# ఆంధ్రగ్రంథమాల

## నెం. 7, తంబుశెట్టి వీథి, చెన్నపురి

ఆంధ్రాభ్యుదయమునకు వాఙ్మయాభ్యుదయమును, తన్మూలమున విజ్ఞానాభ్యుదయమును సాధనంబు లనువిషయము సర్వత్ర తెలిసియున్నది. ఆంధ్రాభ్యుదయమునకు దేశమునందు గ్రంథమండలులు, గ్రంథాలయములు, కళాప్రదర్శనములు మొదలగు సంస్థాపనలు పర్యాప్తంబులై యున్నవి. శ్రీయుత కే. వి. లక్ష్మణరావుగారు ప్రారంభించిన యాంధ్రవిజ్ఞానచంద్రికాగ్రంథమాల నేడు శాఖోపశాఖలతో భిన్నరూపముల వెలయుచున్నది. గ్రంథమాల లన్నియు యథాశక్తిని వాఙ్మయాభివృద్ధికి బాటుపడుచున్నవి. ఆంధ్రమాత నలంకరించుచున్న గ్రంథమాలలం దిది యొకటిగ నుండగలదను విశ్వాసముతో నీ ప్రయత్న మారంభమైనది. ఈ గ్రంథమాలయందు విజ్ఞానాభ్యుదయమునకు సాధనములై వివిధవిషయములకు సంబంధించిన గ్రంథములు రెండుమాసముల కొకగ్రంథమునంతున ప్రచురింపబడును. ఆంధ్రమహాజనులీ ప్రయత్నమును బోషించుటకు ప్రార్థితులు.

### గ్రంథములు

1. శతకమంజరి (భక్తిసంపుటము):—నృసింహ, సర్వేశ్వర, దేవకీనందన, నారాయణ, కాళహస్తీశ్వరాదిశతకములు పది యిందుగలవు. ఒక్కొక్కశతకమునకు పీఠికయు, పాఠభేదములు గలవు. (ఈశతకములు విడిగను దొరకును.) ... ... ... రు ౧-౮-౦

2. బసవపురాణము (ద్విపద):—పాల్కురికి సోమనాథుడు. అనేకతాళపత్రమాతృకలను బరిశీలించి కూర్చిన మూలము. పాఠభేదములు సూచింపబడినవి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన విపులమగు పీఠిక గలదు. ... ... ... రు ౨-౮-౧

3. గాంధిమహాత్ముని బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము:— రు ౦-౪-౦

4. కమలాక్షి (చిన్ని విచిత్రకథ):—రాయసం వెంకటశివుడుగారు, యమ్. ఏ., యల్. టి,
... ... ... ... రు ౦-౩-౦

5. నీతినిధి:—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. మానవజీవితనిబంధనము లిందు సూటిగా వివరింపబడినవి. రెండువేలయేండ్లకుపూర్వ మొక భారతీయబ్రాహ్మణునిచే రచియింపబడినది దీనిమూలము. ఇట్టి యుత్కృష్టనీతిగ్రంథ మాంధ్రగీర్వాణవాఙ్మయముల గానరాదు. ... రు ౧-౪-౦

6. జీర్ణవిజయనగర చరిత్రము:—కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ. కృష్ణదేవరాయల సామ్రాజ్యలక్ష్మీవిహారభూమియై వెలసిన విద్యానగరము (హంపిశిథిలముల) యొక్క ప్రాచీనచరిత్రము, ప్రకృతపు జీర్ణస్థితియు నిందు వర్ణితములైనవి. ... ...

7. త్యాగరాజస్వామి చరిత్రము (పద్యకావ్యము):—శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి శాస్త్రిగారు. శ్రీరామభక్తాగ్రణియు, గాయక శిఖామణియు నగు శ్రీ త్యాగరాజుగారిచరిత్ర మిందు సరసముగ వర్ణింపబడినది. సందర్భానుసారముగ త్యాగరాజుగారు రచించిన కృతులు.
౫౫ ఇందు చేర్పబడినవి రు ౦-౧౦-౦

(పోస్టుఖర్చులు ప్రత్యేకము)

కాశీనాథుని నాగేశ్వరరావు,
వ్యవస్థాపకుడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి

## సచిత్ర మాసపత్రిక

Bharti

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు

Nageshwar Rao

సంపుటము ౪, భాగము ౧

V. 4

C. M. V. sharma
Nalgonda

ఆంధ్రపత్రికా కార్యాలయము - మద్రాసు

౧౯౨౭ 1927

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి - చతుర్థసంపుటము - భా. ౧.

## వ్యాసముల అకారాదిసూచి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతి - చతుర్థ సంపుటము - భా. ౧.

## వ్యాసకర్తల అకారాదిసూచి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## స



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# విషయానుక్రమణిక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చిత్రములు

త్రివర్ణచిత్రములు:—ఐహికోద్యానము-జీవితకుసుమము, స్నానానంతరము, "చిట్టిని తొట్లలోనుంచి జోకొట్టివస్తాబాబూ!"

ఏకవర్ణచిత్రములు:—శ్రీమతీ, యస్. శ్రీనివాసయ్యంగారు, కీ. శే. శ్రద్ధానంద స్వామిగారు, గాంధిమహాత్ముడు; సర్ పి. యస్. శివస్వామయ్యరుగారు, టి.ఆర్. ఫూకన్‌గారు, పండిత మదనమోహన మాళవ్యాగారు; ౪౧వ జాతీయ మహాసభామంటప చిత్రములు ౪; మహారాజా సర్ కిషన్ ప్రసాద బహద్దరుగారు, సి. వి. యస్. నరసింహరాజుగారు, డాక్టరు పార్వతీబాయిగారు, డాక్టరు ముత్తులక్ష్మమ్మగారు; రామస్వామి దేవాలయము-తంజావూరు, ఆంధ్రబాలిక; *ఉడిపి చిత్రములు ౫; *మైసూరుచిత్రములు ౧౫; గరుడవిగ్రహము, తిరువాంకూరుమహారాజాగారు; కృష్ణానది-భరద్వాజాశ్రమము ౨ చిత్రములు; ఇతరచిత్రములును.

---

## వ్యాసరచయితలకు విజ్ఞప్తి

శ్రీ రవీంద్రనాథటాగూరుగారి గద్య పద్య వ్యాసములను తెలిగించి భారతియందు ప్రకటనార్థము పంపగోరువారు శ్రీ టాగూరుగారియొద్దనుండి తా మా వ్యాసములను తెలిగించి ప్రకటించుటకు అనుమతిని పొంది ఆ యనుమతిపత్రమును వ్యాసముతోకూడ పంపవలెను. లేకున్న నా వ్యాసములను భారతియందు ప్రకటింపజాలము. సంపాదకుడు, భారతి.

* ఉడిపిచిత్రములు ౫, మైసూరుచిత్రములు ౧౫ భారతియందు ప్రకటించుటకొసగిన శ్రీ హెచ్. ఆర్. హెబ్బరు గారికి వందనములు. —సంపాదకుడు, భారతి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చెన్నపట్టణము జనవరి ౧౯౨౭

సంపుటము ౪ అక్షయ సంవత్సరము పుష్యమాసము సంఖ్య ౧

# స్వవిషయము

కాలమహాస్రవంతియం దొకయేడు గతించినది. భారతమ్మకు మూడేండ్లు నిండినవి; నాల్గవయేడు వచ్చినది. పుట్టినదినము బిడ్డలకు వేడుకదినము. గుణరూపములున్నను లేకపోయినను ఎవరిబిడ్డ వారికి ముద్దు. పుట్టిన దినమునందు యథాశక్తిని వేడుకలుచేసి బిడ్డల నాశీర్వదించుట లోకాచారము. లోకాచారము ననుసరించి వేడుకలను జేయుటకు గాని, ఆశీర్వదించుటకు గాని నిర్వాహకులు పూనుకొనుట స్వోత్కర్షగ నుండును. ఈ శుభ కార్యాచరణ మాంధ్రలోకాధీనము. భారతి శుభస్థితికి నిర్వాహకులు నిమిత్తమాత్రులు. ఆంధ్రలోక మీమూడేండ్లనుండియును భారతి కాయురారోగ్యైశ్వర్యంబుల నొసంగి పోషించినది. భారతి బాలారిష్టములు లేక, వివిధాంగముల వికాసము గలిగి, సుజనరంజకమై వర్ధిలుచున్నది. విద్వాంసులవ్యాసములు, కవుల కావ్యాలంకారరచనలు, గాయకుల గానములు, చిత్రకారుల చిత్తరువులు, శాస్త్రజ్ఞుల విమర్శనలు, చరిత్రకారుల పరిశోధనలు, తత్త్వజ్ఞుల సిద్ధాంతములు, కథకుల కాదంబరులు, ప్రజల యాదరణానురాగములు భారతికి సౌందర్య కాంతివిలాసంబుల నొసంగి పోషించినవి. భారతి కాంధ్రలోక మవ్యాజానురాగమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జూపుచున్నను పూర్ణమైన వికాసమును బొం
దుటకవకాశములు చాలకున్నవి. ప్రజాహృద
యమునందు విజ్ఞానోపలబ్ధికి తీవ్రమైన యను
తాపము ప్రబలుచున్నను ఏతత్ఫలప్రాప్తికి
గల సాధనములు పరిమితములు.

ఆంధ్రులు 2,20,00,000(రెండుకోట్ల యిరు
వదిలక్షలు)ఉన్ననుతదనురూపమైన బలవికాస
ములును,పత్రికలకుపోషణమునుగలుగకున్నవి
పోషించుటకవసరమైనచందాదారులసంఖ్యఅతి
స్వల్పముగ నున్నది. చిత్రకారులు,కళాభిజ్ఞులు,
కవులు సాహిత్యాభ్యుదయమునకు బాటుపడు
చున్నను సాహిత్యనిర్మాణమునందు ప్రత్యభి
జ్ఞానము దుర్లభముగ నున్నది. సాహిత్య
బృందావనమునందు ప్రజలకును, విద్యావంతు
లకును అన్యోన్యాశ్రయము గలుగకున్నది.
విదేశీయవిజ్ఞానాశ్రయము స్వదేశీయ విజ్ఞాన
వ్యాపకమునకు ప్రతిబంధక మైనది. విద్యా
వంతులమార్గము వేరు: ప్రజలమార్గము వేరు.
ప్రజల నిత్యజీవనాధారములేని విద్యావంతుల
సాహిత్యరచనలు కళాకాంతులులేక సాహి
త్యవికాసమునకును, ప్రజా సౌ భా గ్య ము
నకును ననుకూలము గాకున్నవి. ఆంగ్ల
సాహిత్యాభిమానము స హ జ సా హి త్య
వికాసమునకు ప్రతికూలమైనది. ఆంధ్రోద్య
మము, సహాయనిరాకరణోద్యమము సహజ
మైన సాహిత్యరచనల కుత్తేజము నొసంగి నవ
యుగోదయమునకు దోడ్పడినవి. నవయుగా
రంభమునందు ప్రాచీననవీనసాహిత్యములకును,
నాంగ్లాంధ్ర సాహిత్యములకును సంఘర్షణము
సహజముగ గలుగుచున్నది. ఈసంధి సమ
యమునందు మహానుభావులైన సాహిత్య
నిర్మాతలు ప్రజాశయములను సఫలము చేయు
టకు సమర్థులు. భారతీప్రచారమును సార్థ
కముచేయుటకు పత్రికానిర్వాహకుల కాంధ్ర
సాహిత్యనిర్మాతలు తోడ్పడుటకు వేడు
చున్నాము.

వర్తమానయుగముసంధియుగము; సర్మా
ణయుగము. ప్రజా హృదయమునందు ప్రాత
వాసనలుపోయి నవీనాశయము లుదయించు
చున్నవి. ప్రాచీననవీనాదర్శముల కన్నిరంగ
ములందును సంఘర్షణము ప్రత్యక్ష మగు
చున్నది. రాజ్యాంగరంగమునందు స్వరాజ్య
పతాక మెగురుచున్నది; సంఘజీవనము నందు
సమభావము విలసిల్లుచున్నది; కావ్యరంగ
మునందు కోమలకావ్యగీతములు ప్రతిధ్వనించు
చున్నవి; కళా రంగమునందు చిత్ర రచనలు
రంజిలుచున్నవి; రచనారంగమునందు తెలుగు
రచనలు వెలయుచున్నవి; నాట్యరంగమునందు
నూతనాదర్శములు ప్రదర్శితము లగుచున్నవి.
ఈమహాసంధిసమయమునందు, ప్రాచీననవీనా
దర్శసంరంభమునందు నిర్మాణవిధానము దురా
రాధముగ నున్నది.

రావుబహద్దరు వీరేశలింగము
పంతులుగారు చింతామణిని, పూండ్ల రామ
కృష్ణయ్యగారు అముద్రితగ్రంథ చింతామణిని
ప్రచురించినపు డీసంరంభము లేక ప్రచుర
ణము సుకరముగనుండెను. సంస్కృతాంధ్ర
ములం దపారమైన పాండిత్యమును గడించిన
పండితవర్గమును, ఆంగ్లవిద్యావంతుల వర్గమును
ఆకాలమునందు సాహిత్యనిర్మాతలుగ నుండిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇపు డాస్థితియంతయును మారినది. ఆంధ్రసారస్వతమునందు సంస్కృతాంగ్ల సాహిత్యముల ప్రతిభ తగ్గుచున్నది. ఆంధ్ర సాహిత్యమునకు ప్రతిభ హెచ్చుచున్నది. ఈ సహజావస్థ స్వతంత్ర రచనలకు గారణంబైనది. ఆంధ్ర సాహిత్యరచనలం దుద్భవించిన భావగీతములు, గ్రామ్యభాషోపయోగములు, నాటకములు, నవలలు, కాదంబరులు, పాటలు, పద్యములు నవయుగోదయమును విశదము చేయుచున్నవి. ప్రాచీననవీనరచనలకు గల భేదము భారతి రచనలయందు గోచరం బగుచున్నది. సాహిత్యరచనలయందు గనుపడెడి స్వాతంత్ర్యము చిత్రకళారచనలయందును గనుపడుచున్నది. ఆంధ్రచిత్రరచనలుసౌందర్యభావవిలసితములై ఆంధ్రహృదయమును విశదము చేయుచున్నవి. సర్వతోముఖమైన సాహిత్య వికాసమునందు జాతీయమహోదయము ప్రతిఫలించుచున్నది.

ప్రజలనిర్మాణ సామర్థ్యము సాహిత్యకావ్యకళానిర్మాణములందుగోచరంబగుచున్నది. ఆంగ్లవిద్యావిధానము నిర్మాణమున కుచితరీతినివినియోగపడకున్నది.ఆంగ్లవిద్యాసంభవులందు ప్రసిద్ధులైన సాహిత్యనిర్మాత లపరూపముగ నుండిరి. ఆంధ్రసాహిత్యమునకు గలిగిన యుత్తేజము సాహిత్యనిర్మాణములకు దోడ్పడుచున్నది. గతసంవత్సరపు భారతి సంచికలను బరిశీలించునపుడు సాహిత్యరచనలందు గలుగుచున్న పరివర్తనము పరిస్ఫుట మగుచున్నది. భారతి ఆంధ్రసాహిత్యాభ్యుదయమునకు గతించిన మూడేండ్లయందును యథాశక్తిని బాటుపడి ఆంధ్రలోకాదరణమును బడయుచున్నది. పత్రికానిర్వహణమునందు నిర్వాహకులు జాగరూకులై ప్రవర్తించినను లోపములు గలుగుటసహజము. భగవదనుగ్రహము, సాహిత్యవిశారదులసహాయము ముమ్మందు లోపములను సవరించుటకు వినియోగపడునని నమ్ముచున్నాము. ఇంతవరకును భారతి నాదరించి పోషించిన వ్యాసకర్తలకును, చిత్రకారులకును, కళాభిజ్ఞులకును కృతజ్ఞతాంజలులను సమర్పించుచు ముందును యథాప్రకారము సాయపడుటకు వేడుచున్నాము.

—సంపాదకుడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆశీర్వాదము

నడకుదుటి వీరరాజకవి గారు

మూఁడుశక్తులుగల్గు ముని కాశినాథుని
మూఁడవ యల్లారుముద్దుబిడ్డ,
ముల్లోకముల నేలు ముగురు తల్లులలోన
మొదటి పేరందిన ముద్దుతల్లి,
ముక్కోటి దేవతామూర్తులు దనివొంద
మూఁడేండ్లు గడపిన ముద్దుపాప,
* మూఁడువర్ణంబుల మొనయురూపములకు
మొదటికారణమైన ముద్దుపట్టి
కులుకునడలయందు చెలువంపు నుడులందు
ఆటలందు ముద్దుపాటలందు
మధురమూర్తి యైన మాచిన్ని భారతి
నెలయుఁగాక! యేండ్లు వేయిదాఁక.

---

* 1. అకార, ఉకార, మకారములు; 2. పరుష, సరళ స్థిరములు; 3. త్రివర్ణచిత్రములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri





# కవిద్వయము

## వేంకటపార్వతీశ్వరకవులు

సీ. తీర్చుచో మీవిభూతిత్రిపుండ్రకములమీఁదఁ
దోఁచునే కమ్మకస్తూరిరేఖ
కట్టుచో మీమేని కనకాంబరముమీఁద
జాఱునే పులితోలు చీరచెఱఁగు
పూనుచో మీశేషభుజగహారముమీఁదఁ
జొలుమనే చిగురాకు పూలపేరు
కదలుచో మీయున్న ఖగవాహనముమీఁద
మెఱయునే వృషరాజవరపతాక
శైవవైష్ణవమతభేదసరణి వీడి
యద్వయానందరసరసాయనము మీర
లొక్కఁడొన్నెనే సేవింతుమన్నవార!
రాజశేఖరకవిరాజరాజులార!

సీ. పరిపాకపరిమళప్రసవమంజరులతోఁ
దులకించె మీజాతివిలసనంబు
పరవైభవార్థసౌవర్ణసంపదలతోఁ
గళదేఱె మీపదగౌరవంబు
మధురస్వభావసన్మణిమయద్యుతులతో
నుతికెక్కె మీయలంకృతిగుణంబు
సరసప్రసన్నబంధురచంద్రకళలతోఁ
గడలొత్తె మీరీతికౌశలంబు
శైవవైష్ణవగాథాప్రశాంతభావ
పావనోజ్జ్వలదివ్యప్రబంధలీలఁ
బ్రకృతికంతానఁ బాడిన ప్రభువులార!
రాజశేఖరకవిరాజరాజులార!

సీ. మెలుపారు నభినవోత్పలముల నొకకొన్ని
చెలువొందు వనమంజరులను గూర్చి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుచిమించు వికచాంబురుహముల నొకకొన్ని
కమనీయమగు చంపకములఁ జేర్చి
సోమించు సురలతాసుమముల నొకకొన్ని
కొమరొందు మధుమాధవములఁ దీర్చి
సరసంపు మృదుసుకేసరముల నొకకొన్ని
రమణీయమగు నాగరము లమర్చి
సద్గుణకళావిలాసులై సరసవృత్త
మాలికల భారతీదేవి నేలికొన్న
కృతులు రసమంజరీసమన్వితులు మీరు
రాజశేఖరకవిరాజరాజులార!

సీ. రసమయోత్తుంగతరంగాభిమంగవి
డంబీకృతాగ్ధశబ్దాంబరములు
పృథులవృత్తాచ్ఛగంభీరప్రచారగ
రీభకృతధారాసరిద్వగములు
త్కుణదంతరంగప్రసన్నతాదర్శబిం
బీకృతభావత్కుపాకరములు
అతివేలపావనోద్గతి సముత్కారకదం
బీకృతౌజస్తరశ్శీకరములు
స్థిరవిభవశంకరీకృతశ్రీధరములు
సమహితశ్రీధరీకృతశంకరములు
తావకీనప్రబంధరత్నాకరములు
రాజశేఖరకవిరాజరాజులార!

సీ. రజతకుత్కీలగర్భంబులో వైకుంఠ
దివ్యధామము తల్పు తెఱచువారు
తిరుమల దేవమందిరములో జంగమ
మల్లికార్జునసేవ మరఁగువారు
భవ్యకుమారసంభవలీలలో విష్ణు
చిత్తసారము ప్రపంచించువారు
శ్రీకృష్ణదేవవిశిష్టతేజంబులో
చోడేశ్వరుసిమూర్తిఁ జూచువారు
హరిహరసనాములు సమానులైనవారు
కవిత కిద్దరి నద్దరిఁ గన్నవారు
కాక, మీకీర్తిమూర్తులఁ గాంచఁగలరె
రాజశేఖరకవిరాజరాజులార!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారత వీరుఁడు

జి. జాషువ గారు

ఘనకురుక్షేత్ర సంగ్రామ గగనమునకు
భానుమంతుఁడవై వైరి వర్గములను
కలఁచి గెలిచిన దండిమగండ వీవు;
కర్ణ, కారణమేమి దుఃఖపడ నింక?

గీ. సమరధర్మంబు విడి ధనంజయుఁడు సంపె;
నతనిచేఁ జచ్చె రాధేయుఁ డనెడు పల్కు-
పుట్టెననుచింత గలదు కాఁబోలు నీకు
నట్లుఁగాదయ్య గెలుపు నీయదిమె కర్ణ!

గీ. ధర్మముఁ దలంచి నినుఁ గన్నతల్లి ననుఁగు
సోదరుల రేణువులభాతిఁ జూచినావు
శౌర నీస్వామిభక్తినీయద్వితీయ
సుగుణసంపద వర్ణింప నగునె కర్ణ!

శా. వీరాగ్రేసర, నీవు పాండవబలాబ్ధిన్ మందరంబట్లు దో
స్సారం బార మథించి యంచితయశస్సారంబు లోకంబునన్
బారంజల్లిన సద్ధనుర్ధరుఁడ వెవ్వం డీడురా నీకుఁ గ
ర్ణా, రాజన్యుల కెల్ల నీచరితమన్నన్ గర్ణపేయంబగున్.

మ. ఒకపాంచాలికి భర్త లేవురని మర్త్యుల్ గూడిమాటాడునా
డుకరమే కర్ణకఠోరమై మసలుచుండున్ డెందమం దట్టివా
నికి నాకాఱవ భర్తృనామము ధరన్ నిర్మింప కంచున్ మురా
రికి వాక్రుచ్చి యశంబుఁ జాటవె ధరిత్రీమండలిన్ భానుజా!

మ. జననంబందిన తత్క్షణంబ కఠినస్వాంతంబునన్ గంగ క
ప్పనగావించిన క్రూరురా లనక లోభస్వాంతయై కుంతి "నా
యన, కర్ణా, సుతభిక్షురా" యనఁగ నాహా! మారుమటాడ కి
చ్చిన విఖ్యాతవదాన్యమాన్యుఁడవు యొచ్చెం బేది నీకీర్తికిన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. పార్థనామము చెవిలోనఁ బడినయంత
భగ్గుమని మండిపోవు నాపాదమస్త
కంబు నీకట్టి మీ వైరకారణంబు
చాటుచున్నది కర్ణ, నీ స్వామిభక్తి.

చ. అరదము నేలఁ గ్రుంగినపు డైనను, భార్గవరాముశాపవా
క్సరణశరంబు లూహ కెడసన్నపు డేనియు, శల్యుఁ డెన్ని ని
ష్ఠురములు పల్కుచున్న, రణశూరత దక్కక వైరివీరకం
ధరపటుకర్తనోద్యమమునన్ జెలువారవె సూర్యనందనా!

శా. కింకన్ రుద్రుని బోలి తేరి నడుచక్కం జేరి, దృప్యద్ధను
ష్టంకారంబొనరించుచున్ రిపులకంఠశ్రేణిఁ జెండాడు నీ
వంకన్ జూడఁ గిరీటియంతటిప్రతాపస్ఫారమార్తాండుఁడే
జంకెన్ నీ కెదురెక్క వీరుఁ డొకడున్ జన్మించెనే, భానుజా!

మ. చెవులన్ గుండలముల్ ప్రభావిభవరాజిం జిమ్మ వర్మంబుఁ బు
ట్టువుతోఁ గల్గిన ముద్దుబిడ్డఁడవు, నీటుం గోటు దీపింప రెం
డవమీనాంకుని వోలి విల్లుఁ గొని జన్యక్షోణులం జొచ్చి శా
త్రవనాశం బొనరించు నిన్నుఁ గని, కర్ణా! కుంతి యెట్లోర్చెనో!

చ. మివులఁ బవిత్రవంతమయి మేదినిఁ గాలువకట్టి మర్మరా
రవము సెలంగ నీదురుధిరంబు స్రవించుచు "యర్జునాయధ
ర్మువు, భవ" యంచు నెంతవలపోసెనో! శత్రుకళేబరంబు లం
టవలసెనంచు నెంత వనటంబడినాఁడవో, కర్ణ! కూలుచో.

ఉ. "చండగభస్తిమండల మెసంగిన నాతొలుచూలుకాన్పు క
ర్ణుం"డనుకుంతిమాటకుఁ దనూలత కంపమునంద ధర్మసూ
నుం డెలుఁగెత్తి యేడిచి నినుం గొనియాడుచుఁ బల్కె నట్టిశూ
రుం డిఁకఁ బుట్టఁబోఁడని నిరూపణ సేయుచు సూర్యనందనా!

కం. కర్ణుని తల భారతమని
దుర్ణయవాక్యముగఁ బల్కుదురు జను లోశౌ
ర్యార్ణవ! నీ చరితము సం
పూర్ణముగ నెఱుంగలేకపోవుట కతనన్!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# దగ్గుబల్లి దుగ్గన కవి - నాసికేతోపాఖ్యానము

ఓరుగంటి అచ్యుతరావు గారు, యమ్. ఏ, యల్. టి.

నారాయణకవియొక్క పంచతంత్రమును గృతినొందిన బసవభూపాలుని యాస్థానమునందలి దైన మఱియొక గ్రంథమును మనకు లభించినది. దగ్గుబల్లి దుగ్గన యను కవివరేణ్యుడు రచించిన 'నాసికేతోపాఖ్యాన' మను గ్రంథమును బసవభూపాలుని మంత్రి యగు చెందలూరి గంగయమంత్రి యంకిత మొసంగెను. ఆ గ్రంథ మాంధ్రదేశమంతటను రూపుమాసి పేరునకైనను



వ్యాసకర్త

లేనిస్థితి నుండగా నొక ప్రతి మాత్ర మాంధ్రులయదృష్టముచేత ప్రాచ్యలిఖితగ్రంథాగారమున లభించినది. దానినిబట్టి కృష్ణాజిల్లాలోని ముత్యాల సంస్థానపువారీగ్రంథమును ముద్రించిరి. కావున నాంధ్రలోకమునకు వారొనర్చిన యుపకారము పేర్కొనదగినది. ఈ యుత్కృష్టగ్రంథముయొక్క విలువ యనిర్వచనీయము, అప్రతిమానము. ప్రాచీనాంధ్ర గ్రంథములలో దీనికి సాటి మఱియొకదానిని బేర్కొనుట కవకాశము లేదు. ఆంగ్లేయభాషలో 'పారడైజులాస్టు' (Paradise Lost), ఇటాలియన్ భాషలో "డివైనా కొమిడియా" (Divina Comedia) మన్నగు గ్రంథములు నిర్మాల్యమయినయెడల నాయాభాషల కెట్టియపాగనష్టము వాటిల్లునో యట్టినష్టమే యీగ్రంథ ముత్సన్నమైన యెడల మనభాషకును గలిగియుండునని యాంధ్రు లందఱును నమ్మవలసినదే. ఈగ్రంథ మద్వితీయము; మహత్తరము; సర్వథా యుత్కృష్టము. పశ్చిమఖండవాఙ్మయముల పరిచయము నొంది వానియందలి యుద్గ్రంథముల జదివిన మన యాంగ్లేయవిద్యాధికులను యువతీయువకులు ఈ గ్రంథమును జదివిన నాంధ్రభాషలో గూడ కేవలము శృంగార రసభూయిష్ఠములేకాక సర్వోత్కృష్టగ్రంథములున్నవనియును, స్త్రీపురుషులు వానిని నిరాక్షేపముగ జదువవచ్చుననియును దెలిసికొన గలుగుదురు. ఈయద్భుతగ్రంథమును అద్భుతతర మగు రీతిని రచియించిన కవిశిఖామణి యగు దగ్గుబల్లిదుగ్గనకవినిగుఱించి యించుక విచారింతము:

## కవి వంశము

పదునొకండవశతాబ్దమున నన్నయ భట్టారకుని వలెను, పదుమూడవశతాబ్దమున తిక్కనసోమయాజి వలెను, పదునేడవశతాబ్దమున నాంధ్రవాఙ్మయ సింహాసన మెక్కి కవిలోకమునకు బెక్కురీతుల మార్గదర్శియై కవిసార్వభౌముడను బిరుదుగాంచిన శ్రీనాథమహాకవి "మఱిమిసేయుమఱంది" యని తన్నుగురించి దుగ్గకవియే చెప్పుకొనెను.

"సీ. సంస్కృతప్రాకృతశౌరసేనీముఖ్య
భాషాపరిజ్ఞాన పాటవంబుఁ
బన్నగపతి సార్వభౌమ భాషితమహా
భాష్యవిద్యాసమభ్యాస బలము
నక్షపాదకణాద పక్షిలోదీరిత
న్యాయకళా కౌశలాతిశయము
శ్రుతిపురాణాగమస్మృతి సాంఖ్యసిద్ధాంత
కబళనవ్యుత్పత్తి గౌరవంబు
పూర్వకవి ముఖ్యవిరచితాపూర్వకావ్య
భావరససుధాచర్వణ ప్రౌఢతయును
గందళింపంగఁ గాశికాఖండ నైష
ధ ప్రముఖ వివిధప్రబంధము లొనర్చి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. కవిసార్వభౌముఁడై కర్ణాటవిభుచేతఁ
గనకరత్నాభిషేకములు గనిన
†శ్రీనాథసుకవి గూరిమి నేయ మఱఁదివి
దుగ్గయకవిరాజు దగ్గుఁబల్లి
.....................

దుగ్గకవియింటిపేరు దగ్గుబల్లివారు. దగ్గుబల్లిఅను గ్రామము బహుశః గుడివాడతాలూకాలోనున్న *దగ్గుమిల్లియై యుండునేమోయని యూహించుచున్నాను. ప్రభాకరశాస్త్రిగారీగ్రామమే యైయుండునని తలంచిరి. ఇంకను విచారణీయము. దగ్గుమిల్లియే యైనయెడల శ్రీనాథుని తాతగారియూరగు 'కలపటము' దుగ్గకవి గ్రామమగు 'దగ్గుమల్లి' ఈరెండు ననతిదూరములోనుండి యిద్దరి కుటుంబములయొక్క పరస్పరబాంధవ్యములకు జాలననుకూలముగా నుండియున్నవి. పైగా వారితో సమకాలికులైన, అనంతామాత్యుడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, మున్నగువారు సామీప్యములో నుండుటచే, కవిత్వవిషయములలో వీరందరకును మిథస్సంఘర్షణము గూడ గలిగియుండవచ్చును.

దుగ్గకవితండ్రి తిప్పన; తల్లియెఱ్ఱమ; అన్నలు పోతన్నయు, ఎఱ్ఱనయు; గోత్రము శాండిల్యగోత్రము. బహుశః ఇతడునియోగిబ్రాహ్మణుడు; శైవారాధనతత్పరుడు. సామాన్యముగ మతవిషయకగ్రంథములజదువుట, వేదశాస్త్రవిద్యనుష్ఠానమును, యిట్టియాధ్యాత్మికవిద్యయీయన కెక్కువ. గ్రంథముబట్టియు, కృతిపతివాక్యముల బట్టియు చూచిన నిర్మలాంతఃకరణుడనియు, విశుద్ధజీవియనియు దోచుచున్నది. కృతిపతియగు చెందలూరి గంగన్నమంత్రి, కవి నుద్దేశించి పలికిన వాక్యములు

---

† ఏ. శ్రీనాథుని జన్మస్థానము కృష్ణాజిల్లాలోనున్న సముద్రతీరమందలి కాళీపట్టణము గావచ్చునని బ్ర. శ్రీ. వే. ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినారు. అట్లయినచో శ్రీనాథుడు చెప్పిన "వారిధితటీకాల్పట్టణము" యీ కాళీపట్టణము గావచ్చును. కాళీపట్టణమనుశబ్దమును కాల్పట్టణముగా స్త్రీవాచకములో 'ఈ' కారమును లోపము చేసి శ్రీనాథమహాకవి ఛందోనియమముకొఱకు ప్రయోగించునాయను విషయమును పండితలోకము నిర్ణయింపవలయును. అట్లు ప్రయోగింపబడనేరదని నాదృఢమైననమ్మకము. కీ. శే. కో. వెం. లక్ష్మణరావుగారు వ్రాసినట్లు కృష్ణాజిల్లాలో కాళీపట్టణమునకుసామీప్యముననున్న 'కలపటము' అను గ్రామము గావచ్చునని నేనుగూడ నభిప్రాయపడుచున్నాను. ఈగ్రామము సముద్రమునకు గొంతదూరములో నున్నది గాన యిప్పుడు 'వారిధితటీ' గ్రామమని చెప్పుటకు వీలులేదు. పూర్వము సముద్రశాఖకు దగ్గరగానుండెనేమో? కాళీపట్టణము ప్రాచీనపట్టణమని చెప్పుటకు పాటిదిబ్బలు వగయిరాచిహ్నములేవియు నచ్చోట గానరావు. కలపటములో పాటిదిబ్బలున్నవి. ప్రాచీనగ్రామమనుటకు సూచనలుగలవు. శాసనాద్యాధారములుగూడ నున్నవియట. ఈవిషయము లిట్లుండ పరిశోధకులు మఱియొకవిషయము గనుగొనవలయును. గుంటూరుజిల్లా, నెల్లూరుజిల్లాలయందలి సముద్రప్రాంతములందు 'కాలూరు', 'కాల్పురము' అను పేరుగల గ్రామ మేదైన గలదేమో విచారింపవలయును. 'కాలూరు' కాల్పట్టణము సులభము గానగును. అట్లే తక్కిన పేరులును.

(బి) శ్రీనాథునియింటిపేరునుగుఱించి విచారణ జరుగుచున్నది. 'పాకనాటింటివాఁడవు, బాంధవుఁడవు' అని బెండపూఁడి అన్నయ్యామంత్రి చెప్పినట్లు శ్రీనాథుడు వ్రాసికొనెను. పాకనాటింటివాడవు అనువాక్యము పాకనాటిదేశస్థుడని యర్థమిచ్చునని బ్ర. శ్రీ. వే. ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినారు. 'ఇంటివాడవు' అని చెప్పుటలో గృహనామము చెప్పబడెనని నేనూహించుచున్నాను. పాకనాటివారను బ్రాహ్మణకుల మున్నదియు, లేనిదియు, యింకను పరిశోధనీయము. బహుశః ఉండవచ్చునని నా యభిప్రాయము. గంజాంజిల్లా, పర్లాకిమిడి పట్టణములో పాకనాటివారను స్థితిమంతులు, కులీనులు నగు చతుర్థకులజు లున్నారు. అట్లే బ్రాహ్మణులుగూడ నెచ్చోటనో యుండవచ్చును. ఇది విచారణీయము.

* గుంటూరిజిల్లా తెనాలితాలూకాలో గోవాడగ్రామమునకు సివారుగానున్న దగ్గుమల్లి యొకటియున్నది దగ్గుబల్లియనుగ్రామము యీదగ్గుమల్లియైనను గావచ్చును. ఈవిషయమంతయు సమ్యగ్విచారణీయము..

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"చ. శ్రుతులవిహారదేశములు
సుస్థిరవాక్యపదప్రమాణశా
స్త్రోతులయిక్క లాగమపు
రాణచయమ్ముల కేళిసద్మముల్
స్మృతులనివాసముల్ కవిస
మాహిత సత్కవితాగుణప్రసా
దితములు దగ్గుబల్లికవి
తిప్పయ దుగ్గని గద్యపద్యముల్.

క. హితమతివి సకలవిద్యా
చతురుండవు చాటుపద్యజాలంబుల నా
కతులితకీర్తులఁ గలిగిం
చితి దుగ్గనకవివరేణ్య! శివకారుణ్యా!"

గంగయమంత్రి యాస్థానములో నుండుటచే నీ గ్రంథ మంకితము సేయకపూర్వమే యతనిమీఁద ననేక చాటుపద్యములు చెప్పి దుగ్గకవి మెప్పువడసియుండెను. గంగయమంత్రి పినతండ్రికొడుకగు దేవయమంత్రికంకితముగా కాంచీపురనాథుడగు నేకామ్రనాథుని దివ్య కథను ప్రబంధరూపముగా విస్తరించి రచించెను. వీని నన్నిటిని దిలకించినచో ఈకవివరుడు గంగయమంత్రి వంశజుల కాశ్రితు డనియు, వారి వలన ధనధాన్యాది సత్కారములను బొందుచు గౌరవజీవనము చేయుచుండె ననియు నూహింపవచ్చును.

### కృతిపతివంశము

గంగయమంత్రి యింటిపేరు* చెందలూరివారు. వీరు ఆర్వేల నియోగులు. కాశ్యపసగోత్రులు. చాల కాలమునుంచి లౌకికవ్యవహారములో నారితేరినవారు. కవి వీరికి నాశ్రితుడగుటచే దన ముఖ్యగ్రంథములను రెంటిని ఈకుటుంబమువారికి నంకితము చేయుటయు, అనేక చాటుపద్యముల గంగయమంత్రిమీద జెప్పి యతనిని బహువిశ్రుతకీర్తిసంతునిగ జేయుటయు దటస్థించెను. ఈగంగయమంత్రి మాధవవర్మ వంశజుడైన బసవరాజు నొద్ద నమాత్యపదవియం దుండెను.

"సీ. చతురంగబలముల జయవాడ దుర్గాంబ
పరమునఁ బడసి దుర్వారలీల
జగతీస్థలంబెల్ల సాధించి జయశాస
నములు దిగ్దంతిదంతముల సలిపి
పేదబాలునకుఁగాఁ బ్రియసుతమోహంబు
పట్టక బెజవాడ పాడినిలిపి
కలయంగఁ బురమున గాంచనవర్షంబుఁ
గురియించి దేవతాకోటి పొగడ
వసుధ నెగడిన మాధవవర్మవంశ
వర్ధనుండగు తమ్మభూవరునిబసవ
పార్థివున కార్యుఁడై కృపాపాత్రుఁడగుచు
ఘనత మెరసె ననంతయగంగవిభుఁడు."

గంగనమంత్రి వంశస్థులు శివభక్తులు. అతని యొక్క శైవారాధన తత్పరత యిట్లు వర్ణింపబడినది:

"మ. శివచింతామయ మంతరంగము, శివ
శ్రీపాదపద్మార్చనా
ప్రవణంబుల్ కరపంకజంబులు, శివా
పాదిప్రసిద్ధాగమ
శ్రవణోదీర్ణము కర్ణయుగ్మము, శివ
ప్రాసాద పంచాక్షరీ
వ్యవహారజ్ఞ రసజ్ఞ యిమ్మహి ననం
తామాత్య గంగయ్యకున్."

ఈమహనీయుడు సంగీత మభ్యసించి సరససాహిత్యకళాసంగతమతియై యుండెను. కావుననే కవిత్వమం దభినివేశము గలుగుటయు, చాటుపద్యముల జెప్పించుకొనుటయు, గొప్పప్రబంధముల నంకితమొందుటయు, ఇట్టిసారస్వతాభిలాష చూపించి యాచంద్రార్కస్థాయియగు కీర్తిని గడించెను. †.

### కవికృతులు

### కాంచీపురమాహాత్మ్యము

దుగ్గకవి ప్రథమమున కాంచీపురమాహాత్మ్యమను ప్రబంధమును వ్రాసి చెందలూరిదేవయమంత్రికి కృతి

* 'చెందలూరు' అను గ్రామము గుంటూరుజిల్లా ఒంగోలుతాలూకాలో నున్నది.

† నందిసింగయ ఘంటమల్లయలను జంటకవులు తమప్రబోధచంద్రోదయమను ప్రబంధము నీయమాత్య శేఖరునకే కృతియిచ్చిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యిచ్చినట్లు పైన నుడివితిని. ఆగ్రంథ మిప్పటికిని నుపలబ్ధము గాలేదు. కావున నందలికథావిషయముగాని, కవిత్వవిషయముగాని మనకు దెలియదు. కృతికర్తయు, కృతిభర్తయు సమానముగ శైవమతావలంబకు లగుటచే శివకంచియం దధిదేవతయగు ఏకామ్రనాథుని దివ్యకథను విస్తరించి రచించియుండునని యూహింపదగినది.

† ఈ కాంచీమాహాత్మ్యకథ స్కాందపురాణమందలి సనత్కుమారసంహితాంతర్గతమైన కాళికాఖండమున తీర్థస్థలప్రశంసలో జెప్పబడినది. కాంచీపురము, లేక, సత్యవ్రతక్షేత్రమం దున్న క్షేత్రపాలకు లందఱికథలున్నూ, అనగా కచ్ఛపేశ్వరుడు, సిద్ధేశ్వరుడు, త్రిపశేశ్వరుడు, వల్మీక మాహేశ్వరుడు, మున్నగు నుపదేవతలకథలున్నూ—ఆదివ్యక్షేత్రమునకు ప్రధానముగానున్న యేకామ్రనాథుని చరిత్రమున్నూ—ఇత్యాది మాహాత్మ్యము లెన్నియో అభివర్ణింపబడియుండవచ్చును.

చతుర్వేదముల యేకమయమూర్తి కాంచననగరమందలి కంపానదీరమున నొకమామిడిచెట్టు(ఏకామ్రము) రూపమున జనించెను. ఆచెట్టుమొదట నర్థేందుమౌళి యంబికాసహితుడై స్థిరనివాస మేర్పఱచు కొనెను. కావున నప్పరమేశ్వరునకు నేకామ్రనాథసంజ్ఞయు, అంబికకు కామాక్షిసంజ్ఞయు గలిగెను. §

## 2. నాసికేతోపాఖ్యానము

దుగ్గకవి రచించిన రెండవగ్రంథము నాసికేతోపాఖ్యానము. ఈగ్రంథముయొక్క పేరునుగూర్చి తొలుదొల్త భిన్నాభిప్రాయము లున్నవి. కొంతమంది నాచికేతూపాఖ్యానమనియు, కొందఱు నాచికేతోపాఖ్యానమనియు, మఱికొందఱు నాసికేతోపాఖ్యానమనియు, నిట్లు వివిధనామము లిచ్చియున్నారు. ఈనామనిర్ణయములగూర్చి తారానాథతర్కవాచస్పతిగారు తమ వాచస్పత్యమం దిట్లుచెప్పియున్నారు.

"నాచికేత—పుం. నచికేతశబ్దార్థే, (౧) అనలే (౨) ఋషిభేదే, (౩) తదుపాఖ్యానేచ; త్రికాండే నాచికేతురితిపాఠః లిపికరప్రమాదకృతః; నాచికేత ఇత్యేవ పాఠః శ్రుత్యాదిసంవాదీ. నాచికేతోపాఖ్యానంచ—భారతే: అను 21 అధ్యా. ఆదౌ దృశ్యమ్"

వాచస్పత్యమ్.

వాచస్పత్యకారుడు నాచికేతశబ్దముగాని, నాచికేతుశబ్దముతప్పనియు లేఖకప్రమాదజనితమనియు జెప్పియున్నాడు. ఈపేరు కఠోపనిషత్తునందును, భారతమందును గాన్పించుచున్నది. కఠోపనిషత్తునందును, భారతమందును 'నాచికేతః' యనియే యున్నది. మన ప్రస్తుతగ్రంథమందు నాసికేతయని యున్నది.

(నాసికేత + ఉపాఖ్యానము = నాసికేతోపాఖ్యానము.)

ఇందు చకారమున్నస్థలములో సకారమున్నది. మిక్కిలి మల్లికార్జునకవి రచించిననాచికేతూపాఖ్యానమను తెలుగుప్రబంధమున, 'నాచికేతుః' అనిపేరియ్యబడినది.

ప్రొఫెసర్ క్లేయస్ అనుజర్మన్‌పండితుడు 'నాసికేతరి చరితే' యని వ్రాసినారు. అందుకూడ నాసికేత యనియేయున్నది. పునహాలోనున్న భండారకరు లిఖిత పుస్తకభాండాగారమున రెండు సంస్కృతలిఖితగ్రంథములలో 'నాసికేతః' అను శబ్దమేయున్నది.

కాబట్టి వీనిన్నటిని పరిశీలించిచూడగా మనప్రస్తుతగ్రంథమందున్నటులే 'నాసికేతః' శబ్దమే సమంజసమని నాకు దోచుచున్నది. ఏలయన కథానాయకుడగు నాసికేతుడు నాసిక (ముక్కు) ద్వారా తల్లిగర్భములో ప్రవేశించెను; కావున నాసికద్వారా పుట్టినవాడు అను నర్థమిచ్చెడు 'నాసికేతః' శబ్దమే సరియైనదని నిర్ణయింపవచ్చును [నాసిక + ఇతః = ముక్కు(ద్వారా) + ప్రవేశించిన (వాడు.)]

### కథావిషయము

దుగ్గకవి గ్రంథమందలికథ యిట్లున్నది—బ్రహ్మమానసపుత్రుడగు నుద్దాలకుడనుమహర్షి నిత్యబ్రహ్మచర్యవ్రతమునుబూని నిష్కాముడై యుగ్రతపమును జేయు

† కాంచీమాహాత్మ్యమను నైదాశ్వాసములప్రబంధము నిటీవల కొప్పరాజుసుబ్బరాయకవి రచించి ముక్త్యాలపురాధీశ్వరుడగు వాసిరెడ్డి ముక్తేశ్వరప్రసాదనాయనికి గృతి నిచ్చెను.

§ కాంచీపురమున విష్ణుకంచియను నొకభాగమున్నది. అందు హస్తిగిరిమీద వరదరాజస్వామి వారియాలయ మున్నది. ఇదివైష్ణవ క్షేత్రము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుండెను. ఇట్లుండ పిప్పలాదుడనుమహర్షి యతనియొద్దకు వచ్చి గార్హస్థ్యమును స్వీకరింపుమని యనేకవిధముల జెప్పెను. కాని యాతడు వినలేదు. తండ్రియగు చతురాననుడు పుత్రునికడ కేతెంచి 'యోపుత్రకా! నీవు గృహస్థాశ్రమము స్వీకరింపు'మని యెన్నియో విధముల నుపదేశించెను. కాని యాతనిప్రయత్నమునిష్ఫలమయ్యె. అంత పరమేష్ఠి యాగ్రహచిత్తుడై 'నీకుబుట్టిన కొడుకు తనతల్లిని నీకు వివాహముసేయు' నని యాశ్చర్యకర మగు మాట చెప్పి తటాలున నంతర్హితు డయ్యెను. ఉద్దాలకుండును దండ్రిమాటల వమ్ముచేసెడు తలంపున ద్విగుణీకృతమైన పూనికతో ఘోరతరమైన తప మాచరించుచుండెను. ఇట్లుండ నొక్కనా డాజితేంద్రియుడు తన కృష్ణాజినముపై సుఖముగ నిద్రించుచుండ కలలో నొక యతిలోకసుందరి యగు కన్యక యుపగూహనముసేయ స్ఖలితరేతస్కు డయ్యెను. అంత మేల్కాంచి దిగులొంది యాధాతువును కుశేశయపుటమున నించి నళినీతంతువుల జుట్టి జాహ్నవిలో విడిచెను.

భగవత్ప్రేరితముగ నాసమయముననదే రఘుమహారాజు తనయయగు చంద్రవతి చెలికత్తెలతో జలకమాడుటకు జాహ్నవికేగి మజ్జన మాచరించుచు వీచీడోలికల నూగుచు వచ్చుచున్న యాపద్మముకుళము నంది కొని బాల్యచాపల్యముచే నాఘ్రాణించి నదియందు విడిచెను. తరువాత చెలికత్తెలతో నాపె యంతఃపురమునకు బోయెను. కతిపయదివసములు గడచినపిదప నామెయందు గర్భచిహ్నములు పొడసూపెను. ఆ కన్యకాలలామ యావైపరీత్యమునకు వెఱగొంది తోడిచేడియలతో జెప్ప వారు భీతచేతస్కులై రఘుమహీజానికి నివేదించిరి. అంత నాపృథ్వీశుడు క్రోధోద్విగ్నమనస్కుడై తనతనయ నరణ్యమున విడువుడని యాజ్ఞాపించెను. చంద్రవతి నట్టడవిపాలై దైవవశమున తృణబిందు డను తాపసోత్తముని కంటబడ నమ్మహానుభావు డామె నూరార్చి తనపర్ణకుటీరమునకుం గొంపోయెను. అచ్చట నాకన్యక కొంతకాలమునకు దివ్య తేజోమూర్తియగు పుత్రుని గనియెను. ముని తనదివ్యదృష్టిచే నామెయుదంతము సాంతముగ గనిపెట్టి తత్తనయునకు నాసికేతు డను పేరిడెను. ఆబాలుడు శుక్లపక్షచంద్రునికైవడి దినదినప్రవర్ధమానుండగుచుండ నొకనాడు చంద్రవతి తండ్రిలేని తనయుని స్తన్యమడుగ గోపించి "ఓరీ, నిర్భాగ్యుడా నీవు పుట్టి నాకన్నవారికి నన్ను వేరు సేసితివి. నీవుగూడ నట్లే యగుదువుగాక" యని పుత్రుని నొకపేటికయందు బదిలముగ బెట్టి సూర్యచంద్రులకును, బంచభూతములకును, సమస్తదేవతాగణములకును మ్రొక్కి "నేను నిక్కముగ పతివ్రతనగుదునేని యీయర్భకుడు తనతండ్రిపాలికి బోగలవాడని దీవించి మందాకినియందు విడిచెను. ఆపేటిక మలయమారుత సంచలితోర్మిహస్తములసహాయమున మందమందముగ బోవుచు నుద్దాలకుడు స్నానము సేయుచుండ నతనిముందర నిలిచెను. ఆమునిపుంగవు డాపేటికను జూచి యాశ్చర్యము నొంది పట్టికొని చూడ నందొక బాలకుడు గాన్పించెను. ఆబాలునియందు దాత్మతేజః స్ఫూర్తి వీక్షించి, విస్మయమునొంది తనయాశ్రమమునకు దీసికొనిపోయి తనతనయునివలె బెంచుచుండెను. కొంతకాలమునకు చంద్రవతి కొడుకైనను లేని యేకాకినీజీవితమునకు రోయుచు నాయరణ్యమున వానికై వెదకికొనుచు నొకానొక స్థలమున బుత్రుని గాంచి యాలింగనమొనర్చి "నాయనా! యిక్కడ నెవ్వరియొద్దనున్నా"వని యడుగ నాపిన్నపాపడు తనయుదంతము సవిస్తరముగా జెప్పెను. అంత నామె యా ఋష్యాశ్రమమునకు జేరి తపోధనుని కొఱకు నిరీక్షించియుండ నాతాపసవర్యు డప్పుడే వచ్చి నాసికేతునితల్లినిజూచి "అమ్మా! నీవెవ్వతెవు. ఈశిశువును జాహ్నవియందు విడుచుటకు గారణమెయ్యది"యని ప్రశ్నింప నామె తనకథ నామూలాగ్రముగవిన్నవించెను. అంత నామునిశ్రేష్ఠు డచ్చెరువొంది పరమేష్ఠిచేష్టలకు మెచ్చికొని రఘుమహారాజుకడకు బోయి యావద్వృత్తాంతమును జెప్పి, చంద్రవతిని తనకు బెండ్లిసేయుమని కోరగా, నామహీవల్లభుడు కృతాంజలియై పావనియగు తనతనయను విధాతృసమక్షమున మహావైభవముతో వివాహమొనర్చెను.

దంపతులిరువురును బుత్రసహితముగా నాశ్రమమునకు బోయిరి. అచ్చట సుఖముగ నివసించుచు నుద్దాలకుడు నిత్యము నగ్నిహోత్రాదికర్మముల గాలముగడుపుచుండెను. నాసికేతుడు బాలకుడయ్యు జ్ఞానమార్గమున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సృష్టినిల్పి నిత్యము జ్ఞానయోగసమాధియందు నిరూఢు డగుచు తండ్రికి సమిత్కుశేధ్మముల దెచ్చుచు యజ్ఞస పర్యలు చేయుచుండెను. ఒకనాడు యోగసమాధినిష్ఠుడై తండ్రికొఱకు సమిత్కుశములం దేమఱచియుండ నగ్నిహోత్రకాలాత్యయమునకు గోపించి తండ్రి కొడుకును బిల్చి "పుత్రకా సమిధల దెచ్చినావుకావు. హోమకాల మతీతమైనది." యనిపలికెను. నాసికేతుడు సవినయముగ దండ్రితో "నాయనా, యజ్ఞాదికర్మల కంటె జ్ఞానసిద్ధి యెంతయో మేలైన"దని ప్రత్యుత్తర మిచ్చెను. అంత నుభయులకు ఘోరమైన వివాదము సంఘటిల్లెను. తండ్రి గెలువలేక "శేషం కోపేన పూరయేత్" అనున్యాయము ప్రకారము నహంకరించి కుమారుని యమనగరము జూడబొమ్మని శపించెను. నాసికేతుడు తత్క్షణమే చాపకట్టుగ పడి ప్రాణముల విడిచెను. ఉద్దాలకు డుపశమించి తననిష్ఠురకర్మమునకు లజ్జించి శోకింపసాగెను. నాసికేతుడు యమాలయమునకు బోయి యచ్చట యమునానతిగైకొని నరకప్రదేశమంతయు గలయజూచి శమనుని దీవనలొంది, వీడ్కోలు వడసి మగిడి తనతల్లిదండ్రులకడకు వచ్చెను. తరువాత తన ప్రయాణవృత్తాంతమును,కృతాంతునిపురదర్శనవిశేషములను విన గుతూహలులైన తండ్రికిని, యితరమునిబృంద మునకును సావధానముగ జెప్పెను.

నాసికేతునికథ కఠోపనిషత్తునందును, భారతమునందును గాన్పించుచున్నది. అయినను దుగ్గకవి గ్రంథమందలికథకును భారతోపనిషత్తులయందలి కథలకును జాల వ్యత్యాసము గాన్పించుచున్నది.

## కఠోపనిషత్తునందలి కథ:

వాజశ్రవసుడను మునికి నాచికేతుడను కుమారుడుండెను. ఆపిల్లవాని తల్లి పేరుగాని, యతనిజననప్రకారముగాని జెప్పబడియుండలేదు. వాజశ్రవసుడు విశ్వజితమనెడు యజ్ఞమును జేయుటకు సమకట్టి తన సర్వస్వమును బ్రాహ్మణులకు ధారవోసి యిచ్చివేయుచుండగా కుమారుడు బాల్యచాపలమున దండ్రితో "నాయనా! నన్నెవరి కిచ్చెద"వని రెండుమూడుసా ర్లడిగెను. వాజశ్రవసుడు విసిగికొనుచు"నిన్ను యముని కిచ్చెద"నని కుమారుని నొవ్వబలికెను. మునిమాట యమోఘముగాన బాలుడు తత్క్షణమే మృతినొంది కట్టెవలె క్రిందవ్రాలెను. తండ్రి మేఱలేనిశోకమునమునిగెను. నాచికేతుడు యమపురికేగి యము డింటలేకపోవుటచే నతిథిసత్కారములు జరుగక మూడురోజులు శుష్కోపవాసము చేసెను. అనంతరము యముడు వచ్చి నాచికేతుని సగౌరవముగ సత్కరించి త్రిరాత్రోపవాసమునకు విచారించి మూడువరములు గోరుమని యానతిచ్చెను. నాచికేతుడు సంతోషించి యామూడువరముల నీక్రింది విధముగ గోరెను.

(1) తండ్రి తనయెడల నెన్నడును గోపము బూనకుండుటయు; (2) యముడు తన కనూన మగు నొకయజ్ఞవిధానము నేర్పుటయు; (3) మనుష్యుడు మరణించినతర్వాత గొందరు జీవుకుండుననియు, గొందఱు లేదనియు జెప్పుదురు కనుక సత్యమేదియో తెల్పుటయు అను మూడువరముల గోరెను. యముడు వరముల నిచ్చి జ్ఞానోపదేశముచేసి యాతనిని భూలోకమునకు బంపెను.

## భారతమునందలి కథ:

భారతమున నీకథ వేరొకవిధముగ గాన్పించుచున్నది. ఔద్దాలకుడను మహర్షికి నాచికేతుడను కుమారు డుండెను. ఒకనాడు తండ్రి సమిత్కుశముల దెచ్చి గంగయొడ్డునబెట్టి మఱచి యింటికివచ్చెను. అగ్నిహోత్రసమయ మాసన్నమగుటచే గొడుకునుం బిలిచి శీఘ్రముగ నాకు శేధ్మముల దెమ్మని పంపెను. నాచికేతుడు వెళ్లి చూడగా సమిధలు, పుష్పములు మున్నగునవన్నియు ప్రవాహమున గొట్టుకొనిపోయియుండుటచే జరిగి వచ్చి లేవని తండ్రితో జెప్పెను. క్షుత్పిపాసాకులితుడగు ముని కోపతీవ్రమున గొడుకును, యముని జూడబొమ్మని శపించెను. బాలుడు తత్క్షణమే కులిశక్షతమైన వృక్షమువలె భూమి కొఱగి విగతజీవు డయ్యెను. ఆ కళేబరమును తన యొడిలో నిడుకొని మునిపుంగవు డేడ్చుచు నశ్రుధారలచే దడిపెను. కొంతసేపటికి నా కళేబరము డిగ్గునలేచి కూర్చొనె తండ్రి పుత్రు నూరడించి యేమిజరిగెనని యడుగ నాచికేతుడు తాను యమపురికి బోతిననియు, యమునిసత్కారములబడసిపురమంతయుగలయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జూచితిననియు, కాలుడు తనకు గోదానఫలము సంపూర్ణముగ దెలియజెప్పెననియు నిత్యాదివిషయములనివేదించెను.

కావున నీరెండుగ్రంథములందలి కథలును దుగ్గకవి కథకు సరిపోలేదు.

*మిక్కిలిమల్లికార్జునుడనుకవి రచించిన నాచికేతూపాఖ్యానమందలి కథ దుగ్గకవిగ్రంథమందలి కథకు బహుస్వల్పభేదములు దప్ప చాలవఱకు సరిపోవుచున్నది. కాని దుగ్గకవిగ్రంథమును మల్లికార్జునుడు వ్రాసినట్లు కానిపించదు. వీరిద్ద ఱేదోయొక మూలగ్రంథమునుండి యీకథను సంపాదించియుందురు. దుగ్గనగ్రంథమందు నాసికేతుడనియు, మల్లికార్జునునిగ్రంథమందు నాచికేతుడనియు నున్నట్లిదివఱకే వ్రాసితిని. ఇంతియేకాక దుగ్గకవిగ్రంథమున చంద్రవతియనియు మల్లికార్జునుని గ్రంథమందు చంద్రమతియనియు పేరు గాన్పించుచున్నది. నాసికేతునికి చెల్లెలు గలిగినట్లుగాని, అతడు యోగసమాధియందుండి సమిత్కుశేధ్మముల దెచ్చుటకు తండ్రినియోగమును వినకుండుటగాని— మల్లికార్జునుడు వ్రాసియుండలేదు. ఇట్లు కొన్నిస్వల్పభేదము లుభయగ్రంథముల గాన్పించుచున్నవి.

ఈగ్రంథములు రెండు నేదో సంస్కృతమాతృకనాధారముచేసికొని రచియింపబడినవి. ఆమాతృక యేది?

దీనినిగురించి కడుదీర్ఘవిచారణ చేసి యనేకస్థలములకు వ్రాసి విఫలమనోరథుడనై తుట్టతుదకు మ. రా. రా. శ్రీ, మానవల్లి రామకృష్ణకవిగారిసాహాయ్యమున పునహాలోనున్న భండారుకారుపుస్తక భాండాగారమునుండి రెండువ్రాతప్రతులను దెప్పించి వానిలోనున్న కథ మన దుగ్గకవియొక్కయు మల్లికార్జునునియొక్కయు గ్రంథములందలి కథలకు సరిపోవుట చూచితిని; కనుక నీ యుభయకవులు తమగ్రంథములకథలను దీనినుండియే స్వీకరించిరని స్పష్టపడినది. §

## మూలకథ

బ్రహ్మమానసపుత్రుడగు నుద్దాలకుడను ఋషి తపము సేయుచుండెను. ఆయన యొద్దకు పిప్పలాదుడను ఋషి యొకనాడు వెళ్లి యాతని వివాహముచేసికొనుమని యుపదేశించెను. ఉద్దాలకు డందుల కంగీకరింపక తండ్రియగు బ్రహ్మకడకు సలహానడుగుటకు వెళ్లెను. చతురాననుడు సహితము వివాహము చేసికొమ్మనియే హితము చెప్పుచు "నీకుబుట్టినకొడుకు తనతల్లిని నీకు వివాహము సేయు"నని నుడివెను. ఉద్దాలకుడు సంతసించి పరిగ్రహణోత్సుకుడై అనుకూల కన్యకాన్వేషియై తలపోయుచు కొండొకరేయి నిద్రలో దన్నొక కన్యక యాలింగనము చేసినట్లు కలగని పతితరేతస్కుడయ్యెను. ఆచరమధాతువును పద్మపుటమునందుబెట్టి దర్భలజుట్టి జాహ్నవిలో విడచెను.

ఆసమయమునందు రఘుమహారాజుకుమార్తెయగు చంద్రావతి యనుకన్య (చంద్రప్రభయను నామాంతరముగూడ గలదు.) చెలికత్తెలతో వినోదించుచు మదనావస్థలనొందుచు జలక్రీడార్థము పరివారముతోను తూర్యవాద్యములతోను భాగీరథికివెళ్లి స్నానము సేయుచుండ నదియందు గొట్టుకొనివచ్చుచున్న తామరపూ వత్యద్భుతముగ తనయొద్దనిలిచియుండ జూచి దాని నందికొనుడని చెలికత్తెలతో జెప్పెను. వారట్లు దానిని తీసియిచ్చిరి. ఆమె దర్భలను సడలించి పువ్వును వాసన చూసెను. కాలక్రమమున నామెగర్భము దాల్చెను. గర్భదోహదచిహ్నములు తల్లియగు మనస్విని చూచి దిగులొందెను. ఈమనస్విని పూర్వజన్మమున దేవతా కన్యకయైయుండి శాపకారణమున మర్త్యలోకమున నిట్లు జనించిరి. మనస్వినీదేవి తనభర్తయగు రఘుమహారాజు

* మల్లికార్జునకవి గోదావరిజిల్లా, రామచంద్రపురముతాలూకా పెద్దాపురగ్రామస్థుడు. ఈయన తననాసికేతూపాఖ్యానమును పీఠికాపురసంస్థానములో గొంతకాలము దివానుపనిచేసిన వాడ్రేవు చలమయ్యపంతులుగారి జ్యేష్ఠకుమారు డగు వెంకటరావుగారికి నంకితముచేసెను. ఈ కవి 19-వ శతాబ్దాంతమువరకును జీవించినట్లు దెలియవచ్చుచున్నది. ఈయన వేగినాటినైదికబ్రాహ్మణుడు.

§ ఈ మాతృకకథ యేపురాణమునుండి యెత్తివ్రాయబడినదో నా కిప్పటికిని ద్యోతకము గాలేదు తజ్జ్ఞులు నాకు దెలియపఱచినచో కృతజ్ఞుడనై యావిషయము నిందు బొందుపరచెదను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నపు గసమా ర్తెయొక్క గర్భధారణ విషయమును నివేదించెను. రాజు శోకించియు, గోపించియు నామెను కానలకు బంపించెను. ఆమెయార్తనాద మొకఋషి*విని యామెను జూచి తిలోత్తమయో, లేక మన్మథుడులేని రతియో యని సంబోధించి యామె సర్వాంగసౌందర్యంబును వర్ణించి—అనగా కుచములు, నితంబము నాభి ఇత్యాదులను వర్ణించి- ఆమెయుదంతమును దెలిసికొని తన యాశ్రమమునకు గొంపోయెను. అచ్చట నామె కొకమగశిశువు ముక్కుద్వారా జన్మించెను. కావున నాశిశువునకు నాసికేతు డనుపే రిడెను.

"నాసికాంతస్సముద్భూతః సర్వలక్షణసంయుతః;
నాసికేతు రితిఖ్యాతః మునిభిః కృతమంగళః."

ఆయాశ్రమమున నాసికేతుడు పెరుగుచుండెను. ఒకనాడు బాలుడు స్తన్యముకొఱకు నేడ్వ తల్లి కుపితయై "ఓరీపాపుడా, నీమూలమున నాతల్లిదండ్రుల కెడమైతిని; నీవును అట్లే యగుదువుగాక!" అని యాపాపని దర్భగడ్డిలో జుట్టి గంగలో విడిచెను ఆగడ్డి చుట్ట ప్రవాహమున గొట్టుకొనుచు నదిలో స్నానముచేయుచున్న ఉద్దాలకుని సమీపించెను. అందున్న బాలుని రోదనము విని యుద్దాలకు డామట్టవిప్పి చూడగా బాలుడొకడు గాన్పించెను. తరువాత తన తపోమహిమచే నాబాలుడు తనకుమారుడే యని కనుగొని తనయాశ్రమమున బెంచుచుండెను.

అక్కడ చంద్రావతి కుమారుని గోల్పోయి చింతించి యతనికై వెదకుచు నరణ్యములలో దిరుగులాడుచు నొకమున్యాశ్రమమందు వానిజూచెను. అంత నాసికేతుడు త న్నెవరు పెంచుచున్నదియు తల్లితో జెప్పెను. అప్పు డామె ఉద్దాలకునియాశ్రమము వాకిలి నక్కి రంగవల్లులు పెట్టి నదీస్నానము చేయబోయెను. ఆసమ్మట ఉద్దాలకుడు నదినుండి స్నానముచేసి వచ్చి శృంగారింపబడిన యాశ్రమమును జూచి సంతసించి యెవ రిట్లు కైసేసిరని బాలుని నడుగ దనతల్లియే యట్లుసేసెనని పిల్లవాడు మారుపలికెను. వెంటనే ఉద్దాలకు డామెను బిలిచికొని రమ్మని పిల్లవానిని బంపెను.

నాడు పోయి చెప్పగా నామె "నేను రాజకుమార్తెను; యౌవనవతిని; సుందరిని; ఎట్లు పరపురుషునియొద్దకుబోగల"నని ప్రత్యుత్తరమిచ్చి పంపివేసెను. ఉద్దాలకు డావచనమువిని ఆమెయెవరో,ఎట్లు పిల్లవానిని గనెనో తెలిసికొనిరమ్మని నాసికేతుని ముఖలబంపెను. ఆమె తనచరిత్రము నాసికేతునితో జెప్ప నాతడు తండ్రికి సర్వము నివేదించెను. అంత నుద్దాలకుడు రఘుమహారాజునొద్దకు వెళ్లి చంద్రావతి యుదంతమును తనచరిత్రమును జెప్పి ఆపుత్రికను తనకుబెండ్లిచేయుమని కోరెను. రఘుమహారాజందుల కియ్యకొని కూతుని మనుమని రావించి మహర్షికి గూతు నిచ్చి వివాహము చేసెను.

నాసికేతుడును తల్లిదండ్రులును, తమ యాశ్రమమునకు వచ్చిరి. ఒకనా డుద్దాలకుడు కొడుకును సమీపముననున్న సరోవరమునకు బంపెను. (ఎందుకో అకో యిది గ్రంథమందు లేదు). ఆసరోవరమునొద్ద నాసికేతుడు శివు నారాధించుచు యోగసమాధి యందు లీనుడై యొకటిన్నరసంవత్సర ముండెను.తరువాత పుష్పములు,సమిధలు పట్టికొని యింటికిరాగా తండ్రి "యింతకాల మెచ్చటనుంటివి. నాయజ్ఞవిధులు నీయాలస్యకారణమున జెడిపోయిన"వని కోపించెను. అందుకు నాసికేతుడు "సంసారబంధకమైన కర్మకంటె యోగ మెంతోయెక్కు"డని చెప్పెను. ఆపైన ఇద్దరకును తీవ్రమైన వివాదము జరిగెను. నాసికేతుడు వెనుదీయలేదు. తండ్రి కోపించి కొడుకును యమాలయమునకు బొమ్మని శపించెను. వెంటనే నాసికేతుడు క్రిందబడెను. తండ్రియేడ్వసాగెను. నాసికేతునిసత్త్వము తండ్రియేడుపును వినియాతని నూరార్చి తన వాక్సత్యమును నిల్పుకొనుమనియు, సత్యమువాదనే సమస్తలోకములు నిలిచి యున్నవనియు, తాను యముని దర్శించి శీఘ్రమే తిరిగివచ్చెద ననియు జెప్పిపోయెను.

నాసికేతుడు యమునిజూచి తావచ్చినకారణము జెప్పి కృతాంతుని యాజ్ఞవడసి పుణ్య పాపలోకముల బూర్తిగ విలోకించి యమునిచే జ్ఞానోపదేశము బొంది మరణమున కతీతుడగునట్లు వరముచేకొని తండ్రి కడకు

* ఈమునిపే రిచ్చటలేదు. ఈయన తపోమహిమచే నామెగర్భకారణమును గనుగొనలేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వచ్చెను. ఉద్దాలకు డాశ్చర్యపడి "వత్సా యేమిచేసితి" వని ప్రశ్నింప యమపురీవర్ణనము తండ్రికిని అచ్చటి ముని బృందమునకును జెప్పెను.

ఈమూలకథను, దుగ్గన మల్లికార్జునుల గ్రంథము లందలి కథలను సరిజూచి సామ్యభేదములను నిర్ణయించినయెడల దుగ్గకవి కంటె మల్లికార్జునకవియే మూలకథ యథోక్తముగా వాడికొనెనని తోచుచున్నది. ఇంతియెకాక మల్లికార్జున కవిమూలములోనున్న అనౌచిత్యాశ్లీలాది లోపముల నిట్లే యుంచి, యుక్తమగు భాగముల గూడ గొంతవఱకు జెడగొట్టి కథాక్రమమును రసహీనముగ జేసెను. దుగ్గకవి యట్లుచేయక మూలకథలోనున్న అనౌచిత్యములను విడనాడి కథాంశములనెల్ల గొంతవఱకు స్వతంత్రకల్పనలతో మెరుగుపెట్టి కథాప్రణాళికను సర్వవిధముల నిర్మలరసస్ఫురితముగను, అనూనపుణ్యశీలప్రతిష్ఠాపకముగను, శాశ్వతజగద్వంద్యముగను రచించి యాంధ్ర సారస్వతమునందు చిరకీర్తిగడించెను.

కథాసంవిధానము

ఈ అద్భుతమగు గ్రంథము నద్భుతతరముగ గవి రచించెనని ముందే చెప్పియుంటిమి. నాసికేతునికథ ప్రాయికముగా సామాన్యప్రబంధములోని కథలమాదిరిగ నున్నదికాదు. సామాన్యముగ నాంధ్రప్రబంధములలో దేవతాపురుషుడో, లేక రాజకుమారుడో నాయకుడుగా నుండుటయు, దేవతాకన్యయో, లేక రాజకన్యయో నాయికగానుండుటయు, వారియిద్దరియందు నుదయించిన పరస్పరానురాగము పరిణయమగువఱకు శృంగారాదిరసములతో నిచ్చవచ్చినట్లు వర్ణించుచు నొకరిద్దరుబిడ్డలు పుట్టినపిమ్మట నాకుటుంబము నైహికాముష్మికసౌఖ్యస్థితిలో నుంచి కవి విడిచిపెట్టును. నాసికేతుని కథ యట్లుకాదు. ఇందు నాయకు డొకతాపసోత్తముడు; నాయిక యొకరాచకుమారిత. ఈతాపసోత్తమునకు వివాహమున నెంతమాత్రము నిష్టములేదు. నాయికయగు రాజకన్యకకు కామవికారమన నెద్దియో తెలియదు. ఉభయులు వారివారిస్వకీయనియమాచరణములలోనుండి యొండొరులు గని విని యెరుగకయే పరిణయఫలమనదగు పుత్త్రిభాగ్యము బొందగలిగిరి. ఇది కడు నద్భుతమగు విషయము. పుత్త్రుడు జనించినతరువాతనైన గొంతకాలమువఱకు భార్య యెవరో భర్తకుగాని, భర్త యెవరో భార్యకుగాని తెలియదు. కథానాయకుడైన తాపసోత్తముడు యథాక్రమముగా నిష్ఠాగరిష్ఠుడై తపోనియమములలో బడియుండెను. నాయికయగు రాచకన్నియ కన్యాత్వము తొలగిపోయినను కామవికారము బొందు టెరుగదు. ఇట్లుండ పిల్లవాడగు నాసికేతుడు పెరుగుచుండెను. పిల్లవానితల్లి తనభర్తకొఱకు వెదకుట కంటె తనపిల్లవానితండ్రికొఱకు వెదకుచుండెను. తపోనియమనిమగ్నుడగు బ్రాహ్మణుడును, నిర్వికారయువతీలలామయగు రాచకన్నియయు శృంగార వ్యవస్థలు బొందు టెట్లు?

వారిజీవితమంతయు నాధ్యాత్మికమగు చిత్తశాంతియందే యుండి భగవంతునికి నివేదింపబడియుండ పూవిల్తునిచెయిదములకు తావు కలుగు టెట్లు? పరమేశ్వరుడు హిమవత్కూటమున మహావిలయ దీక్షా పరికల్పితుడై తపమాచరించుచుండ పరమేశ్వరియగు హిమగిరిరాజకన్య నిర్వికల్ప సమాధినిరూఢి నిమీలితలోచనయై జగదీశ్వరునికొఱకు తదేకధ్యాన మొనరించుచుండ మానసముల ముచ్చిలు మనోభవునకు స్థానమున్నదా? కన్నపుదొంగవలెవచ్చి కసిమిసియొనర్చినపూవిలుకాడు నిక్కముగ తుంటరియకదా!

శాంతరసవాతావరణము, భగవజ్జ్ఞాన వినోదపరిస్ఫూర్తి, నిర్వికల్పనిగూఢ యోగముద్ర, యిట్టివియే యీకథయందలి ముఖ్యలక్షణములు. ఈ లక్షణములు చెడకుండ నాయికానాయికులకు వివాహము జరుగవలెను. సంసారక్రమము జరుగవలెను. పుత్రపుత్రికాది సంతానము గలుగవలెను. ప్రాపంచికవ్యవహారక్రమము జరుగవలెను. కథయందలి యాధ్యాత్మిక మాధుర్యము చెడకుండ కథారసపోషణము జరుగవలెను. ఇట్టి యసదృశసామాన్యసంవిధానక్రమమును గవి యెట్లు నిర్వర్తింపగలిగెనో మనము విచారింపవలసి యున్నది.

కథాప్రారంభమున బ్రహ్మమానసపుత్త్రుడగు నుద్దాలకమహామునియు, నాతనియాశ్రమమును వర్ణింపబడినవి. నిత్యబ్రహ్మచర్యవ్రతమున నున్న ఉద్దాలకునికడకు పిప్పలాదుడను మహాముని వచ్చి యాసంయమివరుని దారపరి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రహణ మొనరింపుమని యుపదేశించెను. పదంపడి తండ్రియగు కమలగర్భుఁడు పుత్త్రునికడకు నేతెంచి గార్హ స్థ్యమును స్వీకరింపుమని యానతిచ్చెను. ఉద్దాలకు డెవరు చెప్పినను వినక మొండిపట్టుపట్టి బ్రహ్మచర్యవ్రతము నే నిర్వహింప సమకట్టి వైదికాచారవిధి విధానములో నిత్యానురక్తుడై యుండెను. ఈభాగమెంతయు శుచియై నకల్పనలతో నతిమనోహరముగ వర్ణింపఁబడినది. ఎచ్చటనైన నాధ్యాత్మిక జీవితప్రవాహమేకాని పంచేంద్రియ వ్యాపార మిసుమంతయు గానరాదు. ప్రపంచమంతయు శాంతమగువైరాగ్యమార్గమున గోచరింపుచున్నది చిత్తముల సంభవించెడు కామినీజనసంపర్కముగాని, క్రీడాజల విహారములుగాని కానరావు. ప్రకృతికన్య జటావల్కలముల బూని, సదా ధ్యానపరవశయై యోగినీవృత్తి నాశ్రయించియున్నది. షట్పదములఝుంకారములు, కోకిలారవములు, పుష్పాపచయములు, వనవిహారములు, ఇత్యాది శృంగారరసవిలాసములు లేక వనలక్ష్మి తాపసవ్రతము సలుపుచున్నది. ఇది న్యాయమే. అరణ్యములలో కాలముగడుపుచుపవనపర్ణాంబుభక్షులైయున్న తపోధనులు వేరుమార్గము లవలంబింపఁ ప్రవర్తింతు రెట్లు? ఈవిషయమంతయు నే సామాన్యకవియైన నీవిధముగ జిత్రించును కాని మఱియొకవిధముగ జిత్రించుటకు వలనుపడదు. దుగ్గకవివర్యుని శిల్పచాతుర్య విశేషమిం దెక్కుడగా ద్యోతకము గానేరదు.

నాయకునివిషయము వివరించితిని. ఇంక నాయికా విషయముచూడవలెను. నాయికావిషయములో దుగ్గకవియొక్క కవితాప్రాగల్భ్యము, సంవిధానవైపుణ్యము, ఔచిత్యపరిజ్ఞత, ఇత్యాదిమహాకవిలక్షణము లత్యుత్తమముగా గాన్పించుచున్నవి. ఈప్రసంగభాగమునంతయు దుగ్గకవిగ్రంథమందును, సామాన్యకవియైన మల్లికార్జునిగ్రంథమందును తారతమ్యముగ బరిశీలించినచో దుగ్గకవియొక్క కవితాప్రతిభ యెంత యుత్కృష్టమైనదో మనకు స్పష్టముగ తెలియగలదు.

కథానాయికయగుచంద్రవతి భరతవర్షమునంతయు నఖండసామ్రాజ్యధౌరంధర్యముగ, బరిపాలించిన రఘుమహారాజుకుమార్తె. రాజాంతఃపురములోనుండి, దాసీజనపరివృతయై, ఇచ్ఛామాత్రమున సమస్తభోగభాగ్యపరితృప్తయై నిరంతరకేళీవినోదాసక్తయై యుండదగిన రాజకన్యక నిమ్మహాకవి యెంత విపరీతచరితగా జిత్రించెనో జూడుడు:

సీ. అనుదివసంబును నతిభక్తిఁ దల్లిదం
డ్రులకు నన్నలకు శుశ్రూష సేయు
నతివృద్ధులైన బ్రాహ్మణపురంధ్రులతోడ
ధర్మకథాగోష్ఠిఁదగిలియుండు
సంతతంబును భాగ్యసౌభాగ్యదములనఁ
బొలిచిన వ్రతములు సలుపుచుండు
పెద్దలు తనకుఁజెప్పిన బుద్ధిదప్పక
విమలసదాచారవిధు లొనర్చు
దాల్మియు, జిత్తశుద్ధియు, ధర్మమతియు,
దయయు, దాక్షిణ్యమును, సావధానతయును,
వినయమును, బంధుహితమును, నెరవుఁదగవుఁ
గలిగి చంద్రవతీకన్యకాలలామ.

క. అన్నయును దల్లిదండ్రులు
మన్ననఁ దను గారవింప మహనీయములై
యెన్నిక కెక్కినగుణముల
వన్నియ గలిగించె చంద్రవతి కులమునకున్.

క. ఆచంద్రవతి వివేకము
నాచారము గౌరవంబు నడకువయును నా
లోచింప నెందుఁ గానము
భూచక్రములోన రాజపుత్రికల యెడన్.

ఈమెసౌందర్యము నాపాదమస్తకము వర్ణించుట లేదు. ఈమెయుద్యానవనవిహారములను, జలక్రీడలను, చెలికత్తెలతోడి సరససల్లాపములను, వీనినైన మనసార వర్ణింపుట లేదు. అష్టైశ్వర్యములతో తులతూగుచున్న యీ రాజకన్యను సామాన్యసంసారుల బిడ్డవలె తల్లిదండ్రులకు సదా సేవచేయుచుండుననియు వృద్ధబ్రాహ్మణపురంధ్రులతో ధర్మకథాగోష్ఠి సల్పుచుండుననియు అనవరతము వ్రతములు సేయుచుండుననియు, తాలిమియు, చిత్తశుద్ధియు, ధర్మమతియు, దయయు, దాక్షిణ్యమును వినయమును ఇత్యాద్యాధ్యాత్మిక సుగుణసంపత్తి గలిగియున్నదనియు నభివర్ణించినాడు. ఇది దుగ్గకవిమార్గము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రీరాముఁడు సీత నడవి కంపుట ధర్మమా?

మోచర్ల రామకృష్ణయ్యగారు, బి. ఏ.

స్థిరచిత్తమూని, సర్వముఁ బరిశీలనచేసి, ధర్మవర్తనపరులై
ధరణిం బరిపాలించుట, ధరాధినాథులకు విధివిధానమ్ముగదా!

చ. త్వరపడి యెవ్వఁడో యొకఁడు వాక్కునవచ్చిన యట్టులెట్టులో
పొరపడి పల్కుమాటలను బూర్ణముగా సువిమర్శ సేయకే
బిరబిరఁ దానువిన్నయది వేదమటంచుఁ దలంచి కార్యముల్
జరుపుట పాడియే, సుజన సమ్మతమే, యది రాజనీతియే?

ఉ. "నిక్కమితండు దండ్యుఁ డితనిన్ దగినట్లుగ దండనంబునన్
స్రుక్కఁగఁ జేయుఁడీ!" యని విరోధులు దోషవిహీనుఁడైన వే
ఱొక్కని దెచ్చి రాజసభ నుంచినచో గతియేమి వానికిన్
జక్కఁగ సత్య మారసి విచారముసేయని రాజుముంగలన్.

తే. ఘోరపాతకులను నూఱుగురినినైన-శిక్ష సేయక విడిపింపఁ జెల్లుఁగాని,
నిరపరాధిని నొకని దండించుటెంతొ-దుండగంబని నుడువదే దండనీతి.

చ. అటులగుటన్ రఘూద్వహునియట్టిధరారమణుండు పంచె నే
మిటికి నరణ్యసీమకు నమేయగుణోజ్జ్వలమైన జానకిన్ ?
గటకట ! యెట్టిచేఁత ? వినఁగల్గెనె యిట్టిది యెన్నఁడేని? సం
కటపడఁజేయఁజెల్లునె యకల్మషవర్తనలన్, బవిత్రలన్?

ఉ. "వైరిగృహంబునన్ సలిపె వాసము కొండొకకాల, మందుచే
నేరికినైన సందియములే కలుగున్ గద యెట్టి సద్గుణా
చారను గూర్చియైన" నని సల్పెనొకో రఘురాముఁ డీపనిన్?
దూఱుఁ దొలంచి పావకుఁడు తొల్లి యథార్థముఁ జాటియుండఁడే!

ఉ. ఒక్కనిదృష్టి యున్నయటు లుండదుగా మఱియన్యదృష్టి యే
ప్రక్కను జూచినన్ వివిధభంగులు దాల్చిన దాటచే జగం
బెక్కరణిన్ వహించు సమవృత్తిని? గానఁ బ్రజానురంజనం
బొక్కట సేయ నెంచుట ప్రయోజన మెన్నఁడు గాదు ఱేనికిన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. న్యాయాన్యాయములన్ వివేకమను నున్మానంబులోఁ దూఁచి, య
న్యాయంబుల్ దిగఁ ద్రోచి, ధర్మగుణ విన్యాసంబులన్ భూమికిన్
శ్రేయంబుల్ పొసఁగించుటే నృపులకున్ సిద్ధాంతమై యొప్పదే!
వేయేలా! ప్రజ లందఱన్ దనుప, నే పృథ్వీశుఁ డాఢ్యుండగున్?

తే. ప్రజలయనురంజనమె రాముని వాంఛయగుట-వనమునకు ధారుణీ పుత్త్రి ననిపె నతఁడు!
పట్టభద్రుఁడు గాక తా నెట్టు లరిగెఁ-గానకును బ్రజల్ గన్నీరుగార్చుచుండ?

ఉ. "నాసతిఁ బూతవృత్తిగ జనమ్ము లెఱింగిన యప్డె యశ
శ్రీ సమకూరు నాకు, బళిరే!" యని భార్యను గానలన్ వృథా
యాసముపాలు సేయుట నయంబని యెంచెడి వారిఁ జెందదో
దోసము; రామరామ! యెటు దోఁచును రాజుల కిట్టిభావముల్!

శా. సీతాదేవి పతివ్రతాత్వము జగజ్జేగీయమానంబుగా
ఖ్యాతిన్ జెందుటకో, సమస్తజను లాకర్ణించి, పూర్ణంబుగాఁ
జేతోమోదముఁ జెందుకోర్కెనో కదా, శ్రీరాముఁ డంపెన్ సతిన్
భీతిన్ గొల్పు మహాటవీస్థలికి; లేవే వేఱు సంకల్పముల్?

తే. 'నాతి యొంటరి హేయంపుఁ బాతకంబు-నలిపినను, జాలుఁ దాల్చిన చెలువయైనఁ
గఠినశిక్ష కనర్హ యా కనెడు వఱకు' ననెడి ధర్మసూత్రంబైన నరయవలదె!

చ. కులగుణహీనుఁడైన రజకుం డెవఁడో దురితంబు లాడెఁబో!
తెలిసి యకారణంబుగఁ బతివ్రతయైన కులాంగనామణిన్
సిలుగులఁ గూర్చు కానలకుఁ జేర్పఁ దలంచెనుబో! యదేల? పూ
నులను, దపోవనంబులఁ గనుంగొనఁ బొమ్మను నట్టి వ్యాజమున్.

సీ. వాస్తవం బరయుట దుస్తరకర్మమై వస్తుసందేహముల్ విస్తరిలిన,
నార్యులెల్లను దమయంతఃకరణవృత్తి ముఖ్యమైన ప్రమాణముగ గ్రహించి,
యనుమానములనివృత్తిని బొంది, సంతృప్తి గాంతురంచు వచించెఁ గాళిదాసుఁ
గాన సజ్జను లెన్నఁడైనను బరజన సంశయభావముల్ సరకుఁ గొనరు.
కలియుగపు వాఁడెయగుఁ గాక కాళిదాసు, సత్య మేయుగమునసైన సత్యమెకద!
శాస్త్రచోదిత మైనట్టి సత్యబద్ధ నియమమే మన కాచరణీయముకద!

మ. తనయంతఃకరణంబు తెల్పదొకో, సీతన్ సాధ్విగాఁ! నేటి కీ
యనుమానంబులు దేవిపై? ఇతరు లే యన్యాయముల్ ప్రేలినన్
జనునే జానకి నంపఁ గానలకు నిష్కారుణ్య చిత్తంబునన్
జనులా సాక్షులు, లేక మానసమ, చర్చల్ సేయుఁడీ పాఠకుల్!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# కళా ప్రపంచము

కవికొండల వేంకటరావు గారు, బి. ఎ., బి. యల్.

మానవుని జీవితచర్యలు రెండువిధములుగఁ దోఁచు. కొన్ని పరిమితములు; కొన్ని అపరిమితములు. పరిమితములగున వాతఁడు కల్పించుకొన్నవి. అపరిమితములగున వాతఁడు కల్పించు కొనకయే యతనికి లభించునవి. ధనార్జనము కల్పించుకొనునది. పాఠశాలలయందుఁ, గళాశాలలయందుఁ జేరి పఠించుటలు మనుజుఁడు స్వబుద్ధిని కలిపించుకొనునది. దేశసేవ, భగవదారాధన యట్టివి. వీనియన్నింటియొక్క సర్వసామాన్యలక్షణమిది. ఆయాకార్యముల నొనర్చునతని మానసమున నొక సువ్యక్తమగు నాశయము, నదియొక్క యావలి యొడ్డులాగునఁ బొడఁగట్టు.



వ్యాసకర్త

ఈమితిచేఁ బరిబంధితములగు కార్యముల నడుమనడుమ మన మొకచెట్టువైపున కూఱక చూచుచుందుము. వినోదవంతంబగు నాకసపు వంపునే తెప్పల వ్రాల్చుచుందుము. ఒక కొండ పొడవునంటి దృగంచలముల నెత్తుచు నెదో యఖండపుటూహ నుఱ్ఱూఁతలూఁగుచున్నాము. అది మన కాఁకలి దీర్చునదికాదు; దప్పి కార్చునదికాదు; ధనము కూర్చునదికాదు. చూపులోనే, యూహలోనే మనల నదియపారపుటవ్యక్తసందర్శనంబునం బొదవికొని యొకవిధ మగు ననాదిస్వరూపమును, ననంతలక్షణమ్మును బగటుచుండు. అది, తనంతన, మనలోఁ దట్టుచు మనకు విరామప్రశాంతు లొడఁగూర్చు. దానికి మనపై నుండునంతటి యభిలాష మనకుఁగూడ దానిపై నుండునా? అది మనలో నిలిచియుండు. లేనిచో నయ్యది తాత్కాలికమగుచు పెఱనిముసమున నగోచరమ్మగు. మన మెప్పటి చొప్పునఁ బరిమిత కార్యనిమగ్నుల మగుదుము. ఈ పరిమితకార్యములం గలసిమెలసి మన కలనడునట్టి మితిలేని యయ్యూహాసందర్శనమే కళ. దాని వాతావరణమే కళాప్రపంచము. ఈ కళపొంతు మన కడకంటిచూడ్కి సారించుట లాధనార్జనాదులందుఁ దృష్ణ గొనునెంతటి నిసర్గమో యంతటినిసర్గమును—మనము దానిం బోనాడక పోషించుకొనువారమగుదుమేని ఆకళ మనముందు నిరంతరము సాక్షాత్కరించి యుండునదియ. ఎంతవఱకు మనము స్వార్థమును విడిచి యవ్యాజముగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లభించు నాకళ నాశ్రయింతుమో అంతవఱకు మనజీవితము లనంతశోభను, నవ్యానందము నను నోలాడు.

ఈకళ యననేమి? అది ఎట్లు వెల్లడి పఱుపఁబడుచున్నది ? దానికింగల మెక్కువపాటు తక్కువపాటు లెట్టివి? దాని నెట్లాశ్రయించుటయని యోజన నొనర్పఁబూనినచో నెంత కాలమైనఁజాలదు; వ్రాయ నెన్ని పుటలైనఁబట్టు. ఏమన: చూచుట మొదలిడుదుమా, అది పిపీలికాదిబ్రహ్మపర్యంత మొక్కతెఱంగున కాలరేఖల, నవకాశరేఖల, ఊహారేఖల, చేష్టారేఖల, నొయ్యార మొలికించుచుండు. లయకారుఁడు నటరాజుగఁ దాండవంబాడు. బాలకృష్ణుఁడు తన చిన్నిబొజ్జ నీరేడుజగమ్ములందాల్చి యాపులింత సమ్మ కచ్చెఱుపాటుఁగొల్పు. ఎందువిన్న మృదుమధుర మంజులాలాపమే; ఎందుఁ గన్న సుందరవదనారవిందమే. పాములవాఁడు నాగస్వరమూఁదు. కోడెత్రాచు పడగెత్తియాడు. తెల్లతామర వికసించు, నల్లతుమ్మెద పరిభ్రమించు. గొల్లపిల్ల పాలగంపనెత్తిపై మోచికొనుచు మట్టెలరవళిఁ జేలగట్టునే నడయాడు. గోపాలుఁడు మందస్మితమ్మున నట్టె పడగొట్టనుంకించు. కళాప్రదర్శనమున కుదాహరణములుగొన నమకట్టుదుమా, దానికి మొదలెందు, తుదయెందు? అనాది—అనంతము. కళ నీక్షింగుసఁ బ్రదర్శనదృక్పథమున వీక్షింప దొరకొన్న యది దొరకనే దొరకదు. ఏమన;

జీ వ రా సు లసంఖ్యములు; జడ మనూహ్యము. ప్రతిపదార్థమును కళ ప్రదర్శించుచునే యుండు. ఆప్రదర్శన మొనరించునంతనే ఆపదార్థ మాకళను జూపఁగొనుచున్నదని మన మనుకొనరాదు. దానికిఁ దన సౌందర్యాతిశయము, సౌరభవ్యాప్తి తెలియకుండనే గులాబిపువ్వు వికసించుచున్నది. (తెలిసియున్నను వ్యక్తపఱుప జాలకున్నది.) ఒకానొక లేగదూడ నిక్కిన చెవులతోఁ బొలము నడుమ నిలఁబడియుండియు నట్లు తాను నిలఁబడుటలోఁ దాను గళను బ్రదర్శించుచుంట నెఱుంగక పోవచ్చు. (ఎఱింగియున్న మేలే. ఆత్మశక్తి యొకమెట్టు పైకెక్కిన యదియే.) అంతవఱకేల! మన చుట్టునుంగల పెక్కుమంది రయితులు, పామరాంగనలు, అవ్యక్తపు శిశువులు తాము ప్రదర్శించునట్టి కళను వారెఱుంగనే యెఱుంగరు. ఏమన: మనము వారిని గ్రుచ్చి ప్రశ్నింతుమేని వెఱ్ఱితనమును, బేలతనమును వెలిపుత్తురు. కావున కళను బ్రదర్శించునంతఁ దత్ప్రదర్శకు లయ్యది గ్రహించుచున్నారని మనము తలంపఁజనదు. ఆగ్రహించు శక్తి వేఱు. తత్ జ్ఞత్వ మొకకొందఱికే కల్గియుండు. ఆ యున్నవారిని మన మివ్వ్యాసమునఁ గళాభిజ్ఞు లందము. ఈ యభిజ్ఞు లేమి చేయుచున్నారు? కళాప్రదర్శనమున నాత్మదృష్టిని లీనమొనరించుకొనుచు నద్దానిని దమ సుముఖమ్ముల వ్యక్తీకరించుచున్నారు. లలితారుణ ప్రభాకోమల కరోష్ణబింబోదయ సముదితంబగు నుదయగిరి వీక్షించుచుఁ దమదృష్టి నద్దాన నుపమాద్యలంకారములం గుర్తించి మొగముల మొలకనవ్వులెత్త "ఎంత కోమలమెంత సుందర, మెంత శుభోదయం," బని యుత్కంఠ నుపాసించుచున్నారు. ఆయుపాసన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొలవఱకుండునో యంతవఱకు వారు తది తరమునెల్లను మఱచి యానందతన్మయు లగుచున్నారు.

అట్లు చేయుటలోఁ గొందఱు తజ్జ్ఞులు తమకుఁ గల్గిన యాత్మీయమైకవ్యక్తిత్వము నేమఱి యాకళచే నుపనీతులగుచున్నారు. కొందఱు నైమఱువక దానిని దమ కనువగుతెఱంగున నడిపించుకొనుచున్నారు. కళోపనీతుఁడగు నాతఁడు తాఁగనునట్టి కళను విశ్వకళయందు లీన మొనరించుకొనుచు విశ్వహృదయము నాకర్షించుకొనుచున్నాఁడు. కళోపాసనవలననాతఁడు మోహము,రాగము, తృష్ణ పోయి విమమరఁ గాంచుచున్నాఁడు.కళను కళకొఱకయియే కైవారము సేయుచున్నాఁడు. కేవలాభిజ్ఞుఁడు కళ నానిమేసమునకుఁ దనయొక్క హృచ్ఛాంతికై, చిత్తశుద్ధికై, పరికల్పన మొనరించుకొనుచు మఱుసటినిమేషమున దానిని విడనాడుచున్నాఁడు. ఆతని కాత్మదృష్టియేకాని విశ్వదృష్టి యుండదు. కళయందలి వివిధభంగులు, పెక్కురంగులు, చిన్నెలువన్నెలుఁ హొయలు లయలు,సమస్తము నాతఁడు కొల్లగొనఁ గల్గువాఁడుగాని, వానివలనఁ దనహృదయరసము లె ట్లుబుకునవియో తెల్ల మొనరించు కొనఁగలఁడుగాని, సర్వసాధారణమగు పరమాత్మ నెట్లు తిగుచుకొనినదియో తెలియఁడు. అట్లు తెలిసికొనుట కెంతయో యోపిక, నిగ్రహము, కాలము, త్యాగము కావలె. అవి అతని కుండవు. సరసుఁడే—కాని ఏతత్సరసత్వము తక్కుంగల జీవితచర్యలతోపాటు స్వార్థపుఁ బ్రకృతిగనే యతనియందుఁ బరిణమించియుండు. అతఁడు కళను గుఱించి పలికినా, విమర్శించినా, కీర్తికొఱకో, ధనము కొఱకో, పలుకుబడికొఱకో—

కళోపనీతుఁడగు మహానుభావుఁ డట్టిండు గాఁడు. ఋశ్యశృంగుని భంగి నాతఁడు:

"నన్నును గౌఁగిలించుకొని
నావదనంబునకుఁ నిజాస్య మానన్నముచేసి యొక్క మృదు
శబ్దము సేసె మనోహరంబుగా
నెన్నఁడు నట్టిశబ్దము సు
నీశ్వర! మున్ విని యే నెఱుంగ న
య్యన్నవబ్రహ్మచారిముఖ
మంబురుహంబు సమంబు చూడఁగన్.

అని నిర్లిప్తత వెల్లడించు.

తాదృశంపుటుపనీతులే యుత్తమ కవులు, ఉత్తమ చిత్రకారులు, ఉత్తమ శిల్పులు, ఉత్తమ గాయకులు, ఉత్తమ విమర్శకులును. వీరి సుకృతులఁ గళాప్రపంచము సువ్యక్తమగుచు నిత్యముఁ బోషింపఁబడుచున్నది.

వీరలు కళయందుఁ దన్మయులయి తారే కళాంశంబులుగఁ బొడఁగట్టుచు,—లోకమూహింపలోకయబ్బురపాటుచెంద,—నిర్వికారత, నిరహంకారత, నిరాడంబరతలతో నింగినొప్పకడ చుక్కభంగి నివ్వటిల్లువారలు. వారి చేసేతలఁ గళాప్రపంచము క్రొంగ్రొత్తగ మాఱుచుఁ బరిపూర్ణవికసనము నంది యందగించుచున్నది. వారి ననుకరించుట కొక్కటే తెన్ను. ఆత్మకుఁ దిన్నందన మున్నఁ గళాస్నాతకుఁడు వరింపఁబడుచున్నాఁడు.—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# బాల! యీలీల దుఃఖింపఁ బనియదేల ?

చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు

చెలువు మీఱెడు మోమునఁ జిఱుచెమటలు-గ్రాలఁ, గన్నుల నశ్రులు రాల, మేను
వివశతనుఁ బొంద, నధరపల్లవము నదర-బాల ! యీలీల దుఃఖింపఁ బని యదేల ?

ఉ. తోడియనుంగు బాలికలతో విహరింపఁగలేక యిచ్చటన్
బోడిమిఁ దక్కి జేలవయి ' బోరన ' నేడ్వఁబనేమి? తల్లి ! ని
న్నాడిరె ? కారుకూఁత లెవరైన వచింపఁగదమ్మ, మోమటుల్
వాడఁగ నేడువన్ దగునె ? లాతివిధంబున వెఱ్ఱితల్లిరో !

సీ. తొలుదొల్తఁ బుష్పడోలల నుంచి వీచు నన్నయకునై యింతగా నడలె దొక్కొ !
నినుఁగూడి మోదసంజనితమానసుఁడైన తిక్కనకొఱకుఁ జింతించెదొక్కొ !
భావకవిత్వసంపద నిచ్చి లాలించు నెఱ్ఱనకొఱకు దుఃఖించెదొక్కొ !
నిరుపమాలంకారగరిమ నెలమినిఁగూర్చు శ్రీనాథునకుఁ జింతఁజెందెదొక్కొ !
ప్రేమసన్మార్గమున నడిపించినట్టి-భాస్కరునకీవు దుఃఖార్తిఁ బరగెదొక్కొ !
యమృతమయవాక్య సమితిని న్నాదరించు-సోమకవిచంద్రునకు నింత సోలెదొక్కొ !

సీ. సలలితబాలరసాలపల్లవఖాదియగు పికంబొల్ల దాహార మరయఁ
బరికింపఁ గలకల స్వనమెల్ల విడనాడి విలపింపఁదొడఁగె నీవెఱ్ఱిచిలుక
గమనలాలిత్య మాకలహంస విడనాడి జడత వహించె నాశ్చర్యమొంద
నిలచినచోటనే నిలచి చూచుచునుండెఁ జకితమై లేడి గ్రాసంబు మాని
కమ్మబూఁదేనియలఁద్రావి " ఝు "మ్మటంచుఁ-బాటఁ బాడెడి నీ యెలదేఁటి పాటఁ
బాడుటను మానె; నీ విట్లు పరగుచుంట-వీడు మిఁకనైన దుఃఖంబు వెఱ్ఱితల్లి !

చ. సరసశిరీషపుష్ప సదృశంబగుమే నిటు వాడనేల ? నీ
తరువులు రాల్చెఁ బూవుల నుదారత నశ్రుల నించుభంగి, నో
తరుణి ! వరింత్రు సత్కవులు, దథ్యము నావచనంబు; దుఃఖముల్
దొరగి సుఖింపుమమ్మ, యిటు దుఃఖమునొందకుమమ్మ, నిచ్చలున్.

ఉ. ఏడువకమ్మ, నిన్ను వరియింపఁగలారు ధరాతలంబునన్
వేడుకమీఱ నుందు రిఁక, వేమరుఁ జెప్పఁగనేల? నందు నీ
కీడగువానిఁ జేరి సుఖియించెదవమ్మ, సతంబు దైవమున్
దోడగునమ్మరో, కవివధూమణి యంచు వచింత్రు సజ్జనుల్

కం. అని యీరీతినిఁ గవితా వనితను నోదార్చె సుకవి స్వప్నంబునఁ దాఁ
గని " నిన్ గుకవులు గైకొన "రని; యీ భావంబులోక మరయున్ సదయున్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



సర్ పి. యస్. శివస్వామి అయ్యరుగారు

అకోలాలో సమావేశమయిన

మితవాది మహాసభాధ్యక్షులు



టి. ఆర్. ఫూకనుగారు

౪౧ వ జాతీయమహాసభాహ్వానసంఘాధ్యక్షులు-గౌహతి



పండిత మదనమోహన మాళవ్యాగారు

హిందూమహాసభాధ్యక్షులు-గౌహతి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ౪౧ వ జాతీయమహాసభ - గౌహాతి



నార్త్‌బ్రూకు ద్వారము



నార్త్‌బ్రూకు ద్వారము-మరియొకదృశ్యము
కుడివైపున శుక్రేశ్వరదేవాలయమున్నది.



ఉమానందద్వీపము లేక నెమలిదీవి.



ఊర్వశిపర్వతము - ఈకొండపైన దీపస్తంభ మున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# కావ్యాలంకారచూడామణి-విన్నకోట పెద్దన

విద్వాన్ గనాసి రామమూర్తి శాస్త్రి గారు

ఆంధ్రాలంకార గ్రంథములలో నెల్లఁ బ్రాచీన మనఁదగు నీ కావ్యాలంకారచూడామణిని విన్నకోట పెద్దనకవివరుఁడు రచించి శ్రీచాళుక్యవిశ్వేశ్వరరాజునకుఁ గృతియొసంగెను. " ఈచాళుక్య విశ్వభూపతి మనుమఁడగు నృసింహభూపతి క్రీ.శ. 1403 వ సంవత్సరప్రాంతమునఁ బంచతీర్థమునందలి ధర్మలింగేశ్వర స్వామికి నాలయమును గట్టించిన ట్లొకశిలాశాసన మగపడుచున్నది. తాతకును, మనుమనికిని నేఁబదియేఁడులంతరముండునని యంగీకరించినచో క్రీ.శ. 1350 సంవత్సర ప్రాంతమునఁ గృతిపతియగు చాళుక్య విశ్వభూపతి యుండుట సంభవించును. కావున నీగ్రంథము క్రీ. శ. 14 వ శతాబ్ది మధ్యకాలమున రచింపఁబడియుండును." అని కీ. శే. కందుకూరి వీరేశలింగము పంతులుగారు గ్రంథకాలమును, గ్రంథకర్త కాలమును దేటపఱచి యున్నారు.

మఱియు నీగ్రంథమునందలి చతుర్థపంచమోల్లాసములలోఁ జేర్పఁబడిన గుణాలంకారభాగములుదప్ప దక్కినభాగములన్నియుఁ సామాన్యముగఁ బ్రతాపరుద్రీయము ననుసరించియే యాంధ్రీకరింపఁబడినవి గాన నీగ్రంథము కాకతీయద్వితీయప్రతాపరుద్ర దేవాంకితమై క్రీ. శ. 1320 ప్రాంతమునఁ బుట్టిన ప్రతాపరుద్రీయమునకుఁ దరువాత రచింపఁబడియుండునని నాకుఁ దోఁచుచున్నది.

సామాన్యముగ గ్రంథమంతయుఁ బ్రతాపరుద్రీయమునే యనుసరించుచుండుటంజేసి ప్రతాపరుద్రీయానుసరణము సోదాహరణముగఁ జూపుట యనావశ్యకము. ఐనను మచ్చునకై కొన్నియుదాహరణములఁ జూపెదను:

మూలము: సా పదానాం పరాఽన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే.

ఆంధ్రీకరణము: మృదుతరమై యొండొంటికిఁ
బసమిత్రతగలిగి నొడువు పలుకులలోనన్
బొదలెడునర్థం బెచ్చట
నదలించి శయించు శయ్య యనఁగా నదివో.

మూ: అర్థగంభీరిమా పాక స్స ద్విధా హృదయంగమః;
ద్రాక్షాపాకో నారికేలపాకశ్చ ప్రస్ఫుటాంతరః.

ఆం: పాక మనంగా నర్థని
రాకులగంభీరయుక్తి యదియిరుదెఱఁగై
లోకమునఁ జేర్చు ద్రాక్షా
పాకంబును నారికేలపాక మనంగాన్.

మీఁద నిరూపింపఁబడినయుదాహరణములలో యతిప్రాసముల నిమిత్తము, పద్యపాదపూరణార్థము ప్రతాపరుద్రీయలక్షణములో లేని మాటలు క్రొత్తగాఁ జేర్పఁబడినవి. ఇఁక మక్కికి మక్కిగా నాంధ్రీకరించినస్థలములను గొన్నింటిని జూపెదను.

మూ: శ్రుతికటురూప దోషనిరాకరణాయ సౌకుమార్యం మతమ్.

ఆం: శ్రుతిపరుషతమాన్పుటకై
మతికర్తవ్యంబు సౌకుమార్యము చెప్పన్.

మూ: గ్రామ్యదోష నిరాకరణాయకాంతి స్స్వీకృతా.

ఆం: చతురతఁగాంతి ఘటించుట
వితతగ్రామ్యార్థహరణ విశ్రుతిఁజేయున్.

మూ: అస్పష్టార్థ నిరాకరణాయార్థ వ్యక్తి ర్మతా.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆం: కృతులన పుష్టార్థ ప్రవి
హతికై చొనుపంగవలయు నర్థవ్యక్తిన్.

మూ: న్యూనాధికపదనిరాకరణాయ సమ్మితత్వం మతమ్.

ఆం: వితత న్యూనాధికపద
యుతిహతికై సమ్మితంబు నొప్పం గవితన్.

మూ: అనుచితార్థ నిరాకరణార్థముదాత్తతా స్వీకృతా.

ఆం: అనుచితార్థ నిరాకరణాప్తికొఱకు
నగనుదాత్తతఁ గావ్యంబులందుఁ జొనుప.

మూ: విసంధి నిరాకరణాయ ఔర్జిత్యం మతమ్.

ఆం: యుక్తపాదవిసంధి విమ్యుతియొనర్చు
పనికి నూర్జస్వికర్జంబు పద్యములను.

మూ: పతత్ప్రకర్ష నిరాకరణాయ రీతి రిష్టా;
క్లిష్టపరిహారాయ ప్రసాదో మతః.

ఆం: తుదఁబతత్ప్రకర్ష దోషాపహతికినై
యుక్తరీతిఁ గావ్య మొగి నొనర్ప
నప్రతీతికపరిహారంబు కొఱకు
సుప్రసాదగుణముఁ జొనుపవలయు.

మూ: అశ్లీలపరిహారార్థ ముక్తి స్స్వీకృతా
చ్యుత సంస్కారపరిహారార్థం సౌశబ్ద్య మిష్టమ్;
ప్రక్రమభంగ నిరాకరణాయ సమతా మతా.

ఆం: చ్యుత సంస్కృతిమానుటకై
యతిమధుర సుశబ్దవృత్తముగ నొనరింపన్
ప్రతత ప్రకృమభంగా
హతికై సంక్రమత కూర్పనగు నంద్రు బుధుల్.

ప్రేయోఽలంకారము దా
శ్రేయంబగుఁ బరుషదోష శిథిలతకొఱకై
చేయఁదగునూర్జితం త్రమ
హేయాశ్లీలంబు దొలఁగ నెసుచుటకొఱకై.

ఇశ్లో॥ యచ్చటచ్చటఁ బ్రతాపరుద్రీయము ననుస
రించి మక్కికిమక్కిగా లక్ష్యములును ఆంధ్రీకరింపఁ
బడినవి.

మూ: వ్యర్థాష్టాష్ట బాహూనా
మమీషా మీదృశాం దృశామ్;

కథం సహామహే ధిగ్ధి
క్కృతినం హంత జీవితమ్.

ఆం: జగతి నెనిమిదింటి సగములో సగమగు
భుజము లాహవములఁ బొల్లులగునె
భూపతులకు నన నపుష్టార్థమర్థార్థ
పదము లర్థపుష్టి పదముగాది.

మూ: బాష్పాంబుక్లిన్న నేత్రాణి
ముఖాన్యంగ మృగీదృశామ్;
హిమదూషితపత్రాణి
కుసుదానీవ నిర్బుదామ్.

ఆం: బాష్పకణకీర్ణమైయొప్పు బడఁతిమోము
మంచునిండినతొగపువ్వు మాడ్కినవిన
నప్రసిద్ధోపమార్థమై యడరునండ్రు
కుముదముఖముల కుపమాప్తి గూఢకునికి.

మూ: కా నామ గణనా యస్య కాకతీయస్య భూపతేః;
యశః ప్రతాపయోర్మగ్నౌ సూర్యాచంద్రమసావపి.
ఇాఘాఘామముఖాః కాంతాః కాననే మాలవేశితుః;
గ్రీష్మే నద్య ఇ వామ్లానపద్మోత్పల బిసావిలాః.

ఆఁ: శ్రీవిష్ణువర్ధనాఖ్య
క్ష్మావరుకీర్తిప్రతాపమహిమలలో రా
జీవేందీవరమిత్రులు
కావింతురు చెలిమియనఁగఁ గ్రమభంగ మగున్.

వికలముఖులైన యరివధూటికలు క్లాంత
నళినకైరవలగు గ్రీష్మ నదులభంగి
నైరి నా నధికోపమ యయ్యె నరయ
నందుఁ గైరవ ముపమకు నధికమగుట.

ఇట్టి వనేకములు గలవు; కాని విస్తరభీతిచే
నుదాహరింపనైతి.

ఇందుఁ జతుర్థపంచమోల్లాసములలోఁ జేర్కొనఁ
బడిన గుణరీత్యలంకార సందర్భములు దండికావ్యాదర్శ
ము ననుసరించి రచింపఁబడినవనుటకుఁ బ్రతాపరుద్రీయ
మునందువలెఁగాక యిందుఁ దండ్యాచార్యు ననుసరించి
గుణదశకము నంగీకరించుటయు, దండ్యుక్తాలంకార లక్ష
ణములతో నిందలి యలంకారలక్షణములు సరిపడి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యుండుటయు, దండివలెనే తత్తదలంకారములక్రిందనే తత్తద్దోషముల నిరూపించుటయు, నిర్హేతుకముగ నలంకారములవరుసయు సరిపడియుండుటయుఁ గారణములు గాఁజాలును.

కావునఁ బైని నిరూపించినకారణసమూహముచే గుణాలంకారసందర్భములు దండికావ్యాదర్శము ననుసరించి రచింపఁబడినవని చెప్పకతీరదు. 'రీతి రాత్మా కావ్యస్య', 'రీతిశ్చ గుణవిశిష్ట పదరచనా' అను వామన సూత్రము ననుసరించి పెద్దన,

గీ. అఖిలకావ్యంబులకు రీతులాత్మ యండ్రు;
ప్రాణదశకంబు వానికిఁ బ్రాణమరయ;
ధర నలంకారమతభేదముల నవియు
పెక్కు; లొక కొన్ని తగఁ గానిపింతుఁ దెలియ.

అని రీతిలక్షణమును గల్పించెను. దండియు దశగుణ విశిష్ట పదరచనయే రీతియని యంగీకరించెను గాని యట్టిరీతిని గావ్యాత్మగా నంగీకరింపక కావ్యశరీరముగా నంగీకరించియున్నాఁడు.

మూ. శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలీ ... ...

కావున రీతిలక్షణము వామనసూత్రము ననుసరించి కల్పింపఁబడినదని చెప్పవలసివచ్చినది. కాని 'రీతి రాత్మాకావ్యస్య, రీతిశ్చ గుణవిశిష్ట పదరచనా' అను వామనసూత్రములోని 'ఆత్మక' శబ్దమునకు మనసుగాక శరీరమర్థమని యొప్పినచో వామనుఁడును 'తైశ్శరీరంచ కావ్యానామలంకారాశ్చ దర్శితాః, శరీరంతావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావలీ' అనుదండి మార్గము ననుసరించియే రీతిలక్షణమును నిరూపించెనని చెప్పుట కవకాశముగలదు. మొత్తముమీద ఇష్టార్థవ్యవచ్ఛిన్నపదావళియే వామనుని రీతి యగుచున్నది. కానఁ బెద్దనయు దండిననుసరించియే రీతిలక్షణమును నిరూపించెనని చెప్పుట కవకాశముగలదు.

మఱియుఁ గావ్యాదర్శ ప్రతాపరుద్రీయముల లేనట్టియు, సాహిత్యదర్పణాదులం దగుపడునట్టియు లాటికారీతి, ధీరాధీరాదినాయికాభేదములు, నృసింహ సంకరము మున్నగు నూతనవిషయము లిందుఁ జేర్పఁబడినవి: ఇఁక గుణరీత్యలంకారసందర్భములకు దండికావ్యాదర్శమూలమనుట నంశమునుదిజ్మాత్రముగఁ జూపెదను.

దండికావ్యాదర్శమునఁ దత్తదలంకారములక్రిందనే తత్తద్దోషములను, దత్తద్దోషములకు గుణత్వమును బ్రతిపాదించియున్నాఁడు.

మూ. నలింగవచనే భిన్నే నచ న్యూనాధికోపమే,
ఉపమాదూషణాయాలంయత్రోద్వేగోనధీమతామ్.
స్త్రీవగచ్ఛతి షండోయం,వక్త్యేషా,స్త్రీపుమానివ,
ప్రాణాఇవప్రియోఽయంమే విద్యాధనమివార్జితా.
భవానివ మహీపాల! దేవరాజో విరాజతే,
అల మంశుమతః కక్షా మారోఢుం తేజసా నృప!
అత్యేవ కశ్చిదుద్వేగః ప్రయోగో వాగ్విదాంయథా,
హంసీవ ధవల శ్చంద్ర స్సరాంసీ వామలం నభః;
భర్తృభక్తో భటశ్శ్వేవ ఖద్యోతో భాతి భానువత్.

ఇట్లే కావ్యాలంకారచూడామణికర్తయుమన్న పమాదోషములకు గుణత్వమును నిరూపించి యనంతర ముపమాదోషములను; దండిప్రకరణమును గ్రమముగా నాంధ్రీకరించి నిరూపించెను.

క. లింగంబుల వచనంబుల
భంగులు హీనాధికతల పాటియు వీడ్పా
టుంగదిరిన నుపమకు నిం
పుంగలుగంజేయునండ్రు బుధు లుచితోక్తిన్.

గీ. అరుగుచున్నాఁడు పేడివాఁ డతివవోలెఁ
బలుకుచున్నది పురుషుని పగిది నింతి
ప్రాణములు నాకు నీవఁ డుపార్జితార్థ
మిన్ని విద్యలు ననినను నెసఁగు నుపమ.

క. దేవా, నీచందంబున
దేంవేంద్రుండొప్పు నచట దినకరుగతి ను
ర్వీశ్వరుఁడు తేజమున సం
భావితుఁడన నుపమచెల్లు ప్రౌఢప్రియమై.

గీ. హంసివోలెఁ జంద్రుఁ డవదాతుఁడు, నభంబు
కొలఁకులట్లు నిడము, కుక్కవోలె
నిందు బంటుపతికి నినుఁబోలె ఖద్యోత,
మనెడు నుపమ లపసానకరములు. [రమ్

శ్లో. ప్రసిద్ధహేతువ్యావృత్త్యా యత్కించిత్కారణాంతర
యత్ర స్వాభావికత్వం వా విభావ్యం సా విభావనా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అను కావ్యాదర్శములోని విభావనాలక్షణ మీక్రింది విధమున నాంధ్రీకరింపఁబడినది.

గీ. సహజవిఖ్యాత హేతువు జాఱవిడిచి
కారణాంతర కల్పన కథనమొండెఁ
గామవిహిత స్వభావసంగతియ యొండె
నమరఁ బల్క విభావనయండ్రు బుధులు.

పెద్దన గుణరీత్యలంకారసందర్భమంతయు సరిగా దండి ననుసరించియే యాంధ్రీకరించియుండుటచే దిఙ్మాత్రముగా నుదాహరించి విరమించితిని. కావ్యాదర్శమునందువలెనే యిందును నలంకారములు యథాక్రమముగ నిరూపింపబడినవి. కాని కావ్యాదర్శమున నలంకారములుగాఁ బరిగణింపఁ బడని యుదారవక్రోక్తులును, భావికమును, నిందలంకారములుగాఁ జేర్పఁబడినవి. మఱియుఁ గావ్యాదర్శమున నలంకారముగాఁ బరిగణింపబడిన సంకరమిం దలంకారముగాఁ బరిగణింపఁబడలేదు. కావుననే దండిచెప్పిన ముప్పదినాల్గలంకారము లిందు ముప్పదియాఱయ్యెను. ఈ యిసుమంత భేదముదక్క వేఱొకభేద మీసందర్భమునఁ గానరాదు.

ఇందలి గుణరీత్యలంకారసందర్భములు కావ్యాదర్శమునుండియు, దోషాదిసందర్భములు ప్రతాపరుద్రీయమునుండియు సంగ్రహింపఁబడినవగుటచే నీపొత్తమునఁ గొన్ని యంశములు పునరుక్తములును, గొన్ని పూర్వాపర సందర్భ విరుద్ధములును నగుచున్నవి. దండికావ్యశోభాకర ధర్మము లన్నియు నలంకారములేయనితలంచి యాయలంకారములను గుణరీత్యలంకారరూపముగా నిరూపించి విరమించెను. మఱియు పాకము వృత్తి, శయ్య,రసము, ధ్వని, వ్యంగ్యము మున్నగువానిని జెప్పనేలేదు. వీనికిఁ గావ్యశోభాకరణమే ప్రయోజనమగుటం జేసియు, వీనికంతగాఁ బరస్పరము భేదములేమిం జేసియు నాతఁ డుపేక్షించెను. ఈయంశము "కావ్యశోభాకరాన్‌ధర్మానలంకారాన్ ప్రచక్షతే; తేచాద్యాపి వికల్ప్యంతే కస్తాన్ కార్త్స్న్యేనవక్ష్యతి. కాశ్చిన్మార్గవిభాగార్థముక్తాః ప్రాగప్యలంక్రియాః;సాధారణ మలంకారజాత మద్య ప్రదర్శ్యతే". అనుదండిగ్రంథమువలన స్పష్టమగుచున్నది. కావున దండి యిన్నియవాంతర భేదములఁ బరిగణింప లేదనియు నలంకారదోషములను రెండే భేదములఁ బరిగణించెననియు దండిగ్రంథమును సువ్యక్తముగాఁ జూచినవారలకు విశదము కాకమానదు. మఱియు విద్యానాథాదులవలె దండికావ్యము నొకకాంతగాఁ దలంచి దానికిఁ లోకసామగ్రిని సమకూర్పలేదు.

విద్యానాథుఁ డట్లుగాక వృత్తి, శయ్య, పాకము, రీతి, గుణము, అలంకారము, రసము మున్నగు ననేక భేదముల నిరూపించి వానికిఁ బరస్పరము భేదమును జెప్ప యత్నించి తనగ్రంథమున ననేక పునరుక్తములు చొచ్చుట కవకాశమునుగల్గించెను. మఱియు గుణాలంకార కథనముచే గతార్థమగు దోషప్రకరణమును, దోషప్రకరణముచే గతార్థమగు గుణాలంకారప్రకరణమును నిరూపించి గ్రంథమును గలుషపఱచియున్నాఁడు. క్షయసంవత్సర జ్యేష్ఠాషాఢ సాహితీపరిషత్పత్రికలో మదాంధ్రగురులగు బ్ర. శ్రీ. వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారిచేఁ వ్రాయఁబడిన కావ్యగుణములు అనువ్యాసమున దీనివిస్తరము చూడనగును.

మొత్తముమీఁదఁ బ్రతాపరుద్రీయములోనుండి యిచటికిఁదిగిన పునరుక్తులు గొన్నియు విభిన్నములగు దండివిద్యానాథమతములు జోడించినందున సంభవించిన పునరుక్తిపూర్వాపర సందర్భవిరోధములు గొన్నియు నీ గ్రంథమున సమావేశమైన వని తత్తత్సందర్భ పరిశీలనమువలన సువ్యక్తమగుచున్నది.

దండిమతము ననుసరించి యుపమాలంకారసందర్భమున "లింగంబులవచనంబుల" అను మున్నగుపద్యములచే నుపమాదోషములను జేర్పఁనియున్నాఁడు. తిరుగ వానినే విద్యానాథమతముననుసరించి రచియింపఁబడిన దోషప్రకరణమునందును నిరూపించియున్నాఁడు. కావ్యదోషప్రకరణమున నిరూపింపఁబడిన భిన్నలింగ, భిన్నవచన, న్యూనోపమాధికోపమాద్యుపమాదోషములు పునరుక్తము లగుచున్నవి.

మఱియు గుణములు దోషములం దొలంగించుటకే యంగీకరింపఁబడినట్లు ప్రతాపరుద్రీయమునను, నద్దాని ననుసరించిన చూడామణియందును జెప్పఁబడినది. కావున నేయేదోషములఁ దొలఁగింప నేయేగుణము లంగీకరింపఁబడినవో ఆయాగుణములు కావ్యములో నుండ నాయాదోషములు కావ్యములోఁ జొచ్చుట కవకా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శేము లేదుగదా. కావున గుణములను జెప్పిన దోష ములఁ జెప్ప నవసరము లేదనియు, దోషములఁ జెప్పిన గుణములఁ జెప్ప నక్కఱలేదనియు విశదమగుచుం డుటంజేసి దోషప్రకరణములోని గుణములచే నపాకృతములగు దోషములు పునరుక్తము లనఁజనును.(చూ. ప్ర. రు. గుణప్రకరణము.)

మఱియు దండి ననుసరించి యర్థసందర్భద్యోతకములగు గుణదశకము నంగీకరించినపుడు దండిచెప్పిన దశవిధదోషములుదక్క నితర దోషములు కావ్యములోఁ జొచ్చుట కవకాశమే లేదు. కావుననే దండి గుణాలంకారకథనముచే నగతార్థము లగు దోషములఁ బదింటిని మాత్రమే పేర్కొని విరమించెను.

పెద్దనార్యుఁ డన్నను దండిమతము ననుసరించి తత్తదలంకారసందర్భములందే తత్తద్దోషములఁ బేర్కొనియుఁ దిరుగ ముందుపెక్కు లరయక వానినే విద్యానాథనిరూపితదోషప్రకరణాంధ్రీకరణసందర్భమున సైతము నిరూపించెను. కాన నుపరినిరూపితదోషములు పునరుక్తములైనవని గ్రహింపనది.

పెద్దనద్వితీయోల్లాసమునఁ బ్రతాపరుద్రీయము ననుసరించి రసముల నలంకార్యములనుగా నిరూపించియున్నాఁడు. అలంకారప్రకరణమున దండిననుసరించి యారసములనే యలంకారములుగాఁ బేర్కొని యున్నాఁడు.దండి రసవదలంకారములక్రిందరసములనన్నింటి నుదాహరించుటఁబట్టి చూడ గుణాలంకారములవలె రసములను గావ్యశోభాకరధర్మములే యని తలంచి యంగిభూతరసములును, నంగభూతరసములును నలంకారముల క్రిందనే పరిగణించెనని చెప్పవచ్చును.

శ్లో. రసభావతదాభాసభావశాన్త్యాది రక్రమః;
భిన్నో రసాద్యలంకారా దలంకారతయా మతః.

అను మన్నగు సందర్భములనుబట్టి విద్యానాథుని మతమున నంగభూతరసము లలంకారములనియు, నంగిభూతరసములు రసములనియు సువ్యక్తమగుచున్నది. కావుననే యాతఁడు రసము కావ్యశ్రీకిఁ బ్రాణమువంటి దనియు గుణాలంకారాదులు శౌర్యహారాదులవంటివనియు నంగీకరించియున్నాఁడు. కావున నీతనిమతము ననుసరించి రస మలంకార్యమ యగును.

రసమలంకారముగా నంగీకరించిన నయ్యదలంకార్యము గాఁజాలదుగదా! కటకకుండలాదులు కావ్యశ్రీకి జీవితప్రాయములు గానేరవుగదా! కావున రసముల నలంకారములను నంగీకరించిన దండిమతమున నియ్యవి యలంకార్యములు గాఁజాలవనుట నిర్వివాదాంశము. అట్లే రస మలంకార్యమయ్యెనా యయ్యది యలంకారమెన్నఁడును గాఁజాలదు. జీవితమెన్నడును శోభాదాయకాలంకారము గానేరదుగదా! కావున రసమును జీవితముగా (అలంకార్యముగా) నంగీకరించిన విద్యానాథమతమున నయ్య దెన్నఁడును నలంకారము గానోపదు. ఇట్టిస్థితిలోఁ బెద్దన రసముల నలంకార్యములుగద్వితీయోల్లాసమునఁ బేర్కొని తిరుగ వాని నలంకార ప్రకరణమున నలంకారములుగ నిరూపించుట పూర్వాపరసందర్భవిరుద్ధముగ నున్నది. ధర్మము ధర్మియు నొక్కే వస్తువు కాఁజాలనట్లు రస మలంకార్యమును, నలంకారమును గాఁజాలదు. కానఁ బెద్దన ముందుపెక్కు లరయక కేవల సూత్రమార్గాపేక్షతో దండిగ్రంథము నందలి గుణాలంకారప్రకరణము నాంధ్రీకరించెననియు, దండి విద్యానాథుల మతములు భిన్నములని తలంపకయే గ్రంథమార్గము నవలంబించినపు డాగ్రంథమార్గముననే యనుసరింపుచు నవిమర్శముగ నాంధ్రీకరించెననియు, నక్కారణమున నిట్టి పూర్వాపరసందర్భ విరుద్ధవిషయము లిందుఁ గల్గెననియుఁ జెప్పవచ్చును.

అలంకారప్రకరణమున లవాలంకార ప్రస్తావమున లవలక్షణములో వినుతినిందలను లవాలంకారస్వరూపములుగఁ బేర్కొనియుఁ దిరుగ వినుతినిందార్థ ప్రతిపాదకమగు లవ సజాతీయమగు వ్యాజోక్తినిగూడ నిరూపించుటచే నిందలి వ్యాజోక్తి పునరుక్తమగుచున్నది. వినుతినిందలు మతాంతరాంగీకృతములైనట్లు "లేశమేకేవిదుః" అనుకారికలోని 'ఏకే' అనుశబ్దముచే దండిసూచించుటచే దండి వ్యాజోక్తి పునరుక్తము గానేరదు. ఈతఁ డట్లు గాక భావమునఁ దోషము వస్తుగోపనమును, వినుతినిందలును, లవాలంకార స్వరూపములుగానే నిరూపించుటంజేసి యిందలి వ్యాజోక్తి పునరుక్త వనఁదగియున్నది. వినుతినిందలను, వస్తుగోపనమును లవాలంకార స్వరూపములుగ నంగీకరించినవారి మతమున వ్యాజోక్తి యుండ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దనియు, వస్తుగోపనమమాత్రమే లవాలంకార స్వరూప
ముగ నంగీకరించి వినుతి నింపలు మతాంతరములుగా
నంగీకరించిన వారిమతమున వ్యాజోక్తి యుండనగునని
యు నభిప్రాయము.

ఇందలి వీ లక్షణములు సంస్కృతలక్షణముల వలె
స్పష్టార్థము నీయఁజాలకున్నవి. మఱియు నొక్కొకచో
విపరీతార్థమునుగూడ నొసంగ క్షమములై యున్నవి.
యతిప్రాసపద్య పాదపూరణార్థము ప్రయుక్తములైన
వ్యర్థపదములు రావలసినయర్థమును రాకుండఁజేయుచు
న్నది. మఱియు లక్షణములు స్వకపోలకల్పితము లౌట
చేతను, విశ్వేశ్వరరాజాంకితము లగుటచేతను స్పష్టార్థము
నీయఁజాలకున్నవి. విమర్శకుఁడు వస్తుగుణమును మాత్ర
మే విమర్శింపక యందలి దోషములను గూడ నిరూపింప
వలెననియుఁ దన్మూలమున నుపయోగము గలదనియు
విమర్శకు లందురు. కాననే నిందలి దోషలేశములఁజూపి
తినిగాని దోషారోపణబుద్ధితోఁ గాదని సహృదయులు
గ్రహింతురుగాక!

మఱియు విభిన్నమార్గ గ్రంథద్వయాను సరణముచే
నీగ్రంథమున నీదోషలేశములు కల్గెనని తెలియఁజేయ
నింతమట్టు వ్రాసితిని. ఆంధ్రమున కలంకార గ్రంథము
లేనికొఱంతను దీర్చిన పెద్దనాదులయెడల నాంధ్రపండి
తులెల్లరుఁ గృతజ్ఞులై యుండవలసియున్నది. కాని సాహి
త్యదర్పణాదులవంటి చక్కని లక్షణగ్రంథ మొకటి
యాంధ్రమున నుదయించువఱకు నాంధ్రమున నలంకార
గ్రంథము లేదనియే చెప్పవచ్చును. కాన సమర్థులగు
సహృదయు లట్టిమహోపకార మొనర్చి యాంధ్రమాత
నలంకరింతురుగాక!




# విషమసమస్య

శ్రీమాన్ మాపాటి కొండమాచార్యులు గారు

ఉండుటో, ఉండకుండుటో ఉర్వియందు,
సౌఖ్య మెద్దాన నదియె విచార్య మిపుడు;
ఉండి ప్రాణవ్యథానముద్దండకష్ట
సంచయంబుల భారంబు సైఁచు టెట్లు?

ఉండకయె సర్వవిభుని ప్రచండసృష్టి
చిత్రములనెల్లఁ గనుల వీక్షించు టెట్లు!
భువిఁ జరాచరతతులందు భోగసరణి
గగనమండలిగ్రహముల కళల తీరు
సర్వ విధ సృష్టివైచిత్ర్య సంతతులను
ఉండకయె యెట్లు కాంచఁగా నూహ సేతు?

అహరహంబును గష్టసాధ్యంబు లైన
పనులఁ జేయుచు నెట్లొ జీవనముఁ జేసి
బ్రతుకుదమటన్న భవరోగబాధలెల్ల
ఉండి తప్పించుకొన నెట్టు లూహ సేతు!

* * *

కాంచితిని జన్మ మిచటిసౌఖ్యములఁ గంటి
అసువులను వీడ నెంచిన నవల నేమి
కష్టబహుళంబు లున్నవో కని వచించి
నట్టివాఁ డెవ్వఁడుండె నీ యవని యందు!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# శ్రీనాథ కవిరాజీయము

కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు

నాంది

శ్రీవత్సాంకితుఁడుం గుమారకుఁడు ల
క్ష్మీవల్లభుం డేకసం
భావిద్యాగ్రహణైకదక్షుఁడు సుధీ
త్వప్రాంచితుం డీశ్వరీ
సేవాసక్తుఁడు మాసుదర్శనుఁడు సు
శ్రీవైభవోపేతుఁ డై
భావంబం దలరారి నావెతలు వా
పం జూచి కాపాడుతన్.

స్థలము—ఒక మందిరము

[కమలనాభుఁడు, మారయ, భీమాంబ, ప్రవేశము]

మారయ

(కమలనాభుని పాదంబులకు మ్రొక్కి)

ఉ. మీరు మహానుభావులరు
మీకు మహీతలమందు విద్యలం
బే రరుదెంచినట్టులు ల
భించె దపోవిభవప్రభావ మే
వారును మిమ్ముఁ బోల రని
ప్రస్తుతి కెక్కినవార లక్కటా!
మీ రిటువంటివార లయి
మీకుల మారయ కుంట మేరయే.

తండ్రీ! నాకుఁ బ్రథమకళత్రవియోగము గలిగినప్పుడు నేను బునర్దారసంగ్రహంబు సేయక ఇహసుఖంబు లెల్లం బరిత్యజించి భగవద్ధ్యానైకపరాయణుండనై పరంబుఁగోరి యున్న నన్నుం బిలిచి నాతో "జరత్కారుం డనుముని దారసంగ్రహంబు సేయమింజేసి వానిపితృదేవతల కధోగతి సిద్ధించె ననియు, అది యెఱింగి జరత్కారుండు వివాహము సేసి కొని పితృదేవతల నుద్ధరించె ననియు" నొక కథం జెప్పి "వత్సా! నీ విట్లు విరక్తుండ వై పునర్దారగ్రహణంబు సేయకుండుట ధర్మంబు గాదు. సంతానతంతువుం ద్రెంచివేయుట మహాపాతకంబు. "అపుత్రస్య గతి ర్నాస్తి" అను వచనంబున నీకును బరమ్ము పూజ్యమ్ము. కావున వివాహంబు గావించుకొని కులాంకుర విచ్ఛేదంబు గాకుండఁ జేయుము" అని మెన్నో చెప్పి యొప్పించి యిప్పుడంతిం దెచ్చి నాకుఁ బెండ్లి చేసితివి గదా! నే నీమెఁ బెండ్లి చేసికొనినఫలంబు నాకు నడికిఁ గాలం బైనను గానం బడ కున్నయది. నిస్సారం బైనసంసారసాగరంబున నీదులాడుచుఁ దాపత్రయం బనుభవించుట మాత్రమే ఫలం బగుచున్నయది. వినుము:

సీ. అవనిఁ బితృపితామహాదులతో సపు
త్రకుఁడు త్రైరుణ్యాంబుఁ దఱిగి పరఁగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధనధాన్యపశుదారఘనమాన్యహర్మ్యాదు
లకట! యపుత్రకునకును వితయ
కనుఁగొన ధర్మార్థకామమోక్షాదులు
పుత్రరత్నముః సూవె పూరుషునకు
నిలఁ బురుషాపత్య మేడేడుతరముల
వారికిఁ దారకబ్రహ్మ మరయఁ
గాశి నైనను, బుత్రునికడన నైన
మడియ మోక్షము కరతలామలక మనరె
వేయు నేటికిఁ గొడుకుల వెలయఁ గనక
వేఁగుపాపులజన్మంబు విగతఫలము.

మఱియును:

శా. కాల్సేయాడుచు నెంతదాఁక సిరులం
గావించు నందాఁక నా
స ల్లాగించుచుఁ గూడి మెత్తు రతనిఁ
సైదోడులు న్నెయ్యు రి
ల్లా లుల్టా ల్సరివారు నెల్లబలఁగం
బాయింతయుం దప్పి ము
క్కా ల్సేరం జనునప్పు డెవ్వరును గ్రే
గంటం గనం బో రయో!

కుమారుండు నాఁబడువాఁడు తనకు సహజం బయినభక్తి లేకున్నను నలుగురు నాలుగు మాట లాడుదు రనుభయంబుచేత నైనను దల్లిదండ్రుల కిహపరసాధకుం డగుచున్నవాఁడు. అట్టిఫలం బపేక్షించి నే నీమానినిం గూడి నానావిధ వ్రతంబు లాచరించియు, మంత్ర యంత్రతంత్రౌషధముల సేవించియు, సుబ్రహ్మణ్యాది దే వ తా రా ధ నం బు గావించియు, మహానదీ సాగర సంగ మంబు లెల్లనాడియు,నిట్టుపాసంబు లుండియు, ఊళ్లఁ బల్లెలంగల గుళ్లచుట్టుం జుట్టియు, దేవతాసన్నిధులం బ్రాణాచారంబులు పడి యు, వల్మీకంబులకుం ధనువు లెత్తియు, పిప్పల వృక్షంబులం బ్రతిష్ఠించి ప్రదక్షిణించియు, ఇంకను జేయంగల పనులన్నియుం జేయుచు నీశ్వరారాధనంబు గావించితిని. ధనవ్యయం బును దేహాయాసంబునే కాని లాభ మేమి యును లేక పోయినది. పుత్రసందర్శన భాగ్యంబు మృగ్యం బైనది. సర్వసమర్థులైన మీరుండియు మాకు లేనట్ల యయినది. ఇంక ని ట్లుపేక్షింపక మామొడఁ గరుణించి వంశో ద్ధారకుం డగు నొక్క బాలకుండు పొడముున ట్లుపాయంబు బోధింపఁ బ్రార్థించుచున్నవాఁడ.
(అని పాదంబులపై సాఁగిలిపడుచున్నాఁడు.)

భీమాంబ

(మామగారి పాదములపైఁ బడికంటనీరు వెట్టు కొనుచు)

సీ. మెఱుఁగునా మేనెల్ల మెఱమెఱ మెఱయంగ
వేవిళ్లఁ బడునింపు వెంప నైతి
సీమంతవతు లెన్న సీమంతమున మేటి
గాజులు గొనుమేలు గాంచ నైతి
దరి లేనిపెరిమ లోఁదగుల బంధులు వట్టు
సూడిద లంద నేఁ జూడ నైతి
నొదివి పుణ్యాంగన లొదార్చుచుండ బి
డ్డఁ గనునొప్పులఁ బడఁ దగుల నైతిఁ
తే. దనయుఁ డని మంత్రసాని నా వినఁగనైతిఁ
బొసఁగఁ గాయము గాయ మే మెసవనైతి
బసపుచీఱల నడికట్టఁ బట్టనైతిఁ
వెలయ బాలెంతపేష మే వేయ నైతి.

ఆర్యా! జగదేకపూజ్యులైన మీకుఁ గోడల నైననే నిట్లు పుత్రవతులయిన సతులల్లో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నపుత్రవతినై యుండుట పోలునే? మహాత్మా! మాపాల ననుగ్రహింపుము.

(అని పాదంబులపై వ్రాలుచున్నది.)

కమలనాభుఁడు

(ఇరువుర నిరుచేతుల లేవనెత్తియూఱడించుచు) వత్సలారా! మీరు రిట్లుప్రాకృతులట్లుచింతించుట పాడిగాదు. పురాకృత కర్మపరిపాకంబునం జేసి శుభాశుభంబులు సకలప్రాణులకును సంప్రాప్తంబు లగుచుండు. దీనికి వగచినం బ్రయోజనంబు లేదు. నేను మీ జన్మపత్రికలంబట్టి చెప్పుచుంటిని. మీకు సంతానప్రాప్తి కలదు. మనవంశంబున సంతాన తంతు విచ్ఛేదం బెప్పటికిం గాఁబోదు. మీరు చింతింపకుఁడు. బహువిధవ్రతమ్ము లాచరించితి మని చెప్పితిరి. కాని మన యిలువేల్పు నారాధించినవారు కారు.కడచినదాని కేమిటి కింక నైన నియమవ్రతంబున నారాయణు నారాధించితి రేని మీకుఁ బరమోత్తమసంతానంబు కాక పోదు.అట్లుచేయుఁడు;ఇష్టార్థంబులం బొందుఁడు.

మారయ

తండ్రీ! మన యిలువేల్పు నారాధించుటకెట్టి నియమవ్రతంబు కావలయునో, దాని విధానంబెట్టిదియో వినిపింపఁ బ్రార్థించుచున్నాఁడ.

కమలనాభుఁడు

నియమవ్రతంబు దప్పకుండ మంత్రోపాసనంబు గావించుచు నీశ్వరు నారాధించునది. దాన నతండు సంతసించి మీయభీష్టంబు నెఱవేర్చుం గాక.

మారయ

ఏమంత్రం బుపాసింపవలయునో దాని నుపదేశింప నర్థించుచున్నవాఁడ.

కమలనాభుఁడు

(శిరముపై కరంబులు వెట్టి చెవిలోమంత్రోపదేశంబుచేసి)కుమారా!మీరిపుడ సంకల్పము చేసి వ్రతప్రారంభముం జేయుఁడు; నేడు నీకుక్షేమ తారయు, నీసహధర్మిణికి సంపత్తారయును.

మారయ

పితృపాదులు గూడ మాతో నా వ్రతంబు పరిసమాప్తియగునఱకు నుండి మామనోరథం బీడేర్పవలయు నని మనవిచేయుచున్నాను.

కమలనాభుఁడు

సరే! అట్లే చేసెదను.

(అని బ్రహ్మాసన మధిష్ఠించి మంత్రములు చదువును)

మారయ

(మంత్రధ్యానంబుచేసి కొంతవడికి సభార్యుఁడై చేతులు జోడించుకొని)

మోహన – చతురశ్రగతి

శ్లో. భజ మన ఈశం కరుణావేశం
భవభయపాశవినాశం
నిజజనరక్షా చరణే దీక్షా
కరణ మణో రణుమాత్రమ్
వ్రజకులదక్షం వనజాతాక్షం
వసధిశయాన మనూనం
కుజనకులాంభోనిధి మంథానం
మధుమథనం బుధబోధమ్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధన్యాసిరాగము-రూపకము

శ్లో. పరమేశ్వర, గిరిజేశ్వర జగదీశ్వరనుత, భో
కరుణాకర, గురుణానుత, రమణాకరశరణా;
నిరుపాధికజనపోషక, నరవేషకనిరతం
పరిపాలయసుగుణాలయవరుణాలయవసతే.

(అని ప్రార్థించుచుఁ గంటికిం దూఁగు రాఁ గోడ కొరగు చున్నారు).

[తెరలో శబ్దము]

శ్రీమహావిష్ణువు

(గరుడవాహనారూఢుఁడై చతుర్భుజముల గదాశంఖ చక్రాదులు ధరించి ప్రత్యక్షంబై) వత్సలారా! మీపైఁ గల వాత్సల్యంబునం జేసి దర్శన మిచ్చితిని. వరం బర్థింపుఁడు.

ఇద్దఱు

(స్వప్నమునం గాంచి వినమ్రులై చేతులు జోడించుకొని)

శా. ఓకారుణ్యపయోబ్ధి! యోవరద! యో
యోగీంద్రహృద్వాస! యో
లోకైకస్తుత! యోరమారమణ! యో
లోకత్రయాధీశ్వరా!
యోకంసాంతక! యోసురేంద్రవరదా!
యోదైవచూడామణీ!
యోకృష్ణా! మధుసూదనా! యదుపతీ!
యోవాసుదేవా! హరీ!

విష్ణువు

భక్తులారా! తొంటిపుట్టువున మీరు నాకుఁ బరమభక్తులరై నన్నుఁ బుత్రునిఁ గాఁ బడయ నర్థించితిరి. నేను మీకుఁ బుత్రుండనై పుట్టితిఁ గాని మీ నియమాంతరాయ కారణంబున నంతలోన మిమ్ముం బెడఁబాసితిని. ఇప్పటి మీహృదయార్థంబు మీరు చెప్పకయ నే నెఱింగితిని. మీకు సంతాన ప్రాప్తి యగు. మీయగ్రనందనుండు మదంశ సంభూతుండై నాపేరం బొలుపొంది సకల విద్యావిశారదుండై బహుగ్రంథంబు లొనరించి దిగంత విశ్రాంత కీర్తిం గాంచి జగద్విశ్రుతుండు గాఁ గలండు. మీకులం బాకల్పంబుగ ననల్ప వైభవంబున వన్నె కెక్కుచుండుఁగాక!

(అంతర్ధానమగును.)

ఇద్దఱు

(జాగ్రదవస్థ నభినయించి కమలనాభునినంకం జూచి) తండ్రీ! మాకు స్వప్నంబున శ్రీనాథుండు దర్శనం బిచ్చి సంతానంబు గలుగ వరం బిచ్చినాఁడు.

కమలనాభుఁడు

బిడ్డలారా! మీ మనోరథసిద్ధి యైనది. మీ జపంబు ఫలించినది; లెండు పోవుదము.

ముగ్గురు

అలసనృత్యము-వసంత-మిశ్రగతి

మునిజనులఁ బ్రోచుమునిముఖ్యా! పరమాఖ్యా!
చెనఁటులకుఁ గాని సురసింహా! నరసింహా!
మొనసి జగమేల నగుప్రోడ! బలుతేఁడా!
కనికరముతోడ మముఁ గావఁ దగుదేవా.

[మ్రొక్కి నిష్క్రమించుచున్నారు.]

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్థలము-రచ్చచావడి

[కొందఱు ప్రజలు పరివేష్టించియుండ మారయప్రధాని ప్రవేశించి యగ్రాసన మధిష్ఠించుచున్నాఁడు.]

(ప్రజలు లేచివినమ్రులై విశ్రమించుచున్నారు.)

మారయ

ప్రజలారా! కొండవీటియన వేమారెడ్డి ప్రభుండు నన్నీ కాల్పట్టణంబునకు దేశముఖుగా నొనరించి ఇదిగో ఫరవానా వ్రాయించి పంపించియున్నవాఁడు. మీరెల్లరు రాజభక్తి భరితాంతరంగులై ప్రవర్తింపుఁడు. గ్రామణీ! నీవు జాగరూకుండవై దస్తు శిస్తులనెల్ల వసూలు చేయింపుము. కుల్కర్ణీ! నీ వెల్లరయితులకును ఛాఖదులు వ్రాసి పంపుము. నాయకా! నీవు వీటినవుకరులెల్లరును శేంబవళ్లు తమతమ పనులందు భక్తిశ్రద్ధలు గలిగి ప్రవర్తించుచుండునట్లు చేయుము.

నాయకుఁడు

దేషముఖ్ మహారాజ్! మీకీ సలాము సేస్తాఁ; నవుకర్లూ నాకీ మాటాయినరు. మెట్టీవోసాల్ యిండ్లకీపోయీ మీరు ఖళ్లాల్కాడా వుండావాలా రండీ పిల్సాఁ. మాకీ రాం సెప్పినారు. మునిసీబయ్యా యింట్లో పనీ వుందీ సెప్పిపోయి నార్ సర్కార్!

మునసబు

నే నెప్పుడూ నవుకర్ల చేత నాసొంతపనులు చేయించుకోను. ఇది వెట్టివాసాలు పన్నిన పన్నాగం. మున్నోసారి సర్కారుపనిమీద నేను పిలిపిస్తే కుల్కర్ణీయింట్లో పని చేస్తున్నామని బొంకారు.

మారయ

మహాస్నూల్‌దార్! నీవు పోయి పోయినట్లుగా వెట్టివాసాలం దీసికొనిరమ్ము; పొమ్ము.

నాయకుఁడు

సిత్తం సిత్తం సర్కార్!

(నిష్క్రమించును.)

రయితులు

ఆమెట్టినోసాలోళ్లు మమ్మల్ని బతకనిచ్చుటం లేదు జియ్యా! మేము చేనుచేని కీకట్ట లిస్తున్నాగానీ "మిమ్మ ల్నేయఁ నేయిత్తామో సూడుం"డని బయ్యం పెట్టి మాచే లన్నీ కట్టుకు మోతోండారు. మమ్మల్ని సంపుతుండారు సాయీ!

నాయకుఁడు

(వెట్టివాసాలతోఁ బ్రవేశించి) మహారాజ్! మెట్టి మెంకా: వోసాయీరా హాజర్ సర్కార్!

మారయ

ఏమిరా! వెట్టివాఁడ! వాసావాఁడ! మీరు మీనవుకరీ చక్కఁగాఁ జేయుట లే దని వినుచున్నాము. కళ్లములకాపునకుఁ బోవుట లేదనియు, గ్రామణియింటఁ బనులు చేయుచుంటిమనియుఁ జెప్పినట్లు నాయకుఁడు చెప్పుచున్నాఁడు. నిజమా?

వెట్టివెంకఁడు

ఏలో్నరూ! మేం మునిచీబుగారింటో పన్లు శేటం లేదు. సర్కారుపన్లే నేత్తుంటామండి. ఈచాయేబయ్య మామీద నేరం సెప్పినోడండి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాసావీరుఁడు

ఈచాయేబు నాతో యేల్నోరిమాట యినో ద్దని సెప్పి నాడండి. అంచేత నా నిట్లు శేశా దొరా!

మారయ

మునసబూ! నీ వేమి చెప్పెదవు?

గ్రామ

వీళ్లు దొంగహాలంకోరు లండి. ఈబద్మాషులకి దెబ్బలు తగిలితేనేకాని బుద్ధి రాదండి.

కుల్కర్ణి

మునసబుగారు చెప్పినట్లు చేయుటయే కాక వీండ్రనవుకరీ యీనాము లూడలాగి వీండ్ర స్థానమున మఱియొకళ్లను నిలుపుట యుత్తమ మని నాయభిప్రాయము.

మారయ

నాయకుఁడా! నీ వీమాలమాదిగల శిక్షించి పుచ్చుము.

నాయకుఁడు

సిత్తం, సిత్తం సర్కార్ హుకుం.

(చెప్పినట్లు చేయుచున్నాఁడు.)

మారయ

గ్రామణీ! నీవు తగిన పనివాండ్రవలనఁ బనులు పుచ్చుకొనుచు గ్రామపరిపాలనము చక్కఁగాఁ జేయుచుండుము. మనపురములో జారులు, చోరులు, దురాచారులు, వర్ణసంకరులు, భ్రష్టులు లోనగుదుష్టులు లేకుండునట్లును, దయాసత్యశౌచములు ప్రబలునట్లును గావించి మీ రెల్లరు జాగరూకతతో మెలంగుఁడు. మీ కిదె రాజాజ్ఞ.

[అందఱు, లేచి నిష్క్రమింతురు.]

---

స్థలము – రాజవీథి

[డోలు సనాయిమేళముతో, పసపు, కుంకుమ, పండ్లు, వస్త్రములు, లోనగు పదార్థములుగల కావళ్లతో ఒక పురుషుఁడును ఇద్దఱుస్త్రీలును, పాడుచుఁబ్రవేశింతురు.]

స్త్రీలు

ద్విపదము

వినరయ్య జనులార! విశదంబుగాను
మనమారయామాత్యమణికిఁ బుత్రకుఁడు
జనియించెఁ దన్మహోత్సవ మొప్ప నిట్లు.

(అని యందఱు దండఁ బాడుచు బండ్లు, పసపు, కుంకుము, చీఱలు, రవికలు, లోనగునవి యింటింటికిం బంచి పెట్టుకొనుచుఁ బోవుదురు.)

రాజపురోహితుఁడు

(ప్రవేశించి)

వెంకటావధాన్లూ! ఎల్లావధాన్లూ! పుల్లావ ధాన్లూ! ఓహో బ్రాహ్మణోత్తములా రా! రండీ! రండీ. మారయప్రధానిగారికిఁ గుమారుఁడు పుట్టినాడు. భారసాలా, నామ కరణం, జరుగుతుంది; సంభావ నిస్తారు రండీ! రండీ!

(అని కేకలు వేయును.)

బ్రాహ్మణులు

(గుంపులుగుంపులుగాఁ బ్రవేశించి)

అయ్యా! భారసాలా? సంభావనా? భాగా యిస్తారా?

ఒకఁడు

నేను నాలుగు వేదాలూ తల్లకిందులుగాచదివిన వాణ్ణి; నాకు వరహాకితక్కువి స్తే పుచ్చుకోను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రెండవవాఁడు

నేను షట్ శాస్త్రములూ క్షుణ్ణంగా చదివాను. శిరోమణి పరీక్ష కూడా యిచ్చాను. నా కేమిప్పిస్తారయ్యా?

మూఁడవవాఁడు

నేను జ్యౌతిషంఅంతా నేర్చుకున్నాను. స్కంధత్రయంనాజిహ్వాగ్రమం దుంది. జాతకభాగంల్లో నాకుచాలినవాఁడుపృథివిలో లేడు. పిల్లాడిజాతకంనాచేత రాయించినాకుచాలాడబ్బిప్పించాలి. పిల్లలు గలవాణ్ణి. నీధర్మమా అని పదిరోజులు కమ్మగా తిని జీవిస్తాను.

నాల్గవవాఁడు

నేనుకవిత్వం చెబుతాను. గ్రామ్యకవిత్వంలో, భావకవిత్వంలో నాతోసమానంగా పద్యాలేనా, పాటలేనా, నాటకా లేనా, నవల లేనా, ఏంబడితే అది, మంచిపాకాన్నిపడేలాగ చెబుతాను. ఈకవిత్వవిద్య మొన్న యీనడుమ తూరుపుదేశం వెళ్లి నేర్చుకొచ్చాను. నాకు వెయ్యినూ్నటపదహార్లు ఇప్పించాలి సుమీ పురోహితుఁడుగారూ !

రాజపురోహితుఁడు

సరే! రండి. మీమీప్రాప్తానుసారం దొరుకుతుంది ధనం. ధనం మాటకేమిగాని మృష్టాన్నం మాత్రం సమృద్ధి. చేరలతో నెయ్యి జుర్రవచ్చును. బూరెలు, గారెలు, అరిసెలు, అప్పాలు, లడ్డూలు, మోరుండలు మొదలైన భక్ష్యములు పొట్టలు విచ్చేలాగకొట్టవచ్చును రండి. రండి. (వెనుకకు మరలును.)

అందఱు (అనుసరించి నడచిపోవుచున్నారు.)

(అంతఁ జారులు లోనగువారు కట్నములం బట్టుకొని వరుసగాఁ బ్రవేశింతురు.)

కొండవీటి యన వేమారెడ్డి ప్రధానపురోహితుఁడు

(చీనిచీనాంబరాభరణాదులు మోయించుకొని ప్రవేశించి)

శా. శ్రీరమ్యుం డన వేమభూపతి కడుం
జెన్నారగాఁ గూర్చి సం
భారంబుల్ కనకాంశుకాభరణముల్
పంపించెఁ గట్నంబు లా
మారామాత్యునిపుత్రరత్న ముద
యింపం గల్గుపబ్బంబు చే
కూరం గా విని తత్పితామహునిపైఁ
గోల్కొన్న గారంబునన్.

[అని లోనికిం బోవును.]

ఇది ప్రథమాంకము

---

ద్వితీయాంకము

స్థలము—కొండవీటిలోని సభాభవనము

[కుమారగిరివసంతభూపాలుఁడు, కాటయ వేమారెడ్డి, ప్రగడయ్యామంత్రి కొందఱు భటులుం గొలువు దీరి కనఁబడుదురు.]

ప్రగడయ్య

మహారాజా! రాజేంద్రుండు పరిశీలించి పరిష్కరింప వలసినవిషయములు పెక్కులున్నవి. శ్రీవారు సంతతవిద్యావ్యాసంగమునం జేసి రాజ్యాంగం బింతయును గమనింపకున్నవారు. ఇట్లు ప్రజాపరిపాలన మతిభరం బగు నని విన్నవించుచున్నాను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుమారగిరి వసంత భూపాలుఁడు

మంత్రివర్యా! పండితగోష్ఠియు, విద్యావ్యాసంగముకన్న రాజ్యపాలన మెక్కువయా? రాజ్యంబు పోయినం బోవుఁ గాని విద్యయు, విద్యాఫలంబైనకవిత్వంబు నెప్పటికిం బోవునవి కావు గదా! నే నిపుడు నాపేర "వసంతరాజీయ"మనునలంకారశాస్త్రమును సంస్కృతమున రచించుచున్నవాఁడ. అది యాచంద్రతారార్కస్థాయి యగుం గదా! దానికన్న రాజ్యమును, గీజ్యమును నెక్కువలోనివి కాఁ జాలవు. నాకు సంతతంబును బండితగోష్ఠియే కావలయు. అదియే నాజన్మమునకు సార్థకము; ఇతర మెద్దియును గాదు.

కాటయ వేమారెడ్డి

సత్యమే కాని రాజ్యంబు పూజ్యం బై యున్నయప్పుడే పండితుల నాహ్వానించుటయు, వారిని సత్కరించుటయు, విద్యావ్యాసంగము చేయు జ్ఞానంబు సంపాదించుటయు, గ్రంథంబులు రచించుటయుం గలుగును గాని రాజ్యాంగంబు చెడి నప్పు డివి యన్నియుఁ జెడినవే యగును గదా! కావున విద్యావ్యాసంగమున కంతరాయము గలిగించుకొనవలయు నని చెప్పను గాని రాజ్యాంగంబును జక్కఁ జేసికొనవలయు ననియు నేను జెప్పుచున్నాను.

కుమారగిరి వసంతభూపాలుఁడు

చెప్పెద వినుండు:

శా. ధారారాజ్యమునందు భోజుఁ డను వి
ద్వాంసుండు రా జయ్యుఁ దా
భూరాజ్యంబున బుద్ధి నేయక సదా
పోషించుచుఁ విద్యలఁ
ధీరాగ్రేసరుఁ డై కవీంద్రతతికిం
దివ్యాగమం బై జగ
ద్వారప్రస్తుతకావ్యముల్ సలిపి వి
ద్యాభోజుఁ డై యొప్పఁడే.

అట్లే నేనును నాజీవితకాలమంతయు విద్యావ్యాసంగంబునం బుచ్చెదం గాని మఱియొకవిధంబునఁ గాలంబు గడపువాఁడం గాను. ఇది నిశ్చయము; ముమ్మాటికిని నిశ్చయము.

ప్రగడయ్య

పెదకోమటి వేమారెడ్డి ప్రభృతు లిప్పుడు మనరాజ్యముపైఁ గన్ను వైచి యున్నవారు. ఇట్టిచో మనము తగినకట్టుదిట్టములు జేసికొనకున్న మనకు విద్యావ్యాసంగమే కాదు; ఏప్రసంగమును లేక పోవు ననియే నాయభిప్రాయము.

కాటయవేమారెడ్డి

రాజా! నీ చిత్తంబిట్లున్నచో నేను గాదనను; కాని నీతండ్రి యనపోతరెడ్డి తనరాజ్యమును దమ్ముఁ డనవేమరెడ్డిపైఁ బెట్టినట్లు నీకుమారుఁడు సమర్థుఁ డగువఱకు మఱియొకనిపైఁ బెట్టి పాలించుట శ్రేయము.

ప్రగడయ్య

రాజా! నీకు మేనబావయు, భావుకుండును సర్వసమర్థుండును నగునీకాటయవేమభూపతిం బ్రతినిధిగం జేసి ప్రజాపాలనంబు గావింపుమని ప్రార్థించుచున్నవాఁడ.

(కుమారగిరివసంతభూపాలుఁడు సంతసించుచుఁ గాటయవేమునిదిక్కు చూచుచున్నాఁడు)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాటయవేమారెడ్డి

రాజా! నేను రాజు గాక రాజనై రాజ్యపాల
నంబు సేయ నంగీకరింపను.

కుమారగిరి వసంతభూపాలుఁడు

బావా! నీచిత్తం బట్లగునేని చెప్పెద వినుము.
రాజమహేంద్రవరరాజ్యము నాతోఁబుట్టువు
మల్లమాంబకుఁ బసపుకుంకుముల కీయ నా
తండ్రులయాజ్ఞ కలదు. నే నిపు డట్లు చేసెద.
నీయర్ధాంగిరాజ్యమును నీవు గొని రాజవై
నారాజ్యానుసంధానము గావింపుము.
(అని చేయిపట్టుకొని ముద్రిక వ్రేల బెట్టుచు
న్నాఁడు.)
(కాటయవేమారెడ్డి అంగీకారమభినయించును)

కుమారగిరి వసంతభూపాలుఁడు

మంత్రివర్యా! మన దేశంబునం గలబ్రాహ్మణా
దిబాలురెల్లరును ముఖ్యముగా సంస్కృ
తాంధ్రములలో సాహిత్యజ్ఞానము సంపాదించి
తీరవలయు నని యొక నిర్బంధశాసనముం
గావింపుఁడు.

ఇద్దఱు

చిత్తము, చిత్తము.
[అంగీకరించుచున్నారు.]

కుమారగిరి వసంతభూపాలుఁడు

మనకాల్పట్టణంబునంగల కమలనాభుని మార
యామాత్యునకు శ్రీనాథుం డనుబాలుండు
పుట్టె ననియు, అతండు వేదశాస్త్రశ్రౌతాది
విద్య లభ్యసించుటయె కాక చక్కనికవిత్వ
మల్ల నేర్చె ననియు, మరుత్తరాట్చరిత్రము,
శాలివాహనసప్తశతి యనుగ్రంథంబులు రచిం
చెననియు, వానికి దగ్గుపల్లివారిదుర్గాంబ నిచ్చి
యీసడుమ వివాహము చేసిరనియుఁ దెలియ
వచ్చినది. ఆబాలకవిని మనయాస్థానిం జేర్చు
కొన నెంచితిని. పురోహితునిం బుచ్చి యాహ్వా
నంబు గావింపుఁడు. నాకు విద్యావ్యాసంగ
కాల మయినది. నేఁటి కీకొలువు చాలింతము.
(అని లేచును.)
[అందఱు లేచి నిష్క్రమింతురు]

---

స్థలము-ఉద్యానవనము

[సాయంసమయమున శ్రీనాథుఁడు కొందఱు బాలు
రతో విలాస విహారము చేయుచుండును.]

బాలురు

శ్రీనాథా! మన మీయుద్యానవనంబున విహ
రించుటకు వచ్చియున్నాము. ఇచ్చట ముచ్చ
టదీర గోణిబిళ్లలు గాని, బంతులు గాని ఆడు
కొందమా?

శ్రీనాథుఁడు

మనము చదివినందుకు సార్థకముగాఁ బ్రకృతి
చిత్రంబులతో నాడుకొనవలయును గాని
గోణిబిళ్లలతో నాడుకొను టొప్పునా? ఇవి
ప్రకృతిచిత్రంబు లెఱుంగనివారియాటలు గాని
మనయాటలు గావు. ఆడుకొనుట హృదయా
నందకరం బనికదా! అట్లయిన మిమ్ము నే
నిపుడు కమలనాభవరప్రసాదలబ్ధకవితామా
ధుర్యంబున నోలలాడించెదం జూడుఁడు.

బాలురు

మేలు మేలు; శ్రీనాథా! మేలు మేలు. అన
న్యసాధ్య మగుసుకవిత్వము నీవిత్తె మయిన
దని మే మెఱుంగుదుము. నేఁడు నీయాశుకవి
త్వము పరీక్షించి యానందించెదము గాక!
(అందఱు నొక్కచో విశ్రమింతురు)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బాలుడు

శ్రీనాథా! ఏదీ చూతము. ఈయుద్యానమును వర్ణింపుము.

శ్రీనాథుడు

సీ. కోకిలరుతములఁ గోమలోష్ఠ లేమావి
గున్నలు గనుఁగొన్నఁ గన్నులలరు
నలినాదముల నధికామోద మొనరించు
మల్లికల్ గన మది పల్లవించు
మొగిఁ గప్రపుదుమారమునుగప్పనఁటిబో
తెలసొంపు దిలకింప నలరు మేను
బంగారుమేడల రంగారుసంపంగి
యీరముల్ మది కిచ్చలూరఁ జేయుఁ
తే. గేసరంబులఁ దగునాగకేసరములు
మంజులచ్ఛవి నొప్పెడువంజులములు
పొగడఁ దగుతావి నెగడెడుపొగడగములు
నరయనరయ మేల్ సరసత మగుచునుండె.

బాలుడు

మిత్రమా! ఈశుకశారికాదులగానం బెట్లున్నదియో వర్ణింపుము.

శ్రీనాథుడు

చ. అళులు మరంద మాని యల
రారు నుపశ్రుతు లీన లేఁతయా
కులు కడు మేసి కోయనచుఁ
గోయిల లంచితపంచమస్వరం
బుల నునుపాట వాడ ఫల
ముల్ దిని చిల్కలు వల్క శబ్దముల్
కొలఁకుల నంచ లాడఁ గనుఁ
గోదగు నాటక మట్లు వేడుకల్.

బాలుడు

ఆహా! ఈ వనలక్ష్మీవైభవం బత్యంతస్తోత్రపాత్రముగదా!

శ్రీనాథుడు

మ. పసపుంబయ్యెద లొప్పఁ బుప్పొడిగముల్
పాలిండ్లు పూగుత్తులు
ల్లసదంగంబులు పూవుఁదీవలు కురుల్
పైనాడు తేంట్లంఘ్రులుం
గిసలంబుల్ నగవుల్ సుమంబు లగుచుం
గీర్తింపనై యొప్పఁగాఁ
బస మీఱన్ వనలక్ష్ములున్ వనితలున్
వర్తింతు రేకాకృతిన్.

బాలుడు

సఖా! ఈపుష్పంబులపై నాడుచుఁ దుమ్మెద లెట్లు పాడుచున్నవో చూడుము.

శ్రీనాథుడు

మ. మలయంపుంబవనంబునం గదలునీ
మాకందవృక్షాగ్రశా
ఖలపై నెక్కి యుయాల లూఁగుచును
వేడ్కం గ్రీడలం దోఁగుకో
కిలయుగ్మంబుల కెల్ల మంగళముగా
గీతంబులం బాడఁ బూ
వులపీఠంబుల నిల్చి తేఁటిచెలు
లామోదంబు సంధిల్లఁగన్.

బాలుడు

శ్రీనాథా! అదిగో చూడు మస్తంగతుం డైన సూర్యునికిరణంబు లెట్లున్నవో వర్ణింపుము.

శ్రీనాథుడు

చ. వననిధిఁ గ్రుంగుచోఁ దరణి
పైఁ బయినట్టిటు లెత్తఁ గట్టిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




ఆంధ్ర బాలిక

చిత్రకారుడు: మానికొండ రామారావుగారు, బందరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ట్లనువుగఁ బ్రాఁకుపగ్గముల
యట్టిమయూఖము లభ్రమండలం
బునఁ గన నయ్యెఁ జెంగలువ
పొల్తుకకు న్నెలకు న్వివాహముం
బొనరిచి కాలవిజ్ఞుఁ డిడఁ
బొల్చెడుబంగరు చిచ్చుబుడ్డినాన్.

బాలురు

అదిగో, విదియచందురుఁడు; వానిపై మనోహరంబుగ నొక్కపద్యంబు సెప్పుము.

శ్రీనాథుఁడు

చ. లలిఁ జనునాకసం బనుపొ
లంబునఁ బంటమొగంబు గాఁ బసం
జెలఁగుచు వ్రాలుచుక్కవరి
చేలలుగోయఁగ నెంచి ము న్ననుం
బొలియిడి రాగరక్త మటు
వోయుచుఁ గాలజఘన్యజుండు కై
నిలుపు లవిత్రమో యన జ
నించెను జందురువంకఁ జూడుఁడీ!

బాలురు

మిత్రరత్నమా! నీకవిత్వం బనన్యసామాన్యము; నిన్ను స్తుతించుటకుఁ గాదు; ఇదినిశ్చయంబు. నీవు పుంభావసరస్వతివి గాని సామాన్యుఁడవు కావు. నీకవితామృతంబు మామనోరుజలం దొలఁగించినది. నీ వెంత కైన సమర్థుండవు. కాని యదిగోఁ గనుచూపుమేఱలోనం గాన వచ్చుచున్న దాపక్కనమును బత్తనముం బోలె వర్ణింపుము.

శ్రీనాథుఁడు [కోడి

సీ. కొఱ మఱల్ ద్రిప్పక కొక్కొరో యను
గడియారములు నలుగడలు నిండ
గుఱి బోన మేయక ఘుర్ఘురించెడు పంది
మర్దలధ్వనులసమ్మర్ద మడరఁ
బీఁకె సైరింపక వీఁక భాంకృతి సేయు
కుక్కబాకాలు నల్చక్కి మొఱయ
నగ్గిఁ గాఁచక చేల దగ్గఱ డొమ్మను
బెగ్గురుతుడుము లిల్లిగ్గు లిడఁగ
బేర మాడక పుట్టజు న్నారెపండు
లెల్లయంగళ్ల నిడి యమ్ము నెల్లుబేర్లు
మెలఁగ నొప్పుచు జనకోటి నలరఁజేయుఁ
బత్తనము వోలె నెప్పు డాపక్కనంబు.

బాలు

నేఁడు నీకవితామాధుర్యంబున మే మెల్లఁ దనిసితిమి. నీ వెన్ని ప్రబంధములు చేసి జగంబుం దనుప నుంటివో యని సంతసించుచుంటిమి.
(అందఱు నానందంబున నతని నాలింగనము చేసికొందురు.)

శ్రీనాథుఁడు

ఇప్పటికే కాలాతీత మైనది. ఇంకఁ దడయక మన మిండ్లకుఁ బోవుదము లెండు.
[అందఱు లేచి పరమేశ్వరుని బాడుచు నిష్క్రమింతురు.]

సంపూర్ణము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# నాగడ్డము

## పరశురామకవిగారు

ఓలేటి వేంకటరామశాస్త్రి గారు



గడ్డగు నొక్క కారణము గల్గుటఁ జేసి యొకానొకప్డు నే
సడ్డవహించి నాహృదయసాక్షిగ, లోకము నెన్నఁబోక, నా
యొడ్డతనంబుఁ జూచి యిహిహీ యని యన్యులు నవ్వుచుండినన్
గడ్డము మీసలుం బెరుగఁగా క్షురకర్మఁ బరిత్యజించితిన్.

కం. తఱచుగ గడ్డము మీసము-గొఱిగించెడి వారిలో నొకొండ నగుట న
న్నెఱిఁగిన వారలు పెక్కం-డ్రురుదందుచుఁ జూడఁ దొడఁగి రాసమయమునన్.

చం. వెడ వెడఁ గాంచి కొందఱు వివేకులు చిర్నగ వొప్ప నేదియో
యడుగఁ దలంచియున్ దమకు నట్టి ప్రసంగము లేటికంచునో
యడిగిన నుత్తరంబు సరిమైనది రాదను బుద్ధిచేతనో
యుడిగిరి నెమ్మదింగలుగు నూహలు మోమునఁ దాండవింపఁగాన్.

కం. కొందఱు మనమునఁ బొడమిన-తొందర నడఁచుకొనలేక తొలుదొల్తనె యీ
చందంబునఁ బనిమాసిన-చెందుల కని యడుగఁ జొచ్చి రెన్నో తడవల్.

ఉ. డంబముగాక యేమిటి విడంబన మిఁక్యది? యింతమాత్ర గ
డ్డంబును మీసలుం గడు దడంబుగఁ బెంచిన యంతనే మహ
త్త్వంబు గడించునే? ఇతఁడు తక్కరి; పెక్కురఁ గంటి మిట్టి నీ
మంబులవారి; నంచునొకమాడ్కి వచించిరి కొంద ఱయ్యెడన్.

కం. మఱి చెడెనో, వైరాగ్య-స్థితి ముదిరెనో, లేసిచో విచిత్రంబిది! ఈ
గతి నుండు వాఁడుగాఁ డితఁ-డితరులచే నెన్నఁజేని యెన్నం బడెనే?

ఉ. చెప్పడుఁగాక, యొండొకవిశేషము గల్గియెయుండు దీనికిన్
దప్పదు! దానికై మనము తర్కము సేయఁగనేల? యాతనిం
జెప్పు మటంచుఁ గోరుటయు సిగ్గులచేటగుఁ జెప్పఁగాక! తాఁ
జెప్పక యుండుఁగాక! పరిశీలన మేటికి మూర్ఖచేష్టకున్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కం. అని కొందఱు గుసగుస లాడిన పల్కులుఁ గూడ వినఁబడెం గొన్ని; మహా
జనములు చను మార్గంబునఁ-జన నని కాఁబోలుఁ దెగడ సాగిరి లోకుల్.

కం. మాసిన గడ్డము తోడను-మీసలతో నుంటిఁగాని మిక్కిలిగా నేఁ
జేసినయది వేఱొండొక-దోసము ద్రోహంబు లేదు దూషింపంగన్.

గీ. అడిగినారు కొంద ఱనుఁగుమిత్త్రులు మంచి-తనముచేతఁ జాలఁ జనవుచేతఁ
జెప్పినాఁడఁ జిత్రచిత్రసమాధాన-ములను వారు వెఱ్ఱి మొగము వైవ.

కం. కారణముఁ జెప్పు మని వా-రూరక వేధింప నేమియుం దోఁచక నా
నోరికి వచ్చిన తెఱఁగున-నారంభించితిని గారణాభాసములన్.

ఉ. ఎవ్వరి కేమియుత్తరము నిచ్చిన నచ్చకపోయె వారు నన్
నవ్వులకొకాని నాదువచనస్థితి నిక్క మెఱుంగరైరి, తా
మవ్వల కేగి నెమ్మనములందు మతేమని చింతచేసిరో?
చివ్వన నొచ్చెనో తమదు చిత్తము మద్వచనప్రసంగతిన్?

సీ. ముసి ముసి నగవుతో మ్రొక్కించుఁ జెప్పినఁ-గాదు లెండది వట్టి కల్ల యనుచుఁ
బరిహాసముగ నాదు భార్య గర్భిణియన్న-సంతోషమే! పుత్త్రిజనన! మనుచుఁ
దేటగా నే నొక్కదీక్ష వట్టితి నన్న-నెఱుఁగమే మీదీక్ష లే మటంచుఁ
దథ్యమే; మంచిమూర్తము చిక్కక యటన్న-నౌను మీప ల్కసత్యంబటంచుఁ
బరిహసించుటకాని యప్పల్కులందు-సత్య మెద్దియొ, హేలాప్రసంగ మెదియొ,
నిర్ణయింపక పోయి రనేకమిత్త్రు;లెట్లు నమ్మింపనేర్తు నేనింక వారి?

శా. ఏమో! వారడుగంగ జెప్పఁ బనినా కేమం చుపేక్షించి నే
నేమీ సెప్పక యూరకుండుటకు వీలేలేదు; వారందఱున్
సామాన్యప్రతిపత్తి గల్గుజనులా? సంపన్ను! లమ్మాన్యులన్
గ్రామీణత్వముఁ బూని, పల్కక తిరస్కారంబు గావింతునే?

కం. ఎక్కడ కక్కడనే యెదొ-చిక్కు తటస్థించె; నేమి సేయుదు? నపుడే,
చిక్కులు వడఁ జొచ్చెను బెం-పెక్కిన గడ్డంబు మిగుల నీఱుం బగుచున్.

ఉ. నామదిచొప్పెఱుంగ వదనంబున విన్నదనంబు దోఁపఁగా
నేమిటిదంచు నాదుహృదయేశ్వరి యయ్యెడ జంకుచున్ ద్రపా
కోమల సంశయాత్మయయి కోరగ నిక్కము సెప్పఁ బోక నీ
వేమియు సంశయింపవల; దేమియులే దిది; యంటి హేలగన్.

గీ. తగిన హేతువు చెప్పఁ డీతఁ డింక నంచుఁ-దలఁచెఁ గాఁబోలు! నాసాధ్వి తఱచి తఱచి
యడుగక విసవ్రమై ప్రసంగాంతరమున-నన్ను మరలించె మిగుల విన్నాణమొప్ప.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. ఆలుంబిడ్డలు సన్న్యసింతు నని తా మాత్మన్ విచారింపరో
వేళాకోళము సేయరో విమతు; లీవేషంబు నీక్షించి యి
క్కాలంబందలి నవ్యనాగరకముఖ్యశ్రేణి దూషింపదో
యేలాగియ్యది యంచు లెక్కఁగొనలే దేనించు కంతేనియున్.

కం. తెలుపును నలుపును సమముగఁ-గలిగిన సెంద్రుకలతోడ గడ్డం బంతన్
దిలతండుల సంసర్గము-పోలుపున విలసిల్లి చాలఁ బొడవుగఁ బెరిగెన్.

కం. పెరిగిన గడ్డము నంకం-బరికించిన వారలెల్లఁ బరిహాసము చే
సిరి లోలోపలఁ దిట్టిరి-పరిపరిచందముల నేవపడి రవ్వేళన్.

ఆ. గీ. ఏదియొ కారణమున నేగడ్డమునుబెంప-నింత రవ్వాయెయ్యె నేమిసెప్ప
గడ్డమేల లోకకంటకంబయ్యెనో-చెప్పకొన్న నగుదు చిన్నినగవు.

శా. స్వామిద్రోహము గాదు; కాదొ కదురాశాపాతకంబున్; బర
శ్రీమాత్సర్యము గాదు; వేఱొకరి గాసింబెట్టుటా కాదు; నా
రోమంబుల్ పరికించి యేమిటికి నన్ రూకుంబుగాఁ జూతురో
స్వామీ! లోకులతీరు చిత్రముసుమీ! చర్చింపఁ జర్చింపఁగన్.

గీ. పిచ్చివాఁడనుగాను; దేబెయును గాను; గోపియుంగా; ననాగరకుఁడను గాను;
దాంభికుఁడఁగాను; వట్టి నిప్ప్రపుఁడఁగాను; నన్నుఁగని లోకు లేలొకో నవ్వకొంద్రు?

ఉ. కాంతలు రూపగౌరవనికామ విమర్శనబుద్ధు లెట్లొ యొ
క్కింత హసింత్రుగాక; తమ కేటికిఁ బూరుషుఁ జూచి పూరుషుల్
వింత విమర్శముల్ సలిపి వెంగలులై హసియించి వెఱ్ఱిసి
ద్ధాంతము లాచరింప? నవురా! యిది యెచ్చటి ముచ్చటో కదా.

కం. తలనూయుట, యొడలును జీ-రలు మాయుటఁ జూచి యంతరంగంబున లో
కు లసహ్యపడుదు రనినేఁ-దెలియనె నా కంత తెలివి తేటలు లేవే?

గీ. వెఱ్ఱివాని తెలివి విధమున నున్నదీ-పలుకు తీరటంచుఁ దలఁపఁ బోక
గడ్డమేల పెంపఁ గడఁగితి పనిమాత్ర-మకుగఁ బోకుఁ డోమహాత్ములార!

కం. మీజుట్టులు మీకట్టులు-మీజుంజుఱు మీసములును మీవైఖరులున్
నేఁజూచి యడిగినాఁడనె?-నాజోక యదేల మీకు నాయనలారా!

కం. అనియొక్క యుపన్యాసం-బు నొసంగం దలఁచి లేనిపోనిగొడవఁ బె
ట్టిన నుడికించెద రేమో-యనుకొని లోకులకు వెఱచి యూఁగితి నంతన్.

గీ. పశులు నను మూర్ఖుఁడని యెంచి పరిహసింప-వారియజ్ఞతఁ దలఁచి భావమున నేను
నవ్వుకొనసాగితిని; లోకనటన మెపుడు-నిట్టులే పోవుచున్న, దదేమొకాని.

కం. గడ్డముఁ బెంచుటకుంగల-గడ్డగుకారణము హృదయగతమై యుండన్
గ్రుడ్డితనంబునఁ బలికిన-యొడ్డుల వచనములు సొచ్చునో హృదయమునన్?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# విష్ణు వాయు పురాణములు

[బ్రహ్మాండ పురాణాంతర్భాగములు]

కీ. శే. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు, యం. ఏ.

ఆరంభములోఁ బురాణములసంఖ్య పదునెనిమిది కాదనుసంగతి పండితులందఱు నెఱింగినదియే. మొదట శ్లోకాత్మకమైన పురాణ మొక్కటియే యున్నట్లును, అది క్రమముగఁ బెరిగినట్లును, దాని గ్రంథసంఖ్య మొదటకొద్దిగానుండి పిదపఁ బెరుగుచు వేఱు వేఱు కాలములలో వేఱు వేఱు పెరిగినకూర్పులు బయలుదేఱినట్లును తెలిసికొనుటకుఁ బురాణములలోనే కొన్ని సూచనలు కలవు. కీర్తిశేషులైన జాక్సనుగారు ఈవిషయమును గుఱించి యిట్లు వ్రాయుచున్నారు:



వ్యాసకర్త

“వైదికయుగము కడపటిభాగము నుండి క్రీస్తుపూర్వము రెండవశతాబ్దివఱకు నితిహాసములకనుబంధముగఁ బురాణ మొక్కటియుండినట్లును, అందు సర్గము, ప్రతిసర్గము, వంశము, వంశానుచరితము, మన్వంతరములనునవి వర్ణింపఁబడినట్లును హిందువులవ్రాఁతలవలననే తెలియవచ్చుచున్నది. స్టీఫెనుకాలము వఱకు వేఱు వేఱుమఠములలో వ్రాయఁబడుచు వచ్చిన మన ‘శాక్జను వృత్తాంతము’ (Saxon chronicle) వంటివే యీపురాణములు. నార్మనులదండయాత్రయనంతరము పరస్పరము సంబంధము లేని భాగములు ఆ‘వృత్తాంతము’నఁ జేరిపోవుచు వచ్చినట్లే హిందూసామ్రాజ్యకేంద్రప్రభుత్వమంతరించినపిదపఁ బండితసమావేశము లంతకుఁబూర్వముకంటెఁ గష్టసాధ్యము లైనప్పటినుండి ఆయాపుణ్యక్షేత్రములందలి పండితులు తమయొద్దనుండు శ్లోకాత్మకమైన మూలపురాణప్రతులలో నచ్చటచ్చట మార్చుటయు, మఱికొన్నిచోట్ల స్థానికవిషయములను జేర్చి గ్రంథమును పెంచుటయు సంభవించెను. మూలగ్రంథమగు నాదిపురాణమునుండి యీ విధముగ బ్రహ్మపురాణము ఒరిస్సా యందును; పద్మపురాణము పుష్కరక్షేత్రమునను, అగ్నిపురాణము గయలోను, వరాహపురాణము మథురలోను, వామనపురాణము స్థానేశ్వరమునను, కూర్మపురాణము వారణాసిలోను, మత్స్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పురాణము నర్మదాప్రాంతములందును బుట్టినవి."[1]

**మూలపురాణము ౧౨,౦౦౦ల గ్రంథమే.**

దేశకాలముల ననుసరించి పురాణములు ఎన్నో మార్పులు పొందుటవలన ఆదిపురాణమేది; ఎట్లుండినది; అనువిషయములను మన మిప్పుడు సరిగానిర్ణయింపలేము. కాని వాఙ్మయ విమర్శకుని తీక్ష్ణమైన యంతర్దృష్టి నవనవలాడుచుఁ బుష్టిగఁ బెరిగిన యష్టాదశ సంఖ్యాతీతపురాణోపపురాణ సాంద్రారణ్యమును జొరుచుకొనిపోయి మూలపురాణమను నీ యాదిమవాటికాస్వభావమునుబయలుపఱుచునట్టి మఱుగుపడినిగూఢములైన నిదర్శనములను గొన్నిఁటిని గనుఁగొనఁ గలదు.

భవిష్యత్పురాణములోని యీ క్రింది శ్లోకములవలనఁ బురాణము లన్నియుఁ గలిసి మొదట ౧౨,౦౦౦ ల శ్లోకములే యనియు, నాగ్రంథసంఖ్య క్రమముగఁ బెరిగెననియుఁ దెలియవచ్చుచున్నది.

"ఓ రాజోత్తమా! పురాణములన్నియుఁ గలిసి మొదట ౧౨,౦౦౦ ల గ్రంథముండెను. కాలక్రమమున నందనేకవ్యాఖ్యానములు చేరి యది వృద్ధి నొందినది. స్కాంద, భవిష్య పురాణము లీరీతినే పెరిగినవి. స్కాందము శతసహస్రము (అనఁగాలక్ష)అని లోకు లందఱికిఁ దెలియును. ఋషులు భవిష్య పురాణము నేఁబదివేల గ్రంథముగాఁ జేసిరి."[2]

ఇప్పుడు దొరకు వేఱువేఱుపురాణముల ప్రతులప్రకారము చూచినచో, ఆయాపురాణములలోని అసంఖ్యమాహాత్మ్యములను దీసివేసినప్పటికిని, అష్టాదశపురాణముల గ్రంథసంఖ్య మొత్తము నాలుగులక్షలకు మించినది. పండ్రెండువే లెక్కడ; నాలుగులక్ష లెక్కడ! ఈనాలుగులక్షల గ్రంథమునకును (లక్షలకొలఁదిగ నున్న మాహాత్మ్యములకును) ప్రధానాధారము ౧౨,౦౦౦ ల పురాణమే! ఇప్పటి నాలుగులక్షల గ్రంథమునుండి మొట్టమొదటి పండ్రెండువేల గ్రంథమును విడఁదీసి చూపుటకు సాధ్యముగాకపోవచ్చును కాని సాధారణముగ నన్నిపురాణములలోను గానవచ్చు కథలను, శ్లోకములను విడఁదీసి కుతూహలప్రేరితులై జిజ్ఞాసువు లెవ్వరైన నాదిపురాణస్వరూపమును నిర్మింపఁదలఁచినయెడల నది పూర్తిగ నసాధ్యమైన కార్యము మాత్రము కాదు. అయితే యీవ్యాసమునం దిపుడు నేను చేయఁదలపెట్టినది ఆపనికాదు. ఆదిపురాణము బ్రహ్మాండమను పేరుతో నుండెననియు, నిప్పుడు మహాపురాణము లనఁబడునవి యొకప్పుడు దానిలోని యంతర్భాగములుగ నుండెననియు

---

1. Centenary Memorial Volume of the journal of the Bombay Branch of the Royal Asiatic Society, Epic and Puranic notes by A. M. V. Jackson, p. 69.

2. సంక్షేప్యైవ పురాణాని సంక్షిప్తాని నరర్షభ, ద్వాదశైవ సహస్రాణి ప్రోక్తానాంహ మనీషిభిః."
పునర్వృద్ధిం గతానీహ ఆఖ్యానై ర్వివిధై ర్నృప, యథా స్కాందం తథాచేదం భవిష్యం కురునందన!"
స్కాందం శతసహస్రంతు లోకానాం జ్ఞాతమేవహి, భవిష్య మేత దృషిణా లక్షార్ధసంఖ్యయాకృతమ్."
—భవిష్యపురాణము, బ్రహ్మపర్వము ౧, ౧౦౪-౬.

మాత్రమే నేనీవ్యాసమునఁ దెలుపఁదలఁచితిని. నేనీరీతిని నమ్ముటకుఁ గలకారణముల నీదిగువఁ బొందుపఱుచు చున్నాను.

విష్ణుపురాణము

ఒక్కపురాణమునుండి పెక్కుపురాణములు పుట్టిన వనుటకు విష్ణుపురాణమే యొక దృష్టాంతము. పురాణములను గుఱించి విచారించిన తజ్జ్ఞు లందఱును విష్ణుపురాణము ఆదర్శపురాణమనియుఁ, బురాణములలోఁ బురాతన మనియుఁ జెప్పిరి; కాని యీ పురాణముకూడ స్వతంత్రము కాదనియు, నొకప్పుడిది ఆదిబ్రహ్మాండపురాణముయొక్క భాగముగ నుండెననియుఁ, దరువాతఁ జీలి స్వతంత్ర పురాణమయ్యెననియుఁ దెలియవచ్చుచున్నది. ఇందును గుఱించి యిదివఱ కెవ్వరును విచారించియుండ లేదు. తెలుఁగు విష్ణుపురాణముఁజదువునప్పుడు ఈవిషయము నాకుఁ దెలియవచ్చెను. ౧౬-వ శతాబ్దారంభమునం దుండిన వెన్నెలకంటి సూరన విష్ణుపురాణమును దెనిఁగించెను. ఆతఁడు షష్ఠ్యంతము లైన తరువాత నిట్లు వ్రాసెను: "అభ్యుదయపరంపరాభివృద్ధిగ నా యొనర్పంబూనిన యాదిమహాపురాణం బగు బ్రహ్మాండపురాణంబునందలి పరాశరసంహితమైన శ్రీవిష్ణుపురాణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన..." [౧ ఆ.] ప్రతి ఆశ్వాసము చివరను అంత్యగద్యమం దిట్లె వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి చూడఁగా ౧౬-వ శతాబ్దమందలి సంస్కృత విష్ణుపురాణ ప్రతియందు నది బ్రహ్మాండపురాణమందలి పరాశరసంహిత యనఁబడు భాగమని వ్రాయఁబడి యుండె ననుట స్పష్టము. విష్ణుపురాణము స్వతంత్రగ్రంథ మనక మఱియొక పురాణభాగమన్నయెడల దానిగౌరవము తగ్గునని కాఁబోలును ఇటీవలివారు సంస్కృతప్రతుల నుండి యీ భాగము నెత్తివేసినారు. కావున, నది కానరాదు. కొన్నిటియందు మాత్రము పరాశరసంహిత అని యున్నది.[3]

కావునఁ బై విషయములను బట్టిచూడ నిప్పటి విష్ణుపురాణమను ప్రామాణికగ్రంథము ఆదిబ్రహ్మాండపురాణమున నొక భాగమని తేలుచున్నది. ౧౧-వ శతాబ్దమందుండిన ఆల్‌బెరూనియను మహమ్మదీయపండితుఁడు తన పురాణముల జాబితాలో విష్ణు, బ్రహ్మాండ పురాణములు రెంటిని విడివిడిగఁ బేర్కొనుట వలన విష్ణుపురాణము బ్రహ్మాండ పురాణము నుండి పదునొకండవ శతాబ్దికిఁ బూర్వమే చీలిపోయియుండునని యూహింపవచ్చును.[4] వైష్ణవమతము తిరిగి విజృంభించినకాలమున నీపురాణమునకుఁ బ్రాముఖ్యము వచ్చియుండును. వైష్ణవు లీపురాణ మింకొక పురాణములోని యంతర్భాగమని యంగీకరింపక పోవుట సహజము. కాఁబట్టి మతాభినివేశముగల వైష్ణవులో, లేక, యెన్నో శతాబ్దులు కడచినతరువాత నా పురాణమునకును దీనికినిగల సంబంధముఁ దెలి

---

3. నేను అచ్చుపడిన గ్రంథములను మాత్రము చూచితిని. వేఱువేఱు దేశములందలి వ్రాఁతప్రతులనుజూచి యింకను శోధింపవలెను.

4. Alberuni : Trubners Oriental Series, Vol. I, page 131.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యక యీ యాశ్వాసాంత గద్యము లేఖక ప్రమాదమని తలంచినవారో దానిని తీసివేసి యుందురు. అయినప్పటికిఁ గొన్నికొన్ని వ్రాత ప్రతులలో విష్ణుపురాణ, పరాశర సంహితలు రెండు నొక్కటియే యని తెలుపు నాశ్వాసాంతగద్యభాగ మెట్లో నిలిచియే యున్నది. ఈపురాణముయొక్క కొన్నికొన్ని ప్రతులలోఁ బ్రతిఅంశము చివర నీయాశ్వాసాంత గద్యము లేదు. పురాణము చిట్టచివర నాఱవయంశము కడపటనే యీరీతిని గలదు:

"ఇతి విష్ణుపురాణే పరాశరసంహితాయాం షష్ఠోఽంశః సమాప్తః."5

కనుక విష్ణుపురాణము మొట్టమొదటఁ బరాశరసంహిత యనఁ బరగుచుండెనని తెలిసికొనుట కిక్కడ కిటుకు దొరకినది. అది పరాశరసంహిత యని ౧౬-వ శతాబ్దమున నాంధ్రీకరింపఁబడిన విష్ణుపురాణమునఁ గూడఁ గలదు. అందువలన దీనినిబట్టి బ్రహ్మాండమనే యొకపురాణము మొదట ననేకసంహితలుగ నుండెడి దనియు, విష్ణుపురాణ మందులో నొకటి యనియు మనము గ్రహింపవచ్చును. ఇట్లె వాయుపురాణము గూడ నొకప్పుడు బ్రహ్మాండపురాణములోనిదే యనియు, నది ప్రాయికముగ మొదట వాయుసంహిత యను పేరఁ బరగుచుండె ననియు మనము ముందు తెలిసికొనఁగలము. పెక్కుసంహిత లిప్పటి కొన్ని పురాణములలోనివే యని యందఱు నెఱిఁగిన విషయమే. ఉదాహరణమునకు సూతసంహితఁ జెప్పవచ్చును. అది యొక సంపూర్ణగ్రంథ మైనప్పటికి బ్రహ్మాండపురాణమువలెనే దానిని సంపూర్తిగఁ గానరాని స్కాంద పురాణములోని కొంతభాగ మని యూహించెదరు.

## విష్ణుపురాణముయొక్క వివిధదశలు

నేఁడు కానవచ్చు ౬,౧౦౦ల శ్లోకముల విష్ణుపురాణము కాని, నారదపురాణమునఁ జెప్పఁబడినట్లు ౨౩,౦౦౦ల శ్లోకముల విష్ణుపురాణము గాని మొదట విష్ణుపురాణములో నొకభాగముగ నుండెడిదని మన మనలేము. అప్పుడు పరాశరసంహితలోఁ గొన్ని వేల శ్లోకములో లేక బాగుగా నాలోచించినఁ గొన్ని వందల శ్లోకములో మాత్రమే యుండియుండవలెను. ఈవిష్ణుపురాణముకూడ ననేకములైన యితరపురాణముల వలెను, మహాభారతము వలెను క్రమక్రమముగఁ బెరుగుచువచ్చె ననుట స్పష్టము. రత్నగర్భ భట్టాచార్యులవారనుప్రసిద్ధవ్యాఖ్యాత 'వైష్ణవకూటచంద్రిక" యను తమ విష్ణు పురాణవ్యాఖ్యానమున నిట్లు చెప్పుచున్నారు. "విష్ణుపురాణగ్రంథసంఖ్య పదివేలని కొందఱు, నెనిమిదివేలని కొందఱు నిట్లు వేఱువేఱు విధములుగఁ జెప్పుదురు. ఈవిధముగ గ్రంథసంఖ్యనుగూర్చి యభిప్రాయభేదము లున్నప్పటికి నేనుమాత్ర మాఱువేలశ్లోకములకే వ్యాఖ్యానము చేయు

5. Edition printed at the Oriental Press, Bombay; Mss. in the G. O. M. Library, Madras.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నాను.[6] " విష్ణుచిత్తుఁడను మఱియొక వ్యాఖ్యాకారుఁడు ఈపురాణముయొక్క గ్రంథ సంఖ్యను గుఱించి పైరీతినే పెక్కు భిన్నాభిప్రాయములను దెలిపియున్నాఁడు. "విష్ణుపురాణమున నాలువిభాగములు కలవు; కావున నది పదివేలశ్లోకములదని, ౮ వేల శ్లోకములదని వేఱువేఱు పురాణములలో వేఱువేఱు రీతులఁ దెలుపఁబడినది. ఈవిభేదములు వేఱువేఱు సంహితల మూలమునఁ గలుగుచున్నవని చెప్పవచ్చును. విష్ణుపురాణమున లింగపురాణముప్రకారము పదివేలశ్లోకములును, శివ, మత్స్యపురాణముల ప్రకార మెనిమిదివేలశ్లోకములును గలవు. కొన్నిదేశములలో నిది తొమ్మిదివేల శ్లోకములనియు మఱికొన్నిదేశములలో నిరువదినాలుగువేల శ్లోకము లనియు, వేఱొక కొన్నిట నిరువది రెండువేలశ్లోకము లనియుఁ జెప్పెదరు. కాని మేమిచట నాఱువేలకు మాత్రమే వ్యాఖ్యానము చేయుచున్నాము.[7]"

విష్ణుధర్మోత్తరఖండమును విష్ణుపురాణమున కంటఁగట్టి నారదపురాణము దాని గ్రంథ సంఖ్యను విపరీతముగా ౨౩,౦౦౦ ల వఱకుఁ బెంచుచున్నది. కాని శ్రీ శంకరాచార్యుల వారి గ్రంథములప్రకారము చూడఁగా విష్ణుధర్మోత్తరమును,విష్ణుపురాణమును వేఱువేఱు గ్రంథములనియు, సాధారణముగ నిప్పుడచ్చుపడుకూర్పులలోనున్నట్లే యది యాఱవయంశముతోనే ముగియుచున్న దనియు స్పష్టమగుచున్నది. "యస్మిన్న్యస్తమతి ర్నయాతి నరకం స్వర్గోఽపి యచ్చిన్తనే" అనుశ్లోకముతోఁ బరాశరులవారు విష్ణుపురాణమును ముగించుచున్నట్లుశంకరాచార్యులవారుతమ"విష్ణుసహస్రనామభాష్యము" నందుఁ జెప్పియునార్న.[8]

---

6. విష్ణుపురాణంచ క్వచిద్దశసాహస్రం క్వచిదష్టసాహస్ర మిత్యాది వికల్పే ఽప్యత్ర షట్సాహస్రమేవ వ్యాఖ్యాయతే.—(అం. ౧, అ. ౧, శ్లో. ౨౩.)

7. వైష్ణవంతు షడ్భేదం । తేన పురాణాంతరేషు వైష్ణవస్య దశసహస్రాష్టసహస్రత్వా ద్యుక్తిః । సంహితభేద మాన విషయాకల్ప్య । యథా లైంగే దశసహస్రమితం। శైవమాత్స్యయోస్తు వైష్ణవంచ అష్టసహస్ర మితి। క్వచిత్ దేశే నవసహస్ర ముచ్యతే । క్వచిత్ చతుర్వింశతిసహస్రం। క్వచిత్ ద్వావింశతిసాహస్రం। ఇదంతు షట్సాహస్ర మస్మాభిర్ వ్యాఖ్యాయమానమ్. [౧. ౧. ౨౩]. ఈ వ్యాఖ్యాతయొక్క కాలమును నిర్ణయింపలేకపోతిని. కాని యతఁడు చెప్పిన విషయనుమాత్రము చాల నమూల్యమైనది. లింగ, మత్స్యపురాణములయొక్క యిప్పు డచ్చుపడిన ప్రతులకు, నతనికి దొరకిన ప్రతులకుఁ జాలవ్యత్యాస మున్నట్లు ఆతని వ్రాఁతలవలనఁ దెలియవచ్చుచున్నది. పురాణము లన్నియు నొకఫక్కి నుండవలయునను నుద్దేశముతోను, సందర్భశుద్ధిఁ గలిగియుండవలయు నను నుద్దేశముతోను ఏవిధమైన ప్రమాణము లేకయే పరిష్కర్త లిప్పు డచ్చుపడిన చాలపురాణములను దిద్దియుందురని నానమ్మకము. ఏపురాణముయొక్క గ్రంథసంఖ్య యెంతో యిప్పటి లింగపురాణమునఁ దెలుపఁబడియుండలేదు. విష్ణుపురాణగ్రంథసంఖ్య ౮,౦౦౦ లని కాక ౨౩,౦౦౦ లని మత్స్యపురాణము తెలుపుచున్నది.

8. శ్రీ శంకరాచార్యులవారి 'విష్ణుసహస్రనామభాష్యం' వాణీవిలాసప్రతి, శ్రీరంగం, పుట ౭౩. ఈ భాష్యకర్త ప్రస్థానత్రయభాష్యకారులైన ఆదిశంకరులవారేయని నే ననుకోను. ఆదిశంకరులవారి గ్రంథములందలి రచనకు దీనికి సహస్రాంతము భేదము కలదు. ఆరచనముం దిది చాల నీరసముగ నున్నది. ఆదిశంకరులవారి పీఠము నధిష్ఠించిన శంకరాచార్యులవా రెవ్వరో యీచిన్నగ్రంథమును రచియించి యుందురు. ఈ భాష్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇప్పుడీశ్లోకము దాదాపుగ నాలుగువేల శ్లోకముల విష్ణుపురాణముచివరఁ గాన్పించుచున్నది. "ఓరియంటల్ ప్రెస్" ప్రతిలో నీశ్లోకము తరువాత నాలుగుశ్లోకములు మాత్రమే కలవు.

విష్ణుపురాణముయొక్క వేఱువేఱుప్రతులన్నిటినిబట్టిచూడఁగా మొదట నిది బ్రహ్మాండపురాణాంతర్గతమై యున్నప్పుడిందు ౬౦.౦౦ శ్లోకములకంటె నెక్కువలేవనియుఁ, బ్రారంభములో నొకవేళ రెండు మూఁడువేల శ్లోకములు మాత్రమే యుండెననియు మన మూహింపవచ్చును. ఈయాఱువేల శ్లోకములలోగూడఁ జాలభాగము సాధారణముగ అసలు గ్రంథమునకు సందర్భించని యిటీవలఁ జేరిన ప్రక్షిప్తములని చూపవచ్చును. (సశేషము)



# ఆ శీ ర్వా ద ము

(మిత్రద్వయము)

గంభీరభావనాకలిత ప్రపూర్ణ సద్వ్యాసరాజముల కల్పకమ వగుచు
మకరందతుందిల మాధురీవిలసిత పద్యమాలల కాటపట్ట వగుచు
నవరసమయభావ కవితామనోహర గీతికావళులకు గృహమ వగుచు
ఘనమనోహర మహాగాంభీర్యసముచిత కల్పనాకథల కాకరమవగుచు
భావగర్భితమగు చిత్రపటము లెలమిఁ, గలిగి వెలుగొందు "భారతీ! కలియుగాంత
మగువఱకు నాంధ్ర దేశంబునందు వెలసి, పండితకవిపోషణమును బడయుమమ్మ!

---

కారుఁ డాదిశంకరులవారా, వారితరువాత నాపీఠమధిష్ఠించిన మఠియొక శంకరాచార్యులవారా యన్న వాదములో మనకిప్పు డిచట నంతప్రసక్తిలేదు. గ్రంథకర్త యెవ్వరైనను నీగ్రంథమును రచియించునాటికి విష్ణుధర్మోత్తరము విష్ణుపురాణములోని యొకభాగముగఁ బరిగణింపఁబడియుండలేదనియు, విష్ణుపురాణము పై శ్లోకములో సమాప్తమయ్యెననియు నిశ్చయముగఁ జెప్పవచ్చును. ఈవిషయమే విష్ణుధర్మోత్తర, విష్ణుపురాణములను రెంటిని కలగూరగంపగఁ గలిపివేయు నారదపురాణముయొక్క కాలమును తెలిసికొనుటకుఁ గొంచెము వీలిచ్చుచున్నది. నారదపురాణము గాని లేదా అష్టాదశపురాణములయొక్క విపులసూచి నిచ్చు నారదపురాణభాగము గాని శంకరుల తరువాత—వా రాదిశంకరులవారైన నేమి, లేక వారి తరువాతివారైన నేమి—పుట్టియుండవలెను. వా రాదిశంకరులవారే యైనయెడల నారదపురాణకాలము క్రీ. శ. ౯-వ శతాబ్దికి ముందుది కానేరదు. తరువాతి శంకరులవారే యైనయెడల నాపురాణము నింకను జాలశతాబ్దులు తరువాతికిఁ దీసికొనిరావలసియుండును. అందువలనఁ బురాణవిమర్శనమును గుఱించి 'పురాణనిరీక్షణ' మనఁ బడు తమచక్కని మహారాష్ట్రగ్రంథమున 'నారదపురాణమున నీయఁబడిన పురాణసూచి శంకరాచార్యుల వారి కాలముకంటెఁ బూర్వపు' దన్న పండితత్ర్యంబకగురునాథకాళేగారితో నే నేకీభవింపఁజాలను. స్వభావము ననుసరించి పురాణములు పోనుపోను వృద్ధిచెందునేకాని సన్నగిల్లవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



3. కీ. శే. శ్రీ సోదెస్వామి-ఉడిపి



౪. శ్రీ పేజవారుస్వామి-ఉడిపి



౫. ఉడిపి స్వాములవారలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7618



# శాంత

ఆ. భాస్కరమ్మ గారు

౧

శాంత కాకినాడలో పిఠాపురంమహారాజాగారి కళాశాలలో స్కూలుఫైనలు తరగతిలో చదువుచుండెను. ఆమెకు ప్రకృతిశాస్త్రములన్న విపరీతమగు నభిమానము. అందుచే వానినే తన ముఖ్యవిషయముగా తీసికొనెను. ఆమెస్వతహాగా చాలా తెలివైన బాలికయగుటచే నన్ని విషయములలోనూ తనతరగతిలో నెప్పుడూ మొదటిదిగానే యుంటూ యుండేది. కాని యాపాఠశాలలో ప్రకృతిశాస్త్రబోధకులు సరియగువారు లేకపోవుటచే నావిషయమును దీసికొనిన విద్యార్థులందఱు తాము బహిరంగపరీక్షలో కృతార్థులగుట యెట్లాయని విచారింపుచుండిరి. ఇట్లుండ వారి యదృష్టవశముననే చెన్నపురి రాజధానికళాశాలలో ప్రకృతి శాస్త్రోపన్యాసకులుగానున్న కృష్ణారావనునాయన కాకినాడ కళాశాలకు వచ్చిరి. ఆయన ప్రకృతిశాస్త్ర పండితుండగుటచే ప్రతితరగతికి ఆవిషయమును మాత్రమే బోధన చేయుచుండెను. ఆయనబోధనలను కొన్నిటిని వినినతరువాత విద్యార్థులకందఱకు ప్రాణము లేచివచ్చిన ట్లయింది. అదివరదాకా పరీక్షలో నుత్తీర్ణులగుటయెట్లాయని విచారించుచున్న వారి కిక భయము లేదని ధైర్యము వచ్చినది. వారందఱకు నాయనయం దొకవిధమగు ప్రేమ, యభిమానము, గౌరవము, గురుభక్తి కలిగినవి. శాంత సంతోషమునకు మితిలేదు. ఇట్టి గురువుచేతిలో బడిన తనకు తన యభిమానశాస్త్రములలో పరిపూర్ణజ్ఞానమునుసంపాదించుట కిక నేసందేహమును లేదుకదాయనియుప్పొంగుచుండెను. ఆయన యెంత విపులముగా పాఠమును బోధించుచుండెనో ఈమె యంతశ్రద్ధతో నా విషయమును గ్రహించుచుండెను. ఉపాధ్యాయుడు వేయు యుక్తిప్రశ్నలకు తడవులేకుండగానే చక్కని జవాబులిచ్చుటలోనూ, ఆయనసహాయ మక్కరలేకయే స్వయముగా ప్రయోగములను (Experiments) చేయుటలో క్రొత్త తెలివిని, చాకచక్యమును కనపరచుచుండేది. ఎవ్వరూ చెప్పలేని యెంత యసాధ్యప్రశ్నయయినను శాంతమాత్ర మెన్నడూ తప్పిపోవుట యననేమో యెరుగదు. అందుచే మొట్టమొదట కృష్ణారావుగారు పాఠశాలకు వచ్చుటతోడనే యామెయందు మంచియభిప్రాయము పడిపోయినది. అది క్రమముగా నుత్తమశిష్యులయందు గురువులకుండు వాత్సల్యముక్రిందను, నభిమానముక్రిందను, తుదకొకవిధమగు ప్రేమక్రిందను పరిణమించినది.

శాంత స్కూలుఫైనలు పరీక్షలో మొదటి తరగతిలో కృతార్థురాలైనది. ఆమె యనిన పాఠశాలలోని యుపాధ్యాయులకందఱకూ ప్రేమే. కృష్ణారావుగారికందఱికంటె యెక్కువప్రేమ. అప్పుడప్పుడు 'మీకంటే ఆడపిల్లనయం, ఆమెనుజూచి సిగ్గు తెచ్చుకోండి' అని తక్కినబాలురనుకోపపడుచుండేవారు శాంత యఫ్.ఎ.లోకి వచ్చినది. పిల్లలందఱూ ఆమెకూ కృష్ణారావుగారికీ పేర్లు పెట్టుటకు ప్రారంభించిరి. శాంతకాని, కృష్ణారావుగారుకాని వినిపించుకొనుట లేదు. శాంతమీదకృష్ణారావుగారి కెంతశిష్యవాత్సల్యమో శాంత కాయన మీదనంతగురుభక్తి. ఆయన యేదిచేసినా, యేమి చెప్పినా యామె కాశ్చర్యమే. ప్రతివిషయములోనూ నాయవననుసరింపవలయునని యతిజాగరూకతతో పరిశీలించుచుండేది. ఆమె యేదిచేసినా కృష్ణారావుగారికి ముద్దే. ప్రతివిషయములోనూ తమ యానందమును తెలియపఱుచుచుండేవారు. యఫ్. ఎ. జూనియరులో నామెదే ఫస్టుమార్కు. పిల్లలందఱకూ నామెమీద నసూయప్రారంభమయినది. వారందఱు తమ ప్రకృతిశాస్త్రబోధకుడామెను ప్రేమించినాడనియు, నామెను వివాహమాడునుకాబోలుననియు, ఆమె యాయనకంటి కపరదేవతవలె కనబడుచున్నదనియు, తా మెంతబాగా వ్రాసినా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మార్కులు పడవు. ఆమె యెల్లా వ్రాసినా తెగమెచ్చు కుంటారనియు, ఫస్టుమార్కుల్పు మా ఆమెచే యనియు ఆపిల్ల వెనవపిల్లకదా ఏలా పెండ్లిచేసికొంటా రనియు, ఇంత చక్కనిబోధకులకు నిదేమిగుణమనియు నీవిధము గా చెప్పుకొనమొదలుపెట్టిరి. శాంత యఫ్.ఎ.సీనియరు లోనికి వచ్చినది. ద్రోణాచార్యున కర్జునుని మీాదవలె కృష్ణారావుగారికి శాంతమీాద శిష్యవాత్సల్యము, దిన దినాభివృద్ధి నొందుచుండెను. బహిరంగపరీక్షలోనామె ను రాజధానికంతకును మొదటిదిగా వచ్చునట్లుచేసి వీళ్ల నోళ్లపడవలయునని యుండెను. ఎవరికీచెప్పని యనేక ప్రయోగములు,యుక్తులు మొదలగువాని నామెకుప్రత్యే కముగా చెప్పుచుండెను. అదితక్కినబాలురయొక్కయు నితరులయొక్కయు ననుమానములను మరింత దృఢ పఱచుచుండెను. శాంత యఫ్.ఏ. పరీక్షలో రాజధానికి మొదటిదిగా వచ్చెను.

## ౨

భోజనముచేసి సాంబశివరావు గారు చావడిలో పచారు చేయుచుండిరి. శాంత పడకకుర్చీలో కూర్చుండి యేదో పుస్తకము చదువుచుండెను. ఒకచోట నాపుస్త



కము చదువుట నాపివేసి 'నాన్నగారూ! మనదేశములో నీయతిబాల్యవివాహ దురాచారం ఏలా వచ్చిందండీ. నేనిదివర కనేకయింగ్లీషు నవలలు, కథలు,చరిత్రలు చది వితిని. వానిలో నెక్కడజూచినా బాల బాలికలుబాగా యుక్తవయస్సువచ్చేవరకూ చక్కగా చదువుకొని విద్యా వంతులై అప్పుడు తమ కిష్టము వచ్చినవారిని పెండ్లిచేసి కొనుటయేకాని చిన్నతనములో పెండ్లిండ్లుచేసినట్లెక్క డా కనబడదు. జపానువారిచరిత్ర చదివి చూచితిని. అందులోకూడ నంతే. అప్పుడు నేననుకొనేదాన్ని— ఆదేశములలో నాలాయున్నది కాని మన దేశములో మొదటినుండియు నింతే కాబోలు; ఇది యీ దేశాచా రము కాబోలునని. ఇప్పుడీ భారతమును చదువుచుండ ఇందులోనూ ఎక్కడా చిన్నతనపు పెండ్లిండ్లు కాన రావు. ద్రౌపది, దమయంతి, శకుంతల వీరందఱూ చదు వూ, సంగీతమూ, మొదలగునన్ని విద్యలలోనూ ప్రవీణు రాండ్రై తమకుఁ దగినభర్తలనువరించి పెండ్లిచేసికొన్న ట్లే కనబడుచున్నది.'

తండ్రి—వారందఱవరమ్మా? రాజపుత్రికలు కారూ? ఇప్పుడుమాత్రము రాజులూ, తెలగాలూ, నాయిళ్లూ, మొదలగువా రెప్పుడు చేసికొనుచున్నారూ? యుక్త వయస్సువచ్చినతరువాత కాదూ?

శాంత—నాన్నగారూ! వారేకాదండీ శుక్రాచార్యుని పుత్రిక దేవయాని; యాజ్ఞ్యవల్క్యుని భార్యలుగా ర్గి, మైత్రేయి మొదలగువా రందఱూ బ్రాహ్మణులు కారూ? వారుమాత్రము యుక్తవయస్సు వచ్చినతవాతకాదూ యిచ్చవచ్చిన భర్త లను బరిణయమయినది? మన బ్రాహ్మణ వైశ్యులలో నెక్కడ దాపురించినదండీ యీాదురాచారం? వేదములలో శాస్త్ర ములలో నెక్కడనైనాయున్నదాయేమి?

తండ్రి—లేదమ్మా, ఎక్కడా లేదు. వివా హములలో చెప్పుమంత్రములన్నీ బాగా యుక్తవయస్సు వచ్చి యొకరి నొకరు ప్రేమించుకొనిన వధూవరులు ఒకరితో నొకరు చెప్పుకోతగిన మాటలైయున్నవి; కాని పసిబిడ్డలు మాట్లాడవలసిన మాటలు కావు.

శాంత—అయితే యీాయాచార మెక్కడనుండి వచ్చి నది?

తండ్రి—ఏదో కొందఱు మహమ్మదీయపరిపాలనలో ననీ, అదనీ, ఇదనీ, చెప్పెదరు. కాని యద ం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సయుక్తికముగా గన్పట్టదు. అదే యయినయెడల నొక్క బ్రాహ్మణులలోనే యెందుకు రావాలీ?

శాంత—అయితే నాన్నగారూ, ఈబాల్యవివాహములు శాస్త్రనిరుద్ధములు కావండీ?

తండ్రి—తప్పకుండా; కాని వెధవఆచారం; ఆచార మొకటివచ్చి పడింది. ఈ యాచారం మొదట్లో యెలాఅంకురించిందో తెలియదు. కాని యిప్పు డది బాగా వేళ్లుపాతుకొనిపోయి పెద్దవృక్షమై నిలిచి నది. దానికందఱు దాసులై పోయిరి. ఎవరైనా దానిని కదపవలయుననిచూచిన వీళ్లందరూ బ్రహ్మ రాక్షసులవలె మీదపడెదరు. శాస్త్రసమ్మతమయిన ప్రౌఢవివాహములెవరైనా చేసినయెడల నది శాస్త్ర విరుద్ధమని వెలివేసెదరు అందుచే నిష్టమయిన వారు కూడ విధిలేక యీకష్టములన్నీ పడలేక ఏదోఅదృ ష్టము బాగుండిన వాళ్లేబాగుందురని చేయుచుందురు.

శాంత—పోనీ నాన్నగారూ, చేస్తేచేసారుగాని వెంటనే ఆభర్తలుపోతే వాళ్లకు మళ్లీ యెందుకు వివాహము చే యకూడదూ?

తండ్రి—ఏమిటమ్మా! పిచ్చిదానా! రజస్వలానంతరవి వాహములే యొప్పుకొననివారు వితంతూద్వాహ ములనొప్పుకొందురా? పోనీ సంఘముజోలి మనకెం దుకు, చేయుదమనుకొనినను మొదటిసారి పెండ్లికొ డుకుదొరకుటయే యెంతోకష్టము. రెండవసారిమరల నెక్కడతీసికొనివచ్చెదరు? అందుచే నీబాధలన్నీ పడలేక యిదేబాగుండని యూరకుండెదరు.

శాంత—ఐతే నాన్నగారూ! ఇప్పుడు మనదేశములో వేలకొలదియున్న వితంతుబాలికలందఱు వైధవ్య ములో కృశించి పోవలసినదే? ఇంద్రియములను, మనస్సును నిగ్రహింపలేని యమాయకులు దుర్నీతిప రులై చెడిపోవలసినదే? అందుకు సంఘము ఒప్పు కొనునా?

తండ్రి—తప్పక ఒప్పుకొనును. దాని కేమీ ఆక్షేపణ లేదు. ఏమహానుభావుడో జన్మించి యీసంఘము నంతను కల్లకల్లోలము చేసి తల్లక్రిందు చేసేవరకూ నీలా జరుగవలసినదే.

శాం—నాన్నగారూ! ఇప్పుడాలాటిధైర్యవంతులెవ రూ లేరూ?

తండ్రి—ఏదో కొంతమంది యుండేమాత్ర మేమి లాభ మమ్మా, సాగుతుందా?

శాంత— ఇక ప్రశ్నించలేదు. తండ్రికూడ నేమీ మా ట్లాడలేదు.

## 3

సాంబశివరావుగారు కొన్ని దినములు కాకినాడ లో డిప్యూటీకలెక్టరు పనిచేసిరి. అంతేకాక చాలా భూవసతికూడాకలదు. ఆయన కయిదుగురుకొమారులు, శాంతయొక్కతియే యాడుపిల్ల. ఆమె కారవయేట నె పెండ్లిచేసిరి. పెండ్లి నాలవదినముననే యాబాలుడు గుండె జబ్బుచేతన హఠాత్తుగా మరణించెను. భర్తగతించుటచేత తనకొమారులతోపాటూ మెకుకూడా నున్నతవిద్య నొసగుచుండిరి. మరల పెండ్లిచేయవలయునని మొదటిదినములలోననుకొనుచుండెడివారు. కాని సంఘ మునకువెరచియు, మొదటిసారి తమకొమార్తెకు భర్తను బడయుటలో నెంతశ్రమపడవలసివచ్చినదో అనుభవమె రిగినవారైయుగుటచేతనూ, వితంతుబాలిక యనగానే యెవరూ మంచివాళ్లందు కిష్టపడరనియూ నాయుద్దేశ మును క్రమముగా వదలుకొనిరి.

వేసవికాలపు సెలవులలో నీయనపిల్లలందఱనూ దీసికొని యెక్కడికో యొకక్రొత్తస్థలమునకు బోయి యక్కడ హాయిగా ఆరెండుమాసములు గడపుచుందురు. ఆసంవత్సరము తోటపల్లికొండల సమీపమందున్న శాం త్యాశ్రమములో గడపుట కేర్పఱచుకొనిరి. సెలవులిచ్చు టతోడనే అందఱు నక్కడకువెళ్లిరి. ఆయాశ్రమములో వీరుకూడా నొకయాత్రీకులవలెనే కాలముగడపుట కిష్టపడిరి. చాలాసామాన్యముగా దుస్తులనుధరించి పవి త్రజీవితము చేయుచుండిరి. సాంబశివరావుగారు ప్రతి దినము రాత్రులు పిల్లలనందఱు గూర్చుండ బెట్టుకొని శాంతచేత భారతము చదివించి యర్థముచెప్పుచుందురు. సాయంకాలములందు శాంత యక్కడనుండు ప్రకృతి సౌందర్యమును జూచుటకు తండ్రితోడనూ, సోదరుల తోడనూ కలసి విహారార్థము వెళ్లుచుండెది. అక్కడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుట్టుప్రక్కలంతా యడవిప్రదేశము. అడవులలోనుండు కోయవాళ్లు, చెంచులాళ్లు మొదలైనవా ళ్లప్పుడప్పు డాయాశ్రమ సమీపమునందు డేరాలను వేసికొని తామడవుల నుండి తీసికొని వచ్చిన చెంమకర్రలు, వెదురుతో చేసిన సోలలు, తవ్వలు మొదలగువానిని ఊళ్లోకి తీసికొనివెళ్లి అమ్ముకొనుచుండేవారు. అటువంటి మనుష్యులను వారి యాచార వ్యవహారములనుజూచుటకు శాంతకు చాలా సరదా. ఈమె తరచు వాళ్ళదగ్గఱకువెళ్లి వాళ్ల నతిజాగ్రత్తతో పరిశీలించు చుండేది. వాళ్లదగ్గఱ చెంమకఱ్ఱలు, పిల్లనగ్రోవులుకొను చుండేది. ఈవిధముగా నొకనెల నడచినది.

శాంతిని కెలకొల్పుఆశ్రమము పరిశుభ్రమగుగాలి నీరు, చక్కని ప్రకృతి సౌందర్యము ఎప్పుడూ పట్టణములలో నిరుకుటిండ్లలో మసలే శాంతకు చాలా సంతోషమును కలిగించుచున్నవి. తాను కాకినాడలో నున్నన్నాళ్లు ఎవరేమనుకొందురో యను భయముచే నిల్లూ, పాఠశాలా తప్ప నెక్కడకూ వెళ్లేదికాదు. ఇక్కడ నీ నిర్జనప్రదేశములో నీసృష్టిసౌందర్యములో నిస్సందేహమ్ముగా, నిర్భయముగా నిరాఘాటముగా విహరించుచున్నది. ఆమె సంతోషమునకు, సౌఖ్యమునకు మితి లేదు.

ఒకనాటిరాత్రి మామూలుప్రకారము సాంబశివరావుగారున్నపాకలో తండ్రీ, ఇవతల పాపడిలో మగపిల్లలు పరుండిరి. లోపలి గదిలో శాంత,ఆమెతల్లీపగండి హాయిగా నిద్రపోవుచుండిరి. రాత్రి రెండుగంటలయింది. ఆకసమంతయు కారుక్రమ్మి కొంచెము చినుకు చినుకుగానుండెను. ఆశ్రమవాసులందఱూ గాఢనిద్రలో నుండిరి. తక్కినవారున్నపాకలకును, శాంతావారూ ఉన్నపాకలకును కొంచెముదూర మున్నది. శాంత కేదో భయంకరమగు కల వచ్చినది. ఎవరో తన మెడలోనిహారమును దీయుచున్నట్లు కనబడెను. వానిముఖ మతిభయంకరముగానుండెను. తలంతయు జడలుజడలుగా నున్నది. ఆమె కెవ్వున నొకకేక వేసెను. ఇంట్లోనివారందఱు లేచిరి. సాంబశివరావుగారునూ, కుమాళ్లునూ వారున్నవైపునకు పోబోయిరి. సాంబశివరావుగారు తలమీద నొకగాఢమైన కఱ్ఱదెబ్బ లగిలి నేల గూలిరి. కొడుకు లిద్దఱిలో నొకనికి కాళ్లు విరిగినవి. రెండవవాని భుజముపై కత్తిపోటుతగిలి పడిపోయెను. ఈ గడబిడ యంతయు విని తక్కినపాకలలోనివారు పరుగెత్తుకొనివచ్చిరి. దొంగలు పారిపోయిరి. లోని పురుషులందఱు పడిపోయియుండిరి. సాంబశివరావుగారి తలనుండి రక్తము ప్రవాహము గట్టుచుండెను. ఆయనకు స్పృహలేదు. వారి గాయములకు కట్లు గట్టిరి. కొంతసేపటికి స్పృహ వచ్చినది. నలువైపుల చూచిరి. శాంత యేదని యడిగిరి. ఈయడావడిలో నెవరికీ శాంతమాటే జ్ఞాపకము రాలేదు. అందఱు శాంత యున్నగదిలోనికి పరుగిడిరి. శాంత కనబడలేదు. సాంబశివరావుగారూ, కొడుకులూ కదలలేరు. తక్కిన వారు నలువైపులా పరుగెత్తిరి. చాలదూరము వెళ్లి వెదకిరి. ఎక్కడా కనబడలేదు. ఆదొంగ లాయడవులలోని కెక్కడకుపోయిరో! పాపము, వీరాచీకటిలో నింకా యెక్కడకు పోయెదరు పెద్దవులులైనా, చిరతపులులైనావస్తే? తిరిగి వచ్చివేసిరి. శాంత కనబడలేదని చెప్పిరి. ఇంటిలోనివా రందఱూ మొదలు నరకిన యరటిచెట్లువలె నేల గూలిరి.

౪

తెలతెల్లవార వచ్చుచున్నది. రమారమి నాలుగు గంట లవుతుంది. ఎవరో యొక యౌవనపురుషుడు గుట్టమీదనెక్కి వచ్చుచుండెను. ఆ ప్రదేశమునందు మూడుకొండలు ముక్కోణాకారములో నున్నవి. పెద్దపెద్ద చెట్లతోడనూ, పొదలతోడనూ నరణ్యము దట్టముగా నున్నది. అందుండి యొకబాలికయొక్క యార్తనాదమును, నిరువురు మువ్వురు పురుషుల యొక్క గద్దింపు స్వరములును నా యువకునకు వినవచ్చెను. ఆతనిహృదయము కరగిపోయెను. జేబులోనున్న రివాల్వరు తీసి సిద్ధముగాపట్టుకొని గుట్టమును వేగముగా నా వంకకు పరుగెత్తించెను. పోతపోసిన బంగారుబొమ్మవలె నున్న యౌవనవతియగు నొకబాలిక మధ్య గూర్చుండి యుండెను. ఆమెచుట్టును భయంకరాకారులగు ముగ్గురు మోటుమనుష్యులు కూర్చుండి యామె నేదో గద్దింపుచుండిరి అందొక డాయాశ్రమమందలి డేరాలో శాంత తరుచు చూడవచ్చిన చెంచువాడే. దూరమునుండి యాదృశ్యమును జూచిన యాపురుషుడు శరవేగముతో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నొక్కదాటున వచ్చి యక్కడపడెను. ఈమువ్వు రాతని నెదుర్కొనబోయిరి. అందర్వు రాతని రివాల్వరు వాతఁబడి యచటనే మృతినొందిరి. తక్కినవాఁడు పారిపోయెను. ఆపురుషుఁ డా బాలికసమీపమునకు వెళ్లి 'శాంతా నీవేనా?' అనెను. శాంత భయముచే



"జేబులోనున్న రివాల్వరుతీసి... నావంకకు పరుగెత్తించెను."

పరవశయయి యుండెను. వెంటనే యామె తన బాహువల్లరుల నాతనికంఠమునకు పెనవేసెను. కృష్ణారావుగారు నిస్తబ్ధులయిపోయిరి. కొంతసేపటివరకు నొకరితోనొకరు మాట్లాడలేదు. శాంతకు తెలివివచ్చినది. ఆమె కృష్ణారావుగారిముఖమువంకచూచి సిగ్గుపడి దూరమునకు తొలగి కూర్చుండెను. "అయ్యా! మీరేనా? మీఋణము నేనెన్నటికినీ తీర్చుకొనజాలను. మీరు నాకు చక్కనివిద్యాదాన మొసంగినారు. అసామాన్య శిష్యవాత్సల్యమునుజూపి ప్రేమించినారు. కేవలము పాఠశాలయందొసగు విద్యమాత్రమేకాక విశేషజ్ఞానమును గలిగించినారు. ఇప్పుడు నాకు మానప్రాణము లొసగి రక్షించినారు. ఈసమయములో నిట్టిప్రదేశమున కెట్లు వచ్చి వ్రాలగలిగితిరి?"

కృష్ణారావుగారు—ఆసంగతి తరువాత చెప్పెదను గాని ముందు నీసంగతి చెప్పు.

శాంత—నేను మార్గములో చెప్పెదను. దొంగవానిని జూచుటతోడనే యొక కేకవేసితిని. తరువాత నేమి జరిగినదో నాకు తెలియదు. ఇంటివద్ద మావా క్షేమయిరో? మనమిప్పుడు త్వరగా నిల్లు చేరవలయును.

కృష్ణారావుగారు శాంతను గుఱ్ఱముమీద ముందు గూర్చుండబెట్టుకొని యింటికి వచ్చుచుండిరి. అప్పుడు శాంత యీ క్రిందివిధముగా చెప్పదొడగెను.

"ఈమధ్య కోయవాళ్లు, చెంచులాళ్లు వచ్చి శాంత్యాశ్రమమునకు సమీపమున డేరాలు వేసికొనియుండిరి. వాళ్లడవులనుండి తెచ్చిన వస్తువులను ఊళ్లో అమ్ముకొంటూఉండేవాళ్లు. అటువంటివాళ్లను చూచుటకు నాకు చాలా సరదా. వారి సామాన్యమయిన నిరాడంబరజీవిత మెంత తమాషాగా ఉంటుంది! నిర్భయముగా వాళ్లదగ్గరకు వెళ్లి చూస్తూఉండేదాన్ని. ఈమధ్యే నాలుగుదినముల క్రిందట వాళ్లక్కడనుండి వెళ్లిపోయిరి. నిన్నరాత్రి కొందరు దొంగలువచ్చి మా యిల్లు చుట్టవేసిరి. ఎంతమందో నాకుతెలియదు. ఒకడుమాత్రము నావద్దరవంగుని మెళ్లోహారము దీయుచున్నట్లు కనబడినది. ఒక కేక వేశాను. తరువాత నేమిజరిగినదో తెలియదు. నాకు తెలివివచ్చికండ్లువిప్పి చూచుసరికి మీరువచ్చిన ప్రదేశముదగ్గిర నుంటిని. మీచే జంపబడిన యిరువురిలోనొకడు నేను తరుచు డేరాలోచూచుచుండేవాడే."

శాంత యీలాచెప్పుచుండఁగనే యింటికి వచ్చిరి. వా



రిద్దరు లోపలకు వెళ్లగానే శాంతతల్లి వేగముగా పరుగెత్తుకొనివచ్చి తనముద్దుబిడ్డను గట్టిగాకౌగలించుకొనెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇంటిలోనివా రందఱు నొక్కసారి విలపించిరి. కృష్ణారావుగారిని చూచి వారంద రాశ్చర్యపడిరి. తా మంద రేమియు జేయలేక యసమర్థులై తమబిడ్డను గోల్పోవసియున్న సమయమున నామెను మరలప్రసాదించిన యాతనియెడల నందఱు తమకృతజ్ఞతను వేరు వేర గన్పరచిరి.

సాంబ—కృష్ణారావుగారూ, మీరు మా పాలిటిదైవము వలె వచ్చియుండవలయును. కాని మీ రీమె నెట్లు కనుగొంటిరి? ఎక్కడ కనుగొంటిరి? ఏవిధముగా తీసికొనిరాఁగలిగిరి? మీ రొక్కరు; దొంగలు చాలా మంది యున్నారే, వారినందఱ నెట్లు జయింప గలిగితిరి? మిమ్ముగూర్చి మాయమ్మాయి యెప్పుడూ చెప్పుచుండేది. మీ కామెయందు శిష్యవాత్సల్య మనికూడా చెపుతూ ఉంటుంది. మీవాత్సల్య మిపుడుపూర్ణముగా ప్రకటిత మయినది.

కృష్ణా— మాది పెద్దాపురము కాపురస్థలము ప్రొద్దుటి పూట సూర్యోదయకాలమునం దీతోటపల్లికొండలు, ఈచుట్టుపట్ల అడవి దృశ్యము చూచుటకు మనోహరముగా నుండుననియును, గుఱ్ఱపుస్వారి యభ్యాసము చేసికొనుటకును బయలుదేరి యీమార్గమున వచ్చుచుంటిని. వచ్చేది యరణ్యప్రదేశ మగుటచేత నెందుకయినను మంచిదని రివాల్వరుకూడ తీసికొని బయలుదేరితిని. కొంతదూరము వచ్చుసరి కెవరిదో స్త్రీయార్తనాదము వినఁబడినది...... ఈమొదలు గాగల తక్కిన సంగతంతయు జెప్పిరి. మఱునాడీసంగతి పోలీసువారికి తెలిసి యాదొంగలలో కొందరిని పట్టుకొనిరి. ఇకముందు పట్టిజాలు లా గ్రామసమీపమునకు రాకుండునట్లు తగిన కట్టుదిట్టములు చేయుదుమని చెప్పిరి.

సాంబశివరావుగారు కృష్ణారావుగారిని గురించి యిదివరకు వినుటయేకాని ఎప్పుడూ అంత పరిచయము లేదు. ఇదివరకే ఆయనపైన చాల్గా గౌరవము. ఇప్పుడది ప్రేమక్రిందకూడా మారిపోయినది. ఆయన పుత్రులు మరీ ప్రేమ చూపించిరి. కృష్ణారావుగారూ, వారూ యించుమించుగా నొక యీడువారే యగుటచే నాయన స్నేహమన్నవారికిని, వారిస్నేహ మన్న నాయనకును చాలాయిష్టముగా నుండెను. వా రందఱు కృష్ణారావుగారిని తామిక నుండు నెలదినములూ తమతో నుండమనియు నాచుట్టుపట్ల ప్రకృతిసౌందర్యము చాల మనోహరముగా నుండుననియు ప్రతిదినము తా మందఱు వెళ్లి చూచి యానందింపుచుండవచ్చుననియు బలవంతపెట్టిరి. ఆయన చాలా కులాసా పురుషుడు. సృష్టిసౌందర్యము నెక్కువగా ప్రేమించువాడు. వీరికుటుంబముతో స్నేహము చేయుటన్న చాలాయిష్టము. కానవారి కోరికప్రకారము౦డిపోవుట కిష్టపడెను. ఒకవారముదినములు గడచినవి.

౫

మామూలుప్రకారము రాత్రి శాంత భారతము చదువుచుండెను. ఆమె మృదుమధుర స్వరముతో నతి శ్రావ్యముగా పద్యములను జదువుచున్నప్పుడు కృష్ణారావుగా రాశ్చర్యమును బొంది "మన తెలుగు భాషలో నింతమాధుర్య మున్నదనియు, మనపురాణము లింత రసవంతమగు శ్రావ్యగానములతో నొప్పుచున్నవనియు నే నిదివర కెన్న డెరుగను. ఆ విషయ మీ దినమే తెలిసికొంటిని మీయమ్మాయి యింగ్లీషు, సైన్సు మొదలగు వానిలో నెంతప్రవీణయో నే నెరుగుదును. కాని తెనుగులోకూడా నింతపాండిత్య మున్నదని తెలియదు" అనిరి

సాంబ—అవును పాఠశాలలో నామె తెలుఁగుతీసికొన లేదు. అందుచేత స్వభాష బొత్తిగా మరచిపోవునేమో యని సెలవులలో తెలుగుకూడా చదివించుచుందును.

కృష్ణా!—సంగీతము కూడా నేమయినా చెప్పించుచున్నారా?

సాంబ—ఆ; వీణమీద పాడగలదు.

రాత్రిఅంతా పరుండిరి. శాంతకు నిద్రపట్టలేదు. ఇదివరదాకా దృష్టంతయు చదువుమీదనే యుండుటచేతనూ, చిన్నదానగుటచేతనూ నామెహృదయములో మఱియొకవిషయము తలంపులకు తావులేదు. "ఎంతసేపూ పరునా కేమిప్రయోగములు చేయవలసి యున్నవి. సయన్సుమేష్టరుగారిని మెప్పించు టెట్లు? ఇంగ్లీషులో కమి వ్రాయవలసియున్నది' ఇవేఆలోచనలు. ఇప్పుడామెను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడుచెనిమిదవయేడు. పరిపూర్ణ యౌవనము వచ్చినది. ఊహలు మారినవి. ఆయాశాలతికల పూతకొయ్యగా కృష్ణారావుగారు దొరకినారు. ఇక నవిప్రాకటు కేమి కొదువ?

"ఏమిటిది! నామనస్సులో నెన్నడులేని వికార మొకటి జనించి నన్నీలాబాధించుచున్నది! కృష్ణారావు గారి ధోరణంతేరయు నాకనుకూలము గాకూడా కనబడు చున్నది. ఆయనపాఠశాలలో కాలుపెట్టినదిమొదలు నామీద నపరిమితమగు దయను కనబఱచుచున్నారు. సహాధ్యాయుల కెవరికి జెప్పని, యెవరుగ్రహింపలేని యనేక విషయములను నాకు ప్రత్యేకముగా నేర్పిరి. సామాన్యజ్ఞానమను పేరుపెట్టి సహాధ్యాయులలో పాటు నన్నునేకసినీమాలకు, క్రొత్తగా వచ్చిన నాటకములకు తీసికొనివెళ్లుచూ వచ్చిరి. ఎప్పుడూ నేదోయొక యింగ్లీషుపుస్తకము చదువుకుని యిచ్చుచుండురు. ఆయన కెందుకు నామీ దింతప్రేమ? ఇదంతయు కేవలము శిష్యవాత్సల్యమా లేక వారియొక యర్థమేమయిన నున్నదా? ఎందుచేతనోకాని ఆయనను జూచినప్పుడెల్ల నాకొక విధమగు సిగ్గుతోగూడిన యానందము కలుగు చుండెను. తక్కినవారిని చూచినప్పుడు గురుభావము తప్పవేరేదియునుండదు. వారితో స్వేచ్ఛగా మట్లాడినట్లు ఈయనతో మాట్లాడలేను. నాతోడి విద్యార్థులంతా యేదో అనుకొంటూయుండేవారు. అప్పుడు నాకేమీ అర్థముకాలేదు. ఓర్వలేక అలా అనుకుంటారనుకొనే దాన్ని. నేను భారతము చదువుచున్నప్పుడు నన్నుగు ఱించి నాన్నగారిని ఎన్నో ప్రశ్నలు వేసినారు. ఇదంతా యెందుకో నాకు తెలియదు. ఆయనకు పెండ్లయిందా? ఇటువంటిభర్తను బడయుట కామె యెంతయదృష్టవంతు రాలైయుండవలయునో కదా! ఆరూపము, ఆతెలివి, ఆసరదాలు, ఆచురుకు- సామాన్యబాలికను పెండ్లిచేసి కొంటారా? పెండ్లికాకపోతే బాగుండును. కాకపోతే నాకేమిలాభము? నన్నుచేసికొంటారా? ఛీ; ఈనిర్భాగ్యురాలికా అంతభాగ్యము? వితంతువును. ఆమాట నికి నీజన్మలో తలంపగూడదు. ఆయనను జేపట్టుటకు మరియొక జన్మమెత్తవలయును." అని యనేకవిధముల తల పోయుచుండెను.

సాంబశివరావుగారికిని, కుమార్తెకును దెబ్బలు చాలవరకు నెమ్మదించినవి. కాని యింకా ఆస్థైర్యగ ము నడచుట మంచిదికాదని వ్యాయామమునకు వెళ్లుట లేదు. ఆయనకృష్ణారావుగారినిజూచి "అయ్యా, మేమా చుట్టుప్రక్కలచాలా భాగము చూస్తిమి. మారింకా నేమి యుచూడలేదు. మాతో పాటు మీరుకూడా నీలాయె ల్లప్పుడు నింటిలోనే యుండుట బాగులేదు. మీరూ, శాంతా సాయంకాలములందు తిరిగివచ్చుచుండుడు" అని చెప్పిరి. సాంబశివరావుగారు చాలా విశాలహృదయులు. ఆయన హృదయములో లేనిపోని యనుమానములకు కొంచెమైనను తావులేదు. కాని సంఘమునకు, నపకీర్తికి చాలాభయపడుచుండురు. ఇది నిర్జన ప్రదేశము; అను కొనేవారెవరూ లేరు. శాంతయొక్కయు, కృష్ణారావుగారి యొక్కయు మనోగాంభీర్య మీయనకు తెలుసు. వారి కుండు నన్యోన్యప్రేమతత్త్వమునుగూడ వారు గ్రహించిరి. వారిరువురుగూడ తమకీర్తికి భంగమురానీయరని యెరుగుదురు. వారికి హాయిగా స్నేహితులవలె తిరిగి వచ్చుటకు స్వేచ్ఛనొసగిరి. కృష్ణారావుగారు శాంతకు సృష్టి వైచిత్ర్యములనుగూర్చి వర్ణించిచెప్పుచు మధ్యమధ్య శాంత మెరుములు, ఉరుములు, పిడుగులు, ప్రతిధ్వని మొదలగువానినిగూర్చి వేయుప్రశ్నలకెంతో యుత్సాహముతో జవాబుల నొసగుచు స్వేచ్ఛగా తిరుగుచుండిరి.

## ౬

కృష్ణారావుగారికి శాంతయందు ప్రేమ నానాటికి వృద్ధినొందుచుండెను. ఆమెకుకూడ తమయందంత ప్రేమయున్నట్లు గ్రహించిరి తమహృదయ మామె కెరిగింపనిశ్చయించుకొనిరి. ఆనాటిసాయంకాలము వారెప్పటియట్ల విహారార్థము వెళ్లిరి. ఒకచోట విశ్రమించి ప్రకృతిని పరిశీలింపుచుండిరి.

కృష్ణా—శాంతా, నీతో కొన్ని విషయములను చెప్పవలయునని యున్నది. నీవు మరియొకవిధముగా భావింపక తగినసమాధాన మొసగవలయును. ఏరోజున పాఠశాలలో మొదటిసారి నిన్ను చూచితినో ఆనాడే యెందు చేతనో నీవు నన్నాకర్షించితివి. నీవు తరగతిలోనుండేవిధమూ, నీతెలివీ, బుద్ధీ, చాకచక్యమూ మొదలగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీయోగ్యతలన్నియూ క్రమముగా నాహృదయమును నీవంకకు లాగుకొన్నవి. మొదట చాలా భయపడితిని. నేను చాలాధర్మప్రవర్తనగలవాఁడను. నామనస్సెన్నడూ నన్యస్త్రీలపైకి పోదు. నేను చెన్నపట్టణములో రాజధాని కళాశాలలో చదువుకొనే కాల



"ఒకచోట విశ్రమించి ప్రకృతిని పరిశీలింపుచుండిరి."

మున చాలమంది బాలికలక్కడకు కొన్ని విషయములను నేర్చుకొనుటకు వచ్చుచుండేవారు. వారి నెవరినీ నేను కన్నెత్తియయినను చూచేవాడిని కాను; నీవు వివాహితవేమోయనియు,పరస్త్రీని ప్రేమించుచుంటి నేమోయనియు భయపడితిని. కాని నీవు బాలవితంతువని తెలిసికొంటిని. నాహృదయములో సందేహమునకు చోటు లేదు. నిన్నుతప్ప నింకొకరిని వివాహము చేసికొనకూడదని నిశ్చయించుకొంటిని. నీవే నా సహధర్మచారిణివి.

శాంత—కొంతసేపటివరకూ మాట్లాడలేదు. మీకింతవరకూ వివాహము కాలేదా?

కృష్ణ—లేదు. శాంతా, కాలేదు. నీవంటి యుత్తమ కాంత, అపరసరస్వతి నాకు భార్యకానుండ నాకిదివరకు పెండ్లేలాదు కవుతుంది?

శాంత—మీరు నాకు గురువులు, నేను శిష్యురాలను; నన్ను మీరు కోరవచ్చునా?

కృష్ణ—భార్యకుమాత్రము భర్త విద్య గరపకూడదా? నేను నీ కాభావముతోడనే నేర్పితిని. నీతో నప్పుడే చెప్పవలయు ననుకొంటిని. కాని నీహృదయ మెట్లున్నదో తెలియకపోవుటచేతనూ, నీచదువునకు భంగము వచ్చునేమో యనియూ నింతవరకూ చెప్పకయూరకొంటిని. ఇప్పుడు నీవిద్య పూర్తియయినది. హృదయము తెలిసికొంటిని. కాబట్టి ధైర్యముతో చెప్పగలుగుచున్నాను.

శాంత—మీకు నామీద నెట్టిప్రేమ యున్నదో అంతకు పదిరెట్లెక్కువ ప్రేమ, గౌరవము, భక్తి నాకు మీ మీద నున్నది. కాని యీ జన్మములో మన మిద్దరమూ భార్యాభర్త లగుటకు వీలు లేదు. మనము మరియొకవిధముగా ప్రేమించుకొనవలసినదే కాని యీవిధముగా ప్రేమించుకొనుట అధర్మము.

కృష్ణ—అదేమి శాంతా, అంత నిరాశ?

శాంత—నిరాశగాక ఆశ కవకాశ మెక్కడ? నేను వితంతువునుగాని కన్యనుగానన్నమాట మీ రెరుగుదురు కదా! అట్టి యీనిర్భాగ్యురాలిని మీరెట్లు కోరిరో అదే నా కాశ్చర్యముగా నున్నది.

కృష్ణ—శాంతా, నీవు వితంతువువా? నీకెన్నో యేట పెండ్లయింది?

శాంత—ఆరోయేట.

కృష్ణ—ఆపెండ్లికొడు కెప్పుడు చనిపోయినాడు?

శాంత—పెండ్లి నాలవనాడు.

కృష్ణ—నిన్ను వితంతువువని యెవ రన్నారు?

శాంత—అంతాను.

కృష్ణ—అంతా అంటే అన్నారుగాని నాదృష్టిలో నీవు వితంతువువలెను, నిర్భాగ్యురాలివలెను గన్పట్టుట లేదు. అపరదేవతవువలె కనబడుచున్నావు. నిన్ను ప్రేమించినది నేను.

శాంత—ప్రేమించి యేమిలాభము?మా నాన్నగారు నాకు మరల వివాహము చేయరు. నా అంతట నేను వచ్చి స్వతంత్రముగా చేసికొనుటకు నా కిష్టము లేదు. అట్లు చేసికొనినయెడల గౌరవ ముండదు. తలిదండ్రులవద్ద నుండి లేచివచ్చి చేసికొనినదంటారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణా—మీనాన్నగా రెందుకు చేయరు? నీవు నిజముగా వితంతువువనేనా ఆయన యభిప్రాయము?

శాంత—అయినా, కాకపోయినా యిదివరకు నాకు పెండ్లయింది అది అందఱకు దెలియును. ఆయన కింకా పెండ్లికావలసిన పిల్లలున్నారు. ఇప్పుడు నాకు మరల పెండ్లి చేసినయెడల సంఘములోనుండి ఆయనను వెలివేయుదురనియు, తక్కినబిడ్డలకు పెండ్లి కాదనియు భయము.

కృష్ణా—శాంతా, నీవెప్పుడుచూచినా నవలలు, నాటకములు చదువుచుందువు. తరుచు నాటకములు, సినిమాలు చూచుచుందువు. అవేవియు నిన్ను కలత నొందింపవా? మరొకవిధముగా రహస్యవృత్తులలో మెలగుటకన్న బహిరంగముగా పెండ్లిచేసికొని స్వేచ్ఛగా నుండుట మంచిదికాదా?

శాంత—అట్లు చేయుదానవైతే వివాహము చేసికొనుట కెందుకుఒప్పుకోను? దానిలో సౌఖ్యమేమున్నది? నా మనస్సెప్పుడూ స్వేచ్ఛనే కోరును. నాటకములు, సినీమాలు మొదలగువానిని నేనీయుద్దేశముతో చూచుచుండుట లేదు. అవికూడా జ్ఞానాభివృద్ధి కొకవిధమగు మార్గము లేయనియు, నందలి నటకులు చూపు భావప్రదర్శనకళానిపుణతను జూచి యానందించుటకు మాత్రమే వెళ్లుచుందును. నవలలు, నాటకములలోని భాషాపాండిత్యము, ఆయా కవులయొక్క కవితాచాతుర్యము, భావప్రకటన, కథయొక్క యెత్తుగడ (Plot) మొదలగువానిని గ్రహించుటకు మాత్రమే చదువుచుందును.

కృష్ణా—శాంతా, ఎంతెంతటి మహానుభావులగు మునులు సయితము ఒక్కొక్కప్పుడు స్త్రీలను జూచి మోహపరవశులై తమ తపస్సులను భగ్నము చేసికొన్నట్లు వినుచుందుముకదా! అబలవు; సమస్తకళానిపుణవు; సకలరసగ్రహణ పారీణవగు రసికురాలవు; నీకట్టి వ్యామోహము జనింపదా?

శాంత—నేనూ మానవమాత్రురాలనే. ప్రకృతి స్వభావమందఱను కలతబెట్టునట్లే నన్నూ అప్పుడప్పుడు వేధించుచునే యుండును. ఒక్కొక్కప్పుడట్టి మనోవైకల్యమునకునూ నాకునూ, ఘోరమగుపోరాటము జరుగుచుండును. అట్టియింద్రియవికారములను నిగ్రహించుటలోనే మానవుని ప్రజ్ఞ యున్నది. తక్కిన పశుపక్ష్యాదులవలె యిచ్చవచ్చినట్లింద్రియవికారములకు లోనైతే యికనక్కడ మానవునియాధిక్యమేమున్నది?

కృష్ణా—శాంతా, అదంతా సరే; మరొకవిధముగా నన్యాయముగా ప్రవర్తించకుండా యింద్రియనిగ్రహముకలిగిసత్ప్రవర్తన కలిగియుండుట మంచిదే కాని, నేను నిన్ను వివాహము చేసికొనెదనని యనుచుండ నీ కింత వైరాగ్యమేల? నేను నీకు తగనా?

శాంత—ఎంతమాట! నన్ను ప్రేమించువారెవరైన నీలోకమున నుందురా? అందఱు వితంతువునని యసహ్యించుకొనువారేనా! అని నేను పరితపించుచుండ మీవంటి విద్యాధికులు, రూపవంతులు, ఉదార స్వభావులు, విశాలహృదయులునగువారి ప్రేమకు పాత్రురాల నైనాను. ధన్యురాల నైతిని. ఈ లోకములో నొక్కరైనా నన్ను ప్రేమించువారున్నారే యను సంతోషము నా హృదయమునుండి యెన్నడూ తొలగిపోదు. మీకు భార్యగా నుండు స్త్రీ యెంత యదృష్టవంతురాలో, యెట్టి పూజలను జేసి యిట్టి పురుషరత్నమును బడయవలయునోయని యనుకొనుచున్న నేనే యంతటి యదృష్టవంతురాల నైతినని సంతోషించుచుండ నట్లనుట ధర్మమా?

కృష్ణా—అయితే యిక నీకభ్యంతరమేమి? మీతండ్రి నెట్లో యొప్పించి మన మిర్వురము వివాహము చేసికొని యీ యన్యాయపుసంఘమునుండి యెందుకు విడిపోకూడదు?

శాంత—అందుల కొకకారణ మిదివరకే చెప్పియుంటిని. సరే, మన మిర్వురము వివాహమై భూలోకస్వర్గ మనుభవింప గలము. అందుకు సందేహము లేదు. కాని నావలె యెంతమంది యనాథబాలికలీ ప్రాపంచిక సౌఖ్యములకు దూరులై పరితపించుచున్నారో! నాకేమి, నాతండ్రి నన్నంతహైన్యముగా నుంచక, స్వేచ్ఛనొసగి, యున్నతవిద్య నిచ్చి, చక్కని జ్ఞానవంతురాలినిగా జేసిరి. సంఘములో నెంతమాత్రము గౌరవములేక, విద్యలేక, ప్రాపంచికజ్ఞానము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేక, యింద్రియవైకల్యములకు లోనై వానిని గ్రహించు శక్తి లేక యధోగతిపాలై యెంతమంది విలపించుచున్నారో! వారిగతి యేమి? నా సోదరీ మణు లనేకులు ఇట్లు విలపించుచుండ నేనొక్కతెను వివాహము చేసికొని సుఖింపగలనా?

ఈ నవనాగరికులమని చెప్పుకొనెడు యావను లు, స్త్రీలయందు గౌరవము చూపెదమనెడు పురుషు లు, స్త్రీలకు సంఘమునందు జరుగు దురన్యాయములను గూర్చి యుపన్యసించు నుపన్యాసకులు, గ్రంథములను వ్రాయు కవులు ఒక్కరైన ధైర్య మవలంబించి యట్టిబాలికలు బాహాటముగా బరి ణయమగుట కొప్పుకొందురా? పాతికేళ్లు కాపురము చేసి, పదిమందిబిడ్డలతండ్రయినను భార్యపోతే మళ్లీ పెళ్లికొడుకే. ఎవరుపడితే వారే సిద్ధము పిల్లనిచ్చుటకు. కాని ఆరేండ్లు, మూడేండ్లు, తుద కేడాదివయస్సులో పెండ్లినాలవనాడో, రెండవనాడో ఆపిల్లవాడుపోతే ఆపిల్ల యాజన్మము వెధవముండయి చావకుండా బ్రత క్కుండా బ్రతకాలి. ఇట్టి స్త్రీసంఘము నుద్ధరింప నేను సాధ్యమయినంతవరకు పాటుపడి నా జీవితమునంతను నందుకొఱకు ధారవోయుదును. నేనొక్కతెను సంఘము నుండి దూరురాలనైనచో సంఘమున కేమిలాభము? సం ఘములోనందఱు తమవితంతుబాలికలకు పునర్వివాహము లైనను చేయవలయు; లేనిచో నతి బాల్యవివాహములను చేయుటయైనను మానివేయవలయు. అంతవరకు నాకు మనశ్శాంతి యుండదు. నేను సుఖపడలేను.

కృష్ణా—శాంతా! నీవిశాల హృదయము, ఉన్నతోద్దే శములు, స్వార్థత్యాగము, స్వజాతియందు దిట్టియసామా న్యాభిమానము, దృఢసంకల్పము, ఇంద్రియ మనోనిగ్ర హములు నా కపరిమితానందమును గలిగించినవి. నీవిద్య సార్థకమయినది. అబలవు నీవే యింత దృఢసంకల్పముగల దానవైయుండ పురుషుడ నగు నేనా యుండలేని వాడను. నాహృదయ మిదివరకే నీకర్పితమయినది. అది యిక మరియొక వంకకు మరలజాలదు. నేనుకూడా నీవ లెనే బ్రహ్మచర్య దీక్షవహించి స్త్రీలోకము నుద్ధరింప నేడే కంకణము గట్టుకొంటిని.

[చిత్రకారుఁడు: శ్రీయుత వరదా వెంకటరత్నముగారు, రాజమంద్రి.]




# వసంతకోకిలము

అనంతపంతుల రామలింగ స్వామిగారు


వ్యాసకర్త

ప్రేమ పరాత్పరుండగుటఁ,
ప్రేమనినాదము గానమాటఁ జే
తోముదమై, సదా శ్రవణ
తోషణమై, యమృతాభమై, మహో
ద్దామము నైన గానమును,
దావకకంఠము నుండి వించు ని
న్నే మఱియుండు టెట్లు సత
మేను నుతింపక కోకిలాగ్రణీ!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. గంటకు నూఱునిష్కములు గావలె నంచను గాయకుండు; నీ
వంటి రసప్రసారితరవంబును బూనఁడు—పాట నెంతయో
దంటవు, పత్రమాత్రన ముదంబును బొందుచుఁ బాడుచుందువో
గంటయెకాక యొక్క ఋతుకాల మదెంతయు నెంతమేటివో!

శా. ఆనందోద్భవ మౌను గానము, త్వదీయానూనగానంబు నీ
యానందంబును జాటుచుండఁగ విషాదావేగమం చెంతు ర
జ్ఞానుల్ గొందఱు, సత్యదూర మది యౌఁగాదే! చిదానందసం
స్థానంబా సురసాలసీమ, యట సంతాపంబు సంధిల్లునే?

ఉ. కూయుచు నేకతన్ జిగురుఁగొమ్మలఁ దేనియలాని వేడ్కమై
నాడుచుఁ బాడు చొక్కగతి నద్భుతరీతిని సంచరించి నీ
వేడకొ పోయి క్రమ్మఱెద నెప్పటి యట్లనె కోకిలాగ్రణీ,
పాడినపాటమైన భవపాశవిశేషనిరూపణం బిదో!

ఉ. ఆకులగౌరవంబఱియు, నందముఁ జందముఁ బాసి ప్రోడలై
యేకవిధాన భూజతతు లేమియుఁ బోలికలేక నిల్వ నీ
రాక తటాలునన్ గలుగు, రాగము నిండు నిలాతలంబునం
దాకులగౌరవోద్ధరణ మయ్యెడుఁ గాదె ద్విజావతంసమా!

మ. నిను వీక్షించుచు, నీసుధానినదమున్ నేనెంచుచున్, గాఢరా
గనిమగ్నాఖిలకాననంబుఁ గను చాకాంక్షింతు నేకాగ్రతన్
కనదాకాశము, నిద్ధశక్తిలసదోంకారప్రణాదంబుఁ, ద
జ్జనితస్థావరజంగమాత్మక జగజ్జాలంబు నోకోయిలా!

ఉ. ఎంతటి మూఢు లీమనుజు, లీవొక కాటుకవన్నె పుల్గువం
చెంతురు భౌమజీవతతి నీవొకఁ డందురు, కాని తావకీ
నాంతర దివ్యతేజము నహా! కనఁ జాలక దివ్యలోకసా
ధాంతనివాసులౌ విబుధు లందొకతావును నీకు నీరుగా!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



క్రొత్తపల్లి సూర్యరావుగారు

## మొదటి యంకురము

మాయమ్మ చెప్పుచుండెడిది: మొదటినుండియు మానాయన సత్యకాలపు వాఁడేనఁట. అప్పటికి నిప్పటికి నొక్కటే విధము. ఊరివా రేలాగునఁ బోయినను సరియే-తనపనియేమో, తనదారియేమో యంతియే కాని రెండవజోలికిఁ బోవువాఁడుగాఁడు. ఆనాఁటికి నీనాఁటికి నించుకంతయు భేదము లేదు. వేదము చదువుకొన్నవారిని లక్ష్యపెట్టువా రెవ్వరు? అదియునుగాక ఛాందసు లొక్కరియొద్దకి వెళ్లుట యనాచారముక్రిందఁ బరిగణింపఁ బడుచున్నది. ఇపుడదిలేదు. నేను వేదము చదువుకొన్నాఁడనని సదస్యములలోఁ దోరణములు త్రెంపుటకు దిగుచున్నారు. మహారాజు బాబుగారు—చచ్చి స్వర్గమేలుచున్నారుగాఁబోలును—'దేహి'యనకుండ నింత గంజి త్రాగుట కుపాధి కలిగించినారు. శిష్యులకుఁబనస చెప్పుకొనుచుఁ దాను బెల్లుఁబొడుచుట, శిష్యులు తిరుగవేయుట-ఇట్లే గడపినారు. గురుశుశ్రూషయని శిష్యులు తాను స్నానము చేసిన తడుపుఁబంచి యుదికెద మన్నను, దడి బట్టయాఱవేయుదుమన్నను, "వలదు; మీ కేల? ఎక్కుగుమ్మము దిగుగుమ్మముగఁ బొట్టపోసికొనుచుఁ గూటికి గుడ్డకు, నీకాలమునఁ బనికి రానివిద్యను విత్తనములముడికట్టవలె మోయుచుండవచ్చిన మీకు నాయొద్ద నీచసేనకూడఁ గావలయునా? ఇది రెండవశిక్ష; చాలు" నని మా యమ్మనే కాని తడిగుడ్డ రెండవ కుఱ్ఱవానిని ముట్టికొననిచ్చువాఁడుకాఁడు. ఇది యిటీవలఁ గొంతకొంత యెఱుఁగుదును. మా నాయనకు ఛాందసుఁ డన్నది వేదము చదువుకొనుటచే వచ్చినట్లే రాణించినది. ఆయన ఛాందసప్రక్రియ లనేకములు గలవు. అందులో నావివాహ మొక్కటి. తిండికిఁ దప్ప మఱియొక విశేషకార్యమునకుఁ జాలియుఁ జాలనిది ధవాణమువా రిప్పించినభూమి. ఆకాసతంలో నాపెండ్లికి యెట్లు సరిపడును? కన్యాశుల్క

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము లప్పటికిఁ జాలఁ దక్కువయే. మా నాయ
నాగారా—యాదారిఁ ద్రొక్కరు. వరశుల్క
ములు, లౌక్యవిద్యలు నేర్చుచున్న యువకుల
తలిదండ్రు లడుగుచుండువారు. ఇది యప్పటికి
మిగులఁ దక్కువ. దీనిం జెప్పవలసిన దేమి? నా
పెండ్లినాఁటికి నావయ స్సెనిమిదియేండ్లు. ఎంత
తక్కువయినాఁడునఁ బెండ్లి చేసిన నంతవ్యయము
తగ్గునని—యేబెల్లుపోఁడుచునపుడో, యేబుట్ట
యల్లునపుడో తోఁచినదో—అది పట్టుకొని
కన్యాత్వమున నే పెండ్లి చేయవలయునని సంక
ల్పించినారు. సత్యకాలపు వారికి సత్యకాలపు
వారే దొరకుదురు. శుల్కము లడుగువారి
కిచ్చునారు, నిచ్చువారికిఁ బుచ్చుకొనువారు;
నేజట్టున కాజట్టుసిద్ధము. భగవత్సంకల్పము.

చిన్నపుడు తెలివితేటలుగలిగి యొడలు
ముదిరినవెనుకఁ గొందఱు మందబుద్ధు లగు
దురు. చుఱుకుగానగపడుచున్నను మాంద్యము
నెంటనంటి యున్నట్లే కొందఱు కనఁబడు
దురు, చుఱుకుఁదనము చుఱుకుఁదన మట్లే
యున్నవారు కొందఱు. ఈ మూఁడువిధముల
వారిని దీసికొని ప్రస్తరింప మొదలిడినయెడల
ననేకవృత్తములవారు బయలుదేఱుదురు.

'*ఉబుసుపోకున్న నూరిలోని చుట్టఱికము
చేయు'మని సామ్యము. మాతండ్రిగారికి గట్టి
పట్టు—'ఊరిలోని సంబంధము సుతరామువల'
దని. మాయమ్మ 'వీథిదిరిగి వీథిలోనివాఁడు;
గ్రామములోనికథ'యని యెంత చెప్పినను'లచ్చు
పెండ్లినాఁటికిఁ జూచుకొందము లే'యనువాఁడు.
నాకప్పటి కూరిలో నుండిన నేమిలాభమో,
పొరుగూరిలోనుండిన నేమిలాభమో యూ
హించునంతటి శక్తి లేదు. కాని లచ్చుమాత్ర
మేల యూరిలో నాలోచింపవలయునని యుం
డెడిది. "మీ రెఱుఁగుదురు. మీయొద్దనే కదా
చిల్లరలు చెప్పుకొన్నాఁడు. ప్రక్కయూరిలోని
యవధాని నెఱుఁగరా?" యనిన గౌరిమాట
వచ్చినపుడు చూచికొందమనువాఁడు. అంతి
యకాని గౌరివివాహమునాఁటి కవధాని యె
ట్లుండునో యాలోచింపలేదు. ఎవ్వరి నడుగ
లేదు; మఱియెవ్వరితోను జెప్పలేదు. ఫాల్గు
నము, చైత్రము దాఁట నిచ్చినాఁడు. ఒక్క
నాఁడు కోటికి స్నానమునకు వెళ్లినాఁడు.
అపుడే సింహాచలయాత్ర చేసికొని వచ్చుచుఁ
గాలువలో నీరు లేక పడవసరిగా నడువనం
దునఁ బ్రొద్దెక్కినదని రేవులోదిగిన రేకపల్లి
వారి కుటుంబమును జూచినాఁడు. 'ఏమి శాస్త్రీ
గారు సింహాచలయాత్ర చేసికొని వచ్చినట్లు
మీయొద్ద నేమియు లక్షణములుకనఁబడవేమి'
యని మానాయన వారి యజమాను నడిగెను.
నవ్వుకొనుచు శాస్త్రిగారు "మీదయవలన
భద్రముగా వచ్చి చేరుచున్నా"మనిరి. "ఈ
పూఁట "కుండి" వెళ్లరాదా" యని మా నా
యన "'ఉండి' వెళ్లవలయుననియే తలఁచితిమి
గాని వాద్యము వరుసదప్పినది; లంఘనముల
బోటుపైఁగా నీరులేదు. సరియే, మీరందఱు
క్షేమమా? పంటలు ఫలసాయములునెట్లున్నవి?
మీజువ్వి కొయ్యచెలక యేమైన పండినదా?"
యని శాస్త్రిగారుపలికి మానాయనతోఁగూడ
స్నానమునకని నీటిలో దిగిరి. ఆయన, భార్య,

* ఉండి యని యొక్క గ్రామము గలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యేకపుత్త్రుఁడు, మువ్వురును స్నానముచేసిరి. మానాయన 'యీతఁడు మీపెద్దవాఁడేనా?" యని యడిగెను. "పెద్దవాఁడును,జిన్నవాఁడును వీఁడే. మాయూరఁ జదువులేదు. పదునైదేం డ్లున్నవి. ఏవో వ్రాఁత కోఁతలు తెలియును. తిండికి లోపము లేదు. తెలివిగలిగెనా నాదొక యణాతినుచుఁ దనకొక్క దమ్మిడి కష్టార్జితము చేర్పఁగలఁడు. అల్లరిచిల్లరివాఁడు కాఁడు. ఇప్ప టికి నామాట తల్లిమాట జవదాఁటఁడు" అని శాస్త్రిగారు ప్రసంగించిరి."ఏదీమామా 'హగ్ నస్య' చెప్పుచూత"మని మానాయన శాస్త్రి గారి కుమారు నడిగిరి. అప్పుడే తన సంధ్యా వందనము నాపట్టునకే వచ్చినదికావునఁ దడవి కొనకుండ శాస్త్రిగారి తనయుఁడు చెప్పెను. జల్లిసీమలోని బ్రాహ్మణకుఱ్ఱవాండ్రు సాధార ణముగ విఘ్నేశ్వరపూజ,పుణ్యాహవాచనము, మంత్ర పుష్పము-సంధ్యావందనము రానివారు లేరు. రండని మానాయన వారి నూరిలోనికిఁ దీసికొనివచ్చిరి. నడివీథిలోనికివచ్చి శాస్త్రిగారు ప్రక్కసందులోనికి మరలుచున్నారు. "అది యేమి?నాతోవచ్చి-మీబావమఱఁది, చెల్లెలు నెప్పుడు నున్నవారే- మాగృహపావన మిం కెప్పుడు?"అని మాతండ్రిగారు నిర్బంధించిరి. "మీదయయున్న-నింకొకసారి-మీయిల్లుమా యిల్లని నాకు భేదమున్నదా? మధ్యాహ్నము దర్శనము చేసెద"ననిశాస్త్రిగారు నవ్వుమొగ ముతోఁ జేతులు చాఁపుచు 'సెలవు సెల'వని చెల్లెలుగారి యింటికి వెళ్లిరి.

మానాయన యింటికివచ్చి బట్ట దండ ముపై నాఱవేసికొని, యాఱుచున్న మడిబట్ట కట్టుకొని, దేవతార్చనపెట్టె పీఁటగల తావు నకువచ్చి కూర్చుండి పెట్టిమూఁత విప్పినన్నుఁ బిలిచి "అమ్మా! రెండు నిత్యమల్లిపూవులు, తులసిదళములు నందుకొ"మ్మని రాగిపళ్లెరము తీసియిచ్చి మాయమ్మతో "సుబ్బలక్ష్మియన్న వచ్చినాఁడు సింహాచలమునుండి; పెండ్లమును గొడుకునుగూడ వచ్చి"రని చెప్పెను. ఆమా టలు వినుచు నేను నిలువఁబడియుంటిని. "నమ స్సోమాయచ రుద్రాయచ" అనిగట్టిగా నుచ్చ రించుచుండఁ బువ్వులు కోయలేదని జ్ఞప్తికి వచ్చిపరుగుపరుగుననాల్గుపువ్వులుదళములును జిదిమితెచ్చి యక్కడఁబెట్టి సుబ్బలక్ష్మిగారి దొడ్డిలోని కొబ్బరిచెట్టు మా పెరటిలోని కగ పడును గావున దానివంకఁ జూచుచుంటిని. "అమ్మా! ఉట్టిమీఁది నెయ్యి తీసియిమ్ము. జాగ్రత్త. జిడ్డు;జాఱెనా విడిచిపెట్టెదవు.వచ్చిన వారు మనయింటికి రాకుండ వెళ్లరు" అనుచు గవాక్షములోనుండి నన్నుఁజూచి మాయమ్మ పిలిచెను. "అమ్మా! నన్నెందుకే నీవాలాగున నన్నావు. నేనెపుడైన నెత్తివైచితినా?నాయన విని యేమనుకొనునో?" అని వంటయింటి గుమ్మములో నేతిగిన్నె యుంచి నెమ్మదిగా నంటిని. "అదియేమి తప్పా! నీవు పరధ్యాన ముగా నున్నట్లుతోఁచి యన్నదానను. పని వేళఁ బని;ఆటవేళ నాట. ఇంకఁబోయి మీ నాయన భోజనమగుదాఁక నాడుకొమ్ము" అని మాతల్లి పలికెను. నడవ తుడిచి చాఁప పఱచి గుమ్మములో నున్నదూడను బంచనుగట్టి నీళ్లు చూపి పచ్చగడ్డి పరకలువైచి, నేను నీళ్లుపోసి కొని, మడిపరికిణీగట్టుకొని, బొట్టు పెట్టుకొని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మానాయన ముగించి యిచ్చిన దేవతార్చన పెట్టెను బల్లమీఁదఁబెట్టి నడవలోఁ గూరుచుంటిని.

మాయమ్మ యట్టెగడుసుది కాకపోయినను బొత్తిగా వెఱ్ఱిదిమాత్రము కాదు. మేము ముగ్గురమాఁడుపిల్లల మింటనున్నాము గాని యొకరితో నొకరు కలహించినది లేదు. అది మాతల్లి నేర్పువలననే. పొరుగింటికిఁ బనిలేక పోయి యెఱుంగము. పని గలిగినపుడు మా ముగ్గురలో నెవ్వరనో " అమ్మా, సుబ్బిపిన్ని గారియింటికి వెళ్లి రేపు నాగులచవుతి శని వారము ఉపవాసము చేయుటయా యొంటి పూఁట దినుటయా యని యడిగిరమ్మా. మీ నాయన నడిగిన నొక్కప్పుడుసరిగాఁ జెప్పరు" అనియు, "దూడ పాలుసరిగాఁ ద్రాగుట లేదు. మొన్న మీదూడ కేదో మందువేసినారఁట యేమి"టని యిరుగింటి వెంకమ్మ వదినెనో, స్వామినాయఁడుభార్య మంగతాయారమ్మనో; —ఆమెమాయావుగాని, గేదెగాని, వట్టిపోయి నపుడు నేతిమజ్జిగలు పోయుచుండును—గావున అడిగిరమ్మని పంపును. ఇదియే మాకుఁ బొరుగింటికి వెళ్లుటలో నానందము. అనుమనిచెప్పిన మాటలే యక్కడనని, వారిచ్చినబదులుమాటలనుదెచ్చి చెప్పువారము. ఇదియే తప్ప మేమెన్నఁడు ఇరుగుపొరుగులవా రింటఁ జెట్టెఁ డుప్పుపుంజెఁడు మిరెపకాయలు నప్పుసప్పులుతెచ్చుటకు వెళ్లువాడుకలేదు. ఒకరి యింటికి మేము పోవుటలేదని మాయింటి కిరుగుపొరుగుల వారి బిడ్డలు రామానువారు గారు. వచ్చినవారి నెల్లఁ గూర్చుండఁబెట్టి మా జనని "సుబ్బీ, చెప్పవకో; రామలక్ష్మి, రా! మొన్నటి లక్ష్మీదేవి మీఁది మంగళహారతి వప్పగించుము. కనకమ్మ, లక్ష్మణమూర్ఛ రెండవనూఁఱు మొదలుపెట్టవే" యని గంతులు వేయకుండ, నల్లరిచేయకుండ మరలించు స్వభావము గలది యగుటచే మాలో నెవ్వరు నిర్వ్యాపారముగ నున్నది లేదు. మానాయన యొకరియింటికి వెళ్లరు. అట్లని యొకరు మాయింటికి రారనుకొన్నారా? ఏమంత్రపునీళ్లకో, యింద్రాక్షివిభూతికో, మానాయనవలెఁ జదువుకొన్నవారు నలువురైదుగు రున్నను, వచ్చుచుండువారు. ఎంత చదువుకొన్నను మాతండ్రిగారి కవధానియని, దీక్షితులని, శాస్త్రియని పేరులేదు. అచ్యుత రామయ్యగారనియే వాడుక. మాతల్లిఁని మాత్రము సోదెమ్మయనువారు; కొందఱు యశోదమ్మయనువారు. కాని, మా మాతామహులు పెట్టినపేరు సోమిదేవియఁట. వారియింట మాత్రము తాళ్లపూఁడివారి చుట్టఱికము కలియుటచే నవధానులు, సోమిదేవులు, నిట్టిపేరులు బలిసినవి. ఈసంగతి కొంచెము బల్లిపాడు ప్రసంగములో వచ్చును. మాతండ్రికే యిట్టి పేరు లిష్టములేదు. శాస్త్రి యనునది కాళిదాస త్రయము, పంచకావ్యములు నని యేవో నాలుగు సర్గలు, పదిశ్లోకములు చదివినంతనె వచ్చునా? పెట్టుపేరుల కేమి? ఆఱుశాస్త్రము లలో నేదే నొకటియైన రావలదా? అవధాని యనఁగానే సరియా? నాల్గువేదములు వచ్చి శాస్త్రముల పరిచయము కలిగినప్పుడు గాని వేదార్థము నేర్చికొనుటకు వలనుగాదు. వేదార్థము నేర్చి మాధవ విద్యారణ్యాము నిరం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తరము తిరుగ వేయుచుండువానికిఁగాని, నావం టివానికి, మీ మామయ్యవంటివానికి నవధాని పదమునచ్చుట కష్టమమ్మా యని చెప్పవారు. మా మామయ్యకు బాత్తిగా నీపేరు తగదు. దూరపు వీథిలోని రాజులపిల్లలు, కోమటి బిడ్డలుకూడఁ దమపెద్దలు కోపపడినపుడెల్ల రామసుబ్బమ్మతోఁ బాటలు నేర్చుకొండమని నాయొద్దికి వచ్చువారు. నేను మాయమ్మతోఁ జెప్పి నాకు వచ్చినపాటలు నేర్పి పంపుచుండు దానను.

మానాయన భోజనమయినది. ఆవిస్తరి లోనే యన్నము పెట్టుకొని నన్నుఁ బిలిచి మాయమ్మ "కంచముపెట్టుకో; నీకుఁగూడవడ్డిం చెద"నని పలుకఁగనే సిద్ధముగానే యున్నదా నను గనుక చెఱకాకుకంచము కొంచెము దూరముగా, నావిడచేతి గరిటెకందువాటుగాఁ బెట్టుకొంటిని. భోజనము చేయుచున్నాము. నాకు భోజనము చేయునపుడు ప్రసంగము వలదని యెన్నిసారులో చెప్పినది గాని యా నాఁడు మాత్ర ముండఁబట్టలేదు. ఇట్లంటిని:

"అమ్మా, సింహాచలము మనమెప్పుడయిన వెళ్లి నామా?"

"అది యెక్కడనో యున్నది. మన కీ యూరే సింహాచలము మా యమ్మ చెప్ప చుండునది. ఎవ్వరో గొడేవారఁట. కోటికిఁ బడగెత్తినారఁట. గరుడావారఁట. నక్షత్రశాల యఁట. కొండదిగి తూర్పుగా వచ్చిన, విశాఖ పట్టనములో నీచిత్రము లన్నియు—"

"కోటికిఁ బడగనఁగా నేమి యర్థమో?"

"కోటిరూపాయలు చేరఁగనే వారియింటి మీఁద నొక జెండా యెత్తుదురఁట. పడగ యనఁగా జెండా. అట్లే యెన్నికోట్లున్న నన్ని జెండా లెత్తుదురఁట"

"నక్షత్రశాల యనఁగా నేమిటో ?"

"మీమామయ్యలాగు నీకును బ్రతి ముక్క కునర్థము కావలయును. నేను నెఱుఁగక మా యవ్వ నడిగితిని."

"ఏమని చెప్పినది? నక్షత్రశాల—పేరు చిత్రముగా నున్నది."

"మనకు నక్షత్రములు రాత్రులు గాని పగలు కనఁబడవు.ఆనక్షత్రశాలలోనికిఁ బోయి యాకాశమువంకఁ జూచినఁ బగలే నక్షత్ర ములు కనఁబడునఁట."

"నక్షత్రములు పగలు కనఁబడునా? తెల్ల వాఱునప్పటికన్ని నక్షత్రములు నస్తమింపవా?"

"రాత్రి కనఁబడని నక్షత్రములు పగలు కనఁబడును. సూర్యప్రకాశముచేఁ బగలు మన కగపడవు గాని పగటిపూఁటఁ గూడ నక్షత్ర ము లాకాశమున నున్నవి. మధ్యాహ్న సమ యముల నొక్కప్పుడు చంద్రుఁడు కాంతివిహీ నుఁడై కనఁబడుటలేదా! చంద్రబింబము పెద్దని గావునఁ గొంచెము కనఁబడును. నక్షత్రములు సూక్ష్మములు కావున మన యీ కన్నులకు గానఁబడవు పగలు."

మానాయన యీమాప్రసంగము విను చున్నవాఁడే కావున "మీజ్యోతిశ్శాస్త్ర మంత యు భోజనము దగ్గఱనేనా? కానిండు. సింహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. మైసూరు రాజాగారి వేసవిభవనము



౨. నూతన రాజభవనము-మైసూరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చలము వెళ్లి వచ్చినవారి నడిగి తెలిసికొందము. వారు మనయింటికి వచ్చెదమన్నారు. వారు వచ్చునప్పటికైన మీభోజనములు తెమలునా! "శీఘ్రభోజీ చిరస్నాయీ" యన్నారు." అని కొంచెము గట్టిగాఁ బలికెను. మేము ముసి ముసి నవ్వులు నవ్వుకొనుచు భోజనములు చేసితిమి. కాని మాయమ్మ మాత్రము "చూచితివా, నీమూలమున నాకుఁ జీవాట్లు! అతిప్రసంగమువలననిష్టమిది" యని సంజ్ఞ చేసినది. నేను దలవాంచి యూరకుంటిని. లేచినారము. ఇల్లు సవరించికొన్నాము. "కుఱ్ఱవాండ్రిద్దఱు నింట లేకుండుటచే నిల్లు చిన్నఁబోయినదే" యని మానాయన పలికెను.

లచ్చుగారునను వా రిద్దఱు నేమైరని మీరడుగలేదు; నేను జెప్పలేదు.

"వచ్చెదరు లెండు; ఈపాటికి వారియింట భోజనము లగును. అట్లుబంతియే కాదు! రామసుబ్బికిఁగూడ వెళ్లవలయుననియే యున్నది గాని, మఱి నేను మడిగట్టుకొన్న, నదిగావలయు నిదిగావలయును; చేతికందివచ్చిన పిల్లను బంపిమెట్లు—మడిమైలలేదా—యనిమాతల్లి పలికెను.

"నేను వెళ్లెదనని చెప్పినానఁటే! నే ననని దే వట్టివి కల్పించుచున్నదానవు." అని నేనంటిని.

"అయినఁ దప్పేమి; వెళ్లవలయునని యుండదా?" అని మానాయన సరిదిచెప్పి వాండ్ర కోసముతీసిన మామిడిపండు వాండ్రు వచ్చినదాఁకఁ గోయకుము. ఇంతలోపల రాకున్న నిది శాస్త్రిగారి కుమారున కీయవలయు" నని యెను.

"నాపండు నేను గోయలేదు నాన్నా! దానిని వారి కీయవచ్చును. అని" నేను జెప్పితిని.

"వారనఁగా నెవ్వరు? నీపండు నీదే. వారు, వీరు! వారువచ్చిన నింకొకపండు తోఁకబుట్టలో నుండి తీసి యీవచ్చును" అని మానాయన.

"తట్టపండు నేను గోసికొందును" అని నేను.

"వెఱ్ఱిమొగమా, నీకిచ్చినపండు నీవు తినుము. అంతఁగా గావలసినఁ గావులోనుండి పరువుగా నున్న కాయతీసెదను" అని మానాయన.

"అవును, పరువుగల యిల్లాలు, కొడుకు వచ్చుచున్నారు. వారికిఁ బరువుదగిలిన పండే యీవలయు" నని మాయమ్మ నన్నుఁ జూచుచు నగియెను.

భోజనము సమయములో వారిరువురు నేమి ప్రసంగించుకొనిరో వీథివంకఁ జూచుచున్న నేను వినలేదు.

సంపూర్ణము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# తరువు – దహనము

వల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు గారు



వ్యాసకర్త

పశువులు కండూతి బాధపో మేను రా
సినఁ జర్మ మూడ నిస్సీయటనవు
ఆరణ్యకుండు కుఠారమ్ముతోఁ గొమ్మ
లురవడిఁ గొట్టిన నుస్సురనవు
మదకుంభి నిర్దయరదనతీవ్రాభిఘా
తమ్మున కేనియు దద్దఱిలవు
అకలంకశక్తి నిన్ బెకలించు ఝంఝూని
లమ్ముతాఁకునకైన సొమ్మసిలవు
తొఱ్ఱలోఁ బీఁటవేసి యీదుండగంపు, బాడుదహనంబు నిన్నెంత వాఁడఁ జేసె
వాడఁ జేసిన సరియపో మాడఁ జేసె, జెట్టురో, నీకు నెట్టియిక్కట్టు వచ్చె.

క. పాదంబులఁ బాతాళము, మేదిని గొమ్మలను గొనల మీఱి నభంబున్!
పాదుకొని త్రివిక్రమగతి-గాఁ దనరెద వంచునుంటి; గాలితె తరువా!

చ. ఫలములచేత సంతతముఁ బాంథుల నోరుల నూరఁ జేయుచున్
మల మల మాడ్చు వేసవిని మందసమీరము లొప్ప వీచుచున్!
నలుదెసలందు సూర్యకిరణమ్ములనేఁ జొరనీనిశాఖలన్
జెలువగు నీడురూప మదిఁ జిత్తరువట్టులు తోఁచు వృక్షమా!

గీ. మండువేసంగిలో నీవు మాఁడికూడ-నాశ్రయించిన పథికుల కేశ్రమంబు
లేక చేసెదు; నీమే లనోకహంబ! మఱతురే వారు వేయిజన్మములకైన?

క. ఎచ్చోటివారుమీరని-యెచ్చో మీ రుందురనుచు నెండకు నకటా!
ఇచ్చోటఁ జేరి పథికులు-ముచ్చటలాడుటలు పోయెబో! యికఁ దరువా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



గీ. ఎన్ని విహగంబులకొ వాస మిచ్చినాఁడ,
నితఁడు నొకకోటరంబున నెనఁ గుతమని
యాశ్రయించినమాత్రాననహితుఁడనక;
తాపకారికి నిడుదె యంతరముఁదరువ!

ఉ. దక్షుఁడఁగానుని౯ మనుషఁ
దక్షక ఘోరవిషానలంబుచే
వృక్షము భస్మమైనఁ దొలి
ప్రేమ్మిఁ బూర్వమె యింధనార్థ మా
వృక్షము నెక్కి-యున్న పృథి
వీసురనందను తోడ శక్తిమైఁ
గక్షఁ బునస్సృజించెనఁట
కాశ్యపుఁ డట్టిరు నేఁడు లేరుగా!

* * * * * * * * *

సీ. పోయె వాసమ్ము 'లబోదిబో'యన్నిమొత్తు కొనుద్విజావళులయాగోలఁజూడు
అన్న సత్రంబు మాకయ్యె నియ్యది ఫల మ్ములనను పథికుల మొఱల వినుము
పర్ణశాలగ మాకుఁ బనిచేసె నిదియంచు మనమునఁ దపియించుమునులఁగనుము
మాకుఁ దిక్కయ్యెఁ బో మఠమట్టులిదియంచు వడుగులు చేయునాగడము నరయు
ద్విజులకు గృహంబు లిడుటయో, తెరువరులకుఁ-నన్న సత్రంబు లుంచుటయో, మునులకు
నుటజములుగూర్చుటో, మఠంబు వటులకిడుటో, యేల కాల్చితి దహనంబ! యీకుజంబు?

మ. అనలంకారము నప్రతిష్ఠము నవర్ణ్యంబు౯ నిరాధారము౯
జనతాసేవ్యము నిష్ఫలంబు మఱి నిస్సారంబుఁ బత్రంబు లెం
చినచో నెందునభావమై ధరణి నిర్జీవాకృతి౯ బొల్చు న
వ్వనశుష్కావనిజాతజాతమును గాల్ప౯ రాదొ వైశ్వానరా!

గీ. వృక్షసాహాయ్యమున నె పోవృద్ధిఁ జెంది-వానినే కాల్చివైతు చండానలంబ!
ఇంటఁ దిని యింటివాసంబు లెన్ను వారి-కన్న వో, తమ్ముఁడవొ మఱియరయరాదు.

గీ. తరువులొక రెండు రాసికోఁ దరతరంబ-దానజన్మించి యారెంటిఁదగుల వైతు
నన్ని పాతపరీభాష చందమేని, యెఱుఁగవయొ! యాశ్రయాశున కేల యివ్వి?

క. నాశమొనరించి బహుశా-ఖాశోభిత మైనతరువుఁ గ్రక్కున నీవు౯
నాశముఁ గంటివి పిదప, హతాశా, నీకేమిలాభమయ్యె హుతాశా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



అడివి బాపిరాజుగారు

౧

అనగా అనగా ఆంధ్రదేశంలో పినాకినీ తీరాన్న సింహపురి పెరుమాళ్ల దేవాలయ మండపంలో ప్రతిసాయింత్రం చిరుమబ్బులన్నీ కరిగిపోయే దివ్య వీణాగానము వినిపించేది. దేశదేశాల్నుంచి ఆ అమృతస్వరాలు వినేటందుకువృద్ధులు, యువకులు, నవతుషారపరిమళ గాత్రలు, అంతావచ్చి పులకరాలలో తన్మయత్వం పొందేవారలు. మండపంలోను, మెట్లమీద రంగురంగుల వస్త్రాలతో వెన్నెట్లో విరిగిపడే సముద్రకెరటాల్లా చిత్రమైపోయేవారు. కొన్నినయనాలు నిమీలితములై పాడ్యమినాటి చంద్రవంకలా చెమరించేవి. విస్ఫారిత లోచనాలు కొన్ని చైతన్యం వదలి, బంగారుకిరణాలనీటిలో మరచి విహరించే చాపలరీతిగా తళుకులాడేవి.



వ్యాసకర్త, చిత్రకారుడు

ఆమండపంమీద సౌందర్యం ముద్దపోసిన ఓ యూవనుడు దంతం, మంచిగంధం తీగెలు సాగిన వీణ మేళవించి గౌరీశంకరశృంగంపై మంచుమరిగే విమలగాంధర్వం జగన్మోహనం చేసేవాడు. బంగారం ఒరిసేవాళ్లు; తెలుగుపల్లవుల వేంగీపురం ఏనుగులకుంభస్థలాల్లాంటి భుజాలు; పర్వతసానువువంటి వెడద రొమ్ము; నల్లటి ఉంగరాలజుట్టు; చిలుకముక్కు; విశాలమైనఫాలం. ఆపడుచుపాటకాడు వీణవయ్యారంగా వలెవాటువేసికొని చిక్కుడుకాయల్లాంటి వేళ్లతో తీగెలు సవరించి, మెట్లునొక్కుతూ వీణ పాడుతూంటే పేరుపొందిన గాయకులు, వైణికులు వినటానికి వచ్చి దినందినం ఆపట్టణంలోనే నిలిచిపోయేవారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సహజసంగీతరసోద్రేకం కల యువజనాలు ఆతనిపాటలు విని ఆయన్ని గురువుగా ఎంచుకోని ఆమోాస్తరుగా వీణెలు మేళవించి ఇళ్లదగ్గిర సంగీతం నేర్చుకుంటూండేవారు.

అక్కడికి ఒకపరాయిదేశం మనిషివచ్చి భయంకరంగా ఆకర్షించే కెంపుకళ్లతో ఊగిపోతూ పాటవినేవాడు. ఆతని ఆకుపచ్చని తళుకుపంచెకూడా ఆసంగీతం వినేటట్టే కనబడేది.

౨



ఒక సంధ్యాకాలంలో— ఆవీణాధరుడు హాయిమను కొత్తపాట ఒకటి మోహనమైన గాత్రంకలిపి తీగలపై మ్రోగించినాడు. సభ్యులందరూ పరవశులైపోయారు.

చిరునవ్వుతో ఆపాటకాడు అందర్నీచూచి ఆపరాయిదేశం మనిషిపై చూపుసలిపి "ఓ నాగరాజా, నేపాడే ఈనూత్న ఫణుతులలో అపశ్రుతి ఏమాత్రంకలిగినా ఈనాకుడిచేయిపై కాటేసి నన్ను దహించవలసింది." అని అడిగినాడు. గుండెలుపగిలే పామునవ్వులో ఆపరాయిదేశంమనిషి లేదన్నట్లు తలతిప్పాడు.

ఒక్కనిమేషం నిర్మల నీలాకాశంవైపు చూపులు పోనిచ్చి, కన్నులరమూతలువడగా స్ఫటికంలాంటి చెక్క వీణాదండాని కానించి ఒక్కవిచిత్రరాగం ఆలాపంచేసాడాబాలమూర్తి. కొండపొలాల్లో పరుగులెత్తే వాగుల పాటలు నిశ్శబ్దంలోంచి బయలుదేరినై. ఉదయం మంచుగుళికలు, చెట్లలేత జేగురుఆకుల్నుండి క్రింది సెలయేటినీటిలో తాళంరీతి పడి మారుమ్రోగాయి. వృక్షముల గానమైనది—సాంధ్యరాగాలలో జీరలుపోయి తీగలు సాగి పలవలై తలపుల కలుములైనది. గంభీరసముద్రవీచికలహోరైంది.కథలపాడింది. ఋక్కులై ఘనరాగమై పోయింది. సర్వమహామండలాలు ఊగించి ఒక్కమా రాగి తళుక్కున తారాలోకమై మాయ మయింది ఆపాట.

౩



ఈగానాలసుడిలో తన్మయుడైపోయి ఆపరాయిదేశంమనిషి, కన్నులే చెవిగా విన్నాడు ; ఇటునటు తాండవించి పోయాడు. ఆసమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యంలో ఆతని శిరస్సువెనక మూడు సర్పశిరస్సులు బయలుదేరాయి. ఆతలల్లో మణికిరీటాలు పొడసూపినై.

ఆజనసమూహంలోంచి ఆజాను బాహుడైన ఒకవృద్ధతపసి లేచాడు. ఆతనిజడలు పాలసముద్రం ప్రవాహాలైనై; ఆతనిపొడుగాటి గడ్డం వెన్నెల్లో ప్రయాణంచేసే తెల్లనిమబ్బైంది. మహాసత్వం తెలిపే తీక్ష్ణదృష్టితో ఆపడుచు పాటకునిచూచి. "అబ్బాయీ, కొన్ని ముహూర్తాలకితము 'నీపాటలో అపశ్రుతిదోషముందా? మహానందానికి లోపం వుందా?' అని కళాపశ్రుతి దోషశిక్షారూపమూర్తియైన యీ పాములరాజు నడిగావు" అని, ఆపరాయిదేశ మనిషిని చూచి-"ఓ నాగరాజా, ఈగానగర్వి సంగీతంలో అతులితదివ్యానందం ఏప్రక్క



"గాంధర్వస్మృతిదోషుడైన ఈతనికి మరణమేశిక్ష"

నుంచి వస్తుంది? పూర్వసాంప్రదాయములన్నీ ఛేదించి హేయమైన నూత్నపక్కీలు సృజించాడు. గాంధర్వస్మృతి దోషుడైన ఈతనికి మరణమేశిక్ష" అని ఊరుకొన్నాడు.

ఆమాటల కంతా హాహాకారం చేసారు. ఆపరాయిదేశంమనిషి వణికిపోయాడు.దీనంగా ఆతపసికేసి చూసాడు. తలవాల్చి ఒక్కని మేషం ఆలోచించాడు. బుస్సుమని నిట్టూర్పు పుచ్చాడు. ఇంతలో ఆపరాయిదేశంమనిషి క్రోధమూర్తి అయ్యాడు. చూస్తుండగా ఆతడు కరిగిపోయాడు. దేహమంతా తళుకు తళుకుల పొడలున్న సర్పదేహమైంది. మనిషితల మాయమైంది. ఎఱ్ఱజీరల నాల్కల ఆడిస్తూ మూడుఫణాలు ఛత్రాలవేయ్యటట్లు ఆడిపోయినై.

౪

తేజస్సు నిండినమోములో చిరునవ్వులు తాండవించగా ఆబాలకుడు కాటుకై సూర్య కిరణంలాంటి తనచేయి ముందుకు చాపాడు. ఆరుధనువులపొడవౌ దేహం ఆడి చుట్టలు చుట్టుకొంటూండగా బుస్సుమని ఆనాగరాజు పడగలు వెనుకకు పోనిచ్చి మెరుపులా కాట్లు వేయబోయేచిటికెలో లోకాలు కదిపేతీగపాటల స్వనంతో "ఆగు"మని మాటలువినబడ్డై. ఆమండపంమీద ఒకస్తంభాన్ని ఆనుకొని దిన దినమూ పాటవినటానికి వచ్చే ఒకబాలిక, దివ్యసౌందర్యగాత్ర పద్మంలాంటిచేయిచాపి నాగరాజును ఆగుమని సన్న చేసింది. శ్రుతులన్నీ మురిసిపోయేచూపులతో ఆ తపసిని చూచి "ఓ పూర్వసాంప్రదాయీ! ఈ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుమారుని నూతనసాంప్రదాయము నీ పూర్వ సాంప్రదాయమున కపశ్రుతి తీసికొనిరాలేదు. ఈతనికొత్తపోకడలు అద్భుతానందం యిస్తూవున్నవి. నీపూర్వసాంప్రదాయమంతా అనేకయుగాలలో అనేకకళామూర్తుల క్రొత్తపక్కీలతో నిండివున్నవే. వెనుకటి మార్గముల కేమాత్రము అపశ్రుతిరాని కొత్త దారులు ఉత్కృష్టమైనవి. అనేకసాంప్రదాయ కర్తలవలె ఈనూతనసాంప్రదాయాని కీతడు మూలపురుషుడు. కళాధిదేవినై, ఆనందాత్మమైన నా కీత డీనూతనకుసుమ మర్పించాడు. అదిప్రేమతో అంగీకరిస్తున్నా" అని ఆమె వీణాపల్లవపాణియై వెలుగుల అంతర్హిత అయిపోయింది.

"ఓకళాకుమారా! నువ్వు ధన్యమూర్తివి. నీపాటలు లోకంలో వెదజల్లు. నీదివ్యగీతానాదం ప్రణయాలు గురియనియ్; జోలల్లో, పాపల నూపనియ్; అనంతసత్వాల అవతరింపనియ్." అని ఆతపసి ఎక్కడకో పోయాడు.



"నా కీత డీ నూతనకుసుమ మర్పించాడు."

ఆపరాయిదేశం మనిషి ఇంతలో మాయమైపోయాడు.



# నా రా య ణ స్త వ ము

వాడ్రేవు శ్రీరంగనాయకమ్మ గారు

'రా' రమ్మటంచు నిన్ జేరఁబిల్చినయల్ల గజరాజుమొర విని కాచితెట్లొ
'అక్షయంబుగ వల్వలమరుపవే' యని వేడు ద్రౌపది గోడువింటివెట్లొ
'నాకీర్తిఁ జెరుపంగన్యాయమా' యనుక్రీడి దీనవాక్యము నెద నూనితెట్లొ
దయఁజూచుపొంటె 'మోదంబున శబరివిందారగింపఁగఁబోయితచటికెట్లొ
తెలియఁగారావు నీమాయ తెరఁగులెల్ల, నాగ, చిత్రప్రభావుండ వాదొ, శౌరి,
కోరినను గానుపింప వకుంఠచరిత, విందువో లేదొ మొఱ యదిసందియంబె?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. నిండుచూలాలని నెన రింతయును లేక నాతిఁ బీడించినయట్టి రాతిగుండె
అరయంగ వైర మింతైనను లేనివా లినిజంపినట్టి బల్లిదపుఁ జేఁత
చేరిపాలీయవచ్చిన పూతనాప్రాణ హరణంబొనర్చిన కరకుదనము
సభఁ బెద్దలంగాంచి సత్యమాడినశిశు పాలునిద్రుంచిన పౌరుషంబుఁ
గల భవద్దయ యెటుఁగోఱగాని మమ్ముఁ, బోంట్లపైఁ బ్రసరింపంగఁ బోలునెట్లు
తెలియఁగారాదు మాచిత్తములకు నీవు, హితుఁడవో యహితుండవో యిల రమేశ!

సీ. శత్రుత్వమును నీవు సాధింతువందుమా మోక్షసాయుజ్యంబు మొగి నొసఁగుదు
కఠినమానసమని కడఁగి యోజింతుమా కారుణ్యపూరంబు గనఁగ మనము
గోచరింప వటంచుఁ గుజనత నెంతుమా ప్రత్యక్షమగు దన్నిపట్టులందు
మామొర వినవని మదిని నూహింతుమా సిరిసమక్షముననె చెవుల నిడుదు
అరయ నిన్నాడునుడు లెల్ల నంబుజాక్ష, నీమహత్త్వంబుఁ గానంగ నేరకుంట;
మంద బుద్ధిని నన్గావుమా ముకుంద!, ఆపదుద్ధారకా! యీశ! యఘవినాశ!

సీ. నీదుబందుగు లేమొ నిర్మలాంగా, చూడఁ, బ్రహ్లాద నారద ప్రముఖులెల్ల?
నీదుచుట్టా లేమొనీరజాక్షా, చూడ నలయహల్యాశబర్యాదులెల్ల?
నీదు నాత్మీయులే నీలవర్ణా, చూడ భువి రవి పవనజముఖ్యులెల్ల
నీదు నాప్తగణంబె నిగమవేద్యా, చూడ మునిపుంగవాంగనాముఖరు లెల్ల
నన్ను నిర్లక్ష్యముగఁజూడ న్యాయమగునె? భక్తురాలను గానొకో వారిఁబోలె;
నన్ను నొకకంటఁ గనుము చింతాసముద్ర, మగ్నమానస దరిఁజేర్పుమా మురారి!

సీ. సలలిత సౌభాగ్యములఁ దులఁదూగుచో నేమూలనుందువో యెఱుఁగరాదు;
అతులిత బంధుసంతతి మోదమందుచో నేవంకనుందువో యెఱుఁగరాదు;
అఖిలవిద్యావినోదాప్తిమై నుండుచో నేచాయనుందువో యెఱుఁగరాదు;
భూరిసుఖాసక్తి గోరి నిద్రించుచో, నేచక్కి నుందువో యెఱుఁగరాదు;
కాలిలో ముల్లునాటినఁ గంటిలోన, నలుసు వడనేని మదిలోనఁ దెలియవత్తు
వసుధ నిది యెంతయును మానవప్రవృత్తి, కావు మన్నియెడల నన్ను దేవదేవ!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౮. జగన్మోహనభవనము-మైసూరు



౯. శ్రీ గోమతేశ్వరవిగ్రహము-శ్రావణ బెల్గోల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౭. నందివిగ్రహము-మైసూరు



౮. శ్రీ రంగనాథ దేవాలయము-శ్రీరంగపట్టణము



రాజమంత్రప్రవీణ

౬. డాక్టరు సర్ బ్రజేంద్రనాథ శీల, కె-టి., యం. ఏ.
మైసూరు విశ్వవిద్యాలయోపాధ్యక్షుడు




# చంద్రిక

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు

చిత్రకారుఁడు :
శ్రీయుత మానికొండ రామారావుగారు, బందరు



## ౧

వెలమవారిలో పాములవంశము చరిత్రచేతను పౌరుషముచేతను సుప్రసిద్ధము. పాములవా రసలు వెన్నెలకంటివారు. వెన్నెలకంటి వెంకటరావుగారికి కలిగిన సంతానమంతయు మరణపట్టికలో చేరుచునే వచ్చినది. ఆతఁడు దేవతలఁ గొలిచినను, బ్రాహ్మణులఁ బూజించినను, రాతికి,అప్పకు మ్రొక్కినను వానియందు భక్తి చిక్కుటయే కాని ఫలము చిక్కలేదు. అతఁడు సోదె లడిగెను, జోస్యము చెప్పించుకొనెను. ఎవరికి తోఁచినటులు వారు చెప్పిపోవుచుండిరి. ఇటులుండఁగా భవిష్యద్వేదియు, సిద్ధుఁడు నగు పాములవాఁ డొకఁ డున్నాఁడని విని, వెంకటరావుగా రతిప్రయత్నమున అతనిఁ దమకడకు రావించుకొనిరి. అతఁడు రావుగారి విన్నపము విని “నీకు పుత్రులు కలుగునటు లాశీర్వదింతును కాని యీ నియమములు అవలంబింపవలయును. ఒకటి—మీ యింటిపేరు పాములవారని మార్చుకొనవలయును; రెండు—నీవంశమునఁ గలుగు ప్రతివానిని మాపంక్తుల కిచ్చి పెండ్లినాఁట మఱల మీయింటికి తెచ్చుకొనవలయును; మూఁడు——మీవంశములో ప్రతిపురుషునుదాసీసంబంధము విసర్జింపవలయును. ఈమూటిలో ఏనియమమునేని ఏనాఁడు మీరు విసర్జింతురో ఆనాఁటితో మీవంశముసరి” అనెను.

వెంకటరావుగారికి మొదటి రెండు నియమములును సులభములుగానే కానిపించెను గాని మూఁడవది యే కష్టలక్ష్మము. పెటపెటలమీఁద అతఁ డంగీకరించెను. పాములవాఁ డాశీర్వదించి నిష్క్రమించెను.

ఒక్కొక్క సంవత్సరమే కడఁచినకొలఁది వెంకటరావుగారి నమ్మకపు నిచ్చెనలో ఒక్కొక్క మెట్టు ఊడఁజొచ్చెను. తనపట్టణమునుండి వెడలఁగొట్టిన ఒక్కొక్క దాసికను రావింపఁ బ్రయత్నించెను గాని రాణిగారి భయమువలన అతఁడు దాసికలయెడ బ్రహ్మచారి కావలసివచ్చెను.

పాములవాఁడు వెళ్లి నాలుగేండ్లాయెను. ఆయేట పాములవాని యాశీర్వాదము ‘దీవనలకే బిడ్డలా?’ అను సామెతను నిరర్థకము చేసివైచెను. వెంకటరావుగారు తన కుమారునకు ‘పాపారావు’ అని [ఆపాములవాని పేరును పాపయ్యయే] పేరు పెట్టెను. ఒక పాములవారి కుటుంబమును పిలిపించి తన దివాణములోనే ఉంచుకొని వారిచేఁ బోషింపఁ జేయుచుండెను. పాపారావుగారి తరువాత మఱి యిరువురుకూడ నతనికిఁ గలిగిరి.

ఆనాఁటినుండియు వెన్నెలకంటివారు పాములవారైరి.

వెలమవారిలో కలువ వంశమునకుఁగూడ విలువ కలదు. తరతరములనుండియు కలువవారును, పాములవారును బావలు మామలు, అల్లుఁడ్లు. మఱియు పరాక్రమమునందును పరిభవమునందును సమానులు.

వెలమవారిలో నేఁడు కోడిపందెముల కెంత ప్రాముఖ్యము కలదో నాఁడు గుఱ్ఱపుఁ బందెములకు అంత ప్రాముఖ్యము కలదు.

కలువ రామారావుగారును, పాములపాపారావుగారి కుమారుఁడు వెంగళరావుగారును పందెము వైచుకొనిరి. వెంగళరావుగారి గుఱ్ఱము వెనుకఁబడెను. అపుడు కలువ రామారావుగారు ‘పాములవారికి పాములతోఁ గాక గుఱ్ఱములతోనా పందెము!’ అని పరిహసించిరి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రాహ్మణులకు పరిహాస మిష్టదైవము: వెలమ వారికో—రణదేవత.

వెంటనే వెంగళరావుగారు కత్తి దూసిరి; రామా రావుగారును దూసిరి. ఇరువురును ఆ పరిహాసదేవతకు బలియైరి.

నాఁటినుండియు కుక్క-కయ్యములు పెట్టుకొని సహజమిత్రులైన ఆ యుభయవంశ్యులును సహజశత్రు లయిపోయిరి.

౨

ఎనిమిది తరములు కడఁచినను ఈ రెండువంశము లకు పిత్రుపైతామహమగు ఈవైరము ఒక క్షయరోగ ముగాఁ బరిణమించినది. మఱల నీ యుభయవంశములను వియ్య మందుటయే దాని కౌషధమని తెలిసికొన్న కుల వృద్ధులు వెన్నెలకంటి శేక పాముల విక్రమరావుగారి కిని, కలువ వెంకయ్యామ్మారావుగారికిని వివాహము స్థిర పఱిచిరి.

వివాహ మొక నదీసంగమము. ఆతీర్థమునందు ఉభయవంశములును శాంతిరసమును గ్రోలును.

మైత్రి అనన్యముగానే కలుగవలయు ననియు, మైత్రీదేవతకు తనను లంచమీయవలదనియు, పాముల విక్రమరావుగారిని వివాహమున అవలోకించుటకంటె తొంటిపెద్దలవలెనే రణరంగముననే అవలోకించుట తనవంశమువారికి పాడియనియు, లేదా, పాములవారితో ఉదాసీనతగనే ఉండవలయు ననియు వెంకయ్యామ్మా రావుగారు వాదించియు, చెప్పించియు వీసరవోయిరి. వివాహబంధనమునకుఁ దలిదండ్రులుగదా అధిదేవతలు! కలువ ధర్మారావుగారు ఘాఁతుమాటలు కర్ణాకర్ణికగా విక్రమరావుగారికి వినఁబడునేమో యని బెంగతో తగి నంతకట్టుదిట్టము చేసెను.

ధర్మారావుగా రల్లునకు నొకయేనుఁగును, ఐదు గుఱ్ఱములను, నెనిమిది లొట్టియలను,పదియాళ్లను, ఇరు వదిమంది దాసికలను అరణ మిచ్చిరి. తన మునిముందు విజయకాహళము, పిదప నౌబతు, తరువాత నేనుఁగులు, వెనుక గుఱ్ఱములు, పిమ్మట సైనికులు, పిఱుఁద భటులు, అనంతరమున దాసికలును బెండ్లినడకలు నడుచుచుండఁ గా సింహాసనం బమరించిన పల్లకిలో విక్రమరావుగారు వివాహమునకు వెడలిరి.

పెండ్లికొడుకు యుద్ధముచేయని వీరుఁడు; రాజ్య ములేని రాజు. అతఁ డూరేఁగి దిగ్విజయము చేయును. ఆతనిమాట రాజశాసనము. అతఁడు చూచెనా-మంగళ గీతము లుదయించును. విశ్రమించెనా-వీచోపులు విస్త రించును.

విక్రమరావుగా రసలే రాజుగారు; మఱియు నిపుడు పెండ్లికొడుకు; కాఁగానతఁ డింద్రుఁడో, ఉపేం ద్రుఁడో!

వివాహశాల యంతయు రాజబంధువులచేఁ గొలు వుకూటమువలె,లతావృక్షములచేనందనమువలెఁ,బాలచేఁ జైత్రరథమువలె నుండెను. అందు విక్రమరావుగారు ఠీవిగాఁ బ్రవేశించిరి.

లగ్న మాసన్నమాయెను. ఆవివాహమంటపమునఁ దెరలతోఁ గూర్పఁబడిన పటమంటపము బూరటిల్లి వధూప్రవేశమును సూచించుచుండెను. పురోహితుఁడు మంత్రపారాయణము చేయుచుండెను. మంగళసూత్ర మును గట్ట విక్రమరావుగారు పటమంటపమునఁ బ్రవే శించిరి. సూత్రము గట్టింప నచట చంద్రికయను దాసి నిలుపఁబడియుండెను. దాని యౌవనపరిమళముచే నతఁ డు మత్తిల్లెను. ఆతని చూపు చంద్రికాముఖమునుండి వధూముఖమునకు మఱలలేదు. తా నేమిచేయవలయునో చంద్రికకుఁ దోఁపలేదు. ఆతనిఁ జూచుచు నది కరఁగి పోయెను. కొంతవడికిఁ జంద్రిక విక్రమరావుగారిచే మంగళసూత్రమును మెలమెల్లగా వెంకయ్యామ్మారావుగారి మెడగీలింపఁ జేయఁజొచ్చెను. చంద్రికాస్పర్శమున నతని శరీరము గగురుపొడిచెను. విక్రమ రావుగా రనుకొనిరి: "ఈమంగళసూత్రమునకుఁ జంద్రికా కంఠమే సరియగు స్థల"మని. విక్రమరావుగారి హస్తస్పర్శమునఁ జంద్రిక యొక్క హస్తము చక్కిలిగిలి పెట్టఁబడినది కాఁబోలు! ఆమంగళసూత్రము జాఱి క్రిందఁ బడెను. అపుడు విక్రమరావుగారి నిరీక్షణమాలికయే చంద్రికాకంఠమునఁ గట్టని మంగళసూత్రమాయెను. చంద్రిక తన చూపులచే నతనిపైఁ దలఁ బ్రాలు వోసెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెంకయ్యమ్మారావుగా రాయవినీతి సహింపలేక పోయెను. ఆమె వెంటనే లేచి యా మంగళసూత్రమును జంద్రికా కంఠమునఁ దగిలించి తెరల నన్నిటిఁ దొలఁగించుకొని యంతిపురిలోనికిఁ బోయెను. విక్రమ



"చంద్రికాస్పర్శమున నతనిశరీరము గగుర్పొడిచెను"

రావుగా రప్పుడు నిబ్బరముగా ఆ మంగళసూత్రమును చంద్రికా కంఠమునఁ బంధించిరి. తల్లి మంగయ్యమ్మారావుగారు "ఏమి! యీసాహస"మని యడిగెను. 'అతఁడు దాసికే తగినవాఁడు' అని కూఁతురు ప్రత్యుత్తరించెను.

ఈవార్తచే బంధులోక మంతయుఁ గలగుండుపడెను. తొల్లిటికసి పెరుగుటకే యీ వివాహము సంకల్పితమైనదని బంధుగు లనుకొనిరి.

'మమ్మవమానించుటకే యీవివాహము తలపెట్టితి' రని వెన్నెలకంటివా రనిరి. 'మమ్ముల నవమానించుటకే దాసి నాసించి వివాహమునకు విడాకులిచ్చితి'రని కలువవారనిరి. 'దాసిని బట్టుకొనుఁడు; దాసిని బట్టుకొనుఁ' డని కేకలు వినవచ్చినవి. 'వధువును బట్టుకొనుఁ'డని వెన్నెలకంటివారు ఘోషించిరి. ఈఘోషణమే యుద్ధారంభమునకు దుడ్డుచ్చి. ఆసంకు లారావమున నుభయసేనలును దలపడెను. రాజబంధువులు సంకులసమర మారంభించిరి. వివాహమంటపము రణరంగముగా మాఱిపోయెను. వియ్యంకు లిరువురు వీరస్వర్గ మలంకరించిరి.

విక్రమరావుగారు వెంకయ్యమ్మారావు గారిని బట్టుకొన రాణివాసము చొచ్చిరి. అడ్డువొచ్చిన యాఁడువారి నెల్లరను కత్తికి బలియిచ్చిరి. తుద కాతఁడు వెంకయ్యమ్మారావుగారిని బట్టుకొని సింహనాదము చేసెను. వెన్నెలకంటివారి వంశమునకు విక్రమ రావుగారే మిగిలిరి; కలువవారివంశమునకు వెంకయ్యమ్మారావుగారే శేషించిరి.

## 3

కారాగారమున వెంకయ్యమ్మారావుగారికిని, రాణివాసమునఁ జంద్రికకును స్థిరనివాస మేర్పడినది. వెంకయ్యమ్మారావుగా రాత్మహత్య చేసికొనఁ బ్రయత్నించుటకైనను వీలులేని కట్టడిలో నుండెను. చంద్రిక యొకతూరి తన బంధుజాలమును జూచుటకేని వీలులేని నిర్బంధములో నుండెను. రాణి దాసియాయెను; దాసి రాణియాయెను.

కర్మ మేతము వంటిది. ఒకతూరి యొకకొమ్మనేలను ముట్టును: ఇంకొకతూరి ఆకస మంటును. దాసికలచేఁ దనకడకు వెంకయ్యమ్మారావుగారిని రావించుకొని చంద్రిక తనపాదము లొత్తుమని యామె కాజ్ఞా



పించును. ఆమె యూరకుండఁగా పలువురు దాసికలామెచేతులు పట్టుకొని బలాత్కరించి యొత్తింతురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒక జడప్రతిమకుఁ దన కిచ్చవచ్చినపుడు ప్రాణము పోసి పని చేయించుకొని మఱలఁ బ్రాణము తీసివైచి యొక గదిలో దాఁపఁబడినటు లున్న దామె. విక్రమ రావుగారు వెంకయ్యమ్మారావుగారి మొగము చూడఁడు. ప్రతిదిన మామెను నిర్బంధించి యెటులెటులు శిక్షించి రో తీరికగా వినును. ఆశిక్ష కేనాఁడును తృప్తి పొందఁడు.

ఆశ తీఱునుగాని పగ తీఱదు. ఆశ కంతరంగ మున్నది; పగకు లేదు. పగ కొక స్రష్ట లేఁడు. అదితన ను దానే సృజించుకొనెను. పగయొక్క కుడిచేయిసెగ; ఎడమచేయివగ. క్రౌర్యముదానిహృత్తురు. దాని కొకకోర కలదు. అది కాటందె యొకొక్క విషబిందువునే విడు చును. విషగ్రస్తుఁడు కొంచెమునేపువచ్చి మఱికొంచెము నేపటికి బ్రదుకును. అవి క్రమ్మఱ కాటందుచుండును.

'తా మెంతహింసించినను వెంకయ్యమ్మారావు గారు పల్లెత్తు మాటయేని పలుక'దని దాసికలు చెప్పి నపుడు విక్రమరావుగారు పండ్లు పటపటకొఱికికొనును. అపకారిని క్షమింపుటయే కసి తీర్చుకొనుట కదా!

వెంకయ్యమ్మారావుగారిపై పగతీర్చు కొనుటకే విక్రమరావుగా రంతగాఢముగా చంద్రికను ప్రేమింప లేదు. ఆఁకలి యెటులుకలిగెనో చంద్రికపై ప్రేమయు నటులే కలిగెను. ఈఘటన యుదాసీనమే.

అతఁడు చంద్రికను ప్రేమించినాఁ డనుటకంటె అతఁడు చంద్రికకంటె వేఱేమియు నెఱుఁగఁ డనుట యుక్తతరము. అతనిప్రేమ చంద్రిక నెంత ప్రేమించి నను ఆవల మిగిలియే యుండును. ఆమిగిలినప్రేమప్రపం చమున నాతఁ డానందించును; పక్షివలె ఎగురును. యతనిప్రేమయునుజలప్రళయమున రాజ్యమును, ప్రపం చమును, తుదకు తానునుగూడ మునిఁగిపోయెను. అందు చంద్రికయను లంక యొక్కటియే తేలాడుచుండెను.

చంద్రిక విక్రమరావుగారి యింగిత దేవత. అది యతని దాసిగా మాఱును; శిష్యగా నగును; గురువుగా పరిణమించును; శయ్య యయిపోవును. అది యతని యభీష్ట దేవత.

చంద్రికయేడ్చి యతని నేడిపించును; నవ్వినవ్వించును; త్రాగి త్రాగించును; సొక్కి సొక్కించును; ఏడ్పు కయు నేడిపించును; నవ్వుకయు నవ్వించును; త్రావ కయుఁ ద్రావించును; సొక్కకయు సొక్కించును. విక్రమరావుగారు చంద్రిక చేతిలో కీలుబొమ్మ.

ప్రేమయను పాలవెల్లిలో ఇంద్రియసుఖ మొక విషద్వీపము. ఆవిషద్వీప మెక్కినవెంటనే క్షీరసముద్ర మంతయు విషసముద్ర మయిపోవును.

విక్రమరావుగారు ఎంతవ్యయ మొనరించినను మిగులఁ నిధిగలెనున్న ప్రేమ పరిశిష్టముయొక్క ఛాయ. అట్టిఛాయయే చంద్రికాసహస్రమును సృష్టింపఁగలదు.

చంద్రిక రాజు: విక్రమరావుగారు రాణి. రాజ్య మున నిపుమంతయుఁ గొఱలేదు. ధర్మము నాలుగుపాద ముల నడిచిపోవుచున్నది. ప్రజలో—చంద్రికకుజయ పెట్టనిచేతులు లేవు.

వెంకయ్యమ్మారావుగారి మాట యిపు డెవ్వరు నెఱుఁగనే యెఱుఁగరు. తా నేమో; తన కారాగార మేమో! అది శరత్కాలచంద్రికయే యగుఁగాక! నిదు రలో దాని సెవ రెఱుఁగుదురు?

౪

కలహంసియనిన నితరదాసికల కందఱకు కడుపు మంట. అది చంద్రికకుఁ గడునిష్టురాలు. కలహంసి వచ్చు చో దాసిక లంద ఱుపాగమమందలి యంధతమసము వలె విరిసిపోవలసినదే. దానినందఱు నిందింతురు కాని యది ఎవరిని పల్లెత్తుమాట అనదు.

కలహంసి కంతఃపురముననే యొకయంతఃపురము కలదు. అదియచట నెటులు సంచరించుచుండునో, చంద్రి క కడ కెపుడువచ్చునో, యెపు డేఁగునో యితరుల కెవ రికిని దెలియదు. కలహంసి యొక దాసియనియు, చంద్రిక కంతరంగసఖి యనియు, విక్రమరావుగారు చంద్రికకడకు రాఁగనే కాకులవలె నెగిరిపోయినటులు అది రాఁగనే యావలికి వెళ్లిపోవలయు ననియు దాసీలోక మెఱుఁ గును.

కలహంసి చంద్రిక కెంత యిష్టురాలో విక్రమ రావుగారికిఁగూడ నంత యిష్టురాలు. కలహంసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విక్రమరావుగారికి మద్యపాత్రముతోఁ దక్క నూరక కానరాదు. దానిచేతులతోఁదక్క మఱిదేనిచేతులతోను విక్రమరావుగారికి మద్యము సయింపదు. విక్రమరావు గారి నప్పి యార్పక కలహంసి చంద్రికకడ కేఁగదు. ఆతఁడు నిదిరించినంతటకలహంసిలోనికేఁగి యాయంతః పురకవాటములు దృఢముగా బంధించుకొనును.

రాజుతో అతిపరిచితికల దాసి రెండవ రాణి. దానిమాట మొదట; రాణిమాట పిదప.

౫

శరచ్చంద్రికలో చంద్రికయు, విక్రమరావుగారును విహరింపుచుండఁగా నచటికి దాది శిశువును దీసికొనివచ్చెను. చంద్రిక చేతులలో నాబాలుఁడు బాలచంద్రునివలె నుండెను. చంద్రిక ఆబాలు మోము చూచి విక్రమరావుగారితో సరిగా 'మీ మోమే!' అనియెను.

'అది స్తుతి. నీమోముకాదు. నామోమునుకాదు. ఇరువురిమోము' అనుచు తల్లిమోమున కానించి విక్రమరావుగా రిరువురమోముల ముద్దాడిరి.

చంద్రిక శిశువును విక్రమరావుగారి కిచ్చెను. అతఁ డాశిశువు నేకాగ్రతతో తిలకించు చుండెను.

ఏకాగ్రత యొకయద్దము. అందు కొన్నివిషయములు స్ఫుటముగను, మఱికొన్ని అస్ఫుటముగను కానిపించును.

"చంద్రికా! నీవు నాతో కారాగారమునకు రావలయును."

"నాకు అలంకారవేళ యయినది."

దాది వెంటరా శిశువు నెత్తికొని విక్రమరావుగారు కారాగారమున కేఁగిరి. గొలుసులచే కాలు సేతులు బంధింపఁబడి వ్రాలఁబడియుండిన వెంకయ్యమ్మరావుగారు అతనిఁజూచి చిఱుతపులివలె లేచి నిలువఁబడెను.

"అంతటి యవినయము చేయకుండినచో ఈపాటికి నీవును నాచేత నింతశిశువు నెత్తించి యుందువు."

వెంకయ్యమ్మరావుగారు సహజ మౌనము మానలేదు.

"ఇదిగో మీమూగ అమ్మకడకు వెళ్లుము!" అని శిశువును విక్రమరావుగారు దాది కిచ్చిరి.

"నాకొక కోరికకలదు. చాలఁగాలమునుండి తమతో మనవిచేసికొన నువ్విళ్లూరుచుంటిని. చెప్పుమని సెలవా?"

"అదియేమి?"

న న్నిచట బంధించి యుంచుట పిఱికి తనము. నాచేతి కొక కత్తియిండు; తామొక కత్తికొండు. అది వెలమపని. ఇది దాసీకృత్యము కాదా?"

"నిన్ను నరకమున గొంతువఱకు పాఁతిపెట్టించెదను; ప్రేలకుము."

"ఓరీ! ఇంతకంటె అదిమేలు; అటులు చేయింపుమురా!"

విక్రమరావుగారి కనుసన్నలచే నిరువురు దాసికలిరువైపులనుండి కొరడాలతో నామెను బాదిరి. ఆమె యిసుమంతయు చలింపలేదు.



"ఓసీ, యీనాకుమారు నెత్తికొనుము!"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఓరీ! వాఁడెవఁడో నీ వే నెఱుఁగుదువు?"

"నీనాలుక కోయించెదను."

"ఇంకొక యేడుదాఁటినపిదప వీనిలో నామోము చూడరమ్ము; మఱచితిని. అపుడు నీనాలుకను కోసికొని మఱిరమ్ము."

విక్రమరావు గుండెలలో రాయిపడెను. వృథాలోచన మపుడు పనులలో మునిఁగి తేలుచుండెను. అతఁ డచటినుండి లేచిపోయెను. అచటి దాసికలను దాదిని రాజ్యాంతరము వెళ్లఁగొట్టెను. శిశువును లోనికిఁ బంపి వైచెను.

"నేనిపుడు చంద్రికనుదక్క నెవరి నెఱుఁగుదును? ఎవరి నడుగను? ఏమని యడుగను? ఎటులు కనిపట్టుదును? మద్యము క్రోల కెటు లుందును? ఛీ ఛీ ఛీ! కలహంసీ, కల్లు కల్లు! మద్యము మద్యము!! రమ్ము రమ్ము!!!"

కలహంసి మద్యము తెచ్చెను. విక్రమరావుగారు మద్యముపైఁ దమవిక్రమమంతయు వినియోగించిరి. కలహంసి వెళ్లిపోయెను. అంతఃపుర కవాటములు కటకట పడుచున్నటులు కటకటా పడెను.

"కలహంసీ,మద్యము; కలహంసీ,మద్యము; కల— మద్య-క-ము"అని దీర్ఘధ్వనులాకవాటమునకుఁదాఁకెను. అంతఃపురమున జాగరూకయయియున్న చంద్రిక "కలహంసీ! మఱల మద్యముగొని పొమ్ము" అని శాసింపఁగా కలహంసి క్రమ్మఱ మద్యపాత్రము పూరించి విక్రమరావుగారికడ కేఁగెను.

విక్రమరావుగారు వసరుమండిరి. కలహంసి మద్య పాత్ర మతని కందిచ్చెను. అతఁడు దానిని ద్రావుచు "ఎ ఎ ఎవరి కు కు కు కుమారుఁ"డనెను. ఉదరములోని కేఁగఁగా మిగిలిన మద్యమాతని వక్షమును శిరమును అభిషేకించెను. విక్రమరావుగారు సుఖస్వర్గ మధిరోహించు చుండిరి. అతనిగ్రుడ్లు చంద్రునిప్పులవలె నెఱ్ఱబాఱినవి; అధరము వెల్ల బాఱినది.అతఁడు నేలఁగూలి,స్వర్గమెక్కి యింద్రత్వ మనుభవించుచుండెను.

కలహంసి యంతిపురిలోని కేఁగి తలుపులుమూసి కొనెను. అవి తెల్లవారువఱకు విడివడలేదు. అంతవఱకు విక్రమరావుగారును ఇంద్రత్వమును వీడలేదు.

౬

ఇపుడు వెంకయ్యమ్మారావుగారికి వెనుకటియంత హింసలులేవు. ఇపుడు విక్రమరావుగారికా మెమోముఁ జూడ సిగ్గు. నాఁడును నేఁడును వెంకయ్యమ్మారావుగారొకరీతిగనే యుండిరి. అమాయికతయొక్క తావియు సొగసుదనమును ఆమెను త్యజింపలేదు.

వాన కురియుచుండెను. విక్రమరావుగారు మేడపై నాలోచించుచుఁ గూరుచుండిరి. ఆయత్యంత ప్రశాంతసమయమున నతని విషాదాయుర్ని మేషముల లెక్కిడుచున్నటులు ఒకొక్కబిందువే పడుచుండెను. తన మోహపరిమళము సహింపలేక గాలికిఁ గొట్టుకొని పోవలె ననుకొన్నటు లాతఁడు గవాక్షములఁ దెఱచెను. ఆతఁ డాయునకధారలందు చంద్రికాకంఠమున మంగళ సూత్రము నెందుబంధించెనో యాపట మంటపమును గాంచెను.

"ఛీ, చంద్రిక యేమి? అనుమానమేమి? చంద్రికా, చంద్రికా"యని మెల్లగా ననుకొనుచు అంతఃపురమార్గము పట్టెను.

శిశువు నెత్తికొని దాది దాపునకువచ్చి "బాబుగారికి మాటలన్నియు నచ్చినవి; ఎక్కడలేని యూహలును పుట్టిన"వని మనవిచేసెను.

విక్రమరావుగారాశిశువు నెత్తికొని యుపలాలింపఁ దొడఁగిరి.

ఉపలాలన మొకమద్దుమందు. దానిచే నీశ్వరునైనను సేవకుని జేయవచ్చును.

ఆశిశువు కుక్కపిల్లకంటెఁ జనవుగా విక్రమరావుగారికడ కరుగును. విశ్వాసముతో విక్రమరావుగారతని నెత్తికొందురు. అతఁ డాశిశువు విజయునిపై నేకాంతమున అతిప్రేమ నభినయించు చుండెను.

విజయుఁడు తనకడకు వచ్చినపుడెల్ల విక్రమరావుగారి మనోగృహపుఁ జట్టము ఉబ్బాంత లూఁగిపోవు చుండెను. నోటివఱకు వచ్చిన కొన్నిమాటల నాతఁడు మఱల స్తంభింపఁ జేసికొనుచుండెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాఁడు విజయుని జన్మదినోత్సవము. దాది యతని నలంకరించి విక్రమరావుగారికడకుఁ దీసికొని వచ్చెను. విజయుఁడా నూతనాలంకారములను జూచుకొనుచుండెను.

"బాబూ! అయ్యగారికాడి కెళ్లు!"

"ఛీ ఛీ, నీకు తెలదుపో" అని ఆవిజయుఁడు దాదిని నీసడించి తన విజ్ఞానమునకు గర్వపడెను. దాది తెల్లబోయెను. విక్రమరావుగారిలో నొక జిజ్ఞాస లేచి కూరుచుండెను.

"దాదీ! నీవేగి యిరువురు సేవకులఁ బంపు" మని విక్రమరావుగారు విజయు నెత్తుకొని తలుపులు మూసి "విజయా! అయ్యగా రెవరు?" అని యడిగిరి.

"మా అమ్మదగ్గి రుంటుందే—కలంసి—అదీమా అయ్యారు."

విక్రమరావుగారు కూలఁబడి "అయ్యో! అన్యక్తత" అని తల బాఁదుకొనిరి. అపుడే కోటముందు వృద్ధగజముపై పిడుగుపడెను.

"నిజమంటే నిజం. కలంసి నన్ను అయ్యారూ అనిపిలమని చాటుగా చెబుతుంది."

"ఏమది?" అనుచు విక్రమరావుగా రేకాగ్రతతో నాలోచించుచుండిరి. తనను దహించి భస్మసాత్కరించు చరమాగ్నియొక్క రూపమును విక్రమరావుగారి ముఖము గుంజుకొనుచుండెను.

"తలుపు! తలుపు!"

అతఁడు మందుగడ్డపలెఁ జల్లఁబడి, విజయు నెత్తుకొని తలుపులు తెఱచెను. చంద్రిక లోపలఁ బ్రవేశించుచుఁ జేతులు చాఁపెను.

చంద్రిక వెనుకనే కలహంసి మద్యపాత్రముతోఁ బ్రవేశించి తలుపుచాటున నుండెను.

"కలహంసీ! లోనికి రమ్ము! ఏదీమద్యము?" అని విక్రమరావుగా రడిగిరి. కలహంసి యతనికి మద్యపాత్ర మిచ్చెను. అతఁడు విజయు నొకమాఱును, కలహంసినొకమాఱును సమయము చిక్కినపు డెల్ల చూచుచు "దేవీ! ఇతనిని దీసికొ"మ్మని విజయుని చంద్రిక కిచ్చి "కలహంసిని నేఁడు నాకడ నుంపవలెను. ఈపుత్రని జన్మదినోత్సవమున నా కెడతెగకుండ మద్యము కావలసియుండును. నీవుమాత్ర మెఱుఁగవా?" అనెను.

చంద్రిక కలహంసికేసి చూచి నవ్వుచు "ఇంతకంటెనా?" అనియెను.

"చంద్రికా! నీవు నేఁడు చక్కఁగా నలంకరించుకొనియుండుము. నేనును వెంటనే నీకడకు రాఁగలను."

"తప్పక రావలయును!" అనుచు చంద్రిక శిశువు నెత్తికొని వెళ్లిపోయెను. విక్రమరావుగా రదేపనిగా ద్వారమువెస చూచుచుండిరి. కొంతవడికి ఇరువురు సేవకులువచ్చి ద్వారముకడ నిలువఁబడిరి.

కలహంసి విక్రమరావుగారికి మద్య మీయఁబోయెను.

"ఓసీ! నాకు ముందు కొంచెము పాలు తెమ్ము!"

కలహంసి లోనికేఁగి పాలు తెచ్చెను. విక్రమరావుగారు ఆపాలగిన్నె నచటఁ బెట్టికొనిరి.



"ఇదిగోఁ గత్తి! ఈమద్యమున నీరక్తము కలిపి నీ కుమారుని జన్మదినోత్సవమునఁ గ్రోలుదును."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అతఁ డపుడు మరణమంత యాత్యంతాభావ మనుభవించుచుఁ బటుకుటీరమున నుదయించిన యౌవన మత్తతకు గోరీకట్టి దానిపైఁ దా నిలువఁబడియున్నటు లూహించుకొనుచుండెను.

కలహంసి కొంతసేపటికి "దేవా! మద్యము!" అనెను.

"ఓసీ! నాకు మద్యము కాదు; రక్తము కావలయును."

"దేవా! అదియేమి?"

"ఇదిగోఁ గత్తి! ఈమద్యమున నీరక్తము కలిపి నీ కుమారుని జన్మదినోత్సవమునఁ గ్రోలుదును."

కలహంసితాను తానో, లేకమృత్యువు ప్రసాదించిన యొక యభావమో తెలిసికొనఁ జాలకుండెను.

విక్రమసింహుఁడు సేవకుల లోనికిఁ బిల్చి "ఈ కలహంసి నాగదిలోనికిఁ గొంపోయి వస్త్రము లూడ్చి తీసికొనిరం"డని ఆజ్ఞాపించిరి.



"ఓసీ! నీకు ధైర్యమున్నచో ఈకత్తిగొని నన్ను నఱకుము!"

వెంటనే సేవకులు దానిని గదిలోనికిఁ గొంపోయిరి.

విక్రమరావుగారొకతూరి కత్తిఝళిపించిరి. అది మృత్యువు జిహ్వ చాఁపినటులుండెను.

ఒక గోఁచితో కలహంసుఁడు గదిలోనుండికొని రాఁబడియెను.

"ఓసీ! నీకు ధైర్య మున్నచో ఈకత్తిగొని నన్ను నఱకుము!"

కలహంసుఁడు వెలవెలఁబోయెను.

"ఓసీ! నీపేరేమి?"

"కలహంసుఁడు."

౭

సేవకుఁ డొకఁడు కారాగారద్వారములు తెఱచి వెంకయ్యమ్మారావుగారిని విడిచిపుచ్చెను.

మఱియొకసేవకుఁడు చంద్రికకడకు వచ్చి "దేవీ! నేఁటివిజయుని జన్మదినోత్సవమున భూతభవిష్యద్వర్తమానములు చెప్పఁగలిగిన పాములవాఁ డొకఁడు మిమ్ములవినోదింపఁజేయ దేవరయానతిచే నిపుడేరాఁగలఁ"డని నివేదించెను.

వెంటనే పాములబుట్ట చేకొని యొక పాములవాఁడు చంద్రికాంతఃపురము ప్రవేశించెను. వాని తలపాగ పలురంగుల పాములతోళ్లచే చేయఁబడి నటులుండెను. అతని నాగసారబుర్ర చుట్టలుచుట్టుకొని లేచియాడుచు పాడుచునున్న పామా యనిపించుచుండెను.

సర్వాధిదేవతగా నున్నాఁడాతఁడు. వాఁ డా పాములబుట్ట క్రిందనిడి నాగసారము పాడఁ దొడఁగెను. వానిబుగ్గలు తిత్తులవలె ఉబుకుచుండెను. అతని మోమునందలి నామము మృత్యుశిరమున నెత్తిన దీపశిఖవలె నుండెను. విజయుఁ డాపాములవాని కడ కతి చనవుగా నేఁగెను. అతి సమ్మోహనముగా నున్న దాస్వరము.

చంద్రిక "కలహంసీ రమ్మ"మ్మని పిలిచెను. పాములవాఁ డాసారబుఱ్ఱ క్రిందనిడి "నేను వట్టిపాములవాఁడనే కాను. నేను కాలజ్ఞుఁడను."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



గానవిశారద సంగీతవిద్వాన్
బిడారద కృష్ణప్ప-మైసూరు



సంగీతవిద్వాన్
బి. రాచప్ప-మైసూరు



సంగీతవిద్వాన్ పండిత
బాలక్వాడి శ్రీనివాసయ్యంగారు



సంగీతవిద్వాన్
కె. వాసుదేవాచార్య-మైసూరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



వైణికశిఖామణి శ్రీ. శే. వీణ శేషణ్ణ-మైసూరు



వైణికవిద్వాౕ వెంకటగిరియప్ప-మైసూరు



వైణికప్రవీణ, వైణికవిద్వాన్ సుబ్బణ్ణ-మైసూరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"మాకలహంసిని రానిమ్ము చెప్పుదువుగాని.

కలహంసి యని యేల మోసగించెదవు? కలహంసుఁ డని సత్యము చెప్పుము!"

"మెల్లఁగా ననుము. మెల్లఁగా మాటలాడుము!"

"నాకడ నొకశక్తి యున్నది. దానిచే నామాటలు గోడయావలనుండువారికి వినరావు."

జ్యోత్స్నము కొతుకకవాటములు తెఱచును. అందు శ్రోత కెదురుగా ఆశీర్వదించుచు నొక దేవత ఫలసమృద్ధమయిన పళ్లెర మొండు కైకొని నిలిచియుండును. అందలి ప్రతిపండును శ్రోతవడిలో పడుచుండును.

"నీకట్టి శక్తి యుండుఁగాక! నాకు భయ మగుచున్నది."

"దేవీ! భయపడకుము; నన్ను నమ్ము. నీకు ముందు పెద్దయదృష్టము గలదు. నీవు కావలసిన ప్రశ్నము లన్నియు నడుగుము. నీకు సంతృప్తియగు పిదప నేనాకు బహుమతి యిత్తువుగాక!

"కలహంసుఁ డెపుడేని పట్టుఁబడునా?"

"ఇఁకఁ బట్టుపడఁడు."

"రాజు విజయుని ననుమానింపఁడుకదా!"

"అతని కిపు డేమియు ననుమానము లేదు."

"చెఱలో ఒకరాణి యున్నది. దానికి విమోచనము కలుగునా?"

"ఇఁక క్రొత్తగా కలుగదు."

చంద్రిక ఆలోచించుచుండెను. పాములవాఁడు "దేవీ! నీకు ప్రశ్నము లేమియు గోచరించుచున్నటులు కానరాదు. కొన్ని నేనడిగెదను. వానివలన నీకుఁ దోఁప వచ్చును" అనెను.

"ఔను."

"నీకు రాజ్యకాంక్ష కలదా?"

"సంపూర్ణముగా."

"నీ కొకగంటలో అది పూర్తి యగును. అయితే రాజుగారు పరిష్కారము కావలయునని తమకు కోరిక యున్నదా?"

"అది సిద్ధించు టెటులు?"

"ఎంత తెలివిమాలిన యాఁడుదానవు? ఆఁడుదానిలో ఈ తెలివితక్కువ నే నెచటను జూడలేదు. సరియ. నీయభీష్టము నేను నెఱవేర్చెదను. ఇంకొకమాట—కలహంసుఁడు నీకెట్టిచుట్టము?"

"రాజుగారికంటె ముందు తాళిగట్టినమగఁడు."

"రాజు నాతనిచే చంపింపఁగోర్కయా?"

"వేయేండ్లు వర్ధిల్లుము!"

అచటనచట నాడుకొనుచు నపు డచటికి వచ్చిన విజయుఁడు "అమ్మా! ఈమాట ఆయనతో చెబుతా. ఆయన్ని చంపాలనిచూస్తున్నావుగా. నన్ను చంపి మఱి ఆయన్ని చంపు" అనెను.

"దేవీ! నీకోరికి సిద్ధించితీఱునుగాని అతనిచే సిద్ధింపదు."

"మఱి యెవనిచేత?"

"నాచే."

"నిక్కముగా?"

"నిక్కముగా."

"నాకొక బహుమతి కావలయును."

"నీయిష్టము. కోరుకొనుము."

"తిరిగి పోరాదు."

"తిరిగి పోవను. ముమ్మాటికి తిరిగిపోవను."

"చెప్పనా?"

"వడిగా."

"హత్యయొనరించు ఈపాములవానిని బ్రదికియున్నంతవఱకు మఱచిపోవలయును."

"ఇదేమి బహుమానము?"

"ఇది బహుమతియే కానియెడల ఒక—"

"ఒక యేమి?"

"ఒక—"

"ఛీ, నీ వనుమాన పిశాచగ్రస్తుఁడవు! చెప్పుము. ఒక యేమి? ఊరా? పరగణా?"

"ఇస్సీ! ఎంతినైచ్యము!"

"ఏమా గొప్ప ఒక?"

"తిరిగి పోరాదు."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఛీ ఛీ, ఎంత నీచుఁడవు! నీయెడలనే నీకు నమ్మకము లేదు."

"ఔను. నేను నీచుఁడనే. ఒకముద్దడుగఁ దలఁచితిని. కాని యిపుడు కాదు. అతనిని చంపినతరువాత."

చంద్రిక యొక చిఱునవ్వు నవ్వెను. ఆ నవ్వుతో పాములవాఁ డా పాదమస్తకము కదలిపోయి యిట్టు లనెను:

"ఇఁక నతని చంపుదునా?"

"ఊ! ఊ."

"మానాన్న నే చంపేస్తారా? నేనుపోయి చెప్పేస్తాను." అనుచు విజయుఁడు పరువెత్తఁ దొడఁగెను. చంద్రిక వానిఁబట్టుకొని ముఖపిధానము చేసెను.

"ఏల నోరు మూసెదవు? ఆతనికి వినఁబడినను నీకు భీతి లేదు." "నాయనా! ఈపాలు తాగెదవా?" అని [illegible] విజయుఁ డాగిన్నెను క్రిందఁబాఱవైచి "నాన్నా! నాన్నా!" అని యేడ్వఁ దొడఁగెను.

పాములవాఁడు తలవిసిరి పాగను క్రిందఁబడునట్లు లొనరించెను. చిరపరిచితమగు నొక పరిమళ మా కేశకలాపమునుండి చంద్రిక కడకుఁ బ్రసరించెను.

చంద్రిక కన్ను చెదరెను; నోరు పడెను; ముఖము వెలిసిపోయెను.

విజయుఁడు "నాన్నా నాన్నా" అని పిలిచెను. పాములవాఁడా బుట్టమూఁత తీసి యందలి నల్లత్రాచు నెడమచేతితోఁ బట్టుకొని కుడిచేతిమీఁదను, కుడిచేతితోఁ బట్టుకొని యెడమ చేతిమీఁదను కఱపించు కొనెను. మరణము కోరుకొనఁగా ప్రాణము లీయఁబడినటులు చంద్రిక తలఁచెను.

"నాన్నా! నాకా పా మియ్యవూ? నేనూ నీకు [illegible]" అని విజయుఁ డనెను.



అపుడు వెంకయ్యమ్మా రావుగారు రెండుఖడ్గములు చేఁబూని యచటికివచ్చి బొమ్మవలె నిలిచిపోయెను. పాములవానివలె నే ఆఖడ్గములు రెండును నేలఁగూలెను.

పాములవాఁడు "నాయనా! ఇదిగో! ఇచ్చెదనుపట్టుకొనుము!" అని అతనికేసి చూపుచు నలిపి నలిపి గవాక్షమునుండి నేలమీఁదికి విసిరివైచి నేలఁ గూలెను.

విజయుఁ డతనిని వెఱ్ఱిగా చూచుచు "నాన్నా, నాన్నా! అమ్మా! పదిలెట్టవే" అని పలవించెను.

అపుడు వెంకయ్యమ్మా రావుగారు రెండు ఖడ్గములు చేఁబూని యచటికివచ్చి బొమ్మవలె నిలిచిపోయెను. పాములవానివలెనే ఆ ఖడ్గములు రెండును నేలఁగూలెను.

సంపూర్ణము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# రాధికా ప్రియలేఖ

సోమంచి వాసుదేవరావు గారు



వ్యాసకర్త

మధురాపురీసతీమధు
మధురాధర పానమత్తమారమణునకున్
గుధరారి పూజ్యచరణున
కుధరాపాలునకు మదనగోపాలునకున్.

క. భయభక్తు లెసఁగ రాధ వి
నయపూర్వ నమస్కృతులు పొనర్చి యనుపఁగాఁ
బ్రియలేఖార్థము లేమనఁ
గ యదూత్తమ! నాఁడు విడిచితిగా నను బృందన్.

మ. "లలనా! నిన్ విడువంగనేర భయమేలా నీకు? నిన్వీడ్చినన్
జలజాస్త్రుండు మనంగ నిచ్చునె ననున్ నానాకఠోరాస్త్రజా
తలసద్వహ్ని శిఖాకలాపముల మ్రందన్ జేసెదున్గాని" యం
చలనాఁ డూఱట నొందఁజేసిననుఁ గృష్ణా! యిట్లు వంచించెదే.

ఉ. "నాతి! భవన్ముఖాంబురుహ నవ్యసుగంధ మరందపాన సౌ
ఖ్యాతిశయంబు నొందెడు మదక్షిమధువ్రత యుగ్మ"మంచు నే
మో తెలుపంగ సాత్త్వికపుమూర్తిగ నెంచితిఁగాని వేఱుగా
నేతువటంచు నెన్నఁడు గణింపఁగఁజాల రమామనోహరా!

మ. "అకటా, నమ్మిన దీపాలంతి నను; నియ్యబ్జాక్షిఁ బాయంగఁ బా
తకమౌనేమొ" యటంచు నెంచ విదియుక్తంబౌనె? శ్రీరామణీ
యకపీయూషతరంగడోలల విహారాపేక్ష వాటించి గో
పికయౌ రాధ ననాథఁ జేసెదె కృపావీక్షావిహీనుండవై?

చ. రహము నహంబు నాక మధురాపురలోల విలోచనా మనో
గృహములఁ బ్రేమమీఱఁగఁ జరించెద వక్కట! కొంకులేక నీ
వు హరి! మదీయరాగ ముడివోయెనె? యింతకె నా మనోధనా
పహరణమున్ బొనర్చితివి భాస్వరధర్మ మెఱుంగనేరవే?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. కాఠిందంబు గలట్టివాఁడవయితే రామానుజా, మన్మథ
క్రీడాలోలత మించెదే హరి, పరస్త్రీయుక్తుఁడై, యక్కటా!
క్రీడాహీనుఁడవైతివే నిజవధూప్రేమాతిరేకంబులన్
గూడన్ జాలనివాఁడవై కట కటా! గోపాల, నిన్నే మనన్?

ఉ. అంగజరూప, నమ్మితిఁగదా, నిను నమ్మినదానికిన్ ఫలం
బుం గని బేలనైతి మును మున్ దనరున్ దనునచ్చుకాంత యి
ట్లుం గడుఁ జుల్కనౌఁగద కఠోరహృదంతర! యెట్లు భీకరా
నంగసుమాంబకానలమునందుఁ దపింపఁగఁ జాలుదున్ హరీ!

ఉ. ఆ యమునానదీపులినమం దల శారద చంద్రచంద్రికన్
వాయుకిశోరవారములు వర్తిల మన్మథనర్తనంబు నా
తో యదువంశవార్ధిశశి! తోరపునెయ్యముఁ దియ్యమొప్పఁగాఁ
జేయవె? యప్పుడే మఱువఁజెల్లునె నీకుఁ దదీయవైఖరుల్.

శా. ఆయారంబుల, నాలతాంతమృదుశయ్యన్ గంధవాహార్భకా
మేయప్రాభవసౌఖ్యముల్ పొసఁగ నెమ్మిన్ సుప్తి నేనుండ మా
యాయుక్తిన్ ననుఁజేరి నా కపుడు బాహాలింగనం బీయవే?
హాయిన్‌గూర్పవె? యప్పనుల్ మఱచితే, హా! వల్లవీపల్లవా?

శా. కాళిందీతటినీతరంగచయ ప్రేంఖద్రాజహంసీ సము
ద్వేలారావసుధాప్రసారములు ప్రీతిన్ గొల్పఁగా గోపికా
జాలంబుల్ వెనువెంటరా నపుడు రాసక్రీడలన్ దేలమే;
హాళిం జెందమె డోలికా విహృతి, దేవా, వల్లవీపల్లవా!

శా. బృందావీథి నికుంజపుంజ విలసద్వేదీస్థలిన్ జంద్రికా
సౌందర్యంబు రహించు యామినుల నిచ్చల్ నిచ్చలున్ నిచ్చ యా
నందం బారఁగ వంశనాళసుధ నానన్ జేయవే గోపికా
బృందంబుల్ సను విశ్వమోహనమహావిద్యాధురీణుండవై.

ఉ. ఓ సరసీజలోచన, వియోగభరానలతాపవేదనన్
నే సహియింపఁజాల నలి నీశరసఖ్యత నొంది యేఁచు న
న్నీ శుకశారికానికర, మీ మలయానిల,మీ పికోత్కరం,
బీశరదాగమాబ్జరుచు, లీయళు,లీసుమపుంజకుంజముల్.

చ. మహితసనందనాదిమునిమానస మానసమానసౌక, రూ
పహసిత భావసంభవ, భవత్పరిరంభసుఖంబు నీఁగదే,
యహితమనోజ, దుర్మదము నాఁగఁగదే; భవదీయసేవ నా
కహరహ మీఁగదే, జలరుహాయతలోచన, పాపమోచనా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# అంబట్ఠసుత్తము

## [అంబష్ఠ సూత్రము]

కె. రంగాచార్యులుగారు, యమ్.ఏ.,బి.యల్.

### ఉపోద్ఘాతము

భారతదేశమున వేయిసంవత్సరముల నుండియు బౌద్ధగ్రంథములఁ బఠియింపు నాచార మంతరించినది. బౌద్ధమతము దేశమున వ్యాపించి ప్రబలమై యున్న కాలములో బౌద్ధ వైదికగ్రంథములను భారతదేశీయులు పఠించుచున్నను బౌద్ధ మతము క్షీణించి తుదకు దేశమునుండి యంతరించినతరువాత నట్టిగ్రంథ పరిచయముఁ జేయువారు దేశమున లేక యుండిరి. బ్రాహ్మణగ్రంథములే దేశమునఁ బ్రబలి రానురాను బౌద్ధగ్రంథములంగూర్చి భారతదేశపుఁ బండితులు తలఁపనైనఁ దలఁపరైరి. బౌద్ధవైదికగ్రంథములు బహుపురాతనంబులును, బహు పూర్వ సాంఘి కార్థిక మతసంబంధములును నైన విషయములంగూర్చి ముచ్చటించునవియు నగుటచే వానిని పఠియింపక నిరాకరించుట దేశచరిత్రముం దెలిసికొన నిశ్చయించువారలకు వలనుపడదు. బ్రాహ్మణగ్రంథములను బౌద్ధగ్రంథములను గలిపి పఠియించినఁగాని పూర్వకాలపుఁ బరిస్థితుల యథార్థజ్ఞానము కలుగదు. బౌద్ధవైదికగ్రంథరచనకాలమును సమముగ నిర్ణయించుటకు వీలులేకపోయినను వానింగూర్చి విద్వాంసులు పాటుపడి యందులోఁ గొన్నిభాగములు రెండువేల మూఁడు వందల సంవత్సరములక్రిందటనే దేశమునఁ బ్రబలి యున్నట్లు స్పష్టమగుచున్నదని వ్రాయుచున్నారు.



వ్యాసకర్త

1. హూణశకమునాల్గవశతాబ్దములోఁ గాంచీపురమునందున్న పండితునిచే "కథావత్తు" అను గ్రంథము అశోకచక్రవర్తి యాస్థానమునఁ బాటలీపుత్రములోఁ గ్రీస్తుజననమునకుఁ బూర్వము మూఁడవశతాబ్దమధ్యమున మొగ్గలిపుత్రుండైన తిస్సునిచే రచింపఁబడినదని యాకాలపుఁ బుస్తకములలో వ్రాయఁబడినట్లు తెలియవచ్చుచున్నది. బౌద్ధులలో తిస్సునిసిద్ధాంతములనుగాక భిన్నసిద్ధాంతముల నవలంబించు బౌద్ధులయొక్క రెండువందలయేఁబది యసత్యాభిప్రాయములను ఖండించుటకై రచింపఁబడినట్లు చెప్పఁబడినది. ఈ"కథావత్తు"అనుగ్రంథమునందుఁ జర్చలన్నియును బూర్వ ప్రమాణముల లక్ష్యీకరించుచున్నవి. అపూర్వప్రమాణములు పాళీ భాషాస్థములై కొలఁదికాలముక్రిందటనే ప్రకటింపఁబడిన పిటకములే! ఈప్రమాణములఁ బరీక్షించి చూచి విద్వాంసులు కథావత్తుకాలమునాఁటికిఁ బంచనికాయంబులు నుండియున్నవనియును నాకాలమునాటికే యయ్యవి మతవిషయంబులను వివాదాంశంబులలోఁ బ్రమాణాంశములుగఁ బరిగణింపఁబడుచుండెడివనియును నిర్ణయించిరి.

(2) హోఫ్రాత్ బ్యూల్హర్, హుల్ట్క్ష్ అను పాశ్చాత్యపండితులు క్రీ. పూ. మూఁడుశతాబ్దములకు ముందు నిర్మింపఁబడిన శాసనములంబట్టి యాకాలము నాఁటికి 'పిటకములు' నికాయంబులు, సత్తాంతములు దేశమున లెస్సగ నభ్యసింపఁబడుచుండెడివని నిశ్చయించిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(3) అశోకుని బ్రహ్మశాసనములో నీపిటకాదిబౌద్ధ గ్రంథములకు నివేదనము లున్నవి. అశోకునికాలము నాఁటి కియ్యవి యుండెననుట నిశ్చయము.

ఈ పైని జెప్పఁబడిన కారణములచేతను, నదితర కారణములచేతను, విద్వాంసులు పిటకాదిబౌద్ధగ్రంథము లశోకచక్రవర్తికాలమునకుఁ బూర్వమే రచింపఁబడిన వనియును, నాకాలమునాఁటికిఁ బ్రాబల్యమును జెంది యుండెననియును నిశ్చయించిరి.

బహుపురాతనములగు నీగ్రంథములలో ననేక స్థలములందు ఆకాలపు సాంఘికార్థికపరిస్థితులంగూర్చిన విషయములు గనుపించుచుండును. ఇట్టివిషయములం బట్టి మనకు పూర్వపరిస్థితులంగూర్చిన విషయములను దెలిసికొనఁగలము. ఈవిషయములు కొన్ని బ్రాహ్మణ ధర్మసూత్రములలోఁ గొన్నిటితో విరోధించుచుండును. బౌద్ధగ్రంథములపరిచయ మింతకాలము దేశమున లేకుండుటంజేసియుఁ, బ్రజలు బ్రాహ్మణమతావలంబకులై యుండుటంబట్టియు,బ్రాహ్మణుల ధర్మసూత్రాదిగ్రంథములే దేశమున వ్యాపించియుండుటంజేసియు, మనకు బౌద్ధగ్రంథములం గనుపించు వచనములు కొన్ని వింతగను, నసత్యములుగను గానుపించును. బ్రాహ్మణ ధర్మసూత్రములలోఁ గానుపించు బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రవర్ణక్రమంబు బౌద్ధధర్మసూత్రాదులయందు క్షత్రియబ్రాహ్మణ వైశ్యశూద్రక్రమంబై కానుపించును. బ్రాహ్మణమతములో బ్రాహ్మణుల కెట్టియగ్రస్థాన మొసంగఁబడినదో, బౌద్ధమతమున క్షత్రియుల కట్టి యగ్రస్థాన మొసంగఁబడినది. దీనినిబట్టిచూడ భారతదేశమున బౌద్ధమతము ప్రబలియున్న భాగములలో, క్షత్రియుల కగ్రస్థాన మొసంగబడిన దేమోయనితోఁచుచున్నది. భోజనవివాహాదివిషయములలో బ్రాహ్మణధర్మసూత్రములలోఁ గానుపించునియమములు దేశమునందున్నవని బౌద్ధసూత్రములవల్లఁ దెలియవచ్చుచున్నవి. బ్రాహ్మణధర్మసూత్రాదులవలన దేశమున బ్రాహ్మణాదులలోను, వర్ణధర్మములం బాటింపక ప్రవర్తించువా రుండెడివారని తెలియఁగలదు. ఈవిషయమును బౌద్ధసూత్రములుకూడ దృఢపఱచుచున్నవి.

బౌద్ధసూత్రములవలన దేశమున నంతకుఁబూర్వకాలముననున్న వృత్తులనుగూర్చియు, వివిధాచారములఁ గూర్చియు మనము తెలిసికొనఁగలము. అంబష్ఠసూత్రమువలన జను లెట్టివృత్తులనవలంబించి జీవనోపాధిని సంపాదించుకొనుచుండెడివారో తెలియఁగలదు. జ్యోతిశ్శాస్త్రమున ననుసరించి, భావిసంభవములను జెప్పి, యాపూర్వకాలమునను జనులు ధనము నార్జించుకొనుచుండెడివారు. ఇప్పుడు ప్రతిగ్రామమునను, నగరమునను, జ్యోతిశ్శాస్త్రజ్ఞులు ధనార్జనముచేయుచున్నారని నేవేఱుగఁ జెప్పనక్కరలేదు. భూతవైద్యచికిత్స, విషప్రయోగచికిత్సాది విషయకశాస్త్రము, తేలుకాటులం గుదుర్చుటకు మందు లిచ్చుట మొదలగువాని నాకాలమున నరులు వృత్తులుగ జేకొనియున్నట్లు కానుపించుచున్నది.

నాటకప్రదర్శనములు, నాట్యములు, గానము, ఆఖ్యానములు, మల్లయుద్ధములు, గొఱ్ఱెపోతుపందెములు, కోడిపందెములు, లావపక్షి యుద్ధములు మున్నగునవి యాకాలపు నరులకును సంతోషమును గలుగఁజేయుచుండెడివి. ఈవిషయములోఁ బ్రపంచ మెంత స్వల్పముగ మారినది! ఇప్పటికిని యీయీ ప్రదర్శనముల యందు నరు లెట్టియానందముం బొందుచున్నారు!! ఇప్పటి సర్కస్సులనుబోలు 'ఈటివిద్యలఁజేయువారు' ఆకాలమునఁ బ్రదర్శనముల నిచ్చి ధనార్జనం జేయుచుండెడివారు. ఈటివిద్యచేయువారు చండాలురని చెప్పఁబడినది. ఆకాలమున నీజాతివారే యీవృత్తి నవలంబించుచుండెడివారేమో?

ఆకాలమున నుండెడిబాలురు, యువకులు, గతయౌవనులునుగూడ నేయేయాటల నాడుచుండెడివారో యీసూత్రములవలనఁ దెలియవచ్చుచున్నది. ఇప్పటికిని దేశమున నీయాటలు కనుపించుచున్నవి. చతురంగము—దీని ననేకవిధములుగ నాడుచుండెడివారు. లాక్షాద్రవములో వ్రేళ్లనుముంచి కోరినచిత్రములను భూమిపై వ్రేళ్లనుగొట్టి ముద్రించుట. ఈయాట యిప్పుడును దేశమున నున్నదేమో తెలియదు. కందుకములతో నాట లెట్లుండెడివో తెలియరాదు. ఇప్పటికిని మనబాలురును,బాలికలును నీసూత్రమునందుఁ జెప్పఁబడిన యాటలవంటి యాటల నాడుచున్నారు. గర్లు మున్నగునవి భూమిపై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీసి బాలురును, బాలికలును నొంటికాలిపై మధ్యరేఖలను దాకకయే గెంతియాడుదురు.

దుప్పట్లు, కంబళ్లు మున్నగు వస్త్రములలో భేదములెన్నియో యిందు నిరూపింపఁబడినవి. వస్త్రములను సింహవ్యాఘ్రాది చిత్రములచే శోభితములుగ నొనర్చి వాడుక యాకాలమునందు నుండెడిది. వివిధములగు పర్యంకములను, నాసందులను, కేళీశయ్యలను ప్రజలు సామాన్యముగ నుపయోగించుచుండెడివారు. ఆసంది వాజపేయయాగమునందును నభిషేకసమయమునందును గూడ నుపయోగింపఁబడునని శతపథబ్రాహ్మణమువలనఁ దెలియవచ్చుచున్నది. కంబళులలో నొక్కప్రక్కనే యున్ని గలిగియుండునవి కొన్నియును, రెండుప్రక్కల యందునున్నిఁ గలిగియుండునవి కొన్నియును జేర్కొనఁబడుచున్నవి. అజచర్మములతో దుప్పట్లను జేయుచుండెడివారు. ఇట్టివానిని శీతలప్రదేశములలోఁగాని యుష్ణప్రదేశములలో నుపయోగించుటకు వీలులేదని స్పష్టము.

ప్రజలు దేవతలకు మ్రొక్కుకొనుటయు మనము కనుచున్నారము. ఏదియైన లాభముం గోరికాని దేహమునం దస్వస్థత యున్నప్పుడు కాని జనులు పూర్వమును మ్రొక్కుకొనుచుండెడివారని యీసూత్రమువలన స్పష్టము. భావిసంభవములం గూర్చికాని, చౌర్యమున్నగు జరిగిన చోరవిషయములం గూర్చికాని తెలియఁగోరిన నాభిచారికాదర్శములలోఁ జూచుటయు, దేవతపట్టిన కులీనలగుకన్యలఁ బ్రశ్నించియు, దేవదాసీలను బ్రశ్నించియుఁ దెలిసికొనుటకు వీలుపడునని నమ్మక మిప్పటికిని దేశమునఁ బ్రబలియున్నది.

ఆకాలమున శస్త్రచికిత్సయు, నేత్రచికిత్సయు, శిశుచికిత్సయుఁ జేయువారు వేఱువేఱుగ నుండెడివారేమోయని తోచుచున్నది. చికిత్సకులు కన్నులలో కలికము వేయుటయు, నాసికలోఁ బసరుపోయుటయుఁ, గంటిజబ్బులకుఁ గాటుక పెట్టుటయు నీకాలమునను నాయుర్వేదమునననుసరించి చికిత్సచేయువారు సామాన్యముగఁ జేయుచుండుటఁ గనుచున్నారము.

ఆకాలమున శత్రువులకు దేహకష్టముల నాభిచారికమంత్రప్రయోగములచేఁ గలుగఁజేయుటకు వీలగునను నమ్మకము ప్రజలలోఁ బ్రబలియున్నట్లు కానిపించుచున్నది. అథర్వణవేదములో నెన్నియేని యట్టిప్రయోగములు చెప్పఁబడినవి. ఇప్పుడును మన మిట్టివానిని గనుచున్నారము.

ఈ యంబష్ఠసుత్తము వర్ణవిషయములంగూర్చి చర్చించుసుత్తములలో నొక్కటి. బ్రాహ్మణులయౌత్కృష్ట్యముంగూర్చి యీ సూత్రరచనాకాలములో వివాదలు విస్తారముగ జరుగుచుండెడివని మనమూహింపవచ్చును. ఇంతవిస్తారముగ మఱియెట్టియితరసాంఘిక విషయముంగూర్చియుఁ జర్చ కావింపఁబడియున్నట్లు బౌద్ధపుస్తకములవలనఁ దెలియరాదు. బుద్ధుఁడు బీదలయొక్కయు నీచజాతులయొక్కయు నుద్ధరణముకొఱకుఁ బాటుపడి వర్ణవిభాగములఁ జాలవఱకు నశింపఁజేసెనని చెప్పుట సత్యవిరుద్ధము. మఱియు సంఘనాయకులలో ననేకులు యుక్తమైనవిద్యలం గఱచి శిక్షితులైనయగ్రవర్ణజులును, ధనికకుటుంబములం బుట్టినవారలు నగుటచే బుద్ధుఁడు నీచజాతులను నిర్ధనులను నుద్ధరింపకయే నిరాకరించెనని బుద్ధుని నిందించుటయు సత్యవిరుద్ధమని రిస్ డేవిడ్సుదొరవారు వ్రాయుచున్నారు. ఆకాలమునందున్న వర్ణపరిస్థితు లెట్టివియో పరిశీలించినఁగాని సత్యము ప్రకటింపఁబడదు. ఇప్పటివలెనే యాపూర్వకాలమున దేశమందంతటను వర్ణములుండెడివని యూహించుటకు వలనుపడదు. ఇప్పుడు వర్ణములంగూర్చి భిన్నభిన్నాభిప్రాయంబు లున్నవి. వర్ణములసిద్ధాంతములు అన్యోన్యవిరుద్ధములై పరిస్థితులతో సరిపోకయున్నవి.

వివాహవిషయములలోను, భోజనవిషయములలోను వివిధవర్ణములకు ననుల్లంఘనీయభిన్నాచారములు గలవనునది స్పష్టము. ఒకవర్ణమువారింకొకవర్ణమువారితో భోజనముచేయకపోవుటయు వివాహసంబంధములం గలుగఁజేయకుండుటయు, దేశమున సామాన్యముగఁ గనుచున్నారము. ఇట్టివిషయములలో దేశమున వివిధభాగములలో వివిధాచారములు గనఁబడుచున్నవి. ఇట్టియాచారములలోఁ గాలక్రమమున నెన్నియేని మార్పులు గలుగుచున్నవి. ఇట్టివైవాహిక నియమములు భారతదేశమునం దార్యులలోనేకాక రోమనులలోఁ గూడ నుండెడివని చరిత్ర నుడువుచున్నది. భారతీయుల సహభోజనవైవాహికనియమములఁబోలు నియమములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యవనులు, రష్యాదేశస్థులు మున్నగువారిలోఁ గాన్పించుచున్నవని పండితులు వ్రాయుచున్నారు. బ్రాహ్మణుల వర్ణోత్కృష్టత్వము రాజ్యధనాదిసంబంధము కాక మత సంబంధమగుటచే నింతకాలమువఱకును నట్టి యౌత్కృష్ట్యము సంపూర్ణముగ నంతరింపకుండఁ గొంతవఱకైనను మిగిలినది. పురోహితులకును, రాజన్యాది తదితరులకును మనదేశముననేకాక తదితరదేశములలోను జాత్యౌత్కృష్ట్యము కొఱకు వివాదలు జరిగియున్నట్లు స్పష్టము. ఈసూత్రము లుదయించిన కాలములో బ్రాహ్మణులకును దదితరవర్ణములవారికిని వర్ణాగ్రతకు వివాదలు జరుగుచుండెడి వని నిశ్చయము. అంబట్ఠసుత్తములో క్షత్రియవర్ణమే యగ్రవర్ణ మని చెప్పఁబడినది. బౌద్ధులు బ్రాహ్మణులయందలి ద్వేషముచేత నిట్లు వ్రాసియుండిరని చెప్పుట యసమంజసము. ఆ కాలమునాటికి బ్రాహ్మణు లగ్రవర్ణస్థులుగ నన్నిచోట్లను బరిగణింపఁబడుచుండలేదనుట యుక్తముగ నుండును.

బౌద్ధగ్రంథములును బ్రాహ్మణధర్మ గ్రంథములవలెఁ జాతుర్వర్ణ్యముం జేర్కొనుచున్నవి. బ్రాహ్మణధర్మసూత్రాదులలోఁ గానుపించు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రక్రమంబు బౌద్ధపాళీగ్రంథములలో క్షత్రియబ్రాహ్మణ వైశ్యశూద్రక్రమంబుగ మారినది. ఇందుచే క్షత్రియులు బ్రాహ్మణుల యౌత్కృష్ట్యము నంగీకరింపలేదని స్పష్టము. ఎద్దులన్నియుఁ బసువర్ణములో నొక్కజాతికే చెందియుండుటచే వానిలో నొకదానికిని నింకొకదానికిని భేదమేమియు లేకపోయినను, వర్ణముచేతను జవసత్వముచేతను సురక్షితంబై యుండుటచేతను నొక యెద్దింకొక యెద్దుకంటె శ్రేష్ఠమైనదిగ నెట్లెన్నఁబడుచున్నదో యట్లే దానములిచ్చునప్పుడును, దానప్రతిగృహీత క్షత్రియబ్రాహ్మణవైశ్యశూద్రవర్ణస్థుఁడనికాని, పుల్కస, చండాల వర్ణములకుఁ జెందినవాఁడనికాని యోచింపక, యనలసుండును, ప్రాజ్ఞుండును, వివేకవంతుండును నైనవాని దానపాత్రునిగ యోచింపవలయునని యంగుత్తరనికాయమునఁ జెప్పఁబడినది. పుల్కసులును, జండాలురును జాతుర్వర్ణ్యములకుఁ జెందినవారు కారనియు, సంకరజాతివారనియును మన్వాదిస్మృతులలోఁ జేర్కొనఁబడినది. పుల్కస చండాలురుకాక వేణులు, నిషాదులు, రథకారులు గూడ నీగ్రంథములో హీనజాతివారలని చేర్కొనఁబడిరి ఈహీనజాతివారలనేకాక పాళీగ్రంథములు హీనశిల్పముల నభ్యసించి జీవించువారలని దంతువాయకులాల చర్మకారనపితకటకారులఁ జేర్కొనుచున్నవి. జన్మచే వారివిభిన్నత్వము పరిగణింపఁబడియుండకపోవుటచే నిట్టిహీనశిల్పములను హీనజాతివారలైన నవలంబింపవచ్చునని స్పష్టమగుచున్నది. పుత్రునకు జనకునివృత్తి నవలంబించుట సాధారణధర్మమగుటచేఁ గాలక్రమమున వేఱు వేఱుశిల్పముల నవలంబించువారందఱును నొక్కవర్ణమునకుఁ జెందియున్నట్లు పరిగణింపఁబడుదురు. ఈరీతిగనే వర్ణము లేర్పడియుండునని రిస్ డేవిడ్సుదొరవారు వ్రాయుచున్నారు.

ఇప్పటివలె బుద్ధునికాలమునాఁటికి వర్ణములవిభాగము లనుల్లంఘనీయనియమములతో నుండెనని చెప్పుటకు వీలులేదు. అట్టిపరిస్థితులున్నప్పుడు బుద్ధుఁడీవర్ణవిభాగముల నేరీతిగఁ బాటించెనో మనము పరీక్షించి చూచుట బోధావహంబైయుండు. మొదట బుద్ధుఁడు సన్న్యాసులుకాక సంసారులయ్యు బౌద్ధమతము నవలంబించిన వారలవిషయములో వర్ణవిభాగములంగూర్చి యెట్లుప్రవర్తించెనో, మఱియు సంసారము విడనాడి, పరివ్రాజకులై, శ్రమణులైనవారల వర్ణవిభాగవిషయమై యేరీతిగఁ బ్రవర్తించెనో, మనము పరీక్షించిచూతము.

బహుపురాతనంబగు 'ఆమగంధసుత్తంబు'న కస్సపబుద్ధుఁడు మనుజున కపవిత్రత భోజనమువలనఁగాని, హీనజాతివారలిచ్చినభక్ష్యములం దినుటవలనఁగాని కలుగదనియును, దుష్టవాక్కులవలనను, దుష్టచింతనలవలనను, దుష్టకర్మములవలనను గలుగుననియును జెప్పెను. ఈసూత్రమునం దాబుద్ధుఁడీయుద్దేశములు పూర్వాచార్యులచేఁ బ్రకటింపఁబడినవని నుడివెను. అందు కస్సపబుద్ధుఁడు బుద్ధునకుఁ బూర్వుఁడు. బుద్ధుఁడిట్టియుద్దేశములఁ దనవని యెచటను జెప్పక యయ్యవి స్వయంప్రకాశములైనట్లును, పూర్వాచార్యులచేఁ బ్రకటింపఁబడినట్లును జెప్పివిడుచుచుండును.

ఎట్టివాఁడు బ్రాహ్మణుఁడుగఁ బరిగణింపఁబడవలయునో వాసెట్ఠుండను బ్రాహ్మణయువకుఁడు తెలియఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



విష్ణు శాంతెయందలి లక్ష్మీనరసింహ దేవాలయమున
సుఖనాసిపైగల గరుడవిగ్రహము-మైసూరురాజ్యము



తిరువాంకూరు మహారాజాగారు
పదువాల్గవ జన్మదినోత్సవమున దీసిన ఛాయాచిత్రము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గోరి బుద్ధునిఁ బ్రశ్నించెను. బుద్ధుఁడు వృక్షముల లోను, పక్షులలోను, ఉరగములలోను, జంతువులలోను వేర్వేఱుచిహ్నములచేఁ దెలియనగు వివిధజాతులైన నున్న వనియును, మనుజులలో మాత్ర మట్టి విశిష్టచిహ్నము లెవ్వియు మనుజులలో మనుజులకు భేదము లేర్పఱచు టకై కానుపించ వనియును నుడువుచు, మనుజులలోఁ గావింపఁబడు భేదములు అవిచారమతివలనను, ఆచార ములవలనను గలుగుచున్న వనియును, సదాచరణవివేక ములే మనుజుని బ్రాహ్మణుని నొనర్పందగు విశిష్టచిహ్న ము లనియును, గాన నర్హతుఁడే నిశ్చయముగ బ్రాహ్మ ణుఁ డనియును, జ్ఞానహీనులే జన్మవలననే నరుండు బ్రాహ్మణుఁడు కావలయునని నుడువుచున్నా రనియు దృఢముగఁ జెప్పెను.

మధురసుత్తమునందు మధురపురపాలునకును, కచ్చానునకును నొకవివాదము జరిగెను. అందు నాభూ పాలకుఁడు "కచ్చానుఁడా! బ్రాహ్మణు లిట్లు చెప్పుచు న్నారు: 'చాతుర్వర్ణ్యములోను బ్రాహ్మణులె మొదటి వారై యున్నారు. బ్రాహ్మణులు శ్వేతవర్ణులు; తదిత రులు కాలవర్ణులు; బ్రాహ్మణులే శ్రేష్ఠులును, బవిత్రు లును. తదితరులు నపవిత్రులుగఁ బరిగణింపఁబడుట లేదు. బ్రహ్మముఖమున సంభూతులై, బ్రహ్మచే విశిష్టముగ సృజింపఁబడి, బ్రహ్మాంశభాక్కులై, బ్రహ్మపుత్రులైన వారు'—ఇందులకు నీవేమి చెప్పెదువు, ఆర్యా?" అనెను. అంతకచ్చానుఁడానరపాలునితో చాతుర్వర్ణ్యములో నే వర్ణమునకుఁ జెందినను నరుండొకఁడు ధనసంపన్నుండైన నట్టివాఁడు మిగిలిన మూఁడువర్ణములకును జెందినవారల సేవకులుగ నియమింపఁగలఁడనియును, బాపములంజేయు వాఁడేవర్ణమునకుఁ జెందినను బౌద్ధులచేతనేకాక సర్వ సామాన్యముగ సత్పురుషులచేఁ బ్రకటింపఁబడు కర్మ సిద్ధాంతానుసారముగఁ గష్టభూయిష్ఠమగు పునర్జన్మముం గాంచుననియు, సత్పురుషుం డేవర్ణమువాఁడైనను బర మానందముం బొందుననియు, దుష్టకార్యములం జేయు వాఁడేవర్ణమునకుఁ జెందినను దండితుఁడగుననియును, నేవర్ణమువాఁడైనను సంసారమును బరిత్యజించి పరి వ్రాజకుండైన నట్టివాఁడు ప్రజలచేఁ బూజింపఁబడు చున్నాఁడనియును జెప్పుచు బ్రాహ్మణుల వర్ణసిద్ధాంత మును ఖండించెను. ఇట్లు బ్రాహ్మణవర్ణసిద్ధాంతములను ఖండించి బుద్ధుఁడు జనులకు విచారయుక్తములైన యుద్దే శములఁ బ్రకటించి వారియుద్దేశముల మార్పుఁజెందింపఁ బ్రయత్నించెను.

బౌద్ధసంఘమునుజేరి భిక్షువులైనవారిలో జాతి భేదములుగాని వర్ణభేదములుగాని పాటింపఁబడుచుం డుట లేదు. భిక్షువులకు వర్ణవిభాగములలో నెట్టి సంబంధమును లేదు. ఏజాతివాఁడైనను జ్ఞానసచ్ఛీల సంపన్నుఁడైన యట్టివాఁడు బౌద్ధభిక్షువు కావచ్చును. ఇందుల కుదాహరణములుగ మనము బౌద్ధసంఘము లో విఖ్యాతిఁజెందిన యుత్తమభిక్షువులం జేర్కొన గలము. "వినయ" (అనగ సంఘనియమములు) విషయ ములో బుద్ధుని పిదప బుద్ధునంతవాడుగఁ బరిగణింపఁ బడు నుపాలియనునాతఁడు సంఘమునఁ జేరకపూర్వము మంగలివాఁడై యుండెను. సునీతుఁడనువిఖ్యాతిఁజెందిన భిక్షువు బౌద్ధుఁడు కాకపూర్వము పుల్కసుఁడై యుం డెను. నందుఁడను ప్రసిద్ధిగాంచిన భిక్షువు పూర్వాశ్ర మములో గోపాలుఁడు. పుణ్ణ పుణ్ణిక లను నిద్దఱు బౌద్ధ భిక్షిణులు పూర్వాశ్రమములో దాసులై యుండిరి. బ్రాహ్మణధర్మశాస్త్రములు ద్విజన్ములకే సన్న్యాసా శ్రమస్వీకారాధికారము నొసంగుచున్నవి. అట్లయినను శూద్రాదులకు సంసారమును బరిత్యజించి, సన్న్యసించి, మునివృత్తి నవలంబించి ముక్తింగనుట కధికారము నిషే ధింపబడియుండెడిదని నమ్మఁజాలము. ఏజాతివాఁడై నను సంసారసౌఖ్యములయందు విముఖతంజెంది జ్ఞానియై సన్న్యసించువాని నడ్డినవారుగాని యడ్డఁగలవారు గాని యెవరు?

(సుత్తము) (సూత్రము)

1. ఇట్లె వింటిని: ఒకప్పుడు బహుసంఖ్యాకు లగు భిక్షుకులతోఁగూడ భాగవతుఁడు కోసలదేశములోఁ బర్యటనముఁ గావించుచు నొకపర్యాయము కోసలదేశం బునందున్న యిఛ్ఛానంకలం బను బ్రాహ్మణాగ్రహారము నైదుపందలమంది భిక్షుకులతోఁ జేరెను. అచ్చోట నిఛ్ఛా నంకలవనంబున వాసము చేయుచుండెను.

ఆసమయమున పౌష్కరసాదియను భూసురుండు వృక్షావృతంబును, వనభూమియుక్తంబును, ధాన్యపశ్వాది



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమృద్ధిమంతంబును నగు ఉక్కఢయను ప్రదేశంబు కోసలాధిపుఁడైన పసెనడి నరపాలునిచే సర్వస్వామ్యములతోఁ బ్రసాదింపఁబడుటవలన దానికిఁ బ్రభువై యందుఁ గాపురము చేయుచుండెను.

2. పౌష్కరసాదిభూసురుఁడీ (భాగవతునిరాకఁ గూర్చిన) వృత్తాంతము వినెను: "శాక్యుండైన శ్రమణ గోతముఁడు పరివ్రాజకుండగుటకు శాక్యకులంబును ద్యజించి, తనసంఘమునకుఁ జెందినబహుభిక్షుకులతో నిఖానంకలంబునుజేరి యిఖానంకలవనంబులో వసియించుచున్నాఁడు. పుత్రుండగు నాగోతముని సుయశస్సెల్లెడల వ్యాపించినది. ఈరీతిగ మనుజులముఖములఁ బ్రవర్తించుచుండుభాగవతుఁడు అర్హతుఁడును, ప్రబుద్ధుఁడును, సుజ్ఞానియుఁ, బుణ్యాత్ముండును, సర్వలోకజ్ఞానయుక్తుండును, సత్పథములం గోరువారల నట్టిమార్గములకుం గొంపోఁ గలవాఁడును, దేవ మానవులకు గురువును, బ్రబుద్ధుండును నైయున్నవాఁడు. ఆతఁడితరులసాయము లేకయే బ్రహ్మమారోర్ధ్వలోకంబులను, రాజ ప్రజా బ్రాహ్మణ పరివ్రాజకాదియుక్తం బగు నధోలోకంబులను లెస్సఁగఁ బరికించి, యేతజ్జ్ఞానయుక్తుండై యాజ్ఞానము నితరుల కొసంగుచున్నాఁడు. జన్మప్రవృత్తిసమాప్తియందలి మనోహరంబగుసత్యంబును సమగ్రముగఁ బ్రకటించుచు నుత్తమజీవనముయొక్క పూతత్వమును సమూలముగఁ దెలియఁజేయుచున్నాఁడు.

మఱియు నట్టియర్హతుల దర్శించుట శ్రేయోదాయకము.

3. ఆకాలమునఅంబష్ఠుఁడైన బ్రాహ్మణయువకుఁ డొకఁడు బ్రాహ్మణుఁడైన పౌష్కరసాదియొద్ద విద్య నభ్యసించుచుండెను. మఱియు నాతఁడు త్రివేదవేదాంగజ్ఞానసంపన్నుఁడై, శ్రౌతజ్ఞానయుక్తుండై, యథర్వణవేదంబును బఠియించి, యితిహాసంబులనారిజేరి, లోకాయతికసిద్ధాంతంబునఁ బ్రావీణ్యతఁజెంది, సర్వశాస్త్రంబుల నభ్యసించి, మహాపురుషచిహ్నవిషయికసిద్ధాంతంబుల గుర్తెఱింగి, గురుబోధితత్రివేదవేదాంగాది శాస్త్రజ్ఞానంబున "నాకుఁ దెలిసిన దంతయుఁ దమకుఁ దెలియును, తమకుఁ దెలిసిన దంతయు నాకును దెలియును" అని యాచార్యునితోఁ జెప్పఁగలిగినంత ప్రవీణుఁ డయ్యెను.

4. పౌష్కరసాది యంబష్ఠునితో నీవృత్తాంతమును జెప్పుచు నీరీతిగ వివరించెను:"ప్రియుఁడవైన యంబష్ఠా! ఇటురమ్ము; నీవు శమణుండైన గోతముని యొద్దకుంజని ప్రపంచమున వ్యాప్తింజెందిన యాతనియశముఁ జెప్పుచుండినట్టివాఁడో,ప్రజ లాతనిఁగూర్చి చెప్పుచున్నటుల శమణగోతముం డన్నవాఁడో కనుఁగొనిరమ్ము."

5. "ఆర్యా!అయ్యది నేనెటుల తెలిసికొనఁగలను?" "ఓయీ! అంబష్ఠా! మనమంత్రములలో మహాపురుషుని ముప్పదిరెండు చిహ్నములు నిరూపింపఁబడినవి. అట్టి చిహ్నములుగల నరుండు (ఈక్రింద సూచింపఁబడు) రెండుఅవస్థలలో నెద్దానినైన నొక్కదానిని జెందవలయును. అట్టివాఁడు సన్యసింపక గృహస్థాశ్రమంబున నుండిన చక్రవర్తియై, ధర్మపరిపాలకుండై, చతుస్సముద్రపరివృతరాజ్యంబునకు స్వామియై,జగజ్జేతయై,ప్రజారక్షకుండై, సప్తరాజధనములం గలిగియుండును.ఆసప్తరాజధనంబు లెవ్వియనిన: చక్రమును, గజమును, అశ్వమును, మణియు, యువతియుఁ, గోశాధ్యక్షుండును, నమాత్యుండును; మఱియు నట్టివాఁడు శత్రుసేనలఁ జెండాడు పృథుబలశాలు లగు సహస్ర పుత్రులం గలిగియుండు. మహాసముద్రపరివేష్టితభూతలాధిపుండై, దండకృపాణముల విడనాడియె సుధర్మమున నట్టిసామ్రాజ్యమును బాలించుచుండు. అట్టివాఁడు సంసారమును విడనాడి పరివ్రాజకుండైన లోకాజ్ఞానమును బోఁగొట్టు ప్రబుద్ధుండగు.ఓయీ! అంబష్ఠా! నేనే తన్మంత్రదాతను; నీవు నావలన వాని నభ్యసించితివి."

[సశేషము]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# కర్ణుని మనోనిశ్చయము

బళ్లారి కృష్ణప్పగారు


వ్యాసకర్త

సంసారపూరుఁడై సత్సదాచార్యుఁడై
గ్రీష్మార్కుఁడై వెల్గు భీష్ముఁడుండ
దక్షుఁడై కోదండ శిక్షకాచార్యుఁడై
దోర్దర్పమునఁ గ్రాలు ద్రోణుఁడుండ
పూజాగ్రగణ్యుఁడై రాజన్యమాన్యుఁడై
కీర్తిచే విలసిల్లు కృపుఁడునుండ
శస్త్రాస్త్రవేదియై శాత్రవభేదియై
దాంతుఁడై శోభిల్లు ద్రౌణియుండ

శౌర్యధుర్యులు తమ్ములు సఖులునుండ, నిండుప్రాయంపుఁ గొమరులు దండనుండఁ
గొలువులోపల రారాజు కూర్మి నన్నుఁ-బెద్దగాఁ జూచునరునకు నుద్దియనుచు.

చ. మగలమగండు కర్ణుఁడని మాన్యునిఁజేసిన చక్రవర్తికిన్
దిగులు నశింప రౌద్రమున దివ్యశరాసన బాణపాణినై
పొగడ నృపాలకోటి మెదఁ బొక్కఁ-పడన్ సురకోటి భీతిచే
వగవగ వేల్పుమేటి పడవైతుఁ గిరీటిని సంగరంబునన్.

క. సతమై, సజ్జనవితతికి-హితమై, యౌదార్యపటిమ కిరవై, ధరలో
నుతికెక్క నాస్వధర్మము - పతికొఱ కర్పింతు, నొంతుఁ బార్థునిఁ గడిమిన్.

సీ. భారతసాధ్వీకుమారుండు గాకున్న ముద్దులుగులుకునే మోముసౌరు
భువనబాంధవునకుఁ బుత్రుండు గాకున్న దిశల శోభిల్లునే దేహకాంతి
చాపనైపుణి శార్ఙ్గచాపుండుగాకున్నఁ బ్రజ్వరిల్లునె భూరిబాహురుచులు
శత్రుల నుఱుమాడు శౌర్యుండు గాకున్న బెడిదమై వెడలునె నుడులతీవి
అనుచుఁ గురురాజు ననుఁగూర్మి నాదరించి-యంగసీమాంగనామణి కధిపుఁజేసె
నిట్టి చెలికాని మనిచిన యట్టివాని-వదలిరమ్మంచు శ్రీహరి పలుకఁదగునె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. మేధాశూన్యతఁ బాండునందనులతో మెల్గంగ నేఁ బోయినన్
రాధామాత యశంబు పోదె? యిలపై రారాజు జీవించునే
యోధుల్ దూఱరె? రాజులెల్ల నగరే? యుర్వీజనుల్ దిట్టరే?
వేర్పన్ గాంచిన వన్నెకాని పలుకుల్ విశ్వాసపాత్రంబులే?

శా. సామాన్యుండని సంశయింపక మహాసామ్రాజ్య మర్పించి భూ
వ్యోమంబాదిగ నాయశంబు వెలుఁగన్ బోషించె రారాజు; నే
నీమేటిన్ విడనాడ ధర్మమగునే మొదైన మేలున్నదే
స్వామిద్రోహికి, నాతతాయికి, సదాచారోపసంహారికిన్

మ. తెలిపెన్ భానుఁడు గూఢజుండవని; గుంతీదేవియున్ జెప్పె; శ్రీ
లలనానాథుఁడు నేఁడుపల్కెఁ బడిపోర్లన్ నేను దుఃఖాంబుధిన్
పలుకుల్ వేయును నేల? పాండవులతో బాంధవ్యమున్ గూడునే?
చలమొప్పన్ విహరింతు సంగరమునన్ జక్రాంకుఁ డౌనౌ ననన్.

శా. "కౌంతేయుండవు గావె కర్ణ! యనుజుల్ గారే పృథానందనుల్
భ్రాంతిన్ వీడి సహోదరాదిజనులన్ బాలింప రమ్మంచు, శ్రీ
కాంతుం డాడెఁ దలంపఁ బాండుసతికిన్ గారుణ్యావాక్పేటికిన్
గుంతీదేవికి శుభ్రకీర్తి గలదే, కూడంగ నే ధర్మజున్?

ఉ. హాయన దివ్యవాణి, యొహొహోహోయన నింద్రునిరాణి, భీతి నా
హాయన గుంభినీరమణి; యబ్బురమొంద రథాంగపాణి, వే
కూయుచు నుండగా ద్యుమణి కుండలయుగ్మము వజ్రవర్మముల్
గాయముఁ జీల్చియిచ్చితిని కౌతుక మందఁగ వజ్రపాణికిన్.

క. చల్లన్ బువ్వులు దివ్యులు, సల్లాపము లాడ మునులు, సత్కీర్తులు శో
భిల్లన్ భూమిన్ వెలిఁగితి, ఫుల్లాంభోజాక్షుపురము పొంతన్ లేదే?

ఉ. సుందరమందహాసరుచిశోభిలు ముద్దుమొగంబువాఁడు, నా
నందము చిందులాడు నయనంబుల భక్తులఁ జూచువాఁడు, గో
విందుఁడు, నందనందనుఁడు, విష్ణుఁడు ప్రోవఁడె ధర్మరక్షకై
ముందు శరీరమిచ్చు ఘనపుణ్యులఁ బూర్ణవదాన్యశీలురన్.

మ. బలవంతుల్ ద్రుపదాది బంధుజనముల్ ప్రాపైరి గెల్పింపఁగాఁ
దలఁపన్ నిల్చెను వారిపొంత సతమై ధర్మంబు వీక్షింపఁగాఁ
గలఁ డాదిక్కున మాధవుండు హితుఁడై కామ్యార్థముల్ దీర్పఁగాఁ
గెలువన్ వచ్చునె వారినైన దివిజుల్ గీర్తింపఁ బోరాడెదన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




౧. మహాబోధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




3. మహాబోధి సంఘారామము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౮. మహాబోధి దేవాలయమునకు ఆధారకుడ్యము



బోధివృక్షము క్రింద తప
మాచరించుచుండు శాక్యముని



ధర్మరాజగురుని తామ్రఛత్రము
౯ వ చిత్రము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# బుద్ధగయ

కె. నరసింహాచార్యులు గారు

జగద్విఖ్యాతివహించిన బౌద్ధపుణ్యక్షేత్రములు నాలుగు. అవి: (1) బుద్ధుని జన్మభూమియగు కపిలవస్తు; (2) తపోభూమియగు బుద్ధగయ; (3) బుద్ధుడు ప్రథమమున ధర్మోపదేశమొనరించిన కురంగారామమను సారనాథు; (4) నిర్యాణ మొందినకుశనగరము. ఈ క్షేత్రములలో నొక్కొక్కటియు పదునైదుశతాబ్దములవఱకు నానాదేశాగతబౌద్ధయాత్రికమహాసాగరమునకు రాకాసుధాంశునిభంగి యుత్సాహదాయకమయి ప్రకాశించి స్వదర్శనలాలసమగు భక్తసముద్రము నుప్పొంగఁజేసి, పక్షాంతమున కృశించు శీతభానునిభంగి కృశించి కాలవశమయి నశించినది. తపోభూమియగు బుద్ధగయమాత్రము హిందువులకు గూడ నాదరణీయక్షేత్రముగా నేర్పడినకారణమున తక్కిన క్షేత్రములవలె సంపూర్ణనాశము నందక తనపురాతనప్రతిభ నొకకొంత నిలుపుకొన గలిగెను.

బుద్ధగయ కుత్తరమున హరిహరపురమును, పశ్చిమమున మస్తిపురము, ధోండొవా, భులువ, తురిగ్రామములును, దక్షిణమున రామపురమును, తూర్పున లీలాజనము, లేక నైరంజనానదియు యెల్లలు. నైరంజనానది బుద్ధగయ కొకమైలుదూరమున మోహనానదితో సంగమించి ఫల్గ్వాఖ్యను ప్రవహించుచున్నది.

## స్థలచరిత్రము

బుద్ధగయ ప్రథమమున ఊర్విలయను నొకగ్రామము. ఉత్తరమున ప్రేతశిలయను కొండనుండి దక్షిణమున బోధిద్రుమమువఱకు నుండు పదుమూడుమైళ్ల విస్తారమగు భూమి కంతయు గయయని సమష్టినామ ముండెను. అందు ఊర్విలగ్రామమునకు బుద్ధగయయనియు, హిందువుల ప్రాబల్య ముండినప్రదేశమునకు విష్ణుగయ, బ్రహ్మగయ, లేకగయయనియు, మరియొక భాగమునకు రామగయయనియు స్థలవ్యవస్థ కావింపఁ బడెను.

ఊర్విల నైరంజనానదీపార్శ్వమున నానావిధతరుగుల్మలతాసమృద్ధిగల వనములచే నిండియుండెను. కీకటరాజ్యాధిపతి గయయందును, తత్సేనాని ఊర్విలయందును ఉండి రాజ్యపాలన మొనరించుచుండిరి.

ఊర్విలయనగా ఉరస్ + విల్వ, ఉన్నతమగు బిల్వమని యర్థమునిచ్చుపదముగా నుండుట చూడ ఊర్విల ఉన్నతబిల్వవృక్షములతో నిండిన వనములుండిన గ్రామమని తోచుచున్నది.

ఉరు + వేల యని పదవిచ్ఛిత్తిచేసిన నైరంజనానది యొక్క గొప్పఇసుకగట్టులపైనుండిన గ్రామమని కూడ అర్థమగుచున్నది. ఊర్విలకు సమీపముననే గయశీర్షమను నామాంతరముగల బ్రహ్మయోనియను కొండసానువున గయయను భాగము కలదు.

## గయాసురుని కథ

వాయుపురాణమున గయామాహాత్మ్యశీర్షికక్రింద గయవృత్తాంతకథ యొకటి కలదు.

సృష్టికర్తయగు బ్రహ్మ జీవకోటుల సృజించుచు తామసగుణభూయిష్ఠుడైన కాలమున రాక్షసులను సత్వగుణుడైన కాలమున దేవతలను సృష్టించెను. రాక్షసులలో గయాసురుడు కడుబలవంతుడు. వాని శరీరోన్నతి 125 యోజనములు; నడుముకొలత 60 యోజనములు. గయుడసురుడైనను విష్ణుభక్తుడు. వాడు కోలాహల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పర్వతముపై నొకవేయిహాయనములు ఘోరతప మాచరించెను. వాని తపోవహ్నివల్ల దేవతలు బాధల నొందిరి. అంత దేవతలందఱును బ్రహ్మపాలి కటిగి 'గయాసురుని తపమును వారింపు'మని వేడిరి. బ్రహ్మ కది సాధ్యముకాదని భియపడి దేవతలతో గూడి శంకరునివద్ద కేగెను. గయాసురుని తపోమహిమోత్పన్నములగు ఆపదలను విన్నవించగా శంకరుడు 'ఈకష్టకార్యమును సాధించగల వేలుపు క్షీరసాగరశయాను డగువిష్ణువుకాన, మనమందఱమాయనపాలి కరిగి మనకష్టముల విన్నవించుకొంద'మని నేను అంతనందఱు క్షీరసాగరమును చేరి విష్ణుని అనేకవిధముల నుతించిరి. విష్ణువును గరుడవాహనారూఢుడయి, ఇతర బృందారకులు వారివారివాహనముల నెక్కి వెంటరా, గయునికి వరము లొసగి వానితపమును చాలించునట్లు చేయ నేగెను. సకలబృందారకపరివేష్టితుడై తనకు ప్రత్యక్షమయిన విష్ణుని గయుడు నుతించి నిలచెను. విష్ణువు 'గయాసురా' నీతపమునకు మెచ్చితిని. వరమును కోరిన నిచ్చెద' ననెను. గయుడు విష్ణునికి మరల నమస్కరించి 'జగత్ప్రభూ! నాయల్పతపమునకు నిజముగా నీకు మెప్పు కలిగెనేని నాశరీరము సకలదేవతలకన్నను, బ్రహ్మరుద్రాదులకన్నను, ప్రపంచమునందలిసకలపవిత్రపదార్థములకన్నను పవిత్రముగా జేయవలసిన' దని వేడెను. విష్ణువు గయాసురునికోర్కె నెరవేర్చి దేవతలను గూడి నిజనివాసమును జేరెను. ఏతద్వరకారణమున గయాసురునిశరీరమును స్పృశించినవారును, చూచినవారును బ్రహ్మలోకమును చెందుచుండిరి. కాలక్రమమున త్రయస్త్రింశల్లోకములును జనాభావత నొందెను యముడును, ఇంద్రుడును తమరాజ్యములందు ప్రజలే లేకపోవుటకు వగచి అది గయాసురునిప్రభావ మని గ్రహించి బ్రహ్మపాలి కేగి ప్రజలు లేనిరాజ్యమును, రాజ్యాధికారమును తమకు నిరర్థకములనియు తమ్మునాయధికారము నుండి తొలగింపవలసిన దనియు వేడుకొనిరి. అంత బ్రహ్మయు, యముడును, ఇంద్రుడును, విష్ణునిపాలి కేగి "దేవా! నీచే ననుగృహీతుడైన రక్కసునిమహిమచే జను లందఱును మోక్షము నందుచుండిరి. మారాజ్యములన్నియు పాడుపడిన"వని మొఱలిడిరి. విష్ణువు దేవతల నోదార్చి 'మీరాజ్యముల మరల నుద్ధరించెదను. మీరు పోయి, యజ్ఞము చేయుటకై యజ్ఞవేదికగా గయుని శరీరము నిమ్మని అడుగుడు. అప్పుడు మీకోరిక నెరవేరు' ననెను.

దేవతలు గయాసురుని సమీపించిరి. నిశాటుడు బ్రహ్మాదిదేవతలను గని లేచి నమస్కరించి మహావినయముతో 'బృందారకవరులారా!, బ్రహ్మాదులు నాకతిథులయిన యీదినమే సుదినము. మీపూజయే నాకు కర్తవ్యము. మీకోరిక నెరుంగ వేడెద' ననెను. అందులకు బ్రహ్మ 'నేను చూచినపవిత్రప్రదేశము లన్నింటికన్న నీశరీరమే మేము తలపెట్టుకొన్న యజ్ఞమునకు తగిన వేదికగా నున్నది. కాన నీశరీరమును మా కివ్వ వలసిన' దని కోరెను. గయుడు 'విధాతా, మీకు నాశరీరము నర్పించుటకన్న వేరుచరితార్థము నాకు లేదు. నీచే సృష్టింపబడిన యీనాశరీరము నుపయోగించుటకు నీకన్న సర్వస్వామ్యము కలవా రెవరున్నారు? ఏయాభ్యంతరమును లేక నాశరీరమును యజ్ఞవేదికగా నుపయోగించ వచ్చు'ననెను.

గయుడు కోలాహలపర్వతముపై శిర ముత్తరమునకును, పాదములు దక్షిణమునకును పెట్టుకొని పండుకొనెను. బ్రహ్మ యజ్ఞపరికరముల సేకరించి మానసికముగా ఋత్విజుల సృష్టించెను. తర్వాత గయశరీరముపై త్రేతాగ్నుల గల్పించి సాంగోపాంగముగ యజ్ఞమును పరిసమాప్తిగావించెను. బ్రాహ్మణులకు దానాదికములు కావింప బడెను. యజ్ఞాగ్నుల వేడిమివల్ల గయుడు చచ్చునని దేవతలు తలంచిరి. కాని యతడు చావ లేదు. అతనిశరీరము కదల జొచ్చెను. దేవత లందుల కాశ్చర్యపడిరి. వానిచలనము నాపుటకై యుపాయాంతరముల బన్న మొదలిడిరి. బ్రహ్మ యమునితో 'నీధర్మశిలను గయునిశరీరముపై బెట్టిన నతడు మడియ కల' డనెను. యముడు తనధర్మశిలను రాక్షసుని దేహముపై నుంచెను. రక్కసుడు ఇంకను ఆశిలతో గూడ కదలుచుండెను. బ్రహ్మ 'రుద్రాదుల జూచి మీరందఱు గయుని కదలనివ్వక అదిమి పట్టుకొన వలసినది. మీ రందరును వాని శరీరముపై గూర్చుండవలసిన'దనెను. దేవత లందఱు నట్లే చేసిరి. కాని వారిప్రయత్నములు నిరర్థకము లయ్యెను. గయు డింకను శిరమును కదలించుచుండెను. భగ్నప్రయత్నుడయి బ్రహ్మ క్షీరాబ్ధిశయానుని యోగనిద్రామయుని విష్ణుని సందర్శించి నుతించి ప్రసన్నుని గావించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొని "దేవా! గయుడు మాసకలప్రయత్నములను భగ్న పఱచి యింకను బ్రదికియున్నాడు. వానిని నిశ్చలునిగా జేయుట మాకు సాధ్యముకాకున్నది. నీవెట్లయిన వాని వధోపాయము మా కానతియ్యవలసిన" దని వేడెను.

బ్రహ్మనొుక నాలించి, పద్మనాభుడు తనశరీర మునుండి యొక భయంకరవ్యక్తిని సృష్టించి తత్సహాయ మున గయాసుర సంహారము గావింపుడని పంపెను. ఆ భయంకరస్వరూపుడుగూడ వచ్చి యసురుని శరీరముపై గూర్చుండెను. కాని రాక్షసుడు చావలేదు. బ్రహ్మ మరల విష్ణునిగురించి ప్రార్థించెను. విష్ణు వంత క్షీరాబ్ధిని మఱలి గదాధరుడైవచ్చి రాక్షసుని శరీరముపైc గూర్చుం డెను. ఇంతియకాక ప్రపితామహ, పితామహ, ఫల్గ్వీశ, కేదార, కనకేశ్వరులను అయిదురూపములదాల్చి విష్ణువు రాక్షసుని శరీరముపై నెక్కెను. బ్రహ్మయును గణేశు డును, సూర్యుడు, తన ఉదీచి, దక్షిణ, గయాదిత్యులను త్రిరూపములతోను, సీతారూపమున లక్ష్మియు, మంగ ళానామమున గౌరియు, గాయత్రియు, సావిత్రియు, త్రిసంధ్యలును, సరస్వతియు గయునిపై నెక్కిరి. గదా చాలనమువల్ల గయుని నిశ్చలునిగాcజేసినందున విష్ణునికి ఆదిగదాధరు డను నామము కలిగెను.

అంత గయుడు దేవతలను చూచి దీనాననముతో "దేవతలారా! నేను మీరు కోరినరీతిగా నాపవిత్ర శరీర మును యజ్ఞవేదికగా నిచ్చితిని. తత్పూర్వము గూడ నే నేదుండగములనుగాని చేసియెుఱుంగను. నిరపరాధినగు నన్ను మీరంద ఱిట్లు బాధలబెట్టి మడియింపజేయుటకు పూనుకొననేల? హరి నన్ను మొదటనే నిశ్చలునిగా నుండుమన్న చచ్చినవానివలె నుండకుందునా! ఇప్పటి కైన నాపై మీకు కరుణకలుగలేదా" యనెను. దేవత లందఱును గయునియందు కనికరించి"నీ వేదైన వరమును గోరిన నిచ్చుటకు సంసిద్ధులమయి యున్నారము" కోరు మనిరి. గయాసురుడు "బృందారకులారా! ఈభూమ్యా కాశము లెంతకాలముండునో, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములుఎంతకాలముండునో అంతకాలమును బ్రహ్మ విష్ణుమహేశ్వరులు ఈపర్వతముపై వసించి యుందురు గాక! ఇతరదేవతలును ఇచ్చటనే యుందురుగాక! పంచ క్రోశపరిమితిగల యీ క్షేత్రము నాపేర గయా క్షేత్ర మనబరగుగాక! అందొక క్రోశప్రమాణ భూమియందు నాశిరముండును. ఆప్రదేశము సర్వోత్కృష్ట క్షేత్ర మయి ప్రకాశిల్లి యుండుగాక! గయాక్షేత్రమునందలి తీర్థము లందుపితృదేవతలకు పిండముల వదలినవారు తమకేకాక తమపితృపితామహులకుగూడ బ్రహ్మలోకప్రాప్తిగలుగ జేసినవా రగుదురుగాక! త్రైగుణ్య స్వరూపు డయ్యును త్రిగుణాతీతుడై శుద్ధసత్వ స్వరూపుడగు విష్ణుమూర్తి నెంతకాలము జనులు పూజింతురో అంతకాలమును ఈ గయా క్షేత్రము భూలోకమున వర్ధిల్లుగాక" యని యను గ్రహింపుమని కోరెను. విష్ణువు రాక్షసునికి వరమిచ్చి "గయయందుపితృదేవతలకు పిండములవదలువారు వారికి నూరుతరముల పూర్వికులను గూడ బ్రహ్మలోకమును జేర్చినవా రగుదురు గాక" యని శాసించి వెడలి పోయెను.

## గయాసురక్షేత్ర చరిత్రమునందలి యంతరార్థము

ఈగాథ విచిత్రముగాను విపరీతముగాను, తోచ వచ్చును. అందును పురాణమునందలి గూఢార్థమును గ్రహింపజాలని పాశ్చాత్యు లిట్టి కథలను కేవల మనా గరికము లనియు, వీటిని నమ్మువారు కేవలమృగప్రా యు లనియు చెప్పుటకూడ కలదు.

ప్రస్తుత బ్రహ్మయోనిగిరియే గయాసురుడు తప మాచరించినట్లు వ్రాయబడినకోలాహలపర్వతము. దాని నిడివి సుమారు మూడుమైళ్లు. అంత చిన్న పర్వతముపై 125 యోజనములు లేక 576 మైళ్లు పొడవును, 268 మైళ్లు నడుముకొలతయుగల రక్కసు డుండుటయు, అం తటి బ్రహ్మాండకాయునకు ఒకక్రోశమాత్రము చుట్టుకొల తగల శిరముండుటయు, అట్టిరక్కసుని సృష్టికర్త యగు బ్రహ్మమొదలగు వేల్పు లంద ఱేకమయ్యును అణచుటకు శక్తులు కాలేదనుటయు అసంభవముగా నున్నది. కాని తత్వవిచారవేత్త యగు వాయుపురాణకర్త యిట్టికథను తత్కాల చరిత్రాంశములను తెలియజేయు నట్లుగా వ్రాసెను.

గయు డసురుడయ్యును అసురులకు నైజములగు జీవహింసాహత్యాది దుర్గుణముల కాకరుడనికాని, దైవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వేషియని కాని దూషింపబడక వైష్ణవుడనియు, సద్గుణ స్వభావుడనియు, పాపహారుడనియు, త్రికరణములందును, పరపీడాకరుడు కానివాడనియు తపోబలసంపన్నుడనియు వర్ణింపబడెను. అతనిశరీరమును స్పృశించినను చూచినను జనులు బ్రహ్మసాయుజ్యము పొందగలిగియుండిరి. అతనియందు దేవతలారోపింపగలిగిన నేరము ఏమనగా మోక్షము సులభసాధ్యముగాజేసి యమాదుల లోకములందు జనులు లేక పాడుపడునట్లు చేసెననుట. ఇట్టి సుగుణగణ సంపన్నుడు నిజముగా రాక్షసుడు కానేరడు. ఈవర్ణనలన్నియు బౌద్ధమతమున కన్వయించునవి. బౌద్ధమతమును ద్వేషించుహిందువులు దానికి రాక్షసునితో సామ్యమును కల్పించిరి. బౌద్ధమతమున జీవహింస నింద్యము. తపము ప్రధానము. యజ్ఞ యాగాదికములు మోక్షదములు కావు. అట్టిమతము హిమాలయము మొదలు కళింగము వఱకును గల 576 × 268 మైళ్ల విశాల దేశము నాక్రమించి యుండెను. గయాసురుని కారోపించిన శరీరపరిమాణమును, గుణగణాదికములును బౌద్ధమతమునకు చక్కగా సరిపడును. 576 × 268 మైళ్ల వైశాల్యముగలబౌద్ధరాజ్యమును గయాసురుని శరీరముగ వర్ణించి అతనిశిరము ఒకమయిలు చుట్టుకొలతగలదని చెప్పిరి. బౌద్ధరాజ్యమునందు మతజన్మస్థానము గయాక్షేత్రము. అందలిముఖ్యభాగము ఒక చదరపుమైలు.

బ్రహ్మాదులు గయుని శరీరమునుగురించి యంతతొందఱ పుచ్చుకొనక శిరమునే అణచుటకు ప్రయత్నించిరనగా హిందువులు బౌద్ధమతమునకు ఉత్పత్తిస్థానమయిన గయయందే తన్నాశము జేసినయెడల లోకమంతయు బౌద్ధమతహీనమగునని యట్లు చేసిరి. మూలమును పెకలించిన యెడల వృక్షమంతయు తానే నశించునుగదా! గయాసురధ్వంసమునకు దేవతలు పాటుపడిరనగా బౌద్ధమతనాశము హిందువులకు సులభసాధ్యము కాకుండెననుట. బౌద్ధమతరీతిగా జనులు కర్మబద్ధులేకాని దైవికమనునది లేదు. ప్రతిమనుజునకును ఉత్తమస్థితిగాని హీనస్థితికాని తన సుకృత దుష్కృతములను బట్టియే కలుగును.

రాక్షసునిది దైవమనునది లేక విచ్చలవిడిగాసంచరించు స్వభావము కనుక బౌద్ధమతమునకు అట్టి రాక్షసత్వారోపణము చేయబడెను.

గయాసుర ధ్వంసమునకు పూనుకొనిన దేవతలు గయునికి వరప్రదాతలయిరనుటలో భావ మేమనగా బౌద్ధమతనాశమునకు పూనుకొన్న హిందువులు బౌద్ధ విగ్రహములను సర్వనాశము చేయక వాటినే తాము స్వీకరించి నామభేదముల బూజించిరనుట. ఇందులకు నిదర్శనము హిందూదేశమున నెచ్చటను విష్ణుపాదములకు మాత్ర మాలయముల గట్టించి పూజించుట కానబడదు. బౌద్ధులు మాత్రము బుద్ధుని పాదములను శిరోజములను, నఖములను, శల్యములను, పూజించుట విశేషముగా కలదు. బౌద్ధులచే ప్రతిష్ఠింపబడి పూజింపబడుచుండిన బుద్ధపాదములిపుడు గయయందు విష్ణుపాదములని హిందువులచే బూజింపబడు చున్నవి. ఇదికాక విష్ణుపాదములందు పిత్రుపిండముల నర్పించుటకుపూర్వము బుద్ధగయకేగి బోధిద్రుమమునకు నమస్కరించవలయునని వాయుపురాణమునగూడ జెప్పఁబడియున్నది.

## గౌతముడు

గౌతముడు శాక్యరాజపుత్రుడు. తండ్రి శుద్ధోదనుడు; తల్లి మాయాదేవి. ఆయనకు రాహులుడను కుమారుడుండెను. గౌతముడు యువరాజై సకల సౌఖ్యము లనుభవించుచుండెను. ఒకానొక కాలమున పురవిహారమునకై పోవుచుండ నొకరోగియు, నొక వృద్ధుడును, నొకశవమును కనుబడగా గౌతముని మనస్తత్వముచెడి ప్రతిప్రాణియు నిట్టియవస్థలపాలు కావలసినదే కదా యనుఆందోళన జనించెను. తత్క్షణమే పురవిహారము చాలించి తనభవనమును చేరి ప్రాణికోటుల నీబాధల నుండి విముక్తులఁగావించి జననమరణాదికములు లేనిమోక్షమును కూర్చునుపాయ మేదియా యను చింతాపరవశుడయ్యెను. సాంసారిక సుఖములును, రాజ్యవైభవములును అస్థిరములనియు, దుఃఖదాయకములనియు మాత్రము దృఢనిశ్చయుడయ్యెనేకాని మోక్షమార్గ మిట్టిదని నిర్ణయించజాలకుండెను. తన్మార్గాన్వేషణోపాయము నగరమునుండి సుఖములను పేర మరిమరి సంసారసాగరమున మునుంగుచుండునంతకాలమును తనకు గోచరముకాజాలదని బంధుపుత్రమిత్ర కళత్రాదులను రాజ్యమును త్యజించి బంధవిముక్తుడు కాదలచెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౭. వజ్రాసనము



అశోకకుడ్యముపైని సూర్యచిత్రము
(నాలుగశ్వములుమాత్రము కలవు)



ఆవరణకుడ్యముపైని చెక్కడపుపని



భక్తులచే ప్రతిష్ఠింపబడిన
చిన్నస్తూపము



గ్రీకుల సూర్యచిత్రము
నాలుగశ్వములుమాత్రము కలవు



కుడ్యముల కడ్డపట్టెలు

౮ వ చిత్రము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వజ్రాసనము ముందు సేకరించబడిన పదార్థములు.




హువిష్కుని బంగారునిష్కములు.








## గౌతముని త్యాగము

శాక్యపుత్రుడు రాహులుని జననానంతరము ఒకనాటిరాత్రి ఛన్నుడనుసేవసారథిని అశ్వమును సిద్ధపరచుమని యాజ్ఞాపించెను. ఛన్నుడు గౌతముని ప్రేమాశ్వముసు కాంతకమును తీసికొనిరాగా అర్ధరాత్రమున నెవ్వరికిని దెలియక దాని నెక్కి, ఛన్నునితో నగరువెడలిపోయెను. ఆదినమననే కాంతకము మహావేగముగ పరుగెత్తుచుపోయి గౌతముని నాలుగువందలమైళ్ల దూరమున నున్న అనోమానదిగట్టున చేర్చెను. అచ్చట గౌతముడు గుఱ్ఱమును దిగి ఛన్నునికి తనయాభరణములను, అశ్వమును ఇచ్చి పురమునకు మరిడిపొమ్మనిపంపెను. తానొక వేటకానిచూచి తనవస్త్రములను వానికిచ్చి వానివ్యాఘ్రాజినమును తాను గ్రహించిఖడ్గముచే శిరోజములను ఖండించుకొని సన్న్యాసిరీతి దండమును భిక్షాపాత్రమును గొని లోకమున వెడలెను. ఆయనకు గమ్యస్థాన మిదియని నిర్ణయము కలుగలేదు. ఎప్పుడెట్టిబుద్ధి కలిగిన తదనుగుణ్యముగను పోవుచుండెను. నగరువెడలునపుడు మోక్షమార్గము నన్వేషించవలెనన్న దృఢసంకల్పముమాత్ర ముండెను. ఇప్పుడును ఆసంకల్పము మారలేదు. కాని అట్టిమోక్షమార్గము కనుగొనగలనా యనుసందేహముమాత్ర మాయనను బాధించుచుండెను. మార్గమున నొకనాడు ఒకశాక్యస్త్రీగృహమునకు భిక్షార్థము పోయెను. ఆయమ గౌతముని కన్న వస్త్రముల నిచ్చి కడుభక్తితో గారవించెను. తర్వాత గౌతముడు పద్మాయను బ్రాహ్మణస్త్రీ కతిథిగా నేగెను. ఆమెయు ఆయనను మిక్కిలిగౌరవించి పూజించెను.

పిమ్మట శాక్యసింహుడు రైవతుడను బ్రహ్మఋషిని, త్రిమదండకునికుమారుడగు రాజకుని, మరియు ననేకఋషుల సందర్శించుచు వైశాలినగరమును చేరెను. వైశాలి యాకాలమున ప్రజాపాలన పద్ధతులకు (Republican Institution) ప్రసిద్ధిజెందినరాజ్యమై యుండెను. అచ్చట ఆరాఢకాలామ డను నొకగొప్ప ఋషియుండెను. ఆయన నాశ్రయించి మూడువందల శ్రావకులు (శిష్యులు) ఉండిరి. గౌతముడును ఆఋషి నాశ్రయించి తత్త్వముల నెఱుంగగోరెను కాని ఆరాఢకాలామునివద్ద తనకేమియు మోక్షమార్గము లభించుపద్ధతి నెఱుగలేనందున ఆయనను వదలెను. అటనుండి గౌతముడు మగధకురాజధాని యగు రాజగృహమును చేరెను. అచట పాండవగిరి యనుకొండపై వాస మేర్పరచుకొని అనుదినమును నగరమునందు భిక్షాటనము చేయుచు కాలము గడపుచుండెను.

గౌతమునిసుకుమార సుందరశరీరమును, ఆయన ముఖకాంతియు నతడొకరాకొమరుడనువిషయము ప్రచురము చేయక తప్పదయ్యెను. ఆయన కాషాయాంబరధారియై భిక్షాటనమునకు పురవీథులయందేగుచుండ చూచిన వారందరు నాశ్చర్యమానసు లగుచుండిరి. క్రమముగా జనులకు ఆయనయం దొకవింతగౌరవము జనించెను. అట్టిత్యాగి రాజగృహమునయున్నాడన్న వార్త మగధచక్రవర్తియగు బింబిసారునికి దెలిసెను. బింబిసారుడు వెంటనే గౌతముని దర్శనము గావించి, ఆయన త్యాగమునకు గారణ మెఱింగినంతనే ఆయన ఎఱుంగునట్టి మోక్షమార్గమును తనకుగూడ బోధింపవలసిన దని కోరెను.

రాజగృహమున రామునికుమారుడు రుద్రకుడను యోగి యుండెను. అతడు జనులకు మిక్కిలిసన్మానపాత్రుడు. ఏడువందలమంది ఆయన నాశ్రయించి తత్త్వశాస్త్రము నభ్యసించుచుండిరి. గౌతముడును రుద్రకుని నాశ్రయించెను. కాని ఆయనవద్ద తనకేమియు మోక్షమార్గసాధనము నెఱుంగుదునను నాశ జనించనందున ఆయనను వదలివేసెను. రుద్రకునిశిష్యులలో అయిదుగురు ఉన్నతవంశజాతులగువారుగూడ రుద్రకుని వదలి గౌతముని జేరిరి. ఈయాగ్గురును రాజగృహమునుండి నైఋతి మూలగాపోయి గయను చేరిరి. గయ మగధచక్రవర్తిపాలనలోనే యుండెను. వారు గయశీర్షమను కొండపై కొంతకాలము వసించిరి. గౌతముని కింకను మోక్షమార్గసాధనోపాయ మిదమిత్థమని తెలియకుండెను. కేవలము హఠయోగాదులవల్ల మోక్షమార్గము నెఱుంగుట కష్టమని యాయన దృఢముగా నమ్మియుండెను. తానొక నూతనమార్గము నన్వేషించవలెనని సంకల్పించుకొనెను. కఠినశిలావృతమగు గయశీర్షము ఆయనకు తపోభూమిగా నగియుండలేదు. అందువల్ల గయ కనతిదూరమున నున్న ఊర్వేలాగ్రామమునకు పోయెను. ఊర్వేలయందు ప్రాపంచికసహవాసమునురోసి, ఏకాంతవాసమున తపమాచరించువారికి మనోల్లాసమును, స్థిమితమును ఇయ్యదగు చల్లనినీడలనిచ్చువనము లనేకము లుండెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గౌతముడు జన్మరాహిత్యోపాయము నన్వేషించుకాలమున హిందూదేశమున జనులనేకులు మోక్షోపాయములని యనేకరీతుల తపములును, జపములును, వ్రతములును చేయుచుండిరి. మోక్షము లభించుటకు గొందఱు మంత్రపఠనము చేయువారును, కొందఱు పుణ్యదేశయాత్రలు చేయువారును, కొందఱు నిరశనవ్రతమును బూనువారును, జలపానముమాత్రము చేసియుండువారును, కొందఱు భిక్షాన్నము తప్ప మఱెట్టియన్నమును దినని వారును, కందమూలముల దినువారును, ఫలాహారులును, తృణమును భక్షించువారును, కొందఱు వానప్రస్థులును, పశుపక్ష్యాదిజీవముల బూజించువారును, కొందఱు హఠయోగాభ్యాసులును, కొందఱు మౌనవ్రతులును' వారమున కెండు మూడు లేక నాలుగు మారులు మాత్రము మాటలాడువారును అయియుండిరి.

కొందఱు చాంద్రాయణవ్రతమునుబూని పౌర్ణమి నాడు పదునైదు కబళములతో నారంభించి చంద్రుని క్షీణదశవలెనే తమ కబళముల సంఖ్యను తగ్గించుచు అమావాస్యనాటికి నిరాహారులై మరల శుక్లపక్షమున కబళముల సంఖ్యను దినదినప్రవర్ధమానము చేయుచు వ్రతమాచరించువారును, కొందఱు జటావల్కలధారులును, కొందఱు వ్యాఘ్రాజినకృష్ణాజినధారులును, కొందఱు ఆర్ద్రవస్త్రములతోనే నిద్రించువ్రతము గలవారును, భూశయ్యయందును, భూతిశయ్యయందును శయనించువారును, శిలాశయ్యను, కంటకశయ్యనుపరుండువారును, కొందఱు దిగంబరులును, కొందరు విభూతిధారులును, మృత్తికాధరులును, కొంద ఱెల్లప్పుడును కపాలముల ధరించువారును, త్రిదండములతో నుండువారును, ధూమపానము వల్ల మోక్షము కలుగుననువారును, ఏకపాదముపై నిలిచి తపమాచరించువారు కొందఱును, సూర్యునివంక ఱెప్పలార్పక చూచుచు నమస్కారములు చేయువారు కొందఱును, ఆతపమున నిలచి తపస్సు చేయువారును, జలమధ్యమున నిలచి జపముచేయువారును, కొంద ఱెప్పుడును ఎత్తబడిన చేయికలవారును, జానువులమీదనే నడచువారు కొందఱును, వాయుబంధనము చేయువారును, వేడిఱాళ్లను శరీరముపై నుంచుకొనువారును, అగ్నిప్రవేశము చేయువారును, "ఓమ్, వషట్, స్వాహా, స్వధేత్యాది మంత్రపఠనములఁ జేయువారును, బ్రహ్మ, ఇంద్ర, విష్ణు, దేవీ, కుమార, మాతృక, కాత్యాయని, చంద్ర, ఆదిత్య వైశ్రవణ, వరుణ, వాసవ, అశ్విన, నాగ, యక్ష, గంధర్వ, అసుర, గరుడ, కిన్నర, మహోరగ, రాక్షస ప్రేత, భూత, కూష్మాండ, పార్షద, గణపతి, పిశాచ, దేవర్షి, బ్రహ్మర్షుల నారాధించువారును, కొందరు దేవతల ప్రీత్యర్థమని జీవబలి యిచ్చువారును, యజ్ఞయాగాదులుచేసి వపాహోమములు చేయువారును, కొందఱు పృథివ్యాది పంచభూతారాధన చేయువారును, పుణ్యక్షేత్రయాత్రయు పుణ్యతీర్థసేవయు చేయువారును, పర్వత, వన, శ్మశానాదులయందే వసించియుండువారును వయి మోక్షసాధకము లనియెంచి ఇట్లు నానావిధముల జనులు ప్రవర్తించుచుండిరి.

గౌతముడు వారినందఱినిజూచి నిజమగు మోక్షమార్గము నరయలేక తప్పుత్రోవల బోవు పామరులని తలచెను. జనులు అపరిశుద్ధమును పరిశుద్ధముగాను, యథార్థమును మృషగాను దలంచుచున్నారని ఆయన తలచెను. తానొక నూతనమార్గమున జనసామాన్యమును మోక్షగాముల జేయదలచెను. పామరుల యజ్ఞానాంధకారముల మాయించుటకును, ఏదేనొక యర్థాపేక్షతో జేయుజపములును, వ్రతములును, తపములును నిరర్థకములని బోధించుటకును, ధ్యానమువలని ప్రయోజనములను, ద్వంద్వముల కతీతుడగుట కుపాయములను బోధించుటకును, గౌతముడు తనజీవితమే తార్కాణముగ జేయ సంకల్పించుకొనెను.

## శాక్యసింహుని తపము

శాక్యసింహు డిట్టి దృఢసంకల్పముతో ఊర్విలయందు ఒకపరిశుద్ధప్రదేశమున గూర్చుండి షాడ్వార్షిక వ్రతమును బూనెను: అనగా ఆఱువత్సరములు శ్వాసను బంధించి, మనస్సు నేకాగ్రముగజేసి నిశ్చలుడై యుండుట. ఆయన మనశ్చక్షువులు మాత్రము వికసితములయి ఉత్తమమార్గము నరయుచుండెను. వ్రత మారంభమయి యెనిమిది హేమంతరాత్రములు చనెను; ఒడలు చెమర్చెను; శ్వాస నిలచెను; కంఠమున గుళగుళమను శబ్దము జనించెను; చెవులు గింగురుమనుచుండెను. దేవతలు గౌతము డేదియో యవస్థను పడుచున్నాడనియు శీఘ్రకాల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునసే మరణించుననియు దలచి భయపడి స్వర్గస్థయగు గౌతమజననియగు మాయాదేవికి కుమారునియవస్థను దెలిపిరి. మాయాదేవి పుత్రుడు పుట్టిన ఏడవదినమున స్వర్గస్థ యయ్యెను. తదాది గౌతముని ఆయన సవతితల్లి యగు మహాప్రజావతి పెంచెను. మాయాదేవి కుమారుని యవస్థను విని యప్సరలతోఁగూడి అర్ధరాత్రమున నైరంజనా నదిగట్టున నున్న పుత్రునిజూడ నేతెంచెను. కుమారుని జూచి దుఃఖాతిశయమున పలవింప మొదలిడెను. రోదన శబ్దమువల్ల తపోభంగమగుడు గౌతముడు కన్నులు దెరచి పుత్రుని దలచుకొని రోదించు నీవెవరవని ప్రశ్నించెను. మాయాదేవి 'నేను నీజననిని నిన్ను పదినెలలు మోచి కని నీతోనుండుభాగ్యము లేక స్వర్గమున నున్నను నీవు సుఖముగా నున్నావని సంతసించు చుంటిని. నీవిపుడు మరణావస్థనుపడుటను చూడలేక దుఃఖించుచున్నాను.' అనెను.

గౌతముడు 'జననీ! నీవు నాకొఱకై దుఃఖింప వలదు. నేను మరణావస్థను పడుటలేదు. సర్వోత్కృష్టము అనన్యసాధ్యమయిన మోక్షమార్గము నరయుచున్నాను. శీఘ్రకాలముననే బుద్ధుడ నయ్యెదను. దుఃఖమునువదలి సుఖంబుంకుము' అని తల్లి నోదార్చి పంపెను.

గౌతముడు షడ్వర్షికవ్రతమున ఆహారమును క్రమముగా దగ్గించుచు నిరాహారి యయ్యెను. ఆయన వక్షములోని యెముకలు ఎండ్రికాళ్లవలె స్పష్టముగా గనుబడుచుండెను. వెన్నెముక వెదురుకుర్చీలోని కణుపులవలె కానబడుచుండెను. గ్రీష్మకాలమున జలమంతయు నెండిపోగా నగాధములగు కూపములవలె నేత్రములు లోపలికి లాగుకొనిపోయెను. ఇట్టిస్థితిలోఁగూడ తన మనోనిశ్చయమును, తాను ప్రథమమున గూర్చున్న చోటును వదలక ఎండకును, గాలికిని, వానకును, లోనై ను మశకనుత్కుణాది బాధలకోర్చి అంగములు చలింపకుండ మలమూత్రవిసర్జనాది శారీరక కృత్యముల కావశ్యకము లేక జితేంద్రియుడై తదేకనిష్ఠతో ఆరువత్సరములు తపమాచరించెను. చిరుగుల నేరుకొనవచ్చు గోపబాలురును, బాలికలును, ఇతరమూఢజనములును, గౌతముని నొక కేవలకల్మషపుంజముగా దలచి ఆటకై ఆయన శరీరముపై నేదైన కల్మషపదార్థములు వేసి పోవుచుండిరి.

[సశేషము]

---

# శ్రీ వేంకటేశ్వర స్తవము

మండలేముల వేంకటశాస్త్రి గారు



వ్యాసకర్త

ఇదె యిదె నిశ్చితంబనుచు
　　నేర్పడ వాకొనరాని దెద్ది; నె
మ్మదిగనినట్లు యుండి యను
　　మానముఁ గొల్పుచు నుండునెద్ది; యు
న్నది మఱి వేఱనఁగ దగక
　　నామము రూపము లేకయుండు నె
య్యది; యదె బ్రహ్మమం చెఱుఁగు
　　చుందురు ప్రాజ్ఞులు వేంకటేశ్వరా!

ఉ. సారవిహీనమై సుఖవిషాదములన్ గడుఁ గూర్చుచుండు సం
సారము భేదదర్శన మొసంగుచునుండఁగఁ బ్రాజ్ఞబుద్ధి వే
పారు నభేదదర్శనపుఁబ్రాప్తియె మోక్ష మటంచుఁ బండితుల్
సారమతిన్ వచింతురు రసజ్ఞులు తజ్జ్ఞులు వేంకటేశ్వరా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# గోలకొండ కుతుబ్‌సాహి వంశము

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దారంభము నుండియు మహమ్మదీయు లాంధ్రదేశముపై నడపతడప దండయాత్రలు చేయుచు వచ్చినను కాకతీయ సామ్రాజ్యము సంపూర్తిగ భగ్నమైన పిదపగాని వీరి యధికారము మధ్యాంధ్రదేశమున సుస్థాపితము కాదయ్యెను. అప్పుడైనను అంతవఱకు నోరుగంటి కాకతీయులకు సామంతులుగనుండి యా సామ్రాజ్యము విచ్ఛిన్న మగుటతో స్వతంత్ర పతాకలను విప్పినభూపాలురు నిరంతరము మహమ్మదీయులతో పోరాటములు జరపుచు వారి చంద్రధ్వజము నాంధ్రదేశమునుండి పెకలించి వేయవలెనని సర్వశక్తుల నుపయోగించి ప్రయత్నించిరి. కాని వారికి దైవ మనుకూలపడ లేదు. అయినను ఓరుగంటి ప్రాంతము తక్క ఆంధ్రదేశమున మఱే యేయితరభాగమును మహమ్మదీయుల పరిపాలనమును శిరసావహింపలేదు.

ప్రాక్సముద్రతీరస్థమైన యాంధ్రదేశమంతయు రెడ్డిరాజుల పరిపాలనము క్రిందికి వచ్చెను. సింహాచలమునుండి యుత్కళము వఱకు గల ప్రదేశమంతకు గాంగవంశజులు ప్రభువులైరి. నెల్లూరు, కర్నూలు, కడప, అనంతపురము, బళ్లారి మొదలగు దక్షిణాంధ్రమండలము లన్నియు తుంగభద్రా తీరస్థ విజయనగరాధిపతులైన కర్ణాట ప్రభువుల యధీనమయ్యెను. రాచకొండ, దేవరకొండ, పానుగల్లు మొదలగు శ్రీశైలాంధ్రనగరము (ఓరుగల్లు)లకు నడుమనున్న దుర్గములన్నియు రేచెర్ల వెలమవీరుల రక్షణము క్రిందికి వచ్చెను. ఈ విధమున పరిశిష్టమైన యాంధ్రదేశములోని స్వల్పభాగము మాత్రమే నిజముగా మహమ్మదీయులకు లోబడియుండెను.

కాకతీయ భూపతులలో కడపటి వాడైన రెండవ ప్రతాపరుద్రుని (క్రీ. శ. ౧౨౯౫-౧౩౨౩) యనంతర మాంధ్రదేశమున స్వతంత్రరాజ్యము లెట్లు మొలకలెత్తినవో యట్లే కాకతీయ సామ్రాజ్యవిజేతయైన ఉలూగుఖానను మహమ్మదుబిన్ తుఘ్లకు ఢిల్లీ పాదుషా మరణానంతరము కూడ దక్కను దేశమున మహమ్మదీయ స్వతంత్రరాజ్యములు తలచూపినవి. వానిలోకెల్ల సుప్రసిద్ధమైనదియే బహమనీరాజ్యము. తెలుగు నాయకుల వశమున లేని పరిశిష్టాంధ్రభూతలమున కంతకు నీ బహమని సుల్తానులే యధిపతులుగ నుండిరి. వీరిని జయించుటకే తెలుగు నాయకులు కొందఱు ప్రయత్నించుచు వచ్చినను స్వాతంత్ర్యోద్దీపితులై తమతమ రాజ్యములను విస్తృతము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేసికొనుటకై తమలో దామె కలహములు పెంచుకొని నిరంతరము పోరాడుచుండుటచేత మహమ్మదీయులను జయించుట వారికి సాధ్యము కాకపోయెను. ఈవిధములైన సంగ్రామములలో బడి కొట్టుకొనుచునే బహమనీ రాజ్యము రమారమి రెండునందల సంవత్సరము లాంధ్ర దేశమున దనయధికారమును సాగించెను. కాని నిజముగా నాంధ్ర దేశమున మహమ్మదీయ పరిపాలన మారంభమైనది గోలకొండరాజ్యముతోనే.

బహమనీరాజ్యమును రెండవ మహమ్మదుషా (క్రీ. శ. ౧౪౬౩-౧౪౮౨) యనునతడు పరిపాలించుచుండగా పెరిషియాలోని హమదానునుండి సుల్తాను కూలీయను నతడొకడు వచ్చెను. ఈతడు తన దేశమున దనజాతిని శత్రువులెత్తివచ్చియోడించుటచేత స్వప్రాణరక్షణార్థమై హిందూదేశములోని దక్కనునకుపారిపోయివచ్చి యచ్చటి బహమనీసంస్థానమును సందర్శించెను. బహమనీరాజులయాస్థానమున నతనికి గలిగిన గౌరవ మర్యాదలును,హిందూ దేశముయొక్క-అందు ముఖ్యముగ దక్కను దేశముయొక్క పాడిపంటలును, భాగ్యభోగ్యములును హృదయాకర్షకములై యాతని నానందమునముంచి యెత్తెను. అటుతరువాత మఱల నొకపర్యాయ మాతడు తన దేశమునకరిగినను హిందూదేశపు దక్కను మీదను, బహమని సుల్తానుల యాస్థానము మీదను గల యభిమానమును, మక్కువయును ఆతని హృదయవీథినుండి మాత్రము తొలగిపోవలేదు. మఱల హిందూదేశ ప్రయాణమునకు ఆతని హృదయము కుతూహలపడుచునే యుండెను. ఇట్లుండగా స్వదేశమున నధికారము వహించిన యీతనితెగవారి శత్రువులు ఈతనినివధియించుటకు బ్రయత్నింపగా మఱల నింకొకమాఱు తనప్రాణమును రక్షించుకొనుటకై హిందూదేశమునకు పారిపోయి వచ్చి దక్కనులోని బహమనీరాజగు మహమ్మదుషాయాస్థానమున కొలువుకు గుదిరెను.

ఇట్లు స్వదేశమునుండి ప్రాణమును రక్షించుకొనుటకై పాఱిపోయివచ్చిన యొకతుర్కవానికి దక్కను దేశము శరణమిచ్చికాపాడుట యేకాక తుదకు కిరీటమునుగూడ నొసంగి గౌరవించెను. ఈసుల్తాన్ కూలీయే గోలకొండరాజ్యమును స్థాపించిన కుతుబ్‌సాహి వంశమునకు మూలపురుషుడు.

సుల్తాన్ కూలీ తన ప్రభువైన మహమ్మదు షాకు అత్యంతవిశ్వాసపాత్రుడైన సేవకుడై మిగుల వినయవిధేయతలతో కనులుగలిగి సంచరించుచుండెను. ఇట్లుండగ నొకప్పుడు కొందఱు అసంతృప్తిపరులు, అత్యాశాపరులు నగువారు మహమ్మదుషాను వధించుటకై యొక్కకుట్రను పన్నిరి. కాని వారిపన్నుగడలుకొనసాగ నున్నప్పుడే యాసంగతి తెలిసికొని సుల్తానుకూలి పదిమందియోధులతో శత్రువులపై కుఱికి తనప్రభువును సంరక్షించెను. తుదకు కుట్రయంతయు దెలిసికొనిన మహమ్మదుషా తనకు సుల్తాన్ కూలి గావించిన మహోపకృతి కాతని నెంతయుంగొనియాడి యాతనికి 'మల్లిక్ కుతుబ్ ఉల్ ముల్కు' అనుబిరుదమును రెండవమంత్రి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పదము నొసంగి ఆతనిని గౌరవించెను. ఈవిధ
ముననే ఆతడొకానొక యుద్ధమునజూపిన య
నుపమానధైర్యసాహసములకును, విజయము
నకును సంతసించి మహమ్మదుషా యాతనిని
తెలుంగాణెమునకు ప్రభువుగనియమించుటయే
కాక అతనికి 'అమీర్ ఉల్ ఉమ్రా'యను బిరు
దమును గూడ ప్రసాదించెను. అదియునుగాక
కోటగిరి, ఉట్గి (?)అనునవి స్వోపభోగమునకై
యొసంగెను.

మహమ్మదుషాయొక్క కాలమంతయు
చాలగంద్రగోళమైనది. అతడు దక్షిణమున
కర్ణాటాధీశులతోను, రాజధానిలో తన
యొక్క అధికారమంతయు స్వహస్తగతము
చేసికొనుటకై తడవతడవకు కుట్రలు పన్ను
చువచ్చిన కాసింబరీదుతోను, అప్పుడప్పుడే
తలయెత్తుచుండిన మహారాష్ట్రులతోను వేగ
వలసివచ్చెను. ఇటులుండగా నీమహమ్మదుషా
కాలమునాటికి కొండవీటి రెడ్డిరాజ్యమే
కాక కోరుకొండరెడ్ల పాలనముకూడ నంత
రించెను. కళింగదేశమున గాంగవంశజులపరిపా
లనము ముగిసి గజపతులు గాంగసింహాసనము
నధిష్ఠించి తెలుగుదేశమును దమపతాకము
క్రిందికి దీసికొనిరా బ్రయత్నములు సలుపు
చుండిరి. కపిలేంద్రగజపతి మహమ్మదుషా
సింహాసన మెక్కుటకుపూర్వమే యొకటిరెండు
తడవలు రాజమహేంద్రవర రెడ్డిరాజ్యముపై
దాడివెడలెను. తుదకారాజ్యము ఆతనిపిదప
కటకసింహాసనము నెక్కిన పురుషోత్తమగజపతి
కాలమున గాని పూర్తిగ వారికి స్వాధీనము
కాలేదు. మహమ్మదుషాకు సమకాలికుడైన
యీ పురుషోత్తమగజపతి కూడ రెడ్డిరాజ్యము
నాక్రమించి కర్ణాటదేశాధిపతుల క్రింద నుండు
దుర్గములను బట్టుకొనుటయేకాక బహమని
సుల్తానుల పరిపాలనముక్రింద నుండిన తెలుం
గాణెముపై కూడ దాడివెడలెను.

ఆంధ్రదేశముయొక్కయు, స్వరాజ్యము
యొక్కయు పరిస్థితు లిట్టివిషమస్థితిలోనుండి
నప్పుడు మహమ్మదుషాకు మహాప్రధానియై
ఖ్వాజామహమ్మదు గవానును, విశ్వాసపా
త్రుడైన భృత్యుడును, ప్రతినిధియునై సుల్తాన్
కూలీ కుతుబ్ ఉల్ముల్కును రెండుభుజము
లవలె నుండి బహమనీరాజ్యమును సంరక్షిం
చిరి. వీరిరువురియొక్క బుద్ధికుశలతవల్లను,
బాహుబలమువల్లను బహమనీ రాజ్యము
అత్యంతము ఉచ్చదశనొందెను; కాని యచిర
కాలముననే యది క్రుంగిపోయెను. బహమనీ
సుల్తానగు మహమ్మదుషా క్రీస్తుశకము౧౪౮౨
మార్చి ౨౬-వ తేదిని చనిపోయెను. ఇతడు చ
నిపోవునప్పటికి పండ్రెండేండ్ల యీడుగల యీ
తనికుమారుడు మహమ్మదుషా పిదప బహమనీ
సింహాసనము నధిష్ఠించెనుగాని అప్పటికే బహ
మనీసుల్తానునకు సామంతులుగ నుండినవారు
చీలిపోయి స్వతంత్రులై స్వతంత్రరాజ్యములను
స్థాపింపజొచ్చిరి. వారిలో మొట్టమొదట 'మల్లిక్
అహమ్మదునైజాము ఉల్ముల్క్' అనున
తడు స్వతంత్రుడై అహమ్మదునగరమున గొప్ప
దుర్గమును నిర్మించి దానిని రాజధానిగ జేసి
కొనిదౌలతాబాదుపరగణాల పాలింపదొడగె
ను. ఈయహమ్మదునగరసుల్తానులనే చారిత్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున నైజామ్‌సాహి లందురు. తరువాత ఇస్మెయిల్ ఏదిల్‌ఖాఁ విడిపోయి విజాపురము రాజధానిచేసికొని విజాపురము కొంకణము మొదలగురాష్ట్రములను పాలింపదొడగెను. ఈవిజాపురపునవాబులకే ఏదిల్‌సాహిలనిపేరు. అటుపిదప అల్లాఉద్దీఁ ఇమాద్ ఉల్‌ముల్కు విడిపోయి ఎల్లిచ్‌పురము రాజధాని చేసికొని బేరారును పాలించెను. ఈబేరారు నవాబులకే ఇమాద్‌సాహిలని పేరు. మల్లిక్‌కాసింబరీదు రాజధానియందే యుండి క్రమక్రమముగా బహమనీసుల్తాను అధికారమును, ఐశ్వర్యమునుగూడ నపహరించి బహమనీరాజుల విదర్భ (బీదర్) దేశముననే పరిపాలనము చేయదొడగెను. మిగిలిన సామంతులందఱును స్వతంత్రులై అత్యంత విశ్వాసపాత్రుడైన సుల్తాఁకూలీ కుతుబ్ ఉల్‌ముల్కునుగూడ స్వాతంత్ర్యము ప్రకటింపవలసినదని ప్రోత్సహించుచుండినను అతడు చాలకాలము వఱకు బలహీనులైనను బహమనీ రాజులకే లోబడి యుండెను. కాని చివఱ కింక నెంత యంటిపెట్టుకొని యుండినను కార్యము లేదని తెలిసినప్పుడు అతడు తన ప్రభువుపేర మహమ్మదు నగరమును గట్టించి దానిని రాజధాని చేసికొని క్రీ. శ. ౧౫౧౨ నుండి స్వతంత్రుడై సుల్తాఁ కూలీకుతుబ్‌షా యను పేరుతో తెలుగుదేశమును పాలించెను. ఇతని వంశమువారికే కుతుబ్‌సాహిలని పేరు. ఈ మహమ్మదు నగరమే తరువాత చరిత్రమున గోలకొండ యనుపేర బ్రసిద్ధమయ్యెను.

ఈ గోలకొండ కుతుబుసాహి వంశజులు తెలుగుదేశమును రమారమి నూటడెబ్బది సంవత్సరములు పరిపాలించిరి. వీరిలో మొదటివాడైన సుల్తాఁ కూలికుతుబ్‌షా క్రీ. శ. ౧౫౧౨ మొదలు ౧౫౪౩ వఱకును, అతని పిదప నతని రెండవ కుమారుడైన జమ్‌షీద్ కుతుబుషా క్రీ. శ. ౧౫౪౩ మొదలు ౧౫౫౦ వఱకును, అటుపిదప తండ్రి చనిపోవు నప్పటికి నేడేండ్ల వయసుగల యతనికొడుకు సుభాఁకూలికుతుబుషాను తరిమివైచి జమ్‌షీదు కుతుబుషా కనిష్ఠసోదరుడైన మల్లిక్ ఇబ్రహీం కుతుబుషా క్రీ. శ. ౧౫౫౦ మొదలు ౧౫౮౦ వఱకును, అటుతరువాత నతని మూడవ కుమారుడగు మహమ్మదు కూలి కుతుబ్‌షా క్రీ. శ. ౧౫౮౦ మొదలు ౧౬౧౨ వఱకును, అటువెనుక ఇబ్రహీమ్ కుతుబ్‌షా మనుమడును, మీర్జామహమ్మదు అమీఁ కొడుకును, మహమ్మదుకూలి కుతుబ్‌షా అల్లుడు నగు మహమ్మదు కుతుబ్‌షా క్రీ. శ. ౧౬౧౨ మొదలు ౧౬౨౬ వఱకును, తదనంతరము అతని కుమారుడు అబ్దుల్లా కుతుబ్‌షా క్రీ. శ. ౧౬౨౬ మొదలు ౧౬౭౨ వఱకును, ఆవెనుక నతని యల్లుడైన అబుల్‌హాసఁ కుతుబుషా క్రీ. శ. ౧౬౭౨ మొదలు ౧౬౮౭ వఱకును తెలుగుదేశమును పాలించిరి. తుదిని పేర్కొనబడిన యీ అబుల్‌హాసఁ కుతుబ్‌షాకే తానీషా యనిపేరు. ఈతని కాలముననే క్రీ. శ. ౧౬౮౭-వ సంవత్సరమున గోలకొండ రాజ్యము ఢిల్లీపాదుషాయైన ఔరంగజేబుకు స్వాధీనమయ్యెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ పైనుడివిన కుతుబుసాహి సుల్తాను లలో మల్లిక్ ఇబ్రహీమ్ కుతుబ్ షాయు అబుల్ హాసన్ కుతుబ్ షాయును తానీ షాయు తెలుగు వారికి శ్రుతపూర్వు లు. ఈ యిబ్రహీమ్ కుతుబ్ షానే తెలుగు వారు మల్కిభరామ్ అందురు. మల్కిభ రామ్ తెలుగు కవుల నాదరించి ఆంధ్రవా ఙ్మయమునకు జేయూత నిచ్చినవాడు. అద్దంకి గంగాధర కవియను నత డీమల్కిభరామ్ ఆస్థానముననుండి తపతీసంవరణమను శృం గార ప్రబంధమును రచియించి యాతనికి గృతి యొసంగెను. పొన్నికంటి తెలగనార్యుడను మఱియొక కవి యయాతి చరిత్రమును రచి యించి మల్కిభరామ్ కొలువున నుండిన అమీర్ ఖాన్ అను వానికి గృతియొసంగెను.

రామదాసు చారిత్రమును నిరంతరము పఠించుచుండు నాంధ్రులకు తానీషాను గుఱిం చి చెప్పవలసినదియే లేదు.

సంగ్రహముగ గోలకొండ కుతుబుసాహి వంశజుల విషయము ఇచట దెలుపబడినది. వేఱొకప్పు డొక్కొక కుతుబుసాహి నవాబు పరిపాలనాదికములను గురించి విపులముగ దెలుపబడును.

---

# *నీతి పదములు

౧. కనడ - జంపె

పల్లవి: నీతిగలిగిన నెందు - నిత్యశ్రేయము వచ్చు
నీతియే భూషణము - నృప తుళజరాజేంద్ర!

అనుపల్లవి: తనునమ్మియున్నట్టి - జనులఁబ్రోవఁగవలెను
ఘనముగా శత్రువుల - ఖండింపవలెను
అనయంబు పెద్దలను - ఆదరింపగవలెను
వినయమున శివభక్తి - మొనసి చేయఁగవలెను. నీతి.

శివునిపదపద్మములఁ - చిత్తమునఁ దలఁపవలె
భువి ధాన్యధనవృద్ధి - పోషింపవలెను
సవరణగ ధర్మములు - సతతమును జేయవలె
సవినయంబుగఁ గీర్తి - సాధింపవలెను. నీతి.

ఎలమి సత్పాత్రములు - తెలిసి యీయఁగవలె
కులదైవభజనంబు - కోరిచేయఁగవలెను
విలసిల్ల నేకేంద్ర - వినుత, శ్రీతుళజేంద్ర!
పలుమారు రాజ్యములు - పాలింపవలెను. నీతి

---

* పదునెనిమిదవ శతాబ్దియందు తంజావూరును బాలించిన మహారాష్ట్రరాజగు తుళజేంద్రుని కంకితముగా రచియింపఁబడిన నీపదములు ఇవి తొమ్మిది. వీని మాతృక. తంజావూరు సరస్వతీపుస్తకభాండాగారమునఁ గలదు. 'నీతిపదములు' అను పేరున నివి భారతియందుఁ గ్రమముగ వెలువడును —సంపాదకుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



"చిట్టెని త్రొట్లలోనుంచి జోకొట్టేవస్తా బాబూ !"

చిత్రకారుడు: శ్రీ సి. యస్. వాసుదేవనుగారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# కురళ్

[అను అఱవగ్రంథమునుండి తెలుఁగు చేయఁబడినవి]

సెట్టి లక్ష్మీనరసింహము గారు



వ్యాసకర్త

త్రరుణి దరిసెన పూవులదండను మొల
నూలుగ ధరించి కాడలం దునుమ మఱచె;
దాని బరువున కాఁగఁగా లేనివగుచు
లేనడుము క్రుంగఁబాఱె బాలికకు నకట!

తే. అమృతమయములె యగు ముద్దులాడి బాహు
యుగము; నాదేహమున కవి తగిలినంతఁ
జిగురులెత్తెను మరలఁ గ్రొత్తఁగను మ్రోడు
చెంది శుష్కించి యున్న నాజీవనంబు.

తే. తారకలు దిగ్భ్రమం జెంది తమ పథంబు-వెడలి యిట్టటు వడిగఁ బర్విడఁగఁ దొడఁగె
ఇంకొక శశాంకు వైఖరినే చకోర-లోచనాచారువదనంబు తోఁచినంత.

తే. కలువకంటి మొగము పోలికగ మదీయ - చిత్తరంజనమును నీవు చేయుదేని
నాదు లోచనంబులకుఁ గస్పడుమ యఖిల-జనులకుఁ గనంబడుట మాని చందమామ!

తే. సుదతి తళ్కుఁగనులఁ బుట్టు చూపులందు-రెండు విధముల మాయలు నిండియుండె;
ఒక్క చూపుచేతను దాపమొదవుచుండు, మఱొక చూపున నాబాధ మానుచుండు.

తే. మృత్యువనఁగ నెట్లుండునో యెఱుఁగ మున్ను; ఇప్పుడది స్పష్టముగను నాకెఱుఁగనయ్యె;
మనసు హరియించు నట్టి లోచనయుగంబు-తోడి పూఁబోఁడిగా నది తోఁచె నాకు.

తే. పంకరుహసమనయన నా నంకఁ గాంచెఁ; గాంచి, యావెంటనే మోము దించుకొనియె;
మొలకలెత్తుచు నున్నట్టి మోహబీజ-మునకు నయ్యదియే నీళ్లు చినుకుటయ్యె.

తే. ఒక్కమాత్రైన మఱచుట యున్న యెడల-జ్ఞప్తికిం దెచ్చుకొనుటకు సాధ్యమగును
జుఱుకుఁదూపులట్లు తగులు చూపులుగల-చెలువ చెలువంబు నామదిఁదొలఁగ దెపుడు.

తే. తెలివి చదువుచే హెచ్చినకొలఁది జనులు-తెలిసికొనఁ గల్గుదురు తమ తెలివిలేమి
అట్లె తోఁచు సుందరభూషితాంగి యైన-యంగనను నేను గాంచిన యప్పుడెల్ల.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తే. దవ్వులకుఁ బోయిన కొలందిఁ దాప మొసఁగు; దాపునకుఁ జేరెఁ దాపంబు తగ్గఁజేయు
విశ్వమున లేని యట్టి యీ వింతవహ్ని-నెచటనుండి సంపాదించె నింతిమిన్న?

తే. అవనిలోపల రోగంబు, నౌషధంబు-నొకటికొకటి కిట్టనివనుచుందురు గద?
తాను గలిగించునట్టి సంతాపమునకుఁ, దానె యౌషధంబౌర! యీ తలిరుఁబోణి.

తే. నాదు వలపుంబరణియా నాతి నిలిచి, యుండుటకుఁ దగు తావు వేఱొకటి లేదు:
ఆ వెలందుల మిన్నకుఁ దావొసంగి-గ్రక్కునఁ దొలంగి పొమ్మ యో కంటిపాప!

*　　*　　*　　*　　*　　*　　*　　*　　*

తే. నాదు కనులనె విభుఁడు సంతతము నిలుచు; అతనిరూపము మాయునోయనుభయమున
గాటుకను దాల్పకుంటి; నంగముల నలఁగు-నో యనెడి భీతి ఱెప్పలు మూయకుంటి.

తే. ప్రాణనాథుని కడకు మదాత్మరీతి, నాదు చూపును జేగ యత్నం బొనర్చ
వెల్లువలు కట్టుచున్న కన్నీళ్లను బడి, యేగతిగ నీఁది పోవుటో యెఱుఁగకుండె.

తే. చిత్తమా, నిన్నుఁ బ్రార్థనచేయు దాన; నాకుఁ గనులు లేకుండ నొనర్పుమ ప్రియుఁ
గాంచఁగా వలె నన్న దుఃఖంబు తెచ్చి, యివియె నీ జీవనము దహియించుచుండె.

తే. నేను మెలఁకువగా నున్న నిమిషములను-నామనంబును బాయని నాయకుండు
నిదుర నాకుఁ బట్టినయంత నే వెలుపటి, కేగుదెంచి నా నెమ్మేను గౌఁగిలించు.

తే. మెలఁకువగ నున్న యట్టి నిమేషములను-నాకు మొగమేని జూపని నాథు రూపు
కలలలోపల మాత్రమే కానిపించు; ఇట్లు జీవనంబులు భరియించుచుంటి.

తే. కాంక్షతీర నా కాటుకకన్నుదోయి, కూర్కువచ్చి యించుక మూసికొన్న యెడల
ఇన్ని నాళ్లయి నేఁ బడుచున్న బాధ, నప్పుడే నాదు ప్రియునితోఁ జెప్పుకొందు.

తే. వలపు లోలోన దాఁచి గాసిలు మ్మదాత్మ, కావడిని మోయుచున్నట్టి కైవడిగనె
రెండు బరువులు సరిగ భరించుచుండెఁ, బ్రేమయొక్కదిక్కున సిగ్గు రెండవదెస.

తే. విరహమునఁ బాండిమంబును బారసినట్టి, నాయొడలు కాంచి నలుఁగురుఁ నవ్వ నిమ్ము;
నా మనంబు హరించిన నాథుఁ గూర్చి, నిర్దయాత్ముఁ డటంచు నిందింపరేని.

తే. నాకుఁ దన మానసంబు లోనఁ నిలుచుట, కైనఁ దావు నొసంగని యట్టి యతఁడు
నిచ్చలును నా మనంబునఁ జొచ్చి యుండె; సిగ్గయిన లేదొ యిగ్గతి చేయుటకును.

తే. అప్పటప్పటికిని బ్రియుం డాడునట్టి- సరసవాక్కులు విను నదృష్టంబు లేక
యును దనువు భరియించుచు నున్న వారి-కంటె ధీరమానసులు లోకమున లేరు.

తే. నాదు వాంఛితములకు స్థానంబయిన ప్రి-యుండు కూర్మి నాయెడఁ జూపకున్న నేమి
అతని జిహ్వయందుండి బయల్పడియెడి, పలుకు పలుకును బులకండపలుకె యగును.

తే. నన్ను నెడఁబాయ ననుమాట నాకుఁ దెలుపఁ-దలఁచితేనియుఁ జెప్పుమా నిలిచి విందు;
"వే మరలివత్తు" ననుమాట విరహమునను-జీవములు పోని వారికే చెప్పుమ ప్రియ!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# కొన్ని వరిరకములు

గోటేటి జోగిరాజు గారు

## ఫలించుటకుపట్టు కాలపరిమితి

ఆయావరిరకములు ఫలించుటకుపట్టు కాలము విత్తిననాటినుండియు లెక్కింపవలెను. ఈ కాలపరిమితి ఏప్రదేశమునందైనను సమానపరిస్థితులందు ఒకేనాడు విత్తి ఒకేనాడు నాటినపుడు ప్రతిరకమునకును కొంచెమించుమించుగ నిర్ణీతముగనే యుండును. కాని యొకే రకమే శీతోష్ణాది స్థితిగతులందు విశేషమార్పుగల వేర్వేరుప్రదేశములందు సాగుచేసినపుడుగాని, విత్తుటలోను నాటుటలోను ముందు వెనుక యయినపుడుగాని, కొంతవరకు నేలయొక్క స్థితినిబట్టిగాని, అది ఫలించుటకు పట్టుకాలపరిమితియందును వ్యత్యాసములు రావచ్చును. కావున వరిరకములు ఫలించుటకు పట్టు కాలమును నిర్ణయించుటకు వాని నొకేనాడు విత్తి, సమానపరిస్థితులం దొకేనాడు నాటి పరీక్షింపవలెను.



వ్యాసకర్త

చావర్లకోట పరిశోధనాస్థానమందు లేకరియు, తన సహోద్యోగులును తాము పర్యటనకు సాగినపుడుగాని, సెలవులో నున్నపుడుగాని ఆయాప్రదేశములనుండి సంగ్రహించిన కొన్నిరకములను, పరిశోధనాస్థానము దేర్చితీసిన కొన్నివంగడములను పైనిచెప్పినట్లు సమానపరిస్థితులలో పెంచి అవి ఫలించుటకుపట్టు కాలమును నిర్ణయింప నవకాశమొకటి 1924వ సంవత్సరమున గలిగెను. అన్నిరకముల విత్తనములును జూన్ 18 వ తేదీని నారుమడిలో విత్తబడెను. జూలై 31 వ తేదీని అన్నిటినారును సమమయినప్రదేశమున చిన్నచిన్నసారువలుగ నాటబడెను. కాలమానస్థితి యనుకూలముగనుండి యన్నిరకములును స్వాభావికముగ నెదిగెను. 1 వ పట్టికయందు 145 రకములును, వంగడములును, ఫలించుటకు పట్టిన కాలము చూపబడెను.

ఆపట్టికలో చేర్చబడిన రకములన్నిటిలో జయపురం ఏజన్సీనుండి వచ్చిన భోరికా యనురకము మిక్కిలి తక్కువకాలమున (104 దినములలో) ఫలించెను. నెల్లూరుజిల్లానుండి వచ్చిన సన్నవరియు, తంజావూరుజిల్లానుండి వచ్చిన ముత్యసంబాయును మిక్కిలి యాలస్యముగ (194 దినములలో) పండెను. సామాన్యముగ వరుల నీక్రిందివిధమున నవి ఫలించుటకుపట్టు కాలమునుబట్టి 5 తరగతులుగ విభజింపవచ్చును. [చూడు ౧-వ పట్టిక.]

రైతులు తాము సాగుచేయుటకు తగినరకముల నెంచుటలో గమనించులక్షణములందు ఫలించుటకుపట్టు కాలము ముఖ్యమైనవానిలో నొకటి. వర్షాధారమునగాని, ముందుగ నీటినిచ్చి వెనుకగా నెండిపోవు చిన్నచిన్న చెరువులు, వాగులు మొదలగువాని యాధారమునగాని, సాగుచేయు భూములకు పునాసవరులుగాని, అతిపునాసవరులుగాని యెన్నుకొనబడుచున్నవి. కొన్నిచోట్ల నట్టివరులు గ్రామములసమీపముననుండి ఊలార పునీరు పారుటచే మిగులసారవంతములగు నేలలందుగూడ పైరుచేయబడుచున్నవి. అట్టిచోట్ల పెద్దవరులు పెట్టినయెడల నవి విస్తారముగ నెదిగి వెన్ను వేయకముందే పడిపోవును. కొన్నిచోట్ల పిమ్మట పెద్దవరులను నాటునుద్దేశముతో తొలకరిలో మిక్కిలిపునాసవరులను సేద్యము చేయుదురు. రెండువరిపంటలు పండునేలలలోగూడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పట్టిక ౧

## ఫలించుటకు పట్టు కాలమునుబట్టి వర్గీకరింపబడిన 145 రకముల వరుల పేర్లు

| మిక్కిలి పునాస వరులు (130, అంతకు తక్కువ దినములు) | | పునాస వరులు (131–145 దినములు) | | మధ్యమములు (146–160 దినములు) | | పెద్ద వరులు (161–175 దినములు) | | మిక్కిలి పెద్దవరులు (175 దినములకు పైగా) | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పేరు | ఫలించుటకు పట్టు దినములు | పేరు | ఫలించుటకు పట్టు దినములు | పేరు | ఫలించుటకు పట్టు దినములు | పేరు | ఫలించుటకు పట్టు దినములు | పేరు | ఫలించుటకు పట్టు దినములు |
| ఖోరియా | 104 | లోధ్యారి | . 131 | ధాన్యరాసులు | 146 | జి.యి.బి. 1303 | 161 | కొరంగుసంబా | 189 |
| మొలోకుంభీ | 109 | బసంగి 33 | 131 | రాధాప్రయాగ | 147 | సన్నబయ్యాహుండో (గం | 161 | కొత్తమల్లిసంబా | 189 |
| అరలాడ్డీలు | 109 | ,, 75 | 131 | బొద్దుమణి | 147 | కనకసొంపు 14 [జాం) | 161 | వెల్లసిరుమణి | 189 |
| స్వర్ణాలు 9 | 114 | గరికసన్నవరి 1 | 132 | సున్నాపువ్వులు | 148 | నవకోటిసన్నాలు 4 | 162 | కట్టైసంబా శై | 190 |
| బొబ్బిలిబుడమ | 116 | బొరిగి | 132 | సువర్ణముకీలు | 148 | ,, 6 | 162 | మసిపిషాణం | 192 |
| లంబా | 116 | బసంగి 55 | 133 | టొబారాసులు | 149 | కో. 1. | 162 | ఎర్రసిరుమణి | 192 |
| లోధ్రలు | 117 | ,, 61 | 133 | బొబ్బిలిగంటి | 149 | కృష్ణకాటుకలు 3 | 162 | రామగరుడ సంబా | 192 |
| అరువదాంసంబా 6 | 119 | యెర్రబక్కాలు | 138 | పాలగుమ్మసరి 12 | 151 | కొనామణి 14 | 162 | పిషాణం | 192 |
| సత్తికాలు | 121 | కెవిటొబొంపా | 136 | తెల్లరాధాప్రయాగ | 151 | పాలజలుగుత్తులు | 162 | మొలకొలకులు | 193 |
| నగిశెలు | 122 | బొడామొళీ | 137 | మలకనమహిపాళి | 151 | చీపురుబయ్యాహుండో | 162 | ముత్తుసంబా | 194 |
| నల్లఆరెలు (దాళ్వా) | 122 | కొన్నా | 137 | పునాసకొనామణి | 151 | నగుతలిసన్నాలు | 162 | సన్నవరి | 194 |
| హేమసన్నాలు | 123 | చెవిటిసొంపు | 138 | కొసాకడ్డీలు | 152 | కొయ్యిసొంపు | 162 | | |
| కొక్కెరధాన్యం | 125 | పెద్దకన్నెరాలు | 130 | సుడారిసన్నాలు | 152 | బలరామభోగం | 162 | | |
| బర్మా | 127 | రసంగి 23 | 139 | కాకిరెక్కలు 1 | 152 | వజ్ఝాణం | 162 | | |
| కొండకురంగి | 12/ | ,, 24 | 140 | పునాసకొనామణి 1 | 152 | గుమ్మసరి | 162 | | |
| పునాసఆర్రటగడా | 128 | ముత్తుబయ్యాహుండో | 14l | ంంకెలు | 153 | మహారాజభోగం | 162 | | |
| బసంగి 27 | 130 | ఆల్వారుసన్నాలు | 112 | పాలగుమ్మసరి 7 | 153 | రాజరత్నాలు | 162 | | |
| మెహారో | 130 | రసంగి 29 | 142 | పునాసఅక్కుళ్లు 10 | 154 | గునుపురంసన్నాలు | 162 | | |





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| బొటామొకోడా | 130 | బసంగి 46 | 143 | బొరొపొంకో | 154 | బంగారుతీగలు 3 | 162 |
| | | కలహాండిసన్నాలు | 143 | నల్లకొనామణి | 154 | కొపిసొంపు | 162 |
| | | సుంకిసన్నాలు | 143 | గుదామట్టా | 154 | కనకసొంపు 9 | 162 |
| | | బసంగి 90 | 144 | సన్న బయ్యాహుండో | 155 | రత్నసుడి (గంజాం) | 162 |
| | | రసంగి 26 | 144 | పునాసఅక్కుళ్లు 2 | 155 | మహిపాళి | 163 |
| | | ద్రొహణాపుగడా | 144 | ,, 3 | 155 | రత్నసుడి 13 | 163 |
| | | చినముండాబొలాలో | 144 | ,, 5 | 155 | ప్రయాగ | 164 |
| | | ముండ్లవరి | 144 | వాసనవడ్లు | 155 | బిక్కిరిసన్నాలు | 164 |
| | | పున్నియా | 145 | బర్మా 2 | 156 | రత్నసుడి 9 | 164 |
| | | నావిలబాటిసన్నాలు | 145 | దాశరథులు | 157 | బర్మా 3 | 164 |
| | | రసంగి 21 | 145 | బంగారుతీగలు | 157 | మోసపురులు | 165 |
| | | | | బయ్యాహుండా | 157 | కృష్ణకాటుకలు 1 | 165 |
| | | | | పునాసఅక్కుళ్లు 23 | 157 | కొనామణి 15 | 165 |
| | | | | రత్నసుడి 5 | 157 | ,, 16 | 165 |
| | | | | కనకసొంపు 4 | 157 | రత్నసుడి 10 | 165 |
| | | | | పునాసఅక్కుళ్లు 5 | 158 | పానియ్యాకలా | 166 |
| | | | | సన్నకుక్కుళ్లు 5 | 158 | నవకోటిసన్నాలు 5 | 166 |
| | | | | బర్మా 1 | 159 | హరిశంకర్ | 167 |
| | | | | రత్నసుడి 27 | 159 | నవకోటిసన్నాలు 3 | 168 |
| | | | | తూర్పుసన్నకుళ్లు 3 | 159 | బైటర్ ఫకీర్ | 169 |
| | | | | పాలగుమ్మసరి 4 | 160 | రత్నసుడి 15 | 169 |
| | | | | కిచ్చిడిసంబా(జి.యి.బి.24) | 160 | ,, 11 | 169 |
| | | | | బంగారుతీగలు 2 | 161 | కనకసొంపు 7 | 170 |
| | | | | కనకరత్నాలు | 160 | పెద్దఅక్కుళ్లు | 170 |
| | | | | | | బర్మా 4 | 174 |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొదటిపంటకు సాధ్యమైనంత తేలికవరిని బెట్టుదురు. మొదటిదంత తేలికవరియైన రెండవ వంతభాగుగ ఫలించును. ఏలయన రెండవపంటపెట్టులోపల నేల యారి సారవంతమగును. ఒక్కొకప్పుడు రెండువరిపంటలకును మధ్య పయరపంటనుగూడదీయు నుద్దేశముతో మొదటిపంటకు తేలికవరులను పెట్టుదురు. మరియు తేలికవరికి పిమ్మట చల్లిన పయరపంటవలె పెద్దవరికి వెనుకచల్లినపయరపంట ఫలింపదు. పయర, నూవుగాని చెరుకుగాని పెట్టవలచిన నేలలలోగూడ పునాసవరులనే పెట్టుట యనుకూలము. పెద్దవరులను పెట్టునెడల నేలను ఆసస్యములకు అనుకూలముగ తయారుచేయుటకు దగినవ్యవధి యుండదు. దాళువాపంటకు చివరవరకు నీరందుట కష్టమగుటచే. పునాసవరులే యనుకూలము.

పునాస లేక మిక్కిలిపునాస వరులను బెట్టు వారికి గలుగుముఖ్యమైనయిబ్బంది, అవి వర్షకాలమున కోతకువచ్చుటయే. మరియు నొక్కొకసంవత్సరములో తొలకరివలోర్షములు తక్కువగుటచే వానిసా గాలస్యమయి పంట తగ్గిపోవును చీవనేలలకుగూడ పునాసవరులనుకూలింపవు. పునాసవరులు తక్కినవరులకంటె ముందుగ పండుటచే పక్షులవలని నష్టముకూడ వానికి మెండు.

తుదివరకు నీరు విరామములేకుండ లభించుచోట్లను, నేల మిగుల సారవంతముగ లేనిచోట్లను, నీరాలస్యముగ లభించుటచే నాటుట యాలస్యమగుచోట్లను, ముందు మరియొక పునాససస్యము (చోడి, గంటె, తొలకరినూవు మొదలగునవి)తీసి పిమ్మట వరినాటుచోట్లను, కోతకాలమునకు త్వరలో నీరువదలని ప్రదేశములందును పెద్దవరులుగాని, మిక్కిలిపెద్దవరులు గాని పెట్టుదురు. మిక్కిలి పెద్దవరులన్నియు నెల్లూరుజిల్లాలోగాని యింకను దక్షిణమునగాని తూర్పువానల సహాయమున సాగు చేయబడురకములు. అవి ఈప్రాంతములందుగూడ సారువా నాటుకాలమునకును, దాళువానాటుకాలమునకు మధ్యకాలమున నాటునెడల తక్కిన రకములకంటె కొంతవరకు బాగుగనే పెరుగుచున్నవి. కాని దక్షిణదేశమునందువలె తృప్తికరముగ పెరుగుటలేదు.

పెద్దవరులకు సామాన్యముగ పేరుకు (ఉంచతిరి) గలనిబాగ యొక్క వ. బలమైన నేలలో నవి విస్తారమెదిగి గడ్డిని హెచ్చుగను, ధాన్యమను తక్కువగను నిచ్చును. తక్కినవరులన్నియు కోసినవెనుక నింకనునిలచి యుండు పెద్దవరులకు ఎలుకలబాధయు మెండు.

పునాసవరులకంటె ఆలస్యముగను పెద్దవరులకంటె ముందుగను ఫలించువరులు (మధ్యమములు) ఆ రెండుతరగతులయొక్కయు సుగుణములన్నిటిని కొంతవరకు కలిగియుండుటచే ఇటీవల నివి విస్తారముగ సేద్యము చేయబడుచున్నవి.

పైపట్టికయందు ఆయావరులు ఫలించుటకు పట్టు కాలముగ చూపబడినయంకెలు ఏయేస్థితిగతులం దెట్లు మారునో కొంతవరకు ఈక్రింద చర్చింపబడును.

రెండవ పట్టిక

| రకము | పొలము నెం. | విత్తిన తేది (నారుమడిలో) | నాటిన తేది | కోసిన తేది | ఫలించుటకు పట్టిన కాలము | వరా |
|---|---|---|---|---|---|---|
| | | | | | దినములు | |
| 1. బసంగి | 10 | 22-6-21 | 2[illegible]-7-21 | 5-11-21 | 136 | |
| (పునాసవరి) | 11 | 11-6-22 | 26-7-22 | 27-10-22 | 318 | |
| 2 కొనామణి | 16 | 21-5-12 | 8-7-12 | 21-11-12 | 181 | |
| (పెద్దవరి) | 16 | 12 6-12 | 8-7-12 | 21-11-12 | 163 | |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇతరపరిస్థితులన్నియు సమముగనుండి విత్తుకాలమునందు ముందువెనుక యయినయెడల ఫలించుటకు పట్టుకాలమునను హెచ్చుతగ్గులు గలుగును. కాని యిట్లు కలుగు వ్యత్యాసములపరిమితి వరల ఫలించుటకుపట్టు కాలము ననుసరించియే యుండును. పునాస వరులు విత్తుటయందుగలుగు ముందువెనుకలు చాలవరకు ఫలించు కాలమునందును గానవచ్చుటచే ఫలించుటకు పట్టుకాలమునందు వ్యత్యాసము అంతగా కానరాదు. పెద్దవరులవిషయమున విత్తుటయందు గలుగు ముందువెనుకలు ఫలించు కాలము నంతగా మార్పజాలవు. కావున ఫలించుటకు పట్టుకాలమునందు వ్యత్యాసము హెచ్చుగ నుండును. పై రెండవపట్టికను చూడుడు:

విత్తినకాల మొకటిగనేయుండి నాటుకాలమున వ్యత్యాసముగ నుండినయెడల నావ్యత్యాసము పునాస వరులు ఫలించుటకు పట్టుకాలమునందు హెచ్చుగ కాన్పించును. పెద్దవరులు ఫలించుటకు పట్టుకాలమునం దంతగా కాన్పించదు. మూడవపట్టిక చూడుడు:

మూడవ పట్టిక

| రకము | పొలము నెం | విత్తిన తేది (నారుమడిలో) | నాటిన తేది | కోసిన తేది | ఫలించుటకు పట్టిన కాలము | వరా |
|---|---|---|---|---|---|---|
| | | | | | దినములు | |
| 1. బసంగి (పునాసవరి) | 11 | 11-6-22 | 26-7-22 | 27-10-22 | 138 | |
| | 11 | 10-6-23 | 1-8-23 | 2-11-23 | 145 | |
| 2. కొనామణి (పెద్దవరి) | 16 | 31-5-12 | 26-6-12 | 21-11-12 | 174 | |
| | 16 | 31-5-12 | 16-7-12 | 21-11 12 | 174 | |

ఫలించుటకు పట్టుకాలము మధ్యమముగ నుండు రకములలో నీవ్యత్యాసముల పరిమితియు మధ్యమముగనే యుండును.

సామాన్యముగ విత్తుకాలముగాని, నాటుకాలముగాని, ఫలించుకాలమున కెంతసమీపించిన ఫలించుటకు పట్టుకాలమునందలి వ్యత్యాసము లంత హెచ్చుగనుండును.

సారువావరులను దాళువాకాలమున సాగుచేసినయెడలఅవి ఫలించుటకు పట్టుకాలపరిమితి తగ్గును. కాని సామాన్యముగ దాళువావరులను విత్తుకాలము (జనవరి నెల)నకు ముందుగ విత్తునెడల నీపరిమితి హెచ్చును. క్రిందిపట్టిక చూడుడు:

నాల్గవ పట్టిక

| రకము | విత్తు తేది | కోత తేది | ఫలించుటకు పట్టిన కాలము | వరా |
|---|---|---|---|---|
| 1. గరిక సన్నవరి | 3- 1-23 | 3-5-23 | 120 | సారువా పంటలో, 130 దినములు |
| | 3-11-22 | 9-4-23 | 130 | |
| | 1-11-22 | 21-3-23 | 140 | |
| 2. రసంగి | 3- 1-23 | 9-5-23 | 126 | సారువాపంటలో, 142 దినములు |
| | 30- 1-23 | 17-4-23 | 138 | |
| | 1-11-23 | 8-4-23 | 158 | |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




పువ్వాడ శేషగిరిరావు, చోడవరపు జానకిరామయ్య గారలు





వ్యాసకర్తలు

నీదుజత గూడి కాలంబు మోదమునను
గడప నెంచితిఁగాని యీకరణి నన్నుఁ
జింత కెర సేసి పోయి నంచింతు వంచు
స్వప్నమందైన సంశయింపను గదోయి!
శ్రవణపుటముల మాధుర్యరసముచిల్క-
మోహగీతిక పాడుమా, ముద్దుకృష్ణ!
ఎన్ని దినములు గడచెనోయీ, త్వదీయ
మంజులారావమాధురిమంబుఁ గ్రోలి!



కొన్నిరకములు అవి సామాన్యముగ వెన్నువేయు కాలమును దాటించి విత్తినయెడల మరుచటిసంవత్సరము వెన్నువేయుకాలము వచ్చువరకు ఎదుగుచునేయుండుట గలదు. సైదాపేటవ్యవసాయక్షేత్రమున నొకసంవత్సరము బంకువరి నిట్లు ఆలస్యముగ నాటినపుడదిసుమారు 10 నెలలవరకెదిగి యీనెను.

ఆ యాప్రదేశములందలి శీతోష్ణాదిస్థితిగతులందలి భేదమునుబట్టికూడ కొన్నిరకములు ఫలించుటకుపట్టు కాలము మారుచుండును. ఉత్తరసర్కారులలో సుమారు 5½–6 నెలలలో ఫలించురకమ్నుచుడి, దక్షిణార్కాడు జిల్లాలోని పాలూరువ్యవసాయక్షేత్రమునసుమారు4–4½ నెలలలోనే ఫలించెను.* కోయంబత్తూరులోకన్న ఉత్తరసర్కారులలో కిచ్చిడిసంబా (G. E. B. 24) ఆలస్యముగ ఫలించుచున్నది. కాని గరికసన్నవరి మొదలగు కొన్నిరకములు ఇట్లుండగా మార్పునొందవు.

నేలయొక్కసత్తువయందలి భేదములుకూడ కొంతవరకు ఆయారకములు ఫలించుటకు పట్టుకాలమునందు వ్యత్యాసములు గలిగించును. బలవయిననేలలో సామాన్యముగ బీదనేలలోకంటె చేనుత్వరలో ఈని పండును. కాని నేల మిగులసారవంతముగనున్న పుడీనుటయు, పండుటయు నాలస్యమగుట గలదు. కొన్నిరకముల బీదనేలలలోనే ముందుగ నీనుటయు గలదు. ఉ. కిచ్చిడిసంబా. (G. E. B. 24)

వెలుతురుకూడ చేను త్వరలో నీనుటకు సహకారి. చెట్టునీడనున్న చేనికంటె బాగుగ యెండతగులుప్రదేశమునందలిచేను త్వరలో నీని పండును.

* 1909–12.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శ్రద్ధానందస్వామి నిర్యాణము

దుర్గుమహంతి చిన్నయ్యశర్మ, కళానిలయము

[illegible] పతే రెనా, దేశ కల్యాణవైభవ
దాయకుండగు మహానాయకుండు!
మడిసెనా, కల్పద్రుమమునై నహోస్యంబు
గావింపఁ జాలు త్యాగప్రియుండు
సమసెనా, నూత్న సంస్కరణాభిలాషమై
యతనంబు సల్పెడు యతివరుండు!
పోయెనా, భారతభువన మోక్షపథమ్ము
ననుసరింపఁగఁజాలు నలఘుమూర్తి
పరమపదమును గాంచెనే భారతీయ!
పుత్రరత్నమ్మొకండు సంపూజ్యగుణుఁడు
సర్వసంగపరిత్యాగ సాధుజనున
కక్కటా, యెట్టిదుర్మృత్యు వాసహిల్లె.

ఉ. సారముఁగల్గువాని, మన సారఁగ సేవ నొనర్చువాని, దు
ర్వారవిపన్నికాయము నివారణ సేసెడువాని, ధర్మదీ
క్షారతుఁడైనవాని, గురుసాహసచిత్తముఁ గల్గుయోధునిన్
మారిమిగల్గుపుత్రమణిఁ గోల్పడి యేడ్వఁదొడంగె నింక మా
భారతమాతభావిదశ పాప, మదెట్టులనున్నదో కదా!!

ఉ పారములేనికష్టముల పాల్పడి స్వేచ్ఛఁ దొలంగి బంధనా
గారమునందు నూలఁబడి కన్నులబొమ్మకణంబు లొల్కఁగా
బోరున నేడ్చుచుం దనదుపుత్రుల దీనతతోడఁ గాంచు మా
భారతమాతభావిదశ పాప, మదెట్టుల నున్నదో కదా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సంక్రాంతి

కాట్రావులపల్లి రామమూర్తిగారు

దక్షిణాయనమందు తగిలిన కష్టముల్
మ్రగ్గునటులు భోగిమంట లెగయ
ధర్మాత్ము లొసరించు దానాదికములచే
దీనుల వదనముల్ దీప్తిఁ జెంద
పితృదేవతలఁ బట్టి పీడించు పాపముల్
వీడ బాపలకిడు విందు లెనయ
హరినామసంకీర్తనామృతయుతమైన
దేవతారాధనల్ దీటుమీఱ
రంగవల్లులు వీథుల రంగు నింపఁ
గ్రొత్తయల్లుండ్రు శీవితళ్ళొత్తుకొనఁగ
నమిత సంతోషజనకమై యలరుచుండు
సర్వజనులకు సంక్రాంతి పర్వ మరయ.

C.V.R.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వనకుసుమమాలికల్ గళంబునఁ జెలంగ
నీవు దళుకొత్త మురళి వాయించునీదు
మోహనాకార దర్శనంబునకు వేచి
కాలమిట్టులె నడపు దినాలికెన్నొ.

పొదను బుట్టిన వెదురు నీమురళి యగుచు
నీదు మధురాధరం బాన నేర్చు కొఱకు
నోచియున్నట్టి నోములు నోమ నేమొ,
నేను భవదీయకరుణావిహీన నయితి!

చిఱుత ప్రాయంబునుంచి పెంచితివి మోహ
లతిక నిప్పుడు పెఱుకంగలాడ వెట్లు?
నాహృదయసీమ నయ్యది నాటుకొనియె
లలిత భవదీయ ప్రేమాంబువులను ద్రావి.

తాఁకినంగందు పుష్పసంతతులఁ దెచ్చి
ప్రణయసూత్రాన వలపు కప్రంపుటుండ
లచటచటఁ బెట్టి కట్టిన యలరు దండ
కేలఁ గొనియుంటి రమ్ము! గోపాలకృష్ణ!

ఉ. ఈసుముహూర్తమందుఁ గమ
లేక్షణ! నీవిటు జాగుచేసినం
త్రోసము రూపుమాపఁదలఁ
త్రో; భవదీయ కృపానిధానభి
క్షాసము పేళఁ జేసెదొ; వి
చారము నేసి మదీయజన్మమున్
వాసితము బొనర్చు కరు
ణామతివై నవనీతచోరకా!

ఉ. నాఁటి ప్రభాతవేళ నయ
నంబుల మోడిచి నిన్ జపించగా
గాటపుఁగూర్మిఁ జూపిన య
ఖండమనోజ్ఞ కటాక్షమాలికల్
నేఁటికి నామెడం బరపి
నిత్యము నీముఖదర్శనక్రియా
పాటవమిచ్చి ప్రోవఁదగ
వా, తగవా తెగనాడ నన్నిఁకన్?

శా. ఏలా యింతటి యేవ? మీఁదగను రా
వేలా మదీయార్పితా
వేల ప్రేమ సుధాస్రవంతికల? సం
ప్రీతిన్ మదిన్ బూనఁగా
నేలా సందియ? మిట్టివర్తనముమే
లే? చాలు, నీకోసమై
యీ లీలం బడిగాపులున్న నను నీ
క్షింపంగరాదో యికన్.

గీ. ఈవె దయ దాఁచితేని పూర్ణేందువదన!
శీతభానుని కరసమాయాత వాత
దారుణా ఘాతముల కేను దాళఁ జాలఁ
బ్రేమ కలదేని వాటిఁ దప్పింప రమ్ము.





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




పప్పు మల్లికార్జునరావు గారు, బి. ఏ.

సురూప విభ్రమములఁ గాంచి స్త్రీ పురుషు లన్యోన్యముపొందఁగోరుభోగకాంక్ష మోహమనియు, తిర్యగ్జంతువులు ఋతుకాల మందుఁ గవయగోరు కోరికయునట్టిదయనియు, భర్తసౌఖ్యంబునకై భార్య తనసౌఖ్యములనెల్ల ధారవోయుట ప్రేమ యనియు, మానవుల యందు స్వార్థంబు మాయమైనఁ బ్రేమరాజ్యం బు ధరణిని బెంపుగనుననియు నొకానొక పండి తప్రవరులు మోహప్రేమ శబ్దములకు నిర్వచ నంబు లొసంగి కవికులసార్వభౌముఁడగు కాళి దాసుని మోహమే ముఖ్యముగఁ జెప్పిన గ్రంథ కర్తలలోఁ జేర్చి, వాల్మీకిని, నాంగ్లేయ నాటకకర్త యగు షేక్సుపియరును బ్రేమతత్వంబుఁ బ్రసిద్ధి జేసినవారినిగాఁ బరిగణించిరి.

ప్రేమతత్వంబు ప్రసిద్ధిచేసిరన్న కవీంద్రుల విషయమై నేనేమియుఁ జెప్పఁదలఁచుకొనలేదు. కాని కాళిదాసు మోహమేముఖ్యముగఁ జెప్పిన గ్రంథకర్తలలోనివాఁ డనుట సత్యదూరముగ నుండుననిమాత్ర మిాక్రింది యంశములవలన విన్నవించుచున్నవాఁడను. నేను సంస్కృత భాషాకోవిదుండను గాకపోయినను గాళిదాసు ని కవిత్వము కొంతరుచిగొన్నవాఁడ నగుటచే నీవిషయమై దిఙ్మాత్రప్రదర్శనముగఁ గొంత సమాధానము వ్రాసి చర్చనీయమగు నీయంశ ము నింకనువిపులముగా విమర్శించుటకై పండి తులను గోరుచున్నాఁడను.

కాళిదాసుని గ్రంథము లన్నిటిలోను బ్రేమస్వరూపము గాన్పించుచున్నను నదియే కథావిషయముగవ్రాసిన "మేఘసందేశము"ను దిలకించితిమేని ఈవిషయమున నాతని యభి ప్రాయము స్పష్టపడకలదు. శృంగార రసాత్మక మగు ప్రేమ రెండువిధములుగ సుప్రసిద్ధకవు లందఱును వర్ణించుట వాడుకయై యున్నది. (1) సంభోగశృంగారము (2) విప్రలంభశృంగా రము. మొదటిది నాయికా నాయకుల కూడి కకుము దుభయులయందును బొడకట్టుమనో వికారము. రెండవది నాయికానాయకు లొక సారికూడి తిరిగి వియోగముఁ జెందగా స్ఫురిం చెడి మనోవికారము. ఈ రెండింటి యందును బ్రేమ కలదు. కాని మొదటిదానిలో స్వార్థ పరత్వము హెచ్చుగా నుండును. స్వేంద్రి యోపభోగములకయియే ముఖ్యముగా నాయ కుఁడు పరితపించును. దీనియం దున్నతాశయ ములంతగా నుండవు. ఒక విధముగా దీనిని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మోహమనియే చెప్పనచ్చును. రెండవ దాని
యందలి ప్రేమ యిట్టిదికాదు. అది శుద్ధప్రేమ
యే. నాయికానాయకు లొకరిసంగతి నొకరు
స్వయముగా నెఱుఁగుదురు. ఒకరి యవస్థకు
నింకొకరు సానుభూతి కనఁబరతురు. అంతియే
కాక తమ యవస్థకంటెఁ దమప్రియవ్యక్తి
యవస్థయే మెక్కుడుగఁ దలపోయుచుందురు.
స్వార్థరాహిత్యము, పరహితము గలవు. ఇది
పూర్ణత్వముగాంచినచో శ్రీకృష్ణపరమాత్మ
యందుగోపికాసహస్రములకుఁగలిగినభక్తియై
శాశ్వతానందదాయక మగును. దీనియం దిట్టి
యున్నతాశయము లుండుటచే మొదటి దాని
కంటె శ్రేష్ఠతరమై పైపండితులయభిప్రాయమును
బట్టికూడఁ బ్రేమమనుటకుఁ దగియున్నది.
మేఘసందేశమున నభివర్ణితమైనదియీ రెండవ
ప్రేమనువ్యక్తపఱచు విప్రలంభ శృంగారమే
కాని సంభోగశృంగారముకాదు. అందువర్ణింపఁ
బడిన యక్షుఁడు

"ప్రత్యాసన్నే నభసి దయితా
జీవితాలంబనార్థీ
జీమూతేన స్వకుశలమయీం
హారయిష్యన్ ప్రవృత్తిమ్."

అనువాక్యములఁబట్టితనప్రియురాలియోగక్షే
మములనుకోరువాఁడుగాఁ జెప్పఁబడెనుగానితా
నెట్లు బాధపడుచున్నాఁడోయాబాధలు తెల్పు
వాఁడుగా వర్ణింపఁబడలేదు. విరహిజనవిరహో
ద్రేకంబగు శ్రావణమాసము సమీపించుటం
జేసిప్రియురాలిజీవితపుఁబట్టును గోరినవాఁడై
తాను కుశలముగా నున్న వార్తను బంపఁ
గోరెను. తిరిగి కలిసికొనెదమను నాశచే నామె
జీవించియుండుననియు, నట్టియాశకుఁదన కుశ
లమే ప్రధానమనియు యక్షుఁడుగ్రహించెను.
ఈయాశయే ప్రేమ. ఇట్టిప్రేమ విప్రయోగ
మునందుఁ బ్రాణమును సహితము గోల్పోవు
నట్లుచేయఁదగినంతబలవత్తరమైనదిగాయక్షుఁ
డెఱుఁగును. ఆతని యీ క్రింది వాక్యముల
గనుఁడు:

"తాంచావశ్యం దివసగణనా
తత్పరా మేకపత్నీ
మవ్యాపన్నా మవిహతగతి
ర్ద్రక్ష్యసి భ్రాతృజాయామ్;
ఆశాబన్ధః కుసుమ సదృశం
ప్రాయశో హ్యంగనానాం
సద్యః పాతి ప్రణయిహృదయం
విప్రయోగే రుణద్ధి."

తిరిగి కలిసికొందుమను నాశ యప్పుడు
జారిపడిపోవుచున్న కుసుమసదృశమైన స్త్రీల
జీవితము నడ్డగించునట! అందుచేత మేఘునిఁ
దన కుశలవార్త వేగముగా నెఱింగింపు మని
తొందరపెట్టుచున్నాఁడు.ముఖ్యముగాయక్షుని
మనంబుననున్నది తనప్రియురా లనుభవింపు
చున్న యిక్కట్టులఁగూర్చినతలంపుగాని, తన
కష్టములఁగూర్చికాదు. ఈయంశ మనేకశ్లోకం
బుల నింకను గాననగును. ఇట్టి మనోభావమే
యుత్తమమగు ప్రేమ. అది కాళిదాసే యిట్లు
చెప్పినాఁడు.

"స్నేహా నాహుః కిమపి విరహే
ధ్వంసిన స్తే త్వభోగా
దిష్టే వస్తు న్యుపచితరసాః
ప్రేమరాశీ భవంతి."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈప్రేమతత్వము కాళిదాసితర గ్రంథములందును బాగుగాఁ గనఁబఱచియున్నాఁడు. శాకుంతల నాటకములో శకుంతలా దుష్యంతుల ప్రథమసమాగమముతో సరిపెట్టక తిరిగి వియోగము కల్పించి శకుంతలచేఁ దపము చేయించి దుష్యంతుని బశ్చాత్తప్తునిగఁ జేసి యొకరియం దొకరికి గాఢప్రేమ కలిగించి తిరిగి కలిపినాఁడు. ఇట్టిప్రేమ మిగుల నుత్కృష్టమైనదని ప్రస్తుతకాలమందున్న కవులలో నగ్రేసరుఁడన్న ఖ్యాతిగాంచిన రవీంద్రనాథుఁడు శాకుంతలముఁ గూర్చి యిట్లు వ్రాయుచున్నాఁడు: "దాంపత్యధర్మమును విషయలోలత్వమునుండి తప్పించి పవిత్రమును, నిర్మలమునగు యోగపీఠము నధిష్ఠింపఁజేసెను. హిందువుల మతగ్రంథములయం దాధర్మము కఠినశాసనముల చేతను అనుష్ఠానములచేతను నిర్వచింపఁబడి క్రమపద్ధతికిఁ దేఁబడెను. ఆధర్మమునే కాళిదాసు కళాసౌందర్యరూపమునఁ బ్రకటించెను. ఈసౌందర్యరాశిలో స్త్రీపురుషులప్రేమ, తీవ్రమడఁగి సద్భావసముద్రమున సంగమించుచుఝరీప్రవాహమువలె ప్రశాంతిని బొందుచున్నది. కావుననే యిట్టిప్రేమ నిరంకుశమగు కామోద్రేకమునకన్న నుత్కృష్టమై మహాద్భుతమును గలిగించుచున్నది." మనరాజధాని కళాశాలయందు సంస్కృతశబ్ద తత్త్వ మహోపన్యాసకులుగనుండిన రావుబహద్దర్ యం. రంగాచార్య, యం. ఏ. గారు కాళిదాస శాకుంతలమును గూర్చి యిట్లు వ్రాసిరి:

"His very aim in cleverly combining in the drama of Sakuntala the love that longs for union with the love that yearns for re-union seems to be to obtain the needed scope for the exhibition of that self-effacement which forms the true index of the ideally perfect love. It is in fact in Hindu religion and Indian literature that we see so much importance attached to self-effacement looked upon as the natural and necessary result of godly devotion as well as of perfected human love."

కుమారసంభవ కావ్యమందును లోకోత్తర సౌందర్యముగల పార్వతిని జూచినప్పుడు శివుఁడు ప్రేమించినట్లు చెప్పక యామె తన బాహ్యసౌందర్యము శివునివాల్లభ్యముఁబడయఁజాలక వ్యర్థమైనదని నిందించుకొని ఘోరమైన తపము చేసినప్పుడే శివుఁ డామె నర్థాంగినిగ స్వీకరించినట్లు కవి చెప్పియున్నాఁడు. స్వార్థపరత్వత్యాగమైన యుత్కృష్టప్రేమనే కాళిదాసు తనగ్రంథంబులయం దున్న నాయికానాయకులయందుఁ జిత్రించినట్లుఁ గన్పడుచున్నది కాని మోహము కాదని తోఁచుచున్నది. ఈవిషయముంగూర్చి పండితు లింకను దఱచెదరు గాక యని కోరుచున్నాఁడను.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# మాతృవందనము

### శ్రీ శేషాద్రిరమణకవులు

నన్నయాది మహాకవినాయకులకుఁ - గృష్ణరాయాది రాజనశ్రేణ్యులకును
ఖడ్గతిక్కనముఖవీరగణమునకును - బ్రాపయిన తెల్గుదేశమా, వందనంబు.

ఉ. వీరుల శూరపుంగవుల విశ్రుతకీర్తుల కాలవాలమై
మీఱిన తెల్గు దేశమిది మేదినిఁ జెల్వగు స్వర్గఖండమే
కూరిమి పూర్వజన్మమునఁ గూర్చిన పున్నెముచేత నేయిటన్
పౌరుఁడనై జనించితిని పావనమయ్యెను పుట్టు వన్నెఁటన్.

తే. సర్వభాషలలో నున్న సరళనియతు-లాంధ్రభాషాసరస్వతి కలవరించి
పేరుగాంచిన చాళుక్యవీరనృపుల-జన్మరంగమ తెల్గుదేశమ, నమస్సు.

ఉ. ఆజిని వైరిసంతతుల నందఱ నోర్చి జయంబు గాంచి శ్రీ
రాజమహేంద్రపట్టణము రాజ్యపదం బొనరించి తెల్గులో
రాజిల నాంధ్రభారతము వ్రాయఁగఁ జేసి ప్రశస్తి గన్న మా
రాజనరేంద్రుఁడున్ వెలుఁగు రాజె కరంబులు మోడ్చి మ్రొక్కెదన్.

కం. మును దండ్రియాజ్ఞ నడవికిఁ-జనుచున్ శ్రీరామమూర్తిజానకియున్ మా
తెనుఁగునెలవందె తిరిగిరి-గనుకన్ మాయాంధ్రభూమి గౌరవ మొందెన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చం. ఘనమతి కృష్ణరాయనరకాంతుని కార్యభరంబుఁ బూని నే
ర్పున నిఖిలాంధ్ర భాగమును భూపతికై వస మాచరించి భూ
జనులకొఱంత దీరిచి విశాలయశంబు గడించి పెంపుమై
మనినమహాత్ముఁ దిమ్మరసుమంత్రిని గాంచినమాత మ్రొక్కెదన్.

సీ. పడవలపై నెక్కి కడలి నల్గెలఁకులఁ జేరి వ్యాపారంబుఁ జేసినారు
పరులకు నడుగిడఁ దరము గానట్టులు గట్టిదుర్గంబులఁ గట్టినారు
వనధికి గారాబుతనయ కైవడిఁ బొల్చు పరసరోవరముఁ దేర్పఱచినారు
జీవస్రవంతులఁ జీలిక లొనరించి నిఖిలసస్యములఁ బండించినారు
మగధ మొదలైన విపులసామ్రాజ్యములను, మించి గడియించి పేర్మిఁ బాలించినారు
ఆంధ్రవీరు లనంగ సామాన్యమనుజ, మాత్రులే బీరమందుఁ ద్రినేత్రసములు.

సీ. కదనంబులో నొచ్చి గతిచెడి యింటికివచ్చిన తన ప్రాణవల్లభునకు
మంచంబుచాటున మరుగును గావించి పసుపు కుంకుమ నట పదిలపఱచి
రణభూమిఁ దొఱఁగిన రాచబంటుల కిది స్నానవిధంబని సరసమాడి
క్రమ్మఱ యుద్ధరంగమునకుఁ బతినంపి, యాతనిమృతివార్త నాలకించి
సహగమనసద్వ్రతంబును సలిపినట్టి-చానమకు ఖడ్గతిక్కనసైన్యపతికి
సదన మైనట్టి తెలుఁగుదేశంపు విభవ-వర్ణన మొనర్పఁగా నలువకుఁ దరంబె

చం. గడుసరులైన తేంద్ర నరిగాపులుగా నొనరించి, పౌరులం
దడఁకువ, సత్యనిష్ఠ చెలు వారఁగఁ జేసి, ధరాభరంబుఁ దాఁ
బడఁతుకయయ్యుఁ బూనిన శుభప్రద రుద్రమదేవి రాజ్ఞి యే
ల్బడికతనం బ్రశస్తిని నెలర్చె మహాంధ్రధరిత్రి యంతటన్.

తే. భాషకును రాజ్యమునకు శిల్పంబునకును-ధర్మసంస్థాపనకు జీవితం బొసంగి
వెలసిన ప్రతాపరుద్ర పృథ్వీశ్వరుండు- ఆంధ్రుఁ డగుటయు మాసుకృతాతిశయమె.

సీ. మనుమసిద్ధినృపుండు మామ మామా యంచు-గౌరవదృష్టితోఁ గాంచుచుండ
సకలరాజన్యులసన్నిధి తనయాన - తలమానికంబుగాఁ దనరుచుండ
సర్వవిద్యలును వాచావిధేయంబులై - యవసరసమయంబులం దెలర్ప
పాండిత్యపౌరుషమండనంబులచేతఁ - దనజీవితంబు సార్థకముగాఁగ
ఆంధ్రు లెందాఁక నుందురో యంతదనుక - శాశ్వతంబుగ నలరార సరళగతిని
భారతంబును వ్రాసిన సూరివరుని - తిక్కన మహాకవీంద్రు నుతింపఁ దరమె?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఆసను జంపి, భూవిభులయాదరణంబును రోసి, యాత్మ వి
శ్వాసము నొందె యాంతగొని, భాగవతంబును దెల్గు సేసి, పే
ర్వాసిని గాంచి పెంపెసఁగు భక్త శిఖామణి పోతరాజుచే
భాసురమైన మా తెలుఁగు భాగ్యము సన్నుతిఁ జేయ శక్యమే.

ఆ. వె. మొల్ల, మధురవాణి, మోహనాంగియుఁ దఱి-కొండ వెంగమాంబ కూర్చినట్టి
కావ్యరత్నములకుఁ గైవసంబైన మా - తెలుఁగుబాస పెంపుఁదలఁతు నెదను.

ఉ. జీవకళాభిరామములు శిల్పము లొక్కెడ, మాధురీజల
స్రావములై తనర్చెడితరంగిణు లొక్కెడ; పూర్వవీరచి
హ్నావృతచిత్రవిగ్రహచయంబులు నొక్కెడఁ గానవచ్చు సు
శ్రీవితతాంధ్రభూమిని జరించు టదృష్టము గాదె మాకిలన్.

సీ. వాలారుకీల్జడపోలిక కృష్ణాతరంగిణి నిరతంబు రాజిలంగ
ఆకుపచ్చనిచీరె యట్లు ముక్కారుఫలించు క్షేత్రంబులు మించుచుండ
క్రీడాసరోలక్ష్మి పోఁడిమి తూర్పు సముద్రంబు చెంగటఁ బొలుపుగూర్ప
ఉపవనంబులలీల నుర్వీరుహోన్నత వివిధాటవులు కనువిందు నింప
సంపదలకెల్ల నిరవయి సౌఖ్యములకు - మందిరంబయి యానందకందమగుచుఁ
బుణ్యదేశంబులం దగ్రగణ్యమైన - యాంధ్రమాతకుఁ గేల్మోడ్తు ననుదినంబు.

ఉ. అడ్డిన వైరిసంతతుల నాఁగి రణాంగణమెల్ల నెత్రుచే
జిడ్డొనరించి దుర్గములఁ జేకొని పొంపిరివోనినేర్పుతో
రెడ్డివసుంధరేశులుచరించినయాంధ్రధరాతలంబు సే
ర్వడ్డదిగాదె కీర్తి విభవంబులయం దసమాన వైఖరిన్.

గీ. పురుషులకుఁ దోడునీడయి దురమొనర్చి - అరిబలంబులనోర్చినయాంధ్ర సతుల
విక్రమచరిత్రముల నాలపించుచుండెఁ-బల్లెపాటలు నవరసబంధురముగ.

సీ. వారాశివలయితవసుధాతలంబెల్ల పాలించినారు నృపాలమణులు
భరతవర్షమునందుఁ బరిషత్తులను గెల్చి పేరొందినారలు విప్రవరులు
ద్వీపాంతరములతో బేరసార మొనర్చి భాగ్యముల్ వడసిరి వైశ్యకులులు
ప్రభుభక్తితోఁ గత్తిఁబట్టి మార్తురఁ గూల్చి విలసిల్లినారలు తెలుఁగుబంట్లు
ఆంధ్రజాతీయతా విభవాతిశయము - గణనకెక్క చరిత్ర రంగస్థలమున
ఋషిమనోభావముల నావరించి; నాఁటి - మాతృదేశప్రశస్తి సామాన్యమొక్కొ!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ఏయరా! తెడ్డేయరా!

చిలుకూరి నారాయణరావు గారు, యమ్. ఏ., యల్. టి.

[క్రిందటి వేసంగి సెలవులలో రాజమహేంద్రవరములోని కొంతమంది ఉపాధ్యాయులమున్ను, ఇతరులున్ను కలిసి గోదావరి మీద పడవషికారు వెళ్లుతూ ఉండేవారము. పడవను నడుపుకొనేటప్పుడు ఏలపాటలు పాడుకొంటూఉంటే ఆయాస మనిపించదని తెలిసినా, పాట లెవరికీ రాకపోవడముచేతనూ, గోదావరిమీద పడవవాళ్లు పాడేవాటిలో కొన్ని అసభ్యములుగా ఉండడముచేతనూ, కొన్ని పాటలను మేమే వ్రాసి పాడుకోవచ్చునని ఆలోచించుకొన్నాము. ఆసందర్భములో నేనువ్రాసిన పాటలను భారతిలో ప్రచురిస్తే బాగుంటుందని తలచి ఈ క్రిందిదానిని పంపుకొన్నాను. ఈపాట గౌతమీస్రవంతికిన్నీ, జీవాత్మకున్నూ సంబంధించేటట్టు ధ్వనితో వ్రాసినాను. పాటతరువాత వ్రాసినవ్యాఖ్యానముతో మొదట చదువుకొని, తరువాత మరిఒకసారి చదువుతే ధ్వని బోధపడుతుంది.]

"ఏయరా! తెడ్డేయరా![1]
ఆ - జాయనే[2] పోనీయరా!......ఏయరా!

1. మూడుకన్నుల - కొండ[3]మీదా
తోడునీడా -[4] లేకపుట్టి
కూడుకొన్నది కొత్తవారిని[5]
జోడుగా నడిచింది తోయం[6]..... ఏయరా!

---

(1) తెడ్డేయరా=పడవను నడపుము; నీజీవయాత్రను చేయుము. (2) ఆజాయనే=నీటిజాయను తిప్పలమీది కెక్కించకుండా; ఆగామి, సంచిత, ప్రారబ్ధకర్మలచే విహితమైనట్టిన్నీ, వర్ణాశ్రమాచారవిహితమైనట్టిన్నీ మార్గమున. (3) మూడుకన్నులకొండ=గౌతమి ఉద్భవించిన నాసికాత్ర్యంబకాద్రి, (అంబకమనగా కన్ను) సత్త్వరజస్తమోగుణములను కన్నులు(గుణమనగా కన్ను); (4) తోడునీడా=గోదావరితో కలిసి మరి యేనదిన్నీ పుట్టలేదు; జీవుడీలోకములోనికి వచ్చిన క్షణమందతనికి తోడునీడలు లేరు; (5) కొత్తవారిని=కొత్తజలమును; కొత్తమనుష్యులను; (6) తోయంబు=నీరు బంధుత్వము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

2. పురిటిలోనే - సంపెకొట్టక[7]
జరిగినది యీ - నేలవంకకు[8]
పరువులెత్తె నపారశక్తికి[9]
నిరవుగా నెగసింది తోయం[10]...బేయ రా!

3. పట్టినది బంగారపహూతూ[11]
మెట్టినది రతనాలగనిమై[12]
కొట్టినది మారాజుకోటై[13]
కొట్టుకొని వచ్చింది తోయం...బేయరా!

4. పాపులకు[14]లోబడె నొకప్పుడు
పాపమెలికల[15] తిరిగె నప్పుడు
తాపమెత్తినచోట్ల తిప్పల[16]
కాపుగా తిరిగింది తోయం......బేయరా!

5. అయిదుపాయల యందు పారి[17]
ఆరో పాయకు[18] అంజ లెత్తి[19]
అంత నేడోపాయ[20]తోనే
అంత మొందిన[21]యట్టితోయం...బేయరా!

6. ఇవల నెచ్చటినుండి వచ్చెనో[22]
అవల నెచ్చటి కేగునో మరి[23]
యివల కవలకు[24]మధ్య కొట్టక [రా!
మిన్నుల[25] పొంగుతు కుంగుతుంటుం...దేయ



(7) పురిటిలోనే సంపెకొట్టక=గోదావరి అరేబియాసముద్రమువంకకు జారి ఉంటే అరవైమైళ్ల పిల్లకాలువగా ఉండి ఉండును; జీవుడు పురిటిలోనే తన దేహమును విడిచి ఉంటే తక్కిన అనుభవమును ఈ జన్మములో పొంది ఉండడు. (8) ఈ నేలవంకకు=తూర్పువైపు; భూలోకము వంకకు. (9) అపారశక్తి=గోదావరీ ప్రవాహము మూలమున విద్యుచ్ఛక్తిని పుట్టించినన్నీ, ఇతరవిధములాకూడా పనిచేయుటకు సాధ్య మవుతున్నది. దాని జలములచేత భూమినుంచి సస్యాదిరూపమున అనంతశక్తి బయలు దేరుతున్నది; మనుష్యుడుకూడా చేయతలంచుకొంటే ఎంతపనినైనా చేయడానికి సమర్థుడై ఉన్నాడు. (10) తోయంబు=జలము; బంధుత్వము.

(11-12) గోదావరి బంగారము గనుల మీదనుంచి పారుతున్నది. రత్నగర్భ అన్న ప్రఖ్యాతి పొందినది. కోహినూరురత్నము ఈనదిలో దొరికినదే; జీవుడి జాతకముకూడా ఉన్నతిలోనికి వచ్చినది. (13) మారాజు=మహారాజు. గోదావరి ఒడ్డున ఎన్నో సామ్రాజ్యములు లేచి అంతరించినవి; జీవుడు గొప్పపదవిని పొందుతున్నాడు.

(14) పాపులకు=పాపికొండలు; దుష్టులు; (15) పాపమెలికల=అనేకమార్గములుగా; వక్రమార్గమున. (16) తిప్పలు=దిబ్బలు, లంకలు; కష్టములు.

(17) అయిదుపాయలు=గోదావరి లోలుత అయిదుపాయలుగా విడినది; జీవుడుపంచేంద్రియవిషయములకు లోనవుతున్నాడు; (18) ఆరోపాయ=తరువాత గోదావరి నుంచి ఆరోపాయవిడినది; మనస్సు ఆరోఇంద్రియము; (19) అంజ లెత్తి ఆరోపాయతో గోదావరి గతి మందగించినది; మనస్సునకు ఇంద్రియములు లోబడి అనేకవికారములకు లోనవుతున్నది. (20) ఏడోపాయ—గోస్తనీకాలువ: బుద్ధి; (21) అంతమొందిన=గోస్తనీనది ఎచ్చట అంతమవుతున్నదో తెలియదు; అది యిసుకలో అంతము పొందుచున్నది. "బుద్ధినాశాత్ప్రణశ్యతి" అనేటట్లు బుద్ధి నశించగానే జీవుడుకూడా నశిస్తున్నాడు.

(22) ఇవల=పుట్టకచోటు; జన్మమునకు పూర్వకాలము. (23) అవల=సముద్రములో చేరిన తరువాత; మరణానంతరమున. (24) ఇవలకవలకు=రెండుఒడ్డులకును; పుట్టుకచావులకు. (25) పొంగుతు కుంగుతు-వరదలప్పుడున్నూ ఎండకాలములోనూ; ఉచ్చదశలోనూ, నీచదశలోనూ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




ఈదిగువ జేర్కొనిన గ్రంథములను సంతసముతో నందుకొంటిమి.

౧. (ఎ) శ్రీపన్నగాచలనాయకశతకము; వెల రు 0-4-0; (బి) పరమానంద సుధాలహరి(వేదాంతగ్రంథము), తత్త్వములు—కర్త: పులహరి శీర్ద్రేశేంద్రులు. పేజీలు 63. వెల 0-8-0. ప్రకాశకులు: పులహరి శీరోజిబాబుగారు; సత్తెనపల్లి.

౨. (ఎ) తత్త్వదీపిక; పద్యములు. పేజీలు 33. వెల0-6-0;(బి) బాలశతకము. వెల 0-1-0—కర్త: మహావాది వెంకటరత్నముగారు.

3. ఎల్లమందకోటీశ్వరశతకము;104వృత్తములు—కర్త: అబ్బరాజు. పిచ్చయ్యశర్మగారు. పేజీలు 19. వెల 0-3-0. పై మూడుపుస్తకములును సత్తెనపల్లి నివాసులు వావిలాల గోపాలకృష్ణయ్యగారియొద్ద దొరకును.

౪. ఆంజనేయచరిత్రము(ద్వితీయముద్రణము):గద్యపద్యాత్మకము—కర్త: కొప్పరపు వేంకటరమణయ్యగారు; పోరంకి. పేజీలు 62 వెల. 0-6-0

౫. నిజాంరాష్ట్ర ప్రశంస; పద్యకావ్యము—కర్తలు: శ్రీ శేషాద్రిరమణకవులు; పేజీలు72 వెల 0-8-0. పుస్తకములు దొరకుచోటు: శ్రీకాకతీయగ్రంథమాల, వరంగల్, నైజాము.

౬. రాజయోగి; నవల (పూర్వభాగము)—కర్త: ఆర్. భాష్యాచార్యులుగారు; పేజీలు 741. వెల0-12-0. ఆంధ్రపత్రికా చందాదారులకు అయిదణాలకు ఇవ్వబడును. పుస్తకములు వలయువారు కర్తగారి పేర, 125 సెప్పింగ్సురోడ్డు కంటోన్మెంటు, బెంగుళూరునకు వ్రాయవలయును.

౭. రుక్మిణీకల్యాణము; అయిదంకముల నాటకము—కర్త: విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రిగారు, విజయనగరము. పేజీలు 44. వెల. 0-8-0

౮. రసమంజరి;పద్యకావ్యము—కర్త: తాడూరి లక్ష్మీనరసింహారావు పంతులుగారు, రాజమండ్రి; పేజీలు 65. వెల 0-6-0

౯. విషములు; తచ్చికిత్సలు (విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాలయొక్క ౯ వ కుసుమము); గద్యము—కర్త: ఓ. రాఘవరంగారావుగారు, యం.బి. (హెచ్). పేజీలు 126. వెల 1-8-0. పుస్తకములు దొరకుచోటు: విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల, నెమలికొండ. నైజాం.

౧౦. జయవిజయులు; గద్యము—కర్త: చావలి శ్రీరామశాస్త్రిగారు, గుంటూరు. పేజీలు 150. వెల 0-14-0.

౧౧. గర్వభంగము అను ఫెలిష్తీయుని వధ; రెండంకముల నాటిక—కర్త: బండారు మోషే, బాపట్ల. పేజీలు 62. వెల. 0-6-0.

౧౨. బాలబోధ; పద్యకావ్యము. గ్రంథకర్త్రి: రూపుఖానపేట రత్నమ్మదేశాయిగారు. దీనిని నిజాం రాష్ట్రములోని ఆంధ్రగ్రంథాలయములకు ఉచితముగా పంపుదురు. "ఆంధ్రజనకేంద్రసంఘ కార్యదర్శి, ఆంధ్ర కుటీరము, రెసిడెన్సీబజారు, హైదరాబాదు. దక్కను" అని అర్ధణాచీటి పంపినబడయగలరు.

౧౩. తరుణీశతకము; 112 కందములు—గ్రంథకర్త్రి: గుడిపూడి ఇందుమతీదేవిగారు. పేజీలు 24. వెల 0-2-0 దొరకుచోటు: వెంకటేశ్వర అండుకో, పేపరు మర్చంట్సు; బెజవాడ.

౧౪. (ఎ) యోగచికిత్స; గద్యము—అనువాదకులు: చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు. పేజీలు 28. వెల 0-6-0; (బి) తొట్టిస్నాన నియమములు. వెల 0-6-0. దొరకుచోటు, మేనేజరు: ప్రకృతి ఆఫీసు, బెజవాడ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౫. ఆంగ్లేయ దేశచరిత్రము (మొదటి భాగము); గద్యము—గ్రంథకర్తలు: కూచినరసింహముగారు, ములుకట్ల పేరిదీక్షితులుగారు. పేజీలు 122. వెల 0-8-0. విలాసము: మైలవరపు యజ్ఞన్న, పిఠాపురము, తూర్పుగోదావరి.

౧౬. రామాశ్రమము: నవల- గ్రంథకర్త్రి: చిల్లరిగె రమణమ్మగారు. పేజీలు 292. వెల 1-8-0. విలాసము: మేనేజరు, ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము, పిఠాపురము.

౧౭. దీనబాంధవా! (86 వృత్తములు.) కర్త: నందూరి అమ్మిరాజుగారు. వెల 0-7-0

౧౮. వేదాద్రి నృసింహస్వామి; పద్యములు—కర్త: ముత్తనేని వెంకటచెన్న కేశవులుగారు. వెల 0-1-0. ప్రకాశకులు: చిట్టూరి అమ్మయ్యలపార్థివ లింగముగారు; జగ్గయ్యపేట.

౧౯. పూర్వగాథాలహరి (Dictionary of Puranic allusions); నిఘంటువు. కర్త: వేమూరి శ్రీనివాసరావుగారు, బి. యె., బి. యల్., కాకినాడ. పేజీలు 562. క్యాలికో బైండు వెల రు 7-8-0

౨౦. శ్రీకృష్ణావతారతత్వము (నాల్గవసంపుటము)—కర్త: కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మగారు, కడప. 420 పేజీలు. వెల రు 1-8-0

౨౧. వసురాయ చాటుప్రబంధము— కర్త: వడ్డాది సుబ్బారాయుడుగారు, రాజమండ్రి. పేజీలు 304. వెల 1-8-0.

౨౨. శృంగార రాధామాధవ సంవాదము; మూడాశ్వాసముల ప్రాచీన శృంగార ప్రబంధము. శృంగారగ్రంథమాలయందలి ప్రథమకుసుమము. కర్త: వెలిదిండ్ల వేంకటపతి. ప్రకాశకులు: జి. యస్. శాస్త్రి అండుకో, తపాల్ పెట్టె నెం. 110, మదరాసు. ఫెదర్వెయిటు కాగితము, క్రౌను సైజు; సుందరమైన గిల్టు పేరుగల క్యాలికోబైండు, (లండన్ రాయల్ ఎడిషన్) దీనివెల పోస్టేజి కలిసి రు 2-6-0.





# నా వ ల పు

పూడిపెద్ది వెంకటరమణయ్య గారు

ఎసఁగు భవదీయ శ్యామలాకృతిని జూచి
మోమునిండిన కన్నుఁదమ్ములను జూచి
క్రందుకొను లేతనవ్వు సింగార మరసి
పలుకుపలుకున భావసంపదలఁ జూచి
నవ్యగతిఁ దోఁచు వేణుగానమ్ముఁ జూచి
తనివిదీరెడు నీ ప్రవర్తనముఁ జూచి

వలచి కాంతలు నీవెంటఁ బడుట నిజము;
కలను నిద్దురలోను జాగ్రతను గూడ
రూపగుణములులేని నీరూప మరసి
నేనె వలతును భవదీయ నిర్మలాత్మఁ
బ్రకృతితత్త్వముఁ గను సత్యభామ నాట
చిలుతచెయ్యాల గోపాల! చిన్నికృష్ణ!
[సత్యభామ]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




క్రిస్టమసు పండుగలు క్రైస్తవులకు వలె భారతీయులకును పండుగ దినములుగ బరిణమించుచున్నవి. ఆ పర్వదినములందు క్రైస్తవమతస్థు లనుభవించెడి ఆనంద విలాసములు వర్ణనాతీతములు. శ్రీమంతులైన యూరపియనులు క్రిస్టమసు పండుగల ననుభవించుటకు జేసెడిప్రయత్నము లపారములు. దుకాణము లన్నియును చిత్రవిచిత్ర పదార్థములతో నిండి పరమానందమును గలుగ జేయుచుండును. సురుచిర వస్త్రాభరణములు, పక్వాన్నములు, బొమ్మలు, వింతలు, వినోదములు క్రిస్టమసుప్రభావమును విశదముచేయుచుండును. క్రైస్తవమతాచార్యుడైన ఏసుక్రీస్తునకు (కేశవ కృష్ణునకు) జనవరి 25 వ తేది రాత్రి జనన కాలము. ఆరాత్రి దేవదూత క్రైస్తనజననమును వ్యక్తము చేసెను. క్రైస్తవభక్తులు-ముఖ్యముగను ముగ్ధబాలబాలికలు-దేవదూతకటాక్షముకొరకు నిరీక్షించుట యాచారమైనది. ఆసాంప్రదాయము క్రిస్టమసుపండుగల వ్యవహారములందు హృద్యముగ గనుపడుచున్నది. అభివందనములు, బహుమానములు, విందులు, నృత్యగానసంకీర్తనములు, నాటకాలంకరణములు క్రైస్తవజయంతిని సంస్మరింపజేయు చిహ్నములైనను మహాత్యాగార్థమునుబోధించుటకు నిరర్థకముగ నున్నవి. భాగ్యభోగారాధన మాత్మోపలబ్ధికి ప్రతిబంధకమని క్రీస్తుచేసినబోధలు జయంతి దినమునందైనను నారాధింపదగియున్నవి. క్రైస్తవులవిశ్రాంతికిని సౌఖ్యారాధనమునకును నేర్పడిన క్రిస్టమసుసెలవులు భారతీయులకు క్లేశపూరితములైన సభాదినములుగ నున్నవిధమును నీకాలమునందు గూడుచున్న సభాసమావేశములు విశదము చేయుచున్నవి. పరాధీనస్థితియందున్న ప్రజలకు క్రిస్టమసు పండుగదినములు గలుగజేయుచున్న విశ్రాంతియును, సౌకర్యములును సభాసమావేశము లీసమయమునందు గూడుటకు గారణంబులైనవి.

"యథారాజా తథాప్రజా" యనులోకోక్తి మంచికిని, చెడుగునకును నన్వయించుచున్నది. రాజుల సదాచారములును, దురాచారములును ప్రజలకు పరమప్రమాణములై యనుకరణయోగ్యములగుచున్నవి. రాజుల పండుగదినములు సహజముగ ప్రజలకు నిర్బంధముగ పండుగదినము లగుచున్నవి. రాజుల యాచారవ్యవహారములు ప్రజలకు పరిపాటియగుచున్నవి. రాజుల వేషభాషలు ప్రజలకు గౌరవచిహ్నము లగుచున్నవి. రాజుల యాటలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రజలయాట లగుచున్నవి. రాజుల దురాచారములు నయితము ప్రజలకు సదాచారము లగుచున్నవి. రాజుల పండుగలు ప్రజలకు పర్వదినము లగుచున్నవి. రైలు ప్రయాణము ప్రజలకు క్రిస్టమసు ఈస్టరుపండుగలందు సులభమగుచున్నది. రైలు రేటులు తక్కువచేయబడి రాకపోకలు సామాన్యముగను సగము ధరకే సాధ్యమగుచున్నవి. వేలకొలదియూరపియను యాత్రికుల సుఖారాధనమున కేర్పడిన క్రిస్టమసు సెలవులు భారతీయులకు దేశారాధనమునకు వినియోగపడుచున్న విధము నీ సమయమునందు గూడుచున్న సభాసమావేశపరంపరలు విశదము చేయుచున్నవి.

* * * *

సభాసమావేశములు

భరతఖండమునందు డిసంబరు మాసాంతమునందు చిరకాలము నుండియును గూడుచున్న మహాసభలు ప్రజాప్రబోధమునకు చిహ్నములైనను మహాసంభ్రమమును గలుగజేయుచున్నవి. శీతకాలమునందు దక్షిణము నుండియుత్తరమునకుబోవుటయందుగలకష్టము లనుభవజ్ఞులకు దెలిసియున్నవి. దేశమునందు సాంఘికసభలు, మతసభలు, శాస్త్రసభలు, రాజకీయసభలు సమావేశమై దేశోద్ధరణసాధనముల నన్వేషించుచున్నవి. క్రైస్తవులు, మహమ్మదీయులు, హిందువులు, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు ప్రత్యేక సభలను జేయుచు, స్వసంఘలాభములను గోరుచున్నారు. సాంఘికసభలు సంఘనాయకుల ప్రయోజనముల కనుకూలములైనను సంఘప్రయోజనములకు నిరుపయోగములుగ నున్న విధమును నిత్యానుభవము విశదము చేయుచున్నది. స్వసంఘవికాసము పరసంఘద్వేషమువలన గలుగజాలదు. ఇతర సంఘములవిలయము స్వసంఘాభ్యుదయమునకు సాధనము గాజాలదు. ఆత్మవికాసమునకు ప్రేమగీతము సాధనముగాని ద్వేషగీతము సాధనము గాదు. వివిధజాతులకును, సంఘములకును, మతములకును నిలయమైన దేశమునందు ద్వేషగీతముగలుగజేయుచున్న సంక్షోభము పరమవిషాదమును గలుగజేయుచున్నది. కులాభిమానయుగము, మతాభిమానయుగము ప్రఖ్యాతములైన దేశములం దంతరించినను దురదృష్టవశమున భరతఖండము నింకను పట్టి పీడించుచున్నవి. జపానుప్రజలును, ముస్తఫా కెమెలుపాషాయును నవలంబించినమార్గమును భారతీయు లవలంబించుట కెంతకాలముపట్టునో ఎవ రూహింపగలరు? మతావేశమునకును, దేశారాధనమునకును సంబంధ మంతరింపనంతవరకును దేశసౌభాగ్యముసాధ్యముగాదు. పరాధీనస్థితియం దున్న దేశముల కంతఃకలహములు పరాధీనస్థితిని స్థిరతరముచేయుటకు వినియోగపడుచున్నవి. నిరంకుశప్రభుత్వ పోషణమున కంతఃకలహములు పరమాన్నముగ నుండగలవు. స్వప్రయోజనపరాయణులుధర్మరహస్యమును గనుగొనక దేశదాస్యమును స్థిరతరముచేయుట సంతాపకరము. శ్రద్ధానంద స్వాముల ఘోరహత్య సాంఘికకలహముల దుర్విపాకమునకు ప్రత్యక్ష ప్రమాణముగ నున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

**శ్రద్ధానందస్వాముల హత్య**

మానవసేవకై జీవితమును ధారవోసిన శ్రద్ధానందస్వాము॥ దుర్మరణము దేశమును దుఃఖసముద్రమునందు ముంచినది. అబ్దులు బషీరుచేసిన దారుణాపరాధము హిందూమహమ్మదీయుల దుస్సహమైనసంబంధమును వేయినోళ్లను చాటుచున్నది. అబ్దులుబషీరు గావించిన దారుణకృత్యమును మహమ్మదీయ ప్రపంచ మామోదింపజాలదు. స్వాములవారి ఘోరహత్య హిందూమహమ్మదీయ సమ్మేళనావసరమును విశదముచేయుచున్నది. నాయకులును వారి యనుచరులును మౌనముద్రను విడిచి కార్యశూరులు గావలసిన యవసరమేర్పడినది. ఏక్షణమున సాంఘికద్వేషానలము వ్యాపించి దేశమును నాశనము చేయునో యెవ రూహింపగలరు?

శ్రద్ధానందస్వామి త్యాగమూర్తి; మహాధీరుడు; దేశభక్తుడు; దైవభక్తుడు. వ్యాధిగ్రస్తుడై మంచముమీదనిస్సహాయస్థితియందున్న మహానుభావుని మతవ్యాజమున జంపి పారిపోదలచిన బషీరు పశుప్రాయుడుగాని మానవమాత్రుడు గాడు. ప్రపంచమునం దేమతమును దురంతములను, హత్యలను నామోదింపజాలదు. పరమమూర్ఖుడగు బషీరుచేసిన హత్యను మహమ్మదీయులందరును నేకగ్రీవముగ నిరసించుట యుక్తముగ నున్నది. ఈ దుఃఖసమయమునందు హిందువులు చూపుచున్న శాంతము స్వాములవారి మహాత్యాగమున కనురూపముగ నున్నది. శ్రద్ధానందస్వాములు వర్తమాన కాలమునందు హిందూమతోద్ధరణమున కవతరించిన మహానుభావుడు. హిందూమతము సంకరమై, నిర్జీవమై ప్రజామోక్షమునకు నిరుపయోగమైనది. పరమతాక్రమణము ప్రబలుచున్నది. హిందూమతము నిత్యమును క్షీణించుచున్నది. మహమ్మదీయులు, క్రైస్తవులు హిందువులను వారి మతములందు నిరాటంకముగ జేర్చుచున్నారు. మహమ్మదీయులను హిందూమతమునందు జేర్చుట మాత్రము దుష్కార్యముగ నున్నది. శ్రీస్వాములవారవలంబించిన శుద్ధి సంఘటనోద్యమములు హిందూమత సంఘములకు ప్రాణప్రతిష్ఠను జేసినవి. అస్పృశ్యతా నివారణమునకు శుద్ధిసాధనము పరమ ప్రయోజనముగ నున్నది. సంఘోద్ధరణమునకును, మతోద్ధరణమునకును నిర్భయముగ నాత్మార్పణము చేసిన శ్రద్ధానందస్వామి నిర్యాణము భారతీయులను కర్మవీరులను జేయుటకు భగవంతు డనుగ్రహించు గాత!

* * * *

**కాంగ్రెసు సమావేశము**

శ్రద్ధానందస్వామినిర్యాణము కాంగ్రెసు సమావేశమును విచారాక్రాంతము చేసినది. ఏర్పాటులందు మార్పు గలిగినది. ప్రతినిధుల హృదయములు విచారగ్రస్తములైనవి. కౌన్సిలుల ప్రశ్న కంటెను శ్రద్ధానంద స్వాముల హత్యయె ప్రతినిధులహృదయము నధికతరముగ నాకర్షించినది. గాంధిమహాత్ముడు ప్రతిపాదించిన సానుభూతి ప్రస్తావము సభ్యుల విచారమును దెలుపుచున్నది. స్వాములవారి హత్య విచారగ్రస్తమైనను కోపోద్రేకములకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిమిత్తము గాగూడదు. ముప్పదికోట్ల ప్రజల యందు బహీరువంటి దుర్మార్గులు పుట్టుచుందురు. దుర్మార్గమున కవకాశములను తొలగించుటయే కాంగ్రెసుధర్మము. ఏవిధముగ నైనను హిందూమహమ్మదీయ సమ్మేళనము సమకూరుట కుభయసంఘములును ప్రయత్నించుట యవసరము. ఇట్టి ప్రయత్నమున కన్యోన్య విశ్వాసము, సహనము సాధనములు గాని స్వప్రయోజన పరాయణత్వము సాధనము గాదు. మహమ్మదీయులు వారిసంఖ్యానురూపమైన యుద్యోగములను, ప్రాతినిధ్యమును నపేక్షించుట ధర్మవిరుద్ధముగాదు; కాని, సకల విషయములందును అగ్రేసరత్వమును గోరుటయును, శుద్ధి సంఘటనోద్యమములను ప్రతిఘటించుటయును ననుచితము. మహమ్మదీయులకు వారి సంఖ్యానురూపమైన ప్రాతినిధ్యమును నిర్ణయించుట స్వరాజ్యమునకును, శాంతికిని సాధనములు. ఈ ప్రయోజనము సామాన్యనియోజకవర్గముద్వారా గలుగుట శ్రేయస్కరముగాని ప్రత్యేక నియోజకవర్గముద్వారా గలుగుట శ్రేయస్కరము గాదు. స్వల్పసంఖ్యాకులైన క్రైస్తవులును, పార్సీలును గోరని విధానమును మహమ్మదీయులు గోరుట యనుచితము.

యూరపియను సంఘము నావహించిన పాలక జాతీయాభిమానమే మహమ్మదీయులను నావహించినది. ఢిల్లీయందు గూడిన టబ్లీగు సభయందును, మహమ్మదీయ మహాసభయందును జేసిన తీర్మానములు మహమ్మదీయుల చిత్తవృత్తిని విశదము చేయుచున్నవి. హిందువులను బహిష్కరించి మహమ్మదీయులు బాగుపడగోరుట యసంభవము. ఉభయ సంఘముల సంయోగమువలనను రెండు సంఘములు బాగుపడి స్వరాజ్యము సాధ్యముగా గలదు. విభేదములు ప్రత్యేక సంఘప్రయోజనములను తాత్కాలికముగ సమకూర్చినను నిరంకుశదుర్గమును స్థిరతరము చేయుచున్నవి. నలువదేండ్లనుండియును కాంగ్రెసు సమష్టి భారతజాతీయ ప్రయోజనములను సమకూర్చుటకు జేయుచున్న ప్రయత్నములు క్రమముగ సఫలము లగుచున్నవి. గౌహాతీ కాంగ్రెసునందును సఫలప్రాప్తికి ప్రయత్నములు జరిగినవి; కాని, రెండు సంఘములకును మంచిప్రాయశ్చిత్తముగానంతవరకును చిత్తశుద్ధి గలుగజాలదు. చిత్తశుద్ధిగలుగుట కింకను నెన్ని హత్యలు గావలయునో కాలమువిశదముచేయ గలదు. గౌహాతికాంగ్రెసు లక్ష్యమును, నధ్యక్షుల లక్ష్యమును, దేశలక్ష్యమును, శాసనసభల యందు లగ్నమైయున్న పరిస్థితులందు నిర్మాణ కార్యవిధానము వెనుకబడుట సహజము. గౌహాతియందు ౪౧ వ భారతజాతీయ మహాసభ శాసనసభల యెన్నికలు జరిగిన వెంటనే కూడినది. ఆసమావేశఫలమును తదనుగుణ్యముగ నుండుటయందు విచిత్రము గనుపడదు.

* * * *

శాసన సభలు

గాంధిమహాత్ముడు 1920 వ సంవత్సరము నందు కలకత్తాయందు బహిష్కరణరూపమున నారంభించిన సహాయ నిరాకరణోద్యమము 1926 వ సంవత్సరమునకు శాసనసభా ప్రవేశ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రూపమును దాల్చినది. దేశబంధు చిత్తరంజన దాసు ప్రారంభించిన ప్రతిష్టంభనోద్యమము యథోచిత సహకారోద్యమముగ బరిణమించినది. సహాయనిరాకరణోద్య మారంభమునందు విజృంభించిన సాంఘికసంయోగము ప్రత్యేక సాంఘిక ప్రయోజనముల యందు ప్రతిబింబించినది. కాంగ్రెసునందు సంపూర్ణ స్వతంత్ర వాదులు సహాయ నిరాకరణ వాదులు, స్వరాజ్య వాదులు, యథోచిత సహకారవాదులు, తటస్థులుగలరు. కాంగ్రెసు లక్ష్యమును, గాంధిమహాత్ముని సాన్నిధ్యమును భిన్నపక్షములవారిని గౌహాతి కాకర్షించినవి. శాసనసభలవిషయమై చేసినతీర్మానము సహాయ నిరాకరణోద్యమనిర్గమనమును, శాసన సభాప్రవేశ ప్రాబల్యమును విశదముచేసినది.

కాంగ్రెసు ఆమోదించినతీర్మానము సభాధ్యక్షునిప్రారంభోపన్యాసమునందేకలదు. తీర్మానమునందు దుద్యోగనిరాకరణ సిద్ధాంతమున్నను దేశబంధు చిత్తరంజనదాసు ప్రతిపాదించిన ప్రతిష్టంభనవిధానము గోచరము గాకున్నది. ఒకచోట బడ్జెటులను నిరాకరించుటయును, వేరొకచోట నుపయుక్తములైన పనులకు గ్రాంటుల నంగీకరించుటయును ప్రతిష్టంభనము గాజాలదు. తీర్మానమునందు గల అయిదవ నియమము తీర్మానపు భావార్థమునకు ప్రతికూలము. ఉద్యోగస్వీకార పరిస్థితులను నిర్ణయింపగల యధికారము అఖిలభారత జాతీయోప సంఘవశము చేయబడినది. సహకారపరిస్థితులను నిర్ణయించుటకు స్వరాజ్య నిర్ధారణగాక ఇతర విషయములు సూచింపబడినవి. వంగదేశ నిర్బంధితుల విమోచనము, రాయలుకమిషను నియామకము యథోచిత సహకారమునకుసాధనములుగాగలవు. రీడింగు, బర్కెనుహెడుప్రభువులు కోరినపరిస్థితు లచిరకాలమున సంప్రాప్తము గావచ్చును. సామ్రాజ్యశాసనసభకు నూతనడిల్లీ యందు గృహప్రవేశోత్సవము జరుగునపుడు నిర్బంధితుల విమోచనమును డిల్లీసమావేశాంతమునందు రాయలు కమిషను నియామకమును జరుగుననువదంతులుగలవు. గౌహాతికాంగ్రెసు చేసినతీర్మానమును నీసూచనల కనుకూలముగ నున్నవి. అచిరకాలముననే ఉద్యోగ స్వీకార ప్రతిషేధము తొలగుటయును, సహాయమార్గము శాసనసభలయందవలంబింపబడుటయును సహజము. బ్రిటిషురాజ్యాధికారుల ప్రాబల్యమును, భారతీయుల దౌర్బల్యమును సహాయ నిరాకరణోద్యమ చరిత్రము విశదము చేయుచున్నది. సభాధ్యక్షులు శ్రీమాన్ శ్రీనివాస అయ్యంగారు తమ యుపన్యాసమునందు ప్రజ్ఞావంతుడైనన్యాయవాదివలె ద్వంద్వప్రభుత్వము నత్యంత సామర్థ్యముతో ఖండించిరి. స్వరాజ్య నిర్మాణ సాధనములం దధ్యక్షుని దృష్టి విశేషము లగ్నము గాకుండుట సంతాపకరము. ఆహ్వాన సంఘాధ్యక్షులు ఫూకనుగారి యుపన్యాసము భావగర్భితమై స్వరాజ్యావసరమును పరిస్ఫుటము చేయుచున్నది.

గౌహాతి కాంగ్రెసు నిర్మాణవిధానమునకు సంబంధించిన తీర్మానమును సయితమామోదించి శాసనసభల వెలుపల నాయకులు చేయవలసిన పనిని నిర్ధారణచేసినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖద్దరు వ్యాపనమునకుగాను ఖద్దరు ధారణ మును నిత్యకృత్యములందు సయితము నిర్బంధము చేయుట సమయోచితముగ నున్నది. శాసనసభలయందు విశ్వాసము లేక రాజకీయవిషయములందు విముఖుడైన గాంధిమహాత్ముని రాజ్యాంగములకు నాకర్షించుటకు ఖద్దరునకు సంబంధించిన తీర్మానములను కాంగ్రెసు ఆమోదించినటు లూహింపదగినది. ఖద్దరునందు గాంధిమహాత్మునకు గల విశ్వాసమునందు వీసమైనను స్వరాజ్య వాదులకు గలదని నమ్మట కవకాశములు గనుపడవు. తీర్మానములందు పసతక్కువ యైనను పటాటోప మధికముగ నున్నది. గౌహాతికాంగ్రెసునందు గాంధిమహాత్ముడు తటస్థభావమును బూనినను గాంధిమహాత్ముని సాన్నిధ్యము కాంగ్రెసునకు ప్రాణప్రతిష్ఠను జేసినది. కాంగ్రెసు నాయకులకు నిస్సహాయస్థితియందు గాంధి మహాత్ముడు శరణ్యుడుగ నుండెను.

"క. ఆపద గడువం బెట్టఁగ
నోపి శుభంబైనదాని నొడఁగూర్పను మా
కీ పుట్టువునకుఁ బొందు [త్మా!"
ట్మాపాలుఁడు మిమ్ముఁజూపి చనిమె మహా

—భారతము, ఉద్యోగపర్వము.

గాంధిమహాత్ము డన్ని సందర్భములందును సహజమైన మందహాసముతో నిర్వికారుడై శ్రీకృష్ణ పరమాత్ముడు పాండవులకు వలెను ప్రత్యక్షమగుచు కాంగ్రెసును గాపాడిన విధము దేశారాధకులకు ప్రమాణముగ నుండగలదు.

గౌహాతికాంగ్రెసు ముగిసినది. నూతన సంవత్సర మారంభ మైనది. భగవదనుగ్రహము వలన నూతన సంవత్సరమునం దైనను ప్రజాశయములు సఫలమగు గాత!

* * * *

## వివిధసభలు

గౌహాతియందును, ఇతరప్రాంతములందును దేశాభ్యుదయమునకు సాధనములైన యితర సభలును గూడి యథావిధిని కార్యవిధానమును జరిగించినవి. గాయకమహాసభ, స్వచ్ఛంద సేవక సభ, హిందూమహాసభ, గోరక్షణసభ, రాజకీయఖైదీలసభ గౌహాతి యందు గూడినవి. అకోలాయందు మితవాదుల సభ గూడినది. మధురయందు బ్రాహ్మణేతరులసభ గూడినది. డిల్లీయందు మహమ్మదీయులసభ, చెన్నపురి యందు క్రైస్తవమహాసభ గూడినవి. మితవాదిసభ మామూలు ప్రార్థనాగీతమును బాడి యానందించినది. వంగదేశ నిర్బంధితుల విడుదలగోరుటకైనను సాహసింపలేదు. మితవాదులు పరావలంబనఫలమును చిరకాల మనుభవించియును నివృత్తిని బొందకుండుట దేశ దురదృష్టము. సర్ పరశురామ పాత్రోగారి యధ్యక్షత క్రిందగూడిన బ్రాహ్మణేతరసభ పరివర్తనమును బొందుట శ్రేయస్కరము. ఖద్దరును నిరసించినమంత్రులు ఖద్దరు ధారణము నామోదించుటయును, రాజకీయప్రచారకుల నిర్బంధముల కభయము నొసంగిన మంత్రులు నిర్బంధితుల విమోచనమును గోరుటయును మహేంద్రజాలముగ దోచగలదు. తీర్మానములు కార్యరూపమును దాల్చుటకు బ్రాహ్మణేతర నాయకులు పనిబూనెదరు గాత!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంత్రిపదవులునదలిన పిమ్మటనైనను దేశాభిమానముగలుగుట శుభదాయకము. బ్రాహ్మణేతరనాయకులు బ్రాహ్మణేతరులను ఖద్దరుధారకులనుగ జేయగలిగిన స్వరాజ్యము కరతలామలకము గాగలదు. అన్ని సభలయందును గ్రామపునర్నిర్మాణమునకు సంబంధించిన తీర్మానము లామోదింపబడినవి. కాంగ్రెసు సభయును, మితవాదిసభయును, బ్రాహ్మణేతరసభయును గ్రామపునర్నిర్మాణావసరమును ప్రతిపాదించుచున్నవి. ఏపక్షమువారెంతవరకీ మహత్కార్యమును నిర్వహింపగలరో కాలము విశదము చేయగలదు. గ్రామపునర్నిర్మాణమునకు యావచ్ఛక్తిని వినియోగించిన పక్షము భావికాలము నందు ప్రజావిశ్వాసమునకు పాత్రమగుట సహజము. గాంధిమహాత్ముడు నిర్మాణకార్యవిధానమును వ్యాపింపజేయుటకు మార్చి మాసమునందు దక్షిణదేశసంచారమును జేయదలచియున్నారు. ఆంధ్ర మహాజను లీశుభసమయమునం దంతశ్ఛేదములను విసనాడి నిర్మాణకార్యవిధానమునందు—ముఖ్యముగను ఖద్దరువ్యాపనము నందు— భక్తిశ్రద్ధలతో బాటుపడి గాంధిమహాత్ముని విశ్వాసమునకు పూర్వరీతిని పాత్రులగుట యుక్తము. ఖద్దరువ్యాపనమునకు మహానిధి గావలసియున్నది. వెనుక వసూలుచేసిన గాంధిపూజానిధి దంతయు కాంగ్రెసు ప్రచారమునకు వినియోగపడినది. ఆలోపమును నివారించి ఖద్దరు వ్యాపనము జేయుట కాంధ్రమహాజనులు ఖద్దరునిధి వసూలుచేసి గాంధిమహాత్మునకు సమర్పించి స్వధర్మ నిర్వహణమును చేయుదురుగాత!



Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7, Thumbu Chetty Street, G.T, Madras

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# AMRUTANJAN




**AMRUTANJAN DEPOT.**

**MADRAS** **BOMBAY.**

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# విషయానుక్రమణిక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చిత్రములు





* ఈ తొమ్మిదిచిత్రములను భారతియందు ప్రకటించుట కొసగిన శ్రీ హెచ్. ఆర్. హెబ్బరుగారికి వందనములు.

—సంపాదకుఁడు, భారతి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



సిద్ధార్థుని మహాత్యాగము

చిత్రకారుడు: శ్రీ కవుతా రామమోహనశాస్త్రిగారు, బందరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చెన్నపట్టణము ఫిబ్రవరి ౧౯౨౭

సంపుటము ౪ | అక్షయ సంవత్సరము మాఘమాసము | సంఖ్య ౨

# కంకణము*

భోగరాజు నారాయణమూర్తిగారు

౧

అణువునయందు మేరుగిరియందును నిత్యము నొక్కరీతి న
య్యనుపమహా పరాత్పరు మహత్తర తేజము వెల్గుఁగావునన్
గనుఁగొన నొక్క కంకణమెకా యను నీరసభావ మూన కో
యనఘచరిత్రులార! వినుఁ డయ్య! మదీయకథావిధానమున్.

చ. జలముల నేర్పడున్ జలదసంచయముల్, జలముల్ జనించు న
జ్జలధరజాతమందె; మది సంశయ మయ్యె మదీయజన్మ మీ
జలజలదంబులం దెటనొ; సర్వచరాచరకోటి సాటిగా
నలినభవాండమందె జననం బని మాత్రము విన్నవించెదన్.



వ్యాసకర్త

* ఇది యొక ఖండకావ్యము. ఇందలి కథ యొక జలబిందు స్వీయచరిత్రము. మానవుని జననమరణ నరక స్వర్గాద్యవస్థలన్నియు నీజలబిందువునందుఁ బ్రతిబింబించుచుండును. ధ్వనిప్రధానమైనదియే కాని కేవల శ్లేష కావ్యము కాదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. ఖరకరు గ్రీష్మభీష్మకరకాండముఖంబున నెన్నిమారు లే
నరిగితినో నభంబునకు, నభ్రమునుండి మఱెన్నిసారు లే
నురవడి జారి భూపతన మొందితినో; బుధు లిట్టి జన్మముల్
మరణములుం గణింప రిట మజ్జననక్రమగాథ లేటికిన్ ?

శా. నాపాపం బది యేమొ కాని భువి నానాయోనిసంజాతుఁ డౌ
పాపాత్ముంగ వలెఁ బెక్కుజీవనములం బ్రాపించుచుం బుద్బుద
వ్యాపారమ్మున సంచరించితి ననేకాబ్దమ్ము లేతన్మహీ
వాపీకూపనదీనదాదిబహుళాంభశ్శ్రేణిమధ్యంబులన్.

మ. కలరూపంబు తొలంగి సూక్ష్మమగు నాకారంబుతో మింటికిం
బలుమా రేగుదు నేగి సర్వభువనావాసవ్యథాఖేదముల్
తలపోతుం దలపోసి యంబరనటద్ధారాధరాకారని
శ్చలసంచారసుఖంబు శాశ్వతముగా సర్వేశుఁ బ్రార్థించెదన్.

౨

మ. ఒకనాఁ డిట్లె పయోదమండలగతోద్యోగప్రమోదంబునం
స్వకులాంభఃకణరాశితోడుత నభోభాగంబునం గామరూ
పకలాకౌశల ముల్లసిల్ల బహురూపస్ఫూర్తులం దాల్చి, యా
డుకొనం జొచ్చితి మాప్రభాకరు ప్రభాటోపంబు మా టొందఁగన్.

శా. పారావారధరాధరోన్నతతరువ్రాతాపగాఘోరకాం
తారాకారములా, సమస్తవనసత్వప్రస్ఫుటన్మూర్తులా;
నీరేజోద్భవు సృష్టిరూపముల నన్నింటిం దగం దాల్చి, రం
గారం జూపితి నప్పు డభ్రతలరంగన్నాట్యరంగమ్మునన్.

సీ. మొత్తమ్ములై పారు మత్తేభములఁ గూడఁ బిల్లయేన్గులు వెంటఁ బెట్టినట్లు
అత్యున్నతములౌ మహాపర్వతంబులచుట్టు గుట్టలు కొన్ని పుట్టినట్లు
పేర్చి పెట్టిన దూదిపిండునుండి యనేకతూలాంకురంబులు తూలినట్లు
సాంద్రనీరంధ్రవృక్షచ్ఛటచ్ఛాయలఁ బలు గుజ్జుమ్రాఁకులు మొలచినట్లు
ప్రకృతి ప్రకటించు నఖిలరూపములతో న-లంకృతం బయి నీలాకలంకసకల
గగనతల మెల్ల నా వేళఁ గ్రాలె నూత్న-కళల మాఖేలనాకలాకలనవలన.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. నీలస్నిగ్ధవియత్తలం బనెడు మేల్నిద్దంపు టద్దంబునన్
భూలోకప్రతిబింబ మీాకరణిఁ గన్గో నయ్యెనో; యమ్మరు
జ్జాలంబుల్ గన మర్త్యలోకప్రకృతిచ్ఛాయాపటం బిట్టు లా
కాలాఖ్యుండు గ్రహించెనో యనఁ గడున్ గన్పట్టె మాఘాకృతుల్.

3

ఉ. ఏనిటు నాఁటియాటలను నింత వచింపఁ గడంగ నేటికి? కా
పైని లభించినట్టి ఘనభాగ్య మపూర్వము; దాని నెన్నఁ గా
నౌనె? దినావసానసమయాన ననూనవిమానయానగీ
ర్వాణవితానగానరసపానవిశేషము నాకుఁ జేకురెన్.

శా. హా! నాపుణ్యఫలం బదెట్టిదొ కదా! యానాట నానాట రా
గానన్ గోకిల కాకలీకలకుహూంకారంబులన్ మించు నా
దానందంబున మున్గుచున్ జలకణం బై యున్న నే నామరు
ద్గానానందసుధన్ సుధాకణము నై కంటిన్ వినూత్నప్రభన్.

సీ. మండువేసఁగిలోని నిండుపున్నమనాఁటి జాబిల్లి వెన్నెల చలువలందు
ప్రత్యూషసమయసంభవమందమలయమారుతకోమలతరంగహతులయందు
పాలబుగ్గలు లొత్తవడ నోరఁ జొల్లూరఁ బసిపాప లను ముద్దుపలుకులందు
మందారమకరందమాధుర్యధుర్యసత్కావ్యభవ్యకవిత్వగతులయందు
గలుగు వివిధసుఖంబు లొక్కటన చేర్చి-పేర్చి గానం బనెడు పేరు గూర్చి సకల
భోగ్యముగఁ జేసినట్టి యంభోజభవుని - సృష్టివిరచనావిభవ మచ్చెరువు గాక.

ఉ. ఆయసమానగానవిభవానుభవం బది చెప్పినంత నే
పాయెనొ లేదొ నాదు శ్రవణావధి కెంతయు దాఁటిపోయినన్
దోయకణంబు నే మఱలఁ దోయకణాబునె యాచుఁ జింతతోఁ
దోయమువారలం గలసి తోయదమండలమందు నుండఁగన్.

౪

శా. ఆటంకంబు ఘటించినార మట స్వీయాంశుప్రభావ్యాప్తి క
త్యాటోపంబున భానుఁ డావలిమొగంబై, మాపయిం దా నిరా
ఘాటక్రోధవిలోకనారుణసమగ్రస్ఫూర్తులం గొల్పె; హా
చేటౌ కాలమునన్ సమస్తగతులన్ జేటే కదా వాటిలున్!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. మాస్థితి కెంతయున్ నగచి, మమ్ముఁ గరంబుల నుద్ధరించి, యు
చ్చస్థితిఁ జేర్చె మిత్త్రుఁ డన సత్య మితండె యటంచు నమ్మితిన్
స్వస్థత గన్న మాఘనత సైఁపఁగ లేఁడని యెన్నఁ నైతి ని
ట్లస్థిరు నాశ్రయించు నెడ నౌ దురవస్థలవిట్టివే కదా?

చ. మముఁ బయికెత్తి దాన నగు మాదగు నున్నతి కోర్వలేక దు
ర్భ్రమ గొని మామెడన్ దనప్రభల్ గనరా వని యీసు గాంచె; ను
త్తములు నిజాశ్రితాళి మహితస్థితి కెంతయు సంతసింత్రు మ
ధ్యములు తటస్థు లౌదు రనయ మ్మధముల్ చలమూనువా రిలన్.

ఉ. అద్దిర! లోకబాంధవుఁడ నంచును మింటికి నంటి మాకుఁ దాఁ
బెద్దట! పెంపు గూర్చు నట! వింటిరె యీపరివేషముల్ ఘనో
ద్యద్దశకే కదా తలుచు తాల్చుట? స్వార్థపరప్రసిద్ధులా
పెద్దలు? పెద్దలందె కనిపించును గ్రించుఁజనంబు లన్నియున్.

౫

శా. ఆపై మా కుపకారివోలెఁ బవనుం డం తంత నేతెంచి, మీ
కూపస్థాజ్ఞతవోవఁ గా సకలదిక్కూటంబులం జూచి, ధీ
నైపుణ్యంబు గొనుండు రం డనుచు నానాభంగులం ద్రిప్పె మ
మ్మాపూర్వాచలపశ్చిమాచలసమస్తాకాశభాగంబులన్.

ఉ. భూరిపురాకృతప్రకటపుణ్యఫలానుభవంబు నేటితోఁ
దీరెనొ ఖేచరత్వమును దీరునొ నా ఘనసారహారనీ
హారపటీరచారుధవళాకృతు లెల్లఁ దొలంగిపోయి వి
స్తారవికారగాఢతమసచ్ఛవి మాకు ఘటిల్లె నంతటన్.

మ. బలభిద్ఘోరశతారధారలకు మున్ శైలాగ్రకతాఁ బుత్త్రపౌ
త్త్రులతో గోత్రసమృద్ధి గాంచి గతభీతుం డై కుటుంబంబుతో
జలధిం బాసిన మేనకాత్మజు వియత్సంచారమోనాఁ గడున్
జెలఁగెన్ నాఁ డతిభీకరాకృతుల మాజీమూతసంచారముల్.

సీ. అమరాధిపతి వీఁడు నాక్రమింపఁగ నాఁడు దండెత్తి చను పోఁకుదం డనంగ
దీపంబు లిడి భూసతీమణుల్ గగనంపుఁ బీఁటపైఁ బారించు కాటు కనఁగ
అంజనాచలశిఖరాగ్రమం దుదయించి చదలంటఁ బ్రవహించు నది యనంగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నరకలోకంబున కరుగు ధూర్తుల వెంటఁ బరువెత్తు తత్పాపపటల మనఁగ
గుబురుగుబురు లగుచు గుంపుగుంపులు గూడి-యింత లంత లై యనంతము లయి
కడకు నేకమగుచు ఘనఘనాఘనముల-సంచయంబు మింట సంచరించె.

ఆ. చదలు చెదలువాఱఁ జెదపుర్వుల విధానఁ-బొదలు తారలెల్లఁ జెదలఁ బాపు
తారపూఁత తీరు తనరారు జీమూత-జాతమం దడంగి నమసి పోయె.

క. లేశము గనము భవిష్య-న్నాశము, పవమానగతులు నమ్ముకొనుచు ని
ట్లాశాభ్రమణంబున నక-లాశాభ్రమణం బొనర్చి యలసితి మంతన్.

౬

మ. గజయూథంబును వేఁటకాఁ డినుపచిక్కంబందుఁ జిక్కించుపో
ల్కిఁ జలింపంగ నెడ మ్మొకించుకయున్ లేకుండ మానీరద
వ్రజముం గ్రిక్కిరియంగఁ జేసెను సమీరస్వామి; మాకర్మ హా
ర! జగత్ప్రాణుఁ డటందు రాతఁడు జగత్ప్రాణాంతకుండేకదా!

చ. జగములకుం బ్రకంపనుఁడు సైఁపఁగరాని ప్రభంజనుండు వీఁ
డగు, నధికారపుంబదవి కర్హుఁడుగాఁడని యెన్నఁబోక, తాఁ
దగునని జీవకోటికి సదాగతిగా నొనరించె బ్రహ్మ; యె
న్నఁగ నధికారనిర్ణయమునన్ విధి కేవలమజ్ఞుఁడేకదా!

మ. విలసన్మౌక్తికరత్నయుక్తుఁ డతిగంభీరుండు, నానాధునీ
లలనానాథుఁ డనేకజీవనసముల్లాసుండు, కంపింపఁడే
జలధిస్వామి సమీరుబారిఁబడి యశ్రాంతంబు; నాహా! మహా
త్ములకైనన్ మఱిశాంతి లేదు కుటిలోద్యోగాధికారంబులన్.

చ. అనలుఁడు తా సమగ్రమహితాగ్రహవృత్తి వహింపఁ బ్రోత్సహిం
పనె చనుఁగాని శాంతిపరుపం దలఁపం డొకనాఁడుఁగూడ ని
య్యనిలుఁడు; యుక్తహా తరుణమం దొకచల్లని మాట నెన్నఁడే
ననవు కదా మహోన్నతపదాఢ్యుల జిహ్వలు విహ్వలంబు లై.

చ. అటవి నితాంతపుష్పనిచయాంతరసౌరభముల్ హరించి, యు
త్కటమగు గంధవాహబిరుదంబున వీఁడు చరించుఁ గంటిరే?
కటకట! యించుకంత యధికారము గల్గినయంతఁ గొందఱే
పటిమయు లేకయే బిరుదపద్ధతిఁ గొంద్రు యశోద్ధతిన్ గనన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. అకలంకప్రసవోత్కరం బడవిపాలైపోవఁ దత్సౌరభ
ప్రకరంబుం గొను గంధవాహునె గణింపంజూతు రౌరా! యమా
యకులం ద్రొక్కి, తదున్నతుల్ గొని యశం బార్జించు మిథ్యాప్రయో
జకులంగాక యథార్థధీమణుల మెచ్చంబోదు లోకం బిసీ!

శా. ఎన్నో భంగులు లోక మీకరణి నేనెంతేఁ విమర్శింతు? నెం
త న్నిందింతు దురంతశత్రుననిలుఁ, నన్నోర్చులునజ్ఞుల్ మహా
పన్నుల్ ఖిన్నత నన్యదూషణ మొనర్పంజూతురే కాని, మే
లన్నం గీడన నీశ్వరాజ్ఞ నెకదా యశ్రాంతముఁ వాటిలున్.

శా. మేలే కీడగు, సూనృతం బనృతమా, మిత్రుండె శత్రుండగుఁ
బాలే దుర్విషమౌను; బుణ్యమె యఘప్రాయంబుగాఁ దూలు దు
ష్కాలంబందు; సమస్త మీశ్వర విలాసంబంచు నిక్షేపదలీ
లాలోలాత్మకులై విపజ్జలధి నుల్లంఘింత్రు ధీరోత్తముల్.

శా. ఈ వైరాగ్యము లిన్నినీతులును దా నేత త్తటస్థత్వముఁ
భావం బక్కట మర్కటంబు వహియింప న్నేర్చునే? పామర
త్వావిఖ్యాతసదావివేకమమకారాయత్తమై చిత్త మిం
తే విశ్రాంతిని బొంద దేమిటికి నా కీమెట్టవేదాంతముల్.

ఉ. ఇమ్ముల నున్నమమ్ముల ననేకవిధములఁ ద్రిమ్మరించి, యా
తెమ్మెర త్రిమ్మరీడు పెనుదిమ్మగ నెమ్మెయిఁ గ్రిక్కిరించె; స్వాం
తమ్మున నింతదారుణ విధానమెటుల్ మరువంగవచ్చు? స్వా
స్థ్య మ్మెటులూనవచ్చు? పగ సైఁపఁగలారె విరాగులేనియున్.

౨

మ. అకటా! మమ్మటు లావియచ్చటులకారాగారమం దుంచి, కం
టకుఁడౌ తుంటరి గాలిదయ్యమపు డంతర్ధానమైపోయె; మే
మొకటేఁ మింటను గడ్డవారి చలనం బొక్కింతయుఁ లేక, యా
గక వర్షించితి మంధకారఘనధారాపూరముల్ ధాత్రిపై.

క. ప్రాచి నవాచిఁ బ్రతీచి నుదీచిఁ బహుధాసముత్పతిత వితత తమో
వీచీనిచయము చెలఁగెను-మాచేత నమానచేత మహి నమితంబై.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. భీకరాకృతి సూచికాభేద్యమాన-భూరినీరంధ్రనిబిడాంధకారఘోర
వారినిధిపొంగి జగము ముంపంగ నాటి-రాత్రి ధాత్రికిఁ బెనుకాళరాత్రి యయ్యె.

సీ. పరమేశ్వరాభావదురితభావమ్ము విధాననాస్తికతాప్రధాన మగుచు
సంతతక్లిష్ట దుష్టప్రబంధం బట్లగోచరాఖిలవస్తుగుణము నగుచు
కపటమిత్త్రుని మైత్రికరణి క్షణక్షణజాయమాన భయాతిశయము నగుచు
అతిదరిద్రు మహానసాగారమును బోలెఁ జూడఁజూడఁగ సర్వశూన్యమగుచు
నిర్ధనమనోరథము లీల వ్యర్థమగుచు-నక్షరాపేతు హృదయమ ట్లంధమగుచు
త్యాగరహితు రాజ్యమువోలెఁ ద్యాజ్యమగుచు-తమము గ్రమ్మినజగమఘమముగఁదోఁచె.

శా. మాకుం గ్రమ్మరఁ గానరాఁ డెచటి కమ్మ్యాయానిలుం డేఁగెనో
నాకారామచరత్సురాంగనలఁ గానంబోయెనో లేక గం
గాకల్లోలవిలాసడోలికల నూఁగంజొచ్చెనో భూతలం
బాకల్లాడదు నాఁటిరేయిని సమస్తాశాప్రదేశంబులన్.

ఉ. స్థావరజంగమాత్మకము సర్వజగంబును నాఁడు కేవల
స్థావరరూపమయ్యెను; కుజవ్రజముల్ చలనస్వభావముల్
బో విడనాడి పూనెను దపోనియమంబు తమోనివృత్తికిన్
ద్యోమవలయంబు నిశ్చలసమాధి మునింగెను శాంతిమంతమై.

క. ప్రాణాపానసమానో-దానవ్యానములె జీవధారణమునకున్
మేనుల మిగులఁగ, మిగిలిన-భూనభముల ననిలచలనములు తొలఁగి చనెన్.

శా. ఆపై నొక్క-విషజ్వరాకృతి నవార్యంబై విజృంభించుచున్
దాపోద్రేకము వస్త్రవర్జనము కాంతానిష్టభావంబు ని
ర్వ్యాపారమ్ము హిమోపచార మసుఖాహారంబు నిర్నిద్ర ఘ
ర్మాపూరమ్ము విదాహ బాహ్యగతశయ్యల్ గూర్చె మర్త్యాళికిన్.

శా. ఆరాత్రిన్ నిజభర్తృవక్త్రగతఘర్మాంకూరముక్తాఫలా
కారస్ఫూర్తుల కానతస్మితదళత్కంజాస్యలై, తచ్ఛ్రమం
బారన్ వీచిరి తాళవృంతముల శుద్ధాంతంబులందున్న కాం
తారత్నంబులు రత్నకంకణఝణత్కారంబు లేపారఁగన్.

౨

గీ. బంధురవినీల కంధరపటలినుండి-వెడలదొడఁగె విద్యుల్లతా వితతు లంతఁ
జటులగహనాంతరోజ్జ్వలజ్జ్వలనజనిత-కీలికాభీలమాలికాకృతుల లీల.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. మోహైనింపు నవిద్య, విద్య లవమై మృగ్యంబుగా నుండు బ్ర
హ్మాండంబుల; దటులయ్యు విద్యమె యవిద్యం గూల్చునంచుర్ మహా
ద్దండధ్వాంతవితానముం దోలఁచి సద్యస్స్వల్పశంపాలతా
తండంబుల్ వివరింపఁగాఁ దొడఁగె విద్యామానదండంబులై.

ఉ. చెల్లు సమస్తజీవులును జెల్లినయంతనె, వానియందు రం
జిల్లు పరాత్పరద్యుతియుఁ జేరును దత్పరమాత్మయందె; మా
చెల్లెడునట్టి కాలమును జేకురెనోయన విద్యమానవి
ద్యుల్లతికానికాయము లధోగతి భీతి ఘటించె నక్కటా!

శా. పోమ్మ ముందటిఖేచరత్వ విభవంబుల్; వ్యోమమా నారకం
బాయె; బాపులమైతి మేమకట! మాయంగంబులం గ్రుచ్చనుం
దీయంజాల్పెడు క్రూరకింకరుల యుద్దీప్తాగ్నిసంతప్త దీ
ర్ఘాయోదండములయ్యె నయ్యెడల యాతాయాతశంపాలతల్.

ఉ. నట్టనఁ జిట్టచీకటిమునింగిన యట్టి జగంబునూకుఁ గ
న్పట్టమి నూర్ధ్వదృష్టి పరుపంగఁ బ్రంపచపుదృష్టి కడ్డముం
గట్టిన మేలినీలితెరకై వడి మాజలదాళి గ్రాలఁగాఁ
బట్టపురాణులట్ల కనుపట్టెను మాపయిఁ దారకావళుల్.

శా. ఔరౌరా! పతిరాని రాతురుల మేలౌ నంబరాలంకృతా
కారస్ఫూర్తుల స్వేచ్ఛఁ గాంచెదరు; రాకం గంటిరా తారకా
నారుల్ మెల్లనఁ జాటుచాటునన యుండంబోదురే తద్దురా
చారంబుల్ వ్యభిచారకామినుల సంచారక్రమంబుల్ గదా!

శా. రాజుంగాంచిన కంటితోడఁ గని భర్తల్ మొత్తె నన్నట్లు మర్
రాజుంగాంచి పతిల్ మొఱంగె నొక తారాకాంత; నానాదిశా
రాజుల్ తారలఁ గూడునాఁడు వ్యభిచారంబేరు శంకింతు రం
చేఁ జింతించితి నాఁటి తామసపురేయిం దారలం జూచుచున్.

మ. అకలంకోజ్జ్వలతారలం బొదివి భావాభావ మధ్యాల్పతా
రక లందందునఁ జుట్టుఁజేరె ముదమారల్ రత్నభూషాంబర
ప్రకరోద్యద్రమణీ జనాభరణ సౌభాగ్యంబు వీక్షించు వే
డుకతోడల్ నిరుపేదరాం డ్రరిగి చుట్టుంజుట్టు చందంబునన్.

[సశేషము]

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# దగ్గుబల్లి దుగ్గనకవి - నాసికేతోపాఖ్యానము

టేకుమళ్ల అచ్యుతరావుగారు, యమ్. ఏ., యల్. టి.

(వెనుకటిసంచిక తరువాయి)



వ్యాసకర్త

ఇంక మల్లికార్జునుని పంథ గాంచుడు:—

"గీ. ఆమహామహు పుత్రియై యవనిఁ బరగి
 సజలజలధరనిభవేణి జలజపాణి
 కుందసుందరరదన రాకేందువదన
 చంద్రమతి యనుపేరిటి జలజగంధి."

అని మొదలుపెట్టి వెంటనే యామె సౌందర్యమును నఖశిఖపర్యంతము వర్ణించెను. పదములు కూర్మముల వలెను, జానుయుగ్మము శాలిగర్భములవలెను ఉన్నవి.పిఱుదులు, పొక్కిలి, నూగారు–వీనికి సరిచెప్పుటకు వస్తువులే కనబడలేదు. కుచములు పుష్పగుచ్ఛములు;వర్ణనాతీతములు. ఇట్లాపాదమస్తకము సుమారు ఇరువదియేనుపద్యములకు మించునట్లుగా వ్రాసి కవి తన యావచ్ఛక్తిని వినియోగించియు, సకలకావ్యబంధురవర్ణనాచమత్కృతిని నేకరించియు, సమస్తసాహిత్యసంవిధానవిస్తృతి ననుకరించియు నారీతిలకమగు చంద్రమతికి రంభ, ఊర్వశి, తిలోత్తమ ఇత్యాదిలోకోత్తరమత్తకాశినుల నపహసించి యుద్ధఃకరించెడు అప్రతిమానసౌందర్యము కలదని వర్ణించినాడు. ఇంత శ్రమపడెను గాని, పాపము, కవియొక చిన్నసంగతి మనస్సులో నూహింపకొన్న నెంత బాగుండెడిదో! ఇట్లగణితరూపలావణ్యరాశియై కొమరొందియున్న కన్యను పరిగ్రహించెడు పురుషుడెవడో! కంతుడా, జయంతుడా, వసంతుడా? ఈయొప్పుల కుప్పను, ఈసొంపులగనిని పరిగ్రహించెడు మానిసి యెట్టి స్వభావము గలవాడు? శరీరసౌష్ఠవమును, ప్రత్యవయవ నిరతిశయసౌకుమార్యమును పరీక్షించి యానందించెడు శృంగారరసశేఖరుడా, మదనోద్విగ్నమానసుడా, యను స్వల్పవిషయమును యోచించిన నెంతబాగుండెడిది? కవికి శ్రమయూ తగ్గిపోవును; నాయికానాయకుల కననుకూల దాంపత్యసంయోగమూ సంఘటింపదు; కథాసంవిధానమునకు రసభావముల ఔచిత్యమూ సమకూడును.

నిత్యవైదికకర్మానుష్ఠానపరుడు, అనవరతబ్రహ్మచర్యవ్రతదీక్షాకలితుడు, మహాసంయమి యగునుద్దాలకునకు గృహిణియై యుండదగినస్త్రీ యెట్లుండవలసినది? భువనమోహనసుందరియా, లేక,సద్గుణసమన్వితయగుపతివ్రతయా? క్షణికమోహవివశుడై విశ్వామిత్రుడు మేనకను బరిగ్రహించెను. కాని తత్సంగమసంజాతపుత్రికను జూచి నిరాదరుడై దారపుత్రికలయెడల పెడమొగము పెట్టి చనెను. చంద్రవత్యుద్దాలకుల సంబంధ మిట్టిదియా? కాదు. అరుంధతిని వసిష్ఠుడు చేపట్టినట్లును, రేణుకను జమదగ్ని వరించినట్లును చంద్రవతిని ఉద్దాలకుడు పరిగ్రహింపవలసియున్నది. అట్టివిషయములో చంద్రవతి నిగుడించి వర్ణన మెట్లుండవలెనో కవి యూహింపదగినది. ఇటువంటివిచారణమందు దుగ్గకవితల్లజుని భావనా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శక్తి యెంతయుచితజ్ఞతగలిగి సారవంతమైనదో మనకు తెలియుచున్నది.

తరువాతియంశములకు బోవుదము. విధిప్రేరితయైన చంద్రవతి భాగీరథీతోయములందు మజ్జనమాడుచు ఉద్దాలకునిరేతఃపూరితమైన యరవిందపుటము నాఘ్రాణించి సద్యోగర్భవతియై, రోషావమానరూషితనేత్రుడైన తండ్రిచే కానలకునంపబడి, తృణబిందుమహర్షిచే సత్కారముల బొందినదై, నాసికేతుని గని, యట ఘోరవిపినముల నివసించియుండెను. ఈభాగమును సామాన్యకవులందరు స్వాభావికరసస్ఫూర్తిగనే వ్రాయగలరు. దీనియందైన దుగ్గకవిరచన తనయసదృశశోభ నిక్కముగ బొడసూపగల్గినది.

ధీరోదాత్తుడగు రఘుమహారాజువర్తనము; తాపసోత్తముడగు తృణబిందునికుశలప్రశంస, ఇత్యాదివిషయములలో మల్లికార్జునునికంటె దుగ్గకవి యెంతమిన్నయగు కవియై యుండెనో యాయా భాగములు జదివిన తెలియగలదు. ఈభాగమునింతటితో వదలి మఱియొకముఖ్యఘట్టమును బరిశీలింతము.

కాలక్రమమున జంద్రవతియుద్దాలకు లాశ్రమవాటిక చెంత కలిసికొనిరి. పుత్రుడగు నాసికేతుడు వారి రువురకు సమావేశము గలుగజేయుటయు, నొండొరుల నెరింగించుటయు, నిత్యాదిదౌత్యకార్య మొనరించెను. అప్పు డుద్దాలకుడు చంద్రవతీపరిణయోత్సుకుడై తమక పడుచుండ వీరిరువ్వురకును జరిగినసంభాషణాదివిషయము బహుసుకుమారశృంగారవిషయావస్థను గనపఱచును. ఈభాగమును మనము జాగ్రత్తగా బరిశీలించినచో దుగ్గకవివతంసుని అశేషశేముషీవిలాస మగ్గలముగ ద్యోతక మగును.

మల్లికార్జునుని గ్రంథమందు నుద్దాలకుడు చంద్రమతిని జూచినవెంటనే కొడుకును బిలిచి యిట్లనియె:

"క. నీతల్లి యెచటనుండెను
రా తనయ యెఱుంగఁ జెప్పరా నాకడకీ
వాతతగతిఁ జని తోడ్కొని
యాతలిరుంబోడి వేగ నరిగి కుమారా!

గీ. నీలవేణి విడిచి నిముసమైనను దాళఁ
జాల భూరిసుగుణశీల యనిన
నాచికేతుఁ డపుడు నయమలరఁగఁ దల్లి
పాలికరిగి యిటులు పలుకఁజొచ్చె."

చంద్రమతి యెవరో తనకు దెలియకుండగ, నుద్దాలకుడెవరో ఈమెకు తెలియకపూర్వమే, ఆమానినిని బరిగ్రహించుటకు వెఱ్ఱెత్తిన విటునివలె నుద్దాలకుడు గంతులిడజొచ్చెను.

ఆపైని నాచికేతుడు తల్లికడ కేగి ఉద్దాలకుని మనఃస్థితిని గుఱించి యిట్లు నుడివెను:

"క. జననీ, వడి రమ్మా మ
జ్జనకునిపాలికి నతండు క్షణమైన నినుం
గనుఁగొనక నిలువఁజాలక
పనిచెన్ నన్నవఁగ నానృపాత్మజ యనియెన్.

గీ. తల్లిదండ్రు లన్నదమ్ములు బంధువు
గన్య నొసఁగు టవనిఁ గలదు గాక
కొమరుఁ డంబ నియ్యఁగూడునే యొరునికై
కలదె యియ్యయుక్తకార్య మిలను!"

ఇట్లాసాధ్వి మృదుమధురముగా మందలింప నాచికేతుడు తండ్రికడకు పోయి తానుదెచ్చికొన్న చీవాట్లను వడిరెట్లుగ నాతనికొప్పగించెను!

"ఉ. అయ్యెడ నాచికేతుడు మ
హాగ్రహ మొప్పగఁ దండ్రిపాలికిన్
జయ్యన నేగి యిట్లనియె
సంయమి మీ కిటులాడఁ జెల్లునే
నెయ్యము లేక పావనము
నిప్రవరాశ్రమవాటియందు నేఁ
డయ్యయొ యిట్టిదుర్వచన
మాడఁగ నో రెటులాడెఁ దెల్పుమా?"

అని యింక పలెన్నియో దూషణవాక్యములను ధర్మోపదేశములను ఆవిరళతపూన తండ్రియగు మునిపుంగవునకు దెల్పెనట. ఈదౌత్యమును, ఈసంధానక్రమమును ఎంత అపహాస్యముగను, ఆశ్లీలముగాను నున్నదో చూడుడు!

ఇట్టి విషమపరిస్థితిలో దుగ్గకవి బోయినమార్గ మరయుడు: ఉద్దాలకుని యాశ్రమవాటికయొద్ద చంద్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వతి యుండగా నుద్దాలకుడు సమిత్కుశలను బట్టికొని వచ్చుచుండెను. అప్పుడు తనయొద్దనున్న తనయుడు తన తండ్రి వచ్చుచున్నాడని యాయమకు జెప్పెను. ఆముని పుంగవుని దీర్ఘప్రసారితదృష్టిని పరికించుచుండ నామె కెన్నడును గలుగని మదనవికారము గలిగెనట.

"క. మదనుని యరవిరియమ్ముల
కద లెన్నడు నెఱుఁగ కింతకాలము మిసలఁ
బదిలంబగు చంద్రవతీ
హృదయంబున మదనవికృతు లీరిక లెత్తెఁ."

అప్పుడు తృణబిందుడు చెప్పిన గర్భధారణముచొప్పు మనసునకు స్ఫురించెను. తరువాత తనతనయుడగు నాసికేతునియం దామునియొక్క శరీరలక్షణములు సర్వము గాన్పింప నామునివరుడే తనను పుత్రవతిం జేసెనని నిశ్చయించుకొనెను. ఇట్లుండ నామునిపుంగవు డామెను జూచి మందెరుగని మన్మథవికారము లోఁ గాడనూపుట గ్రహించి యీవరారోహ యానాడు తన్ను కలలో నుపగూహన మొనర్చినదని వితర్కించుచు సమీపింపగా నావ్రీడావతి మునిప్రవరునకు మ్రొక్కి దీవన లందెను. అటుపైన నుద్దాలకు డామె తల్లిదండ్రులవృత్తాంతము, అచ్చటకు వచ్చినకారణము నడిగెను. అందుకు సవినయముగ నాతన్వి తనవృత్తాంతమును నిర్విశేషముగ దెల్పి తృణబిందుడు చెప్పిన గర్భధారణముచొప్పును, తానర్భకుని పేటికలో బెట్టి మందాకినిలో విడచినక్రమమును సవిస్తరముగా జెప్పెను. అంత తాపసోత్తముడు తనజీవితకథకు నాయువంతము సరిదాపట చూచి తనకథనంతయు నాయమకు నివేదించెను. ఇట్లు కడుదీర్ఘప్రసంగములు గావించి యనేకగూఢవిశేషములను గుర్తించి వారొకరినొకరు విశ్వసింపగలిగిరి. మునివర్యు డామెను పత్నిగా గ్రహించెను. ఆమె యాతపోధనుని పతిగా నిశ్చయించుకొనెను. తరువాత వివాహము చేసికొనుటకు తత్తరపడుచున్నసంయమిని జూచి యామానవతి మృదుమధురోక్తుల నిట్లూరడించెను:

"క. నీచేవడ్డది సామ్మిది
వానంయమ వేగపడగవలవదు కృపతో
నాచనువు లీయకొని కా
లోచితధర్మకృతనిశ్చయుఁడవగు మనఘా!"

ఈప్రసంగమంతటిలో నాసికేతునిమాట యొక్కటైనను లేదు. ఆ యర్భకుడు తల్లిదండ్రుల సంభాషణము వినుటయేకాని పాల్గొనుట కెట్టిసందర్భ ముండును? స్త్రీపురుషుల మనోవికారప్రసంగములు బిడ్డల కేమియెరుక? ఈవిధముగా నిమ్నపాకవిపర్య దతిసుకుమారరసభావకల్పనాచమత్కృతియుతంబైన యీ యపూర్వ కథాకావ్యంబును అత్యుత్తమక్రమంబున రచించి యౌచిత్యమును, పారిశుద్ధ్యమును, రసపోషణమును నిర్వహించి శాశ్వతమగు నుద్గ్రంథము నాంధ్రదేశమున కిచ్చెను.

## పాత్రపోషణము

కథాసంవిధానపు నేర్పు చూపించుటలో గొంత వఱకు ముఖ్యపాత్రలగు నాయికానాయకుల గుణవర్తనములు వర్ణింపబడినవి. ఉద్దాలకుడును చంద్రవతియు సహజమగు ఔదార్యగాంభీర్యసౌశీల్యాదిశుభప్రవర్తనము లెన్నడును వీడక పరమపవిత్రజన్మమునకు దగిన జీవితాంతస్మృద్ధియే నిత్యజీవికగా నిడికొని బాహ్యేంద్రియసౌఖ్యములకు లోనుగాక అంతరాయ పరంపరల నతిక్రమించి చిరస్థాయియగు పుణ్యదంపతుల యతులితజీవితము గాంచిరి. ఇట్టి యనూనకావ్యఫలపరిపాకము నొనగూర్చిన మహాకవి దుగ్గకవియే. అరుంధతీవసిష్ఠులు, అనసూయాత్రులు వలె నీ నిత్యనిర్మలచరిత్రులగు దంపతులు బాల్యయోగసిద్ధుడగు నాసికేతునకు దగిన తల్లిదండ్రులు. వారిదివ్యతేజస్సు ఈచిన్నపాపనియం దావిర్భవించి పుట్టుకనుండియే నిర్వికారయోగసమారూఢత నతనియందు నెలకొల్పినది. ఈతాపసమిథునము సమానపావనాంతఃకరణులుగా నుండినను, ఒకరికంటె నొకరెక్కుడుతక్కువ యని నిర్ణయించుట కెడము లేకుండినను చంద్రవతి చరిత్రము ఉద్దాలకునికంటె నొకవాసి యెక్కువమెరుగుచూపుచున్నట్లు నాదృష్టికి ననుమానము గలుగుచున్నది. చక్రవర్తి కుమార్తెయై మహావైభవమున బెరిగిన ఆరాజకన్య యరణ్యవాసులగు తాపసకన్యలవలె ఆజన్మవిరాగిణియై పెరుగుట యత్యద్భుతము. అన్యాయముగ గఠినదండన విధించినతండ్రి యెడల నొక్కపరుషవాక్యమైనను బలికియుండ లేదు. ఘోరవిపత్తుల నన్నిటిని నిశ్చలనిర్మలాంతఃకరణముతో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సహించి సర్వంసహయగు భూదేవివలె ధైర్యస్థైర్యము లను బూని నిష్కళంకముగ విజయముగాంచినంతవఱకు నిర్భీతచిత్తయై నిలువబడెను. అపనిందలన్నియు క్రమ క్రమముగా నపసరిల్లి శుద్ధతేజోవంతమగు నామెపవిత్ర చరిత్రము పతివ్రతోచితముగ భర్తృజీవితమున నంతర్లీన మయ్యెను.

ఉద్దాలకుడు కర్మఠుడు; వైదికవిధికృత్యముల యందున్నయుత్సాహమును నమ్మకమును జ్ఞానసంసిద్ధి యందు లేవు. ఆయన మనస్సు వికారచేష్టితముల కతీతము కాలేదు. బహుశః ఈకారణముచేతనే పిప్పలాదుడును, బ్రహ్మయు వివాహము చేసికొనుమని కోరిరి. క్రోధాదిమనోవికారములను నిర్మూలముగ త్యజింపలేదు. కావున జ్ఞానయోగియైన నాసికేతుడు కర్మానుష్ఠానము గుఱించి యించుక సం[illegible]ంప నుద్దాలకుడు నిష్కారణముగ క్రోధావిష్టుడై [illegible]కుని జావుమని శపించెను. కాని నాసికేతు డెంతమాత్రమును వైరాగ్యధర్మమును వీడలేదు. తండ్రియెడ భక్తిప్రేమరసముల నించుకైనను వర్జింపలేదు.

## నాసికేతుడు

కథాపురుషుడగు నాసికేతుడు పుట్టుకనుండియు మానవప్రకృతికి నతీతుడు; ఆజన్మవిరాగి; అతిలోక జ్ఞానసంపన్నుడు; నిత్యనిర్మలనిశ్చలచిత్తుడు; అనవరతపితృసేవాదీక్షితుడు; అద్వైతసిద్ధమానసుడు. చిన్నవాడయ్యు సుజ్ఞానతేజస్సతనియందు మూర్తీభవించి యుండుటచే ధర్మకర్మవిచారణలో నప్రమత్తుడు. తండ్రియగు నుద్దాలకుడు తాపసుడైనను మానవప్రకృతికి నతీతుడుగా నోపక చిన్నవాడైన తనయునియందలి దివ్యప్రభావమును గుర్తెరుంగలేక యతని యమాలయవీక్షణాద్యద్భుతకృత్యములను విని వెఱగందెను. నాసికేతుడు మానవ విషయములలో బాలుడుగను, దివ్యవిషయములలో నతి ప్రౌఢుడుగను చిత్రింపబడెను. ఇట్టిగుణవర్ణనము ఉపనిషత్పురాణానుసారమేకాని భిన్నముగాదు.

## రఘుమహారాజు

ఇంక ముఖ్యపాత్రలలో శేషించిన రఘుమహారాజును గుఱించి యోచించెదము. ఈ మహామహుని పాత్రపోషణము బహుసుందరముగ, స్వభావసిద్ధముగ నౌచిత్యనిబద్ధముగ నిరూపింపబడినది. రఘుమహారాజా

సీ. "..............................
... .....అకలంకచారిత్రుఁ
డార్య సన్నుతుఁడు సత్యవ్రతుండు
సహజవిక్రమశాలి శరణాగతత్రాణ
నానూనకరుణార్ద్రమానసుండు
హరిహితాదిష్టకాలోకపరివృత
ఘ్నాత్మలుం డసమానమానధనుఁడు
.............................."

ఈమహానుభావుడు మనస్వినియను సార్థకనామ యగు కరుణార్ద్ర హృదయను వివాహమాడెను.

కాలక్రమమున తమయేకపుత్రికయగు చంద్రవతి కన్యకగానుండియే గర్భముదాల్చిన సంగతి భూవిభుడు విని కొంత దుఃఖించి "త్యజేదేకం కులస్యార్థం" అను న్యాయమున గూతును కానలకుపో నాజ్ఞాపించెను. అకలంకచారిత్రుడై, సర్వదా నీతివర్తనుడై, ధర్మానుష్ఠాన పరాయణుడుగాన ఈమానవనాథుడు మానవుల పరిమితదృష్టికి గోచరించినంతవఱకు నిష్పక్షపాతముగ నిర్ణయముగ నాచరింప గలిగిన ధీరోదాత్తుడు. రాజధర్మ నిర్వహణములో తన పితృహృదయపరివేదనము పరిగణింపలేదు. కేవల మున్నతకుల ప్రతిష్ఠయే దృష్టియందిడికొనెను.

కూతుని వనమున కంపినప్పుడైన వ్యర్థప్రలాపములను దీర్ఘపరిదేవనములను జేయక చిత్తసంక్షోభమును నిగ్రహించి ధీరశాంతత వహించెను.

తరువాత కూతు సుశీలత నిశ్చయింపబడి [illegible] గౌరవము నిల్చినప్పుడైనను ధీరశాంతతయు, మితభాషణమును, భావవికార నిరోధమును జూప గలిగెను:

"ఉ. శుద్ధుఁడనైతి భూప్రజకుఁ
జుట్టలకున్ సరియిండ్లవారికిన్
సిద్ధఫలంబులయ్యె మును
జేసిన పుణ్యము లుర్విలోన సం
బద్ధములైన యాడికలఁ
బాసితి నిట్లు త్రికాలబోధసం

సిద్ధులు వీరు చంద్రవతి
శీలము మేలని యాదరించుటకున్."

ఈకొలది మాటలతో డెందమునందు సందడి గొన్న యానందతరంగముల నిస్తబ్ధముచేసి వెంటనే యవసరకార్యాచరణమునకు బుద్ధి మరల్చెను. భూపరి పాలనదక్షులగు నృపోత్తముల గాంభీర్య మిట్టిదియే కదా!

బృందారకపితామహునితో వియ్యమందెడు భాగ్యము లభించినదని యపరిమితానందము బొంది, భూనభోంతరాళములు పెల్లుగుని ప్రతిధ్వానము లీను నట్లు మహావైభవముతో పుత్రీవివాహము గావించి సహజౌదార్యవిశ్రాణనాదిమహాగుణముల వెలయజేసెను.

## కవితా లక్షణములు

### శిల్పము, శైలి

దుగ్గకవీశ్వరు డాశ్వాసాంతగద్యలయందు బావమఱదియగు శ్రీనాథకవిసార్వభౌముని బేర్కొని తన భక్తికృతజ్ఞతలను వెల్లడించెను:

"ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్య పుత్ర సకలవిద్యాసనాథ శ్రీనాథ మహాకవీంద్రప్రసాద లబ్ధకవితావిశేష దగ్గుబల్లితిప్పనార్యప్రియతనూజ దుగ్గననామధేయ ప్రణీతంబైన........."

ఇందు శ్రీనాథుడు తనకవితా గురువని, విస్పష్టముగా వ్రాసినాడు. శ్రీనాథునికి తనయెడల గూరిమియు, ఇతనికి శ్రీనాథునియందు గౌరవము నున్నట్లు దృష్టాంతములు గ్రంథస్థములే. దుగ్గకవికి కవిచక్రవర్తి యగు శ్రీనాథునియందున్న సారస్వత గౌరవము బంధు ప్రేమ నినుమడించెను. తనకు బంధువుమాత్రమేకాక శిష్యుడై అనవద్యకవితా మహిమచే జెన్నొందిన యితనియందు శ్రీనాథునికి గూరిమి హెచ్చయ్యెను. ఇట్లన్యోన్యగౌరవ ప్రేమాతిశయముల నుభయులు వర్తిలుచుండిరి. కవితా విద్యయందు గురుశిష్యసంబంధ ముండినను వీరిద్దరికావ్య రచనయం దెంతయో భేదమున్నది. ఇద్దరికవితలయందు శయ్యాపాకరీతులు చాలవఱకు భేదించుచున్నవి. ఏలకో, గురువుగారి పద్ధతులు శిష్యు డనుగమించుట లేదు! బహుశః దుగ్గన్న తనగ్రంథములను శ్రీనాథునికి గనుపఱచియే యుండును. వానియందు తన కవితామార్గములు గాన్పింపకపోయినను శ్రీనాథునకు దుగ్గనయందు గౌరవము తగ్గలేదు. ఉభయుల వ్యక్తిమహిమల కిదియే గొప్ప నిదర్శనము.

శ్రీనాథు డపారశృంగారప్రియుడు. భగవద్భక్తివర్ణనాఘట్టములందుగూడ నతిమాత్రముగ శృంగారము జొప్పించుట యతని కభ్యాసము. దుగ్గకవి శృంగారవర్ణనములో సంకుచితబుద్ధి; ఆధ్యాత్మికతత్త్వనిరూపణమం దసాధారణగౌరవము గలవాడు. శయ్యావిషయములో దీర్ఘసమాసములుగాని, క్లిష్టశబ్దబంధురవాక్సరణిగాని మహాపండితుడగు శ్రీనాథునకు వాడుక. కొలది మాటలతో జెప్పదగినవిషయము నాడంబరముగా పదజాలమున బెంచి విస్తరించిచెప్పుట యతని ప్రకృతి. దుగ్గకవి యట్లుగాక బహుమితముగా శబ్దముల బ్రయోగించి సుకుమారముగ విషయమును స్ఫురింప జేయుచుండును.

ఇట్లు శిల్పశయ్యాపాకరీతులలో నుభయులకు విశేషభేదము గాన్పించుచున్నది. ఒక్క విషయమున మాత్ర మిద్ద రేకీభవించెదరు. ఏదియన నుభయులు శైవమతాభిమానులు; వీరికి శైవసంబంధమైన గ్రంథములు వ్రాయుటయం దాసక్తి యెక్కువ

గురువు ననుకరింపక కేవలము స్వతంత్రమార్గమును ద్రొక్కి దుగ్గకవి తన యద్వితీయవ్యక్తిత్వమును శాశ్వతముగ బ్రకటించెను.

### కవితాశిల్పము

దుగ్గనకవిత్వ మందలి శిల్పచాతుర్యమును గుఱించి కొంతవఱకు గథాసంవిధాన సందర్భముననను, పాత్రపోషణ సందర్భముననను సూచింపబడినది. అతడు సృజింపబోవుచున్న గ్రంథస్వరూపమునకు దగిన పరికరసమార్జనమును, కథాశరీరసౌష్ఠవమును నిర్ణయింపగలిగెనా లేదా యని విచారింపవలెను. చిత్రకారుడు చిత్తరువు లిఖించునప్పుడు మేలైన పటములను రంగులను గూర్చుకొనుట సగముపని. తావ్రాయబోవు చిత్తరువుయొక్క ఆకారము సర్వావయవసౌష్ఠవము (Symmetry) పొంది తనభావనయందలి యాదర్శమును సర్వాంకషముగా విశదీకరింపజేయుట తక్కిన సగముపని. కాబట్టి చిత్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేఖనమందును (Painting), విగ్రహనిర్మాణమందును (Sculpture) కావలసిన సృష్టిచాతుర్యమే కవిత్వమందు గావలయును. ఇట్టినిర్మాణప్రావీణ్యమునకుగదా శిల్పమని పేరు!

దుగ్గకవి శిల్పమందు రెండు శుభలక్షణములు ముఖ్యముగా గాన్పించుచున్నవి: ఒకటి-వస్తుపరికరశుచిత్వము: రెండు: వానిని వాడుకచేయుటలో నుచితజ్ఞత. తానొక పావనచారిత్రము వ్రాయబోవుచున్నట్లు నిర్ణయించుకొనెను. దానికి గావలసిన పాత్రములు, గాథలు, ఇతిహాసములు, సంప్రదాయములు, వర్ణనలు ఇత్యాదులాయాదర్శమునకు భంగకరము గాకుండ నుండవలెను. అందులో నేవి యయోగ్యములైనను సర్వాంగ సౌందర్యమునకు గొంతవెలితి గలుగుచుండును. ఇట్టి యున్నతాదర్శప్రమాణములబట్టి మనము దుగ్గకవి కావ్యముల బరీక్షించినను గొంచెమైనను లోపము గాన్పింపదు. సమస్త భావములయందును, రసములయందును, అలంకారముల యందును ప్రధాన రసభావము లెవ్వియో వానికి వ్యతిరేకముగా నేవియు సంకల్పింపబడలేదు. అనగా నితని రసపోషణమున విరుద్ధసంచారిభావము లుండవు. కావుననే యీతనికావ్యశిల్ప మత్యద్భుతము. ఈ యద్భుత కథ నమృతతరముగ వ్రాసెనని ప్రప్రథమునం జెప్పగలిగితిని.

కథయందలి ప్రధానరసము శాంతరసము లేక జ్ఞానరసము. (ఈక్రొత్తరసమును గల్పించుటకు నాలంకారికులు క్షమింతురుగాక!) ఈరసమును ప్రధాన రసముగా నుంచుటకు పావనమూర్తులను నాయికా నాయకులను, వారికుమారుడగు జ్ఞానమూర్తియైన నాసికేతుని తత్తదుచితముగా వర్ణించినాడు. శృంగారరసము కథాసందర్భమున దటస్థించినను దానిని చాలనట్టుకుబంధించి కుదించి వెల్లివిరియకుండ నిరోధించి ప్రధాన రసమును గాపాడినాడు. ఇట్టి శృంగారరసమునకు * మోక్షశృంగారమని పేరు.

ఈరసమును బోషించెడు భావనలు, కల్పనలు, అలంకారములు, అన్నియును విశుద్ధస్వరూపమున కనువైనవియే సమకూర్చెను. ఈలాగున ప్రధానరసభావములను బ్రతిశబ్దమునందును, ప్రతిపద్యమునందును బోషించి నిలువబెట్టుటయం దీకవి యగ్రగణ్యుడు.

కథాసందర్భమున వచ్చినపాత్రావస్థావర్ణనలను కథాసరణికి నంతరాయము గలుగకుండ సాధ్యమైనంతవఱకు క్లుప్తపఱచి కథాకథనమును రసోన్నేషముగా సాగించెను. చంద్రవతికి గలిగినవిపత్పరంపరలు తొలగిపోయి యామె కుద్దాలకునితో వివాహము నిర్ణయింపబడగా కథాప్రణాళికయం దొకవిశ్రాంతి సమయము తటస్థించినది. శుభాంతమైనందునకు కథకుడును, శ్రోతలు నానందించుట కవకాశము కలిగినది. ఆసమయమున కవి తనయద్వితీయభావనాశక్తిని వినియోగించి చంద్రవతీపరిణయోత్సవము విపులముగను శ్రవణోత్సవముగను వర్ణించినాడు. దేవలోకమున రాజాధిరాజును, మనుష్యలోకమున రాజాధిరాజును వియ్యమందిరి:—

"శా. నానాదైవతకోటితో నిల కజున్
రప్పించి యావేల్పుతో
శ్రీ నిండారగ వియ్యమందిననృప
శ్రేష్ఠున్ దిగంతాగత

---

* భోజుని "శృంగారప్రకాశము" (౨౧ వ ప్రకాశమున) మోక్షశృంగార మిట్లు నిర్వచింపబడినది:—

"తత్త్వజ్ఞానాదిభిస్త్రిశ్రేయసమీహమానస్య గార్హస్థ్యేఽపి తదధిగతయోగ్యతాభిమానో మోక్షశృంగారః; తథాహిః అస్తిమే మోక్షాధిగమేయోగ్యతా; అధీతాని మయా మోక్షశాస్త్రాణి; నిరంతరా నివర్తకధర్మోత్పత్తిహేతవః క్రియాకలాపాః; నపీయంతే నిత్యనైమిత్తికాని; సీదంతి చిత్తవృత్తయః; ప్రాప్తో నిరాలంబనోపాయయోగః; సాధితాని యోగసాధనాని; స్థిరోహి బీజోవా సమాధిలాభః; నివర్తంతే యోగవిఘ్నాః; ప్రకాశతే ప్రత్యగ్జ్యోతిః; ఉన్మీలయంతి తత్త్వసంవిత్తయః; ప్రత్యాసీదంతి జ్యోతిష్మత్త్వాదయో యోగావస్థాః; ఇత్యాదిర్యోగ్యచేతసోఽభిమానః స మోక్ష శృంగారః. తత్రసాత్వతీ వృత్తిః, అవంత్యా ప్రవృత్తిః, గాడీయారీతిః, స్వకీయా నాయికా, ధీరప్రశాంతశ్చ నాయకః."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్ఠ్యనాథుల్ గొనియాడి రొక్కట శిరః
    కంపంబు గావించి రా
స్థానంబెల్లను రత్నకుండలఝణ
    త్కారంబు తోరంబుగన్."

(ఆ 2, ప. 212.)

నభోమండలము భూమ్యంతరాళముల నావహించినట్లయ్యెను. దివౌకసులు తమదివ్యవిమానముల నెక్కి యామహోత్సవమును జూడ నేతెంచిరి.

"మ. విలుఠన్నీనకుళీరనక్ర మకరమున్
    విస్తీర్ణలీలాకృతిన్
జలధిం బోలె నభంబు దానదనఁ జం
    చల్లీల నేతెంచునో
దలనందంబున నవ్విమానములు చూ
    డం బేర్చె దత్కర్ణధా
రులమాడ్కిన్ జెలువొంది రయ్యెడసుప
    ర్వుల్ స్త్రీసమేతాత్ములై."

(ఆ. 2. ప. 176.)

మేదినీతలమున నున్న రాజులెల్లరు తమతమ పరివారములతో వచ్చి యుత్సవస్థలము నలంకరించిరి. ఈ యసదృశవైభవోపేతమగు పరిణయము * పార్వతీపరిణయమును జ్ఞప్తికి దెచ్చుచున్నది. ఈయుత్సవమును జాలరసవంతముగను పుణ్యశీలముగను వర్ణించి నాయికానాయకులను గృహస్థుల జేసెను. తరువాత నాసికేతుని కడగండ్లు ప్రారంభించినవి. ఆకథాభాగము సైతము దీర్ఘవర్ణనాదికముల కాలవిలంబనముగాకుండ సంగ్రహరూపమున దెల్పినాసికేతునికిని చంద్రికకిని పునస్సమాగమము గావించి, తదుపరియమపురీవర్ణనము సవిస్తరముగ జేసి గ్రంథము నుముగించెను. ఈవిధముగఁ దన యద్భుతశిల్పనైపుణ్యము నుజూపి గ్రంథమునిత్యకౌతుకావహమగునట్లు రచించెను.

## శైలి

దుగ్గకవి శైలి సామాన్యముగ ప్రాచీనాంధ్రకవులలో మేలైనవారిశైలిని బోలియుండును. సహజమాధుర్యమును, ధారాశుద్ధియు, మృదుశబ్దఫణితియు, చక్కని లోకోక్తుల ప్రయోగమును, అర్థగాంభీర్యమును, రసపుష్టియు ఇత్యాది మనోజ్ఞములగు గుణవిశేషములు సర్వత్ర కాన్పించుచున్నవి. శ్రీనాథుడు కవితా గురువైనను ఆయనశైలి ననుకరింపలేదు. మహాపండితుడు సమస్తశాస్త్రవిశారదుడు నగు శ్రీనాథునికవితయందు భాషాప్రాగల్భ్యము హెచ్చు. కృష్ణవేణీ గోదావరీతరంగిణులవలె నుభయభాషలను ఆంధ్రవాఙ్మయభూముల ప్రవహింపజేసి సారతరగ్రంథసంతానముల నెలకొల్పెను. శబ్దాడంబరము, వర్ణనాధిక్యము ఇత్యాదివ్యాప్తిలక్షణము లాయనకు నైజములు. కొద్దివిషయమునైనను పదబాహుళ్యమున బెంచి యుపన్యాసధోరణిని జెప్పుట యాయన ప్రకృతి. ఆంధ్రమహాకవులలో బిగువులేని శైలి యీయనయందును, పోతనామాత్యుని యందును మాత్రము గాన్పించుచున్నది.

దుగ్గకవి యట్లుకాక శబ్దపరిమితిని అర్థపుష్టిని గౌరవించెను. తన భావనాశక్తిని విశృంఖలసంచారిగా విడిచిపెట్టక నియమనిగళముల గట్టిపెట్టి ఔచిత్యపుసరిహద్దుల నతిక్రమించకుండ బంధించెను.

శబ్దాలంకృతి చాల అరుదు. శ్లేషయమకాదులు సామాన్యముగ లేవనియే చెప్పవచ్చును. భావములు విస్ఫుటముగా చెప్పుట, గాథాసాంప్రదాయముల జేర్చుట, ఉపమాద్యలంకారముల గుదిరినట్లుగ వాడుట, దీర్ఘమైన సమాసముల నిరసించుట, పదవాక్యప్రమాణమును బాటించుట యిట్టి రసప్రధానమగు వ్యంగ్య కవితాలక్షణములు గ్రంథమంతటను వెలయుచున్నవి.

ఈయనకు సమకాలికుడగు ననంతామాత్యుడు (భోజరాజీయకర్త) దుగ్గకవివలె భావనైర్మల్యమును, భాషామాధుర్యమును కనుబఱచెనుగాని యాతనికవితాధార దుగ్గకవివలె నిరర్గళముగను, రసవంతముగను నుండదు.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవియును సమకాలికుడై, సమీపస్థుడై, దుగ్గకవివలె ఋష్యాశ్రమమందలి శృంగార

* శ్రీనాథుడు తన 'హరవిలాసము' నందు నాల్గవయాశ్వాసమున పార్వతీపరిణయమును వర్ణించెను. ఆవర్ణనమును, దుగ్గకవి యీవర్ణనమును ఏకత్ర చదివినచో గురుశిష్యులశిల్పముల సామ్యభేదములు దెలియును. శ్రీనాథునివర్ణనమునందపారమగు విస్తృతి, అమేయమగు ఉన్నతి కానబడును. త్రిదశాధీశులును వారిభార్యలును ఔదాత్త్య గాంభీర్యములతో జిత్రింపబడిరి. దుగ్గకవివర్ణనమున అతిలోకౌన్నత్యముతోఁగూడిన సౌకుమార్యము గాన్పించును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రససౌందర్యద్యోతక మగు ప్రబంధమును రచియించి నన్నెకెక్కెను; కాని దుగ్గకవి చూపిన గడుసుపోకడలను గనుపరుప లేకపోయెను.

మల్లికార్జునకవి శైలియందు స్వాతంత్ర్యము లేదు. ఇతరకవులవర్ణనధోరణులను చాలవఱ కనుసరించుటయే యాతనిస్వభావము. అనుప్రాసయమకాదిశబ్దాలంకారములు మితులతఱచుగ వాడుచుండెను. మొత్తము మీదకవిత్వమందు రసపుష్టి లేదు. భావగాంభీర్యమున్న.

దుగ్గకవిశైలి సర్వాంగసుందరముగా నున్నది. పింగళిసూరనార్యుడుచెప్పినట్లు "సొసగముత్తెపుసరుల్ పోహళించినరీతి తమలోనదొరయుశబ్దములగూర్చు" ఈతని పదబంధ మతిక్లిష్టముగాక, అతిపేలవముగాక మృదుల మనోజ్ఞతఁబొందియున్నది. ఈగుణవిశేషమును నిరూపించుట కనేక పద్యముల నుదహరింపవచ్చును గాని స్థలసంకోచముచే రెంటిని దిఙ్మాత్రకముగా నిచ్చెదను.

"ఉ. అక్కట యీతలోదరికి
  నాఁటిడి చూ లిటు లేల వచ్చె? రా
జుక్కువుఁడై కుమారినిటు
  లొప్పరికింపగ నెట్టులొప్పె? సొం
పెక్కిన సౌకుమార్యమున
  కెల్లను నెల్లగునట్టి యిట్టిమై
యెక్కడ? కానలోన వసి
  యించుట యెక్కడ? ఏమిచెప్పఁగాఁ!"
(ఆ. 1, ప. 194.)

"ఉ. మున్నొకనాటిరాత్రి కను
  మూసినచోఁ గలవచ్చి వేడుకన్
నన్ను దృఢోపగూహనము
  సన్ గరగించి మొఱంగి చన్నయా
పిన్నదిగాదె యీయువతి
  పెక్కువనొందిన దిప్డు నాఁటికిం
గన్నియగాన ప్రాయమిది
  కామి నెఱుంగఁగరాదు గ్రక్కునన్."
(ఆ. 2, ప.69.)

వర్ణనలయందు జిత్రపటములరమణీయత బ్రకాశింపజేయు శబ్దసాధ్యచిత్రాకృతినిర్వహణము చూడుడు:

"సీ. శైలశృంగముమీఁద సౌవర్ణవల్లరీ
  జాలంబుక్రియ మాళి జడలు దనర
సాకారయైన మంత్రాక్షరావళి పోలె
  నక్షమాలిక కేల నమరుచుండ
సైకతస్థలిమీఁద సాంధ్యరాగము రీతిఁ
  గటిమీఁద నూత్నవల్కలము మెఱయ
జంద్రునిపైఁ బర్వుశరదంబుదము మాడ్కిఁ
  దనువున భస్మలేపనము దనర
దీప్యమానమైన తేజోవిశేషంబు
నిఖిలదిశలయందు నిండికొనఁగ
మృడునిఁ దపము సేసి మెచ్చింపఁబూనిన
మరుని రీతినున్న మౌనిఁగనియె." (ఆ. 2, ప. 47.)

"ఉ. సౌహృదమొప్పగా సురుని
  సన్నుతి నాథుఁడు వేలుపింప వై
వాహిక వహ్నికీలముల
  వామవిలోచనలీల వేల్పు లా
జ్యాహుతి మూడ నొప్పెసఁగె
  నప్డు కళాధరఖండభృజ్జటా
వ్యూహములోపలం దొరగు
  చుండెడి వేలుపుటేటి కైవడిన్."
(ఆ. 2, ప. 197.)

శృంగారరసావేశము సైత మెంత నిగూఢముగా వర్ణించెనో చూడుడు:

"చ. జిలిబిలిపోవు చేఁతలకు
  సిగ్గుల నిగ్గులు వన్నెపెట్ట వే
నలి యరవీడుచుండఁ జర
  ణంబులు దొట్రిలఁ గ్రాలుగన్నులం
దొలఁకెడు మందహాసములు
  తొంగలిఱెప్పలలోన డాఁగఁగా
నలికులవేణి యోసరిలె
  నల్లనఁ బయ్యెద సంతరింపుచున్."(ఆ.2,ప.114.)

క్వాచిత్కముగా నున్న శబ్దాలంకారములకు నుదాహృతి:—

"క. నారదపారదశారద
  నీరదనీహారకిరణనీహారభర
క్షీరాబ్ధిసీరిదరహార
  హారసుధారసపటీరహారియశునకున్." (ఆ.1,ప.79)

ఈప్రకార మనేకములగు యోగ్యగుణవిశేషముల నుపలక్షించి శైలి నభినుతింపవచ్చునుగాని గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించెద.

ఇట్టి యద్భుతగ్రంథమును నాయనుంగుటాంధ్ర సోదరులందఱు జదివి యానందించెదరు గాక!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# హేమంతఋతువు

నాళము కృష్ణారావు గారు

ఉత్తరపుగాలి వీచె; వియత్తలమున
తరణి దక్షిణదిక్కునఁ దిరుగుచుండె;
మించి లోకంబు లెల్లను ముంచె మంచు;
కడిఁదిచలిచేత గజగజ వడఁకె జగము.

ధరణి యెల్లను సస్యసంభరిత మయ్యె;
ఆలకదుపులపొదుఁగులఁ బాలు కురిసె;
కొలఁకులందలి జలమెల్ల కలఁక దేఱె;
పొందు వాసినకవలకు పొత్తు కుదిరె.

బిరుసువాఱెను ప్రజమేను; బురద లివిరె;
పైరుపచ్చలు మెఱుఁగెక్కె; పాడి హెచ్చె;
దహన మింపయ్యె; పానీయ మహిత మయ్యె;
దినము కుఱుచయ్యె; రాతిరి దీర్ఘ మయ్యె.

ఇంటనింటను చలిమంట లేపు మీఱె;
పచ్చడంబులు కంబళ్లు పెచ్చుపెఱిగె;
తాళవృంతంబు లటకలమూల నక్కె;
ఆతపత్రంబు లందంద యడఁగిపోయె.

పసులమందలు పొలముల మసలియాడె;
క్రేళ్లువాఱుచుఁ గుప్పించె లేళ్లగుంపు;
జలవిహంగమకలకలంబులు సెలంగె;
నట్టుపిట్టలయాటలు కట్టువడియె.

బంతి విరివిగ పూచె; చేమంతి విరిసె;
ఉసిరిక లెసంగె; లొద్దుగు లెసకమెసఁగె;
రేగు చెలరేఁగె; నిమ్మలు సోగదేఱె;
పొంకమునఁ బ్రేంకణంబులు బింకమెక్కె.

పంగ చిక్కుడు గుమ్మడిపాదు లలరె;
చెఱకు మిరెములచేనులు చెంగలించె;
వెలఁగ నారింజపండులు విస్తరించె;
కూరగాయలు కుప్పనగూర లయ్యె.

నల్లగల్వలు చెంగల్వ లుల్లసిల్ల,
క్రౌంచములు సారసంబులు సంచరింప,
కలఁకదేఱిన చల్లనిజలము గలిగి
సరసు లొప్పారె, కన్నులకఱవు దీఱ.

కలితఖర్జూరసుమములకాంతి గలిగి
చక్కఁగాఁ బండి బంగారుచాయ వెలయ
ఎన్ను వ్రేఁగున ముందు కొక్కింత వంగి
పొలిచె వరిపైరు తండులపూర్ణ మగుచు.

సురలఁ బితరుల సంతుష్టిపఱచుపొంటె
అపుడె పండిన క్రొత్తధాన్యములఁ దెచ్చి
ముంగిళులయందు పొంగించి పొంగలులను
విగతకల్మషు లగుదురు విబుధు లెల్ల.

లేఁతపచ్చికజొంపముల్ మేఁత మేసి,
కొలఁకులను దేఱు నిర్మలజలము త్రావి,
రంతు గొనుచు గణిల్లని ఱంకె వైచి,
చియ్యబట్టిన యాఁబోతు చెంగలించె.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొలనుదరిఁ జేరి దప్పిచే కుంజరములు
స్వచ్ఛమై శీతలం బగుజలము త్రాఁకి
జల్లు మని దేహ మెల్లను జలదరింప
ఫూత్కరించుచుఁదొండముల్ ముడిచికొనియె.

సహజభావంబుచేతనె చల్ల నగుచు
వీచు నుత్తరవాయువు ద్విగుణ మైన
శీతలంబున నిపుడు ప్రభాతమందు
విసరుచున్నది నీహారవిద్ధ మగుచు.

పుడమి గడగడ వడఁకించు కడిఁదిచలికి
తాళఁ జాలక భీతిచేఁ దల్లడిల్లి
శరణు చొచ్చిరి శిశువృద్ధతరుణజనులు
కుప్పసంబుల, కుంపట్ల, కుచయుగముల.

గుబ్బెతల నిబ్బరపుగబ్బిగుబ్బకవల
సందునం బడి తబ్బిబ్బ నొంది సీతు
తృణగణోపరి నీహారకణము పేర
కన్నుఱెప్పల బాష్పముల్ గ్రమ్మ నేడ్చె.

గుట్టపై నొప్పు పచ్చికకొనలఁ గదురు
మంచుబిందులు తళతళ మంచు మెఱసె
పుడమిచేడియ బొమిడికమునఁ దురాయి
కుచ్చుపైఁ గ్రుచ్చు ముత్యాలట్లు కొమరు మిగిలి.

పొడుపుగుబ్బలిమీఁదను పొడుచు టాది
చలికి వడవడ వడఁకుచు చండకరుఁడు
గురువువాఱుచు బిరబిర పఱుగులెత్తి
చరమభూధరగుహలందు మఱుఁగుసొచ్చె.

సాంద్రనీహారలవములు సారె సారె
తనకరంబులఁ బొదువుచుఁ బెనఁగొనంగ
నవ్వుదవ్వున భానుండు తలఁగి చనుచు
చల్లనై కానిపించె జాబిల్లి వోలె.

తుహినకణములఁ గిరణముల్ త్రోఁగియుంట,
కరము దవ్వున నుదయంబు గాంచి యుంట,
వేఁడి యెల్లను దిగఁద్రావి పోఁడిమి సెడి
శీతకరుఁ డయ్యె సీతున శిలకరుండు.

తనదు సౌభాగ్య మంతయు నినున కొసఁగి
ఇనము మైనిండఁ గురియంగ నెఱ్ఱబారి
ఊర్పుచే మాఁగువాఱిన దర్పణ మన
హిమకరుం డొప్పె తేజోవిహీనుఁ డగుచు.

మంచు పడుటను, తపనుండు మందుఁడగుట,
సరసులందలి నీరంబు చల్ల నగుచు
సురుచిరం బయి మధురమై శుద్ధ మయ్యు
పానయోగ్యము కా దయ్యె పాంథతతికి.

ముమ్మరమ్మగు తుహినమ్ము గ్రమ్ముకొనఁగ
శీర్ణ కేసరయుతము లౌ కర్ణికలును
దీర్ణపర్ణంబులును గల్గి, జీర్ణము లగు
గృహములో యన నంబురుహము లొప్పె.

విరియఁబాఱిన చెంగల్వవిరుల మీఁద
వ్రాలి తూఁగాడు మధుకరజాల మొప్పె,
తుంటవిలుతుని హోమంపుమంటపైని
బుగులు బుగులున నెగసెడు పొగలనంగ.

చేగదేఱిన బారెఁడు చెఱకువింట
నల్లగలువల కోరి సంధిల్లఁ జేసి
భ్రమరఝుంకారటం కృతుల్ పరఁగ మరుఁడు
విరహిజనములపైఁ బడి వేఁటలాడె.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# భారతీమందిరమున రత్నదీపికలు

మల్యాల సాంబశివరావుగారు బి.ఏ., యల్.టి.

"కవితఁబోలిన మధురవస్తువులు లేవు
కవులఁబోలిన ధన్యమానవులు లేరు."

ప్రథమమయూఖము

ప్రసవములకుఁ బరిమళమువలె, మకరందమునకు మాధుర్యమువలె, కలకంఠమునకుఁ గల స్వనమువలె, చంద్రికలకుఁ జల్లఁదనము వలె జాతిరత్నములకుఁ గాంతి గౌరవములు సహజగుణములు. ఇక్కాంతి గౌరవములచేతనే రత్నము అమూల్యమై శ్రేష్ఠతాపీఠము నధివసించుచున్నది. ఈశ్రేష్ఠత్వము ననుసరించియే సరిద్వరములలో జాహ్నవియు, ధారుణీధరములలో మేరువును, పంచలోహములలోఁ గాంచనమును, ఋతువులలో వసంతమును, షడఁతులలోఁ బతివ్రతయు, ప్రజలలోఁ బ్రభుండును, విద్యలలో బ్రహ్మవిద్యయు, మంత్రంబులలోఁ బ్రణవంబును రత్నంబులయ్యెను.

కావుననే లోకమునం దెల్లవారును రత్నములనే ఆకాంక్షించుచుందురు; రత్నాకరములనే యన్వేషించుచుందురు; రత్నభూషణములనే యంగీకరించుచుందురు. వేయేల?—అందరును రత్నము లగుటకే యత్నించుచుందురు. కాని కోరిక లందఱకును దీరునవి కావు. ప్రయత్నము లందఱకును ఫలించునవి కావు. అలంకారము లందఱకును అలవడునవి కావు. రత్నత్వ మందఱకును లభించునది కాదు. సఫలీకృతప్రయత్నులగువారు మాత్రమే జాతిరత్నములై జగంబునఁ బ్రకాశించుచుందురు. భక్తరత్నములు, జ్ఞానిరత్నములు, పండితరత్నములు, ప్రబోధకరత్నములు, రాజరత్నములు, మంత్రిరత్నములు, యోధరత్నములు, వదాన్యరత్నములు, గాయకరత్నములు, కవిరత్నములు మొదలగువా రందఱు నీజాతిలోనివారలే. ఇట్టి మహాపురుషుల మహిత తేజములే విశ్వధామమునందలి విపులరత్నదీపికలై విరాజిల్లుచున్నవి.

ఇట్లే భారతీమందిరమునందును కాలకాలాంతరములయందు ప్రాచేతసబాదరాయణులు, కాళిదాసభవభూతులు, నన్నెచోడనన్నయ్యలు, సోమయాజిసోమన్నలు, కేతనపోతనలు, వీరనసూరనలు, శ్రీనాథభట్టుమూర్తులు మొదలగు సుకవిరత్నములు రత్నదీపికలై ప్రకాశించుచు, సకలకళావిభూషిణియు, జ్ఞానస్వరూపిణియు నగు శారదాదేవి శాంత ప్రసన్నమూర్తిని సకలజన హృదయన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యనానందకరముగ సాక్షాత్కరింపఁ జేసియున్నారు.

ఈ యిరువదియవ శతాబ్ది ప్రారంభమునుండియు మన యాంధ్రభారతీమందిరమునం దెన్నియో ప్రవిమలతైలదీపికలును, పవిత్రఘృతదీపికలును, పరిమళ కర్పూరదీపికలును, ప్రశస్తకాచదీపికలును, ప్రభామయరత్నదీపికలును ప్రకాశించుచున్నవి. వానిలో దేవీ దివ్యపీఠమున కిరువంకల హేమమణిమయ స్తంభములపై జీవకళలతో దేదీప్యమానములై యొక్కటే రీతిగఁ దేజరిల్లుచున్న రెండు రత్నదీపికల సహజకిరణ సమాలోకంబున సనాతన నూతనాలంకారములతో సరస్వతీమూర్తి యెట్లు ప్రతిభాసిల్లుచున్నదో ప్రదర్శించుటకై భాషారాధకుఁడనగు నేను భారతీమందిరభర్మకవాటముకడ నిలుచుండి నా యాంధ్రసోదరుల నాహ్వానించుచున్నాఁడను.

తులయందును వెలయందును, పరిమాణమునందును ప్రకాశమునందును సమానములయ్యు నసమానములై యున్న యారత్నదీపికలఁ గూర్చి మనుమున్న ముచ్చటించుకొని, తత్త్వైకమూర్తియయ్యును ద్వైరూప్యముతో నందుఁ దేజరిల్లుచున్న ఆంధ్రభారతీమూర్తిని ఆవెలుఁగులోనే యవలోకింతముగాక! ఈ రత్నదీపికలు ఆంధ్రలోకమునకుఁ జిరపరిచితులైన శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారి యొక్కయు శ్రీవేంకట పార్వతీశ్వర కవుల యొక్కయు ప్రబంధబంధురభావరత్నదీపికలే! వీనింగూర్చి సమాలోచనము చేయునప్పుడు గ్రహణసౌలభ్యమునకై క్రమంబుగఁ బ్రథమద్వితీయవిశేషణంబుల నుపయోగించుకొందముగాక.

ఈ రెండురత్నములకును జన్మస్థానము రత్నాకరమే! ఇందొకటి కౌస్తుభమణిజాతిలోఁ జేరినది; రెండవది చింతామణిజాతిలోనిది. ఇవి రెండును బ్రకృతిశాణయంత్రముపైఁ గాలక్రమమునఁ గళలుదేఱినవే. ఒకదానికళలు లలితమధురములు; రెండవదానివి మధురలలితములు. వీనివన్నెచిన్నెలలో నించుక వ్యత్యాసమగపడుచున్నను దీనికళలు దానియందును, దానికాంతులు దీనియందును దోఁచుచునే యున్నవి. ఒకదానిలోనివి మెఱుపువెన్నెలలు; రెండవదానిలోనివి వెన్నెలమెఱుపులు. పదవైశద్యమునందు మాత్రము ఇంచుకభేద మగపడుచున్నది కాని అర్థగౌరవమునందు రెండును సమానములే. ఇక్కవిరత్నముల కవితాతేజమునందలి భావాంతరమిదియే!

వీరి కవితాధారలు గంగాగౌతమీప్రవాహములవలె సమశీతలములై, సరసములై, పావనములై, అమృతజీవనములై ప్రవహించుచున్నవి. సమున్నతగిరి శిఖరవినిర్గతంబులగు వీనికి నామరూపభేదములు కలిగినవి కాని ఇవి రెండు నొకప్పు డేకాకృతితో హరజటాజూటము నలంకరించినవే. ఇందొకటి క్షత్త్రతేజోవిశిష్టమైనది; మఱియొకటి బ్రహ్మతేజోమయమైనది. ఒకటి సుగభీరమైనది; ఇంకొకటి సువిశాలమైనది. ఒకటి ద్రుతగతి గలది; మఱియొకటి సమగతి గలది. పూర్వాభిముఖములై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోవుచున్న ఈ రెంటికిని గమ్యస్థాన మొక్క-టియే.

ఈ యుభయకవితామూర్తులును గూడ మనోమోహనకరము లైనవి. వీనికాదిమూర్తియు ఆదర్శమూర్తియుఁ బ్రకృతియే. ఇందొకటి విశేషించి సృష్టికిఁ బ్రతిసృష్టి చేయుచుండును; మఱియొకటి సృష్టిలో లీనమై గానము చేయుచుండును. ఒకదానిది మయూరగమనము; మఱియొక దానిది మరాళగమనము. ఒకటి పరిహాసప్రియమైనది; వేఱొకటి విలాసప్రియమైనది. విశేషించి యొకటి ఉపమాలంకారిణి; ఇంకొకటి రూపకాలంకారిణి. ఒకటి శుభ్రవసనశోభిత; ఇంకొకటి విచిత్రవస్త్రవిలసిత. ఇందొకమూర్తి తఱచుగ భావాంతరాళమునఁ బ్రచారము సేయుచుఁ బ్రకృతిమూర్తులఁ బలుకరించుచుండును; వేఱొకటి ప్రకృత్యంతరాళమునఁ బ్రచారము సేయుచు భావమూర్తులతోఁ భాషించుచుండును. ఇక్కవితామూర్తులు రెండును ప్రకృతికంఠముతోఁ గంఠమును గలిపి షడ్జపంచమస్వరములతో అసమగతుల నమృతరసమును జిలుకుచు గానము సేయుచుండును. అందొకకంఠము నుండి సరస్వతీవీణానాదమును, రెండవదాని నుండి మురళీగానమును వినవచ్చుచుండును. ఆగానములయందు స్వరమాధుర్యమును స్వభావసౌందర్యమును సమానగుణములు; విషయప్రాచుర్యమును భావతన్మయతయు విశేషగుణములు. రసాకర్షణమునం దొకటి రామచిలుక; ఇంకొకటి మెలదేటికొదమ.

వీనిలో నొకటి సకలసౌరభవిలసితంబగు కనకలత; మఱియొకటి సకలర్తువిలసితంబగు నవమల్లిక. ఒకటి ఫలరసము; ఇంకొకటి పుష్పరసము. ఒకదాని మాధుర్యమునందు కారమున్నది; ఇంకొకదానియందు వికారమున్నది. ఒకటి నోరూరించును; మఱియొకటి తల త్రిప్పించును.

ఇక్కవితాకాంత లిరువురును పదార్థభావములయందు సమానలే! ఇరువురును పరమార్థభావానుభవమునకై పాటుపడువారే! ఇందొకరికి అర్థసమర్థనసమయంబులయందు అప్పుడప్పుడు పదములు తడబడి గమనవైషమ్యమును గల్పించు చుండును; ఇట్లే మఱియొకరికిని భావతన్మయత్వమునందు పదాభావము తోఁచి అర్థావకుంఠనముం గూర్చుచుండును. ఇందొకరు చిత్రించు పూర్వప్రకృతులలోఁ దఱచుగఁ బరిసరప్రకృతులే ప్రతిఫలించుచుండును; ఇట్లే మఱియొకరు తిలకించు బాహ్యప్రకృతులయందు భావనాప్రకృతులే ప్రతిభాసించుచుండును. ఉద్రేకవశంబున నొకదానియందు ఫలంబునం దతిరేకపరిపాకంబునుం బోలి రసంబునకు వైయర్థ్యంబును, మఱియొకదానియందు ఆకాశంబున నావర్తపరిభ్రమణంబునుం బోలి భావంబున కననుభూతియుఁ బ్రాపించుచుండును. రసోత్కర్షంబునకై యేకభావార్థద్యోతకంబులగు పదపరికరంబులను విన్యాసంబు గావించుట యొకరికిని, రసానుభవంబునకై తదేకపదంబులనే పునరుక్తంబు గావించుట యింకొకరికిని స్వభావము. ఒకరు దేవుని మానవునిగాఁ జేసి చూపుటకును, మఱియొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కరు మానవుని దేవునిగాఁ జేసి ప్రదర్శించుటకును బ్రయత్నించుచుందురు. పద్ధతులలోని భేదమేకాని ఈ యిరువురి భావములకును బరమార్థ మొక్కటియే.

ఇట్లుభయపార్శ్వంబుల నెలకొని వెలుంగుచున్న ఈ రత్నదీపికల విమలతేజోమండలమునందు సరసపదపల్లవయు, సకలార్థసంపన్నయు, సువర్ణరత్నాలంకారిణియు, సుప్రసన్నవదనకమలయు నగు భారతీదేవి సాక్షాత్కరించి ఆంధ్రలోకమును దన కృపాకటాక్షావలోకనంబులచే ననుగ్రహించుచున్నది. ఆ దేవీసన్నిధానమున నీరత్నదీపికల కవితారూపదివ్యతేజములు శృంగారరసతరంగిత భక్తిమూర్తులతో నెట్లు ప్రకాశించుచున్నవో చూడుఁడు!—

సీ. ముద్దులమొగముపై మూఁగెనుముంగురుల్
కుదురుగాఁ బైకిఁ ద్రోయుదునో కృష్ణ!
వక్షస్థనిస్తులవకుళమాలిక చిక్కు
నొందెను సరిగఁ జేయుదునో కృష్ణ!
చెక్కుటద్దములపైఁ జెదరెను చెమ్మటల్
మృదువుగాఁ బైఁట నొత్తుదునో కృష్ణ!
బడలికచే నీదు పాదముల్ నొచ్చెనో
వదలుగాఁ జేత నొత్తుదునో కృష్ణ!
అలసియుంటివి కాఁబోలు నస్మదీయ
బాహునల్లి కాన్దోలికా భాగమందుఁ
బ్రీతి నిన్నుంచి గోపికాగీతికలను
మరియలరఁ బాడి కునుకఁ జూపుదునో కృష్ణ!
"రాధాకృష్ణ"

మంజరి

అలసి వచ్చితివేమొ యని జాలినొంది
చలువ పన్నీటిచేఁ జరణముల్ గడిగి
అలరుదువ్వలువచే నడుగుల నొత్తి
అరవిరిగద్దెపై నాసీనుఁ జేసి
ఫలరసంబులతోడఁ బానీయ మొసఁగి
చక్కనినెమ్మనఁ జందనం బలఁది
తనివారఁ గర్పూరతాంబూల మిచ్చి
శ్రమ వాయఁజేయఁగా సరసను జేరి
విరజాజిసురటీల విసరుచునుండ
నామేను మఱపించి నాకన్నుఁ గప్పి
యింద్రజాలముఁ జేసి యేఁగుట నీకు
న్యాయమై తోఁచెనే నా జీవితేశ!
"ఏకాంత సేవ."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



వ్యాసకర్త

# భూదేవి

రాయప్రోలు సుబ్బారావు గారు

వెండిలాంతరు వెలిఁగించి వెడలె రజని
  యెడ లెఱుంగక నిదురించుచున్న ప్రాణి
కోటి నరసి కాపాడ, దిఙ్ముఖరజంత్ర
ములును కదలవాయెను సౌమ్య సిలిసపగిది.

చలి ముదురలేదు గాని, వానలను దడిసి
చెమ్మగిల్లెను నాలుగు చెఱఁగు లవని
మీఁదఁ గార్తికజ్యోత్స్న ప్రామిన కతాన
రేలు శీతము లనిపించెఁ గాల మనక.

ఆస లేకుండ నెండెఁ బునాసపంట
పంటనే లేదు వరిచేలు పరక యయిన
ముదురుసేద్యము గడ్డితో ముగిసె; వెనుకఁ
జిక్కి పడ్డవి వానలు చక్కఁగానె.

చెరువు నిండిన, దీయేడు కఱవు రాదు
మిరపతోఁటల కిందాక పురుగు పట్ట
దతికినవి పైరులన్నియు, నచ్చటచట
సుంకువోయుచున్నది మక్కజొన్న యిపుడె.

పడ్డది విశాఖకార్తెలో వరిగవిత్తు
రాలెనేని క్రొంబాతళ్లు త్రవ్వవలయు
పూఁతపట్టిన కొతిమెర పొలముచాలు
కార్తెకడల మంచానక కాసెనేని.

ఎదిగినది పిల్ల పెండ్లికి; నెట్టులైన
నెడ్లకొట్టమీ యేడు నేయింపవలయు;
వానలకు కాఱిపోయిన పడమటింటి
గోడ కండవేయకయున్నఁ గూలు కొంప.

శిస్తుకోసము నిరుడువ్రాసితిని నోటు
పెరిగె నది పాముపగవలె; పెయ్యదూడ
నమ్మితీర్చెదమన్నఁ బ్రాణమ్ము రాదు
మేపుకొన్నారు పిల్లలు తీపితోడ.

వెల్లనన్నెలో, చనుకట్టు పిఱుఁదుసొగసు
కుదిరి, కొమ్ము వాటముగల గోవు లరుదు;
ఎందు కొక మగదూడ జనింపరాదు
గోవు మాణిక్యమన్నారు కులమువారు.

అనుచుఁ దలపోయుచుండె రామన్న; చుక్క
పొడిచి బారెఁడెక్కె నిరుగుపొరుగు టిండ్లఁ
జల్లఁజిలుకు చప్పుడులు, కావళ్లమ్రోఁత
లును గలిసి చెట్లమీఁది పుల్గులను లేపె.

పసులమేఁతల సవరింపు, పాడిగొడ్ల
కుడితికోసము విడుచుసందడి, యరకలు
గట్టురభసమును జెలంగె, కాడిక్రింద
రాక మార్మసలెడి కోడె ఱంకె లడర.

పేరు భూదేవి, రామన్నఁ బెండ్లియాడె
నిరువదేండ్లు నిండకముందె; నిల్లు దిద్దె
నేర్పుతో వెల్తి బయట రానీక; కడుపు
పండె వెంటవెంటనె దోసపాదు భాతి.

[సశేషము]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




గోర్తి సూర్యనారాయణశాస్త్రిగారు

భాగ్యము గాదె పండితస
   భానుతసత్కవితావధూటి సౌ
భాగ్యముకల్మిచే సకల
   భారతభూయువరాజసత్క్రియా
యోగ్యతఁ బొందినాఁడవు మ
   యొక్కని సత్క్రియలందు నీకు వై
రాగ్యము గల్గుఁ గాదె త్రిపు
   రానకులీనప్రసాదరాట్కవీ!

ఒకప్పుడు నా వ్రాసిన యీపద్యమును బండితమిత్రుల సన్నిధిని నేను జదువ నందు సత్కారాద్యర్థమునఁ బ్రయోగింపఁ బడిన ‘సత్క్రియా’ శబ్దమునకు సత్కర్మ మనియే యర్థము గాని సత్కార మను నర్థము లేద నియు, నిట్లు ప్రయోగించుట తప్పనియు నొకరు వచియించిరి. మఱియొకరు సంస్కృత మున నుండిన నుండునేమో కాని తెనుఁగున మృగ్య మని పలికిరి. ఇంకొకరు ఇదియు నదియు ననక యూరకుండిరి.

‘సత్క్రియా’శబ్దము సత్కర్మార్థకమే కాక సత్కారాద్యర్థకం బనియు నే నప్పుడే నునవిచేసితిని గాని గళితవయస్కుఁడ నగు టచే వెంటనే ప్రయోగములను జూపి నమ్మింప లేకపోతిని. భాషయందు మిగులఁ బరిశ్రమ చేసిన విద్వాంసుల కీయర్థము సందేహాస్పద ముగాఁ దోఁచినప్పు డుపేక్షించుట తగవు గాదని తలంచి మరుసటిదినమునఁ జేతి కందిన కతిపయ సంస్కృతాంధ్రగ్రంథములను దీసి చూచితిని. ప్రతిగ్రంథమును నాచెప్పిన యర్థ మును బోధించినది. కావునఁ దత్సంశయవిచ్ఛే దమునకై నా కంటఁబడిన నాల్గు ప్రయోగముల నిటఁ జూపుచున్నాను.

సత్క్రియా - స్త్రీ - సత్ + కృ - శ- సత్కారే, సమ్మాననే, పూజనేచ.

(వాచస్పత్యము 4 వ సం., పేజి 5205)

సత్కార- పుం- సత్ + కృ - ఘఞ్- ఉపపద- స. సమ్మాననేపూజనేచ.

(వాచస్పత్యము 4వ వాల్యము: పేజి 5205)

Sat-kriya-F. A good action, virtuous action, doing good, charity, virtue; respectful treatment, salutation; welcome; courtesy, worship, homage, hospitality.

*( Sanskrit - English Dictionary by Monie William, M. A., Page 1025.)*

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సత్క్రియ = సం-వి-ఆ-(స్త్రీ)-సత్కారము.
(శబ్దరత్నాకరము, పేజీ 1074)

సత్కార=సం-వి-అ-పుం-సన్మానము.
(శబ్దరత్నాకరము, పేజీ 1074)

సంస్కృతాంధ్రప్రమాణనిఘంటువుల సాక్ష్యమపరిగ్రహణీయమైన——

శ్లో. "విధిప్రయుక్తాం పరిగృహ్య సత్క్రియామ్
పరిశ్రమం నామ వినీయ చ క్షణమ్;
ఉమాం స పశ్యన్ ఋజునైవ చక్షుషా
ప్రచక్రమే వక్తు మనుజ్ఝితక్రమః."
మహాకవి-కాళిదాసు

వ్యాఖ్యా - "సత్క్రియాం = పూజాం, పరిగృహ్య= స్వీకృత్య"——
మల్లినాథసూరి.

శ్లో. "నిరత్యయం సామ న దానవర్జితమ్
న భూరిదానం విరహయ్య సత్క్రియామ్;
ప్రవర్తతే యస్య విశేషశాలినీ
గుణానురోధేన వినా న సత్క్రియా."
మహాకవి-భారవి.

వ్యాఖ్యా-"సది త్యాదరార్థేఽవ్యయమ్; ఆదరానాదరయో స్సదసతీతి నిపాతసంజ్ఞాస్మరణాత్ ; తస్య క్రియాం= సత్క్రియామ్."
మల్లినాథసూరి.

ఉ. భూసురకోటికిన్ వినయ
పూర్వముగా ధనధాన్యగోమణి
వాసలిలాన్నముఖ్యములు
సమ్మతి నీగి సుయజ్ఞ; మాసనో
ద్భాసితసత్క్రియ న్నడపు
భవ్యుఁడు యజ్ఞములున్ దపంబులున్
చేసిన పుణ్యముల్ వడయుఁ
జేయుము దానము లోపి నిత్యమున్.
తిక్కనసోమయాజి.

చ. దినమునసుండి దేవతలు
దివ్యము లైన నిజాంశజన్మముల్
భువిఁ గలిగించి భూరియగు
భూభరముం దొలఁగింప భారతా
హవకరు లైరి గావునఁ ద
దర్చనరూపము గాఁగ భారత
శ్రవణవిధాయి చేయునది
సత్క్రియతో బహుదానధర్మముల్.
ఎఱ్ఱాప్రగడ.

సీ. "ప్రణతమౌళి మణిప్రభానికాయంబుతో
...............................
...............................
యంతిథేయుల కభినవాయాతుఁడైన
యతిథి తమయింటి కేతెంచునపుడు నేయు
సత్క్రియాచారవిధికలాసరణి యందు
ధర్మశాస్త్రోపనిషదర్థధర్మవిదులు."
మహాకవిశ్రీనాథుఁడు.

వ్యాఖ్యా—"సత్క్రియా...సరణి: సత్క్రియా=సత్కారముయొక్క......"
మహామహోపాధ్యాయ-వేదము వేంకటరాయశాస్త్రి.

సీ. "దైవంబుగా నన్ను భావించి నిజతల్ప
మునసుంచి సత్క్రియల్ పూని సలిపి."
బమ్మెరపోతరాజు.

క. ఆతపమునందె నిలిచి మ
హాతపములొనర్చి బడలి యరుదెంచిన మా
కీతరుణి కల్పలతవలె
శీతలసత్క్రియల నింపు సేయక యున్నే.
కంకంటి పాపరాజు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్లు కాళిదాసాదిమహాకవులే కాక నేఁటిదనుకఁ గల సంస్కృతాంధ్రకవు లెల్లరును సత్కృతిశబ్దమునకు సత్కారాద్యర్థముల ననుగ్రహించియే యున్నవారు. ఒక సంస్కృతాంధ్రములయందే కాక హిందీ బంగాళీ ప్రముఖసంస్కృతజన్యభాషలయందును దీని కిదియే యర్థము. ఇంక సత్కృతి శబ్దంబును సత్కారాద్యర్థకంబే యనుట కీ క్రిందిప్రయోగములు చూడనగును:

క. "అతఁ డనుషఁగఁ గనకమయో
న్నతపర్యంకంబునందు నారాయణుఁ డూర్జితమహిమ నుండి యర్ఘ్య [లన్.
ర్చితుఁ డయ్యెఁ దగంగ నతనిచే సత్కృతు

తిక్కన సోమయాజి.

[ఇంకను భాగ-9 వ. స్కం-654 పద్యము, 10 స్కం-573 పద్యము, భాస్క. రా. ఆర-1 ఆ-103 పద్యము, కిష్కి-469 పద్యము.]

ఇట్టి ప్రయోగములు శతాధికముగా నున్నవి. స్థలాక్రమణభీతిచేఁ బద్యసంఖ్యలను మాత్రమే తెలియఁజేసితిని.

శ్లో. సంస్కృతాంధ్రమయీ వాణీ
సత్కృత్యర్థప్రదాయినీ;
ఉద్గ్రంథవాసినీ జీయా
త్సర్వదక్షుః ప్రమోదినీ.

---



వ్యాసకర్త

# స్వర్గమేటికి నేకాంతదుర్గమీశ!*

త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుదొరగారు

కులవధూటియు, రమ్యగుణధుర్య యగు భార్య, త్యాగభోగార్థమై యలరు ధనము
వదనంబున మనోజ్ఞవాణీవిలాసంబు, సత్కవిస్తుత్యమౌ సరసకవిత
పావనంబైన యన్వయమందుఁ బుట్టువు, సజ్జనంబులతోడి సంగమంబు
అస్ఖలితంబైన యంగపాటవమును, శ్రీవల్లభునియందుఁ జిత్తవృత్తి
కలిగి యతిలోకఘనసౌఖ్య విలసనంబు, లనుభవించుచు నుండు పుణ్యాత్ములకును
అనశనపదంబు నతిదూరమైన యట్టి, స్వర్గ మేటికి? నేకాంతదుర్గ మీశ!.

---

* సంస్కృతచాటుశ్లోకమునకుఁ దెనుఁగు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# విష్ణువాయు పురాణములు

[బ్రహ్మాండపురాణాంతర్భాగములు]


కీ. శే. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు, యం. ఏ.


(వెనుకటిసంచిక తరువాయి)

ఇంక వాయుపురాణమును గుఱించి యాలోచింతము. "ఇప్పుడున్న యతిపురాతనములైనట్టియు, నత్యంత విశ్వాసపాత్రములైనట్టియు నాదిపురాణప్రతులలో దీని నొకటిగ భావింపవచ్చు"నని విల్సన్ దొరగారీ పురాణమును గుఱించి చెప్పుచున్నారు. "పవమానప్రోక్తపురాణ" మని బాణకవి దీనిని దన



వ్యాసకర్త

హర్షచరిత్రమునఁ బేర్కొని యున్నాఁడు.[1] ఇంతటి పురాతనపురాణముకూడ నాదిబ్రహ్మాండపురాణములోనియొకవిభాగముగనే కాన్పించుచున్నది. తంజావూరు సౌధపుస్తకభాండాగారము (Tanjore Palace Library) నందలి వ్రాతప్రతులను గుఱించి తయారుచేసిన సుప్రసిద్ధమైన తన గ్రంథముల పట్టికలో డాక్టరు బర్నెల్ గారు బ్రహ్మాండపురాణమునుగుఱించి యీవిధముగ వ్రాసియున్నారు:

"సాధారణముగ వాయుపురాణ మనఁబడునది దాని (బ్రహ్మాండము) లోని యొక విభాగమని కొన్నికొన్ని వ్రాతప్రతుల వలన (వ్రాతప్రతులసంఖ్య ౧౬,౧౨ మొదలగునవి) తెలియవచ్చుచున్నది" [పుట ౧౯౦]. తాను చూచిన బ్రహ్మాండ పురాణమును గుఱించి విల్సనుగారుకూడ నిట్టికథనే చెప్పుచున్నారు:

"సంపూర్ణబ్రహ్మాండపురాణ మనఁబడు ప్రతు లొక్కొక్కప్పుడు అరుదుగనైన దొరకుచునే యుండును. అట్టి ప్రతియొకటి నాకు రెండుభాగములుగ దొరకినది. మొదటిభాగమున ౧౨౪ అధ్యాయములు కలవు; రెండవ భాగమున ౭౮ అధ్యాయములు కలవు. ఆ రెండుభాగములలోఁగలిసియాపురాణమునకుఁ జెప్పఁబడిన గ్రంథసంఖ్య కలదు.[2] పెద్దది యగు మొదటిభాగము వాయుపురాణమే యని తేలి

1. గమకై ర్మధురై రాక్షిపన్మనాంసి శ్రోతౄణాం గీత్యా పవమానప్రోక్తం పురాణం పపాఠ—హర్షచరితము, నిర్ణయసాగరప్రతి, పుటలు ౭౫, ౭౬. 'యత్రపవమహాభారతే శకునివధః పురాణే వాయుప్రలపితం—' కాదంబరి, పీటర్ సన్ గారిప్రతి. పుట ౪౦.

2. ౧౨,౦౦౦.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నది. అందు "ఇతి వాయుపురాణే" అనుటకు మాఱుగ "ఇతి బ్రహ్మాండపురాణే"అనికలదు. ఈవిధమైన మార్పు ఉద్దేశపూర్వకముగఁజేయ బడినట్లు కన్పట్టదు. ప్రళయమును వర్ణించు వాయుపురాణము నందలి మొదటిభాగము యొక్క కడపటికాండమునకు బ్రహ్మాండ మని నామకరణము చేయఁబడెను. ఇది వాయుపురాణమని నిశ్చయించుట కాధారభూతము లైన విషయసూచికయు, వాయువు కథకత్వమును మర్యాదగఁ గాపాడఁబడినవి. ఈ బ్రహ్మాండ పురాణముయొక్క రెండవభాగమునకు వాయు పురాణమునకు నెట్టి సంబంధమును లేదు. దక్షిణదేశమున నది ప్రాయికముగ సంహిత యనియో కాండయనియో వాడుకలో నుండి యుండును" [చూడుఁడు: విల్సనుగారి విష్ణు పురాణోపోద్ఘాతము].

బిబ్లియోథికా ఇండికా గ్రంథమాల, ఆనందాశ్రమ గ్రంథమాల, వేంకటేశ్వర ముద్రాలయ గ్రంథమాల—ఈ మూఁటిలోఁ బ్రకటింపఁబడిన వాయుపురాణప్రతులు మూఁడింటిని నేను సంపాదింపఁ గలిగితిని. ఈమూఁడు ప్రతుల విషయసూచికలను వెంకటేశ్వర ముద్రాలయమువారు ముద్రించిన బ్రహ్మాండ పురాణప్రతి[3] విషయసూచికతో పోల్చి చూడఁగా వాయుపురాణములోని మున్పాటికభాగము ముక్కకుముక్క బ్రహ్మాండపురాణముతో సరిపోవుచున్నది. ప్రక్రియ, అనుషంగము, ఉపోద్ఘాతము, ఉపసంహారము అని బ్రహ్మాండపురాణము నాలుగు పాదములు గలదని నారదపురాణము చెప్పుచున్నది. ఈనాలుగుపాదములు నొకదానితరువాత నొకటి వాయుపురాణమున సంపూర్ణముగ వర్ణింపఁ బడినవి. వాయుపురాణములోని కడపటి భాగమునను, బ్రహ్మాండపురాణమునను గూడఁ గానవచ్చు సామాన్యవిషయ మేమియు లేదు. బ్రహ్మాండపురాణకథకుఁడు వాయువు కావున నిప్పటి వాయుపురాణములోఁ జాలభాగము బ్రహ్మాండపురాణములోని దని కాని, లేక యీ రెండుపురాణములు నొకేపురాణము లోని యంతర్భాగము లని కాని యూహించుట సహేతుకము కాకపోదు.

కీర్తిశేషులైన డాక్టరు రాజేంద్రలాల్ మిత్రగారిచేఁ బరిష్కృతమై బెంగాలు 'ఏషియాటిక్ సొసైటీ' వారిచేఁ బ్రకటింపఁబడిన బిబ్లియోథికా ఇండికా ప్రతి వాయుపురాణమునుగుఱించి బంగాలీవిశ్వకోశ[4] మిట్లు చెప్పుచున్నది:

"దీనిని బట్టి ఈ 'సొసైటీ'వారు ప్రకటించిన వాయుపురాణము అసలు వాయుపురాణము కాదని తెలియనచ్చుచున్నది. గయామాహాత్మ్యముకూడఁ గలిసిన బ్రహ్మాండ

3. నేను వేంకటేశ్వరముద్రాలయమువారి ప్రతులు సరిగా పరిష్కృతములై నవని తలంపను. కాని యవి వాడుకలోనున్నవి. ఏయేవ్రాఁతప్రతిలోనుండి యేయేపాఠము గైకొనఁబడినదో సరిగా నుదాహరింపకుండగనే యాయాపురాణములలోని పరస్పరవైరుధ్యమును దొలఁగించి హాటి నన్వయింపఁ బ్రయత్నించినట్టు కన్పట్టును. అందువలన నేయితరప్రతియు నాకు దొరకనప్పుడు వారిప్రతులనే యుపయోగించితిని.

4. సం. ౧౧. పురాణమునుగుఱించిన వ్యాసమును జూడుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పురాణములోని యొకభాగము మాత్రమే యిది; ఈవిధమున నిది చిత్రమైన యొకసంకర గ్రంథము. ఇది వాయుపురాణమో, బ్రహ్మాండపురాణమో చెప్పుటకు సాధ్యముకాదు."

బ్రహ్మాండపురాణమును బొరపాటున వాయుపురాణ మని చెప్పినందుకు బంగాళీ విశ్వకోశకారుఁడు డాక్టరుగారిని దండించుచున్నాఁడు; కాని పైనిచూపిన దృష్టాంతములవల్ల నీవిధమైన పరివర్తనమునకు డాక్టరుగారు బాధ్యులు కారన్నవిషయము స్పష్టమే. ఎవరో గ్రంథకర్త—లేక పరిష్కర్తయైనఁ గావచ్చును—చాలకాలముక్రితమే ఒకపురాణము నింకొకపురాణముగనో, లేక బ్రహ్మాండపురాణమునందలి వాయుసంహితను వాయుమహాపురాణముగనో మార్చియుండవచ్చును; డాక్టరుగారు సంపాదకధర్మమును పాటించి లేనివి చేర్పకయు, ఉన్నవి తీసివేయకయు సూటిగాఁ దమ వ్రాతప్రతుల ననుసరించిరి.

నారదపురాణ మేమి చెప్పుచున్నది?

ఆయాపురాణములలోని గ్రంథవిషయమును గుఱించి విపులముగ నారదపురాణములోఁ జేయఁబడినవర్ణన మంత చాల ప్రాచీనమైనది కాకపోయినప్పటికిఁ దక్కిన పదునేడు పురాణములు నాదిబ్రహ్మాండపురాణమునుండి పెరిగిన కూర్పులే యను నైతిహ్యమున కందు సూచనలు కలవు. ఇప్పటి బ్రహ్మాండపురాణ (వెంకటేశ్వరప్రతి) విషయసూచికి సరిపోవు బ్రహ్మాండపురాణవిషయసూచి నిచ్చినతరువాత నారదపురాణకారుఁడు బుద్ధిపూర్వకముగ నిట్లు రహస్య మొకటి బయలుపఱుచుచున్నాఁడు:

"నాలుగు పాదములతోను బ్రహ్మాండపురాణమును వర్ణించియున్నాను. ఇది పదునెనిమిదవది; అనుపమానమైనది; సారాతిసారమైనది. బ్రహ్మాండ పురాణము నాలుగులక్షల శ్లోకములని పురాణకాలము నుండి వాడుక. పారాశర్యమహాముని దీనినే యందఱికిఁ బదునెనిమిది విధములుగఁ జెప్పియున్నాఁడు. ఆమహాముని నావలనఁ బురాణములను విని మననము చేసికొని ధర్మశీలురును, దీనానుగ్రహకరులు నైన మునులకుఁ దెలియఁజెప్పి వానిని లోకమున వ్యాపింపఁ జేసెను. వారు వేదముతోపాటు పురాణమును మొదట వసిష్ఠునికిఁ జెప్పిరి. ఆతఁడు దానిని శక్తిసుతునికి (పరాశరుఁడు) నతఁడు జాతుకర్ణునికిఁ జెప్పిరి. ప్రభంజనముఖతః వ్యాసుఁడు దానిని సంపాదించెను. తరువాత నాయద్భుత పురాణ మావిధమునఁ బ్రమాణీకరించి లోకమునఁ బ్రవర్తింపఁ జేయఁబడినది[5]."

5. చతుష్పాదం పురాణంతే బ్రహ్మాండం సముదాహృతమ్, అష్టాదశ మనోపమ్యం సారాత్సార తరం ద్విజ. బ్రహ్మాండంచ చతుర్లక్షం పురాణత్వేన పఠ్యతే, తదేవచాస్య గదిత మష్టాష్టాదశధా పృథక్. పారాశర్యేణ మునినా సర్వేషా మపి మానద, వస్తుదృష్ట్వాథ తేనైవ మునీనాం భావితాత్మనామ్. మత్త్వాశ్రుత్వాపురాణాని లోకేభ్యః ప్రచకాశిరే, మునయో ధర్మశీలా స్తే దీనానుగ్రహకారిణః. యథా వేదం పురాణంతు వసిష్ఠాయ పురోదితమ్, తేన శక్తిసుతా యోక్తం జాతుకర్ణాయ తేనచ. వ్యాసలబ్ధం తతశ్చైతత్ ప్రభంజనముఖోద్గతమ్, ప్రమాణీకృత్య లోకేస్మిన్ ప్రావర్తయత దద్భుతమ్. [నారదపురాణము. వెంకటేశ్వరప్రతి, పూర్వఖండము. అధ్యాయము ౧౦౦, శ్లోకములు ౨౯-౩౭].

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్రహ్మాండమే యన్ని యితరపురాణములకు మూలాధార మని యొకపురాణగాథ యున్నట్లీశ్లోకములు స్పష్టముగ సూచించుచున్నవి. యవద్వీపముదగ్గఱ నున్న బలిద్వీపమునందలి 'కవి'భాషలోని కీబ్రహ్మాండపురాణ మనువదింపఁబడుటయే చాలవఱకు దానిప్రాశస్త్యమును బలపఱుచుచున్నది. అట్టియనువాద మొకటియున్నట్లు మనకు మొట్టమొదటఁ దెలియవచ్చినది డాక్టరుఆర్. ఫ్రెడ్రిక్కుగారిమూలమున. ఇందును గుఱించి వారి తరువాత వ్రాసినవారు వారు చెప్పినదానికంటె నంత క్రొత్త విషయము లేవియుఁ దెలిపి యుండలేదు. ఫ్రెడ్రిక్కుగారన్నప్రకారము హిందువులు క్రీస్తుశకము ౫-వ శతాబ్దికిఁ బూర్వమే బలిద్వీపమునకు వలసపోయిరి; వెళ్లినప్పుడు వారు తమతోఁ గూడఁ దమ మతగ్రంథములను దీసికొనిపోయిరి; అటుతరువాత నాదేశభాషయైన 'కవి'భాషలోని కవి యనువదింపఁబడెను. ఆభాషలో (సంస్కృతమూలములతో సహా)ఋగ్యజుస్సామాథర్వవేదములు, రామాయణమహాభారతములు కూడఁ గలవు. కాని పురాణములలో నాబలిద్వీపనివాసు లొక్క బ్రహ్మాండపురాణమునే కాని యితర పురాణముల పేర్లనైన నెఱుఁగరు.

"బలిద్వీపమున బ్రహ్మాండపురాణము మాత్రమే యేల వాడుకలో నుండవలెనో, తక్కిన పదునేడుపురాణముల పేర్లు చెప్పినను గూడ వాటి నేమాత్రము నెఱుఁగనంత సంపూర్తిగఁ బండితులకు వాని జ్ఞాపకము కూడ నిసుమంతయైన లేకుండ నెట్లు పోయెనో యిందుకుఁ గారణ మీవిధమున సులభముగఁ జెప్పవచ్చును: బలిద్వీపమున నొకతెగ శైవమతస్థులు కలరు. వారు బ్రహ్మాండమునే తమపురాణముగ నంగీకరించియున్నారు."

[పుటలు ౭౯-౮౦]

డాక్టరు ఫ్రెడ్రిక్కుగారీపైవిధమునఁ జెప్పుచున్నారు. దాని ననుసరించి హిందువులు బలిద్వీపమునకు మొదట వలసపోయినప్పు డొక్కపురాణమే యుండెననికాని లేక యేవో కొన్ని యితరపురాణము లాదిపురాణమునుండి చీలిపోవుట యప్పటికే యారంభమైనప్పటికిఁ దరువాత వానికి మతవిషయికముగఁ గలిగిన ప్రాముఖ్యమప్పటికి రాలేదనికాని మనము న్యాయముగ నూహింపవచ్చును. బలిద్వీపవాసుల కీపురాణముతప్ప యే యితరపురాణము తెలియకపోవుట కీకారణముతప్ప మఱి యేయితరకారణమును జెప్పఁజాలము. అయితే బలిద్వీపబ్రాహ్మణులు శైవులనియు, శివోత్కర్ష చెప్పునదగుటచేత వారితర పురాణములకంటె బ్రహ్మాండపురాణమునే కాపాడిరనియు డాక్టరు ఫ్రెడ్రిక్కుగారు ఒకసిద్ధాంతమును జేసి యాకారణమున నాద్వీపమున నితరపురాణములు లోపించెనని చెప్పఁ బ్రయత్నించుచున్నారు. కాని పురాణములలో నాఱుకంటె నెక్కువ పురాణములు శైవపరములైనవే యనియు[6],

---

6. ఈ క్రిందఁ జేర్కొనంబడినవి శైవపురాణములని స్కాంద మిట్లు చెప్పుచున్నది:

తత్రశైవాని శైవంచ భవిష్యంచ ద్విజోత్తమాః, మార్కండేయం తథాలైంగం వారాహం స్కాందమేవచ. మాత్స్య మన్య త్తథా కౌర్మం వామనంచ మునీశ్వరాః; బ్రహ్మాండంచ దశేమాని త్రీణిలక్షాని సంఖ్యయా. గ్రంథానాం మహిమా సర్వైః శివస్యైవ ప్రకాశ్యతే.

[సంభవకాండము 2-3-33]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వానిలోఁ బెక్కులు బ్రహ్మాండ పురాణము కంటెను మతాభినివేశము కలిగించునవి కల వనియుఁ బురాణములనుండియే మన మెఱుఁగుదుము.

బ్రహ్మాండపురాణ విషయసూచి

డాక్టరు ఫ్రెడ్రిక్కుగారి వ్రాఁతలవలనఁ దెలియవచ్చిన దానిని బట్టిచూడఁగా 'కవి' భాషలో రచియింపఁబడిన బ్రహ్మాండ పురాణ విషయసూచి చాలకొద్దిగాను, సాధారణము గను నున్నది.

"సర్గము, ప్రతిసర్గము, మన్వంతరములు, సూర్యచంద్రవంశానుచరితములు, పౌరాణిక గాథలు, కథానకములు మొదలైనవియే బ్రహ్మాండపురాణసూచిలోఁ గలవు. దానిని భగవానుఁడైన వ్యాసుఁడు రచియించెను."

[పుట ౮౦].

ఈపై నీయఁబడిన సూచి యన్ని పురాణములలోఁగూడ గానవచ్చుటవలన నది యన్నిటికి మూలాధారమైనది కావచ్చును. 'కవి' బ్రహ్మాండపురాణముయొక్క సరియైనసూచిని గుఱించి మనకుఁ దెలిసిన విషయము చాల తక్కువ కాఁబట్టి యింతకంటె విస్తారము దానిని గుఱించి చెప్పలేము. కాని యీపురాణమును గుఱించి బంగాళీవిశ్వకోశమండలిలేఖకుఁడు తనకు సమస్తము తెలిసినట్లుగనే యీ క్రిందిరీతిని నొక్కిచెప్పుచున్నాఁడు:

"క్రీస్తుశకము ౫-వ శతాబ్దిలో బ్రహ్మాండపురాణము యవద్వీపమునకు వెళ్లెనని యిదివఱకే చెప్పియున్నాము. 'కవి' భాషలో దాని యనువాద మొకటి కలదు. భవిష్యద్రాజవంశానుచరితమునఁ దక్క మిగిలిన యన్ని విషయములలోను బలిద్వీప బ్రహ్మాండపురాణ మిప్పటి బ్రహ్మాండపురాణమునకు సరిపోవుచున్నది. భవిష్యద్రాజేతిహాసము మినహాగా మన మీ యనువాదమునుబట్టి బ్రహ్మాండపురాణముయొక్క ప్రాచీన స్వరూపమును గాంచఁగలము. అష్టాదశమహాపురాణములలోని కెల్ల నిదియే యత్యంత ప్రాచీనమైనదిగ మనము గ్రహింపవలసి యుండును."　　[సం. ౧౧, పుట ౬౯౪]

ఇప్పటి బ్రహ్మాండపురాణముతో సరి పోల్చి చూడఁగలుగుటకు 'కవి' భాషానువాద విషయానుక్రమణికావివరములను గుఱించిన సమాచార మీ వ్యాసకర్త యెక్కడ నుండి సంపాదించెనో నాకుఁ దెలియదు. నాకువలెనే యీతనికిఁగూడ డాక్టరు ఫ్రెడ్రిక్కుగారి వ్రాఁతలే యాధారమైన యెడల వాటివలన నింత స్పష్టముగ నిన్నివివరములు తెలియవచ్చునని నే ననుకోను. 'కవి' భాషలోని యీ పురాణము నింతవఱకు కేపండితుఁడు ననువదించుటకుఁ బూనుకొనకపోవుట చాల విచారకరము.

పురాణము లన్నిటికి సామాన్యాధారము

ముఖ్యములయిన రెండు ప్రాచీనపురాణములకు మూలమొక్కటే యని కనిపెట్టఁ గలిగితిమి. గనుక మిగిలిన పురాణములలో ననేక మీ రెండుపురాణములనుండియే ఏర్పడియుండునని మనము సులభముగఁ జూపవచ్చును. అష్టాదశపురాణములలోఁ బ్రప్రథమునఁ జెప్పఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బహు బ్రహ్మపురాణములోని చాలభాగములు మక్కికి మక్కి విష్ణుపురాణములోని భాగములే కాని వేఱుకాదు. దాదాపుగ భాగవత పురాణములోని కథ లన్నియు—(శ్లోకముల మాట కాదు. ఇది పురాణపద్ధతినిగాక కావ్య పద్ధతిని వ్రాయఁబడినదని మన మెఱుఁగుదుము)- విష్ణుపురాణమున వర్ణింపఁబడినవి. గరుడపురాణములోను, మఱికొన్ని యితరపురాణముల లోనుగల శ్రాద్ధకల్పమునకు సంబంధించినచాల యధ్యాయములను విష్ణుపురాణములోఁగూడ దానికి సరిపోలిన భాగమునఁ గాంచనగును. ఇంతయేల, వైష్ణవపురాణము లన్నియు రూపములోఁగాని, లేక విషయములోఁగాని ముఖ్యముగా నీవిష్ణుపురాణమునుండియే పుట్టిన వని చూపవచ్చును. ఈవిధముగనే యనేకములైన శైవపురాణములకు వాయుపురాణము మూలాధారముగఁ గనఁబడును. శైవ వైష్ణవ పురాణములలో విపరీత మతాభిమానమును బరికొల్పుచు వ్రాయఁబడినభాగములు, భవిష్యద్వృత్తాంతములు, స్థానిక మాహాత్మ్యములు - ఇవి యన్నియు నిటీవలఁ గాలక్రమమునఁ గ్రొత్తగఁ జేరినభాగములే.

### ఒకసిద్ధాంతము

ఇవియన్నియుఁ బర్యాలోచించి, క్రీస్తుశకము మూఁడునాలుగుశతాబ్దులవఱకుఁ బురాణమనుపేరుతో నొక గ్రంథముమాత్రమే యుండెననియు, దానికే యప్పుడుకాని, యటు తరువాతకాని బ్రహ్మాండమను పేరుండియుండు ననియు నే నొకసిద్ధాంతమును బ్రతిపాదించుచున్నాను. దానిలో ౧౨,౦౧౦ ల శ్లోకముల కంటె నెక్కువయుండవు. ఆపురాణములోని భాగములు క్రమముగా దానినుండి వేఱుపడి ప్రత్యేకపురాణము లయ్యెను. ఈ విధముగఁ దఱిగిపోవుటవలన మూలపురాణము కాలక్రమమున సన్నగిల్లి నామమాత్రావశిష్టమయ్యెను. మూలపురాణభాగము లన్నిటిలోనికి గొప్పవియు, మొట్టమొదటఁ జీలిపోయినవియు విష్ణు వాయు పురాణములై యుండును. కొంతకాలమువఱకు (అంత్యగద్యము మొదలగువానిలో) నేయేభాగము లేయేమూలగ్రంథములోనివో తెలుపఁబడుచువచ్చెను. కాని నుతమునీఁది యభిమానము క్రమముగా నెక్కువైనకొలఁది గౌరవహానియని కాఁబోలు మూలగ్రంథనామమును జల్లఁగ జారవిడిచి స్వతంత్రములైన ప్రత్యేకపురాణములుగనే వానిని బ్రకటించుచువచ్చిరి.

అధ్యాత్మరామాయణమును, బ్రహ్మాండపురాణములోని వనఁబడున నేకమాహాత్మ్యములునుగాక దక్షిణ హిందూదేశమున ఈ వ్యాసమునఁ బై నుదాహరించిన బ్రహ్మాండపురాణమునకుభిన్నమైన గ్రంథము బ్రహ్మాండపురాణమను పేరుతోనే మఱియొకటిగలదు.[7] ఈపురాణమునకే సి. పి. బ్రౌన్‌దొర గారి ప్రోత్సాహమున నెవరో యొక పండితుడు

---

7. చెన్నపురిలో గవర్నమెంటువారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నెం. ౧౩-౫-౧౧ రుగల వ్రాతప్రతిని జూడుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౧. నసగా పెరిగిన పసుపుతోట




౨. కల్యాణమహాల్ -జింజికోట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తయారుచేసినవిషయవివరణముకూడఁగలదు.[8] ఇది వైష్ణవపురాణముగఁ గనఁబడును. పూర్వో త్తరభాగములని యందు రెండుభాగములు కలవు. ఒక్కొక్కభాగమునఁ బెక్కు ఖండములు కలవు.

[తా. క. ఈవ్యాస మంతయుఁ బూర్తి చేసినపిదప నేను తెలుఁగు లిపిలో ముద్రితమైన రెండు సంస్కృత విష్ణుపురాణప్రతులను జూచుట తటస్థించెను. వీటిలోని యంశాంత్యగద్యమునఁగూడ పదునాఱవ శతాబ్ది లోని విష్ణుపురాణాంధ్రానువాదము అంత్యగద్యమున నున్నట్లే కలదు. ఈ రెంటిలో మొదటిప్రతిలో[9] మొదటి యంశము మొదటి యధ్యాయము చివరగద్యమున నిట్లు కలదు:

"ఇత్యాదిమహాపురాణే బ్రహ్మాణ్డే పారాశర్య సంహితాయాం విష్ణుపురాణే పరాశర మైత్రేయసంవాదే ప్రథమాంశే ప్రథమో ఽధ్యాయః."

మఱి యేయితరఅధ్యాయముచివరగాని, యంశము చివరగాని యీగద్యముకానరాదు. మొదటియంశము రెండవయధ్యాయమునుండి యంత్యగద్య మిట్లున్నది:

"ఇతివిష్ణుపురాణేప్రథమాంశే ద్వితీయో ఽధ్యాయః"

నేను చూచిన రెండవప్రతిలో[10] మొదటి యంశము మొదటియధ్యాయము చివరనూత్రమే యంత్యగద్యమున నిట్లుకలదు.

"ఇతి సర్వపురాణానా మాది భూతే బ్రహ్మాణ్డాఖ్యే మహాపురాణే ఉద్ధృతాయాం పారాశర్యసంహితాయాం శ్రీ విష్ణుపురాణే ప్రథమోఽధ్యాయః."

పురాణములన్నిటిలో బ్రహ్మాండమే మొట్టమొదటి పురాణమనియు, పరాశరసంహిత యను విష్ణుపురాణము దానిలోనిదే యనియు నీగద్యము వెనుకటిదానికంటెను మఱింత స్పష్టముగఁ జెలుపుచున్నది.

ఈ గద్యము విష్ణుచిత్తుఁడు వ్యాఖ్యానము చేయునాఁటికిఁగూడఁ గలదని యాతఁడుదానికిఁ జేసిన యీ క్రిందియన్వయమువలనఁ దెలియుచున్నది.

"ఇతీతి: సర్వపురాణానా మాదిభూతే బ్రహ్మాణ్డపురాణే ఉద్ధృతాయాం పారాశర్య సంహితాయాం ఇతి ప్రథమోఽధ్యాయః ఇత్యన్వయః."

ఈయంత్యగద్యమును, దాని వ్యాఖ్యానము నితరప్రతులలోనుంచి తీసివేసిరి.

అచ్చయిన యీ రెండు ప్రతులలోని యంత్యగద్యములవలనవిష్ణుపురాణముప్రత్యేక

8. చెన్నపురిలో గవర్నమెంటు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నెం. ౪-౩-౧౩ రు గల వ్రాఁతప్రతినిజూడుఁడు. ఇందు నితరపురాణముల విషయవివరణముకూడఁ గలదు.

9. శ్రీధర, విష్ణుచిత్త వ్యాఖ్యానములతోఁగూడ నీప్రతిని వావిళ్ల అనంతనారాయణశాస్త్రిగారును, వావిళ్లరామస్వామిశాస్త్రిగారును ఆదిసరస్వతీనిలయ, వివేకరత్నాకర ముద్రాలయములలో ౧౯౧౫ (కలి ౪౯౧౬)-వ సంవత్సరమున నచ్చువేసియున్నారు. దీనిప్రతి యొకటి అడయారు పుస్తకభాండాగారమునఁ గలదు.

10. రెండువ్యాఖ్యానములతో నీప్రతిని అయ్యన్న జగన్నాధాచార్యులవారు జ్ఞానసూర్యోదయముద్రాలయమున ౧౯౦౭-వ సంవత్సరమున నచ్చువేసియున్నారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పురాణము కాదనియు, నది యష్టాదశపురా
ణములకు మూలాధారమైనదని ప్రసిద్ధిఁ జెంది
నట్టియు బ్రహ్మాండమని పేరు గలిగినట్టియు

వేఱొకపురాణములో మొదట నొకభాగముగ
నుండెననియుఁ బరంపరగవచ్చునొకప్రాచీనగాథ
కలదని నిస్సందేహముగఁ దెలియుచున్నది.[11]]

---

# రాట్నము - ఖద్దరు

పంగనామముల రామచంద్రరావుగారు

ప్రతిహింసరాజననీకుమారకుఁడు దౌర్భాగ్యంబు వాటించు నీ
స్థితిఁ బోఁద్రోల రవంత కన్ దెఱచినన్ దీనాస్రువుల్ రాల్చి దు
ర్గతికిన్ వేసట నొందుచున్ ముఖవివర్ణత్వంబుతో నుండుభా
రతధాత్రీమణి రాజ్యలక్ష్మి మన యార్యాదేవి కాన్పింపదే !

పరఖండాంతర దేశభాగముల సంపత్కల్పితంబైన యు
ద్ధురవాణిజ్యపుఁ బాలసంద్రమున మైదుంగూర్చు నియ్యాంత్రికాం
బరహాలాహల ముద్భవించి మనపైఁ బాఱన్ మహాత్ముండు గాం
ధి రువారంబుగ మ్రింగుచో నిలువరాదే మీరు తోడ్పాటుగన్.

మీకొఱకే మహాత్ముఁడు సమీడితపుణ్యచరిత్రుఁ డష్టక
ష్టాకులచిత్తుఁడౌచు సమయంబున కన్నము నీళ్లు లేక కో
ల్పోక ధృతిం బ్రచారకుశలుండయి చెప్ప విదేశవస్త్ర వే
శ్యాకుసుమాంగిసేవల ననర్థము హైందవు లాలకింపరే.

ఆ సన్నందన, మా మిటారపుఁబసం, దాగోటు, లాబిత్తరం,
బాసమ్మోహకశక్తి, పుష్పమృదు శోభాంగప్రభాయుక్తి, యా
హా, సానున్పదసంబు, లామిసిమి యొయ్యారంబు, లయ్యారె ! వే
శ్యాసౌందర్యము గాక యేమిటది పాశ్చాత్యాన్యవస్త్రంబులన్.

పయిఁ బటారమె లోన సత్వంబులేదు, కట్టుకొనువానిచేతి కక్కఱకురాని
రాణివాసపు టబల సరాలపుట్ట, భారతపవిత్రుఁ డెపుడుఁ జేపట్టఁదగదు.

---

11. “సౌత్ ఇండియన్ రిసర్చి” అను నింగ్లీషుమాసపత్రికలోఁ బ్రకటితమైన యాంగ్లవ్యాసమున కిది యనువాదము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# శ్రీనాథకవిరాజీయము

కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు

(వెనుకటిసంచిక తరువాయి)

స్థలము—శ్రీనాథునిగృహము

[కమలనాభుఁడు, మోచెర్ల చెన్నరాయఁడు, ఘంటోడెరాయభీమేశ్వరుఁడు, మృత్యుంజయుఁడు, భట్టారకుఁడు అనువిద్యాగురువు లాసీను లై యుండ శ్రీనాథుఁడు, భార్య దుర్గాంబ ప్రవేశము]

శ్రీనాథుఁడు

(వినయ వినమితాంగుఁడై మోడ్పుగేలుఫాలంబునఁ గీలించి)

మ. శ్రుతులున్ శాస్త్రములుం బురాణములు సం
శుద్ధాధ్వరప్రక్రియల్
స్మృతులుం గావ్యములుం గళాతిగతులున్
సిద్ధాంతభాగంబులున్
ప్రతతత్త్వార్థము లాగమంబులును నా
నాభాషలున్ సత్కవి
త్వతరంబుల్ గృప సేసినట్టిగురులన్
బ్రార్థింతు మిమ్మర్థిమై.

(అందఱకు భార్యాసహితుఁడై ప్రదక్షిణంబు గావించి కమలనాభునిచెంతకు వచ్చి) తాతయ్యగారూ! మీరు నా కోనమాలునోలెఁ బ్రారంభవిద్య యంతయుం జెప్పి చతుర్విధకవిత్వతత్త్వ మెఱింగించి సన్నొకకవిం గావించితిరి. అతిపరిచయంబునం జేసి మీ కింత శుశ్రూష యైనం జేసి యెఱుంగను. మీ ఋణంబు నే నీజన్మంబున కాదు వేయిజన్మంబు లెత్తి యైనం దీర్చుకొనం జాల. మీ కిదే నమస్కారము.

మ. కనకక్ష్మాధరధీరు వారిధితటీ
కాల్పట్టణాధీశ్వరున్
ఘనునిం బద్మపురాణసంగ్రహకళా
కావ్య ప్రబంధాధిపున్
వినమత్కాకతిసార్వభౌముఁ గవితా
విద్యాధరుం గొల్తు నా
యనుఁగుందాతఁ బ్రదాత శ్రీకమలనా
భామాత్యచూడామణిన్.

కమలనాభుఁడు

(శ్రీనాథుని శిరముపై చేయి పెట్టి) చిరం జీవ, చిరం జీవ. సుఖీ భవ, సుఖీ భవ.

శ్రీనాథుఁడు

(చెన్నరాయనిచెంతకుం జని) గురువర్యా! మీరు నా కుభయభాషల సాహిత్యజ్ఞానంబు గలిగించి, నానాభాషల నెఱింగించి సంగీతశాస్త్రపారంగతుని గావించితిరి. నేను మీ కెప్పుడును గృతజ్ఞుఁడ. చంద్రున కొకనూలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షోఁ గనునట్లు నాయీస్వల్పసత్కారమును స్వీకరింపఁ బ్రార్థితులు. (అని భార్య యీయం గొని రాంకవంబులును, ధనంబును నర్పించును.)

చెన్నరాయఁడు

(స్వీకరించి) నేను నీ కుపదేశమాత్రగురువును. సంగీతసాహిత్యములు నీప్రాక్తనజన్మసమార్జితములు. నీవు బృహస్పతితుల్యుండవు. నిన్ను నేము స్తుతింపనోపము. నీకు శ్రేయోఽభివృద్ధి యగుం గాక!

శ్రీనాథుఁడు

(ఘోటకరాయభీమేశ్వరుని చెంతకుం జని) గురువరేణ్యా! మీ కారుణ్యకటాక్షవీక్షణంబునం జేసి నేను తర్క వ్యాకరణ మీమాంసా ధర్మ వైద్య జ్యోతిష శాస్త్రంబులే కాక వేదాంతశాస్త్రంబును సంపాదింపఁ గలిగితిని. నేను మీశిష్యపరమాణువును. లోకములోఁ "గొంతంత దేవరకు మేటంత పత్రి" పెట్టఁ గలవాఁడు లేఁడు. నాయీస్వల్పపారితోషికము గ్రహించి నన్నుఁ గృతార్థునిం జేయుఁడు. (రాంకవార్థంబు లర్పించును.)

ఘోటకరాయభీమేశ్వరుఁడు

(సప్రేమ స్వీకరించి) నీయీసత్కారంబున కెంతయు సంతసించితిని. నీవు మహారాజాస్థాన మలంకరించి మా కానంద మాపాదింతువు గాక! నిన్ను వంటిశిష్యునిం బడయఁ గలుగుట మాభాగ్యవిశేషము. నీకు మంగళంబగుఁగాక!

శ్రీనాథుఁడు

(మృత్యుంజయుని చెంతకుం జని) దేశికాగ్రణీ! మీ రెంతయో శ్రమ కోర్చి నాకు వేదంబులును, శ్రౌతంబును, స్మార్తంబును నెఱింగించి ధన్యుం జేసిన విద్యాగురువు లగుటయే కాక మంత్రోపదేశగురువు లయి నాజన్మంబు సార్థకంబు గావించితిరి. మీ కిదే సాష్టాంగనమస్కారము. (రాంకవాదు లర్పించును.)

మృత్యుంజయుఁడు

(స్వీకరించి) నే నెందఱకో స్వాధ్యాయము జెప్పితిని కాని నిన్నుఁ బోలె స్వరాక్షరపదవృత్తవర్ణంబుల తెఱం గెఱుంగఁ జాలినవాని నొక్కనిం గానను. నీవు పుంభావసరస్వతివి; సకలవిద్యాసనాథుఁడవు. నిన్ను వేదపురుషుఁడు సర్వదా సంరక్షించుచుండుఁ గాక.

శ్రీనాథుఁడు

(భట్టారకుని చెంతకుం జని) ఆచార్యా! బ్రహ్మాండాదిపురాణార్థంబులే కాక ధర్మశాస్త్రార్థంబులును, స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్ర దుర్గబలాద్యర్థంబులును నెఱింగించి నాకు లోకజ్ఞానము కలిగించిన మహానుభావులరు మీరు. మీ కిదే యభివందనము. (అని రాంకవాదు లొసంగును.)

భట్టారకుఁడు

(స్వీకరించి) పుచ్చకాయకుఁ జేవ వచ్చినవిధంబున నీవు నన్నుఁ బెద్ద చేయుచుంటివి. నీవు నాశిష్యుఁడ వని పేరు కాని నీవే నాకు గురుఁడవు. నీకతంబునఁ బ్రాఁతపడిన నావిద్య లన్నియును గ్రొత్తవడినవి. ఏకసంథాగ్రాహి వగు నీకు నాది యుపదేశమాత్రంబ. నీకు విజయం బగుం గాక!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీనాథుఁడు

(చేతులు జోడించుకొని)

"శా. భారద్వాజపవిత్రగోత్రుఁడ శుభా
    పస్తంబసూత్రుండ వి
ద్యారాజీవభవుండ మారయకుఁ బు
    ణ్యాచార భీమాంబకున్
గారా మైనతనూజుఁడన్ ద్విజుఁడ శ్రీ
    నాథాఖ్యుఁడన్ మిమ్ము స
త్కారం బొప్పగ గౌరవించి సతులం
    గావింతు నశ్రాంతమున్."

[నమస్కరించుచున్నాఁడు; తెరపడుచున్నది.]

స్థలము-రాజవీథి

[తంబుర మీటుచు నాడుచుఁ బాడుచు నొక
గాయకుఁడు ప్రవేశించును.]

గేయము

ద్విపద

వినరయ్య, ప్రజలార! వేమభూపాలు
ననపోతరెడ్డి రాజ్యం బది ధాన్య
వాటీపురంబున వైరుల నదిమి
మేటిమగం డయి మెలఁగుచుఁ బదియు
రెండేండ్లు ధర నేలి త్రిదివంబు నసఁగ
వంశమగఁడు లేమి ధర నేలుకొనఁగ
నతనిపుత్రుఁడు బాలుఁడై యున్నకతన
క్షితిఁ దాల్చె నన వేముఁ డతిసమర్థతను
వైరుల నిర్జించి వారిదాడులను
బోరుల వారించెఁ బోటుబం టగుచుఁ
గర్ణాటరాజుల కలహంబునందు
నర్ణితోదయగిరి వారు చేకొనఁగ
దరినుండరా దని తనరాజధాని
పెరిమ మీఱఁగఁ గొండవీటికి మార్చె
నంతఁ గుమారగిర్యాఖ్యుఁడు రాజ్య
మంతయుఁ గొని యేలె నపుడు శ్రీనాథ
కవిరాజు సంస్థానకవి యయి వాని
సవిధంబునం దుండి సత్కార మంది
పోలఁ జేసి మరుత్తభూపాలు చరిత
శాలివాహనసప్తశతి యనుకృతుల
నలరించియును బండితారాధ్య చరిత,
నలిపి తన్మంత్రి కొసంగి పేర్పొందెఁ
గాటయవేముని ఘనశక్తికలిమి
మేటికర్ణాటక మేదినీశ్వరుల
దండయాత్రల గెల్చి తనరుచు నున్న
కొండవీటిని పెదకోమటి వేమ
రెడ్డిశౌర్యమునఁ గొరించి శాత్రవుల
నడ్డింతయును లేక యదిమి కైకొనిమె
మామి డన్నసుతుండు మంత్రి పెద్దన్న
ప్రేమాస్పదసుతుండు ప్రెగడయ్య తమ్ముఁ
డగు సింగయామాత్యుఁ డారాజుమంత్రి
యగుటయు శ్రీనాథుఁ డామంత్రివరుని
కృతిగ నైషధముఁ దెల్గించి యాభూమి
పతిచెంత విద్యాధిపత్యపదంబు
నందె నెల్లొండెడు నని వింటి నేను
నం దేగి బహుమాన మందెదం గాక!

[అని పాడి నిష్క్రమించును.]

స్థలము-ఆస్థానమంటపము

[శ్రీనాథుఁడు, వామనభట్టు, మామిడిసింగనామాత్యుఁడు
లోనగువారు పరివేష్టించియుండ పెదకోమటి
వేమభూపాలుఁడు ప్రవేశించును.]

వేమభూపాలుఁడు

(సింగనామాత్యునకు మొగంబై) మంత్రి
వర్యా! నీవు ప్రతాపగుణభూషణుండవు, పరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ణతార్థసంభాషణుండవు, వితీర్ణమహిమార్ణవుండవు, విభవయోగసంక్రందనుండవు, సంచాంగస్థిరమంత్రరక్షణకళాప్రౌఢుండవు, యవనాధీశసభానిరంకుశవచోవ్యాపార పారంగతుండవు, మహాసామ్రాజ్యరక్షామణివి; ఇట్టి నిన్నుఁ బ్రధానమంత్రిగాఁ బడయఁ గనిన నా భాగ్యమే భాగ్యము. మఱియు సకలవిద్యాసనాథుండైన యీ శ్రీనాథుండు విద్యాధికారి గను, అభినవభట్టబాణబిరుదాంకితుండగు నీ వామనభట్టు ఆస్థానకవిగను నాకు లభించుట నాపుణ్యవిశేషమని సంతోషించుచున్న వాఁడ.

మామిడి సింగనామాత్యుఁడు

మహీమండలాఖండలా! నీవు మహాపండితుఁడవు; సర్వజ్ఞచక్రవర్తి బిరుదాంకితుఁడవు. నీవు రచించినశృంగారదీపికయే నీ పాండిత్యమును వేనోళ్లఁ జాటుచున్నది. నీయాస్థానకవి యగు నీవామనభట్టు నీపేర రచించిన వీరనారాయణచరిత్రము నీకీర్తిస్ఫూర్తికిం దావలంబు. సకలవిద్యాపారంగతుండై నీయాస్థాని విద్యాధికారిపదమలంకరించిన యీశ్రీనాథకవిరాజు నీధర్మశాసనము లన్నియు లిఖించుచు నీకీర్తిలతం బెంచుచున్నవాఁడు. మఱియు నీవు ప్రజ్ఞావంతుఁడవు; బాహుబలసంపత్తిగలవాఁడవు; శత్రురాజుల నెన్నియోతడవ లోడించి రాజ్యప్రతిష్ఠం జేసికొనినవాఁడవు; నైపుణ్యంబునఁ బ్రజానురంజకంబుగా ధరాపాలనంబు సేయుచున్నవాఁడవు. నీవు పూర్వరాజధర్మమార్గానుసారంబుగఁ బ్రవర్తించుచు వర్ణాశ్రమధర్మములం బోషించుచుంటివి. విద్వాంసులకు భూదానాద్యనేకదానంబు లొసంగి విద్యలం బోషించుచున్నవాఁడవు. అనేకసత్రసంతానములం గృతార్థుఁడయినవాఁడవు. నిన్ను వర్ణించుటకుఁ జతుర్ముఖు లేకవులే సమర్థులు.

వేమభూపాలుఁడు

పిరంగిపురశాసనమును రచించినది యెవరు?

వామనభట్టు

"శ్లో. విద్యాధికారీ శ్రీనాథోపిర శ్రీవేమభూపతేః
అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మ
[శాసనమ్"

వేమభూపాలుఁడు

శ్రీనాథకవిరాజా! అస్మద్దేవీనిర్మిత మయిన సంతానసారము నీ వెట్లు వర్ణించితివి?

శ్రీనాథుఁడు

"సీ. కపటసూకరమైన కైటభాసురవైరి
ఘురపుటంబులఁ బరిక్షుణ్ణ మయ్యె
రఘుకులోద్వహధనుర్యంత్రముక్తములైన
చిచ్చుటమ్ములవేఁడిఁ జేవ దఱిఁగె
కుంభసంభవునిహస్తాంభోరుహంబున
నాపోశనం బయి ప్రోస మొందె
పాషాణముల సచ్ఛభల్లగోలాంగూల
కపియూథములచేతఁ గట్టువడియె
వనధి యేభంగి సరివచ్చు ననఁగ వచ్చు
నారసాతలగంభీరవారి యగుచు
నపగతాపాయ మగుచు శోభాఢ్యమగుచు
ననుపమంబైన సంతానవనధితోడ.

ప్రతీహారి

(ప్రవేశించి) మహారాజ! ఎవ్వఁడో విద్వాంసుఁడు రాజదర్శనార్థము వచ్చి హజారముకడ వేచియున్నవాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మామిడి సింగనామాత్యుఁడు

శీఘ్రముగం బ్రవేశపెట్టుము.

ప్రతీహారి

చిత్తము.

(నిష్క్రమించును.)

విద్వాంసుఁడు

(ప్రవేశించి) రాజ! నభ్యుదయోస్తు తే.

మామిడి సింగనామాత్యుఁడు

(విశ్రమింప నియోగించి) అయ్యా! మీనామధేయ మేమి? మీ రేయేవిద్యలయందు విద్వాంసులు?

విద్వాంసుఁడు

మహామాత్యశిఖామణీ! నాపేరు సింగనార్యుఁడు; నేను వైద్యశాస్త్రమందు విద్వాంసుఁడను.

వామనభట్టు

(శ్రీనాథునిం జూచి) విద్యాసనాథా! నీ వీవిద్వాంసునిఁ బరీక్షింపుము.

శ్రీనాథుఁడు

వైద్యశిఖామణీ! ఆయుర్దాయాభివృద్ధికి మందు గలదా?

వైద్యశిఖామణి

కలదు. నిరంతరేశ్వరారాధనంబును, యోగధారణంబును మందు. యోగధారణంబున శ్వాసనిరోధంబు గావించుకొనుచున్నవారు పెద్దకాలము జీవింపవచ్చును. దీనం జేసియే మార్కండేయాదులుచిరంజీవులైయున్నవారు.

శ్రీనాథుఁడు

సూర్యనమస్కారములు చేసిన శ్వేతకుష్ఠపాండుశ్లేష్మపైత్యాదిరోగంబులు వోవు నందు రది నిజమా? కారణమేమి?

వైద్యశిఖామణి

ఆసమస్కారములు వ్యాయామశాస్త్రసమ్మతములు. వ్యాయామంబున రక్తప్రవాహంబునకు నిరర్గళత్వము గలిగి పరిశుద్ధి యేర్పడును. ఆపరిశుద్ధియే రోగశాంతికి హేతు వగును. దాని కాతపంబును సహాయభూతం బగును.

శ్రీనాథుఁడు

స్నానసంధ్యాదినిత్యకర్మములు పుణ్యప్రదంబు లందురు నిజమా?

వైద్యశిఖామణి

పుణ్యప్రదంబులే. విధివిహితము లయినసర్వకర్మములును శరీరారోగ్యమునకై పుట్టినవి. అయ్యారోగ్యమున మనోనిశ్చలత్వ మేర్పడి భగవదారాధనమునకు స్థైర్య మలవడును. అదియే పుణ్యహేతు వగును.

శ్రీనాథుఁడు

మహారాజా! వీని నింక శాస్త్రమునం బరీక్షింప నక్కఱ లేదు. ఈతఁడు వైద్యపారంగతుండు. ఇంక దేవరచిత్తము. వీనిప్రాప్తము.

వేమ భూపాలుఁడు

మంత్రివర్యా! ఈవిద్వాంసుని కొక్కగ్రామ మగ్రహారముగా శాసనము వ్రాయింపుము.

మామిడి సింగ నామాత్యుఁడు

వైద్యరత్నమా! మీదేశమేది? మీ కేదేశమున నగ్రహారము కావలయును?

వైద్యశిఖామణి

నేను వెలనాఁటిసీమలోనివాఁడను. నా కటనే దేనగ్రహార మనుగ్రహించిన సంతసింతును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మామిడి సింగనామాత్యుఁడు

(దస్త్రముం జూచి) విద్యానాథా! ఈవైద్యాగ్రగణ్యునకు వెలనాఁటిసీమలోఁ గృష్ణానదీతీరమున నున్న పొన్నుపల్లె యనుగ్రామమును దానశాసనము వ్రాయుము. మఱియు నిన్న వచ్చి ఋగ్యజుర్వేదములఁ బరీక్ష నిచ్చినవిశ్వేశ్వరపండితునికిఁ దుంగభద్రాతీరంబున నున్న ఆలపా డను గ్రామ మగ్రహారముగా నుఱి యొకశాసనమును వ్రాయుము.

శ్రీనాథుఁడు

అట్లే చేసెదను. (అని వ్రాయును.)

వేమభూపాలుఁడు

శ్రీనాథా! పొన్నుపల్లిశాసన మెట్లు వ్రాసితివి? కొంచెము చదువుము.

శ్రీనాథుఁడు

"శ్లో. చూడామణి ర్నృపాణాం
దుర్మదపరిపంథిశైలదంభోళిః;
సర్వజ్ఞచక్రవర్తీ
పెదకోమటి వేమభూపతి ర్జయతి."

వేమభూపాలుఁడు

అమాత్యా! నేఁ డేమేని రాజకీయవ్యవహారంబులు విమర్శించు నవి గలవా? కలిగిన వాని నెల్ల రేపు విమర్శింతము. నేఁటి కీకొలువు చాలింతము. [అందఱు లేచి నిష్క్రమింతురు.]

---

తృతీయాంకము

స్థలము—రాజవీథి, కొండవీడు

[వలసలు వోవుకొండవీటిపౌరులు ప్రవేశించుచున్నారు.]

గేయము

తీఱిపోయె ఋణము, తీఱిపోయె మాకీ,
యూరికి నీనాఁటితోఁ.

1. పెద్దకోమటిరెడ్డిపృథివీధవుఁడు ధరణి,
విడిచి స్వర్గమునకు వెడలినయప్పుడె. తీ
2. రాచవేముఁడు రెడ్డిరాజేంద్రకులమున,
విషవృక్షమై పుట్టె వేవేలచెప్పంగ. తీ
3. సింగపుగద్దెపైఁ జేరినదాదిగ,
చెడ్డపనులువాఁడుచేయఁగఁదలపెట్టె. తీ
4. తనతండ్రి కీర్తికి దావానలంబయి,
ధర్మకార్యము లెల్ల దగ్ధంబుగావించె. తీ
5. కవులను మంత్రులఁ గడఁ జేరనీ డయ్యె,
గడి మించి పన్నులు గట్టి వేధించె. తీ
6. తిండిమాకెట్లున్న నుండంగ నిల్లును,
పండ మంచము నాచి పడఁ ద్రోచె
ప్రజలను. తీ
7. బలుసాకు దిని బ్రదుకఁ దలఁచి మేమీదారి,
వలస వోయెద మయ్యె వనభూములంబట్టి. తీఱి
(అని పాడుచు నిష్క్రమింతురు.)

(అంత రాముఁడు భీముఁడు అనుసిద్ధులు యోధులాయుధములతోఁ బ్రవేశింతురు.)

రాముఁడు

భీముఁడా! ఆయుధాలతో రం డని రాజుగా రాజ్ఞాపించారం టేంటి?

భీముఁడు

మనరాజు రాణువలేకున్నా డని తెలుసుకొని కర్నాటకరాజు దాడివస్తున్నాడంట! అందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోసం దండును పోగుచేస్తున్నాడు. మనకి యుద్ధం సిద్ధం.

రాముఁడు

మన పెద్దరా జున్నప్పు డేమా రా లేకపోయి నాడు. నేడు సేన సన్నగించిం దని తెలుసుకొని రాయలు దేశము మింగెయ్యడానికే వస్తు న్నాడు.

భీముఁడు

పోనీరా! ఎల్లాపోయీ దల్లాపోతుంది. మనము ఈదుష్టరాజుదగ్గిర కష్టం పడడంకంటే యుద్ధం చేసి చావడమే మంచిది. స్వర్గం వస్తుంది.

(తెరలో ఫిరంగులు ప్రేలును.)

రాముఁడు

అదుగో, అప్పుడే పరరాజులొచ్చిపడ్డారు. కోట ముట్టడించి ఫిరంగులు పేలుస్తున్నారు. మనం పోదాము పద.

(నిష్క్రమింతురు.)

[అపటీక్షేపంబున కత్తులతో, కటార్లతో, నీటె లతో, బల్లెములతో, బాకులతో, విండ్లతో, నమ్ములతో, తుపాకులతో, ఫిరంగులతో పో రాడు నుభయసేనలుఁ గనఁబడును. కొంతలోఁ గోటకూలును. రాచవేముఁడు చచ్చును. హత శేషులు పాఱిపోవుదురు. శత్రువులు సింహాసనం బాక్రమించుకొందురు. తెరపడును.]

---

స్థలము—అరణ్యమార్గము

[శ్రీనాథుఁడు శిష్యులతో నడచుచుఁ బ్రవేశించును]

శ్రీనాథుఁడు

ప్రియశిష్యులారా! దానకర్ణుఁడైన పెద్దకోమటి వేమభూపాలుఁడు పోయిన యీ వైదేశ్లనుం డియు రాచవేముని సత్కారము శూన్యంబగు టం జేసి మహారాజునకు సుగంధద్రవ్యంబు లొసంగి కోటీశ్వరుండైన యవచిదేవతిప్పం డను వైశ్యశిఖామణికి హారవిలాస మంకితము చేసి నేను గాలక్షేపము చేయుచుంటిని గదా! ఎల్లకాలము నాబేహారి పోషణంబున నుంట కిచ్చగింపక దేశాటనము చేసి ధన మార్జింపవల యునని బయలుదేరితిమి. మార్గమధ్యమున మైలారవిభుని మన్ననలం బడసితిమి. కర్ణాటక మున కేగునీలోఁ దెలుంగురాయని గూడఁ జూచి పోవుదము రండు.

(నిష్క్రమింతురు.)

(అపటీక్షేపంబునఁ గొలువుదీరియున్న తెలుఁగు రాయఁడు శిష్యులతో శ్రీనాథుఁడును ఆసీ నులై కనఁబడుదురు.)

శ్రీనాథుఁడు

(తెలుఁగురాయని దిక్కు వరద హస్తముం జూపుచు)

“శా. ధాటీఘోటకరత్నఘట్టనమిళ
ద్ధాత్రీఘిష్ఠకల్యాణఘుం
టాటంకారవిలుంఠలుంఠితమహో
న్మత్తాహితక్షోణి భృ
త్కోటీరాంకితకుంభినీధరసము
త్కూటాటవీఘాట క
ర్ణాటాంధ్రాధిప! సాంపరాయని తెలుం
గా! నీకు బ్రహ్మాయు వౌ.

“శా. అక్షయ్యం బగు సాంపరాయని తెలుం
గాధీశ! కస్తూరికా
భిక్షాదానము చేయురా సుకవిరా
డ్బృందారకస్వామికిన్

దాక్షారామపురీవిహారవరగం
ధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై
వాసించుఁ దద్వాసనల్."

తెలుఁగురాయఁడు

కవిరాజా! నీదర్శనంబునం జేసి నేను ధన్యుఁడను. నిన్నెన్నియో దినంబులనుండి దర్శింపవలయునని తలంచి యుంటి. ఆతలంపు నేఁటికి సఫలమైనది. పెదకోమటివేమభూపాలుఁడే ప్రభువనియుఁ దక్కినవారు కారనియుఁ దలంపకుము. ఇపుడు నిరాశ్రయుండవై యున్నవాఁడ నని చింతింపకుము. మాప్రభువు ప్రౌఢదేవరాయ లతిసమర్థుఁడు; సర్వవిద్యావినోది. నీ వాతని నాశ్రయించి తొంటికన్న మిన్నగా నుండవచ్చును. నేనును మైలారవిభుఁడును దానికై ప్రయత్నించెదము. (అని కస్తూరీగంధాదులతో రాంకవాదులతోఁ బసదనం బొసంగును.)

శ్రీనాథుఁడు

(స్వీకరించి) స్వస్త్యస్తు, సమస్తమంగళాని భవంతు. (అని ఆశీర్వదించును.)

[తెరపడును]

---

స్థలము—మార్గము

[శ్రీనాథుఁడు శిష్యులతో నడచుచుఁ బ్రవేశించును]

శ్రీనాథుఁడు

శిష్యులారా! మనము మైలారవిభునికడఁ గొంతకాలమును, తెలుంగురాయనికడఁ గొంతకాలమును గడపితిమి. ఇంక విద్యానగరంబునకుం బోవుదము. విద్యానగరాధీశ్వరుండు వాగీశ్వరతుల్యుండు. వానికడ డిండిమభట్టాదిమహాపండితప్రకాండులు పెక్కురు కలరు. మనకు వారితో విద్యావివాదంబు రాక మానదు. అందు విజయం బయ్యేని జగద్విశ్రాంతవిఖ్యాతియు నత్యధికవిత్తంబును సంప్రాప్తం బగుం గావున మనము కతిపయప్రయాణంబుల విజయనగరముం జేరుకొనవలయును. మీరెల్లరు విద్యావ్యాసంగము చేయుచు నన్నుఁ బురస్కరించుకొని యుండుఁడు.

శిష్యులు

గురూత్తమా! ఆడిండిమభట్టెవండు? వాని విద్యావైశద్య మెట్టిది?

శ్రీనాథుఁడు

డిండిమభట్టు గౌడబ్రాహ్మణుఁడు. అనేకశాస్త్రము లధ్యయనము చేసి యోగానందాదిమహాగ్రంథములు రచించినవాఁడు. వానిపే రరుణగిరినాథుఁడు. విజయడిండిమము సంపాదించి అష్టదిగ్జయపటహీకృతబిరుద డిండిమాడంబరుం డనియు, డిండిమకవిసార్వభౌముండనియు బిరుదంబు లంది యున్నవాఁడు. అమ్మహాపండితుఁడు—

"శ్లో. అగ్రే డిండిమతాండవం తత ఇతో
వందివ్రజోద్ఘోషణం
ద్విత్రాశ్చిత్రపటాః కియంతి బిరుద
ప్రోతాని పద్యాని నః;
ఆస్తాం తావ దిదం మహేశమకుటీ
కోటీరకల్లోలినీ
కల్లోలప్రతిమల్లసూక్తివిభవై
ర్దేవ్యా న్విజేష్యామహే."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అని యిట్లు ప్రతిజ్ఞ చేసి తన చేతిలోనికంచు ఢక్కా వాయించుచు వాదించి ప్రతివాదుల నోడింతు ననియు, తా నోడిపోయినచో దన ఢక్కం బగులఁ గొట్టించుకొని తనకవిసార్వభౌమబిరుదము విడుచుకొందు ననియు డంబములు వలుకుచు రాజాశ్రయంబు నొంది క్రిందు మీఁదుం గాన కున్నవాఁడు. వానికడ మనవైదుష్య మెట్లగునో తెలియకున్నది.

శిష్యులు

దేశికాగ్రణీ!

"శా. బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడ వుదు
ప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చనకళా
శీలుండ వభ్యర్థిహా
బ్రహ్మాండాది మహాపురాణచయతా
త్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీ
భాగ్యంబు సామాన్యమే."

అని మామిడిసింగనామాత్యశిఖామణి మహాపరిషన్మధ్యమున నైషధకావ్యముం గృతి నొందుచు నిన్నుఁ బ్రశంసించి యున్నవాఁడు. నీవు బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడవు. నీకు సాధింపరానికార్యంబు లీలోకంబున నుండఁ బోవు. విద్యానగరంబున డిండిము నోడించి నీవు విజయపట్టాభిషిక్తుండ వగుదు వనుట నిశ్చయము; ముమ్మాటికిని నిశ్చయము.

శ్రీనాథుఁడు

సరే; కానిండు; పయనంబు సేయుండు. (అని నడచును.)

శిష్యులు

(అనుసరించి నడతురు.)

---

స్థలము-విజయనగరమునందలి సభాభవనము

[అపటీక్షేపంబున మంత్రిసామంతాదులును, విద్వాంసులు, కవులు, గాయకులును గొలువం గొలువు దీరి ప్రౌఢదేవరాయలు ప్రత్యక్ష మగును.]

(వైతాళికులుజయజయశబ్దములుపలుకుదురు.)

(కవులు స్తోత్రపాఠంబులు సేయుదురు.)

(గాయకులు గానం బొనర్తురు.)

(వేశ్యలు నృత్యగీతము లొనర్తురు.)

ప్రౌఢదేవరాయులు

(మంత్రిదిక్కు మొగం బై) అమాత్యమణీ! నేఁడు రాజకీయవ్యవహారము లత్యవసరము లున్నవా?

మంత్రి

లేవు. నేఁడు విద్యావ్యాసంగదినము. రేపు వ్యవహారదినము.

ప్రౌఢదేవరాయులు

(డిండిమభట్టుం జూచి) భట్టారకా! కొన్ని నాళ్లనుండి నీకు వాక్యార్థయుద్ధము సిద్ధించుట లేకున్నది. ఇవి నీకు లంఘనప్రాయదినంబులే కదా!

డిండిమభట్టు

నా కింక రాఁబోవుదినంబు లన్నియు లంఘనప్రాయంబులే యగును. డిండిముఁ డెట్టిదిట్టరియో లోకంబునకుఁ దేటతెల్లం బయినది.

ప్రౌఢదేవరాయులు

డిండిమా! నీకు వాక్కలహమే భోజనము గావున వాదము ప్రతివాదము నీవే చేయుచు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేడు విచిత్రవిద్యావ్యాసంగము గావింపుము;
చూతము.

ప్రతీహారి

(ప్రవేశించి) జయము జయము మహారాజ!
విద్యార్థులతో నెవ్వరో పండితులు వచ్చి నాకీ
పత్ర మిచ్చి పుచ్చినారు. (మంత్రిచేతి కిచ్చును.)

మంత్రి

(పుచ్చుకొని చదువును.)

"శ్లో. విద్యాసనాథ శ్శ్రీనాథో
నానాశాస్త్రవిశారదః;
విద్యాధికారీ సంస్థానే
రాజేంద్రే హాసమాగతః."

[సశేషము]



# జాగ్రత్తసుమ్ము

రాయసం శేషగిరిరావు గారు

పుష్పములపీడి మారుతు పొందు గోరి
సంజ సంచార మొనరించు సౌరభంబ!
ఉగ్గుతోఁ బుట్టు చెలియల సిగ్గు విడిచి
చేరి తడియేల నీవు సమీరవరుని?

వలపె యగుఁగాక వలచిన వనితలందు
సహజముగ నుండు జంకును జంపివైచి
కంటికిం గిపువైన పురుషుని గదిసి పోవ
సతికులము కెంత నగుబాటు సౌరభంబ!

పోయితివిగాక ప్రియువెంట మోహవశత
సౌధముల నుండి కీవు నీసఖుని గూడి
జగమునంతట దిరుగంగ సముచితంబె
వనితలందరు నవ్వరే ప్రౌఢయనుచు.

ప్రియుఁడు దగువాఁడటంచు నీవెంచితేమొ
మురిపెములఁ జేర్చి విడిపుచ్చు మోసకారి
చెరిచె నీవంటి సుందరస్త్రీశతంబు
ఖండితము నిన్ను వీడు జాగ్రత్తసుమ్ము!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతీయ కావ్యసృష్టి

అక్కిరాజు నిత్యానంద శాస్త్రిగారు

## కాళిదాసు ఉపమానవిభుత్వం వియుక్త శకుంతల

శ్లో. "శోచ్యాచ ప్రియదర్శనాచ మదనక్లిష్టేయ మాలక్ష్యతే
పత్రాణా మివ శోషణేన మరుతా స్పృష్టా లతామాధవీ." (శాకుంతలమ్)

[ప్ర. శోచ్యురాలై ప్రియదర్శనమ్ము గలుగు, మన్మథక్లిష్ట గన్పట్టుచున్న దీమె
మాధవీలత స్పృశియించ మారుతమ్ము, పత్రములయొక్క శోషణచేతవలెను.]

ఇది నవవిరహపీడిత అయిన యువతివర్ణన. అడవుల్లో పుట్టి అడవుల్లో పెరిగిన ఈమె సౌందర్యానికి ప్రతిఅయిన సౌందర్యం ఉపవనలతాగృహాల్లో కనబడదు. వనలతల సౌందర్యం శ్రమతో పెంచిన ఉద్యానలతలందు కనబడకపోవడం ప్రసిద్ధమైన విషయమే.

కాని ఈమె స్థితిగతులు ప్రస్తుత విచారణాంశాలుకావు. కవివర్ణించిన రూపాన్ని, లావణ్యాన్ని మనము చూడవలసి వున్నది. కవి కనబరచిన మనోహరత్వం యెటువంటిది? ఈ రూపంలో సౌందర్యం యెక్కడవున్నది? తాను చిత్రించిన రమణీయతతో మనస్సులను కవి యెట్లా ఆకర్షిస్తున్నాడు? అనేవి ప్రసక్తమైన ప్రశ్నలు.

ఈ ప్రశ్నలకు ఉత్తరువులను ఇయ్యడానికి మూలంలో దీనికి సంబంధించిన పంక్తులను ఉన్న భావమంతా సజీవంగా స్ఫురించేవరకు తిరిగితిరిగీ పఠించవలెను. ఈ రూపంయొక్క మనోహరత్వం ప్రేక్షకుల హృదయాలను రహస్యంగా హరించివేసే విచారభావానికి సంబంధించినది. ఇది ఘనవైభవంతో కూడి తళతళలతో చూసేవాండ్లకండ్లు పోగొట్టే వ్యక్తిసౌందర్యం కాదు. కలవరాన్ని కనబడనీయకుండా అంత స్తంభిత. విచారవివశురాలై వున్న స్త్రీయొక్క సౌందర్యం గాబట్టి, మంత్రశక్తితో వశంచేసుకున్నట్లు, ప్రేక్షకుల చిత్తాలను వశంచేసుకుంటున్నది. శకుంతల సహజసౌందర్యవతి; కృత్రిమాలంకరణాలతో కూడినది కాదు. కాని

సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి;
ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్.
(శాకుంతలమ్)

[ప్ర శైవలంచే అనువిద్ధమైకూడ
పంకజమ్ము మనోహరమ్ముగా నుండు
మలినమైనప్పటి కీహిమాంశుడికి
మచ్చ సౌభాగ్యమ్ము గావించుచుండు
నారచీరెను ధరియించినప్పటికి
అధిక మనోజ్ఞయైవున్న దీతన్వి
నిజముగా ఎయ్యది వర్తించకుండు
మండనమ్ముట్టులు మధురాకృతులకు.]

అని కవివ్రాశాడు. కాబట్టి ఈ చిత్తరువులో కనబడేది, విచిత్రంగా అలంకరించుకొని, కండ్లు మూలిపడే తళుకులతో వున్న యువతికాదు. ప్రకృతిసిద్ధాలంకరణాలుగల వనవాసిని. ఈమె విరహకృశత్వం ఈ వున్నశోభనుగూడా బాధిస్తూ వున్నది. చెక్కిళ్లు పలుచబడిపోయినవి; వక్షానికి ఉబ్బుతగ్గింది; మధ్యభాగం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిక్కిలి కృశించిపోయింది; భుజాలు యెక్కువగా వంగి పోయినవి.

క్షామక్షామకపోలమానన మురః కాఠిన్యముక్తస్తనం
మధ్యః క్లాంతతరః ప్రకామవినతావంసౌ ఛవిః పాండురా.
(శాకుంతలమ్)

[ప్ర మిగుల వాడిన చెక్కిళ్లు గలదిముఖము
కఠినతాముక్తకుచమైన యట్టి దురము
క్లాంతతరమైన యట్టిది మధ్యమెంతో
వినతమైనవి మూపులు కాంతి తెలుపు.]

అయినా ఈమె మనోహరత్వానికి వన్నె హెచ్చి వున్నది. ఈ చిత్తరువుకు వున్న ఆయుష్యమంతా "శోచ్యాన ప్రియదర్శనాచ" అనే మాటల్లో ధ్వనిస్తూ వున్నది.

ప్రేక్షకుడి సానుభూతిని లాక్కొని మనస్సును వశం చేసుకొనే ఒకవిధమైన సమ్మోహనత్వం ఈ రూపానికి వున్నది. ప్రకామకోమలమైన మాధవీలతతో ఉపమించి ఈ రూపాన్ని ప్రదర్శించాడు. అది ఉష్ణానిల స్పర్శకు అర్హమైందిగాదు. కాని వాయుహతికి ఆకులు శోషించినవి. శోషించిన ప్రతిపల్లవంలోను మనస్సును కరిగించే యేదో విశేషమున్నది. ఈవిధంగానే శకుంతలగూడా సంతాపం అనుభవించలేని నవపల్లవ కోమలత్వంతో వున్నది.

కవి చిరంతనప్రయోగించిన యీ ఉపమారాజం కండ్లకుకట్టినట్లు చిత్తరువును కనబరుస్తున్నది. వసంత కాలంలో మాధవీలత మార్దవవిజృంభణంతో పచ్చగా కన్నులపండువై కనబడుతుంది. కాని నవవిరహం వ్యదునైన శకుంతలాశరీరాన్ని మోటుతనంగా వశంచేసు కొన్నట్లే గ్రీష్మవాయువు తన ఉష్ణోగ్రతతో లతను స్పృశిస్తుంది. ఆకులు శోషించి కాంతివిహీనాలై వంగి పోయినా లత మనస్సును హరిస్తూవుంటుంది. ఈ భావాన్నే ఉపమ చిత్రించి ప్రత్యక్షంచేస్తున్నది.

మాళవికనుగూడా ఈవిధమైన పరిస్థితుల్లోనే వర్ణించి కవి యిట్లాంటిఉపమనే ప్రసాదించాడు. మాళవిక ప్రియసంయోగం దుర్లభమని నిరాశలో ఉపవాసాలలో కృశిస్తూవుండగా అగ్నిమిత్రుడు చూశాడు. విరహమహిమవల్లనే ఆమె ఆవిధంగా మారిపోయిందని తలుస్తాడు. అప్పుడామె:

శరకాండపాండు గండస్థలేయ
మాభాతి పరిమితాభరణా;
మాధవపరిణత పత్రా
కతిపయ కుసుమేవ కుందలతా.
(మాళవికాగ్నిమిత్రమ్)

[ప్ర. రెల్లుకాడల్లు తెల్లచెక్కిళ్లు గలిగి
ఈమె భాసిల్లు మితభూషణములతోడ
పత్రములుగల్గి మాధవపరిణతములు
కతిపయసుమాలతో మల్లెతీగమాడ్కి.]

రెల్లుగడ్డివలె తెల్లనైనచెక్కిళ్లతో స్వల్పసంఖ్యగల సొమ్ములను ధరించి వసంతునిచే శోషించి అక్కడక్కడ ఒకటీరెండు పుష్పాలుగల మల్లెతీగవిధంగా వున్నదని చిత్రించాడు.

మాళవికనుగూడా కవి పైవిధంగానే శోషించిన లతకే పోల్చాడు. లతతో ఉపమించడంవల్ల రెండుచోట్లా నాయికకు జన్మసిద్ధమైన సుకుమారశరీరప్రకృతి స్ఫురిస్తున్నది. గ్రీష్మతాపంవల్ల లతకూ, విరహతాపంవల్ల నాయికకూ ఇద్దరికీ కాంతిహీనత ఉచితంగా వున్నది.

ఇంతేకాకుండా నాయికకు సొమ్ములు విస్తారంలేనట్లుగా, లతకు మితంగా పూవులు వుండడం ఔపమ్యానికి వున్న సారస్యాన్ని సమగ్రంచేస్తున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆరోగ్యప్రార్థనము

వడ్డాది సుబ్బారాయుడు గారు



వ్యాసకర్త

సౌఖ్యానుభూతి కీశ్వరుఁ డిడ్డ వెన్నన్ని
యారోగ్యహీనున కార్తికరము
లపగతారోగ్యుఁ డా నైశ్వర్యవంతుండు
కలమకేదారాన గడ్డిబొమ్మ
యాతురుం డగు సర్వభూతలేశునకంటెఁ
గూలివాఁ డారోగ్యశాలి సుఖుఁడు
ప్రేమాస్పదములందుఁ బ్రియతమం బగు ప్రాణ
మారోగ్యరహితున కతిభరంబు

భాగ్యములలోన నుత్తమభాగ్యమైన-యట్టి యారోగ్యమునకు, ననామయుండు సర్వశక్తుఁడు, భక్తవత్సలుఁడు నైన-దేవుఁ గారుణ్యసింధుఁ బ్రార్థించికొందు.

క. వికృతిం బాపి, శరీరముఁ-బ్రకృతిం బొందింపు భక్తవత్సల! కరుణా
మకరాలయ! నీనామము-సకలౌషధసార మని రసన సేవించున్.

శా. సంసారాబ్ధిఁ దరించి నీదరికి రా, సర్వేశ! నీ వాత్మకున్
మాంసాస్రాంత్రవసాస్థిచర్మఘుటితన్ నౌకం బ్రసాదింపఁగా
హంసప్రేరణ సాగుయాత్రను, సిరాగ్యస్థిప్రగ్రహప్రాగ్బల
స్రంసం బైనటు దోఁచు; నూల్కొలుపు దార్ఢ్యం బార్తభక్తావనా!

చ. మనిచితి వెన్నొసార్లు విషమస్థితులం దొలఁగించి యిన్నినా
ళ్లనఘ! కృపాసముద్ర! గమనాగమనాదుల కీ వనుగ్రహిం
చినపదశాఖ లేమొ పని చేయవు తిన్నగఁ దొంటియట్లు; నా
మనవి చొరంగ నిచ్చి చెవి, మానుపు తద్వికృతిన్ మహేశ్వరా!

మ. దొర యిచ్చుం జెవి యేని, కానరుని యందుం గ్రిందియుద్యోగు లం
దఱు వందారువులై కనంబఱుతు రత్యంతాదరస్నేహముల్
గుసుభావం; బిసుమంత నీచనవు గల్గున్ వేని కేతచ్చరా
చరసర్గంబు చరించుఁ దత్సుభగు కన్నన్నన్ జగన్నాయకా!

శా. నాకే దక్కఱె యొప్పు డీశ! ధనధాన్యప్రాణిముఖ్యంబులం,
దాకాలంబున సద్భుతం బడుగకే యాకస్మికం బద్దెటో
చేకూఱున్, భవదాశ్రితావనకళా చిత్రక్రియాపాండితీ
సాకల్యంబున; నేఁడుచో నిపు డభీష్టప్రాప్తి గాదా, ప్రభూ!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## కొత్తపల్లి సూర్యారావు గారు

(వెనుకటిసంచిక తరువాయి)

### రెండవ యంకురము

కష్టసుఖము లనేకవిధముల వచ్చును. ఒక్కప్పు డొక్కనికే యీ రెండునువచ్చును. కష్ట మొక వేళ సుఖమొక వేళఁ గొందఱకుఁ గలుగును. ఒక్కయింటి లోనివారి కందఱకు నివి పర్యాయమున వచ్చును. సంఘమంతకును వచ్చుట కలదు. దైవముం గూర్చి మన యూహలు చాలవు. అదృష్టమనఁగా—మానాయనగా రొకనాఁడు మాతల్లి నోదార్చినట్లు—మనుష్యులకు గనఁబడనిది. పుణ్యమో పాపమో, కష్టమో సుఖమో కనఁబడకుండవచ్చి యావహించును.



వ్యాసకర్త

ఒక్కొక్కయూరిలో నొక్కొక్క శాఖ కెచ్చుగఁ బ్రఖ్యాతి—ఒక్కచోఁ దెలుఁగాణ్యము, వేఱొక్కచో వెలనాఁడు ప్రబలముగా నుండును. ఒక్క బ్రాహ్మణుల లోనే కాదు: గొల్లప్రోలునిండఁ గాఁపులే; కొడవలి నిండ గొల్లలే; ఇళ్లే రెడ్లు, నొంటరులు నొక్కొక్క యూరఁ బెక్కు కుటుంబము లుందురు. నే నెపుడైన బల్లిపాడు వెళ్లుట తటస్థించును. అక్కడ మావాండ్రందఱు వెలనాఁటి పుట్టు. తెలుఁగాణ్యులు తక్కువ. తెలుఁగాణులఁట; తెలుఁగు వారిలో ఆణులు—ఆణిముత్తెములని—ఆమట్టుపట్టునొకయూరిలో నిమాతాతగారి కుటుంబస్నేహితుఁ డొక తెలుఁగాణ్యుఁడు నన్నుఁ జూచినప్పుడెల్ల "ఏమి వెఱ్ఱివెలనాఁటిదాన! మీయమ్మ వెనక్కాల నీవు పడుక్కొనుచున్నావా" యని నవ్వించువాఁడు. ఒక్కొకశాఖవారి కొక్కొకమాట యలవాటు. కోనసీమ ద్రావిడులలో గరిటె, గెంటు, గెడ, గెంట యని గాలకెత్వములు పల్కుదురు. మావారిలో వెనక్కాల, పడుక్కోవడము, ఇట్లు కొన్నింటికి ద్విత్వములు. మాటలను, బొట్టుకట్టులనుబట్టి శాఖలను దెలిసికొనవచ్చు మార్గము కొన్నినాళ్లుండెను. కొట్రవారియత్త మాయమ్మ వలెఁ గట్టును. అణుమాయమ్మ పిన్నిగారి పద్ధతి వేఱు. అందఱిలోను మడికట్టు వేఱు, నితరకాలముల కట్టు వేఱు. తలంపున్నచో భేదములను గనిపెట్ట వచ్చును. అన్ని జాతులలోను—మాయూరఁ గమ్మవారి దేవపైఁట, కాఁపులదికుడిపైఁట; గొల్లభామ యొక్కతె యెడమచేతికిఁ జందకడియము దొడుగును. ఒక్కతె బొట్టుపెట్టు, నొక్కతె పెట్టదు. గవరలు దండకేరో ఘరింతురు. నన్ను వేళాకోళముచేయు తెలుఁగాణిమామగారి షాడ్గుణ్య మప్పటికి నాకుఁ దెలియదు; తెలిసిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పెద్దవారి ననుట తప్పుగదా! చెప్పవలసినంతస్వాతంత్ర్యమున్న— కొందఱు వారితో మీ గడుసు కూఁతురిట్లని, మీకొమరుఁడిట్లని యధిక ప్రసంగము చేయుదురు. మాతాతగారు రేకపల్లివారు. అసలు తాళ్లపూఁడి; కల్లూరివారిలోఁ జుట్టఱికము; 'సోమంపీత్వా-సోమయాజి' గారి యల్లుఁడు మా తాత. ఆయనకాలము నిరాలోచనముగాఁ గడచిపోయినది. ఆయనభార్య, మా మాతామహి, యెట్లో యొడ్డెక్కినది. మామాతులుఁడు నాతనికుటుంబము, పాపము, కాలము నెట్టుచున్నారు.

కవిత్వ మన్న మా మామయ్యకే కాదు— నేను మామ యనను, మామయ్య యందును. కొందఱు మేనమామనే మామయ్య యని, మేనత్తనే యత్తయ్య యని యందురు. తక్కినవారిని మామ, యత్త యందురు. అదియే నాకభ్యాసము. వైశ్యులలో మామయ్య, అత్తమ్మ యందురు; అది నాకు వచ్చినది. కాని, నా కలవాటు లేదు. కడనెళ్లఁ జెప్పకుండ సగములో విడిచితిని: కవిత్వమన్న మామామయ్యకే కాదు, వారింట నందఱకుఁ బరమప్రీతి. తెనుఁగు భారతములు, భాగవతములు, రామాయణములు, బల్ల పుస్తకములు గలవు. ఏముక్క విన్నను దాని పుట్టువు, పూర్వోత్తరము తెలిసికొనకుండ విడువరు. వారియింటిలో నొకపుస్తక మున్నది. చైత్రశుద్ధ ప్రతిపత్తు మొదలు ఫాల్గునబహుళామావాస్య వఱకు నెన్ని పండుగలు వచ్చునో యా పండుగలమీఁదఁ బద్యములు— ఒక్కొక్కపండుగ కొక్కొక్కరీతి కల్పనలు; చమత్కారపద్యములు. వారే లేరు; వారిపుస్తకములుండునా! మరల నెవ్వరు నట్టిగ్రంథము రచించినవారు లేరు. వారేమైరా, గంగలోఁ గలిసిపోయిరి; పుస్తకములేమైనవా, పరశురామప్రీతి యైనవి. నే నేమి యెఱుఁగుదును? అట్టిపుస్తక మెవ్వరైన రచించిరేమో? నాదాత్రోవగాదు. మాయింట నెంతసేపు ఎగుమతి దిగుమతి; 'బండి యేస్టేషనులో నున్నది; నేఁ డెన్నిగంట లాలస్యము; బండిలో, నెవ్వరైన డి. టి. యస్. వంటివారు వచ్చుచున్నారా' యని తీగటపాలో నడుగుట— ఇంతే. అంతటిదైన లచ్చుకొన్ని తెలిసికొనియుందును. "ఇత్యర్థముల పులుసు ఇతిభావముల యిగురు"నని తెలిసికొనియెడిదే కాని దానికి దిక్కుమాలిన గతి పసితనముననే పట్టించి నాఁడు దేవుఁడు. ఇదియే మంచికైనఁ జెడ్డకైన వదృష్టము.

శివరాత్రి వచ్చిన దనిన మాప్రాంతములలో పిఠాపురము, కోటిపల్లి, పట్టిసము, ముక్తీశ్వరము తీర్థములు. పిఠాపురములోఁ బాదగయ, కుక్కుటేశ్వరుఁడు; కోటిపల్లిలో సోమగుండము, గోదావరి, సోమేశ్వరుఁడు; పట్టిసము లేక పట్టసము— అఖండగోదావరి, వీరభద్రుఁడు; ముక్తీశ్వరము— గోదావరి, క్షణముక్తీశ్వరుఁడు. అన్నిచోటుల సత్రము లున్నవి. ఉపవాసములవారికి ఫలాహారములు, భోజనములవారికి సంతర్పణము. పిఠాపురములో దివానమువారిసత్రము, రాజరాజేశ్వరీ సత్రము; కోటిపల్లి (కోటిఫలి) పట్టసములలో తల్లి కామయ్యమ్మగారి సంతర్పణములు. స్త్రీలలో జమీందారులు లేరు; ఉన్నను బ్రాహ్మణులు లేరు. ఏజాతిలోను ధనికలు, జమీందారిణులు స్త్రీలున్నను దానధర్మములు సున్న. పుణ్యము పురుషార్థము నుండవలదా? (ఆఁడు) జమీందారిణు లనఁగానే విధవలని యర్థము. అట్టివారికే దానధర్మములమీఁద మనసుండఁదగును. ఆకామయ్యమ్మగా రెంతమంది స్త్రీల కుపాధిగల్పించినది! ఎంతమందికి వడుగులు, పెండిండ్లు, తనయొద్ద నుద్యోగములు! కోటిపల్లి విజయనగరముమహారాజులుంగారి దఁట— అక్కడ నీయమ్మగారిసత్రము!! పట్టసము కామయ్యమ్మగారిదే; ఆదేవుని ధర్మకర్తృత్వమువారిదే. అడుగవలసిన దేమి? ఆమెవిషయము దేశవిఖ్యాతముగదా!

బల్లిపాడు పట్టసమునకుఁ జాలదగ్గఱ. ఒక్కశివరాత్రికి బల్లిపాడువారందఱును బట్టసము వెళ్లవలయునని రెండుదినములకుముందే యేర్పఱచికొనిరి. తెల్లవాఱిన శివరాత్రియనఁగా నందఱు లేచినారు.

కాల్యకృత్యములు దీర్చికొన్నారు. గొడ్డుగోదలు, పాలుపెరుఁగులు, పొలము పుట్రలు చూచుకొన్నారు. పొలముల కేమిగలవు? — ఆకాలమునాటికి— కొన్నియూళ్లలో సెనగచేలుండును. మాయూరినుండి జగ్గయ్యబాబు శివరాత్రి తీర్థమునకు వెళ్లవలెనని యెవ్వరితోను జెప్పువాఁడు కాఁడు. పోయి రాత్రి పొలము పాకలోఁ బండుకొనువాఁడు. కళ్లమునిండ గింజలున్నను— దొంగదొర వాని చేనులోఁగాలు పెట్టుటకు బెదరు; చండశాస



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుండు. తెల్లవారుకడ లేచి స్నానములకై గోదావరికిఁ బోవువారు—బంధువులు, వాని పాలను దాపునఁ బోవుచు "ఓ జగ్గయ్యా! నీవు స్నానమునకు రావా"యని యడుగుచువారు. "నేను రాను; కళ్లములో గింజలున్నవి; మానాన్న యూర లేఁడు; నేను రాను; మీరు పొం" డని పెద్ద కేకవేసి మాటలాడక యున్నచో యుండి వీరి కంటె ముందుగా స్నానములరేవులోనికి వెళ్లి నిల్చువాఁడు. బల్లిపాడు గోడనలో నీ ప్రసంగ మేల?—జగ్గయ్యబాబు చమత్కారము కొంటకు. బల్లిపాటివారు ఇండ్లలికికొని, ముగ్గులు పెట్టుకొని 'సరి యీనాఁటికిఁ బొయ్యిలోఁ బిల్లిని లేపవద్దు. హాయిగాఁ బండుకొననిం' డని తలుప్రలు తాళములు బిగించినారు. వీథివారు, వాడవారు సమస్త జనులు "శివా! మహాదేవ"యని పైలు దేటినారు. స్నానముచేసి గుడిలోనికివెళ్లి దేవదర్శనమైన పిమ్మట "నేను-నేను గ్రామగత్షణమునకై సాయంకాలమునకుఁ దిరిగివచ్చెద" నని చెప్పికొని యుండిరి. కొందఱు లింగోద్భవకాలమువఱకు నుండ నిశ్చయించుకొనిరి.

ఫుట్టినింటి వాసనయో యేమో కాని యీయేఁడు మాయమ్మకుఁగూడఁ బట్టసము వెళ్లవలెనని యున్నది. "నీవు వచ్చినయెడల మీ బావ నన్నుఁ బంపుదురు. రెండు మూఁడునాళ్లు ముందుగా ర" మ్మని తమ్మునిపేర నుత్తరము వ్రాసినది. వ్రాయుట కాలోచన కొన్నినాళ్లు; కాగితమునకై యత్నము కొన్నినాళ్లు. పెంటపాడు వెళ్లి రహస్యముగాఁ బెట్టెలో వేసివచ్చు విశ్వాసపాత్రు లెవ్వ రని కొన్నినాళ్లు. ఇప్పటికైనను బిఠాపురమువంటి మహారాజ నగరములలో మాఊరునూల నొక్కటే పోస్టు. అప్పటి కాలము జల్లి సీమస్థితి యడుగవలయునా? చెప్పవలసినేమనఁ గా మాయమ్మ యెంత త్వరగా వ్రాసినదో మామయ్య కాయుత్తర మంత త్వరగా నందినది. ఇంకనిప్పటికి నాయుత్తరము మామామయ్య కందుచునే యున్నది. దైవముంగూర్చి పదేపదే చెప్పఁజాలము. లలాట లిఖితము. ఎవ్వరికర్మ మెట్లున్నదో యెవ్వరెఱుఁగుదురు? ఒక్క వర్షకాలములో మాయూర నలువురు శూద్రులకట్టువాండ్రు పాకలోఁగూర్చుండిరి. కూడ నొక్కపాలికాపు మాల పిల్లవాఁడు నున్నాఁడు. హోరుమని వాన కురియుచున్నది. మేయుచున్న పసువులలో నొకటి యూకుమడిలోఁ బడినది. కాఁపుబిడ్డ లప్పటికి సుకుమారులు, మాలబిడ్డ సేవకుఁడును గదా! "వెంకా! మాడ యూకుమడిలోఁ బడినది; మరలించికొని ర" మ్మనిరి. ఎంత యవలించిన నది దూడ వినలేదు. ఉత్పన్నమంద బుద్ధులు చెప్పిన మాట వినరు గాని పసువుల కట్టివిపరీత బుద్ధి లేదు. అకార్యము చేయుచున్న యొకపసువును, "కట్టికట్టి! బట్టబట్ట! పైపై! బోడిబోడి" యని యదలించిన నన్నేకదా యనుచున్నారని మరలుట వాని నైజము. ఆనాఁ డాదూడ వారిపాలిటి కేమిటో కాని మాలబాలుని పాలిటి ధర్మదేవత యైనది.

మాలఁడు: "నాదిగాదువంతు; రామయ్యకాఁపుగారిది. నే నిప్పుడేగావంది బట్టావును మరలించికొనివచ్చితిని."

కామయ్య: "నేనింకొకసారిపోయెదను! నీవిపుడు పోయిరా వెంకా! బాబు వచ్చెనా యూకుమడిచూచి కోపపడును."

మాల: "నేనుబోను; నాకుఁజిన్న గుడ్డయొక్కటియే. సగమునానిపోయినది. గొడుగు లే"దని నిరాకరించెను.

నలుగురు కాఁపుబిడ్డలును "పొమ్మన్నఁ బోవా"యని మాలకుఱ్ఱనివానలోనికిఁబట్టిత్రోసివైచిరి. పాపము, వాఁడు వీరికోసరమో, వానకోసరమో యేడ్చుచు దూడవంకకుఁ బోయెను. దూడను మరలించి "కాఁపుగారు! గట్టుకడ మేయుచున్నది గాని యూకుమడి మేయలే" దని పాక వంకఁ జూచుచు నక్కడనుండియే యఱచి వచ్చుచుండఁగనే ధామ్మని యొక్క పిడుగు పాకమీదఁ బడి నలువురు కాఁపుబిడ్డలను జంపినది. "ఓరీ, మా గ్రహచారములోనికి నీవు పాల్గొనరాదల"దని బలవంతముగా విధి బలమున, దీర్ఘాయుష్కుఁడగు మాలబుడుతను దొలఁగించి వైచిరి. కాఁబట్టి యెవ్వ రెట్లుగుదురో చెప్పుట కష్టము. ఏల ఈసంగతి తెచ్చితినా? మాయమ్మ వ్రాసినయుత్తరము సకాలమున కందిన యెడల మా మామయ్య వచ్చునేమో; మాయమ్మ యట్లుకాకుండుటకే యుత్తర మందలేదనుదానికై తెచ్చితిని.

మా యమ్మకు నేనొక్కతనే. కొడుకులు లేరని స్నానములని దానములని వెట్టి యున్నది. మా నాయన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడనిచ్చువాఁడుకాఁడు. "ఈవ్రతమును మన మేలపస్సు చేసి, యేదానధర్మములు చేసి పడసినారము? కొడుకు నకై మన యిష్టమా? చాలును. నోములు వ్రతములు చేసెదనని నా కేయభ్యంతరమును లేదుగాని యది కుమారుఁడు కలుగవలయునను నుద్దేశముతోఁ గారాదు. అదృష్టము నెవ్వరు చూచినారు? నే నడిగినాఁడనా, బాబుగా రేల భూమి యిచ్చినారు! పదికుంచముల నేల! నలువురకు నాలుగు గుడ్డలున్నవి, వీనికి లేదని, వీఁ డెవ్వఁడనియా ప్రభువునకుఁదోఁచును. అపుడు వారివారికి లభించును. ఇదియే యదృష్టము. ఈయష్టదిగ్గజములు మోయఁజాలని మన భూము లనుభవించుటకేనా మనకుఁ బుత్రుఁడు? భూమిని నిందించుట కాదు! ఇది మనపొట్టకుఁ జాలును. నీ వింతకు స్నానములు దానములుచేసినఁ బరమున కుపయోగింపవలయునే కాని, యిహమునకు నీ నీతివర్తనము తప్ప నొక్కటియు నుపయోగపడ" దని వారించువాఁడు. "ఉన్నదో లేదో మనము తినక పస్తు పడియున్నారమా? వాఁడుమాత్రము మనకున్న దాని లోనే..." అని మాయమ్మ నెమ్మదిగాఁబలుకుచుఁ బనిపాటులలోఁ బ్రవర్తించు చుండునది. ఇది దినమున కొక్క మాటు గాకున్న వారమునకో, పక్షమునకో యొక్కతడవ మాయింట జరగుచుండుట గలదు. "అక్కయ్యా! నీ కెందు కే నాన్నకు లేని బెంగ?" యని యొక్కనాఁ డంటిని. "నీకేమి తెలియునే, నాన్న మనస్సున నెట్లున్నదో? నేనాఁడుదానను గనుక పైకనుచున్నానుగాని" యన్నది మాయమ్మ. అప్పటి కాయభిప్రాయ మెట్టిదో నాకుఁ దెలియ లేదు.

కొందఱు మేనమామలు వారి వారి యక్కలను బిలుచుచుండుటచే సాధారణముగ వారి బిడ్డలకు నభ్యాస మగును. మాయమ్మను మామయ్య "అక్కయ్యా" యను టవలననే మాకును మాయమ్మను నట్లే "యక్కయ్యా" యని పిలుచుటకు వాడుకయైనది. ఎవ్వరును దానిని మొదట వారింపకుండుటచేఁ గొన్నినాళ్లకది దృఢపడి నది. ఏయభ్యాసముగాని తలక్రిందుగా నున్నపుడు నివా రింపవలసినదే. వారింపక పోవుటచేతనే కొందఱ అన్న దమ్ములు పేరులు పెట్టి పిల్చికొందురు. కొందఱవలెఁ దల్లిని నేనక్కయ్య యని పిలుతును గాని మఱికొందఱ వలెఁ దండ్రిని బావాయనుట లేదు. ఆపూర్వాభ్యాసము చేతనే నేను పైప్రసంగములో నొక్కసారి యక్కయ్య యని యంటిని. నేను బిలిచెదనని మాలమ్మ, గౌరు నిద్ద ఱును నట్లే పిలుతురు.

పట్టసము ప్రత్యక్షముగా నేను జూడలేదు. కాని, విప్లవము జరిగినతర్వాత జనులందఱుఁ జెప్పుకొను మా టలనుబట్టి చెప్పుచున్నదానను. గోదావరి పాఁతగట్టుమీఁ దుగాఁ బోయి దిగి పడవమీఁద గోదావరిలోఁబోయి వీరభద్రస్వామిపర్వతమెక్క వలసినట్లున్నది. స్నానము చేసి గోదావరిలో కొండయెక్కి స్వామిని దర్శించి తిరిగి పోవువారు మరలఁ బడవమీఁదనే యొడ్డునకు రావలసియుండును. శివరాత్రి నాఁటియక్కడి జనసమ్మ ర్దము చెప్పనలవిగాదఁట. అందఱకును గొలబుట్టి పడవ మీఁదనే ప్రయాణము. దానికని తలకొక డబ్బు పుచ్చు కొని రేవుదాఁటవేయుట కనేకము దోనెలు తెచ్చిపెట్టె దరు. "మాపడవమీఁదికి రమ్ము; మాపడవ త్రోసి వేసె దము. అది బరువుపడవ; మాది దానికంటె నేడువెనుకలు పైలు దేఁటినను ముందుగాఁ బోయెదము" అని మరకాండ్రు కేకలు పెట్టుచుందురు. ఆమ్మాటలవిశ్వాసముతో దీని లోని వారు దానిలోనికి, దానిలోనివారు దీనిలోనికి మాఱుచుందురు. రక్షకభటులు ప్రమాదమున నీటఁబడిన వారిని రక్షించుటకై కొన్ని దోనెలను, ఈఁతనేర్చిన పల్లెవాండ్రను మొదలగు వారిని గొందఱను ముందుఁ బెట్టు కొని సిద్ధముగా నుందురు. మా బల్లిపాటివారు పెద్దప డవ మాటాడుకొనినారు. ఇతరుల నెక్కనీయకుండ రాకపోకలు రెంటికిఁ దామే నిర్ణయించి గుత్తగొన్నారు. శూద్రు లందులో నెక్కిన మైలపడుదుమనుశంకచే 'మాకీ నాఁడు దీక్ష, ఉపవాసము; నీకై మే మెక్కువ యిచ్చెద' మని పడవవానితోఁ గట్టుదిట్టములు చేసికొనిరి. అంత మందియు నొక్కదానిలో నెక్కిరి. పడవలవాండ్రు పోటీ. మన మొంటియెద్దుబండ్లవాండ్ల పెంకితనము- ఒకదానికంటె నొక్కటి ముందుగఁ బోవలయునని పరు గెత్తించి యిరుసులులోఁ జక్రము, జక్రములోఁ గాఁడి తగులుకొని బండ్లు బోరగిలఁ బడఁద్రోయుట నవశేశ్వ రము రాజమహేంద్రములమధ్యను జూచుట లేదా? అట్లే యీపడవలవారు భూమిమీఁదకంటె నతిలాఘవ ముగఁబడవలను నీటిమీఁదఁదోలుదురు. "త్రోయరా మన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడవ; మనకంటె వాఁడు ముందా." "అమరం నుండరా. అలాగే నటరాసుక్కాణీ-పరేరాకురా." "ఏటఁబడరా, పడరా యేటిలో"నని యొకరికంటె నొకరు ముందుగాఁ దప్పుకొనుచు నొకరినొక రెగతాళి చేసికొనుచు "నీ దని మిది టన్నులు, నాదైదు; నీవు నాతో వచ్చేదవటరా" యని నవ్వుకొనుచు, "శివా, మహాదేవ! వీరభద్రా"యని కేకలు వేయుచుండిరి. ఆ సమయమున మన వీరభద్ర స్వామిపై భక్తిగల బల్లిపాటి భక్తులను వహించిన పడవ మహానటునిదర్శించుటకై పోవుచు మహానాట్యము చేయ నారంభించెను. ఆ బ్రాహ్మణులలోఁగూడ నటేశ్వరుఁడు ప్రవేశించినాఁడో యేమో; కదలుచున్న దని యీవైపునవారావైపునకు, నావైపునవారీవైపునకు నడయాడుటలోఁ బడవ ప్రక్కబరువై, తట్టూరఁగి, యొడ్డ గెడపై, నట్టేటఁ బడవనడుపువారికి స్వాధీనముకాని యాందోళనముతో- జనులలో నల్లకల్లోలముపుట్టి, తొట్రుపాటు మిక్కుటమై, బుడుంగుమన్నది. పడవలసమ్మర్దము తప్పుకొనుటకై మనవారిపడవవిశాలనిరాటంకమార్గముననడచుచున్నదికాఁబోలును, సమయమునకు సాయము వచ్చువారు కూడ లేకపోయినారు. పడవవాండ్రీఁత నేర్చినవారు కావున మిగిలినారు. వారని వీరని చేరునప్పటికి, త్రాడు తంకర ప్రోసుచేయునప్పటికిఁ జాలమంది శివైక్యముం జెందిరి. పడవబోరగిలఁబడినపుడు దానిక్రిందనుండి యీఁతచేతనైనవారును రాలేక యందే యూఁపిరాడక కుడితికుండలోఁ జేబారలునైచి 'శివా'యనిరి. వలలు వేసినారు; గాలములు వేసినారు. నలుగు రైదుగు రెవ్వరైన ముసలివాండ్రు బ్రదికియున్నారేమో కాని శివరాత్రి యీకీర్తి గాథమై గోదావరి మధ్యమందు మిగిలియున్నవారు "దేవుఁడా యెట్లు బైటఁబడెద మెట్లొడ్డెక్కుదు"మని, "మాబిడ్డఁ డున్నాఁడా, మనవారంపఱు నున్నారా! మీ రెంతమంది వచ్చితిరి? వాఁడేడి? వీఁడేడి? ఓరయ్యో వీరయ్యో, శమ్ముడా, నాయనా, అమ్మా" యని తొట్రుపాటుతోఁ గొంతసే పలజడిఁబొందిరి. పడవలో బల్లిపాడు బ్రాహ్మణులు తప్ప నెవ్వరును లేరు; ఈశివరాత్రి ఫలము వీరే గుత్తకుఁ బుచ్చుకొన్నారు, పాపము! ఈశివ భక్తాగ్రగణ్యులు దూరము పోయి చూడలేని పిచ్చుకుంటులకు గోదావరిని గంగానదిగాను, పట్టసమును మహాశ్మశానముగాను మార్చి యింద్రజాలము గావించిరి. శాశ్వతముగా మూసివేసిన

ములువేసిన తలుపులు మరలఁ దెరవవలసినపని లేకుండ జరిగినదఁట- ఆఘోరకృత్యము దేశమంతట వ్యాపించి కొన్నినెల లాహాకారము పుట్టినది. దీని నింతకంటె వివరముగాఁ జెప్పుటకు, మా మేనమామగారి కుటుంబ మందుండుటచేఁ గన్నుల నీరుదిరుగుచున్నది.

అమ్మా! మానాయనయే పంపి, మాయమ్మయే వెళ్లియున్నయెడల మాగతి యేమైయుండెడిదో! నేనుగూడఁ బోయియుందునో- మావంటివారికా- ఆలోచించిన గుండె జల్లుమనుచున్నది. కుబ్బిది యొక్కటె ఈవిప్లవము జరగినతర్వాత నాల్గుగడియలకు దూరమునుండి యొకపల్లెవాఁ డెత్తుకొని వచ్చుచుండఁగా నేడ్చుచున్నది. ఒక్కరక్షకభటుఁడు-"మీపిల్లదా, మీపిల్లా" యని యందఱినడుగుచున్నాఁడు. "మాదికాదు, మాదికా"దని యెల్లవారుఁ దమచంకలనున్న బిడ్డలను, చేతనున్న బిడ్డలను దడవుకొనసాగిరి. అతికష్టముమీఁద మధ్యాహ్నమున కొక్కరివలన 'రేకపల్లివారి చిన్నది, బల్లిపా'డని తెలిసినది. బల్లిపాడు తీసికొనివెళ్లినఁ దమయిల్లు గుర్తుపట్టినది. ఇదియే మాలచ్చి.

ఈవార్త తెలిసి మాతల్లిదండ్రులు వెళ్లి బల్లిపాఁడులో మిగిలిన యిల్లువాకిలి భద్రపఱిచి లచ్చిను దీసికొని వచ్చి పెంచిరి.

"ఏదో సమయములో నేను మాతమ్మునకుత్తరము వ్రాసితిని గాని నన్నుఁ దీసికొని వెళ్లుటకు రాలేదు; అతఁడువచ్చిన మీరుపంపిన నేను నిల్లే యనుదు"నని మాయమ్మ మానాయనతోఁ జెప్పఁగా, "చూచితివా నీస్వాతంత్ర్యమున నీకొంపకూడ మునుఁగవలసినదే. ఏమి పుట్టిమునుఁగునని నాతోఁ జెప్పకుండ వ్రాసితివి! ఎవ్వరువ్రాసిరి? యెవ్వరు పెట్టెలో వేసిరి? మనకు మంచి కాలము గనుక యిట్లు పరిణమించినది" అని మానాయన గుండెగొట్టుకొనియెను. మాయమ్మ స్వతంత్రముగా నుత్తరము వ్రాయుట తప్పేకదా! వెళ్లవలయునని మానాయన పంపఁడా! అక్షరములు వచ్చినను వ్రాయుటచేతగానిది గనుక ప్రయత్నముతోనే మోక్షకాలము గడచినది. చదువుకొనునప్పుడే యుత్తరములు వ్రాయుట నేర్చు నిప్పటి కాలములోనే చదివిన యెడల మాతల్లి యెన్ని యుత్తరములు వ్రాయునో! అధిపతికిఁ దెలియకుండ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంచియైనఁ, జెడ్డయైన, మఱియేదియైన స్త్రీయొనరించుటచాలఁ బొరపాటు; గృహిణీధర్మముకాదు. ఇంకేమైన నేనంటినా గురునిందాదోషము వాటిల్లును.

## మూఁడవ యంకురము

గౌరి మామేనత్త వసుమంతాలు. మామేనత్త పుష్పస్త్రీగానే చనిపోయినది. వేంకటరామయ్య మామ కూఁతునాశ్రయించి బ్రదికియున్నన్ని దినములు నల్లునితోపాటు పిఠాపురములోనే యుండువాఁడు. అల్లుఁడు పెద్ద చదువరికాఁడు గాని ధనము గలఁడు. కావున సర్వముగా వీథులవెంటఁ దిరుగు చుండువాఁడు. మామామ తన డబ్బే పెట్టుకొని తననల్లమందు, బట్టలు తెచ్చుకొను చుండువాఁడు గాని భోజన మల్లునిదే. ఆయప్పయిన నడుమకొనకుండఁ బండినప్పుడెల్లఁ గాఁపులను ధాన్యమే తోలిపెట్టు మనువాఁడు. కూఁతునకేదో రెండేండ్ల కొకసారి నగయని, చీరయని ముట్టఁజెప్పువాఁడు. ఆతని పాదగయాస్నానము, భగవద్గీతలపారాయణము, జాతక పుస్తకములు తిరుగవేయుట, ఎఱిఁగియున్నవారికి స్నేహభావముచేత ఫలములుచెప్పుట, ఇంతియకాని యొక్క సాక్ష్యమునకని, యొక్కపనికని యధికరణస్థానములకుఁ బోవుట, ఒకరివ్యవహారములలోఁ జేరుట, తీర్పులు, యుక్తులుబోధించుట యెఱుఁగఁడు. పుట్టినది ఘుల్లిసీమ; వెంకయ్యకోటినీ రొంటఁబట్టినను దనకేమి పాపమో కాని న్యాయశాస్త్రము, కాలదోషము, భుక్తము, అస్వాధీన పుతొకట్టులు, వడ్డి వ్యాపారము నిట్టిమాటలే తలకెక్కలేదు. తమదేశవిద్యలో తనకు డొక్కశుద్ధి కాలేదు. ఈకారణముచే నిస్స్పృహుఁడై పిఠాపురము చేరినాఁడు.

అమ్మ! మాయూళ్లేమి యప్పటినాళ్ల సంగతి- ఈయుత్తర దేశములో నున్నందున నేనిపుడు జ్ఞాపకముచేసికొనుచున్న దానను గాని, యక్కడ నిపుడైన నొక్కగడియ యుండలేకపోదును. మాయింటి చూరు నీరు ప్రక్కయింటివారి దొడ్డిలోఁ బడిన మాయిద్దఱకు లేనిది మూఁడవ వారికేల? మాకుఁ గలహములు కల్పించుట. మాతోఁ 'జాలకాలమునుండి మాచూరు నీళ్లువారి దొడ్డిలోఁ బడుచున్నవి కాఁబట్టి తగవు పెట్టరా'దని చెప్పుమని—వారితో 'రా; కోర్టుకుఁ బోయితిమా మూఁడునిమిషములలో వారిచూరు పీఁకించి పాఱవేయవచ్చు' నని— మేమిద్దఱము మొత్తుకొనుచున్నను నరసాపురమో, రాజమహేంద్రవరమో యీడ్చికొనిపోవుట- "అబ్బ! మీచెట్టునీడ మాయింటిలోనికి వచ్చిన మాగింజలెండవు; వారికేమి? చెట్టుకొమ్మలు మా గోడమీఁదఁ బడకుండ నఱుకు మని" వారికి హిరణ్యాక్షవరమిచ్చుట- ఫలవృక్షనాశము. 'ఇది యేదో దురుద్దేశము. మనతోఁ జెప్పకుండ మూఁడవయేఁడు ముగియుచుండఁగా నాయ డేల పొలములోనికిఁ బాటిమన్ను త్రోలుచున్నాఁడో; నీ వీసంవత్సరము క్రొత్తవాని కీయఁ దలఁచుకొనినట్లు తెలిసి యుండియు నిట్లు చేసినాఁడు; నాతో రా నరసాపురమో తణుకో,' అని యావును దూడయు నుండగా గుంజలార్చును. యుధ్యస్నేహమధ్యమున నక్కచావు. ఇట్లెన్నియని- కొందఱు నిరాంటకకార్యములు- కొందఱు దారుణకార్యములు- ఏయాట కామద్దెల లోకములో నుండును. వేంకటరామయ్య మామకుఁ దగిన వారే పిఠాపురములో- పిల్లకుఁ దలనొప్పి యెత్తిన జాతకము పట్టుకొనివత్తురు. పెండ్లికని, శాంతనములకని, దత్తతకని, గ్రహచారములకని, డబ్బు పుచ్చుకొనఁడు గావునఁ, దెలిసి లేనిపనిం గల్పించినారు. ఇది బాగులేదని మంచి సమయములో వారిని దప్పించుకొనుటకు భద్రాచలము, సింహాచలము, జగన్నాథము యాత్రలు వెడలువాఁడు. వెఱ్ఱిమామ కాకపోయిన- ఇంటనే యుండి యింతయో యంతయో డబ్బుచేరుపెట్టిన నింతతొందర యుండక పోవును- అదియెఱుఁగఁడు. సత్కాలక్షేపములోనే యేకాదశి మరణముం గాంచినాఁడు. కూఁతు నల్లుడు సతినికిఁ గొడుకులైరి.

మావదినె మిక్కిలి గడుసుది. కాని యామెమాటలను సుబ్బన్నయ్య పడనీయలేదు. అది యాతనికి నాయనమ్మతీర్పు- నాయనమ్మ తన మగని పేరని వానిని ముద్దుచేసినది. అడిగినపుడెల్లఁ దనయొద్ద నున్నతృణము, పణము నెవ్వరికిఁ దెలియకుండ నిచ్చుచువచ్చెను. అతఁడు నితరులవంటి తెలివితక్కువవాఁడు కాఁడు గాన, నవ్వ యిచ్చిన దానిలో సగము దాఁచికొని సగము నాటకములకో పాటకములకో నెచ్చించువాఁడు. భూములమీఁద వచ్చుదానిలో సగము తనది, సగము మావదినెది; తన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నగములలో నాల్గవవంతు దాపరికము; మిగిలినదివ్యయము. ధనమార్జించినాడు, వ్యయము చేసినాడు; కాని యెక్కువ దుర్వ్యయమే యనవచ్చును. బంగ్లు చేయించుట, యెద్దులు, గుఱ్ఱములు కొనుట, యమ్ముట- అందు విశేషము దండుగలే; స్వల్పలాభము- ఏమయినను 'నూఱునఱకు నన్నుఁ బెంచినతర్వాత నిన్ను నేఁ బెంచెద' నని పక్షపాతము లేకుండ ధనలక్ష్మి స్త్రీపురుషులతోఁ జెప్పునఁటగదా! చీమయైనను గూడఁ బెట్టుటకు మొదలిడియైనా నిలువుల కొలఁది పుట్టలు ద్రోయును. "అరుగ కుండ నేని గరుడుఁడేనియు నొక్కయడుగు నరుగలేడు"- "చీమయేని నడచిన యెడల యోజనములు కొలఁది నడచును"- మావదినె యెడలెల్ల నగలే- మాయన్న యెడల వెలగలబట్టలు. అప్పుడువచ్చి చూచిన వారి కాయిల్లెంతయో గంభీరముగా నగపడును. ఏలాగునఁ బుట్టినదో ప్రథమమున గౌరి; తర్వాత వారికి సంతానము లేకపోయెను. పని లేదు; తగినంతవ్యాయామము లేదు. మిన్నక కూర్చుండి ఫలాహారములు, రాత్రులు నిద్ర లేకుండఁ—జీట్లాట- లేక కాట్లాట లేదుగాని—యెట్లో తెల్లవార్చువాఁడు. ధనమిచ్చుచున్నాఁడనుగదా భార్యకడియేమియుఁ బాటయనియో మేమాటనిర్లక్ష్యముచేసి, ఏదో కొంతవఱకైనదాఁక నడుగఁడని,—ఎట్లగునో మాతమని వదినె- కొంతకాల మిట్లుగడచినది; బోధింపసాగినది; బతిమాలినది. రాత్రియైనంతనే నవ్వుచు వీథిగుమ్మమునకుఁ దాళమువైచి 'చెవి యెందో పరాకునఁ బెట్టితి'నని, 'నాకుఁ దల భారముగానున్నది, పిల్ల యేడ్చును; గొంచెము చూచికొం'డని, 'చీఁకటి రాత్రులలో బైటపోవుట మానరాదా'యని- 'మీకేమి భయము, మీయింటికే స్నేహితులను రప్పించుకొనరాదా'యని,—ఈమాట తన కిష్టము లేకున్నను,వినఁడని యెఱుఁగున్నను—సాహసముగాఁ జెప్పిన మాట. పద్యములు చదివి యర్థము చెప్పునది- 'మనకన్నుల యెదుట- రంగఁడేమయ్యెనో యెఱుఁగరా' యని సాటిమాటలు వినిపించి, వ్యసనములవలనఁ బూర్వులు, నలాదులు, రావణాదులు,- వీరివృత్తాంతమెత్తి- ఒక్కనాఁడు వీథి తలుపుమూసి రెండు పాదములు పట్టుకొని కన్నీరు పెట్టుకొనుచు- 'మీబిడ్డను మీరు చూచుకొనుఁడు మా మామయ్యకడకుఁ బోయెదను' అని; "ఇదిగో మీరిచ్చినధనము,నగలు నాకక్కఱలేదు. భద్రముచేసికొనుఁడు. నేనన్నము తినను, ఒట్టు పెట్టుకొందును; అదిగో; నన్ను గడ్డము పట్టుకొని బతిమాలవలదు; ఇచ్చినసొమ్ము మరల మీరు పుచ్చుకొనకున్న నెవ్వరికైన దానము చేయుఁడు; ఎప్పటికైన నిది మీసొమ్మే. పిల్ల కొక్కనగచేయించి కొనుఁడు. అదిగో, నాచేయి పట్టుకొనవలదు; నేనేమి యమ్మకడుపునఁ బుట్టలేదా? మీరందఱు చెక్కరాండ్రతోఁ జిల్లుబొల్లు మనుచుండ వలయునా? కుఱ్ఱది 'నాన్నా నాన్నా'యని ముద్దుమాటలాడుచున్న నాలో నేనేనా సంతోషపడుట; ఎవ్వరికిఁ జూపి యెవ్వరికి వినిపింపను? పగలెట్లో పనివెంటఁ బ్రొద్దుపోవును; రాత్రి యొంటిగా నెన్నినాళ్లు? నాకష్టము లెవ్వరికు గట్టెక్కునో- పిల్లనువిచారించి వెనుకదీసెదను; అదిగో, వద్దువద్దు; నాకాళ్లమీఁదఁ జేయివేయరాదు. ఇంతటిపాపమును నేను భరింపలేను. ఇంకనా - మీరింక నాకు ధనమీయనువలదు, నేనుబుచ్చుకొనను వలదు. మీరెప్పుడయిన నేనడిగిన నిచ్చినారా? నేనేల యడిగెదను? మీ డబ్బు మీరుతగుల- కాదుకాదు, పాడుచేసికొనుఁడు. శక్తి రవన్నివిధములఁ బాడుచేసికొనుచున్నారని భయము.- ఆఁ: అబ్బే, తప్పుగాదు. మీతోఁ జెప్పి, మీకుఁజూపించి యేడ్రాసెదనుగాని- మామామయ్య కెవ్వరైనఁ జెప్పినఁ దెలియవచ్చినదేకాని నానోటితో నేనీసంగతిముందుగాఁ జెప్పను- ముందుగా నేమి, యెప్పుడును జెప్పను. అట్లు చెప్పెదనని కలలోను మీరుతలంపకుఁడు. మీయగౌరవము నాదికాదా? మీసంతోషముమాత్రము నాదికాదు; అగుటకల్ల. చివరకు మీ బాధలన్నియు నావి; మీకష్టములన్నియు నావి. ఈకన్నుల కవి దూరములుగావు. నానో రమృతమువంటిది. నేను పార్వతీదేవివంటి యిల్లాలికడుపునఁ బుట్టినదానను. అదియేవద్దు; దూరముగా నుండియే మాటలాడుఁడు. మీరెవ్వరెవ్వరిని ముట్టుకొని వచ్చినారో - అయినను మీశరీరము నాకు యజ్ఞస్థలము వలెఁ బవిత్రమును, బూజ్యమునైనది. నేనందుకని దూరముగా నుండుమన లేదు. నాదేహము దుఃఖముచే వడఁకుచున్నది. వద్దు,పట్టుకొనవలదు. మాయిద్దఱకర్మమెట్లున్నదో యట్లగును. ఒక్కమగనాగమ్మ కాఁగూడదు! విశ్రాంతియేలతప్పును! ఇరుగింటియరుగుమీఁద నొకవిద్వాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"సర్వేభ్యో విధిభ్యోలోపనిధిర్బలీయాన్" యని వల్లించు చున్నాఁడు. ఆమాట యాయింటి యెదురిల్లైన మన యింటికిఁ బట్టినది. పోనిండింతేనా? ఏదియైనను మీరే ముందు చేయవలెను; నామాటగాని, నాయనుమతిగాని యొక్కనాఁడును ముందుగాదు. మీతోఁగూడ నన్నుఁగూడ నేదేశమునకో తీసికొనిపోరాదు! మీ కెందుకు? నన్నువిడిచిపోయేదా! అగను నాబరువు కొంత తగ్గును. ఇల్లువిడిచి చెప్పకుండఁబోవుటకు మీకేమి గ్రహచారము! ఇంటికే మీబంధువులను, స్నేహితులను రప్పించుకొనరాదా? వ్రతములో, సంతర్పణములో చేయరాదా? దుర్వ్యయమేల? అనామకుల సావాసమా మీకు! చూచినవానికెల్ల ధనవ్యయమా? ఏమో! మీమాటలను నేను నమ్మఁజాలను. సంసారఘాతలైన నిప్పటికే దేయోకాలో విజేఁగివారలఁబడియే యుందురు. మన కేయాసయున్న నితరుల కాయాసయుండదాయని మీ రేల తలఁపరు? నాదగ్గఱ లేదు తాళమెక్కడనో పోయినది. ఎట్లో తలుపు తీసికొందురా నమ్మమున కడ్డుగాఁ బండుకొందును. మనుష్యులను దాఁటివెళ్లరాదు. నవ్వుచున్నారా! పోనీ యమ్మ చెప్పినమాట యొక్కటయినఁ జెవికెక్కలేదా! అయ్యో నా తెలివి! దొడ్డిసమ్మను తలుపువేయుమ చిచితినా– పోనీ, పొండు. తెల్లవాఱకుండ నిల్లు చేరుఁడని ప్రార్థనచేయుచున్నాను." ఇట్లని నెలలో రెండుమూఁడుసారు లుపన్యాసము–అన్నియు వట్టివైనవి, అతనివృత్తి యేదో యదేకాని.

అతనికి బంధువులమీఁద నెంత ప్రేమ! చీచీ, ఆమాటతప్పు. అన్నయ్యా! అన్నయ్యయని - నేను; అమ్మాయి, అమ్మాయియని – చెల్లెలికంటె నెక్కుడు ప్రేమ; తండ్రిగారి యస్థికలు గంగలోఁ గలపుటకని కాశికేగుచువచ్చి మూఁడునాళ్లలో చుట్టుదారియైనను వెదకుకొనుచు వచ్చియున్నాఁడు. 'వదినెనుగూడఁ దీసికొనిరాలేదా' యంటిని. ఈప్రయాణము స్వల్పదినములేయని తీసికొనిరాలేదు. కుప్పనూర్పులు, పెద్దపనియున్నది. తీరుబడిగాఁ గుటుంబయాత్ర వచ్చెదమన్నాఁడు. ఏదో యొక దుర్బుద్ధి– ఎంతటివానికైన వేఁపకాయంతవెఱ్ఱి యుండును. భార్యయం దెట్టి దురభిప్రాయమును లేదు. అది యట్లుండఁబట్టియే తనయిష్టానుసార మాటలు సాగుచున్నవని సంతోషము. ఇంటనిల్లాలు లేకున్న నదియిల్లా

మటే? భవిష్యత్తును దెలిసికొనలేకపోవుట యాతనికొక్కనికేకాదు. భూతమును, వర్తమానమును లోకమును గాంచి కొంత భావి యిట్లుండునని స్త్రీపురుషులెఱుంగుటకు మార్గమున్నది. తోఁపదు. తోఁచినను నింతగతియేమి? జాగ్రత్తగానే చాలనాళ్లు శరీరధారణముచేసినాఁడు. ఆహారనిద్రలలో నసాధారణవ్యత్యయములచే నజీర్ణరోగము పుట్టినది.

గుండెలలో మంట, యన్నద్వేషము కలిగినది. ఫలాహారములపైనరుచి; మూఁడుపూటలు రెండు, రెండొకటె క్రిందదిగినది. ఆయొక్కపూఁటయైనను రెండుముద్దలకంటె నెక్కువతినినఁ గడుపులోఁదావు తగ్గిపోయిన బరువు– తిన్నయన్నమునీళ్లు, కొన్నినాళ్లు వమనము– ఇప్పుడైనను వ్యయముతగ్గలేదు. వైద్యులక్రిందఁ జాలసెలవు చేసినాఁడు. లోయేటఁబడి మాటవెడలుటకష్టమగు స్థితికివచ్చినాఁడు. 'మీకునెమ్మదిగానున్నఁ దిరుపతివేంకటరమణమూర్తి కొండయెక్కుదుమనిముడుపుకట్టనా' అనిన భార్యమాటకుఁ బ్రత్తికాయలంత లేసి గ్రుడ్లుచేసి సంతోషసూచకముగ 'ఊఁ!' యనును. 'గుంటూరు వేఁపచెట్లగాలి యారోగ్యకరమట, మన మెఱిఁగినవారు చాలమందియున్నారు. కొన్నినాళ్లక్కడకు వెళ్లుదమా?'—'ఊఁ!' 'కృష్ణనీరు, కనకదుర్గ తల్లిచలువ, బెజవాడవెళ్లవచ్చును. ఈనీరుగాలిమార్చినఁగొంతమేలేమో'–'ఊఁ!' 'ఏలకన్నుల నీరుపెట్టుకొనుచున్నారు? నేను బ్రదికియుండినన్నినాళ్లు మీకేలోపమును లేదు. తలమీఁదఁబెట్టుకొని కాశీరామేశ్వరములు మోచి తీసికొనిపోయి, పువ్వులలోఁబెట్టి మిమ్ముఁబూజించెదను. మీ రెంతమాత్రమును దుఃఖింపవద్దు. దానివలన నింతకంటె జబ్బెక్కువయగును. ఒక్కయేటిలోస్తు చేతఁబట్టుకొన్నామనిన నెంతదేశమైన మూఁడునెలలలోఁ దిరిగివచ్చెదము. ఏయూరెట్టిదో? ఎవరైన మంచివైద్యులు కనఁబడవచ్చును. ఇంతటికంటె నెంతటి కఠినరోగములు వచ్చినవారికిఁ గుదురలేదు? మీ దొక జబ్బుకానేకాదు. ఇంకను ముదరలేదు. జాగ్రత్తపడి ముందే మేలుకొన్నాము. మీరు బెంగపెట్టుకొనవద్దు. మీరు బెంగపెట్టుకొన్నారని నాకుఁ దోఁచెనా యీ యుపచారమైనను జేయలేను. మీరుధైర్యము తెచ్చికొని నాచేత నెంతచాకిరియైనం జేయించికొనుఁడు. రమణారావుగారు మంచిసాధకుఁడు. ఆయనచేతితో నేమిచ్చిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సదియమృతమే. ఆయనయొద్దికిఁ దీసికొనివెళ్లెదను. రెండు పూఁటల లావుమహారాజుగారిచ్చిన యౌషధ మొంటఁబట్టి నదా మీకు వజ్రదేహమగును. నామాటవినిచూడుఁడు; నాల్గు నెలలలో మీ కెట్టియారోగ్యము,బలముకలుగునో-" అనికన్నులనీరు తుడిచి మావదిన పొత్తులలో బిడ్డనువలెఁ గాపాడినది.

వదినె యంటే వదినెగాను. ఆఁడు వాండ్రందఱు నామె గుణములు వరవడి పెట్టుకొనవలసినదే.గుణవంతురాలగుతల్లి యింటిబిడ్డలకు గుణములొకరు నేర్పవలయునా? ఒకరిం జూచి యొకరు నేర్చికొందురు. గౌరిమాటలాడ మొదలు పెట్టినది మొదలు- మగవారింటి కెవ్వరు వచ్చినను మామా, ఆఁడువా రెవ్వరు వచ్చినను అత్తయనియే కదా పిలుపు! "యథామాతా తథాసుతా." ఈచిన్న బిడ్డ సుగుణమునుబట్టియే యాతల్లి యిట్టిదని యెఱుఁగవచ్చును. ఎవ్వరయిన నింటికి రానిమ్ము. ఆమె యెంత యాదరణ! యెంత గౌరవము! కాళ్లు కడిగికొనుటకు నీళ్లిచ్చి, దండముపైనాఱుచున్న తొల్లాయిగుడ్డఁ దుడిచి కొననిచ్చి, పీఁట వేసి కూర్చుండఁబెట్టి, మంచినీరు—వారు త్రాగనిమ్ము మాననిమ్ము—పిఠాపురము కంచుపంచపాత్రతోఁ దెచ్చి దగ్గఱఁ రెండవచేయి సహాయముగాఁబెట్టి గుమ్మము ప్రక్కనునిలిచి 'పిల్లలు క్షేమమా;వదినెబాగుగానున్నదా; పిన్నికుశలమా; తమ్ముఁడు పెండ్లి శుభలేఖ వచ్చునని యెదురు చూచుచున్నా' మని 'ఎప్పుడు మాయింటిలో మిమ్ముఁదలఁచుకొనని దినముండదు. ఎప్పుడో మీయింటి కొక్కనాఁడు వచ్చినారఁట-మీరుచేసిన యాదరణము- "ఏమిప్రేమ, ఏమిబంధుప్రీతి" యని మాటిమాటికిఁజెప్పుచుందురు. ఇంతసేపు నిక్కడనే యున్నారు; "ఎవ్వరో లెక్క యీవలయును; రేపువారూరికిఁ బోయెదరు; ప్రయాణము చేయఁబోవునపు డడిగిన బాగుగాదు; కొంచెము ముందుగాఁబోయి యడుగవలెను; చెప్పులలో; గాలువెట్టుకొన్న వారు మనకుసిద్ధముగా డబ్బు చేతిలోఁ బెట్టెదరా" యని సందేహించుచునే వెళ్లినారు. వీథిలోనికి వెళ్లినవారి కన్నో మధ్య మధ్య పనులు' అని యెక్కడకో, యెప్పుడో పోయిన పెనిమిటి మర్యాద కాపాడుచుండును. అట్టి గుణవతికి, ధనవంతుఁడే- యన్నవస్త్రములకులోటు లేదు-మనఃస్థయిర్యము లేకుండఁజేసినాఁడు.

అతని నేమనవలయును? "బుద్ధిః కర్మానుసారిణీ." వాని మనస్సు మంచిదే- ఆ మనస్సు తన మంచితనముచేత మెత్తని వానిని లొంగఁదీసికొన్నది. సులభసాధ్యుఁడు, పాపము! వదినె యింటికి వచ్చినవారు భోజనమున కుందురని తెలిసిన యెడల వంటచేసి, స్నానాదికముమాచి వీథిలోనికివచ్చి- గిరుక్కున లోనికిఁజని- "ఒకకుఱ్ఱవాని చే వార్త పంపినారు. వ్యవహారము తొందర- ఆలస్యముగా వచ్చెదనని. మీరుభోజనముచేయుఁ"డని-"మీ పీయంకుఁ డింతలో రారు, మీరు లెం"డని, వారు తనభర్తనెఱిఁగి యుండు రనుకొనుఁడు- తానుమాత్రము భర్తగౌరవము నారీతిని గాపాడును. అట్టిపతివ్రతకా యిట్టి మనోవ్యథ? అన్నయ్యకూడ వదినెవంటివాఁడేయైన- ఆహా! ఆయింటిగౌరవము-ఆకళకాంతులు- చిలుక గోరింకలవలె వారిద్దఱును- ఎంతవైభవముగా నుండునో యని నేనప్పుడపు డనుకొనుచుందును. ఎవ్వరో స్టేషనులోఁ గనఁబడి చెప్పినారఁట-'ఆతఁ డింక బ్రతికియున్నను నిష్ప్రయోజనము, దానిత్రాడుగట్టిది; బ్రతికియున్నను వాఁడెప్పుడో గతించినట్లే లెక్క-'యని. పోనిమ్ము. వదినె పసపురాచి బొట్టుపెట్టుకొనుటకైన మఱికొన్నినా ళ్లుండరాదా! అజీర్ణము ముదిరి పోయినది- రాజా రవివర్మగారి పటములోని కుచేలుని యెడమచేతి చిటికెనవ్రేలువంటి యాతని కాలుసేతులు బ్రతుకనిచ్చునవియేనా? తిండి యుడిగిపోయినది; నాలుక యెండుకొని పోకుండ వెండియుద్ధరణితోఁ బాలుపోయుచున్నది. అవియు నసహ్యమైనవి. కాఫీనీళ్లు పోసినప్పుడు గ్రుడ్లు తిరుగఁబడుచున్నను గొంతులో గురకలు వెడల నతికష్టముమీఁద మ్రింగువాఁడు. ఈనీళ్లేయింతకుఁ దెచ్చినవి. మితిమీఱి రాత్రియనక పవలనక త్రాగి తెచ్చుకొన్నదే. పాపము మఱియొకటి యెఱుఁగఁడు. ఆతనిని జంప వలయునన్న- ఏనాఁడైన గాఫీనీళ్లు రెండుద్ధరుణులు పోయకుండిన సరి- ఆనాఁడు మఱేమియుఁ జంపుట కుపాయము లాలోచింప నక్కఱలేదు. తులసితీర్థము ప్రక్కవేసినాఁడు. కుఱ్ఱది "అమ్మా! కాఫీ నీళ్లలోఁగలిపిపోయవే త్రాగియిముడ్చుకొను"నన్నది. వెఱ్ఱితల్లి; దానికిఁగష్టము తెలియునా, సుఖము తెలియునా! అట్లే పోసిన మ్రింగి కూఁతురు మాటలు వినుచున్నాఁడు కావునఁ గనపు!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౮. క్రొత్తగా పట్టిన ఏనుగులను మచ్చికపరుచుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కట్టుదాని తలఁమీఁదఁ జెయివైచి ప్రక్కనున్న వదినె ముఖముం గాంచి తల నూడించి కూర్చుండుమని మీఁదఁ జేయివైచి, కంట నీరు పెట్టుకొని "నీవుగనుక నన్నిట్లు పెంచితివి, మఱియొకరైన నీపాటి కేపెంటమీఁదనో పాఱవేసియుందురు. నేను నిన్నెంతో బాధపెట్టితిని. నీవుగావున నోర్చి యుంటివి; నన్నింతకాలము రక్షించితివి. మీమామనురమ్మని యిల్లువాకిలి భద్రముచేసికొమ్మ. నేను బ్రదికి భూమిపైన నడుగువెట్టుట నట్టిది. పిల్లకు నీవే యున్న దానవు. మీ మామయ్య యున్నాఁడు. నన్ను మఱచిపొమ్మ" అని కన్నులు మూసినాఁడు.

"నన్ను క్షమింప వలయును. మీకుఁ జెప్పకుండ మామయ్య కుత్తరము వ్రాసితిని."

(కన్నుఁ దెఱచి) "మంచిపని చేసితివి. రేపో నేఁడో వచ్చును."

"తప్పక రావలసిన దే-ఒకరిచేత వార్తకూడఁ బంపిన దానను. అదేమి కన్నులు తెఱచియును నావంకఁ జూడరు? నన్ను మఱచి పొమ్మంటిరి; నేను మఱవఁ గలనా? నన్ను మీరే మఱచినారు. అయ్యో! ప్రాణము మంచము మీఁదనే పోవునేమో! అమ్మ, వీథిలోనికివెల్లి శాస్త్రిలు మామను బిల్చికొనిరా; ఇంటిలో మాటలు వినఁబడుచున్నవి" అని కూఁతునుబంపి తానొక్కతెయే భూమిపైదింపి-"అమ్మ! యెవ్వరో శ్రోత్రమామ వచ్చుచున్నాఁడే" యని- మానాయనను బాగుగా నెఱుఁగని గౌరి కేకవేయుచుండఁగా- అబ్బబ్బ! యేమి చెప్పుదును? అన్నయ్య కంటె నొక్క క్షణము ముందుగా దొడ్డి నూతిలోఁబడి వదినె పెనిమిటితోఁగూడ బుష్పవిమానముమీఁద స్వర్గమునకుఁ బోయినది. తనువులు శాశ్వతములు కావు; ఎవ్వరికైనఁ జావు తప్పదుగాని వెనుక ముందు లున్నవి.

---

# నీ తి ప ద ము లు

## ౨

సౌరాష్ట్రి - జంపె

కులమునకు భూషణము - కూర్మి సత్పుత్రుండె
ఇల భూషణము పుణ్య-ములు సేయు నృపతి.

అనుపల్లవి

పరగ విభూతియే - ఫాలసద్భూషణము
గరిమ రుద్రాక్షలే - కంఠభూషణము
పురవైరి దలఁచుటే - ముఖమునకు భూషణము
హరునిఁ బూజించుటే - హస్తభూషణము

శివకథాశ్రవణమే - చెవులకును భూషణము
సవినయ ప్రదక్షిణమె - చరణభూషణము
భవహరుని దర్శనమె - బహునేత్రభూషణము
శివపదధ్యానమే - చిత్తభూషణము

శిరమునకు భూషణము - శివచరణవందనము
సరిసదాచారమే - జన్మభూషణము
ఇరవొంద ఏకరా-జేంద్రనుత తుళజేంద్ర,
ధర నన్నిటికి నీవె - తగినభూషణము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




కొమాండూరి వేంకటాచార్యులు గారు

వ్రావూరిలో రామయ్యను యెరగనివాళ్లంటూ లేరు. ఎందుచేతని అడుగుతా రేమో చెప్తాను వినండి: మొట్టమొదటి కారణం- అతడు వయస్సుమీరిన వా డవటం; రెండవది-పిల్లాజెల్లలతోటి గుట్టుమట్టుగా సంసారం చేసుకోవటం. ఈ రోజులలో సామాన్యగృహస్థు సంసారము గడపట మనేది బ్రహ్మరథం యెక్కటంతో సమాన మంటారు.

సాయంకాలము 6 గంట లయింది. రామయ్య ఆఫీసు వదలి ఇంటికి వచ్చాడు. రావటంతోటే పిల్లలందరూ తనచుట్టూ చేరి వెఱ్ఱి సంతోషముతోటి ఆడడము మొదలుపెట్టారు. రామయ్యకు దీని అర్థ మేమీ తెలియక దిగ్భ్రమతో పిల్లలకేసి తేరిపార చూసాడు. ఇదివర కెన్నడూ లేనిసంతోషము ఈరోజున పిల్లల్లో ఆవిర్భూత మైనందుకు రామయ్యకు ఆశ్చర్యముగా వుంది. ఈసంతోష మెందుకో పిల్లల్ని అడుగుదా మనుకుంటుండగానే ఏడేళ్ల వయసుగల తనకూతురు దగ్గరకు వచ్చి "నాన్నా! రత్తమ్మ పి న్నొచ్చింది" అంది. రత్తమ్మ రామయ్యకు మరద లవుతుంది.

రామయ్య ముఖము చిట్లించుకుంటూ "అల్లానా" అన్నాడు. ఇంతట్లోకే ఇతని భార్య సీతమ్మ—పక్కా తెలివితేటలుగలది—చిరునవ్వు నవ్వుకుంటూ వచ్చి భర్తతో "ఇటు చూడండి, రత్తమ్మ వచ్చిం దండోయి" అని అంది. ఒక్క నిట్టూర్పు విడిచి "బాగానే వుం"దని అన్నాడు రామయ్య. ఈమారు నవ్వటానికి ప్రయత్నించాడు కాని మబ్బురోజున వెలుతురులాగున నవ్వు మాయమయింది. "ఇవాళ మీరు చాలా ఆలస్యంగా వచ్చారేం? వగరుస్తున్నారు కూడాను" అని ప్రేమ వుట్టిపడుతూన్నట్లు జాలి గదుర ప్రశ్నించింది సీతమ్మ. "మరేమీ లేదు. ఇవాళ ఆఫీసులో పని యెక్కువగా వుంది" అంటూ తాను తొడుగుకున్న వదులు కోటును వంటినుంచి విప్పాడు.

మరదలియొక్క ఆగమనానికి సంతోషపడుట ఒకలెక్కలోనిది కాదు. కాని రామయ్యకు అప్పటిస్థితి గతులను పట్టి రవంత కష్టం కలిగినమాట మాత్రం వాస్తవము. రామయ్య మాప్రారి యూనియను ఆఫీసులో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుమాస్తా. ఇతని కిచ్చేజీతం బహుస్వల్పము. ఆజీతం తెచ్చుకుని 15 రోజు లయిందో లేదో అప్పుడే ఖజానా నిండుకుంది. జీతం పేరుచెప్పి ఏమి సంపాదిస్తేనేం రెండు పెద్దపద్దులు మింగేస్తున్నాయి. అందులో ఒకటి ఇంటద్దె; రెండవది కిరాణాకొట్టులో కాతా. ఇక ప్రతినెలా మూడవరోజుకి గృహయజమాని ఇంటద్దికి గడపమీద కూర్చుంటాడు. మనిషిదగ్గర ఖచిత మెక్కువ. అంటువ్యాధి ఎల్లాగయితే పట్టుకుని వదలదో అల్లా పట్టుకుని అద్దె యిచ్చేదాకా వదలడు. ఇందువిషయమై పాపము రామయ్యా అప్రయత్నంగా కంగారు పడేనాడు. ఇంక కోమటాయన ప్రతాపం చెప్పనే అక్కరలేదు.

ఈసంగతిల్లా వుండగా పాల కయ్యే డబ్బుకి మితి లేదు. పాలని పైకి పేరేకాని అవి తెలుపురంగులో వుండే నీళ్లు. ఈఖర్చులంతా మొదుకంటె పిల్లలు పాలు లేకుండా వుండలేరు. ఇవి గాక పిల్లలకు బడిజీతాలంటే, సంత ఖర్చు లంటే; ఇటువంటి వెన్నో వున్నాయి. ఈలాగ ప్రతినెలా రామయ్యా పాతబాకీలు తీర్చటమూ, కావలసిన సరుకులకు కొత్తబాకీలు చెయ్యటమూ అలవా టైపోయింది.

వీటి నన్నిటిని బట్టి రామయ్యాకు మనస్సులో మరదలు వచ్చిం దని ఉల్లాస మేమీ లేకపోయింది. 'మళ్లీ అదనపుఖర్చులు ఈమె రాకవల్ల కలుగుతున్నయిరా భగవంతుడా' అని గుండె గుభిల్లుమంది. ఆయన హృదయంలో వుండే ఉత్సాహమంతా పోయి ఒక్క నిట్టూర్పు వదిలాడు. సీతమ్మ దానిని కని పెట్టి చిటచిట లాడింది. ఇటువంటి ఆత్మవిచారణసమయంలో, ఆతిథ్యమునకును, ఉత్సాహహీనమైన దారిద్ర్యమునకును మనస్సునందు జరుగుచున్న శాంతిసమరసమయమందు ఘనత వహించిన మరదలుగారు గది ప్రవేశించి మందస్మితముతో భావగారిని కుశలప్రశ్న వేసింది. దానికి రామయ్యా లేనిసంతోషము తెచ్చిపెట్టుకుని ఆమెను ఆహ్వానించాడు:

"ఓహో; రత్తమ్మమరదలుగారా? ఎంత దయ వచ్చింది. పిల్లా జెల్లా కులాసాగా వున్నారుకదా? వెంకటపతి (భర్త) నిన్ను ఒక క్షణమైనా మొడబాసి వుండలేదు కదా. ఒక్కదానవు మెల్లా రాగలిగావు?"

వయస్సులో వుందేమో రత్తమ్మ; ఈ మాటలకు కొంచెం సిగ్గుపడింది. సీతమ్మ కనుబొమలు ముడిచింది. ఆయనమాటలు మన్మథుని బాణా లనిపించాయి. రామయ్యా హాస్యం చెయ్యటంలో గట్టివా డని ఇదివరలోనే పేరు పొందాడు. రత్తమ్మ తన కొడుకు వళ్లు బాగుచేసుకుందా మని వచ్చా నని చెప్పింది. ఈముక్కలు వినే వినడంతోటే రామయ్యాకు నడుము విరిగిన ట్టయింది. ఇదివరదాకా ఆమె కులాసాకి వచ్చి ఒకటిరెండు రోజు లుండి పోతుం దనుకున్నాడు. ఇప్పుడావిడ అధమపక్షం రెండునెల లయినా వుండాలి. ఈఖర్చంతా తననెత్తిమీద విరుచుకు పడుతుందనే విచారంలో మునిగిపోయాడు. ఇట్టి వ్యాకులతతో చేరిన ఆలోచనలు అలలవలె తొందరగా వచ్చిపడ్డాయి. కళ్లల్లో నున్న కాంతి తరిగింది. ముఖము నల్లపడింది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రామయ్యగారి సాహసము పరీక్షించటానికి వచ్చిన రోజుల్లా కనపడ్డాయి.

“పిల్లవానికి జ్వరము వస్తోందట. వెంకట పతికి శలవు దొరికింది కాదు. అతను మందు కయ్యే ఖర్చు పెట్టుకుంటాడు గాని శ్రద్ధతీసు కునేనా శ్లైవరూ లేరని మీవద్దకు రత్తమ్మను పంపాడు” అని అంది సీతమ్మ.

“ఓహో, ఇక్కడనుంచి రెండుసంసారా లని పోషించాలి కాబోలు? నేనే వెయ్యిళ్ల పూజారిని” అని నవ్వాడు రామయ్య.

“మీయిష్టము వచ్చినట్టు తిరగండి, ఎవరు వద్దన్నారు? మనుష్యులకు మంచీ మర్యాదా వుండాలి” అని కోపముతో ఒక్క ఉరుము ఉరిమింది సీతమ్మ. ఈపరిహాసాలకి నవ్వుతూ నిలబడింది రత్తమ్మ.

“ముందుగానే ఖర్చుకి వెంకటపతి రు. 50 రత్తితో పంపాడు. తర్వాత మీ రేమయినా చేసుకోండి” అని విసవిస లాడుతూ రూపా యిలు చేతిలో పోసింది సీతమ్మ. దానికి రామ య్య భార్యకేసి కృతజ్ఞతాపూర్వక మైన చూపుచూసాడు. కృతజ్ఞ తెందుకంటా రేమో? ఆమర్నాడే ఒక అర్జెంటుబాకీ తీర్చాలిసి వుంది. తలవనితలంపుగా డబ్బు చేతిలో బడి నందుకు రామయ్యకు కొంచెము ఒడుదొడుకు శాంతించింది.

భోజనా లయింతర్వాత అతిథులకు పడు కుంటానికి చోటు చూపెట్టేటప్పుడు వచ్చింది గొప్పచిక్కు. గొప్పగొప్పవా ళ్లంతా సౌధాల్లోనూ, హంసతూలికాతల్పాల్లోనూ గడుపు తారు రోజులు. ఇందుకు వాళ్లు ఏనాడో పెట్టిపుట్టారు. రామయ్యలాంటి కష్టజీవి జీవనం గాలి వెలుతురు లేని ఇరుకైన అద్దెకొం పల్లో చెయ్యక ఇంకెక్కడ చేస్తారు చెప్పండి! వాళ్లు కష్టపడాలి. కష్టాలన్నీ బీదవాళ్లకి కాక పోతే భాగ్యవంతుల కుంటాయా బాబు! ఈ ప్రకారంగానే రామయ్య మనస్సునకు సమా ధానం చేసుకున్నాడు. భర్తలు ఎంతసేపూ తీసుకొచ్చి పడేసేవారు కారనే గోలగాని, ఇంట్లో ఇదివుంది అదిలే దనే వివక్షత మా ఆడవాళ్లకు లేదు. ఇరుకుకొంప డబ్బుకు లోభించి తీసుకొన్నందుకు సీతమ్మ భర్తను అంపపుకోత కోసిం దంటే నమ్మండి.

కష్ట మనుకున్న దాని కల్లా ఏదో ఒక దారి ఉండనే వుంది. పిల్లలగుంపు నంతటిని ఒక గదిలోకి తోసారు. వాళ్లు నిద్రల్లోకూడా మిఠాయికోసము కలవరించటం మొదలు పెట్టారు. రామయ్య పడుకగది భార్యా మరద ళ్లాక్రమించారు. రామయ్య బిచాణా సామాను కొట్టుదగ్గరకు మార్చారు. మంచముమీద కూర్చుని రామయ్య ఒక్కనిట్టూర్పు వదిలా డు. ఈదరిదాపులేని ప్రపంచములో తన నిజ స్నేహితుడై నిలిచియున్న చుట్టను గొప్ప ఆసక్తితో కాల్చటము మొదలుపెట్టాడు. దోమలు, చిమ్మటలు పెద్దధ్వనితో ఆటపాట లకు ప్రారంభించాయి. అనిద్ర లేనికళ్లకి మధ్య మధ్య పెద్దపెద్ద మొత్తములతో అదనపు ఖర్చులు కళ్లకి కట్టడము మొదలుపెట్టాయి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# సేవాంజలి

వేంకట పార్వతీశ్వరకవులు

౧



వ్యాసకర్తలు

ఏవిందుఁ గావింప నిష్టమో నీకంచు
మృదుపదార్థములెల్లఁ బదనుపఱిచి
ఏరసం బాలయింప నిష్టమో నీకంచు
విరిదేనియలనెల్ల వెదకి తెచ్చి
ఏశయ్యఁ గూర్పింప నిష్టమో నీకంచు
నలరుజాతులనెల్ల నలవరించి
ఏపాటఁ బాడింప నిష్టమో నీకంచుఁ గలసుస్వరములెల్లఁ గలయఁగూర్చి
జయవిజయమైన నీమొగసాల నిలిచి-చాలఁగా వేచియున్నాను సమయమునకు
జననివలె వచ్చి యీదాస జనుని సేవ-లందికొనుమయ్య సచ్చిదానందమూర్తి!

౨

సీ. తలఁపునం దొక్కింత తళుకుమన్నంతనే కనులలోఁ జీకటుల్ క్రమ్ము టేమొ!
చిత్తమం దొక్కింత చిటుకుమన్నంతనే చెవులలోఁ గుంచికల్ చేరు టేమొ!
ఉల్లమం దొక్కింత జల్లుమన్నంతనే యొడలిలో మైకంబు లడరు టేమొ!
నెమ్మది నొక్కింత గమ్ముమన్నంతనే యూర్పులో నట్టాఁక లొదవు టేమొ!
నేను దరిఁజేరఁజాలకున్నానొ యేమొ!-నీవె దూరమై పోవుచున్నావొ యేమొ!
పాలుపోకుండెఁ దెలుపు మీపాటికైన-సచ్చిదానందలీలాప్రసన్నమూర్తి!

3

సీ. సంభావనానంద సమయమం దెపుడైన దీనుని మొఱ నివేదించినానొ?
సంకీర్తనోన్మాద సమయమం దెపుడైన బిడ్డనిగతిఁ దలఁపించినానొ?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంపూజనోల్లాస సమయమం దెప్పుడైన చిలుతనివెత జ్ఞప్తి చేసినానో ?
సంసేవనోత్సాహ సమయమం దెప్పుడైన దాసునికష్టంబు దడవినానో ?
ఏమిచేసినానో మెఱుఁగనితనముచే-దప్పు లున్న దిద్దఁ దగును గాని
కొసరి కొండఁ జేసి కోపగింతురఁటయ్య !-పావనస్వభావ ! దేవదేవ !

౪

సీ. హర్షప్రఫుల్లచిత్తాబ్జపీఠము నిల్పి దీన నాథుని సుఖా సీనుఁ జేసి
సమ్మదోద్గళితాశ్రు సలిలధారలఁ దేర్చి జీవితేశ్వరు నభిషిక్తుఁ జేసి
ఆనందమయవాక్ప్రసూనమాలిక లిచ్చి శ్రితజనావను నలంకృతునిఁ జేసి
ప్రణయలీలోచ్ఛ్వాస పవనడోలిక నూఁపి దివ్యధాముని వినోదితునిఁ జేసి
చేరి చేతులార సేవించు టెప్పుడో ?-కలసి కరవుదీరఁ గాంచు టెపుడొ ?
అలరి యాదరోక్తు లాలించు టెప్పుడో ?-తెలియు టెపుడొ ? ఆస తీరు టెపుడొ ?

౫

సీ. పాటించి నీవింత పలికితేఁ జాలదే పలుకని బంగారు భాగ్య మేల?
నమ్మించి నీవింత నవ్వితేఁ జాలదే నవ్వని రతనాల నాణె మేల?
మురియించి నీవింత ముట్టితేఁ జాలదే ముట్టని ముత్యాల మూట లేల?
శోధించి నీవింత చూచితేఁ జాలదే చూడని నీలాలమేడ లేల?
పలుకుఁదీవలేని భర్మవల్లకియేల ?-రసమయంబుగాని రాగమేల?
స్వామిఁ దనుపలేని సంకీర్తనములేల ?-జీవనంబులేల?— దేవదేవ !



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# సుప్రభాతము

శ్రీ వాసుదేవరావు

౧

"అట్లయిన నీవు నామాట వినవు?"

"ఎన్నిసారులు చెప్పవలెను? నా మనోరథము; నామనోగతము. ఇదివర కెన్నిసార్లు చెప్పియుందునో. ఇంకను నట్లే యడిగిన నేమి చెప్పుదును?" అని కమల కనుబొమలు ముడివడ నసూయతో ననెను.

"అది కాదు; కమలా, మూర్ఖపుఁ బట్టుదలవలన, అవివేకమున సాధారణముగాఁ జేయుపను లనాలోచిత కృత్యములై పోవును. ముందుగానే ముందు వెనుక లాలోచింపకున్నఁ బిదపఁ బశ్చాత్తాపమునకుఁ బాలుకావలసివచ్చును. కావున, నీవిషయమున నట్లు కానీక పూర్ణముగా విచారణ చేసియే-ఆలోచించియే-చేసి—"

"లేదు-లేదు, కృష్ణరావు, నేఁ జేసినది పూర్ణాలోచనానంతరముననే; పశ్చాత్తాపమునకుఁ గారణ ముండదు" అని కమల నిశ్చయాత్మకస్వరమున ననెను.

"నీ కట్లు తోఁచుచుండును; కాని, నీయీయవిచారకృత్యమువలనఁ దప్పక నీకుఁ బశ్చాత్తాపముకలుగక మానదు. నీవు గొప్పవారియింటిబిడ్డవు; విద్యావతివి; జ్ఞానవతివి; సురూపవతివి. ఇట్టినీవు కాసుకుఁగొఱగాని బిచ్చగాని—పొట్టకూటికై పరులకొంపల నాశ్రయించు గర్భదరిద్రుని—ప్రేమించి వరించుటయన—"

"ఇదుగో, కృష్ణరావూ, పవిత్రమగు ప్రేమకుచ్ఛనీచభావములు లేవు. అది శ్రీమంతులకడనే యుండవలయునని నియమము లేదు. పటాటోపము నవలంబించియుండదు. గొప్పవంశములోనే పుట్టవలయు ననుటనుబట్టియు నుండదు. కాని దానికిఁ బరస్పరగుణ స్వభావ ప్రియతయే ముఖ్యము. విపులధనముండియు, గొప్పవంశమునఁబుట్టియుండియు, భార్యాభర్తల గుణస్వభావములలో భూమ్యాకాశముల కున్నంతయంతరమున్న నేమిలాభము? ఇట్టియెడ నిద్దఱకు సుఖ మెదవుట యరుదు. అరుదేటికి?- సౌఖ్యమే లేదు. కావున, నే నాధనమును వంశమును బట్టికొని కూర్చుండుటలో నర్థము లేదు. అవి నా కనవసరములు."

"నీకు నాపైఁ బ్రేమ లేనేలేదు?"

"మరలమరల నామాటయె యుచ్చరించుటకు నాకే సిగ్గగుచున్నది."

"కమలా, యింక నొకమారు నొక్కి చెప్పుచున్నాను. బాగుగా నాలోచింపుము; పిదప నేమి ప్రత్యుత్తరమిచ్చెదవో యిమ్ము."

"అవసరము లేదు. ఇంకను నే నాలోచింపవలసిన యవసరము లేదు; నాయీనిశ్చయము నిశ్చలము."

కృష్ణరావున కధికసంతాప మెదవెను. ఆక్రోశభరమున నాతఁ డిట్లని పలికెను:

"నీనిశ్చయము చలింపదు కదా? చాలును. నీ తండ్రి యీదరిద్రునకు నిన్నిచ్చి వివాహముసేయ నెట్లంగీకరించునో చూచెద. మీతండ్రివలననే నీయీదృఢనిశ్చయమును మార్పింపకున్న నన్ను మారుపేరునఁ బిలువుము."

కమల కిప్పు డధికతరకోప ముదయించెను. ఆమె యునట్లే గంభీరముగ నీనీతిని బలికెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"నీయీబెదరింపుల నే నణుమాత్రమును లెక్క సేయను. బాబాదగ్గర నీయాటలు సాగవు. నాయీ దృఢనిశ్చయము నాన్నగారికిఁ దెలియకుండలేదు. బాబాయునందున కంగీకరించియే యున్నారు. కావున, నిప్పుడు నీవు వచ్చినత్రోవఁబట్టి పోయెదవా, బాబాను బిలువవలెనా?"



"ఏమి? ఇంతపరాభవమా? నీవలననా?"

"ఔ నౌను. నావలననే! నీవే మనుష్యుఁడవై యుండిన, మరలమరల నిట్లు సిగ్గులేక యిక్కడకు వచ్చుచుండవు!"

"ఏమి? నీ వీమాట లెవరికిఁ జెప్పుచుంటివి? ఈ కృష్ణరావుకే?"

"అవును అవును. నాకట్టెదుట నిలిచియున్న యీకృష్ణరావునకే. నాయీగదిలోనికి వచ్చుటకు నీకెట్టి కార్యములును లేవు. ఎవరును నిన్నిక్కడికి రమ్మని పిలువలేదు. వచ్చినట్లే తిరిగిపోయెదవా లేక——" అని కమల సంతాపోద్రేకమున ననెను.

"ఇటుచూడు, కమలా, అయినదేమో యైపోయినది. ఇట్లుకోపింపకుము. నాయీయొక్కమాట——కాదు విన్నపము——మన్నింపుము. నావిన్నపమాలించి మన్నించితివా, నాప్రాణములున్నంతవఱకు——అటుపై పైపై——నీకెట్టిలోటు నొందననీయను. ఇంకను నధికముగాఁ జెప్పనేటికి? నీవు నాశరీరమందలి మాంసముఁ బిడికెడు గోరినను విచారింపక యేయీయఁగలను. నీపై నాకెంత ప్రేమకలదో మాటలతోఁ జెప్ప నలవికాకున్నది. నా యీహృదయకవాటమును తెఱచిచూచిన, నచట నీయందలి ప్రేమతక్క వేఱొక్కటి నీకుఁ గానరాఁబోదు. నీవు నన్ను నిరాకరించితివా, నాజీవితము పాషాణప్రాయమగును. నీవంగడమును, మావంగడమును గూర్చి పోల్చిచూడుము; ఆలోచింపుము. ఇరువంగడములను సమానముగాఁ దులఁదూఁచిచూడుము. ఆహా! యిట్టియెడ నీమెదడున నీభ్రమ యెట్లు చొచ్చెనో కదా! నీవు నేను నొక్కచోట నాటలాడుచుంటిమి; ఒక్కచోటఁ బెరిగితిమి. అప్పటినుండియు నిన్నే తీరునఁ బ్రేమించుచుంటినే యాలోచింపుము. నన్ను భగ్నాశునిఁ జేయుట నీయట్టి సుశీలకు, సద్గుణరాశికి, వివేకవతికి ఉచితమగునా?

తనపలుకు లెట్టి పరిణామ మొదవించునో చూడఁ గోరి కృష్ణరా వీవిధముగ శాంతముతోఁ బలుకుచుండెను. కాని, యిద్దానఁ గమలహృదయము కరఁగదయ్యెను; సమాధానము కాకపోయెను. కాని, యితని యీలజ్జారహితవర్తనమున కామె కధికకోపము, నసూయ కలిగెను. ఆమె తుద కసూయతో నిట్లనెను:

"కృష్ణరావూ, నీకుఁ జెప్పవలసిన దేదియో యొక్కమారే చెప్పివేసితిని. ఇంక నూరకే నాకాయాసము కలిగించుటలో—చెప్పినదానినే మరలమరల చెప్పించుటలో—లాభ మేమున్నది? ఇట్టి యవివేకపుఁ బలుకులు, ఆచరణము నీకుఁదగునా? ఇకనైన నాయందుఁ గృపయుంచి నన్ను వీడిపొమ్ము."

"ఏమి? నను వీడి పొమ్మనుచున్నావా? ఇదిగో పోవుచున్నాను. మన్నింపుము."

"చక్కఁగా నుండుము!"

కృష్ణరావు తనతీక్ష్ణకటాక్షము లామెపైఁ బఱపి మీసముదువ్వి, పండ్లు పటపటమని కొఱుకుచుఁ గోపావేశముతో వెడలిపోయెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ౨

అప్పాజీపంతు పునహామండల న్యాయస్థానమున నొక్కసుప్రసిద్ధన్యాయవాది. ఇతని కీవృత్తిలో విపుల ధనము లభించుచుండెను. అంతియే కాక పునహానగర మున నీతని కొకపెద్దయిల్లును మిక్కుటమగు చరాస్తి యు నుండెను. ఆతని కేకొఱంతయును లేదు; కాని, తనయనంతర మీ విపులసంపదకుఁ దగినవారసుఁడు లేక పోయెనను విచారముమాత్ర మాతని విడువకయుండెను. అయినను నాతని కొక్కపుత్రికమాత్ర మున్నది. ఆమె యే మనము ప్రథమ ప్రకరణమునఁ జూచిన కమల. అప్పాజీపంతునకు వయసు నట్టే ముదిరియుండలేదు. నలువదైదు నలువదాఱేండ్లుండును. కాని, కమల కనం తరము పదేనుపదాఱు వత్సరములవఱకు నేసంతానముఁ గలుగ కునికి, నిఁకఁ గలుగునను నాసయే లేదు. కావున నాతఁడును, నాతనిభార్య లక్ష్మీబాయియు, నాతనితల్లి రమాబాయియు నీయొక్కబాలిక కమల నత్యంతప్రేమ తోఁ బెంచుచుండిరి. ఈబాలికయం దనేకసద్గుణము లుండెను. అతుల రూపవతి. రూపమున కనుగుణ్యము గనే యామె విద్యను నార్జించి సుసంస్కృతయై యుం డెను. లక్ష్మీబాయి యీబాలికను గృహకృత్యనిర్వహ ణమునందును సుశిక్షితను జేసియుండెను. ఇట్టి యాసుత పరగృహవాసమున కరుగునుగదా యని తోఁచి నపుడెల్ల నాయింట నందఱకు మిగుల వ్యాకులమగుచుం డెను. కాఁబట్టి యాబాలికకుఁ బదియాఱేఁడులు వచ్చి నను బెండ్లిమాటయే యెవ్వరును దలపెట్టరైరి. అప్పాజీ పంతు నూతనాచారపరులలోఁ బ్రముఖుఁడు. మాటలచే మాత్రమే కాదు; క్రియారూపమునను నట్టివాఁడె! ఇంట నితని కెదురాఁడువా రెవ్వరును లేరు. కావుననే యతని తల్లియు, భార్యయు నతనికి వ్యతిరేకముగాఁ బలుక రైరి. అయినను, బదియేనేఁడులు వచ్చినప్పటినుండియుఁ దల్లియుఁ, బల్నియు నీతని వెంటఁబడిరి. "ఇఁకనైనను బెండ్లిసేయకున్న నెట్లు? ఇంక నెంతకాల మీఁడేరినపిల్ల నింట నుంచుకొనవచ్చును! లోకమునకు వెఱవకపోయి నను, సంఘమునకు వెఱవకపోయినను, బుద్ధి తెలిసిన పిల్ల——" ఇంక నేమేమియో యనుచుందురు. అన్ని టికిని మన యప్పాజీపంతు తలనూఁపుచు "అఁ, ద్వరలో నే చేసెద. నేను నావిచారముననె యున్నా"నని సమా ధానపఱచుచుఁ గొంతకాలముఁ గడపెను. యదృష్టవశ మున నప్పాజీపంతునకుఁ గమలకై వరుని వెదకవలసిన యవసరము కలుగలేదు. తనమనసున కెక్కినవరు నొ క్కని నాతఁడు మనసున నిర్ణయించి యుండెను.

అప్పాజీపంతు నాశ్రయమున వినాయకుఁడను యువకుఁడు విద్యాభ్యాస మొనర్చుచుండెను. ఈ యువ కుఁడు పసితనముననే తండ్రికి దూరమైపోయి, దిక్క రియుండ, నప్పాజీమిత్రు లొకకొంద ఱీబాలుని నీతనియింట నుంచుకొనఁ బ్రార్థించిరి. పంతు నందున కంగీకరించి, యాబాలున కాశ్రయ మొసఁగి పుత్రుని వలెఁ బెంచుచుండెను. ఈబాలుని చాకచక్యము, విద్యా ర్జనాపేక్ష, వినయశీలస్వభావముఁ గని యాయింట నందఱకు నాతనిపై నధికానురాగ ముదయించెను. ఈ కుఱ్ఱఁడును దన సుగుణసంపదలచే నెల్లర డెందముల నాకర్షించికొనెను. ఈవిధముగ వినాయకుఁ డుత్తమ విద్యావంతుఁ డయ్యెను. చిరపరిచయము మూలమునను, నేకస్థాననివాసము మూలమునను జిన్ననాఁటినుండియే కమలా వినాయకు లమితానురాగబద్ధులై మెలఁగుచుం డిరి. వయసు పైఁబడినకొలఁది ఆయనురాగము దృఢ మై ప్రేమగమారి, యాయిరువురును లోలోననె యనేక విధముల నువ్విళు లూరుచుండిరి. చాణాక్షుఁడగు నప్పా జీపంతున కెట్లో యీవిధము తెలిసెను. అతఁడును లో లోననె యానందించుచు మిన్నకుండెను. ఇఁక పరశో ధనావశ్యకత లేకపోయినందునకు మిక్కిలి సంతసిం చెను. ఇట్లు కొంతకాలముఁ గడువ నీరహస్య మింటను దెలిసెను. అందఱు నిందున కనుకూలురై యుండిరి.

అప్పాజీపంతు నింటిపొరుగింట సదాశివరావను గృహస్థుఁడు నివసించుచుండెను. ఈగృహస్థుఁడు దూది వర్తకమున మిగుల ధనవంతుఁడై యుండెను.

ఈతనికిఁ గృష్ణరావను పుత్త్రుఁ డొకఁడుం డెను. కృష్ణరా వీలోకమున నవతరించినవెంటనె తల్లి పరలోకముఁ జేరెను. తల్లిలేని బిడ్డఁడని తండ్రి మిగుల గారాముస నీబాలునిఁ బెంచెను. అతఁడు పోయినచే త్రోవ! పలికినదే పలుకు! ఈవిధమునఁ బెరుగుచుండెను. ఆంగ్లవిద్యలో నాలుగైదు తరగతులు చదివి పాఠశాల



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వదలివేసెను. పగటివేళల ద్యూతక్రీడలందును, రాత్రి వేళల నాటకములు, ఉత్సవములు, పాటకచ్చేరీలు మొదలగు నవ్యవ్యవసాయములఁ గాలముఁ గడుపసాగెను. ఇన్నిమాట లేటికి? కృష్ణరావునకు నింట నిర్బంధము లేకపోవుటచేతను, దగిన శిక్షణము లేకపోవుటచేతను, నానావిధ వ్యసనములలోఁ జిక్కి సదానంద తన్మయుఁ డయ్యెను. ఇరుగెంటనున్న సుందరతరుణి తనకుఁ బత్ని కావలయునని యితఁ డిచ్ఛనహించెను. నిజముగనె యత నికిఁ గమలపై గాఢానురాగ ముదయించెను. కాని, యాప్రేమను బరీక్షచేసినచో 'విషయోద్భూత' మనియె తేలపడి యుండును. నిజము దేవునకెఱుక! ఈవిష యము తండ్రి కెఱింగింప నాతఁ డప్పాజీపంతుకడఁ బ్రస్తాపించెను. కాని, పంతు "సకలభారమును గమలయే వహించియున్నది. సకలముఁ దన యిష్టానుసారము జరుపుకొనును. ఇందున నే నేసంబంధమును గల్పించు కొనను" దని స్పష్టముగాఁ దెలిపినందుపై, సదాశివ రావు హతాశుఁడై యూరకుండెను. తుద కొకనాఁడు కృష్ణరావు స్వయముగనే యేకాంతమునఁ గమలను సందర్శించి, తనకోరిక వెల్లడించెను. అప్పుడతని కట్టి ప్రత్యుత్తరము లభించినదియు, నేవిధముగ హతాశుఁ డైనదియు, భగ్నహృదయుఁ డైనదియుఁ బ్రథమప్రకర ణమున నుడువఁబడియున్నది.

అనంతరము గొలఁది దినములలోనే కమలా వినాయకులకుఁ బ్రియమైనట్టియు, గృష్ణరావున కప్రి యమైనట్టియు వివాహమయి, కమల యభీప్సితము సిద్ధించెను.

## 3

కమలావినాయకులకు వివాహమై యైదుసంవత్స రములు గడచినవి.

అప్పాజీపంతుగారి శ్రద్ధాభక్తులమూలమున వినా యకరావున కుత్తమవిద్య లభించి బి. ఏ., యల్. యల్. బి., పదవి లభించుటఁ గని యప్పాజీపంతునకుఁ దనశ్రమయు, ధనవ్యయము సార్థకమయినదని మిగుల నానందము గలిగెను. సంఘమునకుఁ గీడుకమగు కృష్ణ రావుమూలమున, బ్రోత్సాహమునఁ గమలావినాయకుల కనేక సంకటము లొదవుచుండెను. సాటివారల వలన వీరి కనేకసంకటము లొదవెను. వాని నన్నిఁటిని నిక్కలియోర్పుతో నోర్చియుండిరి. మదగజమును గని శునక మెంత మొఱిగిన దాని కేమిలోటు? కమలావినా యకు లీ మొఱుఁగుఁగుక్కల బెదరింపుల కణుమాత్రముఁ జలింపరైరి.

వినాయకరావునకు న్యాయవాదిపట్టము లభిం చినవెంటనే రెండుసంవత్సరములకు బరోడాసంస్థాన మున న్యాయశాఖలో నొక గొప్పయుద్యోగము లభిం చెను. అతఁ డుద్యోగమునకుఁ బోవుట కిదియె మొదటి సారియగుటచేఁ దా నొక్కఁడేపోయెను. కమలను దీసి కొనిపోలేదు. ఆసమయమునఁ గమల యించుక యనా రోగ్యమున నుండెను. అంతయే కాక క్రొత్తయూరు- తగినవసతి మొదలగునవి ముందు ఏర్పఱిచినపిదప పిలిచికొనిపోవ నెంచియుండెను. కాని, వనమొకటి నే య నెం చి న నది వేఱొకటి యగుచుండును గదా! ఆరెండు సంవత్సరములును గమల కానూతన సంసారశకటము నడిపించు నవకాశము లభింపలేదు. కమల యనారోగ్యవతియైయుండి కొంచెముగ నిమ్మ ళించి లేచి యటునిటుఁ దిరుగఁబ్రారంభించిన వెంటనే లక్ష్మిబాయికి మన్యపుజ్వరము తగిలెను. అందుచే యామె యించుక యారోగ్యము వడయుచుండ నప్పాజీ పంతులకు సంధివాతము సంప్రాప్తమయ్యెను. ఇట్టి సంక టములలోఁ దలిదండ్రులను విడచి మగనికాపురము దిద్దఁ బోవుట కాయువతి కవకాశము చిక్కదయ్యెను. వినా యకరావుమాత్ర మప్పుడప్పుడు సెలవుదీసికొని యిక్క డికి వచ్చుచుఁ బోవుచుండెను. అదియుఁ గాక కమల పితృగృహనిర్వహణభారమంతయుఁ దానవహించిమిక్కి జతురతతోఁ జరుపుచుండుటచే వినాయకరావున కట్టె యధికముగా సెలవుదీసికొనివచ్చి యిటనుండ నవసరము లేకపోయెను. ఇప్పుడు రోగము అప్పాజీపంతులుగృహ మును దృజించిపోయెను. దీపావళి సమీపించుచుండెను. ఈపండుగున కల్లుఁడువచ్చును. మరలఁ బోవునపుడు కమ లను బంపవలయునని యప్పాజీపంతు నిశ్చయించియుం డెను. కమలకు వివాహమైన దాది నేవో కారణముల మూలమున అనేకవిఘ్నము లొదవుటచే నొక్క దీపా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీపండుగయుఁ దగినరీతి జరిపియుండలేదు. దీపావళి యల్లుండ్రపండుగకదా! ఈమారు తమ యింట నెల్లరు సుఖరూపమున వచ్చినకష్టములన్నియుఁ దొలఁగి లేచు టచే నీపండుగ మహావైభవముతో జరుప నిశ్చయించి యుండిరి. సకలము నొకపక్షముదినములకు ముందే సిద్ధ పఱుచుచుండిరి.

దీపావళి యిఁక నెనిమిది దినములే యున్నది. అప్పాజీపంతు తన మనోగతము నెఱింగించుచుఁ దమ బంధుమిత్రాదులతో రావలయునని వినాయకరావున కాహ్వానమును బంపెను. ఇంట సర్వము నిండియున్నది; ఆనందము తాండవ మాడుచున్నది. పెండ్లియింట నైన నిట్టి కోలాహల ముండదు.

వినాయకుని వృద్ధమాతకును, వితంతువై, నిరాధార యైయున్న యమునకును బత్రికలు లిఖించిరి. కాని, వృద్ధ మాత గోపికాబాయి "నాకు దేహ మనారోగ్యముగనుం డుటచే నేను రానందుకు విచారముగనున్నది. యమునను బంపుదునన్న నాకిక్కడ నుపచారము నేయువా రెవ్వ రును లేరు" అని ప్రత్యుత్తరము పంపెను. అన్నిటికిని వినాయకుఁడె ముందునకు రావలసివచ్చెను. గోపికా బాయి వృద్ధయౌటచే నీప్రయాణశ్రమ కోరువఁజాలదని పం తెఱిఁగియుండెను. అయినను వాడుకచొప్పున నుత్త రము వ్రాయవలసి వ్రాసెను.

తన యాంతరంగికమిత్రులలో నొకరిద్దఱఁ గలిసి ధనత్రయోదశినాఁటిరాత్రి పునహాకు వచ్చెదనని వినా యకరావుకడనుండి యుత్తరము వచ్చెను.

రేపు ధనత్రయోదశి; రేపురాత్రి వినాయకరావు వచ్చును. కావున నింట నందఱును మహదానందసాగర మన నీదుచుండిరి. ఇఁకఁ గమలమాటఁ జెప్ప నేటికి? "ఎప్పు డీనాఁడుగడచి తెల్లవారునా, ఎప్పుడు రేపుపవలు గడచి రాత్రియగునా, ఎప్పుడు తన...... వచ్చునా? ఎప్పుడు తాను లజ్జావనతవదనయై హారతియిత్తునా?" అని యీతీరుగ మనసున ననేకవిధములఁ దలపోయు చుండెను. ఆమె యానందము స్వర్గము ముట్టియుండ వచ్చును. ప్రతిక్షణము నామె లెక్కించు చుండెను. ఎట్టెట్లో ధనత్రయోదశి యుదయమయ్యెను. నేఁడు కమలయానందమునకుఁ బారమే లేకపోయెను.

దీపావళి నిమిత్తమై గృహ మత్తమరీతి సుశోభి తమై యుండెను. అందునను సుందరి చావడి మిక్కిలి యింపుగా శృంగారింపఁబడి యుండెను. సాయంకాల మయ్యెను. అప్పాజీపంతు తన బండినెక్కి స్టేషనుకుఁ బోయెను. ధూమశకట మానాడు కొంచె మాలస్యముగ వచ్చునని తెలిసెను. అంతఁ బంతు తన బండిని, సేవకుని స్టేషనున వినాయకునికొఱకుంచి తానొక బాడుగ బండిలో నెక్కి యింటికివచ్చిచేరెను. బండివచ్చువేళయు నయ్యెను. కమల వినాయకునివచ్చు త్రోవయందు దృష్టి యుంచియుండెను. బండిచప్పుడు వినవచ్చెను. తన భర్త వచ్చెనని యామె వీథివంకఁ జూచెను. ఆబండి యట్లే వెడలిపోయెను. ఈవిధముగ నెన్నియో బండ్లచప్పుడు వినవచ్చెను. ఒక్కబండియుఁ దమ యింటికడ నాఁగ లేదు. చాలఁ బ్రొద్దుపోయెను. బండిరాలేదు. వినాయక రావును రాలేదు. ఇంకను బదిపదేను నిమిషములు వేచి యుండి పంతు దుస్తులను ధరించి స్టేషనునకు వెడలెను. అచట జనసమ్మర్దము తగ్గియుండెను. అచట విచారణ చేసెను. బండివచ్చి వెడలిపోయియు నొకగంటసేపైనది. ఈబండిలో వినాయకరావురాలేదు. భగ్నహృదయము తో నాతఁ డింటికి మరలివచ్చెను.

వినాయకరావు రాకుండుటచే నింట నెల్లరకు ముఖ్యముగాఁ గమలకు మిక్కిలివిషాద ముదయించెను.

"వత్తునని తెలిపిన పిమ్మట నాతఁడు రాకుండు వాఁడు కాఁడు. ప్రయాణసమయమున నేదైన విఘ్న మొదవిననుకొందమా ఆ వెంటనే 'టెలిగ్రా' మిచ్చి యుండునే! టెల్లిగ్రామును రాకుండుటచే నాతని కీబండి మిగిలిపోయియుండవచ్చునని యూహింపవలసియున్నది. నేఁటిబండి మిగిలిపోయినందునఁ దప్పక యువయపు బండికి వచ్చును." అని యప్పాజీపం తింట నందఱను సమాధానపఱచెను.

అందఱును నమ్మిరి. ఆరాత్రిగడపుట కమల కెంతో కష్టమయ్యెను. 'ఎప్పుడు తెల్లవారునా' యని కన్నులు మూయకుండెను. అనేకవిధపరస్పరవిరోధకల్ప నాతరంగడోలికలలో నూఁగుచు నామెయుండ నెట్లో తెల్లవారెను. నేఁడు నరకచతుర్దశియగుట జనులందఱు నరుణోదయాత్పూర్వమె మేలుకొనిరి. అందందు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నపూర్వానందోత్సాహములు తాండవమాడుచుండెను. అనేకులు మంగళస్నానము సేయుచుండిరి. స్నానానంతరమున సుగంధద్రవ్యములు మేనులకు రాచి, నానావిధ మాల్యాంబరాభరణములు ధరించి నగర నారీనరగణములు దేవతాదర్శనమున కరుగుచుండిరి. ముందటి నాఁటిపలెనె యప్పాజీపంతు స్టేషనుకడకు వినాయకరావుకొఱకు బండి నంపియుండెను. బండిపోయియు రెండుగంటలకాల మయ్యెను. వినాయకరావు రాలేదు. అప్పాజీపంతుగృహమున నందఱకు విచారమయ్యెను; చింతింపసాగిరి. నేఁటిదినము మహదానందమునఁ గడుప సర్వసన్నాహములతో నుండ, దీర్ఘకాలము నుండియుఁ గోరుచుండు నీకోరిక ఇప్పుడు నష్టమైనందున నెల్లరకు మిక్కిలి దుఃఖమయ్యెను. కమలాహృదయమో—ఆస్థితిలో నుండువారలకే తెలియవలయును!

౪

ఇంకను రెండుగంటలకాలము గడచెను. అప్పాజీపంతు విషణ్ణహృదయముతోఁ జావడిలో నొకపడకకుర్చీయందుఁ బరుండి విచారమగ్నుఁడైయుండెను. 'టెలిగ్రాఫ్' కచేరినుండి యొకభటుఁ డొక 'టెలిగ్రా'మును దెచ్చి యాతనిచేతి కిచ్చెను. దస్కతుచేసి భటునిఁ బంపివేసి యా 'లకోటా'ను జేతఁబట్టికొనెను. దానిని విప్పుటకతనికి ధైర్యము కలుగలేదు. టెలిగ్రాము వచ్చినతోడనే యతని డెందము పరిపరివిధాలోచనాకల్లోలములతో నిండిపోయెను. అనేకవిధములగు కుశంక లుదయించెను. తుద కెట్టెట్లో మనసును బిగఁబట్టి దాని విప్పి చూచెను. ఆవెంట నాతఁడు పాషాణవిగ్రహమువలె నిశ్చలుఁడయ్యెను! శరీరమున రోమాంచములు నిక్కఁబొడిచెను! చేతిలోని కాగితము జారి నేలఁబడియెను. ఈవిషయ మింట నెవరికిని తెలిసియుండలేదు. సేవకునకొకనికిమాత్రము తెలిసియుండెను. వాఁడును బెగడొంది యేమియుఁ జేయఁజాలక, లోనికరిగి, మెల్లఁగ లక్ష్మీబాయికిఁ జెప్పెను. ఆమెయు నాక్షణమె బయటికి వచ్చి భర్తస్థితిఁ గనెను. ఆమెకు గుండెలు చెదరిపోయెను. కాళ్లు నిలువఁజాలకపోయెను! నో రెండిపోయెను; మొగము వాడిపోయెను. స్వల్పకాలముననె యింట నందఱకు నీటెలిగ్రాముసంగతి తెలియవచ్చెను. అందఱు నాత్రముతో, భయముతో, దుఃఖముతో, నచటికి వచ్చిరి. ఎవ్వరికి నేమియుఁ దోఁచుట లేదు. అందఱును దుఃఖవిహ్వలులై పోయిరి. కడకప్పాజీపంతు మొక ధైర్యముఁ దెచ్చికొని యిట్లనియెను:



"ఇందు జబ్బేలాటిదో వివరించలేదు. కాని వ్యాధి భయంకరమైనదనియు, చికిత్స జరుగుచున్న దనియు మాత్రమె యున్నది. కాఁబట్టి మనము టెలిగ్రామిచ్చి పైసంగతులు తెలిసికొనుటకంటె నేనే స్వయముగ నిప్పుడే మన డాక్టర్ త్ర్యంబకరావును వెంటఁగొని బరోడాకుఁ బోయిన బాగుండును." ఈసలహా యందఱకు సమ్మతమయ్యెను. వెంటనే బరోడాకుఁ బ్రయాణసన్నాహము కావింపసాగెను. తమకుటుంబవైద్యుడును, పరమమిత్రుడునగు డాక్టరు త్ర్యంబకరావున కీయుదంతమంతయుఁ దెలుప నాతఁడును బ్రస్తుత స్థితిగతుల నెఱిఁగి బరోడాకు వెడలసిద్ధమయ్యెను. వారు మధ్యాహ్నపు బండికి బయలుదేర నిశ్చయించిరి.

బయలుదేరువేళ కింక నొక్క గంటకు ముందు మఱొక తంత్రీవార్త వచ్చెను. అప్పుడు మాత్ర మాతని కొదవిన దుస్థితి వర్ణింపలేము. కవరు విప్పుటకైనను నాతనికి వ్రేళులలో శక్తియుండలేదు. ధైర్యమునశించెను. దేహమంతయుఁ గడగడ వడఁకుచుండెను. ఒకానొక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యున్మత్తునివలె, భ్రాంతునివలె నై పోయెను. ఇంకనింట నాఁడువారిబాముల చెప్పనక్కరయే లేదు. వృద్ధ, రమాబాయి కమలను దనచెంతకుఁ దీసికొని "ఏడువకు తల్లీ, మంచిమందు లిప్పించినఁ ద్వరలోనే నిమ్మళించునులె!" మ్మని యోదార్చుచుండెను. కాని, యామెస్థితి యెట్టులుండెనో యామెకే తెలియును! ఆమె కన్నులలో నొక్కబొట్టు నీరైన లేదు. కాని కన్ను లెఱ్ఱబడి వాచి యుండెను. లక్ష్మీబాయిశూన్యాంతఃకరణముతో భర్త్రనిస్తేజముఖమువంకఁ గాంచుచు జీవ్వపాటుతో నిలిచి యుండెను. ఆమె కన్నుల నశ్రువులు ప్రవహించుచుండెను. ఇఁకఁ గమలస్థితి వర్ణింపనలవిగాదు! అప్పాజీపంతున కాతంలి చదువుటకుఁ దోఁచ లేదు; తోఁచినను ధైర్య మొసవ లేదు. రమాబాయి కుమారుని సమీపించి "అప్పా, నుదుటివ్రాఁత తప్పింపఁజాలము కదా! వ్యర్థముగా మనసున కీబాధయేల? దీనిలో నేమున్న దోఁచదివి చూడుము. ఏమున్నమాత్ర మేమిచేయఁగలము? ఎట్లును నీవు బరోడాకు..." ఆపైఁ బలుక లేకపోయెను. కంఠము రుద్ధమయ్యెను. అటుపిమ్మటఁ బంతు బహుకష్టముతోఁ జెవరియున్నధైర్యమును మరల నొక్కటిగఁ జేర్చి తెచ్చుకొని ఆటెలిగ్రామును జదివెను. అంతే; నిశ్చలుఁడై పోయెను; నిస్తేజుఁడైపోయెను. తలపైఁ బెద్దబండ పడినట్లయ్యెను. లటాలునఁ గుర్చీలోఁబడిపోయెను. దుఃఖావేగమున నాతఁ డేడ్చుటకును మరచిపోయెను.

ఈతని యీ భయంకరస్థితిఁ గని యందఱును నిజము తెలిసికొనిరి. గృహమంతయు రోదనధ్వనితో నిండిపోయెను. కమలయో యొకానొకపశువువలె పెనుబొబ్బలు పెట్టి యేడ్వసాగెను. వృద్ధరమాబాయి కీయుదంతము తెలిసినవెంటనె యామె పెద్దపెట్టున నవ్వసాగెను! నోటికివచ్చిన ట్లెల్ల వదరసాగెను. ఆకస్మికభయంకరదుఃఖాహతి నున్మాదినియై పోయెను!

ఇప్పటి యీవృత్తాంతము వర్ణించుటకు మా లేఖిని ముందునకు సాగ నిరాకరించినది.

అప్పాజీపంతుగారి గృహముపై నేఁడు దుఃఖమహాపర్వతము పడెను. అందఱు నా కొండక్రిందఁ జిక్కుకొనిరి. పాపము, కమల యాకస్మికముగా దుస్సహదుఃఖసముద్రమున మునిఁగి పోయెను. ఆమె సౌభాగ్యరవి యస్తంగతుఁడయ్యెను! దుర్భరవైధవ్య మీబాలిక కింతలోనె సంప్రాప్తమైనది! దురదృష్టము!

౫

అప్పాజీపంతుగారియింటిపై నిట్టి మహత్తరదుఃఖపర్వతము కూలిన యాదినము మనకు హైందవులకుఁ బరమపవిత్రమైన, మహోత్సవదాయకమైన నరకచతుర్దశి యని పాఠకులకుఁ దెలిసియే యున్నది. దీపావళి పండుగ మన కెంతటి యానందదాయకమైన పండుగైనది మనకందఱకుఁ దెలిసినవిషయమే! అట్టి యీ యానందోత్సవదివసమున సైతము, కొందఱు వీణావేణుగానాకర్ణనమునఁ దల్లీనులై యుండ, మఱికొంద ఱాప్తబంధుజనవియోగమునకై రోదనము సల్పుచుందురు. దైవచిత్రము లిట్టివే!

పునహానగరమున సకలదిశలయందును నానందమహోత్సవములు తాండవమాడుచుండెను. ఆనగరమున నివసించుచున్న మన యప్పాజీపంతు గారియింటఁ గ్రూరుఁడగు కాలుఁ డానాఁడె తన సామ్రాజ్యమును స్థాపించెను!

నాలుగుదినములు గడచినవి. వీరందఱకు దుఃఖావేగ మించుక తగ్గెను. కాని, పాపము, దీనానాథయగు కమలయొక్క వదనము దుఃఖపూర్ణమై, వివర్ణమై, మలినమై యుంటఁ గని యెల్లర డెందమును నీరగుచుండెను! తమయొక్కతయగు కూఁతున కింతలో నిట్లు దుస్సహవైధవ్యము పిట్ట పిడుగుగఁ దలపైఁబడుటఁజూచి యేతలిదండ్రుల హృదయములు విదీర్ణములు కాకుండఁగలవు? డాక్టరుపచరించుటచే వృద్ధరమాబాయి కించుక నిమ్మళముగ నుండెను. కమల మొదటి రెండుమూఁడు దినము లొక్కమెతుకన్నము—అన్న మేల? ఒక్కగ్రుక్కెఁడు నీరైన—దీసికొనకపోవుటచే మిక్కిలియు నశక్తయై పోయెను! మాటలాడుటకు నామెకుఁ ద్రాణ లేదు. ఆమె యింతవఱకును నెట్లు జీవించియున్నదియా యనియు నాశ్చర్యము కలుగకపోలేదు! ఆసమయమున డాక్టర్ త్ర్యంబకరావుగారుమాత్రము లేకుండిన నిజముగానె యాబాల జీవించియుండదు. అతఁ డీమెయెడల నధికశ్రద్ధవహించి యుపచరించుటచేతనె యామె జీవించినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అయినదినము తెల్లవారెను. ఉదయ మేడుగంటలుండును. అప్పాజీపంతు తన ప్రాతఃకృత్యములు నెరవేర్చి దేవదర్శనముఁజేసి యప్పుడే పంచపాళీలో వచ్చి కూర్చుండియుండెను. ఆతనిదృష్టి బయట త్రోవపైఁ బారెను.

ఇంటిముందర నొకబండి యాఁగెను. అందుండి యిరువదినాలు గిరువదైదేఁడుల యువకుఁ డొకఁడు దిగి చేత నొకచిన్న పెట్టెఁబట్టుకొని బండివానికి నద్దెయిచ్చి మెల్ల మెల్లఁగ నప్పాజీపంతు నింటిలోనికివచ్చుచుండెను. అప్పాజీపంతు తనక్షీణనేత్రములను వికసింపఁజేసి శంకితాంతఃకరణముతో నేకాగ్రదృష్టులతో నా యువకునిఁ గాంచుచుండెను. ఆతనిడెందమున ననేకవిధవిచారవికారము లొక్కపెట్టున వ్యాప్తమయ్యెను. అప్పుడాతఁడు భ్రాంతిగొన్నవానివలెఁజూపట్టెను. ఆయువకుఁడప్పాజీపంతును సమీపించి హసన్ముఖుఁడై గౌరవప్రేమపూర్వకముగా నావృద్ధునకు వంగి నమస్కరించెను. ఆతని యెదుట నిలిచెను. ఆయువకుని ననిమేషలోచనములతో నప్పాజీపంతుచూచుచు నిలిచెను. అతని శరీరమున బులక లుదయించెను. తనకేదైన భ్రమకలిగెనేమో యని యతనికి శంకవొడమెను. ఉన్మత్తునివలె నైపోయెను. యువకుని రెప్పవేయక చూచుచుండ నాతనినోటనాక



స్మికముగా "నేను గలఁగనుచుండలేదు కదా!" యను వాక్యము వెలువడెను.

ఈతని యీవిచిత్రావస్థ, శుష్కశరీరము, వాడియున్న రూపము, నసంబద్ధవాక్యములు గని యా యువకుని హృదయమున ననేకశంక లుదయించెను. దేహము వడఁకసాగెను! అతఁడు కరుణాపూర్ణస్వరమున "నిదేమిట్లు పలుకుచున్నారు? మీ యీ—"

అప్పాజీపంత మీవాక్యముఁ బూర్తిసేయనీయక యిట్లనెను: "నీవు నిజముగానె వినాయకరావేనా? లేక, యీభయంకరదుఃఖాఘాతమువలన నామతిచలించినందున నాకిట్లు కనఁబడుచున్నదియా?" యనెను.

ఈ తుదివాక్యములు విని వినాయకుని హృదయము కరఁగిపోయెను! భయవిహ్వలస్వరమున నాతఁడు "ఎట్టి దుఃఖాఘాతము? నాకేమియుఁ దెలియకున్నదెట్లు? నేనిదే కొంకణమునుండి యిప్పుడే వచ్చుచున్నానే" అనెను. ఇంతలో వేఱొకయాలోచన యతనికిఁ బొడమెను.

"ఇచటఁగూడ నేదియో భయంకరవిషయము జరిగియుండవలయును" అని యతఁడు తనలోఁ దర్కించుకొనెను. క్షణార్ధకాలమున నీయూహ నిజమని రూఢియయ్యెను. కొంచెము ధైర్యము కలిగెను. అతఁడు శాంతముతో నిట్టులనెను—

"ఇచట జరిగినవన్నియు నాయూహనుబట్టి తెలిసికొంటిని. అదియె నిజమనియుఁ దోఁచుచున్నది. ఇంటినుండి బరోడాకు నాకేవిధముగ టెలిగ్రాం వచ్చెనో, ఆవిధముగనె యిటఁగూడ నేదియో కలిగియుండవచ్చును. నిజమేనా? మీ కిచట టెలిగ్రాంగాని, జాబుగాని వచ్చియుండెనా?"

అప్పాజీపం తిప్పు డించుక శాంతివహించెను.

"నీ కింటినుండి యేమని తంత్రీవార్త వచ్చినది?"

"మాయమ్మగారికిఁ జాల జబ్బుగా నున్నదని నే నిక్కడికి ధనత్రయోదశీరాత్రికి రావలెనని నిశ్చయించితిని. ఆముందటినాఁడె 'అమ్మ భయంకర రోగపీడితయై యున్నది. తత్క్షణము రావలె'నని యమునపేరిట నాకుఁ దంతివచ్చినది. ఆకారణమున నేనిక్కడకువచ్చుట మాని కొంకణమునకుఁ బోయితిని. అప్పుడు నేను మీకు టెలిగ్రా మంపియుండవలసినదే కాని యమ్మగారివ్యాధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విషయమై మనసు కలవరపడియుండుటచే నాకామాట తోఁచినదికాదు. ఆవెంటనే సెలవుఁదీసికొని కొంకణమునకుఁ బోయితిని. అక్కడినుండి యింటికిఁబోవుటకు రెండుదినములు పట్టును. అమ్మను జూడఁగలుగుదునా లేదా యని మనసు తల్లడిల్లి పోవుచుండెను. ఇల్లు చేరి చూతుఁగదా మాయమ్మ నరకచతుర్దశియగుటచే ఉదయస్నానముచేసి పూజచేసికొనుచుండెను. అప్పుడు నా కత్యాశ్చర్యమయ్యెను. ఇది యేమి గొడబంగాళము! ఏమియుఁ దెలియదు! విచారింపఁగా మాయమ్మ రోగగ్రస్తయే కాలేదని తెలియవచ్చెను. ఇంటిలో నుండి యెవ్వరు నాకుఁ దంత్రీవార్త పంపియుండలేదఁట! ఈ కార్య మేవివేకశూన్యుఁడో, ఏ ఖలుఁడో చేసియుండవలయునని స్పష్టమైనది. వాని నేవిధముననైన శిక్షింపక మాననని నిశ్చయించితిని. మాయూరికిఁ దంత్రీవార్తా కార్యాలయ మిరువది మైళ్లదూరమున నున్నది. అచటికిఁ బోయివచ్చుటకు రెండుదినములుపట్టును! అక్కడికిఁ బోవలెనన్న రెండెడ్లనాటుబండ్లలోనో, లేక నడచియో పోవలెను. అందునకును సమ్మతించితిని. కాని మాయమ్మ నన్ను బయటికిఁ బోనీయదయ్యెను. అదియు సమంజసమే. దీర్ఘకాలానంతరము నేనింటికివచ్చుట, అందునను దీపావళీ మహోత్సవసమయమున నన్నెట్లు పోనిచ్చును? ధనత్రయోదశిరాత్రి కిక్కడికి వత్తునని తంతిపంపితిననియు, నటు రాకపోవుటచే మీరందఱు విచారపడుదురనియు, మీకొక తంత్రీవార్తఁ బంపి, యిట్టి టెలిగ్రాము నాకెవ్వరు పంపిరో కనుఁగొనవలయుననియు, మాయమ్మకుఁ జెప్పితిని. ఎంతచెప్పినను వినదు. "రెండుదినములు విచారింతురు! క్షేమసమాచారముఁ దెలుపుచు నొకజాబుఁ బంపినఁజాలును!" అన్నది. అందుపై మీ కొకజాబు వ్రాసితిని." అని యనుచునుండఁ దపాలాభటుఁ డొకజాబుఁదెచ్చి యప్పాజీపంతున కిచ్చెను. వినాయకుఁ డాజాబుఁ గాంచి "యిదియె నేవ్రాసినజా" బనెను. "నేను జాబువ్రాసితిని. గాని, యది మీకుఁ జేరుటకు మూఁడునాలుగుదినములగునని నేనెఱుఁగుదును. ఆజాబు మీకుఁ జేరువఱకు నెంతయాతురపడుచుందురో, యని నాకుఁ దోఁచి, మాయమ్మతో నట్లే చెప్పితిని; సమాధానపరచితిని. ఆసాయంకాలమె నేను బయలుదేరితిని. ఇప్పుడు వచ్చిచేరితిని.

ఆరెండుదినములలోఁ దంత్రీవార్తాధికారికి జాబులు వ్రాసి, నాకు వచ్చిన టెలిగ్రాములు పంపి, యిట్టి నీచకృత్యము నేసిన దెవ్వరో తెలుపుఁడని కోరియుంటిని. అనుభవము తప్పదందురుకదా? ఇది నిజమని నాకుఁ దెలియవచ్చుచున్నది. తంత్రీవార్తాధికారికి టెలిగ్రామిచ్చినప్పుడే నా క్షేమసమాచారముఁగూర్చి మీకు నొక నొక టెలిగ్రా మంపవలసియుండెను. నామనస్సు స్థిరముగ నుండకపోవుటచే నప్పుడు నా కామాట తోఁచలేదు. నే నంపినతంతికి బదులు నేను బయలుదేరువేళకే వచ్చిచేరినది. నాకుఁ జేరిన టెలిగ్రాము యమున పేరున నుండెననియు, రాము అనునాతఁడు తెచ్చెననియుఁ గార్యాలయాధికారి నాకుఁ దెలిపెను. మన యిక్కడి కృష్ణరావునకు రాము అను ప్రాణమిత్రుఁ డొకఁడుండుట మనమందఱ మెఱుఁగుదుముగదా! అతఁడు కొంకణమున కేదోపనియుండిపోయియుండెనని నన్నెఱిఁగినయొకఁడు నాతోఁ జెప్పెను. ఇవియన్నియు యోజింపఁగా నీకృత్యమంతయును నీ నీచుఁడు కృష్ణరావు ప్రోత్సాహమున రాముఁడు చేసియుండవలయునని తేటపడుచున్నది.

ఈ వృత్తాంతమంతయును జెప్పి, యిఁకటికత తెఱుఁగు నాతురముతో వినాయకుఁ డప్పాజీపంతును జూచెను. ఈతఁడు నుడివినదంతయు విన్నపిదప నప్పాజీగారి హృదయమందలి సంశయాంధకారము మాయమై పోయెను! సకలోదంతము నీతఁడు వినాయకునకు వినిపించెను. అప్పు డాతనిసంశయము దృఢపడియెను!

కమల నెప్పుడుదర్శింతునా, యని వినాయకరా వాతురపడుచుండెను. కాని, ప్రస్తుత మామెయున్న స్థితిగతుల నెఱిఁగి, యిప్పు డాతురపడిన నామెకు హర్షవాయువు కలుగునేమో యని వెఱచి, క్రమముగ సకలవృత్తాంతములు నామెకుఁ దెలుపవచ్చునని తలఁచెను. అప్పాజీపంతు తనకువచ్చిన టెలిగ్రామును దెచ్చుటకై లోని కరిగెను.

లక్ష్మీబాయి వంటయింటఁ గమల కౌషధ మిచ్చుచుండెను. పంతచటికరిగి "ఇదిగో యిప్పు డింటికివచ్చినవా రెవరో చూచితివా? వినాయకుఁడు—మనవినాయకరావు వచ్చియున్నాఁడు. శీఘ్రముగాఁ దేనీరు కాఁచి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెమ్ము. మనవినాయకరావు వచ్చియున్నాఁడు—వినాయకరావు!"

అని వచించి యప్పాజీపంత చ్చోటువాసి బయటి కరుదెంచెను. ఈతని యానందపూరితమగు కంఠస్వరమును, హాసన్ముఖమును లక్ష్మీబాయి యాశ్చర్యచకితలోచనములతోఁ జూచెను. ఆమెస్థితియు విచిత్రమగనుండెను. అప్పాజీపంతునకుఁ దొలుత నేవిధముగ సందేహమొదవెనో యామెకు నావిధముగనే సందియము వొడమెను! దుఃఖభరమున నతఁడు భ్రమించియుండలేదుకదా! "అనఁగా?" నని యామె భర్త నడిగెను. కాని, ప్రత్యుత్తర మిచ్చుటకు భర్త యందుండలేదు. చేతనున్న పని నట్లే వదలి యామె బయటికి వచ్చెను. ఈమెను గాంచినంత వినాయకరావు నవ్వుచు "అత్తా, నేను స్వర్గస్థుఁడనైతినని మీరందఱు నతిశయముగ దుఃఖించుచుందురని, మిమ్మోదార్చుటకై యొక్కమారు మిమ్ముందఱుఁ జూడఁగోరి స్వర్గావరోహణమొనర్చి వచ్చియున్నాను" అనెను. ఇదేమిచిత్రము! ఏమిమాయ? లక్ష్మీబాయి కిదియేమియుఁ దెలియలేదు. అప్పమాయకయే యతనిఁ గాంచుచు నిలిచెను; తడ వీమెను సంశయాందోళనమున నుంచుట తగదని యప్పాజీపంతు యథార్థమంతయుఁ దెలిపి "ఇదిగో అమ్మతో నీసంగతులేవియుఁ జెప్పకుమా! ఈయానందభారమామెకు మిక్కుటమై మరల భ్రమించిపోవునేమో! పో, పొమ్ము. శీఘ్రముగా తేనీరు కాచి తెమ్ము; చాల నలసియున్నాఁ" డనెను.

లక్ష్మీబాయిహృదయ మత్యంతానందప్రఫుల్లమయ్యెను. పతి సూచించినట్లు తేనీరు కాచుట కామె వెడలిపోయెను.

వినాయకరావు తంత్రీవార్తాపత్రికను బరీక్షాపూర్వకముగాఁ దిలకించుచుండెను. "దీనిలో మనోహరపంతని వ్రాలున్నది. ఈతఁ డెవ్వఁడో? నిజమగు వ్యక్తియో లేక కల్పితవ్యక్తియో తెలియుట లేదు. మా స్నేహితులలో నీపేరువా రెవరును లేరు. కొంకణమునుండి నాకుఁ బంపినవారు నాఁడె మీ కీవార్త పంపఁబడియున్నది. సరే దీనిజాడయుఁ బూర్తిగానె తెలియఁగలదు! బరోడా తంత్రీవార్తాధికారి నాకుఁ జిరపరిచితుఁడు! అతనికి వ్రాసినచో సకలము నిజము తెలియఁగలదు!"

అని యనుచునుండ వీరిద్దఱకు "టీ" త్రాగుటకు లోపలనుండి పిలుపు వచ్చెను. వీరిద్దఱు మాట్లాడుచునే తేనీరుఁ ద్రాగుచుండ, లక్ష్మీబాయి కమలగదిలోని కరిగెను. కమల యప్పటికింకను నిద్దుర మేల్కొనియుండలేదు. ఆమె కిటీవల రాత్రులలో నిద్రపట్టుట లేదు. కాని, తెల్లవారుజామునఁ బట్టును. ఈయుదయమెండెక్కువఱకు మేల్కొనుట లేదు. లక్ష్మీబాయి మెల్లఁగ నామెమంచము చెంత కరిగెను. మెల్లఁగఁ దట్టి లేపెను. వినాయకుని వృత్తాంతమంతయుఁ గొంచెము కొంచెముగా నామెకుఁ దెల్పి వినాయకుఁ డరుదెంచినాఁడనియుఁ దెలిపెను. ఆయకల్పితానందమున స్వర్గమునకరిగిన తనపతి మరల నరుదెంచుట యను నమృతముకన్న నధికమధురవార్త విని కమల కేమితోఁచియుండునో, యామె హృదయస్థితి యెట్లయియుండునో, యూహించుభారము పాఠకులపై మోపుచున్నాము.

అనంతర మీయానందవార్తఁ దెలుపుటకై యప్పాజీపంతు త్ర్యంబకరావుగారి గృహమున కరిగెను.

వినాయకుఁ డరుదెంచినకాలమున వృద్ధరమాబాయి యింట నుండలేదు. కొంతసేపటికి వచ్చెను. త్ర్యంబకరావుగారి శ్రద్ధాభక్తులవలన నామె నెమ్మదిగా నుండెను. నిన్నటినుండియె యామె లేచి తిరుగుచుండెను. ఆమె వంటయింట నుండెను. లక్ష్మీబాయి కమలను వదలి వంటయింటి కేతెంచెను. ప్రేమాదర్శకస్వరమున నామె మెల్లమెల్లఁగ నాముదుసలిమనసున కాయాసమొదవకుండునట్లు సకలము నివేదించెను.

కమల యానందమునకు మేర లేదు. ఆమెరూపమునను మార్పు కనుపట్టెను. ఒక్కక్షణకాలమునకుఁ బూర్వముండిన ప్రేతకళ మాయమైపోయి యామెముఖమండలమున నానందారుణకళలు నెలకొనెను. జలమున, స్థలమున, కాష్ఠమున, పాషాణమున అన్నిటియందును నానందమె దృగ్గోచరము కాసాగెను. ఆవెంటనె యాబాల లేచిపోయి, ప్రాతఃకృత్యములు నెరవేర్చి కచేరి చావడి కరుదెంచెను. అపుడు వినాయకరా వొక్కఁడె వార్తాపత్రికఁ జదువుచుఁ గూర్చుండియుండెను. కమల తనకనుదమ్ములను వికసింపఁజేసి, యాతురతములో నాతని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జూచుచు నిలుచుండెను. ప్రేమానందములు ప్రబలమై యామె విభ్రాంతయై పోయెను! నోట మాట వెడలదు! ఈవికార మామె శరీరమంతటను గగుర్పాటొదవించెను! నేత్రకమలములు నాలుగును ముకుళితము




లయ్యెను! కనుమూయునంతలో నామె వినాయకుని బాహుపంజరమున బద్ధయైపోయెను!

ఇచట రమాబాయియు నానందతన్మయరై పోయెను. ఆమె వినాయకుఁ డున్నెడకుఁ బోయి; పరస్పరబాహుపంజరబద్ధులైయుండు నాయిద్దఱి నిట్లేకౌఁగిలించి, ప్రేమానందాశ్రువుల నాయిద్దఱకు మంగళస్నానముఁ గావించెను.

అప్పాజీపంతున కీదినమె దీపావళీమహోత్సవమయ్యెను. వినాయకుఁడు బరోడాతంత్రీవార్తా కార్యాలయాధికారియగు శ్రీధరపంతునకంపిన తంతి కామరునాఁడె జబాబువచ్చెను. సవిస్తరముగఁ దంతినోసఁగుట కలవికానందున లేఖరూ వ్రాసియుండెను. అం దిట్లుండెను:

"అప్పాజీపంతుగారి కొకటివెంట నింకొకటిగాఁ బంపిన రెండుతంత్రీసందేశములుఁ గొని 'కృష్ణరావు దేశాయి యనుగృహస్థుఁడు తానె స్వయముగాఁ దెచ్చియుండెను. వానిపై 'మనోహరపం' తని వ్రాలుండెను. కృష్ణరావు పక్షముదినములక్రిందట నీయూరునకు వచ్చిన 'శ్రీసంగీతనాట్యసమాజము' వారిలోఁ గలిసి వచ్చియుండెను. నాకతనితోఁ బరిచయము లేదు. ముఖపరిచయమే. అన్నియుఁ దిన్నఁగా విచారణసేయఁగాఁ దెలిసినవిషయము లివియే."

ఈవిషయముఁ జదివి వినాయకున కింకనొకటి జ్ఞప్తికివచ్చెను ఈకృష్ణరావు బరోడాకు నటకులతో వచ్చియుండుతఱి, నాతఁడు తఱచుగాఁ దనకడకు వచ్చుచుండెను. అట్టి సమయములలో నొకనాఁడు మాటలవరుసను "నేను దీపావళీపండుగ కింటికివచ్చెద" నని యుండెను. కావునఁ దా నేనాఁడు బయలుదేరినదియు జాడతెలిసి యాకృష్ణరా వీకృత్సకృత్య మొనర్చియున్నాఁడని తేటపడెను. ఇది యిట్లని యప్పాజీపంతునకుఁగూడ వినాయకుఁడు తెలిపెను! కమల కృష్ణుని ప్రేమ నిరాకరించి, ప్రేమభంగ మొదవించియుండినందున నాదుష్టుఁ డీముగ్ధ కకాలవైధవ్యదుఃఖ మొదవించి, యారీతిని దనసూఁడు తీర్చుకొనెను! మనస్సమాధానముఁ గావించుకొనెను! కాని, యిందున వానిమనసున కెంతటి సమాధాన మొదవియుండునో దైవమెఱుఁగును!

పౌరాణికకృష్ణలీలలు మనమందఱముఁ జదివియున్నాము. కాని, మన యీ యాధునికకృష్ణలీలలకు, నాలీలకు నెంత భేదమున్నదో యాలోచింపుఁడు!

అప్పాజీపంతుగారిగృహమున నందఱకు—అందు ముఖ్యముగాఁ గమలకు భీషణాంధకారభరితమైన యమావాస్యనిశవలె దుర్భర దుఃఖమయకాళరాత్రి సమాప్తిఁ జెంది ఆనందమయసుప్రభాతమయ్యెను ఈసుప్రభాత సమయమునఁ బ్రశాంతమును, తేజోమయమును బాలారుణసువర్ణకిరణప్రసారముల నప్పాజీపంతుగారి కుటుంబము విలసిల్లెను!





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సెలయేఱు

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు



ఆలలచేతుల నిరుగెలంకులకు నొత్తఁ
బడిన రీతిగఁ దగు చెట్లవరుస లల్ల
వానితోఁకల గగ్గుఱుపాటు గొన్న
సొలుపు వహియింపఁ జక్కఁగా మొగ్గదొడిగె.

గీ. వాంశికనికుంజకము లేలపాట పాడ
శరవణము పిల్లనవ్వుల సన్న సేయఁ
గానఁబడునట్లు తమ మోఱకము తెఱంగు
దారి నరికట్టి పెనురాలు బారుదీర్ప.

గీ. మలయపవనాంకురములకు మనసు గదల
నడవిపువ్వులు వేణియం దలవరించి
నురుగుఁగందంబు నెమ్మేను మెఱయ నలఁది
యంచప్రూఁబోండ్లతో మాటలాడుకొందు.

గీ. ప్రక్కప్రక్కల కొదుగుచు వారికెల్లఁ
దావకప్రేమరాజ్యంబు ధన్యజన్ముఁ
డైన వేనికి గుత్తకీయంగఁ దలఁచి
యేగెదో? తెల్పఁగదె? సెలయేటి బోటి!

గీ. నిన్ను నాదు కవిత్వమందిరమునందు
నిలిపి స్వాగత మర్పింతు నేను గవినిఁ
బ్రకృతిసౌందర్యచిత్కళోపాసకుఁడను
సుకృతవశమున నిన్నుఁ జూచుట లభించె.




(రషియాదేశపుకథ)

సెవొలోడ్ మిఖలోవిచ్ గార్టిన్

'సీమన్ ఇవనోవ్' రైల్వేలైనుమీద కావలావాడు. అతడు కాపురమున్న యింటికి పన్నెండు వెర్ స్టుల * దూరమున ఒక రైలు స్టేషనున్నూ 10 వెర్ స్టుల దూరమున ఒకరైలుస్టేషనున్నూ ఉన్నవి. అక్కడకు నాలుగువెర్ స్టుల దూరములో ఒకమిల్లు నిరుటిసంవత్సరము కట్టినారు. దాని ఎత్తైన నల్లని చిమ్నీ (పొగ స్తంభము) అడవిని దాటి కనిపించుచున్నది. ఇంతకు సమీపములో యితడు కాపురమున్న యింటివంటి కావలాయిళ్లు తప్ప, మనుష్యులు కాపురముండే యిళ్లు లేవు. 'సీమన్ ఇవనోవ్' వ్యాధిగ్రస్తుడు. చాలా చితికి పోయాడు మనిషి. తొమ్మిదిసంవత్సరములకు పూర్వము ఒకసైనికోద్యోగివద్ద, వార్తలు కొనిపోయే సైనికుడుగా ప్రవేశించి యుద్ధమయేపర్యంతము అతనికొలువులోనేఉన్నాడు. ఆతడు ఆకలివేసి బాధపడ్డాడు; చలిలో వడవడ వడకాడు; ఎండలో మలమల మాడాడు; ఘాటుపులుగా ఉన్నప్పుడూ, హిమము కురిసేటప్పుడూ నలభైయాభై వెర్ స్టుల దూరము నడిచాడు; ఫిరంగిబారుల కెదురుగా ఉన్నాడు;— కానిదైవబలముచేత కాబోలు ఒక్కతుపాకిరవ్వ అయినా అతన్ని రాసుకుపోలేదు. పూర్తిగా ఒకవారమురోజులు, సైనికదళము సైన్యముఖమున ఉండెను. ఆరోజులలో వారూ, వారికెదురుగా పల్లములో ఉన్న తురుష్కులూ ఎడతెగకుండా ఫిరంగుల బారుపెట్టుకొంటూనే ఉన్నారు. ఉదయము మొదలు సాయంకాలమువరకూ కాల్చడం ఆగలేదు. సీమన్‌యొక్క కామందు సైన్యముఖములోనే ఉన్నాడు. రోజుకు మూడుమార్లు, అతడు తనఉద్యోగస్తునకు, కొండచరియలో ఉన్న సైనికుల వంటయింటినుండి, టీ కాచే పాత్రా, భోజనసామగ్రీ తీసుకొని పోయేవాడు. వంటయింటినుండి టీపాత్రపట్టుకొని ఉద్యోగస్థుని దగ్గిరకు వెళ్లడానికి ఒకబయలు దాటవలసి ఉన్నది. తుపాకిగుళ్లు విజ్జుమని అతని సమీపమునుంచి పరుగెత్తి రాళ్లకు తగిలి శబ్దముచేసేవి. సీమన్ భయపడి ఏడ్చేవాడు. కాని తాను వెళ్లడం మాత్రము మానలేదు. ఉద్యోగస్తు లందరూ

* ఒక వెర్ స్టు 2/3 మైలుకు సమానము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అతన్ని చాలా మెచ్చుకొన్నారు—ఎప్పుడూ వారికి వెచ్చ వెచ్చని టీ దొరికేదీ! యుద్ధములో గాయపడకుండా అతడు తిరిగివచ్చినాడు కాని పాపము కాళ్లలోను చేతుల్లోను నొప్పులు పట్టుకొన్నవి. అప్పటినుంచీ అతడు చాలా చిక్కులు అనుభవించాడు. ఇంటికి వెళ్లాడు—అతని తండ్రి కాలం చేశాడు; నాలుగేళ్ల కొడుకు కూడా గొంతుకలో జబ్బుచేసి మరణించాడు. సీమనూ అతనిభార్యా మాత్రం మిగిలారు. వ్యవసాయంచేస్తే పనిసాగిందికాదు. ఎల్లాసాగుతుంది? కాళ్లూ చేతులూ వాచిపోయి ఉంటే భూమి దున్నడం ఎలాగ? ఇంక స్వగ్రామంలో ఉండడం ఇష్టంలేక సౌఖ్యంకోసం వెతుక్కుంటూ కొత్తస్థలాలికివెళ్లారు. సీమనున్నూ, అతని భార్యా 'ఖార్ కోవు'లోను, 'డాను' లోనూ రైల్వేలో ఉద్యోగంకోసం, ప్రయత్నించారు. ఎక్కడా వారికి అదృష్టదేవత ప్రసన్నం కాలేదు. కొన్నాళ్లకు అతనిభార్య నౌకరీకి వప్పుకుంది. అతడు తిరగడం ప్రారంభించాడు. ఒకమాటు అతను రైలుమీద ప్రయాణమై వెళ్లడం తటస్థించింది. ఒకచిన్నస్టేషను దగ్గిర అతడు బయటకు చూచాడు. స్టేషనుమేష్టరు తనకు పరిచయుడా ఏమిటి చెప్మాఅనిపించింది. సీమర్ స్టేషనుమేష్టరుకేసిచూచాడు. స్టేషను మేష్టరు సీమర్ కేసి చూచాడు. ఒకరి నొకరు పోల్చుకున్నారు. తాను పనిచేసిన సైనికోద్యోగి యితడే కదా అనుకున్నాడు సీమర్.

"నీవు ఇవనోవ్ కావా?" అన్నాడాయన.

"అవును, దేవరా, నేనే!"

"నీ విక్కడకు ఎలాగవచ్చావు?"

సీమర్ యావద్వృత్తాంతము అతనితో చెప్పినాడు.

"ఇప్పు డెక్కడకు వెళ్లుచున్నావు నీవు?"

"నాకు తెలియదు; దేవరా!"

"ఏమిటీ, త్వాష్ట్రం, నీకు తెలియదూ?"

"అవును, దేవరా, ఎక్కడ పనిచెయ్యడానికి సిద్ధపడినా లాభం లేకుండా ఉంది. ఏదైనా పని దొరుకుతుందేమో నని నేను ప్రయత్నాలు చేస్తూవుండవలసిందే కదా దేవరా!"

స్టేషనుమేష్టరు అతనికేసి చూచి ఆలోచించి అప్పు డన్నాడు, "చూ డబ్బాయి; ఇప్పటి మట్టుకు స్టేషనుదగ్గిర ఉండు. నీకు పెళ్లి అయిందనుకుంటాను. కాదూ? నీ భార్య ఎక్కడ ఉంది?"

"అవును దేవరా, నేను పెళ్లి చేసుకొన్నాను. నాభార్య 'కుర్ సక్' లో ఒక వర్తకునివద్ద నౌకరీచేస్తున్నది."

"సరే. నీభార్యకు ఉత్తరం వ్రాయి. ఆమెను ఇక్కడకు రమ్మని చెప్పు. ఆమెకు ఫ్రీపాసు ఇప్పిస్తాను. కాపలావారి యిళ్లలో ఒకటి త్వరలోనే కాళీ అవుతుంది. ఈసెక్షన్ ప్రధానోద్యోగితో నీసంగతి చెప్పుతాను."

"నేను కృతజ్ఞుడను దేవరా!"

అందుచేత అతను స్టేషనుదగ్గిర ఉండిపోయాడు. స్టేషనుమేష్టరు వంటింట్లో అతడు సాయం చేస్తూవుండేవాడు. పుల్లలు కొట్టేవాడు; పెరడు తుడిచేవాడు; ప్లాటుఫారం తుడిచేవాడు. రెండు వారాల్లో అతనిభార్య వచ్చింది. సీమర్ లే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సామాను ఒకతోపుడు బండిలోపెట్టి తనకాప
లాయింటికి వెళ్లాడు. కాపలా యిల్లు కొత్తది;
వెచ్చగా ఉంది. అతనికి కావలసినంతవంట
చెరుకు ఉంది. ఇతనికి పూర్వం ఆయింట్లో
కాపురమున్నవాడు పాదులూ కూరమొక్క
లూ పెంచుకు వెళ్లిపోయాడు. అవి వీరికిదక్కి
నవి. లైనుపక్క సుమారు అరఎకరం దున్న
డానికి వీలుగానున్న భూమి ఉన్నది. సీమర్క
చాలా సంతోషించాడు. భూమిని ఎల్లా సేద్యం
చెయ్యడమో, ఒక ఆవునీ, ఒక గుర్రాన్నీ ఎల్లా
కొనుక్కోవడమో, ఆలోచించడము మొదలు
పెట్టాడు.

అతనిపనికి కావలసిన వస్తువులన్నీ అతని
కిచ్చారు—ఒక ఆకుపచ్చజెండా, ఒక ఎర్ర
జెండా, ఒకలాంతరు, ఒకబూరా, ఒకసుత్తి,
స్క్రూళ్లు బిగించడానికి రెంచీ,ఒకగునపమూ,
ఒక తవ్వుగాలా, ఒకచీపురూ, కొన్ని మరమే
కులూ, ఇనపగద్దగోరులూ. అతనికి రెండుపుస్త
కాలు కూడా యిచ్చారు—రైల్వేరూల్సూ,
టైముటేబిలూ. మొట్టమొదట సీమన్‌కు రా
త్రిళ్లు నిద్ర పట్టనే లేదు. అస్తమానం టైము
టేబిలు చదవడమే. ఇక రెండుగంటలకి రైలు
వస్తుందంటే అతను తనబీటు తిరిగి వచ్చి ఇంటి
వద్ద ఉన్న బెంచీమీద కూచుని చూస్తూండే
వాడు—రైలుపట్టాలు అదురుతున్నాయేమో
ననీ, రైలుబండి చప్పుడు వినిపించదా అనీ.
రైల్వేరూల్సు అన్నీ అతనికి కంఠతావచ్చాయి.
వర్ణక్రమంచేసుకుంటూ చదువుకోవలసివచ్చినా
అతను సర్వమూ నేర్చుకోకలిగాడు.

అది వేసంగి. పని చులాగ్గానే ఉంది. ముద్ద
మంచు కురియడం లేదు కాబట్టి అది తీసివేసి
బాగుచెయ్యవలసిన పని తప్పింది. ఆలైనుమీ
దకు ఆట్టే రైళ్లూ రావు. కాబట్టి సీమర్క
రోజుకు రెండుమార్లు తను చూడవలసిన
వెర్‌స్టు చూచీవాడు. అక్కడక్కడ ఒక్కొ
క్క మేకు బిగించడమూ, పట్టాలమధ్య మన్ను
సరిగ్గా ఉందా లేదా అని చూడడమూ, పట్టా
మధ్యనుంచి నీరు పోవడానికి పెట్టిన కాలవ
గొట్టాలు బాగా ఉన్నాయో లేవో
చూడడమూ అయినతర్వాత ఇంటికి వచ్చి
భూమిసేద్యం సంగతి ఆలోచిస్తూ ఉండేవాడు.
కాని యింటిపనులు చేసుకోడానికి మాత్రం
ఒకచిక్కు ఉన్నది. అతడు ఏమైనా చేద్దామని
అనుకున్నట్లయితే రైలురోడ్డు మేస్త్రీ ఉత్తరు
వుకోసం వ్రాసుకోవాలి. ఆమేస్త్రీ సెక్షను
ప్రధానోద్యోగికి రిపోర్టు పంపాలి. ఇవన్నీ
అయి అతనికి ఉత్తరవు వచ్చేటప్పటికి పుణ్యా
కాలం రవంతా అయిపోయేది. సీమన్‌కూ,
అతనిభార్యకూ చేతినిండా పనిలేక ఏమీ
తోచడంలేదు.

రెండునెలలు గడచినవి. సమీపంలోఉన్న
కాపలావాండ్లతో సహవాసంచేయ మొదలు
పెట్టినాడు సీమర్క. అందొకడు చాలా ముసలి
వాడు. అతడు యిల్లుదాటి బయటకు రావడ
మునకైనా శక్తి లేనివాడు. అతన్ని తీసివేసి
యింకొకరిని ఆస్థానే వేస్తారని గట్టివదంతి కద్దు.
అతనిభార్య అతనిబదులు లైనుమీద పని
చేసేది. ఇంకో కాపలావాడు బక్కపల్చగా
ఉంటాడు కాని కండలు అవుపిస్తూ ఉన్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుర్రవాడే. ఇద్దరిబీటులూ కలిసేచోట సీమర్ మొట్టమొదట అతనిని కలుసుకొన్నాడు. సీమర్ టోపీతీసి బుర్రవంచి సలాముచేశాడు. "ఖులాసాగా ఉన్నావా అబ్బాయీ" అన్నాడు సీమర్.

అబ్బాయి ఓరచూపుతో అతనిని చూశాడు. "నీవు ఎలాగ వున్నావు" అని సమాధానం చెప్పి వెనక్కు తిరిగి వెళ్లిపోయాడు. కొన్నాళ్లైన తర్వాత వారిభార్యలు ఒకరి నొకరు కలుసుకొన్నారు. సీమర్ భార్య 'అరీనా' పొరుగువారి భార్యను పలకరించింది. ఆవిడ ఏవో రెండుముక్కలు చెప్పి వెళ్లిపోయింది. సీమ నొకమారు ఆమెను కలుసుకొని, "ఏమిటి సంగతి, అమ్మాయి, నీభర్త మాట్లాడనే మాట్లాడడు?" అన్నాడు. అమ్మాయి మొదట మాట్లాడక ఊరుకొని తర్వాత అన్నదికదా, "నీతో ఏవిషయమై అతను మాట్లాడాలి? ఎవరిగొడవ వారిది.........మీగొడవ మీరు చూచుకొందురూ, పుణ్యముంటుంది."

అయితే నేమి, ఒకనెల గడవకుండా వారిద్దరూ స్నేహితు లైనారు. సీమనున్నా 'వాసిలీ' యున్నా రైలులైనుమీద కలుసుకొన్నప్పుడు వారిద్దరూ గట్టుమీద కూర్చొని పొట్టి పొగాకుగొట్టాలు వెలిగించి ఏరీతిగాజీవితం గడిపేరో చెప్పుకుంటూ ఉండేవారు. 'వాసిలీ' సాధారణముగా మాట్లాడేవాడు కాడు. కాని సీమర్ తన స్వగ్రామాన్ని గురించీ, యుద్ధాన్ని గురించీ చెప్పేవాడు.

"జీవితంలో యిన్నీ అన్నీ కాదు నేనుపడ్డకష్టములు. కాని భగవత్కృపవల్ల ఆ ట్టేకాలం కష్టపడలేదు. భగవంతుడు నాకు అదృష్టం దయచేశాడు కాడు. పరమేశ్వరుడు ఎంతఅదృష్టం యిస్తే అంతే. అదీ సంగతి, వాసిలీ స్టిపేనిచ్" అని సీమర్ చెప్పాడు.

వాసిలీ స్టిపేనిచ్ తన పొగాకు గొట్టములో నుసి రైలుపట్టామీద కొట్టిదులిపి నిలబడ్డాడు. "భగవంతుడిచ్చే అదృష్టంకాదు మనకు వ్యతిరేకంగా ఉంట, మనుష్యులు. మనుష్యులను మించిన క్రూరమృగములు ఎక్కడా లేవు. తోడేళ్లు తోడేళ్లను తినవు; మనుష్యులు బ్రతికిఉన్న యితర మనుష్యులను తింటారు."

"అన్నా, కాదు; తోడేళ్లు తోడేళ్లను తింటవి. అబద్ధ మంటావా?"

"అప్పటికి వచ్చిన మాట ఏదో అన్నాను. అయితేఏమి? ఇంతకంటె క్రూరమైన మృగములు వేరేలేవు. మనుష్యుని దుర్మార్గతా, ఆశా, లేకపోతే బ్రతకవచ్చు. ప్రతీవాడు నిన్ను బ్రతికిఉండగా పట్టుకొని మ్రింగివేద్దామని వడుపువేసుకు ఉంటాడు- నోటితోకొరికి మ్రింగివెయ్యడానికే."

సీమన్ ఆలోచించాడు.

"నాకు తెలియదు అన్నా. బహుశా అలాగు అయివుండవచ్చు; కాని,అలాగ అయినట్లయితే అది భగవదాజ్ఞ"

వాసిలీ అన్నాడుకదా, "అలాగయితే మనము ఒకరితో ఒకరు మాట్లాడతగ్గ దేదీలేదు;మనకు జరిగే ప్రతిఅన్యాయమూ భగవంతుని మీద పారవేసి కూర్చుని దుఃఖించీ మాటయితే మనము మనుష్యులము కాము, పశువులము. నేను చెప్పేదదీ."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అతడు వెనక్కు తిరిగి వెడతానని చెప్పకుండా వెళ్లిపోయాడు. సీమర్ కూడా లేచి నిలబడ్డాడు. "అన్నా, నాతో అంతికరినంగా మాట్లాడతావేమి" అని వెనకనుంచి కేకవేశాడు.

అతడు తిరిగి చూడలేదు. మలుపు దగ్గిర పల్లములో అతను దిగి అగుపించకుండా ఉండేదాకా అతనికేసి సీమర్ నిలబడి చూచాడు. అప్పుడతడు ఇంటికి తిరిగి వచ్చి భార్యతో అన్నాడు, "అరీనా, మన పొరుగువాడు మా దొడ్డవాడు! వాడు మనిషి కాడు, పగబట్టే మృగము."

అయినా వారిద్దరూ విరోధపడలేదు. త్వరలోనే వారిద్దరూ మళ్లీ కలుసుకొని కూర్చుని పూర్వమువలెనే ప్రసంగించారు. ఎప్పుడూ ఒక్కటే విషయం.

"చూచావు స్నేహితుడా, ఆ మనుష్యుల మూలాన్ని కాకపోతే మనము కాపలాయిళ్లలో కూర్చోనే కూర్చోము" అన్నాడు వాసిలీ.
"కాపలాయిళ్లకేమి? అవి పాడుగా లేవు. వాసయోగ్యముగానే ఉన్నవి."

"వాసయోగ్యమే, వాసయోగ్యమే. అంతకన్న నీవేమి చెప్పతావు. ఇంతకాలము నీవు జీవించావు, ఏమీ నేర్చుకోలేదు. ఇంతకాలం నుంచి చూస్తున్నావు, ఏమీ చూడనే లేదు. కాపలాయింటిలోనైతేనేమి, యితరస్థలాల్లో అయితేనేమి, బీదవాడు బ్రదికే బ్రదుకు ఏ మాదిరిగా ఉంటుంది. నెత్తురు పీల్చేవాళ్లు వాళ్లు; నిన్ను బ్రదికి ఉండగానే తినేస్తారు; ఒకరక్తపుచుక్కైనా మిగలకుండా నిన్ను పిడిచి పిప్పిచేసి నీవు ముసలివాడవైనతర్వాత పందులకు పనికివచ్చే తుక్కుకింద తీసి పారవేస్తారు! నీకు ఎంతజీతమిస్తున్నారు?"

"కొంచెమే వాసిలీ ప్టిపేనిచ్; 12 రూబుల్లు.*"
"నాకు పదమూడున్నర; ఎందుకీ తేడా ఉండాలి? కంపెనీ రూల్సు ప్రకారం మనఅందరికీ ఒక్కటే జీతం. నెలకు పదిహేను రూబుల్లు; దీపమూ, వంటచెరుకూ ఉచితం. నీకు పన్నెండు రూబుల్లు, నాకు పదమూడున్నర రూబుల్లు ఇవ్వమని ఎవరు ఉత్తరువు చేశారు? అదీ నిన్నడగవలసిన ప్రశ్న. కాలక్షేపం చెయ్యవచ్చుగదా అంటావు కాబోలు! రూబులున్నర — వాళ్లు పదిహేనూ ఇవ్వడం తటస్థించితే — మూడురూబుల్ల తేడాకోసం నే చెప్పడంలేదు. క్రిందటి నెల రైల్వేడైరక్టరు యీదారిని వెళ్లినప్పుడు నేను స్టేషనుదగ్గిర ఉన్నాను. అప్పుడు ఆయన్ని చూశాను. ఎన్నో గౌరవచిహ్నాములున్న వాయనికి. ప్రత్యేకంగా ఒకబండి వేయించుకొని అందులో ఆయన ప్రయాణం చేస్తున్నాడు. ఇవతలికి వచ్చి ఆయన ప్లాటుఫారంమీద నిలబడ్డాడు............నే నిక్కడ అట్టేకాలం ఉండేది లేదు. ఎక్కడకు తోస్తే అక్కడికి వెళ్లిపోతాను."

"ఎక్కడికి వెళ్లుతావు నీవు, ప్టిపేనిచ్? పోనిద్దూ; ఇక్కడ నీకోయిల్లు ఉన్నది. వెచ్చగా ఉంటున్నావు; కాస్తపొలం ఉన్నది. పని చెయ్యగల భార్య ఉన్నది."

* రూబులు సుమారు రెండురూపాయలకు సమానము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"కాస్తపొలం! నాకాస్తపొలంకేసీ నీ వెప్పుడైనా చూశావా? ఒకరెమ్మైనా అందులో లేదు. పోయినవసంతఋతువులో కొన్ని కాబేజీలు అందులో మొలవేశాను. రోడ్డుమేస్త్రీ వచ్చి, 'అప్లికేషన్ పెట్టుకొన్నావా? ఉత్తరువు పొందావా? ఈక్షణంలో అవి లాగి పారవెయ్యి; వాట్లు ఆనవాళ్లైనా అక్కడ ఉండడానికి వీలు లేదు' అన్నాడు. అప్పుడు తప్పత్రాగి ఉన్నాడేమో అలాగ అన్నాడు. ఇంకొకప్పుడైతే మాట్లాడక ఊరుకొనును. మంచీచెడ్డా తెలియని మత్తుస్థితిలో ఉన్నాడు. .................'మూడుకూబుళ్లు జుల్మానా!'"

వాసిలీ తన పొగాకు గొట్టమును మాట్లాడకుండా కొంతసేపు పీల్చి ఈరీతిగా అన్నాడు. "అంతటితో సరిపెట్టేడు; లేకపోతేనా, చచ్చేటందుకు తన్ని వదలిపెట్టేవాడిని."

"కానీ, కానీ, అబ్బాయీ, నీవు తొందరమనిషివి; చెప్పుచున్నాగా."

"నేను తొందర మనిషిని కాను. సత్యాన్ని గురించే నేనుఆలోచిస్తూఉంటాను; సత్యాన్నే మాట్లాడుతాను. అవలేదు, వాడిపని పడతానులే. సెక్షను ప్రధానాధికారికి ఫిర్యాదు చేస్తాను."

అతడు ఫిర్యాదుచేశాడు.

సెక్షను ప్రధానాధికారి లైను పరీక్ష చేయడానికి వచ్చాడు. ఇంక మూడు రోజులకు 'పీటర్సుబర్గు' పట్టణమునుంచి కొందరు గొప్పవాళ్లు ఆదారిని రైలుమీద వెళ్లబోతున్నారు. వాళ్లు రావడానికి ముందు సమస్తమూ సక్రమంగాఉండవలెను. కాబట్టిలైను పరీక్ష జరుపవలసివచ్చినది. అవసరమైనచోట మన్ను రాళ్లు పట్టాలమధ్యపోసి దట్టించారు; ఎత్తుపల్లాలు సరిచేశారు; పట్టాలక్రింది అడ్డుదూలాలు పరీక్షచేశారు. బంధాలు పట్టాలకు సరిగా ఉన్నవో లేవో అని సుత్తులతోకొట్టి చూచారు. మరి మేకులు గట్టిగా బిగించారు. స్తంభాలకి కొత్త రంగులు పూశారు. కొవెలు క్రాసింగుల దగ్గర పచ్చమన్ను చల్లారు. ముసలి కాపలావాని భార్య పట్టాప్రక్కలను పెరిగిన మొక్కలను లాగి పారవేయడానికి అతనిని బయటకు పంపించింది. సీమన్ ఒకవారం బాగా కష్టపడి అంతా రైటుచేశాడు. అతడు తన 'కాఫ్టన్'* ఉతికి బాగుచేసి చిరుగులు కుట్టుకొన్నాడు. డవాలీబిళ్ల ఇటికపొడుముతో ధగధగ మెరిసేలాగ తోమినాడు. వాసిలీకూడా చాలాకష్టపడి పనిచేశాడు. సెక్షను ప్రధానోద్యోగి తోపుడుబండిలో వచ్చాడు. నలుగురు కూలివాళ్లు ఆబండి నడపడానికి పనిచేస్తున్నారు. బండి చక్రాలు బజ్జుమని చప్పుడవుతున్నాయి. బండి గంటకు ఇరవైవెర్స్టుల వేగముతో పరుగెత్తుచున్నది. చక్రాలు హోరుమంటున్నవి. సీమన్ కాపలాయింటికి అది రంయని వచ్చింది. సీమన్ పరుగు పరుగున వెళ్లి సిపాయి వలె నిలబడ్డ

* కాఫ్టన్ అనగా రషియాలో ప్రజలుతొడుగుకొను చొక్కా. నడుము దగ్గర పటకాలో బిగిం
డానికి వీలుగాఉన్న చేతులు పొడుగు చొక్కా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సర్వమూ నివేదించాను. సమస్తమూ సక్రమంగా ఉన్నది.

"ఎంతకాలంనుంచి నీవు ఇక్కడఉంటున్నావు" అన్నాడు ప్రధానాధికారి.

"మే నెల రెండవ తేదీనుంచి దేవరా!"

"సరే, మంచిది. నూటఅరవైనాలుగో నెంబరు దగ్గర ఎవరున్నారు?"

తోపుడుబండిలో అతనితోకూడా వచ్చిన కోష్టమేస్త్రి "వాసిలీ స్పిరిడోనోవ్" అని చెప్పాడు.

"స్పిరిడోనోవ్, స్పిరిడోనోవ్...............? ఊహూ. క్రిందటేడు చివాట్లు తిన్నాడు వాడేనా?"

"అవును వాడే."

"సరే చూద్దాము పోనియ్యి."

కూలివాళ్లు తోపుడుబండి నడపడానికి పూనుకొన్నారు. బండి బయలుదేరింది. సీమర్ దానివైపు చూస్తూ అనుకున్నాడు "నాపొరుగువాడు ఏదో తమాషా చేస్తాడు మొత్తం మీద."

రెండుగంట లైనతర్వాత సీమర్ తనిఖీ చేసుకోడానికి వెళ్లాడు. పల్లములో ఉండగా ఎవరో ఒకమనిషి లైనుప్రక్కనుంచి నడుస్తూ ఉన్నట్టు చూచాడు. అతనికి తలమీద ఏదో తెల్లగా ఉన్నట్టు కనిపిస్తోంది. సీమర్ జాగ్రత్తగా చూచాడు. వస్తూన్నవాడు 'వాసిలీ.' చేతులో ఒకకర్ర బుజంమీద ఒకమూటా పెట్టుకొని వస్తున్నాడు. ఒకచెంపమాత్రం జేబురుమాలుతో కట్టు కట్టుకొన్నాడు.

"ఎక్కడకు వెళ్తున్నావోయి అబ్బాయి" అని సీమర్ కేక వేశాడు.

వాసిలీ చాలా సమీపానికి వచ్చాడు. అతని ముఖము వికలముగా ఉంది. సుద్దలాగ తెల్లబడి పోయినది. కళ్లు ఉగ్రముగా ఉన్నవి. మాట్లాడడానికి ప్రయత్నించాడుకాని మాట సరిగా వచ్చింది కాదు. "నేను పట్టణానికి, మాస్కో, బోర్డుకు వెళ్లుచున్నాను."

"బోర్డుదగ్గరకా...........అలాగా అలాగా! ఫిర్యాదు చేయడానికి కాదూ? వదలిపెట్టుదూ, వాసిలీ స్టిపెనిచ్, మరిచిపోదూ!"

"కాదన్నా, నేనుఎంతమాత్రమూమరిచిపోను-మరిచిపోయేరోజులు వెళ్లాయి. చూడు నన్ను మొహంమీద ఎల్లా కొట్టాడో; రక్తం కారి పోతోంది. బ్రతికి ఉండగాను మరిచి పోతానా? ఇలాగ వదలిపెడతానా?"

సీమర్ అతనిచెయ్యి పట్టుకొన్నాడు. "వదలి పెట్టుదూ, స్టిపెనిచ్. నేనుచెప్పేమాట సత్యం; ఇప్పుడున్న పరిస్థితులు బాగుపడవు సుమీ."

"పరిస్థితులు బాగుపడవమా? నేను బాగు చెయ్యలేనని నాకు తెలుసును. భగవంతుడిచ్చేఅదృష్టాన్ని గురించి నీవు చెప్పిన మాటా వాస్తవమే. నాఅదృష్టం నేను బాగుచేసుకోలేను. కాని సత్యాన్ని అనుసరించవలసి ఉంటుంది గాదూ."

"ఏమిటి జరిగిందో చెప్పు"

"ఏమిటి జరిగిందా! అన్నీ పరీక్ష చేశాడు. తోపుడుబండి దిగి ఇంట్లోకి వెళ్లాడు. జాగ్రత్తగా ప్రతీదీ పరీక్ష చేస్తాడని నాకు తెలుసు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అంచేతనే అంతా సరిగ్గా ఉంచాను. వెళ్లిపోవడానికి సిద్ధంగా ఉండగా నేనుఫిర్యాదుచేశాను. నన్నుచూచి మండిపడి అన్నాడుగదా:'ఇదిగవర్నమెంటు తనిఖీ. ఇప్పుడు నీవు పాములను గురించి ఫిర్యాదు చెయ్యడానికి వచ్చావా? ప్రీవీసభ్యులకు సంబంధించిన విషయమిది. నీ కాబేజీల గొడవతో ఇప్పుడా రావడం?' నేను అనకుండా ఉండలేక పోయాను. ఒక్క మాట అన్నాను. అ ట్టేలేదు. కాని అతనికి కోపం వచ్చింది. నన్ను మొహంమీద ఒక్కటి వేశాడు; నేను అలాగ నిలబడిపోయాను. వాళ్లు బండి తీసుకుపోయారు. నేను తెలివి తెచ్చుకొని మొహం కడుక్కొని బయలు దేరాను."

"కాపలాయింటి సంగతి?"

"నాభార్య అక్కడ ఉంది. ఆమెఅంతా సరిగ్గా చూస్తుంది.నాళ్లూ వాళ్లరైళ్లూ విరగడైపోను."

వాసిలీ లేచి వెళ్లిపోవడానికి సిద్ధపడ్డాడు.

"సెలవు, ఇవనిచ్ నాకు న్యాయం జరుగుతుందని చెప్పలేను."

"నడిచి వెళ్లాలనా ప్రయత్నం."

"స్టేషనుదగ్గిర బూర్సుబండిమీద వెళ్లనివ్వమని అడుగుతాను. రేపు మాస్కోలో ఉంటాను."

ఒకరివద్ద ఒకరు సెలవు తీసుకొన్నారు. వాసిలీ ప్రయాణమై వెళ్లాడు. చాలాకాలం అతడు ఎవరికీ కనిపించలేదు. అతనిభార్య అతని పనంతా చేస్తూన్నది. రాత్రింబగళ్లు నిద్ర లేదు. పెనిమిటికోసం కనిపెట్టుకుఉండడంవల్ల సగమైపోయింది. మూడవరోజున ఇన్స్పెక్టరుగారి రైలు ఆదారిని వెళ్లింది. ఒకఇంజనూ, ఒక సామానుబండీ, రెండుఫస్టుక్లాసు బండ్లూను. వాసిలీ అప్పటి డక్కడ లేనేలేడు. నాల్గవరోజున సీమన్ వాసిలీ భార్యను కలుసుకొన్నాడు. అస్తమానం ఏడవడంవల్ల ఆమె మొహం పొంగిఉన్నది. కళ్లు ఎర్రగా ఉన్నవి. "నీపెనిమిటి తిరిగి వచ్చాడా?" అని ప్రశ్నించాడు.

ఆమె చెయ్యి ఆడించి, ఏమీ చెప్పకుండా వెళ్లిపోయింది.

చిన్నతనములో సీమన్ 'విల్లో' శాఖలతో పిల్లంగ్రోవులు చెయ్యడం నేర్చుకొన్నాడు.విల్లో కర్రలో బెండుఊడకొట్టి అవసరమైనచోట్ల రంధ్రాలుపొడిచిచివరపీపిచేసి ఎంతోబాగా ఏపాట పడితే ఆపాటపాడడానికి వీలుగాఉండేటట్లుపిల్లంగ్రోవులు చేసేవాడు. పనిలేక ఖాళీగాఉన్నప్పుడు చాలాగొట్టాలుచేసి బూర్సుబండి గార్డుకూ, తనకూ, పరిచయం వుండడంవల్ల అతని ద్వారా పట్టణం పంపించేవాడు. మార్కెట్టులో అమ్మగా ఒక్కొక్కదానికి రెండు కోపెక్కులు* వంతున అతనికిముట్టేది. తనిఖీఅయినమూడో రోజున, ఆరుగంటలబండి చూడడానికి భార్యను యింటివద్ద అట్టేపెట్టి కత్తి తీసుకొని పిల్లంగ్రోవులకు కర్రలను కొట్టడానికి అతను అడవిలోకి వెళ్లాడు. తనబీటు చివరదాకావెళ్లి రైలుమార్గం మోచేతిమలుపు తిరిగినచోట గట్టుదిగి అడవిలోనికి వెళ్లాడు. అరవెర్స్టు దూరంపై

---

* ఒక కోపెక్కు రూబుల్‌లో నూరోవంతునాణెము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒకపెద్ద తేమప్రదేశ మున్నది. దాని సమీ
పంలో పిల్లంగ్రోవులు చెయ్యడానికి అనుకూ
లంగా ఉండే విల్లోకర్రలు దొరుకుతవి. ఒక
మోపుకర్రలు కొట్టి యింటికి వెడదామని
బయలుదేరాడు; అడవిలోనుంచి నడుస్తున్నా
డు. సూర్యుడు పడమర అస్తమించబోతు
న్నాడు. అంతా నిశ్శబ్దము. పక్షుల రుత
ములూ, కాలిక్రిందపడ్డ ఎండాకుల చప్పుడూ
మాత్రం వినపడుచున్నవి. సీమర్కా మరికొంత
దూరం నడిచాడు. రైలుపట్టాలు సమీపిం
చాడు. ఒక లోహపు వస్తువుమీద ఇంకో
లోహపువస్తువును కొట్టితే పుట్టే శబ్దమువంటి
శబ్దము అతను విన్నట్టు భావించాడు. సీమర్కా
వడివడిగా నడుస్తున్నాడు. ఆప్రాంతాల రైలు
పట్టాలకు ఏమీ మరమ్మతులు లేవు. "ఏమిటి
ఈశబ్దము" అని అత డాలోచించాడు. అడవి
పొలిమేర దాటాడు. రైలుగట్టు కనిపించింది.
రైలు లైనుమీద ఎవరో కూర్చుని ఏమో
చేస్తున్నారు. నెమ్మదిగా సీమర్కా అతన్నిసమీ
పించాడు. ఎవరో మరమేకులు ఎత్తుకుపోవ
డానికి వచ్చారని అత డనుకున్నాడు. సీమర్కా
చూచాడు. ఆమనిషి లేచాడు. అతనిచేతులో
గునప మున్నది. దానిని ఒకపట్టా క్రింద పెట్టి
ఒకవైపుకు కదిపాడు. సీమర్కా కళ్లు చీకట్లు
గ్రమ్మినవి. కేకవేద్దా మనుకున్నాడు. మాట
రాలేదు. ఆమనిషి వాసిలీఅనిఅతడుచూచాడు.
అతనికేసి గబగబ పరుగెత్తుకువెళ్లాడు. వాసిలీ
గునపమూ, రెంచీ చేత్తోపుచ్చుకొని గట్టుఅవ
తలవైపునుంచి పారిపోయాడు.

"వాసిలీ స్టెపెనిచ్! అన్నా! నాయనవు గావు!
తిరిగి రావు! గునపము నాకియ్యి! రైలుపట్టా
యథాప్రకారం పెట్టుదాము. ఎవరికీ తెలి
యదులే. తిరిగిరా, పాపపంకం తగలకుండా
నీఆత్మను కాపాడుకో!"

వాసిలీ తిరిగి రాలేదు. అడవిలోకి వెళ్లి
పోయాడు.

ఊడదీసినపట్టా దగ్గిర సీమర్కా నిలబడ్డాడు.
కర్రలమోపు క్రింద పారవేశాడు. అప్పుడు
వచ్చేబండి సామానుబండి కాదు. ప్రయాణీకు
లుండేబండే. దాన్ని ఆపడానికి అతనివద్ద
సాధనాలేమీ లేవు. జెండాలులేవు. పట్టిచేతు
లతో రైలుపట్టా సరియైన స్థలంలో పెట్టడము
సాధ్యము కాదు. మేకులు బిగించడమూ
సాధ్యముకాదు. ఎక్కడికైనా పరుగెత్తాలి.
సాధనాలు తేవడానికితప్పకుండా అతను తన
యింటికి పరుగెత్తవలసి ఉన్నది. భగవంతుని
సహాయం ఉండాలి!

వగర్చుకొంటూ సీమర్కా యింటివైపు పరుగె
త్తాడు. పరుగెత్తుతున్నప్పుడు ఏక్షణం క్రింద
పడిపోతానో అని అనుకొన్నాడు. అడవి వెలు
వడి పరుగెత్తాడు. అతనియింటికి యింకదూరం
సుమారు రెండువందలగజాలు ఉన్నది. మిల్లు
తాలూకు కూత అప్పుడే వినిపించింది. ఆరు
గంట లయింది. ఆరుగంటల రెండు నిమిషము
లకు రైలుబండి రానై ఉన్నది. కరుణామయు
డా! భగవంతుడా! ఏపాపమూఎరగని ప్రయా
ణీకులను కాపాడవా! సీమర్కాకు జరగబోయే
సంగతిఅంతా కనిపిస్తూనే ఉంది: 'ఇంజను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వస్తుంది. ఊడదీసినపట్టాలో దాని ఎడమవైపు చక్రాలు తగులుకుంటవి. ఇటూ అటూ ఊగు లాడుతుంది. తిరగబడుతుంది. రైలుపట్టాలను పైకి లాగుకుపోతుంది. పట్టా క్రింది దూలాలు వదలిపోతవి. సరిగా అక్కడే లైను మలుపు తిరిగింది; గట్టు ఇరవై అయిదు గజాలు ఏటవాలుగా ఉన్నది అక్కడ. ఆ రైలుబండిలో మూడోక్లాసు బం..........స్త్రీలు, చిన్న పిల్లలు క్రిక్కిరిసి కూర్చునిఉంటారు ......... ఏమి వస్తుందో తెలియకుండా వారంతా కూర్చుంటారు. భగవంతుడా! ఏమి చెయ్య మన్నావు. ఎంతగట్టిగా పరుగెత్తినా ఇంటికి వెళ్లి తిరిగిరావడమునకు వ్యవధిచాలదు......! సీమర్క యింటికి వెళ్లలేదు. అంతకన్న వడిగా పరుగెత్తుకొంటూ వెనకకు వెళ్లాడు. ఒళ్లు తెలియకుండా తరవాత క్షణంలో ఏమి జరుగబోతుందో తెలియకుండా పరుగెత్తాడు. రైలు ఊడదీసిన స్థలానికి పరుగెత్తివెళ్లాడు. అతడు పడవేసిన కర్రలమోపు అక్కడేఉన్నది. వంగి ఒకకర్ర తీసుకొని-ఎందుకో తెలియదు- ఇంకా ముందుకు పరుగెత్తాడు. రైలుబండి వస్తూ న్నట్టు అతను భావించాడు. దూరము నుంచి రైలుకూత వినిపించింది. రైలుపట్టాలు కొంచెము కొంచెము అదురుతున్నవి. ఇంకా పరుగెత్తడానికి అతనికి శక్తిచాలదు. పట్టా ఊడదీసినస్థలానికి రెండువందల గజాలు ముందు ఆగాడు. ఆక్షణాలోనే అతడు ఏమిచేయవలసి ఉంటుందో ఛట్టున తట్టింది. తన టోపీ తీసివేశాడు. అందులోనుంచి ఒక జేబురుమాలు తీశాడు. తన కాలిజోడులోనుంచి కత్తిని పైకి లాగాడు. సిలువవంటి చిహ్నము తనముందు వ్రేలితో గాలిలో వేసుకొన్నాడు. భగవంతుడా రక్షించు!

మోచేతికిపైన ఎడమదండలో కత్తినిగుచ్చాడు. వేడినెత్తురు ప్రవాహము ఉబికివచ్చింది. జేబురుమాలు ఆరక్తముతో తడిపాడు. ముడితేలు తీశాడు. విడదీసి కర్రకు కట్టాడు. ఎత్తుగా ఎత్తిపట్టుకొన్నాడు—అతని ఎర్ర జెండా.

జెండా ఊపుతూ అక్కడే నిలుచున్నాడు. అప్పుడే అతడు రైలుబండిచూచాడు. ఇంజను డ్రైవరుమాత్రం అతనిని చూడలేదు. బండి సమీపిస్తుంది. రెండువందల గజాల దూరంలో బరువుబండి ఆపడం ఎవరికీ శక్యం కాదు.

జెబ్బనుంచి రక్తముఊరి కేకారిపోతోంది. చేతిని ప్రక్కకు అణచిపెట్టాడు. దానివల్ల ప్రవాహం కట్టుపడుతుం దనుకొన్నాడు. కానిరక్తం ప్రవహిస్తూనే ఉంది. రెక్కలోపడ్డ గాయం లోతుగా ఉంది. అతనికి తల తిరుగుతోంది. కళ్లముందర నల్లటి-ఈగలు ఎగురుతూన్నట్లు అయింది.........కళ్లు చీకట్లు గ్రమ్మినవి.... చెవుల్లో గంటలు వాయించిన శబ్దము వి బడుతోంది. బండి అతనికి అవుపించడం లేదు. దానిశబ్దము వినిపించడంలేదు......అతని మ స్సులో ఒక్కటే అలోచన! "నేను నిలువ లేను—నేను పడిపోతాను— జెండా క్రిం పడవేస్తాను—బండి నామీదనుంచి పోతుం అయ్యో దేవుడా! రక్షించవా......!" అ కళ్లు మసకలుగ్రమ్మినవి.మనస్సుశూన్యమైన జెండా వదలివేశాడు. ఆ నెత్తురుజెండా క్రిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడలేదు. ఎవరిచెయ్యో దానిని పట్టుకొన్నది. ఎవరిచెయ్యో దానిని వచ్చేబండీకేసి పైకెత్తి ఉంచింది. ఇంజనుడ్రైవరు దానిని చూచాడు. వాల్వుమూసివేశాడు. ఇంజనుమరల వెనక్కు త్రిప్పాడు. రైలుబండి ఆపివేశాడు.

ప్రయాణీకులు బళ్లుదిగి గుంపులు గుంపులుగా వచ్చారు. ఒళ్లంతా రక్తంతో ఒకడు స్మృతి తప్పి పడిఉండడం చూచారు. ఇంకొకడుఅతని ప్రక్క నిలబడి కర్రకు కట్టిన నెత్తురుజెండా ఎత్తిపట్టుకొని ఉండడం చూచారు.

వాసిలీ ఒకమాటు చుట్టూచూచి తలవంచుకొన్నాడు.

అతడన్నాడు, “నన్ను కట్టివేయండి. రైలు పట్టా ఊడదీసింది నేను.”

—[చింతాదీక్షితులు చేసినతర్జుమా.]



# కీరము

వెలువోలు సీతారామయ్య చౌదరి గారు

సలలితారామసీమల సంచరించి
　　పుష్పఁదీప మేడలయందుఁ బవ్వళించి
మలయపవనుని మందారవంబుతోడ(?)
మృదుమధురమైన కంఠంబు మేళవించి
ప్రకృతి రామణీయకమును బాడుకొనుచుఁ
గవికుమార, సౌఖ్యంబును గాంచినావు
సతతమును నీవు స్వేచ్ఛాప్రచారి వగుటఁ
గాల మత్యంత ముదముతోఁ గడపినావు
ఇంక నెన్నాళ్లు నీ మురిపెంబు, శుకమ?

భువనమోహనమగు నీ తనువ్రను గాంచి
సహజమాధుర్య మగు గానసార మరసి
లాలసుండయి యుండెను బాలుఁ డొకఁడు
పంజరంబున బంధింపఁబడెద వీవు
స్వేచ్ఛ కెడబాటనుచుఁ జింత సేయఁబోకు
బ్రహ్మలిఖితంబుఁ దుడువ నెవ్వరివశంబు
బంధమున మోక్షసంపద నొందవచ్చు(?)
దీనితత్త్వంబు నరసి వర్ధిల్లు, శుకమ?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ముక్కోటి యేకాదశి

[జిజ్ఞాసువు]

ఈయేకాదశి కీపే రెట్లుకలిగినది?(తెలుగు) మూడు + (సంస్కృతము)కోటి— ప్రాణగోష్ఠమునంటిది. మూటికి కోటికి సంబంధ మేర్పడి యటుపై నేకాదశి కలుసుకొనినది.

ముక్కోటి యనగా మూడు కోట్లు. మూడుకోట్లదేవత లాదినమున శ్రీరంగమో మఱియునెద్దియో దివ్యక్షేత్రమున జేరుదురను ప్రతీతిగలదు. దేవతలసంఖ్య ముప్పది మూడు కోట్లుగదా? మూడుకోట్లకే లెక్క వచ్చిన మొదల మిగిలిన ముప్పదికోటుల కీ యేకాదశి ముఖ్యముగాదా? మఱియు నీ ముప్పదిమూడు కోట్లను ఒకచోట నుండువారుగారు. ప్రమాణము:—"యే దేవా దివ్యేకాదశస్థ; పృథివ్యా మధ్యేకాదశస్థ..." దివియందు పదునోకండు; పృథివియందు పదునోకండు; అప్పుల బదునో కండు. ఈవిధమున నివేశనవిభాగము లేర్పడి యుండగ నీమూడుకోట్లు నేన్యాయమున నేమ కము చేయగలిగె?

ఈమూడుకోట్లను దేవతలుగారు. మూడుకోట్లు తీర్థరాజములనియు, ఇవియన్నియు మార్గశీర్ష శుద్ధద్వాదశ్యరుణోదయమున తిరుపతికొండమీదనుండు స్వామిపుష్కరిణిని బ్రవేశించునవియు,అప్పుడందుస్నానముచేసినవిశేష ఫలము గలదనియు పురాణప్రస్తావమైయున్నది. ఎద్దియో యొక దివ్యశక్తిచే తీర్థము లందు జేరగలిగినను తద్గతమాహాత్మ్యము ద్వాదశికి చెల్లినది కాని యేకాదశికి జెప్పబడలేదు. ద్వాదశ్యేకాదశుల నైక్యభావము సమర్థింపవలయునా? లేక లక్షణావృత్తిం బ్రయోగించి ద్వాదశీమాహాత్మ్య మేకాదశికి సాధింపనగునా? లేక దశమ్యేకాదశీద్వాదశులు గలసి యేకాదశీవ్రతపుణ్యోత్పాదనము చేయునా? "మాసేతు మార్గశీర్షాఖ్యే ద్వాదశ్యాం పూర్వపక్షకే,అరుణోదయవేళాయాం త్రిషు లోకేషు విశ్రుతాః; తిస్రః కోట్యర్థకోటీచ తీర్థానాం సుమహామతే, సాన్నిధ్యం తత్ర కుర్వంతి స్వామిపుష్కరిణీజలే" ఇత్యాదివాక్యములు వామనపురాణాంతర్గత వేంకటాచల మాహాత్మ్యఘట్టమున జూడనగు.

ఈ రెండుతిథుల కయుతసంయోగము గల్పించి ద్వాదశికి జెప్పినదానియందు నేకాదశికినిగూడ నన్వయింపజేసినను అందుస్నానఫల ముపపాదింపబడియున్నదియె కాని ముక్కోటిపకాదశీప్రయుక్త ద్వారదర్శనప్రసక్తి మట లేకున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏపంచాంగమును జూచినను ముక్కోటి యేకాదశికి "శ్రీరంగాదిదివ్యక్షేత్రేషు ద్వార దర్శన" మ్మని వ్రాయబడియుండునే కాని స్వామిపుష్కరిణీస్నానఫలము చెప్పబడుటలేదు. ద్వారదర్శనమాహాత్మ్య మీయేకాదశి కెట్లు కలిగినది? సామాన్యముగ నేకాదశి భరతఖండమం దంతటను చాతుర్వర్ణ్యమునకు వ్రతదినమై, యుపవాసదినమై యున్నది. ముక్కోటి యేకాదశియను ప్రమితి కేమియాధారముగలదో విచారింపవలయును. శ్రీరామనవమి, నృసింహజయంతి, కృష్ణాష్టమి, ప్రథమైకాదశి, నరకచతుర్దశి, దీపావళ్యమావాస్య, రథసప్తమి, మహాశివరాత్రి లోనగునవి తిథి ప్రధానములై ఆసేతుహిమాచలమగు వ్యాప్తిని గలిగియున్నవి. ఈ ముక్కోటి ప్రాయికముగ మద్రాసు ప్రెసిడెన్సిలో మాత్రమె ప్రచారముగ నున్నది. ఉత్తరరాజ్యములలో దీని ప్రచారమే లేదు. మద్రాసు ప్రెసిడెన్సిలో నీ పేరందరికి దెలిసియున్నను, అన్నిగొప్ప విష్ణుక్షేత్రములలో దీనియనుష్ఠానము శ్రీరంగములో నున్నంత ప్రతిష్ఠను బొందియుండ లేదు. కంచికి గరుడసేవ, కాళహస్తికి శివరాత్రి, తిరువళ్లూరికి తైయమావాస్య, అరుణాచలమునకు దీపదర్శనము, భద్రాచలమునకు శ్రీరామనవమి యైనట్లు శ్రీరంగమునకు ముక్కోటి ప్రసిద్ధమైయున్నది.

పండ్రెండుమాసములలో దగులు నేకాదశుల పరిగణనమున ముక్కోటియని యొకటి పేర్కొనబడియున్నటులు లేదు. ఏకాదశీ మాహాత్మ్యమును జూడ మార్గశీర్ష (ఆగ్రహాయణి) కృష్ణపక్షైకాదశి మొదలు ప్రతిపక్షమునకు వచ్చు నేకాదశుల క్రిందిపే ర్లేర్పడియున్నవి:—

| | |
|---|---|
| మార్గశీర్ష బ ౧౧ | ఉత్పన్నా |
| ,, శు ,, | మోక్షా |
| పుష్య బ ౧౧ | సఫలా |
| ,, శు ,, | పుత్రదా |
| మాఘ బ ౧౧ | షట్తిలా |
| ,, శు ,, | జయా |
| ఫాల్గున బ ౧౧ | విజయా |
| ,, శు ,, | ఆమర్దకీ |
| చైత్ర బ ౧౧ | పాపమోచనీ |
| ,, శు ,, | కామదా |
| వైశాఖ బ ౧౧ | వరూధినీ |
| ,, శు ,, | మోహినీ |
| జ్యేష్ఠ బ ౧౧ | అపరా |
| ,, శు ,, | నిర్జలా |
| ఆషాఢ బ ౧౧ | యోగినీ |
| ,, శు ,, | పద్మా |
| శ్రావణ బ ౧౧ | కామికా |
| ,, శు ,, | పుత్రదా |
| భాద్రపద బ ౧౧ | అజా |
| ,, శు ,, | వామనా |
| ఆశ్వయుజ బ ౧౧ | ఇందిరా |
| ,, శు ,, | పాపాంకుశా |
| కార్తిక బ ౧౧ | రమా |
| ,, శు ,, | ప్రబోధినీ |
| అధికమాస (మలమాస) బ ౧౧ | కమలా |
| ,, శు ,, | సుభద్రా |

అధికమాసములు గలసి ఇరువదియారు ఏకాదశు లగుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మార్గశీర్షమేల మొదల బలుకబడినదన "మాసానాం మార్గశీర్షోఽహం" (భగవద్గీతా అ. ౧౦, శ్లో. ౩౫.) అని చెప్పుటకు గలకారణమే యిచటను వర్ణింపగలదు.

ముక్కోటియేకాదశినిగూర్చిన యీ చర్చయందు మార్గశీర్ష ప్రశంస ముఖ్యమగు చున్నది. మార్గశీర్షము హేమంతప్రారంభము. ఈ మాసముననే "గోపకుమారికలు రేపకడలేచి చని కాళిందీజలంబులం దోగి జలతీరంబున నిసుమునం గాత్యాయనీరూపంబుఁ జేసి......మాసవ్రతంబు సలిపిరి." (భాగవతము: దశమస్కంధము, హేమంత వర్ణన). "ఆండాళ్ తిరుప్పావై" యని ప్రసిద్ధి జెందిన ముప్పది యరవపద్యముల కీ మాసమె యాలంబనమైనది. ఇదియె కొంచె మించుమించుగ ధనుర్మాసమునకు సరిపోవునది. సంక్రమణములబట్టి మాసపరిగణనము చేయువారికిని చాంద్రమాసము ననుష్ఠించువారికిని దినములు గొన్ని హెచ్చుతగ్గులు గలుగుచున్నవి. ఇంతియ భేదము. మార్గశీర్ష వికారమె ద్రావిడమున మార్గళియైనది. మన దేశమున మాసపరిగణనము అమావాస్యాంతమై వెలయుచుండ నౌత్తరాహులు (People north of the Vindhyas) పూర్ణిమాంతమాసమును గ్రహించియున్నారు. అందుచేత వారిమాసము మనమాసమునకంటె నొక పక్షము ముందుగ ప్రారంభమగును. వారు కృష్ణప్రతిపత్తునుండి మాసమును లెక్కించుటచే నేకాదశీపరిగణనమందు మార్గశీర్ష కృష్ణైకాదశి మొదట దగులుటకు గారణమైనది.

మొత్తమునకు ముక్కోటియేకాదశి ధనుర్మాసశుక్లైకాదశిగనున్నది. పుష్యశుక్లైకాదశికిలోపలనే సూర్యుడు మకరాయనగతుడగునేని ముక్కోటి మార్గశీర్ష శుద్ధైకాదశీదినముననే సౌరులకును గ్రాహ్యమగుచున్నది. ఈ యక్షయ వత్సరమున నిటులే యాచరింపబడినది.

చాంద్రమ్మార్గశీర్షమును సౌరధనుస్సునకనువర్తింపజేసిచూతము. వామనపురాణమున "మాసే తు మార్గశీర్షాఖ్యే ద్వాదశ్యాం పూర్వపక్షకే" యని స్పష్టముగ జెప్పబడి యున్నది. ఇక భవిష్యోత్తరమునను, స్కాందమునను "ధనుర్మాసే సితే పక్షే ద్వాదశ్యా మరుణోదయే" ఇత్యాదిగలదు. గీతాచార్యుండు గూడ మార్గశీర్షమునే యాత్మవిభూతిపదముగ జెప్పి యుండుటచే మనము మార్గశిరమునే స్థిరము చేసికొందము. ముక్కోటియేకాదశి వైష్ణవాలయములందే విశేషముగ పాటింపబడుచుండుట చేతను, ద్రావిడవైష్ణవులు సౌరమాసమునే యాచరించుచుండుటచేతను ధనుర్మాసముసశుక్లైకాదశి కీకీర్తిపవిత్రతలు సంభవించినవి.

ఉదాహృతపురాణప్రమాణములుద్వాదశిని జాటుచున్నవి. అనుభవమున నేకాదశికి గలకీర్తి ద్వాదశికి లేదు. శ్రీరంగక్షేత్రమాహాత్మ్యమున ముక్కోటియేకాదశినిగూర్చి విస్తారమగు ప్రశంస యుండగలదు. ఆగ్రంథము లభింపలేదు. నెల్లూరురంగనాయకులపేటలో నెలకొనియుండు శ్రీతల్పగిరిరంగనాథస్వామి వారి సన్నిధియందు మాత్రము ముక్కోటి ప్రయుక్తముగ ముక్కోటిద్వాదశిని మాహ్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున వామనపురాణాంతర్గత శ్రీస్వామిపుష్కరిణీమాహాత్మ్యప్రవచన మనాదిగ జరుగుచున్నది. ఆ పురాణవాక్యములు ద్వాదశీప్రస్తావనమాత్రములయి యున్నవి.

ముక్కోటియేకాదశి యిటులుండ వైకుంఠైకాదశి యను నొకమాట గలదు. ఈ రెండుపదములకును విషయమగు నేకాదశి యొక్కటియె. కొందరు ముక్కోటియనియు గొందరు వైకుంఠైకాదశియనియు బిలుతురు. ముక్కోటియనుటకు కారణము విమర్శింపబడినది. ఈయేకాదశికి వైకుంఠసంబంధ మేలకలిగెనో విచారింపవలయును. ఈయేకాదశియెల్లపుడును మకరసంక్రమణమునకుఁ బూర్వము వచ్చుచుండును. ఉత్తరాయణప్రవేశము నెదురుచూచుచుండును. ఉత్తరాయణప్రవేశము పుష్యశుక్లైకాదశిని దాటివచ్చునెడల మార్గశీర్ష శుక్లైకాదశియే ముక్కోటి లేక వైకుంఠైకాదశిగ నిర్ణయింపబడుచున్నది. మార్గశీర్ష శుద్ధైకాదశికి "మోక్ష" యని పేరున్నటులు ఏకాదశీనామపట్టికయందు జూపబడి యున్నది. ఈపేరు నాధారపరచి వైకుంఠప్రాప్తియె మోక్షమనుభావముతో దీనికి వైకుంఠైకాదశి యను పేరు ప్రసిద్ధమై యుండునా? ఉత్తరాయణదక్షిణాయనములు రెంటిలో పూర్వతరమగునది "అనావృత్తి" (పునరావృత్తిరహితపదము) నొసంగునని గీతాది ప్రమాణములుండుటచే సూర్యు డుత్తరాభిముఖుడగుటయె సవితృమండలమధ్యవర్తి యగు శ్రీమన్నారాయణుని పరమధామం బగు వైకుంఠమార్గము జూపినటు లగుచున్నదను భావమును బురస్కరించికొని ఈయేకాదశికి వైకుంఠైకాదశి యని ప్రసిద్ధిగలుగుటకు గారణమై యుండునా? ఇరువదియారేకాదశులకు ఇరువదియారు నామము లుండియు "వైకుంఠ" నామమాగణమున జేరలేదు. ఆ యిరువదియారు నామములు గాక విశేషకారణములచే గొన్ని యేకాదశులకు విశేషనామములు గలిగియున్నవి. శయనైకాదశి, పరివర్తనైకాదశి, బోధనైకాదశి, భీష్మైకాదశి ఇత్యాదు లుదాహరణములు. వైకుంఠైకాదశి మార్గశీర్ష పుష్యముల నడుమ వికల్పముగ నున్నది. కార్తికశుద్ధచతుర్దశికి వైకుంఠచతుర్దశి యను పేరు గలదు. కారణమేమియో?

మరియు వైకుంఠైకాదశినాడు వేకువన ఉత్తరముఖముగ నుండు నొక ద్వారముకడ ద్వారదర్శనోత్సవము జరుగుచున్నది. "అగ్నిర్జ్యోతి రహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్" (భగవద్గీత అ. 8.) అనియు, "ధూమో రాత్రిస్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్"అనియు ప్రమాణము లుండుటచేత ఈరెండయనముల సంధి రాత్రిందివముల సంధివలె నుండునుగాన వేకువజాము (ఉషఃకాలము) ద్వారదర్శనమునకు బ్రశస్తమనవచ్చును. ఉత్తర ద్వారముగ నుండుటయందును విశేషముండవలయును. ఇది సూర్యు డుత్తరాభిముఖు డగుటకు సూచకమా, లేక శ్రీవైష్ణవసాంప్రదాయసంకేతమగు త్రిపాద్విభూతి ఉత్తరమునకు సంబంధపడియుండు ననుటకు సూచకమా?


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చాతుర్వర్ణ్య మాచరించుచుండు పండుగులు పర్వములు నెవ్వియో జ్యోతిష విశేషములకు గాని, కర్షకాది వ్యాపారములకుగాని, మహాపురుషచరిత్రములకు గాని పొందుపడు నటులున్నవి. ఈ ముక్కోటి ఇందేగణమున జేరునదియు స్పష్టపడలేదు. ఇది పండుగు గాదు; పర్వముగాదు. చాతుర్వర్ణ్యమువారనుష్ఠించు మిగత సంకేతములు గూఢములై పామరదృష్టికి మూఢభక్తిపై నాధారపడియున్నటులు తోచుచున్నవి. అట్లుకాక ఇవియన్నియు సహేతుకములనియు, మీమాంసా సంచారమునకు ఒప్పినవి యనియు శాస్త్రీయములనియు హేతువాదోపపత్తులచే విశదీకరింపబడినయెడ వైదిక మతోద్ధరణమునకు గొప్పసహాయముగ నుండును.



# భ్రాంతి విచ్ఛేదము

మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి

(లలితకళా కార్యస్థానము)



వ్యాసకర్త

ఏదిదైవమను నీలోన నేకమగుట
 నీకు భిన్నముగా నేది నిలువనేర్చు?
శాశ్వతానందమూర్తి! నీ చందమెఱిగి
తిరుగువానికి చేకురు దివ్యపదవి.

కలదు కలదంచు నెల్లరు బలుకుచుంట
గాఢయత్నమ్ముపాలయి గాసివడితి
గనులువిప్పినమాత్రాన గానబడదు
నిన్ను గనుగొనజాలక యున్నినాళ్లు.

నిన్ను గన్నారజూచిన నిముసమందె
మున్ను చేగొన్నభ్రాంతి నిర్మూలమయ్యె
జగముచుట్టము బోడగన్న జగమునుండి
అంధకారమ్ము దూరమై యరుగునటుల.

(ఆనందగానమునుండి





# అంబష్ఠసుత్తము

[అంబష్ఠ సూత్రము]

కె. రంగాచార్యులుగారు, యమ్. ఏ., బి. యల్.

(వెనుకటిసంచిక తరువాయి)

6. "వల్లె" అని యంబష్ఠుండునల్క యాసనముపై నుండి లేచి, పౌష్కరసాదికి నమస్కరించి, యాఁడుగుఱ్ఱములఁ బూఁచిన రథం బెక్కి, బ్రాహ్మణయువకపరివృతుండై, యిచ్ఛానంకల వనముం జేరెను. రథంబు పోవుటకు వీలైనంతవఱకు మార్గము ననుసరించి చని, రథమునుండి డిగ్గి, కాలినడకను వనంబులోనికిం జనెను.



వ్యాసకర్త

7. అయ్యవసరంబున భిక్షుకులు వనంబులో నిటునటుఁ దిరుగుచుండిరి. వారియొద్ద కంబష్ఠుఁడు చని "ఇపు డెచట పూజ్యుఁడగు గోతముఁడుండును? అతనిదర్శనమునకై మేమిచటికి వచ్చితిమి" అని నుడివెను.

8. భిక్షుకులు "ఈ బ్రాహ్మణయువకుఁడైన యంబష్ఠుండు సువంశోద్భవుండును, విఖ్యాతిఁ జెందిన బ్రాహ్మణపౌష్కరసాది ఛాత్రుండునై యున్నవాఁడు. భాగవతుఁ డట్టివానితో శాస్త్రార్థము చేయ సమర్థుఁడు కాఁడు" అని యిట్లు వితర్కించుకొనుచు అంబష్ఠునితో నీరీతిగ నుడివిరి. "ఓయీ! అంబష్ఠా; అదిగో అచట వాని వాసము. తలుపు మూయఁబడి యున్నది. నీవు చప్పుడు లేక చొచ్చి మెల్లఁగ దగ్గి యర్గళపండము పైఁ గొట్టుము. భాగవతుఁడు భవదర్థము కవాటము తెఱచును."

9. అంబష్ఠుఁ డట్లొనర్చెను. భాగవతుఁడు తలుపు తెఱచిన నంబష్ఠుఁడు లోనికిం జనెను. మఱియు నాతనితో బ్రాహ్మణయువకులును లోనఁ బ్రవేశించి భాగవతునితో మర్యాదాసూచకములగు వాక్యములఁ బల్కి నమస్కారాదుల నొనర్చి, యుచితాసనములపైఁ గూరుచుండిరి. అంబష్ఠుఁడును నేదియో యొకరీతి మర్యాద వాక్యములఁ బల్కి భాగవతుఁడు కూరుచుండి యుండఁగ నిలకడ లేక తొందరపాటుతో నిటునటుఁ దిరుగుచుండెను.

10. భాగవతుఁడు: "ఓయీ! అంబష్ఠా! ఈరీతిగ నీవు బహువృద్ధులగు నాచార్యులతోడను, కడు ముదుసలులును నీగురువులకు గురువులును నైనవారలతోడను నిటునటుఁ దిరుగుచు, నాసీనుఁడనై యున్న నాతో సంభాషింపుటయా?"

11. అంబష్ఠుఁడు: "గోతముఁడా! నిశ్చయముగ నట్లు కాదు. బ్రాహ్మణుఁ డెవ్వఁడైనను నడుచుచుండ నట్టివానితో నడుచుచునే భాషించెదను. ఆసీనుండై యున్న బ్రాహ్మణునితో నాసీనుఁడనై, సుఖోపవిష్టుండైన బ్రాహ్మణునితో సుఖోపవిష్టుండనై నాక్రుచ్చెద. కాని ముండితులతోడను, కుభిక్షుకులతోడను, నీచదస్యులతోడను, 'బంధుపాదపద్ముల'తోడను నే నిపుడు భాషించుచున్నటులనే భాషించెద."

గోతముఁడు: "అంబష్ఠుఁడా! నీవిచటకు వచ్చినపుడేదియో కోరి వచ్చితివి. కాన నీ వేయుద్దేశములతో నిచటకు వచ్చితివో దానిపై నీబుద్ధిని నిగిడించుము. ఈయంబ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్ఠుఁడను బ్రాహ్మణయువకుఁడు. తనపాండిత్యముం గూర్చి గర్వించియున్నను మర్యాదాహీనుఁడై యున్నవాఁడు. అట్టి మర్యాదాహీనత్వము శిక్షారాహిత్యముచేతఁ గాక మఱేమిచేత సంభవించును ?"

12. అంబష్ఠుఁడు మర్యాదాహీనుండని పిలువబడుటచే భాగవతునిపై నాగ్రహమూని, భాగవతుఁడు తన యాచరణమును గర్హించుటచే నాతనిఁ దిరస్కారభావముతో గౌరవహీనంబుగ నిరసించుచు నీరీతిగఁ బల్కెను: "శాక్యకులజులు, ఓయీ! గోతముఁడా! మర్యాదాహీనులును, ననార్యులును, దుశ్శీలురును, సులభకోపులును, తీక్ష్ణకర్ములునై యున్నవారు. దాసులు, భృత్యులు, దస్యులు నయ్యు వారు బ్రాహ్మణులను గౌరవింపరు; అర్చన చేయరు; దానముల నొసంగరు. ఇయ్యది, యో గోతముఁడా! యుక్తమైనది కాదు" అనుచు నీరీతిగ నంబష్ఠుఁడు శాక్యులయందు హీనభృత్యత్వము నారోపించెను.

13. "ఓయీ ! అంబష్ఠుఁడా! శాక్యులు నిన్నెట్లవమానించిరి?"

అంబష్ఠుఁడు: "ఓయీ గోతముఁడా! నే నొక పర్యాయము పౌష్కరసాది కార్యములపైఁ గపిలవస్తుపురంబునకుం జని, యచట శాక్యుల సంధాగారంబునకుం జనియుంటిని. ఆశాలయందు శాక్యవృద్ధులును, యువకులును నచట ఘనంబులగు నాసనముల నలంకరించి యుండి, సోల్లాసులై, యొండొరులతోఁ బరిహాసం బొనర్చుచు, నంగుళిప్రతోదకములచే నొండొరుల నవ్వించుచుండిరి. మఱియు వారల పరిహాసమునకుఁ గారణము నేనై యుంటినని చింతించుచుంటి. అంతియకాక నాకు వారలాసనమైన నొసంగలేదు. అట్టిది, యో గోతముఁడా! యుక్తంబుగాని, సరళంబుగాని యైన ప్రవర్తన కాదు. శాక్యులు దాసులయ్యు, బ్రాహ్మణులకు మర్యాదఁ జూపింపక, యర్చన చేయక, దానముల నీయక యుండుట యసమంజసము."

ఇట్లు అంబష్ఠుఁడను బ్రాహ్మణయువకుఁడు రెండు పర్యాయములు శాక్యులయందు దాసత్వ మారోపించెను.

14. గోతముఁడు: "ఓయీ! అంబష్ఠుఁడా! లావంబల్పంబగు స్త్రీవిహంగమయ్యుఁ దన గూటియందుఁ దనకిచ్చవచ్చినట్లు కూయవచ్చును. ఆకపిలవస్తువందు శాక్యులు వారి స్వస్థానమందుండిరి కదా? కాన నట్టి స్వల్పకారణమునకై నీ వవమానితుఁడవైతివని గోచించుట సమమైనది కాదు."

15. అంబష్ఠుఁడు: "ఓయీ గోతముఁడా! క్షత్రియులు, బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు నను నాలుగు వర్ణములవారు నరులలో నున్నారు; మఱియు నీనాలుగు వర్ణముల వారలలో క్షత్రియ వైశ్య శూద్రజాతులవారు బ్రాహ్మణసేవకులుగాని వేఱు కారు. కాన నో గోతముఁడా ! శాక్యులు భృత్యులై యుండియు నిట్లు బ్రాహ్మణుల గౌరవింపకయుఁ, బూజింపకయు, వారికి దానము లొసంగకయు నుండుట పాడికాదు"

ఈరీతిని మూఁడవపర్యాయము బ్రాహ్మణుండైన యంబష్ఠుఁడు శాక్యులను దాసులుగఁ బరిగణించుచు నిరసించెను.

16. అపుడు భాగవతుఁడును "ఈ యంబష్ఠుఁడు శాక్యులను నిరసించి నీచకులోద్భవులుగఁ బరిగణింపఁ గృతనిశ్చయుఁడై యున్నాఁడు. ఈతని కులగోత్రములఁ గూర్చి నే నేమలనుఁ బ్రశ్నింపఁ గూడదు?" అని వితర్కించుకొనుచు నాయంబష్ఠునితో నిట్లు వాక్రుచ్చెను:

"అంబష్ఠా! నీ గోత్రం బెద్ది?"

అంబష్ఠుఁడు: "నేను కణ్వాయనుఁడను."

భాగవతుఁడు: "సరియె కాని నీవు నీ మాతృగోత్రమునఁగాని, పితృగోత్రమునఁగాని పరికించి చూచి యాయాగోత్రములలో నుద్భవించిన పూర్వుల జన్మములఁ బరిశీలించిన శాక్యులొకప్పుడు నీ యజమానులనియు, మీరు వారి దాసీజనములో నొక్కయామె సంతతివారనియుఁ దెలియఁగలదు. శాక్యులన్నను ఒక్కాక (ఇక్ష్వాకు) వంశంబునకుఁ జెందినవారు.

బహుపూర్వమున, నోయీ ! యంబష్ఠుఁడా! ఒక్కాక నరపాలుఁడు తనభార్యలలో నత్యంతప్రియయగు నామెసంతానమునకు రాజ్యము నిప్పింపఁ గోరి, వారికంటెఁ బెద్దవారలగు ఒక్కాముఖుఁడు, కరండుఁడు, హస్తినికుఁడు, సినిపురుఁడు అను నలువురి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొమరులను రాజ్యబహిష్కృతులుగ నొనర్చెను. అట్లు దేశమునుండి వెడలఁగొట్టఁబడి వారు హిమాలయపర్వత నితంబములయందు మహావృక్షశోభితతటసరోవరసామీప్యంబున వసియించుచుండిరి. మఱియు వారు కులపవిత్రతకుఁ గళంకము రాకుండునట్లు తమ యక్కచెల్లెండ్రను వివాహమాడిరి.

అపుడు, ఒక్కాకపృథ్వీపాలుఁడు "నా పుత్రు లెచ్చట నున్నారు" అని యమాత్యులఁ బ్రశ్నించెను.

"సార్వభౌమా! హిమాలయనితంబప్రదేశముల నొక స్థలంబున సరోవరతటంబుల నొక మహావృక్షం బున్నయది. అచట వారు వసించుచున్నారు. మఱియుఁ గులశుద్ధికి హాని కలుగకుండఁ దమ తోఁబుట్టువుల వివాహ మాడిరి."

అపు డొక్కాకభూపాలుఁడు విస్మయంబుతో నిట్లు చెప్పెను: "ఆయువకులు బహుసత్త్వయుక్తులు; బలె! వారు పరమశక్యులు."

అందువలన నోయీ! యంబష్ఠా! వారు శాక్యు లని వ్యవహరింపఁబడుచున్నారు. దిస యను నొక్కాక రాజుయొక్క దాసి యొకతె కృష్ణవర్ణోపేతుండగు బాలునిఁ గనెను. జన్మించినతోడనే కృష్ణవర్ణోపేతుం డైన యాశిశువు 'అమ్మా! నన్ను స్నానము చేయించి, యీ మలిన్యము లేకుండఁ బరిశుభ్రపఱుపుము. నేను నీ కుపకారముఁ గావింపఁగలను' అనెను.

ఓయీ! అంబష్ఠుఁడా! ఇప్పుడు నరులు దయ్యములుదయ్యములని చెప్పుచున్నట్లా కాలములలోఁ గృష్ణ వర్ణము కలవారలను దయ్యము లని చెప్పుచుండెడివారు. అప్పుడు వా రిట్లనిరి: "ఈశిశువు పుట్టినవెంటనే మాట లాడెను. కృష్ణవర్ణముగల దయ్య మొకటి జన్మించెను" అని. అయ్యదియే ఓయీ! యంబష్ఠుఁడా! కణ్వాయనుల యుత్పత్తి. కాన నోయీ! యంబష్ఠుఁడా! నీమాతృపక్షమునఁగాని, పితృపక్షమునఁగాని, కులగోత్రములఁ బరిశీలించి చూచిన శాక్యులు మీయజమానులై యొప్పుచుండి రనియు, మీరు వారి దాసీసంతతివా రనియు స్పష్టమగును."

17. భాగవతుఁ డిట్లా బ్రాహ్మణయువకునితో సంభాషణఁ గావింప నచటనున్న బ్రాహ్మణయువకు లిట్లు చెప్పందొడంగిరి: "అర్చనీయుండగు గోతముఁ డిట్లంబష్ఠుని దాసీకులోద్భవుండని యత్యధికముగ ననాదరింపకుండుఁ గాక! అంబష్ఠుఁడు సుకులోద్భవుఁడును, సద్వంశజుఁడును, వేదములయం దపారమైన జ్ఞానముకలవాఁడును, పండితుఁడును, వేదాధ్యయనసంపన్నుఁడును; ఈవిద్యల విషయమై గోతముఁడా! ప్రశ్నించిన సరియగు నుత్తరముల నాతఁ డీయఁగలవాఁడు."

18 భాగవతుఁ డిట్లా బ్రాహ్మణులతోఁ జెప్పెను: "అట్లే కానిండు. మీర లింకొకరీతి నాలోచించిన మీరే యీవాగ్వాదమును నాతోఁ గావింపవలసియుండును. కాని మీర లీరీతిగ నాలోచించుటచే నంబష్ఠునే మాటలాడనిండు."

19. బ్రాహ్మణయువకులు: "మే మట్లేచింతించుచున్నాము. మేము నోరు విప్పనైన విప్పము. ఈవిషయములలో నంబష్ఠుం డర్చనీయుం డగు గోతమునకుఁ దగిన సమాధానముల నీయ శక్తిగలవాఁడు."

20. భాగవతుఁ డపు డంబష్ఠునితో నిట్లుచెప్పెను: "ఇపు డొక యుచితంబగు ప్రశ్న వొడముచున్నది. నీ కిష్టము లేకపోయినను నీ వద్దానికిఁ బ్రత్యుత్తర మొసంగవలయును. నీవుస్పష్టమైన జవాబు నీయకపోయినను, భిన్నంబగు విషయమునుగూర్చి మాటలాడినను, మాటలాడక మౌనమును ధరించినను, నిచ్చటినుండి నిర్గమించినను దత్క్షణమే నీతల వ్రక్కలగును. కడుముదుసలులగు బ్రాహ్మణులుగాని, నీయాచార్యులుగాని, యట్టి యాచార్యుల యాచార్యులుగాని కూడుకొని సంభాషించినపుడు కణ్వాయనుల యుత్పత్తిఁగూర్చి కాని, వారి కూటస్థునిగుఱించి కాని యేమి వింటివి?"

భాగవతుఁ డిట్లు నుడివినపిదప నంబష్ఠుఁ డేమియుఁ బలుకక యూరకుండెను. శాక్యసింహుఁడు తిరిగి యాప్రశ్న నడిగెను. అంబష్ఠుఁ డేమియుఁ బలుకకయూరకుండెను. అపుడు భాగవతుఁ డిట్లు చెప్పెను: "అంబష్ఠా! నీ విపుడు నాప్రశ్నకుఁ బ్రత్యుత్తర మొసంగుము. మూకీభావము వహించుట కిది సమయము కాదు. ఏల యన నెవ్వఁ డైనను తథాగతునిచే నుచితంబగు ప్రశ్న మూఁడుపర్యాయము లడుగఁబడి జవాబీయక యూరకున్నచో నట్టివానిశిరము వ్రక్కలగును."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

21. ఆసమయంబున వజ్రపాణియను నింద్రుం డంబష్ఠుని మీఁదుగ జాజ్వల్యమానాయఃపిండంబు హస్తముల ధరించి, యంబష్ఠుఁడు గోతమప్రశ్నముల కుత్తర మీయకున్న వానితలఁ బగులఁగొట్ట నెంచి యాకాశంబున నవతరించెను. భాగవతుఁడును, బ్రాహ్మణాంబష్ఠుఁడును నావజ్రపాణిం జూచిరి. మఱియు నంబష్ఠుఁ డా భయంకరదృశ్యమును గని భయకంపితుఁడై రక్షణార్థము భాగవతుని చెంతఁ జేరి, నమ్రీభూతుఁడై "భాగవతుఁ డేమి చెప్పెను? మఱియొకపర్యాయము సెలవిండు" అని వేఁడుకొనెను.

"అంబష్ఠుఁడా! నీ వేమి యోజింపుచుంటివి?"

అంబష్ఠుఁడు: "పూజార్హుండగు గోతముఁడు చెప్పినరీతినే నేవింటిని. అయ్యదియే కణ్వాయనుల జన్మక్రమము; మఱియు, గోతమునిచేఁ జెప్పఁబడినవానినే కూటస్థునిగఁ బరిగణింపుచున్నారు."

22. ఆతఁ డిట్లు చెప్పినపిదప బ్రాహ్మణులలో సంక్షోభంబు జనించి, కలకలరవం బుద్భవించెను. "బ్రాహ్మణుఁడైన యంబష్ఠుఁడు హీనజన్ముఁ డని చెప్పుచున్నారు. వానికుటుంబంబు నుత్తమం బని నుడువుచున్నారు. మఱియు నాతఁ డొక యాఁడుదానిని యొక్క సంతతివాఁ డనియు, శాక్య లాతని యజమానులనియును బ్రకటించుచున్నారు. ఎవ్వానిపలుకులు ధర్మస్వరూపంబులో యట్టి శ్రమణగోతముఁడు విశ్వసనీయుఁ డని మే మూహింపనైన నూహింపలేదు" అని యాబ్రాహ్మణయువకులు చెప్పిరి.

"ఈబ్రాహ్మణులు, దాసీకులోద్భవునిగ నంబష్ఠుని నత్యంతము నిరసించుచున్నారు. వారిదూషణము నుండి యాతనిని నేఁ గాపాడెదను" అని యూహించుచు వారలతో భాగవతుఁ డిట్లు లనియెను.

"జన్మకారణమున నంబష్ఠుని నధికముగ గర్హింపవలదు. ఆకణ్వుండు మహర్షి యయ్యె. ఆతఁడు దక్షిణాపథంబునకుం జని, యచట మంత్రంబుల నెన్నఁగఁ జదివి యించి, ఒక్కొక పార్థివునికడకుఁ దిరిగివచ్చి, మద్దరూపియను నానృపాలుని పుత్రికను దనకు భార్యగ నొసంగు మని కోరెను. అందుల కానృపాలుఁ డిట్లు చెప్పెను: 'ఏమీ! వీని దుండగీనితనము! నా దాసీపుత్రుం డయ్యు నీతఁడు నా పుత్రికను దన కిచ్చి వివాహము చేయు మనుచున్నాఁడు.' అని యాకుపితుఁడై యాతఁడు బాణంబు నొకదానిని విల్లున నెక్కుపెట్టెను; కాని యానారాచంబు నాతఁడు విడువలేకపోయెను. మఱియు నద్దాని వింటినుండి తీసివేయలేకపోయెను. అపుడు రాజామాత్యులు కణ్వఋషికడకుం జని "మునిసత్తమా! పుడమియేలికకు హాని యేమియు లేకుండఁ బ్రసాదింపుము" అని యాతని వేఁడుకొనిరి.

కణ్వుఁడు: 'రాజున కేమియు హాని లేదు. అయినను నరపాలుఁ డానారాచంబు నధోభూమిపైఁ బ్రయోగించినఁ దనరాజ్యం బెల్ల నిర్జీర్ణంబై యుండు.'

అమాత్యులు: 'భూపునకును, రాజ్యమునకును గూడ హాని కలుగకుండునట్లు చేయు మో తాపసవర్య!'

కణ్వుఁడు: 'రాజునకుఁ గాని, రాజ్యమునకుఁ గాని హాని లేకుండ నుండు. అయినను నారాచంబు నాకాశంబులోనికిఁ బోవిడిచిన నీరాజ్యమునం దంతటను నేడుసంవత్సరములు వర్షములు కురియకుండును.'

అమాత్యులు: 'ఆర్య! నృపునకును రాజ్యమునకును హాని లేకుండఁ జేయుము. మఱియు వర్షములు కురియునట్లు చేయుము.'

కణ్వుఁడు: 'రాజునకును, రాజ్యమునకును హాని కలుగదు; మఱియు వర్షములు గలుగును. రాజుమాత్రము నానారాచంబును జ్యేష్ఠపుత్రునిపైఁ బ్రయోగింపవలెను. ఆరాజకుమారున కేమియు నెగ్గు సంభవింపదు. ఆతని కెంద్రుకకైన హాని కలుగదు.'

అప్పు డాబ్రాహ్మణులు ఒక్కొకున కీవృత్తాంత మంతయు నివేదించుచు నిట్లనిరి: 'రాజా! నారాచంబును పుత్రునిపై నుంచుము; అతనికి హాని సంభవింపదు. భయమైనఁ గలుగదు' అన రాజును నారీతిగ నాచరించెను; హాని యేమియుఁ గలుగలేదు. నరపాలుఁ డీసంభవములవలన భీతుఁడై, బుద్ధి కలిగి, తనపుత్రికయైన మద్దరూప యను నామె నాకణ్వున కిచ్చి వివాహము చేసెను. ఓబ్రాహ్మణులారా! మీ రంబష్ఠుని దాసీకులోద్భవుం డని దూషించరాదు. ఆకణ్వుండు మహర్షి యై

యుండె" ననుచు నంబష్ఠునితో నీరీతిగ బుచ్చటించెను: "అంబష్ఠా! నీ విందుల కేమి చెప్పెదవు? క్షత్త్రియ యువకుం డొక్కరుఁడు బ్రాహ్మణకన్యతో రమింపఁ బుత్త్రుఁ డొక్కఁడు జనించినాఁ డనుకొందము. బ్రాహ్మణకన్యయం దట్లు జనించిన క్షత్త్రియపుత్త్రుని బ్రాహ్మణు లుచితాసనపానీయంబుల నిచ్చి సత్కరింతురా? లేదా?"

అంబష్ఠుఁడు: "ఔను, అట్లే వారు కావింతురు."

గోతముఁడు: "అట్టి వానిచే బ్రాహ్మణులు మంత్రంబులఁ జదివింపించెదరా? లేదా?"

"ఔను; అట్లే చేయుదురు."

"అయిన నట్టివానికి బ్రాహ్మణులు తమకన్యల నిచ్చి వివాహముఁ గావింతురా? కావింపరా?"

"అట్లే చేయుదురు."

"అట్లైన క్షత్త్రియు లట్టివానిని రాజ్యాభిషిక్తునిగఁ జేయుదురా?"

"గోతముఁడా! అట్లుచేయరు."

"ఎందుల కట్లు చేయరు?"

"ఏలయన నట్టివాఁడు మాతృపక్షమున శుద్ధకులోద్భవుఁడు కాఁడు."

25. "మఱియు నేమనియెదవు? అంబష్ఠా! బ్రాహ్మణయువకుఁ డొకడు క్షత్త్రియకన్యతో రమియింపఁ బుత్త్రుఁ డొక డుద్భవించె ననుకొందము. అట్లు క్షత్త్రియకన్యయందు బ్రాహ్మణయువకున కుద్భవించిన పుత్త్రుని బ్రాహ్మణు లుచితాసనపానీయంబుల నొసంగి సత్కరింతురా?"

"అట్లు చేయుదురు."

"అట్లైనను బ్రాహ్మణు లట్టివానిని శ్రాద్ధభోజనమునందుఁగాని, పాయసాన్నమును గాని, దేవనైవేద్యంబులను గాని, యుపాయనముగ నొసంగఁబడిన భోజనమును గాని తమతో భుజింపనిత్తురా?"

"అట్లు చేయనిత్తురు, ఓ గోతముఁడా!"

"బ్రాహ్మణు లాతనికిఁ దమమంత్రంబులఁ జెప్పుదురా?"

"ఆ, అట్లు చెప్పుదురు."

"అట్టివానికి బ్రాహ్మణులు తమకన్యల నిచ్చి వివాహము చేయుదురా?"

"అట్లే చేయుదురు."

"అటులైనను క్షత్త్రియు లట్టివానికిఁ దమకు యుక్తమైన రాజ్యాభిషేకసంస్కారము నొనర్తురా?"

"అట్లు చేయరు."

"ఎందువలన?"

"ఓయీ! గోతముఁడా! అట్టివాఁడు పితృపక్షమున శుద్ధ క్షత్త్రియకులోద్భవుండు కాకపోవుటచే నభిషేకార్హుడు కాఁడు."

26. "అటులైన, ఓయీ! అంబష్ఠుఁడా! స్త్రీలను స్త్రీలతోను, పురుషులను పురుషులతోను, బ్రాహ్మణ క్షత్త్రియులను బరీక్షించి చూచిన క్షత్త్రియులే యుత్తము లనియును, బ్రాహ్మణులే యంతకంటెఁ దక్కువవార లనియును స్పష్ట మగుచున్నది.

మఱియు నోయీ! అంబష్ఠుఁడా! బ్రాహ్మణు లేదియో యొక కారణమువలనఁ దమలో నొక్కని ముండనంబుఁ గావించి భస్మము నాతనిశిరముపైఁ బోసి దేశమునుండి కాని, నగరమునుండి కాని బహిష్కరించిన నట్టివాని నుచితాసనపానీయంబుల నిచ్చి బ్రాహ్మణులు సత్కరింతురా?"

"ఓయీ! గోతముఁడా! అట్లుచేయరు."

"అట్లు కాకున్న బ్రాహ్మణు లట్టివానిని శ్రాద్ధభోజనమందుఁ గాని, పాయసాన్నమును గాని, దేవనైవేద్యంబులను గాని, యుపాయనముగ నొసంగఁబడిన భోజనమందు గాని తమతో భుజింపనిత్తురా?"

"గోతముఁడా! అట్లుచేయరు."

"అట్టివానిచే బ్రాహ్మణులు మంత్రపాఠంబుఁ జేయనిత్తురా?"

"మంత్రాధ్యయనంబుఁ జేయనీయరు గోతమా!"

"బ్రాహ్మణకన్యల నిచ్చి యట్టివానికి వివాహము చేయుదురా?"

"తమకన్యలదగ్గరకు రానీయరు."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

27. "ఓయీ! అంబష్ఠుఁడా! నీవిందుల కేమి చెప్పెదవు? క్షత్త్రియులు తమలో నొక్కని నీరీతిగఁ దేశమునుండి కాని, నగరమునుండి కాని బహిష్కరించి నట్టివాఁ డుదితాసనపానీయంబు లొసగఁబడి బ్రాహ్మణులచే సత్కరింపఁబడునన్నాఁడా?"

"అట్లు సత్కరింపఁబడునన్నాఁడు."

"మఱియు బ్రాహ్మణు లట్టివానిని శ్రాద్ధభోజనమందుఁ గాని, పాయసాన్నమును గాని, దేవతానైవేద్యంబును గాని యుపాయనముగ నొసఁగఁబడిన భోజనముఁ గాని తమతో భుజింపనిత్తురా?"

"భుజింప నిత్తురు."

"అట్టివానిచే బ్రాహ్మణులు మంత్రపాఠంబుఁ జేయనిత్తురా?"

"చేయనిత్తురు."

"బ్రాహ్మణకన్య నిచ్చి యట్టివానికి వివాహము చేయుదురా?"

"బ్రాహ్మణకన్యల నిచ్చి వివాహము చేయుదురు."

"అందుచే నోయీ! అంబష్ఠుఁడా! క్షత్త్రియుండు ముండితుఁడై, యధోగతిం జెంది, దేశనగరబహిష్కృతుండైయుండియు, క్షత్త్రియుండె యుత్తముం డనియును, బ్రాహ్మణుం డంతకంటె నధముం డనియును స్పష్ట మగుచున్నది.

28. మఱియు బ్రహ్మదేవులలో నొక్కరుఁడైన సనత్కుమారుండె యీవచనములను జెప్పెను:

'కులమునకు నాధిక్యము నిచ్చి శ్రేష్ఠత్వము నిర్ణయించు నరులకు క్షత్త్రియుండె యుత్తముండు; కాని వివేకసంపన్నుఁడును, బరమసాధువృత్తియుతుఁడు నైన నరుండు దేవతలలోను, నరులలోనుఁగూడ శ్రేష్ఠుండు.' ఈవచనము ఘనార్థయుక్తంబై, సనత్కుమారబ్రహ్మచే యుక్తముగఁ జెప్పఁబడినది. ఓయీ! యంబష్ఠుఁడా! నేఁ గూడ నీరీతిగఁ జెప్పెదను:

కులమునకు నాధిక్యము నిచ్చి శ్రేష్ఠత్వము నిర్ణయించు నరులకు క్షత్త్రియుండె యుత్తముండు; కాని వివేకసంపన్నుఁడును, బరమసాధువృత్తియుతుఁడు నైన నరుండు దేవతలలోను, నరులలోను గూడ శ్రేష్ఠుండు."

"గోతముఁడా! ఆవచనమునఁ జెప్పఁబడిన వివేకం బేమి? సాధువృత్తి యనున దెట్టిది?"

"అంబష్ఠుఁడా! నేను జెప్పిన వివేకసాధువృత్తి విషయములలో జన్మవంశములకును 'నీయంతటి వాఁడను నేను; నావలె నీవు గౌరవార్హుఁడవు కావు' అను వాక్యములను బ్రేరేపించు గర్వమునకును బ్రసక్తి లేదు. వివాహసంబంధములలో నట్టివిషయములకుఁ బ్రసక్తి యుండును. అంబష్ఠుఁడా! జన్మకులములకుఁ గాని, యుత్తమకులగౌరవమువలన నైనను వివాహసంబంధము వల్ల నైనను సంభవించు గర్వమునకుఁ గాని, లొంగి లోఁబడి యుండు నరు లుత్తమవివేకసాధువృత్తముల కతిదూరంబున నుందురు. అట్టి జాత్యాదిబంధముల నతిగమించియే నరుం డత్యున్నతం బగు వివేకసాధువృత్తుల నభిగమింపఁగలఁడు."

"ఓ గోతముఁడా! ఆసాధువృత్తి యెట్టిది! ఎయ్యది యావివేకము!"

"ఓయీ! ప్రపంచమున సుజ్ఞానియుఁ, [illegible]ర్హుండును ప్రబుద్ధుండును, సత్యమార్గంబున నడువఁ[illegible] చినవారల కసమాననియంతయు, మానవులకును దేవతలకును నాచార్యుఁడును, అర్హతుఁడొక్కరుఁ డుద్భవించెనని యనుకొందము. అట్టివాఁ డితరుల సాహాయ్యము లేకుండఁగనే యథార్థంబులను బ్రహ్మవారలోకంబులను, బ్రాహ్మణరాజన్యవైశ్యులచేఁ బూరితంబైన యధోలోకంబును గల బ్రహ్మాండంబుల నెల్లఁగఁ బరీక్ష చేసినట్లు జ్ఞానంబు కలిగియుండును. అట్టిజ్ఞానము సంపాదించి యాజ్ఞానము నితరులకు బోధచేయును జన్మవృద్ధినివృత్తుల మనోహరంబైన సత్యమును సమూలముగఁ బ్రకటించి, యుత్తమజీవనమందైన పరిపాకమును బవిత్రత్వమును దెలియఁజేయుచున్నాఁడు.

గృహస్థు కాని, యట్టివాని సంతానములో నొక్కఁడు కాని, నీచకులోద్భవులలో నొక్కరుఁడు కాని యిట్టి సత్యవచనములకుఁ జెవియొగ్గి విని, తథాగతునియందు నమ్మకము పుట్టి, యట్టినమ్మకముచే ని ట్లూహించును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

### మధ్య అమెరికాలో

# కోపాన్ పట్టణమందలి 'మయ' శిల్పములు

కోపాన్‌పట్టణపు స్తంభశిల్పములందు; ఏనుగుతలలును, అం దొకదానిపై మావటీడును చెక్కబడి యున్నవని కొందరును, అవి యేనుగుతలలుకాక 'మాకా' చిలుకల ముక్కులని కొందరును చెప్పుదురు. ఇవి చెక్కినకాలమున ఆదేశమున ఏనుగే లేనపుడు శిల్పి యేనుగు నెట్లు చెక్కు ననువారు కొందరు; అక్కడ ఏనుగు లేకున్నను విదేశశిల్పముల ననుకరించియుండవచ్చు ననువారు కొందరు. మొత్తముమీద ఈ శిల్పములం దాసియాఖండపు నాగరికతాచిహ్నములు చాల కన్పడకమానవు. అమెరికాలోని పూర్వకాలపు నాగరికత ఖండాంతరములనుండి ప్రాపించినదా, లేక యచ్చటనే యుద్భవించి వర్ధిల్లెనా యను సమస్యను సాధించు నవసరమున నాధారభూతము లగు ఇట్టి శిల్పములు ఖండాంతరమగు ఆసియాను సూచించుచున్నవి.

ఇందలి (Calendar Column) 'కాలెండర్ కాలమ్' (పంచాంగము) 'మయు'ల తిథులను, తిథిగణన పద్ధతిని నిర్ధారణసేయుట కుపకరించును. ఇదికూడ నచ్చట గూర్చుచున్నది. ఈ శిల్పము లన్నియు నిపుడు బ్రిటిషుమ్యూజియమ్‌లో ప్రత్యేకాగారమున నుంచబడినవి.

ఆసియా అమెరికాలకు పూర్వ మేమైన సంబంధముండియుండెనాయేమి ?



౧. వర్షాధిదేవుని నాసిక— (చిచిన్ ఇట్జా, యుకాటన్) యుకాటన్‌లోని 'మయ' శిల్పుల అతివిచిత్రశిల్పముల కొక మంచి యుదాహరణము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౨. మయదేశమున మతసంబంధ మగు ఒక శిల్పము—మయశిల్పమున కింకొక యుదాహరణమిది—ఇందు గగనాధిదేవత, తత్సంబంధమైన ఇతర శిల్పములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## కోపాన్ పట్టణమందలి 'మయ' శిల్పములు



3. కోపాన్‌పట్టణమున ఒక చెక్కిన స్తంభము—ఏనుగుతల ఒక మావటీడు చెక్కియున్నవి—(ఎడమ ప్రక్క భాగము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౪. ఆ (3 వ చిత్రము) స్తంభమునకే యెదుటిభాగము—ఎడమప్రక్కను వంగియున్న మావటీడు; కుడిప్రక్కనున్న యేనుగు పైభాగము శిథిలమైపోయినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"రాగరజోయుక్తమార్గంబైన సంసారంబు మిక్కుటములగు నడ్డంకులతోఁ గూడుకొని యున్న యది. ప్రాపంచికవస్తువులఁ బరివర్జించినవాని జీవితము వాయువువలె నిర్బంధములు లేకయున్నది. సంసారమున మునిఁగియున్నవాని కిట్టి యుత్తమజీవనంబును సంపూర్ణముగను, శుద్ధముగను, సుత్కృష్టతతోను ననుభవించుటకు వీలు లేదు. అందుచే శిరోజములను, గడ్డమును క్షౌరము సేయించి, కాషాయవస్త్రముల ధరియించి, సంసారమును బరిత్యజించి పరివ్రాజకుడ నగుదునుగాక!

అట్లైన చిరకాలంబుననే కొద్దిదైనను గొప్పదైనను రిక్థమును బరిత్యజించి, యల్పసంఖ్యాకులైనను బహుసంఖ్యాకులైనను బంధువర్గమును విడనాడి, శిరోజములను, గడ్డమును ముండనంబు కావించి, కాషాయవస్త్రముల ధరియించి, సంసారమును ద్యజించి, సన్న్యసించును.

అట్లు సన్న్యాసియైన పిదప నాతఁడు సంసారపరిత్యాగికి నియతమగు నిగ్రహము కలవాఁడై జీవయాత్రను నడుపును. ఋజువృత్తియం దాతఁ డానందమును బొందును. మఱియు నాతఁడు త్యజింపవలసిన బహ్వల్పవస్తువులయందును నెగ్గుం గను. విధులఁ బరిగ్రహించి తదాచరణపరాయణుండై యుండును. సువాక్కర్మలచేఁ బరివర్తింపఁబడు. అతని జీవనాధారములు పుణ్యాత్మకములై యుండు. ఆతని యాచరణము పుణ్యమయంబు. మఱియు నాతని యింద్రియకవాటంబు సురక్షితంబు. అవహితచిత్తుండై, స్థిరాత్ముండై, యానందమయుండై యుండు.

జీవహింస పరిత్యజించి పరివ్రాజకుండైన గోతముఁడు ప్రాణిహింస కతిదూరుండై యుండు. దండంబును గృపాణంబును విసర్జించి, ధూర్తత యనిన లజ్జఁ జెందుచు, కృపామయుండై, జీవజంతువులయందు దయఁ బూని ప్రవర్తించును. ఇయ్యదియే యాతనియందు శీలముగఁ బరిగణింపఁబడుచున్నది.

అదత్తం బగుదానిఁ బరిగ్రహింపక శ్రమణుండైన గోతముఁ డనాత్మీయ వస్తుపరిగ్రహణమును జేయఁడు. ప్రదత్తం బగుదానినే పరిగ్రహించుచుఁ దనకు దానము లీయఁబడు ననునమ్మకముతో నాతఁడు సత్యముగను, మనశ్శుద్ధితోడను గాలమును గడుపును. ఇయ్యదియే యాతనియందు శీలముగఁ బరిగణింపఁబడుచున్నది.

అసత్యమును ద్యజించి గోతమముని యసత్యమునుండి బహుదూరమున నుండును. ఆతఁడు సత్యముం బల్కును. సత్యపథంబును దప్పఁడు. విశ్వసనీయుఁడును, నమ్మఁదగినవాఁడు నైయుండి యాతఁడు తనమాటఁ దప్పఁడు. ఇయ్యదియే యాతనియందు శీలముగఁ బరిగణింపఁబడుచున్నది.

పైశున్యమును విసర్జించి గోతమముని యపవాదమునకు దూరుండై యుండు. ఇచటవినినమాటల నింకొకచోటఁ జెప్పి యిచటనుండువారలకు శత్రుత్వముఁ గలుగఁజేయఁడు; ఇంకొకచోట విను మాటల నిచటఁ జెప్పి వారలకును శత్రుత్వముఁ గలుగఁజేయఁడు. అట్లాతఁడు భిన్నమతు లైనవారలఁ గలియఁగట్టువాఁడై, స్నేహభావమున జీవించువారలను హెచ్చరించుచు, సంధాతయై, శాంతభావంబుల బద్ధభావుండై, శాంతిమయములగు వచనములఁ బల్కుచుండును. ఇయ్యదియే యాతనియందు శీలముగఁ బరిగణింపఁబడుచున్నది.

ధృష్టభాషణముల విసర్జించి గోతమముని యనార్యసంభాషణంబు విడనాడును. ఏవచనంబు నిర్దుష్టంబో, యెయ్యది చెవులకింపుఁ గలుగఁజేయునో, యెయ్యది మనోహరంబై హృద్గమంబై యుండునో, యెయ్యది సుశీలంబో, యెయ్యది జనుల కింపై వారి ప్రేమ కాస్పదంబై యుండునో యట్టి భాషణములనే యాతఁడు కావించును.

అనర్థకప్రలాపంబుల విడనాడి గోతమముని వ్యర్థసంభాషణములనుండి దూరముగ నుండును. యుక్తసమయంబున సత్యానుసారములును, సార్థంబులును నగు వచనంబుల, మతమువిషయమై కాని సంఘువినయవిషయమై కాని యుచ్చరించును. మనమున నిడుకొనవలసిన వచనములను యుక్తదృష్టాంతములతో స్పష్టముగ విచ్ఛేదించి సరియగు వచనములం బల్కును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గోతమముని బీజములకుఁ గాని శాకములకు గాని హాని చేయఁడు.

నిశాసమయంబునఁ గాని, యపరాహ్ణమున యుక్తకాలము మించినపిదపఁ గాని భుజింపక దినమున కొకపర్యాయమె భుజించును.

నాట్యగానప్రదర్శనంబుల మేలలయందుఁ గాంచఁడు. మాలాసుగంధలేపనధారణామలచేఁ దన్నుదా నలంకరించుకొనఁడు.

ఎత్తైనఁ గాని, పెద్దవైనఁ గాని సెజ్జల నుపయోగింపఁడు.

సువర్ణరజతంబులఁ బరిగ్రహింపఁడు.

అపక్వతండులాదులఁ బరిగ్రహింపఁడు.

మాంసమును బరిగ్రహింపఁడు.

కన్యాస్త్రీజనంబులఁ బరిగ్రహింపఁడు.

దాసదాసీజనంబులఁ జేకొనఁడు.

అజావికమేషంబులఁ బరిగ్రహింపఁడు.

శూకరకుక్కుటాదులఁ జేకొనఁడు.

గజాశ్వశ్వానులఁ బరిగ్రహింపఁడు.

కృష్టభూములంగాని యకృష్టభూములం గాని స్వీకరింపఁడు.

సందేశకర్తగ నుండఁడు.

క్రయవిక్రయంబులఁ జేయఁడు.

తులతో వంచనంబు గాని, కాంస్యపాటంబు గాని, మానములతో వంచనంబు గాని చేయఁడు.

లంచముల నిచ్చుటయు, వంచన చేయుటయుఁ, గైతవంబుగ సంచరించుటయు లోనగు కుటిలంబు లగు మార్గముల ననుసరింపఁడు.

వికలీకరణంబును, వధయు, బంధనంబును, బాటలఁగాచి కొట్టుటయుఁ, గొల్లగొట్టుటయు, నను నుచ్చంపకర్మలఁ జేయఁడు. ఇయ్యవి యాతనియందు శీలము లని యెన్నుకొనఁబడుచున్నవి.

కొంతమంది తాపసులును, బ్రాహ్మణులును భక్తియుక్తులగువారలచేఁ బ్రదత్తంబగు నాహారముం భుజియించుచు, బీజాంకురములకుఁ గాని, మూలంబుల వలనను, శకలంబులవలనను, పర్వంబులవలనను, పుట్టి వృద్ధిఁజెందుచున్న యోషధులకు గాని హానిచేయుచు జీవించుచుందురు. గోతమముని యట్టిబీజాంకురములకుఁ గాని, వృద్ధిపొందుచున్న యోషధులకుఁ గాని హాని యొనర్పఁడు.

కొంతమంది సన్న్యాసులును, బ్రాహ్మణులును భక్తియుక్తులగువారలచేఁ బ్రదత్తంబగు నాహారముం భుజించుచు, సంచితంబులగు భోజనపానీయవస్త్రసామగ్రిశయ్యోపకరణసుగంధద్రవ్యామిషంబుల నుపయోగించుచు జీవింతురు. గోతమముని యట్టిసంచితవస్తువుల నుపయోగింపఁడు."

కొంతమంది సన్న్యాసులును బ్రాహ్మణులును భక్తులగువారలచేఁ బ్రదత్తంబులగు భోజనంబులఁ గుడుచుచు మేలక్ప్రేక్షకంబుల ననురక్తులై యుందురు. అట్టి వెవ్వి యనిన:—

1. నాట్యము
2. గీతము
3. వాదిత్రము
4. మేలక్ప్రేక్షకంబులు
5. ఆఖ్యానములు
6. పాణిస్వరములు
7. వైతాళికము
8. కుంభథూణవాద్యము
9. శోభనగరకము
10. చండాలవంశీధోపణము
11. గజాశ్వమహిషాజావికకుక్కుటలావయుద్ధంబులు
12. నియుద్ధంబులు, మల్లయుద్ధంబులు, సాము
13. మిథ్యాయుద్ధంబులు
14. నామావళీపఠనంబు
15. యుద్ధవ్యూహదేశంబులు
16. సేనానిరూపణంబు.

గోతమముని యిట్టిప్రేక్షకముల నుండి దూరముగ నుండును.

కొందఱు మునులును, బ్రాహ్మణులును, భక్తులచేఁ బ్రదత్తంబగు భోజనమును భుజించుచు క్రీడాశీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నానురక్తులై యుందురు. అట్టి క్రీడాఖేలనంబు లెవ్వి యనః—

1. ఎనిమిదిగాని, పదిగాని వరుసలైన వర్గములు గల ఫలకములతో చతురంగము మున్నగు నాటల నాడుట.

2. అట్టియాటలనె యాకాశంబున ఫలకంబు లున్న వని యనుకొని యాడుట.

3. పరిహారపథము:—అనఁగ భూమిపై వ్రాయఁ బడిన చిత్రంబుల ననుసరించి చనుచుఁ బాదము లుంచవ లసిన ప్రదేశములలోనే పాదముల నుంచుట.

4. సంతికా:—నఖంబులతో నొకరాశినుండి కదల్చకుండగనె వస్తువులనుగాని, మనుజులనుగాని వేఱు చేయుట లేక యట్టివాని రాశిగఁ జేయుట. రాశి కద లిన నాయాటయం దట్టివాఁ డోడిపోయినట్లు పరిగణిం పఁబడును.

5. ఖలికా:—అక్షద్యూతము.

6. ఘటికము:—చిన్నకఱ్ఱతోఁ గొట్టుట.

7. చేతిని లాక్షాద్రవంబునఁ గాని, పిండికలిపిన నీళ్లలోఁ గాని ముంచి "ఏమి కావలయును" అని చెప్పు చు నాచేతిని గోడపైఁ గాని, భూమిపైఁ గాని కొట్టి కోరిన గజాశ్వాదిచిత్రములఁ జూపించుట.

8. కందుకక్రీడ.

9. పర్ణములతో బూరాలను జేసి యూదుట.

10. క్రీడనకములైన లాంగలములతోఁ గర్షణ ముచేయుట.

11. వంకకము:—భూమిలోఁ బాతఁబడినరెండు కఱ్ఱలపై నడ్డుగ నింకొకకఱ్ఱను గదలకుండఁ గట్టి యట్టి యడ్డుకఱ్ఱపై మొగ్గలు వేయుట.

12. తాళపత్రములతోఁ జేయఁబడిన వాయుపే మణులతోఁ గ్రీడించుట.

13. తాళపత్రములతోఁ జేయఁబడిన మానము లతో నాడుట.

14, 15. క్రీడనకంబులను శకటంబులతోఁ గాని, బాణములతోఁ గాని క్రీడించుట.

16. ఆకాశంబున వ్రాయఁబడిన యక్షరములఁ గాని, యాడుచున్నవాని వీపుపై వ్రాయఁబడిన యక్ష రములఁగాని పోల్చుకొనుట.

17. ఆడుచున్న మిత్రునియూహాలం దెలిసికొనుట. గోతమముని యిట్టిక్రీడాఖేలనములనువిసర్జించును.

18. అంగవికృతి గల నరుల నుపహాసార్థ మను కరించుట.

కొందఱు మునులును, బ్రాహ్మణులును భక్తి యుక్తులగు నరులచేఁ బ్రదత్తంబగు భక్ష్యముల భుజియిం చి, యెత్తైనవియును, విశాలములైనవియును నగు సెజ్జ లపైఁ బరుండియుండుటయం దనురక్తులై యుందురు. అయ్యవి:—

1. ఆఱడులపొడవు కలిగి యెత్తైన యాసందులు.

2. జంతువుల యాకారములతో శోభితంబులగు కోళ్లుగల పల్యంకములు.

3. దీర్ఘంబగు నజలోమంబుచేఁ జేయఁబడిన ప్రచ్ఛదపటములు.

4. చిత్రకములు.

5. (పటికలు) తెల్లని దుప్పటులు.

6. పుష్పములచేఁ జిత్రింపఁబడిన కంబళులు.

7. దూదిపరుపులు.

8. సింహవ్యాఘ్రాదిరూపములచేఁ జిత్రితములైన దుప్పటులు (వికటికా).

9. అంచులుగల కంబళ్లు. (ఉద్దలోమి) రెండు ప్రక్కలను రోమములుగల కంబళ్లు.

10. ఒకప్రక్కనే లోమముగల కంబళ్లు.

11. మణులచేఁ గుట్టబడి యలంకరింపఁబడిన దుప్పట్లు.

12. కౌశేయములు—పట్టుదుప్పట్లు.

13. షోడశనటకులు నాట్యము చేయుటకుఁదగిన తివాచీలు.

14—16. గజాశ్వరథసంబంధములైన కంబళ్లు.

17. అజినములు చేర్చి కుట్టి తయారుచేయఁబడిన దుప్పట్లు.

18. మృగమాతృకాచర్మనిర్మితములైన దుప్పట్లు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

29. ఉత్తర (ఊర్ధ్వ) చ్ఛదముగల తివాచీ.

20. శిరముగ్రింపను, భాదముల గ్రింపను, నుంచ టకుఁ దగిన యెఱ్ఱనితలగడలుకల సెజ్జలు.

కొందఱు మునులును, బ్రాహ్మణులును భక్తులచేఁ బ్రదత్తంబగు భక్ష్యములఁ దినుచుఁ, దమ్ముఁ దా మలంకరించుకొనుటయం దనురక్తులై యుందురు. అవి యెట్టి వనిన:—సుగంధిపూర్ణంబులగు దేహంబులపై రాయుటయు, దేహమర్దనంబును, నభ్యంగస్నానంబును, మల్లులవలె దేహంబుల లగుడములచేఁ దట్టించుకొనుటయు, నద్దములును, నంజనములును, మాలలు, (సౌందర్యార్థము కపోలములకు లేపనముగ నుపయోగించు) రక్త వర్ణద్రవ్యములు, గాత్రమార్జనద్రవ్యములు, కంకణములు, కంఠహారములు, చేతికఱ్ఱలు, సౌషధముల నిమిత్తమై వేత్రనిర్మితపేటికలు, కృపాణములు, ఛత్రములు, శిరోవేష్టనములు, కిరీటములు, చిత్రితపాదుకలు, చామరంబులు, దీర్ఘాంచలంబులుకల ధౌతవస్త్రంబులు. గోతమ ముని యిట్టి దేహాలంకారవస్తువులనుండి దూరముగ నుండును.

"కొందఱు మునులును, బ్రాహ్మణులును, భక్తులచే దత్తంబులగు భోజనములను దినుచు నింద్యసంభాషణానురక్తులై యుందురు. అవి యెట్టి వనిన:—

భూపాలురయొక్కయుఁ, జోరులయొక్కయు, నమాత్యులయొక్కయు కథలు; యుద్ధములయొక్కయు, భయోత్పాతకములగునట్టియు కథలు; భక్ష్యపానీయ వస్త్రశయ్యామాలాసుగంధములఁ గూర్చి సంభాషణములు; బాంధవ్యములం గూర్చియు, నుపకరణములం గూర్చియు, గ్రామములంగూర్చియు, నగరములఁ గూర్చియుఁ, బట్టణములఁ గూర్చియు, దేశములఁ గూర్చియు సంభాషణములు; స్త్రీలం గూర్చియు, వీరులం గూర్చియు నుడువులు; వీథిమూలలను, నీటిరేవుల యందును (లోకాభిరామాయణము) సంభాషణము; పూర్వప్రేత కథలు; అవ్యవస్థితప్రలాపములు; భూసము ద్రసృష్టిఁగూర్చి విమర్శనము; సత్త్వాసత్త్వములం గూర్చి వితర్కమును—ఇట్టి నింద్యసంభాషణములయందు గోతమముని పాల్గొనఁడు.

కొందఱు బ్రాహ్మణులును మునులును, భక్తప్రదత్తభక్ష్యములం దినుచు నిట్టి వివాదసంజనకవాక్యములం దనురక్తులై యుందురు; అట్టి వెవ్వియన:—"ఈ సిద్ధాంతము,విధియు,నీకుఁ దెలియదు;నాకుఁదెలియును."

"ఈసిద్ధాంతవిధులవిషయమై నీకేమి తెలియును?"

"నీవు మిథ్యాసిద్ధాంతములం బడినాఁడవు; నేనుచితమార్గానుసారినై యున్నవాఁడను."

"అంతమున రావలసినవానిని బ్రథమమునఁ జెప్పుచుఁ బ్రథమమున రావలసినవాని నంతమునఁ జెప్పుచున్నావు."

"నీ వింత దీర్ఘముగఁ బరికల్పించినది పరివర్తింపఁబడినది."

"నీవాద మారోపితం బైనది" (నీవాదము ఖండించుటకు సంసిద్ధుఁడనై యున్నాఁడను.)

"నీవు నిగృహీతుఁడ వైనాఁడవు" (నీవాదము తప్పని నిరూపింపఁబడినది.)

"వాదప్రమోక్షముకొఱకుఁ బ్రయత్నింపుము" (నీకు స్పష్టముగ లేనివానిని స్పష్టముగఁ జేసికొనుటకుఁ బ్రయత్నింపుము).

"ఈ చిక్కునుండి తప్పించుకొనఁగలిగినఁదప్పించుకొనుము."—

గోతమముని యిట్టి వివాదవచనములనుండి యతి దూరమున నుండును.

కొందఱు మునులును, బ్రాహ్మణులును భక్తదత్తభక్ష్యములం దినుచు వార్తాహరులై యుండుటయందును, సందేశహరులుగను మధ్యవర్తులుగను నుండుట యందును నభిరతమనస్కులై యుందురు. ఎట్లనగ:— రాజులను, బ్రాహ్మణులను, క్షత్త్రియులను, నమాత్యులను, యువకులను, "అటు పొమ్ము; ఇచ్చటకు రమ్ము; ఈవస్తువును నీతోఁ గొంపొమ్ము; అచటినుండి దానిఁ దెమ్ము" అని యాజ్ఞాపించుచుండ నట్టివారలకు మధ్యవర్తులుగను, సందేశహరులుగను నుండ నభిరతులై యుందురు. గోతమముని యిట్టి నీచకృత్యములనుండి దూరముగ నుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొందఱు మునులును, బ్రాహ్మణులును భక్తజనదత్తములగు భక్ష్యములం దినుచుఁ గూహకులై, లావకులై, నైమిత్తికులై, నిష్పేషికులై యెల్లప్పుడును లాభమునై లాభము నభిలషించుచుందురు. గోతమముని యట్టి కూటమునుండియుఁ, దుచ్ఛప్రలాపములనుండియు దూరుండై యుండును."

కొందఱు మునులును, బ్రాహ్మణులును, భక్తజనప్రదత్తాహారముం భుజియించుచు సన్మార్గావలంబన మువలన గర్హ్యవ్యాపారములచే ధనసంపాదనఁ జేయుచున్నారు. అట్టి తుచ్ఛవ్యాపారము లెవ్వి యనిన:—

1. సాముద్రికము—చిరాయువు,సంపదమున్నగు వానిని బాలురహస్తపాదంబుల యందైన చిహ్నములచేఁ జెప్పుట.

2. నిమిత్తములచే రాబోవుదానిం జెప్పుట.

3. కులిశంబులనుండియు, నుత్పాతములనుండియు శకునంబులఁ జూచుట.

4. స్వప్నార్థములఁజూచి రాఁబోవుదానిం జెప్పుట.

5. దేహలక్షణములఁ బట్టి శుభాశుభకథనము.

6. మూషికాభిన్నమైన వస్త్రంబుఁ బరీక్షించి శకునంబులఁ జెప్పుట.

7. అగ్నిహోమములఁ జేయుట.

8. దర్వీహోమముఁ జేయుట.

9—13. ఊక, తౌడు, బియ్యము, నెయ్యి, నూనె మున్నగువానితో దేవతలకు హోమములం జేయుట.

14. ఆవగింజల నోటనిడి నమలి, నోటినుండియే దాని నగ్నిలో నుమిసి హోమము చేయుట.

15. దక్షిణజానువునుండి కారురక్తముతో దేవతలకు హోమముచేయుట.

16. అంగుళిపర్వంబులఁ బరీక్షించి, మంత్రంబును బఠియించి యట్టిమనుజుండు కులీనుఁడో, యదృష్టవంతుఁడో, యదృష్టహీనుఁడో చెప్పుట.

17. వాస్తువిద్య—ఇల్లు కట్టుటకుస్థలంబు యుక్తమైనదో కాదో నిర్ణయించుట.

18. క్షత్త్రవిద్య.

19. శివవిద్య—ప్రేతలను శ్మశానమునందు బాధించుట.

20. భూతవిద్య.

21. భూరివిద్య—మంటియింటియందు వసియించునపుడు ప్రయోగించు మంత్రముల జ్ఞానము.

22. అహివిద్య.

23. విషబాధితుని చికిత్సచేసి హానిలేకుండ బాగు చేయుటయు, విషప్రయోగముచేయుటయు మున్నగునవి.

24. తేలుకాటుఁ గుదుర్చుటయు.

25. ఎలకకాటుఁ గుదుర్చుటయు.

26. పక్షిశాస్త్రము (అనఁగ పక్షులభాష తెలిసికొనుట.)

27. కాకశాస్త్రము (అనఁగ కాకములు కనుపించుటం బట్టియు వాని యఱుపులం బట్టియు రాఁబోవు వానిం దెలిసికొనుట.)

28. మనుజుని యాయుర్దాయమును బూర్వనిరూపణంబు చేయుటయు.

29. నారాచములు తగులకుండ నుండుటకుఁగాను రక్షాకరండంబుల నొసంగుటయు. (తాయెతులా?)

30. మృగచక్రము. (జంతుభాషాజ్ఞానము).

గోతమముని యిట్టి గర్హ్యవిద్యలనుండి దూరముగ నుండును.　　　(సశేషము.)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## ఉపాలంభము

ప్రతివాది భయంకరం రంగాచార్యులు గారు

వారిజముపయి జలబిందుభావ మంది
సంతసంబున నాట్యము సలుపుచుండు
వైన నాచిత్తవారిజ మకట! నీకు
నవ్వలికిఁ ద్రోసివేయఁగా నయ్యె నేమి!

తారకలచెంత మెల్లఁగాఁజేరి తేజ
ము నుపహారంబుగాఁ గొనఁ బెనఁగు చుందు;
కాని దూరముగాఁ ద్రోయఁ బూని తీవు
న్యాయమొకొ నాదు భక్త్యుపహార మిపుడు!

భయద ఘోరాంధకారంబు బారినుండి
కాచెదవు నీవె యానిశాకాంత నైన
ఘోరమోహాంధకారంబు బారినుండి
యుద్ధరింపఁగ వెనుకాడుచుంటె నన్ను!

సౌరభచ్ఛలమున నివాసం బొనర్తు
మందమలయాద్రివాయువునందుఁగాని
నామనోమందిరపు వీథి నడుమనైన
నిచ్చగింపవు పౌరవడియేని నకట!

విశదమైయొప్పు నీప్రభావితతి మధుర
తరముఁ గావించెద వరుణోదయముఁ గాని
నాదు భాగ్యోదయంబింకఁ గాదటంచు
నాశ వీడంగఁజేతువే యకట నన్ను!

కరుణతోఁ బల్లవంబుల విరుల నాత్మ
మందహాసాంచితంబులై మనఁగఁజేతు
వైన నించుకయును శ్రద్ధఁ బూనవయ్యొ
నాదు జీవనపల్లవానందమందు!

లీల నాయమునాతరంగాళి మిషను
హృద్యముఁగ నాట్య మీవొనరింతు వైన
నాయెదుట నొక్కపరియుఁ గన్పడ నసహ్య
మైన తాపము పీడించునా యమైన!

దీపశిఖఁ జేసి కరముల నూఁపియూఁపి
యాత్మరాగంబు దానిపై నమరఁజేతు
వైన నాప్రేమదీపంబు నంటుటయును
బాధ యొనరించునా నీకు భారమగుచు!

రాగమొప్పఁగ శారదరజనిఁ జేసి
ప్రీతిమెయి దానితోఁగూడి క్రీడసల్పు
దైన రవ్వంతకరుణ నాపైనఁ జూప
నదియు లజ్జాకరంబుగా నగునొ నీకు!

ప్రకటమగునట్లు నీయనురాగ మెల్లఁ
బ్రకృతిసుందరి నెట్లొ తన్పంగఁజూతు
వైన ననురాగపూరితమైన నాదు
హృదయమున భీషణాగ్ని వర్షించె దయ్యొ!

బాలచూతపల్లవములపైనఁ జేసి
హాయిగాఁ బాటఁబాడుచు నలరుచుంటె
భాగ్యహీనమైనట్టి నాపర్ణశాల
శూన్యమై యేడ్చుచుండె నీఁ జూడ కకట!

కుహూకుహూయటంచును సదె కోయిల మధు
రముగ నానందపూరితరవముఁ జేయఁ
గాని దీనహా నాదునాక్రందమునకు
నంత మెప్పటికిని గల్గదయ్యె నకట!

సాంధ్యరాగపరీతమై జగతియెల్ల
విమలసువర్ణమయమట్లు వెలసె; నింకఁ
గరుణనాదురవస్థనుఁ గాంచినైన
నామనోహర! వేగఁ గన్పడఁగ రాదె!

[హిందీ "విశ్వామిత్ర" నుండి]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# తెలుఁగురాయఁడు-పంటమైలారెడ్డి

కుందూరి ఈశ్వరదత్తు గారు, బి. ఏ.

ప్రౌఢదేవరాయని సుప్రసిద్ధచమూపతులలోఁ, జరిత్రయందును, ఆంధ్రవాఙ్మయమునందును బేరొందినవారు శూరశిఖామణులగు తెలుఁగురాయఁడు, పంటమైలారెడ్డియనువారలు. ఈతెలుఁగు రాయఁడెవ్వరను విషయమునఁ జరిత్రకారులయందు వివిధాభిప్రాయములు జనించినవి. సుప్రసిద్ధాంధ్రచరిత్రకారుఁడు తన ఆంధ్రులచరిత్రము మూఁడవభాగమున నిట్లు వ్రాయుచున్నాఁడు. "ఇతఁడు శ్రీమన్మహామండలేశ్వరమేదినీ మీసరగండ కఠారి సాళువరాయ విభాళమహారాజుయొక్క కుమారుఁడైన శ్రీమహామండలేశ్వరమేదినీ మీసరగండ కఠారిసాళువశంభురాయదేవమహారాజపుత్త్రుఁడైన శ్రీమన్మహామండలేశ్వరమేదినీ మీసరగండ కఠారి సాళువధరణీవరాహ తెలుఁగురాయఁడుగాని మఱియొక తెలుఁగురాయఁడు గాదు. ఇతనిరాజధాని వెలనాఁటిసీమలోని కృష్ణానదీ ముఖద్వారముననున్న శ్రీకాకుళమని తెలియుచున్నది. తెలుఁగురాయని తండ్రియగు శంభురాయఁడును, సాళ్వమంగు జయించిన శంభురాయఁడును, వేర్వేరుపురుషులుగాని యొక్కరుగారు. ఈతెలుఁగురాయని శాసనములు వెలనాఁడుపొదిలి సీమలోను, సింహాచలములోను గన్పట్టుచున్నవి. ఇతఁడు ప్రౌఢదేవరాయల పక్షమున గజపతులతోడి యుద్ధమునందు రాజమహేంద్రవరము రెడ్లకు సాహాయ్యముచేయు సందర్భమున నీతఁడు 1428 వ సంవత్సరమునందు సింహాద్రికిఁబోయి దానశాసనము వ్రాయించెను. కాని రెడ్లను జయించి యాదేశమును నాక్రమించినవాఁడుగాఁడు. ఇతఁ డాత్రేయ గోత్రుఁడు."*

శ్రీ వీరభద్రరావుగారు తరువాతపుటలో ననంతామాత్యకవినిగూర్చి వ్రాయుచు 'ప్రసిద్ధాంధ్రకవి యగు ననంతామాత్యుని తండ్రి తిక్కన తెలుఁగు రాయనికి మంత్రిగ నుండెనని తెలియుచున్నది' అని వ్రాసి యున్నారు. వీరు 'భోజరాజీయమును' జూచి యద్దానిని సరిగ పఠించి యుండినచో నిట్లు వ్రాసియుండరు. అనంతామాత్యుఁడు తనతండ్రి యగు తిక్కన శ్రీకాకుళమందలి యాంధ్రవల్లభుఁడైన శ్రీహరి పాదారవిందసేవకుఁ డగు హరిభక్తుఁడని వక్కాణించి యుండెనే కాని యచ్చట పరిపాలన మొనర్చుచుండిన యొక నరపాలకుని యాస్థానమునందు మంత్రిత్వ

* ఆంధ్రులచరిత్రము, మూఁడవభాగము, పుట390. ఈవిషయమంతయు నేమార్పును లేక నా జీర్ణవిజయనగరచరిత్రమునందుఁ జేర్కొంటిని.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పదవి వహించి యుండెనని వర్ణించలేదు. భోజ రాజీయమునందలి యీపద్యమును జూడుడు.

సీ. విలసితంబగు కృష్ణవేణ్యామలాప హా
రిణి భీమరథినా ధరిత్రియందు
దనరు నద్రిత్రయాంతర్వేదియగు పావ
నక్షేత్రమున శోభనమ్ములెల్ల
ధరనివాసం బగు పెరమగూరి పురంబు
నందు విద్వజ్జనానందమైన
జీవనస్థితిచేతఁ జెన్నొంది వంశక
ర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వమొంది
నెమ్మిఁ బ్రత్యక్ష పరమపద్మమ్మనంగ
నొప్పు శ్రీకాకుళమ్మున కొడయఁడైన
యంధ్రవల్లభ హరిసేవ నలరుచుండుఁ
బెక్కుభంగుల ముమ్మడి తిక్కవిభుఁడు.

పై కారణముచేతనే కాంబోలు శ్రీ వీరభద్రరావుగారు 'ఇతని రాజధాని వెలనాటి సీమలోని కృష్ణానదీ ముఖద్వారమున నున్న శ్రీకాకుళమని తెలియుచున్నది' అని వ్రాసి యున్నారు. ఇంతవఱకును బ్రచురింపఁబడిన తెలుఁగురాయని శాసనములలో నెచ్చటను శ్రీకాకుళేశ్వరుఁ డితఁడని వక్కాణింపఁ బడ లేదు.*

తెలుఁగురాయనిఁగూర్చి తెలుపు శాసనములు రెండు, నెల్లూరిజిల్లా శాసనసంపుటము లందుఁ బ్రకటింపఁబడినది. రెండును పొదిలి గ్రామమునకు సంబంధించినవి. అందు మొదటిది తెలుఁగురాయని తండ్రియగు శ్రీమేదినీమీసరగండకఠారి సాళువసాంబురాయ దేవ మహారాజులపై యున్నది. ఇది యీసాంబురాయదేవ మహారాయలు తన తండ్రియైన రాయవిభాళదేవ మహారాజు పుణ్యమునకు గాను వ్రాయించిన శాసనము.[1] రెండవశాసనము తెలుఁగురాయని తమ్మునికుమార్తెయగు తిప్పలదేవి, తనభర్తయగు జగనొబ్బగండని యొక్కయుఁ, దన కుమారుఁడగు తిమ్మనృపతి యొక్కయుఁ, దన పితృమాతృ వంశజులయొక్కయుఁ బుణ్యమునకుఁ గాను భారద్వాజ గోత్రుఁడైన తమ్మనార్యునకు అగ్రహారమును ధారపోసియిచ్చిన శాసనము.[2]

---

* ఆంధ్రకవులచరిత్రము (పూర్వముద్రణము) ప్రథమభాగమునందు అనంతామాత్యకవిఁగూర్చి వ్రాయుచు శ్రీవీరేశలింగముపంతులవారు ఇట్లువ్రాసియున్నారు: "ఈకవియొక్క తండ్రియైన తిక్కన కృష్ణామండలములోని శ్రీకాకుళమునకుఁ బ్రభువుగానుండిన యాంధ్రవల్లభుని కొలువులోనున్నట్లు పై గ్రంథమననే చెప్పఁబడినది." ఆంధ్రులచరిత్రము మూఁడవభాగము ముద్రింపఁబడునప్పటికి ఆంధ్రకవులచరిత్రము పునర్ముద్రణము గావింపఁబడ లేదు. పై వ్రాఁత ననుసరించియే తెలుఁగురాయఁడు శ్రీకాకుళాధినాథుఁ డని ఆంధ్రచరిత్రకారుఁడు వర్ణించి యుండును. కాని శ్రీవీరేశలింగముగారు తమ నూతనకవుల చరిత్రమునందుఁ బైవాక్యమును గొంచెముమార్చి యిట్లు వ్రాయుచున్నారు. 'ఈకవి తనతండ్రియైన తిక్కన కృష్ణామండలములోని శ్రీకాకుళమున కొడయఁడైన యంధ్రవల్లభుని సేవచేయుచుండినట్లు."—(పుట 391). ఇప్పుడైనను శ్రీ పంతులవారు ఆంధ్రవల్లభుఁడను మేదినీవల్లభుఁడైన భూకాంతుఁడో, లక్ష్మీవల్లభుఁడైన శ్రీహరియో స్పష్టముగఁ జెప్పలేదు.

1. Nellore Inscriptions, P. 26, pages 1184-1185. శా. శ. 1318.

2. Nellore Inscriptions, P. 39, Page 1205. శా. శ. 1360.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పైశాసనముల ననుసరించి తెలుఁగురాయనివంశవృక్షము నీదిగువనిచ్చుచున్నాఁడను:




రెండవశాసనము ననుసరించి తెలుఁగురాయని గోత్ర మాత్రేయగోత్రమనియు, నితని నామము భూపగోవిందుఁడనియుఁ దెలియుచున్నది. ఇతని శాసనములు పొదిలిసీమలోఁ గాన్పించుచున్నందున నితఁడు తత్ప్రాంతనాయకుఁడేమో యని సందియము గలుగుచున్నది. ఇతని శాసనమొకటి సింహాచలములో వరాహనృసింహస్వామివారి యాలయమున నున్నది.*

ఈశాసనమునందు 'కన్నడదేశమందలి తెలుఁగురాయఁడు' అని యితనిగూర్చి వ్రాయఁబడియుండుటచేతను, 'సాళువ, కఠారి, ధరణీవరాహ' అను కన్నడరాజ్యాధీశుల బిరుదులు తెలుఁగురాయని వంశస్థులకుఁ గలిగియుండుట చేతను, ఈతెలుఁగురాయని వంశమువారు మొదట కర్ణాటకులై, తరువాత నుద్యోగధర్మమునఁ బ్రౌఢరాయని కాలమున నుదయగిరి రాజ్యమందలి పొదిలిసీమ కధిపతులైవచ్చి, తెలుఁగుదేశమునందు స్థిరనివాస మేర్పఱచుకొనియుందురు. ముఖ్యముగ మన తెలుఁగురాయని కాలముననే వీరు ఉదయగిరి రాజ్యమునకు వచ్చియుందురు. తెలుఁగుదేశమునకు వచ్చి దేవరాయ మహాకరుణాకటాక్షలబ్ధ రాజ్యుఁడైన మొదటిరాయలగు భూప గోవిందస్వామి పాలుఁడే తెలుఁగురాయఁడని పేర్గాంచి యుండును.

కీర్తిశేషులైన శ్రీవీరేశలింగముపంతుల వారు శ్రీనాథకవినిగూర్చి వ్రాయునపుడు తెలుఁగురాయనిగూర్చి ముచ్చటించుచు నితఁడు కుమారకంపరాయని దక్షిణదిగ్విజయయాత్రయందు సాళ్వమంగుజయించిన రాజగంభీరదుర్గాధిపతియగు సాంపరాయని కుమారుఁడని వక్కాణించి యున్నారు. పై సాంపరాయని నామము 'సకలలోకచక్రవర్తిరాయ నారాయణశంభువరరాయలు.' వీరిశాసనములు కనఁబడినంతవఱకుఁ దమిళభాషయం దున్నవి. అతనికిఁగల బిరుదులకును, తెలుఁగురాయనితండ్రి బిరుదులకును పోలికయొంత మాత్రమును లేదు. అదియుఁ గాక, కుమారకంపరాయల కాలమునందున్న శంభువరాయ లెక్కడ? ప్రౌఢదేవరాయని కాలమునందున్న పెదసంబువరాయ లెక్కడ? కాల విపర్యాస దోషముగూడఁ బట్టినది. కావున శ్రీపంతులవారివ్రాఁత నిరాధారమైనది.

* "స్వస్తి శ్రీశకవర్షంబులు 1350 అగునేటిప్లవసంవత్సర ఫాల్గుణ కృష్ణ 7 గురువారమునను, కన్నడదేశమందలి సంబరాయనికొడుకు తెలుఁగురాయఁడు తనకుఅభీష్టార్థసిద్ధికిఁగాను శ్రీనరసింగనాథునికినిత్యమును సన్నిధిని వెలుంగను అఖండదీపాలు రెండుసమర్పించెను."


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

### శ్రీనాథమహాకవి—తెలుఁగురాయఁడు

శ్రీనాథ మహాకవికిని, తెలుఁగురాయని కిని మైత్రియున్నట్లు శ్రీనాథ కవికృతము లని చెప్పఁబడు క్రిందిచాటుపద్యములవల్లఁ దెలియు చున్నది.

శా. ధాటీఘోటకరత్న ఘట్టనమిళ
ద్ధాత్రీఘిష్ఠ కల్యాణఘం
టాటంకార విలుంఠలుంఠిత మహో
న్మత్తాహితక్షోణీ భృ
త్కోటీఘోకిత కుంభినీధరసము
త్కూటాటవీఝాట క
ర్ణాటాంధ్రాధిప సాంపరాయని తెలుం
గా, నీకు దీర్ఘాయువౌ.

శా. అక్షయ్యంబుగ సాంపరాయని తెలుం
గాధీశ, కస్తూరికా
భిక్షాదానము సేయురా, సుకవిరా
డ్బృందారక శ్రేణికిన్
దాక్షారామ పురీవిహార వరగం
ధర్వా ప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై
వాసించుఁ దద్వాసనల్.

### ఆంధ్రసారస్వతమునందు మఱియొక తెలుఁగు రాయఁడు

ఆంధ్ర సారస్వతమునందు మఱియొక తెలుఁగురాయని ప్రశంసకలదు. మడికిసింగన్న కవి, తన పద్మపురాణోత్తరఖండమునందుఁ దెలుఁగురాయనిఁగూర్చి యిట్లభివర్ణించెను.

మ. గురిజాలాన్వయ దుగ్ధవార్ధిశశి ది
క్కుంభీంద్రహస్తాభ బం
ధుర భూభారధురీణ నిశ్చలమహో
దోర్దండుఁ డుగ్రారి భీ
కరుఁడై దిక్పరివర్తికీర్తి నెగడం
గా భూరిభోగాఢ్యుఁడై
పరగెం ధాత్రిఁ దెలుంగు రాయఁడు జగ
త్పరిఖ్యాత రాజోన్నతిన్.

ఈమడికి సింగన్న పదునాల్గవ శతాబ్ద మధ్యమందున్న కవిశిఖామణి. కృతిపతియు నాకాలమువాఁడేకాని యన్యుఁడుకాఁజాలఁడు. ఈతెలుఁగురాయనిఁ దీసికొనివచ్చి పదునైదవ శతాబ్దమధ్యమువఱకుఁగల మన తెలుఁగురాయనికి ముడిపెట్టుట దుస్సాధ్యమైనకార్యము.

### పంటమైలారెడ్డి

ప్రౌఢరాయల విశ్వాసమునకుఁ బాత్రుఁడైన సేనాధిపతులలో మైలారువిభుఁడొక్కఁడు. ఇతని తాత తండ్రిసూరారెడ్డి; తాత పోతిరెడ్డి; తండ్రి ముమ్మడిరెడ్డి; తల్లిమున్నాంబ; ఇతనికి ధరణీవరాహుఁడు, చౌహత్తమల్లుఁడు, ఘంటానాదుఁడు అను బిరుదవిశేషములుకలవు. ఇట్టి శూరచూడామణి తనకొడఁగూర్చిన కొండంత జయముల కత్యంత సంతుష్టస్వాంతుఁడై రాయ లొకదిన మితనిఁ బిలిచి నీ కేమికావలయునో కోరుకొను మనెనఁట. అంతనతఁడు తన కేమియు నక్కఱలేదనియుఁ, దనప్రభువుయొక్కయుఁ, దన్మూలమునఁ దనయొక్కయు క్షేమముమాత్రము గావలయునని యు,నందులకై బ్రాహ్మణోత్తముల కొకచక్కనియగ్రహారముదానముచేయుట కాజ్ఞయొసఁగుమనియు వేఁడుకొనెనఁట. అంత రాయ లతఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోర్కెకలరియఁదులకాజ్ఞయొసంగెనఁట. అంత తత్ప్రకారము మైలారెడ్డి (శా.శ. 1351 క్రీ.శ. 1429) సంవత్సరము కీలకనామసంవత్సర మాఘమాసమున భాస్కరక్షేత్రమున, హేమకూటమున నివసించు విరూపాక్షదేవునిసన్నిధిని, పూఁగినాటిసీమలో గుండ్లకమ్మనదియొడ్డునునుండు పోలవరమను గ్రామమునకు చేజెర్లయను నామమిడి, బ్రాహ్మణుల కగ్రహారముగా ధారవోసెను (Copper plate No. 18 Nellore Inscriptions). పంటమైలారెడ్డినిగూర్చి తెలుపు శాసనమొకటి శ్రీ గోపినాథరావుగారిచే 'ఎపిగ్రాఫియా ఇండికా'యందు ప్రకటింపఁబడినది. ఈశాసనము చెన్నపట్టణములో తిరువళిక్కేణియందలి కవిభూషణము తాతాచార్యులవారియింట నున్నదఁట. ఈశాసనమునందు మైలారెడ్డి తన కులగురువగు సింగరార్యునకు అద్దంకి సీమలోని కమ్మవిషయమునందలి తెక్కలిపాడు గ్రామమును ధారవోసియిచ్చెను. ఈ శాసనకాలము క్రైస్తవమాసమున 1428 సం. జనేవరి 14-వ తేదీ యగుచున్నది. ఈ శాసనము ననుసరించి యితఁడు వైష్ణవమతాభిమానియై బ్రాహ్మణభక్తుఁడై విఖ్యాతిగాంచినట్లు రూఢిగ చెప్పనగును.*

శ్రీనాథుఁడు అవసానకాలమునందుఁ గష్టముల ననుభవించినట్లు, నాసమయమున నతఁడు విలపించుచుఁ జెప్పెనన్న పద్యమునందు తెలుఁగురాయనిఁ గూర్చియు. మైలారెడ్డిని గూర్చియు నామహాకవి యిట్లు ప్రశంసించెను:

సీ. కాశికా విశ్వేశుఁగలసె వీరారెడ్డి
    రత్నాంబరంబు లేరాయఁడిచ్చు
రంభఁగూడెఁ దెనుంగురాయరాహుత్తుండు
    కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱి హేమ
    పాత్రాన్న మెవ్వనిపంక్తిఁ గలదు
కైలాసగిరిఁబండె మైలారువిభుఁడేఁగి
    దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు
భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగె
కలియుగంబున నిఁక నుండఁ గష్ట మనుచు
దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.



* Triplicane Plates of Panta Mailara, Epgraphia Indica, Vol. XII, Part I.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




అప్పల వీరవెంకట జోగయ్యశాస్త్రి గారు



వ్యాసకర్త

అదిగో, గోసముదాయమంతయును
నందందొప్పఁగా నున్న ! ద
య్యదియే పచ్చికబైలు; నావెనుక
నత్యామోదమును గూర్చుచు
న్నదియే కృష్ణునిసౌధరాజ; మదె
యాహా! వార్ధి యుప్పొంగుచు
న్నది నామానసమట్లు; లీయవనిలో
నను నేన ధన్యాత్ముఁడన్.

* * * * * *

సీ. ముందుగా వచ్చి సముద్రుఁడు పాదముల్ గడిగి యాతీర్థంబు ఘనతఁ దాల్చె
పవనుండు పఱతెంచి పైపయి హాయిగా వీచె సువాసనల్ వెల్లివిరియ
వసుధ కోమలమైన పచ్చికపాన్పుపైఁ బవళింపఁ జేసె నను భక్తితోడ
శుకపికశారికల్ సొంపుగా నటుపైన జోకొట్టుచును నన్ను జోలపాడె
నహహా! నీప్రాంగణంబులయందు సంచ-రించువారలె యతిథి నీరీతిఁ జేయ
బాల్యమిత్రుండవును సహపాఠివగుచు-నెంతగా నీవు నను గౌరవింతొ కృష్ణ!

* * * * * *

సీ. అతిథినం చొకవేళ యాదరింతువొ, లేక శుష్క-దేహుఁడటంచుఁ జూడరావొ?
బ్రాహ్మణుండ నటంచు భక్తిఁ జూపెదొ, లేక పేదపాఱుఁడటంచుఁ బ్రేమఁగనవొ?
సహపాఠి నని నన్ను సన్నుతింతువొ, లేక జీర్ణాంబరుండని చేరఁ జనవొ?
మిత్రుండ నని నన్ను మెచ్చుకొందువొ, లేక "నిన్నెఱుఁగ"నటంచు నన్ను ననెదొ?
ఏదియైన నీభక్తుఁడ నింతదవ్వు-పావనంబగుదర్శనభాగ్యమునకు
వచ్చినాఁడను, కృపఁ జూడవయ్య కృష్ణ! భక్తలోకైకపాల! గోపాలబాల!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పారశీకము—హిందూదేశము

దేశరాజు సూర్యనారాయణ గారు

ప్రస్తుతము హిందూదేశమున నివసించు నానాజాతులలో పారశీకు లొకరు. వీరు దాదాపు 1300 సంవత్సరములనుండియు భారతదేశమును మాతృభూమిగా స్వీకరించి దినదినాభివృద్ధి గాంచుచున్నారు. పారశీకులు పురాతనపు "ఇరాన్" జాతివారు. ఇరానులు నేడు ఖండఖండము లైపోయినను ఒకానొకప్పుడు మిక్కిలి బలముగల సామ్రాజ్యమును పరిపాలించినట్లు గొప్పగొప్ప చరిత్రేతిహాసములును, వారిమతమును ఖండితముగా జాటుచున్నవి.

వీరు మనదేశమున కెట్లువచ్చి స్థిరపడిపోయినది వినుటకు ఆంధ్రయువకులు కుతూహలపడగలరు. ఈదేశమున వీరి ప్రాచీనపు చరిత్ర చాలవరకు హైందవుల చరిత్రను బోలియే యుండును. ఇంతియేకాక హిందూమతమును, "జోరాష్ట్ర"మతమును ఆచారవ్యవహారములందు పోలికగల్గి యున్నవి. సంస్కృతమును, జందను సంబంధముగల భాషలు. మరియు రెండుజాతులును, ఎక్కువసామీప్యమున నివసించుచుండినందున వాటికి మిక్కిలి దగ్గరబాంధవ్యమున్నది.

పారశీక సామ్రాజ్య పతనమునకును, ఇతరదేశముల నాశనమునకును ఎంతమో వ్యత్యాసములేదు. పారమార్థికము తగ్గిపోయి, వెనువెంట బుద్ధికుశలతయు క్షీణించగా పాపభీతిపోయి ప్రాపంచికసౌఖ్యములకు దాసులై రాజకీయ, సాంఘిక, మతధర్మముల నతిక్రమించుటచే అధికారము, అభివృద్ధి, క్షీణించుటయేకాక మరేమి కాగలదు?

క్రీస్తుశకము 633 వ సంవత్సరములో అరబ్బులు పర్షియాదేశముపై దాడివెడలమొదలిడిరి. ఆకాలమున పారశీకుల శిబిరమునందు మనఃస్పర్ధలు పుట్టియున్నందున అరబ్బులకు కొంచెము లాభము కలిగెను. మతోత్సాహమున కిదితోడుకాగా వారికి ధైర్యము వృద్ధిపొంది వీరి రాజ్యముప్రక్కనే యెడారిలో మకాము చేసిరి. అచ్చట కలీఫాశాసనమువల్ల మరికొంత సైన్యముగూడ వచ్చి కలిసికొనెను. వీరిపైకి మిహార్షా అను సైన్యాధిపతి పారశీకసైన్యముతోడ దాడివెళ్లెను. కాని యతడోడింపబడి చంపబడెను.

పారశీకుల కపకీర్తి దినదినముదయించుచున్నదో యన వారి రాజ్యమునందంతటను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలతలు పుట్టెను. దానిఫలితముగా బలహీనుడును, రాజ్యవ్యవహారములయం దనుభవశూన్యుడును నగు రాజు సింహాసనమునకు వచ్చెను. ఈతనిపేరు యజ్దజార్డు. ప్రజ లీతనిని అరబ్బులమీదికి వెళ్లునట్లు పురికొల్పిరి. యుద్ధమింకను సరిగా మొదలుపెట్టక మునుపు పరిష్యను రాజసభకు 14 గురు మహమ్మదీయులు రాయబారమునకు వచ్చిరి. రాజు వారితో నిరసనభావముతోడ మాటలాడుచు కొంతతడవు గడపెను. తదుపరి సంభాషణలో వారేయుద్దేశముతోడ నచ్చటికి వచ్చియుండిరో, మేల తమపై కత్తిగట్టిరో యడిగెను. వారిలోని నాయకుడు చెప్పెను: "ఇస్లాము రాజ్యము ప్రపంచమునం దంతటను వ్యాపింపజేయుమని అల్లా తనయొక్క ప్రవక్తద్వారా మా కాజ్ఞాపించెను. ఆయాజ్ఞను మేము శిరసావహించి మీకు జెప్పుచున్నాము. మా మతమును స్వీకరించి మా సోదరులు గండు; లేదేని—యుద్ధములేకుండ జేసికొనదలతురేని—కప్పము గట్టుట కియ్యకొనుడు." అని. దురభిమానము, అహంకారము బాలుడగు రాజు మనము నావేశించగా కోపముతో "పురుగుపుట్రలు మీకాహారము; ఒంటె గొర్రెల బొచ్చు మీదుస్తులు. ఎంతమాత్రపు వారలని మాసామ్రాజ్యమును బంధించ దలచెదరు? ప్రపంచమందలి నానారాష్ట్రములలో కెల్ల మీది పేదరాజ్యము. మీరు అజ్ఞానులు; మృగప్రాయులు; కండ్లు దెరచి, భ్రమమూఢ్యముల నుండి మేల్కొనుడు. మీ దేశమునందు కరవు దుర్భరమగునేని మీకు కూడుగుడ్డలనిత్తుము. మీ ప్రభువుల సన్మానింతుము. మరియుమిమ్ము సౌఖ్యసంపదల నిచ్చి పాలించుటకు ఏలికనిత్తుము." అని పలికెను. రాయబారులలోని యాలోచన గలవా డొకడు తిరిగి జవాబు చెప్పెను: "రాజా! మీరు వర్ణించిన దంతయు నొకవిధముగా నిజము. ఏలయన పూర్వము మేము కీటకముల భక్షించుచుంటిమి. మరియు మాలో గొందరు తమ కాహారము చాలకుండుటచే దమబిడ్డల జంపుకొనితినిరి. మేము అధములుగా నుండియుంటిమి. ఇదంతయు పూర్వపు చరిత్ర. నేడా పరిస్థితులు మారినవి. అల్లా తమ ప్రవక్తను మాకై పంపించెను. అట్టివానియొక్క ప్రశస్తవాక్కులతోడ అల్లా మాతో మాట్లాడెను. మమ్ముల తన్ను నమ్మి తనయనుచరుల గమ్మనెను. వారి ద్వారా సర్వేశ్వరుడు సత్యమై, అద్వితీయమైన యిస్లాం మతమును అంతట ప్రచారము చేయ సెలవిచ్చెను. అందువలననే మేము ధైర్యముతోడ ప్రఖ్యాతిగల రాజ్యములకెల్ల వెడలి ఇస్లాము గాని, కప్పముగట్టుటగాని, యదియును గాని మొదల తుదివరకు యుద్ధముగాని కోరుడని చాటుచు దిరుగుచున్నాము" అని.

యజ్దజార్డుయొక్క కోపానలము మిన్నుముట్ట "రాయబారు లని సన్మానింపకుందునేని వెంటనే మిమ్ముల విగతజీవులుగ జేసియుండెడివాడ"ననెను. పిమ్మట నాతడు హేళనకై వారిలోని ముఖ్యుని నెత్తిపై మంటిగోనె నొకటి పెట్టించి "యిదియే కప్పము నేను మీకిచ్చునది; ఇంతకన్న వేరొండు మీరు పొందజాలరు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మృగప్రాయులారా! పొండు. రుస్తుము కొద్ది రోజులలోవచ్చి సేనాసహితముగా మీనాయ యకుని 'కడేసియా' కందకములలో పూడ్చ గలడని మనవిచేసికొను"డని చెప్పి తన సౌకరు లకు వారిని సాగనంపుడని సగర్వముగ నాజ్ఞా పించెను.

అయితే రాయబారులుమాత్రము ఎంత యు సంతసించిరి. తమ సేనానాయకుని వద్దకు జని "పరిష్యాదేశపుమన్ను మన"దని ఉత్సా హముతోడ బలికి గోనె నాతని పాదముల కడ హర్షముతోడ నర్పించిరి.

అంతట కడేశియాయుద్ధ మారంభ మాయెను (క్రీ. శ. 636). అందు పారశీకులు పరాజయ మొందిరి. వెంటనే మదయాను,వారి ముఖ్యపట్టణము, అరబ్బులవశమాయెను. యజ్ దజార్డు అందునుండి పారిపోయి హోల్వాను జేరి యచ్చట మరియొక యుద్ధములో గూడ నోడింపబడెను. పారశీకరాజు గొప్ప సేనను గూ ర్చుకొని కడపటి యదృష్టముగూడ పరీక్షింప నెంచెనుగాని నహావందుయుద్ధములో పారశీక రాజ్యము పూర్తిగాపడిపోయెను. యజ్ దజార్డు మరల పారిపోయి నీచముగా మరణించెను. పారశీకులు నాశనము చేయబడిరి. అరబ్బులు ఇరానుప్రభువులైరి.

అప్పటినుండి దుఃఖకర మగు రంగము మొదలిడెను. అరబ్బులు కత్తిదూసి తమ మత మును పారశీకులకు బోధించి స్వీకరింప బల వంతపెట్టజొచ్చిరి. వందలకొలది కష్టముల కోర్వక మరణించిరి. వందలకొలదిమతములో

గలిసిపోయిరి. కొలదిమంది మాత్రము తమ పూర్వపుమతమునకు—అగ్నియే దైవముగాగల మతమునకు—బద్ధులైయుండి దేశము విడిచి పోయిరి. వారు భారతవర్షమువైపు దృష్టి సారించిరి.

ఆపదలు ఒంటరిగా రావు. అవి గుంపులు గుంపులుగా ఒకటి విడువ మరియొకటి వచ్చి ధైర్యస్థైర్యముల పరీక్షించుచుండును. సముద్ర మధ్యమున నీకొలదిమతవీరులను తుపాను ఎదుర్కొనెను. మతము కొరకు దేశమును విడిచిరి. వారి నిప్పుడు మృత్యువు నీటిపై దరుమ జొచ్చెను. కాని వారు ధైర్యమును వీడలేదు. అట్టికష్టదశలో భగవంతునికన్న వారికి వేరు దిక్కెవరు గలరు? దైవప్రార్థన చేసిరి.

"హే సర్వజ్ఞమూర్తీ! ఈ మహాపదలో మాకు చేయూత నొసగుము. రానున్న ఘోరమరణమునుండి విముక్తినొందించుము. స్వప్రకాశా! కష్టపరంపర గడతేర్చి హృదయ పుటముల వికసింపజేయ వేడుకొనుచున్నాము. తమ కటాక్షమువలన మమ్ము చుట్టుకొనిన తుపాను నెమ్మదింపజేయగలవను దృఢసంక ల్పమున నెదురుచూచుచున్నాము. తమతోడు కలిగినంతవరకు, హేప్రభో! యిడుమల లెక్క చేయము. భక్తపోషకుడవను దృఢవిశ్వాసము మాకు కలదు. రక్షించుము. దయామయా! ఆపదబాపి హిందూదేశపుటొడ్డున జేర్చగలవు. ప్రభో! నీదయకు గానుకగా నచ్చట పవిత్ర మగు నగ్ని ప్రజ్వాలింపజేసి మ్రొక్కు చెల్లింతుము."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రార్థన వినెనోయన గాలివాన యాగెను. సన్‌జాను నొద్ద వారు ఓడదిగిరి.

సన్‌జాను హిందూదేశమున పశ్చిమపు టొడ్డున నొకచిన్నపట్టణము. జాదీరాణాయను ప్రముఖుడు దానిని పాలించుచుండెను. ఆతడు దయగలవాడు; విజ్ఞాని. పారసీకులు తమకు నిలువనీడ నిమ్మని వారిలో నొకనిచే రాజు కడకు విజ్ఞాపన మంపిరి. శౌర్య ముట్టిపడు నా భక్తశిరోమణియొక్క దృశ్యమున కచ్చెరు వొంది రాణా వారినిగూర్చి విపులముగా సంగతుల వినగోరెను. తమస్థితిగతులనుగూర్చియు, మతవిషయమునను రాజున కాతడు బాగుగా నచ్చజెప్పెను. మతవిషయమై విశదముచేయుటకుజెప్పిన క్రింది 16 అంశములును రాజునకు ఎక్కుడు ప్రీతిని గలిగించి తావిచ్చునట్లు చేసెను.

1. హూరామజ్‌దా, సూర్యుడు, పంచభూతములను పూజించుట.

2. స్నానము జేయునప్పుడును, ప్రార్థన చేయునప్పుడును, అగ్నికి పూజ లొనర్చునప్పుడును, మరియు భుజించునప్పుడును మౌనము నవలంబించుట.

3. దైవపూజలలో సుగంధద్రవ్యములు, పూలు వాడుట.

4. గోవును పూజించుట.

5. పవిత్రమైన దుస్తులు, సూద్ర అనగా చొక్కా, కుస్తి అనగాత్రాడు, మరియు రెండు మడతలుగల టోపీని ధరించుట.

6. వివాహకాలమందుగానములచేతను, మేళతాళములచేతను ఆనందించుట.

7. స్త్రీల నలంకారభూషితల జేయుట.

8. తటాకములు, బావులు త్రవ్వించుట మొదలగు ధర్మకార్యములందు విరివిగా ఖర్చు చేయుట.

9. స్త్రీపురుషులయెడ సమానౌదార్యమును జూపుట.

10. గోమూత్రము పవిత్రమైనదిగా భావించి శుద్ధిచేసుకొనుటకు వాడుట.

11. ధ్యానము, భోజనముల వేళ, పవిత్రమైన నడికట్టు (యజ్ఞోపవీతము) ధరించుట.

12. అగ్నిదేవుని ధూపములతోడ పూజించుట.

13. దినమున నైదు పర్యాయములు ధ్యానము చేయుట.

14. వైవాహిక బంధుత్వము, పవిత్రత ఎక్కువగా గణించుట.

15. పితృక్రియల ప్రతిసంవత్సరము నాచరించుట.

16. ప్రసవమునకుబూర్వము పిమ్మటను గూడ స్త్రీలుఎక్కువనియమములుపాటించుట.

విజ్ఞాపకులీవిషయములు మత విషయములైన ఆచారములుగా చెప్పగా రాజును ఆతని అనుచరులును సమ్మతించిరి. వారు పూజనీయమైన భారతదేశమున సన్‌జాన్‌లో స్థిరవాసము లేర్పరుచుకొనిరి.

పిమ్మట వారిమ్రొక్కుబడికి తగునట్లుగ ఒక దేవాలయము అగ్నిదేవునకు గట్టిరి. అం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౫. ఆ (3 వ చిత్రము) స్తంభమునందలి యొక యేనుగుతల—(కుడిప్రక్క—భాగము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౬. ఒక క్యాలండర్ కాలమ్ (పంచాంగము)_Calendar Column_దీనినిబట్టి మధ్య అమెరికా నాగరికతాభివృద్ధికాలమును తెలిసికొనవచ్చును._[క్విరిగ్వా కడ ఒక వాలియున్న స్తంభము.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లకు తగినస్థలము రాణా వారి కొసంగెను. మరియు ఒకానొక శుభలగ్నమున అనేకులు సభ తీర్చియుండ దస్తూర్ దారాబ్ నాచరించిరి. రాతిపలకపై మంచిగంధపుచెక్కనుంచి నాల్గు దిక్కుల శాస్త్రవేత్తలు కాచుకొని యుండ వారు "మత్రము"లు అనగా మంత్రముల నుచ్చరించిరి. అంత నెవ్వరికిని తెలియకుండ అగ్ని దేవతయొద్దనుండి దేవవహ్ని వచ్చి ఆ కర్రనంతయు ప్రజ్వలింపజేసెను. ఈ అగ్నిని వారు నేటివరకును ప్రతిదినము నైదుపర్యాయములు దర్శించి పోవుచుందురు. అనుదినము ను జరాతుష్ట్ర పూజకులు అగ్ని కెదుర నిలిచి పూజించి వరములు గైకొందురు.

(C. H. C. మాసపత్రికలోని B. P. Wadia గారి ఆంగ్లేయవ్యాసము ననుసరించి (వ్రాయబడెను.)





వ్యాసకర్త

# భ ర త ధా త్రి

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

సాంఖ్యయోగ న్యాయశాస్త్ర విమర్శకాగ్రణులైన జ్ఞానులఁ గన్నతల్లి
అద్భుతశౌర్యధైర్యస్థైర్యనిధులైన క్షత్త్రియపుత్త్రుల సాకుజనని
సంపత్సమృద్ధి దేశపు దరిద్రతఁబాపు వైశ్యరత్నముల నేర్పఱచునమ్మ
కార్యశూరులయి జాగ్రత్స్వామిభక్తిసంభారులౌ ధీరులఁ బడయుమాత
గణ్యాశిల్పకలా కల్పకల్పనా చమత్కృతివిధాత్రి సర్వసంపత్ప్రదాత్రి
శ్రుతిపురాణేతిహాస కావ్యతతముకుర-ప్రతిఫలిత భవ్యతరగాత్రి భరతధాత్రి!

సీ. తాపసులగుచు విద్యాప్రపంచమునకుఁ బ్రోదియొసఁగెడి భూసురులకు
దుష్టశిక్షకులౌచు శిష్టరక్షకులౌచు శౌర్యధనులయిన క్షత్త్రియులకు
వాణిజ్యమునఁ గృషివలనను ధనధాన్య భూరిసంపదగూర్చు నూరుజులకు
సారస్వతోద్యమ సామ్రాజ్య వాణిజ్య వివిధసాహాయ్యులౌ వృషలులకును
అఖిలశిల్పకలా రహస్యవిదు లొప్ప-వాసిగనిన యవాంతరవర్ణములకు
వాసమై భాసమాన వైభవకళలను-దీర్చె మును తల్లి భరతధాత్రీమతల్లి.

4. 2- 15

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆంధ్రాభ్యుదయము

## ఈడ్పుగంటి రాఘువేంద్రరావు గారు
## ప్రధానమంత్రి - మధ్యరాష్ట్రములు



అన్యరాష్ట్రములందు ఆంధ్రప్రతిభ ప్రకాశింప జేసి, ఆంధ్రులకు గౌరవము సంపాదించిన చింతామణి (అలహాబాదు), రాధాకృష్ణను, రామను (కలకత్తా), మేజరు గోవిందరాజులునాయుడు (హైదరాబాదు), టి. రాఘవయ్య (తిరువాన్కూరు దివాను) మొదలగు నాయకులతోపాటు మధ్యరాష్ట్రములందు ఈడ్పుగంటి రాఘువేంద్రరావుగారు గలరు. అన్యరాష్ట్రమం దింత గొప్పపదవికి వచ్చిన రాఘువేంద్రరావుగారు సోద రాంధ్రుడేయని తెలిసికొనుటకు అనేకులు కుతూహలపడె దరు. వీరుకృష్ణాజిల్లాగుడివాడతాలూకాలోని పెదమద్దా గ్రామవాసులు. వీరి తండ్రిగారగు నాగన్న చౌదరిగా ౬౦ సం. క్రిందట మనదేశమున రైల్లురాకపూర్వ మిలిటరీవారితో మధ్యరాష్ట్రములకు వారిసామగ్రి మీద మోయించుకొనిపోవుటకు కంట్రాక్టుమీద వెళ్లియున్నారు. వీరితోపాటు కమ్మవారు అనేకమం వెళ్లి నాగపూరు, బిలాసపూరు, జబ్బలపూరు మున్న ప్రాంతముల నివాస మేర్పరచుకొన్నారు. రాఘువేం రావుగారితండ్రి మిలిటరీకంట్రాక్టులుచేసి, ధనమార్జిం విశేషముపలుకుబడిసంపాదించిరి. రాఘువేంద్రరావుగా లండనులో బారిష్టరు వేసయి, బిలాసపురమున న్యా వాది వృత్తినుండి పురపాలకసంఘాధ్యక్షులైనారు. జి బోర్డు అధ్యక్షులై గితశాసనసభలలో స్వరాజ్యపా నాయకులై విశ్వాసరాహిత్యతీర్మాన ముపపాదించి మంత్రిపదవిగూడ నిరాకరించిరి.

స్వరాజ్యపార్టీ కార్యనిర్వాహకసభయందు సభ్యు డుగా వీరు పనిచేసినారు. కాని ఆపార్టీసిద్ధాంతములం విశ్వాసముపోవుటచే ఇండిపెండెంటు కాంగ్రెసుపార్టీ స్థాపించి గతఎన్నికలలో పోటీ లేకయే గెల్చినా ఇప్పుడు పార్టీ సిద్ధాంతప్రకారము మంత్రిపదవి స్వీక రించి, ప్రధానమంత్రి అయినారు. ఇట్లు యౌవనమున ఇట్టి గౌరవపదవి నెవ్వరు, ఎచటను మనదేశమున పొందలేదు. వీరివయస్సు 35 సం॥మాత్రమే యుండు పలుకుబడి గలవారు. ధనవంతులు. మనదేశములో సం ధబాంధవములు గలవు. ప్రతిసంవత్సరము స్వగ్రా మగు పెదమద్దాలికి వచ్చుచుందురు. అచట భూములుగూడ గలవు.

ఆంధ్రుల అభివందనములకు వీరెంతయు సర్హు ఆంధ్రమాతకు జయ్ ! ! !

“ 16 అణాల ఆంధ్రుడు ”

*   *   *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## కొటికలపూడి నృసింహసిద్ధాంతి గారు



భారతి మూడవసంపుటము తొమ్మిదవ సంచిక యందు (పే. ౭౯-౮౧) ప్రకటించిన శ్రీకృష్ణరాయల జన్మదివస మను వ్యాసమును రచియించినవారు వీరే. బొబ్బిలిసంస్థానమున వీరు సిద్ధాంతులుగ నున్నారు. వీరి వయసు డెబ్బదిసంవత్సరములు.

* * *

## శ్రీమతి డాక్టరు లక్ష్మీదేవి, యం.బి., బి.యస్.,



శ్రీమతి లక్ష్మీదేవిగారు డాక్టరు ఆచంట లక్ష్మీపతి (యం.బి., బి.యస్.) గారి పుత్రిక. ఢిల్లీనగరమందలి లేడీ హార్డింజి వైద్యకళాశాలలో నేడు సంవత్సరములు వైద్యవిద్యనభ్యసించి యం.బి., బి.యస్. పరీక్షయందు జయముగాంచిన యాంధ్రయువతీమణి యిప్పటికీమె యొక్కతయే. డబ్ల్యూ. యం. యస్. ఐ. (Training reserve of Women's Medical Service in India) పట్టమును పొందుటకై మూడు సంవత్సరములు వైద్యశాఖయందు పనిచేయ నీమె నియమితయయ్యెను. తరువాత నీమె వైద్యశాస్త్రమున నెక్కుడుసామర్థ్యమును గడించి ఉత్తమ పట్టములను గాంచ నింగ్లాండునకు బోవును. ఇట్లే యింకను గొంద రాంధ్రసోదరీమణులు ప్రవీణలగుదురేని ఆంధ్రదేశ మచిరకాలమున మహోన్నతస్థితిని జెంది యితరరాష్ట్రములకు మేలుబంతి కాగలదు. మనుష్యం దీయమవిజ్ఞాన సామర్థ్యఫలము నాంధ్రలోక మనుభవించి యానందించును గాక!

* * *

## వీణాచార్య తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారు



పిఠాపురమహారాజాస్థాన వైణికులు, పిఠాపురము. వీరు అప్పుడప్పుడు శాంతినికేతనమునకు బోయి తమ మధురవీణాగానముచే నచ్చటివారల నానందింపజేయుచుందురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# శివ ప్రబోధము

పండితారాధ్యుల నాగభూషణము గారు

విరాసరమైన తాపమున మేను కృశింపగ రాజతాచలా
వాసము నోసరించి జటిపై జపముం బొనరించె దక్కటా,
వాసరనాథచండకరవార మహోష్ణభరంబు నెట్టులీ
వేసవియందు పార్వతిని వీడి భరించెదు నాగభూషణా!

చ. సడలనిభక్తి నీదుపదసారస యుగ్మకమున్ సతంబు దా
నెడద భజించుచున్ సకల మీవె యటంచు సపర్యలెల్ల నే
ర్పడరగ జేయుచున్న నకటా కడగంటనుజూడ వద్రిజన్
బడతులనీగతిన్ వెతలపా లొనరించుట నీకు బాడియే.

చ. చలువల జిమ్ముచున్ మిగులసౌఖ్యదమై యెసలారు నాహిమా
చల విలసన్మణీ కలితసానుతలంబుల శీతలానిలో
జ్జ్వలదళిపుంజరంజిత విశాలనికుంజ గృహాంతరంబులం
దెలమిని పార్వతిం గవియ కేటి కిటుల్ జపియింతు వొంటివై.

క. అనుకూలయగుచు నీదరి-నన యము ప్రేమించి మసలునబ్జదళాక్షిన్
జనవునలో గొనకకటా!-మునివృత్తి వసించెదేల ముగ్ధుడవగుచున్.

శా. స్త్రీలోలుండని గేలిసేతురనుచున్ జింతింతువో లేక నీ
కైలాసాచలమున్ విడంగ మదిలో గష్టంబుగా దోచెనో
ప్రాలేయాచలభృద్వతంసము నిన్నున్ బ్రార్థింపడం చల్గితో
చాలుంజాలును జాలు లెమ్మికను నీసందేహము ల్మానుమీ.

శా. ఏకాంతంబున నాలతాంగిగొన నీకిష్టంబు లేకున్నచో
నాకన్యామణి తండ్రినే యడుగరాదా యట్టు లర్థించుటల్
నీకుం బోలదటన్న మిత్రులకు నేనిం జెప్పరాదా వృథా
మూకత్వంబు సహించి యిట్లు దినముల్ పుచ్చంగ మేలే శివా!

సీ. అనుమతింపకయున్నె యండజేర్చిన నీవు తనకుదావచ్చిన వనజనయన
సమ్మతింపకయున్నె సతి నోసంగుటకు నీయడుగులంటి భజించు నద్రిరాజు
సంతసింపకయున్నె యింతిగైకొన్న విశ్వహితంబుగోరు నస్వాప్నగణము
బయలు దేరకయున్నె బద్ధానురాగయౌ లలన నీతోడ కైలాసమునకు
లేనిపోనిసందేహంబులూని హాని-నొచుచునేల వృథా కాలయాపనం బొ
నర్చెదవు ధైర్యమేది సుందరినివీడి-చాలుచాలును లెమ్మింక నీలకంఠ!

గీ. అఖిలలోకావనంబును నాశ్రితావ-లీమనోరథసిద్ధియునౌ మహాత్మ,
కాన నీహానమునువీడి కాంతగూడి-వేగసుఖములసందు మో నాగభూష!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




౧. ఎచ్చరిక

[౧౯౨౨ వ సంవత్సరము జనవరినెల 'మాడర్న్ రివ్యూ' సంచికయందు *'సంపాదకుడు వ్రాసిన నాల్గవలేఖ' నుండి.]

"హిందూమహాసముద్రముపై ప్రయాణముచేయునప్పుడు సముద్రవ్యాధులు బాధింపకున్నను ఇంగ్లీషుచానలు (యూరపునకును ఇంగ్లండునకును నడుమనుండు సముద్రభాగము) పైప్రయాణము చేయునపుడు బాధించునని వినియుంటిని. ఇది విశ్వాస్యమే యగును. ఏలయన: భారతదేశముననుండు ఇంగ్లీషువారత్యల్పసంఖ్యాకులయినను కోట్లకొలది నున్న భారతీయులకన్న వెఱపుగొల్పువారుగ నున్నారుకదా! ఇక హిందూ మహాసముద్రమునకన్న ఇంగ్లీషు చానలు ఉపద్రవకరమన్న నేమి వింత? కాని, నేనుమాత్రము ఎట్టి యుపద్రవమునకు పాలుగాక సుఖముగనే చానలును దాటగలిగితిని.

*　　*　　*　　*

డోవరునుండి లండను నగరమునకు రైలులో ప్రయాణము చేయుచు ఇంగ్లండులో కొంతభాగమును గాంచి దేశతత్త్వము నారయగల్గితిని. వంగదేశ కవిపుంగవుడు—శ్రీద్విజేంద్రలాల్ రాయి—"బిలాత్ దేశతా మాటిర్", అనగా 'బ్రిటిషు దేశమునందలి భూమియు నితరదేశముల భూములవలెనే మృణ్వికార'మని నుడివెను.

"ఇంగ్లీషువారు ధనవంతులు, శక్తిమంతులు, మేధావులు నైయున్నారు. వారింగ్లండుభూములనుండి బంగారమును, రత్నములను త్రవ్వి తీసికొని ధనవంతులు గాలేదు. వారింగ్లండునందలి భూసారము ఇతరదేశములందలి భూసారముకన్న విభిన్నమును నుత్కృష్టమును నగుటచే శక్తిమంతులును, మేధావులును గాలేదు. కేవలము వారికిగల యభినివేశము, ప్రయత్నమే వారట్టివారగుటకు గారణము. ఇతరదేశములవారును నట్టి యభినివేశముగల్గి ప్రయత్నించినచో దాము నింగ్లీషువారివలె ధనవంతులు, శక్తిమంతులు, మేధావులు నగుదు"రను విశ్వాసము నాత్మదేశీయుల మనముల నెలకొల్పనీకవి యిట్లు ప్రబోధించెను.

మఱియు నేను ఇటలీ,స్విజరుల్యాండు, ఫ్రాన్సు దేశముల సంచారము చేసితిని. అచ్చటి పొలముల యందు పచ్చని పచ్చిక మొలచియుండెను. చెట్లు పచ్చని చిగుళ్లతోడను, పలువన్నెలుగల పూవులతోడను నలరారియుండెను. నదులు, సరస్సులు మనదేశమునగల నీటివంటి నీటితోడనే నిండియుండెను. కాని బంగరు పచ్చిక, బంగరు చిగుళ్లు, పూలు, బంగరు లేక వెండినీరు నెచ్చటను గాన్పించలేదు. అచ్చట ఆహారమునుగైకొంటిని. మనదేశపు ఆహారమురుచికిని దానిరుచికి నించుకయేని భేదము కాన్పింపలేదు. ఉదకమును గ్రోలితిని. మనదేశపు ఉదకమువలె నుండెనేకాని, అమృతముగా నుండలేదు. ఈదేశములయందే కాదు; ఇంగ్లండునందును అన్నిట ఇట్టి సాధర్మ్యమునే కాంచి వింతచెందితిని. కాని, కట్టా! యూరోపియనులు, ఇంగ్లీషువారు యూరోపియనులు ఇంగ్లీషువారుగనే యున్నారు; మనము మనముగనే యున్నాము.

*　　*　　*　　*

నేను యూరపుఖండమున ప్రయాణముచేసిన యన్ని రైలుబండ్లయందును పొగత్రాగువారికి ప్రత్యే

* మాడర్న్ రివ్యూ సంపాదకులు యూరపుసంచారము చేయుచు తమ సంచారచరిత్రమును, అనుభవములను లేఖలుగవ్రాసి తమ పత్రికయందు ప్రకటింపించుచుండిరి. వానియందిది నాల్గవలేఖ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కము గదులున్నవి. భారతదేశమునగూడ నిట్టి యాచారమును రైల్వేవా రవలంబింపవలెను.

* * * *

పాశ్చాత్యులు దాల్చు బట్టలంగూర్చి యిట గొంత చెప్పవలసియున్నది. ఇటలీ, స్విజరుల్యాండు, ఫ్రాన్సు, ఇంగ్లండు, జర్మనీ, జెకోస్లావేకియా, ఆస్ట్రియా, దేశములయందలి స్త్రీపురుషులను జూచితిని. యూరపు ఖండమునందున్న రషియా, హాలండు, నార్వే, అమెరికా దేశముల స్త్రీపురుషులను జూచితిని. వీరందరికిని వస్త్రధారణమున సామరస్యము చాలవఱకు గలదు.

* * * *

ఈసామరస్యము చాల విలువగలది. భారతీయుల వస్త్రధారణమునందలి భిన్నభిన్న వైఖరులంబట్టి వీరు వీ రీప్రాంతములకు జెందినవారని గుర్తింపగలము. వస్త్రధారణమునందలి యీవిభిన్నత వీరియందు విభేదభావమునుత్పాదించి ఐకమత్యమునకు భంగమును గల్గించుచున్నది. పాశ్చాత్యులయం దట్లుకాదు. వేరువేరు దేశములవారైనను పాశ్చాత్యులు–తమలో దాము కలహించిన కలహింతురుగాక–తామాదఱు నొక్కటెగవారేయనియు, ప్రాచ్యులు వేరనియు దలంతురు. వస్త్రధారణమందలి సాధర్మ్యమే వారియం దీయభిప్రాయ మభివృద్ధి చెందుటకు తోడ్పడుచున్నది. ప్రపంచమునందలి యితరదేశములతో బోల్చి చూచినను పాశ్చాత్యుల యైకమత్యమున కీవస్త్రధారణ సామరస్యమే ముఖ్యకారణ మగుచున్నది."

* * * *

## ౨. డెయిలీమెయిలు పత్త్రికచరిత్ర

['ఇండియన్ రివ్యూ' మాసపత్త్రికలో ఇంతిసూజ్ మహమ్మదుఖానుగారు (యం. ఏ. లండన్) వ్రాసిన వ్యాసమునుండి]

"'డెయిలీమెయిలు'దినపత్రిక ప్రపంచమునందలి యెల్లపత్రికలలో ప్రసిద్ధిగాంచి ప్రజాదరణమును బడసినది. యూరపు, అమెరికా ఖండములయందలి యితర దినపత్రికలు ఈపత్రికతో పోటీచేయజాలవు.

ఈపత్రిక కార్యస్థానము లండనుపట్టణములో ఫ్లీటువీథి (Fleet-Street) ప్రక్కన నొక యిరుకైన సందులో థేమ్సు (Thames) నదియొడ్డున నున్నది.

ఈపత్రికను ప్రారంభించినది 'లార్డు నార్తుక్లిఫ్' (Lord North Cliffe) అని ప్రఖ్యాతిగన్న 'ఆల్ఫ్రేడ్ హారమ్సువర్తు' (Alfred Hormasworth) 'పత్రికయే దేశబల'మని పత్రికాప్రయోజనము నిరూపింపజేసినా డితడు. పత్రికను తక్కువవెలకు విక్రయించి దేశీయులకందఱకు పత్రికాపఠనము నలవాటుచేసి నిత్యకృత్యముగా నొనర్చిన దీతడే.

ఇతడు చిన్నతనమున వార్తాహరుడుగా నుండెను. ౧౮౮౮వ సంవత్సరమున తనసోదరుడగు 'సెసిల్' (Cesil) అనువానితోగలిసి తొలుత 'ఆన్సర్సు' (Answers)అను పత్రికను ప్రారంభించెను. 1894వ సంవత్సరమున 'ఈవినింగ్ న్యూస్' (Evening news) అను పత్రికను విక్రయమునకు దీసికొని తనబుద్ధికుశలతచే దాని నభివృద్ధికి గొనితెచ్చెను. పదపడి 1896వ సంవత్సరమున నీ'డెయిలీమెయిలు'పత్రికను ప్రారంభించెను. పాఠకుల యభిరుచిని, ఆదరణమును బెంపొందించు వృత్తాంతములను సంగ్రహించి ప్రకటించుటయందు నేర్పుగల 'నార్తుక్లిఫు' తెలివితేటలు, చౌకవెల, పత్రిక కచిరకాలముననే ప్రఖ్యాతిని, వ్యాప్తిని గల్గించినవి. అప్పుడు అందముగ ముద్రించిన ౧౦-౧౨ పేజీలుగల యిట్టి పత్రిక వెల అరపెన్ని (రు ౦-౦-౬) మాత్రమే. ప్రస్తుతము దానివెల రెండింతలుగ–ఒకపెన్ని (రు ౦-౧-౦)గ–నున్నను టైమ్సుమొదలయిన ఇతరపత్రికలకంటె చౌకగనే యున్నది.

పత్రికా కార్యస్థానమున్న వీథియందు రాత్రి ౧౦ గంటలప్పుడు—లండను నగరమంతయు మాటుమణిగియున్న సమయమున—కార్యస్థానమున రాత్రులయందు పనిచేయువారలకు చౌకగా నాహారపదార్థముల నమ్ముటకై పెక్కు హోటళ్లు తెఱచియుంచును. రాత్రుల పత్రికలను దేశదేశములకు గొనిపోవు రైలుబండ్లయొద్దకు పత్రికలతో నిండినసంచులను దీసికొనిపోవుటకై మోటారుబస్సు లనేకములు కార్యాలయము వాకిట సిద్ధముగా నిలిచియుండును. రాత్రి ౧౦ గంటలకు

కార్యాలయమున వెలువడుపత్రిక మరునా డుదయమున ౬ గంటలకు 'ఇన్వర్ నెస్' (Inverness)— (స్కాట్లెండు ఉత్తరపుకొస నున్నది)—పట్టణమున పంచి పెట్టబడును.

కార్యస్థానము పైయంతస్తున సంపాదకీయవర్గము ను, కంపాజిటరులును ఉందురు. అచ్చులు తయారు చేయునట్టియు, అచ్చులు పోర్చునట్టియు యంత్రములు ౪౫ అచ్చట నిరంతరము పనిచేయుచుండును. అనటి యుద్యోగులసంఖ్య 1200. వారి జీతము వారమునకు ౩ మొదలు ౪౦ పౌనులవరకు గలదు. పత్రికను అచ్చొత్తి, మడిచి, బంగీకట్టి, ముద్రవేసి, ఒకనిముసమునకు ౧౫౦౦ ప్రతులను సిద్ధముచేయు యంత్రములు, ౧౪ గజముల పొడవుగలవి, ౨౦ ఎడతెగక పనిచేయుచుండును. రాత్రి ౧౦ గంటలకు అచ్చుపోర్పు తయారయిన పత్రిక ౧౧ గంటలకు పూర్వమే ముద్రితమై చందాదారులకు చదువ సిద్ధముగ నుండును. ప్రతి ౨౪ గంటలకును పత్రిక నాలుగైదుమారులు ముద్రణములను గాంచును. అందు రెండు ముద్రణములు దేశాంతరములకు బోవునవి—ఒకటి 'ప్యారిసు' (Paris) నగరమునకును, రెండవది మ్యూనిచ్ (Munich) నగరమునకును (జర్మనీలోనిది) బోవును.

ప్రతిదినము నికరముగ ౨౦ లక్షల పత్రికలు వెలపోవును—బ్రిటిషుద్వీపములందు (లండను పట్టణము సగాక) ౭౪ లక్షలు; లండను పట్టణమునను విదేశములయందును గలసి ౧౨౪ లక్షలు. ఇతరపత్రికలవలెనే యీపత్రికకును ప్రకటనలవలన నధికాదాయము వచ్చును. పత్రిక ముఖ్యపత్రములయం దొకపత్రము ప్రకటనకు గావలయునన్న నొక ప్రకటనమునకు ౧౬౦౦ పౌనులు సొమ్ము ఇచ్చినను ప్రకటనమును పత్రికయందు గాంచుటకు కొంతకాలము వేచియుండవలెను. ప్రకటనలవలన ప్రతిదినము నీపత్రికకు ౭౦౦౦ పౌనులు ఆదాయము వచ్చును."

## 3. ప్రపంచమందలి యొక విచిత్రభాష

['మాధురీ(హిందీ)పత్రిక అశ్వయ పుష్య మాస సంచికనుండి.]

"అమెరికాలోని 'రెడ్ ఇండియన్' జాతివారు (Red Indians) ఒక విచిత్రమగు భాషను వ్యవహరించుచున్నారు. దానిని మనము చిహ్న (Sign) చిత్ర (Picture) భాషయని చెప్పవచ్చును. కెలిఫోర్నియా దేశస్థుడగు విలియమ్ టామ్కిన్ అనునాతడు వారిభాష కొక నిఘంటువును 'Indian Sign Language' అను పేర రచించియున్నాడు. అందతడు దాదాపు 800 సంజ్ఞలకర్థము లిచ్చియున్నాడు. కడచిన 41 వత్సరముల నుండి యాతడు ఇండియనులభాష నభ్యసించుచుండుటచే నాతడొసంగిన సంకేతార్థములు సరిగనుండునని తలపవచ్చును. మొదట నతడు ఎఱ్ఱఇండియనులతో (Red Indians) బరిచయము గలిగించుకొనెను; పిదప వారితో సంజ్ఞలమూలమున భాషింప నేర్చుకొనెను; పిమ్మట వారిభాష నేర్చుకొనెను; తరువాత క్రమముగ వారి యాచార వ్యవహారములను, విచిత్రమగు చిత్రభాషను నేర్చుకొనెను. చిహ్నభాషకు గొన్ని యుదాహరణము లిచట నీయబడుచున్నవి. ఈచిహ్నములు సర్వదేశ వ్యాప్తము లగుటచే వాని ననతికాలముననే యభ్యసింపవచ్చును. మన దేశపుజనులుగూడ ఆచిహ్నములలో ననేకము లుపయోగించుచున్నారు.

ఈపై నిఘంటువులోనే 220 చిత్రరూపశబ్దముల యర్థములుగూడ నొసంగబడియున్నవి. ఈశబ్దములను అక్కడి పూర్వులు రాతిబండలమీదను, కఱ్ఱలపైనను, చర్మములమీదను వ్రాయుచుండెడివారు. ఈ చిత్రశబ్దములు కథలు వ్రాయుట కెక్కువ యుపయోగపడెడివి. ఈక్రిందిచిత్ర మట్టికథ నొకదానిని వివరించుచున్నది. దీనిని నట్టనడుమునుండి చదువ మొదలిడవలెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వరుసగా వానిఅర్థము ఇది:—

"ఒక పురుషునకును స్త్రీకిని కలహము వచ్చినది. పురుషుఁడు వేఁటాడుటకుఁ బోఁ గోరెను; స్త్రీ వలదనెను. కాని పురుషుఁడు వినక, ధనుర్బాణములు తీసికొని యడవి దెసకుఁ బోయెను. దారిలో వర్షము వచ్చినది. ఆతఁడు తడియకుండ దాగుటకు స్థలము వెదుకసాగెను. అతనికి రెండుగుడిసెలు కన్పడినవి; కాని ఒకదానిలో మహామారివచ్చిన యొక కుష్ఠువాఁడును, రెండవదానిలో స్ఫోటకముతో బాధపడు నొక మనుష్యుఁడు నుండిరి. ఆగుడిసెలలో వీలులేక యాతఁడు పరుగునఁబోయి యొక నదియొద్దునఁ జేరుకొనెను. ఒకచేపను బట్టుకొనెను. దానిని తినెను. రెండుగోజులక్కడనే విశ్రాంతి తీసుకొనెను. మఱల ముందునకు సాగుచు ఒక పందిని జూచెను. దానినిఁగూడఁ జంపి, తనపొట్టను బెట్టుకొనెను. పోఁగాఁబోఁగా నతని కొకగ్రామము తటస్థించెను; కాని అక్కడి వాళ్లందఱు నతని శత్రువులగుటచే నీతఁడు పాఱిపోవలసి వచ్చెను. అక్కడనుండి పరుగెత్తి పరుగెత్తి యతఁడొకసరస్సుదగ్గఱచేరుకొనెను. అక్కడ నొక లేడిని జూచెను. దానిని తనబాణముచేఁ జంపి, వచ్చిన లేడి నీడ్చుకొనుచు నిల్లు చేరుకొనెను. అతనిభార్యయు, పుత్త్రుఁడు నతనిఁజూచి చాల సంతసించిరి."

ఈభాష కేభాషయు సాటిగాదు. ఇది చాల భావోత్పాదకమైనది. చిహ్నభాష, బహుశః, ప్రపంచమున మొట్టమొదటిభాష అయియుండును; భూమియందెల్ల ప్రదేశములయం దుండియుండును. మన భాష తెలియనివారికి సైగలను జేసియే మన మనోగతభావములను దెలియఁజేయఁగల్గుదుము. ఈభాష ఆవశ్యకము ననుసరించియే యుత్పత్తియై యుండును. ఉత్తర అమెరికాలో ఎన్నియో జాతులును, ఎన్నియో భాషలు నుండుటచే పరస్పరాభిప్రాయములఁ దెలిసికొనుట కష్టముగ నుండెడిది. ఒకజాతివారు ఇంకొకజాతివారిలోఁ గలిసికొన్నపుడు ఈభాషయందే తమ భావములను వెల్లడి చేయుచుండెడివారు.



1. శోకము. 2 ఉంచుట. 3. రమ్ము. 4 ఇమ్ము. 5. పొమ్ము. 6. వార్తాపత్రిక. 7. పుస్తకము. 8. భవిష్యత్తు. 9. బాలిక. 10. చూర్ణము. 11. నాట్యము. 12. ధాన్యము. 13. తప్పించుకొనుట.

అడుగుటకు మనము చేయిచాచినట్లే, ఎట్టియిండియనులు పిలుచుటకు వ్రేలూఁపుదురు. కండ్ల నీరుకారుచున్నట్లుచేయు సంజ్ఞ శోకభావము నెంతయు బాగుగఁ బ్రకటించును. జుట్టుదువ్వెడు సంజ్ఞ స్త్రీని, బాలికను దెలియఁజేయును. చేతులు క్రిందుమీఁదుగ నుంచుటచే నాట్యము సూచితమగును. ఇట్లే యింకను తెలిసి[illegible]కొనునది."

## ౪. కాకతీయులు శూద్రులు

['సుజాత' పత్రిక ౧ సం. సంచిక ౧ యందు ఆంధ్రపరిశోధక సంఘమునారు (హై-

ద్రాబాదు) ప్రకటించిన 'వడ్డమాను' శాసనము నుండి.]

"ఈశాసనము చాల ముఖ్యమైనది. ఇందు కాకతీయులు చతుర్థ కులజులని స్పష్టముగా వ్రాయఁబడియున్నది. ఆ శ్లోకములను* ఈక్రింద నుదహరించుచున్నాము:—

ఆసృజ చ్చతురోవర్ణా న్ముఖబాహూరుపాదతః,
అన్యా న్యప్యానపాదీని భూతాని స్థావరాణిచ.
అథ స్వీకృతవర్ణోక్త ధర్మనిర్మలచేతసః,
జాతా ద్విజాతయః పశ్చా చ్చతుర్థకుల ముజ్జ్వలమ్.
తత్రానేకనృపాలబాలలిఖితాం వీరాంకవర్ణోదధిం
దర్పం దర్పహనగ్రహం సమువర జ్జీవ్రప్రతాపానలః;
యస్యోదంచిత కాకతీశ్వర కులక్షీరాబ్ధి సంవర్ధనః
ప్రౌఢాహంకృతి చంద్రమా సమభవత్ ప్రోలాభిధానో నృపః."

## ౫. శనిగ్రహము

['ఆంధ్రహెరాల్డు' సంపు-౨, సంచిక ౧నుండి.]

"ఒకనాడు శివుడు కైలాసపర్వతముపై ముప్పదిమూడుకోట్ల దేవతలతో కొలువుండ శనిగ్రహము లేచి తనప్రభావము నుగ్గడించెను. అప్పుడు శివుడు "ఓ శనీ! నీవు నన్నుకూడ పీడింపగలవా?" అనెను. 'ఓ' యని శనిగ్రహము తలయూపెను. సరే, ఆరుమాసములు గడువు నేర్పఱుచుకొనిరి. శనిగ్రహమునుండి తప్పించుకొనుటకు మహాదేవుఁడొక అడవిలో మారుమూల నొకగుహాయం దార్ధసంవత్సరము గడపెను. పిదప శనిగ్రహమును బిలువనంపి "నీప్రతిజ్ఞ యేమైనది?" అని యడిగెను."

"దేవదేవా! నీవు నాప్రభావముచే గాకున్న నీ సమస్తసుఖములు వీడి ఇట్లారుమాసములు గొందిలో దాసుకొనియుందువే" యని సమాధానము చెప్పెను.

## ౬. కీ.శే. జపానుచక్రవర్తి గారు

జపాను చక్రవర్తిగారు మొన్న క్రిస్తుమసుపండుగనాడు కాలధర్మము నొందినారు. వీరి జీవితాంతము చాలదినములనుండి గడియలలెక్కపై నుండినది. వీరికీవల యైదుసంవత్సరములకాలమునుండి రాజ్యవ్యాపారములయం దుత్సాహముతో ప్రవేశము కలిగించుకొనకుండిరి. కాని, పాపము! జపానుప్రజలు వీరి మరణమునకు జాల దుఃఖించుచున్నారు. నూతన చక్రవర్తి 'హిరోహిటో' గారు సింహాసన మధిష్ఠించిరి.



## ౭. నూతన జపానుచక్రవర్తి దంపతులు



"హిరోహిటో చక్రవర్తి వయసు ౨౫ సంవత్సర

* ఈ శ్లోకములయందు సందేహములు పొడకట్టుచున్నవి. శాసనమూలమునందియు దిమ్మలతోగూడ ప్రకటించియుండిన బాగుండెడిది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు. అతి ప్రాచీనకాలమునుండి యెడతెగక చక్రవర్తి పదము నధిష్ఠించుచున్న రాజవంశము వీరిదే. అందు ౧౨౩ వ సూఁత డీచక్రవర్తి. చిన్ననాటినుండి రాజాభిమాన గర్వపర్వతము నధిష్ఠించి యేకాంతముగ కాలము గడపు వెనుకటికాలపు యువరాజులవలెగాక యీనాటి రాజపుత్రులవలె ప్రజలతో గలసిమెలసి యుండువాడు. దేశదేశములందు సంచరించి రాజకీయార్థిక సాంఘికవిషయపరిజ్ఞానము నార్జించినాడు. సంస్కరణాభిలాష యీ చక్రవర్తికి మెండుగగలదు. డెయిలీ మెయిలుపత్రికలో యఫ్. యె. మెకన్జీగారు "హిరోహిటో జపానుదేశ సింహాసనము నధిష్ఠించుట ఆసియాఖండము నూత్నసంస్కరణ పథమున నొకయడుగు ముందుకు వైచుట" యన్నారు. ఇది సత్యము. ఈనాడు జపానుదేశమున జాతీయ జీవితము గాంచుచున్న సత్వరవికాసమును పాశ్చాత్యదేశము లెవ్వియు ననుసరింప జాలకున్నవి.

['పబ్లికుఒపినియను' పత్రికనుండి]

## ౮. జాతీయారోగ్య, శిశుప్రదర్శనములు

చెన్నపురి, ౧౯౨౭

దేశాభివృద్ధి దేశమందలి ప్రజలపై నాధారపడి యుండును. ప్రజలయభివృద్ధికి వారి సంపూర్ణారోగ్యము పరమావశ్యకమైనది. ప్రజలయందొక్కొక్కరును చిన్ననాటి నుండి మంచియారోగ్యమును గలిగియుండవలెను. పిల్లలయారోగ్యమునకు తల్లులే మూలకందములు. తల్లులారోగ్యసూత్రములను లెస్సగా దెలిసికొని తమ పిల్లలయారోగ్యమును జాగరూకతతో కాపాడుకొనవలెను. ఈ నాటి కసుగందులే కదా పసిగా పెరిగి యౌవనవంతులు వజ్రతుల్యశరీరులు నయి మున్ముందు దేశోద్ధరణమునకు బూనుకొనవలసినవారు? కట్టా! అట్టిసిసువులు పెక్కురు ఆరోగ్యహీనులై అకాలమృత్యువువాత బడుచున్నారుగదా! ఇట్టి దుస్థితికి అవివేకము, స్త్రీవిద్యాభావము, దారిద్ర్యము కదా కారణములగుచున్నవి. వివేకవతులగు నే కొలదిమంది తల్లులైనను తమపిల్లలసంరక్షణమున దగినజాగరూకత వహింపక ప్రేమాంధలై యిష్టమువచ్చినట్లు లాహారాదులనొసంగి వారి నారోగ్యశూన్యులనుగ జేయుచున్నారు. చిన్ననాడారోగ్యము నశించినవారు పెద్దలయినపుడు దుర్బలశరీరులు, దుర్భరరోగపీడితులు నయి దుఃఖభూయిష్ఠమగు జీవితమును గడుపవలసినవారగుదురు. ఆరోగ్యవంతమగు ప్రజయేకదా దేశమున కుత్కృష్టసంపద! అట్టి సంపదను బడయజాలని దేశము దారిద్ర్యమునకు బుట్టినిల్లనుటకు సంశయింప నక్కరలేదు. కావున వివేకవంతులగు పురుషులు ఆరోగ్యమార్గములను, సంరక్షణవిధానములను బాగుగ దెలిసికొని తమసతీమణులకు బోధించి తాము, వారును, తమయొక్కయు, తమపిల్లలయొక్కయు ఆరోగ్యమును కాపాడుకొనుట కెల్లవిధముల ప్రయత్నించవలెను. ప్రతిమనుజునకును సనిదర్శనముగా నారోగ్యసూత్రములను బోధించు నుద్దేశముతో ఆరోగ్యప్రదర్శనము లీనాడు పలుచోటుల జరుగుచున్నవి.

చెన్నపురమున నీయారోగ్యప్రదర్శనములు జనవరి౧౮వ తేదిమొదలు ౨౦వ తేదివఱకు వారమురోజులు జరిగినవి. ఈపట్టణమున నివి నాల్గవమారు జరిగిన ప్రదర్శనములు.

యూరపియను శిశువు



పేరు: జాను టార్షి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## దేవాంగకులమునకు చెందిన హైందవశిశువు



పేరు. నారాయణస్వామి, వయస్సు: ౨౪ నెలలు, బరువు: ౨౦ పౌనులు

ర్శనములు. ఆరోగ్యశాఖకు జెందిన ప్రభుత్వోద్యోగులు, పురపాలకసంఘోద్యోగులు, పట్టణమునందలి ఆంగ్లవైద్య విద్యావిశారదులు, ఇతర ప్రజాప్రముఖులు గలిసిన సంఘమువారు గవర్నరు సతీమణియాజమాన్యమున నీప్రదర్శనములను జక్కగాజరిపిరి. ప్రతిదినమును, వేలకొలది జనులు ప్రదర్శనములను గాంచిపోవుచుండిరి. ఈప్రదర్శనకాలమున ప్రతిదినమును వైద్యశిఖామణులు (డాక్టరులు) పలువురు ప్రదర్శనదర్శనమునకయివచ్చు ప్రజలకు తమ యద్భుతోపన్యాసములమూలమున, ఆరోగ్యసూత్రములను, శిశుసంరక్షణమార్గములను, వివిధవిధవ్యాధులను, ఆహారపదార్థములను, నీరు, గాలి మున్నగు వానినిగూర్చి వివరముగా బోధించుచుండిరి. మరియు సంఘమువారారోగ్యవంతమగు జీవితమునకు బరమావశ్యకములగు ప్రత్యేక ప్రత్యేకవిషయములగూర్చి సవిమర్శముగను, సనిదర్శనముగను ప్రత్యేకప్రదర్శనములను జరిపిరి. అందు ముఖ్యముగా శిశువులసంరక్షణమును గూర్చియు, వారి కొసగవలసిన ఆహారాదులనుగూర్చియు, వారిని పీడించు రోగములనుగూర్చియు, వారిని రోగములంటకుండ నివారించు నుపాయములనుగూర్చియు నుపన్యాసములను, చిత్రప్రదర్శనములను, మేజికులాంతరు ప్రదర్శనములను పెక్కుటిని జరిపించిరి. కడపటినాడు శిశుప్రదర్శనమును జరిగించిరి. సంతకు పశువులను దీసికొనిపోవునట్లు లనుంగుబిడ్డలను ప్రదర్శనములకు గొనిపోవు నాచారము భారతీయ మాతృహృదయమున కంతగా నచ్చని

దైనను పలువురు స్త్రీలు పోదిగా పెరిగిన తమముద్దుబిడ్డలను చంకనిడికొని యీప్రదర్శనమునకు వచ్చిరి. ఆరోగ్యము, పుష్టి గలిగియున్న బిడ్డలకు గొందఱికి వయసును, జాతిని అనుసరించి వెండి బంగారు పదకములు, గిన్నెలు, ఇత్తడిసామానులు, జాకెట్టులు మొదలయిన బహుమతు లొసగిరి. ఇతరశిశువులకును జాకెట్టులను, బొమ్మలను, తినుబండములను బంచిపెట్టిరి. ఆ పిల్లలతల్లులెల్లరకు నానాడుతుష్టిగా మృష్టాన్నభోజన మిడిరి. ఘనతయుమాటయటుండ నీ శిశుప్రదర్శనము కన్నులకు పండువుగ గన్పట్టినది. వ్యయప్రయాసముల కోర్చి యిట్టి ప్రదర్శనములను జరిపి ప్రజాసామాన్యమునకు ఆరోగ్యసూత్రములను బోధింపబూనిన యీసంఘమువారి ప్రయత్నము మెచ్చదగినది. ఇట ప్రకటించిన చిత్రము లుత్తమబహుమానముల గాంచిన శిశువులవి.



మహమ్మదీయ స్త్రీ శిశువు వయస్సు: ౬ నెలలు. బరువు: ౨౦ పౌనులు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మాతృవిలాపము

[Wordsworth రచించిన ' Maternal Grief ' అనుదాని యనువాదము.]

మండా సూర్యప్రకాశరావు గారు

అనుఁగుం గ్రీడల నల్లవేళలను బ్రహ్మానందముల్ గూర్తు నం
చనయంబుల్ మదిలోన నమ్మితిని; నీయాసం బెడంద్రోచి, చ
య్యన వేఱొక్క ప్రదేశమేగితివె? నా యుల్లాసులేఁబట్టి! నా
నునుగప్రంపుటసంటిలేమొలక!! నా నూత్నప్రసూనవల్లరీ!!!

ఉ. కనులకు నిద్రరాదు, చెలికత్తెలఁ జూడఁగ వేడ్కలేదు, భో
జనము రుచింపదించుకయు, శక్తి రవంతయులేదు మేన, భూ
షణము లసహ్యమయ్యె, నవచారుశిరీషసుకాంత దేహా! నీ
మనసముదక్క——అన్యము సమస్తము జీకటివోలెఁ దోఁచెడున్.

మ. అకటా, వత్స! భవద్వియోగభర దుఃఖావేశ సంజాతమై
ప్రకటక్లేశవిషాదకీర్ణమగు లాభంబొందు నేకూతు——నీ
యకలంకోజ్జ్వల దివ్యవిగ్రహము ఛాయారూపముం దాల్చి, మా
మకహృత్పంజర గర్భదేశమున సంవాసంబు గావించెడున్.

మ. మఱవన్ రాక పరాకుచే నయిన యుష్మద్రూప రాజన్మనో
హరరేఖాతిశయంబు పొల్పెసఁగఁ, జిత్రాకారతన్ బొల్చి, ది
వ్యరుచిన్ గన్నుల ముంగటన్ లఘుపదన్యాసంబు గావించు నీ
యురుతారుణ్య విలాసవిగ్రహమె శ్రేయోరూఢమై తోఁచెడున్.

మ. తలక్రిందై కలకాలమెల్లఁ దప ముద్యన్నిష్ఠమై సల్పినన్
గలవోలెం జనినట్టి నిన్ను మఱలం గౌఁగింటిలోఁ జేర్చి, చె
క్కిలిముద్దాడి, మహోపలాలసమెయిన్ గ్రీడించు భాగ్యంబునన్
దొలఁగింపం దరమౌనె యెన్నఁటికిఁ జేతోవీథి లగ్నాకృతిన్?

మ. పరికింపం గనరాని యొక్కలఘు నిశ్వాసైక తూలంబుచే
హరియింపంబడె నీదుప్రాణములు; లభ్యంబౌట దుస్సాధ్యమే?
ధర లేగాలికి మొక్కవోవని భుజాదర్పోద్ధత క్షాత్రముల్
గలవైయున్నవె వీరులందు? మఱియేలా ఖేదముం బొందఁగన్?

మ. ఏవో కొన్ని కుతర్కముల్ పనవి యే నెన్నెన్ని యో భంగులన్
భావోద్రేకముతోడఁ బల్కియు భవన్మాయాంధకారంబునం
దావంతైన వెలుంగుఁగానక నితాంతార్తిన్ బ్రపంచంబునన్
దేవా! నేను బరిభ్రమించెదఁ; గృపాదృష్టిం గటాక్షింపవే.

శా. సంసారంబున జన్మముల్, మరణముల్, సంకల్పముల్, సిద్ధియున్
హింసాసూయ దయానురాగములు తర్కింపంగ లేమంచు వి
విద్వాంసుల్ పల్కఁగవిందు; నీవిమలపాదద్వంద్వ నీరేరుహో
త్తంసంబుల్ మదిఁగొల్తు; దేవ, నిజతత్త్వంబున్ బ్రబోధింపవే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## ఆంధ్రభాషానుశాసనము

రాజమహేంద్రవర రాజకీయ కళాశాలాప్రధానాంధ్రాధ్యాపకులగు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు దీనిని రచించిరి. కావుననే దీనికి సూర్యనారాయణీయమను నామాంతరము సైతము పెట్టఁబడినది. ఈగ్రంథము రెండుభాగములుగా 240 పుటలలో ముద్రింపఁబడినది. విషయవిభాగము ననుసరించి నలువదిరెండు భిన్న విషయము లిందుఁగలవు. నాటయఱుంద్రుకవుల గ్రంథములు ప్రమాణములుగా గ్రహింపఁబడినవి. శ్రీశాస్త్రిగారు ఈగ్రంథమును రచించుటలో నూతనమార్గ మవలంబించిరి. ఇంతవఱకు వ్యాకరణములను, ఛందములను రచించినవారు తమకు దొరికిన కొన్నిగ్రంథములనే పరిశోధించి వానిలో దమబుద్ధికి నచ్చినప్రయోగములమాత్రమే ప్రమాణములుగాఁ గొని తత్ప్రయోగానుకూల లక్షణములమాత్రమే సూత్రించుచుండుటచేత సామాన్యముగ నేలక్షణగ్రంథమైనను అసమగ్రమేయనువాడుక స్థిరపడినది. ఆంధ్రభాష ప్రవాహిక; ఆంధ్రదేశము బహువిస్తీర్ణము. అన్నిమండలములయందు నొక్కరీతి వ్యవహారముండదు. ఆదినుండి యిప్పటివఱకుఁగూడ భిన్నభిన్న మండల జాతములగు గ్రంథములందు భిన్నభిన్నవ్యవహార మగపడుచునేయున్నది. ఒకమండలమువారిచే నిర్దుష్టముగా నెంచఁబడి ప్రయోగింపఁబడినపద మింకొకమండలమువారి కశ్లీలద్యోతకమై హేయమగును.

ఇట్టివే గ్రంథములందుఁగూడ వేనవేలుగలవు. వీని కన్నింటికిని సాధుత్వము గల్పింపఁగల వ్యాకరణమింతవఱకు నెక్కడను లేదు. భారతప్రయుక్తములనేకాని యితరములఁ బ్రయోగింపరాదని నిషేధించు కవిరాక్షసు లున్నను బ్రాచీనులును సంస్కారప్రియులు; పూర్వులువిడచిన వానిని సైతము లాక్షణికములుగా నంగీకరించి తమగ్రంథములందు వానిని జేర్చియున్నారు. అయినను వ్యాకరణమునకు సంపూర్తిమాత్రమింకను లభింపనేలేదు. వ్యావహారికభాషయందు పదస్వరూప మతివేగముగమారుచుండుట అనుభవసిద్ధము. ఏకాలమందలికవు లాకాలమందలి వ్యావహారికపదముల గొన్నింటినుపయోగించికొనుటసహజము. మృదుమధురములై తేటతెల్లములై వ్యావహారికపదములవలనఁగలుగు నానంద మింకొకపదమువలనఁ గలుగుటకల్ల. వ్యావహారిక పదములనెల్ల నిదమిత్థమని నిర్ణయించుట కేరికిని దరముగాదు. కావుననే నాఁడుమొదలు నేఁటివఱకు నాంధ్రభాషాజ్ఞానము ప్రయోగశరణ్యముగానే యంగీకరింపఁబడుచున్నది. నిరంకుశ నియంతలని పేరొందినవారు సైతము తత్సమపదవిషయమున నెంతకఠినముగ నియమించినను దేశ్యవిషయమునమాత్ర మావిషయ మంగీకరించియే యున్నారు. కావునఁ దెనుఁగుభాషకు సమగ్రవ్యాకరణము లభించుటయెన్నఁడును శశవిషాణమే.

జనవ్యవహారమందున్న పదములమార్పును సూచించుటయు, వ్యవహారపరిభ్రష్టమయిన పదముల స్థిరరూపములఁ దెల్పుటయునే వ్యాకరణమునకుఁ బరమప్రయోజనము. ఈవిషయమును భాషయందుగల యర్థానుస్వార శకటరేఫములు స్థిరపఱుచుచున్నవిగదా! ప్రాచీనలాక్షణికు లీయర్థానుస్వారాదులవిషయమై చేసినకృతినియమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు మన కెంతవెగటుగనున్నను నవి పదస్వరూపపరి
జ్ఞానమునకత్యంతోపయుక్తములనుటకుసందియము లేదు.
ఆధునికులుగొందఱు వాని నవహేళనగాఁజూచుట హే
యమే. వ్యాకరణము రచింప నెంచువారు ఏయేపదము
లేయే దేశములం దేయేకాలములం దేయేయర్థములం దెట్లు
పయోగింపఁబడినవో కనుగొని తెల్పుటయే పరమార్థము
గనుంచికొన్నచోఁ జక్కనివ్యాకరణము లభించును.
ప్రస్తుతము శాస్త్రిగా రంతసాలంకషముగఁ గాకున్నను
సాధారణముగనైన నీవిషయమును నెరవేర్చియున్నారు.
వీ రీవిషయమునఁజేసినపరిశ్రమ మఖండము. బహుగ్రంథ
ముల సవిమర్శముగఁ బరిశోధించుటయేకాక వ్యావ
హారమునుగూడ బాగుగా విమర్శించియున్నారు.
కాని వ్యవహారమును బరిశీలించుటలో మాత్రము వీరు
కూడనించుక ప్రమాదమునకు వశులైరి. సామాన్యముగఁ
బ్రాచీనులెల్లరును శిష్టవ్యవహారమునుమాత్రము ప్రమాణ
ముగా గ్రహించి భాషకు మహోపచారము నొనర్చియు
న్నారు. శిష్టవ్యవహారమందనేక భాషలుసాంకర్యమొంది
స్పష్టమైన పదపరిణామ మెఱుఁగరాకుండును. గ్రామ్య
జనులన్ననో యేకభాషాపరిచితులగుటచే పదములు సహ
జమైనమార్పునుమాత్రమందుచు శాస్త్రీయమైనవికార
ములందును. కావున దేశవిషయమున కవిప్రయోగముల
కంటెఁగూడ ననాగరకుల వ్యవహారమే బలవత్తరమని
నాయూహ. అనవస్థాప్రసంగభయమున బ్ర. గిడుగు
రామమూర్తి పంతులుగారివంటివారుగూడ శిష్టవ్యవహా
రమునే యవలంబించుచున్నారుగాని యదియెంతయు
నన్యాయ్యము. గ్రహింపవలెనన్నచో శుద్ధమయిన వ్యవ
హారమునే గ్రహింపవలెగాని సంకీర్ణభాషను గ్రహిం
చుటేల? దానివలనఁ బదపరిణామ మెట్లుతెలియును?
దానివలనఁ గలుగు నష్టమును జెలకింపుఁడు.
శాస్త్రిగారు వర్ణసమామ్నాయములో కంఠతాలవ్య
మైన అకారము, దంతోష్ఠజమయిన ఫకారములను
రెండువర్ణములను అధికముగఁ జేర్చినారు. అకారవిష
యమున అమ్మ, అమ్మి, అమ్ము, మొదలగువానికెల్ల
నికారము పరమగునపుడు గ్రామ్యసంధిలో రూప
భేదము కానరానేరాదు. కావున దాని నింతతో సిద్ధాం
తీకరింప వీలుగలుగదు. ఇంక రెండవది: అన్యదేశ్యప
దము. నాగరక వ్యవహారమందుమాత్రము బహుప్రసిద్ధమ
యినది. నాగరక వ్యవహారమునందు దానికి ఫకారపస్ప
శోచ్చారణమెందును గనఁబడదు. గ్రామ్యజనులుకాఁ,
పర్లాంగు, సఫేదుఅని పకారరూపముగానే యుచ్చ
రింతురు. అట్టితఱి దానికి దంతోష్ఠ జన్మమెక్కడిది!
అన్యభాషాజాతములగు వానినిగూడఁ దద్భవములుగా
గ్రహించి వానికిఁగూడఁ దెలుఁగుసంప్రదాయముల నేర్ప
ర్పరించిన నెంతయుమంచిది; కాని కేవలశిష్టప్రయోగము
నాధారముగాఁగొని గ్రామ్యుల నీసడించినచో భాషకుఁ
గలంకము రాక తీరదు. బ్ర. సూర్యనారాయణశాస్త్రి
గారు కేవలము ప్రాచీనపక్కనిగాని, కేవలగ్రామ్యమార్గ
మునుగాని యనుసరింపక భాషాపరివృత్తిని దెల్పు నొకనూ
త్నమార్గమవలంబించిరి. ప్రాచీనులు గ్రామ్యములని శంకచే
విడిచిన యనేకశబ్దరూపములను గ్రంథారోహణాధా
రములవలన సాధువులుగాఁ జూపిరి. ఇదియెంతయు న్యా
య్యమనుటకు సందేహము లేదు. సంచరత్సుపదములుగ బ
హుకవులచే బహుకాలమునుండి వ్యవహరింపఁబడుచున్న
పదముల విడనాడుట కేరితరము? మ. చిలుకూరి నారా
యణరావుగారివలె వ్యవహారమందున్న పదములనెల్ల
గ్రహింపవలయుననక కొంత నియమ మేర్పరించికొని
వీరనుశాసనమును సార్థకముగ నొనరించినారు. అనేకప
దములకు కాలభేదముల ననుసరించి రూ
పభేదములను, అర్థభేదములను జూపియున్నారు.
అవసరమయినంతవఱకు సంస్కృతవ్యాకరణ మర్యాదను
గూడఁ దేటతెల్లముగ వివరించియున్నారు. ఇదియని
యననేల! భాషాభిలాషులకవసరములగు విషయములనెల్ల
నిందిమిడ్చియున్నారు. దీనితోఁ దెలుఁగుభాషకు సు
గ్రలక్షణము లభించినదన వలనుపడదుగాని నిరంకుశప్రా
చీనగహనమునుఛేదించి సులభమైన సవిమర్శలక్షణమార్గ
ము దీనివలనఁ గలిగినదనుట వాస్తవము. కావుననే శ్రీశా
స్త్రిగారి పరిశ్రమము సర్వథాసఫలమై మహోన్నతిశిఖర
మునకు దారిఁజూపునదిగా నున్నది. దీనివెనువెంటనే శ్రీ
శాస్త్రిగారు సాలంకషముగ వ్యుత్పత్తులం దెల్పు గ్రం
థమును రచించి భాషాభిలాషుల కుపకరింతురుగాక యని
యాశించుచున్నాఁడను. రెండుభాగములు.

వెల రు. ౨-౮-౦.

కత్తి సాంబమూర్తిశాస్త్రి గారు

## చరకసంహిత - చికిత్సాస్థానము
## (ఆయుర్వేదగ్రంథము)

ఆంధ్రతాత్పర్యసహితము— ౮౦౦ పేజీలు, (గ్లేజు). క్యాలికో బైండు. వెల రు ౬-౦-౦ మాత్రమే.

చరకసంహితను సంస్కృతమున నగ్నివేశుడను మహర్షి రచియించెను. అం దీచికిత్సాస్థాన మొకవిభాగము. దీనికి ఆయుర్వేదభూషణ భిషగ్వర శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు (బెజవాడ) ఈఆంధ్రతాత్పర్యమును రచియించినారు. ఇదివఱకే యీగ్రంథము హిందీ, మరాటి, ఇంగ్లీషుమున్నగు ననేకభాషలలోనికి బరివర్తనమును గాంచి ప్రసిద్ధి చెందినది. ఆంధ్రానువాద మింతవఱకు లేకున్నకొఱతను శాస్త్రిగారుతీర్చి యాంధ్రులగు వైద్యులయు, ఆయుర్వేద విద్యార్థులయు కృతజ్ఞతకు పాత్రులయిరి.

ఈగ్రంథమున రసాయనవాజీకరణములను, జ్వరము, రక్తపిత్తము, గుల్మము, ప్రమేహము, కుష్ఠము, రాజయక్ష్మ, ఉన్మాదము, అపస్మారము, క్షతక్షీణము (గాయముగుపడని దెబ్బ), శ్వయథువు (శోఫ), ఉదరము, అర్శము (మూలవ్యాధి), గ్రహణి, పాండువు, హిక్కాశ్వాసము, కాసము, అతిసారము, ఛర్ది(వాంతులు), విసర్పి (విషవ్యాధి), తృష్ణ(దాహము), విషము, మదాత్యయము (అతిగా మద్యపానముచేయుటచే గలుగు రోగము), ద్వివ్రణము(బాహ్యాంతరంగికవ్రణములు),త్రిమర్మములు, (పొత్తికడుపు, హృదయము శిరస్సువీనివ్యాధులు). ఊరుస్తంభము, వాతము, వాతశోణితము, యోని వ్యాపత్తు మొదలయినవానినిగూర్చి క్రమముగ వివరించు ముప్పదియధ్యాయము లిందుగలవు. ప్రతిఅధ్యాయమును ఆయారోగములయొక్క లక్షణములు, కారణములు,విభేదములు, వానిని నివారించుట కౌషధములు, వానిని చేయుక్రమము, సేవించుక్రమము, మొదలయినవానిని గూర్చి విపులముగ వివరించుచున్నది.

ఈగ్రంథము కేవలము వైద్యులకు, వైద్యవిద్యార్థులకే కాక ఇతరులకును, అందును శాస్త్రానుభవము లేక పరంపరాగతమైన యల్పానుభవముచే రోగులను బాధించు వైద్యమ్మన్యులకును మిగుల నుపకరించును. దీనిని ఆయుర్వేదకలాశాలలయందును, పాఠశాలలయందును పాఠ్యగ్రంథముగ నియమించు టెంతయు నుచితము.

ఇందు మూలమునందలి సంస్కృతపదములను భిన్నార్థముల నిచ్చువాని నట్లే యాంధ్రమున పొందించియున్నారు. ఇందువలన గొంత యుపద్రవము వాటిల్ల నవకాశము గలుగవచ్చును. కావున నాపదములకు సరియైన తెలుగుపదములనో, అట్టివి లభింపకున్న, వివరణములనో పొందుపరచియుండిన నుచితముగ నుండెడిది.

ఆయుర్వేదౌషధరత్నాకరము, ఆంధ్రభైషజ్యరత్నాకరము, భస్మప్రకాశిక అను గ్రంథములను ఈ శాస్త్రిగా రింతకుపూర్వము రచియించినారు. ఇది వీరి నాలవగ్రంథము. వీరి కాయుర్వేదమునగల అభిమానమును, గ్రంథకరణాసక్తిని, పరిశ్రమమును ఈగ్రంథము చాటుచున్నది.

## పూర్వగాథాలహరి

గ్రంథకర్త: శ్రీయుత వేమూరి శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. యల్., వకీలు, కాకినాడ. రాయల్ సైజు. పేజీలు ౫౬౨. కాగితములు మంచివి. బైండు సుందరముగా నున్నది. వెల రు. ౩-౮-౦.

పురాణస్థము లగు స్త్రీపురుషులయు, నదనదీశైలపట్టణాదులయు, నామములకు సంబంధించిన గాథలను పురాణేతిహాసాదులను పరిశీలించి కైకొని సంక్షేపముగ నిందు వివరించినారు. ఆయాగాథలుగల గ్రంథనామములను దెలిపినారు. ఉపనిషత్తులనుండియు కొన్ని నామములను గాథలను ఇందు జేర్చినారు. 'పురాణనామచంద్రిక'యు నించుమించుగ నిట్టిదేయైనను ఈగ్రంథను దానికన్న కొంత విరివిగనున్నది. కావున ఆంధ్రవాఙ్మయమున నీతీరుగ్రంథములలో నిదియే మొట్టమొదటి దని చెప్పనొప్పును. ఇతిహాసపురాణాదుల మాట యటుండ మాతృభాషనైన సరిగ నేర్చుట కవకాశము ప్రజలకు లభింపని యీకాలమున నీగ్రంథము ప్రాచీన భారతీయమాహాత్మ్యమును, జాతీయౌన్నత్యమును, ప్రజలకు అల్పకాలమున, దిఙ్మాత్రముగ దెలిసి పదంపడి వానినిగూర్చి విరివిగ దెలిసికొనుటకు ప్రోత్సహింపగలదు. ఇట్టిగ్రంథము పాఠశాలలయందు ప్రవేశపెట్టి ఆంధ్రవిద్యార్థుల బుద్ధిని ప్రాచీనభారతీయవిజ్ఞానము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వంకకు మరల్పవలసిన బాధ్యత విద్యాశాఖాధికారులపై నున్నది. అచిరకాలమున వారు తమబాధ్యతను సత్తెరు సుదురుగాక! శ్రీనివాసరావుగారు ఈ గ్రంథరచన ప్రచురణములయందు కావించిన పరిశ్రమ, వ్యయము మిగుల నధికము. ఈగ్రంథముయొక్క అమూల్యప్రయోజనమును దెలిసికొని యాంధ్రసోదరులు వారిని దగిన రీతిని ప్రోత్సహించవలసియున్నారు.

మచ్చునకు:

“ నీలుఁడు. ఒకవానరుఁడు; సుగ్రీవుని సేనలోనివాఁడు. రామరావణయుద్ధమందుఁ బోరాడెను. ఇతఁడు రావణుని మంత్రియైన ప్రహస్తుని జంపెను.

రామా.

నీలుఁడు. పాండవపక్షమునఁ బోరాడిన యొక రాజు. వానిని అశ్వత్థామ చంపెను. భార.

నీలుఁడు. మాహిష్మతీపురనాథుఁడు. కౌరవపక్షమునఁ బోరెను. భార.

నీలుఁడు. కద్రువకుమారుఁడు. భార.

నీలుఁడు. దుర్జయుఁడను రాజు పరివారములో నొకఁడు. రాజుతో వేఁటకును గౌరముఖుని యాశ్రమమునకును వెళ్లెను. ఏ మణిప్రభావమున గౌరముఖుఁ డచ్చట నగరము నిర్మింపఁగల్గెనో యామణిని బుచ్చుకొమ్మని మొదట రాజు మంత్రినిబంపెను. ముని యివ్వనందున నెటులైనను దానిని గైకొనుమని నీలుని సేనను బంపెను. నీలుఁడు గౌరముఖుని యాశ్రమముకడ రథము డిగఁగనే మణినుండి, రథములు అశ్వములు, వీరులు పుట్టిరి. వారికిని దుర్జయుని సేనకును యుద్ధమయ్యెను. ఇంతలో గంగయొడ్డున కేగిన గౌరముఖుఁడు వచ్చి యుద్ధమగుచుండుట చూచి విష్ణుమూర్తిని బ్రార్థించెను. అతఁడు దుర్జయుని, నీలుని సేననంతను సంహరించెను. వరా.”

* * *

“బృహస్పతి. దేవతలకు గురువు. ఇతఁ డంగిరసుని పుత్త్రుఁడు. ఉతథ్యుఁడు, సంవర్తనుఁడు, ఇతని సోదరులు. బృహస్పతి భార్య తార. ఇతనికి శంయుఁడు అను పుత్త్రుఁడు కలఁడు.

బృహస్పతియు నింద్రుఁడును శివునిజూచుటకై మునిరూపములు ధరించి కైలాసమునకు వెళ్ళుచుండిరి. శివుఁడు వీరిని బరీక్షింపఁగోరి యుగ్రరూపము ధరించి దిగంబరుఁడై వీరిమార్గమున నడ్డుగ నిలువఁబడెను. ఇంద్రుఁడు వాని నెఱుంగలేక వానిపై వజ్రాయుధ మెత్తెను. ఆదిగంబరుఁడు తన చూడ్కిచేతనే యింద్రుని భస్మము చేసెను. అపుడు బృహస్పతి యాదిగంబరుఁడే శివుఁడని గ్రహించెను; వానిని స్తుతించి యింద్రుని జీవితునిగఁ జేయుమని ప్రార్థించెను. అందువలన బృహస్పతికి జీవుఁడని పేరువచ్చెను. శివ.

బృహస్పతి భార్య, తార చంద్రుని గామించెను. చంద్రుఁ డామెను గొనిపోయె. తారకు బుధుఁడు జన్మించెను. తారను గుఱించియు నామెకుమారుని గుఱించియు బృహస్పతికిని జంద్రునకును వివాదమయ్యెను. దేవగురు వంచించుట కిదే సమయమని రాక్షసులు చంద్రుఁ జేరిరి. దేవతలలోఁ గలహములు పుట్టకుండ బ్రహ్మాది దేవతలువచ్చి తారను బృహస్పతికిని బుధుని చంద్రునకు నిప్పించిరి. భాగ.

బృహస్పతి తన సోదరుఁడైన యుతథ్యుని భార్యను మమతను గామించెను. ఆమె వలదనుచున్నను ఆమెపైఁ బడియెను. అప్పటి కామె గర్భవతియై యుండెను. ఆమె గర్భమందున్న శిశువు కూడ బృహస్పతిని నిందించెను. బృహస్పతికిఁ గోపమువచ్చి యాశిశువును నీవు గ్రుడ్డివాఁడవై పుట్టుమని శపించెను. ఆశిశువు బృహస్పతి వీర్యమును వెలుపటఁ ద్రోసెను. అట్లు ఉద్భవించిన దానిని నీవు భరింపుము, నీవుభరింపుమని బృహస్పతియు మమతయుఁ దగవులాడుకొనిరి. ఇద్దఱు దానిని విడచిరి. ఆవీర్యము పెరిగి శిశువయ్యెను. ఇతఁడే భరద్వాజుఁడు. భాగ.

రాక్షసగురుఁడైన శుక్రుఁడొకచో జయంతితో భోగించుచుండెను. రాక్షసులను వంచించుట కిదే సమయమని బృహస్పతి శుక్రునిరూపముధరించి రాక్షసులచెంతకుఁ బోయి వారితో వాసము చేయుచుండెను. రాక్షసులువారి మర్మములు వీనితోఁ జెప్పుచుండిరి. ఇంతలో శుక్రుఁడు వచ్చెను. ఇరువురు నొక్కరీతిగ నుండుటచే రాక్షసులు నివ్వెరపాటు నొందిరి. నేను శుక్రుఁడను నేను నిజమైన శుక్రుఁడనని యిరువురు పోట్లాడిరి. తుదకు బృహస్పతి యంతర్ధానము నొంది వారిని విడిచి వచ్చెను. మత్స్య.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## పత్రికలు

### సుజాత

(సచిత్ర మాసపత్రిక.) సం. ౧, సంచిక ౧; క్రౌను 8 పేజీల సైజు; ౭౭ పేజీలు—సంపాదకుడు: పి. యస్. శర్మగారు, బి.ఏ., త్రూపుబజారు, దక్షిణ హైదరాబాదు. వార్షికమూల్యము రు. 3-౦-౦, విడిసంచికవెల రు. ౦-౬-౦.

ఈపత్రిక ౧౯౩౭ సం. జనవరినెలలో ప్రారంభమైనది. ఇందు గద్యపద్యవ్యాసములు పెక్కుగలవు. వానిలోజాలవఱకు నిజామురాష్ట్రాంధ్రప్రముఖులు వ్రాసినవే. 'ఫిర్దౌసీమహాకవి', 'రాచకొండ', 'నిజాంరాష్ట్ర నాణెములచరిత్ర', 'నడ్డమానుశాసనము' అనువ్యాసములు చారిత్రకములు.'వేణుగోపాలుడు'అను త్రివర్ణచిత్రమును, శ్రీ నిజాముగారి చిత్తరువును, ఇతర ఏకవర్ణచిత్రములును కొన్నిగలవు. "యుగాంతరములనుండి ప్రవహించుచున్న ఆంధ్రసభ్యతభిన్నభిన్న నాగరకతలతోడునీడలలోమెలగి నేటికందిన విలక్షణజీవితము ప్రదర్శించుటయే 'సుజాత' యొక్క ప్రధానసుభాషితము" అని పత్రికా 'స్వవిషయము'న గలదు. చిరకాలము అట్టి సుభాషితములనే పల్కుచు నీసుజాత సుజాతయై యొప్పునుగాక!



వ్యాసకర్త

### పుష్పమాల

క్రొత్తవెలువడిన మాసపత్రిక: సంపు ౧, సంచిక ౧. సంపాదకులు: సి. హెచ్. హనుమంతరావుగారు, మచిలీపట్టణము—చందా (తెలియదు.)

౧౯౩౭ వ సం. జనవరి ౬ వ తేదినాడు తొలి సంచిక వెలువడినది. ఇందు క్రౌనుసైజున ౧౦౦ పేజీలు (గ్లేజు) గలవు. ఆంధ్రసోదర సోదరీమణులు రచియించిన కథలు, గ్రంథవిమర్శనలు, రూపకములు రసవత్ఖండ పద్యకావ్యములు నిందు పెక్కుగలవు. అట్టపై రాధాకృష్ణుల త్రివర్ణచిత్రము గలదు.

విజ్ఞానవ్యాప్తికిగల సాధనములలో పత్రికలను కూడ గైకొనదగును. అట్టి పత్రిక లాంధ్రదేశమున నిదివఱకు మృగ్యములైయుండినవి. ఇటీవల క్రమముగ కొన్ని పత్రికలు బయలువెడలినవి. అవి యాంధ్రదేశమున నూతనోత్సాహమును బుట్టించి విజ్ఞానమును వ్యాపింపజేయ బ్రయత్నించుచుండుట సంతోషదాయకము. ఈపుష్పమాలయు నట్లే యాంధ్రలోకమున స్వీయవిజ్ఞాన సౌరభముల వెదచల్లుచు చిరకాల మాంధ్రవాణి కలంకారమై వెలయునుగాక.

## అంధ ప్రబోధము

బుడుమగుంట వేంకటరమణయ్య గారు

అంధుఁడను, దేవి! నీరూపమట్టిదనుచు
　శ్రుతులెఱింగించుటయెకాని చూడనైతి
భావసాగరభంగికాపథము నంటి
నిన్నుఁజేరెడి నన్ను మన్నించుమమ్మ!

ఏమహోజ్జ్వల వనవాటికా మరంద
పానమునఁ జొక్కి పాటలుపాడెదీవు,
ఆమనోహరకాననాభ్యంతరమున
నిలుచుభాగ్యంబు నాకిమ్ము నిముసమైన
నీదుబంగరుగాజుల నినదమదిగో
హృదయకుహరాన నుద్రేకమొదవఁజేసె,
నారవమె మార్గమును జూప నరుగుదెంతు
కిసలయంబుల మించు నీ గేహమునకు
ఎట్టులో నీగృహంబున కేనురాఁగ
నాసలను ద్రుంపఁ దలపోయకమ్మ; మృదుల
కరములను నాదుకన్గవఁ గదియఁజేసి
దృష్టినొసఁగుము నీమూర్తిఁ దెలియునాఁడ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




౧. నారోజా; అయిదంకముల చరిత్రాత్మకమగు నాటకము (కవితాకల్పలతా గ్రంథమాలికయందలి ద్వితీయ ప్రచురణము)—కర్త: భోగరాజ నారాయణమూర్తిగారు, పేజీలు 100. వెల రు. 1-0-0. ప్రకాశకులు: పసుమర్తి వీరభద్రస్వామిగారు, కవితాకల్పలతా గ్రంథమాల, విజయనగరము.

౨. మధువు; పద్యకావ్యము—గ్రంథకర్తలు: చలమయ్య ప్రసాదరావులు. అంగలూరు. పేజీలు 72. వెల రు. 0-8-0. విలాసము; కింగు అండుకంపెని, బెజవాడ.

3. శ్రీ మానసగీతావళి; పద్యకావ్యము—కర్త: రాస్తాటి సుబ్బదాసుగారు, పర్మతగము. పేజీలు 22 వెల 0-6-0

౪. నీతిరామాయణమ్; వ్యాఖ్యానసహితమ్—వైఖానసగ్రంథమాలయొక్క 12 వ అనుబంధము. పేజీలు 76. వెల రు. 0-12-0. విలాసము; డాక్టరు వేదాంతం గోపాలాచార్యులుగారు, చేబ్రోలు, గుంటూరుజిల్లా.

౫. మహమ్మదు; వచనము—కర్త: పురిపండా అప్పలస్వామిగారు. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, చెన్నపురి. పేజీలు 44. వెల లేదు.

౬. (ఎ) సుభాషిత శతకత్రయము; సాంధ్రతాత్పర్యము. (నీలకంఠ మహాకవికృత కలివిడంబన, సభారంజన, వైరాగ్యశతకములు.) స్వధర్మప్రకాశిని పత్రిక నుండి పునర్ముద్రితము. పేజీలు 62. వెల రు. 0-10-0.

(బి) చారుచర్య; క్షేమేంద్రమహాకవి రచించిన శ్లోకములకు పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు వ్రాసిన ఆంధ్రటీకాతాత్పర్యములు కలవు. పేజీలు 15. వెల రు 0-4-0. ప్రకాశకులు: కనుపర్తి మార్కండేయశర్మగారు, బృందావనం, కీల్పాకు, మదరాసు.

౭. శ్రీకనకధారాస్తవము; శ్రీ శంకరాచార్య విరచితము. తూనా విశ్వనాథ శాస్త్రులుగారు వ్రాసిన ఆంధ్రటీకా తాత్పర్యములు కలదు. పేజీలు 30 వెల లేదు

౮. గణితరత్నాకరము—'లీలావతి' మొదలయిన గ్రంథముల ననుసరించి తెలుగున నుదాహరణములతో నున్నది. అభ్యాసములు (Exercises) ఉత్తరములు (Answers) గలవు. గ్రంథకర్త: కాట్లగల్లు వెంకట నరసప్పగారు (కాట్లగల్లు, కందుకూరుపోస్టు, మదనపల్లె తాలూకా, చిత్తూరుజిల్లా.) డిమ్మిసైజున 750 పుటలు గల గ్రంథము. మేలుకాగితములు. క్యాలికోబైండు వెల రు 4-0-0 మాత్రమే.

ఈ గ్రంథమునందలి క్షేత్రగణితభాగము విడిగా దొరకును. పేజీలు 170. వెల రు. 1-0-0.

౯. రాజేశ్వరి—ఒక చిన్నికల్పితకథ (వచనము). గ్రంథకర్త: రాయసము వేంకట శివుడుగారు, యం. ఏ., యల్.టి., అధ్యక్షులు, శ్రీ వేంకటగిరి రాజాగారి కళాశాల, నెల్లూరు. క్రౌనుసైజు. పేజీలు 110. వెల రు. 0-8-0. గ్రంథకర్తగారియొద్ద నీపుస్తకము దొరకును.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




దేశమునందు ఎన్నికల హడావిడి ముగిసినది. శాసనసభల హడావిడి ప్రజల దృష్టి నాకర్షించుచున్నది. ఏపత్రికను చూచినను, ఏ సభకు పోయినను, ఏక్లబ్బునందున్నను, శాసన సభల వ్యవహారములు ప్రత్యక్షము లగుచు న్నవి. వక్తలకు చక్కని ఉపన్యాసములను చేయుట కవకాశములు కలుగుచున్నవి. సక్ర మాందోళన పరాయణులకు ప్రశ్న లడుగు టకును, తీర్మానములను ప్రతిపాదించుటకును వీలు కలుగుచున్నది. అధికారులు మామూ లుమార్గముననే నడుచుచున్నారు. గౌహతీ కాంగ్రెసుమంత్రుల నిర్మాణమును ప్రతిషేధిం చినది; మంత్రుల ధ్వంసమును ఆదేశించినది. కాని అన్నిరాష్ట్రములందును మంత్రు లేర్పడి ద్వంద్వప్రభుత్వమును యథావిధిగ నడుపు చున్నారు. వంగరాష్ట్రము నందును, చెన్న రాష్ట్రమునందును ప్రబలపక్షమైన కాంగ్రెసు పక్షము మంత్రిపదవులను గైకొనుటకు నిరా కరించినది. గతించిన శాసనసభలయందు వంగ రాష్ట్రముమధ్యరాష్ట్రములు మంత్రులులేకయే పరిపాలింప బడినవి. వంగరాష్ట్రమునం దిపుడు, చక్రవర్తిగారును, గజనవీగారును మంత్రులు గను నేమింపబడిరి. వీరిని పదభ్రష్టులను చేసి ద్వంద్వప్రభుత్వము సాగకుండ చేయుటకు కాంగ్రెసుపక్షమునకును, సర్ అబ్దుల్ రహీం గారి మహమ్మదీయ పక్షమునకును సంయో గము కావలసి యున్నది. మహమ్మదీయులు గజనవీచక్రవర్తి గార్లను బహిష్కరింప దల చినను మంత్రివర్గమును పడద్రోయుటకుసాహ సింపజాలరు. వంగరాష్ట్రమునందు దేశబంధు దాసుగారి నాయకత్వము క్రింద నసాధ్య మైన ద్వంద్వప్రభుత్వ మిపుడు సాధ్యమైనది. యథోచిత సహకారుల ప్రవేశమే మంత్రివర్గ నిర్మాణమునకు దోడ్పడినది. మంత్రివర్గమును పడగొట్టుటకు స్వరాజ్య నాయకులైన సేను గుప్తగారి ప్రయత్నము లెంతవఱకు సఫలము లగునో కాలము నిర్ణయింపగలదు.

చెన్నరాష్ట్రమునందు అధికసంఖ్యాకులైన కాంగ్రెసుపక్షముమంత్రిపదవులనునిరాకరించిన ది. స్వల్పసంఖ్యాకులైనస్వతంత్రపక్షము మంత్రి పదవులను స్వీకరించినది. స్వపక్షబలము లేని స్వతంత్రపక్ష మంత్రివర్గము చిరకాలము నిలు చుట కవకాశము గనుపడదు. జస్టిస్ పక్షము మంత్రివర్గమును పడద్రోయుటకు సిద్ధముగ నున్నది. కాంగ్రెసు పక్షమునకు మంత్రివర్గ మును ధ్వంసముచేయుట విధి అయినను తటస్థ భావము నింతవఱకు వహించినది. రాగల సమావేశమునందు కాంగ్రెసుపక్షము అవలం బింపదలచిన కార్యము దుర్జ్ఞేయముగ నున్నది. కాంగ్రెసుపక్షమును,జస్టిస్‌పక్షమును కలిసి పనిచేసిన మంత్రులను పదభ్రష్టులను చేయుట, ద్వంద్వ ప్రభుత్వమును నిర్మూలము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయుట సుకరము. కానిద్వంద్వప్రభుత్వమును పాడుచేయుట కేర్పడిన కాంగ్రెసు పక్షమున కును ద్వంద్వప్రభుత్వమును సంరక్షించుట కేర్పడిన జస్టిసు పక్షమునకును సంయోగము కలుగుట దుర్ణయముగ నున్నది.

మధ్యరాష్ట్రములందు యథోచిత సహకారవాదులు మంత్రివర్గము నేర్పఱచి పనిచేయుచున్నారు. అన్నిరాష్ట్రములందును మంత్రివర్గము లేర్పడి పనిచేయుచున్నప్పు డు కాంగ్రెసునిర్ధారణను సఫలముచేయు మార్గము గనుపడకున్నది. స్వరాజ్యపక్షనా యకులు పండిత మోతీలాలు నెహ్రూ గారు బడ్జెట్టులను నిరాకరించుట, ద్వంద్వ ప్రభుత్వమును పాడుచేయుట గౌహతీతీర్మా నకు భావార్థము లని వ్యాఖ్యానము చేసిరి. ఆభావార్థమును సార్థకముచేయుటసాధ్యమా? సాధ్యమైనను ప్రయోజనకరమా? యను సమస్యలు సభ్యులను బాధించుచున్నవి. చెన్న రాష్ట్రశాసనసభ నీసందియములు మిక్కుట ముగ బాధించుచున్నవి.

*   *   *   *

### చెన్నరాష్ట్ర శాసనసభ

గతించిన మాసమునందు చెన్నరాష్ట్రశా సనసభ గూడినది. స్వతంత్ర పక్షావలంబనులు డాక్టరు సుబ్బరాయనుగారు ప్రధానమంత్రులు. శ్రీయుత రంగనాథము మొదలియారుగారు ఆరోగ్యస్వామి పిళ్లగారును నితర మంత్రులు. మంత్రివర్గమున కేమిచేసిన చేటుమూడునో యని భయము గలుగుచున్నది. జస్టిసుపక్షము ప్రతిపక్షముగ నున్నది. కాంగ్రెసుపక్షము తటస్థముగ నున్నది. జస్టిసుపక్షము రక్షించి పోషించిన సాంఘిక దుర్నయములను తొల గించుట స్వతంత్ర పక్షమునకును కాంగ్రెసు పక్షమునకును ధర్మమైయున్నది. స్థానికసంఘ ములందు జస్టిసుపక్షము ప్రతిష్ఠించిన దుర్ణయ ములు తిరిగి తలయెత్తకుండుటకు జస్టిసు పక్ష ప్రతిష్ఠాపనమును నిరోధించుట యవసరము. ఈనిరోధము కాంగ్రెసు ధర్మమునకు విరుద్ధ మైన స్వతంత్ర పక్ష మంత్రివర్గమును పరోక్ష ముగను గాపాడుటకు వినియోగపడుచున్నది. రాగల సమావేశమునందు కాంగ్రెసుపక్షమేమి చేయవలయునో సభ్యులకు దెలియకున్నది. స్వతంత్ర పక్షమంత్రివర్గము పడిపోయిన జస్టిసు పక్షమంత్రివర్గ మేర్పడుటయును, సాంఘికదుర్ణ యములు పెరిగి జస్టిసుపక్షబలము వర్ధిల్లుట యును సంభవములు. కాంగ్రెసుపక్షము నిర్ణ యింపవలసిన సమస్యమంత్రుల నిర్గమనముగాని జస్టిసుపక్ష ప్రతిఘటనముగానినైయున్నది. ఈ పరిస్థితులందు భారతజాతీయోపసంఘముగూడ దేశపరిస్థితులను గమనించి భిన్నరాష్ట్రములకు వానిపరిస్థితుల కనుకూలముగను మంత్రివర్గ మును పోషించుటకును, నిరాకరించుటకును స్వాతంత్ర్యమును నొసంగుట శ్రేయస్కర ముగ నుండగలదు. కాంగ్రెసుపక్షము స్వయ ముగ మంత్రిపదవుల నిరాకరణమును గాపాడు చు మంత్రివర్గపోషణ నిరాకరణములకు శాస నసభ్యులకుస్వాతంత్ర్యము నొసంగుట కార్య సాధనముగ నుండగలదు. ప్రాణములను గుప్పిట బట్టుకొనియున్న మంత్రివర్గమునకు భావిపరిక్ష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తులుతెలియక కార్యవిధానమును నిర్ణయించు టయును దుర్ఘటము.

చెన్నరాష్ట్ర శాసనసభయందు గత సమావేశమునందు నడిచిన కార్యవిధానము సంతృప్తికరముగ గనుపడదు. సభ్యులు పక్ష ప్రయోజనములను గమనింపక స్వాభిప్రాయములను వ్యక్తముచేయుటకు పాటుపడిరి. రెండుదినములు విరామతీర్మానముతో వ్యర్థమైనవి. కాంగ్రెసుపక్షసభ్యు లందరును సంప్రతించి కార్యవిధానమును నడుపుట ప్రయోజనకరము. గత సమావేశమునకు నిర్ణయమైన తీర్మానము లవకాశములేక నిలిచిపోయినవి. ఆంధ్రరాష్ట్ర తీర్మానము, మద్యపాన నిషేధ తీర్మానము మొదలగు తీర్మానములు నిలిచిపోయినవి. రాగల సమావేశమునం దైనను తగినయేర్పాటులను జేసి శ్రీయుత స్వామి వేంకటాచలముశ్రేష్ఠి, సత్యమూర్తిగార్లనాయకత్వముల క్రిందను కార్యవిధానమును పరిసమాప్తిచేయుట యుక్తము. క్షామనివారణ విషయమై సభ యంగీకరించిన తీర్మానము ప్రజాక్షేమమున కుపచరింప గలదు. తీర్మానముయొక్క ప్రయోజన మధికారుల నిర్ణయముల ననుసరించియుండును. కాని రంగనాథం మొదల్యారుగారి పట్టుదల కొంత ప్రయోజనమునైననుసమకూర్చునని నమ్ముచున్నాము. మోపలా ప్రజల అండమానుద్వీపముల నివాసమునకు శాసనసభ ప్రతిఘటనమునుచూపినది. ముగ్ధ బాలబాలికలను పశుప్రాయులైన మహాపరాధులతో గలిపియుంచుట ధర్మసాధనము గాజాలదు. మూశేపి.యనుల తోటలకు పనివాండ్రు కావలసిన పనివాండ్రను నియమించుకొనుట న్యాయముగాని ఏదో వ్యాజముననునిరపరాధులను నిర్బంధముగను పనివాండ్రను చేయుట న్యాయముగాదు. మానవవాసమున కయోగ్యమని నిర్ణయించిన అండమాను ద్వీపములందు కోమలస్వభావముగలస్త్రీలను, బాలబాలికలను పశుప్రాయులతో గలిపియుంచుట పరమానర్థములకు మూలమగునని గ్రహించి ప్రభుత్వ మీయేర్పాటును నిర్మూలముచేయుటకుపూనుకొనుట ప్రభుత్వధర్మము. వెనుకను ప్రతికూలముగ నున్న జస్టిసుపక్ష మిపు డనుకూలముగ నుండుటకు గారణ మధికారచ్యుతి యని గ్రాహ్యమగుచున్నది.

*          *          *

సామ్రాజ్య శాసనసభ

శ్రీ ఇర్విను ప్రభువు సామ్రాజ్యశాసన సభామందిరమున కారంభోత్సవమును జేయుచు చేసిన ప్రసంగము భారతీయుల హృదయమునందు నిరాశనుగలిగించినది. ప్రాణప్రతిష్ఠ లేని సభామందిరము మహాసమాధివలె నుండును. సభామందిరము విషయమై శ్రీనివాసఅయ్యంగారు తెలిపినభావము ప్రభుత్వ లక్ష్యమును సకలవ్యవహారములందును విశదము చేయుచున్నవి. కోట్లరూప్యములు ఢిల్లీ నగర నిర్మాణమునకు వినియోగపడుచున్నవి. లక్షలరూప్యములు శాసనసభామందిరమునకు వినియోగపడినవి. ఇర్విను ప్రభువు బ్రిటీషు ప్రభుత్వలక్ష్యమునకు సభామందిరము ప్రమాణముగ నుండగలదని వారి ప్రసంగమునందు విశదముచేసిరి. ఢిల్లీనగరము పురాతన శిథిలమం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దిరములతో నిండియున్నది. ఇంద్రప్రస్థము, పృథ్వీరాయమందిరము, తుగ్లకాబాదు, షహాజనాబాదు గతవైభవములను దెలుపుచున్న మహామందిరములు, మందిరములు స్తంభితమైన హృదయమును తెలుపుచున్నవి, గాని చైతన్యపూరితమైన హృదయమును దెలుపుటలేదు. రైజినాయందలి సభామందిరమును జడహృదయమును తెలుపుచున్నది. ఇర్విన్‌ప్రభువు బ్రిటిషుప్రభుత్వహస్తములందు కీలుబొమ్మ. వారి మామూలుపాటలనె వీరును పాడుచుందురు. బర్కెను హెడ్డుప్రభువు కొన్నిమాసములక్రిందను ప్రకటించిన భావములనె ఇర్విన్‌ప్రభువుమృదుమధురముగ వ్యక్తముచేసెను. ఇర్విన్‌ప్రభువుచేసిన ప్రసంగము పిల్లలకు పాఠమువలెనున్నది. భారతప్రభుత్వముపట్లను బ్రిటిషు పార్లమెంటునకు సంపూర్ణాధికారము గలదని పిల్లలకును దెలిసియున్నది. భారతీయులసొమ్మును తినుచున్న రాజప్రతినిధులు పార్లమెంటు ప్రయోజనములను గమనింపవలయునో భారతీయుల ప్రయోజనములను గమనింపవలయునో ధర్మపరాయణుడగు ఇర్విన్‌ప్రభువునకు తెలియని విషయముగాదు. పార్లమెంటును, బ్రిటిషుసామ్రాజ్యమును సంచలనముచేయుటకు భారతీయులకు శక్తియున్నపుడు రాజప్రతినిధులుపిల్లలకువలె పాఠములను జెప్పుటకు సాహసింపరు. వంగదేశ నిర్బంధితులు కుళ్లుచున్నను రాజప్రతినిధికి దయగలుగలేదు. రాజ్యాంగ సంస్కరణములవిషయమై చిత్తవృత్తి మారలేదు. జాతీయ సంవిధానముపట్లను సనుగ్రహము రాలేదు. ప్రజలును, నాయకులును, సభామందిరప్రవేశోత్సవసమయమునను ఇర్విన్‌ప్రభువు ప్రభుత్వహృదయమునందు గలిగిన పరివర్తనమును కార్యరూపమున వ్యక్తముచేయునని ఆశపడియుండిరి. ఆ యాశ నిరాశయైనది. ఇర్విన్‌ప్రభువు తెలిపినభావముల కనురూపముగను సభావ్యవహారములును నడుచుచున్నవి.

చీనాయుద్ధప్రయత్నములు భారతీయుల నిస్సహాయస్థితినివిశదముచేయుచున్నవి. ఇర్విన్‌ప్రభువు భారతీయుల ప్రమేయము లేకనే చీనాకు సైన్యములను బంపి భారతీయుల కవమానమును గలుగజేసెను. స్వాతంత్ర్యమునకై పోరాడుచున్న సోదరఖండవాసులమీదను స్వాతంత్ర్యనిర్మూలమునకై భారతీయులను ప్రయోగించుట యధర్మము. ఇర్విన్‌ప్రభువు తానుచేసినయకార్యమునువిమర్శించుటకైనను నవకాశమునొసంగక సామ్రాజ్యసభాప్రయోజనమునునిరర్థకముచేసెను. దేశమునందంతటను చీనాకు సైన్యములను బంపుట గర్హ్య మని ప్రజలు సభలనుజేసి ప్రతిపాదించుచున్నారు. నిస్సహాయస్థితియందున్న ప్రజలు మాటలతో సంతృప్తిని జెందవలయును గాని ప్రతిక్రియలను జేయజాలరు. తీర్మానములు ప్రజలకు స్వాతంత్ర్యమును సంపాదింపజాలవు. ప్రజలు కార్యపరతంత్రులు గానంతవరకును స్వరాజ్యముగాని, జన్మహక్కులుగాని లభింపజాలవు.

నిర్బంధితులవిమోచనమునుగాని, విచారణనుగాని కోరుచు పండిత మోతీలాలు నెహ్రూగారు ప్రతిపాదించిన తీర్మానమును ప్రభుత్వము ప్రతిఘటించుట నిరంకుశస్వభావమున కను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హీనముగ నున్నది. ఆవిషయమై సామ్రాజ్య శా
సనసభయందు జరిగినచర్చ భారతీయుల కన్ను
లను విప్పుటకు తోడ్పడగలదు. యూరపియను
సభ్యు లందరును విమోచనము నేకగ్రీవ
ముగను ప్రతిఘటించిరి. నిర్బంధితుల నేరారోప
ణమును రుజువుచేయుటదుస్తరమని లిట్టను ప్రభు
వంగీకరించుచున్నాడు. నేరములను రుజువుచే
యజాలని ప్రభుత్వమునందు ప్రజలకు విశ్వాస
ము గలుగజాలదు. ఏప్రభుత్వమైనను నిర్బంధ
శాసనములతోను ఆయుధములతోను చిర
కాలము ప్రజలను పరిపాలింప
జాలదు. ఆంగ్లదేశచరిత్రము పరిపాలకుల కీ
విషయమును బోధించుచున్నది. నిర్బంధితుల
విమోచనతీర్మానమునకు 68 సమ్మతు లను
కూలముగను 50 సమ్మతులు ప్రతికూలము
గను వచ్చి తీర్మానము నెగ్గినది. అభిప్రాయ
ముల నాచరణమునందుబెట్టుట కధికారము
లేని తీర్మానములు కేవలము రద్దుకాగితము.
దేశమునందంతటను పెరుగుచున్న యశాంతిని
గమనించి యైనను భారతప్రభుత్వమునందు
హృదయపరివర్తనము గలుగుట క్షేమకరము.
బాంబులను విప్లవకార్యములను నుపసంహరిం
చుటకు భక్తివిశ్వాసములు సాధకములుగాని
నిర్బంధములు సాధనములు గావని ప్రపంచ
చరిత్ర వేయినోళ్లను చాటుచున్నను స్వార్థ
పరాయణులకు జ్ఞానోదయము గలుగుట దుర్ల
భము.

సామ్రాజ్యసభయందలి పక్షములు దేశము
నావరించిన దుర్దశను విశదము చేయుచున్నవి.
స్వతంత్రపక్షమునకు జిన్నాగారు నాయకులు.
ఈపక్షమునందు సర్ పురుషోత్తమదాసు
ఠాకురుగారిని బోలిన హిందువులున్నను మహ
మ్మదీయపక్షము, జాతీయపక్షమునకు నాయ
కులు లాలా లజపతిరాయిగారు. ఈ పక్షము
హిందూపక్షము. ఈ రెండుపక్షములు చేరినను
28 సభ్యులు గలరు. వీరిలక్ష్యమునందు విశేష
భేదములేదు. కాంగ్రెసుపక్షమునకు నాయ
కులు పండిత మోతీలాలు నెహ్రూగారు. ప్ర
బలమైన కాంగ్రెసుపక్షమునందు 40 సభ్యులు
గలరు. ఈ మూడుపక్షముల ప్రయోజనము
సమానములైనను ప్రత్యేకపక్షములుగ నేర్ప
డుట నిరంకుశ వర్గమునకు ప్రయోజనకరము.
ప్రభుత్వమునకు ప్రత్యేకపక్షములను విడదీసి
విజయమును బడయుట కవకాశములుగలవు.
మహమ్మదుగారి డిప్యూటిప్రెసిడెంటు నియో
జన మిందులకు నిదర్శనము. వంగదేశ నిర్బం
ధితుల తీర్మానవిషయమై మూడుపక్షము లేకీ
భవించినను బడ్జెటు నిరాకరణ విషయమై
మూడుపక్షములును కలిసి పనిజేయజాలవు.
దేశము నావరించిన సాంఘికవిభేదములు వ్యక్తి
భేదములు నిరంకుశవర్గమును సంరక్షించుచు
దేశానర్థమునకు సాధనంబులుగ నున్నవి.
పరాధీనస్థితి కిది సహజావస్థ. విఠ్ఠలభాయి
పటేలుగారి యధ్యక్షతక్రిందను సభావ్యవహా
రములు యథాప్రకారము ప్రవర్తింపగలవు.
విషమ పరిస్థితులందు భగవంతుడే శరణ్యుడు.

* * *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

### గాంధిమహాత్ముని సంచారము — నిర్మాణ కార్యవిధానము

గౌహాతి కాంగ్రెసు స్వరాజ్యసంపాదనమునకును ప్రజాప్రబోధమునకును నిర్మాణకార్యవిధానమును నిర్ణయించినది. శాసనసభలయందు విశ్వాసము గలిగి సభావ్యవహారములందు మునిగి తేలుచున్న నాయకులకు నిర్మాణకార్యవిధానమునందు విశ్వాసముగలిగి కార్యవిధానమును నిర్వహించుట కవకాశములు తక్కువగనున్నవి. స్వరాజ్యపక్షనాయకు లింతవరకును చూపిన యలసత్వ మిందులకు నిదర్శనముగనున్నది. గత సంవత్సరమునందు నిర్బంధముగను సబర్మతియందు విశ్రాంతిని దీసికొనిన గాంధిమహాత్ము డీయేడు యావచ్ఛక్తిని వినియోగించుచు దేశసంచారమును చేయుచున్నారు. వంగబీహారురాష్ట్రములందు సంచారమును ముగించి యిపుడు మధ్యరాష్ట్రములందు సంచారమును చేయుచున్నారు. మహాత్ముడు సంచారము చేయుచున్న ప్రదేశములందు ప్రజలు పరమోత్సాహముతో ఖద్దరునిధికి కానుకలను సమర్పించుచున్నారు. మధ్యరాష్ట్రములమంత్రి శ్రీయుత ఈడుపుగంటి రాఘవేంద్రరావుగారు వేయిరూప్యములను సమర్పించిరి. ఏప్రిలుమాసమునందు గాంధిమహాత్ము డాంధ్ర దేశ సంచారము నుజేయుట కంగీకరించుచున్నారు. తమిళనాడు ప్రజలు లక్ష్యరూప్యములను సమర్పించుటకు శ్రీమాన్ సి. రాజగోపాలాచార్యులుగా రేర్పాటులను జేయుచున్నారు. ఆంధ్రులును మహాత్ముని సంచారసమయమునందు యథాశక్తిని ఖద్దరునిధికి ద్రవ్యసహాయమును జేసి యాత్మగౌరవమును గాపాడుకొనమహాత్ముని సంకల్పమును సఫలముచేయవలసియుందురు. మహాత్ముని సంచార విధానము వారికి ప్రజలు సమర్పింపదలచిన ద్రవ్యముమీద నాధారపడి యున్నది. మహాత్మునకు యథాశక్తిని తృణమొ కణమొ సమర్పింపదలచిన వారందరును వెంటనే వారిసంకల్పము జిల్లా కాంగ్రెసు సంఘములకును, రాష్ట్రీయకాంగ్రెసు సంఘమునకును తెలుపుటకు ప్రార్థితులు. మహాత్మునకు 'సంపన్నులసవరనులవలెను నిరుపేదల కానులును ప్రతిగ్రహణయోగ్యములు. ఆంధ్రులందరును జాతి మత పక్షభేదములను పాటింపకను పెన్నిధులను మహాత్మునకు సమర్పించి దేశారాధనమును చేయుదురుగాక!



Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7, Thumbu Chetty Street, G.T., Madras

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# విషయానుక్రమణిక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చిత్రములు





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చెన్నపట్టణము మార్చి ౧౯౨౭

సంపుటము ౮ అక్షయ సంవత్సరము ఫాల్గుణమాసము సంఖ్య 3

# కంకణము

భోగరాజు నారాయణమూర్తిగారు

(వెనుకటిసంచిక తరువాయి)

గీ. తలుచు తెగి వ్రాలుచుక్కలు ధరణిఁ బడఁగ-నెడములేక మామేఘాళి నడుమఁ జిక్కి-
యొండొకనభంబు గల్పించుచుండె మాకు-నభ్ర మన్వర్థనామధేయంబు గాఁగ.

శా. దేశాంతర్గతుఁడయ్యె భర్త, జగమెంతేమెచ్చు మీమేఘసం(?)
దేశంబన్నను, మాకు నున్న దొక సందేశంబు గొంపోయి మా
యాశల్ దీర్పఁడటంచుఁ దెల్పెఁడని తారాబ్జాస్యలంపన్ దదా
దేశంబుం గొనివచ్చు దూతికలరీతిన్ వ్రాలె నత్తారకల్.

మ. అమితోగ్రాకృతి నుద్భవించి సకలాశాంతంబులన్ శ్రీమహే
శ మహాలింగము వ్యాప్తమౌ నెడ విరాజత్పారిజాత ప్రసూ
నములన్ వేల్పులు పూజసల్పెడు నుదంతంబెల్ల మామేచకా
భ్రముపై వ్రాలెడు తారకావళి స్ఫురింపంజేసె మా కయ్యెడన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. తారామండలమందె యంతవఱ కంతర్భూతుఁడై వింట దు
ర్వారాస్త్రంబులఁ గూర్చి మారుతుఁడు మాపైనిం బ్రయోగింపఁ ద
న్నారాచానలకీలికావళియొనా నాఁ డావియన్నిర్గళ
త్తాశావారము మాకపారభయదోత్పాతంబె యయ్యెం గటా!

౬

శా. ఆయుత్పాతము లుప్పతిల్లుటయు నత్యాకస్మికంబౌ మహా
నాయుధ్వానము మాచెవింబడియెఁ దద్ధ్వానంబు విన్పింప మా
కాయంబుల్ గడు జల్లుజల్లుమనియెన్, గాయంబులున్ జల్లనన్
మాయోగంబున నొక్క జల్లువడియెన్ మానుండి త్వన్మండలిన్.

ఉ. తొల్లిటి పుణ్యపాపములతోడనె నాకము నారకమ్ము సం
ధిల్లఁగ వానినిన్ బడసి తీరి పదంపడి భూతధాత్రికిం
ద్రెళ్ళెడు జీవకోటులటు ద్రెళ్ళె ననేక సహస్రసంఖ్యలై
జల్లున నేలపైఁబడిన జల్లున సంబుకణప్రకాండముల్.

క. ఆతరి నేతరి వాతా-ఘాత మధఃపాతగతిని గల్గించునో యు
న్నీతిన్ బింకము సెడి జీ-మూతవ్రాతములు వడక మొదలిడె నకటా.

క. వికలమతిన్ మివుల వికా-వికలై యిలఁ బడకయుండు వెరవున మావా
రికణము లత్యాతురతన్-జకచక వెను వెనుక కొదుగసాగెను మింటన్

క. ఈతెరగున నాభీకర - వాతధ్వానమ్ముకతన వారిదములలో
నూతనసంచలనం బు – ద్భూతంబై మివుల దివులుపుట్టించుటయున్.

ఉ. ప్రాంతచరత్పయఃకణకృపాపరిలబ్ధసుఖస్థితిన్ దదీ
యాంతరమందు డాఁగి పవనాహతిఁ ద్రెళ్ళకమున్న నిశ్చల
స్వాంతముతో నుమారమణుఁ జర్విత చర్వణమైన యిట్టి జ
న్మాంతరముల్ ఘటింపవల దంచును వేఁడుకొనం దొడంగితిన్.

శా. వందే శంకర మిందుశేఖర ముమాప్రాణేశ్వరం సంతతా
నందశ్రీవిభవప్రదం విబుధసంతానార్పితాత్యుల్లస
న్మందారాంచిత సుందరాంఘ్రియుగళం మన్మాథ మర్కోజ్జ్వలం
కందర్పాంతక మంబుజోదరసఖం కైవల్య సంధాయకమ్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. వ్యాసాగస్త్యవసిష్ఠనారద భరద్వాజాదిసన్మున్యుప
న్యాసాధారగుణాలయాయ భవబంధత్రాసనాశాయ కై
లాసశ్రీవిభవాయ పంకమయదుర్లంఘ్యోచ్చలజ్జీవనా
వాసక్లేశహరాయ భక్తహృదయావాసాయ తుభ్యన్నమః.

శా. నాకుం జెల్లెనె ఖేచరత్వజనితానందైకభాగ్యంబు? నా
నాకూపస్థదురంతపంకనిచయాంతర్మగ్నసంతాప మెం
తో కాలంబయి పొందుచుందుఁ గరుణాదూరుండవై నన్ను ని
కేకూపంబునఁ ద్రోయ నెంచితొకదోయీ, తండ్రి, మృత్యుంజయా!

మ. భవఘోరార్ణవవీచికాతరణసంపత్కారణం బెన్నఁగా
భవదంఘ్రిస్మరణంబ! యన్యతరణోపాయంబు లే దింక, నీ
భవసంతాపభరంబు దుర్భరము, నాప్రాపీవె కాపాడు మో
భవదూరా, యభవా, భవా, శివ, శివాప్రాణేశ, మృత్యుంజయా!

శా. నీవారిన్ నిరతంబు నీవు కరుణానిర్నిద్రభద్రాత్ములన్
గావింపం దలపోసె; దేము నభిషేకస్ఫూర్తి నేవేళ నీ
సేవార్చావిధు లాచరించు టెదలోఁ జింతించి మావారినిన్
నీవారిం బలెఁ బ్రోవఁగాఁ దగదె తండ్రీ, నీకు మృత్యుంజయా!

శా. లోనం బుట్టవు కీటకచ్ఛటలు, కల్లోలంబులుం గల్గ, విం
తేన్ వక్రత నేఁగుజీవనములే, దేపంకసంపర్కమున్
గానన్ రాదు; వియచ్చరత్వము సదా కల్పించి నా కీపయిన్
రానీకయ్య, పునర్మహీపతనసంత్రాసంబు మృత్యుంజయా!

మ. భువిఁ జచ్చున్ దివిఁ జొచ్చు; నచ్చటను జావుం గాంచి చొచ్చున్ భువిన్
భువిచావున్ దివిచావు నాఁగ నిటుచావుల్ రెండు భూతాళికిన్;
భువి చావున్ సుఖసుప్తిపోలెఁ బడయం బోనౌనుగా నక్కటా
దివి చావున్ ననుఁజావనీకుము కపర్దిస్వామి, మృత్యుంజయా!

మ. బహుధాభూతవిలాసకందుకకళాప్రజ్ఞన్ సదా తన్మహ
ర్ముహురుద్వృత్తపతద్గతిక్రమములన్ మోదింతె? యుష్మత్కరా
బ్జహార్తిన్ మింటికిఁ దూలి నేలఁ బడఁగా సుసిద్ధమై యుంటె, నీ
కుహనాఖేలన మేల నాయెడల నీకుం దండ్రి, మృత్యుంజయా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. గంగాశీతలశీకరప్రకరసాంగత్యంబు దివ్యాంగనా
సంగీతామృతపానవైభవ ముదంచత్కామహర్షంబు, నా
కుం గల్పింపుము శాశ్వతమ్ముగ నధఃకూపమ్ము చేకూర్ప కో
గంగాసంకలితోత్తమాంగ, భవభంగా, లింగ, మృత్యుంజయా!

౧౦

గీ. అనుచుఁ బ్రార్థించుచుండఁగ నంతలోన-నస్మదీశ్వరార్చనమున కంతరాయ
ము ఘటించినాఁ డఖిలభూభువనభవన-భంజనవిజృంభమాణ ప్రభంజనుండు.

శా. స్తంభీభూత దిగంతపూరిత పయోదవ్రాతసంచాలనా
రంభోద్వేగసమేత దుర్భరతరా రావానదీర్ఘైక స
ర్వాంభోజ ప్రభవాండభాండుఁడయి నాఁ డమ్మాతరిశ్వుండు ప్రా
రంభించెన్ బహుధాచరాచర సమగ్రధ్వంస సంచారమున్.

ఉ. స్థావరజంగమాత్మకము సర్వజగంబు క్షణంబులో గత
స్థావరమై సహాకలిత జంగమమయ్యెను, జంచలన్మహీ
జావళియున్ శిరఃకరకృతాభినయంబులఁ బాడఁజొచ్చెఁ గ
ల్ద్రావెనోనా నిరంతరనిరర్థక జల్పనకల్పనాధ్వనిన్.

ఉ. త్రుళ్లియు నిక్కినీల్గియును దూఁగియు వ్రాగియు విఱ్ఱవీగియున్
గల్లునుద్రావువాఁడు ధనగర్వితుఁడున్ దుద కొక్కపెట్టునన్
ప్రేల్లైద రెట్టు లట్టు చెలరేఁగియు నిట్టటు లూఁగులాడియున్
బెల్లు ధ్వనించి మించియు గుభిల్లునఁ గూలె మహీరుహావళుల్.

మ. వరలున్ నిశ్చలహానధర్మము జగత్ప్రాణానుబంధంబులన్
బరివర్జించిన యంతకాలము; జగత్ప్రాణానుబంధంబులన్
బరివర్తింపఁగదా ఘటిల్లెను నధఃపాతాత్తక్లేశ మీ
సరణిన్ మాకని చాటె నాఁటి ప్రపతత్సర్వావనీజావళుల్.

ఉ. భూతలమందుఁబోలె సురభూములయందును భూతకోటికు
జ్జాతము గాక తప్ప దవసానదశావసరంబునన్ మహో
వాతము; నాఁడు బిట్టడలుపాటు ఘటింపఁగఁ జేసె నమ్మహో
వాతవిజృంభణంబు భువి వారికినిన్ దివివారికిం గటా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. ఘోరాకారమరుత్ప్రియుక్తభయసంక్షోభంబునన్ మేము ఘీం
కారారావము లాచరించు నెడఁ గ్రేంకారారవం బొప్పఁ గాం
తారావాసమయూరవారము లొగిన్ నాట్యంబు గావించె; నౌ
రౌరా! యొక్కరిఖేద మింకొకరి కత్యామోదమౌనే కదా?

శా. పైకిన్ మైత్రి నటించి మాపతనమున్ వాంఛించు లోలోన, మ
మ్మాకాశమ్మునఁ జూచి యేచి పురు లల్లాడించుమాత్రంబునన్
గేకివ్రాతము మాకుఁ గూర్చునని సంకేతించి వాక్రుచ్చు నీ
లోకం బింతటి గ్రుడ్డిదా యనుచు నాలో నేనె చింతించెదన్.

శా. స్ఫారంబై బహుభీతభూతమయి ఝుంఝామారుతోద్ఘుష్టహుం
కారం బెందు విరామ మొందకయె యోంకారానుకారంబుతో
నీరేజప్రభవాండభాండమునఁ దానిండంగ, సాక్షాన్మహోం
కారబ్రహ్మమయంబు లోకమనువాక్యం బప్పు డూహించితిన్.

౧౧

శా. సైరంధ్రాంబుధరవ్రజంబు, త్రిజగన్నిర్మూలనాఖేలనా
పారీణానిలపాదతాడనములన్ బట్టూడి, బిట్టోడి, పె
ల్లారాటంపడి, బింకమెల్లఁ జెడి, నీరై నాఁటి శేయింగటా!
ప్రారంభించె మదేభతుండనిభధారాపాతముల్ ధాత్రికిన్.

చ. ప్రభువు ప్రకంపనుండయిన రాజ్యము త్యాజ్యముగాన రండురం
డభయముగల్గు దేశమున కభ్రములార, యటంచు శత్రుభూ
పుభయము పెంపునన్ వలసపోయెడు తెంపునఁ బోవఁ జొచ్చె ని
న్నభము దొలంగి పాంఘనఘనాఘనముల్ మహికిం గ్రమంబునన్.

ఉ. ఆలయకాలకాలనిభుఁడైన ప్రభంజను తాడనంబులన్
జీలియు ప్రీలియున్ మిన్నులఁ జిందరవందరమైన పాపయో
దాలుల నుండి నాఁడు కురియందొడఁగెన్ వడగండ్లుఁ గూడఁ గీ
లాలముతోడి మాంసశకలమ్ములలీల నిలాతలమ్మునన్.

ఉ. కొన్ని వనంబులందు నొకకొన్ని సముద్రములందు నిక్కను
గొన్ని కొలంకులందు మఱికొన్ని మహానదులందు నీగతిన్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రస్నన్ గూలె నీలమణికాంతులనేలు పయోదమాలికల్
మిన్నుదొలంగి దారుణసమీరణ మారణకారణంబునన్.

సీ. కలుషమ్మెఱుంగ కొక్కటన పెక్కాట లత్యానందమునఁ గూడి యాడియాడి
సురుచిరబహుదివ్యసుందరీగాన రతిప్రమోదంబులఁ దేలితేలి
మిన్నుమన్నరయ కీయున్నతి స్థిరమంచుఁ బేరాసియాశలఁ బోయిపోయి
కటకట! తుదకుఁ బ్రకంపన బాధకు లోనై మనంబున లోఁగి లోఁగి
పొంకమును బింకమును జెడి పొరలువాఱి - ముడుతలంబడి పెనువాతమున మునింగి
నీరుగ్రమ్ముచు నాడుమానిఖిలమేఘ - మాలికలు క్రమక్రమముగా నేలవ్రాలె.

ఉ. ఇచ్చటనుండి నేలఁబడనీక ననుం గృపఁ గాచుచున్న మా
నెచ్చెలి మబ్బులన్నియుఁజనెన్, బరువాతఁ బడంగఁ బాండుపుల్
సొచ్చినయింటిపిపులికిఁ జొప్పన నాకును నక్రమంబుగా
వచ్చెను వంతు మారుతునివాతఁబడన్ విధినిర్ణయంబునన్.

క. బలహీనులమగు మాపై-బలిసి విరోధించి కూల్పఁ బాల్పడిన మహా
బలుబలమును విధిబలము ప్ర-బలమగునెడఁ బ్రోచు భీమబలుఁ డున్నాఁడే?

ఉ. నెక్కొని మింటనుండి తెగి నేలకురాలినరిక్కరీతి, వి
ల్లెక్కిడి వ్యాధుఁడేయ గుఱియేటునఁ గూలిన పక్కిభాతి, నే
దిక్కును లేక నేనకట! తీవ్రతరంబగు మారుతాహతిన్
గ్రక్కునఁ గూలినా నొకయగాధమహార్ణవమధ్యమందునన్.

౧౨

ఆ. వె. కూలి సొమ్మసిల్లి కులమువారి కృపోప-చారవిధుల సేదదేరి, దైవ
మా, భవార్ణవమున మఱలఁ ద్రోసితె యని-భోరుభోరుమనుచుఁ బొరలి యేడ్చి.

చ. క్రమముగఁ గన్నువిచ్చితిని గాంచితి లోకము, లోకమెల్ల సం
భ్రమె యనుకొంటి బుద్బుదవితానములే ప్రజలంచు నెంచితిన్
సమతయు శాంతి నిశ్చలత సాగనియిందలి సర్వజీవన
క్రమముల గుర్తెఱింగితి నగాధవిషాదపయోధి మున్గితిన్.

ఉ. సంతత మీయపారమగు సాగరమందలి జీవసంబుతో
నెంతయు నంటి యుంటనటు లేఁ జరియంపఁగ నెంచి, దేనినా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శింతును నాశ్రయింతు నను చింతమునింగితిఁ గాని జీవనా
క్రాంతముగాని సాధనము గానఁగనైతిని నెన్ని భంగులన్.

ఉ. జీవనధర్మమూనియును జీవనమం దెటు లంటి యంటన
ట్లే విహరింపనేర్తు? నగరే వినరే నెవరేని నన్ను? నా
కేవెరవున్ స్ఫురింప కెద నింతతలంచుకొలందిఁ దోఁచు నా
నావిధసంశయమ్ములు మనమ్ముఁ గలంచెఁ దొలంచె ధైర్యమున్.

ఉ. రమ్మిటురమ్ము సాగరతరంగములందు నుయాలలూఁగఁ జి
త్రమ్మగు కేళిమై గిరగిరన్ సుడులం దిరుగంగ నంచు, లే
శమ్మును దోఁచనీక నను సారెకుఁ బిల్చెడువారిచేత స్వాం
తమ్ము మఱింత నావశము దప్పె నయో పరమార్థచింతలన్.

మ. ఇవి కల్లోలము లిందుఁ జిక్కుకొనరా, దీవంక నావర్తముల్
తవులం గూడదు వీనియం, దట నగాధం బట్టిపోఁగూడ, దు
న్నవిధంబుండెదమన్న జీవనగతుల్ నన్నొక్కచో నిల్వనీ
వవిలంఘ్యంబగు నిట్టిసాగరమునందా చేరితిన్ దైవమా!

క. పృథువిషనిధి యిది క్షీరో-దధియఁట! రత్నాకరమఁట! తన్మధ్యమునన్
బుధవంద్యుఁడు నారాయణుఁ-డధివసియించునఁట! యివి యనౌచితులె కదా!

సీ. కామించి పెక్కుభంగము లోర్చి శృంగితో మైమఱపూనె నీమద్గురంబు
క్రోధించి కలతిమికులముల నలయించి పొలియించె నీతిమింగిలము కొదమ
లోభించి యామిషలాభ మన్యులకీక మెసవక యొసఁగె నిమ్మునలి మొసలి
మోహించి స్వకుటుంబమును మేపు చాకొన్నపయి మీలకొసఁగ దీపాడుఝషము
మదమునన్ గ్రాహమును గడుమత్సరమున - మకరమును నీటఁ బోరాడుటకుఁ దొడంగె
నకట! దుర్గుణంబుల కెల్ల నాలయంబు-సకలభయహేతుభూత మీసాగరంబు.

ఉ. రాగముపోదు, త్యాగమన రాదు, విరాగముగల్గ, దింద్రియో
ద్యోగము మాఱ, దెయ్యెడల యోగము సాగదు, సర్వజంతుసం
భోగవిలాసలాలసము భూతవినాశనహేతుభూత మీ
సాగర మెట్టిబుద్ధిబలశాలికినైనను నీదరా దహో!

ఉ. జీవనమందు భ్రాంతిపడి చిక్కుకొనందగ దిందుఁ బెక్కు న
క్రావళు లుండు నెంతటిమహాబలునే న్గబళించుచుండు; దం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్తావళివల్లభుండు ఘననక్రముఖంబునఁ జిక్కి స్రుక్కఁగా
రావలసెంగదా మును మురారి వికుంఠమునుండి ధాత్రికిన్.

౧౩

శా. కారాకూరము, నక్రవిక్రమ, ముదగ్రగ్రాహచక్రమ్ము, దు
ర్వారోత్తుంగతరంగవారమగు పారావారమున్ సంతత
శ్రీరామక్షితినాథపాదయుగళీసేవారతిన్, యోగి సం
సారంబుం దరియించుచందమున మున్ సామీరి లంఘింపఁడే.

ఉ. చంచలకన్నఁ జంచలము సర్వవిధమ్ముల మర్కటంబు; క
ల్పించె నయారె దాని కమలీమసయోగమహత్త్వసిద్ధి, దాఁ
టించె మహాసముద్రము! ఘటించె జగజ్జనపూజనమ్ము! నే
మంచు నుతింపవచ్చు మహిమాఢ్యము శ్రీరఘురామనామమున్.

ఉ. రామ, రమాభిరామ, రఘురామ, యశోధనరామ, జానకీ
రామ, పయోజమిత్రకులరంజనరామ, యయోధ్యరామ, సు
త్రామముఖాఖిలామరవితాననతాంఘ్రిసరోజరామ, శ్రీ
రామ, సదాశ్రితప్రకరరక్షకరామ, నమోనమోనమః.

ఉ. అప్పులుదీర వెన్నటికి; నప్పులుదీరక పుట్టుచావులుం
దప్పవు; పుట్టుచావులటు తప్పనిచోట విముక్తిగల్గ; దో
యొప్పులకుప్ప, ఓయినకులోద్వహ, ఓరఘురామచంద్ర, ఈ
యప్పులకుప్పనుండి యెట్టులైన ననుం దరిఁజేర్చి ప్రోవవే.

శా. ధూతప్రాక్కృతపాతకమ్ములు, జగత్పూతంబులుం మంగళ
వ్రాతమ్ముల్ భవదీయచారుచరణాబ్జాతమ్ము లాసించినా
నేతద్భూతమయాకృతిన్ విడిచి నేనంతేని ముక్తాకృతిన్
జేతఃప్రీతి వహింపఁజేయఁగదవే సీతామనోవల్లభా!

ఉ. భక్తజనావనాంకమును భానుకులాభరణంబ, యిట్టిచో
రిక్త మొనర్పఁ బోక ప్రసరింపఁగఁ జేయఁగదయ్య, హా సక్తిఁ గాం
సక్తిని నున్న నాపయిని జల్లని నీకనుదోయి వెంబడిన్
ప్రాక్తనకర్మపాక పరిపాకవిపాక విలోకలోకముల్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. భంగములం దగుల్కొను నవస్థయు, వక్రతనేగువారి దు
స్సంగతి నొందుదుస్థితియుఁ, జంచలజీవనయాత్రయుక్, సతం
బుం గలబుద్బుదాంగమును బోవిడి దివ్యరుచిప్రయుక్తము
క్తాంగము నొందఁజేయుము దయానిధి, రామ, రఘుప్రభూత్తమా!

౧౮

శా. అయ్యయ్యో! యొడలెల్లజల్లుమను నేలా? యిప్డు నాకేమిరా
నయ్యెన్? దిమ్మిరిపోవునట్లయగు నాయంగంబు; లాత్మక్ భయం
బయ్యెక్; రాఁగలముప్పు చొప్పెఱుఁగ రాదయ్యెక్; భయంబేల? నా
కియ్యబ్ధిక్ బడుకంటె గొప్పదగు ము ప్పేమున్న దూహించినన్.

చ. కువలయజీవితాంతకునిక్రూరకరాయతపాశభీతి నా
కవునను కొంట కట్టినమయమ్మనుగా దటువంటిచిహ్నలె
య్యవియునుఁదోఁప; క్రూరక భయంపడ నేమిటి? కింతకుక్ శుభం
బవునొకొ నన్నుదైవము దయామయదృష్టులఁ జూచె నేమొకో.

చ. కళలు తొలంగి రాహుపుముఖంబునఁ జిక్కి విముక్తమైన య
ష్టలఁతి యలంతిగా ధవళమై కనవచ్చు సుధాంశుబింబ మ
ట్లలతియలంతిగా ధవళమై కనవచ్చెడు నాదుమేను; ని
మ్మల ననుఁగూడ నీశ్వరుఁడు ముక్తి మొనర్చునె యిమ్మహోదధిన్?

మ. ధవళంబైన కొలందిఁ గంటికిసమస్తంబుక్ గడుక్ వింతగా
ధవళంబై కనవచ్చుఁ; జిత్తమిపు డేతత్సాగరంబన్న భీ
తి వడంబోక, సమత్వముం జెడక, శాంతింబొంది యుప్పొంగు; నిం
తవిశేషంబగునూతనత్వ మెటు లొందంజాలినానొకదా!

శా. హేయం బంటిని సాగరంబు; నిపుడెంతేనిక్ మనఃప్రీతి సు
శ్రేయంబుక్ శుభదాయకంబుననుచుం జింతింతు; నెందేనియుక్
శ్రేయోశ్రేయవిచారనిర్ణయము భాసింపంబడుక్ దా నవ
స్థాయత్తమ్మగు చిత్తవృత్తి కనుసార్యంబైన భావంబునన్.

శా. కల్లోలంబులు గాసరా వెచట, వైకల్యంబులే కార్తిలే
కుల్లం బూరటగాంచె, సాగరగతోద్యోగంబు లీలావిలా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సోల్లాసంబుగఁ దోఁచె, నార్తజనరక్షోపాయపారీణు సా
త్త్వల్లక్ష్మీశుకృపామహత్త్వమున ముక్తంబౌదు నత్యున్నతిన్.

౧౨

గీ. ధవళమయి నన్నుఁజుట్టె వింతయగునొక్క-దివ్యతేజంబు చక్రాకృతిని నదేమొ!
సాగరవిచారమునఁ గానఁజాలనైతి-నిమ్మహోత్కృష్టదర్శన మింతవఱకు.

మ. వలయుంబై ధవళాంబుజాభమయి దివ్యంబై మహోద్యత్ప్రభా
నిలయంబైనపవిత్రతేజ మిది దీనింగంటి, నాపుణ్యముల్
ఫలియించెన్, సమసెన్ సమస్తభవసంబంధానుబంధంబులున్
బొలిసెన్ బుద్బుదనర్తనమ్ము, లొలసెన్ ముక్తోన్నత శ్రీలహో.

క. ఎన్నఁగ ముక్తాస్ఫోటమ-హోన్నతపదవిని వహింప నొండొకగతి యుం
డ న్నేరదు సాగరగతి-కన్నను నెవ్వారికనుచుఁ గనుఁగొంటి నిటుల్.

క. అని మనమున ననుకొనినం-తనె తత్తేజంబునుండి "తథ్యము! తథ్య"
మ్మనుశబ్దారంభముతో-వినఁబడియెను నాకు నిట్లు విస్ఫుటఫణితిన్.

మ. పరమంబైనరహస్య మియ్యది గ్రహింపంగంటి వీభాగ్యమున్
దరు చెవ్వారికినైన నెశమును బొందన్ రాదుసూ! సాగరాం
తరకల్లోలములం దనామకగతిన్ నాశంబునుం బొందు నీ
సరివారిన్ మణిపూసవైతివి భవజ్జన్మంబు సామాన్యమే?

గీ. సాగరంబునఁ జొచ్చి లేశమ్ము నీవు-జీవనతరంగములయందుఁ జిక్కుకొనవు;
స్వాతి శుభజన్మనక్షత్ర మీతెఱంగు-నీకు ముక్తాకృతి ఘటించె నిక్కువంబు.

మ. కల వించేబహురత్నరాసులు, జగత్కల్యాణసంచారముల్
గలవిందే నినుఁబోలువారికిని ముక్తాస్ఫోటభాగ్యోన్నతుల్
గలవిందే, కలవానితో సుఖపడంగా లేక హేయంబుగాఁ
దలఁపం గూడదు సాగరమ్ము నిది సిద్ధాంతంబు ముమ్మాటికిన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భాషాసంప్రదాయములు

శ్రీ పరవస్తు వెంకటరామానుజస్వామిగారు, యం. ఏ.

## 1. 'ఇండో-యూరపియన్' భాషాకుటుంబనామములు

భాషలను ప్రకృతిప్రత్యయసామ్యమును బట్టి భాషాశాస్త్రజ్ఞులు కుటుంబములుగా విభజించియున్నారు. వానిలో సంస్కృతముతో సంబంధించిన కుటుంబమునకు 'ఇండో-యూరపియన్' (Indo-European) కుటుంబమనియు, 'ఇండో-జర్మానిక్'(Indo-Germanic) కుటుంబమనియును వ్యవహారము కలదు. ఈ కుటుంబములోని భాషలు చాలవరకు హిందూ దేశము లోను 'యూరప్' (Europe)



వ్యాసకర్త

ఖండములోను వ్యవహరింపబడుచుండుటవలన దీనికి 'ఇండో-యూరపియన్' భాషాకుటుంబమను వ్యవహారము సంభవించినది. మరియు నీకుటుంబములోనిభాషలలో నేదియును సంస్కృతము వ్యవహరింపబడుచుండిన హిందూదేశముకంటె దూర్పుగా లేదనియు,'జర్మానిక్' భాషవ్యవహరింపబడుచుండిన 'జర్మనీ' (Germany) దేశముకంటె పశ్చిమముగా లేదనియు దలంపబడుటచే నీకుటుంబమునకు 'ఇండో-జర్మానిక్' భాషాకుటుంబమనుపేరు వచ్చినది. కాని యిటీవల 'జర్మానిక్'భాష వ్యవహరింపబడినదేశముకంటె బశ్చిమముగానున్న దేశములలో వ్యవహరింపబడుచున్న 'కెల్టిక్' (Keltic) భాషకూడ నీకుటుంబములో జేరినదని తెలిసికొనుటచే నీకుటుంబమునకు బైనామముకంటె 'ఇండో-కెల్టిక్' (Indo-Keltic) భాషాకుటుంబ మనునామము యుక్తతరమైయున్నను భాషాశాస్త్రజ్ఞు లెవ్వరు నీనామమును వ్యవహరించియుండలేదు. 'ఆర్యన్' (Aryan) అను నామమునుకూడ గొందరు పూర్వమువాడియుండిరి కాని యిది ప్రస్తుత మీకుటుంబములో జేరిన యొకశాఖకు పేరుగా వ్యవహరింపబడుచున్నది.

## 2. 'ఇండో-యూరపియన్' కుటుంబశాఖలు

ఈకుటుంబములోచేరిన భాషలనన్నిటిని విమర్శించి వానికుండు సంబంధతారతమ్యమునుబట్టి వానినీక్రిందరీతి నెనిమిదిశాఖలుగా భాషాశాస్త్రజ్ఞులు విభాగము చేసియున్నారు.

1. ఆర్యన్ (Aryan)
2. ఆర్మీనియన్ (Armeniar.)
3. ఆల్బేనియన్ (Albanian)
4. బాల్టో-స్లావోనిక్ (Bolto-Slavonic)
5. గ్రీక్ లేక హెలనిక్ (Greek or Hellanic)
6. ఇటాలిక్ (Italic)
7. కెల్టిక్ (keltic)
8. జర్మానిక్ (Germanic)

వీనిలో మొదటినాలుగుశాఖలలోజేరిన భాషలకు 'సెతెమ్' (satem) భాషలనియు, చివర నాలుగు శాఖలలో జేరినవానికి 'కెంటుమ్' (Centum) భాషలనియు సంజ్ఞకలదు. 'లాటిన్' (Latin) భాష 'ఇటాలిక్' శాఖలో చేరియున్నది. 'గాథిక్' (Gothic).'హైజెర్మన్' (High German),'ఇంగ్లీష్' (English) అను నీమూడుభాషలును 'జర్మానిక్' శాఖలో జేరియున్నవి. ప్రాచీన 'ఇంగ్లీషు' భాషకు 'ఏంగ్లోసేక్సన్' (Anglo-Saxon) అనునామాంతరము కలదు. 'లిథుఏనియన్' (Lithuanian), 'స్లావోనిక్'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(Slavonic), 'రష్యన్' (Russian) అను భాషలు 'బాల్టో-స్లెవోనిక్' శాఖలో చేరియున్నవి. 'ఐరిష్' (Irish) భాష 'కెల్టిక్' శాఖలోనిదై యున్నది. 'అయో నిక్'(Ionic), 'యాటిక్'(Attic), 'డోరిక్'(Doric) అను మొదలగునవి 'గ్రీక్' భాషా భేదములు.

## 3. ఆర్యన్ శాఖ

పారసీక దేశపుభాషలును హిందూదేశములోని భాషలును (చూ. 4.) 'ఆర్యన్' శాఖలో జేరియున్నవి. పారసీక దేశపుభాషలకు 'ఐరేనియన్' (Iranian) భాష లని నామాంతరము కలదు. ప్రాచీనమగు 'ఐరేనియన్' భాష 'అవెస్తా' (Avesta) యనియు 'ప్రాచీనప ర్షియన్' అనియు రెండువిధములుగా నున్నది. పారసీ కులమతగ్రంథమగు 'అవెస్తా' (Avesta) లోనిభాషయ గుటవలన దానికి 'అవెస్తా' యనునామము కలిగెను. క్రీస్తుశకమునకు పూర్వము 500 సంవత్సరప్రాంతమున పారసీక దేశము నేలుచుండిన 'డెరయస్' (Darius) మొదలగు రాజులశాసనములలోని భాషను ప్రాచీన 'పెర్షి యన్' అనివ్యవహరింతురు. అటుతరువాతి కాలమున పార సీక దేశములో వ్యవహరింపబడుచుండిన భాషకు'పహ్లవి' (Pahlavi) యనిపేరు. 'ఆఫ్ఘన్' (Afghan) 'బెలూ చీ' (Beluchi) ఆధునిక 'పర్షియన్' మొదలగునవి ప్రస్తుతము వ్యవహారములోనున్న 'ఐరేనియన్' భాషలు

'ఐరేనియన్' భాషలలో ప్రాచీనతమమగు 'అవెస్తా' భాషకును, హిందూదేశపుభాషలలో ప్రాచీ నతమమగు వైదికసంస్కృతభాషలకును పరస్పరము మిగిలి నశాఖలతోనుండుసంబంధముకంటె నధికసంబంధ మగ పడుటచే పారసీక దేశపుభాషలును హిందూదేశములోని భాషలును నొకశాఖలో జేర్పబడినవి. 'అవెస్తా' భాష కును, సంస్కృతభాషకును,నుండు సంబంధ మిక్రిందను జూపబడినది.

'అవెస్తా' భాషలోని యేపదమునైనను దానివ ర్ణములలో స్వల్పమార్పును జేసి సంస్కృతపదములోనికి మార్చవచ్చును. ఈదిగువను 'అవెస్తా' లోనియొక మంత్ర ము వ్రాయబడియున్నది.

təm amavantəm yazatəm
surəm damohu səvistəm
mitrəm yazai zaotrabyo

దీనిని వర్ణములలో స్వల్పములగు మార్పులను జేసి యీ క్రిందివిధమున వైదిక భాషలోనికి మార్చవచ్చును.

"తం అవంతం యజతమ్
శూరం ధామసు శవిష్ఠమ్
మిత్రం యజై హోత్రాభ్యః"

ఇట్లు స్వరూపమునందే కాక మాతృభాషలోని వర్ణములమార్పునందును వ్యాకరణమునందును గూడ 'అవెస్తా' భాష విశేషముగా సంస్కృతమును బోలి యున్నది. మాతృభాషలోని e, o, అను రెండు వర్ణములును పాశ్చాత్యభాషలలో సామాన్యముగా మా ర్పును బొందక నిజస్వరూపములతో నుండగా సంస్కృ తమున మాత్రము అ (అ) కారములోనికి మారినవి.

'అవెస్తా' భాషలోకూడ సంస్కృతమునందువలెనే యీ రెండువర్ణములును అ (అ) కారములోనికి మారినవి

సం చ, అవె—ca, లాటిన్—que

సం. పంచ, అవె—panca, గ్రీక్—pente; లాటిన్—quinque

సం. అధాత్, అవె—dat, గ్రీక్—thesi

వై. అష్టా, అవె—asta, గ్రీక్—okto

సం. భరంతి, ప్రా. పర్షియన్—aparam, గ్రీక్—epheron

సం. అసుః, అవె—asus, గ్రీక్—okus

సం. దదాతి, అవె—dadaiti, గ్రీక్—didosi

మాతృభాషలోని యస్పష్టమైన అచ్చు(ə) మిగి లినభాషలలో అకారముగా నగపడుచున్నను 'అవెస్తా' భాషలో సంస్కృతములోవలెఇకారములోనికిమారినది.

సం. పితా, అవె—pita, గ్రీక్—pater, లాటిన్—pater

సం. మిత, అవె—mita, గ్రీక్—metron

సుబంతములలోకూడ 'అవెస్తా' భాషకును సం స్కృతమునకును విశేషసంబంధ మగపడు చున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంస్కృతమునందువలెనే యీ భాషయందుగూడ నెనిమిదివిభక్తులును, మూడువచనములును, మూడులింగములును గలవు. 'అవెస్తా' భాషలోని సుప్ప్రత్యయములును వానికి సంస్కృతప్రత్యయములతో సాదృశ్యమును తెలుపుటకు వాని ప్రక్కను సంస్కృతప్రత్యయములును నీక్రింద నీయబడినవి.

| ఏకవచనము | | బహువచనము | |
|---|---|---|---|
| అవెస్తా | సంస్కృతము | అవెస్తా | సంస్కృతము |
| 1. s | స్ | (as)-o-a | అస్ |
| 2. (a) m | (అ)మ్ | (ns-as)-o-a | న్స్-అస్ |
| 3. a | ఆ | bis | భిస్ |
| 4. e | ఏ | (byas)-byo | భ్యస్ |
| 5. (a) t | అత్ | (byas)-byo | భ్యస్ |
| 6. (as)-o-s | అస్,-స్, | am | ఆమ్ |
| (s)-he-hya | స్య | | |
| 7. i | ఇ | (su,)-hu | సు |
| 8. - | - | (as)-o,-a | అస్ |

అజంతశబ్దముల షష్ఠీబహువచనమున 'అవెస్తా' భాషలోగూడ నకార మగపడుచున్నది. 'అవె' yasnanam 'సంస్కృ' యజ్ఞానామ్, విభక్త్యర్థములు కూడ నీరెండుభాషలలోను జాలవరకు సమానముగానే యున్నవి.

'అవెస్తా' భాషలోగూడ విశేషణములు నామవాచకములవలె విభక్తిప్రత్యయములను గ్రహించును. తరబిమప్రత్యయము 'అవెస్తా' భాషలో tara, tama అను రూపములతోను, ఈయసీష్ఠన్ప్రత్యయములు yas, ista అను రూపములతోను ఉన్నవి.

సంఖ్యావాచకశబ్దములలో నీ రెండుభాషలకును నుండు సంబంధ మీక్రిందియుదాహరణములవలన స్పష్టపడగలదు.

| అవెస్తా | సంస్కృతము | అవెస్తా | సంస్కృతము |
|---|---|---|---|
| aeva | ఏక | fratəma / paorya | ప్రథమ / పూర్వ్య |
| dva | ద్వ | bitya | ద్వితీయ |
| thri | త్రి | thritya | తృతీయ |
| cathwar | చత్వార | turya | తుర్య |
| panca | పంచ | thuhda | పంచథ (వై) |
| hsvas | షష్ | hstva | షష్ఠ |
| hapta | సప్త | haptatha | సప్తథ (వై) |
| asta | అష్ట | astəma | అష్టమ |
| nava | నవ | nauma | నవమ |
| dasa | దశ | dasema | దశమ |
| visati | వింశతి | etc | |
| sata | శత | | |

సర్వనామములలోగూడ 'అవెస్తా' సంస్కృతభాషలు రెంటికిని విశేషసంబంధ మగపడుచున్నది.

| ఏకవచనము | | బహువచనము | |
|---|---|---|---|
| అవెస్తా | సంస్కృతము | అవెస్తా | సంస్కృతము |
| 1. azəm | అహమ్ | vaem | వయమ్ |
| 2. mam ma | మామ్ మా | ahma no | అస్మాన్ నః [నః |
| 4. mavya me | మహ్యం మే | ahmabya no | అస్మభ్యం |
| 5. mat | మత్ | ahmat | అస్మత్ [నః |
| 6. mama me | మమ మే | ahmakam no | అస్మాకం |
| 1. tum tu | త్వం | yuzəm | యూయమ్ |
| 2. twam, twa | త్వామ్ త్వా | vo | వః |
| 3. twa | త్వా (వై) | | [భ్యం వః |
| 4. tabya te | తుభ్యమ్ తె | yusmaoyo, vo | యుష్మ |
| 5. twat | త్వత్ | yusmat | యుష్మత్ |
| 6. tava te | తవ తె | yusmakam, vo | యుష్మా [కం వః |

ఇట్టిసన్నిహితసంబంధమే మిగిలిన సర్వనామశబ్దములలోగూడ నగపడుచున్నది. ఇక తిజంతశబ్దములలో సంబంధము నిరూపించబడును. రెండుభాషలలోని కొన్ని తిఙ్ప్రత్యయము లీక్రింద నీయబడినవి.

| ఏకవచనము | | బహువచనము | |
|---|---|---|---|
| అవెస్తా | సంస్కృతము | అవెస్తా | సంస్కృతము |
| 1. mi-m | మి | mahi-ma | మస్-మ |
| 2. hi-s | సి-స్ | tha-ta | థ-త |
| 3 ti-t | తి-త్ | nti-n | న్తి-న్ |
| di | | ta | త |
| 3. -tu | -తు | ntu | న్తు |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్లే మిగిలినప్రత్యయములలోగూడ నీరెండుభాషలకును విశేషసంబంధ మగపడుచున్నది. సంస్కృతములోని లకారములన్నియును 'అవెస్తా' భాషలోగూడ నగపడుచున్నది. వేదములోమాత్ర మగపడుచున్న లేట్టు కూడ గలదు. లకారార్థములుకూడ రెండుభాషలలోను సమానముగానే యుండును. సాదృశ్యమును జూపుటకు, గొన్ని తిఙంతరూపము లీక్రింద నుదాహరింపబడినవి.

| అవెస్తా | సంస్కృతము | అవెస్తా | సంస్కృతము |
|---|---|---|---|
| dadami | దదామి | dadarsa | దదర్శ |
| kərnaomi | కృణోమి(వై) | dadara | దధార |
| frinami | ప్రీణామి | dat,dama | అధాత్, అధామ |
| barois | భరేః | zizanat | అజీజనత్ |
| barant | భరంత్ | masta | అమంస్త |
| fravahsya | ప్రవక్ష్యామి | raocayeti | రోచయతి |
| busyant | భవిష్యంత్ | nəmahyati | నమస్యతె |
| maryate | మ్రియతే | zaozaoti | జోహవీతి |

పైయుదాహరణములనుబట్టి 'అవెస్తా' భాషలో గూడ, కర్మణిప్రయోగము ణిజంతములు, యఙంతములు నామధాతువులు మొదలగునవి యున్నవని స్పష్టపడుచున్నది. కృత్ప్రత్యయములలోగూడ 'అవెస్తా' భాష సంస్కృతమును విశేషముగా బోలియున్నది

'అవె'- ta త.ఉ. uhta–ఉక్త, raodita–రుదిత
'అవె'-ya య ఉ. patiricya–ప్రతిరిచ్య

తుమున్నర్థమున వేదమునందువలె 'అవెస్తా' భాషలోగూడ ననేకప్రత్యయములు గలవు.

| | | | |
|---|---|---|---|
| 'అవె' dərədyai | 'వై'-ధ్యై | ఉ. | పిబధ్యై |
| 'అవె' kərətəe | 'వై'-త్యై | ,, | ఇత్యై |
| 'అవె' avamhe | 'వై'-అసె | ,, | చక్షసె |
| 'అవె' vidvanoi | 'వె'-మనె వనె | ,, | విద్మనె |

ఇంత యత్యంతసంబంధము 'ఇండో-యూరపియన్' శాఖలలో దేనికిని గనబడుటలేదు. ఆకారణము వలన భిన్నదేశములలో వ్యవహరింపబడుచున్నను 'అవెస్తా' మొదలగు 'ఐరేనియన్' భాషలును, సంస్కృతము మొదలగు హిందూదేశములోని భాషలు నొకశాఖలో జేర్పబడినవి. నాలుగువేలసంవత్సరములకుబూర్వ మీ రెండుభాషలును నేకభాషగా నుండినవని భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము.

## 4. హిందూదేశపుభాషలు - వైదికసంస్కృత ప్రాకృతభాషలకుండు పరస్పరసంబంధము.

హిందూదేశములోని భాషలలో వైదికభాష ప్రాచీనతమమైయున్నది. ఋగ్వేదాదివైదికగ్రంథములలోమాత్రమే యగపడుటచే దీనికీనామము కలిగినది. ఇది 3500 సంవత్సరములకుపూర్వము 'పంజాబ్' (The Punjab) దేశములో వ్యవహరింపబడుచుండెడిది. తరువాత ననగా 2500 సంవత్సరములకుబూర్వము సంస్కృతభాష వ్యవహారములోనికి వచ్చినది. ఋగ్వేదరచనాకాలమున 'పంజాబ్' దేశమునకు దూర్పుగానుండు దేశములో వ్యవహరింపబడుచుండిన వైదికభిన్నమగు మరియొకభాష నుండి యీ సంస్కృతభాష జన్మించినదని ముందు తెలుపబడును. బౌద్ధమతగ్రంథములలోని పాళీభాషయును, సంస్కృతనాటకములలోని ప్రాకృతభాషలును, సుమారు 2000 సంవత్సరములకుక్రిందను సంస్కృతభాషకు ప్రకృతియగుభాషనుండి పుట్టినట్లు తెలియుచున్నది. ప్రాకృతభాషలలో కొన్ని వైదికభాషనుండికూడ బుట్టియున్నవి. మహారాష్ట్రి, శౌరసేని, మాగధి, పైశాచి, అపభ్రంశము మున్నగునవి ప్రాకృతభాషాభేదములు. తత్తద్దేశవ్యవహారమువలన నాయాభాషల కాయాపేర్లు వచ్చియుండవచ్చును. ఈప్రాకృతభాషలలోనుండియే యిప్పు డుత్తరహిందూస్థానములో వ్యవహరింపబడుచున్న హిందీ, మరాటి, బెంగాలీ, పంజాబీ, గుజరాతీ, సింధీ, ఓఢ్రము మొదలగుభాషలు జన్మించినవి. ఇవి పుట్టి సుమారు 1000 సంవత్సరములై యుండవచ్చును.

సంస్కృతభాష వైదికభాషాజన్యమని భాషాశాస్త్రజ్ఞులు పూర్వము తలంచుచుండిరి. ఇటీవల ఈయభిప్రాయము సరియైనది కాదనియు, సంస్కృతభాష వైదికయుగమున వ్యవహరింపబడుచుండిన వైదికభాషాభిన్నమగు భాషాంతరమునుండి జన్మించినదనియు క్రిందికారణములచే వారు తలంపనారంభించిరి. ఋగ్వేదభాషయందు లకార మతిస్వల్పపదములలో నగపడు

చున్నది. అదిదైనను నవీనభాగములలోనే యగపడు చున్నది. సంస్కృతభాషయందలి లకారయుక్తపద ములు ఋగ్వేదమున నున్నయెడల నవి రేఫయుక్తముగా నుండును. సంస్కృతభాషయందు రేఫలకారములు రెండును సమానముగా వ్యవహరింపబడుచున్నవి. బ్రాహ్మ ణముల భాషలోకూడ సంస్కృతభాషయందువలెనే రెండువర్ణములును నగపడుచున్నవి. ప్రాకృతభాషలలో నెల్ల దూర్పుదగు మాగధీభాషలో రేఫము లేనే లేదు. 'పంజాబ్' దేశమునకు పశ్చిమముగానుండు పారసీకదేశ ములలో వ్యవహరింపబడుచున్న 'ఐరేనియన్' భాషలలో రేఫమేగాని లకార మగపడుట లేదు. కాబట్టి మనదే శములో ప్రాచీనకాలమున బశ్చిమమున లకారములేని భాషలును, దూర్పున రేఫములేనిభాషలును వ్యవహార ములోనుండినట్లు తోచుచున్నది. బ్రాహ్మణములు రచి యింపబడిన మధ్యదేశపుభాషలోమాత్రము రెండువర్ణ ములును వ్యవహరింపబడు చుండినవి. అనగా పూర్వకా లమున నుత్తరహిందూస్థానములో మూడుభాషలు వ్యవ హరింపబడుచుండిన ట్లూహింపవలసియున్నది. వానికి విశేషభేదము లేకపోయినను రేఫలకారములప్రయోగ మనమాత్రము భేదముండినట్లు స్పష్టముగా చెప్పవచ్చును. పశ్చిమభాగమున రేఫయుక్తభాషయు, దూర్పుభాగమున లకారయుక్తభాషయు,నీరెండింటికిని మధ్యదేశమున రేఫ లకారయుక్తభాషయు, వ్యవహరింపబడుచుండినవి. ఇవి యన్నియును వ్యావహారికభాషలు; వీనిలో పశ్చి మభాషనుండి వైదికభాషయు, మధ్యదేశపుభాషనుండి సంస్కృతభాషయు, దూర్పుభాషనుండి మాగధీప్రాకృ తమును నేర్పడినవి. కాగా సంస్కృతభాష వైదికభాష నుండి యుత్పన్నమైనదికాదనియు, నాకాలమున వైదిక భాష వ్యవహరింపబడుదేశమునకు దూర్పుగానుండుమధ్య దేశమున వ్యవహరింపబడుచుండిన మరియొకభాషనుండి పుట్టినదనియు తెలియవచ్చుచున్నది. వైదికభాషలో నగపడులకారయుక్తముసుపదములు మధ్యదేశభాషనుండి గ్రహింపబడినవనియు నూహించునది.

వైదిక సంస్కృతభాషల పరస్పర సంబంధ మీ క్రింది విధమున సూచింపవచ్చును:




ఇకను సంస్కృతప్రాకృతభాషల సంబంధమును గురించి కొంచెము చర్చింపవలసియున్నది. ప్రాకృత వ్యాకరణకర్తలందరును బ్రాకృతభాషలకు సంస్కృతము సాక్షాత్తుగాగాని, పరంపరగాగాని ప్రకృతియని చెప్పి యున్నారు.

'ప్రకృతిః సంస్కృతం తత్ర భవం ప్రాకృతముచ్యతే,
శేషంతు సంస్కృతాత్ స్యాత్ .........'

వీరు సంస్కృతపదములను దీసికొని వానినుండి తత్సమానార్థకములగు ప్రాకృతపదములను, వర్ణాదేశవర్ణ లోపవర్ణాగమములను బోధించి సిద్ధింపజేయుదురు. అట్లు చేయుటకు సరిపడనపుడు ప్రాకృతపదములను సంస్కృత పదముల కాదేశములుగా బోధించెదరు.

'ఉదితుు వృశ్చికయోః, లుగరణ్యే,
యష్ట్యాంలః, వస్తస్యహిత్థలద్వౌ.'

తత్సమములనియు దద్భవములనియు దేశ్యము లనియు బ్రాకృతపదములను మూడువిధములుగా విభ జించియున్నారు.

'తద్భవం తత్సమం చేతి ద్వేధా దేశ్యం చ కేచన.'

వీనిలో మొదటిజాతిపదములకే వ్యాకరణములలో లక్షణము వ్రాయబడియుండును. ఆదేశములన్నియు సామాన్యముగా దేశ్యములలో జేరును.

ఇట్లుప్రాకృతపదముల నన్నిటిని సంస్కృతము నుండి సాధించుటకు వ్యాకరణకర్తలు ప్రయత్నించినను గొన్నిప్రాకృతరూపములు మాత్రము సంస్కృతజన్య ములు కావని మనము నిశ్చయముగా జెప్పగలము. వీనిలో కొన్ని వైదికభాషతో సంబంధించియున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాకృ. ఖంభ, వైది. స్కంభ, సంస్కృ. స్తంభ.
ప్రాకృ. పుత్తాహో, వైది. పుత్రాసః, సంస్కృ. పుత్రా.
ప్రాకృ. పుత్తేహి, వైది. పుత్రేభిః, సంస్కృ. పుత్రైః.
ప్రాకృ. ఏత్థ, వైది. ఇత్థా, సంస్కృ. అత్ర.

మీది యుదాహరణములలో ప్రాకృతపదములు సంస్కృతపదములనుండి పుట్టినవనుటకంటె వైదికపదములనుండి పుట్టినవనుట హెచ్చుసందర్భముగా నుండును. మరియు గొన్ని వైదికభాషాసంప్రదాయములు ప్రాకృతభాషలలో గనబడుచున్నవి. సంస్కృతమున పదములకు సంధి నిత్యమైయుండగా ప్రాకృతభాషలలో వైదికభాషయందువలె సంధి వైకల్పికముగా నున్నది. అజ్మధ్యస్థడకారము ప్రాకృతభాషలో వేదమునందువలె లకారముగా మారుచుండును.

'డస్యలఃస్యాత్.'

మరియు పైశాచీ మొదలగు కొన్నిప్రాకృతభాషలలో లకార మగపడుటలేదు. కృధాతువునకు ప్రాకృతములలో 'కుణఇ' అను మొదలగు రూపములు గలవు. ఇవి సంస్కృతములోని 'కరోతి' అను మొదలగు రూపములకంటె వేదములోని 'కృణోతి' అను మొదలగు రూపములను సంబంధించియున్నదనుట సమంజసము. ప్రాకృతభాషలలోని తుమున్నర్థకములగు "తవే తయే తవీ" అనుప్రత్యయములు వైదికభాషలోని 'తవే తవై తయే' అను తుమున్నర్థకప్రత్యయములతో సంబంధించియున్నట్లు స్పష్టముగా తెలియుచున్నది. మరియు ప్రాకృతభాషలలోని క్త్వాప్రత్యయార్థకములగు 'త్వాన, తూన, తూణం, (దూణం, ఊణం)' అనుప్రత్యయములు సంస్కృతములోని 'త్వా' అనుప్రత్యయముకంటె వేదములోని 'త్వానమ్' (త్వనమ్?) అనుప్రత్యయముతో సంబంధించియున్నవనుట యుక్తము. కాబట్టి ప్రాకృతభాషలలో వైదికభాషాజన్యమగు కొంతభాగ మున్నదని యంగీకరింపవలసియున్నది.

ఇంతియేకాక ప్రాకృతభాషలలో సంస్కృతవైదికభాషావిలక్షణమగు మరికొన్నిరూపములు గలవు. అనేకప్రాకృతభాషలలో ఌకారశవర్ణములు లేవు. మాగధీభాషయందు రేఫ మగపడుట లేదని యీవరకే వ్రాయబడినది. మహారాష్ట్రీ మొదలగు కొన్నిప్రాకృతభాషలలో ప్రథమైకవచనము ఓదంతముగా నుండ మాగధ్యాది మరికొన్ని భాషలలో మాత్రము ఏ ముగా నుండును. మాగధీభాషలో క్త్వాప్రత్యయార్థ 'దాణి' అనుప్రత్యయ మగపడుచున్నది. శౌరసే భాషలో 'ఇఅ' అనుప్రత్యయ మీయర్థమునసే హరింపబడియున్నది.

ఇట్లు ప్రాకృతభాషలలో వైదికభాషారూప లును, సంస్కృతభాషారూపములును, తదుభయవిలక్ష మగురూపములును కనబడుచుండుటచే నవి కేవల స్కృతజన్యములనికాని వైదికభాషాజన్యములనికాని పుట సరికాదు. వైదికసంస్కృతభాషలు గ్రాంథి భాషలగుటచే వానిలో కొంతసంస్కార ముండకతీరదు. ఆయాకాలముల వ్యావహారికభాషలలో వీనిలో నగప నిరూపాంతరములు వ్యవహారమున నుండును. మను వ్యవహారములో నున్న భాషను నియమబద్ధముగాచేయ యసాధ్యము. ఆహేతువుచే వైదికసంస్కృతభాషాజ ములగు భాషలలోని రూపభేదములు ప్రాకృతభా లలో గనబడుచుండవచ్చును. మరియు వైదికసంస్కృ యుగములలో నాభాషలేకాక మరికొన్నిస్వల్పభే ములుగల భాషాంతరములు వ్యవహారములో నుండవల నని పైన సంస్కృతవైదికభాషాసంబంధనిరూపణా రమున జెప్పబడినది. ఆభాషలలోని రూపములుగూ ప్రాకృతభాషలలో గనబడవచ్చును. మరియు నీభాష లను మాటలాడువారికి విశేషసంబంధముండుటచే భా సాంకర్యముగూడ గలిగియుండవచ్చును. సాంకర్య ప్రాకృతభాషలలోగూడ గనబడుచున్నది. శౌరసేనీభా షలో తుమున్నంతములు మిగిలినభాషలలోవలె స స్కృతవైదికభాషారూపజన్యములై యుండగా క్త్వాప్ర త్యయముమాత్రము తదుభయభిన్నముగా 'ఇఅ' అ రూపముతో నున్నది. అజ్మధ్యమగు హల్లులు ప్రాకృ భాషలలో సామాన్యముగా లోపించుచుండగా శౌ సేనీభాషలో తకారముమాత్రము లోపింపక దకా ముగా నుచ్చరింపబడును. మరియు శౌరసేనీభాష 'దఘౌ దబవదుచ్చాయతాః'స్థాధాతువు మహారాష్ట్రీయ దువలె ఠాదేశమును పొందక మాగధీభాషాసంప్రదా యానుసారముగా 'చిట్ఠ' యను ఆదేశమును బొందును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాబట్టి ప్రాకృతభాషలయుత్పత్తినిగురించి యీ క్రిందివిధమున నూహచేయవలసియున్నది. ప్రాకృతభాషలు వైదికభాషాజన్యములుగాని,సంస్కృతభాషాజన్యములుగాని కానేరవు. ఈరెండును గ్రాంథికభాషలు. సంస్కృతభాష వైయాకరణుల సంస్కారమును గూడ బొందినది. ఇవి వీనికిమూలములగువ్యావహారికభాషలనుండియు వానికాలమున వ్యవహారములోనుండినభాషాంతరములనుండియు జన్మించినవి. అవి వ్యావహారికభాషలగుటచే వానిలో రూపబాహుళ్యమును, రూపసాంకర్యమును నుండును. అవి ప్రాకృతభాషలలోగూడ గనబడుచున్నవి. సంస్కృతవైయాకరణులవలె ప్రాకృతవైయాకరణులు భాషలను సంస్కరింపకుండుటచే నీరూపబాహుళ్యము కనబడుచున్నది. ప్రాకృతవాఙ్మయరచన ప్రాకృతభాషలు వ్యవహరింపబడుచున్న కాలముననే ప్రారంభముగుటచే నీరూపభేదములన్నియు వాఙ్మయములోగూడ ప్రవేశించినవి. ఆకారణమువలన వైయాకరణులకు సంస్కారము సాధ్యమైనది కాదు. సంస్కృతవాఙ్మయప్రారంభమునకు బూర్వమే సంస్కృతవ్యాకరణము వ్రాయబడుటచే నాభాషకు సంస్కారము సాధ్యమైనది. ప్రాకృతవ్యాకరణములలో ననేకములు ప్రాకృతభాషలు వ్యవహారమునుండి నశించినతరువాతనుగూడ వ్రాయబడినవి.

## ౫. వ్యాకరణసామ్యకృతభాషావిభాగము

పైని చెప్పిన వంశవిభాగము కాక భాషలకు మరియొకవిభాగము కలదు. వంశవిభాగము పదముల సామ్యము ననుసరించి చేయబడినది. వ్యాకరణసామ్యమునుబట్టిగూడ భాషలను విభాగముచేయవచ్చును. భాష వాక్యరూపమున నుండునుగదా! ఒకవాక్యమును అనేకపదములలోనికి విభాగము చేయవచ్చును. పదమునకు బదాంతరములతో నుండుసంబంధమును బ్రత్యేకపదములచేతనుగాని ప్రత్యయములచేతనుగాని తెలియజేయవచ్చును. ప్రత్యయములతో దెలియజేయుభాషలలో ప్రకృతిప్రత్యయములు చేరుసందర్భమున వానిలో వర్ణవిపరిణామములు కలుగకుండుటగాని, కలుగుటగాని సంభవింపవచ్చును. ఇట్లు విశేషార్థములను తెలియజేయురీతులనుబట్టి భాషలు మూడువిభాగము లగుచున్నవి. వీనినే వ్యాకరణసామ్యమునుబట్టి యేర్పడినవిభాగములని చెప్పెదరు.

1. ప్రత్యయరహితభాషలు.—వీనిలో ప్రత్యయము లుండవు కావున బదములన్నియు ధాతురూపముగానే యుండును. పదములకుండు పరస్పరసంబంధము ప్రత్యేకపదములవలనగాని వాక్యములో పదముల స్థానమునుబట్టిగాని తెలిసికొనవలసియుండును. చీనాభాష యీరీతిగానే యున్నది.

2. స్పష్టప్రత్యయ భాషలు.—వీని యందు బ్రత్యయము లుండును. ఏపదమునందైనను ప్రకృతిప్రత్యయములురెండును వర్ణవిపరిణామములను బొంది తమస్వరూపములను గోలుపోక స్థిరముగా నుండును. ప్రకృతిప్రత్యయములు మార్పునొందకుండుటచే నీభాషలలో బ్రకృతిప్రత్యయవిభాగము సుకరముగా నుండును. తెలుగుమొదలగు 'ద్రావిడ'(Dravadian) భాషలును, 'టర్కిషు (Turkish) భాషయును నీవిభాగములో జేరినవి.

3. అస్పష్టప్రత్యయభాషలు.—వీనిలో బ్రకృతిప్రత్యయమేళనావసరమున కలుగు వర్ణపరిణామములవలన వాని స్వరూపములనుబోల్చుట కష్టముగానుండును. ఆకారణమున బ్రకృతిప్రత్యయవిభాగము దుష్కరముగా నుండును. సంస్కృతము మొదలగు 'ఇండోయూరపియన్' భాషలును, 'హీబ్రు' (Hebrew), 'ఫినీషియన్' (Phoenician), 'అరబిక్' (Arabic) మొదలగు 'సెమిటిక్' (Semitic) భాషలును, నీకక్ష్యలో జేరియున్నవి. ఈవిభాగములోను పైరెండవదానిలోనుజేరిన భాషలలో ధాతువులు స్వతంత్రముగా వాక్యములో బ్రయోగార్హములుగా నుండవు. ప్రత్యయవిశిష్టములైయే ప్రయోగింపబడుచుండును.

ఈమూడవస్థలకును బరస్పరసంబంధము కలదనియు, బ్రథమమున నేభాషయైనను ప్రత్యయరహితముగా నుండి దానిలోని సంబంధబోధకపదములు వర్ణలోపములనుబొంది ప్రత్యేకప్రయోగానర్హములగు ప్రత్యయములలోనికి మారుటచే స్పష్టప్రత్యయవిశిష్టభాషలోనికి మారుననియు, తిరుగ గాలక్రమమున వర్ణవిపరిణామములనుబొంది యాభాషయే అస్పష్టప్రత్యయభాషయగు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననియు గొందరు భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. వారియూహ ననుసరించి పైవిభాగములు భాషావిపరిణామావస్థలుకూడ నగును. కాని యిట్లు తలంచుటకు గొన్ని యాక్షేపములు మాత్రము గలవు. భాషలలో పైని వర్ణించినమార్పు ఊహకు సరిపడియున్నదికాని యనుభవమునకు మాత్రము విరుద్ధముగా నున్నది. ప్రత్యయవిశిష్టమైన భాషలలో నాప్రత్యయములకు నవీనముగా నేవిధమైనమార్పును గలుగుట మన మెరిగియుండలేదు. ప్రత్యయవిశిష్టభాషలను బరీక్షించినచో వాని ప్రాచీనావస్థలలో గూడ నవి ప్రత్యయవిశిష్టములుగానే యున్నట్లు తెలియుచున్నది. కాని ప్రత్యయరహితముగా నున్నట్లు కనబడుటలేదు. మరియు ప్రపంచమునందలి ప్రాచీనభాషలలో నొకటగు చీనాభాష యిప్పటివరకును బ్రత్యయరహితముగానే యున్నదికాని దానిలో నొకపదమైనను బ్రత్యయముగా మారినట్లు కనబడదు. అంతకన్నను చాల నవీనములగు 'ఇంగ్లీషు' మొదలగు మరికొన్ని భాషలస్పష్టప్రత్యయావస్థలో నున్నవి.

## 6. వంశవిభాగము.

వ్యాకరణసామ్యమునుబట్టి యేర్పడినవిభాగములలో జేరినభాషలకు నొక్కవ్యాకరణసామ్యము తప్ప మరియేవిధమైన పరస్పరసంబంధమును నున్నదని చెప్పుటకు వీలులేదు. వంశవిభాగమున నొకభాగములో జేరిన భాషలకు బరస్పరము జన్యజనకభావసంబంధముకాని, సమానభాషాజన్యత్వ సంబంధముకాని యుండును. ఆ కారణముచేతనే దీనికి వంశవిభాగమనునామ మీయబడినది. వంశవిభాగము భాషలలో ధాతువులయందును బ్రత్యయములయందును నగపడుపరస్పరసంబంధమును బురస్కరించుకొని యేర్పడునని యిదివరకే చెప్పబడినది. (1)ఇట్లు పదములనుబట్టి భాషలకు సంబంధమును నిర్ణయించుటలో నాయాభాషలకు స్వతఃసిద్ధములగు పదములను మనము పరిశీలింపవలయునుగాని భాషాంతరములనుండి స్వీకరింపబడిన పదములనుబట్టి నిర్ణయించుటకు వీలులేదు. కాని యొకభాషలో దానికి స్వతఃసిద్ధములైన పదము లేవో, భాషాంతరములనుండి స్వీకరింపబడినపదములేవో నిర్ణయించుట చాల కష్టము. వ్యాకరణసామ్యమును బట్టి భాషలను విభాగముచేయుటలో నిట్టికష్టములేదు. ఒకభాష మరియొకభాషనుండి పదముల నెన్నిటినైనను గ్రహించును గాని వ్యాకరణమును ననగా విశేషార్థబోధకరీతిని మాత్రము గ్రహింపదు. ఈ విషయ మనుభవసిద్ధము. మనము తెలుగుభాషలో 'ఇంగ్లీషు' మొదలగు భాషాంతరములలోని పదముల నెన్నిటినో యుపయోగించుచున్నాముగాని వానిలోని యే ప్రత్యయమును గాని యుపసర్గనుగాని, వాడుట లేదు గదా! కాబట్టి పదములను విమర్శించుటలో నాయా భాషలకు స్వతఃసిద్ధములని మనకు నిశ్చయముగా తెలియు పదములనే పరిశీలింపవలయును. ఏపదములు ప్రతిభాషకును స్వతఃసిద్ధములుగానుండునో యనగా నేపదములు భాషాంతరములనుండి స్వీకరించుట కవసరముకలుగదో యట్టిపదములలో సామ్యమునుబట్టి భాషలకు సంబంధమును మనము నిర్ణయింపవలయును. సామాన్యముగా ఈ క్రిందిజాతులపదములు భాషలకు స్వతఃసిద్ధములుగా నుండును.

1. సర్వనామములు.
2. మొదటిమూడునాలుగు సంఖ్యావాచకపదములు.
3. తల్లి, తండ్రి, అన్న, తమ్ముడు, అక్క, చెల్లెలు, మొదలగు సంబంధవాచకపదములు.
4. తరచుగా బ్రతిదేశమునను నగపడువస్తువుల యొక్కయు, జంతువులయొక్కయు, పక్షుల యొక్కయు పేర్లు.

పైజాతిపదములలో సామ్య మగపడినచో నట్టి భాషలకు బరస్పరసంబంధము కలదనియు, నవి యొక వంశములో జేరినవనియు, మనము సామాన్యముగా నిర్ణయింపవచ్చును. కాని పైజాతులలో జేరినపదములు మాత్రము భాషాంతరములనుండి స్వీకరింపబడవనునిశ్చయము లేదు. కాబట్టి కేవలమిట్లుపదముల సామ్యమును బట్టి భాషలకు సంబంధమును నిర్ణయించుట సరికాదు. పదములలో సామ్యముండుటయేకాక వ్యాకరణసామ్యముకూడ నున్నచో నట్టిభాషలకు సంబంధముకలదని నిశ్చయముగా జెప్పవచ్చును. కేవలపదసామ్యము భాషలకు సంబంధమును నిర్ణయింపజాలదు. వ్యాకరణసామ్యముకూడ నుండవలయును. పదసామ్యము భాషలకు సంబంధసూచకమనియు, వ్యాకరణసామ్యము నిర్ణాయకమనియు చెప్పవచ్చును. రెండును కనబడినపుడే భాషలకు సంబంధమేర్పడును. అప్పుడే ఆభాషలొకకుటుంబములో జేరినవని నిశ్చయముగా జెప్పగలుగుదుము. [సశేషము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# కర్ణప్రశంస

తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు



వ్యాసకర్త

దీక్షఁ బాండవ ధార్తరాష్ట్రులకు సంధిప్రక్రియోద్యోగ సం
రతుం జేయఁదలంచి కౌరవసభారంగంబున స్నీతివా
గ్దక్షత్వంబును జూపి కృష్ణుఁడు స్వకృత్యంబెల్ల వమ్మైన స
ర్వాక్షీణంబు నిజంబు మాకనుచు దుర్వారోద్ధతిం బల్కుచున్.

చ. అరదము నెక్కి పోవుసమయంబున నంబుజనాభు వెంట సు
స్థిరతరభక్తిఁ గుంభజనదీసుతముఖ్యులురా, ముకుందుఁ డా
దరమున వారల న్నిలిపి ధన్యునిఁ గర్ణునిఁ జీరి తేరిపై
సరసను నిల్పి యిట్లనెఁ బ్రసన్నవచోవిభవాభిరాముఁడై.

"శా. కర్ణా! నీ వఖిలార్థవేదివని పల్కంజెల్లదే? యైన నా
కర్ణింపందగు నావచించునుడు లర్కప్రాపితోద్యద్వరో
దీర్ణత్వంబున నీవు పుట్టితివి కుంతీకన్యకుం దొల్లి సం
పూర్ణప్రేమను సూతదంపతులు నిన్ బోషించి రూహించఁగన్.

క. ఆకారణమున నిన్నీలోకులు సూతుండటంచు లోఁదలఁతురు సు
శ్లోకుఁడగు పాండవేయున కీకరణిన్ నీచనామ మేటికిఁ జెపుమా!

శా. దుష్టాగ్రేసరు ధార్తరాష్ట్రు నిటులెంతో భక్తిసేవించి నీ
శిష్టత్వంబునకుం గళంక మిడి వాసిం బాసి తత్సత్కృపా
దృష్టిం గోరుచుఁ గాచియుండిన జగద్విఖ్యాత యుష్మద్యశో
నష్టం బబ్బుఁగదయ్య! యిట్లయినఁ గర్ణా! నీమదిం జూడుమా!

శా. రాజద్భారతసార్వభౌమపదవీ రమ్యుండవై సర్వభూ
రాజస్తోమకిరీట సంఘటిత సద్రత్నప్రభాపుంజ వి
భ్రాజత్పాదపయోజవైభవ పరిప్రాప్తుండవై యుండు న
ట్లేఁ జేయించెద నీదుసోదరులచే నేతెమ్ము నిశ్శంకతోన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. తమ్ములఁ గూడి యెంతయు ముదమ్మున భారతసార్వభౌమపీ
ఠమ్ము నలంకరించి వికటమ్మున ధర్మసుతుండు చామరం
బిమ్ముగవీవ వాయుసుతుఁ డెల్లిని బట్టఁ గిరీటిసారథి
త్వ మ్మొనరింపఁ గుజ్జి లిరువంకలఁ గొల్వ వెలుంగు టొప్పదే ?

సీ. అఖిలలక్షణలక్షితాంగి పాంచాలి నిన్నాఱవభర్తగా నభిమతించు
నిన్నుఁగన్న తల్లి కుంతీదేవి దీనికై యెంతేని మదిలోన సంతసించు
నిఖిల బాంధవమిత్రనివహంబు నీరాకకనితరానందంబు ననుభవించు
లోకైక శౌర్యు లస్తోకసద్గుణధుర్యు లగుపాండవేయు లాహా! యఁటంచు
రిందులకు డెంనమందున సందియంబుఁ-జెందఁ బనిలేదు రాజ్యలక్ష్మీకరాబ్జ
సంగ్రహం బొనరించి శశ్వద్విభూతి-నతులవిఖ్యాతి గాంచుమయ్యా, సునీతి."

మ. అనినం గర్ణుఁడు కృష్ణుఁ గాంచి వినయవ్యాపార మేపార ని
ట్లను, హంసేంద్రగురూపదిష్టమను సంప్రాప్తాంబుజాప్త ప్రసా
దనిదానంబునఁ గుంతి నన్గనినవృత్తాంతంబు నొక్కింత నే
మును విన్నాఁడ ససంశయంబిది జగన్మోహప్రదా! మాధవా.

శా. కన్యాత్వంబున కంతరాయ మకటా కల్గెంగదాయంచు సా
జన్యశ్రీనిధి కుంతి చింతిలి నిరాశావృత్తి న న్నేటిలో
నన్యాయంబనుచుం దలంపక ప్రవాహంబందు వైచెం జగ
న్మాన్యుం డత్తఱిఁ దెచ్చి సూతుఁ డనుకంపాయత్త చిత్తంబునన్.

క. అల్లారుముద్దుగాఁ దన-యిల్లాలును దానుఁ బుత్త్రుఁ డీతం డనినన్
జల్లఁగఁ బెంచిరి మేనులఁ-బెల్లుగ మలమూత్రరాశి పెనఁగొనుచుండన్.

శా. కుంతీపుత్త్రుఁడ క్షత్త్రియాన్వయుఁడ నాకు న్మీకు సంబంధ మా
వంతైనంగలదా? యటంచు నను బాల్యంబాదిగాఁ బెంచి య
త్యంతప్రేమముఁ జూపువారినిపు డన్యాయంబుగా వీడి ని
శ్చింతన్ బాండవులందుఁ జేరిన జనుల్ "ఛీ"యంచు నిందింపరే?

శా. బద్ధప్రేమ నితండు సూతుఁ డనుచుం బాటింప కత్యంతసం
శుద్ధస్వాంతతఁ జేరఁదీసి ధరణీశుం జేసి దుర్యోధనుం
డిద్ధత్వం బొనఁగూర్చి నన్ను సతతంబేలంగ, యుద్ధంబు సం
సిద్ధంబైన, విశుద్ధబుద్ధి నిపు డిప్డీ! వీడినం బాడియే ?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. ఏను గిరీటి నోర్తునని యెంతయు నమ్మికఁ గౌరవేంద్రుఁ డా
పూనిక నాపయి న్నిలిపి పొంగుచు నుండు నిరంతరంబు న
ద్దానిని వమ్ముచేసి దురితంబున కిష్టొడిగట్టి పాండుభూ
జానికుమారులం గలయుసాహస మెట్లొనరింతు మాధవా!

శా. దుర్వారోద్యమశౌర్యవీర్యవిలసద్దోర్గర్వ మేపార గాం
ధర్వాదుల్ దివిఁ జూడ సంగరకళాతత్త్వంబు దీపింపఁగా
సర్వోర్వీశులు మెచ్చఁ బార్థుని మహోత్సాహంబునం దాఁకియు
ద్ధోర్వీక్రీడ యొనర్పకున్న నగరాక్కోలోకు లీకర్ణునిన్.

శా. నే నున్నాఁడ నిఁకేమిలో టనుదుఁ దానిర్భీతి యుద్ధక్రియం
బూనెం గౌరవభర్త పాండవులతోఁ బోరుట్టి యిప్పట్టునన్
నే నేరీతి సుయోధను న్విడతు మన్నిశ్శ్రేయసుం బాసి యా
హా! నట్టేటను బుట్టిముంచు టిది యార్యశ్రేణి మన్నింతురే?

మ. ప్రజకుం దల్లియు దండ్రియుం గురుఁడు భూపాలుండె కా? వానిపై
నిజభక్తిం బ్రకటించు నాతఁ డొకఁడే నిక్కంబుగాఁ బుణ్యుఁ డా
సుజనుండే తగు నిందునందును సుఖస్తోమంబుఁ నందంగ దా
నజనాధీన! యెఱింగి యేపగిది రాజద్రోహముం బూనుదున్.

మ. చతురంభోనిధిమేఖలాఖిలమహీసామ్రాజ్యసింహాసన
స్థితుఁ గావించెద రమ్మఁటందు విపు డిన్నీ తుచ్ఛభోగేచ్ఛదు
ర్మతినై స్వార్థమునం దగుల్కొని యధర్మప్రక్రియల్ పూని శా
శ్వతమత్కీర్తి గడించుటే సముచితవ్యాపారమా, మాధవా!

మ. శరదంభోధరచంచలాచపలముల్ సామ్రాజ్యభోగంబు ల
క్కరికర్ణాంతవిలోల మిత్తను వహో! కల్పాంతకాలంబు సు
స్థిరసూరిస్తవనీయ గేయవిమలశ్రీయుక్త మత్కీర్తి యిం
దరయన్ దేనిఁ బరిగ్రహింపఁదగుఁ గృష్ణా! యానతీయంగదే.

శా. ఇన్నాళ్లాతనియుప్పు పప్పు పులు సెంతే మెక్కితిన్ బాస లె
న్నెన్నో చేసితిఁ "బ్రాణమానములు నీవే నమ్ము"మంచంటి నో
యన్నా! యిత్తఱి నక్కుఱుప్పవతు నన్యాయయంబుగా దుఃఖ సం
పన్నుం జేసిన ఘోరదుర్గతులు సంప్రాప్తించవే మాధవా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. అక్షీణంబగు దీక్ష న న్మనిచి విద్యాబుద్ధులం గూర్చి స
ద్వక్షేమంబు లొసంగినట్టి నృపతిన్ వర్జించి దుర్వృత్తి నీ
ద్వక్షఃకృత్య మొనర్చినందువలనన్ రానున్న మేలెద్ది? నీ
భిక్షావృత్తిఁ జరించుటొప్పదె గుణాఢ్యా, లోకము మెచ్చఁగన్!

శా. స్వామిద్రోహ మొనర్చి సర్వధరణీచక్రంబుఁ బాలించి దు
ర్వ్యామోహంబును బెంచి నింద్యమగు పేరార్జించి జీవింప, నే
నేమాత్రంబును సమ్మతించను గుణాఢ్యా, "రాజభక్తోత్తముం
డీమాన్యుం"డనఁ బేరుగాంచెదఁ బవిత్రేచ్ఛన్ బ్రవర్తించెదన్.

ఉ. పాండవధార్తరాష్ట్రులకు భండన మయ్యది తప్పఁ బోదు, త
ద్భండనసీమ ధర్మజుఁ డపారజయంబును గాంచి సారవే
దండ సరోజషండశరదంబుదకుందమరాళచంద్రికా
పాండురకీర్తిసంపదల భాసిలు సందియమేల మాధవా!

శా. తమ్ముల్ ఋత్విజులై వెలుంగఁగ నుపద్రష్టత్వముం దాల్చి హ
ర్షమ్ముం జూపుచు మీరలుండ నతిదీక్షాకంకణంబూని తే
జమ్మేపారఁగ ధార్తరాష్ట్రపశుహింసన్ భీమసంగ్రామయా
గమ్ముం జేయును ధర్మపుత్త్రుఁడు జగత్కల్యాణ సంధాతయై.

ఉ. భాసురధర్మమూర్తులగు పాండుకుమారులు గాక ధర్మస
న్న్యాసులు కౌరవుల్ రణమునందు జయింతురె? ధర్మమెందుఁ దా
వాసిగ నుండునచ్చట ధ్రువంబు జయంబన లేదె, పండితా
గ్రేసరులైనవారలు హరీ! పెఱమాటలు వేయునేటికిన్?

క. ఎన్నఁడొ కన్నెతనంబున-నన్నుం గని కుంతి విడచె నదిఁ బాండవు లీ
యన్న మొగం బెఱుఁగరు "మీ-యన్నయ్య" నఁటంచు నిప్పు డనిన న్నగరే!

చ. సదమలధర్మమూర్తియు నజాతవిరోధియు నైన ధర్మజుం
డిదివిను నేని రాజ్య మతఁ డేల గ్రహించును నాకొసంగ, క
య్యదితగునే? మహామహుఁ డనంతగుణాఢ్యుఁ డతండు సత్యసం
పద లలరార రాజ్యపరిపాలన సేయకయుండు టొప్పునే?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. కరుణాపూరితమైనచిత్తమున మత్కల్యాణముం గోరి యి
త్తతి మీరాడిన మాటల న్వినక యీదాసుండు మారాడె నే
నెరవుం దోసమి, దీని కల్గక నను న్విశ్వాసహీనక్రియా
చరణాసక్తునిగా నొనర్పకు నమస్కారం బిదే మాధవా!

గీ. ఇంక నొకమేలు సేయు మోపంకజాక్ష! యుష్మదస్మత్ప్రసంగంబు నొక్కమాట
నైన నొరులకుఁ జాటక మానసంబు-నంద నిలుపుము పరమరహస్యమగుట.

చ. సెలవు నొసంగుమయ్య, యదుశేఖర, నే నికఁ బోయివచ్చెదన్;
దలఁపున నుంచుమయ్య, భయదంబగు సంగరసాగరంబు ను
జ్జ్వలభుజశౌర్యనౌక నిరపాయగతి న్దరియించి మించి య
వ్వల నినుఁ గందుఁ గానిమెడ స్వర్గమునం గనుఁగొందు మాధవా! ”

క. అకలంకరాజభక్తిం-బ్రకటించుచుఁ గర్ణుఁ డిట్లుపలికిన విని నం
దకుమారుఁ డద్భుతానం-దకందహృదయంబుతోడఁ దానిట్లనియెన్.

చ. బళిబళి మెచ్చినాఁడను సెబాసు సెబాసు కుమార! నీసము
జ్జ్వలహృదయంబెఱుంగ నిటుపల్కితి నల్కను జెందకయ్య, నీ
విలసితవృత్తము న్గని వివేకు లహో యనకుందురయ్య, ని
ర్మలనిరవద్యకీర్తి, ననమానతఁ గాంచఁగదయ్య, ధీమణీ!

శా. నీసత్యంబును రాజభక్తియును నీనిస్తుల్యశూరత్వము
న్నీసౌశీల్యము నిశ్చలాశయము నీనీతిప్రియత్వంబు నీ
వ్యాసంగంబుఁ బవిత్రజీవనము లోకాదర్శము ల్గాఁగ బల్
వాసిం గాంచుము ముజ్జగంబులను దుర్వారప్రతాపోదయా!

క. అని కర్ణుఁబొగడి కృష్ణుం-డనఘు నతని వీడుకొల్పి యాతనిచరితం
బును దలఁచి మెచ్చుకొనుచు న్జనెఁ బాండవు లున్నయెడకు సత్వరగతితోన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# నూతన కవిత్వపద్ధతులు— గీతములు

తాడిమేటి-
వెంకటసత్యసూర్యప్రకాశరావుగారు, బి. ఏ.

నేనీ వ్యాసమందు నూతన కవిత్వపద్ధతుల గూర్చియు, ప్రత్యేకముగ కవికొండల వెంకట్రావుగారి గీతములను గూర్చియు, వ్రాయ దలచితిని. భారతి,ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికల పాఠకులకు వెంకట్రావుగారికవిత్వము క్రొత్తది కాదు. వెంకట్రావుగారి గీతికలు క్రమక్రమముగా పాఠకలోకములో మెప్పువడయుచున్నవి. వెంకట్రావుగారు తమ కవిత్వమున కభినవాంధ్రకవిత్వమని నామకరణముచేసిరి. తమ నూతనవిధానము వాఙ్మయములో నంగీకృతమగునట్లును, దానిలో నుత్కృష్టస్థానము వడయునట్లను జేయునుద్దేశముతో "కొండకొలకు—వికసితోత్పలశీర్షిక" యనుపేర నొకగ్రంథమాలిక స్థాపించి దానిలో మొదటిసంపుటముగా 'భావమురళి, జనపదములు, కుమారకంఠము, మాతృదేశసంకీర్తనములు, కలరుతము' అనుపుస్తకముల బ్రకటించిరి.



వ్యాసకర్త

వెంకట్రావుగారీపుస్తకములలోని గీతికలకు 'స్ఫురణ' యని యేసందర్భమున నవి రచించినదియు దెలియబరచిరి. ఒకప్రత్యేకసమయమున నప్పటిపరిస్థితులను బట్టి కొన్నిభావములు మనమునుండిబయల్వెడలుననియు, నాభావములే ఒకగీతికగా బరిణామ మొందుననియు ఈకవి యభిప్రాయము. కర్తగాని, యాభావములు గలమరియొకరుగాని యాగీతికల నెలుగెత్తి పాడిన వాటిసహజభావములు బ్రత్యక్షమగునని వీరియభిప్రాయము. గీతికలవిషయమై యిది నిజముగా దోచుచున్నది. కర్తపాడినపుడు గీతికలు రుచించునట్లు యితరులు పాడినపుడు రుచింపవు. ఈసంగతిని గనిపెట్టి యీకవిగారు ఈనూతనకవిత్వమును బ్రజామోదముగా జేయుట కభినవాంధ్రసమావేశముల నేర్పాటుచేయ గుతూహలురై యున్నారు. వీరికవిత్వము నామోదించువారిని శాశ్వతపాఠకులుగా జేర్చికొని, ఇరువదిమంది శాశ్వతపాఠకు లున్నతావున నభినవాంధ్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సమావేశము నేర్పాటుచేసి, యీకవిత్వవిధానమునుగూర్చి యుపన్యాసములు చేయించియు, ఈగీతములను, ఇట్టి యితరకవుల గీతములను తత్తత్కవులచేత నేగానముచేయించియు ఈ నూతనకవిత్వమాధుర్యమును జవిచూపించు నుద్దేశము కలదు. ఇట్టి సమావేశములు నర్సాపురములో రెండు జరిగినవి. వానియుపయోగ మపారమని సభ్యులు గ్రహించిరి. ఆంగ్లనవలాకారులగు థేకరే, డికెన్సు మొదలగువారిని నమెరికాఖండవాసులు పిలిపించుకొని వారిముఖతః వారినవలల వినిరి. దీనికై యమెరికావా రపారమైనసొమ్ము వ్యయపరతురు. కర్తయే తనకావ్యము జదివిన దానిలోని భావములు సుగమములు కాగలవు. ఆంధ్రదేశమునకూడ నీపద్ధతి నవలంబించిన, మననూతనకవిత్వపుపోకడ లనతికాలములోనే ప్రజామోదమువడసి వాఙ్మయముగా నంగీకరింపబడి యాంధ్రవాఙ్మయము విజృంభింపగలదు. ప్రస్తుతకాలమున సాహితీసమితులు, యువకవిమండలులు మొదలగు ననేకకవిసంఘము లేర్పడుచున్నవి. ఒక్కొక్కసంస్థకు ప్రత్యేకకవిత్వవిధానములు గలవు. ఒకరు వ్యావహారికభాషలో వ్రాసినను, మరియొకరు గ్రాంథికభాషలో వ్రాసినను, మరియొకరు 'మొకి' పాటలు వ్రాసినను వీటన్నిటిలోను కవిత్వమందు స్వతంత్రేచ్ఛ గన్పట్టుచున్నది. అప్పకవీయమునుబట్టియు, భాగవతాదిగ్రంథములలోని ప్రయోగములనుబట్టియు కవిత్వముండవలెనను నిర్బంధము నేటియువకవులంగీకరించుట లేదు. పూర్తిగ ఛందోనియమముల విసర్జింపవలె ననువారును అరుదుగా నున్నారు. కాని వెనుకటివలె వృత్తములు, రగడలు నెట్టిఛందోనియమము మీరకుండమాత్రము వ్రాయుట వీరియభిమతము కాదు. సామాన్యజనబోధకములుగానుండునట్లు గీతికలుగను, రగడలుగను ఛందోవిషయమున అవసరమునుబట్టి కొలదిమార్పులతో వ్రాయువారు నేటి నూతనకవులలో పెక్కండ్రుగలరు. కొందరు మాత్రము ఛందోనియమము పాటింపకభాష కూడ గణింపక వారిభావములు వారినెట్లీడ్చిన నట్లు వ్రాయుదురు.

ఆంధ్రకవిత్వములో నీక్రొత్తమార్పునకు గారణములు గలవు. మొదటిది దేశమందు స్వారాజ్యసంపాదనేచ్ఛ విరివిగ వ్యాపించియుండుట. ఆంగ్లవిద్యయందారితేరి యాంగ్లకవిశేఖరులగు వర్డ్సువర్తు, కాలరిడ్జి, బ్రౌనింగు, షెల్లీ, కీట్సు మొదలగు కవుల కవిత్వమును బాగుగ జదువుటచే ఆభావములు, ఆయాదర్శములు, ఆపోకడలు యలవడుట రెండవకారణము. ఇప్పుడున్న యువకవిమండలిలోను, సాహితీసమితి, సాహిత్యసమితులలోను సభ్యులుగా నున్న పెక్కండ్రుకవు లాంగ్లవిద్యయందుబ్రవేశమున్నవారును, స్వతంత్రేచ్ఛ గలవారును. కపికొండల వెంకట్రావుగారుకూడ ఈతరగతికి జెందినవారే.

పూర్వపుటాంధ్రకవిత్వము కావ్యములు, పురాణములు, నాటకములు మొదలగు నంశములకే వినియోగపడెను. ప్రకృతివర్ణనలు వీనిలో మధ్యమధ్య గన్పట్టు చుండెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆధునికకవిత్వములో ననుదినము ప్రకృతిలోను, సంఘములోను గలుగుసంఘటనల కెక్కువ ప్రాముఖ్యము గలుగుచున్నది. భాషా విషయమునగూడ నెక్కువ భేదము గలదు. పూర్వపుకవిత్వములో గ్రాంథికభాషయే వాడుక చేయబడెను. ఆధునిక కవిత్వమందు జాలవరకు వాడుకభాషయే యుపయోగింపబడుచున్నది. దీనిలో కూడ గ్రాంథికభాష విరివిగా నుపయోగింపబడుచున్నది. కాని యొకేరకపుభాష వాడవలె నను నిర్బంధము లేదు. అప్పటిభావమునుబట్టి యేపదము పైకి వచ్చిన దానినే వాడుదురు. అదిగాక విషయమునుబట్టికూడ భాషయుండును. కూలివారి విషయమునుగూర్చి వ్రాయునపుడు వారు వాడుపదములును, పండితులనుగూర్చి వ్రాయునపుడు వా రుపయోగించుభాషయు కవిత్వములో గన్పడుచుండును. ఇది సరియైనపద్ధతియని మా యభిప్రాయము. పూర్వపుకవిత్వమందు ఛందోనియమములు, భాషాప్రయోగనియమములు అతికఠినముగా నుండుటచే ప్రతివారికిని వీని ననుసరించుట సులభసాధ్యము కాదు. ఆధునికవిధానమునం దీనియమములు జాలవరకు సడలినవి.

ఆధునికకవిత్వమందలి ముఖ్యవిషయము భావోదయము. అనగా మనమందు బయల్వెడలు భావములు కవిత్వమందు ప్రస్ఫుటముచేయుట. ఈభావప్రకటనమే యీనాటి కవిత్వమందు ముఖ్యముగా దలంపబడుచున్నది. రెండవ విషయము దినవిషయముల గూర్చి వ్రాయుట. మూడవది కవిత్వమందుపయోగించెడిభాష. వెంకట్రావుగారికవిత్వములో నీనూతనవిషయములన్నియు ప్రాముఖ్యము వహించుచున్నవి. కాని వీరికవిత్వమం దొకవిచిత్రము గలదు. వీరినైపుణ్యముచేత పదములకూడికసొబగు చక్కగ నమరుచున్నది. ఒకగీతిక జూచిన అది హిందీభాషయా యనుపించును; మరియొకటిచూచిన యది సంస్కృతమా యనిపించును; మూడవదిచూచిన బజారులో కూలివాండ్రు మాట్లాడుచున్న ట్లగపడును. కవిత్వ పద్ధతిలో వీరు పూర్తిగా ఆధునికులని చెప్పవొప్పును గాని భాషను పట్టి నిర్ణయింపజాలము. నైమూడు రకములగీతములకు కొన్ని చిన్న యుదాహరణముల వీరిగీతములనుండి పొందుపరచెదను.

౧

"నమోనమోజయ! భరతమహాశయ
సఫలోదయ మంజులహాసీ!
సుముఖీభవ! సుస్వప్నీభవ!
సుఖదాయీభవ! హేదరహాసీ!
భవదాగమన వినిర్మలమారుత
లోలతరంగమ్ మమరంగమ్
భవదాగమన జయప్రసవాద్భుత
మధురోత్కంఠమ్ మమకంఠమ్."

౨

"మోహనగంగా పతనమనోహర
ధారాధరశంకరశిఖరీ!
పావనజలధితరంగనినాద
ప్రకటితరామేశ్వరముఖరీ!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శీతలనీరద దివ్యసమీరణ
 చంచలచామర వనఖచరీ!
జయ! ముక్తిప్రియ! జయశాంతివిజయ
 జయధర్మవినయ! జయమాతా!"

3

"ముప్పావులాకూలొస్తది
 నాయప్పరామె
కోతలోకి కూలికెడదాము
కూకుడుంటె కూడొస్తదా
 నాయప్పరామె
కోతలోకి కూలికెడదాము."

కవిత్వమందు భాషావిషయమున పీరనుకరించినపద్ధతి చాలసమంజసముగా నున్నది. విషయమును బట్టి భాష మారుచున్నది. పైనిచ్చిన యుదాహరణముల బట్టి యీవిషయము సుగమముగాగలదు. భారతదేశసంకీర్తనమును, భారతదేశౌన్నత్యమును గూర్చి గానముచేయుచున్నపుడు వినియోగించిన భాషకును, కూలికివెళ్లుదమని కూలివారల సంభాషణవర్ణించునపు డుపయోగించిన భాషకును గలతారతమ్యమును బట్టి పీరు కవిత్వము దుపయోగించు భాషావిషయమున పీరి యభిప్రాయము వెల్లడియగుచున్నది. భారతదేశౌన్నత్యమును గీర్తించునపుడు సామాన్యులు వాడుభాషయు, కూలివారిసంభాషణకు బండితు లుపయోగించు గ్రాంథికభాషయు వాడిన నెంతహేయముగ నుండును! పీరీ సంగతిగ్రహించియే విషయమున కుచితమైన భాషయే వాడిరి.

ఛందోనియమముల విషయములోగూడ పీరు తమ కిచ్చవచ్చిన తెరంగున మెలగలేదు. పీరు గీతములు, హయగతిరగడలు మొదలగు ఛందోరూపములనే వాడిరి గాని కొన్నితావులలో యొకభావమును వెల్లడించు నొకపదము ఛందస్సుప్రకారమచ్చట పనికిరానప్పుడు భావమునకే ప్రాధాన్యమొసగి యాపదమునే వాడి ఛందోనియమమునకే వ్యతిరేకముగా బ్రవర్తించిరి. అట్టి చిన్నమార్పులతో పీరు ఛందోనియమముల ననుసరించిరి. ఇంతవరకు బ్రకటితమైన పీరిగీతములలో ముఖ్యమైనవానిని బరీక్షించి వానిలో గలగుణముల నీక్రింద బొందుపరచెదను. పీ రన్నిరకములగీతములను గుచ్చెత్తక ప్రకటించునపుడు విషయభేదమునుబట్టి విడివిడిగ బ్రకటించుటచే పీరిగీతములకు విషయ విభాగముచేయుశ్రమ తప్పినది.పీరి మొదటి పుస్తకము భావమురళి. ఈ పేరే గ్రంథములోని విషయమును జెప్పక చెప్పుచున్నది.

భావమురళిలోని రెండవగీతికయగు'కోకిలము'ను బరీక్షింతము. ఈపద మెన్ని సారులు వినినను, చదివినను తనివితీరకయుండును. కోకిల ప్రతివత్సరము వసంతమునవచ్చి యాపాటయే పాడుననియు, కోడలివలె బుట్టింటికి వచ్చి అత్తింటికి పోవుచుండుననియు, దానిరాక ప్రజల కాహ్లాదకరముగ నుండునని యుజెప్పబడినది. కోకిలయన్ని దేశములలోను, అన్నిభాషలందును వసంత ఋతువుతోడను, ప్రకృతి సౌందర్యముతోడను సంబంధముకలిగి యున్నది. ఆంగ్ల దేశమందలి కవులలో కోకిలనుగూర్చి పాడనికవి లేడనియే చెప్పవచ్చును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆపద్ధతినే యాంగ్లభాషాపరిచయముగలమన యాధునిక కవులుకూడ అవలంబించుచున్నారు. సామాన్యముగ ఆంధ్రు లందరు వసంతాగమ మైనపుడు కోకిల పుట్టినింటికి వచ్చినట్లుగ భావింతురు. ఈభావమే గీతమందు బ్రకటిత మైనది. అందుచేత నే పాఠకులకు గీతములోని భావ మెంత యో రమణీయముగ నున్నది.

'ఎఱ్ఱకలువపువ్వు' అను గీతికలో నది మెట్లు తటాకమధ్యమందుండి యా తటాకము దనకొఱకే నిర్మింపబడినట్లు తలచుచున్నదో అట్లు దానిభావము వెల్లడింపబడినది. దానినీడ నీటిలో నెట్లు ప్రతిబింబించుచున్నదో కూడ కవి చక్కగ జెప్పెను-

"నీనీడ చెఱువులోన
నిలువున గనిపించున్."

"జీవనగీతము"లో జీవితరహస్యము చక్కగ బ్రకృతిలోని వస్తుచయముతో బోల్చి వర్ణింపబడినది-

"జీవన మొకసన్న జాజి చిన్న మొగ్గకదర!
దినదినమును జ్ఞానమనెడు తెలి రేకులువిడుచు;
జీవన మొకటిట్టె తోచు చిట్టిమేఘము కదర!
చిరునగవను "ఇంద్రధనుసు" సింగారం బొసగు
జీవన మొక తెరచాపను బోవునావ కదర
మోక్షమనెడుపారంబును బొందసేయుదుదకు."

'వెలుగు'అను గీతికలో సంక్రాంతిపండుగ తరువాత స్త్రీలు నోచుబొమ్మలనోము నాఖరు దినమున బొమ్మలను దీపములతోసహా అరటి బొందల తెప్పలపైనుంచి నదిలో విడుచుట వర్ణింపబడినది. గీతిక యాయుత్సవము సరిగ వర్ణించుచు మనమున కాహ్లాద మొసగుచున్నది-

"బెండుతెప్పను లీలవిలసిల్లు వెలుగ!
ముత్తైదు చేజాతి ముదమందు వెలుగ!"

* * * *

బొమ్మలనోముగా బాలతులు నిన్ను
విడిచివారలదాచి వెడలిరి వారు
"పాలలో బుట్టినపడతి 'గవిరమ్మ'
నీళ్లలోఁ గలిసెనే నే"డంచు నేదొ,
అటువంటి పాటతో నానందముగను
నీనిన్ను వెనువెన్క నీటుగాఁ జూచి."

ఒక 'అపరాహ్ణమున' యనుగీతికలో ప్రకృతి చక్కగ వర్ణింపబడినది-

"కాని యాకోనలోఁ గనిపించుసవిగ
ఇరుగడ శరదంపు టీనేటిచేలు
చేలపయినడచేటి దూది మేఘాలు
మేఘాలు విడ నడు నీలంపుజాలు."

రెండవపొత్తము 'జనపదములు.' ఇందు నుదినమును సామాన్యజనులలో జరుగు విషయములగూర్చిన గీతములు గలవు. దీనిలో 'కోతపాట' 'బల్లకట్టు' 'కూలియన్నలకుతుకము' 'రంగంనుంచివచ్చిన రంగనిచర్యలు' 'సంతనుండి వచ్చుచున్న పాంథునిగూర్చి' 'తీర్థపునరదా' 'ఎక్కడున్నానోలె' 'రస్తామరమ్మతు' మొదలగు విషయములమీద గీతములు గలవు. ఈగీతములన్నియు వినుట కాహ్లాదకరముగా నున్నవి. ప్రతిదినము జరుగుసంగతులు విషయమునకు దగినభాషలో వ్రాయబడినవి. అందుచే బ్రతివారిని నివి యా

క్షించుచున్నవి. 'కోతపాట'లోఁగల యొకటి రెండు ప్రకృతివర్ణనల నిట బొందుపరతును.-

నిమురగనికి, సీటగనెరు
అమడాకు, తూటి కాడ
తేమ సెమలి తీగసాగేను

*　　*　　*　　*

చిన్ని చిన్ని మంచుబొట్లు
సన్న వరిముల్లుమీద
మాపు నిల్చి తేపురాలెను.
మొస్సబట్టిన గాలివాన
మునిగినట్టి మునురుచేలు
నిన్న మొన్న వేసినట్టి
కొంకగాలి కాఱిపోయెను.

తెరవుమఱిగి వెఱపులెఱిగి
పఱగ కిట్టబారులేగె
బేగి లెగి సోయప్ప రామె
కోతలోకి కూలికెళదాము.

మూడవపాత్తము 'కుమారకంఠము'. దీనిలో బాలురమాటలు, వారుచెప్పుకొనుకథలు గలవు. పురాణగాథలు చారిత్రకవిషయములు గూడ కథల రూపమున గీతికలలో వ్రాయబడినవి. దీనిలో 'నాపడవ', 'శివాజి', 'బంతియాట', 'ఉడుత-బుడత' 'వినాయక', 'రాజు-రయితు', 'భూమి-ఆకాశము', 'శబరి' 'పిట్టపోరు - పిట్టపోరు' 'సీటిబొట్టు' ముఖ్యమైనవి. 'శివాజి' యను దానిలో మహారాష్ట్రవీరుడు శివాజి యౌరంగజేబువద్దనుంచి మిఠాయిబుంగలో దాగి పాఱిపోయిన చారిత్రక విషయము బాలురకు సులభముగ బోధపడునట్లు రచింపబడినది. ఇది బొబ్బిలి, కామమ్మకథలపోలిక నున్నది. మచ్చునకు గొన్ని పాదము లుదాహరించెదను.-

శివాజియనునొక - మరాటివీరుడు
అరంగజీబుకు - చేజిక్కెన్.
మొగల్‌నవాబగు - అరంగజీబు
శివాజివీరుని - ఖైదుంచెఁ.

'బంతియాట'యను గీతములో పురాణగాథ వర్ణింపబడినది. పాండవులు, కౌరవులు బంతియాడుచున్నపు డాబంతి నూతిలోఁబడుటయు, ద్రోణుడు దానిని బాణములసహాయమున బైకిదీయుటయు వర్ణింపబడినది.

నాల్గవగ్రంథము 'మాతృదేశసంకీర్తనములు.' దీనిలో 'నవోనవోజయ', 'వడివడి నడకు', 'ఉయ్యాలదంబాలా', 'ఆంధ్రరాష్ట్రము - మాతృదేశమున కది యేనాఁడో' మున్నగు గీతములు గలవు. ఈగీతములలో కవియొక్క దేశాభిమానము ప్రకటితమగుచున్నది. కవిభావనుగూర్చి వ్రాసినపుడు 'నవోనవోజయ' యనుగీతమునుండి యుదాహరణము నిచ్చియుంటిమి. ఈగీతములు దేశాభిమానపూరితములుగా నున్నవి.

'కలరుత'మైదవపాత్తము. దీనిలో 'విరిమల్లెపూలు', 'గాలివాన', 'దొమ్మరిఆట', 'దాసిగొడవ', 'వెన్నెలలు', 'జీవనమను దారిలోన' మొదలగుగీతములు గలవు. గీతికలలోని విషయములు నిజముగ జరగినవేయగుటచే జాలనాహ్లాదము గలుగజేయుచున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈమైదుపొ_త్తములతో మొదటిసంపుటము పూ_ర్ణమైనది. క్లు_ప్తముగా వీనిలోని గీతికలస్వభావము చెప్పియుంటిని. ఈగీతికలను బట్టి కవి ముందు ప్రకటింపబోవుగ్రంథము లింతకంటె నెక్కువ యింపు గూర్చునవిగా నుండు ననుట సాహసము కాదని నా నమ్మకము.

ఇట్టికవిత్వ మాంధ్రవాఙ్మయాభివృద్ధి కెంతవరకు దోడ్పడగలదనువిషయము మిగిలి యున్నది. భాషాకన్య కివియన్నియు భూషణములు. భూషణము లెన్నియుంచినను నవి యెక్కువకాజాలవు. కాని భూషణములలో నెక్కురకము లుండును. ఇవి యేరకమునకు జెందినవనియే మనప్రశ్న. కవికొండల వెంకటరావుగారికవిత్వము వాఙ్మయాభివృద్ధికి దోడ్పడగలదనుట నిర్వివాదము. భావవ్యక్తీకరణము వీరికవిత్వముయొక్క ప్రధానధనము. ప్రకృతి కెక్కువ ప్రాముఖ్యము వీరికవిత్వమందు గలదు. ఇట్టి సందర్భముల కుదాహరణము లిచ్చియుంటిని. అనుదినము మనచుట్టును, పట్టణము పల్లె యనుభేదములేకుండ జరుగు విషయములే గీతికాస్వరూపమును దాల్చుచున్నవి.

ఆంగ్లభాషయందు వీరికవిత్వమువంటి కవిత్వమును రోమేంటిక్ (Romantic) అందురు. వీరుబొబ్బిలిపాట, కామమ్మకథ వంటి బేలడ్ (Ballad) కవిత్వముగూడ 'శివాజి' యనుగీతములో గనుపరచిరి. ప్రకృతివర్ణనలు ప్రతిగీతమందును గన్పట్టును. బిచ్చగాండ్రు, కూలిజనము, దాసివాండ్రుమొదలగు కష్టజీవుల విషయములుగూడ ఈ కవిత్వమందు గన్పట్టుచున్నవి. ఇదికూడ నూతనకవిత్వము దొక ముఖ్యవిషయము. భాష విషయమును బట్టి మారినది. ఈ విషయములనుబట్టి కవి తనకు దోచినట్లు వ్రాయక బాగుగా నాలోచించిన రెండు మంచినూతనపక్షి యవలంబించుచున్నట్లగపడుచున్నది. ఇదియాంధ్ర వాఙ్మయమును సర్వవిధముల వృద్ధి చేయగలదని నానమ్మకము.

ఈవ్యాసమునకు మొదటనే వాఙ్మయముపై దేశకాలపరిస్థితుల కెట్టిశక్తిగలదో వివరించియుంటిని. నూతనకవిత్వ మవలంబించుచున్నవా రందరు నాంగ్లభాష నభ్యసించినవా రగుటచే నాంగ్లకవిత్వపద్ధతులు, పోకడలు వీరవలంబించుచున్నారు. ఈనూతన కవిత్వము మూలమున వాఙ్మయము తప్పక యభివృద్ధి కాగలదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# స్వర్గములో ఒక విలాపము*

జయంతి గంగన్నగారు

ఘనుడంచు పొగడుదురు జనులెల్ల [నన్నెంతొ
ఘనుడంచు సభలెన్నొ కావించి నాకీర్తి
దినదినము చాటుదురు దేశదేశములందు.

*    *    *    *

ఎన్నినియోసభల, ఎన్నినిభాషలనో,
సన్ననగుస్వరములన్ , మిన్నంటునాదముల,
తిన్ననగువాక్యముల, తెన్నుదప్పినగతుల;

*    *    *    *

సరళోక్తిరచనలన్, సందిగ్ధవచనముల,
శరతుల్యవాగ్ధాటి, చంచలస్వరములన్,
మఱివివిధరీతులను, మహనీయులెందఱో:

*    *    *    *

కర్మవాదులు, భక్తిజ్ఞానవాదులు, సకల
ధర్మవేత్తలు, కవులు, తార్కికుల్, వేదాంత
మర్మకోవిదు, లింక మఱియొంద ఱెందఱో;

*    *    *    *

రాచనీతులుకరచి రాజ్యాంగతంత్రముల్
యోచించునాయకులు, ప్రాచీనవమతసాంఘి
కాచారముల్ మార్ప జూచు సంస్కర్తలును;

*    *    *    *

మఱియింక నిటువంటి మహనీయులెందఱో,
'తరియించినాముగద, ధన్యులమగద!'యంచు
'పరమవాక్యము' లంచు, భవ్యసూత్రములంచు

*    *    *    *

పలికినవికొన్ని, నే పల్కనివికొన్నియును
కలిపి, అన్నియుహూపు తొలగి, నాకేవింత
కొలుపునట్లుగ, పల్కు పలుకునకుబండ్రెండు,

*    *    *    *

మారుపల్కినవారి నోరుమూయగ నింక
ఆఱర్థముల్, దీసి అక్షరంబున కైదు
కారికల నవలీల కల్పించి, తలలూచి;

*    *    *    *

అదితెలియు నిదితెలియ దను శంక యొక్కింత
మదిలేక, సర్వజ్ఞ మతమె అన్నిటికంటె
సదుపాయమని యెంచి, చర్చించి, చర్చించి;

*    *    *    *

ఎవరెవరి యుద్దేశ, మెవరెవరియభిమాన
మెవరెవరిపోషకుల యిచ్చ యెట్లుండునో,
చివర కాఘక్కనే సవరణల్ సాధించి,

*    *    *    *

* ఒకమహాత్ముడు జనులకు కొన్ని ఉపదేశములు చేసి మరణించెను. ఆయుపదేశములను జనులు తారాత్తరు చేయుచుండుటచూచి, ఆతని యాత్మభగవంతుని యెదుట పెట్టుకొన్న మొఱ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

‘సిద్ధించె, జనులార, చింత యుడుగుడు, ముక్తి
పద్ధతిదిగో!’ అనుచు పల్కి స్మితవదనులై,
సిద్ధాంతముల్ చిత్రచిత్రమైనవి పన్ని;

* * * *

ఆచిత్రచిత్రముల వ్యాపనముచేయుటకు
నై, చిత్రచిత్రంబు లగుసమాజము లుంచి,
ఆచార్యు, లధ్యక్షు, లధికారులని పెద్ద

* * * *

నామముల్ పెట్టుకొని, పామరుల బల్విరను,
శేముషీస్వాతంత్ర్య మామూలముగ విడిన
సోమరులగొందఱను చుట్టుచేరగ దువ్వి;

* * * *

నియమంబు, లర్చనల్, నిష్ఠ, లుపవాసములు,
నయసూత్రముల్, శాసనంబులు, విధానములు
జయగీతముల్, నగరసంకీర్తనల్ కథలు

* * * *

విధియించి, ప్రకటించి, వినిపించి, ఇటువంటి
అధిక ప్రసంగ పర్యాసక్తిమై, మూల
విధిసాధనక్రియావిముఖులై, ప్రముఖులై

* * * *

శక్తిఅంతయుచూపి ‘జాతీయప్రత్యేక’
ముక్తిపథమందఱకు బోధించి, తా మొక్క
భుక్తిమాత్రాన సంపూర్ణసంతృప్తులై,

* * * *

‘పాపబీజముధనము, పాపవృక్షముధనము,
పాపపుష్పముధనము, పాపగంధముధనము,
పాపఫలమే ధనము, పాపమే ధన’ మంచు,

* * * *

‘మఱి కీర్తియందువా, మాయగాదా?’ అంచు,
దొరతనముకంటె నిక దుఃఖంబు లేదనుచు,
‘బిరుదములకంటె నిక బరువేమిగల’ దనుచు,

* * * *

నాయకుండనగ నందఱికష్టముల బ్రీతి
మోయువాడను సత్యమును గన్నవాకాట
మాయలక్, బరువులం, బాపముల, దుఃఖముల

* * * *

అనుచరుల బీడించు నవ్వాని, తమసొంత
పనులన్నియును వెనుకపడినప్పటికి, సుంత
వెనుదీయకను, మీదవేసుకొని, అత్యంత

* * * *

వినయ మఖిలోత్కృష్ట మనుచు, అద్దాని దా
ల్చినవారి కెదురులేదని, సహజమగునట్టి
వినయమంతయు హృదయముననుండి పైకెత్తి,

* * * *

లేనివినయము కొంత పైనుండి రప్పించి,
దీనిదానినికలిపి దిట్టమగుకవచంబు,
మేనంతయును కప్పుదాని, చేసి ధరియించి;

* * * *

గొప్పగా తము దామె చెప్పకొనసరోసి, ఒ
క్కప్పుడును ఎద్దానికైన కాదనని తల
ద్రిప్పరాయలచేత చెప్పించి, ఒప్పించి,

* * * *

ఎందెందులను ఎవరి కెటువంటి ఆసయో,
అందందులను వారికటువంటి ఆసనే
పొందుపడునట్లు, తమబోధనల్ ముడివెట్టి;

* * * *

అందఱును—పంచేంద్రియముల నుపయోగించు
ముందుగా బుద్ధి యొకమూల ద్రోకొట్టి ప
సందియము చెంతకును జననివారందఱును—

* * * *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# భారతీయ మహిళామండలి



౧. శ్రీ. కౌసల్యాకన్య, బి. ఏ., యల్. టి.

ఈమె మేరీకళాశాలలో నుపాధ్యాయినిగా నున్నది. అకెడమిక్ కౌన్సిలునుండి యీమె సెనెటుసభకు సభ్యురాలుగ నెన్నుకొనబడినది. ఇట్టి గౌరవమును బడసిన మళయాళీయువతి యీమెయే. ఈమె న్యాయమూర్తి కృష్ణనుగారి సోదరుని పుత్రిక.



డాక్టరు ముత్తులక్ష్మమ్మగారు
యమ్. బి. సి. యమ్., యమ్. యల్. సి.
మదరాసుశాసనసభకుపాధ్యక్షురాలుగా నెన్నుకొనబడినది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రీమతి పటవర్ధనమ్మగారు

మదరాసు యునైటెడుక్లబ్బు టెన్నిసు పందెమునందు పాల్గొనుచున్నది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'అవునౌను, బాగు బా!' గనుచు తాళము వేయ
అవసరము లేదింక నని, తొడిగికొన్న యా
కవచమూడగ బెటికి గర్జసల్ చేయుచును.

* * * *

తమభుజములనె ఆకసము నిల్చియున్నదని,
తమవ్రేళ్ల మీదనే ధారుణీచక్రంబు
క్రమముతప్పక తిరుగ గల్గుచున్నదియనియు,

* * * *

తమకటాక్షమె రక్ష, తమ ఉపేక్షయె శిక్ష,
తమకోపమే లోకదహనాగ్ని కీలమని
భ్రమపెట్టుచున్ పరుల, భ్రమ చెందుచుక్తా తాము

* * * *

—ఎంతకని వర్ణింతు ఈమనుష్యుల పోక,
లెంతవర్ణించినను ఏమితరుగును ప్రభూ?
ఇంతతో చాలింతు—ఈశ్వరా, ఓవరద!

* * * *

నామీద దయయుంచి— నవ్వులకు కాదయ్యె;
నామనస్సెంతో సంతప్త మగుచున్నయది—
నానునవి యాలింపు మోమహితకరుణాంక!

* * * *

పోయివచ్చెద ఒక్కపూట భూలోకమునకు,
చేయనాలస్యంబు, సెలవిమ్ము, సతతంబు
నీయాజ్ఞ వర్తింతు, ఇపుడు కాదనవద్దు;

* * * *

పోయి ఆయాచార్యపుంగవుల, ప్రముఖులన్,
నాయకుల, అధికృతుల, అధ్యక్షులం జేరి,
న్యాయమా, మీరిట్లు చేయుటిది న్యాయమా?

* * * *

ఎటువంటి అపచార మెపుడు మీయెడ నేను
ఘటియించితినో యెఱుగ, ఇటువంటిదన్న, ఎం
తటిదండనంబైన తగవు పెట్టక పడుదు.

* * * *

అంతియే కాని—మీ అడుగులకు దండాలు—
పంతంబుపట్టి నా పల్కులీరీతిగా
వింతవింతలు చేయ వెక్కిరించుచున్నయది.

* * * *

అన్నలారా, పుడమియందు నేజీవించి
యున్న పుడుపుత్రులం గన్నవాడను గాను,
అన్ని సంతానంబు లా పల్కులే నాకు;

* * * *

వానిమీరలు చిత్రవధ చేయపూనిన
దైన వంశవినాశ మగునాకు, భరియింప
లేను, సుతభిక్షార్థి, లేదు, పొమ్మనవద్దు

* * * *

భూలోకమున్విడిచి పోలేక, దేహంబు
చాలించినపు, డాత్మ సగమిచ్చుటను వాక్య
జాలస్వరూపమున సంధించిపోయితిని;

* * * *

దానిరూపము మాప తాము సమకట్టిన
దైన, ఆత్మవినాశ మగునాకు, అట్టిపని
పూనలేదట క్రూరదానవాధములైన;

* * * *

చదువులన్నియు నేను చదివియుండగ లేదు,
పెదపెద్దశాస్త్రముల పేళ్లయిన విన లేదు,
హృదయానుభావములె పదములం గూర్చితిని;

* * * *

[సశేషము]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




నిడమర్తి సత్యనారాయణమూర్తి గారు, బి. ఏ. [సారస్వత సమాజము]

పురాణ శకలమగు విరాటపర్వమును సోమయాజి కావ్యముగా మార్చినవిషయ మొకవిధముగా పొరపాటని నాకు గురుసమానులును, నాయందు వాత్సల్యము గలవారును, సుప్రసిద్ధ పండితకవులును నగు నొకరు ప్రసంగవశమున సెలవిచ్చియుండిరి. సంస్కృత భారతమునందలి విరాటపర్వమును జదివినపుడు గలుగని యానందము తెలుగున జదువునపుడు గలుగుటకు గారణమేమాయని యాలోచించుచున్న నాకీవాక్యములు కొంతయాధారమును జూపించినవి. పరిశీలన చేసినకొలదిని విరాటపర్వమును సోమయాజి కావ్యముగా రచించెననియు అట్లు చేయుటలో కొందఱనునట్లు తిక్కన పొరపాటొనర్పకపోవుటయే కాక మిక్కుమిక్కిలి తన యపూర్వరచనాసామర్థ్యమును బ్రకటించెననియు నభిప్రాయము నాయందు దృఢమై నెలకొనినది. ఆవిషయమును విపులముగ జర్చించి తిక్కనయందున్న జనాదరణము నినుమడింపజేయుటే యీవ్యాసముయొక్క యుద్దేశము. కావున కావ్యలక్షణముల నొక్కొక్కటిగ జూచి యిది యెంతవరకు కావ్యమో, దీని యాత్కృష్ట్య మేమియో చూతము.

"కం. పురసింధు నగర్తు వన శశి
సరసీ వన మధు రతిప్రసంగ విరహముల్
పరిణయ తనయోదయ నయ
విరచన యాత్రాజిద్యూత విభు వర్ణనముల్
(నరసభూపాలీయము.)

అనునవి కావ్యమునం దుండవలసిన యష్టాదశవిశిష్టవర్ణనములు. (అనగా పురము, సింధువు, నగరము, ఋతువు, సూర్యుడు, చంద్రుడు, సరస్సు, వనము, మధుపానము, రతిప్రసంగము, విరహము, పరిణయము, తనయోదయము, నయవిరచన, యాత్ర, ఆజి, ద్యూతము, విభువర్ణనము). మఱియు,

ఇందు నొకకొన్ని కడమైన నెంచిచూడ
నదియు నవని మహాకావ్య మనగ బరగు.
(నరసభూపాలీయము.)

నని లాక్షణికులొప్పుకొనుటచే మహాప్రబంధమున కివి యన్నియు నవసరము కాదని తేలుచున్నది. సోమయాజి ఈయష్టాదశవర్ణనలలో చాలవరకు వర్ణించి తన విరాటపర్వమునకు మహాకావ్య లక్షణము నిచ్చియున్నాడు.

అభిమన్యుని వివాహసమయమున బురవర్ణనమును జేసెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"కం. వివిధాలంకరణంబుల
నవకాంతి వహించి పట్టణంబు వివాహో
త్సవమాధవలక్ష్మికి లలి
తవనంబై మెలమికలిమి తావలమయ్యెన్."

ద్వితీయాశ్వాసమున సూర్యోదయ సూర్యాస్తమయ చంద్రోదయములను విపులముగ వర్ణించి విడిచెను. కీచకుడు ద్రౌపదిపై మోహముతో వికలచిత్తుడై వనవిహారము సలిపిన సమయమున సరోవరమును, వనమును వర్ణించెను. ఆసమయమున నే యాతడు నుడివిన,

"సీ. కెంగేలు గేలితోఁ గీలించి నెయ్యంపు
మాటలఁ దగుమఱుమాట లార్తు
గుచము లురంబునఁ గుదియించి క్రమమున
నిఱిసిన కౌఁగిట నింపొనర్తు
నంగుళంబుల నల్ల నలకలు గబళించి
కెమ్మోవియాని మెక్కింతుఁ గాయ్యు
మనము మనంబునఁ బెనఁచి కేళికిఁ జొచ్చి
సతిఁ దేల్తు సౌఖ్యరసంపు నిట్టఁ
దనివు మొదలైనఁ జిగురొత్తుతమకమునకుఁ
బ్రాఁకుపెట్టుచు మగుడఁ బైఁబడుచు నింతి
వింతభంగుల కెలయించి నెకలిఁ జేసి
యభిమతక్రీడనములకు నలవరింతు."

పలుకులలో రతిప్రసంగ విషయము సరచాటుగనుంచి చేసెను. కీచకుని ప్రసంగమెల్లను విరహపరిపూర్ణమై యున్నది. పర్వారంభమున పాండవులు విరాటపురికి బయలుదేరుసమయమున ధౌమ్యుడు వారికి సేవాధర్మముల నెఱింగించి నయవిరచన మాచరించెను. ధర్మజాదుల వైభవమును, మహనీయ మూర్తులను వర్ణించి విభువర్ణనమును, గోగ్రహణసమయమున యుద్ధమును, దక్షిణగోగ్రహణానంతరము విరాటధర్మజులచే పాచికలాడించి ద్యూతమును వర్ణించెను. ద్రౌపదిచే గల్లు దేరబంపి మధుపానమును వర్ణించెను. పాండవులు అజ్ఞాతవాసవత్సరమున బడినకష్టములను మరపించుటకోయన నంత్యమున అభిమన్యుని వివాహము వైభవోపేతముగ వర్ణింపబడెను. ఏ మూడునాలుగువర్ణనములో తప్ప నితరము లెల్ల నిండుపుష్టిగను సరసముగను వర్ణింపబడినవి.

ఈకావ్యమునకు నాయకత్వమున కర్హులు ముగ్గురు కలరు. వారు ధర్మజభీమార్జునులు.

"కం. కీర్తిప్రతాపసుభగుం
డార్తావనుఁ డఖిలగుణగణాఢ్యుఁడు బాహా
వర్తిత భూభరుఁడై పరి
కీర్తితుఁడగు భర్త కావ్యగీత ప్రియుఁడై."
(నరసభూపాలీయము)

అనియుండుటంబట్టి కీర్తి ప్రతాపము, ఆర్తావనత్వము, గుణాఢ్యత, భూభరత్వము కలిగిన వాడు నాయకత్వమున కర్హుడని తేలుచున్నది. ధర్మజుడు రాజసూయ మొనరించి ధర్మాపరావతారుడని పేరుగాంచెను.

"........భూరిప్రతాప మహాప్రదీప
దూరవిఘటిత గర్వాంధకారవైరి
వీరకోటీరమణి ఘృణివేష్టితాంఘ్రి
తలుఁడు కేవలమర్త్యుఁడే ధర్మసుతుఁడు."

ఇట్టులే భీమార్జునులుగూడ,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"కులము మహాభాగ్యము ను
జ్జ్వలత యుదారత మహా విశాలత ధర్మా
కలనయు వైదగ్ధియు"
(నరసభూపాలీయము.)

నను నాయకగుణంబుల జెన్నొంది కథారంగ మున ముఖ్యస్థానము వహించి నాయకత్వము నకు నర్హులగుచున్నారు. కాని తఱచిచూచితి మేని వీరిలో ధర్మజుఁడే నాయకుఁడని తేలుచు న్నది.

మొదట అర్జునుని గైకొందము. ఇతఁడు కులీనుఁడు; మహాభాగ్యశాలి; ఉజ్జ్వలపురుషో త్తముఁడు. ఇంద్రుని అర్ధాసనము నందిన మేటి. నివాతకవచకాలకేయాది మహాదానవవీరుల నెదిరించి నెగ్గిన ప్రతాపశాలి. గంధర్వహ స్త గతుఁడగు దుర్యోధనుని గాచినయుదారుఁడు. విరాటపర్వకథాభాగమున ప్రాధాన్యమునొం దిన యుత్తరగోగ్రహణసమయమున భీరుఁడగు యుత్తరుని సారథిగాఁగొని శస్త్రాస్త్రజ్వాలోష్మ స్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రులగు

"ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు
ద్రోణసుతుండును గర్ణుఁడుం బలు
త్రాణపరాయణత్వమున
దర్పసముజ్జ్వలభంగి నుల్లస
ద్బాణపరంపరల్ గురియ..."

వారిని తలపడి తనమార్గణాగ్నికి వారినాహుతి చేసి వీరవిహారముచేసిన రణకుశలుఁడు. ఇతని పాత్రము ముఖ్యమైన దయ్యును విరాటపర్వ పూర్వార్ధమున నామమాత్రముగానుండిభీముని ముందు నిస్తేజమై యున్నది. ఉత్తరార్ధమున నే ప్రాధాన్యము వహించు అర్జునుఁడు నాయకత్వ మునకు జాలఁడు.

రెండవది భీమునిపాత్రము—ఇతఁడు

"దుర్వారోద్యమ బాహువిక్రమ రసా
స్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన వి
ద్యా పారగుఁడు."

ఇతని

"...వలమూపులావు మును
నేలవహించిన నాగకూర్మ గో
త్రావనిభృద్దిశాకరుల
కారయనూరటపట్టు......సం
భావన భూజనంబులకుఁ
బంపుఁ......మహోగ్రకోపరే
ఖావిభవంబు వైరులకుఁ
గాలము చేరువ."

లోకకంటకులగు బకహిడింబ కిమ్మీర జరా సంధాది ప్రబలబలోదగ్రులగు రాక్షసులనెద రినో యడంచి ప్రజాసౌఖ్యమునొడగూర్చెను. అట్టివాఁడు తనకు గాలము చాలనపుడు వంటల వాఁడయ్యును నిజప్రతిభను జాటుచు మహా నసగృహాధ్యక్షుఁడై చెట్టులను గట్టిపుల్లలవలె విరచుచు, కీచకాదులను వధించుచు దక్షిణ గోగ్రహణమందువలె యుద్ధముచేయుచు తన వీరవిహారము నెడములేకుండ నెఱపి అర్జున ధర్మజాదుల మేఁటిమీరిన మహిత ప్రతాప శాలి. ఇతని నిష్కాపట్యము, క్రూరత్వము నెడల గల విముఖత, ధైర్యము, నిరుపమాన బలసత్త్వము, సాహసము, మొదలగు గుణ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భుజములు ఇతనికి ప్రధాననాయకత్వమునకు అన్హాత నిచ్చును. కాని ఇతడుధర్మజునిముందు స్వాతంత్ర్యము లేనివాడగుటచే ప్రధాన నాయకత్వమున కర్హుడు కాడు.

ఇక ధర్మజునిపాత్రవిషయము:

ఇతడు పాండవాగ్రజుడు. నాయక గుణ లక్షణ లక్షితుడు. కాని కథాగమనమున నితని భాగ మత్యల్పము. విరాటపురిలో ప్రవేశించిన తరువాత నాలుగైదుసారుల కన్న నెక్కుడు మన కితడు కనుపించడు. అదియైనను అక్కడక్కడ. కాని ఆసమయములు కథావిస్తృతికి ముఖ్యములైనవి. కీచకుడు ద్రౌపదిని తన్నినపుడు భీముడు ప్రళయకాల సమవర్తియట్లు యుగ్రుడై, యతని ననునయింప దిన్పురునపుడు హాలాహలము మ్రింగిన శివునియట్లు లాతని నడ్డి కోపానలము నార్పకున్న సమయభంగమై విరాటపర్వవృత్తాంత మన్యథా వర్తిల్లి యుండెడిది. అట్లే ధర్మసూతి దక్షిణ గోగ్రహణమున భీముని బలికొల్పక యూరకున్నచో సుశర్మ విరాటుని బందెగా గొనిపోయి యుండును.

భీమార్జునులను మహాయంత్రములను నడిపించు చతురుడు ధర్మజుడు. వారిబలము, వేగము సర్వమును ధర్మజునియాజ్ఞా దృఢబంధ సంయమితములు. ఇంతటి మహావీరులను ఇచ్చ వచ్చినటులు నడుపుచు తన చేతిలోని కీలు బొమ్మలవలె నాడించిన ధర్మజుని చాతుర్యమును, నడవడియును, సంయమమును సామాన్యములు కాజాలవు. అందుకుదో డతని సత్యనిష్ఠయును, శాంతమును చంద్రికకు చలువ వలె నతని గొప్పదన మినుమడింప జేయుచున్నవి. ఇట్టి ధర్మసూతి నాయకు డనుటకు సందియము లేదు. భీమార్జును లుపనాయకులు. ఒకరుపూర్వార్థమున, నింకొకరు ఉత్తరార్థమున ఉపనాయకులు; ధర్మజుడు నాయకుడు.

## రసవిచారణ

రసపోషణమున తిక్కనచూపిన యౌచిత్యము విపులవిమర్శనార్హమగుటచే నావిషయమును ప్రత్యేకించి యొకవ్యాసమున వివరింపనుంటిని. నవరసములను ఔచిత్యము చెడకుండ వానివానిప్రాముఖ్యమునకు విరోధము లేకుండ వర్ణించుటలో తిక్కనచూపిన నేర్పు ప్రశంసింపదగినది.

ప్రధానరసము నాయకుని యవలంబనమున వర్ధిల్లుట ప్రసిద్ధము. వసుచరిత్రము నందలి శృంగారము వసురాజు నూతగా గొని వర్ధిల్లినది. ప్రభావతీప్రద్యుమ్నమునందు ప్రద్యుమ్నుడు నాయకుడు. శృంగార మాతని నాశ్రయించెను. ఈవిధముగ జూచినచో విరాటపర్వమున ధర్మరాజు నాశ్రయించిన శాంతమే ప్రధానరసము కావలెను. శాంతమున కీకావ్యమునం దగ్రస్థాన మున్నదనుటకుగూడ కారణములు కలవు. అజ్ఞాతవాసము గడపుటకు ప్రతాపవంతులగు పాండవు లగ్గిచల్లబడినటులు శాంతమూర్తులుగాక తప్పదు. అదియే ధౌమ్యు డుపదేశించినది. అదియే ధర్మజు డవలంబించి తమ్ముల కుపదేశించినది.

ధర్మజునిశాంతము భీమార్జునుల వీరమును గొంతవరకును లోబరుచుకొని ప్రకాశించి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నది. ధర్మజునిశాంతమునకును, భీమునివీరమున నకును సంఘర్షణము ప్రాప్తించిన చోటులం దెల్ల శాంతమునకే పైచేయి యయ్యెను. అందుచే శాంతమే ప్రధానరసమని చదువరులను మానింపవలసిన యవసరముగూడ గలుగుచున్నది.

కాని విరాటపర్వమును జదివి పుస్తకమును మూసినయనంతరము భీముని బాహుబలప్రకటనోపయోగములగు సాహసకృత్యములును, అర్జునుని నిరంకుశవీరవిహారమును చదువరి మనఃక్షేత్రమున రాజ్యముచేసినట్లు ధర్మజుని శాంతము చేయలేదు. ఆతనిశాంతము ప్రశంసార్హమయ్యును భీమార్జునుల వీరము ముందర నిస్తేజస్కమగుచున్నది. వారి వీరమునకున్న నిశితత్వమును ప్రతిభయు ధర్మజుని శాంతమునందు గోచరించుటలేదు.

అదియును గాక వీరము పర్వమునందంతటను అనుస్యూతమై యున్నది. నిశ్చింతగ పాండవులు ఊడిగము సంగీకరించుట యందే వీరమున్నది. భీముని వినోద కృత్యములందు గూడ నున్నరస మిదియే. కీచక, ఉపకీచకాదుల సంహారమునందును, దక్షిణోత్తరగోగ్రహణములందును గూడ వీరము వ్యాపించియున్నది. ఇంత వ్యాప్తిగాంచిన వీరము ముందు శాంత మొదిగియుండుట యందాశ్చర్యము లేదు. అందుచే శాంతమునకు బ్రధాన స్థాన మబ్బకున్నది. వీరమే కావ్యము నందలి రసము. విరాటపర్వము వీర రసాత్మక మగు మహాకావ్యము.

నాయకుని యవలంబనమున ప్రధాన రసము పోషణము నొందినచో నాయకగుణ వర్ణనము విరివిగను, ప్రశస్తముగను జరుగుటయే కాక కావ్యమునందలి వివిధరసములకు సామరస్య మలవడి రసవైషమ్యము లేకుండ నుండును. కాని సోమయాజి యీవిషయమున మామూలుమార్గమును విడచి తన యద్భుత రచనాకౌశలమును జూపినాడు. ప్రధానరసము భీమార్జునుల యవలంబనమున వృద్ధిపొందినను ధర్మజుని పాత్రపోషణ యనువుగను, సంపూర్ణముగను, ప్రశంసా పాత్రముగను జరిగినది. నిరాక్షేపముగ నాయకుడు ధర్మజుడగుచున్నాడు. అంతమాత్రమున భీమార్జునుల పాత్రములకు న్యూనతగల్గుటలేదు. భీమార్జునులవలన ధర్మజునకుగూడ న్యూనతగలుగుటలేదు. వారి పాత్రపోషణము పరస్పర గుణప్రకటనమునకు సహాయకారియై కావ్యమునకు అందమునిచ్చుచున్నది.

రసప్రకటనముకూడ నటులే యున్నది. ఇందునవరసములును బ్రకటితములైయున్నవి. ఆయాస్థానములం దవి యుచితముగను, రసవంతముగను నొప్పియున్నవి. ఇన్ని రసముల నేర్పరించుటలో అలంతులగు కవులు రసాభాసమును దప్పక జేసియుందురు. పరస్పర విరుద్ధ స్వభావముగల శాంతవీరములకు ఇందుగుదిరిన మైత్రి యపూర్వము.

వీరము ప్రధానరస మగుటచే స్థాయీభావమును వహించుచున్నది.

ద్రౌపదీకీచకుల యాలంబనమున బెరిగినశృంగారము మూలమున ద్రౌపదీశోకమున స్ఫురించి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకరుణము, కీచకవధయం దుదయించిన అద్భుత రౌద్రములు పోషింపబడినవి. ఈశృంగారము గూడ స్వతంత్రమైన నిలుకడలేక భీమునివీరము నకు లొంగి యంగిరసముగా మారినది. ఇటులే ఉత్తరుని యవలంబనమున బెరిగిన హాస్య మును తత్సమయమున బోషింపడిన భయానక బీభత్సములును అర్జుననివీరమున కంగభావ మున మెలగుచున్నవి. అందుచే శృంగార కరుణాద్భుత హాస్యభయానక బీభత్సరౌద్ర ములు వీరమున కంగరసములై దానికి ప్రాధా న్యము నిచ్చుచున్నవి. మిగిలినది శాంతము. దీనికి ప్రత్యేకమగు నిల్కడ గన్పించుచున్నది. నాయకు నాశ్రయించియున్న యీరసమున కామాత్రము స్వతంత్రస్థాయియుండుట సమం జసమే.

ఇట్లు రెండురసములకును స్వాతంత్ర మగు అవలంబనమున్నను వానికి పరస్పర వైరుధ్యము సిద్ధింపకుండ సోమయాజిచూపిన నేర్పు చూడదగినది. ప్రధానరసమగు వీరము అవలంబనముగాగొనిన భీమార్జునులు నాయ కుడగు ధర్మజుని కనుసన్నల మెలగుటంజేసి యు, అతని సమక్షమున వీర మొదిగియుండు టంజేసియు, నాయకు నాశ్రయించిన వీరము నకు గౌరవమగు స్థానము కుదిరినది.

పురాణశకలమగు విరాటపర్వమును గా వ్యముగా మార్చి తిక్కనసోమయాజి గుణ రూపములందు మాతృకకును, తనగ్రంథము నకు ననేకవిషయములందు భేదమును గన్పర చెను. ఈభేదము లందముగను, రుచికరము లుగను నుండి పాఠకలోకమున కానందము నొసంగుచు తిక్కనయొక్క రచనాసామర్థ్య మును వేనోళ్ల జాటుచున్నవి. విరాటపర్వ మును గావ్యముగా మార్చుటచే సోమయాజి తెలుగుగ్రంథమునకు మూలమునందులేని చవి తెచ్చిపెట్టి పండితపామరజనానందానుసంధా యియై వారి కృతజ్ఞతకు బాల్పడినాడు.

---

## ఆత్మజ్ఞానము

(బరన్సుకవిపద్యమున కనువాదము)

కొప్పర్తి నారాయణమూర్తి గారు, బి.ఏ., యల్.టి. [సాహితీసమితి]


వ్యాసకర్త

మనల నొరులెరుంగుగతిని మనమె మనల
నెరుగ నద్దేని యొకవ్యక్తి వరలెనేని
ఎంత బాగుండునో యెంచ నెవరికగును?
తప్పులన్నిటిని మనము దాటగలము,
తెలివిమాలిన యూహలు తొలగిపోవు,
మనల భేదించు వైరము ల్మాయమగును!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ప్రసంగోచిత వేదవాక్యములు

పారసంది సర్వేశ్వరశాస్త్రి గారు

పఠన పాఠన శ్రవణములచే ద్విజులకు గొప్పఫలము నిచ్చు శ్రీమత్కృష్ణయజుర్వేదమున నచ్చటచ్చట ప్రసంగోపయుక్తములును రత్నసమానములు నగువాక్యము లనేకములు కలవు. అందు కొన్నిటిని మాత్ర మీదిగున సుజనమనోరంజనార్థము తెలియపరచుచు భాష్యానుసారముగ వానియర్థముంగూడ సంగ్రహించి వ్రాయుచున్నాను.

## సంహితాభాగము

కాండ ప్రపాఠ
ము కము

1. 1—5 "శతాయుః పురుషః"

పురుషుడు నూరుసంవత్సరము లాయుర్దాయము కలవాడు. ఇది సర్వసాధారణము. ఈ యాయుర్దాయము వారువారుచేయు ధర్మాధర్మములచే వృద్ధిక్షయముల నొందుచుండును.

2. 1—5 "త్వాష్ట్రాః పశవ ఉచ్యన్తే"

పశువులు త్వష్టృదేవసంబంధము లయినవి. జ్ఞానము లేనివానిని పశుసమానునిగ నెంచి ఆయర్థమున 'పీడాక త్వాష్ట్ర' మని పరిభాషతో నందురు.

3. 1—5 "రజతగ్ం హిరణ్య మదక్షిణ్యం"

వెండి దక్షిణగా నిచ్చుటకు యోగ్యముకాదు.

4. 1—7 "ప్రజాపతిః ప్రజా అసృజత"

బ్రహ్మదేవుడు ప్రజలను పుట్టించెను.

5. 2—1 "మనుష్యాస్సర్వాంవాచంవదన్తి"

దంతపటుత్వముకలవారు అక్షరలోపము లేక సంపూర్ణవనువాక్కులను పల్కుచున్నారు. మనుష్యులాంధ్రగీర్వాణాది సకలభాషారూప మను వాక్కులను పల్కుచున్నారనియు జెప్పనచ్చును.

6. 2—2 "పవిత్రంవై హిరణ్యం"

బంగారము పవిత్రమైనది=శుద్ధికరము

7. 2—2 "అగ్ని స్సర్వా దేవతాః"

అగ్ని సమస్తదేవతా స్వరూపుడు.

8. 2—2 "యద్వై కించ మను రవద త్తద్భేషజం"

మనువు ధర్మస్వరూపుడుగనుక నతడేమి మంత్రమునుగాని ధర్మమునుగాని చెప్పిన నదియౌషధప్రాయము. మనుధర్మశాస్త్రమునకు ప్రాముఖ్యము నిట్లువేదముకూడ చెప్పుచున్నది.

9. 2—3 "ప్రజాపతే స్త్రయస్త్రిగ్ంశ ద్దుహితర ఆసన్"

బ్రహ్మకు ముప్పదిముగ్గురు (అశ్విన్యాదులు) కుమారిక లుండిరి.

10. 2—3 "రూపమే వాస్యై తన్మహిమానం వ్యాచష్టే"

దీనిస్వరూపమే దీనిసామర్థ్యము జెప్పుచున్నది.

11. 2—5 "నానృతం వదేత్"

అనృతమును పలుకకూడదు.

12. 2—6 "అగ్నే స్త్రయో జ్యాయాగ్ సో భ్రాతర ఆసన్"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అగ్నికి ముగ్గురన్నలుండిరి. భూపతి, భువనపతి, భూతపతి అనువారలు.

13. 2—6 "మత్స్యంధియాధియామ్నాస్తీ"

అగ్నిశాపముచే జాలరులు బుద్ధిపుట్టినపు డెల్ల మత్స్యములను కొట్టుచున్నారు.

14. 5—2"న హ్యాపక్షః పతితు మర్హతి"

రెక్కలులేనివా డెగురజాలడు.

15. 5—4"సుకృతాం వా ఏతాని జ్యోతీగ్ం [షి య న్నక్షత్రాణి"

నక్షత్రములనునవి (అశ్విన్యాదులుగాక తక్కినవి) శాస్త్రోక్తపుణ్యకర్మములను చెప్పినట్లు చేసిన మహానుభావుల ప్రకాశములు.

16. 5—6 "ఆపోవా అగ్నే ర్భ్రాతృవ్యాః"

నీరు అగ్నికి వైరి.

17. 6—1 "ఏకహాయనా మనుష్యా వాచం [వదన్తి"

ఒకసంవత్సరము వయసుగల మనుష్యులు మాటలాడుట కుపక్రమింతురు.

18. 6—1"అర్ధోవా ఏష ఆత్మనోయత్పత్నీ"

భార్యతనకు అర్ధ భాగము=అర్ధాంగి.

19. 6—3 "ఏషవా అనృణో యఃపుత్రీ [యజ్వా బ్రహ్మచారివాసీ"

ప్రతిబ్రాహ్మణుడును పుట్టినతోడనే దేవ పితృ ఋణములలో నుండునుగాన నెవడు సంతానవంతుడును యజ్ఞములు చేసినవాడును, బ్రహ్మచారియై వేదాభ్యాసము జేయుచు గురుకులవాసము నొనర్చినవాడు నగునో యాతడే మీదజెప్పిన ఋణత్రయము లేనివాడ (అనృణుడు) గును.

20. 6—4 "త్రయః పశూనాగ్ం హస్తాదా [నాః పురుషో హస్తీ మర్కటః"

పశువులలో మనుష్యుడు, ఏనుగు, కోతి అను నీమూడుజాతులును వాని యాహారమును హస్తముచే గ్రహించి తినును. మిగిలిన గోమహిషాదులు చేతితో దీసికొనక ముఖముచేతనే గ్రహించితినును.

21. 7—4 "అగ్ని ర్హిమస్య భేషజం"

అగ్నిహోత్రుడు మంచునకు (చలికి)ఔషధము. అనగా చలిని పోగొట్టువాడు.

## బ్రాహ్మణభాగము

22. 1—4 "బ్రాహ్మణోవై సర్వాదేవతాః"

బ్రాహ్మణుడు సమస్త దేవతాస్వరూపు డని భావము.

23. 2—1 "వత్సం జాతం దశరాత్రి ర్నదు [హన్తి"

గోవు ప్రసవించిన (ఈనిన) పిదప పదిరాత్రులుగోవుయొక్క పాలుపితుకరు; అనగా నాగోక్షీరములు అపుడు త్రాగకూడదు. ఈసంగతి ధర్మశాస్త్రము నందును చెప్పబడియున్నది.

## ఆరణ్యకభాగము

24. 5—1 "ఉపదీకా యత్ర క్వచఖనన్తి [తదపోభితృదన్తి"

చెదలు వానిముఖముచే నెచటత్రవ్వునో యచట నీరుకల్గి ఆప్రదేశము చెమ్మగిలును.

## ఉపనిషద్భాగము

25. 1—11 "సత్యంవద; ధర్మం చర; మాతృదేవోభవ; పితృదేవోభవ; ఆచార్యదేవో భవ; అతిథిదేవోభవ"

సత్యమును పలుకుము; ధర్మముజేయుము; తల్లి, తండ్రి, గురువు, అతిథి, వీరలు దేవునివలె సేవింపదగినవారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

26. 4_11 "వృక్షస్య సంపుష్పితస్య దూరాం [ద్గంధో వాతి"

పుష్పించిన వృక్షముయొక్క పరిమళము దూరమునుండి వాయువుచే వీచబడును అనగా పరిమళము చాలదూరము వ్యాపించునని భావము.

27. 4_11 "అణోరణీయా న్మహతో మహీ [యాన్"

ఆత్మపదార్థము చిన్నవస్తువుకంటె చిన్నది. గొప్ప (పెద్ద) వస్తువుకంటె పెద్దదియు.

28. 4_10 "చత్వారిశృంగా త్రయో అస్య [పాదాః"

ఓంకారస్వరూపుడగు పరమాత్మకు నాలుగు కొమ్ములు మూడుపాదములును కలవు. అనగా అకారోకార మకారనాదములను నాలుగుశృంగము లనియు విశ్వతైజసప్రాజ్ఞులను మువ్వురు పాదములనియు భావము. మరియు, నాలుగువేదములు శృంగములు నిత్యబద్ధముక్త రూపములగు మూడును పాదము లనియును.

29. 4_63 "దానేన ద్విషంతో మిత్రాభవంతి"

ధనము నిచ్చుట దానము. దానిచే శత్రువులు కూడ మిత్రులగుచున్నారు.

30. 4_63 "లోకే ధర్మిష్ఠం ప్రజా ఉపసర్పన్తి"

లోకమున ధర్మమునందున్న వానిని (ధర్మాధర్మ నిర్ణయకార్థము) ప్రజ లనుసరింతురు.

---

# ప్రణయకథ

విద్వాన్ కోపల్లె శివకామేశ్వరరావు గారు

లేనక్కై కానె తపించుచుంటే; దరుణీత్వం బోచెలీ యింత చు
ల్కనయూనో; కడలేదొ యీవిరహనై ల్యచ్ఛన్నదుర్లోకలో
కనివాసంబున; కింత వంత కలదో కాంత ప్రతీషాతప
స్సున; నారుక్మిణి యేమి నోచినదె? కృష్ణుం డామె రూ పందురే?

నిలుమని యింతప్రేమ నవనీతము చూపి, మనస్వినీమన
స్సుల కది పూతగా నొసఁగి చొక్కఁగఁజేయుటయే మెఱుంగుఁగా
కల లలనారహస్యములయందలిభావము లేర్పరించు నే
ర్పులుగలవాఁడె వాఁడు, చెలి, పొమ్మిఁకఁ జెప్పకు వానివార్తలన్.

నిలువం డొక్కట, నెల్లయందునను దానే యుండఁగాఁగోరు చం
చలుఁ డయ్యో! తనచేయివట్టికొని యాశల్లేనియానందడో
లల నూఁగం దలపెట్టినాముగద, లీలామూర్తినింగోరి లీ
లలకు న్బాయుటకంటె నోచెలియ, మేల్గాదే తనుత్యాగమున్.

విసమగు వానిముచ్చటల విందొనరింపుము నాకు; దాన వె
క్కసమగు నీశరీరమును గాష్ఠసమానమునుగా ద్యజించి యా
ముసిముసినవ్వుతో నెదురుముద్దులకై మొగమిచ్చు మన్మనః
కుసుమరసప్రమత్తు యదుకుంజరు నాత్మకు నాత్మఁ జేర్చెదన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# శ్రీనాథకవిరాజీయము

కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు

(వెనుకటిసంచిక తరువాయి)



ప్రౌఢదేవరాయలు

(ప్రతీహారిం జూచి) వారి నిట శీఘ్రముగం బ్రవేశపెట్టుము; పొమ్ము. (కొలువుఁ గలయఁ బరికించి) విద్వాంసులారా! కవులార! మీరీ శ్రీనాథు నెఱుంగుదురా? ఈతఁ డేదేశము వాఁడు?

డిండిమభట్టు

వీని నేను గని యెఱుంగను గాని విని యెఱుంగుదును. ఈతఁడు మనకు శత్రువైన కొండవీటిరాజుకడ నుండిన తెలుఁగుకవి. శ్రీహర్షుని శృంగారనైషధముఁ దెలుఁగునకుం బరివర్తనము చేయుదు నని డుమువులు తగిలించి మామిడిసింగయ్య కిచ్చినాఁడు. కులమువాఁడు గావున నితని నతఁడు గౌరవించి రాజుకడ సన్మానము గలిగించినాఁడు. విద్యాసనాథుఁ డనునీశ్లోకాదిపదము నేతిబీరకాయవంటిది.

శ్రీనాథుఁడు

(శిష్యులతోఁ బ్రవేశించి) 'రాజ న్నభ్యుద యోస్తు తే' (చే యెత్తి దీవించును).

ప్రౌఢదేవరాయలు

కవిరాజా! ఇందు విశ్రమింపుము. (పీఠముం జూపును.)

(శ్రీనాథుఁడు విశ్రమించును.)

ప్రౌఢదేవరాయలు

(శ్రీనాథునిం జూచి) కవీంద్రా! మీనివాసంబునఁ బవిత్రమైనక్షేత్ర మెయ్యది?

శ్రీనాథుఁడు

"సీ. పరరాజగిరిదుర్గవరవైభవశ్రీలఁ
గొనకొనిచెడనాడు కొండవీడు
పరిపంథిరాజన్యబలముల బంధించి
కొమరుమించినచోడు కొండవీడు
ముగురురాజులకును మోహంబు పుట్టించు
గుఱుతైనయురిత్రాడు కొండవీడు
చటులవిక్రమకళాసాహసం బొనరించు
కుటిలాత్ములకుఁ గాడు కొండవీడు
జనసఘోటకసామంతసరసవీర
భటనటానేకహాటకప్రకటగంధ
సింధురారావమోహనశ్రీలఁ దనరు
కూర్మి నమరావతికి జోడు కొండవీడు."

డిండిమభట్టు

శ్రీనాథా! విద్యాసనాథుఁ డని పేరు పెట్టుకొంటివి. నీ వేశాస్త్రము లధ్యయనము చేసితివి? నీకవిరాజబిరుద మెట్టిది?

శ్రీనాథుఁడు

నావిద్యాభ్యాసము పెద్దలయనుగ్రహమే; బిరుదము నట్టిది యే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డిండిమభట్టు

నీవు తెలుఁగుకవిత్వము చెప్పుదువా?

శ్రీనాథుఁడు

సంస్కృతప్రాకృతాదికవిత్వమును.

డిండిమభట్టు

అబ్బా! సంస్కృత ప్రాకృతాదికవిత్వమును జెప్పఁ గలవా! నీకు శాస్త్రవాసన యున్నదా?

శ్రీనాథుఁడు

అది యిప్పుడు చప్పనిమాటలతోఁ జెప్ప నేమిటికి?

ప్రౌఢదేవరాయలు

కవిరాజా! నీవు పెక్కుదేశములు తిరిగి పెక్కుర నోడించిన గండరగండ వని వినుచున్నాము; సత్యమా?

శ్రీనాథుఁడు

దర్శనార్థి నై వ్రాసిపంచినపత్రమందే తద్విషయ మున్నది; చిత్తగింపుఁడు.

ప్రౌఢదేవరాయలు

(పత్రముం ద్రిప్పి చూచి) ఇం దేమి వ్రాసితివో నీవే చదువుము. (శ్రీనాథుని చేతి కిచ్చును.)

శ్రీనాథుఁడు

(పత్రముం బుచ్చుకొని)

"సీ. డంబు సూపి ధరాతలంబుపైఁ దిరుగాడు
కవిమీఁదఁ గాని నాకవచ మేయ
దుష్ప్రయోగంబుల దొరకొని చెప్పెడు
కవిశిరస్సునఁ గాని కాలు చాఁప
సంగీతసాహిత్యసరసవిద్యల నేర్చు
కవులఁ బొమ్మలు గాని కాల్చి విడువ
చదివి చెప్పఁగ నేర్చి సభయందు విలసిల్లు
కవినోరు గాని వ్రక్కలుగఁ దన్న
దంటకవులకు బలువైనయంటిమగఁడఁ
గవులవాదంబు విన వేడ్క గలిగె నేని
నన్నుఁ బిలిపింపు మాస్థానసన్నిధికిని
లక్షణోపేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర!"

ప్రౌఢదేవరాయలు

సంతోషము; సంతోషము. (డిండిముం డవలోకించి) కవీంద్రా! కొన్నినాళ్లనుండి వాదభోజనము లేక యుపవసించితి నని యింతకు మున్న చెప్పి యుంటివి కదా! ఇదె శ్రీనాథకవిసార్వభౌముఁడు. ఈపండితునితో శాస్త్రవాద మొనర్పుము. చూతము. (భటునిం దిలకించి) నీవు పోయి చంద్రభూషక్రియాశక్తి గురువర్యులం దోడుకొని రమ్ము.

భటుఁడు

మహాప్రభూ! వారు వచ్చి హజారుకడ నే యున్నారు. తోడుకొనివచ్చెద. (నిష్క్రమించును.)

చంద్రభూషక్రియాశక్తి

(ప్రవేశించి) "రాజ న్నభ్యుదయోస్తు తే."

ప్రౌఢదేవరాయలు

గురువర్యా! ఇందు విశ్రమింపుఁడు.

(చంద్రభూషక్రియాశక్తి విశ్రమించును.)

ప్రౌఢదేవరాయలు

పండితాగ్రణీ! ఈపండితు లిరువురును శాస్త్రవాదంబు గావించెద రఁట! వీరివాదోపవా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములు విని జయాపజయములు నిర్ణయింపఁ గోరుచున్నవాఁడ.

శ్రీనాథుఁడు

వాదమునకు మున్ను పణంబు నిర్ణయింప వలసియున్నది.

డిండిమభట్టు

నేను నావాదంబున నోడితి నేని నాసార్వభౌమ బిరుదమును వదలుకొని నాయీకంచుఢక్కం బగులఁ గొట్టించుకొందును.

శ్రీనాథుఁడు

నే నోడితి నేని నాసార్వభౌమబిరుదమును విస ర్జించుకొని యధోముఖుండ నై పోయెదను.

ప్రౌఢ దేవరాయలు

ఈసంస్థానంబున విజయ మందినవారికి స్వర్ణా భిషేకంబు చేయునాచారము కలదు గావున నే నట్లు కావించెదను.

చంద్రభూషక్రియాశక్తి

పండితులారా! మీ రిపుడు పెక్కుశాస్త్రం బులు చర్చింప నక్కఱ లేదు గాని యొక్క శబ్దవిచారముమాత్రము చేయుఁడు విందము.

డిండిమభట్టు

(శ్రీనాథునిదిక్కు మొగం బై) అయే! కిం బహునా; ఉచ్యతాం నిత్య శ్శబ్ద ఆహో స్వి త్కార్యః?

శ్రీనాథుఁడు

నిత్య మేవ హి శబ్దః న హి కార్యః.

డిండిమభట్టు

తత్ర కిం ప్రమాణమ్.

శ్రీనాథుఁడు

"సిద్ధే శబ్దార్థసంబంధే" ఇతి వార్తిక మేవ తత్ర ప్రమాణమ్.

డిండిమభట్టు

అహో కూలంకషం తే పాండిత్యం. కిం సిద్ధ శబ్దస్య నిత్యార్థకత్వం వర్ణ్యతే?

శ్రీనాథుఁడు

క స్తత్ర దోషః? సిద్ధా ద్యౌః, సిద్ధా భూః, సిద్ధ మాకాశ మితి లోకవ్యవహార మప్యజాన తా కి మాక్షిప్యతే.

డిండిమభట్టు

అస్తు నామ లోకవ్యవహారో నిత్యార్థవిషయ కః కిం నాస్తి కార్యార్థవిషయకో లోకవ్యవ హారః; సిద్ధ మన్నం, సిద్ధ స్సూపః, సిద్ధా య వాగూ రితి.

శ్రీనాథుఁడు

వర్తతాంనామ లోకవ్యవహారః నహి కార్య స్య సిద్ధత్వం వక్తుం శక్య మస్మిన్ తంత్రే "కిం కార్య శ్శబ్దోథ సిద్ధః" ఇతి వ్యాడినా సంగ్రహే పక్షద్వయవిచారః కృతః. తత్ర కార్యప్రతి ద్వంద్వి భావేన సిద్ధ శబ్దస్య ప్రయుక్తత్వా త్తస్య నిత్యార్థకత్వం సిద్ధం. త త్సమానతం త్రత్వా ద త్రాపి సిద్ధశబ్దస్య నిత్యార్థకత్వ మే వేతి నిర్ణయః.

డిండిమభట్టు

నను భోః కి మేతావతా ప్రయత్న వ్యాఖ్యా తవ్యతా శ్రమేణ య ద్యేవ మేవ స్వస్యా ప్యాశయ స్తదా ఆచార్యః కాత్యాయనః

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కిమర్థం నాపాదయేత్ "నిత్యే శబ్దార్థసంబంధే" ఇతి. తస్మాన్న నిత్య ఏవ శబ్ద ఇతి చతుర్ముఖే నాపి వక్తుం శక్యం; కిముత భవతా ఏకముఖేన.

శ్రీనాథుఁడు

అలమలం భో స్సర్వజ్ఞంమన్య! శ్రుణు. అయం ఖలు నిత్యశ్శబ్దః నావశ్యం కూటస్థేష్వవిచాలిషు భావేషు దృశ్యతే. కింతు "నిత్య ప్రహసితః, నిత్యప్రజ్వలితః" ఇత్యాభీక్ష్ణ్యేఽపి వర్తతే. త దత్రాపి నాపాకృతః ప్రయత్న వ్యాఖ్యాత వ్యతాశ్రమః. తత ఏ వాచార్యః కాత్యాయనః "మంగళా దీనీహ శాస్త్రాణి ప్రథంతే వీరపురుషాణి చ భవంతి. ఆయుష్మత్పురుషాణి అధ్యేతారశ్చ సిద్ధార్థా యథా స్యు"రితి న్యాయానురోధేన మంగళ ముద్దిశ్య 'వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి ర్నహి సందేహా దలక్షణ' మితి వ్యాఖ్యానేన నిత్యార్థకతాం చ నిశ్చిత్య ఏకనాళే ఫలద్వయవత్ ఏకశబ్దే నైవఅర్థ ద్వయలాభం సంపాదితవాన్ అతః శబ్దః నిత్య ఏవ నతు కార్య ఇతి సిద్ధాంతః. అత్రముఖపిధాన మేవ భవత శ్శరణమ్.

చంద్రభూషక్రియాశక్తి

పండితులారా! మీరిఁక వాదింపనక్కఱలేదు. మీ వాదోపవాదములు నిలుపుఁడు. మహారాజా! మన డిండిమభట్టారకునివాద మోడినది. శ్రీనాథకవిసార్వభౌముని వాదముగెలిచినది.

ప్రౌఢదేవరాయలు

డిండిమభట్టారకా! నీ సార్వభౌమ బిరుదము పోయినది. నీడిండిమముం దీసి యటుపెట్టుము. శ్రీనాథా, నీవు సార్వభౌముఁడ వైతివి.

శ్రీనాథుఁడు

మఱి యితర శాస్త్రములందుఁ గాని కవిత్వమందుఁగాని నన్నుఁ బరీక్షింప నెంతురా?

ప్రౌఢదేవరాయలు

నీవు సర్వసమర్థుఁడవు నిన్నుఁ బరీక్షించుటకు మముబోంట్లు చాలరు. నీవుశారదాదేవి యవతార మని నామదికిం దార్కాణమైనది. నీగ్రంథరాజములే నీకవితా మహత్త్వమును వేయినోళ్లం జాటుచున్నవి. వేఱుపరీక్ష యేమిటికి?

(డిండిమభట్టుకంచుఢక్కం దెచ్చి రాజునెదుటఁ బెట్టును.)

(ప్రౌఢదేవరాయలు దానింబగులఁగొట్టించును.)

డిండిమభట్టు

(తనలో) అయ్యో! నాపేరంతయు నొక్కశబ్దములోనే పోయినది. ఇఁక నిట నుంటినేని మఱియుఁ బరాభవం బగును. (దీనవదనుఁడై ముఖవస్త్రము వైచుకొని నిష్క్రమించును.)

(భటులుస్వర్ణ నిష్కాద్యభిషేక ద్రవ్యంబులు దెచ్చిపెట్టుదురు.)

ప్రౌఢదేవరాయలు

సార్వభౌమా! స్వర్ణాభిషేకముం గావించెదము; సన్నద్ధుఁడ వగుము.

శ్రీనాథుఁడు

"చ. జననాథోత్తమ, దేవరాయనృపతీ,
చక్రేశ, శ్రీవత్సలాం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఘన సంకాశ మహాప్రభావ, హాదిర
  షౌ దక్షు! నాబోటికిన్
గు నృపస్తోత్ర సముద్భవం బయిన వా
  గ్దోషంబు శాంతంబు గాఁ
గనకస్నానము చేసి కాక పోగడం
  గా శక్యమే దేవరన్."

ప్రౌఢదేవరాయలు

(శ్రీనాథుని మెడలోఁ బుష్పహారము వైచి స్వర్ణాభిషేకము చేయును.)

శ్రీనాథుఁడు

(రాజు దిక్కు మొగంబై)

"శా. జోటీ! భారతి! యోర్భటిన్ మెఱయు మీ
  చోద్యంబుగా నేను గ
ర్ణాటాధీశ్వరు దేవరాయనృపతి
  న్నానీరధాటీ చమూ
కోటీఘోటక ధట్టికాఖురపుటీ
  కుట్టాక సంఘట్టన
స్ఫోటీధూత ధరారజశ్ఛళులు కితాం
  భోటిం బ్రశంసించెదన్. "

[తెరపడును.]

---

స్థలము-మెదకుదుర్గపరిసరమార్గము

[శ్రీనాథుఁడు శిష్యులతో నడుమడుఁ బ్రవేశించును]

శ్రీనాథుఁడు

శిష్యులారా! మనకుఁ బ్రౌఢదేవరాయల యాస్థానమున విజయంబు సిద్ధించినది. మఱియుం గొన్నిసంస్థానముల విజయంబు నొంది శ్రీశైలయాత్ర సేవించుకొని యిల్లు చేరం దలంచి యిప్పురంబున కరుదెంచితిమి కదా! ఇట నెట్లు ప్రవర్తింపఁ గలమో తెలియదు.

శిష్యులు

కవిసార్వభౌమా! డిండిమభట్టారకుని డిండిమము పిండిపిండి గావించినప్పుడే మీకు సర్వదేశవిజయ మనుట సిద్ధాంతము. ఈసంస్థానమన నెంత?

శ్రీనాథుఁడు

అట్లనరాదు. ఈసంస్థానాధీశ్వరుండు విద్వదగ్రేసరుఁడు; సర్వజ్ఞబిరుదాంకితుఁడు. బహుగ్రంథకర్త యై ప్రఖ్యాతిం గన్నవాఁడు.

"సీ. క్షితిలోన సర్వజ్ఞసింగనృపాలుండు
  బలవైరిసన్నుతపౌరుషుండు
లలిఁ గావ్యనాటకాలంకారచతురుండు
  సకలశాస్త్రార్థవిశారదుండు
వలనొప్ప సింగభూపాలీయనామక
  గ్రంథంబు రచియించెఁ గౌతుకమున
మును భాగవతమును దెనుఁగుచేసినయట్టి
  బమ్మెరపోతన బాగుమీఱఁ
దనకుఁ జెప్పినభోగినీదండకమును
వెలయ నితరకవీంద్రులు విప్రవరులు
కోరి చెప్పినపద్యముల్ కొని ముదార్తిఁ
బెంపుతో వారి మన్నించి పేరు వడసె."

శిష్యుఁడు

బ్రాహ్మీదత్తవరప్రసాదుల కసాధ్యం బేదియు నుండదు.

శ్రీనాథుఁడు

అంతేవాసీ! నీవు మంచిసమయమున స్మరణకుం దెచ్చితివి. నే నిట విశ్రమించి సరస్వతిం బ్రస్తుతించి ప్రత్యక్షంబు చేసికొనియెదం గాక. (సుఖాసనాసీనుఁడై కనులు మూసికొని ధ్యానించి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"సీ. దీనారటంకాల దీర్ఘమాడించితి
దక్షిణాధీశుముత్యాలశాల
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకుఁ
బగులఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టుకంచుఢక్క
చంద్రభూషక్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద
మెటులు మెప్పించెదో నన్ను నింక మీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణనికురుంబ, శారదాంబ!"

(శారదాదేవి ప్రత్యక్షమై శ్రీనాథునిశిరముపైఁ గరము వెట్టి దీవించి యంతర్ధానమగును.)

(శ్రీనాథుఁడుశిష్యులతో లేచినిష్క్రమించును.)

---

స్థలము—సభాభవనము

[అపటీక్షేపంబున సింహాసనాసీనుఁడైనసింగ భూపాలుఁడు మంత్రిసామంతాదులతోఁ గొలువుదీరి కానుపించును.]

సింగభూపాలుఁడు

శ్రీనాథకవిసార్వభౌముఁడు పెదకోమటి వేమ భూపాలుని యనంతరము తనవిద్యావైశద్యమున దిగ్విజయంబు సేయ నెంచి వివిధదేశంబులం బరిభ్రమించుచుఁ బ్రౌఢదేవరాయల యాస్థానంబునకు వచ్చి నానావిద్యల వాదోపవాదములు ప్రస్తరించి గౌడడిండిమభట్టు నోడించి వానికంచుఢక్కం బగులఁ గొట్టించుటయె కాక రాయలముత్యాలశాలలోఁ గనకాభిషేకంబు నొంది యున్నవాఁడట! అట్టి మహాకవిసందర్శనభాగ్యంబు నను బోఁటి వాఁటికి లభించునే? లభించినఁ గదా నాజన్మము సాఫల్య మగుట.

మంత్రి

అవు నది యట్టిదియే. కాని దిగ్విజయంబు సేయ నెంచినకవి మనయాస్థాని విజయంబు నొందకున్న నితరవిజయంబు విజయంబా? శ్రీనాథుఁ డీ శైలుంగఁడా? అతం డేల సర్వజ్ఞశిఖామణిం జూడ రాకుండును? రాకున్న నాఁటికిఁ జూచుకొందము. ఇప్పు డీకొందలం బేమిటికి?

దౌవారికుఁడు

(ప్రవేశించి) శ్రీనాథుఁ డనుకవిసార్వభౌముఁడు దర్శనార్థియై శిష్యులతో వచ్చి హజారము కడ వేచియున్నవాఁడు.

సింగభూపాలుఁడు

హా హా! ఆడఁ బోయినతీర్థ మెదు రైనట్లు మాటలోనే మహాకవి దర్శనమిచ్చుచున్నవాఁడు. దౌవారికా! ఆపండితోత్తముని శీఘ్రమునం బ్రవేశపెట్టుము.

దౌవారికుఁడు

చిత్తము. (నిష్క్రమించును.)

సింగభూపాలుఁడు

మంత్రివర్యా! మన మందఱ మమ్మహాకవి కెదురేగి తోడ్తెత్తము. తెచ్చి యిచ్చకొలఁదిఁ బూజించి పుత్తము.

(అందఱు లేచియెదురేగుచున్నారు.)

(సింగభూపాలుఁడు శ్రీనాథునిచేయి పట్టుకొని తోడ్కొని వచ్చి సింహాసనంబుకడ నున్నతాసనంబునఁ గూరుచుండఁ బెట్టుచున్నాఁడు.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(అందఱు ఆసీను లగుచున్నారు.)

సింగభూపాలుఁడు

గౌడడిండిమభట్టుకంచుఢక్కాంబగుులఁగొట్టించి కనకాభిషేక మందఁ గలిగినమహావిద్వాంసుని సందర్శనంబు లభించుట మహాభాగ్యము.

శ్రీనాథుఁడు

రాజా! నీవు సర్వజ్ఞుఁడవు. నీదర్శనము మముఁబోంట్లకు మహాభాగ్యము.

సింగభూపాలుఁడు

సార్వభౌమా! నీవు రచించిన ధనంజయవిజయాదిగ్రంథములు విని నిన్ను దర్శింప నెన్నియోనాళ్లనుండి కోరుచున్నవాఁడ. నీశృంగారనైషధము దివ్యామృత ధారాపూరమఁట! నీ వాకావ్య మేమార్గమున నాంధ్రీకరించితివి?

శ్రీనాథుఁడు

అశేష మనీషిహృదయంగమంబుగా శబ్దంబు ననుసరించియు, నభిప్రాయంబు గురించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాపాదించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారంబు రచించితిని.

సింగభూపాలుఁడు

"శ్లో. విజ్ఞాపనీయా న గిరో మదర్థాః
వృథా కదుష్ణే హృది నైషధస్య;
పిత్తేన దూనే రసనే సితాపి
తిక్తాయతే హంసకులావతంస!"

ఈశ్లోకంబునకు నీయాంధ్రీకరణం బెట్లు?

శ్రీనాథుఁడు

"తే. అధికరోషకషాయితస్వాంతుఁ డైన
నరపతికి విన్నవింపకు నాయవస్థ
పైత్యరోగోదయంబునఁ బఱుస నైన
జిహ్వకకుఁ బంచదారయుఁ జేఁదు కాదె."

సింగభూపాలుఁడు

"కుక్కావా నక్కావా ఫణివో
క్రోఁతివా పిల్లివా భూతపిల్లివో."

ఈ సమస్యను మనోహరంబుగం బూరింపుము. ఇది యీభట్టోసంగినాఁడు.

శ్రీనాథుఁడు

"ఉ. తక్కక రావుసింగవసు
ధాధిపుఁ డర్థుల కిచ్చుచున్నచో
దిక్కుల లేనికర్ణుని, ద
ధీచిని, ఖేచరు, వేల్పుమ్రానుఁ, బెం
పెక్కినకామధేనువు, శి
బీంద్రుని నెన్నెదు భట్ట, దిట్టవై
కుక్కావా నక్కావో ఫణివో
కోఁతివా పిల్లివా భూతపిల్లివో."

సింగభూపాలుఁడు

గోలకొండ, మాలముండ, పూలదండ, కొత్తకుండ-ఇవి వచ్చునట్లు భారతార్థముగా నొకపద్యము చెప్పుము.

శ్రీనాథుఁడు

"తే. ఓయి! కురురాజ! నీకొడుకు కొత్తగోల
కొండవిధ మాల ముండఁ గృష్ణుండు కాచి
పాండుసూనుల గెల్పించు నండ యగుచు
నుదరమునఁ బూలదండ రే కొత్తకుండ."


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సింగభూపాలుఁడు

ఆహా! సార్వభౌమా! నీసమస్యాపూరణం బెంత మనోహరము! కర్ణాదులం జెప్పి కుక్కనక్కాదులం జెప్పుట యెంత గంభీరము! ఇట్లు చెప్పుట నీక కాని మఱి యెవ్వరికిఁ జెల్లును? నీయాంధ్రీకరణమును మూలము నకు మెఱుఁగు వెట్టుచున్నది. నీవుపుంభావ సరస్వతివి. నిన్నుఁ బొగడ నస్మదాదు లలం తులు.(అని కర్పూరతాంబూలాంబరాభరణా దులర్పించుచున్నాఁడు.)

శ్రీనాథుఁడు

(స్వీకరించి)

"క. సర్వజ్ఞనామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును నితరుని
సర్వజ్ఞుండనుట కుక్క సామజ మనుటే."

సింగభూపాలుఁడు

కవిరాజా! నీవు మానగరంబునఁ గొన్నినా ళ్లుండి విద్యావినోదమ్ముల మమ్మలరించిపోఁ బ్రార్థించుచున్నవాఁడ.

శ్రీనాథుఁడు

అది నాకుఁ బరమానందమ కాని శ్రీశైలం బునకుఁ బోఁదలంచితిని. ఆజ్ఞ యొసంగుము.

సింగభూపాలుఁడు

నీయనుగ్రహము; కవిరాజుల శాసించుటకు రాజులు సమర్థులు కారు. పోయి రమ్ము, పునర్దర్శనం బొసంగుము.

(శ్రీనాథుఁడు లేచి రాజు నాశీర్వదించి శిష్యులతో నిష్క్రమించును.)

(అందఱు లేచి కవిరాజు ననుసరింతురు.)

---

స్థలము—శ్రీశైలమల్లికార్జునాలయము.

[శిష్యులతో శ్రీనాథుని ప్రవేశము]

శ్రీనాథుఁడు

(చేతులు జోడించుకొని మల్లికార్జును నెదుట నిలిచి)

"జయ సోమ నమో జయ రుద్ర నమో
జయ జయ పశుపతి దేవ నమో
జయ తామ్ర నమో జయ శృంగ నమో
జయ జయ ఖలసమిదుగ్ర నమో
జయ భీమ నమో జయ శర్వ నమో
జయ జయ శివతర శీల నమో
జయ దేవ నమో జయ వర్గ నమో
జయ జయ మునివరపాల నమః."

"అపరాధసహస్రసహస్రకరా
నపిభక్తజనాన్ భవదంఘ్రినతిః;
ప్రవణా నవ నీదృశ మీశ్వర, మాం
కృపయా పరిపాలయ కృష్ణనుత!"

(అంతఁ బువ్వులశాంతయ్య యనుజంగమదేవర కవిరాజు ననుసరించును.)

శాంతయ్య

(చేతులు జోడించుకొని)

"తే. నీవొనర్చిన కృతులెల్ల నేనువింటి
స్కాంద పౌరాణికములైన కథలలోన
ఘనత శివరాత్రిచరితంబు తెనుఁగు గాఁగ
గరుణఁ జేయుము శ్రీనాథకవివరేణ్య!"

శ్రీనాథుఁడు

అట్లయగుంగాక! నీకభ్యుదయ పరంపరాభివృద్ధి యగునట్లు అష్టాదశవర్ణ నాగర్భంబుగా శివ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాత్రిమాహాత్మ్యంబు రచించి నీ యభీష్టంబు తీరిచిపోయెదం గాక!

శాంతయ్య

కవిచంద్రా! సంతోషం బయ్యె. నీ వియ్యెడం గలుగున శేషవిశేషంబు లరసి పోఁ బ్రార్థించుచున్న వాఁడ.

శ్రీనాథుఁడు

ఇం దణిమాదిసిద్ధులును, సిద్ధౌషధంబులును, మఱియు ననేక మహత్త్వంబులును గల వని విందు. అవి యన్నియు నీ వెఱుంగుదేని మా కెఱింగింపుము. పోవుదము రమ్ము.

[నిష్క్రమింతురు.]

---

స్థలము.—మార్గము

[శ్రీనాథుఁడు శిష్యులతో నడచుచుఁ బ్రవేశించును.]

శిష్యుఁడు

గురూత్తమా! మనముచూడఁగలుగు నుత్తమ క్షేత్రంబులు, సంస్థానంబులుఁ జూచితిమి. ఇఁక స్వదేశంబునకుఁబోయి యొకమహారాజు నాశ్రయించి స్థిరనివాసం బేర్పఱచుకొనుట యొప్పు నని నాయభిప్రాయము.

శ్రీనాథుఁడు

నీవు చెప్పినమాట నిశ్చయమే కాని యిపుడు మన కట్టియాశ్రయులెవ్వరో తోఁపకున్న యది.

శిష్యుఁడు

కలఁడు గదా రాజమహేంద్రవర పురాధీశ్వరుఁడు. అతఁడు మన కాటయవేమారెడ్డికూతురనితల్లికి వల్లభుండు. కాటయవేమారెడ్డి తన కూఁతు నల్లాడరెడ్డి రెండవకొడుకైన వీరభద్రారెడ్డి కిచ్చి వివాహముచేసినాఁడు. అతనియన్న వేమారెడ్డి. ఇప్పు డారాజ్యము రాణివంక నైనది గావున వేమారెడ్డి తమ్ముని వీరభద్రారెడ్డిని రాజుఁజేసి పరిపాలించుచుండెను. మీరు బాల్యమునుండియు రెడ్డిప్రభువులకవులు గావున నిపుడును రెడ్డిప్రభువునే యాశ్రయించుటఁ బోలు నని తలంచెదను.

శ్రీనాథుఁడు

నేను పెదకోమటి వేమభూపాలు నాశ్రయించి యుండినవాఁడ నగుటచే వారు వానిపైఁ గల వైరంబు నాపైఁ బూనియుందురేమో యని సందేహించుచున్నవాఁడ.

శిష్యుఁడు

ఇట్టి సందేహమున కవకాశములేదు. అక్కడ మీకు ముఖ్యబాంధవుఁడు మంత్రియై యున్నవాఁడు. వాని మూలమున రాజాశ్రయము సులభసాధ్యము.

శ్రీనాథుఁడు

ఆమంత్రి యెవ్వరు?

శిష్యుఁడు

"సీ. ఏమంత్రికుల దైవ మిందుశేఖరుఁడు ద
క్షారామ భీమేశుఁ డఖిలకర్త
యేమంత్రి యేలిక యిక్ష్వాకుమాంధాతృ
రామసన్నిభుఁడైన వేమనృపతి
యేమంత్రి సితకీర్తి యేడువారాసుల
కడకొండయవలిచీఁకటికి గొంగ
యేమంత్రిసౌభాగ్య మిగురుఁగైదువ జోదు
లాలిత్యలీలకు మేలుబంతి

యతఁడు కర్ణాటలాటభోటాంగ వంగ
కురుకుకురు కుంతలావంతి ఘూర్జరాది
నృపసభాస్థాన బుధవర్ణనీయసుగుణ (డు."
మండనుఁడు బెండపూఁడన్న మంత్రివరుఁ

శ్రీనాథుఁడు

ఓహో! మంచియాలోచనమే చెప్పితివి. మన మిపు డన్నమంత్రిదర్శనమునకుం బోవుదము రండు. [నిష్క్రమింతురు.]

---

స్థలము—అన్నామాత్యునిహజారము – రాజమహేంద్రవరము

[శ్రీనాథుఁడు శిష్యులతోఁ బ్రవేశము]

శ్రీనాథుఁడు

(హజారముకడ దౌవారికుం జూచి) దౌవారికా! మీమంత్రీశ్వరుం డిపు డేమిచేయుచున్నవాఁడు? మాకు దర్శనము లభించునా?

దౌవారికుఁడు

"సీ. భాట్ట ప్రభాకర ప్రస్థాన సంవేద్యు
లుద్దండపాండిత్యు లొక్కవంక
ఫణిపభాషితభాష్య ఫక్కికాభావజ్ఞు
లుత్తమప్రాగల్భ్యు లొక్క వంకఁ
గణభుఙ్మతగ్రంథ గాఢార్థవిధులబా
హుశ్రుత్య సంపన్ను లొక్కవంక
వేదాంతవాసనా విశ్రాంతహృదయజ్ఞు
లుపనిషత్తత్త్వజ్ఞు లొక్కవంక
ఉభయభాషాకవీశ్వరు లొక్క వంక
వేశ్య లొకవంక నొకవంక వీరభటులు
బలసి కొలువంగ నిప్పుడు కొలువుదీరె
బెండపూఁడన్న మంత్రీశ్వరుండు మిగుల."

శ్రీనాథుఁడు

ఓహో! సకలవిద్యాసనాథుండు శ్రీనాథుండు దర్శనార్థియై వచ్చి యుండె నని మీమంత్రివర్యునితోఁ జెప్పిరమ్ము; పొమ్ము.

దౌవారికుఁడు

(లోనికిం జని చెప్పి నట్లు సభ దీరిన అన్నామాత్యునిఁ గని) మహామాత్యశిఖామణీ! శ్రీనాథకవిసార్వభౌముఁడు దర్శనార్థము వచ్చి యున్నాఁడు.

అన్నామాత్యుఁడు

ఓహో! నేఁ డెట్టిపుణ్యదినము! వెదుకఁబోయిన తీవ పాదంబులకుం దగిలినది. ఓరీ! నీవు పోయి శీఘ్రమున వానిం దోడ్కొనిరమ్ము.

దౌవారికుఁడు

చిత్తము. మహామాత్యులయాజ్ఞ. (నిష్క్రమించును.)

అన్నామాత్యుఁడు

(కొలువు గలయం బరికించి) విద్వాంసులారా! ఈ శ్రీనాథుఁడు సకలవిద్యాపారంగతుఁడు; మా కమలనాభునిపౌత్త్రుఁడు; నాకు బాంధవుఁడు; ఎన్నోనాళ్లనుండి వీనిని గన్నులారఁ జూచి యానందింప వలయు నని నాసంకల్పము. అది నేటికి సఫలమైనది. వీని నర్థించి నేనొక కృతి నంది కృతార్థుఁడ నయ్యెదం గాక!

[సశేషము]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఏక్షణము కేమొ, యెవ్వ రూహించగలరు?

బొమ్మకంటి సత్యనారాయణరావు గారు

లలితనిర్మల సుస్నిగ్ధ విలసితాంబ
రస్థలిని గ్రమ్ముకొనుచుండె ప్రావృడంబు
దములు గాఢవినీలసుందరసుకాంతి
శోభితాభిరామములయి! చూడ్కిఁ గముల
కెడనెడ దటిల్లతలు ముద మిఱుచునుండె!
నతిశయోత్సాహపారవశ్యమున నలరు
కేకిలోకంబు దక్క భయాకులంబు
లగుచునుండ బ్రాణివితతు లన్ని నడుమ
నడుమ మిన్నుముట్టుచునుండె గడుఁ గఠోర
గర్జనారావములు! ప్రభాకరుఁడు సైత
మెచ్చటనొ కాని దాగుండె యీప్రకృతివి
చిత్రవిలసన మొకటి వీక్షించుచుండె!!

* * * *

నిట్టి యతిశయానిర్వాచ్యదృశ్యమున నొ
కానొకమహీరుహాగ్రశాఖాంచలమున
గల దధివసించి చాతకాంగన యొకర్తు!!

* * * *

కడపినది మెట్టెటులో పెద్దకాల మనుది
నంబు కల్పంబుగా నీరదాంబుబిందు
వితతిగ్రోలెడు నాస! దద్విమలభాగ్య
గరిమ నేఁటెంచె నాషాఢ మరయ నేఁటి
కభిమతార్థంబు చేకూఱు నట్టికాల
పరిమితి కడుంగడుఁ సమీపస్థమగుచు
నుండె! "నిక గొన్ని నిముసము ల్నిండి నంత
నే మదాకాంక్షితము గల్గు, నేమనందు
నోర మద్భాగ్య!" మంచు నపార సంత
సాంబుధి నిమగ్నచిత్తయై చండగతి వి
సరెడి మారుతమును గూడ సరకుగొనక,
తోడి పక్షిసమూహము జాడ నేని
గాంచ నెంచక, వివృతాస్యగహ్వరయయి
నిక్కి జలదవినిర్గత నీరకణస
మాభిలాష నుద్గ్రీవయై సానుమోద
బాష్పలోచనము ల్నింగిపై నిగుడ్చి
మించువేడుకతో నిరీక్షించుచుండె!!

* * * *

కాని వివరింపగలమె యఖండ నిరుప
మాన దుర్జ్ఞేయప్రకృతి విధానమేమొ?

* * * *

తన్మయత జూచు చాతక తన్వి నోట
నొండు రెం డంబుకణములే యూడిపడునొ;
లేక భీకరాశనిపాతమే కలుగునొ;
ఈశ్వరాదేశ మెట్టిదో యెవని కెఱుక?
ఈవిశాలప్రకృతితత్త్వ మెవ డెఱుంగు?
యేది యెటులగునో చెప్ప నెవ్వఁడోపు?
నేఁగడియ కేమొ యెవ్వార లెంచగలరు?
ఏక్షణము కేమొ యెవ్వ రూహించ గలరు?!!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# క్రొత్తపల్లి సూర్యారావు గారు

(వెనుకటి సంచిక తరువాయి)

## నాలుగవ యంకురము

మా పుట్టినిల్లు గ్రామములో నాళ్లనడుమ నున్నది. పెద్దవీథిలో వచ్చిపోవువారి కంటికిఁ జటాలున నెదురుగాఁ గనఁబడును. మా నూతినీళ్లు మంచివే కాని కోటికి వెళ్లియే నీళ్లు త్రాగుటకుఁ దెచ్చుకొందుము. తక్కిన యన్నింటికి నూతినీళ్లే-బాఁకెఁడుత్రాఁడు. ఎంత చేతగాని వారు వండినను బప్పుకూడ నుడుకును. ప్రయాణికులు దాహమునకని మా యింటికిఁ దఱుచుగ వత్తురు. చైత్ర వైశాఖములలో గాడుపు లేచెవిగాలి యాచెలికిఁ గొట్టునపుడు, కాలువలు గట్టివేసినపుడు- గోతులలో నీళ్లుండవు. కోనసీమకుఁ గొబ్బరిచెట్టువలెఁ దుమ్మచెట్టు మా దేశమునకుఁ గల్పవృక్షము. ఎవ్వరో మహానుభావుఁడు చెప్పిన "దాళవావరిముళ్లు తఱచు దుబ్బులకోళ్లు" అను రఘుల్లి సీమపద్యములోఁ జోటుచాలక కాఁబోలును దుమ్మముళ్లని పెట్టలేదు. తుమ్మముండ్లు గ్రుచ్చుకొని రేవటిబెడ్డలలోఁ గాలెత్తియెత్తివేయుచు నడిచి నోరెండి మాయూరు నడ్డుపడి పోరుగూరు పోవువారు కొంచెము సేపు మా వీథియరుఁగుమీఁదనో చావడిలోనో కూర్చుండి, యూరవైచిన యుసిరిగకాయనమలియో రెండుపచ్చడి బద్దలు చప్పరించియో యిన్ని మంచినీళ్లు త్రాగి ముండ్లుతీసికొని- కొంత విశ్రమించి వెళ్లుచుందురు. మా పొలములోని యొక్క యుసిరిగచెట్టుకాయలను మా యమ్మ యిందుకే వినియోగించును. మాకుఁ బాఁడితక్కువ. ఒక్క గేదెయు నొక్క యావును గలవు. రెంటిలో నేదో యొకటి పాలిచ్చిన దానిలోనే కొంచెము మజ్జిగ తేటతీసి బ్రాహ్మణుల యింటంగూడఁ దీర్థోపయోగము చేయమను శీలముగలవారువచ్చి సూర్యతాపమునకు జంకి ప్రాణధానము చేయుటకై- యాపద్ధర్మముగాఁ గొంచెము మజ్జిగ వ్రేలు ముంచియైన నిన్నినీళ్లు శుద్ధిదాహమునకేర నిమ్మని యడుగుదురని జాగ్రత్తచేసియుంచును. దినమున కొక్కరైనను దాని నుపయోగించువారు వత్తురు. అర్ధరాత్రమున బండ్లలోఁ బోవునుఁ బిల్లలు దాహమని చెప్ప లేక యేడ్చునపుడు రాత్రులు కూడ నెవ్వరో యప్పడపుడు లేపుచుండువారు. మా యమ్మకుఁ జాలినంత మంది బిడ్డలు లేకపోవుటనో సహజముగానో పిల్లలపై దయయెక్కువ. చంటిపిల్లలకుఁ బాలుకావలయునాయని యడుగును. ఇప్పటికాలములోవలె నప్పుడు చాలినంత స్తన్యము లేని తల్లులుతక్కువ. పిల్లలపై దయగలది యగుటయే ముఖ్యము; లేకున్న నాఁడుఁబడుచమనుమరాలిని, అన్నకూఁతురును— చెప్పవలసివచ్చె నాయన్నకూఁతురనఁగాఁ బ్రేమయుండును గాని వదినెకూఁతురనిన నంతను. అర్థమొక్కటియేయైనను మాటలపలుకుఁబడిలో భేద మున్నది. సర్వసాధారణముగా స్త్రీలక్షణమిది—నాయం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుకంటె నెక్కుడు ప్రేమగాఁ బెంచినది. మానాయనకీ గొడవయంతయు నక్కఱలేదు. "ఈనాఁడేమైన నుసిరిగ కాయలు పెట్టితివా"యని యడుగును. వారమున కొక్కనైన మానాయనపంక్తికి బాటసారులు వచ్చువారు. వైశ్వదేవముచేసి కొని వీథిలోనికివచ్చి చూచిగాని నిత్యము భోజనముచేయఁడు. దేవతార్చనపెట్టెకట్టి వడ్డనయైన పిమ్మట నభిఘారమైన వెనుక నతిథికి సాలగ్రామతీర్థముఁ దులసిదళమునిచ్చి తానుగొని, స్వయమాపోశనము కూడదుగనుక మాయమ్మవచ్చి యాపోశనము వడ్డింపఁగా నిరువురును భుజించువారు. మాయూరికిఁ జుట్టుప్రక్కలనున్న యూళ్లలోని పెద్దతలల నందఱను మానాయన యెఱుఁగును గావున యతిథులతో "వారెట్లున్నారు; వీరిస్థితి యెట్లున్న"దని కుశలప్రశ్నలు చేయుచు భుజించును. ఎవ్వరో చెప్పినారు. వీథిలోనిలిచి యెవ్వరైన మంచినీరో మజ్జిగయో యడిగిన "నిది బ్రాహ్మణ గృహము; నీకు మజ్జిగ దొరకునా! మంచినీళ్లిచ్చిర"ని కోపపడువారఁట; మాయింటనట్లుకాదు. 'మాయిల్లుమాయి'ల్లని యింకను బుట్టినింటిని గుఱించి వాఁడుచున్నాను. నాకీరెండిండ్లను స్వాతంత్ర్యము గలవియే. అప్పుడడిమాయిల్లు, నిప్పుడిదిమాయిల్లు. ఎవ్వరికైన నీరో, మజ్జిగయో బ్రాహ్మణ గృహముననే దొరకవలయును. దంచినబియ్యమెుకప్పుడు లేకపోవును; ధాన్యము పెట్టుదురు. గాదెలోనుండి తీసినధాన్యము లేవనుము; మాయమ్మ "బియ్యమునిండుకొన్నవే; రేపురమ్ము. నేఁటిబియ్యము రేపటిబియ్యము కూడ నిచ్చెద"నను. తర్వాతవారు 'రానిమ్మ, మాననిమ్ము; అనిన ప్రకారము రెండునాళ్ల బియ్యమును బుట్టలోఁబోసి వీథిచావడిగూటిలోఁ బెట్టవలసినదే.

ఎవ్వరుగాని చూచినవారు, సంతోషముతో నచ్యుతరామయ్యగారి బిడ్డలు—'ముగ్గురుమూఁడుదీపములు. మూఁడురత్నములు'అనువారు. "ఏమిదీపములో యేమిరత్నములో- యేగాలిలోఁబడుదురో- యేధూళిలోఁబడియెదరో, ప్రపంచములో నిప్పుడేకదా యడుగువెట్టినారు? వీరిగుణము లిప్పుడేమితెలియును." అని మెల్లగసరిది మానాయనచెప్పిపుచ్చువాఁడు. నాకంటె నైదేండ్లుచిన్నది లచ్చు; దానికంటెఁ గొంచెముచిన్నది గౌరు. వారిద్దఱు నన్నక్కయ్యాయనియే పెండ్లియగుదాఁకఁబిలుచువారు. జ్ఞానమువచ్చిన కొలఁది, వృత్తాంతము తెలిసిన కొలఁది వారు వావులు మార్చుకొని లచ్చు'వదినె'యని, గౌరు 'అత్త'యనియు నన్నుఁబిలువసాగిరి. పాపము మూఁడు నాలుగేండ్ల యీడుననడచిన సంగతి వారికిఁ జెప్పినను జ్ఞాపకము లుండవు. మాతల్లిదండ్రుల యదృష్టము. ఇద్దఱును దల్లి దండ్రులు లేనివారే దొరకనా! కొన్నినాళ్లు వచ్చినవారెల్ల వారి పూర్వవృత్తాంతము విని విచారించి "వారికిట్టి గతిపట్టినది. గతియేమిలే వారికంటె నెక్కుడు ప్రేమగాఁ బెంచుచున్నారు" అనుచున్న మావారు సంజ్ఞచేసి "యీపసిబిడ్డవాండ్రకు జ్ఞానము తెలిసియుఁడెలియని యీడు; బెంగపెట్టుకొందురు. వాండ్రకుఁదెలియకుండున ట్లర్థాంతరముగాఁ బ్రసంగింపుఁ"డని వేఁడుచుండువారు. నేనెప్పుడును వారిద్దఱితో మానాన్నమాయమ్మ యనలేదు. 'మన, మన'యనియే వాడుచుండుదానను. ఒక్కనాఁడు పిఠాపురమునుండి తెచ్చిన సామానులలోనుండి యేదో యెత్తఁబోవుచు నాన్న బూజుపట్టిన యద్దములుఁ బటములుం దులుపుచున్నాఁడు. "ఈయద్దములుఁబటములును జావడిలోఁ బ్రేలఁగట్టరాదా" యంటిని. తగిలింపవచ్చును మీవదినెపట మొక్కటి గలదు దానిని మాత్రము దాఁచి తక్కినవానిని నీయిష్టమువచ్చినచోటఁ గొట్టుమని మాతండ్రిచెప్పినఁ నన్నింటిని దీసిదులిపి త్రాళ్లుగట్టివికట్టి మేకులుగొట్టిగోడలకుఁ దగిలించితిని. ఒక్కనాడు, గౌరువచ్చి "అక్కయ్యా; వెదురుపేళ్ల బుట్టలోనిది యొక్కటి దిగఁబడి పోయినది. దీనినిగూడ నొకచోటఁ దగిలింపవే"యని దాని తల్లిపటముం దెచ్చియిచ్చినది. అదిపెట్టెలోఁబడియుండినదనిన సంగతి మేమెవ్వరము నెఱుఁగము. "ఇది యెవ్వరే యక్కయ్యా సరస్వతియా, లక్ష్మీదేవియా"యని యడిగినది. అయ్యో! యంతట నొక్కగంటసేపు మాయిల్లెల్ల నొడెననఁగా జాతి గుండెగల, మధురస్వభావవర్ణనలు నేర్చినకవియైనచో నొక్కపదియాశ్వాసముల కరుణారసకావ్యము రచించుటకుఁ దగినంత సామగ్రిగలదియై యుండెను. మానాయన యింట లేఁడు. మాయమ్మకడుగుచున్న బియ్యము కడుగు బుట్టను నూతియొద్దనే పాఱవైచినది; కాకులు బియ్యము వెదచల్లుచున్నవి. కట్టుకొనినచీర నీళ్లోడుచున్నది. కన్నీరుమున్నీరైనది. మాటలాడకుండ – మాటలాడిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దానికిఁ జెల్లియుననని సంజ్ఞలో గ్రుక్కుగ్రుక్కుమనుచు నేడ్చినదిగదా!—ఏజేఁగియున్న నేను నల్లే యేడ్చితిని. "అమ్మయు, అక్కయ్యయు నెందుకో యేడ్చుచున్నా రే" యని గౌరి లచ్చితోఁ జెప్పినది. మమ్మిద్దఱంగాంచి వారు నేడ్చిరి. ఎంతయజ్ఞానమే యని మేము మఱింత దుఃఖించి వాండ్రనిమిత్తమే మెల్లమెల్లగ వగపుడుపుకొంటిమి. వాండ్రిద్దఱును—

"అమ్మా! యెందుకే మీరేడ్చినారు."

"మొన్నగాదఁటే వాండ్రకుఱ్ఱవాఁడు వడుగులో నెద్దుపొడిచిన చచ్చిపోయినాఁడు."

"అమ్మా, లచ్చమ్మత్తకు వాఁడేమగునే."

"చచ్చిపోయినవాఁడు లచ్చమ్మత్త కేమియుఁ గాఁడు."

"మనమెందు కేడువవలయును మఱి."

"ఎద్దుపొడిచి బలవంతముగాఁ జచ్చినాఁడని."

"ఎద్దునేమిచేసినారు, దానిని గట్టిగాఁ గొట్టినారా?"

"నోరులేనిదానినిగొట్టిన నేమి లాభము! దానిని గొట్టినఁ జచ్చినవాఁడు బ్రదుకునా?"

"చచ్చిపోయినవారు మరలఁ గనఁబడరని యెవ్వరో చెప్పినారు."

"చచ్చినవారిగొడవ మీ కెందుకే. వెఱ్ఱిమొగములార! పోయియాడుకొండు. కొట్టవే బియ్యము పోసికొనిపోవుచున్నవి- లచ్చీ!"

ఇట్టి మాసంభాషణలో వారు రసాంతరమునకు మఱిరి. ఆపటమునుదీసి తాళపుఁబెట్టెలోఁ బెట్టితిని. నామూలమున నేకదా యింతటియలజడి వచ్చెనని, పటములను మొదటఁగోడలకుఁ గొట్టుట— వాఁపసలసినదానిని జాగ్రత్తచేయకపోవుట—తలఁచికొని కొంచెము చిన్నఁబోయితిని. మా నాయన వచ్చినాఁడు. గుమ్మములో నడుగుపెట్టియుఁ బెట్టకమునుపే—"నాన్నా! లచ్చమ్మత్తగారి కుఱ్ఱవాఁడు చనిపోయినాఁడని, మనయమ్మ, అక్కయ్యయేడ్చినా"రని లచ్చి గౌరు నెదురువెళ్లి చెప్పిరి. ఆయన మమ్ము "వాఁడెప్పుడో చచ్చినాఁడుగదా! నేఁడు మీరేల యేడిచినారు. కారణ మే"మని యడిగిరి.

పోనిత్తురు; వానికొఱకు మే మేడ్చుట—అని రహస్యముగా మాయమ్మ చెప్పినది. "నేనెఱుఁగనా, పోనీ, సరదాపడుచున్నదని గోడకుఁ దగిలింపుమంటిని. తీసి మరలఁ బెట్టెలోఁ బెట్టరాదా! ఎందుకవి యిక్కడ? దుఃఖి మరల దాఁచివేయుట మంచిది" యని నిస్పృహ కనఁబఱిచినారు మానాయన. "ఉండనిండు శుక్రవారము ప్రొద్దు పెట్టినపటములు తీసివేయనేల? కృష్ణమూర్తి పటము, గౌరి దేవి; విఘ్నేశ్వరు నొడిలోఁ బెట్టుకొనినది; ప్రొద్దున లేవఁగనే చూచిన పుణ్యము. మఱియెప్పుడో పెండ్లియన్నారుగదా! ఉండనిం"డని మాతల్లి పలికినది; "ఇంకఁ బెండ్లియెంత. త్రిజ్యేష్ఠల వ్యవహారము చూచుకొనుటయే తరవాయి"యని మాతండ్రి యనియెను.

"జ్యేష్ఠలేమిటి? పిల్లవాఁడు జ్యేష్ఠుఁడు గాఁడు, పిల్ల జ్యేష్ఠురాలైనను."

"జ్యేష్ఠబహుళములో మూఢమువచ్చును."

"వైశాఖబహుళములోని ముహూర్తమునకు వారు తూఁగిరా లేరా?"

"మనమెప్పుడు రమ్మనిన నప్పుడే వారు రాఁగలరు. మనమే."

"మనకుమాత్రము—గుడిలోమాత్రము వలదు; ఒక్కగా నొక్కపిల్ల."

"మంచి ముహూర్తములుండఁగా గుడియెందుకు! కపర్తికి దైవసన్నిధి."

"కొట్టైనరాయేమి, మాకు శక్తిలేదనిన నూరందఱు వచ్చి మీఁదఁబడియెదరా?"

"ఊరిలో నెంతమందియున్నారులే, వైదునాళ్ల పని."

"మఱి యింకేల మీకు సందేహము."

"దంపులు, అలుకులు, ముగ్గులుకావలదాయని."

"శుభమస్తని మీరందురు, నేనున్నదానను, మీకుఁ బనులతోఁ బనిలేదు; ఎప్పటికిఁ గావలయుననిన నప్పటికి నేను సిద్ధము చేసెదను; నన్నడుగుఁడు."

"అడిగినట్లే; శుభమస్తనినట్లే; వారు నీలో నేమన్నారు? నీతో శాస్త్రులు పెండ్ల మేమో చెప్పుమన్నది."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"మీరు పిలిచి యిచ్చినపుడు మేము రెండవమాట యనఁగలమా యన్నది."

"ఇంకేమి! వైశాఖబహుళమలో నొక్కమంచి ముహూర్తమన్నది."

ఇట్లు వారు సంభాషించుకొని "'శుభస్యశీఘ్రము,' యని ఆలస్యమైన మన మెవ్వరో కాలమెవ్వరో! రేపు పంచమినాఁడు కొంచెము వర్జము లేకుండఁ జూచి పనులు ప్రారంభింపుము. పందిళ్లు పాకలు వేసు జూచుకొందును. ధాన్యములు, దంపులు, పప్పులు, మడిపనులు, పచ్చడులు, అప్పడములు, వడియములు, ఏమేమి కావలయునో నీవుచూచికొ"మ్మని మానాయన మాయమ్మతోఁ జెప్పెను.

పల్లెటూళ్లలోఁ గట్టెక్కన. మంచికిఁ జెడ్డకు నందలు నొక్కత్రాటిమీఁద నడిచెదరు. "అక్కయ్య! కూఁతురు పెండ్లివచ్చుచున్నది. అత్తా! మనుమరాలి వివాహము. వదినె! మేనకోడలి కళ్యాణము" అని యిరుగు పొరుగు సాటి బ్రాహ్మణవనితలలో మాయమ్మ మెచ్చ టేఁచినది. మధ్యాహ్నములయందు మాయింటికి నలుగురు నాలుగిండ్లనుండి వచ్చువారు. రెండునాళ్లప్పడములు, రెండునాళ్లు వడియములు, ఇట్లే పనులన్నియుఁ జేసిముగించివారు. నరసప్పయను నొక యిల్లాలున్నది. సోమయ్య శాపకాఁ వెళ్లివచ్చుచు దారిలోఁ జనిపోయినాఁడఁట. అపుడే మెకూడనున్నది యొక్కతెయే యాతనికన్నిక్రియలుచేసి నిర్విచారముగ, నిర్భయముగ నింటికివచ్చినదఁట, మహాపతివ్రతే! తీర్థసార్థములు, పుణ్యములు పురుసార్థములను బెనిమిటియే నేర్పించినాఁడు. మగనాలికేమియైనను మగనివలనే యభ్యాసము కావలయును. గాడిప్రొయ్యి దానే త్రవ్వినది. పెండ్లివారికి, నూరిలోనివారికి నంద ఱకు రెండుపూఁటలు గంటలోఁ బప్పువప్పళములతో వంటయంతయు నైదునాళ్లు నడుమనడుమఁ బిండివంటలతో నరసప్పరూపమున నేభీముఁడో నలుఁడో యనునట్లుగా నొక్కలోపము లేకుండ రసవత్తరముగాఁ బాకముచేసి పెట్టినది. కావలసిన వస్తువు లందిచ్చువారిదే తడవు. ఏర్పాటులో ఆనరసప్ప సింహమువంటిది. మానాయన యేకూరగాని పచ్చడిగాని పుచ్చుకొని వడ్డింపఁబోవువాఁడు, "చిన్నాయనా! నీవు ఉండవయ్యా; నీకుఁ జేతఁగాదు; నీవల్లనుగాదు. ఓరి వేంకటేశ్వరా! ఓరి రామా, మామయ్య వడ్డింపఁబోవుచుండ మీరూరక చూచుచు నిలువఁబడియెదరురా" యని యొక్కకేకవేయనీ, నలుగురైదుగురు కుఱ్ఱవాండ్రు జలోదనసేవయభ్యాసము లేనివాండ్రు, స్నానము చేసి మడిగట్టుకొన్నవారు, ధారాళముగా నాహితాగ్నుల పంక్తినిగూడ వడ్డింప నర్హులైనవారు లేచువారు. అన్నియు నామెయే చెప్పుట: "విడిదెలోనికిఁ బిలువఁబంపినారా? వారికవిపంపినారా, యివియిచ్చినారా?"యని, "మనయింటికి వచ్చినపుడు చెప్పినామని బద్ధకింపవలదు; బసలోనికివెళ్లి పిలువవలయును" అని, యిట్లాచారములన్నియు నామెయే తెల్పుచుండునది. ఏడకులు, నేయ నుభయముగల యేమనవారు నామెకుఁ జాలరనుట సత్యాంశమేకాని పురుషులను దిరస్కరించుటకే చెప్పిన యతిశయోక్తి యించుకంతయు నిందులేదు.

అలుకలా, కోపములా, నిష్ఠురములా, మృదువు తప్పిన పరియాచకములా—మందునకైనఁ గనఁబడలేదు. అయిదునాళ్లు, శాస్త్రచర్చలు, వేదార్థములు, గృహస్థ ధర్మములు, నుపన్యాసములు. ఓహో! బ్రాహ్మణుల యింట, మఱియు మానాయనవంటి వైదికుని యింట నెట్లు చెల్లవలయునో యట్లుచెల్లినవి. ఎందఱుపండితులు! ఎందఱువిద్వాంసులు! ఎందఱధికారులు! ఆసభకు 'సభాయైనమః' యని యొక్కనమస్కారము చేయుమన్నపు డెల్ల నామొడలు జల్లుమని పులకలు వొడము చుండెడివి. 'ఎట్లుజరుగునురా, యెట్లొడ్డెక్కుదుమురా, దేవిన మగు తగవులు లేకుండ'నని మానాయనభయము. పాపము! నాఁడట్లేమియు భయపడవలసిన కారణము లేకుండ నందఱును మంచివారుగావున శుభముగా జరగినది. "డబ్బు లేకున్న 'నాయనా, నాశక్తికొలఁది నొక్కతాంబూల మిచ్చినాఁడను. వధూవరుల నాశీర్వదించి దయచేయుఁ' డనిన నెవ్వరు నేమియు ననరు. పిలువకున్నను బండిటిలోనికివచ్చి యల్లరిచేయుటకు మనమేమిలౌక్యులమా, యంతటియల్లరి చిల్లరిమూఁక మనయింటికివచ్చునా. ఏదోవిధముగా స్నాతకమునాఁడు రెండుపూఁటలుఁ బెండ్లివారికే భోజనమునకై యేర్పాటులు చేసి స్థాలీపాకమునుండి యూరిలోనివారిం బిలువవలయు"నని



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మానాయనతలంపు. పిలువవలసిన వారిని, బిలువఁదలఁచినవారిని మానాయన స్వయముగాఁ బిలిచినాఁడు. రావలసినవారు, రాఁదలఁచినవారు వచ్చినారు. "దంపించిన బియ్యమున్నన్నినాళ్లు వచ్చినవారికి సగము కడుపైన నిండునట్లు పెట్టెదను. తర్వాత—నందోరాజాభవివ్యతి యన్నాఁ"డని మానాయన ముందే బెదరుమాటలాడఁ జొచ్చెను. దివాణము బాబుగారికి గృహస్థధర్మముగా నొక శుభలేఖ వ్రాసిశిష్యునిచేతఁ బంపియున్నాఁడు. సుముహూర్తము జరుగుచుండగాఁ బల్లెటూరికి మాయింటికిఁ బెండ్లికివచ్చిన యంతమంది పెద్దమనుష్యు లేపెద్ద పట్టనములలోను రారని చెప్పవచ్చును. రాత్రి యెనిమిది గడియలకు స్థాలీపాకలగ్నమే. ఆసమయములో నొక్క గుఱ్ఱమునెక్కిన యుద్యోగివచ్చి వీథిపందిరిలో దిగినాఁడు. అయ్యా! జనులతొందర యేమనిచెప్పను! మానాయనతో నెవ్వరో గుఱ్ఱము మీఁద వచ్చినాఁడని చెప్పినారు. నన్నింకను గంపలోనే కూర్చుండఁబెట్టియున్నారు. కన్యధారకై మహాసంకల్పము జరగుచున్నది. అసలేయంత-యందులో మఱియంత. పీటఁపైఁ గూర్చుండి ముచ్చెమటలు పట్టి మాతండ్రి, "యెవ్వరైనఁ బెద్దవారు వెళ్లి యేలవచ్చినారో కనుఁగొనిరండురా" యని దిగులుపడుచుఁ బలికెను. మాపెద్దనాయనగారి సత్యమన్నయ్య వెళ్లి "సుముహూర్తమువేళ, మాచిన్ననాయన పీఁటలమీఁద గూర్చున్నారు. తాములోపలికి దయదయచేయుఁ"డని చేతులునలుపుకొనుచుఁ బలికెను. గుఱ్ఱమును సేవకుఁడు పట్టుకొనగాఁ జెప్పులు విడిచి, తలకుఁ జుట్టుకొన్న పాగతీసి చేతఁబట్టుకొని యొక్క దివ్యసుందర విగ్రహుఁడు-బ్రాహ్మణుఁడే-సభలోనికి వచ్చినాఁడు "ఇక్కడకిక్కడకు, ఈలాగీలాగు దయచేయు"డని యెల్లవారుఁ దావుచేయుచుండఁగా మెల్లఁగాఁ దప్పించుకొనుచు నాప్రక్కకువచ్చి యందఱకు నమస్కరించి కూర్చుండెను. ఆయనమొగము వంకఁజూచిన వారికెల్ల నర్థము కానిభయముపుట్టెనుగాన యెవ్వరును బ్రశ్నింపఁదలఁచుకొనలేదు. వారి పురోహితుఁడు, మాదీక్షితులు మామతోఁ "బుష్కరమెన్ని గడియలకు? సుముహూర్తకాలము సరిగానున్నదా" యని యడిగినాఁడు; కన్యధారవేళ నేఁ బీఁటలమీఁదఁ గూర్చున్నపుడు మేనమామలు వచ్చి యేదోచీర, జేమారు తెచ్చుటవాడుక. మామేనమామను గంగమ్మతల్లి సకుటుంబముగా మ్రింగివైచినది. 'ఇపుడు 'తమ్ముఁడున్నయెడల ఎంతయో లక్షణముగా నుండదా' యని మాయమ్మ కన్నీరుపెట్టుకొనుచున్నది. మానాయనయే తెచ్చియుంచినాఁడు. 'తమ మేనకోడలి వివాహకాలమున—గారు, తమ తోఁబుట్టువునకు బావమఱఁదికిఁ గట్టువర్గములు' అని చదివించెదరుగదా! ఇప్పుడెవ్వరిపేరుపెట్టి చదివించెదరు! ఆకాలమున బ్లిపాదు, పట్టిసమును సభవారికన్నుల బాష్పములు రాల్పించినవి. ఏమో యనుచున్నారు గాని ఒక్కప్రక్కనుండి మా చిన్నమ్మమ్మగారి కుమారుఁడఁట; సుబ్బన్నమామ- ఆతఁడును లేఁడు- అతనికుమారుడు శేఖరము బావ, తానును భార్యయు వచ్చి కన్నులుతుడిచికొనుచుఁ దాను దెచ్చిన నూతన వస్త్రములను దెచ్చి చదివించెను. ఆవెంటనే వచ్చినయుద్యోగి దీక్షితులు మామను బల్లెరము తెమ్మని తన చంకలోనున్న సంచితీసి నూటపదారులు పోసి 'యివి దివాణపువారు, మన యచ్యుతరామయ్యగారి కొమార్తె వివాహకాలమునఁ జదివించినట్లు చదువుఁ'డని లేచిపట్కెను. గజగజలాడుచున్న యాసభ యపుడు పొందిన యానందము నేను జెప్పలేను గాని నామట్టుకు నేను గూర్చున్నతావు నాకిఱుకనిపించినది. నమ్ముఁడు; నమ్మకపొండు; ఇంక మానాయనగారికేమి దిగులున్నది దైవసహాయమునకుఁ బదిమంది సంతసపడిరి.

## అయిదవ యంకురము

ఒక్కరిసంగతి యెంతవివరముగానైనఁ జెప్ప వచ్చునుగాని నాసంగతి నేనేచెప్పుకొనుట యంత సరసముగా నుండదు. మొదలుపెట్టినదానను మానఁగూడదు. రసభంగముకాకుండ నుచితరీతిం గొంత తెల్పుచున్నదానను. చెల్లెలియింట భోజనముచేసి యానాఁడు మధ్యాహ్నము మాయింటికివచ్చి కూర్చుండి మామిడిపండ్లుకోసి విస్తరిలోఁబెట్టి మానాన్న యిచ్చుచుండఁగా భుజియించుచు, "బావగారు! సింహాచలములోను విశాఖపట్టణములోను మామిడిపండ్లు—ఏమి పేరులు! ఏమిరుచి! ఏమిరంగు!" అని వర్ణించుచు నేను మాయమ్మ నన్నము దినుచు వేసిన ప్రశ్నములకు విశాలమైన యుత్తరములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మామగారు చెప్పినారు. ఆమాట యీమాట యాడినా ను. అత్త మాయమ్మతో లోనికివెళ్లి పాదప్రక్షాళనము చేసికొని పడమటింటిలోఁ బీటవైచుకొని కూర్చుండి యేమోచెప్పుచున్నది. నేను తెల్లపోయినదాననో, సంతోషములో నున్నదాననో యేదో వైపునకుమాత్ర మర్థములేనిచూపు చూచుచున్నదానను. వారి కుమారుఁడు మేనత్తగారియింటికి వచ్చినపుడెల్ల మాయింటికివచ్చి కూర్చుండువాఁడు. తమయూరిలోని పడవలు, లాకులు, లాకులమీఁది యధికారులు– తెల్లదొరలపుడపుడు తుపాకులు పట్టుకొని కొంగలనుగొట్టుటకు వచ్చుట మొదలయినవి చెప్పుచుండు వాఁడుక. ఈసారి, సింహాచలము, కొండ, దానిమీఁదిధారలు, అనాసపండ్లు, గులాబిపువ్వులుఁ జెప్పవలయునని యూహయఁట. మాతండ్రి, "రావోయి,మామిడిపండు తిను"మని తనవైపునకాకర్షించుటచేత వలనుగాకపోయినదఁట. నేనుమాత్రము మావారిట్లు తలంచుచున్నారని యెఱుంగనుగాని, తొల్లింటివలె మాటలాడుట బాగుండదని యేలనో కొంచెము తటపటాయించితిని. కాని యొకరిమొగ మొకరుచూచుకొనుట,యేదో యడుగఁబోవునట్లు చెప్పఁబోవునట్లు నుబాట మిద్దఱను వినుపలేదు.

సంసారగోష్ఠిలో వియ్యంకు లిద్దఱును స్వవిషయములను కష్టసుఖములు చెప్పుకొనుటలోఁ"గుట్టివానికిఁ జదువంటలేదు. ఎంతసేపు, లెక్కలు, భూమికొలతలు, గజములు, కుంటలు, తుల, యర్ధ యీవెట్టిలోఁ బడినాఁడు. ఓరుసీలుగారు మనయూరికి రాకపోకలు చేయుచుండుటచేవచ్చినయనర్థమిది. మాయింటిలో బస; ఆయనకొడుకు కలకత్తాలో నున్నాఁడఁట. రైలులో పని." అని మామగారు మానాయనతోఁ బ్రసంగించిరి. "ఏదోనేర్చికొననిండు. మనముక్కలవలన దమ్మిడిరాదు. మనవా రెంతమంది బురంపురము, కటకము మొదలగు తావులకు వెళ్లలేదు! నేను బిల్లకుఁ బెండ్లిచేయవలసియున్నది. కనుబొమ్మలమీఁది వెంద్రుకలవలె నిపుడుగా దుగదా యింకనిరువదియేండ్లకయిన నింతకంటె నెక్కువయైశ్వర్యము నాకురాదు. ఎక్కడనో నాకుఁ దగినవానిని, నాలుగువ్రేళ్లులోనికిఁ బోవుచున్నవానిని జూచి ముడివేయవలయునని యున్నది. వైశాఖము వచ్చినది. కుఱ్ఱది తెలివిగలది. ఒక్కయాట యనదు. ఒక్కరితోఁ గయ్యమాడదు. ఎనిమిదనయేఁడు. మీవానివంటి యీడుగలవాఁడు దొరకినఁ జాలును. తర్వాత వాండ్ర యదృష్టము. నాకేమియు నిచ్చుటకు శక్తిలేదు. పుచ్చుకొనుటకుఁ దలంపులేదు. వారిపిల్లవాఁడు మాయల్లుఁడు, మాపిల్లవారికోడలు ఇవియే యిచ్చిపుచ్చుకొనుటలు. ఈ వినిమయమున కొడంబడువా రున్నయెడలఁ జాలును; నేను వెదకి తేలేను." అని మెల్లగా సాగవేసినారు మానాయనగారు. "నాకు నదియే యుద్దేశము. నేను గట్నము లీయలేను. పగళులక్కుముడుగుటకు మావానికి విద్యలేదు నీభూమికంటె నెక్కుడుభూమి నాకులేదు. నాది పిత్రార్జితము, నీదికష్టార్జితము. కొంచెము నీకంటె నేను బెద్దవాఁడను. నీదేసంవత్సరము జననము? నాది శ్రీముఖ. నీది యువ కాఁబోలునని చెప్పినట్లు జ్ఞప్తియందున్నది. నీకు విద్యావంతుఁడల్లుఁడు కావలయుననినఁ జెప్పలేను గాని, మావాఁడు నీకు నచ్చినాఁడా? నాయంతట నేనై యడుగుచున్నవాఁడను. నీయభిప్రాయము తెలిసికొనకుండ నీకూఁతు నడుగనా, మావాఁడు నచ్చునేమో దానికి? యేమమ్మా, యిటురా, మానారాయణ నీకెట్లు కనఁబడుచున్నాఁడు! బాగుగా లేఁడూ!" అని శాస్త్రిలు మామగారు నన్నుఁజూచి నవ్విరి. నేను జిఱునగవుతోఁ జాటునకుఁ బోయితిని. "ఇంతకంటె మంచిసంబంధము నేను దేఁగలనా? మీ రెన్ని మెట్లమీఁద నున్నారో యని భయపడుచున్నవాఁడనుగాని నేనిందాఁక భోజనము చేయుచు మీతోఁబుట్టువుతో నేమంటినో యడుగరాదా! ఏమి! ఓయ్! ఇటురా," యని మాయమ్మను నాయనగారు పిలిచిరి.

లోన నా స్త్రీలిద్దఱు నీప్రసంగమే చేయుచున్నారు కాఁబోలును! శాస్త్రిలు మామ పెండ్లాము చటాలున నవ్వుచువచ్చి "విన్నారా; మీచెల్లెలిమాటలు నేనఁట 'కతికిన నతుక'దని మిమ్ముఁరమ్మని యచ్యుతమన్నయ్య పిల్చుచున్నను సుబ్బలక్ష్మిగారి యింటికిఁ దీసికొని వెళ్లినానట; నేను భోజనమునకు రాలేదని యెంత కల్పించినదో! వారి మనస్సులోని యూహలునాకేమి తెలియు"నన్నది. "ఇదిగో బావనాకిక్కడ ఫలప్రదానము చేసినాఁడు. కొంచెము బెట్టు చేయుచున్నాఁడను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మీరు వియ్యపురాండ్రిద్దఱు నాలోచించుకొనుఁడు. పిల్ల పిల్లవాఁడు నిదివఱకు గుజ్జనగూండ్లాడుకొన్నవారే" అని శాస్త్రులు మామ; "మీరు నేను సై యనుకొన్నయెడల నాఁడువాండ్ర నెంతసేపు నచ్చఁజెప్పవచ్చు"నని మా నాయన; "అలాగునఁగాదోయి, యింకను నీవు వియ్యం కుఁడవుకాలేదు. అపుడుగాని నిన్నుమన్నింపను "అని శాస్త్రులుగారు; "సరిసరి! నన్ను నాకోర్కెదీర్చి యీ విధముగా మన్నింపుఁడు మీరు పెద్దవారు; చుట్ట టికము వచ్చినంతనే నేను మీకంటె, బుద్ధిలోఁ గాని, విద్యలోఁగాని యేండ్లలోఁగాని పెద్దవాఁడ నగు దునా! యెగఁ బెరుఁగుదునా! నన్ను మీపూర్వాభ్యాస మువలెనే పిలువ వలయును గాని మార్చవల"దని మా నాయన.

"నేను నిన్నెపుడైన బావాయని పిల్చుచున్నవాఁ డనా చెప్పుము."

"లేదు, అచ్యుతరామయ్య యనియే పిల్చుచు న్నారు."

"చూచితివా? యపుడే మాటినది ఇంకమాటక తప్పదు. రారా; నాయనా, నారాయణమూర్తి:—" అని—

"రావే; అమ్మా, రామసుబ్బి! ఇటురా మామయ్య పిల్చుచున్నారు. దూరముగాఁ బోవుదువేమి?" అని మా నాయన నన్నుఁబిలిచెను.

తండ్రుల పిలుపులవలన మాయూహలు చేకూరి నవి. ఇరువురము నొక్కచోటఁ గూర్చున్నారము. అనఁగా, వారినాన్న తొడమీఁద,—మానాన్న తొడ మీఁద నేను గూరుచుంటిమి.

"ఇదియే మంచిపని, నీవు సజ్జనుఁడవు; చదువు కొన్నాఁడవు. ఒక్క కూఁతురు. నేను దుఃఖము లను భవించియున్నాఁడను. వీఁడిప్పటి కొక్కకొసరు కాయ మిగిలియున్నాఁడు. నేనెవ్వరితో నాలోచింపవలసిన పని లేదు. నీకు నచ్చినదా!" యని శాస్త్రులుగారు.

"మీకు నచ్చిన దనిన నాకును నచ్చినదనినమాట యే; అందఱము నిక్కడనే యున్నారము." అని మానా యన.

ఇట్టి సమయములో అత్తవచ్చి, "సరి యిఁకనేమి! వియ్యంకులిద్దఱు సిద్ధముచేసినారు. కానిండు; పెండ్లికేమి మన పిల్లను మనము దీసికొనివెళ్లవచ్చును." అని రేఁటో చెప్పవచ్చినట్లును దానికి సరిగా మేముండుటయును గనఁ గొని పలికినది. మాతల్లి దండ్రులున్నపుడే వారు తీసి కొని వెళ్లుమన్నట్లు తటకాపడి క్షణకాలముండి "దై వ్వరియదృష్ట మెట్లున్నదో తెలిసికొనలేము. ఆవరాహ మూర్తి యిక్కడకుఁ దీసికొనివచ్చినాఁడు గదా! పెండ్లి మాత్రము చేయలేఁడా! ఆస్వామిదే యీపిల్లలభార" మని యంతలో నవ్వుకొనిరి.

మానాయన "సుబ్బలక్ష్మిని సాయంకాలము పిలిచి యడుగుఁడు."

శాస్త్రులు "దానికేమి కావలయును నేను జెప్పిన గవ్వునఁ గేక వేయును."

మానాయన—"అవధానులున్నాఁడా, యెక్కడ కైన వెళ్లినాఁడా?"

శాస్త్రులు—"మీ యన్నదమ్ముల రహస్యములు మీకేయెఱుక. ఆయనయూహలు, ఆయనయత్నములు మనకుఁ దెలియనీయఁడు. ఉన్నాఁడు, డబ్బే డబ్బే యని కొట్టుమిట్టాడుచున్నాఁడు."

మానాయన—"ఆతనికేమి? రెండుపుట్లనేల, యిల్లు వాకిలి, యిద్దఱుకొడుకులు; మనకంటె మేలు."

శాస్త్రులు—"ఏమిమేలో; మనకంటె నెక్కుడు కష్టపడుచున్నట్లు బీదయఱపులు."

ఇట్లు ప్రసంగించుచుండఁగనే పొరుగింటియిల్లు బంతికివెళ్లిన లచ్చి గౌరు, గబగబ పరుగెత్తుకొని వచ్చి, "నాన్నా నాకుఁ దాంబూలమిచ్చినారు; నాకుఁ దాం బూలము దొరకిన"దని మాతండ్రిదగ్గఱకుఁ జేరిరి. వారిద్ద ఱం గాంచి రామాయణము రెండుకాండలు తిరుగవేసి నారు. "వీరి కర్మ మెట్లున్నదో బావగారు! మాకు దాప రించినారు. ఇపుడు తొందరయేమికాని వీండ్రతోఁగూడ నాకున్నది," యని మాతండ్రిగారు తత్ప్రసంగముచేయు టలోఁ గొంతకాలమైనది. 'వివాహములకుఁ జింతింపవలసి నదేకాని యన్నవస్త్రములకు లోపమేమి'యని వారు నలువురును వారికిఁ గల యాస్తి, భూములు నుగ్గడించిరి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంచితిని! మానాయనకు రూపాయ మార్చి యైశ్వర్యయముచేసిన నెంత మిగలునో మాయమ్మనే యడుగవలసిన దేకాని తనకుఁ దెలియదు. అట్టివాఁ డిపుడు పెరివ్యవహారమువచ్చి పైఁబడినమీఁదట ధాన్యము, ధనము, కవులు, కదపా, దస్తు సిస్తులు, బల్లిపాడు పిఠాపురము వెళ్లుట వచ్చుట, యిచ్చుట తెచ్చుట, యెవ్వరి లెక్కలు వారికి సరిగానుంచుట-పెద్దముసద్దీపని నేర్చికొన్నాఁడు. సంధ్యావందనముగూడ సావకాశముగాఁ జేసికొనుటకుఁ గాలము చాలకున్నది పాప మాయనకు. మాయమ్మ, "వారి సొమ్మువారికిఁబెట్టునపుఁడైన—లచ్చు, గౌరు—మక్కలోముల్లనరు. వస్తువులు చేయించుటయనిన మీకంతభయమైన నెవ్వరిమూలముననైనఁ జేయింపరాదా! గోఁగుఁ బుల్లలవలెఁ బుట్టినవారు పుట్టినట్లున్నారు." అని చెప్పి నపుడెల్ల "దానిమగఁడు దానికి, దాని మగఁడు దానికిఁ గావలసిన వస్తువులు చేయించి కొందురు, పోనిమ్ము. నన్ను మాపనిలో దింపకుము. తూనికలు తెలియవు. ఆవన్నె లెఱుఁగను. నిజము చెప్పుచుంటివా, యిత్తడియేదో బంగారేదో నాకుఁ దెలియదు. నన్నేల యిబ్బంది పెట్టెదవు? అవధానులచేతికి డబ్బిచ్చెదను; చేయించిపెట్టుమనుము. నాకుమాత్ర మా పని యభక్ష్యభోజనమువలె నుండును. నాకుఁ దెలియదు. 'నాడింధమస్యమాయాం జాతు మజానాసి జాతుషీమపి ష్టే' యనినమాట నాకుఁ జక్కఁగాఁ దలఁపునకు వచ్చుచున్నది. ఇఁక లోఁతులోనికిదింపి ప్రశ్నలు వేయవలదు." అని మా నాయన చల్లఁగాఁ దప్పుకొనువాఁడు; ఎవ్వరో చేయించిపెట్టువారు, వారికా సొమ్మిచ్చివేయువాఁడు.

ఒక్కొక్కప్పుడు "పనివాండ్రు మోసముచేయుదురని నగలు చేయించిపెట్టుకొనుట యెవ్వరయిన మానుచున్నారా" యని మాయమ్మ—"నగలుపెట్టుకొనవలయునని సొమ్ముదఃడుగ పెట్టుకొనువారుందురా" యని మానాయన: ఇట్లు వాదమునకు దిగుచుండువారు.

మ మిద్దఱను 'లేచి యాడుకొనఁ బొం'డని మా తండ్రులు పంపివైచినారు. అప్పటికిఁ బెండ్లియనిన, దాని విశేషములు మాయిద్దఱకుఁ దెలియవు; కాని, చుట్టములు వత్తురు, పల్లకి యెక్కుదుము-ఇట్టి యూహలుండునవి. ఎనిమిదియేండ్ల దానికి నాకంతకంటెఁ దెలియునా? పదాఱేండ్లున్నంతనే—మాత్రము తెలిసినదేమి? అనురాగమున్నది వయసుతోపాటు క్రమక్రమముగా నభివృద్ధియగుచుండును. అది రెండువిధములు—వివరము చెప్పఁజాలను గాని—స్త్రీలయనురాగము వేఱు, పురుషుల యనురాగము వేఱు.

"అమ్మ మీకొఱకు మామిడిపండ్లు దాఁచినది తినుండు, పొం"డనిలచ్చును గౌరును మానాయన యావలకుఁబంపి, "బావా! మీరు రెండవతలంపు పెట్టుకొనవలదు. మనమిపుడే నిశ్చయపఱిచికొన్నారము. నాకు సర్వవిధముల నిష్టముగానున్నది. మీవంటివారి ప్రాపులేకున్న మీఁదమీఁద-ఈ దిక్కుమాలినవాండ్రకుఁ గార్యములు కావలయును; నన్ను మట్టుకొనకుమని దూరముగాఁ దొలఁగి తప్పించుకొనఁ జూచువారి సంబంధములు నాకిష్టము లేదు. ఏమమ్మా, నాయకం! ఏమినీపూరకున్నదానవు? కోడలు నీచంక కెక్కుదు ననుచున్నది; బావగారి మెడలు వంచినాఁడను" అనియెను.

"అన్నయ్యా! మీయాశీర్వాదము. నారాయణ మీయల్లుఁడగునంతటి భాగ్యమునకు నోఁచినాఁడా."

"మేము మీతోసంబంధము చేయుటకై నోఁచినామనియే నమ్ముచున్నారము."

"అన్నయ్యా! మీరు మీరు మాటలాడుకొనుఁడు, మేమాఁడువారము; మీవెనుకనే నడచివచ్చెదము."

"మీవదినెకు నచ్చినది, నాకు సమ్మతమైనది; మా పిల్ల మామాట కడుగుదాఁటదు."

"మీరందఱు శుభమస్తనిన నేనా మీమాటలకు జవదాఁటుదానను?"

అపుడు శాస్త్రులు మామగారు మాయమ్మతో "సోమిదేవీ! మీయల్లుఁడు పండితుఁడుగాఁడు, రెండు ముక్కలు రావు" అనిన, మాయమ్మ "అన్నగారూ! మీరు పండితులుగదా! మీపేరు మోచికొనియైన బ్రదుకలేఁడా?" యనియెను. శాస్త్రులుగారు "నాచదువువానికి భరింపలే" దనిరి. మాయమ్మ "యేచదువోయున్నదియే చాలును; వారియదృష్టమెట్లున్నదో చూతము. మాకిఁక నింక నెవ్వరున్నారు? వడుగులా పెండ్లిండ్లా! యీచిన్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుట్టి నాగమ్మలు నాకుదొరకినారు. వీరితోఁగొన్నికష్ట ములున్నవి. అన్నయ్యగారు! నాదుఃఖము లడుగవలదు. పుట్టినిల్లు పురువు నాకి పోయినదిగదా! గడియగడియకు హృదయములో శల్యములవలె గ్రుచ్చుకొనుటకు వీరిద్దఱు జతపడినారు. మీవంటి వారియూఁత మాకు లేకున్న మేమగుదుము!"

శాస్త్రి—"మీకేమిభయము మేమెప్పుడైన మీకు సాయపడినారమా? యిక్కడి పూరి పుడక యక్కడఁ బెట్టితిమా? మీరిద్దఱును బుద్ధిమంతులు, శాంతులు. మీ మొగముచూచినవారికెల్ల మీయందు భక్తివినయము లుప్పతిల్లును. మాకుమాత్ర మావల మీకంటె నేమిగొప్ప సంబంధములు వచ్చిపడును? ఏమిచూచుకొనియిచ్చెదరు? ఆయుర్దాయమున్న వారే బాగుపడియెదరు.

"అన్నయ్యగారు! సమానసంబంధమునకే మేము కొట్టుమిట్టాడుచున్నది. పెద్దపెద్ద వారితోఁగూడదు"

శాస్త్రి—మేమనదియేచూచుచున్నది. 'వివాహ శ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే'యన్నారు పెద్దలు.

వేయిమాటలింకెందుకు?శుభమస్తనుకొన్నారు. అను కొన్న వేళమంచిది. సత్యకాలపువారితలంపులకు సత్యమైన దేవుఁడు తోడుపడును. ఎవ్వరయాశీర్వాదమో యిల్లని వాకిలియని యత్తమామలని సంసారమని-యింతటిదాన నైతిని. ఆఁడుదానికి మగవానికి నదృష్టమొక్కటి ము ఖ్యము. అది యనేకుల కనేకవిధములుగా నుండును. మాయత్తవారు పుట్టినింటివారు కొంతమేలు. ఆమేలెం దులోను? మగసంతానముం గలిగియుండుటలో. ఇఁక ముం దచ్యుతరామయ్యగారికుటుంబమున కెవ్వరున్నా రనిన నేననినిల్చువారేరి? ఏమో, నేనెవ్వరో నాయదృ ష్టమెవ్వరో; నాకడుపునఁబుట్టి యాతనిపేరు మోయు వాఁ డొక్కఁడుండవలయునుగద! ఎందఱుపుట్టిననింటి పేరు నిల్పలేరు. వారియదృష్టమట్టిదై పోయినది."

నాకొక్కబెంగపట్టుకొన్నది. నేనేదోయెటిఁగి నతావునఁ బడితిని. క్రొత్తలేదు. ఇపుడందఱను విడిచి యింతదూరములో నున్నప్పటికిఁ జిన్నతనపుముచ్చటలు నేమిరుపురము మొదలుపెట్టుకొంటిమా యేమియోఁదోఁ పనిగడియలు గడచిపోవుచున్నవి. లచ్చుకట్టివాఁడువచ్చు

నో,గౌరి కట్టి సంబంధముదొరకునోయని.'నామాటకేమి, వారిమాటయే బాగుగానాలోచింపవలయును.' అని నే ననుకొను చుండుదానను. అనుకొన్నట్లుగానే మానాన్న శుభలేఖ వ్రాసిపంపెను. విప్పిచదువుదాఁకఁ జేతులు వణఁకినవి. మాతండ్రిగారి యక్షరములని గుర్తించి నేనే పుచ్చుకొని విప్పిచదివితిని—గాని యింటికి వచ్చిన పిమ్మట నేపైన నుత్తరములు వచ్చినవా యని యను దాఁక బల్లమీఁదనేయుంచి, వారు చదువుకొన్నపిమ్మటఁ గాని, విశేషము లేమనియడుగుదానను గాను. ఎన్నఁడు ను స్వతంత్రించుట లేదు. మానాయన వ్రాసినను లకోటా యుత్తరము విప్పుదాననుగాను; కాని; పసుపురాచియుం డుట శుభలేఖయేకాని రాజకార్యములందుండఁను ధైర్య ము. అది మాటకు శుభలేఖయేకాని లోపల నింతవిశేష వ్యవహార మున్నది. అందలి ముఖ్యవిషయ మేమనఁగా:

"మీరు దూరదేశములో నున్న వారను బెంగమాకు లేదు. దైవమున్నది. మనమెక్కడ నున్నను మనలో మన యిలువేలుపులు కాచియుందురు. మీరు వ్రాయు నుత్తరములు చదివిన మీతో మాటలాడుచున్నట్లే యుం డును. మీరు తలంపునకు వచ్చినపుడెల్ల మీయుత్తర మొకటితీసి చదువుకొనుచుందుము. అది కొంతయూఱట గలిగించుచుండును. మీనాయనకు నీవు నీజీతములోనుండి కొంతసొమ్ము పంపుచు వ్రాసినదానిలోని సంగతులు వింటిమి. నోరుమంచిదైన నూరుమంచిది యగును. మీవంటివారెంత యరణ్యవాసులతోఁ గలసియున్నను వారికి మీయందుఁ బ్రేమజనించును. మీస్వభావము లట్టివి. మిమ్ముస్తోత్రముచేయఁగూడదు. లచ్చువివాహ మునకై మనచేతిడబ్బు వ్యయమక్కఱలేదు. గౌరిడబ్బు గౌరికే యున్నది దానిని సరియైనమార్గమున వినియో గించుటయే మనపని. ఆవక యేవిధమైన ప్రతిబంధకము వచ్చునోయని వారినివీరిని గూడఁదీసి యడిగి యభిప్రా యము పుచ్చుకొన్నాఁడను. దిక్కుమొక్కు లేని కట్టు వాండ్రమీఁద దండెత్తువా రిప్పుడుగాని మఱియెప్పుడు గాని లేకుండఁ గట్టుదిట్టములు చేసినాఁడను. తిరిగి తిరిగి వెనుకలేను. తిరుగుటకు మొదలుపెట్టితిమా, తప్పదు; కొండద్రవ్వి యెలుకను బట్టుదుము. మనకా తెలివి తేటలు లేవు. మసిపూసి మారేడుకాయ చేయఁజాలము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దానికని యొక్కటి యూహించితిని. నాదగ్గఱఁ జదువుకొనుచున్న లక్ష్మీనారాయణునకు లచ్చిను, శంకరదీక్షితునకు గౌరిని బెండ్లిచేయఁ దలఁచుకొన్నాఁగము. ఎఱిఁగినవాండ్రు, చనవైనవాండ్రు ఎప్పటికైన మనపైఁ గల గురుభావమునఁ గొంతజంకుచే లోకువగా నుందురు. శిష్యులకు బిడ్డల నిచ్చుటలో నాక్షేపము లున్నను లచ్చి నాబిడ్డకాదు. గౌరి నాకూఁతురుగాదు. ఆక్షేపించుటకవకాశ ముండరాదు. వారి తలిదండ్రులు మనయందలి గౌరవముచేత మనయొద్దికిఁ బంపినారుగాని వారికిఁ జుట్టుప్రక్కలయూళ్లలో నెవ్వరును జదువుచెప్పువారు లేక కాదు. అట్టి విషయములో మన మిట్లు చేయుచున్నారమనిన శిరసావహింతురుగాని యడ్డుచెప్పరు. వారికున్నది వారికుండనిండు. ఏదో కొంత నాస్తితోఁ బుట్టెడో రెండుపుట్లో భూమితోఁ గన్యలు వచ్చుచున్నవారి కేమి కష్టము! మహారాజులలాగున నంగీకరింతురు, అంగీకరించినారు. లచ్చినడిగినారము : "అక్కయ్యకువలెనే మాకును నెఱిఁగినవారే దొరకినా" రన్నది. గౌరినడిగితిమి, "ఎవ్వరైననేమి నగలు చీరలు కొనినసరి"యన్నది. ఇదియును గొంతమేలే యనికొని సంతసించితిమి. మొదట గౌరికొఱకు లక్ష్మీనారాయణుని యోజించినారము. గోత్రము, ఋషులు, విచారణలోఁ గొంతచిక్కు వచ్చినది. అటునుండి యిటు మార్చినారము. లక్ష్మీనారాయణునకు లక్ష్మి, శంకరదీక్షితునికి గౌరును సంఘటించితిమి. మీ రెట్లు వత్తురా, మాటిమాటికి సెలవులెట్లు దొరకునా, ఒకపనిలో నుండి వేఱొక క్రొత్తపనిలోనికి మాఱి కొన్నిదినములే యైనదఁట; రానుపోను రెండునెలలజీతము వ్యయ మగును. మీరు రాకపోయినను వచ్చినట్లే సంతోషించెదము. ఎవ్వరుతిన్నది! పుట్టమీఁదఁ బెట్టినట్లు నూఱురూపాయలు--ఎవ్వరు నూరకున్నను లచ్చిగౌరి యూరకుండరు; వారికిఁ దోఁపదు. మానిమిత్తముగాదు, మీనిమిత్తముగాదు. ఆ కుఱ్ఱవాండ్రిద్దఱికొఱకు మీరు రావలయును. పెండ్లి గృహప్రవేశము నీ రెండును గాఁగానే మిమ్మొక నిమేష మిచ్చట నట్టేపెట్టను. నేనే తొందరపెట్టి పంపివైచెదను. జీతము నష్టమైనను సరియే-పదునైదుదినములు సెలవుగొని రావలయును. ఎట్లువచ్చెదరో; యెట్లు పెండ్లిచేయించెదరో; ఎట్లు మీయజమానులకుఁ గోపము రాకుండ నాజ్ఞలభించు నుపాయము చూచికొందురో!" ఇట్లున్న యుత్తరముం గాంచి మే మెట్లు పోకుండఁగలము!

---

# కవితాప్రపంచము

కె. అన్నమరాజశర్మ గారు

రసపరిప్లుత భావసామ్రాజ్యవీథి
నవనవాశయ ఘుర్ణణానందమతిని
విశ్వకావ్యరహస్యముల్ విశదపఱచి
క్రొత్తలోకంబు నొకదాని గూర్చికొంటి.

పొడుపుమలఁ బూచు రాగప్రబోధ మందు
సంధ్య చిత్రించు బంగారు చాయలందు
ప్రణయసుకుమార సూత్రికాబాంధవమున
సరసకావ్యంబు లెన్నేని జదువుచుంటి.

కలితసౌరభ్యసుమమునఁ గాపురంబు
సలుపు కింజల్కముంబోలె స్వాదుభావ
గంధబంధురహృదయ లోకంబు నందు
ననితరానందవృత్తిచే నలరుచుందు.

సకలసౌందర్యరూపసంచలితగతుల
పరిణమించెడి యూహాప్రపంచమందె
కనుల బ్రమదాశ్రుపూరంబు కడలుకొనఁగ
మురళివాయింతుఁ ద్రిదివసమ్మోహనముగ.

—"మల్లెపువ్వులు"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# అతిథి దేవుఁడు

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు

కాకినాడలో ఒకయిల్లుమాత్రమే ఆనందరావు ఆస్తి. అతనికి సంబంధించిన తతిమ్మా ఆస్తి యావత్తూ భార్యాద్వారా సంక్రమించినదే.

స్త్రీధనమువలన జీవింపవలసిన దైన్య మతనిని అతిగా బాధించినది. కావున తన భార్య జ్యోతికి వచ్చు ఆస్తిలో రెండులక్షలు నిలువచేసి తనపేరున పాతమూరు అనుగ్రామము కొన్నాఁడు.

ఆనందరావిపుడు తనపేరున కాకితములలో నెక్కిన ఆస్తి చూచికొని పూర్వపు దైన్యము వదలివేయఁగలిగెను. లోకులు మాత్రము పాతమూరుకూడ జ్యోతిదేయని వ్యవహరించుకొనుచుండువారు. జ్యోతికిని ఆనందరావునకును అటువంటి వ్యవహార మెన్నఁడును కలుగలేదు. ఆఁడుదానికి మగవాఁడే దైవము. మగవానికి మఱిలేఁడుకదా!

ఆనందరావునకు నియోగులకుండు ఆత్మగౌరవ మెక్కువ. వైదికులందు భక్తియు అధికమే. యాచింపవచ్చు అవధానులకు నాలుగైదునాళ్లు స్వేష్టకృత్తుగా భోజనము పెట్టి రొండిని పెట్టుకొనుటకు నాలుగైదురూకలకు తక్కువ లేకుండ ఇచ్చువాఁడు. ఆబస్తీలో యాచకుల కందఱకు ఆయిల్లే యింత హవిస్సు ఇచ్చును.

ఆనందరావు మంచి పేకాటగాఁడు. అందు అందఱకు బాకీలేకాని ఎవరికిని ఏనాఁడును తీర్చినటులు తోఁపదు. ఎవరైనను ఇంటికి వచ్చి అడిగినపుడు ఆనందరావు తాళపుఁ జెవులకు తడవులాడుకొనుచుండఁగా అతని గుమాస్తా వెంకటరావు అది కనిపట్టి 'ఇపుడు డబ్బులేదు పో!' అని బోకరించుచుండువాఁడు. అటులు బోకరించుట ఆనందరావునకు ఇష్టము కాకపోయినను ఊరకుండువాఁడు. జ్యోతిమాత్రము మనస్సునందు పరితపించుచుండెడిది.

౨

చిననాఁటనే తలిదండ్రులు పోవుటవలన వెంకటరావు గాలికి పెరిఁగెను. ఉన్నపొలము కొంచెము అమ్ముకొని మెట్రిక్యులేషన్‌దాఁక వచ్చెను. ఆఱుదండయాత్రలు చేసెనని సహపాఠులందురుకాని యతఁ డొప్పుకొనఁడు. అయిదేండ్లుమాత్రమే తప్పితినని యతఁడు వాదించును. వెనుకటి రికార్డు తగులఁబడిపోవుటవలన ప్రతివాదులావిషయమున పోరాడరు. అంతటితో ఆచదు వంతమయినది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అక్షయ సం. ఫాల్గుణమాసము

భారతీయ మహిళా మండలి

మేరీ రాణీకళాశాలా విద్యార్థినులు



లీలావతీ సులోచన నాటకప్రదర్శన చిత్రము



నాటకప్రదర్శనమున విరామసమయములందు మనోహరముగ గానముచేసిన విద్యార్థినుల చిత్రము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ప్రదర్శకులు

ఈ ప్రదర్శనము గోషనుప్రభ్విసమక్షమున జరిగెనది. ప్రదర్శనమునకై ఎక్కువ పాటుపడిన వెస్లీయను బాలికాపాఠశాలవారిందు గలరు. స్పెన్సరు, వుడు సతుల కప్పులను ఈ పాఠశాల బాలికలు పడసిరి. నిషను విల్లింగ్డను డాలును వీరే పడసిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొన్నాళ్లు నాటకములలో తిరిగెను. కంకమున కాకి అధిదైవతముగా ఉండుటవలనను, ఆంధ్రమున ఆదరము లేకపోవుటవలనను అనులకును తిన్న గాపనికిరాలేదు కాని ఆనాటకరంగము ప్రసాదించిన ఆఁడంగిరేకుల గుణములు లోనగునవి కొన్ని అతనియందు నిలిచిపోయినవి. పిమ్మట వెంకమ్మ అను ఒక దిక్కుమాలిన విధవను తీసికొనివచ్చి ఆమెచే పూఁటకూళ్లు సాగించెను. అఱవవారితో పోటీచేయలేకపోవుటవలన అందులను కడుపునిండ తిండి దొరకలేదు. అయినను ఆవ్యాపారము ఇంకను మానలేదు. ఆవలి యాధారము చూచుకొని కాని యీవలి యవలంబనము పురుగేని వదలదు కదా!

సరిగా ఆసమయమునకే ఆనందరావు పోతమూరు కొనుట సంభవించినది. ఆనందరావు సొంతయాస్తికి ఒక సొంతగుమాస్తా కావలసివచ్చెను. వెంకటరావు అతికెను.

ఆనందరావు తనగుమాస్తాను తనయింటనే భుజింపు మని యనునుగాని పండుగునాఁడైనను వెంకటరా వందులకు సమ్మతింపలేదు. సాటివానియింట తినుట గౌరవమునకు హాని యని యతని విశ్వాసము.

శూద్రుఁడు బ్రాహ్మణునియింటి కతిథిగా వెళ్లునుగాని సాటిశూద్రునింటికి చనఁడు. సాటివానియింట కులగౌరవమున కేమి లోపము వచ్చునో యని వానికి జంకు. తనకన్న ఎక్కువకులమువాఁడగు బాపనియింట తనకు మర్యాదలేకపోవుటయే మర్యాదయని యతని విశ్వాసము. కాని యేయింటనైనను వైదికబ్రాహ్మణునకు మాత్రము ఏకోశమునను శంకలేదు.

వెంకటరావు పరగృహమున విస్తరివేసి యెఱుఁగఁడు. అతనికి పూఁటకూలి యింటనే అన్నప్రాశమయినది. అతనికదే స్వగృహము. పూఁటకూలియింట ఎంత స్వాతంత్ర్య ముండునో నిర్ణయింప వెంకటరావు ప్రమాణము. ఏలయనఁగా ఆహా ఈపీఁట లెంత తేలికగా ఉన్నవో చూడుఁడు! అని పొగడుచు ఆకాశమున కెగుర వేయువాఁడు. అవి క్రిందఁబడి యిబ్బడి యగునవి. మంచినీరు అడుగుటకు క్రిందపఱచియున్న నాపరాతిమీఁద జర్మనీగ్లాసుకొట్టి 'నాకెంత ముడ్డి



కుదురున్నదో నీకును అంతయే' అని నిందించుచు నీరు పోయించుకొని చేపట్టు వదలు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాఁడు. కొన్ని విస్తళ్లమీఁదుగా ఆవఱద పోవుచుండఁగా విస్తరిలోని అన్నముతీసి అడ్డ కట్టలు ఆనకట్టలు వోయుచుండువాఁడు. ఇట్టి పనులవలన వెంకటరావు ప్రమాణముకాఁడని యెవఁ డనఁగలఁడు?

3

దైనందినమును పలువురు వచ్చుచుండుట వలనను వచ్చినవారి కందఱకు జ్యోతియే పలురకముల వంటలు చేసిపెట్టుటవలనను వెంకటరావు తన యజమానుని యింటినిగూడ పెద్దపూఁటకూళ్ల యింటినిగా పరిగణించుటయే కాక జ్యోతినిగుఱించి ప్రక్కగుమాస్తాతో పెద్దవంట లక్కయని వ్యవహరించుచుండును. 'ఆనందరావు పిల్లజమీందారు. పిల్లజమీందారేమి? పెద్దజమీందారే. జ్యోతి కిఱువది వేలువచ్చును. తనకు పదివేలు వచ్చును. ఇంత ఆదాయముకల యిల్లాలు సొంతచేతులతో వంట చేసిపెట్టుట వైదికకుటుంబములలోనే లేదే! ఇఁక నియోగిబిడ్డయా' అని తనకే నామర్దాగా నున్నటులు వెంకటరావు లజ్జించుచుండువాఁడు.

వంటవాఁ డనఁగానే ఆచారవ్యవహారములు తిన్నగా జరుగవని జ్యోతియే వంట చేసికొనును. కాని ఆనందరావు కొన్నాళ్లు వంటవాని ముచ్చటలు చూడక మానలేదు. వంటవానితో తానుగూడ ప్రతినిమిషము ఉండవలసి వచ్చుటచేతను, వైదికబ్రాహ్మణులు తిండి కుండకపోవుటచేతను, అవధానులకు తన యింటనే విందులిడి వారిచే ఆశీర్వాదము పొంది తత్ఫలముగా పుత్రప్రాప్తికుతూహలము పొందియుండుటచేతను ఆనందరావు నింట వంటవానికి మఱి ప్రవేశము లేకపోయినది. ఆ త్కాలమున ఏయవధానులుగారో వంటచేసి పెట్టువాఁడు కావున వారికి ఆవిషయమున అట్టి కష్టము కలుగలేదు.

పంక్తిలో బ్రాహ్మణుఁడు లేనిమెతుకు ఆనందరావున కానాఁడు పస్తే. ఒకనాఁడు బ్రాహ్మణుఁడు లేని దుర్దినము తటస్థించినది. వెంకటరావును ఆహ్వానించెనుగాని యాతఁడన పండుగనాఁడు వచ్చెదనన్నాఁడు. బలవంతము చేసినకొలఁది బిగిసినాఁడు. తుదకు జ్యోతి యింటిలోనుండి వెలుపలికి వచ్చి 'నాయనా! నీవు వచ్చిననాఁడే మాకు పండువు. నామాట నయినను మన్నింపు'మని యడుగఁగా వెంకటరావు తల యూఁపినాఁడు.

ఆఁడుదానిమాటలో తల్లిప్రేమయు, మిత్రుని యనురాగమును, గురువునాజ్ఞయు నున్నవి. వెంకటరావు హృదయశిల జ్యోతిప్రార్థనచే కరఁగినది. వెంకప్పకు కబురంపి అక్కడనే ఆఁగిపోయినాఁడు,

ఆనందరావు స్నానమయినది. వెంకటరావు నిఁక స్నానము చేయు మన్నారు. వెంకటరావున కచట స్నానముచేయ సందేహముగానే యున్నది. ఏలనఁగా వెంకటరావెపుడును భూదేవత కర్పించుటయేకాని తన బట్టను తాను పిడుచుకొని యాఱవైచికొనుట యెఱుఁగఁడు. అందును పరగృహమున తన బట్ట తాను పిడుచుకొని ఆఱఁగట్టుకొనుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొత్తకష్టము! కాని ఆగ్రీష్మాంతమున అడవి జంతువులు కూడ జలకమాడక తప్పవు. అందు వలన అతఁడును ఎట్టులో స్నానము చేసెను. ఉదకము యొక్క శబ్దము ఎవరికిని వినిపింపని లాగున బట్ట పిడుచుచుండెను. బట్టయొక్క ఒకచెంగు పృథివీగంధమును మూచూచుచు న్నది. రెండవ చెంగు చేతులలో నున్నది.

వెంకటరా వెంతసేపటికిని లోనికి రాలే దేమి యని జ్యోతి యచటికి రాఁగనే ఆప రాధవము సహింపలేక వెంకటరావు తన పనిని తొందరగా ముగింప తొక్కిసలాడుచుం డఁగా జ్యోతి 'అపని నీకెందులకు? దాసి పిడిచి కఱనై చునుగదా! లోనికి వచ్చి మడి గట్టు కొనుము' అనుచుండఁగా చేతులలో నున్న రెండవ చెంగుకూడ కుసుమాంజలివలె నేలపైఁ బడెను.

'అబ్బే! నే నేమియుచేయుట లేదు. క్రిం దపడవైచుచునే రాఁబోవుచుండగా మీారే వచ్చితిరి' అని లోపలికి వెళ్లి పీటమీాఁద నున్న మడిబట్ట కట్టుకొనుటకుఁగూడ మొదట కొంచెము సందేహించెను. ఏలనఁగా వెంకట రావునకు మడిబట్ట కట్టకొనుట అనునది అదియే మొదలు. కట్టువిడిచినబట్టగాని, చాకి మడతగాని తనదేమియు నచట లేమి దానిని కట్టుకొనక తప్పినదికాదు. ఆమడిమడుపు కట్టు కొనుచుండఁగా వెంకటరావునకు గగురు పొడి చినది. ఆవలిపెమున నతఁడు మృదుస్పర్శ ననుభవించుటకు బదులు గఱుకుముండ్ల స్పర్శ ననుభవించెను. కాని కట్టుకొనిన కొంతసేప టికి దాని పరిశుభ్రత ప్రత్యక్షము కావుట మొదలు పెట్టినది. ఏలయనిన అది సామా న్యముగా పరులకు మడిబట్టగా ఇచ్చు తలంటు కొల్లాయ గుడ్డకాదు. పాపమది మృదుల వస్త్రము.

అందాఁక పద్మాసనము వేసికొని కూరు చున్న ఆనందరావు అపుడే కనులు తెఱచెను. నగ్నమయిన తన నైచ్యము ఆనందరావు కనులార చూచిపోయినటులు వెంకటరావు మనస్సులో రాయిపడ్డది.

వెంకటరావునకు తూష్ణీం సంధ్యావంద నము చేయుటమైనను చేతకాలేదు. చిన్న పుడు జ్యామెట్రీలో నేర్చికొనిన సర్కిల్ ఒకటివేసినాఁడుకాని ప్రాణాహుతు లభినయిం చుట చేతకాలేదు. వాని యన్నిటిమాట యటుండఁగా అన్నము తినుటగూడ చేతకా లేదు.

పెద్దమనుష్యులలో అన్నము తినుట చాలఁగష్టమే. తమకు భిన్నమయిన ఏయా చారములు సంభవించినను పెద్దలు వానిని మ్లేచ్ఛాచారములు క్రింద కట్టుదురు. తుదకు రుచిలోను అంతియే. పిన్నలలోఁగూడ ఒక వింత లేకపోలేదు: కావలసిన యేపదార్థము గాని యడుగుట తమకు మానహానిగా తలఁ చుటయు, వడ్డించుచుండఁగా చాలుఁ జాలునని మొగము చిట్లించుకొని తత్క్షణము కొంత యాపలఁ బాఱవైచుటయు.

వెంకటరావునకు పూఁటకూటి యింటి రాచఱికము, ఆనందము ఒక్కసారిగా మాయ మయిపోయి దాస్యదుఃఖము లారెంటి స్థాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ములను ఆక్రమించుకొనెను. ఆనందరావునకు భోజనవేళలో మూఁడేండ్లనుండి మూకవ్రత ముండుటచే సరిపోయినది కాని కానిచో అతని ప్రతిమాటయు శూలమువలె వెంకట రావును బాధించియుండును. నడుమనడుమ కమ్మను పదినాళ్లపాటు మావదినెగారియింట నుంపవలయు' నని జ్యోతి యన్నది.

ఆపది దినములలోను ప్రాణములు పోవు ననుకొన్నాఁడు వెంకటరావు. జ్యోతి మొగ ము చూచినాఁడు ఆనం ద రా వు. వెంకటరా వేమియు సమాధానము చెప్పలేదు. ఇరువురులేచి చేతులు కడుగుకొనిరి.



ఆనందరావుకూడ వెంకమ్మను తన అక్క గారి యింటికిఁ బంపవల యును గాఁబోలు నని యనుకొన్నాఁడు. తమల పాకులు వేసికొనుచు 'వెంకటరావూ! ఈ రెండు మెతుకులు మా యింటనే సంజుదువుగాని వెంకమ్మను మా యక్కగారియింటికి పం పు చు న్నా!' అని అన్నాఁడు. అపుడు వెంకటరావునకు తన తక్కువతనమును, ఆనందరావు ఆధిక్యమును గోచరించినవి. అతఁడు 'చిత్తము'అని అన్నాఁడు. ఆనందరావు కనుఁగొనలేదు గాని దూర మునందున్న పాఠకుఁడు ఆతని యంగీకార ములో ఎంత అనంగీకారము మున్నదో తెలిసి కొనకపోఁడు.

తల్లి ప్రేమతో ఇదికావలయునా అదికావల యునా అని యడుగుచు ఆరంగ మధ్యమునకు జ్యోతియే రానిమొడల వెంకటరావున కంధ కారమునందు భుజించునటులు ఉండెడిది.

వెంకటరావు కడుపు నిండలేదని జ్యోతికి తెలియును. ఏలయనఁగా ఆమె సిగ్గునకును ఆఁకలికిని జరిగిన పోరాటమును కనులార చూచినది. మఱిమఱి యడుగుచో ముడుచు కొనిపోవు నాతని నాగరకతాదేవత కెఱుఁగ నటులు బలియిడినను అది ప్రసన్నముకా లేదు.

'వెంకటరావూ! నీవు పదినాళ్లపాటు మాయింట భోజనము చేయవలయును. వెం

౪

వెంకటరావు మెల్లమెల్లగా ఇంటికి నడిచి వెళ్లెను. విస్తళ్లు ఎత్తుకొని అపుడే వెంకమ్మ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్లు శుభ్రపఱచుచున్నది. పదునొకండు గం
టలు వినఁబడినవి.

వెంకటరావు పరుండెను. వెంకమ్మపై తన యాధిపత్యము వినియోగింప కుతూహలమతనికి కలదుగాని ఆనందరావు నియోగమునఁ గలుగు నైచ్యము బయటఁబడక మానదని వెంకటరావు తన యాధిపత్యము నుపయోగింపఁ బూనుకొనలేదు. తప్పించుకొన నుపాయము లాలోచించుచుండెనుగాని యేయుపాయమైనను వెంకమ్మతో సంప్రతింపని చెటులు?

అతఁడు సహజసిద్ధమైన నిద్రను ఆలోచనలు పెట్టుకొని ఆఁపుకొనుచుండెఁగాని తుదకొక స్వప్న మారెంటిని ఆవలికి నెట్టి యాక్రమించుకొనియెను!' 'పాతమూరునుండి తొందరపనిమీఁద వచ్చి తనను లేపుచు 'నిఖామాను' వాకిట నిలువఁబడియున్నాఁడు. తాను లేచి వస్త్రములు సరుదుకొన్నాఁడు. వెంకమ్మను పంపకుండుటకు నైపమునాయము చేసెనని సంతోషించుచున్నాఁడు.' ఉలికిపడి లేచి 'శ్రీరాములూ శ్రీరాములూ!' అని పిలిచెను.

'పలవరించుచుంటివా యేమి, పండుకొనుము. శ్రీరాము లెక్కడినుండి యిపుడు వచ్చును?' అని వెంకమ్మ పనివెను. తన దురదృష్టమునకు వగచుచు వెంకటరావు శయనించెను.

తెలవారఁ బోవుచుండఁగా ఆనందరావు కడనుండి వెంకటరావుకొఱకు జమాను వచ్చెను. వెంకటరావు వానిని గాంచి తటపటాయించెను. 'వచ్చెదను లెమ్ము, వెళ్లు' మని చెప్పెను.

'దగ్గఱ నుండి తీసికొని రమ్మన్నా' రని జమాను కదలలేదు.

వెంకమ్మను వారియింటికిఁ బంపుటకే వార్త! అందులకే జమాను దగ్గఱ నుండి తీసికొని వెళ్లుట! 'ఛీఛీ, ఈయుద్యోగము మానుకొననిచో మానహాని. వెంకమ్మను వెళ్లవలదందునా? రాత్రి పంపుదు నంటిని. వెళ్లుమందునా? ఛీఛీ; తల చితుకకొట్టుకొందును.' అని యిటులు మల్లాగుల్లాములు పడుచుండఁగా మఱియొక జవాను వచ్చెను. ఏమియుఁ దోఁపక 'ఈవిషయము వెంకమ్మకే వదలెద' ననుకొనుచు వెంకటరా వానందరావు నింటికి వెడలిపోయెను.

వాకిట పాతమూరి 'నిఖామాను' శ్రీరాములు కూర్చుండి యుండెను. కాకితములుసరిచేసికొనుచు కుర్చీలో కూరుచుండిన యానందరావు కిటికీనుండి కానిపించుచుండెను. శ్రీరాములు కానిపించుటతోడనే వెంకటరావు ముఖము మాఱెను. వడిగా నడచి 'శ్రీరాములూ! రాత్రి నన్ను పిలిచితివికాదు?' అని యడిగెను. శ్రీరాములు తెల్లఁబోయి 'నేనిపుడే కదా వచ్చితిని' అనెను. వెంకటరావు ఆనందరావుకడ కేఁగెను.

'గురవారాయనికి ప్రాణముమీఁదికి వచ్చినదఁట. ఆతని నోటునకు కాలదోషము పట్టుటచే ప్రాణమే పోయినది. మఱల దానికి ప్రాణప్రతిష్ఠ చేయించుకొని రమ్ము. రైలువేళ అయినది.' అని చెప్పుచు ఆనందరావు నోటు వెంకటరావున కిచ్చెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెంకటరావు మనస్సు రెండువిషయములచే ఉక్కిరిబిక్కిరి యయినది: ఒకటి వెంకమ్మమాట యెత్తకుండుట; రెండవది తన స్వప్న ప్రకారము ఇంచుమించుగా శ్రీరాములు వచ్చుట.

మఱిమాటలాడక వెంకటరావానోటు జేబులో వైచుకొని వంటయింటిదెస దొంగచూపులు చూచుచు బయటికి నడచెను. శ్రీరాము లతని ననుగమించెను. వెంటనే యింటికి వెళ్లి తాను పొలమూరు పోవుచున్నటులు తెలిపి రైలుసంచి తీసికొని రైలుకడకు నడచెను. రైలెక్కిన తరువాత అతని మనస్సున కాస్వప్నమును గుఱించి తలపోయుటకు అవకాశము చిక్కెను.

'నేటినుండియు నాలో ఏదియో ఒకశక్తి పనిచేయుచుండు ననుకొందును. నాకు కలలో ఏయుపాయము స్ఫురించెనో అదియే యేల సిద్ధింపవలెను?' అని నడుమనడుమ ననుకొనుచు కలలోని ప్రతియంశమును గుఱుతునకుఁ దెచ్చికొని సంతసించుచుండెను. కాని జ్యోతి వెంకమ్మకు కబురంపి పిలిపించునేమో! వెంకమ్మ వెళ్లునేమో! తాను వెళ్లువఱకు రంగము మఱల మొదటికి వచ్చునేమో! అను సంశయముకూడ ఆసంతసము వెనుకనే తాపటము చేయఁబడియుండెను.

కొవ్వూరున దిగి పూటకూటియింటికి పుట్టింటికి వెళ్లినటులు వెళ్లెను. అచట అన్నము తినుచు రొట్టెలు వేయుచుండెను. పదార్థములు రుచ్యములుగా నున్నందులకు కాదు. మఱల సొంతగృహ మబ్బినందులకు శాస్త్రి సగము మాఁడిన యతని కడుపిపుడు బెత్తెఁ డుబికెను. లేచి వాకిటఁ బండుకొని యిటు లాలోచింపఁ దొడఁగెను: 'పొరుగింటి భోజనమునకు పూఁటకూటింటి భోజనమునకు పోలికా? అచట కావలసినది కూడ వలదు వలదని అఱతుము: ఇచట అక్కఱలేనిదికూడ కావలయునని దబాయింతుము. అచట చెంబులు మెల్లగా పెట్టుదుము: ఇచట సత్తుపళ్లెముఁడి విసరి పాఱవైతుము. అచట మాటలాడము: ఇచట ఇల్లెగిరిపోవునటు లుపన్యాసము లిత్తుము. కావుననే పూఁటకూటి యిండ్లకు ఆనందభవనమని, ప్రమోదారామమని పేరులు.

మన దేశమున అతిథిపూజ అనునది కడు దురభ్యాసమయిన విషయము. తన పనిమీఁద నెచటనుండియో బయలుదేరి యెచటికో వెళ్లు విధవ హరియఁట! వాని కింటిల్లిపాది పూజ. కాని సామాన్యముగా అతిథులు తమకు కావలసినదానిని అడిగి పెట్టించుకొనను లేరు, ఇంటివారును చేయి విడిచి పెట్టను లేరు. అతిథులు సోమరులు; గృహస్థులు తమసర్వస్వము వారికి ధారపోసినటులు కనఁబడు వంచకులు.'

వెంకటరా విటులు తనలో తా నుపన్యసించుకొనుచుండఁగా శ్రీరాము లొక బండి తెచ్చెను. వారు పొలమూరునకు పయనమయిరి.

౫

గోదావరిపై వేసవికాలపుగాడ్పులు బయలుదేఱెను. ఇసుకతెరలు లేచి నెఱ

చాపలవలె కొట్టుకొనిపోవుచున్నవి. అవి ఆఁగిన పిదప చల్లనిగాలి వీతెంచినది. ఉషయచే చిక్కి శల్యమైన గోదావరి యారోగ్యమునకు ఆగాలి వచ్చినటు లుండెను. ఆగాలి వెనుక వాన దేవుఁడు కూడ చిటపట చినుకులతో బయలుదేరెను.

ప్రొద్దుగ్రుంకువఱకు వెంకటరావు పాత మూట చేరెను. గురవారాయని వాకిట కాలు వెట్టెను. ఇఁక వాన కుండలతో పోసెను.

గుటగుటలాడుచున్న గురవారాయని ప్రాణము లుద్రేకించిన యామహాప్రాణములో లయము చెందునటులున్నవి కాని ఆనందరావున కితఁడు నోటు తిరిగి వ్రాసియిచ్చునా? యీయఁడా? చూత మనుకొని ఆఁగినటు లున్నవి.

కొంతసేపటికి వెంకటరావు వందులకు వచ్చెనని గురవారాయనికి తెలిసెను. అతఁడు వెంటనే క్రొత్తనోటు వ్రాయించెను. అందు వ్రాలు పెట్టుటకు కలము చేతఁ బట్టుకొని ఒక యక్షరము వ్రాయువఱకు తల తిరిగి పఱపుపై నొఱిగెను.

ఇటులు రెండు ప్రయత్నములు జరిగెను. రెండుమాఱులును మూర్ఛ వచ్చెను. గురవారాయని భార్య కృష్ణవేణి 'అయ్యో! మీపైకము పోదు; నేను నోటు వ్రాసియిచ్చెదను. మఱి మీరు బాధింపవల'దని ప్రార్థించెనుగాని వెంకటరావునకు ప్రాణమునందలి తీపి యేమి తెలియును; డబ్బునందుఁ గాని? అతఁడా రేయి నచటనే జాగరించెను.

సూర్యోదయమునకుఁగాని గురవారాయనికి స్మృతి కలుగలేదు. స్మృతి కలిగిన వెంటనే వెంకటరావును బిలిచి నోటిమ్మని అడిగి పుచ్చుకొని అతి ప్రయత్నముతో ఇటు వ్రాలు పెట్టి అటు ప్రాణములు వదిలెను.



వెంకటరావొక నిమిషమేని అచట నిలువలేకపోయెను. రేయెల్లయు వానకురియుటచే బండి కుదురలేదు. సమీపగ్రామమగు భట్టపల్లిలో భోజనసదుపాయము (శ్రీ)రాములు చెప్పఁగా నడచిపోయెను. రాత్రి ఉపవసించుట చేతను, ఎన్నఁడు నడిచినవాఁడు కాకపోవుట చేతను వెంకటరావు నడువఁజాలకపోయెను. నోటు తిరిగి వ్రాయించికొనిన సంతసమే అతని నెటులో నడిపించెను. పదునొకండు గంటలకతఁడు భట్టపల్లి సమీపించెను. ఇఁక ఆగ్రామమున ఏ ఆనందభవనమునకో వెళ్లవచ్చునని యతని తలంపు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రామకంఠమునఁ జింతచెట్లక్రింద పశువులఁ గాచికొనుచు పదములు పాడుకొనుచున్న పైలానిఁ జూచి 'యీయూర పూఁటకూటియిల్లు కన్నదా?' అని యడిగెను.

'ఛీ ఛీ, పల్లెటూరిలోఁ గూడ పూఁటకూటియిల్లు ఉండవలసిన గతి యింకను పట్టలేదు. వెళ్లవయ్యా, ధుంఢీశ్వరులవారి యింటికి; నీబోటివా రెందఱు వచ్చినను ఎన్నాళ్లున్నను పప్పలతో అన్నము పెట్టుదురు' అని వాఁ డనెను.

వెంకటరావు గుండెలు కొట్టుకొనెను. 'రాత్రి భోజనము లేదు; కాని కొవ్వూరే చేరువాఁడను. నేను వెళ్లి వైదికబ్రాహ్మణునివలె ఊరక భోజనమిడుఁడని యెట్లు ప్రార్థింపఁగలను?' అని అనుకొనుచు నడచుచుండెను.



చెఱువు మెట్లమీఁద కూరుచుండి మాధ్యాహ్నిక మొనర్చికొనుచు ధుంఢీశ్వరుఁ డామాటలు వినెను. వెంకటరావు సమీపింపఁగా లేచి దాపునకు వచ్చి 'అతిథి ర్నారాయణో హరిః' అని నమస్కరించి 'తాము మాయింటికి భోజనమునకు దయచేయవలయును' అని ప్రార్థించెను.

'ఈయూర బండ్లు కుదురునా? నేను కొవ్వూరునకుఁ బోవలయును. భోజనము కేమిలెండు!' అని వెంకటరా వనియెను.

'తమకు భోజనమునకు కొఱఁతయని కాదు. మట్టమధ్యాహ్నమున నడతెంచిన మీరు నారాయణులరు. మాయింట విందు కుడిచి గాని మఱిపో వీలు లేదు.' అని ధుంఢీశ్వరుఁ డనెను.

వెంకటరా వెట్టకేలకు సమ్మతించెను. నేను వెంట వచ్చి దిగవిడుతునని ధుంఢీశ్వరుఁడు మెట్లెక్కఁ బోవుచుండఁగా వెంకటరావు 'ఇచటనుండి చూపుఁడు; మీరు రానక్కఱలే' దనఁగా ధుంఢీశ్వరుఁడు 'అదిగో రావిచెట్టు! దాని కెదుటియిల్లే!' అని తెల్పెను. వెంకటరావు కాళ్లీడ్చుకొనుచు వారివాకిలి చేరెను.

చాలమంది అతిథులు దొడ్డిలో బ్రహ్మయజ్ఞము చేసికొనుచుండిరి. ఒకతె యిల్లు పరిశుభ్రపఱచుచుండెను. తాలింపు తావులు అతని బెల్లించుచుండెను. నడుమునకుఁ గట్టిన కంచితుండు అరుఁగుమీఁది చాఁపపై పఱచుకొని పడుకొనెను. ఆఁకటినుండి వేఱుపఱచి నిద్ర యతని నుపలాలించెను.

'అవిధినా కృత మకృతమ్' అనుకొనుచు ధుంఢీశ్వరుఁడు మఱలఁ జెఱువులో సంధ్యావందనము మొదలయినవాని నన్నిటిని ముగించి యింటికి వచ్చెను. అతనిభార్య రంగవల్లి తీర్చి దీపారాధనము చేసెను. మడి గట్టుకొని దేవతార్చన యారంభించెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'ఆహా! ఫస్టుబెల్ అయిన' దనుకొనుచు కనులు తుడుచుకొని వెంకటరావు లేచి కూరు చుండెను. భోజనమునకు పిలుచులోపల స్నాన మొనరించి వత్తు ననుకొని కొలఁకున కేఁగెను.

ఒకొక్కరే దేవతార్చనలు చేయుచుం డిరి. ఒకరికన్న మఱియొకరు రాలస్యము చేయు చుండిరి. వారికి వచ్చిన ధ్యానశ్లోకములన్నియు నాలుగైదుమాఱు లావృత్తము లగుచున్నవి. వెంకటరావు చెఱువునుండి వచ్చి పట్టుబట్ట కట్టుకొని వాకిటఁ గూరుచుండెను. అతఁడు నిదురచే తూఁగుచుండెను. గోడ కానుకొనియే అతఁడు కునికెను.

కొంతసేపటికి చెంబులు పైకెత్తి మంచి నీరు త్రాగు గళబిలధ్వనులు 'నేయితెమ్ము కూరతెమ్ము' అను పురమాయింపులు 'అన్న పూర్ణనంట' అను పొగడ్తలు వెంకటరావును లేపినవి. తనను కనుఁగొన లేదను మంట ఆఁకటి మంటకు తోడయినది. అతఁడు లోలోపల ధుంఢీశ్వరునిపై కారాలు మిరియాలు నూఱెను.

అతిథికి అన్నముపెట్టి తీఱవలసిన నియమ మేమేని కలదా? లేకపోయినను అతిథియే ఆనియమమును స్థాపించినాఁడు. తనను అగౌ రవపఱచినాఁడను నేరము మోపుట కతిథికి సంపూర్ణమయిన అధికారము కలదని వెంకట రావున కెఱుకపడెను. ఆనేర మెన్నటికిని పరి మృష్టము కాకుండ నుండవలయునని వెంకట రావు తలఁచెను. 'ప్రతిమూరను పూఁటకూటి యిండ్లుండుఁగాక! అందును ధుంఢీశ్వరుని యిల్లు ఆనందభవన మగుఁగాక!' అని యాశీ ర్వదించెను.

అతిథులు నారాయణస్మరణ మొనర్చు చుండిరి. ఆ భగవన్నామకీర్తనారస నిమగ్నుఁ డైన ధుంఢీశ్వరున కింతవట్టు వెంకటరావు గోచరింపలేదు. కొంతసేపటికి అందఱ మొగ ములు చూచినాఁడు. ఆమొగములలో నీలా లకపరివేష్టితమగు మొగ మేది? అతని మొగ మున క్షమించినను క్షాళితము కాదేమో యనునంత అపరాధము కానిపించెను. అతిథు లందఱు తెల్లఁబోయి చూచుచుండిరి. భార్య పట్టుకొనిన పళ్లెము పట్టుకొనినపాళముగా నిలు వఁబడి పోయినది.

ధుంఢీశ్వరుఁ డంట్లచేతితో లేచి వాకిటి కరిగెను. వాకిలి శూన్యముగా నుండెను. నారా యణస్మరణ చేయుచు నతఁడు వీథిలోని కరి గెను. అంతయు శూన్యము, అంతయు శూన్య ముగా నుండెను. 'నా నారాయణుని నేను పోఁగొట్టుకొంటిని, నా నారాయణుని నేను పోఁగొట్టుకొంటి'ననుచు నతఁడు శూన్యమును పరికించెను. అతని మన స్సాశూన్యమున లయము చెందెను.

కొంతవడి కతఁడు లేచి ఘంటాపథము వెంటఁ బరుగిడెను. కొలఁది దూరముననే బండిలో వెళ్లుచున్న వెంకటరా వాతనికి కాని పించెను. ధుంఢీశ్వరుఁ డొక్కపరువున బండిని సమీపించి దోయిలి యొగ్గి 'నాయనా! నన్ను క్షమింపుము! నేను నిన్ను మరల కనుఁగొన మఱచితిని.' అని బండి వానితో తన ప్రమాదమును చెప్పికొని బండి నాఁపు మనెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వెంకటరా విసుమంతయు నంగీకరింప మాన్పివైచెదను' అని ఒట్టిడుకొనెను. వెంకటరావు 'రాత్రిభోజనము కూడ మాను' మనెను.



ముందు వెంకటరావును వెనుక ఘుంఢీశ్వరుఁడును పరువిడుచుండిరి. ఘుంఢీశ్వరునకు చాలివచ్చెను. అతఁడు బిగ్గఱగా

'ఆశా ప్రతీక్షే సంగతం సూనృతాఞ్
చేష్టాపూర్తే పుత్రపశూంశ్చ సర్వాన్;
ఏతత్ వృంక్తే పురుష స్యాల్పమేధసో
యస్యానశ్నన్ వసతిబ్రాహ్మణో గృహే.'*

అని పఠించుచు నేలఁబడిపోయెను. అతనినోట మఱి మాటరాలేదు. ఆతనిశరీరమునుండి స్వేద



లేదు. ఘుంఢీశ్వరుఁడు పలుమాఱులు బతిమాలుకొనెను గాని వెంకటరావు 'నే నీక వెనుదిరుగను' అని చెప్పివైచెను. 'నేను బండి కట్ట'నని బండివాఁడు ఎద్దును విప్పివైచెను. వెంకటరావొక్కదూఁకు దూఁకి పరువిడ నారంభించెను. ఘుంఢీశ్వరుఁడు 'నాయనా! నీవు రా ము ప్రవహించి ఆఁగిపోయెను. ఆతని బండిపై కున్న నే నీక మధ్యాహ్న భోజనము వేసికొని బండివాఁ డింటికితోలుకొని పోయెను.

[చిత్రకారుడు: శ్రీయుత అడవి బాపిరాజుగారు, బి. ఏ.,]

---

* ఎవనియింట బ్రాహ్మణుఁ డుపవసించునో వానికి రాఁగోరుకొను ఫలమును, వచ్చునను నమ్మికకల ఫలమును, సత్యవాక్ఫలమును, ఇష్టాపూర్తముల ఫలమును, పుత్రులును, పశువులును–ఈసర్వమును నశించును.

[కఠోప-౧-వ.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



వ్యాసకర్త

# వ్యాసుఁడు జనమేజయు సంశయముతీర్చుట

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

(మదీయాంధ్రభవిష్యపర్వములోనిది)

వ. జనమేజయభూనాయకుం డట్లు సర్పయాగంబు సమాప్తినొందించి పదంపడి యశ్వమేధం బానరింపఁ గృతాభిలాషుఁడై యొక్కనాఁ డాసర్పసత్త్రప్రదేశమందలి శిబిరంబున నింపోలగంబుండి ఋత్విక్పురోహితాచార్యాదులకుఁ దనసంకల్పంబు విన్నవించి తదాహవయోగ్యమైన హయరత్నమును విడిచిపెట్టఁదగిన సన్నాహము సలుపుచున్నపుడు, యోగదృష్టి నతని మనోరథం బెఱింగిన త్రికాలజ్ఞుఁడగు కృష్ణద్వైపాయనుఁడు కామగమనంబున నచ్చి, యాసభాంతరాళమున సాక్షాత్కరింప నప్పుడమిఱేఁడు సంభ్రమాశ్చర్యసంతోషపరీతచేతస్కుఁడై ప్రత్యుత్థానాభివందనపూర్వకంబుగా నర్ఘ్యపాద్యాది విధులాచరించి యమ్మహాత్ము నుచితాసనాసీనుం గావించి సకలవేదపురాణార్థసంగతంబులగు వివిధచిత్రకథాప్రసంగంబులఁ గొంత ప్రొద్దుగడపి, యనంతరంబు తన తాతముత్తాతయుఁ గౌరవాన్వయస్థితికరుండు నగు నప్పరాశరసూనుతో మహాభారతప్రశంసాపూర్వకంబుగా నిట్లనియె.

ఉ. వీనులవిందు, మానసమువేడుక, నాలుకతీపియైన యా
ఖ్యానము, సాంగవేదపరమార్థనిధానము, సర్వధర్మసం
స్థానముఁ, గౌరవాన్వయవిధానము, లోకయశోవిభూతిసం
ధానము, భారతంబును సదా వినుచుందును వీను లారఁగన్.

గీ. కాని శంఖపయోధారకరణిఁ బరమ-పావనంబును మధురమై పరగు నీదు
దివ్యకవితాసుధాధార తీపిమరగు-నాదుమది కిప్పటికిఁ దృప్తిలేదు సుమ్ము.

గీ. కాక, సుధనారగించుట నాకసుఖముఁ-గాంచుటంగూడఁదని పోవఁ గలనుగాని
భారతకథాసుధారసాస్వాదనమున-నొక్కనిముసంబు నాపోవ నోపనేను.

క. అనవరతమట్లు భారత-మును విన ననుమాన మొకటి పొడమెను, దానిన్
వినితీర్పుము ముమ్మనుమని-గని కూర్మిఁ దపోనిధాన, కరుణాభరణా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. ఆదిని రాజసూయము సోముఁ డొనరింపఁ దారకామయసంప్రహారమయ్యె
నటుపైని వరుణుఁ డయ్యాగంబు సాగింప నుగ్రదేవాసురయుద్ధ మయ్యె
నంత హరిశ్చంద్రుఁ డాజన్న మెలయింప ఘనతరాడీబకకలహ మయ్యె
నట ధర్మజుఁడు దాని నాచరింపఁగ మహాభారతరణ మతిఘోరమయ్యె
నట్టు లరయంగ రాజసూయం బజేయ-రాజవీరుల కగునుపద్రవము చండ
భండనారంభకల్పితవ్రతము గాదె? యదియ కురువంశ మేర్చినయగ్ని గాదె?

క. అలవికి మీఱిన యుంగం-బులు పెక్కులు రాజసూయమున కవి యెల్లన్
దలమే జరపఁగ, నొక్కటి-తలఁగినజనసంక్షయంబు తప్పదుగాదే?

గీ. ఇంత యెఱిఁగియు ధర్మజుం డేల గడఁగె నన్వయక్షయమూల మయ్యజ్ఞమునకు?
నాగతానాగతజ్ఞుఁడవైన నీవు-మాన్ప లేదేలొకో దాని మహానినాథ!

గీ. కానివారల నమ్మినహీనమతులు-ననదలును దారితప్పుట చనును గాని
ఘనమనీషులు నీశిక్ష గన్నవారు-పాండవులు త్రోవ దొలఁగుట పాడియగునె?

వ. అనియడిగిన నభిమన్యుపౌత్రునకుఁ బాండవపితామహుం డిట్లనియె:

ఉ. కాలముదాఁట నెవ్వరికిఁ గాదు, తదద్భుతవేగ మాఁగఁగాఁ
జాలునె మానవుండు తనశక్తిని? గానఁ బ్రజావినాశ మా
చాలునఁ జేయఁజూచువిధిచాపలభావ మెదుర్కొనంగఁ దాఁ
బోలక ధర్మజుం డపుడు పుట్టినబుద్ధిన పోయె బాలకా!

ఉ. కాలవశంవదుండగుటఁ గాఁగలకార్యము నట్టులుంట న
న్నేల యుధిష్ఠిరుండడుగు? నియ్యదియహా నిది గాదటంచు నే
నేల వచింతు నాతని కపృష్టుఁడనై యదిగాక త్రోవఁగన్
బోలునె నాకుఁ గాలకరముద్రితమానవఫాలలేఖలన్.

ఉ. నీ విపు డశ్వమేధమున నిక్కపుఁగూరిమి గల్గి యిట్టు లీ
త్రోవకు వచ్చినాఁడవని తోఁచిన దెంతయుఁ దెల్లమయ్యె నీ
భావము, దైవయోగమునఁ బౌరుష మడ్డము గాదుగాని మే
ధావివి గానఁ జెప్పెదను దాల్మి భవిష్యము నాలకింపుమీ!

ఉ. రాజుల కశ్వమేధము గరం బుచితంబగు దానికీవు పే
రోజఁ గడంగు దవ్విధికి నోర్వక వాసవుఁ డడ్డసేయు ను
త్తేజముతోడ నట్టులని తీర్పఁగఁబూనిన దాని మానఁగా
నీజతనంబు చెల్లునె? గణించునె దైవము పౌరుషంబులన్?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. కావునఁ గాఁగలకార్యం-బీవిధిఁ జనుటెఱుఁగుదేని యీబుత్త్విజులున్
నీవును సత్పురుషవ్రాతుఁడుఁ-గావించిన తప్పు లేమిగాంచెదు వత్సా!

ఉ. ఇప్పటి కశ్వమేధవిధి నీవ యొనర్చెద వింకదీని పే
రొప్పదు నావిధాత సెలవొప్ప, నిదేమి? సమస్తయజ్ఞముల్
ముప్పునఁ బోవు వానిఫలముల్ తెగనమ్మెడి విప్రజాతిచేఁ
దప్పక సర్వభూతములు తత్ప్రళయంబునఁ గూలుకై వడిన్.

వ. కావున సచరాచరంబైన యీసకలప్రపంచంబు దైవాధీనంబ యగుటంజేసి పురుషుండు పౌరుషంబున నించుకేని తత్ప్రతీకారంబు చేయనోపండని భావింపు మన్నంత నన్నరనాయకుం డిట్లనియె.

గీ. అనఘ! యియ్యాగ మింతట నాఁగిపోవఁ-గారణం బెఱిఁగింతువేఁ గరుణతోడ
నీదు దీవనకతమున నేర్పుకొలఁది-దానిఁ దొలఁగింపఁ జూతు నేమైనఁగాని.

మ. అనినన్ సాత్యవతేయుఁ డిట్లనుఁ గుమారా, నీకు భద్రంబు; చా
లును దానిం దొలఁగింతునంట, యట నాలోచింపు లోకేశుశా
పనిమిత్తం, బిఁక భూమియుండఁగ మహీపాలావళిన్ నీకుఁద
క్క నొరుం డొక్కని కశ్వమేధమున వంకం జూడఁగా దేనియున్.

చ. అనవుడు భూవరుండు చతురాసను శాపము సోఁకి యింక భూ
మిని హయమేధమాఁగఁగ నిమిత్తమునేనయి దుర్యశంపుబం
ధనమును జొత్తునేని, యురిత్రాళులఁ జిక్కిన రాజహంసచ
ర్యను గనఁజాల విష్ణుపదమంచు భయంపడి యమ్మునీంద్రుతో.

గీ. యోగిజనవందనీయ! నీయోగదృష్టిఁ-దురగమేధనివృత్తి హేతువును గాంచి
నట్ల తత్పునరావృత్తి నరసితేని-తెలిపి కూరిమి నావంత తీర్పుమనఁగ.

గీ. వ్యాసుఁ డిట్లువచించె దినాంతవేళ-నఖిలతేజంబు భాస్కరునం దణంగు
నట్టులీ హయమేధంబు నణఁగియుండు-బ్రాహ్మణోత్తములందు గీర్వాణులందు.

వ. ఇట్లీ యాగంబు చాలకాలంబు వారియందు జ్ఞానరూపంబున విలీనంబై యుండునంతఁ గలియుగంబునఁ గొంతకాలంబునకుఁ గాశ్యపగోత్రుండైన సేనానియను క్షత్త్రియుఁడు తపోనిష్ఠ కునికి పట్టయిన భూవివరంబు వెలువడి యీవలకు వచ్చి విధ్యుక్తంబుగ మరల దీని నాచరించి తరువాతవారికి మార్గదర్శి కాఁగలండు.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# విశ్వవిద్యాలయములు—ఆంధ్ర విశ్వవిద్యాలయము

మామిడిపూడి - వెంకటరంగయ్యగారు, యం. ఏ.

ఆంధ్రోద్యమముయొక్క యుద్దేశముల ననుసరించి ప్రత్యేకముగ ఆంధ్రదేశలాభము నపేక్షించి స్థాపింపబడిన సంస్థలలో ఆంధ్ర విశ్వవిద్యాలయ మొక్కటియైయున్నది. దీనిమూలమున దేశమున కధికమగు ప్రయోజనము సమకూరునని ప్రజలనేకులు తలంచుచున్నారు. ఆప్రయోజనమెట్టిదో, అది కలుగుటకై విద్యాభిమానులు చేయవలసిన కృషియెట్టిదో మనము తెలిసికొనవలసియున్నది. ఈసందర్భమున ఇప్పటికే ఒకగొప్ప విషయమై ప్రముఖులలో అభిప్రాయభేదమగపడుచున్నది. ఆనర్సు, యం. ఏ. లో నగు ఉత్తమపరీక్షలకు కావలసిన విద్యను నేర్పుకలాశాలను విశ్వవిద్యాలయమువారే స్థాపించి నడిపింపవలయునని కొందరనుకొనుచున్నారు; మరికొందరిట్టిమార్పున కంగీకరించక, రాజమహేంద్రవరము, అనంతపురము మొదలగు ప్రదేశములందిప్పుడుండు కలాశాలలే ఇట్టి ఉన్నతవిద్యను నేర్పవలసినదని తలచుచున్నారు. ఈవిషయమును గురించిన వాదప్రతివాదములను పరిశీలించగా విద్యావిషయములలో యథార్థమును కనుగొనవలయునను ఆసక్తిగల ఆంధ్రులనేకులున్నారని తెలియుచున్నది. అట్టివారును, తుదకు కార్యక్రమమును నిర్ణయించు అధికారులును ఈసందర్భమున ఏయే విషయముల ఆలోచింపవలయునో తెలుపుటకై ఈవ్యాసము వ్రాయబడినది.

## (1) విశ్వవిద్యాలయముల ఉద్దేశములు.

విశ్వవిద్యాలయముల ఉద్దేశములు ఎట్టివో, అవి యెట్లుండవలెనో మనము తెలిసికొనినగాని ఆంధ్రవిశ్వవిద్యాలయముయొక్క కార్యక్రమమును నిర్ణయించజాలము. (1) సుమారు డెబ్బదిసంవత్సరములుగ పనిచేయుచుండు మద్రాసు, బొంబాయి, కలకత్తా విశ్వవిద్యాలయములయొక్క ముఖ్యోద్దేశము పాశ్చాత్యవిజ్ఞానమును మనదేశమందు వ్యాపింపజేయుటయని చెప్పవచ్చును. ఇటీవలవరకు ఈవిద్యాలయాధికారులు చేయుచుండిన పని ఇదియొక్కటే. వీరు నిర్ణయించిన బి.ఎ., యం.ఏ. మొదలగు పరీక్షలలో ఉత్తీర్ణులైనవారు నేర్చుకొనుచుండు విద్య ఇట్టిదే. (2) కాని, మనదేశమందు నెలకొల్పబడు విశ్వవిద్యాలయములు ఇంతటితో తృప్తిపొందియుండకూడదు. పాశ్చాత్యవిజ్ఞానముతోపాటు ప్రాచ్యవిజ్ఞానమునకుకూడ గౌరవము నియ్యవలెను. ఇంగ్లీషుభాషయొక్కటే మనకు ముక్తిసాధనముకాదు. మనమాతృభాషయు, మనము పవిత్రములుగ నెంచు సంస్కృతప్రాకృతములును, అరబ్బీపారశీక భాషలును మనకు పఠనయోగ్యములైనవే. ఇట్లే పాశ్చాత్యదేశచరిత్రలు మాత్రమే కాక మనదేశచరిత్రమును, ప్రాచ్యదేశములగు జపాన్ చైనా మొదలగు దేశములచరిత్రములును, మనవేదాంతము, జ్యోతిషము, గణితము, రాజనీతి, అర్థశాస్త్రము లోనగు విద్యలనన్నిటిని మనము చదువవలసియున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయ మెంతవరకు ప్రాచ్యవిద్యల వ్యాప్తికి తోడ్పడునో చూడవలసియున్నది. (3) సాధారణముగ విశ్వవిద్యాలయములు విద్యావిషయమై చేయవలసినపనులు రెండు కలవని చెప్పవచ్చును. ఇప్పటివరకు సంగ్రహింపబడినజ్ఞానమును విద్యార్థుల కుపదేశించుట మొదటిపని. పరిశోధనమూలమున క్రొత్తజ్ఞానమును సంపాదించుట రెండవపని. ఇదివరకు మనదేశములో స్థాపింపబడిన విశ్వవిద్యాలయములు మొదటిపనిని మాత్రమే చేయుచున్నవి. రెండవపని జరుగుటకు కావలసిన అవకాశములను అవి కల్పించియుండలేదు. ఇందుచే మనపండితులు ఇతరులు సత్యములని చెప్పినవిషయములను నమ్మి వాటిని తమశిష్యులకు బోధించుచున్నారేకాని, తమ తెలివితేటల నుపయోగించి స్వతంత్రముగ క్రొత్త సిద్ధాంతముల నేర్పరుపకున్నారు. ఆంధ్రవిశ్వవిద్యాలయము దీని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యమున మార్పు కలుగవలెను. ఈవిశ్వవిద్యాలయ పండితులు తమ స్వయంకృషివలన జ్ఞానాభివృద్ధి కెంతవరకు తోడ్పడగలరో చూడవలసియున్నది. ఇందుకుకావలసిన ఏర్పాటులను విద్యాలయమువారు చేయనియెడల ఆంధ్ర విశ్వవిద్యాలయము సార్థకము కాజాలదని చెప్పవలసియుండును. (౪)జ్ఞానవ్యాప్తి, నూతనజ్ఞాన సంపాదనము–ఈరెంటికంటెను నుత్తమమైన మహాకార్యమొకటి విశ్వవిద్యాలయముల మూలమున జరుగవలసియున్నది. విద్య నేర్చుకొనుటకై వచ్చిన యువకులను యోగ్యులుగను, సత్సాంప్రదాయముల ననుసరించి తమతమ ధర్మములను నెరవేర్చువారుగను చేయుటయే ఈ మహాకార్యము. యోగ్యతలేనినాడుపాండిత్య మెంతయుండినలాభ మేమి? పూర్వకాలమున మనదేశమందు బ్రహ్మచర్యమును, గురుకులవాసమును విద్యార్థులకు విధియైయుండెను. అట్టివిధికి లోబడినవారలకు మాత్రమే గురువులు విద్యల నేర్పుచుండిరి. విద్యపూర్తిచేసి స్వగృహమునకు మరలివచ్చిన విద్యార్థి అభిమానశాస్త్రమందు పరిపూర్ణపాండిత్యము సంపాదించినవాడగుటయేకాక దానికితోడు తన కులధర్మములను చక్కగ నెరిగి దాని ప్రకారము నడుచుకొనుటకు సంసిద్ధుడై యుండెను. బ్రహ్మచర్యము నిర్ణీతమై యుండినందునశరీరమనోదార్ఢ్యములగలవాడైగృహస్థ ధర్మముల చక్కగ నిర్వహింపగలవాడై యుండెను. స్నానము, జపము,తపము, దైవభక్తి, పెద్దలయెడ గౌరవము లోనగు సుగుణములను, సదాచారములను సంపాదించినవాడై యుండెను. కావున విద్యావంతుడనినపండితుడనిమాత్రమే కాక పాండిత్యమున కనుగుణమగుశీలము గూడ కలవాడని చెప్పదగియుండెను. ప్రస్తుతకాలమున విశ్వవిద్యాలయములం దారి తేరిన యువకుల విషయమై ఇట్టియర్థము చెప్పుటకు వీలున్నదా? విశ్వవిద్యాలయ పరీక్షలకు చదువగోరువారు పదిహేను పదహారుసంవత్సరముల వయస్సుననే తల్లిదండ్రులనువదలికలాశాలలుండు పట్టణమునకు వెళ్లుచున్నారు. అప్పటినుండి అయిదారు సంవత్సరములు, విద్యపూర్తియగువరకును, వారట్టిపట్టణమునందే కాలము గడుపుచుందురు. ఏదియొ ఒకవీథియందొకగదిని అద్దెకుపుచ్చుకొని పూటకూళ్లయిండ్లలో భోజనముచేయుచు,కాఫీక్లబ్బులలో ఫలహారముల గావించుచు, అప్పిచ్చుటకు సిద్ధపడియుండు దుకాణములలో కిళ్లీలు, సిగరెట్లు,మట్టలుకొనుచు, ఇష్టానుసారముగ నాటకములు, సినీమాలు, పాటకచ్చేరీలు మొదలగు వినోదములందు కాలము గడుపుచు నిర్ణీతపద్ధతికి దేనికి లోబడవలసిన జరూరు లేక విద్యార్థులు కాలముగడుపుచుండుట అందరికి తెలిసినవిషయమే. ఏవయస్సునందు కట్టుదిట్టములును, పెద్దలజాగరూకతయు, అనుభవజ్ఞులసాంగత్యమును అత్యావశ్యకములో ఆవయస్సున మనము మన యువకులను స్వచ్ఛందవిహారమునకై వదలిపెట్టుచున్నాము. తల్లిదండ్రులుగాని, ఉపాధ్యాయులుగాని, కళాశాలాధికారులుగాని, విశ్వవిద్యాలయాధికారులుగాని ఈవిషయమం దేలాటిశ్రద్ధను వహించుటలేదు. కావున విద్య మూలమున ఏయేలాభములు కలుగునని మన మెంచుచుందుమో, ఏయేలాభములు ప్రాచీన కాలపు విద్యాపద్ధతుల మూలమునకలుగుచుండెనో వానిలో సహస్రాంశమైన ఇప్పటి విశ్వవిద్యాలయము లేర్పరచు విద్యావిధానమువలన కలుగుటలేదు. ఇట్టి స్థితియందు సహితము మన విద్యార్థులు భ్రష్టులుగాక కొంతవరకైన తమజాతిధర్మములను నిలబెట్టుకొనగలిగియుండుటకు వారిపూర్వజన్మ సంస్కారమే కారణముగాని మరియొకటి కాదు. గనుక విద్యార్థుల కష్టసుఖముల గ్రహించి, గురుకులవాసపద్ధతుల నేర్పరచి, తగురీతిని వారిని శిక్షించి, వారిని క్రమమార్గమున బెట్టుట విశ్వవిద్యాలయమునకు విధియై యున్నది. నిజమైన విద్యకిదియే లక్షణము. ఆంధ్ర విశ్వవిద్యాలయ మీపనికి పూనని పక్షమున దేశమునకు దాని మూలమున విస్తారలాభము కలుగజాలదు.

ఈపై యుద్దేశముల నన్నిటిని మద్రాసు విశ్వవిద్యాలయము నెరవేర్పలేకున్నదను కారణము చేతనే గదా ఆంధ్రదేశమునకు ప్రత్యేకముగ నొక విశ్వవిద్యాలయము కావలయునని మనము చెప్పుచుంటిమి. మనము కోరినట్లుగ మనకొక విశ్వవిద్యాలయము లభించినది. ఇదియెంతవరకు పై యుద్దేశముల నెరవేర్చగలదో మనము విచారించవలెను.

### 2. దేశభాషలు—దేశీయవిజ్ఞానము

ఏయే భాషలను, ఏయే విద్యలను మన విద్యాలయమందు నేర్పవలసినదియు నిర్ణయించుటకు విద్యా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లయము వారికి స్వాతంత్ర్యము కలదు. పండితసభ (Academic Council) వారీవిషయములకు సంబంధించిన తీర్మానముల నెట్టివైనను చేయవచ్చును. ఇప్పటికి ఈసభవారు రెండుమూడు ముఖ్యములగు తీర్మానముల చేసిరి. బి. ఏ. పరీక్షయందు ఆంధ్రభాషను అభిమాన శాఖగ నెన్నుకొనిన విద్యార్థు లిదివరకు దక్షిణఇండియా చరిత్రలో అరవదేశమునకు సంబంధించిన చరిత్రను విశేషముగ చదువవలసియుండెను. ఇప్పుడట్లుగాక ఆంధ్రదేశచరిత్రను ఎక్కువగ చదువవలయునను తీర్మానము కావింపబడెను. ఇట్లే హిందూదేశచరిత్రకును, హిందువుల రాజనీతికిని, భరతఖండ రాజ్యాంగచరిత్రకును ఎక్కువప్రాముఖ్యమునుకలిగించు నుద్దేశముతో వీరు మరికొన్ని మార్పులను చేయ నుద్యుక్తులై యున్నారు. ఇంతకంటె ముఖ్యమైన విషయము మాతృభాషమూలముననే విద్యలనన్నిటిని నేర్పుట. ఈపద్ధతి నవలంబింమటవలన కలుగుసాధక బాధకముల నన్నిటిని ఆలోచించి ఆచరణయోగ్యమగు కార్యక్రమమును సూచించవలసినదని వీరొక ఉపసంఘమును స్థాపించిరి. ఈ ఉపసంఘమువారు ఎట్టి తీర్మానమును చేసెదరో తెలియదు. కాని, సమస్తవిద్యలను మాతృభాషమూలముననే నేర్పవచ్చునను తీర్మానము కావించుటయే యుక్తమనితోచుచున్నది. అట్లు చేసిన యెడల మనకు రెండుమూడు విధములగు లాభములు చేకూరును. (1) విద్యార్థులకు శాస్త్రజ్ఞానము ఇప్పటికంటె నెక్కువ సులభముగ అలవడును. ఇంగ్లీషు భాషమూలమున వారిప్పుడు శాస్త్రములను చదువుటవలన ఇంగ్లీషు భాషవారికి పూర్తిగ స్వాధీనము కాకుండుటచే వారికృషియంతయు భాషను స్వాధీనము చేసుకొనుటయందే వినియోగమగుచున్నది. శాస్త్రార్థమును గ్రహించుటకు కావలసినంత అవకాశము వారికి లేకున్నది. చదివిన శాస్త్రములు వారికిపూర్తిగ స్వాధీనము కాకుండుటకు కూడ నిదియే కారణము. మరి యేదేశమందు కూడ విదేశభాషమూలమున విద్యల నేర్చుకొనుపద్ధతి లేదు. కావున మనవారీ సందర్భమున కోరుచుండు మార్పు సహేతుకమైనదనియు లాభకారి యనియు చెప్పవచ్చును. (2) ఆంధ్రభాషలోని వాఙ్మయము వృద్ధియగుటకును దానిమూలమున జనసామాన్యమునకు ఉన్నతవిద్యలభించుటకును ఇదిచాలఆవశ్యకము. మూడుతరములనుండి మనవారు విశ్వవిద్యాలయములం విద్యల నేర్చుకొనుచున్నను మన వాఙ్మయము మాత్రము వృద్ధికాలేదు. ఏవియోకొన్ని నవలలు, నాటకములు బయలుదేరినవి కాని చరిత్రము, రాజకీయము, ఆర్థికము వేదాంతము, ప్రకృతిశాస్త్రము లోనగు గ్రంథములసంఖ్య చాల స్వల్పముగ నున్నది. విశ్వవిద్యాలయములలో చదివిన వారికి ఆంధ్రభాషాపరిచయము మిక్కిలి తక్కువగుటయే దీనికి కారణము. తాము నేర్చుకొనిన విషయముల ఇంగ్లీషుభాషలో వ్యక్తపరచుటకు వలయు సామర్థ్యము కొంచెముగనో, గొప్పగనో వీరికి కలదుకాని ఆంధ్రభాషలో వ్రాయుసామర్థ్యము తక్కువ. భాష అభివృద్ధి యగుట అనగా నేమి? ఎంతటి క్లిష్టమైన అభిప్రాయములనుకూడ మనభాషమూలమున మనము తెలియపరచగలిగిన నాడేకదా మనభాష అభివృద్ధియగుట! ఇట్టి వృద్ధి అయినగాని విద్యావంతులమూలమున జనసామాన్యమునకు విస్తారలాభము కలుగజాలదు. (3) ఇప్పుడు మనమందరము స్వరాజ్యమునకై పాటుపడుచున్నాము. స్వరాజ్యమనగా ప్రజాపరిపాలనమని చెప్పుచున్నాము. ఈ స్వరాజ్యసంపాదనములో జనసామాన్యముయొక్క సాహాయ్యముండుట అత్యావశ్యకము. స్వరాజ్యములభించినతర్వాతకూడ దానిని నిలబెట్టుటకు జనసామాన్యముయొక్క సాహాయ్య మవసరమైయున్నది. ఇట్టిసాహాయ్యమెప్పుడు చేకూరును? దేశములోని ప్రతిమనుష్యుడును దేశమునకు సంబంధించిన ఆర్థిక రాజకీయ సాంఘికవిషయముల గురించి శాస్త్రీయమైన జ్ఞానము కలవాడైనప్పుడుకదా! అట్టిజ్ఞానము ప్రజల యధీనమగుటకు దేశభాషలో ఉద్గ్రంథములు బయలుదేరుటయే ప్రధానసాధనము. మన విద్యావంతులు ఇంగ్లీషుభాష మూలమున శాస్త్రముల నెంతకాలము చదువుచుందురో అంతవరకు వా రిట్టిగ్రంథముల వ్రాయగలిగియుండరు; ఈ విషయములగురించి వారికిగల అభిప్రాయములను జనసామాన్యమునకు తెలుపజాలియుండిరి. కావున మాతృభాషద్వారా ఉన్నతవిద్య నేర్చుకొనుటఅత్యావశ్యకము. ప్రస్తుతకాలమున విద్యావంతులకును, జనసామాన్యమునకును నిజమైన ఐకమత్యము లేదు. వారి అభిప్రాయము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆదర్శములు వేరు; జనసామాన్యముయొక్క అభిప్రాయములు, ఆదర్శములు అంతకంటె విలక్షణములై యున్నవి. వీటినన్నిటిని సమన్వయించినగాని దేశక్షేమముకొరకు కావలసిన మార్పులేవియు జరుగవు. ఈ సమన్వయమునకు విద్యావంతుల భాషయు, జనసామాన్యముయొక్క భాషయు నొకటే యగుట ముఖ్యసాధనము. దీనిని బట్టిచూడ మాతృభాషద్వారా విద్యలను నేర్చుకొనుట ఆత్యావశ్యకమని స్పష్టమగుచున్నది. కావున నీవిషయము నువివర్తింపుట కేర్పరుపబడిన ఉపసంఘమువారేమి చేయబోవుచున్నారో తెలుసుకొనుటకు దేశమందనేకులు కుతూహలులై యున్నారు.

విశేషకష్టములేక దేశభాషలను, జాతీయవిద్యలను వృద్ధిచేయుటకు ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి కవకాశమున్నదనుట స్పష్టము. విద్యాభిమానులు మాత్రము జాగరూకులైయుండి, విద్యాలయమువారు వారి విధులను శ్రద్ధతో నిర్వహించుచున్నారా లేదాయని గమనించుచుండవలెను.

3. పరిశోధన

'పరిశోధన'అను విషయమును గురించి ఇదివరకే కొంత వ్రాసియుంటిని. విశ్వవిద్యాలయముల మూలమున చేకూరవలసిన ఫలములలో 'సత్యము' ఇదియని తెలిసికొనుట ముఖ్యమైనదిగ నున్నది. మన పేవిషయమునుగురించి ఆలోచించినను యథార్థమిదియని చెప్పుటకు వీలులేదని స్పష్టమగుచున్నది. ప్రతిశాస్త్రమును ఇట్టిస్థితియందే యున్నది. పదార్థవిజ్ఞానశాస్త్రమున తర్కింపబడు అణువు పరమాణువు లోనగువాని తత్త్వమునుగురించి పదిపదిహేను సంవత్సరముల క్రిందట సత్యములని యెంచబడిన అంశము లనేకము లిటీవలి పరిశోధనలవలన సత్యములు కావని ఏర్పడెను. జంతుకోటిలోని ప్రాణము వృక్షకోటిలోని ప్రాణముకంటె విలక్షణమైనదని ఇటీవలివరకు వృక్షశాస్త్రజ్ఞులును, జీవశాస్త్రజ్ఞులును చెప్పుచుండిరి. కాని జగదీశచంద్రబోసుగారి పరిశోధనలవలనపదార్థములన్నిటియందును సమానలక్షణములుగల ప్రాణమున్నట్లేర్పడెను. ఇరువదిముప్పది సంవత్సరములక్రిందటివరకు 'ఆర్యులు' ప్రప్రథమమున మధ్యఏషియాలో నుండిరని చరిత్రకారులు చెప్పుచుండిరి. కాని ఇది తప్పనియు, వారినివాసభూమి ఐరోపాఖండమనియుఇప్పటివారుచెప్పుచున్నారు. ఇట్లే ప్రతిశాస్త్రమందును నూతనములగు అంశములనేకములు బయల్పడుటయు,అందుమూలమున వస్తుతత్త్వమును మనుష్యతత్త్వమును గురించిన మన అభిప్రాయములు మారుటయు జరుగుచున్నది. ఇట్లు మారిమారి మన అనుభవము అధికము కానుకాను మనకునిజమైన తత్త్వమేదియో గోచరమగును. విద్యావ్యాసంగమువలనతుదకుకలుగుఫలమిట్టిదే. ఇదియే సత్యాన్వేషణము.

ఇట్టిసత్యాన్వేషణ మెల్లకాలములందు,ఎల్ల దేశములందును విద్యాపీఠముల నలంకరించు పండితులచే చేయబడుచున్నది. విద్యాపీఠము సజీవమా, నిర్జీవమాయని నిర్ణయించుట కిదియే మూలసూత్రము. దీనినిబట్టి చూచిన యెడల మద్రాసువిశ్వవిద్యాలయము నిర్జీవమైనదని స్పష్టమగును. ఆంధ్రవిశ్వవిద్యాలయ మట్లుగాక సజీవముగనుండి జ్ఞానసముదాయము వృద్ధియగుటలో తోడ్పడి 'సత్య'స్వరూపమును నిర్ణయించుటలో పాల్గొనవలయుననికదా మనమందరము కోరవలయును. ఈకోరిక సఫలమగుటకు ఇప్పటికేమియు అవకాశమున్నట్లు కనుపించదు. ఏలయనగా దీనికి ద్రవ్యసహాయ మత్యావశ్యకమై యున్నది. సత్యాన్వేషణము చేయుటలో (1) పాండిత్యమును ఉత్సాహమును గల విద్యావంతులును,(2)వారి పరిశోధనలకు వలయు సాధనసామగ్రియు ఉండవలెను. బహుశః ఇట్టిపరిశోధకు లనేకులు ఈక్షణమందు ఆంధ్రదేశమున లేకపోవచ్చును. లేరని తోచినయెడల అట్టివారిని తయారుచేయుటకు విశ్వవిద్యాలయాధికారులుపూనవలయును. విద్యావంతులగువారికి కొందరికివేతనములిచ్చి ఇంగ్లండు జర్మనీమొదలగు దేశములలోని విశ్వవిద్యాలయములకు వారినిపంపి అక్కడనుండు పరిశోధకాగ్రగణ్యులవద్ద రెండుమూడుసంవత్సరములకాలము పరిశోధనపద్ధతుల నేర్చుకొనివచ్చుట కేర్పాటుచేయవలెను. ఇట్టివారు తిరిగివచ్చినతరువాత వారి పరిశోధనలలో నుపకరించుసాధనములనన్నిటిని వారియధీనమందుంచవలెను. రసాయనశాస్త్రము ప్రకృతిశాస్త్రము లోనగువానియందు పరిశోధనచేయువారికి కావలసిన యంత్రసాధనముల—(Apparatus)ను, అర్థశాస్త్రము, నీతిశాస్త్ర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము లోనగువానియందలి పరిశోధకులకు కావలసినగ్రంథ సముదాయమును విశ్వవిద్యాలయమువారు సమకూర్చవలెను.

ఇదంతయు ద్రవ్యసహాయమువలన కావలసిన పని గాని కేవలము ఉత్సాహమువలన జరుగనేరదు. ఇందుకై లక్షలకొలది ద్రవ్యమావశ్యకము. పూర్వకాలమున మన దేశమందు అమరావతి, నాళంద, నవద్వీపము, తక్షశిల, కాశి మొదలగుపట్టణములలో వేలకొలది విద్యార్థులును, వందలకొలది గురువులును ఏకకాలమం దిట్టివిద్యావ్యాసంగము చేయుచుండిరనియు, అట్టివారికి కావలసిన వసతుల నన్నిటిని దేశమును పరిపాలించుచుండినరాజులును తదితరులగు ధనికులును కల్పించియుండిరనియు, కొన్ని విశ్వవిద్యాలయములకు వందలకొలది గ్రామములు ఇనాములుగ నియ్యబడి యుండెననియు మనము గ్రంథములందుచదివియున్నాము. ఇటీవలికాలములో ఇంతటిగొప్ప విశ్వవిద్యాలయములు మన దేశములో లేకుండినను అచ్చటచ్చట ఘనులగు పండితులుండుటయు, వారు వారి అభిమానశాస్త్రములను వారిదగ్గర చదువుటకువచ్చిన విద్యార్థుల కెట్టిప్రతిఫలమును కోరక నేర్పుచుండుటయు, అట్టివారి జీవనార్థమై అగ్రహారములు, ఇనాంభూములు రాజు లిచ్చుటయు మనకు తెలిసియున్నది. కనుక విద్యావ్యాప్తికిని పరిశోధనకును ప్రభువులయొక్కయు ప్రజలయొక్కయు ఔదార్యమే ఆధారము. సామాన్య ప్రజలెల్లప్పుడు దరిద్రులైయుండుటచే ఇట్టి ఔదార్యమును ధనికులగు వర్తకులును జమీందారులును చూపవలసియున్నది.

ఇప్పటికాలమున మనదేశములోని తక్కినరాష్ట్రములందు స్థాపింపబడిన విశ్వవిద్యాలయములపట్ల ప్రభుత్వమువారును ధనికులును వారి యౌదార్యమును చూపించియున్నారు. కలకత్తా, ఢక్కా, లక్నోమున్నగు విశ్వవిద్యాలయముల కేటేట అయిదారులక్షలరూపాయలను ప్రభుత్వమువా రిచ్చుచున్నారు. ధనికులగువారు ఇరువది ముప్పదిలక్షలమొత్తమును విరాళముగ నిచ్చియున్నారు. కాని మనకిట్టి యదృష్టము పట్టినదికాదు. ఏటేట ఇంతసొమ్ము నిచ్చెదమని ప్రభుత్వమువారు చెప్పియుండలేదు. ఇదియే ఇప్పటి చట్టములోగల గొప్ప లోపము. తామెంతో కష్టపడి ఈ చట్టమునుగావించి ఆంధ్రవిశ్వవిద్యాలయమును స్థాపించినట్లు పాత్రోగారును, వారి స్నేహితులును చెప్పుచుందురు. కాని, వారు కష్టపడి నిర్మించినది ప్రాణములేని శరీరము. దానికి ప్రాణప్రతిష్ఠగావించి శాశ్వతముగ జీవించియుండునట్లు చేయుట అవసరము. దీనిని చేయగలవారు ఇప్పటి మంత్రివర్గమువారును, ఇప్పటిశాసనసభలోనుండు సభ్యులును. ఎన్నికలకాలమందు వారికి వోట్లనిచ్చినవా రందరు విశ్వవిద్యాలయమున కిట్టి సహాయముచేయునట్లు వారిని ప్రేరేపించవలసియున్నది. సాలునకు అయిదు లక్షలరూపాయలైన ప్రభుత్వమువారు విశ్వవిద్యాలయమున కిచ్చినగాని పరిశోధనకు వలయువసతు లేర్పడజాలవు.

## 4. కొన్ని ఆక్షేపణలు

కాని ఈసందర్భములో కొన్ని ఆక్షేపణలకు సమాధానము చెప్పవలసియున్నది.

(1) విశ్వవిద్యాలయపరీక్షలం దుత్తీర్ణులైన బి. ఏ. లు, ఎం. ఏ. లు, యల్. టీ. లు, లాయర్లు మొదలగువారిలో అనేకులు నిరుద్యోగులై, వారి కుటుంబములను పోషించుకొనుస్థితిలో లేకున్నారు. కూలిపని చేసుకొని జీవించు సామాన్యజను లీ విషయమున విద్యావంతులకంటె ఎన్నిరెట్లో మంచిస్థితి యందున్నారు. ఇట్లుండ, ఆంధ్రవిశ్వవిద్యాలయ మొకదానినిస్థాపించి, ఏటేట వందలకొలది బి. ఏ.లను యం. ఏ.లను తయారుచేయుట వలన లాభమేమి? అని కొంద రడుగవచ్చును. లాభము లేని పక్షమున అట్టి విద్యాలయములకు విరాళములిచ్చిన ప్రయోజనమేమి? అను శంకయు కలుగవచ్చును.

ఈ ఆక్షేపణలో కొంత సత్యమున్నదని చెప్పక తప్పదు. ప్రస్తుతము మన దేశములోని విద్యావంతులస్థితి కడుశోచనీయముగ నున్నది. తమపూర్వులు సంపాదించిన ఆస్తులను అమ్మి, అప్పులపాలయి, వేలకొలదిరూపాయలు ఖర్చుపెట్టి, ఎన్నియోకష్టములకుపాలై, పరీక్షలయం దుత్తీర్ణులైనవారు నెలకు ముప్పదిరూపాయలు సంపాదించుటకు తగిన యోగ్యతలేనివారై యున్నారు. కాని దీనినిబట్టి విశ్వవిద్యాలయములవలన లాభములేదని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యు, వాటిని పోషించుట ఆవశ్యకముకాదనియు వాదించుట న్యాయముకాదు. బుద్ధివికాసము, మనోనిశ్చయము, యోగ్యత మొదలగు సుగుణములను సంపాదించుటయందు మాత్రమే విద్య ప్రయోజనకారియగును. గాని ధనసంపాదనమునకు కాదు. ధనసంపాదనాశక్తిని అది వృద్ధిచేయజాలని కారణముచే అది నిరుపయోగమైనదని మన మనుకొనకూడదు. మనుష్యుని సుఖదుఃఖముల కొకధనము మాత్రమే ఆధారముకాదు. బుద్ధివికాసాదులు కూడ ఆధారములై యున్నవి. ప్రాచీనకాలమందు మన దేశములో ఉన్నతవిద్యను సంపాదించినవారు ధనాభిలాషులై అట్లు చేయలేదు. వారిలో అనేకులు భిక్షాటనముచేసి తమ్ముత్తమ, తమకుటుంబమును పోషించుకొనుచుండిరి. కావున విద్యయొక్క విలువను రూపాయలణాలు పైసల మూలమున నిర్ణయించుటకు వీలులేదు. ఇదిగాక, ఇప్పటికాలపు మన విద్యావంతులు గొప్ప వేతనములతో గూడుకొన్న ఉద్యోగముల చేసినగాని తమ పరువుమర్యాదల కాపాడుకొనుటకు వీలుండదను దురభిప్రాయము కలిగియున్నారు. పాశ్చాత్య దేశములం దట్లుగాక పట్టపరీక్షలందుత్తీర్ణులైనవారు స్వల్ప ఆదాయముల తెచ్చు వ్యవసాయము, వ్యాపారములోనగు వృత్తులలో ప్రవేశించి, ఇట్టి వృత్తులు స్వగౌరవమునకు హానికరములు కావను నిశ్చయములో సుఖముగ జీవనము చేయుచున్నారు. ఉన్నతవిద్యకు అనుగుణమగు వృత్తి లేవో కొన్ని యున్నవనియు, అవిగాక తక్కినవాటిలో ప్రవేశించుట విద్యావంతులకు మర్యాదకాదనియు అభిప్రాయపడి మన విద్యావంతు లనేకకష్టము లనుభవించుచున్నారు. అట్లుగాక వారు స్వగ్రామములకు వెళ్లి ఇతరులు జీవించు విధమున తాముగూడ జీవించుటకు సిద్ధపడిన యెడల కష్టములన్నియు నదృశ్యములగును. పాఠశాలలు లేని గ్రామములలో పాఠశాలల స్థాపించియు, సహకారోద్యమమునకు సంబంధించిన సంస్థల నెలకొల్పియు, తగిన నాయకులు లేకపోవుటచే క్షీణించుచున్న పరిశ్రమల పునరుద్ధారణచేసియు, విద్యావంతులు సుఖజీవనము చేయుట కవకాశమున్నది. "ఇంతటి గొప్పవిద్యల నభ్యసించి తుదకు ఈలాటి సామాన్యవృత్తులకు వెళ్లుటయా" అను దురభిమానమును విడనాడవలెను.

ఈ సందర్భమున మరియొకవిషయముకూడ ఆలోచింపదగియున్నది. ఇదివరకు మన దేశమందుండిన మద్రాసువిశ్వవిద్యాలయము లోనగునవి "వృత్తివిద్యలను" విశేషముగ గౌరవించియుండలేదు. ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిట్లుగాక వృత్తులుకల్పించు విద్యలను నేర్పుకళాశాలలను ఎక్కువగ స్థాపింపవచ్చును. వ్యవసాయము, ఇంజనీరింగు (Engineering), లోహపుపనులుచేయుట (Mining and Metallurgy) లోనగు విద్యల నేర్పుటకు మన విశ్వవిద్యాలయ మేర్పాటు గావించవచ్చును. అట్లు చేసినయెడల పై ఆక్షేపణకంత యవకాశముండదు.

కావున విరాళము లియ్యదలచినవారు ఉన్నతవిద్యవలన లాభములేదని యనుకొనుట పొరబాటు. ఇప్పటి విద్యావిధానములలో లోపములున్నవనివారు తలచినపక్షమున, ఎట్టి విద్యావిధానములు లాభకరములో సూచించుచు, అట్టివానికి తాము విరాళముల నియ్యవచ్చును. మొత్తముమీద, విశ్వవిద్యాలయమును పోషించుట ప్రభుత్వమువారికిని ఉదారులగు ధనవంతులకును విధియని చెప్పకతప్పదు.

(2) ఇప్పటి విశ్వవిద్యాలయముల గురించిన ఆక్షేపణ మరియొకటికలదు. "విశ్వవిద్యాలయములు నేర్పువిద్య ప్రజలందరికి ఉపయోగించునది కాదు. ఉద్యోగములు చేయదలచినట్టివారికిని, ఉన్నతవిద్యను సంపాదింపకోరు స్వల్పసంఖ్యాకులకు మాత్రమే దానివలన లాభము కలుగుచున్నది ప్రాథమికవిద్యయన్నో ఇట్లుగాక జనసామాన్యమున కంతకు లాభకరముగ నున్నది. కావున విద్యాభిమానులగు ధనికులును, విద్యను ప్రోత్సహింపవలయు ప్రభుత్వమును ప్రాథమిక పాఠశాలల స్థాపించుటకు ప్రయత్నించవలయునేకాని ఉన్నతవిద్యను పోషించుటకు లక్షలకొలది ద్రవ్యమును ఖర్చుపెట్టుట తగదు."

ఈ ఆక్షేపణకూడ యుక్తియుక్తముగ కనుపించుటలేదు. (1) ఉన్నతవిద్యను సంపాదించినవా రనేకులు దేశమందుండినగాని ప్రాథమికవిద్యను బోధించుటకు కావలసిన ఉపాధ్యాయులు దొరకజాలరు. పైమెట్రి పరీక్షలలో కృతార్థులైనవారే పైమెట్రి తరగతుల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లోని బాలుర కుపాధ్యాయులైనయెడల వారు బోధించు నదేమియున్నది; పిల్లలు నేర్చుకొనునది ఏమికలదు? పసిపిల్లలకు బోధించు ఉపాధ్యాయులు సహితము గొప్ప పండితులుగను, శాస్త్రవేత్తలుగను ఉండుట అత్యావశ్యకము. అట్టివారిని తయారుచేయుటకు విశ్వవిద్యాలయము లవసరములు గదా? (2) దేశముయొక్క—అనగా సామాన్యజనులయొక్క—బాగుఓగులకు చాలవరకు దేశనాయకుల తెలివితేటలును శక్తిసామర్థ్యములును ఆధారములైయున్నవి. ప్రతిదేశమందును కొందరు నాయకులుగను తక్కినవారు వారి ననుసరించి నడుచుకొనువారుగను నుందురుకదా? ఇట్టిస్థితిలో, దేశము నుద్ధరించెదమని చెప్పి, పనికి పూనునాయకులు విద్యావంతులై యుండుట అత్యావశ్యకము. విశ్వవిద్యాలయము లట్టినాయకులను తర్ఫీదుచేయునవిగనుక వాటిమూలమున కొందరికి మాత్రమేకాక దేశమునకంతకు లాభము కలుగుచున్నది.

ఇంతకంటె మరియొక గొప్పవిశేషమున్నది. విశ్వవిద్యాలయపండితుల కృషిమూలమున కనిపెట్టబడిన విజ్ఞానమును విద్యార్థులకేకాక జనసామాన్యమునకుకూడ తెలియపరచు నుద్దేశముతో పాశ్చాత్యదేశములందలి విశ్వవిద్యాలయాధికారులు క్రొత్తఏర్పాటు లనేకములు చేయుచున్నారు. దీనికే 'Extension Movement' అని పేరు. ఇట్టి యుద్యమమును కొనసాగించవలయునని ఆంధ్రవిశ్వవిద్యాలయమువా రిప్పటికే తల పెట్టియున్నారు. ఉపన్యాసకులను పట్టణములకును పల్లెలకును బంపి సామాన్యులు గ్రహింపదగిన విషయములను వారికిబోధింప నెంచియున్నారు. వ్యవసాయము, వ్యాపారము, ఆరోగ్యము, ప్రభుత్వవిధానము, లోనగువిషయములను గురించిజనసామాన్యమునకు తెలియవలసిన దెంతయోయున్నది. ఈ జ్ఞానమును వారియందు వ్యాపింపజేయుటకు తగినమార్గములను విశ్వవిద్యాలయమువా రాలోచించుచున్నారు. ఇదంతయు సఫలమగుటకుకూడ ద్రవ్యమవసరమైయున్నది. ఇందుకు వలయు ధనసహాయము నెవరైన చేసినయెడల విశ్వవిద్యాలయము మూలమున కొందరికే లాభమున్నదనియు, జనసామాన్యమున కంతకు లాభము లేదనియు చెప్పువారి ఆక్షేపణ కవకాశమే యుండ జాలదు.

(3) గురుకులవాసమును విధించనివిద్య విద్యయే కాదనియు, అందుకు తగినయేర్పాటులను ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు చేసినగాని నిజమైనవిద్య దేశమందు వ్యాపింపజాలదనియు మరికొంద రాక్షేపించుచున్నారు. ఈవిషయమై పైన ఇదివరకే కొంత చెప్పబడియున్నది. కాని, గురుకులపద్ధతి విశ్వవిద్యాలయమందు నెలకొనవలయుననిన విస్తారద్రవ్యము కావలసియున్నది. విద్యార్థులును వారి గురువులును నివసించుటకు తగిన వసతిగృహములు కట్టవలసియున్నది. విద్యార్థులు చెడుమార్గములబోకుండునట్లు చేయవలయుననిన ఒక్కొకగురువుయొక్క అధీనమందు పదిపదిహేనుగురు శిష్యులకంటె ఎక్కువ యుండకూడదు. ఒకగురువుయొక్క అధీనమందుండు శిష్యులసంఖ్య హెచ్చుకాను కాను వారిలో నొక్కొక్కని లోటుపాటులను తెలిసికొని దానికితగినట్లు ఆతనిని బాగుచేయుటకు ప్రయత్నించుట కష్టతరమగును. ప్రతిశిష్యునియొక్క గుణదోషములు గురువునకు తెలియుట ఆవశ్యకము. అట్టిదిశిష్యులసంఖ్య తక్కువగ నున్నప్పుడే వీలగునుగాని ఇప్పటివలె వందలకొలది శిష్యులొక్కొక గురువుయొక్క అధీనమందుండినయెడల నది కొనసాగ నేరదు. అనగా ఉపాధ్యాయులసంఖ్య ఇప్పటికంటె నెంతో అధికము కావలసియున్నది. ఇదిజరుగుటకు ఉపాధ్యాయుల వేతనములకై ఇప్పటికంటె నధిక ద్రవ్యమును ఖర్చుపెట్టవలసియుండును. వసతిగృహముల కట్టుటకును ఉపాధ్యాయులసంఖ్య హెచ్చుచేయుటకును ద్రవ్యసహాయ మత్యావశ్యకము. ద్రవ్యము నియ్యవలచినవారు గురుకులవాసాభివృద్ధికై తామిచ్చు ధనమును వినియోగపరచవలయునను షరతును విధించినయెడల ఈ యాక్షేపణకుకూడ అవకాశముండదు. విశ్వవిద్యాలయముయొక్క ముఖ్యోద్దేశములు కొనసాగుటకు ధనముముఖ్యమని దీనినిబట్టి స్పష్టమగుచున్నది.

### 5. పరీక్షాపీఠము నిజమైన విద్యాపీఠముగ మారుట

పైన ఉదాహరింపబడిన ఉద్దేశములు నెరవేరవలసినయెడల ఆంధ్రవిశ్వవిద్యాలయ మిప్పటివలె పరీక్షాపీఠముగమాత్ర ముండుటమాని నిజమైన విద్యాపీఠముగ మారవలసియుండును. పరిశోధనకు వలయు సౌకర్యము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యు, గురుకులవాసపద్ధతియు, ప్రాచ్యవిద్యలును, తదితర ములైన క్రొత్తవిద్యల వ్యాప్తియు అభివృద్ధిగాంచవలయు నని ఈమార్పుఅత్యావశ్యకము. ఆనర్సు, యం ఏ. మొద లగు పరీక్షలకు వలయు విద్యలను విశ్వవిద్యాలయము వారిచే స్థాపింపబడిన కళాశాలలో నేర్పవలయునుగాని రాజమహేంద్రవరము, అనంతపురము లోనగు ప్రదేశ ములం దిప్పుడుండు కలాశాలలలో నేర్పుట లాభకరము కాదని చెప్పుటలోగల సత్యమిదియే. ప్రస్తుతము విశ్వ విద్యాలయము ఆంధ్రదేశములోని కలాశాలలలోచదువు విద్యార్థులను పరీక్షచేయుటకు కావలసిన ఏర్పాటులను మాత్రము చేయుచున్నది. ఇంతకంటె నదిచేయుచుండు ఘనకార్య మేదియులేదు. విద్యలనేర్పు భారమంతయు కలాశాలలు వహించియున్నవి. ఇకముందుకూడ విశ్వ విద్యాలయము పరీక్షాపీఠముగనే యుండవలెనని వాదిం చినయెడల పరిశోధనాదులు జరుగక పోవుటయే కాక, ప్రభుత్వమువారును, ధనికులును విరాళములనియ్యవలసిన పనియుండెదు. పరీక్షాపీఠమునకు విరాళము లెందుకు? విరాళములవలనను లభించినధనమును కప్పముగ విని యోగ మెట్లు?

కృష్ణాజిల్లా బోర్డువారు విశ్వవిద్యాలయమునకు పదిలక్షలరూపాయలను విరాళముగనిచ్చి వ్యవసాయ మునకు సంబంధించిన ఉన్నతవిద్యను నేర్పుటకై ఆద్ర వ్యము ఖర్చుపెట్టవలసినదిగ కోరియున్నారు. వారియభి మతము కొనసాగవలయుననిన విశ్వవిద్యాలయమువారు వ్యవసాయకలాశాల నొకదానిని స్థాపించి నడిపించవల యునుగదా! ఇట్లే పరిపూర్ణమైన ప్రకృతిశాస్త్రాభి వృద్ధికై కొంతసొమ్మునుఇచ్చినయెడల ఆశాస్త్రమునందు పరిశోధనచేయుటకు వీలగు నట్లొకకలాశాలను స్థాపించి పరిశోధకవిద్వాంసులను నియమించి వారిచే విశ్వవిద్యా లయమువారు పనిచేయించనియెడల ఆసొమ్ము ఖర్చు పెట్టుట యెట్లు? కావున ప్రకృతిశాస్త్రకలాశాల యొకటి అత్యావశ్యకమగును. ఇట్లే ఏశాస్త్రమునందు పరిశోధన గావించుటకు విరాళములు దొరుకునో ఆశాస్త్రములను న్నిటిని నేర్పుటకు తగినకలాశాలను విశ్వవిద్యాలయ మువారు స్థాపించుటకు పూనవలెను. ఇట్టి కలాశాలలను స్థాపించి పనిచేయుచుండిన యెడల విశ్వవిద్యాలయము నిజమైన విద్యాపీఠమగును.

ఉన్నతవిద్యలను నేర్పుకలాశాలలు విశ్వవిద్యాల యమువారి అధీనమందుండకూడదని వాదించువారి వాదమే సరియైనయెడల పైజెప్పిన మార్పున కవకాశ ముండదు. ఉన్నతవిద్యకై ఏటేట అయిదులక్షలరూపా యలు ప్రభుత్వమువారు ఖర్చుపెట్ట నిశ్చయించి, ఆసో మ్మును విశ్వవిద్యాలయమువారి యధీనము గావించిన యెడల విశ్వవిద్యాలయమువారికి సొంతకలాశాలలు లేక పోవుటచే వారాసొమ్మునంతయు దేశమందుండు తక్కిన కలాశాలలకు పంచిపెట్టి ఆకలాశాలలద్వారా ఉన్నత విద్య అభివృద్ధియగుటకు తగిన ఏర్పాటుల గావించవలసి యుండును. అనగా అప్పుడు విశ్వవిద్యాలయాధికారులు చేయవలసినపని తపాలాధికారులు (Post office) చేయు పనివలె నుండునుగాని విద్యకు సంబంధించినట్టిదిగ నుం డదు. దొరతనము వారిచ్చిన ధనమును తమయొద్దనుంచు కొనక ఏదో యొకవిధముగ ఇతరకలాశాలలకు గ్రాంటు (Grants) రూపమున విభజించుట మాత్రమే వారిపనిగ నుండును. విభజనముచేయుట యను ఈస్వల్పకార్యము నకు విశ్వవిద్యాలయమను నొక గొప్పపేరుగల సంస్థను స్థాపించుటయెందుకు? ఆసంస్థవ్యవహారముల నడపుటకై రెండువేలరూపాయల జీతమునిచ్చి వైసుఛాన్సలరు అను నొక యుద్యోగిని నియమించి వారిసహాయమునకై మరి కొన్నివేలు ఖర్చుపెట్టి రిజిస్ట్రారు, మేనేజరు మొదలగు ఉద్యోగస్థుల నేర్పరచుట ఎందుకు? పరీక్షలచేయుటయు, గ్రాంటుల పంచిపెట్టుటయు అను నీరెండుపనులను మాత్రమే చేయుటకు క్రొత్త విశ్వవిద్యాలయ మొకటి ఆవశ్యకమే లేదు. ఇంతకంటె ఘనకార్య మేదియో మన విశ్వవిద్యాలయము చేయగలదను ఆశతో నిట్టి సంస్థ కావలయునని ప్రజలుకోరిరిగాని ఇట్టి స్వల్పకార్యమును నిర్వహించుటకు కాదు.

ఉన్నతవిద్యలను నేర్పుకలాశాలలను విశ్వవిద్యాల యమువారే స్థాపించి నడిపించినయెడల విశ్వవిద్యాలయ మను పేరు సార్థకమగుటయేకాక, ఉన్నతవిద్య ఇప్పటి కంటె మంచిస్థితికి రాగలదని చెప్పవచ్చును. సామాన్య విద్యకును ఉన్నతవిద్యకునుగల ముఖ్యభేద మొకటి గమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నింపవలసియున్నది. ఉన్నతవిద్య పరిశోధనతో కూడుకొనియుండును. పరిశోధనయందు ఆరితేరిన విద్వాంసులు ఉపాధ్యాయులుగను, పరిశోధనయందభిలాషగల యువకులు విద్యార్థులుగను ఉందురు. ఇట్టి విద్యను నేర్పుటకు ప్రస్తుతము ఆంధ్రదేశములోని కలాశాలలలో దేనియందును తగిన వసతులు లేవు. రాజమహేంద్రవరము అనంతపురములలోనుండు కలాశాలలలో కూడ ఎట్టి సదుపాయములు లేవనియే చెప్పవలెను. ఇట్టి సదుపాయములను కల్పింప దొరతనమువారు పది లక్షల రూపాయలను ఖర్చుపెట్టుటకు సంసిద్ధులైయున్నారని అనుకొందము. అప్పుడాసొమ్మును రాజమహేంద్రవరము అనంతపురములలో సమానముగ ఖర్చుపెట్టవలయునా? లేక ఒకప్రదేశమందధికముగను, మరియొకదానియందల్పముగను ఖర్చుపెట్టుట మంచిదా? ఒకచోట అధికముగను మరియొకచోట అల్పముగను ఖర్చుపెట్టుట న్యాయమా? ఏఒక్క శాస్త్రమందుగాని పరిశోధన చేయుటకు ఎన్నోలక్షల ద్రవ్యమవసరమైయుండగా, ఉన్నస్వల్ప మొత్తము నీవిధముగ పంచుట వలన లాభముకలదా? ప్రజలు చెల్లించు పన్నులనుండి ఖర్చుపెట్టబడు ఈద్రవ్యమును రాజమహేంద్ర అనంతపురములందు మాత్రమే ఖర్చుపెట్టుట యుక్తమా? కొంతసొమ్ము విశాఖపట్టణములో ఖర్చుపెట్టకూడదా? బెజవాడ కూడ కేంద్రస్థానముగ నుండవలయునను నుద్దేశము కొనసాగిన యెడల అచట గూడ కొంతసొమ్మును ఖర్చుపెట్టవలసియుండును గదా! ఈవిధముగ అన్ని పట్టణములవారిని సంతోషపెట్టుటకు ప్రయత్నించిన యెడల ఏపట్టణమందును ఉన్నతవిద్యకు కావలసిన గొప్ప కలాశాలయొకటి స్థాపితము కానేరదు. కావున ఉన్నతవిద్యకు కావలసిన వసతులును, కలాశాలలును ఆంధ్రదేశమందేదో యొకచోట ఉండుటమంచిదిగాని పలుప్రదేశములందు వెదచల్లుట విద్యావ్యాప్తికి సహకారికాజాలదు. ఉన్నతవిద్యకై మనము ఖర్చుపెట్టగల సొమ్ము చాలతక్కువ. ఆసొమ్మునంతను ఒకచోట ఖర్చుపెట్టిన యెడల ఎక్కువ ప్రయోజనము పొందుటకవకాశముండును గాని పెక్కుచోట్ల ఖర్చుపెట్టినచో ఏలాభమును చేకూరజాలదు. నిష్పక్షపాతబుద్ధితో ఆలోచించినయెడల ఆంధ్రదేశమందంతట నెక్కడో ఒకచోట ఉన్నతవిద్యల నేర్పు కలాశాలయుండుట లాభకారియనియు. అనేకచోట్ల అట్టికలాశాలలస్థాపించుటకు వలయు ధనమిప్పుడు లేదనియు స్పష్టమగును.

ఒక్కచోట అట్టి కలాశాలలుండుటయే యుక్తమని అంగీకరించినయెడల, అవి విశ్వవిద్యాలయము యొక్క అధీనమందుండుట మంచిదని ఏర్పడును. అట్లు కానియెడల అనేకనష్టములు కలుగనున్నవి. దొరతనము వారి అధీనమందే అవి యుండినయెడల దొరతనమువారికి ఉన్నతవిద్యపై సర్వాధికారముండుటయు, వారి యక్కి మతముల ననుసరించిన అభిప్రాయముల గలవారలే ఉపాధ్యాయులగుటయు, అట్టి అభిప్రాయములను మాత్రమే విద్యార్థులకు బోధింప నవకాశముండుటయు సంభవించును. విద్యావిషయములందు విశ్వవిద్యాలయమునకు స్వాతంత్ర్యముండుటకు వీలుకలుగజాలదు. దొరతనమువారుగాక మిషనరీలు మొదలగు వారియధీనమందు ఉన్నతవిద్యయున్నను ఇట్టి నష్టములు రాకమానవు. స్వాతంత్ర్యముతో కూడుకొనిన ఉన్నతవిద్య దేశమందు వ్యాపించవలయుననిన, అట్టివిద్యను నేర్పు అధికారము విశ్వవిద్యాలయము యొక్కదానికే యుండవలెను.

కావున దేశాభిమానులును విద్యాభిమానులును ఈవిషయమును చక్కగ నాలోచించి, ఆంధ్రవిశ్వవిద్యాలయమును నిజమైన విద్యాలయముగ మార్చుటకును, విద్యాలయములయొక్క ముఖ్యోద్దేశముల నెరవేర్చుటకు వలయు ధనసాహాయ్యాదుల చేయుటకును, అన్నిటికంటె దానియొక్క స్వాతంత్ర్యమును కాపాడి దానిని జాతీయవిద్యాలయముగ పరిణమింప జేయుటకును ప్రయత్నము చేయవలెను. ఈసందర్భమున చెప్పవలసిన విషయము లింకను ఎన్నియో యున్నను వ్యాసమిప్పటికే అతిదీర్ఘమగుటచే ఇంతటితో విరమించుచున్నాను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



వ్యాసకర్త

# ఊహాప్రపంచము - సాక్షాత్కారము

చింతలపూడి శేషగిరిరావు గారు

ఆంధ్ర వాఙ్మయ సింధుమధ్యంబు నందుఁ
దఱచి తీసిన దొరకు రత్నంబు భాతి
రాజిలుచు నుండెడి పురాణ రాజ మొండు
చదువు చుంటయు మన్మనస్స రసిజంబు
సతతానంద వాహినిఁ జాలఁ దేలు
చుండె; నర్థనిమీలితాక్షుండ నగుచుఁ
బయగు లెత్తితి నూహాప్రపంచ మందు.

అందుఁ గనుఁ గొంటి నొక్కదృశ్యంబు నేను
గంటి ననుకొంటి గన్నులు కలఫలంబు
ప్రథమమునఁ గంటి దుర్గ మారణ్య మందుఁ
గాకి దూపటకును సందులేక యుండె
గాని తరియింపఁ గల్గి తక్కాననంబుఁ
జేరఁ గల్గితి నారామ సీమనొండు.

సుందర తర తరు సమూహ శోభితంబు
గాఁగఁ గన్పడె నవ్వన భాగ మెల్ల
పల్లుకు లతాంతయుతములై యల్లి బిల్లి
గాఁగ నల్లఁగ వలఁ బన్ను కరణిఁ దోఁచె.

పక్షు లవ్యక్త మధుర శబ్దంబు లెంతో
శ్రావ్యముగఁజల్పుచును దరుశాఖలందుఁ
బారు చుండుటఁ గననేత్ర పర్వమయ్యె.
కమ్మని రసాల పల్లవ ఖాది యగుచు
సరసముగఁ బాడె బంచమస్థాయి యందుఁ
బ్రేమగీతంబులను వనప్రియ యొకర్తు.

బహుళనవ మంజరీయుత వనము నడుమ
నచ్చటచ్చటఁ దిరుగాడి యచ్చమైన
దివ్య పరిమళ గంధముల్ దెచ్చి తనదు
గంధవహనామమును సార్థకంబు సలుపఁ
గలిఁగెను కుమారపవనుఁ డక్కజము దోఁప.

తరులు ఫలభారమునఁ దమతలలు వంచెఁ
జూపఱకు నమ్రతను నేర్పు చున్న వనఁగ.

వివిధవర్ణ విభాసిత విహగసమితి
రకరకంబులు గలసుమరాజములును
గలిగి యారామ మప్పుడు గానఁబడుచు
నుండె నాఖండలునిధనుఃఖండ సమితి
చే విరాజి లెడిగగనసీమ భంగి.

అట్టులారామ రామణీయకముకరము
కనుల పండువు సలుపఁగఁ గాంచి; తవల
దృష్టి పథమునఁ బడెఁ బాలతృణయుతంబు
నతి విశాలమై తనరు బయలు బలారె;
అందు ఘాసఖాదనరతి నచ్చటచట
లేళ్లగమి చెంగు చెంగునఁ గ్రేళ్లుదాఁటు
భళిర! తాలుస్రవత్ఫేనపంక్తితోడ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బహుళరమణీయమైన యాబయలు నడుమఁ
బారుచుండె దొనదొనప్రవాహ మొకటి.

అందు రాయంచలు కడిందియందమొప్ప
నీదులాడుట గాంచఁగ మోదమయ్యె.
చేరువనె యచట ప్రవాహతీరమందు
సైకతస్థలి నొక్కెడ సంతసంబు
దనర ముచ్చటాడె నొకరథాంగ యుగము.

ఏటి కావల పర్ణకుటీర మొండు
గలుఁగ నద్దానిఁగాంచెడి కౌతుకమునఁ
దరణిలేకమె యద్యేటి తరఁగలందు
నీదులాడుచు నద్దరి కేగినాఁడ.

ప్రాంగణమ్మున భిక్షుకుల్ పాత్రలూని
హస్తములుసాచి భిక్షల నడుగుచుండఁ
గడమపడనీక గృహకాంత యిడుచునుండె
నన్నకబళంబు లోపిన యంతవఱకు.

అంతట గృహాధికారి సాయాహ్నమందు
శీఘ్రగతి నొకవేది నాసీనుఁడగుచు
భక్తియును బ్రహ్మవర్చస్సు బరఁగుచుండ
వ్రాయఁగడఁగెను శ్రీతాళపత్రములను
గంటమునుఁ బూని యెద్దియో గ్రంథమచట.

అంత నొకయంబుజాక్షియు నటకుఁ జేరి
హస్తమందునఁగల పీఠె నవల నునిచి
కనుఁగొలఁకులందునను బాష్పకణములురలఁ
దేజమునుదక్కి మిక్కిలి దీనయగుచు
పండితాగ్రేసరుని ముందు నుండియుండి
ఘోరమోమిడి దుఃఖించు చుండుటయును
గనులఁగట్టినయట్లు సాక్షాత్కరించె.

ఆమెఁగాంచి యక్కోవిదుండనియె నిట్లు:
"పలకడుపుచెఱువుగ నీవేడ్చెదిట్టు
లమ్మ! కడుపుకక్కఱితి నిన్నమ్మ నమ్మ!
తిన్నయిలు గుద్దలింతునే కన్న తల్లి!
నమ్ము నామాట యిద్దిసత్యమ్ము సుమ్మ
టంచునుంటయు నాహస్తమందునఁ గల
గ్రంథమది క్రింద జారఁగఁ గండ్లుతెఱచి
తెలివిఁగాంచితి కలఁ గని తేసు భంగి.

---



వ్యాసకర్త

# అనంత ప్రకృతిలో నానందకల్లోలము

సిరుగూరి జయరావుగారు, బి. యస్. సి.

విరతిలేక నితాంతము విరుతిఁజేయు
వీచికాడోలికలతోడ వియ్య మంది,
పవనశాబకమజ్ఞాతవాసనలకు
మేలుకొలుపులుపాడంగ మేళవించి,
మైత్రివైణికతంత్రీసమానగతుల
నలవరించె; సుహృన్మణీ! అవలకడలి,
యిసుకలివ్వలఁ, బైననాకసముఁజేఱి,
కఱగిపోయి, యనంత సాంగత్యసౌఖ్య
తన్మయతనొందెఁ; దల్లీనతాసుఖాప్తి
నీవు, నేనును నందులో నిలచిపోతి
మింకనాపాట యాపాటనెనసిపోయె;
నింకనామాట యామాట నింకిపోయె—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# జన్మభూమి

తురగా వేంకటరామయ్య గారు

౧

విడిపోవుచునుండెనా-బంధమ్ము
నేడె, పోమ్మనుచుంటివా!
కాఁగడదామె,తల్లీ!-నినువీడ
గలనటే, కల్పవల్లీ!

౨

కన్ను లెఱ్ఱంజేయకే!-నాగుండె
కమలియొరుగై పోవునే!
మరచిపోకే పావనీ!-నీగర్భ
సరసిఁబుట్టినపూవునే!

3

కంఠమ్ముకంపించెనే!-మనస్సెల్ల
కరడుగట్టుకపోయెనే!
కఠినశాసనమేటికే?-నాతల్లి
కడుపుతీపే లేదటే!

౪

వేయేండ్లనాడెప్పుడో-యనవేమ
విభుడుగట్టిన పేటలా!
వీడిపోవగవచ్చెనా-యీనాడు,
వీడొక్కఁడే భారమా?

౫

ధన్యులై చన్నారటే!-మాతాత
తండ్రులందరు నిచ్చటే;
నినువీడుటలుగల్గెనా!-నానాడు,
నీచజీవుడనైతినా!

౬

ఏటిలంకలపాటలా,-నాకింక
బీటిపొలములనాటలా!
తోటనీడలవిందులా,-నీయంక
పీఠానగారాములా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౭

పూవులేకోయనీవా!-నీవిభుని
పూజలే చేయనీవా,
పాలుగ్రోలగనీయవా,-గొంతెత్తి
పాడ నానందింపవా!

౮

కలుములిమ్మని కోరనే,-మితిలేని
పొలములిమ్మని వేడనే;
పాదనిమ్మనుచుంటినే,-యానంద
పరవశుడనై యుంటినే?

౯

నేను జేసిన పాపమో,-నాతల్లి!
నీకుబుట్టిన కోపమో?
కన్న దానవుగానటే,-నన్నింత
కష్టపెట్టగనౌనటే?

౧౦

మ్రోడులే చివురించునే,-గొంతెత్తి
పాడి విలపించగానే;
కఠినపాషాణమేమో,-నీమనసు
కరగనైనా లేదటే!

౧౧

వేణుగానము విందునే,-యానంద
వీణచేతను దాల్తునే;
భారతిని సేవింతునే,-నన్నేలు
ప్రభుని బాడుచు బోదునే!

౧౨

నాపాటలం బాడితే,-నీపేరు
నవకంపు గళలందితే,
అస్వాదినా పింవ్వా!-నాపాలి
యానందమయరూపమా!

౧౩

వెతలిపోవుచునుంటినే,-కన్నీటి
వేడికాలువగట్టెనే!
తల్లి! దీవనలీయవే,-మెప్పుమీ నీ
దర్శనమ్మొనరింతునో!

౧౪

అర్ధచంద్రకళాధరా!-నాతండ్రి!
"యనవేమవర" వల్లభా! [యమ్మ
యమృతవాక్యసంగమా-విజ
లందిరా దీవింపుమా!




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ఆంధ్ర మహాసామ్రాజ్యము

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

## ఆంధ్రరాజుల కాలనిర్ణయ సమస్య

ఆంధ్రరాజుల చరిత్రమంతయు పెక్కుసందేహములతో నిండియున్నది. అందొకటి కాలనిర్ణయమును గురించినది. ఆంధ్రరాజుల రాజ్య పరిపాలన కాలము ఇంత వఱకు సంతృప్తికరముగనిర్ణయింపబడి యుండలేదు. అనేకులు అనేకవిధములైన సిద్ధాంతములను జేసియున్నారు; కాని యవి యన్నియు పునాదిదిట్టములేని కట్టడములవలె కూలిపోవుచువచ్చినవి; కారణమేమన ఆయాసిద్ధాంతముల కాధారభూతములైన ప్రమాణము లంత బలమైనవి కాకపోవుటయే. ఆంధ్రసామ్రాజ్యచారిత్రమును వ్రాయుటకు మన కాధారములు చాలకొద్దిగ నుండుటవలన ఊహలే యెక్కువగజేయవలసివచ్చును. ఒక్కొక్కయూహ, ఒక్కొక్క సిద్ధాంతము ఒక్కొక్క క్రొత్త ప్రమాణము దొరకిన బడిపోవుచువచ్చుచున్నది. అయినను ఉన్నయాధారములతోనే చరిత్రకారు లెప్పటి కప్పుడే యూహాలనల్లి సిద్ధాంతములుచేసి చరిత్రను నిర్మించుచున్నారు. ఆంధ్రరాజుల కాలము నెట్లు నిర్ణయింప వీలుకలుగును; నిర్ణయాధారములేవి; అనువిషయములను జర్చించుటయే యీ వ్యాసము యొక్క యుద్దేశము.



వ్యాసకర్త

### పురాణములు—భవిష్యద్రాజకథనము

ఆంధ్రరాజులను గుఱించి మనము సంపూర్ణముగ దెలిసికొనుటకు గల ప్రధానాధారము పురాణములు. మత్స్య, వాయు, విష్ణు, బ్రహ్మాండ, భాగవత పురాణములలో భవిష్యద్రాజకథన మనుపేర ద్వాపరయుగ మంతమైనపిదప కలియుగమున ఏయే వంశములు భరతఖండమును పాలించునో తెలుపబడియున్నది.

నైమిశారణ్యమున ద్వాదశవర్ష యాగ మప్పుడు ఋషులందఱును కలియుగ రాజవృత్తాంతమును దెలుపవలసినదని సూతుని వేడుకొనిరి. అప్పు డతడు తనకు వ్యాసులవారు చెప్పిన అనాగతవృత్తాంతము ననుసరించి ముందు కలియుగమున రాజ్యముచేయు రాజు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లను గుఱించి యాఋషీశ్వరులకు దెలిపెను. కలియుగము రాకపూర్వము సూతుడు ఋషీశ్వరులకు దెలిపిన యీ కలియుగ రాజవృత్తాంతమున కే భవిష్యద్రాజకథనమని పేరు.

దానిప్రకారము కలియుగ ప్రారంభమున

(౧) ఐళులు [ఇళాబుధుల సంతతివారు: ఐళుని (పురూరవుని) వంశమువారు: వీరినే పౌరవులందరు];

(౨) ఐక్ష్వాకులు [ఇక్ష్వాకుని సంతతి వారు];

(౩) సౌద్యుమ్నులు [సుద్యుమ్నుని సంతతివారు] పాలింతురు.

పిదప క్షత్రులు (క్షత్త్రియులు?), పారశవులు (బ్రాహ్మణునికిని శూద్రస్త్రీకిని బుట్టిన వారు), శూద్రులు, ఇంక నితరులైన బహిశ్చరులు (విదేశీయులు?)—వీరినుండి నృపులు పుట్టుదురు. అందు అంధ్రులు (ఆంధ్రులు), శకులు, పులిందులు, ఆభీరులు, శబరులు మొదలగువారు మ్లేచ్ఛసంభవులు; పౌరవులు, వీతిహోత్రులు, వైదిశులు (విదిశవంశజులు), కోసలులు, మేకలులు, పౌండ్రులు, గౌనర్దులు, స్వాప్పౌరికులు, సునిధర్ములు, శకులు, నీపులు మొదలగువారు మ్లేచ్ఛజాతులవారు.

ఒక్కొక్క వంశమున నెందఱెందఱు రాజులుందురో, వారొక్కొక్కరు ఎన్నెన్నియేండ్లు పాలింతురో, మొత్తముమీద వారి వంశమెంత కాలము పాలించునో యీవివరములను పైనుడివిన పురాణములలో కొన్ని తెలుపుచున్నవి. ఈవిధములైన వివరములను సంపూర్తిగ దెలుపునవి మత్స్యవాయు పురాణములు.

ఇట్లు పురాణములందు దెలుపబడిన వంశములేవనగా:

| | కలియుగ రాజవంశములు | వంశములలోని రాజసంఖ్య | ఆయా వంశముల వారి పరిపాలన కాలము | |
|---|---|---|---|---|
| ౧ | పౌరవులు | ౨౩ | | |
| ౨ | ఐక్ష్వాకులు | ౨౮ | | |
| ౩ | బార్హద్రథులు (బృహద్రథుని సంతతివారు) | ౧౬ | ౭౨౩ | సం. |
| ౪ | ప్రద్యోతులు | ౫ | ౫౨ | ,, |
| ౫ | శిశునాగులు | ౧౨ | ౩౬౦ | ,, |
| ౬ | నందవంశజులు | | ౧౦౦ | ,, |
| ౭ | మౌర్యవంశజులు | ౧౦ | ౧౩౭ | ,, |
| ౮ | శుంగవంశజులు | ౧౦ | ౧౧౨ | ,, |
| ౯ | కాణ్వాయనులు (వీరినే శుంగభృత్యులందురు. వీరు బ్రాహ్మణులు) | ౪ | ౪౫ | ,, |
| ౧౦ | ఆంధ్రులు | ౩౦ | ౪౬౦ | ,, |

ఆంధ్ర రాజ్యము విచ్ఛిన్నమైన పిదప గర్దభిలులు, మురుండులు, ఆభీరులు, ఆంధ్రభృత్యులు మొదలగు వారు పాలింతురు.

ఈసందర్భమున నే ఆంధ్రరాజులపేర్లును, వారొక్కొక్కరు పరిపాలించు కాలమును గూడ దెలుపబడినది. పురాణములలోని భవిష్యద్రాజవృత్తాంతమున దెలుపబడిన రాజుల సంఖ్యయు, మొత్తముమీద పరిపాలనముచేసినట్లు తెలుపబడిన వంశమువారి పరిపాలనకాలమును చాలవఱకు సరియైనవే యని భారతీయులైన ప్రాచ్యపరిశోధక పండితులే కాక విదేశీయులగు పండితులుకూడ అభిప్రాయమిచ్చి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యున్నారు. కాని ఆయావంశములందలి రాజు లనుభవించిన పరిపాలనకాలము సరియైనది కాదని పలువురి యభిప్రాయము. దీనికి కారణ మేమన, ఈ భవిష్యద్రాజకథనమునందలి కొన్ని వంశములలోని రాజుల శాసనములు దొరకినవి. వారి శాసనములందు వారిరాజ్య సంవత్సరసంఖ్య నిచ్చియున్నారు. అనగా వారా శాసనమును తమయొక్క యే 'రాజ్యసంవత్సరము'న చెక్కించిరో యది తెలిపి యున్నారు. శాసనముల ననుసరించి యారాజు లెన్నేండ్లు పాలించిరో తెలిసికొన వీలుకలుగుచున్నది. ఇట్లు శాసనములవలన నొకరాజు ఇన్నేండ్లు పాలించునని తెలియనచ్చుచుండగా ఆరాజే అంత కెక్కువ యేండ్లో, అంతకు తక్కువ యేండ్లో పాలించినట్లు పురాణములు తెలుపుచున్నవి. ఇట్టి వ్యత్యాసములవలన పురాణములలో ఆయా రాజులకు దెలుపబడిన పరిపాలనకాలము సరియైనది కాదని తజ్జ్ఞుల యభిప్రాయము.

ఈవిధమున నందులపిదప మౌర్యులు, వారిపిదప శుంగులు, వారితరువాత కాణ్వాయనులు, వారితరువాత ఆంధ్రులు పాలించిరనియు, పైనుడివిన వంశము లొక్కొక్కటి మొత్తముమీద నెన్నిసంవత్సరములు పాలించినదియు తెలిసినను ఆంధ్రరాజులకు బూర్వము ఏరాజవంశమునకు గాని, ఏరాజునకుగాని సంబంధించి నిర్ధారణగ చెప్పదగిన ఏదియో యొకకాలము (సంవత్సరము) తెలిసిననే కాని రాజవంశముల యీపురాణపరిగణనమువలన మనకు ప్రయోజనము కలుగదు. అట్టికాలము (సంవత్సరము) ఏదియైన తెలిసికొన వీలు కలుగునేమో చూతము.

హైందవచారిత్రక కాలపరిగణనము

హైందవుల యొక్క చారిత్రకకాలము పెక్కు విధముల పరిగణింపబడుచున్నది. ఈ కాలపరిగణనమును హిందువులు శ్రీకృష్ణ నిర్యాణముతో నారంభించెదరు. శ్రీకృష్ణుల వారు నిర్యాణము చెందిననాడే కలియుగ మారంభమగుచున్నది. హిందువుల పరిగణనమున కిదియే ప్రారంభము. కలియుగాబ్దములు ౩౧౦౧ గడచినపిదప క్రీస్తుశక మారంభమగుచున్నది: అనగా కలి ౩౧౦౨ వ సంవత్సరము క్రీస్తుశకము మొదటి సంవత్సరమగును. ఇకబౌద్ధులు తమ పరిగణనమును బుద్ధనిర్వాణముతో ప్రారంభించెదరు. బుద్ధనిర్వాణ మెప్పుడన్న విషయమున ఉత్తరాది బౌద్ధులకును, దక్షిణాది బౌద్ధులకును మతభేదములు కలవు; అయినను దక్షిణాపథ బౌద్ధులును, సింహళము, బర్మా, సయాము దేశములందలి బౌద్ధులును గూడ ఏకగ్రీవముగ బుద్ధనిర్వాణము క్రీస్తుశకమునకు ౫౪౪–౫౪౩ సంవత్సరములకు బూర్వము జరిగెనని చెప్పుదురు. ఎక్కువదేశములవారు ౫౪౪-౫౪౩ నే బుద్ధనిర్వాణకాలముగ నంగీకరింతురు గనుక నదియే సరియైనదని చాలమంది యభిప్రాయము. జైనులు తమ చారిత్రక పరిగణనమునకు మహావీరుని నిర్వాణకాలమును, విక్రమసంవత్సరమును ఆధారముగ గైకొందురు. విక్రమసంవత్సరము (లేక శకము) క్రీస్తుపూర్వము ౫౮-౫౭ లో ప్రారంభమగుచున్నది. మహావీర నిర్వాణము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నకు దరువాత ౪౭౦ సంవత్సరములు గడచిన పిదప విక్రమశక మారంభమని జైనుల సరస్వతీ గచ్ఛపుగాథలవలన దెలియుచున్నది; అందువలన జైనచారిత్రముల ప్రకారము మహావీరుడు క్రీస్తునకు ౫౨౭-౫౨౮ సంవత్సరములకు పూర్వము నిర్వాణము నొందెను.

ఈ విధముగనున్న కాలపరిగణనమును జూచి విదేశీయులైన ప్రాచ్యపరిశోధక పండితులు - వారు హిందువులైననేమి, బౌద్ధులైననేమి, జైనులైననేమి-హైందవుల పరిగణనము క్రీస్తుశకమునకు జాలపూర్వమునకు బోవుచున్నదని శంకించి, గాథలవలన దెలియవచ్చు నిర్వాణకాలముల సత్యత్వమును విశ్వసింపరైరి. హైందవచారిత్రమునకు సంబంధించిన కాలపరిగణనము హైందవులు తెలుపునంత పురాతనమైనదిగ గాక క్రీస్తుశకమునకు సమీపమున నుండవలయునను ఉద్దేశముతో వారు పరిశోధనలను ప్రారంభించిరి. ఈపరిశోధనలలో వారికి సహకారియైనది అలెగ్జాండరు దండయాత్ర.

క్రీస్తు శకారంభముననుండిన 'ప్లుటార్కు', క్రీస్తుశకము మొదటిశతాబ్దిలోనుండిన 'క్వింటస్ కర్టియస్ రూఫస్', 'డయడోరస్ సెక్యులస్'లు, క్రీస్తుశకము అయిదవ శతాబ్ది నాటి వాడుకాదగు 'జస్టిన్'-వీరందఱు యవన భూపతియైన అలెగ్జాండరును గుఱించియు, అతని హిందూదేశ దండయాత్రను గుఱించియు వ్రాసియున్నారు. అలెగ్జాండరునాడు మగధను నందుడు పాలించుచుండెననియు, అతడు బహు దుర్మార్గుడనియు కడునీచుడై ప్రజలను హింసించుచుండెననియు, అప్పుడు చంద్రగుప్తుడు అతులితబల సైన్యముతో హిందూ దేశమునంతను జయించెననియు,అలెగ్జాండరు నతడు పంజాబులోచూచెననియు,అతడు చనిపోయినపిదప 'సెల్యూకస్‌నికేటర్'అను నతడు అలెగ్జాండరు జయించిన పూర్వదేశములనన్నిటిని క్రమక్రమముగా జయించుచు, తుదకు హిందూదేశమునకు వచ్చెననియు,అప్పటికి హిందూదేశములోని యవన రాజప్రతినిధులనుగూడ సంహరించి,పారతంత్ర్యమునుండి తన దేశీయులను విముక్తులంజేసి వారికధిపతియై చంద్రగుప్తుడు రాజ్యమేలుచుండెననియు వారి వ్రాతలవలన దెలియనగును. అలెగ్జాండరు క్రీస్తుకు పూర్వము 3౨3 లో చనిపోయెను. ఈయాధారములను బురస్కరించుకొని, చంద్రగుప్తుడు యవన ప్రతినిధులను సంహరించి సింహాసన మెక్కుట అలెగ్జాండరు మరణానంతరము కాని జరిగియుండదని భావించి, అలెగ్జాండరు క్రీ. పూ. 3౨3 లో చనిపోయెను గనుక చంద్రగుప్తుడు క్రీ. పూ. 3౨౨-3౧౨ లమధ్య సింహాసన మెక్కియుండుననియు, నందుని సంహరించి యాతడు మగధసింహాసనము నెక్కెనని యవనుల వ్రాతలు తెలుపుటవలన, నీచంద్రగుప్తుడే హిందువుల పురాణముల ప్రకారము నందునియనంతరము, అనగా నంద వంశపురాజుల యనంతరము మగధసింహాసనము నెక్కెనని తెలియవచ్చు మౌర్యవంశపు చంద్రగుప్తుడగుననియు విదేశీయులైన ప్రాచ్య పరిశోధకపండితులు నిర్ధారణచేసిరి. ఈసిద్ధాంతము ప్రకారమే హైందవ చరిత్రకారులంద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఖను హైందవ చారిత్రకకాల పరిగణనము చేయుచున్నారు. ఇంతవఱకు హిందూదేశ చారిత్రమున కాధారభూతమై, హైందవచారిత్రక కాలపరిగణనమునకు తల్లి వేఱుగనున్నది ఈ చంద్రగుప్త పట్టాభిషేకకాలమే. దీనిబట్టినే బుద్ధనిర్వాణకాలమును, మహావీరనిర్వాణకాలమును క్రీస్తుశకవత్సరముల లెక్కను సిద్ధాంతముచేసిరి. ఇట్లు మౌర్యచంద్రగుప్తుని పట్టాభిషేక వత్సరమును పురస్కరించుకొని బుద్ధ, మహావీర నిర్వాణకాలములను సంస్కరించినను ఈ సంస్కరణములు, ఈ నిర్ణయములు సరియైనవికావని సందేహించుట కేన్నో చిక్కులు తటస్థించుచునే యున్నవి. ఈపాశ్చాత్యుల నిర్ణయముప్రకారము ఈ నిర్వాణకాలములు జైనబౌద్ధగాథలకు భిన్నముగనుండి క్రీస్తుశక సమీపమునకు వచ్చినవి. అందువలన ఈమహావీర, బౌద్ధనిర్వాణకాలములను గుఱించి దేశీయులు, విదేశీయులునైన పండితులు ఇంకనుపరిశోధనలు చేయుచునే యున్నారు. పరిశోధన లెక్కలైన కొలది ఒక్కొకరొక సంవత్సరమును నిర్ణయించి యొకనూతన సిద్ధాంతమును జేయుచునే యున్నారు.

నిర్వాణకాలములను గుఱించి యిట్లు భిన్నమతము లున్నట్లే చంద్రగుప్త పట్టాభిషేక కాలమునను భిన్నమతములు కలవు. ఒకరు క్రీ. పూ. 3౧౨ లోనని, మఱియొకరు 3౧౫ లోనని యీ చంద్రగుప్త పట్టాభిషేకకాలమునెవరి యిచ్చవచ్చినట్లు వారు వెనుకకు ముందుకు జరుపజొచ్చిరి. కాని విన్సెంటు స్మిత్తుగారు తమ హిందూదేశచారిత్రమున దెలిపిన ప్రకారము తరువాతి చరిత్రకారులందఱు సాధారణముగా చంద్రగుప్త పట్టాభిషేకకాలమును క్రీస్తు పూర్వము 3౨౨ గనే రూఢిపఱచి గ్రహించుచువచ్చిరి. ఇటీవల కొందఱు తిరిగి జైన, బౌద్ధవాఙ్మయములను, శాసనములను పరిశోధించి, అంతకు పూర్వముకంటె నుత్తమములైన ప్రమాణములవలన హైందవ చారిత్రక పరిగణనమును గొంత సుస్థితికి దీసికొనివచ్చిరి.

ఇట్టి పరిశోధకులలో మున్ముందు పేర్కొనందగిన వారు హిందూదేశీయులైన శ్రీయుత కే. పి. జయస్వాలుగారు. వీరుపురాణములందలి కలియుగరాజవృత్తాంతములను, సింహళద్వీప బౌద్ధ పాలీ వృత్తాంతములను, జైనులసరస్వతీ గచ్ఛపుగాథలను, యవనచారిత్రములను, అశోకుని శిలాశాసనములను పరిశోధించి, పరస్పరము సమన్వయించి బౌద్ధులు,జైనులు తెలుపు బౌద్ధ మహావీర నిర్వాణకాలములు సరియైనవేయని సిద్ధాంతముచేసిరి. ఈసిద్ధాంతమునకు వారికి ముఖ్యముగ దోడ్పడినవి అశోక చక్రవర్తి శిలాశాసనములు. ఆతని పదుమూడవ శిలాశాసనమున నీ క్రిందిపంక్తులు కలవు.

ఏషెన ముఖ్యముతె విజయే దేవానాం ప్రియస యో ధర్మవిజయో [;] సోచ పున లధో దేవానాం ప్రియస ఇహా చ స[ర్వే]షు చ అంతేషు అషషు పి యోజన శ[తే]షు యత్ర అంతియోకో నామ యోన రాజ పరం చ తేన అంతియోకేన చతురే ౽ రాజని తురమయే నామ అంతికిని నామ మకా నామ అలిక సుదరో నామ [;] నిచ చోడ పాండ్య అవ తంబపంనియ ఏవమేవ హిదరాజ [.]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"దేవానాం ప్రియునియొక్క- యిదియే- యీ ధర్మవిజయమే ముఖ్యమైనది. ఇచ్చటను (అనగా నితని సామ్రాజ్యమునందును), (తన సామ్రాజ్యమునకు) అంతమునందుండు వారి మీఁదను (అనగా దన పొరుగువారిమీఁదను), అంతేకాక, ఎచ్చట అంతియోక నామకుఁడైన యవనరాజున్నాఁడో యచ్చటను, అంతియో కునికి పైని ఎచ్చట నలుగురు రాజులు, తురమయ నామకుఁడగురాజు, అంతికిని నామధేయుఁడగురాజు, మాకనామధేయుఁడగురాజు, అలికసుందరనామకుఁడగురాజు — (వీరలున్నారో) అచ్చటను, ఇంకను దక్షిణమున తామ్రపర్ణివఱకు ఎచ్చట చోడ, పాండ్యులున్నారో అచ్చటను, ఇల్లే ఎచ్చట హిదరాజు ఉన్నాఁడో యచ్చటను దేవానాం ప్రియ డీ ధర్మవిజయమును పొందెను' అని దాని భావము. ఇందు అయిదుగురు విదేశీయులగు యవన భూపతులు పేర్కొనఁబడి యున్నారు.

(౧) అంతియోక యవనరాజు (Antiochus Theos of Asia) క్రీ. పూ. ౨౬౧-౨౪౬.

(౨) తురమాయ (Ptolemy Philadelphus)—క్రీ. పూ. ౨౮౫-౨౪౭.

(3) అంతికిని (Antigonas Gonatus) —క్రీ. పూ. ౨౭౮-౨౩౯.

(౪) మాకరాజు (Magas of Syrene)— క్రీ. పూ. ౨౫౮ లో చనిపోయెను.

(౫) అలికసు[ం] దరరాజు (Alexandar of Epirus)—క్రీ. పూ. ౨?౨-?౨౫౮.

వీరందఱును పాలించుచుండినప్పుడు అశోకుఁ డీశాసనమును వేయించెను; అనగా నది క్రీ. పూ. ౨౬౧ కి ౨౫౮ కి నడుమ చెక్కించెను. అశోకుని శిలాశాసనములలో నిది కడపటిదని అంతఱు నిర్ణయించినారు. దీనికి పూర్వపు శాసనమే (అయిదవది) యొకటి అశోకుని ౧౪ వ పట్టాభిషేక సంవత్సరమును పేర్కొనుచుండుటవలన నిది అశోకుని పదునాలుగవ పట్టాభిషేక సంవత్సరమునకుపూర్వపుదికాజాలదు. ఈరీతినిచర్చించి జయస్వాలుగారు ఆశాసనము క్రీ. పూ. ౨౫౮ నాటిదని నిర్ణయించిరి. ఈనిర్ణయమునుబట్టి అది అశోకుని పదునాలుగవ పట్టాభిషేక సంవత్సర మగును. అనగా అశోకునికి క్రీ. పూ. (౨౫౮ + ౧౪) ౨౭౨ లో పట్టాభిషేకము జరిగెను. అశోకుఁడు పట్టాభిషేకమునకు నాలుగు సంవత్సరములకు పూర్వమునుండియే సింహాసన మెక్కి పాలించుచుండెననియు, సింహాసనమునకు వచ్చిన నాలుగేండ్ల కాతనికి పట్టాభిషేకము జరిగెననియు బౌద్ధులపాలీ వృత్తాంతములు తెలుపుచున్నవి. అందువలన అశోకుని పరిపాలనము క్రీ. పూ. ౨౭౭-౭౬ నుండి ప్రారంభమగుచున్నది. దీని ననుసరించి చంద్రగుప్తుని రాజ్యాభిషేకకాలమును, మహావీర, బుద్ధుల నిర్వాణకాలమును నిర్ణయింపబడినవి. అశోకునితండ్రి బిందుసారుఁడు, తాతయగు మౌర్య చంద్రగుప్తుఁడు, ఇరువురుకలిసి ౪౯ సంవత్సరములు పాలించిరి, అందువలన మౌర్యచంద్రగుప్తుని పరిపాలనము క్రీ. పూ. 3౨౬-౨౫ లో ప్రారంభమగుచున్నది. అనగా మౌర్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వంశమున చంద్రగుప్తుడే ప్రథము డగుటచేత మౌర్యవంశ పరిపాలనము క్రీస్తు పూర్వము ౩౨౬-౨౫ లో ఆరంభమని చెప్పవచ్చును. ఈ నిర్ణయముల ననుసరించియే మహావీరుడు క్రీ. పూ. ౫౪౫ లోను, బుద్ధుడు క్రీ. పూ. ౫౪౩ లోను నిర్వాణమునొందినట్లు సిద్ధాంతము చేయబడినది. ఈ నిర్ణయమే యిప్పుడు హైందవచారిత్రక కాలపరిగణమునకు మూలకందము. ఈనిర్ణయ సిద్ధాంతముల నిపుడు పెక్కు రామోదించుచున్నారు. ఈ నిర్ణయములలో మనకు గావలసినది మౌర్యవంశ పరిపాల నారంభ కాలము.

మౌర్యాదివంశముల కాలనిర్ణయము

మౌర్యవంశము యొక్క పరిపాలనము క్రీస్తుపూర్వము ౩౨౬-౨౫ లో ఆరంభమయ్యెనని తెలియుటచేత నిప్పుడుపురాణముల వలన నేయేవంశ మెంతెంత కాలము పాలించెనో మనకు దెలియునుగావున ఆంధ్రవంశ పరిపాలన మెప్పుడు ప్రారంభమయ్యెనో మనము తెలిసికొనవచ్చును.

మౌర్యవంశపురాజులు ౧౩౭ సంవత్సరములు పాలించిరని పురాణములు తెలుపుచున్నవి కావున ఆవంశము క్రీస్తు పూర్వము ౧౮౮ లో నంతరించెననియు, పిదప శుంగవంశజులు మగధ సింహాసనము నలంకరించిరనియు తెలియదగును.

శుంగవంశజులు ౧౧౨ సంవత్సరములు పాలించినట్లు పురాణాధారమువలన దెలియుచుండుటచేత నావంశజులు క్రీస్తుపూర్వము ౧౮౮ మొదలు ౭౬ వరకు మగధ నేలిరనుట స్పష్టము.

పిదప కాణ్వాయను లనబడు శుంగభృత్యులు రాజ్యమునకు వచ్చిరి. అనగా వీరి పరిపాలనము ౭౬ తో ప్రారంభమగుచున్నది. వీరు నలువదియైదేండ్లు పాలించిరి. అటువెనుక ఆంధ్రులు రాజ్యమునకు వచ్చిరని చెప్పవలసియున్నది. అనగా ఆంధ్రుల పరిపాలనము క్రీస్తుకు పూర్వము (౭౬—౪౫=) ౩౧ లో ప్రారంభమగుచున్నది.

కాని యాంధ్రు లంతకు పూర్వమే పరిపాలనమునకువచ్చిన ట్లూహించుటకు పురాణములవలననే కొంతయవకాశము కలదని కొందఱందురు. ఇట్టివాదము చేయువారు రేప్సన్ దొరగారును, కీర్తిశేషులైన శ్రీరామకృష్ణ గోపాలభండార్కరుగారును. వారికిట్టి యూహకెడ మిచ్చినది యీ క్రిందిశ్లోకము.

"కాణ్వాయనాం స్తతో భృత్యాః
సుశర్మాణః ప్రసహ్య తమ్;
శుంగానాంచైవ యచ్ఛేషం
క్షపిత్వాతు బలీయసః.
శిశుకోఽంధ్రః సజాతీయః
ప్రాప్స్యతీమాం వసుంధరామ్."
—మత్స్యపురాణము.

ఆంధ్రశిశుకుడు సుశర్మను, కాణ్వాయనులను ఎదిరించి, శుంగాధికార శేషమును నాశనముచేసి యీభూమి ననుభవించునని దానిభావము. కాణ్వాయనులలో కట్టకడపటివాడైన సుశర్మతో శేషించిన శుంగాధికారము నశించెనని పురాణములు తెలుపుచుండుటచేత, శుంగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లును, కాణ్వులును సమకాలికులైననే తప్ప "శేషించిన శుంగాధికారము" అనుటయెట్లు సంగతమగునని భండార్కరుగారు మొదలగు వారు వాదించుచున్నారు. అందువలన, కొంతకాలము క్రితము మహారాష్ట్రమును పాలించిన పేష్వాలవలెనే కాణ్వాయనులును శుంగవంశపు రాజులయధికారమంతయు దామే గ్రహించి పేరునకు మాత్రము వారిని రాజులనుజేసి తామే పాలించిరి. పేష్వాలకువలెనే వారును బ్రాహ్మణులు. బ్రాహ్మణులకు రాజ్యముచేయుట కధికారము లేకపోవుట యీ యూహకు బలమిచ్చుచున్నదని వారు చెప్పి, యందువలన కాణ్వాయనులును, శుంగులును సమకాలీనులనిరి. కాని

> భవిష్యతి సుత స్తస్య దేవభూమిః సమా దశ,
> దశైతే శుంగరాజానో భోక్ష్యంతీమాంవసుంధరామ్
> శతం పూర్ణం దశ ద్వేచ తతః కణ్వాన్ గమిష్యతి;

(శుంగవంశజులలోని కడపటి వాడగు) దేవభూమి పదిసంవత్సరములు పాలించును. ఈ శుంగవంశపు రా జు లు ప ది మ ం ది యు నీభూమిని ౧౧౨ ంసవత్సరములు అనుభవింతురు. పిదప నది వారినుండి కాణ్వులకు బోవునని యర్థము. 'ఇట్లు స్పష్టముగ పురాణములు శుంగుల పిదప కాణ్వులు పాలింతురని చెప్పుచున్నవి. అదియునుగాక, మంత్రియైన వసుదేవుని ప్రోత్సాహమున దేవభూతి (దేవభూమి)యొక్క దాసీపుత్రి రాణివేషముతో వచ్చి మోహోన్మత్తుడై యుండగా శుంగుని జంపెనని బాణుని హర్షచరిత్రమున గలదు.' అను నీప్రమాణముల మీద విన్సెంటుస్మిత్తుగారు భండార్కరు, శేషనులవాదము సరియైనదికాదని నిరాకరించుచున్నారు. భండార్కరు ప్రభృతుల వాదమునకు దోడ్పడునది మఱియొక శ్లోకము కలదు. అదియేదన:

> అమాత్యో వసుదేవస్తు
> బాల్యాద్ వ్యసనినంనృపమ్;
> దేవభూమి మథోత్సాద్య
> శౌంగస్తు భవితానృపః
> భవిష్యతి సమా రాజా
> నవ కాణ్వాయనో ద్విజః.
>
> —మత్స్యపురాణము.

పాఠాంతరము:

> దేవభూమిం తథోత్పాట్య
> శుంగేషు భవితా నృపః."—
>
> —వాయుపురాణము.

బాల్యముచేత వ్యసనియైయున్న దేవభూమిని అమాత్యుడైన వసుదేవుడు బలాత్కారమున వెడలగొట్టి తాను (మత్స్యపురాణప్రకారము) శౌంగరాజగును;(లేదా వాయుపురాణము ప్రకారము శుంగులలో రాజగును). ఆకాణ్వాయనుడు తొమ్మిది సంవత్సరములు పాలించును అని యాశ్లోకమున కర్థము. శుంగులు, కాణ్వులు సమకాలీనులనుట కీశ్లోకములే బలీయములైన ప్రమాణములుగ నున్నవి. అంతేకాని కాణ్వులు బ్రాహ్మణులు గనుక వారికి రాజ్యాధికారము లేదు. అందువలన వారు రాజ్యముచేయలేదు అనుట హేతువాదమునకు గొంతబలమే. కాని కాణ్వాయనులవలెనే శుంగులును బ్రాహ్మణులని యే తెలియుచున్నది. అందువలన నాహేతువు నిలువజాలనిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహామహోపాధ్యాయ హరప్రసాద శాస్త్రిగారు శుంగులుకూడ బ్రాహ్మణులేయని చెప్పుచున్నారు. లాట్యాయనశ్రౌతసూత్రము లలో నొకసూత్రము సందర్భమున శుంగుల యభిప్రాయ ముదాహరింపబడినది. ఆసందర్భ మున వ్యాఖ్యాత శుంగులు ఆచార్యులనియు, అందును వారు సామవేదాచార్యులనియు చెప్పి యున్నాడు. భరద్వాజసగోత్రులైన శుంగుల కును, విశ్వామిత్రగోత్రు లగు కతవంశజుల స్త్రీ కిని జనియించినవారు చెప్పు ప్రవరయొకటికల దు. అందు భరద్వాజ విశ్వామిత్రగోత్రజుల ఋషులు కలరు. దీనినిబట్టి శుంగులు బ్రాహ్మణు లనియు, సామవేదులనియు నిస్సంశయముగ నుడువదగును. తన రాజ్యమునందంతట యజ్ఞ యాగాదులను నిషేధించిన అశోకచక్రవర్తి రాజధానిలోనే శుంగులలో ప్రథముడైన పుష్యమిత్రు డశ్వమేధయాగము నెట్లుచేసె నన్న ప్రశ్నకు 'శుంగులుబ్రాహ్మణులు, అందు సామవేదు లని చెప్పిననే తగిన సమాధాన ము దొరకగల'దని హరప్రసాదశాస్త్రిగారు నుడువుచున్నారు. పుష్యమిత్రుడు బౌద్ధమత మునకు వైరియనియు, బౌద్ధులను పెక్కు మంది నాతడు చంపించెననియు బౌద్ధగాథలు కలవు. శుంగులు బ్రాహ్మణులను దానధర్మాది కములచేత సత్కరించి బ్రాహ్మణవిద్యను బ్రోత్సహించిరనుటకు తార్కాణములు కలవు. ఈకారణములచేతకూడ శుంగులు బ్రాహ్మణు లే యని హరప్రసాదశాస్త్రిగారు వాదించు చున్నారు. ఇదియే నిజమని యంగీకరించుచో బ్రాహ్మణులైన శుంగులే పరిపాలనము నెఱపి నపుడు కాణ్వాయనులేల నెఱపియుండరాదు? అందువలన శుంగులు, వారి పిదప కాణ్వాయ నులు, వారి పిదప ఆంధ్రులు పాలించిరని చెప్ప వచ్చును.

కాణ్వులు బ్రాహ్మణులు గావున రాజ్య ముచేయలే దనునది యెట్లున్నను పురాణము లందలి శ్లోకముల యాధారమున వాదమునకు భండార్కరుగారు చెప్పునదియే సరియైనదని యంగీకరింతము. అట్లంగీకరించుటకుకూడ మనకు వేఱొకయాధారము లేకపోలేదు.

పురాణములు ఒకవంశముపిదప మఱి యొక వంశము పాలించెనని చెప్పుచున్నను వాటిలో గొన్నివంశములైన ఒకదాని కొకటి సమకాలికములైనవి యుండకపోవు. ఇట్టి యభి ప్రాయమున కెడ మిచ్చుచున్నది ప్రద్యుమ్న సూరి విరచితమైన 'ప్రభావకచరిత'మను జైన గ్రంథము. దీనివలన మురుండులు, శకులు, గర్దభిలులు, ఆంధ్రులు మొదలగువారొకేకాల మున బాలించినట్లు అనగా నివియన్నియు సమ కాలీనవంశము లైనట్లు తెలియవచ్చుచున్నది. పురాణములలో నీవంశము లన్నియు దెలుప బడినవి కాని క్రమ మిట్లు లేదు. ముందు ఆం ధ్రులు, ఆంధ్రులపిదప ఆభీరులు, వారిపిదప గర్ద భిలులు, వారిపిదప శకులు ఇట్లు పాలింతు రని కలదు. ఇప్పుడు ప్రభావకచరిత ప్రమాణమున పురాణములలో దెలుపబడిన వంశములలో గొన్ని సమకాలీనములైనవియు నుండనచ్చు నని పండితులలో నొకయభిప్రాయము కలుగు చున్నది. అందువలన మనముకూడ దీనినే



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విశ్వసించి శుంగకాణ్వాయన వంశములు రెండును సమకాలీనములే యందము.

అట్లయినచో నాంధ్రవంశపరిపాలన మెప్పటినుండి ప్రారంభమగును? శుంగులును, కాణ్వులును సమకాలికులనుచున్నాము కావున శుంగుల యనంతరమే అనగా క్రీస్తుపూర్వము (౧౮౮—౧౧౨=)౭౬ లోనే యారంభమగును. ఆంధ్రవంశము క్రీస్తుపూర్వము ౭౬ నుండి పాలించుననన్న విషయము సరియైన దగునా? ఇక మనకీసమస్యా పరిష్కారమునకు వాఙ్మయమునుండి తోడ్పాటు రాదు. అందువలన నింకమనము వాఙ్మయేతరములైన శాసనాదికములను శోధింపవలసియుండును. అట్లయిన ఆంధ్ర రాజు లెచ్చటివారో, వారి శాసనములేవైన కలవేమో పరిశీలించి వాటిమూలమున మన మిప్పుడు తేల్చుకొనిన ఆంధ్ర పరిపాలనారంభ సంవత్సరము సరియైనదో కాదో, లేక దాని నింకను ముందునకో, వెనుకకో జరుపవలెనో చూతము.

ఆంధ్రవిష్ణువు: ఆంధ్రుల యాదిమ నివాసస్థలము

ఆంధ్రులు చాల ప్రాచీన కాలమునుండి కృష్ణాగోదావరీనదులమధ్య నివాసము చేయుచుండిరనియు, వారికి కృష్ణానదీతీరమున నుండిన శ్రీకాకుళము మొదట రాజధానిగనుండెననియు, అచ్చట సుచంద్రుడను వాని కుమారుడగు అంధ్రవిష్ణువు నిశుంభుడను రాక్షసునితో బోరాడి తుద కాతనిని సంహరించి యాంధ్ర రాజ్యమును స్థాపించి రాజ్యము చేసెననియు నొకగాథ కలదు. ఈగాథ యెంతవఱకు సత్యమైనదో మనకు దెలియదు. కాని శ్రీకాకులములో శ్రీవల్లభుని యాలయము కలదు. అందు అనేకశాసనములు కలవు. అవి యన్నియు నిప్పుడు గవర్నమెంటువారిచే ప్రకటితమైనవి. ఏవిధమునను శాసనములు ఈగాథకు సహకారులగుటలేదు. క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దినుండి యీయాలయమున శాసనములు కానవచ్చుచున్నవి. క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దాంతమునుండి ధనదప్రోలు (చందవోలు, రేపల్లెతాలూకా) రాజధానిగ తెలుగుదేశమును పాలించిన వెలనాటి చోళరాజుల పరిపాలనములో ఈ శ్రీకాకొలని శ్రీవల్లభునికి ప్రసిద్ధి వచ్చినది. శాసనములందీదేవుడు శ్రీకాకులేశ్వరుడనియు, శ్రీకాకొలని శ్రీవల్లభుడనియు పేర్కొనంబడి యున్నాడు. కాకతీయుల పరిపాలనము అంతమగువఱకు గానవచ్చు నీ దేవాలయపు శాసనములలో నీ దేవునిపేరు శ్రీకాకొలని శ్రీవల్లభుడనియే యున్నది. ఈ దేవుడు శ్రీకాకొలని అంధ్ర శ్రీవల్లభుడనికాని, ఆంధ్రవిష్ణువనికాని, తెలుగు రాయడనికాని పేర్కొనబడి యుండలేదు. ఈ దేవాలయములోని మంటపస్తంభముల మీది శాసనములలో క్రా(ం)జ నరేంద్రేశ్వర దేవరకు చేయబడిన దానములను దెలుపునవి కొన్ని కలవు. దీనంజేసి యీమంటపము అటు తరువాత కట్టబడినదనియు, అట్లు కట్టుటలో క్రాంజ (కాజ) నరేంద్రేశ్వరాలయము అప్పటికి శిథిలమై యుండగా అచ్చటి స్తంభములను దీసికొనివచ్చి యీమంటప నిర్మాణమున కుపయోగించి యుందురనియు నాయూహ. లేనిచో శ్రీకాకులమున క్రాంజ నరేంద్రేశ్వరుని దాన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాసనములుండుట సంభవము కాదు. క్రాంజ నరేంద్రేశ్వరుని దానశాసనములుకూడ క్రీస్తు శకము పండ్రెండవ శతాబ్దినుండి కానవచ్చు చున్నవి. అట్టి శాసనములలో మిక్కిలి పూర్వపుది క్రీ. శ. ౧౧౫౫ నాటిది: చాల తరువాతిది క్రీ. శ. ౧౧౭౨ నాటిది. అందు వలన ఆనరేంద్రేశ్వరాలయము క్రీ.శ. ౧౧౭౨ తరువాత శిథిలమైయుండగ' నాయాలయము లోని స్తంభములను తెచ్చి ౧౧౭౨ తరువాత కట్టబడిన దనదగు శ్రీకాకులేశ్వరాలయ మంట పముయొక్క నిర్మాణమున కుపయోగించి యుం డరు. వేంగీచాళుక్య భూపతియైన నరేంద్ర మృగరాజవిజయాదిత్యుడు తన పేర నూటొక్క శివాలయములను బ్రతిష్ఠించెనని మనకు శాస నములవలన దెలియవచ్చుచుండుటచేత నీక్రాం జనరేంద్రేశ్వరాలయ ప్రతిష్ఠ యతనిదే మై యుండవచ్చును.

ఇది యటుండ నిండు. శ్రీకాకొలని శ్రీవల్లభునియాలయములోని శాసనములలో తెలుగురాయ డనుపేరు మొదట గజపతుల నాడు కానవచ్చుచున్నది. కపిలేశ్వరగజపతి (క్రీ. శ. ౧౪౩౫-౧౪౬౪) యొక్క శాసన మున తెలుగురాయ డనుపేరు చూపట్టును. ఈ శాసనమువలన దెలియవచ్చు ధర్మము తెలుగురాయనికి జేయబడినదే.

నరేంద్రేశ్వరుని బేర్కొను కొన్ని శాసన ము లచటనుండుటచేత శ్రీకాకొలనిదేవునికి రాయడనియు, తెలుగుదేశమున నుండుటచేత తెలుగురాయడనియు వ్యాప్తికలిగె నేమో? తెలుగున రాయడనుపేర బరగు నరేంద్రేశ్వరు నికి తెలుగు అను పదము జేర్పబడినట్లే శ్రీవల్ల భునికి ఆంధ్రయను పదమును జేర్పబడి తుదకు శ్రీకాకొలని శ్రీవల్లభుడు - ఆంధ్రవిష్ణువన బరగియుండును. శ్రీకాకొలని శ్రీవల్లభునికి తెలుగురాయడనియు, ఆంధ్రవిష్ణువనియు నెట్లు పేరువచ్చెనో నిశ్చయముగ దెలుపుట కష్ట సాధ్యమే. కాని, యీపేర్లు గజపతులపరిపాల నకు పూర్వము, లేదా రెడ్లపరిపాలనకు పూర్వ ములేవనుట నిశ్చయము. ఇందులకు శాసన ములే ప్రమాణము. శాసనములందు శ్రీకా కులేశ్వరునికి,

> "గోపాంగనానేత్రశరచ్చశాంకం
> యోగీంద్రహృత్పద్మ సహేందుభానుం
> శ్రీవల్లభం దైత్య గజౌఘసింహం
> శ్రీకాకులేశం శరణం ప్రపద్యే."

అని భక్తులు ప్రణతు లర్పించియున్నారు. శ్రీ కాకులేశు డాంధ్ర విష్ణువేమై యతడు నిశుం భుని జంపిన విషయమే నిజముగా పురాణోక్త మగునేని ఆదేవునికి నిశుంభవైరియనియో, నిశుంభమర్దనుడనియో కొన్ని విశేషణము లుండకపోవు. ఆంధ్రవల్లభుడైనయెడల ఆం ధ్రులు అట్టిపేరితో నతనిని బేర్కొనకపోరు. ఈశ్లోకములోని దైత్యగజౌఘసింహుడన్న పద ము శ్రీవల్లభుడైన విష్ణువునకు సాధారణ నామమే. అంతేకాక మంచన కవి నందూరి గుండ మంత్రిని వర్ణించుచు నతడు,

> "పాటించి కాకుళేశ్వరు తిరునాళ్లలో
> నర్థులకేటేట నర్థమిచ్చు"

ననియు,

> "నలువుగఁ గాకుళేశుతిరునాళుల లోపలగుండమంత్రి ని,
> ర్మలమతి బిట్టువేగముగ మాడలు రత్నచయంబుఁ జల్లు"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ననియు పొగడియున్నాడు. ఇందును శ్రీకాకొలని దేవుడు శాసనములందువలెనే కాకులేశ్వరుడనియే పేర్కొనబడెను కాని తెలుగురాయడని పేర్కొనబడలేదు. ఈకారణములవలన శ్రీకాకొలని దేవునికి శ్రీవల్లభుడు, కాకులేశ్వరుడనియే అసలు పేరులనియు, ఆంధ్రత్వాభిమానము హెచ్చిన పిదపనే యతనికి ఆంధ్రవిష్ణువు, తెలుగురాయడు ననుపేర్లును, నిశుంభవధ మొదలగు విశేషములతోడ స్థలమాహాత్మ్యమును వచ్చెననియు నాయభిప్రాయము. ఈగాథను మొట్టమొదట ఇంగ్లీషు గ్రంథములోని కెక్కించినది క్యాంబెల్ గారు. వారు ఆంగ్లేయుల యుపయోగార్థము ఒక తెలుగు వ్యాకరణము వ్రాసిరి. ఆ గ్రంథపీఠికలో వారు దీనినిపొందుపఱిచిరి. వారి గ్రంథము నాధారము చేసికొని బర్జెస్ మొదలగు పాశ్చాత్య పరిశోధకపండితులు దానిని లోకమున ప్రవర్తింపజేసిరి. ఆవిధమున నీగాథ గ్రంథములలో నల్లుకొనియెను. అందువలన సుచంద్రునికొడు కాంధ్రవిష్ణువనికాని, యతడు నిశుంభుని జంపెననికాని, ఆతడే యాంధ్రరాజ్యమును కృష్ణానదీతీరమున సంస్థాపించె ననికాని, శ్రీకాకులము ఆంధ్రులకు రాజధానియనికాని విశ్వసింపజాలము.

ఇక ఆంధ్రుల యాదిమనివాసము కృష్ణాగోదావరీనదుల మధ్యనగునా యన్నవిషయమును గుఱించి యోచింతము. ఆంధ్రులు ఆర్యాశ్రమోపాంతముల నుండిరని ఐతరేయ బ్రాహ్మణము నుడువుచున్నది. హరివంశము వలన కరూశరాజగు చాణూరాంధ్రుని కృష్ణుడు వధించెనని తెలియుచుండుటచేత ఆంధ్రులు కరూశదేశమున నుండినట్లు ఊహింపనగును. మత్స్య వాయుపురాణము లీయూహను బల పఱుచుచున్నవి. వానివలన ఆంధ్రులు మధ్యదేశవాసులని తెలియుచున్నది. మధ్యదేశమేది?

"హిమవద్వింధ్యయోర్మధ్యం యత్ప్రాగ్వినశనాదపి
ప్రత్యగేవ ప్రయాగాచ్చ మధ్యదేశః ప్రకీర్తితః."

అనగా ఉత్తరమున హిమాలయపర్వతములకును, దక్షిణమున వింధ్యపర్వతములకును, తూర్పున ప్రయాగ (అలహాబాదు) కును, పశ్చిమమున వినాశనము (అనగా సరస్వతీనది యంతర్వాహినియై, యంతర్హితయైన చోటు)నకును మధ్యగల ప్రదేశము 'మధ్యదేశము'అని మనుస్మృతివలనదెలియుచున్నది. ఆంధ్రు లీమధ్యదేశమున నుండిరని పురాణములు తెలుపుచున్నవి.

రామాయణ మహాభారతములలో ఆంధ్రులు పేర్కొనంబడియున్నారు కాని వారినివాసము 'ఫలాని'చోట నని స్పష్టముగా తెలియరాదు. అయినను మహాభారతము భీష్మపర్వమున సంజయునిచే వర్ణింపబడిన భరతవర్షమునందలి దేశములను బట్టిచూడగా ఆంధ్రులు దక్షిణముననుండిన ద్రవిడ, కేరళ, చోళాది మ్లేచ్ఛజాతులవారితోపాటుకాక ఔత్తరాహులగు ఆర్యజాతులవారితోపాటు పేర్కొనంబడి పర్వతప్రాంతముల నున్నవారని తెలుపబడినది. దీని ననుసరించి ఆంధ్రులు తూర్పుకనుమలకిరుప్రక్కలనున్న దేశమున నుండిన ట్లూహింపనగును.

ఇక బౌద్ధజాతకకథల ననుసరించి చూచినను ఈవిషయమే స్పష్టపడుచున్నది. ఆ బౌద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జాతక కథలప్రకారము తెలివాహానది (తెలి నది) ఆంధ్రదేశమునకు పశ్చిమ సరిహద్దుగ నేర్పడియుండెనని శ్రీ జయస్వాలుగారు తెలుపుచున్నారు. ఈప్రకారము చూచినను, క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దినాటి చేదిదేశాధిపతియగు జాజల్లదేవుని శాసనముల ననుసరించి చూచినను ఈ తెలినదికి తూర్పున నున్న ఒరిస్సాలోని బౌద్, దస్పల్లాసంస్థానములు ఆంధ్రదేశములోని వగుచున్నవి. ఈ తెలినది విశాఖపట్టణ మండలమునకు పశ్చిమమున నున్న పర్వతపంక్తులలో బుట్టి ఈశాన్యమూలగా ఒరిస్సాలోని పశ్చిమసంస్థానముల గుండ ప్రవహించి మహానదిలో గలియుచున్నది. తరువాత క్రీస్తు శకము ౬-వ శతాబ్ధిలోని వరాహమిహిరునినాడుకూడ ఆంధ్రులు ఆర్యావర్తమునకు ఆగ్నేయ మూలనుండిరి. ఈప్రదేశము బౌద్ధజాతక కథలవలన దెలియవచ్చిన ప్రదేశమునకు సరిపోవును.

తరువాత మౌఖరభూపతుల శాసనముల ననుసరించి చూచినను ఆంధ్రులు మగధకు సమీపముననే దానికి దక్షిణమున నుండిరని యూహింప నవకాశము కలుగుచున్నది. మౌఖరులు హర్షశిలాదిత్యుని నాటివారు; క్రీస్తుశకము ౬వశతాబ్ది కడపటను, ఏడవ శతాబ్ది ప్రారంభమునను మగధదేశప్రాంతము నేలిరి. వారిలో ఆదిత్యవర్మ కుమారుడైన ఈశానవర్మ మూడువిధములుగ మదోదకము స్రవించు వేలకొలదిగనున్న ఏనుగులుగల ఆంధ్రాధిపతిని జయించెనని యొక శాసనము తెలుపుచున్నది. అదియును గాక మౌఖరభూపతి కోడిపోయి ఆంధ్రభూపతి వింధ్యపర్వత గుహలలోనికి పారిపోయెనని మఱియొక శాసనమువలన దెలియుచున్నది. నేను చూచినంత వఱకు ప్లైనీవ్రాతలలోను, మౌఖరభూపతుల శాసనములలోను మాత్రమే ఆంధ్రులకు గొప్ప గజసైన్య మున్నట్లు పేర్కొనబడినది. ప్రాచీనకాలమునుండియు కళింగాటవులు గజములకు ప్రసిద్ధిబడసినవి. ఆంధ్రులకు కూడ గొప్ప గజసైన్యము కలదనియు, మౌఖరులు వారిని జయించిరనియు చెప్పబడుటవలన వారి రాజ్యము వింధ్యపర్వతములకు, కళింగాటవులకు నడుమను, మగధకు దక్షిణమునను ఉండిన ట్లూహించుట యుక్తము.

అటు తరువాత క్రీ.శ. ౭-వ శతాబ్దిలో వచ్చినయు వాన్‌చాంగ్ కూడ దక్షిణ కోసలమునకు దిగువభాగము నాంధ్రదేశమని చెప్పి, దానికిరాజధానియైన 'పింగ్-కి-లో'ను పేర్కొనియున్నాడు. శ్రీయుతులు భావరాజు వేంకట కృష్ణారావుగారు దీనిని వేంగిగా గుర్తించియున్నారు. అది సరియైనదిగనే కన్పట్టును. బౌద్ధజాతక కథల ప్రకారమును, యువాన్‌చాంగ్ వర్ణనల ప్రకారమును, వరాహమిహిరుని నిర్దేశము ప్రకారమును ఒకవేళ దక్షిణకోసలములోని దక్షిణభాగమే కొంత యాంధ్రదేశముగా నేర్పడునేమో! ఇది యెట్లున్నను కోసలమునకు దక్షిణప్రాంతమంతయు నాంధ్రదేశమనుటకు ఇంకొక ప్రమాణము కలదు. బస్తరుమండలములో క్రీస్తుశకము పదునొకండు పండ్రెండు శతాబ్దులలో నాగవంశపురాజులు వేసిన తెలుగుశాసన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సములే కన్పట్టుచున్నవి. ఏడవశతాబ్దిలోని వాడగు దండిమహాకవి తన దశకుమార చరిత్రమున ఆంధ్రనగరమును వర్ణించుచు, నది యొక గొప్పసరస్సున కనతిదూరముననే కల దని చెప్పియున్నాడు. ఈవర్ణనము కొల్లేటికి సరిపోవును. అట్లయినచో అంధ్ర (ఆంధ్ర) నగరము వేంగియై యుండవచ్చును. దండి మహాకవి వేంగీచాళుక్య విష్ణువర్ధన, మొదటి జయసింహులకు సమకాలికుడు. అప్పుడు చాళుక్యులకు వేంగీనగరమే రాజధానిగా నుండెను. అందువలన వేంగియే అంధ్రనగరమనుట సమంజసముగ నుండకపోదు. ఈవిధమైన పరిశోధనవలన దేలిన విషయమిది: ఆంధ్రులు ఉత్తరాదినుండి దక్షిణమునకు వచ్చినవారు. వారు చాలకాలము తెలివాహానదీప్రాంతముల నుండి పిదప కృష్ణాగోదావరీ మధ్య ప్రదేశములకు వచ్చిరి. క్రీస్తుశకమునకు పూర్వమునను, క్రీస్తుశకారంభమునను దక్షిణకోసలము నుండి కృష్ణానదివఱకు వ్యాపించియుందురు. అందువలన వారు వ్యాపించిన యీప్రదేశములలో వారిశాసనములకై చూతము. ఆంధ్ర రాజులపేరులేవో ముందుమనకు తెలియవలెను.

### ఆంధ్రరాజులు

పురాణములలో నీ యాంధ్రరాజులు ౪౬౦ సంవత్సరములు పాలింతురని చెప్పబడి యుండుటయేకాక ఆవంశములోని రాజుల పేర్లను వారు పాలించుకాలమును గూడ తెలిపియున్నట్లు మన మెఱుగుదుము. ఇట్టి కలియుగ రాజవంశముల పట్టికల నిచ్చు పురాణములన్నిటిలో మత్స్యపురాణమే యుత్తమమైనది. ఈపురాణము నందలి రాజవంశపు పట్టికలు ఇతరపురాణములలోని పట్టికలకంటె సమగ్రమైనవి. ఈపురాణములందలి కలియుగ రాజవంశములను గుఱించి వర్ణించుభాగములను విడదీసి వేలువేలు పురాణముల యొక్క వేలువేలు ప్రతులను రమారమి ౧౬౦ వఱకు సంశోధించి పాఠాంతరములతోగూడ పర్గిటరు

ఆంధ్రరాజుల పట్టిక

| | | |
|---|---|---|
| ౧ | శిశుకుడు | 23 |
| ౨ | కృష్ణుడు | 10 |
| ౩ | శ్రీశాతకర్ణి | 10 |
| ౪ | పూర్ణోత్సంగుడు | 18 |
| ౫ | స్కంధస్తంభి | 18 |
| ౬ | శాతకర్ణి | 56 |
| ౭ | లంబోదరుడు | 18 |
| ౮ | ఆపీలకుడు | 12 |
| ౯ | మేఘస్వాతి | 18 |
| ౧౦ | స్వాతి | 18 |
| ౧౧ | స్కంధస్వాతి | 7 |
| ౧౨ | మృగేంద్ర స్వాతికర్ణుడు | 3 |
| ౧౩ | కుంతలస్వాతికర్ణుడు | 8 |
| ౧౪ | స్వాతికర్ణుడు | 1 |
| ౧౫ | పులోమావి | 36 |
| ౧౬ | అరిష్టకర్ణుడు | 25 |
| ౧౭ | హాలుడు | 5 |
| ౧౮ | మంతలకుడు | 5 |
| ౧౯ | పురీంద్రసేనుడు | 21 |
| ౨౦ | సుందర శాతకర్ణి | 1 |
| ౨౧ | చకోరశాతకర్ణి | ½ |
| ౨౨ | శివస్వాతి | 28 |
| ౨౩ | గౌతమీపుత్రుడు | 21 |
| ౨౪ | పులోమావి | 28 |
| ౨౫ | శివశ్రీ పులోమావి | 7 |
| ౨౬ | శివస్కంధ శాతకర్ణి | 3 |
| ౨౭ | యజ్ఞశ్రీ శాతకర్ణి | 29 |
| ౨౮ | విజయుడు | 6 |
| ౨౯ | చండశ్రీ శాతకర్ణి | 10 |
| ౩౦ | పులోమావి | 7 |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గారను విదేశీయపండితులు ఒక చక్కని ప్రతిని ముద్రించియున్నారు. వారు మత్స్య పురాణప్రతియే యీపట్టికలనిచ్చు పురాణ ప్రతులన్నిటిలో శ్రేష్ఠమైనదనియు, సమగ్రమై నదనియు దెలుపుచున్నారు. దానిప్రకారము పైపట్టికలోని ఆంధ్రరాజులు వారివారిపా లన సంవత్సరములతో గూడ దెలియవచ్చు చున్నారు. ఈ పైపట్టికలోని మొదటిపేరు విష్ణుపురాణమున శిప్రకుడనియు, వాయు బ్రహ్మాండపురాణముల సింధుకుడనియు వేఱు వేఱువిధములగలదు. అంతేకాక ఒక్కపురాణ ప్రతిలోనే యీపేరు వేఱువేఱువిధములుగ పేర్కొనబడియున్నది. అదియునుగాక (౨౮) పులోమావికిని (౨౯) శివశ్రీపులోమావికి నడుమ వాయుపురాణ ప్రతియొకటి శాతకర్ణి నొకని బేర్కొని యతడు ౧౮ సంవత్సరము లు పాలించెనని చెప్పుచున్నది. ఏ యితర పురాణము నితనిని పేర్కొనకపోవుటవలన నాపేరీపట్టికలోనుండి తొలగింపబడినది. (౮) ఆపీలకుడు వేఱువేఱు పురాణములలోనేకాక ఒకే పురాణముయొక్క ప్రతులలోనే వేఱు వేఱువిధముల పేర్కొనబడియున్నాడు. ఆపీత కుడు, అర్యాంతకుడు, ఆపీలవుడు, ఆపీస్తవుడు, దాపిలకుడు, దివిలుడు,సిబిలకుడు, వివిలకుడు- ఈ మొదలగునవి ఆతని నామముయొక్క రూపాంతరము లనేకములుకలవు. ఇక నొకటి రెండుపేర్లకుకూడ నిట్టి రూపాంతరములున్న ను మనలనంతగ బాధింపవు. ఈవిధమున దెలియవచ్చిన ఆంధ్రరాజుల శాసనములు ఆంధ్రదేశమునగాని, మఱియెచ్చటగాని కాన వచ్చునేమో చూతము:

(సశేషము)

---

# అంచ

మిన్నికంటి గురునాథకవి గారు


వ్యాసకర్త

ఉరుగాంభీర్యము పోయె, హంసఖుఁడా !
వ్యూహంబుగా నొడ్డునం
బరివేష్టించిరి జాలరుల్ కొలఁకు నా
వాసంబు సాలించి స
త్వర మిం దుండకపొమ్ము; లెమ్ము;
బకముల్ పంకానులేపావలే
పరసస్ఫూర్తిని గూయుచుం బదములం
బై మోపకున్నంతలోఁ.

ఉ. పాలును నీరు వేఱుపఱపంగల; వుప్పరవీది దవ్వులం
గాలు గదల్పఁబోక యరుగంగల ; వున్నతమా పదంబునుం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జాల గడించె మీకాలముసామి ; యదే మటుతమ్మికాఁడపై
వ్రాలెద ? లెంతయున్నఁ గులపద్ధతి మాఱదొ రాజహంసమా ?

శా. ఐనం దా నొకరాజహంస యగుఁగా; కాకాశగంగా సువ
ర్ణానూనాంబుజనాళఖాదియగుఁగా ; కారాధ్యమేధావియుం
గాని; మైన సమస్తభూతగణహృత్కౌతూహలాపాదియా
పానీయంబిడు నాఘనుం గన సహింపం డేమిసౌజన్యమో ?

ఉ. కమ్మనినీటివెల్లువ దగం దొలఁగించి, మృణాళనాళదా
నమ్మున నాఁకలిం గెడపి, నవ్యజలేజములన్ శ్రమమ్ము వోఁ
జిమ్మి బహూపకారములు సేయుఁగదమ్మ సరోవరమ్ము ; దా
నెమ్మెయి వృద్ధిఁబొందుట సహింప వదేమొకో, రాజహంసమా !

ఉ. ఎవ్వరు మీరు ? హంసముల ; మెందునివాసము ? మిన్నువాక ; నం
దెవ్విధిఁ గర్వులేదుగద ? యీశ్వరు సత్కృప ; పంట లెవ్వియో ?
మవ్వపుఁ బైఁడిదామరలు మాకు సమృద్ధము ; నత్తిగుల్లలో ?
యవ్వియెఱుంగ ; మన్న నహహో యని గొల్లున నవ్వె గొంగలున్.

శా. ఏమే హంసలమంచు నబ్బకము లిం దేతెంచి వాక్రుచ్చె, మా
యీమూఢుల్ నిజమంచు నమ్మి, రిఁక మీ రేతేర వచ్చెం బక
స్తోమం బందురు తారతమ్యముల నిచ్చోఁ జూడరో హంసలా
రా ; మీ స్వేచ్ఛగ నొందుచోటి కరుగుండా ! యీనిమేషంబునన్

మ. స్వకులాయంబుల వీడకుండ బలిపుష్టస్వాంగముల్ గొన్ని ప
క్షికులంబుల్ కుపితోగ్రకౌశికనఖక్షీణాహతిం బక్షముల్
శకలం బౌటకు సిద్ధమైనను మృణాళగ్రాస వర్ధిష్ణువుల్
శకునుల్ గొన్ని త్యజించుఁ గర్దమము లేశంబైన గంగాంబువున్.

ఉ. వెల్లఁగఁ బుచ్చెఁ బ్రాయమును వేడ్కఁ బ్రఫుల్లసరోరుహాటవీ
వేల్లితగంధబంధురపవిత్రవిశుద్ధమనస్సరస్సునం
దొల్లి మరాళ ; మిప్పు డతిదుర్భరనిస్వనభేకభీకరో
ద్వల్లవపల్వలాంబులఁ గటా ! యెటు కాలము వెళ్లఁబుచ్చునో ?

"అడవి పువ్వులు"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## పుష్పాపచయము

శ్లో. ప్రియే ఽపరా యచ్ఛతి వాచ మున్ముఖీ, నిబద్ధదృష్టి శ్శిథిలాకులోచ్చయా,
సమాదధే నాంశుక మాహితం వృథా, వివేద పుష్పేషు న పాణిపల్లవమ్.—కిరాతార్జునీయము, స. ౭-౧౫.

[illegible] శ్రీయుత [illegible] గారు, హైదరాబాదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# శాంతినికేతనము

గూడా కృష్ణమూర్తి గారు

## స్థాపనము

ప్రశాంతమై, తరుశాఖావృతమై కవులకు, చిత్రకారులకు సహస్రకీతుల నుపయోగపడు ప్రకృతి సౌందర్యము కల్గి, సార్థకనామమున బరగుచున్న దీ శాంతినికేతనము. ఆశ్రమమంతయు బారులుతీరిన వృక్షములతోను, లతలతోను నిండియుండి, విద్యార్థులకేమి, అధ్యాపకులకేమి, యానందము కల్గింపకమానదు. ఆశ్రమావరణాంతర మంతయు బహిరంగస్థలమే కాని ఆ నిర్మలాకాశము, అచ్చటచ్చట అనతిదూరముననే



మహర్షి ప్రార్థనాస్థలము(చలువరాతికట్టడము)-సాంతింతాలా-శాంతినికేతనము

యున్న చిన్నచిన్న పల్లెలు, మిట్టపల్లములుగను మైదానములుగను ఉన్న భూభాగములును, అమాయకులును, నవనాగరికతాస్పర్శ యించుకంతయు లేనివారును నగు "సంతాలు" చేయుపనులును, ఆశ్రమావరణకు కొంచెము దగ్గరనే నిర్మింపబడిన"గురుపల్లె"లనెడి యుపాధ్యాయుల కుటీరములును, స్వాతంత్ర్యి మనుభవించుచు, మానవుల మాయకు గురియగుచు గగనమున సంచరించు విహంగములును నిజముగ నెంతమనోహరములు! ఇప్పుడీసుందరతరమగుప్రదేశము పూర్వ మొకయెడారిగ నుండి, దొంగలకును, టోపిడిగాండ్రకును ఆకరమై, చుట్టుప్రక్కల నివసించుజనుల కతిభయంకరమైయుండెను. అట్టిప్రదేశము నేడుచాలమార్పులజెంది, ప్రాక్పశ్చిమఖండములకు జ్ఞానవిజ్ఞానముల వెదచల్లుచు, మహాపండితులకు, చరిత్రకారులకు, చిత్రకారులకు, గాయకులకు తావొసంగుచున్నది.

ప్రాక్పశ్చిమభూగోళములు రెండును అనేకమారులు చుట్టివచ్చిన వంగకవిశేఖరుడగు రవీంద్రనాథఠాకూరుగారిచే స్థాపింపబడి నానాదేశ సారస్వతవిజ్ఞానములకు తావొసంగుచు, భరతఖండముయొక్క విశేషవిజ్ఞానమునేమి, ప్రాగ్దేశముల విజ్ఞానములనేమి వెదచల్లుట కవకాశమిచ్చి, నేటివరకుకూడ ఆకవిశేఖరునియాధిపత్యముక్రిందనే దినదినాభివృద్ధిని జెందుచున్నది. ఈప్రదేశమున నొకనదిగాని, కొలనుగాని మన కగపడదు. ఎటుచూచినను, ప్రపంచమంతటితో అంతరించిన దేమోయను భ్రమ పుట్టుచుండును. ఈ ప్రదేశముకన్న సుందరతరములగు ప్రదేశము లనేకములున్నవి. కాని యిదే శాంతి కాకరమైనదనుటకు కారణమున్నది.

వంగకవిపుంగవుని జనకుడగు మహర్షి దేవేంద్రనాథ ఠాకూరుగారు, తమ దేశాటన సమయమున, ఒకానొకదినమున ఈస్థలమునుండి పోవుచు, ఇచ్చటి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాంతివలన నేమి, ప్రస్తుతపట్టణముల యొక్క గడబిడగాని, రస్తాగాని లేక శాంతముగనుండి నిజముగ ఈ నిర్జనప్రదేశము సౌందర్యముగ నుండు టవలన నేమి, ఆనా డిచ్చట విశిసి యుండెను. ఆకాలమునాటికి వృక్షములుగాని లతలుగాని ఒక్కటియును లేవు. కాని రెండుమూడు పెద్ద పెద్దవృక్షములు మాత్రము గుబురుగ నొక్కచోటనుండి, చల్లగ నుండుటచే మహర్షి డేరాలతో ఆ వృక్షములక్రింద కొద్దిరోజులు మకాము చేసియుండెను. ఈ స్థల మిప్పటికి గూడ బహురమ్యముగనే యున్నది. నేటికికూడ ఆవృక్షములుయథాస్థానమున యథాకీతిని బెరుగుచున్నవి. ఇచ్చట దేవేంద్రనాథఠాకూరుగారు ప్రతిదినము ప్రార్థనలసల్పుచుండెడివారు. అట్టితరి ఒకదినమున ఒకమహాజ్యోతి యీస్థానమున ఆయనలో ప్రవేశించినటు లామహర్షికి గోచరమయ్యెను. ఈ స్థలమే ఆయనయాత్మకు శాంతినొసంగినది. అనంతర మిచ్చటనుండి మరియొకస్థలమున కేగుట కాయన యిచ్చగించియుండలేదు. ఈస్థలముననే, ఆ మూడువృక్షములక్రింద మహర్షి జపమాచరించుకొను స్థలముననే, చలువరాతితో నిర్మింపబడిన యొకచిహ్నమున్నది. అందుపై నిట్లు లిఖింపబడియున్నది:



ఉత్తరాయణమున రవీంద్రుని నివాసస్థలము, శాంతినికేతనము

తిని ఆశేడు

అమార్ ప్రాణేర్ ఆరామ్ నాయొక్కప్రాణారామము
మనేర్ ఆనంద్ మనస్సుయొక్క ఆనందము
ఆత్మార్ శాన్తి. ఆత్మయొక్కశాంతి.

అనంతరము మహర్షి యిచ్చట నొకచక్కనిభవనమును నిర్మించెను. నాటినుండి యీప్రదేశము శాంతికాకరమైనది గాన శాంతినికేతన మని చెప్పవచ్చును. ఇంకను ఈమందిరముననను, ద్వారముననను పెక్కువ్రాతలు గలవు. అందు మాంసాహార మద్యపాననిషేధములు ముఖ్యములైనవి. అప్పుడే తా నొక ప్రార్థనామందిరమును నిర్మించెను. అయ్యది యతిరమ్యముగ వివిధవర్ణములుగల గాజులతో గట్టబడి లోపల నొకచక్కనిపాలు చలువరాతితో నిర్మింపబడెను. అందెచ్చటను యొట్టివిగ్రహముగాని, మరియేచిహ్నముగాని లేక, యేకేశ్వరోపాసనను బోధించుచు, ప్రార్థనకు చక్కగనుండి, భక్తిపూర్ణహృదయులకు శాంతి నొసంగుచున్నది. ఈమందిరమున నేటికికూడ మహాపురుషులయొక్కగాని మహాత్ములయొక్కగాని ఆత్మలకు ప్రార్థనలు జరిగి శాంతి నొసంగుచుండునని చెప్పకతీరదు. అదిగాక యిచ్చట సెలవుదినమును ప్రతిబుధవారమును ప్రార్థనలు జరుగుచుండును. ఇందు రవీంద్రుడు స్వయముగ పాల్గొనుచుండును. ప్రథమమున బాలికలందరు కలిసి యేకకంఠముతో చక్కగ బాడినయనంతరము ఆయన యాశీముతో ప్రార్థనసల్పుచుండును. ఆయన లేనితరి మరియొక రాచార్యము వహింతురు. ఇట్టిప్రార్థనామందిర మానాటిమహర్షి దే. అనంతరము రవీంద్రుడు జనకునియొద్ద ననుజ్ఞగొని తననలువదియవయేట, అనగా 1901 వ సంవత్సరమున, ఈ యాశ్రమము స్థాపించెను. ఇయ్యది ప్రారంభించిననాటినుండియు దినదినాభివృద్ధి చెందుచుండెను. దీనికి బ్రహ్మవిద్యాలయంబని మొదట నామంబిడిరి. అప్పుడు ఏనలువురైదుగురితోనో ప్రారంభింపబడినది. రవీంద్రుడే ముఖ్యోపాధ్యాయుడు. అనంతరము మొన్నమొన్నటివరకుకూడ ఆయన పాఠములు చెప్పుచునే యుండెను. అప్పుడు ఉపాధ్యాయులు విద్యార్థు లందరుగూడ ఆయనపాఠమువినుటకు పోవ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మండెరి. కాని యిప్పుడియ్యది నానాదేశములకు వ్యాపించి, కీర్తిగాంచి, యెల్లజాతులకు జాతి మతభేదములులేక మహర్షి నీతివాక్యముల ననుసరించియే నడుప



సాలవృక్షములబారు, శాంతినికేతనము

బడుచున్నది. ప్రస్తుతము విశ్వభారతియనబడు ప్రపంచాభివృద్ధికి, మానవకోటిసంక్షేమమునకు తోడ్పడుచున్నది.

ఆదర్శములు:—

ప్రపంచమునం దెచ్చటను కవులు సాధారణముగ ఇట్టివిద్యాలయములు స్థాపించుట చాల అరుదు. కాని జగద్విఖ్యాతకవిశేఖరు డిట్టివిద్యాలయము స్థాపించుటకు కారణమేమి? యని యెల్లరకును తోపకమానదు. కాని రవీంద్రుడు ఒక్కకవియేకాదు: వేదాంతి. మానవధర్మముల తా తెలిసికొని అయ్యవి కార్యరంగమున నడుపుటకు ప్రయత్నించెను. మహాదేశాభిమాని. పుట్టిననాటనుండియు ఒకవిధమగు ప్రత్యేకత్వముకల్గిన వ్యక్తి. ఆయన సామాన్యవిద్యార్థులవలె గాని, తనసోదరులవలె గాని మామూలుపాఠశాలకు పోయి విద్యనభ్యసింప లేదు. ప్రత్యేకముగ జనకునియాజ్ఞకు లోబడి అభ్యసించెను. తనకిచ్చిన విషయమును మానవకోటియొక్కచర్యతో సరిపెట్టి చూచుచుండును. ఈయనమగూర్చి యీయన గ్రంథములు చదివినవారికి విశదము కాగలదు. నానాదేశాటనము చేసియుండుటచే బాగుగ అనుభవము సంపాదించియుండెను. మహాదేశాభిమాని యగుటచే ప్రస్తుతమున్న విద్యావిధానముయొక్క బలహీనతను గుర్తించెను; తన యితరదేశములయనుభవములో సరిపోల్చి చూచెను. భారతదేశదుస్థితికి వగచెను.

భారతభూమిఔన్నత్యమునకు తగినపుత్రు లుండ లేరని తలంచెను. కాని అతడు నిరాశజెందినపురుషుడు కాడు. భారతదేశపునరుద్ధరణము అవశ్యముగ జరుగవలయును ప్రస్తుతప్రపంచమున ఇతరదేశములవలెనే భారతభూమికికూడ అత్యుత్తమమగు సందేశమున్నది. భారతచరిత్రనుగాని, వాఙ్మయమునుగాని తెలిసికొనుటకుతగిన యవకాశములుకూడ నిజముగ లేవు. అదియుగాక, భారతీయులుగూడ ఈవిషయములలో శ్రద్ధవహించువారుగాని, పాల్గొనువారుగాని, గౌరవించువారుగాని యెక్కుడుగ లేకున్నారు. ఈవిషయము లన్నిటిని సులభముగ గ్రహింపుటకు అవకాశ ముండవలెను. భారతీయులు తమ్ము తామే తెలిసికొనలేదు. కాన ప్రస్తుతము తన్ను తా నెరింగి యభివృద్ధి జెందుటయే కాక, యితరమానవకోటికి తనసందేశమును దెల్పుచు, వారల తనకడకు నిజవిజ్ఞానస్వీకారమున కాకర్షించి, యితరు లావిషయములు బాగుగ నెరుంగుట కవకాశము కల్పింపవలెను. ఇందుల కంతర్జాతీయవిశ్వవిద్యాలయ మవసరము. పశ్చిమభూమిని పాశ్చాత్యులు వారి విజ్ఞానమ నంతను చక్కగ నెరింగి, వారి విద్యార్థుల నెరింగించి యభివృద్ధిపొందిరి. అటులే పూర్వార్థగోళమున కూడ తమవిజ్ఞానమంతయు తామెరింగి యితరమానవకోటి కెరింగించిన గాని నిజముగ ప్రాపంచిక విజ్ఞానాభివృద్ధి కానేరదు. ఇట్టిపని విశ్వభారతి పూనుకొనును.

ఈకార్యమున కొక్క హిందూదేశమేకాక పూర్వార్థగోళపుదేశము లన్నియును, అందును ఆసియాయెక్కువగను,పాల్గొనవలయును. ఆర్యులయొక్కయు, సెమైటు,చైనా, జపాను, మంగోలియా ప్రజలయొక్కయు ఐకమత్యము అత్యవసరము. ఇచ్చట నశించినప్పటికి భార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తదేశమునుండియే టిబెటు, చీనా, జపాను దేశములకు ప్రాకి, అచ్చటనే భారతసారస్వతవిజ్ఞానమతములుగూడ నివసించియున్నవి. అందుచే ఈవేర్వేరుజాతులు, దేశములు, విజ్ఞానములు కలిసినగాని పూర్తియైన ప్రాగ్దేశవిజ్ఞానము గానేరదు. కాన అట్టియవకాశ మీ విశ్వభారతియం దుండవలెను. అప్పుడు ప్రాక్పశ్చిమ దేశములనుండి విద్యార్థులు, ఉపాధ్యాయులు ఇచ్చటకు ప్రాగ్దేశవిజ్ఞానము గ్రోలుటకువిచ్చేసి, వారలవిజ్ఞానసంపద మనకు తెలియజేయగలరు. అప్పుడు సోదరత్వమున కెక్కుడు అవకాశ మున్నది. కాని యింతవరకు భారతదేశమున, పశ్చిమదేశపుచర్య మాదినచో, విద్యయనునది శూన్యంబైనది; అనగా నిజముగ విద్వాంసు డనుటకు ఒక్కడు నర్హుడైన యాతడు లేకున్నాడు. అది గాక, యిప్పుడు చాల విజ్ఞాన వంతుల మనబడు వారు చక్కని పెద్దపెద్ద భవనములలో, బాగ తెల్లనివెల్లచిలికినగదులలో, హద్దుమీరనిబుద్ధిబలము నుపయోగించి,తమతమవ్యవహారములకై సంకుచితవిద్యాపద్ధతులలో తయారై, యం ఏ.,బి.ఏ. మొదలగు బిరుదములనుగాంచి నంతనే విజ్ఞానవంతు లనుట, విద్యావంతు లనుట లజ్జాకరము. ఇట్టివారు చక్కగ రాజభక్తిపరాయణులై గుమాస్తాలుగను, ప్లీడరులుగను, పోలీసుఉద్యోగులుగను బాగుగ తయారగుచున్నారు. ఇయ్యది విద్యకానేరదు. అట్టివిద్య మన విద్యార్థుల బుఱ్ఱలలోని కెటులో యెక్కించుట ధర్మముగాదు. విద్యార్థికి స్వభావసిద్ధముగ నుండిన యూహాప్రపంచమును జంపి, బెదిరించి, భయపెట్టి,యెట్టులు సంగతులబోధనచేయవలయునో అట్టిపద్ధతులు తెలియక,ఆవిద్యార్థి మేధనుధ్వంసముచేయుట ధర్మముగాదు.ప్రస్తుతము మనము విజ్ఞానవంతులమగుటకుగాని, పండితవర్యులమగుటకుగాని ప్రయత్నములు జరుగకపోవుటయేకాక, యేవో తప్పనిసరిగ కొన్ని పరీక్షలయం దుత్తీర్ణులమగుటయు, అందునను ఆంగ్లభాషయందున్న వాటికి ప్రాముఖ్యము నిచ్చుచుండుటయు, సాధారణవర్తకవ్యాపారమువలె నైయున్నది. ఇట్టికట్టుబాటుల మన మతిక్రమింపవలయును. ఈవిధముగ విద్యనభ్యసించునప్పుడు ఉపాధ్యాయుని విద్యార్థి యొకవ్యాఘ్రముగవలెను, ఉపాధ్యాయుడువిద్యార్థి నొక మేకపిల్లవలెనుజూచుచు, అవసరమైనప్పుడు నాల్గు మొత్తి, యాతని కేవో నాల్గుముక్కలుచెప్పితి నని ఉపాధ్యాయుడు సంతసించునే కాని, ఆతని నాశనము చేయుచుంటినని మాత్రము తలంపడు.

విద్యార్థులకును ఉపాధ్యాయులకును మధ్య పరస్పరప్రేమానురాగములు లేనిదే, విద్యావిషయములబ్బక, ఆధ్యాత్మికాభివృద్ధి లేక, కాగితమే దేవుడనియు, పుస్తకమే తనకు పరమావధియనియుఎంచి, విద్యార్థిప్రకృతినే మరచిపోవును. కాన ఇట్టివిద్య యిహలోకమునకుగాని పరలోకమునకుగాని యెట్టియుపయోగము లేక, విద్యార్థి జెరచి, స్వభావముచే నాతడు జ్ఞానమునొందు నవకాశమును నశింపజేసి, సంకుచితరూపమున బడద్రోయును. ఇట్టివిధానమంతయు మారితీరవలయునని రవీంద్రుడు తలంచెను. కొందఱాంగ్లభాషలో పండితులైనప్పటికి



బాలుర బహిరంగతరగతి, శాంతినికేతనము

కొన్ని కొన్ని విషయములు బాగుగపఠించుట కానాండిత్యము చాలదు. ఇదియే యాటంకముగనున్నది. ఇట్టివానికి మన మెడవిూయరాదు. పాశ్చాత్యదేశములనుండియే మనకు విజ్ఞానము లభించునని యెంచుట చాలఅసమంజ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

షము. ఇయ్యది నిజముగ కాంతిమంతుడగు భాను డిచ్చట వెలుగొందుచుండ, నాతని గుర్తింపలేక, యెచ్చట నుండియో బాగుగ వెలుతురునిచ్చు సూర్యు డుదయించు నని యెంచి, అంధకారమున బడికొట్టుకొనుచున్నట్లున్నది. కాన ఇప్పుడైనను మనము జాగరూకులమై యుండవల యును. ప్రస్తుతవిద్యాలయములవలెగాక భారత విజ్ఞాన మునకును భావములకును, గాన చిత్రకళలకును ముఖ్యముగ స్థానమొసంగి, యభివృద్ధిపరుపవలెను. అంతకును ముఖ్యమగు విషయ మింకొకటి గలదు. ఈవిద్యార్థిదశయందే స్వభా వసిద్ధముగ నభివృద్ధిచెందుటకును, విద్యగూడ నిర్బంధ మంతలేకుండగనే యభ్యసించుటకును, ఆధ్యాత్మికాభి వృద్ధిజెందుటకును తగినయవకాశమీయవలయును. విద్యా ర్థులు గ్రంథపఠనమునకన్న ప్రకృతి సందర్శనముననే నిపుణులు కాగలరు. అట్టియభివృద్ధికి వారలకు సంపూ ర్ణస్వాతంత్ర్యమొసంగి, మొక్కను పెంచునట్లే పెంచ వలయును. అందు బాలుడైయుండునప్పటినుండి యతి జాగరూకతతో పెంచుట మరింతయవసరము.

ఇవియే ముఖ్యముగ విద్యార్థులకు ఆవశ్యకముగ నవసరపడగినమార్గములు. ఈపైవిషయములమీద నాధా రపడియే యీవిద్యాలయము నెలకొల్పబడినది. ఇందు రవీంద్రుని యాదర్శములనుబట్టి నడుపబడుటచే యెల్లర కును మరింతస్వీకారయోగ్యము. ఈవిద్యాలయమునకం తకును విశ్వభారతియని పేరు. ఇందు శాంతినికేతనము, శ్రీనికేతన మని రెండు భాగములు. ఈరెండింటిలోను శాంతినికేతనమే ముఖ్యమైనది. శ్రీనికేతనము శాంతి నికేతనమున కొకమైలుదూరమునందు నిర్మింపబడి, చేతి పనులు మొదలగు వానియందు శ్రద్ధగలిగియున్నది. ప్రస్తుత మిచ్చట జీవిత మెట్లు లుండునో, యెట్టులు విద్యా విషయము లుండునో చూడవలయును.

ఆశ్రమజీవితము:—

ఈవిద్యాలయమున మున్ముందు జూడదగినవి యిచ్చటి జీవితమే. అందునను పసిబాలుర జీవితము మరిం తయుత్సాహపూరితముగ నుండును. పదియేండ్లలోపు బాలు రందరు నిర్భీతిగ, బెంగయనునది లేక, తల్లితం డ్రుల విడిచి, యిచ్చట చదువుకొనుటకు దేశముయొక్క నానాభాగములనుండి వచ్చుచుందురు. ఇచ్చట బాలురం దరకు సంపూర్ణస్వాతంత్ర్యమే. ఈ బాలురందరు ఒక ఉపాధ్యాయుని యాజమాన్యముక్రింద నొకప్రత్యేక గృహమునందు నివసింతురు. ఇంకను వీరలుగాక మెట్రి క్యులేషనువరకు చదువుకొనువిద్యార్థులు గలరు. వీరలు కూడ ఒక్కొకయుపాధ్యాయుని యాధిపత్యముక్రింద ఒక్కొక్కకుటీరమందు నివసింతురు. అనంతరము కాలే జితరగతులలో చదువుకొను పెద్దవిద్యార్థులుగలరు. వీరు సంపూర్ణస్వతంత్రులు. వీరందరుగాక బాలిక లన్నితరగతుల లోను గలరు. వారలకు ప్రత్యేకగృహమున్నది. ఇచ్చట పాఠములుచెప్పుటకుప్రత్యేకముగచక్కనిభవనములుగాని గదులుగాని (Lecture Halls) లేవు. ఆశ్రమమందు ఒకవైపునుండి మరియొకవైపువరకు ఇరుప్రక్కల రోడ్లు, సాలవృక్షములబారులు అతి మనోహరముగ గాన్పించును. ఇవి గాక వీటినంటియే రెండు బారులు దీరిన మామిడితోపు లున్నవి. నిజ ముగ ఒక్కొక్కవృక్షము ఒకఉప న్యాసమందిర మని చెప్పవలయును. ఇటులే యిచ్చట ఉదయము ఏడు గంటలుమొదలు పదకొండు గంట లవరకును మధ్యాహ్నము రెండు మొదలు నాల్గున్నరవరకును ఒక్కొ క్కవృక్షముక్రిందచతురాసనములు పరచుకొని కూర్చుసియున్న



ఆదికుటీరము (విద్యాభవన విద్యార్థులవసతి), శాంతినికేతనము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తిరగతులు కానుపించును. ఉపాధ్యాయులును, విద్యార్థులును వారివారిచతురాసనములు వెంట దీసికొని పోవుచుందురు. బాలురు, ఒకతరి ఉపాధ్యాయులరాక ఆలస్యమైనచో, చెట్టుకొమ్మపై కూర్చుని పఠించుటయు గలదు. ఇచ్చట నొకవిషయము జెప్పవలయును. విద్యార్థులు, విద్యార్థినులు గూడ నొక్కేతరగతియందు, విద్యార్థి కెట్టిహక్కులున్నవో అట్టిహక్కులనే విద్యార్థినిగూడ యనుభవించుచు, పఠించుచుండును. ఇట్టిది ఘోషాపద్ధతి మిక్కుటముగనున్న బెంగాలునందు జరుగుట చాలచక్కనిపని; కాని యిందువిద్యార్థినులు చాలవరకు సంఘ



శాంతినికేతనమందలి ఆంధ్రవిద్యార్థులు.

సంస్కర్త్రులు, బ్రాహ్మసామాజికలనియే చెప్పవచ్చును. క్రమక్రమముగ ఇతరస్త్రీలు, తల్లితండ్రులుగూడ నిట్టి సంఘసంస్కరణకు పూనుకొని, స్త్రీవిద్యకు తోడ్పడవలెను. విద్యార్థులందరు వారివారిపనుల స్వయముగనే నెరవేర్చుకొనుచుందురు.

అన్నిటికన్న ముఖ్యమగువిషయ మేమన, ఇచ్చటికి దేశముయొక్క నానాభాగములనుండి విద్యార్థులు వచ్చి, సోదరభావమున మెలంగుచు, వారివారిభావములను, ఆయాప్రాంతముల ఆచారవ్యవహారములనుగూర్చి చర్చించుచు, అనేకవిషయములు పుస్తకములలో లేనివి బాగుగ తెలుసుకొందురు. ప్రాంతాభిమానము ఇందు బాగుగ ప్రకటితమగును. అదిగాక బాలురు ఇతరప్రాంతముల నుండి వచ్చినచో వారువచ్చిన వారముపదిదినములలో బాగుగ బెంగాలీకూడా మాటలాడగల్గుదురు. ఇందు మాతృభాషను మరచుటకు కూడ ఎక్కువ యవకాశ మున్నది. ఇచ్చట మొత్తము విద్యార్థులందరికి ప్రత్యేకముగ అధికారులచే నడపబడు వసతిగృహ మొకటి యున్నప్పటికి, అచ్చటి భోజనము అందరకు రుచిగా నుండకపోవుటచే ఆయా ప్రాంతమునుండి వంటవారిని తెచ్చుకొని, ప్రత్యేకముగ వేర్వేరువసతిగృహములు పెట్టుకొందురు. ఇప్పుడు గుజరాతీలు, ఆంధ్ర తమిళ మలయాళీలు రెండు వేర్వేరు వసతిగృహముల జరుపుచున్నారు. చిన్నచిన్నబాలురు ఆశ్రమ వారివసతిగృహమున భుజింతురు. అనంతరము విద్యాలయావరణయందే ఒకఆసుపత్రి యుండుటచే చాలఅనుకూలముగ నున్నది. ఏమాత్రపు నలతగ నుండినను త్వరలో అచ్చటకుబోయి మాన్పుకొందురు.

[సశేషము]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






# ఉపలాలనము

మునిమాణిక్యం నరసింహారావుగారు, బి. ఏ.

[సాహితీ సమితి]

కమలాయ తాక్షుండు కళ్యాణ మూర్తి
కోరి నిన్వరియించి కొంపోవ దలచి
ఆకాశనది దాటి అద్రులు దాటి
వెల్లి, నీ సన్నిధి చేరు కొన్నాడు.

నీవె జీవితమని నెరనమ్మినాడు
నిరతమ్ము ధ్యానించు నిన్నె దేవతగ
నీనామ జపమునే నిరతమ్ము చేయు.

విరహ హాలాహల విషము కంఠమున
బిగబట్టి నీమీది ప్రేమచే నతడు
బహుళ కష్టంబులు భరియించి నాడు!
విమల చరిత్రుని విఖ్యాత యశుని
ఏటికో నీవాశ్రయింప కున్నావు!
ఎవరని మొతువో యేమి తలంతొ,
మహనీయు డాతడు మానధనుండు.
ఆశ్చర్య కరముగ నాతని నెట్లొ
పడవేసి కొంటివి పాదాలమీద!

ఎంతపాషాణమో హృదయంబు నీది!
పుట్టి నింటను గల్గు బుద్ధిపోదాయె
విషము నీతోఁబుట్టువే కాదె లక్ష్మి!

మంజులరోచిస్సు మధురరూపంబు
ఉండబో వెల్లప్పు డుండ బోవమ్మ
కోమలోజ్జ్వలమైన కుసుమ రాజంబు
మండు టెండలలోన మాడి పోకున్నె?

నీకొఱ కాతండు నిరతంబు హృదయ
భేదకంబుగ చేయు రోదనం బకట!

ఆలసించితి వేని ఆతండు చెల్లి,
శరణంబు చొచ్చును మరణగృహంబు!

విమల సిద్ధాన్నంబు విరజిమ్మ బోకు
జీవితామృతమును చిమ్మబోకమ్మ,
కాలయాపన యేల? కాఠిన్యముడిగి
కమలనేత్రునకింక కబురంపుమమ్మ,
రమణీయ మూర్తి నిన్ రాణిగా నెంచె
కాఠిన్య మేటికి కరుణ వహింపు
దైవతంబుగ నిన్ను తలచినా డతడు
సామాన్య దృష్టితో చరియింపలేదు
చల్లని రమణీయ సాయాహ్న వేళ
ప్రయాణవార్తను వేగ పంపవే తల్లి!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# మహమ్మదు నీతివాక్యములు

శ్రీమతి గుడిసేవ నాగమణిదేవి గారు

ఎవనిహృదయమున దయయుండదో వానిపై ఈశ్వరుడు దయనహింపడు. ప్రాణు లెల్లరు భగవంతుని పరివారమై యున్నారు. ఏమానవుడు మానవకోటి కంతకును సుఖము గూర్చుటకై ఎక్కువకృషి చేయునో వాడే భగవంతునికి ప్రియతముడైన సేవకుడును, శ్రేష్ఠమైన భర్తుడును అయియుండును.

ఎవడు జ్ఞానదీపమును ప్రజ్వలింపజేయునో వానికి మృత్యువు లేదు.

ముసల్మానుల దృష్టిలో జ్ఞానవాంఛభగవత్ప్రేరణ, జ్ఞానభిక్ష ఈశ్వరుని ఆదేశములై యున్నవి.

ఏమానవుడు జ్ఞానమార్గమవలంబించునో వానికి ఈశ్వరుడే స్వర్గమార్గమునుజూపించును.

జ్ఞానుల నోటినుండి వెలువడిన మాట శహీదుల (మతమునకై ప్రాణమిచ్చినవారి) రక్తముకన్న పవిత్రమగు వస్తువు.

ఎవడు జ్ఞానోపార్జనముకొరకు ఇంటినుండి బయటకు వెడలునో వాడు స్వర్గమునకుబోవు బాటసారి యని యెఱుంగవలయును.

స్త్రీలుగాని, పురుషులుగాని ముసల్మాను లెల్లరకు విద్యానర్చచేయుటముఖ్యకర్తవ్యమై యున్నది.

అన్నివిధముల విద్య నార్జింపవలెను. విద్యమూలమున నే న్యాయాన్యాయముల వివేకణ యేర్పడును. అదియే స్వర్గమార్గమును సుగమము చేయుచున్నది. విద్యయే నిర్జన ప్రదేశమందును, మరుభూములందును మిత్రుని వలె నుపకరించుచున్నది. విద్య సుఖమునకు మూలమును, దుఃఖమున కౌషధము నై యున్నది. విద్య బంధుసమాజమున అలంకారము గను, శత్రువ్యూహమున కవచముగనునుండును.

జ్ఞానోపార్జనము చేసినవానికి ఎల్లెడలను కల్యాణమగును. ఎల్లరు వానిని గౌరవింతురు. జ్ఞాని దరిద్రుడైనను ఈ లోకమున రాజాధిరాజుల సాంగత్య లాభమును, పరలోకమున అనంతమగు ఆనందమును పొందును.

ఉపాసన విశ్వాసము గలవారికి లాభకారియై యున్నది.

ఏకాంతమున భగవంతుని స్మరణ చేయుము. మీరు ఆకలిగొన్నచో ఆహారము లభించును. మఱియు నుపాసనచే మనశ్శాంతి కలుగును.

ఎట్టియుపాసనచే హృదయము నిర్మలము కాదో అట్టిఉపాసన నీశ్వరుడు పరిగ్రహింపడు.

ఏమానవుడు ఉపాసనచే తన దుష్ప్రవర్తనమును తొలగించుకొనడో వాడు చేతిలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాగడాయున్నను మార్గము మరచిపోవును. ఇట్టి ఉపాసనచే ఎవరికిని పుణ్యవృద్ధికాజాలదు. ప్రతిదినము ఈశ్వరునకును, వాని పతితాత్మకును మధ్యవ్యవధాన మేర్పడును.

శ్రేష్ఠదానమే ఉన్నత హృదయమునకు నిదర్శనమై యున్నది. దానివలనహృదయము ఉత్సాహితమగును. దుఃఖితమైన హృదయమునకు దానివలన అమృతవర్షమున బలె కల్యాణమగును.

ఎవడు కష్టార్జితముచే జీవించుచు బీదలను తృప్తివేయక దానముచేయునో అట్టివాని దానమే శ్రేష్ఠమైనదానము.

కోపమును జూపుటకు అవకాశమున్నను ఎవడు దానిని అణచుకొనునో భగవంతుడు వానికి పారితోషిక మిచ్చును.

మనుష్యుని సులభముగ గ్రిందపడవేసిన వాడు బలవంతుడు కాడు. ఎవడు కోపమును అణచుకొనునో వాడే నిజమైన బలవంతుడు.

ఈశ్వరస్మరణచేయుచు నెనడు కోపమును అణచుకొనునో వానితో సమానుడగు భాగ్యవంతు డెనడును లేడు.

ఒకవేశ్య బావిదగ్గరనుండి ఎచ్చటకో వెళ్లుచు దప్పికచే బాధపడు నొక కుక్కను చూచెను. దప్పిక అధికముగా నుండినట్లు కుక్క తెలియజేసెను. వేశ్యయొద్ద నీరునింపుటకు ఏపాత్రయు లేకుండెను. కాబట్టి ఆమె తనపైబట్టను నీటివరకు పోనిచ్చి ముంచి కుక్కకు దప్పిక తీర్చెను. ఈపనిచే ఆమె జీవితమందలి కళంకమంతయు తొలగిపోయెను.

ఇతరులకు కష్టము నిచ్చుటకొరకు ఎవరు పరుల సాహాయ్యము కోరుదురో వారితో మనకు పనిలేదు. తనజాతి అన్యాయ యుద్ధము చేయుటనుజూచి ఎవరు తనజాతిపక్షమున నే చేరుదురో వారితోడను మనకు పనిలేదు. అధర్మయుద్ధమున ప్రాణమర్పించినవారిని మహమ్మదు తనపక్షమున చేర్చుకొనడు.

మీరు మాకు లేనిపోని గౌరవము నీయవద్దు. మేము భగవంతుని సేవకులము. మమ్ములను భగవంతుని సేవకుల మనియు దూతల మనియు నే పిలువుడు.

తర్జనీమధ్యమాంగుళులయందు ఏప్రకారము వ్యత్యాసము లేదో స్వర్గరాజ్యమందు ఆవిధముగనే మలినవస్త్రధారిణు లగు విధవలకును, సన్మానితులగు వ్యక్తులకును భేదము లేదు. ఒకనాడు పరమసుందరులుగ నుండిన వారు విధవలెట్లైరి? వారే తుదకు విధవలయి తమసుఖము, స్వాతంత్ర్యము, సౌందర్యమును తుచ్ఛముగానెంచి కేవలము సంతానపాలనమునకై పరిశ్రమచేసి తమదేహమును త్యాగము చేసిరి.

ఐశ్వర్యభారమును బుజమునమోయువాడు దుర్గమమగు స్వర్గసోపానమునుండి పడినచో మరల లేచుట దుస్తరము.

బిచ్చమెత్తుకొనుట మరగి ఇంటింటికి తిరుగుచుండువాడు దరిద్రుడగుటలో ఎక్కువ కాలము పట్టదు.

మర్యాదకు మూడులక్షణములు: మొదటిది: అద్వితీయుడగు పరమేశ్వరుని అస్తిత్వము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నుస్వీకరించి వానికి ఎట్టికష్టము కలిగించకుండుట. రెండవది: ఇతరుల దౌర్బల్యమును జూచి వారిని అధార్మికులని నిందింపకుండుట. మూడవది: ఇతరుల దుష్కార్యములబట్టి వారిని సంఘమునుండి బహిష్కరింప కుండుట.

వ్యభిచారియు, మద్యపాయియు, స్వార్థపరుడును, దాసుడును, విశ్వాస ఘాతుకుడును నగువాడు ఎప్పుడును ఆస్తికుడు కాజాలడు.

బ్రహ్మపరాయణుడును, పరలోక విశ్వాసియు నగువాడు మంచిమంచి విషయములపై నాలోచన చేయుచుండవలయును. అది చేతకానిచో మౌనముగనుండుట మంచిది.

ఆత్మజయమునకై యుద్ధ మొనర్చుటకు సిద్ధపడువాడే ప్రపంచములో నుత్తముడగు వీరుడు.

సంవత్సరమంతయు నామకీర్తనము చేయుటకంటె ఒకజాము ధ్యానములో మగ్నముగానుండుట శ్రేయస్కరము.

భూతదయ గలవానిపై ఈశ్వరు డెప్పుడును ప్రసన్నుడైయుండును. మంచివారిపై గాని, చెడ్డవారిపై గాని దయచూపుటలో లుబ్ధత్వము పనికిరాదు. దుర్జనునిపై గూడ మంచిగ ప్రవర్తించుటయే మానవునికి ముఖ్యమగు తరణోపాయము.

ఏయింటియందు అనాథశిశువు ఆశ్రయము నొందునో అదే శ్రేష్ఠమైన ముసల్మానుని ఇల్లు. అనాథల నాదరింపని గృహము ముసల్మానులదే అయ్యును అది మతాంతరులయు, నాస్తికులయు గృహముకంటె నీచమైనది.

సదాచారము మహాపురుషులకు పిత్రార్జితమగు సొత్తు. పుత్రునికి సదాచారమును నేర్పిన తండ్రియే తనకొడుకునకు మంచి సంపత్తి నప్పగించి పోయినవాడుగ నెన్నబడును.

నిరాటంకముగ స్వర్గమునకు వెళ్లగోరువాడు తన తల్లిదండ్రులను సంతోషపెట్టవలయును.

తనకు అపకారముచేసినను తల్లిదండ్రులకు సేవచేయుట సంతానమునకు పరమ ధర్మము.

తండ్రి సంతోషించినచో భగవంతుడును సంతోషించును. తండ్రి సంతోషింపనిచో సమిధలచే అగ్నివలె భగవంతుని రోషము మండిపోవును.

మనుష్యుడు చనిపోయిన పిమ్మట వాని దోషములను ఉగ్గడించగూడదు.

నేను పరమజ్యోతిని దర్శించితిని. ఆజ్యోతియందే నానివాసము.

[హిందీనుండి అనువాదము.]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



వ్యాసకర్త

# స్మృతినైరాశ్యము

సూరి గుచ్చి కృష్ణమూర్తి గారు

నాఁటి సాయాహ్నసమయమునం దదేమొ
యేమితోఁచక యుద్విగ్నహృదయుఁడనయి
వెనుకసంగతు లన్నియు మనసులోన
సంస్మరించుచు నాశ్చర్యచకితుఁడనయి
యరుగుచుంటిని దారి నేనరయకుండ
నవ్వుకొంటిని నాదుజన్మకును నేన
విస్మయము నందినాను నావిషయములకె
ఏడ్చితిని గొంతునెత్తి నాకృత్యములకె
ఔనటంచును దలయూఁచినాను నేనె
ఏపదమువట్టి చేరితి నీవిశాల
రమ్యనిశ్శబ్దశాద్వలరాజభూమి
కనుచు నద్భుతమందుచు నాత్మయందె
తెలివినందితి నొక్కింత తడవు కపుడు
మఱఁగిపోలేదు భానుబింబమ్ము నింక
సాంధ్యరోచిస్సులైనను జాఱలేదు
ప్రకృతిసహజరూపమ్మును వదలివైచి
శాంతిఁ దాల్చిన దీప్రదేశ మ్మటంచు.

తలఁచి నిర్మక్షికమఁను శాద్వలపరీత
ధరణిమీఁదను నాదువస్త్రమ్ముఁబఱచి
మేనువాల్చితిఁ జదువ నేమియును లేమి
వెలవెలంబాఱు తెల్లమబ్బులను జూచి
యేడకివి మందగతితోడ నేఁగుచున్న
వో యెఱుంగఁగలరె యిల నొక్కరైన
మొన్న మాయింటిలోని యాఁబోతు మిగుల
మదముచేఁ దనపాలకు మాటవినక
యిష్టముగ గంతులెన్నియో వేసి వేసి
తుదకు నాప్రక్క నూతిలో బెదరిపడియె
అని స్మరించుచుఁ గన్నుల నట్టెమూసి
నానో లేదో కన్పడె నొకనవ్యమూర్తి
శాంతమూర్తి మందస్మితశాలి యెదుట,
దక్షిణకరమ్ము మామకవక్షమందు
నునిచి గంభీరవాక్యములను వచించె,
యువక నైరాశ్యసౌధాలనూరకేసృ
జించి, దైనందినమ్ము శుష్కించెదేల,
ప్రకృతి విషము జీవనము నిష్ఫలము సుమ్ము !



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## శ్రీమతి రుక్మాబాయి గారు

శ్రీమతి రుక్మాబాయి మదనపల్లె చెంత నున్న గంగనాయకను హళ్లియం దొక నియోగిబ్రాహ్మణ కుటుంబమున జనించినది. నాలవ ఫారమువరకు ఆంగ్లవిద్య నభ్యసించి నది. జననము మొదలు మంచి ఆరోగ్యమును, దేహదార్ఢ్యమును గలిగి యుండి యనుదినమును శరీరసాధన చేయుచు బలమును పెంపొందించుకొనినది. ఈమె కిపుడు ౨౫ ఏండ్లు వయస్సు. పది యేండ్లకు పూర్వ మొక సర్కసు కంపెనీలో చేరి వ్యాయామ ప్రదర్శనములను గావింప నీమె మొదలిడినది. తరువాత ఛత్రి సర్కసు, పరశురామ రావు సర్కసు కంపెనీలలో కొంతకొంత కాలముండి యిపుడు జాక్ కార్సను సర్కసులో వ్యాయామప్రదర్శనములు గావించుచున్నది. మొన్న ఫిబ్రవరిలో చెన్నపురమున ఫోర్డు మోటారుకారును ఆపి తన యద్భుత శరీరబలమును ప్రకటించి ఆంధ్రలోకమునకు వన్నె దెచ్చినది. ఈమె యిట్లు చేయుట కిదియే ప్రారంభము.



ఈమె అవివాహిత; మితభాషిణి; సామాన్యస్త్రీవలె గానిపించును. ఈమె నింటికడ చూచినపు డీమె యిట్టి యసాధారణ బలము కలదని తెలియరాదు. ఇంటి పనులన్నియు నీమె తానే చేసికొనుచుండును. ఈమె యిప్పుడు ననుదినము, శరీరసాధనమును, ప్రాణాయామమును జేయుచుండును. తన కిట్టి యసాధారణ బలము లభించుటకు ప్రాణాయామమే ముఖ్య మని యీమె విశ్వాసము.

ఇదివఱ కాంధ్రులలో ప్రొఫెసరు కోడి రామమూర్తిగారు మాత్రమే యిట్టి సామర్థ్యమును గలిగి కీర్తి చెందియున్నారు. ఇపుడు రుక్మాబాయియు అట్టి కీర్తికి స్థానమయ్యెను. స్త్రీలలోగూడ నిట్టివారు బయలుదేరుట యాంధ్రదేశాభ్యుదయ సూచకముగదా!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## 1. ఎచ్చరిక

[౧౯౨౮ వ సంవత్సరము ఫిబ్రవరి నెల మాడర్న్ రివ్యూ పత్రికయందు ఆపత్రికాసంపాదకుడు వ్రాసిన యైదవ లేఖనుండి.]

*　　*　　*

యూరపుఖండమున నేను సంచారముచేసిన ప్రతి దేశమునను, పట్టణమునను, అచ్చటివారు జనులనేకులు చేరు బహిరంగప్రదేశములను, భవనములను పరిశుభ్రముగనుంచుటకుమిక్కిల శ్రద్ధవహించుకొందురు. మన దేశమున దేహము పరిశుభ్రముగ నుంచుకొనుటకు పలుమారు నీటముసుగుదుము కాని వారివలె మనచుట్టుపట్టులను సయితము శుభ్రముగ నుంచుకొన జాలకున్నాము.

*　　*　　*

౧౭౫౦ వ సంవత్సరమున లండను నగరమున నున్న బ్రిటీషు మ్యూజియము లైబ్రరి యూరపుఖండము నందలి యితరముల లైబ్రరీలలో గొప్పదిగా నుండినది. ఇప్పుడు దీనికన్న ప్యారిసు నగరమునందలి నేషనల్ లైబ్రరి పెద్దదిగానున్నది. బ్రిటీషుమ్యూజియము లైబ్రరియందున్న విదేశగ్రంథములు ప్రపంచమున మరి యే లైబ్రరియందును లేవు. ౧౯౨౩ వ సంవత్సరమున నిందు నలుబదిలక్షల గ్రంథములుండినవి. ఇపుడింకను ఎక్కువగ నున్నవి. ౧౯౦౦ వ సంవత్సరము మొదలు ప్రతి సంవత్సరమునుపత్రికలు ౩౫౦,౦౦౦, గాక అన్ని వైపులనుండి వచ్చుగ్రంథములు సరాసరి ముప్పదివేలు లైబ్రరియందుచేరుచున్నవి. మఱియొక లెక్కనుబట్టి ౫౦,౦౦౦ చేరుచున్నట్లు తెలియవచ్చుచున్నది. లైబ్రరియందలి పుస్తకములున్న బీరువాల నెడలుపును గొలిచి మొత్తము చేసిన నేబదిమైళ్ళ పొడవగును.

*　　*　　*

లైబ్రరికేటలాగు నూఱుసంపుటములు. ఇరువదివేల సంపుటములు—నిఘంటువులు, విజ్ఞానసర్వస్వము మొదలయిన కోశములు—పాఠకులు స్వేచ్ఛగ నుపయోగించుకొనుటకుచుట్టును బీరువాలయందు గలవు. సరాసరి ప్రతిదినము ౮౦౦ పాఠకులు వచ్చి చదువుకొనుచుందురు.

పఠనమందిరములోనికి పోవుటకు నాయొద్ద టిక్కెట్టు లేకుండెను. కావున లోపలికి పోవక ద్వారముకడనే యుంటిని. వాకిటికావలివారిలో నొకడు నాకులోపల ఒకచోటనుండియింకొకచోటికిజరిపి తీసికొనిపోవుటకనుకూలముగ నుండునట్లు చేసియుంచిన బీరువాల నమర్చిన పద్ధతిని జూపించెను. అతనికందులకై కొంతలంచమును నీయవలసివచ్చెను. యూరపుఖండము గ్రేటుబిటనులో గలిసి క్రైస్తవ ప్రపంచమున ముఖ్యభాగ మను నట్లే లంచములప్రపంచమునను ముఖ్యభాగమని చెప్పుట ఉచితముగ నుండును. ఏలయన ప్రతిచోటను లంచముల నొసగుట విధిగనుండెను.

*　　*　　*

బ్రిటిషుమ్యూజియములో భారతీయ ప్రాచీనశిల్ప సంగ్రహముచాలతక్కువగ నున్నది. ఇదియు మన యదృష్టమే యనవలెను. మన దేశముయొక్క చారిత్రము మొదలయిన విషయములను గూర్చి తెలిసికొనుటకు గూడ విదేశములకు బోవు నావశ్యకత యెంతతగ్గిన నంత మేలుకదా! అందొక్కచో మేడమెట్లగోడపై అమరావతీ స్తూపశిల్ప మలంకృతమై యుండెను. దానిక్రింద వెనుక నొక ఇండియా మంత్రిగారు దాని నౌదార్యముతో నొసగినట్లు వ్రాసియున్నది. ఈవ్రాతను గాంచినంతనే నాకు 'పొరుగింట చూడరా నాపెద్దచేయి' అన్న సామెత జ్ఞాపకమునకు వచ్చినది. బలముకలవానిదే కదా అధికారము!

ఈమ్యూజియము, ఇట్టి యితర మ్యూజియములు ప్రేక్షకులకు మానవనాగరకతయొక్క గొప్పదనమును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మార్పును, ప్రాచీనతను గూర్చి తెలుపుటను, వారికి గల సంకుచితమైన జాతీయాభిమానమును పోగొట్టవలసినది. కాని ఈ మ్యూజియము బ్రిటిషువారిని అహంకారదూరులుగను, విశాలహృదయము గలవారుగను చేయుట కేమాత్రము తోడ్పడినదో తెలియకున్నది. మఱియు నిక్కడగల విస్తారవస్తుసంగ్రహ మంతయు కొంతవఱకు దోపిడిని, కొల్లను చాటుచున్నదని వారు గ్రహింపగలిగిరా యనువిషయమును దెలియకున్నది. సంగ్రహమెట్లు కావించినను బ్రిటిషువారియొక్క బుద్ధివికాసమునకేకాక నైతికవికాసమునకు నిది తోడ్పడుగాక!

దీని వలన మనము తెలిసికొనవలసిన విషయములు పెక్కులు గలవు. భారతదేశమునకు సంబంధించిన ప్రాచీనవిషయములను తెలిసికొనుటకు మనము తగినంత శ్రద్ధను గైకొనకున్నాము. ఐరోపియనులు ప్రపంచమంతటికిని సంబంధించిన విషయములను దెలిసికొనుటకై ఆతురపడుచుందురు. వారిలో ననేకులు తమ జాతీయవిజ్ఞానము, నాగరకత, చరిత్ర మొదలయినవానినే కాక విదేశీయులకు సంబంధించిన యెల్లవిషయములను బాగుగా దెలిసికొనినవానికి గొప్ప ప్రామాణికులుగ నున్నారు. కాని భారతీయులలో భారతదేశమును గూర్చిన విషయములకైన ప్రామాణికులుగ గైకొనదగినవారు మనలో నెందరున్నారు? ఇట్టిస్థితిలో విదేశములకు సంబంధించిన ఏయొక్కవిషయమునకైన ప్రామాణికులుగ గైకొనదగినవారు మనలో నొక్కరైన నుండుటెట్లు సాగును?

* * *

నేను ఇండియా కార్యాలయమును (India Office) చూచితిని. భారతదేశమును బ్రిటిషువారు కేవలము స్వలాభము కొఱకే పరిపాలించుచున్నను, ఈకార్యాలయనిర్మాణమున కయిన వ్యయమునంతను భారతదేశమే అచ్చుకొన్నది. కార్యాలయోద్యోగుల వేతనములు మొదలగు వానికగు వ్యయము నొసంగుచు దాని నిప్పుడును పోషించుచున్నది. కావున నిట్టి కార్యాలయదర్శనమున నాకు ఉత్సాహము గాని, ఆనందముగాని, కలుగలేదు.

## 2. భారతదేశమునందలి ఆదిమ(కొండ)జాతులు

[౧౯౨౭ వ సంవత్సరపు ఫిబ్రవరి 'మాడరన్ రివ్యూ' పత్రికలో శ్రీ ఏ. వి. ఠాకరు అనువారు వ్రాసిన వ్యాసమునుండి]

౧౯౨౧ వ సంవత్సరపు జనాభాలెక్కల ననుసరించి భారతదేశమున భిన్నభిన్నప్రాంతములగల ఆదిమ (కొండ) జాతులసంఖ్యలు.

| | |
|---|---|
| గోండులు | ౨౯,౦౨,౫౯౨ |
| సంతాలులు | ౨౨,౬౫,౨౮౨ |
| భిల్లులు | ౧౭,౯౫,౮౦౮ |
| కురుంబులు | ౮,౫౫,౨౭౯ |
| ఓరోనులు | ౭,౬౫,౬౮౦ |
| బంజరులు | ౬,౫౧,౯౨౭ |
| కొండులు | ౬,౧౬,౮౨౪ |
| ముండాలు | ౫,౯౩,౮౩౯ |
| సవరలు | ౪,౭౫,౮౬౮ |
| 'హో'లు | ౪,౪౦,౧౭౪ |
| నాగలు | ౨,౨౦,౬౧౯ |
| కచారీలు | ౨,౦౭,౨౬౬ |

వీరిసంఖ్య ౧౬౦ లక్షలు. భారతదేశపు జనసంఖ్యలో వీరు ఇరువదవవంతు ఉన్నారు. వీరు అడవులయందును, కొండలయందును, కోనలయందును, నాగరకప్రపంచముతో సంబంధములేక యేకాంతముగ నివాసము చేయుచుందురు. చెట్లను, గట్లను, నదులను మూఢభక్తితో పూజించుచుందురు. వీనియందేదో అదృశ్యమగు శక్తిగలదనియు, అది తమకు రోగములను, నాశమును గలిగించుననియు వీరి విశ్వాసము. వీరు మిగుల పిరికివారు; అమాయకులు వీరికి ఇతర మనుష్యులను చూచిన భయము మెండు. వీరికి వ్యవసాయము, పరిశ్రమ, వర్తకవ్యాపారములు మొదలయినవి తెలియవు. కావున వీరికి జీవితముగడుపుట కష్టము. ఆహారము దొరకమిచే నొక్కొకప్పుడు ఆకలికోర్వలేక దొంగతనము, దోపిడి మొదలయిన నేరములు చేయుచుందురు. ఇందువలన వీరికి 'దొంగజాతులు' (Criminal tribes) అని పేరుపెట్టి ప్రభుత్వమువారు వీరినిర్బంధమునకై యొక ప్రత్యేకశాసనమును చేసినారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అడవులలో లభించు నిత్యావసరవస్తువులను సైతము వీరు పయోగించుకొనగూడదను నిబంధనలుగలవు. ఈనిబంధనలను గోరంత మీఱినను వీరుకొండంత దండనమునకు పాలగుచున్నారు. కొన్నిచోట్ల రైతులు ధాన్యము, రొక్కము అప్పుఇచ్చి, తక్కువకూలికి వీరిచే వ్యవసాయపనులు చేయించుకొనుచున్నారు. ధనవంతులు వీరికి సొమ్ము నప్పుఇచ్చి ఎక్కువవడ్డిని పుచ్చుకొనుచున్నారు. మఱికొందఱు కల్లు సారాయిని వీరికి విక్రయించి యల్పావశిష్టమగు ద్రవ్యమును దోచుకొనుచున్నారు. ఇదియంతయు వీరిహీనదశకు గారణమగుచున్నది.

క్రైస్తవమత ప్రచారకులుకొందఱు వీరిని తమ మతములోనికి జేర్చుకొనుచున్నారు. అస్సాములోనిఖాసీలు, లూషాయీలు అను రెండుజాతులవారు పూర్తిగా క్రైస్తవుల యిపోయినారు. వీరి పాలకులైన నిపుణు కానరాదు ఇట్టివారు విద్యావంతులై అనేకవిషయముల నితరులగు కొండజాతులవారికన్న మంచి స్థితియందున్నారు. కాని ఉత్తమములగు భిన్నభిన్న జాతులకు, మతములకు స్థానమయిన భారతభూమియందీయాదిమజాతులు విదేశీయమతప్రచారకుల మృగయావ్యాపారమునకు లక్ష్యమయి నానాటికి క్షీణించిపోవుచుండుట మిగులవిచారకరము.

* * *

రాష్ట్రీయశాసనసభలు వీరిమంచి సెబ్బరలను ఎంచి విచారించిచేయుప్రయత్నము అత్యల్పము. బర్మా-బిహారుశాసనసభయందుమాత్రము ఇరువురుప్రతినిధులకు స్థానముకలదు. (౧౬౦ లక్షలు జనసంఖ్యగల యీజాతులకుభారతదేశమునకంతటికి నీయొక్కశాసనసభయందుమాత్రమే ఇద్దఱుప్రతినిధులున్నంత నేమిలాభముగలుగును?)

వారుమనసోదరులు; మన భారతమాత తొలుచూలుబిడ్డలు; ఆధునికనవనాగరకతాప్రపంచముచే పీడితులైనవారు. మనమువారిస్థితిగతులను ఆరసి వారినభివృద్ధిలోనికి తెచ్చుటకు పాటుపడవలసిన భారము మనపై గలదు.

ఈపనికయి అఖిలభారతసంఘమొకటి ఏర్పడవలయును; కొండజాతులవారి యభివృద్ధి నాకాంక్షించువా రాసంఘమున సభ్యులుగ నుండవలెను. ౧౬౦ లక్షలు జనసంఖ్యగల యీజాతులు ఇతరభారతీయులతో సమానమగు స్థితినిపొందునట్లు లాసభ్యులు తగినప్రయత్నములను చేయవలెను.

జనసంఖ్య ఎంతయధికముగగల దేశమైనను ౧౬౦ లక్షలపరిమితిగలిగి తనయందు నివసించుచున్న జనులయభివృద్ధిపట్ల నిర్లక్ష్యభావమును వహించియుండు టెంతయు ననుచితము. భారతదేశమున నన్నిప్రాంతములనుగల యెల్లజాతులసంపూర్ణతయే భవిష్యద్భారత ప్రజాప్రభుత్వమునకు నిక్కమైన గట్టిపునాది.

## 3. భారతదేశము—చీనాదేశము

[ఫిబ్రవరి 'మాడర్న్‌రివ్యూ' సంపాదకీయ వ్యాఖ్యానమునుండి]

"భారత, చీనాదేశములురెండును నానాజాతిసమితియందు సభ్యత్వమును బడసియున్నవి. ఈరెండుదేశములకును బరస్పరము పోరాటములులేవు. ఈరెండుదేశములకు ఆదినుండి ఐహికాధ్యాత్మిక విషయములయందు ఎడతెగని సంబంధముగలదని రవీంద్రుని 'చీనాదేశయాత్ర' తెలుపుచున్నది. మఱియు చీనాదేశముకావించుచున్న స్వాతంత్ర్యప్రయత్నములపట్ల భారతదేశము సానుభూతిగలిగియున్నది. ఐనప్పటికిని చీనాదేశముపై సేనలను బంపుట భారతదేశమునకుతప్పని సరియైనది.

స్వార్థపరమగు విదేశప్రభుత్వము నాజ్ఞకుబద్ధురాలై భారతదేశమాతకు చీనాపై కత్తికట్టుటకు తనపుత్రులనుబంపవలసివచ్చుటకన్న నెక్కువ విచారకమయినవిషయము వేఱొండులేదు. భారతదేశమునుండి సేనలనుబంపువిషమును పర్యాలోచించుటకై శాసనసభలయందు కావించిన యుపపాదనములను ప్రభుత్వము త్రోసి రాజు చెప్పినది. ఇట్లు ప్రజాప్రతినిధులకంఠముల నొక్కుటయే యీవిషయమున ప్రజలకుగల యభిప్రాయమును విశదముచేయుచున్నది. ఇప్పటికే ప్రజలీవిషయమును నిరసించుచు ననేకసభలు గావించియున్నారు; ఇంకను గావింతురు. కాని విదేశప్రభుత్వము దీనిని లెక్కగొనదు. ఈచర్య భారతీయుల యనుమతిపై బ్రిటిషువా రీదేశమును బరిపాలించుటలేదని ప్రపంచమునకు జాటిచెప్పుచున్నది. ప్రభుత్వనియమములనుగాని, ఇతరములగు చట్టములనుగాని అనుస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రించి యిట్టివిషయములయందు ప్రజాప్రతినిధులతో నాలోచించుట ప్రభుత్వమున కనవశ్యము కాకపోవచ్చును కాని భారతీయులనుశేమనైతికధర్మమునకు, మనఃప్రవృత్తికి విరుద్ధముగ ప్రవర్తించుట కెంతమాత్రమును బద్ధులను జేయజాలదు.

భారతశాసనసభయందు ప్రసంగించుచు రాజప్రతినిధిగారు "(చీనాదేశమున) ఒడంబడిక రేవుపట్టణముల యందు బ్రిటిషువారివలెనే పలువురు భారతీయులుగల వర్తకసంఘముయొక్క ధనప్రాణములపై నిటీవలదాడిచే సలబడె" నని చెప్పిరి. చీనారేవుపట్టణములందును భారతీయులుకూడ ననేకులున్నారనియు, వారికిని, వారియాస్తికిని ముప్పువాటిల్లినదనియు, ఆముప్పును దప్పింపనచటకు సేనలుపోవుచున్నవనియుకదా దీనిభావము! దక్షిణాఫ్రికాయందు బోయరులు భారతీయులను బాధించుచుండ వారిని రక్షించుటకయియే బ్రిటిషువారు బోయరు యుద్ధమును జేసిరికాబోలును! మొన్నటి అయిరోపామహాసంగ్రామానంతరము జర్మను తూర్పుఆఫ్రికాదేశమునుభారతీయులుసంపాదించిరని వారికిబ్రిటిషు పరిపాలనము ననుగ్రహించిమన్నించు టావశ్యకముగదలచి బ్రిటను ఆదేశమును తనపాలుచేసికొని నదికాబోలును! పదపడి దక్షిణాఫ్రికా, కెనియాలలో భారతీయులు పడిన పాట్లు అందరును నెరిగినవియే.

రాజప్రతినిధిగారు భారత శాసనసభయందు చీనాదేశపు ఒడంబడిక రేవుపట్టణములందున్న భారతీయులసంఖ్యనుగాని, వారికిని, వారియాస్తికిని నిక్కముగ గలిగిన ముప్పునుగాని, విదేశముల నివసించుచున్న భారతీయుల రక్షణార్థము ప్రత్యేకముగ నెన్నడైన సేనలను పంపినట్లు బ్రిటిషు చరిత్రమున గలదనికాని చెప్పకపోవుట ముఖ్యముగ గమనింపవలసినవిషయము. రాజప్రతినిధిగా రిక్కడ నేమిచెప్పినను ఇంగ్లండున మాత్రము దీని సత్యము వెల్లడియైనది.

టివ్‌టనులో సాలిసిటర్ జనరలు కావించిన ప్రసంగమున "షాంఘైకు పోవుచున్న సైన్యము అచ్చోటు విడిచిపచ్చుటకు వీలులేనిస్థితియందున్న పదునాఱువేల బ్రిటిషు స్త్రీలను, శిశువులను చేతనయినంతవరకును కాపాడుటకై పోవుచున్న" దనిరి.

మఱియు డివానుపటాలములలో నుండి చీనాకు పోవుచున్న యొక పటాలము నెదుర ఫిలిప్ చెట్‌వుడ్ అను సేనాధిపతి కావించిన యుపన్యాసమున "మీరు పోవునది విలాసార్థముకాదు. ప్రస్తుతమక్కడ యుద్ధముజరుగు పరిస్థితిలేదు. మనము నివారింపగలిగినచో ముందును జరుగదు. ఒడంబడికవలన మనకు లభించినసొత్తులను, అచ్చటనున్న బ్రిటిషువారిని, కాపాడుటకు పోవుచున్నారు. * * *" అనిచెప్పిరి.

* * *

దాస్యబద్ధమైనదగుటచే భారతదేశము మిత్రదేశమగు చీనాతో పోరుటకు సేనలను బంపవలసి వచ్చినది."

భారతదేశము ఇట్టిదాస్యము తొలగి,స్వాతంత్ర్యమునుబడసి ప్రాచీనౌన్నత్యముతో వెలయునెన్నటికో!

## 4. భారతదేశము- మోటారుకారులు

'[ఇండియన్ అండ్ ఈస్టర్న్ మోటార్సు' (Indian and Eastern motors) అను పత్రికనుండి.]

"౧౯౨౪, ౧౯౨౫, ౧౯౨౬ సంవత్సరములయందు ఏప్రిల్ ౧ వ తేదిమొదలు అక్టోబరు ౩౧ వ తేదివఱకు ఏడునెలలకాలమున క్రమముగ ౧, ౨౧, ౧౭౪౫౫—౧, ౩౦, ౧౯, ౮౮౧—౧,౫౨, ౩౬,౮౯౫ రూపాయలు విలువగల మోటారుకారులు భారతదేశమున దిగుమతియైనవి. అమెరికాసంయుక్తరాష్ట్రములు కనడా, బెల్జియము, ఫ్రాన్సు, ఇటలీ, స్కాట్లండు మొదలయినదేశములు వానిని ఎగుమతిచేసినవి. వానిలో బెంగాలు ౩౦, బొంబయి ౨౯, సింధు ౧౫, చెన్నపురి ౧౫, బర్మా ౧౧ వంతులు కైకొనినవి. ఈ మూడేండ్లలో నేవరుసగా ౫, ౮౧, ౭౮౧, ౮, ౬౭,౧౦౯—౬,౦౭,౬౨౩ రూపాయలువిలువగల మోటారుసైకిళ్లు కూడదిగుమతియైనవి."

భారతదేశము విదేశపరిశ్రమాభివృద్ధికై తనసంపదనిట్లు కోలుపోవుచున్నది. తన యుపయోగమునకు గావలసిన మోటారుకారులను, సైకిళ్లను తానే నిర్మించుకొని తన సంపదను, తనపరిశ్రమను పెంపొందించుకొన వినియోగించుకొను భాగ్యమును బడయు టెన్నడో!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## 5. హెర్ విల్‌హెలమ్ మార్కస్సు

వీరుకొలోనులో ౧౮౬౩ జనవరి ౧౩ వ తేది నాడు జననమొందిరి. పరిపాలనశాఖ (సివిల్ సర్వీసు) లోని రాజకీయశాఖలో చేరి న్యాయాధిపతి అయిరి. ౧౮౯౯ వ సంవత్సరమున 'ప్రష్యన్‌లాండ్‌టాగ్' అను జర్మనీ దేశపు సంస్థానములసభలో సభ్యుడుగ వీరు ఎన్నుకొనబడిరి. ౧౯౧౦ వ సంవత్సరమున వీరు 'జర్మను రీచ్‌స్టాగ్'



అనబడు ప్రజాప్రతినిధి సభలో చేరి నాయకులలో ప్రాముఖ్యమునుగడించిరి. తరువాత ౧౯౨౧ వ సంవత్సరమున 'సెంటరుపార్టి' అను నొకపక్షమునకు అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. ౧౯౨౩ వ సం. నవంబరు నెల ౩౦ వ తేదిన స్ట్రీసుమెనుగారి స్థానమున రీచ్‌స్టాగులో ఛాన్సలరుగా నియమింపబడిరి. ౧౯౨౫ సంవత్సరము ఫిబ్రవరిలో ప్రష్యా మంత్రివర్గమున కధ్యక్షులయి కొంతకాలముండిరి. ౧౯౨౬ సం. జనవరిలో వీరు న్యాయశాఖామంత్రిఅయిరి.

---

## 6. హెర్ గస్టవ్ స్ట్రీస్‌మను

ఈజర్మను రాజతంత్రజ్ఞుడు ౧౮౭౮ సం. మే నెల ౧౦-వ తేదినాడు బెర్లిననగరమున జననమందెను. బెర్లిను లీప్‌జిగ్ నగరములయందు అర్థశాస్త్రము నభ్యసించెను. తరువాత నొక పారిశ్రామికసంఘమున కధికారియయ్యెను. ౧౯౦౩ వ సంవత్సరమున డ్రెస్డనులోని మండల పారిశ్రామిక సంఘమునకు కార్యదర్శి అయ్యెను. తరువాత పెక్కుమండల పారిశ్రామికసంఘములయందు పనిచేసి శాక్సనురాష్ట్రీయ పారిశ్రామికసంఘము నొకదాని నేర్పాటుచేసి శాక్సనుయొక్క రాజకీయార్థికరంగమునం దీసంఘముల ప్రథమస్థానమును గడించెను.

ఈతని యద్భుతనిర్మాణకౌశల్యముచే బెర్లినులోని పారిశ్రామికసంఘముల ప్రధానకార్యస్థానమున నితనికి ఎక్కువ పలుకుబడిగలిగెను. శాక్సనురాష్ట్రీయపారిశ్రామికసంఘపద్ధతుల ననుసరించి వుర్టంబర్గు, సైలీషియా, తురింజియా రాష్ట్రములలో రాష్ట్రీయసంఘములు పెక్కుస్థాపింపబడినవి. అందును స్ట్రీసుమనుగారే ముఖ్యులుగనుండిరి. తరువాత జర్మను-కనేడియన్ అండ్ జర్మను-ఆస్ట్రియన్ హంగేరియను ఆర్థికసంఘమును స్థాపించి దానికతడే యధ్యక్షుడయ్యెను. బెర్లినులోని 'జర్మనుబల్గేరియన్' సమితికి ఉపాధ్యక్షుడయ్యెను. తదనంతరము జర్మనుయుద్ధనౌకాసంఘనిర్మాణమునగూడ నెక్కుడుగపాల్గొనెను.

౧౯౧౩ వ సంవత్సరమున హాంబర్గ్-అమెరికా లైనుకు జనరల్ మేనేజరగు బాలిను అను నాతడు, స్ట్రీసుమను కలిసి 'జర్మను అమెరికను ఆర్థికసంఘము'ను స్థాపించిరి. ౧౯౦౭ వ సంవత్సరమున స్ట్రీసుమను 'రీచ్‌స్టాగు' అను జర్మను ప్రజాప్రతినిధిసభయందు నేషనల్ లిబరల్ పార్టిపక్షమున సభ్యుడుగ నెన్నుకొనబడెను. అందును ఈతడు గొప్ప గౌరవమును బడసెను. మొన్నటిఐరోపాయుద్ధసమయమున తీవ్రజాతీయవాదియై జర్మనుఛాన్సలరగు బెత్‌మనుహాల్వెసుగారి పతనమునకు కారకులైనవారలలో నొకడయ్యెను. సంఘయుద్ధానంతరము జర్మనుప్రజాపక్షమును స్థాపించి, దానికి అధ్యక్షుడయ్యెను. తరువాత నేషనలు లిబరలుపార్టికిని అధ్యక్షుడయ్యెను.

'రురు' పోరాటము తీవ్రముగనున్నపుడు జర్మను రాజ్యాంగవిధానమున సంపూర్ణముగ మార్పుజరుగుటత్యంతావశ్యకమని చర్చించుచు పెక్కువ్యాసముల ప్రకటించి యీతడు పేరుకాంచెను. కూనోమంత్రివర్గము నశించి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జర్మని కేవలము హీనదశయందున్న పుడితడు 'రీచ్ స్టాగు'న కధ్యక్షుడయ్యెను. అందు జర్మనిలో అన్ని పక్షముల ప్రతినిధులు చేరియుండిరి. 'రుర్' పోరాటము నత డపు డంతము నొందించెను. శాక్సను, తురింజియా రాష్ట్రములవారు ప్రారంభించిన బోల్షివిజము నతడు 'రీచిస్టాగు' పద్ధతుల ననుసరించి నిరోధింపవలసినవా డయ్యెను. ఆకారణ



హెర్ గస్టవ్ స్ట్రీస్ మను

మున రీచ్ స్టాగునందలి సాంఘికస్వాతంత్ర్యవాదు లీతనిని బహిష్కరించిరి. కావున రెండుమాసములకు తరువాత నీత డింకొక మంత్రివర్గమును (కేబినెటును) స్థాపించెను. అది ౧౯౨3 వ సంవత్సరము నవంబరు తుదివరకు నుండెను.

తరువాత నేర్పడినమార్క్సు కేబినెటులో నీతడు విదేశాంగమంత్రియయ్యెను. అందు విదేశరాజ్యాంగవిషయములయం దీతడు ఎక్కువ చొరవగలిగియుండెను. 'డాసుప్లాను'ను జర్మని అంగీకరించునట్లు చేయుటయు ౧౯౨౪ వ సం. ఆగస్టులో లండనునగరమహాసభ జరుగుటయు, ఇతడు ముఖ్యకారణము. మార్క్సు కేబినెటు అస్వతంత్రతను మానుకొనిన తర్వాత నీతడు మరల కేబినెటు నేర్పాటుచేయుట కిష్టపడక జర్మను జాతీయపక్షమును ప్రభుత్వముతో జేర్పుటకు తన శక్తినంతయు వినియోగించెను. ఈతడు లూథరు మంత్రివర్గములు రెంటియందును విదేశాంగమంత్రిగనే యుండెను. ౧౯౨౫ సం. ఫిబ్రవరిలో 'ఎంటెంటి' (మిత్రమండలి)కి యాదాస్తును (మెమోరాండమును) పంపెను. ఈకారణమున నీత డొక్క జర్మనికే కాక ప్రపంచమంతటికిని కౌతుకస్థానమయ్యెను. లొకార్నో మహాసభయందు దీనికి జయము లభించెను. అదే ౧౯౨౫ వ సం. డిసెంబరు ౧-వ తేదిన 'లొకార్నో ఒడంబడిక' లండనునగరమున తీర్మానమయ్యెను.

తీవ్రముగ ద్వేషించు శత్రువులను, న్యాయపూర్వకము మెచ్చుకొనుమిత్రులనుగలిగి, సకలస్థైర్యమును పాటింపక యీతడు తన మతమును సాగించుకొన్నాడు. 'రురు' మండలమును, మెయిన్ 'రైన్ లాండు' మండలమును విదేశసైనికుల అధికారము నుండి తొలగించుటచేతను, కరెన్సీ స్థిరపడుటకు కావించిన గట్టిఏర్పాటులచేతను, జర్మనికి ప్రపంచమందలి ఇతరదేశములతో రాజకీయవిషయములయందు కొంతలిన్నని సంబంధమును గలుపుటచేతను ఈతడింతఖ్యాతిని గాంచినాడు. ఇతడు గొప్పవక్త; రాజతంత్రప్రవీణుడు; మంచిబుద్ధి కుశలతగలవాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## 7. శ్రద్ధానందస్వామి హత్య

['ఇస్లామిక్ వరల్డు' (Islamic world) అను పత్రిక ఇట్లు వ్రాయుచున్నది.]

"ఇట్టి దారుణహత్యలు ఇస్లాముమతమునకు కేవలము విరుద్ధములు. ఇట్టివి మతాభివృద్ధికేవిధమునను ఉపకరింపవు. ఈహత్య సంఘప్రోద్బలమున జరిగెనని కొందఱు తలచుచున్నారు. ఇది కడుశోచనీయము. ఇస్లాముమతము ఇట్టి ఘాతుకకృత్యములతో సంబంధమెన్నఁడును గలిగించుకొనదనియు, కేవలముప్రపంచశాంతికిని, ఐకమత్యమునకును నిరంతరముపాటుపడుచుండు ననియుసోదరహైందవమహాశయుల విశ్వసింపఁగోరుచున్నాము. అట్లుకాక విరుద్ధాభిప్రాయ మెవరేని గలిగియున్న నది కేవలము పొరపాటని తలంచెదము."

---

## 8. వార్తాపత్రికల విపరీతస్వభావము

['సాటర్ డే రివ్యూ'(Saturday Review) ఇట్లు వ్రాయుచున్నది.]

వార్తాపత్రికాప్రపంచమున సంపాదకవర్గముపట్ల గౌరవము క్రమముగ క్షీణించి వ్యాపారముపట్ల నధికమగుచున్నది. కానిపత్రికను సంపాదించునది సంపాదకవర్గము. ఆపత్రికనే పత్రికాధిపతి యమ్ముకొనుచున్నాఁడు. సంపాదకులు పత్రికలను తృప్తికరముగ సంపాదింపకున్న అమ్మకము సన్నగిల్లును. అంత ప్రకటనలు సున్నయగును; తోడనే పత్రికాధిపతి ఆదాయము లేమినిఖిన్నుఁ డగును. కావున పత్రికాభివృద్ధికి ప్రకటనములకన్న వార్తాసంగ్రహణప్రకటన సునిపుణమగు సంపాదకవర్గమే మిగుల ముఖ్యమైనది.

ఈనాడు పత్రికలు ఆడంబరముచే నపారముగ లాభమును బడయుచున్నవి. కాని యట్టిలాభమున సముచితభాగమునైనను మనఃపూర్వకముగ దమయభివృద్ధికై పాటుపడుచుండు సంపాదకవర్గమునకు దయతో బ్రసాదించి ప్రోత్సహింప దొరకొనమి యెంతయు విచారకరము.

---

## 9. చరఖా మనోరోగమునకు మందు!

['మాధురీ'(హిందీ)పత్రిక మాఘ మాస సంచికనుండి]

పదిమందియు వెఱ్ఱివాఁడనినను గాంధిమహాత్ముఁడు చరఖా వలన స్వరాజ్యము వచ్చునని చెప్పుచునే యున్నాఁడు. చరఖా మనదేశములోని పనిలేని పేదవాండ్ర ఆర్థికసమస్య సాధించు ననుటయందు సందియ మేమియు నుండరాదు. చరఖా తిరుగుటవలన పేదవాండ్రాడలు గప్పుకొనుట కేమోటుగుడ్డయో చవుకగ దొరకును. మానసికరోగము పోగొట్టుశక్తికూడ చరఖాకుకలదని యీనడుమ అమెరికానుండివచ్చిన ఒకస్త్రీరత్నము చెప్పినది. మహాత్ముఁడు వెఱ్ఱివాఁడని యెంచు వెఱ్ఱివారి వెఱ్ఱిగూడ చరఖాత్రిప్పినచో తొలఁగవచ్చును. 'అనా బర్గెగ్ హామ్‌స్లోయన్' అను ఈ అమెరికాస్త్రీరత్నము విద్యావతి; చేతిపనులు, శిల్పములు నామెకు మిక్కిలి యిష్టము; ఇందామె చాల ప్రఖ్యాతిగాంచినది. ఒక పత్రికాప్రతినిధి కొన్నిప్రశ్నలడుగ నామె యిట్లుత్తర మిచ్చెను:—"ప్రస్తుతము భారతీయవిద్యాశాలలయందు పయోగించు విద్యాపద్ధతి విద్యార్థుల మనోవృత్తులకు వలసినంతవికాసము గలుగనిచ్చుట లేదు. చేతిపనులందును, శిల్పములందును విద్యార్థు లెక్కువశిక్ష నొందవలెను...... వడుకుటయు నేయుటయు ఆరోగ్యస్థితినిగూడ బాగుపఱచును. అమెరికాలోని యనేకులు ప్రసిద్ధులగు డాక్టరులు పరిశీలించి చరఖాత్రిప్పుటకు మానసికరోగములపై మంచిప్రభావమున్నదని గ్రహించినారు."

చాలమంది మన యాంగ్లవిద్యాభ్యాసకుల కొకప్రవృత్తికలదు: తమదేశపు చక్కని రీతులగూర్చియెవ్వరో పాశ్చాత్యులు గుణగణనము చేసిననేకాని, తాము గ్రహింపజాలరు. అట్టివారిపుడు తప్పక చరఖాపక్షమవలంబింతురని యాశింపవచ్చును.

---

## 10. మధుసూదన సరస్వతి-అద్వైతసిద్ధి

[౧౯౨౭ వ సం. ఫిబ్రవరినెల 'ప్రబుద్ధ భారత' నుండి]

(హరిలీలావ్యాఖ్య యను గ్రంథమునకు 'ఈశ్వరచంద్ర' పండితుఁడువ్రాసిన యుపోద్ఘాతమును బురస్క-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రించుకొని శ్రీప్రహ్లాద సి. దివాంజిగారు 'Annals of the Bhandarker-Institute' అనుపత్రిక గత సంచికయందు ఈచరిత్రలేశమును వ్రాసిరి. ఈశ్వరచంద్ర పండితుఁడు తూర్పుబంగాళము నందలి యొక ప్రాచీన బ్రాహ్మణకుటుంబమునలభించిన 'వైదికవాదమీమాంస' యను తాళపత్రగ్రంథమునుండి దానినిసంగ్రహించెను.)

"కనోజినుండి తరలివచ్చి 'నాడియా'లో నివాస మేర్పరుచుకొన్న రామమిశ్రుని సంతతివాఁడగు పురందరాచార్యుఁడు తనతండ్రి మరణానంతరము వంగదేశ రాజగు మాధవపాశుని యాహ్వానమున నాతని రాజధానికి వచ్చెను. రాజధానికిఁ జెంతనున్న 'కోటలిపద' (Kotalipada) యను నుపనగరమునకుఁ జేరిన ఉసాసుజ (Usasuja) యను చిన్నపల్లెటూరియం దొక సుందరమందిరమును గట్టుకొని 'పురందర వాటిక'యనిదానికిఁ బేరిడి అతఁడందు నివసించుచుండెను. మఱియు నాయూర 'శ్రీదక్షిణామూర్తి కాళికాదేవి'కి ఆలయమును నిర్మించెను. ఆమందిరదేవాలయములీనాఁటికిని గలవఁట. పురందరాచార్యునికి శ్రీనాథ యాదవానంద, మధుసూదన, వాగీశులనుపుత్రులు నలువురు పుట్టిరి. వారిలోఁ గడగొట్టు చిన్ననాఁడే చెల్లుకొనెను. కడమముగ్గురు శ్రీనాథచూడామణి, యాదవానందన్యాయాచార్య, మధుసూదనసరస్వతు లనుపేరుల వెలసిరి.

ఒకనాఁడు పురందరాచార్యుఁడు యాదవ మధుసూదనులను వెంటఁగొని మాధవపాశుని యాస్థానమునకుఁ బోయెను. అచ్చట మధుసూదనుని యద్భుత పాండిత్య ప్రకర్షను బ్రకటింపఁజేసి తనగృహసమీపమునఁ దనకుఁ గొంతభూమి నిమ్మని రాజును కోరెను. రాజు మధుసూదనుని సామర్థ్యమునకు మెచ్చుకొన్నను భూమినిచ్చుట కిచ్చగింపఁ డయ్యెను. భగ్నాశుఁడై మధుసూదనుఁడు తండ్రికన్న నతికుపితుఁడై, తోడనే పశ్చాత్తాపమును జెంది సన్న్యసింపఁ దండ్రి యనుమతి వేఁడెను. తండ్రి యనుమతించెను. అతఁడంత 'త్రిదండి' సన్న్యాసియై కాశికిఁబోయెను.

ఇతని కాశీప్రయాణమునుగూర్చినగాథ యిట్లొకటిగలదు: "మధుసూదనుఁడు కాశికిఁ బోవుచుండెను. త్రోవలో 'యశోహరము'చెంత నొకనది పరుల కెగఁదన్ని ప్రవహించుచు దాఁటనశక్యముగనుండెను. అతఁడు నదియొద్దనా రాత్రియాఁగి వరుణదేవునిఁ బ్రార్థించెను. అపుడు స్వప్నమున "మార్గనిరోధకముండ"దనుదివ్యవాణి యాతనికి వినిపించెను. మేల్కనినతోడనే ప్రవాహము తగ్గియుండుటను గాంచి యాతఁడు నదిని కాలినడకతో దాఁటిపోయెను. నాఁటినుండి యానదియాతనిపేరనే వెలసినది."

అతఁడు కాశికిఁబోయి 'విశ్వేశ్వరసరస్వతి'యను వారియొద్ద బ్రహ్మవిద్య నభ్యసించెను. అచిరకాలముననే పండితలోకమాతని నిశ్చలతపోనిష్ఠను,యోగాభ్యాసక్రమమును మెచ్చుకొని యాతనిని గౌరవించినది. మధుసూదనుఁ డచ్చటనే వేదాంతశాస్త్రమున 'నద్వైతసిద్ధి' యనుగ్రంథమును రచియించెను. ఇది యాతని గ్రంథములలో నెల్ల నుత్కృష్టమైనది. ఈతఁడు పదునాఱవ శతాబ్ది యుత్తరార్ధమునను పదునేడవ శతాబ్దిపూర్వార్ధమునను జీవితుఁడై యుండెను. తులసీదా సీతని సమకాలికుఁడు. అతఁడును గాశియందే నివసించియుండెను. పరస్పరము మైత్రిగలిగినపిదపఁ దా రచియించిన 'రామచరితమానసము'ను దులసీదాసు మధుసూదనసరస్వతికిఁ జూపెనఁట.

మధుసూదనుని గుఱించి వేఱొక గాథ యిట్లు కలదు: "అక్బరుపాదుషా ఇతని నిరుపమానపాండిత్యమునుగూర్చి విని, తన యాస్థాన విద్వాంసులతోఁ బ్రసంగింప నాహ్వానించెనఁట. మధుసూదనుఁ డంగీకరించి యక్కడకుఁబోయి, వారితోఁ బ్రసంగించి, తన యద్భుతప్రతిభను,సంస్కృతపాండిత్యమును వెల్లడించెను. అచ్చటిపండితు లచ్చెరువంది యాతనిని మిగులఁ గొనియాడిరి."

మధుసూదనుఁడు తన కడపటిదినములలోఁ దన నివాసమును హరిద్వారమునకు మార్చుకొని, యచ్చట ౧౦౭ సంవత్సరముల వయస్సున సిద్ధిఁ జెందెను.

---

## 11. రెండు పూర్వపు బంగారు నాణెములు

[నెల్లూరు మండలములోని కందుకూరు తాలూకా సోమదేవిపల్లిలో క్రొత్తగా దొరికినవని రెండు ప్రాచీన సువర్ణ నాణకములను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీయుతులు గొల్లపూడి సీతారామశాస్త్రి గారు శ్రీయుతులు చల్లా శేషగిరిరావు పంతులుగారి కీయగా వారునాటిని పరిశోధనార్థము నా కొసగిరి. ఆ రెండు నాణెముల యొక్క ప్రతిమలు నిందు జూపబడినవి.]

౧




నాణెముయొక్క
అసలు పరిమాణము (size)




నాణెముయొక్క పరిమాణము
పెద్దదిచేసి చూపబడినది.

వాటిలో నొకనాణెము (చూ. పై చిత్రము) పలుచగనుండి గుండ్రనగ నున్నది. దానికి

బొమ్మవైపు:—వరాహప్రతిమ కలదు.

రెండవవైపు:—కుడివైపునకు తిరిగినసింహాకృతినిబోలిన ప్రతిమ ఎడమవైపునకు తోక; పైనిఅర్ధ చంద్రాకృతిగల గీటు- ఇవి కలవు.

తూకము:—ఈ నాణెము ఆఱువడ్లగింజలయెత్తు తూగుచున్నది. గురివెందగింజలతో తూచిన అయిదు గురివెందగింజల యెత్తు తూగుచున్నది.

అయిదు గురివెందగింజలయెత్తు తూగు బంగారు నాణెమొకటి మనగణితశాస్త్రములందు తెలుపబడినది.

మహావీరాచార్య డను సుప్రసిద్ధగణితశాస్త్రజ్ఞుడు తన గణితసారసంగ్రహమున 'సువర్ణపరిభాష' నిట్లు తెలిపి యున్నాడు:

చతుర్భి ర్గండకై ర్గుంజా
గుంజాః పంచపణోచ్యతే
ధరణం ధరణే కర్ష
పలం కర్ష చతుష్టయమ్."

అనగా,

| | |
|---|---|
| ౪ గండకములు | = ౧ గుంజ (గురివెంద గింజ) |
| ౫ గుంజలు | = ౧ పణము |
| ౮ పణములు | = ౧ ధరణము |
| ౨ ధరణములు | = ౧ కర్షము |
| ౪ కర్షములు | = ౧ పలము అని |

మనకు దొరకిన ఒకటవసంఖ్య గుర్తుగల పలుచని బంగారునాణెము సరిగా అయిదుగురివెందగింజలుతూగు చుండుటచే అది పణము అనవచ్చును. బంగారుపణముల వలెనే వెండి, రాగి పణములు నుండును. సాధారణముగ బంగారుపణములు అయిదు లేక ఆఱు వడ్లగింజలయెత్తు తూగును. దాక్షిణాత్యుల 'సువర్ణపరిభాష' ప్రకారము 'కలంజు' అను బంగారునాణెములోని పదియవ వంతు నాణెమునకు పణమని పేరని ఈ క్రింది మానమునుబట్టి తెలియుచున్నది.

| | |
|---|---|
| ౧ ధాన్యపు గింజ | = ౧ వీసతూకము |
| ౪ ధాన్యపుగింజలు | = ౧ కున్రి (లేక రతి) |
| ౨ కున్రులు(లేక రతులు) | = ౧ మంజాడి |
| ౨ మంజాడులు | = ౧ పణతూకము |
| ౧౦ పణతూకములు | = ౧ కలంజు. |

## బంగారుపణము

ఇప్పటి రాగినాణెములలో దమ్మిడివలెను, వెండి నాణెములలో రెండణాలకాసువలెను, పూర్వము, బంగారు నాణెముల చలామణీపద్ధతిలో 'పణమే' మొదటినాణెము (Unit)గ కాన్పించును. అంతకు తక్కువ రకము బంగారునాణెము లుండెడివికావు.

దక్షిణహిందూదేశము నేలిన ప్రతిరాజవంశము వారు-చోళులు, పాండ్యులు, కేరళులు, కలచుర్యులు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చాళుక్యులు, చాళుక్యచోళులు (అనగా ద్రవిడదేశము నచే రాజధానిని గల్పించుకొని ప్రధానముగ చోళదేశము నేలిన రాజరాజనరేంద్రుని కొడుకగు కులోత్తుంగ చోడుని వంశమువారు)వీరు వారన నేల,ఎల్లరు—నిట్టిపణములను వాడియున్నారు. కాని ఆయా రాజవంశముల లాంఛనముల ననుసరించి బొమ్మవైపుగల ప్రతిమ మారుచుండును. చోళులకు వ్యాఘ్రమును, పాండ్యులకు మత్స్యము, చాళుక్యులకు వరాహము— ఈరీతిని వారి లాంఛనము లుండుటచేత ఈపణములు అను నాణెములమీద కూడ బొమ్మవైపు భాగమున వాటి ప్రతిమలు కనబడును. ఇట్టి ప్రతిమలనుబట్టి పణములలో వేలువేలు రకము లేర్పడుచున్నవి. ఈపణము లిప్పుడు వాడుకలో లేకపోయినను ఇప్పటికి నివి దక్షిణహిందూదేశమున చాల చోట్ల దొరకుచుండును. దాని ననుసరించియే యివి పూర్వకాలమున విస్తారము చలామణీలో నుండెడివని చెప్పవచ్చును.

మనకు దొరకిన పణముమీది ప్రతిమవరాహము. చాళుక్యులకును, చాళుక్యచోళులకునుగూడ వరాహమే లాంఛనమగుటచేతను, ఆరెండువంశములవారు నెల్లూరు మండలమును బాలించియుండుటచేతను మనకుదొరకినపణము చాళుక్యులదనికాని, చాళుక్యచోళులదని కాని భావింపవలసి యుండును.

## 'దుర్గివరహా'

మనకు దొరకిన రెండవబంగారునాణెము మొదటి నాణెమునకు భిన్నమైనది. ఇది గుండ్రనైన చిన్నచింతగింజవలె బొద్దుతేరియున్నది. దీనిని ఎవరో నగక్రింద నమర్చుకొని యుండవచ్చును బొమ్మవైపుగాక రెండవ ప్రక్క టంకమువేసి అతికించి బంగారుతో కొంతవఱకు మూసి యున్నది. అతికించిన భాగమున బాగుగ పరికింపగా లోపలనందినాగరిఅక్షరములు కనిపించినవి. పిదప అక్షరములనుజదువవలయునను ఉద్దేశముతో టంకముతో నతికించినభాగమునుఆకురాతితో కోయించితిని. కోయింపకపూర్వము నేనీనాణెమునుతూచియుండలేదు. కోయించినపిదప నాణెముయొక్క స్వరూపమును దెలుపునదియే యీప్రక్క ప్రతిమ.

౨





నాణెముయొక్క అసలు పరిమాణము (size)





నాణెముయొక్క పరిమాణము పెద్దదిచేసి చూపబడినది.

బొమ్మవైపుభాగమున పీఠముమీద కూర్చుండిన దుర్గాదేవి ప్రతిమకలదు. దుర్గాదేవి తన కుడికాలిని బాగుగ ముడిచి పీఠముపై నాన్చి ఎడమకాలిని మడిచి కొంచెము కోణాకారమున నిలువుగా నుంచి కూర్చున్నది. కుడిచేతినించుకముడిచి అభయహస్తాకృతి నుంచినది. ఎడమచేతిని ఎడమ మోకాలిమీదుగ దానికాస్త క్రిందికి వాల్చినది. దేవి శిరస్సున కిటునటు ఏవియో గుర్తులు కలవు కాని మొత్తముమీద ప్రతిమయంతయు బాగుగ అరిగిపోవుటచేత ఆగుర్తు లివియని చెప్పుటకు వీలగుట లేదు.

రెండవవైపున ఈనాణెమునకు అడ్డముగ మూడు పంక్తులవ్రాత కలదు. ఎగుడుదిగుడులు రాకుండుటకై క్రిందను, పైనను ప్రతిపంక్తికి రెండు అడ్డుగీటులు గీసి, అందక్షరములు వ్రాయబడినవి. టంకమతికించి ఈనాణెమును నగచేయించుకొనుటచేత గావచ్చును, మొదటి పంక్తిఅక్షరములు కానవచ్చుటలేదు. కాని క్రిందిగీటు మాత్రము కనబడుచున్నది. మూడవపంక్తిలోని అక్షరములు దిగువభాగము పోయినను అవి గుర్తింపవీలుగ నున్నవి. రెండవ పంక్తిలోని అక్షరములు బాగుగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాన్పించుచున్నవి. మొత్తము మూడు పంక్తులలోని వ్రాతను ఈ క్రిందిరీతిని జదువవచ్చును:—

౧-వ పంక్తి: [ప్రతా*]

౨-వ పంక్తి: పకృష్ణ

౩-వ పంక్తి: [రాయ].

దీనివలన నీనాణెము కృష్ణదేవరాయలదని తేలినది. ఇది కృష్ణదేవరాయలదని తెలియుటచేత మొదటి పంక్తి యూహించి వ్రాయబడినది. అక్షరములున్న వైపు మూసియున్న భాగమును కోయించినపిదప తూకము చేయగా నిది ౪౮ ధాన్యపు గింజలయెత్తు తూగెను. దీనితూక మింతకంటె నెక్కువయుండుననుటకు సందియము లేదు.

సాధారణముగ దక్షిణహిందూదేశపువరాహనాణెములు (వరహాలు) ౫౨ ధాన్యపుగింజలు తూగును. మననాణెము ౪౮ ధాన్యపుగింజలు తూగినది. అందువలన మిగిలిన ౪ ధాన్యపుగింజల యెత్తు తూకము అరుగుదలచేతగాని కోతచేతగాని తరిగినదని భావించునెడల—ఈ భావన సరియైనదే కావచ్చును—మనదివరాహ[1] నాణెమని చెప్పవచ్చును. కృష్ణదేవరాయలకాలమున రెండు విధములైన వరాహనాణెములు చలామణిలో నుండినట్లు రాయల నాణెములనుబట్టి తెలియవచ్చుచున్నది. అవియేవనగా (౧) వేంకటేశ్వర వరాహనాణెములు (వేంకటేశ్వర వరహాలు); (౨) దుర్గి వరాహనాణెములు (దుర్గివరహాలు). అందువలన మనకు దొరకినది కృష్ణదేవరాయల 'దుర్గి(దుర్గా ప్రతిమ గల) వరహా' అనుటకు సందియము లేదు.

సాధారణముగ బంగారుపణము 'వరహా' లో పదియవవంతు తూకముగల నాణెము. అందువలన మనకుదొరకిన రెండునాణెములలో

(౧) చాళుక్యుల బంగారు పణము, (క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దికి పూర్వపుది)

(౨) ప్రతాపకృష్ణదేవరాయల 'దుర్గి వరహా' (క్రీస్తుశకము పదునారవ శతాబ్ది ప్రథమభాగమునాటిది) అని తేలుచున్నది.

మ. సో. శర్మ.

---

## 12. నూటయిరువదియేండ్లు వయసుగల చిలుక

ఈచిలుక కర్నలు, డబ్ల్యూ. బి. పెర్రిన్ అనువారికడనున్నది. దీనితలమీద కొంతభాగము బట్టకట్టిపోయినది. దీనివయసు నూటయిరువదియేండ్లకన్న నధికముగానుండునని విశ్వసించుచున్నారు. ౧౮౭౨ సంవత్సరమున నిది కొల్లాపురపుమహారాజావారిదిగ నుండెను.

---



---

1. చాళుక్యులు తమవరాహలాంఛనమును తమవంశపు బంగారునాణెములమీద ముద్రించి చలావణీకి దెచ్చుటచేత ఆనాణెములకు అదిమొదలు వరాహనాణెములు(వాడుకలో వరహాలు)అను పేరుకలిగెను. కాలక్రమమున దక్షిణహిందూదేశమునందలి పెద్దబంగారునాణెములకు—ఆనాణెములమీద బొమ్మలేవియున్నను — వరహాలనియే వాడుకవచ్చెను. వేంకటేశ్వరప్రతిమగలవి వేంకటేశ్వరవరహాలు: దుర్గప్రతిమగలవి దుర్గివరహాలు: ఇట్లే తెలియునది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## 13. చీనాదేశపు ప్రాచీనచిత్రలిపి

[మాధురీ(హిందీ) పత్రికలోని వ్యాసము ననుసరించి వ్రాసినది.]

ఏదేశపు వాస్తవేతిహాసము నెఱుఁగుటకైన ఆ దేశపుభాష నధ్యయనముచేయుట యావశ్యకము. సాహిత్యమువలనఁగాక సరియగు నితిహాసము లభింపఁజాలదు. దేశవాసుల మానసికసాహిత్యికావస్థల జ్ఞానము ఇతిహాసమున కొక ముఖ్యాంగము. చీనాదేశపుఁ బ్రాచీనసాహిత్యమందలి కొన్ని మనోహరములగు శబ్దములఁ గూర్చి యిటఁ గొంత వ్రాయుచున్నాను. దీనినిబట్టి వారి నాగరకత కొంత తెలిసికొనవచ్చును. వారిభాష చాలకఠినమైనదయ్యు చక్కనిది. స్మరణశక్తిబాగున్న వారికీభాష నెఱుఁగుట కష్టముగాదు. ఈభాషలో నాయాశబ్దముల కాయాచిత్తరువు లున్నవి. ఆచిత్తరువులవలననే భావములు వ్యక్తమగును. కావుననే దీనిని చిత్రలిపియందురు.

ఈభాషలో 'మనుష్యుఁడు' అనుటకు మొదటి చిత్రము వ్యవహరింపఁబడును. ఇందు రెండురేఖలుమాత్రమున్నవి. ఇవి మనుష్యుని కాళ్లకుప్రతి. దీనివలనఁ దెలియవచ్చెడి దేమన, చీనావాసులు మెడయొక్కయుఁ జేతులయొక్కయు ప్రయోజనప్రాధాన్యముల బాగుగ గుర్తింపలేదు. ఇంకను బూర్వపుసాహిత్యమునందు 'మనుష్య' శబ్దమునకు చిత్రము మిక్కిలి సరళమై, మనుష్యస్వరూపమునకే అచ్చుగనుండెడిది. (Israelits) ఇస్రేలిట్స్ ఎఱ్ఱసముద్రమును దాటుట కేడుశతాబ్దముల పూర్వము వఱకు నెం. 2 చిత్రము వ్రాయుచుండెడివారు అనంతరము నెం. 1 చిత్రమే వ్రాయ మొదలిడిరి.

ఇంచుమించు ప్రతిశబ్దమునకు నొకచిత్ర మున్నను, ఒకశబ్దమునందనేకశబ్దసమావేశము గల్గును. అట్టిశబ్దము కొఱకనేక చిత్రములు కూర్పనయును. 'గొప్ప' అను మాటవ్రాయుటకు నెం. 3 చిత్ర ముపయోగింతురు. 'మనుష్య' చిత్రము వ్రాసి నడుమనుండి యొకగీత గీచిన, సృష్టియందన్నిటికన్నఁ బ్రబలతరవస్తువు మనుష్యుఁడే యని యభిప్రాయము. మానవజాతికంటె గొప్పది స్వర్గీయసత్త్వమొకటియున్నదనియు, మానవుఁడొక సర్వశక్తిమంతమగు సత్త్వమున కధీనుఁడనియు జనుల కొక నమ్మకయు నుండెను. కనుక 'గొప్ప' నెత్తిపై నొక అడ్డుగీత గీచినచో మనుష్యునిగొప్పతనముతగ్గి, స్వర్గమును దెలుపునొక చిత్ర మేర్పడును(నెం 4).

'మనుష్య'ని కింకొకరూప మున్నది కానియది కొన్ని తావులందే ప్రయోగింపఁబడును. ఇతరశబ్దములతోఁ గలిపివ్రాయునపుడు నెం. 5 మాదిరిగ వ్రాయవలెను. ఈదిగువఁగల యుదాహరణముచే అది తేటపడును. పొలముదున్నివిత్తెడువారలనుకృషకులందుము. చీనాలోఁ గూడ నిదియే పరిభాష; దీని ననుసరించియే వారి 'కృషక' శబ్దమేర్పడినది. 'పొలము'యొక్కచిత్తరువున కెడమప్రక్క 'మనుష్య'ని జేర్పగా 'కృషక' శబ్దమయినది. (నెం. 6). ఈచిత్రమునవలన వారికి సుఖమనిన నెట్టి యనుభవముండెనో, వారిసంఘమున సుఖమన నెట్టి పరిభాష యుండెడిదో సూచితమగును: 'పొలము'నకుపైని 'ముఖము' (నెం. 7) వ్రాసి, యెడమప్రక్క మనుష్యుని వ్రాయుటచే 'సుఖ'చిత్ర మేర్పడును (నెం. 8). ఇది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చీనాదేశపు కృషకులక్షుధార్తమసదశను బాగుగఁ బ్రకాశిత మొనర్చును. లక్షలకొలఁది పాటుపడు కృషకుల పొలములు వరదలవలన జలప్లావితములై నశించుచుండిన దుర్భరస్థితిలో, నెవని సేద్యము సురక్షితమై ధాన్యఫలిత మగుపొలము చెడిపోకయుండెనో వానిని సుఖవంతునిగా నెంచుట స్వాభావికమును ఉచితమునుగదా!

ఇఁక దండనపద్ధతినిజూతము. చీనాలో, పూర్వము, ఖైదీమెడలో మిక్కిలిబరువై చతుర్భుజాకారము గల కట్టెబేడీ ఒకటితగిలించి, పట్టణమంతటను ద్రిప్పెడు వారు. దీనినిబట్టి, ఖైదీచిత్రము వ్రాయుట సుకరము. ఒక చతుర్భుజము నడుమ 'మనుష్య' చిత్రము వ్రాయుటచే 'ఖైదీ' అగును (నెం. 9).

'సూర్య'శబ్దము రెండు విధములుగా వ్రాసెడు వారు. చాలకాలమునకు పూర్వము ఒకసున్నచుట్టి యందొకచుక్క పెట్టినచో 'సూర్యుఁ'డనియర్థము (నెం. 10). కాని సున్నకంటె చతుర్భుజము వ్రాయుట సులువు; కావున వంకరగీతలకుమారుతిన్ననిగీతలువచ్చి, 'సూర్యుఁడు' నెం. 11 వలె వ్రాయసాగిరి. సూర్యునితరువాతవృత్తము కావలసివచ్చి దానికై సూర్యునిక్రింద నొక యడ్డుగీత వ్రాసిరి (నెం. 12). 'ప్రకాశ'చిత్రము చిత్రముగ నుండును. మొదట సూర్యుని వ్రాసినారు; అతని ప్రకాశము చాలినదికాదు; 'చంద్రుని' జోడించినారు. అప్పుడు 'ప్రకాశ' మేర్పడినది (నెం. 13). ఈశబ్దములలోఁ బ్రతి రేఖకు నేదో యర్థ ముండును. 'ద్వార'శబ్దములో ప్రవేశ మార్గము స్పష్టముగ తెలియును (నెం. 14). వారికిని చోరభయముండెనుగాఁబోలు, రెండుద్వారములకునడుమ నొకగీతగీసి తాళము ఏర్పఱుచుకొనిరి (నెం. 15). ద్వారముమధ్య ముఖము వ్రాయఁగా 'బిచ్చము' ఏర్పడెను (నెం. 16).

చీనాదేశమున స్త్రీల దశ చాల శోచనీయము. పురుషులన్నిటను ప్రభువులుగను, స్త్రీలు నీచముగను పరిగణింపఁబడెడువారు. ఈప్రాచీన చిత్రలిపిలో 'స్త్రీ' శబ్దము 'సందేహము' 'ధూర్తత' యను రెండు శబ్దముల కూడికవలన నేర్పడినది (నెం. 17). సౌశీల్యము, సౌజన్యము స్త్రీలసొత్తని సభ్యజాతులెల్ల భావింప చీనావారొప్పుకొనరైరి. స్త్రీశబ్దము రెండుమార్లువ్రాసిన 'జగడము' ఏర్పడును (నెం. 18). పలువురు స్త్రీలు కూడినచోట గడబడ తప్పదని నమ్మి 'గడబడ' యనుటకు మూఁడు స్త్రీచిత్రములు వ్రాసిరి (నెం. 19).

'కప్పు'క్రింద 'పంది'ని వ్రాసినచో వారి 'గృహ' శబ్ద మేర్పడును. స్వాభిమానమే మైపోయెనో తెలియదు, ఇంత యుత్కృష్ట గృహనిర్మాణము చేసికొనుటకు. వారి వివాహశబ్దము చూడుఁడు: 'కప్పు', 'పంది', 'స్త్రీ'— ఈమూటివలన వారి 'వివాహ' మయినది (నెం. 21). స్త్రీలేమి యపరాధమొనర్చిరో, యీ లిపి సృష్టించినవారికి! పవిత్రమగువివాహసందర్భమున స్త్రీకిని, పందికిని ముడిపెట్టినారు. స్త్రీలకంటె పురుషులు శ్రేష్ఠులనవలెనఁట! పాపము, స్త్రీలకు జ్ఞానసంపాదనమునకు వీలును, సంఘములో గౌరవమును లేవు; ఏమిచేయుదురు?

ఒకవిశేషము. ఒకస్త్రీకి కర్మముచాలక ఆఁడుబిడ్డపుట్టినచో నామెపాట్లు చెప్పఁదరము కాదు. ఆఁడుబిడ్డతండ్రి యనిపించుకొనుట చీనాయువకునకు శిరచ్ఛేదమే. ఏపుణ్యముననో ఆమెకు మగవాఁడు కలిగెనా, ఆమె సత్కారమునకు మేరలేదు. కనుక 'స్త్రీ' 'పుత్రి' శబ్దములఁగూర్చి 'మంచి' యనుశబ్దము నేర్పఱిచిరి (నెం. 22). దానిలో నింతచరిత్ర మున్నది.

కాని, 'శాంతి'శబ్దముమాత్రము స్త్రీలకు మంచి కానుకయే. ఇతరశబ్దములలో నేమినిందించినను, ఇందుమాత్రముమంచిసత్కారమున్నది. 'కప్పు', 'స్త్రీ'—ఈ రెండునుకలిసి 'శాంతి' శబ్దమేర్పడినది. ఏ యింట స్త్రీ వసించునో యది శాంతినిలయమని భావము. (కానిపలువురుండఁగూడదు; గడబడయగును).

దీనినిబట్టి చీనావారిపూర్వచరిత్రకొంత తెలియును. కాని వారు నేఁడు చాలవృద్ధిలోనికి వచ్చిరి. సాహిత్యముగూడ బాగుపడినది. ఈయౌన్నత్యములో ఈచిత్రలిపిని మఱచిపోక, ఈ పాశ్చాత్యానుకరణమునఁ దమ పూర్వపురుషుల యాదర్శముల నాహుతిసేయక వారు సదా గమనించుచుండవలెను.

'God had made of one blood all nations to dwell upon earth' అని యాంగ్లేయులు గ్రహించుటకై దువందలయేండ్లకు పూర్వమే చీనాదేశపు దార్శనికుఁ డొకఁడు

'Tien Hsia Yea Jia' (లోకమునఁ బ్రాణుల కన్నిటికి జాతియొక్కటే) యని ప్రకటించియుండెననుమాట వారు మఱవరాదు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# మధుపము

రాజా మంత్రిప్రెగడ భుజంగరావు గారు

సరసులఁ జేరి భంగముల సంగతినొందని వారితావులం
దిరుగుఁడు; నొవ్వనీయనిగతిం దదధీనమధూపహారముం
గరమనురక్తిఁ జేకొనుఁడు; నావలె నోజనులార! యంచునీ
వఱచిన నాలకింపరుగదా! మధుపంబ! వివేకహీనులై.

చ. ఎటుగడియింతువో? మధువు నెట్టులు గ్రోలుదొ? యెట్లు సంతతిం
గటకట నొందకుండఁ గడఁకన్ భరియింతువొ? కూర్చువారికీ
వెటు సకలంబొసంగెదవొ? యెట్లు చరింతువొ నీచరిత్రవి
స్ఫుటముగఁ బెట్టఁ బుట్టునను చొప్పను జూపెదు నోమధువ్రతా!

చ. ముదమునఁ దేనెనిచ్చు మృదుపుష్పములం గసుగందనీను; న
న్నదయతఁ ద్రోలునట్టి మనుజాళి నడంతును గుట్టికుట్టి; మీ
రిదిఁ బరికించి వర్తిలుట యెంతయు మేలన నీవు, మానవుల్
మదిఁ దలపోయ రా తెరఁగుమాటల నోమధుపావతంసమా!

మ. ఋతులభ్యంబగు వస్తుజాలమును మీ యిండ్లన్నెరిన్నించి సం
తతిఁ బోషించుచు జీవయాత్ర గడుప స్వప్రక్రియం జేయుఁ డం
చితమార్గం బిది, లేనిదానికొఱ కాసింపంగ మేలే? మధు
వ్రతమార్గం బిది యందు వీవు మధుపంబా! లుబ్ధమర్త్యాళితోన్.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# చీనాదేశపు జాతీయోద్యమము

జయంతి వెంకట కిరీటిరావు గారు

చీనాదేశ వ్యవహారము లిపుడు ప్రపంచమునం దెల్లరదృష్టి నాకర్షించుచున్నవి. ప్రపంచ రాష్ట్రముల రాజకీయజ్ఞులందరు మరుక్షణమునందు చీనాయం దేమి జరుగునో యని అత్యాతురతతో వీక్షించుచున్నారు. చీనాదేశమునందు విజృంభించుచున్న మహాసంగ్రామ సంఘటనములపై నొక్కచైనీయుల భాగ్యభోగ్యములే ఆధారపడియుండలేదు; ప్రపంచ వ్యవహారముల భావి ప్రవృత్తియంతయు ఆధారపడియున్నది. ప్రపంచమునందు బలవంతములగు అమెరికా, ఐరోపా, జపాను, దేశములన్నియు ఈవిషయమును గమనించినవి. పట్టపురాణికి పుత్త్రజననమగునా, పుత్త్రికా జననమగునా యని ఆతురతతో వేచియుండు వారసులవలె, ప్రస్తుతము ప్రపంచమున నాయకత్వము వహించిన నాయకరాష్ట్రములు, చీనాయందు జరుగుచున్న ప్రాక్పశ్చిమవిజ్ఞానసంఘట్టనములసమయమున కాలగర్భమునుండి యేమియుద్భవించునాయనిఆతురతతో జూచుచున్నవి. చీనాయందు విజృంభించుచున్న అంతస్సంగ్రామము లాకాల దేవతయొక్క ప్రసవవేదనలు. తత్ఫలితముగ ప్రాగ్విజ్ఞాన పునఃస్థాపనాచార్యు డుదయింపవలెను. లేనియెడల? లేనియెడల ఏమగునో చెప్పజాలము. కాని ప్రపంచ చారిత్రము 'లేనియెడల?' యను ప్రశ్నకు తావిచ్చుట లేదు. కడచిన యిరువదేండ్లనుండియు చీనాచారిత్రమును గమనించినవారు చీనాజాతీయోద్యమము విదేశీయ నిరంకుశ దాస్యమును తిరుగద్రోసి ప్రాగ్దేశములవిజ్ఞాన భాస్కరుని స్వచ్ఛకాంతులతో ప్రకాశింపజేయుట కెట్లుయత్నించుచున్నదియును, ఇంతవర కెటులు విజయ పరంపరలు చూరగొనుచున్నదియును, ఇక ముందుగూడ విజయమందు చిహ్నము లెటులగుపడుచున్నదియును గమనింపగలరు.

1911 సం.నకు పూర్వము చీనాదేశమును 'మంచు' వంశ రాజకుటుంబమువారు పరిపాలించుచుండిరి. ఆసంవత్సరముననే ప్రజాస్వామిక ప్రభుత్వ మేర్పడెను. పాలకుల అశ్రద్ధచేతను, ప్రజలలో నానాటికి పెరుగుచున్న స్వాతంత్ర్యేచ్ఛచేతను, ప్రక్కనున్న జపాను రషియా నోడించి చీనాయువకులకు ధైర్యపాఠముల బోధించుటచేతను, ప్రజలలో ఏకవ్యక్తిపరిపాలన తొలగించి ప్రజాస్వామిక ప్రభుత్వమును స్థాపించవలెనను కోర్కె ప్రబలియుండెను. పెక్కండ్రు సేనానాయకులు సైన్యముల గూడ దీసికొని ఒకరినొకరు మించయత్నించుచున్నారు. అనేక వత్సరములనుండి స్థాపితమైయున్న రాజ్యమును పడగొట్టి నూతనాధికారమును స్థాపించులోపున దేశములో అరాచకము ప్రబలుట యొకవింతగాదు. దీనికి తోడుగ వర్తకవ్యాపారములకై వచ్చిన పాశ్చాత్యజాతులు తమలోతమకుగల యీర్ష్యచేత స్వాధికారమును పెంపొందించుకొనుటకో లేక యితరుల యధికారము వృద్ధిపొందకుండ జూచుటకో చీనాయొక్క అంతఃకలహములందు పాల్గొనుచు అప్పటిపరిస్థితుల మరింత కలవరపెట్టుచున్నవి. విదేశములవలన గలుగు నిరంతర ప్రతిబంధములచే దేశీయులలో జాతీయభావము పెంపొందుచున్నది.

## ప్రజాస్వామిక ప్రభుత్వము-అంతఃకలహములు

1908 సం.రం చీనాదేశపు రాణి చనిపోయెను. రాజవంశమువారు జాతీయవాదుల కాశలు గల్పించి వశపరచుకొనజూచిరి. కాని దక్షిణమున డా. సనుయటుసేనుగారి ఆధిపత్యముక్రింద తీవ్రమగు జాతీయపక్షమొకటి యేర్పడి నిరంకుశప్రభుత్వమును తొలగించుటకు బ్రహ్మాండమగు కృషిచేయుచుండెను. వారి ప్రోత్సాహము పదునాల్గురాష్ట్రములవరకువ్యాపించి తన్మూలమున 1911 సం. హాంకోనగరమున గొప్పతిరుగుబాటు జరిగెను. అప్పటిరాజు విప్లవము నణచుటకుతగిన సామర్థ్యములేక పారిపోయెను. వివిధరాష్ట్రప్రతినిధులుచేరి రాష్ట్రమునకు ముఖ్యపట్టణమగు పెకింగును వశపరచుకొని ప్రజా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




తూర్పు చీనాదేశపు నూతనపటము

ప్రస్తుతము యుద్ధసన్నాహములు జరుగుచున్న ముఖ్యస్థానము లిందు గనుపరుపబడినవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వామిక ప్రభుత్వమును ప్రకటించి డా॥ సనుయటు సేను గారిని అధ్యక్షునిగ నెన్నుకొనిరి. వివిధరాష్ట్ర ప్రాతినిధ్యముగల పార్లమెంటుసభ, అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, ప్రధానమంత్రిగల రాజ్యాంగవిధానము ఏర్పరుప బడెను.

డా॥ సనుయటు సేనుగారు అధ్యక్షపదవిని వేరొకరి కప్పగించి తాను రాజకీయములనుండి విరమింప దలచెను. ఆయన తరువాత నధ్యక్షులుగవచ్చినవారు అధికారమంతయు తామే స్వీకరించి రాజులుగ నేలయత్నించుచుండిరి. ఇదిగాంచి డా॥ సేనుగారు కేంద్రప్రభుత్వమును బలపరచి నిజమగు ప్రజాస్వామిక ప్రభుత్వముగ జేయ యత్నించెను. కాని ఉత్తరదేశములో బహునాయకత్వము ప్రబలియున్నది. ప్రభుత్వాధికారమునందున్నవారి పరిపాలనాపద్ధతులు జాతీయానుకూలముగ లేవు. అంతఃకలహములకు అంతులేకుండెను. సేనాధిపతులు ఒకరిపై నొకరు దండెత్తిపోయి బలముగలవారిచే రాజ్యముగ నెవరికిచిక్కినచోట్ల వారు రాష్ట్రాధిపత్యమును వహించుచుండిరి. నాటినుండి నేటివరకును ఉత్తరచీనాదేశము ఇటులే యున్నది. అందుచే సనుయెటు సేనుగారు కాంటనునందు వేరొక ప్రభుత్వమును స్థాపించిరి (1907). ప్రక్కనున్న రెండురాష్ట్రములందు చేరెను. ఈమూడును గూడి సక్రమముగను జాతీయవిధానానుసారముగ డా॥ సేనుగారిచే పరిపాలింపబడుచుండెను. కాంటను ప్రభుత్వమే న్యాయమగు చీనాప్రభుత్వమని ప్రకటించి దేశమంతయును కాంటను పరిపాలన క్రిందచేర్చుట కాతడు యత్నించెను. ఉత్తరదిక్కునకు దండెత్తిపోయి క్రమేణ యెక్కువభాగమును తన రాష్ట్రముక్రింద చేర్చుకొనుచుండెను. జాతీయవాదులు దేశాభిమానులందరు ఈపక్షమునందు జేరుచుండిరి.

పెకింగు, కాంటనుప్రభుత్వములు రెంటికిని ధనాభావమువలన యిక్కట్టు సంభవించెను. పెకింగు ప్రభుత్వాధికారమునందున్న టుయాన్‌చిజీగారు ఆర్థిక పరిపాలన ముఖ్యాంశములనుగూర్చి చర్చింప పెకింగు నగరమున వివిధరాష్ట్రనాయకులసభ సమావేశపరచెను. దేశమునందు నిరంతరశాంతికి కలహములు అణగి, క్రొత్తకాలము కొంతప్రబలి; వివిధనాయకులకు సఖ్యముకుదిరి చీనాస్వాతంత్ర్యసాధన నిర్మాణమున కవకాశముండునేమో యనెడి ఆశలు వొడముసరికి మరల గొప్పవిపత్తు సంభవించెను. ఉత్కృష్టదేశాభిమానియు, ప్రజాస్వామిక ప్రభుత్వసంస్థాపకుడును, అమిత మేధాశక్తిసంపన్నుడును నగు డా॥ సనుయటు సేనుగారు ఆసక్తకుబోయి రోగపీడితులై మరణించిరి (1925 మార్చి).

కాంటను ప్రభుత్వమునకు ఆదినుండియు విదేశీయులన్న సరిపడదు. విదేశీయ బహిష్కారమునుగూర్చి తీవ్రముగ ప్రచారము చేయుచుండును. ఉత్తరదేశ సేనాధిపతులకీదీక్ష లేదు. పెకింగుప్రభుత్వమునకు తగినబలములేదు. సేనుగారి మరణానంతరముగూడ కాంటను ప్రభుత్వము వారు వారియుద్దేశ్యముల నెరవేర్చుచుండిరి. విదేశీయుల నిరంకుశనిర్బంధములనుండి తొలగిపోవ నిరంతర కృషి సలుపుచుండిరి. దేశహితముకన్న స్వార్థపరత్వము నెక్కువ పాటించు ఉత్తరదేశపు సేనానాయకులు ఇట్టి కాంటను ప్రభుత్వమును అణచివేయ జూచుచున్నారు. అట్లని కలసి ఒక్కమారుగ పైబడుటకు వారిలో వారికి సఖ్యము లేదు. కాంటనుకు గల కట్టుదిట్టములు, ప్రోద్బలము వారిలో నెవ్వరికి లేదు.

## సేనాధిపతులు; నాయకులు

1926 వ సంవత్సరమున ఉత్తరదేశములందు సేనానాయకులు అంతస్స్వంగ్రామమునందు పాల్గొనుచున్నవారు పెక్కండ్రుగలరు. అందు ముఖ్యముగ గమనింపదగ్గవారు, కొన్నిభాగముల నాక్రమించుకొని యున్నవారు, నలుగురుగలరు.

(1) చాంగ్‌టోస్లినుగారు—మంచూరియాయీశాన్యదిక్కునందలి నాయకుడు. పలువురుజపానీయులు వీరికిక్రింద సైనికోద్యోగులుగ నున్నారు. ఇతరసేనాధిపతులకన్న ధనికులు. వీరు ఒకమూలనుండి కాంటనుపైకి దాడివెడలుచున్నారు.

(2) ఫెంగుయు శియాంగు గారు— పశ్చిమోత్తర భాగమునందు నాయకుడు. క్యూమనుచెన గారు వీరిక్రింద సేనాధిపతి. వీరు జాతీయవాదులు. విదేశీయులన్న సరిపడదు. కాంటనువలెనే విదేశబహిష్కారములరడి బ్రిటిషు ప్రతికూలాభిప్రాయములను వ్యాపింపజేయుటయందు ఉత్తరమున మిక్కిలి పాటుబడుచున్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(౩) ఊపె ఫుసేనాని—వీరు మధ్యభాగమునందు ఎక్కువఅధికారము గలిగియున్నారు. ఆధునిక సైనిక విద్యలందు ఆరితేరినవారు. వీరికి దేశాభిమాన మెక్కువ



జనరలు ఫెంగు యుసియాంగు

గలదు. ధనసహాయములేదు. చాంగ్‌టోస్లినుగారిని మూడుసారు లోడించిరి.

(౪) సెకొచాంగుఫాంగుగారు—యాంగ్ట్సిలోయను, షాకొటాంగును ఆక్రమించుకొనిరి. ఆవైపునుండి కాంటను పైకి దాడివెడలుచుండిరి.

(౫) దక్షిణచీనాయందు కాంటనుప్రభుత్వ మధికారము గలిగియున్నది. డా. సేనుగారి మరణానంతరము వారిభార్యయు కుమారుడు నాయకత్వమువహించియున్నారు. చియాంగకాయుషేకుగారు వీరికి సేనాధిపతిగను, యూజినుచెనుగారు విదేశాంగమంత్రిగను నుండి సర్వవ్యాపారముల నడిపించుచున్నారు. చెనుగారు స్వా



మార్షలు చాంగ్‌టోస్లిను

తంత్ర్యప్రియులు; ధీరులు; రాజనీతి నిపుణులు; ధర్మగుణముగలవారును. వీరు హాంకోవరకు నాక్రమించుకొని బ్రిటిషువారి యాధీనమందుండిన యానగరమునుండి క్రిందటినెలలోనే ఆంగ్లేయుల వెడలగొట్టిరి. ఆంగ్లేయ ప్రతినిధియగు ఓమల్లెగారు సంధిచేసికొని హాంకో పరిపాలనపూర్తిగ వారికొప్పగింపక తప్పినది కాదు.



జనరలు యాంగుసేనుగారు

వీరిసేనలు బ్రిటిషునౌకాదళమును ఎదుర్చుటచేతనే ప్రస్తుతము చీనాయందు యుద్ధసన్నాహములు జరుగుచున్నవి.

## చీనాలో పరరాజ్య విభాగములు

చీనా దేశము వర్తకప్రాముఖ్యముగల దేశము. ఆదేశమునందు వర్తకము చేయవచ్చిన విదేశీయజాతులు రేవుస్థలముల నాక్రమించుకొనినవి. ఎవరి సైన్యములనువారు తెచ్చియుంచుకొనిరి. 40 రేవుస్థలములువిదేశీయుల స్వాధీనమునందున్నవి. షాంగే, హాంకాంగు మున్నగునవి ముఖ్యపట్టణములు. షాంగేయందుమాత్రమే 30,000మంది విదేశీయులు గలరు. సుంకముల విధించునధికారము 13 విదేశీయప్రభుత్వముల చేతులందున్నది. విదేశీయుల నౌకాదళములు చీనాతీరములందు పహరా యిచ్చుచుండును.



మార్షలు ఊపెఫూ

సుమారు ఏబదిరువదేండ్లనుండి ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాంసు, ఇటలీ, జపాను, రషియా మున్నగు జాతులవారు చీనాలో కొన్నికొన్ని ప్రాంతముల వశపర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుకొని ఎవరిమట్టుకువారు ఇష్టము వచ్చినరీతి పరిపాలించుటచే దేశీయుల హక్కుల కాటంకము గలిగెను. ఆయాచోట్లనుండు విదేశీయులు చీనా న్యాయశాసనములకు బద్ధులైయుండ నవసరములేదు. వర్తకపు ఖాసాలు తామే యుంచుకొనుట, రైల్లు, తంతివార్తలు మున్నగునవి వశపరచుకొని తమ ఇష్టమువచ్చిన ట్లుపయోగించుట మున్నగుఅధికారముల చలాయించుచుండిరి. మిలిటరీ వారి దౌర్జన్యములు సామాన్య కృత్యములుగ నుండెను. చీనాయందు బ్రిటీషువారి ప్రవర్తనగూర్చి ప్రొఫెసరు ఎఫ్. ఎ. షెపర్డుగారు ఇట్లు వ్రాసి యున్నారు: "హాంకాంగును బలాత్కారముగ లాగికొంటిమి. బ్రిటిషు శతఘ్నిగోళములచే బెదరించి చీనానౌకాలయముల ప్రవేశించితిమి. చీనాయందు నివసించుచు నీ చీనా శాసనములను న్యాయస్థానములను ధిక్కరించి స్వేచ్ఛాప్రవర్తనకు గడంగితిమి. చైనాసముద్రతీరములందు నదులలోను మన యుద్ధనౌకలను పహారాత్రిప్పుచు అనేక సంవత్సరములుగ నిరంతరమును చీనాదేశీయుల ఆత్మగౌరవముల కాలమట్టుచుండుట విషాదకరమగు కాలవైపరీత్యముగాక వేరేమనదగును. ఈచర్యలవలన చీనాజాతీయౌన్నత్యమునకు ఇంతవరకు మనమే (బ్రిటిషువారు) ప్రబల శత్రువులుగ నున్నాము." ఇట్టిపరిస్థితులను చీనా యువజనులు భరింపజాలకున్నారు. అందుచేతనే విద్యార్థుల సమ్మెకట్టులు విదేశీయబహిష్కారములు మున్నగునవి తరచు జరుగుచున్నవి.

## ఐరోపాయుద్ధము-చీనాకు ప్రతిఫలము

ఐరోపాసంగ్రామప్రారంభ సమయమున చీనాలోని షాంటాంగు రాష్ట్రమునందు జర్మనీవారికిగల వర్తకసౌకర్యములకు, రేవుస్థలములకు ఇంగ్లాండు ఈర్ష్య జెందియుండెను. జపానునకు తన పరిశ్రమలకై చీనా ముడివస్తువులు కావలసియున్నవి. అందుచే పాశ్చాత్య ప్రభుత్వములు యుద్ధములో నిమగ్నమై యున్నపుడు జపాను చీనాలో జొరబడి పీఠమువేసి కూర్చుండ దలచెను. షాంటాంగునందలి జర్మనీరేవుస్థలముల నాక్రమించెను. అంతేకాక దురాశగల్గి చీనాకు నష్టము వచ్చినను తనకే యెల్లసౌకర్యములుండునట్టి హిరణ్యాక్షువరము లనదగు 21 కోర్కెలను పెకింగు ప్రభుత్వమును కోరియుండెను. చీనాదేశీయులకు జపానునెడల అసహ్యము పుట్టెను. చీనాదేశీయుల యభిప్రాయము లటుండ, షాంటాంగునందల యిటీవల జర్మనీవారివిగనుండిన రేవుస్థానములను జపానుస్వాధీనమునందే యుండునటులు చేయుటకు శాంతిసభయందు తోడ్పడెదమని వాగ్దాన మొనర్చుచు ఇంగ్లాండు, రషియా, ఫ్రాంసు, ఇటలీప్రభుత్వములవారు రహస్యపుటేర్పాటుల జేసికొనిరి (1917).

విదేశీయుల ఒత్తిడిచే బాధపడుచున్నను పెకింగు ప్రభుత్వమువారు 1917 సం. యుద్ధమునందు మిత్రమండలివారికి తోడ్పడిరి. సేనల పంపజాలకున్నను సేవకులను పంపిరి. తమ తీరమునకు వచ్చినజర్మనునౌకలబట్టియిచ్చిరి; కాని యుద్ధానంతరము సంధిసమావేశమునందు చీనా ప్రతినిధులు కోరిన న్యాయమగు హక్కులనైనను మిత్రమండలివా రొసంగజాలకుండిరి. 1917 రహస్యపుటేర్పాటుల ప్రతిబంధకమువలన యిప్పుడు జపానునుండితప్పించి షాంటాంగునందలి రేవుస్థానములను చీనాకొప్పగింపజాలకుండిరి. వాషింగుటను సంధిషరతుల ప్రకారము అందు పాల్గొనిన తొమ్మిదిప్రభుత్వములుగూడ చీనావారి స్వాతంత్ర్యాభిలాషను పోషించుటకును, తా మెవ్వరు చీనాదేశపరిపాలన విషయమునందు జోక్యము కలుగజేసికొనకుండుటకును తమదేశీయుల సంరక్షణార్థము మాత్రము కొలదిగ సేనలనుంచుటకును, అట్టి సంరక్షణ చీనాప్రభుత్వమువల్లనే చేకూరునను నమ్మకముతోచినవెంటనే సేనలతీసివేయుటకును అంగీకరించి యుండిరి (1922). కాని చీనాలోని పరరాజ్యస్థానములందు యథారీతిచర్యలు జరుగుచునే యున్నవి.

## ప్రతీకార యత్నములు

వాషింగుటను షరతుల ననుసరించుచు పరరాజ్యములన్నియు చీనాయెడలఅనుకూలముగనుండినట్లైయుండి చీనాలో తమకుగల పలుకుబడి నంతను నుపయోగించి యెవరిబలమును వా రభివృద్ధిచేసికొనుటకును, ప్రజాభిప్రాయమును తమవైపు త్రిప్పుకొనుటకును, మిషనరీలద్వారాను, విద్యాసంస్థలద్వారాను యత్నించుచుండిరి. ఇట్లు చేయుటలో రషియా సోవియటుప్రభుత్వమువారి సేవ చీనాజాతీయవాదులకు సహాయకరముగ నున్నది. రషి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యావారు తమ ప్రత్యేకహక్కులను వదలుకొనిరి. తమకు సహజమగు సాంఘికదృష్టితో జూచి చీనాదేశము ధనాతిశయము, సామ్రాజ్యకాంక్షగల విదేశీయులకే పిప్పి పిప్పి చేయబడుచున్నదని తలంచి యాఉపద్రవమునుండి తప్పించుటకై 1924 సంవత్సరమున సంధిచేసుకొనెను. అంతకు ముందే కాంటనీసు ఉద్బోధనలవలనను విదేశీయులయెడ ద్వేషభావము ప్రబలియుండెను.

1925 సం. షాంగేలో నొక జపాను మిల్లునందు గొప్పసమ్మెకట్టుజరిగెను. విదేశసైనికులుకొందరు విద్యార్థులనుకాల్చి చంపిరి. అందుపై యిరువదిసంవత్సరములకు పూర్వమెన్నడు లేనంతటి యాందోళన బయలుదేరెను. అన్ని ముఖ్యనగరములలోను విదేశీయుల బహిష్కరించుట, సమ్మెకట్టుట మున్నగుసాధనలు జరుపుచుండెను. వీనిఫలితముగ కాంటను ప్రభుత్వమువారు బ్రిటీషువారి స్థానమగు హాంకో నాక్రమించిరి; ఓమల్లె ఒడంబడికనెట్లు సంపాదించిరో పైన పేర్కొనబడినది. విద్యార్థుల నాయకత్వముక్రింద జాతీయోద్యమము బయలుదేరెను. అసందర్భపు సంధిపరతులతొలగింపవలెననియు సుంకముల వసూలుజేసికొను స్వాతంత్ర్య మొసంగవలెననియు వారు పట్టుపట్టిరి. పశ్చిమోత్తరదిక్కు నాయకుడగు ఫెంగుసేనానిగూడ అనేకవిధముల జాతీయోద్యమమునకు తోడ్పడుచున్నాడు.

## చీనాకు భారత సేనల నంపుట

ఈయాందోళనవలన బ్రిటను జపానుదేశముల వర్తకమునకు చాలనష్టము కలిగెను. చీనావారికి వారిపైనసే ద్వేషము మెండు. బ్రిటీషువారు తమహక్కులను, ప్రజలను కాపాడుకొనుటకై ఇంగ్లాండునుండియు, ఇండియానుండియు అధికసేనల నంపుటకు నిశ్చయించి కొన్ని సేనల నంపిరి. ఆశియావాసులును, తమవలెనేస్వాతంత్ర్య సాధనకై పాటుబడుచున్న వారునగు చీనావారిపై తమ సేనలబంపరాదని భారతీయులునిరసించియుండిరి. ఉద్రేకపూరితములగు చీనాసేనలవలనఅచ్చటనున్న తెల్లవారికెట్టి కీడేమివిపత్తు సంభవించునో దానిని సంరక్షించుకొనుటకై యీసేన లంపబడుచున్నవిగాని అచ్చట యుద్ధములేదనియు, ముందుగ తామేమియు దౌర్జన్యమునకు గడంగమనియు బ్రిటీషువారు ప్రకటించుచున్నారు. అమెరికా జపాను ప్రభుత్వములకుగూడ నిట్టికారణములేయుండుటచే తమసేనల నంపిరి. వెరసి అందరి సేనలు షాంఘై మున్నగు రేవుస్థలములందు విడిసియున్నవి. ఎప్పుడేమి సంభవించునో తెలియదు. అమెరికా జపాను ఇంగ్లాండులలో యెవరిబలమధికమయినను యితరులకు ముప్పే.

కాని యుద్ధముజరుగకుండ స్వాతంత్ర్యమును బడయవలెనన్నచో చీనావారు అంతఃకలహములు మరచిపోవలెను. ఉత్తరముననున్న జాతీయపక్షమువారును,కాంటనుప్రభుత్వమువారునుగలసియితరనాయకులనోడించియో, ఒప్పించియో బలవత్తరమగు కేంద్రప్రభుత్వమునుస్థాపించవలెను. అప్పుడుగాని విదేశీయులు ప్రత్యేక సౌకర్యముల వదలి సౌమ్యమార్గముల ననుసరింపరు. కాని అట్లు జరుగునా?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## కుంకుమభరణి

ఏ భాషలోని సారస్వతమునకైనా, అది ఎట్టి ఔన్నత్యమునకు వచ్చియున్నా, దానిలో ఎట్టి ఉద్గ్రంథములున్నా ఎట్టి స్వతంత్ర రచనలు వెలువడుతూ ఉన్నా, భాషాంతరీకరణములు అనవసరములైన స్థితికి ఆ సారస్వతము వచ్చిందని చెప్పశక్యము కాదు. మంచి వన్నెకువచ్చిన ఆంగ్లసారస్వతములోనికి కూడా ఇతర సారస్వతములనుంచి గ్రంథములనేకములు ప్రతీయేటా అనువాదము లవుతూఉన్నవి. అట్టి సందర్భములో మన ఆంధ్రవాఙ్మయమునకు అనువాదములు ఎంత ఆవశ్యకములో వేరే చెప్పనక్కరలేదు. స్వతంత్రములైన ఉద్గ్రంథములు బయలువెడలకుండా ఉన్నప్పుడు, ఇతర సారస్వతముల పరిచయము మరీ ఎక్కువగా ఆవశ్యకము. అట్టి గ్రంథాలను స్వతంత్రముగా రచించాలనే కుతూహలము పుట్టుటకే కాకుండా, రచనానియమములు, కల్పనారుచులు, భావనావిధులు, భావములవర్ణనలు ఈ మొదలైన కవితాధర్మముల బోధనకు సాధనములుగా కూడా అన్యభాషాశిరోమణిగ్రంథములు ఉపచరిస్తూఉంటవి. స్వతంత్రకల్పనకు ఇంకా సాహసము చాలని భావికవులకు కల్పనాశిక్షను కలుగజేయడానికి అనువాదములు ఎంతో ఉపయుక్తములు. ఆంధ్రసారస్వతచరిత్రలో పునస్సృష్టియుగమైన ఇప్పుడు అనువాదములు తీవ్రముగా వెలువడుతూ ఉన్నవి.

శ్రీశివశంకరశాస్త్రిగారు అనువాదముచేయ ప్రయత్నించుటకు ఇందులో ఏ హేతువు పురికొల్పిందో నేను నిశ్చయించి చెప్పలేను. వారు స్వతంత్ర రచనాప్రియులని ఆంధ్రలోకమునకు తెలిసేయుంటుంది. వారి హృదయేశ్వరి, వారిసఖి అందుకు తార్కాణము. అయినా గద్యగ్రంథమునకు ఇదే మొదటి ప్రయత్నము కాబోలు! వారున్నూ, చాలామంది యువక కవులవలెనే బెంగాళీ గ్రంథము నొకదానిని తెలిగించుటలో ప్రత్యేకకారణమేమైనా ఉన్నదా అని తర్కిస్తే, దేశభాషలలోకెల్ల బెంగాళీభాషకు ప్రస్తుతము ఎక్కువగౌరవము ఉన్నదన్న మాట స్ఫురిస్తున్నది. కాని ఆంగ్లవాఙ్మయముకంటె దేశీయకథలు భాషాంతరీకరణమునకు ఎక్కువ సుకరములు. మాటలలోను, భావములవర్ణనలలోను పాశ్చాత్య సంప్రదాయములు అనువాదకులకూ, చదువరులకూ కూడా చాలా క్లేశకరములు.

బెంగాళీ సారస్వతములో పేరువడసిన కవులు ఎందరో ఉన్నారన్న సంగతి ఈ కుంకుమభరణివల్ల తెలుస్తున్నది. ప్రభాతకుమార్ ముఖర్జీ, రవీంద్రుడు, బంకిమ్ వంటి ప్రఖ్యాతపురుషుడుకాకున్నా, ఇతని గ్రంథములకు కూడా ఆదేశములో ఆమోదము ఉన్నది. సిందూర్ పహుల్ అన్న నవలను కుంకుమభరిణ అన్న పేరున తర్జుమాచేశారు. కథ అంత ప్రౌఢమైనది కాకపోయినా అనురంజకముగా ఉంటుంది. కల్పనలో ఏమీ ఎక్కువశిల్పము వ్యక్తము కాకున్నా కథనము మాత్రము చాలా సరళముగా ఉంటుంది. అశ్లీలము, కాని అనారోగ్యము కాని ఏమిన్నీ భావములలోను, మాటలలోను లేదు. మృదువుగా, తిన్నగా, ఒకే ఫలాపేక్షతో కథ నడుస్తూ చదువరులకు ఎట్టిఆయాసము కలుగనీయకుండా, ఆరంభించినది మొదలు పూర్తి అయే వరకూ ఒకేవిధముగా చదివే వారిని ఆకర్షిస్తూ ఉంటుందని చెప్పవచ్చును. కథానాయకుడునవనాగరికుడైన బెంగాళీవకీలు. చదివిన చదువు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వల్లనో, చేసిన సహవాసము వల్లనో కాని అతని అలవాటులు, అతని రుచులు, అతని నడవడి అంతా పాశ్చాత్యులను అనుకరిస్తూ ఉంటవి. క్లబ్బులు, హోటేల్లు, సినిమాలు, ఆటలు, పాటలు మొదలైన ఆధునికపట్టణవాసవృత్తులు అతనికి చాలా మనోరంజకములు. వేషము, భోజనాదులు, పానము, మొదలైన చిన్న చిన్న సంగతులలో అతని జోగున్యక్తమవుతూ ఉంటుంది. అయినప్పటికీ ఘోషాలో ఉన్న వకుళమీద ప్రేమ నిర్మలమై గభీరమై ఉండేది. ఆదరము, గౌరవము, అనురాగము, సహజప్రీతి చూపిస్తూ, ఆమెను ఆకర్షించేడు. ఆమెకు ఏవిధమైన నొప్పి కలుగకూడ దనిన్నీ, ఆమె ధర్మపత్నీపదవికి ఏవిధమైన లోపము రాకూడ దనిన్నీ ప్రయత్నించేవాడు. ఇట్టి దంపతుల ప్రీతివ్యాపారాలను కవి అంత ఎక్కువగా చూపకున్నా, విజయుని సరళత్వమును మాత్రము స్పష్టముగా సూచించేడు. అట్టి విజయుడు జబ్బలపూరు బాటసారులబంగాళాలో ఒకక్రైస్తవయువతిని చూసినప్పుడు కొంచెము చలించినా, ఏమీ నీతికి లోపము రాకుండా ఉండేటట్లు ప్రవర్తించాడు. ఆమె భర్తతో కలిసి అక్కడ ఉంటూ ఉన్నది; పాశ్చాత్యుల ఆచారములను అనుసరించి అందరూ వ్యవహరించే వారగుటచేత, ఆమెతో ఒంటరిగా కలిసిమెలిసి తిరగగలిగినాడు. ప్రథమసమావేశమునుండీ ఆమెకు భర్తవల్ల ఏలాటి సౌఖ్యము లేకున్నదని గ్రహించాడు; తన సాంగత్యములో ఆమె వదనము వికసిస్తూ ఉన్నట్లుకూడా పోల్చేడు. తాగుబోతుతనమువల్ల ఆమెభర్త ఉద్యోగాన్ని పోగొట్టుకొని, పరారై పోయినప్పుడు, సుసీకి తాను తప్ప మరెవరూ దిక్కులేకుండుటచేత, వారిద్దరూ కలిసి తిరగక తప్పిందికాదు. అట్టి సందర్భములో వారికాయములు కూడా సన్నిహితములవటచేత పూర్వము హృదయాలను ఆకర్షించిన గౌరవము వృద్ధికివచ్చింది. సుసీని కలకత్తాకు తీసికొనివచ్చి, హోటేలులో ఉంచి ఆమె సదుపాయములకొరకు శ్రద్ధతీసుకొంటూ ఉన్నప్పుడుకూడా వారి మనస్సులలో పొంగుతూ ఉన్న అనురాగమును వాచా వ్యక్తపరచుకోకుండా నిరోధించుకొని ప్రవర్తించుచుండుటచేత; వారి అన్యోన్యప్రీతి దృఢమవుతూ ఉండేది. మొదటినుండిన్నీ విజయుడు తనకూ సుసీకీగల సంబంధమును వకుళకు తెలియజేస్తూ ఉండేవాడు. వకుళహృదయాన్ని అంతగా విప్పి కవి వర్ణించకపోయినా, ఆమె సౌజన్యత చాలా సరళమైనదని తెలియజేశాడు. ఏదో కొంచెము వికలవైపోందినా, వకుళ ఎప్పుడూ భర్తసౌఖ్యమునకు విఘాతముచేసి తాను సుఖపడాలని అనుకోలేదు. భర్త సౌఖ్యముతో తన సౌఖ్యము మిళితమైయున్నదని సూక్ష్మముగా గ్రహించింది. సుసీతో వివాహమునకు అతనిని పురికొల్పింది. ఎందరుంది బంధువులు ఆమెకు హితముచెప్పినా వినక, సుసీ వివాహమునకు అసూయ చూపకుండా, ఆమెకు ఒక సంపదభరితే ప్రసాదించి తనసవతిగా ఆమెను చేసింది. వకుళహృదయగాంభీర్యము ఆశ్చర్యజనకము. ఆమె చూపిన త్యాగము, ఆత్యాగము ద్వారా పూర్ణసౌఖ్యసంధానము లోకానికి దర్శనప్రాయమని చెప్పవచ్చును. వకుళచరిత్రే ఈనవల యొక్క గొప్ప అంతా. సుసీహిందువుగా మారింది; ఘోషా స్వీకరించింది. కాని ఆమె ప్రేమతత్వము వకుళహృదయతత్వము సుందర దివిటీముందర దీపమువంటిదే. ప్రేమ ఎంత గంభీరమైనా, బాహ్యవిలాసములుకూడా ఉంటేనే కాని సామాన్యపురుషుని పూర్ణానందమునకు సాధనము కాదనిన్నీ అప్రయత్నకసౌందర్యముకంటె ప్రీతిపూర్వకచేష్టలు ఎక్కువగ ఆకర్షిస్తవనిన్నీ కథలో వ్యక్తమవుతుంది. కాని సుసీమాత్రము వకుళయొక్క ప్రేమ అపారమైనదనిన్నీ, అనంతమైనదనిన్నీ గ్రహించి, నిరాత్మస్వర్యప్రేమ హిందూస్త్రీలదే అని చెప్పుతూ పాశ్చాత్యనాగరకతాగర్వభంగముసూచించింది. ఈవిధాన కవి తన స్వదేశాభిమానమును సంపాదించుట ఎంత శ్లాఘనీయమో చదువరులు తర్కించవలెను.

ఈకథలో ఉన్న ఈసహజసరళతకు ఈప్రేమతత్వమునకు, అనువాదకులు దీనిని భాషాంతరీకరించినారని చెప్పవచ్చును. అనువాదము సరళమైన భాషలోఉన్నది. శివశంకరశాస్త్రిగారు చాలారోజులనుండీ వ్యావహారిక భాషాభిమానులుగా ప్రకటించినా, ఇన్నాళ్లనుండు వారి ఆమోదమును వ్యక్తపరుప లేదు. ఆభాషను అవలంబించక పోయియుందురా, గ్రంథానికి తీర్చలేని హానిచేసియుందురు. హాస్యములలోను, శీలవ్యక్తీకరణములోను, భావోద్రేకవర్ణనలలోను, వ్యావహారిక భాష ఎట్లు సులభముగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉంటుందో, ఎట్లు చక్కగా, హృదమవుగా వంగుతూ అను సరిస్తుందో గ్రంథము చదివేవారికి సులభముగా తెలుస్తుంది. కాని భాషాంతరీకరణములో లోపములు ఉన్నవి. బెంగాళీవారికి హిందీ తెలియడముచేత, మాతృకలో వికారముగా ఉండని హిందీని తెనుగులో కూడా కలుపుట చక్కగా ఉండలేదు. బెంగాళీలు హిందీని కలిపి మాట్లాడుతారు. ఆలాగే మధ్య మధ్య ఇంగ్లీషుమాటలు కూడా తెలుగులో సరిపడలేదు. బెంగాళీమాటలలోనగల శ్లేష తెలుగుమాటలలో రానప్పుడు, దానిని వదులుకోక తప్పదు. అనువాదకులకు వ్యావహారిక బెంగాళీ బాగా తెలియకపోవుటచేత కొన్ని తప్పులు చేయడము సంభవించినది. తెలుగుప్రయోగాలలో కూడా కొన్ని వింతలుగా ఉన్నవి. అవి ఒకవేళ మాండలీకాలేమో! వీటి సన్నిటినీ రెండోకూర్పులో దిద్దవచ్చును. మొత్తముమీద అనువాదము బాగుందని అంగీకరించగలము.

పారనంది జగన్నాథస్వామి

---

# గ్రంథపరిచయము

## శ్రీచక్రవర్తి నెపోలియన్ బోనపార్టిగారి జీవితము (వచనము)

అనువాదకుడు : శ్రీయుత కనపరాజు నరసింగరావుగారు ప్లీడరు, కావలి, నెల్లూరుజిల్లా

ఈగ్రంథము 'అబ్బాటు' గారు ఆంగ్లమున రచియించిన నెపోలియనుజీవితము (Abbot's Life of Napolean)నకాంధ్రానువాదము. డిమ్మీసైజు ౨౮౦ పేజీలలో ౨౨ అధ్యాయములుగల గ్రంథైక దేశముమాత్రమే యిపుడు వెలువడినది. ఫ్రాన్సుదేశపుచక్రవర్తియు, అపరాక్రమశాలియు, రణనీతికుశలుండునునగు 'నెపోలియను' చరిత్రము సమగ్రముగ విరివిగ నింతవఱకు నాంధ్ర వాఙ్మయమున లేకుండెను. ఆకొఱంతనుదీర్ప శ్రీనరసింగరావుగారు పూనుకొనుటెంతయుఁ బ్రశంసార్హము. ఇట్టి వీరశిఖామణులచరిత్రము లందఱును చదివికొని ఆత్మోన్నతి బొందుటకును దెచ్చుకొనుట యావశ్యకము. కావున నచిరకాలముననే గ్రంథకర్తగారు శేషభాగమును అనువదించి ప్రకటించి యాంధ్రలోకమునకొసంగి తత్కృతజ్ఞతకుఁ బాత్రులగుదురుగాక!

*   *   *

## చిత్రకథామంజరి (రెండవభాగము)

గ్రంథకర్త; శ్రీయుత రాయసము వేంకటశివుడుగారు. యమ్. ఏ., అధ్యక్షులు, శ్రీవెంకటగిరి మహారాజాగారి కళాశాల, నెల్లూరు. క్రౌనుసైజు. ౧౯౩ పేజీలు. వెల రు. ౦-౧౨-౦.

భారతి, ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక, కృష్ణాపత్రిక మొదలయినపత్రికలయందుఁ బ్రకటితములైన కథలే యిపుడీ గ్రంథరూపమునుదాల్చినవి. ఇందుఁ బదునొకండుకథ లున్నవి. ఆంధ్రలోకమునకుఁ బరిచితపూర్వములైన యీకథలనుగూర్చి విశేషించిచెప్పు టనావశ్యకము. పుస్తకము గ్రంథకర్తగారియొద్దనే దొరకును.

*   *   *

## భీష్మ—అయిదంకములనాటకము

ఆంధ్రగ్రంథరత్నాకరమునందలి ఆఱవరత్నమిది. శ్రీజంధ్యాల శివన్నశాస్త్రిగారు దీనిని శ్రీయుత ద్విజేంద్రలాలురాయిగారు వంగభాషను రచియించిన యీ పేరుగలనాటకమునుండి ఆంధ్రీకరించిరి. దీనినివెనుక వీరు కృష్ణాపత్రికయందుఁ బ్రకటింపఁజేసిరట. డిమ్మిసైజు; పే. ౨౨౦. వెల: చందాదార్లకు రు. ౨-౦-౦ఇతరులకు౨-౮-౦

విలాసము: ఆంధ్రగ్రంథరత్నాకరము, గుడివాడ.

*   *   *

## క్షాత్రకాలపు హిందూర్యులు (వచనము)

గ్రంథకర్త: మాడపాటి హనుమంతరావుగారు. ఇది 'కృషిప్రచారిణీగ్రంథమాల' యందు రెండవగ్రంథము. ఇదిచారిత్రకగ్రంథము. 'రావుబహద్దరు చింతామణిరావు వైద్యా, యం. ఏ., యల్. యల్. బి. గారు వ్రాసినవిఖ్యాతమగు "ఎపిక్ ఇండియా" అను ఆంగ్లగ్రంథములోని వ్యాసములకు నాధవన కేవలము అనుకరణము" అని గ్రంథకర్తగారు పీఠికయందు వ్రాసినారు. క్రౌనుసైజు. పే. ౯౭. వెల: చందాదారులకు రు ౧-౦-౦ ఇతరులకు రు ౧-౮-౦. విలాసము: యామారాము నర్సయ్యకంపెనీ, సుల్తాన్ బజారు, హైదరాబాదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## గ్రంథస్వీకారము

### ౧. తులసీరామాయణము (సర్వచనము)

అయోధ్యాకాండము, ప్రథమభాగము. వేగుంజుక్క-గ్రంథమాలయం దీగ్రంథ మిరువదిరెండవది. గ్రంథకర్త భాగవతుల నృసింహశర్మగారు. డిమ్మిసైజు పే. ౧౨౮. వెల: రు.౧-౮-౦ వేగుంజుక్క గ్రంథమాల, పూడిపెద్ది వారివీధి, బరంపురం, గంజాంజిల్లా.

### ౨. ఆంధ్రగీర్వాణశఠకోపసహస్రము పూర్వార్థము

శ్రీశఠకోపసూరి విరచిత మగు తిరువాయ్మొళ్లి అను ద్రావిడప్రబంధమున కిది అనువాదము. సంస్కృత శ్లోకములు, తెలుఁగుపద్యములు. అనువాదకులు:శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, విజయనగరము మహారాజావారి సంస్కృతపండితులు విజయనగరము. డిమ్మిసైజు; పే. ౨౬౨ కాగితపుబైండు. వెల రు. ౬-౦-౦ గ్రంథకర్తయొద్ద నీగ్రంథముదొరకును.

### 3. శ్రీవైఖానసమంత్రప్రశ్న — దైవికప్రశ్న చతుష్టయ మూలము.

శ్రీవైఖానసగ్రంథమాలయందలి పదునాల్గవకుసుమము. సంపాదకుఁడు, శ్రీ. డి. రంగాచార్యులుగారు, ఈగావారిపాళెము. డిమ్మిసైజు. పే.౧౧౬.రు ౧-౧౨-౦

### ౪. విమానార్చనకల్పః—మరీచిప్రోక్తః (సంస్కృతము)

శ్రీవైఖానస గ్రథమాలయందు పదునైదవకుసుమము. సంపాదకుడు: శ్రీమాన్ భిషగ్వర డి. రంగాచార్యులుగారు, యీగావారిపాళెము. డిమ్మిసైజు. పే.౫౩౫ వెల: రు. ౫-౦-౦

---

## పత్రికాస్వీకారము

### పత్రికలు

| | | | | |
|---|---|---|---|---|
| పుష్పమాల (తెలుగు) | సంపుటము | ౧ | సంచిక | ౨ |
| ఆంధ్రభారతి | ,, | ౧ | ,, | ౧౧ |
| సుజాత | ,, | ౧ | ,, | ౨ |
| సఖి | ,, | ౧ | ,, | ౩ |
| సెట్టిబలిజ | ,, | ౨ | ,, | ౫ |
| ఆర్యకథానిధి | ,, | ౧ | ,, | ౧౦ |
| రంగభూమి (కన్నడము) | | ౨ | ,, | ౩ |

---

## విషాదము

### ఉమర్ ఆలీషా కవిగారు

నా విషాద కథావిధానంబుఁ జెప్ప
లేను, వ్రాయఁగాలేను, నాలోనెయీ
హాగ్ని చల్లారవలయుఁ గాఢానుషంగ [మ
మైనధూమంబు శిఖ లీనమైనపగిది.
నావిషాద కథావిధానంబు నాక
వోష్ణ బాష్పావృతాక్షు లీ యుర్విరాలి
వ్రాయుచున్నవి నా రుధిరంబుచేత
సాంధ్యరాగాలవలె మీరు చదువుకొనుడు.
ఏడ్పుచేబ్రద్దలైన నాహృదయసీమ
గ్రక్కుచున్నది నెత్తు రాగ్రహముచేత
ప్రేతభూతముల్ ద్రావుచు ప్రేమగీతి
పాడుచున్నవి ఆరవాభ్రములు సుధను
గురియుచున్నవి నా కింక మరణమేది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




లోకమంతయును మార్పులను బొందుచున్నది. ఐరోపా మహాసంగ్రామ ఫలము లోకమును పీడించుచున్నను యూరపు రాజ్యములు మామూలు మార్గమును బట్టుచున్నవి. యూరపురాజ్యము లాయుధముల నెప్పటివలె నారాధించుచు ప్రపంచ శాంతికి భంగమును గలుగజేయుచున్నవి. జర్మనీరాజ్యమున కేర్పడిన ఆయుధనియమ మితరరాజ్యములకు గలుగలేదు. గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు, ఇటలీ మొదలగురాజ్యములు సంగ్రామ బీభత్సమును లోకమునందంతటను పూర్వము వలెనే చేయుచున్నవి. ఫ్రాన్సు, మొరాకో సంగ్రామమును జయప్రదము చేసి స్వాతంత్ర్యమును బడయుటకు పాటుబడిన ఒకచిన్నజాతిని పారతంత్ర్యమునందు బంధించినది. ఇటలీ,ఫాసిట్ మిషను స్వదేశమునందును విదేశములందును మానవస్వాతంత్ర్యసంహారమునకు పూనుకొనుచున్నది. గ్రేటుబ్రిటను స్వీయసామ్రాజ్య ప్రయోజనములకు, స్వాతంత్ర్యసంరంభములకు శత్రుత్వమును బూనుచున్నది. భరతవర్షమునందు ప్రజా స్వాతంత్ర్యసంరంభమునందు బ్రిటీషురాజ్య నీతిజ్ఞులు అవలంబించుచున్న రాజనీతి బ్రిటీషురాజ్యాధికారులు అవలంబించుచున్న నిర్బంధ రాజనీతిని విశదముచేయుచున్నది. హిందూదేశమునువింటర్టను ప్రభువు సందర్శించినను,పాత్విక్కులారెన్సు సందర్శించిననుఫలముమాత్రము సమానముగ నున్నది. వింటర్టను ప్రభువుబంగదేశనిర్బంధితులవిమోచనము వారిక్షమార్పణపత్రములమీద నాధారపడియున్నదని పార్లమెంటునందు వ్యక్తము చేసినవిధము దేశాన్నతమైన పరదాస్య పాశబంధముల ప్రభావమును విశదముచేయుచున్నది. లేబరుపక్షమునకు చెందిన లారెన్సుగారు ఇరువదేండ్లలో స్వరాజ్యమును స్థాపింపవలయునని చేసినప్రసంగము సానుభూతిని తెలుపుచున్నను ఫలము సమానముగ నున్నది. సామ్రాజ్య శాసనసభయందును, వంగరాష్ట్ర శాసనసభయందును నిర్బంధితులవిమోచనము నామోదించుచు తీర్మానములు అంగీకృతములైనవి. ప్రజలయందు నిరంకుశ ప్రభుత్వ ప్రసంగములు నిర్బంధితుల విమోచనము పట్లను అడియాసలు గలిగించినవి. కాని వింటర్టనుప్రభువు, ఇర్వినుప్రభువు, లిట్టనుప్రభువు మామూలుపాటనేపాడిరి. కానిప్రజా హృదయమును దహింపజేయుచున్న గాఢసంతాపమును శాంతింపజేయుటకు ప్రయత్నము చేయలేదు. బ్రిటీషుప్రభుత్వము అవలంబించుచున్న నిరంకుశ సంగకుణ విధానము భారతీయుల భక్తివిశ్వాసములను శిథిలము చేయుచున్నది. బ్రిటీషుప్రభుత్వాధికారులకు దండనోపాయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ము మీదగల విశ్వాసము సామదాన సాధన ములమీద లేదని నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. బ్రిటీషు ప్రభుత్వము భరతవర్షమునందు అవలంబించుచున్న రాజతంత్రమునే శ్వేతేతర జాతులపట్లను లోకమునందంతటను అవలంబించుచు ధర్మస్వాతంత్ర్యప్రియుల విశ్వాసమును గోల్పోవుచున్నది.

* * * *

చీనా సంరంభము

చీనా దేశముస్వాతంత్ర్యమునుబడసిఆత్మవికాసము పొందుటకు చేయుచున్న ప్రయత్నములు ధర్మపరాయణుల ప్రశంసలకు పాత్రమగుచున్నను సామ్రాజ్యప్రియుల దండనమునకు గురియగుచున్నవి. ప్రస్తుతము చీనాదేశమునందు కాంటన్ ప్రాంతమునందు జరుగుచున్న దండయాత్ర బ్రిటీషుప్రభుత్వ లక్ష్యమునకు నిదర్శనముగ నున్నది. చీనాదేశమునందు పరరాజ్యములు వందలకొలది స్వాతంత్ర్య సంస్థానములను స్థాపించినవి. ఆ సంస్థానముల యధికారమును నిరోధించుటకు చీనా ప్రభుత్వము చేయుచున్న ప్రయత్నము లన్నియును నిరర్థకము లగుచున్నవి. చీనాయందలి స్వాతంత్ర్య సంరంభమును నిరోధించుచున్న పరరాజ్యములందు గ్రేటుబ్రిటను ప్రముఖముగ నున్నది. గ్రేటుబ్రిటను చూపుచున్న ప్రతిఘటనము, వారిహక్కులను కాపాడుకొనుటకు ప్రయోజనకరమైనను చీనాప్రజల సానుభూతి లేక స్వత్వసంరక్షణము దుస్తర మగుచున్నది. చీనాప్రజలు బ్రిటీషువ్యాపార బహిష్కారమును సంపూర్ణముగ జేయుచు బ్రిటీషుప్రభుత్వముపట్ల గల ద్వేషభావమును విశదము చేయుచున్నారు. చీనాజాతీయ సైనికులు బలవంతముగను బ్రిటీషు అధికారమునుండి కాంటను ప్రదేశమునుతీసికొనుట బ్రిటీషుప్రభుత్వముయొక్క కోపోద్రేకములకు కారణమైనను చీనాజాతీయుల వ్యవహారమును బ్రిటీషు అధికారులు చీనాప్రజలదృష్టితో చూచుటకార్య విధానమునకు ప్రయోజనకరము. చీనాదేశము పరదార్జన్యములతోడను, అంతర్విభేదములతోడను దుఃఖవేదన ననుభవించుచున్నపుడు బ్రిటీషుప్రభుత్వాధికారులు సానుభూతినిచూపుట ప్రయోజనకరము గాని దండయాత్రనుపూనుట చీనాకును, బ్రిటీషుప్రభుత్వమునకును ప్రయోజనకరము కాదు. చీనాయందు పరివ్యాప్తంబగుచున్న స్వాతంత్ర్యసంరంభమును ప్రతిఘటించుటకు బ్రిటీషుసైన్యములను ప్రయోగించుట సహజమైనను, భారతసైన్యములను ప్రయోగించుట అనుచితముగ నున్నది. భారతప్రభుత్వము సామ్రాజ్యశాసనసభతో సంప్రతింపుచేయకనే భారతసైనికులను చీనాదేశమునకుపంపి ప్రజల తీవ్రఖండనములకు పాలైనది. స్వదేశవ్యవహారములందుగాని, విదేశవ్యవహారములందుగాని ప్రమేయములేని భరతఖండస్థితి భారతీయులకు పరమవిషాదమును గలుగజేయుచున్నను భారతీయులకు వారి నిస్సహాయస్థితియందు చేయగలిగిన దేదియును గన్పడకున్నది. చీనాయుద్ధమునందు బ్రిటీషుప్రభుత్వమునకు దక్షిణాఫ్రికా, కనడా, ఆస్ట్రేలియా మొదలగు వలసరాజ్యములు సహాయము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయుటకు బూనుకొనియుండలేదు. నిస్సహా యస్థితియందున్న భరతవర్షమునకు మాత్రమే యుద్ధమునందు నిర్బంధముగ పాల్గొనవల సిన యవసరము గలిగినది. భారతీయులు తాము పారతంత్ర్యమును అనుభవించుటయే కాక ఇతరుల పారతంత్ర్యస్థితికి తోడ్పడుట వారి అవమానమునకు కారణంబగుచున్నది. చీనాప్రజలు వారి మతాచార్యులైన బుద్ధదేవు నకు జన్మస్థానమైన భరతవర్షమునకు గౌర వముచూపుటకు బదులు అవమానముచూపు టకు కారకులు బ్రిటీషుప్రభుత్వాధికారులని గతించిన చీనాసంగ్రామములన్నియును వెల్లడి చేయుచున్నవి. భగవత్కటాక్షమువలన ఓమల్లీ చేనుగార్లకు జరిగిన ఒడంబడిక బ్రిటీషు ప్రభుత్వముయొక్క చీనా దండయాత్రను నిరుపద్రవముగ నంత మొందించునని నమ్ముచు చున్నాము. బ్రిటీషుదండయాత్రకు జపాను, అమెరికా, ఫ్రాంసు మొదలగు రాజ్యములుచూపి న ప్రాతికూల్యమును నీఫలసిద్ధికి తోడ్పడగలదు. చీనాప్రస్థానము విశదముచేయుచున్న పశు బల ప్రదర్శనము పాశ్చాత్యరాజ్యము లవలం బించుచున్న రాజనీతిని విశదము చేయు చున్నది.

* * * *

ఆయుధధారణ పరిమాణము

అమెరికా రాజ్యాధికారి కూలిడ్జిగారు యుద్ధనావల నిర్మాణమును పరిమితము చేయు టకు నానారాజ్యముల సభను సమావేశము చేయుటకు చేసిన ప్రయత్నములు విఫలమగు చున్న విధమును వివిధరాజ్యముల ప్రత్యుత్త రములు విశదము చేయుచున్నవి. యుద్ధనావల నిర్మాణమును పరిమితము చేయుటకు ఇటలీ, ఫ్రాంసు, జపాను నిరాకరించినవి. గ్రేటుబ్రిటను తటస్థభావమును పూనినను తుదకు సమావేశ మునకు అంగీకరించినట్లు వార్తలు తెలుపుచు న్నవి. దీనియందలి గూఢార్థమును నిర్ణయిం చుటకు సామాన్యులకు సాధ్యముకాదు. అమెరికాకును, గ్రేటుబ్రిటనునకును నడుచు చున్న రహస్యాలోచనలు కొంతవఱకు బ్రిటీ షు అంగీకారమునకు సాధనములై యుండు నని యూహింపదగియున్నది. బ్రిటీషు సా మ్రాజ్యాంతర్గతములైన రాజ్యముల సమావే శము బ్రిటీషు అమెరికా రాజ్యముల సం యోగమునకు కారణములను స్ఫురింపజేయు చున్నది. అమెరికాకును గ్రేటుబ్రిటనునకును పరస్పర రక్షణమునకును, సంగ్రామమునకును ఒడంబడికలు జరుగుచున్నవని వదంతులు వ్యాపించుచున్నవి. ఆంగ్లభాషను మాటలాడె డిజాతులన్నియును నొక సమితిగ నేర్పడి, వారి స్వత్వములను గాపాడవలయునని హియరస్టు గారు వ్రాయుచున్న వ్యాసములు ప్రపంచ దృష్టి నాకర్షించుచున్నవి. ఆసమితియందు పారతంత్ర్యము ననుభవించుచున్న భరతవర్ష స్థితి దుర్భరముగ నుండగల విధమును శ్రీ మతి బెజంటమ్మగారు, కృష్ణమూర్తిగారు, సా యర్వీసుగారు మొదలగుప్రాజ్ఞులు తెలియజేయు చున్నారు. స్వాతంత్ర్యభరత వర్షము 33 కోట్ల ప్రజలతోడను, సహజసంపదలతోడను, ప్రాచీ నవిజ్ఞానముతోడను, దైవవిభూతులతోడను లోక కల్యాణమునకు దోడ్పడగల విధమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాంధీమహాత్ముని శాంతిసందేశము విశదము చేయుచున్నది. జాత్యభిమానమును, సామ్రాజ్యాభిమానమును పరమార్థముగ నున్న బ్రిటీషురాజ్యాధికారులకు భరతవర్ష ప్రయోజనములు తలకెక్కుట యసంభవముగ నున్నది.

జర్మనురాజ్యము నానాజాతి సమితియందు చేరుట ఆయుధనియమమునకును, శాంతిస్థాపనమునకును శుభసూచకముగనున్నది. జినీవా యందు స్త్రీసుమను గారి యధ్యక్షత క్రింద ఈమాసమునందు గూడనున్న నానాజాతి సమితి, భారత సామ్రాజ్య శాసనసభల వలె కేవలము విమర్శనాధికారమునే కాక కార్య నిర్ణయాధికారమును సయితము గలిగియుండుటకు సాధనముల నన్వేషించుటవలననె విల్సను మహాశయుడు ప్రతిపాదించిన సిద్ధాంతములను సార్థకముచేయుట కవకాశములు గలుగగలవు. పెద్దరాజ్యములు విచ్చలవిడిగ ప్రవర్తించుటయును, బలములేని రాజ్యములను నిర్బంధించుటయును సమితిప్రయోజనములను నిరర్థకము చేయుచున్నవి. చీనాసమస్యను నానాజాతిసమితి వశముచేయుట వలన గ్రేటుబ్రిటను ప్రతిష్ఠయును,సమితిప్రతిష్ఠయును వర్ధిల్లియుండును. నానాజాతిసమితి పరపీడనమునకు గాక పరసౌభాగ్యమునకు వినియోగపడనంతవరకును సమితి ప్రయోజనములు లోకకల్యాణమునకు నిరర్థకములుగ నుండగలవు.

* * * *

దక్షిణాఫ్రికా యొడంబడిక

దక్షిణాఫ్రికాయందు తెల్లవారు నల్లవారిని నిర్బంధించుటకును, వెడలగొట్టుటకును చేయుచున్న ప్రయత్నములు శ్వేతజాతుల స్వార్థపరత్వమును విశదము చేయుచున్నవి. ఆఫ్రికా ప్రజలు స్వదేశమున మంచి ప్రదేశములందు నివసించుటకు వీలులేక మన్య ప్రదేశములందు నిర్బంధముతో నివసించుచున్నారు. బంగారపుగనులు, వజ్రపుగనులు, లోహపుగనులు, సుక్షేత్రములు తెల్లవారికి ఈనాములు; నల్లవారు దాస్యవృత్తికి మాత్రము తగియున్నారు. శ్వేతేతరులైన భారతీయులకును నల్లవారికి పట్టినదుర్గతియే పట్టినది. ఆఫ్రికాయందు చిరకాలమునుండియును నివసించుచున్న భారతీయులను నిర్బంధముగ వెడలగొట్టుటకు తెల్లవారుచేయుచున్న నిర్బంధములు శ్వేతేతరజాతుల దుర్భరస్థితిని తెలుపుచున్నవి. ఆఫ్రికాప్రభుత్వమునకును, భారతప్రభుత్వమునకును జరిగినయొడంబడిక సద్భావములతో నిండియున్నను కార్యసాధనమునకు నిరర్థకమని విమర్శనము విశదముచేయుచున్నది. ఆఫ్రికాయందు నివసించుచున్న భారతీయులసంఖ్య స్వల్పముగనున్నది. చిరకాలమునుండియును నివసించుచున్న భారతీయులకు పౌరత్వస్వత్వములను నొసంగుట ధర్మమని రాజనీతిశాస్త్రములు నిర్ణయించుచున్నవి. ఆఫ్రికాప్రభుత్వము భారతీయులను సామదానోపాయముల మూలమునను వెడలగొట్టుటకు బూనుచున్న యుత్సాహమువారికి సౌకర్యములను గలుగజేయుటయందు గన్పడకున్నది. భారతీయులను వెడలగొట్టుటయందు ప్రభుత్వమువారిదివరకవలంబించుచున్న నిర్బంధవిధానమునకును, సామదానవిధానమునకును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాటలయందు భేదమున్నను ఫలమునందు భేదముగనుపడదు. ప్రభుత్వమునుండి ధనము గ్రహించి వెడలిపోయిన భారతీయులు తిరిగి ధనమునిచ్చి ఆఫ్రికాయందు ప్రవేశించుట దుస్తరము. భారతీయులను స్వదేశములకేకాక వలసరాజ్యములకుకూడా పంపుటకు చేసిన ఏర్పాట్లు కేవలము అన్యాయముగనున్నవి. ఆఫ్రికాయందు శేషించి నిలిచియున్న భారతీయులను తెల్లఆఫ్రికా ప్రజలనువలె చేయుట అసాధ్యమని కాలము విశదము చేయగలదు. ఈనియమములన్నియును భారతీయుల శుభస్థితికి ప్రతిబంధకములైనను భారతీయరాయబారులకు వారి నిస్సహాయస్థితియందు అంగీకరించుట అవసరమైనది. భారతీయుల నిస్సహాయస్థితి నిబాగుగ నెరిగిన ఆంధ్రాసుగారును, గాంధిమహాత్ముడును దక్షిణాఫ్రికాయొడంబడికకు స్వాగతము జెప్పుట సహజముగ నున్నది. ఈస్వల్పమైన ప్రయోజనములనైనను సమకూర్చుటకు తెల్లవారంగీకరింపని విధమును ఆఫ్రికాయందు బయలుదేరుచున్న ప్రతికూలవ్యాఖ్యానములు విశదము చేయుచున్నవి. భారత ప్రభుత్వము సామ్రాజ్యశాసనసభయందును, రాజ్యసభయందును విషయవిమర్శనమును చేయకయే ఒడంబడిక నంగీకరించుట భారతీయుల దైన్యస్థితిని వేయినోళ్లను చాటుచున్నది. శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారును, ఇతర నాయకులును వారియసమ్మతిని తెలుపుట కంటెను చేయగల కార్యము కనుపడదు. దక్షిణాఫ్రికా సమస్య పట్లను చూపిన నిర్లక్ష్యభావమే భారత ప్రభుత్వమునందలి సకల రాజ్యాంగసంస్థలందును ప్రత్యక్షమగుచున్నది.

*  *  *  *

సామ్రాజ్య శాసనసభలు

మాంటుఫర్డుసంస్కరణములు శాసనసభలను చర్చాసభలుగ చేసిన విధమును సభావ్యవహారములు విశదము చేయుచున్నవి. ఆర్థికసభ్యుడు నిర్ణయించిన విధానమును ఖండించుటకును, తగ్గించుటకును సభలకు అధికారము కలదు. క్రొత్తవిషయములకు సంబంధించిన విధమును నిర్ణయించుటకుఅధికారము లేదు. ఈయధికారము వలెనే ఇతరాధికారములును పూజ్యములని శాసనసభా వ్యవహారములు విస్పష్టము చేయుచున్నవి. సామ్రాజ్య శాసనసభయందు నిర్బంధితులవిమోచనమును గోరుచు చేసినప్రతిపాదనము గెలుపొందినది. ఆప్రతిపాదనమును ఆచరణమునందు పెట్టగల శక్తి శాసనసభయందు లేనపుడు జయాపజయములు సమానఫలమును గలుగజేయుచున్నవి. సామ్రాజ్యశాసనసభయందు ఇనుపదారులవిషయమై చేసినతీర్మానములును ఈ అర్థమునే ప్రతిపాదించుచున్నవి. భారత ప్రభుత్వమునకు రయిలు మార్గముల వ్యయనిర్ణయములయందు నాలుగుసార్లు పరాజయము కలిగినది. రయిలు బోర్డునందు భారతీయుల నియమించుటయందును, రయిలుసామానుల కొనుటయందును,మూడవతరగతి ప్రయాణీకులకుచూపుచున్ననిర్లక్ష్యభావమునకును, రయిలుపని వాండ్రకు చూపుచున్న నిరాదరణమునకును ప్రభుత్వమునకు పరాభవము కలిగి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నను ప్రజాప్రతినిధులు నిస్సహాయులైయున్న విధమును వ్యవహారములు విశదము చేయుచున్నవి. భారత ప్రభుత్వాదాయ వ్యయములు నవలోకించునపుడును నీదుర్దశనే కనబడుచున్నది. వర్తమానసంవత్సరమునందు 13,025 లక్షల ఆదాయమును, 12,715 లక్షల వ్యయము కలుగునని సర్ బేసిల్ బ్లాకెట్ గారు నిర్ణయించుచున్నారు. నికరాదాయము వర్తమాన సంవత్సమునందు 310 లక్షలు తేలునని బ్లాకెట్ గారు నిర్ణయించుచున్నారు. ఈయాదాయము రాష్ట్రీయకప్పములను తగ్గించుటకు వినియోగింపబడుచున్నది. నిలువను ప్రజలు చెల్లించవలసిన పన్నులను తగ్గించుటకు బదులు సంపన్నులు చెల్లించవలసిన పన్నులను తగ్గించుటకు వినియోగించుట అన్యాయముగనున్నది. ఉప్పుపన్నును, పోస్టురేట్లను తగ్గించుటకు బదులు మోటారుబండ్ల సుంకములనుతగ్గించుట సంపన్నుల ప్రయోజనములను సమకూర్చుచున్నదిగాని నిరుపేదల ప్రయోజనములనుసమకూర్చుటలేదు. మోటారుబండికి 3000 రూప్యములను వ్యయము చేయగల వారు మరి మూడువందల వ్యయము చేయగలరు. వ్యయభారమునందు 5,555 లక్షల సైన్యవ్యయము దుర్భరమయిన వ్యయమని ఆర్థికపత్రము విశదము చేయుచున్నది. రాగల సంవత్సరమునందు 12,896 లక్షలుఆదాయము 12,532 లక్షలు వ్యయము మదింపువేయబడి 364 లక్షలు నికరాదాయము ఏర్పడుచున్నది. రాగలసంవత్సరమునందు 5,592 లక్షలు సైన్యవ్యయము నిర్ణయింపబడినది. వర్తమాన సంవత్సరముకంటె రాగల సంవత్సరమునందు 37 లక్షల సైన్యవ్యయము అధికమగుచున్నది. దేశాదాయమునందు సగముభాగము సైన్యవ్యయములకు వినియోగపడుచున్నపుడు దేశము యొక్క శుభస్థితి దుస్తరమని ఆర్థికపండితులందఱును అంగీకరించుచున్నారు. బ్లాకెట్ గారి బడ్జెటు లెక్కలన్నియును 18 పెన్నీల మారకమును బట్టి నిర్ణయింపబడినవి. రూపాయిమారకపురేటు 16 పెన్నీలకు మార్చుటవలన 364 లక్షల ఆదాయము అంతరించుటయే కాక 162 లక్షలు లోటు రాగలదని బ్లాకెట్ గారు బెదిరించుట సామ్రాజ్యసభయొక్క సైన్యస్థితికి నిదర్శనముగ నున్నది. బ్లాకెట్ గారు వేసిన కప్పముల మెర భేదాభిప్రాయములను గలిగించి స్వరాజ్యపక్షమును శిథిలముచేయుట సహజమని దేశవ్యవహారములు విశదముచేయుచున్నవి. 16 పెన్నీల మారకపురేటు బ్రిటీషు వ్యాపారమునకువలె భారతీయ వర్తకులకు కర్షకులకు లాభకారి కాదని చిరకాలానుభవము విశదము చేసినది. భారతీయనాయకులు, వాణిజ్య సంఘములు 16 పెన్నీల మారకము దేశమునకు లాభకారియని చాటుచున్నను బ్లాకెట్ గారును, వారివర్గమువారును 18 పెన్నీల మారకమునకు పట్టుపట్టుట భారతప్రభుత్వము బ్రిటీషు ప్రయోజనములను సమకూర్చుట కేర్పడిన విధమును విశదము చేయుచున్నది. ఉక్కు సంరక్షణశాసనమునందు బ్రిటీషు ఉక్కు పరిశ్రమకు గలిగిన సంరక్షణమును ఈదుర్దశనే వెల్లడిచేయుచున్నది. సామ్రాజ్య శాసనసభ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యందు గల భిన్నపక్షములును నిరంకుశ ప్రభుత్వపోషణమునకు వినియోగ పడుచున్నవి. కాంగ్రెసుపక్షము, జాతీయపక్షము, స్వతంత్రపక్షము సంయోగములేక నిరంకుశ ప్రభుత్వమును పోషించుటకు వినియోగపడుచున్న విధమును ఉక్కురక్షణ శాసనచర్చయందు జిన్నాగారు చూపిన పక్షపాతము విశదము చేయుచున్నది. శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు, నెహ్రూపండితుడు మొదలగు నాయకులు ప్రచురించుచున్న నిర్దేశములును భేదాభిప్రాయములను విశదము చేయుచున్నవి. సాంఘిక విషయములను బహిష్కరించుటయందు గలిగిన భిన్నాభిప్రాయములు పక్షముల దౌర్బల్యమును విశదము చేయుచున్నవి. రాజ్యాంగము లందువలె సాంఘిక విషయములందును శాసనసభ్యులను బడిపిల్లలనువలె శాసించుట సంయోగమునకు సాధనముగాక విలయమునకు సాధనంబగుచున్నది. శాసనసభ్యులు స్థాయిసంఘములందు జేరుటకు అనుమతి నొసంగినపుడు సాంఘికవిషయముల కేల యనుమతి నియ్యగూడదో తెలియకున్నది. గాంధీమహాత్ముడు 1920 సంవత్సరమునందు ఆరంభించిన నిరాకరణోద్యమము శాసనసభాప్రవేశము నంగీకరించినపుడే పరిసమాప్తి నొందినది. శాసనసభ్యులు బ్రిటీషు ప్రభుత్వమును పోషించుటకు ప్రమాణమును చేయుచు ప్రభుత్వసంహారమునకు పూనుకొనుట యసందర్భముగ నుండగలదు. పారతంత్ర్య స్థితియందున్న రాజ్యాంగములందు స్వాతంత్ర్యప్రియులు పాశబద్ధులైనిస్సహాయస్థితియం దుండెడివిధమును సామ్రాజ్యశాసనసభావ్యవహారములు బోధించుచున్నవి. మోక్షణోపాయము భారత ప్రజలవలనను కాగలదుగాని ఇర్విను ప్రభువు దెలిపినటులు బ్రిటీషు పార్లమెంటు వలన రాజాలదు.

* * * *

## రాష్ట్రీయసభలు

స్వరాజ్యపక్షము శాసనసభాప్రవేశమును ద్వంద్వప్రభుత్వ సంహారమును జేయుటకు కోరినది. చిత్తరంజనదాసుగారు గత సమావేశమున వంగరాష్ట్రమునందు ద్వంద్వప్రభుత్వమును నిర్మూలము చేయుటకు పూనుకొనిరి. వంగరాష్ట్రమునందు మంత్రులు లేకపోయినను నిరంకుశప్రభుత్వము యెప్పటివలె సాగినది. వర్తమాన సమయమునందు ఇదియును సాధ్యముగాకున్నది. వంగరాష్ట్రమునందు గజనవిచక్రవర్తిగార్లు మంత్రిపదవులను స్వీకరించి ద్వంద్వప్రభుత్వమును నడుపుచున్నారు. బొంబయి, మధ్యరాష్ట్రములు, పంజాబు, చెన్నరాష్ట్రము మొదలగు రాష్ట్రములందును ద్వంద్వప్రభుత్వములుకొనసాగుచున్నవి. చెన్నరాష్ట్రమునందు కాంగ్రెసుపక్షము ప్రబలమైన పక్షముగ నున్నను ద్వంద్వప్రభుత్వమును నిర్మూలము చేయుటకుగాని, మంత్రిత్వమును స్వీకరించుటకు గాని సాహసింప కున్నది. స్వాతంత్ర్యపక్షము స్వల్పపక్షమైనను మంత్రిపదవులను స్వీకరించి ద్వంద్వప్రభుత్వవిధానమును నిర్వహించుచున్నది. జస్టిసుపక్షము స్వాతంత్ర్యపక్షమునకన్నను ప్రబలపక్షమైయుండి మంత్రిపదవులనుస్వీకరించుటకు గోరుచున్నను విశ్వా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సము గోలుపోయి స్వీకరింప జాలకున్నది. కాంగ్రెసు పక్షము ప్రబలపక్షముగ నున్నను గౌహతీ కాంగ్రెసు తీర్మానమును సార్థకము చేయుటకు గాని, స్వతంత్ర పక్షమును నిర్గమింపజేయుటకుగాని పూనుకొన జాలకున్నది. కాంగ్రెసుసభ్యులు కర్తవ్యమును కనుగొనజాలక సంశయాత్ములై తర్కవితర్కములకు లోనగుచున్నారు. కాంగ్రెసు సభ్యులు నియోజకవర్గమునకుచేసిన ప్రతిజ్ఞను పాలించుటకు మంత్రిపదవులను స్వీకరింపకుండుట యుక్తముగనున్నను గౌహతీతీర్మానము నాచరింపకుండుట దురభిప్రాయములకు కారణంబగుచున్నది. ఉత్తరహిందూస్థానమునందును, వంగరాష్ట్రమునందును హిందూమహమ్మదీయవిభేదములు గలుగజేసిన దుర్దశనే చెన్నరాష్ట్రమునందు బ్రాహ్మణబ్రాహ్మణేతరపక్షములు గలుగజేసినవి. చెన్నరాష్ట్రమునందు జస్టిసుపక్షము కొంతవఱకు నిలిచియున్నను బ్రాహ్మణపక్షము కాని, బ్రాహ్మణేతర పక్షము కాని వ్యవహారములందు గనుపడవు. బ్రాహ్మణేతరపక్షమునందు భేదాభిప్రాయములు ప్రబలియున్నవిధమును ఎన్నికలయందు కాంగ్రెసుపక్షమునకు గలిగినవిజయము విశదము చేయుచున్నది. కాంగ్రెసుపక్షమునందు బ్రాహ్మణేతర సభ్యులే అధికముగ నుండుటవలనను, బ్రాహ్మణబ్రాహ్మణేతర పక్షములు స్వరాజ్యపక్షమునందు లేవని విశదమగుచున్నది. బ్రాహ్మణేతరపక్ష దురభిమానమే జస్టిసుపక్ష పరాజయమునకు దోడ్పడినది. చెన్నరాష్ట్రమునందు స్వరాజ్యపక్షము నిర్ణయింప వలసియున్న సమస్య ద్వంద్వప్రభుత్వ సంహారమో, జస్టిసుపక్ష నిర్గమనమో యను సంశయము సభ్యులను, నియోజకవర్గమును బాధించుచున్నది. నియోజకవర్గమునకు జస్టిసు పక్షమునిూదగల యనాదరణము నెన్నికల ఫలము విశదము చేసినది. ఎన్నికలయందు ఓడిపోయిన జస్టిసుపక్షము మంత్రిపదవులను స్వీకరింపకుండుట నియోజకవర్గము సహింపదని విశ్వసింపదగియున్నది. ఇపుడు చెన్నరాష్ట్ర శాసనసభయందలి పక్షములందు జరుగుచున్న యాందోళనము సభాప్రయోజనములకు నిరర్థకముగ నున్నది. పోషణములేని స్వతంత్రపక్షము కార్యాచరణమునకు బూనుకొనుటకు సంశయమును బూనుచున్నది. స్వతంత్రపక్షమును పడద్రోయుటకు జస్టిసుపక్షమునకును, కాంగ్రెసు పక్షమునకును కోరికయున్నను వీరిసంకల్పములకు కారణములు వేరువేరలు సంయోగము సాధ్యము గాకున్నది. ఆంధ్రరాష్ట్రసమావేశము మంత్రివర్గమును పడద్రోయవలయునని శాసనసభ్యులను నిర్దేశించినది. తమిళ, కేరళ, కర్ణాటక రాష్ట్ర సంఘములు శాసనసభ్యులకు నిర్దేశములను పంపియుండలేదు. శాసనసభయందుగల నానారాష్ట్రముల కాంగ్రెసు సభ్యులును కలిసిపని చేయుట ప్రయోజనకరము. కాని ఎవ్వరికి తోచినటుల వారు ప్రవర్తించుట ప్రయోజనకరముగాదు. చెన్నరాష్ట్రపరిస్థితులను బాగుగ గ్రహించి రాష్ట్రసంఘములును, కాంగ్రెసు స్థాయిసంఘమును సభ్యులకు వారి వ్యవహారక్రమమును నిర్దేశించుటయందు సభ్యులయొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్కయు, నియోజకవర్గము యొక్కయు మనో
రథములకు తగినరీతిని కర్తవ్యమును నిర్ణయిం
చుట యుక్తముగ నుండగలదు.

చెన్నరాష్ట్ర శాసనసభయొక్క గతిం
చిన రెండు సమావేశములును నిస్సారముగ
నున్నవి. ఏపక్షమును తనపక్షబలమును విశ
దము చేయుటకు ప్రయత్నము చేయలేదు.
స్వతంత్రపక్షమంత్రులు వారి సంచారసమ
యములందు చేసిన ప్రసంగములును, సూచిం
చిన కార్యవిధానములును స్వాతంత్ర్యవిధాన
మును ప్రకటించుచున్నను కార్యాచరణము
నందు నిరుపయోగములుగ నున్నవి. శ్రీయుత
రంగనాథం మొదలియారుగారు రాజమహేం
ద్రవరమునందు స్వరాజ్యపక్షము నిర్వహింప
దలచిన కార్యవిధానమును విశదము చేసిరి.
సిద్ధాంతమునందు వారి సంభాషణ లన్నియును
బాగుగ నున్నను కార్యాచరణమునందు దుస్త
రములని రాజ్యాంగ వ్యవహారవిధానము విశ
దము చేయుచున్నది. జాతీయ విద్యాలయము
లకు ద్రవ్యసహాయము చేయుటకుగాని, స్థానిక
సంస్థలు చేసినదానిని ఆమోదించుటకుగాని
మంత్రులకు అధికారము లేదు. ఈ యధికార
మును మంత్రులు పడయగలిగిన దేశమునకు
కొంత యుపకృతి గలిగి యుండును.
రంగనాథ మొదలియారుగారు గృహపరిశ్ర
మల నుద్ధరించుటకు నిర్ణయించిన విచారణ
సంఘమువలన కలుగగల ప్రయోజనము
కాలము నిర్ణయింపగలదు. డాక్టరు సుబ్బరాయ
నుగారును, రంగనాథ మొదలియారుగారును
రాటము,మగ్గము పేరులకు జస్టిసు మంత్రివర్గ
మువలెబెదరక ఖద్దరునకు ప్రోత్సాహమొసం
గుటకంగీకరించుట స్వాతంత్ర్యపక్షప్రయోజన
మును చాటుచున్నది.

చెన్నరాష్ట్రాదాయము రాగల సంవత్స
రమునందు 1654 లక్ష. లనియును, వ్యయము
1724 లక్షలనియునులోటు 69 లక్ష. లని
యును ఆర్థికసభ్యుడు విశదము చేసెను.
కేంద్రప్రభుత్వము రద్దుచేయనున్న రాష్ట్ర
కప్పము 116 లక్షలు తొలగిపోయి
నప్పుడు లోటుపోయి 47 లక్షలు నికరాదా
యము తేలుచున్నది. మోయరుగారు చెన్న
రాష్ట్రప్రజలీ లాభమును గోల్పోవజనదని
సభ్యులను హెచ్చరించిరి. బ్లాకటుగారి హె
చ్చరిక మోయరుగారి నోటనుండి ప్రతిబిం
బించుచున్నది. మారకపు రేటును 18 పెన్నీ
లకు నిర్ణయించునపుడు ప్రజలకు గలు
గుచున్న యపారమైన నష్టమును గమనించు
నపుడు రాష్ట్రములకు గలుగనున్న స్వల్ప
ప్రయోజనములు గమనార్హములు గావని
సభ్యులు గ్రహింతురుగాక! ప్రభుత్వాదా
యమునందు మద్యాదాయ మంతరాయము
లేక వృద్ధిని బొందుచున్నది. వ్యయశాఖలం
దైనను విద్యకును పరిశ్రమలకును వినియోగ
పడెడి ద్రవ్యము స్వల్పముగ నున్నది. ప్రభు
త్వాదాయమునందు భూమిశిస్తు ప్రధానము
గనున్నను రయితులక్షేమమునకు జేయబడు
చున్న వ్యయమత్యల్పముగ నున్నది. రయి
తుల క్షేమమునకు గావలసిన వైద్యసహాయ
ము, పరపతి, బాటలు, నీటివసతులు మొదలగు
వానికి జేయబడుచున్న వ్యయము స్వల్పముగ
నున్నది. డాక్టరు మల్లయ్యగారు, మునిస్వామి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాయుడుగారు, కాశీశ్వరరావుగారు, పానుగల్లు రాజాగారు మొదలగువారు తెలిపినటులు గ్రామసీమలకు సదుపాయములను గల్పింపక పెద్దయుద్యమములకు ద్రవ్యమును వ్యయము చేయుట యనుచితముగ నున్నది.

*  *  *  *

### ఆంధ్ర రాష్ట్రము

చెన్న రాష్ట్రముసం దంతర్గతమైన ఆంధ్ర రాష్ట్రము ప్రభుత్వ విధానమునందు స్వయం వ్యక్తిత్వములేక వికాసశూన్యముగనున్నది. కృష్ణాగోదావరి డెల్టాభూములు విశేషాదాయ మును సమకూర్చుచున్నను డెల్టాప్రజలకు సౌకర్యములకుగాను వ్యయమగుచున్న ద్రవ్య మత్యల్పముగ నున్నది. నూరేండ్ల బ్రిటీషు ప్రభుత్వానంతరమైనను కృష్ణాగోదావరీ నదు లకు వంతెనలను కట్టకుండుట ప్రభుత్వవిధాన మునం దాంధ్ర రాష్ట్రము పట్లగల నిరాదరణ మును విశదముచేయుచున్నది. దక్షిణప్రదేశ మునందుగల మెట్టూరు పైకారా కావేరి డెల్టా నిర్మాణముల మీాద ప్రభుత్వమునకు గల యాదరణము ఉత్తరప్రాంతములందలి నిర్మాణ ములమీాదను ప్రసరింప కున్నది. వర్తమాన సంవత్సర వ్యయమునందు మెట్టూరుపైకారా నిర్మాణములకు లక్షలు వ్యయము చేయ బడుచున్నను ఉత్తరప్రాంతములకుచేయబడు చున్న వ్యయ మత్యల్పముగ నున్నది. కోటి రెడ్డిగారు దక్షిణజిల్లాలకు పట్టిన యదృష్టము ఉత్తరజిల్లాలకు పట్టలేదని శాసనసభయందు దెలిపినభావము యథార్థస్థితిని దెలుపుచున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయము స్థాపితమైనను మంది రాదులకునువిద్యాలయములకును నవసర మైన ద్రవ్య సహాయము దుర్లభము గనున్నది. ప్రత్యేకాంధ్రరాష్ట్ర మేర్పడనంత వరకును ఆంధ్రులవికాసమున కవసరమైన ప్రతిపత్తిగలుగదని చిరకాలవ్యవహారాను భవము విశదముచేయుచున్నది. శ్రీయుత వేమవరపురామదాసుపంతులుగారు రాజ్యస భయందు ప్రతిపాదించిన యాంధ్రరాష్ట్ర నిర్మాణతీర్మానముఓడిపోయినను చర్చవలన అవసరమైనప్రయోజనము గలిగినది. భాషా ప్రయుక్తరాష్ట్రవిభాగమునకు ప్రభుత్వపుసా నుభూతిగలదని హెయిగుగారు విశదము చేసిరి. సామ్రాజ్యశాసనసభయందు చర్చింప బడిన ఉత్కలరాష్ట్ర నిర్మాణతీర్మానమును భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణావసరమును విశ దము చేయుచున్నది. ఈ తీర్మానములు చెన్న రాష్ట్ర శాసనసభయందు ఆంధ్రరాష్ట్రతీర్మాన మంగీకృతము గావలసిన యవసరమును విశద ముచేసినవి. వర్తమానసమావేశములం దాం ధ్రరాష్ట్రతీర్మానము చెన్నరాష్ట్ర శాసనసభ యం దామోదింపబడుట కాంధ్రప్రతినిధులు తగిన ప్రయత్నములను జేయుదురని నమ్ము చున్నాము. ప్రభుత్వవిధానమునం దాంధ్ర వ్యక్తిత్వమున కవకాశములు లేకపోయినను కాంగ్రెసువిధానము గలుగజేసిన స్వాతంత్ర్య మాంధ్రవ్యక్తిత్వమునకు దోడ్పడుచున్నది. సహాయనిరాకరణోద్యమ మాంధ్రులవ్యక్తిత్వ మును దేశము నందంతటను ప్రతిష్ఠించినది. ఆంధ్రరాష్ట్రనామముపునరుద్ధరణమై ఉదారా శయములను వ్యక్తముచేయుటకు వినియోగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పడుచున్నది. భాషాప్రయుక్తరాష్ట్రవిభాగము లప్రయోజనమును కాంగ్రెసునందుగల ఆంధ్ర విభాగము విశదముచేసినది. కళాకావ్యములందును, నిత్యవ్యవహారములందును ఆంధ్ర వ్యక్తిత్వము సువ్యక్తమగుచున్నది.

*　*　*　*

ఆంధ్రశిల్పము

చెన్నరాష్ట్రశిల్పప్రదర్శనము శిల్పమునందాంధ్రవ్యక్తిత్వమును విశదముచేయుచున్నది. ప్రాచ్యశిల్పశాఖయందు వంగీయశిల్పనామము ప్రతిష్ఠితమైనను వంగీయశిల్పుల చిత్రపటములు స్వల్పముగనున్నవి. ఆశాఖయందలి చిత్రములందు మొదటిబహుమానమును చుగతైగారు నడసినను ఆంధ్రచిత్రపటములు ప్రముఖములుగ నున్నవి. ఆశాఖయందు ప్రదర్శింపబడిన చిత్రపటములందు ఆంధ్రశిల్పుల చిత్తరువులు చాలగలవు. ఆ చిత్తరువు లాంధ్రశిల్ప వ్యక్తిత్వమును సమర్థించుచున్నవి. కీర్తిశేషులైన దామెర్ల రామారావుగారు శిల్ప నిర్మాణములందు వ్యక్తపు చేసినవ్యక్తిత్వ మాంధ్రశిల్పములయందు గోచరంబగుచున్నది. ఆంధ్రులరచన లజంతావైఖరి నవలంబించుచు వ్యక్తిత్వమును విశదముచేయుచున్నవి. సంభావన యందును, రూపకల్పన యందును, అంగవిన్యాసమునందును, రంగులయందును ఆంధ్రచిత్రరచనలు వ్యక్తిత్వమును వెల్లడిచేయుచున్నవి. చెన్నపురి ప్రదర్శనమునందు సుబ్బారావుగారి 'రాధామనోహరమూర్తి,' వెంకటరత్నముగారి 'గోపీమోహనుడు,' బుచ్చి కృష్ణమ్మగారి 'నటరాజ' బహుమానములను బడసినవి. కౌతా ఆనందమోహన్‌శాస్త్రిగారి 'సిద్ధార్థుడు, మీరాబాయి అక్బరు తన్‌సేను చిత్రము,' చామకూరి సత్యనారాయణగారి 'గౌతమబుద్ధుడు, రాధాస్వప్నము,' వెంకటసుబ్బారావుగారి 'నాగరాజు,' బాపిరాజుగారి 'వేణీభంగము,' రామమోహన్‌శాస్త్రిగారి 'వసంతము,' సత్యవాణిగారి 'నదీసన్నిధి, కృష్ణాబాయిగారి 'నీలవర్ణుడు' మొదలగు చిత్రపటములు శిల్పమునందు ప్రవర్ధమానంబగుచున్న ఆంధ్రుల అభినివేశమును విశదముచేయుచున్నవి. అచిరకాలముననే స్వయంసహాయసాధనమునను వృద్ధినిపొందుచున్న శిల్పవికాసముఆంధ్రుల సహజమైనయభినివేశమును విశదముచేయుచున్నది. ఆంధ్రుల శిల్పవికాసమునం దభిమానముగల మహాజనులందఱును జాతీయవిద్యాసంస్థాపనలందు శిల్పరచనలకు ప్రోత్సాహము నొసంగి ఆంధ్రాభ్యుదయమునకు దోడ్పడుట ధర్మముగనున్నది.

*　*　*　*

సాహిత్యము

శిల్పమునందువలెనుసాహిత్యరచనలయందును, విద్యావిధానమునందును ఆంధ్రులు ప్రకటించుచున్న వ్యక్తిత్వము వారియాత్మావలంబన ధర్మమును విశదముచేయుచున్నది. ఆంధ్రహృదయము నావరించిన మాతృభాషాభిమానమును జాతీయవిద్యాలయములు, సభలు, గ్రంథములు,పత్రికలు విశదముచేయుచున్నవి. జాతీయ విద్యాలయములయందు విద్యాభ్యాసము మాతృభాషాముఖమునను జరుగుచున్నది. జాతీయవిద్యాలయముల యందు బాలురు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బాలికలు సాహిత్యమునందును, సంగీతమునందును పొందుచున్న యభినివేశము ఆంధ్రహృదయవికాసమును విశదము చేయుచున్నది. తెనాలి, నెల్లూరు, గుంటూరు, బందరు మొదలగు పట్టణములందు గల జాతీయ విద్యాలయములు జాతీయ విద్యాప్రయోజనమును విశదము చేయుచున్నవి. విద్యాలయములవలెను సాహిత్యరచనలును దేశావృతమైన ప్రబోధమును వ్యక్తము చేయుచున్నవి. దేశవ్యాప్తములైన నవలలు, నాటకములు, భావగీతములు, జీవితములు, పరిశోధనలు ప్రజాహృదయమునందు పల్లవించుచున్న నవజీవితాశయములను వ్యక్తము చేయుచున్నవి. సాహిత్యమువలె నాటకరంగములును ప్రజాహృదయమునందు నవభావోదయమును సూచించుచున్నవి. సర్వతోముఖమైన ఆంధ్రహృదయవికాసమునకు సాధనములైన లక్షణములు గోచరంబగుచున్నను సాధనసామగ్రిని సమకూర్చి మహాప్రయోజనమును సాధించుటకవకాశములు చాలకున్నవి. ప్రభుత్వాదరణములేని ప్రయత్నములు ఫలప్రదములగుట దుస్తరమైనను స్వయం సహాయసాధనమువలన ఆంధ్రప్రపంచమునకు గలుగుచున్న ఫలము సర్వత్ర ప్రత్యక్షమగుచున్నది. ఈఫలము దేశావసరములకు వినియోగపడుటకు కవులు, గాయకులు, శిల్పులు, నటులు, పరిశోధకులు వారి సాహిత్యకళాభినివేశమును కేంద్రీకరించి దేశాభ్యుదయమునకు సాధనమైన సంస్థాపనలను నిర్మించుట కామితార్థములను బడయుటకు సాధనముగ నుండగలదు. శ్రీమంతులు, విద్యావంతులు, పండితులు యథాశక్తిని వారికి గల యవకాశములను ఆంధ్రాభ్యుదయమునకు సమర్పించి ధన్యవాదములకు పాత్రులగుదురు గాత! ఆంధ్రహృదయావృతమైన యాంధ్రాభ్యుదయమునకు భారతియును ఉడుతభక్తి చందమునను సేవను జేయుచున్నది. భారతిచేయుచున్న సేవావిధానము లోపములతో నిండియుండినను సేవాభిలాష గాఢముగ నున్నది. పత్రికా నిర్వాహకులు దోషములను గ్రహించి సంస్కరించుటకు సిద్ధముగ నున్నారు. స్వప్రయోజనపరాయణులారోపించెడి నిందలు నిరర్థకములై స్వకార్యవిఘాతమునకు వలెను స్వకార్యసిద్ధికి సాధనములుగాకున్నవి. తప్పులనెన్నుట సులభము గాని తన తప్పులను గనుగొనుట దుర్లభము. విమర్శకులు సాదరభావముతో విమర్శనలకు బూనుకొని భారతిచేయుచున్న సేవను సార్థకము చేయుదురు గాక! మాఘసంచికయందు గల వ్యాసములందు భాషాపరిశోధనకు సంబంధించిన పరవస్తు వెంకటరామానుజస్వామిగారి వ్యాసమును, ఆంధ్రచరిత్రమునకు సంబంధించిన మల్లంపల్లి సోమశేఖరశర్మగారి ఆంధ్రమహాసామ్రాజ్యమును, వెంకటరంగయ్యగారి ఆంధ్రవిశ్వవిద్యాలయమును, గంగన్నగారి స్వర్గములోఒకవిలాపమును, వెంకటసత్యసూర్యప్రకాశరావుగారి నూతన కవిత్వపద్ధతులు మొదలగు వ్యాసము లాంధ్రపండితుల విమర్శనలను బడసి ఆంధ్రాభ్యుదయమునకు సాధనములగునని నమ్ముచున్నాము. భారతిని పోషించుచున్న మహాజనులకు కృతజ్ఞతాంజలుల నర్పించుచు ముందును వారిపోషణను వేడుచున్నాము.

---

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7, Thumbu Chetty Street, G.T., Madras.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# విషయానుక్రమణిక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri





## చిత్రములు






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రభవ

సెట్టి లక్ష్మీనరసింహము గారు

శ్రీప్రమదకహారహాంబు బ
హుప్రమదంబెదను బ్రభవమొందించెడి స
ర్వప్రభవిష్ణుఁడు విష్ణుం
డీప్రభవాబ్దమున శుభములిచ్చుత మీకున్.

తే. గీ. ధర్మసంస్థాపనము నిమిత్తము యుగయుగ
మందుఁ బ్రభవంబునందు శ్రీహరి ప్రభవ మొ
దలు గలుగు నీ యఱువది యేఁడుల యుగమును
జగమునకు సౌఖ్యకరముగా జరుపుఁ గాక!

ఆ. వె. ప్రభ వహించి దేవపతిసోదరుఁడుగ వి
ప్రభవనమున దేవపాళిఁ బ్రోవఁ
బ్రభవమొందినట్టి ప్రభుఁడు ముజ్జగము లీ
ప్రభవయందుఁ బ్రోచుఁ బరమకృపను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# సేవాంజలి

శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు

౧

మలపుకోలేనైతి మఱసి నీకై సేఁత సడలింపఁ జేయు నావడఁకుదనము;
ఆఁచుకోలేనైతి నడరి నీనునుమేను నౌఁగిలింపఁ జేయునా గగురుపాటు
అడఁచుకోలేనైతి నలఘు నీనెమ్మోముఁ గందింప జేయు నాకాఁకమూర్పు
నిలుపుకోలేనైతి నిండి నీ చేర్చుక్కఁ గరఁగింపఁ జేయునా కంటినీరు
తప్పఁగలిగె ననుమ దద్దరిల్లుటె కాని-యేమి సేయవలెనో యెఱుఁగకుంటి
సర్వకారణుఁడవు క్షమియింపకుందువే-పావనస్వభావ, దేవదేవ!

౨

సీ. అభవ! నీకర్ఘ్యపాద్యములుగాఁజాలునే నిస్సారమైన యీ నీటిబుగ్గ
కాంత! నీయారాత్రికంబుగాఁజాలునే అతితుచ్ఛమైన యీ మెఱుఁగుఁబురుగు
విశ్వతోముఖ! నీకు విందుగాఁజాలునే పేలవంబైన యీ పేలగింజ
నాథ! నీసంసేవనంబు గాఁజాలునే చిందువంబైన యీ చిన్నిపూవు
పరమదుర్లభమైన నీ కరుణ లేక-తావకశ్రీపదాంభోజసేవనమున
నలరుటబ్బునె యీపరమాణువునకు, సత్కృపాధామ! దేవతా సార్వభౌమ!

౩

[చుండె,
మొగమోటములుగూర్చి మగిడి పోవకు సుమీ పలుకెల్ల నమృతంబు చిలుకు
కనుఁబ్రామికలు గూర్చి కదలి పోవకు సుమీ నిలువెల్లఁ బులకలు నిండుచుండె,
పారవశ్యముఁ గూర్చి పాఱిపోవకు సుమీ తలఁపెల్ల నానంద మొలుకుచుండె,
ఆత్మవిస్మృతిఁ గూర్చి యట్టె పోవకుసుమీ భవమెల్లఁగోర్కులు పండుచుండె,
మఱపుఁగొల్పకుమింక నేమఱకు మింకఁ, దలఁపుఁద్రిప్పకుమింకఁ బోఁదలఁపకింక
ఆదకొను మింక మన మేకమైతి మింక, సచ్చిదానంద లీలాప్రసన్నమూర్తి!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చెన్నపట్టణము ఏప్రెల్ ౧౯౨౭

సంపుటము ౪ ప్రభవ సంవత్సరము చైత్రమాసము సంఖ్య ౪.

# ప్రభు తీర్థము

సాహితీసమితి సభాపతి శ్రీశివశంకరశాస్త్రి గారు

శంకరుడు

మహిత వాసవ మణికుట్టి మమ్ముబోలు
సాగరముతోడనొప్పుభూసౌధమునకు
కౌముదీప్లావితం బైనగగనసీమ
తనరుచున్నది ధవళ వితాన కాంతి.

విమలహా సీవిభావరీసమయశోభ
నేలనోకాని కనుగొన నిచ్చగింప
కాననము వాలిచి నిమీలితాక్షు లగుచు
పలుకకున్నారు శ్రీమహాప్రభువు వారు!

రామానందరాయలు

దేవ, ప్రసరింపజేయుడు దృష్టి యిటులు
పొంగి పోవుచు నున్నది పూర్ణచంద్ర
కిరణజాలమ్ముతాకున కెరలి మిగుల
ఆతతంబైన నీలరత్నాకరంబు.

రాధికాదేవి కబరీభరమ్మునుండి
జారుచుండెడి కుసుమసంస్పర్శవలన
పరమ హర్షమ్ముతో గగుర్పాటు గాంచు
శ్యామసుందరు లలిత దేహమ్ము వోలె.

శ్రీచైతన్యమహాప్రభువు [కన్నులు తెరచి]
ఏడి నాశ్యామసుందరు డేడి యేడి!
చూచుచుండగ నెచటికో సురిగినాడు
ఇచటనే నిల్చియున్నవా డింతలోనె
అచ్చెరువు తోప నేకడ కరిగినాడు!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏమి చిత్రము! సఖులార, ఇపుడె యతని
నీప్రదేశమ్మునందె వీక్షింప గంటి
అంతలోనె యంతర్ధాన మయ్యె నయ్యొ
వంచకాగ్రణి గోపికావల్లభుండు!

[ఇటు నటు చూచి]

కాన రావేమి కృష్ణ, ఈకన్నుదోయి
ఏమి పాపమ్ము చేసినదో, మనోజ్ఞ
దివ్య భవదీయ రూప దీధితి లభింప
దక్కటా!—రమ్ము, నాహృదయాధినాథ!

నిన్ను గనజాల కున్న నే నిమిషమైన
తాళజాలను కృష్ణ! ఈతనువునుండి
ప్రాణములు లేచిపోవు! కృపాప్రపూర్ణ
మానసమ్మున దరిజేరుమా రయంబ!
వినయపూర్వకముగ నిన్ను వేడుచున్న
దోయి రాధిక! రమ్ము నేత్రోత్సవముగ.

[కొంచెమూరకుండి]

శీఘ్రగతితోడ నేల వేంచేయ కుంటి
వోయి! అక్కట యేమి చేయుదును కృష్ణ!
ప్రాణసఖులార, ధూర్త గోపాల కుండు
అతిరయమ్మున నెచ్చటి కరిగినాడొ
తెలిసికొని సత్వరమ నివేదింపరేని
ఇంక మీతోడ నెపుడు భాషింప నేను.

గోవిందదాసు [ప్రభుపాదములమీదవ్రాలి]

మీచరణ దాసవర్గమ్ముమీద నిట్టు
లాగ్రహింపగ నేల మహానుభావ!
కింకరజనమ్ముపై మీరు కినుక బూని
పలుక కుండిన నెట్టులు బ్రతుక గలము!

రామానందరాయలు

ప్రభువరున కాగ్రహాము లేదు, భయము వీడి
లెమ్ము గోవింద, ఇయ్యది లీల సుమ్ము;
స్వామి యిప్పుడు తన్మయత్వమ్ము వలన
పల్కు శ్రీరాధికాదేవి భావనమున.

శ్రీమహాప్రభువు [ప్రక్కకు చూచి]

కేకి పింఛావతంసుడై కృష్ణు డదిగొ
నన్ను గాంచి శిరః కంపనమ్ము చేసె!

[ఆతురతతో]

ఇదిగొ పరుగిడి వచ్చి నాహృదయనాథ,
చేరుదానను నీసమాశ్లేషమందు!

[అని ముందుకు పోబోవును]

శంకరుడు

మారుతాహతి నుత్కంపమాన శిఖర
కలిత మైనట్టి తాళవృక్షమ్ముగాని
బర్హిబర్హావతంస గోపాలమూర్తి
కాదు కాదు, మహాప్రభూ, కనుగొనుడు.

శ్రీమహాప్రభువు [చంద్రునివంక జూచి]

శ్యామసుందర, ఏమి యన్యాయ మోయి!
యోగ్యముగ లేదె నీకు నాయూరుతలము?
ప్రేయసిని రాధ నిట్లు పరిత్యజించి
పవ్వళించితి వేటికి పాలకడలి?

శంకరుడు

కాదు కాదది క్షీరసాగరము కాదు
పరిణతం బైన చంద్రబింబమ్ముకాని
నడుమ నున్నది శ్యామసుందరుడు కాడు
సాంద్ర మైనట్టి మేదినీచ్ఛాయ గాని.

శ్రీమహాప్రభువు

అయ్యయో చూడు, డెంత దయావిహీను
డో హిమాంశుడు, గగనమునుండి యిట్లు
కౌముదీరూపకం బైన కారుచిచ్చు
నొక్కటేరీతి కురియించుచున్నవాడు!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

[బాధతో]
తాశజాలను కృష్ణ, యీతాపమునకు
దీనురాలిని మిగుల బాధింతు వేమి?
శీఘ్రముగ నేగుదెంచి యాశ్లేష మిచ్చి
అపనయింపుము దేహదాహమ్ము నాథ!

[జాలిగా]
ఎంత బ్రతిమాలుకొన్న రావేల కృష్ణ!
రాధ చేసిన ప్రబలాపరాధ మేమి?
ఎంత నీకయి నేను తపించుచున్న
పలుక వేటికి అయ్యయో ప్రాణనాథ!
అక్కటా, సత్వరంబ మీరైన గాని
వెడలి చెలులార, కృష్ణుని వెదకి తెండు.

ప్రాణనాయకు దోర్గాఢబంధమందె
స్వస్థ నయ్యెద—అన్యత్ర శాంతి లేదు!
మిమ్మనైనను చెలులార, నమ్మరాదు,
కఠినహృదయలు! ఇకనైన కదలరేమి?
ప్రాణములు పోవు పిమ్మట పరుగువారి
తీసికొని వత్తురొక్కొ— ఆమోసగాని?

[రోషముతో]
పట్టువడునేని ధూర్తగోపాలు నిపుడు
నలిపివేయనె ఆలింగనమ్మునందు!
కఠిన దంతక్షతమ్ములు కఠిన నఖర
ఘాతములు చేయకుందునే గాత్రమందు!

[కన్నులుమూసికొని]
ఆగ్రహింపకు మోయి, ఈయబలపైన!
బాధలో నాథ, ఏమేమొ పలికినాను.
కరుణ వహియించి వేగమ కౌగిలించి
అతితరం బైన తాపము నార్పు మోయి!

[అని ముందుకు పడబోవగా రామానందరాయలు పట్టుకొన్నాడు.]

[కనులు తెరచి ఆనందముతో]
అడుగో నాశ్యామసుందరు డడుగో అడుగో
వచ్చుచున్నాడు నాప్రాణవల్లభుండు
హస్తములు చాపి! నీప్రియురాలి కృష్ణ,
చేర్చుకొమ్ము భుజాంతర సీమయందు!

[అని తటాలున సముద్రములోపడినాడు.]

రామానందరాయలు [కలవరముతో]
వేగముగ పట్టుకొమ్ము గోవిందదాస!
శంకరా, లెమ్ము లేలెమ్ము సత్వరముగ
పట్టు తప్పించుకొని మహాప్రబలధాటి
నురికినాడు మహాప్రభు వుదకమందు!

[శిష్యులు లేవదీయగా, ఆనందముతో]

శ్రీమహాప్రభువు
ఎంత తాపాపనోదకం బెంత శీత
లమ్ము నాప్రాణనాయకు లలితగాత్ర,
మెంత మధురమ్ము నాహృదయేశు గాఢ
భంగురోరఃస్థలీ సమాలింగనమ్ము!

రామానందరాయలు
ప్రవిమలం బైన శ్రీమహాప్రభువరేణ్యు
గాత్రసంస్పర్శచేత సాగరజలంబు
నేటి యామిని పరమపునీత మయ్యె!
ఈ ప్రదేశము తీర్థమా యింకమీద.

గోవిందదాసు [సముద్రోదకము నోటబోసికొని]
భక్తకల్పద్రుమం బైన ప్రభుశరీర
మధుర సంస్పర్శ వశమున మారిపోయె
నహహా, స్వాభావికం బైనయబ్ధిగుణము!
ఇక్షుమధురమ్ముగా నున్న దిచటి నీరు!

శిష్యులు [ఉచ్చైఃస్వరముతో]
జయము సద్గురుమౌళికి జయము జయము
జయము జయము నవద్వీప చంద్రమునకు
జయము శ్రీగౌర గోవింద చక్రవర్తి
కధిక జయము మహాప్రభు నాశ్రితులకు!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చిలుకూరి నారాయణరావు గారు యమ్. ఏ., యల్. టి.

నా మిత్రులగు మ-రా-రా. గిడుగు సీతాపతి పంతులుగారు నన్నయసీసపద్యములను గురించి తెలుగుపత్రికలో సమగ్రముగా ముచ్చటించియుండిరి. నన్నయగీతములలో కూడా ఈ నియమము కనబడుచుండుట చేత దానిని గురించి యిచ్చట ముచ్చటిస్తున్నాను. అయినా తొలుత, సీతాపతిగారి సీసపద్యచర్చ కనుబంధముగా నాకు కనబడిన సీసపద్య విశేషములను కొన్నిటిని చూపుతాను.

సీసపద్యములం దింకను విశేషములు:

(౧) అమృతాశనంబు సే-యకయును దేవ నా
కజరామరత్వంబు-నందుటయును
నఖిలలోకంబుల-కగ్రణివైన నీ
యగ్రంబునందు ని-న్నధికభక్తిఁ
గొలుచుచునునికియుఁ-గోరితిఁ గరుణతో
దయసేయు ముద్ధత-దైత్యభేది
యనవుడు వానికి - నభిమతంబులు ప్రీతుఁ
డై యిచ్చి హరి యిట్టు-లనియె నాకు
ననఘ వాహనంబ-వై మహాధ్వజమవై
యుండుమనినఁ బక్షి-యును బ్రసాద
మనుచు మ్రొక్కి పలికె-నంతనాతనిమీద
వజ్రమెత్తివైచె - వాసవుండు.

—ఆది. ౨, ౧౦౪.

ఇందు మూడో పాదములో నియమము కొంత తప్పిఉన్నది. పాఠాంతరముండి ఆపాదమందును, ఆ. వె. యందు ౧, 3 పాదములను యతియం దొకేయక్షరము ఉండునేమో చూడవలసి ఉన్నది.

(౨) కమనీయధర్మార్థ-కామమోక్షములకు
నత్యంతసాధనం - బయినదాని
వేడ్కతోఁ దవిలి తగ-వినుచున్న వారల
కభిమతశుభకరం - బయినదాని
రాజులకఖిల భూ - రాజ్యాభివృద్ధి ని
త్యాభ్యుదయప్రదం - బయినదాని
వాఙ్మనఃకాయప్ర - వర్తితానేకజ
న్మాఘనిబర్హణం - బయినదాని
*  *  *  *

—ఆది. 3, ౯.

దీనిలో రెండవ దళమునం దంతటను యతిస్థానమున ఒకేవర్ణము కనబడుతున్నది.

(3) పలుకుల ముద్దును-కలికిక్రాల్గన్నుల
తెలుపును నలుద చ-న్నుల బెడంగు
నలఘు కాంచీపద - స్థలముల యొప్పును
లలితానవేందుమం - డలమురుచియు
నళినీల కుటిల కుం - తలములకాంతియు
నెలజవ్వనంబున - విలసనమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నలసభావంబును-బొలుపును మెలపును
　గలుగు నగ్గిరికను-దలఁచితలఁచి
*　　*　　*　　*
—ఆది. 3, ౨౭.

దీనియం దంతటను ప్రాసస్థానమున నొకే
యక్షరము కనబడుచున్నది.

(౪) యమునంశమునఁబుట్టె - నధిపతి ధర్మజుం
　డనిలాంశమునఁబుట్టె - ననిలజుండు
శక్రాంశమున ధనం-జయుఁ డుదయించె నా
　శ్వినులయంశముల నూ-ర్జితులు నకుల
సహదేవు లనవద్య - చరితులు పుట్టిరి
　శ్రీమూర్తియై యాజ్ఞ - సేని పుట్టె
నగ్నియంశమునఁ జి-తారి ధృష్టద్యుమ్నుఁ
　డనఁబుట్టె ద్రుపదరా- జాన్వయమున
*　　*　　*　　*
—ఆది. 3, ౮౩.

దీనియం దేపాదమున కాపాదములో
రెండుదళముల యందు నొకేవిధమగు యతి
కనిపించు చున్నది.

అధికలజ్జావన-తాస్యుల నపగతా
　భరణాంబరుల ధర్మ-పరుల నజిన
నల్కలధారుల-వరముని వేషులఁ
　బాండుకుమారుల-భానునిభులఁ
జూచి దుఃఖితయయి- సురలార యిట్టి దు
　ర్వ్యసనోపహతులైన-వారిమిమ్ము
జూడక ముందఱ-సురలోకమున కేఁగి
　పాండుభూపతి పుణ్య-భాగియయ్యె.
*　　*　　*　　*
—సభా. ౨, ౨౮౪.

ఇది (౨) వంటిది.

పార్థివప్రభుఁడైన-పాండుమహీపతి
　కోడల నయి యుద్ధ-కుశలు లయిన
పాండుతనూజుల-భార్యనై పూజ్యుఁడ
　వైననీసఖియనై- యధికశక్తిఁ
బరఁగుధృష్టద్యుమ్ను-భగిని నై ధృతరాష్ట్ర
　పట్టిచే సభఁదల-పట్టి యీడ్వఁ
బడి పాపకర్ముచేఁ-బరిధాన మొలువంగఁ
　బడి దారుణంబైన-పరిభవంబు
పడితి నట్టి నన్నుఁ-బాండవుల్ సూచుచు
　నుండి రొరుల వోలె-నుక్కు దక్కి
యాపగాతనూజుఁ-డాదిగా గలవృద్ధ
　బంధుజనులు సూచి-పలుకరయిరి.
—అర. ౧, ౧౩౬.

దీనియందు సీసము ప్రథమదళమున,
నాలుగుపాదములయందును యతి ఒక్కటే.
ఇంకను ఈయతివర్ణము ద్వితీయదళములందుఁ
గూడ 3, ౪, పాదములలోను, ఆ. వె.యందు
౧, ౪ పాదములలోను కనబడుచున్నది.

కడఁగి బుద్ధీంద్రియ-కర్మేంద్రియంబుల
　యందు సంయతచిత్తు-లైన వారు
ధృతి నహంకార ప్ర-తిగ్రహాపేతుల
　యందు నివృత్తాత్ము-లైన వారు
నల్పభోజనులు న-నారంభకులు నయ్యు
　నత్యంత సంతోషు-లైన వారు
సత్యవ్రతులు శుభా-చారు లక్రోధను
　లగుచు ధర్మాన్వితు-లైన వారు
నఖిల తీర్థశతము-లాడిన ఫలమును
　నఖిల యజ్ఞవిధుల-నైనఫలము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడయుదురువిహీన-భాగ్యదుష్కృతులకుఁ
బరమతీర్థసేవఁ-బడయనగునె?

—అర. ౨, ౨౪౦.

ఇదిన్నీ (౨) వంటిదే. ఆ. వె. ౧, ౨, పాదములయం దాయతివర్ణమే తీసికొనిరాఁ బడినది. 3, ౪, పాదములయందు నొకేయతివర్ణ మున్నది.

గీతములు

సీసములందువలెగీతములందును నియమము కనబడుచున్నది. ఆనియమము నీరీతిగా నేర్పరచవచ్చును:

(౧) సర్వయతి.

(౨) సర్వప్రాస.

(3) ౧, 3, పాదములు యతి; ౨, ౪, పాదములు ప్రాస.

(౪) ౧, 3, పాదములు ప్రాస; ౨, ౪, పాదములు యతి.

ఈ నియమములు తేటగీతలకున్ను, ఆటవెలఁదులకున్ను సామాన్యములే.

(౧) సర్వయతి:- తేటగీతలు: ౧3౬. ఉదా:

అమ్మహాశ్వంబు ధవళదే-హంబునందు
నల్లఁగలిగిన నీవిప్ప-నాకు దాసి
వగుము మఱియందు నల్లలే-దయ్యెనేని
నీకు నే దాసినగుదు ప-న్నిదము సఱము.

—ఆది. ౨, 3౧.

ఆటవెలఁదులు: ౧3౮. ఉదా.

సభలవిస్తరిల్లి - శల్యాదికములైన
నాల్గుపర్వములవి-నంగఁ జాలి
నవమపర్వమనఁగ - నవ్యార్థరమణీయ
మగుచు శల్యపర్వ-మతిశయిల్లు.

—ఆది. ౧, ౫౧.

(౨)సర్వప్రాసము:_ తేటగీతలు: ౧౪. ఉదా.

పటువనోపకయున్న మై - మఱచి పెంటిఁ
బెనఁగియున్న నుబ్రసవింప-మొనసియున్నఁ
దెవులుగొనియున్న మృగములఁ-దివిరి వేఁటఁ
రెఱచియాహారముగమను-నెఱుక లయిన.

—ఆది. ౫, ౫౭.

ఆటవెలఁదులు: ౧౮.

ఎట్టి సాధ్వులకును - బుట్టినయిండ్లను
బెద్దకాల మునికి-దద్ద తగదు
పతులకడన యునికి - సతులకు ధర్మువు
సతుల కేమగడయుఁ-బతులసూవె.

(3) ౧, 3:—పాదములు యతి; ౨, ౪.
పాదములు ప్రాస

తేటగీతలు: ౧౨.

సుతుల విద్యాప్రవీణతఁ - జూచు వేడ్క
నెంతయును సంతసంబునఁ గుంతిదేవి
రాజసన్నిధి గాంధార - రాజపుత్త్రి
కెలననుండె నుస్మిలిత - నలిన నేత్ర.

ఆటవెలఁదులు: ౮.

భ్రమవిమోహలోభ - భయపరిభూతనై
కొడుకు విడువ నంత - వెడగనయ్యె
యేను పీనిశక్తి -మె ఱుఁగక పంచిన
దానఁగాను వినుము - పీనిశక్తి.

(౪) ౧, 3, పాదములు ప్రాస; ౨, ౪,
పాదముల యతి:—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తేటగీతలు: ౧౩. ఉదా.

నీఁడు పుట్టిన పదియగు-నాఁడు పెలుచఁ
బడిమ నాచేతనుండియ-ప్పర్వతమునఁ
బడిన వడిఁ జేసి బాలకు-నొడలు దాఁకి
యాషణాబ ఱాలెల్లను-గ్గయ్యెఁ జూవె.

ఆటవెలఁదులు: ౨౪. ఉదా.

దానినెఱిఁగి కమల-యోని వానికిఁ గర
మల్గి మర్త్యయోని-యందుఁ బుట్టు
మనుచు శాప మిచ్చె-నొనరంగవాఁడును
గరము భీతిఁ గరయు-గంబు మొగిచి.

—ఆది. ౪, ౧౨౨.

పై నియమము సాధారణసూత్రము. దీని కపవాదములుగా అచ్చుపుస్తకములం దీ క్రిందిపద్యములు కనుపించుచున్నవి. వానికి సామాన్యసూత్రానుసారమయిన పాఠమును తాళపత్త్రగ్రంథములనుండి యెత్తి యిస్తున్నాను.

అచ్చుపాఠము

సకలధర్మవిదుండవు-సర్వలోక
(తాళపత్త్రగ్రంథపాఠము: సర్వధర్మవిదుండవు-సర్వలోక)
వర్తనము లెఱింగిన పుణ్య-కర్తవీవు
నెయ్య మొనరంగ నెఱిఁగింపు-మయ్యనాకు
వెలయఁ బుణ్యలోకంబులు-గలవె యనిన.

—ఆది. ౩, ౨౩.

ఎట్టిరాజులును మ-హీసురోత్తము లెదు
రరుగుదెంచు నప్పు-డధిక భక్తి
నెరఁగి ప్రియము వలికి-తెరువిత్తు రిట్టిద
(తాళపత్త్రగ్రంథపాఠము.—తెరలిప్రియముపలికి-తెరువిత్తు)
ధర్మ మీవు దీనిఁ-దలఁప వెట్లు.

—ఆది. ౭, ౩.

ఎంత యోటువడిన-నంతియ జూదంబు
(తాళపత్త్రగ్రంథపాఠము: ఎంతయోటువడిన-నింకను జూదంబు)
నందుఁ దగులుఁ జలము-నతిశయిల్లు
నేమి సేయుదాన - నిది యొగ్గునకు మూల
మని లతాంగి దుఃఖి - తాత్మయగుచు.

—ఆర. ౨, ౬౨. అచ్చుప్రతి

ఇది సర్వయతిపద్యము.

ఈ క్రింది పద్యమున మరొక్క విధాన మగుపడుచున్నది.

వానిఁ జూచి నలుఁడు-దానల్గి శాప మీ
నున్నఁ గలి యెఱింగి-నిన్నుఁ బొంది
యహివిషంబుచేత-ననిశంబు దగ్ధుఁడ
[౧]నైతి నింక నాకు - నలుగ వలదు.

—ఆర. ౨, ౧౭౯.

ఈపద్యములో సాధారణసూత్రమునకు విలక్షణముగా ౧, ౨, పాదములందు ప్రాసయు, ౩, ౪, పాదము లందు యతిన్నీ కనఁబడు చున్నది. ఈక్రింది వానికి పాఠాంతరముల నింకను నన్వేషింపవలసి యున్నది.

(౧) కడఁగి సూతుండు పుత్త్రకుఁ-గౌఁగిలించి
కొని తదీయమూర్ధాఘ్రాణ-మొనరఁ జేసి
యంగరాజ్యాభిషేకార్థి-యైనశిరముఁ
దడిపె వెండియు హర్షాశ్రు-తతులఁ జేసి.

—ఆది. ౭, ౫౨.

౧. ఇంక నాకు నది సహింపనలయు; ఐతినింకనను సహింపనలయు.—; గిడుగు రామమూర్తి పంతులు గారి ప్రతులు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇది సర్వయతిగా నుండవలెను. రెండవ పాదమున తప్పినది.

(౨)అధికవీరుండు రక్కసుం-డరుగు దెంచు
నని మనంబున భయమంది-వనజ నేత్ర
వీరి సుఖసుప్తులైయున్న-వారి నిద్ర
సెడంగ బోధింపనోప నా-కడిఁది వినుము.
—ఆది. ౭, ౧౯౮.

ఇందు మొదటిపాదమున ప్రాసయతియో మూడవపాదమున యతియో ఉండవలెను.

(3)ధరణిసురులగురులఁ-బరమ యోగుల మహా
¹భాగ్యవంతు లయిన-భాగవతుల
రాజవంశకరుఁడు-²పూజించుచును వారి
వలనఁ బుణ్యకథలు-వెలయ వినుచు.
—ఆది. ౮, ౧౨౫.

(౪) సాక్షియును ధర్మదర్శియు-సాక్ష్యవిధులు[3]
దప్పఁగాదు తప్పినను న-ధర్మయుక్తిఁ
వరుణపాశసహస్రంబు-వానిఁ గట్టి [౪.
పాయునేఁడేఁట నొక్కొక్క-డాయతము
—సభా. ౨, ౨౪౨.

(౫)వీనిపుట్టిన పాపంబు-వేళఁ బెక్కు
దుర్నిమిత్తముల్ పుట్టిన - నిర్ణయించి
యేను జెప్పితిఁ దొల్లియు - ⁵వీనిచేత
నెట్టుఁ గౌరవులకుఁ గీడు-పుట్టు ననియు.
—ఆర. ౧, ౪౯.

(౬)పాంచజన్యరవము - పంచమహాశబ్ద
రవముఁ జెలఁగ దిశలు - సెవ్వుపడఁగ
నోలసి జనులదీవ- సలు మించె రమ్యమై
గరుడ కేతనంబు - గ్రాలెఁజదల.
—ఆర. ౧, ౧౮౦.

ఈ గీత పద్యములందు మరిఒకరీతి విశేషము అచ్చటచ్చట కనబడుచున్నది. ఆ[illegible] నమునందు ఐచ్ఛికముగా వాడబడే 'మూడై' అని యతివిశేష మిట్టిదే. ఈ క్రింది పద్యములిట్లే ఉండవలెనో, పాఠాంతరములను చూచి అన్ని పాదములూ ఒకేరీతిగా ఉండవలెనని ని[illegible]యింపవలెనో తెలియరాకున్నది. ఈపద్యము[illegible] పైని సూచించిన సామాన్యసూత్రము నను[illegible]రిస్తూ ఇంకామరికొన్ని నియమములతో క[illegible]పించుచున్నవి.

(౧)ఇన్న రేంద్రు చేత-మున్ను గృహీతమై
యున్న నాకరంబు-గ్రన్ననిక
నొరున కర్హమగునె-పరిణయ విషయమై
ధరఁ బరిగ్రహింపఁ-బరమమూర్తి!
—ఆ. వె, ఆది. 3, ౧౬౭.

దీనిలో మొదటి రెండుపాదములయం[illegible]ను ఒకే ప్రాసాక్షరము. తరువాతి రెండుపాదము లందును నొకే ప్రాసాక్షరము.

(౨) ఎట్టి సాధ్వులకును-బుట్టిన యిండ్లను
బెద్దకాల మునికి-దద్ద తగదు

---

౧. భాగులయిన యట్టి., ౨. పూజింపుచును.; 3. సాక్షియును ధర్మదర్శియు-సాంఖ్య[illegible]
౪. విధులు తప్పంగఁ జెప్పిన - నఘమున్నత్తి. ౫. నీతిచెయిని.—గిడుగు రామమూర్తిపంతులుగారి (క[illegible]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సతుల కడనయునికి-సతులకు ధర్మువు
సతుల కేడుగడయుఁ-బతుల సూవె.

—ఆ.వె., ఆది. ౪, ౬౪.

దీనియందు 3, ౪, పాదములలో నొకే ప్రాసాక్షరమున్నది. ౧, ౨, పాదములలో కూడా అట్లేఉందునా అని భ్రమ పుట్టు చున్నది.

(3) ఏల మెఱుక లేని-యితరుల యట్ల నీ
వెఱుఁగ ననుచుఁ బలికె-దెఱేఁగి మెఱేఁగి
యేనకాని దీని-నెఱుఁగరిందొరులని
తప్పఁ బలుక నగునె-ధార్మికులకు.

—ఆ. వె., ఆది. ౫, ౭౭.

ఈపద్యము మొదటి 3 పాదములలోను యతియందొకే అక్షరమున్నది. నాల్గవ దానిలో మారినది.

(౪) ఏను జహ్నుకన్య-నింద్రసమాన నీ
సద్గుణావళులకు-సంతసిల్లి
భానుతేజ నీకు - భార్యగా వచ్చితి
నిష్టమునఁ బరిగ్ర-హింపు నన్ను.

—ఆ. వె., ఆది. ౪, ౧3౫.

దీనియందు ప్రాసము విధింపఁ బడినదా అన్నట్లున్నది. ౧,3, పాదముల రెండవయక్షరమును చూడండి; ఇట్లే:

(౫) పరులవలన బాధ-వొరయకుండఁగ సాధు
జనులధనముఁ గాచు-జనవిభుండు
గరుణదప్పి తాన-హరియించు వాఁడగు
నేని సాధులోక-మేమి సేయు.

—ఆ. వె., ఆది. ౭, ౧౦3.

ఇందు 'ర' యనునది ప్రాసాక్షరముగా ౧, 3, పాదములందు కలియుచున్నది. పైదాని యందు కంటె హెచ్చువిశేషము:

(౬) దీనిఁ బుత్తు మఱి మ-దీయపిండోదక
నిధిఁ దనూజుఁ గులము-నిస్తరించు
వానిఁ బితృగణంబు-నలనిబుణంబుఁ బా
చిన మహోపకారి-జిలుతవాని.

—ఆ. వె., ఆది. ౬, ౨౪౮.

(౭) పురుషుకంటె మున్ను-పరలోకమేఁగిన
సతియు నోఁచినదియు-సతులలోనఁ
బురుషహీనయగుచుఁ-బరమ పతివ్రత
యయ్యు జగముచేతఁ-బ్రయ్యఁబడదె.

—ఆది. ౬, ౨౫3.

ఇది (౫) వంటిదే.

(౮) సతి విముక్తయయిన-పతికి పునర్దార
సంగ్రహంబు సేఁత - శాస్త్రమతము
పతి విముక్తుఁడయిన-సతికన్యపురుషసం
గ్రహము సేఁత లోక-గర్హితంబు.

—ఆది. ౬, ౨౫౫.

ఇదియున్ను (౫) వంటిదే.

(౯)జలము లందయుండు-సర్వలోకంబులు
గాన నీమహోగ్ర - కలుషవహ్ని
జలధిలోన విడిచి - సత్ప్రతిజ్ఞుండ
వగుము జలధి జలము - నది వహించు.

—ఆది. ౭, ౧౪౭.

ఇది (౪) వంటిది.

(౧౦)...వరునితపముఁ జెలుప-వలయునావృషుఁ
లాసనుండు త్రిభువ-నార్చితుండు [గమ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సురహితంబుఁబొంటె - సుందోపసుందుల
కడకువచ్చె వరము - కరుణ నీఁగ.
—సీసపద్యములోని ఆ. వె., ఆది. ౮, ౯౬.

ఇదియు (౪) వంటిదే.

(౧౧)అనఘ ధర్మతనయ-ననుజసమన్వితు
సంస్తుతించి రథిక-సమ్మదమున
నని కురుప్రభునకు-నట్లు వైశంపాయ
నోక్తమైన కథ ర-సోత్కటముగ.
—సీసములోని ఆ. వె., సభా. ౧, ౨౯౧.

దీనియందు ౧, 3, పాదములలో ఒకే యక్షరము యతిగాను, ఒకేఅక్షరముప్రాసవర్ణముగాను ఉన్నది.

(౧౨)గురులవృద్ధశిల్పి-పరవణిగ్బాంధవ
జనుల నాశ్రితులను-సాధుజనులఁ
గరుణఁబేదటీకము-వారయకుండఁగఁబ్రోతె
సకలజనులు నిన్ను-సంస్తుతింప.
—సీసములోని ఆ. వె., సభా. ౧,౪౬.

(౧3) ధర్మరహితులైన-ధార్తరాష్ట్రులకు భూ
రాజ్యలక్ష్మి సుస్థి-రంబు గాదు
ధర్మతనయ నిన్నుఁ-దద్రాజ్య సంపదల్
వలచి తమకుఁ దామ-వచ్చి పొందు.
—అర. ౧, ౬౧.

ఇది (౧౧) వంటిది.

(౧౪) అనిన రక్కసునకు-నలిగిన యగ్రజు
నలుక మెఱిఁగి వీరుఁ-డర్జునుండు
మొనసి గాండివంబు-మోపెట్టె నవసిత
ఖడ్గపాణులైరి-కవలునంత.
—సీసములోని ఆ. వె., ఆది. ౧,౧౧౬.

ఇందు ౧, 3, పాదములలో ప్రాసము; ౧, ౨, పాదముల యందు యతిగా ఒకేయక్షర ముండుట విశేషము.

(౧౫) కరుణనిట్టులనిమెఁ-బరమాత్రలాభంబు
నీకు నిష్టమేని-లోకవంద్య
గరళకంఠు నీశుఁ-బరముఁ బ్రసన్నుగా
వేగఁజేయుమధిక-యోగశక్తి.
—సీసములోని ఆ. వె., అర.౧, ౨౯౪.

ఇది (౫) వంటిది.

(౧౬) పర నరేంద్రమకుట-పద్మరాగద్యుతి
నరుణమగు భవత్ప-దాబ్జయుగము
పరుషదారు శిలల-పైనిష్ప డరుగుట
నరుణమయ్యెఁ బర్వ-తాంతరముల.
—అర. ౧, ౨౧౩.

ఇందు పెద్దవిశేషము: నాల్గుపాదముల లోనూ ఒకేప్రాసాక్షరము. ౧, 3, పాదముల యందును, ౨, ౪, పాదముల యందును యతి స్థానమునఒకే వర్ణము.

(౧౭) వరుణదేవుతోడ-కరమల్గి జలనివా
సంబు విడిచి భూస్థ-లంబువలని
కరుగుదేర నున్న-వరుణేంద్రుదేవియుఁ
బోనిదాని దేవ-యానిఁ గనిమె.
—ఆది. 3, ౧౩౯.

ఇది (౫) వంటిది.

(౧౮) కర్మఫలము లేదు-కర్మఫలాప్తికిఁ
గారణంబు విధియుఁ-గాదనంగ
నంత మెఱుకలేనె-యార్తనై విధిచెద్రు
కలసి పలికితిం బ్రి-యంబు దప్పి.
—అర. ౧, ౨౩౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇది ౧, ౨, పాదములయందున్న, ౩, ౪, పాదముల యందున్న యతిస్థానమున ఒకే అక్షరము గలది.

(౧౯) మిత్రసంపన్నుఁడైన న-మిత్రు మిత్ర
బలముతోడ భేదించి దో-ర్బలముఁ జలము
గలిగి దేశబలంబును-గాలబలము
గలుగువాని కసాధ్యంబు-గలదె యెందు.
—ఆర. ౧, ౨౯౦.

ఇందు ౧, ౩, ౪, పాదములలో ఒకటే ప్రాసాక్షరము.

(౨౦) ఒండొరులఁ గడవంగ న-య్యువిద లెల్లఁ
బఱచియొక్కొ-క్క కలహంసఁ-బట్టికొనఁగ
జెలువముగ నందు దమయంతి-చేతఁ బట్టు
వడియె నలుచేత విఘునంగఁ-బడిన హంస.
—ఆర. ౨, ౧౭.

దీనిలో ౨, ౪, పాదముల యతిస్థానమున నొకటే యక్షరము.

(౨౧) నలున కాని నలిన-దళనేత్ర వరియింప
దట్టి చూత మనుచు-నమరవరులు
నలువురును గడంగి-నలరూపమున వచ్చి
రాస్వయంవరమున-కతిరయమున.
—ఆర. ౨, ౯౨.

ఇందు ౧, ౩, పాదములలో ప్రాసవర్ణ మొక్కటే; ౨, ౪, పాదములలో యతివర్ణ మొక్కటే.

(౨౨) అనుచు సంశయాకు-లాత్ములై సురలార,
నలునెఱుంగు విధము-నాకుఁ జేయుఁ
డాత్మరూపధరుల-రగుఁడని పరిదేవ
నంబుచేసెఁ దనమ-నంబులోన.
—సీసములోని ఆ. వె., ఆర. ౨, ౯౩.

ఇందు ౧, ౩, పాదములలో యతివర్ణ మొక్కటే; ౨, ౪, పాదములలో యతివర్ణ మొక్కటే.

(౨౩) ఎంతదూటు వడిన-నింకనుజూదంబు
నందుఁ దగులుఁ జలము-నతిశయిల్లు
నేమిసేయుదాన-నిది యెగ్గనకు మూల
మని లతాంగిదుఃఖితాత్మ యగుచు.
—ఆర. ౨, ౬౨.

ఇది (౨౧) వంటిది.

(౨౪) నీధనంబును రాజ్యంబు-నికృతిఁ గొన్న
యక్షముల మేము నీవస్త్ర-మపహరింపఁ
బక్షిరూపులమైవచ్చి-పార్థివేంద్ర
యపహరించితి మనిచెప్పి-యరిగెఁ జదల.
—ఆర. ౨, ౬౭.

ఇందు ౨, ౪, పాదములలో ఒకే యతి వర్ణము.

(౨౫)అందుఁ గొంద ఱధిక-హాస్యంబు సేసిరి
యడవి నేమిరోసె దనిరికొంద
అవ్వ, నీవు వేల్ప - వగుదని కొందఱు
మొగిన కేలు మొగిచి - మ్రొక్కి రంత.
—సీసములోని ఆ.వె., ఆర. ౨, ౧౦౪.

ఇందు ౧, ౨, ౩, పాదములందు యతి స్థానమున నొకేవర్ణము.

(౨౬)పురుషునందు దోష-పుంజంబు గలిగిన,
నెఱిఁగి యెద సహించు-నేనిభార్య
పురుషునం దభీష్ట-భోగంబు దేహాంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రంబునందు ధర్మ రతియుఁ బడయు.

—ఆర. ౨, ౧౫౯.

ఇది (౧౨) వంటిది.

(౨౭)(దురిత కర్మంబులెల్లఁ......)
బాయుఁ గాఁకుంజరమను-పర్వతంబు
నందు దేవహ్రదంబాడి-యభిమతమును
బడయుదురు మేధికంబునాఁ-బరఁగు తీర్థ
మాడి మేధాసమన్వితు-లగుదు రెందు.

—సీసములోని తే. గీ., ఆర. ౨, ౨౭౮.

ఇందు ౧, ౩; ౨, ౪, పాదములం దొకే యతివర్ణము.

(౨౮) ఎఱిఁగి యెఱిఁగి దీని-నెట్లీఁగ నగు భోగ
యోగ్యమైన యది వ-యోజనేత్ర
యీనినాఁడు శాప-మిచ్చుఁగా కమ్మని
యేల సైఁచు నింక-నెట్టులొక్కొ!

ఆర. ౨, ౩౨౭.

ఇందు ౧, ౩, ౪, పాదములలో ఒకేయతి.

(౨౯)త్వష్ట యంత నూఱు-ధారలరమ్యమై
యనల కణకరాళ-మైన వజ్ర
మొనరఁ జేసి దీన-నోర్వుము దైత్యుల
ననుచు నిచ్చె దాని-నమరపతికి.

—ఆర. ౩, ౭.

ఇందు ౨, ౪, పాదములకు ప్రాస; యతి వర్ణమొక్కటే.

(౩౦)వరదుఁడైనయీశు-వరముననిదియొక్క
పదరు పుట్టె నెట్టి-వరమొయనుచు
దానిఁ బొఱవైవఁ-గా నున్న నాకాశ
వాణి యిట్టులనియె-వసుమతీశ!

—ఆర. ౩, ౬౪.

ఇందు ౧, ౨, ౪, పాదములయందు యతి స్థానములో ఒకేవర్ణము.

(౩౧) ఇదియు విష్ణుపదంబుదా-నిది వివాశ
యిదియుఁ గాశ్మీరమండలం-బిది నిరస్త
మిదియు మానసద్వారమిం-దిందువంశ,
పరశురాముండు మును హంస-పథముఁ జేసె.

—ఆర. ౩, ౨౬.

ఇందు ౧, ౨, ౩, పాదములలో యతిస్థానమున ఒకే వర్ణము.

(౩౨) ప్రాణభయమున వచ్చి యి-ప్పకి నన్ను
నాశ్రయించె నాశ్రితునెట్టి-యధముఁడైన
విడువఁడనినను నేనెట్లు-విడుతుదీని
నాశ్రితత్యాగ మిదిధర్మ-నగునె చెపుమ?

—ఆర. ౩, ౨౩౦.

ఇందు ౨, ౪, పాదములలో యతిస్థానమున ఒకేవర్ణము.

(౩౩)మునికుమారు నెగిచి-కొనివచ్చినిశితశూ
లాయుధమునఁ బొడిచి-యాసురమున
రక్కసుండుచంపి-యక్కాంతయునుదాను
నరిగె రైభ్యుకడకు-నాకసంబు.

—ఆర. ౩, ౨౭౧.

ఇది (౩౧) వంటిది.

(౩౪) ఏను వేదశాస్త్రమ్ముల-నెఱిఁగి వ్రతము
లెల్ల సలిపి యారైభ్యచే-హింసితుండ
నైతి, నాకంటె రైభ్యున-కధికశక్తి
యైన తెఱఁగెట్టులనిన ని-ట్లనిరి మునులు.

—ఆర. ౩, ౨౮౧.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇందు ౧,౨, పాదములలో యతివర్ణ మొక్కటే; 3,౪, పాదములలో యతివర్ణ మొక్కటే.

పైవిశేషము లన్నీ భారతకవిత్వమునకు మార్దవమును గలిగిస్తున్న వనడానికి సందేహము లేదు. ఇవి కవిత్వమునకు నిర్బంధము లెంతమాత్రమును కావు. ఇట్టి ఐచ్ఛిక వ్యవహారమును బట్టి కవితకు మెరుగు వస్తుంది అవి బంధములుగాపరిణమిస్తే కవిత్వమునకుసొగసు తగ్గిపోతుంది. ఇట్టి నియమములన్నీ ఛందోవిషయమున మొదట కవితాలంకారప్రాయములుగానేర్పరుపబడినా, తరువాత విధులుగా లాక్షణికులచేత చెప్పబడి శృంఖలప్రాయము లైనవి. దేశిపద్యములం దీనియమములువిధులుగా పరిణమింపకుండడము ఆంధ్రభాష అదృష్టము.

ఈవిషయమునే 'సత్కవిత్వతత్త్వ'మున అడిదము సూరకవి ఈక్రిందిపద్యమున నతి సరసముగా సంగ్రహించినాడు.

యతియుక్తి వాక్యాను - గతినంటవలయు వ
త్సంబు ధేనువు వెంటఁ - దవిలి నట్లు
మెట్టుమీఁదనుగాలు-వెట్టఁగైదండ యం
దించినట్టులు ప్రాస - మెనయవలయు
సానబట్టినమణి - చందాన పద మర్థ
నారీశుభంగి బం-ధంబువలయు
దివి వెలుంగుమెఱుంగుఁ - దీఁగె యట్లర్థంబు
తేటతెల్లంబుగాఁ-దెలియవలయు
నలఁతి దొలవడ్డ చంద్రమం-డలము వలన
జలజలన రాలు నమృతంపు-జాలు లీల
రసము దులకింపవలె నట్టి-రమ్యకవిత
రసికరసనారిరంసచేఁ-బ్రబలకున్నె.





వ్యాసకర్త

# వసంత ప్రవాసి

పండితారాధ్యుల నాగభూషణం గారు

శాఖికనాళిః నికరసుస్వరభాస్వరమై మహీరుహ
ప్రకరము పల్లవించెఁ గనుపండువుగా నిలువెల్ల మల్లికా
వకుళజపాద్యనేకసుమవార పరీమళముల్ గ్రహించుచున్
సకలదిశాంతరంబులను సందడిమై విహరించు వాయుడిం
భకుఁడు దళత్సరోజ నవమంజుల పక్వమరంద మాని వా
రక చరియించు తేంట్లు మధురధ్వనులన్ శ్రుతిరంజకంబుగాఁ

బ్రకట మనోనురాగ రసబంధురభావములన్...........
..............రమ్యకళావిభవ ప్రదర్శనో

త్సుకమతులై చెలంగెదరు సుందరపుష్పవనంబులం బ్రసం
చకమఖిలంబు నిట్లతులసౌఖ్యరసాంబుధిఁ దేలుచుండ నీ
వకట, వసంతకాలమున నన్యపదంబులయందుఁ బాంథ! యే
టికిఁ జరియించెదిట్టులు కఠినంది శ్రమంబున కగ్గమాచు, ని
టికిఁ గడుదూర మూచు, గమనింపవు కష్టసుఖంబు లింతయున్
వికచసరోరుహాక్షి యఁట నీదు వియోగముచేఁ దపించుచున్
వికలతఁ జెంద నెంత విలపించునో యీ మధుమాసవేళలన్
సకియల నింట డింపఁజను నాపరదేశములం జరింప నీ
కొకనికిఁ జెల్లెఁగాక యెవఁడోపు నిదాఘనితాంతతాపవా
రకరమణీమణీ లసదురఃప్రభవ ప్రథితాధరామృతా
ధిక సుఖసంపదల్ విడిచి ద్రిమ్మరఁ గన్గొనుమయ్య యే క్రియన్
బ్రకృతి ప్రభూతరాగ రసభావుకమై యెసలారుచుండెనో
నికట మహీరుహప్రతతి నెమ్మి సుఖంచెదుఁ గీరశారికా
పికముఖ పక్షిదంపతులు ప్రేమరహస్యము వెల్లడించు చె
ట్లు కసరి కూయునో వినుము; లోకమునంగల సర్వవస్తులె
ల్లకడల రాగరంజితములై కనుపట్టఁగ నీమనంబునం
దకట రవంతయుం జలనమందినచందము గానరా దిదే
మి! కఠినదారునిర్మితమొ! మృత్పరికల్పితమో! శిలావిశి
ష్టకమొ! యయోమయంబొ! యకటా! జడమై రసహీనమై కడున్
వికృతమునై విచిత్రమయి వింతగనుండె గ్రహింపరాక, తా
వక హృదయప్రవృత్తి, పశుపక్షులయందును మృగ్యమయ్యెఁ జా
లీఁకనయిన న్మనోహర మహీనసుఖావహ మాత్మశాంతిదా
యకమగు నీ వసంతసమయంబు వృథా చననీక వేగమే
సుకముగ నిల్లుఁజేరుకొని సుందరిఁగూడి సుఖంపు మధ్వగా!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




[వెనుకటి సంచిక తరువాయి]

శ్రీ పరవస్తు వెంకటరామానుజస్వామి గారు

## 7. ఇండో యూరపియన్ కుటుంబ సామాన్య ధర్మములు; కొన్ని శాఖల విశేషధర్మములు

'ఇండో యూరపియన్' కుటుంబములో జేరిన భాషలన్నిటికి నీక్రిందిసామాన్యధర్మము లగపడుచున్నవి:

1. ధాతువు లేకాచ్కములుగా నుండుట: అనగా భాషలో నేపదమునైనను తీసికొని దానిలోని ప్రత్యయముల నన్నిటిని క్రమముగా వేరుచేసినచో దుదకు విభాగానర్హమగు నేకాచ్కవర్ణసముదాయము మిగులునని యర్థము. దీనినే ధాతు వందురు. భాషలలోని పదములన్నియును ధాతుజములని భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము.

2. అస్పష్టప్రత్యయములనుగలిగియుండుట. ధాతుప్రత్యయములు చేరునప్పుడు తరచుగా నీరెంటియందును వర్ణవిపరిణామములు గలిగి ధాతుప్రత్యయములు రెండును రూపభేదములను బొందును. ఆకారణమున నీకుటుంబములోని భాషలలో ప్రకృతి ప్రత్యయవిభాగము సులభముగా నుండదు.

3. అజ్విపరిణామమును గలిగియుండుట. అజ్విపరిణామమనగా (Vowel Gradation లేక Ablant) ధాతువులోనికాని, ప్రత్యయములోనికాని యచ్చట్టిధాతుప్రత్యయములు చేరియున్న పదములలో నియమముతో మారుట.

| ఉ॥ గమ్ | జగ్మతుః | అగమత్ | జగామ |
|---|---|---|---|
| తృ(తర్) | పితృషు | పితరః | పితా |

సంస్కృతాదిభాషలయందుదాత్తాదిస్వరము లేపదమునందైనను స్థిరముగా నుండక కొన్నికారణముల ననుసరించి మారుచుండును. ఇట్టి స్వరములోని మార్పే యజ్విపరిణామమునకు ముఖ్యమైనకారణమని భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఈ అజ్విపరిణామమును గురించి ముందు తిరుగ ప్రశంసింపగలము.

ఈకుటుంబములో జేరియున్న భాషాశాఖలకు పైనిచెప్పిన సామాన్యధర్మములే కాక కొన్నివిశేషధర్మములుకూడ గలవు. కొన్నిముఖ్యమైనశాఖల విశేషధర్మము లీక్రింద జూపబడినవి.

1. 'ఆర్యన్' శాఖ—(i) 'ఇండోయూరపియన్' మాతృభాషలోని ఎ, ఒ అను రెండచ్చులును అకారములోనికి మారుట. (ii) మాతృభాషలోని యస్పష్టాచ్చు (e) ఇకారములోనికి మారుట. (iii) ఇ, ఉ, క, ర, ల, స అనువర్ణములకు బరముగానుండు సకారము షకారములోనికి మారుట. (iv) అజంతములలో షష్ఠీబహువచనమున 'నామ్' అనుప్రత్యయము కలిగియుండుట.

2. 'బాల్టోస్లేవోనిక్' శాఖ—(i) అజ్మధ్యములగు ద్విత్వవర్ణములయొక్క ద్విత్వము లోపించుట. (ii) మాతృభాషలోని n అనునాసికాచ్చు in అనువర్ణములోనికి, ఋవర్ణము ir అనువర్ణములలోనికిని మారుట. (iii) సుబంతశబ్దములలో గొన్ని విశేషరూపములను గలిగియుండుట.

3. 'గ్రీక్' శాఖ—(i) మాతృభాషలోని ఋవర్ణము (ar, ra) అనువర్ణములలోనికిని, ౡవర్ణము (al, la) అనువర్ణములలోనికిని మారుట. (ii) మాతృభాషలోని జకారము dj అనువర్ణములోనికి మారుట. (iii) అజ్మధ్యస్థమగు సకారము లోపించుట. (iv) లిట్ (Perfect) లుఙ్ (Aorist) రూపములలో గొన్నివిశేషములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

4. 'ఇటాలిక్' శాఖ—(i) మాతృభాషలోని m, n అను అనునాసికాచ్చులు em, en, అనువర్ణముల లోనికి మారుట. (ii) మాతృభాషలోని ఋ, ఌ, వర్ణములు or, ol అనువర్ణములలోనికి మారుట. (iii) అజ్మధ్యస్థసకారము నాదమగుట. (iv) మాతృభాషలోని ఘ, ధ, భ, అను మహాప్రాణములు తత్తత్ స్థానీయములగు నూష్మలుగా (h, th, f) మారుట.

5. 'జర్మానిక్' శాఖ.—ఈ (i) మాతృభాషలోని ఋ, ఌ వర్ణములును, అనునాసికాచ్చులును(m,n) వరుసగా ur, ut, um, un, అనువర్ణములలోనికి మారుట (ii) 'గ్రిమ్' (Grimm) పండితుడు కనిపెట్టిన నియమముల ప్రకారము స్పర్శలు మారుట.

ఈ శాఖలకు పైనిచెప్పిన విశేషధర్మములేకాక మూడునాలుగు శాఖలకు సామాన్యములగు ధర్మములు కూడ గొన్ని గలవు. 'ఇండోయూరపియన్' మాతృభాషలో కంఠోష్ఠ్యములనియు, కంఠ్యము లనియు, తాలవ్యములనియు, మూడువిధములగు వర్ణములుండినవి. 'ఆర్యన్' 'ఆమినియన్' 'అల్బేనియన్' 'బాల్టోస్లేవోనిక్' శాఖలలో మాతృభాషలోని కంఠోష్ఠ్యములు కంఠ్యములు గాను, తాలవ్యము లూష్మలుగాను మారినవి. మిగిలినశాఖలలో మాతృభాషలోని కంఠోష్ఠ్యములు కొన్ని ఓష్ఠ్యములుగాను, తాలవ్యములు కంఠ్యములుగాను మారినవి.

ఉ. కతరః (poteros) గౌః, (bous)

శతమ్, 'అవే–' satem 'లిథు'–szimtas

EkaTov (ekaton) Centum.

ప్రా. ఐరిష్–, cet, ప్రా. 'ఇంగ్లీషు'–hund

పైని చివరనుండు నుదాహరణములోని 'అవెస్తా' 'లాటిన్' రూపములనుబట్టి మాతృభాషలోని తాలవ్యము లూష్మలుగా మారినభాషలకు 'సతెమ్' భాషలనియు, కంఠ్యములుగా మారినభాషలకు 'కెంటుమ్' భాషలనియు వ్యవహారము కలదు. మాతృభాషలోని కంఠోష్ఠ్యతాలవ్యముల మార్పులను గురించి ప్రసంగించుసందర్భమున తిరుగ నీవిషయము చర్చింపబడును. పైని చెప్పినభేదముల ననుసరించి 'ఇండో యూరపియన్' మాతృభాష దాని జన్మస్థానముననుండే ప్రప్రథమమున రెండు భాషలుగా మారి తరువాత నవి దేశాంతరములలో తిరుగ నెనిమిదిభాషలుగా మారినవని భాషాశాస్త్రజ్ఞు లూహించియున్నారు.

## 8. 'ఇండోయూరపియన్' మాతృభాష, దానిని రూపించు విధము

ప్రతికుటుంబమునకును నొకమూలపురుషుడుండునట్లు భాషాకుటుంబమునకు గూడ నొక మూలభాష యగు మాతృభాష యుండవలయును. 'ఇండోయూరపియన్' మాతృభాష ప్రస్తుత మెచ్చటను వ్యవహారములో లేదు. దానిలో వ్రాయబడిన గ్రంథము లేవియును లేవు. కాబట్టి దానిస్వరూపము తజ్జన్యములగు సంస్కృతాదిభాషలను బట్టి యూహింపవలసియున్నది. ఏదైన నొకధర్మము జన్యభాష లన్నిటియందును గనబడుచున్నచో నది మాతృభాషలో గూడ నున్నదని చెప్పగలము. కాని కొన్నిభాషలలో నగపడి మిగిలిన వానిలో లేనియెడల నాయాభాషల స్వరూపము విమర్శించి యాధర్మము మాతృభాషలో నున్నదో లేదో నిర్ణయింపవలసియున్నది. దీని కొకయుదాహరణ మిాక్రింద జూపబడును.

'గ్రీక్' 'లాటిన్' మొదలగు ననేకభాషలలో హ్రస్వములగు ఎకార ఒకారములుగలవు. సంస్కృతభాషలో నీవర్ణము లగపడుటలేదు. ఈవర్ణములుకలిగినటువంటి 'గ్రీక్' 'లాటిన్' మొదలగు భాషలలోని పదములకు సమానములగు సంస్కృతపదములలో వానిస్థానమున అకార మగపడుచుండును. 'ఇండోయూరపియన్' మాతృభాషలో నీవర్ణము లున్నవో లేవో నిర్ణయింపవలసియున్నది. సంస్కృతభాష యనేకవిషయములలో మిగిలిన భాషలకంటె విశేషముగా మాతృభాషను బోలియుండుటచే మొట్టమొదట భాషాశాస్త్రజ్ఞులు సంస్కృతములో గనబడనందున నీవర్ణములు మాతృభాషలో లేవని చెప్పుచుండిరి. కాని యిటీవల వారియభిప్రాయమును వారు మార్చుకొనవలసివచ్చినది. ఇండోయూరపియన్ మాతృభాషలోని కంఠ్యములును,గంఠోష్ఠ్యములును, తాలవ్యవర్ణములు (ఇ, ఈ,య,e) పరముగా నున్నపుడు సంస్కృతమున తాలవ్యములుగా మారుననునియమమొకటి నేటి

ముగా కనిపెట్టబడెను. మరియు 'గ్రీక్' 'లాటిన్' మొదలగుభాషలలో ఎకారముగలపదములలో నీవర్ణము నకుపూర్వము కంఠ్యమున్నచో నాకంఠ్యముకూడ దత్సమా నసంస్కృతపదములలో తాలవ్యముగా కనబడుచుండును. ఎకారస్థానమున అకారముమాత్ర ముండును. మరియు నా భాషలలో నకారమునకు బూర్వముండు కంఠ్యము సం స్కృతమున కంఠ్యముగానే కనబడుచున్నది. మాతృభా షలో సంస్కృతమునందువలె ఎకారము లేనిచో నీపద ములలో సంస్కృతమున గంఠ్యము తాలవ్యముగా మారుట కవకాశము లేదు. తాలవ్యకరణనియమము నను సరించి తాలవ్యాచ్చు పరముగా నున్నప్పుడుమాత్రమే మాతృభాషలోని కంఠ్యము సంస్కృతమున దాలవ్య ముగా మారవలయును గాని అకారము పరముగా నున్న ప్పుడు మారుట కవసరము లేదు. కాబట్టి సంస్కృతములోని యీ అకారము తాలవ్యేతరజన్యము కావలయును. అది 'గ్రీక్', 'లాటిన్' మొదలగు భాషల లోనుండు ఎకారమనుట న్యాయ్యము. ఎకారము సంస్కృ తమున అకారముగా మారుసందర్భమున దన తాలవ్యతను దత్పూర్వమున నుండుకంఠ్యమునకు సంక్రమింపజేసియుం డవలయును. లేనిచో సంస్కృతమున మిగిలినయకారము లకుబూర్వమువలె భాషాంతరములలోని ఎకారముతో సరి పోవు అకారమునకు బూర్వముకూడ గంఠ్యము తాలవ్య ముగా మారుట కవకాశము లేదు. కాబట్టి సంస్కృతము లోని యీ అకారము ప్రాచీనమైనది కాదనియు, భాషాం తరములలో గనబడు ఎకారమే ప్రాచీనమైనదనియు, మాతృభాషలో ఎకార ముండినదనియు, నది సంస్కృత మున అకారముగా మారినదనియు జెప్పక తీరదు. సంస్కృ తములో లేని ఎకార ఒకారములలో ఎకారము మాతృ భాషలో నున్నదని యంగీకరింపవలసివచ్చినందున రెండవ దికూడ మాతృభాషలో నుండినదనియు నదియును సం స్కృతమున అకారముగా మారినదనియు నంగీకరించు టలో లాభమున్నందున, ఈరెండువర్ణములును మాతృభా షలో నుండినట్లు భాషాశాస్త్రజ్ఞు లంగీకరించి యున్నారు. ఇట్లీవర్ణములు మాతృభాషలో నుండినవని నిర్ణయించుటకు సంస్కృతములోని తాలవ్యీకరణనియ మము ముఖ్యాధార మగుచున్నది. దీనినిగురించి మాతృ భాషలోని కంఠ్యముల విపరిణామమునుగూర్చి చర్చించు సందర్భమున తిరుగ సోదాహరణముగా బ్రసంగింపబడును. మాతృభాషలోని యచ్చులనుగూర్చి భాషాశాస్త్రజ్ఞుల ప్రాచీనాభిప్రాయము లీతాలవ్యీకరణనియమము కని పెట్టబడినతోడనే మార్చుకొనవలసివచ్చినది.

పైరీతిని విమర్శచేసి భాషాశాస్త్రజ్ఞులు మాతృ భాషాస్వరూపమును జాలవరకు నేర్పరచియున్నారు. దాని నాధారముగా జేసికొనియే ముందుభాగములలో సంస్కృతమునకును మాతృభాషకును సంబంధము నిరూ పింపబడును. జన్యభాషాస్వరూపపరిశీలనమువలననేకాని మాతృభాషాస్వరూపమును తెలిసికొనుటకు మార్గాంతరము లేదు. దానిలో వ్రాయబడిన గ్రంథము లేవియును లేవని యిదివరకే చెప్పబడినది.

### ౯. వర్ణోత్పత్తి

మాతృభాషాస్వరూపమును తెలిసికొనుటకు దజ్జ న్యములను భాషలను బోల్చిచూడవలసియున్నదని యిదివ రలో జెప్పబడినది. భాష వాక్యరూపముగాను, వాక్యము పదఘటితముగాను, బదము వర్ణసమూహాత్మకముగాను నుండునుగదా! కాబట్టి, భాషలను బోల్చిచూచుటకు వర్ణోత్పత్తిస్వరూపములు ముఖ్యముగా దెలిసికొనవలసి యున్నది.

కంఠము, కొండనాలుక, తాలువు, నాలుక, దంత ములు, ఓష్ఠములు, నాసికయను నీయవయవములను మనము వర్ణోత్పాదనమునం దుపయోగింతుము. శ్వాసకోశమునుండి వచ్చునిశ్శ్వాసవాయువు కంఠమును దాటి ముఖమును బ్రవే శించినతరువాత నచ్చట జిహ్వాతాల్వాద్యంగములచే దానికి కలిగిన యవరోధమువలన నది వివిధవర్ణములుగా మారు చుండును. శ్వాసకోశమునువదలిన నిశ్శ్వాసవాయువు మొట్ట మొదట కంఠనాళమును బ్రవేశించును. దీనిమీదిభాగ మున రెండుపొరలు గలవు. ఇవి యవసరమగునప్పుడు పైకిలేచి తలుపులవలె మార్గమును మూయును. ఇట్టిసమ యమున నిశ్శ్వాసము వానిని పైకి త్రోసి వానిమధ్య నేర్పడిన మార్గము ననుసరించి పైకి బోవును. ఇట్లు నిశ్శ్వా సవాయుప్రవాహముచే క్షణక్షణమును ద్రోయబడు నీ పొరలయందొక విధమగు కంపము జన్మించును. ఈకంప మువలన శబ్దము పుట్టి యాశబ్దము పైకి పోవు నిశ్శ్వాస



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును నాదయుక్తముగా జేయును. పలుపులవంటి యీ ఘోరలు పైకిలేవక క్రిందకు బడియున్నచో వాయుమార్గమునకు ప్రతిబంధము లేనందున నిశ్శ్వాసము నాదయుక్తము కాక కేవలశ్వాసరూపముగానే పైకి పోవును. ఇట్లు కంఠస్థానమునందు శ్వాసనాదభేదము కలుగును.

కంఠమును వదలి నిశ్శ్వాసవాయువు పైకి బోవునపుడు దానికి రెండుమార్గములు గలవు: ముఖద్వారము ననుసరించికాని, నాసాద్వారము ననుసరించికాని వెళ్ళగలదు. మన మూపిరితీయునపుడు వాయువు నాసామార్గమున బోవును. అప్పుడు విశేషముగా శబ్దముపుట్టును. కొండ నాలుకవాయును; నాసామార్గమున బోనీయక యడ్డును. కొండనాలుక పైకెత్తబడిన యెడల నది నాసామార్గమును మూయును. అప్పుడు పుట్టినశబ్దము నిరనునాసికముగా నుండును. అట్లుకాక అది క్రిందకు పడియున్న యెడల వాయువు నాసామార్గమును గూడ బ్రవేశించి శబ్దము ననునాసికముగా జేయును. ఇట్లు కొండనాలుకవలన ననునాసికత్వ నిరనునాసికత్వ భేదములు కలుగును.

కొండనాలుకను దాటి వాయువు ముఖమార్గమును బ్రవేశించినతరువాత నచ్చట దానికికలుగు ప్రతిబంధముల చేతను ముఖమార్గముయొక్క యాకారభేదములచేతను, వివిధ వర్ణములు పుట్టును. నిశ్శ్వాసమునకు ప్రతిబంధము కలుగనప్పుడు హల్లు లేర్పడును. ఈప్రతిబంధము కంఠమున గాని, తాలువునొద్దగాని, యోష్ఠములవలనగాని, దంతముల యొద్దగాని కలుగవచ్చును. ప్రతిబంధముయొక్క స్థానభేదముచే హల్లులుకూడ ననేకవిధము లగుచున్నవి. కంఠము నందుండు పొరలకదలికవలన కలిగిన నాదము ముఖమార్గముయొక్క యాకారభేదములవలన వివిధముగా మారి యచ్చులుగా నేర్పడును. ఆవరణభేదమునుబట్టి దానియందు బుట్టినశబ్దము భేదించుట యనుభవసిద్ధమేకదా! ముఖముయొక్క యాకారభేదము లసంఖ్యములగుటవలన వానివల్ల నేర్పడు నచ్చులసంఖ్యకూడనిజముగా నసంఖ్యేయమేకాని స్పష్టభేదముకల యచ్చులసంఖ్య మాత్రము స్వల్పముగానే యుండును. ఇవి యన్నియును గూడ నన్నిభాషల లోను లేవు.

శ్వాసనాదభేదమును, ననునాసికత్వనిరనునాసికత్వభేదమును ముఖమార్గమును వాయువు ప్రవేశించుటకు పూర్వమే కలుగును. కాన నైభేదము లన్నివర్ణములకు నుండుటకు నవకాశము కలదు. మరియు ముఖమార్గమున వర్ణము లుత్పన్నములగునప్పుడు జిహ్వాది వర్ణోత్పాదకాంగములకు నేస్థలమునందైనను బూర్తియైన స్పర్శగాని యీషత్ స్పర్శగాని స్పర్శాభావము గాని సంభవింపవచ్చును. ఈకారణమువలన వర్ణములు స్పృష్టములనియు, ఈషత్స్పృష్టము లనియు, వివృతములనియు మూడువిధము లగుచున్నవి.

ఇకను గొన్నిముఖ్యములగు వర్ణము లుత్పన్నము లగునపుడు జిహ్వాద్యవయవము లేరీతిగా నుండునో పరిశీలింతము. అకార ముచ్చరించునపుడు నాలుక కొంచెము వెనుకకు అనగా గంటమువైపునకు లాగబడును. ఆహేతువుచేతనే యిది కంఠ్యమనబడుచున్నది. ఇకార ముచ్చరించునపుడు నాలుకమధ్యభాగము తాలువుదగ్గరకు యెత్తబడును. కావున నిది తాలవ్యమగుచున్నది. ఉకార ముచ్చరించునపుడు జిహ్వామూలము కొంచెము పైకెత్తబడి యోష్ఠములు సంకోచముగా జేయబడి ముందుకు తేబడును. కాబట్టి యిది ఓష్ఠ్యమగుచున్నది. ఎకార ముచ్చరించునపుడు నాలుకయంచయును గొంచెము పైకెత్తబడును. జిహ్వామూలము కూడ పైకిలేచుటచే దీనిని గంఠ్యతాలవ్యమందురు. ఒకార ముచ్చరించునపుడు జిహ్వామూలము పైకిలేచుటయేకాక యోష్ఠములు సంకోచముగా జేయబడును; ఆకారణమున నిది కంఠోష్ఠ్య మగుచున్నది. రెండేసియక్షరములు కలసి యుచ్చరింపబడినచో సంధ్యక్షరమేర్పడునని భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. అకారఇకారముల నవ్యవహితముగా నుచ్చరించినచో ఐకారము వినబడును. ఇట్లే అకారఉకారముల నవ్యవహితముగా నుచ్చరించిన యెడల ఔకార మేర్పడును. హిందూవైయాకరణులు ఏ,ఓ, లను గూడ సంధ్యక్షరములుగా నంగీకరించిరి. సంహితలో నీవర్ణములు కూడ పూర్వపరవర్ణముల కాదేశములుగా నచ్చుటవల్ల కాబోలును, వారట్లుచెప్పిరి. భాషాశాస్త్రజ్ఞులు మాత్రమట్లు కాక 'ఐ,ఔ' అను రెండక్షరములనే సంధ్యక్షరములుగా నంగీకరించిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జిహ్వాద్యవయవములకు గల్గెడి స్పర్శయొక్క-స్థానము ననుసరించి హల్లులు విభాగము చేయబడినవి. జిహ్వామూలమునకును తాలువుయొక్క-వెనుకభాగమునకును గలిగినస్పర్శను బైకిబోవు నిశ్శ్వాసవాయువు విడిపింపగా కంఠ్యములు పుట్టుచున్నవి. జిహ్వామధ్య భాగమునకును, తాలువునకును గలిగిన స్పర్శమును నిశ్శ్వాసవాయువు విడిపింపగా తాలవ్యములు పుట్టుచున్నవి. జిహ్వాగ్రమునకును, తాలువు మధ్యభాగమునకును గలిగిన స్పర్శము నిశ్శ్వాసవాయువు వలన బోగొట్టబడినపుడు మూర్ధన్యములు పుట్టుచున్నవి. 'ఇండోయూరపియన్' భాషలలో నొక్క-సంస్కృతమునందు మాత్రమే మూర్ధన్యము లగపడుచున్నవి. సంస్కృతమున వీనియుపలబ్ధికి కారణము ముందు తెలియజేయబడును. జిహ్వాగ్రమునకును దంతమూలములకును గాని, దంతములకును గాని కలిగెనస్పర్శమువాయువుచేవిడిపడియుసంపర్కమునదంత్యము లేర్పడుచున్నవి. దంతములం దుత్పన్నములగు దంత్యములు సంస్కృతమున లేవు. 'ఇంగ్లీష్' మొదలగు మరికొన్ని భాషలలో కలవు. ఉత్తరోష్ఠాధరోష్ఠములకు కలిగినస్పర్శము వాయువువల్ల విడుసంపర్కమున నోష్ఠ్యము లుత్పన్నము లగుచున్నవి. జిహ్వాద్యవయవముల స్పర్శను పోగొట్టు వాయువు శ్వాసరూపముగాగాని నాదయుక్తముగాగాని యుండవచ్చును. కాన పైవర్ణములన్నియును శ్వాసనాద భేదమున ద్వివిధములుగా నుండవచ్చును. మరియు పైని వర్ణింపబడిన స్పర్శలు నాదయుక్తమగువాయువువలన విడుగినప్పుడు నాసామార్గము తెరువబడియున్నచో నాయా స్థానికములకు ననునాసికవర్ణము లేర్పడును. పైనివివరించిన యీవివిధములగు వర్ణములు నుత్పన్నములైనపుడు వర్ణోత్పాదకావయవములకు బూర్తియగు స్పర్శ (పృథక్ స్పర్శ) యుండును. కాని యవయవముల కట్టి దృఢమగు స్పర్శ లేనప్పుడుకూడ వర్ణములు పుట్టవచ్చును. అట్టివర్ణములకు సంస్కృతమున నంతస్థలనియు, నూష్మలనియు సంజ్ఞలు కలవు. ఇవి పుట్టునపుడు జిహ్వ ఆయా అవయవములకు దగ్గరగా నుండునుగాని వానిని స్పృశింపదు. అప్పుడు వానిమధ్యనుండు స్వల్పమగుమార్గమున వాయువు పోవుటలో గలిగెడిరాపిడి వలన శబ్దములు పుట్టును. అవి కూడ స్థానభేదము ననుసరించి వివిధములుగా నుండును. సంస్కృతమున కంఠస్థానీయమగు నంతస్థయు, నోష్ఠస్థానీయమగు నూష్మమును లేవు.

పైనివర్ణింపబడిన వుత్పన్నములైనపుడు వర్ణోత్పాదకావయవములు తత్తత్స్థానములలో స్థిరముగా నుండును. అట్లు స్థిరముగా నుండక యాయవయవము లొక స్థానమునుండి మరియొకస్థానమునకు బోవునపుడుకూడ వర్ణములు పుట్టవచ్చును. మనము మాటలాడునపుడు వర్ణముల నొకదానివెనుక నొకదాని నతిశీఘ్రముగా నుచ్చరించెదము. అందువల్ల జిహ్వ యొకస్థానమునుండి మరియొకస్థానమున కతిశీఘ్రముగా పోవుచుండును. అట్టిసమయములలో మనము నిశ్శ్వాసము నంపుటలేదు. కాన వర్ణములు పుట్టును. అట్టివర్ణములకు చరవర్ణములని (Glide sounds, Glides) పేరు. వీనిని మనము లిపిలో సూచింపముకాని వీనిలో గొన్ని కాలక్రమమున లిపిలో జూపదగినంత స్పష్టతను సంపాదించి స్థిరవర్ణము లగుచుండును.

## 10. లిపివిచారము

మనము మనయభిప్రాయములను మనయెదుట నుండువారికి తెలియజేయునప్పుడు భాష నుపయోగింతుము. కాని దేశకాలములచే విప్రకృష్టములుగా నుండువారికి మనయభిప్రాయములను దెలియజేయుటకు భాష యుపయోగింపదు. అట్లుచేయుటకు స్థిరమైన యాధారమవసరముగా నున్నది. భాషశబ్దరూపముగుటవలనను, శబ్దము క్షణికముగుటవలనను భాష యస్థిరముగుచున్నది. అట్లు దేశకాలములచే విప్రకృష్టముగానున్న వారికి ప్రాచీనులు తమయభిప్రాయములను దెలియజేయుటకు గల్పించిన సాధనములనుండి క్రమముగా లిపి యేర్పడినది.

'అమెరికా' (America) 'ఆస్ట్రేలియా' (Australia) ఖండములలోని ప్రాచీననివాసులు కొందరు తమయభిప్రాయములను దూరమునన్న వారికి చిత్రముల మూలమున దెలియజేయుచుండిరి. ఈ చిత్రములభిప్రాయబోధకములుగను గాని పదబోధకములు గాని వర్ణబోధకములుగాని కావు. కాని దేశాంతరీయులకును భాష నెరుగని మూగవారికిని ముఖహస్తాదిచేష్టలవలె నర్థవస్తు లగును. కాని చక్షురింద్రియగ్రాహ్యములగు రూపవత్పదార్థములే చిత్రమందు సూచింపబడగలవుగాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిరూపములను పదార్థములను సంబంధములను సూచింపబడవు. మరియు నొకచిత్రము ననేకు లనేకవిధములుగా గ్రహించుట కవకాశము కలదు.

ప్రప్రథమమున చీనాదేశములో మరియొకవిధము నుసాధన ముపయోగింపబడుచుండెను. దీనికి 'క్విపు' (Kwipu) అనునామముతో దక్షిణఅమెరికా (South America)లో వ్యవహరించుచుండిరి. ఒకరజ్జువునకు వివిధవర్ణములుగల యనేకచిన్నచిన్నత్రాళ్లు కట్టబడియుండును. ఈచిన్నత్రాళ్లకు ముళ్లువేయబడియుండును. రంగు త్రాళ్ల స్థానభేదమునుబట్టియు, వానికివేయబడిన గ్రంథులసంఖ్యనుబట్టియు వివిధాభిప్రాయములు సూచింపబడుచుండెను. ఈసాధనముకూడ పైనివర్ణింపబడిన చిత్రములవలె నభిప్రాయబోధకమునుగాని,పదబోధకముగాని వర్ణబోధకముగాని కానేరదు. మరియు చిత్రములవలెకాక యిది సాంకేతికముగనున్నది. అభిప్రాయములను దెలియజేయువారును, దెలిసికొనువారును గొన్నిసంకేతముల నేర్పరచుకొనవలసియున్నది. ఈ 'క్విపు' చే రూపవత్తులగు పదార్థములేకాక నిరూపములగునవికూడ దెలియజేయబడగలవు. వానికిగూడ సంకేతముల నేర్పరచుకొనవచ్చును.

పైని వర్ణింపబడిన రెండువిధములగు నుపాయములును నభిప్రాయబోధకములగుటచే వీనినుండి వర్ణబోధకములగు నాధునికలిపులు పుట్టుట కవకాశము లేదు. పదార్థబోధకములగు మరికొన్నిసాధనములనుండి యాధునికలిపులు వెడలినవని ముందు నిరూపింపబడును.

'ఈజిప్టు' (Egypt) దేశమునందును 'యూఫ్రటీస్' (The Euphrates) నదీప్రాంతములలోను వేరువిధములగు చిత్రములు వ్యవహరింపబడుచుండినవి. 'అమెరికా' ఖండమున వాడబడినచిత్రములు పూర్తియైన యభిప్రాయములను తెలియజేయుచుండెను. కాని యీ చిత్రములు పదార్థబోధకములుగా మాత్ర ముండినవి. సూర్యుని దెలియజేయుటకు సూర్యపటమును, చెట్లు, ఇళ్లు మొదలగువానిని దెలియజేయవలసివచ్చినపుడు చెట్టు,ఇల్లు మొదలగువానిరూపమును వ్రాయుచుండిరి. సంబంధములును, నిరూపపదార్థములను జిత్రమువ్రాయువిధానమునుబట్టి తెలియనగును. దాహమును దెలియజేయుటకు నీటిపటమును నీరుత్రాగుటకు పరుగెత్తుచున్న యొకజంతువుయొక్క పటమును వ్రాయబడుచుండెను. స్నేహమును బరస్పరము పట్టుకొనుచున్న రెండుహస్తములచే దెలియజేయుచుండిరి. ఈచిత్రములలోగూడ బదార్థమునకును జిత్రమునకును సంబంధముకలదుకాని పదమునకును జిత్రమునకును సంబంధము లేదు. ఆకారణముచేనిదికూడ భాషాంతరీయులకును మూగవారికిగూడ నర్థబోధక మగుచుండును. ప్రథమమున బదార్థబోధకములగు నీచిత్రములు సాధ్యమైనంతవరకు వానిని బోలియుండును. కాని కాలక్రమమున లేఖకులయలసతచేతనుగాని సౌలభ్యాభిలాషచేతనుగాని కౌశల్యలోపముచేతనుగాని చిత్రములు పదార్థములను సరిగా బోలియుండక తుదకు సాంకేతికములగును. ఇట్లు వివిధదేశములలో బదార్థాకారకములగుటచే మొదట నేకరూపముగా నున్నలిపి కాలక్రమమున భిన్నభిన్నములుగా మారి దేశాంతరీయుల కర్థవత్తులు కానేరవు. ఇట్లు సాంకేతికములైన చిత్రములు క్రమక్రమముగా నాకారణముచేతనే పదార్థసంబంధమును వదలి పదసంబంధమును బొంది కాలక్రమమున లిపిక్రింద నేర్పడును.

ప్రతిభాషయందును ననేకార్థకపదము సామాన్యముగా నుండును. ఆయనేకార్థకపదముల యర్థములను సూచించు చిత్రములలో దీనినిజూచిన నాపదము జ్ఞప్తికి వచ్చుచుండును. పదమును వినినతోడనే దానిచే బోధింపబడు నర్థములను సూచించు చిత్రములన్నియును జ్ఞప్తికి రావలసియున్నను వానిలో ముఖ్యమైనదిగాని తరచుగా వ్యవహరింపబడునదిగాని మనకు స్ఫురించుచుండును. అందువలన క్రమముగా నట్టి చిత్రమునకు మాత్రమే పదముతో సంబంధ మేర్పడును. ఏయర్థములో నాపదము ప్రయోగింపబడినను నాచిత్రమే స్ఫురించి వ్రాయబడుచుండును. అర్థాంతరములలో నాచిత్రముపయుక్తమగునప్పుడు దాని విశేషార్థసూచకములగు రేఖలు చేర్చి వ్రాయబడుచుండును. ఈరీతిగా చిత్రములకు పదార్థసంబంధము నశించి పదసంబంధము స్థిరపడినప్పుడు పదమున కొకటి యేర్పడును. 'చీనా' భాషలో బదములన్నియు నేకాక్షరములగుటవలన చీనాలిపి యీస్థితినే యిప్పటికినున్నది. ఏకాక్షరపదములుకూడ వర్ణసమూహాత్మకములనియు కాబట్టి ప్రత్యేకవర్ణములకు లిపి యేర్పరచుకొనవచ్చుననియు వారికి దోచియుండలేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'ఈజిప్టు' దేశపుభాష ప్రత్యయవిశిష్టముగా నుం డెను. కాబట్టి యాదేశస్థులకు పదములకు ప్రత్యయము లను చేర్చువలవాటు కలదు. వారు ప్రత్యయములను పద ములకంటె భిన్నముగా నెరిగియుండిరి. ప్రత్యయములు సామాన్యముగా నేకవర్ణాత్మకముగా నుండుటచే వారికి వర్ణజ్ఞానము స్వాభావికమాయెను. వర్ణజ్ఞానము కలవారికి నొకవర్ణ మనేకపదములలో నగపడుటచే పదమున కంటె ను నొకలిపి యుంచుటకంటె వర్ణమున కొకలిపి యుంచి నయెడల లాఘవముండునని తోపకమానదు. వర్ణబోధక లిపి యాక్రిందివిధముగా నేర్పడినదని భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఏదైన నొకపదమును బోధించులిపి నా పదముయొక్క ప్రథమాక్షరమునకు లిపిగా వ్యవహరింప నారంభించియుందురు. అనేకపదము లొకేవర్ణముతో ప్రారంభించియుండును. ఆపదముల లిపులలో తరచుగా వ్యవహరింపబడునదిగాని, సులభముగా వ్రాయబడునది గాని, సొగసుగా నుండునదిగాని యావర్ణమునకు లిపిగా నంగీకరింపబడును. ప్రథమమున గొంచెము వ్యవహారభేద మున్నను గాలక్రమమున నందరును సౌకర్యముకొరకే లిపిని వాడెదరు. ఇట్లు పదాదియందుండు నేకవర్ణములకు లిపులేర్పడగా మిగిలిన వర్ణములకు ప్రాచీనలిపులలో నను పయుక్తములగు వానిని సాంకేతికముగా నేర్పరచియుం డురు. పైరీతిని పదబోధకలిపి వర్ణబోధకముగా మొట్ట మొదట ఈజిప్టుదేశములో మారినది. దానిని 'సెమైట్సు' (Semites) అనుజాతివారు 'ఈజిప్టు' దేశమునకు వెళ్లి నేర్చియుండిరి. ప్రాచీనకాలమున గొప్పవర్తకులుగానుం డిన 'ఫినీషియన్సు' (Phocnicians) దీనిని పైదేశము లలో వ్యాపింపజేసిరి.

'సెమిటిక్' దేశమున 'ఆర్మేయన్' (Armaean) అనియు, 'ఫినీషియన్' అనియు రెండువిధములగు లిపులు క్రమముగా నేర్పడినవి. అశోకమహారాజు చెక్కించిన శాసనములలోని 'ఖరోష్ఠి' లిపి 'ఆర్మేయన్' జాతి లిపి నుండియు, 'బ్రాహ్మి' లిపి 'ఫినీషియన్' జాతిలిపినుండియు బుట్టినవని 'బ్యూలర్' (Bühler) పండితుడు చెప్పియు న్నాడు. 'సెమిటిక్' లిపులు వర్తకులమూలముగా మన దేశమునకు వ్యాపించినవని యతడు చెప్పియున్నాడు. పూర్వకాలమున 'ఫినీషియా' దేశపు వర్తకులు మనదేశ మునకుగూడ వచ్చుచుండినట్లు చరిత్రకారులు చెప్పుదురు. వారు క్రీ. పూ. ౮-వ శతాబ్దప్రారంభమున వారిలిపిని హిందువులకు నేర్పియుండవలయునని 'బ్యూలర్' పండి తుని యభిప్రాయము. 'ఖరోష్ఠి' లిపి 'సెమిటిక్' లిపుల వలెనే కుడివైపునుండి యెడమవైపునకు వ్రాయబడుచుం డెను. 'బ్రాహ్మి' లిపికూడ ప్రథమమున నట్లే వ్రాయ బడినట్లు నాణెములవలన దెలియుచున్నది. కాని యశోక మహారాజు వేయించిన శాసనములలోమాత్ర మెడమవైపు నుండి కుడివైపునకు వ్రాయబడియున్నది. 'సెమిటిక్' లిపిలో నిరువదిరెండక్షరములే కనబడుచున్నవి. 'బ్రాహ్మి' లిపిలో నలువదియారక్షరములు కలవు. హిం దువులు 'సెమిటిక్' అక్షరములను తమభాషలో నా భాషలోనివర్ణములను బోలినవర్ణముల కుపయోగించి మిగిలినవర్ణములకు క్రొత్తలిపులను గల్పించియుందురు.

అశోకమహారాజుయొక్క శిలాశాసనములు హిం దూదేశమునం దంతటను గనబడుచున్నవి. వానిలో నుత్తర హిందూదేశపుశాసనములలోని 'బ్రాహ్మి' లిపికిని దక్షిణ హిందూదేశపు వానిలోని 'బ్రాహ్మి' లిపికిని గొంచెము భేదము కలదు. వీనిలో నుత్తరహిందూ స్థానపు 'బ్రాహ్మి' లిపినుండి (దేవ) నాగరీలిపి యేర్ప డినదని చెప్పుదురు. హిందూస్థానములోని వారును, మహారాష్ట్రులును నీలిపినే యిప్పటికిని వాడుచున్నారు. ఉత్తరహిందూదేశములో స్థలాంతరములలో వ్యవహరింప బడుచున్న 'బంగాళీ' 'ఓఢ్రము' 'పంజాబీ' 'కాశ్మీర' మొదలగు లిపులన్నియు నీ (దేవ) నాగరీలిపిజన్యమైనట్లు స్పష్టముగా దెలియుచున్నది. దక్షిణహిందూదేశములోని తెలుగు, అరవము, మళయాళము మొదలగులిపులు దక్షిణ దేశపుశాసనములలోని 'బ్రాహ్మి' లిపినుండి పుట్టినవని 'బ్యూలర్' పండితుడు చెప్పియున్నాడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# స్వర్గములో ఒక విలాపము

(వెనుకటి సంచిక తరువాయి)

జయంతి గంగన్న

అందు సత్యంబేమియైన కలదని మీరు
డెందముల నమ్మియుండిన, దానిమర్మంబు
పొందనగు హృదయానుభోగముననే కాని;

*　　*　　*　　*

బాలభాషణము లవి, పటుతర్క వాదముల
ఈలీల శోధింప తాళజాలగ లేవు,
తూలి తుత్తునియలై కూలబడుచున్న యవి.

*　　*　　*　　*

శరణుశరణో మహాశయ మృగాధిపులార,
ధరణిసిద్ధాంతముల్, ధర్మముల్, సూత్రముల్
పరతత్త్వముల్, ముక్తిపద్ధతుల్, వాదముల్,

*　　*　　*　　*

శాసనవిధానముల్, సంస్కార తంత్రముల్,
దేశసేవా మహాదీక్షా ప్రచోదితా
వేశముల్, నిల్పనుద్దేశముల్ మీకున్న,

*　　*　　*　　*

నిల్పవచ్చును, మీరునిఖిలకార్య ధురీణు-
లల్పుడను, నాపేర అట్టి సంస్థాపనల్
కల్పించినను వాటిఘనత అంతయు తొలగు;'

*　　*　　*

అనియిట్లు మొఱపెట్టి ఆ[illegible]
కనికరమువడసి, నా కార్యంబు నెరవేర్చు

కొనివత్తు వేవేగ, అనుమతింపుము తండ్రీ."

*　　*　　*　　*

కన్నీరుగారంగ, గద్గదికతో, ఇట్లు
విన్నపంబులుచేసి వేడుభక్తుని ఆత్మ
తెన్నుగని పెట్టి, ఆపన్న జనవత్సలుడు,

*　　*　　*　　*

"పసివాడవౌట, ఈపగిది దీనికి ఇంత
ఉసురుసురని ధైర్య ముడుగుచుంటివితనయ-
హాసియించుచున్న వారటుచూడు మందటను-

*　　*　　*　　*

ఏల యుపరిహాస, మేలనవ్వులు? మీరు
ఈలీలనే వెనుక, ఇందద్భుతము లేదు;
చాలు చా,లింతలో జ్ఞాపకము తప్పెనో?

*　　*　　*　　*

ఏమోయి ఓవ్యాస, ఏమోయి ఓయేసు,
ఏమోయిసిద్ధార్థ, ఏమి ఓశంకరా,
మోము చూపవదేమి, ఏమి ఓ శ్రీకృష్ణ?

*　　*　　*　　*

పాదమిట మోపినది యాదిగా, గుండియల్
మోదుకొను, 'చాహాహా! మున్గిపోయెనుకొం,
మాదు బోధనలన్ని మంట గలియుచునున్న,'

*　　*　　*　　*

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నని మీరు గోలుమను, చవతారమెత్తి, ఆ
మనుజలోకము కరుగుమనుచు, మొన్నటిదాక
ననుపెట్టినది మఱచినారె, నాయనలార?

*　　*　　*　　*

తత్తరిలి తత్తరిలి, తపియించి తపియించి,
నెత్తురుల్ నేత్రముల నింపుకొన నేడ్చేడ్చి,
ఎత్తెఱుగును గనక, ఎపుడు రామానుజుడు,

*　　*　　*　　*

మొత్తుకొని మొత్తుకొని, మొఱపెట్టి మొఱవెట్టి,
ఎత్తెఱుగును గనక, ఎపుడు మహ్మదు తండ్రి,
చిత్తవిభ్రమణంబు చెందుదురొ కద తుదకు,

*　　*　　*　　*

అని నేను ప్రాణంబు లఱచేతిలో పట్టు
కొనియుంటి, ధైర్యంబు కొంచె మిపుడిప్పుడే
జనియించుచున్న, దీచందమే మీరంత-

*　　*　　*　　*

ఓనత్స, తెలిసినదె? ఈవీరి నవ్వులకు
నీవేమియుం జిన్నపోవద్దు—ఇటు చూడు,
నావాక్కు మదిలోన భావింపుమో బిడ్డ:

*　　*　　*　　*

ధరణీతలంబునకు అరిగి, అచ్చట ఒక్క
అరదినమె కాదు, యుగమంత మగుదాక, నీ
వఱచినను, ఏడ్చినను, మఱి అభోజన మున్న,

*　　*　　*　　*

దివిజలోకము నుండి దిగినాడ ననియన్న,
దివిజసందేశముల్ తెచ్చినా నని యన్న,
దివిజుడను నేనన్న, దేవుండ నేయన్న,

*　　*　　*　　*

మఱియింక ఏమన్న, మఱియేమి చేసినను,
కరుణమై అమృతంబు, పరిరోషమున విషము;
కురిపించినప్పటికి, కుదర దారోగంబు.

*　　*　　*　　*

నీవొక్కడవె కాదు, నీతోడ నే గూడ,
దేవతాగణములున్, దివ్యదీధితిజాల
మావరింపగ కదలి, అవనీస్థలికి పోయి;

*　　*　　*　　*

దుందుభి ధ్వానముల్, తూర్యరావము లెసగ,
అందలంబులమీద అందఱను రావించి,
విందు లమఱిచి పెట్టి, వీణియల్ మీటించి,

*　　*　　*　　*

నట్టువల పిలిపించి, నాట్యంబు లాడించి,
ఇట్టివేడుకలింక ఎన్నెన్ని ఏర్పఱచి
పెట్టినను వద్దనరు, విసుగు చెందరు, కాని

*　　*　　*　　*

'మనవియున్నది, మాదు మనవియొక్కటి చిన్న'
దని నోరు తెఱచునరి, 'కాగు, డాగుడు, ఇపుడు
మనవు లాలించుటకు మాకు తీఱిక లేదు.

*　　*　　*　　*

ఏల మీకీతొంద, రింక కొంచెము తాళ
జాల లేకుండిరే, స్వర్గలోకము వచ్చి,
ఆలింపకుందుమా, అన్ని మనవులు మేమె?

*　　*　　*　　*

దయచేయు డిప్పటికి, దయచేయు, డాలస్య
మయిన మాపని చెడును', అని చెప్పి వెంటనే
పయనంబుకట్టించి పంపివేతురు మనల.

*　　*　　*　　*

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# స్వర్గములో ఒక విలాపము

(వెనుకటి సంచిక తరువాయి)

జయంతి గంగన్న

అందు సత్యంబేమియైన కలదని మీరు
డెందముల నమ్మియుండిన, దానిమర్మంబు
పొందనగు హృదయానుభోగముననే కాని;

*　*　*　*

బాలభాషణము లవి, పటుతర్క వాదముల
ఈలీల శోధింప తాళజాలగ లేవు,
తూలి తుత్తునియలై కూలబడుచున్న యవి.

*　*　*　*

శరణుశరణోమహాశయ మృగాధిపులార,
ధరణిసిద్ధాంతముల్, ధర్మముల్, సూత్రముల్
పరతత్త్వముల్, ముక్తిపద్ధతుల్, వాదముల్,

*　*　*　*

శాసనవిధానముల్, సంస్కార తంత్రముల్,
దేశసేవా మహాదీక్షా ప్రచోదితా
వేశముల్, నిల్పనుద్దేశముల్ మీకున్న,

*　*　*　*

నిల్పవచ్చును, మీరునిఖిలకార్య ధురీణు
లల్పుడను, నాపేర అట్టి సంస్థాపనల్
కల్పించినను వాటిఘనత అంతయు తొలగు;'

*　*　*　*

అనియిట్లు మొఱపెట్టి ఆ ధర్మ్మకోవిదులు
కనికరముపడసి, నా కార్యంబు నెరవేర్చ
కొనివత్తు వేవేగ, అనుమతింపుము తండ్రీ."

*　*　*　*

కన్నీరుగారంగ, గద్గదికతో, ఇట్లు
విన్నపంబులుచేసి వేదభక్తుని ఆత్మ
తెన్నుగనిపెట్టి, ఆపన్న జనవత్సలుడు,

*　*　*　*

"పసివాడవౌట, ఈపగిది దీనికి ఇంత
ఉసురుసురని ధైర్య ముడుగుచుంటివిశినయ-
హసియించుచున్న వారటుచూడు మొదటను-

*　*　*　*

ఏల యీపరిహాస, మేలనవ్వులు? మీరు
ఈలీలయే వెనుక, ఇందద్భుతము లేదు;
చాలు చా, లింతలో జ్ఞాపకము తప్పెనో?

*　*　*　*

ఏమోయి ఓవ్యాస, ఏమోయి ఓయేసు,
ఏమోయిసిద్ధార్థ, ఏమి ఓశంకరా,
మోము చూపవదేమి, ఏమి ఓ శ్రీకృష్ణ?

*　*　*　*

పాదమిట మోపినది యాదిగా, గుండియల్
మోదుకొను, 'చాహాహా! మునిగిపోయెనుకొంప,
వాదు బోధనలన్ని మంట గలియుచునున్న,'

*　*　*　*

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నని మీరు గోలుమను, చవతార మెత్తి, అ
మనుజలోకము కరుగుమనుచు, మొన్నటిదాక
ననుపెట్టినది మఱచినారె, నాయనలార?

* * * *

తత్తరిలి తత్తరిలి, తపియించి తపియించి,
నెత్తురుల్ నేత్రముల నింపుకొని ఏడ్చేడ్చి,
ఎత్తెఱుంగును గనక, ఎపుడు రామానుజుడు,

* * * *

మొత్తుకొని మొత్తుకొని, మొఱపెట్టి మొఱపెట్టి,
ఎత్తెఱుంగును గనక, ఎపుడు మహమ్మదు తండ్రి,
చిత్తవిభ్రమణంబు చెందుదురొ కద తుదకు,

* * * *

అని నేను ప్రాణంబు లఱచేతిలో పట్టు
కొనియుంటి, ధైర్యంబు కొంచె మిపుడిప్పుడే
జనియించుచున్న, దీచందమే మీరంత-

* * * *

ఓవత్స, తెలిసినదె? ఈవీరి నవ్వులకు
నీవేమియుం జిన్నబోవద్దు——ఇటు చూడు,
నావాక్కు మదిలోన భావింపుమో బిడ్డ:

* * * *

ధరణీతలంబునకు అరిగి, అచ్చట ఒక్క
అరదినమె కాదు, యుగమంత మగుదాక, నీ
వఱచినను, ఏడ్చినను, మఱి అభోజన మున్న,

* * * *

దివిజలోకము నుండి దిగినాడ నని యన్న,
దివిజసందేశముల్ తెచ్చినా నని యన్న,
దివిజుడను నేనన్న, దేవుండ నేయన్న,

* * * *

మఱియింక ఏమన్న, మఱియేమిచేసినను,
కరుణామై అమృతంబు, పరితోషమున విషము;
కురిపించినప్పటికి, కుదర దారోగంబు.

* * * *

నీవొక్కడవె కాదు, నీతోడ నే గూడ,
దేవతాగణములున్, దివ్యదీధితిజాల
మావరింపగ కదలి, అవనీస్థలికి పోయి;

* * * *

దుందుభి ధ్వానముల్, తూర్యరావము లెసగ,
అందలంబుల మీద అందఱను రావించి,
విందు లమఱిచి పెట్టి, వీణియల్ మీటించి,

* * * *

నట్టువల పిలిపించి, నాట్యంబు లాడించి,
ఇట్టివేడుకలింక ఎన్నెన్ని ఏర్పఱచి
పెట్టినను వద్దనరు, విసుగు చెందరు, కాని

* * * *

'మనవియున్నది, మాదుమనవియొక్కటి చిన్న'
దని నోరుతెఱచుసరి, 'కాగు, డాగుడు, ఇపుడు
మనవు లాలించుటకు మాకు తీఱిక లేదు.

* * * *

ఏల మీకీతొందర, ఇంక కొంచెము తాళ
జాల లేకుండిరే, స్వర్గలోకము వచ్చి,
ఆలింపకుందుమా, అన్ని మనవులు మేమె?

* * * *

దయచేయు డిప్పటికి, దయచేయు, డాలస్య
మయిన మాపని చెడును', అని చెప్పి వెంటనే
పయనంబు కట్టించి పంపివేతురు మనల.

* * * *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కదలమని, ఏమైన కదలమని, ముంజూరు
వదలమని, మనమింక నైదికము చూపింప
మొదలుపెట్టెదమన్న, పదనుతప్పెను; వారు

* * * *

'సరసులనుకొని, చెప్పసాహసించితి, మయ్యో!
పొరపాటు, పొరపాటు, బుద్ధివచ్చిన దిపుడు;
మఱియేల ఈగొడవ? మాకుమీకును, చూడ,

* * * *

వాదముల్ సల్పుటకు లేదు సమరంగమే;
లేదు లేదిక వోట్ల* మీదనే జరుగవలె
మీదివ్యవహార,' మనిమీసముల్ ముట్టుదురు"

* * * *

ఆక్షణంబున భక్తుడదరిపడి బెదరుగొన
వీక్షించి, ఆయఖిల భీతకోటి శరణ్యా
వత్సుండు, "అయ్యయో! వత్స, అదియేమిఅది?

* * * *

అట్లు వణకెదవేల? అదియేమి, వెఱగు వలె
అట్లు చూచెదవేమి?" అని యడుగ, భక్తుండు,
-"వోట్ల*న్న గుబగుబల్ పుట్టె నాగుండెలో!"-

* * * *

"నీకంటె ధైర్యంబు నాకొకింతయు లేదు;
లోకనాయకుడంచు, లోకబాంధవుడంచు,
భీకరుడు దుర్జనుల, కాకరుడు సుజనులకు,

* * * *

పరమపురుషుండంచు, భవ్యచరితుండంచు,
నిరుపముడు, నిఖిలార్థనిర్ణేత యని యంచు,
మఱి గంపలుగ, పుట్లు గరిసెలుగ, ఇంకింక,

* * * *

ఏమేమొ ననుగూర్చి, ఇటువంటివెన్నెన్నొ—
ఆమాటలన్నియు మోముచాటిచ్చకాల్,
మోము చూపిన పంగనామాలు పెట్టరే!

* * * *

ఇదియేను భువిలోని ఈనాటిమానవుల
హృదయతత్త్వము; దీనినెఱుగజాలక యింతె
బెదరుచుంటివి, శాంతి వదలుచుంటివి వత్స."

* * * *

[సశేషము.]



* Votes.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రాచీనభారతీయాభరణములు




౧-వ చిత్రము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# క్రీడాభిరామకర్త శ్రీనాథుడా?*

వేమూరి విశ్వనాథశర్మ గారు, ఎమ్. ఏ., యల్. టి.

శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రి గారి శృంగార శ్రీనాథములోని క్రీడాభిరామకర్తృత్వవిచారము చాల ముఖ్యమైనదని నాతలంపు. ఈభాగములో ఒకరియాస్తిని వేరొకరికి సంక్రమింపజేయుటకై శాస్త్రి గారు సర్వవిధముల ప్రయత్నించినారు. క్రీడాభిరామము వినుకొండ వల్లభరాయని దని గ్రంథమునందున్నది. కాని యది శ్రీనాథునికృతియని శాస్త్రిగారి సిద్ధాంతము. "ఈ గ్రంథము శ్రీనాథరచనమనుటకుఁ బలువురు విశ్వసింపక పోయిరి. అట్టి యవిశ్వాసము సమసిపోవుటకై యింత వ్రాయవలసెను." ఈవాక్యమునుబట్టి శాస్త్రిగారికి తమ వాదమునందుగల గాఢవిశ్వాసమును, పట్టుదలయు వ్యక్తము కాగలవు.

"శ్రీనాథుని రచనాచమత్కారముల నెఱిఁగిన వారిది చక్కఁగా గుర్తింపఁగల్గుదురు. ...మర్మజ్ఞు లీపద్యము వినఁగనే శ్రీనాథుని రచనమని గుర్తింపఁగల్గుదురు. ...రచనాచమత్కారము చక్కఁగా నెఱుఁగనేర్చినవారికి శ్రీనాథుని రచనమనుట కీగ్రంథమెల్ల నుదాహరణమే." ఈవాక్యములనుబట్టి తమయభిప్రాయములో నేకీభవింపనివారు కవితాచమత్కృతుల నెరుగజాలని రసహీనులని శాస్త్రిగారి యభిప్రాయము కాకపోవచ్చును. కాని, పండితులనియు, కవులనియు, విమర్శకులనియు పేరు పడినవారిని బెదరగొట్టుట కీవాక్యములు సూత్రప్రాయములు కాగలవు. నేను కవిని గాను; కవితావిమర్శకుడను గాను; పండితుడ నంతకన్న కాను. అందుచేత శాస్త్రి గారివాదమును, క్రీడాభిరామమును చదివినమీదట నాకు గల్గినసంశయములను జంకులేక చెప్పదలచినాను.

క్రీడాభిరామము వీథినాటకము ఏకాశ్వాసము గల యొకచిన్నప్రబంధము. అచ్చుపడిన ప్రతిలో 295 పద్యము లున్నవి. ఇందు కొద్దిసంఖ్యమాత్రమే వచనములు. ప్రతిపద్యము మిక్కిలి రసవంతముగ నున్నది. పద్యరచనమునందు వివిధముల పోకడలు గలవు. వర్ణనలు స్వభావసిద్ధములు. కవిత్వము గంభీరముగ నుండును. వినుకొండ వల్లభామాత్యుని కృతియని గ్రంథమునందు గలదు. పెదపాటి జగన్నాథకవి తన ప్రబంధరత్నాకరములో వల్లభరాయని వీథినాటకమను గ్రంథమునుండి యొకపద్యము నుదాహరించియున్నాడు. ఆపద్యము మనకు లభించిన క్రీడాభిరామములో లేదు. జగన్నాథకవి తరువాతివాడగు అప్పకవి శ్రీనాథునివీథినాటకములోనివిగ రెండు పద్యము లుదాహరించెను. అవి మనకు లభించిన క్రీడాభిరామములో నున్నవి. ఇది శాస్త్రిగారివాదమునకు పునాది. క్రీడాభిరామమును శ్రీనాథుడే రచించి వల్లభరాయని పేరు పెట్టెనని శాస్త్రిగారి సిద్ధాంతము. ఈ సిద్ధాంతము ననేకకారణములచేత సమర్థించిరి. అందు—

## ౧. గ్రంథనామము

క్రీడాభిరామమునకు మాతృక రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామము. కాని దానికి సరియైన యాంధ్రీకరణము గాదు. ఈసంగతి కర్త సూచించెను. శాస్త్రిగా రంగీకరించిరి. మారుపేరుపెట్టుట కింకొకకారణమున్నది. ప్రేమాభిరామము నాటకము; క్రీడాభిరామము వీథి. "రావిపాటి త్రిపురాంతదేవుఁ డనుకవీశ్వరుఁ డొనరించిన ప్రేమాభిరామనాటకంబు ననుసరించి క్రీడాభి

*ఈవ్యాసమును సారస్వతసర్వస్వమునకై మూడుసంవత్సరములక్రితము వ్రాసితిని. ఆపత్రికతో నావ్యాసముకూడ పోయి ఇటీవల తిరిగి దొరికినది. ఈనష్టవ్యాసలాభమునకు సంతసించి యిప్పు డీపత్రికలో ప్రచురించుచున్నాను.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రామంబను...వీథి యనురూపకము” అని క్రీడా భిరామావతారికయందలి వాక్యము. సంస్కృతనాటకమున కనుసరణమే కాక క్రీడాభిరామమునందు ఒకరోజున ఓరుగల్లులో జరిగిన క్రీడావినోదములుమాత్రము వర్ణింపబడినవి. అందుచేత 'క్రీడాభిరామ' మను పేరు సార్థకము. సంస్కృతమునకు సరియైన ఆంధ్రీకరణము గాకపోయినను క్రీడాభిరామమునందు మాతృకలోనిరచనములను గుర్తించుట సులభము. ఓరుగల్లు పట్టణమునకు సంబంధించిన వర్ణనలన్నియు ప్రేమాభిరామమునం దుండియుండును. కథానాయకులపేర్లు త్రిపురాంతకునివే యగును. పల్నాటివీరులకథ, గ్రామదేవతజాతర, పొట్టేళ్లయుద్ధము, కోడిపుంజులపోట్లాట మొలగునవి క్రీడాభిరామమునందు విశేషముగ విస్తరించి వర్ణింపబడియుండును. ఏదియెట్లున్నను ప్రేమాభిరామమును, తత్కర్తను వందనపూర్వకముగ పేర్కొనుటచేత క్రీడాభిరామకర్త నిష్కల్మషహృదయుడని చెప్పవచ్చును. స్వకపోలకల్పితమని లోకులను మోసపుచ్చెడి యుద్దేశము లేదనుట స్పష్టము. మారుపేరు పెట్టినంత మాత్రమున శ్రీనాథునికృతి యనుటకు ప్రబలకారణము గనుపడదు. వల్లభరాయనికర్తృత్వమునకు భంగము రాదు.

## ౨. అవతారికలోనిపద్యములు-భరతవాక్యము

అవతారికయందలి పద్యములలో స్వోత్కర్ష విశేషముగ నున్నదనియు, భరతవాక్యములో గ్రంథకర్త తనను దానే ఆశీర్వదించుకొనెననియు, అందుచేత కర్త వల్లభరాయడు కాజాలడనియు నొకవాదము. ఈ యవతారికపద్యములలో నున్నంత స్వోత్కర్ష చేసుకొనని ప్రబంధకవులు తెలుగులో నెందరు గలరు? అంతమాత్రము చేత మనకవులు వినయదూరులని చెప్పరాదు. గ్రంథావతారికలో తనకులమును గొప్పగా వర్ణించుటయు, తన పాండిత్యమును అతిశయోక్తిలో జెప్పుకొనుటయు మన కవులకు పరిపాటి.

“సంగీతసాహిత్య సరసవిద్యల నేర్చు
కవులబొమ్మలంగాని కాల్చి విడువ”

అను శ్రీనాథుని వాక్యములోకంటె వల్లభరాయని పద్యములలో పాండిత్యప్రకర్ష యెక్కువ గలదా? ఒకవేళ శ్రీనాథుడే క్రీడాభిరామమును రచించె ననుకొందము; అప్పుడుమాత్రము గ్రంథకర్తృత్వము వల్లభరాయని పేర నున్నంతకాలము, ఆపద్యముల కౌచిత్య మెట్లు గలుగును? ఇంతకు నాయవతారికపద్యములును, భరతవాక్యమును వల్లభరాయని గూర్చి సూత్రధారుడు పలుకుచున్నాడు. కృతిభర్త కవినిగూర్చి పల్కినపలుకులవి మనకవులసాంప్రదాయమునకు విరుద్ధముగ లేవు.

## 3. పద్యసామ్యము

గీ. గార్గ్యసిద్ధాంతమున మహఃకాలకలన
శకునశాస్త్రమునట యది బృహస్పతిమతంబు
విప్రజనవాక్య మనయంగ విష్ణుమతము.”

ఈమూడు చరణములు క్రీడాభిరామములోను, భీమఖండములోను సమానములు.

“వ్యాసమతము మనః ప్రసాదాతిశయము”

అని క్రీడాభిరామమునందు నాల్గవచరణము.

“సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతమగు”

అని భీమఖండములోని నాల్గవపాదము. ఈయైదుచరణములును సంస్కృతభీమఖండములో నున్నవి. కాని యుక్తి శకునశాస్త్రమునందలి శ్లోకము.

“మనోజవంతు మాండవ్యః”

అను శకునశాస్త్రవాక్యముమాత్రము భీమఖండములో పురాణకర్తయగు వ్యాసపరముగా మార్చబడినది. క్రీడాభిరామములోని చరణము భీమఖండవాక్యమునకు తెలిగించుట స్పష్టము. ఈపద్యమంతయు శ్రీనాథునిరచనయై యుండవచ్చును. వల్లభరాయడు గ్రహించియుండును. లేదా ప్రేమాభిరామములోని శ్లోకమునకు తెలుగుచేత శ్రీనాథుడు గ్రహించియుండవచ్చును. లేదా వీరిద్దరికి పూర్వమే యీశ్లోకమునకు తెలుగుచేత యుండినదేమో! కొన్ని పద్యములును, శ్లోకములును ఒకరిద్దరికృతులలో నుండుట యపూర్వము గాదు.

“ దేశభాషలందు తెలుగులెస్స ”

అనువాక్యము క్రీడాభిరామములోను, ఆముక్తమాల్యద లోను గలదు. శ్రీనాథునిరచితశాసనములలో అతనికి భా

ర్వులు రచించినశ్లోకములు లేవా? ఇప్పటికీయభ్యాసము పోయినదా? తాతంభట్టుపని యచ్చువేయుచున్న లక్షణసారములో తిమ్మకవిపద్యము లెన్ని లేవు? సర్వసామాన్యములుగను, లోకోక్తిప్రాయములుగను ఉన్నవాక్యములను కవులు సమయోచితముగ తమగ్రంథములలో చేర్చుకొనియుందురు. ఈశకునశాస్త్రశ్లోకమునకు తెలుగు పూర్వమునుండి వాడుకలోనుండియుండునని నాయూహ.

## ౪. పద్యములపోలిక

క్రీడాభిరామములోని యొకపద్యముయొక్క పోకడ శ్రీనాథునిహరవిలాసపద్యమును బోలియున్నది. ఈ పద్యము అవతారికలో నుండుటచేత సంస్కృత ప్రేమాభిరామశ్లోకమునకు తెలుగు కాదు. ఇంకొకపద్యములో హరవిలాసపద్యమునుబోలిన సమాససంవిధానము గలదు. కాని యీరెండుపద్యములకు మూలాధారము భట్టమురారి యనర్ఘరాఘవమని శాస్త్రిగారే నిర్ణయించిరి. కాబట్టి క్రీడాభిరామకర్తకు మాత్రమే గ్రంథచౌర్యాపరాధము వాటిల్లదు. ఇంతియకాక కథాసందర్భమునుబట్టి యీ రెండవపద్యము రావిపాటి త్రిపురాంతకుని చేతకు తెలుగని స్పష్టము కాగలదు. అందుచేత రెండవపద్యమునుబట్టి శ్రీనాథుడే గ్రంథకర్త యనుట పొసగదు.

మొదటచెప్పిన అవతారికపద్యమునకును, హరవిలాసములోనిపద్యమునకును కొంతపోలిక యున్నది. ఆపద్యమిది:—

శా. సారాచారమునన్ వివేకసరణిన్
　　సౌభాగ్యభాగ్యంబులన్
　　.............................
　　.............................
　వేరే మంత్రులు? సింగవేప్తితనుహో
　　ర్వీచక్రవాళంబునన్.

అని శాస్త్రిగారిచ్చిన పాఠము. చివరిచరణము
　"వీరేమంత్రులు"
అని అచ్చుప్రతిలోనిపాఠము. ఇక హరవిలాసములోని పద్య మిది:—

శా. వేరే నిన్నెదిరింపఁగా జగమునన్
　　వీరుల్ ప్రతాపాఢ్యతన్?"

ఈరెండుపద్యములకు పోలిక యున్నను "వీరే మంత్రులు" అనుటవలన పద్యములో సగము సారస్యము పోయినది. కవియొక్క మనోవృత్తియందే భేదము సూచించును. అర్థ మొకటె యైనను ప్రశ్నార్థమందు పటుత్వము జాస్తి. "కారే రాజులు?" అను పోతనపద్యమునకును "చనినారెవ్వరు చక్రవర్తులు" అను లక్ష్మీనరసింహంగారిపద్యమునకును గలభేద మీరెండుపద్యములకును గలదు. శ్రీనాథునిపద్యమునందే భావగాంభీర్య మెక్కువ యున్నది.

యతిప్రాసలు సరిపోవునప్పుడు పాఠమునుమార్చుట కవకాశ ముండదు. శాస్త్రిగారిపాఠమే సరియైనదని చెప్పినను అంతమాత్రముచేత క్రీడాభిరామములోనిపద్యము శ్రీనాథునిదే యనిచెప్పుటకు సరియైనకారణములు లేవు. పద్యములనుబోలినపద్యములు మనప్రబంధములలో నంపెటను గలవు. భావములనే కాక సమాససంవిధానముల నుగూడ ప్రఖ్యాతకవులనుండి గ్రహించుట మనకవుల కాచారము. పద్యములయొక్క పోకడలయందు సామ్యమును కనుగొనుటకు వెదకనక్కరలేదు. శ్రీనాథుడే రఘువంశము, కుమారసంభవము మొదలగుమహాకావ్యముల నుండి భావముల ననువదించినాడు. ఇతరభాషలలోని యుద్గ్రంథములనుండి మంచిభావములను మనభాషలో సందర్భానుసారముగ ననువదించుట గ్రంథచౌర్య మనిపించుకోదు. ఇది శాస్త్రిగారే యంగీకరించిరి: "శ్రీనాథునకు భవభూతి,భట్టమురారి నాటకములమీఁదనభిమానము మెండు. వారినాటకములలోని రచనములను చెక్కుచోట్లఁ బుడికిపుచ్చుకొన్నాఁడు." ఇట్టిపక్షపాతమును ప్రతికవియెడల జూపవలెను.

తెలుగులోకూడ ప్రఖ్యాతకవులయొక్క కృతులను బోలినరచనలుచేయుట మనలో గౌరవాస్పదమైయుండెను. పెద్దన్నవంటివాడు శ్రీనాథునిపోకడల ననుకరింపలేదా? మనప్రబంధములలో "పిల్లవసుచరిత్ర" లని వసుచరిత్ర కెన్ని ప్రతికలు లేవు? ఇంతకును పైపద్యముల పోకడ శ్రీనాథునికి పూర్వము లేదని స్పష్టముకావలెను. అతని సమకాలీను లిట్టిపద్యమును వ్రాయలేదని నిర్ధారణ కావలెను. అప్పుడీపద్యము శ్రీనాథునిదనుటకు కొంత యాధార మేర్పడును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ౫. భావములపోలిక

"టిట్టిభ! యదె చూడు వరుణరాజవారాంగనావిలాస దర్పణానుకారియై యహర్పతి క్రుంకఁబోయె."—వీథి.
శ్రీనాథుని భీమఖండములోని పద్యమిది:—

క. చరమాచల శిఖరంబునఁ
దరమై యెక్కుడుపడవు దినకరుఁడొప్పెన్
వరుణునిశుద్ధాంతంబున
నరవిందాక్షులకు మించుటద్దం బనుచున్.

అస్తాద్రిపైనున్న సూర్యుని అద్దముగ చెప్పిరి. ఇది సుప్రసిద్ధమైనపోలిక. శ్రీనాథునివిశిష్టకల్పన మనుటకు వీలు లేదు. ఇంకొక యుపమానము:—

వ. నెరసంజయు మసమసకని చీఁకటియుఁ గలిసి దిక్సాథహూటవాటీనికరంబుల వ్రేలవిడిచిన కురువిందపూసల పేరునంబోలెఁ బొలుపుమిగిలె.—వీథి.

శ్రీనాథుని నైషధములోని పద్యము:—
క. పసుఁబాప యెండ కొనలును
మసమసకని యిరులు గలసి మన సులరించెన్
దెసల నలుగడల సంజా
విసరంబులసరులు వ్రేలవిడిచినభంగిన్.

ఈరెంటికిని సంపూర్ణ భావైక్యము గలదు. కాని నైషధపద్యములోని భావము శ్రీనాథునిదా? శ్రీహర్షునిదా? ఈయుపమానము సంస్కృతనైషధములో నున్న యెడల శాస్త్రిగారి వాదమునకు మువ్వాతిక బలము తగ్గును. ఇట్టివే మరికొన్ని యుపమానములు, ఇతరభావములు క్రీడాభిరామములోను, శ్రీనాథునికృతులలోను సమానచ్ఛాయ గలవని చూపబడినవి. ఇవిగాక మరికొన్ని చిన్న సమాసములు శ్రీనాథుడు తనగ్రంథములలో నుపయోగించినవి క్రీడాభిరామములోను గలవని తెలిపిరి. ఇవి చాలవరకు సర్వసామాన్యముగ వాడుకలో నున్నవి. "కసుమంబెట్టినచీరె-పదియార్వన్నె పసిండి-చెక్కుటద్దములు—విజ్జోడు—కప్పురపుబోగివంటకము—పెసర్పప్పు"- ఇవి పద్యాలు వ్రాసేవారందరికి నాలుక చివరనుండు పదములు. "కోకిలపంచమశ్రుతి"—ఇది సుప్రసిద్ధమైన యుపమానము. "ద్యావాపృథివ్యనకాశములన్"- దీనిఛాయ సంధ్యావందనములోను (ఆప్రాద్యావాపృథివీ అంతరిక్షం), ఉపనిషత్తులోను (పృథివ్యామాకాశే) గలదు. "గోఘాటలగ్నము"—ఇది శాస్త్రప్రసిద్ధము. "ఘంటాఘణాత్కారములన్"—కప్ప బెకబెకలాడు నన్నట్లు ఘంట ఘణఘణమనుట సర్వసామాన్యముగ వాడుకలోనున్న విషయము. ఇంతియకాక క్రీడాభిరామములో మరికొన్ని క్రొత్తవిశేషములుగూడ గలవు. "తకధుంగుంధుంకిటాత్కారసంగతి—ఘీటాత్కారంబునం దూలగన్—కోకిలకుహూకారంబు తోరంబుగన్—డమరుడిండిమంబు డమడమధ్వనుల మ్రోసె"— మొదలగునవి ఘంటాఘణాత్కారమువంటివే. సర్వసామాన్యములైన కూర్పులకును, భావములకును ఒకడే కర్త యనుటకు వీలులేదు. ఇంతియకాక క్రీడాభిరామపద్యములలో వైసమాసములు కొన్ని యించుకభేదముతో నున్నవి: "కోయిలపంచమస్వరము క్రొత్తవసంత", "పదియారువన్నె యబంగారు సరిపచ్చు."

ప్రతాపరుద్రుని యుంపుడుకత్తె యగు మాచల్దేవియొక్క భవనము క్రీడాభిరామములో చక్కగ వర్ణింపబడినది. విశేషించి యామెచిత్రశాలలో నేయేవి చిత్తరువు లుండెనో వేరువారిగ చెప్పబడినవి. ఈవిశదవర్ణనము చిత్రశాలావర్ణనము మాచల్దేవిగృహమును జూచి వర్ణించినట్లు స్పష్టమగుచున్నది. శ్రీనాథు డాకాలమున లేడు గనుక యీభాగ మతనిది కాదని యెవరో యాక్షేపించిరట. దీనిని "వికటవాద" మని శాస్త్రిగారు తిరస్కరించిరి, కాని యీభాగము సంస్కృతప్రేమాభిరామమునకనువాదమై యుండవచ్చు నన్న భావమును సూచించిరి. రావిపాటి త్రిపురాంతకుడు ప్రతాపరుద్రుని యాస్థానకవి. అందుచేత ఓరుగంటికి సంబంధించిన భాగము లన్నియు నతనిప్రేమాభిరామములోనివే యగుట సహజము. క్రీడాభిరామములోనివర్ణనములు వానికి తెలుగనుటయే యుక్తియుక్తముగ నున్నవి.

ఏదైననొకగ్రంథమునకు కర్తృత్వమును నిర్ణయించుటకు అనేకవిషయములు సమన్వయించవలసియుండును. ఇది విమర్శకుల బాధ్యత. అందులో ఒకరి పేరనున్నగ్రంథమునొక్క కర్తృత్వమును ఇంకొకరికి కట్టబెట్టవలసినప్పుడు ఈబాధ్యత ద్విగుణమగును. ప్రత్యేకించి క్రీడాభిరామకర్తృత్వము నింకొకరికి చెందజేయునప్పుడు మరియు కొనివిషయములనుగూడ ఆలోచింపవలసియున్నది. వల్లభరా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యనికి ఎట్లో కవియను పేరు సంపాదించి లోకమును మోసపుచ్చేయుద్దేశ మున్నట్లు కనబడెడు. తనపుస్తకము స్వంతకల్పనము గాదనియు, మహాకవియగు రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామమున కనుకరణమనియు మహోద్ఘాటముగా జెప్పి యతనికి కృతజ్ఞతను జూపియు న్నాడు. ఇంతియకాక వల్లభరాయఁడు నిరక్షరకుక్షి కాఁడు. అతడు

"ఆశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించెఁ
బ్రత్యక్షమొనరించి భైరవస్వామిచే
సిద్ధసారస్వతశ్రీ వరించె."

ఇట్టివాఁ డొకసంస్కృతకావ్యమును తెలుఁగున ననువదించెననుటలో నసంభవము లేదు.

క్రీడాభిరామము రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామమునకు తెనుఁగుకాదని శాస్త్రిగారు స్పష్టముగ జెప్పుచున్నారు. ఇందుకు మారుపేరుండుటతప్ప మరియొక కారణ మివ్వలేదు. క్రీడాభిరామమను పేరు వల్లభరాయ డెందుకు పెట్టెనది పైన చెప్పియుంటిని. ఒకవేళ వారనినట్లు శ్రీనాథుఁడే కర్తయైనను ప్రేమాభిరామమును తెనుఁగున ననువదించె ననుటలో న్యూనత యేమున్నది? అప్పుడు క్రీడాభిరామములోని గంభీరభావములయొక్కయు, పదసంఘటనములయొక్కయు గౌరవము రావిపాటి త్రిపురాంతకునికి దక్కును గాని శ్రీనాథునికి జెందదు. క్రీడాభిరామము సంస్కృతమున కనువాదము కాదనుట కిదితప్ప వేరొక కారణము కానరాదు. ఈగ్రంథమునుబట్టి త్రిపురాంతకుడు అద్భుతమైన కవితాశక్తి గలవాఁడని తోఁచుచున్నది. ఇది సంస్కృతమున కనువాదము కాదనుటవలన వల్లభరాయని కర్తృత్వపుమాట యటుండఁగా అసలుకవియగు త్రిపురాంతకునికే మోసము వచ్చినది. క్రీడాభిరామము సంస్కృతమునకు తెలుఁగని యొప్పుకొన్నయెడల శ్రీనాథునిదని చూపిన భావవిశేషము లన్నియు త్రిపురాంతకునివి కాఁగలవు. అప్పుడు క్రీడాభిరామకర్త శ్రీనాథుఁడే యనువారివాదమునకు బలము తగ్గును.

ఏవో కొన్నియుపమానములు, కొన్ని పదముల హర్వులు, మరికొన్ని పద్యముల పోకడలు సమానముగ నున్నంతమాత్రమున అవిగలగ్రంథము లన్నిటికి నొకఁడే కర్త యని వాదము చేయుటకు వలనుపడదు. 'వ్యామగ్రాహ్య' పదప్రయోగమునందును, 'ణిసిద్ధార్థ' ప్రయోగమునందును శ్రీనాథునకు మురిపెమెండని శాస్త్రిగారు చెప్పిరి. ఇందు మొదటిది అనర్ఘరాఘవములో నున్నది. రెండవది ప్రేమాభిరామములోనిది కాఁబోదా? 'మొత్తమునకీగ్రంథము(క్రీడాభిరామము)సంస్కృతగ్రంథమునకు సరియగు తెనుఁగు కా'దని చెప్పినను 'కొన్నిమార్పుల'తోనైనను సంస్కృతప్రేమాభిరామమున కనువాదమని శాస్త్రిగారే యంగీకరింపవలసివచ్చినది. అందు ఏభాగములు ప్రేమాభిరామములోనివో, యేవి క్రీడాభిరామకర్తయొక్క స్వంతకల్పనలో నిర్ధారణచేయలేదు. ఇట్టిస్థితిలో శాస్త్రిగారు శ్రీనాథునివని చూపించిన భావములు, పదములహర్వులు సంస్కృతప్రేమాభిరామములోనివనియే నానమ్మకము. తనకు పూర్వగ్రంథముల నుండి మంచిభావములను, పదములహర్వులను శ్రీనాథుడు తనగ్రంథములలో ధారాళముగ నుపయోగించినాఁడు. ఈ వ్యామగ్రాహ్యణిసిద్ధార్థములే కాక శ్రీనాథుని భీమఖండమునందలి 'దేవవేశ్యాభుజంగ'ముకూడ క్రీడాభిరామమునందు గలదు:—

గీ. "జారచోరమహాధూర్తచక్రవర్తి
దేవవేశ్యాభుజంగుండు తెలుఁగుభర్త."
—క్రీడాభిరామము.

"రాజవేశ్యాభుజంగ" యను బిరుదము శాసనాదికములలో నున్న విషయము అందరికి తెలిసినదియే కాబట్టి యిట్టి ప్రయోగములు తరుమగ వాడినంతమాత్రమున వీటికి శ్రీనాథుఁడే కర్తయనికాని అవియున్న గ్రంథము లన్నియు శ్రీనాథునివనికాని చెప్పుటకు వీలులేదు.

లోకోక్తిప్రాయములుగ నుండదగిన కొన్నివాక్యములకు కర్తను నిశ్చయించుట దుర్లభము. "దేశభాషలందు తెలుఁగు లెస్స" యనుచరణము కృష్ణరాయలు క్రీడాభిరామమునుండి గ్రహించెనని నేను నమ్మను. ఈ భావము స్వభాషాభిమానమును జూపుటకు ఆంధ్రులు గల్పించినదై యుండును. బహుభాషాపరిచయముగల పండితుల యభిప్రాయము లోకోక్తిప్రాయముగ నుండి యుండును. ఆభావమును పద్యములో నిముడ్చినప్పు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డిద్దరుకవుల కొకేచరణము తోచుట యసంభవము కాదు. ఈయిరువురి పద్యములే యీయూహను బలపరుచుచున్నవి. వల్లభరాయని పద్యమునకును, కృష్ణరాయనిపద్యమునకును పూర్వార్ధమునందు పోలిక లేదు. చెప్పదలచిన భావములే వేరైయున్నవి. నాయభిప్రాయమును విపులముగ చెప్పుట కొకయుదాహరణము నిచ్చెదను: "లోకం మయ్యేడానికి మూకుడుందా?" అనులోకోక్తి కలదు: దీనిని ఛందోబద్ధము చేయునప్పుడు పలువురు నొకే విధముగ జేయుట యసంభవమా? అట్లే యీప్రాంతముల ఉభయభాషలు దెలిసిన యాంగ్లులలో "తెనుగు తేనె, అరవము అధ్వాన్నము" అను నానుడి కలదు. మనదేశములో దీనిని పద్యముగ వ్రాయునప్పుడు పలువురుకవులు నొకేరీతిగ వ్రాసినచో నాశ్చర్య ముండదు. "దేశభాషలందు తెలుగులెస్స" యనుభావముకూడ లోకోక్తిరీతిగ తిలోనిదని నానమ్మకము. కావున కర్తను నిశ్చయించుట సులభము కాదు. శ్రీనాథుడే కర్తయైనచో నతనికుండిన భాషాభిమానమునకు దీనిని తనగ్రంథములన్నిటియందును వాడియుండును.

గ్రంథాంతమం దీపద్య మున్నది:—

క. నటులది దోరసముద్రము
 విటులది యోర్గల్లు కవిది వినుకొండ మహా
 పుటభేదన మీత్రితయము
 నిటు గూర్చెను బ్రహ్మ రసికు లెల్లను మెచ్చన్.

ఇది శాస్త్రిగారిచ్చినపాఠము. మానవల్లి రామకృష్ణకవిగా రచ్చువేసినగ్రంథములో ఈపద్య మిట్లున్నది:—

క. అటు నది దోరసముద్రము
 నిటు నది యోర్గలు కడింది వినుకొండమహా
 పుటభేదన మీత్రితయము
 నిటుఁ గూర్చెను బ్రహ్మ రసికులెల్లను మెచ్చన్.

దోరసముద్రమునుండి నటులు, ఓర్గల్లునుండి విటులు, వినుకొండనుండి కవియు గలిసి మోపూరిభైరవుని యుత్సవమునకు వచ్చినప్రజలను సంతసింపజేసిరని శాస్త్రిగా రభిప్రాయపడినట్లు తోచుచున్నది. కాని యిందొక యసంబద్ధ మున్నది. "విటులది యోర్గల్లు" అనుపాఠము సరియైనది కాదు. విటులది కాసల్నాడు; ఓర్గల్లుకాదు:—

క. "కాసల్నాటను శ్రేష్ఠుఁడు
 వీసాలప్పయ్యగారి మేనల్లుఁడు."

సీ. "ఎందుండి వచ్చితి రీరుకాసల్నాట
 నుండి వచ్చితిమి మేముత్పలాక్షి."

ఇత్యాదిచరణములు పుస్తకములోనే యున్నవి. రామకృష్ణకవిగారి పాఠమే సరియైనదని తోచుచున్నది. ఆకాలమున దోరసముద్రము, ఓరుగల్లు, వినుకొండలు సుప్రసిద్ధపట్టణములు. అచ్చట జరుగుచుండెడి క్రీడావినోదాదివిశేషముల నొకచోట జేర్చి రసవంతముగ వర్ణింపబడినవని కవిగా రిచ్చినపద్యమున కభిప్రాయము. కవిగారియభిప్రాయ మిదే యని యీక్రిందివాక్యము వలన తేలును:

"ఓరుగల్లును, ఫల్లాళులరాజధాని దోరసముద్రమును, వినుకొండయు విటుల కనుకూలముగానుండునని గ్రంథాంతపద్యమున నున్నది. రాజధానులుగానుండి క్షీణించెడు నగరము లన్నియు నీతిబాహ్యప్రవర్తనలకు నాటపట్టగునని తోచుచున్నది."

. —క్రీడాభిరామపీఠిక.

ఇందువర్ణించినక్రీడలలో పల్నాటివీరుల ప్రసక్తము, పంబలవాండ్రకథలు, గ్రామదేవతలజాతర్లు వినుకొండలో విశేషప్రచారములో నుండియుండును. ఇట్లే మరికొన్నివినోదములు ద్వారసముద్రములో జరుగుచుండెడివి. ఇవి సంస్కృతప్రేమాభిరామములో నుండినవో లేవో చెప్పజాలము. తెలుగుగ్రంథమునకు మారుపేరు పెట్టుట కిదియు నొకకారణమైయుండునని యిదివరకే చెప్పియుంటిని.

ఇంతవరకు క్రీడాభిరామము శ్రీనాథునిదే యను వాదము పరిశీలింపబడినది. ఇక శ్రీనాథునిది కాకపోవచ్చు ననుటకు కొన్నికారణములు చెప్పి యీవిషయము ముగింతును.

### ౧. లాక్షణికుల ప్రమాణము :—

క్రీడాభిరామములోని రెండు పద్యములు— (1) కుసుమరిచెట్టినచీరకొంగు—(2) కందుకకేళిసల్పెడు— శ్రీనాథుని వీథినాటకములోనివని అప్పకవి యుదాహరించినాడు. లింగమకుంట తిమ్మకవి మొదలగు లాక్షణికులు అప్పకవివలెనే యీరెండుపద్యములను శ్రీనాథుని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వని యుదాహరించిరి. కాని అప్పకవికి పూర్వలాక్షణి కులు చాలమంది యీపద్యములనే కాక మరికొన్ని పద్యములుకూడ వల్లభరాయని వీథినాటకములోని వనియే చెప్పియున్నారు. "చిత్రకవి పెద్దన, ముద్దరాజు రామన, శ్రీధరుడు, గంపవరపు వేంకటకవి, జగన్నాథుడు-వీరందరును వల్లభరాయని వీథినాటకములోనివని దే యుదాహరించియున్నారు. జగన్నాథకవి రత్నాకరములో సుమారు ౧౦ పద్యములకంటె నెక్కువగా వల్లభరాయనివనియే పేర్కొనెను. అళియరామరాయల మత్తారియగు సోమభూపాలున కంకితమీయబడిన శ్రీధరచ్ఛందములో వల్లభరాయని వీథినాటకములోనిదని 'మంచవ వింటివో' యనుపద్య ముదాహరింపబడియున్నది. అందు చేత వల్లభరాయడు శ్రీనాథునిబాల్యదశలో గొప్పకవి యైనట్లు తెలియుచున్నది." అని రామకృష్ణకవిగారు క్రీడాభిరామపీఠికలో వ్రాసియున్నారు. పైని పేర్కొనిన కవులు అప్పకవికి పూర్వులు. అందు శ్రీధరుడు చాల ప్రాచీనుడు. వల్లభరాయకర్తృత్వమువిషయమై యింత గ్రంథముండగా ఈసంగతే యెత్తుకోక "అప్పకవ్యాదులు శ్రీనాథుని వీథినాటకములోనివని యుదాహరించినపద్యములు (రెండుమాత్రము) ఏగ్రంథమున నానుపూర్వితో నుండునో యాగ్రంథమే శ్రీనాథునివీథినాటక మగును గదా! ఆగ్రంథము దొరికినది. దాని పేరు క్రీడాభిరామము. అది వీథినాటకమే." అని శాస్త్రిగారు వ్రాయుట వల్లభరాయనికి జరిగిన యన్యాయము. కవిగారి వ్రాతను శాస్త్రిగారు ఖండించలేదు సరేకదా, అప్పకవికి పూర్వముండిన లాక్షణికులు వల్లభరాయనివని వ్రాసినవ్రాతలైనను సమన్వయించలేదు.

అప్పకవి శ్రీనాథునిదని వ్రాయుటకును, అతనికి పూర్వులు వల్లభరాయనిదని వ్రా యుటకును గల కారణము లనాలోచింతము. వల్లభరాయలపూర్వులదివినుకొండయు, దానికి సమీపమున నున్న త్రిపురాంతకేశ్వరుడు (త్రిపురాంతకము వినుకొండ సమీపముననున్న గ్రామము)వారి కులదైవముగను ఉండియున్నను, అతను మోపూరుగ్రామము నుపాలించు చుండెను. క్రీడాభిరామమును అచ్చటనే వ్రాసెను. మోపూరు కడపజిల్లా పులివెండ్లతాలూకాలో నున్నది. ఆప్రాంతములందుండిన ప్రాచీన లాక్షణికుడను శ్రీధరుడు తనఛందస్సులో వల్లభరాయనికృతి యనుట సహజము. ఈవిషయము తెలిసినవారందరు శ్రీధరునే యనుకరించిరి. కొంత కాలమునకు శ్రీనాథుని వీథి పద్యములు గుంటూరు, కృష్ణా, గోదావరిజిల్లాలలో ప్రచారమందియుండును. అప్పుడు కవిపేరు తెలియక శ్రీనాథునిపద్యములను బోలియుండిన పద్యములనన్నిటిని అతని కంటగట్టియుందురు. ఇప్పు డచ్చుపడి ప్రచారములోనున్న శ్రీనాథుని వీథిలోని పద్యములన్నియు నతనివి కావనువాదము లేదా. అప్పకవికి వల్లభరాయని పేరే తెలియదని నానమ్మకము. ఏలయన క్రీడాభిరామ కర్తృత్వవిషయమున శ్రీధరాదులకు తెలిసినవానికంటె విశేషాంశము లతనికి తెలియుట కవకాశము లేదు. ఒకవేళ శ్రీనాథుడే వ్రాసి వల్లభరాయనిపేరు పెట్టినట్లు లోకవదంతినిబట్టి అప్పకవి వ్రాసెనని యన్నచో, కవులవిషయమై కట్టుకథలు వ్రాయుటయం దభిరుచిగల అప్పకవి యీసంగతి తప్పక బయలుపెట్టి పూర్వలాక్షణికులు తప్పు వ్రాసిరనికూడ చెప్పియుండును. కాబట్టి అప్పకవి యుదాహరించిన పై రెండుపద్యములును కవిపేరు తెలియక శ్రీనాథుని కంటగట్టినవి. శ్రీనాథునిచాటువని ప్రచారములోనున్న "వీరులు దివ్యలింగములు" అనుపద్యము కూడ క్రీడాభిరామములోనిదై యుండునని నానమ్మకము. ఈపద్యమున కందు చక్కనియానుపూర్విగలదు. "కులము దైవతంబు గురజాల గంగాంబ" అను క్రీడాభిరామపద్యము తరువాత నీపద్యమునకు తావున్నది.

## ౨. కవిస్తుతి:—

గ్రంథకర్త కవిస్తుతిలో ఆదికవిని పేర్కొనిన తరువాత తనయభిమాన కవులను స్తుతించుట సహజము. వల్లభరాయడు నన్నయతిక్కనలను చెప్పిన తరువాత భాస్కరుని, చిమ్మపూడి యమరేశ్వరుని మాత్రము నుతించి రావిపాటి త్రిపురాంతకుడు వీరితో సమానుడని చెప్పెను. ఇట్లు చెప్పుట యాకవులయం దాతనికుండిన యభిమానమును సూచించును. శ్రీనాథుడు తనగ్రంథములయం దెన్నటికో, రావిపాటి త్రిపురాంతకుని గాని చిమ్మపూడి యమరేశ్వరునిగాని నుతించెను? "అదె దారువనభూమి" యను క్రీడాభిరామములోని పద్యము శ్రీనాథునిపద్యమును బోలియున్నదని శాస్త్రిగారు వ్రాసిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"అదె కైలాసము" అను అమరేశ్వరుని వసంతసేనమునం దలి పద్యము నిట్టిదే. ఇట్టియెత్తుగడగలపద్యములు క్రీడాభి రామములో పెక్కులున్నవి. "అదె మాణిక్యపుఁ బ్రూణ్ణ కుంభము; ఇదె యీయింటియజమానుండు; అదిగో ఎత్తినవారు; అదె భైరవస్థాన మటమీద నల్లదె చముడే శ్వరీమహాశక్తి నగరు, వీడిదె తెల్లనాకులను వీడెము సేయుచు; అదె నీకుమారితమదనరేఖాకన్య," ఇత్యా దులు పైనిజూపిన యమరేశ్వరునిపద్యముయొక్క యెత్తు గడ గలవి. వల్లభరాయని కిట్టి పద్యములయందుగల మో జును, అమరేశ్వరునియందుగల యభిమానమును సూచిం చును.

## 3. వ్యక్తిగతములగు విశిష్టభావములు:—

ఏవైన రెండుకృతులను పోల్చునపుడు సామాన్య భావసామ్యమునుబట్టి కర్తృత్వమును నిర్ణయించుటయు క్తముకాదు. సమకాలికులగు కవులలో సర్వసామాన్యము లగు భావములందును, బదములయొక్క కూర్పునందును, కొంతవరకు శైలియందుకూడ పోలిక లుండును. "శైలి విషయమున సామాన్యమును జూపి శ్రీనాథునకు కర్తృ త్వమారోపింతమన్నచో నక్కాలపు గావ్యములెల్ల నించు మించుగా సమానపాటవమును,కవితాధాటియును,నిరంకుశ భావములు గలిగియున్నవి." అను రామకృష్ణకవిగారి వాక్యము యథాస్థితిని జెప్పుచున్నది.

ఇతరకవులు సామాన్యముగ నుపయోగించనిభావ విశేషములను బట్టి కొంతవరకు కర్తృత్వము నిశ్చయింప వచ్చును. వ్యక్తిత్వమును సూచించునట్టి విశిష్టభావములు క్రీడాభిరామములో పెక్కులు గలవు. ఈక్రింది చలివర్ణన మెంతస్వభావసిద్ధముగ నున్నదో చూడుడు:—

ఉ. ప్రక్కలువంచు వంచి ముని
పండ్లును పండ్లును రాచు రాచి రొ
మ్మక్కులఁజేయుఁ జేసి తల
యల్లనఁ గాళులసందు సంది లో
నక్కినొక్కు నొక్కి యిరు
చంబడ సుమ్మడిమూటగట్టి వీ
పెక్కి దువాళిచేసి చలి యిక్కడ
నక్కడఁ బెట్టువేసవన్.

మనప్రబంధములలో నిట్టిచలివర్ణనము గానరాదు. 'కాళుల సందు' 'సంది' అనునట్టి క్రియాప్రయోగములుగా నెందరుకవు లుపయోగించినారు?

కండ్లయెదుట గట్టిన ట్లుండునట్లుగ చిత్రించిన యీక్రిందివర్ణనములు చూడండి:—

క. కీలిన వెదురుసలాకలు
నేసిన యిరుదల శిఖండి నిడు వంచమునన్
దోసరిలికట్టుసవరని
లాసిని...........................

ఉ. ద్రుతతాళంబున వీరసంభితకథం
ధుంధుంకిటాత్కారసం
గతి వాయింపుచు......................

సీ. గర్జించి యరసి జంఘాకాండయుగళంబు
వీరసం బెటకోల వేయు నొకడు...

సీ. క్రొత్తదోమినసంత కోరకంబులయందు
తాంబూలరాగంబు తనుక గూర్చి...

సీ. అవయవంబు నెత్తినిచంద్రమల్లెల
జోద్యంపుసందాలు చొచ్చువారు.

ఇట్టిసాక్షాత్కారము నొందజేయగల వర్ణనము లెన్నియేని గలవు. క్రీడాభిరామములోని పాములవాం డ్రవర్ణన మెంతమనోహరముగ నున్నదో చదివి యానం దించవలెను.

శ్రీనాథునిచాటువని ప్రతీతిగన్న "భోగీపుఱ బుచ్చిగాడికి" అనుపద్యమునుబోలిన పద్యమొకటి క్రీడా భిరామములో నున్నది. ఈరెంటికిని అర్థపాటవమునందు భేదము చూడుడు:— క్రీడాభిరామపద్యమిది:—

ఉ. మీనవిలోచనంబులును
మీటిన ఖంగనునుబ్బచన్ను లిం
పైనవచోమృతంబు సాగ
సైనము ఖాలసమంనయానముం
గా నొనరించి దీని గణి
కామణిఁ జేయక నిర్దయాత్ముఁడై
గానులదానిఁ జేసిన వి
ధాతవిధిం దలమొత్తఁగాఁ దగున్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

### ౮. జాతీయములు:—

క్రీడాభిరామమునందు జాతీయములకును, లోకోక్తులకును కొదవలేదు. శ్రీనాథుడు తనగ్రంథములన్నిటిలోను చేర్చి యున్నన్ని జాతీయము లుపయోగించినాడో లేదో సంశయము. ఇందు కొన్ని దత్తమండల ప్రాంతములలో ప్రచారము గలవి. పరిగె, పరిగోల పరిబోసు, లింగముద్రలు, సరుగుల్లాటు, క్రొంత్రోవ కనుము (నల్లగనుము) మొదలగునవి నెల్లూరిజిల్లాకవులకు పరిపాటిలో లేవు.

అపూర్వప్రయోగమిదివరలో నొకటి తెలిపియుంటిని. సందు అనునది క్రియాపదముగ ప్రయోగించుట సామాన్యము కాదు. ఇట్లే జీవగఱ్ఱయను ప్రయోగముకూడ క్రీడాభిరామములో గలదు.

### ౯. ప్రధానరసము:—

క్రీడాభిరామములోని ప్రధానరసము శృంగారమొక్కటియె కాదు. ఎంత శృంగారమున్నదో అంత హాస్యమున్నది. కొన్ని వర్ణనములు పచ్చిగ నున్నను రసౌచిత్యము తప్పలేదు. పుణ్యస్త్రీలను నీచవర్తన నారోపింపలేదు.

ఇక హేళనసేయుటలో దేవుళ్లనుకూడ వదలలేదు. శ్రీకాకుళములోని 'తెలుగుభర్త' చిన్నపోవునట్లు వర్ణించెను.

"కనుతానవతారంబు గైకొన్న దైత్యారి
కనునీయ చరమభాగంబు"
"ఆదియుగంబునం దావిర్భవించిన
జిననాథదేవునిశిరసు"
"గంగపట్టియతోడ సాంగత్య మొదలిన
నునుపారు మునిమిట్ట నడుము"

ఇవి నీచోపమలతో వర్ణింపబడినవి. పైపైనచోట్ల పదశ్లేషల నుపయోగించి గేలిసేసెను.

గీ. "జనకుడవు కర్త వోజ్జవు సజ్జనుడవు
క్రొత్తలంజల కాముండ వుత్తముడవు........"

గీ. ".....భువనహితముగ నుత్సవం బవధరింప
సందుఁ బోయితి విహారయినట్టిరేయి"

శ్రీనాథునివీథినాటకములోనివని చెప్పెడి పద్యము లన్నియు సింహాచలయాత్రను పోయినప్పుడు చెప్పించాటువు లనవచ్చును. కొన్ని నీలాటిరేవుదగ్గిర చెప్పినవి. వీటిలో స్త్రీవర్ణనగాక మరియేమున్నది? సింహాచలయాత్రలో స్త్రీలుతప్ప మరియే వర్ణనాంశములు లేకుండెనా? క్రీడాభిరామములో విషయబాహుళ్య మున్నది. హాస్యములో కొన్నిచోట్ల వీరేశలింగముగారి ప్రహసనహాస్యము జ్ఞప్తికి వచ్చును.

క్రీడాభిరామముయొక్క అచ్చుపుస్తక మిప్పుడు దొరకుట దుర్లభమగుటచేత కర్తృత్వవిషయమై యింత వ్రాసితిని. ఒక్క స్థూలపరీక్ష చేసిన చాలును. క్రీడాభిరామములో 295 పద్యము లున్నవి. ఇవి చదివి తరువాత శ్రీనాథునిగ్రంథములలో ఏకథాభాగమునందైనను వరుసగ 300 పద్యములు చదివిన క్రీడాభిరామకర్త శ్రీనాథుడో భిన్నుడో చదువరులే గ్రహింపగలుగుదురు.

రాజులును ధనవంతులును సామాన్యముగ గ్రంథకర్తలుగారని శాస్త్రిగారి నమ్మకము. వారి యాస్థానకవికృతులే వారిపేర నున్నవని యభిప్రాయము. ఈకుట్ల బయలబెట్టుటకు ప్రత్యేకగ్రంథమే వ్రాయవలసి యున్నదని శాస్త్రిగారు వ్రాసియున్నారు. ఇట్టినమ్మకమున కనుగుణ్యముగ వల్లభరాయడు "కవీంద్రకాంక్షిత శ్రీనశపహీరగుహాము" కావున విశేషధన మొసగికవియశోలోభమున నేతత్కృతికర్తృత్వమును దనపై వేయించుకొన్నాఁడనఁదగును" అని శాస్త్రిగారొక కారణము నిచ్చిరి. ఇంతకంటె "నాకీగ్రంథము (క్రీడాభిరామము) నెడ నభిమానము మెండు...ఈగ్రంథము శ్రీనాథునికృతియై వెల్లడికాఁగల్గినందులకెంతయు సంతోషించుచున్నాఁడను" అను శాస్త్రిగారి మనోవృత్తి చాలవరకు వల్లభరాయకర్తృత్వమునకు భంగము గలిగించినదని నా నమ్మకము.



4. 4- ౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




కందుకూరి వీరబసవరాజు గారు

సంకెలవోలె ముందడుగు సాఁగఁగనీదు నిజాభిజాత్య మే
వంకలు వచ్చునో పరులభావము నొచ్చునొయంచు నాల్కయున్
గొంకులువోవుఁ గొట్టుకొను గుండె లవజ్ఞ ఘటిల్లు భీతి నీ
సంకటమందు దైవ మర సచ్చిన నిన్నలయించు నర్థిరో!

ఉ. భారము తాన మోమయపువ్రాతల నీతలవ్రాసె బ్రహ్మ ని
ష్కారణహార్దమై యినుపగజ్జెలతల్లి వసించుఁబైని సం
సారభరంబు నాపయి నసాధులు సేయునవజ్ఞ యింత బ
ర్వోరిచి మెట్టు లెత్తఁగలవోయి తలన్ బరుఁజేరి నేఁడుచోన్?

శా. ఆర్దిన్ సాదృతిఁగన్న యాప్తుఁడును గార్యంబీవు చెప్పంగ నోఁ
గాదన్ సందులకై మొగాదిగఁ గనున్ గర్వించి పోరామియం
దౌదాసీన్యము వైమనస్యము నసూయన్ జూపు నానాఁటికిన్
నీదౌర్భాగ్యపుగాలిసోఁకి ఘనుఁడేనిన్ నీరసుండై విడున్.

చ. వెడవెడచూపు గుండెదడ వీడనితృష్ణ పరాకు నూఱికే
జడియుట జాడ్యమున్ బరవశత్వము మున్నగ రోగ చిహ్నముల్
బడసిన నీవు ధిక్కృతి యపథ్యముచే మఱిచచ్చినంత పా
డడరి చరింతు వెక్కసపుటాయువుచే నడపీన్గవై ధరన్.

చ. రాజసుఁడంచు జ్ఞానులు నిరాకృతిసేయఁగ, బంధులెల్లరున్
వాజయటంచు నవ్వ, ధనవంతులు పీడ యటంచుఁ దిట్ట, ని
స్తేజత నర్థిరో! మనసు సిగ్గును లొగ్గడిసేయఁగా ధనే
చ్ఛాజితబుద్ధివై వ్రతము సౌఖ్యముఁగూడఁ దొఱంగినావుగా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. అడుగకపెట్ట దమ్మయనటందువె? యమ్మ నిరాకరించునే?
యెడపక యామెపెట్టులవమేనియుఁ దృప్తినిఁ గూర్పకుండునే?
పుడమిని దల్లివంటి జనముల్ మఱి గల్గిన నిత్యతృప్తి నీ
యెడఁదకు నన్న వేఁడు మెదియేనియుఁ దక్కినఁ దక్కు మర్థిరో!

ఉ. తప్పియు దారి పంజరముతల్పుఁ దెరల్చినఁ బోవు చిల్క య
ట్లొప్పడు చేయివిప్పి దురదృష్టపురేఖను బైటఁ బెట్టితో
యప్పుడె పోయె గౌరవ మహంకృతి యేటికి? నీదుగొప్ప నీ
గుప్పిటనుండు విప్పకుము కోటిలభించిన దానినర్థిరో!

గీ. మూఁపుపైనోపరాని కాపురపుమోపు-కాలుసేతులు మోహశృంఖలలు గలిగి
భవజలధి భంగపడితివి, పగ్గెలేల; ఒరులచేమూఁత యర్థింపు మోయియర్థి!

ఉ. డాబు లివేల లౌకికకళాప్రవణుండను, గొప్పవారు నా
జేబులనుందురం చనటఁ జేతులు మోడ్పఁగలేదొ; నాయనా,
బాబని వేఁడలేదొ; తలవంచి సలాములుసేయలేదొకో;
నీబవిసారలేదొ? యెటుఁసిల్గిన నర్థివెసుమ్ము నీవిఁకన్.

మ. కులగోత్రంబుల సాటిఁజూడు, మట నీకుఁ వశ్యమంత్రంబుగాఁ
గలవాఁ డొక్కనిపాట యూఁతగొను, సఖ్యప్రీతిగా వేషభా
షలమార్పుల్ పచరింపు, వచ్చెడియవజ్ఞన్ సైప నుద్యాపనం
బెలమిన్ జేయు మనోభిమానమున కర్థీ! వేఁడు పైసంగతిన్.

చ. ధనికులయందు నవ్విన యధర్మము, నర్థులయందుఁ దృప్తియున్
బొనుపడఁజేయు చిర్వ్వరకుఁ బొత్తుఘటింపఁడ యంతఁబోకనా
ధనికులపంచ నర్థులను దాఁచి యీడ్పులఁ బెట్టి యర్థిచే
ననవినగానితిట్లఁ బడు నాముదిబ్రహ్మ కదేమి ముచ్చటో? (సశేషము)



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# శ్రీనాథకవిరాజీయము

కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

(వెనుకటిసంచిక తరువాయి)

(శ్రీనాథుఁడు శిష్యులతోఁ బ్రవేశించును.)

అన్నామాత్యుఁడు

సార్వభౌమా! రమ్మిమ్మ భద్రాసన మలంకరింపుము.

(సముచితాసనముం జూపును.)

(శ్రీనాథుఁడు ఆసీనుఁ డగును.)

అన్నామాత్యుఁడు

శ్రీనాథకవినాథా! నీ విపు డెందుండి యిందు వచ్చితివి?

శ్రీనాథుఁడు

దేశాటనము చేయుచు శ్రీశైలంబునకుం బోయి యటనుండి యిటకు మహామాత్యుల దర్శింప నర్థినై వచ్చితిని.

అన్నామాత్యుఁడు

సంతోషము, సంతోషము.

"సీ. వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణవిద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకం బైన
హర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణవేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందుఁ
బాకనాఁటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభునిమనుమఁడ వమలమతివి
నాకుఁ గృపసేయు మొక ప్రబంధంబు నీవు
కలితగుణగణ్య! శ్రీనాథకవివరేణ్య."

"మ. అరవిందాప్తకృతప్రతిష్ఠుఁడగుద
క్షారామభీమేశ్వరే
శ్వరుమాహాత్మ్యముతోడఁ గూడి భువన
శ్లాఘాస్పదం బై యభం
గుర మై స్కాందపురాణసారమగు శ్రీ
గోదావరీఖండమున్
బరిపాటిన్ రచియింపు మంధ్రజగతీ
భాషాప్రపంచంబుగన్."

(అని కర్పూరతాంబూలాంబరాదు లొసఁగును.)

(శ్రీనాథుఁడు ప్రతిగ్రహించి)

"సీ. ధారాసురత్రాణ ధాటీసమారంభ
గర్వపాథోరాశి కలశజులకు
సప్తమాడియరాజ రక్షాడియత్క్ష్మాపాల
వందితశ్రీపాద వనరుహులకు
సింహాద్రిపర్యంత సీమాంధ్రమేదినీ
మండలీపాలనాఖండలులకు
హారిదంతదంతిదంతావళీ లిఖ్యమా
నానేకజయశాసనాంకురులకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీరభద్రేశ వేమ పృథ్వీధవులకు
నను:గుమంత్రి! మహాప్రధానాగ్రగణ్య!
బెండపూ:డన్న! జగనొబ్బగండబిరుద!
సచివదేవేంద్ర!మత్కృతీశ్వరు:డవగుము."

అన్నామాత్యు:డు

నీవు నాపేర గ్రంథము రచించుచు నా యింటన యుండుము. మఱియు నీవీరభద్రారెడ్డికడ నా స్థానకవివై యుండ నేనభిలషించుచున్నవాఁడ. ఈరాజమహేంద్ర వరమో,

"సీ. కమలాచలాగ్ర మార్కండేయ శివశిర
　　శ్శశిచంద్రికా ధౌతసౌధ వీథి
గోదావరీ పుణ్యకూలంకషా జల
　　స్ఫారిత శ్రీరుద్ర పాదయుగళి
బలవదభ్యున్నత ప్రాకారపరివేశ
　　గండూషితాజాండ మండలంబు
గంధదంతావళ గ్రైవేయ ఘంటికా
　　టంకారముఖర ఘంటాపథంబు
రాజబింబాననానూత్న రత్నపేటి
వీరరాహుత్తసుభట కంఠీరవాద్రి
వేమభూపాల రాజ్యాభివృద్ధికరము
సాంద్రవిభవంబు రాజమహేంద్ర పురము."

శ్రీనాథు:డు

హా హా; ఏమి నాపుణ్యము! ఈనాకృతీశ్వరుండు

"సీ. రాజమహేంద్రదుర్గమున: గావించె శ్రీ
　　వీరభద్రునకుఁ బ్రాకార రేఖ
నిలిపె మార్కండేయ నీలకంఠుని మ్రోల
　　రామేశుఁ దమతల్లి నామకముగ
సంగమేశ్వర దివ్యశంభులింగమునకుఁ
　　గల్పించెఁ గళ్యాణగర్భగృహము
దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి
　　మొదలివాకిట ధామమును రచించెఁ
బ్రాగ్దిశావప్రగోపుర ప్రాంగణమున
సప్తముని సింధుసోపానసరణి కెలనఁ
దీర్చె భవనంబు భీమయదేవునగర
మంత్రిదేనయయన్నయామాత్యవరుఁడు."

ఇట్టి నీసన్నిధినుండుటకన్న భాగ్యం బొండు లేదు. మఱియు నీరాజమహేంద్ర వరపురంబు

"సీ. ఉండు నేవీట మార్కండేయమునినాథ
　　సజ్జలింగ మనంగశాసనుండు
ప్రవహించు నేవీటి పశ్చిమ ప్రాకార
　　మొరసి గంగమ్మ సాగరము కొమ్మ
యావిర్భవించినాఁ డేవీటికోటలో
　　బలభేది మదన గోపాలమూర్తి
పాలించు నేవీటి ప్రాగుదక్కోణంబు
　　నుమ ప్రోది శ్రీమల్లగూరిశక్తి
ప్రబలధారాసురత్రాణ భద్రజాతి
కరిఘటాసైన్య దుస్సాధకనక లోహ
గోపురద్వాఃకవాటప్రదీపిత మతి
సాంద్రవిభవంబురాజమహేంద్రపురము."

ఇది దక్షిణకాశిక యనం బ్రసిద్ధిఁ జెందిన క్షేత్రంబు. ఇందలి వాసమును బురాకృత సుకృతపరిపాకంబు కాని సామాన్యముకాదు.

అన్నామాత్యు:డు

కవితల్లజా! దేవపూజావసరం బగుచెంచెఁ గావున మన మీకొలువు చాలించి యంతర్గృహంబునకుం బోవుదము రమ్ము (అని లేచును).

[అందఱు లేచి నిష్క్రమింతురు.]

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్థలము—అన్న మంత్రి గృహము

[శ్రీనాథుఁడు వ్రాసికొనుచుండును.]

అన్నామాత్యుఁడు

(ప్రవేశించి) కవిసార్వభౌమా! రాజాస్థానము నుండి నాకు రా నాజ్ఞ వచ్చినది. ఇప్పు డావీర భద్రభూపాలుండు

"సీ. త్రైలోక్యవిజయాభిధం బైనసౌధంబు
చంద్రశాలాప్రదేశంబునందు
సచివసైన్యాధీశసామంతనృపవార
సీమంతినీజన శ్రేణి కొలువ
శాస్త్రమీమాంసయు సాహిత్యగోష్ఠియు
విద్వత్కవీంద్రులు విస్తరింపఁ
గర్పూరకస్తూరికాసంకుమదగంధ
సారసౌరభము దిక్పూరితముగ
నిజభుజావిక్రమంబున నిఖిలదిశలు
గెలిచి తను రాజ్యపీఠ మెక్కించినట్టి
యన్న వేమేశ్వరునియంక మాశ్రయించి
నిండుకొలువుండెఁ గన్నులపండు వగుచు."

నేను బోయివచ్చెద; నీ విట గ్రంథరచన గావించుకొనుచుండుము.

(నిష్క్రమించును.)

శ్రీనాథుఁడు

నా కిప్పురంబున రాజానుగ్రహంబు గలిగించు కొని యుండుట కిష్టమే కాని ఇచటిపండితం మన్యులు ఁడు ము వు లు దీసిన నీకవిత్వ మేదియని నన్నాక్షేపించుచున్నారు.

"తే. బోధ మల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి నిష్ప్రచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములఁబోలెఁ గొంచెమెఱిఁగి
పండితంమన్యు లైనవైతండికులకు."

వీరి నొకసాటివారిం జేసి వీరిమాటలకు నోట మిం జెందుట సాంప్రదాయము కాదు. కాని విచారించెదం గాక!

భటుఁడు

(ప్రవేశించి) హుసాదు కవిసార్వభౌమ! రాజేంద్రులయు నన్నామాత్యులయు నాజ్ఞ యైనదిః రా నవధరింపుము.

శ్రీనాథుఁడు

(తనలో) అన్నామాత్యుఁడు మహారాజుతో నావృత్తాంత మంతయుం జెప్పియుండఁ బోలు. కావుననే నా కాజ్ఞ వచ్చినది. నే నిప్పుడ పోయి రాజదర్శనంబు గావించెదంగాక.

[భటునితో నిష్క్రమించును.]

---

స్థలము—వీరభద్రారెడ్డి సభాస్థలము

[మంత్రిసామంతాదులు పరివేష్టింప వేమభూపాలుఁడు తమ్మునితో సింహాసనాసీనుఁడై కనుపించును.]

శ్రీనాథుఁడు

(ప్రవేశించి)

"శా. కర్ణాటక్షితినాథ మౌక్తికసభా
గారాంతసంకల్పిత
స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధకవిరా
ట్సంస్తుత్యచారిత్ర! దు
గ్ధార్ణోరాశిగభీర! ప్రాహ్ణముఖమ
ధ్యాహ్నపరాహ్ణార్చితా
పర్ణావల్లభ! రాజశేఖరమణీ!
పంటాన్వయగ్రామణీ!"

"శా. మార్కండేయమహేశ్వరుం డఖిలసా
మ్రాజ్యంబు పాలింపఁ గా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నర్కేందుల్ గలయంతకాలము తదీ
యాంఘ్రిద్వయీభక్తిసం
పర్కోదంచితభాగ్యసంపదల నా
త్మామండలీవల్లభుర్
కోర్కుల్ నిండఁగ సేవకత్వమునఁ గై
కొం డ్రాయురైశ్వర్యముల్."

మఱియును

"సీ. చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూగుమీసాల నూత్నయౌవనమున
శాలివాహనసప్తశతి నొడివితి
సంతరించితి నిండుజవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకునిమహిమ
ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండ మనుమహాగ్రంథ మేను
దెనుఁగుఁ జేసెదఁ గర్ణాట దేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి."

వేమభూపాలుఁడు

(శ్రీనాథుని విశ్రమింప నియోగించి)

"సీ. వచియింతు వేములవాడభీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టుమార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాకృత్తు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని త్రోవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు
నైషధాది మహాప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడ వనఘ,
యిపుడు చెప్పఁదొడంగిన యీప్రబంధ,
మంకితము సేయు వీరభద్రయ్యపేర.

శా. ఈక్షోణి న్నినుఁ బోలు సత్కవులు
లే రీనేటి కాలంబునన్
దాక్షారామ చళుక్యభీమవర గం
ధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణ
ద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించుం గవిసార్వభౌమ భవదీ
యప్రౌఢసాహిత్యముల్.

(అని కర్పూరతాంబూలజాంబూనదాంబ
రాభరణాదు లర్పించుచున్నాఁడు.)

శ్రీనాథుఁడు

(ప్రతిగ్రహించి)

"సీ. ఆంధ్రక్షమామండలాఖండలుం డైన
వేమభూపతికృపావీక్షణంబు
ఘోడెరాయాంకసద్గురురాజభీమేశ్వ
రస్వామి పదసమారాధనంబు
కమలాద్రి నిలయమార్కండేయ శివమౌళి
చంద్రాంశు నవసుధాసారధార
వేదాద్రినరసింహ విపులవక్షస్స్థలీ
కల్హారమాలికా గంధలహరి
కారణంబులు నుద్బోధకములు గాఁగ
సంభవించినసాహిత్యసౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధవిభునిఁ జేసి
కాశికాఖండము దెనుంగు గా నొనర్తు."

వీరభద్రారెడ్డి

శ్రీనాథా! నిన్ను మామంత్రివర్యుం డెంత
యేనిం బెద్దచేసి చెప్పియున్నాఁడు. నీకవిత్వం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బనస్యసామాన్యంబు కాని నీ వీనడుమ సింగభూ పాలు పేరోలగంబున వాని బూఁతు పొగడినట్లు పొగడియుంటి వని వింటి నిది నిశ్చయమా ?

అన్నామాత్యుఁడు

ప్రభువర్యా! కవివర్యులు దేశకాలపాత్రాను సారంబుగం బ్రవర్తించుచుండవలయుం గదా! కాకున్న వారికి జీవనాధారం బేది ?

వేమభూపాలుఁడు

అవు నది నిశ్చయమే. కావుననే శ్రీ మహాభారతమున నత్రిగౌతమసంవాదములో నర్థి యగువాఁడు రాజుం బొగడుట తప్పు గా దని చెప్పియున్నది.

శ్రీనాథుఁడు

భూపాలాగ్రణీ! సింగభూపాలు నేఁ బొగడితి నో తెగడితి నో పద్యము చెప్పితిని.

వీరభద్రారెడ్డి

ఏదీ యాపద్యము ?

శ్రీనాథుఁడు

"క. సర్వజ్ఞనామధేయము
శర్వునకే, రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును; దక్కొరు సర్వజ్ఞుం
డనుట కుక్క సామజ మనుటే."

ఇందలి యర్థాంతరము విద్వత్ప్రభువులకు విశ దంబు గాక పోదు.

వీరభద్రారెడ్డి

నీవు మిక్కిలిసమర్థుఁడవు. తిమ్మిని బ్రహ్మిని బ్రహ్మిని దిమ్మినిఁ జేయఁ గలవు. ఉండనిమ్ము. "కాశీఖండ మయఃపిండం నైషధం విద్వదౌష ధమ్" అని కదా పెద్దలు చెప్పుదురు. ఇందు విద్వ దౌషధము చక్కఁగ సేవించితివి. అయఃపిండ ము నెట్లు సేవించెదవో చూచి యానందింతు ము గాక!

శ్రీనాథుఁడు

నా నేర్చినకొలంది విద్వత్ప్రభువుల విపులాను గ్రహంబున నయఃపిండ మమృతపిండముగాఁ జేసి సేవింపఁ గల నని విన్నవించుచున్నవాఁడ.

వీరభద్రారెడ్డి

నీభీమేశ్వరపురాణము మా మంత్రివర్యున కంకి తము గావించి సఫలీకరించితివి. అం దాతని నెట్లు వర్ణించితివో వినఁ గుతూహలం బగు చున్న యది.

వేమభూపతి

అమాత్యు నభివర్ణించిన రాజు నభివర్ణించు టయే కదా!

శ్రీనాథుఁడు

అవధరింపుఁడు:

"సీ. ధారాసురత్రాణ ధాటీ సమారంభ
గర్వపాథోరాశి కలశజులకు
సప్తమాడియరాజ రఘాడి యష్టపాల
వందిత శ్రీపాద వనరుహులకు
సింహాద్రి పర్యంత సీమాంధ్ర మేదినీ
మండలీపాలనాఖండలులకు
హరిదంతదంతి దంతావళ లిఖ్యమా
నానేకజయశాసనాంకురులకు
వీరభద్రేశ వేమపృథ్వీధవులకు
సముఁగుమంత్రి మహాప్రధానాగ్రగణ్యు
బెండపూఁడన్న జగనొబ్బగండ బిరుద
సచివదేవేంద్రుఁ గృతి నధీశ్వరునిఁ జేసి."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నామాత్యుఁడు

మేలుమేలు శ్రీనాథా! నాదికృతి యన్న పేరు
గాని యిదియును మా ప్రభువర్యులదే యని
సంతసించుచున్నవాఁడం జుమీ! మఱియు
నిందు నావంశముకన్న మున్న ప్రభువంశ వర్ణ
నము చేయుటయు నాకెంతయు సంతసము.

వేమభూపాలుఁడు

కవిరాజా! నీకవిత్వం బుత్తమోత్తమము. నీవు
కవిసార్వభౌముఁడవే. నీవింక సకుటుంబంబుగ
మాపురంబున నుండి గ్రంథరచన గావించుచు
మాయాస్థాన కవివై మా కానందం బాపా
దించుచుండుము.

శ్రీనాథుఁడు

(సంతసించుచు లేచి వేమభూపతి దిక్కు మొ
గంబై)

"సీ. వివిధవిద్యోద్దండ విద్వత్కుముదకాండ
హరిణాంక! రూపనారాయణాంక!
నిస్త్రింశ ఖరకరవాల నిర్జితారినృపాల
సప్తాంగ! రాజవేశ్యాభుజంగ!
సకలమహీరాజ్య సంరక్షణోదోఃజ్య
కులశీల, గుజ్జరిదళ విశాల!
భామాజనస్వాంత పరితోషణ లతాంత
కోదండ! రాయచేకోలు గండ!
జయవిజయజన్య కాంభోజహయసమాజ
ఖురవిపాటన సంభూత కుతలరేణు
పటల నిబిడఘనధ్వాన భరితభువన
విజయరఘురామ! అల్లాడ విభునివేమ!"

(వీరభద్రారెడ్డి దిక్కు మొగంబై)

"సీ. జయ! రాజవేశ్యాభుజంగాక! నిశ్శంక!
యభ్యుదయంబు రాజాధిరాజ!
మండసం బానలమండలీ కరగండ!
సంకల్పసంసిద్ధ సమర విజయ!
బ్రహ్మయు నరిరాయ బసువశంకరముద్ర
వర్ధిల్లు గాయగోవాళబిరుద!
మహిమించురిపుచెంచుమలచూఱకారాంక
స్వస్తి కర్పూర వసంతరాయ!
ఆంధ్ర(కర్ణాటశక)సింధు యవనిచేది
వీరలక్ష్మీస్వయంవర వీక్షణాఢ్య!
ధరణి పాలింపు మాచంద్ర తారకముగ
విక్రమోన్నిద్ర! అల్లయవీరభద్ర!"

వేమభూపాలుఁడు

(మంత్రిదిక్కు మొగంబై) అమాత్యవరా!
కవిరాజసందర్శనోత్సవసందర్భమునం జేసి కా
లాతిక్రమణంబు గాన కున్నవారము. ఇప్ప
టికే చాల ప్రొద్దుపోయినది. ఈనాఁటి కీకొ
లువు చాలింతము. అని తమ్మునితో లేచును.)

[అందఱు లేచి నిష్క్రమింతురు.]

---

అంకాంతము

స్థలము-అన్నవారిగడిపిఢి

(తెరలో మేళములు, తాళములు, రప్పెల్లు, డప్పులు,
లోనగువానిశబ్దము.)

(పాములవాఁడు పాములపెట్టెలతోఁ బ్రవేశము.)

పాములవాఁడు

(నాగస్వర మూఁదుచుఁ బాము నాడించుచు
లేచి దానిచుట్టు నాడుచుం దిరుగును.)

పాట

౧. నాగన్నా దేముఁడా! నాపాలీభీముఁడా!
పాలు బోతూనీకూపడగెత్తి యాడరా.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౨. కొండాపుట్టలలోను, కోడేతాచులలోను,
గొప్పాగా దిరిగేటి సప్పాలాసాయుడా.
3. పొట్టా నిండా గాలీ, గొట్టీ ముద్దూపెట్టా
కొందూనాయందూనా కోపము సేయకు.
౪ కలవోరూ నిను సూసి, తల కోడబ్బూవేసి
తల లూసేలాగూనాతలమెత్తియాడరా.

రెండవ పాములవాఁడు

ఓ రెంకుబావా! నీపాట కేంగాని, నీవు మోళీ కడతావంట వోమా టీడ గట్టి నీసిత్తరయిసిత్తరా లన్నీ యీపజ సూసేలాగు సెయ్యిరా సూదారి.

పాములవాఁడు

ఔనోరి బావా! నాసిత్తరా లన్నీ సూపిస్తా సూడు. (నాగస్వర మూఁది) మో! హో! యచ్చిణీ! మహాంకాలీ! సత్తీ! రా! రా! (అనిఆకాశములఁ జూచుచు గుప్పిళ్లతో రూపాయలు లోనగునవి చల్లును).

రెండవవాఁడు

(అవి యన్నియు నేరి చేతఁ బట్టుకొని) యెంత సిత్రం, హెంతసిత్రం! నీకెన్ని ద్దెలు తెలుసున్రా!!

పాములవాఁడు

నేను మోళీకట్టి బర్లు గీస్తా. గీత దాటి వొచ్చి నోడికి నూటికి నూరు పందె మేస్తా; సూడు నాపెగిని; సూడు నామగిమ.

(అంతలో నొకతురకవస్తాదు ప్రవేశము.)

తురకవస్తాదు

(మల్ల చఱచి యెదుటికి వచ్చి) ఏమిటివోయ్! పాములవాడూ! నీకీ మోళీ తెల్సునూ సెప్తావు. నీగీతా దాఁటేవాడూ లేడూ వోయ్! నేనూ హల్లాకామేహర్బానీసే సనంల్లో దాటీ పోతాను వోయ్! (అని గద్దించును.)

పాములవాఁడు

సాయేబిమ్యా! ఇది పుల్లావు కాదోసి. ఎల్లెల్లు. నీలాటివోళ్లను లాచ్చాడబ్బై పదకొండు వేలని సూశాను. మామావోళ్లు నేలగాక మోయారు. ఎల్లు. ఎల్లకుంటే నాను గీసినగీత దాటూ సూదారి.

తురకవస్తాదు

వో! సనంకీ దాటీ పోతాం. గీతా కాదూ. నీతలా దాటీ పోతాం వోయ్!

పాములవాఁడు

సర్లే! కానీ సాయెబూ! (నాగస్వర మూఁదుచు నేలపైఁ గొన్ని గీతలు గీచి బూడిద మంత్రించి యకుతలు చల్లి ఒకచో రూపాయలుపెట్టి) వస్తాదూ! యీగీతల్దాట్కొచ్చి యీరూపాయలు ముచ్చుకో సూదారి.

(తురకవస్తాదు మల్ల చఱచి వెనుకకు పఱచి వచ్చి మొదటి గీతమీఁద పడి నెత్తురు గ్రక్కుకొనును.)

(అందఱు కరతాళధ్వనులు చేయుదురు.)

(తురకవస్తాదు సిగ్గుపడిలేచి పోవును.)

[తెర పడును.]

(అపటిక్షేపంబున నొకచో లాటరు గుండు త్రిప్పుచుందురు; ఒకచో జూదమాడుచుందురు; ఒకచోఁ గొందఱు త్రాఁగి పొర్లాడుచుందురు; ఒకచోఁ జిత్రవస్తుప్రదర్శనము జరుగుచుండును; ఒకచోఁ గజ్జలతో సాము చేయుచుందురు; ఒకచో జక్కు-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లవాండ్రు అమ్మవారు పెట్టెలతోఁ బ్రవేశించి యొడిసెలతోఁ గొట్టుకొనుచుందురు; ఒకచోఁ గోడి పందెములు జరుగుచుండును. మఱియు ననేకవిధములు. అంత మాఱువేషములతో వీరభద్రారెడ్డియు, శ్రీనాథుఁడును, గొందఱు భటులును బ్రవేశింతురు.)

వీరభద్రారెడ్డి

శ్రీనాథకవిసార్వభౌమా! మన మీాయమ్మవారి యుత్సవసందర్భమున నూరెల్లఁ జుట్టిరావలయును జుమీా!

శ్రీనాథుఁడు

దేవరయాజ్ఞ.

వీరభద్రారెడ్డి

శ్రీనాథా! ఈకోళ్ల కెంతశౌర్య మున్నదో చూడుము. మేనెల్ల రక్తప్రవాహంబున సిక్తమయినను విడువక పోరుచునే యున్నవి. వీని నించుక వర్ణింపుము.

శ్రీనాథుఁడు

ఉ. ఊఁదిన యంతమాత్రమున
　నుక్కున ముక్కు బిగించి కాళ్లతో
మీాఁదుగఁ దన్ని కొంగపయి
　మిక్కిలి క్రౌర్యము సూపి పోరెడున్
గాదన మాన దీనెమలి
　కన్నుల నిప్పక లుప్పతిల్లు నేఁ
డాదిపులుంగుతేఁ డమృత
　మందినయప్పటిచంద మందెడున్.

వీరభద్రారెడ్డి

విద్యాసనాథా! ఈగొఱ్ఱెపోతు లెట్లు పోరుచున్నవో చూడుము. వీనిశౌర్య మవార్యము సుమీా!

శ్రీనాథుఁడు

(దృష్టి సారించి చూచి) హాహాహా! పొట్టేళ్లు—

చ. కలిసియు వెన్క వెన్కగను
　గాళుల మెట్టుచు నింత వోయి వే
జవమున మోఱ లెత్తుకొని
　సాఁగి నిమేషములోన రెండునుం
దవులఁగ ముందు వచ్చి కడు
　దర్పము పేర్పడ నిల్చి టాకుఁ బె
ల్లవియ శిరంబు లొప్పఁగ మ
　హారవ మద్రులు ప్రేలుపోలికన్.

వీరభద్రారెడ్డి

శ్రీనాథా! మన మీాప్రజాసమ్మర్దమున నింక నుండఁ జాలము. కొంచెము తొలంగి యుందము రమ్ము. (కొంచెము నడచి) అదిగో త్రాఁగుఁబోఁతు లెట్లు కొట్టుమిట్టాడుచున్నారో చూడుము.

శ్రీనాథుఁడు

(చూచి)

మ. కనుల న్నిప్పక లుప్పతిల్ల సకలాం
　గంబుల్ వడంకన్ నడిం
జనఁ గాళ్లాడక తొట్రుపా టొదవ నా
　చాశక్తి హెచ్చిల్లఁ గుం
భినిపై వ్రాలుచు సోలుచుం దనకు మున్
　వేఁ డున్న లేకున్న న
మ్మను నక్కం గుదెగ్రుచ్చి తిట్టు నతఁ డా
　హాలాప్రభావంబునన్.

వీరభద్రారెడ్డి

శృంగారశేఖరా! అటు చూడుము. పూఁబోఁడులు పోడిమిగ నలంకరించుకొని జాతరం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జూచుతలంపునం గాఁబోలు వచ్చుచున్నారు, చూడుము; వారిశృంగార మించుకయభివర్ణింపుము.

శ్రీనాథుఁడు

(ఒక్కొకదాని నిరూపించి రాజునకుం జూపుచు)

"సీ. బొమవింటఁదొడిగినపూవింటిదొరముల్కి-
పోల్కిఁ గస్తురిపొఁగ బొట్టు పెట్టి
చకచక లీనుతారకల రేకలువోలెఁ
గొలుకులు వెడలఁ గజ్జలము దీర్చి
పొడుపుగుబ్బలిమీఁదఁ బొడమునీ రెండనా
రంగు చందురు కావిరైకఁ దొడిగి
పిఱుఁదుపొక్కిలియును మెరకపల్లముగప్పఁ
బాలవెల్లువవంటి చేలఁ గట్టి
అంచకొదమల బెదరించునట్టిపోల్కి-,
నందెచప్పుళ్లు గల్లుగ ల్లనుచు మెఱయ
నడుము జవజవలాడఁ గీల్జడ ఘటించి
వచ్చు నంకమ్మసేన కీమచ్చెకంటి."

వీరభద్రా రెడ్డి

ఈసుందరి నీయాశీర్వాదమునకుఁ బాత్రురాలు సుమా!

శ్రీనాథుఁడు

సందేహమా? ధరాపురందరా!

"సీ. చక్క-నినీముఖచంద్రబింబమునకుఁ
గళ్యాణ మస్తు బంగారుబొమ్మ,
నిద్దంపునీచెక్కు-టద్దంపురేకకు
నైశ్వర్య మస్తు నెయ్యంపుదీవి,
మీఁటినఁ బగులునీ మెఱుఁగుఁ బాలిండ్లకు
సౌభాగ్య మస్తు భద్రేభయాన,
నలపులు గులుకునీవాలుఁగన్నులకు న
త్యధికభోగోస్తు పద్మాయతాక్షి,
మధురిమము లొల్కు-నీముద్దుమాటలకును
వైభవోన్నతి రస్తు లావణ్యసీమ,
నన్నెచిన్నెలు గల్గునీమన్ననలకు
శాశ్వతస్థితి రస్తు యోషాలలామ!"

వీరభద్రా రెడ్డి

(ఒకయింతిం జూచి) కవిరాజా! ఈరాజాననయేకులస్థురాలో పరికింపుము.

శ్రీనాథుఁడు

"ఉ. వాలుగుకన్నుఁదోయి జిగి
పట్టునగుబ్బలు కాఱుచీఁకటిం
జాలహసించుకొప్పు జిగి
పారదము న్నగుమోముగల్గు నీ
బాలికఁ గూలి కమ్ముకొన
బట్టలు నేసెడువాని కిచ్చె హా!
సాలెత గాదురా కుసుమ
సాయకుపట్టపుదంతి యింతియే."

వీరభద్రా రెడ్డి

ఈసౌందర్యవతి చాకెతవోలె నున్నది చూడుము. ఔను. ఇది చాకెతయే.

శ్రీనాథుడు

"ఉ. శ్రీకరభూషణంబులును
సిబ్బెపుగుబ్బలు ముద్దుఁ జెక్కు-లున్
గోకిలవంటిపల్కు-లును
గొల్చినఁ జేఱలఁ గేరుకన్నులున్
బ్రాకటదేహకాంతియును
బంగరుబొమ్మకు హెచ్చువచ్చు నీ
చాకలివాని జవ్వనికి
సాటిగ రారిఁక బోటు లెవ్వరున్."

(సశేషము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# గంగమ్మ - అహింస

పిసుపాటి నారాయణశాస్త్రి గారు


వ్యాసకర్త

అఖిలేశుఁడైన శ్రీహరి దివ్యపా
దారవిందంబునం దుద్భవించినావు
హావభావాదుల నలరింపఁగాఁ జేసి
ముక్కంటితలమీఁది కెక్కినావు
స్నానపానముల ముజ్జగములఁ బోషింప
నంచితంబుగఁ బ్రవహించినావు
పావనద్వాదశజీవనదులలోన
నగ్రగణ్యప్రథ నందినావు
వారువీరన కిపుడెల్ల వారలకును-దర్శనంబిచ్చి రక్షించు తలఁపుతోడ
వింతవింతగ నూహూర వెలసినావు-కనికరపుఁబాలవెల్లి! గంగమ్మ తల్లి!

సీ. నడురేయి గడగడ వడఁకుచు మొలలోఁతు చన్నీట స్నానంబు సలుపునపుడు
ఊపిరాడకయుండ నొగి గుగ్గిలపుఁబొగ కనుల ముక్కుల నోటఁ గ్రమ్మునపుడు
నెండవేఁడికి వీఁపు మండిన నేమైన నోర్చి దుమ్మునఁ బడియుండునపుడు
ఫెళ్లుఫెళ్లునఁ బంపజోళ్లను ఢోళ్లఁ గొమ్ములు జమిలికలు రేఁగి మ్రోఁగునపుడు

గీ. భయము జెందక విసుకటపాటు లేక-బత్తివీడక నిస్పృహా పాలుగాక
స్త్రీలు సైతము నీసేవ సేయుచుండి-రౌర, నీదుప్రభావ మత్యద్భుతంబు.
గాదె! శ్రితకల్పవల్లి! గంగమ్మతల్లి!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. అంబ! జగంబునం బరగు నందఱు నీదగుబిడ్డలే కదా!
వెంబరవిత్తులై యొదవు వెక్కసపాటున నాలుబిడ్డలన్
డంబుగఁగూడి సౌఖ్యముపడన్ మహి గొఱ్ఱెలఁబెన్పొతేళ్ల నీ
కుం బలివెట్టు క్రూరులను గోపము సేయకయుంట ధర్మవే?

మా లి క ౧

ఉ. ఆయతభంగిఁ దాను దనయాత్మజులున్ దనభార్యయున్ సుఖో
పాయముగా మెలంగుటకుఁ బాతరలాడుచు మూఢచిత్తుఁడై,
న్యాయముదప్పి నోరెఱుఁగ నట్టియమాయిక జంతుసంతతిన్
గూ యిడఁ దెచ్చి నీయెదుట గొంతులుగోయఁ గరాసిధారచే,
మాయురె! యూరకొంటఘనమా? దయమాలిన దానవైతె? హిం
సాయుతులం బ్రసన్నమతి సాఁకఁ దలంచితె? యట్టులైనచో
నీ యశ మింకఁబై నిలువ నేర్చునె? మాంసముఁగోరు దేవతల్,
రోయక కొల్తురే బుధజనుల్? తనబిడ్డలఁ దిన్నతల్లి ము
న్నేయుగమందునైన నుదయింపఁగ వింటిమె? యెట్టిజంతువేన్,
హాయినిగాక యాపదల నందఁ దలంచునె? కన్నబిడ్డలం,
గోయఁగరాదె జంతువులఁ గోసెడిస్వార్థపరాయణుల్?
భవన్మాయ నెఱుంగ మాకుఁ దరమా? జగదంబరో! యిందునేమియున్
జేయక చూచుచుంటఁ బరిశీలనచేసినఁ దోఁచు “నీపశు,
ప్రాయులు ప్రాగ్భవాత్తపటుపాతకదూషితులౌట నీక్రియం
జేయఁదొడంగి” రంచు; సరి చేసినఁజేయుదు, రంతభ్రష్టులై
పోయెద రుగ్రనారకపు భూమి వసింపఁగ; వీరిసంగతిం
బాయుము, డాయ రానియకు; పావనమున్ మహిమాన్వితంబునౌ,
నీయులు నిస్సిరో, మెదడు నెత్తురు మాంసముతో నసహ్యముం
జేయఁగనేల? నావినుతిచేకొని హింసకుఁ జోటులేని యిం
కాయలు మున్నుగాఁ గలుగు కాన్కలఁ బ్రీతివహించి, భక్తులన్
శ్రీయుతులం జిరాయువులఁ జేయుము గంగమతల్లి! మ్రొక్కెదన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## మాలిక ౨

ప్రాణముకన్న మిన్నయగు వస్తువు ముజ్జగమందు నెందునుం
గానఁగరాదు జీవులకుఁ; గావునఁ దత్పరి రక్షణంబె సూ
దానములందు శ్రేష్ఠమగుదానము; దానిని సేయువాఁడె పో;
జ్ఞానియు నుత్తమోత్తముఁడు సార్థకజన్ముఁడు పుణ్యమూర్తి వి
ద్యానిధి సత్కృపానిధి; తల్లిరో! పావనభారతావనిన్
మానవుఁడై జనించి యభిమానము, జ్ఞానము నీటఁబుచ్చి, యా
త్మానుభవ ప్రమోదమున కావలనై, వెలియై ప్రతిష్ఠకున్,
దానెటు లట్టు బాపదల దైన్యము, మేలుననుబ్బు, గన్న సం
తానమునందుఁ బ్రేమయు, సదా మనియుండెడి కోర్కిగల్గి, యి
చ్ఛానుగతిం జరించు పశుసంతతి నెంతయుఁ బట్టితెచ్చి, ధా
రానిశితాసిపాతముల రాయిడి కోర్వక కూయివెట్టినన్
మానక, హింస సేయు దయమాలి యెవం డతఁడెంత పండితుం
డైనను నెట్టి ధర్మపరుఁడైనను గవ్వకుసాటిగాఁడు; పై
వాని మొగంబు గన్గొనినవారికిఁ బాపము రాకతీర; దా
సూనరు ఘోరపుంబనికిఁ జొప్పడ వెయ్యెడఁ దగ్గనిష్కృతుల్;
మానిని! నీవు తన్మతము మార్పఁగఁ జాలినదానవంచు నా
మానసమందుఁదోఁచెను; గుమారులయల్లరిమాన్పఁ దల్లిచే
నైనటు గాదె కేరికి; సమస్త జగజ్జననీ! భవాని! యీ
దీనుని ప్రార్థనంబు విని తెప్పున హంత్రుహృదబ్జవాసివై
మానఁగఁ జేయు మీపనికిమాలిన కార్య, మహింస కెల్లెడన్
స్థానమొసంగుచుం బరమశాంతిని వర్ధిలఁ జేయు మీపయిన్."



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## క్రొత్తపల్లి సూర్యారావుగారు

(వెనుకటి సంచిక తరువాయి)

### ఆఱవ యంకురము

మాయూర బడియున్నదిగాని చిన్నది. ఇరువది మంది పిల్లలకంటె నెక్కుడున్నఁజాలదు. బాలురు, బాలికలును గలసి యిరువదికి లోపుగానే యుండువారు. ఉన్నవారిలో సగము కోమటిబిడ్డలు. తక్కినవారికిఁ బొలముపాలే:- చదువక్కఱలేదు. బ్రాహ్మణులపిల్లలు కొందఱు; వారికేమిచదువు? అయిదుబడులు, గుణింతము. పేరులు నేర్పుటయే యాబడియొక్క పరమోద్దేశము. మొదటినుండియు నంతకంటెఁ జదువే లేదనియు, నంత వఱకువచ్చినఁ జాలుననియుఁ దలంచువారేకాని విద్య యిట్టిదని యెఱిఁగినవారే చాలమంది లేరు. అప్పుపత్రముల మీఁద సాక్షివ్రాళ్లు చేయుటకేకదా మనయూరిలోఁ జదు వనువారే కాని యప్పుపత్రము వ్రాయుట యెట్లని యెవ్వరుఁ దలంపరు. మొట్టమొదటనే గంటులుచెక్కి, యే మామిడిచెట్టుక్రిందనో కమ్మవారు, కాఁపులుఁ గొందఱు పెద్దమనుష్యు లెందుకొఱకనియో, "వానపాముల బుల్లెయ్యసాక్షివ్రాలు," అనునదియే కొన్నిమాసము లభ్యసించువారు. శ్రద్ధపట్టి యీరీతిగాఁ దమతమ పేరులు వ్రాయుట నేర్చికొని గ్రామములో నన్నివ్యవహారము లలోఁ దామే సంబంధము కలిగించుకొనుచుఁ దమ సాక్షివ్రాలు చదువును వినియోగించుమందురు. ఆగొడవ మన కేలగాని, వారు సమయమువచ్చినపుడు, తామే యొక్కరి కవసరపత్రము వ్రాసియీవలసివచ్చినపుడు, చేవ్రాలు చేయుటలో- సాక్షిపదమువిడిచి వ్రాలుచేయుట చేతఁగాక కష్టపడినవారిని నేనెఱుఁగుదును. "దుగ్గమర్తి యేడుగొండలు సాక్షివ్రాలు" అని తనపత్రముమీఁద వ్రాసి, చివరకు నేను సాక్షినేకాని-మఱియొక్కటిగాదని తప్పించుకొని సొమ్మెగవేసినవాని నెఱుఁగుదును. ఆప్రసంగము విడిచినైతము. మానాయన మాకక్షరాభ్యాసముతో పాటు, దానికిఁ గొంతముందో వెనుకోగాని, హితోపదేశము, నీతిశాస్త్రమను చిన్నపుస్తకమును వల్లెవేయించినాఁడు. మాయమ్మ చదువుట వ్రాయుట నేర్పినది. మాయింటి విద్యార్థులు మాచేత వరుసడిపెట్టి వ్రాయించువారు. ఒక్కసంగతి - మనలో నాదినుండియు వ్రాఁత శుభ్రముగా నుండుటకై శ్రమపడినట్లు బాలుర కభ్యాసము చేయించినట్లు దృష్టాంతములున్నను ఒక్కటికి, ముఖ్యముగా బ్రాహ్మణులలోఁ బలువురకుఁ గొక్కిరిబిక్కిరి యక్షరము లేకాని మంచివ్రాఁత చేతఁగాకపోవుట చిత్రము.

క. "యరలవమదనస" యనుమం
బరుపడి నీయక్షరములు భయనయతతులన్
నిరతమును వ్రాయ నేర్చిన
పరకరుణా వానివ్రాలు పట్టుపలమరున్.—అని, పై
యెనిమిది యక్షరములు గుండ్రఁదనమునఁ బ్రసిద్ధికెక్కిన

కాఁబోలును—వీనిని సరిగా వ్రాయుట నేర్చికొనిన మిగిలినయక్షరములు నాయభ్యాసము బలమునసే చక్కఁగా వ్రాయఁగలుగుదురని యేర్పఱిచినారు. తరువాతఁ దలకట్లొక్కరీతిగా వ్రాయ నలవాటుచేసికొనుటకై,

క. పరమదయాకర శుభకర
నరవరనుత గరుడగమన నగధరపరమా
మురహరభవహరమాధవ
ధరధరనుత ధవళనయన దశరథ తనయా!

అనునీపద్యమును మేలుబంతిపెట్టించి వ్రాయించువారు. ఈపరువడియే యొరవడియని పిలువఁబడుచున్నది.—అఱవపదమేమోయని యొక్కరుశంకించిరి.వరివడివు, అనునఱవపదమున్నదఁట. మేలుబంతిలో "మేల్" మీఁదనుండునదియఁట-అనుకొనవచ్చును. ధ్వనిరూపముగా నున్నదాని నక్షరరూపమునఁ జూపుట కఱవములో "వరివడు" వందురఁట. మనకీయక్షరలక్ష్యచర్చయేల-తలకట్లొప్పిదముగాఁ గుదిరినపిమ్మట,

క. గిరిదరిగి బిటగి నిలిచిరి
గిరికిటికింబిండిదినిరి...ఛీతి
ల్లిరిచింతిల్లిరి.........
.....,మినికిమినికితిట్టిరిఛీతిఙ.

ఇట్లు సర్వాక్షరములు గుడులతోనున్నవి వ్రాయించువారు. అనంతరము-"గురులును మునులును బుధులును" నిట్లుగా సైత్వములు నౌత్వములు, క్రారవడులు, నొక్కటియేమి-నేర్పువారు. ఇప్పుడుగాని యప్పుడుగాని యాపద్ధతిననుసరించి ఫలమనుభవించినవారు స్వల్పసంఖ్యాకులనియే తోఁచుచున్నది. మానాయనగారి శిష్యులు మాకుమాత్ర మీపద్ధతిమీఁదనే నేర్పిరి.

మాయమ్మ కవీశ్వరులయింటఁ బుట్టినదేకాని తిన్నఁగా నొక్కటియు రాదు. అన్నింటిలో నున్నదానవని మాకొక్కింత యొక్కింత డొక్కశుద్ధి చేయించినది. మేనమామపోలిక మాయొద్ద నొకించుకయు లేదు. కుమారిశతకము చదివించి యర్థముచెప్పినది. అదియే మాకుఁ బుట్టకేఁటుదెబ్బము. సీతాచరిత్రము, సావిత్రికథ, సత్యాద్రౌపదీసంవాదము, అనసూయారుంధతులు, మొదలుగాఁగల కథలలోని విషయములు నేర్పినది. మామయ్యతాతయో, మామయ్యతండ్రియో వ్రాసినది యొకతాటియాకులపుస్తకము; సుమారు మున్నూఱుపద్యములున్నవి; దానిలోఁ గూఁతులు నత్తవారింటికిఁ బంపునపుడు బహుగ్రంథములలోఁ జెప్పియున్నబోధలు నీతులు నేర్చివ్రాసినారు. అందుఁ గొన్నికొన్ని చదివినదానను. వల్లెవేసిన హితోపదేశములోని మిత్రలాభమున కర్థము మాయింటివిద్యార్థులు చెప్పిరి. మిత్రభేదము నేర్చికొనుటకు నాకవకాశము లేకపోయినది. ఆపదునాల్గేఁడులలో నాల్గుసంవత్సరములే నావిద్యాభ్యాస మనవచ్చును. నేర్చినది చాలును. ఇదియంతయు నాచరణలోనికిఁ దెచ్చుకొనినఁజాలదా! అదియే బ్రహ్మాండము. మనకేమిపని? వంట, పెట్టు, అతిథియభ్యాగతి తర్పణము, బీద సాధు, బంధువు, స్నేహితుఁడు, సేవకులు, సంతానము, వీరివిషయమై సరిగాఁ దెలిసికొని నడవడికలు మఱవక నడచుచున్న నంతకంటె నేమికావలయును? తక్కిన రాజు, మంత్రి, తగవు, తీర్పులు, న్యాయస్థానములు, రచ్చలు రవ్వలు మనకేల? చదివినదానికర్థము రాకున్న వ్యర్థము. ఆసీత, సావిత్రి, ద్రౌపది, దమయంతి- వీరుపడినపాటులు, భర్తలతో నడవులుదిరుగుట, వారియందలినాథులప్రేమ, యిదినేర్చిన నేయి నీతిశాస్త్రములపెట్టు. మేముచదువుకొన్నంతలోనే లచ్చి యొక్కనాఁడు మాయమ్మతో కొంగనుబడఁగొట్టిన బ్రాహ్మణుఁడు, ఆయిల్లాలియొద్ద నోరుమెదుపలేక పోయినాఁడేమియని ప్రశ్నించి యందఱను నవ్వించినది. "అమ్మా, తపశ్శాలికి, బ్రాహ్మణునకుఁ గోపముండరాదు. కోపమెవ్వరికినిగూడదు. అందులోఁ దపస్సుచేసి యాటితేటినవానికి, బ్రాహ్మణునకుఁ గోపమున్న వానితపస్సెందుకు? ఆయిల్లాలికిఁ బతిభక్తియే పెద్దతపస్సువంటిది. అట్టిపతిభక్తియున్నందు కాబ్రాహ్మణునికివలెఁ గోపమేయున్నయెడల వారిద్దఱకు భేదమేమి? చెప్పవచ్చినదే మనఁగాఁ బతివ్రతకుఁ బ్రపంచములోని యందఱును లొక్కయన్నమాట. చూచితివిగదా - ఆకాలముగాదులే యిది, సూర్యుఁ డుదయింపకుండఁజేసినదఁట- దివారాత్రములెఱింగించు సత్యాధారుఁడైన సూర్యునే భయపెట్టినదనిన-ఏమన్నమాట! మనసంతయు నూకొట్టుకాలమేకాని క్రియనడుమను. వారట్లుచేసిరి, వీరిట్లుచేసిరనిన నోహో


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యనుటయేకాని మనచేత నేమియుఁగాదు. మనమతము లోని వారేకాదు, 'సకలమతములలోనివారు నిట్లేయు న్నారు. ఈకాలమే వట్టిదుర్బలకాలము. పెద్దలుచెప్పు మాటలువిని నడువవలసినదేకాని–యట్టిమహత్త్వము మన యొద్దఁ జచ్చిపోయినది." అనిలచ్చుప్రశ్నకుగా నొక్క–యుపన్యాసమొనర్చినది. ఇట్లే యేదో నెత్తిప్రశ్నకు మా యమ్మపెద్దగాథ చెప్పుచుండునది. అవి యిపుడెందు కనుకొంటిమిగదా!

సాధారణముగా నర్థము తెలియని పెద్దపెద్దమాటలు మేముపయోగించువారముగాము. ఉచ్చరించినమాటలకర్థము తెలిసికొనువారము. ఒక్క–నాఁడంతర్వేదినుండి సప్తసాగరయాత్రచేసి మరలివచ్చు నెవ్వరోకొందఱు కుంకుమము పొట్లముకట్టితెచ్చి మాయమ్మకిచ్చిరి. పొట్లము విప్పి బరిణెలోఁబోసికొని కాగితముపాఱవైచినది. తీసిదానిలో నేమున్నదోయని దానిని జదువ మొదలుపెట్టితిని.

"క. తెంపొరరిడిపిటికలకట
రింపొందఁగఁబొందుటలరి హీనగతిన్నే
సొంపున మఱిమీపుణ్యము–"

నాచదువు మానాయన విన్నారు. "అమ్మా! పాఱవేయవే– అదేమిచదువు? నీకు వేఱొకపుస్తకము దొరకలేదా! ఏమంత మంచిపద్యమని పట్టుకొని విడువకున్నదానవు." అనియర్థమునకై రెండుమూఁడు మాఱులు చదువఁగా విని కోపించిరి. ఆనాఁడుమొదలు రెండవకాగితము పట్టుకొనుట మానివైచితిని. సాధారణసంసారికి జన్మమునకంతకును మూఁడువందలమాటలు చాలునఁట. ఒక్క–రియొద్దఁ గొలువుగుదిరి వ్యవహరించువాని కైదువందలపదములు తెలిసిన సరిసెత్తుకొని పోవఁగలఁడఁట. కొంచెము మాటకారి, పుణ్యపాపములు, కథలు, కారుణ్యములు చెప్పువాఁడైన వేయిపదము లుండవలయునఁట. కవులకు వేల కొలఁదిపదములు కావలయునందురు. అంతఱుసంగతి నాకేమిగాని, నాకేడెనిమిది వందలపదములు తెలిసియుండునని ధైర్యము.

అక్షరజ్ఞానము, పదార్థజ్ఞానము దొడ్డవి. ఒక్క–మాట కర్థమువింటిమా రెండవమాటకు దానిసాహాయ్యమున నర్థముచేయుటకు మొదలిడుదుము. పెండ్లికివచ్చిన వారిలోఁ గొందఱు "పాపము, వారివారి తల్లిదండ్రు లిట్టిమహోత్సవములు తమకన్నులతోఁ జూచి యానందింపవలసినవి. ఇంతకుఁ బసివాండ్రయదృష్ట మిట్లున్నది." యనువారు. పూర్వాపరసందర్భములు తెలియక, లచ్చు, గౌరును జిక్కు–పడువారు. వచ్చినవారిలోఁ బలువురు వీరికింకను దమతల్లిదండ్రులు లేరను నూహయున్నదో లేదో, యని యెఱిఁగి, మాటలాడవలసినపనియేమి, ఏబల్లిపాడు ప్రసంగమోచేయువారు. మావాండ్రుకనుసన్నలతో వారించువారు. ఎన్నినాళ్లు దాగినను గన్యావరులకు యమున, వారి మునిమనుమరాలు, వీరిమనుమరాలు; కోడి కూఁతురునని వర్గత్రయము నుగ్గడించు సందర్భములో లచ్చుకను పెట్టినది. "ఏమే, గౌరీ, నీకొకలాగున, నాకొకలాగునఁ జదివినారే మే, నాన్నపేరు రాలేదేమే" యని యొక్క–మాట నెంబడిని నుడివినది. అక్క–డనుండి వారికి బూర్వాపరసందర్భవిచారమున కవకాశము కలిగినది. ఎవ్వరిమాటలలోనో కొంతకొంత బోధపడినది. ఇరువురు నొరులకుఁ దెలియరాకుండఁ గొన్నిదినములు తమలోఁ దామే "అసునే, నాన్నపోలికమనయక్క–య్యలోనున్నదే; నీపోలికి నాలోఁగాని, యక్క–య్యలోఁగాని లేదే; ముగ్గురము మూఁడుతెన్నుల వారముగా నున్నారము. నాన్న పిఠాపురము వెళ్లివచ్చుచుండుట యెందుకో, బల్లిపాడు బల్లిపాడని యెవ్వరో కాఁపులువచ్చుచుండుట యేపనికో, మన మాలోచింపవలయు" నని–"పటము తెచ్చి చూపించిననాఁ డమ్మయేడ్చిన" దని "నాతో నెవ్వరో చచ్చిపోయినారని చెప్పినది. దీనిరహస్యము మనము బాగుగాఁ దెలిసికొనవలయు" నని, ఎవ్వరికిఁ జెప్పవలదనియు నిరువురు గూఢముగా నాలోచింపసాఁగిరి. ముఖ్యముగా పెండ్లిలో వియ్యపురాండ్ర మర్యాదలలో నమ్మలక్క–ల మాటల సారముందీసిరి. ఎన్నినాళ్లు దాఁగును? అప్పటికి తెలువచ్చినవి. ఆనవాయి లేదని తప్పించివేయుఁడని మా యమ్మ మొదట సరిదిచెప్పినది; కాని, యేలయట్లు చెప్పవలయును? వియ్యమువారికిఁదెచ్చిన చీరలు, జామారులు నీసమయములోనే యిచ్చివేయవచ్చును. కానిమ్మని మా నాన్నగారు సాహసించినారు, కాని పాలుపళ్లెములోఁ బోసి తెచ్చినారు; పీటలమీఁదఁ గూర్చున్నారు. "అష్టశ్లాఘవేత్క–న్యాపుత్రవత్పాలితామయా" అనిచెప్పి, తల్లి, మాతండ్రిగారు గోడనుజేరఁబడి యావఱచినట్లుఱచినారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ్రుడ్లనీరుగ్రుక్కుకొనుచున్న మాయమ్మయందుకొన్నది. సందుకొరకె-అపుడువారినోదార్చుటలో, పెండ్లికొమార్లిద్దఱను విషయమెఱిఁగినవారుకాన గురువుగారేడ్చిరని-"అయోగ్యానుమయత్తమామలేయుండినయింకెంతవిశేషముగా నుండియుండునోకదా"యనియేడువసాగిరి. పెండ్లికూఁతుండ్రేడ్చిరి.అంతటనింకనెవ్వరాఁగుదురు? గోడలేడ్చినవి; రోళ్లురోకళ్లు నేడ్చినవి. "అపిగ్రావారోదిత్యపి దళతివజ్రస్యహృదయ" మన్నారుగద!

పెండ్లివారును, "వచ్చినవారువచ్చినారు, మిమ్మే మీంద్రు తల్లిదండ్రులనుకొన్నారు. ఆతల్లిదండ్రులనెఱుఁగనేయెఱుఁగరు. వారినిమఱపించి మీరుపెంచితిరి. పెండ్లిండ్లుచేసి యొక్కొక్కరియిండ్లు మరలనేర్పఱిచి నిల్పితిరి. మీరునిలిచి యింతపనిచేయకున్న నాకెందుకుటుంబములు నేమికావలసినవి! భిన్నాభిన్నమై యెవరికిదొరకనదివారుసంగ్రహింపుకొనిపేరులేకుండఁ జేసియుందురు. ప్రతిచోటను గలదియే, శుభములో నీదుఃఖము;అందునను దుఃఖమునుకొన్నఁ గడుపుతెగఁగోసికొనిపోవు నిట్టివార్తను మీరెట్లెన్నిదినములు లోలోననణఁచియుంచియుండిరో యాశ్చర్యము! ఊరకుండుఁడు; తెలిసియుఁ దెలియనితనము, అజ్ఞానపుబిడ్డలు- చెంగవెట్టుకొందురు" అనికొందఱు- "అమ్మలరామయ్య అన్నా! నీకేమిఛాందసము ; మగవాఁడవు, లేలే: ప్రొద్దులేదు, చాలపనియున్నది. విడిదలలో గృహప్రవేశములు కావలయును. ఆలస్యమగు"నని కొందఱుబోధించిరి. విడిదలపోవుచున్న వధూవరులుఁగూడ నున్నవారు నేడ్చుచునేయున్నారు. క్రమక్రమముగా దుఃఖాశ్రువులు ఆనందాశ్రువులుగా మాఱినవి.

గృహప్రవేశములకు లచ్చిలో మాతల్లిదండ్రులు వెళ్లిరి. గౌరిలో మేమిరువురమునువెళ్లితిమి. ఊరులదూరభారమునుబట్టి మరలవచ్చి మేమందఱము నొకటిరెండుదినముల వ్యవధానములోఁ జేరుకొంటిమి. గౌరి యొక్కనాఁటిరాత్రి యత్తవారియింటనుండఁగానే నాప్రక్కలోఁ బండుకొని "అక్కయ్యా! నేనెవ్వరితోను జెప్పనుగాని, మఱియేడువనుగాని, మాపెండ్లిలో మీరందఱు నంతగా నేడ్చినారుగదా- కొంతకొంత యూహించుకొంటిమిగాని పూర్ణముగాఁ దెలిసికొనకున్న మనస్సులో శాంతి ముదురుకొనదు- జరిగినవృత్తాంతము వినవలయునని యున్నది; చెప్పు"మని కౌఁగిలించుకొన్నది. ఎఱిఁగినంత యెఱుఁగును; ఎఱుఁగనితావుల దానిమాటలకు సంబంధముగలిపి చెప్పవలసివచ్చినది. తప్పినదిగాదు. అప్పుడనుకొంటిని."ఎంతతెలివిగలది యిది! వారు వారనుకొను నాఁటినాఁటిమాటలన్నియుఁ బదముల వరుసలోనికిఁ దెచ్చినది. నడుమనడుమ నన్వయము కుదురనిమాటలు దిగవిడువఁబడినచోటుల నామాటలుచేర్చి యన్వయించుకొన్నది!"అని యత్యాశ్చర్యమును బొందితిని. లచ్చి, యేనాళ్లు పంచిపెట్టుటకని మాయమ్మ మొదలగువారూరిలోనికిఁ బోయియున్న సమయమునఁ, జనవుగలది కావున నొంటిపాటున లక్ష్మీనారాయణనే యడిగి తెలిసికొన్నదట. దానికి దీనికిఁ గలయంతరమిట్టిది! బుద్ధిలో నొక్కరీతివారే వీరిద్దఱును."వీరినే పూర్ణముగాఁ జదువులో విడిచిపెట్టితిమా, స్త్రీలలో జంటకవులు లేరను లోపమును బోఁగొట్టుదురుగదా"యనుకొంటిని.

ఇట్టి స్వచారిత్రమువినిన పిన్నవాండ్రేమిచేసిరో యెఱుఁగుదురా!"వీరు మనతల్లిదండ్రులుగారు; వీరియింట మన పేల? వీరితోఁ బనియేమి?" యను నూహకురాలేదు. "ఆహా! అపుడు వీరువెళ్లి యాదుకొనకున్న మనగతి యేమయియుండునో! ఆయవస్థలో మనకు మూఁడునాల్గేండ్లప్రాయమే యగుటచేఁ గన్నులయెదుట జరగిన దానిని మఱచితిమి. వీరే మనతల్లిదండ్రులు. మఱియొకరి చేతులలోఁబడిన మనమెట్టికష్టముల పాలయియుందుమో! మన మిగిలినయిల్లువాకిలి యెట్టియవస్థకు వచ్చియుండునో!"అని మునుపటికంటె మాయందు నెక్కుడు విశ్వాసము కుదిరినది. దినదినాభివృద్ధిగా వినయము ముదిరినది. "మనసొమ్ము తృణమైనను ముట్టుకొనలేదు. మనపోషణకై మనమనధనములోనుండి వ్యయము చేయలేదు. ఎవ్వరిలెక్కవారికిఁ బెండ్లిలో నలుపురయెదుటఁ జదివి వినిపించినారు." అని నాయనగారిపై దేవునియందువలె భక్తి, గంధముపూసినట్లు, కవచము తొడిగికొనినట్లు, ఆయనశరీరమును గౌఁగిలించుకొనుచు విడువకుండువారు. ఒక్కపనిచేయనీయరు. "అమ్మా! మేమువంటచేయఁగల" మందురు. "మీరింకను వంటచేయఁగూడదు. పనులు బాగుగా నేర్చికొనుటకును, పనిచేసిన నొడలువంగును; కొందఱనుకొనినట్లు శరీరమార్దవమునకు హానిరాదు. వంచినఁ,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బిందెవిసరిన, నీళ్లుతోడిన, నాఁడువారికి శరీరవ్యాయామము. మనమెక్కడకును వెళ్లిపాటుపడుటకు మగవారముకాము. మనకింట నిదియే కసరత్తు. పాటుపడి యింటికి వచ్చినమగవారి కోపిక లేనినాగమ్మ లేమి యుపచారము, పతిశుశ్రూషలు చేయఁగలరు? "సుకుమారము సుకుమారమని కూర్చుండినచోటినుండి లేవలేక, తెగబలిసి, తెగపెంచి- అదిపనిగాదు. వంటచేసిన నలసి, పిల్లకుఁ బాలిచ్చిన డక్కి, ఏమి—తినిన తిండి యేమగును! ఏమనుచున్నది? మాటకొల్లఁ జేతిలోఁ బనివాండ్రున్నారని చేతిలోని చెంబుక్రిందఁ బెట్టుటకు వెంకిని బిలిచిన, నా మొగము, అది యెందుకుఁ బనికివచ్చును? నీళ్లుచేఁదినఁ జేతులకు బలము. నిలువున నరములు సరుదుకొనును. దంచినఁ జేతులకే కాదు ఒంటిలోనికిఁ గాలితోఁగూడఁ బ్రోయుచున్నందునఁ గాళ్లకుఁగూడ బలము. కూర్చుండి తిరుగలివిసరుట, కొంచె మెత్తుపీట మీఁదఁ గూర్చుండి రుబ్బుట, వంగియిల్లలుకుట, బట్టలు దుకుట, ప్రాతఃకాలమున స్నానముచేయుట, కొంతసేపు తడిగుడ్డతోనే యుండుట, పసుపురాచికొని నలుఁగిడుకొనుట, నూనెపూసికొని నలుఁచుకొనుట, కొప్పులకుఁ గాటుక పెట్టుకొనుట- ఇట్టివి శరీరపరిశ్రమలు, లేక దోహదవిశేషములగును. కాటుక, నూనె, పసపు వీనిని వాడుచుండినఁ బ్రొయ్యియొద్దనున్న వేఁడి శరీరమున కెక్కుడనిపింపదు. భోజనమునప్పుడు, వంటయప్పుడు బట్టకట్టులోని భేదమునఁ గొంత విశ్రాంతియున్నది. రాత్రులు వడ్డించుటలోఁ, బగలువడ్డించుటలో భేదములు గలవు. ఏవస్తువును గాని యొకరికిచ్చునప్పుడు డొంటిచేతిలో నీయరాదు. రెండవచేయి సాయము చేసికొనవలయును. పాత్రసంశోధనమున వంటయందుకంటె నేర్పుగలిగి యుండవలయును. ఒక్కరు మంచినీరు డిగిన బిందెలో ముంచితెచ్చినవియే కదాయని చూడకుండ నీయరాదు. సన్నమాతులుగల కూజాలు, బిందెలు వాడుకొనరాదు. మఱి యాచారము, శుచి, మైల, మడి, యంటుసొంటు, ఎంగిలి [illegible] గలలోను మఱవరాదు. ఆఱవైచిన బట్టలతీసి, [illegible] పెట్టునప్పుడే చూచి, దులిపి మడిచియుఁ జేయవలయును. దానివలన పురుగులు, తుక్కుమాళి, చిరుగులు తెలియును. కట్టుకొనునప్పుడు మరల దులిపి కట్టుకొనవలయును. ఆఁడుది మగవారియెదుట వెల్లప్పుడు నిలువరాదు. ఏపనియు నొక్కరుమాచుచుండఁగాఁ జేయరాదు. వంటచేయునప్పుడు మగవారుజొత్తిగాఁ [illegible] రాదు- దానికనియే యడ్డగోడలుపుట్టినవి. తుమ్ముట, దగ్గుట యుమ్మివేయుట, నీరుత్రాగుట, భోజనముచేయుట- యివి యతిరహస్యముగాఁ జేయవలయును. పాడి, పాలు, పెరుగు మాడలు, చిట్టు, తొట్టు- నేర్చుకొనవలయును. పాలుకాచుటలోఁ, జేమిరి పెట్టుటలోఁ, బెరుఁగు చిలుకుటలోఁ, [illegible] తెలిసికొని వెన్నదీయుటలో, నేయికాచుటలో నేర్పు [illegible] లయో కావలయును. మగవాండ్రు పాలుపిడికియిచ్చి[illegible] ఆఁడుది యాపాలను జేయవలసినట్లుచేయదేని యేమి ప్రయోజనము? పండించి నవధాన్యములతో నిల్లునిండించెదరు. ఏవియెట్లు దాఁపవలయునో యెఱుఁగనియాఁడుది యున్న మగవారిపాటుపడుటల మేమి? యింటనున్న వస్తువులకు గతియేమి? అన్నింటికి నింటికిల్లాలుగతి, ఇల్లలుకుట, ముగ్గులు పెట్టుట, గోడలు మేఁగుట, పూసి వెల్లవేయుట, యివి యింటి[illegible] క్షేమకొనుటకేకాదు శరీరమును, దానియారోగ్యము రక్షించుటకునంటిది. ఏవస్తువెక్కడనున్నదో చీకటిలోనైనఁ జెయిపెట్టినచోటఁ గనఁబడునట్లు తీసినచోటనే దానిని మరల బనితీరిన వెంబడినే పెట్టుట[illegible] జెరాకుపుట్టును. ఇట్టివెన్నియో నేర్చికొని పెద్దవారు [illegible] పిమ్మటగాని, మీరిప్పుడేమి వంటచేయుదురే పసివారు! [illegible] మాయమ్మబోధించును. "మనకిన్ని విసములం చెప్పవారెవ్వరున్నారు? మనయదృష్టవశమున నీమెదొరకె[illegible] వారిద్దరు నానందించువారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

వుం దమఁదమరందారవిందబృంద-మందు దినములు గడపితి వయ్యో! తుదకు
కుటజకుసుమమ్ముపై వ్రాలఁ గోరెద వళి! యే మనుభవింత మని దానిపై మరలెదు?

తే. నలుపుగా నుండుటం జేసి బలుపు చూచి-దూరముననుండి యే న్గాంచుఁ దోఁచె నవుర!
దగ్గఱకుఁ బోయి చూడ యథార్థ మయ్యె-నెన్న నేమిటి ఎ వట్టి దున్న సుమ్ము.

తే. కాకమాంస మ్మదేఁ శునకమ్ము ముట్టెఁ-గొంచె మదియును తుదకుఁ జేకూఱదాయె;
కర్మ-శుం డయి విధి యుండఁ గోర్కె-చెట్టు-కటకటా! యేమి చేసిన నెటు ఫలించు?

క. ఫలములయు దళమ్ములయును-విలాసమును తెలియఁదగు వివేకులు నీకుం
గల రైన నీమరందపు-విలాస మొక తేఁటియే వివేచించుఁ జుమీ!

క. మోదుగుపూ వనుభ్రాంతిని-మోదముమెయిఁ దేఁటి చిలుకముక్కునఁ జిక్కెఁ
గాదిలినేరెడుపం డని-యాదృతిమెయి దానిఁ బట్ట నదియుఁ దలంచెన్.

తే. గొరి వై యొప్పచంపకకలిక విడిచి-భృంగమా! నీవు పయిపయిరంగు చూచి
శాల్మలీపుష్పమున వ్రాలఁ దాల్మి నడఁచి-చీ! అఱచుచుందు నీ కింత సిగ్గు లేదె?

తే. ఎంత వాసన యుండిన నేమి వేగ-మొగిలిపూవునకుఁ దూరముగఁ దొలంగు
నీకు మధులవలాభమ్ము లేకపోఁగ-మొగమునిండను దానిదుమ్ము పడుఁ జుమ్ము.

గీ. వేలుపరిమళముల మఱపించుకల్ప-వృక్షసుమరాజుపై విహరించు నీకు
అడవిపూవుపయిని వ్రాల నాసవొడమె-నకట! తుమ్మెద, నీకర్మ వికృతిఁగంటి!

ఉ. పుట్టినదాదిగా నమరభూరుహపుష్పములందు నిష్టమై
నట్టులుగా నిరంతరవిహారము సల్పెదు తేఁటవేడ్కమై
నెట్టిన కొండపూవుపయినిం బడి యుండెదు దానితేనె నీ
కెట్టులు లభ్య మౌను మది నించుక యేనిఁ దలంప వయ్యయో!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# రంగరాజు

దశిక సూర్యప్రకాశరావుగారు

౧

నా ముఖమండలము వాడియున్న దన్న నాభార్య సహింపలేదు. ఎప్పటివలె మధ్యాహ్నము మూడుగంటలకు నేను రుక్మిణీభవనమున విశ్రమించియుంటిని. రుక్మిణి (నాభార్య) కాళ్లగజ్జియలు మ్రోయించుచు, చేత నొకతాళ వృంతమును బట్టికొని, తన వెనుక నొక పరిచారిక ఉపహారపుపళ్లెరము నొకచేత నుంచుకొని వేఱొకట వెండిచెంబుల నుదకముగొనిరా, నేనున్నచోటికి కలకల లాడుచువచ్చినది. నేను పర్యంకముపై మేల్కానియే పరుండి యుంటిని. కాని నావదనమండలము కృశించియున్నది. కళావిహీనమగు నాముఖమును రుక్మిణిచూచి సహింపలేదని తెచ్చికోలు వికాసముతో నుంటిని. రుక్మిణి నానిజస్థితి కనిపెట్టినది. తన మోము వాల్చినది. ఉపహారము నక్కడ బెట్టించి పరిచారికను వెడలిపో నమనుజ్ఞ యిచ్చినది. పరిచారిక వెడలిపోయినది. రుక్మిణి నలరింపవలెనని, "రుక్మిణీ! నేను మిక్కిలి ఆకలి గొనియున్నాను. ఏవీ విందులు!" అంటిని. రుక్మిణి నవ్వినది. ఇందులకే కాబోలు నాముఖము వాడిపోయియున్నదని తలచినది. కాని దుర్మార్గము లగు తీవ్రాలోచనలచే నాముఖము కందిన దన్న సంగతి దానికి తెలియదు. వట్టివెఱ్ఱిది. ఎట్లయినను నేను సంతోషముగానుండుటయే దానికి కావలసినది. దానిమనస్సు సందేహపూరితమయినది కాదు: లోపల నొకవేషము, పై నొకవేషము ధరించుచున్నానని దానికి తెలియదు. అది సరళమార్గమున సత్యమార్గము త్రొక్కుచున్నది: నేను కపటమార్గమున




"రుక్మిణీ!.........ఏవీ విందులు!"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మోసపుబాటను నడచుచున్నాను. నాకంటె రుక్మిణి సత్యసంధురాలని చెప్పక తప్పదు.

విందులు కుడుచుచుంటిని. రుక్మిణి నవ్వుచున్నది. లేని నగవు తెచ్చికొని నేను చిఱునవ్వు నవ్వితిని. కలకలమని నవ్వుచునవ్వుచు, సిగ్గుపడి చటుక్కున నోటిలో చీర చెఱగును గ్రుక్కుకొని నవ్వు నాపుకొన్నది. పురుషుల యెదుట అంతచేటు నవ్వకూడదని దానికి స్మృతివచ్చినది. ఏమో సరసము లాడినది. వంటక మెట్లున్నదని నన్ను ప్రశ్నించినది. "ఎట్లున్నది; ఎట్లున్నది చెప్పరూ!" అని మారాము చేసినది. అన్యాలోచనలో సంపూర్ణముగ మునిగియుండుటచే రుచిభేదముగాని, పాకభేదముగాని నాకు తెలియుటలేదు. మామూలు వంటకములే కదా యని "చాలా బాగా ఉన్నవి" అంటిని. మావంటలక్క చాలా నేర్పరి యని నాకు తెలియును. ఆమె చేసిన వంటకములు దివ్యములని నాకు తెలియును అందుచే నెప్పటివలె రుచికరములుగా నున్నవని యంటిని. రుక్మిణి కడుపు చెక్కలగునట్లు నవ్వ నారంభించినది. ఉచ్ఛ్వాసనిశ్శ్వాసములు కూడ ఆడుటలేదు. ఈ విపరీతమే మంటిని.

రుక్మిణి నవ్వు ఆపుకొనుచు, "తమకొఱకు నేనే ఉపహారములను తయారుచేసితి" నన్నది. అప్పుడు మరల పాకములను రుచి చూచితిని. మధుపదార్థములలో లవణము చేర్చినది. కారపువస్తువులన్నియు లవణసముద్రములే! పాయసాన్నము లవణమయమే; క్షీరములు లవణములే. ఉదకములవణోదకమే. నేనునునవ్వితిని.

వెంటవెంటనే నూతనోపహారపుపళ్లెముల తెప్పించి నాయెదుటఁ బెట్టినది. "రుక్మిణీ! లవణసముద్రమును మోసికొనివచ్చితివేలనే?" యంటిని. "తమకొఱకు పళ్లెరములన్నియు సిద్ధము చేసియుంచగా నాచేతిలోని ఉప్పుబుట్ట ఆకస్మికముగా జాఱిపడుటచే ఆవంటకములన్నియు లవణమయము లయిపోయినవి. అది నేనుచేసిన వంట." అన్నది. నేను నవ్వితిని. నాపరధ్యానమును గుర్తించునేమోయని భయపడితిని. కాని రుక్మిణి సత్యకాలమునాటిది. పురుషులకు రుచిభేదములు తెలియవని, స్త్రీలే పాకమందు, తత్పరీక్షయందు నెఱజాణలని దాని నమ్మకము. ఎట్లయిన నేమి, నా రహస్యపుటాలోచనలు రుక్మిణి సరళాంతఃకరణమునకు గోచరింపలేదు. నన్ను గురించి రుక్మిణి కేమాత్రము సందేహమును లేదు. దానిని చూచినప్పుడు, దానిచెంతనున్నపుడు నాహృదయతరంగములు పవిత్రభాగీరథీజలతరంగములవలె సంతోషమున చిఱుగంతులిడుచుండును. ఎందువలన? రుక్మిణి సరళస్వభావవీచికలే నా హృదయ తరంగములనోలలాడించునవి. నా రుక్మిణినిచూచిన తత్క్షణము నా పాపపుటాలోచనలు పలాయనమగు చుండెడివి. నాదుర్మార్గచింతనలు దూరీకృతము లగుచుండెడివి. రుక్మిణి ఋజుమార్గతేజఃపుంజమే నా దురాలోచనా ధూమముల నెగురగొట్టి, నన్ను నిష్కల్మషునిగా, నిర్మలచిత్తునిగా, తేజస్వినిగా, ఆనందసముద్రునిగా నొనర్చుచుండెడిది. రుక్మిణి నాపాలిటికి తేజస్స్వరూపిణి. దాని ఋజుమార్గపరాయణతకు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సత్యసంధతకు, నిర్మలచిత్తమునకును, నాదుస్వభావమునకు పోలిక వేసికొని సిగ్గుపడుచుండెడు వాడను. కాని నాస్వభావమందు మార్పుగలుగ గలదా? దుర్ఘటము, దుర్ఘటము. రుక్మిణి విసనకర్రతో నన్నుకొట్టి, "రాత్రి నా చేతివంట ఆరగింతురుగానిచూడు"డని పక్కున నవ్వి, కొంత సేపు అతివినయమున తాళవృంత ముతో విసరి, పాయసమును త్రాగుటకు చేతి కందిచ్చి, మరల వచ్చెదనని వెడలిపోయెను.

రుక్మిణి నాచెంత నున్నంతవరకును నాకు నిర్మలభావవీచికలే ప్రసరించుచుండును. అది కాలు బయటపెట్టగానే నాదుష్టభావములు మానస సింహాసనము నధిష్ఠించును.

రుక్మిణి మరలవచ్చినది. కలకల నవ్వినది. ఆముఖమున స్వర్ణతేజస్సు మూర్తీభవించి నట్లు నాకుతోచినది. పెద్దగానవ్వుచు, "అన్నగారికుమారు నింకొకసారి యెత్తుకొందురుగాని లెండు." అన్నది. మరల నవ్వినది.

నాబడలు కంపించినది. కాని పైకి ఏమాత్రమును నేను చలింపనల్లేయుంటిని. నోటి మాట "సంతోషమే"యంటిని. "నేను అక్కయ్యచేత పువ్వులుపెట్టి జడ వేయించుకోవలెను." అని చంటిపిల్లవలె గారాబపు పలుకుల నుచ్చరించినది. పోయిరావలసినదని సంజ్ఞ చేసితిని. రుక్మిణి వెడలిపోయినది. నేనును దానివెనుక రుక్మిణీ భవనము విడిచిపోతిని.

౨

నాప్రత్యేక మందిరమునకు బోతిని. నేను రుక్మిణివలె సరళభావము,ఋజుమార్గము అనుష్ఠింపగలనేమో యని యోచించితిని. అలభ్యము అలభ్యమనియు, అనవసరమనియు తోచినది. స్త్రీకిమాత్రమే సరళమార్గము తగునుగాని పురుషుల కెంతమాత్రము తగదనియు, అందులో క్షత్రియులగు నావంటి వారి కనుచితమనియు, పైగా రాజ్యకాంక్ష గలిగినవారికి బొత్తిగా తగదనియు నిర్ణయించితిని. రాజ్యస్థాపనకొఱకే కాదు: పురుషులు చేయు ప్రతిప్రయత్నము కొఱకును, అనేక మార్గములు త్రొక్కవలసియుండును. కార్యసాఫల్యముకొఱకు సాధనోపాయము లనేకములు వెదకవలసియున్నవి. కార్యసఫలత నొనరించుకొను బాధ్యత పురుషులదిగాన వారి కొక్క మార్గముచాలదు. ఆకారణమున వారికి సరళమార్గము అననుకూలము. పురుషులు పెక్కుదారులు త్రొక్కకతప్పదు. అది స్వభావము. అందులో క్షత్రియధర్మము, దానిలో రాజనీతి మహోదారము లయినవి. మార్గము లసంఖ్యాకములు. సరళమార్గము రుక్మిణికే కాని నాకు తగదనియు, నేను త్రొక్కు మార్గములు వీరపురుషోచిత లక్షణములనియు నిశ్చయించితిని.

నా సోదరు డగు రామరాజు రాజ్యపాలన చేయుచుండెను. మే మిరువురమే సోదరులము, నేను చక్రవర్తి సోదరుడ నన్న బిరుదుతప్ప అన్యమయిన అధికార గౌరవప్రసక్తులేమియు నాకులేవు. రాజలాంఛనములు, మర్యాదలు, గౌరవములు, అధికారములు సమస్తమును రామరాజునే యాశ్రయించియున్నవి. ఆయన భార్య శాంతాదేవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ్యములో రామరాజునకు పలుకుబడి తక్కువ. తల్లిగర్భమున అతడు జ్యేష్ఠుడై జన్మించిన సదుపాయమొకటి తక్క బాహు బలమునందేమి, రాజ్యము విస్తరించుటయందేమి, పరిపాలనమునందేమి, దక్షుడుకాడు. రామరాజుకంటె రంగరాజు సర్వవిధముల సమర్థుడగు చక్రవర్తి కాగలడని నేనానోట నానోట కర్ణాకర్ణిగా వినుచుంటిని. దేశ పుసరిహద్దుల శత్రురాజుల దండయాత్రల నరికట్టుటకు రామరాజునకు సమర్థతలేనిమాట తథ్యము. దేశములో అల్లరిమూకల పెను కల్లోలము లడంచుట కంతకంటె శక్తిలేని మాట నిశ్చయము. ప్రజలు కాతనియందు విశ్వాసము లేదన్నమాట నిజము.

కాని ఈరంగరాజు (నేను) ఏమిచేయగలడు. నిత్యము గోపరాజు (నా మిత్రుడు) నాచెవివద్ద ఇల్లుకట్టుకొని వాపోవుచున్నాడు దేశకార్యములను జక్కపఱుపవలెనని. అట్లే నిశ్చయించితిని.

సరే, నా అన్నగారికి సర్వవిధముల తోడ్పడగలను. అల్లరిమూకల నణచివేయగలను. శత్రురాజుల పీచ మణంపగలను. దేశహితకార్యము లనేకములు ప్రవేశపెట్టగలను. నాకు చక్రవర్తిత్వము అవసరములేకయే అట్టి పనులు చేయగలను కాని నాకంతరాయము లనేకములు. ప్రధానమంత్రియగు లక్ష్మణుడు అట్లుకాదని, ఇట్లుచేయుమని నా కతడు పనులు నిర్ణయించుట, రామరాజు తలయూపుట నేను సహింపరాని విషయములు. అందుచే రాజ్య పాలనాసౌష్ఠవమున కావంతయేనియు నేను సాయపడు నవకాశము తప్పిపోయినది. రామరాజునకు నామాటయన్న తృణభావము. లక్ష్మణమంత్రిమాటయందు గౌరవభావము. ఇక రాచకార్యము లెక్కడ చక్కబడునో నాకు తోచలేదు.

అప్పటినుండియే నాకు సంకల్పము ఉదయించినది. ప్రజాభీష్టముకొఱకు, రాజ్యగౌరవముకొఱకు, దేశవిముక్తికొఱకు, భగవంతుని మెప్పించునిమిత్తము నేనిట్టిపనిచేయ నిశ్చయించితిని. రామరాజును సింహాసనమునుండి తొలగించి నేనేసింహాసన మధిష్ఠింపనిశ్చయించితిని. స్వాతంత్ర్యరహితుడగు రంగరాజు రామరాజు ప్రభుత్వమున నే మహాకార్య మొనరింపజాలడు. చాలాకాలము తర్కవితర్కములకు లోనయి, వాదోపవాదముల కొనసాగించి, చివరకీనిర్ణయము చేసితిని. నేను చక్రవర్తిని కాకతప్పదని నిశ్చయించితిని. ఇది నావజ్ర సంకల్పము. దీనికి చలనము కలుగరాదు. ఇందు స్వార్థము రవంతేనియులేదు. ఇట్టిది క్షత్రియ లక్షణము. వీరపురుషోచిత కృత్యము. ఇందు తప్పేమియు లేదని నా అంతరాత్మ ఎలుగెత్తి చాటుచున్నది. సమర్థత కలిగియుండియు ఇట్టి పనికి పూనుకొనక ఉపేక్షించితినా, నాక్షత్రియ జన్మ మంటకలిసిపోవునని నాకు తోచినది. ఈమహాకార్యమున కెట్టి ఆటంకములున్నను తొలగించుటకు సంసిద్ధుడను.

అప్పటికే రామరాజు సింహాసనారూఢుడుగదా! ఆయనకప్పటికి దాంపత్యయోగము కలుగలేదు. అప్పటిది నారహస్య ప్రయత్నము రామరాజును చాటుచాటుగా కత్తికి బలి


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యిచ్చి సింహాసనారూఢు డను కావలెనను తలంపు అప్పటిది. దేశవిముక్తికొరకు సోదరుని ప్రాణము తృణీకరింపదగునని నాయంతరాత్మ బోధించినది. సంకల్పము కలిగినదికాని సోదరుని మరణమన్న నాగుండె లావులించినవి. ఎట్టిరాజ్యములయినను విస్తరింపచేయవచ్చును గాని, ఏకగర్భోద్భవులను సంపాదించుట దుస్తరమను వేదాంతపుపోకడలు స్పృశించినవి. ఆప్రయత్నము విరమించితిని. ఆయనకు వివాహమయినది. శుష్కాలాపములకంటె రాజ్యగౌరవము ప్రధానమని తోచినది. సోదరమరణమును కండ్లజూడవలెనని తలచుచుండగానే అతని కొకకొడుకు జనించినాడు. నాకార్యము భారమయినది. నేనిప్పుడిరువురను కడతేర్చవలసి యున్నది. నా ఉపేక్షకు నేను పదిపది మారులు నిందించుకొంటిని. ఇప్పుడేకదా నారుక్మిణి వచ్చి చెప్పిపోయినది, "అన్నగారి కుమారు నింకొక్కని ఎత్తుకొనవలసియున్న"దని నావదినె శాంతాదేవి మరల గర్భవతి యయియుండనోపు. నాయుపేక్ష క్షమార్హమయినది కాదని తోచినది. నేనిప్పుడయినను కార్యమునకు బూనుకొనవలెను. ఈయుద్యమమున నాకు తోడ్పడునదొక్క గోపరాజు మాత్రమే.

ఈ ఆలోచనలలో మునిగి తేలుచుంటిని. గోపరాజు అక్కడ కేతెంచెను. రామరాజు భార్య గర్భవతియని ఊదితిని. గోపరాజు నా ఉపేక్షకునాలుక కఱచుకొనెను. ఒక జీవునితో సరిపోవు పని ఒకరికిద్దఱు, ఇద్దఱకు ముగ్గురను చేసితినని నిందించెను. నేను చాలా నొచ్చుకొంటిని. నా అలసతయే రాజ్యవినాశమునకు కారణమని నేనూహించితిని. ఎందఱయినను సరే, రంగరాజు చక్రవర్తి కాబోవుమార్గమున ప్రతిబంధకులు అందఱు హతులుకాక తప్పదని నిశ్చయించితిని.

ఈ యుద్యమమున నాకు గోపరాజు సంపూర్ణసహాయము కాగలడు. పునః పునః ఈ సంకల్పమునే నేను దృఢపఱచుకొనుచుంటిని. రామరాజును కడతేర్ప నిశ్చయించితిని. అతని చిన్నకుమారునికూడ కత్తికి నొప్పగించుటకు నిశ్చయించితిని. పుట్టబోవు శిశువు బాలికయయిన యెడల ప్రమాదము లేదు. పురుషశిశువే యయినచో ప్రమాదము సంభవించును. ప్రమాదమేమి? ఆశిశువు జీవకణములు నిలువజాలవు. ఇది నా దృఢప్రతిజ్ఞ.

ఈ ప్రయత్నమందు నే నహోరాత్రములు నాశక్తినంతయు ధారపోయుచుంటిని అనేకములగు మానసవికారములకు లోనయితిని. చివరకు నాసంకల్పమే దృఢతమమయినదనియు, అవశ్యాచరణీయమయిన దనియునిశ్చయించితిని.

గోపరాజు నాచెవిలో రహస్యము నూది వెడలిపోయెను. నా ముఖవికాసచిహ్నాచే "సర్వోత్తమమని" తెలిపితిని.

## 3

రెండు దినములు గడచినవి. మాకోటయందు రోదనములు పెచ్చుపెఱిగినవి. శాంతాదేవి నిండుచూలాలు. రుక్మిణి ఆమెచెంత ఆమెబాలుని ఒడిలో బెట్టుకొని రోదనము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయుచుండెను. శాంతాదేవి స్మృతితప్పి క్రిం



ద పడిపోయెను. అఘూళిధూసరితమగు నామె నెమ్మోము వెలవెలబాఱి కరుణరసము సోన లుగా ప్రవహింప జేయుచుండెను. నారుక్మిణి లేతమోముకంది కన్నీటిధారలచే మలినమయి దీనమయి చూపట్టుచున్నది. చుట్టును పరి చారికా సమూహము పెద్ద గొంతెత్తి "మహా రాజా! రామప్రభూ! ఏమీ, ఈ కాలకర్మము!" అని వివిధముల విలపింపసాగిరి.

శాంతాదేవి కెటులయినను స్మృతి తెప్పింపవలెనని రుక్మిణీ పరిచారికలచే శైత్యోపచారములు చేయించుచుండెను. పరిచారికలు వివర్ణవదనలై ఏమేమో పలవించుచుండిరి. "ఎన్న డును రామప్రభువు వేటసంగతి యెఱుగడా? నేడేమో కాలము పండి, ఘాతుకమృగము వాతపడవలసిన కర్మమున్నది గనుక, రామ చక్రవర్తి కీదుర్మరణము ప్రాపించె"నని వారు చెప్పుకొను చుండిరి.

రుక్మిణీకూడ వేటకతమున నే రామరాజు చనిపోయెనని విశ్వసించినది. కాని రామ రాజునుజంపిన ఘాతుకమృగము చిరకాలము నుండి పొంచిపొంచి, కోటలో వసించుచుండియే చివర కీపనిచేసినదని దానికి తెలియదు. రామరాజు మరణించినాడు. అరణ్యమున రామరాజు వేటకు బోయిననాడు గోపరాజు అడవిలో పొంచియుండి ఒక్కవ్రేటున కడతేర్చి ఘాతుకమృగముచే మడిసెనని వదంతి కలుగజేసినాడు. అది కథ.

ఒక్కనెల దినములయినది. ఈ నెలదినములనుండియు నే నెట్టిదశయందున్నానో అది పరమేశ్వరునికి దక్క నన్యులకు దెలియ నసాధ్యము. రామరాజువంటి ఉత్తమప్రభువు ఇక ఉండబోడని నాకు తోచినది. అతని నెమ్మది, అతని శాంతభాసము, అతని వికాస వదనము పెక్కండ్రకు ఉల్లాసము కలిగించెడి వని నాకుతోచినది.

శాంతాదేవి మహాయిల్లాలు. రామరాజు చన్న మఱుదినమునుండియు నా పడతి యెట్లు మంచముపట్టి మరణించుచున్నదో నే నూహింపలేను. పతివియోగము మహాదుర్భరమని గుర్తించితిని. చిలుకా గోరువంకలవలె నున్న మిథునము పాలిట నేనొక కాలసర్పమునై జనించితినని స్పష్టపడినది. ఎట్టి సాహస కార్యమయినను చేయగలనుగాని అన్యోన్య ప్రేమితుల నెడబాపజాలనని స్పష్టపడినది. నారుక్మిణి నన్నెట్లు ప్రేమించుచు నాకొఱకై ప్రాణములు ధారపోయుటకు సంసిద్ధురాలయి యున్నదో అట్లు తనపతియెడ శాంతాదేవియు కూడనని స్ఫురించినది. ప్రేమ రజ్జువులచే బంధింపబడిన దంపతులను ఒక్కకత్తివ్రేటున ఎడ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బాపి, ఒకనిని శాశ్వత దూరీకృతునిగ జేసి, రెండవవారిని శాశ్వతమృతజీవిగా నొనరించిన నామహాపాపమునకు మిక్కిలి దుఃఖించితిని.

వెనుదిరిగి చూచితిని. మొదట నాకీ యాలోచన లెందులకు తోచలేదని ప్రశ్నించుకొంటిని. రామరాజును దుర్మరణముపాల్చే యుట కేవలము పరమార్థదాయకమని పైకి మాటలు చెప్పుకొంటినేకాని, యథార్థముగ స్వార్థమే అధిష్ఠాన దేవతయై, నాఆలోచనలలో లీనమయి, ఆలోచనలకు ప్రాణభూతమయి, నాకన్నులకు పొరలు కప్పినది. ఆ కారణమున అంతయు సవ్య మనుకొంటిని. స్వార్థమే అంత పని చేయించినదని ఇప్పుడు తెలిసికొంటిని. స్వార్థము నన్ను మోసగించిన దనుకొంటిని. తెలిసియు, తెలియకయు అకార్యమాచరించితి ననుట స్పష్టము.

౪

రుక్మిణీభవనమునకు నేను బోవుచుంటిని. పూర్వపు కళకాంతులు లేవు. రుక్మిణీమోమున చిఱునవ్వు తొలకరించుట లేదు. మాకోట భాగము లన్నిటికిని వర్షర్తువు ప్రవేశించినది. ఆకాశ మెన్నడును స్వచ్ఛముగా నుండుట లేదు. ఎల్లప్పుడును వదనములు మేఘపరీవృతములే, కళావిహీనములే, రోదనసంకలితములే. రుక్మిణీ వదనచంద్రుడు మేఘమండలములో నణగిపోయెను. ఇది నాకు దుర్భరముగా నుండెను.

శాంతాదేవి పూర్వము రుక్మిణితో గలసిమెలసి యుండుకొనుచుండుటచేత మా భవనములన్నియు సహస్రదీధితులతో వెలుగొందుచుండెడివి. ఆవికాసమును, ఆవిలాసమునుగని నే నానందించెడు వాడను. నేడో గృహాంగణములన్నియు పాడుపడి యున్నవి. ప్రతిభాగమునుండియు ప్రేతధూమము లెగయుచున్నట్లు గుర్తించితిని. ఈప్రేతాగ్నిని రగులు కొల్పిన దీరంగరాజే!

ఒకనాడు రుక్మిణీభవనమున నుండగా రుక్మిణి నాచెంతకు వచ్చినది. నన్నుచూచి నవ్వలేదు. నాతో చనవుమెఱపి మాట్లాడలేదు. ముగ్ధభావము వహించినది. రుక్మిణీసూనముచే నాదుష్టత్వమునకు భగవంతుడు నన్ను శిక్షించుచున్నాడని తలచితిని. పరిచారిక ఒక్కతె పరుగెత్తుకొని వచ్చి, "అమ్మా! శాంతాదేవిగారి సంగతి చూడండి" అన్నది. రుక్మిణి ఆత్రముతో, నాతో బలుకకుండగనే, వెడలిపోయినది. దానిమొగము మాత్రమీపలుకులనుచ్చరించియుండెను: "శాంతాదేవి బ్రదుకు ఏమయితే మాత్ర మేమిలే" అని.

నాచక్రవర్తి పదవికి రాజబాట ఏర్పడినది. రాజమంటపమునకు బోతిని. నన్నుచూచిఅందఱును నాసోదరునిదుర్మరణమునకై నేనువగచుచున్నట్లు తలచి ఓదార్చుచుండిరి. జరిగినది జరుగగా నేను చక్రవర్తినయి పరిపాలన మొనరించుట కెంతయు తగినవాడనని కొనియాడిరి. ఓహో! వీరికి సత్యస్వనము వినబడలేదని సంతసించితిని. ప్రధానామాత్యుడగు లక్ష్మణమంత్రి లేచి, "అవును. రామ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజును ఘాతుకమృగము చంపినది. అది పెంపుడు మృగమే యయియుండవచ్చును. జరిగినది జరిగిపోయినదిగాని, రామప్రభువు పేరు




మీదుగా, ఆయన బిడ్డలను ఘాతుకమృగము వాత పడకుండ కాపాడవలెను." అని శూలములవంటి పలుకుల నుచ్చరించినాడు. నాకు ముచ్చెమటలు పట్టినవి. నేనింత ధైర్యవంతుడనే, ప్రతాపశాలినే, బక్కవానిమాటల తృణీకరింప లేకపోతినే యని దిగులొందితిని. లక్ష్మణసింగు ప్రశంసించిన దుష్టఘాతుకమృగము నేనే. నే నీసంగతి గుర్తించితిని: నేనెంతటి ప్రతాపశాలినయినను, మోసకృత్యమొనర్చి కప్పిపుచ్చుటచే నాప్రతాపము భగ్గున మండి పోయినది. బక్కమంత్రి యయినను, అతడు పల్కినది అమృతమయమగుటచే, దానికి ప్రతీకారము కలుగక, నిరాటంకముగా, స్వేచ్ఛగా బయటికివచ్చి విజృంభింపకలిగినది.

నేను వట్టి అమాయకునివలె నాటకమాడి సభాస్థలి విడిచి వెడలిపోతిని. శాంతాదేవికి కవలపిల్లలు జనించినట్లు తెలిసినది. ఇద్దఱును మగశిశువులే!

౫

నాకు మఱింత ఆందోళన హెచ్చినది. నామార్గమున ముగ్గురు శిశువులున్నారు. లేనిచో లక్ష్మణమంత్రి వారిపేరుమీదుగా పరిపాలన జరపి, ద్వంద్వప్రభుత్వము నేర్పరచును, లేదా పిల్లలను వెనుక వేసికొని ప్రత్యర్థి కక్షలను లేవదీయును. నేను చక్రవర్తినయితినా, పిల్లలు జీవింపరాదు. సర్వతంత్ర స్వతంత్రుడను కావలెనుగాని, అర్ధపరిపాలన వ్యర్థపరిపాలనతో సరి. నా ఉపేక్ష నన్నెంతటికి తెచ్చినదో యని నగచితిని.

గోపరాజు వచ్చినాడు; శిశువుల మారణోపాయమును నాకు బోధింపుచున్నాడు. లక్ష్మణమంత్రిపై నాకు మత్సరము రగుల్కొన్నది. అతడు కారణముగా రామరాజుశిశువులపైకూడ ఈర్ష్య జనించినది. రామరాజు పెద్దకుమారునకు మూడవసంవత్సరము. గోపరాజును, నేనును నూఆలోచనలతో కాలము గడపితిమి. ఓహో! జరగినది జరగిపోయినది; నేనెవరి కొఱకును విచారము పెట్టుకొనరాదని నిశ్చయించితిని. రుక్మిణి నన్ను పల్కరించలేదని మనోవ్యథను పొందుట స్త్రీగుణమని తోచినది. మనోవైకల్యము పొందకూడదని నిశ్చయించుకొంటిని. గోపరాజును మానూతన కార్యక్రమమునకు వినియోగించితిమి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోటలో మరలరోదనములుప్పతిల్లినవి. శాంతా దేవి మరణశయ్య నధివసించినదని తెలిసికొంటిని. ఆమెచెంతకు బోతిని. పరిచారికలు తమ తమ యుపచారములందు నిమగ్నులయి యుండిరి. ఒకప్రక్కన శాంతాదేవి, కవలగ్రుడ్లు వేఱొకశయ్యపై శయనించి యుండిరి. శాంతా దేవి మాటిమాటికిని రుక్మిణివైపుచూచి కన్నుల నీరునించుచున్నది. రుక్మిణి శాంత శయ్యప్రక్క కూరుచుండి, వాల్చిన వదనమెత్తకుండ నట్లే వివశయయి యున్నది.

శాంతాదేవినన్నుచూచి,కన్నుల నీరు నించినది. రామరాజును చంపినది నేనే యని శాంతాదేవికికూడ తెలిసినది. సర్వజనులకును శ్రుతమయినది. అందువలననే రుక్మిణి,శాంతా దేవి దుర్భరవిచారసముద్రమున తానుకూడ మునిఁగి, నాతో విశేషప్రస్తావనకు రాకున్నయది.

శాంతాదేవి నన్నుచూచినది. అప్పుడు నాహృదయ మెట్లున్నదో తెలియునా? వజ్రతుల్య మొనర్చుకొంటిని! నాకార్యము నెరవేరవలెను; అప్పుడు వెనుఁదిరిగి చూడవలెను. అట్టిస్థితిలో నున్నాను. "మహాప్రభూ! బిడ్డలు, రుక్మిణి, మీరు,"అన్నది. శాంత: తన బిడ్డల పోషించుభారము నాది, రుక్మిణిదియు నని చెప్పినది.

ఒక్కనిముసము నా మనోవజ్రమునకు భిన్నత్వము ప్రాపించినది. అయ్యో! రంగరాజు నాథర్తను కడతేర్చినాడు; తిరిగి నాశిశువులను ఆఘాతుకమృగమున కేయొప్పగింపతగునాయనియయిన యోచింపక, నాకే యొప్పగింత చేసినది, శాంతాదేవి. ఎంత దయామయియో,ఎంతబుద్ధిమంతురాలో యని యాశ్చర్యమొంది, చకితుడ నయితిని.

వెంటనే నాకార్యసందేశము స్ఫురణకు వచ్చినది. మానసికపంజరము తిరిగి పాషాణసదృశమయినది. కాఱుమబ్బులు గ్రమ్మినవి. కోటలోని దీపము లాఱిపోవుచున్నవి. అగ్నినుండి రక్తము స్రవించుచున్నది. కవలశిశువుల రుక్మిణియొడిలో పాఱవేసి, శాంతాదేవి తన భర్తృసదనమునకు లేచిపోయినది. కోటంతయు రోదనములతో నిండిపోయెను. నామనస్సు చలింపలేదు. నేను వజ్రతుల్యుడనుగానే యుంటిని. అక్కడనుండి లేచిపోతిని.

నా ఆలోచనాగారముప్రవేశించితిని. గోపరాజు ప్రవేశించినాడు. కార్యముసఫలమయినదన్నాడు. రామరాజు జ్యేష్ఠకుమారునికి,



"మహాప్రభూ! బిడ్డలు రుక్మిణి మీరు" అన్నది శాంత.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మూడేండ్ల బాలునకు విషప్రయోగము చేసి వచ్చినాడనని తెలిపినాడు. నాకు పశ్చాత్తాపము కలుగలేదు. దుఃఖము కలుగలేదు. కాని నాకు ఒడలు తెలియుటలేదు. సేవకుడు నా యొద్దకుపరుగెత్తుకొనివచ్చి, "అయ్యో! రామప్రభువు పెద్దబిడ్డను మరణించినా"డని ఆవురుమని ఏడ్చుచుచెప్పి వెడలిపోయెను.

ఏమా! ఈదుర్మరణములన్న ఆలోచనలను నామనస్సు దరికి రానిచ్చుటలేదు: అద్భుతమగు తపశ్శక్తిచేత నే నా మనస్సును చిక్కబట్టి గలుగుచుంటిని. నాచూపు "రంగరాజు చక్రవర్తిత్వము" మీద నున్నది కాని దేనికిని విచారము కలుగుట లేదు. కోటంతయు పాడుపడుచున్నను సరే,నా కార్యసాధన తీగెలు ప్రాకి, పుష్పించి, ఫలముల నందీయ సంసిద్ధమయినదని తృప్తినొందుచుంటిని.

నేను చక్రవర్తినయిన మఱునాడు రుక్మిణినాతో సరసము లాడకపోదు. అప్పుడు నాహృదయకుసుమము వికసించకపోదు. ఆనందమధువు తొలకక పోదు. అందుచే నీలోపల నేమి జరగినను, ఎవరుమరణించినను, నాకు విచారములేదు.

మరల గోపరాజును నూతనకార్యక్రమమునకు వినియోగించినాము.

ఏమిజరగునో యని యాత్రముతో నుంటిని. నాకు మనశ్చాంచల్యము కలుగలేదు. కాని నాకండ్లు అంధకారమును ప్రేమించుచున్నవి. నాగదిలో కూరుచుంటిని.

మరణశయ్య పైనున్న శాంతాదేవిదృశ్యము ప్రత్యక్షమయినది. నేడెందులకోకాని, శాంతాదేవిని చూచిన జాలి కలుగుచున్నది. భర్తను జంపిన ఘాతుకమృగముచేతికే బిడ్డల నొప్పగించుచున్నదే, నాయందు పుత్రవాత్సల్యము గల శాంతాదేవియెడ నే నెట్లువర్తించితిని? ఆమె భర్తను జంపితిని, ఆమె బిడ్డనిజంపితిని.గ్రుడ్డ నుజంపనుద్యమించుచుంటిని. శాంతాదేవి, నాతల్లి, నేను దుర్మార్గుడ నని తెలిసియుండియు ఆమె నాయెడ వర్తించినవిధము, ఆమె నన్ను పుత్త్రకుని భంగిచూచుచున్నదని తెలిసియుండియు ఆమెయెడ నేను ప్రవర్తించిన విధము తూచుకొంటిని. నేను చక్రవర్తి నగుటకా యిట్లుచేయుచుంటిని? లక్ష్మణమంత్రి కొలువు చాలించుకొని ప్రతికక్షుల జేరినాడు. సామంతరాజు లందఱును కలసి, నాదుర్మార్గమును బ్రకటింపుచు తిరుగుబాటు చేయుచున్నారు. ప్రజలలో రంగరాజు ఘాతుకమృగమని స్పష్టపడినదని తెలిసికొంటిని."అయ్యో!" యని యార్చితిని. నామానసవీథిని శరవేగమున మేఘములుపరుగెత్తుకొని పోవుచుండెను. అందు నారుక్మిణివదనమండలము గాన్పించుట లేదు. నేను ఘాతుకమృగమయిన నాటనుండియు, నారుక్మిణి చల్లనిచూపులే నాకు కఱవయ్యెను. సమస్తమును గోల్పోతిని. కోట నుండి ప్రేతధూమదుర్గంధము బయలువెడలుచున్నది. "ఓయి గోపరాజూ! ఒక్కసారి నిలువవోయీ!"అనిపిచ్చివానివలె కేక వేసితిని. ఆమాట అతనికి వినబడలేదు.

౬

నాప్రాసాదము పైభాగమునుండి చూపు సారించితిని. అదిగో! అడుగు ప్రాసాదమున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నారుక్మిణి! పర్యంకముపై శయనించియున్నది. దానిప్రక్కన దీపములు సహస్రజ్యోతులై నాకు గోచరించుచున్నవి. రుక్మిణీహస్తములు అనేకములు చూపట్టుచున్నవి. రుక్మిణి పార్శ్వ భాగమున తళతళ మెఱయు చేబాకులు పదులు ప్రకాశించుచున్నవి. తనచేతి నొకదాని తల క్రింద జేర్చికొని, వేఱొకచేతిని కవలపిల్లలపై నునిచి, నిదురపోవుచున్నది.

నాకు ముచ్చెమటలు పట్టినవి. నాలుక తడబడుచున్నది. కన్నులు మిఱుమిట్లు గొను చున్నవి. ఆప్రాసాదప్రాంగణమున క్రింద చది కిల బడితిని.

అదిగో! గోపరాజు నిద్రించుచున్న రుక్మిణీ శిశువులవైపు పొంచిపొంచి చూచు చున్నాడు. మాకోట గడియారము రాత్రి ఒంటిగంట యని ఒక్కగంట కొట్టినది. కోట కావలివాండ్రు నిదురించియున్నారు. చరా చరసృష్టి నిదురించు చున్నది. రంగరాజు ఘాతుకమ్మగ మొక్కలే శిశువుల మేతకొఱకు కనిపెట్టికొని యున్నది.

అదిగో, గోపరాజు పొంచిపొంచి శిశువులదగ్గర చేరుచున్నాడు. అతని చేతిలో విష ద్రావకముపోసిన పాత్రయున్నది. "అయ్యో! గోపరాజు! ఆగ వోయీ, ఆ ప్రయత్నము మానుకొంటివి నోయీ!" అన బోతిని. ఈ మాటలు నా కంఠ బిలమునుండి వెలువడలేదు. గోప రాజు శిశువుల నోళులలో విషము పోయు చున్నాడు. పైమాట లుచ్చరింపదలచి తీవ్ర యత్నమును చేసితిని. ఊ, ఊ, ఊ యని పెద్ద మూలుగు మూలిగితిని. నాకు జరగుచున్నది గోచరించుచున్నది గాని నానోటిమాటలు పూడిపోయినవి.

"అయ్యయ్యయ్యో!" యంటిని. నూతన దృశ్యము చూచితిని. కూరుచుండియే చేతులు పైకెత్తితిని. ఆశ్చర్యముతో నోరుతెఱచితిని. ఓ, ఓ, ఓ యని మూలుగుచుండుటయే కాని నానోటనుండి మాట రాదాయెను.

గోపరాజు శిశువుల నోటిలో విషము పోసినతత్క్షణము రుక్మిణి దివ్వున లేచి, తన మొల బాకుతీసి కఱక్కున నొక్కపోటుచే గోప రాజు వక్షమును చీల్చి నేల బడవైచినది.

ఆ యుత్తరక్షణముననే రుక్మిణి శిశువుల నోళ్లలో తన నోరుపెట్టుకొని శయనించినది.




'గోపరాజు శిశువుల నోళులలో విషము పోయుచున్నాడు'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాకు స్మృతివచ్చినదా? ఏమో! ఒక దృశ్యము చూచితిని. రుక్మిణి దభాలున మంచముపైనుండి నేల గూలినది.



నేను పిచ్చివానివలె ప్రాసాద విటంకమునుండి క్రిందకుబరుగెత్తు కొనిపోవుచుంటిని పరిచారికలుపరి చారకులు గుమిగూడిరి. కోటకావలివాండ్రు గుంపులుగా జేరిరి. రామరాజుశిశువులు మృతులగుట తెలిసికొనిరి. రుక్మిణి శిశువులనోటి



లోని విషముగ్రోలుటచే మొగము వెల్లనయి, ప్రాణవాయువు లెగిరి పోయి క్రిందపడిపోయినది.

ఇంతవరకును తెలియును. గోపరాజు రక్తసముద్రములో మునిగియే పోయినాడు. "నారుక్మిణీ!" యంటిని. చనిపోయిన గోపరాజు జేబులో నొకచీటీదొరకినది. అందిట్లున్నది: "ఈరాత్రియే రంగరాజునుగూడ పరిమార్చుము. రేపు గోపరాజు చక్రవర్తి కావలెను." అని గోపరాజు మిత్రుడు గోపరాజునకు వ్రాసిన లేఖ యది.

"ఔరా! కృతఘ్నా!" అంటిని. నన్నిందులకా ఈరక్తసముద్రములో దింపితివంటిని. నాలోనుండి పశ్చాత్తప్తరుధిరము స్రవింపుచున్నది. శరీరము భగ్గున మండిపోవుచున్నది. నేనును శిశువులవదనములు చుంబించి చుంబించి, రుక్మిణి అమృతవదనము ముద్దుపెట్టుకొని, నారుక్మిణిచెంత బరుండి శాశ్వతనిద్ర చెందగోరితిని.




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## వస్త్రాపహారణము—వస్త్రదానము

విస్సకోట వెంకటరత్నశర్మ గారు

రాజ్యమా! సర్వముం గూడఁ బూజ్యమయ్యె
ద్రవ్యమా! వైరిహస్తగతమయిపోయెఁ
దమ్ములా! కట్టుబాట్లకుఁ దప్పినారు
పాండుసుతుని దుఃఖంబుఁ జెప్పం దరంబె?

పాండునరపాలపుత్త్ర, ఆఖండలాభ!
రాజ్యలక్ష్మి పోవుట విచారంబునూని
క్రుంగిపోవగానేల? అర్ధాంగలక్ష్మి
కలదు; తెగియించి యొడ్డఁగాఁదలఁచెదేని!

అనుచు శకునియుఁ గైతవంబున వచింప
ముందువెన్కల నరయఁగాఁ బోక వనరి
కనలి రోషమ్ము కతనఁ జేయునదిలేక
పూవుబోణిని నొడ్డి కోల్పోయె నపుడ

కడలిలో పొంగిపడెడు భంగములగముల
భంగి జీవితంబున నిట్లు పరగుచుండు
నొనరఁ జేకూరునపుడు ధీరోత్తముండు
నుబ్బఁగాఁబోడు క్రుంగియునుండఁబోడు

ఒక్కొకరి కిట్లుగాఁ గల్గకుండునేని
అపగుణమ్ము గుణమ్ము లెట్లరయవచ్చు?
అనుభవజ్ఞాన మెట్లు గైకొనఁగవచ్చు?
దివ్యపథముల నెట్లు సాధింపవచ్చు?

అపుడు దుశ్శాసనుండు క్రోధాత్ముఁడగుచు
సాధ్వి పాంచాలి కేశపాశములు వట్టి
యీడ్చి సభలోనికిఁ దెచ్చె నెల్లవార
లౌను గాదనలేక అల్లాడుచుండ.

అంతతోఁబోక యాదుర్మదాంధుఁడా ర
జస్వలాకాంత మేనవస్త్రమ్ము లొలువ
నాపె కృష్ణ! లక్ష్మీమనోహర! యనాథ
నాథ! సర్వాత్మ! యేడనున్నాఁడవన్న!

సకలభువనసంతతుల బొజ్జను ధరించి
పెంచి రూపుమాయించు పవిత్రచరిత!
తరుణమునఁ గోరువారి చింతలను బాప
అడ్డువడు యశోదాపుత్త్ర! అడ్డుపడవె!

ఒకఁడు విలువిద్యలో మేటి ఒకఁడు గురుని
బాణధారాపరంపర బారినేసె
నొకరిఁ జేరఁగారాదు మృత్యువు భయాన
నొకఁడు పూజ్యుండు సర్వగుణోత్తరుండు.

కాల్పనావీరి సామర్థ్యగరిమలెల్లఁ
గల్పనావీరి కీర్తి గంగాజలాన
నిల్పనా పరమపవిత్రనియతి; నకట!
యిందునొకరైన నన్ను నాలింపరారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దిక్కుగలవారికిని లేని దీనతతికిఁ
బాలురకుఁ బామరులకును భర్తులకును
యక్ష గంధర్వ నర ఖచరాదులకును
నీవకా శరణ్యము! నవనీరజాక్ష!

ధర్మపాశబద్ధులయి మత్పతులు గలరు
నీవుప్రోవవయేని గాంచెడిదెవండు?
తలఁపగాఁబోవు నీకిది ధర్మమగునె?
ఆఁడుదాని మొఱాలింపవా మహాత్మ!

అనుచు నొకకేలను దుకూలమును ధరించి
యంతఁ బెరకేలు నెత్తె నభోంతరాళ
మునకుఁ దీరని పరిభవంబునఁ బాంచాలి
కలుగదాయె నదేమొ శ్రీకరుని కరుణ?
అపుడు వైకుంఠనగరమం దతిచతురతఁ
గమలజాతాయతాక్షి పాల్కడలి పట్టి
లీల నిజనాథునిన్ ద్యూతకేళిఁ దేల్చు
చున్ ద్రుపదపుత్త్రి మొఱ వినుచున్ వచించె.

నాథ! సంతతానంద! అనాదిపురుష
ఓయవార్యచరిత్ర! కుయ్యో! యటంచు
ద్రుపదభూపాలతనయ కం దొవల నీరు
గార్చ నూరకున్నా రేమిగాఁ దలంచి?
గిరినిఁ గేలన్ ధరించి రక్షింప లేదె?
తొలుత గోవ్రాతములను దుందుడుకుఁ దీర్చి
అలజలంబుల మకరిచే నలసియున్న
కరినిఁ గాపాడవే నాఁడు కరుణతోడఁ
దొలుత చే గాల నాకు లెందులకు నపల?
ఎందుల కుపేక్షఁ జేసెద వీసమయము?
జాలికలుగదె? ఆదీనురాలిపైని
భక్తవత్సలుండవుగావె? ప్రాణనాథ!
అనుడు శ్రీవిష్ణుఁడావెకిట్లను: లతాంగి!

ఎవ్వఁడైన నెవ్వతెయైన నెన్నఁడైన
నన్యచింతలు వీడి నాయందు నచ్చ
మైన బత్తిని ప్రార్థించినట్టులైన
వీడుదునె వారలెవరైన వెఱ్ఱిదాన!

శ్లో. అనన్యా శ్చింతయంతో మాం
యేజనాః పర్యుపాసతే;
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్."

తమప్రయోజకత్వముల నాధారముగఁ ద
లంచి పరిపూర్ణ విశ్వాస ముంచలేక
అస్మదీయ సాహాయ్యమ్మునం దనిశము
నరులు బలహీనులౌదు రోసరసిజాక్షి!

'అన్యథా శరణంనాస్తి' యని యెవండు
హృత్కమలమందు నన్ను ధ్యానింపుచుండు
నట్టి అభిమానరహితుఁడై యలరు వాని
నేన చేపట్టుదుగదా! నవేందువదన!
అనుచు వచియించులోపల నచట దుష్ట
శాసనులమేటి దుష్ట దుశ్శాసనుండు
పట్టుబలవంతమున వల్వఁ బట్టి యీడ్చె
నాయమ కరంబుఁజార్చి 'అయ్యో' యటంచు
కరయుగళమున్ మొగిడ్చి సుస్థిర మనంబు
గూర్చి శ్రీకృష్ణభగవానుఁగూర్చి కూర్చె
నేపపు న్నినాదము నాలకించె నావి
కర్ణుఁ డొక్కరుం డానభఁ గనికరాన!
లచ్చితో నోడి ద్యూతసంగ్రామ భూమి
సర్వమున్ గోలుపోయి ఆసారసాక్షుఁ
డప్పటికి రోషతామ్రాక్షుఁడై మహోగ్రుఁ
డగుచు విసరెఁ బాచిక లక్షయ మ్మటంచు
నెమ్మి ననుకంప నన్నవనీరజాక్షుఁ . . . . .

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ర్తాజనరక్షణైక కళాకరుండు
నఖిలదుర్మార్గలోక సంహారచణుఁడు
వైరి లజ్జింప నక్షయవల్వ లిచ్చె.

వ. అంత భానుమతి మొదలైనకాంతలావింత వస్త్రమ్ములం దెప్పించి తమ శరీరమ్ములం ధరించి సొంతయుడుపులెల్ల నింట విడిచి.

అంత కాంతాసమూహమ్ము లంతులేని
గర్వముల రాజఠీవులు గంతు లిడగఁ
బాండవులు ద్రోవదియు సభవారు గాంచు
నట్లు బారులందీర్చి సౌధాగ్ర భూమి
లీల చిరునవ్వు వెన్నెలల్ నిగుడఁ గప్పి
అలరు నొయ్యారముల హాళాహాళి యొసర్చి
కుంతికోడలు సిగ్గునఁ గుందునట్లు
నూపురధ్వనిఁ జేసి రింతులు తటాల్న!
ద్రౌపదీసతి హృదయంబు తల్లడిల్లఁ
జటుకునక్క గంతమెత్తి ఆచాయఁ జూచెఁ
కృష్ణ చీరలు మాయమయ్యెను! వివస్త్ర
లైకనంబడిరా యింతు లద్భుతముగ
పట్టపుందేవి మొదలైన పద్మనేత్ర
లపుడు చెప్పరానట్టి సిగ్గంది గాత్ర
ముల నిజాంశుకంబులదాల్పఁ బోయి రాత్రి
మున మహాత్ములచర్య లద్భుతము ధాత్రి
నెట్టి అవమానమందైన నెట్టి సంక
టమ్ము లందైన నేసమయమ్ము లందు
నైన శ్రీకృష్ణభగవాను నాత్మలోన
నచ్చపుంబత్తిఁ గొల్వఁ బాసరయ రాఁడె?

---

# క ను లు

కవికొండల వెంకటరావు గారు, బి. ఏ, బి. యల్.

౧

తల దాల్చుకొని వచ్చుచున్న దొక యెలనాగ
పొలముగట్టునె పచ్చకలిమికల యొకమోపు
బరువుగా గట్టుకొని, నిలువునా యెత్తుకొని;
అలపులోనే మెలపు గసబఱచుచు, తల.

౨

గడ్డిపోచలు నల్లముంగురుల, గలిసిపో
పడ్డపాటది నొసటి చెమ్మటల జాఱిపో
గఱికబరువుఱకుఱక దిగజాఱ దిగజాఱ
దానికనులో మినుకుమినుకుమని మెఱసిపో-తల.

౩

నడచునట్టీగట్టు అడుగు వెడలుపు—అంతె
నిడివిబెఱిగిన వరిని—నిండిలయున్నవి చేలు
ఈప్రక్క నాప్రక్క నెంతవఱ కరసినా—
మోపుదించుక తనదు మోముతుడుచుక మఱల
మోపునెత్తుకపోవముదిత కెడలే దెందు.
గఱిక బరువుఱకుఱక దిగజాఱ దిగజాఱ
దానికనులో మినుకుమినుకుమని మెఱసెగా
ఎత్తుచుండిన తెప్ప యిట్టె కనుబొమ ద్రిప్ప
దానికనుపాపలో తళుకుమని విరిసెగా, తల.

౪

తప్పకొన వే పిల్ల దారియ్యమని చెప్పి
మెప్పరుసు నెవ్వార లేమిటని యడుగుదురు?
అడుగుతడపునె వారియడుగులల్కుడు జాడ
నుడిలేక సడిలేక నును తెప్ప లల్లార్చి
దాని కనులప్పుడే తెలిసి తెలిమలుపుగా
మన మొత్తిగిలినదువ-మన మొత్తిగిలినదునకే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# నాగరత్నము

రాయసము

వెంకటశివుడు గారు, యం. ఏ., యల్. టి.

## సముద్రయానము

మార్వాడీ వర్తకులతో మాటలాడుటను పట్టణముపోయి ఒకవారమచటనే యుంటిని. ఈసమయమున ఒకనాఁ డింటినుండి తంత్రివార్తవచ్చెను. నా కుమారుఁడు ఎవరికిని జెప్పక సీమ పోవునుద్దేశముతోఁ గొందఱు స్నేహితులతోఁగూడి బొంబయి నడచెనఁట! చావఁగా మిగిలిన యీయొక కొడుకును జూచుకొని దినములు గడుపవలెనని యెంచు మాకెట్టి దురవస్థ వచ్చినది! ఇంటి కింతదూరముననున్న నేనేమి చేతును? నా యలజడికిఁ గారణము విని, మార్వాడీ మిత్రులు బొంబాయిలోఁ దమ బంధువగు మాణిక్చందుగారికిఁ దంత్రి నిప్పించిరి. వారి యాలోచన చొప్పున నింకొక పెద్ద మనుష్యునికి గూడ వార్తనంపి, మాయర్భకునిఁ బట్టుకొని మా గ్రామమునకుఁ బంపుఁడని వేఁడితిని.

స్వగ్రామమునకు మరలివచ్చుచుండఁగా దారిలో నామనస్సు పరిపరివిధములఁ బోయెను. ఉన్నత విద్యాభిలాషముచేఁ గాదా యీపిల్లవాఁ డిట్టి పోకడలు పోవుచున్నాఁడు! మొట్టమొదటనే వీని కింగ్లీషు చదువు వలదని చెప్పితిని. వర్తకవ్యాపారములు చేసికొను మా వైశ్యులకీ మాయయింగ్లీషు విద్యలేల? కాని, మా యాఁడువాండ్రు నామాట పడనీయలేదు! ఈయర్భకుఁడు మృత్యువుకనులు గప్పి, ఆఁడచాటుపిండమువలె నెటులో దినములు నెడలఁ బుచ్చిన చాలునుగదా యని, బడిలో మిడుక నిచ్చితిని. అప్పటి యుపేక్షాఫలమే యిపు డనుభవించుచున్నాము! చెట్టయి వంగనిది, మ్రానై వంగునా? పాఠశాల లన్న నే నాకు తలనొప్పి! పిల్లకాయలు చదువుకంటె చండితనమే యచట నేర్చుకొందురు! ఐనను జరిగినదానికి వగచిన లాభమేమి?

నేనిల్లు చేరునప్పటికి సంగతు లెటులుండవలయునో యటులుండెను. ఇల్లు వాకిలులు మోకాలులోతున చెత్తచెదారములతో నుండెను. పశువులు కట్టురాళ్లపై పడియుండెను. నాభార్య స్వభావముగనే బలహీనురాలు. ఈయొక కొడుకును విదేశములపాలయ్యెనని యిపుడు మనోవ్యథతో మంచ మెక్కెను! లెక్కినవారామె పరిచర్యలోనే మునుఁగుచుఁ దేలుచుండిరి. ఐనను వారుచెప్పెడి యోదార్పుపలుకు లామెకు నచ్చుచుండలేదు. పాలలోఁబడిన బల్లివలె మంచము నంటిపట్టుకొని నేనింటికి రావేగమె యామె గోలుగోలున నేడ్చెను! ఏమిచేయుటకును నాకుఁ దోఁపకుండెను. దుకాణము పని యంతయునుపే మూలపడెను. గుమాస్తా, నౌకరులు కుఱ్ఱవానిని వెదకు ప్రయత్నముల నుండిరి. ఎట్టి గ్రహచారదినములు సంప్రాప్తమైనవి!!

ఇంతలో బొంబాయినుండి జవాబులు వచ్చెను. నాతంత్రివార్త చేరినపుడు మాణిక్చందు గ్రామాంతరము పోయియుండెను. వచ్చి కనుఁగొనఁగా క్రిందటి దినమే సీమ పొగయోడ వెడలిపోయెనని యాయనకుఁదెలిసెను. రెండవ పెద్దమనుష్యునియొద్దనుండికూడ నిట్టివార్తయే వచ్చెను. ఆయన గుమాస్తానంపఁగా అపుడే పొగయోడ నెక్కుచుండిన మాపిల్లవాఁడు వానికగపడి వానిమాట లెక్కచేయలేదఁట! ఇఁక నేమి చేయుదుము?

## సీమ చేరుట

పట్టణప్రయాణ మప్పటినుండియు నా దేహస్వాస్థ్యము తప్పియుండెను. పుత్రవియోగదుఃఖము ఎంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యణఁచుకొన్నను లోలోననే బాధించుచు నాశరీరదుర్బలత కిపుడు డోఁత యయ్యెను. విపత్తునకు విపత్తే విఱుగుడు! ఆదినములలో నాసంరక్షణ చేయుచును, నాకు పథ్యపానములు జరుపుచును, నాభార్య తనబాధనొకింత మఱచిపోయెను. ఇది యిట్లుండఁగా మాయూరనె యావలివీథిని విదేశగమనము సలిపి వచ్చిన పిన్నవాఁడొకఁడు గలఁడు. వాని నొకనాఁడు పిలిపించితిమి. ఇంగ్లాండు ప్రయాణపుసంగతులు కొన్ని వానివలనఁ దెలిసికొంటిమి. మాకవి యెఱిఁగించి యతఁడు "దీనికే మీరింత విచారించుచున్నారేమి? మీవాఁడు హాయిగా ఎదేశము చూచివచ్చును. సీమపోయిరాని యువకుని మొగముచూడఁ గూడదు! అక్కడకుఁ బోయినచో ఎన్నిసంగతులు తెలియును! ఎంతజ్ఞానము సంపాదింపవచ్చును! మీ వాఁడు ఏదో పెద్దపరీక్షనిచ్చి వెంటనే యింటికి వచ్చును." అని మాకు ధైర్యము చెప్పెను.

సుఖముగ గమ్యస్థానముచేరిన తంత్రివార్త కొన్ని దినములకు మావానియొద్దనుండి వచ్చెను. ఇఁకఁగొన్ని రోజులకు పెద్దజాబు వచ్చెను. తాను జూచిన చిత్రవిచిత్రములు నాగరత్నము వర్ణించి చెప్పెను. అది మరల మరల చదువుకొని నాభార్య సేదదేఱెను. ఇపుడామె ముఖమునుండి దుఃఖకళంకము తొలఁగిపోయెను. తరువాతవారము వచ్చినయుత్తరమున పిల్లవాఁ డింకఁ గొన్ని విశేషములు తెలుపుచు సీమఁజేరిన పిదప తాను దీయించుకొనిన ఛాయాపటము నంపెను. అప్పటి నుండియు వారము వారము మాకు సరిగా వాని క్షేమసమాచారములు తెలియుచుండెను. వానికి మేమును క్రమముగ లేఖలు వ్రాయుచుంటిమి. ఇట్లు మేము ఇంటివిచారమును బయటి సమాచారములలోఁబడి మఱచి పోయితిమి!

## పూర్వపు పెండ్లి సమాచారము

కలిగినమేరకుఁ దిని సుట్టుగ గాపురము చేయుచుండు మేమంత మావాని విదేశపు ఖర్చులకై విరివిగ సొమ్ము వెచ్చఁబెట్టితిమి. అసలు మావానిది ధననష్టజాతకము. అబ్బాయి భూమిమీఁద అడుగు పెట్టుటయె తడవుగ మాయిల్లు గుల్లయయ్యెను! వాని భోగములకు, రోగములకు, నగలకు, నామెలకు చేసిన వ్యయములకు మితి లేదు. వాని యక్షరాభ్యాస సంపర్భమున ఊరఁగల కులమువారి కందఱికిని బంతివేసి పేదలకు అన్న వస్త్ర దానములు చేసితిమి. ఆఱువందలకఱకు లానాఁడు కర్చు అయ్యెను. వాని పదియవయేఁడు చొరఁబడఁగానే, బంధువులతోడి పెట్లాటలకును జొరఁబడితిమి! మా కోమట్లలో మేనఱికము విధాయకమైన యాచారము. పిల్లనీయమని పలుకు మేనమామకును, చేసికొన మను మేనల్లునికిని ఇదే మూఁడినదే! ఇది కన్యకామ్మవారి ఖచితమైన శాసనము. నాభార్యకొక యన్నగలఁడు. అన్నకు చెల్లెలికి పద్దుగట్టి వేసిన భగ్గుమనుచుండును. ఎన్నఁడును మాసుమ్మముత్రొక్కి చూడని మాబావమఱఁది ఒకపండుగ దినము ప్రొద్దున్నే 'శివా' యనుచుమాయింటికి వేంచేసి, తనకొమరితకామాక్షిని మాపుత్రునికిఁ జేసికొమ్మనెను! వేఁపవనె యీ తగవుల మారితో డీకొనుట కిష్టములేక తొందరపని యనిమిష పెట్టి దుకాణమున కట్టె పోయితిని. ఒక్కింతసేపటిలో ఇంటికి రమ్మనువార్త వచ్చెను. ఏమి మూఁడునో యని యింటిమొగము కాఁగా ఊరిలో సగముమంది మాకిక్కనే కూడి యుండిరి! ఇంతజనులకు నయనోత్సవము చేయుటకులెవరా యని విచారింపఁగా వివాదములు మమ భార్యయు, బావయు నాకుఁ బ్రత్యక్షమైరి! స్వభావముగనే కొంచెముగాని వారిగొంతుకలు, వాదమునకు పట్టుదల మొసఁగుటకై విజృంభించియుండెను. కులము మరియాద చొప్పునఁ గూఁతు నిచ్చెదనని యన్న తగవు. చిన్ననాఁటనుండియుఁ దనమొగముచూడని యన్నసంబంధ మనక్కర్లేదని సోదరి సమాధానము. విహితులు ప్రేరేపించుచున్న వాదములోఁ దలమార్చుటకు సేనియ్యకొనలేదు. సరిగరికన్నులఁ బడఁగనే, ఏలనో బాల్యమునుండియు నాకు నులు మనకలు గ్రమ్మును; కావున వివాదములలోనేప్రవేశమెరవారివలె నరుఁగుమీఁదనే చతికిలఁబడియుంటిని.

ఆనాఁ డెప్పటికి, ఏకీతిని, ఈతగవు తెగెనో నాకు జ్ఞప్తిలేదు. మూఁడుజాములకు పచ్చిపులుసు మెతుకులు సంజుచుంటి మనిమాత్రము నాకుజ్ఞాపకము! వచ్చినవన్నమారెడు చూపోపమియె అన్న పెండ్లి బేరపు తగవులకు గారణమని మాయూఁడువాండ్ర తలంపు. రచ్చకెక్కనంత దీని కేల తానోడఁబడఁగూడదని మెల్లఁగ నేనంటిని. ఈ తనయుఁడు బ్రహ్మచారిగ నుండినను దనకు సమ్మతమే కాని సుకిరంగు మేనును, చికిలికన్నులసొరును అఱుమునఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గొనివచ్చు నీయొయ్యారికోడలు మమ్మాఁటికిని తనకు వలదని యాయిల్లా లెలుఁగెత్తి విలపించెను! ఇంక నేమి చెప్పను?

ఆసాయంకాలము పప్పుబజారున పార్వతిగుడి సావడిని గూడిన వైశ్యమహాజనసభలో మేనత్తకమును నిరసించిన మాకుటుంబమునకు మున్నూరు రూపాయలు కులముతప్పు విధింపఁబడెను!

## సీమచదువు

నాగరత్నమిట్లు ఆజన్మమును ధనవ్యయమున కుఁగారణమగుచు వచ్చెను. ఇపుడాయన విదేశమున విద్య వెలిఁగింపఁబోయెను. కావున మేమిఁక దివాల లెత్తవలసినదే! భోజనముల కనియు, పుస్తకముల కనియు వన్నెచిన్నెల వరుసలను వాఁడు వ్యయముచేయసాగెను. రోజునకు నాలుగురూప్యము లాయన సువారమునకు సరిపోవటు! వారము వారమును గదికి బాడుగ నీయవలయునటు! ఇట్టివిచిత్రము లెచటనైనఁ గలవా? ఎంత పంపినను వానికి సంతృప్తి లేదు. ఇంక కష్టము బిగింపుట మంచిదని నేఁ దలపోసి కొంతకాలము సొమ్ము పంపలేదు. ఎటులో వాఁడు దినములు పుచ్చుచుండెనని నే సంతోషించుచుండఁగా రహస్యముగఁ దల్లి సొమ్ము రవాణ చేయుచుండెనని తెలిసినది! సంచిలాభము చిల్లికూడఁదీయునని నేఁగెతిల్లి, కాఠిన్యము మాని పిల్లవానికి సొమ్ము నంపుపని నామీఁదనే పెట్టుకొంటిని.

నాగరత్నము సీమచేరియిప్పటి కాఱునెలలైనది. సెలవులలో దేశమునకు వచ్చెదనని వాఁడు వ్రాయఁగా ప్రయాణపు కర్చులకు పైకమంపితిని. అతఁడు బయలుదేర సిద్ధమైనను యుద్ధసమయమగుటచేత ప్రయాణికులు పోఁగూడదని ప్రభుత్వమువారు ప్రచురించిరఁట! అందువలన మా కెంతో యాశాభంగము గలిగెను. దీనికిఁదోడు జర్మనులు పట్టణములమీఁద బాంబులు వేయుచును, ఓడలు ముంచుచును జననాశనము చేయుచుండిరని పత్రికలలోఁ జదివి యలజడి పడితిమి. మనోవ్యధచే గృహిణి మరల మంచమెక్కెను. అంతటఁ గడచిన యాఱుమాసములును మాకు ఆరుయుగము లయ్యెను. ఎట్టకేలకు నాగరత్నము బొంబాయిలో దిగెనని తంతివచ్చెను. ఒకటి రెండు దినముల కాతఁ డింటికి వచ్చునని మేము సంతోషమున మిన్నందితిమి. ఏదో యుత్సవమునకు వలె అమితోత్సాహమున వాని రాకకై పనులు చేసితిమి. వచ్చినపుడు ఆనవాలు పట్టలేనట్టుగ వాడు కనఁబడెను. తొడిగిన షరాయి, పెంచిన క్రాపుజుట్టు వానిపొడుగును మరింత పెంచెను. మాటలలోను,చేష్టలలోను వాఁడు పరదేశీయునివలెఁ గానవచ్చెను. కానవచ్చినతోడనే వాఁడు తల్లి కౌఁగిటఁ జేరెను. గండముదాఁటిన కసుగాయనువలె అక్కునఁజేర్చి వానిని అమ్మ ముద్దాడెను, నేనును గన్నీరాపుకొనలేకపోతిని. మాముద్దుబిడ్డను మరలఁ జూచుకొని బ్రదుకు సార్థకమైన దనుకొంటిమి.

నాగరత్నమును జూచి పోవుటకు పెద్దపిన్నలు మాయింటి కేతెంచిరి. మాసుతుఁడు సరసల్లాపములునలిపి వచ్చినవారి యభినందనములఁ బడసెను. లోకసామాన్యమగు మార్గమునంబడి నేఁటికి ధన్యుల మైతిమని ముదమందితిమి.

ఒకనాఁటిరాత్రి దుకాణము కట్టి కొంచెము చీఁకటి పడినపిమ్మట నే నింటిత్రోవఁ బట్టితిని. ఇద్దఱు చిన్నవారలు నాముందు సంభాషించుచు నడచుచుండిరి. వారు మాకుమారుని గుఱించియే మాటాడుకొనుట గ్రహించి ఎఱుఁగని వానివలె వారిప్రసంగము వింటిని:—

మొదటివాఁడు "డబ్బు తగలవేసి అబ్బాయి తుదకు అబ్బయిల్లు పట్టినాఁడు! ఇఁక నిదేకదా సౌభాగ్యము!"

రెండవవాఁడు "ఇంకే భాగ్యము కావలయును? నేఁడు చదువుచున్నాఁడు, రేపు సంపాదించి సంచులు నింపుతాడు!"

మొదటి—"వాఁడి చదువు సన్నగిల్లినట్టున్నదిలే!"

రెండవ—"చదువేమీ పట్టుపడడము లేదా?"

మొదటి—"అయ్యగారి కిప్పటికి పట్టుపడిన వేమంటే,

బిస్కట్లు – మెక్కడము!
విస్కీలు – వేయడము!
సోడాల – చొక్కడము!
బీడీల – పీల్చడము!"

రెండవ—"నీమాటలు విని జ్ఞాపకము వచ్చినది. ఏమిటి, సీమవెళ్లి నానాకూళ్లు గుడిచివచ్చిన కుఱ్ఱవాని నింటఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జేర్చుకొని మెపలుచున్నాఁడు, పెద్దసెట్టి! ఇట్టివర్ణసాంకర్యాలు కోమట్లు కండ్లుమూసికొని కాచుచుంటే వలసినదేనా?"

మొనటి—"దానిని సహించియేకదా యీరెండు రోజులును పప్పుబజారులో మనవారు చర్చచేస్తున్నారు! కొడుకును వెలివేసిన చాలునని కొందఱును, అందఱును ప్రాయశ్చిత్తము చేయించుకొని కులము తప్పు కట్టవలెనని కొందఱును అనుకొనుచున్నారు. పిల్లవానికి ప్రాయశ్చిత్తము చాలదనియే పేరిశాస్త్రిలు చెప్పుచున్నాఁడు. ఒకటి నిశ్చయము: ఈపర్యాయము పెద్దకోమటిపని గట్టిగ పట్టించెదరు!"

పరిస్థితు లిట్లు చల్లగ గ్రహించి నాముందుజాగ్రత నే బడితిని. కన్యకామ్మవారి యాలయములో మూఁడు నాళ్లు అభిషేకము చేయించితిని. పెద్దదక్షిణలిచ్చి బ్రాహ్మణసమారాధన జరిపించితిని. పేరిశాస్త్రిలకు కాశ్మీరశాలువయు, వైశ్యపత్రికకు పోషకవిరాళమును సమర్పించి మనోరథ సాఫల్యము నొందితిని.

## తులసీరాముని దురవస్థ

ఇదివఱకు చదివినచదువు చాలనియు, దీనివలన మా వైశ్యకులమున కఖండకీర్తి యాపాదిల్లుననియు నే బోధపఱచితిని గాని నాగరత్నమునకు నామాట నచ్చలేదు! ఇంకనుజదివి పెద్దపరీక్ష నీయవలెనని వాని పట్టుదల. విద్యకు మితియేమి? చదువు జూదమువంటిది. ఆడినకొలఁదిని జూద మాడఁగోరుచుందురు; చదివినకొలఁదిని చదువవలెననియే యుండును.

మఱల నాగరత్నము సీమప్రయాణము చేసి యాఱు నెలలాయెను. క్షేమసమాచారములు సరిగఁ దెలియుచుండుటవలన బిడ్డనుగూర్చి యీసారి మేము బెంగపెట్టుకొనలేదు. వాని సీమప్రవాసదినములన్ని యిట్ులే జఱిగిపోవునని యెంచితినిగాని విధి దానికిఁ గొంత విఘాతము గలిపించెను. ప్రాంతపట్టణ వాస్తవ్యుఁ డొకఁడు దేహస్వాస్థ్యము తప్పి యిటీవల యిల్లుచేరెనని తెలిసి వాని నుండి మావాని సమాచారములు వినఁగోరి యచటి కేగితిని. తులసీరాముని తలిదండ్రులు సామాన్యస్థితివంతులు. ఇంటఁ జెప్పకుండ మావానివలెనె కొంతకాలము క్రిందట విదేశమునకేగిన పుత్రుని విద్యాపోషణమునకై వారు పుస్తెయు, పూసయు నమ్మివైచిరి! ఐనను ఏనాటికిని వాని చదువు సాంతము గాలేదు. ఎన్నఁడును వీథిమొగము చూడని యాగృహస్థు లంత సుతునివిద్యకొఱకై యింటింటికినిపోయి తిరిపమెత్తిరి! ఎట్టకేల కీఁక నాలుగేండ్లలో పిల్లవాఁడు విద్యాపరిపూర్తియై యిలుచేరునని తెలిసి తమ కష్టములుగట్టెక్కెనని వారెగిరి గంతిడిరి. కాని యొక వారమువచ్చిన జాబున కుమారుని శరీరమున నలఁతగనున్నదని తెలిసి వారు తహతహపడిరి. మఱువారపు లేఖలో, బొత్తిగ దేహస్వాస్థ్యము చెడుటచేత దేశము వెడలి పొమ్మని వైద్యుఁడు చెప్పెననియు, తరువాత వారమున నెడలు పొగయోడలో బయలుదేఱుదుననియు చిన్నవాఁడు వ్రాసెను. బొంబాయిరేవుననే వానియసువులు వాయునని వారు భయమందిరి! ఎటులో ప్రయాసముతో వాని నిల్లు చేర్చిరి.

ఇపు డాతని నేనే చూడఁబోయితిని. ఆ దీన కుటుంబికులను జూచి మిగుల విచారపడితిని. పిల్లవాఁడు మంచమునఁబడి మూలుగుచుండెను. అతఁడు మిక్కిలి చిక్కియుండెను. కనులు దించుకొనిపోయి, మోము చూచుటకు సంతాపకరముగ నుండెను. తాను వచ్చినప్పుడు మావానిని జూచితిననియు, వానికి సేమమే యనియుఁజెప్పి, యంతకంటెఁ బలుకుట కతఁడు త్రాణలేక యుండెను.

మఱల కొన్నిదినములకు నే వానిని చూడఁబోయినపుడు, వానిదేహమునఁ గొంత జవచేరెను. మొగము తేటపడెను. కనులు కాంతిమంతము లయ్యెను. మంచము వదలి వాఁడు పడకకుర్చీలోఁ గూర్చుండెను. నేనిచ్చిన ద్రాక్షపండ్లగుత్తి వాఁడు వాడినతనహస్తమున నందుకొని, మందహాసమున నాకు వందనము లర్పించెను. తొలకరివానకు తెప్పిరిలు పూలమొలకవలె నుండు నాయువకుఁడు నాకుశలప్రశ్నములకు సమాధానము లిచ్చి, నవ్వుమొగములో నాయభినందనము లందుకొనెను.

## ఇంగ్లండులోని హిందూయువకులు

తులసీరాము స్వతస్సిద్ధముగ బుద్ధిబలము గల వాఁడు. చదువునందలి తెలివి తేటలేకాక, లోకపరిజ్ఞానమందు చతురతతో నొప్పెడివాఁడు! నే నడుగఁగా,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీమలో హిందూవిద్యార్థులు మెలంగెడి రీతి నాకిట్లు వర్ణించిచెప్పెను:— "తలిదండ్రుల చాటునను, బంధుమిత్రులయండను దినములుపుచ్చు హిందూయువకునికి సీమ ప్రవాసము మొదటిదినములలో చెఱసాల జీవితమువలెఁ దోఁచును. ఎడతెఱిపిలేని జనసంకులమున వీని క్షేమ మారయు పాప మొక్కరును గట్టుకొనరు! ఎచటఁ జూచినను విసుఁగువిరామము లేక, కనులఁ జెల్లని మానిసియాకారములె కాని, చామనిచాయ మేనులు మచ్చునకైనఁ గానరావు! ఒకవేళ నేనీక్షించుచున్ నల్లని యొకమోము గనపడినను, అదిఁ డేపశ్చిమ ఇండియాదీవులవాఁడో, ఏ యాఫ్రికాదేశీయుఁడో యగును! భారతీయుఁడైనను లాభమేమి? పంజాబీయుఁడు, అస్సామునివాసుఁడును గానవచ్చిన మనకేమి యొలుగును? శ్రవణసుఖముగా తెలుఁగుమాటాడి, మనకష్టసుఖము లారయువారలు సీమలో నెందియరును! అచటికేఁబోయిన చాలకాలమువఱకును, మనబాలురు ఇంటిమీఁద బెంగపెట్టుకొని, లంకణము లున్నప్పటివలె శుష్కించి పోవుదురు!

"వారు చేయునవి నిజముగ లంకణములే! మల్లెపూవువలె మిలమిలమను వరియన్నము, కమ్మఁగఁ గాచిన నేయిమీఁ గలుపుకొని, తమకమున భుజించుదినము లెన్నటికిఁ గాంతుమా యని తెలుఁగుబాలు రవుట పలవించుచుందురు! చప్పనిపూరలు, చవిసారములు లేని చారుపులుసులును జిహ్వను జంపివేయునట్లుండును. ఏమాత్ర మేమఱినను, మాంసపుముక్కలు, చేపపిల్లలును నోరుకకడ్డము పడుచుండును! మాంసభక్షకులకు నైతము ఇంగ్లీషువారి పూరలు రుచిలేక బెండువలె నుండును. కావునఁ గొంతకాలమునకును అన్నము నిడిచి, చిఱుదిండికై మన చిన్న వారు లండను చెరలాడుచుందురు! పానీయముల సంగతి యిఁకఁ బ్రస్తావింపనక్కఱలేదు. మనము నేయిమజ్జిగలు వాడునట్లె వారు ద్రాక్షారసాయనములఁ గ్రోలుచుందురు! తరతరములనుండి యివి యాదేశీయుల కనువు పడియున్నవి. వీనిసారస్యము గ్రహింపక, మనవారుకొందఱు మితిమీఱి, పానీయములే పరమావధిగ భ్రమించి, యారోగ్యమును గోలుపోవుచున్నారు!

"తినుట కాహారమును, కట్టుటకు గుడ్డయును తగినట్లుగ దొరకక, మనబాలురు కొందఱచట అల్లాడుచున్నారు. చౌకబాటుగ యని తేమయూరు చీఁకటికొట్లలో నివసించి, పలువురు క్షయమొదలగు వ్యాధుల వాతఁబడుచున్నారు. తగినంత డబ్బులేక సీమలో నివసించుట వట్టిబుద్ధిహీనత! ఎంతసొమ్మైనను ఆదేశమునఁ జాలదు. కావుననే సీమపోయిన వారిలో నింతమంది ప్రబలరోగపీడితులై నావలె నిలుచేరుచున్నారు!" పాపమాయువకుఁడు, ఆంగ్లేయదేశజీవితమును దెలుపుచు తన సంగతి జ్ఞప్తికివచ్చి, కంట నీరుపెట్టుకొనెను.

ఇంకొకపరి యాతఁడు నాతో మాటాడుచు, "డబ్బులేక కొందఱును, డబ్బు ఎక్కువయై కొందఱును, మన యువకు లాదేశమునఁ బాడగుచున్నారు!" అని నుడివెను. ఇది యెట్లని నే నాశ్చర్యపడఁగా, ఆతఁడిట్లు ప్రసంగించెను:—"ఆంగ్లేయదేశము అనుభవము చాలని హైందవయువకుల యంపశయ్య! నిషిద్ధాహారపానీయముల రుచిమఱఁగి కొందఱును, రంగుదుస్తులు సింగారించుకొని, నెపలినడకలు నడచికొందఱును, స్త్రీలోలత్వమునఁ దవిలి కొందఱును, ఆదేశమున మనబాలురు మితిలేనివెతల నొందుచున్నారు! మన దేశాచారములకును, అచటివానికిని బోలికయే లేదు.

"ఆంగ్లేయదేశమున యువకులును యౌవనవతులును గలసిమెలసి యుండవచ్చును. జవ్వని సవయస్కునితో ప్రసంగించి, షికారుపోయి, వేడుకలు వీక్షింపవచ్చును. ఏ దేశమందును మంచిచెడుగులు మిళితమైయుండును. స్వదేశాచారము లెఱుఁగియున్న వారగుటచేత ఇంగ్లీషుయువతులు యుక్తాయుక్తములు గ్రహించి మెలఁగనేర్తురు. విదేశీయుల కిట్టి వివేకపరిజ్ఞానము లుండుట కష్టము. వారి స్వల్పలోకానుభవము గాని, వేలకొలఁది మైళ్లదూరమున నున్న పెద్దలభయముగాని, కాముకశోధనలబారినుండి వారలఁ గావనేరదు! నవమల్లికాశోభను హసించెడి విదేశసువాసినుల శరీరసౌకుమార్యముమందర, యువభారతీయుని నవనీతహృదయము సులభముగఁ గరఁగిపోవుననిన నేమి యాశ్చర్యము! ఆంగ్లేయ సుందరుల మందహాసములు, వారల ప్రసన్నవదనములును, దేశాచారసంభవములనియు, నైసర్గిక స్వాతంత్ర్యతా చిహ్నములనియు భావింపక, అవియన్నియు తమహృదయాకర్షిమై యవలంబనముగఁ జేకొనిన



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పలుపుచేడియల శృంగారచేష్టలని భ్రమించి, మన యువకులిట్టు మోసపోవుచున్నారు!"

## ప్రణయ పరిణయములు

నే నింటికి వచ్చునపుడు, ఏలయో కాని, తులసి రాముఁడు చేర్కొనిన సీమలోని 'ప్రణయ' సమాచారములు నా మనసునకు మరలమరల ములుకులవలెఁ దగులుచుండెను! ఆంగ్లేయాంగనల ప్రేమపాశములఁబడి నాగరత్నము మానధనాదులను గోలుపోవుచుండుట లేదుగదా! చిన్ననాఁడె వానికి వివాహము చేసిన నిట్టి ప్రమాదములు ప్రాప్తించియె యుండవు! సీమనుండి వాఁడు దేశము వచ్చిన తరుణముననైన వాని వివాహవిషయము మా మనసుల కేలపట్టలేదు? దారిపోవువనను, చెట్టుచెట్టనను, నాగరత్నమును తమవలలో వేయఁజూచు సీమసుదతులవదనకమలములు నా కన్నులకుఁ గన్పట్టుచుండెను! ఈసమయమునఁ జిక్కువానికి మే మేమి సాయము చేయఁగలము?

నే నిల్లు చేరునప్పటికి సీమటపాలు వచ్చియుండెను. నాగరత్నము నాకు వ్రాసిన పెద్ద యుత్తరము చదువుచు నేనట్టె కూర్చుంటిని. అందలి సమాచారముల మీఁద మాత్రము నా బుద్ధి యేమియు పోక, పంక్తిపంక్తినడుమను వ్రాయని వాని ప్రేమసమాచారము గోచరమగుచున్నటు లుండెను. అరగంటసేపు చదివినను, అందలి సంగతి యొక్కటియు నా తల కెక్కలేదు. భార్య పండుకొని యుండిన గదిలోని కా యుత్తరము కొనిపోయితిని. ఆమెకుఁగూడ తనయుఁడు పెద్దకమ్మ వ్రాసెను. లేఖ చదువుకొనుచు నామె నారాక గ్రహించి, ఏలయో కాని నా కన్నులఁబడకుండ దానిని పలుపుగ్రిందఁ బడవైచెను! పలుపుమీఁద నాకొక చిత్తరువు గానిపించెను. అందొక తరుణి పూఁబొదరింటఁ గూర్చుండి మందహాసము చేయుచుండెను. ఇది యెక్కడిదని నే నడుగఁగా, నాలుకతడబడి యామెలఁత నిరుత్తర యయ్యెను! అబ్బాయి పంపెనా యని యడుగఁగా, ఔనని తలద్రిప్పి, కాదని నోటనుచ్చరించెను! నాసందియములు హెచ్చినను ఆయబలను తొందరపఱచిన లాభము లేదని గ్రహించి కూర్చుండుమని చెప్పి నాకు పిల్లవాఁడు వ్రాసిన జాబును సవిస్తరముగఁ జదివి వినిపించితిని. ఈమా రా లేఖలోని విషయములు నాకు బోధపడినవి కాని, యం దేమియు విశేషములు గానిపింపలేదు. "నాకుఁగూడ నిటులె వాఁడు వ్రాసె"నని యామె పలికి "ఇంకేవో యొకటిరెండు విశేషములు మాత్రము ఉన్నవి లెండి!" అని చెప్పి అవి యేవో చేర్కొన సందేహించెను.

"కమ్మ కేమిగాని ఈబొమ్మ ఎవరిది, మహాలక్ష్మీ" అని నే నడిగితిని. "అదా! దానికీ, మనవానికీ ఏమీ సంబంధము లేదులెండి!" అని యాస్త్రీ తొట్రుపడుచు పలికెను. ఆమెయవ మొగమునిండ చిఱుచెమటలు పట్టెను. విషయము మార్చివైచినఁగాని యలజడితగ్గి తిన్నని సమాధాన మీమె యొసఁగదని నే నెంచి, "ఐతే, మహాలక్ష్మీ! ఇంతసేపటినుండి నీవు భోజన మేల చేయకుంటివి. తిరిగి పడవచ్చును సుమీ!" యని యౌదార్యమాటలంటిని. "ఒక్కతెను గూర్చుండే అన్నము లోనికిపోదని, మీరు వచ్చినదాక వేచియుంటిని. కొంచెము పైత్యముగా నున్నది! ఇక భోజనము చేదాము!" అని పలికి యాయంగన భోజనప్రయత్నమునకై వంటయింటి లోనికిఁ బోయెను.

స్నానము చేయునంత సేపును కోపములో నేను, "ఔను, పైత్యము నీకే కాదు, నీకడుపునపుట్టినవానికిని! ఒక్కకొడుకును తనుదునని పరదేశమంపి, అక్కడ వారిచేత ఆటలాడించుచున్నదే యీయాఁడుది!" అని నే మనసున ననుకొంటిని. ఇపుడు నాకంటఁబడిన యా చిత్తరువు అతగాని యేదిటకత్తెదోకదా!

భోజనసమయమందుసయితము నాకనుపుమంట చల్లారక, మౌనమూనియె యుంటిని. నన్ను మఱింపనెంచి మహాలక్ష్మి, పుత్త్రికనిగుఱించి కొంత యప్రస్తుతప్రశంస గావించెను. ఎట్టకేల కావన్నెలాఁడి, తనసుతుఁడు సీమలోని సత్కుటుంబముల వారలతో నేస్తము సలుపుచున్నాఁడనియును, సత్సాంగత్యమున శుభము లనేకము సమకూరఁ గలవనియును దేల్చెను! చిత్రములోని స్త్రీ యెవరని నే నడుగఁగా, అట్టి కుటుంబములలోని కన్యయే యని యాకలికి పలికెను! మితభాషిత్వమున నన్నెవరును మించఁజాలరు; ఆగ్రహపరవశత్వమున మాత్రము నానోటి కడ్డు లేదు! అంత నే నిట్లంటిని: "మహాలక్ష్మీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నీకొడుకు గొంటుతనమును నీవిట్లు కప్పిపుచ్చరాదు! వానిని భ్రష్టునిచేసెదవు సుమీ!"

సతీపతుల కంత సుతునిగుఱించి వివాదము జరిగెను. ఏసీమకో మఱి యురులనో దవిలి, కొమరుఁడు వంశము వన్నె వాపుచున్నాఁడని పెనిమిటి పలవరము! చాఁప చిరిఁగినను చదరంత యుండుననియును, నీతినియమమునఁ దనయుఁడు తండ్రికిఁ దీసిపోఁడనియును, సతి సమాధానము! ఆఁడుదానిరాకడ బాగుగ లేదని కోపించి, యన్నము దగ్గఱనుండి నేనంత లేచిపోయితిని. కొమరుని బాసిన దీనను దన నిటులు పతి గాసిపెట్టుచున్నాఁడని గృహిణి ఘోషించెను!

తులసీరామునికి ధూపము వేసిన మావానిగుట్టు బయలు పడునని యోజనచేసి, మఱునాఁడు ప్రొద్దుననే వానిని మరలఁ జూచితిని. మార్గమున సతి చండితనమును దలపోసినకొలఁదిని నామనసు దహించుకొని పోయెను! పెనిమిటి చిన్ననాఁటి చీఁకటితప్పులు త్రవ్వి, ప్రయత్నపూర్వకముగ నేల యీబాలు వానిని వెలి కీడువలయును? తన తనయునివలె నతఁ డెన్నఁడును, అంటరాని విదేశాంగనల వెంటనంటి కాలము గడుపలేదులే!

మరల తులసీరాము చెప్పినదానిని బట్టి, ఇటీవల మిత్రులు నాగరత్నమునుగుఱించి యనుమానపడిరఁట! ఐనను వానియౌదార్యవితరణములే వాని దలగాచెను. ఏదియెటులున్నను, నాగరత్నమునకు నిపుడు వేరువ్యాపకములందు దిగుటచేత, స్నేహితులు వానినిగూర్చి వ్యసనపడిరఁట!

ఇంటినుండి రహస్యముగ నేఁగొనిపోయిన నిన్నటి ఛాయాపటము నంత జేబులోనుండి తీసిచూపఁగా తులసీరాము నవ్వి, "ఇఁక లోకవిదితమైన విషయమును నే గప్పిపుచ్చనేల? నాగరత్నము నన్నొకనాఁడు తీసికొనిపోయి తన యీప్రేయసిని జూపించెను. వారి వివాహలగ్న మీపాటికి స్థిరమై యుండవచ్చును. త్వరిత కాలములో మీవాఁడు బారిష్టరై భార్యతో స్వదేశము రాఁగలఁడు. సుశీలయగు సుందరి కోడలైనందుకు నా యభినందనము లందుకొనుఁడు" అని పలికెను.

మాఱుమాటాడక, నే నింటికి బైట వచ్చితిని. సతితో దీనినిగుఱించి ప్రస్తావింపలేదు. మరల మావానికి నాచేతులతో సీమ కుత్తరము వ్రాయనైనలేదు. నీతి మరియాదలు నీటఁగలిపిన పుత్త్రికునితో నుత్తరప్రత్యుత్తరము లెట్లు నడుపుదును? ఎందునకైన మంచిదని తులసీరాముచే తుది కమ్మ వానికి వ్రాయించితిని. నాగరత్న మిపుడు బాగుగ నొకటిరెండుసంగతు లాలోచించుకొనవలయును. అతనికిఁ గావలసినవారు హూణజాణయా, ఆ జన్మమును అధికానురాగమునఁ బెంచిన జననీజనకులా? కన్నతండ్రి కాలము వారిలో తలయెత్తి తిరుగవలెనని కొమరునికిఁ గోరికగలదేని అన్యదేశాంగన హస్తములనుండి యతనిని విడిపింప వేలకొలఁది ద్రవ్యమునువలసినచో వెచ్చించుటకు తండ్రి వెనుదీయఁడు!

## న్యాయవాది నాగరత్నము

వ్యవహారము లింతముదిరినపిమ్మట నిఁక బాధపడుదునా? సీమ వివాహమునుగుఱించి తల్లియు తనయుఁడును మొదటినుండియు మనసు దిట్టపఱచుకొనిరని నా యనుమానము! దీనికేమిగాని నాకు గుట్టేమియుఁ దెలియనీయక, కొమరునికి నాధనము కొల్లగొట్టి పెట్టిన చతురను గుఱించియే నాయాశ్చర్యము.

కొన్ని నెలలలోనే న్యాయవాదిపట్టాచేకొని నాగరత్నము స్వదేశమునకు వచ్చెను. కొంతకాలమునుండి మా కుత్తరప్రత్యుత్తరములు లేవు. ఐనను తండ్రిని నేనుబ్రదికి యుండఁగనే దిక్కులేనివానివలె నతఁడు పురమువెలుపలి రహదారి బంగాళాలోఁ బ్రవేశింపనేల? తెల్లదొరసానిని కూడఁ గొనివచ్చినందువలన నని యందురేమో! తెల్లదైనను, నల్లదైనను కులాంగనకాని కోమలి కులటయె యనిపించుకొనునుగదా! నాసూత్రమవలంబించినచో కులము వారివలన మావాని కేయిడిదుడుకులును వచ్చియుండవు. కాని నాసుతుఁడు సతినిబట్టి యూరేఁగుచు, పట్టమహిషినివలె నామెను బూజించుటవలననే, ఇప్పటికిని నేను వంచినతల నెత్తుకొనలేదు!

ఇఁక నాగరత్నము మొగము చూడనని నే నొట్టు పెట్టుకొంటిని. వాఁడు గ్రామముచేరిననాఁడు ఊరందఱు వానియొద్దకు రాకపోకలు సల్పినను, నేను దుకాణము కట్టివైచి ముసుఁగుపెట్టుకొని యింటనే పండుకొనియుంటిని. సాయంకాలమపుడు "నాయనా!" యను మాట వినఁబడి "ఎవ"రని నే ముసుంగు తీసిచూడఁగా కుమా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుఁడువచ్చి నన్ను గౌఁగలించుకొనెను. వికసించిన నంది వర్ధనపుష్పమువంటి వదనములో వెలయు విదేశ వనిత యొక్క తెల్ల ముందుకువచ్చి వచ్చితిరా యని ముద్దుపలుకులతో "వందన"మనిపలికి నాపాదములకుఁ బ్రణమిల్లెను. వినయ లావణ్యము లావలఁది మోముఁ దమ్ముని వెలుఁగొందు చుండెను. లేవనెత్తి నేనామెను భాంగి నాశీర్వదించిననుక, ఆకోమలి నాకోడలని యపుడే యింగ స్థలము నలంకరించిన మహానటి యత్త పలికెను! ఇట్టి గుణవతి కోడలగుటవలన నేమి నేగి యని లోలోన నే ననుకొన్నను, స్వాభిమానమున మానవుఁడు వహించిరే యంటని!

ఇప్పటికి నాగరత్నము దేశముచేరి నాలుగైదేం డ్లయినది. అవనిమీఁద నాకింకను గినుక పోలేదు. ఉద్యో గము పురుషలక్షణమని శాస్త్రవచనము. ఈపాటిపరీక్ష నిచ్చిన వాఁడింపత్తో దేశమున డిప్యూటీకలెక్టరు పదవి నందియున్నారు. కాని, అబ్బాయికిమాత్రము స్వాతంత్ర్య ఠేయం దప్పునాఁట! గోళ్లు గిల్లుకొనుచు, ఆరి కెదురుగ నింటఁ గూర్చుండియున్నాఁడు! ఆఁడు పిల్లయైనచో నూరకయుండదా యని నే మనస్సు కొంతసమాధాన పఱుచుకొనుచున్నను, విదేశవనిత భార్యయైన పాపమున కీఁడింటనైన మాతోఁగలసి యుండఁగూడదుకదా! భార్య మాత్రము పతివ్రతా. మఱియొకయాంగ్లేయ మచ్చెకంటి యైనచో, సంవత్సరమున కాఱునెలలు సీమయందును, ఆఱునెలలు ఊటకమండలమునను మకాముచేసి తనలంగా లను, సెంట్లుసబ్బులను పతి నీపాటికి తాకట్టుపెట్టదే యుండును! "రోజా"మాత్రము రోజాపూవువలెనే తన సౌమనస్యమును వీడక మెలఁగనేర్చిన మెలఁత! ఏలయన్న సాధ్వీమణి మనపుణ్యభూమిని గాక శ్వేతద్వీపమున నుద్భ వించెనాయని నేనచ్చెరువొందుచుందును. మనుమరాండ్రి ద్దఱును మాపోలికయే. మిన్నిని నేను మణియని పిలిచి దానికి పద్యములు నేర్పుచున్నాను. లిజ్జీ మిగుల సొగసు కత్తె. దీనికి నే బెట్టిన ముద్దుపేరు లక్ష్మి. వీరువ్రతిని విడిచి నే నొకగంటయైన నుండలేను! ఇటీవల నామన స్సున నొకసంకల్పము గలిగినది. మాకులమువారిప్పుడు సంఘసంస్కరణము నాదరణము గలిగియున్నారు. వివాహ శాస్త్రధర్మకర్మ వర్ణసాంకర్యములు నాకసమ్మతములు! శాస్త్రోక్తముగ మా ముసలాఁడువారలకు ప్రాయ శ్చిత్త మిప్పించి, వారిని వైశ్యకులమున జేర్పింపుఁడని శ్రీ శ్రద్ధానందస్వాములవారిని వేడితిని. ఆసమయమున నిచ్చు భూరిదక్షిణలకై సొమ్ము కూడఁ బెట్టుచుంటిని. ఆమహా మహుని యాకస్మికమరణమున నాయుద్దేశమున కంత రాయము గలిగినను, ముందైన నాసంకల్పము నెఱవేర్చు తీరెదను!

---

# సూర్యోదయము

జి. జాషువకవి గారు

యమునిఁ బుట్టించి లోకము నేచు వీరుండు, పక్షికూతలు మెచ్చు పండితుండు
నీరదంబును చేయు గారడీపనివాఁడు, నీడకన్నియను బొంబెడువిటుండు
కలువకన్నులుమూసి గాసింపఁగలదిట్ట, నిప్పుబట్టలు దాల్చు నీటుకాఁడు
మరణించి జన్మించు వరమున్న మొనగాఁడు, మింటినిఁ బాలించు వేఁటిరాజు
కాలుధించని గగనజాంఘాలికుండు, ప్రేమికులను గాచి కాపాడుబంటు
తూరుపుదెస పాలంతుకయంకమునకు నెక్కి, వేగ దోగాడె నలప్రొద్దు పిల్లవాఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ఆంధ్రాయూనివర్సిటీ పట్టుదలలు

భమిడిపాటి కామేశ్వరరావు గారు

[5-3-27 తేదీని సర్. బి. యన్. శర్మగారి అధ్యక్షతకింద, రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో, పాతవిద్యార్థిసంఘము తరఫున, జరిగిన సాంవత్సరిక సమావేశ సందర్భములో, ఒక విద్యార్థి చదివిన వ్యాసము].

నవ్వించడం అంటే: మొత్తంమీదతిట్టడం, ఏకడం, దెబ్బలు తియ్యడం అనే ఉద్దేశం ఉంటూనే ఉంటుంది. కాని, అది హృదయంలేని ఉద్దేశం. నవ్వించడం అంటే కొన్నిలోట్లు కనపరచడం అనికొంతమంది ఉద్దేశం కాని, అది వివక్షతలేని వెర్రిఉద్దేశం. నవ్వించడం అంటే ఒకర్నే బాధించడం అని కొందరి ఉద్దేశం కాని, అదీ సానుభూతీ సరసం లేని ఉద్దేశం. కొన్ని నిముషాల పాటు అందరూ, ఒకే విషయం, సరదాగా, ఆలోచించుకోవాలనే ఉద్దేశం తప్ప, ఇతరమేమీ నాహృదయంలో లేదు. ఆంధ్రులకందరికీ సామాన్యమైన విషయం "ఆంధ్రాయూనివర్సిటీ" గనుక ఆమాటలే నాలుగు అనుకుందాం. ఆసంస్థప్రశంసనీయం. దానికోసంచేసి చేస్తూన్న ప్రయత్నాలు గొప్పవి. ఇప్పుడు ముచ్చటించేది, ఏతద్విషయం ఈమధ్య యావన్మందీ కనపరచిన పట్టుదలలు మాత్రమే.

అంధ + ర = ఆంధ్ర, అనేపదం చిరకాలంనించి అమలులో ఉంది. ఆంధ్రపత్రిక, ఆంధ్రమహాజనసభ, ఆంధ్రమహాసభ, ఆంధ్రులచరిత్ర లాంటివీ—అన్నట్టు మన ఆంధ్రసాహిత్యపరిషత్తు లాంటివి ఆవిర్భవించి ఆందోళన చేసింతరవాత—ఇంకా చెప్పడానికి అలవిలేనన్ని ఇతర సంస్థలు: అభినవాంధ్రమహాదోషాల ప్రత్యేక సమిష్టి, ఆంధ్రమహా-ప్రతీవార్లా—అద్వితీయసభ—మొదలైనవి ఆర్భాటం జరిపి ఆంధ్రులవ్యక్తి ఆంధ్రుల లేడాభా కనపరిచిన తరవాత, ఇన్నాళ్ళకి, ఆంధ్రాయూనివర్సిటీ— (దీనికోసం ఆదినిపించినవారు కొంచెం ఎడంగా ఒత్తిస్లిన తరవాత) అవతారమెత్తింది. ముందుసూచనలు లేందే అవతారం అమాంతంగా రాదు. ఇది పుట్టవలసినంత అవసరం ఉందోలేదో చూడమని పైవారు మొదట ఓకమిటీని ఏర్పరచారు. "ఆ కమిటీలోకూడా బొత్తిగా నాన్-ఆంధ్రుల్ని వెయ్యాలీ?" అని కొందరు ఆంధ్రులు పైకి కనపడనీకుండా "హిడెన్ బ్రాకెట్సు"లో కోప్పడ్డారు. ఆ కమిటీలో వట్టి ఆంధ్రులేకాక, ఇతర మహమ్మదీయ ఐరోపియ సోదరులుండబట్టే, వారంతాకలిసి, ఇది పుట్టితేగాని వీలులేదనీ దీన్ని ఆంధ్రదేశంలోనే పెట్టాలనీ, ఆంధ్రులకి ఆంధ్రభాషయందుండే అభిమాన పులోతు కొలవడానికి గొలుసులేదనీ వగైరా విశేషాలు ఉదారస్వభావంతో నిష్పక్షపాతంగా తీర్మానించారు. ఆ కమిటీలోనే ఇతరులు లేకుండా అంతా కేవలాంధ్రులే అయి ఉంటే, ప్రతీవాడూ వేరేమంచివాడే అయినా, వేరే ప్రతివాడిహృదయంలోనూ ఎంత ఇష్టం ఉన్నా, ఏ ఇద్దరికీ భర్జింపక, అప్పుడే శిఖపట్లగోత్రంలోకి దిగి, మొదటి తీర్మానం—"ఇది తక్షణంకావాలి కాని, ఈ ఆంధ్రాయూనివర్సిటీ ఆంధ్రజిల్లాలలోతప్పించి మరోచోట పెడితేగాని మావాళ్లు సాగ్గించరు. మాసంగతీ, మామజాకా, మీ రెరగరు" అనిచేసి ఉండేవారు. ఆ అవాంతరం తప్పింది. పోనీ ఆ కమిటీవారే "ఇది తప్పని సరిగా ఫలానా గ్రామంలో పెట్టాలి" అని తీర్మానించి, అదిపైవారితో చెప్పి ఓశాసనం చేయించి పారేయ్యవలసింది. ఎంచేతంటే, హెచ్చుతగ్గయితేబుర్ర ఊడిపోతుందే మోరా బాబూ అనిపించే శాసనం ఒక్కటేమాత్రం విధి అనుకుని శిరసావహిస్తాడుగాని ఆంధ్రుడు, పెక్కైన ధర్మాలూ వగైరాలు అరిగానికి నిషేధాలే—అనగా జాంతేనయ్! అల్లాకాక; కమిటీవారు కొన్ని క్షేత్రాలు జాబితారాసి, వాటి ఔన్నత్యాలు చేరీజుచేసి, కొన్నిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టిని తోసిరాజని, "తక్కిన క్షేత్రాలు ఇల్లా ఇల్లా ఉన్నాయి. మీ చిత్తం వచ్చినచోటు క్షేత్రం చేసుకోండి" కేంద్రంచేసుగోండి అన్నారు. "మీ చిత్తం" అని ఆంధ్రులికే ఏదేనా వదిలిపెట్టి ఊరుకున్నప్పుడు, ఆంధ్రులకి తాత్కాలికావేశం బయలుదేరం తప్పదు! మెట్టుకి యూనివర్సిటీ ఇవ్వడం యూథే అన్నారు. యూనివర్సిటీ అనేటుక్క ఇంగ్లీషుగా ఇండియాకి వస్తూ సిపాయ్ మ్యూటినీ యేడే. కాని దాని భావం హిందూదేశానికి కొత్తగాదు. చాణక్యుడు తక్షశిలా విద్యాపీఠంలో చదివాట్ట, నాలందా విశ్వవిద్యాలయానికి ఇతరదేశాల్నించి చదువుకోడానికి జనం వచ్చార్ట అంటే, అవన్నీ అప్పట్లో; పోయినవి మళ్లీ రావు. అందుకని 'విద్యాపీఠం', 'విశ్వవిద్యాలయం' అనేమాటలు మాని "యూనివర్సిటీ" అనే పదార్థం సరిగా పైకి పలికేటట్టు అముక్కేవాడదాం ప్రస్తుతం (వెనకటివి పాతవాసన కొడుతున్నాయని ఇంగ్లీషాంధ్రులు తప్పట్టుగోకుండాను) 'విద్యాపీఠం' అనే మాటకి గౌరవం వచ్చింతరవాత అదీ వాడదాం.

పెద్ద పెద్ద లేచ్చిన నిర్వచనాలలోకి దిగకుండా టూకీగా పదమూలం చూస్తే యూనివర్సిటీ అంటే ఒకటి కింద మారిపోవడం, అని. అనగా అనేకత్వం పోవడం. ఏదేనావేరే సాధించగల్రుగాని, ఆంధ్రులు నానాత్వం చంపుకోగల్రా అని, కొందరి సందేహం. ఎవడిమట్టుకు వాడు తను కలిసికట్టుగా ఉండడానికి సిద్ధమే తన అభ్యంతరం లేదంటాడు, కాని అక్షరాలా తను అన్నమాట జరక్కపోతే ప్రపంచానికి చాలా ఉన్నాయి పాట్లు అంటాడు. ఓసభలో కొంచెం అల్లరిజరిగి గోల అయింది. సైలెన్సుగా ఉండాలని అందరికీ ఉంది. ఉండి ప్రతీవాడూ సైలెన్స్ అంటే సైలెన్స్, సైలెన్స్ అంటే సైలెన్స్ అని మొదలెట్టి పెద్దగోలచేసి, మొదటిగోలే నయం అనిపించారు. అల్లాంటప్పుడేనా మరి కలవడం? పోనీ ఇల్లా అందాం. ఆంధ్రులు యూనివర్సిటీ గనక నిర్వహిస్తే, మరి చెయ్యలేందేమిటి? అయితే, కాలేజీ ఉంది కదా, కాలేజీకీ యూనివర్సిటీకి తేడా ఏమిటి? అంటే "కాలేజీ అక్కడే ఆగుదాం అంటే యూనివర్సిటీ కొంచెం ముందుకి నడుద్దాం అంటుంది" అని. ఎవరికి, యూనివర్సిటీ కావలిసింది ? నేను, నాకు కావలసిన వాడు, ఒకటి, వగైరా వేర్లువిడిచిన బంధుకృ, నాజ్ఞాతి, నా శాఖవాడు, బీరకాయ పీచు, బాదరాయణ సంబంధం, నా భావవాడు, నామతంవాడు, నా గ్రామం, నా దేశం, నా ఖండంవాడు—అనేవాటి కూడా అణిచివేసుగున్నవాళ్లకే; 'అహం', 'మమ' గార్లకి యూనివర్సిటీ అనవసరం. అనగా జ్ఞానులు చెక్కిన రాతిమనిషి చెట్టుమనిషి, పశువుమనిషి, మనిషిమనిషి అవస్థలు దాటిన మనుష్యులకి కావాలి. లేకపోతే పారిస్ యూనివర్సిటీవారు ఒక ఆంధ్రుడి విద్య మెచ్చుగోడం [illegible] పడి ఉంటుందా? నేనూ నన్నెరుగున్న కొందరూ మాత్రమే బాగుపడాలి అని పెట్టుగున్న యూనివర్సిటీలు నిష్క్రమించాయి, బాగుపడ్డ వాళ్లా నావాడే అనుకున్నవి జీవించాయి అని చరిత్ర కేకలేస్తోంది. ఏమైతేం! అర్హత [illegible] వలసింది, ఆచరణలోకి దింపి మరీనూ. మన యూనివర్సిటీ ఇచ్చారు. ఇస్తే, ఏమైందీ, ఆంధ్రాయూనివర్సిటీ పుట్టుతూనే మూడు కాలేజీలున్న మూడు కేంద్రాల్లో కలిసింది—మూడుమూర్తులసారంపుముద్దయనగ—అన్నట్టు ఒకటికాదు, మూడూ, కేంద్రాలు. వలయానికి ఒక కేంద్రం ఎరుగుదుం; పోనీ, కోలవలయానికి రెండు కేంద్రాలుకూడా ఎరుగుదుం; కాని మన యూనివర్సిటీ చాలా పెద్దలెక్కల్లో బొమ్మ గనక ముక్కేంద్ర భూయిష్ఠం అయింది. మరో పని: మూడు కేంద్రాలేమిటి అంటే, మనకి ముగ్గురు పెద్ద దేవుళ్లు, ముప్పై మూడుకోట్ల చిన్న దేవుళ్లూనూ. కొందరు, ముందు ఉత్తరోత్రా ఇవి వేరే యూనివర్సిటీలవుతాయన్నారు. అంటే ఈయూనివర్సిటీ పిల్లల్ని పెడుతుంది. మనలో ఇంకా ఓమూల పుడుతూన్న వాడికీ అప్పుడే సంతానాపేక్ష. అదీగాక, డైట్కి ఎవరైనా చదువుపైగా ఒక్క కేంద్రం ఎల్లా కుదురుతుంది? పైగా, ఒకటి, ఒకటి అంటే ఆంధ్రుడికి కోపం. ప్రతీఆంధ్రుడూ దేవుడు ఒక్కడే అంటాడు గాని ఆయన పేరు విషయంలో మాత్రం ఏ ఇద్దరాంధ్రులూ సరిపుచ్చుగోరు. "ఫలానా విద్యలో మీ ఆంధ్రుల్లో గొప్పవాడెవడు ?" అని అన్యుడు ఆంధ్రుణ్ణి ప్రశ్నిస్తే, ఇతడు "కోటిమందిని చెప్పొచ్చు" అంటాడు. "ఏదీ, ఒక్కణ్ణి చెప్పండి చాలు," అంటే మాసిమాసి ఎవ్వర్నీ చెప్పలేడు. తీరా చెబితే తనమాటో, ప్రతీవాడికీ ప్రతీదీవచ్చునేగా!—ఏది!—అందుకని చెప్పడు. చెప్ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేనిభస్తే అనడు. ఒకవేళ ఏదేనా పేరు చెప్పడానికి తనమనస్సు ఇష్టపడితే, ఆపేక్కినవాళ్లు తన్ని తిట్టిపో స్తారు, ఎందుకొచ్చింది, అనుకుని ఊరుకుంటాడు. పోనీ అవతల అతనే "ఫలానా మీావాడు గొప్ప వాడంటారేఁ?" అంటే, "ఆఁ, వాడి మొహంపోచూ,నాదగ్గర తీశై, వాడి కేంవచ్చు" అంటాడు. అందుకని 'శూన్యం' అనగా లేని దాని యందుండే మక్కువ ఆంధ్రుడికి 'ఒకటి' అనగా ఉన్నదానియందు లేదు. అనగా అతడు అనంతవాది. అవునా, అల్లాంటి స్థితిలో యూనివర్సిటీ కచేరీ ఎక్కడ అనివచ్చింది. కాలేజీలు జుట్టుకున్న వాళ్లేకచేరీలూ లగా యిస్తే కడంవాళ్ల నోట్లో కరక్కాయేనా, వాళ్లకి మాత్రం కడుపు మండదా? అందుకని ఈకాలేజీ ఊళ్లో నూవద్దు, ఆకాలేజీ ఊళ్లోనూవద్దు, అని కచేరీల విషయం తునితగూ చెప్పారు. తునితగూ అంటే 'తుని' లో పెట్ట మనికాదు, మధ్యస్తంగా అన్నమాట, మొదట తిరస్క రించిన చోటన్నమాట, అంటే మనం తిరస్కరిస్తూన్నది మనసు కుదిరితే పనికొస్తాయన్నమాట. చక్రం తిప్ప డానికి అనేక విద్యలూ, రాజకీయం, సారస్వతం, లోక జ్ఞానం ఇవి గలవార్ని నామకరణం చేశారు. స్వయం వరాల్లోవచ్చేవారిని ముందు చూడాలి. ఎన్నికలు, విద్యా విషయం లేనిచోట్ల పని చేసినట్టు విద్యావిషయంలో చెయ్యలేవేమో అని కొందరికి భయం. ఆమట్టున యూని వర్సిటీ చలాయించే సభ తయా రవడానికి ఎన్నికలు కానీ మన్నారు. అయిదేళ్ల బియ్యేలు కొందరుపైకి తేలారు, మునిగి పోతున్న వాళ్లని కావలసిన వాళ్లు వచ్చి అడ్డం పడి గట్టుకి లాగారు. అక్కణ్ణించి అనుకోకుండా అచ్చు ఉత్తరాలు ప్రతీ టపాలోనూ కురిశాయి అనేకమందికి! ఇల్లాంటి అంశంతో—

ప్రథమవోటు తమది పారవేయుమనాకు
దక్కినట్టివోటు తమరి మనసు
డోలుకట్టివత్తు డొక్క బద్దలు చేసి
పంపుదయ్యనన్నె మాట లేల.

చెప్పటకును సిగ్గు చెప్పకుంటే చిక్కు
చెప్పవలసి వచ్చి చెప్పుచుంటి
పట్టివాడికిచ్చి మట్టిచేయక వోటు
గట్టివాడనన్ను గట్టుకొనుడు.

ఆ ఎన్నికల మీాద కొందర్నీ, పేరుగొప్ప చోప్పే న కొందర్నీ కలుపుకుని సభఏర్పడడమేకాక అంత స్సభ లుకూడా వెలిశాయి. కొందరు పామరులకి విద్యార్థులూ, ఉపన్యాసకులూ సభలోకి ఎక్కడం లోపల ఆట్టే ఇష్టం లేదుట. విద్యాక్షేమం కోసం మాసిగలుపడడం ఇతరులకి తెలిసినంత దిట్టంగా పేష్టర్లకి తెలియదని. పైగా, విద్యావిషయం ఏమీా తెలియకపోతేంగాక శాస నసభల్లో వాదించి చోరవమాపే కొందరికి మల్లే చోరవ చూపకుండా, పీరు, అనేక విషయాల్లో భయపడి దేవుడిచ్చిన తలకాయలు ఒక్క ఊగించి పారెయ్యడానికే ఉపయోగిస్తారేమో అనే దిగులు చొప్పునట. కాని, భ్రమాలంకారాలకెక్కడికి? సభాన్యవహారంలోకి రాక పూర్వం కొంచెం వెనక్కివెళ్లి రావాలి.

కాలేజీయేనా లేదాయిరి, కచేరీలేనా లేకపో డం ఘోరం అని అన్నతునితగూ చూశాం. కాని, దరిమె లాని, ఏమైంది? కచేరీలు ఇప్పుడు మరి ఉండనే ఉన్నా యికదా, కచేరీలున్నచోట కాలేజీలేకపోడం శోచనీ యంకదా, నామర్దాకదా! అందుకని అక్కడే అన్నిం టికంటె గొప్పకాలేజీ పెట్టద్దా అనే అభిప్రాయం వచ్చింది వెళ్లింది. అసలే మూడల్లా నాలుగై యూనివ ర్సిటీ నాలుగు స్తంభాలాట ఆడు తోంది. ఎక్కడున్నా బలమంతాకలిసి ఒకటే. అసలు నాలుగు చోట్లు అవడం తోటే ప్రతీచోటా బలం తగ్గింది అన్నమాటేగా! అందులో, ఇతర మారాముట్లు, ఎప్పటికప్పుడు:

"పల్లెటూళ్ల పట్టుపలలు" జ్ఞాపకంవస్తున్నాయి. ఒక పల్లెటూరి సభలో ప్రథమతాంబూలం ఇవ్వడం ఎవరికి అని ప్రశ్నవచ్చిందిట. శూన్యంగారి కివ్వాలని ఒకాయనా, కాదు పూర్ణంగారి కివ్వవలసి ఉంటుందని మరొకాయనా కుస్తీపట్టుకున్నారట.

మొదటివాడు—శూన్యంగారు గొప్పవాడు.

రెండోవాడు—పూర్ణంగారూ చాలాగొప్పవాడే

మొ—శూన్యంగారు వృద్ధు. పూర్ణంగాడేమిటి, చినటూ!

రెం—పూర్ణంగారు అతివృద్ధు. శూన్యంగాడేమి టి, చచ్చూ!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొ—సూర్యంగారి తలకెరిసింది లెండి.

రెం—పుణ్యంగారి తలా నెరిసింది లెండిమరి.

మొ—ఛీ, ఊరుకో! సూర్యంగారికి అంతకంటూ తలనెరిసింది!

రెం—ఛీ, అల్లాయితే, పట్టూ! నెరిసిన తలవెంట్రుకల సంఖ్య స్థిరపరచడానికి ఓపంచాయితీ పెడదాం.—అని.

అల్లాంటి పట్టుదలలు చిన్న గ్రామాల్నించి పెద్ద గ్రామాలదాకా పాకినట్టు కనబడుతుంది. భాషమీద భక్తిపోయి గ్రామభక్తిలో పడితే ప్రజకేం క్షేమం, జాతికేం గౌరవం. త్యాగయ్య 'రామభక్తి సామ్రాజ్యం' అంటే మనం 'గ్రామభక్తి సామ్రాజ్యం' అని పాడుకో వలసివస్తోంది. ఆంధ్రుల్లో సరిసమానులైన గొప్పవాళ్లు కొందరు ఇంగ్లీషున దెబ్బలాడుకున్నప్పుడు You how much? అంటే You how much? అనుకుంటారు—నీకెంతయనిన నీవెంతయనుచు—అన్నట్టు. కాని, పెద్ద గ్రామాలవారిప్పుడు యూనివర్సిటీకోసం నేనెంతంటే నేనెంతని దెబ్బలాడుకుంటున్నారు. అంతా ఒకందుకు ఒప్పుకున్నారు:—"యూనివర్సిటీ పెట్టేచోటు హుషారీగా మజాగా ఉండాలి, ఆకర్షించాలి, ఎప్పుడు లేచిపోదాంరా నరుడా! అని ఉండకూడదు"—అని. అయితే, అల్లాంటి ఊరు తమరి ఒక్కరిదే అని ప్రతీవాళ్లూ దెబ్బలాడేది. స్వంతానికి ఏదేనా కావలసొచ్చినపుడు, తర్కంభానంతట అదే చేరవుతుంది, తమరు మాట్లాడిందంతా తర్కమే అనిపిస్తుంది. ఈదెబ్బలాట బయలుదేరింతరవాత ఏఊరు ఎందుకు ప్రసిద్ధో అందరికీ విశదమైంది. అంటే యూనివర్సిటీరాగానే ఆంధ్రులకి కొంతవరకు హిస్టరీ జాగ్రఫీలు పుట్టాయి. ఏదో గొప్ప సంపర్కంవస్తేగాని ఉన్న మహాత్మ్యాలు పైకిరావు—ఎలెక్షనులోగాని మానవుల చతురోపాయాలూ, వివిధప్రజ్ఞలూ వరసాగ్గా తెలియనట్టు! "మా ఊళ్లో అన్నం అరుగుతుంది, మాఊళ్లో యూనివర్సిటీ పెట్టాలి" అని ఒకరు. ఏఊళ్లో అరగదు, ఎవరికి? "మా ఊరవతల ఖాళీస్థలాలున్నాయి, అందుకని యూనివర్సిటీ మాఊళ్లోనేపెట్టాలి" అని ఒకరు. ఏ ఊరవతల ఖాళీగా ఉండదు? "మా ఊరు చల్లగా ఉంటుంది, కావలసినంత సేపు చదువుకోవచ్చు; మీ ఊరు మంగలం, రోడ్లు అస్తమానమూ దుమ్మెత్తిపోస్తాయి; వాళ్ల ఊరు బొత్తిగా పెనం, మనుష్యులకి అస్తమానం వేపుడే; సరి, వాళ్ల ఊరు గాడిపొయ్యే, తొందరగా ఉడికిపోతుంది" అని ఒకరు. "మాఊళ్లో గోంగూర ఉంది" అని ఒకరు. "మా ఊళ్లో అదీ వంకాయలూకూడా తెల్లవారేసరికి ఎగిరి చక్కావస్తూంటాయి" అని ఒకరు. "మా ఊళ్లో పెదనారింజపండ్లు దొరుకుతాయి, ఇప్పుడది ఫలరాజం" అని ఒకరు. "మా ఊరు పక్కని కొండుంది" అని ఒకరూ, "మా ఊళ్లోనే కొండలున్నా"యని ఒకరూ, "వటప్, కొండమీదే మా ఊరుంది" అని ఒకరు. "మా ఊరు హాయిగా సముద్రతీరం, మా ఊళ్లో పెడితే ఏం ఉప్పెనవస్తుంది?" అని ఒకరు. "మా ఊరు కొంచెం వేడిగా 'సహారా' లాగఉంటేం, వంటచెరుకు కొనుక్కోకుండానే పదార్థాలు ఉడుకుతాయి, లాభం కాదా?" అని ఒకరు. అయితే ఒకటి: అద్దెకొచ్చిన పెద్దమనిషితో ఇంటాయన ఇంటికి ఉండే హంగులూ సౌకర్యాలూ చూపిస్తాడు, కాని ఖాళీచేసిన ఆయన్ని కలుసుకుంటే ఆయింటికే ఉండే ఇబ్బందులూ చిక్కులూ తేలాయి. "వాళ్ల ఊళ్లో ఇరకాటం, దోమలూ, కంగారూ, మా ఊరు రైల్వే కేంద్రం, వచ్చేరైలూ పోయేరైలూనూ" అని ఒకరు. అంటే యూనివర్సిటీ అనేవస్తువుని ప్రతీరైల్లోనూ కాస్తకాస్తే రవాణాచేసి దేశదేశాలా పప్పు అందేటట్టు చెయ్యొచ్చునని. "మాఊళ్లో వెనకవిద్యాపీఠం ఉండేదట. ఇప్పటికీ పోనీ చిన్న పీట చెక్కయినా ఉంది" అని ఒకరు. "ఎరుగుదుం లెండి, తెలుసు తెలుసు, నన్నర ఉండగా నేసరిగాదు, మావూరికి కొద్దిదూరాన్ని ఒక విశ్వవిద్యాలయము ఉండేదిట. దానికేం: మాఊరికి పక్కన 'కృష్ణవేణమ్మ'—పావని—ప్రవహిస్తోంది లెండి". "మా ఊళ్లోనూ ఇప్పుడున్నది కోటిగుమ్మం అయిపోయింది లేకపోతేనా: 'ప్రవహించు (మా)వీటి పశ్చిమప్రాకారమొరసి గంగమ్మసాగరము కొమ్మ. అందుం లెండిమరి" "మాఊళ్లో ఆన కట్టుంది లెండి", "మాఊళ్లోనూ ఉంది లెండి." "మా ఊళ్లో వంతెన గట్టిది లెండి, రైలు గబగబా వెళుతుంది, విూకు మల్లేకాదు." "మాఊళ్లోదీ కొంచెం ఐరోస్తేమి. ఇండియాలో రెండోదిలెండి పొడుగు విమ

యం." "మీ ఆనకట్ట వంతెనకి కింప లెండి, ఆగండి మరి." "మాకు లైబ్రరీ ఉం...పోనీలెండి ఆగండి." కొందరు కొందరు "అన్నీ బాగానే ఉన్నాయికాని, ఆహారమూరం, ఫలానా ఊరు దాటించి యూనివర్సిటీ పెడితే మీకూమాకూచెల్లే, మమ్మల్ని మట్టుగోకండి, డిల్లీ" అని గునుస్తున్నారు. 'దూరం' అంటే, దూరం ఎవరికి? ఊళ్ళకి ఊళ్లు సకుటుంబ సపరివారంగా బయలుదేరతారా ఏమిటి చెప్మా ఆంధ్రులు, ఆంధ్రాయూనివర్సిటీ డిగ్రీలకి! ప్రపంచం మొత్తాన్నించి జనాన్నిలాక్కొవలసిన యూనివర్సిటీకి దూరమేమిటి? విద్యకి దూరం దగ్గిరా లేదు. ఎంచేతంటే, అది మనస్సుది, మనోవేగం అందరూ ఎరుగున్నదే! సంగతి చెబుతూ, "16 గంటలరైలుప్రయాణం పట్టే దూరం ఓదూరమావిద్యకి" అని ఒక జ్ఞాని ఈమధ్యనే అన్నాడు. కొందరి ఊహ, యూనివర్సిటీ ఓపెద్ద పళ్లగంప అనీనీ, ఏఊళ్లో పెడతారో ఆఊళ్లోవాళ్లంతా ఎగడి చేతికందినంతమట్టుకు (నాగవల్లి పిడకలు లాక్కున్నట్టు) తలోటీ చపాయించేస్తారేమో, దూరాన్ని ఉన్న వాడి గతేమిటి? అనిగావును. ప్రస్తుతం ఆఊళ్లో ఉంటూన్న వాళ్లందర్నీ ఆబాల గోపాలంగా తాంబూలానికి పిల్చి తలో డిగ్రీ ఫలప్రదానం ఇవ్వరు. కాని, ఏమిటో ఊరికే భయం!! "వాళ్ల ఊళ్లో ఉంటే ఒక్కటేముక్కలు, వాళ్లెంజేసుకుంటారు, యూనివర్సిటీ! పనసపండు తెచ్చి పళ్లెంలో పెడితే తిన్లేనిబ్రాహ్మడు దిక్కుదిక్కు చూశాట్ట. విద్యకి అర్హతఉండాలి, యోగంవుండాలి. మాఊళ్లో పెద్ద సామగ్రీ కాలేజీ ఉంది. ఇక్కడగనక యూనివర్సిటీ పెడితే, మహారాజాలాగ ఉంటుంది" అని ఒకరు. "మా ఊళ్లో వెనక మహారాజు కాదు రాజరాజే రాజ్యంచేశాడు" అని ఒకరు. మాఊరు పేరు చెబితే విజయంమాకే ఉండాలి" అని ఒకరు. "విజయమే మాఊరు" అని ఒకరు. "మాఊళ్లో పెట్టడానికి అనంతకోటి కారణాలున్నాయి" అని ఒకరు. "మహాప్రభో! వరహీనంవద్దు, వరవిక్రయం వద్దూ, సాంప్రదాయంచూసి మరీ ముడెట్టండి, నాయనా, వెయ్యేళ్లపంట. ఇదేం బొమ్మలనోం కాదు పేసిరోజు చూసుగుని వాల్లాడించి పారెయ్యడానికి!" అని కొందరు వృద్ధులు. ఇంతాచేసి, కేంద్రా లోచనకోసం మొదట తీసుగున్న ఏడెనిమిది ఊళ్లల్లోనూ కొన్నింటికి ఆంక్ష వెయ్యగా, తేలినమూడూ ఉన్నారేం, అని కేవలం ఇదివరకు గవర్నమెంటు కాలేజీలున్న చోట్లే అయి ఊరుకోడం, ఓ గొప్ప రహస్యంలా కనబడుతుంది. కొందరు, ఫలానాచోట అది పెట్టితీరాలీ అని పట్టుపడుతూంటే, వేరేకొందరు అది ఫలానాచోట పెట్టకూడదూ అని పట్టుపడుతున్నారు—(వోట్లరోజుల్లో: "నా కొద్దులే వోటు, ఫలానావాడికిమాత్రం ఇవ్వనని చేతులో చెయ్యేయ్" అంటూ కొందరుజనం తిరిగినట్టు). ఒక కుర్రాడు కొంచెం ఏమన్నా నోట్లో వేసుగోబోతూంటే మరోకుర్రాడొచ్చి "నాక్కాస్త్రైట్టివ్! సరేలే! జ్ఞాపకం ఉంచుకో" అని అనేటంత కుర్రతనంగా వ్యాపారం మారడంచూసి, ఒక ఇంగ్లీషుఎరగని పెద్దమనిషి ఇల్లాఅన్నాడు: "ఆంధ్రుడికి బుర్రఉంది, అఖండత్వం ఉంది. అదికాని ఇదివరకు కనిపించలేదు. ఇప్పటిలో కనిపించేది ప్రత్యేక వ్యక్తులకృషే. కాని, మనవాళ్లకి కొంచెం ప్రథమావేశం కద్దు. అది సోడాకి మల్లే బుస్సుమని పొంగుతుంది. అది తాగడంవల్లే ఈబుడబుడ ఎక్కువైంది. ఆ ఆవేశంలో సంఘాలూ, సమాజాలూ, సభలూ ఏర్పడిపోతాయి. ఆ పిమ్మట ఎవడిదారివాడిదే. పెద్ద కాన్ఫరెన్సుల్లోతప్పకుండా జరిగేవి మంచిభోజనాలూ, కావలసినంతఖర్చూ, కొన్ని ఘాటైన తీర్మానాలూనూ. ఒకగొప్పపేరట సంఘం ఏర్పడేవరకూ పాకులాడడం, అక్కణ్ణించి మరి పీకులాడ్డమూను. తరవాత ఉండాలయ్యా, పట్టుదలా! అదిలేదు. మనఊళ్లోపెట్టారు చూడండి "పేపరుమిల్సు." పోగవల్లే గొట్టంమాత్రం బొబ్బర్లంకదాకా కనపడుతోంది—భస్తే ఆపదు. ఏం డబ్బోశానండి, షేర్లకి" అంటూ ఎంతో అంత ఇదయ్యాడు. అల్లాగ్గా, నష్టానికి ఒప్పుకుంటేనే కాని గొప్పసంఘాలుపడవు. ముక్కలూ చెక్కలూ ఊడకొడితేగాని ఘనపదార్థాలు అతుక్కోవు. మత్స్యన్యాయం ఎక్కడా ఉండదు. భూమిమీద అన్నీ అంతరాలే. యూనివర్సిటీ పెట్టడం విషయం మత్స్యన్యాయం జరగాలంటే అసలు పెట్టకూడదు. పెట్టితీరాలీ అంటే నాలుగు పద్ధతులు చెప్పచ్చు: ఏకంగా చెప్పాలంటే (అనగా one dimensionలో)- ప్రతీవాడి హృదయంలోనూ యూనివర్సిటీకట్టాలి. చతురంగా చెప్పాలంటే (అనగా Two dimensionsలో)- ఆంధ్రదేశాన్ని విశ్వకర్మచేత వలయంగాకోయించి, జనంసరిగ్గాపట్టే ఓవలయంలో


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆంధ్రులంతా నిలబడి, కేంద్రమందు యూనివర్సిటీని ఉంచి, మాట్లాడకుండా చూస్తూ ఉండడం. ఘనంగా చెప్పాలంటే (అనగా Three dimensionsలో)-యూనివర్సిటీని మొదటే (తరవాత మరికార్యంలేదు) పూరణం ఉంచినట్టు లోపలఉంచి దానికిపైన చుట్టు బూరిలాగ ఆంధ్రదేశాన్ని తొడిగించడం. చత్వారిగా చెప్పాలంటే (అనగా Four dimensionsలో) "ఐన్‌స్టన్" గారికి రాసికనుక్కోవాలి, లేక చత్వారీగనక జోడెట్టుగున్నప్పుడుచెప్పాలి.

సరి, లెక్కనకథలోకివత్తాం. యూనివర్సిటీ సభసమావేశం అయింది. స్వల్పాలు అయినతర్వాత 'వర్ణాక్యులరైజేషను, 'మీమాంసవచ్చింది.' అనగా మాతృభాషలో పాఠంచెప్పడమా మానడమా అనే మీమాంస. అంటేఆంధ్రుడితో ఆంధ్రుడు ఆంధ్రంలో మాట్లాడాలా వద్దా అనే మీమాంస. కాని ఈమీమాంస చర్చ తెలుగులోనే కానివ్వండి అనిపెట్టినతీర్మానం పోవడమే నిఖారుసైన ఆంధ్రత్వం. సిద్ధాంతం స్పష్టమే గనక ఇందులో అసలు మీమాంసలేదన్నారు, పూర్వమీమాంసవాళ్లు. కాని, ఇదిగొప్ప మీమాంసేను, ఇల్లాపారెయ్యండి అని ఉత్తర మీమాంసవాళ్లన్నారు, వేదాంతులుకి ప్రతీదీమీమాంసే గనకగావును. ఆంధ్రుడు ఆంధ్రంలో ఆలోచించి ఆంధ్రంలోమాట్లాడ్డం అసహజంకాదుగాని, ఇటీవల అభ్యాసమో దురభ్యాసమో అల్లాఅయింది. సరి,

> పాపంబులు కర్జములని
> యేపున జేయంగననియమునింపగు ధర్మ
> వ్యాపారంబు లకార్యము
> లై పరిణతి బొందనేని అట్టులుసెల్లున్.

అనగా! ఆంధ్రులమాతృభాష ఇల్లాంటి చర్చలో ఉండబోతూంటే ఓఢ్రం, కన్నడం, ఉర్దూ భాషలపిల్లలుంటే వాళ్లకికూడా పాపం వాళ్లమాతృభాషలో చెప్పద్దా, లేకపోతే బాంగుంటుందా? బంతిలో చాలబిక్షంచెయ్యొచ్చునా? ఏడిచేదాని ముగుడువస్తే నాముగుడూవస్తాడని శాస్త్రంగదా, వాటి మాటేమిటి? అని అప్పుడేవచ్చింది. రాకరాక బ్రహ్మాండంమీద కేసొచ్చి డాక్టరు వెదుకూంటే, "అవతలవాడు విల్లురాశాడో లేదో, నీతోనే నూవస్తున్నా" అని ఓలాయరుకూడా డాక్టరు వెంటపడ్డాట్ట. ఆరీతిగా ఉండిది. అదీగాక, ప్రపంచంలోసగం ముప్పాతిక దెబ్బలాటలు ఆంధ్రభాష నెత్తిమీదే ఊరేగుతున్నాయి. అవి అల్లా ఉండగా, మాతృభాషలో చెప్పడాన్నిగురించి అఖండులైనవారు గొప్ప అభిప్రాయాలిచ్చారు.

మనం ఇల్లానే ఉంటాం తెలుగులో విద్యచెప్పగోకపోతే, అందుకని తెలుగు నిచ్చెనఎక్కి స్వర్గంకే వెడదాం రండి అని కొందరు. తెలుగుపట్టుకుంటే వేరే అడగక్కర్లేదు, చివరకి సన్యసించిపోవాలి. తెలుగునిచ్చెనకి మెట్లున్నాయిగాని కిందికున్నాయి. దిగితే నరకమే గనక, అసమం ఇల్లానేనాఉందాం—అని ఒకరు. కొత్త పిండివంటగనక చోరవదాల్చిచెయ్యాలి, ఎప్పుడో ఓఅప్పుడు-అనిఒకరు. అంతామాతృభాషనుంచివన్నవాళ్ళేగానిఅందులోపాఠాలుచెప్పిన ఇతరయూనివర్సిటీవాళ్లులేరు, ముందస్తుగా మనమే ఎందుకు గోతులో దిగడం?-అని కొందరు. తెలుగుతో చెబితే నవ్వుతారు పిల్లలూపెద్దలూకూడాను (బలువులేకపోవడంవల్ల); నాన్సెన్స్, తెలుగు తేలిక, కొంచెం గంభీరంగా ఉండాలంటే కాస్త తెలియని సంస్కృతమో, తెలియని ఇంగ్లీషో, భాషకవిత్వమో ప్రయోగించాలిగాని, తెలుగైతే సంగతి అందరికీ తెలిసిపోయి గౌరవాలు దక్కవు-అని ఒకరి తనలో. మాతృభాషే మనకి దిక్కయ్యా, గ్రహించడం సులభం, సూక్ష్మం, 'రే'గారు, 'లార్డురోనాల్డుషే'గారు చెప్పారు-అనికొందరు. అయ్యా, మీకేకాదు, మాకూ ఉంది భాషాభిమానం ఓరికంటె ఎక్కువగా కాని, అందుచేతే, మనభాషని వాడకుండా పెట్టిలోపెట్టి, అతి ప్రాపదంగా నెత్తిమీద పెట్టుకోవాలి-అని మరికొందరు. వాడి చూడండయ్యా, ఆంధ్రులూ వాడకపోతే అది పెరక్కపోడం అటుంచి చచ్చిపోతుందయ్యా-అనేవారు ఒకరు. ఆఁ. తెలుగులో మాటలులేవు, పుస్తకాలులేవు; తెలుక్కి గౌరవంలేదు; రాజభాషకాదు, స్వంతభాష కాదు; మాస్వంతభాష ఇంగ్లీషే.-అని ఒకరు. మన్నా ఇతరత్రా లేదు గనకే మీరేనా మన్నించి వాడండయ్యా-అని ఒకరు. దేశభాషలందు తెలుగు లెస్స-అని ఒకరు. దేశభాషలందు తెలుగు less అని మరిఒకరు. "నన్ను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెలుగులో చెప్పమంటారు. నవీనశాస్త్రం నాసామ్మె గాని నోట్లో తెనుగుముక్క లేదు. తెలుగున్నవాడికి నవీనశాస్త్రం లేదు. రెండూ ఉన్నవాడు, ఓవేళ ఉంటే, వాడు అలకపానుపు దిగడు. నేను తెలుగువాణ్ణాయె; తెలుగు రాదనీ, నేర్చుగోవాలనీ అన్యుడికి మళ్లే పైకి ఎల్లా ఒప్పుగోడం?"-అని కొందరి జీవాత్మలో భయం. ఇంట్లో గృహకృత్యానికీ గుడుగుడు గుంచం ఆడుకోడానికీగాని, లోకకృత్యానికి తెలుగేమిటి?-అని కొందరు కూకలేశారు. ఆంధ్ర "రాష్ట్రం" ఇచ్చింతరవాత ఈ మాట గాని ఈలోపున ఆంధ్రాన్ని చెప్పడం, ఆనకట్టకి ఎగువున వంతెన కట్టుగుని అంతా దిబ్బవేసేట్టట్లు చెయ్యడమే-అని కొందరు. స్వతంత్రాలోచన ఎక్కువవుతుంది, తలకాయిలో పసలేవాళ్ళి మొయ్యనక్కర్లే సయ్యా మాతృభాషైనేనూ-అని ఒకరు. మాతృభాష. కేవలం మాతృస్థానం-అని కొందరు తల్లికి వసంతం కొట్టడం వెనకణ్ణించీ ఉందిలేస్తురూ-అని అనబోయేవారు కొందరు. ఆమాట కొస్తే, మనలో ప్రతీవాడిదీ తలోమతంగనక మతం సమానంగాక, భాషా సమానంగాక, ఈ ఆంధ్రజాతికి సమానలక్షణ ఏమిటి మరి, మాటల్తో మస్తీపట్టుగోడమే నా?-అని ఓ ఆయన. ఆంధ్రులకి కల్చర్ లేదు, అది ఇంగ్లీషు కాలవలో బాగా బుటగలు వేస్తేగాని అబ్బదు-అని ఒకరు. అన్ని శాస్త్రాలూ ఇంగ్లీషులో బోధిస్తాం చేసే మన ఇంగ్లీషు ఇల్లా ఉంది, తెలుగులో చెబితే దేశం అసలే తెలుగు మీరి పోతుందేమో-అని కొందరు. 'ఇప్పుడు బియ్యేల్నే గణించటంలేదు, అప్పుడు బియ్యేని—వీడు కేవలం వట్టి తెలుగు బియ్యేరోయ్-అని ఏడిపించుగు తింటారేమో'-అని కొందరి భయం. పైగా ఉద్యోగాని కెళ్లినప్పుడు-"నువ్వు వట్టి తెలుగు బియ్యేవి, తెలుగు బియ్యేకి లేదిడీ-అని దొరగారు పక్కని ఇమ్మ- కాలిపితే పరిగెట్టాలి, తెలుగూ తనూను"-అని ఒకరు. బోలెడులక్షలు చిమ్ముతూన్న హైదరబాద్‌లోనే మాతృభాషీకరణం కటకటలాడుతోంది-అని ఒకాయన. మనవాళ్లు ఇక్కడే కొందరు ఫేలవుతారు అనుకోండి, వాళ్లు మరో యూనివర్సిటీకి వెళ్లి ఎల్లా చదువుకోడం వాళ్లంత ఇంగ్లీషు రానప్పుడు?-అని ఒకరు. ఇంగ్లీషు భాషలోని గ్రంథాల్లోంచి లక్ష నేర్చుగోవాలి-అని ఒకాయన. "ఆఁ. అది ఫ్రెంచి లేజ్జమో, జర్మన్ లేజ్జమో కనుక్కుని ఆభాష లే అంధు డులు వెళ్లి నేర్చుగువస్తే తీరిపోతుంది, మహా అనవసరంగా ఇంగ్లీషులో పండితుడైపోయి కూర్చోడం ఎందుకు?" -అని ఒకరు.

"పొట్టకూటికి నేర్చు విద్యలు-పుట్టకేట్లుకదల్చేనా"-అని కవి.

......"నిను నాకటికిక్క గొనిపోయి యల్లకర్ణాట కిరాటకీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!" అనే పోతన్న లుండకపోతారా-అని కొందరు.

ఇట్టి మోస్తరుగా యీక్లిష్టసమస్య హోరెత్తిపోతోంది. తరవాత 'గ్రంథప్రచురణ' అనేసమస్య. యూనివర్సిటీ తనగ్రంథాలు స్వయంగా అచ్చేసి దేశానికి ఆదర్శంగా ఇవ్వాలా, వద్దా? ఇస్తే, గొప్పవాళ్ల చేత రాయించాలా, గట్టివాళ్ల చేతా? లేకపోతే గొప్పవాళ్లనే ఎల్లాగో అల్లా మాటలపోగు చెయ్యమందామా? అదీ కాక, అచ్చువేసుకోగల తడి ఉండి ఇతరపనిలేని తెలివిగలవాణ్ణే రాయమందామా ఏకంగా? పోనీ చాలామందిని రాసి పంపమని, కొందరివే స్వీకరించి తక్కిన అబ్బాయిల్ని రోడ్డుమ్మగోమంటేమీ? మనం తీరా ఏదేనా పుస్తకం నియమిస్తే, మొన్నాడు దాని తాతలాంటిది వచ్చితీరితే ఏమిటి చెయ్యడం? భాషాంతరీకరణం అల్లాటప్పా పనికాదుగదా, ఎన్ని ఏళ్లు పడుతుందో! లెక్కకి లెక్క అక్కడ పెడితే గ్రంథశేవాలు తయారుకావా? ఉభయభాషానిపుణులు కావాలి. ఎవరు? ఒకగ్రంథం సామాన్యగ్రంథం అని మనకు తెలిసీకూడా అచ్చెయ్యడమేనా? లేకపోతే భాషలో ఉన్న మడ్డి కిందకివెళ్లి భాష తేరేవరకూ ఆగాలా?-అనే చర్చలోకూడా సభవారున్నారు. "గ్రామాంతరోపన్యాసాలు" వగైరా బోలెడు ఇతర సమస్యలున్నాయి. మనం ఆగి, ఆంధ్రా యూనివర్సిటీ వచ్చింతరవాత జనం ఏమనుకుంటున్నారో చూసి, చివరికి వద్దాం.

ఇంగ్లీషు గంధంలేని ఆంధ్రులకి 'ఆంధ్రాయూనివర్సిటీ'వచ్చింది అంటే ఆంధ్రులకి ఏమొచ్చిందోకూడా తెలియడంలేదు. "ఇంకేం, మీపని బాగుంది, ఓ మంచి ఉద్యోగం లాగచ్చు" అని అంధ్రంలో గట్టివాళ్లని వారి స్నేహితులు హెచ్చరించడం వింటున్నాం. ఆంధ్రశబ్దం ముందు తగిలించి ఉండడంవల్ల, ఇది, ఇంటింటికీ ప్రతీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాళ్లకి పెట్టేస్తారేమో అని కొందరు పామరులు. ఓ ఆయన, "ఏమండీ! మా నూతివద్దర ఖాళీగా ఉంటుంది, పోనీ, ఆంధ్రాయూనివర్సిటీ అక్కడ పెట్టకూడదూ, నిక్షేపంలాగ చూసి అద్దెవేస్తాను" అన్నాడు. "వాళ్లకి ఇంగ్లీషున చెప్పిన పాఠం ఇహ ఎక్కడుంటలేదు. సమాధానంలో అంశం తెలుగని చెప్పమంటే, వంచేస్తున్నారు-" అంటారు కొందరు మేష్టర్లు. ఇంగ్లీషు స్పెల్లింగు చాలా తప్పులుగా ఉండంటే-'ఆంధ్రాయూనివర్సిటీ వచ్చిందండి- ఇంగ్లీషుమీద అట్టే ఖాతరీలేదు' అంటున్నారట కొందరు అనుభవశాలులైన విద్యార్థులు. "ఇంగ్లీషు మేష్టర్లకి ముట్టుతూన్న జీతాలు తెలుగు మేష్టర్లకీ, తెలుగు మేష్టర్లకి ముట్టే జీతంరాళ్లు ఇంగ్లీషు మేష్టర్లకీ ముట్టుతాయిట, ఇక్కణ్ణించి ఇహ"-అనుకుంటున్నారు కొందరు. ప్రతీ ఆంధ్రుడూ ఆంధ్రాయూనివర్సిటీ పుణ్యక్షేత్రానికి తీర్థంవెళ్లి ఓకొబ్బరకాయ కొడితే నైవేద్యం పెట్టి తనకి సహం చెక్కా ఇస్తారు, ఇవ్వకపోతే దెబ్బలాడి పుచ్చుకోవచ్చు అని కొందరు. అందరికీ ఉండే లాభంకంటె కొద్దిమందికి ఎక్కువలాభం ఉంటుంది దీనివల్ల అని నమ్మరు చాలామంది. కొందరి ఉద్దేశం—"మనవాడు వట్టి 'Stay-at-home, అనగా గుడిపాము. ఒక్క ఊరూ ఎరగడు. ఏమీ చూడందే అన్నీ చూసినవాడి బాబులా మాట్లాడతాడు Which is taller, North Pole or South Pole? అనే విషయం కూడా జోరుగా లెక్చరు దబాయించే గిరీశాలు బోలెడుమంది ఉన్నారు. అందుకని అసమ్మం ఇండియాయేనా తిరిగిరాందే డిగ్రీ ఇవ్వరట, ఈయూనివర్సిటీలో!" అని. మనకు స్త్రీలుమాని యూనివర్సిటీ సాగేసంగతి చూసుకోకపోతే, ఈలోపుగా, ఆంధ్రుడు అనేవాడులేకుండా గురుపరంపర తయారయితే అప్పుడు ఆంధ్రంలోనే నా పాఠాలు చెప్పడం, లేక మనకీ మనకీ ఎప్పుడూ కుదరదేమో గనక, అన్నీ అరవంలాంటి భాషలో చెబితేగాని వీలులేదని వస్తుందా?-అని కొందరి సందేహం. ఈ వాదనలు జరుగుతూండగానే, ఆంధ్రజిల్లాల అంచులమీది వాళ్లు ఆంధ్రనామాలు ధరించేస్తారేమో అని కొందరు. ప్రతీయూనివర్సిటీలోనూ ఓగ్రాంథికభాష (అనగా కంటిది) లేందే లేదు. ఆంధ్రాయూనివర్సిటీలో అల్లాంటి పురాతన ప్రమాదాలుండవుట, నిమిషంలో డిగ్రీ అక్కడ పెట్టించవచ్చు, ఇంగ్లీషుకూడా ఉండదు గనక-అని కొందరు. ఇల్లాగ్గా ఇవీ అంతులేవు.

'న్యూమన్' అంటేనే యూనివర్సిటీ అర్థం అయిందిగనక ఆమహాత్ముడి ఉద్దేశాల్తో వివరించుదాం- "ఉపాధ్యాయుడు: అఖండమైన జ్ఞానం, పేరు, ప్రతిష్ఠ, సంభాషణలోనే కనపడే వర్చస్సూ కలిగి ఉండాలి"— అని. యూనివర్సిటీవారు ఇల్లాంటివాళ్లని నిర్ణయించుకునేటప్పుడు అఖండులుకాని ఆంధ్రులూ, అఖండులైన నాన్-ఆంధ్రులూ ఉంటారు. అప్పుడు తగాదాలు ఉంటాయిగా, ఇప్పణ్ణించీ ఎందుకూ?—"ఇక, విద్యార్థి: విద్య దైవికం, కనక విద్యార్థికి భక్తి ఉండాలి; విద్య పవిత్రం, కనక విద్యార్థికి నైర్మల్యం ఉండాలి; విద్య శాంతిదాయకం, కనక విద్యార్థికి దయ ఉండాలి. ఇవి లేకపోతే, విద్యార్థి పైనదేవుడికి, మనుష్యతనకి, చుట్టూసంఘానికి ద్రోహి" అని. చదువు చెప్పడానికీ, ఖండాంతరాలకి పంపి చదివించడానికీ అర్హత ఉన్న విద్యార్థుల్ని ఏర్పర్చాలి. అప్పుడు తగాదాలు ఉంటాయిగా, ఇప్పణ్ణించి ఎందుకూ?—"విద్య ముందు మొహమాటాలుండవు. డబ్బు, దర్జా, సత్తా ఇవన్నీ విద్యతరవాతే. విద్య ఉంటే డబ్బు లాక్కురాగల్దుగాని, డబ్బుండడం అనేది ఓగొప్ప విద్య కాదు. యూనివర్సిటీ పెట్టి దక్షతచూసుకోవాలిగాని, దక్షత ఉందిగదా అని యూనివర్సిటీ పెట్టరు"—అని. యూనివర్సిటీ విద్యకోసం ఇచ్చిన ధనం ఏంజేస్తారో, ఎవడు తింటాడో అడక్కుండా పూర్ణహృదయంతో ఇవ్వాలిగాని, తద్దినంకింద గాదు. ప్రతిఫలం స్వంతానికే కోరి మరిచేనికేనా దానం చెయ్యాలిగాని, యూనివర్సిటీకి కాదు. కాలేజీ అంటే మనకి అబ్బురంగా ఉందిగాని "లండన్" అనే పట్టణంలోనేన కొంపప్రతీదీ కాలేజీయేట. మనజనం రెండుకోట్లు గనక ముందు చాలా కాలేజీలు పుట్టాలి కాబట్టి, గ్రామకక్ష తగ్గించి, ముందుకు నడవాలి. మొట్టమొదట, న్యూమన్ చెప్పినట్టు, "కాలేజీలు యూనివర్సిటీ కిందికి రావాలి, కళ్లెంచేతికి రావాలి. లేకపోతే యూనివర్సిటీ అనేది నామమాత్రం, వట్టి మొహర్ భానీయేకాని వ్యక్తీకాదు, శక్తీకాదు." శాసనసభ్యుల్లో ఉండిట అంతా వాద

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పెళ్లి పెద్దలతో చెప్పి, సిఫారసుచేసి, యూనివర్సిటీకి కాలేజీల ఫలప్రదానమే కాక మరి ఇతర సంభావన కూడా ముట్టచెప్పించాలి. ఆ విషయంలో అందరూ పట్టుదల చూపడం కర్తవ్యం. క్రియమూకొక,—"లోకానికి దీనియందు అనురక్తి, సానుభూతి, అనేకుల అప్రయత్న సమ్మేళన, విద్య అంటే అపారమైన తృష్ణ, విద్యని సాధించాలనే కసి—ఇవే యూనివర్సిటీ జీవం." దాన్ని నిలబెట్టడం పూచీ గవర్నమెంటువారి మీదకంటె ముందు ప్రతి ఆంధ్రుడిమీదా ఉంది. నమస్కారం.

---

# జిజ్ఞాస

వెలగపూడి దానయ్య చౌదరి గారు

అమృతంబు నునిచిన యబ్ధిగర్భమునందె యుఱుతరంబగు విషం బునిచినావు
నిప్పుపుట్టెడుశక్తి నిలిపినజలమందె నిప్పునార్పెడుశక్తి నిల్పినావు
ఉసురుపుల్పెడుగుణం బుంచిన విసమందె యుసురులగొనుగుణం బుంచినావు
సౌఖ్యాకరంబుగా నలిపిన ధనమందె కోరి కష్టమును గల్పించినావు
తీయనగు త్వక్కుఁగూర్చిన కాయయందె-చేదుగలిగిన బీజముల్ నేర్చినావు
ఇట్టినీచేతలం దర్థమేమొ తెలియ-దతుల చిత్రస్వభావ, దేవాదిదేవ!

సీ. దంతికి బహుళసంతానమిచ్చుట మాని చాలఁగాఁ బంది కొసంగినావు
కోయిలకెన్నఁ జిరాయువీయఁగమాని మొలమిఁ గాకంబున కిచ్చినావు
పనసపండునకు సొంపొసఁగూర్పఁగామాని ముసిఁడిఫలంబున కొసఁగినావు
గనుసుగడ్డకుఁదావిఁ గల్పించుటనుమాని చిఱుతుంగము స్తకుఁ జేర్చినావు.
ఈఁగికానికి ద్రవ్యంబు నీయమాని-కుమతి నూలోభిపందరుఁ గూర్చినావు
ఇట్టి నీచేతలం దర్థమేమొ యెఱుఁగ-నతులచిత్రస్వభావ, దేవాదిదేవ!

సీ. మత్స్యంబులకుమేఁత మడువునం దిమిడించి కొంగల నచటఁ దాకొల్పినావు
మృగచయంబులు వనిఁ దగఁజరింపఁగ జేసి మించుసింగములఁగాపుంచినావు
నిశలందుఁ గాకముల్ నిద్రించునటుసేసి ఘూకంబులను బురికొల్పినావు
ఉద్భిజ్జములు మహి నుద్భవింప నొనర్చి క్రిమితతినటఁ బ్రయోగించినావు
కడఁగిపనిలేని పనిగను బాడమఁ జేసి-యెఱుఁగనట్లు వినాశమేర్పఱచు చుందు
విట్టి నీచేతలందర్థమేమొ తెలియ-నతుల చిత్రస్వభావ, దేవాదిదేవ!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




మల్లంపల్లి సోమశేఖర శర్మగారు

(వెనుకటి సంచిక తరువాయి)

ఆంధ్రులు: సాతవాహనులు

హిందూదేశమున అశోకచక్రవర్తి నాటి నుండి వేలువేలు రాజవంశములలోని రాజుల శాసనము లనేకములు కనిపించినవి. శాసనము లందు గానవచ్చిన యేరాజులునుగూడ దాము ఆంధ్రవంశమువార మని చెప్పకొని యుండ లేదు. కాని శాసనములలో గనిపించు కొందఱు రాజులపేర్లు సరిగా ఆంధ్రవంశములోని రాజుల పేర్లే. ఆరాజులుతాము సాతవాహనుల మని చెప్పకొనియున్నారు కాని ఆంధ్రులమనిమెచ్చటను దెలుపుకొని యుండలేదు. అట్టిరాజులెవ్వరనిన:

౧. సిముఖుడు
౨. కృష్ణుడు
3. సాతకర్ణి
౪. గౌతమీపుత్త్రసాతకర్ణి
౫. వాసిష్ఠీపుత్త్ర శ్రీపులుమావి
౬. శ్రీ శివమాకసాతకర్ణి
౭. గౌతమీపుత్త్రయజ్ఞ శ్రీసాతకర్ణి
౮. వాసిష్ఠీపుత్త్ర శ్రీచ(?ం)డసాతకర్ణి
౯. పులుమావి

వీరు గాక వాసిష్ఠీ పుత్త్రి) చతరపన(?చతుష్పర్ణ) సాతకర్ణి, శక్తిశ్రీ, వేదశ్రీ, సాతకర్ణి-వీరి శాసనములును గనబడినవి. ఈ పైతొమ్మండ్రుగురు రాజులలో మొదటి యిరువురు రాజులు వేయించిన దానశాసనములు కనబడవు: వారిపేరులు మాత్రము శిథిలములైన విగ్రహముల క్రింద వ్రాయబడినవి. ఇందువలన నావిగ్రహములు ప్రాయికముగ నాయిరువురురాజులవియై యుండునని చరిత్రకారుల యూహ. వారివిగ్రహములును "వాలితరువాతి యిద్దఱు రాజులశాసనములును బొంబాయి రాజధానిలోని నాసిక, నానాఘట్టము, కార్లే గుహాలలో గానవచ్చినవి. మిగిలిన రాజుల శాసనములు కార్లే, కన్హేరిగుహలలోబొంబాయిరాజధానిలోను, అమరావతి, చిన్న (కృష్ణాజిల్లా), కొడగోలు (తూర్పుగోదావరిజిల్లా), మైకదోని (బళ్లారిజిల్లా) గ్రామములలో నాంధ్ర దేశమునను కానవచ్చినవి. చాలవఱకీశాసనములన్నియు పర్వత గుహాలలోనివే: బౌద్ధభిక్షువులకు జేయబడిన దానములను దెలుపునవే. కొన్నిశాసనములు బౌద్ధభిక్షువుల కన్నవస్త్ర దానాదికములకై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయబడిన యేర్పాటులను దెలుపునవి; మఱి కొన్ని వర్షకాలమున బౌద్ధభిక్షువులు నివసించుటకై తొలిపింపబడిన గుహలు వారికి దానమొసంగబడినట్లు తెలుపునవి. ఈ శాసనములవలన దెలియవచ్చిన రాజులందఱును తమది సాతవాహనవంశ మనియే శాసనములలో జెప్పకొనియున్నారు. ఇవియే సాతవాహనుల శాసనములు.

ఈ సాతవాహన నృపతుల నాణెములు కూడ గొన్ని దొరకినవి. ఆ నాణెముల మీద రాజుల పేర్లు కలవు. వాటిని బట్టి యవి గౌతమీపుత్త్ర సాతకర్ణి నుండి తరువాతి రాజులవే కాని యంతకు పూర్వపు రాజులవి కావని తెలియ నగును. కేవలము పశ్చిమమున దొరకినవి ఒక్క గౌతమీపుత్త్ర సాతకర్ణినాణెములే. మిగిలిన రాజుల నాణెములు తూర్పున ఆంధ్రదేశమునను, పశ్చిమమున మహారాష్ట్రమునను గూడ దొరకినవి. సాతవాహనుల నాణకప్రశస్తి యిది.

ఈ సాతవాహన వంశజుల శాసనములన్నియు క్రీస్తుశకమునకు పూర్వపువి కొన్ని, తరువాతివి కొన్నియని ఆశాసనములందలి లిపిననుసరించియు,నందలిభాషననుసరించియు శాసనపరిశోధకులు నిర్ణయముచేసియున్నారు. శాసనకాలమునులిపినిబట్టిదెలిసికొనుటకుపీలున్నయట్లే భాషనుబట్టియు—పరిమిత శాసనములకుమాత్రమే - ఇంచుమించుగ నిర్ణయింపవచ్చును. అనగా, ఏ శాసనమునందు ప్రాకృతభాష కలదో అట్టివానికి మాత్రమే యీనిర్ణయము. ఇంతవఱకు హిందూదేశములో మొత్తముమీద గానవచ్చిన శాసనములన్నిటిని శోధించిచూడగా ప్రాకృతముతో నున్న శాసనములు క్రీస్తుశకము రమారమి మూడువందల సంవత్సరములకు పూర్వమే కాని తరువాత కానరావు. ఈనిర్ణయమింతవఱకు దొరకిన శాసనములనుబట్టియే చేయబడినది.

ప్రాకృతభాషలోని శాసనము లన్నియు 'బ్రాహ్మీ'లిపి,'ఖరోష్ట్రి'లిపిఅను రెండు లిపులలోవ్రాయబడినవి. 'ఖరోష్ట్ర'లిపికాష్గర్,గాంధారము,పెషావరుమొదలగుస్థలములపశ్చిమోత్తరపుపరగణాల ప్రాంతముల వాడుకలో నుండెను. దానిని కుడివైపునుండి యెడమవైపునకు వ్రాయుదురు. రెండవది యైన 'బ్రాహ్మీ' లిపి సేతువు మొదలు శీతాచలమువఱకు వ్యాపకములో నుండెను. హిందూదేశములోని దక్షిణోత్తరాపథముల లిపులకన్నిటికి నిదియే మాతృకయని తజ్ఞుల యభిప్రాయము.

ప్రాకృతభాషా శాసనములన్నియు క్రీస్తుశకము నాలుగవశతాబ్దికి పూర్వపువి గనుక 'బ్రాహ్మీ', 'ఖరోష్ట్ర' లిపులలోని శాసనములన్నియు క్రీస్తుశకము నాలుగవశతాబ్దికిపూర్వపువే. అందువలన నెచ్చటనైన 'బ్రాహ్మీ'లిపిలో శాసనము దొరకినదన్న అది ప్రాయికముగ ప్రాకృతభాషాశాసనమై యుండును; క్రీస్తుశకము మూడువందలకు బూర్వపువై యుండును. ఇట్లని క్రీస్తుశకము మూడువందలకు పూర్వము సంస్కృతభాషా శాసనములు లేవని తలంపరాదు. అట్టివి యున్నవి కాని చాలయరుదు: ప్రాకృతభాషాశాసనములే హెచ్చుగాగలవు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాతవాహన వంశపురాజుల శాసనము లన్నియు 'బ్రాహ్మీ'లిపిలో నున్నవి: అన్నియు ప్రాకృతమున నున్నవి. అందువలన భాషావేత్తలయొక్కయు, లిపి శాస్త్రవేత్తలయొక్కయు నభిప్రాయము ప్రకారము సాతవాహనుల శాసనములన్నియు క్రీస్తుశకము మూడువందలకు బూర్వపువే: అనగా శాసనములలోని లిపినిబట్టియు, భాషనుబట్టియు సాతవాహన వంశము క్రీస్తుశకము మూడువందలసంవత్సరములవరకుమాత్రమే యుండెనని నిర్ణయింపవలసియుండును.

అయితే ఆంధ్రవంశపు రా జు ల ను గుఱించిన చర్చ సందర్భమున సాతవాహన వంశజులగుభూపాలురనుగుఱించినయీ ప్రస్తావనకుకారణము లేకపోలేదు. పురాణములవలన దెలియవచ్చు ఆంధ్రవంశపురాజుల పేర్లలో కొన్నిసరిగా శాసనములవలన దెలియవచ్చు సాతవాహనవంశజుల నామములే: ఆంధ్రవంశపురాజుల పేర్లలో గొన్ని సరిగా సాతవాహనవంశజుల పేర్లకు సరిపోవు చున్నవి: ఇట్లు ఆంధ్రవంశపు రాజుల పేర్లు సాతవాహన వంశజుల శా స న ము ల లో నే క న బ డు చు న్న వి. ప్రత్యేకముగ తా ము ఆంధ్రవంశజుల మని చెప్పుకొనిన రాజులశాసనములేవియు ఇంతవఱకు గాన రాలేదు. ఉభయవంశములలోను రాజులపేర్లు సరిగా సరిపోయిన కారణమున సాతవాహనవంశమును గుఱించియు, ఆవంశజుల శాసనములను గుఱించియు ఇచట గొంత ప్రస్తావింపవలసివచ్చినది.

సాతవాహనవంశజుల పేర్లను, ఆంధ్రరాజుల పేర్లను సరిగా ఒక్కటియగుటయే కాక ఇట్లు సరిగా సరిపోయిన యుభయవంశపురాజుల యనుక్రమముకూడ పురాణములలోని దానికిని, శాసనములలోని దానికిని సరిగా సరిపోవుచున్నది. ఎట్లన:

శాసనములను బట్టి సాతవాహన వంశపురాజులు

౧. సిముఖుడు
౨. కృష్ణుడు
౩. సాతకర్ణి
౪. గౌతమీ పుత్రసాతకర్ణి
౫. వాసిష్ఠీ పుత్త్రిశ్రీపులుమావి
౬. శ్రీశివమాక సాతకర్ణి
౭. గౌతమీపుత్త్రియజ్ఞ శ్రీసాతకర్ణి
౮. వాసిష్ఠీ పుత్త్రిశ్రీచడ సాతకర్ణి
౯. పులుమావి

పురాణములను బట్టి ఆంధ్రవంశపురాజులు

౧. శిశుకుడు
౨. కృష్ణుడు
౩. శాతకర్ణి
౨౩. గౌతమీపుత్త్రికు
౨౪. పులోమావి
౨౫. శివ శ్రీపులోమావి
౨౭. యజ్ఞ శ్రీశాతకర్ణి
౨౯. చండ శ్రీశాతకర్ణి
౩౦. పులోమావి

ఈరీతిని కొంచెమించు మించుగ శాసనములవలన సాతవాహనరాజుల పేర్లన్నియు ఆంధ్రరాజుల పేర్లకు సరిపోవుచున్నవి; అనుక్రమమును సరిపోవుచున్నది. అయితే కొన్ని పేర్లలో కొంత వ్యత్యాసము కనబడుచున్నది. శాసనముల ననుసరించి సాతవాహనవంశపురాజులలోని మొదటిపేరు సిముఖుడు:

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆంధ్రవంశములోని మొదటిరాజుపేరు శిశుకుడు. ఈవ్యత్యాసమునకు చరిత్రకారులీరీతిని సమాధానమిచ్చిరి: "పురాణముల ననుసరించియైనను ఆంధ్రవంశములోని మొదటిపేరు సరిగా తెలియవచ్చుటలేదు. ఈమొదటి పేరును ఒక్కొక్కపురాణము ఒక్కొక్కరీతిని తెలుపుచున్నది. సాతవాహనవంశజుల మిగిలిన పేర్లన్నియు ఆంధ్రరాజులకు సరిగాసరిపోవుటవలన ఈమొదటిపేరుకూడ సరిపోవలసియుండును. శాసనములవలన ఈపేరు సిముఖుడని తెలియుటవలన ఇదియే సరియైన పేరుగ నంగీకరింపదగును." ఇట్లే యుభయవంశములలోని మిగిలినపేర్లన్నియు సరిపోవుచున్నవి కావున సాతవాహనులలోని ఆఱవరాజగు శ్రీశివమాకసాతకర్ణి ఆంధ్రరాజులలోని శివశ్రీపులోమావియు, వాసిష్ఠీపుత్ర్ర చడసాతకర్ణి, చండశ్రీశాతకర్ణియు కాదగుననికొంద ఱూహించుచున్నారు.

పురాణములవలన దెలియవచ్చు ఆంధ్రవంశపురాజుల శాసనము లింతవఱకేవియు దొరకక పోవుటవలనను, పై నుడివిన యుభయవంశములలోని రాజులపేర్లును స్వల్పవ్యత్యాసముతో నొక్కటి యగుటవలనను, పేర్లు కలసినంతవఱకు పురాణవంశానుక్రమమును శాసనవంశానుక్రమమునుగూడ సరిగాసరిపోవుటవలనను, సాతవాహనవంశజులను మఱియే యితర పురాణోక్తవంశపు నృపాలురతోను ముడిపెట్టి సమన్వయించుటకు వీలులేక పోవుటవలనను సాతవాహనవంశమే పురాణములు వర్ణించిన యాంధ్రవంశమనియు, సాతవాహనులే యాంధ్రులనియు చరిత్రకారులు నిర్ణయించిరి. సాతవాహనులు ఆంధ్రులనుటకు గల కారణము లివియే. ఈనిర్ణయము సరియైనదే యనివిశ్వసించుచో సాతవాహనవంశము క్రీస్తుశకము మూడువందలకు పూర్వమే యంతరించెను గావున ఆంధ్రవంశము క్రీస్తుశకము మూడువందలకు బూర్వమే అంతరించెనని చెప్పవలసియుండును.

వేఱువేఱువాదములు

పురాణములందు చెప్పబడిన ఆంధ్రులు సాతవాహనులే యని పై చారిత్రకనిర్ణయము కలదు. కావున ఆంధ్రులచరిత్రకొఱకు సాతవాహనవంశజుల శాసనములను బరిశీలించిన జాలును; కాని యిచ్చట గడ్డైన చిక్కొక్కటి కలదు ముందు దానినిగుఱించి యోజింపవలసియుండును. ఈసాతవాహనులను గుఱించియు, ఆంధ్రులను గుఱించియు వ్యతిరేకవాదములు చేయుచున్న చరిత్రకారులు కొందఱు కలరు. ఆవాదములను ముందు మనము తర్కించి యం దెంతవఱకుసత్యముకలదో యాలోచింపవలసి యుండును.

ఈవిధమైన వాదములకు ముందుగ పునాదివేసినవారు శ్రీమాన్ పి. టి. శ్రీనివాస అయ్యంగారు. వారు ౧౯౧౩ వసంవత్సరములో 'ఇండియన్ ఆంటిక్వెరీ' పత్రికలో 'ఆంధ్రులనుగుఱించిన కొన్ని పొరపాటు అభిప్రాయములు' అనుశీర్షికతో నొకవ్యాసమును బ్రకటించిరి. దాని యొక్క సారాంశమేమనగా:—


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧. ఆంధ్రులు వింధ్యప్రాంతపు తెగలలోని వారు.

౨. వారు మొదట పశ్చిమహిందూదేశమును పాలించిరి.

౩. వారు ప్రాకృతమును మాటాడిరికాని ఇప్పటి యాంధ్రులవలె తెలుగు మాటాడి యుండలేదు.

౪. ఆంధ్రులరాజ్యము పశ్చిమమునుండి తూర్పు దిశకు కృష్ణా గోదావరి నదుల లోయభూముల నుండా వ్యాపించినది.

౫. పశ్చిమమున వారిరాజ్యాధికారము క్షీణించి నపుడు ఆంధ్రమండల మనుపేరు వారిరాజ్యములోని పూర్వభాగములకు (అనగా నిప్పటి యాంధ్రదేశమునకు) వచ్చి, పల్లవులయొక్కయు, తూర్పుచాళుక్యులయొక్కయు పరిపాలనమున నాప్రదేశమునకు రూఢమై నిలిచి పోయెను.

౬. ఆంధ్రపదము మొదట జాతివాచకము. తరువాత అది పశ్చిమమున బరిపాలించిన యొక రాజ వంశమునకు జేరయ్యెను. అటుతరువాత అది క్రీస్తు శకము పదునొకండవశతాబ్దికి కొంతకాలమునకుబూర్వము ప్రాక్సముద్రతీరమున (అనగా నిప్పటి ఆంధ్రదేశమున) పరిణామము నొందిన యొక భాషకు పేరయ్యెను.

ఇది శ్రీనివాసఅయ్యంగారి వాదము. వీరు తేల్చిన విషయములనుబట్టి చూడగా వీరి యుద్దేశము ప్రకారము సాతవాహనులును, ఆంధ్రులును ఒక్కరేయని గోచరించును కాని అసలు ఆంధ్రులయొక్క ఆదిమనివాసము అందఱు అనుకొనునట్లు కృష్ణాగోదావరీనదుల మధ్యకాదని తేలుచున్నది. అంతేకాదు; వీరు తమవ్యాసమున మఱియొక్క విషయమును గూడ జెప్పియున్నారు. అదియేదన 'ఆంధ్ర రాజులును, ఆంధ్రజాతులును క్రీస్తుశకము మూడవశతాబ్దినుండి ఆనవాలైనలేకుండ అంతరించిపోయిరి' అని.

ఈ విధమున శ్రీనివాసఅయ్యంగారు చేసిన సిద్ధాంతమును బురస్కరించుకొని పండితులైన మఱికొందఱు చరిత్రకారులు ఆంధ్రులకును, సాతవాహనులకునుగల పరస్పర సంబంధమునుగుఱించి పరిశోధనలుచేసి చర్చింపదొడంగిరి. ఇట్టివారిలో ప్రముఖులు డాక్టరు వి. యస్. సుక్థంకరుగారు. వీరు 'అన్నల్స్ ఆఫ్ ది భండార్కర్ ఇన్స్టిట్యూట్' అను పత్రికకు ఒకవ్యాసము వ్రాసియున్నారు. 'సాతవాహనులు ఆంధ్రులుకారు: శాసనములవలన దెలియవచ్చు సాతవాహన వంశమునకును, పురాణములవలన దెలియవచ్చు ఆంధ్రరాజ వంశమునకును ఏమియు సంబంధము లేదు. సాతవాహనులను ఆంధ్రులనుటయు, వారి యాదిమనివాసము ఇప్పటి ఆంధ్రదేశమనుటయు పొరపాటు'-ఇది సుక్థంకరుగారి వాదముయొక్క సారాంశము. ఈవిధమైన వాదమును చారిత్రకరంగమున ప్రవేశపెట్టిన వారిలో వీరే మొదటివారు. అంతవఱకు సాతవాహనులు ఆంధ్రులుకారని సంశయించిన వారే లేరు. సుక్థంకరుగారు తమవాదమునకు బలముగ జెప్పుకారణము లివి:

౧. ఇంతవఱకు కనబడిన (రమారమి ఇరువది నాలుగువఱకు గల) సాతవాహన వంశజులనాటిశాసనములలో నేనిలోను వారికి ఆంధ్రులతో సంబంధముకలదని చెప్పుటకు తగినసూచన లేవియు గానరావు. శాసనములలో వారు సాతవాహనులని మాత్రమే పేర్కొనబడియున్నారు.

౨. సాతవాహన వంశజులకు సమకాలీనములైన హాథిగుంఫా, గిర్నారు, తలగుండమొదలగు శాసనము

వారిని సాతవాహనులనియే పేర్కొనుచున్నవి కాని యెప్పుడును, ఎక్కడను ఆంధ్రులని పేర్కొనుట లేదు.

3. ఖారవేలుడను కళింగాధిపతి తాను సాతకర్ణికి భయపడకుండ పశ్చిమమునకు గొప్పసైన్యమును బంపినట్లు చెప్పుచున్నాడు. సాతవాహనులు నిజముగా ఆంధ్రు లేయై, ఆంధ్రులయాదిమనివాసము నేటి ఆంధ్రదేశమే యైయుండినచో ఖారవేలుడు తన సైన్యమును (ఇప్పటి ఆంధ్రదేశము కళింగమునకు దక్షిణమున నున్నది గనుక) దక్షిణమునకు బంపినట్లు చెప్పవలసియుండును.

౪. దాదాపుగ సాతవాహనుల శాసనములన్నియు (నాసికసమీపమున) పశ్చిమహిందూదేశములోనే దొరకినవి: కడపటి నలుగురు సాతవాహనభూపాలుర శాసనములు మాత్రమే ఆంధ్రదేశమున గనబడినవి.

౫. కొంచెమించుమించుగ వారి నాణెములన్నియు పశ్చిమహిందూదేశముననే దొరకినవి.

౬. వారి శాసనములన్నియు ప్రాకృతభాషలో నున్నవి. ద్రవిడభాషాకుటుంబమునకు సంబంధించిన భాషలో (అనగా ఆంధ్రభాషలో) వ్రాయబడిన శాసనము సాతవాహనుల దేదియు ఇంతవఱకు గానరా లేదు.

ఈపై కారణములనుబట్టి సుక్థంకరుగారు సాతవాహనులు ఆంధ్రులుకారనియు, వారికి వీరికి ఏవిధమైన సంబంధమును లేదనియు వాదించుచున్నారు. సాతవాహనులును, ఆంధ్రులును వేఱుగనుక వారిని ఆంధ్రులని పేర్కొనవలసిన యవసరము లేదని సుక్థంకరుగారి తీర్మానము. వీరి యభిప్రాయప్రకారము బళ్లారి మండలమే సాతవాహనుల యాదిమనివాసస్థానము. ఇట్లనుటకు వారు హీరహడగల్లి, మ్యాకదోనిశాసనములను ప్రమాణముగ జూపుచున్నారు. అవి యేవన:

బళ్లారిమండలములోని హీరహడగల్లిలో పల్లవవంశజుడగు శివస్కందవర్మయొక్క ప్రాకృతభాషలోనున్న తామ్రశాసనమొకటి దొరకినది. కాంచీపురపు పల్లవరాజయిన శివస్కందవర్మ తనకు పూర్వము పరిపాలించిన మహారాజగు బప్పస్వామి అదివఱకు బ్రాహ్మణులకుచేసిన సాతాహనిరఠ్ఠము (సాతవాహన రాష్ట్రము)లోని 'చిల్లరెకకొడుంక' గ్రామదానమును స్థిరపఱచి, ఆబ్రాహ్మణులకు అదనముగ మఱికొంత దానమునుచేసెను. ఈవిషయమును దెలుపునదియే హీరహడగల్లి తామ్రశాసనము: ఇందు సాతాహనిరఠ్ఠము పేర్కొనబడినది. 'చిల్లరెకకొడుంక' గ్రామ మెచ్చట నున్నదో తెలియరాలేదు. కాని యాతామ్రశాసనము బళ్లారిమండలమున దొరకుటవలన ఆ శాసనమున దెలుపబడిన గ్రామమును, రాష్ట్రమునుగూడ ఆమండలములోనిదే యైయుండునని కొందఱు చరిత్రకారు లూహించెదరు.

బళ్లారిమండలమునందలి ఆదవాని తాలూకాలోని మ్యాకదోనిగ్రామమునకును చిన్నకడబూరు గ్రామమునకును నడుమ ఒకఱాతిబండమీద బ్రాహ్మీలిపిలో వ్రాయబడి ప్రాకృతభాషలోనున్న యొకపురాతన శాసనమొకటి కనబడినది. అది సాతవాహనరాజగు పులుమావియొక్క ఎనిమిదవ రాజ్యసంవత్సరము నాటిది. సాతవాహనిహారములోని వైపురకగ్రామవాసుడగు గృహపతి యొకడు చెఱువు త్రవ్వించెనని యాశాసనము తెలుపుచున్నది. వైపురకగ్రామ మెచ్చటనున్నదో, వైపురకనామ మిప్పటి యేగ్రామమునకు సరిపోవునో తెలియరాక పోయినప్పటికి ఆ శిలాశాసనము బళ్లారిమండలములోని దగుటవలన ఆశాసన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మున దెలుపబడిన సాతవాహనిహారము బళ్లారి మండలము (ఆదవాని తాలూకా) లోని దని యూహించుట సమంజసము కాకపోదు. సాతవాహనరాష్ట్రము, సాతవాహనిహారము— ఇవి రెండును బళ్లారిమండలములోనివే యని తేలుచున్నది. రాష్ట్రమువలెనే హారముకూడ ఒకదేశవిభాగమునకు పేరైన యట్లు పైశాసనములవలన దెలియగలదు: అయితే రాష్ట్రము పెద్దదేశవిభాగమనియు, హారమనునది రాష్ట్రముకంటె చిన్నవిభాగమనియు, ప్రాయికముగ నిది విషయము లేక నాడువంటివిభాగమై యుండుననియు నూహింపవచ్చును.

ఈపైశాసనముల యాధారమున సుక్థంకరుగారు సాతవాహనుల యాదిమనివాసము బళ్లారిమండలమై యుండుననియు, ఆయాతెగలనుబట్టి వారు నివసించిన ప్రదేశములకు పేరు వచ్చినట్లే సాతవాహనులనుబట్టి ఆప్రాంతము వారికి నివాసస్థలమగుటవలన దానికి సాతవాహనరాష్ట్రమని పేరు వచ్చియుండుననియు చెప్పెదరు; కాని ఆంధ్రరాజుల పేర్లును, సాతవాహనరాజుల పేర్లును ఒక్కటియగుట యెట్లు సంభవించినది. అను సందేహమువారికి తట్టకపోలేదు. అందువలననే వారు దానిని సమన్వయించుటకై తుదకు సాతవాహనులు ఆంధ్రుల తెగకు సంబంధించినవారై యుండవచ్చుననియు, ఆంధ్రజాతిలోని యీసాతవాహనశాఖ(గోదావరీ కృష్ణానదీప్రాంతపు పల్లపు ప్రదేశముల స్థిరనివాసము చేసికొన్న) అసలు ఆంధ్రసంఘమునుండి శిముఖుడు, శాతకర్ణి మొదలగువారికి పూర్వము చాలకాలము క్రితమే విడిపోయి పశ్చిమమున స్థిరనివాసము చేసికొనెననియు సమాధానము చేసికొనియున్నారు.

పైవారిరువురు పోయినత్రోవనే పోయి, టి. యన్. సుబ్రహ్మణ్యముగారుకూడ ఈవిషయమును 'సాతవాహనుల యాదిమనివాసస్థలము' అను నొకవ్యాసమున చర్చించియున్నారు. సాతవాహనులు ఆంధ్రులలో నొక శాఖవా రనియు, శిముఖునకు సాతకర్ణికి చాలకాలము పూర్వమే ఆంధ్రులలోనుండి విడిపోయి పశ్చిమమునకు వెళ్లిరనియు, సాతవాహనుల యాదిమనివాసస్థలము బళ్లారిమండలమనియు సుక్థంకరుగారు తెలిపిన విషయములు సరియైనవి కావని వీరివాదము. వీరి కారణము లివి:

౧. సాతవాహనశాఖ ఆంధ్రులలో నుండి విడి అంతటి పూర్వకాలముననే పశ్చిమమునకు బోయిన ట్లూహించుట కాధారములులేవు. దండక యప్పుడు మహారణ్యముగ నుండెనేకాని జనుల నివాసమునకు దగినప్రదేశముగ నుండలేదు. ఆయరణ్యప్రదేశము పూర్తిగ మానవునికి దెలియ రానేలేదు: ఇట్లని మన కప్పటి సంస్కృతగ్రంథములవలననే తెలియుచున్నది. ఇట్టి సందర్భములో క్రీస్తుపూర్వము అయిదవశతాబ్దిలో బళ్లారి మండలమునుండి యొక పాలకవంశము మహారాష్ట్రమునకువలస పోయెనని యూహించుట ఉచితము కాదు.

౨. బళ్లారిమండలమునకు సాతవాహనరాష్ట్రమను పేరు క్రీస్తుశకము మూడవశతా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బ్దినుండియే వచ్చినది. సాతవాహనులు పశ్చిమమున (మహారాష్ట్రమున) దమరాజ్యమును పోగొట్టుకొనిన పిదప పశ్చిమమునుండి తూర్పునకు వచ్చుచు దమత్రోవలోనుండిన దేశములను జయించిరి. అట్లు జయించిన బళ్లారిమండలమునకు, చోళులుమొదలగు వారివలెనే, తమపేర సాతవాహనరాష్ట్రమని పేరిడిరి. ఈ పేరు కడపటి సాతవాహనభూపాలుర నాటినుండియే కలిగినది.

వారివర్ణనవలన దేలిని సారాంశ మిది:

౧. సాతవాహనులకును ఆంధ్రులకును ఎట్టి సంబంధమును లేదు. వారువేఱు: వీరు వేఱు.

౨. సాతవాహనుల యాదిమనివాసస్థలము పశ్చిమహిందూదేశమే.

3. సాతవాహనులభాష ప్రాకృతము. తూర్పుదేశకు వచ్చునప్పుడు వారా భాషను దమతోకూడ దీసికొనివచ్చిరి. అందువలననే ఆంధ్రదేశమున గానవచ్చిన కడపటి సాతవాహనుల శాసనములును, వారి యనంతర మాప్రాంతమును పాలించిన మొదటి పల్లవరాజుల శాసనములును ప్రాకృతముననే యున్నవి.

౪. గోదావరి నదిమీది ప్రతిష్ఠానమే (పైఠాణ్) శాలివాహ (శాతవాహ)నుని రాజధానియని జైనగాథలు నుడువుచున్నవి. టాలెమీయను యవనభూగోళ శాస్త్రజ్ఞుడుకూడ పులోమాయియొక్క రాజధాని బైఠాన్ (పైఠాన్) అనియే చెప్పుచున్నాడు. అందువలన కడుప్రాచీనకాలమునుండియు సాతవాహనుల రాజధాని ప్రతిష్ఠానమే.

ఇది సుబ్రహ్మణ్యము గారి వాదము యొక్క సారాంశము. ఈవిధమున ఆంధ్రులకును సాతవాహనులకును ఏమాత్రము సంబంధమే లేనియెడల సాతవాహన రాజుల పేర్లును, పురాణములందలి ఆంధ్రరాజులపేర్లు నొక్కటియగుట యెట్లు సంభవించినది అన్న సందేహము సుబ్రహ్మణ్యము గారికిని తట్టకపోలేదు. ఈసందేహము తట్టుటచేతనే కాబోలు, సుబ్రహ్మణ్యముగారు ఈరీతిని చెప్పియున్నారు:—

"సాతవాహనులు ఆంధ్రదేశమును క్రీస్తుశకము ౧౮౦ నుండి పాలించిరని యిదివఱకే సమాధాన మిచ్చియున్నాను. అప్పటికి మనకు దెలిసిన ఆంధ్రరాజు ఎవ్వరునులేరు. అందువలన ఆంధ్రులు శాతవాహనులకు సామంతులుగ నుండిరని తీర్మానింపవలసి వచ్చుచున్నది. క్రీస్తుశకము మూడవశతాబ్ది తరువాత పురాణములు వ్రాయబడినవని మనకు దెలియును. పురాణకారులకు శాతవాహనులను గుఱించి బాగుగ దెలియును. శాతవాహనులు ఆంధ్రులను పాలించిరి కనుక పురాణకర్తలు వారినే ఆంధ్రరాజులని పేర్కొనిరి."

ఈవిధమైన వాదములు ఇంకను గలవు కాని మనకిచట సంబంధించినంతవఱకు ఈపై నుడివినవియే ముఖ్యమైనవి. ఈపైరీతిని సాతవాహనులకు ఆంధ్రులకుగల సంబంధమును గుఱించి పండితులైనవారు అనేకులు తమకు గల యాధారములతో తమ బుద్ధికౌశల్యమును జూపి సత్యాన్వేషణమునకు గడంగి తమకు తోచినరీతిని తలయొక సిద్ధాంతమును జేయుచున్నారు. పరిశీలనదృష్టితో నీవిషయమును మథించినకొలది, అసలు సత్యస్వరూపము ఇంకను గోచరింపకున్నను, ఒక్కొక్కరి బుద్ధికుశలతనుబట్టి నిగూఢములైన విశేషములపూర్వమైనవి వెల్లడి యగుచున్నవి. సత్యమునందే దృష్టియుంచి చేయు పరిశోధనలవలన దేలిన నిర్ణయములు మన యభిప్రాయమున కెంత విరుద్ధములుగ నుండినను వానిని గౌరవించి యాదరింపవలసియే యుండును. అట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వానిని గుఱించి యింకను సమాలోచనము చేసి సత్యస్వరూపమును-మనబుద్ధికి దోచిన ప్రకారము-గనుగొనుటకు అన్వేషణదీపమును వెలిగించియుంచుట యుక్తము. అందువలన నీ పైవాదములలోని సారాంశమును పరిశీలింతము. అదియేదన:

౧. 'సాతవాహనులు ఆంధ్రులేకాని ఆంధ్రుల యాదిమనివాసస్థల మిప్పటి ఆంధ్రదేశముకాదు. ఆంధ్రులు పశ్చిమమునుండి తూర్పు దిశకు వచ్చిరి.' అని శ్రీనివాస అయ్యంగారి వాదము.

౨. 'శాతవాహనులు అసలు ఆంధ్రజాతిలోని యొక శాఖవారు కాని వారు క్రీస్తుశకమునకు పెక్కువందల సంవత్సరములకు పూర్వమే ఆంధ్రులలో నుండి విడిపోయి పశ్చిమమునకు వెళ్లి యచ్చట పాలించిరి. వారికి బళ్లారి మండలమే ఆదిమనివాసస్థలము. (వారి భాష, వారి పరిపాలన, వారి నాణెములు, వారి శాసనములు ఆంధ్రదేశమునకు సంబంధించినవి కాకపోవుటవలన) ఆంధ్రులకు సాతవాహనులకు సంబంధమేమాత్రము లేదు.' అని సుక్థంకరుగారి వాదము.

3. 'సాతవాహనులు ఆంధ్రులలోనివారే కారు: వారికి వీరికి ఏమాత్రము సంబంధము లేదు. వారి ఆదిమనివాసము బళ్లారి మండలము కాదు: పశ్చిమహిందూదేశము (మహారాష్ట్రము). సాతవాహనులు ఆంధ్రులని మనమనుకొనుటకును, సాతవాహనరాజుల యొక్కయు, ఆంధ్రరాజుల యొక్కయు పేర్లు ఒక్కటి యగుటకును క్రీ. శ. మూడవశతాబ్దిలో రచియింపబడిన పురాణములే కారణము. అప్పటికి సాతవాహను లాంధ్రులను పాలించుచుండిరి కావున పురాణకర్తలు వారినే ఆంధ్రరాజు లనిరి అని సుబ్రహ్మణ్యముగారి వాదము.

సమన్వయసమాధానములు

ఈపై వాదములలో మనము గమనింపవలసిన విషయయొక్కటి కలదు. ఈవిధమైన వాదములు చేయువారి కందఱికి పురాణములలోని ఆంధ్రరాజులకును, శాసనములలోని సాతవాహనరాజులకును గలనామసామ్యము జవాబుచెప్పి తీరవలసిన ఒకవ్యాసఘట్టముగ పరిణమించినది. 'సాతవాహనులు ఆంధ్రులుకారు. వారికి వీరికి సంబంధము లే'దని యెంతవాదించినను ఈనామసామ్యమునకుఏదియో యొకవిధమున సమాధానమీయక తప్పని సరియగుచున్నది. అందువలన ఆంధ్రులకును సాతవాహనులకును ఏదియో యొక విధమైన సంబంధము—అదిపురాణకర్తలు కల్పించిన సంబంధమైన నేమి, మఱి యేయితర సంబంధమైన నేమి—కలదనుటకుఉభయవంశములలోని రాజులపేర్లును ఒక్కటియగుటయే బలమైన ప్రమాణముగనున్నది.

శ్రీనివాస అయ్యంగారి వాదమునందు సాతవాహనులు ఆంధ్రులు కారని చెప్ప విషయమేదియు లేదు. సాతవాహనులు, ఆంధ్రులు ఒక్కరేయను అభిప్రాయమును ఆధారపఱుచుకొనియే వారు తమ వాదమును నిర్మించిరి. సుక్థంకరుగారి వాదము ప్రకారము

సాతవాహనులు వేఱు, ఆంధ్రులు వేఱు అని పైకి కనబడుచున్నను వారు కూడ తుదకు సాతవాహనవంశము - ప్రధానాంధ్ర సంఘము నుండి ఎప్పుడు విడిపోయినను- ఆమహాసంఘములోని యొక శాఖయేయని తేల్చియున్నారు. అందువలన పురాణములందు వర్ణింపబడిన యాంధ్ర రాజవంశమును, శాసనములందు గానగు సాతవాహన వంశమును ఒక్కటియే యని యంగీకరింపదగును. ఒక్కటి కాదనుచో ఉభయవంశములలోని రాజులపేర్లు నొక్కటియగుట యెట్లు సంభవించెను అను విషయమునకు జవాబు చెప్పవలసియుండును. ఇక సుబ్రహ్మణ్యముగారి వాదము ప్రకారము మాత్రము ఆంధ్రులు వేఱు, సాతవాహనులు వేఱు. వేఱని వాదించు వీరు నామసామ్యమునకు సమాధానమిచ్చియున్నారు. కాని యా సమాధానము అంగీకరింపదగునా? క్రీస్తుశకము మూడవశతాబ్దిలో రచియింపబడిన పురాణములే యీనామసామ్యమునకు కారణములనియు, అప్పుడు ఆంధ్రులకు సాతవాహనులే రాజులుగ నుండిరి గనుక వారినే పురాణకర్తలు ఆంధ్ర రాజులని చెప్పిరనియు సుబ్రహ్మణ్యముగారు నుడువుచున్నారు: అనగా నామసామ్యమునకుసమాధానమిచ్చుటకై వారుపురాణములను బట్టుకొనిరి. పురాణములన్నియు సరిగా మూడవశతాబ్దిలో రచియింపబడినవనుటకు ఱాయిగ్రుద్దినట్లు చెప్పదగిన ఆధార ప్రమాణములేవియు లేవు. మొట్టమొదట ఒక్క పురాణమే యుండెననియు, అది కాల క్రమమున పెక్కు పురాణముల క్రింద పరిణమించెననియు, అవియైనను కాలము గడచిన కొలది శ్లోకసంఖ్య పెరిగి వృద్ధిబొందుచువచ్చెననియు, పురాణములలోని వేఱువేఱు భాగములు వేఱువేఱు కాలములలో రచియింపబడి వానిలో జేర్చబడినవనియు పురాణపరిశోధకుల యభిప్రాయము. అందువలన మనము ఏయేభాగములు ఎప్పుడు రచియింపబడినవో, అసలు పురాణమూలగ్రంథమేదో ఈవిషయములను నిర్ధారణగ చెప్పలేము. అందు ప్రతి పురాణమునందలి భవిష్యకథనమును ఒక్కసారిగ ఒకే కాలమున రచియింపబడినది కాదనియు, అందలి ఆయా రాజవంశములను గుఱించిన కథనము వేఱువేఱు కాలముల రచియింపబడి యందు చేర్చబడుచువచ్చెననియు ఎల్లరు నంగీకరించియేయున్నారు. ఇట్లనుటకు పురాణములే సాక్ష్యమీయగలవు. ఈకారణముల ననుసరించి ఏయేపురాణములు ఎప్పుడు రచియింపబడినవో, అసలు పురాణము యొక్క ప్రాథమిక స్వరూపమేదో, ఏయేభాగములు ఏయే కాలముల పురాణములలో జేరుచువచ్చెనో ఈసంగతులను ఇదమిత్థమని నిర్ణయించుటకు దగిన యాధారము బలమైనదేదియు లేదు. అందువలన పురాణ రచనాకాలమును గుఱించి మనకు విస్పష్టముగ దెలియనప్పుడు, దానినే మనము గరిష్ఠప్రమాణముగ గైకొనుట యుక్తముకాదు. అయితే పురాణములు క్రీస్తుశకము మూడునాలుగుశతాబ్దులలో రచియింపబడినవను నొక సాధారణాభిప్రాయము పురాణ పరిశోధక మండలిలో వ్యాపించి యుండకపోలేదు. కాని యది మనము గొప్ప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రమాణముగ గ్రహించి దానిమీద మన వాదము నంతను ఆధారము చేసికొనదగినంత బలీయమైన హేతువుకాదు. ఒకవేళ పురాణములు క్రీస్తుశకము మూడవశతాబ్దిలోనే రచియింపబడినవని వాదమునకు అంగీకరింతము. అప్పుడు ఆంధ్రులను సాతవాహన రాజులు పరిపాలించుచుండిరి. దక్షిణాపథమున సాతవాహన ప్రభువుల కీర్తి దట్టముగ అలమికొనెను. వింధ్యపర్వతములకు దక్షిణమున ప్రప్రథమమున గొప్ప సామ్రాజ్యమును నిర్మించినవారు సాతవాహనులే. సాతవాహనులు బౌద్ధభిక్షువులు మొదలగువారికి చేసిన దానధర్మములు లోకవిఖ్యాతము లయ్యెను. దుష్టశిక్షణమును, శిష్టరక్షణమును, వర్ణాశ్రమధర్మ పరిరక్షణమునుజేసి సాతవాహనులు అజరామరమైన పేరు సంపాదించిరి. సాతవాహనరాజులపేరు ప్రజల జిహ్వాగ్రముల నాట్యము చేసెను. అట్టిది సాతవాహన భూమీశుల ప్రతిష్ఠ. ఆ కాలమున వారినెఱుగనివా రెవ్వరు? సాతవాహన భూపతుల ప్రతిష్ఠ విని చీనాదేశమునుండి రాయబారులుకూడ వారియాస్థానమునకు వచ్చి పోవుచుండిరి. అట్టి మహాసామ్రాజ్యమును, మహాకీర్తిని సంపాదించిన సాతవాహనులను గుఱించి క్రీస్తుశకము మూడవశతాబ్దిలోని పురాణకర్తలకు దెలియకుండు టెట్లు? ఈమహారాజులను వా రెఱుగుదురు. ఈరాజవంశమును వా రెఱుగుదురు. వారి ధర్మకార్యములను వా రెఱుగుదురు. ఇన్ని యెఱిగిన సాతవాహన మహీపతులను—వారు ఆంధ్రులను పాలించు చుండిరి గనుక—పురాణకర్తలుఆంధ్ర రాజు లనిరనుట సమంజసముగగన్పట్టదు. సాతవాహనరాజులు తమ శాసనములలో తాము సాతవాహనులమనిచెప్పుకొనిరి. వారి సమకాలీనులు వారిని సాతవాహనులని పేర్కొనిరి. సాతవాహన వంశమునకు సాతవాహననామమునకు గౌరవ ప్రతిష్ఠ లేర్పడినకాల మది. ఇట్టి సందర్భములలో వారు ఆంధ్రులను పరిపాలించు చుండిరి గనుక పురాణకర్తలు వారివంశమును మఱచి వారికీర్తిప్రతిష్ఠలనుమఱచి-పొరపాటుగ-వారిని ఆంధ్రరాజవంశజులని పురాణములలో వ్రాసిరి అనిచెప్పుటఅంతసంగతముగ కాన్పింపదు. బ్రిటీషువారిపుడు హైందవులను పాలించుచున్నారు కావున వారిని హైందవరాజవంశజులని పొరపాటుననైన నెవ్వరును చెప్పరు. అట్లు చెప్పెరనుట సత్యదూరము. అందువలన ఉభయ వంశములందలి రాజుల పేర్లలోగల సామ్యము పురాణకర్తలు కల్పించినదని సుబ్రహ్మణ్యముగారు చెప్పువాదము సరియైనదిగ కన్పట్టదు. ఈనామసామ్యము ఎట్లు కలిగినదో మఱియొక రీతిని వివరించి చెప్పుటకు సాధ్యమగుటలేదు కావున ఆయుభయవంశజులును ఒక్కరేయని యంగీకరించుట సముచితము. ఆనామసామ్యమును మఱియొక రీతిని సమన్వయించి చెప్పుటకేదైన నవకాశమున్నచో నీయుభయవంశజులు నొక్కరే యన్న వాదమును వదలుకొనవచ్చును. అట్టి యవకాశము లేనంతవఱకు ఆంధ్రులు సాతవాహనులు ఒక్కరేయందము. అయితే ఆయుభయవంశజులును ఒక్కరే యనుటకు ఇదిబలిష్ఠమైన యాధారముకాకపోవచ్చును కాని-ఈనామసామ్యమెట్లుకలిగె నన్న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విషయమునకు సమాధానము చెప్పవలసియుం డుననియు, ఈవిషయమంత సులభముగను, నిర్లక్ష్యముగను త్రోసివేయదగినది కాదనియు, ఆంధ్రరాజుల చరిత్రమున నిదియొక వ్యాస ఘట్టమనియు మాత్రము జ్ఞాపక ముంచుకొనవ లసియుండును. ఆంధ్రులును సాతవాహనులును ఒక్కరేయనుటకీనామసామ్యముగాక మఱియే దైన నాధారము లున్నవేమో చూతము.

ఆంధ్రులును సాతవాహనులును ఒక్కరు కావచ్చునని పురాణములవలన తేల్చుకొనిన నిర్ణయమే సరియైనదగుచో ఆంధ్రులుండిన చోట్లనే సాతవాహనుల జాడలుకూడ కాన్పింపవలెను. ఆంధ్రులు అసలు కృష్ణాగోదావరీ నదుల మధ్యప్రదేశమున అనాదికాలమునుండి యు నుండలేదనియు, వారు ఉత్తరమునుండి దక్షిణమునకు వచ్చిరనియు, ఇట్లు వచ్చుటలో వారు చాలకాలము తెలివాహానదీ ప్రాంతముల నివసించిరనియు ఇదివఱలో తీర్మానించియు న్నాము. ఈతీర్మానము ప్రకారము ఇప్పటి ఆంధ్రదేశము ఆంధ్రులయొక్క కట్టకడపటిస్థిర నివాసస్థలముగ విదితమగును. తెలివాహానదీ ప్రాంతముల ఆంధ్రులు నివసించిరనుటకు ప్రమాణము లిదివఱకే చూపబడినవి. వాటినే కాక ఆప్రాంతములందలి గ్రామనామములను గూడ అందులకు ప్రమాణముగ జూపవచ్చును. ఈ విషయమును శ్రీయుతులు బుర్రా శేషగిరిరావు (యమ్. ఏ) గారు 'కళింగమందలి ఆంధ్రులు' అనువ్యాసమున సువ్యక్తముచేసియున్నారు. గంజాం, విశాఖపట్టణమండలములందలి పర్వతప్రాంతములలో(మాళియాలలో)ని గ్రామనామము లనేకములు ఆంధ్రపదాంచిత ములైనవి కలవు.

| | |
|---|---|
| ఒంద్రసింగి | ఒంద్రాపుండా |
| ఒంధారోకోటో | ఒంధ్రగుడ |
| ఒంతోరోపాదా | ఒంఘరిఝిలా |
| ఒఘాయ్‌గాం | ఒందోరోఘాటీ |
| ఒంతోరోసింగి | ఒంధారి |
| ఒంతోరోకుడ్డ | ఒందరాగోడా |
| ఒంతోరోబా | ఒందోరాసింగి |
| ఒంఘరోగాం | ఒంద్రిగోడో |
| ఒంఘరి గుమ్మ | ఆంధ్రడొబ్బి |
| ఒంధారిబొంధో | ఒంద్రిగుడ |
| ఒంధారులిమ్మా | ఒంద్రంగి |
| ఒండరిగుడా | అంత్రిగాం |

ఈ పైపేరులన్నియు ఆంధ్రగ్రామములకు సంబంధించినవే. ఈపై పేర్లలో ఒంతరో, ఒంద్రి, ఒందోరో, ఒంధారి, ఒంఘరి, అంత్రి- ఇవి యన్నియు ఆంధ్రపదముయొక్క వికృత రూపములు.ఒంద్రంగి,ఒంద్రిగుడ ఈ మొదలగు నవి ఒంద్రంగి, ఒంద్రిగుడ అనువానికిరూపాంతరములుగభావింపవచ్చును. ప్రాచీనాంధ్రమున 'ద', 'డ' గ కనబడిన యుదాహరణములు లేకపోలేదు. ఎట్లన: కొట్యదొన-కొట్యడోన; నాదెండ్ల-నాడిండ్ల; దామలూరు-డామలూరు: ఇత్యాదులు. ఈగ్రామనామములుకూడ ఆంధ్రులీప్రాంతముల చాలకాలము నివసించిరనుటకు తార్కాణములుగ నున్నవి. ఇట్లే ఆంధ్రులును సాతవాహనులు నొక్కరైనయెడల నీ ప్రాంతములలో సాతవాహనులపేరకూడ గ్రామములు కలవేమో పరిశీలింపవలసి యుండును. సాతవాహనవంశమునకు సాతాహనవంశమనియు, రాజులకు సాతరాజు లనియు, సాతవాహన


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజులనియు, సాతకర్ణులనియు పేరు. దీనినిబట్టి 'సాత' అనుపదమును జాతివాచకముగ దీసి కొనినచో ఆపదముపేరిట నొప్పు గ్రామములు కొన్ని యా ప్రాంతముల చూపట్టుచున్నవి.

| | |
|---|---|
| సాతోకట్టిని | సాతోనోలా |
| సాతోపాండియ | సాతోకుటిని |
| సాతులి | సాతరా |
| సడ(ద)నపల్లె(సాతవాహనపల్లె) | సాప |
| సడాం (దాం) | సతాపి |

ఇవి యన్నియు సాతవాహను లచ్చట నివసించిరనుటకు ప్రమాణలుగ చెప్పదగి యున్నవి. బళ్లారిజిల్లా ఆదవాని తాలూకా లోని సాతనూరు, చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకాలోని సాతంబాక్కం, గుంటూరు జిల్లా నర్సారావుపేటతాలూకాలోని సాతులూరు, కృష్ణాజిల్లా బందరు తాలూకాలోని సాతులూరు- ఇవి యన్నియుగూడ నట్టివే.

ఇట్లు ఆంధ్రపదాంచితములైనగ్రామనామములు కానవచ్చుచోట సాతవాహన పదాంచితములైన యూరిపేరులు కనబడుట కూడ పురాణప్రమాణమును బలపఱిచి,ఆంధ్రులును సాతవాహనులును ఒక్కరేయను నిర్ణయమునకు సహకారి యగుచున్నది.

ఆంధ్రుల పూర్వపు వలసలలో సాతవాహనుల జాడలు కనబడినట్లే సాతవాహనులు పాలించినట్టియు, వారిశాసనములు కాన్పించునట్టియు ప్రదేశములలో ఆంధ్రుల జాడలు కనబడుచున్నవి.

బ్రిటీషు మ్యూజియములోనున్న వీరసత్యాశ్రయదేవుని తామ్రశాసనములో దానమీయబడిన గ్రామముయొక్క సరిహద్దులలో నొకటిగ 'అంధరాగిరి' (అంధ్రగిరి) అనుపర్వతమొకటి పేర్కొనబడినది. ఆశాసనమున నిది బెళ్వంకిగ్రామమునకు సమీపమున వాయవ్యమూలనున్నట్లు తెలుపబడినది. ఈగ్రామము సాతవాహనులు పరిపాలించిన దక్షిణమహారాష్ట్ర దేశములోని 'మిరాజ్'సంస్థానమునకు రాజధానియైన 'మిరాజ్' నగరసమీపమున నున్నది. దాతయైన వీరసత్యాశ్రయుడు పశ్చిమ చాళుక్య విక్రమాదిత్యవంశజుడు. దక్షిణమహారాష్ట్రముననుండిన పర్వతము ఆంధ్రనామాంచిత మెట్లయ్యెను? ఈపేరు తప్పక ఆంధ్రులను బట్టియే కలిగియుండవలెను. కాని పశ్చిమ చాళుక్యవంశజులకు పూర్వము పురాణములందలి ఆంధ్రవంశపురాజులతో నామసామ్యముగల సాతవాహనవంశపురాజులు తక్క మఱియే యితర ఆంధ్రవంశపురాజులును మహారాష్ట్రమున నివసించినట్లు కాని పాలించినట్లు కాని తెలియరాదు. అట్లయినచో అంధరాగిరి (అంద్రగిరి) అనుపేరు ఎట్లు వచ్చియుండును? ఇట్లే బొంబాయి ప్రాంతమున 'ఆంధ్రలోయ' అనుపేర నొకలోయ కలదు. దీనికిట్టిపేరు ఎట్లు వచ్చియుండును ? సాతవాహనులు ఆంధ్రులనియు, వారు మహారాష్ట్రమున పాలించిరనియు, నివసించిరనియు జెప్పిననే వీటికితృప్తికరమగు సమాధానము రాగలదు. ఇట్లే శాసనాధారమున సాతవాహనరాష్ట్ర మని యనబడదగిన బళ్లారిజిల్లా ఆదవానితాలూకాలో 'ఆంద్రహాళు'అను పేరబరగు ఆంధ్రనామాంచిత గ్రామముకలదు. ఈవిధమున ప్రాచీనా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధ్రుల వలసలలో సాతవాహనులకు సంబంధించిన యూరి పేరులును, 'సాతవాహన దేశము'న ఆంధ్రనామాంచితమైన పేరులును కనబడుచున్నవి. ఈకారణమునుబట్టియు, ఉభయవంశపు రాజుల నామసామ్యమును బట్టియు ఆంధ్రులును, సాతవాహనులును ఒక్కరేయని యూహింపదగును. ఈయూహాసరియైనది కావచ్చుననుటకు మనకింకొక యాధారము కలదు.

బ్రహ్మాండపురాణమున భారతవర్షవర్ణనము కలదు. భారతవర్షమునందలి దక్షిణదేశమునను, ఉత్తరదేశమునను, మధ్యదేశమునను, తూర్పుదేశమునను ఉన్న జాతులన్నియు అందు దెలుపబడినవి. ఆంధ్రులు రెండుతావుల నుండినట్లు ఆపురాణములవలన దెలియుచున్నది: (౧) వారు కొంకణులు, కుంతలులు-వీరితో గలసి దక్షిణదేశముననుండినట్లు ఈక్రింది శ్లోకములు చెప్పుచున్నవి:

పులిందా వింధ్య మూలీయా వైదర్భాదండకైస్సహ
పౌరికామౌలికాశ్చైవ అశ్మకాభోగవర్ధనాః [రిపాః
కొంకణాః కం(కుం)తలాశ్చాంధ్రాః కులిందాంగరమా
దాక్షిణాశ్చైవయేదేశా అపరాంస్తాన్నిబోధత.

కొంచెమించుమించుగ మహారాష్ట్రదేశసముద్రతీరమంతయు కొంకణమనుపేర బరగుచున్నది. తూర్పుకనుమలకును సముద్రమునకును మధ్యనున్న సముద్రతీరస్థ ఆంధ్రదేశము వలెనే కొంకణము పడుమటి కనుమలకును, సముద్రమునకును నడుమ నున్నది. ఇందు బొంబాయి, ఠాణా, కొలాబా, రత్నగిరి మండలములు, ఉత్తరకనరాలోని సముద్రతీర ప్రదేశము, జింజీరా సావంతవాడి అను స్వదేశసంస్థానములు, గోవా-ఇవి యన్నియు గలవు.

దక్షిణమహారాష్ట్రదేశము కుంతలమని చెప్పదగును. అజంతాగుహలుకూడ కుంతలదేశములోనివే యని అజంతాలోని యొక శాసనమువలన దెలియుచున్నది. బొంబాయి రాజధానిలోని కర్ణాటభాషామండలము లన్నియు కుంతలములోనివి కాగలవు. దక్షిణహిందూదేశమున పూర్వము పరిపాలనము నెరపిన వాకాటకవంశజులు తాము కుంతలులమని చెప్పుకొనియున్నారు. వాకాటకరాజ్యము మధ్యపరగణాలలోని నాగపుర ప్రాంతమున శేకత్తినది. అందువలన ఆ ప్రాంతమును గుంతలమే.

కొంకణ కుంతలదేశములు రెంటినిగూడ సాతవాహనులు పాలించియున్నారు. ఈవిషయము వారి శాసనములవలననే వ్యక్తపడుచున్నది. సాతవాహనులకును, కొంకణకుంతలులకును చాలసంబంధమున్నయట్లే ఆంధ్రులకును కుంతలులకునుగూడ దగ్గఱసంబంధము కలదనుటకు ప్రమాణములు కలవు.

పురాణోక్తమగు ఆంధ్రవంశపు రాజులలో ఒకనిపేరే కుంతలస్వాతికర్ణి. హాలుడను మఱియొకరాజు పురాణముల ననుసరించి ఆంధ్రవంశపురాజుగ దెలియవచ్చును. ఇతడు సాతవాహనరాజగునా కాదా యని తెలిసికొనుట కీతనిశాసనములేవియు గానరాలేదు. కాని ప్రాకృతవాఙ్మయమువలన నితడు సాతవాహనరాజని తెలియుచున్నది. హాలవిరచితమైన గాథాసప్తశతికి 'శాతవాహన సప్తశతి' యని నామాంతరము కలదు. ఈసప్తశతియందే శాలివాహనుని గుఱించి యొక గాథ (పద్యము) కలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లీలావతి యను ప్రాకృత కావ్యమున నితఁడు సాలాహణుడనియు, సాలవాహణు డని యు పేర్కొనబడినట్లు శ్రీయుతులు మానవల్లి రామకృష్ణకవిగారు తెలుపుచున్నారు. హాలునికి కుంతలుడను నామాంతరము కూడ నున్నట్లు హేమచంద్రుని దేశికోశము వలన నెఱుఁగనగును. ఈకారణములవలన సాతవాహన రాజులకు కొంకణ కుంతలులకు, పురాణోక్తమైన ఆంధ్రవంశపురాజులకు కొంకణ కుంతలులకు సంబంధముండెనని స్పష్టపడుచున్నది.

(౨) పైనుడివిన పురాణముననే ఆంధ్రులు మఱియొకచోట పేర్కొనబడి యున్నారు:

ఝిల్లికాశ్చాపహూకాశ్చైవ హూణాదర్వాస్తథైవచ
ఆంధ్రవాకాః సుద్గరకా అంతర్గిరి బహిర్గిరాః
తథాప్లవంగ మాళ్లయా మాలదామలవర్తికాః
సమంతరాః ప్రావృషేయా భార్గవా గోపపార్థివాః
ప్రాగ్జ్యోతిషాశ్చ పుండ్రాశ్చ విదేహాస్తామ్రలిప్తకాః
మల్లా మగధగోనర్దాః ప్రాచ్యాం జనపదాః స్మృతాః.

ఈ పైశ్లోకములలో తూర్పుననున్న జనపదములలో నివసించు జాతులు పేర్కొనబడినవి. అందు 'ఆంధ్రవాక' నామముచేత ఆంధ్రులే యుద్దేశింపబడి రనునట్లయిన వారు ప్రాచ్యజనపదములలో నివసించుచుండిన వారనియు, అందు ముఖ్యముగ 'అంతర్గిరి', 'బహిర్గిరుల'లోని వారనియు మనము నిశ్చయింపవచ్చును. అంతర్గిరి బహిర్గిరులు భారతము ననుసరించి దేశవిశేషములుగ గనబడుచున్నవి. అవి ప్రత్యేకము దేశవిశేషములైనను కాకపోయినను పర్వతప్రాంతములనియు, తూర్పుదేశములందలివనియు మాత్రము నుడువుటకభ్యంతరముండదు. తెలివాహనదీప్రాంతము పర్వతమయమనియు, నది పూర్వదేశమందలిదనియు మనకు దెలియును. అందువలన ప్రాచ్యజనపదములందలి 'అంతర్గిరి', 'బహిర్గిరుల'లోని, 'ఆంధ్రవాకు' లనబడు ఆంధ్రులు తెలివాహనదీప్రాంతముల నున్నవారని యిదివఱలో మనము నిర్ణయించుకొనిన ఆంధ్రులై యుండవచ్చును.

మఱియొక్క విషయము: హాలుడు కథానాయకుడుగా రచియింపబడిన లీలావతియను ప్రాకృతకావ్యమున ఆంధ్రదేశమునందలి సప్తగోదావరీక్షేత్రమును, భీమేశ్వరాలయమును కథాకల్పనలో బొందింప బడియున్నవని శ్రీయుతులు మానవల్లి రామకృష్ణకవిగారు చెప్పుచున్నారు. హాలుడు గౌతమీపుత్రశాతకర్ణికి పూర్వుడు. 'గౌతమీపుత్రుని తరువాతినుండి కాని సాతవాహనులు ఆంధ్రదేశమునకు వచ్చియుండలేదు, ఆంధ్రదేశమును పాలింపలేదు' అను వాదమున కొకవిధముగ ఈలీలావతీ కావ్యము వ్యతిరేకప్రమాణమగునేమో! హాలుని యాస్థానకవియో మఱి యెవ్వరో ఆతనిని కథానాయకుని గావించిరచియించిన యీకావ్యముయొక్క కథాకల్పనమున ఆంధ్రదేశస్థములైన సప్తగోదావరీక్షేత్ర భీమేశ్వరాలయాదికములు పొందింపబడియుండుటను బట్టి కథానాయకుడు ఆంధ్రవంశపురాజైనను కాకపోయినను, పరిపాలనము ద్వారముననో, మఱి యేవిధముననో ఆతనికిని ఆంధ్రదేశమునకును దగ్గఱ సంబంధముండినట్లు మాత్రము సూచితమగుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అదియును గాక, పశ్చిమసముద్రతీరస్థమగు మలబారుమండలమున 'ఆండుశార్' అని యొక తెగకలదు. ఈపేరబరగు తెగవారు కుమ్మరులు. అటువమున ఆంధ్రులు 'ఆండార్' 'ఆండిరార్' అను పేరబరగుదురు. అందువలన మధ్యాక్షరమున స్వల్పవ్యత్యాసమున్నను 'ఆంమరార్' అనుతెగ 'ఆండిరార్' లేక ఆంధ్ర జాతిలోనిదే కాదగును. ఆంధ్రజాతిలోని కుమ్మరివృత్తి నవలంబించినవారు మహారాష్ట్రమునుండి పశ్చిమసముద్రతీరమున నే మలబారు మండలమునకు వ్యాపించియుందురు.

మన్మిత్రులైన శ్రీయుతులు ఏ. రంగస్వామి సరస్వతి (బి. యే.)గారి 'ఆరిజిన్స్ ఆఫ్ ది సౌత్ ఇండియన్ డైనాస్టీస్' అను పుస్తకమువలన మఱికొన్ని విషయములు తెలియవచ్చుచున్నవి. వారు చెప్పుదాని ననుసరించి ఆండార్, ఆండిరార్ అను పదములు ప్రాచీన తమిళవాఙ్మయమున జూపట్టుచున్నవని తెలియుచున్నది. 'సంగం' గ్రంథములలో 'ఆయ్ ఆండిరార్' అను నొక నాయకుడు పేర్కొనబడెను. 'సంగ' మనునది 'సంఘ' శబ్దభవము. ప్రాచీనకాలమున తమిళదేశమున నిట్టి 'సంఘములు' (సంగములు) మూడుండెను. ఇవి సాహిత్యపరిషత్తులవంటివి. ఈ 'సంగము'నందలి సభ్యుల యామోదమును బడసిననే గ్రంథమునకు ప్రశస్తివచ్చుచుండెడిది. ఈ'సంగము' కాలపుగ్రంథములకు వాటి ప్రాచీనతనుబట్టి విశేష గౌరవప్రతిష్ఠలు కలవు. ఈ'సంగములు' వర్ధిల్లిన కాలమెప్పుడు అను విషయమున తమిళపండితులలోనే మతభేదములు కలవు. అయినను అవి క్రీస్తుశకము ఒకటిరెండు శతాబ్దులనాటివని పెక్కురు తమిళవాఙ్మయపరిశోధకులు వాదింతురు.

తిరునల్వేలి మండలములోని పొదియిల్ కొండ ప్రాంతమున 'ఆయ్ ఆండిరార్' పరిపాలనము నెరపెను. అతని రాజధాని 'ఆయ్కుడి'. అతని రాజ్యమున పెక్కుచలమలతో గూడిన 'కవిరమ్' అను నొక పర్వతపంక్తి కలదనియు, విశేషముగ ఏనుగులు కలవనియు,బహుమానమునకైనను ఏనుగులనే యొసంగువారనియు, ఆండిరార్ కొంగుదేశస్థులతో బోరాడి వారిని పశ్చిమసముద్రమువైపు తఱుమగొట్టెననియు, ఈతని దర్బారు వైభవమును పెక్కురు 'సంగపు' కాలపు గ్రంథకర్తలు పొగడుచు వర్ణించిరనియు, ఈతని యాస్థానకవులలో 'మోసియార్' అను నతడు ముఖ్యుడనియు తెలియుచున్నది.

ఈపైవిషయములు కూడ ఆంధ్రజాతిలోని యొకతెగవారు పశ్చిమసముద్రతీరముననే దక్షిణమునకువచ్చి తమిళదేశపు దక్షిణ మండలములలో వ్యాపించిరనుటకు నిదర్శనములు కాగలవు.

ఇంతవఱకు నిచ్చినప్రమాణముల నన్నిటిని తర్కించిచూడగా తేలిన సారాంశమును ఈక్రిందిరీతిని నిర్వచింపవచ్చును.

(౧) పురాణములవలన దెలియవచ్చిన ఆంధ్రవంశపురాజులపేర్లును, శాసనములవలన దెలియవచ్చిన సాతవాహనవంశపు రాజుల పేర్లును ఒక్కటియే.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(౨) ప్రాచీనాంధ్రుల నలసలలో సాత వాహన వంశమువారి జాడలు కాన్పించు చున్నవి.

(3) సాతవాహనులు నివసించిరను నట్టి యు, పాలించిరనునట్టియు మహారాష్ట్రమున ఆంధ్రులజాడలు కానవచ్చు చున్నవి.

(౪) సాతవాహనరాష్ట్రమని పేరొందిన ప్రదేశమున ఆంధ్రనామాంచితములైన గ్రామ ములు కనబడును.

(౫) ఆంధ్రులు పశ్చిమమునమహారాష్ట్ర మునుండి సముద్రతీరముననే క్రమముగామల బారు,తిరువాన్కూరు మండలములనుండి వచ్చి తమిళ దేశపు దక్షిణమండలములలో వ్యాపించి రనుటకు అవకాశము కలదు.

(౬) హాలుడు(పురాణములనుబట్టి)ఆంధ్ర వంశపురాజనియు, ప్రాకృత వాఙ్మయమునుబట్టి సాతవాహనవంశపు రాజనియుకూడ తెలు చున్నది.

(౭) హాలుడు కథానాయకుడుగ రచి యింపబడిన లీలావతియను ప్రాకృతకావ్యమున ఆంధ్ర దేశస్థములగు సప్తగోదావరీక్షేత్ర, భీమే శ్వరాల యాదికములు ఇతివృత్తకల్పనమున గూర్పబడియున్నవి.

(౮) ఆంధ్రులు ప్రాచ్యజనపదములలో అంతర్గిరి బహిర్గిరులయందును; దక్షిణమున కొంకణకుంతలాదులతో (మహారాష్ట్రమున) ను నివసించిన జాతియని పురాణములు తెలు పుచున్నవి.

(౯) శాసనములవలన సాతవాహనుల ను, పురాణముల ననుసరించి ఆంధ్రులను కుంతలాదులతో ఎక్కువ సంబంధముగలవా రని తెలియుచున్నది.

బలిష్ఠ ప్రమాణములైనను కాకపోయి నను ఈపైనుడివిన హేతువుల ననుసరించియే ఆంధ్రులును, సాతవాహనులును ఒక్కరని యు, లేక మహాంధ్రజాతిలోని వేలువేలుశాఖ లవారనియు, వారిలోని కొందఱు సముద్ర తీరముననే యిప్పటి ఆంధ్ర దేశమునకు వచ్చి రనియు, మఱికొందఱు పశ్చిమమున మహా రాష్ట్రమునకుబోయిరనియు నూహింపదగును.

అయితే మనమిచ్చట మఱియొకవిషయ మునుగూడ గమనింపవలసియుండును. ప్రాచీనాం ధ్రులు నివసించి రన్నవలన ప్రదేశములలో సాత (వాహన) పదాంచితములైన గ్రామనామ ములు కాన్పించుటచేత ఆంధ్రులును, సాత వాహనులును ఒక్కరేయని రుజువుచేయుటకు దానినొకకారణముగ గ్రహించినను ఇచ్చట నొక చిక్కుమాత్రము లేక పోలేదు. తెలి వాహనదీ ప్రాంతముల గంజాం, విశాఖపట్టణ మండలములలోని మన్యప్రదేశమున ఆంధ్రనా మాదిని గలిగినట్టియు, సాతపదమాదిని గలిగి నట్టియు గ్రామములున్నయట్లే 'తెలుగు'పదాం చితములైన గ్రామములును గానవచ్చుచున్నవి.

| | |
|---|---|
| తలగాం | తెలిధ |
| తెలాగాం | తెలిగాం |
| తొల్లంగొ | తెలాంగొపాడా |
| తాలాపాడా | తెలుగాం |
| తాలాగాం | తెల్లిగుడ |
| తెలియాపల్లి | తెల్లాపుట్టు |
| తెనుగు (తెలుగు) | తెలగనలస |

దీనిని బట్టి ఆయాగ్రామములు ఒకప్పుడు కను ప్రాచీనకాలమున ఆయాతెగలకు లేక శాఖలకు నివాసస్థలములుగ లేక వలసలుగ నుండుటవలన వారిపేరిట ఆగ్రామములకట్టినామములు కలిగినవని తలంపదగును. ఇందువలన ఆంధ్రులు, సాతవాహనులు, తెలుగులు ఒక్కరా యను సందియము కలుగక మానదు. అందఱును ఒక్కటే జాతివారు; ఒక్కరేయన్న యెడల తెలుగు సాతవాహన తెగలపేర్లతోగూడ ఎందువలన గ్రామములేర్పడవలసిన యవసరము సంభవించినది? అందఱును ఆంధ్రులేయైన యెడల ఒక్క ఆంధ్రపదాంచిత గ్రామనామములే యుండవలెను. వివిధశాఖల వలస లనునభిప్రాయమును కలుగజేయు ఇతరపదాంచితగ్రామము లెందువలన కలిగినవి?

దీని కొక్కటే సమాధానము కలదు. అసలు ఆంధ్రులును, సాతవాహనులును, తెలుగులును ఒకే జాతిలోని వేఱువేఱుశాఖలనియు, వీరందఱును కాలక్రమమున గలిసిపోయి గొప్ప ఆంధ్రజాతి యొకటేర్పడెననియు, ఆంధ్రులును, సాతవాహనులును, తెలుగులును భిన్నజాతుల వారుకాక ఒకే జాతిలోని అంతశ్శాఖలవారుమాత్రమేయనియు* సమన్వయించుకొనవలసియుండును. ఇంతకన్న వేఱుసమాధానము కుదురదు. ఎట్లయినను నేమి, పైవిషయముల నన్నిటినిబట్టియు ఆంధ్రులును, సాతవాహనులును ఒక్కరేయని చెప్పుటయే యుక్తము. ఆంధ్రులును సాతవాహనులును ఒక్క రనుటకు ఇంతకంటె ప్రమాణము లేవియు గానరావు.

సాతవాహనులును ఆంధ్రులును ఒక్కరు కారను వ్యతిరేకవాదమునకును,ఒక్కరేయను సమన్వయవాదమునకును గల యాధారములు వివరముగ నింతవఱకు దెలుపబడినవి. పరిశీలనాదక్షులైన పరిశోధకు లీవిషయమును గుఱించి యింకను పరిశోధించుట లెస్స.

ఈపైవిధమున ఆంధ్రులును, సాతవాహనులును ఒక్కరేయనియు, ఆంధ్రులలో కొందఱు తూర్పువైపుగ కృష్ణాగోదావరీనదీప్రాంతములకును మఱికొందఱు పశ్చిమముగ మహారాష్ట్రమునకు వ్యాపించిరనియు,పశ్చిమమునకు బోయిన ఆంధ్రులలోనుండియే ఆంధ్రరాజపాలక (సాతవాహన)వంశమేర్పడెననియు సమన్వయించి కావించిన నిర్ణయము అంగీకార్యమైనచో ఒక్క భాషావిషయమున దక్కమిగిలిన అన్నివిషయములలోను వ్యతిరేకవాదులకు సమాధాన మిచ్చిన ట్లగును.

* ఇంతవఱకు దొరకినప్రమాణములను బాగుగ పర్యాలోచించి, సమన్వయించినమీద ఈ క్రిందిరీతిని కొన్ని యూహలుచేయ నవకాశముకలదు. (౧) ఆంధ్రులు తెలివాహానదీప్రాంతములకు రెండుతెగలుగవచ్చిరి. (౨) మొదటి తెగవారికంటె రెండవతెగవారు చాలకాలమునకుతరువాత వచ్చిరి. (౩) రెండవమారువచ్చినవారే 'ఆంధ్రు'లను పేరుతో వచ్చిరి. (౪) రెండవతెగవారికి పూర్వమేవచ్చి తెలి (లేక తెలివాహా) నదీప్రాంతముల కుదురుకొనినవారే 'తెలింగులు' లేక 'తెలుగు' లనబరగిరి. (౫) 'తెలి-కళింగ'మే లేక 'తెల్-కళింగ'మే త్రికళింగ మయ్యెను. (౬) 'సాతవాహను' డను,దేవత నారాధించినవారికి 'సాతవాహను' లను పేరు కలిగెను. 'సాతవాహనులు' పశ్చిమమున బొంబాయిరాజధానిలోను, 'తెలుగులు' బస్తరురాజ్యముగుండ ఓరుగంటిప్రాంతమునను, 'ఆంధ్రులు' కృష్ణా గోదావరీ నదీ పల్లపుప్రదేశముల ప్రాక్సముద్రతీరమునను వ్యాపించిరి. వీటినిగుఱించి వేఱొకవ్యాసమున వివరముగ చర్చింపబడును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




(రా వి త ల్లి)

అడివి బాపిరాజు గారు, బి. ఏ.

కన్ను తెలవని కటికి చీకటి
మిన్ను తెలవక మేఘాలున్నాయ్
తిన్నగా వచ్చింది ఒడికే

చిన్నపాపమ్మా,
ఆరాత్రి
దిక్కులేకమ్మా.



చెదిరిపోయిన చింపిజుత్తూ
నుదురూపైనా నాట్యాలాడా
మెరసిపోయే నల్లపాపల
నవ్వునవ్వేది
నాపాప
బెదిరిచూసేది



పాతముంతా చేతపట్టీ
పావురాయి పాటలాడుతు
మురికిపేలిక మొలకిచుట్టి
ముష్టికెళ్లేది,
ఊరిలోనే
కబళమడిగేదీ.



రావికొంగల కథలూ వింటూ
రావితల్లితో మారాం పెడుతూ
రావిరవళికజోలలాకూ
జోగిపోయేదీ,
తేటగుండెల
నిదురలూనేదీ.

నీళ్ల రేవుకు వచ్చేతల్లుల
కాళ్లకడ్డాలాడే పిల్లలు
కదలిసాగే నావేళ్లతో
కళ్లుమూసీ దాగులింతల
ఆటలాడేదీ,
ఆబిడ్డలచూస్తూ
గంతులేసేదీ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# పిట్టకథలు

అనగనగా ఓపల్లెటూళ్లో వెంకయ్య అని ఓకా వుండేవాడు. అతనికి మంచి వసతుంది. పొలం, యిల్లు, కుక్క అన్నీ లక్షణంగా ఉన్నాయి. పొలం బాగాపంట కొచ్చింది. చూసుకుందాంఅనివచ్చి పొలంచూస్తేఆకుమడి ఎండిపోతోంది.



వ్యాసకర్త్రి



'ఇంకా తొలకరించ లేదు-పై రెండిపోతోంది దేముడా'.

అది చూచి దిగాలపడి, 'ఇంకా తొలకరించలేదు-పై రెండిపోతోంది దేముడా' అని విచారిస్తో వర్షంకోసం ఇంద్రుడిని ప్రార్థించాడు.

దయవచ్చి ఇంద్రుడు తన తెల్లగుఱ్ఱం యెక్కి భక్తుడికి ప్రత్యక్షం అవుదామని వస్తూన్నాడు. దూరంగా ఉండడంచేత వెంకయ్యకి ఒక గుఱ్ఱమే కనిపించింది. వెంకయ్య ఉలికిపడి ఇదేమిరానాయనా వర్షంకావాలంటే ఉన్న నాలుగాకులైనా దక్కకుండా యీ గుఱ్ఱం మేసిపోడానికి వస్తోంది అనుకుని తన పెంపుడు వేటకుక్కని గుఱ్ఱంమీాదకి ఉసికొలిపాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆగుఱ్ఱం ఎంత త్రిప్పినా తిరక్క భూలోకజంతువుయొక్క ధైర్యం చూసి భయపడి తిన్నగా మళ్లీ ఇంద్రలోకం చేరి మరిక్తే వెను దిరిగి చూసింది.

దర్శన మిచ్చే దేము డుంటేమాత్రం పూజారి వరం యివ్వద్దూ? కొంత సేపటికి తేరిపారిచూసి వెంకయ్య వెనక్కిమళ్లిన గుఱ్ఱపు



'తన పెంపుడువేటకుక్కని గుఱ్ఱంమీదకిఉసికొలిపాడు.'



'చేయిజారినతరువాత...ఏడవడం మొదలుపెట్టాడు.'

రౌతు దేవేంద్రు డని గ్రహించి చేయిజారిన తరువాత చేసేదిలేక నెత్తి బాదుకుని ఏడవడం మొదలుపెట్టాడు.

[ క మ ల. ]



'ఆగుఱ్ఱం ఎంతత్రిప్పినాతిరక్క......మరిక్తే వెనుదిరిగిచూసింది.'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# శాంతినికేతనము

గూడా కృష్ణమూర్తిగారు

(వెనుకటి సంచిక తరువాయి)

బాలురు, యువకులు, పెద్దవిద్యార్థులు వేర్వేరు సంఘముల స్థాపింతురు. అందనేకవిషయములు చర్చింతురు. స్వకల్పితములగు కథలు, కీర్తనలు, నాటకములు అప్పుడప్పుడు బాలురందరు ఒక్కనాటకమును ప్రదర్శింతురు. అందు వారు నిర్భీతిగ భావప్రకటన చేయగలరు. వీరుగాక బాలికలు ప్రత్యేకముగ బాలురులేని నాటకమును ప్రదర్శింతురు. బాలురుగూడ అప్పుడప్పుడు ఇటువంటివాటిలో పాల్గొనుటగలదు. ఇప్పటి చిన్నబాలురందరు తాపీపనివాని యవసరము లేకయే యొకగృహమును నిర్మించిరి. అందు వడ్రంగిపని నేతపని కూడవారే చేసిరి. అప్పుడప్పుడు విద్యార్థులచే, ముఖ్యముగ బాలురచే, వస్తుప్రదర్శనములు జరిపింపబడుచుండును. అందు ఆయా బాలురచే స్వయముగ జేయబడిన వస్తువులే ప్రదర్శింపబడును. ఈ బాలురెప్పుడును మామూలు విద్యార్థులవలె భయముచెందక, పాఠశాలయన్న పెద్దపులివలె జూడక, యెప్పుడును చిద్విలాసులై కులాసాగా కాలము



గాజుతో చేయబడిన ప్రార్థనామందిరము—శాంతినికేతనము

చదివి వారలు తమబుద్ధిచాకచక్యమును జూపింతురు. ఒకవిషయము జరిగిన తోడనే ఆవిషయముపై చర్చజరుగుచుండును. ఇందు బాలురకు శ్రద్ధ యెక్కువ. ఈ వేర్వేరుసంఘములనుండి లిఖితపత్రికలు వెలువడుచుండును. కాలేజీతరగతులందు మాత్రమే ఆంగ్లము ప్రయోగింపబడును; ఇతరతరగతులలో అంతటను వంగాలీయే. ఇప్పుడు ద్రవిడులందరొక సంఘముగ జేరి ఒక 'ద్రవిడ'యనుపత్రికను నడుపుచున్నారు. అది ఆంగ్లమందును, మరియితర ద్రవిడభాషలలోను లిఖిత పూర్వకముగ వెలువడుచున్నది. ఇందు బాలు రత్యుత్సాహము చూపింతురు.



శిశువిభాగ బాలురతరులు, నివాసగృహము—శాంతినికేతనము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గడపుచుందురు. వర్షాకాలమున బాలురు, పిన్నలు, పెద్దలుగూడ వర్షమన్న భయపడక యెంతపెద్దగ, అనగ కుంభవృష్టిగ, వర్షించిన అంత యెక్కువగ ఆనందము చెందుచు అందరును బయటకువచ్చి, వర్షజలమున జలకమాడి, ఆశ్రమము మెత్తన నుండుటచే ఆశ్రమమునుండి పోవు జలప్రవాహముల నీదులాడుచు చాలదూరము వరకును పోవుచుందురు.



సంగీతపుతరగతి–శాంతినికేతనము

ఇచ్చట ఆటలన్నను దేహపరిశ్రమయన్నను ఎక్కువశ్రద్ధ. వీరుముఖ్యముగ చెడుగుడు, గూటిబిళ్ల, కాల్బంతి, హాకీ, టెన్నిసు, క్రికెటు మొదలగుఆటలనాడుచుందురు. ప్రతి యాటలోను బలమైన జట్టు లున్నవి. ఈ వేర్వేరు ఆటలు యువకులకేకాక బాలురకుకూడ చాలబాగుగ ఆడుటకు అవకాశములు కల్పింపబడినవి. ఉదయమునను సాయంకాలమునను బాలురు యువకులు గూడ చక్కగ వ్యాయామము చేసికొని, కాల్యకృత్యముల నిర్వర్తించుకొందురు. ఇచ్చటనుండు విద్యార్థులు చాలవరకు బాగుగ దండకట్టినవారే. అప్పుడప్పు డాటలప్రదర్శనములు జరుగుచుండును. అందు ఎవరిచాకచక్యము జూపుటకు వారు ప్రయత్నింతురు. బాలురు యువకులు గూడ బాగుగ చడీ, బాణా త్రిప్పగల్గి బాగుగ సాముచేయుదురు. వీరల కెట్టి ప్రదర్శనములుగాని సభలుగాని జరిగినచో వారు ఆసనములను ఎంతో చక్కగ నలంకరింతురు. ఈబాలురం దరుండు గృహములకు 'సత్యకుటీర్' 'మహిత కుటీర్' 'సింగ భవన్' అని వేర్వేరు నామములుండును. వీరితో నొక యుపాధ్యాయుడు కూడ కలిసియుండును. ఈవేర్వేరు కుటీరములందు వీరు వేర్వేరుఅధికారవర్గము నేర్పాటు చేసికొని, ఆజట్టునాయకుడు చెప్పినరీతిని పోవుచు-దుష్ట శిక్షణ, శిష్టపరిపాలన చేయుచుందురు కాని యెట్టిహా గాని నిరంకుశత్వముగాని ప్రబలదు.

బాలురు బాలికలు కూడ బాగుగ గానముచేయ శక్తులై యుందురు. సాధారణముగ ప్రతి పూర్ణిమకు గానసభలు జరుగుచుండును. అప్పుడు చాలమంది బాలికలు తమ ప్రావీణ్యమును జూపుచు వీణ, ఫిడేలు మొదలగునవి వాయింతురు. కొందరు గాత్రమున బాడుదురు. ప్రతిదినము సాయంకాలము భోజనమైన యనంతరము వైతాళికమనది జరుగును. అప్పుడు ఒకరోజున బాలికలు, ఒకరోజున బాలురు చక్కనిమొకకీర్తనను ఆశ్రమమంతయుతిరిగి పాడుచుందురు. అప్పుడంద రేకకంఠమున బాడుచున్నప్పు డెంతయు మనోహరముగను, శ్రావ్యముగను నుండును. ఇదిగాక యుదయమున ప్రార్థనలు జరుగునప్పుడుగూడ



పుస్తకభాండాగారము–కళాభవనము–శాంతినికేతనము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చాలమంది బాలురు అతి శ్రావ్యముగ బాడుచుందురు. అన్నియు ఠాకూరుగారి పాటలే.

ఇచ్చట విద్యార్థులకు బాగుగ శిక్షణము నిచ్చెదరు. భోజనమునకుగాని, స్నానమునకుగాని, ఫలహారము



చిత్రలేఖనము–శాంతినికేతనము

నకుగాని అందరు నొక్కసారి బారుదీర్చి పోయెదరు. ఇట్లే ప్రతిబుధవారము ప్రార్థనామందిరమునకు గూడ పోవుచుందురు. వేర్వేరువిషయములు, కార్యములు నిర్వర్తించుటకు వేర్వేరురీతులు గంట మ్రోగింపబడును. ఇయ్యది క్రొత్తవారికి చాలవింతగ నుండును గాని ప్రతి బాలునకు బాగుగ ఆగంటలయర్థము తెలియును. ఇట్టికాల నిర్ణయముచొప్పున గంటలిచ్చుటకుగూడ విద్యార్థియే యొకడుండును. ఆతని కధికారులు ఒకగడియారము నిత్తురు. దానినిబట్టి యీతడు ఒకయీల నూదును. ఆయీల వినినప్పుడెల్ల ఆకాలమునకు తగినగంటనే బాలుడు మ్రోగించుచుండును. విద్యార్థులు ప్రాతఃకాలము నాల్గు గంటలకేలేచి, కాల్యకృత్యముల నిర్వర్తించుకొని, స్నానమాచరించి, ఫలహారము చేసిన తరువాత ప్రార్థనకు వచ్చెదరు. స్నానానంతరము బాలురకు ప్రత్యేకముగ ఉపాసనయని పదిహేనునిముషముల కాలము దైవప్రార్థనకు నియమింపబడినది. ఇట్టి ఉపాసన సాయంకాలముగూడ ఆటలయనంతరము జరుగును. ఉపాసనానంతరమును అందరు నొకచో వలయాకారముగ నిలువబడి ఒకశ్లోకమును (వేదమునుండి)చదివి వారిపనులకు పోవుదురు. ఉదయమున శ్లోకానంతరము అల్పాహారము దీసికొని ప్రార్థనకు వత్తురు. అప్పుడు విశ్వభారతియంతయు ఆప్రార్థనకు వత్తురు. అందరు బహిరంగస్థలమున నిలిచియుండగా నొందరుబాలు రొకకీర్తనను బాడుదురు. అది ముగియగనే క్లాసులలోనికి పోవుదురు. తరువాత పదకొండుగంటలకు భుజించి, కొంచెముసేపు విశ్రమించి, పఠింతురు. మరల మధ్యాహ్నము రంగములకు జని, సాయంకాలము ఆటలకు జని, ఉపాసనచేసికొని, భుజించి, వైతాలి కైనయనంతరము కొంచెము పఠించి, నిదురించి, మరల నాల్గుగంటలకు లేచి, యథారీతిని తమ దినచర్య నడుపుచుందురు. పైని పేర్కొనబడిన పను లన్నిటికి వేర్వేరురీతులుగ గంట మ్రోగింపబడును. ఇందులకు వేరే ఒక బంట్రోతు లేడు, విద్యార్థులే చేయుదురు. చివరకు ఆశ్రమమూడ్చుకొనుటకు గూడ గంట నిచ్చుచుందురు. ఆశ్రమ



వ్యవసాయము–శాంతినికేతనము

మంతయు విద్యుద్దీప కాంతులచే ప్రజ్వరిల్లు చుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాత్రి పదిగంటలకు దీపము లారి పోవును. అందరును నిదురింతురు. కాని సెలవుదినములలోను, చక్కని వెన్నెలరోజులలోను బాలురు ఆశ్రమముదాటిపోవుచుందురు. అప్పుడు రాత్రి బాగుగ నొకయుపాధ్యాయునితో బోయి, ప్రకృతిసౌందర్య మను భవించి మరలుచుందురు. సెలవులలో పెద్దవిద్యార్థులు, విద్యార్థినులుగూడ చుట్టుప్రక్కలనున్న తమ యడవుల లోనికిగాని, గ్రామములకుగానిజట్టులుగాబోయి, శిబిరముల నచ్చట నిర్మించుకొని, రెండు మూడుదినము లుండి తిరిగివత్తురు. ఇదియే యిచ్చటి



కాయకష్టము—శాంతినికేతనము

విద్యార్థులజీవనము. ఇందు రవీంద్రు డప్పుడప్పుడు స్వయముగపాల్గొనును. బాలికలు, సంగీతము నేర్చుకొనువిద్యార్థులు సాయంకాలము రవీంద్రుడే బోధించు ప్రత్యేక గాన తరగతికి బోవుదురు. అప్పుడాకవి తననూతనకీర్తనలు గూడ వారికి జెప్పుచుండును. ఈఆశ్రమమున ముఖ్యముగ, చదువుసంఖ్యలెటులుండినను, జీవితమే ముఖ్యమైనది. అదియే యుత్తమవిద్య. విద్యార్థికి తగినశిక్షణము నిచ్చి మానసాభివృద్ధికి, మేధాభివృద్ధికిని సాయపడునదియే యుత్తమవిద్య.

గానము—చిత్రకళ:—

గానమునకు ప్రత్యేకమగుశాఖ యున్నది. రవీంద్రుడు సాయంకాలము ప్రత్యేకముగ బాలికలకు నేర్పుచుండునని యీవరకే చెప్పియుంటిమి. రవీంద్రుడు తన పాటలనన్నిటిని ఆయన అన్నగారిమనుమడగు దినేంద్రనాథ ఠాకూరుగారికి బోధించును. ఆయన రవీంద్రుని పాటలన్నియు చక్కగ పాడగలడు. ఇప్పటికి రవీంద్రుడు ఇంచుమించుగ 6,000 కీర్తనలు చేసియుండునని చెప్పవచ్చును. వీటి నన్నిటిని స్వరరాగములతోకూడ నీదినేంద్రు డెరుగును. ఈయనే యీ గానశాఖకు అధ్యక్షుడు. వీరుగాక మరియిద్దరు గాయకులు కలరు. అందొకరు గాత్రమును, మరియొకరు వీణ, ఫిడేలు, యస్రాజ్, చితార్, తబలా మొదలగు వాద్యములు నేర్పుచుందురు. వీరుగాక ఐరోపాగాయకులొకరు గలరు. ఆయన ఫ్రెంచి, జర్మను, ఇటాలియను, ఆంగ్ల గానములయందు ప్రావీణ్య మున్నవారు. ఇచ్చట మనగానము నభ్యసించు చుందురు. గానమునకుగూడ నొకయుత్తమస్థాన మీయబడినది. అప్పుడప్పుడు పిఠాపురమునకు చెందిన శ్రీ సంగమేశ్వరశాస్త్రిగారు వచ్చి యద్భుతవీణాకౌశలము నిచ్చట జూపి పాడి, వీరల నానందసముద్రమున ముంచుచుందురు.



వ్యవసాయము—శాంతినికేతనము

అనంతరము చిత్రకళ. సుప్రసిద్ధ కళాధ్యక్షులు చిత్రకళానిపుణులు నగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లాలుబోసుగారు. వీరు జగద్విఖ్యాతపురుషులు, చాల సత్తములు. వీరియొద్ద విద్యనభ్యసించినవారు చాల చోట్ల పనిచేయుచున్నారు. ఈయన చిత్రకళ ప్రాచ్య పద్ధతి నందును. ఈ సందర్భమున ఒక



బట్టలనేత–శాంతినికేతనము

విషయము చెప్పకతీరదు: రవీంద్రుడు చైనాదేశమున కేగినప్పుడు చైనాదేశపు రాజు ఒక బుద్ధునిచిత్రమును బహూకరించెను. అయ్యది రంగులతో వ్రాయబడినదికాదు: వాల్గువంపుల సంవత్సరములక్రిందట పలురంగుల దారపు లతో నేయబడినది. కాని యది చూచినవారు అది వాల్గువంపుల సంవత్సరముల దని కాని, నేయబడిన దని కాని చెప్పిన నమ్మరు. నిన్న మొన్న వ్రాయబడిన చిత్రమని తలంతురు. అదిగాక జపానువారిగంటయొకటి గలదు. అది మ్రోగించిన ఆనాదము అరగంటవరకు విని పించుచునే యుండును. రవీంద్రుడు తాను తరగతుల దీసి కొనినప్పుడు ఈ గంటనే స్వయముగ మ్రోగించుచుండును. ఇది యొకగంగాళమువలె నున్నది. ఇచ్చటి భవనము లన్నియుగూడ మామూలుగ ప్రస్తుతము పెద్దపెద్దపట్టణములలో నున్న భవనములవలె గాక, ప్రత్యేకముగ నాలోచించి చక్కని ప్రాచ్యచిత్రకారుల కాధిక్యమొసంగి, ప్రాచ్యపద్ధతుల ననుసరించి నిర్మింపబడినవే. ఈ చిత్రకళాభాగమునే కళాభవన మందురు.

**తరగతులు–వానివిభజన:—**

విశ్వభారతియంతయు మూడు భాగములు. అందు (1) విద్యాభవన్ (Research Department), (2) శిక్షాభవన్ (College), (3) కళాభవన్ (Art)–ముఖ్యములు. ఇవిగాక యిందున సేపథాభవన్ (School) కలదు. కళాభవనమునుగూర్చి యీవరకే చెప్పియుంటిమి. విద్యాభవనమున చదువవలయునన్న నెచ్చటనైనను బి.ఏ.ప్యాసుచేసినను, బి. ఏ. చదువకపోయినను బాగుగ సంస్కృతమును కొలదిగ నర్థముచేసికొనుటకు చాలినంత యాంగ్లమును నేర్చియున్న విద్యార్థి యభివృద్ధిచెందుటకు అవకాశము లున్నవి. ఈ శాఖయందు పాళీ, సంస్కృతము, టిబెటన్, చైనాభాష మొదలగుభాషల చెప్పుదురు. అదిగాక వైదికమతము (Vedic Religion), బౌద్ధమత తత్త్వము (Buddhist Philosophy), భారతీయుల ప్రాచీనవిజ్ఞాన సారస్వతమును (Indology) గూర్చి చెప్పుదురు. ఇవియే యీశాఖకు ముఖ్యాంగములు. ఎవరి యిచ్చవచ్చినట్లు వారాయావిషయముల దీసికొని పఠింపవచ్చును. ఇవిగాక ఫ్రెంచి, జర్మను, అవెస్తా (Avesta) మొదలగు భాషలు నేర్చుకొనవచ్చును.



అద్దకము–శాంతినికేతనము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇచ్చటనే శబ్దశాస్త్రప్రవీణులు, అందు నను ద్రవిడభాషాశబ్దశాస్త్ర ప్రవీణులు అగు డాక్టరు కాలిన్స్‌గారున్నారు. ఈపైవేర్వేరుభాషల నేర్పుటకు ఆయా దేశజు లున్నారు. ఈశాఖ కధ్యక్షులు పాళీ, ప్రాకృత, గీర్వాణపండితు లగు శ్రీ విధు శేఖర భట్టాచార్యులుగారు. వీరినే రవీంద్రుని తరువాత నెల్లరు నెక్కువ గౌరవింతురని చెప్పవలయును.



అంగులకు ఉచితవైద్యము-శాంతినికేతనము

అనంతరము శిక్షాభవన్ కలదు. ఇందు ఇంటరుమీడియటు, బి. ఏ. తరగతులు గలవు. ప్రత్యేకముగ విశ్వభారతి తరగతులు గలవు. ఇవిగాక యిచ్చగించు విద్యార్థులను కలకత్తా విశ్వవిద్యాలయమునకు తయారుచేసి పంపుచుందురు. కాని విశ్వభారతి శిక్షాభవనమునకు తనప్రత్యేక విభాగశిక్షణ గలదు. అందు తీర్ణులైనవారికి "ఉపాధి" యనుబిరుదము నొసంగుదురు. అయ్యది ప్రథమమున ఈసంవత్సరమే జరిగినది. ప్రతి డిసెంబరు ఆఖరువారమునను, మహర్షి బ్రహ్మసమాజమున ప్రవేశించిన దినమునను, అనంతరము శాంతినికేతనము స్థాపించిన దినమునను చాల గొప్పయుత్సవము జరుగును. అదియే అన్నియుత్సవముల కన్న నుత్తమమైనది. అప్పుడే యీసంవత్సరము తొలి జట్టువిద్యార్థులకు "ఉపాధి" బిరుదునిచ్చిరి. ఈ యుత్సవము మన వైపునజరుగు దేవుని రథోత్సవము వలె జరుగును. చక్కని ప్రదర్శనము లుండును. ప్రతివత్సరము ఆ చుట్టుపట్లనుండు జనుల కందరకు (కొన్నిలక్షలకు) ఈ యుత్సవము విద్యారూపముగ పరిణమించి, చాల ప్రోత్సాహ మిచ్చుచున్నది. అనంతరము పఠాభవనము గలదు. ఇందు శిశుతరగతి మొదలు పదియవ తరగతి వరకు శిక్షణ నిత్తురు. అంతయు వంగాలీభాషలోనే జరుగును. పఠాభవనమునకుమాత్రము జనవరినుండి డిసెంబరువరకు విద్యావత్సరము. శిక్షాభవనమున ఆంగ్లము, వేదాంతము, చరిత్ర-యీ మూడువిషయములే చెప్పెదరు. పఠాభవనమున స్కూలుపిల్లలకు తగిన



"సంతాలు"లకు విద్యగరపుట-శాంతినికేతనము

విషయములన్నిటిని బోధింతురు. ఇంకను వివరములు గోరువారు విద్యాలయవిద్యావిషయప్రణాళికకు Prospectus వ్రాసి తెలిసికొనగోరెదను. సామాన్యముగ ప్రతి విద్యార్థియు ముప్పదియైదురూప్యములు చెల్లింపవలెను. పఠాభవనపు విద్యార్థుల డబ్బంతయు అధికారులచేతనే వెచ్చింపబడును.

విద్యాలయమునకు చేరి, హైందవభాషలలోను, ఆంగ్ల, ఫ్రెంచి, జర్మను, ఇటాలియను, గ్రీకు, చైనా, టిబెటను భాషలలోను నానావిషయములనిచ్చు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చక్కని పుస్తకభాండాగార మున్నది. అన్ని హైందవభాషలలోను ఇంచుమించుగ మూడువేలు లిఖితతాళపత్ర పుస్తకము లున్నవి. ప్రపంచమందలి నానాభాగములనుండి యించుమించుగ ముఖ్యమగు పత్రికలు వచ్చుచుండును.

శాంతినికేతనమునకు జేరి తపాలు, తంతి, ఆఫీసులు గలవు. కాన నెవరైన ఇంకను ఈవిషయమునుగూర్చి తెలుసుకొనవలెనన్న నిచ్చట ద్రవిడసమితి కార్యదర్శికి వ్రాసిన తెలియగలరు. అనంతరము విద్యావిషయక వివరములకు (on prospectus) ఆశ్రమకార్యదర్శికి వ్రాయవచ్చును. ఎవ్వ రెవరు వ్రాసినను "శాంతినికేతనము, P.O. బెంగాల్" అనిన త్వరలో చేరగలవు.

శ్రీనికేతనము:—

ఈభాగముకూడ విశ్వభారతి శాఖయే. ఇచ్చట చేతిపనుల నభివృద్ధిచేసిరి. అదిగాక ప్రత్యేకము మూడు నందల యెకరముల నేలయున్నది. అందు వ్యవసాయశాఖ



విశ్వభారతి ఆంధ్రవిద్యార్థులలో నొకరు-శాంతినికేతనము



విశ్వభారతిలోని ద్రవిడులు-శాంతినికేతనము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గలదు. అదిగాక బట్టలనేత, అద్దకము, కోళ్లను పెంచుట, పొదిగించుట (Poultry), తోలుపని(Tannery) మొదలగుపను లిచ్చట నభివృద్ధి పొందుచున్నవి. ఈప్రదేశమే పూర్వము తూర్పుఇండియాసంఘమువా రున్న స్థలము; ఇప్పుడు శిథిలమందిరము లున్నవి. ముఖ్యముగ నిచ్చట గ్రామపునర్నిర్మాణమునుగూర్చి శ్రద్ధవహింతురు. చుట్టుపట్లనుండు గ్రామములలో రాత్రి పాఠశాలలు స్థాపించి యుచితవిద్య నొసంగుదురు. అచ్చటగూడ నొక ఆసుపత్రి యున్నది. అందు గ్రుడ్డివారికి ఇతరరోగులకు అందరికి ధనముక్కర లేకయే మందు నిత్తురు. ఇచ్చట సాగుబడికి ఒక పెద్దచెరు వున్నది. అప్పుడప్పుడు శాంతినికేతనమునుండి విద్యార్థులు పోయి యాడుకాడి, పండుగ చేస్తుమందురు. ఈవిషయములగూర్చి పూర్తిగ తెలిసికొనదలచినవారు అచ్చటికార్యదర్శికి "శ్రీనికేతనము, P. O. Surul బెంగాలు" అని వ్రాసిన జాబు చేరును. ఈస్థలములు రెండును రవీంద్రుని యాధిపత్యముక్రిందనే దినదినాభివృద్ధి చెందుచున్నవి.

---

# నా అభీష్టము

అమరవాది హనుమచ్ఛాస్త్రి గారు, బి. ఏ.

ఏనునీవలెనే కంఠమెత్తి రాగ
మాలపింప నశక్తుఁడ నగుదు గాక
నీమనోజ్ఞవసంత గానామృతమును
గ్రోలి ధన్యుఁడ నగుటకుఁ గూడఁ దగన ?

నీవలెనె నేనుగూడ స్వేచ్ఛావిహార
లోలుఁడను గాన నీ గూటిలోన నుంత
తావు నొసఁగుమ నాకు; నీతో వసింపఁ
గోరి మనమున నువ్విళు లూరుచుంటి.

నీవలెనె నేను గూడ నీమావిగున్న
చిగురుటాకుల తిండి భుజింపఁగలన ?
యనుచు సందేహమేమొ ! చూతాంకుర
కషాయసంగీతి కౌ నీకుఁగాక గర్ణ [ములు
శూల నిస్వనయుతుఁడ నాకేల చెపుమ !

నీకుబలె నాకుగూడ వినీలమసృణ
దేహమేది యటంచు వాదింతు వేమొ ?
పూజనీయునకే కాకపూజ సేయు
వానికంద మదేటి కోపరభృతంబ !

నాకు నీవలె రెక్కలు లేకయున్న
మానె, నీవేగుచోటికే నేనుగూడ
వచ్చి చేరుదు గద నొక్క సరుగులోన
నాపయిని నీకు నింతటి కోపమేల ?...

అయినఁబో నాదు తుదిసల్కు నైనవినుమ
లోకమోహనహా నీకుహూ కుహూలను
దనివిఁదీరంగ వినుచు ని న్ననవరతముఁ
గాంచి తృప్తినిఁ జెందు భాగ్యంబె చాలు
ఎలమి నదియైన లభియింప నిమ్ము పికమ !



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బంగాళా దేశమునకు చెందిన

# ప్రాచీన భారతీయాభరణములు

1-వ చిత్రము.:—నెం. 687–688. ఈ మూడును తలగడ్డలను సులభముగా కట్టువీడకుండ తీయుటకై దంతముతో చేసిన సాధనములు. ఉదయపురమహారాణావారు వీనిని 1882 వ-సంవత్సరమునజరిగిన జయపురప్రదర్శనమునకెరువుగానిచ్చిరి. బంగాళమునందు—ముఖ్యముగా మూర్షిదాబాదునందును, ఆప్రాంతములందును—చిన్న చిన్న దంతపుబొమ్మలు మొదలయినసామగ్రితోపాటు వీనిని ఎక్కువగాచేయుదురు. ఉదయపురమునను ద్యోగిగానున్న జయపురపుశిల్పి వీనినిచేసినట్లు చెప్పుదురు. ఇపు డివిజయపురపు వస్తుప్రదర్శన శాలయందున్నవి.690–692. ఈమూడును నెండ్రుకలయందు గ్రుచ్చుదంతపుసూదులు. వీని తలలయందు సుందరమైన శిల్పముకలవు. ఇవి బర్మాదేశమునందలి మాండలేపురమునకు చెందినవి, ఇవియు జయపురవస్తుప్రదర్శనశాలయం దున్నవి.

2-వ చిత్రము:—720. పెద్దనీలమణిచెక్కిన బంగారపుటుంగరము. 721. మరకతమణిచెక్కిన బంగారపుటుంగరము. ఎఱుపురంగుపూతగలదు. 722. మకమకలాడు కెంపుపొదిగిన బంగారుపూతగల ఉంగరము. 723. పక్షివలె ఇంద్రనీలపుమణిచెక్కిన బంగారపుటుంగరము. కన్నులుముక్కు, కెంపులతో చెక్కబడినవి. 724. బంగారుతీగతో చేసినఉంగరము. పైన ఆడ్డనువలెనున్న బంగారపుదిమ్మగలదు. 725. స్వర్ణహారము. మూడు పేటలుగలది. తక్కువజాతి కెంపులు, ముత్యములు, పచ్చలు, నీలమణులు కలిపి కూర్చబడినది. నడుమ పెద్దనీలమణి పదకమువలె నున్నది. 726. బంగారుదండసరము. గులాబిపువ్వులవలె పచ్చలు, వజ్రములు చెక్కబడినవి. 727. కంఠహారము. ముత్యములు, కెంపులు, పచ్చలు బంగారుతీగతో గుత్తులుగాగట్టబడినవి. నడుమ మాయ కెంపులు,వజ్రములుచెక్కిన చంద్రవంకగలదు. పై రెండువైపుల కుచ్చుదిమ్మలు ముత్యములతోకట్టబడినవి. 728. హస్తాభరణము. బంగారుపై వజ్రపుపలచలు ఆకులవలె చెక్కబడినవి. 729. వెండితో చేసిన మూడుపేటల వజ్రహారము, మోపునపెద్దరాయి చెక్కబడియున్నది.

3-వ చిత్రము—730.వజ్రములుచెక్కిన బంగారపు కర్ణాభరణము. గులాబీపూవువలె అర్ధగోళాకారమునునుండును. పెద్దకెంపొకటి—చుట్టును పచ్చలుకూర్చిన ముత్యములుకట్టినది.—దానినుండివ్రేలాడుచున్నది.731.బ్రూచి; వెండితీగతో అల్లినది. నాల్గుఆకులు;నడుముపూవు. రేకులనడుమ సుంద్రడనిమెరుగుపూసలున్నవి. 732 వజ్రములు చెక్కిన చెవిపోగు. అర్ధచంద్రాకృతినున్నది. చేపవలెనుండు పతకమొకటి, ముత్యమువకుపూసలుకూర్చి కట్టిన కుచ్చులు వ్రేలుచున్నవి. 733. కంఠహారము, అయిదుమత్తెపుసరులు వజ్రములు, కెంపులుపొదిగి ముక్కోణమువలెనున్న బంగారుమోపులకు చేర్చబడినవి. మోపులకు, వజ్రములు, కెంపులు, పచ్చలు చెక్కబడి యొకదానికొకటి తగిలించిన బంగారు చంద్రవంకలు కూర్చబడియున్నవి. క్రింది చంద్రవంకలో రత్నములు చెక్కిన బంగారుచేపయున్నది. చంద్రవంకల అంచులు తళతళ మెరయునట్లు మెఱుగుపెట్టబడి యున్నవి. కెంపులు వజ్రములు తాపి ముత్యములు కట్టబడిన చిన్నపతకములు క్రింది చంద్రవంకకు జతచేయబడియున్నవి. 734—హారము.ఇందును అయిదుమత్తెపుపేరు లున్నవి. మోపులు లేవు. రెండు బంగారుచంద్రవంకలు, చేప ఉన్నవి. వజ్రములు కెంపులు చెక్కబడినవి. వానినుండి కెంపులు,పచ్చలు, వజ్రములు, ముత్యములు వ్రేలుచున్నవి. 735. ఇది 733 వంటిదే. కెంపులు, వజ్రములు, పచ్చలుచెక్కిన బంగారు చంద్రవంక లొకదానికొకటి చేరి 2 ముత్తెపుసరులకు మోపులయందు కూర్చబడినవి. వానికి వజ్రములు, కెంపులుచెక్కిన పతకములు ఆరు కలవు.

4-వ చిత్రము:—741. కాలిఅందె–సీమవెండిది. 742. హారము వజ్రములతోకట్టినది. రెండువైపుల ముత్యములు వరుసగకూర్చబడినవి. నడుమ కెంపులతో కట్టినపతకము గలదు. 743. బంగారుమొలనూలు; మూడుపేటలుగలది. పలుకలు తేరిన బంగారుగుండ్లు బంగారుతీగతోకట్టబడినవి. నడుమ తీగపనిచేసిన బిళ్లకొక్కి యున్నది. 744. హారము; నాలుగుముత్తెపుసరులు. తక్కువ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జాతి కెంపులు ఆసరులనడుమ కూర్పబడినవి. నడుమ పెద్ద పచ్చ, చుట్టువజ్రములుపొదివిన బంగారుపదకము దానికి జతచేయబడినది. ఆపతకముల కొకముత్యము కట్టబడినది. 745 కంఠహారము: 24 ముత్యములు, 24 సముద్రపుపచ్చలు, రెండు పెద్దకెంపులు కలిపికూర్పబడినది. బంగారపుతీగ, కాకిబంగారపుకుచ్చులు కాన్పించుటలేదు.

5-వ చిత్రము:—746 బంగారు పాపటపతకము; నడుమ పెద్దమాయ కెంపు, చుట్టుపలచలు(వజ్రములు-పలుచనివి) పొదుగబడినవి. 747. చెవిపోగు. అర్ధచంద్రాకృతిగలిగి పైభాగముతో చేరియున్నది. పలుకలుతీరినబంగారుగుండ్లతోచేసినది. 748. చేతికడియము. నీలిరంగుగలది; బంగారమున వజ్రములు చెక్కబడినవి. లోవలయమునకు రంగీయబడినది. 749. చెవిపోగు బంగారపుది. బంగారుతీగపనితోచేసిన రోజాపూవువలెనున్న పైబిళ్ల కుగిన్నెవంటిదివేఱొకబిళ్ల వ్రేలుచున్నది. విరళముగనున్న పోగరపని చేయబడినది. 750. చెవిపోగు, బంగారమున వజ్రములుచెక్కిన పతకముకలది. నీలపురంగుపూసలు, ముత్యములు కట్టబడినవి. 751. కంకణము-బంగారపుకడ్డితోచేసినది. చిత్రచిత్రముగ చెక్కబడిన పూవులవంటిబిళ్లలు సన్నతీగతోకట్టబడినవి. 752. కంకణము. నీలపురంగుగల మూడు వరుసలుగకూర్చినబంగరుగుండ్లుగలది. 753. బ్రూచి. వెండిరేకుపై తీగపనితో పక్షివలె చేయబడినది. అంచులుచికిలిపనిగలిగి మెరుగుపెట్టబడినవి. 754. కంకణము-వెండిది. రెండువైపుల మంగరములుగలిగి వంకీలవలెనున్న కడ్డీలు దారమున కూర్చిచేయబడినది. 755. వజ్రములుచెక్కిన వెండిచేతిగాజులు. 756. కాలికడియము. పలుకలుతీరిన వజ్రముచెక్కిన ౧౧ బంగారుపూవులు, రత్నముపొదిగిన ౧౧ బంగారుగుండ్లు, ఒకటిమార్చి యొకటిగకూర్పబడినవి. 757. బ్రూచి. సీతాకోక చిలుకవలె బంగారుతీగతోను, పలుకలుతీరినగుండ్లతోను చేయబడినది. 758. సందెటికడియములు; పలుకలుతీరిన బంగారుగుండ్లు బంగారుతీగతో కట్టబడినవి.

6-వ చిత్రము:—759. కంఠహారములోనిభాగము నాలుగు సరములుగలది. పూలవలె పోగరపనిచేసిన బంగారుబోలుకాయలు తీగలోకట్టబడినవి. 760. తలపిన్నులు. వెండివి. 4¾ అం. పొడవు గలవి. ఒక్కొక్కదాని కొక్కొకవెండిచెక్కడపు పనిగలపూవు గొలుసుతో కూర్పబడినది. ఒక్కొకపూవునకు మూడువెండికుచ్చులు గలవు. రెండుపిన్నులును తీగలతో నల్లినకాయలుగల 14¾ అం. పొడవుగల గొలుసుతో కూర్పబడినవి. 761. మొలనూలు(భాగము)-వెండిది. తీగపనిగలగుండ్లు గొలుసుతోకట్టబడినవి. కొసయందు రెండుకుచ్చులున్నవి. 762. బంగారపుకాలిచుట్టు. 763. పాపటబొట్టు. వజ్రములు, కెంపులు వెండిలో పొదిగిచేయబడినది. క్రింద కొసయందు పచ్చ కూర్చిన ముత్తెపుపూవుగలదు. 764. కర్ణభూషణము. బంగారపురేకుపై తీగపనిగల పూవుకు బంగారుగజ్జెలు కుచ్చు కట్టబడినవి. 765. అర్ధచంద్రాకృతినున్న బంగారు పాపటబొట్టు, వజ్రములు, కెంపులు, ఒకపచ్చచెక్కబడినవి. ౭ ముత్తెములు కట్టబడినవి. 766. దువ్వెన-వెండిది. రత్నములు బంగారున పొదువబడినవి. 767. పత్రాకారముగల భూషణము-బంగారుతీగపనిగలది. 768. సంధసరమునందలి నడిమిబిళ్ల. బంగారపుతీగపనిగలది. రత్నములవలె గాన్పించుచున్న పలుకలుతీరిన బంగారుగుండ్లు కూర్పబడినవి.

7-వ చిత్రము:—769. తలపిన్నులు వెండితీగపనిగలవి. గోళాకారముగనున్న పిన్నులకలలు జరీదారముతో కూర్పబడినవి. ఒక్కొకపిన్ను తలమీదను రెండుతీగపనిగలకాయలు. దారమున నొకటివ్రేలాడుచున్నవి. 770. తలపిన్నులు-వెండివి. రెండువరుసలపూసలపై తీగపని పూవులుగల తలలుగలవి. తలలనుండి రెండుగుండ్లు వ్రేలుచున్నవి. రెండుపిన్నులును గుండ్లగొలుసుతో కూర్పబడినది. 771. చేతిగుండ్లు వెండివి. తీగపనిపూలుగల తొమ్మిదిగుండ్లతో కట్టబడినవి. మూడుగుండ్లు పైయట్టివే వ్రేలాడుచున్నవి. 772. ఉంగరము-వెండిది-తీగపనిగలది. విల్లువలెనున్నది. ఆకులు, పూవులు వరుసగా పైనచెక్కబడియున్నవి. రెండువైపులను చిన్నపదకములు వ్రేలాడుచున్నవి. 773. కాలికడియము-సీమవెండిది.

8 వ చిత్రము:—774. కంఠహారము. 7 ముత్తెపు పేరులు దానిక్రింద నింకొకటి వ్రేలుచుండును. ప్రతి పేరునకును వజ్రములు, పచ్చలుచెక్కిన పతకములున్నవి. 775. బాహుపురి. పలచలుచెక్కిన బంగారురోజాపూవులతో కూర్పబడినది. 776. హస్తాభరణము. పలచలుచెక్కిన బంగారు ఆకులతో కూర్పబడినది. 777. హస్తాభరణము సీమవెండిది. 778. కంఠాభరణము వెండితీగపనిగల ఆకులు, గుండ్లు, పూసలు చేర్చి కూర్పబడినది. 779. బంగారుకట్టు కడియము. తీగపని చెక్కినగుండ్లు పలకలుతీర్చియున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పుష్పమాల

శ్రీ ముత్తింటి నరసింహమూర్తిగారు, బి. ఏ,

ఘ్రాణము శక్తినే మఱచె కంటికి సుందరవస్తుదర్శన
ధ్యానము దప్పె, డెందము సుఖావహమై కనుపట్టకుండె, నీ
ప్రాణము లెంతొ భారముగ భావన జేసెడు నాకరంబునన్
నీ నవకోమలాంగములు నీరులుకారెడుసుమ్ము పుష్పమా!

నీరము పారు తావులను నీటుగ బ్రాకు లతాచయంబులన్
జేరికతో వసంతు డిడు చిన్నరి ముద్దులకున్ జనించి యీ
మారుని కాయుధంబవయి మానిత యావన మోహనాంగి శృం
గార మలంకరింప తలకట్టుల తాండవమాడు పుష్పమా!

మిసమిసలాడు యావనము మేలగుచూపులు కౌగలింతకున్
రసికత నేర్పు ముద్దు జవరాండ్ర స్మితాదరసిక్తభావముల్
గుసగుస ప్రాణనాథుచెవి కూర్చుచు లోకములో శుభంబులన్
బొసగగ జేయు పుష్పమ, సుభూషణవైభవ మేల వీడెదే.

దాంపత్య సౌఖ్యంబుఁ దలపోసికన్యలు పరమేశు శిరముపై భక్తి నిడుటో
పతి సంతసిల్లగా బంగారుజడలపై కొసరుచు పడతులు కూర్చుకొనుటో
తన పేరుగా నీవు స్తనముల నలరార దండలసరసుడు తరుణికిడుటో
తమితోడ గూడెడి దంపతుల్ సుఖియింప మెత్తనిపాన్పుపై నొత్తు పడుటో
భక్తి, వలపు, తలపు, సుఖ భావములన-లేని నన్ను శుష్కహృదయు డీను నేమి
కోరిచేరితె, తరుణుల జేరికొన్న-పావనంబగు నీదగు జీవనమ్ము!!

వలపుల గ్రుమ్మరించు నిడుశ్వాసల స్నానము లాడ నేర్చు త్వత్
కలితమనోహరాంగ మవగాహన సేయగ నూర్పుగాదు మత్
సలలిత మోహనాంగి నొగి జంపిన క్రూరపు బ్రేతధూమమే
వలపులులేని గాడ్పుబడి వాడకు, మాడకు వెఱ్ఱిపుష్పమా!

కనులను విప్పి నావయిపు కమ్మగ జూచుచు వెఱ్ఱినవ్వులన్
వనరుగ ద్రిప్పె దీవు శుభవార్తలఁ దెల్పగ నేగుదెంచితో
వెనుకటి సంగతుల్ మనసు పీకగ జ్ఞప్తికి జేర్ప జేరితో
కనికర ముంచి నన్నిటులు కాతరపెట్టకు వెఱ్ఱిపుష్పమా!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## ఆంధ్రభాషయందలి వింతయక్షరము

శ్రీ జయంతి రామయ్యపంతులుగారు యీమాసముననే వెలువడిన ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సం. ౧౫, సంచిక ౪ లో ఈ వింతయక్షరము(ఱ)ను గూర్చి కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు వెనుక కావించిన సిద్ధాంతమును బలపరుచుచు నిట్లు వ్రాసిరి:

ఈ యక్షరము ప్రథమమున యుద్ధమల్లునిశాసనములో కనిపట్టఁబడినది. ఆశాసనములో అఱె(ప్పి) సిన, అఱెపుప, ఱస్సి యనుపదములందున్నది. తరువాత జరిగినపరిశీలనములో మఱికొన్ని శాసనములలోఁ గూడ—అనఁగా మాలపాడు శిలాశాసనములలో చోఱ, ఏఱువేలశబ్దములందును, ద్వితీయచాళుక్యభీముని మచిలీపట్టణపు శాసనమునందు మేఱంబాశబ్దమందును, పండరంగుని యద్దంకిశాసనములో గొఱలిచి శబ్దమందును ప్రొద్దుటూరి రామేశ్వరమందలి పుణ్యకొమారరాజు శాసనములలో చోఱశబ్దమందును, అరకటవేములశాసనములో ఱచ్చ (దీనిఱచ్చువాండు పంచమహాపాతకసంయుక్తుడగు) అను పదమందును కనఁబడినవి.

*　　*　　*　　*　　*

పూర్వోదాహృతశాసనములన్నియు, యుద్ధమల్లునిశాసనముకంటెఁ బూర్వము పుట్టినవే. అన్నిశాసనములందును అక్షర మొక్కపోలికగానే యున్నది. ఈయుపపత్తుల నన్నింటినిబట్టి చూడఁగా ఱకారము పూర్వకాలమందు తెలుఁగుభాషయందుండి కొంతకాలమున కుచ్చారణములోఁ గూడ నంతరింపఁగా నంతటినుండియు డకారము దానికి బదులుగా నుపయోగింపఁబడుచున్నట్లు కనుపట్టుచున్నది.

---

## క్త్వార్థేకారసంధి

'వజ్రాయుధము' (౧౯౨౭)ఫిబ్రవరి నెలసంచికయందు శ్రీవిక్రమదేవ వర్మగారు 'క్త్వార్థేకారసంధి'ని గూర్చి వ్రాయుచు నుడివిన యీ క్రిందివాక్యముల నీకాలపు ఆంగ్లమానసపుత్రులగు నాంధ్రగద్యపద్యరచయితల కుపకరింపగలవు.

క్త్వార్థేకారమునకు ఇ ఈలుగాని, వానిరూపాంతరములను ఎ ఏలుగాని పరములయి యున్నప్పుడు సంధి గూర్చినచో, వినుటకు వెగటుగనుండదు. తక్కినయచ్చులతో సంధిగూర్చినచో, వెగటుగవినంబడును. ఇట్లు నిశ్చయించియే కొంద ఱిట్టిసంధులనుగూర్పఁగా నామర్మ మెఱుంగని మఱికొందఱు పెఱయచ్చులతోసైత మాసంధినిగూర్చిరి. ఎట్లయినను గొప్పకవు లాసంధిని గూర్చుట సత్యము. కనుక బుద్ధిమంతులు వానిని సవరింప యత్నించుటకంటె నవి మహాకవి ప్రయోగములని వానిని విడిచి తామట్టి సంధులను గూర్పకుండుటయే లెస్స.

---

## సూర్యరాయాంధ్రనిఘంటువు

[మఱియు పైపత్రికయందే 'సూర్యరాయాంధ్ర నిఘంటువు'ను విమర్శించుచు నీ క్రింది సూచనలు కావింపబడినవి.

ఒకానొకపదమునకు ద్రావిడకర్ణాటాదిపదము లుదాహరించుటయు, దానివలననిదిపుట్టినది, దీనివలన నది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పుట్టినదియని వివరించుటయు గ్రంథవిస్తరమగుటయేకాక తల్లాభమును స్వల్పమే. కన్నడము, మయి, తమిళము, తులు, హిందూస్తాని, లోనగు భాషారూపము లిచ్చుట యుక్తమైనను మనకుఁ దెలియని మయిత్తుల్వాదిభాషల నెత్తికొనుట నిరుపయోగము. అట్టివియు నూటికొండు రెం డుండునేమో?

* * *

ఇంతియకాక యిదినిఘంటువు కాని వ్యాకరణ ముకాదు. కావున నిఘంటు కార్యములే యిందుఁ జూప ట్టవలయును. వ్యాకరణకార్యములు చూపట్టుట సమంజస ముగా నొప్పదు. “ఏకక్రియాద్వ్యర్థకరీ” అనునట్లు వ్యాక రణకార్యముగూడ నీనిఘంటువుచేయు చున్నదందురా! ఇది సంపూర్ణముకాదు. వ్యాకరణము కంఠస్థము చేయ దగినది. ఇది చూడఁదగినది. వ్యాకరణమెఱుంగని వారి కీనిఘంటువు సంపూర్ణశబ్దసాధుత్వముం గలిగింపఁజాలదు. అపుడిట్లు వ్రాయుట గ్రంథబాహుళ్యమునకే యేర్పడును.

---

మఱియు నీనిఘంటు రచనమును గూర్చి యే ౧౯౨౭ వ సం. మార్చి ౧౨ వ తేది కృష్ణాపత్రికయందు ప్రకటించిన శ్రీరావు సాహేబు గిడుగు రామమూర్తిపంతులుగారి యుపన్యాసమునుండి:—

ఇంగ్లీషులో......ఒక పదమునకు అర్థము చెప్ప వలసి వచ్చినప్పుడు ఆపదము ఏయే శతాబ్దాలలో ఏయే కవులు ఏ అర్థముతో వాడినారో, ప్రస్తుతము ఆ పద మునకు వ్యవహారములో ఏ అర్థమున్నదో నిర్ణయించి సప్రమాణముగా వాటిని వ్రాసినారు. భాషా పరిణా మము తెలుసుకొనుటకు ఆపద్ధతి చాలా మంచిది. శబ్ద రత్నాకరములో ఈ నియమము పాటించలేదు.

* * *

పదములకు అర్థము లెట్లు మారుతవో తెలియవలె నంటే నన్నయ్య మొదలు ఆధునిక కవులవరకూ గ్రంథ ములలోనుండి ప్రయోగములు తీసి అర్థము ఎట్లు మా రుతూ వచ్చిందో చూపించవలెను.

* * *

సూర్యరాయాంధ్రనిఘంటువు ప్రాచీనాంధ్రని ఘంటువుగా ఉండి భాషాపండితులకు ఉపకరించవచ్చు నని చెప్పినాను. కాని ఆప్రయోజనము కూడా దీనివల్ల కలగదని తోస్తుంది. ఎందువల్లనంటే గ్రాంథికభాషకు గ్రంథములలో పాఠములు సప్రమాణముగా ఉండవలెను. ఇంతవరకు ప్రకటించిన అచ్చుపుస్తకములు అందుకు ప్రమాణము కావు. ఆంధ్రమహాభారతమునకైనను యిం తవరకు పాఠములు నిర్ణయముచేసి ముద్రించిన పుస్తకం లేదు. పాఠములు నిర్ణయించకుండా ప్రయోగములు గ్రంథములనుండి స్వీకరించినట్లయితే ఆగ్రంథములకు సరి యైన పాఠములు వచ్చినప్పుడు నిఘంటువు వ్యర్థమై పోతుంది.

* * *

శబ్దరత్నాకరములో నుండి ప్రయోగాలు తీసి యీ నిఘంటువులో వేస్తున్నారు. ఇందువల్ల అనేక దోషములు సంభవించుచున్నవి. శబ్ద రత్నాకరములోని కొన్ని చోట్ల గ్రంథనామములు పొరపాటుగా పడ్డవి. కొన్నిచోట్ల ఆశ్వాసాలు పొరపాటు. శబ్దరత్నాకరము లోని పాఠములు మూల గ్రంథములతో సరిచూచి పద్య సంఖ్య చేర్చి వాడుకుంటే బాగుంటుంది. శబ్దరత్నాకర ములో కొన్ని శబ్దములకు అర్థములు తప్పు. “బాడుదల” అనేపదమునకు అవమానమనే అర్థ మందులోకలదు. అది తప్పు. సంస్కృతములో జీవగ్రాహము, అనే పదముకు తెలుగులో బాడుదల వుపయోగింప బడ్డది. ఇది “మను దల” వంటిదే.

* * *

నిఘంటువులో ఇచ్చిన నిర్వచనాల వల్ల ఆపద ముల అర్థము స్పష్టము కావడము లేదు. “అంకిణి” అనగా మల్లబంధవిశేష మనిన్నీ, “అంజి” అనగా బాలక్రీడా విశేషమనిన్నీ, ఈరీతిగా వృక్షవిశేషము, జంతువిశేషము అనిన్నీ వ్రాసినారు. వీటికి విమర్శించి అర్థమువ్రాస్తే బాగుండేది. శబ్దరత్నాకరములో “తిమి” అనగా నూరు యోజనములచేప అనిన్నీ, “తిమింగిలము” అనగా తిమిని మ్రింగెడు చేప అనిన్నీ వ్రాయబడియున్నది. ఇంగ్లీషు నిఘంటువులలో ఇటువంటి నిర్వచనము లుండవు. ఒక బాలక్రీడ నిర్వచనము చేసినట్లయితే ఆనిర్వచనమును బట్టి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ ఆట ఆడుకొనుటకు వీలుగానుండవలెను. తిమింగిల మనగా చేప అను అభిప్రాయమును జంతుశాస్త్రజ్ఞు లంగీకరింపరు. అది ఒక స్తన్యపానజీవి.

* * *

నిఘంటువులో వేమనశతకమునుండిన్నీ, శాసనముల నుండిన్నీ కొన్ని శబ్దములు తీసుకొన్నారు. అట్లే యితరశతకములనుండి యితర శాసనములనుండి అన్ని శబ్దములు తీసుకొంటే బాగుంటుంది.

* * *

ఈ నిఘంటువు వ్యావహారిక భాష కుపకరించునది కాదు. కాబట్టి దీని ప్రయోజనము పరిమితము– ప్రాచీనాంధ్రభాషా స్వరూపమును తెలిసికొనుటకైనను ఇది పనికిరాదు. పూర్వకాలములో కావ్యములకు నిఘంటువులకు టీకలు వ్రాసినవారు. తెలుగర్థములు వ్యావహారికభాషలోనే వ్రాసినారు. ప్రాచీనాంగ్ల నిఘంటువులోని మాటలకు అర్థాలు ఇప్పటి వ్యావహారికాంగ్ల భాషలోనే వ్రాస్తారు. మనదేశములో పూర్వమందున్న, ఇప్పుడు ప్రతి దేశములోనున్న ఇదే సంప్రదాయము. కాని సూర్యరాయాంధ్రనిఘంటువులోని పదములకు ప్రాచీనాంధ్రభాషలోనే అర్థములు వ్రాయుటకుపూను కొన్నారు. ఇది సరియైన మార్గముకాదు.

* * * *

## నిజామురాష్ట్రములోని క్రొత్తశాసనములు

శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయము (దక్షిణహైదరాబాదు) వారు ప్రకటించిన రజతోత్సవసంచికయందు ప్రకటించిన 'నిజాముర<br>రాష్ట్రములోని చారిత్రకపరిశోధన' అనువ్యాసమున శ్రీసిరుగూరి హనుమంతరావు గారు (యం.ఏ., యల్.టి.) 'ఆంధ్రపరిశోధక సంఘము' వారు సంపాదించి ౧౩౦ శాసనములలో ముఖ్యములైన కొన్ని శాసనములను గూర్చి యిట్లు వివరించుచున్నారు:

* * * * *

సంఖ్య ౨ శా. శకము ౧౩౯౯ వ వత్సరము తేదీ కలది; విజయనగరరాజు, రెండవహరిహరుడు పానుగల్లు కోటను ముట్టడించిన విషయమున్నది. ఇంకొకటి (సంఖ్య ౪) చాల దీర్ఘముగను, బాగుగ నున్నది. మహబూబు నగరము జిల్లా, నాగర్కర్నూలు తాలూకా, వడ్డమాని గ్రామములో దొరకింది. దీని తేదీ శా. శకము ౧౧౬౭. అందులో మొదటువర్ణోత్పత్తిని గురించి కలదు, కాకతీయులు నాల్గవ వర్ణమువారని కలదు; గణపతియొక్క వంశావళినిచ్చి, కుప్పాంబాపతి యగు గండయయను సేనాని యొకడు దేవాలయముకట్టినట్లు చెప్పబడియున్నది. అతనితండ్రి బోచుడు; తల్లి బోచాంబిక; అతనిది మల్యాలవంశము.

* * * * *

చాళుక్యవంశమును గురించిచెప్పి యీక్రిందివంశావళి నిచ్చెను.




పంపాభారతములోనున్న వంశావళితో నిది సరిపడుటలేదు. * * * *

సంఖ్య. ౧౪. శా. శకము, ౧౯౦౨ వ సంవత్సరమునాటిది. కాకతీయరాజైన ప్రోలునిగురించినది. ఇంకొకటి (సంఖ్య ౨౧) మైలాంబ మహాదేవుని కూతురనియు, గణపతికి సోదరియనియుఁజెప్పి, యామె భర్తయగు రుద్రుని వంశావళి నిచ్చుచున్నది. సంఖ్య. ౩౧ మిక్కిలి దీర్ఘమైనది. కొండపర్తిలో దొరకినది. మల్యాల సేనాపతుల వంశావళి నిచ్చినది; దీనిని సంఖ్య ౪ తోఁ బోల్చవలెను. సర్కారువారు ప్రచురించిన పాలంపేట శాసనములలోఁ జేర్కొనఁబడిన రేచెర్లవంశమునుగురించి యిందులో మూఁడు గలవు. (సంఖ్య ౬౨, ౬౪, ౬౧). కాని, వంశావళిలోఁ గ్రొత్తపేర్లు చెప్పబడినవి.

* * * *

౩౪ వ శాసనము (౧౪౩౯ శా. శ.) విజయనగరప్రభువు కృష్ణదేవరాయలనాఁటి దానమును గురించి చెప్పుచున్నది. * * *

వీని ప్రతులు శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయమున నున్నవట. వీని ప్రకటనము చరిత్ర కుపకరింపగలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ఆంధ్రత్వము

ఆంధ్రభారతి (సంపుటము ౧, సంచిక ౧౨) యందు సంపాదకీయ విమర్శనలలో 'ఆంధ్రత్వము, అను శీర్షిక క్రింద నిట్లుకలదు:

ఆంధ్రులయొక్క లోపములనుగురించి, గొప్పనుగురించి వాద ప్రతివాదములు బయల్వెడలుచున్నవి. లోపాలోపములను వెతకుట కిది తరుణముకాదు. కొన్ని రాజకీయతరంగములు ఆంధ్రోద్యమమును వెనుకకు త్రోసివైచెననుట నిర్వివాదాంశము. అయినప్పటికిని మహామహుల వార్షికోత్సవముల జరిపి గతసంవత్సరములలో నాయామహామహులు తలపెట్టిన యుద్యమములను స్మరించి వాటికి దోహదములొసంగ ప్రయత్నములనుజూడ ఆశ పునర్జీవితమగుచున్నది. హైదరాబాదులో కృష్ణరాయభాషానిలయముయొక్క రజతోత్సవము కావ్యకంఠ గణపతిశాస్త్రిగారి అధ్యక్షతక్రింద అతివైభవముతో జరిగినది. ఆంధ్రదేశమునందలి యాంధ్రులు మాంద్యము వహించినను నిజాంరాష్ట్రాంధ్రులు భాషావిషయిక ఉద్యమమునకు దలపెట్టుట ప్రశంసనీయము. వీరిని బాధించివేధించు ఏరాజకీయోద్యమము లేకపోవుటవలననే, నిజమైన ఆంధ్రత్వస్వరూప మచట మూర్తీభవించుచున్నది. ఇపుడిపుడు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి షష్టిపూర్తిఉత్సవమును జరుప గట్టిప్రయత్నములు జరుగుచున్నవి. ఇంకను మహాను భావు లనేకులుగలరు. దివాకర్ల తిరుపతిశాస్త్రిగారాంధ్రభాషకుచేసిన సేవకు దేశీయులు వారినామమును చిరస్మరణీయముగ చేయవలసియున్నది. ఇట్టితరుణములో నాంధ్రపరిషత్సభకును, ఆంధ్రమహాసభకును సరియైనజీవములేకుండుట విచారకరము. శ్రీఉయ్యూరి జమీందారుగారి ప్రోత్సాహముతో ఆంధ్రమహాసభ చరిత్రలో నూతనశకము ప్రారంభమైనదనవచ్చును. కాని, ఆంధ్రపరిషత్సభ యేడాదికొకపర్యాయము సమావేశమై కేవల ముపన్యాసములు మొదలగు తద్దినపు మంత్రములతో ముగియుచున్నది. ధనలోపము, దేశీయులదృష్టి అన్యథాలగ్నమైయుండుట, యివియే యీదురవస్థకు కారణములు. జాతీయవిద్యాలయములకుగూడ యిట్టి దుర్గతియే సంభవించినది. ధనము తక్కువ, బాలురు యెక్కువలేదు. క్రమమైన విద్యావిధానములేదు. విద్యాలయములనన్నిటిని కేంద్రీకరింపజేయు జాతీయ విద్యాపీఠము లేనేలేదు. జాతీయ విద్యాపీఠమొకటి యవసరమని వేరుగచెప్పనక్కరలేదు. విమర్శకులు తమతమ విమర్శనాచాతుర్యమును గట్టిపెట్టి, నిర్మాణ కార్యములను జరిగినచో ప్రయోజన మింతింతయని చెప్పనక్కరలేదు.

---

## తెంకణాదిత్యు (నన్నెచోడ)నికాలము

'ఆంధ్ర హిస్టారికల్ రిసర్చి సొసయిటీ జర్నలు' జనవరి సంచికయందు శ్రీ వెంపరాల సుబ్రహ్మణ్యముగారు (యమ్. ఏ., యల్. టి.) కుమారసంభవమును రచియించిన నన్నెచోడనికాలమును గూర్చి ఇదివరకు పెక్కురాంధ్రచారిత్రజ్ఞులు తెలుగు పత్రికలందు చర్చించి చర్చించిచేసిన సిద్ధాంతములకు ఆధారములగు కారణములను గైకొని విమర్శింపక వానిని త్రోసిపుచ్చి, (తెంకణ) ఆదిత్యుడను పేరును నన్నెచోడని అసలు పేరుగా తీసికొని అతనికాలము క్రీ. శ. ౮౫౦ మొదలు ౯౦౦ వరకని యొక క్రొత్త సిద్ధాంతమును చేసినారు, అట్లు తలంచుటకు వీరికి గల యాధారముల నిట్లు చెప్పినారు:

"ఏబదిరెండవపద్యమున గ్రంథకర్త తాను సూర్యవంశపురాజని చెప్పుకొన్నాడు. మఱియు నందు భూమధ్యమున నఖాతమును త్రవ్విన సగరపుత్రులను, స్వర్గము నుండి గంగనుదెచ్చి సముద్రమును నింపిన భగీరథుని, రామేశ్వరమునుండి లంకకు వారధికట్టిన రామచంద్రుని, క్రీస్తుశక ప్రారంభమున ప్రఖ్యాతిని జెందియుండిన కరికాలచోళుడను చోళరాజును స్మరించినాడు. తాను పరాక్రమమున వీరితో సమానుడ నన్నాడు. ఏబదిమూడవ పద్యమున ఇప్పటి నెల్లూరు మండలమగు పాకనాడు ౨౧,౦౦౦ కు ప్రభువగు చోడబల్లికిని, హైహయవంశసంజాతయగు శ్రీసతికిని బుత్త్రుడననియు, ఏబదినాల్గవ పద్యమున తనరాజధాని ఉరయూరనియు, తాను తెంకణాదిత్యుడనియు చెప్పికొన్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డాక్టర్ యస్. కృష్ణస్వామి అయ్యంగారి దక్షిణ హిందూదేశ చరిత్రము ననుసరించి చోళరాజులలో ఆదిత్యులను పేరిటివారిద్దరు మాత్రమే కలరని స్పష్టమగుచున్నది. అందు మొదటి యాతడగు నాదిత్యుడు క్రీ.శ.౮౭౦ యందు చోళరాజ్యమును స్థాపించినవాడు. రెండవయాతడగు రాజాదిత్యుడు రాష్ట్రకూటులచే రణమున నిహతుడైనవాడు. శ్రీ. రామకృష్ణకవిగారు కుమారసంభవకర్త రెండవయాతడే యనుచున్నారు. ఇదిపొరపాటు. ఇతని తండ్రి పరాంతకుడుగాని చోడబల్లి కాడు. మఱియు నీసిద్ధాంతము కవిరాజధాని ఉరయూరగుటను, తండ్రి పాకనాటి ప్రభువగుటను సమన్వయముచేసి వివరింపజాలదు. గ్రంథమున కరికాలచోడని పేరు మాత్రమే చెప్పి యితరుల నెవ్వరిని పేరెత్తక పోవుటయే కరికాల చోళునికి, గ్రంథకర్తకు నడుమ గొప్పరాజు లెవ్వరును లేరని తెలుపుచున్నది. నూతనచోళరాజ్య సంస్థాపకుడుగాని, క్రీ. శ. ౯౮౫ మొదలు ౧౦౧౪ వఱకు చోళరాజ్యమును పాలించిన రాజరాజుగాని, కరికాలచోళునికిని గ్రంథకర్తకును నడుమగలకాలమున నుండియుండినచో వారిలో నొక్కరినైన గ్రంథకర్త తన గ్రంథమున తప్పక పేర్కొనియుండును. కరికాలచోళునికి తరువాత కొన్ని తరములకు ప్రాచీనచోళరాజ్య మంతరించి యాస్థానము పల్లవరాజ్య మాక్రమించుకొనెను. క్రీ. శ. ౧౫౦ నుండియే కృష్ణాకావేరీనదుల నడుమనున్న దక్షిణహిందూదేశమున శివస్కంధవర్మయను పల్లవరాజు ప్రబలుడై యుండెను. రాష్ట్రకూటుల దండయాత్రలచేతను, తమలో బుట్టిన అంతఃకలహములచేతను పల్లవులు క్షీణదశయందుండ పాకనాటి ప్రభువయిన చోడబల్లికి కుమారుడగు గ్రంథకర్త, ఆదిత్యుడు, పల్లవులలో కడపటివాడగు అపరాజితునిపై దండువెడలి యాతనినోడించి, రాజ్యభ్రష్టుని చేసి, ప్రాచీన చోళరాజధానియగు ఉరయూరునందు చోళరాజ్యమును మరల స్థాపించెను. ఈచరిత్రాంశమును బట్టి టెంకణాదిత్యపదము జయించిన యాతనికి పేరుకాని బిరుదముకానేరదు. ఐతిహ్యము, లక్షణగ్రంథములు నన్నెచోడని కుమారసంభవమునకు టెంకణాదిత్యుని కుమారసంభవమని చెప్పుచున్నవి. ఆశ్వాసాంతగద్యములందు పేర్కొన్న 'చోడదేవ' పదమువలెనే 'టెంకణాదిత్య' పదమును నన్నెచోడని మరియొక నామముగ గ్రహింపవలెను.

గ్రంథకర్త ఉరయూరు తనరాజధానియని చెప్పికొన్నాడు. కరికాలచోళుని కాలమున చోళరాజుల రాజధాని ఉరయూరు. కాని పరాంతకుని వంశీయుల పరిపాలనమున తంజావూరు రాజధానిగ నుండినట్లు తెలియుచున్నది. కావున గ్రంథకర్త, తంజావూరు రాజధానికాకపూర్వము, రాజ్యమును పాలించియుండవలెను. బహుశః పరాంతకుని రాజ్యపరిపాలనము తుదికాలమున రాజధాని యురయూరునుండి తంజావూరికి మారియుండును. కాబట్టి గ్రంథకర్త పరాంతకునికి పూర్వుడుగా నుండవలెను.

క్రీ. శ. ౮౭౦ వ సంవత్సరమున కాశ్మీరరాజు జయాపీడుని ఆస్థానసంస్కృత కవీశ్వరుడగు ఉద్భటుని కుమారసంభవమున పేర్కొనుటచేత నీగ్రంథరచనా కాలము క్రీ. శ. ౮౭౦ కి పూర్వమునకు బోజాలదు. ఆదిత్యుడు క్రీ. శ. ౮౭౦ మొదలు ౯౦౦ వరకు పరిపాలించియుండుటచే గ్రంథరచనాకాలము ఆనడుమ నయియుండును.

---

## అంతఃపురకాంతల ఆనందమయజీవితము.

[ముగ్గురు సవతులగల యువతి]

['మార్చి ఆరవతేది టైమ్సు ఆఫ్ యిండియా పత్రికనుండి:

నా ఆంగ్ల సోదరీమణులకు:—

నన్ను, నాజీవితమునుగూర్చి మీరెంతయు చింతనొందుచున్నారు. కాని నేనుమాత్రము మీకన్న నెక్కువగాకున్నను మీతోసమానముగ సౌఖ్యమును, సంతృప్తిని గలిగియున్నదానని నొక్కిచెప్పుచున్నాను.

ప్రాచ్యదేశములయందు దంపతులు మగవాండ్రకును మూలముల పెక్కురుందురను దురభిప్రాయమును మీమనస్సులనుండి తొలగించుకొనుడు. అట్టిపద్ధతి నొకప్పుడు మామత మంగీకరించినను ఆచార మంగీకరింపదు. కేవలము సంపన్నులకుమాత్రమే యది పొసగును. స్త్రీలను క్షోభించుట లోకమునందంతటను మిగులవ్యయకరము. మాకే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశమునతక్కువజాతులలోతప్ప,పాశ్చాత్యదేశములయందు వలె పతి, జీవితుడైయుండ సతి తనబ్రతుకునకయి పనిచేయు టతినీచముగ తలతురు. కావున నొక్కటెకన్న నెక్కువమంది భార్యలను భరింపజాలనివాడు పెక్కుర నేనాడును బడయగోరడు.

మీరేల నన్ను నదృష్టహీనురాలినిగా దలచెదరు? నన్నుగూర్చి మీరు విచారింతురని విన్న నాకు మీయెడ నాగ్రహము గలుగుచున్నది. ఇంతయేల? స్త్రీహృదయమునకు ప్రియమైనదేది? సుఖకరమైనగృహము, ప్రశాంతమైనజీవితము, అందమైనవస్త్రములు, విలువగలనగలు, పతిప్రేమ, సంతానము, ఇవి. నాకిన్నియు గలవు. నేను 'పతిప్రేమ' యన్న మీలోగొందరు నన్ను బరిహసింప దొరకొందురు. 'ఏకకాలమున నలుగురుస్త్రీల నొకడెట్లు ప్రేమింపగల'డని మతికొందరు వాదింతురు. అందులకు నాసమాధానము గనుడు: 'పెక్కురుబిడ్డలున్న జననిని మీరు సమముగ ప్రేమించుచుందురు. వారిలో నొక్కని కేదేనిచిక్కు, రోగమో సంభవించినయెడల మీప్రేమ యంతయు నాయొక్కనివంకకే తిరుగుచుండును కదా! అట్లే నాపతియు. ఆతనిహృదయము కడువిశాలమైనది. అందు నాల్గుగదు లున్నవి. అందొక దానిని దెరచినచో దక్కినవి తమంత దాము మూసికొనును. దాని కిందుకే యలవాటు పడిన నదిచాల తేలికయైనపని.

పోనిండు; మీరు మీపతిప్రేమను విశ్వసింతురా! మీపతులు మీవలపులకే చిక్కియుందురని తలతురా? వారు చేష్టలయందు గాకున్నను, భావమునందు మీయెడ బలుమారు ఏవజెందియుండలేదా? వలపుకత్తెల వలలసగిలి యొక్కొకపుడు వారు మీతోడి పొత్తునకుసైతము మిగుల విచార పడుచుండుటలేదా!

ఇక అంతఃపుర విషయమును వినుడు: అచ్చట అసూయకు అవకాశములేని మంచిఏర్పాటుగలదు.అచ్చట ఎందునను కొఱతయుండదు. ప్రత్యేకము గృహము, పరివారము, వ్యయమునకు ధనము, మానలువురకు సమానముగ నొసగబడును. నెలయందొక్కొక్కవార మొక్కొక్కరికడ మాపతియుండును. నాజీవితకాలమంతయు నావంతు వారమును నేనుగొప్ప పండుగుగ భావించుచుందును. మీరట్లు కాదు. కొంతకాలమునకు మీరు పతులయెడ విసుగు జెందుదురు. నాకు విసుగుదల పొడచూపకుండగనే ఆపండుగరోజులు గడచిపోవును. అదిమొదలు మూడువారములవఱకు మరల నట్టిపండుగ దివసములకొఱకు గంపెడాసతో నెదురుచూచుచుందును.

నావంతుదినములలో నొకనాటికార్యక్రమమును గాంచుడు. నాపరివార ముదయమునుండి తమతమ కార్యములయందు నిమగ్నమైయుండును. నాప్రియునకుహితములగు వంటకములను నేనేకావింతును. నేను ఆనాడు బాగుగ సింగారించుకొందును. నాగృహము నంతయు నాకాంతుని స్వాంతమును రంజింపజేయునట్టులలంకరింతును. ప్రేమోత్సాహములతో నేను కావించుసత్కార మాతనికి నాయెడగల మక్కువను పెంపొందజేయును. మేమొండొరులను గాఢముగప్రేమించు ప్రియులము. అతడు నాదొర; నాజోడు; నాప్రేమసర్వస్వము. మీయనురాగము మూన్నాళ్లముచ్చట. అదియునేనాటిమాటయో. మాయనురాగ మట్టిదికాదు. అది జీవితపరమావధికము.

ఆతడు నాకడలేనిదినములలో నొకనాటికార్యక్రమమును జూడుడు. నాకునునాసిబ్బందికిని విశ్రాంతిదినమది. అప్పుడు కార్యక్రమము ప్రశాంతముగ, మెల్లగ జరుగుచుండును. నేనుప్రొద్దెక్కి నిద్రనుండి మేల్కాంతును; రాత్రి పెందలకడనే నిద్రింతును. పగలంతయు దుస్తులను, తయారుచేయుచు, నాప్రియు డెల్లప్పుడు నన్ను నాసవతులకన్న నెక్కువమక్కువతో మన్నింప గోరుచుండుదానను గాన వారి వంతుదినములలోని విశేషములనుగూర్చి నా పరివారముతో ముచ్చటించుచు గడుపుచుందును.

'నీకసూయ జనియింపదా' యని కొందరందురు. సవతులపట్ల అసూయ స్త్రీలకు సహజమేకాని నేనెల్లదినముల సుఖము ననుభవించుచుందును గాన నాయందసూయకుతావు లేదు. "ఇట్టిజీవితమువలన నేమి ప్రయోజన" మని మతికొందరందురు. 'పురుషుడు సర్వాధికారి. ప్రపంచమున సర్వమును నాతనిసౌఖ్యానందముల కొఱకేయైనది. స్త్రీ లాతని సర్వవిధముల సంతృప్తుడగు నట్లు లారాధింపవలెను. పురుషునిజీవితమును మధురతరముగ జేయజాలని స్త్రీయొక్క జీవితము కేవలము వ్యర్థము' అనునీభావములు నాకుగ్గుతోబోసినవి. ఇట్టిది నావిశ్వా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సము; నాయానందము. నేనీవిశ్వాసానందములతో సంతృప్తిని జెందియున్నాను.

---

### "దైవంమానుషరూపేణ"

### 'ప్రబుద్ధ భారతపత్రిక'యందు సంపాదకులు ఇట్లువ్రాసిరి.

* * * * *

౧౮౮౫-వ సంవత్సరప్రారంభమున శ్రీరామకృష్ణపరమహంసగారొకప్పుడు సమాధినిష్ఠులున్న సమయమున తటాలున క్రిందబడిపోయిరి. అందువలన వారిచేయి విరిగిపోయెను. మరల నాచేయి చక్కనగుటకు కొంతకాలమయ్యెను. ఇం దొక యాధ్యాత్మిక రహస్యముగలదు. తరువాతనొక యేడాదికి పరమహంసగారు దానిని తనప్రియశిష్యుల కిట్లు వివరించిరి. "మీకొక రహస్యమును చెప్పుచున్నాను. పూర్ణనరేంద్రాదులను నేనేల యంతగా ప్రేమించుచుందునో యెఱుగుదురా? ఒకపుడు నాకు జగన్నాథస్వామి స్వప్నమున సాక్షాత్కరించిరి. నేనువారిని కౌగిలింపబోయి క్రిందబడి చేయి విరుగగొట్టుకొంటిని. నేను మనుజుడనుగ జన్మించుటచేత మనుజులనే దైవముగ భావించి ప్రేమింపవలయునను తత్త్వమపుడు నాకు స్ఫురించెను." తరువాత కొంతకాలమునకు మరలవారు "నా యాధ్యాత్మికదృష్టి మారుచుండుటను నేనిపుడు గాంచుచున్నాను. చాలకాలముక్రిందటనే వైష్ణవచరణగారు మానవులయందు దైవికబుద్ధిగలిగియుండుటయే యుత్తమాధ్యాత్మికజ్ఞానమని చెప్పియున్నారు. ఆపరమేశ్వరుడే యిట్లు మానవరూపమున సంచరించుచున్నాడని నేనిపుడు తెలిసికొంటిని" అని చెప్పిరి.

---

### హిందువులు నిక్కముగ మతధర్మముల ననుష్ఠించుచున్నారా?

['ది విజోవ్ కాజ్'అనుపత్రిక యిట్లు వ్రాయుచున్నది.]

ప్రాచీనాచారములను, వానిమంచిచెబ్బరలను బరిశీలింపక యనుసరించుటచే హిందువులు నిక్కముగ మతధర్మానుష్ఠానపరులగుదురా? వారి మతమేమి? సంఘసంరక్షణమే వారిమతము. హిందువులు తమయొక్కయాచారమునుబరిశీలించిఅది యెంతవఱకు సంఘసంరక్షణమున కుపకరించునో తెలిసికొని,యాచరించుచున్నారా? ఆవశ్యకమైన యాచారములను సంస్కరించి, సంఘక్షేమమునకు భంగకరములై, యనావశ్యకములయిన యాచారములను ద్రోసిపుచ్చి, సంఘమును చక్కగ దిద్దుకొన జూచుచున్నారా? లక్ష్యమిదియేయైనచో హిందూసంఘమున కిదిపవనమై మార్గదర్శకము కాగలదు.

వేదములందలి మతధర్మనిర్వచనము ననుసరించి హిందువులు ధర్మహీను లనవలసి వచ్చుచున్నది. దీనివలన వీరెంతమాత్రమును సంస్కారులు కాకున్నారు. సంఘరక్షణమున కుపకరింపని మతమును మతమనుటొప్పునా? అది మతముకాదు. జాతియొక్క సంఘసత్త్వములను క్షీణింప జేయునట్టిమతము మంటగలియుగాక!

బలాత్కారముగ వైధవ్యమును విధించునాచారము సంఘమును సంరక్షించుచున్నదా! అది సంఘమునకు లాభకరమా? వెనుకనెప్పుడో ఆయాచారమొప్పియుండవచ్చునుకాని ఇప్పు డది యపాయకరమైనది. అట్టి యాచారమును హిందువు లింకనుపట్టుకొని ప్రాకులాడవలయునా! అంతమాత్రమున వారు నిక్కముగ మతావలంబకులగుదురా?

---

### కాకతీయులు-క్షత్త్రియులు

సుజాతపత్రిక జనవరి సంచికయందలి 'వడ్డమాను శాసనము'నుండి 'కాకతీయులు-శూద్రులు'అను శీర్షికక్రింద ప్రకటించినభాగ మఱియ మాఖనూసభారతియం దుద్ధృతమైనది. అందలి శ్లోకములు సంశయగ్రస్తములుగ నున్నవనియు, దిమ్మలతోగూడ శాసనమురెయొక్క మూలమును ప్రకటించిన బాగుండుననియు నందే సూచింపబడినది. ౧౯౨౭ వ సం. మార్చి 30 వ తేదినాడు వెలువడిన 'ఆంధ్రరాష్ట్రము' అనువా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పత్రికయందు శ్రీవత్సవాయి వెంకటనీలాద్రిరాజుగారు 'కాకతీయులు - క్షత్రియులు' అనుపేర ప్రకటించిన వ్యాసమునందు భారతి యందుద్ధృతమైన భాగమును గూర్చి యిట్లు వ్రాయుచున్నారు:

ఇది మల్యాలగుండ యగుండనాథుని భార్యకుప్పాంబ వ్రాయించిన శాసనమని శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారిదివరకే వ్రాసియున్నారు. ఇందు వీరభద్రరావుగారు పాడిన పాట నంగపరంపరగా పాడుట తప్ప నీయాంధ్రపరిశోధక సంఘమువారు క్రొత్తగా జేసిన పరిశోధన మేమియు లేదు. చదువరులకు బోధపడుటకై పైశ్లోకములయర్థము సంగ్రహముగ పొందుపఱుచుచున్నాము. బ్రహ్మ తనముఖబాహూరుపాదములనుండి నాలుగువర్ణములను సృజించెననియు అందు ద్విజులు తమ తమ ధర్మము ననువర్తించియున్నారనియు, వారి తరువాత చతుర్థకులము ప్రకాశించుచున్నదనియు, అట్టిచతుర్థకులము వారు కాకతికులాబ్ధిచంద్రుడను ప్రోలరాజుప్రభుత్వము క్రింద పౌరుషప్రతాపములు నెరపి వన్నెకెక్కిరనియు-శాసనమునుండి యసంపూర్తిగ నుదహరించిన పైశ్లోకముల తాత్పర్యము. ఇంతకంటె నీశ్లోకములకు వేరర్థము లేదు. కాకతీయ పరిపాలనకాలమున వ్రాయబడిన శాసనములు పందలకొలది పరిశోధకుల కుపలబ్ధములయి యుండగా అసమగ్రమైన యీశాసనము చాల ముఖ్యమైనదని వ్రాయుటలో పరిశోధక సంఘమువారి సంకుచిత భావము సువ్యక్తమగుచున్నది. ఇంతముఖ్యమైనదనుకొన్న శాసనమందుకూడ నీపరిశోధక సంఘమువారి వాదమున కుపకరించు నర్థముగానరాదు. ఈవైఖరి యంతయుచూడగా నీయాంధ్రపరిశోధకసంఘమువారు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారి దుడుకుతనపువ్రాతల ననుసరించి ప్రమాదమునకు లోనైరని తోచుచున్నది. పరిశోధకులగువారు తమకు దొరికినంత వరకు శాసనములనుగాని, గ్రంథములనుగాని, ప్రత్యక్షప్రమాణములనుగాని చక్కగ పరిశీలించి లోకమునకు యథార్థమును వ్యక్తీకరింప పాటుపడవలెను. ఇంతియకాని దుడుకుదనపు వ్రాతలువ్రాసి పాఠకుల సంస్కారబంధురంబగు త్రోవలో తికమకలాడింపరాదు గాన ఆంధ్రపరిశోధకసంఘమువారు కాకతీయుల గూర్చి యింకను జాగరూకులయి పరిశోధన జరిపెదరుగాక!

వివాదగ్రస్తములైన యిట్టి విషయముల యందు సందేహమునకు దావులేకుండ జేయుట వ్యాసరచయితలకు విధియని మఱి యొకసారి చెప్పకతప్పదు.

---

## టైపురైటింగు యంత్రముతో చిత్రించిన చిత్రములు.

విజయనగరము మునిసిపలు హైస్కూలులో వ్యాపారవిద్యాబోధకులు (Commercial Instructor) శ్రీయుత యం. వి. సుబ్బారావుగారు టైపురైటింగు యంత్రసహాయమున శ్రీయుత రవీంద్రనాథ టాగూరు గారియొక్కయు, కీ. శే. బాలగంగాధర తిలకుగారియొక్కయు చిత్రములను చిత్రించినారు. మఱియు నీనడుమ గోపనుప్రభుసంపత్తుల చిత్రములను చిత్రించిరట. వీరి



కీ. శే. బాలగంగాధర తిలకుగారు.

చిత్రములు ఇంగ్లాండునందు ప్రసిద్ధికెక్కినవట. ౧౯-౩-౧౯౨౮ నాటి 'కమెర్షియల్ ఎడుకేషనల్' పత్రిక వీరిని మిగులపొగడినది. వీరు ఇటీవల శ్రీ గోక్లేగారి చిత్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మను వర్ణములతో చిత్రించిరట. ఇట్లాంగ్రులు ప్రతిభావంతులై ఖండాంతరములయందు సైత ము పేరుగాంచుచుండు టాంధ్రదేశమున కత్యంతసంతోషదాయకము (ఇంపలి రెండు చిత్రములు ఫిబ్రవరి (౧౯౨౭) మాడరన్ రివ్యూపత్రికనుండి కైకొనబడినవి).



శ్రీరవీంద్రనాథటాగూరుగారు.



కీ. శే. ఏ. వి. వరదాచార్యులుగారు, రామవర్మపాత్రము

---

## శ్రీ. కీ. శే. ఏ. వి. వరదాచార్యులుగారు

[కర్ణాటకరంగభూమి సంపుటము ౨. సంచిక ౨.]

"శ్రీవరదాచార్యులుగారు కర్నాటకమండలపు వారు. వీరు నాటకప్రపంచమున నత్యున్నతస్థానమును బడసినవారు. నాటకములను కొన్నిటిని కర్నాటకమున రచియించియు, ఉత్తమపాత్రములను ధరించి, భావానురూపముగ నభినయించియు విఖ్యాతినిగాంచినారు. ఈనటకశిఖామణినామము నాటకలోకమునకు జిరస్మరణీయము. శ్రీ ఆచార్యులవారి స్మారకచిహ్నముగా బెంగుళూరు ఆమెచూరు నాటకసంఘమువారు ఆచార్యులుగారు ధరించిన రామవర్మ (Romeo) పాత్రముయొక్క భావచిత్రమును వ్రాయించి గుబ్బినాటకమందిరమున స్థాపింపజేసినారు. దానియొక్క ప్రతికృతియే యిటనున్న చిత్రము.

---

## పాల్ వాన్ హిండెన్‌బర్గు

ఈజర్మనుయోధుని సంపూర్ణనామము 'పాల్ లడ్విగ్ హ్యాన్స్ అండ్ వాన్ హిండెన్‌బర్గు.' పోలండులో పోజను అనుపట్టణమున నొక ప్రష్యను ఉద్యోగికి ౧౮౪౭ వ సంవత్సరము అక్టోబరు నెల రెండవతేది నాడీతడు జనియించెను. పదొకొండేండ్ల ప్రాయమునుండి యీతడు సైనికశిక్షను బడసెను. ఇంత చిన్న తనముననే చక్కని శిక్షనుపొందుటచే నీతనియందు దృఢసంకల్పము, చిత్తస్థైర్యము, శాంతము, కార్యదీక్ష బాగుగ నెలకొనవి. చిన్ననాటప్పుడప్పుడు డీల డనారోగ్యము గలిగియుండుటచే శరీరవికాసమువలె నీతనికి బుద్ధివికాసము కలుగదయ్యెను. కాని కార్యదీక్షాపరుడయి తాపట్టిన పట్టు గారవముగుచుండుటచే క్రమముగ నాతనిబుద్ధి వికాసమునందెంద నాతడు కడుమేధావియని ప్రఖ్యాతిని గాంచెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పదునెనిమిదేండ్లవయస్సున డ్యాంజిగ్ కాల్బలమున జేరి ౧౮౬౬ సంవత్సరమున నొక సైనికోద్యోగి యయ్యెను. తరువాత నచిరకాలమున రణరంగమును బ్రవేశించెను. 'కోనిగ్రాడ్'యుద్ధమున ఆస్ట్రియాయందు మందుకొట్లను తగులబెట్టించెను. ౧౮౭౦-౭౧ వ సంవత్సరమున జరిగిన మొకయుద్ధమున నొక పటాలమున కధిపతియై విజయమునుగాంచి పెద్ద సైన్యమునకు నాయకుడయ్యెను.



పాల్ వాన్ హిండెన్బర్గ

తరువాత మూడుసంవత్సరములకు హిండెన్బర్గ (౧౮౭౭-వ సంవత్సరమున) బెర్లినులోని సైనికవిద్యాశాలయందు ప్రవేశించి అన్నట్టుపనిచేయుచుండి క్రమక్రమముగ 'జనరల్ స్టాఫ్' అను సైనికశిక్షాకార్యాలయమున పెక్కు గొప్పయుద్యోగములు చేసెను. పదపడి ౧౮౮౩ వ సంవత్సరమున 'బెర్లిన్ స్టాఫ్' కాలేజీలో ఉపాధ్యాయపదమును బడసెను. సైనికశిక్షణమునందును, వివిధ వ్యూహరచనమునందును నిపుణుడైన 'కాంటు స్లీకి-ఫెన్'గారికి శిష్యుడై 'జనరల్ స్టాఫ్'నందు సహోపాధ్యాయుడయ్యెను. ప్రష్యను యుద్ధకార్యాలయము (వార్ ఆఫీసు)న నితడు పెక్కేండ్లు కావించిన పరిశ్రమచే నీతని ప్రతిభ పెంపొందెను. తదనంతరము ఓల్డెన్బర్గ పదాతి పటాలమునకు సం. ౧౮౯౩ మొదలు ౧౮౯౬ వరకు కమేండరుగానుండెను. పిమ్మట నాలుగేండ్లు కోబ్లెంజ్ పటాలములకును, తరువాత మూడేండ్లు 'కారల్స్రూ'సేనలలో నొక భాగమునకును ప్రధాననాయకుడుగా నుండెను. ౧౯౦౩ వ సంవత్సరమున 'మ్యాగ్డిబర్గ' యుద్ధ సైన్యమున నొక భాగమునకు ప్రధాననాయకుడయ్యెను. ఎడతెగని కార్యదీక్షతో ధైర్యసాహసములతో యోగ్యుడుగ జీవితము గడపి అరువదియైదేండ్లప్రాయమున నీతడుద్యోగము వదలుకొని,'హానోవరు'లో ఏకాంతముగ నుండెను.

తరువాత ప్రపంచమహాయుద్ధమున తూర్పుదేశము నాక్రమించుకొనివచ్చుచున్న రషియను సేనల నెదుర్కొనుటకై ౧౯౧౪వ సం. అగస్టు ౨౨ వ తేదినాడు ఒక జర్మను సేనాభాగమున కితడు ప్రధాన నాయకత్వమును వహించెను. టానెన్బర్గ యుద్ధమున అసంఖ్యాకులగురషియనులనోడించి విజయమును గాంచెను. 'మసూరియన్ లేక్సు' యుద్ధమున నీమనుసేనను చీకాకుపఱచి తరిమివైచెను. తూర్పు ప్రషియా యుద్ధమున నలువైపుల చుట్టుముట్టి వచ్చుచున్న శత్రుసేనలను నేర్పుతో తప్పుకొనుచు తుదకు జయమునుగాంచెను. తరువాత నీతడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తూర్పుదేశమునందలి జర్మను సేనలకన్నిటికి ప్రధాన సేనాపతి అయ్యెను.

౧౯౧౫ వ సం. ఫిబ్రవరి ౧౫ వ తేదిన 'అప్పర్ బోబరు' వద్ద రషియను సేనల ఉత్తరపక్షముపై దాడి చేసి యందొకభాగము నీతడు ధ్వంసముచేసెను. 'కోవ్నో' పట్టణమును ముట్టడించి ఆగస్టు ౧౮ వ తేదినాడు దానిని తనవశము చేసికొనెను. అంత యుద్ధము మిగుల నపాయకరమయిన స్థితియందుండ 'రీగా' జలసంధిమొదలు 'గలీషియా' వరకుగల భాగమంతయు నీతని యాధిపత్యము క్రిందచేర్పబడెను. అన్నటివిషమపరిస్థితుల నతడు చక్కబరిచెను.

తరువాత జాతీయమోక్షుడయి హిండెన్‌బర్గ 'జనరల్ స్టాఫ్'కు ప్రధానాధికారిగా నియమితుడయి రుమానియాపై యుద్ధమునకు బోయెను. తుదకు ౧౯౧౬ వ సంవత్సరము హేమంతకాలమున రుమానియా రాజీకి వచ్చెను.

ఫ్రెంచివారిని, బ్రిటీషువారిని జయించు నుద్దేశముతో తొలుత నతడు ఫ్లాండర్సువద్ద బ్రిటిషువారి నెదుర్కొనెను. అప్పుడే ఫ్రెంచిసేనలను కూడ ఎదుర్కొనవలసివచ్చెను. ఇందుకు కొంతకాలహరణమగుటచే శత్రువులకు మంచి అవకాశము లభించెను. ఇందువలన నతని ప్రయత్నము విఫలమయినది. సైనికపరిస్థితులను బట్టి ఆ సంవత్సరము ఆగష్టు ౮ వ తేదినాడపజయముతో ఈయుద్ధమంతమొందినను ఈతడు యుక్తితో నెట్లయినను బ్రిటీషువారి రణకౌశల్యమును కుంటుపరిచి జర్మనీవారి పరువు ప్రతిష్ఠల కుచితమైన రొఖంబడికను పుట్టించుకొనవలచెను. కాని బల్గేరియా పరాజయము కారణముగ సేనలకు కొంతవిశ్రాంతి నిచ్చుటకై యుద్ధమునాపుటావశ్యకమని ఆతడు నిశ్చయించెను. బ్రిటిషువారు విజయగర్వితులై యుద్ధమును గొంతకాల మాపుట కనుమతి నిచ్చి తమ సర్వాధికతను ప్రకటించిరి. ఈసమయమున నే టర్కీ ఆస్ట్రియాలు జర్మనీనుండి విడిపోయినవి. జర్మనువారి కంతె స్వయంసహాయముపై నాధారపడవలసివచ్చెను. హిండెన్‌బర్గ అపుడు తుదిప్రయత్నముగా ప్రజలను తమ పరాక్రమమును వినియోగింప బురికొల్పెను. దీనిని మాక్సు మంత్రివర్గము మాన్పజాలనయ్యెను. అంతె జర్మని ఎట్టి షరత్తులు లేకయే శత్రువులకు స్వాధీనమయ్యెను.

ఇట్లు పెక్కు యుద్ధములయందు జయమునుగాంచి ప్రఖ్యాతిజెందిన యీజాతీయనాయకుని ౧౯౨౫ వ సంవత్సరము ఏప్రిల్ నెల ౨౬ వ తేదినాడు జర్మను ప్రజలు 'రీచ్ సభకు' ప్రెసిడెంటుగా నెన్నుకొనిరి.

ఇతడు ఆదర్శపురుషుడను జర్మను వీరుడు; ధైర్యశాలి, కష్టసమయములయందయినను వెనుకకు తగ్గనిచిత్తస్థైర్యము గలవాడు. ఇతడు మానవజీవితమునకు ఆవశ్యకములగు ఎల్లవిషయములయందును మంచి ప్రవేశము గలవాడు.

---

## శ్రీ వెంగరె మాధవరావు గారు
### కర్ణాటకమండల బాలశిల్పి

[జయకర్ణాటక అను కన్నడపత్రిక అయిదవసంపుటము, అయిదవసంచికనుండి.]



వీరు వెంగరె రామారావుగారి మూడవకొమరుడు. వీరి వయస్సు ఇప్పుడు ౧౮ సంవత్సరములు. వీరు చదు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాలుగేండ్లప్రాయమువఱకు మైసూరు సంస్థానమున నొక్క మారుమూలనున్న గ్రామమున బాల్యమునుగడపిరి. వీరు కర్ణాటక (మాతృ) భాషయందు తగినజ్ఞానమునుసంపాదించుకొనిరి. అయిదవతరగతివఱకు ఇంగ్లీషుభాషనుచదివిరి. వీరికి సామాన్యవిద్యయందునకంటె శిల్పాది కళలయందు చిన్ననాటనుండి ఎక్కువ అభిరుచియుండెడిది. పాశ్చాత్య కళాపత్రికల పరిచయమువలన కళాకౌశల్యాభివృద్ధి కావించుకొనిరి. ౨, 3 ఏండ్లనుండి వీరు ప్రతిమలను రచియిం



శిల్పిసోదరి అర్థప్రతిమ



ఈశిల్పి 3½గంటలకాలమున నిర్మించిన శివాజీ అర్థప్రతిమ



శిల్పియొక్క సోదరునిఅర్థప్రతిమ



శిల్పిరచియించిన మరియొక అర్థప్రతిమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చుచున్నారు. వానినుండి కొన్ని ప్రతిమల చిత్రములు మచ్చున కిచ్చుట ముద్రితములైనవి. ౧౪, ౧౬ ఏండ్ల భారతీయబాలుడు డిట్టి యప్రతిమము లగు ప్రతిమలను నిర్మించుట పరమానందదాయకము. ఈ ప్రతిమలయందు జీవకళ యుట్టిపడుచున్నది. మైసూరు ప్రభుత్వమువారీ బాలుని యద్భుత కళాకౌశల్యమును పెంపొందింప పూనుకొందురుగాక!

ప్రస్తుత మీరాఘవరావుగారు బొంబాయియందు శిల్పకళాభివృద్ధి కావించుకొనుచున్నారు. ఇంతేకాక వీరు ప్రాచీనశిల్పచిత్రకళానిలయములగు, బాదామి, వెహాళి, హంపి, హళేబీడు, బేలూరు, అజంతా మొదలగు స్థలములకు బోయి అచ్చటి వివిధప్రాచీనకళావైఖరులను గుర్తించుటావశ్యకము !!

---

## ప్రకృతి పరమాద్భుతములు

[౧౯–౩–౧౯౩౬ స్వయరుపత్రికనుండి]



సంపూర్ణముగ వికసించిన 'రెఫ్లీసియా' పుష్పము

(౧) ప్రపంచమునందలి యెల్ల పుష్పములకన్న పెద్దదగు పుష్పమొకటి 'రెఫ్లీసియా' అను పేరుగలది సుమాత్రా ద్వీపముయొక్క అడవులలో నున్నది. పెద్ద ప్రొద్దు తిరుగుడు పువ్వు దానికంటె చాలా చిన్నది. ఆ పువ్వు సంపూర్ణముగ వికసించినపుడు మూడు అడుగుల వెడల్పు గలిగియుండును. దానికి తీగ చెట్లవేరులలోని పదార్థము నాహారముగా గొనుచు చెట్లకు పెనచుకొని వానినుండి వేరుచేయ సాధ్యముగాకుండును. దాని రేకులు ఇటుకరంగు గలిగియుండును. వానిపై తెల్లచుక్కలుండును. పూవు వాడుమనున్న దిమ్మ, కేసరములు పసుపు, నీలిరంగులు గలిగియుండును. దీని మొగ్గ దట్టమైన గోధుమవన్నె కలిగియుండును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



'రెఫ్లీసియా' మొగ్గ.



(౨) 'అరిస్టాలోషియా' అను చిన్నమొక్క. ఇది మాంసభక్షకము. పైనవ్రాలిన ఈగలు మొదలయిన చిన్న పురుగులను చిక్కించుకొని మ్రింగివేసి జీవించు చుండును.

[౧౯-౩-౧౯౨౭ స్ఫియరుపత్రికనుండి]

# తక్షశిలానగరము

## ఇటీవల త్రవ్వితీయబడుచున్న అశోకచక్రవర్తి ప్రాచీనరాజధాని

ఇది క్రీ. పూ. ౨౫౦ వ సంవత్సరమున, బౌద్ధమతము నంగీకరించి రాజ్యమున స్థాపించిన అశోకచక్రవర్తికి రాజధాని. కాలగతిచే నది భూగర్భమున లీనమై నామమాత్రావశిష్టమైయుండెను. ఈనాడు త్రవ్వబడు



౧. నిర్వాణముద్రనున్న గౌతమవిగ్రహము. ముఖమున శాంతరస ముట్టిపడుచున్నది.

టచే దానివైభవము మరల వెలువడుచున్నది. ప్రాచీన నాగరకత, శిల్పము మొదలయినవానిని దెల్పు నమూల్య వస్తుసంపద బయలుపడినది. ఇప్పటికి సిర్కాప్, మోహ్రామోస్తూపము, జూలియను అనుమూడు ప్రదేశములు మాత్రము త్రవ్వబడినవి. ఆపట్టణమున నింకను త్రవ్వ



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలసిన భాగములు చాల గలవు. అశోకుడుమతపరివర్తకుడగుటచే నా పట్టణమునగుళ్లయందును సమాధులయందును గూడ బుద్ధ విగ్రహములే ముఖ్యాలంకారములు గనున్నవి. చిత్రము (౧)గౌతమవిగ్రహము. అయ్యది 5 అడుగులు పొడవును, మోకాళ్ల వద్ద 3 అడుగుల వెడలుపును గలిగి చెక్క-



౨. దిబ్బపైనున్న ప్రాచీనదేవాలయము కొండనుపులచిన సోపానమార్గము గలది. ఇది మహాస్తూపమునగలదు.

బడినవి. చిత్రము (౨) ఇది గ్రీకువిగ్రహము. ఇది అపార పరాక్రమశాలియైవిశాలమైనమహాసామ్రాజ్య మును స్థాపించినఅలెగ్జాండరు చక్రవర్తిసాహస చిహ్నము.



౩. తక్షశిలానగరమునందలి సిర్కాప్ అను ముఖ్యభాగము. సమీపమున పెద్దనూయియు దూరమున నిండ్లగోడలును కాన్పించుచున్నవి.

చెదరక యున్నది. మూర్తీభవించిన నిర్వాణమో యనునట్లుప్రశాంతమైన ముఖమై ఖరితో నా విగ్రహ మొప్పి యున్నది. చిత్రము (౪) శిల్ప రంజిత మగుసమాధి. అందు వరుసలుదీరి కూర్చున్న పరిచారకజనముతో గూడిన బుద్ధ విగ్రహములు, జంతువులు చెక్క-



౪. రాజులు ఆత్మదైవములు రక్షించుచుండ సమాధులయం దంతిమనిద్రాముద్రయందున్నారు. ఈ సమాధులు ప్రాచ్యశిల్పచిత్రరంజితములై యొప్పియున్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౪. ఐరోపీయ ప్రథమ దండయాత్రా చిహ్నమగు అలెగ్జాండరు చక్రవర్తినాటి యొకగ్రీకువిగ్రహము.
[౧౯౨౮ మార్చి౧౧ వ తేదీ స్ఫియరు పత్రికనుండి]

---

## అజంతా చిత్రములు

చిత్రము ౧. (1) గౌతముని బాల్యము. ఈ చిత్రము ౧౬ వ గుహాలయమున నున్నది. హిమవత్ప్రాంత నివాసియగు అసితుడనుఋషి దివ్యదృష్టిచే శుద్ధోదనునకు బోధిసత్వ (గౌతమ) జననమయ్యె నని తెలిసికొని, నరదత్తుడను తన మేనల్లునితో కూడ కపిలవస్తునగరమునకువచ్చి, రాజుచే సత్కృతుడై, శిశువును దెప్పించి తనచేత నుంచుకొని, ఆ బాలుని దివ్యలక్షణములనుగాంచి యాశ్చర్య గౌరవములను జూపుచున్నాడు. శుద్ధోదనుడు, మాయాదేవియు ఎదుట నున్నారు. ఈరెండుచిత్రములును చెడిపోయినవి. (2) గౌతముడు మఱియిద్దఱు కలిసి గురువునొద్ద విద్య నభ్యసించుచున్నారు. గానవిద్యాపరికరములు, అస్త్రశస్త్రాదులు నటకలవు. గూండ్లయందును, పంజరములయందును పావురములు గలవు. (3) గౌతముడు అస్త్రవిద్య నభ్యసించుచున్నాడు.

చిత్రము ౨. సిద్ధార్థుని త్యాగము: యశోధరాసతి శయనగృహమున గాఢనిద్ర నున్నది. చెలికత్తెలు, వారి బాలురు చుట్టును నిద్రించుచున్నారు. స్త్రీలు వివస్త్రలుగానున్నారను భ్రాంతి గలుగునట్లు సన్నని వలిపములను గప్పుకొనియున్నారు. కస్తూరీ తైలాంజనాద్యలంకరణ వస్తుసముదాయము, గానవిద్యాపరికరములు, శస్త్రములు నిందు గాన్పించుచున్నవి. సిద్ధార్థునిపుత్రు డగు రాహులు డీచిత్రమున గానరాడు. చెడినచోట నుండునేమో? ఎడమప్రక్కను సిద్ధార్థుడు భార్యాపుత్త్రిలను త్యజించి పోవ సమకట్టి లేచి నిలువబడియున్నాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చీనాబాలుడు



ఈ ఉత్తరపుసేనలో నరిదీయు నుద్యోగ మితనిది. చీనా దేశమున చిన్నతనము పెద్ద యుద్యోగమునకు అడ్డురాదు. ఈ బాలుడు తన యుద్యోగచిహ్నముగ కట్టి కత్తిని చేబూని యత్యుత్సాహముతో నవ్వుచున్నాడు.

[స్ఫియరుపత్రిక ౧౯-౩-౧౯౨౭ నుండి]

చీనాదేశము



పూర్వము



ఇప్పుడు

[రివ్యూ ఆఫ్ రివ్యూస్, మార్చి-ఏప్రిల్ సంచిక]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## శృంగార రాధామాధవ సంవాదము

శృంగార గ్రంథమాల మొదటికుసుమము. గ్రంథకర్త: నెలిదెండ్ల వెంకటపతికవి. ప్రకాశకులు: జి.యస్. శాస్త్రీ అండుకో, తపాలుపెట్టె ౧౧౦, మద్రాసు. ఫెదర్వెయిటుకాగితము. క్రౌనుసైజు. అచ్చు, బైండు, అందముగానున్నవి. వెల రు. ౨-౦-౦.

ఈగ్రంథము దక్షిణదేశమున నుత్పన్నమయిన ప్రాచీన శృంగారాంధ్రప్రబంధము. కవి రాధామాధవుల శృంగారలీలలను వస్తువుగాఁగొని రసవత్తరమైన మూఁడాశ్వాసముల యీప్రబంధమును రచియించినాడు. గ్రంథరచనావిధానమునుగూర్చి పీఠికయందు సంపాదకులు

"ఈకృతిలో రాధాకృష్ణులశృంగారలీలలు, సాటిలేని చాతుర్యముతో వర్ణితము లయినవి. రాధామాధవుల ప్రథమానురాగము, రాధావిరహము, శుకసందేశము, రాధామాధవుల సంవాదము, సవతులసంభాషణములు నిందు నెఱజాణతనపు నేర్పుతో నిర్వహింపఁబడినవి. ఈకవిరసవాంచలమున నాంధ్రవాణి యత్యుల్లాసముతో నృత్యమాడినది; పరిమళముగల పలుకుగుత్తులను బస్యరూపమున విరఁజల్లినది. శృంగారకృతికి సంగతములుగాని క్లిష్టపదములు, ప్రౌఢార్థములు నిందుఁ గానరావు. కవి రాధోక్తులను జెప్పునప్పు డాఁడుదిగా మారినాఁడు. అన్యాసక్తు లయినవల్లభులపై నక్కసుగొను కటారికత్తెల తుటారములు నీకవి పుడికిపుచ్చుకొని యీగ్రంథమునఁ బొసఁగించినాఁడు. గ్రంథము పయికిఁబయికిఁ బోనుపోను రసోద్రేకము గల్గించునదిగా నున్నది. ముద్దుపళని రాధికాస్వాంతనరచన కిది మేలుబంతి." అని వ్రాసుచ్చియున్నారు. అది సత్యతమన్న నతిశయోక్తికాదు.

గ్రంథకర్త: క్రీ. శ. ౧౭౦౦ ప్రాంతమువాడు. ఈరచనమున పండితుల యంగీకారమును గాంచజాలని ప్రయోగములు గలవు. అవియే యీరచనమున కందమును గూర్చుచున్నవి. వానిజోలికి పోవమికి ప్రకాశకులయెడ సరసులు కృతజ్ఞు లగుదురు.

మచ్చునకు ముచ్చటలు గూర్చు పద్యములు.

రాధవాక్యము:

ఉ. దోసము కృష్ణ కృష్ణ! నిను
దూఱిన; నానొసలందు ధాత మున్
వ్రాసినవ్రాఁతఁ గాదనుచు
వ్రాయఁగ నీతరమౌనె? నీవు దా
వేసట లేక యేరికని
వేడుకచేసెదు పైనిపైని నా
సాసల మాకు మేమె పయి
నాడిన? నిన్నన నేర మున్నదే?

చ. ఎడనెడఁ జూడు మంటివో, ప
యింబయి నెమ్మది నిల్పుమంటివో,
గడెగడె కోరుమంటివో, వ
గం బడుమంటివో, వేఁగు మంటివో
బడలు మటంటివో, యరుచి
పాల్పడుమంటివో, యెగ్గ సిగ్గలే
కడలుమటంటివో, పొరలు
మంటివో, మూర్ఛ మునుంగు మంటివో?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణునివాక్యము :

క. చిలుకలకొలికికిఁ గలికికి
నలుకట, పలుకదట, చలములట నీకైనన్,
గులుకువగఁగులుకుకపువపుఁ
బలుకులొలుకవలపుఁజిలుకఁబలుకవె చిలుకా!

* * *

అజ్ఞానతిమిర భాస్కరదుర్ణయ నిర్మూలనము

గ్రంథకర్త: శ్రీమాన్ మాడభూషి సింహాద్ర్యప్పలాచార్యులు గారు, కానుకొల్లు, గుడివాడతాలూకా కృష్ణాజిల్లా. డిమ్మిసైజు ౪౦౦ పేజీలు. వెల రు ౩-౦-౦.

జి. యస్. బి. సరస్వతీ స్వాములవారు శ్రీ శూద్రాదులకు వేదాధ్యయన వైదిక ధర్మానుష్ఠానములు తగుననియు, ఉపనయనాది సంస్కారములు గలవనియు సిద్ధాంతముచేసి, 'అజ్ఞానతిమిరభాస్కర' మనుపేర రచియించినగ్రంథమున కిది ఖండనగ్రంథము. వేదశాస్త్రములయందుండి తమఖండనమునకు వలసినప్రమాణముల నిందు జేర్చియున్నారు.

---

# పత్రికా పరిచయము

విద్యార్థి: సంపుటము ౧, సంచిక ౧.

ఇది మూడునెలల కొకమారు వెలువడుచుండును. సంపాదకుడు: శ్రీ. వావిలాల గోపాలకృష్ణయ్యగారు, బాల కవితాకుబేరము, సత్తెనపల్లి. చందా సంవత్సరమునకు రు. ౧-౦-౦. ఇందు శ్రీ కొమాండూరు కృష్ణమాచార్యులు, మిన్నికంటి గురునాథ శర్మ, శతావధాని రత్నాకరం అనంతాచార్యులు మొదలయినవారు రచియించిన రసవత్పద్యఖండకావ్యములు, ఒండురెండుకథలు, మఱి కొన్ని యితరవ్యాసములు గలవు.

ఆంధ్రదేశమున నిప్పుడిప్పుడు క్రొత్తపత్రికలు తఱుచు ప్రారంభమగుచుండుట సారస్వతాభివృద్ధిని సూచించుచున్నది. ఇక పత్రికయొక్క చిరంజీవిత్వమునకు, అభివృద్ధికి గావలసినవి ఉత్తమవ్యాసప్రకటనము, ఆంధ్రప్రపంచాభిమానము. వీనిని బడయగలిగిన పత్రిక స్వాభిప్రాయానురూపముగ వెలయగలదు.

* * *

రజతోత్సవసంచిక

శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయము,
రెసిడెన్సిబజారు, హైదరాబాదు
క్రౌను ౮పేజీల (భారతి)సైజు, పేజీలు—చిత్రములు కలిసి ౧౫౦. వెల రు. ౨-౦-౦.

శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషానిలయ మనుపేర వెలయుచున్న యీగ్రంథాలయము ప్లవసంవత్సర శ్రావణ బహుళ తదియ ఆదివారము (౧-౯-౧౯౦౧) నాడు హైదరాబాదున స్థాపితమైనది. నిజామురాష్ట్రాంధ్ర ప్రముఖుల నిరంతరకృషిచే నీనిలయము దినదినాభివృద్ధి జెంది, రాష్ట్రమున విజ్ఞానవ్యాప్తికి దోహదమును,నీనాటికి (౧౯౨౭ సం.) రజతోత్సవభాగ్యమును గాంచినది. నిజామురాష్ట్రపుగ్రంథాలయములలోనిది మొట్టమొదటిది. ఈరజతోత్సవము కావ్యకంఠ గణపతిశాస్త్రిగారి అధ్యక్షతక్రింద నతివైభవముతో జరిగినది. ఈగ్రంథాలయము రజతోత్సవ(౨౫ఏండ్లు నిండునపుడు చేయునుత్సవము)సమయమున 'రజతోత్సవసంచిక' యనుపేర నీగ్రంథాలయమువారు లీసంచికను ప్రకటించినారు. ఇందుమిందుగ నిజామురాష్ట్రాంధ్రపండితమహాశయులు రచియించిన గద్యపద్య వ్యాసము లిందు ప్రకటితములైనవి.'ఆంధ్రభోజ' బిరుదాంకితుడగు శ్రీకృష్ణరాయలకును,వారి కాలపు వాఙ్మయ,చారిత్రకవిషయములకును సంబంధించినవ్యాసములు, నిజామురాష్ట్రాంధ్రవాఙ్మయ చారిత్రకవిషయములకు సంబంధించిన వ్యాసములు, ఇతర గద్యపద్యవ్యాసములు గలవు. వానియందు చరిత్రసంబంధించినవ్యాసము లధికముగ నున్నవి. అష్టదిగ్గజముల ప్రతిభ, శ్రీ కృష్ణదేవరాయల విజయయాత్ర, నిజామురాష్ట్రాంధ్రకవులు, నిజామురాష్ట్రములోని చారిత్రకపరిశోధనము, నిజామురాష్ట్రపు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లోని ఆంధ్రసంస్థానములచరిత్ర, నిజామురాష్ట్రములోని చారిత్రక ప్రదేశములు (ఆంధ్రేతరప్రాంతము), ఓరుగల్లు—ఒంటిమిట్ట—ఏకశిల, అను నీ వ్యాసములు చేర్పఁబడినవి. భాషానిలయచరిత్రము, నిజామురాష్ట్రాంధ్ర సంస్కృతకవులయు, తత్కృతగ్రంథములయు, నిజాము రాష్ట్రములో కొన్నిగ్రంథాలయములయు (వివరముగ) పట్టికలు గలవు.

మఱియు నిందు నిజాంప్రభువుయొక్కయు, ఇతర నిజాంరాష్ట్రాంధ్రప్రముఖులయొక్కయు, ఓరుగల్లు, హనుమకొండ, పాలంపేట, కైలాసగుహ—(ఎల్లోరా), హంపిమొదలయిన స్థలములయందలి ప్రాచీనశిల్పముల యొక్కయు చిత్రములును, కృష్ణదేవరాయాస్థానకవుల (అష్టదిగ్గజముల) కల్పితచిత్రములును, ఇతరచిత్రములును పెక్కుగలవు.

ఈగ్రంథాలయము రజతోత్సవమును జరిపించి యిట్టిసంచికను ప్రకటించుటెంతయు సమంజసముగనున్నది. ఇది వాఙ్మయాభివృద్ధికిని, గ్రంథాలయోద్యమాభివృద్ధికిని తోడ్పడగలదు. ఈ సంచికవలన నిజామురాష్ట్రాంధ్రులప్రతిభ వెల్లడియగుచున్నది. (మన) ఆంధ్రదేశపు గ్రంథాలయములును ఈగ్రంథాలయపుపద్ధతి ననుసరించినచో దేశమునకును, వాఙ్మయమునకును అమూల్యము సేవనుగావించిన వగును.

ఈగ్రంథాలయ మాత్మదేశమునకు చిరకాలము నిట్టి యమూల్యమగుసేవను గావించుచు, ఎల్లవిషయముల విజ్ఞానాభివృద్ధికి తోడ్పడుచుండుగాక !

* * *

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

సంపుటము ౧౫, సం. ౪.

ఇందలి ముఖ్యవ్యాసములు :

“ఆంధ్రభాషయందలివింత యక్కరము”—శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. ఇందు అకారడకారముల స్వరూపోచ్చారణములకంటె విలక్షణమైన స్వరూపోచ్చారణము గలిగియుండిన‘ఱ’ అను అక్షరముయొక్కయునికినిగూర్చి చర్చింపబడినది.

“ద్రావిడభాషాతత్త్వవిమర్శనము”—శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, యం. ఏ.—ఇందు విభక్తినిరూపణమున ద్రావిడభాష లొండొంటికి గల సంబంధమును గూర్చి విపులముగ జర్చించినారు.

కాళిందీ కన్యాపరిణయ మను నహోబలపతివిరచిత ప్రాచీన ప్రబంధైకదేశము.

* * * * *

వజ్రాయుధము. సంపుటము ౨, సంచికలు౨,3.

మూడవ సంచికయందు (కూచిమంచి తిమ్మకవి కృతి) సర్వలక్షణసారసంగ్రహము—సందేహములు, కులములవిచారణ, ఆంధ్రభాషానుశాసనఖండనము అను వ్యాసములు ముఖ్యములు.

* * * * *

పుష్పమాల—సంపుటము ౧, సంచిక 3.

‘ఇందు వింధ్యాద్రిలోని రావణుని లంక’ అను వ్యాసము చారిత్రకపరిశోధలు పరికింపదగినది.

* * *

ఆంధ్రభారతి—సంపుటము ౧, సంచిక ౧౨.

* * * *

కళ—సంపుటము 3, సంచిక ౧.

ఇందు ‘కవిత్వప్రయోజనము’, ‘ప్రహ్లాద – విషాద నాటకము’ అను వ్యాసములు ముఖ్యములైనవి.

* * * *

ఆంధ్రరాష్ట్రప్రారంభవిద్య, సంపుటము ౧౬, సంచిక 3.

* * * *

ఐంద్రావతి, సంపుటము ౧, సంచిక ౧౦

(సంపాదకుడు: శ్రీవనం శంకరశర్మ, పత్తికొండ).

* * * *

దేశబంధు, సంపుటము ౧, సంచిక ౯.

* * * *

ఆంధ్రభాషావిలాసిని, సంపు. ౬,సం. ౪–౫.

ఇందు త్రిపురారిసుబ్రహ్మణ్యకవి విరచిత మగు శ్రీ సీతాపరిణయమను ప్రబంధమును, రఘునాథభూపాల


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

విరచితమగు 'నలచరిత్ర' ద్విపదకావ్యమును (అముద్రితములు) ప్రకటితము లైనవి.

* * * *

## స్వధర్మప్రకాశిని, సంపుటము 3, సంచిక ౧౨.

ఇందు యామజాల శేషాచలకవి ప్రణీత వసిష్ఠ జనకసంవాదమను ప్రాచీనవేదాంతప్రబంధముయొక్క అంత్యభాగము గలదు.

* * * *

## సుజాత, సంపుటము ౧, సంచిక 3.

ఇందలి 'భాగ్యనగరప్రాంతపూర్వవిభజన' మను వ్యాసము నిజామురాష్ట్రచరిత్రపరిశోధకుల కుపకరింపగలదు.

* * * *

## ఆంధ్ర హిస్టారికల్ రీసర్చి సొసయిటి జర్నల్- (ఇంగ్లీషు), సంపుటము ౧, సంచిక 3.

ఇందు 'తాపసవత్స' రాజమను సంస్కృతనాటకమును గూర్చియు, తత్కర్తృనిర్ణయమును గూర్చియు శ్రీ మానవల్లి రామకృష్ణకవి (యం.ఏ.) గారు విపులముగ విమర్శించివ్రాసినవ్యాసము గలదు. ఈనాటకము క్రీ. శ. ౮౦౦ పూర్వము రచియింపబడి ౧౨౦౦ వఱకువ్యాప్తిలోనుండి తరువాత విస్మృతమై నలుపది యేండ్లకు పూర్వము పంజాబులో మరల లభించెనట. కర్త: అనంగహర్ష నామాంతరముగల మాతృరాజనియు, ఇతడు నరేంద్రవర్ధనుని కొడుకనియు, కాశ్మీరదేశాధీశుడగు జయాపీడుని యాస్థానముననుండిన దామోదరగుప్తుడు కుట్టినీమతమునందును, ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమునందును తొలుదొల్త నీనాటకమును పేర్కొనియున్నారనియు కలదు.

భవభూతి ఉంబేకుడు ఒక్కరేనని నిర్ధారణచేయుచు శ్రీ యస్. కే. రామనాథశాస్త్రిగా రొక వ్యాసమును వ్రాసియున్నారు.

మఱియుకొన్ని చరిత్రమున కుపకరించు వ్యాసములుకలవు.

---

# పిచ్చుకా! యేల నీకిట్టి వెడఁగుఁదనము?

### శ్రీరామ్ వీరబ్రహ్మము గారు

ఆహారహరంబు నీవిట్టులీర్ష్యాభిఘాత
చిత్తమునఁ గోపఘూర్ణితస్థితి వహించి
జ్ఞాతిమాత్సర్యమేర నజ్ఞానివగుచు
నద్దమునఁ దోఁచుఁ బ్రతిబింబ మరసి యద్ది
స్వీయరూపంబటంచు యోచింపలేక
పొడుచుచుండెదు నీముక్కు పుటము లదర
పిచ్చుకా! యేల నీకిట్టి వెడఁగుఁ దనము?

అద్ది నీమైహికధనంబు నపహరించు
నని తలంచితొ? లేక నీయనుఁగు జెలువ
చెలువ మీక్షించి మోహింపఁ గలదటంచుఁ
దలఁచితో? కాకయున్న మేతయును నీళ్లు
మాని ద్వంద్వయుద్ధమునకుఁ బూనుచుండె!
పిచ్చుకా! యేల నీకిట్టి వెడఁగుఁ దనము?

నీవె యదియాట నద్దియే నీవయగుట
నీవు నిలిచి పోరాడుచో నిలుచునదియు
నీవు లేకున్న నదియుఁ గన్పింపఁబోదు
సమరమున కీవు కాల్దువ్వ జంకవేని
అదియు నినుఁబోలె వెనుదీయ దటులె నీవు
మించుప్రేమచే దాని నీక్షించెదేని
అదియు నీక్షించు నిన్ను మహాదరమునఁ
గాన శుష్కమాత్సర్యంబు మాని, చిత్త
శుద్ధిఁ జేకొని నెమ్మిమైఁ జూడకున్న
సిలుఁగులం బడుచుందువో చిన్నిపిట్ట!
పిచ్చుకా! యేల నీకిట్టి వెడఁగుఁ దనము?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# సాభిప్రాయవిశేషములు

ప్రభవ సంవత్సరము చాంద్రమానము నందు నవపరివృత్తి కారంభవత్సరము. ఆంధ్రమహారాష్ట్ర కర్ణాటకులకు సంవత్సరాది పర్వదినము. షష్ఠివత్సర పరివృత్తియందు గలిగెడి 21,600 చాంద్రసంభ్రమణములు నవోదయమును విశదము చేయుచున్నవి. చాంద్రమాన పరివృత్తియె షష్టిపూర్తికి ప్రమాణముగ నున్నది. అరువదేండ్లు జీవయాత్రను సార్థకము చేసిన మానవులు ధన్యులు. అరువదేండ్లు జీవించినమనుజులు షష్టి పూర్తిపండుగనుజేసి యానందించుట సహజము. ఒక పరివృత్తియందు గలిగెడి 21,600 సంభ్రమణములు ప్రాణాయామరహస్యమును విశదము చేయుచున్నవి. మానవులు ప్రతిదినమునను విడిచెడి 21,600 హంసలు సోమపరివృత్తికిని, ప్రాణపరివృత్తికిని గలసంబంధమును దెలుపుచున్నవి. జీవయాత్రయందు సుఖదుఃఖము లాత్మోద్ధరణమునకు సమానసాధనంబులుగ నున్నను సుఖము ప్రీతికరముగ నున్నది. నవసంవత్సరారంభమునందు వసంతోదయము నూతనాశాలతలను పల్లవింపజేయుచున్నది. మానవజీవిత మాశాబద్ధము. సకలకష్టములును సుఖానుభవాశా పోషణమువలన సహ్యము లగుచున్నవి. కర్మఫలము పరిపక్వమైనపుడు క్షణకాలమునందు జ్ఞానోదయము గలిగి బ్రహ్మానందము గలుగగలదు. ఆశాపిశాచము దుర్ణయములకు గారణం బగుచున్నను సదాశ పరమార్థమునకు సాధనంబుగ నున్నది. ఉగాదిని మానవహృదయ మాశాప్రేరితమై భావిభాగ్య శ్రవణమునం దానందమును బొందుచున్నది. నింబకుసుమభక్షణము, దేవతారాధనము, మృష్టాన్నభోజనము, నూతనవస్త్రధారణము, పంచాంగ శ్రవణము జీవితపరమార్థమునకు చిహ్నములై జీవయాత్రారహస్యమును సంవత్సరాదిని స్ఫురింపజేయుచున్నవి. మానవులుసంవత్సరాదిని పూనెడి సత్సంకల్పములు సంవత్సరమునం దంతటను కార్యరూపమునుదాల్చుచు జీవయాత్రను సార్థకము చేయుటకు వినియోగపడుచున్నవి. (శ్రీ) కృష్ణపరమాత్ముడు కురుక్షేత్రమునందు పార్థునకు జేసిన ధర్మోపదేశము సుమానవులు గ్రహించి వ్యవసాయపరాయణులై ప్రభవ సంవత్సరమునందు కామితార్థములను బడయుదురు గాత!

శ్లో. వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన! [నామ్.
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయి

*   *   *   *

గాంధి మహాత్ముడు

గాంధి మహాత్ముని యస్వస్థత భయమునకు గారణము గాకపోయినను పరమవిచారమును గలుగజేయు చున్నది. దేశమునం దంతటను అస్వస్థత సమాచారము మారుమ్రోగినది. స్వస్థత సమాచారమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వినుటకు ప్రజ లాతురులై యున్నారు. వర్తమాన సందిగ్ధావస్థయందు దేశమోక్షము గాంధిమహాత్మునిమీద నాధారపడి యున్నది. సహాయనిరాకరణోద్యమము బ్రిటీషు ప్రభుత్వము నూగింపగల విధమును దేశ వ్యవహారములు విశదము చేసినవి. గాంధినామ స్మరణము స్వరాజ్యమునకు సాధనముగ నెంచబడుచున్నది. గాంధిమహాత్మునిమీదగల భక్తి విశ్వాసములు ప్రజల కితర నాయకులమీద లేవు. భేదాభిప్రాయములతో ననోన్యాస్యము డీకొనుచున్న నాయకులకును, పక్షములకును మహాత్ముడు పాశబంధముగ నున్నాడు. ఒక సంవత్సరమునందు స్వరాజ్యము రాకపోయినను ప్రజలకు గాంధిమహాత్మునియందు గల విశ్వాసమునకు భంగము గలుగలేదని వర్తమానసంవత్సరమునందు మహాత్ముని సంచార విజయములు తెలుపుచున్నవి. ప్రజలన్ని ప్రాంతములందును గాంధిసంకీర్తనమును జేయుచు ఖద్దరునిధికి కానుకలను సమర్పించుచున్నారు. కర్ణాటకతమిళ దేశములందలి ప్రజలు గాంధిమహాత్మునకు స్వాగతంబు నొసంగుటకు పరమోత్సాహమును జూపుచున్నారు. ఆంధ్ర ప్రజలును గాంధిమహాత్మునకుస్వాగతసత్కారముల నొసంగుట కాతుర పడుచున్నారు. మహాత్ముని దర్శనము వారి యస్వస్థ స్థితి యందు ప్రజలందరకు సాధ్యము గాకపోయినను సత్సంకల్పారాధనము సకల జనులకును సాధ్యము.

మహాత్ముడు తదేకనిష్ఠతో దేశదాస్య విమోచనమునకు పాటుపడుచున్నవిధమును వారి నిత్యజీవయాత్ర విశదము చేయుచున్నది. మహాత్మునకు దేశ సౌభాగ్యము, ప్రజాహితము గోచరంబగునటులు తనయాన్నత్యము, తన ప్రతిష్ఠ గోచరము గాదు. మహాత్మునిమీద భక్తి విశ్వాసములు గలవారందరును మహాత్ముని వలె నిరంతరము ప్రజా సౌభాగ్యమునకు పాటుపడుటవలన మహాత్ముని దర్శించినఫలమును బడయగలరు. ఏకలవ్యుడు మట్టి ద్రోణాచార్యులను గొలిచి పొందిన మహత్త్వము మహాత్ముని ప్రజలు పూజించి కృతార్థులు గాగల విధమును విశదము చేయుచున్నది. అస్వస్థతవలనను మహాత్ముడు ప్రస్తుతము చెన్నపురికి రాజాలక పోయినను ప్రజలును, నాయకులును వారి వారి ధర్మములను నిర్వహించి ఏకలవ్యునివలె గురుదక్షిణను సమర్పించుటకు సంసిద్ధులై దర్శనాభిలాషను సార్థకము చేయుదురు గాక! అనుదినమునను బ్రాహ్మ ముహూర్తమునను లేచి రాత్రివరకును మానవసేవకై జీవితమును వినియోగించుచున్న గాంధిమహాత్ముడాయు రారోగ్యములను గలిగియుండుటకు భారతీయులు భగవంతుని ప్రార్థింతురు గాక! ముందు వేసవియందు సయితము సంచారము చేయుటకు గాంధిగారు వెనుదీయ రని స్పష్టముగ దెలిసియున్నది. దాక్షిణాత్యనాయకులు గాంధిమహాత్ముని దక్షిణదేశసంచారమును వేసవికాలమునందాపి వారియారోగ్యాభివృద్ధికి విశ్రాంతిని గల్పింతు రని నమ్ముచున్నాము.

* * * *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## భారతరాజ్యాంగములు

భారతీయరాజ్యాంగస్థితివిషాదమును గలుగజేయుచున్నది. హిందూమహమ్మదీయ విభేదములు వర్ధిలుచున్నవి. మహమ్మదీయులు చీటికి మాటికి దండపాణులై బీభత్సమును గలుగజేయుచున్నారు. సింధుదేశమునందలి లార్కానాయందు మహమ్మదీయయువతిని హిందూమతమునందు జేర్చినందులకు మహమ్మదీయులు దోపిడులను, దురంతములను చేసినవిధమును వార్తలు తెలుపుచున్నవి. బోగ్రాయందు మహమ్మదీయులు నిర్నిమిత్తముగ మార్వాడి వర్తకులను చావమోది దోపిడిని జేసిరి. దేశమునందంతటను ఏ మిషమీదనో ఇట్టి దుండగములు జరుగుచున్నపుడు హిందూ మహమ్మదీయ సంయోగము సాధ్యముగాదు. మహమ్మదీయనాయకులు సంయోగమునకుగాను హిందువులను నిర్బంధించి లాభములను బడయగోరుటయును శాంతిస్థాపనమునకు ప్రయోజనము గాదు. సింధుదేశమును ప్రత్యేక రాష్ట్రమునుగ జేయుటవలన గలిగెడిఫలమును లార్కానా దోపిడులు సూచించుచున్నవి. హిందూమహమ్మదీయసంయోగ ముభయసంఘములును దేశకల్యాణమును, మానవధర్మమును లక్ష్యమునం దుంచుకొనుటవలన గలుగునుగాని స్వసంఘప్రయోజనములను లక్ష్యమునందుంచుకొనుటవలన గలుగ జాలదు. మహమ్మదీయులు మతాభిమానమునందును రాజ్యాంగప్రయోజనములందును దేశలక్ష్యమును విసర్జించి మహమ్మదీయలక్ష్యమును సమర్థింపగోరుట సంయోగసాహచర్యములకు ప్రయోజనకరము గాదు. చిరకాలము నుండియును వైరాగ్యమునకలవాటుపడిన హిందూసంఘము దేశసౌభాగ్యమునకు సామదానోపాయముల నవలంబించుటకు సిద్ధపడినను నీయేర్పాటు స్థిరమైనప్రయోజనములను సమకూర్పజాలదు. హిందూ మహమ్మదీయ సంఘములు రెండును భారతదేశ సంతానములనియును, దేశప్రయోజనములు రెండు సంఘముల ప్రయోజనములకు లాభదాయకము లనియును, స్వసంఘప్రయోజనముల కాశించుటవలనను రెండుసంఘముల ప్రయోజనములును నిర్మూలము లగుననియును గ్రహింపనంతవరకును సంయోగము మాటలయందు గనుపడుచున్నను కార్యములందు నిరర్థకముగ నుండగలదు. హిందూమహమ్మదీయ విభేదములు ఇర్విన్‌ప్రభువువంటి ధర్మాత్ములకు పరమ విచారమును గలిగించినను, సామాన్యనిరంకుశాధికారులకు నిరంకుశవర్గపోషణమునకనుకూలించుచు విచారమును గలుగజేయఁజాలదు. బర్కెన్‌హెడ్‌ప్రభువు పార్లమెంటునందు జేసినప్రసంగ మీవిషయమును సమర్థించుచున్నది. జాతిమతకులభేదములు పరస్పరద్వేషములకు మూలకారణం బగుచున్న దేశమునందు జాతీయసంయోగసాధనము దుర్గ్రాహ్యముగ నున్నది. స్వరాజ్యస్థాపనమునకు విభేదములాటంకములు గాకపోయినను నిరంకుశవర్గమునకు సంస్కరణములవిస్తారమునకు సాకుగ గనపడుచున్నది. గాంధిమహాత్ముడు నిర్ణయించిన నిర్మాణవిధానమే ఏయుగమునకైనను స్వరాజ్యస్థాపనమునకు సాధనము కాని శాసనస

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భలు సాధనములుగావని శాసనసభల వ్యవహారములు, బర్కెనుహెడు ప్రభువుచేసిన యాక్షేపణలు వెల్లడిచేయుచున్నవి.

* * * *

సామ్రాజ్య శాసనసభ

మూడుమాసములనుండియును పాటుపడుచున్న సామ్రాజ్యశాసనసభాసమావేశ మంతము నొందినది. సభావ్యవహారము లంతర్భేదములతో నిండి నిరర్థకము లైనవి. పక్షభేదములు, మతభేదములు, నాయక భేదములు రాజ్యాంగములదౌర్బల్యమును నిరంకుశవర్గ బలమును విశదము చేసినవి. స్వతంత్రపక్షము, జాతీయపక్షము, కాంగ్రెసుపక్షము భిన్నమార్గముల నవలంబించుచు నిరంకుశవర్గమునకు బలము నొసంగి రక్షించినవి. నిరంకుశవర్గమునకు సామ్రాజ్యసభ స్వతంత్రరంగముగనున్న విధమును సభావ్యవహారములు విశదము చేసినవి. ప్రభుత్వనిర్ణయములన్నియును సఫలము లైనవి. రూపాయమారకపు నిర్ణయశాసనము, ఉక్కు సంరక్షణ శాసనము స్వతంత్ర పక్ష సహాయమున ప్రభుత్వపుపట్టు నెగ్గినది. సైన్యవ్యయమును, కార్యనిర్వాహకసభ్యులవ్యయమును రాజప్రతినిధి ధ్రువపరిచెను. ఉప్పుపన్నును రాజ్యసభ పునరుద్ధరించినది. శాసనసభ రెండవసారి యామోదించినది. మోంటుఫర్డుసంస్కరణములు సామ్రాజ్యసభ కేవిధమైన స్వాతంత్ర్యమును గలుగజేయనివిధము తెల్లమైనది. సామ్రాజ్యశాసనసభకు సైన్య వ్యయమును, కార్యనిర్వాహకసభ్యులవ్యయమును నిరోధించుట కధికారము లేదు. ప్రజాప్రతినిధు లధికసంఖ్యాకులుసభయందున్నను ప్రజాప్రతినిధులందుగల విభేదములు ప్రభుత్వ విజయమునకు దోడ్పడగలవు. ప్రజాప్రతినిధు లేకగ్రీవముగ ప్రతిఘటించినను గవర్నరు జనరలునకు సమర్థనాధికారము గలదు. గవర్నరు జనరలు సమర్థనాధికారమును వినియోగింపక పోయినను నిరంకుశవర్గపోషణమునకు రాజ్యసభ సిద్ధముగ నున్నది. ఈవిషయమును గతించిన సామ్రాజ్యశాసనసభా వ్యవహారములు విస్పష్టము చేసినవి. దుర్భేద్యమైన నిరంకుశవర్గబలమును భేదించుటకు ప్రజాప్రతినిధులకు సంకల్పముగాని, సామర్థ్యము గాని, సంయోగముగాని కనుపడకున్నది.

శ్రీనివాసయ్యంగారి మార్గము పండిత మోతీలాలు నెహ్రూగారికి సరిపడదు. లాలాజీగారిపద్ధతి మదనమోహనమాలవ్యగారికి గిట్టదు. ప్రకాశంగారి భావములు రంగయ్యరుకు పనికిరావు. నాయకునిపోటు ఒకపక్షమునను, ప్రచోదకునిపోటు వేరొకపక్షమునను గనుపడుచున్నది. కాంగ్రెసుపక్షమునందలి భేదముల నితరపక్షములభేదములు బలపరచుచున్నవి. జిన్నాగారు వేయుచున్న యెత్తులు చిత్తవిక్షేపమును గలుగజేయుచున్నవి. సామ్రాజ్యసభయందు వ్యక్తమైన ధర్మవిధ్వంసనము మాలవ్యగారి రాజినామాకు గారణంబైనది. మహానుభావుడు మాలవ్యాగారు సహచరసభ్యుల ప్రార్థనల నాలకించి రాజీనామాను మానుకొనినను సామ్రాజ్యసభయందలి దుస్థితికి భంగము గలుగక యథాప్రకారముగ నున్నది. నాయకు లందరును మూడుమాసము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లు కష్టపడి పనిచేసి అలసి సొలసి స్వస్థలము
లను జేరిరి. శ్రీనివాసయ్యంగారు ప్రకటించిన
కార్యవిధానము నాయకుల కార్యపరత్వమున
కు నిదర్శనముగ నున్నది. 1. హిందూమహ
మ్మదీయసంయోగము; 2. కాంగ్రెసున కను
బంధముగ రయితు సంఘముల స్థాపనము;
3. పరిపాలనవిధానమును నిర్ణయించి ఆచరిం
చుటకు కన్వెన్షను పార్లమెంటు స్థాపనము;
4. అనుభవమునుబట్టి గౌహతి తీర్మానమును
మార్చుట; 5. జాతీయారాధనమునకై జాతీ
యప్రతిజ్ఞను చేసెడి యువజన సేవాసంఘముల
నిర్మాణము శ్రీనివాసయ్యంగారు సూచించిన
కార్యవిధానముగ నున్నది.

ఈపనులనే చేయుటకు కాంగ్రెసుసంఘ
ములు, కన్వెన్షను, హిందూయువజనసంఘము,
భారత సేవాసంఘము, స్వరాజ్యాశ్రమములు,
తంతుకారసంఘము మొదలైన సంస్థాపనలు
గలవు. ఉన్నసంఘములు చేయలేనిపనిని
క్రొత్తసంఘము లెటులుచేయగలవో తెలియ
కున్నది. అభిప్రాయములందు నాయకుల ప్రతి
ష్ఠకుగల ప్రకాశము కార్యవిధానమునందు
గనుపడకున్నది. నాయకులందరును స్వీయాభి
ప్రాయములను వెనుకబెట్టి దేశపరిస్థితులను
గ్రహించి కలిసిపనిచేయుట సంకల్పసిద్ధికి సాధ
నముగాని సిద్ధాంతములనిర్వచనముకార్యసిద్ధికి
సాధనముగాదని ఇప్పుడైనను గ్రహించుట
వివేకము.

* * * *

చెన్నరాష్ట్ర శాసనసభ

సామ్రాజ్యశాసనసభ ప్రదర్శించిన దృశ్య
మునే చెన్నరాష్ట్రశాసనసభయును వేరొక
రూపమున ప్రదర్శించినది. స్వతంత్రపక్ష
మంత్రివర్గము స్థిరాసనము లేక వ్రేలాడుచు
న్నది. పానుగల్లు రాజాగారును, వారియనుచరు
లును స్వతంత్రపక్ష మంత్రివర్గమును పడద్రో
యుటకు చతుర్విధోపాయములను వినియో
గించి విఫలమనోరథులైరి. మద్యపాననిషేధ
వ్యాజమున మద్యాదాయము నంతయును
తగ్గించుటకు కాంగ్రెసుసభ్యుల సహకారమును
జస్టిసుపక్షముకోరి వారిచాతుర్యమును వ్యక్త
ముచేసినది. మంత్రులవేతనములను కోయు
టకు జస్టిసుపక్షముపన్నినతంత్రమునకుకాంగ్రె
సుపక్షము తటస్థభావమునువహించినది. చెన్న
పురివైద్యాశ్రమనిర్మాణమునందును, నితరవిష
యములందునుజస్టిసుపక్షముమంత్రివర్గమునకు
పదచ్యుతి గలుగజేయుటకు జేసినప్రయత్న
ములు విఫలము లైనవి. దేశమునం దంతటను
గోతిదగ్గర నక్కలవలెను వేచియున్న జస్టిసు
పక్షానుచరులకు నిరాశ గలిగినది. కాంగ్రెసు
పక్ష మవలంబించిన తటస్థభావము జస్టిసు
పక్షమునందును, కాంగ్రెసు పక్షమునందును
కోపావేశములను గలుగజేసినది. శాసనసభ
యందు పానుగల్లురాజాగారు, మునిస్వామి
నాయుడుగారు చేసినయాక్షేపణలును, జస్టిసు
పత్రిక చేసిన వ్యాఖ్యానములును మంత్రివర్గ
నిర్గమనమునందు జస్టిసుపక్షమునకు గల పట్టు
దలను విశదము చేయుచున్నవి. పాపము
ద్వంద్వప్రభుత్వసంహారమునందు జస్టిసు పక్ష
మునకుగల యుత్సాహము ప్రజలకు దుర్గ్రా
హ్యముగ నున్నది. ఆరేండ్లు ద్వంద్వప్రభుత్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును పోషించుచు కాంగ్రెసుపక్షమును నిర్బంధములపాలుచేసిన జస్టిసుపక్షము మంత్రిపదవులు పోయినతోడనె ద్వంద్వప్రభుత్వమును నిరసించుట ధర్మాత్ములకు విశ్వాస జనకము గాదు. స్వామి వేంకటాచలము శ్రేష్ఠిగారికి మంత్రిపదవులను స్వీకరించుటవిషయమై పానుగల్లురాజాగారుచేసిన సూచనలు వారి తంత్ర కౌశల్యమును విశదము చేయుచున్నవి. జస్టిసుపక్షము చేయుచున్న యాక్షేపణమునే కాంగ్రెసుసంఘములును శాసనసభ యందలి కాంగ్రెసుసభ్యుల మీాద చేయుచున్నవి. రెండుపక్షముల యాక్షేపణలును గౌహతి తీర్మానముమీాద నాధారపడియున్నను సంకల్పము మాత్రము భిన్నముగనున్నది. జస్టిసు పక్షము స్వప్రయోజనములకును, కాంగ్రెసు పక్షము దేశప్రయోజనములకును ప్రయత్నములు చేయుచున్నవి. ధర్మవిరుద్ధములైన భావములకు కార్యరంగమునందు సంయోగసాహచర్యములు సాధ్యమైనను ఫలముమాత్రము విషమయముగ నుండును. కాంగ్రెసుసంఘములు ప్రతిపాదించెడి దోషారోపణము ధర్మయుక్తమైనను దురారాధ్యముగ నున్నది. మంత్రివర్గమును పడద్రోయుటకు జస్టిసుపక్షసహాయము గావలసియున్నది. కాంగ్రెసుపక్షమునందును నేకాభిప్రాయములేదు. స్వతంత్ర పక్షమంత్రివర్గమును వెడలించిన తరువాత కర్తవ్యము గహనముగ నున్నది. స్వతంత్ర పక్షనిర్గమ నానంతరము ద్వంద్వప్రభుత్వము రెట్టింపుబలముతోజస్టిసుపక్షరూపముననుతిరిగి ప్రత్యక్షమగుననుభయము కాంగ్రెసు సభ్యులను బాధించుచున్నది. శాసనసభాప్రవేశము నియోజకవర్గము నందును, ప్రతినిధు లందును సహాయనిరాకరణధర్మమును శిథిలముచేసినది. నిరంకుశవర్గము, జస్టిసువర్గము కలిసిపెట్టిన బాధల ననుభవించిన ప్రజలు జస్టిసుపక్షారోహణమును నిరసించుచున్నారు. కాంగ్రెసు పక్షము సంయోగబలములేక భిన్నమార్గముల నవలంబించుచున్నది. "ఎవరికి వారే యమునాతీరే" యనునటులు కాంగ్రెసుసభ్యులు నాయకుని నాయకత్వమును నిర్లక్ష్యము చేయుచు కాంగ్రెసుబలమును ధ్వంసము చేయుచున్నారు. కాంగ్రెసుసభ్యులు కొందరు వారి కర్తవ్యమును నిర్ణయించుటకు కాంగ్రెసు స్థాయిసంఘసమావేశమును జేయగోరిరి. కాంగ్రెసు అధ్యక్షులు శ్రీనివాసయ్యంగారును గౌహతికాంగ్రెసు నిర్ణయమును పునర్విమర్శనము చేయగోరుచున్నారు. పునర్విమర్శనఫలమిదమిత్థమని నిర్ణయించుట సాధ్యముకాకపోయినను రాష్ట్రములకు మంత్రివర్గవిషయమున స్వాతంత్ర్యమిను నొసంగుట సమంజసముగనుండును. జస్టిసుపక్షతంత్రములు మంత్రివర్గసంహారమునకు ప్రతిబంధకములుగ నున్నను కాంగ్రెసుపక్షముమాత్రము మంత్రిపదవులను స్వీకరింపకుండుట ధర్మముగనుండగలదు. చెన్నరాష్ట్రశాసనసభయందు కాంగ్రెసుపక్షము రాగల సమావేశమునందైనను నేకాభిప్రాయముతో మెలగి కాంగ్రెసుప్రతిష్ఠను గాపాడుటనివేకము. దేశమునందు పర్యాప్తంబగుచున్న యంతఃకలహములు సామ్రాజ్యాహంకారశక్తిం తుండైన బర్కెనుహెడు ప్రభువునకు భారతీ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యులను వేధించుట కంకుశముగ నేర్పడినవి.

*　　*　　*　　*

బర్కెనుహెడు ప్రభువు

బర్కెనుహెడు ప్రభువు నావహించిన దురహంకార దురభిమానము లపారముగనున్నవి. మార్చి 30-వ తేదిని ప్రభువులసభయందు బర్కెనుహెడు ప్రభువుచేసిన ప్రసంగము దురభిమానపూరితమై యహంకారాంధత్వమును విశదముచేయుచున్నది. వంగదేశ నిర్బంధితుల విషయమై తెలిపినభావములు కాఠిన్యమునకు నిదర్శనములుగాని వివేకమునకు నిదర్శనములుగావు. భారత ప్రభుత్వ నిర్ణయములనుసమర్థించుట వారిధర్మముగాని న్యాయమునుచేయుట వారిధర్మముగాదుగదా! దోషమును స్థాపింపక ప్రజలను నిర్బంధముల పాలుచేయుట యన్యాయమని మంత్రిబర్కెను హెడు ప్రభువు గ్రహింపజాలకపోయినను న్యాయవాది బర్కెనుహెడుప్రభువు గ్రహింపవలయునుగదా! సంస్కరణ విచారణసంఘమును 1929 వ సంవత్సరము లోపల నియమింపవలసిన యవసరమును బర్కెను హెడు ప్రభువంగీకరించుచున్నాడు. కాని 1927 లో నియమించుటకన్నను 1929 లోనే నియమించుట వారి యభిమతమై యుండును. మార్నింగు పోస్టు పత్రిక ఈయూహ నామోదించినను లండను టైమ్సు, మాన్చెస్టరుగార్డియను పత్రికలు వెంటనే నియమించుట యవసరమని ప్రకటించినవి. ఇండియా ప్రభుత్వదేవతలు ఇర్విను ప్రభువు సంప్రీతులు గా నంతవరకును గడువును మార్చుట కిష్టములేదని బర్కెనుహెడు ప్రభువు వ్యక్తముచేసెను. యథోచితసహకార పక్షము పూనిన సహకారమునకు మంత్రి హర్షించుచు కాంగ్రెసుపక్షము చూపిన ప్రతిఘటనమునకు బర్కెను హెడుప్రభువు దేశమును దండింపదలపెట్టుచున్నాడు. పార్లమెంటునకు ప్రజలక్షేమముపట్లగల సానుభూతికి వీరి నిర్దాక్షిణ్య ప్రసంగము నిదర్శనముగ నున్నది. విచారణసంఘనియామకము భారతీయులవశమునందు గలదనువిషయ మా బాలగోపాలము తెలిసియున్నది. అంతఃకలహములతో నిండియున్న దేశస్థితిని గ్రహించియే బర్కెనుహెడుప్రభు విట్టివితండవాదమును జేయుటకు సాహసించిరి. కాలమెప్పుడును నొక్కరీతి నుండదని చీనాదేశవ్యవహారములనుబట్టియైనను బర్కెను హెడ్డు ప్రభువు గ్రహింపజాలకుండుట దురదృష్టము. హిందూమహమ్మదీయవిభేదములనుబర్కెను హెడుప్రభువున కాక్షేపణకారణము లగుటయందు విచిత్రము లేదు. స్కీనుకమిటి నిర్ణయములవిషయమై బర్కెనుహెడుప్రభువు తెలిపిన భావములు భారతప్రభుత్వముయొక్క నిస్సహాయస్థితిని విశదము చేయుచున్నవి.

*　　*　　*　　*

స్కీనుకమిటి నిర్ణయములు

స్వరాజ్యమునకు స్వదేశరక్షణ సామర్థ్యము లక్షణమని నిరంకుశవర్గము విసుకు విరామములేక చాటుచున్నది. స్వదేశరక్షణ సామర్థ్యము భరతఖండమునకు గలదని 33 కోట్ల ప్రజలు ప్రకృతి సిద్ధమైనస్థితి తెలుపుచున్నవి. ఐరోపా మహాసంగ్రామసమయము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నందు భారతయోధులు బ్రిటీషు సామ్రాజ్య సంరక్షణమునకు వినియోగపడిరి. ఇపుడు చీనాదండయాత్రకు వినియోగపడుచున్నారు. పదునాలుగేండ్ల యందు సైన్య వ్యయము రెట్టింపుపెరిగినది. సైన్యవ్యయమునుభరించుట భరతవర్షమునకు విధియును, సైన్యోపయోగ మును, వ్యయమును నిర్ణయించుట బ్రిటీషు సామ్రాజ్యరక్షణసంఘధర్మమును నైయున్నది. బర్కేను హెడుప్రభు వీసిద్ధాంతమునే సమ ర్థించు చున్నాడు. స్కీనుకమిటి సైనికుల శిక్షణమునకు సాండర్స్టను 1933 నందు స్థా పించవలయు ననియు, 1952-వ సంవత్సరమున కు సగముమంది సైనికోద్యోగులు భారతీయు లు గావలయుననియు నిర్ణయించినవి. ఇం గ్లాండుసాండర్స్టునందు హైందవులను, ఇండి యాసాండర్స్టునందు ఆంగ్లేయులను జేర్చుకొన వలయునని నిర్ణయించినది. ఇంతవరకును అవు లునందున్న ఎనిమిదిపటాలముల విధానమును రద్దుచేయుటకు నిర్దేశించినది. నిర్ణయములు నివేదికయందు కొంతఆశాజనకముగ నున్నను ఆచరణమునందు నిరాశను గలుగజేయుట సహజము. సైనికవిధాననిర్ణయములను జేయు టకు బ్రిటిషుసామ్రాజ్యసంరక్షణసంఘమునకు మాత్ర మధికారము గలదనియును భారత ప్రభుత్వమునకును స్కీనుకమిటికిని అధికా రము లేదనియును బర్కేనుహెడు ప్రభువు విశదముచేసి భారతదేశపరాధీనస్థితిని సువ్య క్తము చేసెను. భరతవర్షము మొదటను బ్రిటీషుసామ్రాజ్యప్రయోజనములకును, తద నంతరము భరతవర్ష ప్రయోజనములకును నేర్పడినదని చాటుమాటు లేక బర్కేను హెడుప్రభువు తెలిపి భారతీయులకు జ్ఞానోప దేశమును జేసి వారికి కర్తవ్యమును వ్యక్తము చేసెను. సంస్కరణ విచారణసంఘము 1927వం దేర్పడినను బ్రిటీషుప్రయోజనముల రక్షణమునకువలె హిందూదేశ ప్రయో జనములకు వినియోగపడదని బర్కేను హెడు ప్రభువుచేసిన ప్రసంగము విశదముచే సినది. స్వరాజ్యము భారతీయుల స్వయంసహా యమువలనను రాగలదుగాని బ్రిటీషుపార్ల మెంటు శాసనమువలన రాజాలదని సిద్ధాంత ములు, వ్యవహారములువిశదముచేయుచున్నవి. పరాధీనస్థితియందు మైమరచి నిద్రించుచున్న భారతీయులకు మేలుకొలుపు గలుగుటకు దైవసహాయముశరణ్యముగనున్నదిగాని పూర్వ వ ప్రయత్నములు శరణ్యముగ గనుపడవు.

*   *   *   *

ఆంధ్రరాష్ట్రము

రామదాసుపంతులుగారు రాజ్యసభయం దు ప్రతిపాదించిన ఆంధ్రరాష్ట్రతీర్మాన మో డినను చెన్నరాష్ట్ర శాసనసభయందు పిల్లల మర్రి ఆంజనేయులుగారుప్రతిపాదించిన ఆంధ్ర రాష్ట్రనిర్మాణ తీర్మానమునెగ్గినది. పానుగల్లు రాజాగారు విశాఖపట్టణమునందు రాష్ట్రని ర్మాణము నామోదించిరి; అన్నపూర్ణయ్య గారితో రాష్ట్రనిర్మాణమున కనుకూలాభిప్రా యమును వ్యక్తముచేసిరి; శాసనసభయందు ఆంధ్ర రాష్ట్రతీర్మానమునకు వ్యతిరేకముగ వోటునిచ్చి పానుగల్లు రాజాగారు సహజమైన తంత్రశీలతను తెల్లము చేసిరి. జస్టిసుపక్ష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాయకు డవలంబించుచున్న తంత్రముజన్టిసు పక్షప్రతిపత్తిని పాడుచేయుచున్నదని పక్షా వలంబను లిపుడైనను గ్రహించుట ధర్మముగ నున్నది. ఆంధ్ర రాష్ట్రతీర్మాన మాంధ్రుల కర్తవ్యము నుపదేశించు చున్నది. రాగల సంస్కరణ విచారణయందు భరతఖండము నందు సాంఘాతికరాజ్యాంగమును స్థాపన చేయుటయందు గల సాధకబాధకములు పరి శీలింపబడునని క్రీరారు, ఫ్రెడరికుప్రైవేటు, కోటు మనుగారులు తెలిపిన భావములు విశదముచేయు చున్నవి. సర్దారుఇక్బాలుఆలీషాగా రీభావమునే విశదము చేయుచున్నారు. ప్రబలమైన కేంద్ర ప్రభుత్వము స్వపరిపాలనము గల భాషాప్ర యుక్తరాష్ట్రములు సంయోగసంబంధమును గలిగియుండుట భారతరాజ్యాంగలక్ష్యమని దే శస్థితి, రాజ్యాంగ విధానములు విస్పష్టముచే యుచున్నవి. ఆంధ్రనాయకులు భారత ప్రభు త్వాయత్తమైన భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణ మును సార్థకముచేసి దేశక్షేమమునకు దోడ్ప డుట ధర్మముగ నున్నది.

ఆంధ్రోద్యమ మారంభమునం దవలం బించిన సర్వతోముఖమైన యాంధ్రత్వవికాస మున కాంధ్రనాయకులుపాటుపడవలసిన శుభ సమయ మాసన్నమైనది. సహాయనిరాకర ణోద్యమము ప్రజానాయకుల లక్ష్యమును రాజ్యాంగరంగమునందు మాత్రమే లగ్నము చేసినది. స్వరాజ్యకవచము దేహసంరక్షణ మునకు సాధనంబైనను ఆత్మరక్షణములేని దేహసంరక్షణ మాంధ్రాభ్యుదయమునకు నిర ర్థకముగ నుండగలదు. సర్వతోముఖమైన యాంధ్రాభ్యుదయమునకు సాహిత్యకళావికా సము, పరిశ్రమలవికాసము, మతధర్మాభ్యు దయము గావలసిన విధమును ఆంధ్రత్వవికా సము విశదము చేయుచున్నది. ప్రజానాయ కులు వారి లక్ష్యమును తాత్కాలికమైన రాజ్యాంగ వ్యవస్థలయందుమాత్రమే లగ్నము చేయక నిత్యమైన సాహిత్యకళాంగములందు సయితము లగ్నముచేయుట ప్రయోజనకర ముగ నున్నది.

సాహిత్యోపాసకులు సాహిత్యా రాధన మును జేయుచున్నవిధమును సాహిత్య రచ నలు విశదముచేయుచున్నవి. ఆంధ్రపత్రికా నిర్వాహకులు ప్రచురించిన ప్రభవ సంవత్స రాదిసంచికయును శ్రీకృష్ణదేవరాయాంధ్రభా షానిలయ నిర్వాహకులు ప్రచురించిన రజతో త్సవసంచికయును ఆంధ్రసాహిత్య కళారచన లయందు నవ భావోదయమును విశదము చేయుచున్నవి. ప్రభవ సంచిక యం ద లి శ్రీ వేంకట పా ర్వ తీ శ్వ ర క వి విరచిత మైన సమాలోచనము, దాని నలంకరించిన చిత్రాంచలము, అడివి బాపిరాజుగారు రచి యించిన నరపతి అందలిచిత్రములు, శతావ ధాని శివరామశాస్త్రిగారి కామకవి, శర్మగారి సరస్వతీదేవి మొదలగు రచనలు సాహిత్య కళావికాసమునకు నిదర్శనములుగ నున్నవి. హైదరాబాదునందు ప్రచురింపబడిన రజతో త్సవసంచికయందలి సిరుగూరి హనుమంత రావుగారి చారిత్రకపరిశోధనము, గాడేపల్లి సూర్యప్రకాశరావుగారి కృష్ణ దేవ రా య ల విద్వత్సభ మొదలగు రచనలు నిజామురాజ్య

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునం దాంధ్రాభ్యుదయము జరుగుచున్న విధ మును విశదముచేయుచున్నవి. తేకుమళ్ల రామ చంద్రరావుగారి కుమారార్పణ మాంధ్రప్రచారిణీగ్రంథమాలయందు ౪౪ వ కుసుమమైవెలయుచు నవలలప్రచురణమునందు స్వాతంత్ర్య వికాసమును విశదముచేయుచున్నది. తొాగ ర్చేటి భాస్కరశాస్త్రిగారి ఆయుర్దాయయోగ ము, సింగంశ్రేష్ఠి నంబెరుమాళ్లుశ్రేష్ఠిగారి నాడీజ్ఞానబోధిని, శ్రీ సచ్చిదానందయోగీశ్వరుని జీవబ్రహ్మైక్యరాజయోగసారామృతము, నారాయణరావుగారి జగద్గురు దర్శనము మొదలగు ప్రచురణములు శాస్త్రవేదాంత విషయములం దాంధ్రలోకమునందు ప్రవర్ధమానంబగుచున్న వికాసమును విశదముచేయుచున్నవి. ఆంధ్రోద్యమసిద్ధికి రాజ్యాంగము లందును, సాహిత్యకళారచనలయందును, పరిశ్రమలయందును, సంపదలయందును, విద్యావ్యాపనమునందును, మతాచారములందును అపారమైన వికాసముగావలసినవిధమును వర్తమానపరిస్థితులువిశదముచేయుచున్నవి. ఆంధ్రోద్యమాదర్శములను సార్థకముచేయుటకు ప్రభవసంవత్సరమునందు ప్రజానాయకులు పాటుపడి భగవదనుగ్రహమును బడయుదురుగాక!



Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7, Thumbu Chetty Street, G.T., Madras

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# విషయానుక్రమణిక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# చిత్రములు

త్రివర్ణచిత్రములు:—వేణీభంగము; పసునాథుడు.

సాధారణచిత్రములు:—శివాజీస్మరణ చిహ్నచిత్రములు; ప్రాచీనమహారాణుల చిత్రములు; ప్రాచీనభారతీయాభరణములు; గోవర్ధనధారి; ఆకస్మిక ఛాయాచిత్రములు; ఇతర చిత్రములును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



వేణీభంగము

చిత్రకారుడు : శ్రీయుత అడవి బాపిరాజుగారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చెన్నపట్టణము మే ౧౯౨౭

సంపుటము ౮ ప్రభవ సంవత్సరము వైశాఖమాసము సంఖ్య ౨

# శివాజీ మహారాజు

సోమంచి వాసుదేవరావు గారు

ప్రబల మహారాష్ట్రరాష్ట్ర మెవ్వానిచేఁ దొలుదొల్త బలిమిచే నిలుపఁబడియె
బాశ్చాత్య సంఘదార్బల్య మెవ్వానిచేఁ దొలుదొల్తఁ గడిమిచేఁ దెలుపఁబడియెఁ
ఢిల్లీమహారాజ్య కల్లోలినీపతి తొలుత నెవ్వానిచేఁ గలఁపఁబడియెఁ
గర్ణాటకాధీశు గర్వసంరంభంబు తొలుత నెవ్వానిచే నలఁపఁబడియె
నతడు వొగడొందు నభియాతి తతచమూస,మూహ విదళనఘనశౌర్య బాహుబలుఁడు
దశదిశాభ్యంతరవ్యాప్త ధవళకీర్తి, సత్ప్రివర్తి మహారాష్ట్రచక్రవర్తి.

గీ. శాలివాహనశకమున జలజజాత, వసధిభూతసోములఁ బ్రభవంబు నొందె
భోన్సలే వంశవనధి సంపూర్ణపూర్ణి,మాశశాంకుండు ఘనుఁడగు శ్రీ శివాజి.

గీ. ధైర్య శౌర్య సాహస ఘనౌదార్యలక్ష్ము, లెవ్వని వరించి చిరకీర్తి నెసఁగు నతఁడు
చనె శివాజీమహారాజు ఘనుఁడు యవన,సరసిజశశి మహారాష్ట్రచక్రవర్తి.

గీ. ఘనధనుర్వేదపారగుఁడును హయాధి,రోహణకళావిదగ్ధుండు బాహుబల స
మంచితుండును వేదశాస్త్రార్థవేది, యై యెసఁగుచుండె నాభూతలాధినేత.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అతిభయంకరస్వీయమతానలంబ,నార్థమయి హిందువులను గష్టాలిపాలు
చేసి మించిన యౌరంగజేబు చక్ర,వర్తికి హృదయశల్యమై వఱలె శివుఁడు.

గీ. తోరణ పురంధరాదిక దుర్గములను, లీలగా ముట్టడించి లలిఁ జెలంగి
గోలకొండ విజాపురపాలకులకుఁ, దురకలకు మనశ్శల్యమై పరఁగె శివుఁడు.

గీ. సంగర కళాధురీణుఁడై సకలయవన, సైన్యనాశకుఁడై మహాసాహసమున
ఖలుని హాఫ్జలుఖానునిఁ గాలుపురికి, నంపి రాయగడంబున నడరె శివుఁడు.

గీ. అల మహమ్మదీయుల దుర్గములను ముట్ట,డించి వారిరాజ్యము లాక్రమించి "చౌతు"
పన్నుల విధించి కొంకణ భాగమెల్ల, వృద్ధి గావించి సితకీర్తి వెలసె శివుఁడు.

గీ. సింహగడదుర్గమున మహాసింహమట్లు, గర్జనారావవిదళిత ఖలమనోంత
రుండయి నిజప్రతాప ప్రచండసూర్య,కరముల నరిప్రకరములఁ గాల్చె శివుఁడు.

గీ. సింహగడదుర్గమునఁ జేతఁ జిక్కినట్టి, శత్రురాజుల ఘనధైర్య శౌర్యధనుల,
ఘనకృపావేశమున విడ్చెఁగా శివాజి, కలఁడె తాదృశవీరుఁ డీ క్ష్మాతలమున.

గీ. ఉద్ధతుండగు కర్ణాటకోర్విపాలు,చేతఁ గారాగృహంబందుఁ జిక్కియున్న
కన్నతండ్రిని విడిపించెఁగా శివాజి, షాజహాను సాహాయ్యంబు చేఁ జెలంగి.

గీ. క్రూరకర్ణాటకాధీను కూర్మి మంత్రి, శైస్తఖానుఁడు ఘనచమూసహితుఁడగుచు
నిజనగరమైన పునహాను విజనఁజేయఁ, దంత్రమున వానిఁ బోఁదోలెఁ దా శివాజి.

గీ. ప్రబలతరమైన సూరతు పట్టణంబు, నాఱుదినములలోనఁ గొల్లాడి యాంగ్ల
పోర్చిగీసుల క్రొవ్వేర్చి పేర్చి వరధ,నంబులను రాయఘురుఁ జేర్చె సాంబశివుఁడు.

గీ. పిదప నౌకాదళము నొండు వెలయఁజేసి, యల్లమక్కాకుఁ బోయెడు యవనజనుల
నుండి పలుమాఱుఁ బన్నుల నొలిచి నిజమ,హోద్ధతిఁ బ్రకటించుచు నుండె శివుఁడు.

గీ. అలపురంధరస్థలమునసైన యట్టి. యొప్పందల యోర్చి కొన్నినాళ్లుండి తానుఁ
జక్రవర్తి వశుండయి సరవిఁ దంత్ర,బుద్ధిఁ గారాగృహము విడిపోయె శివుఁడు.

గీ. మఱియుఁ గర్ణాటకమునకు మరలి జోధ,పురపు "జస్వంతసింగు"ను "ముజము" మంత్రి
దానమను నుపాయంబునఁ దనకు వశులు, గాఁగ నొనరించి కర్ణాటకమును గోల
కొండను జయించి కప్పముల్ గొనె శివుండు.

గీ. మహిత చింతామణీపీఠ మధ్యమందు, వరసుధర్మాసభాంతరవర్తియైన
గోత్రరిపుకీర్తి రాయఘుర్కోటలోన, నిండుపేరోలగంబున నుండె శివుఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. చెన్నపురికేగి "వెల్లూరు" "జింజి" యనెడు, దుర్గముల ముట్టడించి యాత్రోవ "జిల్న"
నాఁగఁ దనరెడు దుర్గంబు వేగఁగొని స్వ,కీయ నగరంబునకుఁ దాను బోయె శివుఁడు.

గీ. అల్లకల్యాణ దుర్గంబునందు యుద్ధ,సీమ సరిసరిపోరి చేఁ జిక్కినట్టి
యవన శుద్ధాంతమానిని శివుఁడు విడచె, గలరె తాదృశేంద్రియనిగ్రహులు జగమున.

గీ. భారతీయుల మతమును బాడుచేసి, వారి దేవాలయంబులు నీరుచేసి
గోవధ నొనర్చుచును దదీయావమాన,మ్ము బొనర్చెడు తురకల ముష్కరులను
ఖండఖండంబులుగఁ జేసెఁగా శివాజి!

గీ. యవనపరిపాలనంబున భువి నధర్మ,వృద్ధియును ధర్మనాశంబుఁ బెరిగెఁగాన
ధర్మసంస్థాపనార్థంబు ధరణి నీశ్వ,రాంశమున శివాజి జనించె నండ్రు జనులు.

గీ. పరమభక్తిని ధన్యతాగరిమఁ జేసి, గురుఁడయిన రామదాసుచే నెఱిఁగె శివుఁడు
కర్మయోగంబు వేదాంతమర్మములును, రాజనీతియు ధర్మశాస్త్రంబుఁ గడఁక.

గీ. స్వీయరాజ్యంబు సకలం బమేయభక్తిఁ, దాను గురుదక్షిణగ రామదాసునకు నో
సంగె; మరలగ్రహించె రాజ్యంబు శివుఁడు, గురుఁడు కరుణార్ద్రహృదయుఁడై కొమ్మనంగ.

సీ. యవన సేవాలోలురై మరాటులు దేశ మతభక్తి విడచిన కతనఁ జేసి
కూటికి గుడ్డకుఁ గొఱమాలి "మావళే" లతికష్టములఁ బొందు కతనఁ జేసి
ప్రక్కబల్లెముల లా గుక్కుసూపెడు తురకల రాజులుండెడు కతనఁ జేసి
తనప్రయత్నములకుఁ దండ్రియౌ "షాజీయుఁ" బ్రతికూలుఁడై యుండు కతనఁ జేసి
భారతీయుల స్వాతంత్ర్య సారమెల్లఁ, గొంచె మగుతఱిఁ బునరుద్ధరించె దాని
నఖిలహరిదంత విశ్రాంతయశుఁడు శివుఁడు, దేవతాంశోద్భవుండు గీర్తిత చరితుఁడు.

సీ. తననిరంకుశతఁ గాంచిన శతారముగల్గువాఁడైనఁ దలవంపనలయుననిన
దనసంగర కళావిదగ్ధతఁగన్న గాండీవియైనను జిన్నవోవుననిన
దనయుదారతఁ గన్న ఘన కర్ణ శిబి కల్పబలులైనఁ దలయూఁప వలయుననిన
దనవర్తనంబుఁ గాంచిన మనీషులకైన నడలవంకలు దీర్ప నడరుననిన
నతని నగ్గింపఁదరమె నీహారహార, హీరదేవతాహార పటీరశార
దాంబుద మరాళ ఘనసార తారకాశ, తారకాశవిరాజిత ధవళకీర్తి.

క. ఆతని నుతియింపందగు, మాతృపదారాధనము సమగ్రబలప్ర
స్ఫీతు భవానీపద జల,జాత యుగాధీనమానసమధువ్రతునిన్.

గీ. యవనపరిపాలనంబున విపులదుఃఖ, వనధిమునుఁగుచు నుండు మాభరతమాత
చేతిసంకెళ్లు విడిపించి స్వేచ్ఛఁగూర్చి,నట్టి శివునకు నర్పింతు నంజలులను.

[తాంగావళి]

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




"కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా"

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు [శతావధాని]

మహాకవి కాళిదాసుఁ డీ నాటకమందుఁ దాను సాధింపఁదలఁచుకొనిన శృంగారరసమును, సముచితమై విచ్ఛేదమునందకుండ సిద్ధింపఁజేసికొనుచుఁ బాత్రములకునుఁ బ్రసంగములకును, సమగ్రమైన యౌచిత్యమును సంపాదించుకొనుచు నపేక్షితములుగాని వర్ణనలకుఁ బ్రసక్తి నిడక కథాసంవిధాన శిల్పమందగ్రగణ్యుఁడై రసికసంతతికి స్పృహణీయమహిముఁ డయ్యెను.

రసము

హాస్యభయానక శాంతాది రసములకు, వాత్సల్యము, భక్తి, మున్నగు భావములకు నచ్చటచ్చటఁ దగురీతిఁ బ్రవేశ మొసంగినను, మహాకవివర్యుని యవిచ్ఛిన్నప్రతిభాధారకు గోచరమై ధారావాహినిగానాటకమందాద్యంతవ్యాపియైనది శృంగారరసమే. వీరరసమో, శృంగారరసమో నాటకమునందుఁ బ్రధానరసమై యుండితీరవలయు నను లాక్షణిక సంప్రదాయనియమముసైతము మనశాకుంతలమువంటి లలితరచనలయందు శృంగారమునకును, అనర్ఘరాఘవ మహావీరచరితములవంటి యుద్ధతరచనలయందు వీరరసమునకును వస్తుసౌందర్యజ్ఞులైన మహాకవికాళిదాసాదు లిట్టి ప్రాధాన్యము నొసంగంబట్టియే యేర్పడెను.

ఆశృంగారముసహిత మొక్కవిధముగఁ బోషింపఁబడిన సహృదయ హృదయములకు విసువొడవునోకోయని ప్రయోగసూక్ష్మజ్ఞుఁడగు మహాకవి ప్రథమాంకమందుఁ బూర్వరాగవిప్రలంభశృంగారమును (అనగా నాయికానాయకులకుఁ బ్రప్రథమమందుఁ గలిగెడియనురాగముయొక్క నూతనావస్థ) బోషించి యంతట ద్వితీయాంకమున నయ్యదియే స్మరణమధురమగులాగునఁ బ్రయోగించె. పిదపఁ దృతీయాంకమున సంభోగశృంగారరసమయమైన భావసామగ్రిని వ్యక్తముఁజేసె. చతుర్థాంకమున రసికహృదయముల సులభముగఁ దన్మయముఁ జేయఁజాలు వాత్సల్యమును, గణ్వమహర్షి యందును, శకుంతలయందును, నొకచోననేల- కణ్వాశ్రమమం దెల్లెడలను సహజశాంతిప్రసారమునకు సహిత మొ పిడి కలుగునట్లు వెల్లివిరియఁజేయుచుఁ నత్యాదృశమై సమాతిగామి యగు నమ్మహావాత్సల్యప్రవాహమునకు సేతువై నిలిచి శృంగారరసమే నాటకమందుఁ బ్రధా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాయిక యగు శకుంతలయొక్క పతిగృహ యాత్రకు నిర్విఘ్నమొనఁగూర్చెనని వ్యక్త పఱచి తనప్రధానరసపోషణమందలి జాగరూకతను వెల్లడించె. పంచమాంకమున దైవానుకూల్యములేక రసకార్యములకుఁ బ్రతిబంధమేర్పడినను, నాయికానాయకుల యంతరంగముల స్నిగ్ధతను బలపఱచు తిరమగు భావప్రతిష్ఠఁ దొలఁగింప శక్యముకాదని దుష్యంతుని యొక్కయు, శకుంతలయొక్కయు సంభాషణములయందు సూచించుచుఁ బ్రస్తుతమగు ప్రధానరసరాజమున కవిచ్ఛిత్తిని నెలకొల్పుకొనెను.

షష్ఠాంకమునఁ దనకుఁ బలువిధముల నభీష్టమైన విప్రలంభశృంగారమును పూర్వవిలక్షణముగ వివిధములగు పాత్రముల ముఖమునఁ బ్రస్ఫురింపఁజేసెను.

సప్తమాంకమునఁ బూర్వవర్ణితము లగు బహువిధములైన శృంగారరసమందలి యవాంతరావస్థలకెల్లఁ బరమావధి యనందగి ఫలభూతమైనసంభోగశృంగారరససమగ్రతను సువిశుద్ధప్రణయరసభరితులగు నాయికానాయకుల యాకస్మికసమాగమమున నద్భుతరసముతోఁ గూడఁ బ్రదర్శింపఁబోవుచుండెను. అందుఁ జిత్రముగఁ బ్రప్రథమమున శాస్త్రీయమగు సంతతి విచ్ఛేదదోషముఁ దలఁచుకొని పశ్చాత్తాపతప్తుఁడగుచున్న దుష్యంతుని స్నిగ్ధహృదయమున కౌరసపుత్త్రుని గాఢాలింగనమువలని సౌఖ్యము నొదవించె. ఇచ్చటఁ గవిహృదయ మగాధము. నిరపరాధ యగు సతీమణి సౌశీల్యముం దన్యథాభావముఁ గల్పించి పూర్వమొనరించిన శాస్త్రీయగాంధర్వవివాహముయొక్క వృత్తాంతమును మఱపించిన ముని శాపప్రభూతమగు తమస్సునకును, తదనంతర మతివేలమై పశ్చాత్తాపమిశ్రమయిన వియోగవేదనానుభవమువలని కాలుష్యమునకును, నిష్కృతిగాఁ బావనమై యగాధమగు పుత్త్రవాత్సల్యమను దివ్యగంగాప్రవాహమునఁ గథానాయకుని హృదయము నొకపరి మనమహాకవి తీర్థమాడించఁ దలఁచియుండెను. పదంపడి సువిశుద్ధప్రేమవల్లికలు మొలకలెత్తయేకాకారమైయున్న యనురూపదంపతుల హృదయదేశమున గంగా యమునా సరస్వతులకుంబలె నవనవవాత్సల్యానుగతములైన యనురాగములకు సంగము ఘటిల్లఁజేయుచు నిపుణముగ నిర్వహణసంధియందుఁ గథ నుపసంహరించెను. సత్యముగ నిట్టిసముచితరస సంపాదనధోరణి యనితరసాధారణమై యన్యాదృశమైన యతిశయమున రాజిల్లుచుండెడిని.

ధ్వని

కావ్యకర్తలెల్లరు నొక్కొక్కవిధమున నొక్కొక్కరు దమ కబ్బముల కందముదేఱ బ్రయత్నించుచునేయుందురు. కొందఱు శబ్దాలంకారములచేఁ గావ్యములఘనత నిలుపుకొందురు. కొంద ఱర్థాలంకారములుగుప్పి పైపని సాధింతురు. కొందఱు శబ్దశక్తిమూలధ్వనులు నింపి పద్యములశోభఁ బోషింతురు. మఱికొంద ఱర్థశక్తిమూలములై యనురణనాత్మకములైన వస్త్వలంకారధ్వనులతోఁ గావ్యార్థమందలి యుదారతను సమగ్రముఁ జేయుదురు. కవికులశిరోమణులగు మనమహాకవికాళిదాసుని వంటి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారు కేవల మసంలక్ష్యక్రమ వ్యంగ్యసరణిపై దృష్టినిల్పి భావాధ్వముల విస్రబ్ధముగ విహరించుచుఁ బిపీలికాది బ్రహ్మపర్యంతముగల సకలప్రాణికోటుల హృదయరంగములయందును బరమేశ్వరకళావిలాసముగ సర్వకాల సర్వావస్థలయందును దేశపరిచ్ఛేదము లేక యేకాకారముతోఁ దాండవము సల్పుచుండెడి యఖండబ్రహ్మానందరసరాజముయొక్క యవతారము లనందగిన నవరసముల మహాసామ్రాజ్యమునం దగ్రాసనము నధివసించి యానందామృతధారాపానమత్తంబులైన చిత్తంబుల పారవశ్యంబున నోకించుక ప్రణయగీతంబు లానర్చుచు లోకంబుఁ దన్మయత్వంబునందించుచుందురు.



# మాతృసందేశము

మొ. హనుమంతరావు గారు

వ్యావహారి కాంధ్రమని గ్రాంథికంబని
భేదభావములను వృద్ధిపఱచి
కలహాభోక్తలైన గల్గునే లాభంబు
మాతృసేవ కదియె మార్గమగునె.

పండితులతోడ, సభలలోఁ బ్రభులమ్రోలఁ
బామరులతోడ బాంధవప్రతతితోడ
నాడుభాషయె గ్రంథములందు వాడఁ
దగినదని యొక్క తెగవారి తగవు విందు.

పలుకుబడిఁ జెల్లు భాష కావ్యములయందు
వాడఁదోడఁగిన భాషాప్రపంచమెల్ల
రాజులేనట్టి రాజ్యంబు నోజఁజెడఁదె
తగదు తగదండ్రు భిన్నమతంబువారు.

శాస్త్రమే వధ్యశిలయైన శబ్దశాస
నుండు తలవరియందురే? నూర్లకొలఁది
వర్షములు నేటిదాఁక నేపగిదిభాష
బ్రదుకఁజాలెనో యిట్టిదుర్భ్రిమలు తగునె.

విమలభారతశబ్దజాలమునుగాని
శబ్దశాసనుసూత్రంపు సరణిఁగాని
తప్పి రచియింపుమని చాటిచెప్ప ఘనులు
గలరె, యెంతటి ప్రజ్ఞాప్రకాండులైన.

నన్నపార్యుఁడు చెప్పిన నాటినుండి
భాష యొక్కవిధంబునఁ బరగునయ్య!
ఎన్నఁదత్సూత్రములె చాలియున్న మఱియు
గొన్నిలక్షణగ్రంథముల్ గూర్పఁబడునె.

పెక్కులక్షణగ్రంథముల్ వెలయుననుట
భాష నానాటి కభివృద్ధిఁ బడసెననుట
గాదె, యింతియెకాని తద్గ్రంథచయము
భాష బాధించునని రామ! పలుకఁదగునె.

లోకమే దిక్కు శబ్దస్వరూపసిద్ధి
కనిగదా తొంటియాచార్యుఁడనియెనదియె
నేటిదాఁక బ్రమాణమై నెగడుచుండ
జీవకళ మాటకైన నశించునయ్య!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పరగ నభివృద్ధి సంస్కారఫలము, నియమ
విరహితంబగు సంస్కారసరణి యున్నె,
నియమపూర్వక సంస్కారనికషమునను
జీవకళ వన్నె మీఱక చేటుగనునె.

నియమములు, నెల్లవారు గణించుచున్న
నొకతరమువారియట్లు లింకొకతరంబు
వారురచియింపఁ జాలిరే, వారువీరు
భిన్నగతులౌట భాషాభివృద్ధి గాదె.

క్రొత్తపదములు దెచ్చుట, క్రొత్తతెఱఁగు
ప్రాతపదములు వాడుట, ప్రాతసూత్ర
ములకులొంగని కార్యముల్ సలుపుచుంట
భాష నభివృద్ధిఁ జాటవే పలువిధముల.

రఘులపై నప్పకవి యెంత వ్రాసికొనిన
చుడులకై సూరిగారెంత శూరుఁడైన
ఫలముగల్గెనె, సిద్ధాంతములు సతములె,
కవుల స్వాతంత్ర్యమునకు భంగంబుగలదె?

కడు నిరంకుశముగఁ గవికార్మికాళి
లోకఖనినుండి పదమణుల్ స్వీకరింప
లాక్షణికశిల్పు లవ్వాని రమ్యములుగ
నల్పుదురుగాదె సంస్కారసాధనమున.

పరలు లక్షణగ్రంథముల్ గొఱఁత వడిన
లోపమెడలింపఁ దలఁపక, రోషమూని
వానిమూలముననె భాష పాడువడియె
ననుచువానిని విడనాడుమనుట తగవె.

లక్షణము లెన్నిచదివిన రాదె తప్పు
తప్పు తప్పనిదని చెప్పి తప్పిదముగ [స్న
శాస్త్రముల ద్రోయునుంట మూషకము లు
వనిగృహంబును ముట్టించు మనుటగాదె.

ధరణి నుత్తమ సారస్వతములలోన
వ్యావహారికమునకుఁ దా వరయఁగలదె
కవినిరంకుశుఁ డనుమాట గల ఫలంబు
వ్రాయమనుటయ్యె, నోటికి వచ్చినటులు

నవనముఖదిష్య సత్క్రియాసరణి మొదలు
పడుపుకత్తెల పద్ధతివరకు నున్న
నిఖిలకార్యవిధానముల్ నియమపరత
గావె నియమపరీతంబుగాదె స్వేచ్ఛ.

అరయ నోటికివచ్చినయటులు వ్రాయు
మనుటఁ నోటికివచ్చిన ట్లనుటగాదె.
తెరచి నిలుకుక్క చొచ్చిన తెఱఁగు బాస
నమిత దుష్కవితా ప్రచారములుచొరవె?

గ్రాంథికంబన నియమసంకలిత మనుచు
మతినెఱుంగక కాఁబోలు వితతమతులఁ
దిట్టుదురు దోసములె ప్రోగు వెట్టుచుంద్రు
ప్రబలవైదుష్య మంతయు వ్యర్థముగను.

లక్షణములకుఁ దద్గ్రంథరచయితలకు
నెఱిగి తమయొక్క పాండితీగరిమ వెలయ
లక్ష్యలక్షణమైత్త్రి వెలార్చునెడల
స్వచ్ఛతరకీర్తి గల్గదే శాశ్వతముగ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ముక్తిచింతామణి

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

ఇది యొక పద్యకావ్యము. ఇది యింతకు మున్ను ముద్రితమైనట్లు కనఁబడదు. ఇది మూఁడాశ్వాసముల ప్రబంధము. నామిత్రు నివలన నాకు లభించిన కొన్ని వ్రాఁతపత్రము లందు రెండుమూఁడాశ్వాసములలోని కొన్ని పద్యములుమాత్రము కనవచ్చుచున్నవి. దీని సంపూర్ణప్రతి యేప్రాచీనపుస్తకభాండాగార ములందైన నున్నదేమో తెలిసికొనవలసియు న్నది.లభించినపద్యములనుబట్టి యీ గ్రంథము మనభాష కలంకారముగాఁ దగియున్నదని చెప్పఁగలను.

దొరకినపత్రములనుబట్టి యీ ముక్తిచింతామణి కావ్యమునురచించినయతఁడు, అండలూరి మల్లికార్జునకవియని తెలియుచున్నది. ఇతనితండ్రి శరభనార్యుఁడు. ఇతని గోత్రనివాసాదులు తెలియరావు. ఈవిషయము దెల్పునిందలిగద్యము:

"ఇది శ్రీమదఖిల విద్వత్కవిజేగీయమాన సరసకవితావిచిత్రాండలూరి శరభనార్యపుత్ర సమధిగతవీరశైవాచారవిధాన మల్లికార్జునాభిధాన ప్రణీతంబైన ముక్తిచింతామణి యను వేదాంతప్రబోధంబునందు రాజయోగనిరూపణం బన్నది సర్వంబును దృతీయాశ్వాసము."

ఈకవి యీగ్రంథమును, కాశీపతియను పేరుగల రాజునొద్ద మంత్రిగానున్న సృష్టికరణకులసంజాతుఁడైన కృష్ణమంత్రి కంకితమొసర్చిన ట్లీక్రిందిపద్యములు తెలుపుచున్నవి.

క. శ్రీముఖకాశీపతి పృ
థ్వీమండలరమణలబ్ధ విభవైశ్వర్యో
ద్దామ ముఖ......
స్వామిఘృణీ కృష్ణమంత్రి సామంతమణీ!

చ. అతిబలభీమ సృష్టికర
ణాన్వయవారిధిసోమ కీర్తిగుం
భితకకుబంత బంధు కవి
మిత్ర వనాంతవసంత సాధువ
ర్ణితకృతధర్మ షడ్గుణవి
నిర్జిత శాత్రవమర్మ మేరుప
ర్వతసమధైర్య కాశిపతి
రాజహితా ధృతకార్య ధీమణీ!

క. అనిశ నిజదానహర్షవ
దనఘుతరానేక భూసురాశీర్వాదా!
దినదినవర్ధిత సంప
ద్ఘనవైభవసాంద్ర సృష్టికరణకులేంద్రా!

గ్రంథానతారికయం దేదయిన నాథారము కలదేమో కాని పైపద్యములనుబట్టి కాశీపతిరాజును కృతిపతియైన కృష్ణమంత్రియుఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గూడ నెక్కడివారో యేకాలమువారో తెలియకున్నది. కాని కావ్యభాషనుబట్టి యీకవియును, గృతిపతియుఁ గూడఁ బ్రాచీనులు గారనియు, నొకటి రెండువందల యేండ్లలోపువారేమో యనియుఁ దోఁచుచున్నది. గ్రంథాంతమందున్న—

ఆ. మునుపు నైమిశాటవిని సూతుఁ డెఱిఁగింప
నఖిలమునులు హర్షమందినట్టు
లనఘుఁడైన శంకరాచార్యుఁ డీతత్త్వ
పదవి తెలిపెఁ బద్మపాదుఁ డలరె.

అను పద్యమునుబట్టి తనశిష్యుఁడైన పద్మపాదాచార్యునకు జగద్గురు శంకరాచార్యు లుపదేశించినట్లుగా నీగ్రంథము వర్ణింపఁబడినదని తెలియుచున్నది.

గ్రంథవిషయము పరమాత్మ వివేకము. రెండవ యాశ్వాసమాత్మబోధమును, మూఁడవది రాజయోగమును దెల్పుచున్నవి. పద్యములు హృద్యములు. శైలి సులభము. భాష చిన్నయసూరి వ్యాకరణమునకు లొంగక పోతరాజాదుల భాష ననుకరించుచున్నది.

రుచిచూచుటకుఁ గొన్ని పద్యములు:

ఆ. అన్యసాధనంబు లన్నింటి కన్నను
బోధనంబు మోక్షసాధనంబు
పాకమునకు వహ్ని పగిదిని జ్ఞానంబు
గలుగకున్న ముక్తి కలుగ దనఘ !

చ. ఘటాదులందుఁ బ్రతి
బింబితమైన నభంబుమాడ్కి లో
నిలిచి యుపాధిసంగతి న
నేకవిధంబుల భిన్నమూర్తియై
చెలఁగుశివుం డుపాధులు న
శించును గేవలుఁడై చిదాత్మయై
యలరుటఁ జేసి యాశివున
కన్యమొకించుక లేదు చూడఁగన్.

...వివేకునకు,ఉపనిషత్తను పత్నియందు ప్రబోధంబను తనయుండును విద్యయను కూఁతురును బుట్టి మనఃకల్పితంబైన ప్రపంచంబును తదీయకులంబును నశింపఁజేతురఁట. కావున-

క. మన సేగిరులును తరులును
మన సే బ్రహ్మాండచయము మన సేసురలున్
మన సే మనుజులు తనుజులు
మనసునఁ గల్పింపఁబడు సమస్తం బనఘా !

మ. సరవిన్ వాయువుభంగిఁ గ్రమ్మరుచు సం
సక్తుండుగా కెయ్యెడన్
దఱుచైనట్టి యుపాధుల న్నిలిచి త
ద్ధర్మంబులుం బొందకన్
గరిమన్ వర్తిలు సర్వకాలముల నా
కాశంబు చందంబునన్
మఱియున్ మూఁడునిరీతిఁ దోఁచఁబడు బ్ర
హ్మజ్ఞాని యూహింపఁగన్.

సీ. సద్భక్తిఁ దరణికి సాఁగిమ్రొక్కెడివారు
తిరిగి రావులచుట్టు తిరుగువారు
కొసరి తీర్థములలోఁ గ్రుంకుపెట్టెడివారు
పుణ్యభూములకెల్లఁ బోవువారు
అఖిలకర్మంబుల నాచరించెడివారు
పాయక వ్రతములు చేయువారు
ధారుణీసురులకు దానమిచ్చెడివారు
సప్తసంతానముల్ సలుపువారు
ద్వైతమత ముత్తమంబని తలఁచువారు
చతురతను వేదశాస్త్రముల్ చదువువారు
పట్టి భజనంబుచే బొబ్బపెట్టువారు
వారు బ్రహ్మజ్ఞులకు సాటి రారు వినుము.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# స్వప్న దృశ్యము

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు

కన్నులం దేదో! ప్రాకాడుచున్నయట్లు
చూడ్కి మావులఁ, బరువెత్తు వేడ్కఁ బాపి
వెనుక కెవ్వండొ, పగ్గాల బిగుచుపోల్కి;
వెనుకఁ బొంచుండి యెవ్వఁడో కనఁగరాక
మోహజాలంబు విసరి నాబోధయుక్త
మానసము లాగుచుండినమాద్రి; నాదు
నయనగోళంబులను మూసి నాసమస్త
మింద్రియార్థంబు లెవఁడొ, హరించుకరణిఁ;
దోఁపఁ జేసి క్రమంబుగాఁ దూఱె నిద్ర
హృత్కవాటంబు బిగించె; నేనొకండఁ
గాని యన్యుండు లేఁడ; యొక్కరుఁడ నేని;
నేఁగితిని శాంతముగను మధ్యేగృహంబు.

శాంతిపాలిత మానంద కాంతిదీప్త
మైన ధామంబునందు నేనాడుకొంటి
నో? యపుడు పాడుకొంటినో? యోలలాడు
కొంటినో? విభజించి వాక్రువ్వఁజాల.

కొంత సేపటికొక దివ్యకాంత లలిత
మూర్తి చనుదెంచి కైదండఁ బూనె; మేము
పుష్పరథమునఁ గూర్చుండి పోవుచుంటి
మాకసంబున నానంద మతిశయింప
తారకలు రమ్యవేషముల్ తాల్చియొకట
జలదయవనిక లెత్తంగ సరసగతుల
నాటపాటల మెప్పొంద నాటకంబు
నభినయించెను శాంతరసాత్మకంబు

చదలేటి దరులపచ్చనిపట్టులఁ దన
మృగముతోఁ గ్రీడించు నిందుమూర్తి
మెఱుఁగుపిండుకు నాట్యపరికరంబుగ గాన
మును నేర్పు కిన్నరీజనచయంబు
గిరిశృంగముల నిల్చి ధరియించి తనువులు
ప్రకృతివ్యాఖ్యచేయు రవికరములు
తమతమ తారతమ్యమునకై యన్యోన్య
మాలంబొనర్చు సమస్తకళలు
పువ్వుల విమానముల నెక్కి వ్యోమవీథిఁ
గెరల విహరించు సుకవులకీర్తిసతులు
మనసునకు వేడ్కఁ బుట్టింపఁ గనుచుఁ గనుచుఁ
జనితి మాస్వర్గమునకు ముచ్చటలు గొనుచు.
మలయమారుతముల గూఢమంత్రశక్తిఁ
జలి వెలుఁగు వెల్గులందలి చలువపదను
నాపికాలాపములరహస్యార్థభంగి
నొకట వివరించుచుండిరి యువతు లచట.
అంత నాకాంత పులకించి యస్వాహంబు
రథముపై నన్నుఁ గొని యిట్టి రంగములను
నాకుఁ జూపింపఁ గదవోయి! నాథ! యనుచు
గాటముగ నొక్కి మోవి, నన్ గౌఁగిలించె.

స్వర్గమున నుండి పుడమిపైఁ బడితిఁ; బుడమి
నుండి పాతాళమును జొచ్చియుంటి; నచటి
నుండి యత్యధోలోకంబు నొందినాఁడ
నొక్క ప్రేల్మిడి నాయభాగ్యోచ్చయమున.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# భారతీయ కావ్యసృష్టి

౨

తపస్విరమణీయత-భారవి అర్జునుడు

అక్కిరాజు నిత్యానందశాస్త్రిగారు

చిర నియమకృశోఽపి శైలసారః
శమనిరతోఽపి దురాసదః ప్రకృత్యా;
ససచివ ఇవ నిర్జనేఽపి తిష్ఠన్
మునిరపి తుల్యరుచి స్త్రిలోకభర్తుః.

శశధర ఇవ లోచనాభిరామై
ర్గగన విసారిభి రంశుభిః పరీతః;
శిఖరనిచయ మేకసానుసద్మా
సకలమివాపి ధరన్మహీధరస్య.

యమనియమకృశీకృతస్థిరాంగః
పరిదదృశే విధృతాయుధః స తాభిః;
అనుపమశమదీప్తితా గరీయాన్
కృతపదపంక్తి రథర్వణేవ వేదః.

(కిరాతార్జునీయమ్)

[చిరనియమమ్ముల కృశుడైవుండియు
పర్వతబలయుతుడు
శమరతుడయ్యును నైసర్గికముగ
చేరరానివాడు
నిర్జనమందును సచివయుతుడివలె
నిల్చి వున్నవాడు
తాపసి అయ్యును త్రిభువనపతిసమ
తేజుండగువాడు.

యేకసానువున వాసముచేసియు
పర్వతమ్ము యొక్క
శృంగసమూహం సకలం సయితము
ఆవరించి నటుల
హరిణాంకుడివలె కన్నులకింపై
ఆకాశమునందు
ప్రసరణమొందెడు తేజస్సులచే
పరివృతుడైవుండి
అసమానమ్మగు శమమును దీప్తిత
పొందిగరీయమ్మై
అతడథర్వకృత మానుపూర్విగల
వేదంవిధమునను
యమనియమమ్ముల కృశతం చెందియు
స్థిరదేహముగల్గి
శస్త్రముదాలిచి దీక్షితుడాయెను
తత్కాంతల చేత.]

పాండవులందరిలో ప్రియదర్శనుడైన అర్జునుడు ఈశ్వరానుగ్రహం కోసం, తీవ్రతపశ్చరణకు ప్రేరితుడవుతాడు. అనివార్యమై తటస్థిస్తూవున్న జ్ఞాతియుద్ధంలో జయలక్ష్మిని ప్రసన్నం చేసుకొనడానికి వారికి వేరేమార్గం కన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడ్డదికాదు. సోదరుల ఆదేశాన్ని అర్జునుడు హృదయపూర్వకంగా స్వీకరించి, బయలుదేరి పోతాడు. స్వల్పవయస్కుడైన ఆ భూలోకవాసి తపస్తీక్ష్ణతకు కొద్దికాలంలోనే స్వర్గలోకవాసులందరు ఆశ్చర్యపడతారు.

అర్జునుడు ఆయుధాలను ధరించి, స్పష్టంగా క్షత్రియవీరుడై కనబడుతూవుంటాడు. కాని, ఆయన స్వరూపంలో తీవ్రమైన రక్తచలనంగాని ఉద్రేకం గల స్వభావంగాని, కనబడవు. ముఖం ఆత్మసంతుష్టిహేతువైన శాంతాన్ని కురుస్తూ, అంతస్థమై కిరణసహస్రంతో వెలువడుతూవున్న బ్రహ్మానందదీప్తితో కూడి వుంటుంది. నూతనజీవితం ప్రారంభమైంది మొదలు దినక్రమంగా ఆయన క్షుద్రమైన శరీరసుఖాలమీాది ప్రేమను త్యజిస్తాడు. చిత్తాన్ని నిగ్రహించి జితేంద్రియు డవుతాడు. అధర్వాక్కృత పదపంక్తి అయిన, వేదంవిధంగా ధ్యానపరవశుడై గంభీరమైనశాంతితో దీప్తితో నిలిచివుంటాడు. జిజ్ఞాసావిషయంలో గూడా తదంతస్సారమైన ఈశ్వరమహిమను అన్వేషిస్తుంటాడు.

ఆవిధంగా ధ్యానతన్మయుడైవున్న క్షత్రియతపస్విరూపం అతిరమణీయంగా వుంటుంది. పర్వతాగ్రప్రదేశంలో ఒంటరిగా వున్నా, ఆత్మీయమైన ప్రకాశంతో సర్వదాదీపిస్తూ, నిశానాథసదృశుడై మనోహరంగా ఉంటాడు. వాడుకగా కనబడే, తాపసులైన వనచరులకంటె భిన్నుడని వ్యక్తీకరిస్తూవున్న ఒకవిధపు సౌందర్యం ఆయనలోనుండి, బయలుదేరుతుంది. శరీరం ఆవిధంగా నిర్మితమై వుంటుంది. జన్మసిద్ధమైన ప్రభుత్వచిహ్నాలతో సమస్తవనప్రదేశానికి అధిపతియైవున్న దైవంవిధంగా కనబడుతూవుంటాడు. రూపంలో ఉగ్రత్వం లేశమైనా గోచరంకాదు. ప్రేక్షకుడిదృష్టికి ప్రతివర్తనం కలిగించే లక్షణమేమీా కనబడదు.

కాని ఆయనలో అతిపరిచయవర్తనను దగ్గరకు చేరనియ్యని ఒకవిధమైన విశేషమేదో ఉంటుంది. సమీాపానికి పోవడానికే జంకు పుట్టించే మహిమాతిశయం ఆయనను పరివేష్టిస్తుంది. దీర్ఘతపోనిష్ఠలతో కృశించినా పర్వతపటిమగలవాడై కనబడతాడు. నిశ్చలుడై ప్రశాంతంగావున్నా మహిమతో గూడి, భయగౌరవాలను ప్రతిపాదిస్తాడు. ఒంటరివాడైనా పరివారంతో కూడుకొన్నట్లు ప్రబలుడై వుంటాడు. తపోవృత్తిలోవున్నా త్రిలోకాధీశ్వరుడివిధంగా తేజస్వంతుడై శోభిస్తాడు.

ఇది నాయకుల్లో ఉచితస్థానం తీసుకొన్న ధీరోదాత్తుడివర్ణన. మన దృష్టిలో వున్నది భారతీయకవితాసృష్టిలో ఒక ఉత్కృష్టుడైన పురుషుడు. మొదటిశ్లోకం ఈక్షత్రియవీరుడి ప్రశాంతతను వర్ణిస్తున్నది. రెండవశ్లోకం ప్రతిలేని రమణీయతను తెలియజేస్తున్నది. మూడవశ్లోకం దుష్ప్రాపమైన మహిమవిశేషాన్ని వ్యక్తంచేస్తున్నది. ఇది భారతీయభావానికి అత్యంతం ప్రియమైన కవితాసర్గం. సుహృద్వశీకరణం చేసి తీవ్రమైన తపోనిష్ఠలతో ప్రశాంతనిశ్చలుడైన క్షత్రియవీరుణ్ని యీసృష్టి ప్రదర్శిస్తున్నది.

చలించని బాహుబలంతో ఇంద్రియనిగ్రహసామ్యం సమ్మేళనమయినందున అత్యున్నతమైన ఆదర్శం యేర్పడుతున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అర్జునుడు భుజబలసమన్వితుడు, ధనుర్ధరులలో అగ్రేసరుడు, రణవిహారంలో నిస్తులుడు, అయినా, శౌర్యానికి ఆశ్రయమైన తన శరీరాన్ని ఇంద్రియనిగ్రహానికి సాధనంగా చేస్తాడు.

సౌందర్యంతోను ఔదార్యంతోను శోభిస్తూ పరమవిధేయుడై జ్యేష్ఠులఆదేశాన్ని శిరసావహించి, ఈప్సితార్థాన్ని జితేంద్రియత్వంతో సాధించడానికి యత్నించే వీరుణ్ణి కనబరుస్తూవున్న ఈసృష్టి అత్యంతమైన ఆత్మోన్నతిని ప్రసాదిస్తున్నది.

స్వల్పకాలంలోనే ఈ అర్జునుడి తపోమహత్వం ఊర్ధ్వలోకవాసులకు తెలియవస్తుంది. మనుష్యకోటిలో వాడైనా పుత్రుడు చలించని చిత్తంతో అత్యుగ్రంగా మహాభీష్టసిద్ధికి, యత్నిస్తున్నాడని స్వర్గాధిపతి సంతోషంతో వింటాడు. ఐనా అర్జునుడి చిత్తస్థైర్యాన్ని పరీక్షించవలెనని ఇంద్రుడికి కోరికపుడుతుంది. యేది దురతిక్రమమో, దేని ప్రతిరోధంవల్ల మనుష్యుడికి మానుషత్వ విమోచనం కలిగి, తనలోవున్న దేవత్వసాధనానికి యోగ్యతలభిస్తుందో అటువంటి ఇంద్రియప్రేరణాన్ని, ఆయనమీద ప్రయోగించడానికి సంకల్పిస్తాడు.

స్వర్గవాసినులైన అప్సరసలసందరినీ పిలువనంపి వారిలో ప్రతిలేని సౌందర్యంతో మనస్సును ఆకర్షిస్తూవున్న ప్రౌఢలను తమసమ్మోహనసామర్థ్యాన్ని అర్జునుడి మీద కనబరచడానికి పంపుతాడు. వాండ్లు ఆసందేశాన్ని చిరునవ్వులతో స్వీకరించి తమకు తమ వశీకరణశక్తి తెలిసివుండడంవల్ల, జయం అనాయాసలభ్యమని దృఢవిశ్వాసంతో బయలుదేరి పోతారు.

కాని వారు అర్జునుడి చిత్తస్థైర్యాన్ని గ్రహించడంలో పొరపడతారు. నిశాకరుడివిధంగా మనోహరుడై ప్రశాంతమైన లతాగృహంలో దురాసదుడైవున్న ఆయనను వాండ్లు చూస్తారు.

ప్రకృత మనుససార నాభినేయం
ప్రవికసదంగుళిపాణి పల్లవంవా;
ప్రథమ ముపహితం విలాసిచక్షుః
సితతురగే నచచాల నర్తకీనామ్

—కిరాతార్జునీయమ్

[ప్రథమమ్మందున శ్వేతాశ్వుడిపై
　　ఉపహితమైనట్టి
ఆటకత్తియల సొంపగుచక్షువు
　　కదలజాలకుండె
ప్రక్రాంతమ్మగు అభినేతవ్యము
　　ననుసరించ లేదు
ప్రవికసదంగుళికరకిసలము నే
　　ననుసరించలేదు.]

ఆతపస్వియొక్క తేజస్సౌమ్యాలు వాండ్లకు తెలియకుండానే వాండ్లహృదయాలను అపహరించి వేస్తవి. దేవవేశ్యా బృందంలో నొక్కరైనా వుద్దేశించుకొన్న ఆకర్షణ గంగంలో స్వకార్యనిర్వహణం చెయ్యలేకపోతారు. ఆకర్షించబోయిన భామినులు తపస్వి రమణీయతచేత ఆకృష్టలవుతారు. తపస్వియందుపహితమైన వీక్షణం మరలలేక అతనియందే కదలకుండా నిలిచి అభినయానికి ఉపక్రమించిన వ్రేళ్లవైపు తిరిగి రావడం మరిచిపోతుంది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# తుమ్మెద పాట

పెమ్మరాజు లక్ష్మీపతిగారు

పాడుమమ్మా, తుమ్మెదా-పువ్వు-పైనవాలే తుమ్మెదా! పువ్వు,
పైనవాలే తుమ్మెదా-పూ-దేనెలోనే తుమ్మెదా!

౧. తేనెకొరకే యాటలనుచును-తేనెకొరకే పాటలనుచును
తేనెకే యారాటమని క్రొం-దేనెలొలికే తేటపాటలు — పాడుమమ్మా!

౨. ఆటలన్నియు నొక్క-యాటే-పాటలన్నియు నొక్క-పాటే
యాటపాటల కవలనున్నవి-తేటతేనియమూట లనుచును — పాడు.

౩. కరకుముండ్లను సరకుసేయక-పరిమళంబున మరగిపోవక
నిరకు తప్పకనిలచితేనియ-కొరకె తిరుగుచునుందునేనని — పాడు.

౪. పాటలన్నీ పారిపోగా-యాటలన్నీ అణగిపోగా
తేటతేనియ మూటలానుచు-మాటలేనీ మూగపాటలు — పాడు.

౫. తేనెతీపికి జొక్కి-యటుపై-మేనుసర్వము మరచితేనియ
లానుటే మరపించునా య-జ్ఞానమునబడి మూగపాటలు — పాడు.

౬. యుగములెన్నో జరగిపోనీ-జగములెన్నో కరగిపోనీ
తగిలితేనియ తీపిలోన ము-నుగుచు తేలుచు తేలిమునుగుచు — పాడు.

౭. దేహమంతయు తేనెకాగా-దాహమంతయు దీరిపోగా
మోహసంబగు రాగముల సం-దేహములు విడిపోవునట్లుగ — పాడు.

౮. పాటపాటకు తేనెలొలుకగ- ఆటయాటకు దేనె చిలుకగ
పాటప్రాకినజగము తేనియ-యాటలోబడి యూరిపోవగ — పాడు.

౯. జగము సర్వముతేనె నిండగ-జగముతానొక తేనెకుండగ
జగమెతేనెగ తేనెజగముగ-జగము స్వర్గము క్రిందమారగ — పాడు.

౧౦. అణువులేదా తేనెకానిది-అణువుకాదా తేనెలేనిది
అణువు నణువున జేర్చుమధుర-ప్రణయమును, ప్రణవమున గూర్చుచ — పాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ఆంధ్రభారతారణ్యపర్వశేషము

## విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రి గారు

తిక్కనాదులు కవిస్తుతిసందర్భమున మూఁడుపర్వములను నన్నయయే రచించినట్లు చెప్పియుండుటచేతను, నన్నయభాగమునందలి కొన్ని పద్యములును పద్యపాదములును నెఱ్ఱన రచించెనను భాగమున నగపడుచుండుటచేతను, శైలియందును నంతగా భేదము గానరాకుండుటచేతను, రాజనరేంద్రుఁడే కృతిపతియైయుండుటచేతను నెఱ్ఱన యాంధ్రభారతారణ్యపర్వశేషమును దూచాతప్పకుండ నాంధ్రీకరింప లేదనియు నచ్చటచ్చటఁ గ్రిమిభ్రష్టము లైన పద్యపాదపదపదైకదేశములనుమాత్రమే పూరించి యుండెననియు నిపుడొక వింతవాదము బయలువెడలినది.

"ద్వితీయ ప్రతాపరుద్రుని కాలపువాఁడగు మారన గూడ నన్నయ మూఁడుపర్వముల వ్రాసెనని చెప్పియున్నాఁడు. పదునేఁడవశతాబ్దివాఁడగు నప్పకవియు నన్నయ మూఁడుపర్వముల వ్రాసెనని చెప్పియున్నాఁడు. దీనినిబట్టి యప్పకవికాలమునకుఁగూడ నన్నయవిరచితములగు మూఁడుపర్వములు సంపూర్ణముగా నున్నవని యనవలయును. కావునఁ గవులు రెండుపర్వముల మూఁడాశ్వాసముల నూటనలువదిపద్యములని చెప్పుటకు బదులుగా సామాన్యోక్తి నాశ్రయించి యట్లు చెప్పియుందురు. మఱియుఁ దిక్కనతరువాత సుమా రేఁబదిసంవత్సరములలోనే యెఱ్ఱన యున్నవాఁడు. అట్టి స్వల్పకాలములోఁ దిక్కనరచించిన పదునేనుపర్వములు నశింపకుండఁగా నన్నయరచిత భారతభాగమున నందును నరణ్యపర్వపు దుదిభాగముమాత్రమే యాంధ్రదేశమునగల యన్నిప్రతులలో నశించెననుట యుక్తిదూరమై యున్నది. ఇంతియే కాక యెఱ్ఱన ఆరణ్యపర్వాంతమున 'ధీరవిచారుఁడు' అను పద్యమునఁ దా నారణ్యపర్వశేషమును బూరించితినని చెప్పికొనియున్నాఁడు. మఱియుస్వవిరచితనృసింహపురాణమున 'ఉన్నతసంస్కృతోక్తి' అనుపద్యమున దా నారణ్యపర్వశేషోన్నయన మొనర్చితి నని చెప్పికొనియున్నాఁడు. ఎఱ్ఱనవంశజుఁడును నాతనికి వరుసకు మనుమఁడును నగువిప్రనారాయణచరిత్రకర్త మల్లన విప్రనారాయణచరిత్రమునఁ దనతాత యెఱ్ఱన ప్రతిభతో నారణ్యపర్వశేషమును జెప్పెనని వ్రాసియున్నాఁడు. ప్రాచీనతాళపత్రప్రతులలో నెల్ల నిక్కడనుండి యెఱ్ఱాప్రగడ కవిత్వమని వ్రాయఁబడియున్నది. కవీశ్వరులెల్లరు నెఱ్ఱనను నరణ్యపర్వశేషోన్నయనకర్తగాఁ జెప్పుటయే కాక నన్నయతిక్కనలతో నాతనిం జేర్చి కవిత్రయముగా లెక్కించి స్తుతించి యున్నారు." కాన నెఱ్ఱన తూచాతప్పక యరణ్యపర్వశేషమునుఁ బూరించెనని కీ. శే. వీరేశలింగముపంతులుగారు పైవాదమును ఖండించి సిద్ధాంతీకరించిరి.

పంతులుగారు ఆరణ్యపర్వశేషమును నన్నయ రచింపనే లేదనువాదము ననుసరించి తమయభిప్రాయమును సవిమర్శముగాఁ దెలియఁజేసిరి. కాని యెఱ్ఱన క్రిమిభ్రష్టపద్యపదభాగపూరణ మొనర్చెననువాదము నెత్తికొనలేదు. అయినను విషయమునఁ గొంతవరకైక్య మున్నందునఁ గ్రిమిభ్రష్టపద్యపదభాగపూరణవాదుల కయ్యవి యడ్డుతగులుచునే యున్నవి. "కాని 'ధీరవిచారుఁడు' అను నరణ్యపర్వాంతపద్యమునఁ గ్రియ 'పూరించితిని' అని యుత్తమపురుషలో నుండవలసియుండఁగా 'పూరించె' అని ప్రథమపురుషలో నుండుటచేతను నెఱ్ఱన నిజముగా దా నారణ్యపర్వశేషమును నాంధ్రీకరించియున్న భార

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తమునఁ దనపేరిటనే యాశ్వాసాంతగద్యలు వేసికొని యుండునని చెప్పుట యుక్తిదూరము గాకుండుటచేతను పై పద్యము ప్రక్షిప్తమనఁదగును. మఱియు రెండుభాగ ముల కవిత్వపురీతికిని భేద మగపరచి భిన్నకవికర్తృకత్వ మును సమర్థింపఁజాలక 'తక్కువితారీతియుఁ గొంతదోఁప ద్ద్రచనయకాన్' అని కొమటియుక్తిని జమత్కారము గాఁ గల్పించి యిటీవల నెవరో పద్యమున నిమిడ్చి యున్నారు. మఱియు దక్కువితారీతి గొంతయే తోఁచు నపుడది తద్రచనయే యెట్లగును? ఇట్టి యుక్తిదూరము లనుమాట లీపద్యమున నగపడుచుండుటంబట్టియే యీ పద్యము నిటీవలివారలు గల్పించి యెఱ్ఱనకు నరణ్యపర్వ శేషసంపూర్ణకర్తృత్వమునొసంగ దలంచి యరణ్య పర్వాంతమునఁ జేర్చి యుందురనుటకు సందియము లేదు.

మఱియుఁ గొన్నిగాథలను వ్రాయుచు నన్నయ రాజనరేంద్రునిచే సత్కారము నందకుండుటంబట్టినన్నయ గతించినతరువాత రాజరాజు భారతమును పూర్తిచేయు టకు యత్నించెనని పంతులుగారు వ్రాసిరి. కాన నట్టి యత్నము జరుగుకాలములోనే నన్నయాంధ్రీకృతభారత మాతృక రాజనరేంద్రుని యాస్థానమున నొక మూలఁబడి యుండును. ఏదైన నొకపుస్తకమును బేటికలో నిముడ్చు నపుడు ముఖపత్రమును మీఁదుగా నుంచుట యాచార ము. అట్లే యయ్యదియు నెచటనో పడియుండును. క్రిందనుండి పురుగు లచ్చటచ్చటఁ దినియుండును. కావున నసలుప్రతియే (మూలభూతమాతృకయే) క్రిమిభ్రష్టమై యుండును. భ్రష్టభాగపూరణ మొకయసాధ్యకార్యము గాకుండుటచేతనో నన్నయకువలెఁ దన కేదైన నొకకీడు మూడునని భయపడుటచేతనో తిక్కన యాభ్రష్టపద్య పదభాగములను బూరింపక విరాటపర్వమునుండి యాం ధ్రీకరించియుండును. కావుననే క్రిమిభ్రష్టభాగ మారణ్య పర్వమున గలదని విశేషించి చెప్పక పంతులుగా రంగీక రించినట్లు సామాన్యోక్తి నాశ్రయించి నిపుణముగాఁ దిక్కనమారనాదులు నన్నయయే యరణ్యపర్వము నంత యు నాంధ్రీకరించెనని నిజమును వక్కాణించియుందు రు. దీనికనుగుణముగా శంభుదాసుఁడు నృసింహపురాణ మున నరణ్యపర్వశేషాన్నయన మొనర్చితిననియే చెప్పి కొనియున్నాఁడు. ఉన్నయనమనగా మీఁదికెత్తుట లేక లేవనెత్తుట. ఈశబ్దమున కీయర్థ మనేకకోశములందు ప్రసిద్ధమైయున్నది. ఉన్నదానిని మీదికెత్తుట లేక లే వనెత్తుట సాధ్యముగాని లేనిదానిని లేవనెత్తుట సాధ్యము కాదుగదా! కావుననే యదివర కచ్చటచ్చటఁ గ్రిమి భ్రష్టములగు స్థలములుగల యరణ్యపర్వశేషమునే తా నున్నయన మొనర్చితినని యెఱ్ఱన యథార్థమును నన్న యనశబ్దమూలముగాఁ దెలియపరచియున్నాఁడు. ఆయారణ్య పర్వభాగములోఁ గొన్నిస్థలములుమాత్రమే శిథిలములై తక్కినభాగమంతయుఁ జెక్కుచెదరక యుండునారణ్య విమర్శకులకు సందియము గలుగవచ్చును. ఆంధ్రభాగము ములోఁ గ్రమశూన్యముగ నెన్నోభాగములు శిథిలము లయినట్లును నందును నడుమనడుమఁ గొన్నిభాగములు మిగిలియున్నట్లును, పంతులుగారేకాక పెక్కురు విమర్శకు లంగీకరించియుండుటంబట్టియు నియ్యది యట్లు క్రమ శూన్యముగ, యుక్తివిరహితముగ శిథిలముగాక యుక్తి యుక్తముగ శిథిలమగుటఁ బట్టియు నట్లు శంకింప నవకా శము లేదు. సత్యమును బరికింతము? నిజముగా నన్నయ యే యారణ్యపర్వశేషమును రచింపకయున్నచో రాజ నరేంద్రుఁడు కవులఁ బిలిపించి యగ్రహారాదుల నిచ్చి పూర్తిచేయింపకుండునా? ఒకవేళ తిక్కనాదులవంటి గవులు భయపడుటచే రాజరాజా భాగమును బూర్తి చేయింపలేకపోయెనని యెవరేని శంకింపవచ్చును. రాజ రాజు వలసినంతధనమునిచ్చి యాభాగమును బూర్తి చేయించుటకు యత్నించియుండిన నెఱ్ఱనవలె నెవఁడైన నొకకవీశ్వరుఁడు నన్నయపేరిటనే రాజనరేంద్రునికే కృతియిచ్చి పూరించియుండును. మఱియు నన్నయ తిక్కనలమధ్యకాలమునఁ గలకవు లట్లాభాగము కొరఁతవడియున్నచోఁ బూరింపక విడచియుందురా? అక్కాల మున నే నన్నయతరువాత భారతమును దెనిఁగింప నారం భించిన యథర్వణుఁడు తిక్కన మున్నగువారు విరాట పర్వమునుండియే యాంధ్రీకరింప నారంభించిరి.

కాన రాజనరేంద్రుఁడు యత్నించుట తరువాయి భాగమును బూరింపించుటకైకాని యరణ్యపర్వభాగము నకై కాదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. పై వ్రాసినకారణములనుబట్టి నన్నయ యాదిసభారణ్యపర్వ ముల మూఁటిని సంపూర్ణముగా రచించెననుటకు సంది యము లేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మఱియు శంభుదాసునికాలపువిగాని తిక్కనకాలపువిగాని తాళపత్త్రప్రతులు లభింపమి నక్కాలమున నరణ్యపర్వశేషము లేకయే యయ్యవి వ్రాయఁబడిననని చెప్పుటకు వలనుపడదుగదా! ఎఱ్ఱన యాక్రిమిభ్రష్టభాగములు పూరించి యాయరణ్యపర్వపుఁ దుదిభాగము నర్థసంపూర్ణముగఁ జేసిననాఁటినుండి తాళపత్త్రప్రతులలో నిక్కడనుండి యెఱ్ఱాప్రగడ కవిత్వమని లేఖకులు వ్రాసియుందురు. 'గతానుగతికో లోకో నలోకః పారమార్థికః' అనున్యాయము ననుసరించి లోకము నామార్గమునే యనుసరించియుండును. దాన లోకమున నెఱ్ఱన యరణ్యపర్వశేషమును దాఁచాతప్పకుండ రచించెనను ప్రఖ్యాతి లోకమునఁ గలిగియుండును. ఇట్టిప్రసిద్ధి నాశ్రయించుటచేతనో, తనతాతయందలి యభిమానముచేతనో మల్లన తనతాతనరణ్యపర్వశేషనిర్మాణకర్తనుగాఁ జెప్పియుండును. ఇట్లే కవులెల్లరు జనశ్రుతి ననుసరించియుఁ దమకంటెఁ బూర్వముననుండు తాళపత్త్రప్రతులలోఁ గల వ్రాఁతననుసరించియుఁ గవిత్రయములోఁ జేర్చి స్తుతించియుందురు. ఇప్పటికిని సత్యమును మఱచి లోకమును నద్దానినే యుగ్గడించుచున్నది. తనకంటెఁ బ్రాచీనులగు కవులెల్లరు నవిమర్శముగ నెఱ్ఱనయందు నరణ్యపర్వశేషసంపూర్ణకర్తృత్వము నారోపించుచున్నను నద్దాని నిజమును వీథిఁబెట్టుటకే యప్పకవి వారికెల్లరకు విరుద్ధముగా నన్నయకే త్రిపర్వసంపూర్ణకర్తృత్వము నొసఁగియున్నాఁడు. కానఁ గ్రిమిభ్రష్టపద్యపాదపదైకదేశములనుమాత్రమే యెఱ్ఱన పూరించెనని చెప్పుటకుఁ బ్రబలాధారము లగపడుచున్నవి." అని క్రిమిభ్రష్టపద్యపాదభాగపూరణవాదులు వీరేశలింగముపంతులుగారి యుక్తులకుఁ బ్రతియుక్తులనుఁ బన్ని తమవాదమును నిలబెట్టుకొనియున్నారు.

నన్నయ తాటియాకులప్రతి చెడిన శ్లోకకవియును వ్రాయకుండుటచేతను గేవల జనశ్రుతుల నాధారముగాఁ జేసికొని యనేకవిషయముల ననేకగాథలను వ్రాసిన యప్పకవ్యాదు లీగాథను వ్రాయకుండుటచేతను గేవల పద్యపాదపదపదైకదేశపూరణమునఁ గవు లిట్టియనన్యసామాన్యమగు గౌరవము నెఱ్ఱన కిచ్చిరనుమాట యెంతమాత్రము నమ్మఁదగియుండమిచేతను, ఉన్నయనమనునది ప్రాసకై వేయఁబడినదగుటచేతను, 'పూరించె' అనునట్లు క్రియ ప్రథమపురుషలో నుండుట కనేకకవిప్రయోగములు ప్రమాణములుగా నగపడుచుండుటచేతను రాజనరేంద్రునికే యంకిత మిచ్చి నన్నయపేరిటనే యెఱ్ఱన యాంధ్రీకరించుటం జేసి పద్యపాదైక్యముండుటయు విరుద్ధమగుటచేతనుఁ గవిజనశ్రుతితాళపత్త్రమాతృకా ప్రమాణములఁ దిరస్కరింపఁజాలినంతటి ప్రబలప్రమాణము లెవ్వియు నుపలబ్ధములు గాకుండుటచేతను నెఱ్ఱనయారణ్యపర్వ క్రిమిభ్రష్టపద్యపాదపదైకదేశముల మాత్రమే పూరించెననుట మిగులసాహసోక్తియని తోఁచెడిని. విమర్శకులీయంశము నితోధికముగా విమర్శించి లోకమునకు సత్యమును వెల్లడింతురుగాక!




CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ఏమిసత్కవి బ్రహ్మావో యెఱుగనైతి?

విద్వాన్ కట్టీ సుబ్బారావు గారు

కల్పింతు వొకచోట, కనకవప్రావృత సౌవర్ణకీలిత సౌధములను
కల్పింతు వొకచోట కాలమేఘవినీల గాఢతమోరుద్ధ గతులనిశల
కల్పింతు వొకచోట గాఢభీతిప్రద కాలమృత్యుకరాళ కాననముల
కల్పింతు వొకచోట కామితార్థప్రదానాతిశాంబు ఋష్యాశ్రమంబు
ఇట్టిచిత్రవిచిత్రమౌ సృష్టిచేయ-నెట్టిసాధనసంపద యెట్టిశక్తి
యెట్టిమేధావిశేష మిదేమిగలవో-యేమిసత్కవిబ్రహ్మావో యెఱుఁగనైతి?

గీ. కలదఁనీచేత కవితయన్ ఖడ్గమొకటి-దానదండ్యుల దండింతు ధర్మమార్గ
రతులమెప్పించి మనుతువు ప్రభుఁడవగుచు-నేమిసత్కవిబ్రహ్మావో యెఱుఁగనైతి?

సీ. తలఁచినయంత ప్రదర్శింపగానేర్తు వతిశాంతమైన సాయంతనంబు
తలఁచినయంత ప్రదర్శింపగానేర్తు మలయపర్వతమందమారుతంబు
తలఁచినయంత ప్రదర్శింపగానేర్తు వమలవాఃపూర్ణ జలాశయంబు
తలఁచినయంత ప్రదర్శింపగానేర్తు వతిగంధకుసుమితోద్యానవనము
అచట యువతిని యువకు నాహ్లాద మొప్పఁ-గూర్చిప్రేమానుబంధంబు నేర్చియంత
నంత రాయంబుఁగూర్తు వటయ్య, చెపుమ-ఏమిసత్కవిబ్రహ్మావో యెఱుఁగనైతి?

సీ. తూగుటుయ్యేలలందు నూఁగుచుండెడిముద్దు లొల్కుబాలునిరూపు నొక్కచోట
అనియతసంజాత హాసదుఃఖంబుల నుండెడిబాలకు నొక్కచోట
ఉరమునఁ బులిగోరు కరమునఁ గంకణా లొప్పబాలకురూపు నొక్కచోట
తోడిబాలురఁగూడి యాటలాడుచుకేరు చున్నబాలునిరూపు నొక్కచోట
చూపగల విట్టి చూపులే చూడ్కికలిగె-నేమి యెఱుఁగంగశక్తి యింకేరికుండు
గహనమగుగాదె చూడగా కవిమనంబు-ఏమిసత్కవిబ్రహ్మావో యెఱుఁగనైతి?

సీ. మోము మీసము లేక మొలకనవ్వులఁదేరు చిన్నారి చిఱుఁతని చిత్రమొకటి
నూనూఁగుమీసాల నూత్నయౌవనమునఁ జెన్నారుయువకుని చిత్రమొకటి
బవిరిమీసముగల్గి పరిపాకదశనొంది చెన్నారు కౌమారు చిత్రమొకటి
పండుమీసములొప్పి పలితమస్తముగల్గి చెలఁగఁజాలనివృద్ధు చిత్రమొకటి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నిటిని వాక్యరీతిన యగుపడంగ-చేయఁగలశక్తి యెట్లు సంసిద్ధమయ్యె
నెఱుఁగ నింకేదిమార్గ మింకేమి సేతు-నేమిసత్కవిబ్రహ్మవో యెఱుఁగనైతి?

సీ. బొమ్మరిండ్లనుగట్టి పొయ్యిముగ్గులువెట్టు లలితబాలనుజూపఁగలవు నీవు
వీణచేతనుబూని గానరక్తినిజూపు కలితయౌవనఁ జూపఁగలవు నీవు
సెజ్జపైమెయివాల్చి చెలులయూరటవిని వలఁచుకామినిజూపఁ గలవునీవు
పతిదోషములనెంచి పదతాడనముఁజేయు కలితకోపనజూపఁ గలవునీవు
అన్నియైననుగోప మావంత లేక-యోర్మిభార్యనుబ్రార్థించు యువకుఁ జూపఁ
గలవు నిన్నెన్ననోరులకుఁ గాదువశము-ఏమిసత్కవిబ్రహ్మవో యెఱుఁగనైతి?

సీ. శుకముఖద్విజులైన చూడ్కికినెదురైన శ్యామావిహారంబు సలుపుటయును
అతిమానకామినీ తతియె సాహసమూని సకలసన్నాహంబు సలుపుటయును
అతిసత్వహీనులే యతిధైర్యవంతులై చండయుద్ధంబుల సలుపుటయును
అతిఘోరమృగములే యాదరంబులఁబూని సత్సహాయంబుల సలుపుటయును
అన్నియునునీవశంబున నలరుచుండు-అంతసృష్టికిఁ బ్రభుఁడ వీ వగుదువనుచు
నెఱుఁగనేరక మూర్ఖుఁడ నేనయైతి-నేమిసత్కవిబ్రహ్మవో యెఱుఁగనైతి?

సీ. లక్షాధికారిచే భిక్షంబునెత్తింతు సర్వశక్తుఁడవౌన సత్కవీంద్ర!
అపాణిశిలతులచే నాటలాడింతువు చాలమాయికుఁడవే సత్కవీంద్ర!
నిర్జనవనులను నెలవులఁగాఁజేతు సచ్ఛిల్పివౌదువే సత్కవీంద్ర!
మేడగోడలనెల్ల మేలిమితోఁజేతు స్వర్ణాగధన్వివే సత్కవీంద్ర!
ఇచ్చవొడమినఁ బుట్టింతువేపుఁజూపి-సంహరింతువుబ్రహ్మవే సత్కవీంద్ర!
యేమి బ్రహ్మవో శివుఁడవో యెఱుఁగనైతి-సత్య మెఱుఁగంగనైతి నే సత్కవీంద్ర!

సీ. కమ్రామ్రపల్లవ ఖాదియైచొక్కుచు "కో"యని కూసెడి కోకిలొకటి
లేఁగలతోఁగూడి లేతపచ్చికమేసి హాయిగాఁదిరిగెడి హరిణియొకటి
కమలషండముఁజేరి కమలనాళమునాని యలసటనిద్రించు హంసయొకటి
పువ్వుఁదీఁగెల ముట్టి పువ్వువాసనమూని పరగుదక్షిణగంధవాహ మొకటి
రమ్యలావణ్యసీమయౌ రమణియొకతె-నూరుగేరెడిసొగసుకుమారుఁడొకఁడు
తగును నీసృష్టిలోనఁ బ్రధానములుగ-నేమి సత్కవిబ్రహ్మవో యెఱుఁగనైతి.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




ఉమర్ అలీషా కవి

"ఈ ఉమర్ ఖయాం" అనునతఁడు సుప్రసిద్ధుఁడైన పారసీక కవి. క్రీస్తుశకము 1018 సం. పెరిషియా దేశమున నైషాపూర్ అను గ్రామమున జన్మించెను. ఈతని తల్లిదండ్రులు ఇస్లాము మతమునకు జేరిన వ్యవసాయదారులు. "నైష్" అనఁగా వెదురు. వెదురు చిడమును దొలగించి కట్టిన పల్లెయే 'నైషాపుర' మని ప్రసిద్ధి వహించినది. ఇది ఖురాసాన్ దేశపు చక్రవర్తుల కాలమున బలఖ్, హిరాత్, షాజహానులతో పాటు నైషాపురమును రాజప్రతినిధి నివసించు ముఖ్యస్థానమై యుండెను. ఇందెన్నియో కళాశాలలు నిర్మింపబడి యుండెను. బాగ్దాదులోని పెద్దపెద్ద విశ్వవిద్యాలయములకన్న నీనైషాపురమున పెక్కు విశ్వవిద్యాలయములు నిర్మింపబడినవి. అందు నిజాముల్ ముల్కుతూసి "జేహాఖియా" నిజామియా నైషాపూర్ మహామూన్ గజినీ సోదరుఁడు "సైదియా", ఇబ్లే అబూసైన్ బగ్దాదీ, అబూ ఇసహాఖ్ మున్నగు ప్రసిద్ధపురుషులచే నెన్నియో కళాశాల లీనైషాపురమున నిర్మింపబడినవి. అందు అరబ్బీ మహా విద్వాంసు డగు "ఇమామెగజ్జాలి నైజామియా" విశ్వవిద్యాలయమునకు ప్రధానాచార్యుడు (Chancellor) గా కొన్నినాళ్లుండెను. ఉమర్ ఖయామ్ ఇందుత్తీర్ణు డగుటయేకాక లోకమున నెచ్చటెచ్చట గొప్ప విద్వాంసులున్నారని విన్నను అచ్చటకు బోయి తర్క వ్యాకరణాది జ్యోతిషములు సంపూర్ణముగ నేర్చుకొనియెనని "ఇబ్నె ఖల్ కాన్" అను చరిత్రకారుఁడు వ్రాయుచున్నాడు. ఈతని సహాధ్యాయులు హాసన్ బిన్ సబా, నిజాముల్ ముల్కు అను ప్రసిద్ధపురుషు లిరువు రుండిరి. వీరినిగూర్చి యొక విచిత్రకథ గలదు. వీరు చదువుకొను కాలమున హాసన్ బిన్ సబా మన ముువ్వురిలో నెవరి కదృష్టము పట్టినను తక్కినవారికి సమానముగా బంచవలెన నొక ప్రమాణపత్రము వ్రాయించెను. కొంతకాలము గడిచినతరువాత నిజాముల్ ముల్కు బాగ్దాదు పరిపాలించుచున్న మలిక్షాసల్జూకీచక్రవర్తులయొద్ద ప్రధానమంత్రిగా నేర్పడియెను. వానియొద్ద కొకనాడు ఎక్కడికో పోవుచు మార్గశ్రముడై ఉమర్ ఖయామ్ వెళ్లి దర్శించెను. నిజాముల్ముల్కు చూచి చాల గౌరవించి నీకేమి కావలెనని కోరెను. నాకేమియు నగత్యము లేదని చెప్పి వెళ్లిపోజూచెను. కాని నిజాముల్ ముల్కు 'మనము చదువుకొను దినములలో నొక ప్రమాణపత్రము వ్రాసికొంటిమి. నీకు జ్ఞాపకము లేదా' యని యుగ్గడించి నీవు 'నావెంట రావలెను నాయేలికతో జెప్పి నిన్ను నాయంతవానిగ జేయుదును' అని మిక్కిలి ప్రార్థించెను. కాని ఉమర్ ఖయా మామాటలకు నవ్వి.

"ఎకనానె బదోరోజ గరమవన్ హాసిలెమర్ద
బరకూజషికిస్తాదమె అబెసర్ద
మామూరకసేదిగర్ చరాబాయెద్ బూద్
తాఖిద్మతె చూఖుదీచరాబాయద్ కర్ద.

అనఁగా,

ఉ. రెండుదినాలకైన నొక
రేయొక రొట్టె లభించెనేని నో
రెండినవేళ నింతజల
మిచ్చెడు పెంకు లభించెనేని నే
నొండొరు వేఁడివాని కొలు
వుండను నాగతి మానవుండె భూ
వుండును వానిగొల్చి తన
పొట్టను నింపుకొనంగఁ బోదునే.

"ఎకకొగమె అమ్యాంనదారేంఖు షేం
గర్చాష్త బునన్ షాంనదా రేంఖుషేం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాషాఖత నెమా మెరసన్ అజముద్బఖయిఖ్క
అజకస్ తమాఖానదారేం ఖుషేం.

అనఁగా,

సీ. జగతిక్ దుఃఖమొకింత నామనసులోఁ
　　జర్చింపఁగా లేదు రే
బగలం దెప్పుడొ గుప్పెఁడన్నము లభిం
　　పక్ జాలు లేకున్నచో
నగ పే లేదు మహానసగృహములోఁ
　　బక్వాన్నమే చిక్కుచుం
డఁగ నన్యుంగని వేఁడ నేఁటి కది మా
　　ర్ధన్యంబు గాకుండునే!

అని బహులుచెప్ప నాతనివివేకమునకు, స్థితప్రజ్ఞ కెంతయు సంతసించి సంవత్సరమునకు 1200 పదురెండువందల తోమానులు—తోమానఁగా ఇరువదిరూపాయలు; ఇరువది నాలుగువేలరూకలు(రు 24,000)—నైసాపురమున ఆదాయము వచ్చుభూమి దానపట్టా వ్రాసి యిచ్చిపంపెను. ఇది గని యొక జిజ్ఞాసువు నేనడిగి దేవురించినను నెవరును నాకొక కాసైన నియ్యరే నీకింతధన మెట్లు వచ్చినది? అని యడిగినాఁడు. వానితో,

మ. ధనవాంఛన్ వ్యజియించి యేఁగు ప్రతిపా
　　దంబందు వేవేలుగా
ధనరాసుల్ లభియించు లేనియెడ న
　　ర్థం బర్థి రాఁబోవ దే
పనియైనక్ సమకూడ లేదని మదిక్
　　భావింప కీదుఃఖముం
డిన దీర్ఘంబున నర్థదాయకము నై
　　డిందించు నీజీవముక్.

శా. రాగద్వేషము లాశ్రయించి విషయ
　　భ్రాంతిన్ బ్రవర్తింప ను
ద్వేగింపక్ వసునా జగాన విధి సం
　　యోగంబుచే నెందఱో
భోగాపేక్షను వచ్చిపోయి రిటు లే
　　ముందింక రానున్న వా
రేగక్ జాతురుగాని యొక్కఁ డిలపై
　　యిష్టార్థముల్ పొందునే.

అని బహులుచెప్పి వానికేదో కొంతధన మిచ్చి పంపించెను.

ఈ "ఉమర్ ఖయాం" యొక్క అసలు పేరు ఉమర్. కొందఱు ఉమురూ అనిగూడ చెప్పుదురు గాని అది ముద్దుపేరు కానోపును. ఖయాం అనునది బిరుదు. ఈబిరుదునామములే అరబ్బీ, పారసీకవులు తమ కావ్యములందు వాడుచుందురు. పూర్వసంస్కృతకవులకు గూడ నిదే ఆచారము. వ్యాస వాల్మీక మయూర బాణవిద్యారణ్యభవభూతికాళిదాసులనునవన్నియు బిరుదులే కాని అసలు పేరులుగావు. అక్లే, ఫజు, సాది హాలానా, రూమ్, గజ్జాలీ, ఖయాం అనియు నెఱుంగవలయును. ఉమర్ ఖయాంక అనఁగా ఉమర్ అనే ఖయాం అనియర్థము. ఈతడు విద్యారణ్యునివలె పెక్కుగ్రంథములను వ్రాసిన ఋషి (నా నృషిః కురుతేకావ్యమ్). అందీతని మత సిద్ధాంత గ్రంథమునకు ఉమర్ ఖయామని పేరిడినాడు. ఈతడు ఇస్లాము మతస్థుడైనను కపిలాది సాంఖ్యమతస్థులకును, విరోచనాది చార్వాక లోకాయతమతములకును సంబంధమైన యొక సిద్ధాంతమును ప్రతిపాదించినాడు. అది ముందు చర్చింపబడును. ఈతడు జ్యోతిషమునకు ప్రధానాచార్యుడు. "తక్వీ మెజలాలీ" అను గొప్పజ్యోతిష సిద్ధాంతగ్రంథమును వ్రాసినాడు. ఇప్పటి ఇంగ్లీషు కేలండ రీతని సిద్ధాంతములోనిదే యని గిబ్బక్ మున్నగు చరిత్రకారులు వ్రాయుచున్నారు. మఱియు నిట్టిదే "జీచ్ ములెక్షాహి" అనునది జాతక సిద్ధాంత భాగములు వ్రాసిననాడీగ్రంథము.

"అరాయిసన్ నఫాయిస్" అను తత్త్వశాస్త్రము (Philosophy).

"అల్ జబర్"(Algebra). దీనిని అరబ్బీ భాషలో వ్రాసెను. ఇది ఇప్పుడు ఫ్రెంచిభాషలో బరివర్తింపబడినది.

"ఒఖిలీదస్" (Geometry) లోని కఠినతరసమస్యలు ప్రస్తరించి చూపించెను.

"ఇల్మెత బీయాత్" (Chemistry).

దర్బారయే "హుక్మతుల్ ఖాలిక్". ఇదివేదాంత శాస్త్రము. పంచీకరణవిషయము గలదు.

"రిసాలా" శారీరఆర్థికశాస్త్రము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"రిసాలయెమెహూసూవా" తర్క-శాస్త్రము.

ఇట్టివే యెన్నియో కలవు. ఇవి యన్నియు నిప్పటికిని ప్రమాణగ్రంథములుగ బండితులచే బరిగణింపబడుచున్నవి. పాశ్చాత్యు లీ గ్రంథములన్నియు తమభాషలలో తర్జుమా చేసికొనినారు.

ఈతని జీవితకాలములో గూడ నతనికి జగద్విఖ్యాతమైన యశస్సుండెడిదని, నాటిచక్రవర్తులలో శేరన్నికగన్న వంషుల్ ముల్కు-ఖాఖాని సుల్తాన్ సంజీన్ మున్నగువా రీతని కర్థసింహాసన మిచ్చి గౌరవించుచుండిరని, పల్లకి దండి చేతితో తాకి బోయీల కెత్తుకొనుట కనుజ్ఞ నిచ్చుచుండి రని నాటి ప్రసిద్ధచరిత్రకారులగు దౌలిత్ షా, సమార్ ఖంది, తారీఖు ల్హుకమ్మ మొదలగు వారివలన తెలియుచున్నది. నాటిసమకాలికులగు కవుల చరిత్రకారులగు "నిజామీ, ఫరూజీ;" మున్నగువా రీతని పూజ్యపాదునిగ గ్రహించి పేర్కొనుచుండిరి. ఈతని కాగతానాగతజ్ఞానము గలదనుట కనేకనిదర్శనములు ప్రజల కగుపర్చుచుండెను. అవి యిందుదాహరించుట గ్రంథవిస్తరమగును.

సంతచెప్పుటయందును, అవధానము లొనరించుట యందును, తర్క-వ్యాకరణాదిజ్యోతిషవిషయములే కాక యెన్నియో కళలయందును ప్రవేశమున్నట్లు చరిత్రలవలన తెలియుచున్నది; తుద కీమహనీయగుణగరిష్ఠుడైన ఉమర్ ఖయాం నూట తొమ్మిదియేండ్లు జీవించి తన జన్మభూమియగు నైసాపురమున క్రీస్తుశకము 1127 వ సంవత్సరమున తనభౌతికశరీరమును విడిచి దివి నలంకరించెను. ఈతనిగోరీ "హీరా" అను ప్రదేశమున గలదు. ఒకసారి 'బలఖ్, పట్టణమున నేదో వేదాంతవివాదము వచ్చి తన గోరీపై ప్రళయకాల పర్యంతము పూలు కురియుచుండునని కొన్నిపద్యములు చెప్పెను. అది నేటికిని ప్రత్యక్షముగ ప్రక్క-నున్న మసీదులోని పూలతీవ లల్లుకొని పువ్వు లజస్రము కురియుచున్నవని తెలియుచున్నది. ఇట్టివే పెక్కు-వ్యాఖ్యానము లీతనిగూర్చి చరిత్రజ్ఞులు వ్రాసియున్నారు.

ఈతని మతసిద్ధాంతగ్రంథమునకు "ఉమర్ ఖయాం" అని పేరిడినాడని పైన నుడివియుంటిమి. అసలు దాని పేరు "రుబాయాత్ ఉమర్ ఖయామ్" అనగా ఉమర్ ఖయాం వ్రాసిన రుబాయీలనియర్థము. "రుబాయీ"లన శార్దూలాదివృత్తములవంటి పారసీవృత్తములలో నొకదానికి పేరు. ఈ వృత్తములలో దనభావములను వెల్లడించెను. ధారాపాతమువంటి యీతనికవిత్వములలో కాతీతమైన భావగంభీరతను, ఆలోకసుందరమైన ఉపమానవస్తువులను చూచి విషయమెట్టిదైనను లోకము మోహించి రససముద్రమున మునిగిపోయినది. ఇది తొలుత ఫిట్జ్‌జరల్ డను నాతడు 1858 వ సంవత్సరమున ఆంగ్లభాషలో 75 పద్యములలోని కనువదించి అచ్చొత్తించినాడు; కాని దానిపై తనపేరుకూడ వేసికొనలేదు. ఆపొత్తములు అమ్ముడు కాకపోవుటచే 5 షిల్లింగులనుండి ఒకపెన్ని వెలకు తగ్గించి బుక్కు-దుకాణములవంటి దుకాణదార్లమ్ముచుండిరి. అదితొలుత సర్ రిచెర్డు బర్టన్, స్విన్ బరన్, రాసెటి, గబ్రియల్, రూస్కి మున్నగువారు కొని చదివి వ్యామోహితులై తమ ఆప్తులకు బంపి విమర్శనములు వ్రాసి దానిప్రాశస్త్యము వేనోళ్ల గొనియాడుట కారంభించిరి. తిరిగి యీపొత్తము 1868 వ సంవత్సరము రెండవసారి ముద్రింపబడినది. తరువాత 1872 లో మూడవముద్రణము జరిగినది. తరువాత 1879 లో రెండు మూడుసారులు ముద్రింపబడి యిట్లే యేటేట లెక్క-లేనన్ని సార్లు వివిధములైన మాదిరులలో ముద్రింపబడుటయేకాక అనేకు లనేకానువాదములుచేసియు వ్యాఖ్యానములు వ్రాసియు గౌరవింపజొచ్చిరి. ఒక్క-యూరపుదేశమందే కాక అమె[illegible]కాలో నిదిలేనియిల్లే లేదనునంతవ్యాప్తిని గాంచినది. యిప్పుడిప్పు డెల్లదేశములలోను, ఎల్లఖండములలోను ఎల్లభాషలలోను ననువాదములు బయలుదేరుచున్నవి.

ఈ ఉమర్ ఖయాం గ్రంథమంతయు నొకచోట లభించలేదు. ఖండఖండములుగ దేశాంతరములయందు [illegible]డిపోయినవి. ఇప్పటికి దాదాపు 1200 పద్యములు లభించినవి. అసలు కవివ్రాసిన పొత్తమెందో తెలియదు. అది కాలగర్భమున మునిగిపోయినది. అనుకారకులు వ్రాసిన ప్రతులును నిప్పు డగుపడవు. మిక్కిలి పురాతనమని చెప్పదగిన ప్రతి 1460 వ సంవత్సరమున వ్రాయబడినది. అది బోడ్లిన్ భాండాగారమున గలదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇందు 158 పద్యములు మాత్రమే కలవు. దానిని 1898వ సంవత్సరమున ఎడ్వర్డు హీరక్ అయి ననువాఁడు లండనునగరమున బ్రకటించినాఁడు.

పేరిసునగరమున 1530 వ సంవత్సరమున వ్రాసిన ప్రతిగలదు. ఇందు 76 పద్యము లున్నవి.

బ్యాంకిపురమున నొకప్రతి లభించినది. అందు 604 పద్యము లగుపడుచున్నవి.

ఏషియాటిక్కుసొసైటి (కలకత్తా) వారిగ్రంథాలయమున నొక ప్రతిగలదు. అందు 516 పద్యములున్నవి.

వాన్‌హామిర్ తనయొద్దప్రతిలో 200 పద్యములు మాత్రమే కలవని వ్రాయుచున్నాఁడు.

లఖ్‌నోప్రతిలో 770 పద్యములు వ్రాయబడి యున్నవి.

జాక్‌పేర్ అనువానిప్రతిలో 845 పద్యము లున్నవి.

మిస్ జే. సి. ఐ. కేడిల్ 1200 పద్యములు సేకరించెను. ఇంక నెన్నిపోయినవో తెలియదు. తొలుత ఇంగ్లీషులో భాషాంతరీకరించినవాఁడు ఎడ్వర్డు ఫడ్జిజెరల్డు అనిగదా పైని వ్రాసియుంటిని. అతనికి లభించిన ప్రతి యిప్పుడెక్కడను అగుపడకున్నది. ఆపద్యము లిప్పుడచ్చుపడుచున్న పారసీప్రతులందు లేవు.

ఈతని తరువాత 1872 వ సంవత్సరమున ఐ. హెచ్. వఠ్‌ఫీల్డు అను నాతఁడును, 1898 వ సంవత్సరమున రిచెర్డులీగేలిన్ అనువాఁడును, 1913 వ సంవత్సరమున జాక్‌సన్‌పాపా అనునాతఁడును 762 పద్యములును, 1915 వ సంవత్సరము జాక్‌పాలిక్ 158 పద్యములును, 1920 వ సంవత్సరము పరబ్‌నూల్ 346 పద్యములును ఇట్లే ప్రొఫెసర్ హెర్నిలిన్, మీకార్తి గారజ్ మున్నగు నెందరో పూర్తిగ అనువదించినారు; ఇంకను ననువదింపనున్నారు. కాని అసలులోఁగల ధారాప్రవాహరూపకమైన, శాంతియుతమైన కవితాప్రభావము, రసపుష్టి, ధ్వని, వ్యంగ్యాలంకారము లొక్కరవంతయు రాలేదు. వచ్చుటకుగూడ సంభవముగాదు. కేవలము భావము మాత్రము వచ్చును. భావము శైలితో కూర్పబడినప్పుడున్నరసము ఇదమిత్థమని వచింప రాదు. అందుచే నొక ప్రసిద్ధుఁడైన ఇంగ్లీషుకవి. ఉమర్‌ఖయాంమాతృక యెట్లుండునోయని యరువదిరయేండ్లు ఫారసీభాష లెస్సగ నేర్చి తరించినాఁడట. మొత్తమున నీగ్రంథరాజము చదువుచున్న నింక నేశాస్త్రముపైగూడ మనస్సు పోనేరదు. ఇందు 35 విషయములపై ప్రసంగముగలదు. అవి భగవద్గీతాధ్యాయములవలె వేరువేరు చేయబడినవి. అత్యంత ప్రాచీన మనదగిన చార్వాకుల శాస్త్రములు పోయినను ఇదియొక టగుపడుచున్నది. ఇందు వేదాంతము, జీవన్ముక్తి, ప్రపంచము, ధ్యానము, యోగము, తపస్సు, సమాధి, కాలము, మానవప్రవృత్తి నివృత్తిమార్గములు, ఈశ్వర జిజ్ఞాసతత్త్వము, మఘువు, లోకదుఃఖము, వైరాగ్యము, వివేకము, ఆనందము, సృష్టి, జీవుఁడు, స్వర్గము, నరకము, సదసత్తులు, మాయ, భ్రాంతి మున్నగునవి ముఖ్యములు. మొత్తమున్నిటియందును, విశేషముగ ఆసవపానము, గానము, మానిని, ఏకాంతవాసము (సౌధారామములు)పల గూర్చి పెక్కుభావము లలంకారములలో తర్కించి సాధించి సిద్ధాంతపూర్వపక్షములలోని నిగ్గును తేల్చి, పరమును దానిని మఱపించి, కైవల్యాదిపదవులు సాకులని యొప్పించి కేవలమైహికమే నిక్కమని పెక్కునిదర్శనము లగుపర్చి తనసిద్ధాంతమున నయఃపిండమువలె దృఢతరమును స్థిరతరమును గావించి లోకముచే పాడించి విడిచినాఁడు. అసంబంధమైన భావముల నిసుకతిప్పవలె చెప్పి గుచ్చియెత్తినాఁడు. భూమ్యాకాశమధ్యమునున్న యన్నివస్తువులను సోదాహరణముగ జూపించి, ఆస్తిక వాదమును చింపరవందర చేసి పటాపంచలు గావించి నాఁడు. ఇది పాశ్చాత్యనాగరికులకెంతయు సరిపోయినది. అందుచే నాతనిని వారత్యంతము గౌరవించుటయేకాక నాతని యీగ్రంథమును దేవతుల్యముగ సమారాధించుచున్నారు. మొన్న నొకపాశ్చాత్యుఁడు జిరల్డు మొదటి కూర్పుప్రతిని 600 పౌనులకు కొన్నాఁడట. అదిగాక యెందరో పాశ్చాత్యులు నైషాపురముపోయి యీతనిగోరీనే అర్చించుచున్నారు. ప్రతిసంవత్సరము నచ్చట గొప్పఉత్సవము సాగుచున్నది.

ఇతఁడు నాస్తికుఁడని, వామమార్గావలంబుఁడని చెప్పుదురు. నాస్తికులకు పాషండులకును నీతనికిని యే విషయమునగూడ రవంతేనియు భేదమగుపడదు కాని యీతఁడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. నైరుల్ నన్ను పదార్థమాదియని సం
భాషింతురే వారలే
తీరున్ నన్నటులాడుచుందురో కొ
యర్థిన్ జెప్ప దూహింప సాం
పారన్ ధాత్రి కులాయమందు సృజియిం
పన్ వచ్చితిన్ నేను నా
దేహాపంబని చర్చచేయవలదా
యిందేమి తప్పున్నదో.

అనియును ఆస్తికులని చెప్పుకొనువారే వామమార్గానలంబు లనియు, మఱియొకచోట.

ఉ. కోవిదవర్య, శాంతివిన
గోరెద నాపలు కీవు నేనునం
బోవుచునున్న మార్గ మొక
పోలికదైనను వామమార్గమం
దీ వొకదృష్టినిల్పితివి
యెప్పటికైనను దిద్దుకొమ్ము నా
పైవిరసోక్తులాడకు సె
పంబులు వీడుమ ఈశ్వరార్థమై.

అనియు చెప్పుచున్నాడు. కాని యాతని ప్రధానోప దేశము:

ఉ. మాసభయందుఁ ద్రాగుడును
మంజులగానము పానసాత్రలే
భాసిలుచుండు మేము మధు
పానప్రమత్తత నుందు మెప్డు నీ
వ్యాసము లిందు జెప్పకుమ
శాంతరవర్తి, దురాత్మ, యింక మా
యాసవమున్ మృగాక్షి యధ
రాసవమున్ మము తేర్చ వింతయున్.

ఉ. లెమ్ము నిజానురాగభవ
లీలలఁబుచ్చుము వర్తమానకా
లమ్ము విశాలవిశ్వము వి
లాసవిభాసవినూత్నచారుస
స్యమ్ములఁ గుల్కుచున్నది ని
జంబుగ నీసమయమ్మునందు మ

ద్యమ్మును పాత్రలో నునిచి
హాయిగ ద్రావుము నిర్విచారవై.

చ. చెలఁగు వసంతకాలవన
సీమలసోమరసంబు పాత్రలో
పల నిడి మా కొసంగఁగల
భామినియున్న నిజంబు స్వర్గమే
నలఁపఁ దలంచి తేని శపథం
బిది శ్వానశతంబుకంటె న
ల్పలఁతినిఁ జూడుమా పథము
నందు రహస్యములే దొకింతయున్

ఉ. చీకులు, రొట్టెముక్కలును,
సీధువు, నొక్కరహస్యమందిరం
బోకమలాక్షి, యున్న నిఁక
నుజ్వలరాజ్యపదంబు నొల్ల నా
నాకలుషావహంబయియ
నంతదురంత విచారఘోరదు
ర్వ్యాకులనై తనర్చెకు ప్ర
పంచము నీగతి నేఁ దరించెదన్.

ఉ. ఓచెలి, మమ్ము భ్రమింపటకు
నొక్కెడ కాలము వేచియుండె నీ
పాలి జగంబు మా కొకప్ర
వాసనికేతనమట్టు లున్న దం
తే చషకంబు ద్రాక్షరస
మీయెడఁ గైకొని ద్రావనున్న సం
కోచము నొందనేల యిది
కూడని కార్యమె యెట్టివారికిన్.

మ. మధువున్ ద్రావుము నిత్యలోపమునకున్ మార్గంబుగానోపు నీ
మధువే ప్రాణ హృదార్తులన్ క్షతిముల్ మాయించు నల్వంకలన్
వ్యథజంఝానిలమావరింపఁ దలక్రిందై పోయిదుఃఖావిలాం
బుధిలో మున్గిన నూహనౌకవలె నిన్ బోషించు సంభావ్యమై.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. నీవు పాత్రనుండి పడి
　　చేయుకలధ్వని వేణుగానపున్
మాధురి యెంతహాయినిడు
　　మానినికౌఁగిట నద్దిచారుసం
శోభనలక్ష్మి వెలార్చునిజ
　　భోగపరంపర నాసవాస్తి సం
బాధము లాహహా యెటు ప్ర
　　పంచవిచారము మాన్పఁజాలెదే.

ఉ. ఆసవమున్ వధూటియు వ
　　నాంతనివాసము మాకుఁ గూర్చి నీ
కోసము స్వర్గమున్నదను
　　కొమ్మటులైనను బంధమోక్షవన్
వ్యాసము లాలకింపకుఁడు
　　స్వర్గమునుండి యెవండువచ్చె రా
కాసి నిశాంతవేళ నర
　　కంబున కెవ్వఁడు పోయెఁ జెప్పుమా.

శా. ఏసౌధావళి విశ్రమించి బెహరా
　　మెంతే సురన్ ద్రావెనో
ఆసౌధాళి కురంగశాబకము సిం
　　హవ్రాతముల్ నిండి గ్రొం
తే సుప్తింగను నాతఁ డీమృగములన్
　　హింసించెనో నేఁడవే
గాసిన్ ద్రొక్కఁగ నోరి కిప్డుబలిమై
　　కైసాచె కాలాహతిన్.

ఉ. పోయినవారు బూడిదయి
　　పోయిరి వారిశరీరలేశమం
దేయణువైనఁ గానఁబడ
　　దెట్టిసురన్ గొని మూర్ఛవోయి యా
కాయమువాసిరో ప్రళయ
　　కాలము దాఁకసుషుప్తిఁ జెందిరా
రాయెను కర్మవాంఛఁ జన
　　రాయెను వేనికి లెక్కసేయకన్.

ఉ. అంబరచుంబితంబులవు
　　తాభము లీనవశంబులైన సౌ
ధంబుల నేలెనే నృపుప
　　దంబులపై భువనాధిపుల్ గిరీ
టంబులు మోపి మ్రొక్కఁగొక
　　టో యశ్లేఁడేఁడని పల్కుచున్ గపో
తంబులు హూహుహూకలరు
　　తంబులు సేయఁగ వింటి నేనటన్.

ఇట్లేచార్వాకులును వామమతస్థులును.

"పీత్వాపీత్వాపునః పీత్వా యావత్పతతి భూతలే,
పునరుత్థాయ వై పీత్వా పునర్జన్మ నవిద్యతే.
మద్యం మాంసంచ మీనంచ ముద్రా మైథునమేవచ,
ఏతే పంచమకారాః స్యుర్మోక్షదాహి యుగేయుగే."

అని పెక్కువిషయములు వ్రాసినారు. మఱియు ఈచార్వాకమతస్థాపనాచార్యుఁడు "విరోచనుఁడు." ఈవిరోచనుఁడు ప్రహ్లాదునిమనుమఁడును, బలిచక్రవర్తితండ్రియు నగువిరోచనుఁడని కొందరును, కలియుగములోనివాఁడగు నొకసంస్కర్తయని కొందఱును వాదించుచున్నారు. ఎవరైనను, ఆతఁడు ఈఉమర్ ఖయాం కన్నచాలపూర్వుఁడు. ప్రాచీనకాలమందే భారతదేశమున అనఁగా కపిలాదిసాంఖ్యమతముల కన్న పూర్వమే యీనాస్తికమతము గలదని తెలియుచున్నది. వీరిసిద్ధాంతము వేదబాహ్యముగాదని శ్రు. "సవాఏష పురుషోఽన్నరసమయః" అనుశ్రుతులును పురాణములన్నియుఁ దమకుఁ బ్రమాణము లనిచెప్పుదురు. మఱియు ఆస్తికులకు పరమప్రమాణములైన యుద్గ్రంథములయందు సైత మీనాస్తికసిద్ధాంతములే యగుపడుచున్నవి.

శ్రు. మాయాంతరత్వే సదహం శివోఽహం
　　శక్త్యంతరత్వే చిదహం శివోఽహమ్;
　　శివాంతరత్వే శివరూపకోఽహం
　　అతఃపరం పూర్ణమనుత్తరోఽహమ్.

పైనతనకంటే అన్యము లేదని;

శ్రు. "నమాతృవధేన పితృవధేన, నస్తేయేన
　　నభ్రూణహత్యయా" హత్యలుచేసినపాపము లేదని;

భగవద్గీత—

శ్లో. నాదత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం విభుః;
　　అజ్ఞానే నావృతంసాపం తేన ముహ్యంతి జంతవః.
　　　　—పాపపుణ్యాలు లేవని;

నకర్తృత్వం నకర్మాణి లోకస్యసృజతిప్రభుః;
నకర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే.
　　　　—ఈశ్వరుఁడు కర్తగాఁడని;


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా.

చనిపోయినతరువాత పుట్టకపూర్వము మానవుఁడు కాఁడని;

జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి
యజ్ఞాత్వాఽమృతమశ్నుతే
అనాదిమత్పరంబ్రహ్మ
నసత్తన్నాసదుచ్యతే.
—ఈశ్వరుఁడు లేఁడని;

శ్రుతి. అసదేవేదం పురాసీత్

అనియు;

"లాయిలాఃఇల్లల్లా.
—అని ఖురానులోను, ఇట్లే మఱికొన్నియు గలవు.

"నమాంసభక్షణే దోషో నమద్యే నచమైథునే
ప్రవృత్తి రేషా భూతానాం నివృత్తి స్తు మహాఫలః."
"సౌత్రామణ్యాం సురాం పిబేత్ ప్రోక్షితం
భక్షయే న్మాంసం వైదికీ హింసాహింసా నభవతి."
—అని మనువును,

"ఉభౌ మధ్వాసవం పీత్వా ఉభౌ చందనచర్చితౌ,
ఏకపర్యంకశయితౌ దృష్ట్వా మే కేశవార్జునౌ.
—అనిపరాశరుఁడును.

* మధుసేవన మాంసభక్షణాదిదోషములవలన పాపము రానేరదని వ్రాయుచున్నారు.

ఈ ఉమరుఖయాముసు, చార్వాకులును పాప పుణ్యములను నవి లేవనియు

తే.గీ. ఎంతకాలంబు నదిలోన నీనిధాన
రాళ్లు విసురుదు రాళ్లను గుళ్లయందు
పూజచేసి హతాశునిఁ బోలెఁ బోదు
తెమ్మ మద్యమ్మ చెలువ, ముద్దిమ్మ రమ్మ
నరకమేమిటి స్వర్గంబు నాఁగనేమి.
ఉసురువిడిచి యాలోకమున్ మసుఁగునందు
మాయమై పోయెదవుగాన మధువు త్రావి
కలదినంబు లానందాన గడుపుమెచట
కేగెదో వచ్చి తెటనుండి యెఱుఁగ వీవు.

చ. శరధినిఁబోలువిద్యయును
జ్వాలనుబోలినజ్ఞానదీప్తియున్
బరఁగినవార లీనిశిత
భాసురగాఢమహాంధకార బం
ధురతరమార్గమున్ గడచు
త్రోవ నెఱుంగక కల్పనాకథా
భరితవిచిత్రవాక్యములఁ
బల్కుచుఁ నిద్దురఁబోయి రెంతయున్.

ఇట్లే ధర్మాధర్మములు, పూర్వాపరములు, స్వర్గనరకము లేవు. ఇసుకనుండి తీసినబంగారమునకు దగ్ధకాష్ఠన్యాయ మునుబట్టించి చూడవలయును. మానవులు తృణయవ వ్రీ హ్యాదులనుండి రేతోరూపమున మాతృగర్భమునఁ బ్రవే శించి వెలువడుచున్నారు. నిన్న నాకులలోపచ్చగ నున్న బంతిమొక్క నేఁడెఱ్ఱని పువ్వుచే నొప్పుచున్నది. అట్లే పరిణామమే మూలకారణము. అనాద్య నసములను పదార్థములపై నమ్మకముంచి భూతికి, సౌఖ్యమునకు భంగముగలిగించుకొనరాదు. చిన్నచిన్న గుంటలలోనినీళ్లు కప్పలేడ్చుచున్నను పశువులు త్రాగి పోవును. అట్లే తనసుఖమేకాని యెదుటివారియిబ్బందిని విచారింపనక్కఱలేదు. ఎల్లవారు స్వార్థపరులైనను పై పరోపకారులవలె దోచుచుందురు. అదిమోసము. దాని ముసూఁడ స్వార్థమే. గడ్డియైకొఱకబడుకంటె పక్షి కొఱుకుట మంచిది. ఒకరు నిన్ననలదితే నీవు వారి పలచుచున్నావు. ఆనందమేకాని దుఃఖమనేది లేదు. దుఃఖము నీవు కొనితెచ్చుకొనుచున్నావు. రాగమేకాని రోగము లేదు. వేడుకయేకాని వేడికోలులేదు. నిన్న టికి నేఁడొకదినము ముదిమిఆవహించినది. ముదిమి మేని ముసుగువలె మూయకముందే యిష్టోపభోగముల ను ము. నీవు కన్నులు మూయగనే నీసమాధిత్రవ్వువా వాఁడే, గడ్డపార చేతధరించి నిలిచినవాఁడే దండధరు యముడు. వానిపేరయే పాపపుణ్యములను తూఁచు త్రా సు. ఆబలిపీఠమే అన్నిటికి స్వస్తిచెప్పుమంత్రవేదిక ఏసును బలియిచ్చినారు. ఆరుధిరావలిప్తమైన బలిపీ కయే యమధర్మరాజు సింహాసనము. అందు బలియిచ్చు

* ఖురాను మిక్కిలిదోషమని చెప్పుచున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బడినవాడు మృత్తికారేణుసముదాయముచే పరిణమించిన ఎముకలు రక్తమిశ్రితమైన మాంసవసాస్వరూపముగు వ్యక్తి. అది శరీరమును వదలి ఒకగంతువేసి వాయువులో గలిసిపోవును. దాని నెవరు పట్టుకొనగలరు? ఎవరికి కావలెను? అంతామిథ్య. ఈశ్వరభక్తిని గూర్చి చెప్పునవన్నియు ముసలమ్మకథలు. తిని నిర్వ్యాపారముగ గూర్చుండుసోమరులచే కల్పింపబడినవే. వేదాంతములు (మారిఫత్), సూఫీలు (బ్రహ్మసూత్రములు), తసవ్వపు వ్రాసినారేకాని ఆత్మస్వరూప మిదమిత్థమని నిర్ణయింపలేక సర్వాంతర్యామియని యథోచిత నాస్తికవాదములోనికి లాగి మజేంత యంధకారములోనికి దింపివిడిచినారు. ఇవియేమియు యథార్థములు గావు. జీవించినన్నాళ్లు భోగించుటయే దారి. అదే జీవపరమావధి. అని పెక్కువిషయములచే సమగ్రమైన నాస్తికవాదము నిందుపూర్వపక్ష సిద్ధాంతములచే వ్రాసి అందందు శృంగారరసస్వరూపములను భావములచే పాఠకులహృదయమును మిక్కిలి ఆకర్షించినాడు.

ఉ. ఆరమణీమనోహరము
　　　ఖర్జము ముంగురు లుంగరాలసిం
　గారము పెట్టి దిద్దితి వి
　　　కాసముగుల్కెడు ముద్దరాల, సొం
　పారఁగఁ బొందరా దనెద
　　　వక్కట, నిండిననాఁటి పాత్రముల్
　బోరలవేసి నేలపడఁ
　　　బోలదు నీరుమనట్టులుండదే!

ఇట్టివే పెక్కులు గలవు. గ్రంథవిస్తరమని వ్రాయలేదు. ప్రతిపద్యమును భావపూరితమైన ప్రస్తావనమున కనుకూలించునట్లుండును. ఇట్లే రాజులను గూడ నిందించినాఁడు.

ఉ. గాడిదవంటి యీనృపుల
　　　కైవస మేమిఫలంబుగూర్చు నీ
　తోడను నేలపాండితినిఁ
　　　దోడ్కొనిపోయెదు వీర విద్యుతో
　బోడిమికిన్ వెలన్ బసఁగఁ
　　　బోవరు వత్సరమేడిపించి యే
　నాఁడును చేరెడంబువుల
　　　నర్మిలిఁ బోయరు దాహ మారఁగన్.

అస లీతఁడు విషయాసక్తుఁడే కాఁడని, ఈతనివేదాంతములోని మధువు ధ్యానామృతమని, కాంత ముక్తికాంతయని, విషయోపభోగములు సమాధినిష్ఠావిధానము లని తూచాలు పొల్లు పోకుండ అర్థములు చెప్పువారునుకలరు. వారీతని గ్రంథమునుండియే అనేకోదాహరణములు చూపించెదరు. అవి:

శా. రాగద్వేషము లాశ్రయించి విషయ
　　　భ్రాంతిన్ బ్రవర్తింప ను
　ద్యోగింపన్ దగునాజగాన విధిసం
　　　యోగంబుచే గంపతో
　భోగాపేక్షను వచ్చిపోయి రిటులే
　　　ముందింక రానున్న వా
　రేగన్ జాతురొ కాని యొక్కఁడిలపై
　　　యిష్టార్థముల్ పొందెనే.

ఉ. నీవు ధరిత్రి కామవిష
　　　యేచ్ఛలకై జనియించితంచు నీ
　భావమునన్ దలంపకుము
　　　వ్యర్థుఁడవై నశియించిపోదు వే
　తావుననుండి వచ్చితివొ
　　　తథ్యము నీవన నేమివస్తువో
　నీ విపు డేమొనర్చుటకు
　　　నెంచితివో పరికింపు మెంతయున్.

మ. విషయాసక్తికి లొంగిపోవక మహా
　　　వేగంబుతోఁ బోవు నా
　విషరాశింబలె తీవ్రవహ్నివిలసత్
　　　విస్ఫూర్తిమై దాఁచి పా
　రుషలీలన్ మనఁజెల్లు గాని రజమై
　　　రోదోంతరాశంబునన్
　వృషవాతాహతిఁ బోవునట్టి బ్రతుకిం
　　　దేలా విచారింపఁగన్.

అని యెన్నియో జితేంద్రియత్వమును గూర్చిన మహావిజ్ఞానవిషయములను గూడ వ్రాసినాడు. ఈర డెప్పుడును ఆసవపానాది దుర్విషయములుగాని కామినీప్రక్కం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పనాది విషయలంపటుడుగాని కాడని చరిత్రజ్ఞులు వ్రాయుచున్నారు. ఔరంగజేబీతని గ్రంథమును, హాఫీజు (ఈతఁ డొక సుప్రసిద్ధుఁడైన పారసీకవి.) ప్రబంధమును దేశస్థు లెవరును చదువరాదని నిషేధించినాడు. జేబున్నిసా (ఔరంగజేబుకుమార్తె) ఈగ్రంథముల నిరంతరము పారాయణము సేయుచుండెడిది. ఈవిషయమునుగూర్చి ప్రజ లౌరంగజేబునడుగ వీరవి యర్థముచేసికొన గలిగితిరేని చదువవచ్చునని చెప్పిపంపినాడు. దీనినిగూర్చి అక్బరు చక్రవర్తి తనయయినిఅక్బరి అనుగ్రంథములో మిగుల ప్రశంసించి యీ మహాగ్రంథములోని యుద్దేశములు సర్వసామాన్యములు; ఎల్లవారు గ్రహించుటకు సాధ్యముగాను వ్రాసినాడు. మొత్తముపై నీ శాస్త్రము చదువుచున్నంతసేపు మనస్సును చాల ఆకర్షించుచుండును. రహస్యరూపమెదుట తాండవమాడుచున్నదాయని తోచకపోవదు. ఇట్టిపరివర్తన మింకొకగ్రంథమువలన రానేరదు.

---

# కీరమా!

నాళము కృష్ణారావుగారు

“ఏచటి కేగెదు? కీరమా! యిందు రమ్ము
ఏటి కాయాసపడెదవు ఎగిరి యెగిరి?
పసిడితీగలఁ గూర్చిన పంజరంబు
వ్రేలఁగట్టితి, నల్లదే! వ్రాలు మందు.

దోరపండిన నునుపారుదొండపండ్లు
పరువమొందిన తీయని పనసతొనలు
కుడుపఁబెట్టెద నిచ్చలు కడుపునిండ
ఆరగింపుము కీరమా! హాయి మీఱ”

“మోదమందితి బాలరో! నీదుదయకు
డంబు మీఱిన నీపంజరంబుకంటె
మఱ్ఱిమ్రాకున నలరారు తొఱ్ఱలోని
నాదువెచ్చనిజిగిగూడె నాకు హితము

తలపవెన్నెలలందలి తళతళలును
మించునునుమంచుబిందుల మిలమిలలును,
కమ్మతెమ్మెరలందలి గమగమలును
విడిచి, నీయింట కడగిండ్లు బడఁగ నేల?”

“మండుటెండల మలమల మాఁడిమాఁడి,
వానసోనలఁ బలుమాఱు నాని నాని,
మంచుబిందుల మాటికి మాఁగి మాఁగి
కడిఁదిసీతును వడవడ వడఁకి వడఁకి

గాసి నొందఁగ నేటికే గండుచిలుక?
మంజులంబగు నాపైఁడిపంజరమున
కొంతకాలము తల దాచికొనఁగరాదె?
ఇచ్చ గలదేని పిదప పోయెదవు కాని.”

“మండుటెండలు వానయు మంచు సీతు
మీకు మనుజులకే కాని మాకుఁ గలవె”
స్వచ్ఛతర మగు నిర్మలవాయువులను
స్వేచ్ఛమీఱ విహారంబు సేయుచుందు.

మంచుమలలందు నొకసారి మలయుచుందు
జలదపంక్తుల నొకమాఱు చౌకళింతు
సాగరముమీఁద నొకపరి సంచరింతు;
పులుఁగులగుమాకుఋతుభేదములును గలవె”

“గిరుల, మబ్బుల, నంబుధిఁ దిరుగునపుడు
త్రోవ తప్పి భ్రమింపవే తోడు లేక?
చిన్నచిలుకరో! నీ కిట్టి సలుగు లేల?
చెలఁగి నాయండ నెపుడు వసింపరాదె?”

నోరు లేనట్టి పసుపక్షివారమునకుఁ
దోడుపడు నెవ్వఁ డాతండె త్రోవ సూపు;
కిరణములఁ జిమ్మి, జిగిమబ్బుపొరలఁ జించి
లీల విహరింతు నిచ్చమై గాలి వోలె.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు

(వెనుకటి సంచిక తరువాయి)

వీరభద్రారెడ్డి

ఇదిగో నిటఁ దమలపాకు లమ్ముచున్నది; దీనిం జూచి తమలపాకులు బేర మాడి రమ్ము.

(శ్రీనాథుఁడు పోయి వచ్చును.)

వీరభద్రారెడ్డి

రసికాగ్రగణ్యా! తమలపాకులదానిం జూచి వలచితివా యేమి? పెక్కుమాటలు సాఁగించితివి.

శ్రీనాథుఁడు

(నవ్వుచు)

"చ. తొలకరిమించుఁదీవ గతి
దోఁప దుకాణముమీఁద నున్న యి
య్యలికులవేణితోఁ దమల
పాకులబేరము లాడఁ బోయి నే
వలచుట కేమి శంకరుని
వంటిమహాత్ముఁడు లింగరూపి యై
కులుకుమిటారిబొమ్మపయిఁ
గోరిక లీరికలెత్త నాఁడఁగ౯."

వీరభద్రారెడ్డి

శ్రీనాథా! నీకెంతసాహసమున్నదో చూతము! చెంగావిచీర గట్టుకొని పోవునీపూవుఁబోఁడిం బిలిచి మాటాడుము.

శ్రీనాథుఁడు

"సీ. సొగసు కీల్జడదాన! సోఁగకన్నులదాన
వజ్రాలవంటి పల్వరుసదాన!
బంగారు జిగిదాన! బటువుగుబ్బలదాన!
నయమైన యొయ్యారి నడలదాన!
తోరంపుఁగటిదాన! తొడల నిగ్గులదాన!
పిడికిట నడఁగు నెన్నడుము దాన!
తళుకుఁజెక్కులదాన! బెళుకుముక్కరదాన!
సింగాణి కనుబొమ చెలువు దాన!
మేలిమి పసిండి రవకడియాలదాన!
మించి పోనేల రత్నాల మించుదాన!
తిరిగి చూడవె ముత్యాల సరులదాన!
చేరి మాటాడు చెంగావి చీరదాన!"

వీరభద్రారెడ్డి

కవిరాజా! కవులు తమ స్వభావమెట్టిదయినను సమయానుకూలముగఁ బ్రవర్తింపనేర్తు రనుటకు నీయిప్పటి శృంగారవర్ణనమే సాక్ష్య మిచ్చుచున్నది. నీవు మహానుభావుఁడవు; సకలవిద్యాపారంగతుఁడవు. బ్రహ్మజ్ఞాననిష్ఠాగరిష్ఠుఁడవు. నిన్నవేవిధంబునఁ జలంచిన నేమిలోపము? మహాకవీ! మన మిట వచ్చి చాలకాల మయినది. గంగాదర్శనము చేసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మార్కండేయేశ్వరు నారాధించి నగరునకుం బోవుదము రమ్ము.

శ్రీనాథుఁడు

దేవరవారియాజ్ఞ.

(ఇద్దఱు నడచుచున్నారు.)

(అటవీక్షేపంబునఁ బుష్పగిరిక్షేత్రంబును, గౌతమీనదియు, మార్కండేయేశ్వరాలయంబును గానిపించును).

శ్రీనాథుఁడు

(గంగదిక్కు మొగంబై చేతులు జోడించి)

శా. శైవాగ్రీయజటానవస్కరమహా
స్థానంబునం బొల్చి వే
ధోవీధ్రోరుకమండలూదరమునం
దున్నిల్చి విష్ణ్వంఘ్రిరా
జీవంబందుఁ దలిర్చి భూమిగతవై
చెన్నారు నోగౌతమీ
దేవీ! సేవ యొనర్తు దీనుని ననుం
దీపింపఁగాఁ జేయవే.

(రాజుదిక్కు మొగంబై) రాజా! యిప్పద్మాద్రిం దిలకింపుము.

మ. కల దిచ్చోటఁ గృతాదికాలమున లో
కప్రస్తుతంబై మునీ
ట్కలితంబై యమృతంపుఁగుండము మహా
కల్పంబునం దైసఁ ద
జ్జల మానర్ మృతి లేక జంతుతతి హె
చ్చర్ దానిపైఁ దమ్మిపూ
పొలుపుం గాంచినకొండఁ బెట్టి రమరుల్
ప్రోలింతె భూపాలకా!

ఈ పుష్పగిరి నరంబు—

మ. అవలన్ నాశికనుండి సాగరమునం
దాంతర్యతం బొందుదా
కినలన్ ప్రేలుచు భూపురంధ్రిగళమం
డింపారుముత్యాలపే
రవు నా గౌతమి వొల్చుదాని తరళం
బై పద్మభూభృద్వరం
బవితబ్రాహ్మణలోకమై వెలయు లో
కాధీశునాస్థానమై.

(రాజుతో నించుక నడిచి మార్కండేయేశ్వరుం దర్శించి చేతులు జోడించుకొని)

మ. ఉదితక్రోధముతోడఁ బ్రాణపవనం
బుట్టూఁతలూఁగింప ను
న్మదుఁడై వచ్చినదండపాణి నెదురన్
దర్శించి దైన్యంబునన్
బదియాఱేఁడులబాలుఁ డయ్యు నెడఁదం
బ్రార్థింపఁ దజ్జీవన
ప్రదుఁడై పొల్చినశర్వునిం గొలుతు మా
ర్కండేయనామేశ్వరున్.

వీరభద్రారెడ్డి

(స్వామికి నమస్కరించి కవిరాజుగాంచి) కవీంద్రచంద్రమా! నేడు మనరాజమహేంద్రపట్టణము చుట్టి చూచితిమి గదా! ఇది నీకెట్టిమనోరథంబు పుట్టించినది? ఇదియెట్టిప్రాశస్త్యము గల దని తోఁచినది? చెప్పుము.

శ్రీనాథుఁడు

రాజేంద్రా! చెప్పెద నవధరింపుము.

ఉ. రాజమహేంద్రుకాలమున
వ్రాసెను నన్నయభట్టు భారతం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బోజమెయిం దదాదిగ
మహోన్నతిఁ దెల్గది జన్మభూమికా
రాజిలు నిష్పదుర్క సుకవి
రాజసమంచితమై తలిర్చుట్ల
రాజమహేంద్ర మొప్పెసఁగు
నాఁటికి నేఁటికి సాటి లేనిదై.

వీరభద్రారెడ్డి

నీ కానందసంధాయక మగుటయే మా కానందము కవీంద్రా! మన మింక నగరునకుం బోవుదము రమ్మా.

(ఇద్దఱు నిష్క్రమింతురు. తెరపడును).

అంకాంతము

---

స్థలము—ఆస్థానము

[వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, అన్నామాత్యుఁడు, శ్రీనాథుఁడు, పురోహితుఁడు, ప్రవేశము.]

వేమభూపాలుఁడు

కవిరాజా! కృతిగ్రహణంబునకు ఋషిప్రోక్త కల్పంబు గలదా? తద్విధాన మెట్లు?

శ్రీనాథుఁడు

కృతిగ్రహణంబునకు ఋషిప్రోక్తకల్పంబుగలదు. "ఆదౌ పూజ్యో గణాధిపః" అనుటంజేసి గణపతిపూజం గావించి, పిదప నవగ్రహారాధనంబును, అష్టదిక్పాలకపూజయుం గావించి, యనంతరంబ కలశస్థాపనంబుచేసి, యందు గ్రంథముం బ్రతిష్ఠించి, సరస్వతింబూజించి, మంగళతూర్యంబులు మొఱయుచుండ నాగ్రంథము కృతికర్త కృతిభర్త హస్తయుగంబునం బెట్టుటయు నందలి కృతిపద్యము లొండు రెండు చదువుటయు దానివిధానము.

పురోహితుఁడు

ప్రభువర్యులారా! సుముహూర్తము సమీపించినది. ఆజ్ఞకుఁ బ్రతీక్షించుచున్నవాఁడ.

(వేమభూపాలుఁడు అన్నామాత్యునిం దిలకించును).

అన్నామాత్యుఁడు

బ్రాహ్మణోత్తమా! కల్పోక్తక్రమంబునఁ బూజఁ గావింపుము.

(పురోహితుఁడు శ్రీనాథునిచేతినుండి పుస్తకముం బుచ్చుకొని మంటపముపైఁ బెట్టి పూజించును).

(శ్రీనాథుఁడు కాశీఖండమును బూజాస్థానమునుండి పుచ్చుకొని వేమారెడ్డిదిక్కు మొగంబగును).

వేమభూపాలుఁడు

సార్వభౌమా! ఆంధ్రమహీమండలాఖండలుండైన వీరభద్రభూపాలునకుఁ గృతి సమర్పించి కృతార్థుండ వగుము.

(శ్రీనాథుఁడు వీరభద్రారెడ్డి సమ్ముఖమ్మునకుం జని వాని హస్తయుగంబున గ్రంథముం బెట్టును. కరతాళధ్వనులు మంగళతూర్యములు మొఱయును).

అన్నామాత్యుఁడు

కమలనాభపౌత్రా! నీవు ధన్యుఁడవు. శ్రీమహావిష్ణుతుల్యుం డయిన మారాజేంద్రునకుఁ గృతి సమర్పింపఁ గలిగితివి.

వేమభూపాలుఁడు (శ్రీనాథునకు రత్నాంబరంబు లర్పించును).

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నామాత్యుఁడు

కవీంద్రా! కృతిసమర్పణ పద్యములు చదువు దువా?

శ్రీనాథుఁడు

చిత్తము. మహామాత్యుల యాజ్ఞ!

(రాజుచేతిలోని పుస్తకమును బుచ్చుకొని వాగ్దేవిం బ్రార్థించి)

"శా. శ్రీకాశీనగరాధిరాజ్యపదవీ
సింహాసనాధ్యాసి లో
కైకగ్రామణి విశ్వనాథుఁడు విశా
లాక్షీ మనోభర్త సు
శ్లోకుం దొడ్డయయల్లభూవరు తనూ
జుశ్రీ వీరభద్రేశ్వర
క్ష్మాకాంతుం జగనొబ్బగండని మహైశ్వ
ర్యాన్వితుం జేయుతన్."

"క. గజదళ విభాళబిరుదున
కజగవధరభక్తి భావితాత్మునకు సము
ద్విజయునకు రాయవేశ్యా
భుజగునకును వీరభద్రభూపాలునకున్."

"వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన కాశీఖండంబు."

"మాలిని. వికచకమలనేత్రా! వేమమాంబాసు
పుత్రా!
సకలనృపశరణ్యా! సంశ్రితాశేషపుణ్యా!
మకరనిధిగభీరా! మానినీచిత్తచోరా!
ప్రకటగుణతరంగా! రాయవేశ్యాభుజంగా!"
"స్వస్తి"

(చదివి మరల పుస్తకము రాజు హస్తమునం దుంచును).

వీరభద్రారెడ్డి

(పుస్తకము మరల శ్రీనాధున కిచ్చి) అగస్త్యులు కాశిం బెడఁబాయుపట్ల రెండు పద్యములు చదువుము.

శ్రీనాథుఁడు

"సీ. పరమకళ్యాణి! సౌభాగీరథీ! గంగ!
వార్ధిభామిని; పోయివత్తు నమ్మ!
యమరేంద్రులార! లోలార్క-కేశవులార!
వనజసంభవ! పోయివత్తునయ్య!
శ్రీవిశాలాక్షి! దాక్షిణ్య పుణ్యకటాక్షి!
వాసవార్చిత! పోయివత్తు నమ్మ!
శ్రీపూర్ణభద్ర పారిషదనాయకులార!
వటుకభైరవ! పోయివత్తు నయ్య!
తీర్థసంవాసులార! కృతార్థులార!
పాశుపతులార! భాగ్యసంపన్నులార!
మందిరోద్యానవాటికామఠములార!
పోయివత్తును మీ కాశిపురము విడిచి"

"సీ. కలహంసి రారాదె కదలి నాతోఁ గూడి
నీ వేల వత్తమ్మ నెమ్మి నుండి
కదళికాకాంతార! కదలి రా ననుఁ గూడి,
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి
శ్రీవిశాలాక్షి! విచ్చేయు నాతోఁ గూడి
నీ వేల వత్తమ్మ నెమ్మి నుండి
నాతోడఁ గూడి యంతగ్రేహ! యేతెమ్ము
నీ వేల వత్తమ్మ నెయ్య నుండి
రండు ననుఁ గూడి సోదరవ్రాతులార!
వత్సలత గల్గి మీ రేల వత్తురయ్య!
పరమసర్వాభ్యసూయ దైవనాజ్ఞ నట్టి
కటకటా! సౌఖ్యజలరాశిఁ గాశిఁ బాసి."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీరభద్రారెడ్డి

ఆహా! నీకవిత్వ మనన్యసులభ మమృతప్రవాహము. నన్నయతిక్కనాదులును నీకుఁ దక్కువ యనియే నాయభిప్రాయము.

అన్నామాత్యుఁడు

మేలు మేలు. మహారాజా! మేలు మేలు. మనుబోంట్లమాట మాట కాదు. విద్వత్ప్రభువులమాట మాట. మీరు మెచ్చుట లోకత్రయంబు మెచ్చుట యని నాసిద్ధాంతము.

వేమభూపాలుఁడు

గౌడడిండిమభట్టు నోడించిన వీనిపాండిత్యమును, నైషధకాశీఖండంబులం దెలిఁగించిన వీని కవిత్వమును మెచ్చుకొననివాఁ డెచ్చట నైన నుండునా?

శ్రీనాథుఁడు

ప్రభువర్యులయనుగ్రహము కాని నేను సామాన్యుఁడను.

వేమభూపాలుఁడు

శ్రీనాథా! గాంధర్వకవిత్వములు పుట్టుకతోడం బుట్టునవి యందురు. చదువుకొనినఁ గవిత్వము చెప్ప లేనివాఁ డుండునా? పాడ లేనివాఁ డుండునా?

శ్రీనాథుఁడు

దాని కర్థ మిట్లు కాదు. రెండు కూనిరాగములు తీయుట సంగీత మనియు, గురులఘుజ్ఞానము గలిగి రెండు గీతలు గీయుట కవిత్వ మనియుఁ దలంపరాదు. ఆపాతమధురమైన సంగీతమును, ఆలోచనామృతమైన కవిత్వమును బురాకృతకర్మపరిపాకంబునం గలుగునవి కాని సామాన్యములు కావు.

వేమభూపాలుఁడు

చతుర్విధాంధ్రమున గ్రామ్య ముపయోగించుకొన నొప్పదా? అది వ్యవహారబద్ధము కాదా?

శ్రీనాథుఁడు

వ్యవహారము దేశమునకు గ్రామమునకు నొక విధము. శాసనము లేనిభాష సర్వజనైకవేద్యము కాదు. కావున గ్రామ్యము నింద్య మనియే మహాకవులసిద్ధాంతము.

వేమభూపాలుఁడు

గ్రామ్యకవిత్వ మెట్లుండునో విన నభిలషించుచున్నవాఁడ.

వీరభద్రారెడ్డి

(శ్రీనాథుం జూచి) నిన్న మనము వీథినాటకమునఁ జూచియున్నకవులం బిలువ నంపి తెప్పించినవా రీమహారాజునభిలాషం దీర్పఁ గల రని తలంచెదను, (అన్నామాత్యుని జూచును).

అన్నామాత్యుఁడు

ఎవ రక్కడ?

భటుఁడు

(ప్రవేశించి) అమాత్యశిఖామణీ! ముదల యేమి?

అన్నామాత్యుఁడు

నీవు పోయి ధర్మశాలలో నున్నవైదేశికులం దీసికొని రమ్ము. పొమ్ము.

భటుఁడు

చిత్తము.

(నిష్క్రమించును)

శ్రీనాథుఁడు

వేమభూమీశ్వరా! గ్రామ్యకవులు మువ్వురు తెలుంగులై యున్నవారు. లోకములో జనులు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యవహరించుమనట్లు గద్యపద్యము లల్లువారు. భావకవిత్వము లని కొంతవ్యావహారికభాషం జేర్చి కవిత్వము చెప్పెదు మనువారు. నీచాతి నీచభాషతోం బాటలు పదములు నల్లువారును.

వేమభూపాలుఁడు

ఇందు భావకవిత్వ మన నర్థ మేమో నాకుం దెలిసినది కాదు. భావము లేనికవిత్వ ముండు నా? ఉన్న నది కవిత్వమా? భావకవిత్వ మని యొకక్రొత్తగకుం బేరు పెట్టుట యేమి?

శ్రీనాథుఁడు

ఈభావము దేవర యూహించెడుభావము కాదు. ఈభావ మెట్టిదో యిప్పుడే విందురు గాక.

(అంత బైం జెప్పినమువ్వురు కవులును బ్రవేశ పెట్టఁబడుదురు).

(అన్నామాత్యుఁడు వారిని విశ్రమింప నియో గించును).

గ్రామ్యకవి

దేశభాషల్లో కవిత్వం చెబితే దేశీయులకి తెలుస్తుం దని చెప్పి అట్లు వ్యావహారికభాషలో గ్రంథా లుంటే సర్వజనులకీ సుబోధకంగా వుంటుం దనిన్నీ చచ్చి కుళ్లినచోక్కల్లా గున్న మృతభాష పనికి రాదనిన్నీ, దాంతో గ్రంథాలు చెయ్యడం పాప మనిన్నీ, ఆపాత్తైను గుతో గ్రంథాలు రాస్తే పిల్లాళ్లుఅర్థం చేసుకోలేక నా నాచిక్కులూ పడి వ్యర్థులై పోతా రని, అల్లా శాసనాలు పుట్టా లని నేను పదిపదిహేను సంవత్సరాలనుంచి భగీరథప్రయత్నం చేస్తూ వున్నాను. నామానప్రాణధనాలు దీనికే విని యోగిస్తున్నాను. ఏలినవా రనుగ్రహానికి ప్రతీక్షిస్తున్నాను. నేను కోరేది శాసనాల్లో వుండే మాటలు పాత్తాటాకుపుస్తకాల్లో వుండేమాటలే కాని మరోటి కావు. ఇంతే నావిన్నపం.

వేమభూపాలుఁడు

గ్రామ్యవాదీ! పద్యము కూడ గ్రామ్యములో నుండవలయు నందువా? వచనములో మాత్రమా?

గ్రామ్యకవి

రెంటియందున్నూ.

వేమభూపాలుఁడు

ఏదీ చూతము. గ్రామ్యముతో నొక్కపద్యము చెప్పుము.

గ్రామ్యకవి

క. చెబితే గ్రామ్యకవిత్వం
పెబు లందరు మెచ్చఁ జెప్ప వాలది కాదా
ఉబు సెందురు వ్రూర్కో వలె
సబలోపల మెచ్చు మెంచు సత్కవిమైతే.

అందఱు

(నవ్వుచుం గరతాళధ్వనులు చేయుదురు).

వేమభూపాలుఁడు

మేలు మేలు గ్రామ్యవాదీ! మాపండితు లందఱు నిన్నుఁ జూచి కవిత్వము నేర్చుకోవలసిన వా రగుచున్నారు.

అన్నామాత్యుఁడు

నీగ్రామ్యకవిత్వలక్షణము తెలిసినది. నీవు విశ్రమింపుము. (భావకవిదిక్కు మొగంబై) ఓయీ నీభావకవిత్వప్రభావ మొక్కసారి వినిపింపుము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భావకవి

భావకవిత్వ మన్న సామాన్యము కాదు. సామాన్యులకు మాకవిత్వములోని భావము తెలియుట దుర్లభం. అది యిప్పటివారికి తెలియక పోయినా ముందువచ్చేవారికి తెలియక పోదు. ఆఫల మపేక్షించే మే మి ట్లుద్యమించినాము.

వీరభద్రారెడ్డి

ఒక్కపద్యము చెప్పుము. విని యానందించెదము. దానిభావము మాకుఁ దెలియకున్న మాపండితులకైనం దెలియకుండునా? అట్లు తెలియకున్న నీవే చెప్పి నీభావము వెల్లడింతువు గాక.

భావకవి

చిత్తము, చిత్తము, చిత్తగింపుఁడు.

చ. చిలుకలు చెట్లకొమ్మలవ
    సించి కుహూ యని మాటలాడు కో
  కిలములు కావు కావు మని
    కేకలు వైచెడు కొండ లెక్కి కో
  తులు కయిసేసి సింగములతో
    సరసంబులు సంతరించు సి
  క్కలియుగరాజుకుఁ సకల
    కాలము జాలిని గోరి దీర్ఘతకఁ.

వేమభూపాలుఁడు

భేషు! భేషు! భావకవీ! భేషు! భేషు! నీవు చెప్పినట్లే నీభావము మాకు స్ఫురించినది కాదు. నీవే చెప్పి మ మ్మానందింపఁ జేయుము.

భావకవి

తనకవిత్వమునకు తానే వ్యాఖ్యానముచేయుట తప్పని చెప్పుదురు. అట్లే నాకవిత్వమునకు నేనే భావము చెప్పుట తప్పే యగును. కావున నేఁ జెప్ప రాదు.

వేమభూపాలుఁడు

కవిసార్వభౌమా! దీనిభావము నీవుచెప్పగలవా? ఇందు భావమున కభావమే యని నాభావము

శ్రీనాథుఁడు

అట్లనుట న్యాయ్యము కాదు. ఇట్టి భావార్థంబులు తొల్లియుం గలవు. ధారా నగరాధీశ్వరుం డగు భోజరాజు రాజ్యము సేయుకాలమున నొక్కనాఁ డొక్క తిలఘాతుకు నలంకరించి కాళిదాసుఁడు రాజదర్శనంబు సేయించె. రాజు నమస్కరింపఁగా వాఁడు అశ్వనీ, పునర్వసూ, కృత్తికా, రేవతీ, యని యాశీర్వదించినాఁడు. రాజు వాఁడు మూర్ఖుఁ డని గర్హించుచుండఁగాఁ గాళిదాసుఁడు రాజా! దీనిభావ మతిగంభీరము. ఆలకింపుము. "శ్లో. అశ్వనీ భవతు భూపమందురా, మందిరే భవతు తే పునర్వసూ; కృత్తికాతనయవిక్రమోస్తు తే, రేవతీపతికనిష్ఠ సేవయా" అని వీని యభిప్రాయము. అని చెప్పెనాఁడఁట! అట్లే యీ భావకవియును. దీనిభావం బాలకింపుఁడు.

కలియుగరాజుకుఁ =కలియుగములో రాజైన వీరభద్రరాజునకు, సకలకాలము=ఎల్ల కాలము జాలినిగోరి = కరుణతోడనని యర్థము ధ్వని; దీర్ఘతకఁ=దీర్ఘత్వముగా; అనఁగా దీర్ఘాయుర్దాయమును జెప్పుకో వలయును; మఱియు నిందు కలి; యుగ, రాజ, కల, కాల, జాలి, గోరి, వీనికి నానార్థములు కలవు. ఏయర్థము కావలయు నన్న నా యర్థము చెప్పుకొన వచ్చును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిలుకలు=చిలుకలవంటిస్త్రీలు, చెట్ల=దండల యందు; నసించి=ఉండి; కుహూ యని పలుక రించుచు నాడుదురు; అనఁగా సుందరస్త్రీల పొందిక కలుగుఁ గాక యనియు, కోకిలములు= పరభృతములు, పగులు శత్రువులు; కొండ లెక్కి యనఁగా నిలిచి యని యర్థము. కావు కావుము = రక్షించుము మని మొఱ్ఱ పెట్టుదురు. అనఁగా శత్రువులు వశు లగుదు రనియు; కోతులు=కోతిపనులు చేయువాండ్రు పిల్లవాం డ్రు; కయినేసి = అలంకరించుకొని లేక నేతు లలో నాడుకొనువారై సింగములతోఁ= ప్రభువులతో; సరససల్లాపము లాడుదురు. అనఁగాఁ బుత్రపుత్రికాసంతానము కలుగుఁ గాక యనియు నాశీర్వాదము.

అందఱు

బళిబళీ! బళిబళీ! (అని కోలాహలము)

వేమభూపాలుఁడు

ఇక్కడికి భావకవిత్వభావము తెలిసినది. ఇంక మూఁడవది తరువాయి యున్నది. తత్ప్రభా వముగూడ వినఁ దలంచితిమి.

పదకవి

(సంగీతముతో)

౧ ఎల్లి! రావే జాజిమల్లి రావే; మల్లీ మల్లీ
(వొచ్చి) వొళ్లోసూ గూకుండ॥ ఎల్లి
౨ నీతోనే గూకుంటే నిన్నే సూసూసుంటే,
నాపానా మింతాలో లేసీ వస్తా దోసి॥ ఎల్లి
3 సంతాకీ నువ్వోయి సనములో వచ్చినా,
యింతాలో నామడుసు యింకొక్కయిద
[మాద్ది॥ ఎల్లి

ర నువ్వే నేనూ నేనే నువ్వూ నీపానాము,
నాపానా మొక్కటే సూపేరులే కా[illegible]
[ఎల్లి! రావే

అందఱు

మేలు. మేలు! బళిబళీ! (అని కరతాళధ్వను[illegible]

వేమభూపాలుఁడు

ఇక్కడికి మూఁడు ముత్తెఅంగుల గ్రామ్యము[illegible] దెలియవచ్చినది. ఇట్టియపాత్రపు గ్రామ్యమ[illegible] నకుఁ బాత్రత గలిగించి విద్యాధికారు [illegible] వారే కొందఱు మందమతులై గ్రామ్యవాద[illegible] గౌరవించుచున్నారు. ఈ గౌరవించుట [illegible] కుక్కను గంగిగోవుం జేయుటయే. గ్రామ్య వాదీ! నీకవిత్వ మెత్తుకోలు మొత్తికోలను [illegible] న్నది. నీవాదము దుర్వాదము. భావక[illegible] నీభావకవిత్వము నేతిబీరకాయ వంటిది. నీ[illegible] త్వములో భావమే లేదు. నీకు గణయతిప్రా[illegible] లక్షణము కొంచెము తెలియునేకాని నీవు [illegible] తుఁడవు, కవివింగావు. నీ కవిత్వము పైత్యము గీతకపీ! లోకములో నీపాడు కవిత్వము ప్ర[illegible] క్తికిఁ దెచ్చుటకన్న దరిద్రము మఱియొక్క[illegible] లేదు. ఇది బూతుబూంతైన జావళీ కవిత్వ[illegible] కన్న నధమము. అధమాధమము. (మంత్రి దిక్కు మొగంబై) మంత్రివర్యా! ఇట్టి గ్రామ్య ము దేశమునఁ బ్రబలఁగూడ దనియు [illegible] ప్రసక్తిం దెచ్చినవా రెల్ల శిక్షార్హు ల[illegible] నొక్క శాసనము సృష్టించి, ఇప్ప [illegible] గ్రామ్యగ్రంథము లన్నియు నశింపఁ జేయ[illegible] యునని శాసించుచున్నవాఁడ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అన్నామాత్యుఁడు

(గ్రామ్యవాదులం జూచి) మీరు భాషాద్రో హులు. భాషాద్రోహి దేశద్రోహి నాఁబడు. మీరు శిక్షార్హులు. మిమ్ముశిక్షించుట న్యాయ శాస్త్ర సమ్మతమే.

అయినను మీరు బ్రాహ్మణులు కావున నిది మొదటితప్పుగా నెంచి మిమ్ముఁ గరుణించి పుచ్చినారము. మీ రింక నిట్టి కవిత్వమును బ్రసక్తికిం దెచ్చితిరేని రాజశాసనం బెట్లు చేయవలయునో మీరే తెలిసికొనుఁడు. పొం డు, బుద్ధిగలిగి మెలంగుఁడు.

గ్రామ్యవాదులు

(అధోముఖులై లేచి నిష్క్రమింతురు).

(తెరలో ఘంటలు)

వేమభూపాలుఁడు

మధ్యాహ్నకాల మయినట్లు ఘంటలు మ్రో యుచున్నవి. నేఁటి కీకొలువు చాలింతము.

(అని లేచును).

[అందఱు లేచి నిష్క్రమింతురు]

అంకాంతము



# ఆనవాలు

పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు గారు

ద్విపద

౧

స్వీయాధికారంబు చేమత్తుఁ డగుచు
న్యాయంబు విడి యక్షనాయకుచేత
ఏఁడాది, ప్రియురాలి నెడఁబాయు మనుచు
వాఁడియౌ శాపంబు వడసి యద్దాన
తనదు సామర్థ్యమంతయుఁ గోలుపోయి
వనట యక్షుండు ప్రవాసియై యొకఁడు
శ్రావణమాసంబు సన్నిధియగుడు
జీవితేశ్వరిని సజీవఁగాఁ జేయ
నేమంపు వార్తను జీమూతువలనఁ
గోమలికింబంప గోరి యీరీతి
అలకాపురంబునం దలరారు తనదు
నిలయంబు నెఱుఁగ వర్ణింపంగఁ దొడఁగె.

౨

ధనపతి మందిరోత్తర భాగమందు
అనతిదూరమున నే యలరు మద్గృహము
దానిచుట్టును శక్రధనువు నాఁగోట
కాననౌ మఱిసేకుఁ గనులఁపండువుగ,
చేతికందెడు పూలచెండ్లచే వంగి
నాతన్వి పుత్త్రి మన్ననఁ బెంపఁ బెరిఁగి
దీపించు నీకు గుర్తింప నాకోట
దాపున బాలమందార వృక్షంబు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మసృణ నైదూర్య సమంచితనాళ
విస్ఫురద్ధేమాబ్జ వికసితం బగుచు.
వాపి యొక్కటి యందు వరలు మారకత
సోపానపంక్తులం జూడనై యొప్పి
అందు వసించు రాయంచను నిన్ను
ముందు వీక్షించియు, మోసాలనున్న
మానసంబున కేఁగి మనవచ్చు నంచు
మానసంబున నేని మఱియొంచ వెపుడు.

౩

రుచిరేంద్ర నీలోరు రోచిరింఛోళి
విచికిల శిఖరమై వింతగొల్పుచును.
కనకరం భావనాక్రాంతమై జలద!
తనరుఁగ్రీడా పర్వతంబు తత్తటిని.
మిత్రమా! నాదు భామిని కదిప్రేమ
పాత్రపఠాటను "బదేపదె" చెప్పనేల?
నినుఁదటి త్సందర్శనీయుఁ జూచుడును
మనసున కది మఱిమఱి జ్ఞప్తివచ్చు
జలద! యాకృత్రిమ శైలంబునందు
విలసిల్లు నొకమాధవీ మంటపంబు
దానిచెంగటఁ జలద్దళ మశోకంబు
మానైన పొగడయు మఱికానిపించు
ఆరెండు నెపుడు దోహదకైతవమునఁ
గోరెదు, ననుఁబోలెఁ గోమలికూర్మి
ఒకటి తద్వామపాదోరుతాడనము
ఒకటి తన్ముఖమదిరో పాసనంబు.

౪

రవ్వల పీటతో రాజిల్లు పైఁడి
మవ్వంపు గడ,వాని మధ్యఁ జెన్నారు
పచ్చివెదుళ్లతోఁ బల్లటీలాడు
పచ్చరా యరుగు కన్పడు దానిక్రింద
ఘలుఘల్లుమని పైఁడి గాజులుమ్రోగ
లలిఁదాళములను మల్లలన యాడింప
ముదమొందు నీమిత్రముఖ్య మానెమలి
నిదురించు నజనుల నిత్యమాగడను.
గుఱుతు వేరొక్కటి గూడఁ జెప్పెదను
మఱివీని మదిలోన మఱవకు మయ్య,
కలవు వాకిట నిరుగడలఁ గుహ్యముల
సలలితగతి వ్రాసి శంఖపద్మములు
నాయెడఁబాసిన నాటనుండియును
ఏయుత్సవము లేక యొసఁగుట కతన,
దేజంబు చెడి యిల్లు దీపింపకుండు
రాజిల్లునే తమ్మి రవి నెడఁబాసి.

---

# నా జీవితనాటకము

బసవరాజు వెంకటప్పారావుగారు, బి. ఏ., బి. యల్.

ఈ కపటనాటకాల నే నికనాడ, లేను, తెరదించుడీ, కొరగాని నాలి
వేసముల వేసి పొట్టకై మోసగించి, పరుల లాలించి యాచించి బతకలేను!
గీ. పుట్టినట్టి పౌరుషమైన పుటక మరిచి, పరుని కృతికి వేసముగట్టు పాపమేల?
నా విధురజీవితమ్మునే నాటకమ్ము, జేసి, ఆడించి, జగతి రంజింపలేనొ?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# క్రొత్తపల్లి సూర్యారావుగారు

(వెనుకటిసంచిక తరువాయి)

## ఏడవయంకురము

వివాహమునంతటి సంతోషసమయ మేదియు లేదని స్థూలసృష్టికిఁదోఁచి నలువురు నానందింతురుగాని సూక్ష్మసృష్టిని విచారించిన నంతటి పెద్దవిచార మేసమయములో నెన్నఁడును గలుగదు. మగవానికి నాఁడుదానికి నిదియొక్క పెద్దచేఁపవచ్చి మీఁదఁబడుటయే—దశాంతరమునకు మాఱుటయే—బాల్యాదిదశలుమాఱి గృహస్థాశ్రమమునకుఁదిగుట మాటలతో నున్నదా! సంసారము మాకు వలదోయితండ్రీ! యని యొక్కనమస్కారముచేసి, శాస్త్రవేత్తలు గృహ్యసూత్రములు రచియించి మనుష్యులకు ద్వంద్వానురాగమునకు దారిచూపిన సర్వజ్ఞులు, మానులై యడవులఁబడిపోవుట— దీనికర్థమేమో యాలోచింపవలసినదే. సంసారమును భరించుటయనఁగా మీఁద నుండి పడుచున్న యాకాశమును బ్రహ్మాండముయొక్క పైచిప్పను దలఁపైఁబెట్టుకొని మోయుచుఁ గష్టభారమును లక్ష్యముచేయక— తల కెండవానలుటలేదు. వానచినుకులు మీఁదఁబడుటలే—దని సంతోషించుటవంటిదే కాదా! ఇప్పటికి మనవారిలో నెందఱో వందలు గడించుచున్నవారు కూడ నట్లు సంసారమును భరింతురు — సంసారమనఁగా భార్యయేపరమార్థము— భర్తయనునామమును మేమభరింపలేము. భార్యనెట్లు భరింతుమని చేసి విధిలేక యున్నజంజాటమునువిడిచి యడాయడలు చేయలేక వృద్ధలగుజనకులఁ బోషింపను మాత్రము పనిపూని కుమ్మరపురువులవలె సంచరించుచున్నారు. 'పెండ్లి, నాకుఁబెండ్లి, నాకు భార్యవచ్చును, నాకుమగఁడు, నగలు వచ్చునను నుబలాటము, బిడ్డలఁగందు'మను పెద్దయుత్సాహము— వెఱ్ఱిసంతోషము — ఇందుకనియే, జ్ఞానమువచ్చినపిమ్మట, నొక్కమాఱనుభవించుసంసారులంగాంచి యేమని మతిమాలుదురో, యీలోకయాత్ర యెట్లుజరుగునో — మొత్తమో యీసంసారము నాకువలదనిన గ్రామములన్నియు మునిపల్లియలగునేమో యనియే పెద్దలు, 'మామాటలు చిన్నలువినవలయును. మేము చెప్పినట్లుచేసి మెలఁగవలయును. మాయాజ్ఞలవలన మీకుఁ గష్టమువచ్చినను మీరనుభవింపవలసినదియే' యని బంధించివైచినారు. ఎదిగినకొలఁది స్వాతంత్ర్యమెదిగి 'నాకిది వలదు వీఁడు నాకు వల'దనియందురేని— ఎవ్వని నెవ్వతె యెవ్వతె నెవ్వఁడు నిల్పఁగలుగుదురు? అపుడు కావలులో మున్కరులో—పశుమర్యాదలకు దిగుదురు. సంసారమును భరించుట మాటలా? దానికొఱకే శాస్త్రములు చదువుట, రాజ్యము లేలుట, "తెప్పానాం తేలానాం." పరదేశములు ద్వీపములు గుండెలు చేతఁబట్టుకొని తిరుగుట, సముద్రములు దాఁటుట, యీపొట్టలు రెంటికినీసనముచాలదు. భూమిలోనుండిని క్షేపములు పైలు దేలినఁగాని యేనుఁగు దాహము చూరునీళ్లతోఁ దీఱదని భూములు పెల్లగించి యొలుకఁబోసి యెత్తికొనుట—సంసారమును భరించుట మాటలా? తాను గోఁచిపెట్టుకొని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తిరిగియైనను భార్యను సమ్మదిగి రానీయక, యొరుల కంటఁ బడనీయక, యింటిగుట్టొకరికిఁ జెప్పక, 'నలుపురితో నారాయణ'యని సంచరించుట సంతోషముచేతనేనా! మోసముచేసి పెద్ద లిట్టికష్టములలోఁ బడఁద్రోయుచున్నారు. తప్పదు సగముసగములో విడువరాదు. దీనియంతయు చూడవలయునని కుడితితొట్టెలోఁ జేబారలువేయుట యానందముచేతనా! సంసారమును భరించుట మాటలా-రోగములు రొష్టులు, బిడ్డలను పెంచుట, పెద్దవారిం జేయుట-ఈపెద్దవారిం జేయుటలో నెంతయర్థమైన నిమిడియున్నది. ఓసక్కా-వీ! ఏదీ, పెద్దవారిం జేయుట యన నెంతగంభీరాభిప్రాయమున్నదో వర్ణింపుము! వారికిఁ బెండ్లిండ్లు, వారికి సంసారములు, మన వేషమే వారికివేసి మొండినక్కవలె, మనము కష్టపడుచున్నపుడు వీరేల యూరకుండవలయునని యసూయచేతనువలె-గోతిలోఁ బడఁద్రోయుటయే-అబ్బబ్బ! సంసారమును భరించుట యనిన మాటలా? మగఁడు లోకాంతరగతుఁడైన, మగువ నడుము నాయఁగట్టుకొని బిడ్డలం బెంచుట-దైవమా! సోమలేశ్వరా! ఉమారమణా! వలదు వలదు; మగువ కీకష్టము వలదు, తెచ్చిపెట్టకుము. మగువ ముందే లోకాంతరము చేరెనా మగవానికష్టము చెప్పఁదరమా! అపుడు మగువాఁ డాఁడుదిగా మారవలయును. చేతఁగానిపై యీ రెండువిషయములం దలంచుకొంటిమా, వారువారు నలవాటు లేనిపనులలోఁబడు కష్టములం జూచితిమా, స్వామీ! ఒడలు గగుర్పొడుచును. వెంటనే సన్న్యాసాశ్రమము స్వీకరింపవలయుననినంతవైరాగ్యము గడుంగష్టునకైనఁ బుట్టును. పెండ్లియనఁగా నొక్కసారి యాఁడుదానికి-ఆడుకొనుచున్నదానికి-ఈప్రపంచము తలక్రిందుచేసి భూలోకములోని దానినిదీసికొనిపోయి యంతరాళమున వ్రేలాడఁదీయుటయో! ఇంతకంటె వేఱొకటియని యనుభవశాలులును మఱియొక్క దానిం జెప్పఁజాలరని చెప్పవచ్చును. బాలికకుఁ బెండ్లియైనదనిన వెంటనే రెండవ పనిలేదు. 'నాపెనిమిటికి దీర్ఘాయువిమ్ము. నాభర్తకు సుజ్ఞాన మొసఁగుము. నానాథునకు నాయందుఁ గరుణపుట్టునట్లు చేయుము. నా ప తి కి సం సా ర ప్ర భు త్వ మి మ్ము. నా ప తి కి, ధనధాన్యములు ప్రసాదింపుము'—అని దేవులాటతప్ప పెద్దలు వేఱొకదారి చూపింపలేదు. అంతయు నింతో గాంతునితో నున్నది. పెండ్లియన నొక్క-పందెమువంటిది. రామరావణయుద్ధమువంటిది. ఎవ్వగుగెల్తురో, యెవ్వరోడుదురో, పందెముగాదు, యుద్ధముగాదు- గెలుపోటములునైచికొనుటవంటిది. అదృష్టమెవ్వరిపంకఁ దిరుగునో, పదికాలములు తిన్నగా నడువవలసినదేకాని- నడుమనే యవాంతరమువచ్చునో, శివా! వద్దువద్దు, తండ్రీ! జ్ఞాపకముచేసికొనరాదు. ఆఁడుదానికి మగవానితో నున్న మగఁడుతప్ప దానికి వేఱుదైవము, పూజలు, వ్రతములు, యాత్రలు లేవందురు. అర్థమేమి? బాగుగా నాలోచించితిమా- ఆఁడుదానిగతి యధోగతి! ఆఁడుదానికిఁ బెండ్లియైనపనిసమాట గుండెలు గుభేలున వ్రక్కలింపఁ జేయునుగాని మాటయనవచ్చునా- ఎందఱో చూచుచున్నాము. ఎన్నికష్టములో పడుచున్నాము. దానిపైఁగల యాశ- ఛీ ఛీ!

"అన్నమైన నదేమిరా, సున్నమైన నదేమిరా" యని వేదాంతి- అన్నము సున్నము నొక్కటియే కనుక యన్నమే తినవగునురోయని- పాడునట. అట్లే సుఖదుఃఖములలోఁబడిన సంసారియును బాడును. దానిలో రుచియెట్టిదో - దానియున్నరుచి యితరవస్తువులపలేదు. అజీర్ణముం జేయు తీయనిలడ్డువముందిన బుద్ధి పుట్టునా? యారోగ్యమునిచ్చు మిరియములకషాయమున్రాన బుద్ధి పుట్టదు. నేను గవినిగానుగాని వేదాంతిని- నేను సంసారమునుగూర్చి వర్ణించినభ్రమరకీటన్యాయము పట్టునేమో- పట్టకేమి? నేనెందున్నదానను? సంసారమను పెద్దనెగడుపైన తేనె బానలియందమనిఁ వ్రాలినయీగను; వచ్చుచున్నదానను, బానలోఁబడి తెక్కలుబడిసి కాళ్ళుతులంటుకొనిపో విలవిలలాడు సమయమేయింక. నే నొక్కరినిభూషించిన దూషించిన 'నీవేప్రపంచమునందే యూడిపడితి'వని నలువురు నవ్వుదురు.

ఆభగవంతుఁడు మమ్ము మఱచిపోవలసినదే.కాని, మాలోనేమున్నది? మాపై నాతనికిఁ దలంపులేకుండ నుండవలయును. అట్లయిన మేము మువ్వురము నొకేకీతినుందుము. ఏల తలంపకుండ నుండును? అంతటి తొందరపనివాఁడు జగత్తులో నింకొక్కఁడు లేఁడు. ఆకోపవానిదేనెటేఁగతోఁ బోల్పవచ్చును. ఇది హీనోపమయైన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రేమోకాని యాతనిపట్లఁ బూర్ణోపమరయే - ఒక్కక్షణ మూరకుండఁడు. ఏకకాలమునందే రెండుమూఁడు లక్షల కోట్లు పనులుచేయ మొదలు పెట్టును. పట్టనములోని రాజకిరీటములోనికి మణినిగల్పించుటకును, గుహాలలో నిద్రించు నేసింహము చెవిలోనో, రోమములమీఁదనో దుముకుచుండు మిడినల్లికో చీడపేనునకో కాలునిలుగఁ గొట్టి బాధించుటకు, మహాసముద్రములోని తిమింగిలము గడుపుమాడ్చి, తిండికొరకక చిఱుచేపలై పరుగులిడుచున్న దానిని వేఁటాడుటకై వేఁటకాండ్రను సన్నాహము.చేయను,—ఒక్కఁడాని కేమి—యన్నింటికిఁ దానే పోవలయును. ఒక్కచెట్టు నెండింప, నొక్కచెట్టు (బండింప) నొక్కయాకురాల్ప, నొక్కకొమ్మ చిగిరింప- నొక్కఁడనో పడగొట్టి దారిలోఁ బడిపోయిన బాటసారి ముసలివానికి గంజినీళ్లు పంపుటకై సంసారి నొక్కని లేపను, మునిఁగిపోవుచున్న ద్వీపాంతరములోని రెయోడలోని బాలు నుద్ధరింప నొక్కపలక నమరించుటకు-'ఇందుఁగల డందు లేఁ'డని సందేహములోఁ బనిలేని యీశ్వరుఁడు-మనలను మఱచియుండునా! పాపము మఱచియే యున్నాఁడు. మేమెన్నిపాట్లు పడుచున్నామో కనుఁగొనుటలేదు. మా కర్మమున మేమున్నాము. అదిగోఁ గర్మమనఁగా నెవ్వరు? అట్టే దూరము పోవలదు. వేదాంతము ముదురనీయరాదు.

లక్ష్మీనారాయణునకుఁ దల్లి లేదు; తండ్రి యున్నాఁడు. శంకరదీక్షితునికిఁ దండ్రిలేఁడు, తల్లిగలదు. 'వారములు చేసికొని నాలుగు ముక్కలు నేర్చికొనుటకై నన్నుఁగూడ విడిచిపెట్టి స్థలాంతరవాసముచేసి కష్టార్జితముగా సరస్వతిలోపాటు లక్ష్మిని సంపాదించుకొన్నాఁడా మాలక్ష్మీనారాయణమూర్తి'యని యాతండ్రిపడిన సంతోషమునకు మేరలేదు. 'ఎన్నిదినములైనది! నాకిప్పటి కీశ్వరుఁడు సుఖముం గూర్చినాఁడా! నాకొడుకు గృహస్థాశ్రమము స్వీకరించాఁడా! నాకు నట్టింట నాకు వైచి వడ్డించుటకు నాభార్య యీకోడలిని బంపించినదా!' అని, చెప్పనలవిగాని సంతోసము. మాయమ్మ, 'కొండబవలె. వడుగువెట్టఁగానే పిడుగు పడినదన్నట్లు- అత్తవారియిల్లు చేరఁగానే కుండ చేతికి వచ్చినదని విచారింపలేదు. పోనిమ్మా, సందెగుమ్మ మాడ్చి నీళ్లుచల్లి, నాలుగుముగ్గుకఱ్ఱల వెట్టుటకుఁగాని, దీపము వెలిగించుటకుఁగాని 'లేక, పాడుపడియున్న సంసారమును నాలక్ష్మి మరలఁ బొత్తుచేయుచున్న'దని యానందించినది. అలవాటుచేత-'అమ్మా నే నుదికికొందునే; నేను మంచినీళ్లు లెచ్చెదను; బిందె యిట్లిమ్మని మామగారు దయచేసి నే పల్కెవాఁడు."మీకేలకష్టము నేనుండగా"నని లక్ష్మి పల్కెను. "నేను జేసిచేసి మెలఁకువలు నేర్చియున్నవాఁడను, నీవు క్రొత్తదానవు-నీవుండు"మనువాఁడు-"నేర్చినవారు మీరు నేరని దానికి నాకు నేర్పుఁ" డను నది లక్ష్మి-ఒక్కపని చేయనిచ్చునదికాదు. లక్ష్మీనారాయణునకు వేఱుపని లేదు. ఏఁడాదికొక్కసారి బళ్లిపాడువెళ్లి వస్తువస్తులు తెచ్చికొనుట, తండ్రిని బువ్వలలోఁ బెట్టి పూజించుట-'ఆహా! శంకరా నాపై దయవచ్చినదా! దయవచ్చినదానికా మరల సంసారములోఁ బడవైచుచున్నాఁడవు.' అని యాముసలాయన రాత్రిందివము లాకోడలిని గొడుకును ముద్దు సేయుటతప్ప వేఱుపని లేకుండెను. గౌరియత్తగారు- 'భగవంతుఁ డెక్కడ లేఁడు; దిక్కులేనిదానను; ఒక్కగా నొక్కకొడుకు; ఆపూఁటకు గతిలేదు; దేవుఁడా యెట్లురాయని బెంగపెట్టుకొన్నదానను. నాకొడుకుపై దయవచ్చినదా! తిండిలేనివాని కైశ్వర్యమిచ్చి, భార్యనిచ్చి, దీర్ఘాయుష్యమిచ్చి నాకన్నులు చల్లఁబఱిచి నన్నుఁ జలికాలఁదన్నినాఁడా! అమ్యతరామయ్యగారు పెట్టినదీపముగదా యిది. దివ్వెవెట్టి యామహాత్మునకు మ్రొక్కవలయును. 'ఏటికొనితిను కుఱ్ఱవాఁడే, వీనికేమి మనబిడ్డనేమి, యిచ్చుటయే'మని తలఁచినాఁడా; అగును, మాటికిఁదక్కవగాని కులమునకుఁ దక్కువగాదుగదా; ఏడంతస్తులమేడమీఁద నింకొక్కయంతస్తు లేవఁదీయుట మంచిదా పడిపోవుచున్నధర్మసత్రము నడికొప్పు బాగుచేయుటమంచిదాయని యాలోచించినాఁడు.' అని పొంగిపోయినది. మాయమ్మ, 'అమ్మో! అత్త కోడఱికము కత్తిమీఁది సాముగదా! ఆముసలిదానిచేతిలో నీకసుగందు, బ్రదుకుటయెట్లని కొండబవలెఁ దలంచినదా! మఱి కొండబవలె 'నా ముసలిముండచచ్చిన మావాండ్రిద్దఱుహాయిగానుందురుగదా'యని దురూహలు పెట్టుకొన్నదా! లేదు 'బిడ్డయడుగువెట్టినవేళమంచిదైనఁ బదిమందిచుట్టములు వత్తురుపోదురు. అల్లవారిపిల్ల మంచిది; చుట్టాల సు


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రభి యని పొగడుచుందురు. అత్తయింటఁ గొంతచేయూఁత యున్నది. మగఁడు చిన్నతనమునుండి సుపరిచితుఁడు, బుద్ధిమంతుఁడు- యేమోయేలుకొని తిందురని విడిచి నామా, కంచము, చెంబు, పాడు, గుడ్డ, యిచ్చి బ్రదుకుమని పంపితిమి- ఈనిసువుల చుట్టరికమున నా కన్నిసై పుల బంధుజాలము పెరుఁగునుగాక! నాకేమికొదవ-'అని కొదవయేదో జ్ఞప్తికిరాఁగాఁ గొంతసేపు కన్నులనీరుపెట్టుకొనుచు ననుదినముగాల క్షేపముచేయుచున్నది.ఆకొదవ భగవంతుఁడు తీర్పవలసినది; తీర్చినాఁడుకాఁడు; మించ లేదు. తీర్పనచ్చును. ఎంతమంది కొదవలు తీరినవికావు.

మాయమ్మకు మాకుటుంబముపై బెంగయెన్నఁడును లేదు. నిర్విచారము, విచారములేకేమిగాని- ఇది యొక విచారమా-'దేశముగాని దేశములో నున్నది. మనమాట మనమంతిలేదు. బిక్కుబిక్కుమనుచు నున్నది. మగవాఁడు పనిలోనికిఁ బోవును. ఇరుగా పొరుగా;ఏదో భాషయఁట. దీనికేమి తెలియును.' అని తలపోయుట మాయమ్మ కొక్కవిచారమేమో కాని నాకు విచారము లేదు. మేము రైలులోని పనివారమగుటచేఁ గాశీయాత్రకుఁబోవు తెనుఁగువారందఱు మాకుఁ బ్రతినిత్యము కనఁబడుచుందురు. దేశక్షేమము,గ్రామారోగ్యము, బంధువార్తలు తెలియుట కెవ్వరో యొక యెఱుకవారువచ్చుచునే యున్నారు. ఎఱిఁగినవారు రైలులోఁ గనఁబడిన 'శేపు వెళ్లవచ్చును రం'డని దింపి యింటికిఁదీసికొనివత్తురు. మా కొనాఁడు వారితోఁ జిల్లుబొల్లుమనుచుఁ గడచిపోవుచున్నది. లచ్చికిఁ జీరయని, నాన్నకుధావళియని, గౌరికిఁ బట్టురవికలని, అమ్మకు మహాలక్ష్మిపేఁటయనిఁ గౌరియత్తకుఁ దులసికోటయని, లచ్చిమామగారికి నాగరాక్షరముల పుస్తకములని యేవో యెవ్వరిచేతనో మేమిక్కడినుండి పంపుచున్నాము. మాకేబెంగయును లేదు. అందఱు క్షేమవార్తలు తెలియుచున్నవి. కనుక, నిరాలోచనముగ నున్నారము. జీతమంత యెక్కువదిగాదు. అత్తమామలకు మాదానిలోనుండి వారికిఁ జలినీళ్లకు వేఁడినీళ్లు తోడని పంపుచుందుమే కాని వారినిద్దఱ నిక్కడఁ బెట్టుకొనుటకుఁ జాలినంత లేదు. వారికక్కడ, మాకిక్కడఁ గడచుచున్నదని సంతోషము. అందఱివంటి గుణముగలవారైన నింక రెండుకుటుంబములను బోషింపవచ్చును.గడి పఱక-కణకణలాడునిప్పువలెఁ జూతురు. తాపేయున్న వారిలో నక్కడఁ బెద్ద. చేతిక్రిందఁ బదిమందియున్నారు. తీఁగటపాలో నొక్కరు, చీట్లిచ్చువా రొక్కరు, రాత్రిపనివారు కొందఱు, దీపములుచూపుటకు, దారులు మరలించుటకు, మూటలెత్తుటకు దింపుటకు, ... యెందఱో యున్నారు అందఱు నొక్కత్రాటిమీఁద నడిపింతురు. 'కక్కుఱితిపని పనికిరాదు. అది పుచ్చుకొనుఁడు. దారులు కొట్టవలదు. మనజీతము మన కక్కుతము. అన్యాయవిత్తము విషము. మనకు సహిరియిచ్చినది పుచ్చుకొనుటలోఁ దప్పులేదు. అది మనకరుగును' అని బోధించి వచ్చి సెట్టులుపడియున్న మూటలలో నుండి కోసి యపహరింపకుండ నేతి డబ్బాలకుఁ జిల్లులుపొడువకుండఁ గట్టడచేసిరి. వచ్చెడువర్తకులు,బాటసారులు,'స్టేషను మేస్టరుగారు బహుమంచివారు,లెక్కవారును సజ్జనులని పొగడుచుండిరి. పూవ, కాయ, గింజ, గిట్ట, నూనె, నేయి, పండు ఫలము స్టేషనులో సెనుమతికి వచ్చినవి దిగినవి మాపదిమందికి దొరకుచున్నవి. న్యాయముగా నుంచిచేసికొని తిననది లోపకార్యమనరాదు. అట్లిగారుకానియెడల 'వీరు తీసికొనితినుచు నేయున్నారు; మనమనమేల?' అని నిరాదరమునహింతురు. పనివాండ్రందఱును మహారాజ్ మహారాజని యడుగులకుమడుగులొత్తుదురు. ఈ మహారాజువూలమున మనకింతయన్నము దొరకుచున్నదని సంతోషపడువారు. విశేషమేమనఁగా నీస్టేషను, మాఱుమూల నేకొండలలోనో లేదు. పట్టనము సమీపమునఁగలదు. కావలసినంత బయలుగలదు. నల్లేరివలెనే మేమును జిన్నయావును సంపాదించికొన్నారము. చిన్న మేస్టరుగారు మాకంటెముందు వచ్చియున్నవారు గావున,వారొక్కయావును సంపాదించుకొనియున్నారు. రెంటిని మేఁపలేక 'సంప్రదాయము మంచిది. మాయింటఁబుట్టినది, పాలుకుడిచినది, ప్రక్కకుశేరుపాలిచ్చుదానిబిడ్డ, మీరుపుచ్చుకొనుం'డని యేదోరూపముచేసి పెట్టి మాకిచ్చినారు. నెలనెలకుఁ గొంచెము కొంచెముగా దానివెల మాయొద్దనుండి పుచ్చుకొనుపద్ధతిమీఁద గ్రహించినారము. నాకుఁబుట్టినింటఁగూడ దూడలపరిచయము గలదు. ఏకాఁపో బండెఁడు గడ్డిపంపుచున్నాఁడు. పనివాండ్రు చేతిలోనున్నారు. ఆపీని పెయ్యమానవచ్చె

నది. నాకింటియొద్ద నొకరితోఁబనిలేదు. చూడలేమో,
నేనేమో పొట్టనిచిట్టని- కట్టుఁగజ్జెయొద్దఁ దుడిచిపోడి
గానుంచుట, యొలువలు నాన వేయుట- చెప్పవలదా? ఒక్క-
పనివానియిల్లాలుదొడ్డది. 'మాయీ, మాయీ' యని నన్నె పు
డునదలను. దానిమాటలు అమ్మాయీ! అమ్మాయి! యని
నాయమ్మపిలుపువలె నొక్కప్పుడు తోఁచుచుండును. తల
యంటుకొనునపుడువచ్చి షీకాయనూఱిపెట్టును, వీఁపు
తోముచు. నాతెనుఁగునంట యామెకెంతో యిష్టము. ఏదో
వంటెనలు కట్టునపుడు చిన్నతనములోఁ దండ్రితో మన
దేశమువచ్చినదట- ఆపరిచయముచేత, నన్నాపె హూర
గాయపాటలలో నన్ననుసరించుచుండును. ఆమె సావాస
మే నాకుహిందీ నేర్చికొనుటకుఁబనికివచ్చినది. దొడ్డిఊడుచు
వానికొడుకే మాయావును బగలంతయు నెక్కడనో మర
ంచి మేఁపుకొనివచ్చును. ఎప్పుడైన నేను, తోటే యనిపిలి
చిన, 'హో! మాయి!' యని యంపటునువచ్చి పడుదురు.
చిన్నమేష్టరుగారు బాబూలు; వారిభాష యిది కాదు.
కాని దేశభాష హిందీ వారికివచ్చును. ఓహో యనుచుఁ,
గసలుకార్యము లపుడే కాని వారియాఁడువారితో గట్టిపరి
చయము నాకుదొరకలేదు. నీళ్లగొట్టముకడకు వారురారు.
ఏపనివాఁడో తెచ్చియిచ్చును. మఱియు వారియింటికి
మాయిల్లు కొంచెముదూరము.

కొన్నినాళ్లకుఁగాని తెచ్చికొనవలసినవి బియ్య
మును వస్త్రములునే. తక్కినవన్నియు యథేష్టముగా నిం
టికి వచ్చుచుండు నంతటి సమయము వచ్చినది. తల్లి
దండ్రులను రప్పింపవలయునని తలంచిరి. రైలులోఁ బెద్ద
యధికారుల మూలమున వారినిద్దఱను రప్పించుటకు ధారా
ళముగా మార్గపత్రము సంపాదింప గట్టి యత్నము చేసిరి.
ఇంతలో సామ్యము చెప్పినట్లు - ఒక్కరాజునకు బీద
వానిపైఁ గరుణవచ్చి యేనుఁగు నిచ్చినాఁడట- ఏనుఁగును
బుచ్చుకొన్నామన్న సంతోషమేనా - పెంచుటలోఁ
గష్టముమాట! ఈరీతిగానే జీతమెక్కువ చేసినామని
యధికారులు కలకత్తాకు మమ్ము మార్చినారు. చీపురు
పుడకయొద్దనుండి యిక్కడి వక్కడనేవిడిచి, యాపద్ధతి
మీఁదనే యావును దూడ నొకరికిచ్చివేసి-జీతమెచ్చునకు
నగరములో శట్టింపు సెలవులకు - సమానమానసములతో
నధికారులయాజ్ఞ ననుసరించి కలకత్తా చేరితిమి. ఇంక
వారిని దీసికొనివచ్చుట యెక్కుడా? గొంచెము గొప్ప?
చేతిలోనిది కూడ నెగిరిపోవు నవస్థవచ్చినది.

"మహారాజ్ కో బదలీ హోగయా హై" అని
యక్కడి పనివాండ్రే కాదు- చుట్టుప్రక్కల వర్తకులు
మొదలగువారు మేము బైలుదేఱునాఁడు రైలుకడకు
సమ్మంపవచ్చిరి. ఇదియును జెప్పవలసినదే. రైలుకదలు
నపు డొక్క వర్తకుఁడు ప్రీతిపూర్వకముగాఁ దాంబూల
మిచ్చినాఁడు. అది మేమొకటి రెండు నెలలు లేదవు
కొనకుండఁ గలకత్తాలో చక్కఁగా స్థిరపడుట కుపకరించి
నది. ఆతావు విడుచుట మాకును గష్టమే యనిపించినది.
అత్తవారింటికిఁ గ్రొత్తకోడండ్రు వెళ్లునట్లు దిగులుదిగులు
మనుచునే వెళ్లినారము. అక్కడమాత్రము మనుష్యులు
లేరా? ఇదియేనా మనము పుట్టినప్పటినుండి నివసించు
చున్నది? నేను రాక మునుపు రెండు తావులకు మాఱిరి.
ఎక్కడనున్నను నోరుమంచిది కావలయును. మనదేశ
స్థులు కలకత్తాలోను టెక్కువుందియున్నారు. కాశికి
వెళ్లువారంపటు నక్కడ దిగుదురు. కాళికాదేవి సాన్ని
ధ్యము జేరితిమి.

## ఎనిమిదవయంకురము

విద్యయందాశలేనివారును, గతించిన వ్యర్థకాల
మునకై పశ్చాత్తాపపడనివారును, జేరుగడింపవలయునను
నభిప్రాయము లేనివారును, ధనమున్నదే చాలును-మఱి
యక్కఱలేదనువారును, బీదవైనను సంసారభారమునకు
విసిగినవారును సాధారణముగా నుండరు. పెండ్లికాక
మునుపే-'యింటనున్న విద్యయబ్బినది కాదు. అది నాలో
పముగాదు. నాయదృష్టదేవత చేసిన లోపము. ఊరిలో
వేఱు విద్య నేర్చికొనుట కుపపత్తులు లేవు. అది నావంటి
బాలురు చేసిన సంఘదుష్కృతము. ఇంటఁ గావలసినంత
ధనమున్న నేపట్టనమో చేరి యేదో చూడవచ్చును. అది
మాకుటుంబము చేసికొనిన దౌర్భాగ్యము. వారితో
వారితోఁ జేసిన కృషి యింటిలోఁ దండ్రితోనే చేయక
పోయితినే- దృష్టి వేఱుగానుండుటచేఁ దండ్రిమాటలు
చెవి కెక్కలేదు. "కలవిద్యలెన్నియైనను గలవిద్యకు సాటి
రావు-' దానివలన ధనము రానీ మాననీ, యది యలవడినది
గాదు. ఇహపరసాధనములైన వేదాదివిద్యలు నా
కబ్బునా! పొట్టపూటి విద్యయైన నొక్కటి యలవడినదా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈకొలఁతలు, నీయుప్పరివారు, వడ్డెవారును నాకు సహ
వాసముచేయుననియు నొక విస్మయమేనా! దానిపై నేదో
కొంత యభిమానము గలిగినది. 'చదువునకిద్దఱు జపమున
కొక్కఁడు'నని సామెత-తండ్రిగారు చెప్పఁబోవు చదువు
నకు సహాధ్యాయుఁడు లేకపోయెను. ఎవ్వరో కొలఁతల
యుద్యోగితోఁ దిరిగిన నాకేమి ప్రయోజనము? నా
కాతఁడేదైన పనిచెప్పునా, యీతడు స్వాతంత్ర్యము
గలవాఁడుకాఁడు. వెనుక నొక్క చిన్నవానికి సమయ
మట్లు వచ్చినది. దొరతోఁ జెప్పినాఁడు. రెండుకోసుల
దూరము తిరిగి మార్గములోఁ జెట్లు చేమలు, తూములు,
మార్గము మెఱకపల్లములు సదునుచేయించుట-ప్రయాణికుల
సౌకర్యమునకు రాదారిని గాపాడుటయే యాతని పనియై
యుండెను. ఆపనిలోనుండి యాబాలుఁడు చేసిన గర్వపు
దుశ్చేష్టలు - పనియిప్పించిన వానిమర్యాద కూడఁ
దప్పుటకు హేతువైనది. తనకు పదిరూపాయల జీతమా?
తనక్రింద నొక్క మూడురూపాయల జీతపు సేవకుఁడా?
తన కుద్యోగ మిప్పించిన పెద్దయుద్యోగి యామడల
కొలఁది కాలినడకను దారులుచూచుటకు వచ్చుచుండ
నీచిన్నవాఁడు లొట్టుగుఱ్ఱము నెక్కి వచ్చుటయూ - సేవ
కుని జూచిరమ్మని తానింటఁ గూర్చుండుట - నలువు
రచేఁ బనిచేయించి యార్వురను బద్దువ్రాయుట-ఇట్లుండ
"విషవృక్షోపి సంవర్ధ్య స్వయంఛేత్తుమసాంప్రతం" మ్మని
యుండుటచేఁ గొంచెము మందలించి వినకున్న మిన్న
కుండి, పాపమాయన చిన్నవానినేమియు ననకుండఁగనే
లోపములు తానే సవరించుకొనుచుఁ గాపాడి కొన్నిదిన
ములలో వేఱొకతావునకు మార్పఁబడిన తర్వాత వచ్చిన
యొక్కరు విషయముఁ దెలిసికొని యధికారమును నూడఁ
దీయించిరి. "అధికారాంతమునందుఁ జూడవలదా యా
యయ్య సౌభాగ్యముల్" మన్నాళ్ల యల్పోద్యోగము
నకై రెపరెపలాడి గజాంతైశ్వర్యము బ్బి
నట్లుబ్బిన వాఁడన్యుని యాచించుటకు
మఱియొక పని చేయుటకు నభిమానము కల్గెను.
కులము పెద్దది; బలము తక్కువ? చెప్పవలసిన దేమి? ఆ
బాలుఁడు చివరకు- 'అప్పాలు తెన్నులు- మప్పుమాఁడు
తెన్నులు' చేసినాఁడు. ఇట్టియూళ్లలోని యుద్యోగమొక
యుద్యోగమా? ఇంతకంటెఁ బసులవెంటఁ దిరుగుట? సదు
ద్యోగము' అనిమనస్సులోనుండెను. 'పరులకుఁ జెప్పక-
లోలోన-తలిదండ్రులను విడుచుటయెట్లు? తానొంటరి
నింకొకస్థలమున నివసించుటయెట్లు?' అని చింతమనస్సు
లో మెండుకొనినది. సింహాచలయాత్రనుండి యింటికిరా
కుండఁగనే మార్గములోఁ దెండ్లిలట స్ఫురించినది. ఏది యే
క్కయుపాయము చూచికొని- తండ్రినడుగకుండఁ దెండ్లి
మున కొక్క ఉనికగుడ్డకొనుటకు రెండణాలైన స్వతంత్ర
ముగాసంపాదింప లేకుండ నింటఁబడియుండుట యొక్క
పౌరుషమాయని పుట్టినదికాఁబోలును దిగులుపడుచు
నేకాంతవిచారమునకు మొదలుపెట్టిరి.

సత్యకాలపు తల్లిదండ్రులు గ్రహింపలేదు. అప్ప
డప్పుడువచ్చు "ఓవరుసీరు" గారు కనిపెట్టినారు.
'అబ్బాయి! ఏలనీవు మునుపటివలె లేవు? విచారముగాఁ
గనఁబడుచున్నాఁడవు, కారణము నాతోఁ జెప్పు'మని యడి
గిరి. 'నాకేమియుఁ దోఁచుటలేదు. ఏపట్టణమునకైనఁ
బోయి యొక్క కాలక్షేపవిద్య నేర్చికొనవలయునని యు
న్నది. మావారొడఁబడరు. నేను స్వతంత్రింపఁజాలను.
నాకేదియు నుపాయము తోఁచుటలేదు' అని యోవరుసీ
రుగారితో విన్నవించిరి. 'దీనికింత యోజనయేమిటికి!
మాబంధువులే, ధనాఢ్యులు, వ్యాపారులు, నొక్కపట్టణము
లోనున్నారు. వీఁడు మిక్కిలి విద్యార్థియు- నీకే విద్య
యందభిరుచికలదో దానిని నేర్పించెదరు. నేను నిన్ను
వారికొప్పగించెదను పోయెదవా' యనిరి. 'కృపనగంటుకై
చి'పోయెద'ననిరి. 'వారి పేరను త్తరము చెప్పెదను నీవ్రా
యుము.' అని కాగితమునుగలము నిచ్చి 'అన్నగారికి-నమ
స్కారములు, ఈ యుత్తరము తెచ్చిన బాలుఁడు నా
కిష్టుఁడు. పల్లెటూరిలోనుండి కాలమువ్యర్థ మగుచున్న
దని పశ్చాత్తాపపడుచున్నాఁడు. వీనికేదేని మీరొక యుపా
యము కల్పించెదరా నాకుఁగల్పించినట్లు సంతోషించెదను' అని
వ్రాసి తాము చేవ్రాలుచేసి యాపట్టణమునకుదారి యిచ్చి
వాళ్లఁజెప్పి తండ్రిగారియనుమతియిప్పించి పంపించిరి. నా
ఁడగనే యామహారాజు-వీరు తెచ్చినయుత్తరముపుచ్చుకొని
చదివికొని-'దీనిని వ్రాసినవారెవ్వరు? నీ పేరెవ్వరు, గ్రామ
మేది' యని కుశలప్రశ్న చేసి తమగిడ్డంగిలో సాయంకాల
మువఱకుఁ గూర్చుండుమని- రాత్రియింటికిఁ దనతోఁ దీసి
కొనివెళ్లి, తమప్రక్కనే భోజనము పెట్టించి, మేడమీఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దికిఁ దీసికొనిపోయి కూర్చుండి- 'మరల నీవేయుత్తరము మీయోవరుసీరుగారికి వ్రాయు' మని—'మీరుపంపిన చిన్నవాఁడు వచ్చినాఁడు. ఇతని కభిమానముగలవిద్య యేదియో యది మేమునేర్పించుటకు మాకనేక సౌకర్యములున్నవి. మేమనేకవ్యాపారములలోనుందుము. దేనిలోనైన బ్రవేశపెట్టవచ్చునుగాని,ఈతనితల్లిదండ్రులసమ్మతిని మీరు కనుఁగొని రెండుమూఁడుకట్టుబట్టలిచ్చిపంపవలయును'అని వ్రాయించి చేవ్రాలుచేసి, 'అబ్బాయి! నాకుకొంచెము స్వస్థతగానున్నది. ఉదయమున నేను లేచువఱకుఁ గాచుకొని యుండవలదు. నీవు మరల నన్నుఁ జూడనక్కఱ లేదు. ఒడ్డెమంగలి నీకుఁ గ్రింద మంచముమీఁదఁ బ్రక్కవేయును పండుకొని తెల్లవాఱఁగనె లేచి వెళ్లిరమ్ము. భయము లేదు. నేను నీకుఁ గావలసిన విద్య నేర్పించెదను.' అని ధైర్యము చెప్పిపంపించిరి.

తలిదండ్రులకేమి, మన ఓవరుసీరుగారికేమి యా ప్రత్యుత్తరము సంపూర్ణానందము గలిగించినది. మంచి దినముఁ జూచి తండ్రిగారే దిగవిడిచి వచ్చినారు. నడుమ నడుమఁ గార్యాంతరములమీఁద వచ్చుచుండు ఓవరుసీరుగారు క్షేమసమాచారములు కనుఁగొనుచుండిరి. 'ఏవిద్య వచ్చినను రాకపోయినను వ్యవహారమునకు మాకు ముఖ్యముగాఁ జెప్పినదానిని జక్కఁగా వ్రాయువాఁడు లేక చిక్కుపడుచున్నారము. మీరు మాకుఁ జక్కని కుఱ్ఱవానినప్పగించినారు'- అని వారోవరుసీరుగారిని స్తుతించుచుండువారు. పుత్రసంతానములేని యామహాత్ముఁడు - వీరిని బెద్దకొడుకువలెఁ బెంచి విద్యాబుద్ధులు నేర్పెను. ఒక్కపూటనైన నొంటిగా విస్తరివేయ లేదఁట. ఆతల్లి కన్నతల్లికంటె మంచిదఁట - ప్రేమతోపాటు సమస్తసదుపాయములు చేసిరఁట-ఆమెకుఁ బుత్రుఁడవరుసలో మొదట- వీరు నిలువఁబడినచో నందఱు నేక గర్భజనితులనలెలోకులు భావించునంతటి సమానవయస్కులగు నా బాలికా సంఘమును వీరియందు దన్నగారియందువలె భక్తివిశ్వాసములు గలిగియుండెనఁట-ఆసదాత్ముఁడు, సజ్జనుఁడు, సర్వజ్ఞుఁడు, దేవభాష, రాజభాష, మాతృభాష చక్కఁగా నెఱిఁగినవాఁడు. లక్ష్మీసరస్వతులు వైరముమాని వారి యింట మెలఁగుచుండిరి. మహాబుద్ధిశాలి, బ్రహ్మవేత్త, తపోనిధి, నేర్పరి, తీర్పరి, ఎక్కడకుఁ జనుచున్నను, గుఱ్ఱపుబండిలోఁ గొమారునివలెఁ గూర్చుండఁబెట్టుకొని పురమంతట సంచరించువారట. కొన్ని నెలలు గడచినవి. శీతోష్ణాదిస్థితులు కొంత వికటించినవి. జ్వరమువచ్చినది. మొగమునఁ బాదములఁ గొంచెము మెఱుఁగు చూపెను. ఇంట సమస్తమును గలవు. స్వయముగా నామహారాజును వైద్యుఁడు. మేనమామ ప్రసిద్ధవైద్యుఁడు. మందులిచ్చుచునే యుండఁగా గీళ్లనొప్పులు వచ్చినవి-బెంగజబ్బేమో యని బండిచేసి తలితండ్రులయొద్దకిఁ బంపివైచిరి. ఏఱు దీసిపోయినట్లు నాలుగురోజులలో నన్ని జబ్బులును బోయినవి. మఱిపదినాళ్లుండి క్రమ్మఱఁ బట్టనముం జేరెను. నాఁడునాఁటికి వ్యాపారములోని విషయములు బోధపడఁ జొచ్చెను. ఒక్కొక్కపూటఁ దాము రాక 'అబ్బాయి! నీవు వెళ్లి యాపని యట్టులీపనియిట్లు చేయించి తలుపులు జాగ్రత్తగా మూసికొని, యెంతమంది పనివాండ్రు పనిచేసిరో, యెవ్వరేపనిచేసిరో వ్రాసికొని రమ్మని స్వతంత్రుని జేసి పంపుతారు. చెప్పినట్లు చేసికొని వచ్చుటయే కాక మఱునాఁటికిఁ గావలసిన యేర్పాటులుకూడఁజేసి వచ్చుచుండుటచే వారిమనస్సునకెక్కెను. కొంచెమో గొప్పయో రాజవిద్య యలవడినది. వ్యవహారకాండము కొంత నేర్పిరి. పదిమందికిఁ బరిచయము చేసిరి. ఇట్లు మూఁడేండ్లయిన జరుగకుండఁగనే నలువదిరేండ్లయిన వయసు రాకుండఁగనే యామహారాజు స్వర్గస్థులైరి. ముసలితల్లిని, తపస్వినియైన యిల్లాలిని యజ్ఞానమగు సంతానమును విడిచి చనినారు- ఈయనయం దంతకంటె నెక్కుడు ప్రేమకనఁబఱచుట కవకాశ మెక్కడిది. వృద్ధమాత మాత్రము వదలెనా! 'అబ్బాయి! అబ్బాయి!' యనికూడఁ ద్రిప్పుకొనుచుఁ గొన్నాళ్లు వ్యవహారములలోఁ ద్రిప్పుకొనియెంగాని యామె కేకపుత్రప్రేమ భూలోకమునం దసహ్యము పుట్టించెను.

తర్వాతను బరాక్రాంతమైన యా వ్యాపారములలోఁ గొన్నిసంవత్సరములు పనియెఱిఁగియున్నవారగుటచే నుండవలసివచ్చెను. ఇతరులయొద్దఁ బనిచేయుచున్నను భోజనము, బసవారియింటనుండి మార్చుటకు వలనుగాకపోయెను. మరల నొకజబ్బువచ్చినది. అది, యెంతమంది వైద్యులకును దొరక లేదు - ఎఱిఁగియున్న వైద్యు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లంఘనలు ప్రేమపడిరి. ఒక్కనాఁడా వ్యాపారశాలలలో నుండి యొక సేవకునిచేత 'నేఁడు నే నింటికి రాఁజాలను. రాత్రి యిండే పండుకొందును. ఉదయమున లేచి వత్తు'నని వార్త యంపినాఁడు. అదివిని యాతల్లి పడినదుఃఖము చెప్పనలవికాదు. 'ఈమాటచెప్పినంతనే వారు దుఃఖించుచున్నా'రని సేవకుఁడు వచ్చి చెప్పెను. 'అయ్యో'యని వానిబుజమున నానుకొని మెల్లగ నడచి యింటికి వచ్చిరి. అప్పటి కాయమ్మ'బిడ్డల నింటిలో నుండుఁ' డని లాంతరు వేయించుకొని సేవకునితోఁగూడ బంధువగు వైద్యునింటికిఁ జని 'బాబు! పిల్లవానికేమియును గుణము కనఁబడుట లేదు. నేఁడింటికి రానని చెప్పి పంపినాఁ'డని విచారించుచుఁ జెప్పెను. 'అమ్మాయి, నీకీ మమకార మెందుకు- వానికిక్కడఁ గుదురదు, పదిదినములకుఁ గొన్ని పోట్లము లిచ్చెదను తల్లిదండ్రుల దగ్గఱకుఁ బంపివేయుము. నీవీబెడద నెత్తిఁబెట్టుకొనకు'మని నిష్ఠురముగాను వెల్లడించిరి. అతల్లి యేమియు ననఁజాలక జీకటిలోఁ గన్నీరు విడుచుచు నింటికివచ్చినది. అప్పటికేవచ్చి- దొడ్డిలో వైటమంచముమీఁద మూల్గుచుఁ బండుకొనిరి. చూచినంతనే దుఃఖమును మరుపపఱుచుకొని 'అబ్బాయి! యెట్లున్నది. పోనీ, యక్కడఁ బండుకొనిన మంచినీరే కావలయునో యేమి కావలయునో యెవ్వరక్కడనని కలఁతపడితిని. బాబునడిగివచ్చితిని, రేపు పోట్లములిచ్చెదనని చెప్పె'నని యోదార్పుమాటలాడెను. ఆరాత్రి యాఁకలిలేక యన్నము తినలేదు. 'అయ్యో యిఁక నేమిదారి? తిండిపడిపోయినదే' యని యామె గట్టిగాఁ బలికెను. 'ఈయనకుఁ దోఁపలేదు. నన్నింటికిఁ బంపివేయుఁడు. రాముని నాతోనిచ్చిన నేను బోఁగలను. ఒక్కమాసము నే నందుంటికునాదురును- మరల వచ్చెద'ననిరి.

'అక్కడ మందెవ్వరిచ్చెదరు. పల్లెటూరు-'

'ఇక్కడఁ బట్టనములో మందిచ్చిన గుణముకనఁబడినదా.'

'ఇతఁడుగాక నింకొక వైద్యుఁడున్నాఁడిక్కడ-'

'ఎవ్వరైననిం తే. నాకు ధైర్యము లేదు, మీకుఁగష్టము గలుగకుండవలయునని చూచుచున్నాఁడను.'

'మాకేమికష్టము, మాకేమియుఁ గష్టము లేదు. నీకేమియుభయము లేదు.'

'నాకొక్కటియేభయము. మీకుఁ గష్టము కలి[illegible]చుచున్నాఁడనని-'

'నీవేమియు సందేహింపవలదు. నీకేమికావల[illegible]రాముఁడున్నాఁడు. నరసమ్మయున్నది. వారు నీకు [illegible]స్తోపచారములు చేసెదరు. మేమేమియుఁ గష్టపడము.'

'నేనిక్కడ నుండఁజాలను- కొన్ని దినములు [illegible]టికిఁ బంపివేయుఁడు.

'నామాటవినుము; నీవక్కడకువెళ్లిన గష్ట[illegible]యెదవు.'

'నన్నింటికిఁ బంపి వేయుఁడు - మీకన్ని [illegible]నావలనఁ గష్టము వచ్చును.

'చూచుకొందము గాని రాత్రియైనది. [illegible]కొనుము. నీవు సందేహింపవలదు.'

'నీకేమైనఁ గావలసి నన్నడుగ నిష్టము లేని[illegible]చెల్లెలున్నది. దాని నడుగుము, నీవలన మాకేమి[illegible]గష్టము లేదు.'

'నాకేమియు వలదు. నన్నూరికిఁ బంపుఁడు.'

ఈమాటల కొల్లో మాఱుమాట యాడ[illegible]కన్నీటితో లోనికిఁ బోయి హేతుతో 'ఇదిఁ[illegible]యింటికిఁ బోదునా యని పట్టుపట్టినాఁడు. నీవే[illegible]జెప్పి మరలింపఁగలవా' యని ప్రసంగించెను. ఆ[illegible]చెల్లెలువచ్చి తనమంచము నామంచము ప్రక్కనే [illegible]చుకొన్నది. నడుమ నడుమఁ బేరుపెట్టి - [illegible]'ఏమి మూలుగుచున్నాఁడవు. మంచినీరు కావలయునా[illegible]' యని యడుగుచుండెను.

ఆబిడ్డతో నీయన-

'నాకేమియు వలదు. నన్నూరికిఁ బంపి [illegible]రాదా!'

'అదిగో నీవామాటఁ బట్టుకొని [illegible]చేతనే యమ్మ వసారాలో విచారించుచున్నది.'

'అట్లయిన నన్నిఁకఁ దప్పక పంపివేయ[illegible]నాకదేభయము-నావలన మీకుఁ గష్టము.'

'మాకేమి కష్టము! సుఖముగా నున్నప్పు[illegible]నిచ్చి జబ్బుగా నున్నపుడు పంపివేయుదుమా?'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'నన్ను గురించి వీరు మిక్కిలి శ్రమపడియున్నారు. ఔషధములు పనిచేయనపు డిక్కడనే యేల-'

'రేపు మఱియొక మందు మార్పవచ్చును. అది కొన్నినాళ్లు చూడరాదా.'

'నాకు ధైర్యములేదు.నన్నూరికిఁ బంపివేయుఁడు.'

'అగును, నిజమే, మేమెంత జాగ్రత్తగాఁ జూచినను మేము మేమే. మీతల్లిదండ్రు లిక్కడలేరు.' (అని మొదంబడుటకై నిష్ఠురముగాఁ), 'మాయమ్మ నీకమ్మయగునా? మేము నీచెల్లెండ్రమగుదుమా? నీ వనారోగ్యముగా నున్నవాఁడవు. నిన్నింతకంటె నిష్ఠురము లాడఁజాలను.'

ఈమాటతో నీయనకుఁ గొంతమనసు మరలి-'అమ్మాయి! మీరేమనుకొన్నను మంచిదియే.'

'మేమేమియు ననుకొనుటయు లేదు-నీవే యన్నియు ననుకొను చున్నాఁడవు.'

'నా కీజబ్బు కుదురదను నధైర్యముతో నట్లూరికిఁ బోఁదలచి యంటినిగాని వేఱుకాదు.'

'నీవు పల్లెటూరిలో మందు ద్రాఁపులు దొరకక యెట్లుందువో యని మే మిట్లనుచున్నాము.'

అని యాచెల్లెలు లేచివచ్చి మంచపుఁ బట్టెమీఁదఁ గూర్చుండి - చేయిపట్టుకొని- 'నీవమ్మను మఱింత దుఃఖపెట్టకుము. రాత్రియన్నము తిన్నఁగాఁ దినలేదు. నేనిక్కడ నుండను, న న్నూరికిఁ బంపివేయుమని పెంకిపట్టు పట్టితివా కేవుబొత్తిగా నన్నమే తినదు.'

'అమ్మో, చూచినావుగదా నావలన మీకువచ్చు గష్టములు!'

'మాకేమియుఁ గష్టములు లేవు. పోనీకాని, మమ్మ గష్టపెట్టవలదు. నీకీయూరనుండుట కిష్టములేకున్న- అక్కయ్యదగ్గఱకు వెళ్లెదవా? అక్కడబావ వైద్యుఁడు. మనమందఱము నెఱిఁగిన రావుగారున్నారు. మంచివైద్యులు- అమృతహస్తమువారిది. రామునిగూడఁ బంపెదను. నీవక్కడకు వెళ్లెదవా.'

'ఈమాటవినఁగనే, మేమిదియన్నియుఁ గడలవలెఁ జెప్పుకొనవలసిన యోగముండఁబట్టి కాఁబోలును- 'అట్లే వెళ్లెద' నని సమ్మతించిరి. చెల్లెలొక్క యుఱుకలోఁ బోయి - అమ్మ! 'అక్కయ్యగారి యింటికి వెళ్లెదనని యొప్పుకొన్నాఁడే' యన్నది. ఆతల్లి చివాలున లేచివచ్చి 'అబ్బాయి! అబ్బాయి! నీకుభయములేదు. మీయూరు వెళ్లనంటివా. నీవు బ్రదికినవాఁడవే-'

ఈయన, 'మాయూరువెళ్లెదనని నే ననలేదు. మాయూరు మాయిల్లు నాకింతకంటె వేఱులేదు. మిమ్మ గష్టపెట్టుట నాకిష్టములేక-'

'ఇంక నీవు బ్రదికినాఁడవనియే నాకు ధైర్యము. రేపుప్రొద్దుననే రైలులో నెక్కించెదము పోయిర' మ్మని దగ్గఱఁగూర్చుండి సమాధానపఱచి యాతల్లి తాను సమాధానపడి-కొంతసేపుండి నిద్రించెను.

'దైవమా! ఈయమ్మకంటె నీచెల్లెలికంటెనా క్రొత్తచుట్టఱికము? అక్కయ్యనుబట్టి బావవైద్యమనకని- అక్కయ్య యత్తవారియింట రోగముతోఁబోయి యెట్లుందు'నని యేమైన సందేహపడియెనా? లేదు. ఈయిల్లే యాయిల్లని భావించెను. ఉదయమున రైలెక్కించినారు. ఆయూరిలోదిగి వారియింటికి ఘటమునఁ జేరనైచిరి. అక్కయ్య, బావ చూచినారు; ఏమియిట్లున్నావని యడిగినారు. వృత్తాంతము సమస్తముంజెప్పి, 'యింటికిఁ బంపివేయుమంటిని, నన్నిక్కడికిఁ బంపినా' రని చెప్పిరి. బావగారు, వదినెగారును 'మంచిపనిజరిగినది. అక్కడకుఁబోయిన నీపాటికి-వేంచేసియుందువు. (అబ్బ! యీమాట యిప్పుడనుచున్నను భయముగానున్నది.) చాల సంతోషముగానున్న'దని యాదరించి కొన్నినాళ్లువైద్యముచేయించి పూర్ణారోగ్యుని గావించిరి: ఏనాఁడెవ్వరికెవ్వరెంత యప్పుపడిరో యెఱుఁగరాదుగద! తల్లిదండ్రులీసమయములో నేమిచేసినారు.?ఏమియుఁ జేయలేదు.సంగతి తెలిసివచ్చినవారిని 'సరిసరి, మీరంతలువచ్చి మఱింత బెంగకలిగించెదరు.మీరుండనక్కఱలేదు. మేమున్నాము; పొమ్మ'ని బావగారు వదినెగారును వచ్చినవారి నెల్లఁ బంపివైచిరి. వారియాదరణము దైవకటాక్షమువలె వ్యాధినివారణముగావించినది.

"ఘనముగఁ బ్రాణముర క్షించిన యుపకారికి నప్రియంబు సేయుదు" నన నేర్తురె యెవ్వరైన - ఆనాఁడు మొదలు వదినెగారు వారియూరికి వచ్చినపుడెల్ల- ఏమయ్య 'యెన్నిసీసాలకందికట్టు త్రాగినావు. రైలు సంచి చిలుకకొట్టునఁ దగిలించినావా'యని హాస్యముచేయుచుండెడునారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఏసునాథ స్తవము

రాజా మంత్రిప్రెగడ భుజంగరావు గారు

క్షమసర్వవిషయ సూక్ష్మగ్రహణంబును సకలపండిత తిరస్కరణ మహిమ
మించిలోకమును శాసించెడుశక్తియు ఘనకార్యనిర్వాహకత్వలఘుత
స్వీయసంకల్ప వశీకరణప్రాప్తి స్వేచ్ఛావిహార నిర్విఘ్నసరణి
యనుపమాన భగవదవతారపురుషత సర్వేంద్రియజయత్వసంపదయును
గలిగియణిమయు మహిమయు గరిమ లఘిమ-ప్రాప్తి ప్రాకామ్య మీశితవశిత యనెడు
నెనిమిదైశ్వర్యముల నొప్పు నేసువిభుఁడు-తలఁప సామాన్యుఁడే మహీతలమునందు.

సీ. వీక లాజరు విధవాకుమారాదుల మృతులవేగంబున బ్రతుకఁజేసె;
బంగ్వంధవిజ్వర పక్షవాతాదిరోగంబులఁ గడఁకితోఁ గడకుఁద్రోచె;
దరిలేనిబాధలఁ దవిలి కుందెడి పలువురిదయ్యములఁ బారఁదరిమివైచె;
జారచోరాది దుష్టప్రవర్తకుల పాపంబులనెల్ల దూరంబొనర్చె;
నిట్టి సద్గుణసంపన్నుఁ డిట్టి లోక-కష్టహరణుండుఁ బ్రశమితకల్మషుండు
ఘనకృపాశాలి యేసునాథుని ధరిత్రి-భగవదవతారమూర్తినాఁ బొడిగాదె!

సీ. తనశిష్యులు భయాద్భుతంబులుచెందంగ నీటనడచియోడ నెమ్మిఁజేరె;
గంగాళముల నుదకంబునుగడునింపి దానిఁ జక్కనగు మద్యముగమార్చె;
నైదురొట్టెలతోడ నైదువేలజనమ్మునకుఁ దృప్తిగా భోజనమ్మువెట్టెఁ;
దనుజపంపాతిపెట్టిన మూఁడునాళ్లకు నలమృతులసజీవుఁ డగుచులేచె;
మీనముఖమునఁ బన్నీయ మేటినాణె-మును ముదమునరప్పించెఁ; బెగినభటుచెవిఁ
బరగ నంటించెఁ; గాలితుపానునడఁపె;-స్వామి యేసు పను లమానుషములుగావె!

సీ. సృజియించు సప్పరమేశ్వరుఁ డొక్కఁడే యనియన్యదైవముల నిరసించె;
నఖిలంబులగు నైతికాదర్శములఁజేయఁ బూనుఁడంచుఁబ్రజకు బోధఁజేసె;
స్వచ్ఛందవర్తన సల్పువారే నిర్మలుని దేవునిం గందురని వచించె;
సత్ప్రవర్తనలేని సకలయాగాదికర్మలు వ్యర్థములటంచుఁ దెలియఁబలికెఁ;
దనర మానవసౌభ్రాతృత భగవత్పి-తృత్వమును విశ్వసించి వర్తించువారె
ఘనులనుచు నట్లు నడచిచూపినమహాత్మ-నేసు మానవమాత్రుఁగా నెన్నఁదగునె!

సీ. తనయందు నహితవర్తనులైనజనులందు మిత్రభావముతోడ మెలఁగుటొకటి
ప్రభువులయందైనఁ బ్రజలయందైన నక్రమచర్యలున్నఁ బోకార్చుటొకటి
ఇతరులు తన్నెంత హింసించుచుండిన రెచ్చిపైఁబడక సైరించుటొకటి
అతులిత దుస్తరోద్యమములనైన సాత్వికనిరోధమున సాధించుటొకటి
శత్రుదార్జన్య మధ్యాత్మశక్తి సమయఁ-జేసి వారల లంఘింపఁ జేయుటొకటి
దూరదర్శన మొకటి క్రీస్తునకుఁజూడ-ఘనతరములగు నైసర్గికములుగావె!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



ఏసునాధుడు

పిల్లలను దీవించుచున్నాడు

శ్రీ రాజా యం. భుజంగరావుగారు దీనిని ప్రకటనార్థము దయతో నొసగినారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# అనాథ బాలిక

తోలేటి పేర్రాజు గారు

౧

మురళీధరుడు గొప్ప సంఘసంస్కర్తయని ఒప్పుకొనక తప్పదు. అతనితో పరిచయమున్న వాళ్లంతా "మురళీధరుడు చాలా ఉదార స్వభావుడు, దయాపరిపూర్ణ హృదయుడు" అనేవారు. మురళీధరుడు కుశాగ్రబుద్ధి గలవాడు గనుక బాల్యంలోనే యం. బీ., సి. యం. క్లాసు చదువుచున్నాడు చెన్న పట్నంలో.

సాయంకాలం అయిదు గంటలైంది. మురళీధరుడు తెల్లని ఖద్దరు ధరించి భారతీ మాసపత్రిక చూస్తూ కూర్చున్నాడు పడక కుర్చీలో. అంత పన్నెండుసంవత్సరముల బాలుడొకడు పరుగుపరుగున వచ్చి "మురళీధరులు మీారేనా" అంటూ ఒకఉత్తరమిచ్చిపోయాడు.

ఆలేఖ పఠించుచుండగనే మోము వికాసం వాడి వెలవెల పోదొడగింది. నీరవుడై,నిశ్చితుడై "ఉశ్శూ" అని ఒక పెద్దనిట్టూర్పు విడిచాడు పాపం మురళీధరుడు. అప్రయత్నంగా బొటబొటమని కన్నీరు పిల్లకాలవలా ప్రవహించడం మొదలుపెట్టింది. భగవానుడగు భానుడు చూడలేక కాబోలును పశ్చిమాంబుధి క్రుంగిపోయాడు.

"పరాత్పరా! అప్రతిహతమాయా ప్రభావా! నీమాయ లెరుగ నేరితరము! ఆ అనాథ బాలికకు ఇంక ఎట్టిఎట్టికష్టములు పెట్టనెంచితివో కదా!" అంటూ మళ్లావుత్తరం చదవడం మొదలుపెట్టాడు మురళీధరుడు.

"నవమాసములు మోసి నినుకన్న పదియవదినముననే అపారకృపావతి యగు మీా తల్లి పరమపదం బలంకరించుటచేతను, నీవు తదుపరి మాయింటనే పెంపబడుటచేతను,రక్తస్పర్శ కలియుటచేతను, ఇరువురము ఒక్కవక్షస్థలమున క్షీరము క్రోలుటచేతను విచారము మానుదమన్నను పొంగి పొరలివచ్చుచున్నదే. ఆడిన ఒక్కచోట, కుడిచిననొక్కపాత్రలో, శయనించిన నొక్కశయ్యగదా! కఠినుడై నీజనకుడు నిన్ను తీసుకొనిపోవుతరి నే పొందిన విషాద మపారముకదా! నీ కొరకై అహర్నిశము పరితపించుచు, పలవించుచు నేనొక మాసమువరకు పొందినవిచారము తలచుకొన్న ఇప్పటికిని గుండె నీరైపోవుచున్నదే! ప్రత్యక్షమందు కాకపోయినను పరోక్షమందైనను, ఎచటనో ఒకచోట సుఖులై యున్నారని విని సంతసించి యూరకొంటిమి.గోరుచుట్టు మీాద రోకటిపో టన్నట్లు, మాయదైవమా, ఆమె కెట్టికష్టము తెచ్చిపెట్టితివోయి! "అంటూ కుర్చీలోంచి లేచాడు మురళీధరుడు. తారకాకాంతలు అంబరమునుండి వాని కష్టములు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాంచి బాష్పభరితలోచన లైనా యనునట్లు బొటబొటమని చినుకులు పడ్డం ప్రారంభిం చాయి.

అంత మురళీధరుడు తనసైకిలెక్కి సము ద్రతీరాన్నుంచి పూర్వసువాసినీగృహం దాటి మైలాపురం చేరుకొన్నాడు. అచ్చట నాలుగు వీథులు పరికించేటప్పటికి "పి.టి. స్టోర్సు, చేప్టి స్టు మిష" నని. కనపడింది. తిన్నగా లోపలి కెళ్లాడు మురళీధరుడు. ఒకవైపున చిన్న కుటీర మొక టుంది. అందులో "ఉ, ఉ, ఉ" అని మూల్గు వినబడుతోంది. నోట మాట లేదు. మురళీధరునకు ఏదో గొప్పతప్పు చేసి నట్టు గుండెలు దడదడ కొట్టుకోడం మొదలు పెట్టాయి. ఎట్లాగైతే ఏం, గుండె నిబ్బరం చేసు కొని తలుపు తట్టాడు మురళీధరుడు. అంత "ఎవరు వా" రని గద్గదస్వరంతో అంటూ "గబుక్కున" గడియ తీసారు.

తోడనే లోన ప్రవేశించాడు మురళీ ధరుడు. కట్టెదుట మంచముమీద మూల్గు చున్న వ్యక్తివంక తనదృష్టి సారించి నిశ్చేష్టి తుడై విగ్రహంలా నిలబడిపోయాడు పాపం మురళీధరుడు. అంత పన్నెండువత్సరముల బాల నివురుకప్పిన నిప్పులాలె జీర్ణవస్త్రధారి యై తలుపు వెనుకనుంచి నిమేషకాలము ఆ పాదమస్తకము పరికించి "బావా! వచ్చితివా" అని పెద్దపెట్టున ఏడ్చుచు వచ్చి కౌగలించు కొనెను. మురళీధరుడు ఆమెను వారించ ప్రయత్నంచేసాడు కాని విచారం తనకే పొంగి పొరలి వచ్చేసింది. తన జేబురుమాలుతో ఆమె కళ్లనీళ్లు తుడుస్తూ "అమ్మడు! ఎందుకే ఏడ్పు? జబ్బన్నది మనుష్యులకురాక మానుం కొస్తుందా వెర్రిదానా! మనమీదే పగ వాడా, రేపోఎల్లుండో నాన్నకు కాస్త నిమ్మ దిగా ఉంటుంది. మరి ఊరుకో" అంటూ మం చం సమీపాన కెళ్లాడు మురళీధరుడు.

"ఉ-ఉ-ఉ-" అన్న మూలుక్కి పరిమితి లేదు. ఆయాసం అధికంగా ఉంది. నోటినుంచి నురగనురగల్లా వచ్చేకఫానికి విసుగు విరామం లేదు. మురళీధరుడు మెల్లగా మంచం పట్టె మీద కూర్చొని "మామ, మామ, మామ," అని ముమ్మారు మెల్లిగా పిల్చాడు. పాపం మాటాడలేక కాబోలును "ఊ" అని ఒక పెద్ద నిట్టూర్పు విడుస్తూ కనులువిచ్చి మురళీ ధరునివైపు చూస్తూ బొటబొటమని కన్నీరు విడిచాడు. మురళీధరునకు ఆవ్యక్తి జీవించు నని ఆశలేదు. తన కొంగుతో కన్నీళ్లు తుడు స్తూ విచారించవలదని చేసన్న చేశాడు.

అంత రాధ వెక్కి-వెక్కి ఏడవడం మొదలుపెట్టింది. "రాధారాధా, ఎందుకే ఏడ్పు? మామమనస్సు కలత చెందుతుంది— చూడు నాన్న మాట్లాడలేక ఊరుకోమని చేసన్న చేస్తున్నాడు" అంటూ దగ్గరకు తీసు కొని కన్నీళ్లు తుడిచాడు మురళీధరుడు.

" ము-ర-ళీ-ధ-రా, హు-హు- మురళీ- ధరా-హా- నేను మిక్కిలి పాపాత్ముడనోయి. మతద్రోహిని-దేశ-ద్రోహినోయి; నా మొఖం చూస్తే ఆరోజు-నాకు- దుర్దిన మేటు—" అన్నాడు ఆవ్యక్తి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"మామ! ఇప్పుడు అనవసరంగా మనస్సు కలత పెట్టుకోకండి. చూరునుంచి నీళ్లు కారు తుంటాయి. అదివర్ష పునీళ్లుగాని చూర్నీళ్లా?



'రాధా రాధా, ఎందుకే......ఊరుకోమని చేసన్న చేస్తున్నాడు'

మామా! అంతా దైవయత్న మండి. తప్పు చెయ్యడం, చూశారు, మానవ లక్షణం. అది తెలుసుకొని పశ్చాత్తాపపడ్డం మహాత్ముల లక్షణం" అన్నాడు మురళీధరుడు.

"మురళీధర! ఒక గొప్పరహస్యాన్ని వెలి పుచ్చేటందుకు రావించానోయి! మీ అత్త రాధను కన్నపదియవదినమున నే ప్రసూతిచే మరణించినదోయి! అంత నీలోకము అంధకారముగ కాన్పించినదోయి, మురళీధరా! కామాంధుడనై మతభ్రష్టుడ నైతినోయి. మీ అత్త అవసానకాలమందు పసికూనయగు రాధను చూపుచు 'జాగ్రత్త, జాగ్రత్త,' అని ముమ్మారు చెప్పినది. మురళీధరా! నే నొంటిగానున్న సమయమున పిలిచి కంటనీరు గ్రుక్కుకొనుచు 'నే జీవించను. రాధ దైవవశంబున బ్రతికి బట్ట కట్టినయెడల నాముద్దుమురళీధరున కిచ్చి వివాహం చేయవలయును. అదియే నాకడసారి కోరిక' అనెను. నే సమ్మతించినను 'నా కభయ మియ్యా' మని తనచేతిలో చేయివేయించుకొని మరీ మరణించినదోయి! చెప్పిన నమ్ముదువో లేదో కాని, మురళీధరా! మీ అత్తగారి పదియవరోజున పిండములు కాకులు ముట్టినవికావు. అంత మీ అమ్మొచ్చి 'ఒదినా మీరు సంశయము పెట్టుకోవద్దు. రాధను మా మురళికి చేసుకొంటాము' అనేటప్పటికి ఎక్కడనుం చొచ్చాయో, ఒక కణమైన లేకుండా తినేశాయోయి. మాయీకోర్కె నెరవేర్చవలసిందని నా ప్రార్థన. అయ్యో! మురళీధర, అందుకని ఇంకా నాప్రాణము లున్నవోయి! ఇంకా రాధకు మత మివ్వలేదు. హాతాని కైన పళ్లు, పాలు తిని ఉంటోంది. కాబట్టి ప్రాయిశ్చిత్తం చేయించి హిందూమతంలోకి తీసుకోవలసిందని నాకోరిక!!"

అంత ఆయాసము హెచ్చుగాదొడంగె. రాధ "నాన్నా" అని హోరున యేడువదొడంగె. "రాధా! విచారించకు" మనుచు మురళీధరుడు తనఒడిలో కూర్చొన బెట్టుకొని కన్నీళ్లు తుడుస్తున్నాడు.

"మురళీధరా! నే ధన్యుడనోయి; బ్రాహ్మణోత్తములు స్వస్తివాచకములు చదువ, అగ్ని సాక్షిగ నీకాళ్లు కడిగి, ఆజలంబు శిరంబున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జల్లుకొని రాధను నాచేతులార నీఒడియందు కూర్చొనబెట్టు భాగ్యము లభించకపోయినను, నాఅవసానకాలమున రాధ విచారించుచుండ నీ ఒడిలో కూర్చున బెట్టుకొని ఊరడించుట కాంచితినోయి! ఇదియే నాకు పదివేలు. నే నిక నిష్కాముడనై నిశ్చింతతో మరణించెద నోయి! ఇట్టిసంతసము కాంచిన యీకన్నులతో యిక నే నేమియు చూడలేనోయి." అని కళ్లు మూసుకొనెను. "మురళీధర-మురళీ-ధర ము-ర-ళీ-ధర-కృ-ష్ణా-కృష్ణా-కృ." అని శ్వాస విడిచె.

అట్టితరి రాధ విచారము వర్ణించుట కంటె చదువరులు ఊహించుట ఉత్తమము. మరుసటిఉదయమున క్రైస్తవమతాచారవిధిని తీసుకొనిపోయిరి. రాధ మురళీధరుని వెంబడించ ప్రయత్నించెను గాని దొరగారు పోనియ్యలేదు. మురళీధరుడు పీడలేక పీకలేక గృహోన్ముఖు డాయె.

౨

అది వైశాఖమాసము. ఆ ఎవి గాడ్పులు ఈ చెవికి కొడుతున్నాయి. కాకులు నీడపట్టున చేరి "కావు, కావు" అని అరుస్తున్నాయి. ఎక్కడా వీథిలో జనసంచారం లేదు. అట్టిసమయంలో సన్నిధివీధి 56 నెంబరు గృహంలోకి పన్నెండేళ్ల బాల చెమటలు కక్కుచు, ఒగరుస్తు వచ్చింది. ఆ అరుగుమీద సేద తీర్చుకొనిసాధోపరిభాగాని కెళ్లింది. అదివిశాలమైన హాలు. అందులో మురళీధరుడు 'యంగిండియా' అనే వార్తాపత్రికను చేతిలో నిడుకొని తెల్లని పాన్పుపై పవళించియున్నాడు. ఆ విగ్రహాన్ని చూచేటప్పటికి మనరాధ కళ్లు మిరుమిట్లు గొలిపాయి. ఆమెకంటికి శేషశాయిలా కనిపించా డతడు. రాధ రెండడుగులేసి ఇటుఅటు పరికించింది. చూపుమేర దూరంలో ఆమె కెవరూ కనపడ్లేదు. నిశ్శబ్దంగా చెవొగ్గి రెండు నిమిషాలు నిలబడ్డదిరాధ. మనుష్యుల అలికిడి కూడా వినబడ్లేదు.

పాన్పుకి ఎడమప్రక్క నొకమేజాబల్లుంది. దానిమీద ఏవో అనేకపుస్తకా లున్నాయి. గోడలకు గాంధి, రామకృష్ణపరమహంస మొదలగు పటాలు వ్రేలాడుతున్నాయి. ఎలుకను పట్టె పిల్లిలాగ చప్పుడు కాకుండా రాధ మెల్లిగా బల్లను సమీపించింది. అచ్చట ఏదో ఒక అమూల్యవస్తువు చూసింది రాధ. వెంటనే అపరమితానందపడి కళ్ల నద్దుకొంది దాన్ని. దానిమీద వస్తువులన్ని చప్పుడు కాకుండా క్రింద పెట్టింది. తన సంచిలోంచి ఒక అల్లినగుడ్డ ఒకటి తీసింది రాధ. దాన్ని బల్లమీద పరిచింది. ఆగుడ్డమీద నెమలొకటి అల్లిఉంది. ఒకమూల "రాధ" అని వ్రాసుంది. మళ్లా యథాప్రకారంగా అన్ని సర్దేసింది రాధ.

మళ్లా యిటుఅటు పరికించింది. మెల్లిగా పాన్పుదగ్గర కొచ్చింది. కాళ్లు గజగజ లాడాయి, ఒళ్లు చెమట్లు కమ్మాయి, నోరు తడారింది పాపం రాధకు. అట్లా చూస్తూ నిలబడ్డది రెండు నిమిషాలు. ఎలాగయితే నేం మనస్సు నిబ్బరం చేసుకొంది రాధ. సంచిలో చెయ్యోట్టింది. చక్కని ఒక మల్లిదండ తీసింది. పాపం, ఆదండ మురళీధరుని మెళ్లో వెయ్యా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లని ఊహ. అట్లాగే పరకాయించి చూచింది అతనికేసి. ముత్యాల్లా చెమటబిందువులు మోముతా అలంకరించాయి. ఎట్లాగయితేనేం




దండ మెల్లిగా అతనిమెళ్లో వేసింది రాధ. ఉలిక్కిబడిలేచాడు మురళీధరుడు. కట్టెనుట నున్న విగ్రహాన్నికాంచాడు. ఒళ్లు గగుర్పొడిచింది. రెండునిమిషాలు అట్లాగే విగ్రహంలో చూస్తూ ఊరుకొన్నాడు.

"ఈయెండలో ఎట్లా వచ్చావు? ఎంత సేపయిందినువ్వొచ్చి?"అన్నాడుమురళీధరుడు. రాధకు నోట మాటలేదు. నీరై పోయింది. కాళ్లదిక్కు కెళ్లి తలవంచుకొని కాళ్లుక్రింద రాస్తూ నిలబడింది రాధ.

మురళీధరుడు ఇటుఅటు పరికించాడు. రాధ చెయ్యిచ్చుకొని దగ్గరకుతీసుకొన్నాడు. బలవంతంమీద ఎట్లాగో కాళ్లువెనకవెనక్కు లాక్కొంటూ సమీపించింది రాధ.

"ఏవళ్ల కేవందమో వాళ్లక వుండాలి. చెండ్లు మాలలు ఇవన్నీ, చూసావ్రా, ఆడాళ్ల కందంగాని; మొగాళ్ల కెందుకు?" అంటూ తన మెళ్లోదండ తీసి రాధమెళ్లో బలవంతంగా పడేసాడు మురళీధరుడు. రాధ బిక్కమొగమేసిం



ది. చూస్తూండగా కళ్లమ్మటనీళ్లు తిరిగాయి. నాలుగైదు చినుకులైతే మురళీధరుని బట్ట మీద పడ్డాయి. మురళీధరుని మనోభావం మారిపోయింది. "రాధా! రాధా!" అనిరెండు సార్లు గద్గదస్వరంతో పిల్చాడు. రాధ నోట మాట లేదు. వెక్కివెక్కి ఏడవడం మొదలు పెట్టింది. "రాధా ఎందుకే ఏడ్పు" అంటూ తన చెంగుతో కళ్లు తుడిచాడు మురళీధరుడు. రాధ అట్లాగే అధోముఖియై నిలబడిపోయింది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాధ గద్గదస్వరముతో "బావా, నేను అనాథ బాలికను" అన్నది.

"రాధా! అలాగయితే నన్ను జీవన్మృతునిగా భావించావా" అన్నాడు దీనంగా.

"బావా, నాన్నగారి అవసానకాలపు మాట మరచితిరా" అన్నది రాధ.

"దేహ పంజరమున ప్రాణవిహంగ మున్నంతకాలము మురళీధరుడు మరువజాలడు" అన్నాడు గంభీరంగా. రాధ తలెత్తి మురళీధరునికేసి చూసింది. మురళీధరుడు ఆమెచూపులో తనచూపు ఐక్యం చేశాడు. అట్లా కాస్సేపు చూచుకొని చిరునవ్వులతో ఇరువురుకూడ సిగ్గున కాబోలు తలలు వంచేశారు. అంత మనస్సులు ఏక మయాయి. తోడనే శ్రీపార్థసారథివారి కోవెలలో "టంగు టంగు" మని రెండుగంటలు కొట్టారు. అంత ఇంట్లో పిల్లాడు "అమ్మా" అంటూ కూని దీర్ఘంతో లేచాడు.

"మీా అత్తొచ్చింది చూశావా" అంటూ మురళీదరుడు లోపలికెళ్లి "అమ్మా అమ్మా రాధొచ్చిందే" అన్నాడు.

ఉలిక్కిపడి లేచి "ఏది, నాకన్నత ల్లేది" అంటూ హాల్లో కొచ్చింది యిల్లాలు.

పాపం రాధ బిక్కమొగ మేసుకొని వెనకవెనక్కి వెళ్లడం ఆరంభించింది. పరుగు పరుగునొచ్చి కౌగలించుకొని హోరున ఏడుస్తు, "తల్లీ, నీకెక్కడ దాపురించిందే యీామాయ మతం" అంది. కన్నకడుపుకంటె పెంచిన ప్రేమ పెద్దదిగదాండీ! పాపం, రాధను చూసి ఏడేళ్లయింది.

రాధను లోపలకు తీసి కెళ్లింది. శుభ్రంగా తలంటి నీళ్లోసి అన్నం పెట్టింది ఆయిల్లాలు. కొత్తగుడ్డలు కట్టపెట్టి పైటవేసింది రాధకు. తలంతా తుడిచేసి జడేసేటందుకు హాల్లోకి తీసుకొచ్చింది రాధను. మురళీధరుడు కూని దీర్ఘాలు తీస్తూ కుర్చీలో కూర్చున్నాడు. అట్టే క్రీగంటను చూశాడు రాధను. రాధ ఊరు కొంటుంది కనుకనా? ఒండొరుల చూపుల గ్రహించింది యశోద. రాధకు జడేస్తూ కూర్చుంది. "అమ్మానాకే" అంటూ బల్లమీాదున్న దండకేసి చూస్తూ ఏడవడం మొదలుపెట్టాడు తారకం.

"ఏడవక ; అది అన్నయ్యది. తీస్తే వదిన కొడుతుంది ఊరుకో" అన్నది యశోద.

"అమ్మా! నాకువదినైతే అన్నయకో."

మళ్లా రాధామురళీధరులు ఒండొరుల చూచుకొని ముసిముసినగవుల పాలయారు.

"అమ్మా చెప్పవే అదిన అన్నయి కేమవుతుందే-ఏ-ఏ-"అని మూల్గారంభించాడు తారకం.

"నేను నాన్న కేమవుతాను" అంది నవ్వుతో యశోద.

అంత బాలుడు నవ్వుతూ "పెళ్లాం" అన్నాడు. అంత అందరి మొగాలు ఒక్కసారిట్టున వికాసం వహించాయి. రాధామనోహరులు ఒండొరులు ఒక్కసారిచూచుకొన్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యశోద రాధను తిరిగి పోవలదని బల వంతపెట్టింది. రాధ పోకప్పీల్లేదని చెప్పి, గుడి కిపోవు మేకపోతులా పోలేక పోలేక తనఉనికికి పోయింది.

3

మదరాసు ధూమశకటాలయం చూసిన వారు పెద్ద దనక మానరు. బళ్లు విసుగు విరామము లేక అన్నివైపులనుంచి వచ్చి పోతూంటాయి. రాత్రి 7-30 అయింది. కలకత్తాబండి క్రిక్కిరిసింది. అంత ఒకదొరగారు "నీవ్వు, రాహేలు ఆడఓరి పెట్టిలో కూరుచుండి" అని ఒకఆపెతో చెబుతూ భార్యాసమేతంగా తాను మధ్యతరగతి పెట్టిలో కూర్చున్నాడు.

రాత్రి 8 గంట లయింది. "ఢాం" అన్న కోటలోని ఫిరంగిచప్పుడు వినబడింది. 'గుభు గుభు' అని ఈలేస్తూ పచ్చలాంతరు చూపించాడు శకటరక్షకుడు. అంత 'కూ' అని కూత కూసి 'గుఫ్ గుఫ్' అనిధూమాన్ని వదలుతూ 'లటక్-లటక్' అనే శబ్దంతో బండి కదిలింది.

రాహేలు! మన మేమూ రెడుతున్నాం? అంది కృపావతమ్మ.

"ఏమో నాకు తెలియదండి" అని పెదవి విరిచింది రాహేలు.

"పోనీ, ఎందు కెడుతున్నామో తెలుసునా?" అంది. "ఉహూఁ" అంటూ తెలియదనే భావం తెలియ జేసింది తలూపుతూ రాహేలు.

"మన మెడుతూన్నది నెల్లూరు, నీపెళ్లి కెడుతున్నాము" అంది కృపావతి.

రాహేలు మోము వెలవెలపోయిందీ. ఆశ్చర్యంతో నోరావలించింది.

ఆకస్మికంగా మోకాళ్లమీద తలజేర్చి "ఉస్సూ" అని ఒక పెద్దనిట్టూర్పు విడిచింది.

కృపావతమ్మ వాళ్ల పంతులమ్మ. సార్థక నామధేయురాలు. "రాహేలు నా మనస్సులో నున్నది దాచకనాతో చెప్పు. ప్రస్తుతంలో నీకు నాకంటె సహాయం చేసేవారెవరు లేరు. నీవొకటి మామార్గొకటి కాదు నాకు" అంది దయాపూర్వకంగా కృపావతి.

రాహేలు మాటాడలేదు. "చెప్పవమ్మా మరి నీమనస్సులో నున్నది; నాకేం తెలుస్తుంది? అమ్మయినా అడగండే అన్నమైనా పెట్టదుగదా" అంది కృపావతి.

"నాకు ఈమతమునందు యిష్టములేదు. ఆర్యమతంలో చేరి మా తల్లిదండ్రుల అభీష్ట ప్రకారం మాబావను......" అని హోరున యేడుపు మొదలుపెట్టింది. కృపావతమ్మ రాహేలు మనోభావం గ్రహించింది.

"అమ్మా! యథార్థం చెబుతున్నాను. దొరగారు పదిహేనువందల రూపాయలు తీసుకొని నిన్ను నెల్లూరులోనున్న సామ్యూలు కొడుకుమేచ్చాసు కియ్యాలని సంకల్పించుకొన్నాడు. రాహేలు, నీవు ధైర్యంగా మాత్రం ఉండు. ఈవిషయంలో నీకు నేను నాశక్తివంచన లేకుండా సహాయం చేస్తాను.ముల్లుని చూస్తానే తియ్యాలి సుమా! దొరగారు నిన్నడిగినప్పుడు వ్యతిరేకంగా మాత్రం చెప్పకు. నేననలు గవళ్లదానను. నాపెనిమిటివల్ల యిందు

లోకి రాక తప్పింది కాదు. నాపేరు అసలు కడలి కాంతమ్మ. నాది గడపారం" అని అంత వృత్తాంతం చెప్పింది కృపావతమ్మ.

బండి నెల్లూరు ఆలయం వచ్చి ఆగింది. దిగేవాళ్లు దిగకుండా యెక్కేవాళ్లు ఎక్కుతున్నారు. దొరగారు "కుపాతి, కుపాతి బండి దిగు" అని కేకలేశారు. అంతా దిగారు. బండి కదిలి వెళ్లిపోయింది. రాహేలు మామగారు సామ్యూల్యాలు, నల్ల కోటు తొడిగి, జరీబుట్టపాగా పెట్టి, కొరడా చేత్తోపట్టుకొని దొరగారికి వారి సానిగారికి సలాములు చేసి "దయచేయం" డన్నాడు. దొర పత్నీసమేతంబుగా ఆ రెండెడ్లబండి నెక్కెను. రాహేలును, కృపావతిని చోటులేని హేతువుచే బండిదిగి నడిచిరమ్మన్నారు. సామ్యూల్యాలు పళ్లుబిగించి బండి తోలడం ప్రారంభించాడు. ఎలాగో యిల్లు చేరారు. ఆరాత్రి గడిచిపోయింది. తెల్లవారింది. దొరగారికి కాఫీ తయారు చేశారు. బ్రెడ్డుదొరకలేదని మేచ్యూాసు మరియు తహ తహ లాడిపోయాడు.

మెచ్యూాసు సహజంగా మంచివాడు; దయాపరిపూర్ణ హృదయుడు. బందరు నోబులు కళాశాలలో మధ్యతరగతి చదువుచున్నాడు. దేశంలో జరుగుచున్న సంగతులన్ని తెలిసినవాడు. ఒరులమనస్సు నొప్పించడమే గొప్ప పాప మనేవాడు.

పదిగంటల పొద్దెక్కింది. పిల్లను చూసి మరియ, సామ్యూల్యాలు మురిసిపోతూన్నారు. చుట్టుప్రక్కలున్న మతంపేరంటాళ్లు, మాల పేరంటాళ్లు వచ్చి చూచి పోతున్నారు."వాం బేమ్మడికూతురు మాలాడిపెళ్లాం" అన్నారు కొందరు. "మాతమ్మ! నీ కోడల్ను చూచినావా" అంది దొరసాని.

"అంతా ఏలోన్రి సలవండి. మాఅబ్బాయంటె దొరోరికి నిండా పేమండి" అంది మార్త. "ఈపిల్ల యిశంలో దొరారు చాలాలావు కష్టపడ్డారు" అంది దొరసాని.

ఈమాటలన్ని వింది రాహేలు. అల్లంతదూరములోఉన్న చింతచెట్టుక్రింద కెళ్లి హోరుహోరున యేడవడం ఆరంభించింది. ఏం వారించేటందుకు కడుపు వాపా!

కృపావతికి మెచ్యూాసు సంగతి తెలిసింది గనుక వృత్తాంతమంతా చెప్పేసింది. "ఇన్ని పిల్లను రక్షించే భారం నీది. మానాన్న చేదస్తుడు. నేనే యీపిల్లను వద్దంటే పదిహేనువేల రూపాయలు పెట్టానని నాలిక పెట్టుక్కొంటాడు. పిల్ల కిష్టం లేందే పిల్లమనస్సు నొప్పించి వివాహం చేసుకోవడం నాసమ్మతి కాదు. నేను యిక రెండేళ్లలో నాన్నగారిని ఒడంబడచి మళ్లా హిందూమతంలోకి వెళ్లిపోతాను. మొన్న దేవేంద్రుడుగారివద్ద వాగ్దత్తం చేశాను" అన్నాడు మెచ్యూాసు.

మెచ్యూాసు తిన్నగా పిల్లదగ్గర కెళ్లాడు. అశోకవనంలో సీత జ్ఞాపకమొచ్చింది మెచ్యూాసుకు. "ఆపద్బాంధవా! అనాధరక్షకా! ఆర్తత్రాణపరాయణ రక్షక! నీవే దిక్కని నిరతము నమ్మియుంటినోయి! నా మనఃపీఠమున నిన్నే నిరతము సేవించుచుంటినోయి తండ్రీ! నీవే నామొర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కలిసతవహించిన నా మేలు గోరు ముగ్గురు నెచ్చెలులు కలరోయి! ఆ! ఎవరనియా? నిప్పున్నది, నీరున్నది, విషమున్నది—తండ్రీ!" అని పెద్దపెట్టున యేడుస్తూన్నది రాహేలు.

మెస్సాసు కడుపు చెరువై పోయింది. నోట మాట రాలేదు. ఎట్టకేలకు "అమ్మా!



ఏల విచారించెదవు" అని మెస్సాసు సంబోధించాడు. అమ్మా, అన్న అక్షరద్వయము చాలా పవిత్రమైంది.

"నేను కృపావతివల్ల మీ మనోభీష్టము తెలుసుకొన్నాను. మిమ్ములన్ని విధములకృపావతి కాపాడును. మీరు విచారించ పనిలేదు. కొలదికాలములో మీఅభీష్టము నెరవేరును." అని దయాపూర్వకంగా ఊరడించాడు మేస్సాసు.

అంతరాహేలుకు ధైర్యం వచ్చింది. వినయ పూర్వకంగా నిలబడి "తండ్రీ, నమస్కారములు. తమవంటి పూజ్యు లుండుటచేతనే ప్రపంచక మిటులైన నున్నది. మీరు బ్రాహ్మణులనిన అతిశయోక్తి కానేరదు. పుట్టుకచే గాక బుద్ధిచే మానవుడు బ్రాహ్మణు డగును. మీవంటి పరమపురుషులను భర్తగా స్వీకరించుట నాకును సమ్మతమేకాని నామనస్సు అన్యాయత్తము కావించినదానను. క్షమించ ప్రార్థించుచున్నాను" అని వినయ పూర్వకంగాంది రాహేలు.

"విచారించవలదు. కృపావతి మిమ్ముల రక్షించును." అని చెప్పి మేస్సాసు వెళ్లిపోయాడు.

రాత్రయింది. మరుసటిదినము ఉదయమున నే వివాహము. సామ్యూలు, మరియ కాళ్లు చేతులు విరక్కొట్టుకొని వాళ్ల జమ్ముటిల్లంతా అలంకరించారు. చుట్టుప్రక్కల మతం పుచ్చుకొన్న బుద్ధిమంతు లంతా వచ్చారు. ఇల్లంతా కోలాహలంగా ఉంది. రాత్రి 11 గంటలైంది. నిద్రాదేవత అందర్ని ఆవరించింది. కృపావతికిమాత్రం కాలం గడచినకొలది ఆవేశం హెచ్చవుతోంది.

మెల్లగా రాహేలును వెంటబెట్టుకొని ధూమశకటాలయాని కెళ్లింది కృపావతి. తండ్రి అవసానకాలంలో ఇచ్చిన 36 రూపాయల 9 అణాల 6 పైసలు రాహేలు సంపత్తి దగ్గరున్నది. కృపావతమ్మ తనవద్దనున్న పదకొండు రూపాయలు కూడా యిచ్చి "రాహేలు, మనిద్దరకు యీడబ్బు చాలదు. కాబట్టి నీవు యీ పైకంతో ప్రస్తుతం కాశీకెళ్లు. ఈ ఆపద తప్పుతుంది. తరువాత దైవమున్నాడు. ఆల


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్యం చెయ్యరు. అదిగో బండొస్తోంది. నే టికెట్టు తీసుకొస్తాను" అని కలకత్తారు టికెట్టు తీసుకొచ్చింది కృపావతమ్మ.

బండొచ్చి యథాస్థానములో ఆగింది. రాహేలును బండెక్కించి కదిలేదాకా సువార్తలు చెపుతో దగ్గర కూర్చుంది కృపావతమ్మ. ఇంతలో ఈల వినపడింది. కృపావతి "జాగ్రత్తమ్మా" అంటూ దిగలేక దిగలేక బండి దిగింది. రాహేలుకు దుఃఖ మాగ లేదు. "తల్లీ, నమస్కారము" అంటూ గవాక్షం వద్ద కొచ్చింది రాహేలు. బండికదలింది. ఇరువురు ఒకరినొకరు చూస్తూ నిలబడి పోయారు.

కృపావతికి ఎట్లాగా యింటికెళ్లడ మని బెంగ కలిగింది. 'తెల్లారాక పిల్ల యేదంటే యేమనాలా?' అని ప్రశ్నించుకొంది. 'నాకేం తెలుసు అందామంటే నీదగ్గర పడుకున్న పిల్ల నీకు తెలియక ఎవరికి తెలుస్తుం దంటాడు దొర. పాపం ఎప్పుడు అబద్ధమాడి ఎరుగదు కృపావతి.

ఇలా తర్కవితర్కాలు చేసుకొంటూ ఎక్కడ కెడుతోందో కూడా తనకే తెలియకుండా వెడుతోంది కృపావతమ్మ. త్రోవలో ఒకగాడి నుయ్యిదగ్గర ఒక పెద్దబండఉంటే దాని మీద కూర్చొని యీక్రిందివిధంగా ఆలోచించింది: "నేను నావిధికృతాన్ని నెరవేర్చాను, ధన్యురాలను. ఇకను నేనింటికెడితే ఊరుకొనే వాడు కాడు దొర. గుండెల్లేవు; ఎంతపనైనా చేస్తాడు. నేనా అబద్ధానికి అలవాటుపడిన దానను కాను. అబద్ధ మాడుదామని వెడితినా నోరు తడబడుతుంది. కాళ్లు చేతులు ఒణుకుతాయి. ఒళ్లా, చెమట్లు కమ్ముతాయి. చచ్చే అవస్థ పడుతుంది. కంగారుపడి నిజమే చెప్తాను. లేకపోతే యెక్కడికైనా పారిపోదామంటే-నన్నెరుగని క్రైస్తవులు లేరు. నిలువ డమీద జాడ తెలియక మానదు. ఇకను అని త్యమై అనిర్మలమైన యీదేహంచేత నిత్యమై నిర్మలమైన యశస్సు సంపాదించాను. అదే నాకు పదివేలు. 'జాతస్య మరణం ధ్రువమ్.' ఎప్పటికైనా చావవలసిన వాళ్లమే. ఇక నాకు యీతను వున్నా వొకటే, లేకపోయినా ఒకటే," అని అంటూ, "కృష్ణా, ఆపద్బాంధవా" అని అప్రయత్నంగా గుభాలుమని నూతులో ఉరికింది కృపావతమ్మ.



౪

బెజవాడలో గూడూరివారు గొప్పకుటుంబికులు; ఆపదలకు అడ్డుపడేవారు. వాళ్లబామ్మ కాశీవెళ్లి తిరిగొచ్చింది. వచ్చేటప్పుడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దిక్కులేని ఒకపిల్లను తీసుకొచ్చింది. ఆపిల్ల రక్తనిహీనమై వెండిబొమ్మలాగుంది; లేవ సత్తువలేదు. వాళ్లవాళ్లంతాపిల్లను చూచి చాలా కనికరించారు. ఆసాయంత్రమే వారింటివైద్యులైన డాక్టరు యమ్. ఆర్. ధర్ గారిని పిలిపించి చూపించారు. డాక్టరుగారు చాలా ఉదారస్వభావులు; దీనులపాలిటి కల్పవృక్షం. పిల్ల జీవించుట కష్టమని ఆయనకుకూడా అధైర్యం తోచింది.

"రేపుదయాన్నే మా హాస్పిటలునకు తీసుకు రండి. రోగిని గంటగంటకు చూస్తూండాలి. రోగం చాలా దుర్భరమైంది. రాత్రి గంటగంటకు పాలిస్తూండండి" అని చెప్పి వెళ్లిపోయాడు డాక్టరు.

చెప్పినచొప్పున పిల్లను 'రాధామెడికల్ హాలు'కు తీసుకొనివెళ్లారు. అంత డాక్టరుగారు దాయి నొకదాన్ని పిలిచి "పడక" ఒకటి ఖాళీచేసి స్నానం చేయించి పడుకోపెట్టండన్నారు. పిల్లకు జ్వరంమాత్రం అధికంగానే యుంది. ఇంత జ్వరంలో నున్న పిల్ల ఆమూల్యం ఏముందో కాని, ఒక చిన్న తాటాకుల పెట్టె మాత్రం వదలింది కాదు.

రోగు లందరకు యథాప్రకారం మందులిచ్చి 12 గంటలవేటప్పటికి ఈ రోగిదగ్గర కొచ్చాడు డాక్టరు. ఆమె హృదయం పరీక్షచేసి నాలుకచూచి తలఊచి గంట గంటకు నిద్రపోతూన్నను లేపి పాలు పట్టవలసిం దని దాయితోచెప్పి తా నింటికి పోయాడు. పరిపరివిధా లాలోచించాడు డాక్టరు. కాని రోగం మాత్రం బోధపడలేదు.

రాత్రి షుమారు తొమ్మిదిగంటలైంది. రోగి ఏ అవస్థలో ఉన్నదో చూదామని డాక్టరు లాంతరువేసుకొచ్చాడు. దాది ఒకమూల గుర్రట్టి నిద్దరోత్తోంది. రోగి ఈక్రింద విధముగా పలవిస్తోంది:—

"మురళీధరా; నన్ను మోసగించితివా? ఆనాటి నాన్నగారి అవసానకాలపు మాట మరచితివా? మురళీధరా—రాధ మరణించినదని వివాహమాడితివా? ముర-ళీ-ధరా—ఇహంబున నీవును, పరంబున దైవము తప్ప నా కన్యులు లేరోయి! ఆ! అదుగో మురళీధరుడు; నానాధుడు! రండి దయచేయండి-నన్ను స్వీకరించండి. నాతో దాగుడుమూతలా-నే చూశాలెండి. నేనే వస్తున్నా" అంటూ లేవబోయింది.

డాక్టరంతా విన్నాడు. నిశ్చేష్టితుడై నిలువునా నీరై పోయాడు. రోగిని గట్టిగా పట్టుకొని లేవవద్దనిచెప్పి దాయిని కేకేసాడు. ఉలిక్కిపడిలేచి పరుగెత్తుకొచ్చింది దాయి. రాత్రి జాగరూకతతో కాపాడవలసిందని చెప్పి కిందున్న తాటాకుపెట్టె తీసుకొని యింటికెళ్లాడు డాక్టరు.

డాక్టరు మనస్సులో సంతోషము, దుఃఖము ఒక్కసారి ఉద్భవించాయి. నీరసంగా తన వాలుకుర్చీలో వాలిపోయాడు. లాంతరు పెద్దది చేశాడు. ఆపెట్టెలో ఏముందో అని ఆత్రముతో, తీసాడు. అందులో రెండు ఛాయాపటాలున్నాయి. ఒక వుత్తరం అంటించుంది. దానిమీద విలాసం ఇట్లా వుంది.

మ. రా. శ్రీ—

డాక్టరు మురళీధర్రావు గారికి,
నర్సాపురం; పశ్చిమ గోదావరిజిల్లా.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆ ఛాయాచిత్రాల్లో ఒకటి స్త్రీది. ఒకటి పురుషుడిది. ఆపురుషుడిపటానికి పసుపురా సుంది. అచ్చటచ్చట నిత్యం పూజ చేస్తూన్నట్లు పువ్వు లగపడుతున్నాయి. మెల్లిగా ఉత్తరం విప్పాడు డాక్టరు. అందులో యీ క్రిందవిధం గా ఉంది:—

కాశీ,
3-4-1925

పూజ్యులగు మురళీధర బావగారికి,

నమస్కారములు.

అయ్యా,

ఈలేఖా పూర్వకంబుగ తమకు దుఃఖము కలుగచేసినందులకు క్షమింప ప్రార్థితులు. నామనోనిశ్చయము తమకు తెలిపినగాని నాకు ఆత్మ శాంతి లేదు. ఆహేతువుచే నే నిశ్చింతతో మరణించనేరను.

నేను తమవద్దను, అత్తగారివద్దను సెలవు తీసుకొనిన మాసముననే నావివాహము తల పెట్టిరి. కృపావతితల్లి కృపచే నే నాకష్టసముద్రమును దాటి కాశీ చేరగలిగితిని. ఇచ్చట శ్రీశంకరస్వాముల అనుమతిని ప్రాయశ్చిత్తము బొందితిని.

నే జీవింతునని ఆశలేక నే నీలేఖ వ్రాయ పూనుకొంటిని. నామరణానంతరము గాని యిది తమకు చేరనేరదు. మీరు యిప్పటివర కును నామీద ప్రేమచే అవివాహితులుగ నుండెదరని నమ్ముచున్నాను. నే నట్టినోమును నోచుకొనలేదు. మిమ్ముల నెవ్వరినైనను వివాహము చేసికోవలసినదని కోరుటయే ఈలేఖ యొక్క ముఖ్యోద్దేశము. మీరు నామీద ప్రేమ గలిగినచో అనాథబాలికల రక్షించ కంకణము కట్ట ప్రార్థించుచున్నాను.

నావిషయమై విచారించవలదు. దైవము తమకు అనతికాలములో పుత్రపౌత్రుల ప్రసాదించుగాక.

ఇట్లు
భవదీయశ్రేయోభిలాషిణి
చరణదాసి,
రాధ.

డాక్టరు ఆలేఖను మరలమరల చదువ దొడగెను. కన్నీరు బొటబొటమని రాల జొచ్చె. యథాప్రకారముగ లేఖను భద్రప రచెను.

దీపమును సన్నముచేసి డాక్టరు మంచముమీద వ్రాలెను; నిద్దురపట్టదు. పిచ్చివాని వలె తనలో తాను వాదప్రతివాదములు చేసికొనుచుండెను. తెల్లవారవచ్చినది. "కొక్కొరో కో" అని కోడి కూసింది.

అంత డాక్టరు ఆపెట్టెను తీసుకొని ఆసుపత్రి కెళ్లాడు. రోగి యీ క్రిందవిధంగా ఒక పిచ్చిపాట పాడుతోంది.

బ్రతికి యున్నానోయి మురళీధర,
ఎందు వెతకిన గాని మురళీధర నీవు-
కానరా వేమోయి మురళీధర
నిన్ను- ఏమనందూనోయి మురళీధర
నన్ను- మోసగించితివోయి మురళీధర
నీవె- దిక్కనిరోయి మురళీధర
నేను- నమ్మియుండితినోయి మురళీధర
వాపోవుచున్నాను మురళీధర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాళ్లు కరుగుతవోయి మురళీధర
వెన్న రా యయిందోయి మురళీధర
జాగు సేయక నన్ను మురళీధర
వచ్చి రక్షించవోయి మురళీధర

అని పాడుతూ హోరున ఏడవడం మొదలు పెట్టింది. డాక్టరుకు కూడా అప్రయత్నంగా కన్నీళ్లు కారాయి. వెంటనే ఒకబండిమీా వేసి రోగిని తన యింటికి తీసికెళ్లాడు డాక్టరు.

రోగికి ఆనాడే తనచేత్తో కాఫీ యిచ్చాడు. తాగుతూ రోగి డాక్టరుకేసి తేరిపారచూసింది. డాక్టరు చూశాడు. దానితోనే రోగి మొఖానికి కళొచ్చింది. రోగికి డాక్టరే స్వంతంగా అన్ని ఉపచారాలు చేస్తూ ఉండేవాడు. రోజు రోజుకు ఆరోగ్యం కలుగుతోంది రోగికి.

రోగి మధ్యమధ్య "డాక్టరుగారు! ఎలా గండి మీాఋణం తీర్చుకోడం" అనేది.

నవ్వుతూ డాక్టరు "నీవు బాగా ఆరోగ్యంగా ఉంటే నా ఋణం తీర్చుకోగల వనే ధైర్యం నాకుందిలే" అనేవాడు.

రోగి కొన్నాళ్లకు ఆరోగ్యవతైంది. మదరాసు లేతతమలపాకులా నవనవలాడుతూంది. నవ్వితే బుగ్గలు చొట్టపడుతున్నాయి. ఉంగరాలు ఉంగరాల్లా ముంగురులు ముందుకు పడుతున్నాయి. నన్నే చూడమంటూంది రాధ.

యథాప్రకారంగా ఒకరోజు సాయంకాలం రాధ "డాక్టరుగారు, మీాఋణంఎట్లాగండి తీర్చుకోవడం" అంది.

"లేంది యిమ్మంటాను గనుకనా; యేదో నీదగ్గరున్నదాంతోనే తీర్చుకో" అన్నాడు చిరునవ్వునవ్వుతూ డాక్టరు.

"డాక్టరుగారు నాదనిచెప్పేది నా దగ్గర ఏమిాలేదండి. మళ్లా జన్మలో తీర్చుకోవాలండి" అంది తీక్ష్ణభావంతో రాధ.

గూడూరి వారితో ఈ వృత్తాంతం చెప్పాడు డాక్టరు. వాళ్లు డాక్టరు మిత్రులే కాకుండా వాళ్లింటల్లుడయాడని ఆబాలగోపాలం అపరమితానంద పడ్డారు.

ఆనాడు పూర్ణిమాచంద్రుడు పట్ట శక్యం కాకుండా ఉన్నాడు. రాధ దొడ్లో మాలతి క్రిందచపటామిాదకూర్చుంది. డాక్టరుఅప్పుడే భోంచేసి దొడ్లో కొచ్చాడు. ఇటుఅటు పచార్లు చేస్తూ డాక్ట రన్నాడుగదా "రాధా నాఋణం మాటేం చెప్పావు"?

"దానివిషయంలో నే ఆలోచిస్తున్నానండి. ఇహంలో తీర్చుకొనేభాగ్యం పట్టలేదండి" అంది రాధ.

"రాధా, నీవు అవివాహితవు కావా" అన్నాడు డాక్టరు.

"లోకానికి అట్లాగే తోస్తుందండి. నా ఆత్మ అన్యాయత్త మైపోయిందండి. ఆత్మేనా వివాహ మైందన్నమాటేనండి" అంది రాధ.

"నీమనోవిభుడు నాకు తెలియ కూడదా?" అన్నాడు డాక్టరు. "ప్రాణదాతలు మీా దగ్గర మరుగేమిటండి?" అంటూ ముసిముసి నవ్వులు నవ్వుతూ "మురళీధరులు" అంది రాధ.

"ఆయన్ను నే నెరుగుదును. ఆయనకు వివాహ మయింది. ఇప్పుడు నాఋణం తీర్చే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

టందుకు నీకభ్యంతర ముందా?" అన్నాడు డాక్టరు.

అంత రాధ మోము తెల్లబారింది. క్రోధంతో "చితితోగాని చిత్తం మార్పుకలుగ దండి; వివాహమైనా ఆయన హితం కూరుస్తూంటానండి" అంది రాధ.

"ఆయనభార్య నన్ను చేరనియ్యకపోతే ఏపుణ్యక్షేత్రానికో పోయి యిహాన్ని విడచి మళ్లాజన్మంలో మీరుభర్తలు కావాలని దైవాన్ని ప్రార్థిస్తాను." అంది దీనంగా రాధ. "బలవం తాన్ని నిన్ను నే యిప్పుడు చెరబడితే ఏం చేస్తావు?" అన్నాడు నవ్వుతూ డాక్టరు. "వెలుగే చేను మేస్తే కాసేవా రెవరండి?" అంది రా కోపంతో.

"చూడు" అంటూ చేరబోయాడు డాక్టరు.

"క్రూరా! స్త్రీమానచోర!" అంటూ తోటలోని బావివైపు పరుగెత్తింది రాధ.



"నీవు కానుకగ నిచ్చిన లేసిదిగో! యశోదత్త లోనున్నది" అంటూ వెంటాడించాడు మురళీధరుడు.

"రాధా! తొందరపడకు. నేనే మురళీధరుడను. మీ తండ్రికోర్కె ప్రకారము అవివాహితుడను. నీవు కానుకగ నిచ్చిన లే సిదిగో! యశోదత్త లో నున్నది!" అంటూ వెంటాడించాడు మురళీధరుడు.

రాధ మూర్ఛచే వాలిపోయింది. అంత మురళీధరుడు తన కౌగిలి పట్టాడు.

ఈసంగతి గూడూరివారికి తెలిసింది. వీధులు దద్దరిల్లె పెళ్లిమంటూ పెళ్లి చేసారు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




బులుసు వెంకటరమణయ్యగారు

ప్రన సౌఖ్యమ్ము దలంపక-జనులాడుచునుండు దుష్టజల్పములకుఁ దా
వనుదాని నీయకుండ న-వని నేలినవాఁడె న్యాయపార్థివుఁడుగదా!

ఉ. కష్టము కల్గఁజేయ హృది కద్ది యథార్థము కాకపోయినన్
దుష్టుఁడు తోఁచిన ట్లనిన దోసపుప్రేలుడు మాటమైన స
చ్ఛిష్టులు నమ్మకుండిన 'నిసీ'యని స్వాంతముత్రోసిపుచ్చినన్
స్పష్టము చేయకుండుటయు భావ్యమె?అయ్యది రాజనీతియే?

చ. హృదయము సాక్షియై సుజనహృన్ముకురంబు లెఱింగియున్న నా
ర్మద కలితాత్ములాడు నవమానము కూర్చెడుమాట నెంచకే
పదిలము చేసిగూఁకొనుట భావ్యమె? విన్న జనంబు లెంతయున్
వదరరె? నిందకల్గదె? యపార్థముతోఁచదె? న్యాయమొప్పునే?

గీ. అనపరాధి యటంచును దనమనంబు-దెలిపినను సత్ప్రమాణముల్ సెలుపకుండ
శిక్షణము చేయకుండుట సేమమగునె?-రాజునకునైన రాజాధిరాజుకైన.

చ. అటులగుటన్ రఘూద్వహుని యంతటి ధీరుఁడు పంచె జానకిన్
గటకటఁ జెంది కానలకుఁ గర్కశ మానవ దూషణంబులన్
గటువులనెంచి కాని మఱి కానఁడె ఆవిమలాచరిత్రమున్?
అటువలెఁగాక యెంచ నిఁక నన్యవిధం బది వేఱ యున్నదే?

ఉ. ఎక్కడిలంక? పావకుఁడదెక్కడ? సీత పవిత్రయంచుఁ దా
నిక్కము పల్కుటేడ? యవనీపతి దాఁదలయూఁచి మెచ్చి సొం
పెక్క గ్రహించుటేడ? జను లీయవినిశ్చిత సత్ప్రమాణమున్
నిక్కమటంచుఁ బల్కుదురె? నింద్యముకాదె దలంచి (?) చూడఁగన్!

ఆ. మంచి మెచ్చునట్టి మనుజు లరుదుగాని-చెడ్డఁ దెగడువారి కడ్డమేమి?
గొడ్డుగోఁతఁబడిన బెడ్డవేయుటెకాని-కావనెంచువారు కలరెమొదు.

చ. "వనితపవిత్రయా!" యనుచుఁబల్కుచు నుండి ప్రజల్ తదర్థమై
ఘనతరసాక్షి సున్న మది కాంచఁగనొప్పదసత్ప్రవర్తనన్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనమది నచ్చనేమి ఫల మూరయ లోకులనింద నించురా
గనక మెలంగ న్యాయమగుఁగాదె! రఘూద్వహు దోషమున్న దే?

ఆ. తండ్రియాజ్ఞకంటెఁ దక్కువదే యగుఁ-బ్రజల మెప్పటంచుఁ బ్రథితముగద!
కాన రాముఁ డరిగెఁ గాననసీమకు-జనులు దన్నుఁ జూచి జాలిపడఁగ.

ఉ. దోసముకంటె నెక్కుడగు దుష్టుల నిందల నెట్టివారికిన్
గాసిలు మానసంబు "సతికాదుపవిత్ర" యటన్న నెంచియో
దోసముకల్గుచున్నను వధూపరితాపము లెక్కసేయకే
బాసలుచేసి జానకిని బంపెను రాముఁ డరణ్యసీమకున్.

క. గర్భవతియైనఁగానీ-దుర్భర పరితాపమొందు తొయ్యలి కానీ,
నిర్భరమా నవమానము-నర్భకునకునైన సైఁచనగునే చెపుఁడీ!

చ. నిజ మది కాకపోయినను నిందనుబట్టి యశోవినాశమా
రజకుఁడు పల్కియున్నను ధరారమణుండటు పల్కినన్ సరే
నిజహృదయంబు నచ్చినను నేమిటి! కెవ్వరు విశ్వసింతు రీ
ప్రజలు తలంపఁ గాకముల వంటి యధర్మపథప్రవర్తకుల్.

ఉ. ఈయదు మానసమ్ము మిథిలేశ్వరపుత్త్రిఁ బరీక్షచేయఁ దా
వీయదు ఖ్యాతి లోక మవనీశ్వరపుత్త్రిఁ బరిత్యజింపకే
పాయదుసాధ్వి కోరి తనుఁ బాపపుటూహఁ దలంపకున్నచోఁ
జేయునదేమి రాఘవుఁడు చేర్పక సీత నరణ్యసీమకున్?

గీ. మానసముఁబట్టివర్తించి మనలుచున్న-లోకమున వాదుపోవునే? ప్రాఁకిపోదె?
జడియకున్నను దనబంధుజనములకును-జనములకునైన జడియంగఁ జనదె చెపుఁడీ.

ఆ. కాళిదాసు చెప్ప కమనీయధర్మంబు-వేఱు దానిభావ విధియువేఱు
"అయిన దీనితత్త్వమరయంగవలె" నను-ఘనోక్తి దానియర్థపటిమదెల్పు.

శా. కారుణ్యామృతపూరితాత్ముఁడు యశఃకాంతామనోనాథుఁడౌ
శ్రీరాముం డెదనేడ్చి గాసిలె నహో! సీతామహాసాధ్వికై
పౌరాహ్లాద పరాత్ముఁడై వనమునన్ బంపెన్ మహాసాధ్వి నీ
ఘోరావిష్కృతికారణంబు ప్రజలే గుర్తింపుఁడీ పాఠకుల్!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆంధ్రగ్రంథమాల

## నెం. 7, తంబుశెట్టి వీథి, చెన్నపురి

ఆంధ్రాభ్యుదయమునకు వాఙ్మయాభ్యుదయమును, తన్మూలమున విజ్ఞానాభ్యుదయమును సాధనంబు లనువిషయము సర్వత్ర తెలిసియున్నది. ఆంధ్రాభ్యుదయమునకు దేశమునందు గ్రంథమండలులు, గ్రంథాలయములు, కళాప్రదర్శనములు మొదలగు సంస్థాపనలు పర్యాప్తంబులై యున్నవి. శ్రీయుత కే. వి. లక్ష్మణరావుగారు ప్రారంభించిన యాంధ్రవిజ్ఞానచంద్రికాగ్రంథమాల నేడు శాఖోపశాఖలలో భిన్నరూపముల వెలయుచున్నది. గ్రంథమాల లన్నియు యథాశక్తిని వాఙ్మయాభివృద్ధికి పాటుపడుచున్నవి. ఆంధ్రమాత నలంకరించుచున్న గ్రంథమాలలం దిది యొకటిగ నుండగలదను విశ్వాసముతో నీ ప్రయత్న మారంభమైనది. ఈ గ్రంథమాలయందు విజ్ఞానాభ్యుదయమునకు సాధనములై వివిధవిషయములకు సంబంధించిన గ్రంథములు రెండుమాసముల కొకగ్రంథమునంతున ప్రచురింపబడును. ఆంధ్రమహాజనులీ ప్రయత్నమును పోషించుటకు ప్రార్థితులు.

### గ్రంథములు

1. శతకమంజరి (భక్తిసంపుటము):—వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, నారాయణ, కాళహస్తీశ్వరాదిశతకములు పది యిందుగలవు. ఒక్కొక్కశతకమునకు పీఠికయు, పాఠభేదములు గలవు. (ఈశతకములు విడిగను దొరకును.) ... ... ... రు ౧-౮-౦

2. బసవపురాణము (ద్విపద):—పాల్కురికి సోమనాథుడు. అనేకతాళపత్రమాతృకలను బరిశీలించి కూర్చిన మూలము. పాఠభేదములు సూచింపబడినవి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన విపులమగు పీఠిక గలదు. ... ... ... రు ౨-౮-౦

3. గాంధిమహాత్ముని బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము:— రు ౦-౪-౦

4. కమలాక్షి (చిన్ని విచిత్రకథ):—రాయసం వెంకటశివుడుగారు, యమ్. ఏ., యల్. టి, ... ... ... ... రు ౦-౮-౦

5. నీతినిధి:—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. మానవజీవితనిబంధనము లిందు సూటిగా వివరింపబడినవి. రెండువేలయేండ్లకుపూర్వ మొక భారతీయబ్రాహ్మణునిచే రచియింపబడినది దీనిమూలము. ఇట్టి యుత్కృష్టనీతిగ్రంథ మాంధ్రగీర్వాణవాఙ్మయముల గానరాదు. ... రు ౧-౪-౦

6. జీర్ణవిజయనగర చరిత్రము:—కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ. కృష్ణదేవరాయల సామ్రాజ్యలక్ష్మీవిహారభూమియై వెలసిన విద్యానగరము (హంపిశిథిలముల) యొక్క ప్రాచీనచరిత్రము, ప్రకృతపు జీర్ణస్థితియు నిందు వర్ణితములైనవి. ... ...

7. త్యాగరాజస్వామి చరిత్రము (పద్యకావ్యము):—శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి శాస్త్రిగారు. శ్రీరామభక్తాగ్రణియు, గాయక శిఖామణియు నగు శ్రీ త్యాగరాజుగారిచరిత్ర మిందు సరసముగ వర్ణింపబడినది. సందర్భానుసారముగ త్యాగరాజుగారు రచించిన కృతులు. ౫౪ ఇందు చేర్చబడినవి రు ౦-౧౦-౦

(పోస్టుఖర్చులు ప్రత్యేకము)

కాశీనాథుని నాగేశ్వరరావు,
వ్యవస్థాపకుడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri






# ప్రేమప్రభావము

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

౧

వేంకయ్యనాయుడు చాల స్థితిమంతుడని పేరు మోసినవాడు. అతడు మెట్రిక్యులేషను పరీక్షలో నొకదెబ్బతిని వెనుకకు మరలియుండుటచే నాతని చదువుకొనినవాడనియే చెప్పవలెను. వేంకయ్యనాయుడు జనపనారవర్తకముచేసి ధనవంతుడైనవాడు. కాన నాతనికి జనపనాయుడనికూడ పేరుగలదు. పేరున కాతడు నారవర్తకుడైనను చూపుల కాతడట్లుండడు. ఆతని చూచినవారు ఏ హైకోర్టులాయరో, ఏడిప్యూటి కలెక్టరో యనునట్లుండును. నల్లపట్టంచు తెల్లధోవతి, నల్లనిపట్టుకోటు, దానిపై సేలంఅంచు జరీఖండువా, జేబులో జార్జిఫిఫ్త్ పతకమువేసిన బంగారపు గొలుసుగల గడియారము, శిరమున రాజమండ్రి పట్టుసెల్లా తలపాగ, కాళ్లకు జోడు, కన్నులకు జోడు, చేతిలో బంగారు పిడివేసిన కఱ్ఱ- సర్వదా యీతడిట్టివేషముతో నుండును పూర్వ మాతనివేషము పరిహాసపాత్రముగ నుండినను బ్రాహ్మణేతరప్రాముఖ్యమువచ్చినతరువాత నాతనివేషము వృథకాలేదు. శ్రీకృష్ణుని గోపాంగనలు వరించినట్లు జిల్లా బోర్డు, తాలూకాబోర్డు, మ్యునిసిపాలిటి మున్నగు స్థానిక సంఘములలోని సభ్యత్వ అధ్యక్షత్వాది పదవు లనేకము లాతని వరించి యీతనివేషమును సార్థకపఱచినవి. అయినను నాయుడు కీపదవు లన్నియు లభించుటకు ధనము, వేషము, అబ్రాహ్మణత్వమే కాకుండా మఱి కొన్ని సుగుణములుగూడ నున్నవి. అందు మొదటిది అధికారప్రాపకసంపాదన. ఆ విషయమున నాయుడు అందెవేసినచేయి. ఆవిషయమున నాతనికి యుచ్చనీచములు లేవు; గొప్పకొద్దులు లేవు. ఎన్ని యకృత్యము లైనజేసి, ఎన్ని శ్రమలైనపడి, ఎంతధనమైన వెచ్చించి, అధికారిని లోబఱచుకొనును. అభిరుచినిబట్టి పసదనము లర్పించి అధికారిని మెప్పించుటలో నతని కతడే సాటి.

అతనికడనున్న రెండవసుగుణము అభిమానశూన్యత. ఏవిషయమునైన నపజయము గలిగినచో నాత డభిమానపడి యూరుకొనడు. ఏకృత్రిమోపాయము ద్వారానైన జయమందుట కాతడు విశ్వప్రయత్నము చేయును. నాయుడుకు ధనముతోపాటు, అధికారముల తోపాటు వృద్ధిపొందినది బ్రాహ్మణద్వేషము. బ్రాహ్మణాధిక్యము నాత డెంతమాత్రము సహింపడు. దుంపతెగ బ్రాహ్మణులనియో, బ్రాహ్మణముండాకొడుకులనియో, తిట్టాలపదము లేక ఆతడేవేళనుగూడ బ్రాహ్మణనామమే యుచ్చరింపడు. అధికారరీత్యా తనకడకువచ్చు బ్రాహ్మణుల కాతడు సామాన్యమైనంత యగౌరవము చేయును. అంతకంటె లోకువైనవారి నాతడు 'ఒరే! బ్రాహ్మణా!' యని సంబోధించుట పరిపాటివిషయమే. పూర్వమెట్లున్నను సహాయనిరాకరణోద్యమము వచ్చినతరువాత నాతనిమాట తడిపిన మైదాపిండివలె యిచ్చవచ్చినట్లు సాగుచున్నది. వివాహాదిశుభకార్యములలోను, శ్రాద్ధాది క్రియలలోను నాతడనాదిగా వచ్చుచున్న బ్రాహ్మణ పురోహితమును మూడుసంవత్సరములక్రిందటనే వదలుకొని, కాపుశాస్త్రులనో, చాదరిశాస్త్రులనో రెడ్డిశాస్త్రులనో పిలిపించి పురోహితక్రియల నడిపింప సాగించినాడు. ఈవిధముగా నాయుడు బ్రాహ్మణేతరుల కొక యాదర్శనాయకుడై, దొరతనమునకు నమ్మినబంటై, దేశభక్తులకు గర్భశత్రుడై విరాజిల్లుచున్నాడు. బ్రాహ్మణేతరుల కాతనినుడి వేదవాక్యము.

౨

లక్ష్మీదేవి వేంకయ్యనాయుడుభార్య. లక్ష్మీదేవి పల్లెటూరు మనిషి. మాయమర్మము తెలియదు. దాబు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డచ్చా తెలుగదు. దైవభక్తి, పాపభీతి, బ్రాహ్మణ గౌరవము గలిగి దయాధర్మాది సద్గుణములుగల యుత్తమ సాధ్వియని కీర్తిగాంచిన యిల్లాలు. పేదలయార్తనాదము, పెద్దలతిరస్కారమామె విని సహింపదు. బంధుమిత్రులకును గ్రామస్థులకు నామెయనిన మిగులగౌరవము. అతనిప్రకృతికి కేవలము ప్రతికూలముగానుండుటచే నామె యొక్కొక్కప్పుడు వేంకయ్యనాయుని తీవ్రకోపమునకు గురియగుచుండును. నాయుడు అనాదిగా వచ్చుచున్న బ్రాహ్మణపురోహితమును తొలగించినప్పుడు ప్రాచీనాచారమును రూపుమాపవలదని లక్ష్మీదేవి భర్తను వేవిధముల బ్రార్థించినది. నాయుడు వినలేదు. బ్రాహ్మణులను నామెనుగూడ నొవ్వదిట్టి తండ్రిశ్రాద్ధమును బ్రాహ్మణేతరపురోహితునిచే యథావిధిగ నిర్వర్తింప జేసినాడు. అది జరిగిన పదియైదురోజులకే వేంకయ్యనాయుడు కొమార్తె, పదునాలుగేండ్ల చిన్నది, వివాహయోగ్యయై యున్నది, రెండురోజులు జ్వరముతగిలి పుటుక్కున జచ్చినది. అది దైవికమైనను లక్ష్మీదేవి యమాయకపుబుద్ధికిమాత్ర మది బ్రాహ్మణతిరస్కారమువలన గలిగిన కీడేయని గట్టినమ్మకము గలిగినది. బ్రాహ్మణభక్తి మఱింత ప్రబలమైనది. అందుచేతనే బ్రాహ్మణబ్రువులు కొందఱు వీథివాకిట వెళ్లిన నాయుడుగారు శపించెదరని దొడ్డివాకిటవెళ్లి నాయుడు పత్నిచే సత్కరింపబడి వచ్చుచుందురు.

రామస్వామి వేంకయ్యనాయుని యేకపుత్త్రుడు. ఇరువదిమూడేండ్ల వయస్సు. చెన్నపురిలో బి.యల్. తరగతిలో జదువుచున్నాడు. రామస్వామికి వేంకయ్యనాయునకు ప్రహ్లాద హిరణ్యకశిపుల కున్నంత తారతమ్యమున్నది. తండ్రిచేయు అకార్యములు రామస్వామికి గిట్టవు. కాని కాదనడు. తనచదువేమొ తానేమొ : ఇతర విషయము లాతడు పట్టించుకొనడు. బ్రాహ్మణద్వేషము కాని, పంచమతిరస్కారము కాని, స్వమత దురభిమానముగాని యాతనికి లేవు. అతడందఱతో సమానముగ వర్తించును. అతనికి బ్రాహ్మణ బ్రాహ్మణేతర పంచమమిత్రులుగూడ కలరు. అతడందఱతో స్నేహముసలిపి యందఱిస్నేహమును జూరగొనును.

రామస్వామి కింకను వివాహము కాలేదు. వేంకయ్యనాయునకు కొమారునికట్నముమూలకముగా గొప్పయాస్తిని బడయవలెనని కోరిక. కట్నమే వివాదింపవలెనని కొమారుని యుద్దేశము. తండ్రికొడుకుల కీవిషయమున మనస్సులలో కలతలున్నవి. కాని యింకను పైకిరాలేదు.

ఏపిల్లవలన ఎక్కువఆస్తి వచ్చునో, ఏపిల్లతండ్రి యెక్కువఅధికార ప్రాబల్యము కలవాడో ఆలోచింపుచున్నాడు నాయుడు. కొన్ని తానేకొట్టివేయుచున్నాడు. కొన్ని భార్యతో నాలోచింపుచున్నాడు. కొన్ని రామస్వామిదాకా బంపుచున్నాడు. "ఈ పిల్లను జేసికొనిన పాతికవేలరొక్కము వస్తుంది. ఆపిల్లను జేసికొనిన ఏబదియెకరాల పల్లము వస్తుంది. ఆపిల్లను జేసికొనిన లక్షరూపాయల కవిలెకు మనవాడే యధిపతి." అని నాయుడు కోడలివల్లవచ్చు రాబడినిగూర్చి యోచింపుచున్నాడు. "ఆపిల్ల యింగ్లీషు బాగుగా జదువుకొనినది. ఈపిల్ల సంస్కృతాంధ్రముల బ్రజ్ఞావతి. ఆపిల్ల సంగీతమున సరస్వతి." అని రామస్వామి విద్యావతులను బాలికలవిమర్శింపుచున్నాడు. డిసెంబరు సెలవులలో రామస్వామి యింటికివచ్చినప్పుడు తల్లి "నాయనా! మీనాయన నీకీవత్సరము పెండ్లిచేయదలంచుచున్నాడు. నీవు అడ్డుచెప్పకు. మీ తండ్రి తగనివాడు. ఆయన యిష్టప్రకారము నడువకపోయిన నీపై కోపించును. ఇప్పుడే మీ తండ్రికి నీవు నచ్చవు. నీవు పెండ్లివిషయమున తగవు పెట్టితివా, సాగదు. ఆయన సరసుడుకాడు. మీయిద్దరిలో కలత నాకు మనోవేదన. మీతండ్రికి చెప్పి యొప్పింపలేను. నీవైన నామాటవిని మీతండ్రి కుదిర్చినసంబంధమున కొప్పుకొనుము." అని బతిమలాడి చెప్పినది.

"అమ్మా! నాన్నకు కోడలితోపాటు గొప్పసంపత్తిని బడయవలెనని కోరికయున్నట్లున్నది. బాలికవిద్యారూపగుణాదులను జూచుకొనవలెను గాని, యాస్తినా చూచుకొనుట? ఇదియేమిసబబు? వారియొద్దసొమ్ముపుచ్చుకొనినగాని మనకు పొట్టగడవదా?"

"మీతండ్రికి గుణము ప్రధానము కాదు. సొమ్మే ప్రధానము. సొమ్మెక్కువ తీసికొనుటలోనే యెక్కువ గణ్యత యున్నదని యాయనయూహ."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"గుణములేని ఆస్తితో నాకు బనిలేదు."

"నాయనా! నేను నీకు మొదటనే చెప్పితినిగదా, ఆయనవలెనె నీవు గూడ మూర్ఖపుబట్టు బట్టవలవని! నీవు గూడ నిట్లు మాట్లాడిన నేమి చేయగలను ?"



తండ్రి తగనివాడని రామస్వామికి దెలియును. అమాయకురాలగు తల్లి యాతని కెదురాడ నేరదనియుగూడ నాత డెఱుగును. కావున తల్లిని దన్నుగూడ నాముప్పునుండి తప్పింపవలెనని రామస్వామికి దోచినది. కాన తల్లివంకజూచి "అమ్మా! ఈ సెలవులు వెళ్లిపోయినవి గదా! ఇక వేసవికాలమువఱకు పెండ్లికవకాశమే లేదు. నాకిది రెండవయేడు. పరీక్షలు సమీపించినవి. ఈ రెండు మూడునెలలు గట్టిగా జదివినగాని గట్టెక్కము. కాన వేసవివఱకీవిషయము నాపియుంచుమని నాన్నతో జెప్పుము. అప్పుడు సావకాశముగా సంబంధముల మంచి చెడుగు లాలించి,యవసరమగుచో నాన్న యిష్టప్రకారమే పోవచ్చును" అన్నాడు. కొమారుని పలుకులు లక్ష్మీదేవి కెంతయో హృదయశాంతిని గలిగించినవి. రామస్వామి చెప్పినవిధము భర్తతో జెప్పినది. నాయుడు గూడ పరీక్షల ప్రాముఖ్యము గుర్తించి వివాహయత్నమాపుచేసినాడు. శీతకాలము వెళ్లగనె రామస్వామి చెన్నపురి వెళ్లినాడు.

## 3

౧౯౨౧ సంవత్సరము వచ్చినది. మహాత్ముడుపదేశించిన అసహాయోద్యమతత్త్వము ఉత్సాహభరితులగు నాంధ్రులహృదయమున జక్కగా నాటుకొనినది. స్త్రీలు, పురుషులు, ధనికులు, పేదలు, ఉద్యోగులు, విద్యార్థులు, వర్తకులు, వ్యవసాయదారులు—వీరువారననేల— సర్వవర్ణములవారును, సర్వవృత్తులవారును ఉద్యమములో జేరి యుత్సాహముతో బనిచేయనారంభించినారు. మార్చినెలలో విజయవాడయందు జరిగిన దేశీయమహాజనసభా స్థాయిసంఘ సమావేశమున కేతెంచిన గాంధీమహాత్ముడు ఆంధ్రదేశమున బర్యటనమునల్పి, ఆంధ్రులు కార్యోన్ముఖులగునట్లుద్బోధించి, యేప్రియలు మొదటివారములో చెన్నపురి చేరికొనినాడు. చెన్నపురిపౌరు లత్యుత్సాహముతో మహాత్మునకు స్వాగతమొసగిరి. సముద్రతీరమున గొప్పసభ సమావేశమైనది. మహాత్ముడా సభయందు అసహాయోద్యమమునకు మూలసూత్రము లైన సత్యము, త్యాగము, అహింస, ఐకమత్యము నను నాల్గుసూత్రములనుగూర్చియు, న్యాయస్థానములు, శాసనసభలు, పాఠశాలలు, విదేశవస్త్రములు, అస్పృశ్యత, మద్యపానము నను షడ్విధబహిష్కారములను గూర్చియు, గంభీరమైన యుపన్యాస మొసగినాడు. రామస్వామిగూడ ఆమహాసభకేగి మహాత్మునియుపన్యాసము నామూలాగ్రముగ నాలించినాడు. మహాత్ముని పలుకు మహాత్మునికే యొప్పగించి వెళ్లిన యనేకులవలె గాక మహాత్ముడు చెప్పిన ప్రతివిషయము రామస్వామిహృదయమున గాఢముగా నాటుకొనిపోయినది. సభ ముగిసినది. రామస్వామి తననివాసమున కేతెంచినాడు. కాని తనశ్రోత్రేంద్రియముకడజేరి ముక్తకంఠముతో మహాత్ముడు భారతీయులకుల కర్తవ్యమును బోధించుచున్నట్లే రామస్వామికి స్ఫురింపసాగినది. రామస్వామి తనగది చేరగనె దీపము వెలిగించి కిటికీకెదురుగ బడుకుకుర్చీ నైచుకొని యాలోచింపుచు గూర్చున్నాడు. పరీక్షకై యాతడు దీక్షతో జదువుచున్న లా పుస్తకములు బల్లపై చీకాకుగ బడియున్నవి. అతని ప్రాతకాగితములు వాతాహతిచే తనహృదయమువలెనే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తటతట గొట్టుకొనుచు బత్రిహస్తముల నాతనికి స్వాగత మొసగుచున్నవి. వంకెలపైనున్న సేలం అంచు జరీఖండువాలు, పట్టుత్తరీయములు సాగరవీచీ పవనంబులకు రామస్వామి మానసమునుబోలి యుయ్యాల లూగుచున్నవి. రామస్వామి వానిని వేనిని పరికించుట లేదు. అతని మానసము మహాత్ముని యుపన్యాస చింతనములో మగ్నమైపోయినది. సమస్తేంద్రియములు, సమస్త వృత్తులు ఆమానసికచింతలో లీనమై కట్టుపడి పోయినవి. అతనికి బాహ్యజగత్తే దూరమైపోయినది. ఏకాగ్రయోచనకు గడంగినాడు.

మహాత్ముని యుపన్యాసము నాలకించినది మొదలు తానొకనూతన ప్రపంచమున ప్రవేశించిన ట్లున్నాడు. నవ్యచైతన్యము, నవోత్సాహము, నవ్యభావములు! అంతయు నవ్యమే! అతనితనువే నవ్యరూప మెత్తినట్లున్నది. అప్పటి కాతనిదృష్టియందు చదువులు, పరీక్షలు, ఉద్యోగములు కేవలము నిస్సారములుగ, నిస్తేజములుగ, నిరుపయోగములుగ గాన్పించుచున్నవి. ఇట్టి పనికిమాలిన పదవులకై యమూల్యమును, నుత్కృష్టమును నగు జీవితమును వ్యయము సేయుటకంటె భౌతికము లగు నీయున్నతోద్యోగములకు జలాంజలి యొసంగి, మహాత్ముని యాన శిరసావహించి మాతృదేశారాధనము సేయుట యుత్తముగాదా యను నూత్నభావ మొకటి యాతని మానసమున నుదయించినది. మానవసేవయే దేశసేవ. దేశసేవయే దైవసేవ. దైవసేవయే ఆత్మసంతుష్టి. ఆత్మసంతుష్టియే యాత్మోపలబ్ధి. అంతకంటె కావలసిన దేమి? ఉన్నతవిద్య, పట్టపుబిరుదులు, ఉద్యోగయత్నములు, అధికారపదవులు, బిరుదులు, సన్మానములు- వీనివలలో జిక్కిన నెప్పటికైన వాంఛాసిద్ధి, ఆత్మసంతుష్టి యనునది కలదా? లేదు. వీని నన్నిటిని వదలి భారతజననీ దాస్యవిమోచన దీక్షావ్రతు డగు మహాత్ముని యాన శిరసావహించి జన్మసాఫల్యము నందుట మేలుగాదా యని రామస్వామి యూహించినాడు. అంతకంటె నుత్తమధర్మము లేదని నిశ్చయించినాడు. కాని వెంటనే రామస్వామిగుండె జల్లుమన్నది. శరీరమా పాదమస్తకము కంపించినది. నేత్రము లశ్రుసిక్తములైనవి. "దుష్టుడా, ఏమినీతలంపు! అధికవ్యయముచేసి నేచెప్పించిన చదువంతయు పాడుచేసి సన్న్యాసివై పోదలంచితివా! ఛీ, దరిద్రుడా! పొమ్ము! నాగృహమును వీడిపొమ్ము! నాయాశ లడుగంటజేసి, నాకపయశమును దీసికొనివచ్చి, నాయింటి కేమని వచ్చితివి? పుత్రుడవై పుట్టిన శత్రుడా! పొమ్ము! నాగృహము వీడిపొమ్ము! నీకును నాకును ఋణము తీరినది. పొమ్ము." అని యాకులీకృతములగు పండ్లు పటపటగొఱకుచు భయంకర క్రోధమూర్తియై తండ్రి తనయెదుట నిలువబడినట్లు రామస్వామి మనోదృష్టికి దోచినది. మహాభయముచే రామస్వామి గడగడలాడి కన్నులు మూసికొనినాడు. కాని లాభ మేమి? మనోదృష్టికి మఱుగేమున్నది? నిమీలితనేత్రుడైననుగూడ తండ్రియాకృతి యాతనికగపడుచునే యున్నది. ఇన్నియేండ్లువచ్చి తండ్రికి తా ననుకూలముగ ప్రవర్తించునప్పుడే యాతని కెదురాడనెఱుగని రామస్వామి తండ్రికి కోపకారణమగు నీవిషయమున నెట్లు నిర్భయుడై ప్రవేశింపగలడు? తండ్రియానతి శిరసావహించెనా, ఉద్యోగములు, ఉన్నతాధికారములు, ధనసంపదలు, సర్వసుఖములు; కాని ఆత్మకు సంతుష్టిలేదు: జన్మకు సాఫల్యము లేదు. పారతంత్ర్యభారమునకు విమోచనము లేదు. కావున మహాత్మునియానతి నంగీకరించెనా, తండ్రితోడి బలవద్విరోధము! గృహత్యాగము! మాతృదుఃఖము! శ్రమ! దారిద్ర్యము! వేయేల, అనంతసుఖములు దూర; అనంతకష్టములు దీన. ఇందేది శ్రేష్ఠమైనది! రామస్వామి దీర్ఘముగ నాలోచించెను: "తండ్రికి ప్రియము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేయుటకై మనస్సాక్షికి వ్యతిరేకముగ వర్తించుట దుస్తరమైనపని. కాన ప్రహ్లాదునివలె తండ్రి పెట్టు బాధలకోర్చి గాంధియుద్యమమున జేరి దేశసేవ చేసితీరెదను." అని కృతనిశ్చయుడైనాడు. ఏదియో యొకనిశ్చయమునకు వచ్చుటచే రామస్వామిహృదయము తేలికపడినది. "వత్సా! వీరపురుషోచితమైన నిశ్చయము చేసితివి." అని యంతర్వాణి యతని నభినందించినది.

## ౪

తెల్లవారినది. రామస్వామి నిద్దురలేచి ప్రాతఃకృత్యముల నిర్వర్తించుకొని యాలోచనాధీనచేతస్కుడై కుర్చీలో గూర్చున్నాడు. ఇంతలో రామస్వామికి మిత్రుడును సహపాఠియు నగు కృష్ణయ్యచౌదరి వచ్చి రామస్వామి యెదుటి కుర్చీపై గూర్చుండి, "రాత్రి యెంత ప్రయత్నించినను వచ్చుటకు వీలు కాలేదు. మాపిల్లకు రొంచెము సుస్తీగా నున్నది. కుటుంబముతో వచ్చినవారికి దేకష్టము. నిశ్చింతగా జదువుకొనుటకు వీలుండదు. నీవు చాల చదివినావు కాబోలు అనుకున్నాను. ఏమి చేయను? రాజాలక పోయినాను" అనెను. రామస్వామి మందహాసవదనములో చౌదరి దెస జూచుచు, "మిత్రుడా! దిగులుపడకు. చదువలేదు; చదువను. పరీక్షాజయము నీదే కాని నాదికాదు" అన్నాడు.

"ఏమి! క్రొత్తమాట లాడుచున్నావు! గాంధి తత్త్వము తలకు పట్టలేదు గదా?"





"పట్టినది, బాగుగా బట్టినది."

"ఎంతవఱకు?"

"ఈచదువులు, ఉద్యోగములు, బిరుదులు, సన్మానములు వ్యర్థము లనువఱకు."

"ఓహో! చాలముందుకు బోయినావే! ఒక్కమాటతో నున్నది రెండేండ్లశ్రమ. ఏదోవిధముగా దీనిగూడ నెగ్గించు. తరువాత తీరుబడిగా గూర్చుండి వ్యర్థసార్థకము లూహింతువుగాని."

"రాత్రి పరీక్షయైనది. ఫలితము తెలిసినది. ఇక చెన్నపురి వీడుటయే తరువాయి. అది సాయంత్రము జరుగును."

"వినదగు నెవ్వరు సెప్పిన
వినినంతనె వేగపడక వివరింపదగున్."

అని మనము చిన్ననాడె చదువుకొంటిమి. ఆనీతి ప్రతివిషయమున నవలంబింపదగినది. నిదానముగా నాలోచింపక ఏపనియు చేయరాదు."

"దీర్ఘముగా నాలోచించియే నిశ్చయించితిని; తొందరపడలేదు. మనసు నీరగునట్లు మహాత్ముడు వచించినవాక్యము లాలించియు, చౌదరీ! ఇంకను జదువుటకును నుద్యోగములు సేయుటకును నీమానస మెట్లంగీకరింపుచున్నది?"

"మహాత్మున కేమి? ఎన్నైన జెప్పును. వాని నన్నిటిని మన మాచరింపగలమా? ఆయన సర్వము వదలుకొని సన్న్యాసియై, దేశజనులకు సన్న్యాస మిప్పించుటకు బూనుకొనినాడు. మెత్తనివలువలను వదలి కంపగుడ్డలను కట్టుడనియు, కమ్మని నెయ్యియన్నమును వదలి ముడిరొట్టెలను తినుడనియు మహాత్ముని బోధ. ఇది యేమిపని? కూటికి గుడ్డకు గలవారు గూడ పేదతనము ననుభవించినచో లోకములో పేదలనియు, భాగ్యవంతులనియు తారతమ్య మేమున్నది? ఈయాందోళనల కేమి? వచ్చుచుండును, పోవుచుండును. నందేమాతరం గడబిడ మాడలేదా, మూడునాళ్ల ముచ్చటైనది. నాడు చదువులు మానియు, నుద్యోగములు మానియు, భ్రష్టులైనవారెందఱో నేటికిని నట్లే యున్నారు. కాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాటినాయకులైన బెనర్జీ, పాలు మున్నగువారు నేడు దొరతనమునకు జేయూతలై వారొసగిన యుద్యోగము లు, బిరుదులు నందుటకు సిద్ధమైనారు. ఈయుద్యమము గూడ నట్టిదే. మూడునాళ్లు; దొరతనమువారేదైన రుచి చూపిరేని యీనాయకుడుగూడ అంతే. ఇట్టిబూటకపు టుద్యమములనమ్మి మనచదువులుపాడుచేసికొని, యుద్యోగలాభములు చెడగొట్టుకొని, ధనార్జన చెఱుచుకొని, సౌఖ్యమును మంటగలుపుకొని, తలిదండ్రులకు దూరమై దారిద్ర్యము నకు జేరువై, మన మేల భ్రష్టులము కావలెను ?"

"చాదరీ! దీర్ఘోపన్యాసమొసగితివి. నాహితముకోరి నీవు చేసిన హితోపదేశమునకు గృతజ్ఞుడను. కాని యొకమనవి: దేశము, మతము అనునవి మనుష్యునకు ప్రాణముకంటె ప్రియతరములు. ఈరెండిటికిని తమప్రాణములను ధారవోసిన వీరవ్రతుల నెందఱనో మనము దేశచరిత్రములలో గాంచుచున్నాము. కాని మన నేటిచదువు మనలో జీవశక్తినిజంపి స్వార్థచింతను బ్రేరేపించునదిగా నుండుటజేసి మనలో దేశాభిమానము నశించిపోయినది. లేకున్న విద్యాధికుడవగు నీనోట నిట్టి మాటలురావు. వందేమాతరపు గోల పోయినదంటివి. ఎక్కడకు పోయినది? నాటియుద్యమములో బుట్టిన జాతీయసంస్థలెన్నియో నేటికిని నిలిచి ప్రజలలో జాతీయతను పెంపొందించుచున్నవి. నాటిదేశారాధకు లెందరో నేటి నిరాకరణోద్యమములో జేరి దేశసేవకు గడంగినారు. కావున ఉడుకు చల్లారవచ్చునుగాని యుడికిన గుణమెప్పటికి చల్లారదు. ఉద్యమమున కుచ్చనీచము లుండునుగాని నాశ ముండదు. సత్యవ్రతుడును, త్యాగశీలుడును నగు మహాత్మునికంటె యుత్తమ నాయకుడు భారతదేశమున కెప్పటికిని లభ్యపడడు. అట్టివానిచే నేర్పడినఅసహాయోద్యమము బూటకపుటుద్యమముగాదు. అతడు చెప్పిన సూత్రములుగూడ నక్రమములును, నన్యాయములునుగాక ప్రజాక్షేమకరమైనవిగను, పరతంత్ర భారతదేశమున కర్తవ్యమైనవిగను నున్నవి. సర్వము వర్జించి సన్న్యసి గమ్మనుమండెనని మహాత్ముని నిరసించితివి. స్వార్థదృష్టితో జూచువారికి మహాత్ముని త్యాగతత్త్వము సన్న్యాసముగనే గాన్పింపవచ్చునుగాని నాకుమాత్ర మది మహోత్కృష్టధర్మముగా గాన్పించుచున్నది. ఉత్తమ త్యాగి యెప్పుడును ధనధర్మమును జూచుకొనడు. 'తన భార్య బిడ్డల పోషణమెట్లు? తన సౌఖ్యమెట్లు?' అని స్వార్థమును లెక్కించువాడెట్టి ధర్మకార్యము జేయజాలడు. 'మనచదువులైన తరువాత, మనయుద్యోగ వాంఛ తీరినతరువాత, ధనముకూర్చినతరువాత, మనుమలు పుట్టినతరువాత'- అని యనుపులు పెట్టినచో మనజీవితములో ధర్మసాధనకు కాలమే లభింపదు. మహాత్మునిచే ప్రబోధితమై నాచిత్తము దేశసేవకేయ నుత్సాహపడుచున్నది. కాన నిరుత్సాహవాక్యములచే నన్ను గలవరపెట్టకుము."

"రామస్వామి! నీత్యాగశీలతకును, నీమనోదార్ఢ్యమునకును సంతసము గుచున్నది. కాని యొకసంగతి యాలోచింపుము: మీతండ్రి ధూర్తుడు. అధికారపక్షపాతి. నీవిట్టిపనిచేసిన కొంపకు రానివ్వడు. ఆసంగతి నాలోచించితివా?"

"ఆలోచించితిని. కొంపకు రానీయకున్న వెలుపలనేయుండ నిశ్చయించితిని."

"అమాయకుడా! లక్ష మీ తల్లియేకపుత్రుడ వగు నీవు కనులబడకున్నచో విలపింపదా?"

"చాదరీ, నామనోదౌర్బల్యమును శోధింపనేతెంచినయీశ్వరునివలె నున్నావు నీవు. నీవువేసిన వెఱ్ఱి ప్రశ్నలు నా మనస్సందేహముల బాపి కార్యదీక్షను గావించుటకే తోడ్పడుచున్నవి. యథార్థము నెఱిగి యనుజ్ఞ వేడినచో మా యమ్మ విచారింపదు. విచారించినను మానునది లేదు. సత్కార్యములకు విఘ్నము లనేకము లుండుట సహజమేకదా! వాని నెదిరింపవలసినచో సధైర్యముగ నెదిరించుట కాయత్తుడనై యున్నాను. కాన నా సంకల్పమును వికల్పముచేయ యత్నింపకుము. విఫలుడ వగుదువు."

ఆశ్చర్యసంభ్రమములతో చౌదరి మారుబల్క నశక్తుడై యూరకుండెను.

నిర్ణయించుకొనినప్రకారము రామస్వామి నాటి సాయంకాలమె చెన్నపురివీడి స్వగ్రామమేగెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౫

రామస్వామి యింటికివెళ్లిన రెండవ దినమున మధ్యాహ్నము రెండుగంటలకు వేంకయ్యనాయుడు తనగదిలో నటునిటు పచారుచేయుచు, "ఇదిగో, యిటురా!" అని భార్యను పిలిచినాడు. లక్ష్మీదేవివచ్చి ఎదుట నిలిచినది. వేంకయ్యనాయు డావిడవైపుజూచి, "ఇదిగో నీకొమారునికి నచ్చచెప్పు. అన్యాయముగా చెడిపోవద్దను. అయినదేదో అయినది. కడచినదానికి వగచిన లాభములేదు. ముందుసంగతి చూచుకోవలె. కలెక్టరాఫీసులో ఏభైరూపాయలపని ఒకటి ఖాళీ వచ్చింది. దొరతోచెప్పి ఆపని వేయించుతాను. ఈదినాల్లో మన శూద్రులకు గవర్నమెంటులో పలుకుబడి యెక్కువగా వున్నది. తెలివిగలవాడని అధికారులకు తోచెనా, మూడురోజులలో పైకి తీసుకవస్తారు. మూడేండ్లలో కొడుకు తాసిల్దారవుతాడు." అన్నాడు.

"ఏమో, వాడు వినేటట్టులేదు."

"వినకపోతే యింట్లో ఒకక్షణ ముండటానికి వీలులేదు. ఇటువంటివాడు కొడుకని యింట్లో పెట్టుకొంటినా, నాకుగూడా ముప్పు; నాఅధికారాలు గూడ పోతాయి."

"పోతేపోనియ్యండి;అధికారాలకోసం బిడ్డను వదులుకుంటామా? వాడు చెప్పేమాటల్లో యేం తప్పుందని ముప్పువస్తుంది? ఇల్లుఒళ్లు గుల్లఅయ్యే యీ చదువెందుకు? మనపూర్వులంతా యీచదువులవల్ల జీవించారా ? వ్యవసాయం జేసుకొని పాడిపంటలతో సుఖించలేదా? అట్లానే చేతామంటాడు. 'ఏటా నుడ్డకు బోలెడుడబ్బు పోయాలిపోస్తున్నది. సొంతంగా రాటంమీద నూలువడుక్కొని గుడ్డలు నేయించుకుంటే గుడ్డలు మన్నుతాయి, డబ్బు కలిసివస్తుంది' అంటాడు. ఇందులో తప్పేముంది ? మా చిన్నతనంలో మానాయనమ్మవడికిననూలుతో కోకలు నేయించుకుంటే మూడేళ్లు కట్టేవాళ్లము. పట్టుకుచ్చువలె అంతమెత్తగా, చామాకువలె అంతసరసంగా వుండేవి. సన్నచీరలు సన్నచీరలు అని గొప్పేకాని యీసన్నాసి కోకలు మూడునెల్లైనా వుండవు. అంతదాకా యెందుకు? ఏటేటా పాతికలు, యేభయిలు పెట్టి రంగురంగుల శాలువలు కొంటుంటారుకదా! వాటిలో యేమైనా సుఖం వున్నదా ? సొగుసుకేకాని చలి ఆపదుకదా! నేను కాపురానికి వచ్చేటప్పుడు మానాయనమ్మ కట్టెడు నూలువడికి మాలవాడిచేత దుప్పటినేయించి యిచ్చింది. పాతికేండ్లయింది, యిప్పటికి కొత్తమాయలేదు. అది కప్పుకుంటేమా చలి యేమూలున్నదో తెలియదు.అదిసరి,కొండారెడ్డి గజంస్థలం ఆక్రమించాడని మూడుకోర్టులు తిరిగారు. మూడువేలు ఖర్చుచేశారు. చివరకు అతనిపక్షమయింది. ఇంత బేజారులేకుండా మనవూళ్లోనే మధ్యవర్తులద్వారా పరిష్కారం చేసుకున్నట్లయితే కొంతయినా న్యాయంజరిగేది. లేక వదిలిపెట్టినా యింతనష్టంలేకపొయ్యేది. మూడువేలు పెట్టితే ఎన్నివేలగజాలైన వచ్చేవి. ఇటువంటి నష్టాలు లేకుండావుందా మనేకా, మనరామస్వామిచెప్పేది! అందుకోసం వాడిని కొంపలోంచి వెళ్లకొట్టుతారా? పోగాపోగాఉ ప్పుగల్లాలెవాడొక్కడుకనబడుతున్నాడు. వాడినిగూడావిడనాడుకోని మనంబావుకునేదేమున్నది?"

వేంకయ్యనాయుడికోపం పట్టరానిదై పోయింది.

"ఛీ, నోరుమూయి. ఊరుకున్నకొద్ది నీధోరణి యెక్కువైందే. నీవల్లనే ఆవెధవ యింతపనిచేశాడు. నీవు యేడ్చినాసరే చచ్చినాసరే. వాడు వుద్యోగంలో చేరకపోతే యింట్లో వుండటానికి వల్లగాదు. పో; నీకొడుకుతో రూఢిగా చెప్పు;పో!" అన్నాడు నాయుడు.

"ప్లీడరు సుబ్బారావుగారి అబ్బాయి చదువు చాలించుకొనివస్తే వారు యింట్లో పెట్టుకోని వూరుకోలేదా? ఇట్లాగె వెళ్లగొట్టుకున్నారా?"

"వాళ్లమాటే చెప్పు. చాలించుకోక చదువుకుంటే:మాత్రము బాపనయ్యలకు ఉద్యోగ మిచ్చే దెవరు? అటువంటివాళ్లు చదివితేనేమి, మానితేనేమి; వాళ్లకేమి నష్టము? చదువులకోసం మడిమాన్యాలమ్ముకొని బ్రాహ్మణు లిదివరకే సన్న్యాసు లైనారు. వాళ్ల వుద్యోగ దాహంచూచి గవర్నమెంటువారు శూద్రాదుల కన్యాయం జరుగుతున్నదని ఉద్యోగాలు యియ్యక బిగించేటప్పటికి ఇబ్బడిసన్న్యాసు లైనారు. ఇప్పుడు గాంధి ఉద్యమంలో జేరి ముమ్మడిసన్న్యాసు లైనారు. వాళ్లు దీనిలో చేరినా చేరకపోయినా సన్న్యాసమే కాబట్టి వాళ్లకు గలిగే నష్టంలేదు. అనంతలాభాలు పొందటానికి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీలున్నవాళ్లము మన మెట్లూ ఊరకుంటాము? నీకేమైన మంచిచెడులు తెలిస్తేనా!పో! కొడుకుతో చెప్పు, పో!"

లక్ష్మీదేవికి కనులనుండి నీళ్లు జొటజొట కారినవి. నోటమాట రాలేదు. ఆమె కనులనీళ్లను జూచియైనను నాయుడునకు కనికరము కలుగలేదు. మఱింతకోపంతో "నా దగ్గరయెందు కేడుస్తావు?కొడుకునొద్ద కేడు;పో!" అన్నాడు. కన్నీళ్లతో లక్ష్మీదేవి యటనుండి వెడలిపోయినది.

౬

లక్ష్మీదేవికి ఓరిమి, కరుణ, శాంతము, వినయము, దైవభక్తి సహజగుణములు. మత్సరుడును, అహంకారియు, దుర్వ్యవసాయియు నగు నాయు [illegible]పతి షుడు గానుండ నుండుట కేబలవత్తరమైన కారణమైన నున్నచో నది లక్ష్మీదేవి సాధ్వీత్వమే కాని వేఱు గాదు. ఆమె నిల్లాలుగా బడయుటయే నాయుడి పూర్వపుణ్యము. ఉత్తమురాలగు నామెయందు బంధువులకును,మిత్రులకును, దీనజనులకును నసమానమైన గౌరవము. ఇట్టి సర్వజనపూజ్యురా లగు జననియందు రామస్వామి కెనలేని భక్తి. అతనికి తల్లి యొకపరదేవత. ఆమెమాట యాతనికి వేదవాక్యము. ఆత డింతవఱ కెప్పుడునుగూడ తల్లిమాట కాదని యెఱుగడు. ఆమెకు వ్యతిరేకముగ బ్రవర్తించి యెఱుగడు. కాని నేడాతని నొక విషమసమస్య యెదుర్కొనినది. దేశహితైకచింతతో మనస్సాక్షి ప్రేరితుడై యాత డసహాయోద్యమమును జేపట్టినందులకు దండ్రి కోపించుచున్నాడు, తల్లి దుఃఖించుచున్నది. తండ్రియాగ్రహమున కాతనికి జింతలేదు. కాని తల్లికన్నీళ్లాతనికి వేయని సంకెలలై నిర్బంధించుచున్నవి.

జననీజన్మభూములు రెండును నాతనికి సమాన గౌరవపాత్రములుగనే యున్నవి. అత డేదిత్రోసి యేది యంగీకరింపగలడు? కాన జననిని సమ్మతిపఱచి జన్మభూమిని సేవింప నిశ్చయుడై యాతడు తల్లిసన్నిధి కేతెంచినాడు. ఉద్యమతత్త్వ మామెకుబోధపఱచినాడు, తల్లి సమ్మతించినది కాని కొమారునిమాత్రము మాడక ఉండలేకనుచున్నది. ఎప్పుడును పెనిమిటి కెదురాడని లక్ష్మీదేవి త్రెంపజాలని పుత్రానురాగముచేతనే పెనిమిటికెదురాడ సాహసించినది. కాని నాయుడు పౌర్వాపర్యము లాలోచించునంతటి సరసుడా? కాదు. అతని కేదైనను గావలసినది తనమాట చెల్లుబడికాని భార్యాబిడ్డ యభీష్టము కాదు. వాళ్లభ్యముసే కాని వాత్సల్యము నాతడు లక్ష్యపెట్టడు కావుననే యాతడట్లు భార్యను తిరస్కరింపగలిగినాడు.

భర్తచే నావిధముగా నాశాహతయైన లక్ష్మీదేవి తిన్నగా కొమారునిగదిలోని కేగినది. రామస్వామి [illegible] పోవుటకై యుతికి యూరవేయించిన క్రొత్త [illegible] చొక్కాకు మడతలు సరుదుకొనుచున్నాడు.లక్ష్మీదేవి కన్నీళ్లచే తడిసిన చెక్కిళ్లతడి యింకను ఆరలేదు. తల్లి యెద్దియో కారణమున దుఃఖించినట్లు రామస్వామికి [illegible] గనుటతోడనే విదితమైనది. తోడనె యాతడు "అమ్మా, విచారముగా నున్నావెందులకు?" అన్నాడు.

"నాయనా! మీతండ్రి చెప్పినట్లు నీవు ఉద్యోగములో జేరకున్న నిక నిన్నుజూచు ప్రాప్తము నాకు లేదు." అని లక్ష్మీదేవి కన్నుల నీరు నించినది.

"అమ్మా! భయపడకు. వియోగ సంయోగము [illegible] మానవయత్నములు గావు. నీవు నన్ను జూడనని భయపడెదవేల? నేనెక్కడకుపోవుదును? నీ వెక్కడకు పోవుదువు? విద్యార్థి బంధమును త్రెంచుకొని యుద్యోగబంధముల జిక్కుపడుట త్రాడుకట్టుల త్రెంచుకొని యినుప గొలుసుల గట్టుపడుటవంటిది. ఉద్యోగము చేయుట నాకిష్టమునుచో నొకపూటలో బూత్తియసుపరీక్ష నేలనిచ్చి వత్తును?"

"పనిలో చేరకున్న మీతండ్రి నీవు యింటిలోని స్వరాజ్యవ్యవహారముల దిరుగుట కంగీకరింపరు."

"అంగీకరింపకున్న వెళ్లెదను."

"వెళ్లుట కోర్వలేకే కదా నా యేడుపు!"

"నీవెంతమాత్రము దుఃఖింపకు. నన్ను ప్రేమతో బంపుము. నేను యిల్లువీడుటే నాకు మేలు. నా [illegible] నే జేయవచ్చును. మఱియు నాన్న అనుగ్రహమునుగూడ సంపాదింపవచ్చును. ఎదుటనుండి వ్యతిరేకముగ [illegible] చున్నచో ఆయనకు మత్సర మెక్కువ."

"అనుగ్రహ మనునది మీనాయనకు లేదు. [illegible] పెట్టెనా మరల పిలుపు తలపు లుండవు. ఆయన [illegible] మట్టిది. నాకొడుకని ప్రేమపడుమనిషి గాడు."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"అక్కటా! తండ్రికి బిరుదు తనయునకు ఖైదు!" అని



నేలగూలిపోయినాడు. మిత్రులెల్ల రాత్రముతో నాయుడు కడకేగి యాతంతివార్తల తీసి చూచినారు.

"మీ కొమరుడు రామస్వామి జాతీయగీతములు పాడుచు స్వదేశవస్త్రములు విక్రయింపు చుండగా పట్టుకొనబడి, యొకసంవత్సరము కఠినశిక్షకు గురియైనాడు. పెద్దజయిలుకు రేపు పంపబడును.

వి. నారాయణరావు.

ప్రియమైనతండ్రీ! నమస్కారములు. స్వరాజ్యాందోళనము సలుపుమన్నందున నేను శిక్షింపబడితిని. దైవానుగ్రహముండినచో నొక్కసంవత్సరమునకు మరల మిమ్ము సందర్శింపగలను. మాఅమ్మ అమాయకురాలు. నాస్థితికి దుఃఖించును. నాయపరాధశతముల క్షమించి జైలునం దామె నన్నొకపరి చూచున ట్లనుగ్రహింప గోరెద.

విధేయతనయుడు,

రామస్వామి.

అని వ్రాయబడియున్న రెండువార్తలను జదివి, "రామస్వామి నిజముగా రామస్వామి. అంతయోగ్యుడుమనవర్ణములో లేడు"అని సభ్యులెల్లరు కనుల నీరునించిరి. ఇంతలో వేంకయ్యనాయుడు మిత్రుల శైత్యోపచారములచే దేలుకొని, కన్నీళ్లను త్తరీయమున నొత్తుకొనుచు, 'రామా! నీకు నేను తండ్రిని కాదగినవాడను కాను. నీపాఠశాలాబహిష్కార మామోదించి నిన్నింటనుంచుకొనినచో నీకిట్టికష్టములు వచ్చియుండవుగదా! రామా! రామసదృశుడవు నీకు రామునకు గైకవలెనే నేను నీకుదాపురించితిని. కుమారా! ఇట్టిదయాశూన్యుడను తండ్రి ప్రాప్తించినందులకు నీమానసమెంత పరితపించుచుండెనోకదా! నాయనా! నాయనువారులేని పరాయియూర కఠినశృంఖలాబద్ధహస్తుండవై, సాయుధులగు రక్షకభటులు వెంట నడువ, దిక్కులేనిపక్షివలె, కారాగృహము ప్రవేశించితివా! బిడ్డా! నీకుగాని యీ సంపదలు, ఈయధికారములు, సన్మానములు, సౌఖ్యములు, నాకేల? అవివేకిని, మూర్ఖుడను, కఠినుడను; కావుననే నీతల్లిమాట నిరాకరించితిని! నిన్నిల్లువెడల నడిచితిని! అయ్యో! తండ్రీ! ముడిరొట్టెలు తినుచు కఠిన మగు నేలను బవళింపుచు, మోటుపనులు చేయుచు ఒక్కసంవత్సర మెట్లు గడపుదువోయి! అయ్యో! ఈ మహాకష్టమును తరించి నారాముడు మరల నాకన్నుల బడునా! హేరామచంద్రమూర్తీ! నేను మ్రొక్కుచున్నాను. వింటివా! నాకొమారుడు జైలునందున్నయొక్కసంవత్సరము నాబిడ్డతిండియే నాతిండి. నాకొడుకు పరుండుకర్కశ శయ్యయే నాశయ్య. నాకొడుకుచేయుపనియే నాపని. నీవుఆనగా నిట్లువ్రతము సలుపుదును. నాకొమరుని నాకు ప్రసాదింపుము. నీసన్నిధికే తెంచి నీపాదములనర్చించినీకమూల్యములగుకానుకలర్పింతును. అయ్యలారా! నన్నింటికి జేర్పుడు. నేనిచ్చట నిలువలేను. నాకడుపు మండిపోవుచున్నది." అని తలమోదుకొనుచు నాయుడు మరల నేలబడినాడు. నాయుడునకు గుండెచెదరెననియు, ఏకపుత్రుని యాపదనిని సహింపలేకుండెననియు తలంచి, మిత్రులెల్ల రాతని వెంటనె మోటారుబండిపై నెక్కించుకొని యింటికి దీసికొని వెళ్లిరి.

భార్యమొగముచూడగనె నాయుడానుదానివలె బావురు మన్నాడు. కొమారుని నిర్బంధవార్తవిని, "నాతండ్రిచెఱనుపడనేసెద్దానా" యనిలక్ష్మీదేవిమొదలునఱకిన కదళివలె నేలబడినది. చాలసేపటివఱకామెకు ప్రాణమేరాలేదు. ఆభార్యాభర్తల దుఃఖమునుండి తేర్చుట

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుస్సహమైపోయినది. కట్టతెగిన ప్రవాహమువలె వారి దుఃఖము పొంగిపొంగివచ్చుచున్నది. ఆకొమరుని నొక్క మారు కనులజూచినగాని వారిదుఃఖ మాగదని యెల్లరకు దోచినది. "మీరుభయులువెళ్లి కొమరుని చూచివచ్చుట మంచి"దనిమిత్రులునాయుడుతో చెప్పిరి. "వానినిజూచు నవ్వారునాకు లేదు. అర్హత సంపాదించుకొనువఱకు నేను జూడజాలను. తల్లినిమాత్రము రాత్రికి బంపెద" నని నాయుడనెను. నాయుడు హృదయమునందు గలిగినమార్పు తాత్కాలికము గాదని యందఱ కప్పుడు తోచినది.

నాటిరాత్రియే తన తోడబుట్టినవానిని దీసికొని లక్ష్మీదేవి కొమారునిజూచుటకు వెళ్లినది.

# ౭

ఒకానొకప్పుడు కరుణ, భక్తి, వాత్సల్యము మున్నగు భావముల యాకస్మికోదయము మానవునియందొక యపూర్వపరిణామమునకు హేతుభూత మగుచుండును. కఠినుని కరుణాశాలిగా, నాస్తికుని భక్తునిగా, మత్సరుని వాత్సల్యపూర్ణునిగా మార్చెడి యీ యపూర్వశక్తిమానవహృదయమునందు నక్కియుండి, యదనుజూచి విజృంభించుట దైవచిత్రముగాని వేరుగాదు.

వేంకయ్యనాయుడు నిన్నటివఱకు సామాన్యులకు డేఁకీచూడరాని యధికారి. అధికారములను, నధికారులను దానంటగా, నధికారములు,నధికారులుతనకంటగా మెలగుచున్నవాడు. పరస్పరాశ్రయమనెడి యిరుకు సందులో "నేనత్యున్నతుడను, నా పదవు లత్యున్నతము" లనెడి యహంభావములో సుఖస్వప్నములగాంచుచుండు వాడు. ఐశ్వర్యగర్వము, అధికార వ్యామోహము, జాతిమత్సరము లనెడి బిరుసుదుప్పటు లాతని సుఖసుప్తి యందలి స్వప్నగాఢలకు భంగము కలుగకుండ కాపాడు చుండెను. ఇంతవఱకు ప్రేమోదార విలసితమగు మానవ జగత్తున కతడు కడుదూరముగ నుండెను. కాని నేడాతని హృదయమున హఠాత్తుగా నుదయించిన ప్రేమవాహిని యాతని నొకనవ్యప్రపంచమునకీడ్చుకొనిపోయి నది. ఇంతకుపూర్వ మాతని హృదయక్షేత్రమును మలిన పఱచుచున్న క్రోధలోభ మోహమాత్సర్యాది కశ్మలము లాప్రేమ ప్రవాహములో కొట్టుకొనిపోయి దూరపరి పోయినవి. అనేక కశ్మలగుణములచే సంకుచితమైయున్న యాతని మనస్సిప్పు డిప్పుడు అకల్మషమై, పవిత్రమై, సువిశాలమై, యుదారభావభాసితముగా మారిపోయినది. చిరకాలముగా నాతనిచే నుపాసితము లగుచున్న జాతిమాత్సర్యాధికార వ్యామోహాది దోషగుణము లనేకము లాతని హృదయమున నిలువ నీడ లేక పలాయనమైనవి. ఆతని విశాలదృష్టి కప్పుడు భారతావనిగల భిన్నజాతులు ఒక్కసూత్రమున గ్రుచ్చిన మాణిముత్యములుగా దోచినవి. తన కంటె యధికులని ద్వేషించిన బ్రాహ్మణులు, తనకంటె నల్పులని నిరసించిన యంత్యజులు, తనవారని దురభిమానపడిన యాత్మకులజులు సమానసోదరులే యని యతనికప్పుడుతోచినది. 'నాయనలారా! మీరందఱు నాకడుపున బుట్టినవారు. మీలో మీకు జాతిమత్సరము తగదు. మీరందఱేకమై నాదాస్యవిముక్తికి గృషిసల్పు'డని భారతాంబ యాహ్వానించుచున్నట్లు వేంకయ్య నాయుడు తలంచినాడు. ఆదేశజనని పిలుపునకు నాయుడు ముగ్ధుడై పోయినాడు. ఇక సంశయింపలేదు.."నిన్నటివఱకు దేశహితైకకార్యములకును దేశారాధకులకును బలవద్విరోధిని గానున్న నేనేమని స్వరాజ్యాందోళనలో బ్రవేశింప"నని లజ్జింపలేదు. తన విలువవస్త్రములనెల్ల దీసి యావలపార వైచి, తన యధికారములనెల్ల నొక్కమారుజ్జగించి, తన రావుసాహెబు బిరుదమువలదని తిరస్కరించి,ఖద్దరువస్త్రధారియై ఖద్దరువస్త్రముల విక్రయింపగడగినాడు. కఠినపు జొన్నరొట్టె తిండి, కర్కశపునేలను నిదుర. ఖద్దరు వస్త్రములవిక్రయము-దినమున కొకదమ్మిడి. ప్రాణటకొక యూరు. తిండితినినయూర నిదురలేదు. నిదురించిన యూర తిండిలేదు. ఒకటే ఖద్దరు ప్రచారము. ఏగ్రామమునకేగిన నాతని కపూర్వమైన స్వాగతసన్మానము జరుగుచున్నది. ప్రజలాతని నత్యంతప్రేమతో నాదరించు చున్నారు. నాయుడు పూర్వముకూడ నెందఱివలననో సన్మానము లందుకొన్నవాడె, కాని యానాటి సన్మానము లింత యుదారములుగ, ప్రేమపురస్సరములుగ నాతనికి గాన్పింపలేదు. జాత్యభిమానమో, అధికారభీతియో, స్వార్థలాభమో, ఏదియో సంకుచితభావ మాసన్మానము లకు మూలకందముగా నుండెడిది. కాని నేటి సన్మానమున కట్టికళంక మిసుమంతయు లేదు. కేవలప్రేమచేతనే

ప్రజలు చిన్న సన్మానించుచున్నారు. ఆసన్మానమును గాంచి వేంకయ్యనాయుడు చిన్నవోయినవాడై పోయినాడు. అతని కార్యదీక్ష యినుమడించినది. స్వపక్షగౌరవమును పాడుచేసి నీవీ పనిచేయుటేమి యని మిత్రులు లాయరు సన్నిహితుల ప్రార్థించిరి; బోధించిరి; చివరకు దూషించిరి. కాని నాయుడు వెనుదిరుగలేదు. ఆహా! ఏమి కార్యదీక్ష!

౬

సంవత్సరము నిండినది. రామస్వామి విడుదల దిన మేతెంచినది. బంధువుల సన్నాహముతో కారాగృహమున ప్రవేశపెట్టబడుటయు, విముక్తుల సన్నాహముతో వీడ్కొల్పబడుటయు నిత్యకృత్యముగా పెట్టుకొనిన రాజమండ్రి పౌరులప్పుడే, యువయువ మేళగంబులైన కాకమునుపే, మేళతాళములతో, పుష్పహారములతో జైలుద్వారమునొద్ద జేరినారు. వారిలో ఖద్దరున స్త్రీనారియు, కృశీభూతశరీరుడును, దీనవదనుడును, నేబదేండ్లు సమీపించినవాడును నగు నొక యపరిచితవ్యక్తికూడ నుండెను. అతనెవరో వారు పరికింపలేదు. తానెవరో యాతడు వారికి తెలుపలేదు. సరిగ ఎనిమిదిన్నరగంటలయినది. రక్షకభటులు రామస్వామిని దీసికొనివచ్చి కారాగృహద్వారముకడ విడిచినారు. తోడనె పుష్పవర్షము గురిసినది. జయధ్వానములు చెలరేగినవి. మేళతాళములు మ్రోగినవి. కారాగృహవాసశ్రమచే శుష్కించినవాడయ్యు రామస్వామి అపూర్వమైన దేశభక్త్యుత్సాహము వదనమున తాండవింప, ఉజ్జ్వలమైన శాంతరసము నయనముల నొలుకుచు, ముకుళితకరకమలుండై, మందస్మితవదనారవిందుడై, ప్రజలదెసజూచుచు నిలువబడినాడు. ఇంతలో నటునుండి వచ్చెనో ఆయపరిచితవ్యక్తి, యొక్కయడుగునవచ్చి "నాతండ్రీ! కనులబడితివా!" యని రామస్వామిని కౌగిలించుకొనినాడు. ముక్కుమొగ మెరుగని యాయూరాత నన్నింత ప్రేమపూర్వకముగ గౌగిలించుకొనిన యీ కృశశరీరు డెవరు? రామస్వామి నిశ్చేష్టు డయినాడు. అతని కెవ్వరైనది తెలియలేదు. "నాయనా! నన్ను మరచితివా! అవును: ఈదోషి మరువదగినవాడె! "అన్న డప్పుడు వేంకయ్యనాయుడు! అనుతాపతప్తములును విచారపరీతములునగు నావాక్యములు వెలువడుటతోడనే రామస్వామి యాతనిదెస పరికించిచూచినాడు. ఎవరతడు? తనతండ్రి! ఆభయంకరాకారము లేదు. ఆగర్వంపువేషము లేదు. ఆరూక్షవీక్షణములు లేవు. తండ్రికి ప్రేమభరితమగు సౌమ్యస్వరూపమెట్లు వచ్చినది! అనుతాపము లొక్కమారు రామస్వామిని చుట్టుముట్టి తన్మయునిగా గావించినవి. తోడనే పితృభక్తి ద్విగుణమై నాతని యుత్తమాంగము తండ్రిచరణములపై వాలినది. నాయుని అనుతప్త బాష్పాంబువులతో రామస్వామి యానందబాష్పములు వియ్యమంది దేశప్రేమవాహినిగా ప్రవహించినవి. ఆహా! ఏమి, ప్రేమప్రభావము!





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పాదపద్మంబు లొత్తెద బాలకృష్ణ!

తమిరిశ శ్రీరామ అప్పారావు గారు

క్రూరశకటాసురారాతిఁ గూలఁదన్ను
నపుడు గర్కశమణి సమూహావృత
కాళియాభోగ తాండవకాలమందు ఁతత
పల్లవాంచిత మృదుపాద పంకజముల
వెంతనొచ్చెనో? యిటుచెపుమ్మ! వేణులోల!
పాదపద్మంబు లొత్తెద బాలకృష్ణ!

జలదమాలిక వెలువడు చంద్రభాతి
దివ్యతేజోమయుండవై దేవకీ వి
శుద్ధగర్భ వితానంబు శుభదభంగిఁ
జెరచివచ్చినదాదిగ దితిసుతాళిఁ
బుడమిభారంబుఁ దీర్పఁగాఁ బూని వెదకి
భవ్యభవదంఘ్రిఘట్టన పాలుచేసి
విగతజీవులఁగాఁ జేసి వెలసితౌర!
కఠినరాక్షసమర్దనఁ గంచెనీదు
మృదుల మంజుల చరణముల్ వదలనింక!
నీదుసేవమె కోరెద నెమ్మినిమ్ము
పాదపద్మంబు లొత్తెద బాలకృష్ణ!

పాపి నజ్ఞాని నతిరోషభరిత మతిని
నాదుపుణ్యకథాలాపనవ్యసుధను
గ్రోలనేరదు చిత్తంబు కుటిలవర్త
నమున దుష్కథాశ్రవణ మనారతంబు
సలుపు నీవేడ! మత్పాద జలజసేవఁ
జేయుటేడ యటంచు భాషింతు వేమొ!
కాదుకాదది నీపాదకమలస్మృతి వి
తాన మొకకొంత కాన్పించఁ దరలిపోదె
మలిన భావపరంపర మానసమునఁ
గ్రోధపూరిత హృదయముల్ గూలిపోవె
పాపపుంజంబు బద్దలై పాసిచనదె
నక్రతరక్రూరనైజంబు వమ్ముగాదె!
నిర్దయాత్ముల డెందంబు నీఱుగాదె!
శాంతరస ముప్పతిల్లదే స్వాంతమందు!
సాధుభావంబు పుట్టదే క్షణములోన!
నట్టి త్రిభువనవినుత మహామహిమలఁ
గోటి ప్రాభాతమిత్రుల మీఱి వెలుఁగు
నిత్యనిర్వాణదంబగు నీదుపదము
నంటకయమున్న శుద్ధుఁడ నౌదుఁ గాదె!
మోక్షసామ్రాజ్య సౌఖ్యసమ్మోదకరము
భవ్య మాద్యంబు భువన పావనకరంబు
భవజలధిమగ్న మనుజుల పాలినౌక
యఖిలభద్రానుసంధాయి యగుచు మించు
నీదు పదకంజ యుగళంబు నిశ్చలాత్మ
నిల్పి భావించి తిలకించి నెగడఁడేని
భక్తిరసవాహినులఁదోఁగి ప్రబలఁడేని!
ధ్యానమునఁ బారవశ్యతఁ బూనఁడేని!
చేతులారఁగఁ బూజించి చెలఁగఁడేని
పాదకీర్తన వేమాఱు బలుకఁడేని
పాడి సేవించి పులకించి భజనచేసి
నిర్మలానంద వార్ధిలో నిలువఁడేని!
విబుధుఁడౌనెట్లు జనుఁ డయో విబుధవంద్య!
జ్ఞానియేరీతి నగునయ్య జ్ఞానరూప!
నేయుమాట లిఁకేటికి విశ్వభార
మఱఁచి యలసితి వెంతయుఁ గుణరహితుఁడ!
ప్రసవకోమలపదములు వాడిపోయె
నాలసింపకుమయ్య, గోపాలబాల,
శ్రమఁదొలఁగఁ జేతుఁ జరణముల్ చాఁపుమయ్య
పాదపద్మంబు లొత్తెద బాలకృష్ణ!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# మాట్లాడుకొనే మర్యాద

హరికుమారుడు

మాట్లాడుకోవడ మనేది తమ మనో భావాలను వెల్లడించుకోవడానికి సమస్తజనులకూ సర్వేశ్వరునిచేత ప్రసాదించబడ్డ హక్కు. భిన్నభిన్న మనుష్యజాతుల వలెనే తిర్యగ్జంతువులుకూడా వాటివాటి ఊహలను వివిధధ్వనులమూలంగా తెలియజేసికొంటవని సృష్టి శాస్త్రజ్ఞుల అభిప్రాయం. గార్నర్ అనేదొర కోతులభాష పరిశ్రమచేసి కనిపెట్టి నేర్చుకొన్నట్టు పత్రికలలో చదువుతున్నాము. అలాగే యితరజంతువులకున్నూ వాటి భాషాసంజ్ఞ లుండవచ్చును. ఏమైనా, సదసద్వివేకయుతమైన భావప్రకటనశక్తి ఇంత విశాలమైనది యీశ్వరుడు మనకే అతిశయంగా అనుగ్రహించాడని మనుష్యజాతి గర్వించడానికి కారణం లేదనరాదు. కాని ఆహార నిద్రాదులకన్న అధికంగా నున్న జ్ఞానమును దుర్వినియోగపరచి ఖగమృగాదులే మేలురా అనిపిస్తూన్నట్టే మనుష్యుడు సంభాషణశక్తిని గూడ పాడుదారులపట్టించి పరమాసహ్యాహానికరుడగుచున్నాడు. పనిచేయడానికంటె మాటలు చెప్పడము తేలిక అంటాము. కానిమాటలాడడంలో గొప్ప నేర్పు,అందువల్ల అధికమైన లాభం, వివేకులకు క్రొత్త గాదు. అందలి మర్యాద ముందుకొంచెము సూచించి పలు రకాలవక్తల లీలలను అభివర్ణించడమే యీ వ్యాసోద్దేశం.

'వాగ్భూషణం భూషణం' అంటూ మనవారెప్పుడూ వాక్కుకు ఎక్కువ ప్రాశస్త్యం ప్రధానత్వం యిచ్చారు. మాట లమ్ముతారు పుష్పలావికలని కవులు ప్రబంధాలలో వర్ణించారు. వేషం తర్వాత మనిషిగౌరవం పొందడానికి ముఖ్యమైనదిభాషేనని వేషభాషలన్న సమాసం చాటుతున్నది. కుండ గట్టీ ఓటీ పలుకునుబట్టి కనిపెట్టినట్లే మనిషివివేకం, అవివేకం వానిమాటల వాటమును బట్టి తేల్చుకోవచ్చు. 'నోరూ వాయీ'లేదంటూ మాటాడలేనివానిని పనికిమాలినవాడుగా చూస్తుంది లోకం. "మౌనమే భూషణము మూఢమానవునకు" అని భర్తృహరి. 'అతి సర్వత్ర వర్జయేత్' కాని సామాన్యంగా మాట్లాడే నేర్పు అందరికీ అవసరమే.

సంగతిసందర్భం కనిపెట్టిఉచితమైన రీతిని ప్రసంగించడం ఉత్తమం.'కీలెరిగివాత, వీలెరిగి మాట' అనేదిఅందరూ వాడేసామెతే.'ఎప్పటికెయ్యది ప్రస్తుత' మనుపద్యంలోని పరమార్థము యిదేనని తోస్తుంది. లేనినాడు ఆ పద్ధతిగా తప్పించుక తిరగడం దొంగతనం అనిపించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొంటుంది. ఏమీచేతగానివాడు ఊరకున్న వాడై ఉత్తమయోగికావడమే ఉత్తమోత్తమం.

మాటకు ప్రాణమట సత్యము. 'ముఖే సత్యావాణీ' అన్నారు. దానినిగూర్చి వాజ్ని పుణులు ఎక్కువ జాగ్రతగా నుండవలసినదే. మాట తిన్ననలేని మనిషిగూడా పలుకుజబ్బు నానెలాగే జనంలో చలామణీ కాలేడు. పది మాటలలో ఒకటి పొల్లు ఉండక తప్పదు. అతినాగుడులో అసత్యరాహిత్యం అరుదు. ఉండనే ఉండదనవచ్చు. అబద్ధానికే అనేక ఉపోద్ఘాతాలుగాని నిజానికి ఇన్నిమాట లక్క ర్లేదు. అందుకోసం పదిపాళ్లు మితభాషిత్వం అలవాటు చేసికోవలె. ప్రసంగంలో మిత భాషిత్వం మేలుదారే. పరమేశ్వరుడు మనకు కళ్లూ చెవులూ రెండేసియిచ్చి నాలుక ఒక్క టే నిర్మించడంచూస్తే మాట్లాడడంకంటే చూ డడమూ వినడమే యెక్కువ అవసరమైన పనులని ఉద్దేశించాడని తేలుతుంది. అనగా మనం సంగతులు సావకాశంగాచూచి చక్క గావిని మరీ మాట్లాడవలసి ఉందన్న మాట. సత్యంకోసం మితభాషులని రఘువంశపురాజు లను మహాకవి కాళిదాసు వర్ణించాడు. ఇందు లో యెంతో అర్థమున్నది. అట్టి మితభాషులే మహామాటకారులనే వాళ్లకంటె యెక్కువ ఉత్సాహం కలుగజేస్తారు. మునుపు ఒక పెద్దమనిషి భోజనంవేళ మూడుమాటలే మాట్లాడేడట అప్పటప్పట మంచివ్యవధితో. కాని అప్పటి ఆయన ప్రతీమాటా యిప్పటికీ మరవరానివై ఉన్నవి. భోజనసమయంలో చక్కని సరసమైన గోష్ఠి ముదావహము. అతిథి అవివేకి గానీ, విచారమగ్నుడు గానీ గృహస్థు ఇతర సదుపాయాలకంటె ముఖ్యం గా తనమాట మర్యాదవల్లనే సంతుష్టహృద యునిజేసి పంపుతున్నాడు.

తెలియని విషయం తెలిసికోవడముకూ భోగట్టాకూగాదు సంభాషణ యేర్పడ్డది. పరస్పరానందం మాత్రమే దానిపరమార్థం. పరస్పరాభిప్రాయాలు ధారాళంగా వెల్లడించు కోవములోనే ఉన్నవి సంభాషణయొక్క సౌలభ్యమున్నూ, ప్రయోజనమున్నూ. అలా అని అది ప్రశ్నోత్తరమాత్రమై ఉండరాదు. తన వాక్చాతుర్యంచేత ఆకర్షింపగలుగుతున్న ప్పటికీ యెదుటివాళ్లకు మాట్లాడడానికి అవ కాశం లేకుండా కాలమంతా ఒక్కడే భుక్తం చేసికోవడం పొరపాటుపని. సంభాషణ అటూ యిటూ తిరిగే హస్తకందుకము (Badminton) బంతి లాగుండాలికాని ఎదిరికి దొరకనీకుండా ఒక్కడే నడిపే కాల్బంతిలాగ ఆక్రమించబడ గూడదు. అందువల్ల పైన అనుకొన్న పరమ ప్రయోజనమునకు భంగంవాటిల్లుతుంది.

ఒకనిమాట పూర్తిగాకుండానే రెండవ నాడు వాక్యం ప్రారంభించడం ఒకఅవివేకము. అ క్లైడుటివానికి అడ్డురాగూడదు. సంభాషి స్తున్నప్పుడు ఎదుటివాని ధోరణి పెంచడానికి కాన్సి,తగ్గించడానికిగాని ఏవిధంగానూ మాటలు అందిస్తూ తయారుకావడము తప్పు. ఇతరులు అడ్డుతూ తమకు మాటలు అందివ్వడముకు స్వభావసిద్ధంగా ప్రాసంగికులు ఇష్టపడరు. ప్రతీవిషయం పదేపదే రాపాడించే భోగట్టా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గాళ్లో చెప్పేది కడముట్టా వినకుండా మాటి
మాటికీ అడ్డుదగిలే వాఖబుదార్లూ క్రియకు
ఏమీ తెలుసుకోలేక పోవడమేకాక చాలా
చిరాకు, అసహ్యత కలుగజేస్తారు. అటు
వంటిప్రశ్న పరాయణులతో సంఘటనకంటె
ఉరిపెట్టుకోవడం సౌఖ్యకరం అన్నాడట
పూర్వమొక ఆంగ్లకవీశ్వరుడు.

ప్రసంగం వివాదాత్మకంగా ఉండరాదు.
సంభాషకులు సహనపరులుగానినాడు ప్రసం
గం తీవ్రవాదంలోని కిన్ని, వాదం ద్వేషంలోని
కిన్ని దిగడము కద్దు. ఐచ్ఛికమైన అభిప్రాయ
ప్రకటనం వాదంలోనికి దిగనీయకుండా కాచు
కొనే బాధ్యత ప్రాసంగికులది. ప్రతీబాలుడూ
రాజకీయాలు చర్చించే యీరోజులలో మా
మూలు ఇష్టాగోష్ఠిలో రాజకీయమతవిషయా
లు తలపెట్టకపోవడం మంచిదనడము ఆశ్చర్య
కరంగా కనబడవచ్చు. అక్కడిపదునుబట్టి
నటించవలె. వర్తమానస్థితియందు గ్రామసీమ
లందు రాజ్యాంగాందోళన మసంగతమని
యొకనాయకునికి సమాధానముగా గాంధి
మహాత్ము డొకప్పుడు వాక్రుచ్చిన దీకారణ
మననే దేమో? ఎదుటిమనిషి వివేకము,
సహనశక్తి గలవాడని కనిపెట్టినప్పుడు అట్టి
చర్చలు అసందర్భములు కావు. ఒకడు తప్పు
సిద్ధాంతాలు విచ్చలవిడిగాచేస్తూ ఉన్నప్పుడు
వాటివల్ల సంఘానికి నష్టంవాటిల్లునని తోచ
నంతవరకూ అనగా ప్రజ వాటిని మన్నించి
చెడిపోవుననుకోనంతవరకూ అటువంటివాచా
టుని ఖండించడానికి పూనుకోవడము అనవ
సర శ్రమ.

ప్రతివాడూ ఎదుటివాళ్లను రంజించ
డానికే యత్నిస్తాడు. ఇట్టిప్రయత్నం యెక్కు
వగాచేసే మాటకారులకే తరుచు అందుకు
వ్యతిరేకఫలితం తటస్థించడమున్నా. అధికార
బధిరత్వం మొదలైనవి కొన్ని ప్రత్యే
కహేతువులు ఉన్నా సామాన్యంగా ఒకరు
మాట్లాడుతుంటే ఎదుటివాడు ఎంతసేపటికీ
మౌనంగా ఊరుకోవడముకు ముఖ్యకారణాలు
మూడనవచ్చు: 1. చెప్పేసంగతి వినేవాడికి
కొత్తదై ఉండడం. 2. ఆవిషయమువు అభి
రుచి - మనస్సులేక పోవడం. 3. వినేవాడు
యెక్కువపండితుడు- అనగా ఆవిషయం అంత
కు మునుపే లెస్సగా తెలిసినవాడు అయిఉండ
డము. అట్టిసందర్భాలు అతిమెలకువతో గమని
స్తూ,వినేవాళ్ల అభిరుచినికనిపెట్టివర్తించే వారే
నిజమైన మాటకారులు. అనుకూలతను బట్టి
నడుమనడుమ పిట్టకథలు సమకూర్చి చెప్పే
నేర్పు ప్రశంసనీయమే. అట్టి కథలు టూకీ
గాను కొత్తవిగాను వినదగినవై విషయం
తట్టించేటట్టు ఉంటే ప్రసంగం బాగా రాణి
స్తుంది. చుట్టు తిరుగుడుగానూ ఇరుకు దారి
గా'క కథలు ధారాళంగా టక్కున అతికే
టట్టున్ను,విషయాంతానికి సరిపోయేటట్టున్ను
నడిపించవలె. నిస్సారములైన పుక్కిటి పురా
ణాలతో వినేవాళ్లకు విసువుబుట్టించగూడదు.
బడబడాయమానములైన శబ్దాలంకారాలు
కట్టిపెట్టి అనువైన హాస్యోక్తులు అప్పటప్పటి
ప్రయోగిస్తే సంభాషణ మరీబలేగాఉంటుంది.
ఈసందర్భంలో 'పరిహాసప్రసంగములేనివాక్య
ముగా' అనే చాటుపద్యభాగం జ్ఞప్తికి వస్తూ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ప్రాచీన భారతీయాభరణములు


































చిత్రము ౧

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాచీనభారతీయాభరణములు

























చిత్రము ౧ (బి)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉన్నది. ప్రభావతీ ప్రద్యుమ్నం అనేకావ్యం లో కవి సంభాషణ చాతుర్యం చక్కగా కనబర్చాడు.

కంఠస్వరాన్నిబట్టికూడా ప్రసంగం ఆకర్షక మవుతుంది. గొంతు ముఖలక్షణాలూ గనుక కొంచెం రమ్యమైతే అర్థశూన్యమైన జల్పనమాత్రమైనా, చెప్పినదేచెప్పినా ఆనంద సంధాయకమే అవుతుంది. చదువురాని అవివేకపు ఆడవాళ్ల మాటలుగూడా అందుచేతనేమో అంతయింపు కావడము. ఈ వైఖరి వక్తలను కీరుమనే చిలకలతోటీ, కూపెట్టే కోయిలలతోటీ జమ చేయవచ్చు.

చిత్రోపచిత్రములైన అభ్యాసాలూ, తమాషా అభినయమూ తరుచు వాచాలురకు పరిపాటిగా ఉంటవి. ముక్కూ,మూతీతిప్పడం, కళ్లు చిట్లించడం, పళ్లు గిట్టగరవడం, ఆవలించినట్టు నోరుతెరిచి నాలుక పారసాచడం కొన్ని లక్షణాలు. ఇందులో గుర్రుగాళ్లను పళ్లుమాత్రం బైటపెట్టి బెదిరిస్తూ ఉండే కరవలేని కాలభైరవులంటే జాలిపడనవసరంలేదు. మెడ లురిక్కించడం,బుజాలుఎగరవెయ్యడం, చెయ్యి జాడించడం, కుస్తీపట్టే వస్తాదులాగ కాళ్లునిలదన్ని బారలు సాచడం కొందరి వైఖరి. ఈ రకం వక్తల ప్రసంగప్రాగల్భ్య భరతసూత్రాలను చాలవరకు అనుసరించి ఉంటుంది. ఇలాంటి చతురులు జనంతోమాట్లాడేకంటె శుభ్రమైన నిలువుటద్ద మొక్కటిసంపాదించుకొని దానిలో చూచుకొంటూ తమ ప్రతిబింబము తోటే మాట్లాడుకొంటూ ఉంటే తమలో తాము ఆనందించడానికి మెక్కువ అనుకూలిస్తుంది.

బొమలు విరవడం, గుడ్లు తిప్పడం, గుడ్లు పెద్దవి చేసుకొని యేదో హాని ఉందేమో అన్నట్టు పరకాయించడం, ఈహీఁ, ఈహీహీఁ అంటూ ఇకిలిస్తూ ఉండడం, (నవ్వుకాదు)మరి యొకరకం వారి మామూలు. వీరిలో కొందరీమర్యాదలో మర్కటచక్రవర్తులకు గూడా గురుపదం వహించడానికి అర్హులై అతిశయిస్తున్నారు.

ఎవరో తరుముకువస్తూ ఉన్నట్టు వగరుస్తూ ఒకవిధమైన బొంగురుగొంతుకతోబోకి చేదలాగ బొణబొణ వాగేది ఇకనొకమోస్తరు. ఇలాంటిస్వరాన్ని కోమటిగొంతుక అంటారు. స్థూలకాయులలోను లంబోదరులలోను తరుచు యీస్వరం తప్పని సరి అవుతుంది. ఇది వారికి స్వభావసిద్ధమై ఉండవచ్చు. తక్కిన వాళ్లలో ఉండే యీపద్ధతి అతిమహాకాయుల వలన పట్టువడ్డదే అనవచ్చు. ఇకవీరు నవ్వులోకిగూడా దిగితే వరాహమూర్తికే వంకలు దిద్దే శబ్దమాధుర్యం అచ్చంగా ఆవిర్భవించి తీరుతుంది.

ఈనవ్వులలో రకాలు అనేకాలు. వీటికి అనేకకారణాలున్నా—ఉంటవనడంకంటె అవి నిర్నిమిత్తహాస్యానుగ్రహాలనడమే నిక్కమైన మాట. అసలు మందహాసం సరసమైనదిగానే యెంచి,'మందమందహసితాననాంబుజం నందగోపతనయం' అని భక్తులైన కవీశ్వరులు పాడినారు. 'నగవుమార్గంబు దంతములుదోపక యున్కి' అని ఉన్నది. ఇట్టినవ్వు ఔచిత్యమును బట్టినది అందంగానే ఉంటుందికాని చీటికి మాటికి చిరునవ్వులు చిందిస్తూ చిత్రంగా


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మూతివిరుస్తారు కొందరు. ఇందులో మంచి దర్జా ఉందని వారిఊహ. జెంట్రీలోనే యీ దర్జా యెక్కువ. మా నాయుడిగారి ముఖం యెపుడూ కలకలలాడుతూ ఉంటుం దని అచ్చంగా అలాగే మూతివిరవడం అలవాటు చేసుకొంటా డొకమిత్రుడు. ఎలాంటినవ్వు మొహం బాగుంటుందో అని అద్దంలో చూచుకొంటూ అహోరాత్రాలు ఆలోచించి ఆలోచించి అలా పెదవులు కట్టుబాటు చేసు కోబోతా డొకప్రముఖుడు. అల్లే ఫోటోలు తీయించుకొంటాడు. మననవ్వు అందరినీ ఆక ర్షిస్తున్నదనే సంతోషాన ఇంకొకనవ్వు వెంట వెంటనే, ఇలాగే అంతా నవ్వులప్రసంగం గానిస్తాడు, రేగుచెట్టుక్రింద భాగోతం చూసి న ముసలమ్మ నవ్వులు కొన్ని, మనంకూడా నవ్వకపోతే యెదుటివానికి కష్టంగా ఉంటుం దేమో అనికొన్ని - అవి సౌఖరునవ్వులు- దాస్యహాస్యములు-హాస్యదాస్యములు. తెలివి తక్కువ నవ్వుగదా అని వెక్కిరించే ఉద్దేశం కొన్ని నవ్వులది. కాముకుల నవ్వులు, గ్రామాఫోనునవ్వులు - చాలా ఉంటాయి. కొన్ని నవ్వులకు ఏసాక్షీకూడా అర్థంతీయ లేడు. కొందరి నవ్వుతో విపరీతమైన ధ్వని కూడా ఏర్పడుతుంది. ఒకాయన అట్టహాసం చేస్తాడు. కొంచెం కళ్లుమూసికొని గనక వింటే అది యేడుపో నవ్వో, కనిపెట్టలేము. ఇమి టేషన్ ఆచార్లుగారు రాసభాగం ఆలాపిస్తు న్నాడనుకొంటాము. ఒకాయన నవ్వేకంటె యేడుపే యింపుగా ఉంటుంది. తలుపు కిరకిర, ఎంజిన్ దడబిడ కొన్నినవ్వులు వినిపిస్తవి.

పళ్లుకండలసైతం గుజ్జంలాగ బైటపెట్టే నవ్వు లు, పెదవులను చెవులనరకూ సాగనంపే నవ్వులు మరికొన్ని ఉన్నవి. నవ్వులతో విష యాన్ని మీరు తున్నానని పాఠకులూ నవ్వ బోతారేమో, ఒక్కసంగతి. చల్లనిదర్జానవ్వు లతోగూడిన అభినయం శాసననిర్మాణ సభ్య త్వాము నాసించి తిరిగేపెద్దలు మోటార్లమీద వోటర్లనద్దకు వచ్చినప్పుడు భాగా చూపి స్తారు.

హస్తాద్యభినయం వల్ల ఉద్ఘాటిస్తూ తమ సోదెవెళ్లబోసే డచ్చీకోరుల విలాసాలు బహు విధాలు. మాటమాటకు పుట్టి మునిగిపోయి నట్టు ఉద్రేకంతో ఒత్తిపలుకుతూ, చేతుల్లూ కాళ్లూ విరిగి పోయేటట్టు జాడించుకొంటూ, బుర్ర టోకాయిస్తూ మొగం మీద మొగంపెట్టి తుంపర్లతో తడిపేస్తూ, నానాహంగామా అసహ్యం చేస్తారు. కంఠ నాళం బద్దలుచేసుకొని శ్రోతల చెవులలోకి గొట్టాలతో పోసేటట్టు ధోరణి కురిపించేస్తూ, అడుగడుగుకు 'మరిమరి' 'నున్ను' మొదలైన పదాలతో హంగుచేస్తూ, తమ వాగ్ధాటి చాటించుకొంటారు కొందరు. తనచెప్పేదానికి సందేహముందా అనే భావంతోకాబోలు,ఒక వాగ్మి ప్రతిమాటకూ 'ఊఁ?' 'ఏంటీ?' అనే పదాలు ఊతగా పాట వదిలిపెట్టకుండా సాగి స్తాడు. సమర్థించుకోవడమేమో అనుకొంటూ, వెంటనే 'ఆదీఅదీ'అంటూ అట్టే ఆగుతూఉండ డంకూడా. నోటితుంపర్లతోటీ, రొజుకొంటూ విశిచేవేడిగాలితోటీ, నడుమనడుమ ఉద్ఘాటన లనే ఉరుములతోటీ వీరి ప్రసంగం మబ్బు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేకుండానే అకస్మాత్తూపట్టే చిన్న తుపాను రంగం అవుతుందనడం స్వభావోక్తికిన్నీ చాలనిమాట. ఇట్టి అధికారిన క్తలు తాముశ్రమపడి ఇతరులను ఆయాసపెట్టడంకంటె యేశబ్దగ్రాహినాళమో (Speaking trumpet) పెట్టుకొని కొంచెందూరంనుంచే తమమధురవాణిని ప్రదర్శిస్తే సుఖపడతాము.

తలపంకించడం, ఏదోరహస్య మున్నట్టు శ్రోతచెవికీ తమ మూతికీ వియ్యంగలిగించడం, చెవిటికి చెప్పినట్టు ఒంటిమీద తరుచుతట్టుతూ ఉండడం, గుసగుస లాడడం, లోపల లోపల గొణుగు కోవడం కొన్ని విద్యలు. బయస్కోపు బొమ్మలలాగు సంజ్ఞ లేకాని వీరిస్వరం యెవ్వరికీ స్పష్టంకాదు. పట్టిచూస్తే యేమీ విషయం కనబడ దందులో. రహస్యం ఉంటే ఏకాంతంగా మాట్లాడుకోవలసిందేకాని అన్నిటికీ అలా గొణుగుకొనే గొడవ అవాచ్యమై, అసహ్యకరమై, అనర్థకమై అంతరిస్తుంది. అస్తమానమూ చెవులదగ్గిర గొణిగే చాడీకోర్లు దినాంధప్రాయులు.

వాయి తెరిస్తే వరహాలు రాలిపోతాయేమో అన్నట్టు సంభాషణ జరుగుతున్నంతసేపూ నోరుమూసికొనే ఉండే హానవ్రతులు మఱికొంద రున్నారు. వీరు వేఱు. వీరి పలుకే బంగారం. "Silence is golden" అన్నవాక్యం అక్షరధర్మంగా ఆరాధిస్తారు. మూడు పాళ్లు ఊఁ, ఉహూఁలతోటే వ్యవహారం గానిస్తారు. కర్మంజాలక పెదవికదిపితే ఔనూ, కాదూ అనే మాటలను మించివెళ్లరు. పైన చెప్పిన దర్జాషద్దులలో చేరడమే వీరి మహోద్దేశమూ కాబోలు.

శబ్దాడంబరులై విడంబించేవారు కొందరు. శరత్కాలమేఘాలలాగు వట్టి గర్జలేకాని అందులో ఒకఅర్థం, క్రియా ఏమీఉండవు. వీళ్లనే బడబడగాళ్లంటారు. పదజాలమంతా తమ అధీనమై ఉన్నట్టు నలుగురికీ తెలిసేలాగు చేయడమే వీరి సంకల్పం. అందుకోసం అప్రస్తుతాలు, అనర్థకాలూ అయిన అనేకవిషయాలలోకి దిగి ప్రసంగంపెంచుతారు. వీరిలో కొందరు వేదాంతులమంటూ గూడ దురహంకారులై కస్సుబుస్సుమని విషసర్పాలలాగ చెలరేగుతారు. అర్థంతెలియని (తమకూ) కొన్ని పడికట్టుముక్కలు యెలాగో బట్టీపెట్టి సందర్భంలేకుండా అన్నిటిలోనూ దొర్లిస్తూ విద్వాంసులుగా విమర్శలలోకిగూడ దిగేవీరికి ఏజంతువు సాటో తెలియరాదు.

మాటమాటకు శపథవర్షం కురిపించేవి యింకొకతరహా. ఈతరహా మనుష్యులమాటలూ ఉమార్హములు కావు. అనృతవాదుల స్తమానమూ ఒట్లుపెట్టుకొంటారనిఅర్థమిచ్చే లోకోక్తి ఒకటి ఆంగ్లములో ఉన్నది. నీతోడు, దైవముఖంగా, ప్రమాణపూర్తిగా ఇత్యాదులు ప్రతీసంగతికీ వారిపల్లవులూ,అనుపల్లవులూను. ఒక ఘరానామనిషి చెట్టుకింద ఉన్నప్పుడు'పచ్చనిచెట్టుకింద ఉండి చెబుతున్నాను' అని ప్రమాణం చేస్తాడు. అతడే యింటిదగ్గర మాటాడుతున్నపుడు 'పదిమందికట్టిన యింటికింద ఉండి చెపుతున్నాను' అని ఒట్టుపెట్టుకుంటాడు. వీధిలో ఉన్నవేళ 'నలుగురూ నడిచే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీథిలో నిలబడి చెబుతున్నాను' అని శపథం చేస్తాడు. ఆయన మొక్కడ చేసే ప్రమాణం గట్టిదో మరి. ఇంకొక పెద్ద నమ్మ మాట అని నొక్కి వక్కాణిస్తూ ఉంటాడు. తనమాటలన్నీ నమ్మగూడదనినేమో!

వెనకటికి ఒకమహాపతివ్రత పట్టపగలు కాకి కావుమంటే పరుగెత్తుకు వెళ్లి మగణ్ణి గట్టిగా కౌగలించుకొందట భయంచేత. అంతకు పదిరెట్లు ఆశ్చర్యం కనబర్చే విద్వాంసులను మనం చూస్తున్నాము. తమ అత్యల్ప విషయాలకుగూడా అత్యంత ప్రాముఖ్యమిస్తూ గాథ రాపడతారు వీరు. వండ్లగింజలో బియ్యపుగింజ చూచి డిల్లపోతారు. వీరికి పొద్దెక్కిందంటే బోలెడువింత. పొద్దుకూకడం అద్భుతం. మబ్బుపట్టడం మహాద్భుతం. వానరావడం బహువిచిత్రం. టపాకాయపేలినా, తారాజువ్వ పైకిపోయినా నివ్వెరపడతారు. మతాబుకాలుతూంటే మహాభక్తులులాగ తాండవించిపోతారు. 'చొప్పదంటుప్రశ్న' ఇట్టి బుద్ధిమంతుల వల్లనే పుట్టిఉంటుంది. వీరికి జీవితంలో అద్భుతంగాని విషయం కనబడదు. వీరిబదుకు ఆశ్చర్యంతోటే తెల్లవారి పోతుంది.

ఇందాకా ముచ్చటించుకొన్న అభినయాదికము చాలామట్టుకు కొనితెచ్చుకున్న విద్యే అయి ఉంటుంది. సిరి అబ్బకున్నా జీడిపెంటనే అంటుతుందన్నట్టు ఇతరులవల్ల నుంచి యిట్టి పాండిత్యం యిట్టే పట్టువడుతుంది. కాని మళ్లీ దాన్ని తప్పించుకోవడానికి బ్రహ్మకైనా వశంగాదు. వీలున్నంతలో మునుముందే కాచుకోవాలి. అవసరమైతే ఆటువంటి పండితులసావాసముకున్నా ఒకసలాముపెట్టాలి. సర్వరక్షకుడూ, సర్వకారుణ్యుడూ అయిన సర్వేశ్వరుడు మనకు ప్రసాదించిన సంభాషణ ప్రతిభను సక్రమపథాన నడిపి సార్థకం చేసుకోవాలి.

---

## నారాయణతీర్థులు

చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు

ఇవతాళించును జందనక్రియను హా యింగూర్చుమందానిల
మ్మువలెం, గూల్చును గంగపోలిక నఘుంబుల్ చెప్ప నెవ్వండగున్
భవదుత్తుంగతరంగముల్ త్రిజగతీ ప్రఖ్యాతముల్ పూతముల్
కవినారాయణతీర్థసద్గురుమణీ! కల్యాణవాగ్ధోరణీ!

మ. అణుమాత్రంబును సందియంబువలద య్యా! కృష్ణలీలాతరం
గిణికిన్ శేవును నీవుచాపనిమొర్ణ గ్రీడింతురే స్వేచ్ఛధీ
మణు లానందరసంబుం గ్రోలుదు రె శ్రీ మన్మోక్షసామ్రాజ్యకా
గణనారాయణతీర్థదేశికవరా, రాధాపతీచ్ఛాచరా!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. చరణాంభోరుహ నూపురారవములాశల్ నిండఁ బార్శ్వమ్ములన్
బరివారం బాగి మేళవింప ననుకంపన్ బాలగోపాలమూ
ర్తి రహిన్ స్నెదురన్ నటించెఁగద నీ దివ్యోక్తికిన్ మెచ్చి భా
స్వరనారాయణతీర్థ, ధన్యతమ! నిన్ భావింతు హృత్కర్ణికన్.

మ. సుకవీ! యేయమృతంబుఁ బోసితివొ సంశుద్ధాంతరంగోత్థ భా
వుకభావత్కతరంగవర్ణముల నం భోజాక్షుఁ డేకాదు బా
లకుఁడున్ నిల్చును విన్నమాత్రమున లౌ ల్యంబంతయున్ లేక తా
రక! నారాయణతీర్థ, నిన్ గొలుతు ధీరాజీవపూజావిధిన్.

మ. పరికింపంబడె నీదుమూర్తి యదిగో భావప్రపంచంబునం
దు రహిం దోఁన యవే వినంబడెఁ జెవిం ద్రుప్పెల్లఁ బోనూడ్చి శ్రీ
హరిలీలాంగతరంగమంగళమృదంగారావముల్ ముక్తి చే
కుఱె నారాయణతీర్థ, నేఁడిచట మాకున్ మోక్షవిద్యాగురూ!

మ. హరిదుగ్ధాబ్ధి మథించి తెచ్చినసుధన్ వ్యామోహలీలాకృతిం
బరిపూర్ణాశయుఁడై ధృతిన్ సురలకుం బంచెన్ సమస్తశ్రుతుల్
పరిశీలించికృపం దరంగసుధ శేవన్ భూసురశ్రేణి క
ద్దిర, నారాయణతీర్థ, పంచితివి నీ తెన్నాతఁ డెట్లం దెదున్.

మ. మది యోచింపక కొందఱజ్ఞులిపుడున్ మానాథు నయ్యబ్ధిలో
వెదుకంబోవుదు రుండు నే యట ముదబ్ధిప్రస్ఫురన్మంగళ
ప్రదభావత్కతరంగసౌధములలో భక్తాళితోఁ గూడి య
ల్లదె నారాయణతీర్థ! కొల్వమరినాఁడయ్యా! కుటుంబంబుతోన్.

మ. ధరణీచక్రము చక్రమై ప్రమద ముత్కన్నందకంబై శశి
స్ఫురణన్ మించు యశంబు శంఖమయి చేఁ బొల్పొ గదాదండమున్
గరభాగస్థిత బ్రహ్మదండమగుచున్ గ్రాలన్ జగంబేలు శ్రీ
హరి! నారాయణతీర్థరూప! మది నిన్నశ్రాంతముం గొల్చెదన్.

మ. బహుళాయాసముఁ గూర్చు సంసరణజంబాలమ్మునం జిక్కి య
న్వహముం జీఁకటి నూతిలోఁ దెరల లే కల్లాడు వేళం జెవిన్
మహిమోత్తుంగ! భవత్తరంగ మొకటైనన్ సుంత యాలింప ని
మ్మహి నారాయణతీర్థ సమ్మదము సామ్రాజ్యంబు చేకూరెదున్.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# బుద్ధగయ

కె. నరసింహాచార్యులు గారు

## షాడ్వార్షికవ్రతసమాప్తి

శాక్యునిషాడ్వార్షికవ్రతము పరిపూర్తి యయ్యెను. కాని యాయన సంకల్పసిద్ధి కాదయ్యెను. శాక్యుడీ యారువత్సరములును తానొనర్చిన తపోవిధానము మోక్షప్రాప్తికి తగినది కాదని యెంచెను. నిరశనవ్రతమున శరీరము కృశించి, శల్యావశేషమై, యవశమై, జ్ఞానమార్గాన్వేషణకు తగినదార్ఢ్యమును పోగొట్టుకొనుట తప్ప వేఱుఫలము లేదని గ్రహించెను. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనం' అని కదా! అందువలన వ్రతమును వదలి మార్గాంతరమును వెదకదెంచెను. తనపూర్వుండిన స్థలమును వదలి కొంతయాహారమును గొని బోధిమండమునకు పోనుద్యుక్తుడయ్యెను. ఈలోన దైవతలు కొందరు, ఆహారమును దినకయే శరీరదార్ఢ్యమునుని లుపునట్లు చేసెదమనియు, తనమ్మూలమున నిరశనవ్రతభంగము కానేరదనియు చెప్పిరి. శాక్యుడందులకు సమ్మతింపక, ఋజుమార్గమున నాహారమును భుజించెదనని చెప్పెను. ఇంతవఱకును గౌతముని నాశ్రయించి అయిదుగురు శిష్యులు, అజ్ఞాతకౌండిన్యుడు, మహానాముడు, వాస్పుడు, అశ్వజితుడు, భద్రికుడు అనువారు తపమాచరించుచుండిరి. గౌతముడు తనషాడ్వార్షికనిరశనవ్రతమును ముగించి భోజనము చేయనుద్యుక్తుడుకాగానే వీరయిదుగురును శాక్యుడు చంచలచిత్తుడనియు, అతనికి మోక్షమార్గము లభింపదనియు, తాము ఆతని త్యజించుటయే క్షేమమనియు నెంచిరి. వారాతక్షణమునవే కాశీపురమున ఋషిపట్టణమునకు సమీపమున నుండు కురంగారామము, లేక సారనాధునకు పోయిరి.

## సుజాత యనుకన్య

శాక్యుడు తనభావిచర్యను నిర్ణయించుకొని, శరీరదార్ఢ్యమును కలుగజేసికొనుటకు ఆహారమునకై ఊర్వెలయందలి దశకన్యలకడకు పోవనెంచెను. ఆపదుగురుకన్యలును ఆయనషాడ్వార్షికవ్రతమునకు పూర్వమునుండియు పరిచర్యలు కావించుచుండినవారు. వారియందు సుజాత కడుభక్తురాలు. శాక్యునికి పరిచర్యలు చేయుటయేకాక శాక్యసంకల్పము నెరవేరుగాక యనియు, నీతడు లోకోద్ధారకుడగుగాక యనియు ప్రార్థించుకొనుచు, తద్దేవాసక్తయయి ప్రతిదినమును ఎనిమిదివందల బ్రాహ్మణులకు అన్నదానము చేయుచుండెను.

శాక్యునివస్త్రము జీర్ణమయి శరీరాచ్ఛాదనకు చాలకుండెను. శ్మశానవాటికమీదుగా పోవుచుండిన ఆయనకొకశవము కానబడెను. అదిసుజాతయొక్క సేవకురాలగు రాధ శవము. గౌతముడాశవముపైనుండినవస్త్రమును లాగికొని, మలినముకాన ఉదికి కట్టుకొనుటకై యోచించుచుండెను. తత్క్షణమే దైవయోగమున నొకప్రవాహమును, అందు గడ్డలుదుకుకొనురాయియు కానబడెను. గడ్డనుదుకుకొని, అచ్చటనే యొకకకుభవృక్షమునీడను కూర్చుండి, తాను శవముపైనుండి లాగికొనిన వస్త్రము జీర్ణమయి యుండినందున దానిని కుట్టుకొనుచుండెను. ఈలోన అలిమలప్రభుడను దేవపుత్త్రుడు యోగులకు ధారణయోగ్యమగు పీతాంబరమును గొనివచ్చి సమర్పింపగా శాక్యుడు దాని స్వీకరించి, మరునాడు గ్రామములోనికి భిక్షాటనార్థమేగెను. దేవతలాయనరాకను సుజాత కాలోలినాడే ఎరింగించియుండినందున ఆకన్య అతిథిపూజకై సిద్ధపడుచుండెను.

సుజాత గోక్షీరమును తెచ్చి, దానినుండి ఏడుమారులు మీగడనుతీసి, యొకనూతనపాత్రమందు కొంతబియ్యమును పోసి వండి, మీగడతోచేర్చి, వాసనద్రవ్యములను, ఖండశర్కరాదికములనుకలిపి పక్వపరచి, యొకహేమపాత్రమందాదివ్యాన్నము నుంచెను. తనదాసిని ఉత్తరనుపిలిచి

"నీవు లక్షణముగ వెళ్లి యొక బ్రాహ్మణుని భోజనమునకు పిలుచుకొని ర"మ్మని పంపెను. ఉత్తర మొదట పూర్వాభిముఖముగా బోయెను. బ్రాహ్మణు డెవడును లభించ



౧. వజ్రాసనము

లేదు. కాని యతివేషమున శాక్యుడు కానబడెను. బ్రాహ్మణుడు కాడని ఆయనను ఉత్తర యాహ్వానింప లేదు. క్రమముగా అన్ని దిక్కులయందును బ్రాహ్మణుని కొరకై వెదకెను గాని ఎవరును దొరక లేదు. ఉత్తర మరలి తనరాణియొద్ద కేతెంచి, "అమ్మా! నే నేదిక్కునకు బోయినను బ్రాహ్మణు డెవండును కానరాడు. ఒక్కొకసారియు నొకశ్రమణుడుమాత్రము కనబడుచున్నా" డని విన్నవించెను. సుజాత అత్యాతురతతో "నే నాశ్రమణునే పూజించవలెను; ఆయనను వేగమ పిలుచుకొనిర"మ్మనెను. ఉత్తరయు శాక్యునిగొనివచ్చెను. సుజాత ఆయన నతిగౌరవమున నింటికి గొనిపోయి, తాను పక్వపరచిన క్షీరాన్నమును హేమపాత్రతోగూడ సమర్పించెను. గౌతముడు 'సోదరీ! నా కీపాత్ర మెందులకు? అన్నముమాత్రమి' మ్మనెను. సుజాత పాత్రలేనిది అన్నమునిచ్చుట ధర్మముగాదనియు, భోజనానంతరము పాత్ర

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును మీయిష్టానుసారముగా నుపయోగించుకొనవచ్చు ననియు వేడుకొనెను. అంతశాక్యుడు హేమపాత్రమును, అన్నమునుగొని నైరంజనానదికి స్నానార్థమేగెను. తన కాషాయాంబరమును, హేమపాత్రమును గట్టుననుంచి,నది లోదిగెను. నదీజలమంతయు దేవతలవలన చందనాది సుగంధద్రవ్యములతోను,పుష్పములతోను నింపబడియుండెను. ఆయన స్నానముచేసి, వస్త్రమునుదొడిగి, అన్నమునుచేతగొని, సమీపముననుండిన వనమునకుపోయి, క్షీరాన్నమును దృప్తిగా భుజించి, హేమపాత్రమును నీట పారనైచెను. భోజనానంతరము గౌతముడు యథాపూ

విశేషవర్ణన లేవియు లేవు. ఊర్విల్వగ్రామమున నదియొ కమహాపిప్పలవృక్షము.ఆమహావృక్షముక్రింద సాధారణము గజ్ఞానవయోవృద్ధులు నిత్యమును గూడి లోకవ్యవహార ములను, మతవిషయములను చర్చించుటయు, తత్త్వవిచార ము జేయుటయు కలదు. ఆవృక్షమునుచుట్టి యొకవేదిక యుండెను. ఇచ్చటికే గౌతముడు భోజనానంతరము బయలుదేరినది.

గౌతముడు బుద్ధుడగుకాలము సమీపించెను. ఆయ నమనస్సు రాగరహితమయి పరిపక్వస్థితిని పొందియుం డెను. పూర్ణజ్ఞానులగుటకు పరిపక్వస్థితియందుండువా



౧. అశోకావరణము

ర్వముగ సుందరశరీరుడయ్యెను. తపమువలన చిక్కిశల్యగతమయిన శరీరము వరల పుష్టికలదయ్యెను. ఆయనశరీరమున ముప్పదిరెండుమహాపురుషలక్షణములును అవగతములయ్యెను. ముఖము దివ్యతేజోయుతమయ్యెను. పునర్లబ్ధపృథుశరీరుడై బోధిమండమునకు బయలుదేరెను.

## బోధిమండము

బుద్ధునిచరిత్రమంతయు విస్తారముగా వర్ణించబడిన లలితవిస్తార మనుగ్రంథమున బోధిమండమునుగురించి

బోధిసత్త్వ లనబరగుదురు. బోధిమండమునకు గౌతముబో ధిసత్త్వుడేగుమార్గమునుగురించి 'లలితవిస్తారము'న విస్త వర్ణించియున్నారు: "వాయుదేవుడు మార్గమునంతయు సమ్మార్జనముచేసి, మందమందగమనుడై పథికుల కాహ్లా నకుడై యుండెను. వరుణుడు సుగంధయుతజలమును పుష్పముల పజిచెను. వృక్షములును, శైలములును గౌ వానవతశిరములై మార్గమునకంతకు నీడనొసగుచుండెను. మార్గమునంతను దేవపుత్త్రిలు రక్షించుచుండిరి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పార్శ్వములను నవరత్నఖచితములగు విశ్రమగృహముల గట్టించియుండిరి. మార్గమున తాళవృక్షము లుండెను. వాటిపై ననేకఛత్రచామరము లుంచబడినవి. తాళవృక్షముల మధ్యప్రదేశమున నానావిధజలచరములతోను, పుష్పములతోను నిండినతటాకము లుండినవి. వేలకొలది అప్సరసలు విశ్రమగృహములందుండి సుగంధధూపముల వేయుచు, పుష్పవర్షములు గురిపించుచు, దివ్యగానములతోను, వాదిత్రములతోను నృత్యములు చేయుచుండిరి. బోధిమండమును దేవభటులు రక్షించుచుండిరి. బోధివృక్షముక్రిందనుండిన నవరత్నసింహాసనమున గూర్చుండుటకు బోధిసత్త్వుడు నైరంజనానదినుండి వచ్చుకాలమున లోకమంతయు ఆనందమయమయియుండెను. గౌతముడు వృక్షమును సమీపించగనే నాగపతియగు కాళికుడును, తత్పత్ని సువర్ణప్రభయు పరివారసమేతముగ వచ్చి, ఆయనను దర్శించి, నమస్కరించి నిలిచిరి. శాక్యుడు బోధివృక్షమును చేరి తనఆసనమునకై మృదువులగు తృణములను వెదకఁబోచ్చెను. అప్పుడు శక్రుడు గడ్డికోయువానివేషమున తత్సమీపమున గడ్డికోయుచుండెను. శాక్యుడతని సమీపించి ఆసనమునకై కొన్నితృణముల దీసికొనివచ్చి బోధిద్రుమముక్రింద నొక యాసనమును నిర్మించుకొని పూర్వాభిముఖుడై కూర్చుండెను. అట్లు ఆసీనుడై, "నాశరీరము కృశించినను సరే, చర్మము, మాంసము, శల్యములు నశించినను సరే, నేనన్వేషించుమార్గము గోచరించునంతకును ఈయాసనమునుండి లేవజాల"నని దృఢసంకల్పము కావించుకొనెను. వెంటనే కామావచరులను దేవత లార్వురువచ్చి బోధిసత్త్వునికి నమస్కరించి వెడలిపోయిరి.

## మారునిదుండగములు

శాక్యుడు మోక్షమార్గాన్వేషియై దృఢసంకల్పముతో నుండగా మారుడు కొనసాగనీయదలచుకొనలేదు. మారుడు అరిషడ్వర్గాధిపతి. అతని జయించినగాని ముక్తి సులభముకాదని గౌతముడెరుగును. మారానుచరులగు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులను జయించిన, మారుని జయించినట్లే. అందులకుముందు తనఇంద్రియముల జయించవలెను. జితేంద్రియునికి ఏదియు అసాధ్యము కాదు. దేనినైన జయించవచ్చుగాని తనఇంద్రియముల జయించుటయే లోకమున కష్టతమమగుకార్యము. గౌతము డట్టికార్యమును బూనుకొనెను. వాటిని జయింపవలెను. ఎటు చూచినను ఏదోయొకరూపముననవి మనమును బాధించుచునే యుండును. ఒకవస్తువునందలి యపేక్షను వదలుకొనవలెనన్న అంతకంటెను ఆవస్తువునందే మనస్సు నిలుచుచుండును. ఇది మనుష్యస్వభావము.

శాక్యుడు మారజయమునకు పూనుకొనగనే మారుని దుండగములును బలసెను. అతడుగౌతముని సంకల్పమునుండి మరల్పజూచెను. మారునియనుచరులు అనేకభూతములుగను, పిశాచములుగను, రాక్షసులుగను భీకరాకారముల బూని, నఖదంష్ట్రాదిద్యాయుధములతోను, సర్పసింహవ్యాఘ్రాది క్రూరసత్త్వములతోను బోధిసత్త్వునిపై కేకముఖముగ దుమికిరి. ఆయనను లాగియు, త్రొక్కియు చూచిరి. కాని ఆయన చలింపడయ్యెను. వారాయనపైకి విడిచినసర్పములు పుష్పమాలికలవలె నయ్యెను. బాణములు తుమురై పోయెను. శాక్యుడు మారునిదుండగముల జూచి, సపరివారముగ నతని వెడలిపొమ్మని మందలించెను. దౌష్ట్యమువల్ల జయించుట దుర్లభమని తలచి మారుడు తనపదునార్వురు కుమార్తెలను నిరుపమానలావణ్యవతులను గౌతమతపోభంగమునకు నియోగించెను. వారును తమశక్తికొలది శృంగారచేష్టలతోను, హావభావవిశేషములతోను, నృత్యగీతాదికములతోను శాక్యునిముందర జేరి, అతనిమనస్సును చలింపజేయ జూచిరి; కాని నిష్ఫలమనోరథులైరి.

మారుడు శాక్యుని కెన్నెన్నియో దుస్సహబాధల గలిగించెను; కాని ఆయన, కంఠీరవంబు గజయూథంబుల జెండాడుభంగి, మారుని చెయిదముల మాయించి, యద్వితీయ ప్రతిభాసంపన్నుడై, జితేంద్రియత్వము రూపొందినదోయన్నట్లు వెలయుచుండెను. శాక్యుడు బుద్ధుడయ్యెను. మారుని యాత్మశక్తియు కుంఠితమయ్యెను. అతని వాహనము, గిరిమేఖలమను గజము, మోకరించి బుద్ధుని కెరగెను. మారు డిక చేయునదిలేక యాస్థలమువాసి వెడలిపోయెను. ఇట్లు మారుని ప్రథమదివసముననే జయించి, యారాత్రియందు ప్రథమయామమున 'పూర్వనివాసము'



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అను పూర్వజన్మజ్ఞానసిద్ధి గాంచెను. ద్వితీయయామమున 'దివ్యచక్షు'వను దివ్యజ్ఞానసిద్ధియు, తృతీయ చతుర్థయామముల సంపూర్ణ బుద్ధత్వమును బడసెను.

## బుద్ధత్వము

బుద్ధుడు ప్రాణులయొక్క, జనన జీవన మరణాదికములకును, వాటిదుఃఖములకును కారణము వెదకెను.












3. అశోకావరణ స్తంభములపైని చెక్కడపు పనులు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౭. బౌద్ధులనాటి ఆభరణములు

అవిద్యవలన సంస్కారమును, సంస్కారమువలన నామరూపవిజ్ఞానమును, నామరూపవిజ్ఞానమువలన షడాయతనము లనియెడు ఆరు జ్ఞానేంద్రియములును, జ్ఞానేంద్రియములవలనస్పర్శయు, స్పర్శవలన వేదనయు, వేదనవలన తృష్ణయు, తృష్ణవలన ఉపాదానములును—అనగాపంచభూతములును, ఉపాదానములవలన ప్రపంచమును, ప్రపంచమువలన జననమును, జననమువలన మరణమును కలుగుచున్నవని బుద్ధుని ఆశయము. ఏతత్ప్రకారముగ జూచిన జననమరణములకు మూలకారణము అవిద్య, లేక అజ్ఞానము. అజ్ఞానమే సంస్కారవేదనతృష్ణలకు కారణము. జనన మరణములకు లోనగువాని జీవుడు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాది కారణములచే బాధింపబడుచుండును. "అజ్ఞానాంధకారమునుండి తొలగినేని జీవుడు ముక్తిపొందును" ఇదియే బుద్ధు డెరింగి లోకమునకు బోధించిన మోక్షమార్గము.

శాక్యుడు బుద్ధుడు కాగానే ఆయనశరీరమునుండి దశదిక్కులకును ఒకదివ్య తేజము ప్రసరింపదొడగెను. ఈ సంతోషవార్త అన్నియెడలను వ్యాపించెను. బుద్ధునికి తమ సానుభూతి నొసగుటకు మొదట కామావచరులను నప్సరసలు వచ్చిరి. వెనుక శుద్ధావాసకాయికులు (శరీరములును, వస్త్రములును శుద్ధముగా గలవారు), ఆభాస్వరులు (కాంతిగలవారు)ను, సుబ్రహ్మలును, శుక్లపక్షికులు (తెల్లనిరెక్కలు కలవారు)ను, పరివారసమేతుడై పరనిర్మితవశవర్తి యను దేవపతియును, సునిర్మితదేవపుత్త్రుడును, సంతుషితదేవపుత్త్రుడును, దేవేంద్రాదిదిక్పాలురును వరుసగా వచ్చి బుద్ధుని సందర్శించి పూజించి వెడలిపోయిరి. ఏడుదినము లిట్లు కడచెను. ఎనిమిదవ దివసమున దేవతలు హేమకుంభములయందు జలమును దెచ్చి బుద్ధునికిని, బోధివృక్షమునకును అభిషేకము కావించిరి. బుద్ధుడు మొదటివారమున శ్రీత్యాహోవ్యూహము అను ధ్యానమున నుండెను. అనగా ముక్తిమార్గమును కనుగొన్నందులకు ఆనందము ననుభవించెను. రెండవవారమున ఇటునటు నడచుచుండెను. దీనికే దీర్ఘచంక్రమణ మని పేరు. మూడవవారమున బోధిద్రుమమున దృష్టి నిలిపి అనిమిషుడై యుండెను. నాలుగవవారమున ధరాచంక్రమణమొనర్చెను: అనగా పూర్వాపరసముద్రస్థ భూమండలమును తనమనశ్చక్షువుల చూచుచుండెను. అయిదవవారమున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముచిలిందుడను నాగరాజు గృహాముననొద్దకు వచ్చెను. అది వర్షకాలము: శీతల మెక్కుడుగ నుండెను. నాగరాజు దాని నెరింగి తత్క్షణమే బుద్ధునిచుట్టును తనశరీరమును ఏడుచుట్లు చుట్టుకొని పడగతో నాయనశరీరమును వాన



౫. బుద్ధగయ ఆలయములోని యొక స్తంభము

నుండి యాచ్ఛాదించెను. ఆరవవారమున వర్షము నిలువగానే బుద్ధుడు ముచిలిందుని వదలి, యొకన్యగ్రోధవృక్షము క్రింద వసించెను. ఏడవవారమున న్యగ్రోధమును వదలి, మరికొంతదూరమునందున్న రాజాయతన మను వృక్షము క్రింద వసించెను.

## ఇద్దరు వణిజులు

త్రపుషుడు, భల్లికుడు అను వణిజసోదరు లిద్దరు ఉత్కల (Orissa) దేశమునకు వ్యాపారార్థము పోవుచుండిరి. వ్యాపారమున విశేషలాభమును సంపాదించి 500 బండ్లనిండ వర్తకసామగ్రుల నింపుకొని మధ్యదేశమునకు పోవుచుండిరి. మార్గమున బుద్ధుడు నివసించుచుండిన రాజాయతనవృక్షమునకు కొంతదూరమునందుండగా వారి బండ్లకు కట్టిన యెడ్లలో సుజాతము, కీర్తి అను రెండెడ్లు ముందుకు సాగకపోయెను. ముందేదైన అపాయముగాని, అటంకము గాని యుండినయెడల ఆవృషభము లది గ్రహించి ముందుకు సాగకుండుట వాడుక. కాన వర్తకులు మార్గమున విశేష మేమైన నున్నదా యని పరీక్షింపుడని సేవకుల నంపిరి. వారు ముందుపోయి చూచి, భయకారణ మేమియు లేదనియు, ఒకవృక్షముక్రింద దివ్యతేజోయుతుడగు నొకయోగి యున్నాడనియు తెలిపిరి. వెంటనే వర్తకులిరువురును సపరివారముగాబోయి బుద్ధుని దర్శించిరి. వెంటనే తేనెయును, శర్కరయును కలిపిన యవపిండిరొట్టెలను సమర్పించిరి. బుద్ధుడు దాని భుజింపగానే వర్తకు లిరువురును యావజ్జీవమును బుద్ధునికి పరిచర్యచేయుట కియ్యకొనవలెనని యాతనిని వేడిరి. బుద్ధుడు వారిని పరిగ్రహించెను. వారికి ఉపాసకులని పేరు. బుద్ధుడు శిష్యులుగా స్వీకరించిన ప్రథమపురుషు లీవణిజసోదరులే.

## బుద్ధుని ప్రథమబోధ

బుద్ధుడు త్రపుషభల్లికులచే నాదరింపబడిన పిదప న్యగ్రోధవృక్షముక్రిందికి వెళ్లెను. అచ్చట తాను గనుగొనిన ముక్తిమార్గము నెవరికి బోధించిన సులభముగా గ్రహింపగలరా యని యోచించెను. కపిలవస్తునగరమును వదలి వచ్చుచుండగా మొదట తా నాశ్రయించిన ఆలారునికి ధర్మమును బోధింప నెంచెను. కాని ఆలారు డొకవారముక్రిందనే మరణించినట్లు ఆయనకు మనోగోచరమయ్యెను. పిమ్మట తా నాశ్రయించిన ఉద్రకుని తలచెను. ఆయనకూడ ఆతొలిరాత్రియే మరణించెనని తెలిసెను. కడపట తన్ను చంచలమనస్కుడనియెంచి త్యజించిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అయిదుగురుసన్న్యాసుల వలచెను. వారప్పుడు కాశియందు మృగదావమున తపమాచరించుచుండిరి. అప్పటికి బుద్ధుని తపఃపరిసమాప్తియయి ఎనిమిదివారములయ్యెను. ఆషాఢ శుద్ధపూర్ణిమనాడతడు వారణాసికి పయనమయ్యెను. అదియే ఆయన దేశసంచారమునకు ప్రారంభము. బుద్ధుని త్యజించిన అయిదుగురు సన్న్యాసులును తపోనిష్ఠయందుండిరి. వారు బుద్ధుని దూరముననే చూచి ఉదాసీనత వహించిరి. కాని వారిలోవారు చంచలచిత్తుడగు గౌతముడు ఆదరణపాత్రుడు కాడనుకొని యూరకుండిరి. బుద్ధుడు వారిని సమీపించెను. ఆయనను చూచిచూడనట్లు నటించుచు, లేచి గౌరవింపరాదని దృఢనిశ్చయులైనవా రయిదుగురును, బుద్ధుడు సమీపింపగనే, తమసంకల్పమును మరచి, తమకు తెలియకయే లేచి ఆయనకు నమస్కరించి నిలిచిరి. అప్పు డాయన వారికి తనధర్మమును బోధించెను. వారును ధర్మమును స్వీకరించి అర్హతులైరి. అర్హతులనగా పరిపూర్ణజ్ఞానులై మోక్షార్హులగువారు. సారనాథు నందు యశస్సనువాడును, వానితలిదండ్రులును, భార్యయు, ఏబదినలుగురుమిత్రులును బుద్ధునిధర్మమును స్వీకరించిరి. బుద్ధుడు అరువదిమందిశిష్యులను నానాదిక్కులకును ధర్మబోధకై పంపి, తాను మరల ఉరువేలకు పోయెను. అచ్చట ఉరువేల కశ్యపుడు, గయకశ్యపుడు, నదీకశ్యపుడు అను కశ్యపసోదరులు ముగ్గురు అగ్న్యారాధకు లుండిరి. వారికి ధర్మమార్గోపదేశము కావించి, అర్హతుల జేసెను. అటనుండి క్రమముగా లోకసంచారముచేసి, ధర్మమును లోకమునస్థాపించి, ఆచంద్రార్కకీర్తిస్వరూపు డయ్యెను.

బుద్ధునితపోభూమి యగు గయయందు అనేకాలయములును, స్తూపములును కలవు. సుమారు క్రీ. పూ. 250-వ సంవత్సరము మొదలు, క్రీ. శ. చాల సంవత్సరములవరకును అనేక బౌద్ధచక్రవర్తులచేతను, ధనికులచేతను, భిక్షులచేతను కట్టబడినవై యుండెను. ఈ 14 శతాబ్దముల కాలమున బౌద్ధమతము శశాంక, కుమారిలభట్టాదిబౌద్ధమతద్వేషుల ప్రహారకృత్యములవలన చాలవరకు బాధల నందియుండెను. శశాంకుడు బౌద్ధాలయముల ననేకముల నాశ మొందించెను. అతడు బోధిద్రుమమునుగూడ నెన్నిమోమారులు దహించియు, నరికియు తనకక్కసమును దీర్చుకొనుచుండెను.

మహాబోధి ఆలయమును కట్టించినవాడు అశోకచక్రవర్తి. ఉపగుప్తుడు ఆయనయొక్క గురువు. ఉపగుప్తుడు శూద్రకులజుడయ్యును, పదునేడవసంవత్సరప్రాయమున బౌద్ధుడై, జితేంద్రియుడని ఖ్యాతి జెందినవాడు. అశోకుడు తొలుత క్రూరుడైయుండెను. సమయము చిక్కినపుడెల్ల నతనికి ఉపగుప్తుడు సన్మార్గావలంబనము బోధించుచుండి అతనిని బౌద్ధుని జేసెను. బౌద్ధుడైనఅశోకచక్రవర్తి గయాప్రభావమునువిని, ఉపగుప్తుని ప్రేరణవల్ల గయయందు మహాబోధిఆలయమును ఒకలక్ష హేమనిష్కములు వ్యయించి కట్టించెను. ఈఆలయము పదునారు స్తంభములుగల మంటపమై యుండెను. ఆమంటపమధ్యమున నొక 'వజ్రాసన' ముండెను. దానివ్యాసము 5¾ అడుగులు, దానిమందము ఆరంగుళములు. అది యొకపాలరాతిచే చేయబడినది. దానిపై చిత్రవిచిత్రములుగ చెక్కడపుపని చేయబడియున్నది. (చిత్రము ౧) అశోకుడు మంటపమునేకాక దాని చుట్టును ఒక స్తంభావరణమునుగూడ కట్టించెను. ప్రతి స్తంభముపైనను చిత్రములు కలవు. స్తంభములకడ్డముగా రాతిదూలము లమర్చబడి, ఆవరణమంతయు నొకకంచెవలె కనబడుచుండును. (చిత్రము ౨) అశోకునితర్వాత ననేకరాజులు ఆలయమును వృద్ధిచేసిరి. అశోకునితర్వాత 9 శతాబ్దములకు హిూయన్‌త్సాంగు గయను దర్శించినపుడు ఆలయమొకమంటపమాత్రము కాక పెక్కు అంతస్తులుగలదై యుండెను. అశోకమంటపము క్రీ. పూ. ప్రథమశతాబ్దమున శంకరుడు, ముద్గరగ్రామణి అనునిద్దరు ఉపాసకసోదరులు (ఇందు శంకరుడే శంకరాదిత్యు డనబరగువాడు కానోపును) గొప్పఆలయముగా గట్టించిరి. వీరే నాలంద ఆలయమునుగూడ గట్టించిరి. తర్వాత 300–400 మధ్యకాలమున నేపాళరాజగు పశుపతి బుద్ధవిగ్రహము నొకదానిని ప్రతిష్ఠించి, తూర్పుమంటపమును, ఇంక ననేకస్తూపములను గట్టించెను. క్రీ. శ. 600–620 మధ్యకాలమున శశాంకరాజు బౌద్ధమతమునందలి ద్వేషమువలన బోధిద్రుమమును పెకలించి, ఆలయమును ధ్వంసముచేసెను. తాను ధ్వంసముచేయుట చాలక, తనమంత్రి బౌద్ధుడైనను, అతని నాలయధ్వంసము కావించుట కాజ్ఞాపించెను. ఆమంత్రి యట్టిదారుణమున కొడంబడజాలకయు, రాజాజ్ఞ నుల్లంఘింపను చాలకయు నందలి బుద్ధవిగ్రహమునకు ముందొకకుడ్యమును గట్టించి కప్పించెను.

[సశేషము]

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# సాధుభిక్ష

రాయప్రోలు సుబ్బారావు గారు

౧

ధర్మధేనువు చేపగా దాయఁగట్టి
జగతిఁ బిదికె నెవం డహింసాపయస్సు
నా తపస్వివతంసు నామామృతంబు
వీథివీథులఁ బడి పంచిపెట్టికొనుచు.

౨

కాళ్లు కందగాఁ గట్టిన కడపలెల్ల
నెక్కిదిగితిని పగలెల్ల నీపురాన;
పిలిచి నోరారగా నింత భిక్షఁ బెట్టు
గ్రామవాసి యొకండును గానరాఁడు.

౩

వృత్రవధఁ గీర్తనము సేయు వేదవాణి
నధ్యయన మొనరించు బ్రాహ్మణజనంబు
సృష్టిచేతన మెల్ల నార్ద్రీకరించు
మహాదహింస కేపగిది బ్రహ్మణ్య మిచ్చు?

౪

చంపఁ జేయెత్తు కటికికసాయి యసికి
నవ్వుచు శిరస్సు నీఁగలపువ్వుటొడఁద
చంపలేదె జీవనపయఃపూరమయిన
యతనిలోని హింసాప్రరోహమును బ్రేమ.

౫

ఊరినలుప్రక్కలందును నుదయవేళఁ
గదలి చీమలపుట్టలు వెదకి వెదకి
మంచిబియ్యము చల్లు సంసారులకట!
మాఱినారు మతద్వేషమలిన మంటి.

౬

వేసవిదినాల పక్షిదప్పికలు దీర్ప
ప్రమిదలను మంచినీర్వోసి బయటిగోడ
మదురులందునఁ బెట్టు బ్రాహ్మణపురంధ్రు
లకట! యిపుడేల యిటు లదయాత్మలైరి.

౭

లేళ్ల మేతకు పచ్చిక బీళ్లు పెంచి
విడిచిపెట్టు కర్షకులు లోభింత్రు నేఁడు
కంచె వేసి తోఁటల కెల్ల గరుణవిడిచి
మాఱెనే బౌద్ధధర్మ చక్రారపంక్తి!

౮

తొట్టెలో పసిపాపను దొడ్డిలోని
బాలవత్సమ్ముఁ, దోఁటలోఁ బచ్చమొలక
నేకవత్సల దృష్టితో సాకినట్టి
ప్రియకుటుంబిను లిప్పు డేమయిరొ, యకట!

౯

తీయనీయలేదు తేనెఁ దెట్టెలనుండి
త్రుంపనీయలేదు తొడిమఁ బువులు
కోయనీయలేదు కొమ్మలఁ ఫలములు
ఎటుల మాఱె నా యహింస నేఁడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧౦

కావిఁగొన్న పరివ్రాజి కాకులంబు
సుఖముగా చైత్యములయందు సుప్తిఁగొండ్రు
రాళ్లనిలువునఁ "బ్రియదాసి" వ్రాసినట్టి
ధర్మశాస్త్రలు ధూళిలో దాగు నేఁడు.

౧౧

కొఱికివేయుచున్నదిచలి నరము లెల్ల
ప్రాయమున నున్న నన్నె సర్వాంగకముల,
కాన్పులుడిగిన యీగోవు కదలలేక
వణకుచున్నది నావచః ఘటితిపగిది.

౧౨

డొక్కలంటుకపోయెఁ గండ్లు ముసుకునడు
నీపయస్వినినెక్కటా! యెట్లుచూతు;
చలికిఁ గప్పెదమన్న వస్త్రంబులేదు
ఒక్కకావికౌపీనము దక్కనాకు.

౧౩

అనుచు విలపించుచుండె సన్న్యాసి యొకఁడు
లేవలేని యొక్క ముసలిగోవు చెంత
ఆంధ్ర రాజ్యేశ్వరీ కంఠహార మయిన
ధాన్యకటకవీథులమధ్య శూన్యగతిని.

౧౪

మేత తేలేఁడు, వృద్ధగోమాత బాధ
చూడలేఁడు ప్రాణములు కొట్లాడుచుండ
ఎటుతోఁచక చేదోయినెత్తిగోమ
తల్లిని గవుంగలించె వత్సము విధాన.

౧౫

బుంగతో నీళ్లు మోసుకపోవుచున్న
పేదరాలోర్తు చూచె హృద్భేదనముగ
నామహార్తి సంక్రాంతి నింకేమి చెప్ప
కలదుగాదె సూత్రాత్మ జగత్తునందు.

౧౬

ముందువెనుకలవచ్చుచుఁ బోవుచున్న
పౌరులను జూడలే దామె; వారిమీఁదఁ
జినిగిపోయిన తనమేని చీరవిచ్చి
బుద్ధభగవానుపేరు చెప్పుచును గప్పె.

---

# చింత

## వేంకట కాళిదాస కవులు

[ఆంధ్రగీర్వాణ సాహిత్యసమ్మేళనము]

త్రేటినై భవదీయ దివ్యపాదాంభోజ రుచిరమరందంబు గ్రోలువాఁడ
హంసనై భవదీయమగు మానససరోవరోర్మికాశ్రేణుల నూగువాఁడ
వరచకోరంబునై భవదీయముఖసుధా కరచంద్రికలవేడ్కఁ దిరుగువాఁడఁ
గోయిల నై భవదీయ భాసురతనూసురసాలముంజేరి వరలువాఁడ
"రామకృష్ణా!" యటంచు గీరంబునగుచు-నీదు కరపల్లవమున రాణించువాఁడ
సుకవినై భవన్నామ సంస్తుతివినిర్మ-లాంబరంబున విహరించి యలరువాఁడ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ఆంధ్ర మహాసామ్రాజ్యము

మల్లంపల్లి సోమశేఖర శర్మగారు

(వెనుకటిసంచిక తరువాయి)

ఇక భాషావిషయమునుగుఱించి యాలోచింతము. 'సాతవాహనులు ఆంధ్రులే యైన యెడల - ఆంధ్రులు ద్రావిడులలోని వారును, ద్రావిడభాషా కుటుంబమునకు జెందిన ఆంధ్రమును మాటలాడువారును గనుక-వారి శాసనములలో ఒక్కటియైన ద్రావిడభాషాకుటుంబమునకు జెందిన ఆంధ్రభాషలో నున్నది కనబడవలసి ఉండును. కాని, అట్టి శాసనమేదియు ఇంతవఱకు గానరాదు. సాతవాహనులశాసనములన్నియు ప్రాకృత భాషలోనే కలవు. అందువలన సాతవాహనులును ఆంధ్రులును ఒకరుకారు' అని వ్యతిరేకవాదము: అనగా సాతవాహనుల మాతృభాష ప్రాకృతము; ప్రాకృతము కావుననేవారి శాసనము లన్నియు ప్రాకృతమున నున్నవని దానిభావము.

సాతవాహన శాసనములు ప్రాకృతమున నున్నంత మాత్రమున వారి (మాతృ) భాష ప్రాకృతమని నిర్ణయింప వీలులేదని వ్యతిరేక వాదమునకు సమాధానము. శాసనములలో ప్రాకృతభాష ఒక్క సాతవాహనులనాటి నుండియే, ఒక్క దక్షిణాపథముననే, ఒక్క సాతవాహనుల కాలముననేకాదు; క్రీస్తుకుపూర్వమునను పరమునను, ఉత్తరాపథమునను దక్షిణాపథమునను, అశోకునినాటినుండియు గూడ శాసనములలో గానవచ్చుచున్నది. మౌర్య వంశపురాజైన అశోకుని శాసనము లన్నియు ప్రాకృతమున నున్నవి. శుంగవంశజులనాటిశాసనములు ప్రాకృతభాషలో గలవు. సాతవాహనులకు సమకాలీనులై ఉత్తరహిందూస్థానమున పరిపాలనము నెఱపినశక, కుషాణవంశజులనాటి శాసనములుచాలవఱకు ప్రాకృతముననేకలవు. మాళవసౌరాష్ట్రముల నేలిన క్షత్రప వంశజుడగు నహపానునియొక్కయు, అతని అల్లుడు వృషభదత్తుని యొక్కయు, అతని కూతురును వృషభదత్తుని భార్యయు నగు దక్షమిత్ర యొక్కయు, అతనిమంత్రి 'అయమ' యొక్కయు శాసనములన్నియు ప్రాకృతముననేకలవు. వృషభదత్తుని యొక శాసనమున మాత్రము ఆత డదివఱకుచేసిన దానధర్మములనువర్ణించు ప్రశస్తియాతయు సంస్కృతముననేయున్నను క్రొత్తగ చేయబోవుదానమును వర్ణించుపట్టు నుండి సంస్కృతము కాక ప్రాకృతమే వాడబడెను. ఈ పైనుదివిన వారందఱు సాతవాహనులకు సమకాలీనులే, సాతవాహనులకు సమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలికుడైన కళింగరాజగు ఖారవేలుని శాసనము ప్రాకృతమున నే రచియింపఁబడినది. సాతవాహన రాజ్య మంతరించినపిదప పరిపాలించి రనబడు కర్ణాటదేశపు కదంబవంశజుల మొదటి శాసనములు ప్రాకృతమున నే కలవు. క్రీస్తుశకము మూడవ శతాబ్దాంతమునుండి కాంచీపురమును రాజధానిచేసికొని పాలించి రనబడు పల్లవ వంశజుల మొదటి శాసనముల లోని భాషయు ప్రాకృతమే. సాతవాహన రాజ్య మంతరించిన పిదప ఆంధ్రదేశమున వేఱువేఱు ప్రాంతముల రాజ్యముచేసిరని యూహింప దగు ఆనందగోత్రజుల శాసనములు, బృహత్ఫలాయన సగోత్రుల శాసనములు, వేంగీశాలంకాయనులలోని మొదటిరాజుల శాసనములు—ఇవియన్నియు ప్రాకృతమున నే ఉన్నవి.

ఈ పై యుదాహరణముల ననుసరించి చూచినచో ప్రాకృతము ఒక్క సాతవాహన వంశజులశాసనములలోను, వారు పాలించిన ఒక్కపశ్చిమహిందూదేశమునను, వారినాఁడును మాత్రమేకాక వేఱువేఱు రాజవంశములవారి శాసనములలోను, ఉత్తర హిందూస్థానమునను, కళింగమునను, మాళవ సౌరాష్ట్రములలోను, ద్రవిడకర్ణాట దేశములందును, క్రీస్తుపూర్వము అశోకుని నాటినుండి సాతవాహన రాజ్య మంతరించిన పిదప కొంతకాలము వఱకునుగూడ గానవచ్చుచున్నట్లు తెలియగలదు. దీనిని బట్టి ప్రాకృతభాష ఒకప్పుడు అనగా క్రీస్తుపూర్వము ౩౦౦ ల సంవత్సరములనుండి క్రీస్తుతరువాత ౩౦౦ ల సంవత్సరములవఱకు సాధారణముగ హిందూదేశ మందలి రాజవంశములవారి కందఱికి సామాన్యమైన 'శాసనభాష' యయ్యెనని మనము నిస్సంశయముగ నుడువవచ్చును.

ఇట్లు ప్రాకృతము దేశ మంతటను వ్యాపించుటకును, రాజవంశములవారి కందఱికి సామాన్య 'శాసనభాష' యగుటకును కారణము లేకపోలేదు. అది హిందూదేశమున బౌద్ధమతము ప్రబలముగ వ్యాపించిన కాలమును విషయమును జ్ఞాపక ముంచుకొనినచో ఆకారణము సువిదిత మగును. హిందువుల యొక్క వైదికవాఙ్మయమంతయు సంస్కృతమున నున్నయట్లే బౌద్ధులయొక్కయు, జైనుల యొక్కయు మతగ్రంథము లన్నియు 'పలీ' భాషలోఁగలవు. 'వ్యావహారికమునకు భిన్నమైన గ్రాంథికప్రాకృతముయొక్క ప్రాచీనరూపమునకే 'పాలీ' యని పేరు.' సంస్కృతగ్రంథములకును, సంస్కృత పండితులకును హిందువులలో ఎట్టి గౌరవప్రతిష్ఠ లుండెడివో అట్లే బౌద్ధమతము ప్రబలిన రోజులలో ప్రాకృతగ్రంథములకును, ప్రాకృతభాషా పండితులకును అట్టిగౌరవమర్యాద లుండెడివి. హిందువులకు సంస్కృత మెట్టిపవిత్రభాషయో బౌద్ధ జైనాదులకు ప్రాకృత మట్టి పూజ్యభాష. మత విషయకమైన కార్యకలాపాదుల సందర్భమున నే తప్ప మిగిలిన వేళల సంస్కృతమును వాడుట పూర్వ మెంత యపవిత్రముగ తలంపబడుచుండెనో అట్లే బౌద్ధయుగమున మత స్వభావమును సూచించు కార్యముల పట్లనే కాని మిగిలిన యప్పుడు ప్రాకృతమును వాడుట దోషముగ పరిగణింప బడుచుండెను. రాజరాజ


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నరేంద్రునినాటి వఱకుగూడ తెలుగువ్యాకరణ ములైననేమి, మఱి యేగ్రంథములైన నేమి సంస్కృతమున రచియించుటయే ప్రతిష్ఠావహ మనునభిప్రాయ ముండినట్లే బౌద్ధమతము ప్రబలిన సాతవాహనుల నాడు గ్రంథ రచన ప్రాకృతమున జేయుటయే ఘనతగ నెన్నబడు చుండెను. ఇంతయేల, భాషా విషయకముగ వైదిక మతమునకు సంస్కృతము చిహ్నమైనట్లు బౌద్ధజైనమతములకు ప్రాకృతము చిహ్నమయ్యెను. మతస్వభావమును సూచించు ఏలేఖ్యమునైనను బౌద్ధయుగమునప్రాకృతభాషలో రచించుటయు, వైదికయుగమున సంస్కృతభాషలో రచించుటయు మీరరాని యొకపవిత్రాచారమయ్యెను. ఇందువలననే బౌద్ధమతస్వభావమును సూచించు దానధర్మములను దెలుపు లేఖ్యము లన్నియు బౌద్ధయుగమునప్రాకృతముననే కలవు. ప్రాకృతభాషలో గానవచ్చుశాసనము లన్నియు రాజులు కాని ప్రజలు కాని బౌద్ధభిక్షువులకో, బౌద్ధసంస్థలకో లేక జైనసంస్థలకో చేసినదానధర్మములను దెలుపునవే. ఈ కారణముననే ఋషభదత్తుని ప్రశస్తియంతయు మొదట సంస్కృతమున నుండినను దానవిషయమును దెలుపు పట్టునుండి ప్రాకృతముననే కలదు. అందువలన ఇట్టిప్రాకృతమును ఆధారముగా గైకొని సాతవాహనులు ఆంధ్రులుకారని వాదించుట యుచితముకాదు. సాతవాహనుల కాలమున గాని, అంతకు పూర్వము కాని హిందూదేశమునందలి వేఱు వేఱుప్రాంతముల పరిపాలనము నెఱపినవారు తమశాసనములను దేశభాషలలో వేయించియుండినయెడల — ఆయాప్రాంతము లందలి వారు అచ్చటి దేశభాషలో తమశాసనములు వ్రాయించియుండిరి గనుకను, సాతవాహనుల శాసనములు ప్రాకృతమున గానవచ్చుచున్నవి గనుకను — సాతవాహనులభాష ప్రాకృతమేయనియు, అందువలన వారు ఆంధ్రులకు భిన్నులై యుందురనియు అప్పు డూహింపవచ్చును; కాని సాతవాహనుల కాలమున హిందూదేశమునం దెల్లెడల సాధారణముగ ప్రాకృతభాషాశాసనములే కనబడును కాని దేశభాషాశాసనమే కానరాదు. అందువలన ఈభాషాధారమున సాతవాహనులు ఆంధ్రులు కారనుట యొప్పదు.

మఱియొక విషయము: ప్రాకృతము ఇప్పటి ఆంధ్రదేశమునకు గౌతమీపుత్రునితరువాతి సాతవాహనరాజుల మూలమున వచ్చినదను వ్యతిరేకవాదమును సరియైనది కాదు. ఇందుకు కృష్ణామండలములోని భట్టిప్రోలు బౌద్ధస్తూపశాసనములే ప్రమాణము. ఈశాసనములన్నియు ప్రాకృతముననే కలవు. వీటిని ప్రకటించినబూలరుదొరగారు వాటిలిపి ననుసరించి యవి అశోకునికి కొంచెము తరువాతివనియు, సాతవాహనుల నానాఘట్టముశాసనములు ఖారవేలునిహాథిగుంఫాశాసనము మొదలయినవానికి పూర్వపు వనియు, అందువలన అవి క్రీస్తుకు ౨౦౦ లకు కూడ పూర్వపువేయై యుండుననియు జెప్పుచున్నారు. ఇదియే సరియైనదగుచో సాతవాహనుల నానాఘట్టపు శాసనములకు పూర్వమే ప్రాకృతభాషాశాసనములు భట్టిప్రోలు బౌద్ధస్తూపమున గానవచ్చు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నవని చెప్పవలసియుండును. ఆ శాసనము లొకవేళ బూలరుగారు చెప్పునంతటి ప్రాచీనమైనవి కావని సంశయించినను క్రీస్తుపూర్వము మొదటి శతాబ్దిలోనివైన గాకపోవు. అవి క్రీస్తుతరువాత మొదటిశతాబ్దిలోని వని వాదమున కొకవేళ వాదించినను అప్పటికిని అవి గౌతమీపుత్త్రాదులకు పూర్వపువే కాగలవు. ఏలయన గౌతమీపుత్త్రాదుల నాసిక శాసనములలోని లిపికంటె భట్టిప్రోలుస్తూపపు శాసనముల లిపి చాల పూర్వపుదని యెల్లరు నంగీకరించియే యున్నారు. గౌతమీపుత్త్రాదుల తరువాతివారే ఆంధ్ర దేశమునకువచ్చిరనియు, వారే ఆంధ్రదేశమునకు ప్రాకృతమును దీసికొనివచ్చిరనియు వ్యతిరేకవాదము. అట్టిచో సాతవాహనులురాకపూర్వమేఆంధ్ర దేశమున ప్రాకృతభాషాశాసనములు కాన్పించుట యెట్లు కలిగెను? సాతవాహనులకు పూర్వము ఆంధ్ర దేశమునందలి శాసనములు ద్రావిడ భాషా కుటుంబమునకు సంబంధించిన ఆంధ్రమున కాక ప్రాకృతముననుండుట యెట్లు కలిగెను? ఏటిననుసరించియే వ్యతిరేకవాదముసరియైనది కాదనవచ్చును. ఈపై ప్రశ్నలకు ఇదివఱలో చెప్పినదే సమాధానము. శాసనములందుప్రాకృతముండుట అది దేశభాష యగుటవలనను కాకపోవుటవలనను కాదు: అది బౌద్ధులమత భాష, పవిత్రభాష యగుటయే అందుకు కారణము. 'సాతవాహనులకు పూర్వమే' ఆంధ్ర దేశములో ప్రాకృత భాషా శాసనములుకాన్పించుటనుబట్టియే ప్రాకృతమునకు భిన్నమైన దేశ భాష యచ్చటనుండి యుండునని యూహింప నవకాశము కలుగుచున్నది. సాతవాహనులకు పూర్వమైనను పరమునవైనను ఆంధ్రదేశము నందలి శాసనములలో ప్రాకృతముకాన్పించుట అది దేశభాషయగుటవలన గాదనియు, అది మతభాష యగుటవలననే యనియు మనము నిర్ణయింప నచ్చును. అందువలన ప్రాచీన ప్రాకృతభాషాశాసనములు కాన్పించిన ప్రాంతముల ప్రాకృతేతరమైన దేశభాష లేదని మాత్రము నిశ్చయముగ చెప్ప వల్లకాదు. ఈ కారణములవలన సాతవాహనులును, ఆంధ్రులును ఒక్కరుకారనుటకు ప్రాకృతము ఏవిధముననను అడ్డురాదని మనము నిశ్చయింప వచ్చును.

వేఱొక విషయము: శ్రీమాన్ పి. టి. శ్రీనివాస అయ్యంగారు క్రీస్తుశకము ౩౦౦ లనుండి ఆంధ్రజాతియు, ఆంధ్రరాజవంశమును అంతరించెనని చెప్పుచున్నారు: కాని యిది సమంజసమైన యూహగ కాన్పింపదు. ఆంధ్ర రాజవంశము వారిశాసనములు క్రీస్తు శకము మూడువందలనుండి కాన్పింపకపోవుటచేత ఆ వంశ మొకవేళ అంతటినుండి అంతరించెనన్న అనవచ్చునేమో కాని ఆంధ్రజాతి యంతయు నంతరించెననుటకు వీరికిగలయాధారములేవో తెలియరాకున్నవి. ప్రత్యక్షముగ ఆంధ్రజాతి యిపుడుండగా సాతవాహనులును ఆంధ్రులును ఒకరని నిర్వివాదముగ నంగీకరించువీరు ఆంధ్ర జాతి యంతరించెననిచెప్పుట విపరీతముగ కనబడకమానదు. అయితే ఇట్లుచెప్పుటలోఇప్పటి యాంధ్రజాతియు, పూర్వపు ఆంధ్రజాతియు ఒక్కటికాదని వీరియుద్దేశమనుట స్పష్టము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూర్వపు ఆంధ్రులును, ఇప్పటి ఆంధ్రులును ఒక్కరు కారనుటకు వీరు చూపిన ప్రమాణములు బలమైనవి కావు. బలిష్ఠములైన కారణములున్ననే కాని పూర్వపుఆంధ్రులును,ఇప్పటి ఆంధ్రులును ఒక్కరు కారని యనజాలము. అంతేకాక ఆంధ్ర రాజవంశమును, ఆంధ్రజాతియు అంతరించెనని వారనుచో ఆంధ్రరాజ వంశమే ఆంధ్రజాతియనియు, ఆంధ్రరాజ వంశము మినహాగా ఆంధ్రజాతియే లేదనియువారు చెప్పవలసి యుండును. ఇందుకైనను వారు ప్రమాణములు చూపవలసి యుండును.తగిన బలిష్ఠ ప్రమాణములులేనిదే ఆంధ్రజాతి యంతరించెనను వీరి సిద్ధాంతము అంగీకార్యము కాజాలదు.

ఈ పైప్రమాణములనుబట్టియు, కారణములనుబట్టియు ఇంతకంటెబలిష్ఠములైన వ్యతిరేక ప్రమాణము లున్ననే తప్ప సాతవాహనులును ఆంధ్రులును ఒక్కరేయని నిశ్చయించుకొనవచ్చును.

సాతవాహనులును, ఆంధ్రులును ఒక్కరని మనము నిశ్చయించుకొనుటచేత ఆంధ్ర రాజుల కాలనిర్ణయ చరిత్రాదుల కొఱకు—సాతవాహనులశాసనములేకాని ఆంధ్రరాజుల శాసనములు ఏవియుకాన్పింపలేదు కావున—సాతవాహనవంశజుల శాసనములనే పరిశీలింపవలెను.

సాతవాహనవంశజుల శాసనము లెచ్చటచ్చట నున్నదియు ఈవఱకే తెలుపబడినది. ఆ శాసనములలో సాతవాహనరాజుల రాజ్యసంవత్సరములే కాని శకవర్షములు తెలుపబడియుండలేదు. సాతవాహనరాజుల రాజ్య సంవత్సరములు తెలిసినంతమాత్రమున వారి కాలమును శకవర్ష పరిగణనమున గాని, క్రీస్తుశక పరిగణనమున గాని నిర్ణయించుటకువీలులేదు. అందువలన సాతవాహనవంశమునందలిఅనగా ఆంధ్రవంశము నందలి ఆయారాజులు — శకవర్ష పరిగణనమునగాని, క్రీస్తుశకపరిగణనమున గాని — ఎప్పటినుండి ఎప్పటివఱకుపరిపాలించిరో వారికిసమకాలీన శాసనములను బట్టియైన నిర్ణయించుటకు వీలుకలుగునేమో ఇక చూడవలసి యున్నది.

యవన, శక, పహ్లవులు

సాతవాహనరాజుల శాసనముల ననుసరించి వారియొక్క (అనగా ఆంధ్ర రాజుల యొక్క) కాలమును నిర్ణయించుటకు వీలు లేదని తెలుటచేత వారికి సమకాలీనులైనవారి శాసనములవలననైనను ఈకాలనిర్ణయ సమస్యాపరిష్కారమునకు మార్గ మేర్పడునేమో చూతము. సాతవాహనుల శాసనముల ననుసరించియే వారికి సమకాలీనులైనవారిని నిర్ణయించినచో నది ప్రామాణికముగనుండగలదు.

శాసనములవలన దెలియవచ్చు సాతవాహనరాజులలో మొదటి మువ్వురును స్వయముగ వేయించిన శాసనము లింతవఱకు గానరాలేదు. సాతవాహన ప్రభువులు స్వయముగ వేయించిన శాసనములు గౌతమీపుత్రుని నుండియే కనబడుచున్నవి. కాని గౌతమీపుత్రుని శాసనములలో సాతవాహనేతరములైన తెగలేవియు పేర్కొనబడియుండలేదు. అందువలన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శాతవాహనులకు సమకాలీను లెవ్వరను విష
యమును దెలిసికొనుటకు గౌతమీపుత్ర శాస
నములు మన కుపకరింపవు.

గౌతమీపుత్ర శాతకర్ణి శాసనముల తరు
వాత మనకు లభ్యము లగునవి వాసిష్ఠీపుత్ర
శ్రీ పుళుమావి శాసనములు. ఈ పుళుమావి
యొక్క పందొమ్మిదవ రాజ్య సంవత్సరము
నాటి నాసికగుహాశాసనమున గౌతమీపుత్రుడు
యవన, శక, పహ్లవులను నాశము గావించె
ననియు, ఖఖరాత వంశమును నిర్మూలము
గావించెననియు దెలుపబడి యున్నది. ఇందు
వలన యవన, శక, పహ్లవులును, ఖఖరాతు
లును శాతవాహనులకు సమకాలీనులని నిస్సం
శయముగ నుడువవచ్చును. ప్రాకృత భాషలో
ఖఖరాత వంశ మను పేరం బరగు దానికే
సంస్కృతమున క్షహరాతవంశ మని పేరు.
అందుచేత యవన, శక,పహ్లవులయొక్కయు,
క్షహరాతుల యొక్కయు చరిత్రమును బరి
శోధించినయెడల ఆంధ్రరాజుల కాలనిర్ణయ
సమస్యను పరిష్కరించుటకు కీలకము దొరకు
నేమో చూడవలసి యున్నది.

మనహిందూవాఙ్మయమున అలెగ్జాండరు
మొదలగు గ్రీసుదేశీయులకు యవనులనిపేరు.
అలెగ్జాండరు హిందూదేశముపై దండెత్తివచ్చి
సింధు, పంజాబు ప్రాంతములను జయించుట
హిందూదేశ చరిత్రపాఠకులకు దెలియని విష
యము కాదు. అలెగ్జాండరు చనిపోయినపిదప
అతని ప్రాగ్దేశరాజ్య మంతయు అతని సేనా
నాయకులైన యవనముఖ్యుల వశమున నుం
డెను. మౌర్యచంద్రగుప్తుడు సింధు, పంజాబు
ప్రాంతముల నేలుచుండిన యవనులను జయించి
స్వరాజ్యమునుస్థాపించినప్పటికి మౌర్యసామ్రా
జ్యము పతనము నొందినపిదప దానికిఉత్తరపు
సరిహద్దులను, వాయవ్యపు సరిహద్దులను
ఉండిన బాక్ట్రియా, పార్థియా దేశములనుండి
హిందూదేశముపై మరల గొన్ని దండ
యాత్రలు జరిగెను.

హిందూదేశమునకు వాయవ్య మూల
నున్న 'హిందూకుష్' పర్వతముల యొక్క
ఉత్తరపు 'సాలోపు'లకును మధ్యఆసియాలోని
ఇప్పుడు 'ఆమూడేరియా' యనబడు 'ఆక్ససు'
నదికిని మధ్యగల ప్రదేశమునకే,అనగా'ఆక్సస్'
నది ఉత్తరపు సరిహద్దుగాగల ఉత్తర ఆఫ్ఘన్
స్థాన దేశమునకు బాక్ట్రియా యని పేరు. ఈ
దేశమును అలెగ్జాండరు చనిపోయిన పిదప
'యూథిడిమస్' అను యవనవీరుని వంశము
వారు పాలించిరి. 'యూథిడిమస్' కుమారు
డైన 'డెమిట్రియస్' చాలసమర్థుడైన మహా
వీరుడు. ఇతడు బాక్ట్రియానుండి పడమటి పం
జాబు, సింధుప్రాంతము వరకు జయించి కొంత
కాలము హిందూదేశములోని భాగములను
గూడ బరిపాలించెను. ఇవతలహిందూదేశభాగ
ముల నాతడు జయించుచుండగా ఆతనికి ప్రతి
స్పర్థియైన 'యూక్రిటైడీస్' అను మరియొక
యవనవీరుడు బాక్ట్రియా సింహాసనమునకై
కలహించి తుద కారాజ్యమును గైవసముచేసి
కొనెను. అప్పటినుండి 'యూథిడిమస్'వంశము
వారు తాము జయించిన హిందూదేశ భాగ
ములనే పరిపాలించుచువచ్చిరి. కొంతకాలము
నకుదరువాత 'యూక్రిటైడీస్' వంశమువారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'యూథిడిమస్' వంశమువారినిజయించి,అంతే గాక వారు పరిపాలించు చుండిన పశ్చిమ పంజాబు ప్రాంతములను బాక్ట్రియా దేశమును గూడ పరిపాలించిరి. వీరలెల్లరును యవనులే. ఈయవనుల పరిపాలనము ఒక్క హిందూదేశ వాయవ్య ప్రదేశముననే కాక భరుకచ్ఛ (Broach), మాళవ, సౌరాష్ట్రాది పశ్చిమ హిందూదేశప్రాంతముల కూడ సాగుచుండె ననుటకు నిదర్శనములు కలవు: (౧) అశోక చక్రవర్తిక్రింద సౌరాష్ట్రమున కధిపతిగ నుండిన యతేషు యవనుడని తెలియుచున్నది. (౨) పారసీక సింధుశాఖ నుండి హిందూదేశము యొక్క పశ్చిమతీరమునకు అనగాభరుకచ్ఛము సౌరాష్ట్రము, కొంకణము మొదలగు దేశములకు సముద్రప్రయాణముచేయు గ్రీసుదేశవర్తకుల కుపయోగకరముగ నుండునట్లు అచ్చటి రేవుపట్టణములు, అచ్చటి పరిశ్రమలు, ఎగుమతి దిగుమతి వ్యాపారము—ఈ మొదలగు వాటిని గురించి తెలుపు 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సి' అనుగ్రంథమున గ్రీకుఅక్షరములతో 'అపోలోడోటస్', 'మినాండర్' (మిళిందుడు)ల పేర ముద్రింపబడిన నాణెములు భరుకచ్ఛము రేవుపట్టణములో చెలామణి యగు చుండెనని తెలుపబడి యున్నది. 'అపోలోడోటస్,మినాండరు'లు'యూథిడిమస్' వంశజులు: 'డెమిట్రియస్' తరువాతివారలు. వారి యధికారము భరుకచ్ఛమున సాగుచుండక పోయినచో వారి నాణెము లచ్చట చెలామణి కానేరవు. అందువలన యవనులయధికారము పశ్చిమ హిందూదేశమునందు కూడ సాగుచుండినట్లు నిర్ణయింపవీలగుచున్నది. (౩) కాళిదాసవిరచితమైన చారిత్రకనాటకమగు మాళవికాగ్నిమిత్రమున శుంగవంశకర్తయైన పుష్యమిత్రుని మనుమడగు వసుమిత్రుని సేనానాయకత్వమున నడపింపబడిన సైన్యములకును,యవనులకును మధ్యహిందూదేశమున నెచ్చటనో యొకచోట పోరాటము సంభవించినట్లు తెలుపబడి యున్నది. ఈ విషయము ననుసరించి కూడ యవనులు ఒక్క పశ్చిమపంజాబుప్రాంతముననేకాకమధ్యహిందూదేశమునగూడనుండినట్లు తెలియు చున్నది. ఇట్లే 'గార్గిసంహిత' యను జ్యోతిశ్శాస్త్రము ననుసరించియు యవనులు మధ్య హిందూదేశమున పాటలీపుత్రము (Patna)వఱకు వ్యాపించిరని విశదమగును. ఈ విధములైన ప్రమాణములనుబట్టి యవనులు పశ్చిమపంజాబుప్రాంతములను మాత్రమేకాక మధ్యహిందూదేశమునను, భరుకచ్ఛ సౌరాష్ట్రాదిహిందూదేశపశ్చిమతీరస్థదేశము లందును గూడ నుండిరని సిద్ధాంత మగుచున్నది. ఇంతకంటె వారినిగుఱించి మన కేమియు దెలియరాదు. సాతవాహనవంశజుడైన గౌతమీపుత్రసాతకర్ణి నాశము చేసిన యవనులు హిందూదేశ పశ్చిమతీరస్థ దేశవాసులును, మధ్యహిందూదేశ వాసులునై యుందురు. కాని మధ్యహిందూదేశమునగాని, హిందూదేశ పశ్చిమతీరస్థ దేశములందు కాని పరిపాలనము నెఱపిన యవనప్రభువులను గుఱించి మన కేమియు దెలియరానందున యవనచారిత్రమునుబట్టి ఆంధ్రరాజుల కాలమును నిర్ణయించుటకు మనకు సాధ్యము కాదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అందువలన నిక శకపహ్లావులను గుఱించి విచారింతము.

శకులనబడు తెగవారు మొదట నొక చోట స్థిరముగ నివసింపక దేశముల వెంట ద్రిమ్మరుచుండిరి. కాలక్రమమున వారు పారసీక దేశము(Persia)నకును, హిందూ దేశమునకును నడుమనుండిన 'ద్రాంగియానా' రాష్ట్రమున కుదురుకొని యచ్చటనే స్థిరపడిరి. శకులయొక్క స్థిరనివాసస్థాన మగుటవలన నారాష్ట్రమునకు కాలక్రమమున 'శకస్థాన' మనుపేరు కలిగెను. దీనినే యిప్పుడు 'సెయిస్థాన్' అందురు. పార్థియా దేశవాసులకే 'పహ్లావు'లని పేరు. మధ్యఆసియాఖండమునందు గలిగిన ఈశకుల 'అవాంతరము' మూలమున బాక్ట్రియా దేశపు యవనరాజ్య మంతయు విధ్వస్తమయ్యెను. పార్థియా దేశపు రాజులు మిత్రదత్తులు-ఈశకవాహిని నడ్డగించుటకు ప్రబల ప్రయత్నములు కావించిరి కాని వారు శకస్థానమునుండి శకులను తలుమగొట్టుటకు మాత్రము సమర్థులు కాజాలరైరి. శకులు పార్థియాసామ్రాజ్యముననే స్థిరపడిపోవుటవలన కాలక్రమమున శకపహ్లావు లిరువురికిని అన్యోన్యసంబంధము హెచ్చెను. యవనుల పిదప హిందూ దేశముపై దండెత్తివచ్చినవారు ఈశకపహ్లావులే.

శకులు పశ్చిమపంజాబు సింధుదేశములపై దాడివెడలి, అంతవఱ కాప్రాంతమును పాలించుచుండిన యవనరాజ వంశజుల నణచి, యచ్చట దమ రాజ్యమును స్థాపించిరి. వీరు పశ్చిమపంజాబు సింధుప్రాంతముల అలెగ్జాండరు నాటినుండి సాగుచుండిన పరిపాలన విధానమునే యవలంబించి, తాముజయించిన ప్రదేశములకు దమకు మాఱుగ ప్రతినిధులను నియమించి, పరిపాలింప దొడంగిరి. ఈ ప్రతినిధులకే 'క్షత్రపు'లని పేరు.

క్షత్రపులు

కొంత క్షేత్రమును (ప్రదేశమును) పరిరక్షించువాడని యర్థమిచ్చు 'క్షత్రపావన'పదమునకు 'క్షత్రప' పదము రూపాంతరము. అసలు మొదట 'మహారాజరాజ'బిరుదమును వహించుచు వచ్చిన పార్థియాదేశపు రాజుల ప్రతినిధులకే 'క్షత్రప' బిరుదము చెల్లుచుండెడిది. తరువాత శకరాజ ప్రతినిధులు కూడ నీబిరుదమును వహించుచువచ్చిరి. అందువలన శకరాజ్యమునుగాని, పహ్లావ రాజ్యమునుగాని తెలిసికొనుటకీ'క్షత్రప' బిరుదము నొకసాధనముగ మనము గ్రహింప నచ్చును. 'క్షత్రప' బిరుదమునలెనే 'మహాక్షత్రప'బిరుదముకూడ గలదు. పదవియందును, స్వాతంత్ర్యాధి కారములయందును క్షత్రపులకంటె మహాక్షత్రపులు ఎక్కువవారు. ఆయా రాష్ట్రములలో 'క్షత్రప' వంశపరిపాలనము స్థిరపడిన పిదప మహాక్షత్రప, క్షత్రపు లిరువురును గలిసి ఏకకాలమున పరిపాలనచేయుచుండినట్లు శాసనముల ననుసరించి తెలియనగును. అట్టి సందర్భములలో మహాక్షత్రపుని అసలురాజుగను, క్షత్రపుని యువరాజుగను మనము గ్రహింపవచ్చును. ఇట్లు యవన, శకపహ్లావ ప్రతినిధులు మాత్రమే మొదట ఈ క్షత్రపబిరుదమును వహించుచు వచ్చినను వారివంశముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వారు కాలక్రమమున తమపై మహారాజుల యధికారమును ద్రోసిపుచ్చి దాము స్వతంత్రులైనప్పుడుకూడ నీ క్షత్రప, మహాక్షత్రప బిరుదములను వహించుచునేయుండిరి.

హిందూదేశచరిత్రజ్ఞులకు దెలియవచ్చిన క్షత్రపవంశము లింతవఱకు మూడు కలవు. (౧) కపిశాక్షత్రపవంశము. శకులు గాంధార దేశమును జయించిన పిదప కపిశానగరమును రాజధాని గావించుకొని యాదేశమును క్షత్రపులు పాలించిరి. ఆఫ్ఘనిస్థానములోని కందహార (Kandahar) రాష్ట్రమే పూర్వపు గాంధారదేశమని పురాతత్త్వవిదులు గుర్తించి యున్నారు. (౨) తక్షశిల రాజధాని చేసికొని పాలించిన క్షత్రపవంశము (3) మథురానగరము రాజధాని చేసికొని పాలించిన క్షత్రపవంశము. ఈ క్షత్రపవంశములు మూడును ఉత్తరహిందూదేశమును బరిపాలనము నెఱపినవే.

ఇట్టి క్షత్రిపవంశములు ఉత్తర హిందూదేశముననేకాక పశ్చిమ హిందూదేశమున మాళవసౌరాష్ట్రప్రాంతముల బరిపాలించుచుండినవికూడ కొన్ని యుండినట్లు తెలియవచ్చుచున్నది. పశ్చిమహిందూదేశమును పాలించిన యాక్షత్రపులుకూడ అసలు ఉత్తర హిందూదేశీయులే యనుటకు గొన్ని నిదర్శనములు కలవు. వీరి మొదటి నాణెములమీది పేర్లు 'ఖరోష్ఠి' లిపిలో నున్నవి. ఈలిపి యిదివఱలో దెలిపినట్లు, సాధారణముగ ఆఫ్ఘనిస్థానములోని తూర్పుభాగముననను, పంజాబులోని యుత్తరభాగముననను వాడుకలో నుండెను. పశ్చిమక్షత్రపరాజ్యములైన మాళవ, సౌరాష్ట్రాది దేశములలో సాధారణముగ బ్రాహ్మిలిపిలోని శాసనములేకాని ఖరోష్ఠిలిపిలోని శాసనములు కానరావు. పశ్చిమక్షత్రప దేశములలో అశోకచక్రవర్తినాటినుండియు వాడుకలోనుండినలిపి బ్రాహ్మీలిపియే. అందువలన పశ్చిమక్షత్రపులుతమమొదటినాణెములమీద పేర్లు వ్రాయుట కుపయోగించినఖరోష్ఠీలిపి విదేశీయమనుట స్పష్టము. ఆలిపి పంజాబు ప్రాంతముల దని నిశ్చయముగ మనకు దెలియవచ్చుటచేత దానిని తమ నాణెములమీద వాడిన పశ్చిమక్షత్రపులు అసలు ఉత్తర హిందూదేశీయులైయుందు రని నిశ్చయించుట యుక్తము కాకపోదు. వీరు ఉత్తరహిందూదేశీయు లనుటకు మఱియొక ప్రమాణము కూడ గలదు. ప్రద్యుమ్నసూరి యను జైనపండితుడు రచియించిన 'ప్రభావకచరిత' మను జైనగ్రంథముపలన ఈపశ్చిమక్షత్రపులు అసలు ఉత్తర హిందూదేశమున నుండినవారనియు, 'కాలకసూరి' యను జైనమతాచార్యుని ప్రోత్సాహప్రోద్బలములవలన వారు పశ్చిమ హిందూదేశమునకు వచ్చిరనియు దెలియుచున్నది. ఈవిషయమంతయు ప్రభావకచరితములోని 'కాలకసూరి ప్రబంధ'మను నాలుగవ యధ్యాయమునకనుసరించి తెలియుచున్నది. అందలికథ యిది:

"శ్రీధరావాసమని యొకనగరముకలదు. అందు వీరసింహుడను పేరుగల పరాక్రమవంతుడైన రాజొకడుండెను. ఆతనిభార్య పేరు సురసుందరి. ఆదంపతులకు వరికి నొకకొడుకు, నొకకూతురు కలిగిరి. కొడుకుపేరు కాలకుడు: కూతురిపేరు సరస్వతి. కాలకుడొకప్పుడు వనమునుదాటి తనగుఱ్ఱముమీద స్వారివెడలి యచ్చట ఆనే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆకస్మిక ఛాయాచిత్రములు (Snap shots)



తుంగభద్రలో నీదులాట

శ్రీ జి. తిమ్మారెడ్డిగారు, గుంటకల్లు. (మొదటిబహుమానము)



బండ్లపై శ్రీశైలపర్వత ప్రయాణము

సి. బసవరాజు అండు సన్సు, కాకినాడ. (మూడవబహుమానము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



వనభోజనము

శ్రీ అయ్యగారి సూర్యనారాయణమూర్తిగారు, కాకినాడ. (రెండవబహుమానము)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ఆకస్మిక ఛాయాచిత్రములు (Snap shots)



శ్రీశైలదేవాలయము

సి. బసవరాజు అండు సన్సు, కాకినాడ.



శ్రీశైలక్షేత్రమునకు ౫-౬ మైళ్లదూరములోనున్న పాతాళగంగ

సి. బసవరాజు అండు సన్సు, కాకినాడ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



భీమునికొలను, శ్రీశైలము

సి. బసవరాజు అండు సన్సు, కాకినాడ.



మార్కాపురమునుండి శ్రీశైలమునకు వెళ్లు దారిలో శిఖరేశ్వరమునకు సమీపమున

మేకలబండవద్ద చెంచుఘాటు

సి. బసవరాజు అండు సన్సు, కాకినాడ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గరుల దానిని నడిపించెను. తుదకాలేదమును, సుబ్బముగూడ అలసటనొందుటచేత సుబ్బమునొకచెట్టునకు గట్టివైచి యాలేదు విశ్రాంతిదీసికొనుచు నొకచోటగూర్చుండెను. ఇంతలో నా ప్రాంతముల నరణ్యమధ్యమున దనకు అనతి దూరమున ఎవరో మాటాడుచున్న ధ్వనియాతనికి వినవచ్చెను. తోడనే అదియేదో కనుగొనిరావలసినదని కాలకుడు తనమంత్రిని బంపగా ఆతడు ధ్వని వినవచ్చినచోటు ననుసరించి వెళ్లిచూచివచ్చి, గుణాకరుడను జైనమతాచార్యుడొకడు మతబోధగావించుచున్నాడని యాతనికి నివేదించెను. కాలకు డందుమీదట నచటికివెళ్లి జైనమతసిద్ధాంతములనుగుఱించియు, తత్త్వమునుగుఱించియు బోధించుచున్న గుణాకరాచార్యులం గాంచి, యాతని ప్రసంగమును శ్రద్ధతో నాలకించి, జైనమతమునందభిమానాభినివేశములుకలవాడై, నగరికిమఱలివచ్చి, తలిదండ్రులయనుమతి గైకొని, తనసోదరితోగూడ జైనమతము నవలంబించి, తాను జైనసన్న్యాసియయ్యెను. గుణాకరాచార్యుడు సిద్ధిపొందినయనంతరము కాలకు డాతనిపీఠము నధిష్ఠించి మతబోధగావింపజొచ్చెను.

"కాలకాచార్యు డొకప్పుడు ఉజ్జయినికివెళ్లెను. అప్పుడానగరమును గర్దభిలుడనురాజు పాలించుచుండెను. కాలకాచార్యుడును, అతనిసోదరియు ఉజ్జయినీనగరబహిరంగణమున నుండినప్పుడు రాజన్నటనుండుటతటస్థించెను. గర్దభిలుడు కాలకునిసోదరియైన సరస్వతిని జూచి మోహముగ్ధుడై యామెనెత్తికొనిపోయెను. కాలకాచార్యుడు తనతోవచ్చిన జైనసన్న్యాసినుల మూలమున జరిగినయావృత్తాంతమును విని గర్దభిలుని కొలువుకూటమునకరిగి యారాజుతో నిట్లనియె:

'ఓ శైవరాజా! మా కష్టము యొక్క ఫలములను గాపాడుటకై దానిచుట్టు మేమొక కంచెవలె నేర్పడి యున్నమాటనిజమే; కాని యన్ని జాతులవారిమతములను గాపాడవలసిననీవే యాఫలములనెత్తికొనిపోయి భుజియింపబూనుకొనినచో మేమిక నెవరితో మొఱపెట్టుకొందుము?'

"మనోన్మత్తుడైన యారాజు కాలకాచార్యునిమొఱాలింపక పెడచెవినిబెట్టెను. కాలకుని రక్తనాళములలో క్షత్రియరక్తము ప్రవహించుచుండుటచేత అప్పుడాతడు తీవ్రమైన క్రోధమును వహించి, భార్యలతోను, పుత్త్రులతోను, బంధువులతోను, పరివారముతోను రాజును తాను చంపక పోయినయెడల మానవలోకమునంతను హత్యచేసినందువలన గలుగు మహాఘోరపాతకము నొడిగట్టుకొనినవాడ నగుదునని ఘోరశపథమును గైకొనెను. భూభారమును దనభుజాస్కంధములవహించి, నిరంకుశాధికారమును నెఱపుచు బరిపాలనముచేయు పరాక్రమవంతుడైన యారాజుమూలమునను, ఆతని కనువర్తులైన ప్రజలమూలమునను ఆసన్న్యాసి యట్లు శపథముగావించుట జూచి యందఱు నాతనిని పిచ్చివానిగ భావించిరి. శపథముగైకొనిన యనంతరము కాలకాచార్యుడు తన సోదరికై కుందుచు సింధునదీతీరమున నున్న శకదేశముల కరిగెను.

"అచ్చట ౯౬ శకసంస్థానములు కలవు. వారందఱిపై నధికారము నెఱపుచు ఏడు లక్షలగుఱ్ఱపుదళముతో మండలికు డొకడుండెను. కాలకసూరి యాతనిని సందర్శించి తన వృత్తాంతమునంతయు నాతనికి విన్నవించి, గర్దభిలునిపై పగదీర్చుకొనుటలో దనకు సాయము చేయవలసినదని యాతనిని వేడికొనెను. మండలికు డాతని వేడికోలు నంగీకరించి కాలకాచార్యుని సోదరియైన సరస్వతిని గర్దభిలుని చెఱనుండి విడిపించుటకై తన తొంబది యాఱుగురు సామంతులను ఆ యుజ్జయినీ నగరాధిపతిపై బంపెను. ఆసామంతవీరులందఱు గర్దభిలుని రాజధానిని ముట్టడించి, యాతనిని జీవగ్రాహముగ బట్టుకొని, తుదకు కాలకసూరిసోదరి సరస్వతిని చెఱవిడిపించిరి.

"కాలకసూరి కోరిక ననుసరించి శకసామంతులు గర్దభిలుని చంపకుండ వదలిపెట్టిరి కాని యాతనిరాజ్యమునంతనుపరిగ్రహించి యాతనిని స్వదేశబహిష్కృతునిం గావించిరి. పిదప నాసామంతులు గర్దభిలరాజ్యమును దమలో దామ పంచుకొనిరి. సరస్వతి తిరిగి జైనసన్న్యాసినులలో జేర్చుకొనబడెను."

ఈ ప్రభావక చరితము క్రీస్తుశకము ౧౨౭౮ లో రచియింపబడెను. క్రీస్తుశకము ఎనిమిది తొమ్మిది శతాబ్దులలో జరిగిన వని మనకు నిశ్చయముగ దెలిసిన విషయములు

4. 5- 14
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కూడ ఇందు పొందుపఱుపబడి యుండుటచేత ఈకథయొక్క సత్యాసత్యములను గుఱించి కొంతసందేహము కలుగుట సహజము: అయినను ఇది ౧౨౭౮ వఱకు జైనసంఘమున తరతరములనుండి పరంపరగ వచ్చుచుండిన గాథయనిమాత్రము నిశ్చయింపవచ్చును. ఎట్లయినను ఉజ్జయినికి శకులు ఎట్లు వచ్చినదియు వెలుపుగాథ యగుటచే దీని సత్యత్వాసత్యత్వములను గుఱించి కొంతశ్రద్ధతో విమర్శింపదగును.

పశ్చిమహిందూదేశమున బరిపాలనము సలిపిన క్షత్రపవంశములు ఇంతవఱకు రెండు తెలియవచ్చుచున్నవి: (౧) క్షహరాతవంశము (౨) చాష్టనవంశము. ఈరెండును శకవంశములే యని చాలమంది యభిప్రాయము. కాని కొందఱుమాత్రము క్షహరాతవంశము పహ్లవవంశమనియు, చాష్టనవంశమేశకవంశ మనియు చెప్పుదురు. ఎట్లయినను వీరందఱును క్షత్రపులే. క్షహరాతులుకూడ శకవంశజులేయైన యెడల వారు శకులలోని యొకశాఖవారై యుందురు.

సాతవాహనవంశజుడగు (శ్రీ) గౌతమీపుత్రసాతకర్ణికి సమకాలీనమైనట్టియు, ఆతని చేత ఉన్మూలింపబడినట్టియు క్షహరాత (ఖఖరాత)వంశము తెలియవచ్చినను ఆవంశములోని రాజులనుగుఱించి మనకు దెలిసినదే కాని గౌతమీపుత్రునియొక్క, తద్ద్వారమున సాతవాహన (ఆంధ్ర) రాజులయొక్క కాలమును నిర్ణయింప వీలుపడదు. అందువలన క్షహరాతవంశనృపతులను గుఱించి యించుక తెలిసికొందము.

క్షహరాతవంశమున ఇంతవఱకు చరిత్రకారులకు దెలియవచ్చిన నృపాలురు ఇరువురు మాత్రమే కలరు. వారెవ్వరన (౧) భూమకుడు (౨) నహపానుడు. వీరిరువురు తప్ప ఇతరు లెవ్వరును దెలియరాలేదు. వీరిరువురిలోనైనను నహపానుని శాసనములుమాత్రమే కనబడుచున్నవి కాని భూమకుని శాసనములింతవఱ కేవియు గానరాలేదు. భూమకునివి నాణెములు మాత్రమే దొరకినవి. క్షహరాతవంశమున భూమకుడను రాజొకడు కలడని తెలియవచ్చినది ఈ నాణెములను బట్టియే. భూమకునికి సంబంధించిన వింతవఱకు రాగి నాణెములు మాత్రమే దొరకినవి. నహపానునివి రాగినాణెములును, వెండినాణెములును గూడ దొరకినవి. ఉత్తరమహారాష్ట్రదేశమునందలి నాసికమండలములోని 'జొగల్ తెంబి' గ్రామము దగ్గఱ ౧౯౦౬ లో పెద్ద నిక్షేపమొకటి దొరకినది. అందు ౧౩,౨౫౦ వెండి నాణెములు కనబడినవి. వాటిమీది ముద్రలను బట్టియు, పేర్లనుబట్టియు అవి నహపానుని యొక్కయు, గౌతమీపుత్ర సాతకర్ణి యొక్కయు నాణెములని తెలియవచ్చినది. నహపానుని నాణెములమీద ఒకవైపున ఇప్పటిరూపాయనాణెముమీద రాజు తల యున్నట్లే రాజు తలయును, గ్రీకు అక్షరములతో రాజుపేరును, రెండవవైపున అధోముఖముగా నున్న బాణమును, వజ్రమును, దానికి నడుమ నొకగుండును, చుట్టును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'ఖరోష్ఠి'లిపిలోను, 'బ్రాహ్మి'లిపిలోను రాజు పేరును కలవు. గ్రీకు, ఖరోష్ఠి, బ్రాహ్మిలిపు టనుసూచించుననియు, వారు పాలించిన ప్రదేశముస బ్రాహ్మిలిపియే వాడుకలో నుండుటచేత



నహపానుని నాణెములు

నాణెముల మీద వారి పేర్లు బ్రాహ్మి లిపిలో నుండుట కూడ దటస్థించెనని యు ఊహింపవచ్చును. 'జొగల్ తెంబి' నిక్షేపము దొరకనంతవఱకు నహపానుని వెండినాణెములు అరుదుగనుండెడివి.

పైనుడివిననాణెములలో గౌతమీపుత్త్ర సాతకర్ణివికూడ కలవని యీవఱకే తెలుపబడినది. ఇట్టి నాణెములు ౯౨౭౦ వఱకు గలవు. వీటి అన్నిటిమీద గౌతమీపుత్త్రుని పేరు బ్రాహ్మిలిపిలలో నున్న పేరు సహపానునిది యగుటచేత (-అతడు స్వతంత్రముగనే పాలించుచుండిన యెడల-) రాజుతలప్రాయికముగ నహపానునిదే యైయుండునేమో యని యూహింపవచ్చును. యవనులు పాలించినచోటనే వారి తరువాత క్షహరాతవంశజులు రాజ్యమేలుటచేత వారు

లో వ్రాయబడియున్నది. వాటిమీద ఒకవైపున ఖండవృత్తాకారముగల మూడుతోరణములతో నున్న చైత్యమును, ఒక్కొక్క తోరణము నడుమ నొక్కొక్క గుండును, చైత్యముదిగువ తరంగమువలె ఎగుడుదిగుడులుగ నున్న



యవనుల నాణెముల పద్ధతినే యనుకరించి రాజుతల ముద్రించి, గ్రీకులిపిలోకూడ దమపేర్లు వ్రాసికొనెడు వారనియు, ఖరోష్ఠిలిపివా రసలు పశ్చిమ పంజాబుప్రాంతస్థులను



గౌతమీపుత్త్రుని ముద్రపడిన నహపానునినాణెములు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీట్లును, 'రాజ్ఞో గౌతమీపుతస సిరిసాతకణీస' అని పేరును, రెండవవైపు 'ఉజ్జయినీచిహ్నము'ను*, దానిపై అర్ధచంద్రరేఖయును, 'ఉజ్జయినీచిహ్నము' నడుమ గుండును గలవు.

గౌతమీపుత్త్రునియొక్క నాణెములన్నిటి మీదను రెండుమూడులు ముద్రలు పడినట్లు కనబడును. స్పష్టముగ గనబడునదియే గౌతమీపుత్త్రుని ముద్ర. ఆ నాణెముల మీద అదివఱకే యున్న యొకముద్రమీద మఱల గౌతమీపుత్త్రుడు తనముద్ర కొట్టించినట్లు తెలియవచ్చును. గౌతమీపుత్త్రుని యా నాణెముల నన్నిటిని జాగ్రత్తగ బరిశీలించినచో అదివఱకుండిన ముద్ర నహపానునిదిగ గానవచ్చును. వాటిమీద నహపానుని తలయు, అతని నాణెములమీది చిహ్నములును, అతనిపేరు అక్షరములును కూడ కొన్ని చెడిపోయియు, కొన్ని అస్పష్టముగ నుండియు, అరిగిపోయియు కానవచ్చుచున్నవి. ఈకారణముల ననుసరించి గౌతమీపుత్త్రుడు క్షహరాతవంశజుడైన నహపానుని తరువాతివాడనియు, నహపానుడు పాలించుచుండిన దేశమును జయించి స్వాధీనపఱచుకొని దానిని తనరాజ్యమున జేర్చుకొనినప్పుడు అక్కడ చెలామణిలోనుండు నాణెముల నన్నిటిని సంగ్రహించి వాటిని కరగించకుండ వాటిమీదనే మఱల దనముద్ర కొట్టించెననియు నిస్సంశయముగ సిద్ధాంతము చేయవచ్చును. గౌతమీపుత్త్రుడు క్షహరాతవంశమునునిర్మూలించెనని సాతవాహనుల శాసనములుకూడ సాక్ష్యమిచ్చుచుండుటచేత పైని తేల్చిన సిద్ధాంతము సరియైనదే యని స్థిరపడుచున్నది. క్షహరాతవంశజుడైన నహపానుని నాణెముల మీదనే గౌతమీపుత్త్రునిముద్ర లుండుటచేత అతడు ప్రాయికముగ నహపానుని కాని, అట్లు కాకపోయినచో ఒకవేళ నహపానునినాణెములనే చెలామణీచేయుచుండిన నహపానవంశజులను

---

* నిలువుగ నొకగీటుగీసి దానినడుమ అడ్డముగ నొకగీటుగీసి నాలుగువైపుల నాగీట్లచివర వాటినంటి సున్నలుచుట్టిన నేర్పడు ఆకృతికే (౦+౦) 'ఉజ్జయినీచిహ్న' మని పేరు. ఉజ్జయిని రాజధానిగాగల అవంతి (పశ్చిమ మాళవ) దేశమున ఈ చిహ్నముగల నాణెములు మొదట ఎక్కువగ దొరకుటచేత వాటిమీది ఈవిధమైన చిహ్నమునకు సర్. ఏ. కన్నింగ్‌హాము దొరగారు 'ఉజ్జయినీ చిహ్న' మని పేరిడిరి. కాని ఈపేరుమాత్రము సముచితమైనది కాదని ఎల్లరును అంగీకరించియే యున్నారు. ఏలయన ఇట్టిచిహ్నముగల నాణెములు ఒక్క ఉజ్జయినీప్రాంతముననే కాక ఇటీవల హిందూదేశమునందలి ఇతరప్రాంతములలో గూడ దొరకినవి. అందువల్ల ఈచిహ్నమున కీపేరు ఉచితమైనను కాకపోయినను ప్రాచీనహిందూనాణకపరిశోధకులు దాని నాపేరుతోనే ఇంకను పేర్కొనుచున్నారు. ఇప్పటికిని ఆచిహ్నముయొక్క యర్థమేమో ఎవరికిని తెలియదు. 'ఉజ్జయినీచిహ్న'మును, చైత్యమును ప్రత్యేకము గౌతమీపుత్త్రిసాతకర్ణి నాణెములమీదను, పులుమావి యజ్ఞశ్రీ మొదలగు ఇతర సాతవాహనరాజుల నాణెములమీదను మాత్రమే కానవచ్చుచున్నవి; కాని ఏ యితరవంశపురాజుల నాణెముల మీదను గానరావు. అందువలన 'ఉజ్జయినీచిహ్న' చైత్యములు ప్రత్యేకము సాతవాహనవంశజుల నాణకచిహ్నము లని ప్రాచీననాణకపరిశోధకులు సిద్ధాంతము చేసియున్నారు. ఎచ్చటనైనను ఉజ్జయినీచిహ్న చైత్యములుగల నాణెములు కానవచ్చుచో వాటిమీద వాటిని ముద్రించిన రాజుపేరు బ్రాహ్మీలిపిలోగాని మరియేలిపిలోగాని లేకపోయినను వాటిని సాధారణముగ సాతవాహనుల నాణెములుగనే పరిగణింపవచ్చును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాని జయించియుండుననియూహించుట సమంజసము.

ఈ విధమున సాతవాహన వంశజుడైన గౌతమీపుత్త్ర సాతకర్ణికి సమకాలీనమైన క్షహరాతవంశమే కాక ప్రాయికముగ ఆతని చేత(?)జయింపబడిన యావంశజుడైన నహపానుడు కూడ దెలియవచ్చుటచేత ఆతనికాలమును బట్టి సాతవాహన(ఆంధ్ర)వంశజులైన గౌతమీపుత్త్రాదుల కాలమును నిర్ణయింప వీలుకలదేమో చూడవలసియున్నది.

భూమకుని నాణెములమీదగాని, నహపానుని నాణెములమీద కాని సంవత్సరము లేవియులేవు. కావున వాటికొఱకు ఇంక నహపానుని శాసనములు శోధింపవలసి యుండును.

క్షహరాతవంశనృపాలు రిరువురిలో నహపానుడే కడుబలవంతుడు. నాసిక,జూనాగడము, కార్లీగుహలలో కనబడిన ఈతనికి సంబంధించిన ఎనిమిది శాసనముల ననుసరించి, యీతడు మహారాష్ట్రమునగూడ చాలభాగము నాక్రమించి పరిపాలించినట్లు తెలియుచున్నది. ఈ పైనుడివిన ఎనిమిది శాసనములలో ఏడు నహపానుని యల్లుడును, ఆతనికి లోబడి పరిపాలనము నెఱపినవాడును, శకవంశజుడును అగు ఉషవదాతు(?ఋషభదత్తు)ని దానధర్మములను దెలుపునవియే. ఎనిమిదవ శాసనము నహపానుని అమాత్యుడైన 'అయమ' వ్రాయించినది.

ఈ శాసనములలో సంవత్సరములు గలవు: అనగా, ఆయా శాసనములవలన దెలియవచ్చు దానధర్మము లేయేసంవత్సరములలో జేయబడినవో అది తెలుపబడెను. నాసిక గుహాశాసనములవలన ౪౧, ౪౨, ౪౫ సంవత్సరములును, జూనాగడము శాసనము వలన ౪౬-వ సంవత్సరమును దెలియుచున్నవి. ఇవి యన్నియు క్షహరాత నహపానుని పరిపాలన సంవత్సరములే యనుకొందమన్న అనుకోవచ్చునుగాని చారిత్రమున ౪౬ సంవత్సరముల వఱకు పరిపాలించినరాజులు అరుదుగ కాన్పింతురు. అదియునుగాక వాటిని పరిపాలన సంవత్సరములుగనే భావించినచో మొదటి నలువది సంవత్సరములవఱకు ఒక్కశాసనమైన గాన్పింపకపోవుటయు, అంతటినుండి ఆఱుసంవత్సరములవఱకు మాత్రమే శాసనములు కాన్పించుటయు విపరీతముగ కనబడకపోదు. అందువలన వాటిని పరిపాలన సంవత్సరములుగ గ్రహించుట సముచితముకాదు. కనుక ఈ సంవత్సరములు నహపానుని పట్టాభిషేకకాలమునుండి లెక్కింపబడదగినవని యనజాలము. అట్లయినచో నివి ఏమిటి? ఏపరిగణనము ననుసరించి కైకొనదగినవి?

ఈ విషయమున హైందవచరిత్రకారులలో పెక్కు భేదాభిప్రాయములు కలవు. ఈ సంవత్సరములను గుఱించి తలయొకరు తలయొకరీతిని సిద్ధాంతములు చేసినారు: ఇంకను చేయుచున్నారు. కొందఱు వాటిని విక్రమసంవత్సరము లనిరి: మఱికొందఱు శకవర్షములనిరి: వేఱొకకొందఱు వేఱొకవిధమున దెలి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పిరి. ఎవరెవ రెన్నెన్ని విధముల దెలిపినను తుద కిప్పుడు ప్రధానముగనున్న వాదములు రెండే: అవి విక్రమసంవత్సరములా? శకవర్ష ములా యని. మిగిలినవి పొందికయైన హేతు వాదమున కంతగ సరిపడనందున వాటియంత నవియే రంగభూమినుండి జారిపోవుచున్నవి. అందువలన మన మిప్పు డాలోచింపవలసిన విషయ మిది యొక్కటే: క్షహరాతనహపా నుని శాసనములందలి సంవత్సరములను విక్ర మసంవత్సరములుగ పరిగ్రహింపదగునా? లేక శకవర్షములుగ పరిగ్రహింపదగునా యని. అవి విక్రమసంవత్సరములే యైనయెడల నహపా నుడు క్రీస్తుపూర్వము (౫౮-౪౬)౧౨ సంవ త్సరముల వఱకు పరిపాలించినట్లు ఊహింప వలసి యుండును. ఒకవేళ నవి శకవర్షములే యన్నయెడల అతడు ౪౬-వ శకవర్షమువఱకు అనగా క్రీ. శ. ౧౨౪ వఱకు పాలించినట్లు నిశ్చయింపవలసియుండును. క్షహరాతవంశపు నహపానుడువిక్రమశకపరిగణనమునకైననేమి, శకవర్షపరిగణనమునకైన నేమి ఎప్పటినుండి ఎప్పటివఱకు పరిపాలించెనో నిశ్చయముగ దెలి యవచ్చినచో తద్ద్వారమున సాతవాహన (ఆంధ్ర)రాజుల కాలమును నిర్ణయింప వీలు కలుగవచ్చును.

---

## ప్రార్థన

గూపాటి కొండమాచార్యులు గారు

జలదమా! వేచియున్న దీచాతకంబు
 నిను మనంబున నెంచుచు ననవరతము
 జాగుసేయుట నీబోటిసరసునకును
 బ్రాణదానముఁ జేసి కాపాడు మమ్మ!

గీ. దినకరా! నీదురాకకై దీనయగుచు
 రాత్రిగడపెను పద్మినీ రమణి! యెటులొ!
 జాగుసేయుట నీబోటి సరసునకును
 బాడి గాదిఁక వచ్చికాపాడుమయ్య!

గీ. చంద్ర! చల్లనిచూపులసమ్మదమ్ముఁ
 గూర్తువని నమ్మిగాదె ర్విగోరి యెటులొ
 కలువకన్నియ దినమెల్ల గడపుకొనియె
 రమ్మిఁకను నీవు మిగులహర్షంబుఁగూర్ప!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కొన్ని వరిరకములు

## ౨

గోటేటి జోగిరాజు గారు

### గింజలపరిమాణము, తూనిక, ఆకారము

పైని పేర్కొనబడిన లక్షణములలో గూడ ఆయారకములందు చాల వ్యత్యాసములు గానవచ్చును. పొడవునందు 5.7 మిల్లిమిటరులు * మొదలు 10.8 మిల్లిమిటరులవరకు గల రకములు గలవు. వెడల్పున తారతమ్యము 1.9 మి.మి. మొదలు 3.9 మి.మి. వరకు గలదు. దళము అన్నిరకములకును కొలవలేదు. కాని యిది సామాన్యముగ పొడవును, వెడల్పును బట్టియుండును. అయినను, కొన్నిరకములలో గింజ పొడవునకును, వెడల్పునకును తగినంత దళముగనుండక బల్లపరువుగ నుండును. ఉ. కొబ్బెరపూవుధాన్యము. 1, 2 పట్టికలలో లేకరి చామర్లకోట వ్యవసాయస్థానమునను ఇతరచోట్లను పరీక్షించిన 142 రకముల పొడవు వెడల్పులు చూపబడెను.

పొడవునుబట్టి వరిరకములను 5 తరగతులుగ విభాగింపవచ్చును. 7 మి.మి. గాని అంతకు తక్కువగాని పొడవుగల రకములను 'మిక్కిలి పొట్టి' రకము లనవచ్చును. 7.1—8.0 మి.మి. పొడవుగలవానిని 'పొట్టి'రకములనవచ్చును. 8.1—9.0 మి.మి. పొడవుగల రకములు 'మధ్యమము'లుగ నెంచవచ్చును. 9.1—10.0 మి.మి. పొడవుగలవి 'పొడవు'రకములుగను, 10.0 మి.మి. లకు పైగా పొడవున్నవి 'మిక్కిలి పొడవు' రకములుగను ఎంచవచ్చును. ఇట్లే 2 మి.మి. గాని అంతకు తక్కువగాని వెడల్పుగలరకములు మిక్కిలి సన్నరకములుగను, 2.1—2.5 మి.మి. వెడల్పుగలవానిని సన్నరకములుగను, 2.6—3.0 మి.మి. వెడల్పుగలవానిని మధ్యమములుగను, 3.1—3.5 మి.మి. వెడల్పుగలవానిని ముదుగురకములుగను, 3.5 మి. మి. లకు పైగా వెడల్పుగలవి మిక్కిలి ముదుగురకములుగను ఎంచవచ్చును. 1 వ పటమునందు పొట్టి పొడవు తారతమ్యములు, 2 వ పటమునందు సన్నము ముదుగు తారతమ్యములు గల కొన్నిరకముల కెల్లలు చూపబడెను. మూడవపటమునందలి మొదటి మూడువరుసలలోను ఈ భేదములుగల గింజలు విడివిడిగా చూపబడెను.

3-వ పట్టికయందు ఆయారకములగింజలు నూరేసి తూచగా వచ్చినయంకెలు (గ్రెయినులలో) చూపబడెను. తూనిక చాలవరకు పరిమాణమునుబట్టియే యుండును. కాని కొంతవరకు గింజలెండుటనుబట్టియు, బియ్యపుగింజయొక్క స్వభావమునుబట్టియు, ఊకపాయలదళమునుబట్టియు గూడ నుండును. కొన్నిరకములలో బియ్యపుగింజ ఊకపాయల మధ్యనుండుస్థలమును పూర్తిగ నాక్రమించకపోవుటచే చివరగుల్లగానుండు భాగ ముండును. 3-వ పటము 4-వ వరుసచూడుడు. అట్టివి తేలికగనుండును. పరీక్షింపబడిన 125 రకములలో 100 గింజలును 17 మొదలు 52 గ్రెయినులవరకు తూగెను. ఈ తూనికనుబట్టి వరిరకములను ఈక్రిందివిధముగ 6 తరగతులుగ విభాగింపవచ్చును.

| | | | | |
|---|---|---|---|---|
| I | —100 గింజలును 25 గ్రెయినులుగాని తక్కువగాని తూగునవి. | | | |
| II | ,, | 26—30 | గ్రెయినులు | తూగునవి. |
| III | ,, | 31—35 | ,, | ,, |
| IV | ,, | 36—40 | ,, | ,, |
| V | ,, | 41—45 | ,, | ,, |
| VI | ,, | 45—కి పైగా | ,, | ,, |

గింజయొక్క ఆకారమునందుగూడ కొంతభేదము గలదు. చాలరకములలో గింజయొక్క పొట్ట రెండువైపు

* మిల్లిమిటరనగా అంగుళమున సుమారు 25 వ వంతు. మి. మి. అనునది సాంకేతికము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ౧-వ పట్టిక

## కొన్ని వరిరకముల గింజలపొడవు—(5 తరగతులుగ విభజించి వ్రాయబడెను.)

| మిక్కిలిపొట్టి (7, అంతకుతక్కువ మి. మి.) | | పొట్టి (7.1—8.0 మి. మి.) | | మధ్యమము (8.1—9.0 మి. మి.) | | పొడవు (9.1—10.0 మి. మి.) | | మిక్కిలిపొడవు (10.0 మి.మి. లకు పైగా) | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పేరు | పొడవు మి. మి. | పేరు | పొడవు మి. మి. | పేరు | పొడవు మి. మి. | పేరు | పొడవు మి. మి. | పేరు | పొడవు మి. మి. |
| కాకిరెక్కలు 1 | 5.7 | రాసనవడ్లు | 7.5 | కిచ్చిడిసంబా (జి.యి.బి.24) | 8.1 | తూర్పుసన్నక్కుళ్లు 3 | 9.1 | బంగారుతీగలు 5 | 10.5 |
| కోవెలసన్నాలు | 6.0 | ములకొలకులు | 7.7 | పునాసఆట్రగడా | 8.1 | బలరామభోగం | 9.1 | బంకు 1 | 10.8 |
| పునాసనన్నాలు | | పేసాణం | 7.7 | నొగాదిసన్నాలు | 8.1 | బసంగి 55 | 9.1 | | |
| (మధ్యరాష్ట్రములు) | 6.1 | ముత్తుసంబా | 7.8 | బసంగి 75 | 8.1 | చినముండాబొలాలా | 9.1 | | |
| తెల్లసిరుమణి | 6.1 | రామగరుడసంబా | 7.9 | లోధ్రలు | 8.1 | మొహానో | 9.1 | | |
| చిట్టిముత్యాలు | 6.1 | స్వర్ణాలు | 7.9 | కృష్ణకాటుకలు 1 | 8.1 | పాలబలుగుత్తులు | 9.1 | | |
| కొత్తమలిసంబా | 6.2 | పునాసఅక్కుళ్లు 5 | 8.0 | రత్నసుడి 7 | 8.1 | పెద్దకన్నెరాలు | 9.1 | | |
| బర్మా 5 | 6.3 | బిక్కిరిసన్నాలు | 8.0 | కలహండిసన్నాలు | 8.1 | వంకెలు | 9.1 | | |
| మోసపురులు | 6.5 | బ్రాహణాపుగడా | 8.0 | సన్నబయ్యాహుండా | 8.2 | జిలవు | 9.2 | మధ్యమము | |
| బొద్దుమణి | 6.9 | | | బొండామోళి | 8.2 | వావిలపాడుసన్నం | 9.2 | 8.1—9.0 మి. మి. | |
| | | | | సనకోటిసన్నాలు 4 | 8.2 | శ్రీకృష్ణభోగం | 9.2 | (శేషము) | |
| | | | | గునుపురంసన్నాలు | 8.2 | బుడమవడ్లు | 9.2 | —— | |
| | | | | కొక్కెరధాన్యం | 8.2 | సన్నఅక్కుళ్లు | 9.3 | సన్నవరి | 8.7 |
| | | | | మహారాజభోగం | 8.2 | బంగారుతీగలు 2 | 9.3 | కొయ్యిసాంపు | 8.7 |
| | | | | కొండసంపంగి | 8.2 | ముండ్లవరి | 9.3 | రామసాగరాలు | 8.7 |
| | | | | కొన్నా | 8.2 | ఆకుసరులు | 9.4 | ఆల్వారుసన్నం | 8.8 |
| | | | | పానియన్‌బా | 8.2 | బసంగి 46 | 9.5 | చైటల్ పకీర్ | 8.8 |
| | | | | అరలొడ్డీలు | 8.3 | కొయ్యిసాంపు | 9.5 | బంగారుతీగలు 1 | 8.8 |
| | | | | సనకోటిసన్నాలు | 8.3 | పసినికంటికలు | 9.5 | మహిసాళీ | 8.8 |
| | | | | పెద్దఅక్కుళ్లు | 8.3 | ప్రసాగ | 9.5 | బంగారుతీగలు 3 | 8.8 |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | | | |
|---|---|---|---|---|---|
| నవకోటిసన్నాలు 5 | 8.3 | బసంగి 79 | 9.7 | చులకనముహిపాళీ | 8.8 |
| పునాసఅక్కుళ్లు 9 | 8.3 | కొసాకడ్డీలు | 9.8 | కో 1 | 8.8 |
| పాత్తేరుసన్నం | 8.3 | | | జి. యి. బి. 130.3 | 8.8 |
| దూసిసన్నం | 8.3 | మధ్యమము | | పునాసకొణామణి 1,2 | 8.8 |
| రత్నసుడి 14 | 8.3 | 8.1–9.0 మి. మి. | | గుదాకుట్టా | 8.8 |
| గరికసన్నవరి 1 | 8.3 | (శేషము) | | రసంగి 21,24 | 8.8 |
| రత్నసుడి 9 | 8.3 | ముట్టుబయ్యాహుండా | 8.5 | హేమసన్నాలు | 8.8 |
| అరవదాంసంబా 6 | 8.4 | పాలసుమ్మసరి 7 | 8.5 | రత్నసుడి 5,13 | 8.8 |
| పాలసుమ్మసరి 4 | 8.4 | పెద్దకన్నెరాలు | 8.5 | కనకరత్నాలు | 8.8 |
| రాజరత్నాలు | 8.4 | బయ్యాహుండా | 8.6 | బర్మా II | 8.8 |
| రసంగిల 23 | 8.4 | రత్నసుడి 15 | 8.6 | లంబా | 8.9 |
| సత్తికాల | 8.4 | హరిశంకర్ | 8.6 | సుదారిసన్నాలు | 8.9 |
| వర్షుణాం [ధాన్యం) | 8.4 | సున్నాపువ్వులు | 8.6 | సుమ్మనరి | 8.9 |
| బర్మా I (కొబ్బెర పూవు] | 8.4 | కొసిసాంపు | 8.6 | కెవిటోచాంపా | 8.9 |
| మొఖుబంకి | 8.4 | తెల్లరాధాప్రయాగ | 8.6 | నల్లకొణామణీ | 8.9 |
| దాశరథీలు | 8.4 | కొణామణి 16 | 8.6 | కొణామణి 14 | 8.9 |
| నగిసెలు | 8.4 | యెఱ్ఱబక్కాలు | 8.6 | కొండకురంగి | 8.9 |
| కనకసాంపు 7 | 8.4 | బసంగి 27 | 8.7 | లోధ్యారి | 9.0 |
| నవకోటిసన్నాలు 6 | 8.4 | ,, 33 | 8.7 | బొబ్బిలిగంటి | 9.0 |
| కృష్ణకాటుకలు 3 | 8.5 | సువర్ణముకీలు | 8.7 | ప్రసనియా | 9.0 |
| పునాస అక్కుళ్లు 3 | 8.5 | బొబ్బిలిబుడమ | 8.7 | బర్మా III | 9.0 |
| చీపురుబయ్యాహుండా | 8.5 | చెవిటిసాంపు | 8.7 | టూబారాసులు | 9.0 |
| బసంగి 90 | 8.5 | సారిముండాబోలాలో | 8.7 | నగుతలిసన్నాలు | 9.0 |
| బోరోషాంకో | 8.5 | దుడ్డుమహిపాళీ | 8.7 | రసంగి 26,29 | 9.0 |
| మూన్ భోగాలు | 8.5 | కనకసాంపు 14 | 8.7 | ఢిల్లీభోగాలు | 9.0 |
| ఖోరియా | 8.5 | రామగడా | 8.7 | | |

4, 5- 15

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ౨-వ పట్టిక

కొన్ని వరిరకముల గింజల వెడల్పు—(5 తరగతులుగ విభజించి వ్రాయబడెను.)

| మిక్కిలిసన్నము (2.0 మి. మి. అంతకు తక్కువ) | | సన్నము (2.1-2.5 మి. మి.) | | మధ్యమము (2.6-3.0 మి. మి.) | | ముదుగు (3.1-3.5 మి. మి.) | | మిక్కిలి ముదుగు (3.5 మి. మి. లకు పైగా) | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పేరు | వెడల్పు మి. మి. | పేరు | వెడల్పు మి. మి. | పేరు | వెడల్పు మి. మి. | పేరు | వెడల్పు మి. మి. | పేరు | వెడల్పు మి. మి. |
| హంసన్నాలు | 1.9 | కోనెలసన్నాలు | 2.1 | సన్నక్కుళ్లు | 2.6 | పునాసఆర్టగడా | 3.1 | లైటల్ ఫక్కీర్ | 3.7 |
| బంగారుతీగలు 3 | 2.0 | బంగారుతీగలు 1 | 2.2 | గుడారిసన్నాలు | 2.6 | పెద్దఅక్కుళ్లు | 3.1 | బర్మా IV | 3.7 |
| ద్రోహణాపుగడా | 2.0 | పునాససన్నాలు (మ. | 2.3 | కనకసాంపు 4, 7, 9 | 2.6 | పునాసఅక్కుళ్లు 5 | 3.1 | " I (కొబ్బెర పూ | |
| | | మహారాజభోగం [రా.) | 2.3 | నవకోటిసన్నాలు 3,4,6 | 2.6 | బయ్యాహుండా | 3.1 | వు ధాన్యం) | 3.9 |
| | | మొలోకుంభి | 2.3 | పాత్తేరుసన్నాలు | 2.6 | చీపురుబయ్యాహుండా | 3.1 | | |
| | | చిక్కిరిసన్నాలు [చా) | 2.4 | రాజరత్నాలు | 2.6 | బొబ్బిలిబుడమ | 3.1 | | |
| | | జి.యి.బి.24 (కిచ్చిడిసం | 2.4 | రత్నసుడి 9 | 2.6 | బొబ్బిలిగంటి | 3.1 | | |
| | | కాకిరెక్కలు 1 | 2.4 | ఆకుసరులు | 2.7 | చిలకనమహిపాళీ | 3.1 | | |
| | | సారుముండాబొశాలో | 2.4 | సన్నబయ్యాహుండా | 2.7 | నల్లఆరెలు | 3.1 | | |
| | | సుంకిసన్నాలు | 2.4 | బొద్దుమణి | 2.7 | ధాన్యరాసుల | 3.1 | | |
| | | బంగారుతీగలు 2 | 2.5 | కో 1 | 2.7 | దుడ్డుమహిపాళీ | 3.1 | | |
| | | చినముండాబొశాలో | 2.5 | జి. యి. బి. 24 | 2.7 | గుడాకట్టా | 3.1 | | |
| | | దాశరథీలు | 2.5 | కనకరత్నాలు | 2.7 | గరికసన్నవరి 1 | 3.1 | | |
| | | దూసిసన్నం . | 2.5 | కెవిటోబొంపా | 2.7 | కొణామణీ 14 | 3.1 | | |
| | | గునుపురంసన్నాలు | 2.5 | కొణామణీ 16 | 2.7 | మొహార్ | 3.1 | | |
| | | కొసిసాంపు | 2.5 | కొక్కెరధాన్యం | 2.7 | ముత్తుసంబా | 3.1 | | |
| | | ముట్టుబయ్యాహుండా | 2.5 | కొండసంపంగి | 2.7 | నగిసెలు | 3.1 | | |
| | | శ్రీకృష్ణభోగం | 2.5 | కృష్ణకాటుకలు 1, 3 | 2.7 | పెద్దకన్నెరాలు | 3.1 | | |
| | | సన్నాపువ్వులు | 2.5 | మోసపురులు | 2.7 | రత్నసుడి 15 | 3.1 | | |
| | | వాసనవడ్లు | 2.5 | నవకోటిసన్నాలు 5 | 2.7 | రసంగి 21, 26, 29 | 3.1 | | |
| | | | | పేషాణం | 2.7 | వత్తికాలు | 3.1 | | |
| | | | | ప్రయాగ | 2.7 | స్వర్ణాలు | 3.1 | | |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | రాధాప్రయాగ | 2.7 | వర్షు...ం | 3.1 |
| | | పునాసఅప్పుల్లు 3 | 2.8 | అరవచాంసంబా 6 | 3.1 |
| | | బలరామభోగం | 2.8 | బసంగి 33 | 3.2 |
| | | బసంగి 75 | 2.8 | బర్మా II | 3.2 |
| | | బోరోపాంకో | 2.8 | బర్మా 5 | 3.2 |
| | | చిట్టిముత్యాలు | 2.8 | దూద్ భోగాలు | 3.2 |
| | | కొసాకడ్డీలు | 2.8 | సమ్మసరి | 3.2 |
| | | డిల్లీ భోగాలు | 2.8 | ఖోరియా | 3.2 |
| | | కొయ్యిసాంపు | 2.8 | కొణామణి 15 | 3.2 |
| | | నగుతలిసన్నాలు | 2.8 | పుహిపాళీ | 3.2 |
| | | నొగాదిసన్నాలు | 2.8 | నల్లకొణామణి | 3.2 |
| | | రత్నసుడి 7, 13, 14 | 2.8 | పాలబలుగుత్తులు | 3.2 |
| | | సువర్ణముఖీలు | 2.8 | పాలసమ్మసరి 7, 12 | 3.2 |
| | | టొచారాసులు | 2.8 | పునాసకొణామణి 1, 2 | 3.2 |
| | | వరికెలు | 2.8 | సన్నవరి | 3.2 |
| మధ్యమము | | ఆల్వారుసన్నాలు | 2.9 | బట్లమొకుడి | 3.3 |
| 2.6–3.0 మి. మి. | | అరిలొడ్డీలు | 2.9 | హరిశంకర్ | 3.3 |
| (శేషము) | | బసంగి 55 | 2.9 | ఈశ్వరకోరా | 3.3 |
| మొలకొలకులు | 3.0 | లంబా | 2.9 | జిలను | 3.3 |
| పసుపుకంటికలు | 3.0 | లొధ్యారి | 2.9 | కొన్నా | 3.3 |
| రత్నసుడి 5 | 3.0 | రామగరుడసంబా | 2.9 | కొరంగుసంబా | 3.3 |
| రసంగి 23, 24 | 3.0 | తెల్లరాధాప్రయాగ | 2.9 | మసిపీసాణం | 3.3 |
| తెల్లసిరుమణి | 3.0 | వావిలపాడుసన్నాలు | 2.9 | పాలసమ్మసరి 4 | 3.3 |
| యెర్రబక్కాలు | 3.0 | బసంగి 27 | 3.0 | పున్నియా | 3.3 |
| | | చెవిటిసాంపు | 3.0 | రామగడా | 3.3 |
| | | గరుడవాహనాలు | 3.0 | భోడామోళీ | 3.4 |
| | | క్లాత్తమలిసంబా | 3.0 | ముండ్లవరి | 3.4 |
| | | లోగ్రలు | 3.0 | బుడమవడ్లు | 3.5 |
| | | | | పానియకలా | 3.5 |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ౩-వ పట్టిక

## కొన్ని వరిరకముల గింజలబరువు—నూరేసిగింజల తూనిక (గ్రెయినులు)

| 25 గ్రెయినులు అంతకు తక్కువ | | 26–30 గ్రా. | | 31–35 గ్రా. | | 36–40 గ్రా. | | 41–45 గ్రా. | | 45 గ్రెయినులకు పైగా | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| పేరు | గ్రా | పేరు | గ్రా | పేరు | గ్రా | పేరు | గ్రా | పేరు | గ్రా | పేరు | గ్రా |
| పునాససన్నాలు | | ద్రౌహణాపుగడా | 26 | బసంగి 61 | 31 | కొక్కెరధాన్యం | 36 | ఖోరియా 1 | 41 | బసంగి 46 | 46 |
| (మధ్యరాష్ట్రములు) | 17 | వాసనవడ్లు | 26 | ముట్టుబయ్యాహుండా | 31 | బసంగి 27 | 36 | లంబా | 41 | బర్మా I (కొల్చేరుపూవు | |
| కాకిరెక్కలు 1 | 20 | బిక్కిరిసన్నాలు | 26 | సారుముండాబోలాలో | 31 | రసంగి 23 | 36 | అరువదాంసంబా 6 | 41 | ధాన్యం) | 46 |
| హేమసన్నాలు | 21 | మొలొకుంభి | 27 | సుడారిసన్నాలు | 31 | ఆల్వారుసన్నం | 36 | రసంగి 21 | 41 | జిలను | 46 |
| బంగారుతీగలు 3 | 21 | సుంకిసన్నాలు | 27 | పునాసఅక్కుళ్లు 9 | 31 | సన్నాపువ్వులు | 36 | ,, 24 | 41 | మహిపాళీ | 46 |
| కొత్తమల్లిసంబా | 21 | జి. ఇ. జి. 24 | | పునాసఆట్రగడా | 32 | బోరోపాంకో | 36 | పాలసుమ్మసరి 7 | 41 | బసంగి 33 | 47 |
| బంగారుతీగలు 1 | 22 | (కిచ్చిడిసంబా) | 27 | బర్మా III | 32 | పునాసఅక్కుళ్లు 2 | 36 | ,, 12 | 41 | వైట్ టల్ ఫకీర్ | 48 |
| కలహాండిసన్నాలు | 25 | కృష్ణకాటుకలు 1 | 27 | నవకోటిసన్నాలు 5 | 32 | ,, 3 | 36 | నల్లకొణావణి | 41 | పానియన్‌లా | 50 |
| బొడ్డుమణి | 25 | నవకోటిసన్నాలు 6 | 29 | ఎఱ్ఱసిరుమణి | 32 | గునుపురంసన్నాలు | 36 | గడాకుట్టా | 41 | ముండ్లవరి | 51 |
| | | దాశరథీలు | 30 | చినముండాబోలాలో | 33 | రత్న సుడి 13 | 36 | వజ్ఞాణం | 41 | బర్మా IV | 52 |
| | | నవకోటిసన్నాలు 4 | 30 | రాజరత్నాలు | 33 | ప్రయాగ | 36 | రత్న సుడి 15 | 41 | | |
| | | ,, 5 | 30 | రామగరుడసంబా | 33 | మసిపిసాణం | 36 | బొబ్బిలిబుడమ | 42 | | |
| | | రత్న సుడి 9 | 30 | మొలకొలకులు | 33 | యెఱ్ఱబక్కాలు | 36 | కోడిబుడమ | 42 | | |
| | | కనకసాంపు 7 | 30 | ముత్యపుసంబా | 33 | టాంభారంసులు | 37 | సత్తికాలు | 43 | | |





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| కనకసాంపు 4 | 33 | బంగారుతీగలు 2 | 37 | నల్లతారెలు | | 42 |
| పునాసఅక్కుళ్లు 5 | 33 | రత్నసుడి 14 | 37 | మొహారో | | 42 |
| కనకరత్నాలు | 33 | లాధ్యారి | 38 | రసంగి 29 | | 42 |
| బోరిగి | 34 | బొబ్బిలిగంటి | 38 | పున్నియా | | 42 |
| కృష్ణకాటుకలు 3 | 34 | రత్నసుడి 7 | 38 | పునాసఅక్కుళ్లు | 23 | 42 |
| బలగామభోగాలు | 34 | బొట్లమొకుడి 1 | 39 | బయ్యాహుండా | | 42 |
| కొణామణి 16 | 34 | కొసమెచ్చొంపా | 39 | కొయ్యసాంపు | | 42 |
| కొండకురంగి | 35 | కొన్నా | 39 | కొసిసాంపు | | 42 |
| బసంగి 75 | 35 | కొణామణి 14 | 39 | రసంగి | 26 | 43 |
| గరికసన్నవరి 1 | 35 | పెద్దఅక్కుళ్లు | 39 | గుమ్మసరి | | 43 |
| చెవిటిసాంపు | 35 | సన్నవరి | 39 | పాలగుమ్మసరి 4 | | 44 |
| రాధాప్రయాగ | 35 | అరలొడ్డీలు | 40 | పాలబలుగుత్తులు | | 45 |
| తెల్లరాధాప్రయాగ | 35 | లోధ్రలు | 40 | చారబుడమ | | 45 |
| కొనాకడ్డీలు | 35 | బసంగి 55 | 40 | | | |
| వంకెలు | 35 | బొట్లమొకుడి 2 | 40 | | | |
| సన్నఅక్కుళ్లు | 35 | బసంగి 90 | 40 | | | |
| | | వావిలపాడుసన్నాలు | 40 | | | |
| కో 1 | 35 | బర్మా II | 40 | | | |
| నగుతళిసన్నాలు | 35 | చీపురుబయ్యాహుండా | 40 | | | |
| కనకసాంపు 9 | 35 | కొణామణి 15 | 40 | | | |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## ౪-వ పట్టిక

| వరుస సంఖ్య | రకము | అనకాపల్లి (మొదటి పంట) | చామర్లకోట (మొదటిపంట) | | | చామర్లకోట యిలకపంట | | | షరా |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | ఒకఔన్సు గింజల సంఖ్య | ఒకఔన్సు గింజల సంఖ్య | గింజ పొడవు మి. మి. | గింజ వెడల్పు మి. మి. | ఒకఔన్సు గింజల సంఖ్య | గింజ పొడవు మి. మి. | గింజ వెడల్పు మి. మి. | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
| 1 | జి.యి.బి.24(కిచ్చిడి [సంబా) | 1868 | 1609 | 7.5 | 2.4 | 2006 | 7.0 | 2.3 | |
| 2 | నవకోటిసన్నాలు | 1698 | 1473 | 8.3 | 2.6 | 1713 | 7.4 | 2.6 | |
| 3 | కనకసాంపు | 1557 | 1295 | 8.5 | 2.7 | 1809 | 7.8 | 2.3 | |
| 4 | రత్నసుడి | 1559 | 1324 | 8.5 | 2.6 | 1849 | 7.3 | 2.3 | |

లను ఉన్నతముగ నుండును. కాని సామాన్యముగ లోపలి తుషములందు పెద్దది యెక్కువ ఉన్నతముగ నుండును. కొన్ని రకములలో నీయున్నతము స్వల్పముగ మాత్రమే యుండును. కొన్నిటిలో తుషములవెన్నులు (ముఖ్యముగ చిన్న తుషముయొక్క వెన్ను) తిన్నగనుండును. కొన్నిటి లో నించుక నిమ్నతగూడ కలిగియుండును. కొన్నిరక ములలో గింజ ఒకవిధమయిన ముక్కుగలిగియుండును. కొన్నిటిలో గింజ పైనవెడల్పుగను, క్రింద సన్నముగను ఉండును.మూడవపటమునందు ఈభేదములు చూడనగును.



చిత్రము ౧

గింజల ముదుగు సన్నములు చాలవరకు వాని వెడ ల్పునుబట్టియే నిర్ణయింపబడును. ముదుగు సన్నములను బట్టియే రకములకు గణ్యత యేర్పడుచున్నది. వరియన్న మును తినువారు బియ్యపు ముదుగుసన్నముల నెంచికొన గలంత సామర్థ్యమున్నచో ముదుగురకములనువదిలి సన్న రకములనే యెంచుకొనును. సన్నబియ్యము సామాన్య ముగ తెలుపుగగూడ నుండుటచే చూచుటకింపుగకూడ నుండును. మిక్కిలి సన్న బియ్యపుఅన్నము కొంచెము ఓరు సుగ నుండుటచేతను, మెతుకు నూకలకూడు నందువలె మిక్కిలి చిన్నదిగనుండుటచేతను తినుటకు మధ్యరకపుటన్న మంత యనుకూలముగ నుండదు.

పొడవుగనుండు గింజలు దంపు టలలో విరిగి నూక లెక్కువయగును. పొడ వునకు తగినంత లావులేనిగింజలు మరింత విరుగును. మరియు నట్టిగింజలు తడిసిన గాని, మిగుల నెండినగాని, మిగులపండిన గాని మరింత నూకవాటగును. సామాన్య ముగ దంపుటకుగాని ధాన్యపు మరలలో పోయుటకుగాని వెడల్పునకు 2½—2¾ రెట్లకంటె హెచ్చు పొడవుగల రకము లనుకూలముగావు.

గింజలపరిమాణమును, బరువును సామాన్యముగ నిలుకడయైన రకపు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చిత్రము 2

లక్షణములుగ ఎంచబడియున్నను, ఈ లక్షణములు స్థితిగతులనుబట్టి కొంతవరకు మార్పునొందుట గలదు. గంజాం విశాఖపట్టణపు జిల్లాలలోని తేలిక నేలలనుండి గోదావరి డెల్టాకుదెచ్చి సాగుచేయబడిన రకములు కొన్ని అనటుకంటె ముదు గయ్యెనని చాలమంది యభిప్రాయము. ఇట్టిమార్పు ఎంతవరకుజరుగునో, అందుల కెంతకాలము పట్టునో మొదలగువిషయములు తెలిసికొనవలసియున్నవి. నాల్గవపట్టికలోని 3, 4 కలములలోని యంకెలు పైనిచెప్పినట్లు విశాఖపట్టణము జిల్లానుండి గోదావరిజిల్లాకు విత్తనములు మార్చుటవలన గలిగిన భేదమును తెలుపుచున్నవి. అనకాపల్లి వ్యవసాయస్థానమునందు పండినగింజలకంటె చామర్లకోట వ్యవసాయస్థానమున పండినవి బరువుగ నుండెను.

4–9 కలములలోని యంకెలు యిలకపంట గింజలకును, సామాన్యపు పంటగింజలకును గల తారతమ్యమును జూపును.

నేలయందలి సత్తువలోను, నాటుకాలములోను, దూరమునను విశేష వ్యత్యాసము లున్నయెడల నందువలన గూడ గింజలపరిమాణమునందును, తూనికయందును కించిద్భేదములు కలుగవచ్చునని తోచును. ఈవిషయమునుగూడ పరీక్షింప వలసియే యున్నది.



చిత్రము 3





# అన్వేషణము-రాధ

శ్రీ శేషాద్రిరమణకవులు

విశ్వమోహనమైన వేణుగానంబు
మఱల విన్పింపుమోమాధవా, మాకు
నిండారి చంద్రికల్ నెఱయఁగా సాఁగె
మందమారుతములు మలయుచునుండె
నిశ్శబ్దముగ నుండె నిఖిలజగంబు
పున్నమచంద్రుండు పోవకమున్న
పండువెన్నెలచెన్ను బడలకమున్న
ఇవముచే రోదసి యెనయక మున్న
రావయ్య, యొకమారు రతనాలకృష్ణ,

పలుకరా యొకమారు బంగారుకృష్ణ,
నవ్వరా యొకమారు నాచిన్నికృష్ణ,
మురళి వాయించరా మోహనకృష్ణ,
దయచేయవేమిరా తాండవకృష్ణ,
యమునాతరంగిణియందు దాఁగితివా
కానుగుపొదలలోఁ గలసిపోయితివా
పొదరిండ్లలోపలఁ బొంచియున్నావా
పాడరా యొకమారు ప్రణయగీతంబు
వినిపింపరా నాకు వేణుగానంబు.



# కోమటుల యింటఁ దలఁదాఁచుకొంటి నమ్మ!

పండిత పురాణం సూర్యనారాయణతీర్థులు

మర్యాదకుక్ లోఁగి మసలునాతండ్రి జీవన మంత నొకఁడు లోఁబఱుచుకొనియె
భద్రమ్ముగా నింట నిద్రించుచున్న నామగని నొక్కఁడు గుండె పగులఁదన్నె
చచ్చినందాఁక నాసవతిపాదములనే కొలుచుచున్నా రింకఁ గొంతమంది
మఱికొంతమంది త్రిమ్మరు లెదో మిష పెట్టి కొల్లగా నాయిల్లు గూల్చుచుందు
రన్ని విధముల నాకు మహోపకారు-లైన బాపలవలని భయమ్మువలన
శిష్టులనుచును నన్ను రక్షింతు రనుచుఁ-గోమటులయింటఁ దలదాఁచుకొంటినమ్మ!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## [అంబష్ఠ సూత్రము]

కె. రంగాచార్యులు గారు, యమ్. ఏ., బి.యల్.

"కొందఱు మునులును, బ్రాహ్మణులును, భక్త ప్రదత్తభక్ష్యంబులఁ దినుచు, నసన్మార్గంబుల నవలంబించుచు, నింద్యవిద్యల ననుసరింతురు. అట్టి వెవ్వియనః-

ఈదిగువ నుదాహరింపఁబడిన వస్తువుల సదసచ్చిహ్నములను, లక్షణములను బరీక్షించి, యట్టి వస్తువులు గల నరుల దేహస్థితులను గాని, యదృష్టంబులఁ గాని నిర్దేశించుటః—మణులు, దండములు, వస్త్రములు, ఖడ్గములు, నారాచములు, విల్లులు, తదితరాయుధములు, యువతులు, నదులు, బాలురు, బాలికలు, దాసులు, దాసీజనము, గజములు, నశ్వములు, మహిషంబులు, వృషభములు, అజములు, మేషములు, కుక్కుటములు, లావకులు, గౌధారములు, కర్ణావతంసంబులు, కూర్మంబులు మున్నగుజంతువులు.—గోతమముని యట్టి నింద్యవిద్యల నవలంబింపఁడు.

కొందఱు మునులును, బ్రాహ్మణులును భక్తులచే దత్తంబగు భోజనముం దినుచు, శైవపరీక్షాది నింద్యవిద్యల నవలంబించుచు నసజ్జనమార్గంబు నవలంబింతురు. అవి యెవ్వి యనః—

1. రాజులు సోత్సవులై దాడివెడలుదురు.

2. రాజులు రాష్ట్రములకుం దిరిగివత్తురు.

3. స్వదేశరాజు లెదుర్కొన శత్రువులు వెనుకకుఁ బారిపోవుదురు.

4. శత్రురాజు లెదుర్కొన స్వస్వాములు వెనుకకుఁ దిరుగుదురు.

5. స్వదేశరాజులు జయమును బొందుదురు, పరరాజు లోడిపోవుదురు.

6. పరరాజులు జయముం గాంతురు, స్వదేశరాజులు పరాజయముం బొందుదురు.

ఈ రీతిగ జయ మీపక్షమున నుండును; అపజయ మాపక్షమునకుఁ గలుగును.

గోతమముని యిట్టి నింద్యవిద్యల ననుసరింపఁడు. కొందఱు మునులును, బ్రాహ్మణులును భక్తదత్తభోజనముం దినుచు, రాఁబోవుహానిం జెప్పును, నట్టి నింద్యవిద్యల నభ్యసించుచు, నసజ్జీవన మార్గముల నవలంబింతురు. అట్టి వెవ్వి యనినః—

1. చంద్రగ్రహణము కలుగు నని చెప్పుట.

2. సూర్యగ్రహణము కలుగునని చెప్పుట.

3. నక్షత్రగ్రహణము కలుగునని చెప్పుట.

4. చంద్రునియొక్క గాని, సూర్యునియొక్క గాని యుత్పథగమనమును జెప్పుట.

5. చంద్రునియొక్క గాని, సూర్యునియొక్క గాని పథగమనముం జెప్పుట.

6. నక్షత్రోత్పథంబులు కలుగు నని చెప్పుట.

7. నక్షత్రముల పథగమనముం జెప్పుట.

8. ఉల్కాపాతము కలుగు నని చెప్పుట.

9. దిగ్దాహ మగునని చెప్పుట.

10. భూకంపము కలుగునని చెప్పుట.

11. దేవుఁడు మేఘగర్జనము కావించు నని చెప్పుట.

12-15. సూర్యచంద్ర నక్షత్రోదయాస్తమయంబులును, నవ్వాని యస్పష్టతను గాని, వాని వైమల్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మును గాని, యీపంచదశ స్థితులను గాని చెప్పుట, నయ్యవి యట్టియట్టి ఫలములఁ గలుగఁజేయు నని చెప్పుట.

కొందఱు మునులును, బ్రాహ్మణులును భక్త ప్రదత్తంబగు భక్ష్యంబులఁ దినుచు నింద్యవ్యాపారము లచే ధన మార్జించుచున్నారు.

1. వర్షాధిక్యము కలుగు నని చెప్పుట (పూర్వ కథనము).

2. అల్పవర్షంబులు కురియు నని చెప్పుట.

3. పంటలు సమృద్ధిగఁ బండునని చెప్పుట.

4. దుర్భిక్షము కలుగు నని చెప్పుట.

5. దేశక్షోభము లెవ్వియు నుండ వని చెప్పుట.

6. దేశక్షోభము కలుగు నని చెప్పుట.

7. మారీజాడ్యములు కలుగు నని చెప్పుట.

8. వ్యాధిరహితమై దేశ ముండు నని చెప్పుట.

9. వ్రేళ్లపై లెక్కపెట్టుట.

10. వ్రేళ్ల నుపయోగించకుండ లెక్కపెట్టుట.

11. పృథుసంఖ్యా సంకలనము.

12. కావ్యరచన.

13. లోకాయతము.

గోతమముని యిట్టి నింద్యవిద్యలకు దూరుండై యుండును.

కొందఱు మునులును, బ్రాహ్మణులును భక్త ప్రదత్త భక్ష్యంబుల మెసవుచు, నసన్మార్గావలంబనచే జీవనోపాధిని సంపాదించుచు, నీనింద్యవిద్యల నభ్యసింతురు:-

1. పెండ్లికొడుకును గాని పెండ్లికూఁతును గాని గృహమునకుఁ దీసికొనివచ్చుటకు శుభదినమును నిర్ణయించుట.

2. పెండ్లికొడుకునుగాని, పెండ్లికూఁతును గాని, వివాహార్థము తీసికొని వెళ్లుటకై శుభదినమును నిశ్చయించుట.

3. సంధి చేసికొనుటకు శుభకాలమును నిశ్చయించుట.

4. యుద్ధము చేయుటకు శుభకాలమును నిశ్చయించుట.

5. అప్పులు రాఁబట్టుకొనుటకు శుభకాలమును నిశ్చయించుట.

6. ధన వ్యయమునకు శుభదినమును నిశ్చయించుట.

7. సుభగ కరణము (ప్రజలకు శుభముకలుగుటకై ప్రయోగించు మంత్రములు.)

8. ప్రజల కెగ్గు కలుగునట్లు ప్రయోగించు మంత్రములు.

9. గర్భస్రావ మగుటకై ప్రయోగించు మంత్రములు.

10. మూకత్వముఁ గలుగఁజేయు మంత్రప్రయోగము.

11. అనుగ్రహమునకై మంత్రప్రయోగము.

12. ఊర్ధ్వబాహుండై యుండుటకు మంత్ర ప్రయోగము.

13. బధిరత్వము కలుగఁజేయుటకై మంత్ర ప్రయోగము.

14. ఆదర్శ ప్రశ్నము— అభిచారికాదర్శంబుల గోప్యములగు సంభవములఁ గూర్చి ప్రశ్నలడుగ దేవుఁడు కనుపించి యాప్రశ్నల కుత్తరము లిచ్చు నని యర్థము; అట్టిపనులు చేయుట.

15. కుమారీ ప్రశ్న—దేవతపట్టిన సుబాలయగు కన్యను గోప్యములగుసంభవములం గూర్చి ప్రశ్నలడిగి యుత్తరములం బొందుట.

16. దేవ ప్రశ్నలు—ఒకకన్యకు బదులుగా దేవదాసియగు నొక్కతె నిట్టి ప్రశ్నలడిగి యుత్తరములఁ బొందుట.

17. ఆదిత్యార్చన.

18. మహాబ్రహ్మపూజ.

19. నోటినుండి జ్వాలలం బుట్టించుట.

20. లక్ష్మీదేవి నర్చించి ప్రార్థించుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కొందఱు మునులును, బ్రాహ్మణులును భక్తిదత్తాహారంబుల భుజియించుచు, నసజ్జీవనమార్గంబుల నవలంబించుచు నిట్టి నింద్యవిద్యల నభ్యసింతురు:—

1. ఏదియో యొకలాభము కల్గిన నొక దేవున కుపహారముల మ్రొక్కుకొనుట.

2. అట్టి మ్రొక్కులను దీర్చుకొనుట.

3. భూగృహమున నున్నపుడు మంత్రములఁ బఠించుట.

4. పుంస్త్వమును గలుగఁజేయుట.

5. క్లీబునిగ నొనర్చుట (అనఁగవృషణచ్ఛేదనములనఁ గాక మంత్రప్రయోగముచేత).

6. మంగళవస్తు నిర్ణయము (గృహాదినిర్మాణమునకై మంగళప్రదాయకంబులగు స్థలములఁ బరీక్షచేసి కనుఁగొనుట. ఇయ్యది వాస్తువిద్యలో నొక ముఖ్యభాగము).

7. వాస్తుకర్మ— (అట్టి స్థలముల కర్షణ దేవపూజ బలిదానాదులచే బవిత్రముగ నొనర్చుట).

8. ఆచమనములు.

9. నైమిక స్నానంబులు చేయించుట.

10. యజ్ఞములు చేయుట.

11-14. విరేచనములకును, వమనములకును మందుల నిచ్చుట.

15. మనుజులు తుమ్ముటకై మందుల నిచ్చుట.

16. చెవులలో నూనె బోయుట.

17. కన్నులలో నౌషధములఁ బోసి శమనము కలుగఁజేయుట.

18. నాసికనుండ మందుల నిచ్చుట.

19. కన్నులకుఁ గాటుక నుంచుట.

20. ఔషధీయాంజనము గన్నులయందుంచుట.

21. నేత్రవైద్యము చేయుట.

22. శస్త్రవైద్యము చేయుట.

23. శిశుచికిత్స చేయుట.

24. మూలములను,నౌషధములను బ్రయోగించుట.

25. ఒకదాని వెనుక నింకొక యౌషధమును బ్రయోగించుట.

గోతమముని యిట్టి నింద్యవిద్యల ననుసరింపఁడు."

మఱియు భిక్షుకుం డీగుణంబులను నయవిధుల ననుసరించిన నట్టివాని కేవైపునుండియు హానికలుగదు; అనఁగా నాచరణలో నాతని నిగ్రహమున కేయపాయము నుండదు. అభిషిక్తుండైన నృపాలుఁడు జయము పొందినపిదప నేదిక్కునుండియు శత్రువులవలనఁ దన కపాయము కలుగ దను నిబ్బరముతో నెట్లుండునో యట్లే భిక్షుకుండు ధైర్యముతో నుండును.

మఱియు భిక్షుకుం డెట్లింద్రియద్వారముల సంరక్షించుకొనును? తా నేవస్తువునైనఁ జూచినపు డట్టి వస్తువుయొక్క నిమిత్తగ్రాహి గాని, యనువ్యంజనగ్రాహి గాని కాకయుండును. నిమిత్తగ్రాహి యన వస్తుస్వరూపమును, నాకారమును సంపూర్ణావస్థలోఁ గనుఁగొనుట. అనువ్యంజనగ్రాహి యన వస్తువిభిన్నభాగముల యాకారమును బరిశీలించుట. నిమిత్తగ్రాహి యన రూపమును గనుఁగొని యాజ్ఞానముచే వస్తువును దెలిసికొనుట.

ఆకారమును జూచికాని, కంఠధ్వనిని విని కాని యట్టిది స్త్రీయో పురుషుఁడో తెలిసికొనుట. ఇది నిమిత్తగ్రహణము. అనువ్యంజనగ్రహణ మన నట్టిస్త్రీ గాని, పురుషుఁడుకాని నవ్వుచున్నాఁడో, మాటలాడుచున్నాఁడో తెలిసికొనుట. (బుద్ధఘోషుఁడు) చక్షురింద్రియనిగ్రహము లేనియెడల నున్నంతవరకు లోభత్వ విషాదములును,శాపస్థితులు నెట్లాతనికి సంభవించి వానిని లోఁబఱుచుకొనునో, యట్టి దురవస్థఁ జెందకుండునట్లుండుటకై చక్షురింద్రియమును నిగ్రహించును. భిక్షుకుఁడు చక్షురింద్రియమును జాగరూకతతో నిగ్రహించుచు నాయింద్రియమును జయించును. ఈరీతిగనే కర్ణముతో ధ్వని విన్నప్పుడు కాని, నాసికతో వాసన చూచినప్పుడు కాని, జిహ్వతో రుచిచూచినప్పుడు కాని, కాయముతో స్పర్శచేసినప్పుడు కాని, మనస్సుతో నొకదాని నెద్దానినైన గ్రహించినపుడు కాని యిట్టివాఁడు తత్త్వవిషయములో నిమిత్తగ్రాహి కాని, యనువ్యంజనగ్రాహి కాని కాఁడు. మనోనిగ్రహము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లేనంతవఱకు నట్టిలోభత్వవిషాదములును, బాపస్థితులు నెట్లాతనికి సంభవించి యాతని భిక్షుకుఁడు మనమును నిగ్రహించును. మఱియు నాతఁడు మనమును నిగ్రహించుచు మనమును జయించును. అట్టి శ్లాఘనీయంబగు నింద్రియనిగ్రహంబు గలిగి మనమున నట్టివాఁడు పాప స్థితి చేరరాని సౌఖ్యావస్థను బొందును.

"భిక్షుకుఁడు స్వస్థచిత్తుండై, జాగరూకుండై యుండునా? ఈవిషయములోఁ గూడ భిక్షుకుఁడు ముందఱకుఁ జనుటలోను, వెనుకకు వెళ్లుటలోను మనమునఁ దత్కార్యహేతువు నిడికొనును. (అనఁగా నట్టిభిక్షువు కర్మోద్దేశమున నాకర్మ సూచించు ధర్మార్థమును, నట్టి కర్మ తన యుత్కృష్టాశయములకు దోడుపడును మఱియు బ్రాహ్మ్యకర్మలను బ్రేరేపించి చేయించు యథార్థాంతస్థకారణములను దెలిసికొనును.) ఈరీతిగనే ముందునకుఁ గాని, సమంతమునఁ గాని యాలోకించుటయందును, జేతులఁ జాపి ముడుచుటయందును, త్రాగుట యందును, నమలుటయందును, మ్రింగుటయందును, మూత్రపురీషోత్సర్జనమందును, నడుచుటయందును, నిలువఁబడి యుండుటయందును, గూరుచుండి యుండుట యందును, నిదురించుటయందును, జాగ్రదవస్థయందును మాటలాడుటయందును, భాషింపక యూరక యుండుటయందును;— ఈవివిధావస్థలం గు ర్తెఱింగి యుండును.

"ఏరీతిగ భిక్షువు సంతుష్టుం డై యుండును?"

"భిక్షువు దేహమును రక్షించుటకుఁ దగినవస్త్రములతోడను, ఉదరమునకుఁ దగినభోజనములతోడను, సంతుష్టుండై యుండును. పక్షి యెగురునపు డెట్లు తన ఱెక్కలను దనతోఁ గొంపోవునో యట్లే భిక్షువు తాను బోవుప్రదేశములకు వీనిం గొంపోవును! ఈరీతిగ భిక్షువు సంప్రీతుండై యుండును."

"ఇట్టి ధర్మోపదేశమున దక్షుండై, ఘనంబగు నిట్టి యింద్రియనిగ్రహము కలవాఁడై, యిట్లు స్వస్థచిత్తుండును, జాగరూకుండునునై, ఇట్లు సంప్రీతమనస్కుండునై, యాతఁడు తనమార్గమున విశ్రమించుట కడవులయందుఁ గాని, తరుమూలంబునఁ గాని, పర్వత నితంబప్రదేశమునఁ గాని, పర్వతకందరంబునఁ గాని, శిలామయంబగు గుహయందుఁ గాని, శ్మశానవాటిక యందుఁ గాని, బయలున గడ్డికుప్పపైఁ గాని నిర్మానుష్యంబగు స్థలమును జూచుకొనును. భిక్షాపర్యటనానంతర మాతఁ డచ్చటకుం జని, యన్నముం దిని, వ్యత్యస్త పాదుండై, యనతశరీరుండై, యవహితచిత్తుండై, యనన్యమానసుండై యుండును."

"సంసారానురక్తిని గామరహితమనస్కుండై కామరాగముల మనమునుండి పారఁద్రోలును. జీవహింసేచ్ఛా (శీలభ్రంశనంబును) దూషణంబును మనమున జేరనీయక, దుశ్శీలరహితంబగు మనములో నుండి, మనమును ద్రోహరహితముగ నొనర్చును. హృదయమున నుండు మనమునందు మాంద్యము లేకుండఁ జేసి, యాశయములఁ బ్రభావయుక్తంబులుగ నుంచి, స్వస్థచిత్తుండై, జాగరూకుండై యుండి, మనమును దౌర్బల్యజాడ్యహీనముగ నొనర్చును. సంక్షోభక్లేశంబులఁ బోవిడిచి, సంక్షోభరాహిత్యమున జీవించుచు, నంతశ్శాంతియుక్తుండై, సంక్షోభక్లేశములు లేకుండ జీవించును."

"ఋణమును జేసి పురుషుం డొక్కరుఁ డాధనముతో వాణిజ్యమును జేసి, యట్టివ్యాపారము లాభకరమైనదియై యానరునకుఁ బూర్వఋణమును దీర్చుకొనుటకే కాక భార్యను బోషించుటకుఁ దగినధనము మిగులునంత లాభమును గలుగఁజేసిన నాతఁ డిట్లు చింతించును! 'అప్పుచేసి వ్యాపారమును జేసితిని. ఆవ్యాపారము లాభకర మైనదియై, చేసినయప్పు తీర్చుకొనఁగ భార్యను బోషించుకొనుటకు మిగులునంత లాభము వచ్చినది' అని. అందుచే నాతఁడు సంతుష్టుఁడై యెట్లానందపూరితమనస్కుండై యుండునో; "ఎట్లు నరుఁ డొకఁడు రోగపూరితుఁడై బాధపడుచుండి, యన్నమును జీర్ణించుకొనలేక దుర్బలుండై యుండి, కొలదికాలమైనపిదప ననామయుఁడై, యాహారమును జీర్ణము చేసికొనఁగలిగి, యెప్పటివలె బలము కలవాఁడై యుండి యపుడు, పూర్వము రోగియై యున్నస్థితికిని, యిప్పటి నిరామయస్థితికిని గల తారతమ్యమును బరికించి మానసి సంప్రీతుండై యానందపూరితమనస్కుండైయుండునో;"

"ఎట్లు కారాగారమున బంధితుం డైననరుండు కొలఁదికాల మైనపిదప రిక్తము రాజాపహృతము కాక,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాతఁడు క్షేమముగఁ గారాగృహమునుండి విడిచిపెట్టఁ బడి, యట్టివాఁడు భూతవర్తమానస్థితులను లెస్సఁగఁ బరికించి చూచిన సంప్రీతుండై, యానందపూరితమన స్కుండై యుండునో;" "ఎట్లు దాసుండై యథేచ్ఛగఁ జననేరక పరాధీనుండై యుండి కొంతకాల మైనపిమ్మట యథేచ్ఛగఁ జనుటకు వీలు కలిగి, దాస్యవిముక్తుండై, యనన్యాధీనుండై యుండి, భూతవర్తమానస్థితులను బరికించి చూచిన సంప్రీతుండై, యానందపూరితమన స్కుండై యుండునో;"

"ఎట్లు ధనికుండై, సంపన్నుఁడైన నరుఁ డాహారము దొరకని యపాయభూయిష్ఠమైన యెడారిలో దీర్ఘమార్గము ననుసరించుచుఁ, దుద కట్టియెడారిని దాటి సురక్షితముగ క్షేమముతోఁ దనగ్రామప్రాంతమును జేరి భూతవర్తమానస్థితులను బరికించిచూచిన నట్టివాఁడు సంప్రీతుండై యానందపూరితమనస్కుండై యుండునో;" "అట్లే భిక్షువీపంచనిరోధముల నధిగమించువఱకును, ఋణగ్రస్తునివలె, బందీకృతునివలె, బానిసవలె, వాలుకాబహుళమార్గమునఁ జిక్కుకొన్నవానివలెఁ దన్నుఁ దాను బరిగణించుకొనును. కాని యీ పంచనిరోధములను నధిగమించిన పిదపఁ దన్నుఁ దాను నీఋణునివలెను, బంధవిముక్తునివలెను, దాస్యవిముక్తునివలెను, క్షేమముతో నున్నవానివలెను బరికించుకొనును."

"మఱియు నప్పుఁ డాతఁడు ప్రీతుఁడై యానందపూరితమనస్కుం డగును. అందుచే నాతనికి స్వస్థత కలుగును. అట్టి స్వస్థతచే నాతనిమనము శాంతిపూరితమై యట్టి శాంతముతో నెల్లప్పుడు నుండును." "రాగకామాదులనుండి యట్టివాని మనము దూరంబై ప్రాథమికధ్యానావస్థ వివేకజనితంబైన యానందమయంబగు నవస్థ—నట్టివాఁడు చెందును:—మఱియు నీయవస్థయం దట్టివాఁ డనవరతము విచారశీలుండై యాలోచనపరుఁడై యుండును. వివేకజనితంబగు నానందముతో నాతని దేహము పూరితంబై, యట్టి యానందములో నిమగ్నమై యుండుటచే నందత్యల్పభాగంబైన నానందరహితంబై యుండదు."

"ఎట్లభిషేకస్నానము చేయించువాఁడు కాని, యట్టివాని యంతేవాసికాని, సుగంధితారిష్టచూర్ణంబును లోహపాత్రమందు నిక్షేపించి, యందు బిందువులు బిందువులుగ నీటినిచల్లి, యా మార్ణమును ముద్దగఁ జేయుటచే నయ్యది తేమనుగ్రహించి, దానితో నంతటను వ్యాప్తంబై తేమపోవుటకు వీలులేనట్లగును. పరివ్రాజకుఁ డగువాని జీవనముయొక్క ఫల మియ్యది, యీలోకమున దృష్టంబై, పూర్వప్రదానికంటె నుత్తమంబును నై యుండు."

"అటుపిమ్మట విచారమును నాలోచనను (నివర్తించి) నిగ్రహించి భిక్షువు ద్వితీయధ్యానావస్థం బొందును. అట్టి యవస్థ సమాధివలన జనించి, యందునందు విచారమునకును, నాలోచనమునకును బ్రసక్తియుండదు. ఏకాధిభావమును, మనశ్శాంతియు నందుఁగలుగును. అధోభాగంబున (ప్రస్రవణంబు) వారి ప్రవాహములో నుండి గభీరపల్వలములోనికి నీరెల్లప్పుడును వచ్చుచుండినఁ, బూర్వాపరదక్షిణోత్తర దిక్కులయందు జలమార్గములు లేకయున్నఁ, బర్జన్యుఁ డేకాలమునను వర్షింపకపోయిన, నాజలాశయంబు స్రోతస్సునుండ లోనుండివచ్చు శీతలోదకములతో నిండి సంపూరితంబై, యాపల్వలంబున నేభాగము నుదకములేక యుండదు. పరివ్రాజకుఁ డగువాని జీవనము యొక్క ఫలమియ్యది యీలోకమున దృష్టంబై పూర్వప్రదానికంటె నుత్తమంబును నైయుండు."

"మఱియు నటుపిమ్మట నానందమును దూరముగనుంచి యుపేక్షకుఁ డగును. అవహితచిత్తుండైన యట్టి నరుండు అర్హతుఁడు."

'స్వస్థచిత్తుండై యవహితచిత్తుండై యుండు నరుండు సుసౌఖ్యముననుండు' అనునవు డెట్టిసౌఖ్యమును గూర్చి చెప్పుదురో యట్టి సౌఖ్యముం బొందు. అపుడట్టివాఁడు తృతీయధ్యానావస్థను జెంది యందు సుస్థిరుఁడైయుండు. అట్టివాఁడు తన దేహమును నానందరహితముగ నున్నయట్టి సౌఖ్యములో నింపి సంపూర్ణముగ నొనర్చుటచే నాతని దేహమునం దేభాగమును, నట్టి సౌఖ్యపూరితము కాకుండ నుండదు."

"ఎట్లు పద్మయుక్తంబగు సరోవరంబున ననేకములగు నీలధవళ పద్మంబు లుదకంబునంబుట్టి యుదకమున, బెరిగి నీటిపైనుండక, యుదకగర్భముననుండి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యాహారమును గ్రహించును. చివరనుండి శ్రేష్ఠమగు నాతే మచే నిట్లు వ్యాపింపఁబడియుండి, యాపద్మంబు ధవళం బైనను, రక్తంబైనను, నీలంబైనను భేదములేక యే భాగ మైననుండదు."

"మఱియు భిక్షువు పూర్వావస్థలోఁ బొందుచుం డిన సుఖదుఃఖములను, సంతోషవిషాదములను బోవిడిచి చతుర్థధ్యానావస్థంబొందును. సుఖదుఃఖరాహిత్యంబైన యవస్థయందు స్వస్థచిత్తుండును, సమభావయుక్తుండునై యుండు. అతఁడు మఱియుఁ బవిత్రతతోను, హృదయ నైర్మల్యముతోను దేహమును నింపుటచే నందు స్వల్ప భాగంబైన నసంపూరితంబై యుండదు."

"పురుషుం డొక్కఁడు శుద్ధమైన ధవళాచ్ఛాదన ముతో దేహమున నేభాగమైనను దాకకుండునట్లు సం పూర్ణముగఁ గప్పుకొనియుండునట్లే భిక్షువు పవిత్రత తోను, హృదయనైర్మల్యముతోను, దేహమును వ్యాప్త ముగ నొనర్చుటచే నం దేభాగమైనను, దద్గుణములచే నవ్యాప్తముగ నుండదు."

"మనమును నట్లు శాంతముగను, బవిత్రముగను, నిర్మలముగను, శీలవంతముగను, బాపరహితముగను, కోమలంబుగను, దృఢముగను, నిర్వికారంబుగను, గర్మకై సిద్ధముగను నొనర్చి యాతఁ డద్దానిజ్ఞానమువలనఁ గలుగు నిరీక్షణమునకై మనమును శిక్షించివంచును. ఆతఁ డీ విషయమును గ్రహించును: 'ఈ నాదేహము రూపము గల్గి, చతుర్భూతజనితంబై, సతతమును బక్వాన్నము చేతను, రసవంతములైన ద్రవములచేతను, బోషింపఁబడు చున్నదై, యనిత్యస్వభావము గలిగి నాశమునకును, నుచ్ఛాదనంబునకును, బరిమర్దనంబునకును. వియోగమున కును లోనై యున్నది. నావిజ్ఞానమును నందు సంబద్ధమై దానియం దాధారపడుచున్నది. 'ఎట్లతిశ్రేష్ఠంబగు వై డూర్యమణి యష్టముఖములుగలిగి, నిర్మలంబై, దూషణ రహితంబై సమస్తవిధముల నుత్తమంబై యుండి, వేధిం పఁబడి, నీలకౌసుంభరక్తధవళపీతవర్ణములలో నెద్దియో యొక వర్ణముగల సూత్ర మారంధ్రములో దూర్చఁబడి, మనుజుఁ డెవ్వఁడైన హస్తమున నట్టిసూత్రయుక్తంబగు మణినిబట్టిచూచిన నారెండు నొకదానితోనొకటి కలిసి భేదము లేకుండనుండినట్లు కనుఁగొనును. ఇయ్యదియే యుత్తమంబగు వృత్తి."

"మనమును నట్లు శాంతమయముగను, బవిత్రము గను,నిర్మలముగను, శీలవంతముగను, బాపరహితముగను, నిర్వికారంబుగను, కోమలంబుగను, దృఢముగను, గర్మకై సంసిద్ధముగను నొనర్చిన యట్టివాఁ డొక మానసిక రూపమును మనమున దాల్చుటకుఁ జిత్తమునుపయోగిం చును. తన దేహరూపము ననుసరించియుండి, యింకొక రూపమును (దన) యంగములం బోలియుండు నంగము లతో నంగములలో నొక్కటియైన విడువక మనమున నూహించును."

"మనుజుఁడు నలము నావేష్టనమునుండి తీసిన నిట్లు చింతించును: ఇయ్యది నడము ఇయ్యది యా వేష్టనము. నడమొకవస్తువు, ఆవేష్టన మింకొకభిన్నమైన వస్తువు. ఆవేష్టనమునుండియే నడము తీయఁబడినది. ఈ రీతిగనే యాతఁడు భుజంగమును దత్త్వక్కునుండియు, కరవాలమును గోశమునుండియు వేఱుచేసిన నియ్యదియే యుత్తమంబగువృత్తి."

"అట్లు మనము శాంతమయముగను, బవిత్రము గను నిర్మలముగను, శీలవంతముగను,బాపరహితముగను, నిర్వికారముగను, కోమలంబుగను, దృఢముగను, కర్మకై సంసిద్ధముగను నొనర్చిన యాతఁడు మనమును బుద్ధి మార్గములనుండి నిగుడించును. ఆతఁడు వివిధరీతులగు బుద్ధిని బొందును. అవి యెవ్వియనిన:—దృగ్గోచరుండ గును; అదృశ్యుండగును; తానొక్కఁడై యుండియు నానాత్వమును జెంది, తిరిగి యేకత్వమును బొందును. ఆకాశమునవలెనట్లు గోడలోనుండికాని, ప్రాకారముల లోనుండికాని, పర్వతములోనుండికాని యొకప్రక్క నుండి యింకొకప్రక్కకుఁ జనును; భూమిలో నీటియం దువలెఁ గ్రిందికిని, మీఁదికిని జనును; భూమిపై నడచు నట్లు నీటిపై మునుఁగక నడచును; పక్షిఱెక్కలపైవలె నాతఁ డాకాశములో వ్యస్తపాదుఁడై చనును; చంద్రుఁ డును, సూర్యుఁడును బ్రభవిష్ణులై, తేజోమయులై, తేజస్వులై యుండినను వారలను స్వహస్తములలోఁ దాకుట బ్రహ్మలోకమునకు దేహముతోఁ జనుట వం టివి."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"కుశలుండగు కులాలుండుకాని, యట్టి వాని శిష్యుండుకాని, యుక్తమైనమంటితో నేవిధమైన పాత్రను గోరిన నావిధమైన పాత్రను జేయసమర్థుండగునో; గజదంతములోఁ బనిచేయువాఁడు దంతముతోడను, బంగారుపనివాఁడు బంగారముతోడను, గోరిన వస్తువులను జేయ సమర్థులగుదురు. ఇయ్యదియే యుత్తమంబగువృత్తి."

"అట్లు మనమును శాంతమయముగను, పవిత్రముగను, నిర్మలముగను, శీలవంతముగను, పాపరహితముగను, నిర్వికారంబుగను, కోమలంబుగను, దృఢముగను, గర్మచేయుటకు సంసిద్ధముగను నొనర్చిన యట్టివాఁడు తనమనమును దివ్యశ్రోత్రముపై నిగుడించును. అట్టిమానుషకర్మను నుపగమించు దివ్యశ్రవణములో దూరపువైనను, దగ్గరవైనను, మానుషములైనను, దైవసంబంధములైనను వినును".

"రాజపథమననున్న మనుజుఁడు భేరీనినాదమును, మృదంగధ్వనిని, నల్పడిండిమధ్వనులను, శంఖధ్వనులనువినిన నియ్యది భేరీధ్వని, యియ్యది మృదంగధ్వని యియ్యదియల్పడిండిమధ్వని, యియ్యది శంఖధ్వని యని సుక్తెఱుంగు."

"అట్లు మనసును శాంతమయముగను, పవిత్రముగను, నిర్మలముగను, శీలవంతముగను, పాపరహితముగను, నిర్వికారంబుగను, కోమలంబుగను, దృఢముగను, గర్మచేయుటకు సంసిద్ధముగను నొనర్చిన యట్టివాఁడు తనమనమును హృదయమును వ్యాపించు జ్ఞానముపై నిగుడించును. తన హృదయములో నితరులయొక్క హృదయములను దదితరజీవజంతువుల యొక్క హృదయములను దెలిసికొని—

1. చండశీలంబగు హృదయము నుత్తాపశీలము కలదానిగను, ప్రసన్నంబగు హృదయమును ప్రసన్నమైన దానిగను;

2. కుపితంబగు హృదయమును సకుపితముగను, శాంతియుక్తంబగు మనమును శాంతియుక్తమైనదానిగను;

3. మూఢమైన మనమును మూఢమైనదానిగను' జాకరూకతలోఁ గూడిన మనమును జాగరూకత కల దానిగను;

4. అప్రమత్తమైన మనము నప్రమత్తమైనదానిగను, (స్వస్థతలేని మనమును) స్వస్థతలేని దానిగను;

5. విశాలమైన హృదయమును విశాలమైనదానిగను, క్షుద్రంబైన మనమును క్షుద్రమైనదానిగను;

6. నీచమైనమనమును నీచమైనదానిగను, నున్నతమైన మనము నున్నతమైన దానిగను;

7. దృఢమైనమనమును దృఢమైనదానిగను, నవవస్థితమైనమనము నవవస్థితమైన దానిగను;

8. అనధీనమైన మనము ననధీనమైనదానిగను, బరాధీనమైన మనమును బరాధీనమైనదానిగను;

అట్టివాఁడు సుక్తెఱుంగును."

[సశేషము]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# పాంథ!

వెలువోలు సీతారామయ్య చౌదరి గారు

నిశ్చలంబు నిర్మలమయి నెగడునట్టి గూర్చ
మృదుల నవనీతహృదయంబు ముదము
నరుగుచున్నాడ వెచ్చటికయ్య; పాంథ!
ఆగు మాగుము, నాపలు కాలకింపు.

నీసహచరులు సంచరించు సరణిఁగని
కంటకావృతమైన మార్గంబటంచు
శిష్యవాత్సల్యమున నీకుఁ జెప్పినట్టి
గురుని హితవాక్యముల నెద మరువఁబోకు.

మంచిమార్గంబె నీవు గ్రహించినావు
కాపథంబులు కొన్ని నిన్ గలయుచుండు
మందభాగ్యుండ నగుచుఁ బ్రమత్తుఁడవయి
యాసరణు లవలంబింప నాసపడకు.

పాంథ! నీవేగుచున్న దే పరమసౌఖ్య
జాలములు కాలవాలమై శ్రావ్యమైన
శారికాకీర పికకేకి సారస ప్ర
సూతనిస్వనములతోడ సొంపొసంగు

నవ్యరమణీయ మార్గంబు, వనకుమారి
భోగ భాగ్యంబులను, కవిపుత్త్రుఁడవయి
పరగుదో స్వీయగీతముల్ పాడుకొనుచు
నందుకొనుమయ్య, గమ్యస్థలంబు పాంథ!

---

# ప్రణతి

కొమరవోలు నాగభూషణరావుగారు

లాలిఁబాడెడు మలయానిలంబు లందు
విమలతోయనదీతరంగములయందు
వికచపుష్పఫల వనవాటికల యందు
అవని నస్పష్ట సూక్ష్మరేణువులయందు.

శ్రీహిమాలయపర్వత శ్రేణులందు
బాలభానుమయూఖ సంస్పర్శయందు
కమలకాంత వినూత్నహాసముల యందు
శారద శశాంకజ్యోత్స్నాప్రసారమందు

వలపులం జిల్కు చెంగల్వకొలనులందు
గుమిగఁగూడిన నీలమేఘములయందు
పచ్చఁగాఁ బండిపొలుపారు పంటలందు
కవికుమారులమంజులకవితలందు

నిరుపమానంద తాత్పర్యగరిమ నిచ్చు
ప్రకృతియే ప్రేమ ప్రేమయే ప్రకృతిసుమ్ము
ప్రణయమాధుర్యమూర్తియౌ ప్రకృతి కివె
కరము ననురక్తి నానమస్కారశతము. [గొ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ప్రాచీన భారతీయాభరణములు

## దేవతావిగ్రహములకు జెందినవి

### చిత్రము ౧

693. స్త్రీ విగ్రహముయొక్క చిన్నకిరీటము. ఇది 'డ్యూక్' అను పాశ్చాత్యదేశపు ప్రభువు ధరించుకిరీటమువలె నున్నది. 694. దేవతాకిరీటము; గొప్పది. 695 వెండ్రుకలను, ముకుటమును సరిదిద్దియుంచుట కుపయోగించునది. పైన 3 తురాయిలు గలవు. 696. దేవతాకర్ణాభరణము. ఒరిస్సాలో నిప్పటికిని ఈ యాభరణమును ధరించుచున్నారు. 697. దేవతాకర్ణాభరణము. దీనికి పూవు, గుబ్బ కలవు. ముత్యపుజాలరులు గలవు. 698. కర్ణపుష్పము. ఒరిస్సాలో భువనేశ్వరాలయము చేరువనున్న యొక చిన్న ఆలయమునందలి వరాహావతారవిగ్రహమున చెక్కబడియున్నది. 699. ముత్యపుసరులను కూర్చిన బంగారు రేకులో చేసిన కర్ణాభరణము. 700. పైచెవిని ధరించెడు ఒకఅందమైననగ. దీనికి తోలపత్రమని పేరుగలదు. 701. 699-వ సంఖ్యగల కర్ణాభరణమువంటిది. 702. కార్తికేయ విగ్రహము. 703. భగవతీవిగ్రహము. ఈరెండువిగ్రహముల మేఖలలును ఒకేమాదిరిగనున్నవి. కాని 702 విగ్రహపు మేఖలయొక్క మోపు ఎక్కువశిల్పసౌందర్యముగలిగి చూడ సొంపుగనున్నది. రెండువిగ్రహములయందునున్న కంకణములు, దండకడియములు సుందరముగ నున్నవి. భగవతీ విగ్రహమునకు మధ్యకాలపు ఫక్కిని చెక్కినచంద్రహారమున్నది. ఇదిగాక ఇతరహారములును రెండువిగ్రహములపై చెక్కబడియున్నవి. అవి చాల అందముగనున్నవి. కార్తికేయవిగ్రహమునకున్న ఇతరహారములో పెద్దదానిమోపు పులిగోళ్లతో బంగారమున కట్టబడినదానివలె చెక్కబడినది. భగవతీవిగ్రహము భువనేశ్వరాలయగోపురమున నొక గూటియందున్నది. దానిపొడవు 7 అడుగులు. అదిక్లొరైట్ అను ఒక ఖనిజపదార్థముతో చేయబడినది. కార్తికేయ విగ్రహమును ఆగోపురముననే యున్నది. ఈ గోపురము ఏడవశతాబ్ది మధ్యకాలమున నిర్మింపబడినది. ఈ విగ్రహములయందలి ఆభరణ శిల్పవైఖరి ఆకాలముననే బంగారపు నగలను చేయుటయందుగల అధికమగు సామర్థ్యమును వెల్లడిచేయుచున్నది.

### చిత్రము ౨ (ఏ, బి)

౧౨౦౦ ఏండ్లకు పూర్వము ఒరిస్సాలో నీయాభరణములను ధరించుచుండిరి.

704. తలముడి (కొప్పు). బుజము నానునట్లు వేయబడినది. పూవులు చిత్రించిన నాడాలో కట్టబడినది. ఆ నాడాపైన రెండువైపుల నక్షత్రములవంటి పూవులు చెక్కబడినవి. ముందలపై ముంగురులు జాలరువలె దిద్దబడియున్నవి. పైన ముక్కోణములుగల యొక భూషణము చెక్కబడియున్నది. చెన్నపురమును నిప్పుడును కొందరు ఆయాలు ఇట్టిముడినిఎడమవైపున వేసికొనుచున్నారు. 805. తలవెండ్రుకలుగాని, కుట్టుపనిగల నాడాలుగాని కలిపి పేని కిరీటమువలె కట్టబడిన ముడి. 706. సరిగబుటాలు తీగలువేసిన నాడాతో చేర్చి తలపాగావలె చుట్టినముడి. 707. తలముడి. ఇట్టిముడిగలవిగ్రహము భువనేశ్వరాలయగోపురముపై నున్నది. ఒరిస్సాలోను, రాజధానిదక్షిణభాగమునను స్త్రీలు ఇట్టిముడిని ఇప్పటికిని వేసికొనుచున్నారు. దానిపై రాకణివంటి బంగారు నగను తాల్చెదరు. ముత్యములతోగాని, బంగారుతోగాని చేసినగొలుసులజడలు మూడు ముడిపై నొకవైపున ధరింతురు.

ఆహస్తాభరణములలో ప్రధానమయినది 'బాలా' అనునది. ఒరిస్సాలో దానినే 'ఖారు' అందురు. 'బాలా' అనునది గంధ్రపనికడ్డిలో చేయబడినది. రెండవది: చదునైనకడ్డితో చేయబడినది. సాధారణముగ శిల్పములయందివి పూసలతో కట్టబడినట్లే చెక్కబడును. కొన్నిటియందుమాత్రమే పుష్పములు, రెక్కలును చెక్కబడియుండును (చూ. 710 ఏ). ఒకొకప్పుడు పైన పూవు లేకుండ రెండువరుసలుగ నుండును (చూ. 715 ఏ). లేక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రెండువలయములమధ్య కొంతఅవకాశము వదిలిగాని, విలువంపులుగవంచిగాని, ఇతరఏవిధమయిన వనిశీపనిగలిగిగాని యుండును. (చూ. 709 ఎ, 713, 714, 708ఎ,). కట్టకడపటిమాదిరి వానిని సామాన్యముగా కలకత్తాలో 'పాటురి' అనుపేర ధరియింతురు. అవి అయిరోపీయుల కడియములకు ప్రతిరూపములుగా నుండునవి.

వండను బాజు, టాబి, డాక్ అను పేరులుగల కడియములును మొనమొన్నటివరకు ధరించుచుండిరి. (చూ. 716 బి, 712, 708 బి). 709 బి, 715 బి సంఖ్యగల రెండును 'టాబి'అను దండకడియముమాదిరివి. ఇప్పు డుపయోగమున నుండునవి యుట్టివికావు. 709 బి సంఖ్యగలదానికంటె 710 బి సంఖ్యగలదానికి చిరుగంటలు కలవు. గొలుసుపట్టెడను చిరుగంటలుకాని, చిరుగజ్జెలుగాని, కట్టినమాదిరిగాని అందీముఖ్యమైనది. దానిని కింకిణిఅందురు. స్త్రీపురుషు లుభయులు ధరింతురు. 718 లో మాదిరిగా గజ్జలుగాని గంటలుగాని లేక బోలుకడియమున గుండ్లు వేసియుంచుటయుగలదు. దీనికే సంస్కృతమున నూపురమనుపేరు. 718 లో పైనవున్న అందె మాత్రమే యిప్పుడు వాడుకయం దుండునది. దానిని సత్రిజిఅందురు. అది బోలుగాగాని, గజ్జెలుకట్టబడిగాని ఉండును. 719 లో పైది, 717 లో పైది ఒరిస్సాలోను తెలింగనలోను బట్టలు ఎగువకుకట్టుకొనువాడుక వారు ఉపయోగింతురు. దీనిని స్త్రీలు పురుషులుకూడ ధరించెదరు. ['ఇండియన్ జ్యూయలరి'అను పత్రికనుండి.]



# పయఃపానము (భావగుచ్ఛము)

ఆవంత్స వెంకటరంగారావు గారు, బి. ఏ., సీనియర్

చదలఁ దీవ్రసంచారము సలుపుకతన
జలదబాలుని దేహమ్ము ఛాయదొఱఁగి
అసితమై ఘర్మబిందు ముత్యములఁ రాల్చి
క్షుత్పిపాసార్త రూపమ్ముఁ జూపుచుండఁ
గరుణ భూదేవి నిజధరా ధరపయోధ
రముల దుగ్ధమ్ములాని విశ్రాంతి నొందఁ
బిలువఁగా వాఁడు ప్రీతితో నిలకు దిగుచు
వారెను ప్రసన్నసితపయోధార లపుడు
వరపయఃపానమునఁ దెల్లఁబడియె నతఁడు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## భారతీయుల ప్రాణముల విలువ

### టెలిగ్రాఫికుపత్రిక విలాపము

<u>మానవుల ప్రాణములు, వానివిలువ:</u> కడచిన మత కలహముల సమయమున కలకత్తానగరమున దుండగీడ్రు చేతికి షేకమహమూదు అను తంతిజవాను తన ప్రాణములను గోలుపోయెను. తత్పరిహారముగ ఉదారశీల మగు ప్రభుత్వ మాతని కుటుంబమునకు నలువదిరూపాయలు ధర్మభిక్ష మొసంగెను. ఇందువలన కొంతకాలమునకు పూర్వము ౧౫౦ రూపాయల పరిహారము తనయజమానునకు ప్రభుత్వమువలన లభించునట్లుచేసిన యొక వేటకుక్క ప్రాణముల విలువకన్న తంతి తపాలుశాఖల యందలి యుద్యోగుల ప్రాణములవిలువ చాల నల్పముగ మతింపబడుట స్పష్టమగుచున్నది. ఆధర్మభిక్ష తపాలుఉద్యోగులవరకు కూడ వ్యాపించినట్లు తెలియ యనచ్చుచున్నది. ఆసాములో నొకగ్రామమునందలి కార్యాలయమున పనిచేయుచున్న సబ్ పోస్టుమేస్టరు తీవ్ర జ్వరపీడితుడయి సాధ్యమయినంతత్వరలో విరామమును దయచేయింపగోరెను. కాని యాతడు తనయుద్యోగపు విధ్యుక్తధర్మములను నెరవేర్చుటకయి తన ప్రాణములను ధారపోయువరకు విరామము లభించుతరుణము సంప్రాప్తింపదయ్యెను. పాప మాతని కుటుంబమునకు ౧౫౦ రూపాయలు ధర్మభిక్ష మొసగబడెనట! తంతి తపాలు శాఖలయందు మనప్రాణములవిలువ యిట్టిది. ఆర్జకుడగు వానిమరణమువలన వాని కుటుంబమునకు సంభవించెడు నష్టకష్టములను, నిస్సహాయస్థితినిగూర్చి చక్కగా పరిశీలింపమి వింతలలో వింత!!

---

## భారతదేశ సంస్థానములు-వాని సంవత్సరాదాయము

'హిందూస్థాన్ రివ్యూ' అనుపత్రికలో శ్రీ. సి. విజయరాఘవాచార్యులు గారు 'భారతదేశ సంస్థానముల భావిసమస్య' అను వ్యాసమున నీక్రిందివిధమున వ్రాయుచున్నారు. దీనినిబట్టి అల్పాదాయముగల సంస్థానము లూహింప శక్యముగాని స్థితియందున్నవనుట స్పష్టమగును.

భారతదేశమున ౫౬౨ సంస్థానములు గలవు. వానిలో ౧౦ మొత్తమున కోటికి తక్కువగాని సంవత్సరాదాయము గలవి. వీనియందు హైదరాబాదు ఒక్కటియే ఆఱుకోట్లు ఆదాయముగలది. ౫౩ సంస్థానములు ౧౦ మొదలు ౧౦౦ లక్షలవరకు ఆదాయము గలవి. ౧౨౮ సంస్థానములు లక్ష మొదలు ౧౦ లక్షలవరకు నాదాయము గలవి. తక్కిన ౩౮౨ సంస్థానములు లక్షకంటె తక్కువ ఆదాయము గలవి. వీనిలో రమారమి ౧౩౮ సంస్థానములు ౧౦ వేలకన్న తక్కువ ఆదాయము కలవి; ౭౦ సంస్థానములు వేయికన్న తక్కువ ఆదాయముకలవి. వానిలో రెండుసంస్థానముల విషయ మిట ప్రత్యేకప్రస్తావనార్హము. ౧. రాజానాయక్ గంగారామ్ అంసమ్ అను వర్ధ్యవాన్ నాయకునకు ౧౬౦ రూపాయలు ఆదాయము. ఆతని పోష్యులు ఏబదినలుగురు. సంస్థానవిస్తీర్ణము ౫ చదరపుమైళ్లు. ౨. బిల్బారిరాజను రాజా బావ్ జీ గారికి ౯౦ రూపాయలు ఆదాయము. ఆతనిపోష్యులు ముప్పదియిద్దఱు. సంస్థానవిస్తీర్ణము ౧౪ చదరపుమైలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇట్టి సంస్థానములను నిర్మించుటకుగల కారణములు మిగుల నాశ్చర్యకరముగ నుండును. ఇట్టిపరిస్థితులలో నిట్టి యనేకసంస్థానముల—వేయిరూపాయలకంటె తక్కువ ఆదాయము గలవాని—అధీశులను సజీవములగు పిల్లల ఆటబొమ్మలయందలి రాజారాణులతో సరిపోల్చుట సాహసము గాజాలదు.

---

## భారతదేశము—శిశుమరణములు

౧౯౨౭ సం. ఏప్రిల్ నెల మాడర్న్ రివ్యూలో శ్రీ రాజానికాంతదాసుగారు వ్రాసిన "భారతదేశమున మనుష్యబలనష్టము" అను వ్యాసమునుండి.

౧౯౨౧ వ సం. జనసంఖ్యప్రకారము భారతదేశమునందలి శిశువులసంఖ్య.

| వయఃపరిమాణము | సంఖ్య లక్షలు | మొత్తము జనసంఖ్యలో నూరుగురిలో వంతు |
|---|---|---|
| ౦–౫ | ౪౦౦ | ౧౨.౬ |
| ౫–౧౦ | ౪౭౦ | ౧౪.౮ |
| ౧౦–౧౫ | ౩౭౦ | ౧౧.౬ |
| మొత్తము | ౧౨౪౦ | ౩౮ |

భారతదేశమున చాలవరకు ఎక్కువమంది బిడ్డలకు—అందును చంటిబిడ్డలకు—శరీరపుష్టి, వికాసము లేదనియే చెప్పుట యుక్తము. ఆహారము, సుపోషణవిధానము పిల్లలయభివృద్ధి కావశ్యకములైనవి. వ్యవసాయమునకు పేరుగన్న భారతదేశమున పరిశ్రమలకు పేరుగన్న ఇంగ్లాండు జర్మనీలలోకన్న (పిల్లలకు ప్రధానాహారమగు) పాలు చాలతక్కువగా లభించుచుండుట సుప్రసిద్ధమగు విషయము. ఇంతేకాక భారతదేశమునందలి ప్రజలు ౩ వంతులవరకు దుర్భరదారిద్ర్యపీడితులై తినుటకు తిండి లేక మలమలమాడుచున్నారు. కావున పిల్లలపోషణమునకు వలసిన ఆహారాదులు దుర్లభములగుచున్నవి. ఆరోగ్యశాస్త్రపరిజ్ఞానాభావమును దీనికి తోడగుచున్నది. ఇట్టిస్థితిగతులలో క్రిందిపట్టికయందు గనపడుకీతిని శిశుమరణము లత్యధికముగ నుండుట వింతకాదు. ఇంగ్లాండులో ౧౦౦ కి ౭.౫ ను, జపానులో ౧౦౦ కి ౧౬.౬ ను, కాగా భారతదేశమున ౧౦౦ కి ౧౯.౪ శిశుమరణములు సంభవించుచుండుట పరికింపవలెను.

### భిన్నభిన్న దేశములయందలి శిశుమరణముల పట్టిక

| దేశము | సంవత్సరము | జీవములతో పుట్టిన ప్రతినూరుగురు బిడ్డలలో చనిపోయినవారు |
|---|---|---|
| ఇంగ్లాండు–వేల్సు | ౧౯౨౪ | ౭.౫ |
| ఫ్రాన్సు | ౧౯౨౪ | ౮.౫ |
| బెల్జియం | ౧౯౨౨ | ౧౦.౭ |
| జర్మనీ | ౧౯౨౪ | ౧౦.౮ |
| స్పెయిను | ౧౯౨౩ | ౧౪.౫ |
| ఇటలీ | ౧౯౧౮ | ౧౬.౧ |
| జపాను | ౧౯౨౨ | ౧౬.౬ |
| ఇండియా | ౧౯౨౧ | ౧౯.౪ |

గర్భమున మృతులై జనియించిన శిశువులుగాక భారతదేశమున ప్రతిసంవత్సరమును ౨౦ లక్షలు చంటిపిల్లలు మృతులగుచున్నారని అంచనావేయబడినది. బాల్యమునసే మృతినొందువారత్యధికసంఖ్యాకులు. ౧౦–౧౫ ఏండ్లబాలురు ౧౦౦ లక్షలు మృతులగుచున్నారు. దుష్టములగుఆహారములచేతను,ఆరోగ్యదూరములగు పరిస్థితులచేతను బాధపడుబాలురు మృతులగువారికన్న నెక్కువమంది గలరు. వారచిరకాలమున మృత్యుదేవతకుగాని, చిరకాలము ననారోగ్యదేవతకుగాని బలియై, దేశాభివృద్ధికిని, దేశక్షేమమునకును నిరుపయోగులగుచున్నారు.

---

## భారతజాతీయనాయకుల కొకసందేశము

శ్రీయుత తారకనాథదాసు (Ph. D.) గారు ౧౯౨౭ ఏప్రిలునెల మాడరన్ రివ్యూ పత్రికయందు ప్రకటించిన 'చైనాతోఇంగ్లాండు యుద్ధము — భారతజాతీయనాయకుల కొకసందేశము' అను వ్యాసమున ప్రకృతము ఇంగ్లాండు చైనాయెడ పన్నుచున్న తంత్రములను, ఇండియాపారతంత్ర్యస్థితిని, ఇండియాపై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఇంగ్లాండు చూపుచున్న నిరంకుశచర్యలను, నిరసనభావమును, రషియా టర్కీల విషయమున వెనుక ఇంగ్లాండు కావించిన తంత్రములను వివరించుచు తుదకిట్లు నుడివిరి:

ప్రపంచయుద్ధమున బ్రిటిషురాజ్యము సురక్షితముగ నుండుటకొరకు జర్మనులతోడను, తురుష్కులతోడను, భారతీయులుపోరాడి తమ జీవితములను ధారపోసియుండుటను, తత్ఫలితముగ అమృతసరహత్యలు, రౌలెట్టుచట్టము, బ్రిటిషువారి కొరకు భారతీయులు సంరక్షించిన దక్షిణాఫ్రికాయందు భారతీయుల యెడ బ్రిటిషువారుచూపిన విభేదభావము, ఇన్నిటికి పైగా ప్రపంచసామ్రాజ్య మహాసభయందు భారతదేశ మితర రాజ్యములతో సమానమగుగౌరవమును బొందదగునన్న తీర్మానము, మొదలగునవి బ్రిటిషువారు ప్రసాదించిన వరములనుటను భారతీయుల కెన్నిటికిని మరువరాని విషయములు. ఇట్టియన్నలను బడసిన భారతదేశము బ్రిటిషుసేనల కొరకును, బ్రిటిషురాజ్యముకొరకును, ఆసియాకు విరుద్ధముగను నేల పోట్లాడవలెను? ప్రపంచమహాయుద్ధసమయమున గాంధీమహాత్ముడుకూడ సైన్యమును సమకూర్చెనుగాని నేడట్టి స్థితిలేదు. మహాత్ముడును ఇతర నాయకులును సైతము భారతదేశముయొక్కయు, ఆసియాఖండముయొక్కయు స్వేచ్ఛాస్వాతంత్ర్యములకును, జాతీయైకమత్యమునకును విద్రోహమును గావింప సమకట్టినవారు తప్ప నితరభారతీయులెవ్వరైనను, బ్రిటిషులాభముకొరకు చీనాతోగాని ఏయితరదేశములతోగాని కత్తిగట్టి పోరాడు టనుచితమని ప్రబోధింపవలసిన సమయము ఘటిల్లించినది.



చియాంగుకాయిషేకు సేనాని

ఈయన కాంటనుప్రభుత్వ సేనానాయకుడుగనుండెను. హాంకో, నాంకింగునగరములనుఆక్రమించుకొనెను. మఱియు దక్షిణభాగపు జాతీయపక్షనాయకుడు. కాని యాపక్షమునందు అతివాదులు రషియాసోవియటుపక్షమువారి ప్రేరేపణలకు వశమగుచున్నారను తలంపుతో అందుకు ప్రతికూలముగ నాంకింగునందు వేరొక ప్రభుత్వమును ఏర్పరచిరి. [౧౯౨౭, ఏప్రిల్ నెల ౨౫వ తేది స్ఫియరుపత్రిక.]

—

## స్త్రీలయం దున్నతవిద్యావశ్యకత

'సోషల్ సర్వీస్' అను త్రైమాసికపత్రిక ఇట్లు వాకొనుచున్నది.

జాతియొక్క నాగరకతాభివృద్ధిని విద్యాభివృద్ధిపట్ల నాజాతి కావించిన పరిశ్రమనుబట్టె నిశ్చయింపవగును. ప్రభుత్వము తనఆదాయమున నెక్కువభాగమును విద్యాభివృద్ధికై వ్యయించునేని, విద్యావంతులగు మెట్రికలవంటియునవసలనేకులు బద్ధకంకణులై తమదేశమునందలి బాలబాలికలకు లెస్సగా విద్యను నేర్పి వారిని పౌరశిఖామణులుగ చేయుపవిత్రోద్దేశముతో తమజీవితముల నర్పింతురేని, గొప్పవర్తకస్థానములయందలి వర్తక చక్రవర్తులుదారులై యొండొరులనుమించి తమదేశమునందలి విద్యా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంస్థలయభివృద్ధికై యపారముగ ధనము నొసంగుచుదురేని, దినదినాభివృద్ధిగాంచుచున్న తమపిల్లలభావిసుఖజీవితము నకై శుష్కదరిద్రులు సైతము తమసౌఖ్యముల నించుక యేని సరకుగొనకుందురేని, యెన్ని యిక్కట్టుల పాలైయున్నను, ఎన్నిలోపములు గలిగియున్నను జాతి అత్యున్నతాభ్యుదయమును, ప్రఖ్యాతిని గాంచగలదని నొక్కివక్కాణింపవచ్చును. భారతదేశమునందలి ప్రస్తుతపరిస్థితులను గూర్చి యిట విమర్శించు టనవసరము. కాని విద్యావిధానమునందలి యవస్థావిశేషమును మాత్ర మిట పేర్కొనవలెను. అది స్త్రీలయందున్నతవిద్యావ్యాపనావశ్యకత. విద్యనేర్పుటకును, వైద్యముచేయుటకును, సంఘాభివృద్ధికరములగు కార్యములను నిర్వర్తించుటకును, కేవలము స్త్రీలే చక్కగా నిర్వహింపగల ఇతరకార్యములను నెరవేర్చుటకును స్త్రీలు వలసినంతమంది లేకపోవుటయే భారతదేశస్త్రీల కున్నతవిద్య యెంతయవసరమో తెలుపగలదు. పాశ్చాత్యదేశములయందు బాలబాలికల ప్రాథమిక మాధ్యమికపాఠశాలలలోని యుపాధ్యాయులలో స్త్రీలే యెక్కువమంది యున్నారు. వారు పట్టుదలతోను, ఆసక్తితోను తాము నిర్వర్తింపవలసినవిధులను గుర్తెఱిగి పెంపొందియున్నారు. వారు పొందిన సక్రమశిక్షావిధానమే వారి కట్టియభ్యున్నతిని సహకరిచ్చినది. అందు సాంఘికాభివృద్ధికరములగు విషయములయందు పాల్గొని సామర్థ్యముతో నిర్వహింపగల స్త్రీలు భారతదేశమున చాల తక్కువగ నున్నారు. వేయేల? క్లిష్టములైన ప్రస్తుతపు సాంఘికపరిస్థితులను సరిచేయుటకు సమర్థులగువారు కావలయునన్నచో విద్యావిధానమును ప్రస్తుతపు స్థితిగతులకు దగినట్లు సవరించుకొను టత్యంతావశ్యకము.

---

## 'మారెజో'ద్వీపపరిశోధనము — ఇండియనులు

('అమేజాను' నదీముఖమున గల యొక ద్వీపమున ఈనడుమ సలిపిన పరిశోధన ఫలితములు).

[అమెరికాఖండపు గొప్ప'పురాతనవస్తుశాస్త్రజ్ఞు' డగు ఫిషర్ దొరగారు 'మారెజో' ద్వీపమునందలి తన పరిశోధన ఫలితములను గూర్చి ౧౯౩౭ ఏప్రిల్ ౨వ తేదీ 'స్ఫియర్' పత్రికయందు వ్రాసిన వ్యాసము నుండి]

'మాకాకవో' అనుస్థలమునకు సమీపమున నున్న గోరీదిబ్బకై బయలుదేరితిమి. దీని కథయే నేను పూర్వేండ్లక్రిందట వినియుంటిని. బురదప్రదేశములను, నిండు కాల్వలను దాటుచు రెండుదినములు కఠిన ప్రయాణము సాగింపగా, తుదకు 'లారెంజీరో' అను గోరీదిబ్బ చేరుకొంటిమి. ఈస్థలము తేళ్లకును, గబ్బిలములకును, కో



1. మారెజోద్వీపమున దొరకిన (ఇండియనుల పనితనము నిదర్శించు) కుండలు మున్నగువని ఫిషర్ దొరగారు పరిశీలించుచున్నారు.

మలకును ఆటపట్టైయైనను, బసచేయుటకు మాత్రము కొంతుకావలనుగనేయుండెను. ఇచ్చట కుండలు మొదలగు మట్టితో చేసిన వస్తువులు దొరకెడి సూచనలు కన్పడెను; విలువగల అట్టి కుండపెంకులు మాత్రమే అనేకములు నాకుదొరకినవి; కాని పూర్ణపాత్రము లేవియుఁలభింపలేదు.

'మాకాకవో' ఇక్కడికి మూడు మైళ్లుండెను. రెండుదినములకు మరల ఎడ్లపై బయలుదేరితిమి. దోమల దండులు మున్నగువాని బాధలపాలగుచు ఇంచుమించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాలుగుగంటలు పయనము సేయుసరికి "మాకాకెవో"కు సంబంధించిన చక్కని పచ్చికబయలు మాకన్నులబడెను. మేమచటికి చేరుకొనుసరికి దరిదాపు రెండుగంటలు లయినది. ప్రయాణముచే మిక్కిలి బడలియున్నను వెంటనే నా పనిమొదలికొనక నాకు తోచినది కాదు.

నేను చాకును భూమిలో నొక్కసారి నాటుట తోడనే కఠినపదార్థమొకటి తగిలినది. ఉత్సుకతతో



2. 'మారెజో' ద్వీపమునందలి ఇండియనుల అస్థిపాత్రములు

మెల్లగా చుట్టునున్న మట్టిని త్రవ్వివైచితిని. అంతకంతకు గొయ్యి లోతయి కొంచెముసేపటి కొక పెద్దపాత్ర బయల్పడినది. దానిగొంతుకపై పక్షులయొక్కయు, పాములయొక్కయు చిన్నచిన్న బొమ్మలు కన్పడినవి. మండు టెండలో సుమారొక గంటసేపు పనిసేయుసరికి సమగ్రమైన మట్టికుండయొకటి, 2½ అ. యెత్తును, 18 అం. పొట్టవెడల్పును గలది కనపడినది. వందలకొలది సం॥ముల నుండి దాని కంటియుండిన మట్టిని కొంచెము కొంచెమే కడిగివైచితిని. సూర్యాస్తమయము కాకమునుపే యీ చక్కనిపాత్ర రంగులతోను, చెక్కిన నగిషీలతోను, సుమారు వేయేండ్లక్రిందట తాను మొదట తయారైన సర్వాంగసౌందర్యముతో వెలుగ సాగెను. జాగరూకతతో నాకుండలోనిమట్టిని త్రవ్వితీసి అందుండి ముక్కలు ముక్కలుగ నొక యువకకళేబరపుటవశిష్టముల వేరు పరిచితిని.

మఱియు నాప్రదేశమున అమూల్య వస్తువులు వెలువడినవి. ఆ అవశేషములన్నియు కడిగిన మీదట నెక్కడను రంగులుగాని, నగిషీలుగాని చెడకుండ నఖండసౌందర్యముతో నొప్పినవి. భ్రష్టలయి పోయినవి కొన్నిశకలములు మ్యూజియములో తరువాత బాగుపరుపబడినవి.

—

## భారతదేశమున ప్రారంభవిద్య, కడచినశతాబ్దియందలి వెనుబాటు

['ఆస్ట్రేలియా ఇండియాలీగ్ బుల్లెటిన్'పత్రిక నుండి]

కొంచెమించు మించుగ హిందూదేశములోని ప్రతిగ్రామములో ఒక్కొక్క పాఠశాల యుండెనని ౧౮౧౩ లో కామన్సు సభవారికి నివేదింపబడినట్లు తెలియవచ్చుచున్నది. అప్పటి పాఠశాలల సంఖ్యయేమి? ఇప్పటి పాఠశాలల సంఖ్యయేమి? అప్పటినుండి వంద సంవత్సరములకుపైగా బ్రిటీషువారీ దేశమును పాలించుచున్నను అప్పటికి, ఇప్పటికి ఎంతటి విచారకరమైన వ్యత్యాసము! బ్రిటీషువారితోడి సంబంధమునవలన నిస్సందేహముగ చాల మేలు కలిగినది కాని విద్యావిషయమున జూచినచో వా రవలంబించినపద్ధతి నిరర్థకమై నిష్ప్రయోజనమైనది. ఇది కడుశోచనీయము. ప్రభుత్వమువారు మూలుగు కొనుచు ధనమిచ్చి సాగించుమన్న ఈ విదేశీయవిద్యాపద్ధతి హిందూదేశమునకు సరిపడలేదు. పాశ్చాత్యపద్ధతితో సరిపోల్చి చూచినయెడల హిందూదేశమునకు ప్రాచీనవిద్యాపద్ధతియే మిక్కిలి అనుకూలముగనుండగలదు. బ్రిటీషువారికి పూర్వము ప్రతిగ్రామమున నొక పాఠశాలను నెలకొల్పుటకు వీలిచ్చిన ప్రాచీనపద్ధతిని యథాస్థానమునకు గొనివచ్చుటకై హైందవదేశాభిమానులు ప్రయత్నములు సలుపుచున్నారు. విదేశీయుడు ప్రజలకొఱకు ఎంత ఎక్కువగ పాటుపడినప్పటికి అతడు వారితో గలసి పనిచేయనికారణమున చెడిపోయిన విద్య స్వపరిపాలనమున తిరిగి సుస్థితికి రాగలదని యాశింపవచ్చును.

—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## బుద్ధుని సందేశము

'బ్రిటీషు బుద్ధిస్టు' పత్రికలో 'బుద్ధుని సందేశము'ను గుఱించి 'ఎనటోలి ఫ్రాన్సు' వ్రాసిన వ్యాసములో నీదిగువ విషయములు కలవు:

నిర్వాణసిద్ధాంతమును నమ్మి అయిరోపాఖండము బౌద్ధమతము నవలంబించుటకు సిద్ధముగా నున్నదని యన లేము కాని దానిని గుఱించి ఖండఖండాంతరముల బాగుగ ఇప్పుడు తెలియవచ్చుటచేత ఆమతము విశృంఖల హృదయులను ప్రత్యేకము చిత్రముగ నాకర్షింపగలిగిన దనియు, శాక్యమునికి ఆతనిని గుఱించి విరుద్ధాభిప్రాయ మేర్పడని యట్టి హృదయమును మార్చివేయ శక్తిగల దనియు మాత్రము అంగీకరింపవలెను. బాగుగ నాలోచించినయెడల పాశ్చాత్యప్రతిభ వికసింపక పూర్వమే హిమవత్పర్వతపాదమునుండి ప్రవహించిన యీ నీతి నిర్ఝరిణి ఫలప్రదమైన తన పవిత్రతను, రుచ్యమైన తన నవ్యతను ఇప్పటివఱకు గాపాడుకొనుచు వచ్చుటయు, దుఃఖపీడితమైన మానవప్రపంచమున కిప్పటికిని కపిలవస్తు మహర్షి యే ఉపదేశకులలో నుత్తముడుగను, దుఃఖోప శమనకులలో కడుమధురవచోవిభవుడుగను ఉండుట యు విచిత్రముగ నుండకపోదు.

బౌద్ధము నిజముగా ఒకమతముకాదు. అది ప్రపంచోత్పత్తిని గుఱించి కాని, దేవతలను గుఱించి కాని, సరిగా చెప్పవలసిన యెడల తుదకు పూజను గుఱించి కాని చెప్పదు. అది యొక నీతివిధానము: అన్ని విధానము లలో మిక్కిలి సుందరమైనది. అది యొక తత్త్వము. అత్యంతస్వేచ్ఛాప్రవృత్తిగల ఆధునిక వేదాంతులు చేయు మిక్కిలి సాహసపు ఆలోచనలకు కూడ సరివచ్చునట్టి తత్త్వము. అదియొక్క రక్తబిందువైన చెందకుండ తిబెత్తు, బర్మా, నేపాళము, కాంబోడియా, ఆనాం, చీనా, జపానుదేశములను జయించెను. ఇట్టిది సింహళమున దక్క (తూర్పు) ఇండియాదీవులలో నిలబడుట దుర్ఘట ముగ నున్నది. ఆమతముమీద గల విశ్వాసగౌరవముల చేత ఆసియాఖండమునం దిప్పటికిని దాని నవలంబించిన వారు ౮౦ కోట్లజనము గలరు. బాగుగ నాలోచించిన యెడల అయిరోపాఖండములో దాని యదృష్టము చాల విపరీతముగ నున్నది. అత్యంతము బుద్ధి సూక్ష్మతకలవా రని నిర్వివాదముగ నంగీకరింపబడు ఆధునికతత్త్వశాస్త్ర జ్ఞులలో మిక్కిలి శ్రేష్ఠులైన వారి కీమతమువలన క్రొత్త సిద్ధాంతములు తోచునాటికి అయిరోపాఖండమున దీనిని గుఱించి యెవ్వరు నెఱుగరు. లోకము దుఃఖమయమను వాదమును ప్రతిపాదించిన 'స్కోపెన్‌హోర్' అను శార్మన్యా (జర్మను) తత్త్వశాస్త్రజ్ఞుడు బౌద్ధతత్త్వము నాధారపఱచుకొనియే తనయిచ్ఛాశక్తి సిద్ధాంతమును నిర్మించెననువిషయము లోకవిదితమే. తన శయనగృహ మున గూడ సువర్ణబుద్ధప్రతిమ నుంచుకొనిన యాసుప్రసిద్ధ తత్త్వశాస్త్రజ్ఞుడే యీవిషయమును 'కాదనలేదు.

---

## పాఠశాలలయం దారోగ్యపరీక్ష

['హెల్త్ అండ్ వెల్ఫేర్' పత్రిక
(౨౫-౨-౩౭) నుండి.]

హిందూదేశమున పాఠశాలలం దారోగ్యపరీక్ష యింకను వెనుకబడియున్నది. ఈపద్ధతి హిందూదేశమున వ్యాపించుటకు చాలకాలము పట్టును. మొదట పెద్దపెద్ద పురపాలకసంఘములు దీనిని విద్యాలయ పరిశీలనములందు ప్రవేశపెట్టవలెను. చాలమంది వైద్యశాస్త్రపట్టభద్రులు ఇట్టి పని చూడవలసి యుందురు గాన నిందుకు ధన మత్యావశ్యకము. పట్టణములం దిదిప్రవేశపెట్టినచో పల్లెటూళ్లయందు కాలక్రమమున వ్యాపించి తీరును.

విద్యార్థులకు ఆహారలోపములు కండ్లజబ్బులు మొదలగునంశములు ముఖ్యముగ గమనింపవలసిన విషయ ములు. ప్రణాళికప్రసిద్ధిచెందుచు మెప్పునడయుచున్నది.

---

## కీ. శే. నాటకశిరోమణి

### శ్రీమాన్ ఏ. వి. వరదాచార్యులుగారు

కర్ణాటక రంగభూమి (సంపు ౧, సంచిక ౯) యం దాచార్యులవారినిగూర్చి వ్రాసిన వ్యాసపరంపర నుండి:—

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీ ఆచార్యులుగారు ఆంధ్రము మాతృభాషగా గల శ్రీవైష్ణవకుటుంబమున ౧౮౬౪ వ సంవత్సరము ఫిబ్రవరి నెల ౨ వ తేది జనన మొందిరి. బాల్యమున



వీరు చిత్రదుర్గమునందే విద్యాభ్యాసమును గావించి ప్రవేశపరీక్షయందుత్తీర్ణులయిరి. పిదపడి ఉన్నతవిద్యార్జనమునకై బెంగుళూరు కళాశాలయందు ప్రవేశించిరి. కాని కొలదిదినములకే మాతృవియోగదుఃఖకారణముగ విద్యార్జనమును విడనాడి ౧౮౮౯ వ సంవత్సరమున మైసూరుననే ఆరోగ్యశాఖయందొక గుమాస్తా ఉద్యోగమున జేరిరి.

నాటకకళాభిమానము వీరి పుట్టుకతో వచ్చినది. వీరుద్యోగమున జేరుటకు బూర్వము కొన్ని నాటకముల యందు జేరి తమ యద్భుతాభినయకౌశలమును ప్రదర్శించుచుండిరి. వీరికి ౧౯౦౦ ప్రాంతముల నుద్యోగహాని, దారాపుత్త్రినియోగము సంభవించి వీరిని దుఃఖసముద్రమున ముంచివైచినవి. మైసూరునందప్పుడున్న సరస్వతీవిలాససభవారు ౧౯౦౪ వ సంవత్సరము వీరిని ప్రోత్సహించి దుఃఖప్రపంచమునుండి నాట్యకళాప్రపంచములోని కడుగుపెట్టించి తమ సభకు 'రత్నావళి నాటకసభ'యను పేరిడి దానికి వీరినే యధిపతిని జేసిరి. అది మొదలు ఆచార్యులుగారు నాట్యకళాభివృద్ధికై సర్వ విధముల పాటుపడుచుండిరి. తమకుగల సామర్థ్యముచే నాసభయందలి నటులనందరిని దిద్ది తీర్చిరి. అప్పటినుండి యీసభవారు మైసూరుమండలముననే కాక చెన్నరాష్ట్రమున నెల్లకడలను సంచరించి నాటకములను ప్రదర్శించి యపారమగు కీర్తిని గడించిరి. ౧౯౧౦ వ సంవత్సరమున మైసూరుప్రజలు శ్రీ. శ్రీకంఠరాజ అరసుగారి యాధిపత్యమున గొప్పసభను జరిపి ఆచార్యులుగారి నాట్యకౌశల్యమును బ్రశంసించి యొక మణిఖచితస్వర్ణకంకణము (తోడా)ను వారి కొసగిరి. ౧౯౧౬-౧౯౧౭ వ సంవత్సరమున నీసభ దక్షిణదేశసంచారము గావించుచుండ నపటి మహాజనులు తిరుచినాపల్లియందు శ్రీ బెజంటుగారి యాజమాన్యమున సభగూడి వీరికి 'నాటకశిరోమణి' బిరుదమును, సువర్ణకంకణమును ఒసగి సన్మానించిరి. ౧౯౨౪ వ సంవత్సరమున బెంగుళూరుప్రజలొక మహాసభగూడి రత్నహారము నొకదానిని వీరికి బహుమానముగ నొసగిరి.



వీరు పురుషపాత్రములను ధరించెడివారు. దుష్యంత, హిరణ్యకశిపు, సంతాపక, రామవర్మ, వత్సరాజాదిపాత్రములకు వీరు పెట్టినది పేరు. ఏపాత్రమున కాపాత్రము



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీరి సర్వాంగములయందును కరగిపోసిన ట్లిముడుకొని యుండును. చతుర్విధములగు నభినయములు వీరి నాశ్రయించి యొకదానిని మించి యొకటి వెలయుచుండెడివి. ఏరసమున కారస మీనటశిరోమణి కనుసన్నల మెలగుచుండెడిది. అభినయకౌశలమునకు దోడు వీరికి శరీరసౌందర్యము, అవయవవిన్యాసవికాసములు నిండార నమరి యుండెడివి. వీరే మహాపురుషుని పాత్రమును ధరించిన నా మహాపురుషుడుగనే ప్రేక్షకులు తలతురు కాని ఆచార్యులనుబుద్ధి పొడమదు. వీరి దుష్యంత మహారాజుపాత్రమున కేమహారాజుసాటి? భిన్నభిన్న భావ పరంపర వీరి ముఖమున బరువిడుచు దేనికది యాక్షణమున సువ్యక్తమగుచుండును. ఏబదియేండ్ల ప్రాయమున సైతము వత్సరాజాది యువపాత్రములను ధరించు నాచార్యులు యువవత్సరాజాదులుగ నుండిరేకాని వృద్ధాచార్యులుకారు. ధరించినపాత్రమున దామైక్యమై పోవుదురు.

సంగీతసాహిత్యములయందు వీరు నిరుపమానులు. వీరికంఠము సుశ్రావ్యము. రంగమున వీరి సంగీతము సాహిత్యసంగతిని విలసిల్లుచు శ్రోతలను తన్మయులజేసెడిది.

ఈ పురుషుడు కేవలము నటకుడుగాడు. నాటకకర్తయు గూడ. పెక్కు నాటకములను స్వయముగ రచియించి, రంగానుకూలముగ మఱి పెక్కిటిని పండితులచే రచియింపించెను.

ఈ మహనీయుడు కడునుదారశీలుడు. తొలుత వీరిది పేదకాపురమయినను నాటకప్రపంచమున దామార్జించిన ధనమును దాచుకొనక, నాటకకళాభివృద్ధికిని, దారిద్ర్యపీడితులగు విద్యార్థుల విద్యాభివృద్ధికిని వినియోగించి శాశ్వతమగు కీర్తి నార్జించిరి.

ఇట్టి ఆచార్యులవారు ౩౦-౩౫ ఏండ్లు కర్ణాటక నాటకరంగమున జయభేరి మ్రోగించి ౧౯౨౬ వ సంవత్సరము ఏప్రిల్ నెల ౮ వ తేదినాడు నాటకరంగముతోపాటు జీవితరంగమును వీడి కీర్తిశేషులైరి. వీరి మృతిచే నాట్యకళాప్రపంచమునకు నష్టమపారముగ వాటిల్లినది.

---

## శివాజీ స్మరణచిహ్నము

[టైమ్స్ ఆఫ్ ఇండియా మార్చి ౨౮-వ తేది సంచికనుండి.]

'భారతదేశమున శివాజీస్మరణచిహ్న'మునకు ౧౯౨౧ సం.న పూనాలో వేల్సుయువరాజుగారు పునాదవేసిరి. మహావీరుడగు శివాజీ జీవితచరిత్రమును చదువుభాగ్యము లభింపనివారు ఆతనివిగ్రహమునైన జూచుచుండుటకుగా నొకబహిరంగస్థలమున నామహాత్మునివిగ్రహమునొకదానిని సంస్థాపించుటకు, శివాజీవంశీయులగు శ్రీ శ్రీ కొల్హాపూరు మహారాజావారును, తదితరులును సమకట్టిరి. జి. కె. మెహాతరుగారు ఎనిమిదిమాసములు ఎడతెగక కష్టించి విగ్రహమును నిర్మించిరి. వి. పి. కార్మర్కరుగారు అనుగుపీఠమునకు మూడులోహఫలకములను, ఒక నలువరాతిపలకను చెక్కియుంచిరి. వీటి నన్నిటియొక్క మట్టినమూనాల బొమ్మలిందు పొందుపరుపబడినవి.

గుఱ్ఱముపై నెక్కియున్న శివాజీ పెద్దవిగ్రహమే ముఖ్యమయినది. ఇది మెహాతరుగారి శిల్పము. ఈవిగ్రహము ఆధునిక పాశ్చాత్యశిల్పపద్ధతి ననుసరించియున్నది. పీఠముపై చెక్కబడిన తక్కినశిల్పములు పురాతనప్రాచ్యకళాపద్ధతి నున్నవి. ఈస్మరణ చిహ్నస్థాపనము ప్రాచ్య పాశ్చాత్య శిల్పకళావిధానములకు సంఘర్షణరంగభూమి యనుటకు మెహాతర్ కార్మర్కర్ మహాశయు లిరువురును చెక్కినడు భిన్నశిల్పములే నిదర్శనములు.

ఈ విగ్రహస్థాపనకు శ్రీ శ్రీ కొల్హాపూరు మహారాజుగారు ముఖ్యకారకులు. మహారాజుగారు పూజ్యుడును, తమపూర్వపురుషుడును నగు శివాజీవిగ్రహమును తమ యుద్యానవనమున ప్రతిష్ఠించుకొనక, ఆమహాత్ముడు హిందూదేశమున కంతకునుగూడ పూజ్యపురుషుడే యను నుదారజాతీయభావమును దమకార్యమునలన బ్రకటించుచున్నారు.

ఈవిగ్రహము ప్రపంచమందలి మిక్కిలి గొప్ప విగ్రహములలోనొకటి. మూడు చిత్రము లీసంచికయందు గలవు. వాని వివరము—

### ౧. శివాజీ మహారాజు

మెహాతరుగారి శిల్పము. వారి బొంబాయి కళాభవనమున నిపుడిట్లున్నది. త్వరలో నొక గచ్చునమూనా

తీసి 'విల్లిపార్లె' అనుస్థలమున లోహమున పోత పోయు దురు.

౨. శివాజీమహారాజు భవానీపూజ

ఈ చలువరాతిపలక స్మరణచిహ్నపు పీఠమున ముందుభాగమున నమర్చుటకై కల్పింపబడినది.

3. శివాజీమహారాజు అర్ధచిత్రము

మెహాతెరుగారు రచించినది. విగ్రహము పురుష ప్రమాణమున కొకటిన్నరరెట్లున్నది. సూక్ష్మలక్షణములు లోహవిగ్రహమున నింకనుజక్కగ ప్రకటితము లగును.

## చెరుకు తోటలకు ఎరువు

౧౯౨౭-వ సం. ఏప్రిల్ ౧౬-న తేది కృష్ణాపత్రికలో శ్రీ మాలేటి రంగారావుగారు ఇట్లు వ్రాయుచున్నారు.

మన దేశములో చెరుకు పంటలవలన విశేష లాభములు ఉండుటచేత రయితులు ఎక్కువగా చెరుకు వ్యవసాయము చేయుచున్నారు. ఎక్కువనుండి వ్యవసాయకులు ఇప్పుడు అనులులో ఉండు ఎక్కువ లాభము కలుగజేయు క్రొత్త పద్ధతులు తెలియక పోవుటచే నవలంబించక పూర్వవ్యవసాయ పద్ధతులనే అవలంబించుచు అంత విశేష లాభము పొందుటలేదు. భూములు ఎంత సారవంతముగా నున్నప్పటికి ప్రతి సంవత్సరము పంటకు తగ్గఎరువు వేయని యెడల తగిన ఆదాయము నివ్వవు. మనము ఒకభూమినుండి విశేషము పంటలు తీయుచున్న సంగతి అందరికి విశదమే. సదరుభూమికి తిరిగి ముందు వేయబోవు పంటకు తగిన ఆహారము నిచ్చి బలముచేయు నెరువులు ఉపయోగింప వలసి ఉన్నవి. సదరు ఎరువుల వలన ఖర్చు తక్కువగా నుండవలెను.

ఫక్తు ఒక్కపశువుల ఎరువు ఉపయోగించుటకన్న ఈదిగువ నుదాహరించిన ఎరువులుకూడ ఉపయోగించిన, ఎక్కువ మంచి గుణములు గల్గిన చెరుకురసము-బెల్లము నభివృద్ధి చేయును. మామూలు పశువులపెంట వేసినప్పుడు కల్పితమైన ఎరువులు తగ్గించవచ్చును. తరుచు చెరుకు సేద్యముయొక్క స్థితులు వేరగును. కనుక సర్వత్రముగా సిఫార్సు చేయుటకు అంత వీలుండదు. తరుచు నైట్రజను ఉపయోగము నీరు పారించు ప్రదేశములలో 70 పౌనులు మొదలు 150 పౌనుల వరకు భిన్నముగా నుండును. కొన్ని సమయములందు ఇంకను ఎక్కువగా నుండును. సూచించు ఎరువు మిశ్రమః ఆముదపుపిండి 500పౌనులు; సామాన్యపు సూపర్ ఫాస్ఫేటు 500 పౌనులు సల్ఫేటు ఆఫ్ పొటాష్ లేక సాల్టుపీటరు 100 పౌనులు. మొత్తము 800 పౌనులు మొదలు 1000 పౌనులు ఒక ఎకరమునకు ఉపయోగించవచ్చును.

చెరుకు నాటుటకు ముందు పై నుదాహరించిన ఎరువులు భూమిమీద వెదచల్లి దున్నవలయును. ఏప్రిల్ నెలాఖరున 200 మొదలు 300 పౌనుల వరకు నైట్రేటు ఆఫ్ సోడా రెండు మోతాదులలో చెరుకు వరుసలలో వేయవలసినది. ఇంకా వివరములు కావలసిన యెడల గుంటూరు చిలియన్ నైట్రేటు కమిటీవారికి వ్రాయవచ్చును.

## తిక్కనకాలనిర్ణయము

విజయనగరం మహారాజాకాలేజి మేగజిను (సంపు. ౬-సం. 3) త్రైమాసికపత్రికలో శ్రీ. జి. నరసింగరావుగారు (బి. ఏ., యల్. టి.) 'తిక్కనకాలనిర్ణయ' మనువ్యాసమున తిక్కన మంత్రిపదము నధిష్ఠించుటకు బూర్వమే యజ్ఞములు చేసియుండుననియు, భారతమును రచియించియుండుననియు, మంత్రియైన తరువాత నిర్వచనోత్తరరామాయణ రచనమును ప్రారంభించి పూర్తికాక మునుపే యాతడు మరణించియుండుననియు సూచించి యాతనికాలనిర్ణయమును గుఱించి యీక్రింది విధమున వ్రాసిరి:—

తిక్కన రచించిన నిర్వచనోత్తరరామాయణమున, నెల్లూరు రాజధానిగ రాజ్యమేలుచుండిన మనుమసిద్ధి రాజుసభ తానలంకరించినట్లు చెప్పియున్నాడు. అందుచే నాదికవియని పేర్కొనబడిన నన్నయకాలము నిర్ణయించుట కెట్టియాధారముకలదో, అట్టియాధారమే తిక్కనకాలమును నిర్ణయించుటకుగూడగలదని తోచుచున్నది. కాని యెవ్వనికంకితముగ భారతము నన్నయ రచించెనో యట్టి రాజరాజనరేంద్రునికాలము నిశ్చయ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ముగఁ దెలిసినట్లు మనుమసిద్ధికాలము మనకుఁ దెలియదు. అయినను దొరకిన శిలాశాసనములం బట్టి మనుమసిద్ధియను నొకరాజు శా. శ. 1179–1182 వరకు, అనఁగా క్రీ. శ. 1257–1260 వరకుఁగల కాలమున నుండెనని కనఁబడుచున్నది. కాని యిది నిర్ణయమునకు చాలదు. ఈ శాసనముల మనుమసిద్ధియు, తిక్కనమనుమసిద్ధియు నొకఁడే యని చెప్పుట కాధారము లేవియును లేవు. తిక్కనమనుమసిద్ధి తాతపేరును మనుమసిద్ధియే యైనట్లు నిర్వచనోత్తర రామాయణముననే చెప్పఁబడియున్నది. అందుచే మనుమసిద్ధియను పేరీవంశమువారికి మరికొందరి కుండియుండవచ్చును. కావున నీశాసనముల మనుమసిద్ధి యెవరని వివాదము పొడముచున్నది. ఇది నిర్ణయించుటకు నిర్వచనోత్తరరామాయణమున నేమున్నదో చూతము. తిక్కన కాశ్రయుఁడగు మనుమసిద్ధితండ్రియగు తిక్కనృపాలునిం గూర్చి యిట్లు చెప్పఁబడియున్నది:

"కేశవసన్నిభుండు పరిగీతయశోనిధి చోళతిక్కధా
త్రీశుఁడు కేవలుండె నృపు లెవ్వరి కాచరితంబు గల్గునే
శైశవలీల నాఁ డుపటుశౌర్యధురంధరబాహుఁడైన పృ
థ్వీశనరేంద్రుమస్తకము నేడ్తెరఁ గందుక కేళిసల్పఁడే."

ఈ పృథ్వీశనరేంద్రుఁడు క్రీ. శ. 1163–1180 వరకు రాజ్యముచేసెనని యున్నది. కావున నితనిని జయించిన తిక్కనృపాలుని కొడుకగు మనుమసిద్ధి క్రీ. శ. 1257–1260 వఱకు నుండెనన్నచో తిక్కనృపాలుని రాజ్యపరిపాలనకాలము 80 సంవత్సరము లగుచున్నది. కాని యిది విశ్వాసపాత్రము కాదని కాటమరాజుకథను పరిశీలించినచో తేటపడఁగలదు. కాటమరాజున్ను, పల్నాటి పద్మనాయకుఁడున్ను పశువుల మేతబీళ్లను గురించి మనుమసిద్ధితో చేసిన యుద్ధమున తిక్కనసోమయాజి యన్నకుమారుఁడగు ఖడ్గతిక్కన రణనిహతుఁడయ్యెను. ఈ పద్మనాయకుఁ డెవరో విచారింపవలసి యున్నది. పల్నాటివీరులలోఁ బ్రఖ్యాతిగన్న బ్రహ్మనాయనికి జ్యేష్ఠసోదరుఁడగు పద్మనాయఁ డున్నాఁడని చరిత్రవలన తెలియవచ్చుచున్నది. ఈపద్మనాయకుఁడున్ను, కాటమరాజుఁ గలసి ఖడ్గతిక్కనతో యుద్ధముచేసిన పల్నాటి పద్మనాయకుఁడున్ను ఒకరే అయియుండవచ్చును. ఈ పద్మన్నతండ్రి పల్నాటిప్రభువైన శేటరాజునకు మంత్రిగనుండెను. ఆ శేటరాజు పశ్చిమచాళుక్యరాజగు భూలోకమల్లునకు, అనఁగా మూఁడవసోమేశ్వరునకు సామంతుఁడైయుండెను. ఈపద్మన్నతమ్ముఁడగు బ్రహ్మనాయఁడు రాజుగాకపోయినను రాజ్యభారమునంతను వహించినట్లు తెలియుచున్నది. ఇవియునుగాక నాల్గవ సోమేశ్వరుఁడు తనరాజ్యమును తిరిగి సంపాదించుటలో నతని వంశమునం దభిమానముగల బ్రహ్మన్న మిక్కిలి సహాయముచేసి శా. శ. 1104 లేక క్రీ. శ. 1182 కు పూర్వ మనేకయుద్ధములుచేసి సోమేశ్వరుని పట్టాభిషిక్తునిఁ జేసినట్లు శాసనమొకటి యున్నది. క్రీ. శ. 1184 సం.మున నొక శాసనమునఁ గూడ బ్రహ్మన్న యున్నట్లున్నది. ఈ బ్రహ్మన్నయు, పశ్చిమచాళుక్యుల సామంతరాజుల మంత్రియగు బ్రహ్మన్నయు నొకఁడే యైయుండవచ్చును. అందుచే నీ బ్రహ్మన్నకు జ్యేష్ఠసోదరుఁడైన పద్మన్నగూడ నాకాలమునందే యనఁగా క్రీ.శ. 1182 కు పూర్వమున నున్నవాఁడు. కాఁబట్టి ఖడ్గతిక్కనను రణనిహతునిఁగావించిన పద్మన్న నఁబట్టి కవితిక్కనకాశ్రయుఁడైన మనుమసిద్ధియు, నాకాలమువాఁడు కావలయునని యొక యూహ పొడకట్టుచున్నది. అందుచే పృథ్వీశరాజును జయించిన తిక్కనృపాలుఁడు క్రీ. శ. 1182 కు పూర్వమే రాజ్యమందుండవలయుననియు, నతఁడు క్రీ.శ. 1257 వరకు రాజ్యమును పాలించుచుండ నేరఁడనియును తోఁచుచున్నది.

నిర్వచనోత్తరరామాయణమున నింకొక యంశ మున్నది. తిక్కనసోమయాజి కాశ్రయుఁడైన మనుమసిద్ధితండ్రియగు తిక్కనృపాలుఁడు కర్ణాటసోమేశ్వరుని జయించిన ట్లీక్రిందిపద్యమున నున్నది:

"కమలాప్తప్రతిమానమూర్తియగు నాకర్ణాటసోమేశు దు
ర్దమదోర్గర్వము రూపుమాపి నిజసర్వంబుం బ్రతిష్ఠించి లీ
లమెయిం జోళునిభూమిపైనిలిపి చోళస్థాపనాచార్య నా
మముదక్కం గొనితిక్కభూవిభుఁడు సామర్థ్యంబుచెల్లిం
పఁడే." ఇచ్చటనిర్ణయింపవలసినయంశములు రెండుగలవు. చోళరాజునామము లేకపోయినను చోళరాజ్యమున కట్టియవస్థ యెన్నఁడు తటస్థించినదో తెలిసిన నది కొంత సహాయము చేయును. చరిత్రను చూచినచో రెండవ కులోత్తుంగుని కాలమున ననఁగా క్రీ. శ. 1135–1146 మొదలు చోళరాజ్యము బలహీనమైనది. చోళులకును, చాళుక్యులకును వైరము సహజముగ నున్నదిగాని చాళుక్యరాజ్యము క్రీ. శ. 1189 చెడిపోయినది. 1162 కు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పూర్వము బలహీనమై పునరుద్ధారణ గాంచినది. ఈ యంశములంబట్టి చూచినచో 1146 మొదలు 1189 వరకు నున్న కాలములో పరిపాలించిన చోళరాజులెవరైన గావచ్చును. కర్ణాటసోమేశ్వరు డెవరని తెలియవలసి యున్నది. క్రీ. శ. 1163-1180 వరకు రాజ్యముచేసిన పృథ్వీశనరేంద్రుని జయించిన తిక్కరాజు 1234-1253 వరకు రాజ్యముచేయుచున్న వీరసోమేశ్వరుని జయించె నని చెప్పుచు నీకర్ణాటసోమేశ్వరుఁడు వీరసోమేశ్వరుఁడే యని చెప్పిన సందర్భ్మరహితముగ నుండును. ఇంక మరెవ్వరు? నిర్వచనోత్తరరామాయణమునఁ జెప్పఁబడిన మనుమసిద్ధివంశావళియును హిందూదేశశాసనసంగ్రహము (Epigraphia Indica) న నేడవ సంపుటమందున్న శాసనములవలనను తేలిన వంశావళులును, ఈ క్రిందివిధ మున నున్నవి:

(1) ఉత్తరరామాయణము

బ్రహ్మ
|
రఘు
...
రాముఁడు
...
కరికాలచోళుఁడు
...
...
బిజ్జన
......
.........
మనుమసిద్ధి
...
తిక్కన
...
మనుమసిద్ధి

(2) ల

కరికాల
|
మధురాంతక పొత్తాపిచోళ
|
...బెట్టి...
తెలుంగుబిజ్జ
├── సిద్ధి
└── బెట్ట
  ├── రాయభీమ — మనుమసిద్ధి
  ├── నల్లసిద్ధి — బెట్ట
  └── అరియసిద్ధి — తమ్మసిద్ధి 1207 సం.

(3) ఆ

కరికాలచోళ
|
పొత్తాపిచోళ
......
బిజ్జన
|
మనుమసిద్ధి—నల్లసిద్ధి
|
తిక్కరాజు
|
మనుమసిద్ధి

నిర్వచనోత్తరరామాయణమందు చెప్పఁబడియున్న బిజ్జనయు, శాసనములయందు చెప్పఁబడియున్న తెలుంగు బిజ్జనయు ఒక్కఁడే. ఈబిజ్జనను తెలుంగు బిజ్జఁడని చెప్పుటవలన నితఁడును, యాదవవంశజుఁడగు బిజ్జనయును, హైహయవంశజుఁడగు బిజ్జనయును సమ కాలికులని తోఁచుచున్నది. తిక్కనసోమయాజి చెప్పిన వంశావళియందు కరికాలచోళునివంశమున బిజ్జన జనించె నని చెప్పి తద్వంశంబున మనుమసిద్ధి జనించెనని చెప్పెను. అందుచే బిజ్జనకును, మనుమసిద్ధికిని నడుమ విశేషకాల ముండెనని యభిప్రాయపడుచున్నారు గాని శాసనము లందలివగు 2, 3-వ వంశావళులలోఁగూడ బిజ్జన చెప్పఁ బడి యుండెను. ఇందొకటి బిజ్జనసంతతివారును, మరి యొకటి బిజ్జనదాయాదుల సంతతివారునై యున్నారు. 3-వ వంశావళియందు మనుమసిద్ధి, యతనికొడుకు తిక్క రాజు, నతని కొడుకు మనుమసిద్ధియు గనుపించుచున్నారు. రెండవదానియందీవరుసగ నీ పేరులు లేవు. తిక్కన కాలమునందు మనుమసిద్ధి యీ 3-వ వంశావళికిఁ జేరి యుండనోపును. అందుచేతనే కాఁబోలు తద్వంశంబున అని సోమయాజిగారు చెప్పియుందురు.

---

## ప్రాచీనకాలపు మహారాణులు

[స్ఫియరు ౧౯౦౬ మార్చి ౧౭-వ తేది]

చిత్రకారుడు:—యఫ్. మెకేనియా అనువాని డు. ఈజిప్టులో పరిశోధకశాఖా సంఘమువారి స్వాధీన మునకున్న పత్రములు మొదలయిన లేఖనముల నాధార ముగా గొని యాల చిత్రములను వర్ణములతో చిత్రించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చున్నాడు. వానినుండి తీసినఏకవర్ణ చిత్ర మిది. ఇట్టి చిత్రములు రెండు ఈసంచికయందు గలవు.

### చిత్రము ౧
### 'నెఫర్ టిటి' రాణి

ఈచిత్రమున 'నెఫర్ టిటి' అను నొకరాణి తన సొంతదేవాలయమున పూజారిణినఘును నెరపుచున్నట్లు చిత్రింపబడినది. యువతియు, సుందరియు నగు నీమె 'అఖ్నాటను' చక్రవర్తిభార్య. చక్రవర్తి పూజా పీఠమున కెదుట సింహాసనముపై శిరస్త్రాణమును ధరించి కూర్చుని యున్నాడు. ఆతనిపిల్లలు ప్రక్కననిలుచుకొనియున్నారు. రాణి పూజాపీఠముచెంత నిలువబడి ప్రార్థన చేయుచున్నది.

[స్ఫియరుపత్రిక-౧౯౩౭ మార్చి ౫ వ తేది]

### చిత్రము ౨
### సెమిరామిసు రాణి

ఈమె అసీరియాయందలి 'నినెవే' పట్టణమును క్రీ. పూ. ౨౧౭౨ సం. ప్రాంతముల నిర్మించి పరిపాలించిన యోధురాలు. పరాక్రమమున పురుషులుసైతమీమెకెంతయుసాటిరారు. ఈమెభర్త 'సైనసు' మహారాజుసైన్యములో నొక గొప్పయోధుడుగ నుండెను. అస్సీరియా సేనల నెదిర్చి యొకప్పుడు బాక్ట్రిసేనలు పోరాడుచుండెను. ఈమె స్వయముగా అస్సీరియా సేనలను ధైర్యచాతుర్యములతో నడపుచుండెను. అట్టిసమయమున భర్త యీమెను తన శిబిరమునకురమ్మనికోరెను. ఆమెభర్తమాటను లక్ష్యపెట్టక యుద్ధమును సాగించి బాక్ట్రిను స్వాధీనపరుచుకొనెను. చిత్రమున నీమె యాపట్టణమును రాజునకు కైవసము చేయుచున్నట్లున్నది. ఈమె సాహససౌందర్యములకు ముగ్ధుడై రాజీమెను భార్యగా గోరెను. అప్రియుడగు నామె భర్త ఆత్మహత్య కావించుకొనుటచే రాజుకోరిక సులభముగ నీడేరునట్లుండెను. అంతనామె యైదుదినములు రాజ్యపరిపాలనము గావింప రాజు ననుమతి వేడెను. అందులకాతడంగీకరించెను. ఆమె తన పరిపాలనకాలమున నారాజును చెఱయందుంచి తుదకు తుదముట్టించెను. ఆమె యద్భుతనిర్మాణకౌశల్యమునకు, పరాక్రమమునకు నామె స్థాపించిన సుందరనగరములే నిదర్శనములు.

---

### మొట్టమొదటి సత్యాగ్రహి కైది

['కరెంట్ థాట్'పత్రిక ఏప్రిల్ సంచికలో 'దక్షిణాఫ్రికాలోని సత్యాగ్రహము' అను వ్యాసమునుండి.]

ట్రాన్స్వాలులో ఏషియాటిక్ శాఖవారు తమ క్రింద పనిచేయుట కైదువందల మందికంటె భారతీయులంగీకరింపకుండుటచే ఇంకను కైదుచేయవలెనని సంకల్పించిరి. జర్మిస్టనులో చాలమంది భారతీయులుండిరి. వారిలో పండిత రామసుందరు డనునాత డొకడుండెను. ఆతడు గుండె నిబ్బరము గలవాడు; వదరుబోతు. సంస్కృతశ్లోకములు గొన్ని పఠించినాడు. ఉత్తరహిందూస్థానము వాడగుటచే నతడు తులసీరామాయణమందలి కొన్ని దోహాలును, చౌపాయీలును అప్పచెప్పగలడు. పండిత నామముచేత నాతడచ్చట గొంత పేరుగాంచెను. పలుతావులనాతడెన్నియో గంభీరోపన్యాసములొసగెను. రామసుందరుని కైదుచేసిన చాలమంది లొంగిపోవుదురని యచ్చటి దుష్టులగు భారతీయులు కొందరు ఏషియాటిక్ శాఖవారికి సలహా ఇచ్చిరి. ఆశపడి వారతనిని కైదుచేసిరి. అట్టి నర్యకదియే మొదటిసారి యగుటచే ప్రభుత్వమందును, భారతీయులయందును గూడ కలవరము రేగెను. ఆ తొలినాటివరకు జెర్మిస్టనులో కొందరు మాత్రమే యెరిగియుండిన రామసుందరు డుత్తరక్షణమున దక్షిణాఫ్రికాయందంతటను ప్రఖ్యాతుడయ్యెను. అందరు నతని నొక మహాపురుషునిగ పరిగణింపసాగిరి. అవసరము లేకుండినను శాంతిరక్షణమునకై ప్రభుత్వమేర్పాటులు గావించెను. న్యాయస్థానమున సైతము రామసుందరుడు తన సంఘమునకంతకును ప్రతినిధిగా గౌరవింపబడెను. ఆత్రముతో చూడవచ్చిన భారతీయులు న్యాయస్థానమును నింపివేసిరి. రామసుందరు డొకమాసము సాధారణశిక్షకు పాల్పడి, జోహాన్స్ బర్గు జైలులో యిరోపీయుల వార్డు (వార్డు)లో ప్రత్యేక మొకగదియందుంచబడెను. జనులాతని గలిసికొనుటకు నిషేధము లేకుండెను; అతనికి భోజనము బయటనుండి వచ్చుట కాటంకము లేకుండెను. అనుదిన మతని కతనిసంఘమువారు పిండివంటలతో భోజనము పెట్టుచుండిరి. అతని కేమి కావలసినను కొరతలేకుం

డెను. అతనికి శిక్షవిధించిన దినమున పరితాపమనుమాటయే లేక ఎక్కడచూచిన నుత్సాహము చెలరేగెను. వందలకొలది భారతీయులు జైలునకుబోవ కుతూహలపడిరి. ఏషియాటిక్ శాఖాధికారుల మొగములు వెలవెలబోయెను. జెర్మిస్టనునుండియైన నొక్కడును తమ పేరును (రిజిస్టరు చేయించుకొనుటకు) రాడయ్యెను. తమ చర్యవలన భారతీయులకే మేలుకలిగెను. 'తానొకటి తలప దైవమొకటి తలచెను.' శిక్షాకాలము గడచిపోయెను. రామసుందరు నూరేగించి సభచేసిరి. బల్లగ్రుద్ది యుపన్యాసము లిచ్చిరి. అతనిపై పూలవండలవర్షము గురిపించిరి. ఐచ్ఛికభటులతనికి విందుచేసిరి. ఆయదృష్టము తమ కబ్బనందులకు ఎందరో భారతీయులు వగచిరి.

---

## ౧. బర్మానావికుడు



భారతీయ నావికులలో సమర్థుడగు నొక బర్మానావికుడు సంపూర్ణశిల్ప సౌందర్యముతో నొప్పియున్న పురోభాగముగల నావను మాండలేపురమునకు నడుపుచున్నాడు. అతడు నదియందు నావనునిలిచి తీవ్రప్రవాహమున కెదురుగ తనబుద్ధికుశలతచేతను, బలముచేతను నడుపగలడు. గాలియు, ప్రవాహమును అనుకూలముగనున్నయెడల నాతడు నిర్వాణముద్రాముద్రితునివలె దినమంతయు (మండుటెండలో సైతము)గడపును. అతడట్లు గడపుట సోమరితనమున గాదనియు, కళాకుశలుడు, ఆధ్యాత్మవేత్తయు నగుటచేననియు నొక సుప్రసిద్ధ గ్రంథకర్త నుడువుచున్నాడు. వినీలాకాశము, వివిధకాంతుల నీనునదీజలము నాతడు రొక్కమునకన్న మిక్కిలిగ నెంచును. ప్రకృతిసౌందర్యము, ఆత్మానందము ననునవియే శాశ్వతములని యాతని విశ్వాసము. ఆర్థికలాభము స్వప్నప్రాయముగు భౌతికజీవితమునకు జెందినదనియు, ఆతనికి నేర్పబడిన లౌకికవిషయము లన్నియు ఆత్మవికాసవినాశకరములనియు నాతడు భావించును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౨. శిథిల మగు స్తూపము

రంగూను సమీపమున గౌతమబుద్ధుని అస్థి శకలములను నిక్షేపించుటకై మధ్య యుగమున నిర్మింపబడిన ఆలయము. తరువాతి భారతీయ యాత్రికుల కిది యాత్రాస్థల మయినది.

## బ్రహ్మసూత్రములు – తదాధార గ్రంథములు

'జయకర్ణాటక' ప్రభవ, చైత్ర సంచిక యందు 'శ్రీమడివాళప్ప సాసనూరు' అను వారు ప్రకటించిన "బ్రహ్మ సూత్రములు" అను వ్యాసమునుండి :

వ్యాసమహర్షి బ్రహ్మసూత్రములను రచియించుట కాధారములగు గ్రంథములు:

౧. ఈశావాస్య, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యక, శ్వేతాశ్వతర, కౌషీతకీ, బ్రాహ్మణ, కైవల్య, జాబాలము లను నుపనిషత్తులు;

౨. కాణ్వశాఖ, అగ్నిరహస్య, తాండిశాఖ, శాట్యాయనీశాఖ, పైంగీరహస్యము అను బ్రాహ్మణములు;

3. మనుసంహిత, మహాభారతము, తదంతర్గత భగవద్గీత అను స్మృతిగ్రంథములు;

౪. పాంచరాత్రము లేక భాగవతము అను ఆగమ గ్రంథము;

౫. కపిల, పతంజలి, కణాద, గౌతమ, జైమినుల రచియించిన దర్శనములు;

౬. చార్వాక, బౌద్ధ, జైన, మాహేశ్వరాది మతవాదములు.

శ్రీశంకరాచార్యులవారు తమ (యద్వైత) మత ప్రతిష్ఠాపనకొరకు పైగ్రంథములనేకాక యీక్రింది గ్రంథములను సైతము నాధారముగా గైకొనిరి:

ఐతరేయారణ్యక, ఐతరేయ బ్రాహ్మణ, ఆపస్తంబ ధర్మసూత్ర, ఆర్షేయ బ్రాహ్మణ, గౌడపాదకారిక (వ్యాసకృతము), మైత్రాయణీయ సంహిత, నిరుక్త (వ్యాసకృతము), పాణిని (వ్యాసకృతము), ఋగ్వేద సంహిత, షడ్వింశ బ్రాహ్మణ, శతపథ బ్రాహ్మణ, తైత్తిరీయారణ్యక, తైత్తిరీయబ్రాహ్మణ, తైత్తిరీయ సంహిత, విష్ణుపురాణ (వ్యాసకృతము), వాజసనేయ సంహిత, విష్ణుధర్మోత్తరపురాణ, శివపురాణ, శివ ధర్మోత్తర, ఉపవర్షి వృత్తులు, మున్నగునవి.

శ్రీరామానుజాచార్యులు స్వీయ(విశిష్టాద్వైత)మత ప్రతిష్ఠాపనకొరకు పైగ్రంథముల నన్నిటినికాక యీ క్రింది గ్రంథములను సైతము గైకొనిరి:

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దక్షస్మృతి, గర్భోపనిషత్తు, గౌతమధర్మసూత్రములు, చూళికోపనిషత్తు, మహానారాయణోపనిషత్తు, మహోపనిషత్తు, మైత్రాయణోపనిషత్తు, సనత్సుజాతీయము, సుబాలోపనిషత్తు, యాజ్ఞవల్క్యస్మృతి, యామున శఠకోపాచార్యాదికృత మతగ్రంథములు.

బ్రహ్మసూత్ర వ్యాఖ్యా రచయితలు : భారతీయ విజయ, సంవిదానంద, బ్రహ్మఘోష, శతానంద, బౌధాయన, ఉద్ధత, విజయ, రుద్రభట్ట, వామన, యాదవప్రకాశ, శంకరాచార్య, భర్తృప్రపంచ, శఠకోప, రామానుజ, బ్రహ్మదత్త, భాస్కర, పిశాచ, విజయభట్ట, విష్ణుకాంత, వాదీంద్ర, మాధవదాస, పూర్ణప్రజ్ఞ, రాఘవేంద్రస్వామి, వల్లభాచార్య, విజ్ఞానభిక్షు, శంకరానంద, శ్రీకంఠ శివాచార్య, శ్రీశంకరభగవత్పాద శిష్య, ధర్మభట్ట, వజ్రనాథభట్ట, భైరవ, అప్పయ్యదీక్షిత, వాచస్పతిమిశ్ర, సురేశ్వరాచార్య, సదాశివేంద్రసరస్వతి, మొదలయినవారు.

ఈనాటివరకు ఉపలబ్ధములగు వ్యాఖ్యానాదులు శ్రీశంకర, రామానుజ, పూర్ణప్రజ్ఞ, వల్లభ, భాస్కర, విజ్ఞానభిక్షు, శ్రీకంఠశివాచార్యవిరచితభాష్యములు.

శంకరానంద (శంకరభగవత్పాద శిష్యుడు) వృత్తి, ధర్మభట్ట కృత అద్వైతామృత వర్షిణి, రామానుజకృత వేదాంతదీపము, వజ్రనాథభట్టకృత మరీచిక, రాఘవేంద్రకృతదీపిక, భైరవపండితవిరచిత బ్రహ్మసూత్రవృత్తి, సదాశివేంద్రసరస్వతికృత తత్త్వప్రకాశికావృత్తి, వైయాసికన్యాయమాల అనునవి.

---

## చీనాలోని కల్లోలము

ఇంగ్లీషు రషియా వీరులు:— "మా చేతిలోని ఆయుధములు (చైనీయులు) ప్రక్కలగువరకు ఇట్లే కొట్టుకొనుచుందుము."

(రూలు—బెర్లిను)






CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




## శివాజీవిజయము

**కృతికర్త: మొసలకంటి హనుమంతరావుగారు**

క్రౌను సైజు 100 పుటలు. వెల 12 అణాలు

ఇదియొక చరిత్రాత్మకమగు నాటకము: స్వతంత్ర రచన. శివాజీ ఔరంగజేబును దర్శించుటకై ఆగ్రాపురమునకు వచ్చును. దర్బారున నౌరంగజేబతని నగౌరవించి, అతఁడు విడిసినయింటనే యతనికిఁ జెఱవిధించును. రామసింగనెడు సరదారునకు దేశభక్తిని, గర్తవ్యము నుపదేశించి, అతని సాయమున శివాజీ మాయోపాయమునఁ జెఱఁ దప్పించుకొనిపోవును. దారిలోఁ గొన్ని యడ్డంకులదాఁటి తనరాజధాని సమీపించుచుండఁ దన్నెదిరింప వచ్చిన మొగలులను దనతల్లి పంపిన సేనల సాయమున జయించును. ఇది యిందలి యితివృత్తము. ఇది వీరరసప్రధానమగు నాటకము. దేశభక్తి చాలగ వర్ణింపఁబడినది.

'శివాజీవిజయము' అను పేరున కనుపించు చరిత్రభాగము లింకనున్నను, రచయిత యీస్వల్పభాగమును ప్రదర్శించుటతోడనే సంతృప్తినొందుటకు గ్రంథరచనాకాలము బాధ్యముగాకపోదు. ఇది ౧౯౨౧ సం. న వెలువడినది. స్వాభావికముగ, నిందు దేశభక్త్యుపన్యాసములు ప్రధానముగ నున్నవి.

ఇందు శివాజీరామసింగులపాత్రలే ముఖ్యములు. తక్కినవి స్వతంత్రచరిత్రల వ్యక్తీకరింపక, నిమిత్తమాత్రములుగ నున్నవి. స్త్రీపాత్రలు రెండున్నను లేవనియే చెప్పవచ్చును. ఔచిత్యము భంగపడలేదు.

నాయకుని చరిత్రసిద్ధములగు గొప్పలక్షణములుగాక యదనముగ నాయకునికి మెఱుఁగులువెట్టుట నాటకకారుని కర్తవ్యమైయుండ, చరిత్రసిద్ధములగు మహాలక్షణముల నైన రచయిత సువికసితములుగఁ బ్రదర్శింప యత్నింపకుండుట యిందొకలోపము.

నాటకము మొదటనే రక్తికట్టును. రామసింగుని యుపన్యాసము రగియున్నది. ఔరంగజేబు పంపిన లేఖవలన శివాజీ తనచెఱశిక్ష నెఱిఁగినరంగమున నతనిమనమున నొదవు సంకులభావములను, దేశభక్తి బ్రదర్శించుటకు నేర్పఱియగు కుశీలవుఁ డుండవలెను. రామసింగు దేశభక్తుఁ డగుట కాతని మానసము పొందిన మార్పులు స్వాభావికములు; శివాజీయుపదేశములును సమర్థములు. శివాజీ యుక్తివలనఁ జెఱదప్పించుకొను భాగము చతురతతో నిర్వహింపఁబడినది. తుదిభాగమునఁ గొన్ని దృశ్యము లాకర్షకములుగ లేవు. మొత్తముమీఁదఁ గార్యప్రదర్శనముకన్న వాక్ప్రదర్శన మెక్కువగనున్నది.

శైలి గంభీరమై, సరసమై, భావోచిత పాత్రోచిత గతుల వెలయుచున్నది. దేశభక్తిపూరితములగు పద్యములు భావోద్రేకము గల్గించును. మచ్చునకుఁ గొన్నిపద్యము లిటఁ జూడుఁడు:—

సీ. వస్త్రరత్నాన్నార్థ వరదానములచే జ
గజ్జనులను బ్రోచు కల్పశాఖి
రఘుపూరు వంశాది రాణ్మణీవతుల న
పారంబుగాఁగన్న వీరమాత
విజ్ఞానశూన్యతా విహ్వలపాశ్చాత్త్య
లకువిద్య నేర్పు కలాకలాప
శంకరరామానుజాతాది మతసర్మ
పోషకులనుగాంచు పుణ్యురాలు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అక్కటా! నేఁడు దిక్కఱి యొక్కనింటఁ
గడుపుకూటికి దాసియై పడుచునున్న
కష్టములఁబాప మగటిమిగల్గినట్టి
పుత్త్రుఁడొకఁడైన లేఁడయ్యె మిత్రులార!

శా. మెల్లంబై చనువాహినీధవరుణ
ప్రోద్భూత సంరంభముల్
చాల్లైపోవఁగలేదు, నీయెడ లసం
బుం బ్రేమ పోలేదు, మా
వల్లత్వంబును, మాతృభక్తియు జయో
న్మాసంబుగాఁ జూప నో
తల్లీ! భారతరాజ్యలక్ష్మి! తగు స
త్కాలంబు రాదయ్యెడిన్.

స్వగతములం దేకాని సంభాషణములం దంతగాఁ బద్యములు లేకుండుట యిందు మెచ్చఁదగియున్నది. ముఖ్యముగ శివాజీయుపదేశములు గంభీరమగు గద్యధోరణి నున్నవి.

పద్యములు మితముగానున్నవి. నాటకమంతయు వేగగమనము గలదిగనున్నది. స్వభావవైరుద్ధ్యము లెక్కడను గానరావు.

పుస్తకములయువారు గ్రంథకర్తగారి పేర 'మహారాజావారి కళాశాల, విజయనగరము' అని వ్రాసినఁ బనయఁగలరు.

*　　*　　*　　*

## రాణా ప్రతాప్

రచయిత: గుండిమెడ వేంకటసుబ్బారావుగారు
రాయల్ సైజు, ౧౨౭ పుటలు, వెల రు. ౧ ౪ ౦

ఇది 'రాణాప్రతాపసింహ' అను హిందీనాటకమునకు కొన్నిమార్పులతోఁ జేసిన యనువాదము. సుప్రసిద్ధనాటకకారుఁడగు శ్రీ ద్విజేంద్రలాల్ రాయల వంగమాతృక హిందీలో ననువదింపఁబడినది. ఇందలి యితివృత్తము ప్రసిద్ధము. కాళికాలయమునందలి ప్రతిజ్ఞతోఁ బ్రారంభమయి, ప్రతాపుని మరణములో ముగిసినది; విషాదాంతము. అంకదృశ్యనిర్మాణము, పాత్రపోషణము, ఔచిత్యము చాలబాగున్నవి. భావములు గంభీరములు. చారిత్రికపాత్రలును, కల్పితపాత్రలునుగూడ మిక్కిలి నిపుణతతో సజీవముగఁ జిత్రింపఁబడినవి. శ్రీద్విజేంద్రలాల్ రాయలు స్వయముగఁ జెప్పిన భావయుద్ధమును నుత్తమాశయ మీనాటకమున బాగుగఁ జూపఁబడినది. ఇట్టి యుత్కృష్టనాటకమును తెలుఁగుభాషకు సమర్పించినందులకు శ్రీ సుబ్బారావుగా రాంధ్రజనుల కృతజ్ఞతకుఁ బాత్రులు.

వీరు భాషాంతరీకరించిన భాగములు చెడకుండ నొప్పించిరి. ఒక్కొకచో హిందీనుండి తర్జుమా యిది యని సూచించు పదప్రయోగములున్నను తర్జుమా బాగున్నదనియే చెప్పవలెను.

ఇందు వీరు కొన్నిదృశ్యములు మార్చిరి, కొన్ని తీసివేసిరి; కొన్ని భాగములు రచించి చేర్చిరి.

ముఖ్యముగ నాల్గవయంకము నాల్గవదృశ్యమున వీరు పెద్దస్వాతంత్ర్యము గైకొని, యితివృత్తమునకే మార్పుఁదెచ్చిరి. ఇతిహాసము ననుసరించియు, మాతృక ననుసరించియు ప్రతాపుఁడు కోమల్ మీర్ దుర్గము కోల్పోయినతరువాతఁ దానులోఁబడినట్లు అక్బరునకు జాబు వ్రాసెను. కాని, ఆజాబు రాజనీతిచతురుఁడగు అక్బరు కల్పించినదని వీరు చూపినారు. దీనివలన వీరు ప్రతాపుని కార్యదీక్షయు, అక్బరురాజనీతినిపుణతయుఁ బోషింపనెంచినట్లు తోఁచును. కాని ఇది చాలమందికిరుచింపదు.

మాతృకయందు – అక్బరునోట ప్రతాపుఁడు తన కులొంగిపోయెననువార్త వినుటతోడనే పృథ్వీరాజునకువలెనే మనకుఁగూడ విస్మయాదులు జనించును; కాని పరంపరాగతములగు పరాజయములచేతను, దుర్భరమగు దారిద్ర్యపీడచేతను, తదుపరి హృదయదారకమగు పుత్రికామరణముచేతను విశీర్ణహృదయుఁడగు ప్రతాపునిదైన్యమున దర్శించి, అతనినోటనే అక్బరునకువ్రాసినలేఖమాట విన్నపుడప్రయత్నముగ బాష్పములురాలునంతటి సానుభూతియే ప్రతాపునియెడ జనించునుగాని, కార్యదీక్షాశూన్యుఁ డనునవజ్ఞ సుంతయుఁ గలుగదు. ఆసానుభూతి సుబ్బారావుగారి ప్రతాపునియెడ జనింపదు. తనకుపరమప్రీతిపాత్రుఁడగు గోవిందసింహునకును, దనసహోదరుఁడగు శక్తసింహునకునుగూడ నక్బరుకుతంత్రమును మొదట చెప్పక తుదివఱకు దాఁచిపెట్టుట ప్రతాపుని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యందలి గౌరవమును కంటువఱుచును. శక్తసింహుఁడు "మొగలాయీలతోడి యుద్ధమునందు మీకుఁదోడ్పడుటకైవచ్చితి" నని చెప్పినపుడు "ఇప్పుడు సాహాయ్యమున కవసరములే" దనియు, పిదప నతఁడు "మీరక్బరునకధీనులైతిరా" యని యడుగ "జో" ననియుఁ బ్రతాపుఁడ సత్యమేలపల్కెను? పరిహాసమునకా? ఇది చాలమల్కన గనున్నది. పృథ్వీరాజు భామాషాలు వచ్చినతరువాత, సైన్యధనముల యాశచిక్కినవెనుకఁ దెలియఁజేయవచ్చునని ముందిట్లుచెప్పెనా? సైన్యమున నెల్లర నాకర్షింపనెంచెనా? అసత్యమే చెప్పుటకేమి కారణముండెను? నాయకునిపాత్ర చెడిపోయినది. నాటకమంతటనున్న ప్రతాపుఁడువేఱు, ఈ దృశ్యమందలి ప్రతాపుఁడువేఱు. ఆద్విజేంద్రుని ప్రతాపునికిని ఈసుబ్బారావుగారి ప్రతాపునికిని బోలిక లేదు.

అదిగాక, జాబువ్రాసినను నతఁ డక్బరునమక్షమునకుఁ బోయి తలవంచి యతని యధికారము స్వీకరింపలేదు. అనతికాలముననే మఱలఁ దనరణభేరి మ్రోఁగించెను. సైన్యధనముల యాశ చిక్కుటతోడనే తిరిగివిజృంభించిన ప్రతాపుఁ డట్టియాశలేనపుడు దుస్తరబాధలకుఁ దాళఁజాలక యొక్కపరి మానవదౌర్బల్యమునకు లోఁబడుట యతని కార్యదీక్షయందలి పెద్దలోపముగాదు. ప్రళయమార్తండునిభంగి విజృంభించి జయపరంపరలఁ గొల్లగొననున్న వీరుఁడు ముందొకసారి నిరాశావిష్టుఁడగుటంతటి పతనముగాంచుట స్వాభావికమే కాక, కవిలోకము నఁగూడ ననుసరింపఁబడు సరణియే. ప్రకృతిసిద్ధమగు నాయకరత్నమిచట కళంకితమైనది.

అక్బరుపాత్రయు నిందుచెడిపోయినది. (పంచమాంకమున) తనపుత్త్రికద్వారా ప్రతాపుని యుదారగుణసూచకమగు జాబు నాకర్ణించినపుడు, "ప్రతాప్, ప్రతాప్! నేఁటిదనుకను నీస్థలము నాదక్షిణపార్శ్వమం దని యూహించియుంటినేకాని, నీయాసనము నామూర్ధోపరి భాగమునందని తలంపనైతిని! నేను జగజ్జేతననియు, నీవొకసామాన్యుఁడ వనియు భావించి గర్వించుచుంటినిగాని, నీవేజగజ్జేతవనియు, నేనేసామాన్యుఁడననియు నిప్పుడు తెలిసికొంటిని!... నేఁటినుండియుఁ ప్రతాపసింహుఁడు... నాకుఁ బ్రాణబాంధవుఁడు!" అని ముక్తకంఠమున, నోడలెఱుఁగక, భక్తునివలెఁ బ్రశంసించిన అక్బరుహృదయమహత్త్వము మూఁడేండ్లపూర్వము నిష్పచ్చరమైయుండెనా? ప్రతాపునియందలి భక్తిగౌరవములచేతనే అక్బరు చిత్తూరుదుర్గమును వదలివైచెనుగాని తనకూఁతును ప్రతాపసింహుఁడు తనకడకుఁబంపివేసినాఁడనికాదు; ఏలయన నతఁడు చిత్తూరుదుర్గమును గోరకయే యామెను బంపివేసెను. కేవల మక్బరు సద్గ్రహణశీలమగు హృదయమే యందులకుఁగారణము. అంతటి గొప్పహృదయముగల అక్బరు మూఁడేండ్లపూర్వ మామహత్త్వపుటంకురములైన లేక, యంతటినికృష్టతంత్రము పన్నెనా? ఇరువదిరెండేండ్లు దుస్సహబాధలచే నొగులుచుండియు, స్వదేశస్వధర్మరక్షణమునకై తాత్పర్యమునఁ బోరుచుండిన ప్రతాపునిచరిత్ర సార్వభౌముఁడగు అక్బరునుదారహృదయమున నికృష్టతఁ బెంపుచేయదు. ఇచ్చటి రాజనీతియుఁ గడుపేలవము. ప్రతాపరుద్రీయమున యుగంధరుని రాజనీతిసరియగు రాజనీతి! నిజము తేలినవెనుక "ఆహా! యుగంధరునిరాజనీతి!" అని లోకమంతయు నేకగ్రీవముగ శ్లాఘించును. కాని యీఅక్బరురాజనీతి---రాజనీతి యనఁదగినదో—నిజము తేలినవెనుక లోకమంతయు గర్హింపఁదగియున్నది. అక్బరు రాజనీతికిఁ జేరుపడినవాఁడు. అతనిపాత్ర కీకల్పన మేమియు యోగ్యముగలేదు. ప్రతాపుఁ డెదుర్కొనుటకుఁ దగనినిస్సహాయస్థితినున్నను, ఆమిథ్యాపవాదమువిని వాస్తవస్థితి ప్రకటించినఁ జాలు నక్బరుకీర్తికి భంగము వాటిల్లును. కావున నీరాజనీతికి సార్థకత గన్పట్టదు. మఱలద్విజేంద్రుని అక్బరు వేఱు, వీరిఅక్బరు వేఱు. ఆహృదయమును, మేధయుఁగూడ నిందుఁ గానరావు.

నాయకునికిఁ బెద్ద గీటురాయి యగు అక్బరుపాత్రయుఁ జెడిపోయినది, నాయకుని పాత్రయుఁ జెడిపోయినది.

ఇంకను గొన్ని చిన్నచిన్నమార్పు లున్నవి; మార్పు కథకు మెఱుఁగుఁబెట్టినవి యగుటకు. వీరు చాలదృశ్యములు తీసివేసిరి. అందు కొన్ని యుండఁదగినవియుఁ గలవు. జోషీబాయి తుదిరంగములు రెండు నుంచియుండినచో నొకగొప్పపరిణతపాత్రము నాటకమునకు లోటుగాకయుండెడిది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శైలి బాగున్నది. సీసపద్యమున నాల్గుపాదము లను సమగతితోడను, దుల్యభావములతోడను తూఁగు గలిగియున్నవి.

'ఒకానొక విషయమును వర్ణించుచున్నప్పుడు తనహృదయమున నేభావ మెంతబలముతో నుద్రేకించునో, ఆభావ మంతబలముతో పాఠకునిహృదయమున నుద్రేకించునట్లు చేయుట కేకవి ప్రయత్నించుచుండును' అని శ్రీ. మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు పీఠికయందు నుడివినది తగియున్నది. భాష భావోచితముగనున్నది. చూడుఁడు:—

సీ. సంశయింపఁడు శత్రుసైన్యాంబునిధియందు
 తనసేనబిందు మాత్రకమటంచు!
తలఁపఁడు మ్లేచ్ఛశతఘ్నికాలతియందు
 తనసాధనములు వ్యర్థము లటంచు!
వెనుదీయఁ డీనాఁటి రణభూమి తనకు నా
 ఖీలమృత్యుగుహాంతరాళ మనుచు!
వలవ మొంపఁడు పరాజయమన్న రసపుత్రి
 జీవనంబునకు దుష్కీర్తియనుచు!
పౌరుషంబె యాదర్శదైవంబు గాఁగ
సమరభూమియె మృదుపుష్పశయ్య గాఁగ
ప్రాణ మఱచేతఁ బట్టి పోరాడుచుండె
అహహ! అది యెట్టి మొండిసాహసముకాని!

౭౦ పుటలుగలిగిన హిందీనాటకమునుపదించి, చక్కనిశైలిలో స్వతంత్ర భావములతోఁ బద్యముల రచించి చేర్చి, ప్రస్తుతాంధ్రరంగమున కనువుగ నీనాటక రత్నము నాయిత్తపఱిచిన శ్రీ. సుబ్బారావుగారు ప్రశంసార్హులు.

ఈ నాటకముప్రతులు వలయువారు

మేనేజరు, రామానుజకుటీరము, బరంపురం (గంజాం) అనికాని,

సైశ్యరాజు శంకరనారాయణమూర్తి, ఛత్రపురం (గంజాం) అనికాని వ్రాసినఁ బడయఁగలరు.

---

# గ్రంథ పరిచయము

## పునహావ్యవసాయప్రదర్శనము

### (తెలుగునచనము-సచిత్రము)

ప్రకాశకులు: గోలకొండ ముద్రాలయమువారు, తురుపు బజారు, దక్షిణ హైదరబాదు, దక్కను. ఫూల్‌స్కేపు ౧౬ పేజీలసైజున ౬౦ పేజీలుగలపుస్తకము

వెల. రు. ౦-౮-౦

ఇందు ప్రదర్శనమునననుసరించి వ్యవసాయవిధులను, అందుకునలసిన పరికరములనుగూర్చి వివరింపబడియున్నది.

*  *  *  *

## లోకనాయకశతకము

(భా. ౧) గ్రంథకర్త: శ్రీమాధవపెద్ది శేషగిరి రావుగారు. బ్రాహ్మణ కోడూరు, బాపట్లతాలూకా, గుంటూరు.

*  *  *  *

## ఇకకంటాక్సుగైడ్ (తెలుగు)

గ్రంథకర్త: యక్. సూర్యనారాయణగారు (డిప్లొమాహోల్డరు) అక్కౌంటంటు అండ్ ఆడిటర్ బెజవాడ. క్రౌనుసైజు ౨౦౦ పేజీలు. వెల రు. 2-8-0

ఈగ్రంథమాంధ్రమున క్రొత్తగ వెలసినది. దీని ప్రయోజనమునుగూర్చి పీఠికలో శ్రీ కోట కామరాజుగారు (బి. ఏ., బి. యల్.) ఇట్లువ్రాసినారు: "వర్తకులకు సదుపాయముకొరకు తెలుగులో వ్రాసిన పుస్తకమును ఇంతవరకు నేను చూచియుండలేదు. 1922 సం. ఇకకంటాక్సు చట్టమున్నూ, అందులో ముఖ్యమైన సెక్షనులకు ఉదాహరణములతోనున్నూ, అప్పీల్లు చేయువిధమున్నూ, యిన్‌కంటాక్సుకు సంబంధించినఅంశములన్నియు వ్రాసినారు. ఇదియుగాక వీరుప్యాసు అయినపరీక్షుల వల్లను, వీరు గవర్నమెంటు డిపార్టుమెంటులో పనిచేయుటవల్లను, యిప్పుడు ఆడిటరుగా పనిచేయుచుండుటవల్లను వర్తకులయొక్క కష్టసుఖములు గ్రహించి యీ పుస్తకమును తెలుగులో ప్రచురించడమయినది. ఈ పుస్తకమునందు వర్తకులలెక్కలు వ్రాయుపద్ధతులను, వర్తకులు మా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మూలుగాచేయు పోరపాట్లను, యిక్కకంటూకప్పు చట్టముల లోవర్తకులకొరకు ఉన్న సదుపాయములను, ఆఫీసువారు వేయు ప్రశ్నలను, జరుపువర్యలను యేలానడచుకొనవల యునో ఆపద్ధతులన్నియు విశదముగా ప్రతివారికి అర్థము వునట్లు వ్రాసిరి."

* * * *

## ఏకాదశీమహిమాసర్వస్వము

### (పద్యకావ్యము - రెండాశ్వాసములు)

గ్రంథకర్త: కేసిరాజు వెంకటసుబ్బారాయకవి.

క్రౌనుసైజు. పే. ౮౦ వెల రు. 0-5-0. మచ్చునకొక

పద్యము: ఉ. రజ్జులు త్రేలనేటికి దు
రంబొనరింతువుగాక నేఁ డనిక్
బొజ్జ గరంగఁజేసి యసు
వుల్ వలఁకక్ గుదిగెల్వ వేలుపుం
బజ్జకు బంపువాడనిదె
పాటికనిల్వు దురాత్మ, నేటితో
ముజ్జగముల్ జెలంగుచున
పూర్వమనః ప్రమదంబు నొందఁగక్.

* * * *

## చోరచరిత్రము (ఏకాశ్వాసపద్యకావ్యము)

గ్రంథకర్త: కేసిరాజు వేంకటసుబ్బారాయకవి.

ఇందు తిరుమంగయాళ్వారుచరిత్రము వర్ణింపబడినది.

క్రౌనుసైజు ౧౭ పేజీలు. వెల 0-2-0

మచ్చునకు:

"ఉ. కంటకయుక్తమైనను సు
గంధరసస్థితిఁ జేసి యెందుని
ష్కంటకవృత్తిఁ జెందనను
గ్రాలువిధంబున వీఁడు దుర్నయుం
డంటిన యేని వైష్ణవ న
రాంఘ్రిపయోరుహ తీర్థసేవ ని
ష్కంటకవృత్తిఁజెన్నలరుఁ
గావునఁ బ్రోవఁగఁబాడి యీతనిన్."

* * * *

## వేంకటేశ్వరతారావళి

గ్రంథకర్త: కేసిరాజు వెంకటసుబ్బారాయకవి. ఇందు రెండుతారావళులున్నవి. ఒకటి సీసతారావళి, ఇంకొకటి వృత్తతారావళి: క్రౌనుసైజు ౨౦ పేజీలు

వెల రు. 0-2-0

* * * *

## శ్రీభద్రాద్రిరామాయణము

గ్రంథకర్త: కేసిరాజు వేంకటసుబ్బారాయకవి. ఇందు శ్రీరామషోడశోపచారస్తవము, దశావతారస్తవము, శ్రీభద్రాద్రిరామాయణము, అనుమూడుగ్రంథములుగేయ, పద్యాత్మికములుగనున్నవి. డిమ్మిసైజు పే.౩౪

వెల రు. 0-3-0

* * * *

## రామదాసనాటకము-యక్షగానము

గ్రంథకర్త: కేసిరాజు వేంకటసుబ్బారాయకవి. ఇందు ఇప్పటినాటకములవలె వచనరూపమున పాత్రముల సంభాషణ మచ్చటచ్చటగలదు. డిమ్మిసైజు. పే. ౧౭౦

వెల రు. 0-8-0

పై యైదుగ్రంథములకును ప్రకాశకులు: శ్రీతమిరిశెనంటరమణారావుగారు, రావూరుపాడు, తాళ్లపూడి పోస్టు, పశ్చిమగోదావరి.

* * * *

## సాంఘికదర్పణము (వచనము)

గ్రంథకర్త: మల్లాదినాగభూషణముగారు.కొన్ని సాంఘికధర్మము లీగ్రంథము వివరించుచున్నది. క్రౌను సైజు. పే. ౧౦౦ వెల రు. 0-8-0

* * * *

## ప్రహ్లాదనారాయణయుద్ధము

### (రెండాశ్వాసములు-పద్యములు)

గ్రంథకర్త: సంపన్నుకుంబసింగరాచార్యులుగారు, బాలకవి. ఈ ప్రహ్లాదనారాయణుల యుద్ధగాథకు మూలము వామనపురాణమునగలదు. క్రౌనుసైజు. ౭౦ పేజీలు. వెలలేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఈ రెండుగ్రంథములును విజ్ఞానప్రచారిణీగ్రంథ మాలలోని ౧౦,౧౧ కుసుమములు. విలాసము: నెమిలికొండ, జగ్గ్యాల.

* * * * *

### భోగేశ్వరయాత్ర (వచనము)

గ్రంథకర్త: నుడిపాటి వేంకటేశ్వరశర్మ, బాలకవి. ఇందు కైకలూరుతాలూకాలోని కోట, కొల్లేరుల చరిత్రలు వివరింపబడినవి. క్రౌను సైజు పే. ౭౨ వెల రు. 0-4-0. ప్రకాశకులు: వ్యవస్థాపకులు, ఆంధ్రకవితా ప్రచారిణీగ్రంథనిలయము, ప్రొద్దువాక, కోరుకొల్లు పోస్టు, కృష్ణాజిల్లా.

* * * * *

### ఆచారకాండ (వచనము)

గ్రంథకర్త ఎవరో. ఇందుకొన్ని ఆచారాంశములు వివరింపబడినవి. ఇది పంచాననపుస్తకాలయమున ప్రకటింపబడినది. సోంపేట, గంజాము. క్రౌను సైజు, ౧౭౨ పేజీలు. వెల. రు ౦-౪-౦

* * * * *

### కుమారస్వామి (వచనము)

ప్రకాశకులు: సి. కుమారస్వామినాయుడు అండు సన్సువారు, చెన్నపురి. ఇందు కుమారస్వామిచరిత్రము పురాణములనుండిగైకొని సులభశైలిని రచియింపబడినది. ఇది చిన్నవిద్యార్థులకు చాలనుపయోగకరము. క్రౌను సైజు. ౪౭ పేజీలు. వెల రు. ౦-3-౦

* * * * *

### గోత్రప్రవరసంగ్రహము

శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులు గారు సమకూర్చినది. ఈ క్రిందనుదహరించినపీఠికయందలి వాక్యములవలన నీగ్రంథవిషయము తెలియగలదు: డిమ్మీసైజు ౬౨ పేజీలు వెల రు. ౦-౫-౦

"ఈగ్రంథమునందు ఆపస్తంబ,బోధాయన, హిరణ్యకేశీయ, వైఖానస, కాత్యాయన, లౌగాక్షి, ఆశ్వలాయన, కల్పసూత్రములను, మత్స్యపురాణమును అనుసరించి ఆయాగోత్రగణములకు గల ప్రవరలను, వికల్పప్రవరలను, ఏయేసూత్రకర్తలు ఏయే ప్రవరలను తెలిపిన దియు వివరముగ వ్రాయబడినది.

"గ్రంథాంతమునందు ఏయే గోత్రగణమునందు ఎందఱు గోత్రకర్తలు ఆయాసూత్రకర్తలచేత పఠింపబడియున్నారో, ఆయాగోత్రకర్తలనామములు అకారాదిగ ఇందు ప్రకటింపబడియున్నవి."

ప్రకాశకులు: శ్రీ కనుపర్తి మార్కండేయశర్మ గారు, బృందావనము, కీల్పాకము, చెన్నపురి.

* * * * *

### శివయోగసారము

### ఉత్తరభాగము (ప్రథమసంపుటము)

గ్రంథకర్త: కొలనిగణపతిదేవుడు. శివపారమ్యప్రతిపాదకమగు నీ ప్రాచీనగ్రంథమునందలి ప్రథమాశ్వాసముమాత్ర మిందుగలదు. శ్రీవిద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు ప్రతిపద్యమునకు తాత్పర్యము వ్రాసియున్నారు. ఇది శైవప్రచారిణీకార్యాలయమున ౧౪వ కుసుమము. వరంగల్. డిమ్మీసైజు. పే. ౧౨౫.

వెల చందాదారులకు రు. 1-0-0

,, ఇతరులకు రు. 1-4-0

---

## పత్రికాపరిచయము

### పుష్పమాల–సంపుటము ౧, సంచిక 3.

ఇందలి ముఖ్యవ్యాసములు

కుక్కపిల్ల:— వేలూరి శివరామశాస్త్రిగారు. కరుణరసభూయిష్ఠ మగు రసవత్ఖండకావ్యము.

పాండురంగమాహాత్మ్యము:— అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. తెనాలి రామకృష్ణకవి–పాండురంగమాహాత్మ్యమున ఉత్ప్రేక్షలకును, ఉపమలకును ఉపయోగించిన స్వానుభవమునందలి విషయముల నిం దుదహరించి సోదాహరణముగ వివరించినారు.

'భవభూతి–మాలతీమాధవము' విమర్శన:— విద్వన్మణి శిష్టా నరసింహశాస్త్రిగారు. ఇవి మొదలగునవి.

* * * * *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆంధ్రభారతి–సంపుటము ౨, సంచిక ౧.

ఈసంచిక స్వరూపమున నభివృద్ధి గాంచినది. ఇందలి 'చానమ్మ' చాలాపత్రికలలో ప్రకటితమైనది.

సుజాత–సంపుటము ౧, సంచిక 3.

ఇందలి ముఖ్యవ్యాసములు

"నాగులపాడు:— ఆంధ్ర పరిశోధకసంఘము." నాగులపాటిశాసనములకు మూలమిందు ప్రకటితమైనది.

"ఇనుస్తి":— ఓ. సీతారామచంద్రరావుగారు వ్రాసినది.

* * * * *

విజయనగరం మహారాజాగారి కాలేజి మేగజీను (త్రైమాసికపత్రిక) సంపుటము ౯, సంచిక 3. ఇంగ్లీషు, తెలుగు.

చారిత్రక సారస్వత విషయములను గూర్చిన వ్యాసములు పెక్కులుగలవు. తెలుగువ్యాసములలో ముఖ్యములైనవి:

'తిక్కన కాలనిర్ణయము':— జి. నరసింగరావుగారు (బి. ఏ., యల్. టి.) వ్రాసినది.

'శ్రీనాథయుగము':—కోరాడ రామకృష్ణయ్యగారు (యమ్. ఏ.) వ్రాసినది.

---

# శ్రీవేంకటేశ్వర స్తవము

మండలేముల వెంకటశాస్త్రిగారు, బి. ఏ. యల్. టి.

ఆరయ నామరూపములయం దభిమానముఁ బూనుచున్కి సం
సారము గల్గు దేహికి; విచారమునన్ సుఖసచ్చిదాత్మకం
బై రహియించు లోక మని యాత్మ నెఱుంగుట మోక్షమందు
రీతీరు నెఱుంగుపండితు లతి స్థిరబుద్ధులు వేంకటేశ్వరా!

ఉ. ఆస యనంగ నొప్పును మహత్తరపాశము; తన్ని బద్ధమై
గాసిలు నెల్లలోకములు కర్మములన్ బహుచింతలన్ వృథా
యాసము నొంది; క్షీణమగు నాయువు భంగి నెఱుంగ దింతయున్
ధీ సముదగ్రుఁ డేమరఁడు దీనివశమ్మున వేంకటేశ్వరా!

చ. ఎది త్రిగుణాత్మకంబనుచు నేర్పడఁ దోఁచుఁ బ్రపంచమెల్ల నె
య్యది తగు నీశ్వరుండనఁగ నంచితసత్త్వగుణప్రధానమై
ఎది వెలయున్ రజస్తమము లేర్పడ జీవుఁడనంగ నిర్గుణం
బదియె యెఱుంగుబ్రహ్మ మని యార్యులు వల్కిరి వేంకటేశ్వరా!



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




వర్తమానయుగము మహాసంరంభయుగము. బల సంరంభము, ధన సంరంభము, వ్యాపారసంరంభము, సాంఘికసంరంభము, ధర్మ సంరంభము లోకమునంతను నావరించి బీభత్సమును గలుగజేయుచున్నవి. పాశ్చాత్య సంస్కారము తృష్ణాప్రవాహమును వృద్ధిజేయుచు మహాసంరంభమునకు సాధనంబుగ నున్నది. రాజ్యకాంక్ష, వ్యాపారతృష్ణ ధనాభిమానము జాతి కులసంఘాభిమానము సంరంభమును గలుగజేయుచున్నవి. మతధర్మాభిమాన మాచరణమునందు నిరర్థకముగ నున్నను సంరంభమునం దావేశమునకు సాధనంబుగ నున్నది. ఈమహాసంరంభము ప్రజాస్వామ్యత్వమునకు సహజఫలమైనను భయభ్రాంతులను గలుగజేయుచున్నది. లోకమంతయును నింతవఱకును స్వప్రయోజనారాధనముమీఁదనాధారపడియున్నది. జాతులకును, వ్యక్తులకును సంస్కృత స్వప్రయోజనపరాయణత్వము (enlightened self-interest) ధర్మమార్గానుష్ఠానమునకు పరమప్రమాణముగ పరిణమించినది. తనకుమాలినధర్మము లేదను సిద్ధాంతము పాతుకొనినది. విపరీత జాతీయత రాజ్యమునుచేయుచు మానవత్వమును లుప్తముచేసినది. స్వధర్మపరధర్మములకు విపరీతార్థములు కల్పింపబడినవి. స్వధర్మపరధర్మారాధనసిద్ధాంతము లాత్మార్థమునకు గాక దేహార్థము వినియోగపడుచున్నవి. క్రీస్తు బుద్ధుడు శంకరాదులుబోధించిన త్యాగధర్మములు లుప్తమై భోగధర్మము ప్రబలినది. శ్రీకృష్ణభగవానులు గీతాశాస్త్రమునందు దైవాసుర సంపద్విభాగయోగమునందు ప్రతిపాదించిన త్యాగధర్మము పోయి సకలవ్యవస్థలయందును భోగధర్మము సుస్థాపితమైనది.

శ్లో. అసౌ మయా హత శ్శత్రుర్హనిష్యే చాపరానపి,
ఈశ్వరోఽహ మహంభోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ.

శ్లో. అహంకారం బలందర్పంకామం క్రోధంచ సంశ్రితాః,
మామాత్మపరదేహేషుప్రద్విషంతోఽభ్యసూయకాః.

శ్రీమంతులు విద్యావంతులు చేయుచున్న ఆసురసంపదారాధనము ప్రపంచమునకు ప్రమాణమై మహాసంరంభపమును దాల్చుచున్నది. స్వత్వసంరక్షణమునకు ప్రాచీనసిద్ధాంతములకును నవీనసిద్ధాంతముళకును నేర్పడుచున్న సంగంభము భయంకరాకారమును దాల్చుచున్నది. రుష్యాయందలి బొల్షివిజము, ఇటలియందలి ఫాసిటు ఉద్యమము, చీనాయందలి సంగ్రామము, భరతవర్షమునందలి రాజకీయ సాంఘిక సంరంభములు, బ్రిటీషు పార్లమెంటు నిర్మింపనున్న వర్తకసంఘశాసనము ప్రపంచవ్యాప్తమైన మహాసంరంభమునకు ప్రమాణములుగ నున్నవి. ప్రపంచవికాస


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునకు సృష్టిలయము లన్యోన్యాశ్రయమును గలిగి యున్నవి. సృష్టి యానందమునకును లయము శోకమోహములకును గారణంబైనను సృష్టికిలయ మాధారభూతముగనున్నది. లోకమంతయును పునర్నిర్మాణము నపేక్షించుచున్నను, పునర్నిర్మాణమునకు అమృత బీజమైన త్యాగమును నిరసించు చున్నది. త్యాగాభావమైన ప్రజాస్వామ్యత్వము విప్లవమునకు సాధనం బగునటులు త్యాగవిరహితమైన రాజ్యధనాధికారములును విప్లవమునకు మూలము లగుచున్నవి.

శ్లో. సహయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్టకామధుక్.

మానవులు తరించుటకు త్యాగరూపమైన యజ్ఞము పరమసాధనముగ నున్నది. త్యాగములేని యజ్ఞములు దుర్నయములకు సాధనంబు లగుచున్న విధమును ప్రపంచేతిహాసములు విశదము చేయుచున్నవి. వర్తమాన ప్రపంచస్థితి దుర్భరమై సంరంభమునకు సాధనంబుగనున్నది. పునర్నిర్మాణమవసరమైనను భయభ్రాంతులను గలుగ జేయుచున్నది. పూర్వ ప్రతిష్ఠాపకులకునునవయుగ ప్రతిష్ఠాపకులకును భయంకరసంరంభము సంప్రాప్తమగుచు ప్రపంచశాంతి స్వప్నతుల్యముగనున్నది. బర్కేను హెడు ప్రభువు భారతరాజ్యాంగ వ్యవహారసందర్భమునను, వర్తకసంఘశాసనసందర్భమునను తెలిపినభావములు తీవ్రమైనదురభిమానమును విశదముచేయుచున్నవి. బర్కేను హెడుప్రభువు మాటకుమాట, సభకు ప్రతిసభ, దెబ్బకుదెబ్బ, ప్రకటనమునకు ప్రకటనము సాగించి కార్మిక బలమును శక్తిరహితము చేయుటకు ప్రతిజ్ఞను జేయుచున్నాడు. బర్కేను హెడుప్రభువు నధికారోన్మాదము పీడించుచు యుక్తాయుక్తవివేకమును పోగొట్టినది. బర్కేను హెడుప్రభువర్యుని ప్రగల్భములు సుమతిశతకములోని నీతివాక్యములను సంస్మరింపజేయుచున్నవి!

క. బలవంతుడ నా కేమని
పలువురతో నిగ్రహించి పలుకుట మేలా
బలవంతమైన సర్పము
చలిచీమలచేతఁ జిక్కి చావదె సుమతీ.

గ్రేటుబ్రిటనునందు 21 ఏండ్లను మించిన స్త్రీలును, పురుషులును వోటులను గలిగినపుడు ప్రజాబలము హెచ్చునుగాని ప్రభువుల బలము హెచ్చదు. దూరదృష్టిలేని బర్కేను హెడుప్రభువు తాత్కాలికబలమును జూచి గంతులు వేయుట ప్రయోజనకరము గాదు. వర్తకసంఘశాసనము కార్మికపక్షబలమును తాత్కాలికముగ తగ్గించినను కాలాంతరమున కార్మికపక్షబలము హెచ్చుటయును శాసనము రూపాంతరమును దాల్చుటయును సహజము. బర్కేను హెడుప్రభువు వర్తకసంఘశాసనముపట్లను భారతరాజ్యాంగముల పట్లను బూనుచున్న నిరసనభావము బ్రిటీషుసామ్రాజ్యమునకును ప్రపంచమునకును సంప్రాప్తము గానున్న దుఃఖానుభవమునకు నిదర్శనముగ నున్నది.

* * * *

వర్తకసంఘశాసనము

బ్రిటీషుద్వీపములందును నితరదేశములందును నిటీవల కార్మికసంఘములబలము క్రమ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వికాసమును బొందినది. బ్రిటీషుద్వీపములం దిపుడు కార్మికసంఘము(Trade Unions)లందు 43,65,414 సభ్యులు గలరు. గతసంవత్సరము నందు బొగ్గుగనులపనివాండ్రను కార్మికులును సమ్మెకట్టుటకు చేసినప్రయత్నములు ధనస్వాములకును పూర్వాచారప్రియులకును భయభ్రాంతులను గలుగజేసినవి. ప్రభుత్వాదరణము గల ధనస్వాములపక్షము గెలిచినను కన్సర్వేటివు పక్షము తమకు గలబలమును కార్మికపక్షబలమును నిర్మూలముచేయుటకు వినియోగించుట యనుచితముగ నున్నది. కార్మికసంఘముల పలుకుబడిని సమ్మెకట్టులను నిర్మూలముచేయుటకు కన్సర్వేటివు ప్రభుత్వము నూతన శాసననిర్మాణమునకు బూనుకొనుచున్నది. ధనాధికారబలము లేని పనివాండ్రకు కష్టనివారణమునకు ప్రత్యక్షాచరణము మాత్రము శరణ్యముగ నున్నది. ప్రత్యక్షాచరణమును శాసనము ప్రతిషేధించునపుడు కార్మికసంఘముల బలమును,నుపయోగమును నంతరించుట సహజము. కన్సర్వేటివు పక్ష మవలంబించుచున్న దుర్ణయము ప్రస్తుతము సంతృప్తికరముగ నున్నను కాలాంతరమునను పరమవిషాదము గలుగజేయుట సహజము. సామ్రాజ్యదురభిమానుల దుర్ణయముల నాపుటకు పరమేశ్వరునికటాక్షముమాత్రమె శరణ్యముగనున్నది. పరాధీనరాజ్యముల నావరించిన దుర్గతి భారత రాజ్యాంగములను నావరించినది.

* * * *

భారత రాజ్యాంగములు

శాసనసభాసమావేశములు ప్రస్తుతమును నంతము నొందినవి. సభావ్యవహారములు సభ్యులకును, ప్రజలకును నసహ్యముగ నున్నవి. సామ్రాజ్యశాసనసభయందు, నాయకులయందు పెరిగిన యంతఃకలహములు భేదాభిప్రాయములు దేశావృతమైన దుర్దశను విశదము చేయుచున్నవి. నాయకులయందు సంయోగసాహచర్యము లపురూపములైనవి.నాయకులందరును స్వీయాభిప్రాయములు నెగ్గించుకొనుటకు పట్టుపట్టిరి. శ్రీనివాసయ్యంగారి యోచనలు నెహ్రూగారికిని, నెహ్రూగారియోచనలు ప్రకాశముగారికిని, ప్రకాశముగారి చర్యలు రంగయ్యరుగారికిని సరిపడకుండెను.జిన్నా మాలవ్య లాలాజిగారల విషయమును భిన్నపక్షమునకు జెందినవార లగుటచే విమర్శింప నవసరములేదు. హిందూ మహమ్మదీయవిభేదముల కాద్యంతములు లేవు. సభ్యులెవరికి దోచినటులు వారు ప్రవర్తించునపుడు సంయోగబలముశూన్యమై ప్రభుత్వబలము, ప్రతిఘటనము బలములేక యథాప్రకారము సాగిపోవుచున్నది. నాయలకు వ్యాఖ్యానములకును, వారిప్రవర్తనమునకును సంబంధము గోచరము గాకున్నది.

సామ్రాజ్యశాసన సభయందు జరిగిన వ్యవహారమే రాష్ట్రసభలయందును జరిగినది. మంత్రివర్గము నాపుటకు వివిధరాష్ట్రములందును కాంగ్రెసుపక్ష సభ్యులకు బలము లేకున్నది. చెన్నరాష్ట్రసభయందు బలమున్నను నిరర్థకముగ నున్నది. కాంగ్రెసుపక్షమునకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మంత్రివర్గమును జస్టిసుపక్షవర్గముతో గలిసి పడద్రోయుట కవకాశమున్నను మంత్రివర్గ నిర్మాణము నాపుటకు శక్తి లేకున్నది. శక్తి యున్నను జస్టిసుపక్షభయము బాధించుచున్నది. మంత్రివర్గ పోషణమును జేయుటవిషయమై కాంగ్రెసుపక్షమునందు భేదాభిప్రాయములు ప్రబలినవి. మంత్రివర్గపోషణము నామోదించెడివారును నిరసించెడివారును తటస్థులును గలరు. శాసనసభయందు ప్రజోపయోగమగు పనులను జేయుట కవకాశములు గలవని విశ్వసించెడి సభ్యులు గలరు. నియోజకవర్గమునకీ సహాయము సంతృప్తికరముగ నుండగలదను వారును గలరు. మంత్రివర్గపతనమును గోరెడి సభ్యులు గలరు. సహాయ నిరాకరణవాదులకును, జస్టిసు వర్గమునకును నిది సంతృప్తికరముగ నుండగలదు. ఇట్టి సందిగ్ధస్థితియందు కాంగ్రెసుసభ్యులకును నాయకులకును ప్రజలకును కర్తవ్యము దుర్గ్రాహ్యముగ నున్నది. శాసనసభాప్రవేశమె సహాయనిరాకరణధర్మమున కభ్యంతరమును గలుగ జేసినది. ప్రవేశానంతరము సహాయ నిరాకరణ ధర్మాచరణమెంతసాధ్యమొ నిర్ణయించుట దుస్తరముగ నున్నది. శాసనసభ్యులను గౌహతితీర్మాన మొకవంకను, పక్షనిర్ణయ మొకవంకను బాధించుచున్నవి. ఈసందిగ్ధస్థితియం దెవరికి తోచినటులు వారు ప్రవర్తించుట కవకాశములు గలుగుచున్నవి. అఖిల భారతసభాస్థాయిసంఘము వెంటనె కాంగ్రెసు పక్షము శాసనసభలయందు నిర్వహింపవలసిన కార్యవిధానమును నిర్ణయించి భిన్నపక్షము లేకమార్గమునను ప్రవర్తించుట కేర్పాటు చేయుట యవసరముగ నున్నది.

* * *

## ఆంధ్రరాష్ట్రజాతీయోపసంఘము

ఆంధ్రరాష్ట్ర జాతీయోపసంఘమునందు ప్రబలినవాదప్రతివాదములు దేశావృతమైన విషాదావస్థను విశదము చేయుచున్నవి. రాష్ట్రసభ్యులందు సహాయనిరాకరణోద్యమారాధకులు గలరు. వారి లక్ష్యమునకును, శాసనసభా సభ్యుల లక్ష్యమునకును సాదృశ్యము గలుగుట యసంభవము. గోవిందాచార్యులుగారు దేశభక్త వేంకటప్పయ్యపంతులుగారు, బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యముగారు శాసనసభాప్రవేశమును నిరసించెడి అసహాయవాదులు; నిర్మాణకార్యమునందు విశ్వాసము గల కాంగ్రెసు పక్షావలంబకులు. వీరికిని శాసనసభ్యులకును శాసనసభావ్యవహారములందు సాదృశ్యము గలుగుట దుర్లభము. శాసనసభ్యుల చర్యలను ఖండించుచు నిర్మాణకార్యవిధానము నవలంబింపవలయు నని తీర్మానము లామోదింపబడినవి. ప్రముఖులకాలము శాసనసభలయందు గడచిపోవునపుడు నిర్మాణకార్యమును నిర్వహించెడి వారెవరో తోచకున్నది. ప్రకాశముపంతులుగారు నిర్మాణవిధానమును, సభావ్యవహారములను, నితర కార్యములను నిర్వహించుటకు సంకల్పించినను ఆచరణమునందు సాధ్యముగాకున్నది. శాసనసభాప్రవేశమునకును, నిర్మాణకార్య విధానమునకును వైరుధ్యము లేకపోయినను సాహచర్యముసాధ్యముగాదు. రెండుమార్గములకును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సంకల్పములు, ధ్యానములు, సాధనలు వేర్వేరుగ నున్నవి. త్యాగమునకును, లాభమునకును సామ్యము దుర్లభము. సభ్యులకు వాగ్వివాదములందు గల పట్టుదల కార్యాచరణమునందు లేదని వ్యవహారములు విశదము చేయుచున్నవి. విజయవాడసభతో పాటునిర్మాణవిధానమును ముగియుచున్నది. ప్రకాశము పంతులుగారు నిరాశాప్రేరితులై యథోచిత సహకారమునకు సంబంధించిన తీర్మానమును ప్రతిపాదించుటయును, చర్చానంతర ముపసంహరించుకొనుటయును దేశావృతమైన నిస్సహాయస్థితిని విశదముచేయుచున్నవి. సహాయ నిరాకరణసాధనము లుప్తమైనను ఆదర్శము ప్రజానాయకులను బాధించుచున్నది.

శాసనసభాబహిష్కారమును దేశబంధుదాసు తొలగించి ప్రతిష్టంభనవిధానమును నెలకొలిపిరి. గౌహతి కాంగ్రెసు ప్రతిష్టంభనస్థానమున ప్రతిఘటనమును నెలకొలిపినది. ప్రతిఘటనమునందును నియమములను నిర్ణయించినది. గౌహతికాంగ్రెసు శాసనసభలయందు సభ్యులు చేయవలసిన కార్యవిధానమును నిర్ణయించినది. ఆంధ్ర రాష్ట్రీయసంఘసభ్యులు వారిస్థలములను ఖాళీగనుంచవలయునని చేసినతీర్మానము సహాయనిరాకరణసూత్రమునకు సన్నిహితముగ నున్నను గౌహతితీర్మానమునకు దూరస్థముగ నున్నది. గౌహతితీర్మానమునకును ఆంధ్ర రాష్ట్రసంఘముచేసినతీర్మానముకును వైరుధ్యము లేదని సభాధ్యక్షులు నిర్ణయించుట విచిత్రముగనున్నది. గయాకాంగ్రెసునందు దేశబంధుదాసుగారు ప్రతిపాదనమును నిరాకరించిరి. శ్రీనివాసయ్యంగారు గయాకాంగ్రెసునందు ప్రతిపాదించిన తీర్మానమును ఆరేండ్లశాసన సభల యనుభవముతరువాత తిరిగి ప్రతిపాదించుట వ్యవహారనిర్ణయమునకు ప్రయోజనకరము గాజాలదు. వారముదినములకు బొంబయియందు గూడనున్న కాంగ్రెసు స్థాయిసంఘము శాసనసభల విషయమై సుస్థిరాభిప్రాయమును వ్యక్తముచేసి దేశావృతమైన సంరంభము నాపుట శ్రేయస్కరము.

*　　*　　*　　*

అఖిలభారత చరఖా సంఘము

అఖిలభారత చరఖా సంఘముయొక్క ఆంధ్రశాఖయును, ఖాదిప్రచారకులును సమావేశమై చేసిన నిర్ణయములు ఖద్దరు వ్యాపనమునకువలయు సాధనములను వ్యక్తముచేయుచున్నవి. ఆంధ్రదేశమునందు ఖద్దరునిర్మాణమునకు గల సాధనసంపత్తి పుష్కలముగనున్నను ఖద్దరు నిర్మాణము మందగమనమును జేయుచున్నది. కైలాసపట్నము, తుని,పల్నాడు, ఒంగోలుప్రాంతములందు ఖద్దరునిర్మాణము నెమ్మదిగనుసాగుచున్నది. దూదిరాటములు మగ్గములు దేశమునం దంతటనుగలవు. ఉత్సాహపరాయణులైన ఖద్దరు ప్రచారకులుగలరు. నైపుణ్యముగలనేతగాండ్రుగలరు. ఆంధ్రఖద్దరు దేశమునం దంతటను నాలుగేండ్లు రాజ్యము చేసినది. ఇపు డాంధ్ర ఖద్దరు పేరుప్రతిష్ఠలు లేకను వెనుకబడు చున్నది. ధనములేక ఖద్దరు నిర్మాణము విరివిగ జరుగకున్నది. ఖద్దరు నిర్మాణప్రచారములకుతమిళనాడునకు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గల ప్రతిపత్తి ఆంధ్రదేశమునకు లేకుం డుట సంతాపకరముగ నున్నది. నిర్మాణవిధానము విషయమై తీర్మానములను జేసినంత మాత్రముననను కార్యసిద్ధి గలుగజాలదు. ఖద్దరు వ్యాపనమునకు తంతుకారసంఘము సంగిన ద్రవ్యము నందు విశేష భాగము రొక్కరూపమున గాక అప్పులరూపముననను నిలిచియున్నది. ఉత్సాహపరాయణులైన యువకులు నిర్మాణకార్య విధానము నవలంబించుటకు సంసిద్ధులైయున్నను సాధనసామగ్రి లేకను కార్యాచరణము వెనుకబడుచున్నది. స్వరాజ్యమునకు రాటము, మగ్గము సాధనము లని గాంధిమహాత్ముడు చేయుచున్న బోధ సార్థకము గాకున్నది. అంతఃకలహములు, సాంఘికభేదములు, నిర్లేపత్వము, స్వాభిమానస్వప్రయోజనములు శాసనసభలయందును, నిర్మాణకార్యవిధానమునందును సంయోగ కార్యాచరణమును దుర్లభము చేయుచున్నవి. సత్కార్యములు, సద్భావములు విపరీతవ్యాఖ్యానములకు పాలై పరిహాసపాత్రము లగుచున్నవి. సకలమును శాపగ్రస్తమై న్యాయాన్యాయములు, ధర్మాధర్మములు సమాచ్ఛాదితములై భయంకరాకారమును దాల్చుచున్నవి. ఈవిషాదావస్థయందు భారతహృదయావృతమైన సమ్మోహమును బాపి భారతీయులను ధర్మయోగులనుజేయుటకు భగవదనుగ్రహము శరణ్యముగ నున్నది. కురుక్షేత్రమునందు విషాదావస్థయందు శ్రీకృష్ణపరమాత్ముడు భారతయోధాగ్రేసరునకు జేసినధర్మోపదేశమె వర్తమాన విషమావస్థయందు భారతీయులకును శరణ్యముగనున్నది.

శ్లో. క్లైబ్యం మాస్మగమః పార్థ, నైతత్త్వయ్యుపపద్యతే;
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!

భారతీయులు ధర్మనిరతులై భగవదనుగ్రహమునకు పాత్రు లగుదురుగాత!



Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T., Madras

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# విషయానుక్రమణిక



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## చిత్రములు





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



రాధాస్వప్నము

చిత్రకారుడు: శ్రీ చామకూర సత్యనారాయణగారు, రాజమండ్రి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



చెన్నపట్టణము జూన్ ౧౯౨౭

సంపుటము ౪ ప్రభవ సంవత్సరము జ్యేష్ఠమాసము సంఖ్య ౬

## పోలి

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

వంగిననడుముతో వాడినయొడలితో గురుచలై నెరసిన కురులతోడ
ముడుతలనుదుటితో ముదుగుచెక్కిళ్లతో జెంపలవ్రేలాడు చెవులతోడ
నొరసినకనులతో నెరసినబొమలతో బొమలనడుమ చుక్కబొట్టుతోడ
తడబడునడకతో వడకెడునెలుగుతో నుసురుస్సురనియెడు నూర్పుతోడ
ముచికపట్టున నిలబడి పోకయుండి-మిగుల ముగ్గినపండన దగినముసలి
పడతి యొక్కతె యొకయింట బాచిపనుల-జేయుచుండును కాకులుకూయువేళ.

గీ. వాడిపోయిన యాసతి వదనమందు-కమలిపోయిన యారెండు కనులనుండి
యెదిరిమదికెంతొ ప్రేగయి మెసక మెసగు-వింతతేజమొక్కటి వెల్లివిరియుచుండు.

గీ. బిడ్డలే లేరొ, రెక్కలు విరిచి ముసలి-వయసునందును పొట్టకై ప్రాకులాడు
సంఘదోషమొ, రాజ్యదోషంబొ, పూర్వ-కర్మదోషమొ, మరియేమి కారణంబొ?

ఉ. ఓపిక లేకయున్న గడు నోరిమి బూనుచు నాపడంతి యె
ట్లో పనిసేయుచుండు నటు లోపికతో బరిపాటియయ్యె, దా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నేపని జేసెనేని యొకయించుకయైనను లోప మందులో
దోపగనీద యాపడతి; తొంబదియేడుల తొక్కు చూచినన్.

గీ. నిష్ఫలను కడుగంజూచు నెలతలైన-నడుగులెత్తిత్తివేసెడు నతివలైన
నెట్టియాచారవతులైన నించుకేని-తప్పకనుగొనలేని విధమున జేయు.

క. "బ్రాహ్మణ్యము చెడె నయ్యో-బ్రాహ్మణులకు లేదు గౌరవం"బను కుహనా
బ్రాహ్మణు లెవ్వరు లేవని- బ్రాహ్మముహూర్తమున ముసలిపడతుక లేచున్

క. హోరుమనువర్షమున దన-చీర తడియుచున్న, జాగుసేయక వెస నే
తేరును పిలువకయే, తెల-వారకమును పనుదినంబు వరవుడుసేయన్.

క. స్నానము జేయని దిన మొక-టేనియు గనగా దొకించుకేనియు మలినం
బానాతి వస్త్రములు నే-నేనాడుం జూడ శౌచ మిట్టిది సతికిన్.

గీ. యజ్ఞముల జేయు నాసోమయాజులందు-లక్షవత్తులనోములు లక్షచేసి
నట్టివనితలయందును నరయరాని-కర్మదీక్షయు ధర్మాభికాంక్ష కలవు.

గీ. అంట్లుదోమి జీవించెడు నట్టివా ర-నేకు లాయూర గల రైన నెవ్వరైన
బోలికిని నింకనొకతెకు బోలికయను-మాటయే లేదంటచును జాటుచుంద్రు!

గీ. ఒరులు నీ కెట్లుసేయంగ నూహజేతొ-యొరుల కటు నీవుసేయుటే యుత్తమమగు
నట్టిధర్మంబనుచు జాటునట్టినీతి-నబల యాచరణంబున నన్వయించు.

క. ఆయూర నెలకు నొకరూ-పాయకు నొకగవ్వ తక్కువకు బాచిపనుల్
జేయ రికెవ్వరు నొక్కత-యే మెనిమిదణాలతోడ దృష్టివహించున్.

గీ. కన్నులకు నద్దుకొని యధికముగ జీత-మిచ్చువా రెందరోయుండ నిష్టపడక
నమ్మియున్నవారల విడనాడ నోడు-విత్తవైరాగ్య మెట్టిసున్నృత్త మహా!

గీ నీటికొలది తామరకద కోటులాది-ధనములు గడించువారి యంతరము లరసి
వెలయుత్యాగంబు దానికి విలువకలదె? త్యాగగుణముండదోటు నిర్ధనులయందు!

చ. తనపనిరీతిగా నియమితంబగు కార్యముచేయు, నెవ్వరుం
బనిచెడి పైన చూడ దగుబాధయు నీయక యెంతొవింత నే
ర్పున నొనరించు నమ్మకము పుట్టెడునట్టులు చేయు గాని తా
గనులను గప్పి కుత్సితపు గక్కురితిన్ ప్రకటింప దింతయున్.

గీ. హీనకులజులకెందు నహీనబుద్ధి-సంపదలు కలుగునేయని సంశయింత్రు
పలువ్రు, రది సత్యమైన గావచ్చునేమొ? గుణమె కలిగిన నది హీనకులము కాదు!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. ఆయింటివారు పెట్టెద-రాయతివకు నొక్కపూటయన్నము సతి దా
నాయన్న మొకటి తిని, దీ-ర్ఘాయుర్దాయంబు బలము కలిగి తిరిగెడిన్.

గీ. గంజిలోనికి నుప్పు లేకను విచార-పడెడువారుండ, పాలలో పంచదార
లేదనుచు నేడ్తు రెందరో; లేరు లబ్ధ-విత్తముల దృప్తిజెందెడు వెఱ్ఱు లెందు.

గీ. ధర్మ మెద నెంచి, రాగలధనమురోసి-యున్నయునికిన సంతృప్తినొందునట్టి
వార లీకాలమున వెఱ్ఱివారె కాని-వారివర్తన భూమి కాధారమయ్యె.

గీ. అట్టిగుణఫలములు గల్గి యలరుచున్న-యట్టిముదికొమ్మ పోలి; యే నప్పుడపుడు
చూచి యొకనాడు చివరకు జోద్యమంది-వీథిగుమ్మము నలికెడువేళ జేరి.

ఉ. 'ఏమిది కొద్దిజీతమునకే పనిసేయుదువేమి? నీకు నీ
గ్రామములోన జీత మధికంబుగ నిచ్చెడువార లుండ, నీ
వామెయి బోక వీరలనె యంటినదాన విదేమి? నీకు వీ
రేమిట గొప్పలాభ మొనరించిరి నీకథ చెప్పు మంతయున్.'

క. అని ప్రశ్నించిన నామెయు-"బనిమెంతయొ కలదు మిమ్ము బతిమాలెద నా
పని మైన వెనుకజెప్పెద-చను డంతకు గరుణతోడ క్షమియింపవలెన్."

చ. అన విని సిగ్గుదెచ్చికొని యావల బోయితి నట్టికార్యదీ
క్షను మఱియొండుచో గనుట సందియ మెంతటివేత్తలైన త
ప్పనుచు వచింత్రుగాని తమయాచరణంబున జూపజాల రా
వనిత యొకంతయుం జదువ వ్రాయను గూడ నెఱుంగ దింతకున్.

శా. ఆమధ్యాహ్నమె వచ్చి యాయతివ "యమ్మా." యంచు నర్కబిల్చి "మీ
రేమో నాకథ మీరు జెప్పుమనినారే! విందురా? మీరు నిం
కేమేనిన్ బనియున్నదా?" యనిన 'లేదింతైన నాకట్టిదే
నీమాటల్ వినగోరియుంటి చెపు'మంటిన్ వేడ్క దళ్కొత్తగన్.

క. చిన్నతనంబునయందే-నన్నువిడిచి పోయినారు నాతలిదండ్రుల్
కన్నకొమారితె యట్టులు-నన్నతిదయ మామ పెంచినాడటుపైనన్.

క. నాకర్మమేమొ యటువలె-సాకుచునుండంగ దా విషజ్వరవశుడై
నాకమునకు జనె నన్నీ-లోకంబునవిడిచి మాతులుండును నంతన్.

క. ఆయన గతించినంతనె-నూయత్తను జూడవచ్చి మాతయు బితయు
న్నాయమ దమతోడం గొం-పోయిన దిక్కొకరు లేకపోయిరి నాకున్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. ఆస్తి యేమైననుండిన నాదుకొందు-రేమొ, బంధుగులము మేమ మేమయనుచు;
దేవునకు దక్క మాబోటిదిక్కుమాలి-నట్టిపక్షులు బరువౌదు రందరకును.

గీ. ఐన దైవోమెనేదో, న న్నదిమొదలుగ-నిరుగుపొరుగుజనంబులు పరమకరుణ
కూడుగుడ్డయునిచ్చి సాకుచును తగిన-పనులొనర్పగ నపుడప్డు పనుచుచుండ్రి.

గీ. ఒకరిభారము నాకు నింకొకరి కేను-భార మనుమాట లేనట్టితీరుదోప
బ్రదుకుచుంటిని ఆభగవంతుకరుణ-నింతవరకును నికముందు నిల్లైనడచు."
ననిన నిట్లంటి నేను నా యవ్వతోడ.

గీ. 'ఎంత వెఱ్ఱిదానవొకదె యింతి! సేవ-జేసినన్నాళ్లు దరిజేరదీసికొంద్రు
కాలుసేతులు నుడిగినకాలమందు-నెవ్వరుం జూప రటులు కన్నెత్తియైన.

క. కడుపున బుట్టినబిడ్డలె-కడునేడ్తురు తల్లిదండ్రి గాపాడగ, నీ
చెడుదినములలో దాస్యపు-బడతుకలకు ముప్పుగడపువా రెవ' రనినన్.

గీ. "లేనిమాట సత్యమెసుకి యైన సామి! -వీర లటువంటివారలు కారటంచు
నమ్మికొనియుంటి నిన్నిదినాలు తుదకు-నేమిచేసిన సరిమె నా కిష్టమయ్య!

గీ. లాభమో నష్టమో లో దలంచకుండ-రెక్క లాడెడునందాక నిక్కరణిని
సేవచేసెద వేర నే చేయదగిన-దేది? మంచిచెడ్డలు వారిమీద నుండు!

గీ. అట్లుగాక వేరొక్కరియండ జేరి-ధనమును గడించి యెవరికి దాచి యిత్తు?
బిడ్డలా, పాపలా? కూడుగుడ్డ కొదువ-లేదుకద సామి! యిక లోటులేదు నాకు.

గీ. ఏదొ బ్రతుకుచునుంటి నేనింతకాల-మింకపై నెంతయైపోయె, నెట్లొ వీరి
పాదములచెంత దేహంబు వదలినైతు; నింతకంటెగావలసినదేది నాకు?

మ. నను గాపాడిరయేని యింక నొక జన్మంబెత్తియైనన్ ఋణం
బును నేదీర్చెద, బ్రోవకుందు రనినన్ బోనిండు లోకంబునం
దున మీబోంట్లు కలారు పుణ్యు లెవరో ద్రోయింతు రీపాడుక
ట్టెను, లేకుండిన మీద దైవమును లేడే, చూడడే యన్నియున్!"

శా. ఆపల్కుల్ విని యంటివెండియు 'వివాహంబయ్యెనానీకు, దా
నేపుణ్యాత్ముడు భర్తయయ్యె, మరి దా నెందున్నవాడిప్డు, ని
వీ పాట్లన్బడుచుండ చూడ డిదియేమీ? పెద్దకాలంబు ని
న్గాపాడంగలవారె వీర లిటుపైనన్ జెప్పుమీ' నావుడున్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. "పెండ్లియనుకొనబడునట్టి వింతకూడ-జరిగినది లోటులేకుండ సామి! నాకు
భర్తయయ్యెను నొకమోటువా డతండు-కలడు నేడును, నేమన గలుగుదాన!

క. ననుబెండ్లి జేసికొని యా-వనుడాతడు కామపాశవశుడై యొకకాం
తను నవ్యయావనాఢ్యను-గని చేకొనె వెండికొంతకాలంబునకున్.

గీ. మించుజవ్వనమునఁ బసమించునన్ను-కూడ జేకొందునని వచ్చి కోరియుండ
రాను పొమ్మంటి పెద్ద పోరాటయయ్యె"-ననుచుజెప్పిన, దొక కథ యగును వ్రాయ.

ఉ. అంతయుజెప్పనేల సతి యాగతి నెంతయు ధూర్తుడైన యా
కాంతుని ద్రోసిపుచ్చెను "మగండవుకా"వని యేమిచెప్ప దా
నంతటినుండి "యాత్మసముపార్జిత పావన విత్తమొప్ప, జీ
వింతు"న టంచు జెప్పె గడు వింతగదోచెను నాకు నంతయున్.

గీ. నిప్పు జెదలంటదని వేరచెప్పనేల? యప్పుడాదిగ నాసతి యతులభీష్మ
మైనశౌచంబు, బ్రహ్మచర్యంబునడపె-సాక్షి యాచూపె, వేర పరీక్షయేల?

గీ. అవల నేను ప్రశ్నించితి 'సతివ! తప్పు-కాదెయట్టులుచేయ? మగండు చెడ్డ
వాడయైనను భార్యకు వీడజనద టంచుజెప్ప రే?' యన నాకు ననియె నామె

క. "మగడన గాడుకుడా? పో! మగవారలమాట కేమి? మగువయు నిల్లే
తగవువిడువ నేమందురో?-మగవానికి గలుగుస్వేచ్ఛ మగువకు లేదో?

క. నను విడిచిపెట్టి వేరొక-వనితం జేపట్టినపుడె వానికి నాతో
డను పనితీరెంగద విను-వనితను గైకొనుటయే వివాహంబగునా?

గీ. పనులయందును నుద్యోగబాధ్యతలను-వేషములయం దికెంతైన భేదమున్న
నుండవచ్చు భర్తకు భార్య కొండొరులకు-బాధ్యతసమంబె పరిణయబంధమందు.

క. సామియగునరుడు, భాగ-స్వామికదా భార్య వాని పౌరుషమున! సి
స్సీ! మమతవిడుచు భోగపు-సామియు భోగంపుసాని సములే యరయన్.

గీ. నాకొరకెనీవుకాని యేనీకుగా న-టంచునీభేదబుద్ధి జూపించు, తోలు
బొమ్మపెనిమిటితోడ గాపురముజేయు-మనెదు, దైవమొ యతడు దయ్యంబొయనుడు."

గీ. 'మారుమను వనగబడెడు నాచారమొకటి-కలదుకద యీకాలంబునగాంత! వేర
యొకనిబెండ్లాడ కిల్లేల యూరకుంటి-వతడుసేసినదానికి బ్రతిగ నీవు?'

చ. అనవిని యామె నాకనియె "నన్నియు మీర లెరింగియుండి యి
ట్లనియెదరేల? మారు మను వన్నది యీకులమందు ధర్మమై

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నను నది యేను పాపమని నమ్మెద; మీరలు చెప్పినట్ల యా
తని నొకసాటిగా గొని యధర్మము నేనును జేయనేటికిన్?

క. మగనికిమగువయు మగువకు-మగడొక్కడు కుదిరినంతమాత్రంబుననే
సుగతులుకల్గునె? యిక ధ-ర్మగతి తలంపంగవలదె, మనుజుల కెందున్?

క. ఏమీ మగడుండినగా-కీమేదిని బ్రదుకజాలరే స్త్రీలయ్యో!
యీమె త్తనయేకద మ-మ్మీమెయి నడపించి యతి నికృష్టత దెచ్చెన్!"

క. అని యాగతి నేమేమో-విన నద్భుతమా నుదాత్తవిషయంబుల దా
ననుభవదృష్టింగనినవి-వనిత వచింపంగ వినుచు బైనిట్లంటిన్.

గీ. 'ధర్మమొ! యధర్మమో! సృష్టితంత్రమెట్లు-నడచునోయవ్వ! సతి మగనాలుకాక
యున్న? నటుగాక పెనిమిటి యొకడులేక-బ్రదుకుటయె కష్టమగు నాడువారలకును.

క. మగవానిని కాదని యే-మగువయు నీభూమిమీద మనగలిగెన యే
యుగములనైనను పోలీ! తగవువిడిచి మాటలాడుదానవా నీవున్?

గీ. అంత రాజసమేటికోయవ్వ! భర్త-మంచివాడైననే సతి మంచితనము
జూపవలెనందు విది కడు చోద్యమహహా! రాజకీయమొ, లేక నర్తకమొ ప్రేమ?

గీ. దివ్యరాగిణులైన పతివ్రతలకు-బుట్టినిల్లైన యీప్రేమభూమి యందు
నా, యథోచితసహకార హేయమార్గ-నిష్ఠపావనదాంపత్య నియమమునకు?'

గీ. బొమలు ముడివైచి కనులరమోడ్చి లక్ష్య-మును విభేదించు విలుకాడుపోలె పోలి
ముదిమిముడుతలువడిన కన్బొమలదోలచి-పొడుచుకొనివచ్చు చూపుతూపులనుబరపి.

గీ. చిక్కనగు మొగిలుముసుగును జింపివైచి-కరడుకట్టిన కటికచీకటి బగుల్చు
సూర్యకిరణంపుచూపుల జూచు పోలి-చూపులకె మోహాటించి యే జూచుచుండ.

గీ. ముసలిసింగము గర్జించుపోల్కి, మేటి-యనుభవము సానదీరి యనల్పశక్తి
జేవదేరినయట్టి సజీవవాక్కు-లగ్నికణములు వెలువడునట్టులనియె.

క. "కనులైన విప్ప వింకన్-గనుగొనజాలుదువె యీజగంబు రహస్యం
బును పెద్దపెద్దమాటల-బనికలదే? మైన దెలియబలికెద వినుమా!

ఉ. భర్తలు భార్యలంచు బలుపల్కులు పల్కెదు వెఱ్ఱితండ్రి! యా
భర్తకు భార్యకుం గలుగు బంధమెఱుంగవు, భూతలంబునన్
భర్తలు భర్తలంచు బహుభంగుల జెప్పెడువార లెవ్వరున్
భర్తలుకారు, భార్య లల భర్త యొకండె జగజ్జనాళికిన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. గోపికాకృష్ణు డలవాడె! గోపికలును-మీజగంబున గలయట్టి మేటిమగలు
ఐన నిటుచెప్ప వెఱ్ఱివేదాంతమనుచు-గొట్టివేతురు నిజమును బట్టుకొనరు.

గీ. రాజకీయముకాదు, న_ర్తకముకాదు, ప్రేమయన నే నెఱుంగని వెఱ్ఱిదాన
కాను, నీకేల యీ వెఱ్ఱి? కామమునకు,బ్రేమమునకును సంబంధ మేమికలదు?

గీ. వెలుగుచీకటు లొక్కచో నిలువజాల-వనుచు బల్కెద నా పతివ్రతల చరిత
లేనెరుంగనిదానను కాను వారి-కథలతో నేటికథకు నైక్యంబులేదు.

గీ. వారు దివ్యచారిత్రలు వారిపాద-రజము సద్భక్తి దాల్తు శిరంబుపైన
వారిడాకాలి కొనవ్రేలి గోరునైన-పోల దీపోలి, పలుమాట లేల చెపుమ !

గీ. ఆడుదానికి మగవాని యండజేర-కున్న బ్రదు కింక లేదను చుంటి వహహా !
గుణ మొకటిలేని పురుషుని గూడినట్టి-యాడుదాని కర్మఫలంబ యంతయు నిది.

గీ. పురుషుడొక్కడు మెడలోన పుస్తెకట్టి-గట్టిగా బట్టుకొనకున్న యట్టె పట్టు
నదలి పాతాళలోకాన బడునో యేమొ ! యేమిగతి యింక స్త్రీకి నా కెరుగ జెపుమ!

క. లేదా స్త్రీకి శరీరము? లేదా మానసము? బుద్ధిలేదా? జగమే
లే దామెలేక, యాంకెం-గాదని యటు పురుషు డడుగు కదపం గలడే?

గీ. సత్యమే, భ_ర్త దైవమే, సగముదైవ-మగును భార్యయు భ_ర్తలో సగము కాన
సగము భ_ర్తయు దక్కినసగము భార్య-యైన యానందమూ_ర్తి రాజ్యంబె యిదియు.

గీ. ఆమిథునమూ_ర్తి పూజ్యరాజ్యంబు కాదె-యఖిలజగమును? దీనిలో నాడుదనము
మగతనము తుల్యములును,సమంబులును,స-దృశములు, సమానములును బరీక్ష జేయ!

గీ. విషమె కంఠస్థమగుగాక విషధరంబు-లలమికొనుగాక జమిలిదేహంబు నిండ
నదియు నవియును భూషలై యమరు మిథున-రాగరస పూరితాంగ సామ్రాజ్యమునకు.

గీ. ఆమిథునమూ_ర్తి దేహంబు నంటియుండు-ఫాలతలమధ్యమున శిరోభాగమునను
అఖిలకామనాశనమైన యగ్నిహోత్ర-మమితతాపనివారిణి యైన గంగ!

గీ. మగతనము కలుగు మగువలు మగువతనము-కలుగు మగవారు జగమున గలరు కాదె
భావరూపప్రకృతుల సంబంధ మర్మ-మరయజాలెడువేత్త లెందైనగలరె?

గీ. మగతనములేని మగడును మగువమీద-మగతనము చూపుచుంట ధర్మంబయుంట
మొదటినుండియు నిది చెల్లిపోయె గాక-నీనిరంకుశత్వమునకు హేతు వేది?

గీ. అయ్య, యెంతటివారు కారయ్య, మీరు-పురుషమూ_ర్తులు ! మీర లేకరణివ్రాసి
రేని యది చెల్లు స్త్రీలు నోరె_త్తరాదు-న్యాయమిటు తగులబడియె నేమందు నేను?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. పురుషునకు బంధనంబంట తరుణి, స్త్రీని-వదలకుండిన జ్ఞానము కుదురదంట,
నిక్కమరయుము చెప్పెద నొక్కమాట-బుద్ధికలపురుషు నెవతె నిబద్ధజేసె?

గీ. ఐన నాడుది యనినంత నంశచుల్క-దనముతో జూచుటకు నిమిత్తంబు కలదె?
సర్వశక్తిస్వరూపిణి సర్వకామ-దాయినియునైనసతి పూజనీయకాదె?

గీ. నమ్మియున్న భార్యను విడనాడి లేచి-పోయె బైరాగి యగుచు నీపురుషు, డింక
సచ్చిపోయిన మగనితో సహగమనము-జేసి మసియయ్యె స్త్రీ, శ్రేష్ఠు లెవరొ యిందు?

గీ. క్షాత్రమని శౌర్యమని పౌరుషం బటంచు-మగతనమె తెచ్చె నాశంబు జగతికెపుడు;
తల్లియై స్తన్యమిచ్చి వత్సలత బెంచె-నాడుదన మిందులోనేది యధికమగునొ?

గీ. అబ్ధి తనగర్భమున బడబాగ్ని దాల్చు-నట్లు జగముల నల్లలనాడజేయు
నట్టిచైతన్యమును గుక్షియం దిముడ్చు-తరుణియట యబల! యేమి యథార్థ వాక్కు!

గీ. ఎన్నటికినైన నున్నదే యింత కింత-కర్మమెప్పటికైనను కట్టికుడుపు
స్త్రీలు రాణులు మగవారు సేవకులుగ-నొదు, రానాడు రారాణి నగుదు నేను.

గీ. కట్టిపెట్టితి నీనాటకంబు నాడె-పాపపుణ్యము లానాడె పాసిపోయె;
భస్మమయమూర్తియు శ్మశాన భాగవర్తి-యైన యాయేకమూర్తియం దైక్యమౌదు."

గీ. అనుచు జెప్పి యనంతరం బామె తనదు-పనుల వెంటను బోయె, నప్పలుకు లెల్ల
నమృతబీజములట్లు నాయంతరంగ-క్షేత్రమున నంకురించు, విచిత్ర రీతి.

చ. అదిమొదలా మెయున్న యెడ కప్పటికప్పటి కేగుచుండి చే
యుదును బ్రసంగమా కెయు సదుత్తరముల్ వచియించుచుండు నె
మ్మది ననుకొందు నేను "నిసుమంతయు విద్దె నెరుంగ దెట్టు లీ
సుదతి వచింపగల్గె విన జోద్యములైన విశేషవాక్యముల్."

గీ. అటులు జరుగుచునుండ గ్రామాంతరమున-కొక్కపనిమెయి నేగి, యే నొక్కవార
మునకు నింటికివచ్చితి పోలి కేదియొ-జబ్బుచేసినదని విని సత్వరంబ
యామె జూచుకోరిక జేసి యరిగి తటకు.

గీ. అచటిజనముల నడిగితి 'నతివకేమి జబ్బుచేసిన'దని, వారు "సామి! జబ్బ
కేమి? ముసలిదం డామె, యదృష్టవంతు-రాలు! నూరేండ్లునిండె, నెటైన లెస్స."

క. అని యనిరి "దైవ మెద్దియు-దనపైనం బెట్టుకొనునె? తండ్రి! యెదో చూ
పును హేతువొకటి; యొకజ్వర-మనుమిష గల్పించినాడు మానిని యందున్."

గీ. అనినవిని యేను పడతి డాయంగ బోయి-యవనిపై బండిరాలిన యాకువోలె
నచట బడియున్నదాని గన్నార గాంచి-"పోలి! ఓపోలి!" యనెడు సంబోధమొప్ప.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చ. పిలిచినయంత గన్నులరవిచ్చి ననుం బొడగాంచి యంత ను
జ్జ్వలమగు లోచనద్వయము జక్కఁగ విచ్చి యపూర్వలాఘవం
బొలయగ లేచినిల్చి "యొహూహో ! చనుదెంచినవారె సామి ! వే
సెలవు నొసంగుడయ్య" యని చేతులు రెండును జక్కఁజేర్చినన్.

గీ. ఏను నాసతిమోముపై దృష్టి నిలిపి-కనుఁగొనుచు నుండ నెట్టి యాకర్షణంబొ?
నన్ను నే మరచిపోయి యనంతకాంతి- ధామమొక్కఁటిగంటి తత్క్షణమునంద.

గీ. కనబడకపోయె పోలి నాకనులయెదుట-కనబడకపోయె నిఖిలజగంబుగూడ
కనబడినదేదొ యద్దాని గాంచువార-లెవ్వరో తోచదయ్యె నయ్యెడను నాకు.

గీ. అయ్యఖండకాంతి ప్రవాహాంతరమున-మునిగిపోయి యొక్కింతసేపునకు బైకి
దేలి, బాహ్యప్రపంచము దిరిగిచూడ-గంటి, నద్భుతములు చూడగంటి నంటి.

గీ. కనులుమిరుమిట్లు కొలుపు నక్కాంతి పూర-మును గనుంగొని తనిసిన కనులతోడ
బాహ్యవిశ్వముపై దృష్టి బరపునంత-నంతయును నంధకారమయంబ యయ్యె!

క. "ఎందరు సూర్యులు చందురు-లెందరు మఱి యగ్నులెంద రెన్ని మెరుము లా
సుందరతేజము జగమున-కందింపగలారలొక్కొ?" యని యనిపించెన్.

గీ. అంత ధన్యోస్మి ధన్యోస్మి యనుచునామె-ముఖముపై దృష్టినిలుప నప్పొలతి తనదు
చూపుప్రేల సూర్యునిదెస జూపు చనియె-"నయ్య! నేనిప్పుడచ్చటి కరుగుదాన."

గీ. అనుచు నాక్షణమందె యయ్యబల పుడమి-పైననట్టులెపడియె తద్భావమేను
తెలిసికొని 'యెంతదాన నోపొలతి' యంటి-విస్మయానందములు ముంచివేసె నన్ను.

ఉపసంహారము

గీ. ఏది లేకున్న జదివిన దెల్ల దా ని-రర్థకంబౌనొ, యట్టి సదాచరణము
కలిగెనేసియు, జదువనక్కరయెలేదు-కరతలామలకమగు మోక్షంబు దాన.

గీ. నీతివిరహితముగ విద్య నెత్తికెక్క-జేయుగురులేల? ముక్తిని జెందజేయు
హృదయవిద్యకు నీముదిముదిత యొజ్జ-యనిన సందియ మావంతమైన కలదె?

గీ. వందిమాగధసంస్తుతుల్, పండితప్ర-కాండనుతులును గలుగు భూకాంతులకు, ధ
నాఢ్యులకు;—నిట్టివారల నరసియరసి-వారి గుణరత్నముల గాంచువారు లేరు.

గీ. పరమసత్త్వసమేతయా భరతమాత-పరమపావని! యీతల్లిపాలు త్రాగి
నట్టిబిడ్డలలోపల నెట్టిఘనులు-పుట్టిరో! పుట్టుచున్నారొ! పుట్టగలరొ!

క. పూవులు కాయలు కలుగని-తీవల విలసిల్లు నోషధీ నిచయంబుల్
గా వీరి నెన్నదగు స-ద్భావుల హృద్గ్రంథిరోగభంజకులు నిలన్.

---


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# నన్నయ యతులు

చిలుకూరి నారాయణరావు గారు,
యమ్. ఏ., యల్. టి.

తొలుత యతులాంధ్రభాషలో కొద్దిగనే ఉండేవి. రానురాను వాటిసంఖ్య హెచ్చినది. ఈవిషయమునే అప్పకవి ఈక్రింది పద్యములలో చెప్పినాడు:—

"భీమన పదిచెప్పె ననం [వది నా
తామాత్యుఁడు చేసె వెనుక యతు లిరు
ల్గామీఁదఁ గొందఱు కవి
గ్రామణు లిరువదియు నేడు గావించిరొగిన్."

"పూర్వకవుల లక్ష్యములుగూర్చి సత్కవి
జనము లవునటంచు సమ్మతింప
విశ్రమంబు లేను విరచింతు నాలుగు
పదులమీఁద నొకటి విదితముగను."

మనకున్న ఛందోగ్రంథములలో భీమన రచించిన కవిజనాశ్రయమే అత్యంత ప్రాచీనమైనది. అందు చెప్పబడ్డ యతులు:

౧. స్వరయతులు

అ, ఆ, ఐ, ఔ; ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ; ఉ, ఊ, ఒ, ఓ. (విశేషము: హల్లుల మీఁద ఈస్వరగుణము కూడిఉన్నా స్వరమే ప్రధానము; హల్లు కాదు.)

౨. వర్గయతులు

తుది అనునాసికములు తప్ప తక్కిన ఒక్కొక్కవర్గములోని అక్షరములు వరుసగా తమలో తాము మైత్రిగలిగి ఉంటవి.

౩. అఖండయతి

"భానుసహస్రభాసి నృప
భాధిపుఁ డన్నటు లర్థయుక్తి మై."

ఇట్టి అఖండవడులు భారతములో లేవని లాక్షణికుల అభిప్రాయము. మ. రా. రా. గిడుగు సీతాపతిగారు 'తెలుఁగు' పత్రికలో "నన్నయ సీసపద్యభేదము" లనేశీర్షికతుదను అఖండవడిని గురించి ముచ్చటిస్తూ భారతములో అఖండవడి ఉన్నదనిన్నీ, ముద్రాపకులు దానిని సవరించినా రనిన్నీ, ఆది. ౮. ౧౨౮. స్వరయతి సీస మవుతుండగా నన్నయనియమమును గ్రహింపలేక,

"కొని నాగపురమున -కొనరంగఁ జని-"
అనే చతుర్థపాదమున ప్రాసయతి అని భ్రమించి, దానిని దిద్దక విడిచినారనిన్నీ,

"............సందియం,
బీరమణీయకాంతి నుప-మింపఁగ,"
—ఆది. ౫. ౧౫౫.

"లక్ష్మియుత యిష్టు నిన్ననుగ-మింపఁగ"
—అర. ౨. ౩౦౨.

అనేచోట్ల ఒకదానిలో తప్పితే ఇంకొకదానిలో అఖండయతి ఉన్నదని ఒప్పుకొనవలసిన దనిన్నీ వ్రాసి ఉన్నారు. నన్నయప్రయోగములలో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఉప - మింపంగ" మొదలైన స్థలములలో అచ్చుతో మైత్రి ఎచ్చటా లేదు. వైషద్య ములో మరి ఒకపాదము—

"వీరలు దైవశక్తిఁ బ్రభ
    వించిన వారను టేమి సందియం
బీరమణీయకాంతి నుప
    మింపఁగ........."

ఇచ్చట 'కాకుస్వరయతి' కావున హల్లు తోనే యతి. ఇంక,

"కొని నాగపురమున-కొనరంగ"

అనేచోట పాఠాంతర మున్నదేమో చూచి కొనవలయును. ఇదమిత్థమని చెప్ప వీలులేదు. ఈ యఖండవళులు తరువాతి కవులయందు బహుళముగా కానవస్తున్నవి. తిమ్మకవి తన "సర్వలక్షణసారసంగ్రహము"లో,

"అక్కజు, తెమ్మెర, రూపఱ
గ్రక్కదలగ, నోలమాస, క్రన్నఱ, యనునీ
పెక్కుపదము లిరుదెఱఁగుల
నిక్కముగ నఖండవడి గణించిరి సుకవుల్."

అని చెప్పినాడు.

అప్పకవి వీటికి "దేశ్యనిత్యసమాసవిశ్రాంతు"లని పేరు పెట్టినాడు.

ఇచ్చట యతి అచ్చునకును హల్లునకును చెల్లు ననినాడు.

ఇట్టి అఖండవళులే భారతములో కనిపిస్తున్నవి.

౪. ప్రాదియతులు

ఉపసర్గలతో కూడిన పదములందు అచ్చు కున్ను హల్లుకున్ను యతిచెల్లుతుంది.

౫. బిందుయతులు

ఙ, క, ఖ, గ, ఘ; ఞ, చ, ఛ, జ, ఝ; ణ, ట, ఠ, డ, ఢ; న, త, థ, ద, ధ; మ, ప, ఫ, బ, భ. —ఆర. ౧. ౧౮౫.

౬. ప్లుతియతులు

దూరాహ్వానము, రోదనము, గానము, సంశయార్థములయం దుభయమునకున్ను వడి చెల్లుతుంది.

౭. సంయుక్తాక్షరయతులు

సంయుక్తవర్ణములలో దేనికైనా యతిచెల్లు తుంది.

౮. ఎక్కటివడి

మ, ర, య, ల, వ (పాఠా. మ, ర, వ, న, ల)-వీటిలో వీటికేయతి.

వీటినన్నిటినీ అప్పకవి చెప్పలేదు. ఒక్క "రేఫము" నకే విధించి దానికి "ఏకతరయతి" అని పేరుపెట్టినాడు.

౯. పోలికవడి

ము, పు, బు, భు; ఇట్టివిలేవని శేషాద్రి రమణకవులు ఆంధ్రపత్రికలో వ్రాసినారు. ఇది అపూర్వవాదము. వీరు వనము, ధనము, ఇత్యాది సంస్కృత నపుంసక శబ్దములు తెలుగులోనికి వచ్చి "మ్ము" అనియేకాని "ంబు" అని యుండవనిరి. ఈ క్రింది యుదాహరణములు చూడవలెను.—

(౧) "...తీర్థం
బునకరిగెనగంబులొక్క-మొగిగ్రక్కదలన్."
—ఆది. ౨. ౬౮.

(౨) "భువనంబులయందు సర్వ-ములు
ద్రిమ్మరుటన్." ఆది. ౨. ౧౧౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(3) "ఎట్టి విశిష్ట కులంబునఁ
బుట్టినసదసద్వివేక-ములు గల్గిన-"

పై వానిలో వీరు (౧) తీర్థమ్మున, అని యుండవచ్చునని తప్పించుకోవచ్చును. కాని, (౨) (3) లో, "సర్పంబులు" "వివేకంబులు" అని ఉన్నవని ఒప్పుకొనకతప్పదు. ఇట్టి సిద్ధాంతములకు మూలమేదీలేదు. తాటాకు ప్రతులలో ఎట్లున్నదో వీరు గమనింపలేదు.

౧౦. సరసయతి

అ, య, హ; చ, ఛ, జ, ఝ, శ, ష, స; న, ణ;

ఈరీతిగా ఉన్న ౧౦ యతులను తక్కినవారు పెంచుతూరాగా అప్పకవి వాటికి గుడికట్టినాడు. అతడు పెంచిన కొన్నియతులితరయతులక్రిందికిని వచ్చును. ఆతని ర యతులను ఈరీతిగాక్లప్తము చేయవచ్చును:—

(౧) స్వరమైత్రివళి, స్వరప్రధానవళి: ఈ రెండును నొకేయతి; పేళ్లు మాత్రము వేరు. (౨) లుప్తవిసర్గస్వరవళి. (3) వృద్ధివళి. ఈమూడున్ను ప్రత్యేకముగానే ఉండవలెను. ఈమూడున్ను స్వరయతులు. ప్రాణివిరామమని వేరే చెప్పనక్కరలేదు. తక్కిన వ్యంజనాక్షరవిరతు లన్నీ దీనిలోని భేదములే.

(౪) వర్గయతులున్ను, బిందుయతులున్ను కలిసి ఒకే యతివర్గముక్రింద వచ్చును. భేదము చేయుటకు కారణము లేదు.

(౫) తద్భవవ్యాజవిశ్రమములు. (౬) విశేషవళులు. (౭) అనుస్వారసంబంధ యతులు. (౮) అనునాసికాక్షర యతులు. (౯) ముఖభక్తియతులు, ముకారయతులు. (౧౦) మవర్ణవిరామములు. (౧౧) ఏకతరయతులు. (౧౨) అభేదయతులు. (౧3) అభేదవర్గయతులు. (౧౪) ఊష్మ, సరసవళులు (ఋజుయతి, సరసవళిక్రిందకే వచ్చును). (౧౫) సంయుక్తవిశ్రామము. ఈపన్నెండున్ను వ్యంజనాక్షర విరతులు.

(౧౬) యుష్మదస్మచ్ఛబ్దవిరతులు. (౧౭) పరరూపయతులు, నిత్యసమాస యతులు. (౧౮) ప్రాదియతులు. (౧౯) దేశ్యనిత్యసమాస విశ్రాంతులు, లేక, దేశ్యాఖండయతులు. (౨౦) నిత్యయతులు, ఆగమసంధియతులు, విభాగవళులు, నామాఖండయతులు. (౨౧) పంచమీవిభక్తివిరామము. (౨౨) కాకుస్వరవళులు, ప్లుతయుగవిశ్రామములు. (౨3) ఋవళి, ఋత్వసంబంధవళి, ఋత్వసామ్యవళి, అని స్వరవళులకింద చెప్పబడినవి. (౨౪) అంత్యోష్మసంధివిరమణము, వికల్పసంధి విరమణము. వీటి నప్పకవి వ్యంజనాక్షర విరతులక్రింద చెప్పినాడు. ఈ ౯ యతులున్ను ఉభయవళులు.

ప్రత్యేకయతులు, భిన్నయతులు అని అప్పకవి చెప్పినవి యతిభేదములని చెప్పటకు వీలులేదు. కనుక, అప్పకవి ఊరకే యతులను పెంచినాడనిన్నీ, అనంతామాత్యుని మతమున ౨౪ యతులే ఉన్నవనిన్నీ అప్పకవి చెప్పటచేత యతులసంఖ్య ౨౪ అనియే గ్రహింపవలెను.

అయినా యతులవిషయమున సంపూర్ణముగా చర్చించినవాడగుటచేత ఆవిభాగమునే అనుసరించి భారతమునందలి యతుల నేర్పరించడానికి ప్రయత్నిస్తాను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

౧ స్వరవళులు

(౧) స్వరమైత్రివళులు:

"అమలసువర్ణ శృంగఖుర
మై కపిలంబగు గోశతంబు."
—ఆది. ౧. ౧౫.

"అతనికి మది భ్రూణహత్య
యగునండ్రు బుధుల్."
—ఆది. 3. ౧౮౭.

(౨) స్వరప్రధానవళులు:

"లో,కాశ్రయుఁ డాదిరాజనిభుఁ
డత్యకలంక చరిత్రనుండఁగన్."
—ఆది. ౧. -.

"లో,కాంచితుఁ డైనవాఁడు నిఖి
లాగమపుంజము నేర్పడన్విభా,
గించి."
—ఆది. 3. ౪౬.

(3) లుప్తవిసర్గవళులకు భారతమున నాకుదాహరణములు కనబడ లేదు.

(౪) ఋవళి:

"ఋత్విజుండని విచా-రించి పూజించితే
ద్వైపాయనుండుండ-ధర్మయుక్తి."
—సభా. ౨.

(౫) ఋత్వసంబంధవళి:

"కృతవీర్యధనమెల్ల-క్షప్తిచేసి."—ఆది. ౭.

(౬) ఋత్వసామ్యవళి
(౭) వృద్ధివళి
} వీటికి నాకుదాహరణములు భారతమున కానరాలేదు.

౨. వ్యంజనాక్షరవిరతులు

(౧) ప్రాణివిరామము:

"విమలవిచారుఁడు కుమార-విద్యాధరుఁ డు
త్తమ చాళుక్యుఁడు." —ఆది. ౧. ౪.

(౨) వర్గయతులు:

"వివిధా, గమవిజితశ్రముఁడు తుహిన
కరుఁ డురుకాంతిన్."—ఆది. ౧. ౪.

"ఘనదురితానుబంధకలి
కాలజదోషతుషార సంహతిన్."
—ఆది. ౧. ౫.

(3) బిందుయతులు:

"శా,ర్ఙ్గ వినిర్ముక్తనిశాతసాయక శతా
గ్రచ్ఛిన్నమై దైత్యదా,నవ......"
—అర. ౧. ౧౮౫.

"వాం,ఛిత మెయ్యది దానిఁ జెపుము-చేయు
దు ననిన్." —ఆది. ౧. ౧౦౯.

వీథిం, బఱచె వియచ్చరవిమాన
పంక్తులు దూలన్." —ఆది. ౨. ౬౭.

(౪)తద్భవవ్యాజవిశ్రమములు
(౫)విశేషవళులు
(౬)అనుస్వారసంబంధయతులు
(౭)అనునాసికాక్షరయతులు
} ఈ నాల్గింటికిన్ని భారతములో ప్రయోగములు నాకు కానరాలేదు.

(౮) మువిభక్తియతులు:

"వంశం,బునను భరద్వాజుకలశ
మునఁ బుట్టె శరా,సనవిద్యాచార్యుఁడు."
—ఆది. 3. ౭౭.

(౯) ముకారయతులు:

"భువనంబులయందు సర్ప
ములు ద్రిమ్మరుటన్."—ఆది. ౨. ౧౧౪

"ఎట్టి విశిష్టకులంబున
బుట్టిన సదసద్వివేక-ములు గల్గిన."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(౧౦) మవర్ణవిరామములు:

ఇవి భారతమున నాకుఁ గన్పడలేదు.

(౧౧) ఋజుయతులు:

కృష్ణద్వైపా, యనమునినృపసభాభిహిత మ
హాభారత బ,ద్ధనిరూపితార్థమేర్పడ."
—ఆది. ౧. ౧౬.

"మనో,హర సుచరిత్రపావన ప
యః పరిపూర్ణములైన."
—ఆది. ౨. ౨౩.

"హృదయ సముద్భవుఁడు వాఁడ
యిన మద్వచనం, బది."
—ఆది. ౩. ౧౯౭.

(౧౨) ప్రత్యేకయతి:

"దా, నిది కలరూ పెఱుంగ నవ
నీపతి యుత్సుకుఁ డయ్యె నాత్మలోన్."
—ఆది. ౪. ౨౯.

"ఘోరా,హవమునకును వెఱచుచున్న
యది కుంతి."
—ఆది. ౬. ౪౧.

"అనపాయతఁ బొంది చేయు
నది ధర్మంబుల్."—ఆది. ౬. ౧౦౪.

(౧౩) భిన్నయతి:

"పవళుల్, రేలును నేమఱక పరిచ
రించుచునుండెన్."—ఆది. ౨.౧౫౨.

"ఏన మెల్లకాలము భరి-
యింతుఁగాన." —ఆది. ౨. ౨౨౬.

"ఇ,చ్చినసదియును గరము సంత
సిల్లి కుమారుం,గని."—ఆది.౫. ౩౨.

(౧౪) ఏకతరయతి:

"రాజకులైక భూషణుఁడు
రాజమనోహరుఁ డన్యరాజ తే
జోజయశాలి." —ఆది. ౧. ౩.

(౧౫) అభేదయతులు:

"లలిత కృశోదరంబు తర
ళత్రివళీయుతరోమరాజియున్."
—ఆది. ౪.౪౨.

"జ,ల్లిననంతటఁ జెదరియవియ-ల్ప్రకరనిపే
వన మొప్ప నున్నయవి."
—ఆర. ౩. ౧౦౯.

"తడనో,డుదురుసన్మును లిందుఁ గోల్మొన
డుల్ గొన న్వడిఁజొచ్చినన్."
—ఆది. ౮. ౧౪౮.

"సూనృత,వ్రత యొక బావి మేలు మఱి
బావులు నూఱిటికంటె." ఆది.౪.౯౧.

ఆదేశ 'వ' కారమునకున్న 'బ' కున్న మాత్రమే భారతములో ఉదాహరణములు కనబడుతున్నవని ఒకరన్నారు. అది నిరాకరణీయము.

(౧౬) అభేదవర్గయతులు:

"మహీ,వల్లభ తత్కథము నె-వంబున."
—ఆది. ౧. ౧౬.

"నానాభరణవిభూషిత
పీనోన్నతకుచముఁబోలె-వెలిఁగెడుదా
నిన్."—ఆర. ౩. ౨౯౨.

"పేరువారనునట్టి బుద్ధివి
భేదమెన్నఁడు లేదు." —ఆది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ధ్యానా, పరతేంద్రియవృత్తినున్న
　　నాని శమియించున్."　　—ఆది.

"కోరి యనేకయుగంబు ల
　　పార తపోయుక్తులయిన - వారికిఁ బడ
　　　　యన్."—అర.

(౧౭) ఊష్మయతులు:

"పూజామహో,త్సవము స్నంతత దానశీలత
　　యశశ్వ త్సాధుసాంగత్యమున్."
　　　　—ఆది.౧.౧౨.

"మదీయవం,శమునఁ బ్రసిద్ధులై విమల
　　సద్గుణశోభితులైన."—ఆది. ౧. ౧౭.

(౧౮) సరసవళులు:

"అమలిన తార కాసముద
　　యంబుల నెన్నను."—ఆది. ౧. ౧౯.

"వ,ర్ణాశ్రమ ధర్మరక్షణ మ
　　హామహిమన్."　　—ఆది. ౧. ౬.

"హిమకరుదొట్టి పూరుభర
　　తేశ."　　—ఆది. ౧. ౭.

"జంబూషండవినిర్మా
　ణంబాదిగ హృదయరోచ-నము లగు."
　　　　—ఆది. ౧. ౭౫.

"విబుధశ్రే,ణినుతంబై యానుశాస
　నికపర్వము..."　　—ఆది. ౧. ౫౯.

"దుర్ని మిత్తముల్ పుట్టిన-నిర్ణయించి."
　　　　—అర. ౧. ౭౯.

"పం,చదివసంబులు గర్ణుఁడున్ దివ
　　సద్వయంబు."　　—ఆది.౧.౬౭.

"స్రోతో మార్గవినిర్గతోగ్రదహనా-ర్చుల్."
　　　　—ఆది. ౧.

"సం,జాతప్రోద్ధత బాడబానల శిఖా
　　శంకాధికాతంకమై."　　—ఆది. ౧.

(౧౯) సంయుక్తవిశ్రామము:

"వి-ద్యాశ్రమతత్త్వవిత్త్వమున
　　దానగుణాభిరతిన్."　　—ఆది.౧.౬.

(౨౦) అంత్యోష్మసంధివిరమణము: దీనికి భారతమున నా కుదాహరణములు కానరాలేదు.

(౨౧) వికల్పసంధివిరమణము: ఈప్రయోగములలో కేవలము సంధికాగా వచ్చిన హల్లుతోనే మైత్రి కానవచ్చుచున్నది.

"మహో, న్నతులేక త్రికపంచసప్తనవనా
　　నామస్తకుల్ పల్వు రు
ద్ధతనాగేంద్రులు బ్రహ్మదండహతినా
　　ర్తధ్యానులై వహ్నిలోన్."
　　　　—ఆది.౨.౨౧౦.

"జగ, న్నుతసుమహాతపోధను ల
　　నుగ్రహానిగ్రహ శక్తియుక్తులన్."
　　　　—ఆది. ౨. ౨౨3.

"రమ్యో,ద్ధతినుద్ధూత వివర్ధితాయతబృహ
　　ద్దావాగ్నివోలెన్."—ఆది. ౨. ౨3౦.

3. ఉభయవళులు

(౧) యుష్మదస్మచ్ఛబ్దవిరతులు:

"భయ, త్రస్తాత్ములమైనయస్మ
　　దాదులకెల్లన్."　　—ఆది.౨.౨౧౫.

(౨) పరరూపయతి:

"వే,దండగండపిదారి ఘోరతర
　　రాసిభాసిభుజార్గళా."—ఆది. 3. ౨౨౭.

(3) ప్రాదియతులు:

"కుండలము ల,పేక్షించుచు నున్నవాఁడ
　　భేద్యుఁడు."　　—ఆది. ౧. ౯౮.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"సురా, మ్నాయము నాహుతాహుతిస
మంచిత." —ఆది. ౧. ౮౯.

"మడవక చేయు మీానని స
మర్పణ నేసె ప్రభుత్వమేర్పడఁగ."
—ఆది. ౨. ౪౦.

ఉగ్రమయూఖుసాక్షిగ స
మున్నత దక్షిణపాణిఁ జేసి..."
—ఆది. 3. ౧౪౯.

"ఆవిపినాంతరంబున ని
రంతర నిష్ఠ..." —సభా. ౧. ౧3౬.

"అతులరణాంతరంబున ని
రంతర మప్పటుబాణ దారితో
చ్ఛ్రితి..." —అర. 3. ౬౫.

(౪) నిత్యసమాసయతులు, లేక, అఖండయతులు:—

"ఆశ్రితపోషణంబున స
నంతవిలాసమునఁ..." —ఆది. ౧. ౬.

శా,స్త్రములతెఱుఁగు గెఱింగితి ను
దాత్తరణాన్విత..." —ఆది. ౧. ౧౦.

"నా,రాయణునట్లు దానును ధ
రామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధు
రంధరుఁడు." —ఆది. ౧. ౨౪.

"అధ్యాత్మవిదులు వే-దాంతమనియు."
—ఆది. ౧. 3౧.

"సర్వంబుల నేనిటుం గృ-పాయితమై."
—ఆది. ౧. ౫౫.

"అహిపతిదుష్కృ తాంతకుఁడ - నంతుఁడు."
—ఆది. ౧. ౧౦౪.

"కా,కోదరసంహారిఁ హుతన
హో,గ్రసమగ్ర శిఖాచయంబులఁ."
—ఆది. ౧. ౧౨౪.

"...అజితశక్తియుతుల
నాయున నెడుదాని-కజరు లధిక..."
—ఆది. 3. ౬3.

(౫) దేశ్యనిత్యసమాస విశ్రాంతులు:

"బో,రనఁ గీర్తించిరి సంతతస్తుతిపదా
రావంబురమ్యంబుగఁ."ఆది. ౨. ౨3౨.

"బో,రనఁగీర్తించిన శంతనుం డతిమనో
రాగంబునం బొంద."—ఆది. ౪. ౧౯౦.

"అవనీచక్రము పాదఘాతహతి న
ల్లాడంగ." —ఆది. ౬. ౧3.

"గ్ర,క్కదల సైన్యపాద-ఘట్టనమున..."
—ఆది. ?. ౧౬౫.

"కదలెఁ దద్వనమెల్ల గ్ర
క్కదలుచుండ..."—అర. ౧. 3౧౧.

"ఆయంబునందు నా
లవభాగ మొండె మూఁ
డవభాగ మొండె నం
దర్ధమొండె..." —సభా. ౧. ౪౬.

(౬) నిత్యయతులు: లాక్షిణికు లందరూ 'ఏని' శబ్దమునే కాని 'నేని' శబ్దమును గ్రహింపలేదు. అందుచేతనే అప్పకవి ఈయతిని ప్రత్యేకముగా చెప్పినాడు. కావుననే

"ఎన్నడు,న్నేని మోఘముకాదు దిగ్గర
ణీరవీందు లెఱుంగఁగాఁ."

అనేదానిలో ఆంధ్రశబ్ద చింతామణిలోని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సూత్రమున కీప్రయోగము విరుద్ధమైనదని చెప్పవలసివచ్చినది. 'నేని' శబ్దమును గ్రహిస్తే ఈచిక్కులు వదలి పోవునుగాని, ఆవిషయమై ఇంకా ఆలోచించవలసిఉన్నది.

"ఇద్ధయశోర్థు లెం-దేనిబుట్టి
రట్టి..." —ఆది. 3. ౮౯.

"ఈతఁ డనిసేయఁగాఁ దగఁ
డేని వీని..." —ఆది. ౬. ౪౭.

"నీవును జూచి తట్టిసభ
నేని వినంబడ దేయుగంబునన్..."
—సభా. ౨. ౯౫.

(౭) రాగమసంధి: దీనికి భారతములో నా కుదాహరణము కానరాలేదు.

(౮) విభాగవళులు: 'ఏసి' కి మారుగా పరిమాణార్థమున సాధారణముగా 'నేసి' యనియే కాన్పించుచున్నది. ఇట్టివడులకు భారతమున నా కుదాహరణము కాన్పించలేదు.

(౯) నామాఖండయతి: ఇట్టియతికిని ఉదాహరణములు లేవు.

(౧౦) పంచమీవిభక్తి విరామములు: అచ్చటెక్కడను యతిలేదు.

(౧౧) కాకుస్వరవళులు:

"......తపోమహి
మాయిన్నిదినంబులేల-మసలితిచెపుమా."
—ఆది. ౧. ౧౧౯.

"మాయిద్దఱిలో నం దెవ్వరి వలతుసెప్పు
మా యనవుఁడు." ఆది. ౮. ౧౧౦.

"అ,య్యిరువురపేర్మియును వింత
యే దివిజేంద్రా!" —ఆది. ౮. ౨౮౫.

"వీరలు దైవశక్తిఁబ్రభ
వించినవా రను టేమి సందియం
బే రమణీయకాంతి నుప
మింపఁగ..." —ఆది. ౫. ౧౫౫.

(౨) ప్లుతయతులు: దీనికి భారతములో నా కుదాహరణములు కానరాలేదు.

౪. ప్రాసయతులు

వీటి కుదాహరణము లసంఖ్యాకములుగా ఉన్నవి గనుక చూపలేదు.

ఈరీతిగా అప్పకవిచెప్పిన ౪౧ యతిభేదములలోను ౧౫ యతులు భారతములో కానరావు. అందుచేత భారతమును రచించినవారి కవి ఇష్టములో కావో చెప్పవీలులేదు. ఇవిగాక కొన్ని విశేషము లీయతుల సందర్భమున భారతములో కానవచ్చుచున్నవి.

(౧) "జ్ఞానము సర్వభూతహిత
సంహితబుద్ధియు..."-ఆది. ౧. ౧౫౭.

"అమ్మనుజేంద్రుఁడైన నలు
యజ్ఞము ధర్మజు రాజసూయ య
జ్ఞమ్ముఁ బ్రయాగఁ జేసిన ప్ర
జాపతియజ్ఞముఁ బాశపాణి య
జ్ఞమ్మునుఁ గృష్ణుయజ్ఞము ని
శాకరుయజ్ఞము నీమనోజ్ఞ య
జ్ఞమ్మును నొక్కరూప విల
సన్మహిమం గురువంశవర్ధనా!"
—ఆది. ౨. ౨౨౨.

"కావించున,జ్ఞులు భూనాథుల
కాప్తులున్ సఖులునై-శోభింతు రత్యంతమున్." —ఆది. ౮. 3౫.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ధృతరాష్ట్రునను
జ్ఞానముఁ బడయుఁడును మనకు సమకూ
రు..."—సభా. ౨. ౧౦౦.

"జామదగ్న్యుండు నిర్మల-జ్ఞానదృష్టి."
—అర. 3. ౧౨౮.

అప్పకవి 'తద్భవవ్యాజవిశ్రమము' లని 'జ్ఞ, నణ'లకును, 'విశేషవళు'లని 'జ్ఞ, కఖ, గఘు'లకును యతులు చెప్పినాడు. భారతమును బట్టి యీయతులను సమర్థింపలేము. భీమన యీయతులను చెప్పలేదు. భారతమునుబట్టి 'జ్ఞ'కును 'చఛజఝశషస'లకే యతిచెల్లును గాని 'కఖగఘు'ల కెంతమాత్రమును చెల్లదు. దీని యుచ్చారణము తరువాతికాలములో"గ్య' యని మారినది. భారతకాలమున ఇది 'జ్ ఞ' అనియే ఉచ్చరింపబడి ఉండవలెను.

(౨) "క్షేత్రమునం బ్రకామగతి
ఖేలన నొప్పి..." —ఆది. ౧. ౧౦౭.

"క్షమాదమ సమన్వితుం గనియెఁ
గాననాంతంబునన్."—ఆది. ౨.౧౬3.

"అవిచలిత రక్షా,క్షముఁడై రక్షించుకొని సు
ఖస్థితి నుండెన్." —ఆది. ౨. ౧౧౮.

"క్షత్త్రియవంశ్యులై ధరణిఁ-గావఁగఁబుట్టిన...
క్షత్త్రియవైశ్యశూద్రులనఁ-గాఁదగు..."
—ఆది. ౨. ౧.౭3.

"త,క్షకకోటుల్ పనిసేయఁగా ఘనతరై
కస్తంభ..." —ఆది. ౨. ౧౭౯.

"త,క్షకభీతిన్ రచియింపఁ బంచి దృఢర
క్షన్..." —ఆది. ౨.

సా,క్షాద్విష్ణుండవు నీవు భూపతులలోఁ
గౌరవ్యవంశోత్తమా."-ఆది.౨.౨౪.

"క్షితి భృత్యంబగుదాని భూరిభుజ శ
క్తిం జేసి..." —ఆది. 3.౯౨.

"క్షేమంబున నడుపుచున్న
కృష్ణునియోగం..."—సభా.౧.౧౦3.

"క్షత్త్రియుండు పూజ్యుండు వి
క్రమ సమృద్ధి..." —సభా. ౨. ౨౫.

"క్షేమవృద్ధియనువాని న
కృత్త్రిమసాహస..."—సభా.౨.౧౫౫.

"క్షత్త్రియధర్మముల్ గుగతి
కారణముల్..." —అర. ౧. ౨౪౭.

"విక్రమ, క్షణదానం బొసరింపు మీక్షణ
మవి-ఖ్యాతంబుగా..."
—అర. ౧. ౨౪3.

"క్షత్త్రవధనైన పాపంబుఁ
గ్రాఁగ వలయు..."—అర. ౧. ౨౬౨.

"క్షత్త్రియుఁ డుద్భవిల్లియు న
ఘక్షయ కారణుఁడున్..."
—అర. 3. ౧3౬.

పై యుదాహరణములందు 'క్ష' కును 'కఖగఘ' లకు మాత్రమే యతి కనబడు చున్నది. దీనికపవాదముగా:

పాఠాంతరములు

"క్షమయ తాల్చియుండఁ
జన దెల్లప్రొద్దు..." —అర. ౧. ౨౧౭.

"క్షమయ తాల్చియుండఁ
గాదెల్లప్రొద్దు..." (పా.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క్షత్త్రచరిత్రుఁడై పరఁగు
సత్త్వమునన్..." —ఆర. 3. ౧౩౬.

"క్షత్త్రచరిత్రుఁడై పరఁగు
గర్భమునన్, గర్వమునన్." (పా.)

అని కాన్పించుచున్నవి కాని వానికి పాఠాంతరముల జూచినచో భారతకర్త షత మున 'క్ష' కును 'చఛజఝ, శషస' లకును మైత్రిలేదని చెప్పవలెను.

(3) భావించు, సేవించు, మొదలగు 'ఇంచు' గల క్రియారూపములయం దచ్చుకు మైత్రిలేదు. 'ఈరమణీయకాంతి నుపమింపఁగ నచ్చు'-అనే ప్రయోగ మఖండవడిన్నీ కాదు; స్వరయతిన్నీ కాదు. పాఠాంతరములో చూపబడ్డప్రకారము 'కాకుస్వరయతి.' ఇట్లే 'ఎడు' అనేది పరమైనప్పుడు కూడా హల్లుకే కాని అచ్చుకు యతి చెల్లదు.

"ఉడుగక మేనుహితముఁ బలి
కెడువారమునీవుహీనవు-క్రియఁగొనఁగా."
—ఆది. ౮. ౪౦.

"నెలకొని యతనికి సర్వహృదయ మ
నెడి విద్యనిచ్చి..." — ఆది. ౨.౧౨౮.

(౪) ఃఖ, హ, లకు యతి చెల్లును.

"దుఃఖంబునై నెడ విమో
హమును బొంద..."—ఆర.౪.౧౨౦.

(౫) మ, వ, లకు యతి చెల్లునా?

"ఆ స్త్రీకుని ముద
మునఁ దలఁచిన నురగభయము
వొందదు జనులన్."—ఆది.౨. ౧౩౩.



# నహుషభ్రష్టత

దొంతరాజు వెంకట్రామయ్యగారు

సురలోక రాజ్యపదవీ-గరిమంబున మించి ముజ్జగంబుల నెల్లన్
బరిపాలించియుఁ దుద కీటు-లురగమ వైపోతి వేలనోయీ, నహుషా!

సీ. చింతామణీ భద్రసింహాసనంబున నుజ్జ్వలస్థితిఁ గొలువుండ వేల?
నందనోద్యాన వనప్రదేశంబులఁ జారువిహారంబు సలుపవేల?
తుంబురు నారదాదుల వినోదైక సంగీతారవము లాలకింపవేల?
నిర్జరకామినీ నికురుంబముల నృత్య కౌశల విస్ఫూర్తి గాంచవేల?
కటకటా! నేడు భవదీయ కర్మ మిటులు-పరిణమించె నిదేలయ్యా పార్థివేంద్ర!
రెండు మూన్నాళ్లె ముచ్చటై నిండెనొక్కొ-భవ్య సురలోక శాసన భాగ్యరేఖ!!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. శమన స్పర్శన పావకాది సుమన స్సంఘంబు లొక్కుమ్మడిన్
తమ తేజంబు లొసంగి దైవతసభాధ్యక్షాసనం బిచ్చి, ని
న్నమితైశ్వర్యసమేతుఁ జేయ మద గర్వాంధీకృతాత్ముండవై
యమరశ్రేణికి నెగ్గుగూర్చి నహుషా! వ్యాళాకృతిన్ బొందితే!!

ఉ. కైవసమైన యుష్మదధికార మదోద్ధతిమై "వినాశకా
లేవిపరీతబుద్ధి" యను లీల నెఱున్ భగవత్స్వరూపులౌ
పావన సంయమీశ్వరుల పైన నిరంకుశ శాసన ప్రయో
గావసరంబు కల్గెనె! యహా! విబుధవ్యథ రిత్తవోవునే?

క. అందలము మోవఁ దాపస-బృందము శాసింతురయ్య? త్రిజగంబులలో
నెందైనఁ దద్రుషాగ్నికి-నింధనమవు కావటంచు నెంచితె చెపుమా!

గీ. పూర్వ సుకృతంబున మహీవిభుత్వమునకుఁ-దోడు సంక్రందనపదంబు దొరకినంత
కండకావరమునఁ గన్నుగాన కీవు-బేలవయి కోలుపోయి తిదేలనయ్య!

క. యతివరుఁ డగస్త్యునకు నప-కృతిఁ జేసియ రెంటఁ జెడ్డ రేవడి పగిదిన్
శతమఖు పదవిశ్లేషము-క్షితిరాజ్యచ్యుతియుఁ బొంది చేడ్పడితి నృపా!

శా. కూలాతీత విభూతిసాగర నిమగ్నుండయ్యు నేఁ డీగతిన్
వ్యాళం బౌట స్వయంకృతంబు; పరితాపం బేల నీ కక్కటా!
యాలోచింప నవశ్యమైన యనుభవ్యం బొంద కెవ్వారి కే
లీలన్ దీరునె, పాపపుణ్యఫలముల్ చేసేతఁ గావించినన్?

మ. మహితంబౌ నధికారవైభవము సంప్రాప్తించినన్ సత్పథ
స్పృహా దూరుండయి లోకకంటకములౌ కృత్యంబులెల్లన్ దయా
రహితుండై పొనరించునట్టి మదగర్వస్ఫారుఁ డెం దేనియున్
నహుషభ్రష్టతఁ బొంది కష్టతతికిన్ బాత్రుండు గాకుండునే!!!

---

# పున్నమ వెన్నెల

వెదురుమూడి వేంకటకృష్ణారావు గారు

నిండు పున్నమరేయి వెన్నెలకు సాటి, యేదటంచు నన్నడుగంగ నేల? బెలున!
లేదు లేదెందు, భువనావళిని వెదకిన, నవవధూ విలాసినుల లేనగవుకంటె!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# క్రీడాభిరామకర్తృత్వ విమర్శనము

కె. రాఘవాచార్యులు గారు

క్రీడాభిరామము శ్రీనాథవిరచితమగునా కాదా యనునది భాషాభిమానుల కొకక్లిష్టసమస్యయై యున్నది. ఏతద్గ్రంథమును ప్రకటించిన మానవల్లి రామకృష్ణకవిగారు తమయుపోద్ఘాతమున శ్రీనాథరచితమే మోయని సందేహింపుచుంటిమని వ్రాసియున్నారు. శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారీగ్రంథమును విమర్శించి శ్రీనాథవిరచితమనుట కెట్టిసందేహమును లేదనియు, వల్లభామాత్యుని పేర శ్రీనాథుడు రచించినాడనియు దెల్పియున్నారు. శాస్త్రిగారివాదమును ఖండించుచు వేమూరి విశ్వనాథశర్మగారు భారతి సం. ౪, సంచిక ౪ యందు శ్రీనాథు డట్టిగ్రంథమును రచింపలేదనియు, గ్రంథములందలి భావపదపద్యసామ్యములవలన గ్రంథకర్తను నిర్ణయింప వీలులేదనియు విపులముగ జర్చించియున్నారు. ఏతద్గ్రంథకర్తృత్వవిషయమున నాకుగల సంశయములను దెల్పుచు, భాషాభిమానులును, బండితులును నిష్పక్షపాతబుద్ధితో నిర్ణయింతురని నమ్ముచున్నాను.

## శ్రీనాథుడును వల్లభరాయలును సమకాలికులా ?

క్రీడాభిరామమున గ్రంథకర్తనామము వల్లభరాయలని యున్నది. ఇతనితండ్రి తిప్పన; తాత మల్లన; ముత్తాత చంద్రామాత్యునికుమారుడగు మంచన. చంద్రామాత్యుడు పెదబుక్క-క్ష్మాపదేవేంద్రుని యమాత్యుడని కవి వర్ణించియున్నాడు (క్రీడా. ప. ౭). ఇందుదాహరించిన పెదబుక్క-రాయలు విద్యానగరనిర్మాత యగు హరిహర బుక్క-రాయలని తోచుచున్నది. విద్యానగరము క్రీ. శ. ౧౩౩౬ సంవత్సరమున నిర్మింపబడెను. చంద్రామాత్యుని మనుమడగు వల్లభరాయలు నాల్గవతరమువాడగుటచే క్రీ. శ. ౧౪౩౬ ప్రాంతమున నుండియుండును. (తరమునకు జారిత్రపరిశోధకు లిచ్చిన ౨౫ సం.ల పరిమితి యిచట గైకొనబడినది). కవికి పెదతండ్రియగు లింగనయు, తండ్రియగు తిప్పనయు హరిహరరాయల యాస్థానమున నుండినటు లవతారికలో వర్ణింపబడియున్నారు (ప. ౧౬, ౧౯). ప్రథమ దేవరాయ లనబడు హరిహరరాయలు క్రీ. శ. ౧౪౨౫నకు బూర్వముననే, ద్వితీయ హరిహరరాయలు క్రీ. శ. ౧౪౨౫–౧౪౪౯ సంవత్సరములలోను రాజ్య మొనర్చినట్లు గర్ణాటరాజ్యచారిత్ర పరిశోధకులు వ్రాసియున్నారు. ఇందు వల్లభరాయల తండ్రి ప్రథమ హరిహరరాయల యాస్థానమున రత్నభాండాగారాధ్యక్షుడైనచో కవియు క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతమువాడగును. ద్వితీయ హరిహరరాయ లైనచో కవి క్రీ. శ. ౧౪౭౫ సం. ప్రాంతమువాడగును. ఆళియరామరాజు ముత్తాతయగు సోమభూపాలున కంకితమీయబడిన శ్రీధరచ్ఛందమున 'మంచనవింటివో' యను క్రీడాభిరామములోనిపద్య ముదాహరింపబడినది. ఆళియరామరాజు సదాశివరాయలకాలములో కర్ణాటరాజ్యమును బాలించుచుండెను. సదాశివరాయలు క్రీ. శ. ౧౫౪౦ ప్రాంతమువాడు. సోమభూపాలునకు రామరాజునకు మూడుతరముల యంతరముండుటచే, శ్రీధరుడును, సోమభూపాలుడును క్రీ. శ. ౧౪౬౫ ప్రాంతమువారగుదురు. శ్రీధరునకు బూర్వపువాడగుటచే వల్లభరాయలు క్రీ. శ. ౧౪౫౦ సంవత్సరప్రాంతమున నుండియుండును. కవితండ్రియగు తిప్పనయు ప్రథమ హరిహరరాయల యాస్థానమునం దుండనొప్పు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీనాథుడు అల్లాడవీరభద్రారెడ్డికి (క్రీ. శ. ౧౪౨౬–౪౦) గాశీఖండమును గృతినొసంగి, వేమ వీరభద్రారెడ్ల యనంతరమున రాజమహేంద్రవరపు రెడ్డి రాజ్యము క్షీణింపగా, కొన్నివత్సరములు కష్టదశ నొందినటులు గన్పడుచున్నది. ఆకాలములోనే శ్రీనాథుడు శివరాత్రిమాహాత్మ్య మనుగ్రంథమును రచించెను. శ్రీనాథుడు క్రీ. శ. ౧౪౭౦ వరకు జీవించియుండుటచే వల్లభరాయలకు సమకాలికుడని తోచుచున్నది. అట్టి సమకాలికులగు వల్లభరాయ శ్రీనాథులలో క్రీడాభిరామమును రచించిన దెవరో నిర్ణయింపవలసి యున్నది. శ్రీనాథ విరచిత గ్రంథములందును, క్రీడాభిరామమునందును గల పదపద్యభావసామ్యములను దొలుత విమర్శించి, తరువాత నితరయుక్తులను విమర్శింపదలచితిని.

## పదపద్యభావసామ్యములు

ఈవిషయము చర్చింపకముందు తెలుగుభాషలోని యనుకరణము లెట్టివో విమర్శింపవలసి యున్నది. సంస్కృతవాఙ్మయమునందును, తెలుగుభాషయందును బూర్వకవుల పద్యములయందలి భావములను, బదముల కూర్పును నర్వాచీనకవు లనుకరించుట సనాతన సాంప్రదాయమై యున్నది. అట్టి యనుకరణము గ్రంథచౌర్యమనరాదు. పూర్వకవిప్రయోగములకు మెఱుగులబెట్టుచు, సందర్భానుసారముగ బదములకూర్పును మార్చుచు దరువాతికవులు వాడియున్నారు. పెద్దన మొదలగువారి యనుకరణము లిట్టివే. అంతియకాని పద్యములను, రెండు మూడు పాదములను, బదములకూర్పునం దొకించుకయు భేదము లేకుండ నెట్టిప్రసిద్ధాంధ్రకవులును జౌర్యమొనర్చి యుండలేదు.

శ్రీనాథునిభీమఖండమునందును, క్రీడాభిరామమునందును

గీ. గార్గ్యసిద్ధాంతమున నుషఃకాలకలన
శకునమూనుట యది బృహస్పతిమతంబు
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము-

అను గీతపద్యమునందలి మూడుపాదములును సమానములు. హరవిలాసమునందు (ఆ. ౮, ప. ౧౦౯)

శా. ప్రాలేయాహిత సంప్రదీప్తకిరణ
ప్రక్రీడ దర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీ
వాచాలకోయష్టియై-

యను పద్యమునందలి సమాసము క్రీడాభిరామమున (ప. ౧౫౩)

శా. ప్రాలేయాదికృశాను భానుభావ్యతికర
ప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీ
వాచాలకోయష్టులై-

అని కొలదిమార్పులతో గానవచ్చుచున్నది. భట్టుమూర్తి ప్రణీతమగు నరసరాఘవమునందలి

"ఉద్దామద్యుమణిద్యుతివ్యతికర
ప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీ
వాచాలకోయష్టయః"

అనుసమాస మిరువురు కవులును ననువదించిరని శర్మగారు వ్రాసియున్నారు: ఇది సమంజసము కాదు. 'లోకో భిన్నరుచిః' యనునటులు భిన్నప్రకృతులచే నలరారు కవులొక్కటియే సమాసమును, నొకేపదసంవిధానమును గూర్చి పద్యముల రచించిరనుట వివాదాంశము. ఇటులు సమర్థించుటకు వీలులేక శర్మగారు భీమఖండములోని పై నుదాహరించిన 'గార్గ్యసిద్ధాంత......'యను పద్యము వల్లభరాయలు శ్రీనాథునిగ్రంథమునుండి గైకొనెననియు, నట్లుకానిచో నిరువురకుబూర్వము శకునశాస్త్రమున నట్టిపద్య ముండెనోపుననియు నేమేమో వ్రాసియున్నారు. ఇట్టిపద్య మొక్కటియే అయినచో నట్టియూహల కవకాశ ముండును. నే నీక్రింద గనపఱుపబోవు పదభావసామ్యములను బాగుగ బరిశీలించి శర్మగారును, భాషాభిమానులగు పండితులును సత్య మరయుదురుగాక!

### ౧. పదభావసామ్యములు

పదములయందును, భావములయందును గల పోలికను విమర్శించుచు, శర్మగారు కొన్నిటిని శ్రీహర్షుని నైషధమున నుండవచ్చుననిరి. మఱికొన్నిటిని సామాన్యముగ వాడుకలో నున్నవని నిరసించిరి. శ్రీనాథుని భీమఖండమును, గాశీఖండమును, శృంగారనైషధమును సంస్కృతగ్రంథముల కాంధ్రీకరణములే. అయినను శ్రీనా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుని యాంధ్రీకరణము మక్కికి మక్కిగ నొనర్పబడి యుండలేదు. మూలమునందలి భావమును గైకొనుచు, గొంచె మెక్కువతక్కువగ స్వతంత్రరచనముల నొనర్చి యున్నాడు. హరవిలాసమును, శివరాత్రిమాహాత్మ్యమును శ్రీనాథునిస్వతంత్రరచనలని పండితు లెల్లరకును విశదమే. మరియు శైలివలన మహాకవులగ్రంథములను సత్తెలుగ వచ్చుననుట నిర్వివాదాంశము. కాని యిది ప్రమాణముగ గైకొనక విమర్శింపనగును. నేనిట జూపబోవు నుదాహరణములలో గొన్ని శ్రీనాథుని స్వతంత్రరచన యనదొప్పు గ్రంథములలోనివియు, సర్వసామాన్యములు గానివియు, హర్షనైషధాదుల గానరానివియు నై యున్నవి.

(౧)వీణాక్వాణపాణింధమంబైన —క్రీ. రా. ప. ౧౦౦

పాణింధమంబనుపదము శ్రీనాథునికవనమున పెక్కుసారులు గన్పడుచున్నది.

కలమధురవీణాక్వాణపాణింధమంబై– భీ. ఖం. ౨–౧౧౦
గంధసారతుషారపాణింధమంబు– „ ౧– ౫౩
ప్రవాహధారాగంధపాణింధమంబైన– కాశీఖం. ౨– ౪౪
నీహారక్షీరధారాశ్రేణిపాణింధమంబైన– „ ౩–౧౧౩
మాణిబంధాశ్వలవణపాణింధమములు– „ ౪–౧౯
కాలకూటచ్ఛాయాపాణింధమంబై– „ ౪–౧౮
కేసరపరాగగంధపాణింధమంబై– „ ౪–౨౭౨
నిశ్వాసాగ్నిపాణింధమంబేలా– శృం. నై. ౨– ౩౨
కోదండనారాచధారాపాణింధమంబు– „ ౭– ౫౭

శృంగారనైషధమునందలి 'నిశ్వాసాగ్నిపాణింధమంబేలా' యనుపద్యమునకు మూలమునందు 'పాణింధమం'బను పదము గానరాదు. హర్షనైషధమున మూల మిట్లున్నది:—

౨–౫౭ "శ్లో. విషమో మలయాహిమండలీ
విషఫూత్కారమయో మయోహితః,
బత కాలకళత్రదిగ్భవః
పవన స్త్వద్విరహానలైధసా."

(౨) గన్నేరు పూజాయ కరమొప్ప నీర్కావి
మడుగుదోవతిపింజె విడచికట్టి
గొజ్జంగిపూనీరు కులికి మేదించిన
... ... ...గంగమట్టి లలాటకమునఁ దీర్చి

..................................
..........................
సరిగొన్నసముకట్టు జన్నిదంబులబుంగ
యంటువాయంగదానకుశవైచి
క్రీ. రా. ౪౩.

సీ. సరిగొన్న వెలిపట్టుజన్నిదంబులతోడ
రత్నాలతారహారము ధరించి
వలిపనీర్కావిదోవతిపైఁబదార్వన్నె
కళయైన పసిఁడిమేఖల ఘటించి
గంగమట్టియమీఁదఁ గస్తూరిరసమునఁ
బుండ్రకంబు లలాటమునను దీర్చి
శి. మా. ౨–౯౦.

(౩) పై క్రీడాభిరామమునందలి సీసపద్య ప్రథమపాదములో నీక్రింది సీసపద్యపాదమును బోల్చవగును.

గన్నేరుపూచాయ గనుపట్టు జిలుగైన
సలిలకాషాయవస్త్రంబు గట్టి
శృం. నై. ౭–౧౦౩.

శృంగారనైషధమునకు మూలమగు హర్షునిగ్రంథమున నిది గానరాదు.

(౪) మరియు,
గొజ్జంగిపూదేనె కులికి మేదించిన
కమ్మకస్తురి మేనఁ గలయనలఁదు
కాశీఖం. ౩–౧౮.

గొజ్జంగిపూనీరు కులికి మేదించిన
గంగమట్టి లలాటకమునఁ దీర్చి
క్రీడా. ౪౩.

(౫) క్రీడాకూన్యకటీరమండలము దే
వీశంభశ్రీవ్రాతముక్.
క్రీ. రా. ౧౩౩.

కట్టిక్రీడాకూన్యకటిగోపురద్వార
పరిరక్షకుడు...—కాశీఖం. ౧–౨.

లజ్జయెఱుఁగనికటిమండలంబుమీఁద–కాశీఖం. ౩–౨౪౦

(౬) మధుకైటభారాతిమడుఁగుఁబాన్పు– క్రీ. రా. ౨౨౧
మధుకైటభారాతిమడుఁగుఁబాన్పు–కాశీఖం. ౩. ౧౬౯

(౭)తోఁకచుక్కలఁబోలుదృక్తోయజముల–శృం. నై. ౭–౬౦

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తో(కచుక్క-ల(బోలు తోరంపు(దెలికన్ను
లావైశమున సిగ్గు నతకరింప
క్రీ. రా. ౧౩౪.

హర్ష నైషధమున( గానవచ్చు శ్లోకమున 'తో(క చుక్క-ల(బోలు' అనుదానికి మూలము గన్పడదు.

"శ్లో. పూర్ణయైవ ద్విలోచన్యా సైషాలి రవలోకతే
ద్రాఘ్రిగంతాణునా మాంతు మంతిమంతి మివే
[శృ. తే. ౨౦-౩౧.

(౮) నిద్దంపువెలిపట్టునెఱికదూ(నయపు
తొడలమించులు వెలిదొంగ(ంప
క్రీ. రా. ౧౩౪.

అన్నవెన్నె(చాయనవఘులింప(గ(జాలు
నిద్దంపువెలిపట్టునెఱికగట్టి
శృం. నై. ౬-౨౭.

ఈసీసపద్యపాదమునకు సరిఅయినమూలము హర్ష నైషధమున లేదు. గీతమునందలి భావమునకే సంస్కృత మున మూలము గలదు:

శ్లో. పుష్పై రభ్యర్చ్య గంధాదిభి రపి సుభగై శ్చారుహం
సేన మాంచే, న్నిర్యాంతీం మంత్రమూ_ర్తిం జపతి
మయి మతిం న్యస్య మయ్యేవ భ_క్తః— ౧౮-౯౧.

(౯) ఆలీఢపాదవిన్యాసమొప్ప(గ్రవాలి- క్రీ.రా. ౧౧౪.

ఆలీఢపాదవిన్యాసంబు శృంగార
వీరాద్భుతములకు విందుసేయ-
—శృం. నై. ౬-౨౭.

మూలమున జనసమూహముమంపఱ స్మరుండు వచ్చెననియుండ శ్రీనాథుడు స్మరవర్ణనమునకు సీసపద్య మొకదానిని నియోగించియున్నాడు.

శ్లో. అద్రాక్షీ రాజహంసం తే స్మర మగ్రేసరం సురాః;
అక్షా వినయశిక్షార్థం కలిసేన పురస్కృతమ్.
[౧౪-౧౮.

(౧౦) వ్యామగ్రాహ్యానితంబబింబకుచహా
రాభీలభద్రాకృతుల్ -క్రీ. రా. ౨౧౯.

వ్యామగ్రాహ్యకుచంబులంటియుదెనా
ప్రాణంబురక్షించెదక్ -శి.మా. ౩-౮౪.

వ్యామగ్రాహ్యపయోధరల్ - కాశీఖం. ౩-౫౩.

వ్యామగ్రాహ్యపయోధరల్ - హరవిలా. ౫-౭౩.

వ్యామగ్రాహ్య స్తనులగు, భామలు మనుజలకమార్చ-
—శృం. నై. ౮-౯౮.

మూలగ్రంథమగు హర్ష నైషధమున నిది మృగ్యంబు.

(౧౧) నింగియింగిలీకంబునంటెట్టి క్రీ రా. ౭౭౩.

నింగి యింగిలి కాన నభ్యంగమార్చె-కాశీఖం.౧-౧౬౮

(౧౨) రోలంబంబులుమూతిముట్టనెఱచెక్
గ్రొవ్వేఁడిబీరెండలక్ -క్రీ.రా. ౧౪౩.

మొకరితుమ్మెదమూతి
ముట్టనోడెడి- శివ.మహా. ౭-౧౦౪.

కోమలినిట్టూర్పుగ్రొవ్వేడిసెత్తావి
మొకరితేంట్లను మూతిముట్టనీదె.
—శృం. నై. ౭-౧౧౩.

శృంగారనైషధమునందలి పై పద్యభాగము హర్ష నైషధమునుండి యాంధ్రీకరింపబడియుండలేదు. శ్రీనాథుని స్వకపోలకల్పితము.

(౧౩) కోయిలలుకొసరుట శ్రీనాథునకుగడునింపుహర్షు వర్ణనమని తోచుచున్నది.

కోకిలముపంచమశ్రుతి(గొసరినట్లు- క్రీ. రా. ౧౦౧.

కొసరివసంతకాలమున
కోయిలక్రోల్చినభంగి-
—కాశీఖం. ౫-౧౬౪.

కొసరెనుద్యానపుంస్కోకిలములు-హరవిలా. ౪-౧౩౫.

కోయిలపంచమస్వరముక్రోల్చినభంగి- క్రీ.రా. ౧౪౦.

కోకిలంబెడ్డపుకూయునోకొసరియనుచు-శృం.నై.౮-౨౦

హర్ష నైషధమున నిదియు గానరాదు.

(౧౪) కంఠగ్రైవేయఘంటికాటంకారంబులును-
—క్రీ. రా. ౨౨౪.

కరిఘటాకంఠగ్రైవేయ ఘంటికా టంకారంబుల ప్రోదిసేయుచు- శృం. నై. ౬-౮౦.

(హర్ష నైషధమున నిదిలేదు).

గంధదంతావళగ్రైవేయఘంటికా
టంకారముఖరఘంటాపథంబు
—భీ. ఖం. ౧-౭౬.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మహిమ గైరిప్రేయఘంటాధ్వనుల్ – కాశీఖం. ౫-౨౭.

(౧౫) కలకంఠకామినీకోమలకుహూకారంబు–

—శ్రీనాథుని స్వతంత్రకవనము.

కలకంఠీకలకంఠకోమలకుహూ

కారంబులోరంబుగన్–క్రీ.రా. ౧౩౧.

ఈపదసంవిధానమే భీమఖండము (౩-౧౯) నందును, కాశీఖండము (౧-౫౯; ౧-౯౩; ౬-౮౨)నందును, హరవిలాసమున (౬-౯౨౦) నందును గానవచ్చుచున్నది. శృంగారనైషధమునందలి (౧-౭౮), 'కలకంఠకామినీకంఠకోమలకుహూకారకోలాహలకరంబిత కకుబంతంబు లగు వసంతంబులును' అను సమాసమునకు హర్షనైషధమున మూలము గానరాదు.

(౧౬) అదెముద్దరాల్మసానమ్మనివాసమ్ము–క్రీ.రా.౧౯౯.

మోసపోక మసానమ్మముద్దరాలు– కా ఖం.

(౧౭) ఘ్రాణపుటీకుటీరములం

గాంపుర మండఁదోడంగెనిప్డు.

—క్రీ. రా. ౧౬౧.

పౌరనాసికాపుటకుటీరంబులకుఁగుటుంబకంబుగా–

—కాశీఖం. ౭-౧౮౫.

నాసికాపుటకుటీకుటుంబినియగు పక్వాన్నగంధంబు–

(౧౮) కలమధురరుణా

త్కారముల్ తోరములో గాన్– క్రీ. రా. ౧౧౦.

ఇట్టి పదములహూర్పు శివరాత్రిమాహాత్మ్యము (౨-౮౦; ౨-౮౭; ౩-౮౮) నందును, హరవిలాసము (౬-౨౦;౭-౧౨౪) నందును, కాశీఖండము (౬-౨౭) నందును, భీమఖండము (౨-౧౧౦) నందును, శృంగారనైషధము (౬-౩౫; ౬-౮౦) నందును పెక్కుసారులు గానవచ్చుచున్నది. క్రీడాభిరామమునందలి ప్రయోగము ప్రమాదజనితమని కాని, సామాన్యపదసంకలనమని కాని చెప్పుటకు వలనుపడదు.

(౧౯) కెంజిగురాకు మోవిని శిధాత్వర్థంబనుష్ఠింతునో–

—క్రీ. రా. ౯౦.

ణిసిధాత్వర్థమనుగ్రహింపఁదగవే నీరేజపత్రేక్షణా!

—శృం. నై. ౮-౫౨.

హర్షనైషధమున నిది గానరాదు. 'ణిసిచుంబనే' యను ధాత్వర్థము ననుసరించి రచించిన యపూర్వ ప్రయోగమైయున్నది.

(౨౦) చరణాంగుళీకుటిలనఖశిఖాకోటికుట్టనంబున–

—క్రీ. రా. ౨౩౫.

కుటిలపాటలజటాంకురకుట్టనంబున– కాశీ.

కుటిలచంచూపుటకోటికుట్టనమున– శృం.నై. ౨-౫.

హర్షనైషధమున నీశ్లోకము గానవచ్చుచున్నది.

శ్లో. సగరుద్వనదుర్గదుర్గ్రహాన్

కటుకీటాన్ దశత స్సతః క్వచిత్;

నును దే తనుకంటుపండితః

పటుచంచూపుటకోటికుట్టనైః.

(౨౧)చాంపేయకుసుమచ్ఛదచ్ఛాయాదాయాదంబులైన–

—క్రీ. రా. ౮౧.

కఠోరపాకీనచ్ఛాయాదాయాదంబులైన– భీమఖం.

సుకుమారశుకచ్ఛదచ్ఛటాదాయాదంబులైన– కాశీఖం.

(౨౨) ద్యావాపృథ్వ్యంతరాళముల– క్రీ. రా. ౫.

ద్యావాపృథ్వ్యవకాశపేశలయశోధారానభస్సింధువై–

—కాశీఖం. ౧-౨౩.

ద్యావాపృథ్వ్యవకాశముల్– కాశీ. ౬-౨౪౦.

ద్యావాభూమ్యంతరమట్టహాసడమరుధ్వానంబులన్–

—కాశీఖం. ౭-౩౨.

శర్మగారు దీనినిగురించి వ్రాయుచు సంధ్యావందనమున 'ఆప్రాద్యావాపృథివీ' అనుప్రయోగముండుటచే నిది సామాన్యప్రయోగ మనిరి. సర్వసామాన్య ప్రయోగములని వారువ్రాసిన ప్రయోగములును, పైన నుదాహరించిన పదపద్య సామ్యములును శ్రీనాథవల్లభరాయల కవిత్వమునందుమాత్రమే కానబడుటచే నవి యపూర్వ పద సంవిధానము లనియు, శ్రీనాథవల్లభరాయలలో నొకరు వేఱొకరిగ్రంథమునుండి గ్రంథచౌర్యమొనర్చిరనియు, (ఇట్టివి యనుకరణములు గానేరవు గాని లేనిచో) క్రీడాభిరామమును శ్రీనాథుడు రచియించియుండుననియు గాని స్ఫురించుట నిశ్చయము. ఇక భావములపోలిక నాలోచించినచో నదియు నట్టి సందేహమునే కల్గించుచున్నది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(౨౩) వరుణరాజ వారాంగనా విలాసదర్పణాను కారియై యహర్పతి గ్రుంకఁబోయె- శ్రీ. రా. ౨౫౬.

వరుణరాజ శుద్ధాంత కాంతానివాసమాణిక్యదర్పణంబై- శ్రీ. రా. ౨౬౩.

వరుణుని శుద్ధాంతంబున
నరవిందాక్షులకు మించుటద్దం బగుచున్.

—భీ. ఖం. ౨-౨౬.

ఇది సుప్రసిద్ధమగు పోలికయట. సమానపదసంవిధానమును, భావమును గల ప్రయోగములను శర్మగారు చూపించినచో నది నమ్ముటకు వీలుండును.

(౨౪) నెలసంజయు మసమసకని చీఁకటియుఁ గలసి దిక్స్నేహవాటీ నికరంబుల వ్రేలిడిచిన కురువింద పూసలపేరునం బోలెఁ బొలుపు మిగిలె. శ్రీ.రా. ౨౬౩.

క. పసిపాప యెండకొనలును
మసమసకని యిరులు గలసి మనమలరించెన్
దెసల నలుగడల గుంజా
విసరంబుల సరులు వ్రేలిడిచిన భంగిన్.

—శృం. నై. ౮-౧౨.

ఇందు సంపూర్ణభావైక్యము మాత్రమేకాక పదసామ్యముకూడ గలదు.

హర్ష నైషధమున నిట్లున్నది.—

శ్లో. ఘుసృణసుమనః శ్రేణీశ్రీణా మనాదరిభిః సరః
పరిసరచరై ర్భాసాం భర్తుః కుమారతరైః కరైః,
అజని జలజామోదానందోత్పతిష్ణుమధువ్రతా
వళిశబలనా ద్గుంజా పుంజాశ్రియం గృహయాలుభిః.

—స. ౧౯-శ్లో. ౩౮.

దీనికి సరియయిన యాంధ్రీకరణము శృం. నై. ౮-౧౪ నందు గలదు. 'గ్రొత్త విరియు నెత్తమ్మివిరుల కేసరంబుల వాసనఁ గ్రోలి మత్తిల్లి యుల్లాసంబునం దూలియాడు కొదమ తుమ్మెదకదుపులు ఘుసృణసుమన శ్శ్రేణిశోణంబగు పొడుపుసంజకెంజాయయుం గలయఁ దెలసి గురువింద పేరుల యందంబు వహించుటయును'— శ్రీనాథున కిట్టి రచనయందుగల యభిమానముతో శృం. నై. ౮-౧౨ పద్యమునుగూడ నిట్టిభావముతోడనే రచియించియున్నాడు. 'మసమసకని యిరులు' అనుదానికి మూలమేమి? ఇట్టి ప్రయోగసామ్యములవలననే గ్రంథకర్తృత్వ మరయవలసి యున్నది.

మరియు నీయపూర్వ భావసామ్యమును గనుడు:—

(౨౫) ఉ. తియ్యనివింటిజోదు రతి
దేవిచనుంగవనొత్తగిల్లియొ
య్యొయ్యనవంకచక్కఁబడ
నొత్తెడుఁ జూచితె పుష్పబాణముల్
మయ్యొరవ్రాసెఁజిత్తరువు
మాఁగిలిమాఁగిలి చిత్రకారుఁడా
దయ్యముగాక వీనిపస
దానము టిట్టిభ, వీనికిందగున్.

—శ్రీ. రా. ౧౯౨.

తే. గీ. కోరగించినకడకంటికొనకిఁజూచి
వాఁడివాలికపూఁదూపువంకఁదీర్చు
చోరగిరతిదేవిపాలిండ్లనొత్తగిలిన
యించువిలుకానివ్రాసినారిదుపునందు.

—శృం. నై. ౮-౧౫౦.

ఈపద్యమునకు మూలము నైషధమున నెచ్చటను గానరాదు. ఇట్టి యపూర్వకల్పనలే శ్రీనాథుని ప్రతిభావిశేషమును జాటుచు, నాతని యాంధ్రీకరణపద్ధతిని వివరణ మొనర్చుచున్నవి. హర్ష నైషధమునలేని యీ భావసామ్యము గతియేమి?

(౨౬) వండాలపులవరారోహ వాహకుం డెక్కి విడిచిన వారువంపుఁ గొదమయుంబోలె- శివ.మాహా. ౩-౯౬.

వాహకుం డెక్కి విడిచినవారువంపుఁ
గొదమయునుబోలి- శ్రీ. రా. ౮౬.

ఇందలి పదభావసామ్యమును గనుగొనుడు.

పద్యసామ్యము గాని భావైక్యము గాని లేక కేవలము సమానమగు పోకడగల పద్యముల నిచట వదలి వైచితిని. గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించుచుంటిని గాని యింక ననేకప్రయోగముల గన్పఱుపవచ్చును. శ్రీనాథుని రచనను దెలుపు 'వీథీవిటంకము' 'బీరెండవేఁడి' 'దాసనపుఁబువ్వుచాయ' 'కప్పురబోగివంటకము' 'ఆఁకొ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నాఁడవు' 'కుసుమంబెట్టిన' యిత్యాది ప్రయోగము లెన్నియేని గలవు. ఇట్టిప్రయోగములు సర్వసామాన్య ప్రయోగము లనుటకు వీలులేదు. శర్మగా రిట్టి ప్రయోగములను గురించి వ్రాయుచు 'నిట్టివి పద్యములు వ్రాయువారికి నాల్కచివర నుండు'ననిరి. ఈవ్యాసమున శ్రీనాథ వల్లభరాయల గ్రంథములలోనివనిచూపిన ప్రయోగములు విశేషముగ నితరకవుల గ్రంథములలో బ్రయోగింపబడిన వని చూపినగాని యట్టివాదము సమ్మతముగానేరదు.

మరియు గ్రీడాభిరామము త్రిపురాంతకుని ప్రేమాభిరామమున కాంధ్రీకరణమునిన, జైనజూపిన భావ విశేషములు త్రిపురాంతకుని వనియు, నటులు గాక పోయినచో నసలుకవి యగు త్రిపురాంతకునికే మోసము వచ్చెననియు శర్మగారు వ్రాసిరి. త్రిపురాంతకుని ప్రేమాభిరామము మనకు లభింప లేదు. 'ప్రేమాభిరామరూపకంబు ననుసరించి క్రీడాభిరామంబను వీథీరూపకంబును రచించితి'నని కవియే తెల్పియుండెను గదా! క్రీడాభిరామము మాతృకకు సరియయిన యాంధ్రీకరణముగాదనియు, గ్రంథకర్త మూలమునందలి వర్ణనములను బెంచి యున్నాఁడనియు శర్మగారు ఒప్పుకొనియున్నారు. అటులయినచో గవి ప్రయోగములన్నియు దిపురాంతకునివి కానేరవు. ఈ సందర్భమున శ్రీనాథుని యాంధ్రీకరణమును గూర్చి ముచ్చటింపవలసియున్నది. శ్రీనాథుని యాంధ్రీకరణము మక్కికి మక్కిగా రచియింపబడియుండలేదు. భావములను విస్తరించి వర్ణించుటయు, గొన్నితావుల దనసొంత కల్పనల జేర్చి పద్యముల నల్లుటయు గలదు. శృంగార నైషధమును మూలముతో బోల్చిచూచినచో నిందలి నిజము బోధపడగలదు. శృంగారనైషధములోని శ్రీనాథుని యపూర్వకల్పనలను, హర్షనైషధమున గానరాని వానిని గొన్నింటిని బైనజూపియే యుంటిని. మరియు వేదము వేంకటరాయశాస్త్రిగారి శృంగారనైషధటీక యందలి ౧౩, ౧౪ పుట లరసినచో నిట్టి ప్రయోగములు మరికొన్ని చూపబడినవి. పైన జర్చించిన పద్యపదభావ సామ్యములవలన క్రీడాభిరామము శ్రీనాథవిరచితమని సందేహించుటకు బ్రబలకారణము కలదని తోచుచున్నది. ఈభాగము నింతటితో ముగించి మిగిలిన విషయముల జర్చించుచున్నాను.

౨. గ్రంథాంతమున మూర్తిత్రయమునం దెవ్వరినో వర్ణించి గ్రంథమును ముగించుట కొన్నిగ్రంథముల గలదు. కాని శీతకిరణుని వర్ణించి, విశ్వమున కాతడు కల్యాణపరంపర లొసగుగాత యని ప్రబంధముల ముగించుట శ్రీనాథవిరచితనైషధమునందును, గ్రీడాభిరామమునను దక్క మరెందును గానరాదు. నైషధమునందలి గ్రంథాంత చంద్రవర్ణనమునకును (ఆ. ౭ ప. ౨౦౧), గ్రీడాభిరామము నందలి (౨౫౨ వ) పద్యమునకును బోలిక కలదు. హర్షనైషధమున నిట్టి గ్రంథాంతచంద్ర వర్ణనము మంగళార్థ మొనరింపబడియున్నది. (స. ౨౨ శ్లో. ౨౫౦.) క్రీడాభిరామము శ్రీనాథకృతమనుట కిది ప్రబలకారణము కాదు. అయినను పండితులు సహృదయులై యాలోచింతురని యిందు గనబఱచితిని.

౩. మరియు గ్రీడాభిరామమున (ప. ౬౩) బుభుక్షార్థమై యేగుదెంచిన చండాలాంగనవర్ణనము జూడ 'జలుబంతి పసుపాడ' జనుదెంచి సుకుమారుని మనంబు గొల్లగొనిన చండాలాంగనను దలపించుచున్నయది. ఈసందర్భమున శివరాత్రిమాహాత్మ్యమున (తృతీయాశ్వాసము) ౩౧, ౩౨ పద్యముల జూడనగు.

౪. శ్రీనాథుడు ద్రాక్షారామమునందలి వేశ్యల దన కావ్యముల ననేకస్థలముల వర్ణించియున్నాడు (భీమఖం. ౧-౮౪; ౧-౯౨ మొ. కాశీఖం. ౧-౧౪; ౧-౧౪౦; ౫-౩౩౬......శివ.మాహా. ౩-౯౩). దాక్షారామ భీమేశ్వరునికి సైతము దక్షపురిసానిహాతుల తగులాటమును గగ్గించినాడు. క్రీడాభిరామమున (ప.౨౪౨) మధుమావతియను వేశ్యను వర్ణించు నవసరమున నొక యోగి యామె భూతభవిష్యజ్జన్మముల నొకపద్యమున లిఖించెనని చెప్పుట, నాసుందరాంగి దాక్షారామమున 'చిన్నిపోతి' యను భువనమోహినియై జన్మించునని వ్రాసియున్నాడు. ఇట్టి దక్షారామవేశ్యావర్ణనము క్రీడాభిరామము శ్రీనాథకృతమేమోయను సందేహమును బలపఱచుచున్నది.

౫. క్రీడాభిరామమున (౧౧౬-౧౨౫) పల్నాటి వీరచరితము నొకవనిత 'యాంతరాలిక యతిగ్రామాభిరామంబుగా, యతిగూడం ద్విపదప్రబంధమున వీరానీకముం బాడె' నని వర్ణింపుట, 'సలముదైవతంబు గురిజాల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గంగాంబను,' 'మాచెర్ల చెన్నుని' బేర్కొనుటచే దాను రచించిన పల్నాటివీరచరిత్రకథాభాగమును సూచించెనని మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు. పల్నాటి వీరచరితము శ్రీనాథకృతమగునా కాదా యని పండితులు సంశయించుచునుండ, దీనివలన శ్రీనాథుడే క్రీడాభిరామ మును రచియించె ననుటకు వలనుపడదు. అయినను క్రీడాభిరామకర్త రెడ్డిరాజుల యాస్థానమున వసించుచు బల్నాటివీరచరిత్రమును వినియుండు ననుటకు సందియము లేదు.

౨. క్రీడాభిరామము శ్రీనాథకృతము గాదనియు, వల్లభరాయనిచే రచియింపబడె ననియు నిర్ణయించుటకు శర్మగారు గ్రంథమునగల కవిస్తుతిని గైకొనిరి. ప్రథమమున క్రీడాభిరామ మసంపూర్తిగ నున్నదనియు, ప్రస్తావనలోని పద్యములు గ్రంథాదిని గానరావనియు బాఠకు లెఱుంగుదురుగాక! నన్నయ, తిక్కన, భాస్కరాచార్యాధిపులతో రావిపాటి త్రిపురాంతకునకు సమానకవితా ప్రాగల్భ్యము గలదని కవి సూచించి యున్నాడు (ప. ౩౭). గ్రంథాదిని గవి యేకవులను స్తుతించెనో తెలియరాదు. మరియు నిట్టి కవిస్తుతిచే గ్రంథకర్తృత్వము నిర్ణయింప వీలులేదు. పాఠకులు పింగళిసూరన, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, శ్రీనాథుడు మొదలగు కవుల గ్రంథములను గాంచినచో సత్యము తెలియగలదు. పింగళిసూరన కళాపూర్ణోదయమున 'నన్నయ బుధోత్తము దిక్కన సోమయాజి' అని స్తుతించి, రాఘవపాండవీయమున 'జగద్ధేయుల నన్నపార్యుని దిక్కన సోమన భాస్కరాహ్వయుల' అని స్తుతించియున్నాడు. ప్రభావతీప్రద్యుమ్నమున దెలుగుకవుల బ్రశంసించియుండలేదు. 'ఆదికవులఁ బ్రాచేతసవ్యాసమునుల' అను పద్యమును జూడుడు.

పిన వీరభద్రకవి శృంగారశాకుంతలమున నన్నయ తిక్కనల బ్రస్తుతించి, జైమినీభారతమున 'నన్నయభట్టు తిక్కకవి నెట్టాప్రెగ్గడన్ సోమునిన్' అని పేర్కొనియున్నాడు. వేయేల? శృంగారనైషధమున నన్నపార్యుని దిక్కయజ్వ శంభుదాసుల సన్నుతించిన శ్రీనాథుడు హరవిలాసమున సంస్కృతాంధ్రకవుల వినుతించియుండలేదు. ఇట్టి కవిస్తుతులవలన గ్రంథకర్తృత్వనిర్ణయ మొనర్పరాదు.

౩. ఇక లాక్షణికప్రమాణము నాలోచింతము. పై ప్రమాణములవలన గాని, యితర సందర్భములవలన గాని క్రీడాభిరామకర్త శ్రీనాథుడేయని స్థిరపడినచో లాక్షణికుల గ్రంథములు గ్రంథకర్తృత్వవిషయమున కడ్డము రానేరవు. ఏకారణములచేతనో శ్రీనాథుడు తనగ్రంథమును వల్లభరాయల గ్రంథమని ప్రకటించె నన్నచో, లాక్షణికులు వల్లభరాయల గ్రంథములోనివని యుదాహరింతురుగాని శ్రీనాథునివని యుదాహరింపరు. గ్రంథకర్తృత్వనిర్ణయము వారిపనిగాదు. గ్రంథస్థప్రయోగముల నుదాహరణములుగ గైకొనుటయే వారివృత్తి. క్రీడాభిరామము శ్రీనాథకృతమా, వల్లభరాయకృతమా యను చర్చ వారి కవసరమేమి? ఒకవేళ శ్రీనాథకృతమని వారంగీకరించినను, బ్రజాసామాన్యమునకు వల్లభరాయని గ్రంథమని ప్రచురింపబడిన క్రీడాభిరామమును శ్రీనాథకృతమని యేలయుదాహరింతురు? 'వల్లభరాయల క్రీడాభిరామ'మని వారు వ్రాసినచో వల్లభరాయనిదని లోకమున బ్రచురింపబడిన గ్రంథమని వారియర్థము. అప్పకవి కాలమునాటికి క్రీడాభిరామకర్తృత్వము చర్చనీయాంశమైయుండి, అప్పకవి కేతద్గ్రంథము శ్రీనాథవిరచితమని నమ్మకముండుటచేత నప్పకవి శ్రీనాథుని వీథినాటకములోనివని కొన్ని పద్యము లుదాహరించియుండవచ్చును. అంతియకాని శ్రీనాథునకుఁ గ్రీడాభిరామము నంటగట్టుటకై యప్పకవి ప్రయత్నించినాడనియు, గవులవిషయమున గట్టుకథలు వ్రాయుటయం దాతనికి నభిరుచియనియు వ్రాయుట సమంజసము కాదు. లాక్షణికులకు గ్రంథకర్తృత్వనిర్ణయ మనవసరమనియు, లాక్షణికప్రమాణముల నట్టి నిర్ణయముల శిలాక్షరములుగ గైకొనరాదనియు నాయభిప్రాయము. లక్షణకవు లుదాహరించిన గ్రంథములు మనకు గొన్ని లభించుటలేదు. ప్రసిద్ధకవులగు నన్నయ, పెద్దన, శ్రీనాథాదులచే రచియింపబడిన కొన్నిగ్రంథములనుండి వా రుదాహరణముల నిచ్చియున్నారు. ఆగ్రంథముల ప్రశంస, ఆయాకవుల యితరగ్రంథముల గన్పడదు.

ఆయాగ్రంథము లాకవులు రచియించిరని కాని రచియింపలేదని కాని చెప్ప వలనుపడదు. ధనంజయవిజయమును శ్రీనాథుడు రచియించెనని మూర్తిత్రయో

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యాఖ్యానకర్త చెప్పియున్నాడు. రంగరాట్ఛందమున శ్రీనాథుని నందనచరిత్రము (సునందనచరిత్రము) లోని వని కొన్ని పద్యపాదము లుదాహరింపబడినవి. గ్రంథకర్తృత్వ విషయమున లాక్షణికగ్రంథములు బలమైన ప్రమాణములుగావని తెల్పుచు నీచర్చ నింతటితో ముగించుచున్నాను.

౮. మరియు శ్రీనాథుడు వల్లభాభ్యుదయ మను గ్రంథమున నాంధ్రవల్లభుని తిరునాళ్లలోని విధవా దుర్వర్తనముల విశదముగ వర్ణించెననియు, 'గరుడస్తంభ ప్రతిష్ఠాకలన' యను పద్యమున నట్టివర్తనముల గేలిచేసెననియు మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు. వల్లభాభ్యుదయము నిదివర కెవరును బ్రకటించి యుండలేదు. కవిగారిపేటికనుబట్టి యాగ్రంథము వారియొద్ద సమగ్రముగ నున్నట్లూహించవలసియున్నది. వారాగ్రంథమును దాము బ్రకటించుటయో, లేక పరిషత్పత్రికయందుగాని, యితరపత్రికలందు గాని దానిని బ్రకటింప నిచ్చుటయో జరిగించిన, క్రీడాభిరామకర్తృత్వము తేటపడగలదని నా నమ్మకము.

పైనవ్రాసిన కొన్ని యాధారములను బట్టి శ్రీనాథుడే క్రీడాభిరామమును విరచించెననుటకు బ్రబలసంశయము గలుగుచున్నది. నావ్యాసమునందలి తప్పులను మన్నించుచు పండితవర్యులు సహృదయులై, ఏతద్గ్రంథకర్తృత్వనిర్ణయ మొనరింతురని నమ్ముచు నింతటితో విరమించుచున్నాను.

---

# తీవ

పువ్వాడ శేషగిరిరావు, చోడవరపు జానకిరామయ్య గార్లు

తొలకరి చిన్కులం గలుగు తోయముతోడఁ బిపాస నార్చి, మం
జులము రసార్ద్రమై ప్రకృతి సుందరతావిభవంబు నూని పు
వ్వుల తెలిచీరఁగట్టి సొలపుం గనుదోయి మిటారిచూపులన్
గలకల నవ్వుచున్న తరుణంబునఁ జిత్తము పల్లవింపఁగన్.

ఉ. పేశలమున్ మనోజ్ఞమయి వీచు సమీరకుమారమందని
శ్వాసములన్ మొగంబునఁ బ్రసన్నత నృత్యమునల్పఁ గ్రొత్తసొం
పాసలఁ బెంప, రక్తరుచు లల్లన నెల్లెడలందుఁ బర్వ శో
భాసము పేత యొక్కరితె పాపము! లోకముఁ గేలిసేసెడిన్.

మ. "ఇదె పుష్పించెను మాలతాతరుణి రారే!" యంచు మాధుర్యసం
పద రూపైన విధానఁ బిల్చుఁ గలకంఠంబుల్ స్వజాతీయులన్
వదనమ్ముల్ జలమూరఁ బక్షులు రాపాడంగ నేతెంచెడిన్
బదనైరుచ్యములౌ చివుళ్ల భుజియింపం బేరటాం డ్రద్దిరా!

చ. తరుణములైన లేఁ జివురుతళ్కులు పైపయి సందడింప, సుం
దరమగు రూపుఁ దాల్చిన తదాకృతి కన్నుల విందుగా వసేం
దిరకన, "మే" లటంచు నవనీజము లౌఁదలలూచి మెచ్చఁ గా
తరనయనమ్ములం గవివతంసుఁడు తీవనె చూపునిల్పెడిన్.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# శ్రీనాథుని యింటిపేరు పాకనాటివారా?

కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

శ్రీ టేకుమళ్ల అచ్యుతరావు గారు భారతీ పత్రిక పుష్యమాస సంచికలో 'దగ్గుబల్లి దుగ్గనకవి- నాసికేతోపాఖ్యానము' అను వ్యాసమునందుఁ దమకుఁగల్గిన రెండు ధర్మసందేహముల నాంధ్రదేశమునకు వెలిపుచ్చిరి. రెండును సుప్రసిద్ధాంధ్రకవులకు సంబంధించినవే. అందు మొదటిది: శ్రీనాథుని యింటి పేరును గుఱించినదియై యున్నది. 'పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు' అని బెండపూఁడి అన్నమంత్రి చెప్పినట్లు శ్రీనాథుఁడు వ్రాసికొనెను. 'పాకనాటింటివాఁడవు' అనువాక్యము పాకనాటి దేశస్థుఁడని యర్థమిచ్చునని బ్ర. శ్రీ వే. ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినారు. ఇంటివాఁడవు అనిచెప్పుటలో గృహనామము చెప్పబడెనని నే నూహించుచున్నాను-" అనునది. రెండవది: దుగ్గనకవి "బహుశః ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు" అని వక్కాణించుట. ఆంధ్ర సారస్వతమునం దభిలాషగలిగి దానిని గృషి చేసిన శ్రీ అచ్యుతరావుగారు శ్రీనాథుని యింటిపేరు పాకనాటివారని యూహించుటయు, దుగ్గనకవి నియోగిబ్రాహ్మణుఁడేమో యని తలఁచుటయుఁ జూడ 'పిచ్చికుదిరినది తలకు రోఁకలిని జుట్టు'మన్న ట్లున్నది.

శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమునందుఁ గృతిభర్త తన్నిట్లు సంబోధించినట్లు వ్రాసికొనెను:—

సీ. వినుపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణ విద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకంబైన
హర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణ వేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందుఁ
పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభునిమనుమఁడ వమలమతివి
నాకుఁ గృపసేయు మొకప్రబంధంబు నీవు
కలితగుణగణ్య, శ్రీనాథకవివరేణ్య!

శ్రీనాథుఁడు పెదకోమటి వేమభూపాలుని మరణానంతరము రాజమహేంద్రవరరాజ్యమునకు వచ్చుటకుఁ గారణము లేమి? అచ్చట వేమవీరభద్రనరపాలకులకు సచివగ్రామణియై, పండితపోషకుఁడై, బాంధవుఁడైయున్న బెండపూఁడి అన్నమంత్రి తన కర్థ్హానసత్కారము లొసంగుననియే. అన్నమంత్రి కృతిభర్తయై శ్రీనాథుని 'పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు'అని హెచ్చరించుటఁ గనినచో ఆపద్యపాదమున కి ట్లర్థము చేసుకోవలెను:—

'నేను కృతిభర్తను, నీవు కృతికర్తవు; మనమిరువురము ఒక్కటియే శాఖవారము;

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మీఁదుమిక్కిలి బంధువులము.' ఇచ్చట వారి వారి స్వశాఖాభిమానమును ప్రస్ఫుటముచే యుచున్న వాక్యరత్నములే కాని 'మీయింటి పేరు పాకనాటివారు, మీరును మేమును బంధువులము' అని యర్థమిచ్చుమాట లెంత మాత్రమును గావు. దూరదేశమునఁ గలుసు కొన్న శాఖాభిమానమువలన గలిగినలాభమే శ్రీనాథునిట్లు వ్రాయుటకుఁ బురికొల్పినది.

అదియునుగాక ఆంధ్రదేశమునఁ గల ఆర్వేల నియోగులలో పాకనాటినియోగిశాఖ కూడ కలదని మనవాఙ్మయమే సాక్ష్యమిచ్చు చున్నది. కృష్ణరాయవిజయమును రచించిన కుమారధూర్జటి పాకనాటినియోగిశాఖా బ్రాహ్మణుఁడు. తద్గ్రంథమునందలి యీక్రిందిప ద్యమును జూడుఁడు:—

సీ. ననుభరద్వాజగోత్రుని సదాపస్తంబ
సూత్రుని బాంధవస్తోత్రపాత్రు
పాకనాట్యార్వేలవంశప్రసిద్ధుని
ధూర్జటిపౌత్రుని బంధురచరిత్రు
సద్గురుకారుణ్యసంప్రాప్తవిద్యావి
హారుని శ్రీకాళహస్తినిలయు
చిత్ప్రసూనాంబికా శ్రీకరానుగ్రహా
సాదితకవితారసజ్ఞహృదయు
సారరచనాధురీణుఁ గుమారధూర్జ
టిప్రధానాగ్రగణ్యుఁ బటీరహీర
మహితసత్కీర్తి కాళియామాత్యపుత్త్రు
వెంకటార్యుని బిలిపించి వేడ్క ననియె.

కావున 'పాకనాటింటివాఁడవు' అను వాక్యమునకు 'పాకనాటి నియోగిశాఖా బ్రాహ్మణుఁడవు' అను నర్థమే చేసుకోవలెను. సుప్రసిద్ధాంధ్రచరిత్రకారుఁ డట్లే వ్రాసెను. శ్రీ ప్రభాకరశాస్త్రులవా రట్లే వ్రాసిరి. దీనికి వేఱొకయర్థము సందర్భశుద్ధిలేక కల్పించుట పరిహాసాస్పద మైనపని.

శ్రీనాథుఁడు పాకనాటియార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. అతని మఱఁదియైన దుగ్గనకవి కూడ నియోగిబ్రాహ్మణుఁడే కావలెను గదా! శ్రీ అచ్యుతరావుగారి 'బహుశః' అనుశంక కింక తావులేదు.

శ్రీనాథుని యింటిపేరు తెలిసికొనుటకు రెండేపద్ధతు లున్నవి. అందు మొదటిది: శ్రీనాథుఁడురచించిన మరుత్తరాట్చరిత్రగాని సప్తశతిగాని సంపాదించి, యందు కృతికర్తవంశ వర్ణనము గాంచుటయే. బాల్యమునందు రచించిన గ్రంథము లగుటచే గ్రంథకర్తయుఁ గొంచెము గొప్పగా తనవంశాభివర్ణనము గావించియుండును. రెండవది: 'కమలనాభామాత్యునియుదంతము'. ఇతఁడు కరణమో, లేక రెండవప్రతాపరుద్రునికడ గొప్పయుద్యోగమునందే యుండెనో తెలిసికొనవలెను. అతనిశాసనములు, అతఁడురచించిన పద్మపురాణాదిగ్రంథములు మొదలగునవి సంపాదించవలెను. వానిలో శ్రీనాథుని యింటిపేరు దొరకక మానదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




అనంతపంతుల రామలింగస్వామిగారు

మానవ జీవకాల మణుమాత్రము మృత్యువు కుడ్యమాచు నెం
దైనను దానిఁ బోనిడక యంతట నాఁపునో, లేక ద్వారమై
యేనవసీమఁ జేరుటకు సిద్ధపథంబును జూపునేమొ య
ద్దానికి,—నే నెఱింగిన యథార్థ మొకండగు—చావు జీవసం
తానమునుం దటాలునఁ గొనంగను నెన్నఁడు—దాని వెన్క నే
మౌనో యెఱుంగ, నేపథికుఁడైనను గ్రమ్మఱ రాఁడు పోయి—యీ
జానగు జీవితంబును నిజంబని యెంచెదఁ గాని—కష్టసం
తానము దీనఁ గల్గు—మరుధాత్రివలె న్ననుపట్టుచున్న ని
ద్దాన జలాశయా లమరుఁ, దామరతంపరగాఁగ నుండు ను
ద్యానవనాలు,—విద్య సతతంబును నేర్పెను నాకు "పాంథుఁడా!
కానిపథంబుల న్విడువఁగాఁ దగు, సత్పథగామివై సదా
యానము సల్పఁగాఁ దగు, హృదంబురుహంబున మోదతుష్టులన్
బూనుచుఁ గన్నులన్ దెఱచి పోఁదగు" నంచుఁ—దదీయబోధనన్
నానయనాలు విచ్చెఁ,—గఠినంబగు త్యాగధరాధరేంద్ర మొం
డా నడుదారినుండుటయు, నాగరికావలి చోట నిత్యసౌ
ఖ్యానుభవైకయోగ్య మగునట్టి, దనన్యసుసాధ్యమైన, దా
జానగు మోక్షదుగ్ధరససాగర మొం డలరారుచుండుటన్
నే నెఱుఁగంగఁ జాలితిని—నేర్వఁగ నన్నిటికన్న మిన్నయౌ
దాని వరించు టొప్పనుగదా—వరియించితి నేను—త్రోవ న
ద్దానికిఁ గంటి నక్కట సదా యిటఁ గల్గెడు నొక్కచిక్కు—నే
నానగ మెక్కి పోవలయు నావలితట్టున, కెన్నఁ డీదెసన్
నే నిలువంగఁ దృప్తిమెయి నేర్చితి నయ్యో!—నగంబు చిన్నదౌ
శే నొకవేళఁ గన్గొనియు నెక్కక జాగొనరించుచుంటి,—నీ
లోననె నాదు జీవనపురోజులు నేఁగఁగసాగె—నాఁడు నాఁ
డేనును మృత్యువున్ దరియు చేగుచునుంటి—నిదెంత ఘోరభా
వానుభవంబు, దీన దురవస్థ, తలంచి కనంగ నక్కటా!!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



80.—PEASANT ORNAMENTS. Central Provinces, if not otherwise stated

చిత్రము 3

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు

(వెనుకటిసంచిక తరువాయి)

స్థలము—శ్రీనాథునిగృహము

[శ్రీనాథుఁడు, భార్య దుర్గాంబ ప్రవేశము]

శ్రీనాథుఁడు

ప్రేయసీ! మాయక్క జాబువ్రాసినది చూచితివా?

దుర్గాంబ

ఏమి వ్రాసినదియో వినఁ గోరుచున్నాను.

శ్రీనాథుఁడు

(జాబు చూచుచు) "సహోదరా! మీబావ యేరాజును ఆశ్రయింపక నిరంతరగ్రంథకార్యమంద యుండి గృహకృత్యంబు లరయకున్నవారు. ఇంట నున్నదని కాని, లేదని కాని యెప్పుడును విచారింపరు. కుటుంబపోషణము చేసికొనుట మిక్కిలి కష్టముగా నున్నది. ప్రతిదినంబు నగ్నిప్రతిష్ఠాపనమే మాయింట లేకయున్నది. పిల్లలాఁకట మటమట మాఁడుచున్నవారు. దీనికి నీ వేమిసాధనము చేయుదువో చేసి మాకుటుంబమున కింతయన్నము పెట్టఁ దలంపు మని మీయక్క ప్రార్థించుచున్నది." అని వ్రాసినది.

(కంట నీరుపెట్టుకొనును.)

దుర్గాంబ

(కంట నీరు పెట్టుచు) మావదిన యిట్లు కూటికి పేదయై తానుం దనసంతానంబును నితాంతచింతాసాగరంబున మునింగి యుండ మన మిట్లుండుట ధర్మంబు గాదు. దీనికి మీ రెట్లాలోచింతురో యాలోచింపుఁడు.

శ్రీనాథుఁడు

మాబావ పోతనామాత్యుఁడు సకలజగజ్జేగీయమానకవిత్వము చెప్పఁ గలవాఁడు. శ్రీమద్భాగవతమును మూలమునకు మెఱుంగు వెట్టునట్లు తెలుంగు గావించి యున్నవాఁడు. అతని కృతి కర్ణాటభూపతికిఁగాని సింగభూపతికిఁ గాని మఱి యేభూపతికేని గాని కృతి యిప్పించి పసదనం బర్పింప నే నెంతయో ప్రయత్నించి విఫలమనోరథుండ నైతి. ఆతఁడు ప్రాణము నైన విడుచుట కంగీకరించును గాని నరకృతి యిచ్చుట కంగీకరింపఁడు. అందునంజేసి తత్కుటుంబ మిట్లు నిరుపేదయై యుండవలసి వచ్చినది. తాను వ్యవసాయము చేసి జీవింతు నని నాతోఁ జెప్పి యిట్లు చేయుచున్నాఁడు. కాలము కలిసిరానప్పు డేవ్యవసాయమును ఫలింపదు. దీనికి నే నేమి చేయవలసియున్నదో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తెలియకున్నది. (ఆలోచించి) కాంతా! నే నిప్పు డోరుఁగంటికిం బోయి సామదానాదు లుపయోగించి మఱియు నాపోతరాజుం బోధించి యేదే నొకదారింబెట్టి వచ్చెద. దీనికి నీ వేమి చెప్పెదవు?

దుర్గాంబ

ఇది మంచిదియే. నేనును మీ వెంట వచ్చి మావదినం జూచి చేతనైన సాయము చేసి వచ్చెద.

శ్రీనాథుఁడు

సరే. మనము సకుటుంబముగా నందలంబు లెక్కి మహావైభవంబున నోరుఁగంటికిం బోవుదము. మన కాతఁ డెట్లు సత్కారము గావించునో పరీక్షించి పిదపఁ జేయవలసినపని చేసి వత్తము. ఆతఁడు నామాట వినకున్న నిర్బంధించి యైన నరకృతి యిచ్చునట్లు ప్రయత్నించెద. నేఁడే ప్రయాణము. సంభారంబులు సమకట్టుము. నే నీవృత్తాంతము మహారాజున కెఱింగించి సెలవు పుచ్చుకొని వచ్చెదను.
(నిష్క్రమించును.)

---

స్థలము—ఓరుగంటిలో పోతన కుటీరము
[పోతనామాత్యుఁ డొకచోఁ గూర్చుండి గ్రంథరచన చేయుచుండును.]

పోతనామాత్యుఁడు

(పల్లకీబోయీల శబ్ద మాలకించి) కుమారా! మనయింటిచెంతఁ బల్లకిశబ్ద మగుచున్నది. అది యేమో విచారింపుము.

మల్లన

(వడివడిం బ్రవేశించి) తండ్రీ, మామామ శ్రీనాథకవిసార్వభౌముఁడు భార్యాపుత్త్రపరివార సహితుండై యందలంబు లెక్కి మనయింటికే వచ్చుచున్నాఁడు.

పోతనామాత్యుఁడు

వత్సా! నీవు పోయి వాని నెదుర్కొని తోడి తెమ్ము.
(మల్లన నిష్క్రమించును).

పోతనామాత్యుఁడు

ఈతఁడు నన్ను నరకృతి యిమ్మని నిర్బంధించుటకే వచ్చినాఁడు. నేనుమాత్ర మట్లు చేయను. అతండు న న్నెట్లు చేసినను జేయుఁగాక.

"ఉ. ఇమ్మనుజేశ్వరాధముల
కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని
సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటపోటులం బడక
సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు
భాగవతంబు జగద్ధితంబుగన్."

అనునాపద్యమునకు నేను భిన్నముగాఁ బ్రవర్తింపను. ఎట్లు కానున్నదో అట్లు కాక మానదు. సర్వమునకు దైవమే ప్రమాణము.

శ్రీనాథుఁడు

(పల్లకి దిగి మహావైభవముతోఁ బరివారపరివృతుండై పోతరాజుకడకు వచ్చి నమస్కరించి)
హాలికులు కుశలముగా నున్నారా?

పోతనామాత్యుఁడు

"ఉ. బాలరసాలసాలనవ
పల్లవకోమల కావ్యకన్యకన్

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గూళల కిచ్చి యప్పడపుఁ
గూడు భుజించుటకంటె సత్కవుల్
హాళికు లైన నేమి గహ
నాంతరసీమలఁ గందమూల కు
ద్దాలికు లైన నేమి నిజ
దారసుతోదరపోషణార్థమై."

శ్రీనాథుఁడు

బావా! మేలమాట కనిన నామాట కింతకో పింపఁ జెల్లునా?

పోతనామాత్యుఁడు

నీమాటకు నామాట ప్రత్యుత్తరము కాని కోప మెట్లగును?

శ్రీనాథుఁడు

నే నిపుడు రాజమహేంద్రవరమున వీరభద్ర రెడ్డియాస్థానమున నున్నవాఁడ. అతఁడు నా చేతఁ గాశీఖండము కృతినొంది నన్ను మిగుల మన్నించుచున్నవాఁడు. నిన్నుఁ జూచి పో వచ్చితిని.

పోతనామాత్యుఁడు

మిక్కిలి సంతోషము. నాయందు నీకు దయ యుండనుట కిదియే తార్కాణము. నీరాక మాకు రాక.

శ్రీనాథుఁడు

బావా! మన మందఱము నేకగ్రీవముగా మార్కండేయక్షేత్రమున నుండ నాచిత్త మభిలషించుచున్నది.

పోతనామాత్యుఁడు

సంతోషమే కాని రాజాశ్రయ మపేక్షింపని నా కట నుంట సమ్మతము కాదు.

శ్రీనాథుఁడు

నీవును రాజాశ్రయంబు నొంది సంపన్నుఁడవై వేసివేయక యుండవచ్చును.

పోతనామాత్యుఁడు

ఎంతకాలము ముండవచ్చును? భూమి యున్నం తకాల ముండవచ్చునా? ఓయి వెఱ్ఱివాఁడా! నే నెంతకాల ముందును? ఈనాలుగునాళ్లలో కనులు మూసికొని కాలక్షేపము సేయ నొప్పదా? వినుము—

ఆ. బ్రదుకు తరఁగలాట పసిజవ్వనము కొన్ని
నాళ్లమాట బ్రదుకు నీళ్లమూట
బోఁటి సొమ్ము కొడుకు మేటిమెఱపుఁదేట
యేటికయ్య, యిట్టిపాటిబాట.

చ. తెలియఁగ నెంతవారు నిలఁ
డ్రెల్లిర కాని యొకండు మిత్తిక
న్నుల మసిఁ బ్రామి పొల్చుట క
నుంగొనియే వినియే యెఱుంగ మీ
పొలిసెడునంతయుం గనియు
బూమె లెఱింగియు నుట్టిగట్టి యు
య్యెల లిటు లూఁగు చుందుమని
యెంచుట వెఱ్ఱితనంబు కాదొకో.

శ్రీనాథుఁడు

ఈమెట్టవేదాంతముల కేమిలే. పొట్టకు లేక మలమలమాఁడుచు, ఏమో ధర్మపన్నములు చదువ వచ్చినావు. సుఖమైనను, కష్టమైనను బ్రదికియున్నవాళ్లలోనే కాని యవ్వల నేమి యున్నది? మట్టి యున్నది.

పోతనామాత్యుఁడు

నీ విట్టిభావము కలవాఁడవు గనుకనే త్రిలోక రక్షకుం డైనపరమేశ్వరునిం గాదని నీకవితా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కన్యక రాజులకు రెడ్లకుఁ గాఁపులకుం గమ్మలకు జంగాలకు లింగాలకు నమ్ముకొని బ్రదుకుచు నాది యుత్తమజీవనం బనుచున్నవాఁడవు. నీ వెట్లనుకొన్న ననుకొన వచ్చును. నేను మాత్ర మది యుత్తమజీవనం బనను.

శ్రీనాథుఁడు

సరే కాని మిామావిషయ మిప్పు డేమిటికి? మఱి యొకప్పుడు ప్రసంగించుకొందము. నే నిప్పుడు లోనికిం బోయి మాయక్కగారిం దర్శించి కాలకృత్యంబులు నెరవేర్చుకొనియెదం గాక. (నిష్క్రమించును.)

పోతనామాత్యుఁడు

ఈ శ్రీనాథుఁడు నన్ను వంచించుటకే యింత పరివారముతో వచ్చియున్నాఁడు. సన్న్యాసిపెండ్లికి జుట్టు మొదలుకొని యెర వనునట్లు నా యింట నిప్పు డుప్పుతో నాజింటికిని లా కేత్వమే. నా కప్పిచ్చువాఁ డీయూర లేఁడు. నే నొరుల యాచించువాఁడఁ గాను. ఇంట వస్తువాహనాదు లేని కుడువఁ బెట్టి కొంతసొమ్ము తెత్తు మన్న నవియును సర్వమంగళమే. నా మగువకు మంగళసూత్రమే మామిడాకు. ఇట్టిచో నెట్లు చేసి వీరికి నేఁ డాతిథ్య మిత్తునో తెలియకున్నది. (కొంచె మాలోచించి) మల్లనా! మల్లన్న! (బిగ్గఱగాఁ బిలుచును.)

మల్లనామాత్యుఁడు

(ప్రవేశించి) నాయనగారూ! నా కేమియాజ్ఞ?

పోతనామాత్యుఁడు

నాయనా! నేఁడు మిామామ పరివారముతో వచ్చియున్నాఁడు గదా! వారిభోజనవిషయ మేమి యాలోచించితివి?

మల్లనామాత్యుఁడు

నేను మిారు చెప్పకమున్నే నాస్నేహితుల యిండ్లకు వెళ్లి అప్పడిగినాను. అందఱు లేదు లే దని చెప్పినవారే. బచ్చునింటికిఁ బోయినఁ దాకట్టు తెమ్మనినాఁడు. అమ్మ నడుగఁగా నా మెయొద్ద నేమియు లే దని చెప్పినది.

పోతనామాత్యుఁడు

(ఆలోచించి) మనయింటిలో నిత్తడిబిందె యొకటి యున్నది కదా! అది తీసికొనిరమ్ము. దానిం గుదువఁ బెట్టి కొంతద్రవ్యము తెచ్చెదను.

(మల్లనామాత్యుఁడు లోనికిఁ బోయి నాలుమాట్లు వేసి మయిన మతికించిన ప్రాతసొట్టలబిందె తెచ్చి తండ్రి కిచ్చును.)

(పోతనామాత్యుఁడు పుచ్చుకొని నిష్క్రమించును.)

(మల్లనామాత్యుఁడు అటఁ గూరుచుండి చింతించును.)

(అంత బియ్యము, పప్పు, నెయ్యి, కూరలు, ఆకులు లోనగుభోజనసామగ్రిం గొని యిద్దఱు సేవకులు, ఒక సేవకురాలును బ్రవేశింతురు.)

సేవకుఁడు

మల్లనగారూ! మిాతండ్రిగా రంగడిలోన సామగ్రిం గొని మాచేతి కిచ్చి పంపించినారు. స్వీకరింపుఁడు. (అని వలసినంత వస్తుసముదాయమును వాకిటిలోఁ బెట్టి నిష్క్రమింతురు.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

(మల్లనామాత్యుఁడు సంతసించుచు నవి య
న్నియు లోనికిం గొనిపోవును).

పోతనామాత్యుఁడు

(దీనవదనుఁడై బిందె చేతం గొని ప్రవేశించి)
కుమారా! ఈబిందె నెవ్వఁడును దాఁగట్టు వట్టి
నవాఁడు కాఁడు. కానిమైనను జేతఁ జిక్కి
నది కాదు. ఎట్లు చేయుదునో యేమియుం దెలి
యకున్నది.

మల్లనామాత్యుఁడు

(సమీపించి) తండ్రీ! వలసినంతసామగ్రి వచ్చి
నది. ఇట్లనుచుంటి రేమి?

పోతనామాత్యుఁడు

(ఆశ్చర్య మభినయించి) ఏమీ? ఎట్లు వచ్చినది?

మల్లనామాత్యుఁడు

అంగడిలోఁ గొని మీరు పంపితి రని చెప్పి
యెవ్వరో సేవకు లిద్దఱు పురుషు లొకస్త్రీ
యును వలసినన్ని భోజనపదార్థము లిచ్చి
పోయినారు. ఇంటిలో వంటకంబును సిద్ధ
మయినది.

పోతనామాత్యుఁడు

(కుమారుం గౌఁగిలించుకొని) నాయనా! నీవు
పుణ్యాత్ముఁడవు. సీతారాముల దర్శనము
చేయఁ గలిగితివి. మనవంశమును ధన్యమైనది.
(అని కన్నులు మూసికొని ధ్యానించి)

శా. చేతోమోదముతోడ నార్ద్రదిమికిం
జేయూఁత వాయూఁతయై
ప్రీతిం గూర్చుచుఁ దోడునీడ యగుచుం
బ్రేమించి కామించి నా
చేతోజాతమునందు నిల్చి సతముం
జేకొంచు రక్షించు మా
సీతారాముల లక్ష్మణాగ్రజుల నే
సేవింతు నశ్రాంతమున్.

(ప్రార్థించి లోపలికిం బోవును.)

మల్లనామాత్యుఁడు

(తండ్రితో లోనికిం బోవును.)

---

స్థలము—పోతన్న గృహము

[భోజనానంతరము తాంబూలచర్వణము చేయుచుఁ బోతనయు, శ్రీనాథుఁడు నాసీనులై యుందురు.]

శ్రీనాథుఁడు

బావా! నీవు శ్రీమద్భాగవతము నాంధ్రీకరిం
చితి వని వింటిని. నా కందు రెండుపద్యములు
వినిపింతువా?

పోతనామాత్యుఁడు

నీకు వినవలయునను నభిప్రాయమేని, అట్లే విని
పింతును. (అని తాళపత్రగ్రంథముం దీసి విప్పి)
ఇదియే నాభాగవతము. ఇం దేభాగమునఁ జదు
వు మనియెదవు?

శ్రీనాథుఁడు

గజేంద్రమోక్షములో గజేంద్రుని మొఱ్ఱయును,
శ్రీమహావిష్ణువు దర్శన మిచ్చుటయు నెట్లు
వ్రాసితివో విందు నాఘట్టము చదువుము.

(పోతనామాత్యుఁడు ఆభాగముందీసి చదువును.
చదువుచుండఁ బోతన కూఁతు రొకమూల
నిలిచి వినుచుండును.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"శా. లావొక్కింతయు లేదు ధైర్యము విలో
లం బయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్
డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మ
న్నింపం దగున్ దీనునిన్
రావే యీశ్వర, కావవే వరద, సం
రక్షించు భద్రాత్మకా!"

అని గజేంద్రుఁడు ప్రార్థించెను; ప్రార్థింపఁగా శ్రీమహావిష్ణువు:

"మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం
జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం
బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివా
దప్రోత్థిత శ్రీకుచో
పరి చేలాంచల మైన వీడఁడు గజ
ప్రాణావనోత్సాహియై."

శ్రీనాథుఁడు

కవిత్వమున కేమిగాని బావా! గజప్రాణావనోత్సాహి యైనవిష్ణువు మకరిని సంహరించి కరిని బ్రోవ నెంచి నప్పుడు చక్రాద్యాయుధంబులు పూని పరివారపరివృతుండై పోవలయును గాని "సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం చేదోయి సంధింపఁడు" అని వ్రాసితివి. ఇట్లు పోవునా? కలవఁ బోయెనా? గిల్లఁబోయెనా? వేడుకఁ జూడఁ బోయెనా?

(పోతనామాత్యుఁడు ఉత్తరము చెప్పక పుస్తకము గట్టిపెట్టును).

(శ్రీనాథుఁడు కనకఘంటముం గొని యేదో వ్రాసికొనుచుండును.)

పోతరాజుకూఁతురు

(చాటునుండి శ్రీనాథునియాక్షేపణము విని లోనికిం జని దొడ్డినూఁతిలో నొకబండఱాయి పెద్దధ్వని యగునట్లు పడవైచి ఓమ్మొ గొట్టుకొనుచు వడివడి వచ్చి) నాయనగారూ! మామగారికొడుకు నూఁతిలోఁ బడిపోయినాఁడు. అయ్యో! అయ్యో!

(శ్రీనాథుఁడు వ్రాయుచు నామాట విని తత్తఱపడి హాహాకారము సేయుచు వ్రాయునలేఖముతో ఘంటముతోఁ బఱచిపోయి నూతిలో నుఱుకును.)

(అందఱు నూతియొద్దకు వచ్చి మోకులు వేసి శ్రీనాథుని లేవ నెత్తుదురు.)

పోతరాజుకూఁతురు

(అక్కడకు వచ్చి) మామా! నీకొడుకు నూఁతిలోఁ బడె ననినమాత్రాన జేతిలోనిపుస్తకమును ఘంటమును విడువకయే యిందు వచ్చి పడితివి. నూతఁ బడినవాని లేవనెత్తుటకు మోకు లేవి? నిచ్చెన యేది? ఏమిచేయ వచ్చితివి? నూతిచుట్టును గంతులు వేయ వచ్చితివా? వేడుకఁ జూడ వచ్చితివా? నూతిలో నుఱికి ప్రాణము పోఁ గొట్టఁకొన వచ్చితివా? భక్తపరతంత్రు లెప్పుడు నిట్లు చేయువారే కాని సాధనములు సేకరించుకొని పోవునంత వ్యవకాశము గలిగించుకొనరు. మానాయనగారిపద్యము నిప్పు డాక్షేపింతువా? అది

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్వభావసిద్ధము కాదా? శ్రీమహావిష్ణు వట్లు శంఖచక్రాదులు ధరింపక పోయినను బై నేమి జరిగినదో ఆవలిపద్యము వినుము.

మ. "తన వెంటన్ సిరి లచ్చి వెంట నవరో
ధవ్రాతమున్ దాని వె
న్కను బక్షీంద్రుఁడు వానిచెంతను ధనుః
కౌమోదకీశంఖచ
క్రనికాయంబును నారదుండు ధ్వజినీ
కాంతుండుఁ దా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా
రాబాలగోపాలమున్."

పోతనామాత్యుఁడు

(కూఁతును వారించును.)

శ్రీనాథుఁడు

(సిగ్గుపడి మాటాడక తనలో) నా కిట్లు పరాభవము జరిగినది. నే నీపోతన కెట్టెనిర్బంధమేని గలిగించి వీనిచే నరాంకితము చేయించి పడపుకూఁడు భుజించుచుంటి వని న న్నీతఁడు దెప్పకుండఁ జేసెదం గాక. (నిష్క్రమించును.)

---

స్థలము—కారాగృహము

[భటు లాయుధపాణులై ద్వారముఖమున నిలువ లోన పోతనామాత్యుఁడును, వానియెదుట దుఃఖించు సరస్వతి యు నగపడును.]

పోతనామాత్యుడు

తల్లీ! సరస్వతీ!

"ఉ. కాటుకకంటినీరు చను
కట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని
గాదిలికోడల యోమదంబ యో
హాటకగర్భురాణి నిను
నాఁకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాటకిరాటకీచకుల
కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ!"

తల్లీ! దుఃఖింపకుము దుఃఖింపకుము. (ఓదార్చును).

భటుఁడు

(రెండవవానితోఁ జే యడ్డుపెట్టి) హాహా! యేమి యీవింత! ఈయన మహానుభావుఁడు. ఆమె సరస్వతీదేవి. ప్రత్యక్షమైనది చూడుము. నేను పోయి శ్రీనాథునిం దోడ్కొనివచ్చి చూపెదను. (అని నిష్క్రమించి శ్రీనాథునితో వడివడిఁ బ్రవేశించును).

(శ్రీనాథుఁడు చూచి భయకంపితహృదయుండై మ్రొక్కుచుండును).

సరస్వతి

(శ్రీనాథునిదిక్కు మొగంబై) ఓరీ మూర్ఖా! పరమభక్తాగ్రేసరుఁడైన యీకవిశిఖామణి నిట్లు నిర్బంధించితివి. ఇది నీకుఁ గీడున కగు. ఇపుడైన వీని విడిచిపుచ్చుము. (అని యంతర్ధాన మగును).

శ్రీనాథుఁడు

మహాత్మా! మూర్ఖుండనై నిరపరాధుండనగు నిన్నిట్లు నిర్బంధించిన నాతప్పు సైపుము. (అని తలుపు తెఱచి వానిం బయటికిం దెచ్చి పాదంబుల సాగిలిపడును.)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోతనామాత్యుఁడు

(శ్రీనాథుని లేవనెత్తి) శ్రీనాథా! చింతింప కుము. నన్ను నీవు నిర్బంధించితివనుట వట్టిది. ఇది నాకర్మపరిపాకము. దీన నా కింతయు నీపై ద్వేషంబు గాని కినుక గాని లేదు. లెమ్ము ప్రకృతిం బొందుము.

శ్రీనాథుఁడు

నీవు దరిద్రుండ వై బాధపడుచుంటి వని విని ని న్నేవిధంబున నైన బోధించి రాజదర్శనంబు చేయించి ధనవంతునిఁ జేయ నెంచి యిటవచ్చి తిని. వచ్చినకార్య మంతయు ని ట్లయినది. నే నింకఁ బోయివచ్చెదను. నా కాజ్ఞయొసం గుము.

(అని భటులతో నిష్క్రమించును, పోతన వానితో ననుసరించును. తెరపడును.)

అంకాంతము

---

స్థలము—రాజమహేంద్రపురవీథి

[ఎల్లన మల్లన .ఋనునిద్దఱు బ్రాహ్మణులు ప్రవేశము]

ఎల్లన

మల్లనా! మన శ్రీనాథకవిసార్వభౌముఁ డోరు గంటినుండి యిట వచ్చి వచ్చినకొన్నినాళ్లకే బయలుదేరి పోయినాఁడు గదా! ఎక్కడకుఁ బోయెను? ఏమివృత్తాంతము?

మల్లన

ఈరాజమహేంద్రవరమునకు వచ్చినకొన్నినా ళ్లకే పురాకృతకర్మపరిపాకంబునంజేసియో, నిరపరాధి యైనపోతరాజును నిర్బధించి బాధిం చినకారణంబుననో కాని అతనికుమారుఁడు సుదర్శనుఁడు కాలధర్మము నొందినాఁడు.అతం డాదుఃఖసాగరంబున మునింగి యుండునంతనే రాజమహేంద్రవర పురాధినాథులును రాజ్య ము వీడిపోయిరి. కవిరాజునకుఁ గలిగినపుత్త్ర శోకకష్టంబునకుఁ దోడు భోజనకష్టంబును దటస్థించినది. అందుచేత అతం డిటనుండి మరలఁ గొండవీటికి తనకాపురమును మార్చు కొనినాఁడు.

ఎల్లన

ఆసార్వభౌముఁ డిప్పుడు కొండవీటిలోనున్నాఁ డా? ఎందేని ప్రభుదర్శనార్థము పోయినాఁడా? ఇప్పు డాతనిస్థితిగతు లెట్లున్నవి?

మల్లన

కొండవీటిలోఁ గొంతకాల మెట్లో కాలక్షే పము చేసి తాను మున్నాశ్రయించినరాజు లందఱును గాలధర్మ మందుటంజేసి కుటుంబ పోషణార్థ మెంతయు వంత నొంది నానాదేశ ములు తిరిగి నానాకష్టములు పడి పట్టరాని వాండ్ర కాళ్లు పట్టి యెట్టును ధనార్జనము చేయం జాలక జాలింబడినాఁడు. కన్నడదేశ మునకు వెళ్లి తిన్ననియన్న మైన దొరకక యటఁ దాను బడినకష్టము లిట్లు వర్ణించినాఁ డట. వినుము:

శా. "కుల్లా వెట్టితిఁ గోక చుట్టితి మహా
కూర్పాసముం దొడ్గితిం
వెల్లుల్లిం దిలపిష్టముం మెసవితి
న్విశ్వాస్త వడ్డింపఁగాఁ

జల్లా యంబలిఁ ద్రావితిన్ గుచుల దో
　　సం బంచుఁ బో నాడితిం
దల్లీ ! కన్నడరాజ్యలక్ష్మి ! దయలే
　　దా, నేను శ్రీనాథుఁడన్."

మఱియు నాతండు పల్నాటి సీమకుఁ బోయి యట నొకయింట బచ్చలియాకు పులుసుకూరతో జొన్నన్నము పెట్టఁగాఁ దినలేక యిట్లు చెప్పినాఁడట విను...

ఉ. "ఫుల్లసరోజనేత్ర! యల
　　పూతనచన్నులచేఁదు ద్రావి నాఁ
డల్లదవాగ్ని మ్రింగితి న
　　టంచును నిక్కడ వేల తింత్రిణీ
పల్లవయుక్తమై యుడుకు
　　బచ్చలిశాకము జొన్నకూటితో
మెల్లన నొక్కముద్ద దిగ
　　మ్రింగుమ నీపస గాన నయ్యెడిన్."

ఎల్లన

మఱియుఁ బల్నాటిలోఁ గొన్నినాళ్లుండి యప్పుడు కొన్నిపద్యములు చెప్పినాఁడట! నీ కాపద్యములు ముఖస్థములా?

మల్లన

కొన్నిముఖస్థములు; చదివెద వినుము——

ఉ. "అంగడి యూర లేదు వరి
　　యన్నము లేదు శుచిత్వ మేమి లే
దంగన లింపు లేవు ప్రియ
　　మైనవనంబులు లేవు నీటికై
భంగపడంగఁ బాల్పడు కృ
　　పాపరు లెవ్వరు లేరు దాత లె
న్నంగను సున్న గానఁ బలి
　　నాటికి మాటికిఁ బోవ నేటికిన్.

మనకవిరాజొకనాఁడు పల్నాటిసీమలో నొక పురోహితునియింటికి భోజనమునకుఁ బోయి వానియిల్లిట్లు వర్ణించెను.

"ఉ. దోసెడుకొంపలోఁ బసుల
　　త్రొక్కిడి, మంచము దూడ రేణమున్
పాసినవంటకంబు, పసి
　　బాలురశౌచము, విస్తరాకులున్,
మాసినగుడ్డలున్, దలకు
　　మాసినముండలు, వంటకుండలున్,
రాసెడుకట్టెలుం, దలఁప
　　రాదు పురోహితునింటికృత్యముల్.

మఱియు నాతం డొకప్పుడు మొసరరాజ్యంబునకుఁ బోయి కొన్నిపద్దెములు చెప్పినాఁడట ! చదివెద వినుము.——

"ఉ. గొంగడి, మేలుపచ్చడము,
　　కుంపటి, నల్లులకుక్కిమంచమున్,
జెంగట వాయుతైలము, ల
　　జీర్ణపుమందులు, నుల్లిపాయలున్,
ముంగిట వంటకట్టెయల
　　మోపులు, దోమలు, చీఁకిపోతులున్
రంగ! వివేకికీ మొసర
　　రాజ్యము కాపుర మెంత రోఁతరా."

ఇట్లు మనకవిరాజు నానాదేశంబులు తిరిగి నానాశ్రమలం బడి తుదకుఁ గృషి చేసి జీవనము కల్పించుకొన నెంచి కృష్ణాతీరమునందలి బొడ్డుపల్లెను గుత్తచేసి యట నాఁగలిగట్టి వ్యవసాయము సాగించుచున్నాఁడట! మన కత్యం



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తప్రియుం డైన యక్కవిసార్వభౌము నొక్క మారు సందర్శించి వత్తము; నీవు వత్తువా?

ఎల్లన

తప్పక వత్తును. పోవుదము, పద.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది ప్రవేశకము.

---

స్థలము—బొడ్డుపల్లెలో లంకాక్షేత్రము

[కట్టు పేటేఁ గొని శ్రీనాథుఁడు, వ్యవసాయదారులును ప్రవేశము.]

శ్రీనాథుఁడు

కాపులారా! ఇదిగో నేను గుత్తగొన్న చేను. మీరు దీనిం బదను తప్పకుండ దున్ని తిలలు, పెసలునుం జల్లుఁడు.

సేద్యగాండ్రు

దొరా! ఇది మాదొడ్డసేనండి. యిందులో యి తైశామంతే నిలువుపోడు గవుర్దండి. పన్ను బందులు మోాను మీాకెంత లేదన్నా మెయ్యి రూపాలు మిగుల్తయండి. చరిగా మా కూలి మాత్తరం ఇవ్వాలండి. ఇచ్చాక మా పని సూడండి. బాబోయి! మీారు బాపనెగ సాయం సెయ్యాక రేత్తిళ్లు పొగుల్లూ వుండి పని బాగా సేయిచ్చుకోండి బాబూ!

శ్రీనాథుఁడు

మీా రుత్సాహముతోఁ బనిచేయుఁడు. మిమ్ము సంతోషపెట్టెదను. దుక్కి సాగింపుఁడు.

సేద్యగాండ్రు

(ఒకఁడు పాడగా నితరులు దాని ననువదించుచుఁ బాడుచు దున్నుట నభినయింతురు).

"హరి హరీ! నారాయణాదినారాయణో! కరుణించావై మమ్మూ కమలలోశనుడ. హ. చరణుచీతారామ చరణు పావనరామ చరణు జానికిరామ చరణజయరామా. హరి. నీయందు గురివుంచి నీజబ్బపూనితిమి ధర్మంబు నిరతంబు—

(శ్రీనాథుఁడు ఒకచోఁగూర్చుండి చూచుచుండును).

సేద్యగాండ్రు

(వెనుకటివలెనే పాడుచు విత్తనములు చల్లుట నభినయింతురు).

"సీరామూరామూరా, మోరామూరామయ్యా హరిరామూరామూరామైవోద్దీరామూరా. సీ. మాదవుడీ యాదవుడూగాయంగ, మాదవుడూ మచ్చావాతాగా మైనాడు. సీ. మేమెద్దూకొమ్మూలూ, మేకాదివిటీలు, యేమాటికో నేరు వేపాదో నేరు. సీ.

శ్రీనాథుఁడు

కాపులారా! మీారు చేలు చక్కగా సంరక్షించుచుండుఁడు. నే నెక్కడికే నేగి కొంత సొమ్ము తెచ్చెదను. పెట్టుబడికిఁ గావలయును.

సేద్యగాండ్రు

నీవు పోయినకాడే కూకుడుండక బాబో! చెబుతుండాము మామాటినుకోని బేగిరా బాబో!

శ్రీనాథుఁడు

సరే! అట్లే వచ్చెదను. (నిష్క్రమించును).

సేద్యగాండ్రు

(పొలము తిరిగి చూచుచు) ఓర్రోయ్! నీడ మట్టుకుందర్రోయ్! చేలు మాడవకుండా సూసు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోవాల. పురు గేరిమాశేదారి బదంకర్రా!
(అందు పురుగు లేరుట నభినయింతురు.)

పాట

"ఏమిసిత్తర మేమిసిత్తర మింతలోనే పుట్టెరా
　　శన మంతలోనే పుట్టెరా.　　ఏమి.
సీడపురుగులు గావు రియ్యా
　　సెడ్డపురుగులు బాబురో
సేను సేనూ మింగియేస్తయి
　　సెనములోనే తండిరో.　　ఏమి.
కంటసూసూ సుండగానే
　　కాయ లాకులు గాకనే,
కాడ లేళ్లూ గూడ మింగీ
　　పాడు సేస్తుండాయి రా.　　ఏమి.

శ్రీనాథుఁడు

(ప్రవేశించి) కాపులారా! ఏమి చేయుచున్నారు? చే లి ట్లున్న వేమి?

సేద్యగాండ్రు

నిన్న సందేళ కాడనుండి సేలకి సీడపురు గట్టింది దొరా! మే మయన్నీ యిల్లా కట్టమడి యే శేత్తున్నాం జియ్యా!
(శ్రీనాథుఁడు నలుగడఁ దిరిగి పరీక్షించుచున్నాఁడు).

సేద్యగాండ్రు

(ఆకర్ణించి) ఆహా శేటో? (ఆలోచించి) దొర గోరూ!కుట్టలో కేదో ఆగొచ్చి పడ్డట్టుందండీ. ఏరు పొంగుద్దండీ. సూడండి. సూత్తుంటేనే నిలువు మై కొచ్చిందండీ. మన సేలో మడి మాడు సేసేలాగుంది తండీ!

(అందఱు అటు చూచుచున్నారు. నిమేష మాత్రములోఁ దాటిపొడవున నీరువచ్చి చే లన్నియు మునిఁగిపోవును).

---

స్థలము—శ్రీనాథుని గృహము

శ్రీనాథుఁడు

(దుఃఖాక్రాంతచిత్తుండై తల వంచుకొని)
మ. కృతులం గొన్న మహానుభావు లగు పృ
　　థ్వీశుల్ పరం బంది రీ
　క్షితి జీవించుట కష్టసాధ్య మగుటం
　　జిత్తంబునం దెంచి భూ
　పతి నొడ్డీశ్వరు వేఁడి గుత్తఁ గొని సే
　　ద్యం బేను జేయింప నా
　ప్రతికూలం బగుదైవ మిట్లు తలఁచెం
　　బా డయ్యె సర్వం బయో!

ఇంక నే నెట్లు జీవించువాఁడ? గుత్తచేసిన విత్తం బెక్కడ తెచ్చి తీర్చెదను? ప న్నీకున్న న న్నారాజు నిలువనిచ్చుట యెట్లు?కటకటా! దైవమా! నా కెన్నియిక్కట్టులం దెచ్చిపెట్టితివి? నాప్రాణం బేల నిలిపితివి? నా కెంతచింత సంప్రాప్తమయినది? హాహా! కొండవీటిరాజుల కడ శాసనాధికారినిగా నున్నకాలమునఁ గొన్నియగ్రహారములు సంపాదించుకొనుట కను వు కలదు గదా! అట్లు చేసినవాఁడం గాను. ఎప్పటికి నా కప్పదవియే శాశ్వత మనుకొంటిని. అది పోనిమ్ము. సర్వజ్ఞభూపాలునిప్రోలఁ గనకాభిషేకంబు సేసిననాఁడు నే నెంత కన కంబు సంపాదించుకొనవచ్చును. అపుడును నేను విరక్తుండ నైతి. ఆవల వీరభద్రారెడ్డి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నన్నుఁ దనకన్న కొడుకుంబలె నాదరించె. అప్పు డైన ముప్పు కాలంబున కగు నని దొప్పెడు భూమి సంపాదించుకొననైతి. ఆరాజులు పోయినను మునుమున్న కూఁటికిం గుడ్డకుం గఱవై యున్నయప్పుడు నాచేతఁ బోషింపంబడిన నామిత్రులు గోత్రాకళత్రులు గల రనుకొంటి. వారు ధనమదాంధులై నన్ను నిరాకరించినారు. అయ్యో! మహారాజుల నాశ్రయించిన నే నలంతుల నాశ్రయింపఁగూడకున్నను బలినాటి భూస్వామిని బొట్టకూఁటి కాశ్రయించితిని. అతండు పరమమూర్ఖుండై నా యాశీర్వచనంబు నొందఁజాలక నన్నుఁ ద్రోసిరాజని తనవాసికి వంక దెచ్చుకొనినాఁడు. ఎచ్చట నెట్టిగతియుం గానక తుద కీయొడ్డెరాజు బొడ్డుపల్లె గొడ్డేరి ప్రాణగొడ్డంబు దెచ్చుకొంటి నే నేమి సేయుదు? ఎటు చొత్తు? ఏది దిక్కు? అయ్యో! అయ్యో!

(అని విచారించుచుండఁగా నిద్దఱు తురకజవానులు ప్రవేశించి కవిరాజు రెండుచేతులు నిద్దఱు పట్టుకొందురు.)

(శ్రీనాథుఁడు గడగడ వడంకుచుండును).

మొదటివాఁడు

సర్కార్కాహుకుం దేఖో.

(తాఖీదు చూపును)

(శ్రీనాథుఁడు పుచ్చుకొని చేతివడఁకునఁజదువలేకవిడుచును).

రెండవవాఁడు

అరే! మియా! పైసా దేవు. నైతో ఆవు.

శ్రీనాథుఁడు

(వడంకుచు) అ-య్యా-లా-రా! ఇప్పుడు నా చేతిలో నొక్క గవ్వయైనను లేదు. సర్కారు పైక మెట్లు చెల్లింపఁగలను?

మొదటివాఁడు

నైతో చలో- జల్దీ చలో-(అని త్రోయును.)

రెండవవాఁడు

ఆవ్ బొమ్మన్! జల్దీ ఆవ్——(అని లాగును.)

శ్రీనాథుఁడు

నాభార్యతోఁ జెప్పివత్తును. క్షణమాత్రము వేగిరింపకుఁడు. నన్ను నిర్బంధించుట మీకు న్యాయముగాదు. నేను గొండవీటను, రాజమహేంద్రవరమునందు, మఱికొన్ని మహారాజసంస్థానములయందు మన్ననలఁ గొన్న మహాకవిని. నే నెన్నో గ్రంథములు చేసియున్నాను. నన్ను మీరు నిర్బంధింపకుఁడు. మీకుఁ బాపము వచ్చును. నేను దొంగను గుచ్చను గాను. నే నేమియుఁ దప్పు సేయలేదు. పంట పోయినది. పన్నియ్యలేకపోయినాను. ఇదియే నాతప్పు. మీ రిట్లు బాధింపకుఁడు. బ్రాహ్మణుఁడను. బాధింపకుఁడు.

మొదటివాఁడు

భార్యా గీర్యా మై జానతం నై. జల్దీ చలో- నీకీ మేం మెహర్బానీ సేసీమాటా నై. చలో.

రెండవవాఁడు

నువ్వు పాయిూరు సెప్తావు. గీయిూరు సెప్తావు. నీరాజుల్ మాటా, నీపోథీలమాటా, వేడికీహోయ్! ఆవు బోలేతో పాపం గీపం బోల్తావు,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాకూ పాసం నై గీసం నై. సర్కారా హుకుం. భీమడు గీమడూ మై జాంతం నై. చలో- జల్దీ చలో. (అని చేతులకుఁ ద్రాళ్లు కట్టి లాఁగుకొని పోవుచున్నారు).

---

స్థలము—ఆస్థానమంటపము
[ ఓడ్రరాజు, మంత్రి, భటులు ప్రవేశము. ]

రాజు

మంత్రివర్యా! కోశాగారం బెట్లున్నది? మన తాలూకావ్యవహారము లన్నియుఁ జక్కఁగా నెరవేఱినవా? దస్తు శిస్తులు బాకీలు సాకీలు లేకుండ వసూలయినవా, లేదా? సంగతి సందర్భము లన్నియు నెట్లున్నవి?

మంత్రి

కోశాగారము సురక్షితముగా నున్నది. దస్తు శిస్తు లన్నియు వసూలయినవి. కాని బొడ్డుపల్లి గుత్తదారునివలన నొక్కపయిసయును రాలేదు.

రాజు

మీా రావిషయమున నేమిచేసితిరి?

మంత్రి

లోఁగడ రెండుతాఖీదులు పంపితిమి. ఒక్కదానికిని సమాధానము రాలేదు. ఆకారణంబున వానిం బట్టితేర హర్కాలాలం బంపియుంటి. వారు నేఁడో రేపో కార్యంబు సాధించుకొని రాఁగలరు.

రాజు

ఆగుత్తదారుఁ డెవ్వఁడు?

మంత్రి

దిగంతవిశ్రాంతకీర్తివిస్తారుం డగు శ్రీనాథకవిసార్వభౌముండు.

రాజు

ఆతఁడు రాజాస్థానంబులం దుండి కడుంగడు ధనంబు సంపాదించినవాఁ డని చెప్పుదురు. మనపన్నీకుంట మొండితనమా?

మంత్రి

ఆతం డేనాఁడు సంపాదించినవిత్త మానాఁడే వ్యయముచేసియున్నాఁడు. ఇపుడు నిరుపాధికుఁడు. కావుననే బొడ్డుపల్లె గొడ్డేరినాఁడు.

రాజు

వానిం గరుణించిపుచ్చుట నామతంబు గాదు. కట్టి కొట్టి వేధించి బాధించియైన టంకంబులు కొంకక సంపాదింపవలయు నని శాసించుచున్నవాఁడ.

మంత్రి

దేవరచిత్తము.

దౌవారికుఁడు

(ప్రవేశించి) జయము. జయము. మహారాజ! మన హర్కాలా లెవ్వరినో కట్టి తీసికొని వచ్చుచున్నారు.

మంత్రి

సరే! రానిమ్ము. పొమ్ము.
(దౌవారికుఁడు నిష్క్రమించును).
(చెప్పినట్లు తురకబంటురౌతులు శ్రీనాథుని ప్రవేశపెట్టుదురు).

మొదటివాఁడు

మహారాజ్! వీడు పొడుపల్లే గుత్తేదారు వుండాడు హుజూర్!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రెండవవాఁడు

షాయీరు చెప్పి తంటాలుపెట్టాడు సర్కార్! మేము వీడికీ కట్టితెచ్చినాం మహారాజ్!

మంత్రి

గుత్తేదార్! మా పయికముమాట యేమి చెప్పినావు? కిస్తీ లన్నియు దాఁటినవి. నీవు వచ్చి దస్తు దాఖలుచేసియుండలేదు. ఏమిచెప్పెదవు?

శ్రీనాథుఁడు

మంత్రివర్యా! క్షేత్రము పండలేదు. పండిన దింతయున్న నది చీడపురువులపాలైనది. శేషము కృష్ణవేణమ్మపాలైనది. అనుగ్రహించి మాఫీ దయచేయింపఁ బ్రార్థించుచున్నాను.

రాజు

నే నీరాజ్యమునకు వచ్చినదిమొదలు పండనీ పండకపోనీ మాఫీ యనఁగ నేమో యెఱుఁగను. నీయింట నున్నసొమ్ముల నమ్మి యైనఁ గుదునఁబెట్టియైన మాపన్ను మాకుఁ జెల్లింపక తప్పదు. అట్లు చెల్లింపకుంటివేని నీకు నిర్బంధమును దప్పదు.

మంత్రి

మీయింటఁ గలవస్తువుల నమ్మి సొమ్ము చెల్లింపుమని రాజాజ్ఞ. ఏ మందువు?

శ్రీనాథుఁడు

ఇంటఁ గలసర్వస్వమ్ము నమ్మియే యీ వ్యవసాయము చేసితి. ఇఁక మాయింట నొకపూచికపుల్లయైనను శేషించి లేదు. ఇల్లు మున్నే పోయినది. నాభార్య యరుంధతి యైనది.

మంత్రి

నీకుఁ గొన్నినాళ్లు గడు విప్పించెదను. ఏరాజునైన నాశ్రయించి ధనము సంపాదించుకొని రాఁగలవా?

శ్రీనాథుఁడు

నన్నుఁ బ్రేమించురాజు లందఱును లోకాంతర గమనంబు చేసియున్నవారు. నాకవిత్వం బాదరించి నాకు ధనం బొసంగఁగల రాజొక్కఁడును లేఁడని విన్నవించుచున్నాను.

మంత్రి

అట్లయిన నీవు మఱియొక్కసంవత్సరము సేద్యము చేయించి యీ ఋణము తీర్చుకోఁగలవా?

శ్రీనాథుఁడు

పెట్టుబడికిఁ దెచ్చుకొనంజాల. చాలనష్టపు సేద్య మెట్లు చేయింపఁగలను? ఎట్లు ఋణము తీర్పఁగలను. అనుగ్రహించి నన్ను ఋణవిముక్తునిఁ జేయుఁడనియే కోరుచున్నాను.

రాజు

ఈతండు మొండి శిఖండి బండ. వీనిని దగునట్లు నిర్బంధించిన మనసొమ్ము మనకు రాకపోదు. అట్లు చేయ నాజ్ఞాపింపుము.

మంత్రి

భటులారా! ఈబ్రాహ్మణునిం గొనిపోయి దండింపుఁడు.

(భటులు శ్రీనాథునిఁ గొనిపోవుదురు).

(రాజు మంత్రితో లేచి నిష్క్రమించును).

---

స్థలము—పురవీథి

[భటులు శ్రీనాథునితోఁ బ్రవేశము.]

(భటులు ఎదురెండలో శ్రీనాథుని నిలిపి,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాళ్లకు గొలుసుగట్టి, చేతులకు బేడీలు వేసి, నల్లగుండు మెడపలమీఁదఁ బెట్టిదురు).

శ్రీనాథుఁడు

(అశ్రుపూర్ణనయనుండై) అక్కటకటా! విధి విధానము దాఁట నెవ్వరికినిశక్యంబుగాదుగదా! సర్వజ్ఞసింగభూపాలుని ముత్యాలశాలలోఁ గనకాభిషేకమహోత్సవము నందఁగలిగిన నా కీపాట్లు వచ్చినవి. ఏకాలంబున కెట్టిగతి పట్టునో యెవ్వరికిం దెలియఁబోదు. ఇది నేను జేసికొన్న కర్మపరిపాకము గాని మఱియొక్కటి గాదు. నాకర్మమే న న్నింతకుఁ దెచ్చినది. "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" హా! హా!

"సీ. కవిరాజుకంఠంబు కౌఁగిలించెను గదా
　　పురవీథి నెదురెండ పొగడదండ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మమునందుఁ
　　దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
　　వియ్యమందెనుగదా వెదురుగొడియ
సార్వభౌమునిభుజాస్తంభ మెక్కెను గదా
　　నగరివాకిట నుండు నల్లగుండు
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు."

(అని విచారించి ధైర్యం బవలంబించి కన్నులు మూసికొని కొంతసేపు ధ్యానించి)

"సీ. కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి
　　రత్నాంబరంబు లేరాయఁ డిచ్చుఁ?
గైలాసగిరిఁ బంటమైలారువిభుఁ డుండె,
　　దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు?
రంభఁగూడెఁ దెనుంగురాయరాహుత్తుండు,
　　కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి, మఱి హేమ
　　పాత్రాన్న మెవ్వానిపంక్తిఁ గలదు?
భాస్కరుఁడు మున్న దేవునిపాలి కరిగెఁ,
గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
దివిజకవివరుగుండియల్ దిక్కు రనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి."

(అని చదివి క్రిందఁబడి యంతర్ధాన మగును. అంతలోఁ జతుర్భుజములతో శంఖచక్రాద్యాయుధములతో మణికిరీటకౌస్తుభాదులతో గరుడవాహనారూఢుఁడై శ్రీ మహావిష్ణువిగ్రహము పొడసూపి దేదీప్యమాన కాంతులు దిక్కుల వెదఁజల్లుచు మీఁదికిఁ బోవుచున్న ట్లెల్లవారికిం గానుపించును.)

ఇది సమాప్తము

---

## పీ ఠి క

శ్రీనాథకవిసార్వభౌమునియందు నాకుఁ జిన్నటి నాఁటినుండియుం గలిగియుండిన గౌరవంబునంజేసి వాని గ్రంథములే చదివి వానినే యనుసరించి వానియందే నా చిత్త మైక్యమగునట్లుచేసి ప్రవర్తించుచుండినవాఁడ నగుటంజేసి యమ్మహాకవిశిఖామణి పవిత్రచరిత్రమంత యు నొక్క శ్రవ్యప్రబంధముగాఁ వ్రాయ నెంచియు నాకన్న మున్ను కొందఱు కవులు గద్యప్రబంధములు కొన్ని విరచించి తచ్చరిత్రము విస్తరించి ప్రకటించుటం జేసి ఆయుద్యమము మానుకొని దృశ్యప్రబంధమైనచో నమ్మహానుభావుఁడు సర్వాలోకలోచన గోచరుండగుచుం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డుననియు, ఇక్కాలమున దృశ్యకావ్యములకు వ్యాప్తి యెక్కువయుండుననియుఁ దలంచి యిట్లుద్యమించి యెట్లో కృతకృత్యుఁడ నైతిని.

ఈనాటకములో నాటకోచితేతివృత్త మంతగా సరిపడియుండలేదు. శ్రీనాథునిజీవితము మాత్రమే యిందలి కథాంశముగా గ్రహించితిని. దానంజేసి సంవిధానము చక్కనిమార్గముం బొందియుండదేమో యని సందేహము మాత్రము నాచిత్తమున లేకపోలేదు. అయినను రాఁబోవుకాలమునఁ జక్కని సంవిధానములో నీనాటకము వ్రాయువారి కిది యించుకంత చేయూఁత యీఁగలదనియు, నీలో నాటకప్రదర్శకు లనుగ్రహించి దీనిం బ్రదర్శించినచో శ్రీనాథదర్శనభాగ్య మబ్బఁగలదనియు, తచ్చరిత్రము జగన్నేత్రపర్వముఁ జేయఁగలదనియు నా నిశ్చయము.

మహాకవి నాటకములో నతనిపద్యములే హృద్యములుగాని ననుఁబోంట్ల పద్యములు హృద్యములుగావని యెక్కడెక్కడనో కొన్ని తక్కఁ దక్కినవన్నియు నతని పద్యములే చొప్పించితిని. పోతరాజు పద్యములు కొన్ని మాత్రము గలవు. శ్రీనాథునకును బోతరాజునకును గల సంబంధము మృగ్యమయినను లోకప్రవాదమును బట్టి తద్వృత్తాంత మించుక స్పృశించితిని. శ్రీనాథుఁడు శృంగారాగ్రేసరుఁడు, విటుఁడు నని వ్రాసిన వారివ్రాఁత నాకిష్టముకాదు. అతఁడు పరమపవిత్రుఁడని నాయభిప్రాయము. మహానాటకములో శృంగారమునకుఁ గొంచెము చోటీయవలయును గావున వీథినాటక మొకవిధముగా మార్చి వ్రాసి తత్కాలమున నాయభిప్రాయమును వెల్లడించితిని. ఇందు నాటకనియమము పాటింపలేకపోవుటయేకాక దీనిని విషాదాంతముగా ముగించితిని. దీనికి నన్నెవ రేమి యన్నను సహించుకొని యుండవలసినవాఁడ నగుచున్నాను.

ఈరూపకము నే నెప్పుడో వ్రాసియుంచితిని. ఈలోఁ జెన్నపురికిఁ బోయినప్పుడు దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారితోఁ బ్రసంగించుచు దీనివృత్తాంతముం దెచ్చి, భారతిలోఁ బ్రకటింతురా యని యడిగితిని. వారు గ్రంథములోఁ గొంతభాగము విని ప్రకటించుట కంగీకరించి తమపత్రికారాజమునఁ జోటిచ్చి దీనికి లేనిగౌరవముం గలిగించినారు. ఇట్లనుట నాప్రమాదము: నాకవిత్వములో గౌరవము లేకపోయిన లేకపోవునుగాని శ్రీనాథుని కవిత్వమందును వానిచరిత్రమందును గౌరవము లేనివా రుండరు. అక్కారణంబుననే పంతులుగా రీగ్రంథమును స్వీకరించినారు. వారు స్వీకరించినగ్రంథమే కావునఁ గృతికూడ వారి పేరనే సమర్పించుట సమంజసమని తలంచి లోకోపకారపరాయణులైన పంతులుగారికే దీని నంకితముచేసి శ్రీనాథ చరిత్రమునకు మఱింతపవిత్రతను గలిగించితినని సంతసించుచున్నాఁడను. శ్రీనాథునియందును, నాగేశ్వరరావుగారియందును గల గౌరవంబునం జేసియైనఁ బండితలోక మీనాటకము నాదరించి నన్ను మన్నించుఁగాక యని విన్నవించుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
రాజమహేంద్రవరము 1-3-27

---

## వేఁడుకోలు

### శంకర నారాయణ కవులు

శ్రీకరాంచితదివ్య శేముషీవిభవంబుఁ దుల్కించు నీకనుదోయిఁ ద్రిప్పి
రమణీయతమభవ్య రచయితృపటిమంబు నొలయించు నీకరయుగముఁ జాఁచి
సుకుమారతరనవ్య సుకవితాభాగ్యంబుఁ బ్రభవించు నీపదద్వయము నిలిపి
పరమపావనధన్య వాక్సుధాసారంబు నొలికించు నీయోష్ఠయుగళిఁ గదపి
కరుణ నొకమారు నీచిన్నికవులఁ గాంచి-యభయదానంబు నిచ్చి దాస్యంబు నొసఁగి
లీల వెలయింప దీవించి మేలు గూర్చి-దేవి! మముఁ బ్రోవు మోభారతీమతల్లి!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చిత్రము ౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




మున్నికంటి గురునాథ కవి

ఎన్ని లతలు గొమ్మలు లేవు క్రొన్ననలను-గుసుమవిసరములను ముద్దుగొలుపునవి; మ
నోజ్ఞకళికాళికావాల నుతవిశాల - ఘనరసాలసాలమువలెఁ గావుగాక.

క. విరితేనెయు నెఱితావియు, నరవిప్పం బొరయుతమ్మి నచటవిడిచి నీ
సరసంగనెఁ గ్రొమ్మావీ! పరికింపుము భృంగము నుపవాసముదీరన్.

మ. పువులంబూయుటకంటెఁ బూర్వము మొదల్ పూజించు భృంగంబు ని
న్నవురా యిప్డు ఫలాభివృద్ధిఁగని డాయన్ రాఁగ మాటాడఁ బూ
నవు; కీటంబులు నీమొగం బెఱుఁగ వైనం బండ్లలోఁ జేర్చ జం
కవు ఛీ చూతమ! తారతమ్య సువివేకంబేది? నీ కాత్మలోన్.

చ. మివుల సుధారసోపమసమృద్ధఫలంబులఁ దొప్పఁదోఁగి పొ
ల్తువు ఫలమేమి? తద్గ్రహణలోలురదండ శిలాభిఘాతముల్
దవిలెదు బిడ్డలంగనిన లాభమొకో? యిది మావిగున్న! యీ
భువి నెవరైన సౌఖ్యములఁ బొందరె బిడ్డలకారణంబునన్.

ఉ. కమ్మనిపండ్లచాగమునఁ గ్రాలెదు తీయనిమావిమ్రాఁక! భృం
గమ్ములు గోయిలల్ విరివిగా భవదీయయశంబుఁ జాటుచో
నమ్మక చెల్ల! తాలము తనంతనె గాలికి నూఁగులాడు ప
ర్ణమ్ముల గల్గలార్భటి నిరంతర మాత్మ యశంబుఁజాటెడిన్.

ఉ. దిక్కులనెల్ల నింపితివి తీరుగ సౌరభసారపూరముం
జక్కదనాలకిక్కవయి చాలితి కన్నుల కింపునింపఁగా
నక్కట మావిపండ! అనయంబు మనంబున డంబుమీరు స
మ్యక్కఠినంబు గ్రంథిలమునందున నొందితి నిందనెందునన్.

"అడవిపువ్వులు"





CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# క్రొత్తపల్లి సూర్యారావుగారు

(వెనుకటిసంచిక తరువాయి)

## తొమ్మిదవ యంకురము

ఇట్టి వీరందఱి యాశీర్వాదమువలన నొకవ్యక్తి పునర్జన్మమెత్తి పైతృకులయిండ్లలో నాబాలవృద్ధము మెచ్చఁదలలోని నాలుకవలె ననువర్తనమున మెలఁగుచు నేనో పేరునకని యొక్కయుద్యోగము సంపాదించుకొని తిరుగుచుండెను. వీరియందఱియాదరణముకడ నుద్యోగమెంతపాటిది! ఆతల్లి, యొక్కనాఁటి సంతోషప్రసంగములో, "నీకు జబ్బుచేసినకారణమున నొకసాయంకాలమింటికి రాఁజాలనని శంకరయ్యచేఁ జెప్పినవార్త యంపినపుడు, నేను వైద్యునింటికి వెళ్లితిని. 'నీ వీబెడఁదయేల పెట్టికొందువు? వానిరోగము కుదురునదికాదు. ఇంటికిఁ బంపివేయుము'మని చెప్పినాఁడు. నీవు బెంగపెట్టుకొందువని నీతోఁజెప్పలేదుసుమా– లోలోన దుఃఖపడుచు నిన్నినాళ్లుదాఁచిపెట్టితి"నని యక్కయ్యగారి యింటినుండివచ్చిన కొన్నివాళ్లకుఁ జెప్పెను. ఎంతప్రేమ! ఎంత వాత్సల్యము! ఓతల్లీ! విజయవిలాసములోఁ జెప్పినట్లు "బిడ్డలపేరువెట్టినం దీఱునె విమోచనంబు." ఆయననుగాదు బ్రదికించినది–ముఖ్యముగాననున్న. దైవవశము; సంబంధము లేని దారిఁబోవువారిం దెచ్చికొని వారితో బాధపడుట–యుద్ధరించుట– యెంతటి పూర్వజన్మసంబంధమో– వారికివారికి నుండవలయును. తొల్లింటిజన్మమునసే యీయన యీయమ్మకుఁ బుత్త్రుఁడో–లేక పుత్త్రుఁడనై పుట్టెదననియాస పెట్టెనో! 'నహి కారణంవినా కార్యంసంభవతి'–ఆయమ్మప్రేమ! కొమరితలవివాహములలో లాజహోమమునకుఁ బిలువలేదు – ఇంతియ – తక్కినతావులలో బావమఱఁదికి జరుగుమర్యాద లన్నియు నడపించెను. పేరునకుఁ దగినట్లే – ఒక్కరియింటఁ బుట్టి, యొక్కరియింటఁ బెరిఁగి, యొక్కరి నానందపెట్టి, యొక్కతావున సంచరించుట యీయన కిప్పటికిని దగియున్నది. పెనిచిన తల్లి, అక్కయ్య, బావగారు, వీరివీరిబంధువులు, వీయనువారు– నెటుచూచినను మున్నూఱుమంది సజ్జనులు పరిచయులైరి. పరిచయమేమి? అప్పటికి నిప్పటికి వారికి వీరికి నొక్కవిధమైన ప్రేమయే. కాశివెళ్లివచ్చినవారెవ్వరు గనఁబడినను గలకత్తాలో–మా...కనిపించినాఁడా యని యడుగనివా రెవ్వరు! చెల్లెంద్రయిండ్లలో నెంత మర్యాద! ప్రతివారికిని "మాయింటికిరావలదా, మాయింట భుజింపవలవ మముఁగనవలదా" యను పూర్వపద్యమునందలి యభిప్రాయముండుట వింతకాదు. వారువారుఁ గూడుకొనిన వేళావిశేషము. ఓవరుసీరుగా రీబీఱకాయపేఁచులోనివారేకదా! ఉత్తరదేశములోఁ గుమారుఁ డొక్కఁడు నున్నాఁడు. క్రొత్తగాఁ గోడలునుగూడఁ బంపించినారు. ఇక్కడ వీరికే తోఁచుటలేదు: మారదేశమే, క్రొత్తతావే, యెట్లు గడపుదురోయని–ఎక్కడి వారి కక్కడ సరిపడునుగాని వారికుండఁబట్టలేదు. ఒకనాఁ డెదురుపడినపుడు – 'నీ వొక్కసారి రామమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జూచిరాఁగలవా? నా కిక్కడ సెలవులేదు. మీయత్తగారొంటిగా వెళ్లుటకుఁ జాలదు. వెళ్లిన నా కీయుద్యోగమున కనుకూలము గాదు. ప్రస్తుతము కొన్ని నాళ్లు నీకు సెలవిమ్మని మీయజమానుల నడిగెదను. టిక్కెట్టు కొని యిచ్చెదను. రామునకుఁ దంతికొట్టెదను. సిద్ధముగా వచ్చి స్టేషనునుండి నిను దీసికొని వెళ్లు'నని పలికిరి. 'దీని కేమి! వెళ్లివచ్చెద'నని సమ్మతించిరి. ఏదూరదేశమైనను నాల్గింగ్లీషుముక్కలు వచ్చునుగదా, కథ గడచిపోవును; వెళ్లినారు. పదిదినము లక్కడ నున్నారు. రామముగారు పరీక్షయైన పిమ్మట నాగపురమునే క్రొత్తరైలు- ప్రాంతరైలుమార్గములమీఁద నుద్యోగమునఁ బ్రవేశించిరి. దినము నొక్కవైపునకుఁ దమతోఁగూడఁ బనులలోనికిఁ దీసికొనిపోవుచుండిరి. ఆజనులు- వేషము- భాష- పనులు చూచినకొలఁది వీరికిఁ గొన్నినాళ్లాదేశములో నుండవలయునను నుద్దేశము కలిగినది. ఉండవచ్చును వారియింట నేఁడాదియున్నను బెంగలేదుగాని, యూరకయే యుండుటలో స్వారస్యము లేదు. 'ఎట్లురా దైవమా!' యని యోంచుచుండిరి.

ఆష్‌బాబు, సర్కారుబాబు నని యిద్ద ఱన్నదమ్ములు. నూతనమార్గములను వేయించుటకుఁ గుత్తగొనువారు. వారిచేతిక్రింద ననేక దేశముల కూలివాండ్రు పనిచేయుచున్నారు. తెలుఁగుకూలిపనివాండ్రును బెక్కురుగలరు. వీరియందఱకుఁ బనులు చెప్పుటకుఁ, జేయించుటకు, వచ్చినవారు రానివారిని బద్దువ్రాసికొనుటకుఁ దక్కినదేశపు కూలివాండ్రవిమీఁదనువలెఁ దెనుఁగువారిమీఁది కొక్కరు కావలసివచ్చెను. కూలివాండ్రలోని యొక్కని నూతనిఁ బెట్టిరిగాని సమర్థతచాలదు. ప్రస్తావనలో రామముగారికిది తెలిసినది. బాబూలతో మాటలాడినపుడు వారే యీ కొదవను జెప్పిరి. "కొన్నినాళ్లీపనిలో నుండరాదా, మీయుప్పుకేటి వంతెనలమీఁదవలె నిచట నీతోఁ బలుకరించువారు లేరా,'యక్కడి మీకుటీరనిలయంబులను నరిరాక పోయెనే యిక్కడి రత్నకందరములు'"- అని నవ్వుచు రామముగా రనిరి. రోగియుఁ బాలేకోరెను, వైద్యుఁడును బాలే పథ్యముచెప్పెనుగదా - మామయత్తమామలకు బెంగలేదు. చాలనాళ్లనుండి వారితో నుండుటలేదు గనుక - కాకినాడలో నున్నను, గలకత్తాలో నున్నను వారికిసమానమే. అందఱు నంగీకరించిరనుఁడు. బాబుల చేతిక్రిందఁ బనికొప్పుకొనిరి. బాబులు బంగాలీవారు. దేశభాషయగు హిందీ వారికి మంచినీళ్లప్రాయము. ఇంగ్లీషు సాధారణముగావచ్చును. నేనువినియుంటిని- చెన్నరాజధానిలోని విద్యాతిశయమునకుఁ గలకత్తారాజధాని విద్య చాలదట- మనవారు బొట్లేరింగ్లీషని నవ్వుచుండువారు గదా! అదియే యిప్పుడు తారసిల్లినది. ఈయనమాత్రము- ఒకబడిలోఁ జదివెనా, యొక్కపరీక్ష యిచ్చెనా- అంతయును స్వయంకృషియే - వారివలన వారివలన గ్రహించినదే- అయిననేమి - తాత్కాలికవ్యవహారజ్ఞానమునది లభించినది. మఱియు నిప్పటివలెఁ గాదపుడు. ఇంత నిర్బంధము లేదు. అందులో నెన్నిమార్కు లిందులో నెన్నియని యడుగరు. కవిలెకట్టలవలెఁ బుస్తకములు పట్టుకొనివెళ్లి చూపనక్కఱలేదు. వ్యవహారసరళి నెఱిఁగి కార్యము నడపినంజాలును. ఎక్కడనైనను బి. ఎ. చదివి యుద్యోగములోఁ జేరఁబడిన నీపదు వొక్కపాఠశాలలోఁదప్ప నితరస్థలముల నుద్యోగమునకుఁ బనికిరాదు. ఇతరమునకుఁ దగినవనువునకు మరల నక్షరాభ్యాసము చేయవలసినదే కద!

ఎటుచూచిన నిరువదిమైళ్లదూరములో నెంతలేదనిన నుబదివందలమంది తెనుఁగుకూలిపనివాండ్రు గలరు. వారందఱు వీరిచేతిక్రిందికి వచ్చిరి. అందఱిలోఁ జుట్టఱికము. 'మీదేయూరు మీదేయూ'రని తెలిసికొని- 'మీయూరనాతఁడు బాగుగానున్నాఁడా- మీయింటిపే రెవ్వరు- అల్లయూరిలోనివాఁడు నీకుఁజుట్టమా'- అని యొక్కొక్కరి గుట్టుమట్లు తెలిసికొనుచు వారి కుత్సాహకారి వాక్యములు చెప్పుచుఁ బనిచేయుచుండిరి. 'కాకిసరబాసర వదలినది. మనమాటతెలిసినవా రొక్కరు మనజట్టుకుఁ దలవరి దొరకినాఁ'డని కూలివాండ్ర కానందము. వాండ్రకుఁగల లోపములన్నియుఁ దెలిసికొని వీరు బాబూలతోఁజెప్పుట- వారివలన సహాయముచేయించుట- బాబూలకుఁ బ్రేమపాత్రమగుట- ఇవి వీరి ముఖ్యోద్దేశములు. ముఖవిశేషమో యేమో చూచినవారెల్ల వీరికిఁ బ్రియులగుట మొట్టమొదటినుండియుఁ గలదు. తిష్ఠకుదిరినది, నిష్ఠకుదిరినది. నెలకింతని బాబూలు జీతమిచ్చువారు. దానిని రామముగారి చేతికిచ్చువారు. ఆయనదాని నన్ని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

హోత్రమువలెఁ బవిత్రముగాఁ జూచి భద్రపఱిచిరి. ఏమని చెప్పవచ్చును! ఎట్లు దీనిసందర్భము! ఎట్లయిన దానిలో నుండి కొంచెము నాక్రింద వ్యయపెట్టుచుండుఁడనిచెప్పిన వారికేమియర్థమగునో-ధర్మసందేహము. వారికిదియొక్క-లెక్క-లోనిదేకాదు. కొంతమొత్తముచేసి వారే మా యత్తమామలకు బంపివేయుచుండువారు. అపుడేమన వచ్చును? మాటలాడఁగూడదు. నీమాజామా వీరికి వేషము ముదిరినది. ఇతరదేశపుఁ బనివాండ్ర తలవాఁడు కూలివాండ్రయొద్దనుండి రూపాయ కింతని రుసుము తీయుచుండు వాఁడు. తెనుఁగుపనివాండ్రాయలవాటు చొప్పున నీయఁ బోయిన- 'ఛీఛీ, ఇట్టిపనికూడదు. నెత్తి మండించుకొని కష్టపడి మట్టికొట్టుకొని రాళ్లుదప్పలుదొఁగించి గడించు కొన్నడబ్బు-నీడపట్టునఁగూర్చుండి కష్టపెత్తనము చేయు నేను బుచ్చుకొనను. నాకును గొంతవచ్చుచున్నది. అదియే నా లెక్క-వ-' అని వారికి సంతోషము గలిగించుటయే కాదు; తక్కిన తలవరులకు బోధింపసాగిరి. ధనమే ముఖ్యోద్దేశముగావచ్చినవారుగావున వారువినినట్లు వినని యట్లు నటించిరిగాని - కొందఱు దారిలోనికివచ్చిరి. కొందఱు పుచ్చుకొనుదానిని దగ్గించుకొనిరి. కేవలము మానిపించుటకు వీలులేకపోయినది. వీరికేమి, యిచ్చువా రిచ్చుచున్నారు. పుచ్చుకొనువారు పుచ్చుకొనుచున్నారు. ఇచ్చుట పుచ్చుకొనువారు నేర్చిరి.

కొంతభాగము మార్గము పూర్తియైనది. క్రొత్త క్రొత్త స్టేషనులు నిర్మించిరి. క్రొత్తక్రొత్త మేస్త్రులను బనివాండ్రను నియమించుటకూడ జరగినది. బాబూ లిద్ద ఱకు లాభము గలిగినది. వారి కుత్సాహముగా నున్నం దున వేఱుపని గుత్తగొను సమయములోఁ దమక్రింది వారికి బహుమానము లిచ్చిరి. వీరికి నీయఁబోయిరి. 'నా కీబహుమానము వలదు. తమరును రామముగారును దొర లతోఁజెప్పి యేదోయొక స్టేషనులోఁ బని చెప్పించిన-తొలుత నెంతటి చిన్నస్టేషనులో నైనను సరియే-అదియే నాకు బహుమానము.' అని వీరు చెప్పికోరిరి. 'పండిత్ జీ, యీలైనులో మంచియూళ్లు లేవు; పట్టణములు లేవు. కొన్నినాళ్లు మాతో నుండుము. సమయముచూచి నీకు మంచిపని చేయించెదమని బాబూలు సమాధానపఱచి వారికిఁగల మఱియొకపనిలోఁ బెట్టిరి. దీనికి దానికి సంబం ధము లేదని - నలువురతోపాటు బహుమానముగూడ నిచ్చిరి. దానిలోఁ గొంత నాకేమైనఁ జేయించిపెట్టుఁడని మా నాయనగారియొద్దకుఁ బంపించిరి. నాకు బాలతొడు గంతగా లేదు. అత్తవారు పెట్టినదియుఁ దక్కు-వయే. ఈహారమొక్క-టి యెన్నఁటికిని వదులు బిగువుగానిదని యూసొమ్ముతో మాయమ్మ చేయించినది. నేనడిగితినా, మావారడిగిరా, తల్లిదండ్రులు బోధించిరా- ఏమియును లేదు. మూఁడేండ్లది కానిమ్ము, ముప్పదియేండ్లది కానిమ్ము 'నాది, నాభార్య' యనునభిమాన మెప్పుడుపుట్టినదో యపు డొకరు చెప్పనక్క-అలేదు. చెప్పినఁ బుట్టునదియా యీ తలంపు? తలంపున్నంతనే-రామిలేనినాఁ డొడఁగూడునా, కాలము రావలయును మాయింటి కుత్తరము వ్రాయు చుండువారు. దానిలో- 'నేను మీదయవలన నిన్నిదెలలు పనిచేయఁగా నిన్నిరూపాయలు దొరకినవి. ఇంతమంది స్నేహితులైరి. దేశమిట్లుండును; భాషయిట్టిది. జన హృదయములు మంచివి. ఆదరణమెక్కు-'డని తెల్పుచుండు టచే నా కింతప్పటినుండి దేశము చూడవలయునని కోర్కి-యుదయించెడిది. దానికిఁ గాలము రావలయును. నడుమ నడుమ, 'లక్ష్మిదేవి, గౌరిదేవి క్షేమముగా నున్నవైనము వ్రాయఁగోరెదను. ఎవ్వరైన నీప్రాంతమునకు వచ్చువా రున్న వారితో వారిద్దఱ నొక్క-సారి యీప్రాంతమునకుఁ బంపుఁడు; సొమ్ముపంపెద'నని, నన్ను మనస్సులోఁ బెట్టు కొని యుటంకించువారు. 'లక్ష్మినిగాని, గౌరినిగాని నీ భార్యను బంపునపుడే పంపవలయునుగాని యితరులతోఁ బంపఁజాల'మని యోగక్షేమములు తెల్పుచు బదులు వ్రాయువారు. అదిగోనని యా కాలమును సమీపించినది.

ఆగరాపారా కలకత్తాకుఁ గొన్నిమైళ్ల దూరము లోనున్న చిన్నస్టేషను. పేరునకుఁ జిన్నస్టేషనే - పని మాత్రము పెద్దస్టేషనులోకంటెఁ బెద్ద-అందులో నెక్కు-డుపని సి. కె. సేనుగారిది. వారు పెద్దప్రసిద్ధాయుర్వేద వైద్యులు. కలకత్తాలో వారినివాసము. చంద్రకిశోర సేనుగా రాయుర్వేదములో నిధి. ఆకాలములో వారి నెఱుఁగనివారు లేరు. వారిచే నేసఁబడఁగెన మొట్టమొదటి తలనూనె జపాకుసుమతైలము. కలకత్తా పెద్దనగర మగు టచే సేనుగారికి వైద్యమున నుపయోగించు వెన్న, పాలు, తేనె, వనమూలికలు దొరకుట. అప్పుడుదొరకుట దుర్లభ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మయ్యెను. దానికని ఆగరాపారాలో నొక్క పెద్దభూమి కొని, దానిలో నిండ్లుకట్టి, బీళ్లు, పచ్చిక పెంచి, కామధేనువులవంటి కొన్ని యావులను, గేదెలను, మేకలను బెంచిరి. దానికిఁ దగిన పనివాండ్రను-వైద్యమునకుఁ గావలసిన మూలికలు-వృక్షములు నాటించి పెంచిరి. శాస్త్రవిధిగా వైద్యాలయము నిర్మించిరి. అనేకవిధములైన కాసారములు, ఫలవృక్షములు, పుష్పవృక్షములు, గుల్మములు-కొలనులలో శతపత్రములు, సహస్రపత్రములు, వివిధములైన కలువలు, పద్మములమండలములు-వాని కందములు, తూండ్లు, పుష్పమధువు, కదళీమధువు, పద్మమధువులు- తీఁగలను బెంచి తటాకతటవృక్షములలోఁ దేనెపట్లు పట్టించువారు. అనుదినము వారిపుత్త్రిలు, పనివాండ్రు ఆగరాపారాస్టేషనుకుఁ బెద్దపని కల్పింతురు. ఆస్టేషను మిగులఁ బెద్దదియుఁ గాదు, చిన్నదియుఁ గాదు. మా యనుభవమునకుఁ దగినట్లే యున్నది యనవచ్చును. అందులో నొక్క టిక్కట్లమేష్టరుపని బాబూజు వేయించిరి. మా పండిత్‌జీగారును గొంతెనయుఁ దగినవారి సావాసమున నా పనికై యత్నించుమన్నవారగుట మొదటినుండియుఁ గొంతకొంత పరిశ్రమ చేయుచున్నవారు- కావున ముందే కొన్ని బందుకట్లు నేర్చికొనిరి. టిక్కట్లిచ్చుపని, పుచ్చుకొనుపని యితరమైన తీఁగటపా మొదలైనపనులవలె నెల్లకాలము నుండుపని కాదు. టెలిఫోనుకు బదులుచెప్పుట - తీఁగటపామేష్టరు లేనియపుడు-ఏమని, యెవ్వరని, నిలువుమని యనుట నేర్చికొనిరి. వచ్చినమూటలు తూఁచుట, వెలలుకట్టుట-రసీదులిచ్చుట గ్రహించిరి. లైటింజనులు పోవునపుడు-ఆస్టేషనులో నిలువకుండఁబోవు రైళ్లు వచ్చునపుడుఁ బెద్దమేష్టరుగారు లేకపోయినను బనివాండ్రను వెంటఁ బెట్టుకొని ముందుస్టేషనుకుఁ దెలియఁబఱుచుట, తాళము పుచ్చుకొనుట యిచ్చుట, యిట్టివి పెద్దవారియనుమతిపై జరిపించుచుండువారు.

హృదయమున దయగలదు; పెంకితనము లేదు. దయతో న్యాయసామ్యము పుట్టును. తమస్టేషనులో రైలెక్కువారికి న్యాయముగాఁ బెట్టెలు బరువులు తూఁచి, సరియైనసొమ్ము పుచ్చుకొని రైలెక్కించువారు. ఇతరస్థలములనుండి వచ్చిదిగినవారిని 'నీపెట్టె నాకనుమానముగానున్నది. బరువెక్కువయుండును. నేను మరలఁ దూఁచెద'నని బెదరింపక-నిర్బంధపెట్టక-లోపములున్నను గరుణించి వదలుచు- డబ్బులేనివారిని తలమీఁదిగుడ్డ యక్కడఁ బెట్టుమనక- మొదటనే హృదయము మెత్తనిది- సరకారుసొమ్ము పోఁగొట్టుట కిష్టపడక-బహుచమత్కారముగా మెలఁగఁజొచ్చిరి. తమపనిలో లోపము లేకుండ-నితరస్థలములలో జరిగిన లోపము లిక్కడ బైలుపడినను-ఇతరులలోపములు బైలుపఱచి మాట తెప్పించుట కిష్టము లేక-కొన్నిలోపములను గరుణచే వదలి, యెఱిఁగిన యెట్టివానికైన టికట్టుకనకు లోనికివచ్చిన నిచ్చి యెఱుఁగని నాఁ డెంతటిఘనుఁడైన నావలినుండి యడుగుమనక - ఎఱుఁగక లోనికివచ్చినవారికిఁ గావలసిన ప్రత్యుత్తరమిచ్చువారు. 'మూఁడేండ్లేమి యీబిడ్డకై డెండ్లున్నవే; అంటిక్కట్టు కావలయును'- ఇట్టి బిభీషికలాయనయొద్ద లేవు. దేనిలోఁ బ్రవేశించిన దానియందు మంచిపేరు కొనుటకే ప్రయత్నముచేయువారు. కావుననే యచిరకాలములోనే యక్కడనే మేష్టరు పదవి లభించినది.

రెండుమూఁడునాళ్ల కొకసారి, చంద్రకిశోరసేనుగారి పుత్త్రిలు, దేవేంద్రనాథసేనుగారో, ఉపేంద్రనాథసేనుగారో వచ్చువారు, పోవువారు-చాలసేపుస్టేషనులోనుండువారు. దీనిచే వారితో మైత్రి యలవడినది. 'మీ దేదేశము, జిల్లాయేది, వారి నెఱుఁగుదురా, వీరిని దెలియునా- కాకినాడ యెన్నఁడైన వెళ్లినారా- రాజమహేంద్రవరములోఁ బెద్దన్యాయవాదుల పేళ్లేమి. వారిలో నెవ్వరితోనైనఁ బరిచయమున్నదా' యని వారడుగువారు. ఈయనచేసిన సహవాసము పెద్దపెద్దవారితో-సాధారణముగా నెఱుఁగని వారేలేరు. ఏదో యొకప్రసంగములోఁ దమ పరిపాలనలో నొకయింగ్లీషు దినపత్రిక యుండినట్లును, దానికి నాయాసమయములలోఁ బ్రకటించుట కాంధ్రదేశమునఁగల ప్రసిద్ధపురుషులు, జమీందారులు, వర్తకులు, దేశసేవాపరులు, న్యాయవాదులు, పండితులు నిట్టివారి ఛాయాపటములు కావలసియుండుననియు సేనుగారు చెప్పిరి. వీరెఱుఁగని ఫోటోగ్రాఫరులు లేరు, వీరెఱుఁగని చరిత్రములు లేవు. కాఁబట్టి యెవ్వరిపేరనో వ్రాసి యొక్కరిపటము దెప్పించి తామెఱిఁగియున్న స్నేహితునకు వ్రాసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రసిద్ధపురుషుల జీవితచరిత్రము వ్రాయించి తెప్పించి వారికిఁ గొంతసహాయమును స్టేషనులోఁ గూర్చుండియే వీరుచేయుచుండువారు. మాయింట నేను వచ్చునప్పటి కెన్నియో జపాకుసుమ తైలములును, సుదర్శనచూర్ణములును,దశనకాంతిచూర్ణము డబ్బాలుఁ గలవు.ఒకప్పుడు ప్రసంగములో 'మాయౌషధములు మీ దేశములోఁ బ్రచారమునకుఁ దెచ్చి యమ్మిపెట్టువారి నెవ్వరినైన నమ్మకమైనవారి నొక్కరిం జూడరాదా'యని నేనుగారు కోరిరి. 'కావలసినంతమందియున్నారు. మావాఁడే శంకర దీక్షితులని యున్నాఁడు.పిఠాపురములోఁ గొట్టుపెట్టించి చుట్టుప్రక్కలయూళ్లలో నమ్మించెద'నని చెప్పిరి. 'ఆతని వలన మీకు సందేహమక్కఱలేదు. అంతయును నేనే పూటకాఁపును. కేవలము నాపేరుననుండిన నాయుద్యోగమున కాటంకమని దీక్షితులు పేరుపెట్టించుచున్నా'నని చెప్పి కొన్నిమందులు పిఠాపురములోనుండి విక్రయించునట్లు చేసెను. రాకపోకలు రైలుసొమ్ము నేనుగారే పెట్టుకొని, నూటికిరువదియైదువంతున నమ్మినదానిపై దీక్షితునకు ముట్టులాగున నేర్పాటయినది. రూపాయకేదైన నమ్మిన నాలుగణాలు తీసికొనుటయే. ఎంతలేదనినను నెలకుఁ గాలిమీఁదఁ గాలునైచుకొనికూర్చుండి యిరువది ముప్పది రూపాయలు గడించుచుండెను. లెక్కలు చక్కఁగావ్రాసి యిన్ని వ్యయమైనవి, యిన్ని నిలువ యున్నవి, యింతసొమ్ము వచ్చినది, యింతపుచ్చుకొంటి, నింతే పంపితి ననియు, నీయామందులు లేవు, వానిని బంప వలయు ననియుఁ దెనుఁగులోనే వ్రాసిపంపిన నవి మీ రెప్పటికప్పుడు తర్జుమాచేసి వారికప్పగించువారు. డబ్బు దొరకుచున్నకొలఁది దీక్షితులు శ్రద్ధయెక్కువయి ప్రతి వారికి బోధించి యౌషధములు తలనూనెలు విక్రయించి యుత్సాహముతో నుండెను. ఈ విధముగా నూరక కూర్చున్న దీక్షితు నొకవ్యాపారిం జేసి పదిమందిలో నడయాడఁగాఁజేసిరి. నేనుగారేఁటేఁట దీక్షితులు పేరు మీఁద క్యాలండరులు, డైరీలునచ్చువేసి పిఠాపురము పంపుచుండువారు. తారీఖుల క్యాలండరులు, డైరీలు కావలసినవా రూరకయే వానిం బంచిపెట్టుచున్నను మర్యాదకుగా నేదోయొక్కబుడ్డి కొనుటయు, నొక్కతేదులక్యాలండరు పుచ్చుకొనుటయు-సరసులు, రసికులు, సుందరామణీ-జపాకుసుమతైలములు నెలనెలవాడుకలు-బుడ్డిచెల్లఁగాఁబుడ్డి - పల్లెటూళ్లలోను గాకినాడ మున్నగు పట్టణములలోను దీక్షితు లొక్కఁడే వీరి యౌషధముల విక్రయించువాఁడు. మఱి యితరులకు నేనుగారు పంపుమన్నను బంపరు. కాఁబట్టి రుచియెఱిఁగిన చిల్లరవర్తకులు దీక్షితులుదగ్గఱ నౌషధములుకొని మాఱుబేరమున కమ్ముకొనఁజొచ్చిరి. చిన్నచిన్నవైద్యులు వాసారిష్ట, సువర్ణకషాయము, చందనాసవము, కల్యాణవటి, మొదలైనవి కొనిపోయి రోగుల కుపయోగించి లాభము పొందుచుండిరి. గౌరి, శంకరదీక్షితులు పిఠాపురములో నెక్కుడు నాళ్లు నివాసముచేయవలసివచ్చినది. గౌరి చిన్నతనములో నున్నదేకావునఁ జుట్టములు పక్కలు మెండుకొనిరి. హాయిగాఁ గుక్కుటేశ్వరునిదయచే వారన్నటుఁ గాలము గడుపుచుండిరి.

నేనుగారికి మావారియందు మైత్రి మెండైనది. అదియని యిదియని వలసన్నను నేదో కొంతవర్తకసులే మీఁద ముట్టఁజెప్పుచుండువారు. ఒంటరిగా నున్నపుడు మీ రదియంతయుఁ దండ్రిగారికిఁ బంపివైచుచుండిరి. మంచికి మంచిలోనే స్నేహితులు, విరోధులు నుందురు. చెడ్డకుఁ జెడ్డలోనే స్నేహితులు, విరోధులు నుందురు. ఎవ్వరిగుణము వారు కనఁబఱచుకొనుచుందురు. నైజగుణమునకును గ్రుడ్డికంటికిని మందులేదు. కాని యేకాలమందైనను సత్యము, న్యాయము బలిష్ఠములు నక్రమములచేఁ గప్పఁబడినను దానిగౌరవము నెప్పటికైన నిలుపుకొనును గాని మానదు. జ్ఞాపకము నుంచుకొనుఁడు. దీనిప్రసంగము ముందు గావించెదను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కుబ్జ - ఉత్కంఠ

బళ్లారి కృష్ణప్పగారు

గగనసీమంతినీమణి కైరవాప్తు-రాకఁ గోరుచుఁ బువ్వుల కోకఁ గట్టి
నిలిచెనో నాఁగఁ జుక్కలు నిండిపోయె-మదనకేళికిఁ బైకొను మాయలాఁడి
కన్నుఁగవ చెల్వమో యనఁ గలువలేమ-నగవు దళుకొత్త మోమెత్తి మగనిఁ గాంచెఁ
గన్నుఁగానక తెమ్మెర పిన్నవాఁడు-పూలతావులు వెదఁజల్లి మేలమాడె
నించువిలు పూని రతిరాజు సంచరించెఁ-గడచె నొకజాము జనరవం బుడిగె నకట!
ఉగ్రసేనుని యాజ్ఞ మహోగ్రమనఁగ-గుండుమ్రోఁగెను ఢామ్మని కోటమీఁద
"మరువ"నని పల్కి పోయిన మాయకాఁడు-తడయఁ బనియేమొ? నాయింటి దారి తప్పి
వాడవాడలు తిరిగెనో, మేడలందుఁ-గుసుమ శయ్యలు వెదకెనో, కుబ్జకొఱకు?

క. మధురాపుర వైభవములన్-మధురాధరలన్ మనోజ్ఞమందిరవనులన్
మధురస్వర కీరములన్-మధుదమనుఁడు గాంచి కాంచి మఱచెనో మరలన్?

ఉ. గోపనితంబినీవిభుని కోమలదేహము సోఁక గొబ్బునన్
దీపితమయ్యెనా చెలువు దివ్యమృగాక్షులకన్న నవ్యమై
కాపురమయ్యె నాగృహము కామితదాయికి భాగ్యదేవికిన్
బాపురె! యమ్మహామహునిఁ బట్టి పెనంగిన జన్మమున్నదే!

ఉ. శ్రీరమణీయమై దివిజసేవితమై వివిధార్థసద్మమై
భూరిమనోజ్ఞమై భువనపోషణమై కరుణాలవాలమై
కారణజన్మమై వెలయు కంజదళాక్షుని దివ్యకాయమున్
సారెకుఁ గౌఁగిలించి రతిసల్పినబోటికి నాకమేటికిన్?

ఉ. కన్నులపండువై కుసుమకాండునిదాడికి రాజమార్గమై
యున్నతమై నభోరమణి యుర్వికిఁ జిల్కిన గంధసారమై
వెన్నెల నిండిపోయెఁ గడు వేదనలొందుచు డాఁగెఁ జీఁకటుల్
బన్నమునొందెఁ దామరలు పర్విడె నాయెద నున్నకోరికల్
తిన్నఁగఁ బ్రాఁకెఁ గాక యిఁక దేహము నిల్చునె? రాగదే హరీ!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. హరినీలద్యుతిసంచయంబులను మాయల్ జేయు దేహంబుతోఁ
శరదిందుప్రభలన్ మఱల్చు దరహాసం బొల్పు నెమ్మోముతోఁ
నరవిందంబుల డాలు డీలుపడఁ జేయన్ వెల్గు కందోయితోఁ
విరిదండల్ నటియింపఁ దీవ్రగతులన్ వెన్నుండు రాకున్నచోఁ
దరమే గెల్వ శశాంకునిన్ రతికళాతత్త్వజ్ఞమీనాంకునిన్?

సీ. నామగోత్రము విని నయన మల్లార్చిన సోయగం బెచ్చటఁ జొనిపినావు?
గంధంబు గైకొని కనులెత్తి చూచిన విన్నాణ మెక్కడ వీడినావు?
తావి కానందించి తలయూఁచి మెచ్చిన తాత్పర్య మెచ్చోటఁ దాఁచినావు?
మూఁడుడొంకలు దిద్ది ముచ్చటలాడిన మన్మార్థ మెందుకో మఱచినావు?
ఉన్నచేష్టలెల్ల నొప్పుగాఁ బరికించి-కపటకృత్యములను గౌరవించి
నిన్నుఁ గలసి మెలసి యెన్నండు పుట్టని నగరమందు నుందు నిగమవినుత!

సీ. ఆశించె నని యెంచి యరయఁగాఁ బొంచితో కౌఁగి లిమ్మనుటకుఁ గాదుకాదు
ప్రేమించె నని యెంచి పెడత్రోవఁ బట్టితో గానంబు వినుటకుఁ గాదుకాదు
మోహించె నని యెంచి మూలల డాఁగితో కలికిసేఁతలు సేయఁ గాదుకాదు
కామించె నని యెంచి కానరావైతివో కందర్పకేళికిఁ గాదుకాదు
కనకపీఠంబునం దుంచి గంధ మలఁది-పుష్పహారంబు లర్పించి పూజసేసి
పరమవైకుంఠపురమున కరుగఁగోరి-వేఁడుచున్నాను శ్రీకృష్ణ! వేగ రమ్ము.

---

# చంద్రోదయము

జి. జాషువకవి గారు

కడలిరాయని మేలికడుపున జన్మించి సిరితోడఁ బెరిగిన చిన్నవాఁడు
నళిననాభుని పెండ్లినాఁడు సోదరి నవ్వఁ బాదాలు గడిగిన బావమఱఁది
పండువెన్నెలఁ జిమ్మి పైరులు పండించి ధరణికన్నముఁ బెట్టు ధర్మరాజు
రక్తసంబంధంబు రవ్వంత లేకున్న మానవావళికెల్ల మామగారు
కులట లెంతెంతగాఁ దిట్టుకొనుచు నున్నఁ-జింత కాసంత నందని శాంతమూర్తి
జింకపిల్లను ప్రియమారఁ జంకఁ బెట్టి-పొడుపుఁ గొండల కెక్కె వెన్నెలమగండు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# పద్మాక్షి

శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు

౧

శారదాశ్రమమున నుండు విద్యార్థు లందఱిలో ప్రద్యుమ్నుఁడే మిగుల తెలివి కలవాఁడును, మిగుల దరిద్రుఁడును.

ప్రద్యుమ్నుని తండ్రి ప్రమోదుఁడు మహాతపస్వి. అతఁడు తపస్సుచేయని క్షేత్రమే లేదు. అతఁడు భారద్వాజాశ్రమమునఁ బండ్రెండేండ్లు తపస్సుచేసి వచ్చినపిదప కలుగఁబట్టి ప్రద్యుమ్నుఁ డింత మేధావియైనాఁ డని విద్యార్థులు వివిధవిధముల చెప్పికొందురు.

కాసంత కటికనేలయేని లేకపోవుటయే ఆయింట ఆఁడువారివద్దనుండియు అంబుభక్షణ, పర్ణభక్షణ పూర్వమగు తపస్సుచేయుటకు హేతువని తీవ్రవిమర్శకులు వాదించినను, కొంత ఆఁకటితపస్సుక్రింద విలియాపడినను, కొంత యథార్థము కాకపోదని పలువురనుకొందురు. వారిశరీరములు చూచుచో అంతయు యథార్థమేయని యందఱును ఒప్పుకొందురు.

ప్రమోదునకిపు డెనుబదియేండ్లు. అతని భార్య ఆమోద కఱువదేండ్లు. ఆదంపతు లిపుడు భూప్రదక్షిణమునకు బయలుదేఱఁ దలఁచుచున్నారు. అట్టి ప్రదక్షిణములు ఇదివఱకు రెండుమాఱులు అయినవి.

ప్రమోదునిలో పర్వతపు పవిత్రత, మఱ్ఱిచెట్టు రాచఱికము, ఉదయసూర్యుని తేజమును కలవు. దుర్వాసుని కోపము వీనికన్నిటికి మకుటముగా కలదు.

ప్రమోదునియందలి కోపము తీసివైచి యశోదాప్రేమ కలిపినచో నామోద యగును.

ప్రద్యుమ్నునకు విద్యాదీక్ష అయిపోయినది. అనఁగా వివాహమునకు పట్టా పుట్టినదన్నమాట. అతఁడు స్వగృహోన్ముఖుఁ డాయెను.

గురుకులమునుండి గృహోన్ముఖుఁడగు విద్యార్థి యానందమునకు మేరలేదు. అతఁడు తనకుటీరమున స్వర్గసుఖ మనుభవించును. జీవన్ముక్తునివలె సంచరించును.

మునిపల్లెలో ఆత్మారామునియిల్లు అతిథులకోసమే కట్టఁబడినదని అందఱు అనుకొందురు. అతనికూఁతు పద్మాక్షికి అతిథుల కర్ఘ్యపాద్యము లిచ్చుటతోడనే దినమంతయు సరి



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోవుచుండును. ప్రద్యుమ్నుఁ డాయూర నాఁగి వారిముంగిటికి వెళ్లువఱకు పద్మాక్షి పాద్య మిచ్చుట కెదురుగా వచ్చెను. పద్మా





క్షిని జూడ ప్రద్యుమ్ననకు రెండుకనులును చాలలేదు. తన యిచ్చినపాద్యము గ్రహింపక నిలువఁబడియున్న ప్రద్యుమ్నుఁడు పద్మాక్షికి కానఁబడుట లేదా? పద్మాక్షియు అతని వీక్షించుచున్నదా ?

తార్కికులు గాలి, ఆకాశము మొదలగు వానిని అమూర్తద్రవ్యములుగా పరిగణించిరి. పద్మాక్షిమతమున జగత్తంతయు అమూర్తమే. అద్వైతులుగూడ ఈశ్వరునకు రూపమున్న దని అంగీకరింతురు కాని పద్మాక్షి అంగీకరింపదు. ఆమె పుట్టుగ్రుడ్డి.

పద్మాక్షి చూచుచున్నదో లేదో కాని ప్రద్యుమ్నుఁడు గ్రుడ్డివానివలె లోక మూర యనున్నాఁడు. పద్మాక్షి మెలమెల్లగా లోని కేఁగెను. ప్రద్యుమ్నుని కపుడు కనులు వచ్చెను. అవి యపుడు అతని హృదయమునుండి అననుభూతపూర్వ మగు నొక తన్మయతను తోడుకొనివచ్చెను. అతనిమనస్సు చిగిరించెనో, లోపించెనో కాని అది యొకసుఖము, ఒక ఆవేదన, ఒక కాంతి, ఒక లబ్ధి, ఒక జన్మాంతరసంబంధము, ఒక అధునాతన ఘటన, ఒక లోపపూరణము, ఒక లోపము.

ఆత్మారాముఁ డగ్నిహోత్రగృహమునుండి వచ్చి, ప్రద్యుమ్ను నాదరించి, యతని కులగోత్రాదులు ప్రశ్నించి సమాధానము పడసెను. తన కుమారుఁడు శశిచే లోఁగడ పలుమాఱులు భోజన సమయములందు గురుకులమునందలి మేధావులలో అతి మేధావి యని ప్రశంసింపఁబడువాఁడు ఇతఁడే యని గ్రహించి, 'నీ నామధేయము ప్రద్యుమ్నుఁడు కాదా?' అని ప్రశ్నింపఁగా లోనియక్కజమును వెలువరింపక ప్రద్యుమ్నుఁ డగు ననెను.

ఇంటిలోనుండి శశి వచ్చెను. ప్రద్యుమ్నుఁ డతనిఁ జూచి 'మీ రెపుడు వచ్చితిరి?' అనెను. 'ఇదియే మాయూరు. మాయిల్లిదే' అని శశి తెల్పెను.'ఏమీ! తన్నిన పరుపుపైఁబడినటులు నేను సరిగా మీయూరే, విశేషించి మీయింటికే వచ్చితినే!' అని ప్రద్యుమ్నుఁడు పలికెను. 'మా యదృష్ట'మని శశి పలుకుచు 'దొడ్డిలో దిగుడుబావి యున్నది. ఇంక స్నానముచేయుఁ'

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

డని పండులు కోసికొని రా తోఁటలోని కేఁగెను. ప్రద్యుమ్ననకు దొడ్డిలోనికి దారి చూపి ఆత్మారాముఁడు అగ్నిహోత్రగృహములోని కేఁగెను.

ప్రద్యుమ్నుఁడు తరులతావితానపరివేష్టితమగు నా గృహోద్యానమున దిగుడు బావి కడ నిలుచుండి యింటిదెసఁ జూచుచుండెను.

ఓ ప్రథమప్రేమమా! నీవు ధన్యమవు! నీయందలి తన్మయత, శూన్యత - ఆవేదన,సుఖము-ఆశ, నైరాశ్యము లోనగు జంటలు గొలుసులవలె నెటులు కలిసియుండునో పిదప నెవఁడెఱుఁగును? ఆ ప్రథమాగ్నివలననే పదంటి వలపువత్తులన్నియు వెలిఁగింపఁబడుచున్నవి. నీవు ఆవేశించిన పిదపనే పురుషుఁడు పురుషుఁడు, ఆఁడుది ఆఁడుది. పిదప నిన్నందఱు స్మరించుకొందురుగాని నీవు గోచరింపవు. పూవెన్నిమాఱులయినను పూచుఁగాక! ఒకటే తావి. నీ తొలిపూఁదావికి పదపటి పూల తావికిని పోల్కియా?

ప్రద్యుమ్నున కాత్మారాముని యిల్లాలు ధాత్రి చేసిన గౌరవము అత్తగారుకూడ చేయఁజాలదు. ఆమె యతని విస్తరిలో నేతిగిన్నె జాఱ విడిచెను. శశి తెచ్చినపండ్లు పడఁద్రోసెను. ఇక్షురసము పోసెను. అతఁడును అల్లుని వలెనే అన్నింటిని కొంచెము కొంచెము రుచి చూచి మెక్కువ మెక్కువ పరిహరించెను.

శశి ప్రద్యుమ్ననకు పడుకొన శయ్యవైచెను. ఆశయ్యపై నతఁడు మేలుకనియే కలవరించుచుండెను.

గృహోద్యానమున రసాలముక్రింద కూరుచుండి పద్మాక్షి-'ఓ సూర్యభగవానుఁడా! నిన్నుపాసించు నాకు నీకిరణ మొకటిమాత్ర



మిమ్ము. ఒక్కసారి ప్రద్యుమ్నని తిలకించి నీకిరణమును మఱల నీ కిత్తును' అని మనస్సునం దనుకొనుచుండెను. ఒకానొక తేజోదేవత తనహస్తమెత్తి 'ఇచ్చెదను లెమ్ము, ఇచ్చెదను లెమ్ము'అని పలికినటులు ఆమె వినెను. పద్మాక్షి అచటినుండి మఱి కదలలేదు.

ప్రద్యుమ్నుఁ డచటినుండి ఒక అనిష్ట ప్రయాణము చేయఁవలసివచ్చెను. అతఁడు తన కొల్లాయను,అంతరీయమును, ఉత్తరీయమును,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఒక పుస్తకమును మూటకట్టుటకు అంతము కానరాలేదు. తుదకు పుస్తకము క్రిందమఱచి మూట సమాప్తిచేసెను.

## ౨

అతఁ డుదకము తెచ్చికొనన దిగుడుబావికి వెళ్లెను. గృహాంతర్భాగమున కేఁగి ధాత్రికడ సెలవందెను. ఆత్మారామునితో 'పోయివచ్చెదను' అని మనవి చేసెను. అతఁ డాగృహమంతయు వెదకి వెదకి శూన్యమునే గ్రహించి వెలుపటికి వచ్చెను. శశికూడ నడచుచుండెను. పదడుగులు వేసిన పిదప 'శశీ! పుస్తక మచట మఱచితిని' అనఁగా శశి యింటిలోని కేఁగెను. ప్రద్యుమ్నుఁ డాగృహారామము నంతయుఁ బరీక్షించుచుండఁగా ఎట్టెదుటనే గసాలము క్రింద తననే నిశితముగా నిరీక్షించు పద్మాక్షిని కనుఁగొనెను.

పద్మాక్షియొక్క దిదృక్షాసమాధి నిరవలంబ మాయెను. ఆమె కనులఁ జీల్చుకొని లోపలినుండి యొకజ్యోతి యుదయించెను. ఆజ్యోతిలో తజ్జ్యోతీరూపుఁడగు ప్రద్యుమ్నుని ఆమె కనుఁగొనెను. ఆమె కొక సర్వాంగీణమగు ఆనంద ముదయించెను. అపు డామెలోనుండి వేలకొలఁది రతీదేవతలు జనియించుచున్నటు లుండెను.

శశి 'ఇదిగో పుస్తకము!' అనుచు వచ్చి ముందు దారి తీయఁగా వెనుక వెనుక చూచికొనుచు ప్రద్యుమ్నుఁడు పోవుచుండెను. కొంతవడికి "శశీ!. 'ఆవనాంతా దోదకాంతాత్' అని రెండును అయినవి. ఇఁక నీ వుండుము" అనెను. శశి చాల ఉపచారవాక్యములు చెప్పి వెను దిరిగెను. ప్రద్యుమ్నుని శరీరము ముందఱికిని మనస్సు వెనుకకును ఒకతూరియే ప్రయాణము చేయుచుండెను.

## ౩

'మా ప్రద్యుమ్నునకు మీ పద్మాక్షి నీయ వలసిన'దని కోరుటకుఁగాను అన్వేషించు బ్రాహ్మణు లాత్మారామునిగృహము చేరుట కెన్నాళ్లో పట్టలేదు.

ఆత్మారాముఁ డామాట వినినతోడనే ముఖమును చిట్లించుకొని పిదప అంగీకారము తెలిపెను. పాపము! పద్మాక్షి గ్రుడ్డిదని యాతఁ డెఱిఁగియుండఁ డని ధాత్రి మనస్సునందు మిగుల ఆవేదన నొందెను.

ప్రద్యుమ్నుఁ డంపిన బ్రాహ్మణులు పద్మాక్షిసౌందర్యము ప్రద్యుమ్నునకు తగినదని సంతసించిరి. సౌందర్యము స్త్రీయందే పర్యవసన్నమైనయెడల అది పద్మాక్షియందే యని వారు నిర్ధారించుకొనిరి.

పద్మాక్షి పదచలనముచేసి యెఱుఁగదు. ఆమె కిల్లే జగత్తు. ఇంట నీఁగ వాలుచో నామెకు వినఁబడును. కుటీరముపై తాటియాకులలో ఏమాత్రము చప్పుడైనను దానికి కారణము కణుఁదుఁరీఁగయో, ఉడుతయో, నలికండ్లపామో ఆమె చెప్పివైచును. ఇపుడింట కొన్ని క్రొత్తపాదములు నడుచుట మాత్రమే కాక వా రేల వచ్చిరోకూడ ఆమెకు తెలియును.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పద్మాక్షి కనురెప్పలు మాత్రలువడి యుండవు. గ్రుడ్లు కాయలు కాయలేదు. ఆమె నియతమగు నిమీలనోన్మీలనతాళమును వేయుచుండును. కాని భోజనానంతరమున ఆబ్రాహ్మణులు ప్రద్యుమ్నుగుఱించి ఆత్మారామునితో చేయు ప్రసంగమును వినుచున్నపుడు పద్మాక్షిని చూచి నిజముగా గ్రుడ్డిదని చెప్పివేయవచ్చును. ఏలనఁగా ఆమెకనులు ప్రశాంతప్రాయములై చెవులలోనికి ముకుళించుకొని పోయినవి.

ఆత్మారాముఁడు వచ్చిన బ్రాహ్మణుల సత్కరించి వెంటఁబెట్టుకొని తోఁటలు,దొడ్లు, గిదులు, గహ్వరములు,పళ్లు,డొంకలు లోనగు ఆయూరిసౌందర్యమంతయుఁ జూపించెను. అద్దాన వారికి గ్రామమున మఱి యెవ్వరితోడను మాటలాడ వీలు చిక్కలేదు.

రాత్రి భోజనమగు పిదప ఆత్మారాముని రక్తబంధువులు నలువురును అరుదెంచిరి. తాంబూలములు పుచ్చుకొనిరి. లగ్నము నిర్ణయించిరి. తెలవారుజాముననే లేచి బ్రాహ్మణులు వెళ్లిపోయిరి.

ఈవివాహ మెటులు తుద నిగ్గునాయని యాత్మారాముఁడు వేదనపడఁ జొచ్చెను. ధాత్రికి గుండెలలో గుబులెత్తెను. శశవిషాణప్రాయముగా నున్నది శశికి.

పంచభూతముల గుణములలో నుండు సౌందర్యముతక్క వాని రూపసౌందర్య మెఱుఁగని పద్మాక్షి యిపుడు వారినీ వారినీ 'భూమి యెటులుండును? రూపము పొడుగా,పొట్టియా' అని యడుగుచుండెను. తోఁగడ భగవానునకు రూపము లేదనునామె యిపుడు రూప ముండును అని యనుచున్నది. గ్రుడ్డితనమునకు సౌందర్యము లేదన్నచో వివదించు నామె కిపుడదియు కొంచెము కొంచెము నచ్చినది.

దైన్యముతో తనకడకు వచ్చిన తల్లిని జూచి పద్మాక్షి—"అమ్మా! తీరవచ్చిన పెండ్లికొడుకు 'పెండ్లికొమార్త గ్రుడ్డి దని చెప్పక పోయితి' రేమని అల్లరిచేసి లేచిపోవునేమో! పెండ్లి కాకున్న నేమాయెె? ఈ యవమానము మీ రేల తెచ్చికొనవలయును? లోఁగడ తెలుపకున్నను ఇపుడేని వార్త నంపుఁ"డని ముదలకించెను.

ఆత్మారాముని కనులవెంట రెండు బాష్పబిందువు లురిలెను. కొంతవడి కతఁడు 'అమ్మా! అతఁడే నిన్ను కోరుకొనెను. పెండ్లికి వత్తుమని వారే చెప్పిపోయిరి. మన దేమి లోటు? ఆరెండునిమిషములు నీ వూరకుండుము' అనియెను.

౪

శశి తన రెండుచేతులతో పెండ్లిప్రయత్నమంతయు కావించెను. తనశిష్యులు సమిత్తులఁ దెచ్చిరి; నీవారము లెండఁబోసిరి; తోఁటలో కూరగాయలు, పండ్లు సిద్ధపఱచిరి.

తనకు తప్పక ప్రద్యుమ్నుఁడే భర్త కాఁగలఁడనువిశ్వాసమే వేయికన్నులుగా పద్మాక్షి తనలోఁ దా నానందించుకొనుచుండెను. ప్రద్యుమ్నునివలననే తనకు కనులు వచ్చునని యామె యేకసంకల్పము. కాని తాను గ్రుడ్డి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దని యతనికి తెలుపకుండుట తీఱని లోపమని యామె నిశ్చయించుకొనెను. ఆమె తండ్రిని బిలిచి చెప్పెనుగాని యతఁడు వెనుకటియటులే చాఁచివైచెను.

తన యంగవైకల్యము తలిదండ్రుల గుణములకుఁగూడ వైకల్య మాపాదించిన దని యామె గ్రహించినపు డామెమనస్సు ఉస్సురనిపోయెను. తలిదండ్రులకు తాను బరు వని తెలిసెను. ‘ఓ పరిత్యాగమా! నీవే నాకు తల్లివి, తండ్రివి. నేను నీ చిన్నారి పొన్నారి బిడ్డను’ అని దుఃఖించుచుండఁగా వీథిలో వేద పారాయణము వినఁబడెను.

ఆ వేదపారాయణము చేయువారు ప్రమోదుని శిష్యులు. వారుకాక పెండ్లివారు నలువురు: ఆమోదా ప్రమోద ప్రద్యుమ్నులు; నాలవవాఁడు పురోహితుఁడు.

లగ్న మాసన్నమాయెను. వధూవరులు మంగళస్నానము చేసిరి. వేదిక యలంకరింపఁబడెను. ముత్తైదువలు పూచిన తంగేడులవలె వేదిచుట్టు నిలువఁబడియుండిరి. గణాధిపతిపూజ యాయెను. కొంతవడికి వరునికడకు గంపలో వధువు తీసికొనిరాఁబడెను. ఆమెకనులు పద్మములవలె వికసించియుండెను.

ఆమె లేచి నిలువఁబడి ప్రద్యుమ్ననకు నమస్కరించి—“దేవా! నా విన్నప మాలింపవలయు. మీరు లోఁగడ తెలిసికొని యుండరు. నేను గ్రుడ్డిదానను; పుట్టుగ్రుడ్డిదానను; ప్రకృతియంత గ్రుడ్డిదానను. కాని దేవరయే నాకన్ను.” అనెను.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఏమిరా! ఓరి ఆత్మారాముఁడా! మమ్ము వంచింపఁదలఁచితివిరా! నీ కులమంతయు గ్రుడ్డి దయిపోవుఁగాక!" అని శపించుచు ప్రమోదుఁడు లేచెను.

'ఓసి నిర్భాగ్యురాలా! ఈ రెండు నిముసములు నోరు మూసికొని పడియుండక యేల నాగొంతుక కోసితి'వని లోపల ననుకొనుచు 'మీరందఱు చూచికొనిపోయి ఇపుడు తగవులాటయా?' అని ఆత్మారాముఁడు లేచెను.

"ఛీ ఛీ, మీ పిల్లయే 'మీరు లోఁగడ తెలిసికొనియుండు' రని చెప్పుచుండఁగా ఏల యసత్యము లాడెద"వని పండ్లుకొఱుకుచు "నీ వంశ మసత్య మగుఁగాక!" అని ప్రమోదుఁడు మఱల శపించెను.

ఆమోద ధాత్రిని చూచుచు లేచి నిలువఁబడెను. ధాత్రి తలవంచుకొని చేతులు పిసికికొనుచు కనులవెంట నీరుకాఱ అధోముఖియై కూరుచుండెను.

ప్రద్యుమ్నుఁడు నడుమ తెర తొలఁగించి పద్మాక్షిని చూచెను; ఆమె కనులు చూచెను; పద్మాక్షిని చూచెను. ఆమె యపు డతనికి కౌచుకంపుకొట్టు ముత్తైపుఁ జిప్పవలెఁ దోఁచెను.

"ఏమి? చూచుకొనుట అయినదా?" అని ప్రమోదుఁ డనెను. అతఁడు పేరునకు ప్రమోదుఁడుగాని అసలు ప్రకోపుఁడని ప్రద్యుమ్నుఁ డెఱుఁగకపోఁడు. అతఁ డాతెరను మెల్లగా జాఱవిడిచెను.

"ఇంక కూర్చుంటి వేమి? ఇంక నిలువఁబడితి వేమి? ఈగ్రామమున నుండ రాదు. వట్టి బూటకము, వట్టి పాడు. లేచి రా రేమి?" అనుచు ప్రమోదుఁడు వాకిటికి బయలుదేరెను. గ్రామవృద్ధు లతని శాంతింపఁజేయ నడ్డుపడిరి. వారి నందఱను పడఁద్రోక్కుకొనుచు ప్రమోదుఁడు పరశురాముఁడై పరిక్రమించెను. ప్రమదలు పతివర్త్మగలని విచేతనములచేఁ గూడ ప్రతిపన్నము కావున ఆమోద యతని ననుసరించెను. అటు ఇటు తోఁపక ప్రద్యుమ్నుఁడు వాకిటిలోని కొక్కొక్కయడుగే పెట్టుచు పద్మాక్షిని చూచుచుండెను. పురోహితుఁడు మాత్రము ఆఁడుపెండ్లివారికడ దక్షిణకుఁ గాఁబోలు, ఇంకను పీటనుండి కదలలేదు.

"ఏమిరా! పెండ్లికూఁతురు ప్రకృతియంత గ్రుడ్డిదగుచో నీవు పురుషునంత కుంటివా? సాంఖ్య మేడిచితివి కాఁబోలు!" అని ప్రమోదుఁడు కసిరికొట్టుచుండఁగా, 'అగును. పురుషునంత కుంటివానివలెనే యున్నాను.' అని లోపల ననుకొనుచు ప్రద్యుమ్నుఁడు ప్రమోదు ననుగమించెను.

"వెతికి వెతికి మంచిసంబంధము తెచ్చికొంటివి! మాకు కనులు పోయిన వనుకొంటివా, నీవే వెతికికొనుటకు?"అని ప్రమోదుఁడు కుమారు నొకచఱపు చఱవఁబోయి చేయి వెనుకకు తీసికొనెను.

ప్రద్యుమ్నునిమనస్సు మనస్సులో లేదు. దిగుడుబావిలో పెద్ద చప్పు డాయెను. 'పద్మాక్షి యేది? పద్మాక్షి యేది?' అని సంకులధ్వని యుదయించినది. ధాత్రి పెద్దపెట్టున ఏడ్వ మొదలిడెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

'మన మిచట నుండరాదు, మన మిచట నుండరాదు' అనుచు ప్రమోదుఁ డామోదా ప్రద్యుమ్నుల వెన్నున చేయివైచి ముందరికి నెట్టెను.

అపు డాగృహదేవత తన సహస్ర కంఠములతో ఉచ్చైస్స్వరముగా ఏడ్చెను.

ప్రద్యుమ్నుఁడు "నాయనా! నేను వివాహము చేసికొనఁ గుండఁజాలను." అని నిలువఁబడెను.

"ఓరి పిచ్చివాఁడా! ఆగ్రుడ్డిది పరలోకమున కనులు కుదుర్చుకొనఁ బోయిదినరా. మాటలాడకు! రా రా" అని ప్రమోదుఁడనెను.

౫

ఆ రేయి శ్మశానమున ప్రద్యుమ్నుఁడును, అతని హృదయమున పద్మాక్షియు కూరుచుండియుండిరి.

ప్రభాత మగునప్పటికు అచట ఒక శల్యమేని లేదు. అంతయు నుసినుసి యైపోయెనని శశియు, ధాత్రియు, ఆత్మారాముఁడును దుఃఖించిరి.

కొంత కాలమునకు ప్రద్యుమ్నుఁ డంధుఁడై తలిదండ్రులకుఁ గానిపించెను.



---

# జాగ్రత

వెలువోలు సీతారామయ్య చౌదరి గారు

(సారస్వతసమితి)

ఆర్యజన భూషితంబు, శుభాకరంబు,
వాసయోగ్యంబు రమ్యహర్మ్యం బటంచు
బైమెఱుంగులఁ గాంచి విభ్రాంతితోడ
నతిగభీరంబునై నిబిడాంధకార
బంధురంబగు ప్రాక్తనమందిరంబు
జ్ఞానలవదుర్విదగ్ధహా మానసమునఁ
జొచ్చినాడవు, జాగ్రతసుమ్ము పాంథ!
* * * * * *

గుండెనిబ్బర మేమైనఁ గుంటువడెనె
యేల విలపించె దెంతటి బేలవయ్య!
ధీరచిత్తుండవై భీతిఁ బారఁ ద్రోలి
విమలవిజ్ఞానదీపిక వెలుఁగఁ జేసి
తత్ ప్రభావాన నజ్ఞానతమము నడఁచి
స్వచ్ఛభావసంతోష సంభరిత హృదయ
మున నఖిలకామ్యఫలసిద్ధి ననుభవించి
సర్వ వేళల సుఖయాత్ర సలుపుమయ్య!
* * * * * * *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మిన్ను గ్రమ్మిన పున్నమచేయి



చిత్రకారుడు: శ్రీ యస్. శ్రీనివాసరావుగారు, బరంపురం.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# మా బావమరది పెళ్లి

మొక్కపాటి నరసింహశాస్త్రి [సాహితీసమితి]

నాకు పెళ్లి అంటే మహాచెడ్డసరదా. సరదాలోనూ కాస్తాకూస్తా కాదు. అందులో మొగపెళ్లివారితో తరలివెళ్లడమంటే ఇక వేరే చెప్పనక్కర్లేదు. విశేషించి ఇంటిఅల్లుణ్ణి; అందులో పెద్ద అల్లుణ్ణి. అయితే ఇంక అడిగారూ? ఏ అల్లుడైనా ఆడపెళ్లి అంటే కొంచెం చిక్కే మొత్తముమీద. ఇంటిల్లిపాదీ, ఆడవాళ్లూ మొగవాళ్లూ కూడా అటూయిటూ ఏదో పనులున్నట్టుగా పరుగులెత్తుతూ కేకలువేస్తూ ఉంటే అల్లుడికిమట్టుకు కూర్చోబుద్ధి అవుతుందా? నాబోటివాడు చూసీచూడనట్టుగా పరధ్యానంగా కుర్చీలో ఏమీ కలుగజేసుకోకుండా పడుకున్నా, మామగారు ఏపనికోసరమో కుర్చీలోవున్న మనిషిని కేకవేసి అర్ధనిమీలితనేత్రుడై ఇంతహడావిడిలోనూ, నిర్వికల్ప సమాధిలోనున్న మహామహుడు అల్లుడని తెలిసికోని మాట్లాడకుండా చక్కాపోయినా, వాళ్ల పుట్టిఅంతా మునిగిపోయినట్లు పైవాళ్లుమట్టుకు ఊరుకోరు. ఎందుకో అంటున అస్తమానమూ 'సత్యం, ఇలారా' అనీ, 'బావా, ఒకమాటు వంటపందిట్లో' అని ఒకడూ, 'అన్నగారూ, పందిట్లో యిలాయిబుడ్డీసంగతి చూడండి' అని ఒకరూ, 'ఏమోయ్ మామా' యిలా కూర్చుంటే ఏలాగు, భోగముమేళము ఇంకా రాలేదు.' అని ఒకరూ— ఇలాగుప్రాణాలు తీసివేస్తారు. వాళ్లంతా వీధిలోనుంచి దొడ్లోకి దొడ్లోనుంచి వీధిలోకి పరుగులెత్తడమేకాని చేసేపనేమీ కనబడదు. ఒకటి రెండు సార్లు చూసి వీళ్లతోటి బాధపడలేక వాళ్లకంటే ఎక్కువ తొందరగా ఎక్కడికో అక్కడికి పిలుపుకు అందకుండా పరుగెత్తుతుండేవాణ్ణి. ప్రస్తుతము ఆబాధఏమీ లేదు— మొగపెళ్లిగనక.

తెల్లవారితే స్నాతకము. బంధువులంతా వచ్చారు— అనగా ముఖ్యులొకరిద్దరు తప్ప. కావలసినసామానులన్నీ, బాజాసంచాసహా, వచ్చినవి. మర్నాడు ప్రయాణానికి సామాను సర్దుకోవడముతో పడుకునేటప్పటికి రాత్రి రెండుగంటలయినది. ఈప్రయాణ మేలాగో, అక్కడికి ఏలా చేరుతామో అనుకుంటూ కన్నుమూసేసరికి పాతికమంది చంటిపిల్లలు ఒక్కమాటు లేచి రాగాలుపెట్టడము మొదలుపెట్టినారు. నిజానికి ఇంట్లో ఇంతమంది చంటిపిల్లలున్నారని నేనెరుగను. తెలిస్తే అక్కడే పడుకోకపోయ్యేవాణ్ణి. పడుకోవడమేమిట్రి, అసలు పెళ్లికే వెళ్లకపోయ్యేవాణ్ణి. ఆపూటకు వచ్చిన జనాభాను లెక్కచూడడములో ఏడెనమండుగురుకంటె పిల్లలతల్లులున్నట్టు తోచలేదు. దాన్నిబట్టి ఏడెనముండుగురుకంటె చంటిపిల్లలుండరుగదా— పోనీ యిందులో కొంతమందికి కవలపిల్లలున్నా మొత్తముమీద పదును కంటె ఎక్కువ ఉండరుకదా అనుకున్నాను. వాస్తవానికి అంతకంటె ఎక్కువవుంది లేకపోయిఉండవచ్చును. కాని ఇంతమంది ఏకగ్రీవముగా ఒక్కసారే తమ అభిప్రాయాన్ని తెలియబరిచేసరికి కొంచెము బాధగానే ఉన్నది. రాత్రి తెల్లవార్లూ నిద్రలేక తెల్లవారుఝామున మూడుగంటలకు కన్నుమూసినప్పుడు కోకిల కూసినా దాన్ని కొంచెము మందలించ బుద్ధి వేస్తుంది. అలాంటి సందర్భములో చంటిపిల్లలకంఠాలు— అందులో అన్ని కంఠాలూ, కేవలమూ కోవెలస్వరాలని చెప్పడానికి వీలుండదుకదా! ఏలాగైతేనేమి? వాళ్లనందరినీ సముదాయించి వాళ్లతల్లులు పడుకోబెట్టేటప్పటికి సుమారు నాలుగుగంటలు కావచ్చినది.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మళ్లీ ఏలాగో కన్నుమూసినాను. పొరుగూరి నుంచి కుదర్చిన బాకావాడు నాపాలిటియముడులాగ అప్పుడే వచ్చాడు. పోనీ వచ్చినవాడు- వాడూ ఒకరాత్రి వేళను బయలుదేరిఉండవలెనుగదా - నిద్ర లేకుండా నడిచివచ్చినాడా - కాస్సేపు పడుకోగూడదూ! ఇంకా ముందు అయిదురోజులు వుండనే ఉన్నదాయెను! అమ్మో, వాడెందుకు పడుకుంటాడు? నాలుగువందల పరకాశాతాన్లు ఒక్కమాటు చింపినట్లు బర్రున బాకా పట్టాడు. తేలుకుట్టినట్టుగా లేచాను. దురుద్దేశము కలిగింది చెప్పవద్దూ, వాణ్ణి నిలువునా చీల్చివేతా మను కున్నాను. కాని తీరా ఇంతపెళ్లీ ఆగిపోతుంది; ఇంత మందికి ఉత్సాహభంగము అవుతుంది;- అనుకొని శాంతిం చాను. బడాయి కాదుకాని, ఆసమయములో నేను కన కనే ఆగాను, మరొకడయితే తెల్లవారేసరికి రాజమండ్రీ జయిల్లో ఉండేవాడే. సరే, వాడూ మానేటప్పటికి భజంత్రీలు వచ్చారు. ఇంతట్లోకే తెల్లవారినది. తేనె పట్టులో ఈగలులాగ ఇంట్లో అందరు కిలకిల్లాడుతూ లేచారు. కావడము ఆరోజూ అన్నిరోజులలాంటిది అయినా నామట్టుకు సూర్యుడేదో కొత్తతేజస్సుతో ఉదయిస్తూన్నట్టు, ప్రభాతవాయువులలో కొత్త సౌరభ ము ఉన్నట్టు, స్త్రీముఖాల్లో వింతసొగసు ఉన్నట్టు తోచింది.

దంతధావన మయ్యేసరికి చంటిపిల్లలమీదా, బాకా వాడిమీదా, భజంత్రీవాళ్లమీదా వచ్చినకోపము కొంచెము చల్లారినది. ప్రొద్దున కాఫీఇచ్చేవాళ్లు ఎవళ్లూ లేక, ఆకలిపట్టలేక, స్నాతకానికి తెచ్చిన అరటిపళ్లు నాలుగు కుర్రవాళ్లు ఎవళ్లూ చూడకుండా నోట్లో చడీ చప్పుడూ కాకుండగా వేసుకున్నాను. ఇంతట్లోకే మా మామగారు వచ్చి 'ఏమి నాయనా, ఇవ్వాళ కాఫీకూడా లేదుకాబోలు-భోజనాలు ఆలస్యమవుతవి. కాసినిపాలు పుచ్చుకుంటావా ఏమిటి' అన్నారు. 'ఆఁ, ఎందుకులెండి. ఎంతపొద్దుపోత వేమిటి భోజనాలు. అయితేమట్టుకు మునిగి పోయిందేమిటి' అన్నాను. అరటిపండ్లసంగతి ఆయన కేమి తెలుసును? 'అలా కాదు. కాసినిపాలు పుచ్చుకుంటేనేకాని వల్లకా' దని, చంటిపిల్లలకోసరము తెప్పించి పొయ్యిమీదపెట్టిన ఆవుపాలు కాసినీ ఎవరి తోటీ చెప్పకుండా ఆవుకోరాలో వంచుకొని కాస్త పంచదార వేసి మామగారు స్వయంగా నాముందు పెట్టారు. పుచ్చుకోకపోతే ఆయన కేమికోపంవస్తుందో ననుకొని రెండుగుక్కలలో ఆవుకోరాడుపాలూ తాగి వేశాను.

ఇంతట్లోకే యింట్లో ఆడవాళ్లల్లో కంగారు బయలుదేరినది. ఏమిటని విచారించగా, 'పొయిమీద కాగుతూన్న ఆవుపాలు ఏపిల్లో తాగివేసినది; ఇక చంటి పిల్లలగతి ఏలా' గని కంగారుపడుతున్నారు. మా మామ గారు వెళ్లి, 'అవి ఆవుపాలా! గేదెపాలు అనుకున్నాను. వెధవపనులూ, వెధవతెలివితేటలూనూ, ఎవ్వరితోనూ, చెప్పనక్కరలేదా! చెప్పకపోతే ఏలా తెలుస్తుంది నాకు? చంటిపిల్లలు అలా గోలపెడుతున్నారు. మళ్లీ పాలు ఎప్పటికి రాను, ఎప్పటికి కాగను; ఎన్నిఏళ్లు వచ్చినా తెలివితేటలు ఒక్కమాదిరిగానే తగలబడు తున్నవి.' అని ఇంటిల్లపాదిమీదా ఇంటికప్పెగిరి పొయ్యేటట్టు కేకలువేశారు. మాఆవిడ ఏదో మాట్లాడబోతూంటే 'నీవేమీ మాట్లాడవద్దు' అని సంజ్ఞ చేసి నేను నిమ్మళంగా అవతలకి దాటాను. అదీ తెలివి అయినది గనుక గ్రహించుకొని 'సరే నాన్నా, యిప్పుడు కేకలు ఎందుకు? అయినదేదో అయిపోయినది. ఆలస్య మవుతే పాలు ఇంకఎక్కడా దొరకవుకూడాను. ముందు ఎక్కడికయినా పాలకు పంపించు' అని తండ్రిచేతికి తప్పేలా అందించింది. ఆయన పాపము కోపముఅంతా మరిచిపోయి మళ్లీ పాలప్రయత్నముమీద వెళ్లిపోయి నారు.

నే నీకూడావుడి అణిగేదాకా కొంచెము అటూ యిటూ తిరిగి కుర్చీలో కూర్చొని కాస్సేపు నిద్రపోదా మని కన్నుమూశాను. మా పెద్దబావమరది ఒక్కపరుగున వచ్చి నన్ను లేపి, "బావా వచ్చారోయ్" అన్నాడు. కళ్లు మూసుకునే, 'ఆఁ హాఁ, వచ్చారా; సంతోషము. జాగ్రత్తగా వచ్చారా? సామానులు లోపలపెట్టించి పిల్ల లకు పాలూగీలూ కావాలెనేమో చూడు. కొంచెము తల నొప్పిగా ఉండి పడుకున్నాను' అన్నాను. "పిల్లలేమిటి? పాలేమిటి?" అన్నాడు. "ఆప్రశ్న ఏమిటి నీమొహము. పిల్లలకు ఆవుపాలు కావలెనేమో కనుక్కో" అన్నాను

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"ఎవరిపిల్లలకు" అన్నాడు. "ఇప్పుడు ఎవరు వచ్చారు సూరమ్మా పిల్లలూ కాదా" అన్నాను. వాడు పకాలున నవ్వి, "కాదోయ్, భోగము మేళము" అన్నాడు. "ఏడిసి నట్టే ఉంది తెలివితేటలు; వాళ్లకోసము నేను బెంగ పెట్టుకున్నాననే నిద్రపోతూన్నవాణ్ణి లేపావా? సరే ఇంకనేమి, నీకు చేతినిండా కావలసినంత పని. వెళ్లి పాపము, వాళ్ల సప్లయిసంగతి చూడు" అన్నాను. ఇంక నిద్రఏలాగూ వీళ్లు పోనివ్వరు అని ఆవొచ్చిన మొహాలు ఏలాంటివో చూతామని నేనూ వీథిలోనికి వొచ్చాను. ఎంత ఏంటీనాచ్ అయినా కళ్లముందునుంచి వాళ్లు వెడుతూంటే తల వంచుకునేనా వాళ్లకేసి చూడ బుద్ధి అవుతుంది. తల వంచుకుని క్రీగంట చూస్తే వాళ్లకు సైగ చేస్తున్న ననుకుంటారేమో నని నేను ఎప్పుడూ బాహాటంగా తల ఎత్తే చూస్తాను. అది కాకుండా బ్యూటీ ఎక్కడున్నా సౌందర్యపిపాస కలవారు చూచి ఆనందించక మానరుకదా! ఊళ్లో సగముమందిజనము బండ్ల చుట్టూ నిలవబడి బండ్లవాళ్లను సామాను జాగ్రత్తగా దింపమనీ, భోగమువాళ్లని జాగ్రత్తగా దిగమనీ హెచ్చరించడము మొదలుపెట్టారు. పాపము వాళ్లు ఎక్కడికి వెళ్లినా, ఏలోటూ లేకుండా ఆలా యోగక్షేమము కనుక్కొని ఊరిలో అశేషజనమూ సప్లయిలు చేస్తూంటారు. గనుకనే వాళ్లు సెగ్గుకుని వస్తూంటారు. ఆరాత్రి ఊరిలోనుంచి పెళ్లివారు బయలుదేరి వెళ్లేవరకూ గ్రామస్థులయిన యువకులకు యీసప్లయితోటి భోజనానికి ఎక్కడా తీరిక లేకపోయినది. బండీలోనుంచి దిగిన రెండు మొహాలు చూశాను. మూడోమనిషి దిగుతూంటే ఇకనక్కడ నిలబడ లేకపోయాను. అనిత్యసువాసినుల సౌందర్యము చూస్తూంటే వళ్లు గగురి పొడిచింది. ఏదో పదిపూళ్లు తిరిగేవాణ్ణి, అనేకరకాల ముఖాలు చూసేవాణ్ణి నాకే హడలుపుడితే యింక ఆడవాళ్లూ, పిల్లలూ చూస్తే వాళ్లేమవుతారా అనిపించినది. ఏది ఏలావున్నా మనవాళ్లు మేజువాణీ పెట్టించక మానరు. వాళ్లు ఆడుతూన్నప్పుడు ఆడవాళ్లు పిల్లలను ఒడిలో పెట్టుకొని చూడకమానరు. పిల్లలు వీళ్లని చూసి జడుసుకోకమానరు. అందుకని పిల్లలమట్టుకయినా ఇంద్రాక్షివిభూతి చెప్పడానికి ఒకబ్రాహ్మణ్ణి తీసుకువస్తేనే కాని వల్లకాదని మామగారితోటి దెబ్బలాడాను. ఆయన ఎంతసేపూ వేళాకోళ మనుకున్నాడు గాని నాటోన్లో Anxiety అంటే నాకంఠములో ఆదుర్దా కనిపెట్ట లేకపోయినాడు.

ఇంతట్లోకే ఎదట వర్జ్య మొస్తూన్నది; స్నాతకానికి పీటలమీద కూర్చోవాలి; లేవండి అంటే లేవండి అన్నారు. ఊళ్లో నలుగురిని కేకవేసుకొని రమ్మని మామగారు నాకూ, ఆయన పెద్దకుమారుడికీ పురమాయించారు. మేమిద్దరమూ, మావెనకాల పదిపదిహేను గురు ఆడవాళ్లూ బయలుదేరి నిముషములో అందరినీ పిలుచుకొని చక్కావచ్చాము. మేము వచ్చేటప్పటికి అప్పటికే ఒకపక్కని మేజువాణీ జరుగుతూ ఉన్నది. మేము ఏలాగూ పిలుస్తా మనేధైర్యముతోటి ఊళ్లో కుర్రకారు అంతా భోగమువాళ్లదగ్గర సభతీర్చారు. ఎదురుగుండా స్నాతకము జరుగుతున్నది. పురోహితుడికి కొంచెము వయస్సుమళ్లినా, దృష్టిఅంతా మేజువాణీ మీదనే ఉన్నది. ఏ మేజువాణీచూస్తూన్నా డబ్బుల దగ్గిరమట్టుకు ఎప్పుడూ ఏమీ మరిచిపోలేదు.

సరే, పెండ్లికొడుకునకు కర్రా, చెప్పులూ, చెంబూ, గొడుగూ, మొదలయినపరికరాలు అన్నీ యిచ్చి ఒకమారు కాశీవెళ్లి రెండునిమిషాలలో మళ్లీ వర్జ్యము తగలకుండా తిరిగి రమ్మన్నారు. రెండడుగులు వెళ్లగానే బావమరది వరసవాళ్లంతా "సరేవెళ్లనివ్వండి ఎక్కడికి వెడతాడో, పిలవకండి; ఏమిచేస్తాడో చూతాము" అని మామూలు 'విట్లు' వేశారు. ఏమో ఒకవేళ నిజంగా చక్కాపోతాడేమో కొంపతీసి అని మేనమామ జేమారూ, బెల్లము ముక్కా తీసుకు వెళ్లి, "రా, నాయనా, వెళ్లకు. మా పిల్లనిచ్చి పెళ్లి చేస్తాము!" అని బ్రతిమాలి తీసుకువచ్చాడు. పెళ్లికొడుకు అల్పసంతోషి. లేకపోతే మేనమామ ఇచ్చిన రెండు రూపాయల జామారుకు చప్పున కక్కురితిపడి వెనకకు రాకపొయ్యేవాడే! పయిగా మాటవరుసకు అన్నాడే కాని ఇప్పుడు మావాడికి ఇవ్వబోయేపిల్ల మేనమామ కూతురు కాదు. మరొకళ్లయితే ఆమాటమీద నిలబెట్టి నీకూతురినిచ్చి పెండ్లిచేస్తావా చెయ్యవా అని నిఖాచేసి ఉండేవాళ్లే. ఇక నేమైతే నేమి, పెళ్లికొడుకు అంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాశీప్రయాణామూ మానుకొని పిల్లనిస్తాననేసరికి మాట్లాడకుండా వెనుకకు చక్కావచ్చాడు. వెర్రివాడు అనండి, అమాయకు డనండి, పెద్దమనిషనండి – అంతా ఒకటే.

స్నాతకము పూర్తిఅయినది. ఆడబడుచులు మంగళహారతులు తీసుకుని చక్కావచ్చారు. "సరే కానివ్వండి అమ్మా, త్వరగా, మంగళహారతి ఇచ్చివేసెయ్యండి. మన కింకా బోలెడంతపని ఉన్నది" అన్నారు మామగారు. "సరే మాఅభ్యంతర మేమీ లేదు; పళ్లెములో పడేదేమిటో వేస్తేనేగాని మంగళహారతి యివ్వడ మేలాగు" అన్నారు. "ఏలాగేమిటి, మంగళహారతి రూపాయలతోటి యివ్వరుకదా – చేత్తోటికాని ఇస్తారెండి ఏదో ఒకటి తరవాత, కానివ్వండి" అన్నారు.

"తరువాత నెందుకు లెండి. ముందు రూపాయలు అందులో పడితేనేకాని మాచేతులు ముందుకు రావు" అన్నారు. రోజులు అలాంటివి: డబ్బువద్దికి వచ్చేసరికి తండ్రిమాటయినా నమ్మరు. అంతా కోమటిబేరము లోనికి దిగినది. డబ్బిస్తేనేకాని ఆడపడుచులు మంగళహారతి ఇవ్వరు; డబ్బిస్తేనేకాని బ్రాహ్మణులు ఆశీర్వదించరు; డబ్బిస్తేనేగాని పురోహితుడు పెళ్లి చేయించడు; కట్నమిస్తేనేకాని పెళ్లికొడుకు దొరకడు; వస్తువులు పెడితేనేకాని పెళ్లికూతురు వప్పుకోదు. ఏలాగయితేనేమి పదినిమిషాలు ఘర్షణపడి రూపాయలు పళ్లెములో ఘల్లుమనగానే నాలుగుపాటలుపాడి మంగళహారతు లిచ్చారు. గవ్మత్తేమిటో కాని మామూలుగా మనవాళ్లకంతా లెంతఅసహ్యాముగా ఉన్నా, యిటువంటిసమయాలలో వాళ్లు నలుగురూ కలిసి పాడుతూ ఉంటే నాకది ఒకవిధమయిన ఆనందముగానే ఉంటుంది. అవతల భోగమువాళ్లుమట్టుకు వీళ్ల కంఠాలూ, పాటలూ విని నవ్వుకుంటూనేవున్నారు.

సభవారికి ఇష్టము లేకపోయినా మేజువాణీ అప్పటికి కట్టిపెట్టించి తాంబూలాలు ఇచ్చి అందరినీ పంపివేసి భోజనప్రయత్నాలు చేశాము. ఏవో రెండు మెతుకులు నోట్లో వేసుకొని ఇవతల పడేసరికి సుమారు మూడుగంట లయినది. ఇక నక్కడుంటే వాళ్లపనికి అడ్డుగా ఉంటుం దని నేను ఇంకొకస్నేహితుల ఇంటికి వెళ్లి పడుకున్నాను.

[illegible] దీపాలు పెట్టేసరికి లేచి కొంచెము షికారువెళ్లి నెమ్మదిగా ఇంటివైపు మళ్లాను. ఆకాశము నిర్మలముగా ఉన్నది. వెన్నెల చక్కగా ఉన్నది. గాలి కొంచెము చల్లగా వీస్తూన్నది. ప్రయాణమునకు చాలా అనుకూలముగా ఉన్నదని సంతోషించాను. మావీథిలోకి వచ్చేసరికి బళ్లలో సామానులు సర్దుతున్నారు. ఒక్కమాటు అన్ని బళ్లకేసీ మాశి బళ్లవాళ్లను త్వరగా సర్దమని ఒకకేక వేసి సాయంకాలమునుంచీ యీపనిమీదనే ఉన్నట్లు హడావిడిగా ఇంట్లోకి వెళ్లను. ఆలా డాబు చేస్తూ ఏదో నిరవాకము చేస్తూన్నట్లు నటిస్తేనేకాని మాటదక్కదు. బంట్రోతు మొదలు గవర్నరువరకూ రాజ్యభారమంతా తమరే మోస్తూన్నట్టూ, చక్రవర్తి శ్రేయస్సు కోరేవారు తమరుతప్ప మరొకరు లేనట్టూ నటిస్తారు. ఖద్దరుబట్ట లమ్మేగుమాస్తా మొదలు దేశబాంధవులవరకూ ఉన్న అన్నిరకాలవారూ తమంత దేశభక్తులూ త్యాగులూ మరొకరు లేనట్టునటిస్తారు. ఒళ్లంతా విభూతి పూసుకొని వీథులలో తిరిగే బైరాగి మొదలు మహర్షిభిరుదాంకితులవరకూ ప్రతీవాళ్లూ తమంత భక్తులూ, విరాగులూ, పరమేశ్వరున కాప్తులూ మరొకరు లేనట్టు నటిస్తారు. ఏమిచెయ్యము?

లోపల ఆడవాళ్లు యింకా పెట్టెలు సవరిస్తున్నారు. మా ఆవిడా పెట్టెవద్దర కూచుని పెట్టెలో బట్టలు ఇవతల పారవేసి, బయటనున్నవి. పెట్టెలో పడవేసి, అన్నికలిపి ఒకమాటు ఇవతలకు తోసి, మళ్లీ అన్నీ కలిపి పెట్టెలో పెట్టింది. ఇంతా చేస్తే పెట్టెలో ఏ బట్టలు పడ్డవో, ఏబట్టలు పడలేదో జ్ఞాపకము లేకపోయింది. అందుకని తనవెనకాల కూచుని ప్రపంచమంతా మరచి బొమ్మకి తలంటి నీళ్లుపోసుకుంటూన్న కూతురిని అల్లరిచేస్తూం దనేమిషతోటి ఒకటి తగల్నిచ్చి మళ్లీ పెట్టెలో బట్టలు ఒకటొకటే తియ్యడము మొదలుపెట్టినది.

నేను తిన్నగా మాఆవిడవద్దరకు వెళ్లి ఇంటిల్లపాదీ హడిలిపోయేటట్లు "ఇంకా ఎంతసేపు యీసర్దడము, తెమలడపకుంటూ వుండదు ఏవేళకూను. పెందరాళే రెండుమెతుకులు నోట్లో వేసుకుని బయలుదేరితేనే కాని రేపు చాలా ఇబ్బందిపడవలసి వుంటుం దనే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జ్ఞానము ఒక్కళ్లకూ లేదు. ఎప్పుడూ నీపను చింతేను. ఆడవాళ్లతోటి ప్రయాణము పెట్టుకోవడము బుద్ధి తక్కువ. ఈమాత్రము సర్దుకోలేనివాళ్లు నోరు మూసుకొని ఇంటిదగ్గర కూర్చోక, 'రసుదునమ్మా'అని ఎక్కడికి పడితే అక్కడికి వస్తారు. కానియ్యవేమి యింకాను? హేత్ హూాత్". అని పెద్దపెద్ద కేకలు వేశాను. ఇదంతా మాసి పక్కనున్న చూపిల్ల వాళ్లతల్లిని కొడతానేమో నని భయపడి తల్లిని కౌగలించుకొని రాగాలు పెట్టడం మొదలు పెట్టినది. నాఅసలుఉద్దేశము మాఆవిడను కోప పడదామని కాదు. దాన్ని కోపపడడమంటే నామనస్సు ఒప్పుకోదు. మాఆవిడ చాలాబుద్ధిమంతురాలూ, నెమ్మదైనదీ, తెలివితేటలైనదీ అని నానమ్మకము. ఇప్పుడూరికే తక్కినఆడవాళ్లందరికీ బుద్ధిచెబుదామని మా ఆవిడమీద వంకపెట్టి కేకలువేశాను. అది ఆరహస్యము కనిపెట్టినట్టు కనుపించదు. ఆనక బండిలో ఒంటిగా వున్నప్పుడు చెప్పి సముదాయిద్దా మనుకున్నాను. అదిగాక వాళ్లపుట్టినింటే, వాళ్లవాళ్ల ఎదటే ఒక్కసారి ఇలా డబాయిస్తే నాభార్యమీద నాకుండే సంపూర్ణ స్వాతంత్ర్యము తెలుపవచ్చుననీ, నాభార్య చాలా బుద్ధిమంతురాలు, ఆయన ఇన్ని కేకలు వేసినా మారు మాటాడలేదని తక్కినఆడవాళ్లంతా సంతోషిస్తారనీ నాఅభిప్రాయమే కాని, మాఆవిడ ఎదురుతిరుగుతే పట్టుకు కొంప మునిగిపోయేది ఏదో నాఅదృష్టము బాగుంది. అలాంటి ప్రమాదమేమీ జరుగలేదు.

నాకేకలూ వృథాగా పోలేదు. ఆడవాళ్లందరూ గబగబా సామాను సర్దుకొని పెట్టెలు ఇవతల పడవేశారు. బళ్లవాళ్లు తీసుకువెళ్లి బళ్లల్లో పారవేశారు. తీరా మూసేసరికి సగముబళ్లు సామానుతోనే నిండిపోయినాయి ఇంతసామాను ఎందుకర్రా అంటే వినరు. ఏవో నాలుగుబట్టలు తీసుకుంటే చుఖ్ఖగ్గా వెళ్లిరావచ్చునా- అలా వప్పుగోరుగా! ట్రంకుపెట్టెలు, రంగూనుపెట్టెలు, మోర్మేను పెట్టెలు- ఎందుకు ఇవన్నీనీ? మనలో ఉండేదే అదీ: ఊరికే అనవసరమైన బరువంతా నెత్తిని పెట్టుకోవడము. జీవితములోకూడా అంతే. లేనిపోని బాదరబందీలు, అయినవీ కానివీ, నెత్తినేసుకోవడము; అందుకనే మనకు సంసారాల్లో ఎప్పటికీ తెగూ తెంపూ అంటూ ఉండదు.

...నే నేదో మహా శ్రమపడిపోతున్నా ననుకొని మామామగారు వచ్చి "నాయనా, లేచి మడిగట్టుకొని రెండుమెతుకులు నోట్లో వేసుకొని కాఫీపు కూడో; రాత్రి తెల్లవార్లూ నిద్దరుండదు, నీకు జబ్బుచేస్తుంది కూడాను. ఇలా చేస్తూఉన్న కొద్దీ ఉంటూనేఉంటుంది. బళ్లదగ్గర ఎవరోఒకరు ఉంటారు. రా, మడిగట్టుకో" మని తొందరపెట్టారు. పెద్దవాడు ఆయన అలా బలవంతపెడుతూఉంటే ఇంక బాగుండదని మడిగట్టుకో డానికి లోపలికి వెళ్లాను.

నెమ్మదిగా అందరిభోజనాలూ అయినాయి. సుమారు తొమ్మిదిగంటలయింది. జనమంతా బళ్లదగ్గర చేరారు. బళ్లుసరిపోయేటట్టు లేదు; పల్లెటూరు. మా మామగారికి పలుకుబడి ఎక్కువ; అందుకని ఊళ్లోవాళ్లు కూడా సగమునంది పెళ్లికి బయలుదేరారు. ఉన్న మట్టుకు బళ్లలో బండి కొక్కొక్కజోడా చొప్పున దంపతులంతా సర్దుకున్నారు. ఎవళ్లని దిగమంటే వాళ్లకే కోపము. పోనీఅని ఆబండిలో ఇంకొకళ్లను కూర్చో బెట్టినా కోపమే, ఏలాగు. ఇంకాకొన్నిబళ్లు పిలిపించి వీలైనంతవరకూ ఆడవాళ్లనూ,పిల్లలనూ ఎక్కించి తక్కిన వాళ్లను కొంతమందిని కొంతదూరము నడవమన్నాము. బళ్లవాళ్లల్లో ఒకతనికి నేనంటే చాలా భక్తీ, గౌరవమూ ను-ఎందుకో తెలియదు. "బాబూ గాంధీమహాత్ములులా ఉంటారు.—వాడెప్పుడూ ఆయన్ను చూడలేదులెండి.— తమ రెక్కడ కూసున్నా దెవేంద్రసబలా నుంటుంది. తమరు నాబండీలో కూసోండి. నాబండి వేరే అట్టేపెట్టి ఎవ్వరూ ఎక్కకుండా చేస్తానండి. తమరు దయచెయ్యాలం"డని, ఆబండీలో మరికాస్త గడ్డివేసి, నాపరుపు పరిచి, నాసావ నుసర్ది. అట్టేపెట్టాడు.

మాఆవిడను బండీ ఎక్కమంటే పిల్లవాడికి పాలు పోసి వస్తా నన్నది. 'పాలు పొయ్యడానికి చెంచా కనబడలేదు. పెట్టెలో పెట్టినట్టున్నాను' అని తెప్పించి చూసింది. కనబడలేదు. నాపెట్టెలో చూచిన జ్ఞాపకము నాకు: అందుకని నాపెట్టె తెప్పించి చూశాను. అందులోనూ లేదు. ఇంతట్లోకే మాపెద్దపిల్ల వచ్చి 'నాన్నా, నాపెట్టెలో ఉన్న' దన్నది. కాబోలు ననుకొని దాని పెట్టెకూడా తెప్పించి చూశాను. అందులోనూ లేదు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మాఆవిడకు ఏదో జ్ఞాపకము వచ్చి ముఖము విప్పారింది. 'ఏమి, చెమిచా కనపడ్డదా' అన్నాను. 'ఆనవాలుగా ఉంటుందని పిల్లవాడి ఉయ్యాలతొట్టిలో పరుపుకింద పెట్టాను' అని ఒక్కపరుగున వెళ్లి చెంచా తీసుకొచ్చి పాలుపొయ్యడ మారంభించింది. 'ఏడిసినట్లే ఉన్నాయి తెలివితేటలు' అని విసుక్కుని నేను పెట్టెలు సవరించి బండీలో పెట్టించేసరికి పిల్లవాడికి పాలుపొయ్యడమూ అయింది. యావన్మందీ బళ్లల్లో ఎక్కి బళ్లు సాగేసరికి పదకొండుగంట లయింది. ఎదరు ముప్ఫయిమయిళ్ల ప్రయాణము ఉన్నది. క్రింద నడుస్తూన్న మాపెద్దబావ మరదీ మరికొందరు యువకులూను "చీకట్లో ఒంటరిగా వస్తున్నారు; భయమువేస్తుందేమో" నని ఆలోచించి భోగమువాళ్ల బళ్లల్లో కొంచెము ఇరుకుగా ఉన్నా సర్దుకున్నారు.

తెల్లవారుఝామున రెండుగంట లవుతుంది. బళ్లు నెమ్మదిగా, నిశ్శబ్దముగా, కునికిపాట్లుపడుతూ వెడుతున్నాయి. బళ్లల్లో జనంకూడా ఎంత ఇరుకుగా ఉన్నా అలాగే కూచుని కునికిపాట్లు పడుతున్నారు. మాబండిలో పిల్లలు ఖులాసాగా నిద్రపోతున్నారు. మాఆవిడ నన్ను సంబోధించి 'అలా తెల్లవార్లూ ఎలా కూర్చుంటారు, కాశ్శేపు ఇలా పడుకోండి. నేను కాస్త సర్దుకుంటాను' అని అక్కడ తనే పడుకొని నిద్ర పోయింది.

తెల్లవారుసరికి ఒకగ్రామము చేరినాము. అక్కడ ఆపూటకు ఆగి, వంట చేసుకుని భోజనాలు చేసి, మధ్యాహ్నము రెండుగంటలకు బళ్లు కట్టించాము. మధ్యను గోదావరిపాయ ఒకటి దాటవలసివచ్చింది. అది సుమారు ఒకమైలు వెడల్పు ఉంటుంది. ఇంకా ఫాల్గుణమాసమే అయినా అందులో నీరు లేదు. మధ్యనుమాత్రము కొద్దిగా ఉన్నది. బళ్లు పోనిచ్చారు. ఇసుకలో బళ్లు నడవడము కష్టముగా ఉన్నదని మగవాళ్లను దిగి నడవ మన్నారు. వచ్చినట్టు దిగి నెమ్మదిగా నడుస్తున్నాము. ఎండ పైన నెత్తి మాడుస్తోంది. అడుగున కాళ్లు అంటుకు పోతున్నాయి.

ఇంతలోకే నీళ్లదగ్గరకు చేరినాము. సరదాగా నీళ్లలో నడవవచ్చునని కొందరు ఆడవాళ్లూ పిల్లలూ కూడా దిగినారు. వీళ్లను చూచి భోగమువాళ్లుకూడా బళ్లలోనుంచి కులాసాగా దిగి, నీళ్లలో తిప్పకుంటూ, నవ్వుకుంటూ, వేళాకోళా లాడుకుంటూ నడవడ మారంభించారు. బళ్లవాళ్లకు కొంచెము అల్లరిచేద్దామని బుద్ధి పుట్టింది. ఎడ్లకేసి చూశారు. ఎడ్లుగ్రహించి కళ్లు మీటినాయి; బళ్లవాళ్లు 'పప్ప' అన్నారు. వాళ్లను విడిచి పెట్టి ఒక్కపరుగున పరుగెత్తినాయి. ఈసంగతి భోగము వాళ్లు కనిపెట్టలేదు. నీళ్లలోనుంచి ఇవతలకు వచ్చి రెం డడుగులు వేశేసరికి కాళ్లు చుఱ్ఱు మన్నాయి. బళ్ల వాళ్లను కేకవేశారు. ఇంకెక్కడ బళ్లు- అప్పుడే అవతల గట్టుకు చేరినాయి. ఇక్కడింక వాళ్లువేసిన గంతులూ కేకలూ చేసిన అల్లరీ లెక్కలేదు. ఏమిచేస్తే ఏమిలాభము అలాగే? నడవవలసివచ్చినది. మన మగవాళ్లు వాళ్లనలా నడవనిస్తారా? మనవాళ్లకు స్త్రీలపట్ల గౌరవము లేదనేది వట్టిమాట. తక్షణం పదిమంది యువకులు తమ పాదరక్షలు తీసి వాళ్లదగ్గరకు విసిరారు-తొడుక్కోమని. మరికొందరు తమఖండువాలు గిరవాటేశారు-వాట్లమీద నడవమని. ఇలాటివాళ్లను చూస్తూకూడా మనవాళ్లకు Chiva!ry లేదంటే ఒప్పుకోగలమా!

సూర్యాస్తమయము అయేసరికి పెళ్లికొమార్తె గారిగ్రామము చేరాము. వివాహము తెల్లవారుఝామున. సామాను విడిదిలో సర్దుకుని, రెండుమెతుకులు నోట్లో వేసుకుని, రెండుకునుకులు తీద్దామని పడుకున్నాను. కన్ను మూశానో లేదో, ఒకపెద్దమనిషి తొందరగా నన్ను లేపి, 'అయ్యా ఎంతైందండి' అన్నాడు. నాకు ఒళ్లు మండింది. మండదు మరి? ఇంతమంది ఉండగా టైము తెలుసుకోడానికి నన్నే లేపాలి? గడియారము తలక్రింద పెట్టుకు పడుకుంటా ననుకున్నాడా! ఈయన్ను ఏడిపిద్దామని బుద్ధిపుట్టింది. 'ఎంతేమిటండి, ఎంతయినా అయినదేను' అన్నాను. 'అదికాదండి, సుమారు ఎంత అవుతుందండి' అన్నాడు. 'ఇప్పటికి మూడువేలు అయిందండి. ఇంకా పెళ్లంతా ముందే ఉన్నది' అన్నాను. ఆబ్రాహ్మడు తెల్లబోయాడు. చీకట్లో నాకు కనబడలేదు కాని అయినా తెల్లబోయిఉంటా డనుకున్నాను. 'అదికాదండి అయ్యా, డబ్బుసంగతి కాదండి. సుముహూర్తమున కింకా ఎంతవ్యవధి ఉన్నదో తెలుసు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కుందామని ఎన్నిగంటలైనదో అడిగానండి' అన్నాడు సవినయముగా. 'ఓయి నీఇల్లు బంగారముగాను, అది టయ్యా. నే నిలా అనుకున్నాను; సరే. మైనుసంగతి నాకు ఎలా తెలుస్తుంది బాబూ, నిద్రపోతున్నవాడికి గడియారము తలక్రింద ఉంటుందనుకున్నారా? లేక నా కేమైనా దివ్యజ్ఞాన మున్నదనుకున్నారా? ఇప్పుడే కునుకు పడుతోంటే మునిగిపోయినట్టు లేపారు?' అని అవతల వైపుకు తిరిగి పడుకున్నాను. ఆ బ్రాహ్మణుడు మారుమాట లేకుండా చక్కాపోయాడు.

మళ్లీ ఎలాగో తంటాలుపడి కన్నుమూశాను. చక్కనికల వచ్చింది. కల మధ్యలో ఉండగా మాచాకలి వాడు—కొంచెము అమాయకుడు – వచ్చి హడావిడిగా నన్ను లేపాడు. 'బాబూ, పెళ్లికుమారుడుగారికి ఎదురు సందేహ మవుతోందిటండి. మామయ్యగారు లేపమన్నారండి' అన్నాడు. వాడు లేపినందుకు కొంచెం కోపము వచ్చింది కాని వాడిమాటకు నవ్వు వచ్చింది. ఎదురుసన్నాహ మనవాడిఉద్దేశ మేమైఉంటుం దనుకున్నాను. 'పెండ్లికుమారుడుగారి కైనాసరే, వారి తండ్రిగారి కైనాసరేను. ఎదురుసందేహ మయ్యేది, పక్కసందేహ మయ్యేది; నేనుమట్టుకు రాను. ఈమాటు నువ్వుగాని, నీవారసులుగాని, తదితరులుగాని ఎవరువచ్చి నన్ను లేపినా బుర్ర బద్దలుకొడతాను. ఈసంగతి అందరి తోనూ చెప్పు. అవసరమయితే కరణముగారితోటి చెప్పి సాటింపు చేయించవచ్చును. ప్రమాదము జరిగిన తరువాత ఏమనుకొనీ ఏమీ లాభము లేదు' అన్నాను. వాడు హడిలిపోయి నోరు మూసుకు చక్కాపోయాడు.

ఇంక నిద్దర పట్టలేదు. విడిదిలో అంతా పెళ్లికి వెళ్లిపోయారు. వచ్చినదే పెళ్లికి కదా! చూచివద్దాము, లేకపోతే బాగుండ దనుకొని, లేచి, చాకలితెచ్చిన నేలముజరీపంచ కట్టి, షర్టూ, కోటూ తొడుక్కుని, ఉప్పాడజరీఖండువా పైన వేసుకుని, పెళ్లిపందిట్లోకి చేరాను. పందిట్లో జనము కిటకిటలాడుతున్నారు. ఒక పక్కను మేజువాణీ జరుగుతోంది. ఆడవాళ్లంతా ఒక పక్కను కూర్చున్నారు. పండితులవేదఘోషతో పందిరి మారుమ్రోగుతోంది. నేను నెమ్మదిగా జనాన్ని తప్పించు కుని ముందు కూర్చున్నాను. పెండ్లికుమార్తెను ధాన్యపు తట్టలో పెట్టి అప్పుడే పందిట్లోకి తీసుకువచ్చారు. ఆ అమ్మాయి ఒక్కసారి తలఎత్తి సభకేసి చూసి మళ్లీ తలవంచుకుని నెమ్మదిగా పెళ్లికొడుకువైపు చూసింది. పెళ్లికొడుకూ ఆపిల్లకేసి చూస్తున్నాడు. ఇద్దరికళ్లూ కలుసుకున్నాయి. ఒక్కక్షణము ఇద్దరూ సభసంగతి మరచిపోయారు. వాళ్ల లేతహృదయాల్లో ఏమిఉద్వేగము కలిగిందో, వాళ్ల లేతమనసులలో ఏమిభావాలు పరుగు లెత్తినాయో ఎవరు తెలుసుకోగలరు! వాళ్లకే తెలియ దనుకుంటాను.

'కాళ్లు పళ్లెములో పెట్టు నాయనా' అన్నాడు పురోహితుడు. కన్యాప్రదాత పెళ్లికొడుక్కి కాళ్లు కడిగి, కొంచెము గద్గదస్వరములో 'కన్యాం కనకసంప న్నాం......దశపూర్వేషాం......శాశ్వతబ్రహ్మలోక నివాససిద్ధ్యర్థం' అని కొబ్బరిపండూ పిల్లనూ పిల్లవాడి కిచ్చాడు. వాళ్లఉద్దేశము, అనగా ఈ మంత్రకారుల ఉద్దేశము, ఏమిటో! వాళ్లకు ప్రేమసంగతి ఏమీ తెలియ దేమోఅనుకుంటూ ఏమేమిటో ఆలోచిస్తూకూచున్నాను. పెళ్లికొడుకు లేచి మంగళసూత్రము ముడివేస్తున్నాడు. బ్రాహ్మణు లాశీర్వదిస్తున్నారు. అమంగళమేమీ వినపడ కుండా భజంత్రీలు వాయిస్తున్నారు. నాజీవితములో ఇటువంటి క్షణమే ఒకటి జ్ఞాపకము వచ్చింది. కళ్లు కొంచెము చెమర్చినాయి. తల ఎత్తి ఆడవాళ్లు కూర్చు న్న వైపు చూశాను. మా ఆవిడ కూడా ఇంద్రనీలాల లాగ మెరుస్తున్న తనవిశాలనేత్రాలతో నాకేసి చూస్తోంది. మాఇద్దరికళ్లూ కలుసుకున్నాయి. కొంతసేపు పూర్వస్మృతిలో ప్రపంచము మరచిపోయాను. తక్కిన ఆడవాళ్లకళ్లూ తమభర్తలకోసము వెతుక్కుంటున్నట్టు తోచింది నాకు. ఆ అయిదురోజులలోనూ ప్రతిక్షణమూ తమపూర్వానుభవమంతా జ్ఞప్తికితెచ్చుకుని ఆడవాళ్లు అపారమైన ఆనందము అనుభవిస్తా రనుకుంటాను. వాళ్లకు పాపము ఎప్పుడూ వర్తమానమంటూ లే దను కుంటాను. గతము స్మృతికి తెచ్చుకోవడము భవిష్యత్తును గురించి ఆలోచించడము – ఇలాగే వాళ్లకు రోజులు వెడుతూఉంటా యనుకుంటాను. మాపెద్దపిల్ల, అయి దేళ్లది, పెళ్లికూతురుదగ్గర నిలబడి జరిగేదంతా బహు శ్రద్ధగా చూస్తోంది. దానిభవిష్యత్తునుగురించి అదికూడా ఆలోచిస్తూ ఉన్న దేమో.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తలంబ్రాలు పోసుకోవడ మైనది. ఫలప్రదానము లిప్పించి మంగళహారతు లిచ్చి వధూవరులను పీటలమీద నుంచి లేవదీసి ఒక్కసారి విడిదిలోకి తీసుకువచ్చారు. ముడి పడిపోయింది; ఇంక నది బ్రహ్మకుకూడా అభేద్యము.

కావలసిన దేమిటో అయిపోయింది. మూడు ముళ్లూ పడ్డాయి. ఇంకను మిగిలింది ఆడపడుచులాంఛనాలూ, వియ్యపరాలులాంఛనాలూ, అల్లుడులాంఛనాలూ, అల్లుడు అలగడమూ, ఆడపడుచు లలగడమూ, వచ్చిన వాళ్లు అలగడమూ, మధ్యను ఆడపెళ్లివారి ప్రాణాలు తియ్యడమూను. ఎలాగో ఆలాగు వాళ్లదగ్గరనుంచి వచ్చినంత రాబట్టి వాళ్లను దివాలాఎత్తించినంతపని చెయ్యడము. అప్పటికీ ఒక్కళ్లకూ తృప్తి లేకపోవడము.

ఇక పెళ్లికి వచ్చినమగవాళ్లకు పనేముంది? ఏమీ లేదని పోవచ్చునా! పోరు. అయిదురోజులూ ఉండడమూ, ఇంకా వీలైతే తిరిగి గృహప్రవేశానికికూడా రావడమూను. ఇంక నీఅయిదురోజులూ ఇక్కడ కూచుని, భోజనములదగ్గర తగాదా; ఫలహారములదగ్గర తగాదా; భోగము మేళముదగ్గర తగాదా. ఎవ్వళ్లూ ఏమీ నోరెత్తడానికి వీలులేదు; ఇదేమని అనడానికి వీలు లేదు. ఏమన్నా అంటే కోపమువచ్చి లేచిపోవడము. ఈమాత్రము సర్దుబాటు చేసుకోలేకపోతే పెళ్లికి పిలవడ మెందుకని నిష్ఠురములాడడము. ఇటువంటి మహానుభావుల జీవితములు వ్రాయవలెనంటే, వారు ఏయేవివాహాలలో ఎలా దెబ్బలాడినది తప్ప ఇంక వ్రాయవలసినఅంశము ఏమీ ఉండదనుకుంటాను.

ఇంక తాంబూలాలు సేవించి మేజువాణీలదగ్గరకు చేరుతారు. పోనీ, వచ్చినవాళ్లు వాళ్లవిద్య చూచి సంతోషించవచ్చునా--ఊహుఁ; చక్కనిజావళి కాని, శ్లోకము కాని, అష్టపది కాని పాడి అభినయిస్తూ ఉంటే ఎవరో ఒకఅనామకుడు మహావిద్వాంసుడులా ముందుకు వచ్చి 'ఏదీ హిందూస్తానీ పాడవే' అనడము. పాపము, ఎంతకోపము వస్తేమట్టుకు వాళ్లు ఏమి చెయ్యగలరు? హిందూస్తానీ పాటతోటే ఇంకో పెద్దమనిషి 'ఇకనైనా మానావేమీ ఈమాయమల్లులు' అనేది పాడమని తన దేశాభిమానము వెల్లడించడము. నాకు అభినయ మంటే చాలా అభిమానము. వచ్చినజట్టులో ఒక గొప్ప విద్వాంసురాలు ఉన్నదని విన్నాను. సావకాశముగా చూద్దామంటే ఎలాగు? అసహ్యము వేసి ఒక్కరోజైనా అక్కడ కూర్చోలేదు. సనాయిపాటకుడిచేత పాడించి నేనొక్కడినీ అక్కడ కూచుని ఆనందించేవాడిని.

ఎలాగైతేనేమి, అయిదురోజులూ గడచినాయి. అయిదవరోజున కళ్ల నీళ్లు గుక్కుకుంటూ 'అష్టవర్షా భవేత్కన్యా పుత్రవ త్పాలితా మయా......' అని పిల్లను ముఖ్యులైనవా రందరికీ అప్పచెప్పారు. చూచేవాళ్లందరికీ, అందులో ముఖ్యముగా ఆడవాళ్లకు, కళ్ల నీళ్లు వచ్చినాయి.

కూడావిడిగా, పోయినవి పోగా ఉన్నవి పెట్టెలలో సర్దుకుని, నిద్దర్లు లేక, వేళపట్టున తిండిలేక, తిన్నది అరగక, పిల్లలకు పోషణ లేక, నలుగురుపడి ఇంటికి చేరుకున్నాము.

వధూవరులు కుడికాలు ముందు పెట్టి గృహప్రవేశమయ్యారు. మరునాడు సంతర్పణా; ఆరాత్రి భాగవతమూను. ఆమరుసటిదినము భోగమువాళ్లు సంభావన పుచ్చుకుని శెలవు తీసుకున్నారు. ఇంకను, వాళ్లు వెడుతూ ఉంటే వీధివాడుగునా ఊళ్లో మొగపురుగులంతా బారులుతీర్చి నిలబడ్డాయి. పిల్లవాళ్లు చెడిపోతారు; మన మిక్కడుంటే వాళ్లు రారుకదా అని పెద్దవాళ్లు వచ్చారు. పెద్దవాళ్లే చూడగాలేనిది మనము చూడ కూడదా అని కుర్రవాళ్లు వచ్చారు. కొందరు ఊరు పొలిమేరదాకా సాగనంపి బిక్కమొహాలు వేసుకుని వెనక్కు వచ్చారు. కొందరు సాహసముకలవాళ్లు బళ్లతోటికూడా పడవలకాలవదాకా వెళ్లి వాళ్లను పడవ ఎక్కించారు. పడవ గట్టుని దాటుకుంది. లోపలికి తొయ్యవలసివచ్చింది. సరదాగా ఇందులో కొందరు కుర్రవాళ్లు పడవ వడి ఏట్లోకి వెళ్లేదాకా తోశారు. ఇంక మునిగిపోతామేమోనని భయపడి ఇవతలికి వచ్చారు. శెలవుపుచ్చుకు వెడదామంటే భోగమువాళ్లు కనపడలేదు. కొంతదూరము వాళ్లే పడవ లాగినా ముక్తి వస్తుందని రెండుమైళ్లదూరము లాకు దాకా ఒక్కవిసురున లాక్కుపోయారు. పడుచువాళ్లు, పడవలో భోగమువాళ్లు సంతోషిస్తారనే ఉత్సాహమును విసురు కాక్షేమి?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భోగమువాళ్లు ఈలోపున వీళ్లమాట మరచిపోయి, పడవలో ఒకవస్తువునితోటి సంభాషణ ఆరంభించారు. పడవ లాపునగ్గరకు వచ్చింది. ఈపుత్రవాళ్లు పడవలోకి వెళ్లి భోగమువాళ్లను సంబోధించి మేమింక వెడతామని అన్నారు. వీళ్ల నెప్పుడూ జన్మమధ్యమందు చూడనట్టు నటించి, 'చిత్తము, దారే పోయేవాళ్లంతా మాతోటి చెప్పి వెళ్లనక్కరలేదన్నారు. ఈపుత్రవాళ్లకు పైప్రాణాలు పైకెగిరిపోయినాయి. ఒకళ్ల మొగాలు ఒకరు చూచుకున్నారు. మాట్లాడకుండా ఇంటికి చేరుకుని ఒక్కొక్కళ్లు నాలుగు లంఖణాలు చేశారు.

* * * *

నాకు పెళ్లంటే మహా చెడ్డసరదా. ఇంత తొందరా, ఇంత గందరగోళమూ, ఈమేజువాణీలూ, ఈ అకాలపు భోజనాలూ, ఈవేగవులూ, ఈఅనవసంపు ఖర్చులూ లేకుండా ఉంటే మహాసరదాగా ఉంటుంది. వధూవరులు ప్రాజ్ఞులైతేనా, ఇంక నడిగారూ? వాళ్ల పెళ్లి వాళ్లుకూడా ఆనందిస్తా రనుకుంటాను.

---

# భ్రమరకాంత

## వేంపాటి సీతారామయ్యగారు

ఎచట నుండియు వెడలెదో యెవ్వఁడెఱుఁగు?
నేమి కార్యార్థివై యుందొ యెవ్వఁడెఱుఁగు?
నెచట కెచటకుఁబోవుదో యెవ్వఁడెఱుఁగు?
నెటులు మటుమాయమౌదువో యెవ్వఁడెఱుఁ[గు?

భయముభక్తియుఁగఅపుచు భద్రముగను
బెంచదా నిన్ను నీతల్లి పెడసరముగ
ఱెక్కలు విదల్చి తిరిగెద వొక్కతెవును
దోడునీడైన లేక నీ వాడ నాడ.

ఉదయమాదిగఁ జూచుచునుంటి నిన్ను
దారి తెన్నును లేక సవారిపరుగు
లిడుచుఁ దిరిగెద వట్టు లదేమి కతము?
ఇల్లు వాకిలి సంసార మొల్ల వేమొ?

చెట్టుఁజెట్టును దిరిగెదు చేరి నీవు
పుట్టపుట్టకు మ్రొక్కెదు పోయి నీవు
నియమముగఁ దిర్గుచుంటివి నిసువులకయి
నయముతోడుతను బ్రదక్షిణములు నేతొ?

జుమ్మనుచు వ్రాలుదువు ప్రతి కొమ్మపైనఁ
బువ్వుపువ్వుతో మాటాడి పోవుచుందు
వాచిదంబరగోప్యమ్ము నాలకింత
మన్నఁగూడను వినఁబడ దయ్యె నాకు.

ప్రణయకలహాతిభరమునఁ బాసి చనిన
ప్రాణకాంతుని జాడకై పాప మీవు
కాలు బలపమ్ము కట్ట నల్గడల దిరిగి
తిరిగి పతిభిక్ష మెత్తెడు తెన్న దేమొ?

మఱొకవిధముగఁ దలఁపకు మాట కలదు
తప్పు కాకున్న నడుగఁగఁ దలఁచి తదియు
నానవాళ్లను జెప్పు మీయాయనకును
వెదుకఁ బోయెద నేనును వేగిరమ్మె.

చెప్పు మన్నను దల వంచి సిగ్గుపడెదు
క్రొత్తకోడలవో, నీవు - కోమలాంగు
దివ్యరూపము వర్ణింప దృష్టితగులు
నంచుఁ జెప్పవో? మఱియేమొ? యడిగియడిగి
ప్రాణ మొంతయు విసగటఁ బడుచునుండె.

ఆలకించితి నీపతి యానవాళ్ల
నట్టులైనను మీయాయ నందకాఁడె
రూపరేఖావిలాస నిరూఢమూర్తి
నిపుడె నేఁ గాంచివచ్చితి నిదిగో! చూడు!

చేయి చాయగనున్న యాచెట్టుకడను
జాజిపొదచెంతఁ గూర్చుండె సాగి రమ్మ
త్రోవఁ జూపెట్టి నే నంతఁ దొలఁగిపోదు.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




[అంబష్ఠ సూత్రము]

కె. రంగాచార్యులు గారు, యమ్. ఏ., బి.యల్.

(వెనుకటిసంచిక తరువాయి)

"తీక్ష్ణమతిగల యువతిగాని, యువకుఁడుగాని, బాలుఁడుగాని, స్వాత్మీయముఖప్రతిబింబమును ప్రజ్వలంబు, నిర్మలంబునైన యాదర్శములోఁగాని, పాత్రయందుంచఁబడినశుద్ధజలములోఁగాని చూచిన, జడులంబు ముఖమున నున్నయెడల ముఖమున జడులంబున్నవని యును, నట్టిది లేకుండిన లేదనియును గుర్తెఱుంగును."

"మనమును శాంతిమయముగను, బవిత్రముగను, శీలవంతముగను, బాపరహితముగను, నిర్వికారముగను, కోమలంబుగను, దృఢముగను, గర్మచేయుటకు సంసిద్ధముగను నొనర్చినయట్టివాఁడు పూర్వజన్మజ్ఞానముకై మనమును నిగుడించును. ఒకటిగాని, రెంటినిగాని, మూటినిగాని, నాల్గిటినిగాని, పదింటినిగాని, యిరువదింటినిగాని, ముప్పదింటినిగాని, నలువదింటినిగాని, యేఁబదింటినిగాని, నూఱింటినిగాని, వేయింటినిగాని, నూఱుసార్లు వేయింటినిగాని, లేక అనేకములగు లయకల్పములలోఁగాని, సృష్టికల్పములలోఁగాని సంభవించిన తనపూర్వజన్మములను స్మృతికిఁ దెచ్చుకొనును; 'ఆ స్థలములలో జన్మముఁ గాంచితిని. అయ్యది నాకులము అయ్యది నావర్ణము; అట్టిది నాయాహారము; అట్టిది నా సుఖదుఃఖానుభవము. అంతవఱకు నా యాయుఃపరిమాణము. ఆజన్మానంతరమున నాస్థలములోఁ బునర్జన్మము నందితిని. అచ్చట నట్టికులము నామము, వర్ణము, నాహారము, సుఖదుఃఖానుభవము, నాయుర్దాయముఁ గలిగియుంటిని. అచట జన్మము ముగిసినపిదప నిచటనేఁ బునర్జన్మముం గాంచితిని.' ఈరీతిగ నాతఁడు పునర్జన్మములవిషయములను, భేదములను స్మృతికిఁ దెచ్చుకొనును."

"స్వగ్రామమునుండి నరుండింకొకగ్రామమునకుం జని, యచటినుండి వేఱొకగ్రామమునకుం జని, యచటినుండి తిరిగి స్వగ్రామమునకుఁ జేరిన 'నాగ్రామమునుండి యాగ్రామమునకుఁ బోయితిని. అచట నాయావిధముల నిలువఁబడియుంటిని; కూరుచుంటిని; మాటలాడియుంటిని; మాటలాడకయూరకుంటిని. అచటినుండి యారెండవగ్రామమునకుం జని యచటనాయావిధముల నిలువఁబడియుంటిని; కూరుచుంటిని; సంభాషించితిని; మూకుఁడనై యూరకుంటిని. ఆగ్రామమునుండి తిరిగి యిటు చేరితిని' అను నిట్టివిషయములం గుర్తెఱుంగును."

"మనమును శాంతిమయముగను, బవిత్రముగను, శీలవంతముగను, బాపరహితముగను, నిర్వికారముగను, కోమలంబుగను, దృఢముగను, గర్మఁ జేయుటకు సంసిద్ధముగను నొనర్చిన నరుండు జంతూద్భవనాశనజ్ఞానముకై మనమును నిగుడించును. మానవచక్షువుకంటె నుత్తమంబగు దివ్యచక్షువుతో నాతఁడు 'జీవజంతువులు మరణించి వేఱువేఱుగఁ బొందు పునర్జన్మములను దాను బొందును. నీచులును, నుదారస్వభావులును, రూపవంతులును, కురూపులును, సౌఖ్యవంతులును, గడుకష్టములం బడువారును, వారివారి కర్మానుభవానుసారముగ జీర్ణించుటం గనును. "అట్టివారు, ఓభ్రాతలారా! మనోవాక్కర్మముల మహాత్ముల నపవాదల నిరసించుచు, సత్యసిద్ధాంతముల నిరసించుచు, మిథ్యాసిద్ధాంతావలంబనవలన సంభ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వించు కర్మానుభవఫలమును సంపాదించుచు, మరణానంతరమున దేహము జీర్ణించినపిదపఁ బునర్జన్మములలో దుఃఖభాజనులై పుట్టుదురు. ఇతరులైన యట్టియట్టివారలు, ఓ భ్రాతలారా! సుమనోవాక్కర్మల నాచరించుచు, మహాత్ముల నిరసింపక, యథార్థములైనమతములనవలంబించుచు, యథార్థమతావలంబనవల్ల నైనకర్మానుభవఫలమును సంపాదించుచు, మరణానంతరమున స్వర్గమున నానందమయమగు స్థితి నొందుచుఁ, బునర్జన్మము గాంతురు. మానవచక్షువుకంటె నుత్తమంబును, పవిత్రంబును నగుదివ్యచక్షువులతో నాతఁడు జీవజంతువులు మరణించి వేఱువేఱుగఁ బొందు పునర్జన్మములం గాంచును. నీచులను, మహాత్ములను, రూపవంతులను, కురూపులను, సౌఖ్యవంతులను, దుఃఖభాజనులను సుక్షేత్రెఱింగి యట్టివారు వారివారి విహితకర్మానుసారముగ నాశేషముం గాంతురు."

"శృంగాటకములలో నట్టాలములుగల గృహముపై నరుం డుండి, చూచుటకుఁ గన్నులు కలిగి, గృహమును బ్రవేశించువానిని, గృహమును విడిచి చనుచున్నవానిని, వీథిలో నిటునటుఁ దిరుగుచున్నవానిని, చత్వరంబున నాసీనుండై యున్నవానిని సుక్షేత్రెఱింగి 'ఆమనుజులు గృహమును బ్రవేశించుచున్నారు. ఆ మనుజులు గృహమును విడిచి చనుచున్నారు. ఆమనుజులు బాటయందు నిటునటుఁ దిరుగుచున్నారు. మఱియు నామనుజులు చత్వరమున నాసీనులై యున్నారు' అని తెలిసికొనును."

"మనసును శాంతిమయముగను, పవిత్రముగను, శిలవంతముగను, పాపరహితముగను, నిర్వికారముగను, కోమలంబుగను, దృఢముగను, గర్మ చేయుటకు సంసిద్ధముగను నొనర్చిననరుఁడు కామాస్రవ భవాస్రవ విద్యాస్రవములను, తృష్ణాస్రవజ్ఞానమును సంపాదించుటకును, వాని నశింపఁజేయుటకును మనసును నియోగించును (శాసించును). "ఇయ్యది పీడనము" అనుదాని యథార్థస్థితిని సుక్షేత్రెఱుంగును. "ఇయ్యది పీడామూలంబని" అనుదాని యథార్థమును దెలిసికొనును. "ఇయ్యది పీడితోపశమనంబు" అనుదాని యథార్థస్థితిని దెలిసికొనును. "ఇయ్యది పీడోపశమనంబునకుఁ గొంపోవు మార్గంబు" అనుదాని యథార్థస్థితిని సుక్షేత్రెఱుంగును. "ఇయ్యవియే యాస్రవంబులు" అనుదాని యథార్థస్థితుల సుక్షేత్రెఱుంగును. "ఇయ్యదియే యాస్రవమూలంబు" అనుదాని యథార్థస్థితిం దెలిసికొనును. "ఇయ్యదియే యాస్రవనిరామంబు" అనుదాని యథార్థస్థితిం సుక్షేత్రెఱుంగు. "ఇయ్యదియే యాస్రవనిరామంబునకుఁ గొంపోవు మార్గము" అనుదాని యథార్థస్థితిని సుక్షేత్రెఱుంగు. అట్టిజ్ఞానము కలిగి యట్లు పరీక్షించు వాని హృదయంబు కామాస్రవమునుండి విముక్తంబయినది. భవాస్రవమునుండి విముక్తంబైనది. అవిద్యాస్రవమునుండి విముక్తం బయినది. అట్లు విముక్తిఁగనిన వానిలో మోక్షజ్ఞానం బుద్భవించును. పునర్జన్మ నశించినది. ఉత్తమజీవనంబు సాధింపఁబడినది. చేయఁదగిన కార్యములు చేయఁబడెనవి. ఈజీవనానంతరమున మఱి యెద్దియును లేదు."

"పార్వతీదుర్గమునందు నిర్మలమును, స్వచ్ఛమును నైన పల్వలం బొకటి యుండిన నట్టిపల్వలతటంబునఁ జక్షువులుగల నరుండొకఁడు నిలువఁబడి యుండి, శుక్తికలను, శుక్తిపుటంబులను, శర్కరలను, మపలంబులను, బోతాధానంబు కటునటు తిరిగెనను, నొకచో నుండెనను జూడఁ గలుగును. 'పల్వలంబు నిర్మలంబై, శుద్ధంబై యున్నది. అందులో శుక్తికలును, శుక్తిపుటంబులును, శర్కరలును, మపలంబులును, నిటునటు నీదుచున్నట్టి గాని, యొకచో స్థిరముగ నున్నయట్టి గాని మత్స్యసంఘాతములును నవిగో నున్నవి' అని కనుఁగొనును. ఓయీ! యంబష్ఠుఁడా! అట్టినరుం డాచరణయందును, విద్యయందును, బరమావధిం గనును. విద్యాచరణమునం దింతకంటె నున్నతమస్థితి మఱి లేదు."

"అంబష్ఠుఁడా! ఇట్టి యత్యుత్తమవిద్యకును, సదాచరణమునకును జయుగ్గంబులైన యుపాయముఖంబులున్నవి. ఆనాల్గు చెప్పియనిన:—

"ఒకప్పుడు, అంబష్ఠా! ఏపరివ్రాజకుఁడైనను, బ్రాహ్మణుఁడైనను, నిట్టి యత్యున్నతవిద్యాచరణస్థితులను బొందకుండఁగనే (ఇంగన కనంపలు సూచి కాషాయవస్త్రంబులఁ గట్టుటకై) దండమును భుజమున ధరించి 'ఇప్పటినుండి పక్వములై భూపతితము లైనఫలంబులం భుజియించుచుందును' అని యూహించుచు దుర్గమకాననంబులం జొచ్చినను, నట్టివాఁడు విద్యాయుక్తుండై సదా

చరణపరాయణుం డైనవాని సేవకుఁడై యుండుటకు మాత్రము తగియుండును."

"మఱియు నంబష్ఠుఁడా; పరివ్రాజకుఁడుకాని, బ్రాహ్మణుఁడుకాని, యత్యున్నత విద్యాచరణస్థితులను బొందకయే, పక్వములై భూపతితము లైనఫలములం భుజించుస్థితిం బొందక ఖనిత్రపిటకములం జేఁబూని 'ఇప్పటి నుండియు నేను గందమూలాదులనే భుజియించుచుం దును' అని నియమించుకొని, దుర్గమాటవీప్రదేశంబులం జొచ్చినట్టివాఁడు విద్యాయుక్తుండై, సదాచరణపరా యణుం డైనవాని సేవకుఁడై యుండుటకుమాత్రము తగి యుండును."

"మఱియు నంబష్ఠుఁడా! పరివ్రాజకుండుకాని, బ్రాహ్మణుండుకాని, యత్యున్నతవిద్యాచరణస్థితులను బొందకయే, పక్వములై, భూపతితము లైనఫలములను భుజింపలేక, కందమూలములను భుజింపలేక గ్రామనగర ప్రాంతప్రదేశముల నగ్నిదేవున కొకదేవాలయమును నిర్మించి యాదేవు నర్చించుచు, జీవించుచుండిన నట్టివాఁ డత్యుత్తమవిద్యాయుక్తుండై సదాచరణపరాయణుం డైనవాని సేవకుఁడై యుండుటకు మాత్రము తగియుం డును."

"మఱియు నంబష్ఠుఁడా! ఏపరివ్రాజకుం డైనఁ గాని, బ్రాహ్మణుఁడుకాని యట్టి యత్యున్నతవిద్యాచర ణస్థితులను బొందలేక, మఱియుఁ బక్వములై భూపతి తము లైనఫలములను భుజింపలేక యగ్నిదేవు నర్చించు టకుఁ దగినశక్తి లేక, శృంగాటకములలో నొక చతుర్ద్వా రోపేత మగుభిక్షాశాలను నిర్మించి, 'నాల్గుదిక్కులనుండి వచ్చు నేసన్న్యాసినైనను, బ్రాహ్మణునైనను నాశక్త్య నుసారముగ సత్కరించెదను' అని నిశ్చయించుకొని యట్లు చేయుచు నచటువసియించిన నట్టివాఁడు విద్యాసచ్చరిత సంపన్నుఁ డైనవానికి సేవకుఁడై యుండుటకు మాత్రము తగియుండును."

"ఓయీ! అంబష్ఠుఁడా! ఇయ్యవియే యత్యున్న తవిద్యాసచ్చరితులకునైన నపాయముఖములై యున్నవి."

"ఓయీ! అంబష్ఠుఁడా! నీ వీ యత్యున్నతములగు విద్యాసచ్చరితములందు, ఒక్కయాచార్యునివద్ద విద్యఁ గఱచు శిష్యులలో నొక్కఁడుగ శిక్షను బొందితివా?"

"గోతముఁడా! నేనెట్టిశిక్షను బొందియుండలేదు. నేను నేర్చుకొనిన దెంత స్వల్పము! ఈవిద్యయు, సదా చరణయు నెంత ఘనంబులైనవి! నే నట్టివిద్యలో శిక్ష కలిదూరుఁడనై యుంటిని."

"ఓయీ! అంబష్ఠుఁడా! నీ విట్టి యత్యున్నతవి ద్యాసచ్చరితముల పారముంగనక, నీభుజములపై దండ మును ధరియించి, పక్వములై భూపతితము లైనఫలముల భుజియించియే జీవించుటకై కాననములం జొచ్చియుం డునట్లు శిక్షింపఁబడితివా?"

"ఓయీ! గోతముఁడా! అదియైనను లేదు."

"ఓయీ! అంబష్ఠుఁడా! నీ విట్టి యత్యున్నతవి ద్యాసచ్చరితముల పారముం గనక, పక్వములై భూపతిత ములైన ఫలములను భుజియింపలేక, కందమూలఫలములం దినలేక, గ్రామనగరప్రాంతముల నగ్నిదేవునకు దేవాలయ మును నిర్మించుకొని, హవిర్యాగర్చనను జేయుచు జీవనంబు సల్పుచుండునట్లు శిక్షింపఁబడితివా?"

"అదియైనను లేదు, గోతముఁడా!"

"ఓయీ! అంబష్ఠుఁడా! నీ విట్టి యత్యున్నతము లగు విద్యాసచ్చరితముల పారముం గనక, పక్వములై భూపతితము లైనఫలములను భుజియింపలేక, కందమూ లఫలాదులను దినలేక, హవ్యవాహు నర్చింపలేక, చతుష్ప థంబులందుఁ జతుర్ద్వారోపేత మగు భిక్షాదానగృహము నిర్మించుకొని, యేదిక్కునుండియైనను నీకడకుఁ బోవు సన్న్యాసికిఁ గాని, బ్రాహ్మణునకుఁగాని నాశక్త్యను సారముగ భోజనము నొసంగుదునని నీ కెవ్వరలైన బోధించిరా?"

"గోతముఁడా! నాకట్టిబోధ యాచార్యుఁడు చేయలేదు."

"అంబష్ఠుఁడా! అట్లైన నీవు విద్యగఱచు ఛాత్రుఁ డవై యున్నపు డుత్తమంబులగు విద్యాచరణవిషయము లలోనే కాక యట్టి విద్యాచరణవిషయములకుఁ బ్రతిబం ధకములగు చతుర్గుణాపాయముఖంబులయందును శిక్షను బొందకయే యుంటివి. నీ యాచార్యుం డైన పౌష్కర సాది భూసురుఁడు నీయల్పము లైన నియమములనైనను బాటింపకయే నీ కీబోధను గావించెను."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"త్రివేదజ్ఞానసంపన్ను లగు బ్రాహ్మణోత్తములతో సంభాషించెద మని విఱ్ఱవీగు నీవుండితులును, మిథ్యాస న్న్యాసులును, నీచదస్యులును, బందుపాదా...

అంబష్ఠుఁడా! నీఆచార్యుండైన బ్రాహ్మణ పౌష్కరసాది యెట్టి యపకారమును నీకుఁ గావించినాఁడో తెలిసికొనుము."

"కోసలరాజైన ప్రసేనది నరపాలునిచే నీయఁబడిన భూములఁ బౌష్కరసాది బ్రాహ్మణుఁ డనుభవించుచున్నాఁడు. అట్లైనను రా జాతనిఁ దనసముక్షమునకు రానీయఁడు. అతనితో సంభాషించునపు డారాజు ప్రచ్ఛద పటము ప్రక్కనుండియే భాషించును. ఏభూపాలునివలన నాతఁ డిట్టి పవిత్రమైనదియు, ధర్మ్యమైనదియు నగు పోషణమును బొందుచున్నాఁడో యానృపుఁ డెందుల కాతనిసమక్షమునకు రానీయఁడు? అంబష్ఠుఁడా! నీగురువైన బ్రాహ్మణ పౌష్కరసాది నీ కెంత హాని యొనర్చెనో కంటివా?"

"ఓయీ! అంబష్ఠుఁడా! గజారూఢుఁడై కాని, యశ్వారూఢుఁడై కాని, లేక ధరాస్తరణముపై నిలుచుండి సామంతరాజులతోఁగాని, యమాత్యులతోఁగాని యేదియో రాజ్యకార్యముఁగూర్చి చర్చించి చనినపిదప నాస్థలంబున శూద్రుండుకాని, శూద్రదాసుఁడుకాని నిలువఁబడి, 'ఈయావిషయములఁ బ్రసేనదినరపాలుఁడు సెప్పెను' అని యారాజువలెనే సంభాషించినను, చర్చ గావించినను, అట్టివాఁడు రాజగునా? లేక రాజనియోగియైన నగునా?"

"గోతముఁడా! అట్లు కానేరఁడు."

"వేదమంత్రకర్తలును, మంత్రపాఠకులును నైన పూర్వబ్రాహ్మణఋషులు, ఈబహుపురాతనములైన మంత్రముల నేరీతి నేస్వరముతోఁ బఠియించిరో, ఆరీతినే యాకాలపు బ్రాహ్మణులును బఠియించుచుందురు. నీవు వారి శిష్యుఁడవై, వారి మంత్రములు కంఠస్థములై యున్నవి అని చెప్పఁగలిగినను, నీ వంతమాత్రమునను ఋషివి కానేరవు; ఋషుల స్థితిని బొంద నేరవు. అట్టివి యసంభవములు కదా!"

"అంబష్ఠుఁడా! వృద్ధులైన బ్రాహ్మణులును, నీయాచార్యులును, వారి యాచార్యులును సంభాషించుకొనుచున్నపుడు, ఎవ్వారి మంత్రముల మీరు పఠియించుచుంటిరో యాపూర్వఋషులు మీవలెను, మీ యాచార్యునివలెను నాభరణాదుల ధరియించి, సుగంధములఁ బూసుకొని, శిరోజములను గడ్డమును సొగసుగఁ గత్తిరించుకొని, మాలలను, మణులను ధరించుచు, ధవళవస్త్రముల ధరియించి, పంచేంద్రియంబులతో సుఖముల ననుభవించుచునుండిరా?"

"గోతముఁడా! అట్లుండియుండ లేదు."

"ఆపూర్వఋషులు నీవు, నీయాచార్యుఁడు నిపుడు చేయుచున్నట్లు కృష్ణశకలంబులు లేకుండ నేరఁబడి బాగుచేయఁబడిన మేలురకములగు బియ్యముల నన్నముగ వండి, వివిధములగు సూపములతోడను, శాకములతోడను భుజియించుచుండిరా?"

"గోతముఁడా! వారట్లు చేయుచుండుట లేదు."

"అంచలములతోడను, నూర్మ్యాకారాంచుకము లగు వస్త్రాంచలములతోడను గూడినవస్త్రములఁ గటిదేశములం ధరియించు స్త్రీజనము ఈకాలమున నిన్ను నీయాచార్యుని సేవించుచున్నట్లాపూర్వఋషులను సేవించుచుండిరా?"

"వేణీకృత లాంగూల సటాయుక్తములగు గుఱ్ఱములు పూన్చఁబడిన రథముల దీర్ఘములగు దండములను, సృణులను నుపయోగించి తోలుకొనుచు నీవలెను, నీయాచార్యునివలెను బూర్వఋషులు ప్రయాణములం జేయుచుండెడివారా?"

"ఓయీ! గోతముఁడా! వారట్లు చేసియుండ లేదు."

"పరిఖాప్రాకారాదిరక్షితంబై, యవకృప్తపరిఘాయుక్తములగుద్వారములుగలిగి, దీర్ఘఖడ్గంబులం బూనిన సైనికులచే రక్షింపఁబడిన నగరములలో నీవలెను నీయాచార్యునివలెను,బూర్వఋషులు జీవించుచుండెడివారా?"

"గోతముఁడా! వారట్లు చేసియుండ లేదు."

"కాన నోయీ! అంబష్ఠుఁడా! నీవుగాని నీయాచార్యుఁడు గాని ఋషులు కారు. మఱియు వారు జీవించుచున్నట్లు మీరు జీవించుటయు లేదు. ఏది యెట్లున్నను నీ కెద్దానిఁ గూర్చి శంక వొడమినదో దానిఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గూర్చి ప్రశ్నింపుము. వివరణముచేసి నీకు స్పష్టముగ నొనర్చెదను."

అపుడు భాగవతుఁడు కోష్ఠమునుండి బయలునకు వచ్చి యిటునటు పచారుచేయుచుండెను. భాగవతు ననుసరించుచు నాయంబష్ఠుఁ డిటునటుఁ దిరుగుచు నాతఁడు మహాపురుషచిహ్నములైన ముప్పదిరెండింటిలో ముప్పదింటి నామహాపురుషుని దేహముపైఁ గనెను. గుహ్యాంగముం గూర్చియు, నాలుకపొడవును గుఱించియు నీ రెండు చిహ్నములను మాత్రము కనుఁగొనలేక శంకపుట్టి వ్యాకులచిత్తుండై యుండెను.

అంబష్ఠుఁడు శంకాపీడితుఁడై యున్నాఁడని గుర్తెఱింగి, భాగవతుఁడు బుద్ధిచే వస్త్రములలో గుప్తముగ నుండవలసిన యంగము నావేష్టనావృతమై యున్న దానిగ నంబష్ఠునకుఁ గనుపడునట్లు చేసి, నాలుకతోఁ జెవులను, ముక్కును, నుదుటిని గూడ స్పృశించె. బ్రాహ్మణయువకుఁ డగునంబష్ఠుఁడు "శ్రమణుం డగుగోతముఁడు మహాపురుషచిహ్నములు కొన్నిటితోడనే కాక యన్నిటితోడను గూడుకొని యున్నాఁడు" అని వితర్కించుకొనుచు నాతనితో నిట్టు లనియెను:

"గోతముఁడా! నేను బోయెదను. మేము చేయవలసిన పను లధికము లగుటచే..."

"అంబష్ఠుఁడా! నీ కేమి యుక్తమని తోఁచునో యద్దానిని గావింపుము."

అంబష్ఠుఁ డశ్వములఁ బూఁచినరథము నెక్కి యచటినుండి చనెను.

ఆసమయమున బ్రాహ్మణ పౌష్కరసాది బహుబ్రాహ్మణపరివృతుఁడై యుక్కట్ఠమునుండి బయలుదేరి వచ్చి తన యారామములో నాసీనుఁడై యంబష్ఠుని రాకకు వేచియుండెను. అంబష్ఠుఁ డచటికి వచ్చి రథము నకు వీలైనంతవఱకు దానిపైనే పోయి, రథము పోవుటకు వీలులేని ప్రదేశమును జేరినపిదప నద్దానినుండి దిగి పౌష్కరసాది యున్న ప్రక్కదేశమునకుఁ గాలినడకపైఁ బోయి, వానికి నమస్కరించి యాచార్యుని గౌరవించుచు, నాతని కొకప్రక్కగఁ గూరుచుండెను. అతఁ డాసీనుఁడైనపిదప పౌష్కరసాది యాతనితో నిట్లనియెను:

"ఓయీ! అంబష్ఠుఁడా! నీవు భాగవతుని దర్శించితివా?"

"ఆర్యా, మే మాతనిఁ జూచితిమి."

"సరియె, పూజార్హుం డగుగోతముఁడు జనశ్రుతి యట్లున్నాఁడా? అతఁ డట్టివాఁడు కాఁడా?"

"ఆర్యా! జనశ్రుతి యాతనిఁ గూర్చి యేమి చెప్పుచున్నదో యట్లే యాతఁ డున్నాఁడు. అట్లే యున్నాఁడు; కాని వేఱువిధమున లేఁడు. ద్వాత్రింశన్మహాపురుషలక్షణోపేతుండై యాతఁడున్నాఁడు కాని కొన్నిటినిమాత్రమే కలిగియుండ లేదు."

"శ్రమణగోతమునితో నీవేమైన సంభాషించితివా, యంబష్ఠా!"

"ఆర్యా! నే నాతనితో సంభాషించితిని."

"సంభాషణ యెట్లు జరిగెనది?"

అప్పు డాయంబష్ఠుఁడు బ్రాహ్మణ పౌష్కరసాదితో, భాగవతునితోఁ దనకు జరిగెన సంభాషణ యంతయుఁ జెప్పెను. అంబష్ఠుఁడు చెప్పిన దంతయు విని పౌష్కరసాది యిట్లు చెప్పెను:

"ఓహో! బుద్ధిహీనుఁడా! ఓయీ! మూర్ఖుఁడా! ఓత్రివేదజ్ఞానపారంగతుఁడా! ఏమనుజుఁడైన నిట్లు వ్యవహరించిన మరణానంతరమున నేది యొక దుఃఖభాజనంబగుదుఃస్థితిం గలుగఁజేయు పునర్జన్మముం బొందవలయును? అవినీతవచనములతో నీవు నొక్కి ప్రకటించిన యుద్దేశములఁ బూజార్హుండగు గోతమునిచేఁ బ్రకాశితంబులగు తత్త్వములకుఁ గాక వేఱొండు తత్త్వములసం గొంపోవునా? ఎట్టిపండితమ్మన్యుఁడవు! ఎట్టి మూర్ఖుఁడవు! మన త్రివేదములలో నెంతటి పండితుఁడవు!" అని అతి కుపితుండై కాలితోఁ దన్నిన నాయంబష్ఠుఁడు నేలపైఁ గూలెను. ఆసమయముననే తాను భాగవతుని దర్శింపఁ గోరెను.

"ఆర్యా! శ్రమణగోతముని దర్శించుట కిపుడు కాలాతీతమై యున్నది. అర్చనీయుఁ డగుపౌష్కరసాది రేపటిదినమున నట్లు గావింపవచ్చును" అని యచటనున్న బ్రాహ్మణు లాతనితో నివేదించిరి. పౌష్కరసాది కఠినములైనవియు, మృదులైనవియు నగు స్వాదుభక్ష్యము

లను వనగృహమునవే వంచించించి, జ్వలించుచున్న యగ్ని కాష్ఠములవెలుతురుతో వానిని బండ్లమీఁద నుక్కట్టు నషఁ గొంపోయెను. ఆతేఁ డిచ్ఛాసంకలనంబునకు సాధ్య మైనంతవఱకు రథముపైఁ బోయి, రథము పోవుటకు సాధ్యము కానిచోటున దిగి కాలినడకతో భాగవతుఁ డున్నస్థలమునకుఁ బోయి, సామనయంబులును, సౌజన్య సంభాషలును నగు వచనముల భాగవతునితోడను, వాతేఁ డీతనితోడను, నిట్లన్యోన్యము మాటలాడుకొనిరి. అప్పు డాతేఁ డొకప్రక్క నాసీనుఁడై యుండి భాగవతునితో నిట్లు నుచ్చరించెను: "ఓయీ! గోతముఁడా! మదశి ష్యుండైన యంబష్ఠుఁడను బ్రాహ్మణయువకుఁ డిటకు వచ్చెనా?"

"బ్రాహ్మణుఁడా! ఆతేఁ డిచ్చటికి వచ్చెను."

"గోతముఁడా! నీ వాతనితో సంభాషించితివా?"

"బ్రాహ్మణుఁడా! ఔను, నే నాతనితో సంభా షించితిని."

"నీ వాతనితో నెట్టి సంభాషణను గావించితివి?"

అపుడు భాగవతుఁడు జరిగిన వంతయు నా బ్రాహ్మణ పౌష్కరసాదితోఁ జెప్పెను. గోతముఁడు చెప్పినతరువాత పౌష్కరసాది భాగవతునితో నిట్లు చెప్పెను:

"ఆయంబష్ఠుఁ డను బ్రాహ్మణయువకుఁడు, అల్ప ప్రాయము కలవాఁడును, మూఢుఁడును. కాన గోత ముఁడా, యాతని క్షమింపుము."

"బ్రాహ్మణుఁడా! ఆబ్రాహ్మణయువకుఁ డైన యంబష్ఠుని సుఖముగ నుండ నిమ్ము."

మఱియు నాబ్రాహ్మణ పౌష్కరసాది భాగవ తుని దేహముపై నున్న ద్వాత్రింశన్మహాపురుష చిహ్నము లను జూచుచుండెను. రెంటిని తప్ప మిగిలినవాని నీతఁ డుసూడఁ జూడఁగల్గెను. దీర్ఘంబగునాలుకనుగూర్చియు, నాచ్ఛాదితగుహ్యాంగమును గూర్చియు నాబ్రాహ్మణుఁడు శంకించుచుండెను. భాగవతుఁ డంబష్ఠునకుఁ గనుపఱచిన రీతినే పౌష్కరసాదికిని గనుపఱచెను. భాగవతుఁడు ద్వాత్రింశన్మహాపురుషలక్షణములలోఁ గొన్నిటితోఁగాక యన్నిటితోడను గూడుకొని యున్నాఁడని యపుడు పౌష్కరసాది నుర్థారించెను. అపు డాతేఁడు "రేపటిదిన మున" బూజ్యుండగు గోతముఁడు భిక్షువులతోఁ గూడి నాతో భోజనము చేయుట కనుగ్రహించును గాక!" అని భాగవతుని బ్రార్థించెను. భాగవతుఁడు మౌనముతో పౌష్కరసాది యాహ్వానము నంగీకరించెను.

మరునాడు యుక్తకాలమున బ్రాహ్మణ పౌష్క రసాది రతనతోఁ గలిసి భోజనము చేయుట కొప్పుకొన్న గోతమునితో, "ఓయీ! గోతముఁడా! భోజనసమయ మైనది. భోజనము సిద్ధముగ నున్నది." అని నివేదించెను. భాగవతుఁ డుపయమునవే కాషాయవస్త్రముల ధరి యించి యుండుటచే నాచ్ఛాదనమును ధరియించి, పాత్రం బూని, భిక్షువులతో పౌష్కరసాది గృహమునకుఁ జని, తనకై యేర్పఱుపఁబడిన యాసనముపైఁ గూరుచుండి యుండెను. బ్రాహ్మణ పౌష్కరసాది స్వహస్తములతోఁ గఠినమైనవియు, మృదువైనవియు నగు స్వాదుభక్ష్యముల భాగవతునకుఁ జాలు నన్నంతవఱకు వడ్డించెను. భాగ వతుఁడు భోజనమును జాలించి, పాత్రను శుద్ధముగఁజేసి, హస్తప్రక్షాళనమును గావింప, పౌష్కరసాది నీచాసన ముపై నాతనిప్రక్కను గూరుచుండెను.

అట్లాసీనుఁడై యున్న వానితో భాగవతుఁ డీక్ర మమున సంభాషించెను. అనఁగా నాతనితో దానశీలతం గూర్చియు, సదాచరణమును గూర్చియుఁ, గామరాగాదుల వల్లనైన యపాయమును గూర్చియు, నిస్సారత్వమును గూర్చియు, సన్న్యాసమువల్లనైన లాభములను గూర్చియు నుచ్చరించెను. బ్రాహ్మణ పౌష్కరసాది శిక్షితుండై, శమయుతుండై, చేతోవికారరహితుండై, యున్నతమనుం డై, భక్తియుక్తుండై యున్నవాఁడని భాగవతుఁడు గుర్తె ఱింగి బుద్ధునిచే మాత్రము గనుంగొనఁబడిన మతమును బోధించెను. ఆమతము దుఃఖమును గూర్చియు, దుఃఖోత్ప త్తిం గూర్చియు, దుఃఖనాశమును గూర్చియు, సత్పథమును గూర్చియు బోధించును. ఎట్లు పరిశుభ్రముగ మలినము లేని ట్లుతుకఁబడిన వస్త్రమున కే రంగు వేసినను బట్టునో యట్లే యాబ్రాహ్మణ పౌష్కరసాది యచటఁ గూరుచుండియుండఁగనే పవిత్రమును, గళంకరహితం బును నగు సత్యచక్షువును "జన్మ కల ప్రతివస్తువును నశ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్యముగ నాశముం బొందవలయును” అను జ్ఞానమును బొందెను.

అపుడు సత్యమును గని, జయించి, గ్రహించి, లోతును గనుంగొని, శంక లేక, మనోవైకల్యముం జెందక యాత్మధైర్యముం బూని, బుద్ధోపదేశములకై యింకెవ్వానియపేక్షయు లేకయుండువానివలె నీరీతిగ భగవానునితోఁ జెప్పఁ దొడంగెను:—

“ఓగోతముఁడా! (నీవచనంబులు) బహుశ్రేష్ఠంబులు. గుప్తముగ దాఁచఁబడినదానిని వ్యక్తీకరించినట్లును, దప్పుత్రోవలం బోవుచున్నవానికి యుక్తమార్గమును గనుపఱచినట్లును, గన్నులు గలవారు బాహ్యరూపములఁ జూడఁగల్గునట్లును, జీఁకటిలోనికి దీపమును దీసికొని వెళ్లినట్లును, నాకుఁ బూజార్హుఁడగు గోతమునిచే నో ప్రభూ! అనేకములైన యుపలక్షితవచనములచే ధర్మముపదేశింపఁబడినది. ఓగోతముఁడా! దారాపుత్రబంధుమిత్ర సహితముగ నేను బూజార్హుండగు గోతముని మార్గదర్శిగ నెన్నుకొని, గోతముని మార్గదర్శిగను, ధర్మమును సంఘమును నాశ్రయించుచున్నాఁడను. పూజ్యుండగు గోతముఁ డీనాఁటినుండియు నా జీవమును సన్మార్గదర్శిగఁ జూచుకొను నన్ను శిష్యునిగఁ బరిగ్రహించునుగాక! ఏరీతిని బూజ్యుండగు గోతముఁ డుక్కట్ఠమం దితరశిష్యకుటుంబములను జూచుచుండునో యట్లే నాకుటుంబమును గూడఁ జూచును గాక! బ్రాహ్మణులలోఁ గాని, వారి వనితలలోఁ గాని యెవ్వరైనను బూజనీయుండగు గోతమునకుఁ బూజఁ గావించి కాని, యాతని సమక్షమున నిలువఁబడి యుండికాని, యాసనపానీయంబుల నాతని కొసంగి కాని, యాతనియందు సంప్రీతిం జెందునో, యట్టివానికిఁ జిరకాల మయ్యది శ్రేయస్కరమును, సౌఖ్యాస్పదమును నై యుండును.”

“ఓయీ! బ్రాహ్మణుఁడా! నీవు చెప్పినది నిజము.”

అంబట్ఠసుత్తము
సంపూర్ణము



# శ్రీ వేంకటేశ్వర స్తవము

మండలేముల వెంకటశాస్త్రిగారు, బి. ఏ., యల్. టి.

నరుఁ డుదయంబె మేల్కని యనారతమున్ మదిలోన బ్రహ్మత
త్పరుఁడయి చింతసేయుచు దివమ్ములఁ బుచ్చుట యుక్తమందు రే
మరఁదగ దీయెడన్; భువిని మానవకోటులకున్ సమీపమై
మరణము సిద్ధమౌ ననుట మాన్యులు పల్కిరి వేంకటేశ్వరా?

చ. ఘన మగుచిత్తశుద్ధి గలుగంగ నవశ్యము కర్మసంచయం
బనుపమయోగసిద్ధికి సహాయమగున్ దలపోయఁగా నుపా
సనముల బ్రహ్మము న్నెఱుఁగుజ్ఞాన మవశ్యము మోక్షసిద్ధికిన్
వినుఁ డిది తథ్య మందురు వివేకులు ప్రాజ్ఞులు వేంకటేశ్వరా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




చిత్రము ౭

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# దండనముల ప్రయోజనము

పారనంది జగన్నాథస్వామిగారు, యం. ఏ., యల్. టి.

వ్యక్తి చేయకూడని పనిని ఒకదానిని చేసేడని వాని కొకవిధమైన వ్యథ కలుగజేయుటయే దండనము. దండించేవాడు ప్రబలు డైనవ్యక్తి కావచ్చును. లేదా సంఘ మనేపేరుతో ప్రవర్తించే వ్యక్తి కావచ్చును. దండింపబడినవాడు చేసినపని ఒకవ్యక్తికి గాని సంఘమునకు గాని హానికరమైనది అయి యుంటుంది.

ఆహాని వ్యక్తికి చెందేదే అయియుండి, దండించేవాడు ఆవ్యక్తే అయియున్నప్పుడు, ఆవ్యక్తికి ఆహానివల్ల కలిగిన కోపము శాంతింపచేసేటట్లు ఆదండనము ఉంటూ ఉంటుంది; అంతకంటె వేరే ఏవిధమైన సంబంధమూ ఆ రెండింటికీ (అనగా అతనికోపకారణమైన నేరమునకున్నూ, అనేరమువల్ల కలిగిన నష్టమునకున్నూ, అతడు పెట్టిన బాధకున్నూ) ఉండదు; అనగా ఎట్టి సామ్యము గాని, అనుగుణ్యము గాని సాధారణముగా ఉండకపోవచ్చును. రెండూ ఒక్కరకము కావు. ఒకటి ఆస్తిసంబంధమైన హాని యైతే మరొకటి శరీరబాధ అగుట, ఆస్తిని దొంగిలించినవానికి శరీరపీడ కలుగజేయుట; ఒకటి తేలికైన హాని యైతే రెండోది చాలా తీవ్రమైన దగుట; ఒకమేకను దొంగిలించేడని వాడిప్రాణము తీసివేయుట;— ఇట్టివి అందుకు ఉదాహరణములు. ఇట్టి కోపశాంతి దండనమునకు ఒకస్థితిలో ప్రయోజనముగా ఉండేది. ఇది పామరస్థితి. ఆలాగని సవర్లు, కోదులు మొదలైన తెగలలోనే కాని నాగరకులలో కనబడదని చెప్ప వీలులేదు. నాగరకసంఘములకు చెందియున్నా మనస్సు పరిపక్వము కాని మూర్ఖులలోకూడా ఇందుకు ఉదాహరణములు బాగా దొరుకుతూఉంటవి.

ఇది కసితీర్చుకొనుట. ఇది ఆయావ్యక్తులతోను, ఆయాకార్యములతోనూ తుది జెందక, వాడొక నేరము చేసేడనిన్నీ, ఆనేరమునకు అది తగినదే అనిన్నీ ఎక్కడెక్కడ విచక్షణపూర్వకజ్ఞానము సూచనవుతుందో అక్కడక్కడ దండన మన్నభావము ప్రారంభ మైనదన్నమాట. వాడానష్టము కలుగజేసేడు కాబట్టి తానీవ్యథ కలుగజేస్తానని గ్రహించి ప్రవర్తిస్తే ఆచోట కోపశాంతి కార్యమే కాకుండా దండనపూర్వకధర్మస్థాపన కార్యము ఉన్నట్లు స్పష్టమవుతుంది. అప్పుడు ఆపెట్టిన బాధకు ప్రయోజనము కసితీర్చుకొనుటే కాదు. దండనము కసితీర్చుకొనుటకు కాదు అని పరిష్కరించుటకు ఈజ్ఞానము ఉన్నదా లేదా అని తెలుసుకోవలెను. ఈజ్ఞానము స్పష్టముగా ఉంటే, మరొకభావము కూడా



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉన్నట్లు మనము ఊహింపవచ్చును. ఆనేరస్థుడు తనకు కలుగజేసిన నష్టమువంటిది ఇకముందు ఎవడూ కూడా తనకేకాకుండా ఎవరికీకూడా కలుగజేయకూడ దన్న సంగతికూడా దండించేవాని మనస్సులో ఉండవచ్చును. అలాగైనప్పుడు దండనమునకు పూర్వము, దండముయొక్క యెక్కువతక్కువల గురించిన్నీ, స్వరూపము గురించిన్నీ దండించేవాడు కొంత ఆలోచించవచ్చును. ఎందుకంటే, మనుజుడు సాంఘికప్రాణి. ఎంత ప్రాథమికావస్థలో ఉన్నా సంఘక్షేమ మనేభావము వానిమనస్సున పట్టేఉంటుంది. అట్టిక్షేమమునకు భంగకరములైనవి జరగకుండా చేయాలనే భావము ఉదయించకమానదు. ఒక అనర్హ కార్యమువల్ల తనకు జరిగేనష్టమే కాకుండా సంఘమునకుకూడా కొంతహాని జరిగినదని తట్టవచ్చును. దండించేవానికే దండనము విధించేక్షణములోనే తట్టకపోయినా సంఘములో ఉన్న యితరులకు తట్టకతప్పదు. గుంపులలో ఉండేవాళ్లకు అట్టినష్టము తిరిగీ జరగకుండా కాపాడుకోవాలనే ఉద్దేశము పుట్టకమానదు. దానికి మార్గము భయోత్పాదనమని తట్టుతుంది. భయమువలన కార్యనిరోధము అవుతూఉండుట వాళ్లకు బాగా అనుభవములో ఉండుటచేత, భయము కలిగించే దండనముద్వారా ఆహానికరకార్యమును నిరోధించుటకు ప్రయత్నములు సహజముగా జరుగుతవి. కాబట్టి జరిగినహాని, చేసిననేరము, బాధపెట్టే దండనము, ఆదండనమువల్ల పుట్టే భీతి, అభీతివల్ల కార్యనిరోధము, అందువల్ల సాంఘికలాభము-ఇవన్నీ కలిసి దండనస్మృతికి ప్రారంభ మవుతుంది.

దండనము మొత్తముమీద సాంఘికమని చెప్పవచ్చును. గుంపుయొక్క అంగీకారము ఉంటేనేగాని దండించేవానికి బలము, ధైర్యము చాలవు. కసి తీర్చుకొనేటప్పుడు విధించే తీవ్రదండనములవిషయమై కూడా ఈ సాంఘికామోదము ఆవశ్యకమే. గుంపు ఆమోదించాలంటే కసే అయితే చాలదు; కసితో కలిసో కలియకో గుంపుయొక్క లాభము కూడా అవసరమవుతుంది. అందుచేత ఎట్టి పామరస్థితిలో ఉన్న గుంపులోనైనా దండనస్మృతికి బీజములుగా సంఘామోదము ఉండా లన్నమాటే. సంఘామోదమునకు సంఘలాభము ప్రయోజనమైనా, దండించేవ్యక్తియొక్క అపేక్షను బీజముగా కసికూడా ఉండకమానదు. అందుచేత ఎంత నాగరకసంఘములలో కూడా దండనము అనగానే ఈరెండుభావముల మిశ్రమము తప్పలేదని తత్త్వవేత్తలు వాదిస్తున్నారు. అంతే కాకుండా కసితీర్చుకొనే స్వభావమే సాంఘికలాభ మనేవేషమును ధరించి ప్రవర్తిస్తూ ఉంటుందని నూతన మనశ్శాస్త్రజ్ఞులు నిరూపిస్తున్నారు. కాబట్టి దండనముల ప్రయోజనము సాంఘికక్షేమ మని దండనాధికారులు, న్యాయవాదులు, పరిపాలనాధికారులు ఎంత నొక్కిచెప్పినా, తత్త్వపరీక్షకులు మాత్రము కసితీర్చుకొనే స్వరూపమును మరచిపోకూడదు అని చెప్పుతూనే ఉన్నారు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కసితీర్చుకొనే స్వభావము పరిణామములో ఏంతో ప్రాచీనమైనది. జంతువులు ఆహారమునకు పోరాడుతూఉండే నాటినుండీ ప్రాణిజీవనముయొక్క పోరాటములో స్వరక్షణకొరకు తయారైన ఈపశుగుణము మనుజుని చైతన్యమునుకూడా ఆశ్రయించే ఉన్నది. నాగరకత ప్రభావమున మనుజునిలో అణగియున్నది. కాని నశించిపోలేదు. సంఘములో సాంఘికాభిప్రాయము విస్తరించినకొలదీ, మనుజునిలో ఉన్న ఉత్తమగుణములు (దైవసంబంధమైనవని చెప్పవచ్చును) నాటుకొంటూ ఉన్నకొలదీ, ఈ కసితీర్చుకొనే స్వభావముయొక్క ప్రభావము తగ్గుతూ ఉన్నది. కాని ఇప్పటి మనుజునిలో మాత్రము ఈపశుగుణములు ఇంకా ప్రాథమికవాసనల రూపమున నిలిచియున్నవి. అవి ధారాళముగాను, బాహాటముగాను ప్రవర్తించక, వెనకనుండి బలము నిస్తూ ప్రోత్సహిస్తూ సర్వకార్యములకు ప్రకారాంతరహేతువులుగా ఉంటవని అభిప్రాయము. కాబట్టి ఈ కసితీర్చుకొనేప్రయోజనము సంఘక్షేమప్రయోజనముతో మిళితమై దండనముల ప్రయోజనముగా ఉద్రేకిస్తూ ఉంటుందని చెప్పవచ్చును. ఈయభిప్రాయమును మనస్సులో ఉంచుకొన్న ఒక తత్త్వశాస్త్రజ్ఞుడు ధైర్యముగా ఇట్లు వ్రాశాడు: "సంఘక్షేమము కొరకు దండనము విధిస్తున్నామని చెప్పట ఒట్టిమిష. నిజమైన కారణము కసే. అందుచేతనే సంఘమునకు వాస్తవముగా హానికరమైన దండనములను సంఘక్షేమమని పేరుపెట్టి నాగరకప్రజలుకూడా నిలిపియుంచారు."

పశుతుల్యమైన మరణదండము అందుకు ఉదాహరణము. ఎన్నో సంవత్సరాలనుండీ మరణదండము విధిస్తున్నా నేరములుతగ్గలేదు. ఇప్పుడు కూనీనేరమునకు మాత్రమే మరణదండనము విధిస్తున్నా, పూర్వము ఎంతో తక్కువ నేరములకు కూడా దానినే విధిస్తూ ఉండే వాగు. అయినప్పటికీ నేరములు తగ్గలేదు. కాబట్టి తీవ్రదండనములవల్ల సంఘములో నేరములు తగ్గునని వాదించే దండనాధికారులందరూ వారిఅభిప్రాయమును మార్చుకోవలెను. అంత తీవ్రదండనములకు కోపశాంతి తప్ప వేరే మరొకప్రయోజన ముండదు.

కాని క్రమముగా మనుష్యునియెడల సామాన్యభ్రాతృత్వభావము వృద్ధియవుతూ మనుష్యుని పశువుగా చూచుటకు సిగ్గుపడుతూ నాగరకప్రజలు ప్రవర్తిస్తూ ఉండుటచేత నాగరకదేశములలో మనుష్యునియెడల క్రూరత్వము తగ్గుతూఉన్నది. మొత్తముమీద సంఘముక్రూరపుపనులుచూచి సహించకున్నదని చెప్పగలము. అయినప్పటికీ ఇంకా కసిదీర్చుకొనే స్వభావముయొక్క చిహ్నాలు ఉన్నవని చెప్పుటకు మరణదండము ఒక్కటేచాలును. అంతేకాకుండా నాగరకప్రజలమని విర్రవీగుతున్నప్రజలు తమశత్రువులపై చూపే క్రూరత్వము మనుష్యునిలో ఇమిడియున్న పశుత్వమునకు గొప్ప సూచన. ఇందుకు ఉదాహరణములు ఎన్నో కలవు. గ్రంథవిస్తృతిభయముచేత వాటిని విడిచిపెట్టవలసియున్నది.

ఈచర్చవలన దండనములకు సామాన్యప్రయోజనమైనభీతిప్రదర్శనమునింద్యమనిన్నీ,

నిష్ఫలమనిన్నీ స్పష్టము. అందుచేత దండనము లన్నీ శిక్షలుగా మారవలెననిన్నీ, నేరమునకు ప్రతీకారము తీవ్రదండనము గాక భ్రాతృత్వము ఆధారముగా గల సానుభూతి యనిన్నీ, నేరస్థుని భయపెట్టుటకంటె నేరస్థుని స్వభావము సంస్కరించుట లాభకారి అనిన్నీ బుద్ధిమంతులు అంగీకరిస్తున్నారు. దండనము లందుచేత సంస్కారసాధనములుగా ఉండవలె ననే అభిప్రాయము వ్యాపించినది. అప్పుడు దండనముల ప్రయోజనములు వ్యక్తిని బాగుచేయుట, దానిద్వారా గుంపు క్షేమమును చేకూర్చుట అని తేలును. ఇప్పుడు నేరస్థుని సంస్కారముద్వారా సంఘక్షేమము కలుగవలసియున్నది. కాబట్టి ముఖ్యముగా ఆసంస్కారముగురించి విచారించవలసియున్నది గదా! కాని ఆరెండింటిలో ఏ ప్రయోజనమును ముఖ్యముచేస్తే దానిని అనుసరించి ప్రతిక్రియల స్వరూపము మారుతుంది. వ్యక్తియొక్క సంస్కారము ప్రధానమైతే వ్యక్తిని గురించి బాగా తెలుసుకోవలసియుంటుంది; వ్యక్తియొక్క స్వభావము శోధనాపదార్థము అవుతుంది. సంఘక్షేమము ముఖ్యమైతే నేరముల కారణములను బాగా తెలుసుకోవలసియుంటుంది. రెండూ అన్యోన్యసంబంధము కలవి. కాబట్టి మొదట ప్రత్యేకముగా విచారింతము.

ఒకవ్యక్తిని దండింపవలసివచ్చినప్పుడు ఆ వ్యక్తి పూచీ యెంత అని నిర్ణయించవలసివచ్చును. ఈవిషయమై న్యాయతత్త్వజ్ఞులకున్నూ, రోగతత్త్వజ్ఞులకున్నూ ఏకీభావము లేదు; వారు బాధ్యత అనేదానిని వేరువిధములుగా నిర్వచిస్తున్నారు. జతపడిన సాక్ష్యమును పరీక్షించి పూచీ నిర్ణయించేపద్ధతి ఒకరిది. కాని ఈవిచారణవలన వ్యక్తిదండనమువలన సిద్ధించవలసిన సంఘక్షేమము ప్రాప్తింపదు; అట్టి బాధ్యతా నిర్ణయమువలన నేరనిరోధమునకు అవకాశములు ఏర్పడవుకదా. వైద్యులు, మనశ్శాస్త్రజ్ఞులునిర్ణయించేటట్లు బాధ్యత నేరస్థుని నీతిధర్మగుణములతో సంబంధము కలదిగాను, నేరస్థుని మనోనిర్మాణముతో సంబంధము కలదిగాను భావించవలసియున్నది. అప్పుడు నేరస్థుని లోపములను తీర్చుటకు ప్రయత్నించి తిరిగీ నేరకార్యమును చేయనక్కరలేకుండా చేయడానికి వీలు ఉంటుంది. కాని ఇదంతా వ్యక్తిక్షేమకర మైనట్లు సాక్షాత్తుగా సంఘక్షేమకరము కానేరదు. ఇట్టి ప్రయత్నమువల్ల నేరస్థుడైనవ్యక్తియొక్క స్వభావములో ఉన్నలోపమును కనుక్కొని దానిని తీర్చగలిగినచో ఆవ్యక్తి బాగుపడును కాని అందువలన ఇతరనేరస్థుల లోపములు తీరవుగదా. నిజమే. కాని ప్రకారాంతముగా అతని బాగుద్వారా సంఘమునకు క్షేమము కలుగును. ఆబాగుపడినవ్యక్తివల్ల నేరస్థుల సంఖ్యలో ఒకడు తగ్గినట్లు కదా! అంతే కాకుండా ఆవ్యక్తియొక్క మంచినడత ఎంతమందికో మార్గదర్శి అగును. ధర్మబుద్ధి గలవ్యక్తి వాస్తవముగా శక్తిస్వరూపుడు; అందుచేత బాగుపడినవాడు సద్వృత్తిస్థాపనకు సహకారి అవుతాడు. ఉదాహరణపూర్వకముగానున్నూ, ప్రచారకరూపముగానున్నూ ప్రభవిస్తూ సంఘక్షేమమునకు వాడు సాధకుడు అవుతాడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్యక్తిని బాగుచేయడ మనగా వ్యక్తి నేరము చేయకుండా ఉండేటట్లు చేయుట గదా. దండనముయొక్క ప్రయోజనము కూడా నేరనిరోధనమే అయినా, రెండూ ఒక్క విధమైన సాధనములు కావు. దండనమువల్ల బాధ కలుగుతుంది; బాధ అనిష్టము; ప్రతీ ప్రాణికి అనిష్టమునుండి తప్పుకొనుట స్వాభావికము; అట్టి అనిష్టము కలుగుతుం దన్నభయము ఉత్తేజకముగా ప్రభవించి, ఆఅనిష్టము తెచ్చిపెట్టేదానినుండి తప్పుకోవాలని కదా ప్రాణి ప్రవర్తిస్తుంది. అనగా నేరప్రవృత్తికి కారణమైన హేతువు ప్రాప్తించగానే, ఈ అనిష్టభయము ఉద్రేకించి ఆప్రవృత్తికి నిరోధము కలుగుతుంది; క్రొత్తవ్యాపారమునకు వ్యవధి దొరుకుతుంది. ఇదే స్వనిరోధమునకు ప్రారంభము. మనుజునిలో మాత్రము ఈ స్వనిరోధము ఇట్టి బాహ్యసాధనములవల్ల కలగడమే కాకుండా, అంతర్దర్శనమువల్ల ధర్మబుద్ధి మొదలైన ఆధ్యాత్మికాంతరోత్తేజకముల వల్ల ఉదయిస్తుంది. మనుజుడు నాగరకుడు అయినకొలదీ ఇట్టి స్వనిరోధము ఎక్కువవుతూ ఉంటుంది. కాబట్టి దండనములవల్ల లాభము బాగా పొందవలెనంటే, ఇట్టి ఉత్కృష్టస్వనిరోధము ఉదయించేటట్లు చేయవలెనుగదా. అందుచేత మనుజుని అంతరోత్తేజకముల సంగతి తెలుసుకోవలెను. అవి తెలియనిదీ దండనములను ఉపయోగిస్తే కావలసినఫలము కలుగదు. ఏవ్యక్తిని బాగుచేయవలసియున్నదో, ఆవ్యక్తియొక్క మనోవృత్తులు తెలియవలెను. ఒక ఉదాహరణ: సాధారణముగా పిల్లలో కనబడేది దొంగతనము. తన కేవిధాన్న ఉపయోగము లేనిదీ వస్తువులు దొంగిలించి, వాటిని పారవేస్తూ ఉన్న పిల్లలు కనబడతారు. ఇట్టి ప్రవర్తనమునకు వాస్తవమైన కారణ మేదో కనుక్కోనిదీ, ఆ కారణమును నిర్మూలించనిదీ, ఆకుర్రవానిని బాగుచేయు టెట్లు సాధ్యమవుతుంది? ఆ మూలకారణమును ఆలాగే ఉంచివేసి, మీద మీద వ్యక్తమైయే నేరక్రియలను మాత్రము దండనభీతిద్వారా అణచివేస్తే ఆవ్యక్తి బాగు కావడమెట్లు? ఆమూలస్వభావము ఆ నేరమనే ద్వారముద్వారా వ్యక్తము కాక, మరొక ద్వారముద్వారా వ్యక్తమవుతుంది; ఆనేరము పోయినా మరొకనేరము వ్యక్తమవుతుంది. వేరు తీసివేయని ముళ్లపొదవంటిదే ఆనేరస్వభావముకూడా. అందుచేత కారణనిరూపణ చేసి వ్యక్తిని సంస్కరింపని దండనము నిష్ప్రయోజనమే కాకుండా హానికరము కూడా అవుతుంది.

నేరము స్వభావజనకమేనా కావలెను, లేదా పరిసరముల ఫలమేనా కావలెను. స్వభావజనక మైనపుడు ఆస్వభావమును మార్చుట సాధ్యమవునో కాదో పరీక్షించవలసియున్నది. మనుష్యస్వభావము గురించి ఆధునికశోధన విశేషముగా జరుగుతూఉంది. చాలాచోట్ల స్థిరపడిన నేరములన్నీ ఏదో ఒకలోపమువల్ల కలిగినవే అని ఆధునికాభిప్రాయము. లోపమనగా ఆవ్యక్తియొక్క మనోనిర్మాణములో ఉన్నది. దానిని దీర్చుటకు వీలున్నప్పుడు కర్తవ్యము స్పష్టమే. అదిమాత్రము దండనము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కానేరదు. వారికి నేరము చేసినట్లు తెలియదు కూడా. ఎక్కడ నేరము చేసినట్లు బాధ్యతా చైతన్యము కలగదో అట్టిచోట్ల నేరము లేనట్లే అని అందరు తత్త్వజ్ఞులూ అంగీకరించియున్నారు. ఇట్టిదిక్కు ముఖ్యముగా సంఘమర్యాదలను, పరిపాలనశాసనములను బుద్ధిపూర్వకముగా తిరస్కరించినవారి విషయమై కలుగుతుంది. ఈచర్చ నీతిపరమైనది; ఈవ్యాసమునకు అప్రస్తుతము. ఇట్టి బాధ్యతాజ్ఞానము కాక, మనోనిర్మాణలోపమువల్ల కలిగిన బాధ్యతాచైతన్యముగురించి ఆలోచించినపుడు వివాద ఉండనేరదు. అనగా ఒకపిచ్చివానివిషయము ఆలోచించవచ్చును. పిచ్చివాడు చేసిన నేరము నేరమా? స్పష్టముగా పిచ్చిఎత్తిన వారిని గురించి అభిప్రాయభేదము ఉండదు. కాని ఆధునికమనఃశాస్త్రజ్ఞుల పరిశోధనల ప్రకారము, వ్యక్తమైన పిచ్చి లేకున్నా అవ్యక్తమైన పిచ్చి, సామాన్యవ్యాపారములవిషయమై పిచ్చిలేకున్నా కొన్ని ప్రత్యేకవ్యాపారములలో పిచ్చి ఉంటున్నదని అభిప్రాయము. ఇట్టి సూక్ష్మస్థితులవిషయమై శాస్త్రజ్ఞులుతప్ప సామాన్యులు అంగీకరింపరు.

అట్టివ్యక్తులగురించి చేయవలసిన దేమిటి? వారివల్ల జరిగే హానినుండి సంఘమును రక్షించవలసియున్నది. అట్టివాళ్లను సంఘములో నుండి తొలగించి ప్రత్యేకముగా ఒకచోట ఉంచివేయుట ఒకమార్గము. అప్పుడు ఆవ్యక్తి చేయగలిగే హాని జరగదని అభిప్రాయము. ఆవ్యక్తియొక్క లోపము ఎప్పటికీ తీరేది కాకపోతే ప్రశ్న లేదు కాని, అది తీరేదే అయితే అట్టి నిర్బంధమువల్ల ఒకవిధముగా సంఘమునకు లాభము కలుగుతున్నదని అంగీకరించినా, వ్యక్తికి క్షేమము అవునా కాదా అని ఆలోచించవలసిఉంటుంది. నిర్బంధములో ఉన్నంతవరకూ ఆవ్యక్తి హానిచేయకపోయినా, కారాగృహవాసమునుండి వచ్చినతరువాతకూడా హాని చేయలేనివాడే అయియుండకూడదు. అనగా హానిచేసే స్వభావము పోవుట రెండు విధముల జరగవచ్చును. దానిని బాగుచేయుటఒకటి. అది అంగీకారమే కాని ఆయుద్దేశముతో వానిని కారాగృహములో ఉంచితే, ఆనిర్బంధకాలములో వానివిషయమై జరిగించే ప్రయత్నములు అందుకు ఉచితములై యుండవలెను. అందుకు కావలసిన శాస్త్రజ్ఞానము ఆవశ్యకము గదా. అట్టి పరిశోధన ఇప్పటికింకా జరగవలసియున్నది. ఇక రెండో విధము: ఆనిర్బంధములో ఆనేరస్వభావమును అణచివేయవచ్చును; ఇట్టిపద్ధతి చాలా హానికరమని ఇదివరకే చూపించియుంటిని. అంతేకాకుండా ఆఅణచివేయుటలో వ్యక్తియొక్క ఇతరమనోవృత్తులకు చాలాఅపకారము జరగకమానదు. వ్యక్తి మనస్సు చెడిపోవును. కారాగృహవాసమువల్ల చాలామంది ఖయిదీలు చెడిపోతున్నట్లు పరిశోధనలు వ్యక్తపరుస్తున్నవి. సంఘమునుండి తొలగించి, అతడు అలవాటుపడ్డ వ్యాపారములనుండి తొలగించి నిర్బంధించినపుడు, అతనిమనస్సులో క్రమముగా సంఘముపైని ద్వేషము కలుగకమానదు. అందుచేత వ్యక్తికే అపకారము కాకుండా సంఘమునకు కూడా చాలాహాని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చేకూరుతున్నది. వ్యక్తికి అపకారమైన పద్ధతినే అంగీకరించకూడదు. అట్టిస్థితిలో వ్యక్తికీ సంఘమునకూ కూడా అపకారిమైన ఈనిర్బంధపద్ధతినిగురించి వేరే ఖండనఅనవసరము.

వ్యక్తిని బాగుచేయుట అసంభవమైనపుడు కారాగృహనిర్బంధమును అంగీకరించవచ్చు నన్నట్లు మీాద చెప్పియుంటిని. అసంభవము అన్నది నిశ్చయమైతే సరే, కాని ఏవ్యక్తివిషయమైనా ఆలాగు చెప్ప సాధ్యమా? ఆలాగు చెప్పుటకు తగిన శాస్త్రజ్ఞానము ఉన్నదా? ఇక బాగుకాదని నిర్ణయించుట సంభవమా?ఒకవేళ వాదనకని అంగీకరింతము. అట్లుచెప్ప వీలున్నా,ఆవ్యక్తినిఅట్లునిర్బంధించుటధర్మమా?ఏమానవవ్యక్తినైనా నికారించుట మానవనీతా? సంఘక్షేమ మన్నప్రయోజనము మిష కాదని నిరాటంకముగా స్థిరపరచగలిగినా, వ్యక్తులకు భిన్నముగా సంఘమంటూ ఉన్నదన్నా, ఇతరవ్యక్తులకు హాని కలుగకుండా జేయాలన్నా, మరొకవ్యక్తిని నిర్బంధించుట మానవస్వభావమునకు విరుద్ధము కాదా? అందుచేత కారాగృహవాసమును వ్యత్యపేక్షయా పరీక్షించవలసియున్నది.

ఇట్టి అభిప్రాయములు నాగరకప్రపంచములో వర్ధిల్లుతూఉన్నవి. నిర్బంధదండనమును తత్త్వజ్ఞులందరూ నిరసిస్తున్నారు. వీరిఖండనములవల్లనే కారాగృహవాసములో చాలా చాలామార్పులు వచ్చినవి. ఈమార్పులన్నీ లోపలనుండీ విస్తరిస్తూన్న పుండుమీాదరాసిన లేపులవంటివని మనశాస్త్రజ్ఞులు కఠినముగా ఖండిస్తున్నారు. వారి అభిప్రాయమంతా నేరస్థుని మనోనిర్మాణపరీక్ష చేయవలసియున్నదని. నేరముయొక్క కారణమును నిరూపించనిదీ, నేరస్థునిఉద్దేశములనుకనుక్కోనిదీ, ఏమిచేయవలెనో నిశ్చయింప శక్యముకాదని వారివాదము. నేరస్థునికి "శిక్ష"వలనగాని,విద్యవలనగాని బుద్ధి చెప్పవలెను. సంఘములోని పరిసరముల వలన నేరము జరిగేదే అయితే ఆపరిసరములను మార్చవలెను. నేరస్థుని మనోనిర్మాణములో ఏదైనా లోపమున్నదా అని పరీక్షించవలెను. సంఘములో నేరము జరగకూడదన్నదృష్టినుండి, సంఘములో నేరము జరుగుటకు అవకాశము లేపే ఉండకూడ దన్న దృష్టికి మార్పు జరిగవలెను. ఈవిధముగా జరుగుటకు వీలైన సంఘవిధానము ఉండవలెను.

నేరము రోగమువంటి. దన్నదృష్టి కలుగుతూఉంది. ఒకమారు వచ్చినరోగమును చేదుమందులు పట్టి అప్పటికి నివారింపజేసినా వైద్యునికర్తవ్యము పూర్తి కానట్లు, రోగము కలుగకుండా ఎల్లప్పుడూ ఆరోగ్యమే ఉండేటట్లుచేయనంతవరకూ వైద్యునికర్తవ్యము పూర్తికానట్లు, నేరముయొక్క రూపు మాపుచేసి దానిమూలకారణమును తెగగోయనిదే సాంఘికక్షేమము గాని, వ్యక్తిక్షేమము గాని సమకూరినట్లు కాదు.

సంఘములో న్యాయ్యమైన సాంఘికభావము అభివృద్ధికి వస్తే వ్యక్తివాంఛ, సంఘామోదము ఒకటిగా ప్రవర్తిస్తవి. అప్పుడు సంఘము ఆమోదింపని కార్యములను చేయుటకు వ్యక్తి తగ్గుతాడు. అట్టిస్వనిరోధము కఠిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దండములకంటె తీవ్రతరముగా ప్రభవిస్తుంది. దండనమునకున్నూ, నీతికిన్నీకూడా సాంఘికామోదమే బీజమైనా, ఆసాంఘికామోదమునకున్నూ, నాగరకకాలములో నాగరకసంఘములలో నవీనయుగములోఉండే సాంఘికామోదమునకున్నూ తారతమ్యమున్నది. విద్య, బుద్ధి, తర్కము, శాస్త్రజన్యజ్ఞానము, సౌభ్రాత్రము, మానవత్వాదరణము, వ్యక్తిస్వాతంత్ర్యము- ఈసాధనములద్వారా ఉద్భవించిన సాంఘికామోదము ఈయుగములో ఉన్నది. అది ప్రభవించకపూర్వము నేరముల పరిశోధన జరగవలసియున్నది.



# విద్యార్థి

పూడిపెద్ది వెంకటరమణయ్య గారు

ఆరసాలముకొనఁ జివురాకుపుటల
వర్ణసందర్భములఁ గూడఁబలుకుకొంచు
సారెసారెకు గొంతెత్తి చదువుకొనెడు
నాసికము నేర్చు చదువున కర్థ మేమి?

విరిసి నగియెడు దళదరవిందమునకు
బంభరము తత్తరముతోడ వచ్చి మోము
మోముపైఁ జేర్చికొని చెప్పి పోయినట్టి
యారహస్యమునకుఁ గల యర్థమేమి?

తడవతడవకు వీచిహస్తములు నాఁచి
పొలుపు సెడకుండ నభినయపూర్వకముగ
నిరుపమంబైన గంభీర నినద భాష
నావనధి వేయుకూఁకల కర్థ మేమి ?

తొలుతఁ దల నెత్తి మెల్లగఁ దొంగిచూచి
క్రమముగా బైలుపడి యాకసమున కెగసి
సకలదిశలను వ్యాపింప శశి యొసర్చు
నట్టహాసమ్మునకుఁ గల యర్థ మేమి?

ఇటులుగాదని యటు పోయి యిటులు మరలి
మరల నటుపోయి లోన నెమ్మదిగ గొణఁగు
కొనుచు నిత్యము నది యొక్కపనిగఁ బోవు
నల్ల సెలయేటి పరుగున కర్థ మేమి?

చదలమేడను జల్లని జలదపీఠి
నగుచుఁ గూర్చుండి క్రీఁగంట జగముఁ జూచి
రిక్క మూఁరాండకయ పచరించునట్టి
యల్ల కనుగిల్పులకుఁ గల యర్థ మేమి?

ఒక్కపరి మందగతిని వే రొక్క మాటు
పరుగు పరుగున దెసలెల్లఁ దిరుగులాడి
నిత్యచాంచల్యమునఁ గాలు నిలుపలేని
యాపవను తత్తరమ్మున కర్థ మేమి?

పచ్చిచీఁకటి కోక వింత వన్నెఁ బూసి
వెలుఁగు నంతను బిడికిటఁ బెట్టి మూసి
అలుక కులుకులతోడ నిత్యము చరించు
నల్ల కవి తారుమారున కర్థ మేమి?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# మహాబలిపురము

జి. తిమ్మారెడ్డి గారు

మహాబలిపుర మను గ్రామము తూర్పుతీరమున చెన్నపట్టణమునకు 25 మైళ్ల దూరమున నున్నది. దీనికి మామల్లాపుర మనియు, మల్లాపురి యనియు స్థలపురాణమున నామాంతరములు గలవు. ఈనామాంతరములే సరియైన పేర్లనియు, మహాబలిపుర మనునది వాడుకయందుండు వికృతరూపమనియు చరిత్రకారులు చెప్పుచున్నారు. ఈగ్రామము సముద్రపుటొడ్డున నుండుటవలనను, అచట కొన్ని పురాతనమైన కట్టడములుండుట వలనను, చాలమంది యాత్రికులను, చరిత్రకారులను ఆకర్షించుచున్నది. విద్యార్థులు తాము మదరాసున నుండుకాలమున నొక్కసారియైనను సెలవులయందు విలాసార్థముగ ఆగ్రామమునకు పోవకమానరు.

గ్రామమునందలి కట్టడములలో అతిపురాతనమైన విశాలము, ముఖ్యమైనవియు నగు పంచరథములు దక్షిణభాగమునందున్నవి. వీనియందు మొదటిది కొంత వేరుగ నున్నది. మిగిలిన నాల్గును ఒక్కవరుసగ నుండి, 40 అడుగుల యెత్తుగల ఒక్కటే పెద్దరాతి నుండి చెక్కబడినవాటివలె కనబడుచున్నవి. ఈవరుసలో నుత్తర భాగమున నుండునది రెండవరథము, ఇది పూర్తిగ ముగింపబడియున్నది గాని లోపల నొక్కవిగ్రహము కూడ లేదు గావున ఇది ఇట్టిదని నిర్ణయించుటకు సాధ్యముకాదు. మూడవది కడపటిరథము ననుసరించి చిన్నదిగ కట్టబడియున్నది. ఇది 11 అ. వెడల్పును, 16 అ. నిడివియు, 20 అ. ఎత్తును గలది.

నాల్గవది తక్కినవానివలెగాక మిగుల నిడివిగను, చూచుట కందముగను నున్నది. ఇది 42 అ. పొడుగును, 25 అ. వెడల్పును, 25 అ. ఎత్తునుగలదై, పైభాగమంతయు ఒక విన్నమైన కమాను తీర్చబడి, మిగుల రమణీయముగనున్నది. వెలుపలమాత్రము పూర్తిగ చిత్తరువులు చెక్కబడియుండినను లోపలిభాగమున చాల కొంచెము పని చేయబడియున్నది. ఈకట్టడమునందొక పెద్దచీలిక యుండుటచేత అదియే లోపలి భాగమున పనిచేయకుండుటకు కారణమై యుండవచ్చునని చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. ఆచీలిక లోపలివరకును వ్యాపించియుండుటయేకాక కొంత భాగమున కట్టడము శిథిలమై క్రింద బడియున్నది. "దీనిని కట్టినవా రంత నేర్పరులు కాకపోవుటచేత, ఇట్టి కట్టడములు కట్టబడుటయం దిదియే ప్రథమప్రయత్నమైయుండుటచేత గాబోలు,



౧. పంచరథములు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనుభవములేక సాధారణమైన భవనమునందు మిద్దె కాధారముగ నుండునట్లు కొన్నియే స్తంభములను నిర్మించి, పైన నుండునది పెద్దరాయిగావున దాని భారమును మోయ



౨. మొదటిరథము, అన్నిటికన్న పెద్దది

నసాధ్యమై చీలినందువలన, దానినే హెచ్చరికగా గైకొని ముందునకు బోక అంతటితో పనిని చాలించినట్లు తోచుచున్న" దని ఒక్కరు వ్రాయుచున్నారు.

కట్టకడపటి దన్నింటి కంటెను ముఖ్యమైనది. ఇది 27 అ. పొడువు, 25 అ. వెడల్పును, 34 అ. ఎత్తును గల్గియున్నది. పై భాగము పూర్తిగ చెక్కబడియున్నది గాని అడుగు భాగమున నంతగా చిత్రపు పనులు లేవు. లోపలిభాగమున ఏ పనియు చేయబడలేదు. నాల్గవరథపు టవసానమును జూచి జాగరూకులై దీనియందేపనియు లోపలి భాగమున చేయలేదని తోచుచున్నది.

ఈరథపంచకమును కట్టినకాలమును నిర్ణయించుటకు కొన్ని యాధారములు గలవు. మొదటిది అప్పటి శాసనములయం దుపయోగింపబడిన లిపి. ఈలిపి 7-వ శతాబ్దమునకు పూర్వమున వ్రాయబడిన లిపివలె కానవచ్చుచున్నది. భాష సంస్కృతమై యుండినందునను, ఆ ప్రాంతములయందు 10-వ శతాబ్దానంతరము వ్రాయబడిన చోళశాసనము లన్నియు తమిళభాషయం దుండుటవలనను, కట్టడములపై చెక్కబడిన ప్రతిమలు బ్రహ్మవిష్ణుమహేశ్వరులను జూపుచుండుటవలనను, ఈత్రిమూర్తులు ఒక్కచో కట్టడమునందు అంతపురాతనముకాని ఎల్లోరా, ఎలిఫెంటా ప్రదేశములయందు కానబడకుండుటచేతను, ఈకట్టడములు రమారమి 7-వ శతాబ్దమున కట్టబడియుండవచ్చునని యూహింపబడుచున్నది. శాసనములయందు కాలము నుదాహరింపకుండుట మిగుల శోచనీయము.

మహాబలిపురమున జూడదగిన వింతలయందు రెండవది అర్జునతపఃస్థలమని చెప్పబడు నొక పెద్దరాయి దాని కెందుల కాపేరు గలిగెనో చెప్పసాధ్యము కాదు. అది 96 అ. పొడుగును, 43 అ. యెత్తును గలదై, మధ్య స్వాభావికమగు చీలికవలన రెండు భాగములుగ విభజింపబడి యున్నది. రాయి



3. నాలుగు రథములు (౨ మొదలు ౫ వరకు)

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యంతయు చిత్ర విచిత్రము లగు ప్రతిమలతో నిండి యున్నది.

౪. అర్జున తపస్స్థలము

ఎడమభాగమునందు ప్రతిమలు బలిచక్రవర్తియు, పరివారమును, వారి భార్యలును, నలుగురు సైనికులును, ఐదుగురు సన్న్యాసులును అని చెప్పుచున్నారు. గుహాయందొకఋషి తపస్సు చేయుచున్నాడు. ఈమనుష్యవిగ్రహములే కాక సింహములు, పులులు, చిరుతలు, లేళ్లు మొదలగునవికూడ నున్నవి. చీలికక్రింది భాగమున నుండువిగ్రహము బుద్ధునివనియు, అతనిచుట్టు నుండు ఐదుప్రతిమలు శిష్యులవనియుచెప్పెదరు. చీలికమధ్యభాగమున కిరీటయుక్తంబగు శిరస్సుపై ఏడుఫణములు గల సర్పమొక్కటి ఛత్రమువలె నీడ నిచ్చుచుండ, చేతులుపైకెత్తి మ్రొక్కుచుండు విగ్రహము నాగరాజగు వాసుకిదట. ఆవిగ్రహము క్రింద నుండునది వాసుకి తనయయగు ఉలూపిదట.

రాతియందు కుడిప్రక్కన కూడ ననేకప్రతిమ లున్నవి. భార్యాసహితులై కొందరు రాజులును, వారి అనుచరులును, కొందరు ప్రజలును, పక్షులకాళ్లుగల కొన్ని మనుష్యవిగ్రహములును, కోతులును, తపస్సుచేయుచున్న ఒక పిల్లిసన్న్యాసియు, దాని చుట్టు పరుగిడుచు కొన్ని యెలుకలును నున్నవి. ఇవియే కాక ఏనుగులు, పులులు, బాతులు, కోళ్లు మొదలగునవి కూడ నున్నవి. ఈ మృగములన్నియు వానికి స్వాభావికము లగు చేష్టల గనబరచుచు నిజమైన జీవన్మృగములవలె గన్పట్టుచున్నవి.

ఈ రాతిమీది ప్రతిమలు 10-వ శతాబ్దమునకు పూర్వము చెక్కబడియున్న వని చరిత్రకారుల యూహ. కాలనిర్ణయమునకు శాసనాధారములు లేవు. అడవి మృగములును,సాధుజంతువులును, ఏలికలును, ప్రజలును ఒక్కచోటనే చేర్చబడి యుండుటయు, ప్రజలయందనేకు లొక్కరొక్క రొక్కొక్కభార్యతో నుండుటయుజూడ ఇది బౌద్ధమతప్రచారకాలమునకుభూతవయయు, నిరంతరసుఖమును బోధించుటకై చెక్కియుందురని చరిత్రకారు లూహించుచున్నారు.

ముఖ్యముగ మూడవకట్టడము సముద్రపుటొడ్డున నున్న ఈశ్వరదేవాలయము సముద్రమున కిరువది అడుగుల దూరమున నుండుటవలన ఈ గ్రామమును దర్శించువారు సముద్రస్నానమునకు, సాయంకాలవిహారమునకును, అచ్చటి ఇసుకదిబ్బలపై గూరుచుండి విలాసార్థముగ మాటలాడుకొనుటకును, ఈదేవాలయము చాల



౫. సముద్రతీరమునందలి శివాలయము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనుకూలముగ నుండుటవలన అన్నికట్టడములకంటె దీని కెక్కువ ప్రాముఖ్యము నిచ్చుచున్నారు.

ఈదేవాలయము సూర్యవర్మనమునకు మిగుల రమణీయముగ నుండును. రమారమి 1600 చదరపుఅడుగుల



౬. వరాహస్వామి దేవాలయము

వైశాల్యము నాక్రమించుకొని, 60 అడుగుల యెత్తుగల గోపురము గలదై యున్నది. గోపురము కొంతభాగము శిథిలమై యున్నది. దాని కలశము నల్లని నలుపురాతితో చేయబడియున్నది. సముద్రమున కంతసమీపమున నుండుటచే ఉప్పునీటితుంపరలు గాలితో కలిసి సదా తాకుచుండుటచే కట్టడమున నుపయోగించిన రాయి, సున్నము మొదలగు పదార్థములు రసాయనపుమార్పు జెంది కొంచెముకొంచెముగ రాలిపోయినందున చెక్కడపుపనియంతయు కొంతవరకు నాశనమై యుండుటయేకాక కట్టడము శిథిలమగుటకు కారణమాయెను. దేవాలయముచుట్టు నుండు ప్రాకారపుగోడపై నందివిగ్రహము లనేకము లున్నవి. ముఖ్య దేవాలయ మొక పెద్దగట్టుపై కట్టబడి యున్నది. పై కెక్కుటకు మెట్లున్నవి. ఎడమప్రక్క నుండు ద్వారముపైని చిన్నగోపురము దేవాలయముతో గూడ కట్టినది కాదనియు, తరువాత చాలకాలమునకు కట్టినదనియు నూహించుట కాధారములు కలవు. గర్భాలయమునందు పెద్దగోపురమునకు క్రింద 6 అ. 9 అం. చుట్టుకొలతగలిగి నల్లని నలుపురాతితో చేయబడిన లింగ మొక్కటి గలదు. సాధారణముగ లింగమున కధోభాగంబుననుండు పానవట్ట మిచ్చట కానరాదు. లింగాకారము కొంతవరకు శిథిలమై యున్నది. ప్రక్కననే శేషశయానుడగు విష్ణువిగ్రహ మొక్కటి కలదు.

నాల్గవకట్టడము గ్రామముఖ్యమునందుండు వరాహస్వామి దేవాలయము ప్రాకారపు గోడపై వ్రాయబడియుండు పెద్దపెద్ద నామములు అది వైష్ణవదేవాలయ మని చాటును. ప్రథమప్రాకారద్వారోపరిభాగమునందు గోపురము కొంచె మందముగనున్నది. ఈ దేవాలయమునందుమాత్రము నిత్యపూజలు జరుగుచుండును.

పైన వర్ణించిన రెండుదేవాలయములును 17-వ శతాబ్దారంభమున కట్టబడినవని చరిత్రలయందు వ్రాయబడియున్నది. విజయనగరసామ్రాజ్య మస్తమించిన పిదప వెలుగోటివారివంశమునకు చేరిన అచ్చమనాయుడు, సింహమనాయుడు అనువిద్దరు సామంత



౭. ప్రాలదీప స్తంభము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజులు అన్నటనుండిన చిన్నచిన్న రాజుల నోడించి, ఆరాజ్యమును స్వాధీనపరచుకొనిరనియు, సింగమనాయుడు రాజ్యమేలుచుండగా క్షామముసంభవించెననియు, ఆ సమయమున బీదల జీవనోపాయమునిమిత్తము ఈ రెండు దేవాలయముల గట్టుటకు ప్రారంభించిరనియు, క్షామము అంతముకాగానే పనులు చాలించిరనియు చరిత్రకారులు వ్రాసియున్నారు.



౧. ప్రాతదీపస్తంభమునుండి కాన్పించు మహాబలిపురము

గ్రామమునకు పశ్చిమంబున నొక చిన్నకొండ గలదు. దానియందున్నతమైన ఒక పెద్దరాతిపై మండపాకారముగ చిన్నకట్టడ మొక్కటి కట్టబడియున్నది. దీనియందు విగ్రహము లేనికారణమునను, జనావాసంబున కుపయుక్తముగ లేదు కావునను దీనిపైకెక్కి చుట్టుప్రక్కల శత్రువుల రాకను చూచుటకై యిది యుపయోగింపబడుచుండెనని తోచుచున్నది. ఈకొండక్రింద నిలుచుకొని పైనున్న మండపమును జూచితిమేని మిక్కిలి అందముగ కాన్పించును. క్రొత్త విద్యుద్దీపగృహమును నిర్మించుటకు పూర్వము గవర్నమెంటువారీ మండపముమీదనే విద్యుద్దీపమును వెలిగించుచుండిరి.

ఈ మండపముపైకెక్కి సాయంసమయమున పరిసర ప్రాంతముల నవలోకించితిమేని ఆనందదాయకముగ నుండును. తూర్పుదిక్కున ప్రబలతరంగపంక్తులచే ఘూర్ణిల్లుచుండు హిందూమహాసముద్రమును, తత్సమీపముననే ఇసుకదిబ్బలమధ్యమున కెంతయో శృంగారవంతముగ నలరారుచుండు ఈశ్వరదేవాలయమును, దానికీవల అత్యున్నతములై, ఫలవంతములై యున్న నారికేళవృక్షములతో నిండినవనములును, నిర్మల జలపూరితంబులైన రెండు తటాకంబులును, గ్రామమధ్యమున వరాహస్వామి దేవాలయమును, కొండ కడుగు భాగమున విద్యుద్దీపగృహమునకు సంబంధించినవారి నివాసగృహములును కనులపండువుగ గానవచ్చుచుండును. పశ్చిమంబున సస్యవంతములగు పొలములును, వానిమధ్యమున సూర్యకిరణములు ప్రతిబింబించుచుండ చిన్నచిన్న పడవలతో నిండియున్న తూర్పుతీరపు కాలువయు (East coast canal) చూచుట కెంతయో సొగసుగ నుండును. దక్షిణమున పంచరథములును, ఉత్తరమున కొండపైనుండు చిన్నచిన్న కట్టడములును కొన్నిగుహలును కానవచ్చును.

ఈకొండయందు అతిరణచండేశ్వరమండపము మరియొకమండపము గలదు. దానియం దొకగోడను



౨. మహిషాసురసంహారము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శిల్పకారుని నైపుణ్యము నంతయు వెల్లడించునట్టి చెక్కడపుపని చేయబడి యున్నది. మహిషాసురమర్దనము మిక్కిలి శృంగారముగ తీర్పబడియున్నది. దుర్గ సింహారూఢయై, ఒకచేత విల్లు నెక్కిడి, మరియొకచేత ఖడ్గము పూని, అతిరౌద్రాకారమున గదాయుధుండగు మహిషాసురు నెదుర్కొనుట అత్యద్భుతముగ నున్నది. ఇంతటి జీవకళలను గ్రక్కుచుండు ప్రతిమలు ఈగ్రామమున మరెచ్చటను గానరావు.

విశాలమైన యొకబండపై 100 అనుగులయెత్తు గల విద్యుద్దీప స్తంభమును గవర్నమెంటువారు కట్టించియున్నారు. ఈగ్రామము సమీపముననున్న సముద్రభాగము చిన్నచిన్న కొండలతో నిండియుండుటచేతను ఒకటిరెండు ఓడలు నట్టికొండలను డీకొని పగిలిపోయినందువలనను గవర్నమెంటువారట్టి కార్యముగ నీదీప స్తంభమును నిర్మించియున్నారు. ఓడలు మునిగినప్పుడు వానియందుండిన లోహసాధనములు కొన్ని అలలవలన ఒడ్డునకు వేయబడినవనియు, ఇప్పటికిని



౧౧. మహాబలిపురమునకు ౨౧, ౬ మైళ్లదూరముననున్న ప్రశస్త పుణ్యక్షేత్రము



౧౧. క్రొత్తదీపస్తంభము

కొందరియిండ్లయందు నట్టి లోహసాధనము లున్నవనియు నొకవిచిత్రగాథ నాపురవాస్తవ్యుడొక్కడు నాతో చెప్పెను.

ఈమల్లాపురికి మరియొక ప్రాముఖ్యమును చరిత్రకారు లొసంగుచున్నారు. రోము, చైనా, పర్షియా మొదలగుదేశములకు చేరిన నాణెములు కొన్ని ఈగ్రామభూములయందు దొరకుటంజేసి, పూర్వమున నిది యొక పెద్దపట్టణమై యుండవచ్చుననియు, విదేశములతో వాణిజ్యము నడుపుచుండవచ్చుననియు నూహించుటయేకాక, గొప్పచరిత్రకారుల వ్రాతలనుబట్టి తూర్పుతీరమున వర్తకవ్యాపారములకు ప్రసిద్ధిగాంచిన ఒకమహాపట్టణముండి యుండవలయుననియు, ఈమల్లాపురికంటె వేరుస్థలము లేవియు కానరాకుండుటచేత ఇదియే టాలమీగారి మల్లార్ఫా (Ptolemy's Mallarpha) అను పట్టణమని నిర్ధరించియున్నారు. (Theory of Heeran. Historical researches. Asiatic Nations; Vol.II.)



# తారకసంబోధనము

బులుసు పాపయ్యశాస్త్రిగారు

"సుకృతాం వా ఏతాని జ్యోతీగ్ంషి యన్నక్షత్రాణి."

[కృష్ణయజుస్సంహిత—5 కాండ, 4 ప్రపాఠకము.]

మిన్నంటి వెలిఁగెడి మీరలెవ్వారు?
అనురాగభరమెల్ల నాకృతిఁదాల్చి
మినుప్రాఁకి మెఱసెడి మినుకులే మీరు?
ద్వేషపంకంబును వెడలంగఁ గడిగి
చెన్నొందు సమ్మతంపుఁ జినుకులే మీరు?
మీకృత్యముల చేత, మీవాక్కు చేత
సత్కృష్టగుణముల నుర్వి బోధించి,
అమలతేజోమూర్తు లయి దివి నిప్పు
డలరారుచున్న మహాత్ములే మీరు?
తండ్రి కోపంబునఁ దర్జింప నోర్చి,
కాలాహితతిచేతఁ గఱపింప నోర్చి,
మత్తగజాళిచే మట్టింప నోర్చి,
అంతరంగంబున హరిభక్తిఁ బొందు
పర్చి నిల్చిన బాలభక్తులే మీరు?
ఎల్ల రాజ్యంబును దృణముగా నిచ్చి,
సద్గుణపేటిని, సౌందర్యసధిని,
రాచకన్నెను, మహారాజు నర్ధాంగిఁ,
బతిమె దైవం బని భావించుపత్ని;
నొకచెంపఁ బాలు వే ఱొకచెంప నీరుఁ
బారఁ గాఱు నిసుఁగును బుత్రరత్నమును;
గఠినాత్ములకు నమ్మి, కాటికాపరికి
అమ్ముడువోయి యే నాఁడినపగిది
జరపుకొనిన సత్య సంధులే మీరు?
ప్రాణాతురంబైన పక్షిని బ్రోవ
స్వశరీర మిడిన కృపాళులే మీరు?
మింటికి నెగఁ బ్రాకు మేడలు వీడి,
ఊఁగఁ బన్నిన తూఁగు టుయ్యెలల్ వీడి,
కనుసన్న మెలఁగు లెంకల నెల్ల వీడి,
శారీరసౌఖ్యంబు సకలంబు వీడి,
ధరణీరుహచ్ఛాయ తగుబస గాఁగ,
పరుషశిలాస్థలుల్ పఱపులు గాఁగ,
దుష్టమృగంబులె తోడులు గాఁగ,
కాంతుఁడే స్వీయమహా గాఢానురాగ
మున కేకవిషయమై మున్నాడుచుండ,
స్వాంతమెల్లను గాంతు పయినె కదించి,
కానల కరిగిన కాంతలే మీరు?
పగఱకు నిజవధోపాయంబుఁ దెల్పి
ధర మేను వ్రాల్చిన త్యాగులే మీరు?
స్వప్రాణమును గావ జన్మంబుతోన
కలిగిన మహిమాఢ్యకవచకుండలము
లర్థికిఁ గొంకక యర్పించినట్టి
పేరుపడిన దాన వీరులే మీరు?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పలువురు యోధులు బాలు నొక్కరునిఁ
బోరి పాడిఁ దొలంగి పొదివిన వేళ
వెఱవక పోరిన వీరులే మీరు?
వేదముల్ నాలుగు విభజించి యిచ్చి,
నిఖిలపురాణముల్ నిర్మించి యిచ్చి,
వేదాంతసూత్రముల్ విరచించి యిచ్చి,
ధరణి మానవులకుఁ దరణమార్గంబుఁ
దెల్పిన వ్యాసయతిప్రవరుండు
మీలోన నెచ్చోట మెలఁగుచున్నాఁడు?
అఖిలవేదాంతరహస్యమ్ముఁ దెలుపఁ
బ్రజలకు నోరువిప్పని గురుండైన
శుకుఁడు మీలోన నెచ్చో నున్నవాఁడు?
నారులు నరు లెట్లు నడచుకోవలెనో
బోధింప నవతారమును దాల్చినట్టి
జానకీశ్రీరామ చంద్రుల చరితఁ
గావ్యమ్ముగాఁ జేసి కవివర్యులందుఁ
దొంటివాఁ డన్న నిస్తులకీర్తిఁ గన్న
వాల్మీకి యెం దున్నవాఁడు మీలోన?
అఖిలభోగప్రద మైనరాజ్యంబు
విడనాడి, భార్యను బిడ్డను వీడి,
ఏండ్లును బూండ్లును నేకాకి యగుచు,
ధ్యానంబు సేయుచుఁ దపము సేయుచును
గానలఁ దిరుగాడి జ్ఞానంబు నడసి,
యది బోధపర్చిన యమ్మహాత్ముండు
బుద్ధదేవుం డెందుఁ బొల్చుచున్నాఁడు?
ధర్మ మర్థంబును దగురీతిఁ జూచి
రాజ్యమ్ముతోడ ధర్మంబును వ్యాప్తి
నొందించిన యశోకుఁ డున్నచో టెద్ది?
వెలుఁగునె కొల్వుఁడు, పలుఁగె తమంబుఁ
బోకార్చు ననుచును బోధించినట్టి
జరతుష్ట్రుఁ డేఁడి యెచ్చట నున్నవాఁడు?
అపకృతి సేసిన నదియెల్ల సైచి
పగవానియందైన స్వచ్ఛంపుఁ బ్రేమ
మనుఁడని యుత్తమ మార్గంబు బోధ
పర్చిన యాక్రీస్తు భగవానుఁ డేఁడి?
మనమున శ్రద్ధ నిర్మలభక్తిఁ బూని
యీశ్వరుఁ గొల్వుఁడీ, యెల్లమానవుల
సోదరబుద్ధితోఁ జూడుఁడీ యనుచుఁ
దెల్పిన యారబదేశికుం డేఁడి?
బాలసన్న్యాసియై ప్రతిభ వెలుంగ
షణ్మతోద్ధారకాచ్ఛఖ్యాతిఁ గాంచి
నాస్తికమతముల నడుగింటఁ ద్రొక్కి
అద్వైతమును నిల్పినట్టి పూజ్యుండు
శంకరాచార్యుఁ డెచ్చట నున్నవాఁడు?
వాసుదేవపదాబ్జ భక్తి బోధించి
నట్టి పావనులు రామానుజగురుఁడు
మధ్వగురుండు మీ మధ్యనున్నారె?
ఈశుఁ డొక్కండని యెఱిఁగి భజింపుఁ
డనుచు బోధించిన యారామమోహ
నాభిధుం డెచ్చోట నలరుచున్నాఁడు?
పావనచరితు లీశ్వరభక్తియుతులు
గౌరాంగుఁ డేఁడి? తుకారాముఁ డేఁడి?
రామదా సేఁడి? మీరాబాయి యేది?
నందుఁ డెచ్చోట నున్నాఁడు మీలోన?
అనుపమవేదాంత విద్యాగురుం డైన
రామకృష్ణుం డెందుఁ గ్రాలుచున్నాఁడు?
పలు దేశములకేఁగి వాక్పాటవమున
వేదాంతవిద్యను వివరించి చెప్పి
భరతభూమికి మహాప్రఖ్యాతి దెచ్చి
నట్టి మాన్యుఁడు వివేకానందుఁ డేఁడి?

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వంగదేశమ్మున వనితాజనముల
దుఃస్థితిఁ దొలఁగింపఁ దొడరి తదర్థ
మఖిలశక్తియు ధనం బర్పించినట్టి
యీశ్వరచంద్రుఁ డెచ్చోట నున్నవాఁడు?
విద్య వ్యాపింపంగ వెలి వని యెంచి,
సామాన్యజనులును జదువంగఁ దగిన
తెనుఁగున వచనంబుఁ దేటగా వ్రాయ
బాటఁ జూపుచు కాక బాలపితంతు
దుఃఖంబుఁ జల్లార్పఁ దొడరి యనేక
కష్టాలఁ గోర్చిన ఘనుఁడు తా నెందు
వీరేశలింగము వెలుఁగుచున్నాఁడు?
పరదేశ సేనలఁ బాఱంగఁ ద్రోలి
విద్యలఁ బోషించి విస్ఫూర్తిఁ గన్న
విక్రమార్కుం డెందు వెలుఁగుచున్నాఁడు?
భోజరా జెచ్చటఁ బొదలుచున్నాఁడు?
కాళిదాసాతఁ డెక్కడ నున్నవాఁడు?
భవభూతి యెచ్చోట వఱలుచున్నాఁడు?
ఉత్తమగ్రంథము లొగిఁ దెనుంగునను
రచియింపఁగాను మార్గము సేసినట్టి
రాజనరేంద్రుండు క్రాలుచో టెద్ది?
తెనుఁగునఁ గవులకుఁ దెన్ను సూచించి
విఖ్యాతిఁ గన్నట్టి విమలాత్ములైన
నన్నయయును దిక్కనయును నెచ్చోట?
పోతరా జెచ్చటఁ బొదలుచున్నాఁడు?
శ్రీనాథుఁ డెచ్చోటఁ జెలఁగుచున్నాఁడు?
పినవీరభద్రకవిప్రభుం డెచట?
విద్యలఁ బోషింప విమతులఁ ద్రోల
నపరవిక్రముఁ డన్న యశమును గన్న
కృష్ణరాయనరేంద్రుఁ డెచట నున్నాఁడు?
సాకారమైనట్టి శౌర్యమే యనఁగ
దేశాభిమానమూర్తి యనంగఁ గీర్తిఁ
గన్న శివాజి యెక్కడ నున్నవాఁడు?
దేశంబున మహమ్మదీయుల విద్య
నెగడింపఁ బూని యెన్నికఁ బాటుపడిన
సయ్యదహమ్మ దెచ్చట నున్నవాఁడు?
దేశపురోభివృద్ధికిఁ బలుగతులఁ
దెన్ను సూపిన మహాదేవుఁ డెచ్చోట?
దానరాధేయుండు తాత యెచ్చోట?
పచ్చప్ప యెచ్చోటఁ బరఁగుచున్నాఁడు?
ప్రాచ్యపాశ్చాత్యవిద్వత్ప్రథితుండు
రామకృష్ణుం డెందుఁ గ్రాలుచున్నాఁడు?
సంస్కృతభాషకు సంపూర్ణమైన
యసమానమైనట్టి వ్యాకరణంబు
నిచ్చినపాణిని యెందున్నవాఁడు?
దేశంబునకు నన్యదేశీయులైన
ప్రభుపాలనమున వఱలు కష్టములఁ
దొలఁగింపఁ బ్రాణముల్ ధారవోసిన మ
హాత్ములౌ నౌరోజి, యల కాశినాథుఁ
డేరి? ఫిరోజుషా యెం దున్నవాఁడు?
శ్రీకృష్ణదాసుండు శిశిరకుమారుఁ
డానందమోహనుఁ డల సురేంద్రుండు
చిత్తరంజనుఁ డెందుఁ జెలఁగుచున్నారు?
అతులయశుం డయోధ్యానాథుఁ డేడి?
అడరు నెచ్చట ననంతాచార్యవరుఁడు?
రంగయ్యనాయఁ డేప్రక్క నున్నాఁడు?
ఏరి సుబ్రహ్మణ్యు లిరువురు ఘనులు?
మృదుమధురోక్తిఁ బృథుకీర్తి గాంచి,
రాజనీతిజ్ఞుఁ డన్ ప్రఖ్యాతి వడసి
చిన్నమంతయు దేశసేన యేమఱక
ప్రతిపక్షులకు నేని ప్రస్తుతిపాత్ర



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైనగోపాలుఁ డెం దలరుచున్నాఁడు?
తెరువమై సత్యాంశుల దెల్పి యెన్నెన్నొ
పడరానిబాములు పడి పడి దినము
పొచ్చినయట్టి యాశూరనర్యాఁడు
బలవంతరా వెందు నలరుచున్నాఁడు?

బ్రహ్మవిద్య మఱుంగు పడినది మరల
బ్రచురంబునేసిన పణఁతి బ్లావట్స్కి,
యాక్కట్టు నెచ్చోట నలరుచున్నారు?
ఇంకను మహితాత్ము లెందఱు గలరొ
మీలోన నది శక్యమే మాకుఁ దెలియ?

---

# తరంగగానము

పాతూరి అంజయ్యగారు

ప్రణయశాలి:—

కనులనేని విచ్చి కాంచని కామిని
నాశ్రయించి తిరుగునట్టి చదువు
నేర్చికొంటివోయి, నీరజముకులాంగ
ణముస రొదలుసేయు భ్రమరముకడ.

తిరస్కృతుఁడు:—

"చేతిలోఁ జేయివైచి వచించినావు
"ధన్యుఁడ మఱువకురా పాదదాసి" ననుచుఁ
గనుల నీళులతోఁ గాళ్లు కడుగుచున్న
గాని దయరా దదేమె పాషాణహృదయ!"

అతృప్తుఁడు:—

చరణములు రావ్రు, కన్నీరు జాలుకొనెమె
"పోధు"నని చెప్పుటకుఁ గూడ రాదు మనసు
అంగుళులఁ జుట్టుచున్నావు కొంగు నింక
నెటులు పోయెదురా జీవితేశ విడిచి!

భయశీల:—

చైత్రఋతువు వచ్చె, సఖుఁడ విదేశమేఁ
గకుము; ఏఁగెదేని సకలమదన
గోష్యకాళి వెంటఁ గొనిపొమ్ము, తెత్తువు
గాని తిరిగివచ్చు కాలమందు.

ప్రమన:—

వయసుపిరుల బోర్లపడుదాన గర్వమ్ము
పడెదొ విచ్చువిరుల వలపుఁ జూచి
భువనమోహనంపుఁ బున్నమజాబిల్లి
మెలపుఁ జూచి కాఱుమెఱపుఁ జూచి.

శరన్మయి:—

మగువ కెమ్మోవి నటియించు నగవునందుఁ
గాంత శారదశశిరేఖ కరఁగిపోయె
అతులసౌభాగ్య భువనమోహనములైన
తారకలయందునఁ దమిస్ర దాఁగికొనెమె.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ఆంధ్ర మహాసామ్రాజ్యము

వల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

(వెనుకటిసంచిక తరువాయి)

చష్టన వంశము

నహపానుని శాసనములందలి సంవత్సరములను 'ఈవర్షములే కాని యాసంవత్సరములు కావు' అని చెప్పుటకు వీలిచ్చు సూచనమైనను ఆశాసనములలో లేకపోవుటచేత అవి వివాదాస్పదములైనవి. అవి శకవర్షములని వాదించినవారు కలరు: అవి మఱియేవియైనను గావచ్చును కాని శకవర్షములు కావని వాదించినవారును మఱికొందరు కలరు. అందువలన మనమిపుడు శకవర్షములపక్షమో, విక్రమ సంవత్సరములపక్షమో యవలంబించి, నహపాన సంవత్సరము లాపక్షపు వెందుకు కాగూడదో విచారింపవలసియున్నది. మాటవరుసకు నహపానుని శాసనసంవత్సరములను శకవర్షములనియే యందము: అవి శకవర్షములు కావని వాదించువారును గలరని యీవఱకే చెప్పబడినది. అందులకు వారికిగల కారణము లరయవలసియున్నది. ఈవాదమును గుఱించి తెలిసికొనుటకు ముందు మనము రెండవ క్షత్రప వంశమునుగుఱించి విచారింపవలయును. దానిని గుఱించి తెలిసికొనినచో నహపానసంవత్సరములు శకవర్షములు కావనువారి వ్యతిరేక వాదము సులభముగ బోధపడగలదు.

పశ్చిమహిందూదేశమును పరిపాలించిన రెండవ క్షత్రపవంశమును చష్టనవంశమందురు. ఏలయన చష్టనునినుండియే యావంశమున కధికారగౌరవములు లభించినవి. ఈవంశమువారు చష్టనునినుండి ఎనిమిది తొమ్మిది తరముల వఱకు వంశపారంపర్యముగను, అవిచ్ఛిన్నముగను చష్టనసముపార్జితమైన రాజ్యము ననుభవించియున్నారు. ఈవంశమువారి నాణెములును, శాసనములునుగూడ ననేకములు గానవచ్చుచున్నవి. వాటిననుసరించి యావంశము వారి యనుక్రమ మిట్లు తెలియవచ్చుచున్నది. (చూ. వంశవృక్షము)

ఇట్లు అవిచ్ఛిన్నముగను, వంశపారంపర్యముగను బరిపాలించిన యీచష్టనవంశమునకును, క్షహరాతవంశమునకును సంబంధమేమైన గలదా? ఇది యెప్పటిది? క్షహరాతులకు పూర్వము పరిపాలించిన వంశమా? పరమున బరిపాలించిన వంశమా? ఈవిషయము లిక తేల్చుకొనవలెను.

నాణకపరిశోధకులును, శాసనపరిశోధకులును గూడ ఈవంశము నిరాక్షేపముగా శకవంశమనియే యభిప్రాయ మిచ్చియున్నారు. ఒక్క క్షహరాతవంశజుడగు నహపానుని విష

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

యమున నే అతడు శకవంశజుడా? పహ్లావవంశ
జుడా యని భేదాభిప్రాయములు పుట్టినవి.
చష్టనవంశము శకవంశమే యని నిశ్చయముగ
జెప్పినట్లే వారివంశమునకును, క్షహరాతవంశ
మునకును సంబంధము లేదనియు నిశ్చయముగ
జెప్పుచున్నారు. శాసనముల ననుసరించి కాని,
నాణెముల ననుసరించి కాని యీ రెండువంశ
ములకు నేమాత్రము సంబంధమున్నట్లు పొడ
కట్టదు.

ఇక రెండవవిషయము ఈవంశము ఎప్ప
టిది యని. ఈ విషయమునగూడ మఱల
భేదాభిప్రాయములు కలవు. ఈవంశము క్షహ
రాతవంశమునకు సమకాలీన మనువారు కొం
దఱు; ఆ వంశమునకు దరువాతి దనువారు
కొందఱు. అంతేకాని యెవ్వరును గూడ ఇది దా
నికి పూర్వపుదని చెప్పియుండలేదు. అది సమ
కాలినమైన దన్నను, తరువాతి దన్నను
అందులకు కారణములు తెలిసికొనవలయును.

రెండవ క్షత్రపవంశజులైన చష్టనాదులు
క్షహరాతవంశజులకు పూర్వులని ప్రధానముగ
అయిదుకారణముల ననుసరించి చెప్పవచ్చును:
అవి యేవన (౧) నాణెములు (౨) శాసనలిపి
(౩) నిర్మాణాదికములు (౪) విదేశీయుల వ్రాత
లు (౫) పరిపాలితదేశములు. వీటి నొక్కొ
క్కటిగ వివరముగ దెలిసికొందము.

౧. చష్టనవంశజుల నాణెములనేకములు
దొరకినవి. ఈవంశములోని మొదటి పేరు
య్సామోతికునిది. ఈపేరు కేవలము నాణె
ములను బట్టియే తెలియవచ్చెను. చష్టనవంశ
జులు తమనాణెములమీద తండ్రికొడుకు లిరు
వురిపేర్లను వ్రాసికొనుట యాచారము. ఇదియే
య్సామోతికుని పేరు తెలియవచ్చుటకు
సాధనమైనది. య్సామోతికుడు చష్టనుని
తండ్రి. ఇతని నాణెములు గాని, శాసనములు
కాని దొరకలేదు. చష్టనునివి నాణెములు
మాత్రమే దొరకినవి. వాటి ననుసరించియే
చష్టనుడు రెండవ క్షత్రపవంశమున రాజ్యము
చేసినవారిలో మొదటివాడైయుండునని యూ
హింప నవకాశము కలిగెను.

చష్టనునివి క్షత్రప, మహాక్షత్రప బిరుద
ములతోనున్న నాణెములు కానవచ్చినవి.
నహపానుని నాణెములమీదవలెనే ఇతనినా
ణెములమీదను ఒకవైపున గ్రీకు లిపితోను,
రెండవవైపున బ్రాహ్మీ, ఖరోష్ఠీలిపులలోను
పేర్లుకలవు. ఈతని నాణెములను బరిశీలింపగా
వాటిలో గొన్నిటిమీద నొకవిధమైన ము
ద్రయు, మఱికొన్నిటిమీద నింకొకవిధమై
నముద్రయు నున్నట్లు కనబడును. ఒకరకము
నాణెములమీద చంద్రరేఖ నక్షత్రముల ము
ద్రలుకలవు. చంద్రరేఖయు, నక్షత్రమును
పార్థియాదేశపు నాణెములమీదగూడ నుండు
ను. చంద్రసూర్యుల కివి చిహ్నము లందురు.
ఈచిహ్నములును, ఖరోష్ఠీ, గ్రీకులిపులును
ఈ వంశమువారు ఉత్తరహిందూదేశముతో
సంబంధము గలవారనుటను స్థిరపఱుచుచు
న్నవి. రెండవరకము నాణెములమీద చంద్ర
రేఖయు నక్షత్రమునే కాక ఖండవృత్తాకార
ముగల మూడుతోరణములతోడి చైత్యమును
గలదు. అందు చైత్యమే ప్రధానముగను, చం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్రరేఖానక్షత్రములు వాని కిరుప్రక్కలను ఉండును.

చైత్యముద్రకల నాణెములు ప్రత్యేకము ఆంధ్రరాజులవేయనియు, అవిసామాన్యముగా ఆంధ్రులు పరిపాలించిన దేశములలో చెలామణియగుచుండెననియు మనకుదెలియును. అంతేకాక యట్టిముద్రకల నాణెములను ఆంధ్రులే కాని మఱియితరులెవ్వరు ఆంధ్రులకు పూర్వము వాడినట్లు ఇంతవఱకు దొరకిన ప్రమాణములనుబట్టి తెలియరాదు.

అందువలన చష్టనుడు సాతవాహనుల నాణెములమీది ముద్రననుసరించియే తన నాణెములమీదను చైత్యముద్ర నచ్చొత్తించియుండును. ఇంతవఱకు దొరకిన సాతవాహనరాజుల యొక్క మొదటి నాణెములు గౌతమీపుత్త్రునివే కావున ఆతనినాణెములనే చష్టనుడు అనుసరించియుండవచ్చును. గౌతమీపుత్త్రుడు నహపానుని ఓడించి, క్షహరాతవంశము నుమ్మూలించి పశ్చిమ క్షత్రపరాజ్యమున దనబావుటా నిలిపి పరిపాలనము సలిపినవాడగుటచేత ఆప్రాంతముల చెలామణిలో నుండిన గౌతమీపుత్త్రుని నాణెములనే అనుకరించి చష్టనుడుతనచైత్యముద్రగలనాణెములను అమలులోనికి దెచ్చియుండుననినిశ్చయింపదగును. గౌతమీపుత్త్రునికి చష్టనుడు పూర్వుడేయైనచో చష్టనుని నాణెములమీద చైత్యముద్రిక కాస్పింప నవకాశముండదు. అందువలన చష్టనాదులు క్షహరాతవంశజుడైన నహపానుని ఓడించిన సాతవాహన వంశజుడగు గౌతమీపుత్త్రాదులకుఅయితే సమకాలికులును, లేనిచో తరువాతివారును కావలెనుగాని వారికి పూర్వులుకారని పైవిషయములవలన దేలుచున్నది. చష్టనుడు మొదలగువారు గౌతమీపుత్త్రాదులకు దరువాతివారు లేక సమకాలికులనియే తేల్చినచో వారు నహపానునికి పూర్వులు కారని వేఱ చెప్పనక్కరలేదు.

౨. ఇక రెండవవిషయము: చష్టనుని నాణెములే కాని ప్రత్యేకశాసనములు దొరకలేదని యిదివఱకే తెలుపబడినది. చష్టనునియొక్క కొడుకు జయదాముడు. జయదామునివి నాణెములే కాని శాసనములు కానరాలేదు. ఆతని నాణెములమీద క్షత్రపబిరుదము మాత్రమే యుండుటవలన నతడు మహాక్షత్రపుడుగ పరిపాలింపలేదనియు, క్షత్రపుడుగమాత్రమే పాలించెననియు నూహింపవచ్చును: అనగా చష్టనుడు మొదట క్షత్రపుడుగను, పిదప మహాక్షత్రపుడుగను పాలించెను; అతనికొడుకు క్షత్రపుడుగమాత్రమే పాలించెను; మహాక్షత్రపపదవి నందనేలేదు. జయదామునికొడుకు రుద్రదాముడు. ఇతనివి నాణెములును, శాసనములును గూడ చాలగ గానవచ్చినవి. వాటి ననుసరించి యతడు క్షత్రపుడుగను, పిదప మహాక్షత్రపుడుగను పరిపాలించినట్లు తెలియును.

రెండవక్షత్రపవంశజుల మొట్టమొదటి శాసనములు అంధౌలో దొరకినవి. ఈ గ్రామము 'కచ్ఛ' సంస్థానములోని ఖేద్వానగరమునకు సమీపమున నున్నది. ఈయంధౌ శాసనములలోని లిపి నహపానుని శాసనములందలి లిపికంటె చాలపరిణామమును బొం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దినదని లిపిశాస్త్రజ్ఞులయభిప్రాయము. దక్కను దేశప్రాచీనచరిత్రమును విరచించిన డుబ్రాయిల్ గారును, ఇంక మఱికొంద ఱితరులును గూడ నిట్లే యభిప్రాయపడినారు. అంధ్రశాసనములు చష్టనునినాటివే యైనయెడల ఆశాసనములందలి లిపి నహపాన శాసనములందలి లిపికంటె మార్పునుపొంది యభివృద్ధిని సూచించుచున్నదని తజ్ఞు లభిప్రాయపడుచున్నారు కావున నాలిపిననుసరించి నహపానునికంటె చష్టనుడు తరువాతివాడని నిస్సంశయముగ నుడువవచ్చును. అయితే ఆ శాసనములు చష్టనునినాటివగునా కాదాయని యొకపెద్దచర్చ కలదు. చష్టనుని ప్రత్యేక శాసనము లేవియు దొరకలేదని యీవఱకే తెలుపబడినది. అందువలన నివి కేవలము ఒక్కచష్టనునివే యనిచెప్ప వీలుపడదు. ఏలయన ఆశాసనములలో "రాజ్ఞా చాష్టనస య్సామోతికపుత్రస రాజ్ఞా రుద్రదామస జయదామపుత్రస వర్షే ద్విపచాశే" అని ప్రాకృతమున గలదు. ఇందలి యన్వయమును గుఱించి పలువురు పండితులు పలువిధముల చర్చించియున్నారు. పైదానికి ఉన్నరీతిని 'య్సామోతిక పుత్త్రుడైన చష్టన రాజుయొక్క, జయదామ పుత్త్రుడైన రుద్రదామ రాజుయొక్క యేబదిరెండవ సంవత్సరమున' అని యర్థము చెప్పదగును. దీని ననుసరించి కొంద ఱీశాసనములు చష్టనునియొక్కయు, అతని మనుమడైన రుద్రదాముని యొక్కయు ఏబదిరెండవ సంవత్సరమున వ్రాయబడిన ట్లూహించినారు: అనగా వారి యభిప్రాయప్రకారము చష్టనుడును, అతని మనుమడు రుద్రదాముడును ఒకేకాలమున కలిసి పరిపాలించుచుండిరని స్పష్టమగుచున్నది. జయదాముడు నాణెములనుబట్టి క్షత్రపుడుగ మాత్రమే అనగా యువరాజుగమాత్రమే పరిపాలించెనని తెలియవచ్చుటను బట్టి అతడు మహాక్షత్రపుడుగ అనగా రాజుగా రాజ్యము చేయలేదని స్పష్టమగుచుండుటచేతను, ఆతనికొడుకు క్షత్రపుడుగ పాలించినట్లు తెలియవచ్చుటచేతను, చష్టనునియొక్కయు, రుద్రదామునియొక్కయు పేర్లతో శాసనములు కానవచ్చుటచేతను చష్టనుడు మహాక్షత్రపుడుగ రాజ్యమేలుచుండినకాలముననే జయదాముడు గతించియుండుననియు, అటుపిమ్మట చష్టనునికాలముననే అతనిమనుమడు రుద్రదాముడు క్షత్రపుడై (యువరాజు)యుండుననియు, అంధ్రశాసనములు వారిరువురునుగలిసి పరిపాలించుచుండిన కాలమునాటివే యనియు వారివాదము. ఇది సరియైనవాదము కాదని యాక్షేపించువారును గొందఱు కలరు. అంధ్రశాసనములు ప్రత్యేకము రుద్రదామునివనియే వారియభిప్రాయము. ఇట్టివారిలో డుబ్రాయిల్ గారొకరు. ఈపై నుడివినశాసనములు చష్టనరుద్రదాములిరువురికిని సంబంధించునవే యైనచో 'రుద్రదామసచవర్షే' అని 'రుద్రదామస, పదమునకుపిదప 'చష్టనుని యొక్కయును, రుద్రదామునియొక్కయు, నని యర్థమిచ్చు 'చ' కాని, అట్టి యర్థమువచ్చుట కనువైనరీతిని ఆపదరచన మఱియొకవిధముగగాని యుండవలయునని వారి వాదము. అట్లు లేదు కావున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆశాసనములు కేవలము రుద్రదామునికిమా
త్రమె వర్తించునని వారందురు; కాని యీవిధ
ముగ వాదించు డుబ్రాయిల్‌గారు దాని నీవిధ
మున ఇంగ్లీషులోని కనువదించియున్నారు:

"In the 52 nd year, in the reign of Rudradaman Son of Jayadaman, grandson of Chashtanı and grıat grandson of ysamotika."

య్సామోతికుని ప్రపౌత్రుడును, చాష్ట
నుని పౌత్రుడును, జయదాముని పుత్త్రుడును
అగు రుద్రదాముని పరిపాలనమున ఏబదిరెం
డవసంవత్సరమున అని పై ఆంగ్లానువాదమున
కర్థము. 'చ' అను అక్షరము మూలములో
లేదని వాదించు డుబ్రాయిల్ దొరగారు తెలు
గున 'మరిన్ని' అని యర్థమిచ్చు 'అండ్' పద
మును, 'పౌత్రు'డని యర్థమిచ్చు 'గ్రాండ్‌సన్'
పదమును, 'ప్రపౌత్రు'డని యర్థమిచ్చు 'గ్రేట్
గ్రాండ్‌సన్' పదమును వాడియున్నారు: ఈ
యర్థమును స్ఫురింపజేయు పదములైనను
మూలములో లేనిదే డుబ్రాయిల్‌గారిట్లు ఆం
గ్లాను వాదముచేయుట విచిత్రముగ కాన్పిం
పకపోదనియు, వారి ఆంగ్లానువాదము ప్రకా
రమే యుండవలసివచ్చినచో మూలమున
"య్సామోతికప్రపౌత్రస, చష్టనపౌత్రస,
జయదామపుత్రస రుద్రదామస" అని యుం
డు ననియు, హేమచంద్రరాయ చౌదరి
గారు వ్రాయుచున్నారు. అంతేకాక చష్టన,
రుద్రదాములకు నడుమనున్న జయదామునికి
మూలమున రాజబిరుదమేమియు లేదనియు,
చష్టన, రుద్రదాములకు మాత్రమే అట్టిబిరు
దము కలదనియు, వారిరువురు మాత్రమే
పితృనామములతోకూడ పేర్కొనబడిరనియు,
అందువలన ఆయేబదిరెండవ సంవత్సరపు శా
సనములు చష్టన రుద్రదాము లిరువురును
కలిసి పరిపాలించునాటివే యనియు చౌదరి
గారు ప్రత్యుత్తర మిచ్చియున్నారు.

ఈపైని కావింపబడిన చర్చననుసరించి

(౧) 'రాజ' బిరుదము జయదామునికి
మూలములో లేకపోవుటవలనను

(౨) చష్టన రుద్రదాములవలె జయదా
ముడు తండ్రిపేరుతో గలిసి పేర్కొనబడక
పోవుటవలనను

(3) జయదాముడు క్షత్రపుడుగ మాత్ర
మేరాజ్యమేలెనుకాని మహాక్షత్రపుడుగరాజ్య
మేలలేదని ఆతనినాణెములు సాక్ష్యమిచ్చుచుం
డుటవలనను

(౪) రుద్రదాముడు మొదట క్షత్రపు
డుగను, పిదప మహాక్షత్రపుడుగను ఏలినట్లు
ఆతనినాణెముల ననుసరించియు, శాసనముల
ననుసరించియు దెలియుటవలనను

(౫) 'చష్టనునియొక్క, రుద్రదాముని
యొక్క పాలనమున ఏబదిరెండవ సంవత్సర
మున' అని అంధౌశాసనములందు వ్రాయబడి
యుండుటవలనను

అంధౌశాసనములు చష్టనరుద్రదాము
లిరువురును గలిసి పరిపాలించుకాలమున వ్రాయ
బడినవనియు, ఏబదిరెండవ సంవత్సర మిరువురి
'సంయుక్త' పరిపాలనమునకును సంబంధించు
ననియు తేలుచున్నది. ఈయభిప్రాయమే సరి
యైనదని హేమచంద్రరాయచౌదరిగారే కాక

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రొఫెసర్ దేవదత్త రామకృష్ణ భండార్కరు గారు, ఆర్. సి. మజుందారుగారు మొదలగు వారుకూడ అంగీకరించియున్నారు. అందువలన అంధ్రశాసనములు చష్టనరుద్రదాముల కాలమునాటివనియు, చష్టనుడును రుద్రదాముడు నొకేకాలమున నుండిరనియు నిస్సంశయముగ నిశ్చయింపవచ్చును. చష్టనరుద్రదాము లిరువురు నొకేకాలమున నుండినవారని నిశ్చయముగుటచేతను, వారిశాసనములలోని లిపి నహపానుని శాసనములలోని లిపికంటె చాల తరువాతిదిగ కాన్పించుచుండుటచేతను చష్టనుడు నహపానునికంటె తరువాతివాడేకాని పూర్వుడుకాడని నిశ్చయింపవచ్చును.

3. ఇక మూడవది నిర్మాణాదికములు: మొదటి హేతువు నంగీకరించినచో దీనినిసైత మంగీకరింపవచ్చును. నహపానుడు బౌద్ధభిక్షువులు మొదలగువారికి చేసిన దానధర్మములు పెక్కులు కలవు. అతనికాలమున ప్రజలు బౌద్ధభిక్షువులు నివసించుటకై కొండలను దొలిపించి గుహలను, ప్రార్థనాదికములు సల్పుటకై శిలలను దొలిపించి చైత్యములను (బౌద్ధ దేవాలయములు) నిర్మించి బౌద్ధసంఘమునకు ధర్మముచేయువారు. ఇట్టిగుహలును చైత్యములును జున్నార్, నాసిక, కార్లీ మొదలగుచోట్ల కలవు. వీటిలో కార్లీచైత్యము సుప్రసిద్ధమైనది. కార్లీయనునది బొంబాయిరాజధానిలోని పూనామండలమునందలి మావల్ తాలూకాలో నొకగ్రామము. ఈచైత్యము నహపానునినాటిదని అందలి శాసనములలోని లిపి ననుసరించియు, ఈనిర్మాణమునందలి రచనాపద్ధతి, కళావిన్యాసముల ననుసరించియు చరిత్రకారులు నిర్ధారణచేసియున్నారు.

నహపానునివలెనే గౌతమీపుత్రుడును బౌద్ధులయుపయోగార్థము పెక్కుగుహలను దొలిపించి బౌద్ధసంఘమునకు ధర్మముచేసియున్నాడు. గౌతమీపుత్రుడొక్కడేకాక ఇంక ననేకులు నహపానునినాటివలె నిర్మాణముల రూపమున పెక్కుధర్మము లాచరించియున్నారు. నహపాన గౌతమీపుత్రులనాటి నిర్మాణములందలి రచనాపద్ధతి, కళావిన్యాసము మొదలగువాటిని పరిశీలించిన శిల్పపరిశోధకులు గౌతమీపుత్రునినాటి నిర్మాణములకంటె నహపానునినాటి నిర్మాణములు ప్రాచీనమైనవనియు, ప్రాయికముగ నవి క్రీస్తుశకమునకు పూర్వపువై యుండుననియు, నహపానుని నాడుకంటె గౌతమీపుత్రునినాడు నిర్మాణాదికములలో హిందూశిల్పరచనాపద్ధతి పరిణామమును బొందినట్లు తెలియవచ్చు మార్పు లనేకములు కలిగెననియు నభిప్రాయపడియున్నారు. ఆయానిర్మాణములందలి రచనాపద్ధతి, కళావిన్యాసము, అలంకారవిధానము—ఈమొదలగువాటి ననుసరించికూడ ఆయానిర్మాణముల కాలమును దెలిసికొనవచ్చును. ఒక రాజవంశమువారి కాలమునకు మఱియొక రాజవంశమువారికాలమునకు నిర్మాణముల విషయమున రచనాపద్ధతిలోను, అలంకారవిధాన కళావిన్యాసములలోను భేదములు కాన్పింప గలవు. ఈ కారణముననే స్థూలదృష్టిని ఈయీ నిర్మాణములు పల్లవరాజవంశజుల నాటివి; ఆయానిర్మా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

- చష్సామోతికుడు
  - (౧) చష్టనుడు
    - (౨) జయదాముడు
      - (౩) (మొదటి) రుద్రదాముడు
        - (౪) (మొదటి) దామజదశ్రీ
          - సత్యదాముడు
          - (౫) జీవదాముడు
        - (౬) (మొదటి) రుద్రసింహుడు
          - (౭) (మొదటి) రుద్రసేనుడు
            - పృథివీసేనుడు
            - (రెండవ) దామజదశ్రీ
          - (౮) సంఘదాముడు
          - (౯) దామసేనుడు
            - వీరదాముడు
              - (౧౪) (రెండవ) రుద్రసేనుడు
                - (౧౫) విశ్వసింహుడు
                - (౧౬) భర్తృదాముడు
                  - విశ్వసేనుడు
            - (౧౧) (మొదటి) యశోదాముడు
            - (౧౨) విజయసేనుడు
            - (౧౩) (మూడవ) దామజదశ్రీ
        - (కూతురు)



కార్లీ చైత్యము – అంతర్భాగము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ణములు చాళుక్యవంశజులనాటివి; ఇవి విజయనగరాధీశులనాటివి; ఈశిల్పరచన కాకతీయులనాటిది అనినిశ్చయింపవచ్చును. హిందూశిల్పకళ యీవిధమున క్రమపరిణామమును పొందినది. ఇందువలననే పల్లవశిల్పము (అనగా పల్లవులనాడు పెంపొందిన శిల్పకళాసంప్రదాయము), చాళుక్యశిల్పము (అనగా చాళుక్యులు రాజ్యము చేయునాడు అభివృద్ధినొందిన కళాసంప్రదాయము) అని హిందూశిల్పకళలో కొన్ని సంప్రదాయములును, కొన్ని రీతులును ఏర్పడినవి. ఈవిధమైనరీతి, సంప్రదాయముల ననుసరించి నిర్మాణముయొక్క కాలమును నిర్ణయించుట యొకపద్ధతి. ఈపద్ధతి ననుసరించియే హిందూశిల్పకళాపరిశోధకులు గౌతమీపుత్త్రుని నిర్మాణములకంటె నహపానునినాటి నిర్మాణములు ప్రాచీనమైనవని సిద్ధాంతీకరించియున్నారు. ఇందువలన గౌతమీపుత్త్రునికంటె నహపానుడు ప్రాచీనుడని తేలుచున్నది. నాణెముల ననుసరించి చష్టనుడు గౌతమీపుత్త్రునికి పూర్వుడుకాడని తేలినదికనుకను, నిర్మాణముల రచనావిధానము, అలంకారపద్ధతి, కళావిన్యాసము-వీటిననుసరించి నహపానుడు గౌతమీపుత్త్రునికి పూర్వుడేయని నిశ్చయమైనదిగనుకను చష్టనుడు నహపానునికి పూర్వుడు కాడని నిర్ణయింపవచ్చును.

౪. చష్టనవంశమున హపానునికి పూర్వుడుది కాదని నిర్ణయించుటకు గల నాలుగవయాధారము విదేశీయులవ్రాతలు. అందిచ్చట మనము ప్రధానముగ గైకొనవలసినది 'టాలెమీ' యను విదేశీయుని వ్రాతయే. టాలెమీ యనువతడు అలెగ్జాండ్రియానగరపు ఖగోళశాస్త్రజ్ఞుడు. ఇతడు అక్షాంశములతోను (Latitudes) రేఖాంశములతోను (Longitudes) భూగోళపటమును వ్రాయు నుద్దేశముతో భూగోళశాస్త్రమును వ్రాసినవాడు. ఈతడు ఎప్పటివాడో సరిగా తెలియదు కాని యితడు క్రీస్తుశకము ౧౪౭ లోగూడ తన పరిశోధనలను సాగించుచుండెననియు, అంతకు పూర్వము ౪౦ సం. ములనుండియు ఈవిషయమై పరిశ్రమచేయుచుండెననియు, రోమకచక్రవర్తియైన ఆంటోనియస్‌పయస్ కాలధర్మమునొందిన పిదపగూడ ఇతడు జీవించియుండెననియు తెలియవచ్చుచున్నది. ఆంటోనియస్ పయస్ అనునతడు క్రీ.శ. ౧౬౧లో చనిపోయెను. ఈపైవిషయముల ననుసరించి టాలెమీ తనయభిమానవిద్యావిషయమున క్రీ. శ. ౧౨౭-వ సంవత్సరమునుండి పనిచేయుచుండెననియు, అథమము అతడు క్రీ. శ. ౧౬౧ వఱకైనజీవించియుండెననియు మాత్రము నిశ్చయముగ జెప్పవచ్చును. ఈతడు ఆనాడు పశ్చిమహిందూదేశమున సుప్రసిద్ధములైన పట్టణములను గొన్నిటిని తన గ్రంథమున పేర్కొనియున్నాడు. వాటిలో 'బైతాన'మనునదియొకటి. అది 'సిరిపొలిమాయి'యొక్క రాజధానియని తెలిపియున్నాడు. టాలెమీ పేర్కొనిన బైథానమును నిజాం రాష్ట్రమునందు గోదావరినదీతీరమున గల ప్రతిష్ఠానముగను, 'సిరిపొలిమాయి'ని సాతవాహన (ఆంధ్ర) వంశపురాజులలో నొకడైన 'శ్రీపులుమావి'గను చరిత్రకారులు గుర్తించియున్నారు. ఇట్లే 'ఇండోశిథియా' యను



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దేశమునకు దూర్పుననున్నట్లు టాలెమీ తెలిపిన ముఖ్య పట్టణములలో 'బరిగజ', 'ఓజీనీ' నగరములు కలవు. వీటిలో 'బరిగజ' నగరము సుప్రసిద్ధవర్తకస్థానమనియు, అది 'నమదాస్'నదికి పశ్చిమమున కొంచెమెగువగ గలదనియు టాలెమీ తెలుపుచున్నాడు. చరిత్రకారులు 'నమదాస్'నదిని నర్మదానదిగను, 'బరిగజ' నగరమును 'భరుకచ్ఛము'గను గుర్తించియున్నారు. ఇప్పుడు 'బ్రోచ్' అనుపేరబరగు ఈ భరుకచ్ఛము నర్మదానదికుత్తరమున సముద్రమునకు 33 మైళ్లదూరమున నున్నది. ఇప్పటికి నిది గొప్పనగరముగ నున్నది. 'ఓజీనీ' నగరమును చరిత్రకారులు ఉజ్జయినీనగరముగ గుర్తించియున్నారు. ఉజ్జయిని అవంతిదేశమునకు రాజధాని; టాలెమీ కాలమున ఉజ్జయిని 'ట్యస్టనీస్' అను నతనికి రాజధానియని అతని భూగోళశాస్త్రము ననుసరించి తెలియవచ్చుచున్నది. టాలెమీ పేర్కొనిన 'ట్యస్టనీస్'ను చరిత్రకారులు చష్టనునిగ గుర్తించిరి. ఇట్లు టాలెమీ భూగోళశాస్త్రము ననుసరించి శ్రీ పుళుమావి ప్రతిష్ఠానమున బరిపాలించుచుండినట్లును, చష్టనుడు ఉజ్జయిని రాజధానిగ పాలించుచుండినట్లును తెలియవచ్చుచున్నది. ఈకారణముననుసరించి అనేకులుపుళుమావియు చష్టనుడునుటాలెమీ కాలముననుండిరని సిద్ధాంతముచేసియున్నారు. కాని టాలెమీ తనభూగోళశాస్త్రమును విదేశములను స్వయముగజూచి వ్రాసియుండ లేదనియు, కేవలము విదేశముల కరిగిననావికులు తెలిపినవిషయములననుసరించియే తనగ్రంథమును వ్రాసెననియు, అందువలన పుళుమావి, చష్టనులు కేవలము టాలెమీకాలమున నుండెనని యెంచ నక్కఱలేదనియు, అంతకుపూర్వముండియుందురనుటయే యెక్కువ సమంజసముగ నుండుననియు కొందఱు వాదింతురు. అందువలన టాలెమీవ్రాతల ననుసరించి పుళుమావిచష్టనులకాలమును సరిగా నిర్ణయించుటకు వీలులేదన్నను వారిరువురును క్రీ. శ. రెండవశతాబ్ది ప్రథమభాగమున నుండినట్లును, పుళుమావిచష్టను లిరువురును సమకాలికులైనట్లును మాత్రము నిశ్చయింపవచ్చును. నహపానుని శాసనముల ననుసరించియు, నాణెముల ననుసరించియు, నిర్మాణముల ననుసరించియు అతడు క్రీ. శ. రెండవశతాబ్ది ప్రథమభాగమునకు దరువాతనుండె ననుటకు వీలులేదు. కావున, చష్టనుడు నహపానునికి దరువాతివాడేకాని పూర్వుడని చెప్పుటకు వీలులేదు.

౫. ఇక అయిదవ యాధారము పరిపాలిత దేశములు. నహపానుని శాసనముల ననుసరించి యాతని రాజ్యవిస్తీర్ణతను ఒకరీతిని నిర్ణయింపవచ్చును. నహపానుని యొక్కయు, అతని యల్లుడు ఋషభదత్తుని (ఉషవదాతుని) యొక్కయు, అతని మంత్రి 'అయమ' యొక్కయు శాసనములు నాసిక, కార్లీ, జున్నారులలో కనబడుచున్నవని యీవఱకే తెలుపబడినది. చాలవఱకీశాసనములుఋషభదత్తునివే. వాటిలోనతడు ఏయేక్షేత్రములలో దానధర్మములు చేసెనో తెలుపబడియున్నది. ప్రభాసపుణ్యతీర్థము, భరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కచ్ఛము, దశపురము, గోవర్ధనము, శోపారగము, పారాదా, దమణ, తాపీ, దాహానుక నదీతీరములు, పౌకురతీర్థము, అన్నియు ఋషభదత్తునివితరణౌదార్యమునకును, దానధర్మములకును సాక్ష్యమిచ్చునవియే. ప్రభాస, పౌకుర (? పుష్కర) తీర్థములు మినహాగా మిగిలినవన్నియు ప్రత్యేకము నహపానునియల్లుడును, అతని సైన్యాధిపతియునగు ఋషభదత్తుని రాజ్యములోనివే యైయుండునని రాప్సన్ మొదలగువారి యభిప్రాయము. ప్రభాస, పౌకుర (? పుష్కర) తీర్థములు సుప్రసిద్ధ యాత్రాస్థలములనియు, అందువలన ఋషభదత్తుడచటికి యాత్రికుడుగ బోయి దానధర్మముల నాచరించి యుండుననియు, మాలయులను జయించినపిదప విజయాభిషేకము నిమిత్తము ఋషభదత్తుడు పుష్కరతీర్థమున కరిగినట్లు శాసనమున తెలుపబడియుండుటచేత అదియు, ప్రభాసతీర్థమును ప్రత్యేకము ఋషభదత్తుని రాజ్యములోనివి కాకపోయినను నహపానుని రాజ్యములోనివైన గాకపోవనియు రాప్సన్ దొరగారు వ్రాయుచున్నారు. వారు ప్రభాసతీర్థమును దక్షిణకథియవాడలోని సోమనాథ పట్టణముగను, భరుకచ్ఛమును బ్రోచ్ నగరముగను, గోవర్ధనమును బొంబాయి రాజధానిలోని నాసికమండలమునందలి యొకపట్టణముగను, శోపారగమును బొంబాయిరాజధానియందలి ఠాణాజిల్లాలోని 'సోపార్' నగరముదగ్గఱనున్న సుపారముగను, పారాదమును బొంబాయిరాజధానియందలిసూరతుజిల్లాలోని పారదీనదిగను, దమణమును 'దామన్' నగరమువద్దనున్న దమనగంగగను, తాపీతీర్థమును తపతీనదిగను, దాహానుకమును ఠాణాజిల్లాలోని దహాను గ్రామమువద్దనున్న దహానుకతీర్థముగను, పౌకుర (? పుష్కర) తీర్థమును రాజపుత్రస్థానమునందలి అజ్మీరుదగ్గఱనున్న 'పొఖార'గను గుర్తించియున్నారు. వారుగుర్తించినదంతయు, చెప్పినదంతయు సరియైనదేయగునెడల—సరియైనదికాదనుట కవకాశముకనబడదు—నహపానుడుమహారాష్ట్రమునందలి సూరతు, ఠాణా నాసికమండలములు, కథియవాడ, గుజరాట్, మాళవదేశము, రాజపుత్రస్థానమున గొంతభాగము—వీటినిబరిపాలించెనని చెప్పదగును. దీని ననుసరించియే నహపానుని రాజ్యముయొక్క గొప్పదనము నూహింపవచ్చును.

సాతవాహనవంశజుడైన గౌతమీపుత్త్రుడు క్షహరాతవంశమును కూకటివ్రేళ్లతో పెకలివేసెననియు, ఏతద్వంశజుడైన నహపానుని జయించెననియు మనకు నాణెములవలనను, శాసనములవలనను దెలియవచ్చుచున్నది. ఈవిధముననేక్షహరాతవంశజులను జయించిన గౌతమీపుత్త్రుని రాజ్యవిస్తీర్ణతను ఆతని కుమారుడైనపులుమావియొక్క పందొమ్మిదవ పరిపాలన సం.మున గౌతమీపుత్త్రుని తల్లియైనగౌతమీబాలశ్రీ వ్రాయించిన నాసికగుహాశాసనము ననుసరించి గ్రహింపవచ్చును. ఆ శాసనమున గౌతమీపుత్త్రుడు అసికము, అశ్మకము, మూలకము, సురాష్ట్రము, కుకురము, అపరాంతము, అనూపము, విదర్భ, ఆకరము, అవంతి మొదలగు దేశములను, వింధ్యము, అచ్ఛవటము, పారియాత్రము, సహ్యము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కృష్ణగిరి, శ్రీస్థానము (?శ్రీశైలము), మల
యము, మహేంద్రము, శ్వేతగిరి, చకోరము
మొదలగు పర్వతములను పాలించెనని చెప్ప
బడినది. అసిక, అశ్మక, మూలకములు ఇప్పుడు
ఏ దేశములకు వర్తించునో తెలియరాదు.
సురాష్ట్రము (సౌరాష్ట్రము) ఇప్పటి కథియ
వాడలోని దక్షిణభాగమునకు వర్తించును:
కుకురము రాజపుత్రస్థానములోని పశ్చిమ
భాగముగ గొందఱు గుర్తించియున్నారు.
ఉత్తరకొంకణదేశమునకే అపరాంతమనిపేరు.
కథియవాడలోని ఉత్తరభాగమునకును, నర్మ
దానది కెగువ నున్నభాగమునకును అనూప
దేశమనిపేరు. ఇప్పటి బేరారురాష్ట్రములోని
పశ్చిమభాగమునకే పూర్వము విదర్భయని
పేరు. ఆకరమని తూర్పుమాళవదేశమునకును,
అవంతియని పశ్చిమమాళవదేశమునకును పేరు.
ఈపై నుడివిన దేశనామములపట్టికను బరిశీలిం
చినచో రాజపుత్రస్థానమందలి పుష్కర
తీర్థము మొదలైన మిక్కిలి యుత్తరదేశము
లొకవేళ గౌతమీపుత్త్రునికి వశమై యుండ
వన్నను సురాష్ట్రము, కుకురము, ఆకరము,
అవంతి, అనూపము—ఇవియన్నియు క్షహరాత
రాజ్యమును జయించిన పిదప నూతనముగ
గౌతమీపుత్త్రుని రాజ్యమున గలసిన వను
టకు శాసనములే ప్రమాణము. అవంతి
మున్నగు దేశములు గౌతమీపుత్త్రునికిపూ
ర్వము నహపానుని వశమునందుండగా
గౌతమీపుత్త్రుడు అతనిని జయించి వాటిని
దనరాజ్యమున జేర్చుకొనెను గావున అవంతి
మొదట నహపానునివశమునను, పిదప
సాతవాహనవంశజుడైన గౌతమీపుత్త్రుని వశ
మునను ఉండెనని తెలుచున్నది. అవంతికి
రాజధాని ఉజ్జయిని. విదేశీయులవ్రాతల ననుస
రించి చూడగా ఉజ్జయినియే చష్టనునికిని రాజ
ధాని. చష్టనుడు ఉజ్జయిని రాజధానిగా అవంతిని
నహపానునికి పూర్వము పాలించెనా గౌతమీ
పుత్త్రునికి పరమున బాలించెనా యనునదియే
సమస్య. శాసనముల లిపి ననుసరించియు,
నాణెముల ననుసరించియు, నిర్మాణాదికముల
ననుసరించియు, చష్టనుడు నహపానునికంటె
బూర్వుడనుటకు అవకాశము లేదు. అంతేకాక
టాలెమీవ్రాతలవలన అతడు క్రీస్తుశకము రెం
డవశతాబ్దినాటివాడైయుండవలెనని యూహిం
పవలసివచ్చుచున్నది. ఒకవేళ చష్టనుడు నహ
పానునికి పూర్వుడు కాకపోయినను ఆతనికి
సమకాలికుడైన నైయుండు ననుకొందమన్న
అవంతి నహపానుని రాజ్యమునందుండినట్లును
మనకు దెలియును. అవంతికి రాజధానియైన
ఉజ్జయిని చష్టనునివశమున నుండినట్లును మన
కు దెలియును. అందువలన ఒకేకాలమున నొక
దేశము ఇరువురి పరిపాలనమునకు లోనైయుం
డుట యసంభవము. దీనిననుసరించి చష్టనన
హపానులిరువురు నేకకాలమున పాలించుచుం
డిరనుటకు వీలులేదు. వారుసమకాలీనులుకా
నిచో ఒకరికొకరు ముందైన నుండవలెను;
లేదా, తరువాతనైన నుండవలెను. చష్టనుడు
నహపానునికి ముందుండెననుటకు శాసనాది
ప్రమాణములు తోడ్పడవుకావున నహపాను
నికి దరువాతనే అతడుండవలెను. ఆతడును, గౌ
తమీపుత్త్రుడును సమకాలికులన్నచో ఆతని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రాజ్యమునగల అవంతినేలు చష్టనుడు గౌతమీపుత్త్రునికి సామంతుడై యుండవలెను. సామంతుడుకాడన్నచో గౌతమీపుత్త్రునికి దరువాతివాడై యుండవలెను. చష్టనుడు గౌతమీపుత్త్రుని రాజ్యమునందలి అవంతిని పాలించుటవలనను, ఆతని నాణెములమీద గౌతమీపుత్త్రుని నాణకచిహ్నమైన చైత్యము యొక్క ముద్రయుండుటవలనను ఆతడు గౌతమీపుత్త్రునికి సామంతుడనియు, గౌతమీపుత్త్రుడు క్షహరాతదేశములను సహపానుని నుండి జయించిన పిదప వాటి కధికారిగ చష్టనుని నియమించెననియు నూహించుట సమంజసము. అయితే కొందఱు చష్టనుడు తనపేరుతో నాణెములను అచ్చొత్తించియుండుటచేత అతడు స్వతంత్రుడుగ పాలించెనందురు: కాని యది సరియైనయూహ కాదు. దక్షిణహిందూదేశమున కడుప్రాచీన కాలమునుండియు నాణెమున కిప్పటంత ప్రాముఖ్యము లేదు. ప్రాచీన కాలమున హిందువులు నాణెమును అసలు వ్యవహారసరళి నొక మారకపు వస్తువుగనే పరిగ్రహించినట్లు కనబడుచున్నది కాని రాజ్యాధికార లాంఛనములలో ప్రధానమైనదిగ గ్రహించినట్లు కనబడదు. ఇట్లని పూర్వము నాణెమునకు రాజకీయప్రాముఖ్యమేమియు లేదనలేము కాని యిప్పటంత ప్రాముఖ్యము లేదని మాత్రమే చెప్పదగును. ఒకమహారాజునకు లోబడిన సామంతులుకూడ ప్రత్యేకముదమనాణెములను ముద్రించుకొనువారు. అది యెటులున్నను చష్టనుని విషయమునమాత్ర మతడు తనపేరు నాణెములమీద వ్రాసికొన్నను. వాటిమీద గానవచ్చు గౌతమీపుత్త్ర నాణకచిహ్నము చైత్యమే యతని సామంతరాజత్వమునకు సూచకముగ పరిగణింపదగును. ఈకారణములవలన చష్టనుడు సహపానునికి బూర్వుడుకాడనియు, గౌతమీపుత్త్రునికి సమకాలికుడైన యతని సామంతుడనియు నిర్ణయింపదగును. చష్టనుడు గౌతమీపుత్త్రునికి సమకాలికుడనియు, అతనికి సామంతుడనియు మనము నిర్ణయించుకొనుటచేత చష్టనునితోపాటు టాలెమీ పేర్కొనిన 'సిరిపులోమాయి' గౌతమీపుత్త్రునికుమారుడే కాని మఱియొకడు కాడని నిర్ణయింపదగును.

ఈకారణములవలన చష్టనుడు సహపానునికి పూర్వుడుకాడనియు, తుదకు సమకాలికుడైనను గాడనియు మనము నిశ్చయింపవచ్చును. చష్టనుడు సహపానునికి జాల తరువాతివాడని చరిత్రకారు లెల్లరు నింతవితర్కము లేకయే యంగీకరించియున్నారు. వారిలో జాలమంది అతడు టాలెమీకి సమకాలికుడై క్రీ.శ. ౧౧౦-౧౩౦ సం.ల ప్రాంతమున నుండెననియే యభిప్రాయపడియున్నారు; కాని కొందఱుమాత్రము అతడు టాలెమీకి సమకాలికుడని యంగీకరింపలేదు. టాలెమీ తాను భూగోళము వ్రాయుచుండిన నాటికి పూర్వమే ఉజ్జయినిని చష్టనుడు పరిపాలించుచుండెనని ఆయాదేశములకు బ్రయాణ మొనరించిన నావికులవలన వినియుండునుగావున చష్టనుడు ఉజ్జయినిని టాలెమీ భూగోళమును వ్రాయుచుండిన కాలమునకు పూర్వమే పరిపాలించుచుండవలెననియు, అందువలన నతడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రాయికముగ క్రీస్తుశకము ౧౦౪-౧౪౭ వత్సరములకుఁబూర్వమే యుండియుండుననియు వారు వాదింతురు. ఇట్టి వారుకూడ చష్టనుని ఎంత వెనుకకు గొనిపోయినను అతఁడు క్రీస్తుశకము మొదటిశతాబ్ది కడపటి పాదమునకు పూర్వము మాత్రముండియుండడని నిర్ధారణగ అంగీకరించియున్నారు. ఎట్లయిననేమి, తుదకు పైకారణములవలనను, చర్చవలనను చష్టనుడు నహపానునికి పూర్వుఁడు కాడనియు, సమకాలికుఁడుకూడ కాడనియు తేలినది.

రెండవక్షత్రపవంశజులు కుహరాతవంశజులవలెనే తమశాసనములలో సంవత్సరముల నిచ్చియున్నారు. వారిశాసనములలో మొట్టమొదటిది అంధౌశాసనమని యీవఱకే తెలుపబడినది. ఈశాసనమునందీయబడిన సం.రము ఏబదిరెండనియు మన మెఱుంగుదుము. కాని యీసంవత్సరమును నహపానశాసనములందలి సంవత్సరములవలెనే శకవర్షముగ పరిగ్రహింపవలెనో, విక్రమశకసంవత్సరముగ పరిగ్రహింపవలెనో తెలిసికొనుట కాశాసనమున నేమియు నాధారములేదు. ఇట్లే రుద్రదామునినుండి పశ్చిమహిందూదేశమున బరిపాలనము నెఱపిన చష్టనవంశజులైన పశ్చిమక్షత్రపుల శాసనములలోను, నాణెములలోను ఈ సంవత్సరసంఖ్యలు క్రమముగ వృద్ధినొందుచు బోయినవి. ఇట్లు పోగా పోగా ఇంతవఱకు తేలిన కట్టకడపటి సంఖ్య ౩౧౦. ఇది నాణెములవలన మాత్రమే తెలియవచ్చినది. క్రమముగా పశ్చిమక్షత్రపులు తమశాసనములలోనేకాక నాణెములలోగూడ సంవత్సరముల నిచ్చియున్నారు. పైనుడివిన ౩౧౦ వ సంవత్సరసంఖ్య పశ్చిమక్షత్రపప్రభువైన స్వామి మూడవరుద్రసింహుని నాణెములమీఁదగలదు.

ఈమూడవ రుద్రసింహుఁడు చష్టనవంశములోని వాఁడుకాఁడు. ఇంతవఱకు దొరకిన శాసనముల ననుసరించియు, నాణెముల ననుసరించియు చష్టనవంశము భర్తృదాముని కుమారుడైన విశ్వసేనునితో అంతరించినట్లగపడును. విశ్వసేనుని సంవత్సరములు ౨౧౬ నుండి౨౨౬ వఱకును దెలియవచ్చుచున్నవి.

ఇంతటితో చష్టనవంశ మంతరించినపిదప మఱియొక క్షత్రపవంశము చష్టనవంశజుల స్థానము నాక్రమించి పశ్చిమహిందూదేశమును బరిపాలించెను. ఈవంశమువారుకూడ దమశాసనములందును, నాణెములందును చష్టనవంశజులవలెనే సంవత్సరముల నిచ్చియున్నారు. వారు ప్రత్యేకము సంవత్సరముల నారంభింపక విశ్వసేనునినుండివచ్చిన సంవత్సరములనే ఇంకనుసాగించిరి. ఈవంశమునకు స్వామి జీవదాముఁడు మూలపురుషుఁడు. యస్మోతికునివలెనే యితనికి రాజ, క్షత్రప, మహాక్షత్రప బిరుదములేవియు గానరావు. అందువలన ఈతని కుమారుడైన రెండవ రుద్రసింహుడే నూతన క్షత్రపవంశస్థాపకుడనియూహింపనగును. ఈతని మొదటిసం.రము ౨౨౭ గ దెలియవచ్చుటచేత ఇతఁడు విశ్వసేనునికి తరువాత అచిరకాలమున నే రాజ్యమునకువచ్చిన ట్లూహింపనైయున్నది. ఈవంశమువారిలో కట్టకడపటివాఁడే మూఁడవ రుద్రసింహుఁడు. ఈతని నాణెములమీఁద గానవచ్చిన ౩౧౦-వ సంవత్సరమే పశ్చిమహిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దూ దేశమున క్షత్రపుఁడిగ దెలియవచ్చిన కడపటిసంవత్సరము. ఇట్లు చష్టనరుద్రదాము లనాడు ౫౨ నుండి ప్రారంభమైన సంవత్సరములు మూడవరుద్రసింహునినాటికి ౩౧౦ వఱకు పెఱిగినవి. కాని ౫౨ నుండి ౩౧౧ వఱకు దెలి యనచ్చిన క్షత్రపు లనేకులున్నను వారిశాస నములవలనగాని, నాణెములవలనగాని యా సంవత్సరము లేవియో తెలిసికొనుటకు ఆధా రము దొరకలేదు. ఈ సంవత్సరము లేవియో తెలిసికొనుటకై వేఱువిధమున బ్రయత్నింపవల సివచ్చుచున్నది.

గుప్తవంశజులు

పశ్చిమ హిందూదేశమునందలి పశ్చిమ క్షత్రపరాజ్యము నాపోశనముపట్టినవారు గుప్త వంశజులు. గుప్తుఁడనునతడే యీవంశమునకు మూలపురుషుఁడు. ఈవంశమువారు రమారమి మూఁడువందల సంవత్సరములు అవిచ్ఛిన్న ముగ ఉత్తరహిందూస్థానము నంతయు బరిపా లించిరి. వేంగిదేశమును శాలంకాయనులును, కాంచీపురమును పల్లవవంశజులును పరిపా లించుచుండిన కాలమున దక్షిణాపథమును జయించుతలపుతో దాడివెడలివచ్చిన గుప్త సామ్రాట్టగు సముద్రగుప్తునిగుఱించి చరిత్ర పాఠకులు చదివియుండకపోరు. ఆసముద్రగుప్తు డీవంశములోనివాడే. వీరికాలముననే హిందూ మతము పునరుద్ధారము నొందెను; బౌద్ధ మతము క్షీణింప నారంభించెను; పాలీభాషకు వెనుకటి గౌరవము తగ్గిపోయెను. సం స్కృతమునకు గౌరవప్రతిష్ఠలుహెచ్చి ఆంధ్ర వంశజులనాఁడు ప్రాకృతభాషవలెనే పిరినాఁడు అది మహోన్నతపదవి నందెను. కవికుల భూషణమైన కాళిదాసు ఈగుప్తులనాటివాఁడే.

గుప్తవంశజుల శాసనములును నాణెము లును చాలదొరకినవి. వాటిలోవారు తమవం శమునకు విలక్షణమైన ఒకప్రత్యేకశకమునువా డి అందే తమపరిపాలనసంవత్సరములను దెలిపి యున్నారు. వీరు వాడినశకమునకు గుప్తశక మనిపేరు. ఈగుప్తశక మెప్పటినుండి ప్రారంభ మన్నవిషయమున పాశ్చాత్యులు, ప్రాగ్దేశీయు లునైన ప్రాచీన హిందూదేశచరిత్రకారులు చాలకాలము చర్చించిచర్చించి తుదకది ౨౪౨ వ శకవర్షము (క్రీ. శ. ౩౨౦) నుండి యారం భమయ్యెనని సిద్ధాంతీకరించియున్నారు. ఇప్ప టికిని హిందూదేశచరిత్రకారులు ౩౨౦-వ సంవత్సరమును గుప్తశకమునకు ప్రారంభవత్స రముగ నంగీకరించుచున్నారు. 'ఘాజీపూర్' జిల్లాలోని భితరీగ్రామమునందలి గుప్తవిజయ స్తంభముమీది శాసనముల ననుసరించి చంద్ర గుప్తుఁడనునతడు ౨౪౨-వ శకవర్షమున (క్రీ. శ. ౩౨౧) రాజ్యమునకు వచ్చెననియు, ఇతఁడు గుప్తవంశజులలో మూఁడవయతఁడనియు పన్నా లాల్ యమ్. ఏ., బి. యస్. సి., యల్. యల్.బి. గారు నిర్ధారణచేసియున్నారు. అందు వలన నైవిషయము ననుసరించి గుప్తశకకర్త (మొదటి) చంద్రగుప్తుఁడని తేలుచున్నది.

పశ్చిమక్షత్రపరాజ్యమును గుప్తవంశ జులే జయించినట్లు ఆరాజ్యములలో గానవగు వారిశాసనముల ననుసరించియు, నాణెముల ననుసరించియు దెలియవచ్చుచున్నది. ఆకరదే శమును అనగా తూర్పుమాళవదేశమును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గుప్తులు జయించిరనుటకు గుర్తుగ విదిశానగరమునకు రెండు మైళ్లదూరమున వాయవ్యమూలగనున్న యుదయగిరిగుహాలలో రెండుశాసనములుకలవు. అవి గుప్తవంశజుడైన రెండవచంద్రగుప్తునినాటివి: ఈరెండవచంద్రగుప్తునికే విక్రమాదిత్యుడనియు నామాంతరము కలదు. ఈతనిని చంద్రగుప్త విక్రమాదిత్యు డనియు చేర్కొందురు. ఈపైనుడివిన రెండుశాసనములలో నొకదానిలో సంవత్సరముకలదు. అది ౮౨-వ గుప్తసంవత్సరము: అనగా ఆశాసనము ౩౨౩-వ శకవర్షము (క్రీ. శ. ౪౦౧) నాటిది. గుప్తవంశజులు అవంతి (పశ్చిమమాళవదేశము) నేలిరనుటకుశాసనాధార మేమియుకానరాదు. కాని యాప్రదేశముల పశ్చిమక్షత్రపులకాలమున వాడుకలోనుండిన నాణెములననుసరించి ముద్రింపబడిన గుప్తవంశజుల నాణెములు కొన్నిదొరకినవి. వాటిమీద క్షత్రపనాణెముల మీదవలెనే సంవత్సరములుకూడ ముద్రితములైనవి. ఇట్టి సంవత్సరములుగల గుప్తనాణెములలో కడుప్రాచీనమైనది గుప్తసంవత్సరము ౯౦ నాటిది: అనగా ౩౩౧ వ శకవర్షము (క్రీ. శ. ౪౦౯-౪౧౦) నాటిది. ఈ పైవిషయములవలన గుప్తవంశజులు చంద్రగుప్త విక్రమాదిత్యునినాడు ఆకరమును అనగా పూర్వమాళవదేశమును, ౩౨౩ వ శకవర్షమున (క్రీ. శ. ౪౧౧ లో) ను, అవంతిని అనగా పశ్చిమమాళవదేశమును ౩౩౧ వ శకవర్షమునను (క్రీ. శ. ౪౦౯) జయించినట్లు స్పష్టమగుచున్నది. మాళవ సురాష్ట్రములను క్షత్రపులు ౩౧౦ వ సంవత్సరమువఱకు పాలించుచుండినట్లు స్వామి మూడవరుద్రసింహుని నాణెము ననుసరించి మనకు దెలియును. గుప్తులమాళవదేశవిజయము ౩౨౩ వ శకవర్షమునుండి యారంభమైనట్లు మనకు నిశ్చయముగ దెలిసినది కావున క్షత్రపనాణెముల ననుసరించి తెలియవచ్చిన ౩౧౦ వ సంవత్సరము— క్షత్రపులనోడించి యాప్రాంతమును గుప్తులే పాలించిరి కావున- శకవర్షమైయుండునని యూహించుట సమంజసము. శకవర్షము ౩౨౩ నాటికే గుప్తులశాసనములు పూర్వమాళవదేశమున గానవచ్చుచుండుటచేత వారాదేశమునంతకు బూర్వమే జయించి యుండవలెను. అందువలన గుప్తవంశజుల కీవిజయము ౩౧౦-౩౨౩ శకవర్షములకు నడుమ సంప్రాప్తించియుండును. ఈకారణములవలన చష్టనవంశజుల నాటినుండివచ్చు సంవత్సరములన్నియు శకవర్షము లేకాని మఱియొకటి కావని తేలుచున్నది. చరిత్రకారులందఱీవిషయమును నిర్వివాదముగ నంగీకరించియున్నారు. అందువలన చష్టనరుద్రదాములు అంధౌశాసనములనుబట్టియు, పైనితెల్పిన నిర్ణయములననుసరించియు శకవర్షము ౫౨ లో నుండినట్లు నిశ్చయింపనగును; అనగా అంధౌశాసనములు చష్టనరుద్రదాము లిరువురి సంయుక్తపరిపాలనముననే వ్రాయబడినవని యంగీకరించుచో ౫౨-వ శకవర్షమునాటికి (క్రీ. శ. ౧౩౦) చష్టనుడు మహాక్షత్రపుడుగను, రుద్రదాముడు క్షత్రపుడుగను పాలించుచుండినట్లు తేలుచున్నది. ఈ విధముగ దెలియవచ్చినకాలము టాలెమీ-

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ్రాతలవలన నిర్ణీతమైన కాలమునకును సరి పోవుచున్నది.

చష్టనవంశమువారి శాసనములవలనను, నాణెములవలనను దెలియవచ్చిన సంవత్సరములు శకవర్షములని తేలుటవే, వీరికి పూర్వము పశ్చిమహిందూదేశమునుపాలించిన క్షహరాత క్షత్రపవంశమువారి శాసనములలోని సంవత్సరములుకూడ శకవర్షములే యైయుండదగునని కొందఱూహించుటకు కారణము. అట్లగునేని శాసనములవలన దెలియవచ్చిన నహపానుని కడపటి సంవత్సరము ౪౬-వ శకవర్షమని యూహింపవలసియుండును. అట్లయినచో సాతవాహనవంశజుడైన గౌతమీపుత్త్రుడు క్షహరాతవంశజుడైన నహపానుని ౪౬-వ శకవర్షమునకు పిదప జయించి యుండును. శాసనములవలన చష్టనవంశమువారిదిగ దెలియవచ్చిన మొదటి వత్సరము ౫౨-వ శకవర్షము. అందువలన ఈ రెండు వంశములకు నడుమగలయెడము ౫ సంవత్సరములు మాత్రమే. ఉభయవంశములవారి శాసనములలోని సంవత్సరములును శకవర్షములే యైనచో ౪౬-వ శకవర్షమున నహపానుడును, ౫౨-వ శకవర్షమున చష్టనుడును పరిపాలించుచుండినట్లు చెప్పవలసియుండును. కాని నహపానుని శాసనసంవత్సరములు శకవర్షములై యుండవని కొందఱు వాదించుచున్నారు. వారట్లు చెప్పుటకుగల కారణము లివి:

"నహపానుని శాసనములందలి సంవత్సరములు శకవర్షములే యైనయెడల, నహపానునికిని, చష్టనునికినిగల ౫ సంవత్సరముల వ్యవధిలో

(౧) నహపానుని పరిపాలన మంతరించుట.

(౨) క్షహరాతులు నాశనము గావింపబడుట.

(3) చష్టనుడు క్షత్త్రపుడుగ రాజ్యమునకువచ్చి అట్లు కొంతకాలము పరిపాలించుట: పిదప అతడు మహాక్షత్త్రపుడుగ సింహాసనమెక్కి పరిపాలించుట.

(౪) జయదాముడు క్షత్త్రపుడుగ రాజ్యమునకు వచ్చి కొంతకాలము పాలించుట. (డుబ్రాయిల్ గారి ప్రకారము అంధౌశాసనము కేవల మొక్కరుద్రదామునికే వర్తించుచో) జయదాముడు ఒకవేళ మహాక్షత్త్రపుడుగ కూడ పాలించుట.

(౫) రుద్రదాముడు క్షత్త్రపుడుగ రాజ్యమునకు వచ్చుట: అతని పరిపాలనారంభము.

"ఇన్నివిషయములు జరిగియుండవలెను. అయిదేండ్లలో ఇన్ని సంగతులుజరుగుట అసాధ్యము కాకపోయినను అసంభావ్యము మాత్రమగును. నలుబదియాఱవసంవత్సరపుజున్నారు శాసనమువ్రాయబడిన వెంటనే క్షహరాతులు నాశము గావింపబడుట అసంభావ్యము. చష్టనుడు మొదట క్షత్త్రపుడుగ పాలించుట, పిదప ఆతడు మహాక్షత్త్రపుడుగపాలించుట, అటుతరువాత జయదాముడు క్షత్త్రపుడుగ పాలించుట (డుబ్రాయిల్ గారి ప్రకారము) ఒకవేళ జయదాముడు మహాక్షత్త్రపుడుగ కూడ పరిపాలించుట - ఇందఱు నాలుగైదుసంవత్సరములలో



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పాలించుట అసంభావ్యము: రుద్రదాముడు సరిగా అంధ్రశాసనములకు పూర్వమే రాజ్యమునకు వచ్చియుండుట అసంభావ్యము."

ఈ పై కారణములవలన డుబ్రాయిల్ మొదలగువారు నహపానశాసనములందలి సంవత్సరములు శకవర్షములు కావనియు, (శిల్పము,లిపి, నాణెములు ఈ మొదలగు వాటి యాధారమున నహపానుడు క్రీస్తుశకమునకు పూర్వపువాడని యూహింపవలసియుండుట చేత) అవివిక్రమసంవత్సరములైయుండునని యే యూహింపవచ్చుననియు వాదించుచున్నారు.

ఈవిధమైన వాదమునకు బదులుచెప్పి నహపానుని శాసనములందలి సంవత్సరములు శకవర్షములేయని స్థిరపఱుచుటకై హేమచంద్రరాయ చౌదరిగారు క్షహరాతవంశము వినాశమునొందినపిదపనే చష్టనుడు రాజ్యమునకువచ్చెనని తెలుపుట కాధారములేదనియు, నహపానుడు మాళవ మహారాష్ట్రములను పాలించుచుండినప్పుడే, కచ్చిదేశమున చష్టనుడు రాజ్యమేలుచుండి యుండుననియు,అందువలన నహపానుని శాసనములలోని సం॥రములను అగత్యముగ విక్రమసంవత్సరములుగ భావింపనక్కఱలేదనియు, అవి శకవర్షములు కాదగుననియు వాదించుచున్నారు. కాని యీవాద మంత సరిమైనదిగ కాన్పింపదు: ఏలయన:

(౧) శిల్పము, లిపి, నాణెములు మొదలైనవానివలన నహపానుడు క్రీస్తుశకమునకు పూర్వుడై యుండునని తేలుచున్నది.

(౨) టాలెమీ వ్రాతలవలన చష్టనునికి ఉజ్జయిని రాజధానియని తెలియును. ఉజ్జయిని అవంతియనబరగు పశ్చిమ మాళవదేశమునకు రాజధాని. నహపానుడుకూడ అవంతిని పాలించెనని మనమెఱుగుదుము. ఒకేకాలమున ఇరువురురాజులు ఒకే దేశమును పాలించుట అసంభవము. అందువలన అవంతీపరిపాలకులుగ దెలియవచ్చు నహపానచష్టనులలో ఎవరో యొకరు రెండవవారికంటె పూర్వమైన నుండవలెను; పరమునైన నుండవలెను. చష్టనుడు నహపానునికి దరువాతివాడని యీవఱకే నిర్ణయించియున్నాము. అందువలన నహపానుని తరువాతనే చష్టనుడు అవంతిని పాలించెననుట సమంజసము.

ఈ కారణములవలన నహపానచష్టనులిరువురు సమకాలికు లనలేము. నహపాన, చష్టనులిరువురు సమకాలికులు కానియెడలను, నహపానుని తరువాతనే చష్టనుడు పాలించెనన్నయెడలను నహపాన శాసనసంవత్సరములు శకవర్షములాయని డుబ్రాయిల్ మొదలగువారు చెప్పిన కారణముల ననుసరించి సందేహము కలుగకమానదు.

నహపానునిమాట యెటులున్నను చష్టన, రుద్రదాములు మాత్రము ౧౨-వ శకవర్షప్రాంతమున నున్నవారని నిస్సంశయముగ జెప్పదగును. టాలెమీ చష్టనునితోపాటు పులమావినికూడ పేర్కొనుటవలన వారిరువురు సమకాలికులని యూహింపవచ్చును. చష్టనుడు ప్రాయికముగ గౌతమీపుత్త్రుని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాణెములనే అనుకరించియుండునని యిదివఱకూహించితిమి కావున అతనితోపాటు పేర్కొనబడిన పులుమావి గౌతమీపుత్త్రుని కుమారుడైన పులుమావిగ నిశ్చయింపవచ్చును; అనగా గౌతమీపుత్త్రుని కుమారుడైన పులుమావి ౯౨-వ శకవర్షములో నుండెనని తేలుచున్నది. ఇదియే సాతవాహనుల (అనగా ఆంధ్రరాజుల) కాలమును నిర్ణయించుటకు గల సాధనములలో మొట్టమొదటిది; ఉత్తమమయినది. ఈయాధారము ననుసరించియే మనమింక సాతవాహనుల కాలమును నిర్ణయింపవలసి యుండును: అనగా ఆంధ్రరాజు లెప్పటినుండి యెప్పటివఱకు పాలించినదియు తేల్పవలసి యుండును. ఆంధ్రరాజ కాలనిర్ణయమునకు అంధౌ శాసనములలోని ౯౨-న శకవర్షమే ప్రాతిపదిక.



# గ్రీష్మర్తువు

నాళం కృష్ణారావుగారు

దివస మంతకు నంతకు దీర్ఘ మయ్యె
సవిత్రుఁ డీశానదిక్కున సంచరించె
నాఁటినాఁటికి నెండలు గాట మయ్యె
వేఁడిగాడ్పులు మెండుగ విసరఁ జొచ్చె.

ఏళ్లు కొలఁకులు వాడి యిఱ్ఱింకు లింకె
కీల జాలము వనముల కేళి సలిపె
గగనతలమున సుడిగాలి నెగసె ధూళి
ఎండమావులు దండిగ మెండుకొనియె.

వేఁడిమెండల మలమల మాఁడి మాఁడి
పాముపడగలక్రింద కప్పలు వసించె
నెమలిపించెంబు గొడుగులనీడఁ జేరి
పడగలను వాల్చి పన్నుండె పన్నగములు.

మెండుగాఁ గాయు నెండకు మిడికి మిడికి
నోరు తెరచుచు సెలవుల నురువు జాఱ
పొలసుముద్దలఁ బోలు నాల్కలు వెలార్చి
దున్నపోతులు తిరిగెఁ దుందుడుకు నెంది.

మిటమిటని కాయు నెండకు కటకటపడి
కుతుక లెండఁగ దప్పిచే కొదమ లేళ్లు
చదల కాటుకమబ్బులు జలము లనుచు
బమ్మరిల్లుచు నాసచేఁ బరుగులెత్తె.

దండిగాఁ గాయు నెండల మండి మండి
కొండ లోర్వక మొఱపెట్టి కూసె ననఁగ
గహ్వరంబులఁ బోలు వక్త్రములఁ దెఱచి
బెబ్బులులు గాండ్రు గాండ్రని బొబ్బరించె.

దారుణం బగు నెండకు తాళ లేక
నీరు లింకిన మడుఁగులఁ జేరి పంది
ముస్తె లెత్తఁగ నిడువాఁడి ముట్టెతోడ
గ్రొచ్చికోరాడె పుడమిలోఁ జొచ్చుకరణి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చండతర మైన యెండకు జలము లెండి
పడియలందలి యదు గొల్ల పగులువాఱ
బీటికల వెంట తన నిడుపాటి త్రోటి
గ్రుచ్చి బొమ్మడాయల మెక్కి కొక్కెరాయి.

దావపావకకీలల దగ్ధ మొంది
చెట్లయాకులు సుడిగాలిచేత రేఁగి
గగనమున పల్లటీల్ గొట్టి మెగురుచుండ
పావురము లంచు డేగలు పట్టఁదఱిమె.

భీష్మతర మైన దారుణ గ్రీష్మమందు
గాలిచే మింటి కెగసిన ధూళి యొప్పె
దండిగాఁ గాయు నెండకుఁ దల్ల డిల్లి
పుడమి చేడియ దాల్చిన ముసుఁ గనంగ.

చండమార్తాండు నెండకు మండి మండి
జగము రగులంగ గాలిచే నెగసినట్టి
బూదియో యన బూరుగుదూది పగిలి
పింజపింజగ నంబరవీథి కెగిరె.

భానుతేజంబు జలములఁ బ్రజ్వరిల్ల
హ్రాదము లొప్పారె నెండిన నదులయందు
వార్ధివిరహాగ్నిఁ బాయ స్రవంతికాంత
లఱుతఁ దాల్చిన ముత్యాలహారము లన.

భీకరం బగు నెండకు భీతిఁ జెంది
పాదపచ్ఛాయ నిదురించు పథికజనులు
మాటిమాటికిఁ దావుల మార్చి మార్చి
పొరలియాడిరి నీడలు జరగు కొలఁది.

మల్లెపువ్వులు సిగఁ దాల్చి మాపులందు
చెఱకురస మాన గానుఁగ చెంత జనము
కూడె రానున్న వృష్టికై గ్రుడ్లు మోచి
మధువు చుట్టను మూఁగు చీమలో యనంగ.

మిగులఁ గాసిన మిడిమెండ నోగిలి తమ్ము
నాశ్రయించిన గంగయు యమున యనఁగ
మల్లియలఁ తోడి కీల్జడ లల్లలాడ
చలువపందిళ్లఁ బొలిచిరి జలజముఖులు.

లలితమంజీరరవ మొప్ప లత్తుకలను
జొత్తువాఱిన పదములు శోభిలంగ
అమలవస్త్రంబులను దాల్చి యంచ లనఁగ
మందయానలు నడచిరి మద మెలర్ప.

తరణి బింబపు రాట్నాన కిరణములను
సన్ననూలును వడికి గ్రీష్మంబు పేరి
సాలె నేసిన జిలుగు వస్త్రంబు లనఁగ
ఎండమావులు గనుపట్టె నిండు జిగిని.

తలఁపు తలఁచినమాత్ర డెందంబు కందు
మోవి కదలింప నోరెల్లఁ బొక్కి పోవు
కనులు పై కెత్తె తెప్పలు కమురు నౌర
నిండు వేసఁగి యెండ వర్ణింపఁ దరమె?



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# జాతివిభాగము

[హిందూ విశ్వవిద్యాలయాంధ్రవిద్యార్థి]

**దారి తెన్నూ లేక దశగతులనుండు ప్రయోగయోగ్యతత్త్వముల ననతిక్లిష్టముతో నాకట్టుటయే విజ్ఞానజాతివిభాగముయొక్క ముఖ్యోద్దేశ్యము**

ఈమధ్య మనమంతరము వర్ణాశ్రమధర్మములు దైవనిర్మితములా, మనుష్యకల్పితములా యను చర్చల ననేకస్థలములందు కనుచున్నాము; వినుచున్నాము. నాకుగూడ దీనినిగూర్చి విచారించినకొలదియు నూతనసందేహము లుదయించుచున్నవి. ఇవి దైవనిర్మితములా? మనుష్యకల్పితములా? అంటే "కోమటిసాక్ష్యం తంతు"గా రెండూ నని తోస్తోంది.

పైగా మనవైపునుండి మా హిందూవిశ్వవిద్యాలయమునకు (దూర మనటంచేతో మరెందుచేతో) వచ్చు విద్యార్థులు బహు తక్కువ. ఈవున్న "సాడేతీన్" లోను (ఇంజనీరింగు విజ్ఞానములలో చేరినదే నంటాము కనుక) విజ్ఞానముల నభ్యసించువారే విరివిగా నుండుట చేత "ఊరి కంపరకు నేను లోకువ-నాకు నంబికొండయ్య లోకువ" అన్నట్లు కళల నభ్యసించువారిని (నిజంగా ఆమాటకొస్తే చరిత్రాదులు కళలకంటె బేకళలుగానే కనపడుతున్నాయి లెండి) చూచి "ఆర్ట్సువా డర కానికైనా కొరగా" డని హేళనచెయ్యడమే కాని అనువర్తనోద్దేశము (Idea of Continuity) ననుసరించి దేనియుద్దేశ మేమిటో ఆలోచించుట మట్టేపోయి, తెలిసికొనటానికికూడా ఖాళీ దొరికిందే కాదు.

ఈమధ్య నేపేపరులోనో (పేరు జ్ఞాపకం లేదు) జాతిమతభేదములనుగూర్చి చదువుటతోనే ఇవి మనుష్యులలో నున్నాయి సరే కాని వృక్ష, జంతు, ఖనిజాదికములందుకూడ నున్నవా? విజ్ఞానములలో (Sciences) నున్నవా? గణితశాస్త్రం బ్రాహ్మణా, రసాయనశాస్త్రం రాజూ కాదుకదా అనిపించింది; ఆలోచిస్తే అవు ననిపించింది; కా దనిపించింది. అంతటితో నూరకుండక మనలో "నష్టావశేషవర్ణము" లన్నమాట, సంగీతములో స, రి, గ, మ, ప, ధ, ని, స, లు, హిందీలో "సాత్ జాత్" అన్నవాటితోటే, రసాయనశాస్త్రమందలి సామయికజాతివిభాగము (Periodic Classification) లో తొమ్మిదిసమూహములుగా విభజింపబడిన మూలపదార్థములు, స్ఫటికవిద్య (Crystallography)లోని యారు స్ఫటికచిత్రసాంప్రదాయములు (Crystallographic Systems)ను మొదలగు ననేకజాతివిభాగములు జ్ఞప్తికి వచ్చినవి.

అప్పుడు తెలిసినంతవరకు వీటినిగురించి వ్రాద్దాము, తెలియని వెవరైనను చెప్పిన నేర్చుకుందామని బుద్ధి పుట్టింది. అందుచేత నిది వ్రాయటానికి సాహసించినాను.

ప్రస్తుతముఖ్యాంశమునకు వచ్చి క్రింది సారణి (Table)ని పరికించిన విద్యయందలి ముఖ్యజాతుల నెరుగవచ్చును. ప్రస్తుత మిందు విజ్ఞానములవిషయములనే పొందుపరిచితిని.

ఇవి ముఖ్యమయినవి. ఇవి గాక ప్రస్తుతపు సంకరజాతులను బోలి రెండుమూడు శాస్త్రసమ్మేళనము వలన గల్గిన భూపదార్థవిజ్ఞానము (Geo-physics) జీవరసాయనము (Bio-chemistry) మొదలగునవియు, ప్రజోపయోగవిజ్ఞానములును (Useful and Technical Sciences) మొదలగు ననేకము లీసారణియందు చేర్పబడలేదు. గణితశాస్త్రముకూడ నీకూటిలోనిదే. అది ఉమ్మడిబిడ్డ. దానిని కళగా కొందరును విజ్ఞానముగా కొందరును గణింతురు. నేనుమాత్రము దానికి త్రిశంకుస్వర్గమునే యిచ్చెదను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




పైజాతు లన్నిటినిగూర్చి వ్రాయుట మంత పాకంగా కుదిరేలాగ లేదు. అందుచేత మున్ముందు పుస్తకాల్లో బరువైన మాటలలో తేలికపటంచేత (రసాయన మనేమాటలో ద్విత్వాక్షరాలు లేవు కనుక) అనాదినుంచీ వైరాగులు, గోసాయిలు మొదలగువారు రసాయనంచేత "సత్తిచ్చి కరగి పోసిన, నిత్తడి బంగార మానె యిలలో వేమా" యనులోకోక్తిని బూటకం చేస్తారని మనలో (కొందరికైనా) నమ్మకం వుండేది కనుకను (యిప్పుడూ వున్నారేమో నాకు తెలియదు, వరుస చూస్తే ఉన్నట్లున్నారు) ఆరసాయనంలో నున్న వర్ణభేదా లెల్లా గొచ్చాయో టూకీగా నాలోచిద్దాం.

ఇంతకీ రసాయనమంటే నేమిటంటారేమో: దాన్నిగురించొక యాంగ్లరసాయనవేత్త

"The Science of Chemistry is man's attempt to classify his knowledge of all the different kinds of matter in the universe; of the ultimate constitution of matter; and the phenomena which occur when the different kinds of matter re-act with one another" అన్నాడు.

పైగా దీనికితోడుమనము రసాయనశాస్త్రముయొక్క చరిత్రాత్మకవికాసము (Historical Development) ను గమనించిన మొదటినుండియు, అంటే దీని ఓనమాలకడనుండి జాతిమతభేదము లున్నవి. ఇంత ఫట్టి మనుగుటకు కారణం దీని హిందూజననమని నే ననుకుంటాను. దీనికి తోడేనోపుల్లపెట్టి సంఘజనాన్ని (అంటే రసాయనమందలి మూలపదార్థములు) లేవతీద్దామంటే వాటికి ప్రాణం లేదు.

హిందువులలో మొదట బ్రహ్మ, క్షత్రియ వైశ్య, శూద్రు లని నాల్గుజాతులను నిర్దేశించి, వీటిలో వేటిలోను జేరనివారిని పంచము లన్నారు. అట్లే రసాయనమునకుకూడ నుగ్గపాలతోటే పంచజాతులను నిర్మిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చిరి. (అంటే హిందూసంఘ మనేగృహమునకు పైన వివరించిన యైదుజాతులు యెట్లో అట్లే రసాయన మని మెడి యజ్ఞశాల కైదు స్తంభములున్న వన్నమాట). వీనికే పృథివ్యాపస్తేజోవాయు రాకాశము లని పేర్ల నిడిరి. రసాయనమును ప్రప్రథమమున హిందువులవద్దనుంచి నేర్చుకొనిన మిగతదేశములు "సామాన్యముగా హిందూజాతు లైదైనను మొదటి నాల్గింటినే గణించెదరు గాన నట్లేచేసిన బాగుండు" నని కాబోలు మొదటినాల్గు మూలప్రకృతులనే వెల్లడిపుచ్చి ఆకాశ మను నైదవదానిని (Something anologous to our present ether) వదలినట్లు తోచెడి. అందుచేత నిది పాశ్చాత్యఖండముల యందు చతుర్భూతయుక్తిగా (Four Elements Theory) పరిణమించినది. కాని యది వారికే బాగని పించినది కాదు. అందుచేత గ్రీకువేదాంతజ్ఞులు "ఆది పదార్థము" (Primal Matter) అను నైదవదానిని నిరూపించిరి.

కాని యిట్లెన్ని జాతివిభజన లొనర్చినను మనుష్య ప్రకృతిని మాన్పలేకపోయిరి: వేదాంతమం దుత్కృష్ట మగు నద్వైతసిద్ధాంతమం దందరును సర్వవ్యాపక పరబ్రహ్మముయొక్క స్వరూపములనియేకదా చెప్పిరి. దీనికౌన్నత్యము నాశించుమనుష్యప్రకృతి లోడుపడినది. మరొకసంగతి: బోయిలు (Boyle)గారి కాలమువరకు మూలప్రకృతి, సమ్మేళనములకు (Elements and Compounds) మూలలక్షణములను శాస్త్రజ్ఞు లంతగా నెరుగరు.

పశ్చిమంబున లెవాయిజరు (Lavoiser) కాలము వరకు నుదకమును పృథివిగా మార్చవచ్చునని నమ్మిరి. అంతతో నూరకుండక, ఘనాశచే కాబోలు, తక్కువ వెలగల ఇనుము మొదలగు లోహములను వెండిబంగార ములుగా మార్చ ప్రయత్నించిరి.

మూలప్రకృతుల నొకదాని నొకటిగా మార్చుటొక పెద్దగాథ (Transmutation of Elements): టూకీగా తేల్చుట మహాకష్టము. రేడియో ఆక్టివిటీని గురించి తెలియకపూర్వ మది వట్టిబూ తన్నారు. దీన్ని కదిపితే కామరపు జీడి. వద్దంటే వెనకపడుతుంది. అందుచేత నిజాంశమైన రసాయనమందలి సామయిక జాతివిభాగమునకు వద్దాం.

సృష్టిలో రాసాయనికసంబంధము (Chemical Relation) లేక (అల్లా గనటానికికూడ నీమధ్య రసాయనశాస్త్రవేత్తలకు మనస్సొప్పుటలేదు (సామయికసారణి)Periodic Tab'e)లో నాద్యంతజాతులం దున్ననవు సోడియము, హరినము (Chlorine) సమ్మేళనము విస్తారముగా దొరకుచున్నవి, పూర్వమునుంచియు మూల ప్రకృతులను గుణములనుబట్టి విభజింపవలె నను ప్రయత్నము లనేకములు జరిగినవి. అందు ముఖ్యముగా పేర్కొనదగినవి (౧) బెర్‌జీలియస్‌గారి విద్యుద్రసాయనపంక్తి (Electro-chemical Series of Berzelius) (౨) దొబెరీనరుగారి త్రిబంధములు (Dobereiner's Triads) (౩) న్యూలాండ్సుగారి అష్టక నియమము (Newland's Law of Octaves) (౪) ప్రస్తుత మానవరాయందుండి యనేకులచే సమర్థింపబడు చున్న నవీనసామయికవిభాగము. దీనిని రష్యాయందు మాండెలీఫ్‌గారును, జర్మనీయందు లూథర్ మేయర్ గారును ఇంచుమించు నేకకాలమందే యొకరిప్రేత్స్య మొకరికి లేకయే యుపపాదించిరి.

ఇందొక విచిత్రాంశ మున్నది. మొదటినుండియు మూలప్రకృతులనుగూర్చి శాస్త్రజ్ఞుల యుద్దేశ్యములను రెండువిధములుగా భాగింపవచ్చును. (౧) సీసమును బంగరుగా మార్చు 'కీమియాల' (Alchemists) ప్రయత్నములను విమర్శించిన అనువర్తనోద్దేశ్యము వారిమన మున దృఢముగా నుండెనని తోచును. ప్రౌట్‌గారి "మూలప్రకృతు లన్నియు జలవాయువు (Hydrogen) వివిధరూపము" లను వాక్యము వారికికూడ ననువర్తనో ద్దేశ్యమందే (Idea of Continuity) నమ్మక మని తెల్పును. ప్రస్తుతోద్దేశ్య మొకమాదిరిగా నిదియే యన వచ్చును. (౨) విచ్ఛేదనోద్దేశ్యము (Idea of Discontinuity) బోయిలుగారి మూలప్రకృతిలక్షణమందు (Definition of Elements) మొలకెత్తెను. రేడియో ఆక్టివిటి మొదటియుద్దేశ్యమునే బలపరచును.

ప్రాతలయాధారములనుబట్టి చూడ మాండలీఫ్‌గారికి (౧) సంఖ్యలయం దెక్కువగన్పాత యుండుటచేతను [సంఖ్య లనువర్తనయుక్తములు (Continuous) కావు కనుక] (౨) వారు సామయికవిభాగమునకు పరమాణు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

భారములు (Atomic Weights)నే మూలాధారముగా గణించుటచేతను (3) సామయికనియమమును(Periodic Law) విశదపరుచుటకు చిత్రపద్ధతుల నుపయోగించుటను (To use graphic methods) ప్రతిపాలురై యుం డుటచేతను విశ్లేషనోద్దేశ్యపుం దెక్కువయిష్టముని చెప్పక తప్పదు.

లూథర్ మేయర్ గారు (౧) వివిధపరమాణువు శేకవస్తుజాతములే యని నమ్ముటచేతను (౨) సామయిక నియమమున విశదీకరించుటకు నసువర్తనయుక్తము లగు రేఖల (Curves)నే యుపయోగించుటచేతను నసువర్త నోద్దేశ్యమం దెక్కువనమ్మకము కలవారుగా భావింప దగును.

ఇట్లయినను యిర్వురు నేకనియమము నేక కాల మందే యుపపాదించుట బహువిచిత్రము.

ఇక నీవ్యాసమును ముగించుటకు పూర్వము జాతి మతభేదము లుండవలె నసువారి కొకమాట.

ప్రస్తుతము విజ్ఞానములందు నవీనపరిశ్రమ (Research) మంతయు ప్రకృతినియమములను (Natural Laws) కనుగొనుటకే. మన మీప్రస్తుతవిజ్ఞానదేజ మున నీజాతిసమస్యను పరికించిన నొకదాని కొకటి సహాయభూతము లనియు, సంఘశరీరమున కివి యవయవ ప్రాయము లనియు, నొకదానినుండి యొకదానిని గీటు గీచి వేరుచేయ లేమనియు, అన్నియు ననువర్తనయుక్త ములే కాని, విశ్లేషనములు కావనియు తేటతెల్లము కాగలదు.

---

# ప్రకృతిలాస్యము

## కొంపెల్ల జనార్దనరావు గారు

సతత నూతన మృదు విలాసప్రభూత
తావక మనోజ్ఞలాస్య సందర్శనమున
నాదు భావాలు మధుర గానమ్ము సలిపెఁ
బ్రకృతి! ఆనంద తన్మయత్వమున మునిఁగి.

క్షణములో దుఃఖచయ మెల్ల సమసిపోయె;
నెన్నియో లాలసలు—హరియించిపోయె;
స్మృతులు మెల్లమెల్లన సొమ్మసిల్లిపోయె;
నీయెదుట నిశ్చలత నేన నిలిచిపోతి.

ఆదయాశీకరాసార, మాపవిత్ర
విశ్వమోహనమైత్రి, యాప్రేమమధుర
మంగళాకార, మాతపోమహితముద్ర—
అహహ, ఎంతేసి కానుక లబ్బె నాకు!

నీ జగన్మోహనం బైనన్యాత్యమందు
మెప్పు లలసి పో, నేత్ర నిమీలనమున
దవ్వులను విన వచ్చె నెంతయుఁ బునీత
విశ్వసందేశతతుల గంభీరరుతులు.

ఎవరికొఱకు నీ నాట్యంబు, లేప్రపూత
గాన సంచార ఫణితు లేకాంత కాంత
నృత్య వైదగ్ధ్యమును ప్రసాదించె నీకు?
అనుచు ధ్యానించినా నప్రయత్నముగను.

ధ్యాన మది గానమైపోయెఁ, దావకీన
ప్రణయ సౌభాగ్య మహిమ, నాప్రశ్నములకు
నేని చూపట్టినిని సమాధానమనయి:
నీవలన నాయనంతత నేర్చికొంటి!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# బాలికలు - లోకసేవ

శ్రీమతి రొట్టెకల్ సుబ్బమ్మ గారు

పెక్కుచోట్ల బాలురు లోకసేవకు, అందు ముఖ్యముగా తమదేశసేవకు, చేయుచున్న ప్రయత్నములనుగురించి మనము పుస్తకములలో చదువుచున్నాము; కన్నులార చూచుచున్నాము. ఇది యెంతయు సంతోష కరము. మనపురోభివృద్ధికి ఎంతయు శుభ సూచకము. కాని అంతటితో తృప్తిపడుటకు వీలులేదు. బాలురు లోకమున సేవచేయుటకు ఎంతఅవసరమో బాలికలు సైతము ఈమహా సేవకు అంతముఖ్యము. మనభారతమాతకు బాలురు, బాలికలు రెండుకన్నులవంటివారు. ఒకకన్ను ఎక్కువఅందముగా నున్న ఏమి ప్రయోజనము? ఆకన్నున కున్నంతశక్తి, ప్రకాశము రెండవకన్నున కుండితీరవలయును. అప్పుడు నేత్రములు శోభాయమానములై చూచుట కెంతయు ఇంపుగా నుండును.

నేటి మనబాలికలగతి చూచినయెడల మన మీ ముఖ్యరహస్యమును కొంచెమైనను తెలిసికొనినట్లు అగపడలేదు. బాలికలు అజ్ఞానములో పడి దిక్కుగానక యున్నారు. లోకసేవ అట్లుండనిండు; దేశసేవ అటులుండనిండు: తమసేవనుసైతము పూర్తిగా మరచిపోయినారు. అందువలననే బాలురకున్నంత దేశభక్తి, దైవభక్తి, కార్యశూరత, తెలివితేటలు ఏమాత్రమును లేకున్నవి. తమయింటినే ప్రపంచముమాదిరిగా చూచుకొనుచున్నారు. అజ్ఞానులగు తల్లిదండ్రులే వారికి సర్వమును. పిరికితనము, సోమరితనము, అనారోగ్యము, అజ్ఞానము వారికి ఇష్టదేవతలు. అందువలననే వారు పెద్దవారైనతరువాత, భర్తలు చేయు పనులకు తోడ్పడుటకు బదులుగా అడ్డపుల్లలు వేయుచు, తమతెలివితక్కువతనముచే మనదేశమునకే మహాపద తెచ్చుచున్నారు. సాధ్వీమణులగు సీత, సావిత్రి, దమయంతి మొదలగు శీలవతులనామములకే కళంకము దెచ్చుచున్నారు.

ఎంతకాలము మనబాలికలు ఈ యజ్ఞానాంధకారమున నుండవలయును?

నేడు ప్రపంచము మార్పుచెందుచున్నది. అభిప్రాయములు మారిపోవుచున్నవి. అంతవరకు పోనేల? మనుష్యులే మారిపోవుచున్నారు. అట్టిచో మనబాలికలు యథాస్థితిలో నుండిన ముందుముందు పెద్దవారైన తరువాత తమసోమరితనమున కెంతయు వగవగలరు.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రపంచములోని అన్ని దేశములలో గల బాలికలు ఈకాలదేవతలు వారికిచ్చు అవకాశములను గైకొనుచు, లోకమునకు, దేశమునకు, తమసంఘమునకు ఎంతయో ఉపకారిణులై యున్నారు. మనము సైతము మనఅజ్ఞానాంధకారమును పటాపంచలుచేసి వెలుగునకు రావలయును. ప్రపంచసేవకు మనము అనుసరించవలసిన ధర్మములను అతినిపుణతతో నేర్చుకొని కార్యాచరణమునబెట్టి పావనము కావలయును.

ఇందులకుగాను ఇతరదేశములలోవలె మనదేశమున గరలుగైడింగు (Girl Guiding) అను ఉద్యమము బాలికలలో ప్రచారములో నున్నది. ఇందు స్త్రీలు లోకమునకు, తమస్వదేశమునకు, ప్రజాకోటికి ఏరీతిని సేవచేసిన లాభముగ నుండునో, మనము ఆసేవావ్రతమున నేరీతిని పాల్గొని కృతార్థులము కావలయునో నేర్చుకొనవచ్చును. ఇట్టిఉద్యమమును మనము బాలురలో చూడగలము. దానినే బాలభటోద్యమము (Boy Scouting) అనిపిలుతురు. బాలభటులు మనదేశములోను, ఇతరచోట్లను ఏరీతిని సేవచేయుచు, సర్వప్రజలకు తోడ్పడుచున్నారో మనము చూచుచున్నాము. బాలురకు వారిసహాయముకొరకు ఈయబడుచున్న శిక్షణ ననుసరించియే ఇందును బాలికలకు వారిసేవావ్రతమునకు కావలసిన సహాయ మంతయు నీయబడుచున్నది.

ఈ శిక్షణమున నొకటి రెండు సంవత్సరములు ఆరితేరిన బాలికలు బాలికాసంఘమునకేకాక తమతల్లిదండ్రులకు, అన్నదమ్ములకు, అక్కసెల్లెండ్రకు, బంధుమిత్రాదులకు-వీరువారననేల?-సకలజనులకు నెంతయు సహాయపడుచు కృతార్థురాండ్రు కాగలరు.

తమ స్వధర్మములను బాగుగ తెలిసికొనగలరు. తమదేహారోగ్యమును కాపాడుకొనగలరు. తమఇండ్లను సుందరముగా నుంచగలరు. ఇతరుల కనారోగ్యముగ నున్న ఒకనిమిషమైనను ఊరుకొనజాలరు. ఏసహాయము ఇతరులకు కావలయునన్నను అతినిపుణురాండ్రై ఆసహాయమును శుభప్రదముగా నిర్వహింపగలరు.

అంత యననేల! ప్రతివిషయమునను నిపుణలై దానిని నిర్విఘ్నముగను, సంతోషపూర్వకముగను, స్వార్థత్యాగము తోడను ముందు అడుగు పెట్టి సేవ చేయగలరు.

ముందు మనదేశమునకు ఇట్టివారే లక్షలకొలది కావలయును. అట్టివారివలననే లోకమున శాంతి సమకూరగలదు. కావున మన బాలికలు, అందు ముఖ్యముగ పెద్దలగు బాలికలతల్లిదండ్రులు, సోదరులు ఈ విషయమున శ్రద్ధతీసికొని, ఈబాలికాభటోద్యమము ఇచ్చు అవకాశములను గైకొందురుగాత. పెద్దలసహాయము లేకపోయిన బాలికల ఈకోరికలు, ఆశలు నెరవేరజాలవు. దైవము ఈ మహోద్యమము ద్వారా బాలికలను సేవామార్గమున నడపుచు ధన్యురాండ్రనుగ చేయుటకు వారికి, వారిపెద్దలకు తోడ్పడుగాత !

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# కీ. శే. ఆచార్య పప్పు పార్వతీశంగారి స్మృతిపద్యములు

ముడుంబ నరసింహాచార్యులుగారు

భవబంధమ్ములు వీడి, మోక్షపదవిం బ్రాపించునాసక్తి, సం
భవహా లీలల నూనవాత్మలను మార్పం దంత్రముల్ పన్ను, లో
కవిభుం, డాహరి తన్ను జేరుటకు వీఁగ వచ్చు మాపార్వతీ
శు, విశుద్ధాత్మకు శాంతి సేకుర నొనర్పుంగావుతం బేరిమిన్.

మ. పరదేశాటనపాటవమ్మున, కళాప్రావీణ్యలక్ష్మీధురం
ధరతన్, విజ్ఞుఁడవైన నీక తగు దథ్యం బెన్న నాచార్య స
ద్బిరుదం; బయ్యది గాంచి దేశహితబుద్ధిం గాంధివిద్యాలయాం
తరసంస్థఁగ మనినట్టి నిన్ను మరుపందఁగ శక్యమే మాకికన్.

మ. "పతనంబంచు నెఱింగియుండియు విధిప్రాబల్యసంఘర్షణో
న్నతి మి మ్మందఱి వీడిపోయెద జుడీ నర్సాపురీశైలరో
న్నతవిద్యాలయమందు జేర" నని దైన్యంబార నీవన్నమా
ట తలంపారిన బారు గాల్వలయి కంటఁగ మాకు దుఃఖాస్రువుల్.

శా. జాతీయోద్యమముం ద్యజించి చనుఁగ సన్మానముల్ సేత, వి
ఖ్యాతిన్ విన్నపపత్రమిచ్చుట పొసంగన్నేర కావేళ, సం
కేతప్రక్రియ నొక్కయుంగరము భక్తిఁగ నీకు నర్పింపగా
బ్రీతిం గైకొని పల్కు నీనుడి తరంబే విస్మృతిం జెందగన్.

శా. ఆజన్మాంతము బాయజాలనిది నాకాహ్లాదసంధాయియై
పూజార్హంబయి మాతృదేవతవలెం బాల్పారు నెవ్వేళ; గాం
ధీజాతీయకళాస్థలిఁగ హృదయవీథింజొన్పు; నుగ్రంబె న
న్నొజ్జఁగ మీదెస లాగుమంత్రమని మమ్మారార్చుచుం బల్కువే.

శా. విద్యాసంస్థల కీ లెఱింగి, మగుడఁగ విచ్చేతు విం కెప్పుడో;
హృద్యంబైన కళాప్రణాళిక ప్రవర్తింపింతు, జాతీయసం
వేద్యాంశంబుల; నంచు మేము మది నువ్విళ్లూరుచుండంగ, ని
న్నాద్యంతమ్ములు లేనిదైన మెడబాయంజేసె నెట్లోర్తుమో!

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. చేరి, తుయదగ్గునిన్ను గ్రుశింపజేయ-ప్రభవవత్సరవైశాఖ బహుళతదియ
శుక్రవారము కీర్తిశేషుడవయితివె! పప్పుకులసింధుతారేశ, పార్వతీశ!

మ. మనవిద్యాలయ మెట్టు లున్నదను సంప్రశ్నమ్ములుఁ, ఖద్ద రే
ననయమ్మం ధరియించుచుంటి నను నెయ్యంబారు వాక్యమ్ములుం
గని, నీలేఖలు సారెసారె చదువంగా మాకుమోదమ్ము గ
ల్గెను మః; న్నిప్డెద నీవు వోవ, గలచెఁ లేఖల్ ద్రిశూలమ్ములై.

మ. తనువు న్వీడెడు వేళ జీవున కెడంద న్నిల్చి, పోజాల, కే
పున వర్తించెడి వాంఛ లంకురములై పొందించు మార్పుట్టు; నీ
ఘనసంకల్పము రిత్తవోవునె? మహాకల్యాణ మీభారతా
వనికిం గూర్చు బల మ్మొసంగి మగుడం బంచు న్నినుఁ ధాత్రికిన్.

ఉ. పంబినశాంత మానసము పై విలసిల్లగ, నాదరప్రశ
స్తంబయి పొల్చుమాడ్కియు, హితమ్మగు సూక్తియు నొప్ప నీనిరా
డంబరజీవిత మ్మది మెడందను నాటెను; పప్ప పార్వతీ
శంబ! గుణాఢ్య! నిఁమఱువ శక్యమె మాకిక నెన్నినాళ్లకున్!



# యశోద-విశ్వప్రదర్శనము

భమిడి ఉమామహేశ్వరావధాని గారు

కలయో, భ్రమయో, మతిచం-చలమో, మాయో, మహేంద్రజాలంబో యా
నిలఁగంటిమి వింటిమి విం-తలు కుక్షిని జగములున్న తనయులు గలరే!

చిఱుతపాపఁ డటంచుఁ జింతించునే కాని-యఖిలలోకాధ్యుఁడం చరయలేదు
వెన్నయే కడుపార నున్నది యనుకొంటి-విశ్వంబు లుంకుట వినఁగలేదు
బాలకృష్ణుఁ డటంచుఁ గేలుఁగట్టితి గాని-యాదివిష్ణు వటంచు నరయలేదు
భువిఁ బావనముసేయఁ బుట్టినశిశువని-కలనైన నేఁ జూడఁ గాంచలేదు
ఇట్టి మహిమలుగల ముద్దు పట్టిఁ గన్న-ననలతోఁ గూడి పొల్పారు నారకెటులు
వాస నబ్బునో యటులు నావంశ మిపుడు-పావనం బయ్యె నహహా! గోపాలబాల!

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# చీనాయందలి కల్లోలము

(జాతీయోద్యమమునకు గల ప్రతిబంధకములు)

జయంతి వెంకటకిరీటిరావుగారు

న్రాంట డెబ్బదిరెండు యుద్ధనౌకలు ఎనిమిది విదేశీయధ్వజములను ఎగుర వేయుచు, చీనాపరిసరసముద్రముపై సంచరించుచున్నవి. అమెరికావారు ముగ్గురు నౌకా దళనాయకులను, ఇంగ్లాండు ముగ్గురను, ఫ్రాన్సు జపానులు చెరి ఒకరిని చీనాకుఁబంపియున్నవి. 35,000 విదేశీయసేనలు షాంగేయందు విడిసియున్నవి. ఇదంతయు నెవరికొరకు? చీనాలోనున్న తమతమ స్వదేశీయుల సంరక్షించుకొనుటకే యన్నచో నెవరు నమ్మగలరు? సైన్యములను పంపక పూర్వ మీమాట జెప్పిన నమ్ముటకు కొంత వీలుండెను. కాని యిటీవల యీ సైన్యములయొక్క చర్యల విన్నపిదప నీమాట నమ్ముటకు వీలులేకున్నది. ఈహడావిడియంతయు బ్రిటను రషియాదేశము లొండొరుల పైగల పగసాధించుకొనుట కుద్దేశింపబడినది. పరిశ్రమాధికారుల తరఫునే కాక, సామ్రాజ్యమంతటి తరఫున ఇంగ్లాండును, కమ్యూనిజము (సాంఘికసమానత్వము) నెలకొల్పుటకే కాక జాతీయస్వాతంత్ర్యమును నెలకొల్పునుద్దేశముతో పరాధీనరాజ్యముల తరఫున రషియాయును పోరాడుచున్నవని యీదిగువ విషయములబట్టి తెలియగలదు. పెకింగునందున్న రషియాకార్యాలయపు ముట్టడి, నాంకింగు దుర్నయములు, కుమింగుటాను (జాతీయ) పక్షమునందలి చీలిక మున్నగువిషయములే యిందుకు నిదర్శనములు.



కీ. శే. డా. సన్‌యట్‌సేనుగారు

దక్షిణచీనాకు స్వాతంత్ర్యము చేకూర్చి కాంటనుప్రభుత్వమును స్థాపించిన విప్లవనాయకుడు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఐరోపాయుద్ధానంతరము జరిగిన వాషిం గ్టనుసంధి షరతులకు విరుద్ధముగను, జాతి



కాంటను ప్రభుత్వమునకు సరుకీతముగనున్న స్త్రీరత్నము.
దక్షిణచీనాకు స్వాతంత్ర్యము సంపాదించిన
డా. సన్ యట్ సేనుగారి భార్య.

సమితి నిబంధనలకు విరుద్ధముగను అమెరికా ఇంగ్లాండు ప్రభుత్వములు చీనాలో తమసేన లను దించినవిషయ మిదివరకుసూచింపబడెను. ఈసేనలు జాతీయోద్యమమునకు ప్రతికూలు రగు ఉత్తరచీనానాయకులకు లోలోపల సహా యముచేయుచుండినను, కాంటను జాతీయ ప్రభుత్వపుసేనలు చియాంగ్ కాయి పే.కుగారి సేనాధిపత్యమున హాంకోనగరమును ముట్టడి చేసి బ్రిటీషువారి స్వాధీనమునుండి తప్పించి తాము వశపరచుకొనిరి. కడచిన మార్చిమాస మున ఇంకను ఉత్తరమునకు దండెత్తిపోయి ముందుగ షాంగేనగరమును (ప్రతికూలదేశీయపక్షమువారి వశమందున్న భాగమును), పిదప నాంకింగునగరమును ఆక్రమించుకొనిరి. విదేశీయవర్తకవ్యాపారములకు కేంద్రస్థానము ను, ముఖ్యమగు రేవుస్థలమును నగు షాంగేకు మోసము రాకుండుటకై ఉత్తరభాగము నాయకులగు చాంగ్ట్సోలిను మున్నగువారు తమసేనలను నాంకింగువైపునకు దెచ్చి, షాం గేపై బోవుచున్న చియాంగ్ కై షే.కుగారికి వేరొకవైపున ఒత్తిడికలిగింప జూచిరి. కాని కాంటను జాతీయప్రభుత్వమునకు కార్మికుల సహాయముండుటచేతను షాం గే నగరమున విజయముగాంచి, నాంకింగునగరమును గూడ నాక్రమింపగలిగిరి. రత్నములవంటి షాంగే నాంకింగు నగరములు లభించినపిదప ఇంక పెకింగు, తదితరనగరములు చేకూరుటెంత?



సన్ ఫూ గారు.
విప్లవనాయకులగు కీ. శే. సన్ యట్ సేనుగారి కుమారులు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

త్వరలోనే చీనాయంతయు జాతీయపక్షము వారి వశము కాగలదని విదేశీయవర్తకులకు భయమగుచున్నది.

నాంకింగు ముట్టడిసమయమున ఉత్తరపు సేనలు, కాంటను సేనలుగూడ నగరమునం దుండెను. ఉభయులు కలియబడి పోరాడుచున్న పుడు అచ్చటనున్న విదేశీయులకు దెబ్బతగిలెను. అమెరికా ప్రతినిధికార్యాలయము కొల్లగొట్టబడెను. జపానుయుద్ధనౌకలపై తుపాకులు కాల్చబడెను. ఈసంపడిలో ముగ్గురు మాత్రమే తెల్లవారు చనిపోయిరి. దక్షిణపు సేనలచే వెంటాడబడి పారిపోవుచున్న ఉత్తర దిక్కు సైనికులు తమకడ్డుదగిలిన పాశ్చాత్య సేనలకు గొంత హింస గావించిరి. ఇదికారణముగగొని అమెరికా బ్రిటిషు యుద్ధనౌకలు నాంకింగునగరముపై ఫిరంగులు గాల్చిరి. అనేకమంది చైనీయులకు హాని కలిగెను. ఇదియిట్లుండ



ఫెంగ్ యుసి-హ్యాంగ్ గారు, జాతీయపక్షనాయకుడు. ప్రస్తుతము షెన్సిరాష్ట్రము వీరి స్వాధీనమునం దున్నది

తమకు గలిగిన నష్టమునకు కాంటనుప్రభుత్వమువారు పరిహార మొసంగవలసియుండునని బ్రిటీషువా రనుచున్నారు. అంతకు ముందు షాంగేలో ఉత్తరభాగపుసేనలపై విదేశీయులు తుపాకులు గాల్చుటచే వారిపై పగ సాధించుటకు ఉత్తరదిక్కుసేనలే యీదుర్నయముల గావించియుండునని విదేశీయులు తలంపరైరి.



మార్షల్ సన్‌చాను ఫాంగుగారు. షాంగేనగరమును కాపాడుచుండగా జనవరిలో కాంటనుప్రభుత్వమువారు వీరిని ఓడగొట్టిరి.

### బ్రిటీషువారి యెత్తు

నాంకింగు దుర్నయములు కారణముగజేసి, అమెరికా, బ్రిటను, ఫ్రాంసు, ఇటలీ, జపాను-ఐదు ప్రభుత్వములుగలసి నష్టపరిహారము గోరుచు కాంటనుప్రభుత్వమునకు అంత్యసందేశము నంపి యుద్ధమునకు గడంగవలెనని ఇంగ్లాండు యత్నించెను. కాని యీయత్నము

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సాగలేదు. ఇదివర కొకసారి హాంకో ఒడంబడి కకు పూర్వము ఇట్లే బ్రిటీషువారు సూచించియుండిరి. కాని అప్పుడును అమెరికా జపాను లంగీకరింపలేదు; ఇప్పుడును అంగీకరింపలేదు. అవసరమున్నచో తానే కాంటను ప్రభుత్వముతో ఉత్తరప్రత్యుత్తరముల నడుపుకొనగల నని అమెరికా చెప్పెను. జపాను ప్రస్తుత మెక్కువ చొరవజేసికొనక బ్రిటీషువారు పోయినచో యాంగ్ట్సిలోయయందు తన వర్తకమును స్థాపించు నుద్దేశముతో నున్నట్లు తెలియుచున్నది. చివరకు విదేశప్రభుత్వములు వేరువేరుగనే సందేశము లంపినవి. ఇన్నింటికిని కాంటను ప్రభుత్వము తరఫున యుజను దోషము రూఢిగానిది శిక్షింపవీలులేదనియు, ఎవరిచే జరిగినను చీనాభూమిపైనున్న అమెరికా ప్రతినిధి కార్యాలయమునకు నష్టముకలిగి నందున తాము నష్టపరిహారము నిచ్చుకొందుమనియు జెప్పిరి. ఇట్టి న్యాయ్యమగు ప్రత్యుత్తరమునకు గూడ విదేశీయులు సంతృప్తిజెందక, మూలకారణముల గూర్చి విచారించుట కిష్టములేనివా రగుటచే చేనుగారి జవాబునకు అసమ్మతి దెలిపి యూరకొనిరి.

సోవియటు భవనము ముట్టడి

కాంటను ప్రభుత్వమునారు బ్రిటీషువారిపై జరుపుప్రతికూలచర్యయంతయు రషియావారి ప్రోద్బలమున జేయుచున్నారనియు, రషియాలోని కమ్యూనిస్టుపక్షము వారే యంతకు కారకులనియు బ్రిటిషువారి తలంపు. అందులకనుగుణ్యముగ వారు చీనా రషియాలకు ప్రతికూలముగ చాల ప్రచారము జేయుచున్నారు. అనేక పత్రికలు, వార్తాప్రచారకసంస్థలు వీరిచేత నుండుటచే చీనావారిలోపములను గోరంతలు కొండంతలుచేసి, సోవియటు (రషియా)పై అనవసరముగ అపవాదములువేసి, వార్తలను



షాంగే ముట్టడియందు పాల్గొనిన కార్మికులు బాల్షివికుల ప్రేరేపణవలన ఆయుధసహితులై ఊరేగుచున్నారు.

చేనుగారు ప్రత్యుత్తరమిచ్చుచు నాంకింగు దుర్ణయములకు తమసేనలు కారణముగావనియు, అంతర్జాతీయసంఘము నొకదానిని నియమించి విచారించినచో తమకేమియు అభ్యంతరము లేదనియు, విచారించునపుడు నాంకింగుపై ఫిరంగులు కాల్చుటవలన గలిగిన ముప్పునుగూర్చి కూడ విచారింపవలెననియు, వివిధ దేశములకంపుచున్నారు. కాని యింత మాత్రమున ప్రజలందరు మోసపోజాలరు. ఇట్టి ప్రచారమువలన వీరు వారింపదలచిన జాతీయోద్యమము ఘనతయే యెక్కువ ప్రకటనయగును. ఏప్రిలు మొదటివారములో పెకింగునగరమునందున్న సోవియటు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ప్రభుత్వభవనమును కొల్లగొట్టుటకు ఛాంగ్ టొసోలినుగారికి అంతర్జాతీయసంఘమువారు (డిప్లమాటిక్ కోరు) అనుమతి నిచ్చిరి. ఛాంగ్ టొసోలినుగారి సేనలు చూచిరమ్మన్న కాల్చి వచ్చినట్లు చేసినవి. 72 చైనీయులను, 22 రషియనులను అరెస్టు చేసిరి. అనేక కాగితములను, కరపత్రములను బయటికి దీసి, రషియావారు చీనాలో జేయుచున్న ప్రచారపు గుట్టంతయు బయటపెట్టితిమని యుప్పొంగిరి. చీనాజాతీయవాదులకు రషియానుండి ధనము, ఆయుధములు వచ్చుచున్నవనియు, విదేశీయులనుచంపి వారిభవనముల లూటీ చేయుమని రషియావారు ప్రోత్సహించుచున్నారనియు,ఆకాగితములవలన తెలిసినట్లు చెప్పి రషియాపై నిందల మోపిరి. ఇవి యెంతవరకు నిజమో తెలియదుగాని నిజమేయని అంగీకరించినను, జాతీయపక్షేతరులకు బ్రిటిషువారు,అమెరికనులు ఇంతకన్న నెక్కుడు సహాయము చేయుచున్నపుడు ఇందు వింతేమున్నది. జాతీయపక్షపుసేనలు ఉత్తరదిక్కు సేనలతో పోరాడుచున్నపుడు, అంతఃకలహములందు పాల్గొనరాదను బ్రిటీషు అధికారులు షాంగేనగరములో 2000 మంది షాంటాంగు (ఉత్తర) సేనలకు ఆశ్రయమిచ్చి, జాతీయపక్షపు సేనలకు పట్టువడకుండ కాపాడి రహస్యముగ ట్సింగ్‌టూ నగరమున కంపినట్లు నేషనలు న్యూసుఏజన్సీ వార్త దెలుపుచున్నది. ఐరోపియనులు మాత్రము తమ కనుకూలమగు ప్రచారము చేసికొనుటలేదా? వారిచే స్థాపింపబడిన క్రైస్తవసంస్థలు, విద్యాసంస్థలు మున్నగున వన్నియు అందులకు తోడ్పడుచున్నవి. కాని పరాధీనులైయున్న చైనీయులకు, ముఖ్యముగ కార్మికులకు,సామ్రాజ్యకాంక్షగల బ్రిటను అమెరికా జపాను ప్రభుత్వముల ప్రచారము నచ్చక జాతీయాభివృద్ధి కనుకూలమగు ప్రచారమే చెవినిబడుచున్నది. అందువల్లనే జాతీయపక్షమునకు విజయము చేకూరుచున్నది.

### ప్రస్తుత స్థితి

జాతీయసేనలు ప్రస్తుతము దక్షిణభాగమంతయు వశపరచుకొని, యాంగ్‌ట్సిలోయనాక్రమించుకొని ఉత్తరమున పెకింగువైపు దారి జూచుచున్నవి. హోసనురాష్ట్రి మప్పుడే వారిచేతిలో బడినది. పశ్చిమమున నున్న షెన్సిరాష్ట్రము జాతీయవాదియగు ఫెంగుయుశియాంగుగారి స్వాధీనమునందున్నది. కాని యీవిజయము స్థిరమగుట కింకెంతకాలము పట్టునో తెలియదు. ఈలోపుగ జాతీయపక్ష


పెకింగునందు చాంగుట్సోలినుగారిఉత్తరువుప్రకారము ముట్టడిచేయబడిన సోవియటుభవనమునందు పట్టువడిన బొల్షివికులైదీ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మునందే చీలిక గలిగినది. అసలు జాతీయ పక్షమునందు గమనింపదగ్గ నాయకబృందములు మూడు గలవు. కాంటనునందు గల డా॥ సనుయటుసేనుగారి బంధువర్గము, భార్య, కుమారుడగు సనుఫూగార్ల ననుసరించువారు. వీరు పక్కా జాతీయవాదులు. తరువాత చియాంగ్ కాయిషేకు సేనావర్గము. జాతీయ పక్షమునందు ఎన్ని సేనలు చేరినను వీరి యధికారము ఇనుమడించుచునే యున్నది. మూడవవర్గము హ్యూసెచెలన్‌గారి నాయకత్వము క్రిందనున్న అతివాదవర్గము. వీరు కేవలము కమ్యూనిస్టుపద్ధతుల ననుసరించునారు. ఈ పక్షమువారు కమ్యూనిస్టునాయకుడగు బరోడినుగారి ననుసరించుటచేతను, వారి ప్రచారమునం దన్నియంశములతో తాను ఏకీభవింపకుండుటచేతను, చాంగ్ కాయిషేకు సేనాని, జాతీయ ప్రభుత్వమేర్పడినచో డా॥ సనుయటుసేనుగారు చెప్పిన సూత్రముల ననుసరించి స్థాపింపబడవలెనుగాని విదేశీయ రషియా విధానము ననుసరింపరాదను నుద్దేశముతో ఈ యతివాదపక్షమునుండి చీలిపోయి, నాంకింగునం దొక స్వతంత్ర ప్రభుత్వము నేర్పరచిరి. సి. సి. వూగారు ఈ ప్రభుత్వమునకు విదేశాంగమంత్రిగ నియమింపబడిరి. చియాంగ్ కాయిషేకుగారు హాంకో నగరమును మరల స్వాధీనపరచుకొన జూచుచున్నారు. హాంకో నగరమున విషమ పరిస్థితులు సంభవించినవి. చీనా ఉత్తరభాగపు అధికారమునకై హాంకోలోనున్న కమ్యూనిస్టు ప్రభుత్వమువారు, చియాంగ్ కాయిషేకుగారి నాంకింగు ప్రభుత్వము, ఉపేఫూగారి నాయకత్వమున నున్న ఉత్తరదిక్కు సేనలు పోరాడుకొనుచున్నవి. పెద్దయెత్తుబడి మీాద తీవ్రమగు యుద్ధము జరుగుచున్నది. దీని ఫలితముగ దేశీయుల లో వ్యాపారమంతయు నిలిచి



చీనా రక్షకసంఘమువారు రెడ్‌క్రాసు జెండా నెత్తి బ్రిటిషు సరిహద్దులయొద్ద యుద్ధమునందు చనిపోయినవారి శవములను గొంపోవుట.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పోయినది. వర్తకమునకు భంగము కలిగినదని వేరుగ జెప్పనవసరములేదు. పెకింగులోనున్న బ్రిటిషుమంత్రి సర్ మైల్సులాంసనుగారు, తదితర పాశ్చాత్యసేనానాయకులు, ప్రతినిధులు షాంగేలోగూడి కర్తవ్యముగూర్చి ఆలోచించుచున్నారు.



కాంటను ప్రభుత్వమువారు షాంగేనగరమును ఆక్రమించిన పిమ్మట ఇండ్లలోనున్న వారిపై ఆడ్మిరలు జనరలు సీగారి సేనలు వీధులలో నిలిచి తుపాకుల ప్రేల్చుట. జనరలు సీగారు సోవియటులకు ప్రతికూలమగు "వైటు" (శ్వేత) పక్షమువారు.

తమవలెనే పరాధీనులైయున్న చీనాప్రజలయెడల సానుభూతి జూపుచు అచ్చట జాతీయోద్యమము నణచివేయ తమదేశపు సేనలనే ప్రభుత్వమువారు చీనా కంపుచుండ వారింపలేక పోయినను, భారతీయులు చీనావారికి సహాయము చేయుటకై కొందరువైద్యులను, నర్సులను, సేవకదళమును పంపుటకు మొన్న బొంబాయిలో జరిగిన కాంగ్రెసుసభయందు తీర్మానించిరి. ఇది యెంతవరకు నెరవేరునో తెలియదు. ప్రభుత్వమువా రనుమతించినగదా పంపుట?



## భారతీయ మహిళామండలి

## కన్యా శ్యామకుమారి నెహ్రూ

పండిత శ్యామలాలు నెహ్రూగారి దుహిత.

అలహాబాదు విశ్వవిద్యాలయము యం. ఏ. పరీక్షయందు ఉత్తీర్ణులయినవారిలో ప్రప్రథమురాలుగా వచ్చెను.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



# ప్రాచీన భారతీయాభరణములు

[బొంబాయి మధ్యరాష్ట్రములకు, ఇతరరాష్ట్రములకు జెందినవి.]

చిత్రము. ౭౮—౪౯౧. హస్తభూషణము, వెండిది. వెండిమలాముపూసిన తీగపనిగలది. వెడల్పు ౧$\frac{౩}{౪}$ అం., అడ్డుకొలత ౩ అం. ఒకజత వెల ఆఱుపౌనులు. అబిసీనియా దేశపుది. ౪౯౨. బంగారుకంకణము; మొగ్గల వంటిగుబ్బలు, గుండ్లు దారముతో కట్టి కూర్పబడినవి. సం. ఇది ౧౮౯౭ లో అరేబియా దేశములోని మస్కటు నగరమున నొక అరబ్బీ చేసినది. అడ్డుకొలత ౩ అం., వెడల్పు ౧ అ. ౪౯౩. హస్తకంకణము; వెండిది. జాంజిబారులో చేసినది. వెల అయిదు పౌనులు. ౪౯౪. భుజత్రాణము; వెండిది. వెండితీగపనిగలది; రాళ్లుచెక్కబడినది. అబిసీనియా రాజగు థియోడరు హార్ముజ్డు రస్సామ్ అను నాతనికి బారితోషికముగా నొసగినది. ఎత్తు ౬ అం. నడిమికొలత ౪ అం. అబిసీనియా దేశపుది.

చిత్రము. ౭౯—౪౯౫. పువ్వుకలశము. వెండిది. తీగపనిగలది. ఒకజత వెల పౌ. ౧౭, షి. ౧౨.

చిత్రము. ౮౦—భారతదేశపు పాటకజనము తాల్చు ఆభరణములు. మట్టరకపులోహముతో చేసినవి. ౪౯౬. చెవిపోగు. బెంగాలురాష్ట్రముది. ౪౯౭. (ఎ. బి. సి.) మూడును లక్కతో చేసిన చెవిపోగులు. సంయుక్తరాష్ట్రములలోని మీర్జాపురమువి. ౪౯౮. కమ్మితో నల్లిన చెవిపోగు. సంయుక్తరాష్ట్రములది. ౪౯౯, ౫౦౧. కాలిచుట్లు (పిల్లాండ్లు). మధ్యరాష్ట్రములలోని సాగరపట్టణముది. ౫౦౦. దక్కనులోని పారభిల్లులు ధరించు కర్ణాభరణముల జత. ౫౦౨, ౫౦౩, ౫౦౪, ౫౦౯. క్రమముగ అజిమీరు, బెంగాలు, పాట్నా, కలకత్తా నగరములకు జెందిన హస్తాభరణములు. కాని ౫౦౪, ౫౦౯ సాధారణముగా ఉత్తరహిందూస్థానమున నంతటను ధరింతురు. ౫౦౫. చెవిగొలుసుల జత, ౫౦౭. గజ్జె; ఇవి పారాభిల్లులు ధరించునవి. ౫౦౮. గుబ్బగల చెవిగొట్టాలు. చెన్నపురివి. ౫౦౬. కర్ణాభరణము. భారతదేశమంతటను సాధారణముగ వాడుకలో నుండునది. ౫౧౧. ముక్కుపోగు. సంయుక్తరాష్ట్రములలోని సహారాన్‌పురముది. ౫౧౨. పారాభిల్లుల ముక్కుపోగు. ౫౧౩. కమ్మవంటినగ. సాధారణముగ భారతదేశమంతటను వాడుచున్నను, సంయుక్తరాష్ట్రములలో ఎక్కువ ఉపయోగించెదరు. ౫౧౦. తెల్లలోహముతో చేసిన కాలికడియము. బెంగాలులోని 'సారన్' లో నుపయోగింతురు. ౫౧౪. బెంగాలులో ధరించు కాలికడియము.

చిత్రము. ౮౧—౫౧౩—౫౩౫. మట్టమైనలోహముతో చేసినవి. సాధారణముగ మధ్యహిందూస్థానమున వాడుకలోనున్నవి. ఇందలివి చేతికి, కాళ్లకు పెట్టుకొను గొలుసులు, కడియములు. ౫౨౪, ౫౩౧, ౫౩౩. వీనిని దారములోగాని, తీగలోగాని కూర్చి కాళ్లకు చేతులకు ఆభరణములు చేసికొనుట కుపయోగించునవి.

చిత్రము. ౮౨—౫౩౬మొ. ౫౬౩. మట్టరకపు లోహముతో చేసినవి. ౫౪౨, ౫౪౯. చెవిపోగులు. ౫౪౩, ౫౪౫, ౫౪౬, ౫౫౦. చేతివ్రేలి ఉంగరములు. ౫౫౩, ౫౫౪, ౫౫౫, ౫౫౭, ౫౫౯, ౫౬౦, ౫౬౧, ౫౬౨ కాలివ్రేలిచుట్లు. తక్కినవి కాళ్లను చేతులను ధరించుకడియములు.

చిత్రము. ౮౩—వెండినగలు. ౫౬౪, ౫౬౫ సంఖ్యగల కాలివ్రేలిచుట్టు యొక్క వెనుకవైపు. ౫౬౫. కాలివ్రేలను ధరించునది. ఉంగరములు కడ్డీతుండ్లు చేర్చి చేసినది. ద్రాక్షపండ్లవంటి సన్నని గుండ్లు అతుకబడినవి. ఒకజతవెల రు. ౧౬. ౫౬౬. చేతిగుండ్లు. ౬ పలకలుగా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

తీర్చిన బోలుగుండ్లతో కూర్పబడినవి. ఒకజతవెల రు. ౧౬. ౫౬౪. పైదానివంటిదే. భిన్నవిధములనున్న గుండ్లతో కూర్పబడినది. ఒకజతవెల రు. ౧౬. ౫౬౭. చేతిగొలుసులు, గుండ్రని చిన్నగజ్జెలు కట్టినవి. ౫౬౯. గట్టి కాలికడియము. గుండ్రని చిన్నగజ్జెలు కట్టినది. ఒకజత వెల. రు. ౪౦. ౫౭౦. హారము. పెక్కుసరములు గలది. పూవులు, బిళ్లలు, గుండ్లు, గజ్జెలుకలిపి గొలుసు కట్టుష ముగా కట్టినది. ఈనగల నన్నిటెని జయపురాస్థానమున నగలు చేయుచుండిన కాశీనాథుడను నాతడు వెండిలోను బంగారములోను చేసినాడు.

చిత్రము. ౯౪—వెండినగలు. ఇందుగల ౫౭౩ వ సంఖ్యలప్ప, తక్కినివన్నియు జయపురపు కాశీనాథుడను నాతడు చేసినవి. ౫౭౧. కాలిగొలుసు; గజ్జెలుకట్టినది. వెల రు. ౮౦. ౫౭౨. ఉంగరములు, దిమ్మలుకూర్చి చేసినహారము. గజ్జెలుకట్టియున్నది. వెల రు. ౧౧. ౫౭౩. వజ్రములవలె చెక్కియున్న ఉంగరములతో కట్టినహారము. పతకమున్నది. ఈరకపుపతకములను అయిదుగుండ్లతో జేర్చి చేయుచుందురు. ఈహారమును బంగారుతోను, వెండితోను జేయుదురు. పడమటిహిందూస్థానమునందలి స్త్రీలందఱు దీనిని ధరింతురు. జయపూరుజైలులో చేయబడినది. దీనికి మొదటి బహుమానము లభించినది. ౫౭౪. బాజుబందు. వంకీకడ్డీలతో దారమున కూర్పబడినది. వెల రు. ౧౩. ౫౭౫, ౫౭౬. కాలిగొలుసుల జత. వెల రు. ౯.

చిత్రము. ౯౫—వెండి ఆభరణములు. ఇవియు జయపురపు కాశీనాథుడను నాతడు చేసినవే. ౫౭౭. తలపైనుండి చెవులవఱకు ధరించు ఆభరణము. (ఫూల్ ఝుంకా) వెల రు. ౨౦. ౫౭౮, ౫౭౯. కర్ణాభరణములు. దీని పైభాగము పక్షివలెనుండును. గజ్జెలుకూర్చిన గొలుసులు వ్రేలాడుచుండును. క్రింద అందమైన మొగ్గవంటి యొకపతకము వ్రేలాడుచున్నది.—ఇవి కొంతవరకు గొలుసును దిమ్మలుచిన్నగుండ్లుకలిపి చేయబడినది. ఒకజత వెల రు. ౧౬. ౫౮౦. ఉంగరాలగొలుసుతో చేసిన కంఠహారము. ద్రాక్షగుత్తులవలె గజ్జెలతో కట్టిన యొకగుత్తి పతకమువలె దీనికి కూర్పబడినది. ౫౮౧. హస్తకంకణము. చుట్టును చిన్నగజ్జెగుత్తులు కట్టబడినవి. ౫౮౨. చేతికడియము. ఒకగజ్జెగుత్తి కట్టబడినది. ౫౮౩. ఉంగరములతో కూర్చిన గొలుసు (కంఠహారము). చుట్టునుగజ్జెగుత్తులుకూర్చిన చతురస్రమగు పతకముకలదు. పతకమునడుమ నొకబిళ్లపై కుతుబ్ మినారుకుపోవు త్రోవలో నున్న సఫ్దర్ జంగు గోరీయొక్క చిత్రము చెక్కబడియున్నది. విలువ రు. ౪౦. ౫౮౪, ౫౮౪. గజ్జెలుకట్టిన గుండ్లతో చేసిన హస్తాభరణము. ౫౮౫. చెక్కడపుపనిగల బోలుకడియము. చేరదాల్చునది. ఈనగలన్నియు బంగారముతో చేయించి రాజపుటానా, మధ్యహిందూదేశములయందుండు సంపన్నులు ధరింతురు. అక్కడనుండి ఆచుట్టుపట్టులనుండు రాష్ట్రములకును వ్యాపించియున్నవి. వీని విలువబరువునుబట్టి, పనితనమునుబట్టి వివిధముగ నుండును. ఒకతులము లేక ఒకరూపాయిబరువుగల వెండివెలరెండణాలమొదలు ఎనిమిదణాలవఱకును, బంగారమువెల నాల్గణాలమొదలు రెండురూపాయలవఱకును నుండును. ఒకరూపాయ లేక ఒక తులముబరువు అవున్సులో రెండింట నైదుభాగములకు ($\frac{2}{5}$) సమానము.

["జర్నల్ ఆఫ్ ఇండియన్ ఆర్టు అండ్ ఇండస్ట్రి" అనుమాస పత్రికనుండి]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# వందనము

(రవీంద్రకవిచంద్రుని గీతమున కాంధ్రము)

కోవల్లి వేంకటరమణరావు గారు

వందనం బిదె యర్పింతు నందుకొనుమ!
కటికిచీఁకటి కడుపు చెక్కలగుభంగి
నవ్వినాఁడవుకావున నమ్రుఁడనయి
వందనం బిదె యర్పింతు నందుకొనుమ!!

* * * *

ఈ నిరుత్సాహపూరిత మహా నభంబు
నుండి, యింక నగాధమై యుండు నింగి
నుండి, నిర్మలాకాశమందుండి నీకు
వందనం బిదె యర్పింతు నందుకొనుమ!!

* * * *

మందగతుల విజృంభించు మలయమారు
తమునఁ జిక్కియొక్కెడ క్షితితలము నమరు
పూరిపాన్పునఁ బవళించి మోదమలర
వందనం బిదె యర్పింతు నందుకొనుమ!!

* * * *

అనిశ మాకాశవీథియం దవతరించి
మెఱుఁగుఁబురుగుల వరుసను మించు తీవి
వెలయు నక్షత్రపంక్తిఁ దవిలియు నీకు
వందనం బిదె యర్పింతు నందుకొనుమ!!

* * * *

శ్రమనివారణానంతరంబమలసౌఖ్య
కీలకంబగువిశ్రాంతి గృహమునందు
వేడ్కమైశయనించి నీవింత లరసి
వందనం బిదె యర్పింతు నందుకొనుమ!!

---

# అభిసారిక

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

"ఏ గభీరనిశీథిని నేటి కబల [నురుక?"
సాహసము చేసెదు తమిస్రజలధి
"అద్భుతగులకు మమ్మ నాయనుగురాయ
డాత్రపడుచుండు నందు నన్నరసికొనుచు"
"ఈవసంతనిశీథిని నెందు చనునో
నీమ మేమమ్మ? దక్షిణనేత యతడు"
"పొల్లుమాటల నను నిల్పబోకు మింక
విసిగివేసారి నారాజు వెడలిపోవు"
"ఈప్రశాంతనిశీథిని నిందు నందు
వసతు లెన్నేని కల; వేల బైట చనగ?"
"అది వినీలనదీపులినాంతికమ్ము
పూవ్రుటీరమ్ము, పావురములకు నెలవు"
"ఈదురంతనిశీథిని నెచట నేమి
కలదొ? మంచిది కాదమ్మ కాలినడక"
"పూలబెట్టిన యట్లు కొంపోవనుండ
పంచబాణుడు, నాకేమి భయము చెలియ?"
"ఈకరాళనిశీథిని నీవ యేల
చనగ, చెలి నంపి రప్పించుకొనగ రాదొ?"
"సుందరీ, వల దటు శ్రమయందు వోలె
ఫలము నందును పాలీయవలెనో యేమొ?"

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



## శ్రీ శివాజీమహారాజు

జాతీయత లోకమున బలముగొనుచున్న యీ కాలమున జనులదృష్టి జాతీయతకొఱకును, జాతికొఱకును జీవితముల ధారవోసిన వీరవరుల చరిత్రములవంకకు మరలుట సహజము. అట్టి శాశ్వతజీవను లగు వీరాగ్రగణ్యులలో శ్రీ శివాజీమహారాజొకఁడు.

ఈర్ష్యాపరులు కొంద ఱతని నొకయల్పునిగ జనులకుఁ బ్రదర్శింప యత్నించినను, అతనిచరిత్రమును బరికించినచో, వారివ్యాఖ్యానములం దాఁగియుండు హృదయమాలిన్యము పొడసూపక మానదు. కేవల మొకమోటుమానిసియగు బందిపోటుఁ స్వతంత్రరాజ్యమును సంస్థాపింపఁజాలఁడు. అది యొకప్రతిభాశాలియగు రాజ్యతంత్రజ్ఞుని పని.

సరియగు రాజ్యతంత్రజ్ఞుఁ డెన్నఁడును దన పరిస్థితులఁ జూచి భయమందఁడు; ఆనుకూల్యము లేదని వెనుకంజ యిడఁడు. ఎట్టి దేశకాలపరిస్థితుల నైనను లోఁగఁదీసికొని, వాని ననుకూలముగ గావించుకొని, తన పూనినకార్యము నీడేర్చుకొనును. అందును, శివాజీ యెట్టిపరిస్థితులందుఁ దనరాజ్యమును స్థాపించెనో పరికించిన నతనిప్రతిభాపరిమాణము గోచరింపఁ గలదు.

పృథ్వీరాజు పతనము నొందినది (౧౧౯౩) మొదలు ఐదుశతాబ్దము లెడతెగక విదేశీయులదాడులు భారతవర్షమును కలఁచివైచినవి. సురక్షితమగు దక్షిణహిందూదేశమునఁగూడ తాళికోటయుద్ధము (౧౫౬౫) మొదలుకొని స్వతంత్రరాజ్యము గలిగి, ముసల్మానుల దాడుల లెక్కగొనక తలయెత్తి నిలువఁగలిగిన భారతీయ భూపతి యెవ్వఁడును లేకుండెను. నాఁటనుండి ఏపరదేశీయప్రభువుక్రిందనో ఉన్నతపదవియందు వర్తించు ధనాఢ్యుఁడు భారతీయులలో నగ్రగణ్యుఁడుగ నుండెను.

ఇట్లు తరములు గడచిన కొలఁది స్వాతంత్ర్యసంపాదన మనునది దూరదూరమునకుఁ బోవుచు, తుదకొకయప్రాప్యమగు నాదర్శమైపోయెనని చెప్పవచ్చును. అట్టిపరిస్థితులందు ఒకయొన్నిక లేని కుటుంబమున జన్మించి సాహాయ్యసంపత్తులు లేని యొక సామాన్యయువకుఁడు ౧౬౨౭ సం. న, అఖండవైభవముతో శత్రుదుర్నిరీక్ష్యముగ వెలుఁగుచుండిన మొగల్ సామ్రాజ్యము నెదుటను, ఒకశతాబ్దమునుండి దక్కనునకు శిరోభూషణమై యలరారుచుండిన బీజపూరు రాజ్యము నెదుటను కత్తిగట్టి నిలిచెననిన కదుంగదు వింతగను, హాస్యాస్పదముగను గన్పట్టును. కాని ఆరాజ్యముల భావిపతనము నాతఁ డెట్లూహింపఁగల్గెనో యెవ్వ రెఱుఁగుదురు? ఆస్థితియందుఁ దనయత్నము నారంభించినచో సఫలమయి తీరునని నిశ్చయించుట కతఁడు దేశకాలములం దెట్టి చిహ్నముల గుఱుతించెనో యెవరు చెప్పఁగలరు? ఇదియే అతనిప్రతిభను జాటును!

ఎట్టివేళలం దైనను దెగువరియై నిలుచుట బందిపోటునకును లక్షణము గావచ్చును. కాని భావ్యభ్యుదయాదుల నూహించి యాత్మవిశ్వాసమున వర్తించుట వానిపనిగాదు. అథవా, ప్రతిభాశాలియగు బందిపోటే రాజ్యతంత్రజ్ఞుఁ డనుఁడు.

అపజయము వాటిల్లినచో సాయమొనర్చుటకు శివాజీకి హిందువులుగాని, ముసల్మానులుగాని యెవ్వరు బాసటయైలేరు. అతనితండ్రియు నతనికి సాయ మొసంగుట లేదు. అతనిసోదరుఁ డతనితో యుద్ధమే కావిం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చెను. ప్రజలా, సుంతయు మెచ్చుటలేదు; వారియం దైకమత్యమును లేదు. ఇన్నిలోపము లున్నను దనకు



నెల్లూరునకు చేరువనున్న బుచ్చిరెడ్డిపాళెం అనుగ్రామమున శ్రీశిల్పి నూతులపాటి నరసింహచారి గారిచే త్రిశతాబ్దవర్ధంత్యుత్సవమునకుగాను నిర్మింపబడిన ఛత్రపతి శివాజీమహారాజుగారి విగ్రహము యొక్క ఛాయాచిత్రము.

జయముచేకూరునని దూరదృష్టిగలన గ్రహించి కార్యరంగమున దుమికినాఁడు. నవనవోన్మేషశాలినియగు నతని బుద్ధి యతనికి జయపథములందు మార్గదర్శిని యైనది. తన తపమునకై వలసినంత బలియొసంగినాఁడు: తుద కఖండసిద్ధి చేకొనినాఁడు. దేశమున నలజడి ఘటించినను, స్వాతంత్ర్యవైభవమును జేకూర్చినాఁడు. దేశీయులజీవనముల నాహుతిమొనర్చినను, దేశీయుల కొకస్వతంత్ర జాతిని సంఘటించినాఁడు!

మొగలులు, బీజపూరులు, పోర్చుగీసులు అనునీ మూడుమహాశక్తులను బ్రతిఘటించి తనస్వతంత్రజాతీయా దుర్గమును నెలకొల్పెను. ఎంతటి రాజ్యతంత్రజ్ఞత! ఎట్టి యపూర్వ ప్రతిభ! ఎట్టివీరత!

రాజ్యస్థాపనమునఁ గాని, రాజ్యపాలనమునఁగాని యతనికి జాతీయత, దేశభక్తి, స్వాతంత్ర్యాభిమానము నాదర్శములు కాని పరమతద్వేషము, అసహనము, కౌటిల్యము నెంతమాత్రము నుగావు. తనరాజ్యమున నతఁడు మహమ్మదీయులకుఁ గూడ నుద్యోగపదవుల నొసఁగి సత్కరించెను; తనమతగ్రంథముల కొసఁగిన గౌరవము కురానునకుఁ గూడ నొసఁగెను. అతనిహృదయము విశాలమైనది. సమర్థ రామదాసస్వామికిఁ దనరాజ్యము నర్పించుట యతనిహృదయ మహత్త్వమున కుత్కృష్టము గు తార్కాణము. స్వలాభాభిలాష యింతయు నతనికి లేదు. కేవలము కర్తవ్యమున నాతఁడు తన జీవనమును లగ్నము గావించెను.

శివాజీ యథార్థవీరుఁడు: మహాత్ముఁడగు మానవుఁడు. అతనిచరిత్ర మహోజ్వలము. అతనిఁ గాంచిన భారతమాత ధన్యురాలు!

---

## తామ్రలిప్తి

ఇటీవలి బెంగాల్ నాగపుర రైల్వే మేగజినులో నిట్లున్నది:

కొలఘట్టస్టేషనుకు నైరృతిదిశను పదిమైళ్లదూరమున, బొంబాయిరైలుమార్గమున రూపనారాయణనదీ తీరమునందున్న పాంచ్ కురస్టేషనుకు ౧౬ మైళ్లదూరమునందు ప్రాచీనపు టోడరేవుపట్టణ మగు తామ్రలిప్తి ప్రస్తుతము 'తామ్లుక్' అను పేరనున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఏనాఁడీపట్టణ మోడరేవుపట్టణమయ్యెనో తెలియకుండెను. కాని ఆచెంతను త్రవ్వితీసిన నాణెములపై జస్టినియను చక్రవర్తి శిరస్సు ముద్రితమై యుండుటచే రోమనుచక్రవర్తులకాలమునాటికే యిది యోడరేవుగనుండెనని యూహింపదగియున్నది. దీనిని బట్టి తామ్రలిప్తి ప్రాచ్యదేశములకు ప్రయాణముచేయుచుండిన ఫోనీషియనులకొకానొక రేవుపట్టణముగానుండెనని స్పష్టమగుచున్నది. ఈపట్టణము భారతదేశమున నతిప్రాచీనములగు ఓడరేవులలో నొకటి అగుటయే కాక బెంగాలాదేశములో వర్తకవ్యాపారములు నడుచుట కొక్కటియే రేవుపట్టణముగనుండెను. ఇందుమిందు దీనికాలమును నిశ్చయించుటకుజైన బౌద్ధ బ్రాహ్మణసంస్కృతగ్రంథములను బరిశీలించుటావశ్యకము. ఆగ్రంథములయందు ఈపేరు, రేవుపట్టణమునకును, ఈపేరుననున్న రాజ్యముయొక్క రాజధానికిని, ఆరాజ్యపుప్రజలకును గూడ గలిగినట్లు తెరుచుగనుదాహరింపబడినది. ఈగ్రంథములను బట్టియే యీపట్టణము క్రీస్తుకు పూర్వమునుండి రేవుపట్టణముగనుండినట్లూహింపబడినది.

టాలెమి క్రీ. శ. ౧౫౦ వ సంవత్సరమున వ్రాసిన భూగోళమున దీనిని 'టామలిటస్' అను పేర నుదాహరించియున్నాడు. అందలి భూగోళచిత్రమున నీపట్టణము గంగానదియొడ్డున కాన్పించుచున్నది.

సింహళము మొదలయినచోట్లకు బోవువర్తకులకును, ఇతరులకును నిది రేవుపట్టణముగ నుండెనని మధ్యకాలపు బౌద్ధులు పలుమాఱు పేర్కొనియున్నారు. ఈపట్టణము సముద్రపుటొడ్డుననే యున్నట్లు ఫాహియాను (క్రీ. శ. ౪౦౫-౧౧) పేర్కొనియున్నాడు. సముద్రమున కెనిమిదిమైళ్లదూరమున నున్నట్లు ప్రాచీనభారతేతిహాసములు తెలుపుచున్నవి. ప్రస్తుత మిది సముద్రమునకిరువదిమైళ్లదూరముననున్నది. ఫాహియా నచ్చట నొకబౌద్ధమఠమున రెండేండ్లు నివాసము చేసెనట. తరువాత మరల హ్యూన్‌త్సాంగు అను నొక చైనాయాత్రికుడు (క్రీ.శ. 7 వ శతాబ్దము) ఈపట్టణమొక సింధుశాఖచెంతనున్నదనియు, అచ్చట ౧౦ బౌద్ధమఠములుండినవనియు, వానియందు వేయిరుసన్న్యాసు లుండిరనియు, రెండువందల అడుగుల యెత్తుగల అశోకనిర్మిత స్తంభమొకటియచ్చటనున్నదనియు నీలిమందు, పట్టు, రాగి (తామ్రము) ఈవస్తువు లిటనుండి ఎగుమతియగుచుండెడివనియు, తామ్ర మెగుమతియగుటచే దీనికి తామ్రలిప్తియను పేరు వచ్చెననియు వ్రాసియున్నాడు. ఇట్సింగ్ అను మఱియొక చైనాయాత్రికుడు డాశతాబ్దాంతముననే చైనానుండివచ్చి యచ్చట దిగినాడు. 'హ్వీలను' అను నొక కొరియను (యాత్రికుడు) 'చైనాకుపోవుట కిది రేవుపట్టణము సముద్రమునకు దగ్గర నున్నది.' అని వ్రాసియున్నాడు. మిత్రగుప్తుడు వ్రాసిన 'దశరాజపుత్రచరిత్ర' (Story of the Ten Princes) యందీపట్టణము గంగానదీ సమీపమున నున్నదనియు, సముద్రప్రయాణముచేయు యవనులు మొదలయినవారల పడవలినటికి మాటిమాటికి వచ్చుచు పోవుచు నుండెననియు, అప్పు డీపట్టణ మభివృద్ధిదశయందుండెననియు గలదు.

మఱియు క్రీ. ౧౯, ౯ శతాబ్దములకు పూర్వపుదగు దూధపాణి కొండలపైనున్న శాసనమునను ఈయోడరేవుపట్టణ ముదాహృతమైనది. తరువాత నెచ్చటను దీని ముచ్చటయే కాన్పింపదు.

---

## ప్రాచీనమహారాణుల చిత్రములు
## మూడవచిత్రము

షేబారాజ్యపురాణి సాలమనుప్రభువుల సంభాషణము

అరేబియాదేశమునందలి ప్రాచీనతరమగు షేబారాజ్యముయొక్క మహారాణి దుకూలాంబరములను, వింతకాంతుల వెదచల్లు ననర్ఘమణిమయ భూషణములను ధరించి 'వివేకి' యని ప్రఖ్యాతిగాంచిన సాలమనుప్రభువు నాస్థానమునకు వచ్చెను. 'సాలమనుచక్రవర్తి దైవజ్ఞానసంపన్ను'డను ప్రఖ్యాతిని విని యామహారాణి యాతనిని గఠినవిషయముల గుఱించి ప్రశ్నించి పరీక్షించుటకై, సుగంధద్రవ్యములను, సువర్ణరత్నభారములను అపారముగ నొంటెలపై నెక్కించుకొనిగొప్పపరివారము వెంటరా నతివైభవముతో నచ్చట కేతెంచెను. ఆతఁ డామెప్రశ్నముల కన్నిటికిని సరియైన సమాధానములనొసగి యామెను సంతుష్టిపరచెను. ఆతని యద్భుతజ్ఞానమును, సుందరధామమును, సంపద్వైభవమును గాంచి యాశ్చర్య



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వక్రవర్తియై యామె సిగ్గిలెను. పింఛతాపుల వెనవల్లు పిల్ల గాలుల నీనుచున్న నెమలి పింఛెముల వీవనలక్రింద, తళతళ మెఱయునట్లు నునుపెక్కించినరాళ్లు తాపిన దివ్యభవనమున, క్రూరవనమృగములవలె సునిపుణముగ నిర్మితమైన సువర్ణసింహాసనముపై నాసీనరైయామె సాలమును చక్రవర్తితో నుచ్చటించుచున్నది.

[ఇ. మహేనియాగారు చిత్రించిన త్రివర్ణచిత్రమునుండి. [illegible] సం. ఏప్రిల్ ౩౦ వ తేది స్ఫియరుపత్రిక.]

---

## అజంతాచిత్రములు

### చిత్రము. ౧

### పట్టాభిషేకము

ఈచిత్రము మొదటిగుహాలయమునందలి వెనుకటి గోడపైన ఎడమప్రక్కనున్నది. ఇందలి పైయర్ధభాగమున కుడిప్రక్కనుండునది యొక అభిషేకశాల. ఒక సింహాసనమున కూర్చుండి అధిపుడొకడు ఒకస్త్రీపళ్లెరమున గొనితెచ్చిన శుభవస్తువులను స్పృశించుచున్నాడు. ఆయన వెనుకధవళశిరోంబరమును ధరించిఇద్దరు రెండుకుంభములనుండి జలమును అభిషేకించుచున్నారు. కుంభములపై ననేకచిత్రవిచిత్రాలంకారలేఖనములు కలవు. అధిపతికి వెనుక నిరుపార్శ్వములందును చామరధరులు కలరు. కుడివైపుననుండుచామరధారికి ముందుండునది బృహస్పతియై యుండనోపును. దీనికెడమవైపు నొకస్త్రీ యొకకుబ్జ తెచ్చిన పళ్లెరమును అందుకొనుచున్నది. వీరివెనుక మఱియొకయువతి పళ్లెరమున ఫలాదుల నుంచుకొని నిలువంబడియున్నది. ఒకపురుషుడు తెల్లనిచొక్కాను, టోపీని ధరించి, తనచేతి కర్రనానుకొని నిలిచి ప్రభునభిషేకమును జూచుచున్నాడు. వానివెనుక నొకడు అభిషేకార్థము సాధారణకుంభమునందు జలమును తెచ్చియున్నాడు. ఇంకను ఎడమప్రక్కను కొందరుభిక్షులు రాజుపట్టాభిషేకసమయమున సన్మానమును బడయ నిరీక్షించుచున్నారు.

చిత్రమునందు క్రిందిసగభాగమున నిద్దరుయువతులు ఒకపళ్లెరమునందు నాలుగు శిశు శిరముల నుంచుకొని యొకభిక్షునికి సమర్పించుచున్నారు. భిక్షువు చేత నొక నల్లనిపూసలమాలనుంచుకొని మంత్రముల బఠించుచున్నాడు. క్రింద నిద్దరు అంజలీబద్ధులై నిలచియున్నారు. భిక్షునికి వెనుక నొకడు తెల్లనియుడుపును ధరించినవాడు కలడు. పూర్వమున రాజసూయాదిక్రతుసందర్భములయందు మృగబలికిమారు నరబలులుకూడ నిచ్చువాడుక యుండెనట.

### చిత్రము. ౨

### సమస్య

ఇది పదునాఱవ గుహాలయమున దక్షిణపార్శ్వ కుడ్యముపై చిత్రింపబడియున్నది. రాజాంతఃపురమున నొకవర్తులాకారమంటపమునందు గౌతమయశోధరా సతులు చెరియొకపర్యంకమున తివాసీల నానుకొనికూర్చుండియున్నారు. వారిపాదములక్రింద పీఠములు కలవు. గౌతముడు తనపురవిహారము ముగియగనే స్వగృహమునకేతెంచి తాను మార్గమున గాంచిన దుఃఖకరములగు దృశ్యములగురించి యశోధరాసతితో చర్చించుచున్నాడు. రాజకుమారుని మనసున విరాగోత్పత్తికి యశోధరాసతియు పరివేష్టించియుండు సఖీజనంబులును ఖిన్నులైనట్లు కన్పట్టుచున్నారు. క్రింద నిరువురు బాలురు ఒండొరుల గౌగిలించుకొని కూర్చుండియున్నారు. అందొకనిభుజమున నొకచిన్ని కత్తి వ్రేలుచున్నది.

---

## భారతమ్మ కొకజాబు

[శ్రీమతి బొడ్డపాటి సీతాబాయిగారు]

చిరంజీవి సౌభాగ్యవతియగు భారతికి,

నీ ప్రియసోదరి, నీకు చిరాయువు జ్ఞానాభివృద్ధి, ధనసమృద్ధి, సోదరివాత్సల్యము గలుగునట్లుగను, దేశోపకారిణి వగునట్లుగను ఆశీర్వదించి వ్రాయునదేమనగా:

నీ మూడవపుట్టినదినము జరిగినట్లు విని చాలా సంతోషించితిని. నేను సంక్రాంతికి ముందు బెజవాడలో మా పుట్టినింటికి వెళ్లియుండగా, నా శ్రేయోభిలాషులొకరు నీవు పుట్టినకొద్దిరోజులకే నిన్ను చూడుమని నాకిచ్చిరి. ఆడుపిల్లవౌట కొంత అలక్ష్యము చేసితినిగాని దేశోద్ధారకులకు నీవు రెండవసంతానముగుటచే నీవున్నావృద్ధిగాంచి, దేశమున కుపకరించెదవని అనుకొనుచు, నీలోని పేజీలను తిరుగవేసితిని. సంక్రాంతిపండుగ కాగానే

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



అజంతాచిత్రము ౧

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

బెజవాడనుండి పట్నము వెళ్లి, నాభర్తగారికి నిన్ను గురించి చెప్పి, నిన్ను మా యింటికి రప్పించగోరితిని. నా కోరికి నెరవేర్చుటయే వారియుద్దేశ్యమగుటచే, నీగుణాగుణములను ఎంచక నీరెండవనెలలో ప్రథమసంచికాసహితముగా నిన్ను మా ఇంటికి రప్పించిరి. అప్పటినుండియూ, నీకూ నాకూ స్నేహము పదిరి దినదినాభివృద్ధిఐనది. ప్రథమవత్సరమంతయూ నీముఖసౌందర్యము చూచియూ, నీలోనిచిత్తరువులు చూచియూ, నీవుచెప్పెడి కథలు వినియూ నీతో ఆనుకొనుచూ జరిపితిని. నీరెండవయేట మేము చెన్నపట్టణమునుండి షోలాపూరువెళ్లితిమి. నీవింట పెరుగుచుండుటచే విడువలేక నిన్నునూ అచ్చటికి తీసుకు వెళ్లితిని. ఇక్కడ నీరూపు కొంతమారెను. నీ కథల్లు శ్రద్ధగా వినసాగితిని. నీపాటలు పాడుచుంటిని. నీమాటలు నాకిష్టమయ్యెను. నీచేతలు నాకు నచ్చెను. నామనసు నీకు వశమయ్యెను. నేనున్నూ నీవలె నుండుటకు ఆలోచించెడిదానను. ఈ యాలోచనలతోనే నీరెండవయేడు ఇక్కడ జరిపితిని. నీమూడవఏట షోలాపూరునుండి ఇక్కడికి (లాహోరుకు) వచ్చితిమి. నీస్నేహబలము నిన్నిక్కడికిని తీసుకురాగలిగెను. ఈసంవత్సరము నీలో చాలామార్పులు గలిగినది. తోడి బాలికలవలె నీవు బాలారిష్టములకు లోనుగాక దృఢశరీరవై, అన్ని విషయములలోనూ ముందంజవేసితివి. సమస్తవిషయములూ నీవుగ్రహించితివి. నీవల్ల నాలోకూడా చాలా మార్పులు గలిగెనవి. ఆరునెలలసహవాసమునకే వారు వీరగుదు రందురు. అటువంటిది మూడేండ్లసహవాసమగుటచే నీనుండి చాలాసంగతులు గ్రహించితిని. నీవు నాలో నణగియున్న నాశక్తిని నాకు స్ఫురింపజేసితివి. నీవు నాకంటెవయసున చిన్నదానవైననూ, గుణమున పెద్దదానవు. నిన్నుగురించి వ్రాసినదంతయూ అతిశయోక్తి అనిగాని, నిన్ను పొగడితినని గాని ఎంచవద్దు. ఉన్న సంగతిని వ్రాసితిని. నీ కింకొకవిషయము వ్రాయుచున్నాను. పాశ్చాత్యమాసపత్రికలందునూ, వారపత్రికలందునూ, స్త్రీలకొరకు కొన్ని పేజీలను ప్రత్యేకముగనుంచెదరు. దానిలో స్త్రీలదుస్తులు, వారుచేయవలసిన పనులు, వారు నేర్చుకొనవలసిన శిశుసంరక్షణ, కుట్టుపని, గృహవైద్యము, గృహనిర్వహణము, పాకవిశేషములు మొదలయినవి ముఖ్యముగా ఆడువారే వ్రాసెదరు. అటులే నీలోకూడా కొంతస్థలమిచ్చి, నీసోదరీమణులచే వ్రాయు స్త్రీజనోపయోగకరములగు నట్టి చిన్నవ్యాసము లందు ముద్రించిన బాగుగానుండును. ఈసంగతి మీజనకులకు వ్రాయదలచి వారేమందురో యని యూరకుంటిని. నేను వారికి తెలుపుటకంటె నీవు తెలిపిన నీయందలిపుత్రికావాత్సల్యముచేత తప్పక వారంగీకరించి నీసోదరీమణులకుతావొసగెదరని, నీపేర వ్రాసితిని. గనుక కొన్ని పేజీలు స్త్రీలకొరకు ప్రత్యేకించునటుల మీతండ్రిగారితో చెప్పి, నీసోదరీమణుల కుపకారము చేసెదవని నమ్ముచున్నాను. ఇది నీ ధర్మము. మూడేండ్లపసిపాపకింతజాబేమి టని నాసోదరసోదరీమణు లనుకోవచ్చును. నీవువయస్సున పసిపాపవౌదువుగాని, బుద్ధిని బృహస్పతికి సమానురాలవని వారికి విన్నవించుచున్నాను. నీకాయురారోగ్యైశ్వర్యములు భగవంతుడు ప్రసాదించుగాక!

[లాహూరు.]　　　ఇట్లు నీ ప్రియసోదరి సీతాబాయి.

---

## ఉద్యోగుల విందులు

వల్లూరి సూర్యనారాయణరావు గారు ౧౯౨౮ మే ౨౧ వ తేది కృష్ణాపత్రికయందు ఇట్లు వ్రాయుచున్నారు:

వచ్చే పోయే యుద్యోగులకు వారి తాబేదారులు విందు లొసంగుట ఒక యాచార మైపోయినది. ప్రతి యుద్యోగియు కొందరికి మంచివాడుగను, కొందరకు చెడ్డవాడుగను నుండును గాని, తాబేదారులలో కొందరాయనకు విందుచేసినపుడు, తక్కినవారుకూడ తమయం దనిష్టము కలిగి తరువాత వచ్చు ఉద్యోగి అపకార మేమైన చేయునేమో యని ఆవిందులకు పోవుచుందురు. ఈ విందులు, వెళ్లే యుద్యోగికి చేయుచున్నట్లు పైకి కనబడినను, రాబోవు ఉద్యోగి యీ సంగతి విని తమకేమో లాభము చేయునని యీ తాబేదారులు ఎంచుచుందురు. ఏ యుద్యోగియైనను తన క్రిందవారిని రొష్టుపెట్టక తనవిధాయకకృత్యమును సరిగా నెరవేర్చుకొన్నంతమాత్రముననే మనవాండ్రు ఆయనకు బ్రహ్మరథముపట్టుట ఆచారమగుచున్నది. ఇట్టి విందులు, టీపార్టీలు, ఫోటోలు ప్రతిఆఫీసులోను,

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కోర్టులోను, పాఠశాలలోను మిక్కిలి చవుక యైపోయినవి. ఎట్టి విచక్షణయు లేకుండ మంచివాడనిపించుకొను ప్రతియుద్యోగికి ఆయన వెళ్లేటప్పుడు ఎక్కడలేని గౌరవము నిచ్చెదరు. ఆయనగుండా రాబోవువారి దయ సంపాదించుకొనుట, వెళ్లేవాడు తమ్మును బాధలు పెట్టలేదను కారణము ఈ తాబేదారుల నిట్టి పనులకు పురికొలుపుచున్నవి. ఇది బానిసబుద్ధితప్ప వేరు కాదు.

ఇట్టి బానిసబుద్ధి ప్లీడర్లలోకూడ వ్యాపించుచున్నది. మునసబు మంచివాడు గనుక విందులు చేయుచున్నామని వీరు చెప్పెదరు. మంచియనగ నేమి? ఈ ప్లీడర్లందరు మంచివారు కారా! దొంగతనము, లంజతనము, దౌర్జన్యము, త్రాగుడు మొదలైన యవినీతికరమైన పనులు చేయుచున్నారా? ఇతరులను హింసింపక తనపనిని తాను చేసికొన్నందుకు ప్రతివాడును మంచివాడనిపించుకొనవచ్చును. ఇట్టి మంచికేనా యీప్లీడర్లొకని తరువాత నొకరు వరుసగా తమ మునసబుగారికి విందులు కావించుట? ఒకే ప్లీడరుగారు తాను ఇరువదియిద్దరు మునసబులను చూచితిననిన్నీ వారిలో ప్రతివారును యేప్లీడరునో తిట్టుచుండెననియు, ఈ ప్రస్తుతము మునసబుగారు తానిక్కడనున్న సంవత్సరములో ఎవరిని తిట్టలేదు గనుక తా నాయనకు విందుచేసితిననియు చెప్పినారు. ఇట్టి బానిసస్వభావము స్వతంత్రవృత్తి నవలంబించు నీప్లీడర్లకే యలవడినపుడు యికతాబేదార్ల విషయమై చెప్పనేల?

ప్లీడర్లకును మునసబుగారికిని మధ్య హిందూమతానుసారమైన భార్యాభర్తల న్యాయమేర్పడి వారు రెండవవారికి వంగి వంగి సలాములు చేయుచు, వారికి కోపము వచ్చిన తమ జీవనోపాధికి భంగము కలుగునని యెంచుచు తాము ఎంతధనము సంపాదించినను తమ క్రింది ప్లీడర్లకుకూడ ఈ బానిసత్వమునే నేర్పెడి మార్గదర్శకులగుచున్నారు. న్యాయాధికారియు, న్యాయవాదియు న్యాయాన్యాయవిచారణకు సమాన గౌరవములకే పాత్రులగుదురని వీరు ఎంచరు. యజమానుని యెడల నౌకరు ప్రవర్తించునట్లు వీరు న్యాయాధికారుల యెదుట మెలగుచుందురు. తమయింటి కెన్నడును మునసబుగారు తన గడువుకాలములో రాకపోయినను సరే, తమతో నెన్నడును మనసిచ్చి మాట్లాడకపోయినను సరే, కేసులు తగులబెట్టినను సరే, గ్రామజీవనములో నెవ్విధము గాను ఆయన పాల్గొనకపోయినను సరే, తమ్మును తన యింటి కెప్పుడును విందుకు పిలువకపోయినను సరే, ఆమునసబు వెళ్లేటప్పుడు యీప్లీడర్లు విందులు చేయుచు తమమీద వారి కాధిక్యమున్నదని ఒప్పుకొనుచున్నారు. దీనికితోడు మునసబుల, సబుజడ్జీల జీతములు వృద్ధియగుట, ప్లీడర్లసంఖ్య యెక్కువై వీరి అయివజు తగ్గుచుండుట కూడ తటస్థించినది. వీరిలో ఐకమత్యము నశించి, గవర్నమెంటు నౌకర్లకంటెకూడ అధోగతికి దిగిపోయిరి. ఇటు పార్టీలకును, అటు న్యాయాధికార్లకునుకూడ బానిసలై స్వగౌరవమును చెడగొట్టుకొనుచున్నారు. ఒక యుద్యోగి తన విన్యుక్త కార్యములను సరిగా నెరవేర్చుకొనుటయే కాక ప్రజలతో కలసి ఆయాపట్టణములలోని సాంఘిక ఆర్థిక విద్యావిషయిక పారిశ్రామిక విషయములలో నేనియందైనను పాల్గొనినయెడల అతనికి విందు చేయుటలో కొంత అర్థము వుండ వున్నది. ఏవిషయము లోను ప్రజాహితైక జీవనములో పాల్గొనక తన జీతము నంతయు మూటగట్టుకొని, తనబొజ్జ తాను నింపుకొనుచు స్వార్థపరుడైన యుద్యోగికి విందులుచేసి గౌరవింప జూచుట మన యాత్మగౌరవమును పోగొట్టి ప్రజాసామాన్యములో హాస్యాస్పదుల మగునట్లు చేయును.

---

## శ్రీ సుభాష్‌చంద్రబోసు

౧౯౨౪ సంవత్సరము ఏప్రిల్ మాసమున బెంగాలు ఆర్డినన్సు శాసనము ననుసరించి నిర్బంధితులయి రెండు సంవత్సరములు, ఏడుమాసములు జెయిలులో పెక్కు యిక్కట్టులకు లోనయి తుదకు క్షయరోగపీడితుడై ప్రాణాంతస్థితికి రాగా బోసుగారిని ప్రభుత్వమువారు ౧౯౨౭ సం॥ మే ౧౬ వ తేదినా యెట్టి షరతులను గోరక విడుదలచేసిరి. బోసుగారు తమ గృహమున విశ్రమించియుండగ దీసిన ఛాయాచిత్రమిది.

వీరి విడుదలనుగూర్చి ౧౯౨౭ వ సంవత్సరము మేనెల ౨౧ వ తేది కృష్ణాపత్రిక

"వీరి విడుదల ప్రజాందోళనముయొక్క ఫలితమని కొందరు, వంగరాష్ట్రీయు యొక్క క్రొత్త గవర్నరు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గారి యౌదార్యసూచక మని మరి కొందరును వాకొను చున్నారు. ఈ విడుదలకు సంబంధించిన సంగతి సందర్భములను గొంచెము లోతుగఁ దరచి చూచితి మేని, ఇయ్యది ప్రజాందోళనముచేగాని, అధికారవర్గమునందలి మార్పు వలన గాని, కాదని బోధపడగలదు."





శ్రీ సుభాషచంద్రబోసు.

అని చెప్పి అందుకు గల కారణములను జర్చించు చు తుదకు బోసుగారి అనారోగ్యమే వారి విడుదలకు కారణ మగునని యిట్లు వాకొనుచున్నది.

"బోసుగారి తీవ్రవ్యాధియే యీవిడుదలకు కారణ మనుట నిస్సంశయము. వెనుకను గాంధిగారినిగూడ నిట్లే విడుదలచేసిరి. వ్యాధి జైళ్లలో గల చికిత్సోపాయముల కుదాటినదని తలంచినప్పుడు, వారిని విడుదలచేయుటతప్ప గవర్నమెంటు వారికి గత్యంతరము లేదు. బోసుగారి వ్యాధి యపాయకరమైనదని గవర్నరుగారి స్వంతడాక్టర్లే యభిప్రాయ మిచ్చినప్పుడు గవర్నమెంటు వారి కింకొక మార్గము లేక పోయినది. ఈవ్యాధి కుదురుట కధమ మే రెండు మూడు సంవత్సరములో పట్టును. అంతవఱకును బోసుగారు తిరిగి కర్మక్షేత్రమునకు రాజాలరు. వారి నిప్పుడు విడుదలచేసినంత మాత్రమున, వారింతలో తిరిగి కార్యరంగమునకు దుముకగలరని గవర్నమెంటువారు నమ్మజాలరు. ఈ కారణముచేత బోసుగారిని విడుదల చేసిరే కాని రాజకీయ కారణము చేత గావని నిస్సంశయముగ జెప్పవచ్చును బోసుగారి యనారోగ్యమైన నంతత్వరలో చక్కబడుటు కవకాశము కల్పింపబడిన దను కారణము తప్ప గవర్నమెంటువారు తుదకు తమ యక్రమము నుగుర్తించి న్యాయపథమును త్రొక్కుదు రని సంతసించుటకు అవకాశము లేదు."

---

## హిందూస్త్రీ

"సుజాత" ౧-వ సంపుటము ౫-వ సంచిక యందు శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఇట్లు నుడివిరి:

పురుషు డెంతమంది స్త్రీల నైన పెండ్లాడవచ్చును. భార్య చనిపోతే వెంటనే యింకొక తెను కట్టుకొన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వచ్చును. అట్లు చేయకపోయినా ఐహికసుఖములను బడయవచ్చును. ఒక భార్యను విడిచిపెట్టి, అంటే ఆమె జీవితమును ధ్వంసముచేసి, మరియొకతెను పెండ్లాడ వచ్చును. స్త్రీ యట్లుకాదు! భర్త పోతే స్త్రీసహగమనముచేయవలెను. లేకున్న వికృతరూపిణియై ఐహిక ప్రవృత్తిని విడిచి ముండమోపియై యుండవలెను. నిర్దయుడై భర్త విడిచిపెట్టినచో కిక్కురుమనకుండ మోడై యుండవలెను. ఈ దౌర్జన్యముతో ప్రేమయొక్క యాధిపత్యము తుడిచిపెట్టుకొని పోయినది. దీనితో దాంపత్య ధర్మమునకు విఘాతము కలిగినది.

మనకు మరల స్వేచ్ఛ లభించుట కనేకు లనేకవిధముల ప్రయత్నించుచున్నారు. గాని స్త్రీల విషయమున శ్రద్ధచేయుట లేదు. సత్యము లింకను గమనింపబడలేదు. స్త్రీని బానిసచేసితి మేని మన మిప్పుడు కొనసాగింపలేకున్న అనేకోద్యమముల నామె చక్కగ నిర్వహించి పురుషుని శ్రమను తగ్గింపగలదు.

మీరు నిర్బంధవిద్యను ప్రారంభింపుడు; బాల్యవివాహములను రద్దుచేయుడు; వితంతు వివాహములను శాసింపుడు; అస్పృశ్యతను తొలగింపుడు; రాటమును విసరుడు; హిందీని నెత్తి కెక్కించు కొనుడు; గర్భాధాన వయస్సును హెచ్చింపుడు; వేశ్యలను తగ్గించి నృత్యగానాభినయములను చంపివేయుడు; గ్రామ పునర్నిర్మాణ మనబడు దానిని సాగింపుడు; హిందూ మహమ్మదీయ సఖ్యమును సాధింపుడు; రాటపుజెండా నెగురవేయుడు; శాసనసభల నాక్రమింపుడు; లేకున్న వానిని నాశనము చేయుడు; ఏమయిన చేయుడు జాతి బాగుపడుట కివి మార్గములు కావు. జాతీయ నిర్మాణము పురుషుని పని గాదు. పురుషుని హృదయము నిర్మలము కావలెనన్న అది మాతృస్తన్యమువలన గాని కాదు. పురుషుని శక్తి నిశ్చితముకావలెనన్న అదిమాతృలాలనమువలన గాని కాదు. హిందూ స్త్రీ హృదయము సంస్కరింప బడునంతవరకును హిందూజాతి కున్నతి రాదు; హిందూ స్త్రీకి బంధముక్తి యగునంతవరకు హిందూదేశమునకు మోక్షములేదు.

---

## తథాస్తు

(మార్కండేయపురాణము అధ్యా. ౪౯)

గంజాం మండలమునందలి లక్ష్మీనరసుపేట నివాసులగు పారనంది సర్వేశ్వరశాస్త్రి గారిట్లు వ్రాయుచున్నారు.

పూర్వము తమోగుణప్రధానుఁడగు 'దుస్సహుఁ' డను యక్షుఁడు బ్రహ్మచే సృజింపఁబడెను. ఋతుకాలంబున చండాలదర్శనమువలన కలిభార్యయందు పుట్టిన 'నిర్మాష్టి' యనునది వీనిభార్య.

ఈదంపతులకు నెనమండ్రు పుత్త్రులును, పుత్త్రులతో సమానసంఖ్యగల పుత్త్రికలును గలిగిరి. అందు, 1. దంతాకృష్టి, 2. తథోక్తి (తథాస్తు), 3. పరివర్తి, 4. అంగధుక్కు, 5. శకుని, 6. గండప్రాన్తరతుడు, 7. గర్భఘ్నుడు, 8. సస్యఘ్నుడు అనువారు పుత్త్రులు.

1. నియోజిక, 2. విరోధిని, 3. స్వయంహారకరి, 4. భ్రామణి, 5. ఋతుహారిక, 6. స్మృతిహారిణి, 7. బీజహారిణి, 8. విద్వేషిణియను వీరు పుత్త్రికలు.

వీరిలో ద్వితీయ సుపుత్త్రుఁడగు 'తథోక్తి' అనువాఁడు ప్రతిగృహమునందుండి యాయింటివారు మంచిమాటనుగాని చెడ్డమాటనుగాని పలికినపుడెల్ల 'తథాస్తు' అని యనుచుండును. వానిపలుకు వ్యర్థముకాదు. (అమోఘాశీర్వచనము) గాన ప్రతివారును సర్వకాలములయందు శుభవాక్యములనే పలుకుచుండవలెను. ఒకవేళ నమంగళవాక్యముల నుచ్చరించినచో వెంటనే శ్రీభగవన్నామస్మరణముఁ జేయవలయును.

శ్లో॥ తిష్ఠ త్యన్యః కుమారస్తు తథాస్త్వితి యస్సదా
శుభాశుభే నృణాం యుంక్తే తథోక్తి స్తచ్చ నాన్యథా.
తస్మా దదృష్టం మంగళ్యం వక్తవ్యం పండితైస్సదా;
దృష్టే శ్రుతే తథైవోక్తే కీర్తనీయో జనార్దనః.
అని యున్నది.

'తథాస్తు దేవతలు కలరు' అని మనప్రాచీనులు చెప్పుట కీపురాణగాథ కొంతయాధారమై యుండవచ్చును. తథోక్తికిఁ గల తక్కిన సోదరీసోదరుల కృత్యములు అతిక్రూరములుగఁ జెప్పఁబడియున్నవి. వీరితండ్రియగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

దుస్స్వహులకు ముప్పదియైనమంద్రు పౌత్రులును దౌహి త్రులును కల్గిరి. అందులో 'తపశ్శక్తికి పుట్టిన 'కాల జిహ్వుఁ' డనువాఁడొకదుస్సహపౌత్రుఁడు. ఈసంతతివా రంచఱును బాంధవ్యముచేతనేకాక స్వభావకృత్యములచేఁ గూడ మిగుల సన్నిహితులు.

---

## టైపురైటింగు యంత్రముతో చిత్రించిన చిత్రములు

(15-6-27 టైమ్సు ఆఫ్ ఇండియానుండి.)

ఈరెండు చిత్రములను ఫోటోచిత్రములను జూచి టైపురైటింగు యంత్రముతో విజయనగరనివాసు లగు శ్రీ యం. వి. సుబ్బరావుగా చిత్రించిరి. కేవలము ఉత్తర ములు వ్రాయుట కుపయోగించుచుండిన టైపురైటింగు యంత్రముచే చిత్రములనుగూడ చిత్రించు శ్రీ సుబ్బరా వుగారి యద్భుతకౌశల్యము ప్రశంసార్హము.



౨. మండి రాణి సాహెబ గారు



౧. ఇర్విను ప్రభువు రాజప్రతినిధి

---

## హృదయస్పందము

['మాధురీ' పత్రిక వైశాఖ సంచికనుండి]

కాయ మెంతస్థూలముగ నున్న, హృదయ మంత మందముగ గొట్టుకొనును. ఏనుగుగుండె నిమిష మునకు ౨౫ మారులు కొట్టుకొనును; గాడిదగుండె ౫౦ మారులు కొట్టుకొనును. సామాన్యముగా పురుషుని హృదయము ౭౦ మారులును, స్త్రీహృదయము ౮౦ మారులును, యువకుని హృదయము ౯౦ మారులును, అప్పుడే పుట్టిన శిశువు హృదయము ౧౪౦ మారులును స్పందించును. కుందేలుగుండెలు ౧౫౦ పర్యాయము లును, ఎలుకగుండెలు ౧౭౫ పర్యాయములును అదరును. ఏపనినైన చేసినచో హృదయస్పందము హెచ్చును. ఏపనియు లేక దినమెల్ల పండుకొనియుండినచో హృదయస్పందము ౨౦,౦౦౦ మారులు తగ్గను. పుట్టు టకు నాల్గుమాసముల పూర్వమునుండి మరణపర్యంతమును హృదయ మెడతెగక సాలునకు ౪౦,౦౦,౦౦,౦౦౦ పర్యాయముల వంతున స్పందించును. శరీరమునుండి వేఱుపరచిన హృదయమును ఉప్పుకలిపిన నీటిలోనుంచి,



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నడుమ నడుమ పంచదార నీటిలో వేయుచుండినచో అది కొన్నాళ్లవరకు స్పందించుచుండును. మరణింపనున్న మనుష్యుని హృదయమును మరికొంతకాలమువరకు నడచుచుండునట్లు చేసి వైజ్ఞానికులు మనుష్య లఘుత్వము నొందుటకు మొదటిమెట్టు సాధించినారు. కాని నిజముగ మనము అమరత్వము నొందగలమో, లేమో చూడవలయును.

---

## గ్రామములు-విశ్వవిద్యాలయములు

[శ్రీ యస్. వి. రామమూర్తి ఐ.సి.ఎస్. గారు జనవరి ౧౯౩౮ హిందుస్తాన్ రివ్యూ' పత్రికయందు "భారతవర్షమున గ్రామపంచాయతులు" అను వ్యాసమున నీ క్రింది విషయములు వ్రాసిరి.]

వేల కొలది భారతీయయువకులు విశ్వవిద్యాలయములందు విద్యగఱచుచున్నారు. డిగ్రీలుపడసి వీరు తమ తమ యుద్యోగముల బడుదురు. వారు పట్టణములందే యుండవలెను గాని పల్లెటూళ్లయందు నసింపజాలరు. వారి విద్యవలన పల్లెటూళ్ల కేమియు లాభములేదు. కాని మనవిశ్వవిద్యాలయములు కేవలము పట్టణవాసుల ధనమువలననే సాగుటలేదు. అందులకు చాలవఱకు గ్రామములే సాయపడుచున్నవి. గ్రామస్థుల ధనమువలననే సర్కారు ఖజానాలు చాల భాగము నిండుచున్నవి. గ్రామస్థుల ధనమువలననే విశ్వవిద్యాలయములకు పునాది యేర్పడినది. గ్రామస్థుల ధనమువలననే యవి నడచుచున్నవి. అట్టియెడ నీ విద్యాలయములలో నుత్తీర్ణులైన విద్యార్థులను గ్రామములందు విద్యా ప్రచారము గావించుటకై యేల ప్రోత్సహింపరాదు? అట్లయిన, డబ్బిచ్చినందులకు గ్రామములకు గూడ కొంత లాభముచేకూరును. ఉపాధు లాసించు విద్యార్థులకు, వారొక కొన్ని గ్రామములందు సంచారముచేయుచు విద్యాప్రచారముగావించు పద్ధతిపయినే బి.ఏ.,యం.ఏ. మొదలగు బిరుదములనొసగు నేర్పాటు గావింపవలెను. దీనివలన విద్యాభివృద్ధి గలిగి, గ్రామము లారోగ్యవంతములై యెక్కువపాటుపడు శక్తి గలిగి దేశమున కార్థికవృద్ధినిగూడ సమకూర్చును. నేడు గ్రామములు చాలనీచస్థితియందున్నవి. ఈస్థితికి కారణము కేవలము దారిద్ర్యము కాదు; జ్ఞానాభావమే ముఖ్య హేతువు.

ఒక్కొక గ్రామమున నొకరిద్దరు యువకులు విద్యాలయములయందు విద్యనేర్చినవా రున్నను, సమూహములవలన గ్రామములకు గలుగు ప్రభావము ఒకరిద్దఱువ్యక్తులవలన గలుగజాలదు. పురములందలి యువకులకు గ్రామములందు సంచారముచేయుట శ్రమదాయకమే యయినను,దానివలన గలుగు నైతికవికాసము చాలగ నుండును. గ్రామముల కిదియొక మహోపకారముగాదు. ఇది నాగరిక జనులకు గ్రామములయెడ గల చిరవిస్మృతికి మారుకర్తవ్యము.

---

## పాడాంగు స్త్రీలు-బర్మాదేశము

(ఆడువాండ్ర అలంకారముల ఆగడములు)

[౧౯౩౮ సంవత్సరము మేనెల ౧౫వ తేది టైమ్సు ఆఫ్ ఇండియా పత్రికనుండి]

బర్మాదేశమున 'పాడాంగు' లను నొక జాతివారు గలరు. వీరిది ౧౫౦౦ చదరపుమైళ్లు వైశాల్యముగల పర్వతమయదేశము. దక్షిణ 'షాన్' సంస్థానములలోని 'మాంగ్ పెయి' సంస్థానమునుండి దక్షిణమున 'కారెన్ని' లోని 'బాలేక్' సంస్థానమువర కాదేశము వ్యాపించియున్నది. వీరిస్వరూపము చాలవఱకు చైనావారిని బోలియుండును. వీరిభాషకును, చైనావారిభాషకును సంబంధముగలదు. ౧౯౩౧వ సంవత్సరపు జనాభాప్రకారము ఈభాషను మాట్లాడువారు ౩౩,౪౯౯ మంది యున్నను ఈ 'పాడాంగు' జాతికి జెందినవారు ౧౩,౮౫౫ మందిమాత్రము కలరు. వీరిలో స్త్రీలు పురుషులు సమానముగ నుందురు.

పాడాంగులు గడుసరులు. వీరు ఇరుగు పొరుగు జాతులవారికంటె యినుమడిగ ఆహారమును గైకొందురు; ఇనుమడిగ పనిచేయుదురు. వీరికి వేటాడుటయందు నేర్పును ఆసక్తియును గలదు. వీరు నిర్దయులై చిన్న చిన్న పక్షులను సైతము వేటాడుదురు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీరినాయకుడు వీరిజాతివాడు కాడు. వీరాతని వేఱొకజాతినుండి సొమ్మునిచ్చి కొనెదరు. ఇట్లు వీ రిప్పటికి రెండుమాఱులు తమనాయకుని కొనిరి. మొదటి



౧. పాడాంగుస్త్రీలు. వీరు ధరించిన ఇత్తడిచుట్టలు పొడవయిన యిత్తడికమ్మితో చేసినవి. వీరికి అలంకారమునందు గల అభిమానము వీరిముఖములయందు దుట్టిపడుచున్నది.

యాతడు ఇప్పటినాయకునికి తాతయో, బంధువో అగు ను. ఆతడు 'షాన్' జాతికి జెందినవాడు. తమ యభి ప్రాయమునకు విరుద్ధముగ నాతడు ప్రవర్తించుటచే వారాతని జంపివైచిరి. తత్పాపఫలముగ నా దేశపు పొలములు ఫలశూన్యము లయ్యెను. ఎల్లపైరులును చక్క గా పెరుగును. గాని, ఫలముమాత్రము లేకుండెడివట. తరువాత మఱియొకనిని అధికముగ సొమ్మునిచ్చి కొనిరి. కొనుటకుబూర్వ మాతని సామర్థ్యమును, బలమును నీ క్రిందివిధముగ బరీక్షించిరి: ఒకగొప్ప కారుపందిని పిడి కిట గ్రుద్దికాని, బల్లెముతో బొడిచికాని చంపి మంటపై దానిని తానొకడే కాల్చి పక్వముచేయవలెను. తిన్నగా పెరిగిన యున్నతవృక్షము నెక్కవలెను. మఱియు మూడేండ్లవయసుగల కోడిపుంజుకాలినుండి మాంసము నంతయు నొకేమా ఊడదీయవలెను.

వీరు కొంచెము జంకులు లేక కలసి మెలసి చెలిమి చేయ దగియుందురు. ఈజాతివారిలో స్త్రీలయెడ గౌ రవ మధికము. ఆడువారు అలంకారప్రియులు. వీరుధరించు జాకెట్లు చాలవఱకు తెలుపు, ఎరుపు రంగుగలిగి పొడ వుగ నుండును. వానియంచులు నీలిరంగు గలిగి యుండు ను. వీరు అలంకారముగ కంఠమునందును, కాళ్లయందు దునుధరించు ఇత్తడి కమ్మిచుట్టలు మిలమిల మెరయుచు మిగులవింతను గొలుపుచుండును. ఈ యలంకారమువలన వీరికంగవైకల్యము గలిగును. మెడయందలి చుట్టవలన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౨. ఇటీవల నవీనపద్ధతి నలంకరించుకొని యున్న 'పాడాంగు' సుందరి.

మెడ కొన్నియంగుళముల పొడ వధికముగ పెరుగును. ఇత్తడిచుట్టలుగల మెడలు, వాలుబుజములు గల యీ స్త్రీలు 'షాంపేను' సారాయిబుడ్లవలెనుండి నవ్వుపుట్టించు చుందురు. చిన్నపిల్లలకుగూడ నీచుట్టలువగిలించి క్రమముగ కంఠము సాగునట్లు చేయుదురు. ఎంతపొడవుగ కంఠము పెరిగిన నంతయందమని వీరియభిప్రాయము. వీరొకొక్కరు ధరించు నిత్తడిచుట్టలు ఇరువదిపౌనులకు మించిన బరువు గలిగియుండును.

ఆభరణములయందలి పిచ్చిచే నిట్లంగనలు తమ సహజసౌందర్యమును గోలుపోయి వికారరూపములను చెందుచుండు టాశ్చర్యమును గలిగింపక మానదు.



3. చక్కగా అలంకరించుకొనియున్న పాడాంగు స్త్రీ (పిఱుందవైపు). కాళ్లయందును, కంఠమునందును ఇరువదిపౌనులకు మించిన బరువుగల ఇత్తడిచుట్టలను ధరించియున్నది.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



౪. తనసింగారమునకు మురియుచు గర్వితురాలైయున్న పాడాంగు యువతి. కంఠమునందలి చుట్టలలో పైవలయము ఆరుపౌనులకన్న నెక్కువ బరువుగలిగియుండును. ఈచుట్టలవలన వీరు క్రిందికి జూడ జాలరు. ఒకశతాబ్దమునకు పూర్వము పురుషులు సైతము నిట్లే యలంకరించుకొనుచుండిరట.

---

## భారతీయ చిత్రకళలో నూతనశక్తి

### (ఆంధ్రుల చిత్రకళావికాసము.)

మిథిక్‌సొసైటీ త్రైమాసికపత్రిక ఏప్రిల్ సంచికకు భావచిత్రలేఖనాశిరోమణి బిరుదాంకితులైన శ్రీయుత యమ్. వ్యాసారామ్ గారు 'భారతీయ చిత్రకళలో నూతనశక్తి' అను వ్యాసమొకటి వ్రాసియున్నారు. వారు చిత్రకళ దాని పరమార్థము, పాశ్చాత్యచిత్రకళకు ప్రాచ్యదేశచిత్రకళకు గల భేదము, కడచిన శతాబ్దికడపటి భాగమునుండి హిందూదేశమున చిత్రకళపై కలిగిన అభిమానాదరములు—ఈ మొదలగు విషయములను గుఱించి వివరించుచు నడుమ రవివర్మ చిత్రములు, అందలి కళాసంప్రదాయములు, నేటిసుప్రసిద్ధ వంగదేశ చిత్రకారులు, వారి కళాకౌశలము, వారిలో ఒక్కొక్కరి చిత్రరచనలలో నుండు భేదములు, రవివర్మచిత్రములకు వంగీయచిత్రములకు సంప్రదాయములలోగల భేదము—ఇవి యన్నియు తీవ్రముగను, సూక్ష్మముగను వివరించిరి. ఈసందర్భమున ఆంధ్రుల చిత్రకళా పునరుద్ధరణప్రయత్నములను గుఱించి యిట్లు వ్రాసిరి:

"బంగాళాదేశమున కళావిషయమున గలిగిన పునర్వికాసము మూలమున ఆంధ్రదేశమునను కళావిషయమై యభిమానము కలిగి దానిని పునరుద్ధరింప ప్రయత్నములుజరిగెను. దక్షిణహిందూదేశమునందలి యేయితరప్రదేశములందుకంటెను ఆంధ్రదేశమున దేశాభిమానము నిజముగా ఒకజీవశక్తియే. ఆంధ్రులలో కళాభివృద్ధివిషయమై కలిగిన యభిమానము బూటకము కాదనుటకు వారిలోని సుప్రసిద్ధ చిత్రకారుడగు డి. రామారావు గతించిన పిదప అతనికి స్మారకచిహ్నముగ నుండుటకై స్థిరమైన యొకచిత్రకళాబోధనామందిరమును నెలకొల్పుటయే తార్కాణము. ఇప్పటి చిత్రకారులలో శ్రీ అడవి బాపిరాజు ముందుముందు చాలఅభివృద్ధిలోనికి రాగలవనితోచుచున్నది. నూతనోత్సాహపూరితులైన యీయాంధ్రచిత్రకారులును అజంతానే యాదర్శముగ గైకొందురు. అజంతాను లక్ష్యముగ గైకొన్నప్పటికి వారు జీవితములోని ఆంధ్రావర్యమును, దేశీయములైన వారి యాచారవ్యవహారములను తమ చిత్రరచనలలో ప్రతిఫలించునట్లు చేయుటకై ప్రయత్నించుచున్నారు. ఆంధ్రచిత్రకళ యింకను శైశవావస్థయందే యుండుటచేత దాని భావిస్థితినిగుఱించి యూహాలు చేయుట యనుచితము. అయినను, వారుకూడ కళను పునరుద్ధరించుట యత్యంతావశ్యకమని యోజించి, వారియూహను కార్యరూపమునకు దెచ్చుటకై మనస్ఫూర్తిగ తీవ్రముగ పనిచేయుచున్నందులకు వారినభినందింపదగియున్నది."

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## పొడవైన యాడుది



మిస్. డొరైస్ డువాల్ అను పేరుగల యీమె లండనునగర నివాసిని. ఈమెపొడవు ఎనిమిదిఅడుగులు, ఒక అంగుళము. ఈమె విహారమునకై వీధివెంట బయలు వెడలెను. కొంతవడికి వెంటనంటిన గుంపునకు దాళ జాలక తిరిగి యింటికి జేరుకొనవలసిన దయ్యెను. ఈమె తలిదండ్రులు, పదునారేండ్లవయసుగలసోదరియు నందఱు వలెనే మితమగు పొడవుగలిగి యుందురు. ప్రపంచమున నీమెకన్న పొడవయిన యాడుది వేఱెవ్వతెయు లేదు. (టైమ్సు ఆఫ్ ఇండియా. 8-5-1927.)

---

### నూతన ఢిల్లీనగరము

౧౯౨౭, మేనెల ఇండియను రివ్యూపత్రిక ఇట్లు వ్రాయుచున్నది.

నూతనఢిల్లీ నగరమున డెబ్బదివేలు ప్రజలు త్వరలో చేరనున్నారు. ౨౪ మైళ్లు పొడవుగల రోడ్లు అచ్చట నున్నవి. ౨౦౦ మైళ్లు పొడవుగల విద్యుత్తంత్రులు కూరబడినవి. ఇప్పటికి నగరనిర్మాణమునకు ౯,౨౫౦,౦౦౦ పౌనులు వ్యయమైనవి.

సంపూర్ణనగర నిర్మాణమునకు మదింపు ఇట్లు వేయబడినది :

| | పౌనులు |
|---|---|
| పార్లమెంటు కార్యాలయము | ౫౬౨,౫౦౦ |
| సెక్రిటేరియటు (మంత్రివర్గ) కార్యాలయము | ౪౧,౩౧౨,౫౦౦ |
| రాజప్రతినిధి భవనము | ౧,౯౩౭,౫౦౦ |
| ఇతర భవనములు | ౧,౧౨౫,౦౦౦ |

నగరనిర్మాణమునకు నికరవ్యయము ౧౦,౫౦౦,౦౦౦ పౌనులనియు, తోటలు, ఉద్యానములు మొదలయిన వానియొక్క నిర్మాణమునకు ౩,౭౫౦౦౦ పౌనులనియు మదింపు వేయబడెను.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri



శ్రీ రోమెయిను రోలెండుగారు
(నోబెల్ సారస్వతబహుమానమును గాంచినవారు)
మాడరన్ రివ్యూ పత్రికాసంపాదకులు శ్రీ రామానంద చటర్జి గారు
౧౯౨౬ సెప్టెంబరుమాసమున చటర్జిగారు జినీవానుండి రోలెండుగారిని సందర్శింప వెళ్లినపుడు తీసిన ఛాయాచిత్రము.

---

## ప్రభుత్వోద్యోగుల ప్రజాహితకార్యములు

౧౯౪౨ మేనెల మాడర్న రివ్యూపత్రిక ఇట్లు హెచ్చరించుచున్నది:

నాలుగేండ్లక్రిందట ఒరిస్సా బీహారు రాష్ట్రీముల మంత్రులలో నొకరయిన శ్రీ గణేశదత్తసింగుగారు తమ జీతమున మూడువంతులు ప్రజాహితకార్యమున కర్పింప వాగ్దత్తముచేసిరి. దానిననుసరించి వారు పాట్నాలో నొక యనాథశిశురక్షణాలయమును స్థాపించి దాని కొక లక్షరూప్యముల నొసగిరి. అట్లే సామ్రాజ్యశాసనసభా సభ్యులు శ్రీ పటేలుగారును తమజీతమునుండి నిర్దిష్ట భాగమును ప్రజోపయోగములకు వినియోగింప మహాత్మునికి పంపుటకు వాగ్దత్తముచేసి యట్లేపంపుచున్నారు.

ఇట్టి శ్లాఘ్యకార్యములు యితరప్రభుత్వోద్యోగులకు సైతము సర్వదా అనుసరణయోగ్యములు.

---

## చైనా కత్తికట్టవలెను

డాక్టరు ఛారల్సు ఇ. జెఫర్సనుగారు (అమెరికాసంయుక్తరాష్ట్రీములకు జెందినవారు) 'ది క్రిశ్చియను రిజిస్టరు'లో నుదాహరించిన రీతిని ఇట్లు వ్రాయుచున్నాడు:

నేను చైనాలోనుండగా నాకు తెలిసిన విషాదకరము లగు విషయములలో ఒకవిషాదవిషయమును నాకు సందర్శన భాగ్యము లభించిన గొప్ప మనుష్యులలో నొక డగు ఆమాయి విశ్వవిద్యాలయాధ్యక్షుడు చెప్పినాడు. మే మిరువురమును హాంకాంగునకువెళ్లుచు నోడ పైతట్టున గూర్చుండి



సంకెల లూడినవి
చీనా: "ఇపుడు నాకు స్వేచ్ఛ. నా యిష్టము వచ్చినట్లు చేయగలను"
ఇంగ్లాండు: "నా కనిష్టమయినదానిని తప్ప."
"హిందీపంచినుండి."

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చైనాదేశపు వర్తమాన భవిష్యత్పరిస్థితులను గూర్చి చర్చించుచుంటిమి. అపుడాతడు "చైనాకత్తికట్టవలెను. ఏప్రాచ్యజాతిపట్లగాని, కత్తికట్టనిదే పాశ్చాత్యక్రైస్తవజాతులకు గౌరవము గల్గదు. ఏప్రాచ్యజాతిగాని కత్తికట్టనిది పాశ్చాత్యక్రైస్తవజాతినుండి న్యాయమును బడయజాలదు. కావున, కత్తికట్టుట తప్ప వేఱుగతి లేదు. పాశ్చాత్యజాతులవలన న్యాయమును బడయుటకయి మేము, మా పెద్దలయైతిహ్యములకును, జ్ఞానఘనులగు మా మహాత్ముల సిద్ధాంతములకును విరుద్ధముగ ప్రవర్తింపక తప్పనిదయ్యెను" అని చెప్పెను. అతడట్లు చెప్పుచుండ నేనాతనియెదుర సిగ్గుచే తెల్లబోయి నోరుతెఱవ జాలక కూర్చుంటిని.

---

## "మానవుడు కుక్కకంటె నీచుడు!!!"

[మాధురీపత్రికనుండి]



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




# గ్రంథములు

## ౧. సర్వలక్షణసారసంగ్రహము

గ్రంథకర్త: శ్రీ శేషులూరు కుప్పన్నయ్యంగారు. క్రౌను సైజు ౨౫ పుటలు. వెల ౪ అణాలు.

ఇందాంగ్లపద్ధతులపై నాంధ్రవ్యాకరణాలంకార లక్షణాదులు వివరింపఁబడియున్నవి. విద్యార్థుల కిది బాగుగ నుపయోగపడును. దీనికి శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు విపులమగు పీఠికను వ్రాసిరి. పుస్తకము వలయువారు 'వెంకటరత్నం అండ్ కో., బెజవాడ' అని వ్రాయవలెను.

## ౨. వేంకటేశ్వరశతకము

కర్త: అవధానుల కామేశ్వరరావుగారు. క్రౌను సైజు ౨౦ పుటలు. ౧ అణా పోస్టుబిళ్ల పంపువారి కుచితముగ పంపబడునఁట. మృదుశైలిగల నూఱువృత్తము లిందుఁగలవు. వలయువారు గ్రంథకర్తగారి పేర 'ఫొటోగ్రాఫరు, తణుకు' పశ్చిమగోదావరి, అని వ్రాయవలయును.

## 3. వేంకటేశ్వరశతకము

కర్త: నల్లా చినరెడ్డినాయఁడుగారు. డెమ్మీసైజు ౨౮ పుటలు. వెల 3 అణాలు. 'వేంకటేశ! యనంతర విప్రకాశ!' అను మకుటముతో ౧౦౨ చక్కని సీసపద్యము లిందుఁ గలవు. వలయువారు గ్రంథకర్తగారి పేర 'అమలాపురము, తూర్పుగోదావరి' అని వ్రాయవలెను.

## ౪. అభిమన్యునాటకము

గ్రంథకర్త: సూరపనేని వెంకటాద్రిగారు. క్రౌను సైజు ౭౫ పుటలు. వెల రు. ౧. ఇది 'పండిత రాధేశ్యామ కవిరత్న' కృత హిందీనాటకమునకు భాషాంతరము. శైలిబాగున్నది. సందర్భానుసారముగ భారతములోని రసవంతములగు పద్యములు చొప్పింపఁబడినవి. సరసమగు పాత్రపోషణాదికము కలిగి, నాటకము వేగముగ నడచిపోవుచున్నది. కాని కొన్నిచోట్ల రసపుష్టికిఁ గూడ వ్యవధియొసఁగని వేగమైయున్నది. వలయువారు 'మద్దుల లక్ష్మీనారాయణగుప్త, బుక్కుసెల్లర్సు, మచిలీపట్టణము' అని వ్రాసినఁ బడయఁగలరు.

## ౫. సరోజముఖి

గ్రంథకర్త: బిట్రా ఆంజనేయులుగారు. డెమ్మీ సైజు ౧౦౪ పుటలు. వెల రు. ౧. ఇది ఆరంకముల నాటకము. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి 'మణిమంజరి' యను నవలయందలి కథయే యీ నాటకమున కితివృత్తము. వలయువారు 'దొంతరాజు వెంకట్రామయ్యగారు, తాడికొండ (గుంటూరుజిల్లా)' అని వ్రాసినఁ బడయఁగలరు.

## ౬. స్వరాజ్యవాస్తవోపాయద్విశతీ

కర్త: శతావధాని శ్రీ వేమూరి నృసింహశాస్త్రులుగారు. క్రౌనుసైజు ౩౯ పుటలు, వెల ౪ అణాలు. ఇందు ౨౦౩ సంస్కృతశ్లోకములు తెలుఁగు తాత్పర్యముతో నున్నవి. వలయువారు 'విజయ ముద్రాక్షరశాల, బాపట్ల' అని వ్రాయవలెను.

## ౭. త్రిదోషతత్త్వము

గ్రంథకర్త: కిదాంబి వేంకటవరదాచార్యులవారు. డెమ్మీసైజు ౪౩ పుటలు. వెల రు. ౧. ఇది వైద్యవిద్యార్థులకును, వైద్యులకును చాల నుపకరించు గ్రంథము.


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలయువారు గ్రంథకర్తగారి పేర 'తాళ్లమువునూరు పంచు, తాడేపల్లిగూడెము తాలూకా, పశ్చిమగోదావరి జిల్లా' అని వ్రాయవలెను.

### ౮. శారీరకధర్మబోధిని

గ్రంథకర్త: చివుకుల లక్ష్మీనారాయణ శాస్త్రి గారు. క్రౌనుసైజు ౮౪ పుటలు. వెల ౧౦ అణాలు.

ఇందు శౌచస్నానాహారవిహారాది ముఖ్యవిషయములు బాగుగ జర్చింపబడినవి. వలయువారు గ్రంథకర్త గారి పేర 'మారీసుపేట, తెనాలి, గుంటూరు జిల్లా' అని వ్రాయవలెను.

### ౯. నాడీజ్ఞానబోధిని

గ్రంథకర్త: డా॥ యస్. కె. నంబిగారు. క్రౌనుసైజు ౨౦౯ పుటలు.(వెలవేయలేదు). హఠాదియోగములచేగూడ నాడీపరీక్షగావించి గ్రంథకర్త యీగ్రంథము నన్వర్థముగ రచించినారు. వీరు విశిష్టగుణముల నాయుర్వేదమునకుc గావించుచున్న యుపకారములలో నీగ్రంథ మొకటి. అక్కడక్కడ వీరు చిత్రపటములనుగూడనిచ్చి, చెప్పెడి విషయములను సుబోధ్యములcగావించి యున్నారు. వలయువారు గ్రంథకర్తగారి పేర 'ఆర్య వైశ్య ఆయుర్వేద విల్డింగ్స్ ఫ్రీ వైద్యశాల, ౨౪, హంటర్స్ రోడ్, వేపేరి, మద్రాసు' అని వ్రాయవలెను.

### ౧౦. ఆంధ్రవీరులు (మొదటిభాగము)

గ్రంథకర్తలు: శ్రీ శేషాద్రిరమణకవులు. క్రౌనుసైజు ౧౬౮ పుటలు. వెల ౮ అణాలు. ఇందు చరిత్రాత్మకములగు పదికథ లున్నవి. వలయువారు 'వేంకటరామ్ అండ్ కో., బెజవాడ' అని వ్రాయవలెను.

### ౧౧. యోగేశ్వరినవల (మొదటి సంపుటము)

గ్రంథకర్త్రి: పులుగుర్త లక్ష్మీనరసమాంబ గారు. డెమ్మీసైజు ౨౧౩ పుటలు. వెల రు. ౧-౮-౦. ఇది శ్రీ దామోదర ముఖ్యోపాధ్యాయుని వంగనవలకు తెలుగుసేత. మృదుమధురమగు శైలి. వలయువారు 'మేనేజరు, ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము, పిఠాపురము, తూర్పుగోదావరి' అని వ్రాయవలయును.

### ౧౨. వసిష్ఠజనక సంవాదము

యామిజాల శేషయకవిప్రణీతము. డెమ్మీసైజు ౮౮ పుటలు. వెల ౧౨ అణాలు. ఇదియొక వేదాంత ప్రబంధము. వలయువారు 'కనుపర్తి మార్కండేయశర్మ గారు, స్వధర్మప్రకాశినీ కార్యాలయము, బృందావనము, కేర్ సానుకుపోస్టు, మథురా జిల్లా' అని వ్రాయవలయును.

### ౧౩. ఈశ్వరశతకము

గ్రంథకర్త: గుళ్లపల్లి నారాయణమూర్తి గారు. క్రౌను ౧౬ సైజు ౫౪ పుటలు. వెలతెలియదు. వలయువారు గ్రంథకర్త పేర రాయవరము, తూర్పుగోదావరి జిల్లా అని వ్రాయవలెను.

### ౧౪. వీరకాంతలు (మొదటిభాగము)

రచయిత: నల్లమోడి వేంకటరత్నము గారు. క్రౌనుసైజు ౯౨ పుటలు. వెల ౬ అణాలు. ఇందు తొమ్మండుగురు వీరవనితలకథలున్నవి. గ్రంథముదొరకుచోటు: కృష్ణా ఫాన్సీ స్టోర్సు, తెనాలి.

## పత్రికలు

### ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

సంపుటము ౧౫, సంచికలు ౫, ౬. కాకినాడ

#### ముఖ్యవ్యాసములు :

దేవేంద్రవర్మ చీడివలసశాసనము—శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు. గాంగవంశీయుడగు భూపేంద్రవర్మ కుమారుడు దేవేంద్రవర్మ గాంగశకము ౩౯౭-వ యేట (క్రీ. శ. ౬౬౭) సూర్యగ్రహణకాలమున కోలువర్తని యందలి కంపలివాటి గ్రామవాస్తవ్యులగు ఆదిత్యభట్ట, యజుభట్టప్రముఖులకు దానముచేసిన 'సిపిది'యను గ్రామ శాసనమిది. శాసనమున పేర్కొనబడిన గాంగలరాజధాని 'విజయకళింగనగరము' గంజాముజిల్లాలోని ముఖలింగమునకు జేరువనున్న కళింగనగరమని శాస్త్రిగారూహించుచున్నారు. దానమిచ్చిన 'సిపిది' అను ప్రదేశము ప్రస్తుతము నరసన్నపేటకు దూర్పుగా రెండుమైళ్ల దూరముననున్న 'చీడివలస' యను నగ్రహారముగా యిందూహింపబడినది. వీరిందు కావించిన కాలనిర్ణయమునకు సరియైన ఆధారము కాన్పింపదు.

బాలవ్యాకరణ హరికారికల పౌర్వాపర్య విమర్శనము—విద్వాన్ మువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు. ఇందు శిష్టు కృష్ణమూర్తి కవికృతమగు హరికారికలను జూచి చిన్నయసూరి బాలవ్యాకరణమును రచియించిరని కల్లూరు వేంకటరామశాస్త్రి గారు గుప్తార్థప్రకాశిక యను బాలవ్యాకరణవివరణగ్రంథాంతమున గావించిన

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సిద్ధాంతమును ఖండించుచు ఉభయగ్రంథస్థవిషయములను, ఇతరాధారములను గైకొని సుదీర్ఘముగ విమర్శించి బాలవ్యాకరణమే హరికారికలకు మూలమని సిద్ధాంతము కావింపబడినది.

అరవమునందలి వింతయక్షరము తెలుగునగలదా?— కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు. అడలయుచ్చారణము కంటె భిన్నమైన యుచ్చారణముగల యొక వింతయక్షరము 'ఴ' (ழ) యొకటి ఆంధ్రమున గలదని శాసనప్రమాణముల నాధారముగా గొని కొందఱంగీకరించిన దానిని ఖండించుచు నట్టియక్షర మాంధ్రమున లేదని శాస్త్రిగారిందు నుడువుచున్నారు. వ్యాసము ముఖ్యముగా నీపత్రికయొక్క పూర్వసంచికలో శ్రీ జయంతి రామయ్యపంతులుగారు ప్రకటించిన వ్యాసమునకు ఖండనరూపమైనది.

మఱియు, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు వ్రాసిన సూర్యనారాయణీయాంధ్రభాషానుశాసనప్రామాణ్యవిచారము, బండారు తమ్మయ్యగారు వ్రాసిన 'పాలకురికి సోమనాథకవి—గద్యకృతులు' మొదలయినవి కొన్ని గలవు.

ఈపత్రికకు ఇందు ప్రకటించిన క్షయసంవత్సరపుటాయవ్యయ పట్టిక ననుసరించి ఆయము రు ౧౦,౪౫౦ను, వ్యయము రు ౩,౩౮౦ను అని తెలియవచ్చుచున్నది. ఇట్టారికలోపము లేకున్నను రెండు మూడు సంచికలుకలిపి ఏ మూడు నాల్గునెలలకో ఒకమారు పత్రికప్రకటింపబడుచున్నది. ఆంధ్రసాహిత్యోద్ధరణమునకు కంకణము కట్టి గట్టిగ పాటుపడవలసిన యీపత్రికను ముమ్ముందు సకాలమున నుచితరీతిని ప్రకటించుట పరిషత్తువారికి విధియని చెప్పక తప్పదు.

**వజ్రాయుధము, రెండవసంపుటము,**

**నాల్గవసంచిక.**

ప్రధానవ్యాసములు:—

'ప్రౌఢవ్యాకరణప్రశంస.' ఇది ప్రశంసకాదు; నిరాసము.

'సాహిత్యము-నూతనయుగము.' వ్యాసరచయిత ముమ్ముందు ప్రకటింపనున్న 'అభినవాంధ్రసాహిత్యవిమర్శనావ్యాసావళికిది యుపోద్ఘాతమట. ఈయుపోద్ఘాతమభినవాంధ్రసాహిత్యముపై నెత్తిన దండయాత్ర.

'ముచ్చుపదముల ముచ్చటలు.'

ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటింపనున్న సూర్యరాయాంధ్రనిఘంటువుయొక్క 'ముచ్చుపదములు' అను చిన్ని శాస్త్రముపై విమర్శనమిది. సశేషము.

ఇందొక్కచో వ్యాసరచయిత "ఏకన్నిఘంటు సంపాదకులు ఏతన్మహాకోశపరిశోధనమునకుఁ దగిన యవకాశము నాకొసంగియుండిరయేని, ఇంకముందొసంగుదురయేని గ్రంథస్థప్రతాతివిషయమునను, పదముల యర్థలక్ష్యసమన్వయతావిషయమునను తగిన శ్రమచేసి గ్రంథమాక్షేపణాపూరగముగాటకుఁ దోడ్పడ గలుగుదును." అని వ్రాసియున్నారు. ఇట్లయాచితముగ సారస్వతసేవకు కంకణముకట్టుకొన సిద్ధపడియుండు వీరి కట్టియవకాశమును గలిగించి నిఘంటుకార్యాలయమువారెల్లవిధముల వీరి సాహాయ్యమును బడయుట కడుంగడు సముచితమేకాని వీరు మఱియొక్కచో "'అపశబ్దభయం నాస్తి అప్పలాచార్యసన్నిధౌ' యన్నట్లు ముచ్చుపదముల యచ్చుకూటమిని నే మెచ్చుమను జొచ్చెమను మచ్చునకేనియు నిచ్చగింపనియచ్చుకుప్పలు నచ్చికపుంబుచ్చికల ముచ్చటకాండ్రు తమకెట్లునచ్చిన నట్లుచ్చుకొన వచ్చుంగాక. అచ్చముగ భాషాస్వచ్ఛతనె మెచ్చుపనికిఁ బ్రచ్చువారలందలి షారసాచ్చెములఁ గప్పిపుచ్చరాదను నిచ్చను మచ్చునకుఁ గొన్ని యాక్షేపణల నిచ్చట కచ్చిగ నేను వెలిబుచ్చుట మచ్చరమునకుఁ గాక యొచ్చరమునకె యనియు, నెచ్చుగ నీయచ్చుకూటనమున కొకమచ్చయేని వాటిల్లకుండఁ జూచు నిచ్చగాక మఱియొండు కచ్చితముగా దనియు ముచ్చుపదములవారచ్చుకొనుదురు గాక!" అని వ్రాసినట్లు తమ రచనాచాతుర్యమును నిఘంటువునందు జొప్పింపకుండ మాత్రము చూచుకొనుట శ్రేయము.

'ఆంధ్రభాషానుశాసన ఖండనము.' వెనుకటి సంచికలో బ్రారంభమైనది. ఇంకను సశేషము.

**సుజాత**

**సంపుటము ౧, సంచిక ౫. త్రూపుబజారు,**

**హైద్రాబాదు.**

ఇందు 'శాసనములు' అను శీర్షికక్రింద, హైదరాబాదు ఆంధ్రపరిశోధకసంఘమువారు రేచర్ల వారికి సంబంధించిన దోసపాటిశాసనముయొక్కయు సోమదేవశాసనముయొక్కయు మూలమును బ్రకటించియున్నారు.

**ఆంధ్రభారతి**

రెండవ సంపుటము, రెండవ సంచిక, మచిలీపట్టణము.

యథాప్రకారము కథలు,పద్యాలు, ఒకటి రెండు చరిత్రవ్యాసాలు ఇందు ఉన్నవి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri




శ్లో. వ్యవసాయాత్మికా బుద్ధి రేకే హ కురునందన! బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో వ్యవసాయినామ్.

వేదాధ్యయనమును 'హరిః ఓమ్' అని ఉపక్రమించి 'ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః' అని ముగించుట శిష్టసాంప్రదాయము. అధ్యయనమునందువలె నియత కర్మలయందును భగవన్నామస్మరణతో కార్యోపక్రమణమును జేయుటయును, శాంతిహోమముతో కర్మలను ముగించుటయును సనాతనధర్మము. ప్రవృత్తి వాయువేగ మనోవేగములతో పరువులిడుచున్నను శాంతిని గోరుచున్నది. గ్రీష్మము వర్షాగమనమును గోరుచున్నది. మహాప్రళయము వటపత్రశయనమునందు పరిణమించుచున్నది. సంరంభము ప్రవృత్తియందు తాత్కాలికముగను ప్రబలినను శాంతి ప్రపంచస్థితికి సహజావస్థయై యున్నది. గాంధిమహాత్ముడు సనాతనమైన శాంతి సందేశమును లోకమునకు నిరంతరము చాటుచున్నను సంరంభమున కలవాటుపడిన ప్రపంచమునకు శాంతిసందేశము దుర్గ్రాహ్యముగ నున్నది. త్రికరణశుద్ధిగ శాంతి నారాధించుట వర్తమాన పరిస్థితులందు దుస్తరముగనున్నది. శ్రీ హరిస్థానమును ధనాధికారములును, శాంతిస్థానమును సంరంభమును నాక్రమించి శాంతిసందేశమును నిరర్థకము చేయుచున్నవి. రాజ్యనీతిజ్ఞులు, శ్రీమంతులు, నాయకులు శాంతిధర్మములను ఘోషించుచు సంరంభబీజములను పోషించుచున్నారు. సిద్ధాంతములందు స్వాతంత్ర్యము, ప్రజాస్వామ్యము గోచరించుచున్నను ఆచరణమునందు నిరంకుశత్వము, పరాధీనత్వము, ప్రత్యక్షముగ నున్నవి. ఈవిపరీతసంరంభము సాంఘిక వ్యవస్థలందును, ఆర్థికపరిస్థితులందును గోచరంబగుచున్నది. ధనస్వాములకును కార్మికులకును, శిష్టులకును సామాన్యులకును, పరాధీన రాజ్యములకును స్వాతంత్ర్యరాజ్యములకును, వివిధమతస్థులకును దినదినప్రవర్ధమానం బగుచున్న మహాసంరంభమునకు ఫలము దైవాయత్తమైనను వర్తమాన సంధిసమయము దుర్భరముగనున్నది. వర్తమానసంధిసమయమునందు ధర్మాధికారమును నిర్వహించుటకు విశేషావకాశములుగల గ్రేటుబ్రిటను ధర్మమార్గమునకు ప్రతికూలభావమును వహించుట సంతాపకరముగనున్నది. కన్సర్వేటివు ప్రభుత్వము విదేశవ్యవహారములందును, స్వదేశవ్యవహారములందును నవలంబించుచున్న రాజనీతి పరమానర్థములకు సాధనము గాగలదని కాలము విశదము చేయగలదు. ఐరోపా మహాసంగ్రామము ముగిసి పదేండ్లు గాకపోయినను బ్రిటిషు రాజ్యాధికారుల రాజనీతి సంగ్రామమునకు సాధనంబుగనున్నది. బ్రిటిషు రాజ్యాధికారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లవలంబించుచున్న రాజనీతి యేతద్విషయ
మును నిర్ధారణచేయుచున్నది.

*　　*　　*　　*

విదేశవ్యవహారములు

బ్రిటిషు మంత్రివర్గము రుష్యా సామ్రా
జ్యముపట్ల నవలంబించిన రాజనీతి యనాలో
చితముగ నున్నది. లండనునందలి రుష్యాభ
వనమును ధ్వంసముచేయుటయును, రుష్యావర్త
కసంబంధమునువిచ్ఛేదముచేయుటయును అను
చితకార్యములని ప్రాజ్ఞులు గ్రహింప గలరు.
బర్కేనుహెడు ప్రభువు రుష్యాచేయుచున్న
కుతంత్రముల నద్భుతముగ వర్ణించిరి. సోవి
టుప్రభుత్వము పన్నుచున్న యెత్తులు నింద్య
ములైనను బ్రిటిషుప్రభుత్వము పన్నుచున్న
గూఢచర్యలు నింద్యతరములుగ నున్నవని
రైకోఫుగారు ప్రకటించుచున్నారు. బ్రిటిషు
ప్రభుత్వ మవలంబించుచున్న రాజ్యతంత్రము
మహాసంగ్రామమునకు బీజాంకురములను
నాటుచున్నదని రైకోఫుగారు తెలిపినభావము
చిరకాలముననే సార్థకముగాగలదని బ్రిటిషు
రాజ్యాంగవాతావరణము వ్యక్తముచేయుచు
న్నది. బ్రిటిషుప్రభుత్వము చీనా, ఈజిప్టు,
పారసీకము, భరతవర్షము దేశములం దవలం
బించుచున్న నిర్బంధప్రస్థానము సంగ్రామ సం
స్కారమును సూచించుచున్నది. చీనాదేశము
నకు సైన్యనివహము లింకను పోవుచున్నవి.
ఈజిప్టునకు దండయాత్ర వెడలినది. భరతఖండ
మునకు నిర్బంధవిధానము పరిపాటియైనది.
బ్రిటిషుప్రభుత్వము సామ్రాజ్యమునందలి శ్వే
తజాతుల కభయమును, శ్వేతేతరజాతులకు
నిర్బంధములను నొసంగుచు సంక్షోభమును
గలుగజేయుచున్నది. శ్వేతరాజ్యములకు స్వా
తంత్ర్యము నొసంగుటయును, శ్వేతేతరజాతు
లను నిర్బంధించుటయును వర్తమాన బ్రిటిషు
రాజ్యాధికారులకు పరమలక్ష్యముగ నున్నది.
మూడువంతులు శ్వేతేతర ప్రజలుగల బ్రిటిషు
సామ్రాజ్యమునకు వర్తమానరాజనీతి క్షేమ
కరము గాదు.

బ్రిటిషు ప్రభుత్వముపట్ల ప్రపంచము
నందంతటను ప్రతిఘటనము బయలుదేరు
చున్నది. బ్రిటిషు సామ్రాజ్యమునకు మర్మ
స్థానములైన ఈజిప్టు, ఇండియా మొదల
గుదేశములం దశాంతి పెరుగుచున్నది. నిర్బం
ధితులపట్లను, రాజ్యాంగ సంస్కరణములపట్ల
ను వింటర్టనుప్రభువు వ్యక్తము చేయుచున్న
నిర్లక్ష్యభావము భారతీయుల హృదయములం
దు నిరాశను గలుగజేయుచున్నది. దేశము
నందు కుట్రలులేవని వింటర్టనుప్రభు వంగీకరిం
చియును నిర్బంధితులను విడిచిపెట్టకుండుట
రాజనీతిగాని, న్యాయాచరణముగాని కాజా
లదు. భయము భక్తి లేని ప్రభుత్వమునకు
న్యాయముతో నిమిత్తముండదుగదా! సుభా
సుచంద్రబోసుగారిని విడుదల జేయుటవలన
గలుగని రాజ్యవిప్లవము శేషించినవారిని విడు
చుటవలన గలుగజాలదు. రాజ్యాంగ సంస్క
రణముల విచారణ విషయమై తన కేమియును
తెలియదని నటించిన మంత్రి ప్రజ్ఞను వర్ణించు
టకు వేయినోళ్లుగల శేషునికైనను సాధ్యముగా
దు. భారతప్రభుత్వమును ప్రాణములేని బొ
మ్మనువలె నాడించుచున్న బర్కేనుహెడు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వింటరుటను ప్రభువులకు లోకమునకంతకును వెల్లడియైన విషయము తెలియదని యెవరు న మ్మగలరు? వేలకొలది వేతనములను గైకొనెడి మంత్రు లేదేశమునందును నిట్టి దౌర్భాగ్యస్థితి యం దుండజాలరు. అంతఃకలహముల కాల వాలమై శాపగ్రస్తమైన భరతవర్షమున కీదౌ ర్భాగ్యస్థితి సహజావస్థగ నున్నది. బ్రిటిషు రాజ్యాధికారులు పరాధీన రాజ్యములకు చూ పుచున్న నిర్లక్ష్యభావమునే స్వదేశమునందు కార్మికపక్షమునకును జూపుట ఆత్మ వినాశ మునకు గారణము గాగలదు.

* * * *

వర్తకసంఘ శాసనము

యూరపురాజ్యములందు గ్రేటుబ్రిట ను యోగక్షేమములు పరిశ్రమలమీద నాధా రపడియున్నవి. బొగ్గు, ఇనుము, బట్టలు, యంత్రములు, నౌకలు మొదలగు పరిశ్రమలు బ్రిటిషుప్రజల యోగక్షేమములకు మూలా ధారములై బ్రిటిషుద్వీపముల సంపన్నత్వము నకు దోడ్పడినవి. ఈ పరిశ్రమలందు ధనస్వా ములకును కార్మికులకును నిరంతరము సంరం భము గలుగుచున్నది. ఈసంరంభమునందు ధనస్వాములకుగల ప్రభుత్వాదరణము, కార్మికు లకు లేకపోయినను కార్మికుల సంయోగబల ము ధనస్వాములకు భయభ్రాంతులను గలుగ జేసినది. ఏబదేండ్లనుండియును కార్మికసంఘ ములు పనివాండ్రకు గడించిన ప్రయోజన ములను నిష్ఫలము చేయుటకు బాల్డ్విను ప్రభుత్వము వర్తకసంఘశాసనమును నిర్మించు చున్నది. కన్సర్వేటివు ప్రభుత్వము శాసనని ర్మాణవిషయమునను చూపుచున్న పట్టుదల యసహ్యమై మహాసంరంభమునకు సాధనము గాగలదు. కార్మికసంఘశాసనము, రుష్యా సం ధివిచ్ఛేదము, చీనా దండయాత్ర, పరాధీన రా జ్యములందు నిర్బంధములు ప్రపంచమునకు సంప్రాప్తముగానున్న మహాసంక్షోభమునకు సూచనలుగ నున్నవి. బాల్డ్విను ప్రభుత్వము నిర్బంధసాధనముల మూలమునను బ్రిటిషుసా మ్రాజ్య ప్రతిభ నుద్ధరించుటకు బూనుకొను ట స్వాతంత్ర్యయుగమునందు నిరర్థకముగాని సార్థకముగాదు. మహాసంగ్రామము ముగిసి పదేండ్లు గడువకమునుపే సంగ్రామ ప్రయత్న ములకు బూనుకొనుట మహాసంక్షోభమునకు గారణము గాగలదు. ప్రపంచమునకు 1929వ సంవత్సర ప్రాంతములందు గలుగనున్న మహా సంక్షోభమును నివారించుటకు పరమేశ్వరుడు బ్రిటిషురాజ్యాధికారులకు జ్ఞానోదయమును గలుగజేయుగాత!

* * * *

భారత రాజ్యాంగములు

భారతరాజ్యాంగములస్థితి అయోమ యముగనున్న విధమును దినదిన ప్రవర్ధమా నం బగుచున్న యంతఃకలహములును, నిస్సహా యస్థితియును, నిర్బంధములును విశదము చేయు చున్నవి. శాసనసభలకు గలిగిన విరామము కాంగ్రెసు స్థాయిసంఘసమావేశమున కుద్వేగ మును గలుగజేసినది. బొంబయియందు గూడిన స్థాయిసంఘసమావేశమునందు స్వరాజ్యవాదు లకు యథోచితసహకారవాదులకు, బహిష్కా రవాదులకు రోషావేశ పూరితములైన వాగ్వి

నాదములు పెరిగినవి. స్వరాజ్యపక్షమునకును, బహిష్కారపక్షమునకును గౌహతి తీర్మాన విషయమునను చెలరేగిన భేదాభిప్రాయము లు సిద్ధాంతఖండనమునందు గాక వ్యక్తిదూ షణమునందు పరిణమించుట దేశమునకు సం ప్రాప్తమైన దుర్దశను విశదము చేయుచున్నది. నాయకులందాత్మవిశ్వాసమును, పరస్పరవిశ్వా సమును సంకుచిత రూపమును దాల్చినవి. నా యకులకును, అనుచరులకును ప్రతిపక్షులందు రంధ్రాన్వేషణము జేయుటయును, దోషా రోపణము జేయుటయును పరిపాటియైనది. అసహాయోద్య మారంభమునం దుచ్చస్థాన ము నధిష్ఠించిన దేశధర్మలక్ష్యము సంకుచిత రూపమును దాల్చివ్యక్తిదూషణలందును, సాం ఘికకలహములందును పరిణమించినది. ఇపు డు 1920 వ సంవత్సరపుస్థితి లేదని వగచుట గతజలసేతుబంధనముగ నున్నది.

గయాకాంగ్రెసువరకును నడచిన కాల ప్రవాహమును నాయకులును, అనుచరులును గమనించుట యవసరము. స్వరాజ్యపక్ష నాయ కుడు దేశబంధుదాసు ప్రతిపాదించిన ప్రతిష్టం భనము గోహతి కాంగ్రెసునందు దాల్చినది యథోచిత సహకారరూపమును. గోహతి కాంగ్రెసు చేసిన తీర్మానము పరస్పరవిరుద్ధభా వములతో సమ్మిళితమై యున్నను శాసన సభా ప్రయోజనముల నాశించు చున్నది. గోహతి తీర్మానము స్వరాజ్యవాదులకు శాసనసభలయందు గలుగజేసిన యవకా శములను బహిష్కారవాదు లొకవిధము నను, స్వరాజ్యవాదులు వేరొక విధమునను సమన్వయము చేయుట కవకాశములు గలిగి నవి. భిన్నలక్ష్యములు గలపక్షము లొక విష యమును సమానదృష్టితో జూడజాలవు. ఒక పక్షమునకు శాసనసభలు నిర్బంధాలయ ములు; రెండవపక్షమునకు శాసనసభలు దేశ ప్రయోజనములకు సాధనాలయములు. బరం పురంము, బెజవాడ, నెల్లూరు, రాజమహేం ద్రవరము మొదలగు మ్యునిసిపలు సంఘములం దసహాయవాదు లధ్యక్షులుగనున్నారు. శాసన సభలయందు స్వరాజ్యవాదులు సహకారధర్మ ము నవలంబించు చున్నారు. అధఃపతనమున కు హద్దులను నిర్ణయించుట సాధ్యము గాదు. వర్తమానదుర్దశ కొకరిని బాధ్యులనుజేయు ట న్యాయము గాదు. భిన్నపక్షముల నాయకు లొండొరులను నిందించుకొనుట ధర్మచ్యుతికి సాధనం బగుచున్నది గాని ధర్మ సంరక్షణమున కు సాధనంబు గా కున్నది. కార్యనిర్వాహక సంఘము చేసిన తీర్మానమువిషయమై పత్రిక లందును సభావేదికల యందును బయలుదేరిన నిందారోపణములు ప్రజాహృదయమునం దసహ్యతను గలుగజేయుచున్నవి. నాయకులు చూపుచున్న కోపావేశములు పరమానర్థము లకు గారణంబులగుచున్నవి. ప్రజావిశ్వాసము ను బడయుటకు నిగ్రహానుగ్రహముల వలెను కోపోద్రేకములు సాధనములు గావని నాయ కులును వారియనుచరులును గ్రహించి ధర్మా రాధనమును జేయుదురుగాత!

బొంబయి స్థాయిసంఘమునం దంకురిం చిన భేదాభిప్రాయములు వ్యక్తి దూషణము లందు బరిణమించుట సంతాపకరము. శ్రీని

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వాసయ్యంగారు, ప్రకాశముగారు, హార్నిమను గారు వారి శక్తికొలది దేశసేవను జేయుచు ప్రజల మన్ననలను బడయుచున్నారు. దురభిమానమును పెంచి దేశమును దురాగ్రహపూరితము చేయుట యనర్థదాయకము గాని ప్రయోజనకరము గాదు. ఈ నిందారోపణలు గాంధిమహాత్ముని మీదను సయితము ప్రసరింపజేయుట దేశమునకు సంప్రాప్తమైన యధోగతికి నిదర్శనముగ నున్నది. కాంగ్రెసు కార్యనిర్వాహకసంఘము తెలిపిన యభిప్రాయమును స్థాయిసంఘము మార్చుట కవకాశములు గలవు. ప్రత్యేకముగ గూడనున్న కాంగ్రెసు స్థాయిసంఘ మేమి తీర్మానమును జేసినను భిన్నపక్షములవారును వారిదృష్టిని అభిశంసనవిధానము నుండి కార్యనిర్మాణమునకు బూనుకొనుట శ్రేయస్కరము.

* * * *

హిందూమహమ్మదీయ సంయోగము

సాంఘిక ప్రయోజనములును, సాంఘిక ద్వేషములును దేశమును కీలాభీలము జేయుచున్న సమయమునందు వివిధసంఘములకు సంయోగమును గలుగజేయుట స్వరాజ్యపక్షమునకు మొదటిమెట్టుగ నున్నది. సంయోగములేని స్వరాజ్యము స్వప్నదృశ్యముగ [illegible] గాంధిమహాత్ముడు స్వరాజ్యమునకు హిందూమహమ్మదీయ సంయోగము ముఖ్యావసరమని చేసిన నిర్ధారణకు గతసంవత్సరానుభవము మహావ్యాఖ్యానముగ నున్నది. హిందూమహమ్మదీయనాయకులు భిన్నపక్షములందు జేరి గలుగజేసిన సంక్షోభము హృదయవేదనను గలుగజేసినది. బొంబయియందు స్థాయిసంఘ మామోదించినతీర్మానము ప్రశస్తము గాకపోయినను హర్షింపదగియున్నది. ప్రత్యేకనియోజకవర్గము నేర్పాటుచేయుట భారతజాతీయ నిర్మాణమున కొకమెట్టుగ నేర్పడగలదు. వర్తమాన సందిగ్ధస్థితియందు, సంయుక్తనియోజనములందు స్థానములను నిర్ణయించుట రెండుసంఘములకును సాహచర్యమును విశ్వాసమును గలుగజేయుటకు సాధనము గాగలదు. బొంబయి తీర్మానము వెంటనే హిందూమహమ్మదీయ సంయోగమును పరిపక్వము చేయజాలకపోయినను సంయోగమునకు తోడ్పడునని యందరును నంగీకరింపవలయును. హిందూమహమ్మదీయులకు రాజ్యాంగములందు సంయోగ మేర్పడునపుడు మేళతాళాదులసమస్యలను నిర్ణయించుట కవకాశము లేర్పడగలవు. హిందూమహమ్మదీయసంయోగము స్థిరపడుటకు రాగల కాంగ్రెసునకు డాక్టరు అన్సారిగారి నధ్యక్షునిగ నెన్నుకొనుట ధర్మము. పత్రికలయందును, సభావేదికలయందును నిర్మాణకార్య విధానము ప్రత్యక్ష మగుచున్నను ఆచరణమునం దపరూపముగనున్న విధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి. నాయకానుచరులకు వాగ్వాదములందు గలయుత్సాహము కార్యాచరణమునందు గనుపడకున్నది. ఈ సందిగ్ధ సమయమునందు గాంధిమహాత్ముడనారోగ్యస్థితియం దుండుటయును దేశదౌర్భాగ్యము.

* * * *

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## గాంధిమహాత్ముడు – శాంతి సందేశము

ప్రపంచశాంతికిని, స్వరాజ్యసిద్ధికిని గాంధిమహాత్ము డుపదేశించిన సత్యాగ్రహము రూపాంతరమును పొందుచున్న విధమును ప్రపంచపరిస్థితులును, భారతదేశ వ్యవహారములును విశదము చేయుచున్నవి. గాంధిమహాత్ము డుపదేశించిన సత్యాగ్రహమున కాత్మనిగ్రహము, త్యాగము బీజములు. దౌర్జన్యరహితమైన సహాయనిరాకరణము సత్యాగ్రహానుష్ఠానమునకు సాధనముగ నున్నది. మనోవాక్కాయకర్మలను దౌర్జన్యమును విసర్జించిన మహానుభావులు సత్యాగ్రహవ్రతము ననుష్ఠించుట కధికారులు. ఈయధికారమును బడయుట కవసరమైన శిక్షణవిధానమును మహాత్ముని సత్యాన్వేషణచరిత్రము విశదము చేయుచున్నది. ఇపుడు దేశవ్యవహారములందు సత్యాగ్రహానుష్ఠానమునందు సత్యము లుప్తమై ఆగ్రహము మిగిలినది. అసహాయోద్యమము పేరునకు నిలిచియున్నను సహాయరూపమును దాల్చి రాగ ద్వేషపూరితమై యొప్పుచున్నది. మహాత్ము నియస్వస్థత సత్యాగ్రహమునకు సాధనభూతమైన నిర్మాణకార్యవిధానమున కాటంకమునుగలుగజేయుచున్నది. నిర్మాణకార్యవిధానమున కవసరమైన సాధనసంపత్తి దుర్లభముగ నున్నది. ధనము లేదు; కార్యనిర్వాహకులు లేరు; శాంతివాతావరణము లేదు. మహాత్ముడు తంతుకారసంఘాధిపత్యమును శ్రీయుత జమ్నాలాలుబజాజుగారి వశముచేసి విశ్రాంతిని గైకొనుచున్నాడు. సత్యాగ్రహపీఠాధిపతులు, సహాయనిరాకరణమంత్రోపాసకులు యథేచ్ఛముగ ధర్మోపదేశములను జేయుచు ప్రజలయందు సంశయభావములను వ్యాపింపజేయుచున్నారు. నాయకులయందును, సంఘములందును ప్రబలుచున్న భేదాభిప్రాయములు, వాగ్వివాదములు ప్రజలయం దుత్సాహమును సంకుచితముచేయుచుండ, కార్యపరాఙ్ముఖత్వ మేర్పడుచున్నది. భారతీయులకు దుఃఖానుభవము పరిపక్వము గానంతవరకును జ్ఞానోదయము దుర్లభముగ నున్నది. నిరంకుశప్రభుత్వమునకు భారతీయులయంతఃకలహములు పరమానందమును గలుగజేయుచు స్వరాజ్యాశయమును నిర్లక్ష్యము చేయుట కవకాశము లేర్పడుచున్నవి. వర్తమానసంధిసమయమునందు స్వాతంత్ర్యోదయమునకుగలుగుచున్న యాటంకము లన్నియును కాలాంతరమునను పోయి, స్వాతంత్ర్యవికాసము గలుగుటకు భారతీయులు వ్యవసాయపరాయణులై భగవదనుగ్రహమునకు పాత్రులగుదురు గాత!



SRI JAGADGURU VISHWARADHYA
JNANA SIMHASAN JNANAMANDIR
LIBRARY
Jangamawadi Math, Varanasi
Acc. No. 7618

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thumbu Chetty Street, G.T., Madras

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# ఆంధ్రపత్రికాకార్యాలయమున దొరకు గ్రంథములు

---

| | | |
|---|---|---|
| రాష్ట్రభాషాహిందీప్రథమ పుస్తకము—రామానందశర్మ | ... ... | ౦-౩-౦ |
| శ్రీరామవిజయము (నాటకము)—కే. వెంకటరమణరావు | ... ... | ౦-౪-౦ |
| శారదాంబ, (స్త్రీధర్మబోధిని) నాటకము—టి. శ్రీనివాస రాఘవాచార్యులు | ... | ౦-౮-౦ |
| శబ్దకౌముది (నిఘంటువు)—శిరోభూషణము వేంకటరంగాచార్యులు | ... | ౧-౮-౦ |
| ఆంధ్రోద్యమము—మొదటి అయిదు ఆంధ్రమహాజనసభల అధ్యక్షుల ఉపన్యాసములు, తీర్మానములు, చిత్రములు గలవు | ... ... ... ... | ౧-౪-౦ |
| ఆరాధనవిధి—ముదిగొండ నాగలింగశాస్త్రి | ... ... ... | ౦-౫-౦ |
| ఆత్మజిజ్ఞాసాసంఘము—పారనంది జగన్నాధస్వామి. శరీరము విడిచినతరువాత ఆత్మస్థితిని గూర్చి చెప్పునది ... | ... ... ... ... | ౦-౪-౦ |
| సత్యవత్యుపాఖ్యానము—మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి; ఆ. ౨, రసవత్ప్రబంధము | ... | ౧-౦-౦ |
| గురుబోధామృతము (వేదసారము)—కట్టమంచి తిరుమలమ్మ; భక్తిరసభరితములగు పాటలు | | ౦-౮-౦ |
| తిలకుమహాశయునిజీవితము, సంపూర్ణోపన్యాసములు—మనికొండ సత్యనారాయణశాస్త్రి | | ౨-౮-౦ |
| తత్వానుసంధ్రిక (ప్రథమభాగము)—సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి | ... | ౧-౦-౦ |
| సంగీత శమంతకమణి | ... ... ... ... ... | ౦-౪-౦ |
| ఆంధ్రశబ్దచింతామణి (సటీకము)—పారనంది రామశాస్త్రి | ... ... | ౦-౧౨-౦ |
| మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు స్వీయచరిత్రము:—మొక్కపాటి రామమూర్తి | | ౨-౪-౦ |
| శ్యామాసుందరము (నవల)—ఒంతెలి సత్యనాథము; (రంపయుద్ధము) | ... ... | ౧-౦-౦ |
| బారిష్టరు పార్వతీశం (భా. ౧)—మొక్కపాటి నరసింహశాస్త్రి | ... | ౧-౪-౦ |
| రామదాసు నాటకము | ... ... ... ... ... | ౦-౧౦-౦ |
| గాలవఋషి నాటకము | ... ... ... ... ... | ౦-౧౨-౦ |
| మనశ్శరీరములపై పరిసరముల ప్రభావము | ... ... ... | ౦-౧౨-౦ |
| శతకకవుల చరిత్ర—వంగూరి సుబ్బారావు | ... ... ... | ౩-౦-౦ |
| కవిత్వతత్త్వవిచారము | ... ... ... ... ... | ౨-౪-౦ |
| ఆంధ్రసర్వకళాశాల విద్యాప్రవృత్తి | ... ... ... ... | ౦-౮-౦ |
| హిందీ తెలుగు నిఘంటువు—పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి (జేబులో నిముడునది) | | ౧-౦-౦ |

| | | | |
|---|---|---|---|
| హిందీ మొదటివాచకము ... | ౦-౬-౦ | దేవకీనందన శతకము ... | ౦-౨-౦ |
| హిందీ బాలశిక్ష ... | ౦-౬-౦ | ఒంటిమిట్ట రఘువీరశతకము-అయ్యలరాజు త్రిపురాంతకుడు ... | ౦-౨-౦ |
| సకలనీతిసమ్మతము ... | ౦-౪-౦ | నారాయణశతకము ... | ౦-౩-౦ |
| అవిమారకము ... ... | ౦-౧౦-౦ | కాళహస్తీశ్వర శతకము ... | ౦-౮-౦ |
| నవచోళచరిత్ర (ద్విపద) ... | ౦-౧౨-౦ | దాశరథిశతకము-కంచర్లగోపకవి... | ౦-౩-౦ |
| ఏకభాషాపి ప్రశంస ... | ౦-౮-౦ | రంగశాయి శతకము ... | ౦-౨-౦ |
| శ్రీనృసింహశతకము-పాలకురికి సోమన | ౦-౫-౦ | శ్రీరామతారకశతకము ... | ౦-౩-౦ |
| సర్వేశ్వర శతకము-యథావాక్కుల అన్నమయ్య ... | ౦-౫-౦ | రామచంద్రశతకము-పైడిపాటి వెంకట నృసింహకవి ... | ౦-౨-౦ |

ఆంధ్రపత్రికా కార్యాలయము, (తపాలపెట్టె 212.) 7, తంబుశెట్టివీథి, చెన్నపురి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

